

# శబ్దరత్నాకరము

అనునీయకారాదియాంధ్రనిఘంటువు

చెన్నపట్టణపు బోధనాభ్యసనపాఠశాలయందు ఆంధ్రపండితులుగనుండిన

బ. సీతారామాచార్యులచే

వ్రాయఁబడి.

దేశభాషాగ్రంథకరణసభవారి

ఆంధ్రభాషాధ్యక్షులచే పరిచూడఁబడి ప్రచురముచేయఁబడియె

చెన్నపట్టణము:

చెన్నపట్టణపు దేశభాషాగ్రంథకరణసభ

1922

# పీఠిక.

జనులు తమతమభాషలయందు సంపూర్ణజ్ఞానము సంపాదించుకొనుట యత్యావశ్యకము. ఆజ్ఞానము ఆయాభాషాగ్రంథములను దలస్పర్శముగఁ జదువక కాని కలుగనేరదు. అట్లుచదివి పదార్థపరిజ్ఞానముఁబడయుటకు ముఖ్యసాధనంబులు నిఘంటువులు. ఆనిఘంటువులో యీదేశభాషలయం దింగ్లీషునందువలె వచనరూపములుగాక సంస్కృతంబునందుంబలెఁ బద్యరూపములుగానున్నయవి. అట్లుండుటచే విద్యార్థుల కవి సుబోధంబులుకావు. ఆహేతువుఁబట్టి ముందు సంస్కృతమునందుఁ బద్యరూపములుగానుండిన నిఘంటువులన్నియు నిప్పుడు అకారాదిక్రమమున వచనరూపములుగా నేర్పఱుపఁబడియున్నవి. ఇంకను గొన్ని యేర్పఱుపఁబడుచున్నవి. అట్లే యాంధ్రద్రవిడాది భాషలయందును గొన్ని యేర్పఱుపఁబడియున్నవి. అందు ద్రవిడాది భాషల కేర్పఱుపఁబడిననేమో విద్యార్థుల యుపయోగమునకుఁ జాలునంతటివిగాను లక్ష్యావిరుద్ధములుగాను నున్నవి. ఈయాంధ్రమున కేర్పఱుపఁబడియుండు నొకటి రెండు నిఘంటువు లన్ననో యట్లుకావు.

కావున నీలోపంబుం బాపఁ గొంతకాలంబునకుముందు సంస్కృతాంధ్రములయందు విశేషపాండిత్యంబు గలిగి యాసేతుహిమాచలము చాలఁ బ్రసిద్ధి వహించియుండిన పరవస్తు చిన్నయసూరిగారు జీవితులైయుండినకాలంబున దీర్ఘసూత్రతతో ననేక గ్రంథపరిశోధనంబుగావించి మిగులవిరివిగాఁ బ్రయోగసహితంబుగ అకారాది తెనుఁగునిఘంటు వొకటివ్రాయం బ్రారంభించినడపుచుండిరి. ఆమహాప్రారంభముఁ జూచి యది పరిపూర్తియగుటకు బహుకాలము చెల్లుననియుఁ బరిపూర్తియయినను అందుఁ దెనుఁగు పదములుమాత్రమే చేర్పఁబడియుండుటం జేసి యదివిద్యార్థుల కంతగాఁ బ్రయోజనకారికాఁ జాలదనియు ఇదికాక బల్లయందుఁ జదివెడువిద్యార్థులంత పెద్దపుస్తకముఁ గొని యుంచుకొనుట కష్టముగానుండుననియు నూహించి సంస్కృతాంధ్రభాషలయందుఁ గొంత పరిశ్రమముగల నేనీయాంధ్రభాషఁ జదువ దొరఁకొను విద్యార్థుల సహాయార్థము వారియుపయోగమునకుఁ జాలునంతటిదిగాను లక్ష్యావిరుద్ధముగాను నుండునట్లు తెనుఁగుపదములతోఁగూడఁ దదపేక్షితములైన సంస్కృతపదములనుజేర్చి చిన్నదిగ అకారాదినిఘంటు వొకటివ్రాసి శీఘ్రకాలముననే పూర్తిచేసెదఁగాక యని యుక్కలి పూనికతో దీని వ్రాయ నుద్యమించితిని.

అట్లుద్యమించి మును మున్ను తెనుఁగునిఘంటువులయందుండి పదములనుమాత్రమెత్తి వ్రాసికొని యర్థము లందలివి తఱచుగ లక్ష్యవిరుద్ధములుగా నుండుటచే లక్ష్యశోధనంబుగావించియు తదనుసారంబుగ నర్థములనువ్రాయ నిశ్చయించి వాస్తవార్థపరిజ్ఞానసిద్ధికిని విశేషపదప్రాప్తికిని మూలకారణంబగు నాంధ్రభారతాదిగ్రంథపరిశోధనంబునం దత్యంతసముత్సుకుండనై తదసాధారణ గ్రంథసముపార్జనంబునకుం గడంగి తదుపార్జనవిషయమై శరీరకష్టమును విత్తనష్టమును నించుకేనియుం బాటింపక నాకుఁ దీఱికయైన కాలములయందు వేతనములేర్పఱిచి యుంచుకొనియుండిన యిద్దఱు ముగ్గురు వ్రాయసకాండ్రతోడఁ బదిగంటలకుఁ గలేజికిం జని సాయంకాలమయిదుగంటలపర్యంత మచ్చటనయుండి యనేకగ్రంథములను వ్రాయించికొని వచ్చితిని. కొన్ని దేశాంతరంబులనుండి తెప్పించితిని. కొన్ని పండితులసన్నిధిం గడించితిని. కొన్ని హానరెబిల్ లక్ష్మీనరసింహులుసెట్టిగారి యొద్ద వ్రాయించితిని. ఆగ్రంథసంపాదన కాలమునందుఁ బచ్చయప్పమొదలారిగారి పాఠశాలలోఁ బండితాగ్రగణ్యులై ప్రఖ్యాతికెక్కియుండిన ఉ. వైయాకరణ శ్రీనివాసాచార్యులవారు తాము ప్రాణపదముగా సంగ్రహించియుంచికొనియుండిన యపూర్వగ్రంథ ప్రయోగసారసంగ్రహములైన కొన్ని సంచికలను లోకోపకారార్థము నాచేతికొసంగిరి. అవి నాగ్రంథకరణ

కార్యమునకు ఒక్కొక్కరి సహకారులయ్యెను. ఈతీరున గ్రంథములను సేకరించుటకే యయిదాఱు సంవత్సరంబులు కావచ్చెను. ఇన్నిపాట్లుపడియు నింతద్రవ్య వ్యయముచేసియు సాధారణగ్రంథములే విశేషము దొరకినవిగాని తదితరములు విశేషముగ దొరకినవి కావు. సాధారణగ్రంథములయందును బెక్కులు చిక్కవయ్యె. చిక్కినగ్రంథము లివియని వెనుకఁజేర్పఁబడియుండు గ్రంథసంకేతాది వివేచనపట్టికయందు విశదములు కాఁగలవు. అక్కడనే గ్రంథభారశోధనచే నాకుఁదోఁచి యేర్పఱిచిన తద్గ్రంథకర్తలగు కవుల తారతమ్యమును నెఱుకపడఁగలదు. ఈప్రకారము గ్రంథములను సేకరముచేసి యందు వెదకి యెత్తినపదములను మంనటి తెనుఁగుపదములతోఁడఁగూర్చి తెనుఁగు సంస్కృతానుసారి కనుక అమరము, అమరపదపారిజాతము, మేదిని, విశ్వప్రకాశికలోనగు సంస్కృతనిఘంటువులను బరిశీలించి యందుండి వలయునన్ని సంస్కృతపదముల నెత్తి చేర్చితిని. నాగ్రంథకరణకార్యములు రెంటిమూటికిఁ జాలసహాయభూతముగా నుండినకతన అమరపదపారిజాతము నాపాలిటికిఁ బారిజాతముగానే యుండెను.

సంస్కృతాంధ్రపదముల నకారాదిగా నిర్ణేర్చికూర్చి మిగుల మహాక్లేశపడి దేశ్య వైకృత సంస్కృత గ్రామ్యాది సూచకంబులుగ నక్కడక్కడ నాయాయి సంకేతాక్షరంబులిడి యంతనెంతయు విచారణచేసి యా తెనుఁగుపదములకు లక్ష్యావలోకనముచే లక్షింపఁబడిన యర్థములను వ్రాసి సంస్కృతపదంబులకు నాయానిఘంటువులయందు వ్రాయఁబడియుండు నర్థములను వ్రాసితిని. వాడుకపదములు నైఘంటికపదములును దక్కఁదక్కిన తెనుఁగుపదముల కర్థములు వ్రాయఁబడి ప్రయోగములు చూపఁబడియున్నవి. కొన్నిచోట్లఁ గ్రొత్తగానిర్ధారణ చేయఁబడిన యర్థము సరియని విశ్వాసము పుట్టుటకుఁగాఁ దెనిఁగింపఁబడిన గ్రంథములయందలి పదములకుఁ దత్తత్సంస్కృతమాతృగ్రంథములనుండి యాయాఘట్టముల ప్రయోగములును నెత్తి వ్రాయఁబడియున్నవి. సంస్కృత నిఘంటువులన్నియుఁ బ్రామాణికులగు పండితులచేతనే వ్రాయఁబడినవి కాన వానికిఁ బ్రయోగములు చూపఁబడవు. ఇంగుఁ దెనుఁగుపదములు కొన్నిటికి యథాశక్తిని వ్యుత్పత్తియు వ్రాయఁబడియున్నది. తెనుఁగునందపూర్వమయినయది యట్లు వ్రాయఁబడుట స్వపాండిత్యప్రకటనమునకుఁ గాదు. తెనుఁగుపండితులును దాము నితఃపరము దానిని వాడుకలోనికిఁ దేవలయునను టకు సూచకంబని గ్రహింపవలయును. సంకేతాక్షరక్రమమును వానియర్థములును దీని వెనుకనుండు సంజ్ఞావివరణ పట్టికయందుఁ బ్రకాశితములు కాఁగలవు. సంకేతము లేర్పఱుచుచోఁ గొన్నియెడల నిది సంస్కృత మిది తెనుఁగని కనిపట్టుట దుష్కరముగా నుండెను. కొన్నికడల దేశ్యమిది వైకృత మిదయని తెలిసికొనుట దుస్సాధ్యముగా నుండెను. కొన్నిచోట్ల దేశ్యవైకృత మిశ్రపద మిదియని గుర్తెఱుఁగుట దుర్లభముగా నుండెను. కొన్నిపట్ల నిది సంస్కృతాంధ్ర మిశ్రపదమనియు గ్రామ్యపదమనియు గ్రహించుట దురూహముగా నుండెను. అది యట్టిదయని బుద్ధిమంతులు తలంతురు. "విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమమ్, నహివంధ్యా విజానాతి గుర్వీమ్ప్రసవవేదనామ్" అని పెద్దలు వక్కాణింతురు కాదె.

ఈ నిఘంటువును వ్రాయఁ బ్రారంభించిన క్రొత్తలో, రా - రా - పో - రామానుజులునాయఁడు కొంతకాలము లేఖరిగానుండి యీగ్రంథమునకుఁ గావలసిన కుదురుపాటులన్నియుఁ గలుగఁ జేసెను. ఆపిమ్మట నొక రిద్దఱు కొన్ని కొన్నిదినములుండి యా వ్రాఁతపని చూచిపోయిరి. అటుతరువాత సంస్కృతాంధ్ర పండితులైన ఉ - కో - అనంతాచార్యులు వ్రాయసమునకుఁ గుదిరి యత్యంతశ్రద్ధతో నిర్భరప్రయాసము పుచ్చుకొని నిర్విఘ్నముగ నీగ్రంథముఁ బరిసమాప్తిఁ బొందించిరి. శీఘ్రకాలముననే ఈనిఘంటువు వ్రాసి సంపూర్తిగావించెదఁగాకయని యుద్యమించియు నిది పరిసమాప్తిఁబొంద రమారమి యిరువదియైదు సంవత్సరములకు మీఁదనే కాలము పట్టెను.

ఎటువంటి బుద్ధిశాలురకును నిట్టి కార్యములయందుఁ బొరపాట్లు కలుగుననఁగా నావంటి స్వల్పబుద్ధికి యిట్టి మహాకార్యమునందుఁ బొరపాట్లు కలుగకమానును? కావున బుద్ధిమంతు లట్టిపొరపాట్లు దెలిపి దిద్దించి నన్నుఁ గృతార్థుం జేయుదురని ప్రార్థించెద.

ఈయకారాది నిఘంటువును నేను శ్రమపడి వ్రాసినను నాశ్రమము విఫలంబుగాక రెండువిధంబులను సఫలంబగునట్లు దానింగొని ముద్రితంబొనర్పించి ప్రసిద్ధికిని బ్రచారమునకును దెచ్చినట్టి ఘనులగు దేశభాషాగ్రంథకరణ సభాధ్యక్షులను గృతజ్ఞతతోఁ దలంచుచు నిప్పు డీ వృత్తాంతంబుం బరిపూర్తి యొనరించెద.*

ఇట్లు. బ. సీతారామాచార్యులు.

---

# భాషాప్రశంస.

1. భాషయనఁగా శబ్దరూపమై భాషించుటకు సాధనమైనది. ఆశబ్దము ధ్వనిరూపముగాను వర్ణరూపముగాను నుండును. అది యుచ్చరించునప్పుడు మొదట ధ్వనిరూపమై యాభ్యంతర ప్రయత్నములచే నుద్గమించి కంఠతాల్వాది స్థానములయందుఁదగిలి కకారాది వర్ణరూపముగాఁ బరిణమించుచున్నది. ఆవర్ణములు కొన్ని స్వతంత్రించియుం గొన్ని యనేకములు చేరియు నాయాయి యర్థములను బోధించుచున్నవి. భాషణము పరస్పరాభిప్రాయసూచకంబయి లోకప్రవర్తనమునకు మూలకారణముగా నున్నయది.

2. ఆభాష సంస్కృతాదిభేదంబులచే బహుభంగులం బ్రవర్తిల్లెడు.

సంస్కృతము దేవతలు భాషించెడు భాషగావున దేవభాషనాఁబడు. అపభ్రంశాది దోషంబులులేక సంస్కరింపఁబడిన దగుటంజేసి సంస్కృతంబని దానికభిధానంబుగలిగె. అది యనాదియగు వేదంబునకాధారమై భాషలన్నింటికి నాది యగుటం బట్టి యాదిభాషయనంబడు. "ఆద్యామహార్హాసా మూలాసర్వస్యేతిని గద్యతే" అని వికృతివివేకకారుఁడు. సంస్కృతభాష యిప్పుడు కావ్యనాటకాదులయం దుపయోగపడుచున్నది.

3. ఇట్టిభాషయే వివేకవర్ధనములగు విద్యలుగాను కళలుగాను తంత్రములుగాను మఱియు ననేకములుగాను నేర్పడియున్నది.

విద్యలు. — ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, మీమాంసాశాస్త్రము, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము అని ఇవి పదునాలుగు.

కళలు. — ఇతిహాసము, ఆగమము, కావ్యాలంకారనాటకములు, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, దురోదరము, దేశభాషాలిపిజ్ఞానము, లిపికర్మము, వాచనము, అవధానము, స్వరశాస్త్రము, శాకునము, సాముద్రికము, రత్నశాస్త్రము, రథాశ్వగజకౌశలము, మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము, గంధవాదము, ధాతువాదము, ఖనివాదము, రసవాదము, జలవాదము, అగ్నిస్తంభము, జలస్తంభము, ఖడ్గస్తంభము, వాచస్తంభము, వయస్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము, కాలవంచనము, పరకాయప్రవేశము, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఐంద్రజాలికము, అంజనము, దృష్టివంచనము, స్వరవంచనము, మణిసిద్ధి, మంత్రసిద్ధి, ఔషధసిద్ధి, చోరకర్మము, చిత్రకర్మము, లోహకర్మము, అశ్మకర్మము, మృత్కర్మము, దారుకర్మము, వేణుకర్మము, చర్మకర్మము, వస్త్రకర్మము, లావకుక్కుటమేషాదియుద్ధకారకకౌశలము, అదృశ్యకరణము, దూతీకరణము, మృగయావిధి, వాణిజ్యము, పాశుపాల్యము, కృషి, ఆసవకర్మము అని ఇవి యఱువదినాలుగు.

---

* ఈనిఘంటు విట్లు వ్రాయఁబడి చెన్నపట్టణమునందలి దేశభాషాగ్రంథకరణసభవారి ఆంధ్రభాషాధ్యక్షులచే పరిశోధింపఁబడి ముద్రింపఁబడియెను. ఈగ్రంథస్వాతంత్ర్యముగల పైసభవారు నాశ్రమమునకు ఐదువేలరూపాయలు సన్మానముగా నిచ్చిరి.

**తంత్రములు.** — అవాంఛజపాలినీతంత్రము, స్వర్ణలక్ష్మీప్రసాదకతంత్రము, సర్వసామ్రాజ్యతంత్రము, అంగారగమనతంత్రము, రాజ్యోపాంగతంత్రము, స్త్రీబాలరాజతంత్రము, చామరద్వంద్వతంత్రము, ప్రవర్ణరాజతంత్రము, ధీరతంత్రము, గ్రామపాలనతంత్రము, మిత్రలక్ష్మీప్రయోగతంత్రము, పర్ణపాలనతంత్రము, ప్రాణలక్ష్మీప్రయోగతంత్రము, ప్రవాలక్ష్మీప్రయోగతంత్రము, తోయలక్ష్మీప్రయోగతంత్రము, గంధలక్ష్మీప్రయోగతంత్రము, పుష్పలక్ష్మీప్రయోగతంత్రము, కామరూపతంత్రము, లాజీవనికాతంత్రము, కుంజకంబళతంత్రము, కనకప్రయోగతంత్రము, బోధినీ తంత్రము, సత్యలక్ష్మీప్రయోగతంత్రము, పాదుకాతంత్రము, ప్రజ్ఞాలక్ష్మీప్రయోగతంత్రము, ఖేటకతంత్రము, చాపతంత్రము, శేషతంత్రము, శల్యతంత్రము, భీమలక్ష్మీప్రయోగతంత్రము, మణిస్థానప్రయోగతంత్రము, పాతాళగమనతంత్రము, మర్దినీతంత్రము, స్ఫుళింగలక్ష్మీతంత్రము, శంఖమర్దళతంత్రము, చక్రాయుధప్రయోగతంత్రము, భైరవాదిప్రయోగతంత్రము, రూపతంత్రము, లేఖతంత్రము, పృథివీతంత్రము, అశ్వతంత్రము, గజతంత్రము, గోరక్షతంత్రము, ఐశ్వర్యలక్ష్మీతంత్రము, శుల్కతంత్రము, మిశ్రలక్ష్మీప్రయోగతంత్రము, జీవనీతంత్రము, గిరితంత్రము, వనతంత్రము, స్థానాపత్యప్రయోగతంత్రము, శ్రీసర్వదండినీతంత్రము, విఘ్నవిచ్ఛేదతంత్రము, భరతతంత్రము, శృంగవాద్యప్రయోగతంత్రము, సర్వవాహనతంత్రము, స్తంభినీతంత్రము, దాహినీతంత్రము, మారిణీతంత్రము, ద్వేషిణీతంత్రము, ఆకర్షణతంత్రము, ఉచ్చాటనతంత్రము, శోషిణీతంత్రము, మృతసంజీవనీతంత్రము, హరమేఖలికాతంత్రము అని ఇవి యఱువదినాలుగు. ఇవి చతుష్షష్టికళలకును విద్యలకును మూలభూతములయినవి.

4. సంస్కృతము తక్కఁదక్కిన భాషలు స్వస్వజన్మదేశనామపూర్వకంబులుగ ఆంధ్రభాష, ద్రవిడభాష, కర్ణాటభాష, ఘూర్జరభాష, మహారాష్ట్రభాష, తురుష్కభాష అని యిట్లు పెక్కులు పేర్కొనంబడుచున్నవి. అందుఁ గొన్ని ఆంధ్రము, ద్రావిడము, కన్నడము, తురకము, మహారాష్ట్రము అని యీరూపములుగాను పేర్కొనంబడియెడి. కనుకనే యాంధ్రములోనగు భాషలు దేశభాషలనంబడు. అవి సాధారణములు అసాధారణములు అని ద్వివిధములుగా నేర్పడుచున్నవి. సాధారణములు జనులు వ్యవహారమునం దుపయోగించునవి. అసాధారణములు కవులు గ్రంథములయందుఁ దఱచుగఁ బ్రయోగించునవి. సాధారణము లశుద్ధములుగానుండును. అసాధారణములు శుద్ధములుగానుండును. సాధారణభాషలు అనేక నీచజాతుల నోళ్లఁబడి యశుద్ధములైనవి. వానినే గ్రామ్యమందురు. ఒక్కొక్క కారణంబున లోకంబులోని వానికన్నింటికివలె రాజ్యవిభేదకారణంబున భాషలకును వృద్ధిక్షయంబులు సహజంబులని యూహింపవలయును.

5. భాషలు ప్రపంచసృష్టికి వెంబడిన నానావిధజనసమాజ సంకేతితములై యేర్పడినవి. అవి తొలుదొల్తఁ గేవలము దోషయుక్తములై యల్పములై వ్యవహారమాత్రోపయుక్తములైయుండి యవులఁ గ్రమక్రమంబున వృద్ధిఁబొంది, ఋషిప్రభృతులచేఁ బరిష్కృతంబులై కావ్యరచనలకును నుపయుక్తములయినట్లు తెలియఁబడుచున్నది. మొదట నేదేనియొకటి సామాన్యరూపముగా నేర్పడి మీఁదమీఁద నది యుక్తివిశేషముచేఁ జక్కఁబడుచు వచ్చునుగాని మొట్టమొదటనే యేదియు నిర్దుష్టముగా నేర్పడదు. అది యనుభవవేద్యము.

6. ఆభాషలు లక్ష్యలక్షణరూపములుగానుండును. లక్ష్యములు కావ్యనాటకాదులు. లక్షణములు ఛందోవ్యాకరణాదులు. అన్ని భాషలయందును లక్ష్యములు ముందుగలిగి లక్షణములు వెనుకఁగలిగినవి. లక్ష్యమనఁగా లక్షణమునకు విషయమైనది. లక్ష్యానుభవముచేఁ గలుగు లక్షణజ్ఞానము లక్షణాభ్యాసముచేఁ గలుగు లక్షణజ్ఞానముకంటె దృఢముగానుండును. భాష బాల్యముఁదొట్టి జనులచే భాషింపఁబడునదిగాన భాషాముఖ్యమగు లక్ష్యము ముందు పుట్టినదనుటయు నట్లుకాని లక్షణము తదనుసారి యగుటచే వెనుకఁబుట్టిన దనుటయు నిర్వివాదము. ఇప్పటికిని గొన్నిభాషలు లక్షణములు లేకయే ప్రవర్తిల్లుచున్నవి. లక్షణాభ్యాసము లక్ష్యపరిజ్ఞానమునకు సాధనముగాని స్వతఃప్రయోజనము కాదు. అయిన నొక్కవిశేషము. కేవల లక్ష్యము నభ్యసించి పదిసంవత్సరములకు గట్టెక్కఁగలవాఁడు

లక్షణాభ్యాసముతో లక్ష్యము నభ్యసించి యెనిమిది సంవత్సరములకుఁ గడతేఱఁగలఁడు. అనేకులు లక్షణములయందు విశేషపరిచితిగలిగి లక్ష్యములయందంతటి పరిచయములేకయున్నారు. అది నేత్రవిహీనమయిన సురూపతవంటిది. అట్టి లక్ష్యములయందుఁ బరిజ్ఞానము చిరకాలానుభవముచేతఁ గలుగవలయుఁగాని కేవల బుద్ధికౌశలముచే శీఘ్రకాలమునఁ గలుగునది కాదు. ఆ యనుభవము ప్రాచీనకావ్యాదుల పరిశీలనచేతను బ్రాజ్ఞులగోష్ఠీపరిచితిచేతనుం గలుగును. మనుష్యానందములలోపలఁ గావ్యామృతరసపానానందము ముఖ్యమని పెద్దలు చెప్పుచున్నారు గాన దాన నభిరుచి భాగ్యవంతులకుఁ గాక భాగ్యహీనులకుఁ గలుగఁబోదు.

7. దేవభాష యొక దేశభాష కాదు. "అమరోక్తులు సకలభూములందును వెలయుఁ." అన్నట్టులది యీయాదేశమనక సమస్తదేశములయందును వ్యాపించియుండుటవలన నందలిపదంబులు కొన్ని దేశములయందు స్వస్వరూప వికృతరూపములతోడను గొన్నిటఁ గేవల వికృతరూపములతోడను నయ్యాయి దేశభాషాపదంబులతోఁ దఱచుగఁ గూడిమాడి వ్యవహరింపఁబడుచున్నవి.

ఉదాహరణము.

"తగునిది తగదని యెదలో,
వగవకసాదులకుఁజేదవారికి నెగ్గుల్,
మొగిఁజేయు దుర్వినీతుల,
కగు ననిమిత్తాగమంబు లైనభయంబుల్."

"தவத்தளவேயாகுமாந் தான்பெற்ற செல்வம்,
குலத்தளவே யாகும் குணம்."

"చిన్నదిరన్నవబిగిదడె,
సన్నుతభూషణవువక్క."

ఈక్రిందటి వాక్యములయందు 'దుర్వినీతులు' ఇత్యాదులు స్వస్వరూపయుక్తములు. 'ఎద' ఇత్యాదులు వికృతరూపయుక్తములు. ఇట్లితరభాషలయందు నితరంబు నెఱుంగవలయును. మఱియు నొక్క విశేషంబు దేశసన్నికృష్టత్వహేతువుచే నొక్క పదమే యుచ్చారణభేదంబించుక గలిగి యనేకభాషలయందు వ్యవహరింపఁబడుచున్నది. చూచుఁడు. క్రిందివాక్యములయందుఁగల అగుఁ, కుమ్, అక్కు అను నీమూఁడును సమానార్థకమగు నొకపదము. ఇట్లనేకములు గలవు.

అన్న-அண்ணன்-అణ్ణ, ఒండు-ஒன்று-ఒందు, కన్ను-கண்-కణ్ణు, కాయ-காய்-కాయి, నాలిక-நாக்கு-నాలిగె, పాలు-பால்-హాలు, ముక్కు-மூக்கு-మూగు, వ్రేలు-விரல்-బెరళు, అది-அது-అదు, నీవు-நீ-నీను, నేను-நான்-నాను మొదలగునవి. ఇవి దిక్ప్రదర్శనములుగాఁ జూపఁబడినవి.

సంస్కృతపదంబులు వికారముం బొంది కొన్ని మొదలఁ బ్రాకృతముం జొచ్చి యందుండియుఁ గొన్ని ప్రాకృతముం జొరకయ పరిగాను నాంధ్రంబునం బ్రవేశించెను.

సంస్కృతభాషను నానాయిదేశప్రజనులు దమతమ దేశలిపులతో వ్రాసి చదివెదరు. అయినను దేవనాగరమను లిపి దీని కసాధారణమైనదని చెప్పుచున్నారు. ఈ భాషయందుఁ గావ్యాలంకారనాటకకర్త లసంఖ్యాకులు వ్యాకరణకర్తలు ననేకులుండినను వారిలోఁ బాణిని కాత్యాయన పతంజలులు ముగ్గురు ప్రశస్తులు. వారి లక్షణంబులకు లోపడని లౌకిక ప్రయోగములు మృగ్యములుగానుండును.

8. ఇట్టి సంస్కృతభాషకు రెండవదిగాఁ బ్రాకృతమని యొకభాష కలదు.

ప్రాకృతము ప్రకృతియగు సంస్కృతము యొక్క వికృతియగుటంజేసి యీనామంబునంబడసె. ఇది తత్సమము, తద్భవము, దేశ్యమునని త్రివిధము. రామో, హరీ, గురూ ఇత్యాదులు తత్సమములు. హత్థో, వణం ఇత్యాదులు తద్భవములు. ఉరల్లీ, కందోట్టం ఇత్యాదులు దేశ్యములు. ఇయ్యది ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికాపైశాచి, అపభ్రంశము అని యాఱుభేదములుగలది. అందు మహారాష్ట్ర దేశమునందు వ్యవహరింపఁబడుచుండిన భాష ప్రాకృతము. శూరసేనదేశమునందుఁ బుట్టినది శౌరసేని. మగధదేశమునందుఁ గలిగినది మాగధి. పిశాచదేశంబులయందు వ్యాపించియుండినది పైశాచియుఁ జూళికాపైశాచియు. (పాండ్యము, కేకయము, నేపాళము, బాహ్లీకము, కుంతలము, చోళము మొదలగు కొన్నిదేశంబులు పిశాచదేశంబులని చెప్పుదురు.) గొల్లలు మొదలగువారి భాష యపభ్రంశము. షడ్విధంబగు నీభాషకు సంస్కృత నాటకాదులయం దాయాయి పాత్రముల

కనురూపముగాఁ బ్రయోగములు చూపట్టెడు. పాత్రములనఁగా వేషములు. నాటకాదులయందు స్త్రీపాత్రములకును హాస్యకారులు మొదలగువారికిని బ్రాకృతభాష యుపయోగింపఁబడును. అధమపాత్రములకు శౌరసేని యుపయోగింపఁబడును. అత్యధమపాత్రములకు మాగధి వినియోగింపఁబడును. రాక్షసపిశాచాది నీచపాత్రములకుఁ బైశాచియుఁ జూళికాపైశాచియు వినియోగింపఁబడును. చండాలయవనాది పాత్రములకపభ్రంశమగును. ఈపాత్రంబులకెల్ల నొక్కొక్క కారణమునుబట్టి భాషావ్యత్యాసంబును గలదు. ఇట్టి యీభాషకు వాల్మీకివరరుచి మొదలగువారు వ్యాకరణములు చేసి యున్నారు. ప్రాకృతభాషయందుఁ గాళిదాసుఁడు సేతుబంధమని యొక కావ్యము నొనర్చియున్నాఁడు. శాలివాహనుఁ డీభాషయందే సప్తశతియని యొక గ్రంథమును, వరరుచి పైశాచియందు బృహత్కథ యను నొక గొప్పగ్రంథమును జేసియున్నారనుట సీనులకుమాత్రము విషయముగానున్నది. జైనులవేదంబులు పురాణంబులు మొదలగునవి ప్రాకృతభాషయందేయున్నట్టును దెలియవచ్చుచున్నది.

ఈభాష యిప్పటికిఁ బ్రస్తావానర్హమైయుండినను సంస్కృతంబట్ల యిదియు నాంధ్రభాషకు మూలముగా నుండుటంబట్టి యింత చెప్పవలసివచ్చెను. "ఆద్యప్రకృతిర్గి ప్రకృతిశ్చాద్యే" అని శబ్దశాసనుఁడు. కాఁబట్టి యాంధ్రభాషా పరిజ్ఞానము కోరువారికి సంస్కృత ప్రాకృతభాషాపరిజ్ఞానము నవశ్యము కావలయు. తుదకు సంస్కృతభాషాపరిజ్ఞానమేని పరిపాటిలేకున్నఁ గేవలాంధ్రభాషాపరిజ్ఞాన మంత శ్లాఘ్యముగనుండనేరదు. ఆంధ్రభాషక కాదు. అన్నిభాషలకును దత్సాహాయ్య మత్యావశ్యకము.

**9. ఇప్పటికిఁ బ్రస్తావార్హమైనది యాంధ్రభాష.**

ఆంధ్రము గొప్పదిగాని కొలఁదిది కాదు. "భాషేయమమితా తత్ర దేశ్యా చిత్రస్వభావయుక్, తచ్చిత్రతా తు ద్రష్టవ్యా పూజ్యపాద సుభాషితే" అని వికృతి వివేకకారుఁడు. ఇది ఆంధ్రదేశ వ్యవహారసిద్ధమగుటంజేసి ఆంధ్రమనియు, త్రిలింగక్షేత్ర మధ్యవర్తియగుటంజేసి తెలుఁగు తెనుఁగు అనియు, ళేఖచుగ సంస్కృతప్రాకృతముల వికారమగుటం జేసి వికృతియనియుఁ జెప్పఁబడును. "ఏషాతయోర్వికృతిః" అని శబ్దశాసనుఁడు. శ్రీశైల దాక్షారామ కాళేశ్వరములనెడు త్రిలింగక్షేత్రముల మధ్యదేశము ఆంధ్రము. "క. శ్రీక్షితిధర కాళేశ్వర, దాక్షారామంబులనఁగఁ దనరారెడు నీ, త్రిక్షేత్రంబులలింగము, లీక్షితిని ద్రిలింగసంజ్ఞ నెన్నికకెక్కెన్" అని అప్పకవి. "శ్రీశైల దాక్షారామ కాళేశ్వర మధ్యవర్తిత్వా దాంధ్రదేశస్య త్రిలింగదేశ ఇతి ప్రసిద్ధిః" అని అహోబలపతిపండితుఁడు. దాక్షారామమును ద్రాక్షారామమందురు. అది ప్రాఢోక్తి. "దక్షస్యారామభూమిత్వా ద్ద్రాక్షారామ ఇతీర్యతే" అని స్కాందమున భీమేశ్వరఖండమునందు. (శ్రీశైలము కర్నూలుజిల్లా ఆత్మకూరు తాలూకా ఆత్మకూరు హెడ్క్వార్టరుకు నీశాన్యపుదిక్కున నిరువదినాలుగు మైళ్లదూరముననున్నది.. దాక్షారామము గోదావరిజిల్లా రామచంద్రపురము తాలూకా రామచంద్రపురము హెడ్క్వార్టరుకు దక్షిణమున నాలుగు మైళ్లదూరముననున్నది. కాళేశ్వరము (అనఁగా కాళహస్తి.) చిత్తూరుజిల్లా కాళహస్తి జమీనులోఁ దిరుమలకు నీశాన్యపుదిక్కునఁ బదునేను మైళ్లదూరముననున్నది.) ఈభాషకును మొదట లక్షణము లేకయుండి పిదప హేమచంద్రుఁడు మొదలగు మునులచే లక్షణము కల్పింపఁబడినట్లు చెప్పఁబడియున్నది. "శ్లో. హేమచన్ద్రాదిమునిభిః కథితఞ్చాన్ధ్రలక్షణమ్" అని త్రిలింగశబ్దానుశాసనమునందు.

ఈయాంధ్రభాష తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము అని నాలుగు భేదములు గలది. ప్రకృతికి విశేషవికారములు లేక ప్రత్యయాది వికారములుగలిగి ప్రయోగింపఁబడునది తత్సమము. ప్రకృతియందు వర్ణలోపాగమాది వికారములను బొంది వ్యవహరింపఁబడునది తద్భవము. దేశవ్యవహారసిద్ధమయినది దేశ్యము. దేశవ్యవహారసిద్ధమయి లక్షణవిరుద్ధమయినది గ్రామ్యము. అందు తత్సమము సంస్కృతసమము ప్రాకృతసమము అని ద్వివిధము. సంస్కృతసమము.— రాముఁడు, హరి, పోషించు, రంజించులోనగునది. ప్రాకృతసమము.— జేముఁడు, రాణిలోనగునది. షడ్విధంబగు ప్రాకృతము ప్రత్యేకము తత్సమ తద్భవ దేశ్య- భేదములచేఁ ద్రివిధమగుటవలనఁ బ్రాకృతసమము పదునెనిమిది

భేదంబులు గలదియగును. ఎట్లనిన: — సంస్కృతసమ ప్రాకృతసమము, సంస్కృతభవ ప్రాకృతసమము, ప్రాకృత దేశ్యసమము; సంస్కృతసమ శౌరసేనసమము, సంస్కృతభవ శౌరసేనసమము, శౌరసేనదేశ్యసమము; సంస్కృతసమ మాగధసమము, సంస్కృతభవ మాగధసమము, మాగధదేశ్యసమము; సంస్కృతసమ పైశాచసమము, సంస్కృతభవ పైశాచసమము, పైశాచదేశ్యసమము; సంస్కృతసమ చూళికాపైశాచసమము, సంస్కృతభవ చూళికాపైశాచసమము, చూళికాపైశాచదేశ్యసమము; సంస్కృతసమాపభ్రంశసమము, సంస్కృతభవాపభ్రంశసమము, అపభ్రంశదేశ్యసమము అని. తద్భవమును సంస్కృతభవము, ప్రాకృతభవమని ద్వివిధము. సంస్కృతభవము.—చందురుఁడు, తామరలోనగునది. ప్రాకృతభవము.—వెన్నుఁడు, లచ్చిలోనగునది. ప్రాకృతభవము ప్రాకృతసమమువలె పదునెనిమిది భేదంబులు గలదియగు. ప్రాకృతసమంబులును సంస్కృతప్రాకృతభవంబులునగు పదములను తద్విశేషంబులతోడ సప్రపంచముగ వైకృతదీపికయందుఁ దెలియనగు. దేశ్యము ఆంధ్రదేశ్యము, అన్యదేశ్యమని ద్వివిధము. ఆంధ్రదేశ్యము.—తల్లి, తండ్రిలోనగునది. అన్యదేశ్యము.—తావి, మోవిలోనగునది. గ్రామ్యము నింద్యగ్రామ్యము, అనింద్యగ్రామ్యమని ద్వివిధము. నింద్యగ్రామ్యము లక్షణవిరుద్ధమయిన పామరజన వ్యవహారము.—వస్తాఁడు, తెస్తాఁడులోనగునది. అనింద్యగ్రామ్యము లక్షణవిరుద్ధమయినపండితజన వ్యవహారము.—కలకంఠుఁడు, జీవగఱ్ఱలోనగునది. లక్షణము లక్ష్యానుసారిగానుండ లక్షణవిరుద్ధమగు లక్ష్యము నింద్యమనుట యెట్లని శంకింపఁబనిలేదు. లక్ష్యములు పండితజన వ్యవహారములు గాని పామరజన వ్యవహారములు కావు. ఎక్కడనే నొక్కచో నసాధారణలక్షణవిరుద్ధంబగుపండితజనవ్యవహారంబు ప్రయోగరూఢంబై యనింద్యంబగు.

10. ఈభాష ప్రయోగమే శరణముగాఁగలది. ఆప్రయోగంబులకెల్లఁ గవిత్రయమువారి సమ్మతి యుండవలయును. వారు నన్నయభట్టు, తిక్కనసోమయాజి, ఎఱ్ఱాప్రెగ్గడ అను వీరు మువ్వురు. వీరిప్పు డాంధ్రలక్ష్యములకెల్ల ముఖ్యముగానుండు భారతమును తెనిఁగించినవారు. వ్యాకరణముల యందుఁ గనఁబడని లక్షణంబు లందుఁ బెక్కులు గానఁబడుటంజేసి యది ముఖ్యలక్ష్యమగుటయేగాక లక్షణముగాను బరిగ్రహింపఁబడుచున్నది. అందు,

నన్నయభట్టారకుఁడు అను ప్రాథమిక కవి రాజరాజనరేంద్రుఁడు రాజ్యమేలుకాలంబున రాజమహేంద్రపురమునందు సర్వజనస్తుత్యముగ భారతమునఁ గొంతకొఱఁతగా మొదటి మూడు పర్వములను తెనిఁగించి నన్నయభట్టారకుండనియు, సంస్కృతమునం దార్యావృత్తశ్లోకములతో నాంధ్రశబ్దచింతామణియను నొక తెనుఁగు వ్యాకరణమును వ్రాసి శబ్దశాసనుండనియు బిరుదు గ్రహించెను. ఆంధ్రశబ్దచింతామణికి ప్రక్రియాకౌముది యని నామాంతరము. దీనిని నన్నయభట్టు రచించెఁగావున నిది నన్నయభట్టీయము శబ్దశాసనీయము అను పేళ్లం బ్రవర్తిల్లుచున్నది. ఈ యాంధ్రశబ్దచింతామణికి బాలసరస్వతియను పండితుఁడు టీకయొకటి వ్రాసెను. అది బాలసరస్వతీయమను పేరం బరఁగెడును. తరువాత వాసుదేవుఁడను పండితుఁడు దానికి వృత్తి యొకటివ్రాసెను. దానిని వాసుదేవవృత్తియందురు. తదనంతరము అప్పకవి దానిం దెనిఁగించెను. అది యప్పకవీయమను పేరనొప్పుచున్నది. ఇటీవల అహోబలపతి పండితుఁడును, నృసింహపండితుఁడును విరివిగా దానికి వ్యాఖ్యానములువ్రాసిరి. అవి క్రమంబుగ అహోబలపతిపండితీయము, నృసింహపండితీయము అను నామంబులం బ్రసిద్ధిఁజెందియున్నవి. అహోబలపతిపండితునకు అభినవనన్నయభట్టు అనియు, తద్గ్రంథమునకుఁ గవిశిరోభూషణమనియు నామాంతరములు గలవు. మఱియు నన్నయభట్టు తెనుఁగుపద్యములతో నొకఛందస్సును వ్రాసినట్టు తెలియఁబడుచున్నది. ఇట్లు నన్నయభట్టారకుని కాలము మొదలు తెనుఁగభివృద్ధికి వచ్చుటంజేసి తిక్కనాదులును వారికి వెనుకటి కవులందఱు నాతనినే యాదికవిగా స్తుతించుచువచ్చెదరు. అయిన నింతమాత్రముచేతనే యతనికిముందుగాని యతని కాలమందుఁగాని యితరకవులును నితరగ్రంథములును లేవనఁగూడదు. నన్నయభట్టారకుఁడే "టాది విభక్త్యానిర్ణేత్యేకే నామన్త్రణేడుజిత్యన్యే, డుజతో తునప్లుతిస్యాత్సమ్బుద్ధావిత్యూతాంవిదుర్గకేచిత్, కవి

భల్లపైర్గక్రియాణాం నామ్నాఖ్లోల్లోప ఇష్యతే" అని యాంధ్రశబ్దచింతామణియందు సూత్రించెంగాదె. అంతియకాదు. కాశీఖండంబున "సీ. వచియించు వేములవాడభీమనభంగి నుద్దండలీలనొక్కొక్కమాటు, భాషింతునన్నయభట్టుమార్గంబున నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు, వాక్రుత్తుతిక్కయజ్వప్రకారమరసాభ్యుచితబంధముగ నొక్కొక్కమాటు, పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని త్రోవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు" అని కృతిపతియగు వీరభద్రభూపాలుఁడు శ్రీనాథునిఁజూచి చెప్పినట్లు చెప్పఁబడియున్నది. అట్లు చెప్పఁబడిన క్రమముఁబట్టి యాలోచింప భీమన నన్నయభట్టుకు ముందటివాఁడని తోఁచుచున్నది. అట్లుగాక "భీమన రాఘవపాండవీయమను కావ్యమును నొకఛందస్సును వ్రాయ నన్నయభట్టు స్వగ్రంథప్రాశస్త్యముకై యాకావ్యమును నాఛందస్సునందలి వ్యాకరణాంశమును మూలనడఁగఁద్రొక్కెను. అట్లడఁగఁద్రొక్క నన్నయభట్టువ్రాసిన యాంధ్రశబ్దచింతామణిని భీమన గోదావరిలోఁ గలిపివేసెననియు, అది యట్లు గోదావరిలోఁ గలసిపోఁగా శబ్దశాసనుఁడావ్యాకృతిని వ్రాయుతఱి నాతనితోడం దానిం బఱించిన సారంగధరుఁడు తాను సిద్ధుఁడయినపిమ్మట నాపాఠమును బాలసరస్వతి కుపదేశింప నాబ్రాహ్మణోత్తమునిచే నది భూమియందు వెలయంగఁ దలఁచియు నారాయణమూర్తి చెప్పినట్లు కలగఁటిని" అని అప్పకవి వ్రాసెనని కలదే గాక నిజమయినపక్షమున భీమన నన్నయభట్టుకు సమకాలికుండయి కొంతముందు ప్రసిద్ధికెక్కినవాఁడుగానైన నుండవచ్చును. అది యటుండగాక తిక్కనచే నిర్వచనోత్తరరామాయణంబున గవిస్తుతియందు "అదికవీంద్రులను" అనియు, ఎఱ్ఱాప్రెగ్గడచే హరివంశమునందు నన్నయతిక్కనలను స్తుతించి, మరల "క. వెండియుఁ దొల్లిటియప్పటి, పండితుల మహాకవిత్వ పదవీగరిమా, ఖండితుల నతులతేజో, మండితులఁదలంతు నింపు మనమున నెపుడున్" అనియుఁ జెప్పఁబడియున్నది.

తిక్కనసోమయాజి అను కవివరుఁడు తొలుత నిర్వచనోత్తరరామాయణమును వ్రాసి పిమ్మట భారతమున విరాటపర్వము మొదలు కడకుఁ బదునేనుపర్వములను బొందుపడఁ దెనిఁగించి మిక్కిలి పేర్కొనఁబడెను. నిర్వచనోత్తరరామాయణము కొంతగా వ్రాయఁబడినదగుటచేత నది భారతమును దెనిఁగించిన పిమ్మట వ్రాయఁబడినట్లు కొందఱు తలఁతురు. ఉత్తరరామాయణమునఁ గొంతపడినకథ రామనిర్యాణకథగావున నాతఁ డాకథను వ్రాయ సమ్మతిలేనివాఁడయ్యెనని కొందఱు చెప్పెదరు. గ్రంథశైలినిబట్టియు, భారతము దేవతాంకితముగాను ఉత్తరరామాయణమునరాంకితముగాను నుండుటఁబట్టియుఁ దొలుత నిర్వచనోత్తరరామాయణమును రచియించి పిమ్మట సోమయాజియై భారతమును దెనిఁగించెననుటయే సరియని తోఁచుచున్నది.

ఎఱ్ఱాప్రెగ్గడ.—ఇతఁడు ప్రబంధపరమేశ్వరుఁడను బిరుదు వహించిన దొడ్డకవి. ఈతఁడు భారతారణ్యపర్వశేషమును దెనిఁగించి, భారతశేషమగు హరివంశమును దెనిఁగించినపిమ్మట లక్ష్మీనృసింహావతారమను నొక కావ్యమును వ్రాసెను. దీనికి అహోబలమాహాత్మ్యమని నామాంతరము. ప్రబంధపరమేశ్వరుఁడను బిరుదనామముతో నీతఁ డారణ్యపర్వశేషమును వ్రాసిన ట్లక్కడక్కడఁ జెప్పఁబడి యున్నది. అది యిప్పుడట్లు కనఁబడునదికాదు.

భారతమునందు నన్నయభట్టారకుని కవిత్వమున నాంధ్రపదంబులు గొన్ని సంస్కృత పదంబులు మెండు. తిక్కనసోమయాజి కవిత్వమున సంస్కృతపదంబులఁ గొన్ని యాంధ్రపదంబులు మెండు. ఎఱ్ఱాప్రెగ్గడ కవిత్వమున సంస్కృతాంధ్రపదములు రెండును మణిసరంబు గ్రుచ్చినట్లు సమముగా నుండును. ఈ మూటికిని పాకభేదంబును గలదు. వీరి కవిత్వములు సర్వవిధంబులచేతను మిక్కిలి శ్లాఘనీయములనుట విశేషముకాదు.

అథర్వణాచార్యుఁడు అని కవిత్రయము వారికాలమునందొకగొప్పపండితుఁడుండెను. అతఁడు త్రిలింగశబ్దానుశాసనమను వ్యాకరణమును వికృతివివేకమను వ్యాకరణకారికలను వ్రాసినవాఁడు. ఆంధ్రశబ్దచింతామణియందు లేనియనేక లక్షణములు వికృతివివేకమందుఁ జెప్పఁబడియున్నవి. అతఁడు వ్రాసిన విరాటపర్వంబును నొక్కండు గానంబడియెడి. కొందఱు ఇతఁ డాంధ్రభారతమొకటివ్రాయుట మొదలుగా నెంతయు శోచ్యమైన వృత్తాంతమును గొంత చెప్పుచున్నారు. అవృత్తాంతము

గాని నన్నయభట్టారకుని యందు గొప్పదోషమేర్పడుచున్నది. దాని వాస్తవార్థ మెట్టిదో తెలిసినదికాదు. ఇతనిని ద్వితీయాచార్యుఁడని పేర్కొందురు. ఇతఁ డిట్లు పేర్కొనఁబడుటచే నన్నపాచార్యుఁడు ప్రథమాచార్యుఁడనుట స్పష్టమగుచున్నది. హరి యను నొక పండితుఁడుండి కొన్ని కారికలను వ్రాసినట్లు అథర్వణాచార్యునిచేఁ జెప్పఁబడియున్నది. "అప్రయుక్తత్వదోషస్తు నవిరుద్ధో హరేర్మతే" అని. వీరికి వెనుక కవిరాక్షసుఁడను నొక యుద్దండకవియుండి కవిరాక్షసీయమను నొక లక్షణగ్రంథమును వ్రాసినట్లు కూడఁ జెప్పఁబడియున్నది. అదిదృగ్గోచరము కాదు.

నాచనసోమన అనియొక మహాకవి కలఁడు అతఁడు ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమును వ్రాసినపిదపఁ దానొక హరివంశమును వ్రాసెను దానంజేసి యీ కవి కవిత్రయమువారికి వెనుకటివాఁడనియు నా గ్రంథ ముత్తరహరివంశమని పేర్కొనఁబడెననియు నెఱుఁగఁబడుచున్నది. ఆగ్రంథ మిక్కడ సమగ్రముగాఁ జిక్కకపోయినను జిక్కినంతమట్టు పరికించిచూడఁగా నది మిక్కిలి ప్రౌఢముగాను భారతమునకంటె నెల్లవిషయముల విశేషించినదిగాను గానంబడుచున్నది. ఇతనిని సర్వజ్ఞుఁడందురు. అట్లనుటకు సందేహింపఁబనిలేదు. కనుగొనుండు. ఉత్తర హరివంశమునందలి పద్యము. — "సీ. వంకదారకుఁ జేరి వాకిటిదద్దడంబులు సెర్చి కొమ్మలమోకువైచి, ప్రాఁకిలోపలఁజొచ్చి పలుగాఁడిఁదెఱచిన పంతకార్లకు మున్న బ్రద్దపరుల, తోనచ్చెనలెక్కి దోనికొత్తళములోఁ బురణించి చొచ్చిన పోటుమగల, వాఁడిమెచ్చకయాడు పరిమీఁదఁబాళెలవారిఁ దాఁకించిన వానిబిరుదు, లచ్చెరువులొందమేడలు సొచ్చియార్చు, దొడ్డకార్లచేఁబడిపోయెఁ దూర్పుదిక్కు, జాలవాటులనేటుల అంతుమిగిలి, తతిసురచ్ఛటిబలముఁ గొందలగడంగి."

11. వెనుకటికవులు ప్రశస్తులయి రమారమి నాదికవులతోఁబోల్పఁదగి వశ్యవాక్కులుగా నుండువారనేకు లున్నారు. వారు.—రంగనాథుఁడు, భాస్కరుఁడు, అమరేశ్వరుఁడు, బమ్మెరపోతన, శ్రీనాథుఁడు, ప్రౌఢకవిమల్లన, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, మారన, జక్కన, కేతన, అనంతామాత్యుఁడు, తాతంభట్టు, ముద్దరాజు రామన, వెన్నెలగంటిసూరన, పింగళిసూరన, అల్లసాని పెద్దన, ముక్కుతిమ్మన, తెనాల రామకృష్ణుఁడు, రామభద్రుఁడు, బట్టుమూర్తి, కాకమానిమూర్తి, అడిదముసూరన, పుష్పగిరితిమ్మన, తెలగనార్యుఁడులోనగువారు. క్రింఁదఁజెప్పఁబడిన కవులు మూఁడుతెగలుగ నేర్పడుచున్నారు. అందు మొదటితెగవారు నన్నయభట్టారకాదులు. వీ రాదికవులు. రెండవతెగవారు రంగనాథాదులు. వీరు మధ్యకవులు. (కేతనయు, తాతంభట్టును నన్నయభట్టుకు ముందటివారని కొందఱు చెప్పుచున్నారు.) మూఁడవతెగవారు పెద్దనాదులు. వీ రంత్యకవులు. వీరికి వెనుకటి కాలమునందును పెక్కండ్రుకవులు గలరు. వా రాధునికులని చెప్పఁబడుదురు. వారలు లింగముగుంటతిమ్మన, కూచిమంచితిమ్మన, చెఱకుసూరి రామయ, అప్పకవి, అప్పయవేంకటపతి మొదలగువారు. కవితాశైలినిబట్టి వీరిలో మూఁడుతరగతులేర్పడుచున్నవి.

రంగనాథుఁడు ద్విపదరామాయణమును సలక్షణముగ వ్రాసినవాఁడు. ఇతఁడు దానిని బుద్ధరాజు రచించినట్లు వ్రాసినను అది యితనిపేరనే ప్రసిద్ధికెక్కెను. ఇతఁడు లాక్షణికుఁడైన దొడ్డకవి గావున ప్రతిక్షిప్తములయిన వాక్యములదోషము లితనివిగా నెన్నఁబడఁగూడదు.

భాస్కరుఁడు.—ఇతఁడిప్పుడు కనఁబడు రామాయణమునందు యుద్ధకాండమున ముందటి భాగమును వ్రాసినవాఁడు. ఇతనిని హుళక్కి భాస్కరుఁడందురు. బాలకాండమును కిష్కింధాకాండమును సుందరకాండమును నితనిపుత్రుఁడగు మల్లికార్జునభట్టు వ్రాసెను. అయోధ్యాకాండమును కుమారరుద్రదేవుఁడను కవి వ్రాసెను. యుద్ధకాండశేషము నీ భాస్కరుని మిత్రుఁడగు నయ్యలార్యుఁడు వ్రాసెను. అరణ్యకాండ మిందెవరిచేతను వ్రాయఁబడినదికాదు. అది తిక్కనసోమయాజి తాతయగు మంత్రి భాస్కరమహాకవిచే వ్రాయఁబడినది. మంత్రిభాస్కరుఁడు తిక్కనసోమయాజి తాతయవుటయు మహాకవియవుటయు నిర్వచనోత్తరరామాయణమునందలి "తే. సారకవితాభిరాము గుంటూరఁ విభుని, మంత్రిభాస్కరు మత్పితామహునిఁదలఁచి, యైనమన్ననమెయిఁ లోక మాదరించు, వేఱనాకృతి

"గుణములు వేయునేల" అను నీపద్యముచేతను తెల్లమగును. మంత్రి భాస్కరుఁడు భారతము తెనిఁగింపఁబడుటకుముందే రామాయణమొకటి వ్రాసినట్టు రూఢమగుచున్నది. దానిచేతనే భాస్కరరామాయణమను పేరును గలిగియుండవచ్చును. అది యాదికావ్యమగుటచేత నట్లు మొట్టమొదట తెనిఁగింపఁబడియే యుండును. కనుకనే నన్నయభట్టారకుఁడు దానిఁదలఁచి భారతమును దెనిఁగింపఁదొరఁకొనుటయు, రామాయణమును దెనిఁగింపఁబూనుకొన్న తిక్కనసోమయాజి యందలి పూర్వకాండములను వదలి యుత్తరకాండమును దెనిఁగించుటయు నని యెఱుంగునది. అట్లు మంత్రి భాస్కరునిచే రచియింపఁబడిన రామాయణమునం దారణ్యకాండముతక్కఁ దక్కిన కాండములు కొంతకాలమునకుఁబిదప నష్టమ్ములైపోఁగా ఆయారణ్యకాండముతోఁ జేసి హుళక్కి భాస్కరుఁడులోనగువారు తక్కిన కాండములను వ్రాసిచేర్చి పూర్తిచేసిరని తెలియవలయు. మఱియు నారణ్యకాండము మంత్రి భాస్కరునిచే వ్రాయఁబడినదగుటను, అది తక్కిన కాండములవలె నేకాశ్వాసముకలదిగాఁ జెప్పఁబడక రెండాశ్వాసములుకలదిగాఁ జెప్పఁబడియుండుటచేతను, ఆయాశ్వాసములయందలి యాద్యంతపద్యముల వైలక్షణ్యముచేతను, ఆశ్వాసాంత్య గద్యభేదములచేతను, శైలిభేదము చేతను నిశ్చయింపవచ్చును.

అమరేశ్వరుఁడు.—ఇతఁడొక దొడ్డకవిగా గ్రంథములయందుఁ జెప్పఁబడియున్నాఁడు గాని యితఁడు రచించిన గ్రంథమేదియుఁ గానఁబడదు.

బమ్మెరపోతన.—ఇతఁడు గొప్పకవి. భాగవతమును దెనిఁగించినవాఁడు. అది నాతికఠినంబై తేఁటగ శబ్దాలంకారసహితంబై మిక్కిలి శ్రావ్యంబై కొంతయేనియు విషయభేదములేక సంస్కృతమున కొక టీకవలె మిగులశ్లాఘనీయంబై యున్నయది. ఇతఁడు భాగవతమును దెనిఁగించినపిమ్మట వీరభద్రవిజయమను నొక కావ్యమును వ్రాసెను. చంద్రుని యందుఁ గళంకమువలె నీతని కవిత్వమునందు లఘ్వలఘురేఫములకు మైత్రిగలుగఁజెప్పుటయను నొక యొచ్చెంబు గానంబడియెడి. ఈయొచ్చెము మఱి కొందఱుకవుల కవిత్వములయందును జూపట్టెడి. లఘ్వలఘురేఫములకు మైత్రి కలుగఁజెప్పుట తెలియక కాదు. అది యొకమతముగా వారు గ్రహించినారు. ద్రావిడమునందువలె నాంధ్రమునందును లఘ్వలఘుభేదంబుచే రేఫంబు ద్వివిధంబు. అవి పండితప్రయోగసంకేతితము లయినవి. వానికి యతిప్రాసములయందు మైత్రి కలుగఁజెప్పుట యాదికవి సమ్మతముకాదు. "నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యంస్యాత్" అని శబ్దానుశాసనుఁడు. "అనయోస్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ, అస్యాత్యంతదోషత్వా ద్దుష్కవిస్సహి కథ్యతే" అని సుకృతివివేకకారుఁడు. మఱియు నిం దర్ధానుస్వారంబొక్కండు విశేషంబుగఁ గలదు. అదియుఁ బండితప్రయోగ సంకేతితమే. అది ఈభాషకు సహజమయిన లక్షణమనుట యాంధ్రదేశీయుల వ్యవహారములందుఁ దెల్లంబుగఁ దెలియఁబడు. ఈ రెంటిచేతనే యాంధ్రభాష మిగుల మహిమం బొంది యున్నది. వాని భేదంబులను గుర్తెఱుఁగుట పండితులకత్యావశ్యకము.

శ్రీనాథుఁడు.—ఇతఁడొక ప్రశస్తకవి. ఇతఁడు బాల్యమున మరుత్తునిచరిత్రమును, పండితారాధ్యచరిత్రమును, ప్రథమయౌవనమున శాలివాహనసప్తశతిని; పూర్ణయౌవనమున నైషధమును, కౌమారదశయందు భీమేశ్వరపురాణమును, కౌమారదశకుఁ గడపట కాశీఖండమును రచియించెను. ఇతఁడు వ్రాసిన కావ్యములయందు నైషధము శృంగారప్రధానమై యుండుటగాక యీతని యితరకావ్యములకంటె నిది సంస్కృతపద భూయిష్ఠమై ప్రౌఢమై యున్నయది. మఱియు నితఁడు వీధినాటకమను నొకగ్రంథమును వ్రాసినట్లు చెప్పుచున్నారు.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు.—ఇతఁడు గొప్పకవి. ఇతని కవిత్వము మిక్కిలి శ్లాఘ్యముగానే యున్నది. అయిన నితఁడు బమ్మెరపోతన మతము నవలంబించినవాఁడు.

కేతన.—ఇతనికి అభినవదండియని బిరుదుపేరు. ఇతఁడు విజ్ఞానేశ్వరీయమను ధర్మశాస్త్రమును దెనిఁగించి, ఆంధ్రభాషాభూషణమను నొక లక్షణగ్రంథమును వ్రాసినాఁడు.

అనంతామాత్యుఁడు.—ఇతఁడొక లక్షణగ్రంథమును వ్రాసినాఁడు. భోజరాజీయమను

కావ్యమును వ్రాసినాతఁడు నితఁడని తోఁచుచున్నది. అది మంచికావ్యము. అందు వింతవింత కథలుఁగలవు.

**తాతంభట్టు.**—ఇతఁడు కవిచింతామణియను నొక లక్షణగ్రంథమును వ్రాసినాఁడు.

**ముద్దరాజురామన.** — ఇతఁడు కవిలోకసంజీవనియను నొక లక్షణగ్రంథమును వ్రాసెను. రాఘవపాండవీయములో నగువాని వ్యాఖ్యానములచే నాంధ్రశబ్దచింతామణి బాలసరస్వతివలన బయలుకి రాకముందు కేతనాదికవులు వ్రాసిన యాంధ్రభాషాభూషణాది లక్షణగ్రంథములే యుపయోగపడుచుండెనని తెల్లమగుచున్నది.

**పింగలిసూరన.**—ఇతఁడు మిక్కిలి దొడ్డకవి. వెన్నెలగంటిసూరన యీయనకు ముంగలివాఁడు గనుక ఈయనకు పింగలిసూరనయని పేరువచ్చినది. ఇతఁడు క్రమముగా గరుడపురాణమును, రాఘవపాండవీయమును, కళాపూర్ణోదయమును, ప్రభావతీప్రద్యుమ్నమును, మఱికొన్ని కావ్యములను రచించినవాఁడు. ఇందు రెండవది రాఘవపాండవుల చరిత్రములను శ్లేషభంగిం దెలుపుచు సులభశైలిచే శోభిల్లుచున్నది. మూడవది అతి విచిత్రమగునొకానొక కల్పితకథచేఁ గొనియాడఁదగి మృదుశైలియుంగలిగి వఱలుచున్నది. కడపటిది మృదుశైలియుఁ జక్కనిస్వభావోక్తులునుగలిగి వినువారి వీనులకుఁ దేనియ లొలుకుచున్నది. భాషాశ్లేషగాఁ గావ్యము చెప్పు విషయమునకు నితఁడు మార్గదర్శిగా నున్నాఁడు. వెనుకటికవులలోపల నితఁడు సర్వతోముఖచాతుర్యుఁడని చెప్పనొప్పును.

**అలసానిపెద్దన** కృష్ణదేవరాయల కాలమందలి పండితులలో ముఖ్యుఁడుగానుండెను. ఇతఁడు స్వారోచిషమనుసంభవమను నొక కావ్యమును వ్రాసెను. దానిని మనుచరిత్రమనియుం జెప్పుదురు. అది మృదుశైలియు "అల్లసానివాని యల్లికబిగియును" అన్నట్లు కవిత్వగాంభీర్యమును గలిగి శృంగారరసప్రధానమై యున్నయది అందు నాలవ యాశ్వాసము కేవలాంధ్రపదభూయిష్ఠమై యుండును. పూర్వకవితాధోరణి ననుసరించియుండుటం జేసి కొన్నియెడల నైషధమార్కండేయపురాణములయందలి వాక్యములకును నిందలివాక్యములకును సుంతయేనియు భేదమగపడక యుండును. ఇతఁడే విష్ణుచిత్తీయమని ప్రసిద్ధిఁబొందిన ఆముక్తమాల్యదయను కావ్యమును వ్రాసినవాఁడని చెప్పుదురు. శైలిభేదిల్లి వ్యాకరణదోషయుక్తమయి యుండుటంజేసి యందుఁ జెప్పఁబడినయట్లు యది కృష్ణదేవరాయని చేతనో మఱి యేకవిచేతనో వ్రాయఁబడినదిగాని పెద్దనచే వ్రాయఁబడినదికాదని తోఁచుచున్నది. స్వారోచిషమనుసంభవములోని పద్యములు కొన్నియందుండుటచేత నేయట్టిదానిఁ బెద్దనరచితముగాఁ జెప్పుట యుక్తముకాదు. పెద్దన లదాస్థాన ముఖ్యపండితుఁ డగుటంజేసి స్వారోచిషమనుసంభవమునందలి పద్యము లిందుండుటకుఁ గావలసియుండినఁ గారణాంతరములను వలసినన్ని కల్పించుకొనవచ్చును.

**ముక్కుతిమ్మన.** — ఇతనికి నందితిమ్మనయని నామాంతరము కలదు. ఇతఁడు పారిజాతాపహరణమనునొక కావ్యమును రచియించెను. అది "ముక్కుతిమ్మనార్యు ముద్దుఁబలుకు" అన్నది నిజముగా మృదుపదసందర్భము గలిగి మధురముగా నున్నయది.

**తెనాలిరామకృష్ణుఁడు.** — ఇతనిని మహాకవియని చెప్పవలెను. ఇతఁడు పాండురఁగవిజయమను నొకకావ్యమును రచియించెను. దానిని పాండురంగ మహాత్మ్యమనియుం జెప్పుదురు. ఇతనికిఁ బదసందర్భము కుదిరినట్టు లేకవికిం గుదిరినదికాదు. ఇందు నిరర్థకపదము మందునకైన నొక్కండు దొరకదు. "పాండురంగసుకవిపద్యంబుహారువును" అన్నది సార్థకముగానర్ణనావైలక్షణ్యము గలిగి శ్లాఘ్యతరమైన కవిత్వశైలిగలదై యున్నది. ఇతఁడు నిరోష్ఠ్యరామాయణాది చిత్రకావ్యములను గొన్ని చెప్పినట్లు వినఁబడుటయేకాని యవి కనఁబడవు.

**రామభద్రుఁడు.**—ఇతఁడొక దిట్టకవి. ఈతనిని రామకృష్ణకవికి రెండవవానిఁగా నగ్గడింపవచ్చును. ఇతని కవిత్వమునందు యమకములును బ్రాసములును మెండుకొని పండితులకు హృదయంగమములయి యున్నయవి.

**బట్టుమూర్తి.** — ఇతనికి రామరాజభూషణుఁడని నామాంతరము. రామభూషణుఁడనియే గ్రంథనిబద్ధనామము. ఇతఁడు వసుచరిత్రమును, హరిశ్చంద్ర నళోపాఖ్యానమును వ్రాసినవాఁడు. వసు

చరిత్రముతోఁ దులదూఁగఁదగిన శ్లేషకావ్యము తెనుఁగున మఱియొండు లేదు. అయిన నిందు నాదికవుల ననుసరింపని పదప్రయోగములు కొన్ని గలవు. ఈతఁడే కావ్యాలంకారసంగ్రహమును రచించినట్లు నానుడి కలదుగాని వసుచరిత్ర హరిశ్చంద్ర నళోపాఖ్యానముల యాశ్వాసాంతగద్య ప్రవృత్తియు ను, కావ్యాలంకారసంగ్రహముయొక్క యాశ్వాసాంతగద్యప్రవృత్తియును భిన్నప్రకారములుగా నుండుటంజేసి యది సందిగ్ధంబుగా నున్నయది.

అడిదము సూరన.—ఇతఁడొక సుకుమార కవి. ఈతఁడు శుద్ధాంధ్రరామాయణమును, కవిజనరంజనమను నొకచిన్నకావ్యమును రచియించినవాఁడు. ఇందు మొదటిది వెనుకటికవులచే మూలనడఁగఁ ద్రొక్కఁబడి రెండవదిమాత్రము కనఁబడుచున్నది. దానిని పిల్లవసుచరిత్రమని చెప్పుదురు. అది తన పడసిననామము నన్వర్థముచేయుచున్నది. మఱియు నితఁడు కవిసంశయవిచ్ఛేదమని యొక చిన్న లక్షణగ్రంథమును వ్రాసినాఁడు అని తప్పివ పదములు కలిగిన విషయము గొంత యెఱిఁగించుచున్నది.

పుష్పగిరి తిమ్మన.—ఇతఁడు సమీరకుమార విజయమను నొక కావ్యమును వ్రాసెను. మఱియు నితఁడు కంకంటిపాపరాజు వ్రాసినట్లు ఉత్తరరామాయణ మొకటియు, కంకంటి నారసింహరాజు వ్రాసినట్లు విష్ణుమాయావిలాస ద్విపదకావ్యమొకటియు రచించినాఁడని చెప్పుచున్నారు. దశావతారచరిత్రంబును నితనిచే వ్రాయఁబడినదనియుఁ గొందఱు చెప్పెదరు. ఇతని కవిత్వమునందు లక్షణవిరుద్ధములగు ప్రయోగములు కొన్ని కానఁబడుచున్నవి.

తెలగనార్యుఁడు. — ఇతఁడు యయాతిచరిత్రము నొకకావ్యమును అచ్చతెనుఁగుతో వ్రాసినాఁడు. అది శ్రుతికటువుగాక మృదువుగాను ప్రౌఢకగాను నున్నయది. ఇది యచ్చతెనుఁగుగ్రంథములలో మేలైనదని తోఁచెడి.

లింగముగుంటతిమ్మన సులక్షణ సారమను నొక లక్షణగ్రంథమును వ్రాసెను.

కూచిమంచితిమ్మన రసికజనమనోభిరామమును, రాజశేఖరవిలాసమును, రుక్మిణీపరిణయమును, అచ్చ తెనుఁగురామాయణమును, అచ్చ తెనుఁగు నీలాసుందరీపరిణయమును, లక్షణసారసంగ్రహమను నొక శబ్దలక్షణమును విరచించెను. ఈతని కవితాధోరణి యనర్గళప్రవాహమువంటిదని తెలియ వచ్చెడిని.

చెఱకుసూరిరామయ కువలయానందమను నలంకారగ్రంథమును దెనిఁగించినవాఁడు.

అప్పకవి. — ఇతఁడు మిక్కిలి యోపికతో ననేక గ్రంథములను శోధించి యప్పకవీయమను గ్రంథమును వ్రాసినాఁడు. అంతటిశోధనము మఱియొక్కరి కుండదని తోఁచెడి. ఇతఁడు కవికల్పకమను లక్షణగ్రంథములోనుగాఁ గొన్నికృతులు చేసినట్లు చెప్పఁబడియున్నది అవి గానఁబడవు.

అప్పయవేంకటపతి.—ఇతఁడు ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమను నొక పెద్దలక్షణగ్రంథమును వ్రాసినవాఁడు.

ప్రౌఢకవిమల్లన, మారన, జక్కన, వెన్నెలగంటి సూరన, కాకమానిమూర్తి. వీరు లాక్షణికులయిన గొప్పకవులు. వీరు రచించిన గ్రంథములు తొల్లింటికవుల గ్రంథములవలె మిక్కిలి కొనియాడఁదగినవిగా నుండును. ఆ గ్రంథముల నామములును, తదితరగ్రంథముల నామములును; వానిరచించినవారి నామములును నిందు గ్రంథసంకేతాదివేచనపట్టికఁ జూడ విశదములు కాఁగలవు. ఎందుఁ బురాతనకృతులు పెక్కులు స్వకర్తలు తమ్ముంబాసి మేముదొలంగినం దాము పతివిహీనలునయి పరిపంథి పరిభవ పరిపీడనంబున మూలల నడంగిపోయె. “బోద్ధారోమత్సరగ్రస్తాః” అన్న భర్తృహరి సుభాషితం బేల పొల్లపోవు

12. మఱియుఁ జాటుప్రబంధకవులు లెక్కకు మీఱియున్నారు. వారు.—బడబానలభట్టు, మేధావిభట్టు, రెల్లూరి తిరుమలయ్య, ఎడపల్లి పర్వతన్న, పెద్దిరాజు రామరాజు, పింగలిరామరాజు, రంగరాజు లింగయ, రాచపాటి తిప్పరాజు, మైలము భీమన, పొట్లూరి గోపన, పలకలూరి గోపన, రాచపూడి వెంకయ్యలో నగువారు.

### అందు, మేధావిభట్టు చాటుధార.

"క. సాళువపెదతిమ్మమహీ, పాలవరుఁడుపేఁడె
నచ్చెఁ బద్యమువ్రాయఁగ, నేలనులేదా కొకటియుఁ,
దాళమముత్తురియఁగుచ ధరపైఁబడుమా."

13. ఇంకను లక్ష్యలక్షణ గ్రంథముల నామంబులనేకంబులుగనఁబడుచున్నవికాని యాగ్రంథములును, అందుఁ గొన్నిగ్రంథములు వ్రాసినవారి నామంబులును గనఁబడవు.

### అందు, లక్ష్యగ్రంథములు.

అష్టమహిషీకల్యాణము, కూర్మపురాణము, చంద్రికాపరిణయము, చమత్కారరామాయణము, చాటుపద్యచరిత్రము, చిత్రభారతము, త్రైశంఖ్యోపాఖ్యానము, నేకవిజయము, మనుసేవనము, రాజశేఖరచరిత్రము, వసంతవిలాసము, విజయసేనము, శశిబిందుచరిత్రము, శృంగారషష్ఠము, సాంబోపాఖ్యానము, సుదక్షిణాపరిణయములోనగునవి.

### లక్షణగ్రంథములు.

కవిభల్లటఫక్కి, అధోక్షజఫక్కి, కవికంఠపాశము, కవిమూషకమార్జాలము, కవిగజాంకుశము, కవిజనాశ్రయము, కవికంఠాభరణము, కావ్యచింతామణి, కావ్యాలంకారచూడామణి, అధర్వణచ్ఛందము, గోకర్ణచ్ఛందము, శ్రీధరచ్ఛందము, ఛందోదర్పణము, అలంకారసంగ్రహము, అలంకారరత్నావళి, లక్షణవిలాసము, లక్షణదీపిక, శారదాదీపిక, శారదామకుటము, శారదాతిలకము, శారదాదర్పణము, వాగీంద్రచూడామణి, వైకృతచంద్రిక, (ఈ గ్రంథము కొంతమట్టుకు దొరకినదిగాని అందు దాని వ్రాసినవాని పేరు గనఁబడదు.) సర్వలక్షణసారసంగ్రహము మొదలగునవి.

14. ఈకవులు భావవిస్ఫూర్తిగ రసంబులుచిప్పిలునట్లును, తత్తద్రసానుకూలంబుగఁ బదంబులు పొంకపడునట్లును, అకలంకమార్గంబుగ నలంకారంబులు విలసిల్లునట్లును ఏవిధమయిన లక్షణలోపంబులులేకుండఁ గవితలొనర్ప నసదృశులైయున్నారు. సంస్కృతభాషయందపారజ్ఞానములేక వీరి కింతటివైదుష్యము కలుగఁబోదు. అయినను వీరు కవిత్వంబుఁ జెప్పఁ బ్రారంభించుచో "గతానుగతికో లోకః" అన్నట్లందఱు నొక్కమార్గంబవలంబించియున్నారు. అయ్యది హాస్యాస్పదంబుగనున్నయది. అదియనఁగా స్వప్నంబుం గాంచుటలోనగునది. వారిభక్తితాత్పర్యమెట్టిదో యది యటుండనిండు. మతియొక్క విశేషంబు వినుండు. వీరు వర్ణనలు సేయ మొదలుపెట్టిరా మీరు నమ్ముదురో నమ్మరో తల్లిగేని కేశాది నఖపర్యంత మొక్కయంగమైనఁజిక్కక సివమెత్తినట్లు వర్ణింపక మానరు. అది యెట్టి పారవశ్యమో యెఱుఁగరాదు. మతస్థాపకులయిన యాచార్యులో యిందులకును నాచార్యులే. ఇది యిప్పుడు వచ్చినదికాదు. పారంపర్యముగ సంస్కృతభాషా మహాపండితుల సన్నిధానమునుండి వచ్చిన సంప్రదాయముగానున్నయది.

వీరు మహనీయులుగావున నిర్మలచిత్తులై స్తోత్రపరాయత్తులై యభేదబుద్ధితో నిట్లువర్ణించుట "తెల్లనిదంతయుఁ బాలు నల్లనిదంతయు నీళ్లు" అని యెంచియున్న యాకాలమునందు శ్లాఘనీయంబైయుండెంగాని యిప్పటికాలమునం దది యట్లుండునని తోఁచినదికాదు.

15. ముత్తెగలకవుల శైలికిని ఆధునికకవుల శైలికిని జాల నంతరముగలదు. అదిగాక వారికవిత్వములయందు లేనియన్యదేశ్యములును, వైకృతములును వీరి కవిత్వములయందు మెండుగాఁ గానఁబడుచున్నవి.

### ఆదికవికవిత్వము.

"సీ. లలితంబులగుమట్టియలచప్పుడింపార నంచకైవడినడనల్లవచ్చి, యొడమేనిసెత్తావి సుడియంగఁబయ్యెద సగముదూలించి పై మగుడఁదిగిచి, సోలెడుసెలధీఁగ లీలఁగ్రాలుచు వింతచెలువంబు దలకొనఁజేరి నిలిచి, తెలిగన్నుఁగవను నెచ్చెలిపైనెనలేఁతన వ్వోలయంగ సరసంపుఁ బలుకువలికి, మెఱయురాగంపుఁజెయ్వులు మేకొనంగ, నెడఁదసొగయించు మాటల నెలమిమిగుల, నిన్ను ననురక్తిఁగొలుచునన్నెలఁతలుండ, నీరసాకారసైరంధ్రిఁ గోరఁదగునె."

### మధ్యకవికవిత్వము.

'స్రగ్ధర. సేవించెన్ రంగధామున్ శ్రితనివహపయస్సింధుసంపూర్ణసోమున్, గావేరీమధ్యసీమున్ ఘనకలుషమహాకాలకూటోగ్రభీమున్, దేవారిశ్రీవిరామున్ దివిజవినుతసందీప్తితానంతనామున్, ధీవిజ్ఞానాభిరామున్ ద్రిభువనవిలసద్దేవతాసార్వభౌమున్."

### అంత్యకవికవిత్వము.

"శా. తండ్రీనాకును గ్రహింపఁగ దైవైద్యంబంచుఁ బ్రార్థించినన్, గండ్రగ్లానటులాడిధిక్కృతు లంటోకాల్మంటివో హాహామదిన్, దీండ్రల్గల్గినవారి కేకరణి నేనిన్ విద్యరాకుండునే, సుండ్రాడాఁచినఁ భేండ్లిమేమిటికిఁ జిక్కుంగష్టముప్పింపచా."

### ఆధునికకవికవిత్వము.

"మ. తలిరుంజొంపపుఁడాలు పూరజపునిద్రాజాలు బత్తేటిగం, టలచాలు న్విరితేనెమేలు తరులంటం గ్రాలుఁజేదీవచే, గ్గలబాకిలు జగాచొకాయలరు జాగామావటీ లొప్పుఁగా, నలరాదంతులకైవడిన్ వనము త్రోసెంద్రిమ్మరుందెమ్మెరల్."

ఇవి దిక్ప్రదర్శనముగఁ జూపఁబడినవి.

16. "మ. మహిమన్ వాగనుశాసనుండు సృజియింపంబడెఁ ద్రుఁచెుఁ, న్మనీయస్థితిమూలనై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహా, మహులైసోముఁడుభాస్కరుండు వెలయింపన్ సొంపువాటించునీ, బహుశాఖోద్ధురశక్తిమయప్రపంచమునఁదత్ప్రాగల్భ్యమూహించెదన్" అన్న పద్యార్థముచొప్పున నన్నయభట్టారకునికాలముఁదొట్టి క్రమక్రమంబున వృద్ధిఁబొంది సొంపుఁజెందియున్న యయ్యాంధ్రవాణి కృష్ణదేవరాయలవారికాలంబున రేయుంబవలు సరసగోష్ఠీవినోదక్రీడలం బ్రొద్దుపుచ్చి తదనంతరంబా శ్రమంబు పరిహారంబుగాఁ గొంతకాలంబు సుఖనిద్రంజెందియుండి యిప్పుడుమహాప్రభువులగు నింగ్లీషువారిదొరతనంబున శ్రద్ధాళువులయిన విద్యార్థుల విద్యాపఠనభవ్యరవంబుల మేల్కాంచి శుచిర్భూతయయి యుత్సాహంబుతో మరల నలంకరణంబుచేసికొను నవసరంబున నున్నయది.

---

# నియమవిధానక్రమము.

1. నన్నయభట్టారకుఁ డాంధ్రవ్యాకరణంబునఁ బఱచిన వర్ణసమామ్నాయమందలి వర్ణక్రమము ననుసరించుటంజేసి యీనిఘంటువునందు శకారయుక్త పదములు కడపట వ్రాయఁబడెను.

2. ఇందుఁ గ్రియాపదములకు ధాతురూపములుమాత్రమును, నామపదములకుఁ బ్రథమైకవచన రూపములుమాత్రమును వ్రాయఁబడును.

3. ఇందు సామాన్యములైన సమాసపదములు ప్రత్యేకముగా నెత్తి వ్రాయఁబడవు. అవి.—కట్టలుక, కట్టెండ, కెంగేలు, కెమ్మోవి, క్రొంజాయ, క్రొమ్ముడి, నెత్తావి, నెమ్మోము, పూఁదోఁట, పూరెమ్మ, ప్రాఁగెంపు, ప్రాయిల్లు, లేఁగొమ్మ, లేదూఁడ మొ (చూ. కడు, కె, క్రొ, నె, పూ, ప్రా, లే మొ)

4. సంస్కృతము, వైకృతము, దేశ్యము, గ్రామ్యము వీని కాయాయిసంజ్ఞ లిడఁబడును. అన్యదేశ్యము దేశ్యముతోఁ జేర్పఁబడినదిగాన దానికిఁ బ్రత్యేకముగా సంజ్ఞ యిడఁబడదు.

5. ద్వయమునకు అవయవములైన పదములయొక్క సంజ్ఞలను అయ్యాయి శబ్దముకడఁ జూచునది. అనఁగా "ఇంచుఁబోఁడి" అనుచో ఇంచుశబ్దముయొక్క సంజ్ఞను ఇంచుకడను, పోఁడిశబ్దముయొక్క సంజ్ఞను పోఁడికడను జూడవలయునని యర్థము. ఇట్లు తక్కినచోట్లను దెలియవలయును. (చూ. ద్వ. సంజ్ఞావివరణపట్టికయందు.)

6. ఇందు సంస్కృతశబ్దమొకటి యర్థభేదముచే మూఁడు లింగములయందును వర్తించునపుడు ముందు స్త్రీలింగరూపార్థమును వెనుక నపుంసకలింగరూపార్థమును నావెనుక పుంలింగరూపార్థమును వ్రాయఁబడును. పుంలింగమయ్యును స్త్రీలింగతుల్యరూపమయ్యేనేని యా పుంలింగరూపార్థము నపుంసకలింగరూపార్థమునకుముందు వ్రాయఁబడును. (చూ. నందన, బ్రహ్మ మొ.)

7. "మువర్ణాంతము" అనుచో నాపదమునకు మువర్ణమును జేర్పవలెనని యర్థము. చేర్చుచో నా

పదము మువర్ణకాంతముగా నుండెనేని యా మువర్ణక మును నాముందటి యుత్వమును దొలఁగింపవలయును. (చూ. అంగజ, మధుసూదనుఁడు మొ.) (చూ. ము. సంజ్ఞా... పట్టికయందు)

8. "డువర్ణకాంతము" అనుచో నా పదమునకు డువర్ణకమును జేర్పవలయునని యర్థము. చేర్చుచో నా పదమును ఉదంతముగాఁ జేసికొనవలయును. అది యితర ప్రత్యయాంతముగా నుండెనేని యా ప్రత్యయమును దొలఁగించి పిమ్మట ఉదంతముగాఁ జేసికొన వలయును. (చూ. నంది, అంగడము మొ.) (చూ. ము. సంజ్ఞా... పట్టికయందు.)

9. ఒక్కొకచో నించుక రూపభేదముగల శబ్దము దాని మొదటిరూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ. అకటవికటము మొ.)

10. ఒక్కొకయెడ మువర్ణాంతరూపము మువర్ణములేని శబ్దరూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ. అగ్గలిక మొ.)

11. కొన్నిచోట్ల తెనుఁగుపదమునకు ఇయాంతరూపము ఏదంతరూపము రెండును వ్రాయఁబడును. కొన్నియెడల ఇయాంతరూపముకడ ఏదంతరూపమును, ఏదంతరూపముకడ ఇయాంతరూపమును వ్రాయఁబడును. (చూ. అంచగత్తియ, మెట్టె మొ.)

12. తెనుఁగున అయి అవులు మొదటఁగల పదములు వేఱువేఱుగా వ్రాయఁబడవు. వానిని ఐకారౌకారాది పదములకడఁ జూచునది. (చూ. అయితిని ఐతికడ, అవుఁగును ఔఁగుకడ మొ.)

13. ఉకారలోపముగల అల్లులోనగు వాడుకలోని పదములు ప్రత్యేకముగా వ్రాయఁబడవు. ఆ మొదటిరూపముకడనే రూపాంతరమని వ్రాయఁబడును. (చూ. అలుగు మొ.)

14. తన ప్రత్యయాంతశబ్దములు వేఱుగా నెత్తఁబడవు. కాఁబట్టి మొదటిపదముఁగొని యాయర్థమును దెలిసికొనవలెను. అనఁగా అల్లఁదనములోనగు వానికి అల్లశబ్దములోనగువానిఁగొని అర్థము నెఱుంగవలెనుట.

15. దేశ్యక్రియలయందు ఇంచుక్కువచ్చెడు సామాన్య ప్రేరణరూపములు ప్రత్యేకముగా వ్రాయఁబడవు. (అడఁగించు, ఇప్పించు మొ.)

16. తేటగాఁ దెలియఁదగుచోట్ల తెలుఁగుపదములకు సంస్కృతపదములతోడను సంస్కృతపదములకుఁ దెనుఁగు పదములతోడను అర్థము వ్రాయఁబడును.

17. ఒకపదమున కర్థము స్పష్టముగాఁ దెలియనిచో అర్థముగా వ్రాయఁబడిన పదమునుజూచి ఆయర్థమును చక్కఁగాఁ దెలిసికొన వలయును. అక్కడ చూ. అని వ్రాయఁబడి యుండును.

18. ఒకపదము దేశ్యముగాను వైకృతముగాను సంస్కృతముగాను నున్నయెడ ముందు దేశ్యార్థమును వెనుక వైకృతార్థమును నావెనుక సంస్కృతార్థమును గ్రమముగా వ్రాయఁబడును. (చూ. కలము, నారి మొ.)

19. ఒకపదము క్రియాద్యర్థభేదములచే ననేకవిధార్థక మగుటవలన అర్థములు వ్రాయఁబడుచో ముందు క్రియార్థమును, వెనుక అభావార్థమును, అటువెనుక విశేష్యార్థమును, ఆవెనుక విశేషణార్థమును, దానివెనుక సర్వనామార్థమును, కడపట అవ్యయార్థమును వ్రాయఁబడును. ముందు ముందటి యర్థములు లేనివేని వెనుక వెనుకటియర్థములు మొదలుచేసి యావలియర్థములన్నియుఁ గ్రమముగా వ్రాయఁబడును. (చూ. ఎత్తు, ఒత్తు, అందు, కయి, అలఁతి, ఈరు, అంత, కోలె మొ.) (చూ. అప. సంజ్ఞా... పట్టికయందు.) ఈనియమ మొకానొకచో దీనికి ముందటినియమముచే బాధింపఁబడును. (చూ. నీరు, నే, కరము మొ.) క్రియార్థము ముందు వ్రాయఁబడునను నియమాంశముమాత్రము బాధింపఁబడదు. (చూ. మెలపు.)

20. ఒకక్రియ అకర్మకముగాను సకర్మకముగాను నున్నచో ముందు అకర్మకార్థమును వెనుక సకర్మకార్థమును వ్రాయఁబడును. (చూ. అగు మొ.)

21. వైకృతపదముల కర్థము వ్రాయఁబడుచో నక్షత్రచిహ్నములేనియర్థము ముందును అదిగలయర్థము వెనుకను వ్రాయఁబడును. (చూ. అంకియ మొ.) ఈనియమ మొకానొకచో పందొమ్మిది ఇరువదవ నియమములచేత బాధింపఁబడును. (చూ. బంటు మొ.)

22. పదము లేక వచనాంతములైనప్పటి యర్థములు ముందు వ్రాయఁబడి బహువచనాంతములైనప్పటియర్థములు వెనుక వ్రాయఁబడును. ఈనియ

మము పదునెనిమిదవ నియమమును బాధించుచున్నది. (చూ. మల్లె మొ.)

23. ఇందుఁ గొన్నిటికి గ్రంథవిస్తరభీతిచే ప్రయోగములు సంగ్రహముగా వ్రాయఁబడియుండుటవలన అర్థములు విశదములు కానియెడ ఆయుదాహరణములకు ముందు వెనుకలను ఆగ్రంథములయందు విశదములుగాఁ జూచుకొనవలయును. కొన్నియెడల ముందు వెనుకలను జూడుమని వ్రాయఁబడియు నున్నది.

24. ప్రయోగములు దొరకియు తప్పులు గానుండుటవలన అవి కొన్ని పదముల కెత్తి వ్రాయఁబడవు. కొన్ని కొంతమట్టుకు వ్రాయఁబడును.

25. ఇందు వ్యాకరణవిషయములయిన విధులు కొన్ని అక్కడక్కడ వ్రాయఁబడియుండును. మఱియు నొక్కొక్కపదముకడ నొక్కొక్కవిధి వ్రాయఁబడి ఆవిధికి విషయములయిన తక్కినపదములకడ విధి వ్రాయఁబడిన పదమును జూచునట్లు తెలుపఁబడియుండును. (చూ. అఱువుల్లు, అలరుఁబోఁడి, ఆరగింపు మొ.)

26. చదివెడివారికిఁ జక్కఁగాఁ దెలియుటకై యొుదు అర్థములోనగునది తఱచుగ సంధిలేక వ్రాయఁబడియుండును.

నియమబాహుళ్యముచే నీక్రమము కొన్నియెడలఁ దప్పినను దప్పియుండును.

27. తెనుఁగున వాడుకలోనికి వచ్చిన యన్యదేశీయ శబ్దములు కొన్ని యీ క్రొత్త కూర్పునందుఁ జేర్పఁబడినవి. బ్రౌణ్యనిఘంటువులోనుండి యిట్టి శబ్దములు గొన్ని చేర్పఁబడినవి ఇట్టి శబ్దములకు గ్రంథదృష్టాంతములు దొఱకుట దుస్సాధ్యముగాన నట్టివాని నిందుఁ జేర్పలేదు.

—

# సంజ్ఞావివరణపట్టిక.

| సంకేతములు. | వాని స్వరూపార్థములు. |
| --- | --- |
| అ. | అకారాంతము. (ఇట్లు ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ఐ, ఒ, ఔ, చ్, జ్, త్, ద్, ధ్, న్, ప్, భ్, ర్, వ్, శ్, ష్, స్, హ అను వర్ణములు కలచో ఆయా అంతములుగా చెప్పుకొనవలెను. ఉదా. ఆకారాంతము, ఇకారాంతము, ఈకారాంతము, చకారాంతము, జకారాంతము, తకారాంతము అని.) |
| (అ.ఆ, ఈ.అ.) | (పుంలింగవిశేషణమైనప్పుడు) అకారాంతము. (స్త్రీలింగవిశేషణమైనప్పుడు) ఆకారాంతము, లేక ఈకారాంతము (నపుంసకలింగవిశేషణమైనప్పుడు) అకారాంతము. |
| అం, ప్రే. | అంతర్భావితప్రేరణము. |
| అ. క్రి. | అకర్మక క్రియ. |
| అప. | అపదము. (ప్రత్యయములోనగునది.) |
| అప్ర. | అప్రసిద్ధము. |
| అర. | అరవము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆం. | ఆంగ్లేయభాష. |
| ఉప. | (తెనుఁగుపదములకు ముందున్నచో) ఉపపదము. (ఉద్ద, ఎగ మొ.) (సంస్కృతపదములకు ముందున్నచో) ఉపసర్గము. (ప్ర మొ.) |
| ఉదా. | ఉదాహరణము. |
| ఉభ. | ఉభయము. (కొన్ని యర్థములయందు అచ్చతెనుఁగును కొన్ని యర్థములయందు సంస్కృతము నైనపదము.) |
| ఏ. | ఏకవచనాంతము. |
| కన్న. | కన్నడము. |
| క్రి. | క్రియ. |
| క్రి, విశ. | క్రియావిశేషణము. |
| గ్రా. | గ్రామ్యము. (అనింద్యము.) |
| చూ. | చూడుము. |
| డు. | డువర్ణకాంతము. |
| త్రి. | మూడులింగములయందును వచ్చెడు విశేష్యపదము. |
| దే. | దేశ్యము. |
| ద్ర. | ద్రుతాంతావ్యయము. |
| ద్వ. | ద్వయము. (వైకృతమును దేశ్యమును మిశ్రమైనపదము.) |
| ద్వి. | ద్వివచనాంతము. |
| న. | నపుంసకలింగము. |
| ని. | నిపాతము. |
| పుం. | పుంలింగము. |
| పుం, న. | పుంనపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| పై. | పైయట్లు. |
| ప్రా. | ప్రాకృతము. |
| ప్రే. | ప్రేరణము. |
| బ. | బహువచనాంతము. |
| మి. | మిశ్రము. (సంస్కృతాంధ్రములు కలిసినశబ్దము.) |
| ము. | మువర్ణకాంతము. |
| మొ. | మొదలైనవి. |
| యౌ. | యౌగికము. (కొన్ని యర్థములయందు దేశ్యమును కొన్ని యర్థములయందు వైకృతమునైనపదము.) |
| వి. | విశేష్యము. |
| విశ. | విశేషణము. |
| వు. | వువర్ణకాంతము. |
| వై. | వైకృతము. (ప్రాకృతసమమును సంస్కృతప్రాకృతభవమునైనపదము.) |
| సం. | సంస్కృతసమము. |
| స. | సర్వనామము. |
| స. క్రి. | సకర్మక క్రియ. |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| హిం. | హిందుస్తానీభాష. |
| *. | ఇది ప్రకృతిశబ్దార్థముకంటె భిన్నమగు నర్థమును దెలుపునది. |
| †. | ఇది వృక్షలతాదివాచకమగుటను తెలియఁజేయునది. |
| ... | ఈగురుతు నడుమ కొన్ని యక్షరము లుండుటను దెలుపును. |

# గ్రంథసంకేతాదివివేచనపట్టిక.



| | గ్రంథసంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదులు. | గ్రంథకర్తల నామములు. | గ్రంథకర్తల సంగతులు. (అను. ౬.) |
|---|---|---|---|---|---|
| 1. | అ, పా. | అమరపదపారిజాతము. (తెనుఁగర్థముగల సంస్కృత నిఘంటు టీక.) | కాం. ౩. | మల్లినాథుఁడు........ | [illegible] |
| 2. | అచ్చ. | అచ్చతెనుఁగురామాయణము.<br>౧. బాల. బాలకాండము<br>౨. అ. అయోధ్యాకాండము.<br>౩. ఆర. ఆరణ్యకాండము.<br>౪. కిష్కిం. కిష్కింధాకాండము.<br>౫. సుం. సుందరకాండము.<br>౬. యు. యుద్ధకాండము. | కాం. ౬. | తిమ్మయ............ | ౪. |
| 3. | అధ్యా. | అధ్యాత్మరామాయణము.<br>ఉ. ఉత్తరకాండము.<br>(బాలకాండాదులు ఆఱుతోడ ఉత్తరకాండమునుజేర ఏడు కాండములు) | కాం. ౭. | నాగయామాత్యుఁడు..... | ౫. |
| 4. | అని. | అనిరుద్ధచరిత్రము. | ఆ. ౫. | అబ్బయ.......... | ౪. |
| 5. | అప్ప. | అప్పకవీయము. (లక్షణగ్రంథము.) | ఆ. ౫. | అప్పకవి.......... | ౦ |
| 6. | అభి. | అభిధానరత్నమాల. (తెనుఁగర్థముగల సంస్కృత నిఘంటువు. దీనికి షడ్రస నిఘంటువనియు పేరు.) | స్కం. ౬. | (ఇందు గ్రంథకర్త పేరు లేదు) | ౦ |
| 7. | ఆం, సం. | ఆంధ్రనామసంగ్రహము. (నిఘంటువు.)<br>౧. దేవ. దేవవర్గు.<br>౨. మాన. మానవవర్గు.<br>౩. స్థా. స్థావరవర్గు.<br>౪. తి. తిర్యగ్వర్గు.<br>౫. నా. నానార్థవర్గు. | వర్గులు. ౫. | పైడిపాటిలక్ష్మణకవి..... | ౦ |

| గ్రంథసంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదులు. | గ్రంథకర్తల నామములు. | గ్రంథక తరగతు (అవి. |
|---|---|---|---|---|
| 8. ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము. (నిఘంటువు.) ౧. ప్ర. ప్రథమకాండము. ౨. ద్వి. ద్వితీయకాండము. ౩. తృ. తృతీయకాండము. (ఇందలి వర్గములను అక్కడక్కడ తెలిసికొనునది.) | కాం. ౩. | వెంకనార్యుఁడు........ | ౦ |
| 9. ఆం, శే. | ఆంధ్రనామశేషము. (నిఘంటువు.) | ౦ | అడిదముసూరన్న....... | ౦ |
| 10. ఆము. | ఆముక్తమాల్యద. (విష్ణుచిత్తీయము.) | ఆ ౬. | కృష్ణరాయలు......... | ౪. |
| 11. ఉ, రా. | ఉత్తరరామాయణము. | ఆ. ౭. | పాపరాజు......... .. | ౪. |
| 12. ఉ, హరి. | ఉత్తరహరివంశము. | ఆ. ౫. (దొరకినవి.) | సోమనాథుఁడు......... (నాచనసోమన.) | ౧. |
| 13. ఉ,హరిశ్చ. | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. ౪. | తక్కెళ్లపాటిలింగన....... | ౬. |
| 14. కవి. | కవిజనరంజనము. | ఆ. ౩. | అడిదముసూరన్న....... | ౩. |
| 15. కవిక. | కవికర్ణరసాయనము. (మాంధాత చరిత్రము.) | ఆ. ౬. | నృసింహకవి........... | ౩. |
| 16. కవిస. | కవిసర్పగారుడము. (లక్షణగ్రంథము.) | అధికారములు. ౨ (దొరకినవి) | బసవన............. | ౦ |
| 17. కళా. | కళాపూర్ణోదయము. | ఆ. ౭. | పింగళిసూరన్న.......... | ౨. |
| 18. కా. | కావ్యాలంకారసంగ్రహము. (నరసరాజీయము.) | ఆ. ౫. | మూర్తి............... | ౩. |
| 19. కాశీ. | కాశీఖండము. | ఆ. ౮. | శ్రీనాథుడు......... | ౨. |
| 20. కాళ. | కాళహస్తిమాహాత్మ్యము. | ఆ. ౪. | ధూర్జటి............ | ౩. |
| 21. కుచే. | కుచేలోపాఖ్యానము. | ఆ. ౩. | గట్టుప్రభు............ | ౫. |
| 22. కృష్ణ | కృష్ణరాజవిజయము. | ఆ. ౪. | కుమారధూర్జటి ........ | ౫. |
| 23. కృష్ణా. | కృష్ణాభ్యుదయము. | ఆ. ౫. | గోతేటిసూరన్న........ | ౫. |
| 24. చంద్ర. | చంద్రభానుచరిత్రము. | ఆ ౫. | మల్లన.............. | ౪. |
| 25. చంద్రా. | చంద్రాంగదచరిత్రము. | ఆ ౬. | వేంకటపతి........... | ౪. |
| 26. చమ. | చమత్కారమంజరి. | ఆ. ౩. | వేంకటకవి............ | ౪. |
| 27. చెన్న. | చెన్నబసవపురాణము. | ఆ. ౫. | పాపయామాత్యుఁడు...... | ౫. |
| 28. జైమి. | జైమిని భారతము. అశ్వమేధపర్వము. | ఆ. ౭. | పినవీరభద్రుఁడు........ | ౩. |
| 29. దశా. | దశావతారచరిత్రము. | ఆ. ౧౦. | ధరణిదేవులనాగయ...... | ౪. |
| 30. ద్వా. | ద్వాత్రింశత్సాలభంజికాకథలు. | ఆ. ౧౨. | కొండమీఁది గోపురాజు... | ౪. |

**అగుదెంచు.** దే. అ. క్రి. (అగు+తెంచు.) అగు. "అంతనగోరు చూపుడుదు, యంబగుదెంచె." నిర్వ. ౬, ఆ.

**అగురా.** దే. అవ్య. (అగును+రా.) అవురా. (ఆశ్చర్యసూచకము) అగురగురా. "క. అగురగుర ముఖరముఖుడై, జగము విరం దనబలంబు చాటె సముద్రం, బొగి బిరుదు దక్కడయ్యెన్, సగరకుమారులుగదా ప్రశంసార్హతముల్." రామా. ౭, ఆ.) (రూ. అగురా.)

**అగురు.** దే. వి. అవురుగడ్డి, వీరణము.

**అగురువు.** సం. వి. ఉ. న. ఇరుగుడుచెట్టు. పుం, న. అగలు. విణ. చిన్నది.

**అగులు.** దే. అ. క్రి. ఊడు. "వ. తెరంబులకొగిలించియు సీసకంబులనగిలించియు." భాగ. ౬, స్కం.

**అగౌకసము.** సం. వి. స. పుం. 1. పక్షి; 2. సింహము; 3. శరభము.

**అగ్గపడు.** దృ. అ. క్రి. (అగ్గము+పడు.) అగపడు.

**అగ్గపాటు.** దృ. వి. అగ్గపడుట.

**అగ్గము.** దే. విణ. 1. అధీనము; 2. కనబడినది, దృష్టము. "సీ. ఇదిదుశ్చరిత్రనానెవ్వశరరియించు నట్టిబ్రాహ్మణిమీకునగ్గమైన." భో. 3, ఆ.

**అగ్గలము.** దే. విణ. వెగ్గలము, అధికము. "క. విలువిద్య నారులు నీక, గ్గలముగలేకుండనిన్నుగలపుదు." భార. ఆది. ౫, ఆ.

**అగ్గలించు.** దే. అ. క్రి. 1. అతిశయించు; 2. పూను, ఉత్సహించు. "ఉ. అ, క్షీణబలంబునం గవియు సేనకు మార్కొనసగ్గలించితే." భార. విరా. ౫, ఆ.

**అగ్గలిక.** దే. వి. 1. ఆధిక్యము; "అచ్చెరువైనవిక్రమమునగ్గలికన్." భార. విరా. ౪, ఆ.—2. పూనిక, ఉత్సాహము; "గీ. అనినసట్ల కాక యనినరస్సేనాధి, పత్యభారపట్టబంధమునకు, నియ్యకొనియె భీష్ముడయ్యగ్గలికగొని, యాజిభిదుడు ప్రముదితాత్ముడగుచు." భార. ఉద్యో. ౪, ఆ.—3. శౌర్యము. (చూ. ఇలువడి) (రూ. అగ్గలికము. "పేర్చినయగ్గలికంబున." భార. కర్ణ. ౨, ఆ)

**అగ్గి.** వై. వి. నిప్పు, అగ్ని. "క. అగ్గలికజముడు దరికొన, నగ్గితెఱంగమర." భార. భీష్మ. ౨, ఆ.

**అగ్గించు.** వై. స. క్రి. పొగడు, స్తుతించు*.

**అగ్గికంటి.** దృ. వి. ముక్కంటి, శివుడు.

**అగ్గిచూలి.** దృ. వి. కుమారస్వామి, కందుడు.

**అగ్గువ.** వై. వి. వెలతక్కువ, చేవుక*.

**అగ్ని.** సం. వి. ఇ. పుం. 1. నిప్పు; 2. చిత్రమూలము. (త్రేతాగ్నులు=ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము. ఇవి క్రమముగావేదికి బూర్వదక్షిణ పశ్చిమదిక్కులయందుండును. పంచాగ్నులు=పైమూడు, సభ్యము, అవసథ్యము. సభ్యావసథ్యములు ఈశాన్యదిక్కునందుండును. సామాన్యాగ్ని భేదములు=అనలము, కుకూలము, ఛగలము, వత్సలము. అనలము మొదలగువాని కర్థములను ఆయాపదములకడజూచి తెలిసికొనవలెను. అగ్నిచటాత్కారము సంకారము.)

**అగ్నికణము.** సం. వి. అ. పుం. విస్ఫులింగము, మిడుగుఱులు.

**అగ్నిచిత్తు.** సం. వి. త్. పుం. అగ్నిచయనముచేసినవాడు.

**అగ్నిజ్వాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. అరెచెట్టు; 2. నిప్పుమంట.

**అగ్నిభువు.** సం. వి. ఊ. పుం. కుమారస్వామి, అగ్గిచూలి.

**అగ్నిమంథము.** సం. వి. అ. పుం. శ్రీపర్ణము, నెల్లిచెట్టు.

**అగ్నిముఖము.** సం. వి. అ. పుం. న. జీడిచెట్టు.

**అగ్నిముఖుడు.** సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుడు; 2. వేలుపు.

**అగ్నిశిఖ.** సం. వి. ఆ. స్త్రీ. 1. తరిగొప్పచెట్టు; 2. వెన్నవెదురుసారె; 3. నిప్పుమంట. అ. న. ము. 1. కుంకుమపువ్వు; 2. కుసుమపువ్వు.

**అగ్నిష్టోమము.** సం. వి. అ. పుం. వసంతకాలమందు ఐదుదినములలో చేసిముగించెడి యాగవిశేషము.

**అగ్నిహోత్రము.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. ఆహితాగ్నులు ప్రాతస్సాయంకాలములయందుఁ జేసెడిహోమము; 3. హవిస్సు.

**అగ్రజన్ముడు.** సం. వి. న్. పుం. 1. బ్రాహ్మణుడు; 2. అన్న; 3. బ్రహ్మ.

**అగ్రజుడు.** సం. వి. అ. పుం. అగ్రజన్ముడు, అన్న.

**అగ్రణి.** సం. విణ. ఈ. ముఖ్యము, గామిడి.

**అగ్రతస్సరుడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందునడచువాడు; 2. మొదటివాడు.

**అగ్రబీజము.** సం. వి. అ. పుం. ముంతమామిడిచెట్టు.

**అగ్రము.** సం. వి. అ. న. 1. చివర; 2. ఎదురు; 3. సమీపము; 4. సమూహము; 5. నాలుగుకళ్లకొలఁదిగలభిక్ష. విణ. 1. మొదటిది; 2. ముఖ్యము; 3. మిక్కుటము.

**అగ్రసరుడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందునడచువాడు; 2. మొదటివాడు.

**అగ్రహారము.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుల యిండ్లవరుస, సర్వేణ్యము.

**అగ్రిముడు.** సం. విణ. (అ. ఆ. అ.) మొదటివాడు.

**అగ్రియము.** సం. విణ. (అ. ఆ. అ.) ముఖ్యము, గామిడి.

**అగ్రీయము.** సం. విణ. (అ. ఆ. అ.) అగ్రియము.

**అగ్రేదిధిషువు.** సం. వి. ఉ. పుం. మాఱుమనువుదాని మొదటిమగడు.

**అగ్రేసరుడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందునడచువాడు; 2. మొదటివాడు.

**అగ్ర్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అగ్రీయము.

**అఘమర్షణము.** సం. వి. అ. న. సర్వపాపములను పోగొట్టెడు మంత్రము.

**అఘము.** సం. వి. అ. న. 1. పాపము; 2. వ్యసనము; 3. దుఃఖము.

**అఘోరము.** సం. విణ. (అ. ఆ. అ.) అంతికంటె ఘోరములేనిది.

**అఘ్న్య.** సం. వి. ఆ. స్త్రీ. సౌరభేయి, ఆవు.

**అచల.** సం. వి. ఆ. స్త్రీ. నేల. అ. పుం. ము. 1. కొండ; 2. మేకు. విణ. కదలనిది.

**అచిరద్యుతి.** సం. వి. ఇ. స్త్రీ. విద్యుత్తు, మెఱపు.

**అచేతనము.** సం. వి. అ. పుం. అప్రాణి.

**అచ్చారము.** అర. వి. సంచకరువు.

**అచ్చి.** దే. వి. దేశవిశేషము. (అచ్చిమట్టము.)

**అచ్చిక.** దే. వి. కొఱఁత. "ఉ. అక్కట నేకొకందులకు నచ్చిక లేక మెలంగవిష్ణుదా, నెక్కుడిబిత్తిగాఁగ సృజియించెనజుండు." హంస. ౧, ఆ. (హా. అచ్చికము. "చ. అదె ఘృతతండుల ప్రకరమల్లవె చీరలు భూషణాదిసం, పదలవెరాజురాకకులు పాయొనఁగూర్చిన యట్లుమీఱెడున్, ఘుదితలకేమియచ్చికము." కళా. ౬, ఆ.)

**అచ్చికబుచ్చిక.** దే. వి. కలుపుకోలుతనము, అభేదము. "ఉ. అక్కఱఁజూడవేటి కల యచ్చికబుచ్చికసేయుసంచలన్." విజ. 3, ఆ.

**అచ్చివచ్చు.** దే. అ. క్రి. అయివచ్చు. (నాకాయిల్లు అచ్చివచ్చినది)

**అచ్చు.** సం. వి. ప్రాణాక్షరములు. (అకారాదులు.)

**అచ్చెరుపడు.** వై. అ. క్రి. (అచ్చెరువు+పడు.) ఆశ్చర్యపడు.

**అచ్చెరుపాటు.** వై. వి. అచ్చెరువడుట.

**అచ్చెరువు.** వై. వి. వెఱఁగు, ఆశ్చర్యము.

**అచ్చెరువుపడు.** వై. అ. క్రి. ఆశ్చర్యపడు.

**అచ్చెరువుపాటు.** వై. వి. అచ్చెరువుపడుట.

**అచ్యుతుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. విణ. స్థిరుఁడు.

**అచేటు.** దే. వి. ఏ. అచోటుయొక్క రూపాంతరము.

**అచోటు.** దే. వి. ఏ. (అ+చోటు.) ఆ స్థానము.

**అచ్చ.** (చూ. అచ్చెము.)

**అచ్చగుండ్లపేరు.** దే. వి. 1. ముత్యాలహారము; 2. స్ఫటికమాల.

**అచ్చటు.** దే. వి. ఏ. అచ్చోటుయొక్క రూపాంతరము.

**అచ్చనగండ్లు.** దే. వి. బ. 1. బాలికాక్రీడావిశేషము; "మ. దినముల్ కొన్ని చనంగనంతఁగడు నర్థింబొమ్మపెండ్లిండ్లుగు, జ్జైనగూళ్లచ్చనగండ్లుపింపిళులుకుచ్చెళ్ గీరనంగింజలో, మనగుంటల్ కనుమూసిగంతసలు కంబాలాట లోనైనఖే, లనముల్ మీఱఁగ బోట్లతో నలరె బాలారత్నమెల్లప్పుడున్." కళా. ౬, ఆ. – 2. అచ్చనగండ్లాడెడు చిన్నచిన్నగుండుజాళ్లు, గిరీయకములు. "ఎ, గీ. కొండలచ్చనగండ్లయినిండుచెఱువు, లెల్లనద్దంపు బిల్లలై యేర్లు ముత్తి, యంపుసరులైయరణ్యంపు గుంపులెల్ల, నారులైతోఁచుఁ బొడవున నారులార." వసు. ర, ఆ.

**అచ్చనగాయలు.** దే. వి. బ. (అచ్చన+కాయలు.) బాలికాక్రీడావిశేషము, అచ్చనగండ్లు. "సీ. కరకంకణధ్వనుల్ గలుగల్లుమని యింపు గానింప నచ్చనగాయలాడు." రుక్మి. ౧, ఆ.

**అచ్చనగుండ్లు.** దే. వి. బ. 1. అచ్చనలాడుగుండ్లు, గిరీయకములు; "సీ. ముదురువెన్నెలగాయు ముత్యాలదిన్నెపైఁబైఁడియచ్చనగుండ్లు పాఱవైచి." య. 3, ఆ.–2. అచ్చనగుండ్లాట.

**అచ్చనలు.** దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. "క. దీర్ఘతరంబై, పెచ్చినశోకముమదిలో, నచ్చనలాడంగ." జై. ౧, ఆ.

**అచ్చెము.** వై. విణ. 1. స్వచ్ఛము; "సీ. ఒండువిధంబులఁ, బడయంగరానియెక్కుడుపదంబు, అచ్చమైనతపంబునవచ్చుఁబడయ." భార. ఆశ్వ. ౨, ఆ.–2. కేవలము*; "సీ. అచ్చతెల్పునఁగడు నభిరామమగునొక్క యశ్వంబుఁగాంచితి మవ్వధూటి, కేవలధవళంబునావిని యొద్దారమునకు నేనదెనల్లఁదనముఁగంటె, వెనుకదెస నన్నవాదయ్యె." భార. ఆను. ౧, ఆ.–3. తెల్లనిది*; "ఈయచ్చగురిజవేరెందుఁగలిగె." య. ౧, ఆ.–4. దట్టము*. "సీ. అచ్చవెన్నెలచాయ నవఘళింపఁగఁజాలునిద్దంపువెలిపట్టు నెఱికగట్టి." నై. ౬, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము వైకల్పికముగనగు.)

**అచ్చెర.** వై. వి. అప్సరస్త్రీ.

**అచ్చెలము.** దే. వి. 1. ఆగ్రహము; "వ. దెందంబునం గ్రందుకొనునచ్చెలంబును మచ్చరంబునుంబెచ్చువెరుగ." జై. ౫, ఆ.– 2. పూనిక, ఉత్సాహము. "క. అందఱునన్నిముఖంబుల, నందందగిరిద్రుమాదులచ్చెలమునన్, నందుకొనునలునియరుదుం, జందమగనిమఱియు వృక్షచరులు గడంకన్." రా. యు, కాం.

**అచ్చెలించు.** దే. అ. క్రి. ఆగ్రహించు.

**అచ్చాళు.** దే. విణ. (అచ్చెము+ఆళు.) జంజాటములేనివాఁడు. "ద్వి. చారుశీలాముఖ్యజలజలోచనలఁ, జేరికొబంధులఁజెలులనీక్షణమె, పగఱకుఁజొరరాక బహుదుర్గమార్గ, మగుకోహళ మహర్షియాశ్రమస్థలిని, జేరిచి మనము నిశ్చింతనేతెంచి, యారూఢ బలయుక్తినచ్చాళుగాఁగ, ననికినన్నద్ధులమై యుందమవల." పతివ్రతా మాహాత్మ్యము. (ఆళు అన్యదేశ్యము.)

**అచ్చు.** యు. దే. అ. క్రి. అప్పుపడు. "ద్వి. అచ్చినాయెదుర బ్రహ్మకుఁబోవరాదు." హరిశ్చ. ౨, ఆ. – స. క్రి. 1. ఇచ్చు; "గీ. కలనఁబడినవారిఁ గయికొనిపోట్లవుం, డ్లోమిమగుడఁబుచ్చుటొప్పఁబంత, మడుగమగుడబవరమచ్చుటయొప్పఁగా, కించుకేనిదానయేలుటొప్ప." ఉ, హ. ౫, ఆ.–2. దండుగిచ్చు. "క. ప్రీతిఁగులశ్రేష్ఠునిపై, నాతతముగలేనిబ్రహ్మ హత్యాదిమహా, పాతకమువెట్టి తిట్టిన, నాతండేనూటనాలుగచ్చుఁబణంబుల్." విజ్ఞా. ప్రా, కాం. –వై. వి. 1. ముద్ర*; 2. విధము*; "ఉ. మీ, మెచ్చునకెంత వాఁడనసుమీపదభక్తులలోనఁగూర్చియీ, యచ్చుననానతిచ్చు భవదాదరణంబిదికోటిసేయదే." భో. ౭, ఆ.–3. సాలెవానిసాధనవిశేషము*. విణ. 1. శుద్ధము. "క. ముచ్చునుబట్టినమాత్రన, చెచ్చెరదండింపకతనిచేఁదెలిగొనివాఁ, డచ్చైనవిడుపునిక్కపు, ముచ్చైనందగినదండమునుగొనవలయున్." విజ్ఞా. ప్రా, కాం. "వ. వీరలకందఱకుం దేటతెల్లంబుగా భాగవతులయచ్చుందనంబేర్పరించి పిమ్మట నెట్లుగావలయునట్లుచేసెద." పర. 3, ఆ.

**అచ్చుఁగూటము.** దవ్. వి. (అచ్చు + కూటము.) ముద్రాక్షరశాల.

**అచ్చుకట్టు.** ద్వ్.స.క్రి. 1. ఏర్పఱచు; "గీ. అబ్ధులనగిరులన దీవులనఁగనేఱు, లనఁగ నడవులనఁగ నూరులనఁగ వరుస, నచ్చుకట్టి." లక్ష్మీ. ౫, ఆ.–2. మడిమడిగాగనిమతీయు. "తే. అది మఱియు మెత్తగాదున్ని యచ్చుకట్టి." వై. ౧, ఆ.

**అచ్చుకుప్ప.** దే. విణ. ధనవంతుఁడు. "సీ. ఆఢ్యుఁడు విలసిల్లు నాస్తికాఁడు, నాఁగఁగలవాఁడనంగను నచ్చుకుప్ప, యనఁగవిడిముడికలవాఁడటన్న." ఆం, భా. తృ. వి.

**అచ్చుకొను.** దే. స. క్రి. తౌనియ్యవలవని ధనాదికమును ఒప్పుకొనియిచ్చు.

**అచ్చుటెద్దు.** ద్వ. వి. (అచ్చు + ఎద్దు.) అచ్చుపోసి స్వేచ్ఛగాఁదిరుగవిడిచిన వృషభము, ఆఁబోతు.

**అచ్చుదల.** దే. వి. 1. అప్పు; 2. అచ్చివచ్చుట.

**అచ్చుపడు.** వై. అ. క్రి. ఏర్పడు. "క. నెచ్చెలులుదన్నుఁగొలువఁగఁ, బచ్చవిలుతుకలిమియెల్లఁబద్మాననయై, యచ్చుపడినట్లుమెఱయుచు, నచ్చటికేతెంచె భూవరాత్మజనెమ్మిన్." భార. ఆర. ౭, ఆ.

**అచ్చుపాటు.** వై. వి. అచ్చుపడుట, ఏర్పాటు.

**అచ్చోటు.** దే. వి. ఏ. (ఆ+చోటు.) 1. ఆ స్థానము; 2. ఆఁడు గుజే. "క. చేడియలమ్ముదురచ్చోటు." హరి. ఉ. ౯, ఆ. (రూ. అచ్చోటు.)

**అచ్చొత్తు.** ద్వి. స. క్రి. (అచ్చు + ఒత్తు.) అచ్చువేయు, ముద్రించు.

**అచ్ఛభల్లము.** సం. వి. అ. పుం. ఎలుఁగుగొడ్డు.

**అచ్ఛము.** సం. వి. అ. పుం. 1. ఎలుఁగుగొడ్డు; 2. పటికపురాయి. విశే. స్వచ్ఛము.

**అజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకృతి; 2. ఆఁడుమేఁక. అ. పుం. ము. మేఁకపోతు.

**అజగంధిక.** సం. వి. ఆ. స్త్రీ. వాయింటకూర.

**అజగరము.** సం. వి. అ. పుం. పెనుఁబాము.

**అజగర్దము.** సం. వి. అ. పుం. నీరుపాము.

**అజగవము.** సం. వి. అ. న. శివునివిల్లు.

**అజన్యము.** సం. వి. అ. న. తోఁకచుక్కలోనగు ఉత్పాతము. విశే. జన్యముకానిది.

**అజప.** సం. వి. ఆ. స్త్రీ. 1. సగము మగపోలిక సగము ఆఁడుపోలికయుఁగల ఆకృతి; 2. మంత్రవిశేషము.

**అజపుఁడు,** సం. వి. అ. పుం. వైదికములుకాని గ్రంథములను చదువువాఁడు.

**అజభక్షము.** సం. వి. అ. పుం. బొబ్బలికూర.

**అజమోద.** సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు ఓమము.

**అజశృంగి.** సం. వి. ఈ. స్త్రీ. జెట్టువుకూర.

**అజస్రము.** సం. క్రి. విశే. అ. న. అనవరతము, ఎల్లప్పుడు.

**అజహ.** సం. వి. ఆ. స్త్రీ. దూలగొండికూర.

**అజాగ్రత్త.** సం. వి. ఆ. స్త్రీ. జాగ్రత్తలేమి.

**అజాజి.** సం. వి. ఈ. స్త్రీ. జిలకఱ్ఱ.

**అజాజీవుఁడు.** సం. వి. అ. పుం. మేఁకలమేపువాఁడు.

**అజాతశత్రువు.** సం. వి. ఉ. పుం. ధర్మరాజు. విశే. శత్రువులు లేనివాఁడు.

**అజితుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు. విశే. గెలువఁబడనివాఁడు.

**అజినపత్ర.** సం. వి. ఆ. స్త్రీ. జతుక, జివుకపిట్ట.

**అజినము.** సం. వి. అ. న. చర్మము, తోలు.

**అజిరము.** సం. వి. అ. న. 1. ముంగిలి; 2. కప్ప; 3. గాలి; 4. శరీరము; 5. శబ్దాదివిషయము.

**అజిహ్మగము.** సం. వి. అ. పుం. బాణము, అమ్ము.

**అజిహ్మము.** సం. వి. అ. పుం. కప్ప. విశే. సరియైనది.

**అజిహ్వము.** సం. వి. అ. పుం. కప్ప. విశే. నాలుకలేనిది.

**అజీగవము.** సం. వి. అ. న. అజగవము, (రూ. అజీగావము.)

**అజుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. మన్మథుఁడు; 5. ఒకానొకరాజు.

**అజ్ఝటి.** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరికకూర.

**అజ్ఞత.** సం. వి. ఆ. స్త్రీ. అజ్ఞత్వము, తెలివిలేనితనము.

**అజ్ఞానము.** సం. వి. అ. న. తెలివిలేమి.

**అజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. జడుఁడు; 2. మూర్ఖుఁడు.

**అజ్మాయిషీ.** హిం. వి. శోధన, పరీక్ష.

**అజ్జారము.** దే. వి. 1. మొగసాల; 2. ఆస్థానమండపము. "లయగ్రాహి. నృప, పుంగవుఁ డజారమున కుం గదలివచ్చెన్." రా, వి. ౩, ఆ.

**అజ్జ.** యు. దే. వి. 1. అడుగు, పాదము; 2. సమయము. "గీ. అజ్జపాటించి మదివెఱ పుజ్జగించి." భార. శల్య. ౧, ఆ. —జై. అవ్య. బళి. "ద్వి. అజ్జగాఁదిలకంబుహ వణెంచినదుట." (అజ్జేగా — అజ్జేయను శబ్దముపుట్టఁగా బళియనఁగాననుట) భద్రరాజపుత్రచరిత్రము. (రూ. అజ్జే.)

**అజ్జము.** వై. వి. కొన్నిపనసలుగల వేదభాగము, అనువాకము. "ఉ. ఈ, యజ్జెముతోనసాపనసయన్నవసిష్ఠులు మీరు శ్రౌతమం, దు." పాంచా. ౪, ఆ.

**అజ్జరే.** ద్వి. అవ్య. (అజ్జే + రే.) బళిరే. "ఉ. అజ్జరెయంచుఁ బంచుకొనిరందఱు వ్రేల్చుచు ద్రవ్యదక్షిణల్." పాంచా. ౪, ఆ. (రూ. అజ్జరే.)

**అజ్జవాలు.** ద్వి. వి. కోడి, చరణాయుధము. "ఉ. ఇంకనీ, యాటలుడించివేజరగుమంచునువెన్నెలతేనికేర్పడం, జాలెననంగఁగూఁతలిడఁజాగెఁదుటూరపుటజ్జవాల్గముల్." అచ్చే. ౭, కాం.

**అజ్జోరే.** ద్వి. అవ్య. (అజ్జో+రే.) అజ్జేరె. (రూ. అజ్జోరే. "శా. అహోవిలాసంబుల, జ్జారేజవ్వనమద్దిరావగలు మజ్జారేతనూవిభ్రమం, బు." శశాం. ౩, ఆ.)

**అట.** దే. వి. ఏ. అక్కడ. "క. అంతనట నక్కుమారుం, డెంతయుఁగరుణమ్ముదోఁప నేడ్చుచునుండన్." నిర్వ. ౩, ఆ. (అట ఇట శబ్దములకు వృత్తియందుఅంత ఇంత అనునర్థము కలుగుచున్నది. అటమున్న అంతకుముందు. ఇటమున్న ఇంతకుముందు.) — ద్రు. అవుల. "హేమాచలమును నావల హేమకూ, టంబును నట నిషధంబునొప్పు." భార. భీష్మ. ౧, ౬.

**అటకలి.** దే. వి. నూనెజిడ్డునుపోఁగొట్టెడివస్త్రక్షాళనము, ఉత్సాదనము.

**అటకాయించు.** హిం. క్రి. నిరోధించు, అడ్డగించు.

**అటకావు.** హిం. వి. ఆటంకము.

**అటతాళము.** సం. వి. అ పుం. తాళభేదము. (౧౪ అక్షర కాలము.)

**అటని.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. వింటికొప్పు.

**అటమట.** దే. వి. 1. వంచన; (చూ. అటమటించు.) 2. దుఃఖము; "చ. కటకట రాజ చంద్రయిటు కర్ణమెనిర్ఝర కన్యకామణిం, దటుకునఘోరమారనిశితప్రదరంబులపాలుచేసియి, చ్చటికిటుచేరి నీవుచు విశంకటతాపభరాలనుండనై, యటమటఁజెందెదేల." రసి. ౫, ఆ.—విశే. 1. అసత్యము; 2. వ్యర్థము. (రూ. అటమటము. అసత్యమునకు—"క. ఇటుచూచినఁజెలిపైఁద, ప్పటుచూచినసుతుని నేరమవుఁగాదన్నఁగా, నెటువలెవచ్చెనొమీఁదట, నటమటమోలేక నిజమొ యదియెఱుఁగముగా." సా. ౩, ఆ.—వ్యర్థమునకు—"క. ఇటువలెవెదకియుఁదమంత్రి, ప్పటగురువిరహితులమంత్ర పరసంచేటుల, ట్లటమటమైపోఁజూచిన." రామా. ౬, ఆ.)

**అటమటకాఁడు.** దే. విశే. అటమటీఁడు, వంచకుఁడు.

**అటమటించు.** దే. అ. క్రి. చలించు. "వ. మెఱుఁగుతుమ్మెదవన్నె పెన్నెఱుల నటమటించు నెన్నడుములవిన్ను వెన్నుదన్ని." స్వా. ౫, ఆ.—స. క్రి. 1. వంచించు; "గీ. యతిననుచువేష

భాషలనటమటించి, పొంచితపవేచికన్నియఁ గొంచుసరిగ." విజ. 3, ఆ. — 2. అపహరించు. "క. తమ్ముఁడవనినిన్నేగతి, నమ్మంగా వచ్చునిట్లునాకొనఁగకల, త్నమ్మటమటించుకొంటివి, పొమ్మిఁక నీతోడిపొత్తుపొంపొచ్చెమగుఙ." వి, పు. ౬, ఆ.

**అటమటీఁడు.** దే. విశే. (అటమట + ఈఁడు.) మోసకాఁడు. (చూ. వాట్లీఁడు.)

**అటరూషము.** సం. వి. అ. పుం. అడ్డసరముకీ.

**అటవి.** సం. వి. ఈ. స్త్రీ. అరణ్యము, అడవి.

**అటాట్య.** సం. వి. ఆ. స్త్రీ. భిక్షలోనగువానికొఱకు తిరుగుట, పర్యటనము.

**అటివి.** దే. విశే. అట్టి. "రగడ. ఏకాంతమనితోలఁగె దిందుసివటివేరు, చేకొనవెనుమ్నాడి చెలువయూవటివేరు." సాన్వ. 3, ఆ. (ప్రయోగమిదియొక్కటియకానంబడియెడిఁగావున నింకను విచారింపఁదగినది.)

**అటిక.** దే. వి. ఒకదినుసుమంటిపాత్రము, అట్టిక.

**అటికమామిడి.** దే. వి. మండలచ్ఛదముకీ.

**అటు.** దే. అవ్య. ఆప్రకారము. "క. ఊరకయటుమిముబోఁటుల, చేరువఁజరియింపఁగనిన సిద్దాపవెయే, కోరికలైన." కళా. ౧, ఆ (చూ. అట్లు.)

**అటుక.** దే. వి ఇంటిలోపల గోడలమీఁద నడ్డముగా పలకలు కొయ్యలులోనగువానిచే మంచెవలె నమర్చినది, (చూ. అట్టుక.)

**అటులు.** దే. అవ్య. ఆప్రకారము. "ఎట్లునచెప్పినటులు ధక్తిమైనను వు" భార. విరా. ౧, ఆ. (చూ. అట్లు)

**అటువంటివి.** దే విశే అట్టి "అటువంటినిపురా, తనమగుదివ్యమూర్తి నవిరింబుగఁ జూపితివి" వి, పు ౭, అ

**అటువలె.** దే. వి. అట్లు. "అటువలెనంటుకాఁడు" శశాం. ౪, ఆ.

**అటెు.** దే. అవ్య. 1. ఆశ్చర్యమును తెలిపెడి; "క. నహుషుఁడు వనుచువాఁడటెు, విహితానుష్ఠానపరులువీర టెపోలో, కహాలంబటెుయిది మనకుఙ, మహనీయమ కాకయెట్లు మానఁగవచ్చుఙ." భార. ఉద్యో ౧, ఆ.—2. దుఃఖమును తెలిపెడి "సీ. ధర్మసుతుఁడు, భీమసేనుఁడును బీభత్సుఁడును దనకొమపునఁబుట్టినకొడుకులట్టె, యెగ్గతంబునఁదానుగారగ్గిఁగాలె, నటెుయనాథయ్యె." భార. ఆశ్ర. ౨, ఆ.

**అట్ట.** దే. వి. 1. తలతెగినశరీరము, కబంధము; 2. చెప్పులకొఱకుఁ జిక్కఁబఱపఁబడిన చర్మఖండము.

**అట్టచెమ్మ.** ద్వి. వి. నాలుగుగవ్వలతో నాడెడు దాయమువంటి యొకానొక ఆట.

**అట్టడి.** వై. వి. యుద్ధార్థము వాకిటిమండపముమీఁదఁగాని కొత్తళముమీఁదఁగాని యేర్పఱచిన గది, అట్టము. "కొత్తళంబులకెల్ల, నట్టళ్లు [illegible]" ఉ, హరి. ౨, ఆ.

**అట్టిక.** దే. వి. అటిక.

**అట్టియ.** దే. వి. గుంపు, సమూహము. "క. అట్టియెడఁ జెలిమికత్తియ, లట్టియలుగఁగూడి చేడియంగని యనిరి." నీలా. ౨, ఆ.

**అట్టు.** దే. వి. అపూపవిశేషము. అవ్య. ఆప్రకారము, (చూ. అట్లు.)

**అట్టుక.** దే. వి. అటుక. "క. తలవరి గడగడ వడఁకినఁ, గలఁగకు మని వీఁపుఁజఱచి ఘనురాలతనిఙ, నిలిపి యొకమూల నట్టుక, నెలమిని వాకిలిసడల్చి హితమలరారఙ." హంస. 3, ఆ.

**అట్టుప్పు.** దే. వి. (అట్టు+ఉప్పు.) లవణవిశేషము, పాక్యము.

**అట్టులు** దే. అవ్య. ఆప్రకారము, (చూ. అట్లు.)

**అట్టువ.** దే. వి. అటుక.

**అట్టువోలె.** దే. క్రి. (అట్టు+పోలె.) అట్లు. "సీ. ఏనుంగునంజలోనెల్లసత్వంబుల యంజలునడఁగిన యట్టువోలె." భార. శాం. ౨, ఆ.

**అట్టె.** దే. అవ్య. 1. ఆశ్చర్యమును తెలిపెడి; "గీ. నలునకాని నలిన దళనేత్ర వరియింప, దట్టెచూతమనుచు నమరవరులు." భార. ఆర. ౨, ఆ.—2. దుఃఖమును తెలిపెడి, (చూ. అటెు.)

**అట్టెడ.** దే వి. 1. పూడికయెత్తుటకు ఈఁతబద్దలులోనగువానితో అల్లినతట్ట, 2. నెరసులు పోఁగొట్టుటకై కూర్చిన జల్లెడవంటి తడక, 3. కయధాన్యములయందలి మట్టిగడ్డలుమొదలగువాని వెలువరించుటకుఁ గట్టిన గోఁగుకట్టెలులోనగువానిమోపు; 4. వంతెన.

**అట్ఠము.** వై. గ్రా. వి. వేదభాగము, అష్టకము.

**అట్లు.** దే అవ్య ఆప్రకారము. "క. అమరవరులందుఁబురుషో, త్తముఁడెట్లువిశేషమట్లు ధరణింగలతీ, ర్థములందునబుష్కరణి, ర్థముఁగరమువిశేషమభితార్థప్రదమై." భార. ఆర. ౨, ఆ. (దీనికి వృత్తియందు ప్రకారముమాత్రమర్థము. చెప్పినట్లుచేయుము. మొ)

**అడ.** దే. వి. 1. ముద్ద; "సీ. అడలవెన్నెలఁజిక్కెరిడి చొక్కవెన్నెలఁబూనికనాళిలుగానుగూర్చి." య. ౨, ఆ.—2. ఆకృతి "ధూర్జటికంటి కడిందిమంటలో, నడ పొడగానరాక తెగటాఱెయు." సాన్వ. 3, ఆ.

**అడఁకువ.** దే. వి. అణఁకువ, నమ్రత.

**అడఁగారు.** దే. అ. క్రి. అడఁగు, ఉపశమిల్లు.

**అడఁగు.** దే. అ. క్రి. 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నమ్రమగు; 4. నశించు; 5. లోపడు.

**అడంగు.** హిం. వి. మొదటిచోటు. విశే. తగులుబడియైన.

**అడఁచు.** దే. ప్రే. అడఁగఁజేయు. (అనుప్రయుక్తమైన అడఁగు ధాతువునకును రూపమిట్లెయుంగునది.)

**అడకము.** దే. విశే. లోపలనణఁగినది, అంతర్భూతము. "ద్వి. నానామరేంద్రబృందము మాయలెల్ల, హరిమాయలోపల నడకముల్." విష్ణు. పూ. ౧, ఆ.

**అడకొత్తు.** దే. వి. (అడకాయ+ఒత్తు.) పోఁకొత్తు, తంకుల. "ఓర్వదుబంధుజాల మడకొత్తునవొత్తును మామగారు." శశాం. 3, ఆ.

**అడఁగుబొద్దు.** దే. వి. జేలుదారిలోపల నణఁగియుండునట్లు గోడయంచులయందు గీజె యేర్పఱచెడు బొద్దు.

**అడగొను.** దే. అ. క్రి. (అడ+కొను.) అడకట్టు, ముద్దకట్టు.

**అడగోలుకొను.** దే. స. క్రి. (అడ+కోలుకొను.) అపహరించు. "ఉ. అవశంకరార్థదే, పంబడగోలుకొన్న సతియద్భుతరూపవిలాస రేయముల్." హరి. ఉ. ౬, ఆ. "ఇల్లడసొమ్ము, నడగోలుకొని త్రొచ్చునతనికతికె." భో. ౬, ఆ.

**అడజడి.** దే. వి. అలజడి, దుఃఖము. (చూ. అడజేడిపెట్టు.)

**అడజేడిపెట్టు.** దే. స. క్రి. దుఃఖపఱచు. "చ. న, న్నడజడి పెట్టుమాట యిటు లాడఁగఁగూడునె యీయకార్యముల్, వినుకృతలాంగి." మార్క. ౧, ఆ.

**అడదడి.** దే. వి. ప్రభుత్వము. (అప్ర.)

**అడప.** దే. వి. అడపముంచుకొనియుండు అఁడుది. "చ. కలికి వరాటరాజడప కప్పురవీడెమువెట్టెవంచనన్, నలునడపంబువానికి ఫణాధరవల్లి దళాంతరంబునన్, బలితపుఁదేలుమైనమునఁబన్ని." నై. ౭, ఆ.

**అడపకత్తె.** దే. వి. (అడపము+కత్తె.) అడపమునుంచుకొనియుండునది, (రూ.) అడపకత్తియ.

**అడపకాఁడు.** దే. వి. అడపమునుంచుకొనియుండువాఁడు.

**అడపట్టె.** దే. వి. పొలములో విస్తనమువిత్తి మిట్టపల్లము సమముగు టకై యెద్దునుకట్టి త్రోలెడు మ్రాను, దిందు.

**అడపము.** దే. వి. 1. వక్కలాకుంతిత్తి. 2. మంగలతిత్తి.

**అడపొడ.** దే. వి. జాడ. "ఆకసము .వారి యీసుచేసడపొడ లేకపోయె." కళా. ౭, ఆ.

**అడబాల.** వై. విశే. వంటవాఁడు, వంటలక్క*. "ద్వి. అడ బాలకొనిపోయియమ్మిసుఁజెంచి, కసుపులో నొకబాలుఁగనివెఱఁ గంది." భాగ. ౧౦. స్కం.

**అడరు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "క. ఆపాదమస్తకముత, ద్రూపముబీక్షించుచుం గుతూహలమడరన్." భార. విరా. ౧, ఆ.–2. పూను; "ఎ, గీ. ఇటిగోరత్న మొక్కనాఁడేకతంబ, పోఁకుమేయుచునుండబెబ్బులియొకంపు, దానిఁగని పొంచియొడలెల్లదాఁచివాల, మవనిఁదాటించుచు నవ్రేయనడరుటయును." భో. ౪, ఆ.–3. కలుగు; "క. కసులజ్జయుదైన్యంబును, నడరె." భార. అర. ౬, ఆ.–4. త్వరపడు; "క. మీరాఁకలిపెల్లుసనా, హారంబుగళవముఁగొనుటకడరితిరి." భార. అను. 3, ఆ.–5. వర్ధిల్లు; "క. ఈరీతినొబళేశమ, హీరమణునివంశమడరె." రామా. ౧, ఆ.–6. విజృంభించు; "వ. కాలరుద్రులంబోలెనడరుచు." వీర. ౪, ఆ.–7. వ్యాపించు. "క. వఱటులు మన చేరువఁదె, ల్లఱచుటబెట్టిదురుగాలి యడరుట." భార. కర్ణ. ౨, ఆ.–8. ఆధిక్యము. "క. గొనములనంద్రమ యిత్తెఱఁ, గునఁజాలుపుఁ దేర్లతేఁడుకొదయొదవనిపెం, పునసడరొందుచు." అచ్చ. అ, కాం.

**అడరించు.** దే. ప్రే. బాణమును ప్రయోగించు. "సీ. అతఁడడరించునానాస్త్రశస్త్రములు హుంకారరవమ్మునఁగ్రాఁచెదేవి." మార్క. ౬, ఆ.

**అడరుచు.** దే. ప్రే. అడరించు. (రూ. అడర్చు. "వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వ నొక్కబల్, కాండమడర్చె." జై. ౭, ఆ.)

**అడరుదెంచు.** దే. అ. క్రి. (అడరు+తెంచు.) అడరు, అతిశయించు. "గీ. రెండుదరులుముంచి యొండొండవెల్లువ, యగ్గలింప నురువ్రలడరుదేర, నతిరయమునఁ బఱచునయ్యేటివజ్జోడ్డి, పోయెదవ్రస్ఫుఁగాఁగభూవిభుండు." మార్క. ౫, ఆ. (అడరు ధాతువ్రనకువలె దీనికిని సందర్భానుసారముగా అర్థములన్ని చెప్ప కొనవలెను.)

**అడలు.** దే. అ. క్రి. 1. వన్ను; "క. అసుచుండొడఁగెడుసత్రుల, మునిఁగినమోముతనవక్షమునఁజెరిచియు, వప్పనితయువస్థయతొల్చుచు, ననిలసుతుండడలెదేహమలమటఁబొందన్." సం. "ముఖమానీయశైవత్న్యరుదోదపరీకరహ." భార. విరా. ౨, ఆ.–2. విలపించు; "సీ. అనిఖిలాపింపనూరార్చియేటికిఁ గ్రొవుఁ బాసిగొడ్డొలలెడి పగిడినడలె, దు." జై. ౬, ఆ.–3. శోకించు. "క. కొడుకులదెసనెవ్వగఁజే, డ్పడివందురియున్నయా నృపాలునడుగులం, బడిభీష్మపాటుసెప్పుచు. నడలికడున్నాదమెసఁగ నాక్రందించెన్." భార. భీష్మ. ౧, ఆ.–4. భయపడు. "సీ. పల్లెరం బిడులోనె పాలుపత్తెముసేయు నతివకాయిందలఱ కడలుకుడుపు." పాంచా. 3, ఆ.–వి. 1. శోకము. "వ. ధర్మనందనుండు వెడ వెడఁదెలిసియు మగుడనిగుడునడలున." సం. "తతస్తత్రమహాన్ శోకః ప్రాదురాసీన్మహాత్మనః." భార. సౌ. ౨, ఆ.–2. భయము. (అందఱికి వానియడలు పెద్దదిగానున్నది.)

**అడలుకొను.** దే. అ. క్రి. అడలు, శోకించు. "గీ. అత్తెఱంగెల్ల నాలించియపుడుచాల్పు, లరదముల దొరతద్దయు నడలుకొను చు." అచ్చ. అ, కాం.

**అడవి.** వై. వి. కాన, అరణ్యము. [అడవిశబ్దము ముందుఁగల సంజ్ఞావాచకశబ్దములు–అడవికంద (సర్పనాళము†), అడవికాకర (వనకారవేల్లము†), అడవికిక్కస (దేవనాళము†), అడవికోడి (వనకుక్కుటము), అడవిగెనసు (పిండాంశుకము†), అడవిచెఱకు (కాంతారము†), అడవిచేమ (శుకటము†), అడవితొగరి (తువరిక†), అడవితొలసి (క్షుణకము†), అడవిదున్న (వనమహిషము), అడవిదోమ (దంశి), అడవినువ్వులు (జర్తిలము), అడవిపంది (వనసూకరము), అడవిపెసలు (వనముద్గము), అడవిప్రత్తి (భారద్వాజి†), అడవిబచ్చలి (వనోపోదక†), అడవిబీఱ (కోశఫల†), అడవిమల్లె (ఆస్ఫోట†), అడవిమామిడి (ప్రియాలము†), అడవిమామెన (శారిబాభేదము†), అడవిమునగ (వనశిగ్రువు†), అడవిమేఁక (ఇడిక్కము), అడవిమొల్ల (యూధిక†), అడవియులవలు (వనకులుత్థము), అడవినదాప (శాలేయము†), అడవీఁగ (దంశము). మొ.]

**అడవికుక్క.** వై. వి. తోఁడేలు, అరణ్యశునకము.

**అడవితిరుగుడు.** ద్వ. వి. కోఁతి, వానరము.

**అడవినట్టు.** ద్వ. వి. అడవితిరుగుడు. (ఇట్లు అడవినెలవు, అడవిమనికి. మొ.)

**అడసాల.** వై. వి. వంటయిల్లు, మహానసము.

**అడావుడి.** హిం. వి. అల్లరి, దడబిడలు.

**అడి.** వై. ఉప. 1. అధికము; "క. అడివిగ్గులతమకంబులు, నుడివోవఁగ." మార్క. ౮, ఆ.–2. వ్యర్థము*. "క. అడివీరపుఁదులువగెలుచునటెపాండవ్రులన్." భార. ద్రో. ౪, ఆ.

**అడిగండ్లు.** దే. వి. బ. (అడుగు+కండ్లు.) మలుపఁగా అడుగున నిలిచిన జాడ. "ఆ. అడిగండ్లు మలిగండ్లు, తిరిపమిడెడుకటికి చేటెరెల్ల." వేమన.

**అడిగము.** దే. వి. ధాన్యవిశేషము. "చ. తడాగము లాసుకంట్ల ములు లవిడిగముల్ నలకన్ దకైత్కుతూ, గడుములు చెక్కు-సుంపు అడిగంబులు." హంస. ౫, ఆ.

**అడిగట్టు.** దే. వి. (అడుగు+కట్టు.) పావ, పాదుక. "ద్వి. హార గణంబులకెల్ల నడిగట్టువనిన." ప్రభు. ౪, ఆ. (అడుగు, కట్టు ఈరెండుపదములుచేరునపుడు గకారముమీఁది ఉకారమునకు ఇకారమువచ్చినది. ఇట్లు అడిగొట్టు అడియాలముమొదలగువానికి నెఱుఁగునది. పదములు ఒకటితోనొకటి చేరునపుడు వర్ణలోప వర్ణాగమవర్ణాదేశములు పెక్కు-లు పెక్కు-విధములుగా వచ్చుచున్నవి. ఉదా. ఒక్కె, నానె, తామరపాకు, ఇరుమడి. మొ.)

**అడిగొట్టు.** దే. విశే. (అడుగు+కొట్టు.) కుత్సితుఁడు. "ఎ, గీ. కటిటి యడిగొట్టు పలువ యేసరి గడాసు, లంజు కూళ చెనఁటి కుచ్చితుండు మొండి, కష్టె నాఁగను కుజనాఖ్యనాఁజెలంగు." ఆం, భా. త్ర. ౧.

**అడిచిపడు.** ద్వి. అ. క్రి. 1. తమకించు, త్వరపడు; "క. జడనిధిచందంబునని, మ్మడువొప్పఁగ నిప్పుడేమి మాఁడెనునిమ్మై నడిచిపడరిత్తనెవ్వగ, లుడుగుఁడుమజేచూచికొంద మొయ్యనతవే తోడ." భార. శాం. 3, ఆ.—2. మండిపడు. "గీ. అడిచి పడునాజ్యహోమ మంత్రాహుతులకు." నై. ౪, ఆ. "గీ. పాలునెయ్యినేలపాలైనఁజిడిముడి, పడుచుఁబడుచుమీఁద నడిచి పడుచు." వి, పు. ౭, ఆ.

**అడిచిపాటు.** ద్వి. వి. త్వర. "సమరముపేక్షించి శాంతిమై నుండెద నడిచిపాటేటికి." భార. భీష్మ. 3, ఆ.

**అడితి.** దే. వి. ఒకవర్తకుఁడు మఱియొకఁడంపెడు సరకులనమ్మి మరల వానికి సరకులుగొనిపంపుటకై వానివద్ద నూటికింతయని పుచ్చుకొనెడుతఱుగు.

**అడిత్రాగుడు.** దే. వి. (అడిగి+త్రాగుడు.) కఱవు, దుర్భిక్షము. "క. అడిత్రాగుడనకయిప్పటి, కడిఁదికిసేమాంసమైన గ్రక్కు-నఁగొనిరం, జెడసేయ కనుచుసనిపినఁ, గడువడినలువురును బోయిగహనములోనఁ." పంచ. నా. ౧, ఆ.

**అడిదపుమెకము.** ద్వి. వి. (అడిదము+మెకము.) మీఁగండ్ల మెకము, ఖడ్గమృగము.

**అడిదము.** దే. వి. కత్తి, కరవాలు, ఖడ్గము.

**అడియఁడు.** దే. విశే. (అడుగు+అఁడు.) పాదసేవకుఁడు. "సీ. దండంబుదర్పితో ద్దండరక్షోహర్త కడియండజాతహాపాంబరునకు." రుక్మాం. ౧, ఆ.

**అడియరి.** దే. వి. (అడుగు+అరి.) కింకరుఁడు. "ఇంక, నడియరితనముననప్పాండవులనాశ్రయింపఁగఁజాల." సం. "కథమన్యభరిష్యామి ప్రేష్యభూతోదురంతకృత్." భార. సౌ. ౧, ఆ.—విశే. లోభి. "క. యాగార్థమడిగినర్థము, యాగమునకుఁబెట్టవలయు నడియరియైతొ, భోగార్థముగా దాఁచిన, యాగమబాహ్యుండు కాకియైజన్మించుచుఁ." విజ్ఞా. ఆచా, కాం.

**అడియాలము.** దే. వి. (అడ+అలము.) గుఱుతు, చిహ్నము. (అలశబ్దమునకిక్కడ స్థానమర్థము.)

**అడియాస.** వై. వి. (అడి+అస.) కలుగునదెడియాశ, ప్రత్యాశ*. "సామ్యములఁగోరక పొమ్మడియాసయేటికిఁ." భార. అర. ౪, ఆ. (చూ. దొడ్డ.)

**అడియొత్తు.** దే. వి. (అడుగు+ఒత్తు.) అడిగట్టు. "ద్వి. జన్నిదంబులుచిక్కు-జడలునుబెట్టి, యడియొత్తునుంచి." భాగ. ౫, స్కం.

**అడిసాటూ.** దే. వి. (అడితి+సాటూ.) తఱుగుబేరము.

**అడుకు.** దే. స. క్రి. దొంతిగనిడు. వి. 1. దొంతి; 2. బ. వడ్లునానఁబోసివేఁచికొట్టినవి, చిపిటము. "క. అడుకులుదిన్నట్లగునే, కడుపునఁగుట్టైత్తినపుడు." భార. ద్రో. ౪, ఆ.

**అడుగంటు.** దే. అ. క్రి. (అడుగు+అంటు.) వట్టు. విశే. బ. అడుగునవనిలిచినవి. "వ, త్నాకరరత్న రాసులడుగంట్లు." కవిక. ౧, ఆ.

**అడుగు.** దే. స. క్రి. 1. ప్రశ్నముచేయు; 2. యాచించు. వి. 1. క్రిందు; 2. పాదము; 3. పాదప్రమాణము. విశే. అధమము. "గీ. కొమ్మ, యడుగులకునుజిగురులడుగులయ్యె." అని. ౧, ఆ.

**అడుగుకొను.** దే. స. క్రి. 1. ప్రార్థించు; 2. యాచించు.

**అడుగుకోలు.** దే. వి. 1. ప్రార్థన; 2. యాచన.

**అడుగుపడు.** ద్వి. అ. క్రి. అధమమగు. "క. లలిఁగొప్పక్రిం చితిమఘు, పులకుకులనునడుగుపఱచిపుష్పాస్త్రామా, లలకునుమంచంబులు బాఁ, పలుకునుబీఁటలనుమాటబళినిజమయ్యెఁ." చంద్ర.

**అడుచు.** దే. స. క్రి. కొట్టు, తాడించు. "క. మదమునపెలుచన యొకగా, డిదకొదమంగోలఁగొనియడిచె." భార. అను. ౧, ఆ.

**అడుజో.** దే. వి. ఒకజాతిడేగ, అఱుజు.

**అడుప.** దే. వి. (అడుగు+పట్టినది.) పశువులకాళ్లయందుఁగలిగెడు వ్యాధివిశేషము. "సీ. పశుపాదరోగంబు పరఁగు నడుపయన." ఆం, భా. ద్వి. మ.

**అడుపు.** దే. వి. ఆటు, కొట్టు, తాడనము.

**అడువ.** దే. విశే. (అడుగు+పట్టినది.) ప్రాఁత, పురాతనము. (అడువసరకులు.)

**అడువు** దే. స. క్రి. అడుగు. "ఎ, గీ. అనుచుమన్యువేగంబున నడువ." (నలకథయందు అడుగఁగాననియు, హరిశ్చంద్రకథయందు కొట్టఁగాననియు అర్థములు.) హంస. ౫, ఆ.—వి. పాదము.

**అడువుఁబుట్టువు.** దే. వి. (అడువు+పుట్టువు.) కాఁపువాఁడు.

**అడుసు.** దే. వి. బురద, పంకము.

**అడ్గు.** దే. స. క్రి. 1. ప్రశ్నముచేయు; 2. యాచించు. వి. 1. క్రిందు; 2. పాదము; 3. పాదప్రమాణము. విశే. అధమము.

**అడ్డ.** యు. దే. వి. గుంటకలోనగువానిదిండు. వై. కుంచములో నగము*.

**అడ్డంకి.** దే. వి. అడ్డి, నిరోధము.

**అడ్డకట్ట.** దే. వి. (అడ్డము+కట్ట.) ఏఱులోనగువాని నీళ్లు వెలికిఁ బోక కట్టెడు కట్ట, అనకట్ట.

**అడ్డకట్టు.** దే. స. క్రి. (అడ్డము+కట్టు.) అడ్డగించు, నిరోధించు. "గీ. అపరకాలుఁడడ్డ, కట్టుకొనియున్న విపినమార్గమున." పర. ౪, ఆ.

**అడ్డకత్తి.** దే. వి. (అడ్డము+కత్తి.) ఆయుధవిశేషము, పట్టిసము.

**అడ్డకమ్మి.** ద్వి. వి. (అడ్డము+కమ్మి.) గడపయందు త్రొక్కుడు కమ్మికి నరిమీఁదుగా నడ్డముగ నేర్పఱపఁబడిన దారువిశేషము, నాను.

**అడ్డకట్ట.** దే. వి. (అడ్డము+కట్ట.) అడ్డి, విఘ్నము. (ఏవ్రు నామాటకు అడ్డకట్టవేయకుము.)

**అడ్డకోడమ.** దే. వి. (అడ్డము+కొడమ.) మత్స్యములఁబట్టు నాకానాకసాధనము. "గీ. కొడమతిజ్జడ్డకొడమ ద్రొబ్బుచుపటంబు." హంస. ౪, ఆ.

**అడ్డగాలు.** దే. వి. (అడ్డము+కాలు.) అడ్డకట్ట. "క. తలగలిగిన సుల్లాయలు, గలవేవగసైనసేవ గలిగినఁదాప్య, కన్నులరవములెన్నియైనం, గలిగెనుఁబోకుమనియడ్డగాల్ వేయఁగక" ...

**అడ్డగించు.** దే. స. క్రి. అడ్డకట్టు, నిరోధించు

**అడ్డచాఁపు.** దే. వి. (అడ్డము+చాపు) అడ్డవాసపుదూలము.

**అడ్డనము.** వై. వి. 1. చెత్తములోనగువానిచేతఁజేయఁబడినకేడెము; (చూ. ఒడ్డనము.) 2. కేడెము. "వ. అంతఁ గ్రోధనాసు ...లంబునడ్డనంబునఁగొని." రా. యు, కాం.

**అడ్డపట్టు.** దే. స. క్రి. (అడ్డము+పట్టు.) అడ్డముగాపట్టు. "ద్వి. అడ్డపట్టెను వాలుఁ దటవెయోయమ్మ." సా.

**అడ్డపట్టె.** ద్వి. వి. (అడ్డము+పట్టె.) మడి చదునుచేసెడి పలక. (రూ.) అడ్డపట్టెయ.

**అడ్డపడు.** ద్వి. అ. క్రి. (అడ్డము+పడు.) అడ్డమువచ్చు.

**అడ్డపాటు.** ద్వి. వి. అడ్డపడుట, నిరోధము.

**అడ్డపాప.** దే. వి. 1. (అడ్డము+పాప.) అడ్డముగా పట్టఁదగిన శిశువు; 2. దూరదృష్టిలేనివాని కన్నులలోనిపాప.

**అడ్డపెట్టు.** దే. స. క్రి. (అడ్డము+పెట్టు.) 1. అడ్డకట్టు, నిరోధించు; "గీ. అడ్డపెట్టెదఁగాక శీవ్రాంశురథము." కాశీ. ౧, ఆ.–2. ఈడుపెట్టు. వి. అడ్డగింత, నిరోధము. "అడ్డపెట్టభిసారికాంగనలకు." చంద్ర.

**అడ్డబాస.** దే. వి. నాపాభూషణవిశేషము. (దీనిని బులాకి అందురు.)

**అడ్డమాను.** దే. వి. (అడ్డము+మాను.) అడ్డపట్టె.

**అడ్డము.** దే. వి. 1. నిరోధము; 2. చాటు; 3. తాకట్టు; 4. పూఁట. విశే. నిరోధకము. (వృత్తియందు అంత్యవర్ణలోపము. అడ్డకట్ట, అడ్డగాలు, అడ్డవేడెము. మొ.)

**అడ్డరిక.** సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు పోఁకి.

**అడ్డవాట్లు.** దే. వి. బ. (అడ్డము+వాట్లు.) అడ్డకట్ట. (నీవేల దానికి అడ్డవాట్లువేసెదవు?)

**అడ్డవాతియమ్ము.** ద్వి. వి. (అడ్డము+వాయి+అమ్ము.) ఒకదినుసు బాణము.

**అడ్డవేడెము.** ద్వి. వి. (అడ్డము+వేడెము.) పాముపడగవంటి గుఱ్ఱపునడ. "రవగాలునుజోడసయడ్డవేడెముల్, దొక్కుడువాళి జిల్గు నడలుంగనిపించుచు." సా. ౧, ఆ.

**అడ్డసరము.** వై. వి. అటరూషము‡.

**అడ్డసాళులు.** ద్వి. వి. బ. (అడ్డము+సారెలు.) పాచికలు. "గీ. అతఁడుగాండివమునడ్డసాళులు వైవఁ, దురులనంపవాన గురియుఁగాని." సం. "నాక్షాఞ్ఞాక్షీపతి గాండీవమ్" భార. విరా. ౪, ఆ. (రూ. అడ్డసాళ్లు.)

**అడ్డాదిడ్డి.** దే. విశే. (అడ్డము+దిడ్డి.) అక్రమము. (వాఁడు అడ్డాదిడ్డిమాటలాడుచున్నాఁడు.)

**అడ్డి.** దే. వి. అడ్డంకి, అభ్యంతరము, నిరోధము.

**అడ్డిగలు.** దే. వి. బ. ఆఁడువారు మెడనుంచుకొనెడు ఒకదినుసు సొమ్ము, గ్రైవేయకము.

**అడ్డిపడు.** ద్వి. అ. క్రి. అభ్యంతరమగు.

**అడ్డీ.** దే. వి. అమూల్యమైనవస్తువుయొక్క పూఁత. (అప్ర.)

**అడ్డు.** దే. స. క్రి. అడ్డగించు. "జగమడ్డుఁదగుదొడ్డసత్తియై." సీలా. ౧, ఆ. –వి. అడ్డగింత. "పాదనేత్రములకడ్డుచొరకమున్న." కాశీ. ౩, ఆ.

**అడ్డుగ.** వై. వి. పాకలోనగును, అర్ధపణము*.

**అడ్డుగట్టు.** దే. వి. (అడ్డు+కట్టు.) 1. అడ్డకట్ట; 2. గడియ ద్రాను. విశే. విఘాతము. "క. నీయడ్డుగట్టుమాటల, కేయడఁబనియేమి." ముక్తా. ౫, ఆ.

**అడ్డుగొను.** దే. అ. క్రి. (అడ్డు+కొను.) అడ్డపడు. "గీ. అడ్డుగొనినాఁడుదోషకుఁ బ్రహస్తుఁడనియె." అచ్చ. యు, కాం.

**అడ్వాన్సు.** ఆం. వి. ముందుగానిచ్చు రూకలు.

**అణఁకువ.** దే. వి. అడఁకువ, నమ్రత.

**అణఁగారు.** దే. అ. క్రి. అడఁగారు, ఉపశమిల్లు.

**అణఁగు.** దే. అ. క్రి. 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నమ్రమగు; 4. నశించు; 5. లోపడు.

**అణఁచు.** దే. ప్రే. అడఁచు, అణఁగించు.

**అణక.** దే. వి. మెడమీఁదనున్న కాఁడిమొదలగువానిని మెడక్రిందికి తెచ్చుకొనుట. "సీ. వెగడొందిరవితేరి నొగలఁగట్టినయట్టి వాహంబులణకలు వైచికొనియె." విక్ర. ౪, ఆ.

**అణకించు.** దే. స. క్రి. అడకించు. "ద్వి. అణకించు నొకటిరెండనుగులవానిఁ, బ్రణుతవిఖ్యాతిసంపదపెంపుగలిగి." భాగ. ౧, స్కం.

**అణకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అధముఁడు, కుత్సితుఁడు.

**అణవీనము.** సం. విశే. (అ. ఆ. అ.) అణువులుపండునది. (పొలము.)

**అణవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అణవీనము.

**అణా.** హిం. వి. రూపాయలో పదియాఱవవంతు.

**అణి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. ఇఱుసుతుదచీల; 2. అంచు; 3. ఎల్ల.

**అణిమ.** సం. వి. న్. పుం. 1. ఒకయైశ్వర్యము; (చూ. ఐశ్వర్యము.) 2. అణుత్వము.

**అణీయము.** సం. విశే. (స్. ఈ. స్.) అల్పిష్ఠము, మిక్కిలి యణువు. (ఈకారాంతమైనపుడు అణీయసీ అని రూపము. ఇట్లంతట నెఱుఁగునది.)

**అణుకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అల్పుఁడు; 2. నేర్పరి.

**అణుజో.** దే. వి. అనుజో. "గీ. సాళువముగిద్దకుడుజావేసడముకురుజు, బాఁజాపెలకట్టె జాలియభైరియణుజు, నోరణంబునునాదిగాఁ బేరువడిన, వేఁటడేగలగిటికొనవిడిచికడిమి." హరిశ్చ. ౨, ఆ.

**అణువు.** సం. వి. ఉ. పుం. 1. చిఱువడ్లు; 2. లేశము. విశే. అల్పము.

**అతఁడు.** దే. స. ఆశబ్దమునకు మహదర్థకపూజ్యైకవచనము, ఆతగాఁడు.

**అతకరించు.** వై. స. క్రి. క్రిందుపఱచు, అధఃకరించు;

"గీ. అధికులనుతాపసులనెల్లనతకరించి, తానయఖిలలోకాధిపత్యం బునొందె." హరి. పూ. ౮, ఆ.—2. అతిక్రమించు*. "సీ. ఆచార్యులను మిమ్మునతకరించుట దోసమైనను నొకమాటయాడవలసె." అక్షి. ౪, ఆ.

**అతెసుడు.** దే. విశే. దుష్టుడు. "క. అతగులచేద్రుపదుడు బల, ప్రాతుడైపట్టువడినంత యుల్కుడై." కవిక. ౬, ఆ. "ద్వి. అతిసరుకో, నరుకాముపెట్టుకొన్న, యతగునిరీతి." ప్రభు. ౫, ఆ.

**అతెనుడు.** సం. వి. ఉ. పుం. మన్మథుడు. విశే. గొప్పవాడు.

**అతర్కణము.** వై. వి. మట్టుమీచేనకాన్నము*. (వాసుకలోనిది.)

**అతలషు.** హిం. వి. వస్త్రవిశేషము.

**అతసి.** సం. వి. ఈ. స్త్రీ. నూనెయగిసె*.

**అతిక్రమము.** సం. వి. అ. పుం. అతిపాతము, మీఱుట.

**అతిక్రమించు.** సం. స. క్రి. మీఱు.

**అతిక్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) అతీతము, మీఱినది.

**అతిక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. అతిక్రమము.

**అతిగండము.** సం. వి. అ. పుం. ఒకయోగము. (చూ. యోగము.) విశే. దొడ్డచెంపగలది.

**అతిచర.** సం. వి. ఆ. స్త్రీ. మెట్టదామర*.

**అతిచ్ఛత్ర.** సం. వి. ఆ. స్త్రీ. సదాప*. అ. పుం. ము. గుడ్డికామంచి*.

**అతిథి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. విందు. పుం. కుశునికొడుకు.

**అతిదేశము.** సం. వి. అ. పుం. 1. ఒకచోటఁజెప్పఁబడినదానిని సామ్యముఁబట్టి మఱియొకచోట నుపయోగపఱచుట; 2. బదులు.

**అతిధృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకఛందస్సు. విశే. అత్యంతధృతిగలవాడు.

**అతినువు.** సం. విశే. ఉ. ఓడఁగడచినది.

**అతిపథము.** సం. వి. న్. పుం. సత్పథము, మంచిత్రోవ.

**అతిపాతము.** సం. వి. అ. పుం. అతిక్రమము.

**అతిబల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తవపులగమువిసుషు*; 2. (విశ్వామిత్రుఁడుపదేశించిన) ఒకవిద్య. విశే. మిక్కిలి బలముగలది.

**అతిభూమి.** సం. వి. ఇ. స్త్రీ. అతిశయము.

**అతిమాత్రము.** సం. క్రి. విశే. అ. స. పెల్లు. విశే. అధికము.

**అతిముక్తము.** సం. వి. అ. పుం. 1. తినాసము*; 2. పుష్పల గురివింద*. విశే. కూడికలేనిది.

**అతిరథుఁడు.** సం. వి. అ. పుం. పెక్కువిలుకాండ్రతో పోరెడి యోధుఁడు.

**అతిరసము.** సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము. "సీ. అలివేణి నీచేతియతిరస రుచి రసజ్ఞానందమయ్యోనేమనఁగవచ్చు." అని. ౧, ఆ.

**అతిరిక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) సమధికము, హెచ్చినది.

**అతిరేకము.** సం. వి. అ. పుం. ఆధిక్యము, హెచ్చు.

**అతివ.** దే. వి. ఆఁడుది, ఇంతి, వనిత.

**అతివస.** వై. వి. ఒకమందుదినుసు, అతివిష*.

**అతివాదము.** సం. వి. అ. పుం. పరుషముగా మాటాడుట.

**అతివాసము.** వై. వి. శ్రాద్ధదినమునకుముందుదినము.

**అతివిష.** సం. వి. ఆ. స్త్రీ. అతివస*.

**అతివృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దేశమునకు హానికరమైన మిక్కిలివాన.

**అతివేలము.** సం. క్రి. విశే. అ. స. పెల్లు. విశే. అధికము.

**అతిశయము.** సం. వి. అ. పుం. ఆధిక్యము, అగ్గలిక.

**అతిశయిల్లు.** సం. అ. క్రి. అగ్గలించు.

**అతిశాయి.** సం. విశే. (న్. ఈ. న్.) అతిశయించినది.

**అతిసర్జనము.** సం. వి. అ. న. 1. ఈవి; 2. కొల.

**అతిసారకి.** సం. విశే. (న్. ఈ. న్.) అతిసారరోగముగలవాఁడు.

**అతిసారము.** సం. వి. అ. పుం. రోగవిశేషము.

**అతిహసితము.** సం. వి. అ. న. శరీరకంపముతోఁ గూడిననవ్వు. (చూ. హాసము.) (ఇది అధమము.)

**అతీంద్రియము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రత్యక్షముకానిది.

**అతీతము.** సం. విశే. (అ. ఆ. అ.) అతిక్రాంతము, కడచినది.

**అతుకు.** దే. అ. క్రి. అంటుకొను. అం, ప్రే. అతికించు. వి. 1. అతుకుట; 2. అతికినతావు. (రూ. అదుకు.)

**అతులము.** సం. విశే. (అ. ఆ. అ.) సరిలేనిది.

**అతులితము.** సం. విశే. (అ. ఆ. అ.)———పై.———

**అత్త.** ఉభ. దే. వి. 1. మగనియొక్కతల్లి; 2. భార్యయొక్కతల్లి. —సం. ఆ. స్త్రీ. 1. అక్క; 2. తల్లి. (సంస్కృతమునసీయర్థములు కొన్ని పుస్తకములయందు వ్రాయఁబడియున్నవి.)

**అత్తడి.** దే. వి. గోడిగబుతువు. (గోడిగ=ఆఁడుగుఱ్ఱము.)

**అత్తపత్తి.** దే. వి. ఓషధివిశేషము, శాఁకుడుముడుఁగు.

**అత్తమిల్లు.** వై. అ. క్రి. 1. అస్తమించు. "సీ. ప్రాలేయ కిరణబింబంబు వెల్వెలఁబాఱి యస్తాచలంబుపైనత్తమిల్ల." కాశీ. ౧, ఆ.—2. ఒఱగు*; "కాయలుత్తుంగకుచపాళినత్తమిల్ల." స్వా. ౨, ఆ.—3. వ్యాపించు*; "వ. అంగళ్లముంగిళ్ల నత్తమిల్లిన ముత్తియంపురంగవల్లుల మీఁద." జై. ౨, ఆ. — 4. శయనించు*. "సీ. పెనుఁబాఁపనునుఁ బానుపునఁదమ్మియింటి తొయ్యలియజ్ఞెలొత్తంగనత్తమిలిన, వెన్నునకు." అచ్చే. బాల, కాం.

**అత్తము.** దే. వి. అరఁటిపండ్లగెల.

**అత్తరము.** దే. వి. త్వర. "వ. అప్పుడమితేఁడురెండువెడందవాతితూపుల నతనికాళ్లు గత్తరించియయ్యత్తరమునొత్తరముకుఱుచపఱచిన." రామా. ౬, ఆ. (రూ. అత్రము.)

**అత్తరు.** దే. వి. సుగంధతైలము, ప్రబోధనము. (రూ. అత్తరువు. "ఎ, గీ. తమ్మపడిగము మంచి గందంపుఁగోర, తబుకుచిన్నారి యడపమత్తరుభుకుప్పె, మొదలుగాఁగల వస్తుసంపదలుపొదలు, సమలమణిమయపటకుటీరాంతరమున." రసి. ౫, ఆ.)

**అత్తలము.** దే. వి. 1. ఈఁటె, కుంతము. "క. పెనుఁగడఁకదొడ్డయత్తల, మునవైచిన." సం. "ప్రాసేన సహదేవస్య శిరసి ప్రాహరద్భృశమ్." భార. శల్య. ౧, ఆ. (రూ. అత్తళము.) 2. బల్లెము. "ఈఁటెల డొంకెనలకగటార్లబల్కుత్తుల నత్తలంబులను." కళా. ౭, ఆ.

**అత్తి.** దే. వి. మేడి, ఉదుంబరము*.

**అత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. (నాట్యపరిభాషయందు) అక్క. (తఱుచుగా నిఘంటువులయందు అంతికయనియున్నది.)

**అత్తు.** దే. అ. క్రి. 1. కలుగు; "క. ఉత్తరమునఁబోడమున త్రి, త్యుత్తరముత్తరములేకయుత్తరమగునే, యత్తినసువృష్టివలనన్, ఇత్తి లకుంబోడమినట్టిచిత్తులపోలెన్." పంచ. నా. ౧, ఆ.—2. కూడు. "క. ఉత్తమమగుద్రవ్యంబును, విత్తంబునునగ్రజునకు విండ్లాంశం బున్, బొత్తుననిచ్చి సహోదరు, లత్తినమాంశంబుగొనుట యర్థిర బెందున్." విజ్ఞా. వ్య, కాం.

**అత్తెము.** వై. వి. హస్తకవచము. "గీ. చేగ, తెగలఁదగనేర్పరించి యత్తెములనుంచి, కదలెన్నపువెంబడినయూడిగములగములు." ఉ, రా. ౭, ఆ.

**అత్తెసరు.** దే. వి. (అత్తు + ఎసరు.) గంజివారకుండ నన్నముతో నిమిడిపోవునట్లు పెట్టెడియెసరు.

**అత్యంతము.** సం. క్రి. విశే. అ. న. పెల్లు. విశే. అధికము.

**అత్యంతీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విచ్చలవిడిఁ గడు నడచువాఁడు.

**అత్యయము.** సం. వి. అ. పుం. 1. అతిక్రమము; 2. చేటు; 3. దండము; 4. దుఃఖము; 5. దోషము.

**అత్యరాళము.** సం. వి. అ. పుం. అరాళమనెడి యేనుఁగునకంటె మిక్కిలి ప్రమాణముగలయేనుఁగు. (ఇది నింద్యము.) విశే. మిక్కిలివక్రము.

**అత్యర్థము.** సం. క్రి. విశే. అ. న. పెల్లు విశే. అధికము.

**అత్యాకారము.** సం. వి. అ. పుం. తిరస్కారము, తెగడిక.

**అత్యాహితము.** సం. వి. అ. న. 1. మిక్కిలిచెఱుపు; 2. ప్రదు కుఁగోరనివని. విశే. కూడఁబడినది.

**అదంత్రము.** వై. విశే. స్వాతంత్ర్యము తప్పినది. "ఉ. మా, తామహుయాగతంత్రమునదాంత్రముచేసి." కాశీ. ౭, అ. (దీనిని అతంత్రమని సంస్కృతముగానే చెప్పవచ్చునని తోఁచుచున్నది. అయినను ప్రతులయందట్లులేదు.)

**అదక.** దే. వి. ప్రాఁతచెప్పు.

**అదటు.** దే. వి. 1. గర్వము. "వ. అనిగర్వించిపలికిన కాళరాత్రిఁ జూచి కనలి రాత్రించరేశ్వరుండు. వ. ఇట్లుహాసముచేసియాగా ప్రతాపోక్తులాఁటదానికి నింతయదటువలదు." కాశీ. ౬, అ.— 2. మదము. "ఎ, గీ. అచలచాలనచణమైనయదటుగలిగె." స్కా. ౫, ఆ.

**అదనము.** వై. విశే. అగ్గలము, అధికము.

**అదను.** దే. వి. సమయము, (రూ.) పదను.

**అదపు.** హిం. వి. గద్దింపు, హెచ్చరిక, భయము.

**అదయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దయలేనివాఁడు.

**అదరు.** దే. అ. క్రి. చలించు. వి. 1. చలనము; "ద్వి. అదరును బెదరునెయ్యంబుతియ్యంబు." భాగ. ౫, స్కం.—2. బ. మిడుఁగుఱులు. "గీ. అసురనీకనొక మహాచలశృంగంబు, విఱిచి వైచెనమరవిభునిమీఁద, గోత్రవైరిమూరకులిశాభిహతివ్రయ్య, నడి చెడానిఁజదలనదరులెగయ." భార. అర. ౫, ఆ. (వృత్తియందు నీశవచనాంతమగు. అదరుటగ్గి. మొ.)

**అదర్శనము.** సం. వి. అ. న. 1. కల; 2. చూడమి.

**అదలు.** దే. అ. క్రి. బెదరు. (చూ. అదలుచు.)

**అదలుచు.** దే. ప్రే. అదలించు. (రూ. అదల్చు. "గీ. అతండు రాజు, ధర్మమూఁదిచలింపకదల్చెనధిప." భార. కర్ణ. ౩, ఆ.) కోప మున గద్దించు, తర్జించు. (చూ. గద్దించు.)

**అదలుపు.** దే. వి. అదలించుట, (రూ.) అదల్పు, తర్జనము.

**అదవద.** దే. వి. కలఁత. "గీ. కీలిఁగబళించి యాతన్ముచూలిమించి, ఘూర్ణిఁగదలించి యుగ్రగ్రహాళినొంచి, యెందునున్నను వెత్తుని యుండువదన, నదన ననుఁజూడు మదవదల్ వదలియధిప." రామా. ౫, ఆ.—విశే. వ్యత్యస్తము. "చ. అదవదలైనపయ్యెదలునందము తప్పిన హారవల్లులున్." విక్ర. ౫, ఆ.

**అదవదపడు.** ద్వి. అ. క్రి. కలఁతపడు. "క. వదవదరాఘవనిలు నిలు, మదవదపడవలదు దశరథాధిప." రామా. ౪, ఆ.

**అదాటు.** వై. అవ్య. ఉన్నట్టుండి. (ఇది వాడుకలోనిది.)

**అది.** దే. స. ఆశబ్దమునకు అమహద్వాచకప్రథమైకవచనము. (అయాఁ డుది. ఆపశ్వాది. ఆజడవస్తువు.) (చూ. అ.)

**అదిగో.** దే. ద్ర. చూపుటను తెలుపునది. "గీ. పూనికన్ధాత్రజుఁడు వృషసేనుఁడాత్త, హయముదాఁటించినట్టివాఁగల్లయదిగో." కళా. ౮, ఆ. (రూ. అదిగో. "సీ. రామానుజుండదిగో మహాయతిరాజు నాయకుండనఁగనున్నాఁడువెలసి." పర. ౫, ఆ.)

**అదితినందనుఁడు.** సం. వి. అ. పుం. అమరుఁడు, వేలుపు.

**అదిర.** దే. అవ్య. (అది+ర.) ఔరా. (రూ. అదిరా. "క. మదిరా క్షికినేగురుమగ, లదిరా." పాంచా. ౫, ఆ.)

**అదిరిపడు.** ద్వి. అ. క్రి. ఉలికిపడు.

**అదిరిపాటు.** ద్వి. అవ్య. ఉన్నట్టుండి, అకస్మాత్తుగా. "గీ. అదిరి పాటెవ్వఁడీక్షించెనాకతమున, హాటకపుఁగృష్ణపింగళుఁడైనపురు షు, నాతనికి వత్సరద్వయంబవధిసూవె, ప్రాణధారణమునకలవ్వలా మురారి." శ్లో. "అకస్మాద్వీక్ష్యతేయస్తుపురుషం కృష్ణపింగళమ్, తస్మిన్నేవక్షణేరూపం నజీవేద్వత్సరద్వయమ్." కాశీ. ౫, ఆ.

**అదుకు.** దే. అ. క్రి. అతుకు. "మహోపలంబుతో, నదికినరీతి నున్న నవనాళ్వము." జై. ౪, ఆ. — అం, ప్రే. అతికించు. వి. 1. అతుకుట; 2. అతికినతావు.

**అదుము.** దే. స. క్రి. అణఁచు.

**అదుముడు.** దే. వి. అదుముట.

**అదురు.** దే. అ. క్రి. చలించు. "క. అదురుదురేపగదాయకుఁ, జెదురుదురేధైర్యమెడలితీవితవాంఛన్, ముదురుదురేమూలలనరి, కెదురుదురేకాకతూరులెచ్చోనయినన్." చంద్ర.—వి. చలనము. (చూ. అదరు.)

**అదురుఁగ్రోవి.** దే. వి. (అదురు+క్రోవి.) అదురువేటు.

**అదురుఁద్రిక్క.** దే. వి. (అదురు+త్రిక్క.) పశురోగవిశే షము. "గీ. నరిడిపుప్పి కప్పనాపురుకడుపూఁద, యదురుఁ ద్రిక్కయనఁగనడరిమటేయుఁ, చెప్పఁగ లెన్నియేని తవిలియెంతయు మహోగ్ర, గ్రంబులయ్యెఁ బశుగణంబునందు." హరి. పూ. ౬, ఆ.

**అదురుగడ.** దే. వి. అదిరిపాటు. "చ. అదురుగడన్ సుగారి భటు లాజియశంఖరవంబువీనులన్, గదిసిన గుండియల్పగులఁ గంపముతోఁదలలెత్తి." ఉ, రా. ౩, ఆ.

**అదురుగుండియ.** దే. విశే. భయపడుస్వభావముగలవాఁడు, భీరువు.

**అదురుచు.** దే. అ. క్రి. అదురుయొక్క రూపాంతరము. (రూ. అదుర్చు. "మ. ధరణీచక్రము దిద్దిరన్ దిరిగె మార్తాండుండు కుంభీభవ, త్కిరణుండయ్యెదిశాళితానమువడంకెన్ మిన్నదిర్చెన్ మహీ, ధరసంతానము గ్రక్కసంగదలె నుద్భ్రాంతంబులైయంబు

ఘంక్, పారలేక గట్లమీఁద బెట్టుపిడుగుల్ ద్రొసెక మహో గ్రతక." భా. (ద్రో. ౫, ఆ.)

**అదురువేటు.** దే. వి. మృగయందు ఇనుపగొట్టములునాటించి వానియందు మందుగట్టించి అదురునట్లు వేసెడువేటు.

**అదువ.** దే. విశే. అధికము. "క. నదులంబులు విడిచి యదువల్లై యుడువులు వడువులువదల." భాగ. ౧౦, స్కం. పూ. "అదువ గాంపురము." ఆము. ౬, ఆ.

**అదృక్కు.** సం. విశే. శ. ప్రసిద్ధవాఁడు.

**అదృశ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) దృశ్యముకానిది. (దృశ్యము=చూడఁదగినది.)

**అదృష్టము.** సం. వి. అ. న. 1. అగ్నిజలాదులవలనఁబుట్టెడికీడు; 2. భాగ్యము. విశే. చూడఁబడనిది.

**అదృష్టి.** సం. వి. ఇ. న. రోషముచేఁగ్రూరమైన చూపు.

**అద్ద.** వై. వి. 1. సగము; 2. అరపోలక*; "సీ. అద్దయంచనఁగఁద దర్థమొప్పు." అం, భా. ద్వి. వై.--3. నాల్కవేసినకుప్పయొక్క క్రిందిసగముభాగము*. (దీనికి సగమను అర్థమునందు వ్యస్తము గాఁ బ్రయోగము కనఁబడలేదు.)

**అద్దకము.** దే. వి. వస్త్రమునకువేయురంగు.

**అద్దగోడ.** వై. వి. మఱుఁగుగోడ.

**అద్దమరేయి.** వై. వి. (అద్ద+రేయి.) అపరాతిరి, అర్ధగాత్రము.

**అద్దము.** వై. వి. ముఖముచూచుకొనెడు గాజుబిల్ల, దర్పణము.

**అద్ది.** దే. స. (చూ.) అది. (రూ. అయ్యది, ఆయది.)

**అద్దికము.** దే. వి. కావలి, రక్షణము. "ఎ, గీ. వాటివాటిలోనింత తాటోటుచేసి, యటమటించకయుండఁదైయద్దికముగ, నేవఁదిరు గాడువిశ్వాసులెపుడుమాకు, జాగిలంబులుసుమ్ముమాసామికాన." సా. ౧, ఆ. (ఈయుదాహరణమునందు వాటివాటిలో అనునది గ్రామ్యము.)

**అద్దియ.** దే. వి. బాడుగ, భాటకము.

**అద్దిర.** దే. అవ్య. (అద్ది+ర.) అదిర. "తాయియ, ద్దిగస్ఫురితంబు మమ్మయన." ఉ, రా. ౬, ఆ. (దీనికి అన్నయ్యలు అను ప్రయుక్తంబులగు. "అద్దిరన్న." "అద్దిరయ్య.") (రూ. అద్దిరా. "అద్దిరా వగలు." శశాం. 3, ఆ.)

**అద్దిరపాటు.** ద్వ. వి. అద్దిరపడుట. "అద్దిరపాటునవానిఁజూచి." సా. 3, ఆ.

**అద్దు.** దే. స. క్రి. 1. తోఁచు; 2. రంగువేయు.

**అద్దువ.** దే. విశే. (రూ.) అదువ. (చూ.)

**అద్దె.** దే. వి. అద్దియయొక్క రూపాంతరము.

**అద్భుతము.** సం. వి. అ. న. ఆశ్చర్యము. విశే. ఆశ్చర్యకరము.

**అద్మరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) భక్షకుఁడు, తిండిపోతు.

**అద్యత్వము.** సం. వి. అ. న. ఇప్పుడు.

**అద్రి.** సం. వి. ఇ. పుం. 1. కొండ; 2. చెట్టు; 3. సూర్యుఁడు.

**అద్రికాకము.** సం. వి. అ. పుం. కాకిదినుసు, కొండకాకి.

**అద్రుచు.** దే. అ. క్రి. అదురు, కంపించు. (అదురుచుయొక్క రూపాంతరము.)

**అద్వయవాది.** సం. వి. న్. పుం. జైనులదేవత.

**అద్వైతము.** సం. వి. అ. న. 1. అభేదము; 2. జీవేశ్వరుల నైక్యముచెప్పెడిమతము.

**అధఃకరణము.** సం. వి. అ. న. 1. క్రిందుపఱచుట; 2. తక్కువ పఱచుట.

**అధఃకరించు.** సం. స. క్రి. 1. క్రిందుపఱచు, అతకరించు; 2. తక్కువపఱచు.

**అధఃకారము.** సం. వి. అ. పుం. 1. క్రిందుపఱచుట; 2. తక్కువ పఱచుట.

**అధఃకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందుపఱపఁబడి నది; 2. తక్కువపఱపఁబడినది.

**అధమము.** సం. విశే. (అ. ఆ. అ.) అవద్యము, తక్కువైనది.

**అధమర్ణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అప్పులకాఁపు.

**అధరము.** సం. వి. అ. పుం. పెదవి. విశే. 1. క్రిందిది; 2. తక్కువైనది.

**అధరితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందుపఱపఁబడినది; 2. తక్కువపఱపఁబడినది.

**అధర్మము.** సం. వి. అ. పుం. ధర్మముకానిది.

**అధర్వణుఁడు** సం. వి. అ. పుం. 1. అథర్వవేదము దెలిసిన బ్రాహ్మణుఁడు; 2. పురోహితుఁడు. (అధర్వణియని ఇకారాంత ముగాఁ గొందఱు.)

**అధర్వము.** సం. వి. న్. న. ఒకవేదము.

**అధర్వుఁడు.** సం. వి. న్. పుం. బ్రాహ్మణుఁడు.

**అధికము.** సం. వి. అ. పుం. ఒకయర్థాలంకారము. (చూ. అలంకారము.) విశే. అదనము.

**అధికరణము.** సం. వి. అ. న. ఆధారము.

**అధికరించు.** సం. స. క్రి. చదువు.

**అధికాంగము.** సం. వి. అ. న. సారసనము, నడికట్టు.

**అధికారము.** సం. వి. అ. పుం. 1. ప్రక్రియ; 2. చెల్లుబడి.

**అధికారి.** సం. వి. న్. పుం. అధికారముకలవాఁడు, అధ్యక్షుఁడు.

**అధికృతుఁడు.** సం. వి. అ. పుం. అధికారి.

**అధిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. అధికారము.

**అధిక్షిప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. దూఱఁబడినది; 3. బెదరింపఁబడినది.

**అధిక్షేపము.** సం. వి. అ. పుం. 1. దూఱుట; 2. బెదరించుట.

**అధిక్షేపించు.** సం. స. క్రి. 1. దూఱు; 2. బెదరించు.

**అధిగతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చదువఁబడినది; 2. పొందఁబడినది.

**అధిగమము.** సం. వి. అ. పుం. 1. చదువుట; 2. పొందుట; 3. లాభము.

**అధిగమించు.** సం. స. క్రి. 1. చదువు; 2. తెలియు; 3. పొందు.

**అధిజ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎక్కుపెట్టినది.

**అధిత్యక.** సం. వి. ఆ. స్త్రీ. కొండమీఁదినేల.

**అధిపతి.** సం. విశే. ఇ. ప్రభువు, ఏలిక.

**అనఘము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిర్దోషము; 2. నిర్మలము; 3. మనోజ్ఞము.

**అనడ్వాహము.** సం. వి. హ. పుం. వృషభము, ఎద్దు.

**అనద.** వై. విణ. 1. అనాథ; 2. అల్పుఁడు*. "గీ. పలువురొకనికోడి పాఱుటబల్లిదు, లనదచేతఁజెడుటయునుఘటిల్లు." సం. "శూరంకాపురుషాహంతి." భార. ఉద్యో. 3, ఆ.

**అనన్యజుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**అనన్యవృత్తి.** సం. విణ. ఇ. ఒకటమనసు చెల్లినవాఁడు, ఏకాగ్రుఁడు.

**అనన్యాదృశము.** సం. విణ. (అ. ఈ. అ.) మఱియొకటితో సమానముకానిది.

**అనన్వయము.** సం. వి. అ. పుం. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.) విణ. అన్వయములేనిది.

**అనపత్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బిడ్డలులేనివాఁడు.

**అనపరాధి.** సం. విణ. (న్. ఈ. న్.) అపరాధికానివాఁడు.

**అనపాయము.** సం. విణ. (అ. ఆ. అ.) అపాయములేనిది.

**అనపాయి.** సం. విణ. (న్. ఈ. న్.) అపాయములేనిది.

**అనయము.** ఉభ. దే. క్రి. 1. అత్యంతము. "క. అనినవినియనుచితంబున, కనయముశంకించియును." బార. విరా. ౨, ఆ. "క మనమునఁగలిగినవివేకమహామకినయం, బును మెచ్చి." పరి. ౪, ఆ —2. ఎల్లప్పుడు "ద కనకపుఁగుప్పలున్ మణిని కాయములున్ ఘనదాన్యరాసులున్, వినుతగజాశ్వసంఘములు విశ్రుతగోమహిషాదికంబులున్, దనకధికంబుగాఁగలిగివాతయు భోక్తయునైనవాఁడునా, కనయముచిత్తగావలయునం చొకభామిని కోరవేమకన్." భో. ౧, ఆ.—3. మఱిమఱి; "ఉ అదియేమి యెఱిఁగింపుమని యాలతొంగితన్ననయంబు నడుగ నిట్లనియె నతఁడు." కళా. ౩, ఆ.—4. సతతము "సీ. ననయమ్ము వానిఁగన్నయమ్ముగలయింతి ననయమ్ముఁదాల్చువానన్నఁజెనకి." కా. ౪, ఆ (కవిత్రయము వారి ప్రయోగములయందీపదమున కత్యంతమనునర్థముతప్ప వేఱొండుగానఁబడదు. కడపటియర్థము ఆధునిక గ్రంథములయందే తఱచుగాఁ గనఁబడుచున్నది.)—సం. వి. అ. పుం 1. అశుభము; 2. ఆపద; 3. దురదృష్టము; 4. ద్యూతాదివ్యసనము; 5. నీతికానిది.

**అనరు.** దే. వి. 1. సంకటము. "గీ. శరనిధులమాఖ్యములుదీఱె మరునకిట్టి, యనరునజయింతమని" ఆము. ౫, ఆ.—2. బలీపస్థానము, మర్మము. "క. తొడిగిన, యనలాస్త్రంబేసెననరులంటఁగ నతఁడున్." ఉ, హరి. ౪, ఆ

**అనర్గళము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డంకిలేనిది.

**అనర్ఘము.** సం. విణ. (అ. ఆ. అ.) వెలలేనిది.

**అనర్ఘ్యము.** సం. విణ. (అ. ఆ. అ) (అర్ఘ్యముకానిది. అర్ఘ్యము=వెలపెట్టఁదగినది; పూజకొఱకైనది.)

**అనర్థకము.** సం. విణ. (అ. ఆ. అ.) పునస్వరాన్వయములేనిది. (దశదాడిమములు షడపూపములులోనగు పదసముదాయము.)

**అనర్థము.** సం. వి. అ. పుం. కీడు. విణ. అర్థములేనిది.

**అనర్హము.** సం. విణ. (అ. ఆ. అ.) అర్హముకానిది.

**అనలము.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. జఠరాగ్ని.

**అనలుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్నిదేవుఁడు; 2. ఒక వసువు. (చూ. వసువు.)

**అనవటిల్లు.** దే. అ. క్రి. అన్నముపక్వమై చల్లారు.

**అనవరతము.** సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

**అనవరార్థ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ముఖ్యము, గానిడి.

**అనవస్కరము.** సం. విణ. (అ. ఆ. అ.) కడుగుటలోనగువానిచేత గరగరికైనది, శోధితము.

**అనస్సు.** సం. వి. స్. న. శకటము, బండి.

**అనాకారము.** సం. విణ. (అ. ఆ. అ.) రూపములేనిది.

**అనాచారము.** సం. వి. అ. పుం. ఆచారములేమి. విణ. ఆచారములేనిది.

**అనాదరము.** సం. వి. అ. పుం. ఆదరములేమి.

**అనాది.** సం. విణ. ఇ. ఆదిలేనిది. (ఆది=మొదలు.)

**అనాదీయము.** సం. విణ. మరి పురాతనపుది.

**అనాథ.** సం. విణ. (అ. ఆ. అ.) నాథుఁడులేనిది.

**అనామతు.** హిం. వి. 1. నమ్మకముమీఁద అల్పకాల మొకవస్తువు నిచ్చుట; 2. ఒక వస్తువును వాడుకొనక యూరకయుంచుట.

**అనామధేయము.** సం. విణ. (అ. ఆ. అ.) పేరులేనిది.

**అనామిక.** సం. వి. ఆ. స్త్రీ. ఉంగరపువ్రేలు.

**అనాయకము.** సం. విణ. అరాజకము.

**అనాయాసము.** సం. వి. అ. పుం. ఆయాసములేమి. విణ. ఆయాసములేనిది.

**అనారతము.** సం. క్రి. విణ. అ. న. (చూ.) అనవరతము.

**అనార్యతిక్తము.** సం. వి. అ. పుం. నేలవేము☨.

**అనావృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దేశమునకు టోనికలుగునట్లు బొత్తిగా వానలేకపోవుట, వఱపు.

**అనాస.** దే. వి. మొగలిపనస☨.

**అనాహతము.** సం. విణ. (అ. ఆ. అ) చలువచేయనిది, (క్రొత్తవస్త్రము) కారికము.

**అని.** దే. వి. 1. యుద్ధము; 2. అల్లికమొదలు. స ప. అన్నియొక్క రూపాంతరము. (చూ.) "పురాణంబులనియును నొకవిద్య." భార. శాం. 3, ఆ.—అవ్య. 1. ఈ ప్రకారము అను నర్థమును తెలుపును; "అంధుండవగుమని శాపంబిచ్చిన."—2. ప్రకారమును తెలుపును; "బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులని నాలుగువర్ణములవారు కలరు."—3. తలఁచుటను తెలుపును; "ఇమ్మహాత్ముని కీఁగాంచితి, కృతార్థుండనైతినని మనంబున నంతసిల్లి."—4. కారణమును తెలుపును; "అశుచిభావంబునంగాశేమియప్పరమపతివ్రతమదియదృష్టిగోచరకాకున్నదయ్యెనని పూగ్గాభిముఖుండై."—5. ప్రసిద్ధిని తెలుపును "ఉజ్జయిని అని యొక పట్టణముకలదు." (ఇంకను ప్రయోగములు విచారింపవలెను.)

**అనికి.** దే. వి. అల్లిక.

**అనిక్షువు.** సం. వి. అ. పుం. నల్లచెఱకు☨.

**అనిత్యము.** సం. విణ. (అ. ఆ. అ.) నిత్యముకానిది. (నిత్యము=శాశ్వతము.)

**అనిదంపూర్వము.** సం. విణ. (అ. ఆ. అ.) అపూర్వము, అబ్బురము.

**అయ్యారె.** ద్వి. అవ్య. (అయ్యా+రె.) ఔర. (రూ. అయ్యారే. "క. అయ్యారే చెలువెక్కడ, నయ్యారే గెలువఁజాలు సంగజు నారిన్." నిజ. ౧, ఆ.)

**అయ్యు.** దే. ద్ర. (అయి+యు.) మీఁదవిరుద్ధధర్మముకలుగుటను తెలుపును. "గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నానుండునేని, బాలుఁడయ్యును బూజ్యుండు ప్రాప్తుఁడుండు." భార. సభా. ౩, ఆ.

**అయ్యో.** ద్వి. అవ్య. (అయ్య+ఒ.) అయో. "ఎ, గీ. కటికి నేలఁగంప్లసుళ్లొత్తనిద్రపోయెనొసయ్యో." భార. ఆది. ౬, ఆ.— (రూ. అయ్యా. ఆమ్రేడితమందు అయ్యయ్యొ, అయ్యయ్యో.)

**అర.** వై. వి. సగము, అర్ధము.

**అరఁగు.** దే. వి. తిన్నె, వేదిక. "ఉ. నీడసున్నపున్, రంగుటరంగు ప్పెలయరంగయిపో." ఆము. ౫, ఆ.

**అరఁటి.** దే. వి. అనఁటి, కదళీ.

**అరక.** దే. వి. ఎద్దులఁగట్టిదున్నుటకు సిద్ధపఱిచిన నాఁగలి, ఏరు.

**అరకాఁడు.** దే. వి. (అరిక+కాఁడు.) సైరుపెట్టువాఁడు, కర్షకుఁడు.

**అరఖు.** హిం. వి. ద్రవరూపమైన ఔషధము.

**అరగడము.** దే. విశే. వయసుచెల్లినది, వృద్ధు.

**అరగడి.** దే. వి. కుఱచగోడ.

**అరగన్ను.** ద్వి. వి. (అర+కన్ను.) సగముమూయఁబడినకన్ను.

**అరగలి.** ద్వి. వి. (అర+కలిమి.) సందేహము. "చ. నరుననుఁ బూనిపల్కితి వినం జనిమాలినయట్టిపల్కులే, నరగలిలేక బెట్టదరి నప్పుసుసూడును నన్ను నాతినిన్." భార. కర్ణ. ౩, ఆ.

**అరగలిగొను.** ద్వి. అ. క్రి. (అరగలి+కొను.) సందేహించు. "ద్వి. హరుఁడుభక్తులమనంబరియంగఁదలఁచి, యరుదైనవస్తువు లడుగంచివేఁడ, నరగలిగొనకిత్తురల్లభక్తులున." బస. ౮, ఆ.

**అరగూఁడు.** ద్వి. వి. గోడయందేర్పఱిచినగూఁడు.

**అరడ.** దే. వి. పఱుచాఁటఁదగినసాధనవిశేషము. "గీ. ఈఁదుకొయ్యలుతెప్పలునీఁదుకాయ, లరడలరిగోళ్లుపడవలుదరులుపుట్లు, చేపడవలోడ లాదిగాఁజెలఁగునట్టి, యంబుతరణంబులకునెల్ల నధిపుఁడతఁడు." హంస. ౪, ఆ.

**అరణము.** వై. వి. వివాహకాలమునందు అల్లునకును ఆఁడుబిడ్డకును ఇయ్యఁబడుధనము, హరణము.

**అరణి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. త్రచ్చినిప్పుఁబుట్టించెడుకొయ్య.

**అరణ్యము.** సం. వి. అ. న. కాననము, వనము, అడవి.

**అరణ్యశునకము.** సం. వి. అ. పుం. వృకము, తోఁడేలు.

**అరణ్యాని.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దయడవి, పేరడవి.

**అరత.** వై. ద్ర. సమీపమునందు. "గీ. అనుజాగెలుపు, గాంచి మోదించెనరతనటించుచక్రి." (రామాయణార్థమున నరతననియు, భారతార్థమున అరతననియుభేదము.) రాఘ. ౮, ఆ. (కొందఱు ఉపకంఠము అను సంస్కృతశబ్దముయొక్క అర్థమునుబట్టి తెనుఁగు నను సమీపమునందు అనునర్థమున అఱుతనని ప్రయోగించినారు. చూ. అఱుత.)

**అరతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. విరాగము; 2. ఒక మన్మథావస్థ.

**అరత్ని.** సం. వి. ఇ. పుం. 1. చిటికెనచాచినమూర, 2. మోఁచెయి.

**అరదండ.** దే. వి. రెండుచేతులకుఁదగిలించెడు సంకెల.

**అరదము.** వై. వి. తేరు, రథము.

**అరప.** దే. వి. మీఁదఁగూర్చుండుటకై యేర్పఱిచిన చిన్నచప్పరము, మంచము.

**అరపది.** వై. స. పదిటసగము, అయిదు.

**అరమర.** ద్వి. వి. (అర+మరలుట.) 1. సందేహము; 2. భేదము. (రూ. అరమరము. "ఉ. తామదినమ్మకున్నది విదర్భనరేంద్రసుతుజ నిన్నును, ప్రేముఁడవంచునీ యంమరంబునఁబోమనసీదు నీకు." సై. ౭, ఆ.)

**అరమరిక.** ద్వి. వి. (అరమరయొక్క రూపాంతరము.) 1. సందేహము; 2. భేదము. "అరమరికలేనిచుట్టలు." క్షే. త్రయ.

**అరమీటుమొన.** ద్వి. వి. మల్లబంధవిశేషము.

**అరము.** సం. వి. అ. న. బండికంటియాకు. క్రి. విశే. న. శ్వీరితము. విశే. వడిగలది.

**అరముడి.** దే. క్రి. విశే. మాటిమాటికి.

**అరయిక.** దే. వి. ఎరయుట, విచారణ.

**అరయు.** దే. స. క్రి. 1. విచారించు; 2. వెదకు.

**అరరము.** సం. వి. అ. న. 1. తలుపు; 2. ఒఱ.

**అరరి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. కవాటము, తలుపు.

**అరవిరలు.** దే. విశే. బ. శుష్కము. "క. విరహాగ్నివలనదేహము, లరవరలైహస్తభూషణావళులెల్లన్, హరిఁగోరిజాఱిపడఁగా, నరుదుగనొకచోటఁగూడియందఱుఁదమలోన్." వి, పు. 2, ఆ.

**అరవాయి.** వై. వి. 1. అధైర్యము; 2. సంకోచము.

**అరవాయిగొను.** ద్వి. అ. క్రి. (అరవాయి+కొను.) 1. అధైర్యపడు; 2. సంకోచించు. "వ. చుట్టంబనియరవాయిగొనుట కర్జంబుగాదు." భార. కర్ణ. 3, ఆ.

**అరవిందము.** సం. వి. అ. న. పద్మము, తామర.

**అరవిరి.** ద్వి. వి. సగమువిరిసినమొగ్గ, ముకుళము.

**అరసావు.** ద్వి. వి. (అర+చావు.) మూర్ఛ. "చ. అతండు నీమఱం, దికినరసావునొచ్చె." భార. ద్రో. ౫, ఆ.

**అరళము.** సం. వి. అ. న. తలుపు. "అరళంబులు విరళంబులైన." భాగ. ౧౦, స్కం. పూ.

**అరళువు.** సం. వి. ఉ. పుం. దుండిగముచెట్టు.

**అరాజకము.** సం. విశే. (అ. ఆ. అ.) రాజులేనిది.

**అరాతి.** సం. వి. ఇ. పుం. శత్రువు, పగతుఁడు.

**అరాళము.** సం. వి. అ. పుం. 1. మదపుటేనుఁగు; (ఇదినింద్యము.) 2. సర్జరసము; 3. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలినివంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి చూపుడువ్రేలిని వంచి తక్కిన వ్రేళ్లను జక్కఁగాఁ జాఁచిపట్టినది.) విశే. వంకరైనది.

**అరి.** ఉభ. దే. వి. 1. కప్పము; 2. శరసంధానస్థానమైనయల్లెనడుమ. "క. నరినాభానముసేయుట, యరిఁబోయుటతెలియుటేయుటద్భుతకరమై, తరుణీశరములుభానుని, కరములగతిరిపులనేక కాలమకప్పెన్." విక్ర. ౬, ఆ. "సీ. బలితంపుఁగ్రొవ్వాఁడి ములుకుల సింగాణిఁగూరిచియరిసెవికొనకులాగి." అచ్చ. యు, కాం. (దీనికి వృత్తియందు నిర్బంధములోనగు అర్థములు కలుగుచున్నవి. చూ. అరికట్టు. మొ.)–సం. ఇ. పుం. 1. చక్రము;

2. శత్రువు. (అరిషడ్వర్గము.—కామము, క్రోధము లోభము, మోహము, మదము, మాత్సర్యము.)

**అరిందముఁడు.** సం. విశ. (అ. ఙ. అ.) శత్రువు నడఁచువాఁడు.

**అరికట్టు.** దే. స. క్రి. 1. అడ్డగించు; "సీ. తెరువులనరుగంగ నరికట్టిచంపె నాబాలవృద్ధంబుగా బహుజనముల." నిరఙ్. 3, ఆ.—2. పరివేష్టించు. "సీ. ఆకుశద్వీపంబునరికట్టుకొనియుండు నెనిమిదిలక్షలఘనఘృతాబ్ధి." భాగ. ౫, స్కం. ౨, ఆ.—వి. బ. దుష్టటికెులిపెట్టి రెండుబుజములయందును జందెపువాటుగానైచి కట్టినకట్టు.

**అరిగ.** దే. వి. 1. కేడెము; "సీ. బెడిదంపుటరిగలు బిఱబిఱం ద్రిప్పుచు వడిఁబిల్లమెఱములువైచువారు." కళా. ౮, ఆ.—2. ఒకబిరుదు. "సీ. కదువేగమునఁబెండ్లికోడుకు నెమ్మొగమున కరిగయడ్డమువట్టెఁగురుఁబిభుండు." కళా. ౭, ఆ.

**అరిగాపు** దే వి. (అరి+కాపు.) కట్టుకావలి. (అరిగాపుఁదోఁట= కట్టుకావలిగలతోఁట. మఱియు అరిగాఁపు అనఁగా కప్పముకట్టు వాఁడు.)

**అరిగాళ్లు.** దే. వి. బ. (అరి+కాళ్లు.) ద్వారపుగుజ్జపువీఁటలకు వెనుకటిభాగమున ఊఁతగానుంచెడుకమ్ములు.

**అరిగొను.** దే అ. క్రి. (అరి+కొను.) అడ్డపడు. "ద్వి. అలకు బెబ్బులియరిగొన్నయట్లు." వీరచరిత్రము.

**అరిగోలు.** దే. వి. (అరి+కోలు.) ఏఱుదాఁటఁదగిన సాధనవిశేషము. (చూ. అరడ.)

**అరెెం.** దే. వి. ఎత్తుడునీరుపోయుటకై లోలిచి కాలువమొదటనుంచెడు తొట్టివ్రాఁనులోనగునది, దోనె.

**అరితి.** దే. వి. కూరిమి, ప్రేమము. "ఎ, గీ. అరితి, బాళి ప్రేముడి మచ్చికమక్కువయనఁ, బ్రేమదోఁచును." ఆం, భా. ప్ర, నా.

**అరిత్రము.** సం. వి. అ. న. ఓడగడపెడుత్రెడ్డు, కడపుఁజేయి, చుక్కాను.

**అరిదళము.** వై. వి. హరిదళము, హరితాళము.

**అరిది.** దే. విశ. 1. అశక్యము. "క. అరిగరమునఁదాల్చిన, నరిగరమునఁగేంద్రధీరుఁడైనం బెడఁడే, యరిదిరమైనన్నడుగుట, యరిదిరమైకాభిలాషులగునృపతులకున్." ఉ, హరి. ౪, ఆ.—2. దుర్లభము. "సీ. హిమాద్రికన్య వరమునఁబుట్టిన యరిదికూఁతురు." హరి. ఉ. ౭, ఆ.—3. దుస్సహము. "చ. అరిదినిక్రంతనాఖ్య నిరయంబిది." మార్క. ౨, ఆ.

**అరిపడు.** రూ. అ. క్రి. అడ్డపడు. "చ. తద్భుజనాంతరాయత, త్వర మతిమాకునిప్పుడరిపడ్డదురాత్మలనేఁడుగంటిరే." భాగ. 3, స్కం.

**అరిమి.** దే. వి. బిడ్డలకుగొంతునందుఁగలిగెడు వ్యాధివిశేషము. "ద్వి. పలపలక్కవు చెప్పవేయన్న నీకు, నరిమియోకోవయోయంగి టిముక్కో." భల్లా. 3, భా.

**అరిమేదము.** సం. వి. అ. పుం. వెలితుమ్మ. (అనికొందఱు.)

**అరివాణము.** వై. వి. గిన్నె*. "క. సతనాల్కలజేజేయపు, డతనికిఁబొడకట్టిపనిఁడియరివాణముతో, మతఁడెచ్చి పాలయో రెం, బతివలుమువ్వరకుఁబెట్టుమనియిడిచనుమున్." అచ్చ. బాల, కాం. (హరివాణశబ్దము సంస్కృతమనియు దానికర్థము గుండిగయనియుఁ దెలియునది.)

**అరిష్టతాతి.** సం. విశ. ఇ. క్షేమంకరుఁడు, మేలుచేయువాఁడు.

**అరిష్టము.** సం. వి. అ. న. 1. కీడు; 2. పురిటిల్లు; 3. మజ్జిగ; 4. చావుగుఱుతు; 5. కల్లు; 6. సేబు. పుం. 1. కాకి; 2. గద్దపులుఁగు; 3. వెల్లుల్లి; 4. కుంకుడుచెట్టు; 5. వేముచెట్టు.

**అరుంతుదము.** సం. విశ. (అ. ఆ. అ.) మర్మమునఁదాఁకునది.

**అరుంధతి.** సం. వి. ఈ. స్త్రీ. వసిష్ఠునిభార్య, ఒకనక్షత్రము.

**అరుఁగు.** దే. వి. తిన్నె. "అరుఁగుమెఱుఁగుమట్టికల్ మసనెక్కెక్కుడు." పాంచా. ౪, ఆ. (అరుఁగనియే తఱుచుగా వాడుక. అరఁగని యొకానొకచోఁ గానఁబడుచున్నది.)

**అరుగు.** దే. అ. క్రి. పోవు, గమించు.

**అరుగుదెంచు.** దే. అ. క్రి. (అరుగు+తెంచు.) 1. వచ్చు; "కాంచిరరుగుదెంచుమహాస్త్రముల్." భార. ఆది. ౭, ఆ.—2 పోవు. "ఎ, గీ. హంసకేతనుసాలికినరుగుదెంచె." జై. ౪, ఆ. (గక్కడ తెంచుధాతువుస్వార్థమందు అనుప్రయుక్తమైనదని యెఱుఁగవలయును. ఇట్లే ఏగు చను క్రియలకును. ఇట్టిప్రయోగములు ఇక గ్రంథములయందుఁగానఁబడవు. ఈ స్వార్థమందు ... అనుప్రయుక్తమగుటకు పోవుటకు పోవుదె ము అని ప్రయోగించిన ఆంధ్ర ప్రయోగమే ప్రమాణము. చూ. పోవఁదెంచు.)

**అరుచి.** సం. వి. ఇ. స్త్రీ. రుచిలేమి.

**అరుజు.** దే. వి. మత్స్యవిశేషము, శాలము. "ఎ. అరుజులిప్పుఁ జేఁపయాకుజెల్ల." హంస. ౪, ఆ. (దీనిభేదములు. ఇంగువ, పుల్లరుజు.)

**అరుణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎలిపదచెట్టు; 2. ... గెడచెట్టు; 3. మంజిష్ఠచెట్టు; 4. మంచుకచెట్టు. అ. పుం. ను. 1. ఇంచుకయెఱుపు; 2. కపిలవర్ణము; 3. కుష్ఠభేదము; 4. ... వి. 1. ఇంచుకయెఱుపుగలది; 2. కపిలవర్ణముగలది.

**అరుణిమ.** సం. వి న. పుం. ఎఱ్ఱదనము, ఎఱుపు.

**అరుణుఁడు.** సం. వి. అ. పుం. 1. అనూరుఁడు; 2. సూర్యుడు.

**అరుదు.** దే. వి. విశ. ఆశ్చర్యము. విశ. అపూర్వము.

**అరుదుపడు.** దే. అ. క్రి. ఆశ్చర్యపడు.

**అరుదెంచు** దే. అ. క్రి. (అరుగు+తెంచు.) 1. వచ్చు; 2. పోవు. "వ. చంపకాపురంబునకరుదెంచువారు." జై. ౪, ఆ. (చూ. అరుగుదెంచు.)

**అరులు.** దే. వి. వాత్సల్యము. "సీ. ఆర్తిలియుఁ జనఁగుఱు ... వాత్సల్యసంజ్ఞయైవరఁగుచుండు." ఆం, భా. ప్ర. నా.

**అరులుమరులు.** దే. వి. ముదిమియందుఁగలిగెడు మదతప్పుబుద్ధి, (రూ.) అర్లుమర్లు.

**అరుళువు.** సం. వి. ఉ. పుం. దుండిగచెట్టు.

**అరువు.** దే. వి. ధాన్యాదులఋణము.

**అరువుద్రిక్క.** దే. వి. (అరువు+త్రిక్క.) పశుపోగవిశేషము.

**అరువుఁబూఁట.** దే. వి. (అరువు+పూఁట.) గొక్కపుఁబూఁట. (అచ్చునకు అరువు దేశము.)

**అరుష్కరము.** సం. వి. అ. పుం. జీడిచెట్టు. ... వ్రణము నగలుగఁ జేయునది.

**అరుసము.** వై. వి. హర్షము. "చ. అరుసముఁజెందివచ్చిరంట యందఱు ముందటిలీలగుంభుల్లై." ఉ, గా. ౨, ఆ.

**అరుసు.** వై. వి. రాజు. "క. చేపట్టిన ప్రభులగుదురు, కోపించిన రంభగూడుకొందురుజగతిన్, స్థాపింపఁబోవుదురాలని, యా పందలుసాల్వకోనమరుసునవెనయో." అప్ప. 3, ఆ.

**అరుస్సు.** సం. వి స్. న. వ్రణము, పుండు.

**అరుహుఁడు.** వై. విశే. అర్హుఁడు.

**అరె.** దే. అవ్య. ప్రశంసనుదెలుపును. (రూ. అరే. ఆమ్రేడిత మందు అరరె, అరరే. "చ. వెం, బడిబళిరే పురే యరరె బాపురె యంచువచింపవేఁటరుల్." చంద్రా. ౨, ఆ. "అరరే దాంతి." చంద్రా. 3, ఆ.)

**అర్కపుష్పిక.** సం. వి. ఆ. స్త్రీ. కోలపాలతీగ.

**అర్కబంధువు.** సం. వి. ఉ. పుం. శాక్యసింహుఁడనుబుద్ధుఁడు.

**అర్కము.** సం. వి. అ. పుం. 1 జిల్లేడుచెట్టు; 2. పటికము; 3. రాగి.

**అర్కారా.** హిం. వి. దూత, పనివాఁడు. (రూ. హర్కారా.)

**అర్కుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అన్న; 3. ఇంద్రుఁడు.

**అర్గళము.** సం. వి. అ. న. ఆ. స్త్రీ. 1. గడియమ్రాను; 2. పెద్ద యల. (ఇదిమూడులింగములయందని మేదిని.)

**అర్గు.** దే. అ. క్రి. అరుగుయొక్క రూపాంతరము. "మత్త. ఎన్న డుఁగామణియిట్టటర్గియెఱుంగవు." కళా. 3, ఆ.

**అర్ఘము.** సం. వి. అ. పుం. 1. వెల; (రూ. అర్ఘువు.) 2. పూజిం చుట.

**అర్ఘ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పూజకుఁదగినది; 2. పూజకొఱకైనది. (అష్టార్ఘ్యములు.—పెరుగు, తేనె, నెయ్యి, అక్షతలు, గఱిక, నువ్వులు, దర్భ, పుష్పము.)

**అర్చ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పూజ; 2. ప్రతిమ.

**అర్చకుఁడు.** సం. వి. అ. పుం. పూజచేయువాఁడు, నంబివాఁడు.

**అర్చన.** సం. వి. ఆ. స్త్రీ. పూజ. (ముగ్గు, సుగంధము, అక్షితలు, పుష్పము, ధూపము, దీపము, ఉపహారము, తాంబూలము అని యెనిమిదివిధములుగలది.)

**అర్చి.** సం. వి. స్. స్త్రీ, న. 1. మంట; 2. వెలుఁగు.

**అర్చించు.** సం. స. క్రి. పూజించు. (సమర్చించు అనియు.)

**అర్చితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అపచితుఁడు.

**అర్జకము.** సం. వి. అ. పుం. తెల్లగగ్గెరచెట్టు.

**అర్జీ.** హిం. వి. వ్రాంతపూర్వకమైన మనవి.

**అర్జుకి.** సం. వి. ఆ. స్త్రీ. నాట్యపరిభాషయందు వేశ్య.

**అర్జునము.** సం. వి. అ. న. 1. కసవు; 2. బంగారు; 3. కంటి తెవులు. పుం. 1. ఏఱుమద్దిచెట్టు; 2. తెలుపు; 3. నెమలి. విశే. తెల్లనిది.

**అర్జుని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు; 2. బాణాసురునికూఁతురు; 3. బాహుదయనునది; 4. (చికానోరచో) కుంటెనకత్తె.

**అర్జునుఁడు.** సం. వి. అ. పుం. 1. కృతవీర్యుని కొడుకు; 2. పాండురాజుకొడుకు; 3. ఒకతల్లికొక్కకొడుకు.

**అర్ణము.** సం. వి. స్. న. ఉదకము, నీరు.

**అర్ణవము.** సం. వి. అ. పుం. సముద్రము, కడలి.

**అర్ణోరాశి.** సం. వి. ఇ. పుం. సముద్రము, నీరుకుప్ప.

**అర్తనము.** సం. వి. అ. న. రోయుట, రోఁత.

**అర్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. దుఃఖము; 2. వింటికొప్పు.

**అర్థజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తెలివరి.

**అర్థన.** సం. వి. ఆ. స్త్రీ. యాచన, వేఁడికోలు.

**అర్థనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) వేఁడఁదగినది.

**అర్థపుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు, సెట్టిఱేఁడు.

**అర్థప్రయోగము.** సం. వి. అ. పుం. కుసీదము, వడ్డిచేతి బ్రదుకు.

**అర్థము.** సం. వి. అ. పుం. 1. శబ్దార్థము; 2. ఇంద్రియార్థము; 3. కారణము; 4. ధనము; 5. నివృత్తి; 6. న్యాయము; 7. ప్రయోజనము; 8. వస్తువు.

**అర్థవంతుఁడు.** సం. విశే. (త్. ఈ. త్.) అర్థముకలవాఁడు. (ఈకారాంతమైనప్పుడు అర్థవతి అని రూపము. ఇట్లంతట నెఱుఁగు నది.)

**అర్థవాదము.** సం. వి. అ. పుం. స్తుతి.

**అర్థశాస్త్రము.** సం. వి. అ. న. నీతిశాస్త్రము.

**అర్థాపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒక అలంకారము. (చూ. అలం కారము.)

**అర్థి.** సం. వి. న్. పుం. 1. వేఁడువాఁడు; 2. వాది; 3. కొలు వుకాఁడు; 4. (తెనుఁగున) కోరిక.

**అర్థించు.** సం. స. క్రి. 1. కోరు; 2. వేఁడు.

**అర్థితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది; 2. వేఁడఁ బడినది.

**అర్థ్యము.** సం. వి. అ. న. శిలాజిత్తు. విశే. 1. తెలివిగలది; 2. న్యాయముతోఁగూడినది; 3. వేఁడఁదగినది; 4. అర్థమువలన తొలఁగనిది.

**అర్దన.** సం. వి. ఆ. స్త్రీ. అర్థన, వేఁడికోలు.

**అర్దితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడుగఁబడినది; 2. నొప్పింపఁబడినది.

**అర్ధచంద్ర.** సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడచెట్టు. అ. పుం. ము. 1. క్షురప్రమనెడి అమ్ము; 2. మెడపట్టిత్రోయుట కమర్చిన అర్ధ చంద్రాకారపుచేయి; 3. గోటినెలవంక; 4. అభినయహస్తవిశే షము. (చూపుడువ్రేలుమొదలయిన నాలుగు వ్రేళ్లనొక ప్రక్క సరిగాఁజేర్చి బొటనవ్రేలినెడముగాఁ జాఁచిపట్టినది.)

**అర్ధతూరము.** సం. వి. అ. పుం. యుద్ధారంభ వాద్యధ్వని.

**అర్ధము.** సం. వి. అ. న. అర. పుం. తునుక.

**అర్ధరథుఁడు.** సం. వి. అ. పుం. ఒక్కవిలుకానితో నరిగా నిలిచి పోరలేని యోధుఁడు.

**అర్ధహారము.** సం. వి. అ. పుం. అఱువదినాలుగుపేటలుగల హారము. పేరుబదినాలుగుపేటలుగల హారము. (అనికొందఱం దురు.)

**అర్ధేందువు.** సం. వి. ఉ. పుం. 1. అరచందురుఁడు; 2. కల యికవగ; 3. మెడపట్టిత్రోయుటకమర్చినచేయి; 4. గోటినెలవంక.

**అర్ధోరుకము.** సం. వి. అ. న. చండాతకము, చల్లడము.

**అర్పటము.** సం. వి. అ. పుం. అప్పడము.

**అర్పణము.** సం. వి. అ. న. అర్పించుట, అప్పనము.

**అర్పించు.** సం. స. క్రి. అప్పగించు.

**అర్పితము.** సం. విణ. (అ. ఆ. అ.) అర్పింపఁబడినది.

**అర్బుదము.** సం. వి. అ. పుం. 1. దశకోటి; (కోటి అనికొందఱు.) 2. నేత్రరోగవిశేషము; 3. ఒకానొకకొండ.

**అర్భకుఁడు.** సం. వి. అ. పుం. బాలుఁడు. విణ. 1. కృశుఁడు; 2. మూర్ఖుఁడు.

**అర్మము.** సం. వి. న్. న. నేత్రపక్ష్మమధ్యరోగము, కొరి. నేత్రరోగము (అనికొందఱు.)

**అర్మిలి.** దే. వి. 1. అపేక్ష; "చ. చూచుటఁగాని క్రీడిక, న్నర్మిలిమఱిలేదు భోజనముమీఁది యపేక్ష యొకించుకేనియుఙ్." విజ. ౨, ఆ.–2. ప్రేమము.

**అర్య.** సం. వి. ఆ. స్త్రీ. కోమటిది.

**అర్యముఁడు.** సం. వి. న్. పుం. 1. సూర్యుఁడు; 2. పితృదేవతలలో నొకఁడు.

**అర్యాణి.** సం. వి. ఈ. స్త్రీ. అర్య, కోమటిది.

**అర్యీ.** సం. వి. ఈ. స్త్రీ. కోమటివానిపెండ్లాము.

**అర్యుఁడు.** సం. వి. అ. పుం. 1. కోమటివాఁడు; 2. ఒడయఁడు.

**అర్లు.** దే. వి. అరులుయొక్కరూపాంతరము. (చూ.) అరులు.

**అర్వము.** సం. వి. త్. న్. పుం. 1. గుఱ్ఱము; 2. తులువగుఱ్ఱము. విణ. అధమము, కీడ్పడినది.

**అర్వాచీనము.** సం. విణ. (అ. ఆ. అ.) క్రిందనుండునది.

**అర్శము.** సం. వి. స్. న. మూలరోగము.

**అర్శసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మూలరోగముగలవాఁడు.

**అర్శోఘ్నము.** సం. వి. అ. న. మీఁగడపెరుఁగు. (మీఁగడదీసిన పెరుఁగు దధిబుసము.) పుం. కందగీ.

**అర్శోఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. నేలతాడిగీ.

**అర్హణ.** సం. వి. ఆ. స్త్రీ. అర్చ, పూజ.

**అర్హత.** సం. వి. ఆ. స్త్రీ. యోగ్యత.

**అర్హము.** సం. విణ. (అ. ఆ. అ.) అనురూపము, తగినది.

**అర్హితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అర్చితుఁడు.

**అల.** యు. దే. వి. 1. గది; 2. పెట్టెలోనిసగువాని లోపలి అఱ; 3. హస్తాది తలము. "మీఁజేయి యఱచేయి." సం. "పాణిపృష్ఠంపాణితలమ్." కాశీ. ౫, ఆ.–వై. 1. సగము; "అఱచందురునిక్రొత్త మెఱుఁగులు." హరి. ఉ. 2, ఆ.–2. కొఱఁత*; "క. ఘోరంబగునీ, జఱభివధియించినీతో, నఱలేనిమనోజకేళినలరెదనెలమిఙ్." రా. ఆర. ౧, ఆ.–3. భేదము*; "సీ. పికభాషలకువిపంచిక మ్రోఁతలకుభావ మఱలేక తోడ్పడిమెఱసెనేని." హరి. ఉ. 2, ఆ.–4. వంచన*; "చ. అనిననతండు నెమ్మనమునందొగిమోదము ఖేదముంబెనం, గొనఁగఁబురోహితుంబిలిచికోమలిజన్మఫలంబుమీకుఁదోఁ, చినలెఱఁగంతయుందెలియఁ జెప్పుముమీరికి వీరుసమ్మతిం, చినవెంటులైనలెస్స యఱచేసినదోషము వచ్చునావుడుఙ్." భో. ౪, ఆ.–5. కీడు*; "ఎ. గీ. దుర్జయమున శకుని కర్ణదుశ్శాసనుల్, గఱపఁబాండవులకు నఱయచేయఁ, గడఁగెఁబాండవులును గమధార్మికులుగానఁ, బొరయలేరివారి దురితవిధుల." భార. ఆది. 3, ఆ.–6. చింపి*. "ద్వి. అఱలదోవతిమొలనంటఁగాబిగిచి, కుఱుచగాశిఖముడికొనియాసకఱచి." గా. అ, కాం.

**అలక.** దే. వి. మూఁపు, స్కంధము. "క. మోపులఅలకనేపారదమనీ, లావరిపులుఁగెక్కడియది" హరి. ఉ. ౪, ఆ

**అలకడ.** దే. వి. (అలక+కడ.) స్కంధప్రదేశము "గీ. కడునిద్రగానమిఁదోఁచరుచువడిగొని నడువంగనేంకతడుగ్రుచున్న, నెఱిఁగిచెచ్చెరఁదల్లినఱకడనిడి." భార. ఆది. ౬, ౬. (చూ. అలకడము. "గీ. పయంబునెస, గొతెయుబంఁ బెట్టుకొనివచ్చునఱకడమున." ప్ర. ౧, ఆ.) (పదార్థము స్త్రీసముద్దేశము పోరాటముమాటాటములోనగువానికివలె వృత్తియందు ను వర్ణకము వచ్చినదని తోఁచెడిని.)

**అలకము.** దే. వి. అఱుకువ, అజీర్తి.

**అలగొండెతనము.** ద్వ. వి. గుండెజైర్యము. "ద్వి. అద్దిరభళ్లని యఱగొండెతనము." భల్లా. ౫, భా. (ఈ పదము ఇంకను విచారింపఁదగినది.)

**అలగొడ్డియము.** దే. వి. అకార్యము, దుండగము. (చూ. అల గొడ్డెము.

**అలగొడ్డెము.** దే. వి. అఱగొడ్డియముయొక్క రూపాంతరము. "క. ఎఱుఁగియెఱుఁగనీముందట, నఱగొడ్డెముచేసిపోయిరి." ఉ, హరి. ౪, ఆ.

**అలగొఱ.** ద్వ. వి. న్యూనత. "చ. భీమనాయకుం, దఱగొఱలేని వేల్పు నిఖలాభ్యుదయంబులునీకునయ్యెడుఙ్." భీ. ౨, ఆ.– విణ. న్యూనము.

**అలచు.** దే. అ. క్రి. 1. కూయు. "క. పసిగొనుచు మేయవచ్చిన, పసిగొనఁదుంగోలుపులులుబలిసెగన్నపసి; యనీ యాడు నేని యచ్చేట, నసియామందఱుచువెఱచునఱుంబఱుచుర్ఙ్." గామం. ౨, ఆ.–2. పిలపించు. "క. సెవిదప్పంబడిపెల్లుగ, నొఱలెడి నరవాజికరులయులివభిమన్యుం, డవిను జొఁబడుటకు వగమదిఁ, బఱిగొన నిలపెలుచనఱచుచుఁగెఁదెలుఁగెఙ్." నార. ద్రో. ౨, ఆ.

**అలజాతి.** మి. విణ. దుష్టుఁడు. "క. వఱువాఁపిలిచిపిడుగు, కొఱుగాములుచక్కఁద్రోచి కొనఁబోయెదినం, బఱుగువడిచనియుసిపను, లఱజాతివి నిన్ను నేమియసనేర్తుసుతా." హరి. పూ. ౫, ఆ.

**అలడా.** దే. వి. 1. జడకుచ్చుమీఁదిపూస. "అపరంజిబంగారుటఱడాలు." భాను. ౪, ఆ.–2. కర్ణాటకపుపల్లకీ బొంగుకొనకు వేసెడు సింహాలలాటపుతగడు.

**అలడు.** దే. వి. అఱడాయొక్కరూపాంతరము.

**అలపు.** దే. వి. కూఁత. (చూ. అఱమ.)

**అలమర.** ద్వ. వి. (అఱ+మఱలుట.) 1. సందేహము; "ఉ. మఱియు నొకమాటయెవ్వరు, నెఱుఁగని యదిదత్రిధునకునేకొంత మునం, దఱమరలేకదృఢంబుగ, నెఱుకవదంజెప్పవింటినేసూఱరుండఙ్." నిర్వ. ౯, ఆ.–2. భేదము. "క. వెఱవకు నమ్మదినుండుము, పెఱవారలబుద్ధినాత్మఁబెట్టుసయనఘుం, డొఱసిఁడి చాడ్పుననామది, నఱమరలేదొండునమ్ముమనియెనరేంద్రా." విక్ర. 3, ఆ.

**అలమరిక.** ద్వ. వి. (అఱమరయొక్కరూపాంతరము.) 1. సందేహము; 2. భేదము.

**అలవ.** దే. వి. సాధువుకానియావు, ఒట్టియ. "సీ. అఱవలనైనను నలవున వెరవునమట్టియంటఁగఁబట్టి కట్టివిడువఁ, బిదుక." భార. విరా. ౧, ఆ. (ఇది యిట్లు వ్రాఁతప్రతులపాఠము ననుసరించి

వ్రాయఁబడినది. అచ్చుపుస్తకములయందు నఱవడుని పాఠము గనఁబడుచున్నది.) ౨౹ం. దుష్టము, దుష్టుఁడు. "ఆ. పంగులఱవల్లె కాలుచే, నిటిచి సాధుజనులఁబఱచినారు." (ఇది వ్రాఁతప్రతుల యందలిపాఠము.) భార. అను. ౫, ఆ.

**అఱవడు.** దే. వి. సస్యవిశేషము. "క. అఱవడుగం టెతపిందయు, నఱువదిదినములకుఁబండునని బ్రదుకాశన్, దఱచుగనేతొల్తెఁగఁ, బఱిపటియైయవియుమల్లెవడిచెడిపోయెన్." కాశీ 3, ఆ.

**అఱనతే.** దన్య. వి. ద్రావిడస్త్రీ. "ఎ, గీ. కంచి యఱవత లనమా ప్రుక్షాద్లలతలు." కాశీ. 3, ఆ.

అఱవము. వై. వి. (అఱ+వాయి.) ద్రావిడభాష.

అఱవఱలు. దే. వి. బ. సూక్ష్మఖండములు. "క. అఱవఱలైనరథం బులు, నెఱదప్పంబడినయాశ్వనికరంబులుఁజెం, దఱచుగఁగూలి నకరులున్, గిఱికొనియెన్సమంమేదినీతలమెల్లన్." భార. భీష్మ. ౨, ఆ.

అఱవఱ సేయు. దన్య. స. క్రి. (అఱవఱలు+చేయు.) 1. ఖం డించు; 2. ధ్వంసించు. "అరిగిదషౌధ్వరంబఱవఱసేయంగ." హరి. ఉ. ౬, ఆ.

అఱవలు. వై. వి. బ. అఱవవారు, ద్రావిడులు.

అఱిముఱి. దే. వి. 1. సంభ్రమము. "చ. యుధిష్ఠిరుండటె ముపేఁజంపెసారథిఁవదశ్వములంబటుబాణపాణియై." సం. "తతో యుధిష్ఠిరోరాజాత్వరమాణోమహారథః." భార. విరా. 3, ఆ.— 2. కలఁత. "క. విజిగిభవత్సుతనివహం, బఱిముఱిఁగనకనిజనంగ ననిలసుతుండే, ద్దైఅనెగచివగచెవారం, దఱుఁదనచేఁజచ్చుటపుడు తప్పటకుఁగడున్." భార. భీష్మ. ౨, ఆ.

**అఱిముఱిపడు.** దన్య. అ. క్రి. కలఁతపడు. (చూ. అఱిముఱి.)

**అఱిమెనకుండలు.** దన్య. వి. బ. బచ్చెనపనిచేసిన పెద్దకుండలు.

అఱిసియ. దే. వి. అఱిసె, అతిరసము.

అఱిసె. దే. వి. అఱిసియయొక్క రూపాంతరము.

అఱు. దే. అ. క్రి. 1. క్షయించు; 2. నశించు. వి. 1. అఱ్ఱు, కంఠము; "సీ. ఇందుబింబముఁజూచి చెందుప్పఁగలుగాని యఱు లెత్తినాకంగ నానపడిన." కాశీ. 3, ఆ. – 2. సమీపము.

**అఱుఁదెవ్వులు.** దే. వి. (అఱు+తెవులు.) క్షయరోగము. "అఱుఁ దెవుల్గొన్నాతఁడు." భార. అను. 3, ఆ.

**అఱుకువ.** దే. వి. అజకము. "అఱుకువయెఱుకతో." (ఇక్కడ అఱుకువ అనఁగా అపక్వమనియర్థము.) ఉ, హరి. ర, ఆ.

**అఱుక్రమ్ము.** దే. అ. క్రి. కవియు. "ద్వి. పఱచునెత్తురు పేర్లు బహుమాంసములకు, నఱుక్రమ్ముసూత్తములైరంబొప్పె." రా. యుం, కాం.

**అఱుగు.** దే. అ. క్రి. 1. జీర్ణించు; 2. క్షయించు.

**అఱుగుఁదెవ్వులు.** దే. వి. (అఱుగు+తెవులు.) అఱుఁదెవులు.

**అఱుగుల్లు.** దే. విశే. బ. శిథిలము. "సీ. కుడికరంబున నఱుగుడు వేణుదండంబు." జై. 2, ఆ. (వృత్తియందు ఏకవచనాంతమైనది. చూ. అఱువుల్లు.)

**అఱుగువడు.** దన్య. అ. క్రి. (అఱుగు+పడు.) 1. క్షయించు; 2. నశించు; 3. హీనమగు. "క. అఱుగువడిచనియెనీపనులు." హరి. పూ. ౫, ఆ. (చూ. అఱజాతి.)

**అఱుత.** దే. ద్ర. సమీపమునందు. "గీ. మహితతుచిజీవనావాస ఘంగళీసణ, మరసిఘుఱుతఁదెల్పినఁగుందియా వెలంది." (హరిశ్చం ద్రునికథయందు కంఠమందనియు, నలునికథయందు సమీపమం దనియు అర్థము.) హన. ౫, ఆ. (చూ. అరత.)

**అఱుపు.** దే. స. క్రి. దక్కించు.

**అఱుము.** దే. స. క్రి. 1. ఆక్రమించు; 2. ప్రతీక్షించు. "క. ఎతెఁగుదునేనుసుయోధను, కొఱగామియు నతనితోడఁగూడినన్నపు లం, దఱుఁబగమనమునఁనడికొని, యఱుముటయుఁనంధిపాసఁగ దనియుమహాత్మా." భార. ఉద్యో. 3, ఆ.—వి. అఱము, ఆక్ర మణము. "క. ఆతండఱుమెడలకమఱియు నేసె నఖేనయమునన్." భార. భీష్మ. ౨, ఆ.

**అఱుసంద్దు.** దన్య. స. అఱువదిమంది. (అఱువదికి మహాస్త హస్తికరూపము.)

**అఱువది.** దన్య. స. (అఱు+పది.) ఆఱుపదులు.

**అఱువు.** దే. అ. క్రి. అఱుగుయొక్క రూపాంతరము.

**అఱువుఁదెవులు.** దే. వి. (అఱువు+తెవులు.) అఱుగుఁదెవులు. "ఉ. మీను హితంబుచెప్ప నటు లేచి దురా చరణంబులిమ్మెయిన్, మానవశ్రోగిచందయిన మం దఱువుందెవులంటఁదాఁకినం, గాని యెఱుంగఁడప్పు ప్రతికారముగల్గునెయట్లుపోలెనీ, దైనికృష్టవృత్తి ఫల మంది తలంచెదుగాకపిమ్మటన్." నిర్వ. ర, ఆ.

**అఱువుల్లు.** దే. విశే. బ. శిథిలము. "క. ఆమెయిన వివిధవర్మ, స్తోమంబఱువుల్లునేసి." భార. విరా. ౫, ఆ. (అఱువుల్లు ఇత్యాది బహువచనాంతములు వృత్తియందు ఏకవచనాంతములగును. "అ ఱువుడుఁగావి." ఉ. హరి. ర, ఆ. "అఱువునుఁగుప్పసంపుఁ బొరలై." లక్ష్మీ. ౧, ఆ. ఇత్యాది.)

**అఱ్ఱు.** దే. వి. 1. గది; 2. పెట్టెలోనగువాని లోపలి అఱ; 3. ప్రయాణమునఁ బిండఁదగినయావు, కరట.

**అఱ్ఱము.** దే. వి. ముండ్లమోపులోనగునది.

**అఱ్ఱాఁక.** దే. వి. (అఁక+అఁక.) 1. మిక్కిలినిర్బంధము; "క. ఆఁకలిగాదోభక్తిం, దేఁకువగలవాఁడఁగాన తినవేలకృపన్, సాఁకఁగ దేనన్నిపుడ, ఱ్ఱాఁకలఁబెట్టకపలాశినానక్తఁడవై." కాశీ. 3, ఆ.— 2. మఱఁగు. "శా. ఊఁకోఁజెప్పఁగనెంతయేనిదడవౌనోవిప్రశా ర్దూలన్, వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమైయుండన, ఱ్ఱాఁకంబెట్టకచెప్పెదన్ సకలవృత్తాంతంబునుందేటగా, వీఁకన్వేళ యతిక్రమించెఁ గుడువన్ విచ్చేయుమాగ్రక్కునన్." కాశీ. 2, ఆ.

**అఱ్ఱాఁకలి.** దే. వి. (ఆఁకలి+ఆఁకలి.) మిక్కిలి క్షుత్తు. "క. శాల యకయన్నంబిడుమీ, జలజభవాన్వయులకనుట చాలదెయఱ్ఱాఁ, కలినేయకుమనియేలా, పలికితిరనియడుగ నతికిఁబతియిట్లనియెన్." "శా. ఆహారాధికమైనమండునిలతో నయ్యగ్నిదేవుండు నన్, ల్పాహారంబునమందుబిప్రుఁడు." భో. ౬, ఆ.

**అఱ్ఱాడు.** దే. అ. క్రి. (అఱ్ఱు+ఆడు.) చేరువ చుట్టిచుట్టితిరుగు. "సీ. చిగురుజొంపములందుఁదగిలియఱ్ఱాడుచుఁగెరలుకోయిలలను స్వరములకును." మార్క. ౫, ఆ.—"వ. అనుచుఁ దలంగిపోక యిట్టునట్టుంజుట్టుమెట్టెడు చిట్టివడుగుల నానట్టువరగపునంగోపం బుఁ గదురనదలించుచుందనమేళగాండ్ర నాలోకించి యిబ్బాల కులు మనవాలకపుసొమ్ములందు నేమేనియు నపహరించుటకు నఱ్ఱాడు చున్నవారు. మీరలీ ముచ్చులనెచ్చరికం గనుపెట్టుకొనియుండుఁ డనుటయు." ప్రభా. ౧, ఆ.

**అఱ్ఱియను.** దే. వి. అఱకము. "సీ. అఱకనుజైమననజీర్తియగు." ఆం, భా. ద్వి. మ.

**అఱ్ఱు.** దే. వి. 1. అఱు, కంఠము; 2. సమీపము.

**అష్ట్రైము.** దే. వి. అష్టైయముయొక్క రూపాంతరము.

**అల.** యు. దే. వి. తరంగము. విశ. ప్రసిద్ధినితెలుపును. "అలపర్జన్యుఁడు." వై. అవ్య. సంబోధనమునుదెలుపును. "ఉ. అక్కలకన్యకాత్వమిటులాఅడిపోవ నకారణంబనీ, కెక్కడిచూలువచ్చె." నిరవ. ౨, ఆ. (రూ. అలా. "క. పెలవుల లాలలుశొరఁగంగ సన్నలా యనియొఅలుక్." ఉ, హరి. ౪, ఆ.)

**అలంకరించు.** సం. స. క్రి. కైసేయు, సింగారించు.

**అలంకరిష్ణువు.** సం. విశ. ఉ. 1. కైసేయువాఁడు; 2. కైసేయు స్వభావముకలవాఁడు.

**అలంకర్త.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) కైసేయువాఁడు.

**అలంకర్మీణుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పనియందు నేర్పరియైనవాఁడు, కర్మక్షముఁడు.

**అలంకారము.** సం. వి. అ. పుం. 1. కైసేఁత; 2. భూషణము; 3. ఉపమాది. (ఉపమాదులు.—ఉపమ, అనన్వయము, ఉపమేయోపమ, స్మృతి, రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతి, అపహ్నవము, ఉల్లేఖము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, సహోక్తి, వినోక్తి, సమాసోక్తి, వక్రోక్తి, భావోక్తి, వ్యాజోక్తి, మీలనము, సామాన్యము, తద్గుణము, అతద్గుణము, విరోధము, విశేషము, అధికము, విభావన, విశేషోక్తి, అసంగతి, విచిత్రము, అన్యోన్యము, విషమము, సమము, తుల్యయోగిత, దీపకము, ప్రతివస్తూపమము, దృష్టాంతము, నిదర్శనము, వ్యతిరేకము, శ్లేషము, పరికరము, ఆక్షేపము, వ్యాజస్తుతి, అప్రస్తుతప్రశంస, పర్యాయోక్తము, ప్రతీపము, అనుమానము, కావ్యలింగము, అర్థాంతరన్యాసము, యథాసంఖ్యము, అర్థాపత్తి, పరిసంఖ్య, ఉత్తరము, వికల్పము, సముచ్చయము, సమాధి, భావికము, ప్రత్యనీకము, వ్యాఘాతము, పర్యాయము, సూక్ష్మము, ఉదాత్తము, పరివృత్తి, కారణమాల, ఏకావళి, మాలాదీపకము, సారము.)

**అలంకృతి.** సం. వి. ఇ. స్త్రీ. అలంకారము, కైసేఁత.

**అలంకృతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినవాఁడు.

**అలంక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. అలంకృతి, కైసేఁత.

**అలంగము.** దే. వి. కోట ప్రాకారపుగోడకు ఆధారముగా మట్టిచేతఁగాని ఱాళ్లచేతఁగాని యేర్పఱుపఁబడినకొఱడు, వప్రము. "సీ. అలంగంబననలవరినావప్రమగును." ఆం, భా. ద్వి. పు.

**అలంఘ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) లంఘ్యముకానిది. (లంఘ్యము=దాఁటఁదగినది.)

**అలంజరము.** సం. వి. అ. పుం. మణికము, కాఁగు. ముంత (అనికొందఱు.)

**అలంజుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) నిరర్థకజన్మము గలవాఁడు.

**అలఁగు.** దే. అ. క్రి. 1. వెనుదీయు; "చ. పలికిననేనునీతలఁపుపద్ధతిగాకిపుడేమిమీఱిన, ర్తిలితిఁదొడింబడఁ జానిను వధింపఁగవచ్చెదనోయటంచునా, కలఁగుచురాకమానుమనియానలువెట్టఁగ." కళా. ౬, ఆ.—2. శోకించు; "ఉ. బాలురచావుకర్ణములఁ బడ్డఁగలంగి యలంగిమోరువం, జాలకబాష్పతోయకణ జాలము చెక్కులరాలనేడ్చి." భాగ. ౧, స్కం.—3. శ్రమపడు; "మ. మలఁగుఁ మెల్లనిగాలికిం బటునటన్నత్తద్విరేఫాలికిఁ, దలఁగుఁ గోయిలమ్రోఁతకైయలఁగు." భాగ. ౧౦, స్కం. పూ.—4. సంకోచించు. "ద్వి. జలకేళిసలుపునిర్జరసతుల్ శుకుని, కలఁగకూరకయుండి యటుతరుశాత." భాగ. ౧, స్కం,

**అలఁచు.** దే. ప్రే. అలఁగఁజేయు, శ్రమపఱచు. "అలిగెఁగడు డాసియేమిటికలంచెదవిష్మెయినన్నునీవు." మార్క. ౫, ఆ.

**అలఁత.** దే. వి. 1. బాధ; "క. వడినదిపీఁపునవెడలెనఁ, బడియెఁ బుడమినర్జునుండు పదపడి త్రెళ్లెం, గొడుకునుమున్న తఁడేసిన, బెడిదపుటేటులయలంతఁబృథ్వీనాథ." భారం. అశ్వ. ౪, ఆ.—2. శోకము; "సీ. అమ్మునియాశిష్యురమ్మని చేరఁగఁబిలిచినవేటికనలఁతఁబొందె, దనిసినతఁడుశిష్యులందఱిపైఁగలి. కరుణమీఱఁబెద్దగాలమేని, మునివరేణ్యనావఁగ లేదుదానికి, నున్మలింప ప్టులుండనప్పు." భార. అశ్వ. 3, ఆ.—3. ... "...వేఁకటిఁగులఁ..." అని. 3, ఆ.

**అలఁతి.** దే. వి. తేలిక, ఉపాయము. "సీ. నున్ననమానవాటు, దుఃఖపాటుగలిగితొడరంగవచ్చిన, వారుగాన నలఁతిఁబోరు." భార. ఉద్యో. ౪, ఆ.—విశ. 1. అల్పము; 2. సూక్ష్మము. "...గీ. అలఁతియెలుఁగుననిట్లనునాలతాంగి." భార. ఆన. ౧. ఆ.

**అలఁదు.** దే. స. క్రి. పూయు.

**అలఁదురు.** దే. అ. క్రి. ఉమ్మలించు, దుఃఖించు. "క. కొలఁదికమీఱినవెవ్వగ, నలఁదురి." నిరవ. ౫, ఆ.—"చ. దీనినిన...మానఁగట్టిచననిశ్చయముందగఁజేసెదైవమే, మనఁగలదట్లకాకయనియాత్మనలందురిమందచేష్టఁడై." భార. విరా. ౧, ఆ.

**అలక.** ఉభ. దే. విశ. సూక్ష్మము. సం. వి. ఆ. స్త్రీ. కుబేరునిపట్టణము. అ. పుం. ము. నెఱికురులు.

**అలకన.** దే. వి. సూక్ష్మత. విశ. సూక్ష్మము. "అలకనితెల్వి." హరి. ఉ. ౭, ఆ. "అలకనిజేబు." స్వా. ౬, ఆ. (విశేషణమైనప్పుడు సమాసమునందు కడపటి అకారమునకు ఇకారమువచ్చెడి.)

**అలకి.** వై. వి. కుండ[*]. "నాలుగే నలకులదొంతిడించి." హరి. పూ. ౫, ఆ.

**అలకువ.** దే. వి. 1. ఆయాసము; "తెలుపనలకువదీనన్." భల్లా. ౪, ఆ.—2. వైముఖ్యము. "అలకువలేనినిష్ఠలను." మై. ౧, ఆ.

**అలక్తము.** సం. వి. అ. పుం. యావను, లత్తుక.

**అలక్ష్యము.** సం. విశ. (అ. ఆ. అ.) లక్ష్యముకానిది.

**అలక్ష్యముచేయు.** మి. స. క్రి. అనాదరించు.

**అలగర్దము.** సం. వి. అ. పుం. నీరుపాము, (రూ. అలగర్ధము, అరగర్దము.)

**అలఘువు.** సం. విశ. (ఉ. ఈ. ఉ.) లఘువుకానిది. (లఘువు = చులుకన.)

**అలజము.** సం. వి. అ. పుం. కుక్కుభము, గంపపులుఁగు.

**అలజడి.** దే. వి. 1. ఆపద; "క. అలజడివచ్చుటకు మూలమదియెయ్యదియో." సం. "నాపదామస్తిమర్యాదా." భాగ. ఆర. ౭, ఆ.—2. క్లేశము. "చ. అలజడిలేదుచిత్తమునకంగములందుఁబ్రయత్నమేమియున్, వలవదు." లక్ష్మీ. ౪, ఆ.

**అలజడిదరి.** దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

**అలపద్మము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (అయిదువ్రేళ్లనుగొనలుకూడకుండునట్లు విల్లువలె వంచి చిటికనవ్రేలివెంబడి వ్రేళ్లన్నియెడముగలుగఁద్రిప్పఁబడినది.)

**అలపు.** దే. వి. అలయిక, శ్రమము.

**అలబలము.** దే. వి. కలకలము. "క. అలబలములసంఖ్యముల్లై, యలబలములుసేయుచుండ." విజ. 3, ఆ.

**అలభ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) లభ్యముకానిది. (లభ్యము = పొందఁదగినది.)

**అలమట.** దే. వి. చింత. "గీ. ధర్మసుతుమాటచొప్పెవ్విధంబొ యెఱుఁగ, కునికిఁజేసి వింతిల్లితినోపుదీవు, తెలియఁజెప్పినాయల మటమలుగఁజేయ." భార. ఉద్యో. ౨, ఆ.

**అలమటపడు.** దృ. అ. క్రి. చింతపడు.

**అలమటించు.** దే. అ. క్రి. చింతించు. "ద్వి. సాహాయ్య మునకు, సందునెవ్వరిగానకలమటించుచును." విష్ణు. ఉ. ౫, ఆ.

**అలమరు.** దే. అ. క్రి. చింతించు. "ద్వి. ఈవిధినలమరియేగు చుండఁగను." హరిశ్చ. ౧, ఆ.

**అలమారుచు.** దే. స. క్రి. ఐండియెడ్లనుమార్చికట్టు.

**అలము.** ఉభ. దే. అ. క్రి. కవియు. "చ. సులభమొదుర్లభం బొయనిమాడనెఱుంగవు కన్నదానిపై, నలముదుకామమా." భార. శాం. ౪, ఆ.—స. క్రి. 1. ఆక్రమించు; "గీ. రక్కసులును గుంతఖడ్గ, కార్ముకప్రముఖాయుధకలిత భుజులు, కవచ ధారులు నయి కోటఁగలయనలమ." రా. యు, కాం.—2. కౌఁగిలించు; "ఎ, గీ. అతివయత్యంతవివశయైయలమఁగ్రోవి, తేటతేనియతెలి నీటఁదెలివిదెచ్చు." హంస. 3, ఆ.—3. పరిగ్రహించు. "గీ. అతఁడుమనుమనినందంద శ్రీతియడర, నలమియాలింగనముచేసి." మార్క. ౮, ఆ.—వి. 1. అఱుము, ఆక్రమణము; "చ. అలము నఁదున్నివైవుఁడు." భార. ఆర. ౫, ఆ.—2. శాకవిశేషము. "క. అలములుదుంపలుననులుచు." అచ్చ. సుం, కాం.—సం. అ. న. 1. తేలుకొండి; 2. తేలుకొండిముల్లు.

**అలముకొను.** దే. అ. క్రి. 1. కవియు; "అలముకొనిన మూర్ఛ లుపరాగ్యయమునఁదేజి." జై. ౭, ఆ.—2. పైకొను; "నిచ్చనిచ్చలు లాలించినేనలముకొనుటేగాని, గ్రుచ్చివాఁడుకౌఁగిలించుకొను టెన్నఁడులేదుగా." క్షేత్రయ.—3. వ్యాపించు. "గీ. రూపాదుల, నలముకొనవుచక్షురాదికములు." భార. శాం. ౪ ఆ.

**అలయిక.** దే. వి. అలపు, అలసట, శ్రమము.

**అలయు.** దే. అ. క్రి. 1. శ్రమపడు; 2. విసుగు; "క. అలయు నెడ డయ్యునెడనాఁ, కలియుఁదృషయునైన యెడలఁగడుకొని ధరణీ, తలనాథ పురుషునకుని, మ్ములభార్యయపాచఁజెత్తమున దుఃఖంబుల్." భార. ఆర. ౨, ఆ.—3. అలస్యముచేయు. "క. కనుఁగొనినాశలఁచినపని, యనువుపఱచిమఱచియైనయలయక వేగం, బునవత్తు." ఉ, హరి. ౨, ఆ.

**అలరారు.** దే. అ. క్రి. 1. ఒప్పు; 2. ప్రకాశించు.

**అలరు.** దే. అ. క్రి. 1. వికసించు; 2. సంతోషించు. వి. 1. పుష్పము; 2. సంతోషము. "మిగులనలరొంది" అచ్చ. సుం, కాం.

**అలరుఁబోఁడి.** దే. వి. (అలరు+పోఁడి.) 1. పుష్పమువలె మనోజ్ఞురాలైన యింతి; 2. ఇంతి. (ఇట్టితెావులయందుపోఁడి శబ్దము పరమగునపుడు ఎల్లచో నుగాగమంబగునని యెఱుంగునది.)

**అలరుచు.** దే. ప్రే. అలరఁజేయు. "క. ఇలావంతుండని, యాచకు రుఁడు నామకరణమలరిచి యంతట." (అలరిచి అనఁగా ఇక్కడ చేసియనియర్థము.) విజ. ౧, ఆ.

**అలరువిలుకాఁడు.** దే. వి. పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

**అలరువిలుతుఁడు.** దే. వి. అలరువిలుకాఁడు. "ఎ, గీ. అలరు విలుతుపూవుటమ్ములోలె." భార. విరా. ౧, ఆ. (రూ. అలరు విల్తుఁడు.)

**అలర్కము.** సం. వి. అ. పుం. 1. తెల్లజిల్లేడుచెట్టు; 2. ముండ్ల యుచ్చిఁతచెట్టు; 3. మందుచేవెఱ్ఱియెత్తినకుక్క.

**అలవ.** దే. వి. గుంజలునాటికమ్ములుతోనగువాని నడ్డముగాఁదొప్పిం చినవెలుగు. "సీ. గందవుఁగూచముల్ పొందించికురువేల్లనలవగాఁ గట్టినయట్టిమహిమ." రా, ఐ. 3, ఆ. "సీ. నీటిలోఁదవేసిన పారీనములగతివెలుగులుచొచ్చియావలికిఁబోవు, గోడలలవలువెన దాఁటుఁగ్రీడవోలె." హరి. పూ. ౬, ఆ.

**అలవడు.** దృ. అ. క్రి. (అలవు+పడు.) 1. అభ్యాసపడు, వాడుకపడు; (చూ. మరాట్య.) 2. తగు; "క. తలఁపఁగఁబు ధ్వలకతనం, దలకొక్క నారయనువిధంబునహరివా, రలమగుట నిట్టి పేర్మికి, నలవడితిమి ధన్యతములమైతిమి ధరణిక్." హరి. ఉ. ౭, ఆ.—3. సిద్ధించు; "వ. అందుమీరెవ్వరెవ్వ రెక్కడెక్కడ నెయ్యే రూపంబులం జరియింపం గోరినయయ్యెరూపఁబులలవడి యెడు." భార. అర. ౭, ఆ.—4. స్వాధీనపడు. "క. పురికొను చుందెరలుచునో, హరిపొహరి నొక్కచోటనలవడునొకచో, విరియునొకచోటఁదిరుగుట్, దిరుగ యొకచోట రెండుదెఱఁగులు నొచ్చున్." భార. భీష్మ. ౨, ఆ.

**అలవరి.** దే. వి. అలంగము, వప్రము. "సీ. అలంగంబన నలవరినా వప్రమగును." ఆం, భా. ద్వి. పు. (ప్రయోగములయందు ఆశు పరియని కనఁబడుచున్నది.)

**అలవరించు.** దృ. ప్రే. 1. అభ్యసించు; "గీ. శాస్త్రములనెల్లఁదగిన భంగి నలవరించి." భార. అను. ౪, ఆ.—2. అలంకరించు; "స్త్రీవలెనెయలవరించి." క్షేత్రయ. 3. వహించు; "సీ. జప హోమాదాన సంస్కారపూర్వకముగా సధర్వరవ్రతదీక్ష యలవ రించి." జై. 3, ఆ.—4. సవరించు; "సీ. ఒక్కంతసడలిన యుత్తంసదామకంబభినవంబుగమాలినలవరించి." హరి. పూ. ౫, ఆ.—5. సిద్ధపఱచు; "గీ. అలవరించిచతుర్విధాహారములను, దుష్టిచేసి." ఉ, హరి. ౪, ఆ.—6. స్వాధీనపఱచు. "వ. అవి వీరలు దిగ్విజయంబుచేసియలవరించికొన్నపదంబగుటయు." భార. ఉద్యో. ౧, ఆ. (అలవడుధాతువు.)

**అలవఱుచు.** దృ. ప్రే. అలవడఁజేయు, అభ్యాసపఱుచు. (రూపాంతరము అలవరించు.) (ఒకానొకచో అలవర్చు అని రూపము కనఁబడుచున్నది.)

**అలవాటు.** దృ. వి. 1. అభ్యాసము; 2. సిద్ధి. "ఎ, గీ. ఆత్మ నిష్ఠయలవాటుగాంక్షించి." శాం. ౬, ఆ.—విశే. సిద్ధము. "తేరల వాటుగఁదేరనెక్కి." ఉ, హరి. 3, ఆ. (రూ. అలవడుట.)

**అలవి.** దే. వి. కొలఁది. "క. వృత్రుఘనబాహుబలంబలవికిమీఁజెను." భార. ఉద్యో. ౧, ఆ.—విశే. శక్యము. "క. బలహీనుఁడైనవానికి, నలవియెమోపెట్టి తివియనక్కార్ముకమున్." భార. ఆది. ౭, ఆ.

**అలవు.** దే. వి. 1. పరిశ్రమము; "గీ. మావటీఁడల్లనల్లనమదగ జంబు, నిచ్చతోఁగూడ నోజకుఁదెచ్చునట్లు, యోగవిద్యాపరుం డును నొయ్యనొయ్య, నలవుతోఁగూడఁబవసంబునాఁగవలయు." మార్క. 3, ఆ.—2. బలము; "క. బలభద్రునిభరియింపఁగ, నలవుచెడిప్రలంబదైత్యుఁ డయ్యెడధరణీ, తలమునకువచ్చె" వి, పు. ౭, ఆ.—3. శ్రమము. "క. తురగమునునీరుజలజా, కరమునఁ ద్రావించితావికచపుష్పఫలౌ, త్కరభరవినమ్రచూతాం, తరమర కతవేదినలవునంబవళింపక్." (అలవునక్ ఇక్కడ అలవునక్ అనియే యుండవచ్చును. అయినను ప్రతులయందంతట పాఠము అలవునక్ అనియున్నది. ఈరూపమును సాధువే.) జై. ౭, ఆ.

**అలవోక.** దృ. వి. (అల్ల+పోక.) 1. స్వేచ్ఛ, యదృచ్ఛ; "సీ. అంతటనొకఁడుమధాశయుండను జగతీనాయకుండురూపాన భూతి,

యన భార్యయును దారువనమంత్రిసిరభావాఖ్యుఁడునువేడగానట యదృచ్ఛ, నొక్కింకపాలయుబయును." (ఇది మఱియొకచో చెప్పఁబడినప్పుడు) "వ. మదాశయుండనువాఁడు రాసాన భూతియను భార్యయుందాన స్సాభావుండనుమంత్రితోడ నలవోక నటుపొలసినమాత్ర." కళా. ౫, ఆ.—2. లీల. "సీ. నీకళంబు నఁగాదెకోలలిషవహ్నినలవోకయునుబోలెనార్పఁగలిగె." కాశీ. ౬, ఆ.

**అలస.** సం. వి. ఆ. స్త్రీ. అల్లుకుసుతీఁగ. అ. పుం. ము. 1. వృక్ష విశేషము; 2. పాదరోగవిశేషము. విణ. సోమరి.

**అలసందియలు.** వై. వి. బ. కాయధాన్యవిశేషము. "అనఁగమ్మింగ వలసందియలు." మార్క. 3, ఆ.

**అలసందెలు.** వై. వి. బ. అలసందియలయొక్క రూపాంతరము.

**అలసట.** దే. వి. అలపు, ఆయాసము.

**అలసత.** సం. వి. ఆ. స్త్రీ. అలసభావము, ఆలస్యము.

**అలసాంద్రము.** సం. వి. అ. పుం. అలసందెలు.

**అలాతము.** సం. వి. అ. న. ఉల్ముకము, కొఱవి.

**అలాబువు.** సం. వి. ఉ. ఊ. స్త్రీ. సొరకాయ.

**అలాయిదా.** హిం. విణ. ప్రత్యేకము.

**అలికము.** సం. వి. అ. న. లలాటము, నొసలు.

**అలికిడి.** దే. వి. చప్పుడు, ధ్వని.

**అలిపిరి.** వై. విణ. అల్పశరీరముగలవాఁడు*.

**అలివేణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తుమ్మెదవంటి వెండ్రుకలుగల యింతి; 2. ఇంతి.

**అలుఁగు.** దే. వి. 1. ఖడ్గము; 2. చెఱువునిండినపుడు నీళ్లు పోవుట కేర్పఱచినదారి, పరీవాహము; 3. బాణాదుల యగ్రపుటుక్కుతునుక, ఫలము. (రూ. అల్గు.)

**అలుక.** దే. వి. 1. కోపము; 2. ద్రోహచింత. "అటుసేయదివ్వ జాన్యుఁడల్కకా." ఆము. ౪, ఆ.

**అలుకు.** దే. అ. క్రి. భయపడు. స. క్రి. ఇల్లులోనగువానినలుకు. వి. భయము.

**అలుకుఁజుట్టు.** దే. వి. (అలుకు+చుట్టు.) అలికెడు ప్రాంతగుడ్డలో నగునది.

**అలుకుడు.** దే. వి. అలికిడి, రొద, ధ్వని.

**అలుకువ.** దే. వి. అలుక, కోపము. "అలుకువతగ్గె." చంద్ర.

**అలుగు.** దే. అ. క్రి. 1. కోపముచేయు; 2. ద్రోహముతలఁచు. "క. తనయునికంటెను నను న, మ్మనుజేంద్రుఁడుకరమునెమ్మి మన్నించుమనం, బునవట్టియగ్రజన్ముని, యనువమరాజ్యమున కలుగగనునేనాతుఁడా." మార్క. ౮, ఆ. (రూ. అల్గు.)

**అలుగులు.** దే. వి. (చూ. అలుగులము.)

**అలుగులపడు.** ద్వ. అ. క్రి. (అలుగులము+పడు.) 1. నలఁగుడుపడు; "వ. ఒండొరుల యలుఁగులలుగులపడ వ్రేసియు." ఉ. హరి. 3, ఆ.—2. బాధపడు. "క. తలకంటగించిచుండఁగ, బలిమినినౌషధరసంబు పానముసేయక, దలకొనుకొరోగార్తునిక్రియ, నలమటతోచెరయుతెగువ నలుగులపడుచుఁజా." నిర్వ. ౧౦, ఆ.

**అలుగులము.** దే. వి. 1. నలఁగుడు; 2. బాధ.

**అలుచు.** వై. విణ. మందుఁడు. "క. అలుచైనను గుణము నెదిఁ, దలఁపుగలుగవలయుననిదరోన్నత్సవలదో, వ్వలులగుకొంతేయుల మన, మెలమికలిమినచ్చియిట్టులేమఱ నగునే." సం. "నావజ్ఞేయో రిపుస్స్వల్ప ప్రాకృతోపి బుభూషతా, కింపునః పాండవాస్తాత సర్వే ప్రకుశలారణే." భార. విరా. 3, ఆ.

**అలుపము.** వై. విణ. అల్పము. "సీ. ఈవెండ్రుకలుపట్టి యీడ్చినయాచేయి తొలుతగాఁ బోరిలోదుస్ససేను, తనువింతలింత లుగనియలైచెదరి రూపఱేయున్నఁగనియుడుకాఱుఁగాక, యలుపాలఁ బొనుపడుడునట్టిచిచ్చెయిది." (అలుపాలక = అల్పకార్యముల చేత.) భార. ఉద్యో. 3, ఆ.

**అలువు.** దే. అ. క్రి. అలుగు. "వినుముసకోంద్రసిఫ్రుఁడలివెకా." భార. శాం. ౧, ఆ.—వి. అలుఁగు, పరీవాహము.

**అలేఖము.** సం. వి. అ. న. వ్రాయనిపుస్తకము.

**అల్క.** దే. వి. అలుకయొక్క రూపాంతరము.

**అల్కా.** హిం. విణ. తేలికైన, నీచమైన.

**అల్గోజా.** హిం. వి. పిల్లఁగ్రోవి.

**అల్పము.** సం. విణ. (అ. ఆ. అ.) సూక్ష్మము, అలఁతి.

**అల్పిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) కడునల్పము, అణీయము.

**అల్పీయము.** సం. విణ. (స. ఈ. స.) అల్పిష్ఠము.

**అల్మారా.** హిం. వి. సొరుగులుగల యెత్తయిన కఱ్ఱపెట్టె. (రూ. అల్మారు.)

**అల్ల.** యు. దే. విణ. ప్రసిద్ధినితెలుపును. "అల్లనాడు." వై. మందము. "అల్లనగుచు."

**అల్లకము.** దే. వి. అల్లుట, అల్లిక.

**అల్లకల్లోలము.** దే. విణ. తాఱుమాఱు, వ్యస్తవ్యస్తము.

**అల్లటపెట్టు.** దే. స. క్రి. (అల్లాటము+పెట్టు.) శ్రమపఱచు. "ద్వి. అల్లసమూఁడేఁడులయ్యెననెంత, యల్లటపెట్టెదోయయ్యనే నెఱుఁగ." భల్లా. ౧, భా.

**అల్లన.** వై. వి. 1. తిన్నన; "అల్లనిసగవు." (చూ. అలకన.) 2. మెల్లన*. "చ. అనిలజుఁడోయిరావణుఁడయల్లననేటికిచెట్టు చెప్పెదరా." రామా. ౬, ఆ.

**అల్లము.** వై. వి. ఆర్ద్రకము*.

**అల్లరి.** దే. విణ. దోషముయొక్క ప్రకటనము. విణ. దోషమువలన ప్రకటనమైనది.

**అల్లలనాడు.** ద్వ. అ. క్రి. (అల్లన+అల్లన+ఆడు.) చలించు. "లేనడుమల్లలనాడ." ప్రా. ౨, ఆ.

**అల్లలాడు.** ద్వ. అ. క్రి. (అల్ల+అల్ల+ఆడు.) చలించు, (రూ. అల్లల్లాడు.)

**అల్లాటము.** ద్వ. వి. అల్లాడుట, త్రిప్పట.

**అల్లాడు.** ద్వ. అ. క్రి. (అల్ల+ఆడు.) 1. చలించు; "అవనీచక్రము పాదఘాతమునసల్లాడంగ." భార. ఆది. ౬, ఆ.— 2. తిరుగు.

**అల్లారుచు.** ద్వ. ప్రే. అల్లాడఁజేయు.

**అల్లారుపు.** ద్వ. వి. అల్లార్చుట, విక్షేపణము. "వాలంబునల్లార్పుల్ గాడ్పులరేఁచ." రామా. ౬, ఆ.

**అల్లారుబెల్లము.** ద్వి. విశే. (అల్ల+అరు+బెల్లము) మిక్కిలి ప్రియము. "గీ. ఎల్లబంధుజనులకు నల్లారుబెల్లమై." కళా. ౬, ఆ.

**అల్లారుముద్దు.** ద్వి. విశే. (అల్ల+అరు+ముద్దు.) మిక్కిలి మనోజ్ఞము. "మ. అనఁగుం గ్రీడలనెల్లవారలకు నిట్లల్లారుముద్దైనకూఁతు నకుఁ." వసు. 3, ఆ.

**అల్లి.** దే. వి. 1. కలువవంటి యొకానొక జలపుష్పము; 2. పచ్చిగా నుండునపుడే వంటచేయుటకుపయుక్తమైన యొకానొకచెట్టు; 3. బాలక్రీడావిశేషము. "శీ. చిమిడిమువ్వలపోఁటి చెండు కట్టినబోదియల్లియువ్వసఁబిట్టెయప్పళాలు." కాశీ. 3, ఆ.

**అల్లిక.** దే. వి. అల్లుట, అసిక.

**అల్లికబిల్లిక.** దే. వి. అల్లిబిల్లియొక్క రూపాంతరము.

**అల్లితెమ్మెర.** దే. వి. చల్లగాలి.

**అల్లిబిల్లి.** దే. వి. 1. పెనఁకువ; 2. ఒద్దిక. "గీ. అరిగితనకూర్మి చెలువతో నల్లిబిల్లి, యగుచునెప్పటియట్లనెయ్యమునసుండె." పర. 3, ఆ.

**అల్లిబిల్లిగొను.** దే. అ. క్రి. పెనఁగొను. "మావులఁ గ్రోవులు నల్లిబిల్లిగొనఁ గాంతారంబునందు." స్వా. ౨, ఆ.

**అల్లియ.** దే. వి. వింటినారి, మౌర్వి.

**అల్లియము.** దే. వి. (చూ. అల్లెము.)

**అల్లు.** దే. అ. క్రి. (తీఁగ) ప్రాఁకు. స. క్రి. అల్లికచేయు.

**అల్లుఁడు.** దే. వి. (అల్లు+వాఁడు.) కూఁతుమగఁడు, జామాత.

**అల్లుఁడుకొమాళ్లు.** ద్వి. వి. బ. (అల్లుఁడు+కొమారుఁడు.) కొంచెము ఇంచుమించుగా దొరతోసమమైన వేషమును భోజనమును గలిగి దొరకు అంగరక్షకుఁడుగా నుండువాఁడు.

**అల్లుఁడు.** దే. వి. అల్లిక.

**అల్లుబచ్చెలి.** దే. వి. తీఁగబచ్చలికూర.

**అల్లువాఁడు.** దే. వి. అల్లుఁడు. "క. అనఁదనయురామభద్రుని, మునిపరమేశ్వరునకిచ్చె మోహముతోన, జనకనాథుఁడుజాబిల్లిన్, వననిధివలిగట్టునల్లు వానికిఁబోలెన్." రామా. ౪, ఆ.

**అల్లె.** దే. వి. అల్లియయొక్క రూపాంతరము.

**అల్లెదమ్మ.** దే. వి. మత్స్యవిశేషము. "ఎ, గీ. అల్లెదమ్ములవ్వఁజేప యుగొల్లదోఁదు." హంస. ౪, ఆ.

**అల్లెము.** దే. వి. పెండ్లియైనతోడనె యల్లునిఁబిలిచి యత్తవారింటఁ బెట్టెడివిందు. (ఇది అల్లియముయొక్క రూపాంతరము.)

**అల్లోనేరేడు.** దే. వి. 1. రాజజంబువృక్షము; 2. జంబువృక్షము; "శీ. హాలాహాలంబనునల్లోనేరేడుఁ బండుమిసిమింతుఁడునుగాక మ్రింగి నాఁడు." భీ. ౧, ఆ.—3. బ. సంగీతవిశేషము. (రూ. అల్లొనేరేడు. సంగీతవిశేషమునకు. "శా. నీకేవచ్చుసువాలయుగ్ధవళమింతీయల్లొనేరేళ్లుగా, రీకల్యాణములంచు." పాంచా. ౪, ఆ.)

**అల్లొనేరేడు.** దే. వి. 1. రాజజంబువృక్షము; "క. ఎల్లెడయుం జీఁకటిచే, నల్లనయయితోడిమపట్టునాఁడూర్పునఁబా, టిల్లెడుచిజిగింపునభ, మల్లోనేరేడుఁబంటియాకృతిఁజూపెన్." కవిక. ౪, ఆ.—2. జంబువృక్షము; 3. బ. బాలక్రీడావిశేషము. "క. ఎల్లసుఖంబులఁజేకొనఁ, జెల్లుటయౌవనమునందచిక్కినమజిపా, టిల్లునెవెన్నెలదినములఁ, నల్లోనేరేళ్లుగాక యావలఁగలవే." దా. షుం, కాం.

**అల్వరించు.** ద్వి. ప్రే. అలవరించుయొక్క రూపాంతరము. "శి. ప్రేమలుగఅవంగ వెం వల్వరించిరో గోంజితులుగ్రుక్కినోల్లనాఁడ." నిర్వ. ౧, ఆ.

**అవ.** ఉప. వై. వి. అవ్వయొక్క రూపాంతరము. సం. (ఉపసర్గము.) చెడ్డ అనునర్థమును తెలుపునది. (ఉదా. అవగుణము, అవమానము. మొ.)

**అవంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పట్టణవిశేషము; 2. ఉక్కిలి.

**అవంతీసోమము.** సం. వి. అ. న. ధాన్యామ్లము, కలి.

**అవకటము.** సం. విశే. (అ. ఆ. అ.) విరుద్ధము.

**అవకరము.** సం. వి. అ. పుం. పొరకతోఁ జిమ్మిచేర్చిన కసవుకుప్ప.

**అవకర్ణనము.** సం. వి. అ. న. వెడలించుట.

**అవకాశము.** సం. వి. అ. పుం. 1. ఎడము; 2. తెఱపి.

**అవకీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) చల్లఁబడినది.

**అవకీర్ణి.** సం. విశే. (న్. ఈ. న్.) నశించిన బ్రహ్మచర్యవ్రతముగలవాఁడు.

**అవకుంఠనము.** సం. వి. అ. న. చుట్టుట.

**అవకుంఠితము.** సం. విశే. (అ. ఆ. అ.) చుట్టఁబడినది.

**అవకృష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) నిష్కాసితము, వెడలింపఁబడినది.

**అవకేశి.** సం. విశే. (న్. ఈ. న్.) గొడ్డుపోయినది. (చెట్టు.)

**అవక్రయము.** సం. వి. అ. పుం. 1. బాడిగ; 2. వెల.

**అవక్షిప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) తప్పుపెట్టిత్రోయఁబడినది.

**అవక్షేపము.** సం. వి. అ. పుం. తప్పుపెట్టిత్రోయుట.

**అవగండము.** సం. వి. అ. పుం. బొటిమ.

**అవగడము.** వై. వి. అగడము, అకార్యము*.

**అవగణన.** సం. వి. ఆ. స్త్రీ. తిరస్కారము, తెగడిక.

**అవగణితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినవాఁడు, పరిభూతుఁడు.

**అవగతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తెలియఁబడినది; 2. పొందఁబడినది.

**అవగతి.** సం. వి. ఇ. స్త్రీ. బోధము, తెలివి.

**అవగాధము.** సం. వి. అ. పుం. ప్రాతస్స్నానము.

**అవగాహము.** సం. వి. అ. పుం. 1. ఆకళింత; 2. మునుక.

**అవగాహించు.** సం. అ. క్రి. మునుఁగు. స. క్రి. ఆకళించు.

**అవగీతము.** సం. వి. అ. న. దూఱు. విశే. 1. దూఱఁబడినది; 2. చెప్పఁబడినది.

**అవగీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రణుతము, పొగడఁబడినది.

**అవగుంఠనము.** సం. వి. అ. న. ముసుఁగు.

**అవగుంఠితము.** సం. విశే. (అ. ఆ. అ.) ముసుఁగిడఁబడినది.

**అవగుణము.** సం. వి. అ. పుం. దుర్గుణము.

**అవగ్రహణము.** సం. వి. అ. న. 1. అడ్డపాటు; 2. అనాదరము.

**అవగ్రహము.** సం. వి. అ. పుం. 1. వఱపు; 2. అడ్డపాటు; 3. ఏనుఁగునొసలు.

**అవఘళము.** దే. వి. 1. వ్యాపనము; "ఎ, గీ. క్షౌరకరవాఁడి చూపులయవఘళంబు." పాండు. ౧, ఆ.—2. సామర్థ్యము. "క. ఆరీతినేర్పుగలిగిన, భూరమణునిఁజేరుమనుచుఁబులుఁగుల దొరతఁ, జేరఁగ హేమావతియని, యారాచెలియవఘళంబటంచు గణించెఁ." హంస. 3, ఆ.—విశ. హెచ్చు. "ద్వి. వన జాక్షినినునాఁడువనవహ్నిఁగూల, ననుమతించినసాకునవఘళం బెద్ది." హరిశ్చ. ౨, ఆ.

**అవఘళించు.** దే. అ. క్రి. 1. వ్యాపించు; "సీ. కలయంగ నలఁదినకస్తూరినెత్తావి యష్టదిక్కులయందునవఘళింప." కాశీ. ౧, ఆ.—2. సరియగు. "సీ. అవిముక్తదేశస్థుఁడయ్యెనేఁబతి తుంచుసకలమేధాధ్వరావాప్తదొరయు, వారణాశీసంభవంబైనమశ కంబు నైరావణముతోడనవఘళించు." కాశీ. ౨, ఆ.—స. క్రి. మీఱు "సీ. తాపింఛవిటపికాంతార సంవృతయైనయంజనాచల రేఖనవఘళించి." సావి. 3, ఆ.

**అవఘళుఁడు.** దే. విశ. వ్యాపకుఁడు. "సీ. వేఁడిపురందరు వేయిమాఱులుదాఁకనాజిలోఁదజిమినయవఘళుండు." మై. 3, ఆ.

**అవచూడము.** సం. వి. అ. పుం. 1. టెక్కెపుగుడ్డయొక్క క్రిందికొనకుచ్చు; 2. సిగ.

**అవచూర్ణనము.** సం. వి. అ. న. పొడిచేయుట, అవధ్వంసము.

**అవచూర్ణితము.** సం. విశ. (అ. ఆ. అ.) పొడిచేయఁబడినది.

**అవచ్ఛిన్నము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఛేదింపఁబడినది; 2. వేఱుపఱుపఁబడినది.

**అవచ్ఛేదము.** సం. వి. అ. పుం. 1. భాగము; 2. వేఱుపాటు.

**అవచాటము.** వై. క్రి. విశ. అకస్మాత్తు. "క. ఖరుఁడుగుకంసుని పంపున, సరిగితృణావర్తుఁడవనికవచాటముగా, సురకరువలియై బిసబిస, సరుదరుదనముసరివిసరిహరిఁగొనిపోయెఁ." భాగ. ౧౦, స్కం. పూ. (ఇది యింకను విచారింపఁదగినది.)

**అవజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. అవగణన, తెగడిక.

**అవజ్ఞాతము.** సం. విశ. (అ. ఆ. అ.) పరిభూతము, తిరస్కరింపఁబడినది.

**అవటము.** సం. వి. అ. పుం. 1. బొక్క; 2. పల్లము; 3. నూయి; 4. పక్షిపిల్ల. విశ. మోసమునబ్రదుకునది.

**అవటీట.** సం. వి. ఆ. స్త్రీ. చేప్పటముక్కు. అ. న. ము. ముక్కు చప్పట. విశ. చప్పటముక్కుగలది.

**అవటువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. పెడతల. పెడతలయందలి ముచ్చలిగుంట. (అనికొందఱు.) పుం. 1. నూయి; 2. పల్లము.

**అవడు.** దే. వి. అగడుయొక్క రూపాంతరము. "నీపనింబాయక యోమ్మునందవడుఁబాములమోవను." (ఇది వ్రాతప్రతులయం దపపాఠము.) భార. ఆది. ౨, ఆ. (చూ. పని. అయిదవ యర్థము.)

**అవతంసము.** సం. వి. అ. పుం. 1. పూఁగుత్తి; 2. సిగబంతి.

**అవతంసితము.** సం. విశ. (అ. ఆ. అ.) అవతంసముగాఁజేయఁబడినది.

**అవతమసము.** సం. వి. అ. న. తగ్గినచీఁకటి, మసమసకన.

**అవతరణము.** సం. వి. అ. న. 1. దిగుట; 2. దాఁటుట.

**అవతరించు.** సం. అ. క్రి. 1. దిగు; 2. పుట్టు.

**అవతరిల్లు.** సం. అ. క్రి. పుట్టు.

**అవతల.** ద్వ. వి. (అవల+తల.) 1. ఆవలిప్రదేశము; 2. పిమ్మట.

**అవతారము.** సం. వి. అ. పుం. 1. దిగుట; 2. రేవు; 3. కోనేటిలోనగునది.

**అవతారిక.** సం. వి. ఆ. స్త్రీ. గ్రంథముఖమున వ్రాయఁబడు తదుత్పత్తిక్రమము.

**అవతీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. దిగినది; 2. దాఁటఁబడినది.

**అవదంశము.** సం. వి. అ. పుం. 1. ఊరుఁగాయ; 2. కల్లు త్రాగునపుడు నంజుకొనెడువస్తువు.

**అవదగాకి.** దే. విశ. పలుగాకి. "ఎ, గీ. కూర్చిచెట్టఁబట్టుకొని తెచ్చెలోపలి, కవదగాకినారియత్తలారి." పంచ. నా. ౧, ఆ.

**అవదాతము.** సం. వి. అ. పుం. 1. తెల్లన; 2. పచ్చన. విశ. 1. తెల్లనిది; 2. పచ్చనిది; 3. స్వచ్ఛము; 4. శ్రేష్ఠము; 5. ఖండింపఁబడినది.

**అవదానము.** సం. వి. అ. న. 1. కడచినపని; 2. నఱకుట.

**అవదాయము.** మి. గ్రా. వి. తక్కువదాయము.

**అవదారణము.** సం. వి. అ. న. చీల్చుట. పుం. గుద్దలి.

**అవదాహము.** సం. వి. అ. న. నీటివట్టివేరు.

**అవదీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

**అవద్యము.** సం. విశ. (అ. ఆ. అ.) అధమము.

**అవధరించు.** సం. అ. క్రి. ఎచ్చరికపడు. (విననవధరింపుము. మొ.)—స. క్రి. ధరించు.

**అవధానము.** సం. వి. అ. న. ఎచ్చరిక.

**అవధాని.** సం. విశ. (న్. ఈ. న్.) అవధానముకలవాఁడు.

**అవధాయకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) అవధానముచేయువాఁడు.

**అవధారణము.** సం. వి. అ. న. నిశ్చయము.

**అవధారు.** వై. గ్రా. ని. వినుము. (దీనిని వర్గతృతీయమధ్యముగాఁ జెప్పవచ్చునుగాని ప్రయోగములయందంతట నిట్లేయున్నది.)

**అవధి.** సం. వి. ఇ. పుం. 1. మేర; 2. ఎడము; 3. వేళ; 4. బొక్క.

**అవధీరణము.** సం. వి. అ. న. తిరస్కరించుట.

**అవధీరితము.** సం. విశ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది.

**అవధూతుఁడు.** సం. వి. అ. పుం. దిగంబరసన్న్యాసి. విశ. కదలింపఁబడినవాఁడు.

**అవధ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) వధ్యముకానిది. (వధ్యము=చంపఁదగినది.)

**అవధ్వంసము.** సం. వి. అ. పుం. 1. పొడిచేయుట; 2. విడుపు; 3. దూఱు.

**అవధ్వస్తము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొడిచేయఁబడినది; 2. విడువఁబడినది; 3. దూఱఁబడినది.

**అవనతము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆనతము, వంగినది.

**అవనము.** సం. వి. అ. న. 1. కాపాడుట; 2. తనివిపఱుచుట.

**అవనాటి.** సం. (చూ.) అవటీట.

**అవనాయము.** ఉభ. వై. విశే. న్యాయములేనిది. సం. వి. అ. పుం. పడఁద్రోయుట.

**అవని.** సం. వి. ఇ. స్త్రీ. భూమి, నేల.

**అవపథ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అపథ్యము.

**అవపాతము.** సం. వి. అ. పుం. ఏనుఁగులోనగువానిపట్టునపుడు అవి పడుటకై త్రవ్వి మీఁదతేలికైన కఱ్ఱలనుకంపలను పలుచనగా కప్పి ఆపైనికొద్దిగా మట్టిపఱచి నేలమట్టుగాచేసినపల్లము, ఓదము.

**అవబోధము.** సం. వి. అ. పుం. 1. మేలుకొనియుండుట, ఉప వడము; 2. బోధించుట.

**అవభృథము.** సం. వి. అ. పుం. యజ్ఞముకడపట న్యూనాతిరిక్త దోషపరిహారార్థము చేయుకర్మము.

**అవభృటి.** సం. (చూ.) అవటీట.

**అవమతము.** సం. విశే. (అ. ఆ. అ.) అవజ్ఞాతము, అవమానిం పఁబడినది.

**అవమతి.** సం. వి. ఇ. స్త్రీ. అవమానము, ఖిన్నము.

**అవమము.** సం. వి. అ. పుం. మూఁడుతిథులుగూడినవారము. విశే. అధమము.

**అవమర్దము.** సం. వి. అ. పుం. పరులచేతలుగురాయిడి.

**అవమర్యాద.** సం. వి. ఆ. స్త్రీ. అమర్యాద.

**అవమానన.** సం. వి. ఆ. స్త్రీ. అవజ్ఞ, తెగడిక.

**అవమానపడు.** మి. అ. క్రి. భంగపడు.

**అవమానపెట్టు.** మి. స. క్రి. భంగపఱచు.

**అవమానము.** సం. వి. అ. న. అవమతి, భంగము.

**అవమానించు.** సం. స. క్రి. అవమానపెట్టు.

**అవమానితము.** సం. విశే. (అ. ఆ. అ.) అవమతము.

**అవయవము.** సం. వి. అ. పుం. కరచరణాది.

**అవయవి.** సం. విశే. (న్. ఈ. న్.) అవయవములుగలది.

**అవరజుఁడు.** సం. వి. అ. పుం. అనుజుఁడు, తమ్ముఁడు.

**అవరతి.** సం. వి. ఇ. స్త్రీ. విశ్రాంతి, ఉడుకువ.

**అవరము.** సం. వి. అ. న. ఏనుఁగు వెనుకటిపిక్కలోనగుకాలు. స. వెనుకటిది.

**అవరవర్ణుఁడు.** సం. వి. అ. పుం. శూద్రుఁడు.

**అవరీణము.** సం. విశే. (అ. ఆ. అ.) ధిక్కరింపఁబడినది.

**అవరుద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపరుద్ధము, అడ్డగింపఁ బడినది.

**అవరోధము.** సం. వి. అ. పుం. 1. అంతఃపురము; 2. అంతః పురకాంత; 3. అడ్డగింత; 4. మఱుఁగు.

**అవరోధించు.** సం. స. క్రి. నిరోధించు, అడ్డగించు.

**అవరోహము.** సం. వి. అ. పుం. 1. మఱ్ఱిలోనగువానియూడ; 2. చెట్టుమొదలనుండికొనకెగఁబ్రాఁకెడితీఁగ; 3. దిగుట; 4. ఇంద్రునిపట్టణము.

**అవర్ణ్యము.** సం. వి. అ. పుం. అపవాదము, దూఱు.

**అవల.** దే. వి. అవ్వలయొక్కరూపాంతరము.

**అవలంబము.** సం. వి. అ. పుం. ఆశ్రయము, ఊఁత.

**అవలంబించు.** సం. స. క్రి. ఆశ్రయించు, ఊఁదు.

**అవలంబితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది.

**అవలక్షణము.** సం. వి. అ. న. దుర్లక్షణము.

**అవలగ్నము.** సం. వి. అ. పుం, న. నడుము. విశే. తగులువడి నది.

**అవలిప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది; 2. గర్వమునొందినది.

**అవలీఢము.** సం. విశే. (అ. ఆ. అ.) నాకఁబడినది.

**అవలీల.** సం. వి. ఆ. స్త్రీ. చులుకన.

**అవలుంఠనము.** సం. వి. అ. న. పొరలిక.

**అవలుంఠితము.** సం. విశే. (అ. ఆ. అ.) పొర్లాడినది.

**అవలేపము.** సం. వి. అ. పుం. 1. పూఁత; 2. గర్వము; 3. భూషణము.

**అవలేహనము.** సం. వి. అ. న. నాకుట.

**అవలోకనము.** సం. వి. అ. న. చూచుట, చూపు.

**అవలోకించు.** సం. స. క్రి. వీక్షించు, చూచు.

**అవలోకితము.** సం. విశే. (అ. ఆ. అ.) చూడఁబడినది.

**అవలోడనము.** సం. వి. అ. న. పరామర్శము.

**అవల్గుజము.** సం. వి. అ. పుం. కారుగచ్చకీ.

**అవశకునము.** సం. వి. అ. న. దుశ్శకునము.

**అవశము.** సం, విశే. (అ. ఆ. అ.) వశముకానిది.

**అవశిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) మిగిలినది.

**అవశేషము.** సం. వి. అ. పుం. మిగులు, మిగత.

**అవశేషించు.** సం. అ. క్రి. మిగులు.

**అవశ్యము.** సం. క్రి. విశే. అ. న. నిశ్చయముగ, నెట్టన.

**అవశ్యాయము.** సం. వి. అ. పుం. 1. మంచు; 2. గర్వము.

**అవష్టంభము.** సం. వి. అ. పుం. 1. అవలంబము; 2. గర్వము; 3. ప్రయత్నము; 4. బంగారు; 5. మ్రానుపాటు.

**అవష్టబ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆక్రమింపఁబడినది; 2. ఆశ్రయింపఁబడినది; 3. కట్టఁబడినది; 4. సమీపించినది.

**అవసడి.** మి. గ్రా. వి. అపవాదము.

**అవసథము.** సం. వి. అ. న. గృహము, ఇల్లు.

**అవసన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కడముట్టినది; 2. నశించినది.

**అవసరము.** సం. వి. అ. పుం. 1. వేళ; 2. కురియుట; 3. మంత్రవిశేషము.

**అవసాదము.** సం. వి. అ. పుం. 1. నాశము; 2. కడ.

**అవసానము.** సం. వి. అ. న. 1. కడ; 2. ముగియుట.

**అవసాయము.** సం. వి. అ. పుం. 1. నిశ్చయము; 2. ముగి యుట; 3. శేషము.

**అవసితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱ్ఱచేయుబడఁబడి నది; 2. తెలియఁబడినది; 3. ముగిసినది.

**అవస్కందము.** సం. వి. అ. పుం. నిద్రించుటలోనగునవయ ములందు శత్రువులపైఁబడుట.

**అవస్కరము.** సం. వి. అ. పుం. 1. కడవయిపుగంటు; 2 రథావయవము; 3. గుహ్యావయవము; 4. విష్ఠ.

**అవస్థ్యము.** సం. వి. అ. న. ఆవసథము, ఇల్లు.

**అవస్థ.** సం. వి. ఆ. స్త్రీ. కాలకృతమైన స్థితివిశేషము. (త్ర్యవస్థలు.—జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి.—చతురవస్థలు.—బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధకము.—దశావస్థలు.—దర్శనము, మనస్సంగము, సంకల్పము, జాగరము, కార్శ్యము, అరతి, అలజ్జ, ఉన్మాదము, మూర్ఛ, మరణోద్యమము. కొందఱు జ్వరము, సంతాపము ఈ రెంటినిఁజేర్చి ద్వాదశావస్థలందురు. మఱికొందఱు దశావస్థలను వేఱొకవిధముగా పఠింతురు.)

**అవస్థానము.** సం. వి. అ. న. ఉనికి.

**అవహననము.** సం. వి. అ. న. దంచుట.

**అవహారము.** సం. వి. అ. పుం. 1. జూదము యుద్ధములోనగు వానియందలి యొడంబడిక; 2. గ్రాహము; 3. నిమంత్రణము చెప్పుటకు కొనిపోఁదగిన వస్తువు.

**అవహారుఁడు.** సం. వి. అ. పుం. తస్కరుఁడు, దొంగ.

**అవహితము.** సం. విణ. (అ. ఆ. అ.) అవధానమునొందినది.

**అవహిత్థ.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. గౌరవకౌటిల్యాదులచేఁజేయు హర్షాద్యాకారములమఱుఁగుపాటు. అ. పుం. ము. అభినయ హస్తవిశేషము.

**అవహేలనము.** సం. వి. అ. న. అవమానన, తెగడిక.

**అవాంతరము.** సం. విణ. (అ. ఆ. అ.) లోపలిది.

**అవాక్పుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. సదాపకీ.

**అవాగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) అవనతము, వంగినది.

**అవాచి.** సం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు.

**అవాచీనము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దక్షిణదిక్కునందుఁ బుట్టినది; 2. వ్యత్యస్తమయినది.

**అవాచ్యము.** సం. వి. అ. న. దూఱుమాట. విణ. చెప్పఁదగనిది.

**అవాజా.** హిం. వి. శబ్దము, వదంతి.

**అవానము.** సం. వి. అ. పుం. నిశ్వాసము.

**అవాపము.** సం. వి. అ. పుం. ఆలవాలము, పాదు.

**అవాప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాప్తము, పొందఁబడినది.

**అవాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రాప్తి, పొందు.

**అవాయి.** దే. వి. ఆకాశబాణము.

**అవారణము.** సం. వి. అ. న. అడ్డులేమి.

**అవారము.** సం. వి. అ. న. ఈవలిదరి.

**అవారి.** వై. విణ. అపరిమితము, (రూ. అవార్వరి.)

**అవారితము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడనిది.

**అవాసనుఁడు.** సం. వి. స. పుం. జనదేవత. విణ. దిసమొల వాఁడు.

**అవి.** సం. వి. ఇ. స్త్రీ. ముట్టుది. పుం. 1. ఎలుక; 2. కంబళి; 3. కొండ; 4. గొఱ్ఱె; 5. సూర్యుఁడు.

**అవికలము.** సం. విణ. (అ. ఆ. అ.) వికలముకానిది. (వికలము= తొఱ్ఱుమాఱయినది.)

**అవిఘ్నము.** సం. వి. అ. పుం. కలివెండ్రీ.

**అవిచ్ఛిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) విచ్ఛిన్నముకానిది. (విచ్ఛిన్నము=విచ్ఛేదమునొందినది.)

**అవిటి.** దే. విణ. అంగహీనుఁడు, పోగండుఁడు.

**అవితే.** సం. విణ. (అ. ఆ. అ.) కావఁబడినది. (ఋ. ఈ. ఋ.) కాచువాఁడు.

**అవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. అహమ్మతి, అజ్ఞానము.

**అవిధి.** సం. వి. ఇ. పుం. దుఃఖము, సంకటము.

**అవినీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సముద్ధతుఁడు, అడఁకువలేనివాఁడు.

**అవిభక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) విభక్తముకానిది. (విభక్తము= భాగింపఁబడినది.)

**అవిముక్తము.** సం. వి. అ. పుం. కాశి. విణ. విడువఁబడనిది.

**అవియు.** దే. అ. క్రి. 1. చెడు; (కన్నవిసెనిత్యాదులు.) 2. పగులు. (గుండియలవిసెనిత్యాదులు.)

**అవిరతము.** సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

**అవిరళము.** సం. విణ. (అ. ఆ. అ.) విరళముకానిది. (విరళము= విడవిడనుండునది.)

**అవిరి.** దే. వి. 1. నీలిచెట్టు; 2. నేత్రరోగవిశేషము.

**అవిలంబితము.** సం. క్రి. విణ. అ. న. త్వరితము. విణ. వడి గలది.

**అవివేకము.** సం. వి. అ. పుం. తెలివిలేమి.

**అవివేకి.** సం. విణ. (న్. ఈ. న్.) తెలివిలేనివాఁడు.

**అవిసియ.** వై. వి. అగస్త్యముచెట్టు.

**అవిసె.** వై. వి. అవిసియయొక్క రూపాంతరము.

**అవిసోఢము.** సం. వి. అ. న. గొఱ్ఱెపాలు.

**అవీచి.** సం. వి. ఇ. పుం. నరకవిశేషము. విణ. అలలులేనిది.

**అవీర.** సం. వి. ఆ. స్త్రీ. మగఁడును బిడ్డలునులేనిది. విణ. బలిమిలేనిది.

**అవు.** దే. అ. క్రి. అగు. ద్ర. అంగీకారమునుదెలుపునది.

**అవుతుఖానా.** హిం. వి. స్నానముచేయుతొట్టి.

**అవేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. హెచ్చరిక. కాచుట. (అనికొందఱు.)

**అవ్యండ.** సం. వి. ఆ. స్త్రీ. దూలగొండిచెట్టు.

**అవ్యక్తము.** సం. వి. అ. న. 1. పరమాత్మ; 2. మహదాది తత్త్వము. విణ. తెల్లముకానిది.

**అవ్యక్తరాగము.** సం. వి. అ. పుం. ఇంచుకయెఱుపు, అరుణము.

**అవ్యక్తుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.

**అవ్యథ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కరకచెట్టు; 2. మెట్టతామరచెట్టు. అ. పుం. ము. పాము. విణ. దుఃఖములేనిది.

**అవ్యయము.** సం. వి. అ. పుం; న. చాదిశబ్దవిశేషము. పుం. శుభము. విణ. వెచ్చములేనిది.

**అవ్యయుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు

**అవ్యవహితము.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యవహితముకానిది, (వ్యవహితము=వ్యవధానమైనది.) కదిసినది.

**అవ్యాజము.** సం. వి. అ. పుం. కపటములేమి. విశే. కపటము లేనిది.

**అవ్వ.** వై. వి. 1. తల్లి; 2. తల్లితల్లి*; 3. పూజ్యురాలు*.

**అవ్వల.** దే. వి. (ఆ+వలను.) 1. ఆప్రక్క; 2. పిమ్మట.

**అవ్వల్.** హిం. విశే. మొదటి, శ్రేష్ఠమైన.

**అవ్వారి.** వై. విశే. అవారియొక్క రూపాంతరము.

**అశక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) శక్తముకానిది. (శక్తము=ఓపినది.)

**అశక్యము.** సం. విశే. (అ. ఆ. అ.) శక్యముకానిది. (శక్యము=తరము.)

**అశనము.** సం. వి. అ. న. 1. అన్నము; 2. భోజనము.

**అశనాయ.** సం. వి. ఆ. స్త్రీ. బుభుక్ష, ఆఁకలి.

**అశనాయితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నవాఁడు, బుభుక్షితుఁడు.

**అశని.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. పిడుగు; 2. మెఱపు; 3. వజ్రాయుధము.

**అశబ్దవాది.** సం. వి. న్. పుం. సాంఖ్యుఁడు.

**అశితము.** సం. విశే. (అ. ఆ. అ.) భక్షితము, తినఁబడినది.

**అశిశ్వ.** సం. వి. ఈ. స్త్రీ. బిడ్డలులేనిది, గొడ్రాలు.

**అశీతి.** సం. వి. ఇ. స్త్రీ. ఎనుబది.

**అశుచి.** సం. విశే. ఇ. పరిశుద్ధముకానిది.

**అశుద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) అశుచి.

**అశుభము.** సం. వి. అ. న. కీడు.

**అశేషము.** సం. విశే. (అ. ఆ. అ.) అఖిలము, అంతయు.

**అశోక.** సం. వి. ఆ. స్త్రీ. కటురోహిణి*. అ. న. ము. పాదరసము. పుం. కంకేళి*. (దీనికిదోహదక్రియపాదతాడనము) విశే. శోకములేనిది.

**అశోకుఁడు.** సం. వి. అ. పుం. దశరథుని మంత్రులలోనొకఁడు. విశే. శోకములేనివాఁడు.

**అశ్మంతము.** సం. వి. అ. న. 1. ప్రొయ్యి; 2. చావు; 3. కీడు. విశే. మేరలేనిది.

**అశ్మకుట్టకుఁడు.** సం. వి. అ. పుం. ఱాతిపనివాఁడు.

**అశ్మగర్భము.** సం. వి. అ. పుం. మరకతము, పచ్చ.

**అశ్మజము.** సం. వి. అ. న. గిరిజము, సిలాజిత్తు.

**అశ్మపుష్పము.** సం. వి. అ. న. ఱాపువ్వు*.

**అశ్మము.** సం. వి. న్. పుం. ఉపలము, ఱాయి.

**అశ్మరి.** సం. వి. ఈ. స్త్రీ. నీరుకట్టురోగము.

**అశ్మసారము.** సం. వి. అ. పుం. లోహము, ఇనుము.

**అశ్రద్ధ.** సం. వి. ఆ. స్త్రీ. శ్రద్ధలేమి, అసడ్డ.

**అశ్రపుఁడు.** సం. వి. అ. పుం. నిర్బతి, మూలజేఁడు.

**అశ్రము.** సం. వి. అ. న. అశ్రువు, కన్నీరు.

**అశ్రాంతము.** సం. క్రి. విశే. అ. న. ఎల్లప్పుడు. విశే. ఎడతెగనిది.

**అశ్రి.** సం. వి. ఇ. స్త్రీ. కోటి, అంచు.

**అశ్రువు.** సం. వి. ఉ. న. అశ్రము, కన్నీరు.

**అశ్లీలము.** సం. వి. అ. న. 1. అర్థదోషవిశేషము; 2 శబ్దదోషవిశేషము. విశే. అసభ్యము. (మాట.)

**అశ్వకర్ణకము.** సం. వి. అ. పుం. తెల్లమద్ది*.

**అశ్వఖుర.** సం. వి ఆ. స్త్రీ. తెల్లదింటెన*.

**అశ్వగంధ.** సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరు*.

**అశ్వతరము.** సం. వి. అ. పుం. 1. కంచరగాడిద; 2. ఒకానొకపాము.

**అశ్వత్థ.** సం. వి. ఆ. స్త్రీ. పున్నమ. అ. పుం. ము. రావి*.

**అశ్వము.** సం. వి. అ. పుం. తురగము, గుఱ్ఱము. (అశ్వవిశేషములు.—ఇంద్రాయుధము, మల్లికాక్షము, శోణము, శ్రీవృక్షకి, హరితము, హలహలము, హేమము ఇత్యాదు లనేకములు. వీని ఉత్పత్తి సప్తవిధము. దీని ఱొమ్మునుడి శ్రీవృక్షకము. మెడసుడి రోచమానము. నిలువుసుడి పురుషకము. దీని యగ్రభాగము వంకము. ఖురము పుటము. గతి విక్రాంతి. కవచము ప్రఖరము. మునికోల ప్రతోదము. పగ్గము రశ్మి. పొర్లిక ఉరసము.)

**అశ్వయుక్కు.** సం. వి. జ్. స్త్రీ. అశ్వినీనక్షత్రము.

**అశ్వవాలము.** సం. వి. అ. పుం. ఱెల్లు*.

**అశ్వారోహ.** సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరు*.

**అశ్వారోహుఁడు.** సం. వి. అ. పుం. రౌతు.

**అశ్విని.** సం. వి. ఈ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**అశ్వీయము.** సం. వి. అ. న. గుఱ్ఱపుసమూహము. విశే. గుఱ్ఱమునకు హితమైనది.

**అశ్వుఁడు.** సం. వి. అ. పుం. అశ్వజాతిపురుషుఁడు.

**అశ్వులు.** సం. వి. న్. పుం. ద్వి. అశ్వినీసుతులు, అశ్వినీదేవతలు.

**అషడక్షీణము.** సం. విశే. (అ. ఆ. అ.) ఇద్దఱకంటె నన్యులెఱుఁగనిది. (మంత్రము. మొ.)

**అష్టక.** సం. వి. ఆ. స్త్రీ. శ్రాద్ధవిశేషము. అ. న. ము. 1. అట్టము; 2. ఎనిమిది.

**అష్టపత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. నాగమల్లె*.

**అష్టమము.** సం. స. (అ. ఆ. అ.) ఎనిమిదవది.

**అష్టమి.** సం. వి. ఈ. స్త్రీ. ఎనిమిదవతిథి.

**అష్టమూర్తి.** సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి. (అష్టమూర్తులు=పంచభూతములు, సూర్యచంద్రులు, పురుషుఁడు.)

**అష్టాదశము.** సం. స. న్. పదునెనిమిదవది.

**అష్టాపదము.** సం. వి. అ. పుం, న. 1. నెత్తపలక; 2. బంగారు. పుం. 1. మీఁగండ్లమెకము; 2. వెండికొండ; 3. సాలెపురుగు.

**అష్ఠీవత్తు.** సం. వి. త్. పుం. జానువు, మోఁకాలు.

**అసంగతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కూడనిది; 2. పొసఁగనిది,

**అసంగతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. కూడికలేమి.

**అసందర్భము.** సం. వి. అ. పుం. సందర్భములేమి.

**అసంభవము.** సం. విణ. (అ. ఆ. అ.) కలుగనిది.

**అసంహతము.** సం. వి. అ. పుం. బలములువేఱువేఱుగాఁదీర్చిన వ్యూహవిశేషము.

**అసడ్డ.** వై. వి. అశ్రద్ధ.

**అసతి.** సం. వి. ఈ. స్త్రీ. కులట, అంకుటాలు.

**అసత్యము.** సం. వి. అ. న. బొంకుమాట. విణ. బొంకు.

**అసదు.** వై. విణ. 1. అల్పము*; "అసదుఁగాను." పా. ౨, ఆ.–2. నికృష్టము*. "సీ. గాంగేయకుంభజకర్ణులమిగిలెడుఁ గాదేనినముఁడగుఁగానియసదు, గాఁదలంపఁగరాదు." భార. శల్య. ౧, ఆ.

**అసదృశము.** సం. విణ. (అ. ఆ. అ.) సమముకానిది.

**అసనపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. శామిదముౕ.

**అసనము.** సం. వి. అ. న. చిమ్ముట. పుం. వేఁగిసౕ.

**అసభ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) సభకుయోగ్యముకానిది.

**అసమంజసము.** సం. విణ. (అ. ఆ. అ.) బాగుకానిది.

**అసమగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) పూర్ణముకానిది.

**అసమనేత్రుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**అసమర్థము.** సం. వి. అ. పుం. కావ్యదోషములలోనొకటి. విణ. సమర్థముకానిది.

**అసమశరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, ఖేసితూపుల జోదు.

**అసమాధానము.** సం. వి. అ. న. అసమ్మతి.

**అసమీక్ష్యకారి.** సం. విణ. (న్. ఈ. న్.) చక్కఁగాయోచింపక ఏపనినేని చేయువాఁడు.

**అసము.** యు. దే. వి. 1. చనవు; 2. దర్పము. "చ. అసమున మీఁదెఱుంగకమహాగ్రహవృత్తిఁగడంగిచెచ్చెరన్, బసులకుఁ గూయిగాఁ జనియెఁబోఁవుఁడు." భార. విరా. ౫, ఆ.–వై. యశము. "ఉ. చెన్నగుమానికంబులును జెల్వగుగుజ్జములేనుఁ గుల్పదా, రన్నియపైఁడికోర్కిఁ గడవంగనుబాఱులకిచ్చియెన్నియే, జన్నములెన్నఁజేయుచుసంబునమీఱెడు వారుసాటియే, కన్నియయల్కలేకయొడికంబుగనుండెడుప్రోడకెయ్యెడన్." య. 3, ఆ.

**అసరవేయు.** దే. స. క్రి. ఆలస్యముచేయు.

**అసరు.** దే. వి. ఆకుపసరు. "సీ. ఒక్కనాఁడత్తపస్వి వ్రేల్నాటి దర్భ, గంటిఁగూరయసరుగాఁజిన సర్తించె." సం. "క్షతేఽకిలకరే రాజన్ స్తన్యశాకరసోస్రవత్." భార. శల్య. ౨, ఆ.

**అసలారు.** దే. అ. క్రి. అతిశయిల్లు. "ప్రియ మసలారఁగ." భార. ఆను. ౨, ఆ.

**అసలు.** దే. వి. 1. అడుసు; 2. మూలధనము.

**అసలుఁబుట్టువు.** దే. వి. (అసలు+పుట్టువు.) తామర, పంకజము.

**అసలుకొను.** దే. అ. క్రి. పంకిలమగు.

**అసపత్నుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు. విణ. ఓర్వనివాఁడు.

**అసహాయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తోడులేనివాఁడు.

**అసహిష్ణుఁడు.** సం. విణ. ఉ. ఓర్వనివాఁడు.

**అసహ్యపడు.** మి. అ. క్రి. రోఁతపడు.

**అసహ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) సహింపఁగూడనిది.

**అసహ్యించు.** సం. అ. క్రి. అసహ్యపడు.

**అసాదు.** దే. అవ్య. బళి. "క. ఋఘల్, సాదనశాత్రవులెల్లన, సాదనజేగజెల్లదొడరి సాదనసేయున్." రామా. 3, ఆ.

**అసాధారణము.** సం. విణ. (అ. ఆ. అ.) సాధారణముకానిది.

**అసాధువు.** సం. విణ. ఉ. సాధువుకానిది.

**అసాధ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) సాధ్యముకానిది.

**అసి.** ఉభ. దే. ఉప. అల్పార్థకము. (అసికోఁత, అసిగాయము. మొ. మఱియునిదియొకానొకచో ఇత్యర్థకముగాఁ గానఁబడియెడి.) చూ. అపాసనము. సం. వి. ఇ. పుం. ఖడ్గము, కత్తి.

**అసిఁబోవు.** దే. అ. క్రి. (అసి+పోవు.) తప్పిపోవు. "సీ. అసిఁబోవుటెట్లునాయసిఁబోవుమొకములంజించునాచేయమ్ముచిలుకుటమ్ము." రామా. ౨, ఆ.

**అసిక్ని.** సం. వి. ఈ. స్త్రీ. 1. శరీరాయాసముచే జీవనముచేయుచు అంతఃపురమునందు మెలఁగెడిప్రాయపు ఆఁడుది; 2. ఒకానొకయేఱు.

**అసితము.** సం. వి. అ. పుం. నలుపు. విణ. నల్లనిది.

**అసితాంగము.** సం. వి. అ. పుం. కత్తి. విణ. నల్లనిదేహము గలది.

**అసితుఁడు.** సం. వి. అ. పుం. శనిగ్రహము. విణ. నల్లనివాఁడు.

**అసిధావకుఁడు.** సం. వి. అ. పుం. సానపెట్టువాఁడు.

**అసిధేనుక.** సం. వి. ఆ. స్త్రీ. అసిపుత్రి, చురకత్తి.

**అసిపత్రము.** సం. వి. అ. పుం. 1. కత్తియొఱ; 2. చెఱకు; 3. నరకవిశేషము.

**అసిపుత్రి.** సం. వి. ఈ. స్త్రీ. అసిధేనుక.

**అసిమి.** దే. వి. ఎద్దుమీఁదవేసెడు గోనెవలె కుట్టినసంచి.

**అసిమిగొల్లెన.** దే. వి. ఇరుప్రక్కలవంపుగాశాలవలె నేర్పఱచిన చిన్నగుడారము. "గీ. మునుపుగానేగియసిమిగొల్లెనలుపన్ని." కళా. ౮, ఆ.

**అసియాడు.** దే. అ. క్రి. (అసి+ఆడు.) చలించు.

**అసిలేరు.** వై. వి. ఆశ్లేషనక్షత్రము.

**అసివాలు.** దే. వి. (అసి+పాలు.) ఈరువాలు, విహారము. "సీ. ఎవ్వఁడు నలువతేరెక్కియష్టాదశ ద్వీపాళినసివాలుదిరిగె లీల." కాశీ. ౪, ఆ.

**అసుతృణము.** సం. వి. అ. న. అవహేలనము, (రూ. అసూర్క్షణము.)

**అసుధారణము.** సం. వి. అ. న. జీవము, బ్రదుకు.

**అసుర.** సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి; 2. వేశ్య. అ. పుం. 1. అసురుఁడు; 2. అసురకృత్యముచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.) ము. 1. ఏనుఁగు; 2. మాలకాకి.

**అసురి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లావలు; 2. అసురునిభార్య.

**అసురుఁడు.** సం. వి, అ. పుం. 1. దైత్యుఁడు; 2. సూర్యుఁడు.

**అసురుసుసు.** దే. వి. త్రిమము శందగుఫ్వన్యనుకరణము. "క. మునురుకొనుజరభరంబున, నసురుసురైయున్న మమ్మునడకిం చితిప." పాన్. ౪, ఆ.

**అసువులు.** సం. వి. ఉ. పుం. బ. ప్రాణములు, ఉసురు.

**అసూక్షణము.** సం. వి. అ. న. అసుక్షణము, (రూ. అసూర్ణణము.)

**అసూయ.** సం. వి. ఆ. స్త్రీ. గుణములయందు దోషముసారోపించుట, ఇడుగడ.

**అసూర్యంపశ్య.** సం. వి. ఆ. స్త్రీ. దొరసాని. విణ. ఎండ కన్నయుఁగనిది.

**అసృక్కు.** సం. వి. జ్. న. రక్తము, నెత్తురు.

**అసృగ్ధర.** సం. వి. ఆ స్త్రీ. త్వక్కు, తోలు.

**అసృగ్వర.** సం. వి. ఆ. స్త్రీ.——పై.——

**అస్తమయము.** సం. వి. అ. పుం. అస్తమించుట.

**అస్తమించు.** సం. అ. క్రి. 1. అడఁగు; 2. కనఁబడకపోవు.

**అస్తమితము.** సం. విణ. (అ. ఆ. అ.) అస్తమించినది.

**అస్తము.** సం. వి. అ. పుం. (సూర్యుఁడు.) అస్తమించుకొండ. విణ. 1. త్రోయఁబడినది; 2. ముగిసినది. గ్రా. వి. గెలుశోనొకభాగము.

**అస్తరు.** హిం. వి. ఒక గుడ్డకాత్రయముగా లోప్రక్కఁ జేర్చి కుట్టెడు మఱియొకగుడ్డ*.

**అస్తుంకారము.** సం. వి. అ. పుం. అంగీకారము, ఇయ్యకోలు.

**అస్తోకము.** సం. విణ. (అ. ఆ. అ.) స్తోకముకానిది. (స్తోకము=అల్పము.)

**అస్త్రజీవుఁడు.** సం. వి. అ. పుం. యోధుఁడు, జోదు.

**అస్త్రము.** సం. వి. అ. న. 1. బాణము; 2. కత్తి; 3. విల్లు.

**అస్త్రి.** సం. విణ. న్. ధానుష్కుఁడు, విలుకాఁడు.

**అస్థి.** సం. వి. అ. న. కీకసము, ఎముక.

**అస్థిరము.** సం. విణ. (అ. ఆ. అ.) స్థిరముకానిది.

**అస్రప.** సం. వి. ఆ. స్త్రీ. 1. జెలగ; 2. పిశాచి.

**అస్రపుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

**అస్రము.** సం. వి. అ. న. 1. కన్నీరు; 2. నెత్తురు. పుం. 1. మూల; 2. వెండ్రుక.

**అస్రువు.** సం. వి. ఉ. న. అశ్రువు, కన్నీరు.

**అస్వప్నుఁడు.** సం. వి. అ. పుం. నిర్జరుఁడు, వేల్పు.

**అస్వరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) చెవికింపుగాని కంఠస్వరము కలవాఁడు.

**అహంకరించు.** సం. అ. క్రి. గర్వించు.

**అహంకారము.** సం. వి. అ. పుం. గర్వము, ఆమిక.

**అహంకారి.** సం. విణ. (న్. ఈ. న్.) అహంకారముగలవాఁడు, అహంయువు.

**అహంకృతి.** సం. వి. ఇ. స్త్రీ. అహంకారము.

**అహంత.** సం. వి. ఆ. స్త్రీ. అహంభావము.

**అహంపూర్వికీ.** సం. వి. ఆ. స్త్రీ. యుద్ధాదులయందు నేను ముందు నేనుముందని యొకరొకరిని మీఱుట.

**అహంభావము.** సం. వి అ. పుం. నేననుట, గర్వము.

**అహంయువు.** సం. విణ. ఉ. అహంకారి.

**అహతము.** సం. విణ. (అ. ఆ. అ.) చలువచేయని క్రొత్తది (వస్త్రము), కోరికము.

**అహమహమిక.** సం. వి. ఆ. స్త్రీ. యుద్ధాదులయందు ఒకరొకరికిఁగల అహంకారము.

**అహమించు.** సం. అ. క్రి. గర్వించు. "తెక్కుకుఁ మిగిలినసేన నొక్కఁడహమించివధించుటయెట్లు." జై. ౨. ఆ.

**అహము.** సం. వి. స్. న. దినము, పగలు.

**అహమ్మతి.** సం. వి ఇ. స్త్రీ అవిద్య. అజ్ఞానము.

**అహరహము.** సం. అవ్య. ప్రతిదినము.

**అహర్దానము.** సం. వి. అ. న. మృతులకొఱకుఁజేయఁబడు పిండజలాదిదానము.

**అహర్పతి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు, పగలింటిదొర.

**అహహ.** ఉభ. అవ్య. ఔర, (రూ. అహహా.)

**అహా.** వై. అవ్య. అహహ. "భూతివిభవపంచాస్యులహా." పాం చా. ౧, ఆ.

**అహారే.** ద్వ. అవ్య. (అహా+రే.) అహా, (రూ. అహారే.)

**అహార్యము.** సం. వి. అ. పుం. కొండ. విణ. దొంచఁదగనిది.

**అహి.** సం. వి. అ. పుం. 1. పాము; 2. వృత్రాసురుఁడు.

**అహిచ్ఛత్రము.** సం. వి. అ. న. భూస్ఫోటము, పుట్టగొడుగు.

**అహితుండికుఁడు.** సం. వి. అ. పుం. పాములవాఁడు.

**అహితుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు, పగతుఁడు.

**అహిద్విషము.** సం. వి. ష్. పుం. 1. నెమలి; 2. ముంగిస.

**అహిద్విషుఁడు.** సం. వి. ష్. పుం. 1. గరుత్మంతుఁడు; 2. ఇంద్రుఁడు.

**అహిఫేనము.** సం. వి. అ. న. 1. అభిని; 2. విషము.

**అహిభయము.** సం. వి. అ. న. రాజునకు పుత్రదాయాదప్రభృతి స్వపక్షజనకృతమైన భయము. (స్వపక్షమువారేడువ్వరు.—మూలబలము, మిత్రబలము, సమాశ్రితుఁడు, సంబంధజుఁడు, కార్యసముద్భవుఁడు, భృత్యుఁడు, ఉపచారగృహీతుఁడు.)

**అహిభుక్కు.** సం. వి. జ్. పుం. 1. గరుత్మంతుఁడు; 2. నెమలి.

**అహిర్బుధ్న్యుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**అహేరువు** సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీఁచరి.

**అహో.** సం. అవ్య. అహహా.

**అహోపురుషిక.** సం. వి. ఆ స్త్రీ. గర్వముచేఁ గలిగెడి ఆత్మగౌరవము. (ఇట్లు హ్రస్వాదిగాను పాఠము కలదు.)

**అహోరాత్రము.** సం. వి. అ. పుం. ముప్పది ముహూర్తముల కాలము, రేపగలు.

**అళఁది.** వై. వి. విణ. హరిద్రావర్ణము.

**అళము.** దే. వి. ఉప్పుపంటపెట్టెడియేఁబదిపాదులకొలఁదినేల. ఉప్పుమ్మెడుచోటు. (అనికొందఱు.)

**అళి.** సం. వి. ఇ. న్. పుం. 1. తుమ్మెద; 2. తేలు; 3. మద్యము.

**అళిందము.** సం. వి. అ. పుం. తలవాకిటి ప్రక్కనుండెడు చిన్నగది. (కొన్నిచోట్ల నడవగదియని యర్థమగుచున్నది.)

**అళిగర్దము.** సం. వి. అ. పుం. అలగర్దము, నీరుపాము.

**అళిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతుమ్మెద; 2. ఆఁడుతేలు.

**అళీకము.** సం. వి. అ. న. 1. అప్రియము; 2. నొసలు; 3. బొంకు.

**అళుకరి.** దే. విశే. భయశీలుఁడు. "సీ. భయశీలుఁడౌవెఱఁగిరి యళుకరి." ఆం. భా. తృ. వి.

**అళుకు.** దే. వి. వెఱపు, బెదరు.

ఆ.

**ఆ.** ఒకయక్షరము. ఉభ. దే. స. 1. ముందుచెప్పఁబడినదానిఁ దెలుపును; "ఆ వరము."—2. ఎదుటలేనిదానిఁ దెలుపును: (వానికృపలేక యేదియుఁగలుగదు.)—3. ఉద్దేశింపఁబడినదానిఁ దెలుపును. "క. ఏకథలయందుఁబుణ్య, శ్లోకుఁడు హరిచెప్పఁబడును సూరిజనులచే, నాకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్." భాగ. ౧, స్కం.—అవ్య. 1. అంగీకారమునదెలుపును; "మ. అరయన్ శూరుఁడు బభ్రువాహనుండుకాఁడాపెట్టుముక్తామణుల్." జై. ౭, ఆ.—2. ఆశ్చర్యమును దెలుపును; "చ. మదగజవైరివంటినడుమాకమలంబులవంటికన్నులా, యదనుశశాంకువంటి మొగమాముకురంబులవంటి చెక్కులా, మదనునివంటిచక్కఁదనమా మధురాధరవాని రూపునా, హృదయపటంబునందులిఖియించినకైవడిగాననయ్యెడిన్." అని. ౨, ఆ.—3. ప్రశ్నమునుదెలుపును; "అస్త్రశస్త్ర విద్యానిపుణుండుక్రీడిసుఖియా." భార. ఉద్యో. ౩, ఆ.—4. ప్రార్థనమును దెలుపును; "అనఘావినవలతుఁజెప్పుమా." ఉ, హరి. ౨, ఆ.—5. వ్యతిరేకమును దెలుపును. "ఇస్సిరోయావసుదేవసూనుసరియాయితఁడు." ఉ, హరి. ౩, ఆ.—సం. ఉప. ఇది ఒక పదమునకు ముందువచ్చునపుడు వఱకు అనునర్థము నిచ్చుచున్నది. (ఆచంద్రతారకము = చంద్రతారకలున్నవఱకు. ఆబాలగోపాలము=బాలగోపాలురవఱకు. ఇట్లు ఆకంఠము, ఆచండాలము. మొ.)

**ఆంగారము.** సం. వి. అ. న. అంగారముల సమూహము. (అంగారము=బొగ్గు.)

**ఆంగికము.** సం. విశే. (అ. ఆ. అ.) అంగముచేతఁ గలిగినది. (కనుబొమలెగరవేయుటలోనుగాఁగలది.)

**ఆంగిరసుఁడు.** సం. వి. అ. పుం. బృహస్పతి, వేల్పుటొజ్జ.

**ఆంగీరస.** సం. వి. అ. పుం. 1. ఒకసంవత్సరము; (చూ. సంవత్సరము.) 2. పుష్యమీనక్షత్రము. డు. బృహస్పతి.

**ఆంతరిక్షము.** సం. విశే. (అ. ఆ. అ.) అంతరిక్షమువలనఁగలిగినది. (అంతరిక్షము=ఆకాశము.)

**ఆంతర్యము.** సం. వి. అ. న. అభిప్రాయము, తలఁపు.

**ఆంత్రము.** సం. వి. అ. న. అంత్రము, ప్రేగు.

**ఆందోళనము.** సం. వి. అ. న. ఊఁగుట, ఉరియాట.

**ఆందోళము.** సం. వి. అ. పుం. అందలము.

**ఆందోళించు.** సం. అ. క్రి. ఊఁగు, ఉరియాడు.

**ఆందోళిక.** సం. వి. ఆ. స్త్రీ. ఆందోళము.

**ఆందోళితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఊఁచఁబడినది.

**ఆంధసికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) వంటవాఁడు, బాసికుఁడు.

**ఆంధ్యము.** సం. వి. అ. న. అంధత్వము, గ్రుడ్డితనము.

**ఆంధ్రుఁడు.** సం. వి. అ. పుం. ఆంధ్రదేశమువాఁడు, తెనుఁగువాఁడు.

**ఆంక్షు.** వై. వి. వెలివేయుట.

**ఆఁక.** దే. వి. 1. అడ్డగింత; "సీ. కికురించిరిచ్చిపుచ్చికొనుచోటులవారలాఁకకులోనుగాకప్పుడ్రోచి." స్వా. ౩, ఆ.—2. చెఱ; "హృదయంబున రోషముపట్టిలేని వధ్యతకువిధింపనేలయితఁడాఁకకుఁబాత్రము." ఉ, హరి. ౫, ఆ.—3. నిషేధము. (చూ. ఆఁగు.)

**ఆఁకట్టు.** దే. స. క్రి. (ఆఁక+కట్టు.) అడ్డగించు, నిరోధించు. "దం. మూడంజేలన్ ముజ్జగంబుల్ కరంబుబ్బురంబొప్పనాఁకట్టి." సీలా. ౨, ఆ.

**ఆఁకత్రాళ్లు.** దే. వి. బ. కవ్వమునుదగిలించుటకైతరిగంబమునందుఁగట్టెడుత్రాళ్లు. "సీ. ఆహవప్రస్థాదులగుమారుతంబులు తగులఁగట్టినయాఁకత్రాళ్లుగాఁగ." భీ. ౪, ఆ.

**ఆఁకపడు.** ద్వి. అ. క్రి. అడ్డిపడు. "క. ఇలఁబాతాళమునభ, స్థలినంబుధినాఁకపడక చరియింపఁగల, క్తులుగలవానరవీరులు, గలరెన్నననేకు లేనుగలనీపనికిన్." రా. కిష్కిం, కాం.

**ఆఁకపెట్టు.** దే. స. క్రి. అడ్డగించు. "క. మంత్రులుతా, రెడ్డియునుబల్కకుండిరి, పెద్దతడవు వింజెమాఁకపెట్టినభంగిన్." రా. యు, కాం,

**ఆఁకరము.** వై. వి. ఆగ్రహము. "క. వీఁకఁబఱతెంచినల్లడఁ, దాఁకినఁగడునల్గిఘోరతరశరహతిన, మ్మూఁకలువిరియఁగనర్జునుఁ, డాఁకరమున నేసెనుగ్రుఁడయిరణభూమిన్." భార. ఆది. ౧, ఆ. (మఱిచూ. రా. యు, కాం.)

**ఆఁకలి.** దే. వి. అంగద, క్షుత్తు.

**ఆఁకొను.** దే. అ. క్రి. (ఆఁకలి+కొను.) ఆఁకలిఁజెందు.

**ఆఁగాఁకర.** ద్వి. వి. (ఆకు+కాఁకర.) అడవికాఁకర, కర్కోటకి. (దీనికివిశేషముగా ఆకులుకలవు.)

**ఆఁగు.** దే. అ. క్రి. అణఁగు. స. క్రి. 1. అడ్డగించు; "క. మ్రోఁగుచుఁదూపులుదూపుల, నాఁగుచు." రామా. ౧, ఆ.—2. నిషేధించు; "గీ. ఆఁగఁబడినవానిలోఁగఁగఁజేయుట, యధమగతికి మార్గమనిరి బుధులు" భార. ఆది. ౩, ఆ.—3. మోచు; "భారమాఁగఁజాలక." భాగ. ౧౦, స్కం. పూ.—4. కాపాడు.

**ఆఁచికొను.** దే. స. క్రి. అపహరించుకొను. "సీ. పురిలోనఁ జొచ్చి విస్ఫురితగేహంబులయర్థసంచయమును నాఁచికొనుఁడు." హరి. ఉ. ౬, ఆ.

**ఆఁచు.** దే. ప్రే. అణఁగించు. "సీ. అదిత్యుపసనాఁచి హాలహాలంబునులోఁచి హుతవహుగర్వముల్మూఁతలూఁచి." కళా. ౧, ఆ.

**ఆఁటది.** దే. వి. ఆఁడది. "క. పటికినీరాచఱికం, బాఁటదిమొఱవెట్టఁబశువులాతురపడనో, యాఁటదనిలేచిదొంగల, గీఁటవ్రవెడలంగశవముక్రియనుండెదిదే." భాగ. ౯, స్కం.

**ఆఁటు.** దే. అ. క్రి. 1. చాలు; "నీరాఁటనిరాటపుంజెఱువులారయనబ్బురము." య. ౧, ఆ.—2. తాళు. "స్రగ్ధర. నాచేతికాఁటం గ్రూరేషావ్వసంబులేదొక్కొఁడు." రాఘ. ౨, ఆ.—వి. ఆఁడుతనము,

**ఆఁడెంగి.** దే. వి. ఆఁడుదాని స్వభావముగలపురుషుఁడు. బ. ఆఁడువారు.

**ఆఁడది.** దే. వి. ఆఁడుది, ఇంతి.

**ఆఁడి.** దే. అప. కల అను నర్థమునందు వచ్చెడి యొక స్త్రీప్రత్యయము. (కులుకులాఁడి, వగలాఁడి. మొ.)

**ఆఁడు.** దే. అప. కల అను నర్థమునందువచ్చెడి యొక పుంప్రత్యయము (ముద్దులాఁడు. మొ.)- వి. ఆఁడుతనము.

**ఆఁడుకట్టు.** దే. వి. ఆఁడుదానికోఁకకట్టు. "కాళ్లయొప్పిదమాఁడు కట్టనుజ్జ్వలముచేయంగ." భార. విరా. ౧, ఆ. (ఇక్కడ ఆఁడు కట్టనఁగా ఆఁడుదానికోఁకకట్టువంటికట్టని అర్థము.)

**ఆఁడుకూఁతురు.** దే. వి. ఆఁడుది, ఇంతి.

**ఆఁడుతోఁడు.** దే. వి. తోడఁబుట్టినది, సహోదరి. "బోయవెయాఁడుతోఁడునను బుట్టవె." సావ్. ౪, ఆ.

**ఆఁడుది.** దే. వి. ఆఁడది, ఇంతి.

**ఆఁడుపడుచు.** దే. వి. కూఁతురు. "సీ. కొడుకు మన్మథుఁడాఁడుపడుచుభాగీరథ యిల్లాలుభూకాంత యిల్లుకొండ." రా, ని. ౨, ఆ.

**ఆఁడుపాప.** దే. వి. పడుచు, కన్యక.

**ఆఁడుపుట్టువు.** దే. వి. ఆఁడుది. "గీ. చనునెయిమ్మాటలాడనజ్జనులకాఁడు, పుట్టువులతోడనీవునుబుట్టినాఁడ, వు." భార. విరా. ౨, ఆ.

**ఆఁడుబిడ్డ.** దే. వి. 1. కూఁతురు; "సీ. క్రొత్తగాఁజేయించుకొనిన ముక్కరకుఁగానడలుదుర్వారమైయాఁడుబిడ్డ." పాండు. 3, ఆ.—2. మగనితోడఁబుట్టినది. (ఈయర్థము వాడుకలోనిది.)

**ఆఁదోఁక.** దే. వి. (ఆవు+తోఁక.) ఆవుతోఁకవలె మొదట లావును అవల క్రమక్రమముగా సన్నమునైనయాకృతి. (ఇక్కడ ఆవు అన్నది ఇతరమునకును ఉపలక్షణము.)

**ఆఁదోఁకపాటు.** ద్వి. వి. ఆవుతోఁకవలెనగుట, ఆఁదోఁకపడుట. "గీ. కదళికవియించెనగ్రాంఘ్రికంపుఁదొడల, పెనుపునెట్లన్నఁబొరలశోధననడంచు, కొన్నయాఁదోఁకపాటునుగొప్పవిప్ప, మెఱయుగోర్ముచ్చులును గెంపుగుఱులుగావె." ఆము. ౫, ఆ.

**ఆఁపు.** దే. ప్రే. ఆఁగఁజేయు, ఆఁచు. వి. అడ్డగింత. "గీ. పట్టుకొనియాఁపునేయించెబాణుఁడతని." అని. 3, ఆ. (ఆఁపుప్రేరణరూపమనుటకు తగిన ప్రయోగము కానఁబడలేదు.)

**ఆఁబసి.** దే. వి. (ఆవు+పసి.) గోవు. "సీ. బలుదాదులగుచు బెబ్బులులబిడ్డలనిచ్చ ఖనువకపెంచునాఁబసులకదుపు." య. ౨, ఆ.

**ఆఁబోతు.** దే. వి. (ఆవు+పోతు.) 1. అచ్చుపెద్దు; 2. ఎద్దు. "అంకెవేసె నొకచో నాఁబోతుకాల్ద్రవ్వుచున్." పంచ. నా. ౧, ఆ.

**ఆఁబోతురవుతు.** ద్వి. వి. ముక్కంటి, శివుఁడు.

**ఆఁబోతుస్వరము.** ద్వి. వి. సప్తస్వరములలోనొకటి, ఋషభము.

**ఆకంపించు.** సం. అ. క్రి. మిక్కిలి కంపించు, వణఁకు.

**ఆకంపితము.** సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగాఁ గదలింపఁబడినది.

**ఆకట.** దే. అవ్య. (హా.) అక్కట. "క. అఁగొంటిరిన్నిదినములు, పోఁకంత ముభిక్షవిటఁబుట్టకయునికన్, ఆకటదూఁకటనలఁగితి, నేఁకటవాయంగ భిక్షలిడియెదరంచు." భీ ౨, ఆ.

**ఆకతాయి.** వై. విశే. తుంట*. "సె. ఆకతాయలు మూఁకలై వేశమంతయుఁజెఱచి పుణ్యస్త్రీలఁ జెఱలుగొనిరి." వి, పు. ౨, ఆ.

**ఆకరము.** సం. వి. అ. పుం. 1. రత్నములులోనగునవి పుట్టునట్టిచోటు, గని; 2 సమూహము.

**ఆకర్ణనము.** సం. వి. అ. న. శ్రవణము, వినికి.

**ఆకర్ణించు.** సం. స. క్రి. ఆకర్ణనముచేయు, విను.

**ఆకర్ణితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆకర్ణింపఁబడినది.

**ఆకర్షము.** సం. వి. అ. పుం. 1. ఆకర్షించుట; 2. ఇంద్రియము; 3. జూదము; 4. జూదమాడెడుపలక; 5. వాచిక; 6. వింటినభ్యసించెడువస్తువు.

**ఆకర్షించు.** సం. స. క్రి. ఆకర్షణముచేయు, తిగుచు.

**ఆకర్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆకర్షింపఁబడినది, తిగువఁబడినది.

**ఆకలనము.** సం. వి. అ. న 1 అవగాహనము; 2. ఎన్నిక; 3. కోరిక; 4. బంధనము; 5. సమూహము.

**ఆకల్పము.** సం. వి. అ. పుం 1. వస్త్రాద్యలంకరణము; 2. కల్పనము, వన్నెగడ.

**ఆకసము.** వై. వి. మిన్ను, విన్ను, ఆకాశము.

**ఆకస్మికము.** సం. విశే. (అ. ఆ. అ.) అకస్మాత్తుగాఁ గలిగినది.

**ఆకళించు.** వై. స. క్రి. అవగాహనముచేసికొను. "ప్రధానపురుషాంతరవర్తన నాకళించుచున్." రాఘ. ౧, ఆ.

**ఆకళింత.** వై. వి. అవగాహనము.

**ఆకాంక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక; 2. అన్వయముకొఱకు ఒక పదము మఱియొక పదమును కోరుట. క్రియాపదమునుబట్టి కర్తృకర్మాదులకును వాని విశేషణములకును చేసెడు ప్రశ్నము. (అని వాడుకయందు.)

**ఆకాంక్షించు.** సం. స. క్రి. వాంఛించు, కోరు.

**ఆకాండికము.** సం. విశే. (అ. ఈ. అ.) అకాలమునందుఁ గలిగినది.

**ఆకారణ.** సం. వి. ఆ. స్త్రీ. ఆహ్వానము, పిలుపు.

**ఆకారము.** సం. వి. అ. పుం. 1. రూపము; 2. బొమముడిపాటులోనగు వికారము.

**ఆకారితము.** సం. విశే. (అ. ఆ. అ.) పిలువఁబడినది.

**ఆకాశము.** సం. వి. అ. న. నభము, ఆకసము.

**ఆకీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) ఒకటితోనొకటి కలసినది, సంకీర్ణము.

**ఆకు.** దే. వి. 1. చెట్టునందలియాకు, పత్రము; 2. తములపాకు; 3. తాటాకు; "ఇందునీవిపుడు వ్రాలిడుమనియాకుగంటముఁజేతికిచ్చె." పర. ౫, ఆ.—4. విస్తరాకు; 5. చెవికమ్మ; "చ. వలపలడాపలన్ వరుస వాలుఁగనుంగొనచూపులార్చుచున్, దిలకముతీర్చుచున్ గురులు దీటుచువీనులమానికంపుటా, కులఁబొరిఁద్రిప్పుచున్." లక్ష్మీ. ౨, ఆ.—6. ఇచ్చిపుచ్చుకోలు పత్రము; "క. అప్పిచ్చినతనియాకును, నప్పుమగుడఁబెట్టి నతనియాకును గలచో, నప్పిచ్చినాతు బొంకగు, నప్పుమగుడఁబెట్టి నతనియాకు

నిజనుగుఁ." విజ్ఞా. వ్య. కాం.—7. చీటి; "సీ. చావులే కుండ నాజముచేతనాకుఁదెచ్చినవారుగలరె యీసృష్టియందు." భో. ౪, ఆ.—8. జాబు; "నన్నవలఁజదువనికతానొండిసి యాయాకుబలిమిఁబుచ్చుకొని." ప్రభా. ౪, ఆ.—9. బండి కంటియాకు; 10. మిద్దెటింద్లులోనగువానితలుపుల కమర్చెడి ఆకు; 11. నాఙు.

**ఆకుంచనము.** సం. వి. అ. న. ముడుఁచుట.

**ఆకుంచితము.** సం. విశే. (అ. ఆ. అ.) ముడువఁబడినది.

**ఆకుచిఱుతే.** దే. వి. ఒకదినుసు చిఱుతపులి.

**ఆకుచిలుక.** దే. వి. తెల్లబొట్లుగల పెద్ద ఱెక్కల పురుగుదినుసు.

**ఆకుజెముడు.** దే. వి. పత్రస్నుహి చె.

**ఆకుజెల్ల.** దే. వి. మత్స్యవిశేషము. "అరుజాతిలెల్లపుఁ జేఁపయాకు జెల్ల." హంస. ౪, ఆ.

**ఆకుటిల్లు.** దే. వి. (ఆకు+ఇల్లు.) ఆకులతో కప్పఁబడినగుడిసె, పర్ణశాల.

**ఆకుతేలు.** దే. వి. ఒకదినుసుతేలు.

**ఆకుపచ్చ.** దే. వి. విశే. హరితవర్ణము.

**ఆకుపత్రి.** దే. వి. ఒకానొకచెట్టు.

**ఆకుపాఁచి.** దే. వి. ఒకదినుసుపాఁచి, కుంభిక.

**ఆకుపిఁకెలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. హంస. 3, ఆ.

**ఆకుపురుగు.** దే. వి. ఆకులయందుండెడి ఒకదినుసు పచ్చపురుగు.

**ఆకుపోయు.** దే. స. క్రి. నాఱుపోయు.

**ఆకుప్పు.** దే. వి. (ఆకు+ఉప్పు.) ఒకదినుసు ఉప్పు.

**ఆకుమిడుత.** దే. వి. పచ్చఱెక్కలమిడుత.

**ఆకుఱాయి.** దే. వి. ఇనుములోనగువానిని తెగరాచెడి కొఱముట్టు, పత్రపరశువు.

**ఆకులపడు.** మి. అ. క్రి. (ఆకులము+పడు.) ఆకులతనొందు, చెదరు.

**ఆకులపాటు.** మి. వి. ఆకులపడుట.

**ఆకులము.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యస్తము, చెదరినది.

**ఆకుల్యము.** సం. వి. అ. న. నేలతంగేడుచె.

**ఆకుసన్నములు.** దే. వి. బ. ధాన్యవిశేషము.

**ఆకూతము.** సం. వి. అ. న. అభిప్రాయము, తలంపు.

**ఆకూతి.** సం. వి. ఇ. స్త్రీ.——పై.——

**ఆకృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. రూపము; 2. దేహము; 3. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 4. భావమునెఱిఁగించెడిసంజ్ఞ; 5. సామాన్యము.

**ఆకృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ఆకర్షణము, తెగ.

**ఆకె.** దే. స. ఏ. (ఆ+అక.) ఆమె. "క. నాకంటెయకటయుత్తమ, యాకెయగుటచెప్పవలయునా." ప్రభా. ౫, ఆ. (ఆకె, ఈకె, ఏకె, ఎవతె ఒకతె ఇత్యాదులయందు ఎకారము ఆదేశముగా వచ్చెనని యెఱుంగునది.)

**ఆకేకర.** సం. వి. ఆ. స్త్రీ. దృష్టివిశేషము.

**ఆకొత్తు.** దే. వి. అడకొత్తుయొక్క రూపాంతరము.

**ఆక్టు.** ఆం. వి. చట్టము.

**ఆక్రందము.** సం. వి. అ. పుం. 1. ఏడ్పు; 2. పిలుపు; 3. భయంకరయుద్ధము.

**ఆక్రందించు.** సం. అ. క్రి. ఏడ్చు.

**ఆక్రందితము.** సం. విశే. (అ. ఆ. అ.) పిలువఁబడినది.

**ఆక్రందుఁడు.** సం. వి. అ. పుం. 1. చెలికాఁడు; 2. తోడఁబుట్టినవాఁడు.

**ఆక్రమణము.** సం. వి. అ. న. ఆక్రమించుట.

**ఆక్రమించు.** సం. స. క్రి. ఆఱుము

**ఆక్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆక్రమింపఁబడినది, ఆఱుమఁబడినది.

**ఆక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ఆక్రమణము.

**ఆక్రీడము.** సం. వి. అ. పుం. ఉద్యానవనము.

**ఆక్రోశము.** సం. వి. అ. పుం. తిట్టు, (రూ. ఆక్రోశనము.)

**ఆక్రోశించు.** సం. స. క్రి. తిట్టు.

**ఆక్షారణ.** సం. వి. ఆ. స్త్రీ. అమ్మకునాలికిఁదిట్టుట.

**ఆక్షారితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు.

**ఆక్షిప్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఆక్షేపింపఁబడినవాఁడు.

**ఆక్షీబము.** సం. వి. అ. పుం. మునగచె.

**ఆక్షేపకుఁడు.** సం. వి. అ. పుం. 1. నత్తిగలవాఁడు; 2. బోయవాఁడు. విశే. ఆక్షేపించువాఁడు.

**ఆక్షేపము.** సం. వి. అ. పుం. 1. అడ్డంకి; 2. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. దూఱు; 4. ఆకర్షణము.

**ఆక్షేపించు.** సం. స. క్రి. 1. అడ్డగించు; 2. దూఱు; 3. ఆకర్షించు.

**ఆక్షోటము.** సం. వి. అ. పుం. కొండగోఁగుచె.

**ఆఖండలుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

**ఆఖరు.** హిం. విశే. చివర, అంత్యము.

**ఆఖుభుక్కు.** సం. వి. క్. పుం. మార్జాలము, పిల్లి.

**ఆఖువు.** సం. వి. ఉ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు.

**ఆఖేటకుఁడు.** సం. వి. అ. పుం. మృగయుఁడు, వేఁటకాఁడు.

**ఆఖేటము.** సం. వి. అ. పుం. మృగయ, వేఁట.

**ఆఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. ఆహ్వయము, పేరు.

**ఆఖ్యాత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) చెప్పెడువాఁడు.

**ఆఖ్యాతము.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినది. (వ్యాకరణమునందు ధాతువులమీఁద విధింపఁబడినతిజ్ఞు.)

**ఆఖ్యానము.** సం. వి. అ. న. చెప్పుట.

**ఆఖ్యాయకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఏదేనొక విషయమును వివరించిచెప్పెడువాఁడు. (ఆకారాంతమైనప్పుడు ఆఖ్యాయికా అని రూపము. ఇట్లంతట ఎఱుఁగునది.)

**ఆఖ్యాయిక.** సం. వి. ఆ. స్త్రీ. వాస్తవార్థముగల హర్షచరితాది గ్రంథము.

**ఆఖ్యేయము.** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁదగినది.

**ఆగంతుకము.** సం. విశే. (అ. ఈ. అ.) కాలనియమములేక వచ్చునది.

**ఆగంతువు.** సం. విశే. ఉ. అతిథి, విందు.

**ఆగడకాఁడు.** దృ. విశే. (ఆగడము+కాఁడు.) అకార్యముచేయువాఁడు.

**ఆగడపలు.** దే. వి. బ. దొంతిగా నేర్పడినమేఘపఙ్క్తి. "వ. ఆగడపలంగదియవైచి వీచీరేఖలఁబోఁద్రోఁచి కుసుమనారాచుకేళాకూళింగల జాలువాసోపనంబులం బ్రతిఘటించు త్రివళివిభాగంబులును." పాండు. 3, ఆ.

**ఆగడము.** వై. వి. అవగడముయొక్క రూపాంతరము.

**ఆగడీఁడు.** దృ. విశే. (ఆగడము+ఈఁడు.) అకార్యముచేయువాఁడు. "సీ. ఆగడీలెగఁద్రోయనగ్రజులను హాస్యభావంబు నెఱపి దుర్భావులాడు." భల్లా. 3, ఆ.

**ఆగతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వచ్చినది; 2. పొందఁబడినది.

**ఆగమనము.** సం. వి. అ. న. వచ్చుట, రాక.

**ఆగమము.** సం. వి. అ. పుం. 1. రాక; 2. దేవపూజావిధానమును తత్సంబంధివిషయములను తెలుపునట్టిశాస్త్రము; 3. (వ్యాకరణమున) అధికముగావచ్చెడు వర్ణము.

**ఆగము.** సం. వి. స్. న. 1. తప్పు; 2. పాపము.

**ఆగాడి.** దే. వి. తేలికైనధాన్యము.

**ఆగాత్యము.** వై. వి. కొంచెమును గొప్పగాచేసి కావించెడు అఱపు ఏడ్పులోనగునది*. (ఇది వాడుకలోనిది.)

**ఆగామి.** సం. విశే. (న్. ఈ. న్.) రాఁగలది.

**ఆగుబ్బతిలు.** దే. అ. క్రి. అతిశయించు. "మదిలోని కోర్కులాగుబ్బతిలంగ." సాన్వ. ౨, ఆ.

**ఆగుబ్బు.** దే. వి. అతిశయము, ఆధిక్యము. "ఉ. గొబ్బురితిమ్మభూవిభుని ఘోరతరాసిని డ్రెళ్లివైరులాగుబ్బుననేగి." రామా. ౧, ఆ. — విశే. అధికము.

**ఆగుబ్బుకొను.** దే. అ. క్రి. అతిశయించు. "సీ. ఒక వంకజాలసముద్ధూతసుమజాతఘుమఘుమామోదమాగుబ్బుకొనఁగ." శేష. ౨, ఆ.

**ఆగువు.** సం. వి. ఊ. స్త్రీ. అంగీకారము, ఇయ్యకోలు.

**ఆగ్నేయము.** సం. వి. అ. న. దశాహశ్రాద్ధము. (చూ. శ్రాద్ధము.) విశే. అగ్నిదేవతాకము.

**ఆగ్రహము.** సం. వి. అ. పుం. 1. కోపము; 2. అనుగ్రహము; 3. ఆక్రమము; 4. ఆసక్తి; 5. గ్రహణము.

**ఆగ్రహాయణి.** సం. వి. ఈ. స్త్రీ. మృగశిరోనక్షత్రము.

**ఆగ్రహాయణికము.** సం. వి. అ. పుం. మార్గశీర్షమాసము.

**ఆగ్రహించు.** సం. స. క్రి. 1. కోపించు; 2. చలపట్టు.

**ఆఘాటము.** సం. వి. అ. పుం. 1. కొలఁది; 2. మేర.

**ఆఘాతము.** సం. వి. అ. పుం. వధస్థానము, చంపుడుగట్టు.

**ఆఘాతించు.** సం. స. క్రి. వధించు, చంపు.

**ఆఘూర్ణనము.** సం. వి. అ. న. తిరుగుడు.

**ఆఘూర్ణితము.** సం. విశే. (అ. ఆ. అ.) తిరుగుడుపడినది.

**ఆఘోషించు.** సం. అ. క్రి. 1. అఱచు; 2. మ్రోయు.

**ఆఘ్రాణము.** సం. వి. అ. పుం. మూచూచుట, మూర్కొనుట.

**ఆఘ్రాణించు.** సం. స. క్రి. మూచూచు, మూర్కొను.

**ఆఘ్రాతము.** సం. వి. అ. న. ఘూషణధ్వని. విశే. మూర్కొనఁబడినది.

**ఆచమనము.** సం. వి. అ. న. ఉపస్పర్శము, వార్పు.

**ఆచమించు.** సం. స. క్రి. చూపుడువ్రేలుపొడవుగా నిలిపినప్పుడిసిట జలముగ్రహించి మూడుమార్లు పుచ్చుకొను, వార్చు.

**ఆచరణము.** సం. వి. అ. న. ఆచారము, నడత.

**ఆచరణీయము.** సం. విశే. (అ. ఆ. అ.) నడపఁదగినది.

**ఆచరించు.** సం. స. క్రి. నడపు.

**ఆచరితము.** సం. విశే. (అ. ఆ. అ.) నడపఁబడినది.

**ఆచాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆచమింపఁబడినది.

**ఆచాంతి.** సం. వి. ఇ. స్త్రీ. ఆచమనము.

**ఆచామము.** సం. వి. అ. పుం. మానరము, గంజి.

**ఆచారము.** సం. వి. అ. పుం. ఆచరణము, నడత.

**ఆచార్య.** సం. వి. ఆ. స్త్రీ. వేదవ్యాఖ్యానముచేయునట్టు ఆఁడుది.

**ఆచార్యకము.** సం. వి. అ. న. ఉపాధ్యాయత్వము, ఒజ్జఁదనము.

**ఆచార్యాని.** సం. వి. ఈ. స్త్రీ. ఆచార్యునిపెండ్లాము.

**ఆచార్యుఁడు.** సం. వి. అ. పుం. వేదవ్యాఖ్యానముచేయువాఁడు.

**ఆచితము.** సం. వి. అ. న. పదిబారువులకొలఁది. పుం. బండిబరువు. విశే. 1. కప్పఁబడినది; 2. గ్రహింపఁబడినది; 3. పఱపఁబడినది.

**ఆచ్ఛాదనము.** సం. వి. అ. న. 1. కప్పుట; 2. దోషమును గప్పుట; 3. వస్త్రము.

**ఆచ్ఛురితకము.** సం. వి. అ. న. 1. నఖక్షతవిశేషము; 2. పరిహాసపుమాటతోఁగూడినన్వు.

**ఆచ్ఛోదనము.** సం. వి. అ. న. ఆఖేటము, వేఁట.

**ఆచోకి.** దే. వి. (ఆ+చోడికి.) పోబడి, జాడ.

**ఆజకము.** సం. వి. అ. న. అజసమూహము. (అజము=మేఁకపోతు.)

**ఆజగవము.** సం. వి. అ. న. అజగవముయొక్క రూపాంతరము.

**ఆజవంజవము.** సం. వి. అ. పుం. సంసారము.

**ఆజానేయము.** సం. వి. అ. పుం. మేలుజాతిగుఱ్ఱము.

**ఆజి.** సం. వి. ఇ. స్త్రీ. 1. యుద్ధము; 2. సమభూమి; 3. క్షణకాలము.

**ఆజీవము.** సం. వి. అ. పుం. జీవిక, బ్రదుకుత్రోవ.

**ఆజువు.** సం. వి. ఊ. స్త్రీ. అమిజి, వెట్టి.

**ఆజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. ఇది యిట్లు చేయవలసినదనెడి ఉత్తరువు.

**ఆజ్ఞప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఆజ్ఞ.

**ఆజ్ఞాతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

**ఆజ్ఞాపనము.** సం. వి. అ. న. ఆజ్ఞాపించుట, ఆనతి.

**ఆజ్ఞాపించు.** సం. స. క్రి. ఆజ్ఞాపనముచేయు, ఆనతిచ్చు

**ఆజ్ఞాపితము.** సం. విశే. (అ. ఆ అ.) ఆజ్ఞాపింపఁబడినది.

**ఆజ్యము.** సం. వి. అ. న. ఘృతము, నెయ్యి.

**ఆట.** దే. వి. 1. క్రీడ; 2. నర్తనము; 3. నింద. "సీ. ఆటలు పసిబిడ్డయాటలై పెంపుచె యొరుల యాటలఁబడనోగితముగ." లక్ష్మి. ౨, ఆ.—4. నువ్వులులోనగువాని గానుగలోవేసి త్రిప్పుట. "చ. వరేక్షుపఙ్క్తినడుమంత్రపుసంపదచేఁ గ్రిందుమీఁ, దెఱుగక సాటివత్తునని హెచ్చినవాటకుఁబెట్టఁగుందచే." భాను. ౨, ఆ.

**ఆటంకము.** దే. వి. అడ్డంకి, నిరోధము.

**ఆటకత్తియ.** ద్వి. వి. ఆటఆడునది, నర్తకి, (రూ. ఆటకత్తె.)

**ఆటకాఁడు.** దే. వి. నర్తకుఁడు. "గీ. అలరితోలుకరిపేరిటియాట కాఁడు, మీఱువాటిల్లవలరాజు మెచ్చువడసి, పథికజనమానధనము లపాఱలీఁ, గొల్లలాడెనుఘువనంబులుల్లసిల్ల." రామా. ౬, ఆ. (ఇతరములైన ఆటలాడువానికిని ఈపేరుచెల్లును. "గీ. ఓరియాట కాఁడ యీరీతియజపులా, పొగడుటనఁగమెచ్చు పుట్టదిందు." (ఇక్కడ ఆటకానికి దొమ్మరివాఁడర్థము.) ప్రభా. ౧, ఆ. ఇత్యాదులు.)

**ఆటగొట్టు.** దే. వి. మూడుకట్లులుగల గొట్టు.

**ఆటడిగ్గియ.** ద్వి. వి. క్రీడార్థము ఏర్పఱుపఁబడిన నడబావి.

**ఆటతిప్ప.** దే. వి. క్రీడార్థమేర్పఱిచినకొండ, కృతకాద్రి.

**ఆటతోఁట.** దే. వి. 1. ఉద్యానవనము. "సీ. నీవునువాలియు నేడునునాడును నయముతోఁబాటించునాటతోఁట, మధువనంబు." భార. అర. ౭, ఆ.—2. ప్రమదావనము. "ఉ. పూనికనాట తోఁటవలపుల్ గలకప్రపుఁగమ్మధూళిపూఁ, దేనియయేటికాలువలు తీర్పఁగనోపికలేనిదౌ హృద. శ్రీనిధియాధరాధిపతిచేడియ." రామా. 3, ఆ.

**ఆటపట్టు.** దే. వి. 1. క్రీడాస్థానము; 2. నాట్యస్థానము; 3. వాసస్థానము.

**ఆటపాక.** దే. వి. నాట్యస్థానము, నర్తనశాల.

**ఆటవిడుపు.** దే. వి. ఆడుకొనుటకై విద్యార్థులను వదలిపెట్టుట.

**ఆటవెలఁది.** దే. వి. 1. నర్తకి; 2. పద్యభేదము; 3. వేశ్య.

**ఆటాడు.** దే. అ. క్రి. (ఆట+ఆడు.) క్రీడించు.

**ఆటి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకదినుసుబాతు, ఆడేలు.

**ఆటు.** దే. వి. అడుపు, హతి.

**ఆటోపము.** సం. వి. అ. పుం. సంభ్రమము, వేగిరపాటు.

**ఆటోపించు.** సం. అ. క్రి. సంభ్రమించు, వేగిరపడు.

**ఆట్రగడలు.** దే. వి. న. ధాన్యవిశేషము, అర్కిళ్లు.

**ఆడ.** దే. వి. వి. అక్కడయొక్క రూపాంతరము. "ఒగడ. అలమిసను జగురుసకునగునెకంటకమాడఁ, జాఱుకుమనె వేల్పొక్కచోటఁ గంటకమాడ." పాన్థ. 3, ఆ.

**ఆడంబరము.** సం. వి. అ. పుం. 1. యుద్ధవాద్యధ్వని; 2. వేగిరపాటు; 3. ఏనుఁగుయొక్క గీఁక.

**ఆడాలు.** దే. వి. ఒకానొకచెట్టు.

**ఆడి.** సం. వి. ఇ. స్త్రీ. ఆటి, ఆడేలు. "క. ఆడిబకసాంపరాయము, వేడుకఁజెప్పినను వినినవిఘ్నములడఁగుఁ." మార్క. ౨, ఆ.

**ఆడిక.** దే. వి. దూఱు, నింద.

**ఆడికపడు.** ద్వి. అ. క్రి. దూఱుపడు. "ప్రజలచే నాడికపడుదును." జై. ౫, ఆ.

**ఆడికోలు.** దే. వి. దూఱు, నింద. "క. కులపెంచిరాడికోల్లకుఁ, దలఁకరుసడివావివరుసదలఁచరుసేతిక, దలకొనరుసత్యమాడరు, కలకంఠులువారినమ్మఁగానెటువచ్చుక." హంస. ౫, ఆ.

**ఆడిపోసికొను.** దే. స. క్రి. దూఱు, నిందించు.

**ఆడు.** దే. అ. క్రి. 1. క్రీడించు; 2. నర్తించు; 3. చలించు; (ఆ మాటవిన్నదిమొదలు నాకుచేయికాలాడలేదు.)—4. మునుఁగు; "సకలతీర్థంబులనునాడి." కాశీ. ౭, ఆ.—5. నాటు; "క. తోడనపయసూతులనో, నాడఁగనేయుటయునతఁడునలిగి." భార. కర్ణ. ౨, ఆ.—6. విహరించు; "సీ. వాహ్యాళిభూమిరేవంతనైపథులట్లు హయరత్నములనెక్కియాడనేర్చు." భీ. ౧, ఆ.—7. సంచరించు. "గీ. అడరికురుసేనపై గ్రద్దలాడఁజొచ్చె." భార. భీష్మ. ౩, ఆ.—స. క్రి. 1. నిందించు; "శ్రీ. సత్కీర్తిసుధాకరందేవసరసులనాడియు సరసులనాడకుండు." కా. ౧, ఆ.—2. వచించు; 3. నడపు; "జూదము నీతో నాడఁగడఁగెదన." భార. అర. ౨, ఆ.—4. నువ్వులులోనగువాని గానుగలో వేసి త్రిప్పు.

**ఆడుకొను.** దే. స. క్రి. దూఱు, నిందించు.

**ఆడువరి.** దే. వి. అలంగము, వప్రము.

**ఆడె.** దే. వి. కడితమునందు ఏకదేశము.

**ఆడెలు.** వై. వి. పక్షివిశేషము, శరారి.

**ఆడేలు.** వై. వి. ఆడెలుయొక్క రూపాంతరము.

**ఆఢకము.** సం. వి. అ. పుం, న. తూము.

**ఆఢకి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కంది; 2. అడవికందిత్రీఁగ; 3. ఒకదినుసుమన్ను; 4. తూము.

**ఆఢకికము.** సం. విశే. (అ. ఈ. అ.) తూమెఁడువిత్తులు విత్తఁదగినది. (నేల.)

**ఆఢ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సంపన్నుఁడు.

**ఆణి.** ఉభ. దే. వి. 1. ముత్యపుగుండ్రఁదనము; 2. మర్మము.—సం. ఇ. పుం, స్త్రీ. 1. ఇరుసుతుదిచీల; 2. అంచు; 3. ఎల్ల.

**ఆణికాఁడు.** దే. విశే. మర్మజ్ఞుఁడు.

**ఆణిపూస.** దే. వి. ముత్యము. "సీ. వేణుజాతములైన యాణిపూసలనెంతు రూడుగపండ్లకునీడుగాఁగ." కాళ. ౧, ఆ.

**ఆణిపోటు.** దే. వి. జీవస్థానమునందు పొడిచినపోటు.

**ఆణియ.** దే. వి. దద్రురోగము, (చూ. ఆణె.)

**ఆణియము.** దే. వి. దేశము, (చూ. ఆణెము.)

**ఆణె** దే. వి. ఆణియయొక్క రూపాంతరము. "సీ. ఆనెయంచనఁగనునాణెయంచనఁగనుదద్దురంచనఁగనుదద్దనంగ, దద్రువువెలయు." ఆం, భా. ద్వి. వ.

**ఆణెము.** దే. వి. ఆణియముయొక్క రూపాంతరము. "సీ. ఆణెమంచనఁగదేశాహ్వయంబు." ఆం, భా. ద్వి. భూ.

**ఆతంకము.** సం. వి. అ. పుం. 1. ఆరాటము; 2. చేమిరి; 3. మద్దెలమ్రోఁత; 4. వెఱపు; 5. వ్యాధి.

**ఆతంచనము.** సం. వి. అ. న. 1. చేమిరి, నిక్షేపము. (అనికొందఱు.) 2. తనుపుట; 3. వడి.

**ఆతఁడు.** దే. స. ప. (అ+ఁడు.) (రూ. అతఁడు.) (ఇక్కడ తవర్ణము ఆగమము. ఇట్లు ఈతఁడు ఏతఁడు వీనికిని.)

**ఆతగాఁడు.** దే. స. ప. (ఆతఁడు+కాఁడు.) ఆతఁడు. (ఇక్కడ స్వార్థమునకాఁడు.)

**ఆతతము.** సం. విణ. (అ. ఆ. అ.) విరివియైనది.

**ఆతతాయి.** సం. విణ. (న్. ఈ. న్.) చంపనుద్యుక్తుఁడైనవాఁడు. (పేరాబుగురు-ఇంట నిప్పిడువాఁడు, విషముపెట్టువాఁడు, కత్తిగొని నఱకువాఁడు, ధనము దోఁచుకొనువాఁడు, నేలనపహరించువాఁడు, ఒకనిభార్యను జెఱపట్టువాఁడు.)

**ఆతపత్రము.** సం. వి. అ. న. 1. గొడుగు; 2. గుడ్డికామంచి*.

**ఆతపము.** సం. వి. అ. పుం. ప్రకాశము, ఎండ.

**ఆతపవారణము.** సం. వి. అ. న. ఆతపత్రము, గొడుగు.

**ఆతరము.** సం. వి. అ. పుం. ఓడకిచ్చెడుకూలి, కేవు.

**ఆతర్పణము.** సం. వి. అ. న. 1. తనివి; 2. మంగళార్థమైన పూఁత.

**ఆతల.** దే. వి. ఆవలిప్రదేశము.

**ఆతాపి.** సం. వి. న్. పుం. 1. చీపరపిట్ట; 2. చెమరుఁగాకి.

**ఆతి.** సం. వి. ఇ. స్త్రీ. పక్షివిశేషము, ఆడేలు.

**ఆతిథేయము.** సం. వి. అ. న. అతిథిసత్కారము. విణ. అతిథికి యోగ్యమైనది.

**ఆతిథ్యము.** సం. వి. అ. న. అతిథిసత్కారము. విణ. అతిథికొఱకైనది.

**ఆతిథ్యుఁడు.** సం. వి. అ. పుం. అతిథి, విందు.

**ఆతురపడు.** మి. అ. క్రి. (ఆతురము+పడు.) బాధపడు.

**ఆతురుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యాధిగ్రస్తుఁడు, తెవులుగొంటు.

**ఆతోద్యము.** సం. వి. అ. న. తతము ఆనద్ధము సుషిరము ఘనము అనెడు వాద్యచతుష్టయము, వాదిత్రము.

**ఆత్తగంధము.** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది (పాఠాంతరము ఆత్తగర్వము.)

**ఆత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. అపహరింపఁబడినది.

**ఆత్మ** సం. వి. న్. పుం. 1. జీవుఁడు; 2. బుద్ధి; 3. బ్రహ్మము; 4. మనస్సు; 5. శరీరము; 6. స్వభావము; 7. ధైర్యము; 8. ప్రయత్నము.

**ఆత్మంభరి.** సం. విణ. ఇ. తన పొట్టపోషించుకొనువాఁడు, కుక్షింభరి.

**ఆత్మగుప్త.** సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి*.

**ఆత్మఘోషము.** సం. వి. అ. పుం. కరటము, కాకి.

**ఆత్మజ.** సం. వి. ఆ. స్త్రీ. పుత్రిక, కూఁతురు.

**ఆత్మజుఁడు.** సం. వి. అ. పుం. పుత్రుఁడు, కొడుకు.

**ఆత్మదర్శము.** సం. వి. అ. పుం. దర్పణము, అద్దము.

**ఆత్మనేపదము.** సం. వి. అ. న. క్రియాపదముయొక్క భేదము.

**ఆత్మభువు.** సం. వి. ఊ. పుం. 1. బ్రహ్మ; 2. మన్మథుఁడు.

**ఆత్మాశి.** సం. వి. న్. పుం. మత్స్యము, చేప.

**ఆత్మీయము.** సం. విణ. (అ. ఆ. అ.) తనది.

**ఆత్రగాఁడు.** దే. విణ. (ఆత్రము+కాఁడు.) త్వరపడువాఁడు.

**ఆత్రము.** దే. వి. ఆతురముయొక్క రూపాంతరము.

**ఆత్రేయి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ముట్టుది; 2. ఒకానొక నది.

**ఆత్రేయుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు. విణ. అత్రివంశమునఁ బుట్టినవాఁడు.

**ఆద.** దే. వి. విచారము. "క. లేదింకంబగయనిపిను, రాదులదెనవాహనములయందునుసంతస్య, క్షాదరులైపగతునునే, పాదమఆచినిత్రవోదురదికఁజీవోదువన్." భార. సౌ. ౧, ఆ. "క. వినియతఁడెయ్యదియునెఱుం, గనిముగ్ధుండువోలెఁబల్కఁగాఁదొడఁగెమనం, బునవింతయాదగల్గిన, ననుమునుబాసగొనఁగారంభేమియొకో." భో. ౪, ఆ.

**ఆదట.** దే. వి. ప్రేమము. "క. ఆదటమునువానిసఖి, సోదరులును పోదరులును నొక్కటియైనన్." సం. "పితృశ్రోత్రియః పునః పితాభ్రాతృమాతృనేకత్రసంస్థితః, పితృవ్యేణాథవాప్రీత్యాసతుసంసృష్ట ఉచ్యతే." విజ్ఞా. వ్య, కాం.

**ఆదటపోవు.** దే. అ. క్రి. (ఆదట+పోవు.) తనియు. "అయ్యనఘుఁడుదానిఁజిత్తమునఁనాదటవోవఁగఁజూచె." భార. ఆది. ౪, ఆ.

**ఆదరణీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆదరింపఁదగినది.

**ఆదరబాదర.** దే. క్రి. విణ. అతిత్వరితముగా.

**ఆదరము.** సం. వి. అ. పుం. 1. పాటింపు; 2. మన్నన.

**ఆదరించు.** సం. స. క్రి. 1. పాటించు; 2. మన్నించు.

**ఆదరువు.** వై. వి. 1. ఆధారము; 2. ఆశ్రయము*.

**ఆదర్శనము.** సం. వి. అ. న. 1. చూపుట; 2. అద్దము.

**ఆదర్శము.** సం. వి. అ. పుం. 1. అద్దము; 2. టీక; 3. ప్రతియైన పుస్తకము.

**ఆదర్శితము.** సం. విణ. (అ. ఆ. అ.) చూపఁబడినది.

**ఆదా.** హిం. వి. లాభము, ఆదాయము.

**ఆదానము.** సం. వి. అ. న. 1. పుచ్చుకొనుట; 2. గుఱ్ఱముయొక్క అలంకారము; 3. రోగకారణము. (చూ. స్కంధము.)

**ఆదాయము.** సం. వి. అ. పుం. 1. లాభము; 2. ధనము; "గీ. ఇవ్విధంబుననాదాయమెల్లఁజెల్ల, నిచ్చలును వెలయాంధ్రకునిచ్చియిచ్చి." శేష. ౪, ఆ.-(ఇది సంస్కృతముగాఁబంచాంగముల యందువాడఁబడుచున్నది. మఱియు నానార్థరత్నమాలయందీయర్థము చెప్పఁబడియున్నదని శబ్దార్థకల్పతరువునందు వ్రాయఁబడియున్నది.)

**ఆది.** ఉభ. దే. వి. గుఱి. సం. వి. ఇ. పుం. మొదలు. "ఆదిశ్రీసతికొప్పునై." భాగ. ౧, స్కం. విణ. మొదటిది. "లోకాదిత్రిలోకపూజ్యుఁడు." భార. సభా. ౨, ఆ.

**ఆదికొను.** దే. అ. క్రి. కన్నువేయు. "వ. వృషభంబునకాదికొను తెబ్బులియుంబోలె." భార. విరా. ౫, ఆ.

**ఆదితాళము.** సం. వి. అ. పుం. తాళభేదము. (ఎనిమిది అక్షరములకాలము.)

**ఆదితేయుఁడు.** సం. వి. అ. పుం. ఆదిత్యుఁడు, వేల్పు.

**ఆదిత్యవారము.** సం. వి. అ. పుం. ఆదివారము. (ఇట్లు భానువారము. మొ.)

**ఆదిత్యుఁడు.** సం. వి. అ. పుం. 1. వేలుపు; 2. సూర్యుఁడు. (ద్వాదశాదిత్యులు. — ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, త్వష్ట, పూషుఁడు, అర్యముఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, విష్ణువు, అంశుమంతుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు.)

**ఆదిత్స.** సం. వి. ఆ. స్త్రీ. గ్రహింపనిచ్ఛ.

**ఆదిమము.** సం. విణ. (అ. ఆ. అ.) మొదటిది.

**ఆదివారము.** సం. వి. అ. పుం. తొలివారము, ఆదిత్యవారము.

**ఆదివెలమలు.** మి. వి. బ. వెలమలలో ఒకతెగవారు.

**ఆదిష్టము.** సం. వి. అ. న. ఎంగిలి. విణ. 1. ఆనతియ్యఁబడినది; 2. ఉపదేశింపఁబడినది; 3. విధ్యుక్తమైనది.

**ఆదీనవము** సం. వి. అ. పుం. క్లేశము, అలసట.

**ఆదుకొను.** దే. అ. క్రి. ఆనికయగు. "ఆదుకొన్నకావరమున." రాఘ. ౪, ఆ. — స. క్రి. ఆదరించు. "క. దాదులు పెనుపఁ గనిటుజగ, దాదులకాదియగుమగువ యనిశముసిరులం, బాదుకొని నృపతితిలకం, బాదుకరాఁబెరుగుచుండెనంతఁగడంకన్." దశ. ౧, ఆ.

**ఆదుర్దా.** అన్యదే. వి. భయము, తొందర.

**ఆదృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆదరింపఁబడినది; 2. మన్నింపఁబడినది.

**ఆదృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఆదరము, పాటింపు.

**ఆదేయము.** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది.

**ఆదేశము.** సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. ఉపదేశము; 3. (వ్యాకరణమున) ఒకటినిబోఁగొట్టివచ్చు మఱియొకవర్ణములో నగునది.

**ఆదేశించు.** సం. స. క్రి. 1. ఆజ్ఞాపించు; 2. ఉపదేశించు.

**ఆదేష్ట.** సం. వి. ఋ. పుం. 1. ఆజ్ఞాపించువాఁడు; 2. అధ్వర తంత్రమునుపదేశించువాఁడు.

**ఆద్యమాషకము.** సం. వి. అ. పుం. అయిదు గురిగింజలయెత్తు.

**ఆద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రథమము, మొదటిది.

**ఆద్యూనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఒకరిచేతికూటికి కని పెట్టుకొనియుండువాఁడు, ఔదరికుఁడు.

**ఆధర్వణము.** సం. వి. అ. న. అథర్వములసమూహము. (అథర్వుఁడను ఋషిచేఁ జెప్పఁబడిన వేదము అభేదోపచారమువలన అథర్వమనఁబడును.)

**ఆధానము.** సం. వి. అ. న. 1. ఉంచుట; 2. కప్పుట; 3. ధరించుట.

**ఆధారకుండము.** సం. వి. అ. న. కుండలులోనగునవి యుంచెడు కుదురు.

**ఆధారము.** సం. వి. అ. పుం. 1. ఆదరువు; 2. చెఱువు; 3. పాదు.

**ఆధారిక.** సం. వి. ఆ. స్త్రీ. జెట్టి.

**ఆధి.** సం. వి. ఇ. పుం. 1. మనోవ్యథ; 2. కుదువ; 3. ప్రత్యాశ; 4. వ్యసనము; 5. ఉనికిపట్టు.

**ఆధిక్యము.** సం. వి. అ. న. అధికత్వము, గొప్పతనము.

**ఆధిదైవికము.** సం. విణ. (అ. ఈ. అ.) దైవమువలనఁ గలిగినది.

**ఆధిపత్యము.** సం. వి. అ. న. అధిపతిత్వము, దొరతనము.

**ఆధిభౌతికము.** సం. విణ. (అ. ఈ. అ.) భూతమువలనఁ గలిగినది. (భూతము=పృథివ్యాది.)

**ఆధివేదనికము.** సం. విణ. (అ. ఆ. అ.) అధివేదన నిమిత్తమైనది (స్త్రీధనము.)

**ఆధీన్యము.** సం. వి. అ. న. అధీనత్వము, అగ్గపాటు.

**ఆధునికము.** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఇప్పటిది; 2. క్రొత్తది

**ఆధూతము.** సం. విణ. (అ. ఆ. అ.) కంపితము, కదలింపఁబడినది.

**ఆధేయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉంచఁదగినది.

**ఆధోరణుఁడు.** సం. వి. అ. పుం. హస్తిపకుఁడు, మావటివాఁడు.

**ఆధ్యాత్మికము.** సం. విణ. (అ. ఈ. అ.) ఆత్మవలనఁ గలిగినది

**ఆధ్యానము.** సం. వి. అ. న. స్మృతి, తలఁపు.

**ఆన.** వై. వి. 1. ఆనతి, ఆజ్ఞ; 2. అన్యదే. క్రీస్తుశక సూచన.

**ఆనంద.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**ఆనందథువు.** సం. వి. ఉ. పుం. ఆనందము, సంతసము.

**ఆనందనము.** సం. వి. అ. న. చుట్టములుమొదలగువారి నాలింగనాదులచేత సంతోషపఱచుట.

**ఆనందము.** సం. వి. అ. పుం. సంతోషము, సంతసము.

**ఆనందించు.** సం. అ. క్రి. సంతోషించు, సంతసించు.

**ఆనందితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషమునొందినది; 2. సంతోషపెట్టఁబడినది.

**ఆనకట్ట.** అర. వి. ఏటియడ్డకట్ట.

**ఆనకదుందుభి.** సం. వి. ఇ. పుం. కృష్ణునితండ్రి, వసుదేవుఁడు

**ఆనకము.** సం. వి. అ. పుం. 1. తప్పెట; 2. భేరి; 3. మద్దెల; 4. ఉఱిమెడిమబ్బు.

**ఆనతము.** సం. విణ. (అ. ఆ. అ.) అవనతము.

**ఆనతి.** ఉభ. వై. వి. ఆజ్ఞ. సం. ఇ. స్త్రీ. మ్రొక్కు.

**ఆనతిచ్చు.** ద్వి. స. క్రి. (ఆనతి+ఇచ్చు.) సెలవిచ్చు. "వంశమెల్లఁబూ తమ్మగునీదుచర్యనని ధాతపడంతియెయానతిచ్చె." కళా. ౪, ఆ. (రూ. ఆనతియిచ్చు. "మోక్షముతెరువానతియీవే." భార. శాం. ౪, ఆ.)

**ఆనద్ధము.** సం. వి. అ. న. మద్దెలలోనగు చర్మవాద్యము. విణ. కట్టఁబడినది.

**ఆననము.** సం. వి. అ. న. 1. మొగము; 2. నోరు.

**ఆనమితము.** సం. విణ. (అ. ఆ. అ.) వంపఁబడినది.

**ఆనము.** సం. వి. అ. పుం. ఉచ్ఛ్వాసము.

**ఆనయము.** సం. వి. అ. పుం. 1. పొందించుట; 2. తెచ్చుట.

**ఆనయించు.** సం. స. క్రి. తెచ్చు.

**ఆనర్తము.** సం. వి. అ. పుం. 1. నాటకశాల; 2. నీరు; 3. పోరు; 4. దేశవిశేషము. (ఇది పశ్చిమసముద్రతీరమున ద్వారకకు సమీపమునన్నది.)

**ఆనవాలు.** దే. వి. 1. అడియాలము; 2. (ఆన+పాలు.) ఇవ్వరఁగాఁచినపాలు, కూర్చిక. "సీ. పాలఁబోలే వయసునీపాలు సేయుటకిదెయానవాలన్నట్టులానవాలు." శశాం. ౩, ఆ.

**ఆనాయము.** సం. వి. అ. పుం. జాలము, చేఁపవల.

**ఆనాయ్యము.** సం. వి. అ. పుం. గార్హపత్యమునుండియెత్తి దక్షిణాగ్నియందుంచఁబడిన అగ్ని.

**ఆనాలు.** దే. వి. ఆనవాలుయొక్కరూపాంతరము. "మ. కలమాన్నంబుఘృతంబుఁబాయసము శాకవ్రాతముల్ పిండివంటలుఁబాల్ తేనియ జున్ను వెన్నయిడి యానాలుక్కరల్ చక్కెరల్, ఫలముల్ పానకముల్ రసాయనము లంబల్లూరుఁ బిండ్లూరుఁగా, యలుబజ్జుల్ దధిపిండఖండములు సందావిర్భవించెన్ వెసన్." రాజశేఖరచరిత్రము.

**ఆనాహము.** సం. వి. అ. పుం. 1. నిడుపు; 2. మలమూత్రబంధము.

**ఆనిక.** దే. వి. 1. ఉపాశ్రయము; 2. దార్ఢ్యము.

**ఆనియ.** దే. వి. అణియ, (చూ. ఆనె.)

**ఆనీతము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొందింపఁబడినది; 2. తేఁబడినది.

**ఆను.** దే. అ. క్రి. 1. ఆనికయగు; "ఇంపుసొంపానఁగనానియాని." భార. ఆర. ౬, ఆ.—2. ఒఱగు.—స. క్రి. 1. అదుము; "మోఁకాళ్లువక్షస్థలంబుననాని." కళా. 3, ఆ.—2. అణఁచు; "ఆనఁగరానికోపమున." కా. ౨, ఆ.—3. ధరించు; "మోహప్రకటనమానితన్నిచ్చిన." (హరిశ్చంద్రకథయందుమోహప్రకటనము అని అనియు నలకథయందుమోహప్రకటనమానితన్ననిచ్చిన అనియు భేదము.) హన. ౨, ఆ.—4. తిను; "ఉ. తేనెలుగ్రోలిక్రోలి కడుఁదియ్యని కమ్మనిపండు లింపుసొంపానఁగనానియాని." భార. ఆర. ౬, ఆ.—5. త్రాగు. "భాషణామృతంబానఁగఁజేసెనాచెవుల." భార. అను. ౧, ఆ.

**ఆనుకట్ట.** దే. వి. ఊఁతకోల.

**ఆనుకూల్యము.** సం. వి. అ. న. అనుకూలభావము, ఒద్దిక.

**ఆనుగము.** దే. వి. సొర, అలాబువు.

**ఆనుగు.** దే. వి. ఆనుగముయొక్కరూపాంతరము.

**ఆనుగుణ్యము.** సం. వి. అ. న. అనుగుణభావము, ఇమ్ము.

**ఆనుడుబిల్ల.** దే. వి. ఒఱగుదిండు, గభోళి.

**ఆనుపూర్వి.** సం. వి. ఇ. న. ఈ. స్త్రీ. అనుక్రమము, సొరిది.

**ఆనుపూర్వ్యము.** సం. వి. అ. న.——పై.——

**ఆనువు.** దే. వి. ఆనిక. "వ. జానువునానువుననదిమియుంగదిమియు." ఉ, హరి. ౬, ఆ.

**ఆనృశంస్యము.** సం. వి. అ. న. అక్రూరభావము.

**ఆనె.** దే. వి. ఆనియయొక్కరూపాంతరము. (చూ. ఆణె.)

**ఆనేత.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) 1. పొందించువాఁడు; 2. తెచ్చువాఁడు.

**ఆనేయము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొందింపఁదగినది; 2. తేఁదగినది.

**ఆన్వీక్షకి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వైశేషికాదితర్కవిద్య; 2. రాజవిద్యలునాలుగింటిలో నొకటి. (చూ. విద్య.)

**ఆపక్వము.** సం. వి. అ. న. అభ్యూషము, గుగ్గిళ్లు.

**ఆపగ.** సం. వి. ఆ. స్త్రీ. నది, ఏఱు.

**ఆపణము.** సం. వి. అ. పుం. నిషద్య, అంగడి.

**ఆపణికుఁడు.** సం. వి. అ. పుం. వణిజుఁడు, బేహారి.

**ఆపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఇడుమ; 2. పొందించుట.

**ఆపద.** సం. వి. ద్. స్త్రీ. విపత్తు, ఇడుమ.

**ఆపన్నము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఇడుమగలది; 2. పొందఁబడినది.

**ఆపన్నసత్త్వ.** సం. వి. ఆ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

**ఆపమిత్యకము.** సం. వి. అ. న. ఒకవస్తువునిచ్చి మాఱుగా పుచ్చుకొన్న మఱియొకవస్తువు.

**ఆపము.** అర. వి. అప్పము.

**ఆపసోపాలుపడు.** ద్వి. అ. క్రి. ఉస్సురస్సురను. (పీఁడు అలసి ఆపసోపాలుపడుచున్నాఁడు. మొ.)

**ఆపాతము.** సం. వి. అ. పుం. 1. పడుట; 2. తేలిక; 3. అప్పుడు.

**ఆపాదకము.** సం. విశ. (అ. ఆ. అ.) కలిగించునది.

**ఆపాదనము.** సం. వి. అ. న. ఉత్పాదనము, కలిగించుట.

**ఆపాదితము.** సం. విశ. (అ. ఆ. అ.) కలిగింపఁబడినది.

**ఆపాదిల్లు.** సం. అ. క్రి. కలుగు. (ప్రే. ఆపాదించు.)

**ఆపానము.** సం. వి. అ. న. అనేకులుకూడి కల్లుత్రాగెడిచోటు.

**ఆపితము.** సం. విశ. (అ. ఆ. అ.) పొందఁబడినది.

**ఆపీడము.** సం. వి. అ. పుం. 1. నలఁపుట; 2. సిగనిడినపూలదండ; 3. గోడబయటికివచ్చినగృహదారువిశేషము.

**ఆపీడితము.** సం. విశ. (అ. ఆ. అ.) నలఁపఁబడినది.

**ఆపీతము.** సం. విశ. (అ. ఆ. అ.) త్రాగఁబడినది.

**ఆపీనము.** సం. వి. అ. న. పొదుఁగు. విశ. మిక్కిలి బలిసినది.

**ఆపుచేయుట.** దే. క్రి. నిలుపుదలచేయుట.

**ఆపూపికము.** సం. వి. అ. న. అపూపముల సమూహము.

**ఆపూపికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) పిండివంటవాఁడు.

**ఆపూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలినింపు.

**ఆపృచ్ఛనము.** సం. వి. అ. న. చుట్టములులోనగువారిని ఆలింగనాదులచేత సంతోషపఱచుట. యాత్రాదులయందు బంధువులులోనగువారియనుజ్ఞపడయుట. (అనికొందఱు.)

**ఆపె.** ద్వి. స. ఏ. (ఆ + అప.) ఆమె. (చూ. ఆకె.)

**ఆపొసనము.** వై. వి. ఆపోశనము. "చ. అసియఱచేతనాతఁడటులాపొసనంబును బట్టుకొన్నన, య్యసుకటెచేటలంజెరిగియింపగు బియ్యము చేసివేడ్కతో, నెసరులు వోసివండి వెరవేర్పడనయ్యశనంబుభూదివా, కసులకుఁబెట్టెఁగన్దనిసిగ్రక్కునఁ గలితీఱునట్లుగన్." భో. ౬, ఆ.

**ఆపోక.** దే. వి. అపోవుట, తనివి, తృప్తి.

**ఆపోవు.** దే. అ. క్రి. (అదట + పోవు.) తనియు, తృప్తిపడు.

**ఆపోశనము.** సం. వి. అ. న. భోజనమప్పుడు పుడిసిట జలము పోసికొని మంత్రపూర్వకముగా పుచ్చుకొనుట.

**ఆపోశనించు.** సం. స. క్రి. ఆపోశనముచేయు.

**ఆప్తము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. ఆప్తమైనది; 3. సత్యమైనది.

**ఆప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కలిమి; 2. పొందు.

**ఆప్యము.** సం. విశ. (అ. ఆ. అ.) జలమయము.

**ఆప్యాయము.** సం. వి. అ. పుం. తృప్తి, తనివి. (రూ. ఆప్యాయనము. అ. న.)

**ఆప్యాయిత.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) తనియువాఁడు.

**ఆప్యాయితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) తనిసినవాఁడు.

**ఆప్రపదీనము.** సం. విశ. (అ. ఆ. అ.) మీఁగాళ్లదాఁక జాఱుగలది. (అంగి, ఆఁడుదానిపావడ. మొ.)

**ఆప్లవము.** సం. వి. అ. పుం. స్నానము, మునుక.

**ఆప్లావము.** సం. వి. అ. పుం.——వై.——

**ఆప్లుతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. వేదముఁజదివినపిమ్మట ఆశ్రమాంతరమునుపొందనిస్నాతకుఁడు, 2. మునిఁగినవాఁడు.

**ఆఫీను.** ఆం. వి. కచ్చేరి.

**ఆబ.** దే. వి. కంటిపాప. (వానియాబలఁగెను.)

**ఆబంధము.** సం. వి. అ. పుం. 1. గట్టికట్టు; 2. పలుపు; 3. ప్రేమము; 4. ఆభరణము.

**ఆబాధ.** సం. వి. ఆ. స్త్రీ. దుఃఖము, నొగులు.

**ఆబిడ.** దే. స. (ఆ+బిడ్డ.) ఆమె.

**ఆబూతి.** వై. వి. పెనుతిండి. (వీనికాబూతి యెవరువేయుదురు.)

**ఆబూతికాఁడు.** వై. విశ. తిండిపోతు, భక్షకుఁడు.

**ఆబ్దికము.** సం. వి. అ. న. మృతిఁబొందినవారికి సంవత్సరాంతమున చేసెడికర్మము, పేఁడుకి.

**ఆభ.** సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలిదీప్తి, ప్రభ.

**ఆభరణము.** సం. వి. అ. న. భూషణము, తొడవు.

**ఆభాషణము.** సం. వి. అ. న. ఆలాపము, నిండుమాట.

**ఆభాసము.** సం. వి. అ. పుం. 1. ప్రకాశము; 2. ప్రతిఫలనము.

**ఆభిజాత్యము.** సం. వి. అ. న. అభిజాతభావము.

**ఆభిముఖ్యము.** సం. వి. అ. న. అభిముఖభావము.

**ఆభీరము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**ఆభీరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లది; 2. గొల్లవానిపెండ్లాము.

**ఆభీరుఁడు.** సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. చెంబడివాఁడు.

**ఆభీలము.** సం. వి. అ. న. బాధ. విశ. భయంకరము.

**ఆభుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. పెనుతిండి, ఆబూతి.

**ఆభోగము.** సం. వి. అ. పుం. 1. పరిపూర్ణత; 2. ప్రయత్నము; 3. వరుణునిగొడుగు.

**ఆమండము.** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

**ఆమంత్రణము.** సం. వి. అ. న. 1. పిలుపు; 2. చుట్టములలోనగువారిని ఆలింగనాదులచే సంతోషపఱచుట. యాత్రాదులయందు బంధువులులోనగువారి యనుజ్ఞపడయుట, వీడుకోలు. (అనికొందఱు.)

**ఆమంత్రించు.** సం. స. క్రి. ఆమతించు, పిలుచు.

**ఆమంత్రితము.** సం. విశ. (అ. ఆ. అ.) పిలువఁబడినది.

**ఆమడ.** దే. వి. నాలుగుకోసులదూరము, యోజనము.

**ఆమతించు.** వై. స. క్రి. 1. పిలుచు. "రాజులఁబిల్వఁబంపుము ధరాసురసంఘము నామతింపుము." భార. ఆర. ౬, ఆ.—2. పూజించు*. (చూ. జంకపొక్కిలి.)

**ఆమతింపు.** వై. వి. ఆమతించుట. (చూ. అరగింపు.)

**ఆమతిల్లు.** వై. అ. క్రి. పుట్టు*. "ఇంపామతిలంగనిల్వ." య. ౧, ఆ.

**ఆమనస్యము.** సం. వి. అ. న. ప్రసవవేదన, బిడ్డకుట్టు.

**ఆమని.** దే. వి. 1. వసంతఋతువు; 2. ఫలసమృద్ధి; 3. సమృద్ధి.

**ఆమము.** సం. వి. అ. పుం. 1. రోగము; 2. రోగవిశేషము. విశ. అపక్వము.

**ఆమయము.** సం. వి. అ. పుం. రోగము, తెవులు.

**ఆమయావి.** సం. విశ. (న్. ఈ. న్.) ఆతురుఁడు, తెవులుగొంటు.

**ఆమలకము.** సం. వి. అ. న. ఉసిరికకాయ. పుం, న. ఉసిరిక†.

**ఆమలకి.** సం. వి. ఈ. స్త్రీ. ఉసిరిక†.

**ఆమవడ.** వై. వి. మజ్జిగపులుసులోనగువానియందు నానవేసినవడ.

**ఆమిక.** వై. వి. ఆము, మదము*.

**ఆమిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. పాలవిఱుగుడు, కూతు.

**ఆమిషము.** సం. వి. అ. పుం, న. 1. మాంసము; 2. లంచము; 3. లాభము; 4. భోగము; 5. భోగింపఁదగినవస్తువు.

**ఆమిషి.** సం. వి. ఈ. స్త్రీ. జటామాంసి†.

**ఆము.** వై. వి. ఆమిక, మదము*.

**ఆముకవియు.** దే. అ. క్రి. (అలము+కవియు.) మిక్కిలి క్రమ్ముకొను. (చూ. పెంటికొబ్బమునర్థము రెండవ యుదాహరణము.)

**ఆముకొను.** దే. అ. క్రి. (అలము+కొను.) పైకొను. "ఆముకొన్న ప్రేమచే ననురుసురనఁచు." క్షేత్రయ.

**ఆముక్తము.** సం. వి. (అ. ఆ. అ.) కట్టఁబడినది. (వస్త్రము.) తొడుగఁబడినది. (కవచము.) (అనికొందఱు.)

**ఆముత్రికము.** సం. విశ. (అ. ఈ. అ.) పరలోకసంబంధమైనది.

**ఆముదపుఁజెట్టు.** రూ. వి. ఏరండము†.

**ఆముదము.** వై. వి. ఏరండతైలము*. బ. ఏరండబీజములు. (ఈ యర్థమందు తఱుచుగా ఆముదాలు అనియె వాడఁబడుచున్నది.)

**ఆముష్మికము.** సం. విశ. (అ. ఈ. అ.) పరలోకసంబంధమైనది.

**ఆముష్యాయణుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రసిద్ధకులుఁడైన తండ్రివలనఁబుట్టినవాఁడు.

**ఆమూలము.** సం. క్రి. విశ. అవ్య. కడవెళ్ల, మూలముట్టుఁగ.

**ఆమె.** రూ. స. వి. (ఆ+అమ.) ఆపూజ్యురాలు. (చూ. అది.)

**ఆమెత.** వై. వి. విందు*. "ఎ, గీ. మేటిఱుమ్మెదగములకామెతలు పెట్టు." రసి. ౪, ఆ.

**ఆమోదము.** సం. వి. అ. పుం. 1. దూరముగా వ్యాపించెడు పరిమళము; 2. వాసన; 3. సంతోషము.

**ఆమోదించు.** సం. అ. క్రి. సంతోషించు, సంతసించు.

**ఆమ్నాయము.** సం. వి. అ. పుం. 1. వేదము; 2. ఉపదేశము; 3. సంప్రదాయము.

**ఆమ్రము.** సం. వి. అ. పుం. చూతము, మామిడిచెట్టు.

**ఆమ్రాతకము.** సం. వి. అ. పుం. అంబాళముచెట్టు.

**ఆమ్రేడించు.** సం. అ. క్రి. ద్విరుక్తమగు. "వ. సంయమీశ్వరతిలకంబులధికస్వరస్వరంబులనామ్రేడించువేదమంత్రపఠనంబులవలన." పా. ౫, ఆ.

**ఆమ్రేడితము.** సం. వి. అ. న. 1. రెండుమూడుమాఱులు చెప్పఁబడినమాట; 2. (వ్యాకరణమందు) ద్విరుక్తముయొక్క పరరూపము.

**ఆమ్లము.** సం. వి. అ. పుం. ఒకరసము, పులుసు.

**ఆమ్లలోణిక.** సం. వి. ఆ. స్త్రీ. పులిచింతచెట్టు.

**ఆమ్లవేతసము.** సం. వి. అ. పుం. పుల్లప్రబ్బచెట్టు.

**ఆమ్లిక.** సం. వి. ఆ. స్త్రీ. చింతచెట్టు.

**ఆయకె.** ద్వి. స. (ఆ+అక.) ఆకె. "క. ఆనారదుఁ డట్లయగు దుఃఖమాయకతోఁ." కళా. ౧, ఆ.

**ఆయకట్టు.** మి. గ్రా. వి. (ఆయము+కట్టు.) ధనము వచ్చుబడియొక్క నిర్ణయము.

**ఆయకము.** దే. వి. కుదువ, తాకట్టు, ఆధి.

**ఆయకాఁడు.** మి. గ్రా. వి. (ఆయము+కాఁడు.) కరణములోనైన ఊరియుద్యోగస్థుఁడు.

**ఆయతనము.** సం. వి. అ. న. 1. ఇల్లు; 2. గుడి.

**ఆయతము.** సం. విశే. (అ. ఆ. అ.) దీర్ఘము, నిడుపైనది.

**ఆయతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నిడుపు; 2. ప్రభావము; 3. రాఁగలకాలము; 4. వచ్చుబడి.

**ఆయతికాఁడు.** మి. విశే. ధనార్జనముచేయువాఁడు. "క. ఆయతికాఁడు వలయునర నాయకునకు." భార. శాం. ౨, ఆ.

**ఆయత్తము.** సం. విశే. (అ. ఆ. అ.) అధీనము, అగ్గము.

**ఆయత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. లోఁకువ; 2. ఎల్ల; 3. చెలిమి; 4. దినము.

**ఆయది.** దే. స. (ఆ+అది.) అది.

**ఆయన.** దే. స. (ఆ+అన.) అతఁడు.

**ఆయప.** ద్వి. స. (ఆ+అప.) ఆపె.

**ఆయపఱచు.** దే. ప్రే. సాగుబడిచేయు.

**ఆయమ.** ద్వి. స. (ఆ+అమ.) ఆమె.

**ఆయము.** ఉభ. వై. వి. జీవస్థానము, మర్మము.—సం. అ. పుం. వచ్చుబడి, పన్ను.

**ఆయలె.** దే. అవ్య. (ఆ+ఆ+లెమ్ము.) అనాదరమునుతెలిపెడిని. "చ. అలరెఁబ్రియాళువోస్త ప్రియమాటవసంతముఁబాడనప్పుడ, వ్వలఁడిసపత్ని భక్తికినివేల్పులుమెత్తురుగానరాగమఁ, ఛల మునఁ దన్నుఁబాడఁగవసంతుఁడుతోదయసేసెఁగాకయా, యలెనిజశక్తినాయనుచునావసకుంగోదవెట్టెనీసునఁ." ఆము. ౫, ఆ.

**ఆయల్లకము.** సం. వి. అ. న. విరహము, ఎడఁబాటు.

**ఆయవారము.** వై. వి. ధాన్యయాచన, యాయావరము.

**ఆయసము.** సం. వి. అ. న. ఇనుము. విశే. ఇనుపది.

**ఆయస్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడ్డది; 2. కోపము నొందినది; 3. త్రోయఁబడ్డది; 4. దుఃఖమునొందినది; 5. వాఁడి చేయఁబడినది.

**ఆయా.** హిం. వి. సేవకురాలు.

**ఆయామము.** సం. వి. అ. పుం. దైర్ఘ్యము, నిడుపు.

**ఆయాసపడు.** మి. అ. క్రి. (ఆయాసము+పడు.) శ్రమపడు.

**ఆయాసపాటు.** మి. వి. ఆయాసపడుట.

**ఆయాసపెట్టు.** మి. స. క్రి. (ఆయాసము+పెట్టు.) శ్రమపఱచు.

**ఆయాసము.** సం. వి. అ. పుం. 1. శ్రమము; 2. ఉత్సాహము.

**ఆయిటి.** దే. వి. బూరుగుచెట్టు. "గీ. ఊఁకనీరుచెలఁదినేఁతమూఁకటాయిటి, దూదియొండపసుపు లొత్తెయక్క, రంబుమేనుదీనిరపెఁబుణ్యమష్టుట, కప్పురంబువెట్టియుప్పుగొనుట." ఆము. ౬, ౬.

**ఆయితపడు.** ద్వి. అ. క్రి. (ఆయితము+పడు.) సిద్ధమగు.

**ఆయితపాటు.** ద్వి. వి. ఆయితపడుట, సిద్ధమగుట.

**ఆయితపెట్టు.** దే. స. క్రి. (ఆయితము+పెట్టు.) సిద్ధముచేయు. "సంప్రేము నాయితపెట్టి." విజ. ౨, ఆ.

**ఆయితము.** దే. విశే. సిద్ధము. "గీ. వికచహృదయుఁడై తలచీర యాయితముచేసి." భార. విరా. ౨, ఆ.

**ఆయిత్తపడు.** ద్వి. అ. క్రి. (ఆయిత్తము+పడు.) ఆయితపడు.

**ఆయిత్తపాటు.** ద్వి. వి. అయిత్తపడుట. "ఎ, గీ. సేవకులకు, విష్ణుసారూప్యసౌభాగ్యవిలసనంబు, లెప్పుడపు డెన్నఁజింపనాయిత్తపాటు, వెలయనున్నది." పర. ౨, ఆ.

**ఆయిత్తము.** దే. విశే. ఆయితము, సిద్ధము.

**ఆయుధము.** సం. వి. ధ్. స్త్రీ. అ. న. శస్త్రము, పోటుముట్టు.

**ఆయుధికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఆయుధముచేత బ్రదుకువాఁడు, శస్త్రాజీవుఁడు.

**ఆయుధీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

**ఆయుర్వేదము.** సం. వి. అ. పుం. వైద్యశాస్త్రము.

**ఆయువు.** సం. వి. స్. న. జీవితకాలము, ఉగము, (రూ. ఆయుస్సు.)

**ఆయుష్కరము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆయుస్సును వృద్ధిచేయునది.

**ఆయుష్కర్మము.** సం. వి. న్. న. క్షౌరము.

**ఆయుష్మంతము.** సం. వి. త్. పుం. ఒక గ్రహయోగము. విశే. చిరకాలము బ్రదుకునది.

**ఆయుష్యము.** సం. వి. అ. న. ఆయువు. విశే. ఆయువుగలది.

**ఆయోగము.** సం. వి. అ. పుం. 1. గంధమాల్యముల కానుక; 2. తెలివి; 3. వ్యాపారము.

**ఆయోధనము.** సం. వి. అ. స. 1. యుద్ధము; 2. వధము.

**ఆర.** ఉభ. దే. అవ. సంబోధనమునందువచ్చెడి ఆగమము.—సం. వి. ఆ. స్త్రీ. మాదిగవానిసూది, ఆరె.

**ఆరంగపువక్క.** దే. వి. మేలగు ఒకవిధమయినవక్క.

**ఆరంజ్యోతి.** వై. వి. అరుంధతి. "క. చీరచెఱంగులు ముడిచియుడి, కూరిమిచిటికెనలువట్టికొనఁగూరిచితా, రారంజ్యోతినిగను నిం, పారఁగమ్రొక్కించిరప్పుడాలికఁ జిమగనిఁ." నీలా. 3, ఆ.

**ఆరంభము.** సం. వి. అ. పుం. 1. ప్రయత్నము; 2. గర్వము; 3. త్వర; 4. వధము.

**ఆరంభించు.** సం. అ. క్రి. యత్నించు, కడఁగు.

**ఆరకాటి.** దే. వి. ఓడనడపువాఁడు, నావికుఁడు.

**ఆరకూటము.** సం. వి. అ. పుం, న. ఇత్తడి.

**ఆరక్షము.** సం. వి. అ. పుం. ఏనుఁగుకుంభముల క్రిందిచోటు. కుంభములసంధి. (అనికొందఱు.)

**ఆరక్షుఁడు.** సం. వి. అ. పుం. తలారివాఁడు.

**ఆరగించు.** వై. స. క్రి. 1. భుజించు; 2. త్రాగు. "సీ. ఎవ్వరు జలదాశలిలమీఁదనాఘనుల్ క్షీరపూరములారగింతురచట." శేష. 3, ఆ.

**ఆరగింపు.** వై. వి. ఆహారము. "గీ. ఇతఁడుపెక్కేండ్లఁబట్టియో యిందువదన, వైష్ణవసహస్రముసకుసస్వహముసార, గింపు సేయించి కానిభుజింపనొల్లఁ, డాత్మనతియునుదానునేమసినుతింతు." పర. ర, ఆ. (ఇంపవ్వంతము ప్రాచీనకవిసమ్మతముకాదు.)

**ఆరగ్వధము.** సం. వి. అ. పుం. తేలకీ, (రూ. ఆర్గ్వధము.)

**ఆరఘట్టము.** సం. వి. అ. పుం. నూతినుండి నీళ్లు వెలుపలికిఁ దెచ్చుటకేర్పఱచిన యంత్రవిశేషము, ఏతము.

**ఆరజము.** సం. వి. అ. పుం. వాద్యవిశేషము. "చ. కొలఁదికి మీఱఁగానమరుగోముఖడిండిమ మడ్డుశంఖకా, హళముఠలీమృదంగపణవానకదుందుభిఢక్కకాంస్యమ, ర్దళముర జారజాదివివిధ ధ్వనులేపునభూనభోంతరం, బులఁజెలఁగఁ." భాగ. ౧౦, స్కం. ఉ. (ఈ పదప్రయోగమపూర్వము. ఇంకను విచారింపఁదగినది.)

**ఆరజేము.** దే. వి. 1. ఇంపు; "ఎ, గీ. పుణ్యచిహ్నంబులపఘనంబునఘటింప, సిగ్గువడుగానికరనఖశిఖరలసిత, జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు, నారజముమీఱియాదుర్వహారహారి." పాండు. 3, ఆ. — 2. కలధ్వని. "ఎ, గీ. పావురములారజంబులువలుకుచోట." స్వా. 3, ఆ. — విశ. 1. కలము; "రగడ. ఇంతిపావురపురొదయేలవినెదారజము." స్వా. 3, ఆ.—2. మనోజ్ఞము. "సీ. తైకనడల్చియారజపుఁబైఁట ఘటించి యదివేలో యిదివేలోయనుచునడుగు." శశాం. ౨, ఆ.

**ఆరటపడు.** ద్వ. అ. క్రి. (ఆరటము+పడు.) వందు, పరితపించు.

**ఆరటపాటు.** ద్వ. వి. ఆరటపడుట.

**ఆరటపెట్టు.** దే. స. క్రి. (ఆరటము+పెట్టు.) పరితపింపఁజేయు.

**ఆరటము.** దే. వి. వంత, పరితాపము. "క. పటునఖరశైత్యమునసా, రటముడిపిసురారినేలురసికున్పసింపలుఁ." పాండు. ౫, ఆ.

**ఆరటించు.** దే. అ. క్రి. ఆరటపడు, పరితపించు. "అవద్రాగిన వానికరణినారటించుచు." సా. 3, ఆ.

**ఆరట్టము.** సం. వి. అ. పుం. హిందూదేశముయొక్క పశ్చిమోత్తరమునసుండు దేశవిశేషము.

**ఆరడము.** దే. వి. పూనిక, ఉత్సాహము. "శ. వెలివాఱునుగాలురులును, వలలుఁదెరలుదీవములునువడిందీరినకు, క్కలునారె గోలలునునుం, డలక్రోవులువేఁటకారడంబులు పెనుపఁ." ఉ, హరి. ర, ఆ.

**ఆరతి.** ఉభ. వై. వి. హారతి. సం. వి. ఇ. స్త్రీ. విరతి, ఉడుకువ.

**ఆరనాళకము.** సం. వి. అ. న. పులియఁబెట్టిన కడుగునీళ్లు, కలి.

**ఆరబము.** వై. వి. సైరు*. "ఆకీడునఁ వానల్ కల్లకమానెనారబము లెండంజొచ్చె." వి, పు. ౨, ఆ.

**ఆరబ్ధము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆరంభింపఁబడినది.

**ఆరభటము.** సం. వి. అ. పుం. మ్రోఁత.

**ఆరభటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక కావ్యవృత్తి; 2. ప్రౌఢిమ; 3. మ్రోఁత.

**ఆరభి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకరాగము.

**ఆరయు.** దే. స. క్రి. అరయుయొక్క రూపాంతరము.

**ఆరవము.** సం. వి. అ. పుం. నినదము, మ్రోఁత.

**ఆరాటము.** దే. వి. ఆరటము, పరితాపము. "ఆరాటముం బోరాటంబుఘనంబులైన." కాశ. ర, ఆ.

**ఆరాటించు.** దే. అ. క్రి. పరితపించు. "బాష్పపూరములోఁ గ్రుమ్మడికన్నులం దొరఁగనారాటించుచుఁ." వి, పు. ౧, ఆ.

**ఆరాత్రికము.** సం. వి. అ. న. నీరాజనము, ఆరతి.

**ఆరాధకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఆరాధించువాఁడు.

**ఆరాధనము.** సం. వి. అ. న. 1. ఆరాధించుట; 2. ప్రాప్తి; 3. వంట.

**ఆరాధనీయము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆరాధింపఁదగినది.

**ఆరాధించు.** సం. స. క్రి. సంతోషపఱచు.

**ఆరాధితము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆరాధింపఁబడినది.

**ఆరాధ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆరాధింపఁదగినది.

**ఆరామము.** సం. వి. అ. పుం. ఉపవనము, తోఁట. (గృహారామము నిష్కుటము.)

**ఆరాముఖము.** సం. వి. అ. న. బాణవిశేషము, ఆరెగోల.

**ఆరాళికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) వంటవాఁడు, బానసీఁడు.

**ఆరావము.** సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

**ఆరిందా.** హిం. వి. మూటలుమోయువాఁడు, అడితిదారుఁడు.

**ఆరివేరపుఁదపసి.** వై. వి. (ఆరివేరము+తపసి.) నారదుఁడు. "ఎ, గీ. దేహకాంతు లకాలచంద్రికలనీన, జడలుమోషద్రుపల్లవ శంకసేయ, గగనముననుండివచ్చెనాకస్మికముగ, నారివేరపుఁదపసిద్దై త్యారికడకు." పా. ౧, ఆ.

**ఆరివేరము.** వై. వి. 1. కలహము; 2. ద్వేషము; (చూ. ఆరేవ్వరము.) 3. కలఁత*. "ఎ, గీ. తల్లియస్థులకోకమూట, పాపకర్ముండుచెంచర్లభారమనుచు, వంచనాపాటవంబునఁగొంచుఁబోయి, యారివేరంబుచేసినకారణమున." కాశీ. ౫, ఆ.

**ఆరు.** దే. అ. క్రి. 1. కలుగు; "ఉ. కర్ణుఁడా, భూరమణుఁ వడిఁ గదిసిభూరిశరంబులు మేననింపనా, వ్వారుటయుందొలంగెనతఁడు." భార. కర్ణ. 3, ఆ.—2. నిండు. "విప్రులకునాహారంబపూపాజ్య పూర్వకమైతద్దయుఁదృప్తిగాఁగమనసారంబెట్టి." (మనసారఁ—మనఃపూర్తిగాననుట.) భో. 3, ఆ. (అడఁగారు, ఒప్పారు, ఇత్యాద్యులయందిదివ్యాపారమాత్రబోధకమగును.) — వి. రోమావళి.

**ఆరుఁడు.** సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. శని.

**ఆరుగ.** దే. వి. సస్యవిశేషము. "ఆరుగన్నుజెత్తమలరెను." (ఆరు కన్నెల్ అని. ఆరుగ అన్నల్ అనియు ఛేదము.) రసి. ౧, ఆ.– బ. ధాన్యవిశేషము, ఆర్ల. (ఆరుక అనికొందఱు.)

**ఆరుచు.** దే. ప్రే. 1. ఆడించు; (ఆడుధాతువు అనుప్రయుక్తమై నపుడును రూపము లిట్లుండును గనుక.) 2. విసరు. (చూ. రూ. ఆర్చు.)

**ఆరుదూఱు.** దే. వి. అల్లరి. "ఆరుదూఱుచేసినన్న లయించిన మంచిదే." క్షేత్రయ.

**ఆరుదొండ.** దృ. వి. తుజాలకము.

**ఆరుద్రపురుగు.** వై. వి. వానకురిసి నేల తడిగా నుండునపుడు కలుగునట్టి పట్టువంటి దేహముగల ఒకానొకపురుగు. (ఆర్ద్రము అను పదము ఆరుద్ర అని అయినట్లు తోఁచుచున్నది.)

**ఆరుపోరు.** దే. వి. ఎడతెగనికలహము.

**ఆరురుక్షువు.** సం. విణ. ఉ. 1. ఎక్కనిచ్ఛగలవాఁడు; 2. మోక్ష మందిచ్ఛగలవాఁడు.

**ఆరూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కినది.

**ఆరె.** యు. దే. వి. ధాతకి. వై. 1. చెప్పులుకుట్టెడుసూది; 2. బాణవిశేషము. "వ. పేరెలమిందలపడినవీరుల నారెలం జీబె సాఱులువోసినట్లుచేసియు." ఉ, హరి. ౬, ఆ.–3. విణ. మహారాష్ట్రదేశపు.

**ఆరెకుఁడు.** వై. వి. తలారి, ఆరక్షుఁడు.

**ఆరెబొట్టె.** దృ. వి. కోడికాలివ్రేళ్లకు వెనుకతట్టున సూదివలె మిక్కిలి వాఁడియైయుండెడు ఒంటిగోరు*. "సీ. ఆరెబొట్టె యనఁదదంఘ్రిజన్యకంటకాతినిశితాంగమొప్ప." ఆం, బా. ద్వి. సిం.

**ఆరెము.** యు. దే. వి. భాషావిశేషము. "ఎ, గీ. అరబిపారసిగుజరాతియారెమచ్చు, తెసఁగు కన్నోజమొదలుగాఁ దెలిసివ్రాయ, దారిగన్నట్టివాఁడు." య. ౧, ఆ.–వై. ఆరామము. "ఆరెముఁ జొచ్చికందువకునరెడునంతకమున్న." షా. ౪, ఆ.

**ఆరెవడ్లు.** దృ. వి. బ. సూదులవంటి తోఁకలుగల ఒకదినుసువడ్లు.

**ఆరేవతము.** సం. వి. అ. పుం. తేలి.

**ఆరోగణము.** వై. వి. భోజనము. "క. ఈరీతిరిసుమజ్జన, మారోగణమైన." సా. ౨, ఆ.

**ఆరోగ్యము.** సం. వి. అ. న. అరోగభావము.

**ఆరోపము.** సం. వి. అ. పుం. ఆరోపించుట, (రూ. ఆరోపణము.)

**ఆరోపించు.** సం. స. క్రి. లేనిదిమోపు.

**ఆరోపితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆరోపింపఁబడినది; 2. ఎక్కింపఁబడినది.

**ఆరోహకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కెడువాఁడు.

**ఆరోహణము.** సం. వి. అ. న. 1. ఎక్కుట; 2. నిచ్చెన; 3. మొలక.

**ఆరోహము.** సం. వి. అ. పుం. 1. ఎక్కుట; 2. చెట్టు మొదట నుండి కొనకెగఁబ్రాఁకెడితీఁగ; 3. నిడుపు; 4. ఉత్తమస్త్రీపిఱుఁదు; 5. పొడవు.

**ఆరోహుఁడు.** సం. వి. అ. పుం. 1. మావటివాఁడు; 2. గుఱ్ఱపు రౌతు.

**ఆర్చు.** దే. అ. క్రి. (అఱచుయొక్కరూపాంతరము.) 1. కూయు; "ఆర్చెజనంబఖిలంబునుబ్బునన్." భార. అశ్వ. 3, ఆ.– 2. యోధులు బొబ్బరించు; "గీ. ఆర్చెనెత్తురుట్టపసమ్మస్తకముఁబట్టి, కొనియకంఁడుదాత్రిఘూర్ణభంగి, ప్రమరిపాఁడికురుసృపాలకు నర దాబు, నందువైచి యిట్టులనియెనధిప." భార. ద్రో. ౫, ఆ.– 3. (ఆడుధాతువునకు) ప్రే. ఆడించు; "క. నేర్పరిపెక్కువిధంబుల, నార్పఁగబొమ్మలుగడంగియాడెడువందం, బేర్పడఁగాన్పముకాలన, మర్పితకార్యకరులైనమానవులెదెన్." భార. శాం. ౧, ఆ. "విటు లార్చును శిరపుఁడాళవృంశముల్." ఆము. ౨, ఆ. "సీసుతులు మంత్రులుసౌంలుజూదమార్చి." భార. ఉద్యో. 3, ఆ. "సీ. కెంగేలు గేలితోఁగిలించినెయ్యంపు మాటలఁదగుమఱుమాట లార్చు." భార. విరా. ౨, ఆ. (ఇక్కడ ఒక్కొక్క అర్థమునకు ఒక్కొక యుదాహరణముగా వ్రాయఁబడినది.) 4. (ఆఱుచు యొక్క రూపాంతరము.) ఆఱఁజేయు.

**ఆర్జకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) సంపాదించువాఁడు, గడించువాఁడు.

**ఆర్జనము.** సం. వి. అ. న. సంపాదనము, గడన.

**ఆర్జవము.** సం. వి. అ. న. ఋజుభావము, చక్కన.

**ఆర్జించు.** సం. స. క్రి. సంపాదించు, గడించు.

**ఆర్జితము.** సం. విణ. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది, గడింపఁబడినది.

**ఆర్డరు.** ఆం. వి. క్రమము, ఆజ్ఞ.

**ఆర్డర్లీ.** ఆం. వి. తైనాతిబంట్రౌతు.

**ఆర్తగళము.** సం. వి. అ. పుం. నల్లగోరంట.

**ఆర్తము.** సం. విణ. (అ. ఆ. అ.) దుఃఖము నొందినది.

**ఆర్తవము.** సం. వి. అ. న. 1. స్త్రీఋతువు; 2. పుష్పము. విణ. ఋతుసంబంధమైనది.

**ఆర్తి.** ఉభ. వై. వి. హారతి. సం. ఇ. స్త్రీ. 1. దుఃఖము; 2. వింటి కొప్పు.

**ఆర్త్విజ్యము.** సం. వి. అ. న. ఋత్విజునిభావము.

**ఆర్థి.** సం. వి. ఈ. స్త్రీ. సదృశాదిశబ్దప్రయోగముగల పూర్ణోపమా భేదము.

**ఆర్దుము.** దృ. వి. (ఆఱు+తూము.) ఆఱుతూములు.

**ఆర్ద్ర.** సం. వి. ఆ. స్త్రీ. ఒకనక్షత్రము. విణ. తడిసినది.

**ఆర్ద్రకము.** సం. వి. అ. న. శృంగబేరము, అల్లము.

**ఆర్పు.** దే. ప్రే. ఆఱుపుయొక్కరూపాంతరము.

**ఆర్భటము.** సం. వి. అ. పుం. మ్రోఁత.

**ఆర్భటి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**ఆర్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. పదునాలేండ్లప్రాయముగల యాఁడుది; 2. పార్వతి.

**ఆర్యకము.** సం. వి. అ. న. పితృకార్యము.

**ఆర్యపుత్రుఁడు.** సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) పెనిమిటి.

**ఆర్యావర్తము.** సం. వి. అ. పుం. వింధ్యమునకును హిమవంతమునకును మధ్యదేశము.

**ఆర్యుఁడు.** సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) పెనిమిటి; 2. సావిదల్లుఁడు. విణ. 1. పూజ్యుఁడు; 2. మంచివాఁడు.

**ఆర్వేరము.** వై. వి. ఆరివేరముయొక్క రూపాంతరము. (కలహా సూచకము.—"గీ. విధునితమకంబుతో నిట్టులువెలఁదిసిగ్గు, పోరుబెల్లను వట్టి యార్వేరమయ్యె." అని. ౧, ఆ.—ద్వేషమునకు.—"ఎ, గీ. వట్టియార్వేరమునబలవంతుతోడ, సాటికేఁదెనంగుబెల్లనిష్ఫలము గాదె." అని. ౧, ఆ.—కలఁతకు.—చూ. ఆరివేరము.)

**ఆర్షభ్యము.** సం. వి. అ. పుం. ఆఁబోతుగావిడువఁదగిన కోడెదూడ.

**ఆర్షము.** సం. వి. అ. పుం. ధర్మార్థము వరునివలన గోమిథునము పుచ్చుకొని కన్యకనిచ్చి యథాశాస్త్రముగాఁజేయు వివాహము. (చూ. వివాహము.) విణ. ఋషిది.

**ఆఱడి.** దే. వి. నింద. "శ్రీ. రక్తాక్ష యాంత్రికారాతి మూర్ధార్ధశాలి నాఱడి రిత్త చంపుకొంటి." జై. ౭, ఆ.—విణ. వ్యర్థము.

**ఆఱడిపడు.** ద్వి. అ. క్రి. 1. దూఱుపడు; 2. వ్యర్థమగు. "ద్వి. నూఱువేలేండ్లునన్ను తగతిలేక, యాఱడిపడిభగ్నమైయున్న వారు." రా. బాల, కాం.

**ఆఱడిపోవు.** దే. అ. క్రి. 1. దూఱుపడు; "ఉ. అక్కలకన్య కాత్వమిటులాఱడిపోవనకారణంబనీ, కెక్కడిచూలువచ్చె." నిర్వ. ౨, ఆ.— 2. వ్యర్థమగు. "ఆఱడిపోకయుండ ఫలములందుట యుక్తాగని." భార. ఉద్యో. 3, ఆ.

**ఆఱు.** దే. అ. క్రి. 1. ఉపశమిల్లు; 2. తడితీయు; 3. నశించు. స. ఐదునొకటి.

**ఆఱుగురు.** దే. స. ఆఱుమంది. (ఆఱునకు మహన్మహత్వర్థక రూపము.)

**ఆఱుచు.** దే. ప్రే. 1. ఉపశమింపఁజేయు; 2. తడితీయఁజేయు; 3. నశింపఁజేయు.

**ఆఱుపు.** దే. ప్రే. ఆఱుచు. వి. (అఱుపుయొక్క రూపాంతరము.) 1. కూఁత; 2. యోధులబొబ్బరింత. "క. పొడిచిరికడుఁజెంచు లాఱుపులఁజెదలదరన్." య. ౨, ఆ. (చూ. ఉఱుము.)

**ఆఱుమోములవేలుపు.** ద్వి. వి. కుమారస్వామి, షణ్ముఖుఁడు.

**ఆఱువాళ్లు.** దే. వి. బ. (ఆఱు+వాడులు.) కొంచెము ఎండుట.

**ఆఱువురు.** దే. స. ఆఱుగురుయొక్క రూపాంతరము.

**ఆఱుస.** ద్వి. వి. (ఆఱు+కుంచము.) ఆఱుకుంచములు. "శ్రీ. వట్టిస్థిపేరాఱునయనవెలయు." ఆం, భా. ద్వి. వై.

**ఆలంకి.** దే. వి. 1. కురిచీవంటిపల్లకి; 2. ఆలంకిగుడి. (చూ. పిల్లదీవి.)

**ఆలంకిగుడి.** ద్వి. వి. బాలక్రీడావిశేషము. "శ్రీ. పాలముల్ రిపుఁజట్టి సాధింతుననులీల నాలఁకి గుడిడింభకాళిదిగుచు." రా, వి. ౨, ఆ.

**ఆలంకులు.** దే. వి. బ. ఆలఁకిగుడి. "శ్రీ. పుట్టచెండ్లువ్వనఁబట్టె లాలంకులు గుడిగుడికుంచాలు గుంటచాళ్లు." వి, పు. ౭, ఆ.

**ఆలంబము.** సం. వి. అ. పుం. అవలంబము, ఊఁత.

**ఆలంబించు.** సం. స. క్రి. అవలంబించు, ఊఁదు.

**ఆలంభము.** సం. వి. అ. పుం. వధము, కొల.

**ఆలకాపరి.** దే. వి. 1. కృష్ణుఁడు; 2. గోపాలుఁడు.

**ఆలకించు.** వై. స. క్రి. 1. ఆదరించు*; "గీ. అంచలారయాల కించివినుఁడు." చంద్ర.—2. విను*.

**ఆలక్షించు.** సం. స. క్రి. కనుఁగొను, చూచు.

**ఆలగోఁడుబాలగోఁడు.** దే. వి. పెడబొబ్బలు.

**ఆలతి.** వై. వి. రాగాలాపము. "చ. అలరులుకోసి కోసినవయస్య లఁబల్లఱుఁగాఁగిలించికో, యులలయెలుంగులాలిఁగొనియింపుగఁ జిల్కలతోడనెమ్మిమై, సలవడిమాటలాడియళులాలతిసేయఁగఁబాడి డాఁగురించి, తలుహరితోడనాడుదురుతద్వనవీథులయందుగోపి కల్." హరి. పూ. ౮, ఆ.

**ఆలపించు.** వై. స. క్రి. రాగమునాలాపించు. "ఉ. ఉద్యన్న ఖరప్రఘాతములఁదంత్రులమీటుచునాలపించునా, విన్ననియల్లు నాచెవులఁదేనియలొల్కచవుల్ దలంచెదన్." పాండు. 3, ఆ.

**ఆలపోతు.** దే. వి. ఆఁబోతు, వృషభము.

**ఆలప్తి.** సం. వి. ఇ. స్త్రీ. రాగాలాపము, ఆలతి.

**ఆలము.** ఉభ. దే. వి. ఉపేక్ష. "ఆలమునేసినాతగులమాఱడి పుచ్చుఁగనేలచేల." భార. విరా. ౨, ఆ.—వై. యుద్ధము. "క. కాలంబగుటయున్నృపులకు, నాలమునసమకూతె." భార. భీష్మ. ౧, ఆ.—సం. అ. న. 1. తేలుకొండి; 2. హరిదళము.

**ఆలయము.** సం. వి. అ. పుం. గృహము, ఇల్లు.

**ఆలరి.** దే. విణ. దుశ్శీలుఁడు. "ఉ. చాలుఁబురేనరోహితవసత్వథ వృత్తిఁదొఆంగిఖూఁతుని, ట్లాలరివైరిమింపహృదయంబునఁగోరుట ధర్మరీతియే." భాగ. 3, స్కం.

**ఆలఱేఁడు.** దే. వి. బసవఁడు, వృషభము.

**ఆలవట్టము.** వై. వి. వస్త్రముతో గుండ్రముగాఁజేసిన విసనకఱ్ఱ.

**ఆలవాలము.** సం. వి. అ. న. ఆవాలము, పాదు.

**ఆలసించు.** వై. అ. క్రి. ఆలస్యముచేయు, తడయు.

**ఆలస్యము.** సం. వి. అ. న. 1. సోమరితనము; 2. జాగు. విణ. సోమరి. సం. వి. అ. పుం. నీరుపంది.

**ఆలాజ్యము.** సం. వి. అ. న. ఇంధనము, వంటచెఱకు.

**ఆలానము.** సం. వి. అ. పుం, న. 1. ఏనుగుఁకట్టుకంబము; 2. త్రాడు.

**ఆలాపము.** సం. వి. అ. పుం. 1. నిండుమాట; 2. రాగాలాపము.

**ఆలాపించు.** సం. స. క్రి. రాగముఁ దిన్నఁగానీడ్చు.

**ఆలాబువు.** సం. వి. ఊ. స్త్రీ. అలాబువు, సొరకాయ.

**ఆలాయము.** వై. విణ. పాత్రము*.

**ఆలావర్తము.** సం. వి. అ. న. ఆలవట్టము.

**ఆలి.** ఉభ. దే. విణ. (నాలియొక్క రూపాంతరము.) హీనము. "వ. మగఁడానీవుజగంబుచొప్పమిగులన్ మానంబువాటింతువా, లిగాసిగ్గంబగుమాటవాటిలెనె." నిర్వ. ౪, ఆ. "ఉ. ఇయ్యాలి కసంబువాపెదఁ బ్రియంబొనరించెదనీకుదండ్రికిన్." భార. శల్య. ౨, ఆ.—సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. చెలికత్తె.

**ఆలింగనము.** సం. వి. అ. న. ఉపగూహనము, కవుఁగిలింత.

**ఆలింగితము.** సం. విణ. (అ. ఆ. అ.) కవుఁగిలింపఁబడినది.

**ఆలింగ్యము.** సం. వి. అ. పుం. గోపుచ్ఛమువంటి ఆకారముగల మృదంగము. విణ. కవుఁగిలింపఁదగినది.

**ఆలించు.** వై. స. క్రి. ఆలకించుయొక్క రూపాంతరము. (ఆదరించుటకు.—"గీ. ఇంకనైననన్ను నేలయాలింపవు, నాకుశరణమగుము

నాథ." భార. ఆర. ౨, ఆ. "ఎ, గీ. లిఖితుఁడిట్లనుశంఖుఁ డాలించివినఁగ." జై. ర, ఆ.)

**ఆలిగొను.** దే. స. క్రి. (ఆలి+కొను.) 1. అపహసించు; "గీ. అట్టివిక్రమౌనసు గాంచియిట్టులనియె, నోనిశాటియీయొప్పులెనున్న నిన్నుఁ, గన్నవారిదిటూలరేకాముచేత, శేలనీకింతవలవనిభాళియేల. వ. అని. క. ఈలీలసుమిత్రానుతుఁ, డాలిగొనఁగ." రా. ఆర, ౩౦.— 2. తక్కువపఱచు. "అమరులకగు భోజ్యములెల్ల మ్రింగి మోపుగొనుచుమిమ్మునాలిగొనిపోయిరి." నిర్వ. ౫, ఆ.

**ఆలిచిప్ప.** దే. వి. కప్పచిప్ప, శంబూక.

**ఆలీఢము.** సం. వి. అ. న. విలుకాఁడు కుడికాలు ముందటికిచాఁచి నిలుచుట. (చూ. స్థానము.) విణ. నాకఁబడినది.

**ఆలు.** దే. వి. భార్య. (దీనికి వృత్తియందు ఆఁడుదియనిమాత్ర మర్థము. జవరాలు, ధీరురాలు. మొ.)

**ఆలుక.** సం. వి. ఆ. స్త్రీ. గిండిచెంబు.

**ఆలుకము.** సం. వి. అ. పుం, న. గెనుసు. చేమ. (అనికొందఱు.)

**ఆలుగడ్డ.** హిం. వి. ఉరలగడ్డ, బంగాళాదుంప.

**ఆలుండి.** దే. వి. మంచినడత, శీలము.

**ఆలువు.** సం. వి. ఉ. స్త్రీ. గిండి. న. 1. గెనుసుగడ్డ; 2. పడవ.

**ఆలెగాఁడు.** దే. వి. క్రిందికొలువుగాఁడు.

**ఆలెప్రాయిప్ప.** దే. వి. ఒకసారిగా నాలుగైదు పాత్రములు వేఱు వేఱుగాఁబెట్టి వండునట్లేర్పఱచినపొయ్యి.

**ఆలేఖనము.** సం. వి. అ. న. 1. వ్రాయుట; 2. చిత్తరువు వ్రాయుట.

**ఆలేఖ్యము.** సం. వి. అ. న. 1. చిత్తరువు; 2. వ్రాఁత.

**ఆలోకము.** సం. వి. అ. పుం. 1. చూపు, (రూ. ఆలోకనము;) 2. ఎండ; 3. బట్టువాఁడుచేయుస్తోత్రము.

**ఆలోకించు.** సం. స. క్రి. వీక్షించు, చూచు.

**ఆలోకితము.** సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడినది.

**ఆలోచన.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. యోచన.

**ఆలోచించు.** సం. స. క్రి. యోచించు, వితర్కమాడు.

**ఆలోడనము.** సం వి. అ. న. కలఁత.

**ఆలోడించు.** సం. స. క్రి. కలఁచు.

**ఆలోడితము.** సం. విణ. (అ. ఆ. అ.) కలఁచఁబడినది.

**ఆవ.** దే. వి. సర్షపము. బ. సర్షపబీజములు. (ఈయర్థమందు తఱచుగా ఆవాలు అని వాడెదరు.)

**ఆవజము.** వై. వి. వాద్యవిశేషము. "చ. అ, య్యనుపతిగాంచి దండియ యుపాంగము మద్దెలతాళమావజం, బునుగొని." రామా. ౨, ఆ.

**ఆవటము.** దే. వి. పొందిక. విణ. పొందికైనది. "ఎ, గీ. వలయు నంపదలందనావటమువటము." భాగ. ర, స్క౦.

**ఆవటముచేయు.** దే. స. క్రి. పొందికపఱచు. "సీ. మోచేతి వంపుగామడిచిపట్టినకేల వరదాభయంబులావటముచేసి." పాండు. ౨, ఆ.

**ఆవటిల్లు.** దే. అ. క్రి. పొందుపడు. "గీ. అతఁడుఁ గ'అప్రాణములనుండిహరువురెరువు, లావటిలఁదెల్ప." రామా. ౮, ఆ.— (ప్రే. ఆవటించు.)

**ఆవడ.** దే. వి. చేఁదుగలబీఱ.

**ఆవడి.** దే. వి. హావడి, ఉపద్రవము. "క. మానుగజగములయావడి, మానుపఁగాఁగోరి." అచ్చ. సుం, ౬౦.

**ఆవపనము.** సం. వి. అ. న. (కాఁగుగంపమొదలైన) పాత్రము.

**ఆవపాఱు.** దే. అ. క్రి. 1. జ్ఞప్తికివచ్చు; 2. తోఁచు.

**ఆవము.** వై. వి. (కుమ్మరి కుండలుతొనగునవి కాల్చుటకేర్పఱచిన) కొలిమి, ఆవాపము.

**ఆవరణము.** సం. వి. అ. న. ఆచ్ఛాదనము, మూఁత. (సప్తావరణములు. — పృథివ్యప్తేజోవాయ్వాకాశాహంకారమహత్తత్త్వములు. ప్రకృతితోడఁగూడ అష్టావరణములగు.)

**ఆవరించు.** సం. స. క్రి. చుట్టుకొను.

**ఆవర్జనము.** సం. వి. అ. న. ఆకర్షణము.

**ఆవర్జా.** హిం. వి. దినచర్య, ప్రతిదినపులెక్క.

**ఆవర్తనము.** సం. వి. అ. న. 1. మరలుట; 2. పాఠముయొక్కవల్లె.

**ఆవర్తనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మరలఁదగినది; 2. వల్లింపఁదగినది.

**ఆవర్తము.** సం. వి. అ. పుం. 1. గుజ్జుపుసుడి; 2. నీటిసుడి; 3. మరలుట; 4. పాఠముయొక్కవల్లె.

**ఆవర్తించు.** సం. స. క్రి. పాఠమును వల్లించు.

**ఆవర్తితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మరలినది; 2. వల్లింపఁబడినది.

**ఆవల.** దే. వి. (అ+వలను.) 1. అప్రక్క; 2. పిమ్మట.

**ఆవలి.** ఉభ. దే. వి. ఉపద్రవము. "సీ. మురహయగ్రీవాంత్రమూలఫేనావలినావలిదలఁగఁజేకొకుపఱచె." ఉ, హరి. ర, ఆ.. సం. ఇ. స్త్రీ. పఙ్క్తి.

**ఆవశ్యకము.** సం. వి. అ. న. అక్కఱ. విణ. అక్కఱైనది.

**ఆవసితము.** సం. విణ. (అ. ఆ. అ.) నుఱిచినది. (ధాన్యము.)

**ఆవహము.** సం. విణ. (అ. ఆ. అ.) కలిగించునది.

**ఆవహిల్లు.** సం. అ. క్రి. కలుగు. (ప్రే. ఆవహించు.)

**ఆవళి.** దే. వి. ఆవడియొక్కరూపాంతరము. "అత్యలఘుతరంగ సంపదలకావళులావళులు." చమ. ౧, ఆ.

**ఆవాపకము.** సం. వి. అ. పుం. ఆఁడుదానిచేతి మట్టిగాజు, సూడిగము.

**ఆవాపము.** సం. వి. అ. పుం. 1. పాదు; 2. విత్తుట; 3. ఆవము; 4. పరరాష్ట్రచింతన. (స్వరాష్ట్రచింతన తంత్రమనఁబడును.)

**ఆవాయకము.** సం. వి. అ. పుం. ఆవాపకము.

**ఆవాలము.** సం. వి. అ. న. ఆలవాలము, పాదు.

**ఆవాసము.** సం. వి. అ. పుం. సదనము, ఇల్లు.

**ఆవాహనము.** సం. వి. అ. న. ఆహ్వానము, పిలుపు.

**ఆవాహితము.** సం. విణ. (అ. ఆ. అ.) పిలువఁబడినది.

**ఆవి.** దే. వి. 1. శ్వాసము; "గీ. ఆనుయోధనుముక్కునవావిగలుగఁ, బుధమినీకీఁడు," భార. ఉద్యో. 3, ఆ.—2, ఆవము. మ. "విషా

రించుకా మలయానిలంబచటఁదానింజిల్కినెన్మేనియా, విహరించుం బికనాదముల్ చెవికిఁగావించుంజవుల్ పోదమా." విజ. ౨, ఆ.

**ఆవించు.** దే. స. క్రి. వాసెనమీఁదఁబెట్టి ఆవిరితోఁ బక్వముచేయు. "వ. కీచకతండులంబులంబిండిగొట్టికొ ట్రఁబోసియుప్పిగొప్పలు గాఁజేసి యావించిన కుడుములబానలు." కాశ. 3, ఆ.

**ఆవిగ్నము.** సం. వి. అ. పుం. కలివిశీ. విణ. ఆవేగమునొందినది.

**ఆవిధము.** సం. వి. అ. పుం. తొలిచెడుసాధనము.

**ఆవిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా తొలువఁబడినది; 2. వంకరయినది.

**ఆవిరి.** దే. వి. ఊష్మము.

**ఆవిరిల్లు.** దే. అ. క్రి. చెమర్చు.

**ఆవిర్భవించు.** సం. అ. క్రి. ప్రభవించు, పుట్టు.

**ఆవిర్భావము.** సం. వి. అ. పుం. ప్రభవము, పుట్టుక.

**ఆవిర్భూతము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రభూతము, పుట్టినది.

**ఆవిలము.** సం. విణ. (అ. ఆ. అ.) కలఁకఁబారినది, కలుషము.

**ఆవిలి.** దే. వి. మాంత్రికుఁడు ఉపయోగించెడు కాచపాత్రవిశేషము.

**ఆవిష్కరణము.** సం. వి. అ. న. ప్రకటనము, వెల్లడి.

**ఆవిష్కరించు.** సం. స. క్రి. ప్రకటించు, వెలయించు.

**ఆవిష్కృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రకటింపఁబడినది, వెలయింపఁబడినది.

**ఆవిష్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఆవిష్కరణము.

**ఆవిష్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ.——పై.——

**ఆవిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆవేశముకొన్నది; 2. చొచ్చినది.

**ఆవు.** దే. వి. గోవు. (వృత్తియందు అంత్యవర్ణలోపము వికల్పముగ నగు. ఆఁగదుపు, ఆఁబడ్డ, ఆఁబెయ్య, ఆదూడ. మొ.)

**ఆవుకుఁడు.** సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) తండ్రి.

**ఆవుత్తుఁడు.** సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) బావ.

**ఆవురు.** దే. వి. రోదనార్థధ్వనులయందగు ధ్వన్యనుకరణము. "ఉ. దేవుఁడొహానియోయనిమదిందలపోఁతలునాకికానినిక్, వేవురువేయిచందములనిందయొనర్చెదరిప్డుమూఁగయక్, పావులనోరునీయెడ మహాదతలంబునఁదన్నినట్లుగా, నీవొకయింతయావురని యేడ్వఁగదన్న కుమారరత్నమా." పర. ౨, ఆ.

**ఆవులించు.** దే. అ. క్రి. ఆవులింతవిడుచు, జృంభించు.

**ఆవులింత.** దే. వి. ఆవులించుట, జృంభము.

**ఆవృతము.** సం. విణ. (అ. ఆ. అ.) వలయితము, చుట్టుకొనఁబడినది.

**ఆవృత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) తిరుగుడుపడినది.

**ఆవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తడవ; 2. తిరుగుడు; 3. వల్లె.

**ఆవృత్తు.** సం. వి. త్. స్త్రీ, న. అనుక్రమము, సొరిది.

**ఆవేగము.** సం. వి. అ. పుం. (ఇష్టానిష్టప్రాప్తిచేఁగలుగు) తొట్రుపాటు.

**ఆవేగి.** సం. వి. ఈ. స్త్రీ. బొడ్డికూరకీ.

**ఆవేదకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తెలిపెడువాఁడు.

**ఆవేదనము.** సం. వి. అ. న. తెలుపుట.

**ఆవేదించు.** సం. స. క్రి. తెలుపు.

**ఆవేదితము.** సం. విణ. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.

**ఆవేశనము.** సం. వి. అ. న. 1. పట్టడ; 2. ప్రవేశము; 3. ఒల్లెయుఁగమి.

**ఆవేశము.** సం. వి. అ. పుం. 1. ఒల్లెయుఁగమి, సుమాళము; 2. వేగిరపాటు.

**ఆవేశించు.** సం. అ. క్రి. ప్రవేశించు, చొచ్చు.

**ఆవేశికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అతిథి, విందు.

**ఆవేష్టకము.** సం. వి. అ. పుం. ముండ్లకంచె.

**ఆశ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆస; 2. దిక్కు. అ. పుం. ము. 1. అగ్ని; 2. వ్యాప్తి.

**ఆశంసనము.** సం. వి. అ. న. కోరుట.

**ఆశంసిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) కోరువాఁడు.

**ఆశంసితము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**ఆశంసువు.** సం. విణ. ఉ. ఆశంసిత.

**ఆశపడు.** మి. అ. క్రి. అపేక్షపడు.

**ఆశయము.** సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. ఆధారము; 3. మనస్సు.

**ఆశయిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) తినిపించువాఁడు.

**ఆశరుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. రాక్షసుఁడు.

**ఆశాబంధము.** సం. వి. అ. పుం. 1. ఊఁత; 2. సాలెపట్టు.

**ఆశాసనము.** సం. వి. అ. న. ఆశీర్వాదము.

**ఆశాసించు.** సం. స. క్రి. ఆశీర్వదించు.

**ఆశాస్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆశీర్వదింపఁదగినది; 2. ప్రార్థింపఁదగినది.

**ఆశి.** సం. వి. ఈ. స్త్రీ. పాముయొక్కకోఱ.

**ఆశించు.** సం. స. క్రి. అపేక్షించు, ఆసించు.

**ఆశితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తినఁబడినది; 2. అంతకుముందు ఆవులనుమేపినది. (పొలము.)

**ఆశీర్వదించు.** సం. స. క్రి. దీవించు.

**ఆశీర్వాదము.** సం. వి. అ. పుం. దీవన.

**ఆశీవిషము.** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**ఆశీస్సు.** సం. వి. స్. స్త్రీ. 1. హితముకోరుట; 2. పాముయొక్కకోఱ.

**ఆశుగము.** సం. వి. అ. పుం. 1. బాణము; 2. గాలి.

**ఆశువు.** సం. వి. ఉ. పుం. ఎఱ్ఱజిల్లమవడ్లు. క్రి. విణ. న. వేగ. విణ. వేగముగలది.

**ఆశుశుక్షణి.** సం. వి. ఇ. పుం. అగ్ని, వహ్ని, నిప్పు.

**ఆశౌచము.** సం. వి. అ. న. అశుచిత్వము, అంటు.

**ఆశ్చర్యము.** సం. వి. అ. న. అచ్చెరువు. విణ. అచ్చెరువైనది.

**ఆశ్రమము.** సం. వి. అ. పుం, న. 1. పర్ణశాల; 2. బ్రహ్మచర్యాది; (ఇవి నాలుగు.— బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాసము.) 3. మఠము; 4. అడవి.

**ఆశ్రయము.** సం. వి. అ. పుం. 1. అండ; 2. బలవంతునాశ్రయించుట; (చూ. గుణము.) 3. ఇల్లు.

**ఆశ్రయాశుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని. విణ. ప్రాపుచెఱచువాఁడు.

**ఆశ్రయించు.** సం. స. క్రి. ఆశ్రయముచేయు, అండగొను.

**ఆశ్రవము.** సం. వి. అ. పుం. 1. అంగీకారము; 2. క్లేశము.

**ఆశ్రవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మాటదాఁటనివాఁడు, వినయముగలవాఁడు. (అనికొందఱు.)

**ఆశ్రి.** సం. వి. ఇ. స్త్రీ. కత్తివాదర.

**ఆశ్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది.

**ఆశ్రుతము.** సం. విణ. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది, సమాహితము.

**ఆశ్లిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆలింగితము, కవుఁగిలింపఁబడినది.

**ఆశ్లేషము.** సం. వి. అ. పుం. 1. ఆలింగనము; 2. నక్షత్రవిశేషము.

**ఆశ్లేషించు.** సం. స. క్రి. కవుఁగిలించు.

**ఆశ్వత్థము.** సం. వి. అ. న. రావిపండు.

**ఆశ్వము.** సం. వి. అ. న. గుఱ్ఱములగుంపు, ఆశ్వీయము.

**ఆశ్వయుజము.** సం. వి. అ. పుం. ఒకమాసము.

**ఆశ్వసించు.** సం. స. క్రి. ఆశ్వాసించు, ఊఱడించు.

**ఆశ్వసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఊఱడింపఁబడినది.

**ఆశ్వాసము.** సం. వి. అ. పుం. 1. ఊఱట; 2. ఆఖ్యాయికపరిచ్ఛేదము; 3. పరిచ్ఛేదము.

**ఆశ్వాసించు.** సం. స. క్రి. ఆశ్వసించు.

**ఆశ్వాసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్వసితము.

**ఆశ్వికుఁడు.** సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు.

**ఆశ్వినము.** సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము.

**ఆశ్వినేయులు.** సం. వి. అ. పుం. ద్వి. అశ్వులు.

**ఆశ్వీనము.** సం. విణ. (అ. ఆ. అ.) గుఱ్ఱము ఒక దినము నడవఁదగినది. (త్రోవ.)

**ఆశ్వీయము.** సం. వి. అ. న. ఆశ్వము.

**ఆషాఢము.** సం. వి. అ. పుం. 1. ఒకమాసము; 2. బ్రహ్మచారి పట్టుకొనెడుమోదుగుకోల; 3. మలయపర్వతము.

**ఆషూర్ఖానా.** హిం. వి. నత్రము.

**ఆస.** వై. వి. ఇచ్ఛ, అపేక్ష.

**ఆసంగము.** సం. వి. అ. పుం. 1. ఆశ్రయము; 2. ఆసక్తి.

**ఆసకప్పెరగాఁడు.** ద్వ. వి. పక్షివిశేషము.

**ఆసక్తి.** సం. వి. ఇ. స్త్రీ. అపేక్ష, ఆస.

**ఆసక్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఆసగొన్నవాఁడు.

**ఆసచేయు.** వై. స. క్రి. ఆశించు. "ఇంద్రపదంబుకోరఁడు దిగీశులగాఁ జన్మములాసచేయఁడు." ని, పు. ౨, ఆ.

**ఆసత్తి.** ఉత. వై. వి. ఆశ. సం. ఇ. స్త్రీ. 1. లాభము; 2. సంగమము

**ఆసన.** సం. వి. ఆ. స్త్రీ. కూర్చుండుట. అ. న. ము. 1. పీట; 2. స్వస్తికాది; (స్వస్తికాసనము, గోముఖాసనము, బద్ధాసనము, పద్మాసనము, వీరాసనము, సింహాసనము, భద్రాసనము, ముక్తాసనము, (దీనికి సిద్ధాసనమని, వజ్రాసనమని, గుప్తాసనమనియు నామాంతరములు గలవు.) మయూరాసనము. ము.) 3. బలాద్యపేక్షచేదండెత్తిపోకనిలుచుట; (చూ. గుణము.) (ఇది పంచవిధము.—సంధాయాసనము, ప్రసంగాసనము, విగృహ్యాసనము, సంభూయాసనము, ఉపేక్ష్యాసనము. వీనికర్థము యానశబ్దమునకువ్రాసినట్లెయుండునది.) 4. వీనఁగుమూఁపు. పుం. వేఁగిసెట్టు.

**ఆసన్నము.** సం. వి. అ. న. దాపు. విణ. దాపైనది.

**ఆసపడు.** వై. అ. క్రి. అపేక్షపడు.

**ఆసపాటు.** వై. వి. అపేక్షపడుట.

**ఆసరా.** వై. వి. ప్రాపు, ఆశ్రయము.

**ఆసవము.** సం. వి. అ. పుం. 1. పక్వమునుకాని చెఱకురసమునఁ జేసినకల్లు, చెఱకురసమునఁజేసినకల్లు; (అనికొందఱు.) 2. కల్లుతేట; 3. పూఁదేనె.

**ఆసాదనము.** సం. వి. అ. న. ప్రాప్తి, పొందు.

**ఆసాది.** దే. వి. మాదిగ. "వి. ఆసాదిగోనఁగిమాదిగగూఱిరియన మాతంగుఁడగు." ఆం, భా, ద్వి. ఖా.

**ఆసాదించు.** సం. స. క్రి. ప్రాపించు, పొందు.

**ఆసాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాప్తము, పొందఁబడినది.

**ఆసాద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాప్యము, పొందఁదగినది.

**ఆసాను.** హిం. వి. ఆధారము.

**ఆసారము.** సం. వి. అ. పుం. 1. జడివాన, పెడిగలవాన; (అనికొందఱు.) 2. మిత్రబలము; 3. అంతట సేన వ్యాపించుట.

**ఆసించు.** వై. స. క్రి. అపేక్షించు.

**ఆసికుఁడు.** సం. వి. అ. పుం. ఖడ్గాయుధుఁడు.

**ఆసితము.** సం. వి. అ. న. ఉనికిపట్టు. విణ. కూర్చుండినది.

**ఆసిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. కట్టాయితమయినది.

**ఆసీనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కూర్చున్నవాఁడు.

**ఆసుఁగ్రోవి.** దే. వి. (ఆసు+క్రోవి.) (సాలెవాఁడు ఆసుపోయునపుడు) నూలుచొప్పించెడుక్రోవి.

**ఆసుమ్రాను.** దే. వి. సాలెవాని ఒకకొయ్యముట్టు. (నూలుపోఁగు వాటించుటకై వరుసకు మూడువంతునఁగాని అయిదువంతునఁగాని నాలుగైదువరుసలుగా మొలలుగూర్చిన కొయ్యచట్టము.)

**ఆసురము.** సం. వి. అ. పుం. ధనమిచ్చికన్యకనుదీసి చేసికొనెడియొకవివాహము. (చూ. వివాహము.)

**ఆసురి.** సం. వి. ఈ. స్త్రీ. కృష్ణిక, నల్లావలు.

**ఆసురీణము.** సం. విణ. (అ. ఆ. అ.) నల్లావలుపండునది. (పొలము.)

**ఆసురుఁడు.** సం. వి. అ. పుం. నిరృతి, మూలజేఁడు

**ఆసువోయు.** దే. స. క్రి. (ఆసు+పోయు.) (ఆసున్నూని మొలలకునూలు) పోఁగువాయించు.

**ఆసేకము.** సం. వి. అ. పుం. చల్లుట.

**ఆసేచనకము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎంతచూచినను తనివి తీఱనిది.

**ఆసేచనము.** సం. వి. అ. న. చల్లుట. విశే. కోరఁబడినది.

**ఆసేధము.** సం. వి. అ. పుం. నిరోధము, అడ్డగింత.

**ఆసేధించు.** సం. స. క్రి. నిరోధించు, అడ్డగించు.

**ఆసేధ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

**ఆస్కందనము.** సం. వి. అ. న. 1. యుద్ధము; 2. ఇంకుట, 3. తిరస్కారము.

**ఆస్కందితము.** సం. వి. అ. న. అతివేగమును అతిమందమును గాక నడితరముగాఁబాఱెడి యొక యశ్వధార, (చూ. ధార.) రవగాలు.

**ఆస్తరణము.** సం. వి. అ. న. 1. ఆసనము; 2. ఎఱ్ఱకంబళి; 3. ఏనుఁగుమీఁదవఱచెడి యెఱ్ఱకంబళి; 4. పఱపు.

**ఆస్తరము.** సం. వి. అ. పుం. 1. పఱపు; 2. ఆసనము; 3. ఎఱ్ఱకంబళి.

**ఆస్తి.** దే. వి. కూడఁబెట్టినధనము.

**ఆస్తికాఁడు.** దే. విశే. ధనవంతుఁడు. (చూ. అచ్చుకుప్ప.)

**ఆస్తికుఁడు.** సం. వి. అ. పుం. భగవంతుఁడున్నాఁడని నమ్మువాఁడు. విశే. శ్రద్ధగలవాఁడు.

**ఆస్తిక్యము.** సం. వి. అ. న. ఆస్తికునిభావము.

**ఆస్తీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) పఱవఁబడినది.

**ఆస్థ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆస్థానము; 2. ప్రయత్నము.

**ఆస్థానము.** సం. వి. అ. న. 1. సభ; 2. రాజసభ.

**ఆస్థాని.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**ఆస్పత్రి.** ఆం. వి. వైద్యశాల, (రూ. ఆస్పిటాలు.)

**ఆస్పదము.** సం. వి. అ. న. 1. చోటు; 2. పని.

**ఆస్ఫాలనము.** సం. వి. అ. న. చఱపు. (రూ. ఆస్ఫాలము. పుం.)

**ఆస్ఫాలించు.** సం. స. క్రి. ఆస్ఫోటించు, చఱచు.

**ఆస్ఫాలితము.** సం. విశే. (అ. ఆ. అ.) చఱవఁబడినది.

**ఆస్ఫోట.** సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమల్లెతీఁ; 2. దంతెనతీఁ. అ. పుం. ను. జిల్లేడుతీఁ.

**ఆస్ఫోటనము.** సం. వి. అ. న. 1. చఱపు; 2. పోటు; 3. చీలిక.

**ఆస్ఫోటని.** సం. వి. ఈ. స్త్రీ. రత్నములకు బెజ్జము వేసెడుసూది, పిడిసాన.

**ఆస్ఫోటించు.** సం. స. క్రి. 1. చఱచు; "క. మాటికిమనపై నుఱుములు, చాటుచువేకోటులద్రిచరులుగొలువనా, స్ఫోటించి నేలఁగాలం, దాటించుచునున్నవాఁడుదంభుఁడుకంటే." రా. యు, కాం.—2. పొడుచు; 3. చీల్చు.

**ఆస్ఫోటితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చఱవఁబడినది; 2. పొడువఁబడినది; 3. చీల్పఁబడినది.

**ఆస్య.** సం. వి. ఆ. స్త్రీ. ఉనికి, కూర్చుండుట. (అనికొందఱు.) అ. న. ను. 1. ముఖము; 2. నోరు.

**ఆస్రము.** సం. వి. అ. న. 1. కన్నీరు; 2. నెత్తురు. పుం. వెంట్రుక.

**ఆస్రవము.** సం. వి. అ. పుం. శ్లేష్మము, అలసట.

**ఆస్వదనము.** సం. వి. అ. న. 1. అనుభవించుట; 2. చవిచూచుట.

**ఆస్వదించు.** సం. స. క్రి. 1. అనుభవించు; 2. చవిచూచు. "ఆబావితేటనాస్వదించిన." క శీ. ౬, ఆ.

**ఆస్వాదనము.** సం. వి. అ. న. ఆస్వదనము.

**ఆస్వాదించు.** సం. స. క్రి. ఆస్వదించు.

**ఆస్వాదితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది; 2. చవిచూడఁబడినది.

**ఆహకము.** ఉభ. దే. వి. కుదువ. "ద్వి. ఆహకంబులువెట్టియవి దక్కుమితులు, సాహసంబుననబల్కి సాక్షులఁబెట్టి." హరిశ్చ. ౨, భా. (ఆయకము అనునది హాకారమధ్యకముగా నిట్టిగ్రంథమునందు కనఁబడుచున్నది.) — సం. అ. పుం. ముక్కునఁగలుగు రోగము.

**ఆహతము.** సం. వి. అ. పుం. తప్పెట. విశే. 1. కలుగనేరనిది; (గొడ్రాలికొడుకుచూచుచున్నాఁడు. అనగుమాట.) 2. కొట్టఁబడినది; 3. క్రొత్తది; (వస్త్రము.) 4. ప్రాఁతది; (వస్త్రము.) 5. రెట్టింపఁబడినది.

**ఆహతలక్షణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) గుణములచేతఁ ప్రసిద్ధిఁజెందినవాఁడు, కృతలక్షణుఁడు.

**ఆహరించు.** సం. స. క్రి. 1. అపహరించు; "నేదల్లడమంద భూషణవితానమునర్థమునాహరించి." పా. ౪, ఆ.—2. ఆకర్షించు; "విజ్ఞానమునఁజేసి విషయాదివలననెమ్మనమాహరించి." (ఇక్కడ ఆహరించి=మరలించియనుట.) ఆము. 3, ఆ.—3 ఆరగించు. "ఎ, గీ. బ్రహ్మచర్యమునకుఁబరమాయుధపవాన, మిులకుఁజిత్త శుద్ధిఫలజలంబు, లాహరించియునికిదాధిరాజ్యముపత్ర, భక్షతకు దివంబు ఫలమగుధిప." భార. అను. ౧, ఆ.

**ఆహర్త.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) ఆహరించువాఁడు.

**ఆహవనము.** సం. వి. అ. న. యజ్ఞము, వ్రేలిమి.

**ఆహవనీయము.** సం. వి. అ. పుం. ఒక శ్రౌతాగ్ని. (చూ. అగ్ని.) విశే. యజ్ఞమునబలియియ్యయోగ్యమైనది.

**ఆహవము.** సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. పిలుపు; 3. యజ్ఞము.

**ఆహా.** వై. అవ్య. ఔరా. "ఆహాపుట్టెడులాఁతిచూపఱకు." భార. శల్య. ౨, ఆ.

**ఆహారము.** సం. వి. అ. పుం. 1. భోజనము; 2. వంటకము; 3. అపహరణము.

**ఆహారించు.** సం. స. క్రి. ఆరగించు. "సీ. గ్రహణవేళలయందు రాహువాహారించిత్రస్తిమైగఱ్ఱునఁద్రేఁచెనేని." నై. ౨, ఆ.

**ఆహార్యము.** సం. వి. అ. పుం. హారాదిభూషణములచేఁగలిగెడి అభినయవిశేషము. (చూ. అభినయము.) విశే. తెమ్మకోఁదగినది.

**ఆహావము.** సం. వి. అ. పుం. 1. పశువులు నీరుద్రావుటకై నూతియొద్ద ఏర్పఱచిన తొట్టి; 2. యుద్ధము.

**ఆహికము.** సం. వి. అ. పుం. 1. విడిచివిడిచి వంతుప్రకారము వచ్చెడు జ్వరము; 2. సుషిరవాద్యవిశేషము.

**ఆహితము.** సం.విశే. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. చేయఁబడినది.

**ఆహితాగ్ని.** సం. వి. ఇ. పుం. అగ్నిహోత్రమునుంచుకొని యుండువాఁడు.

**ఆహుతము.** సం. విశే. (అ. ఆ అ.) వేల్వఁబడినది.

**ఆహుతి.** సం. వి. ఇ. స్త్రీ. అగ్నియందువేల్చుట.

**ఆహేయము.** సం. విశే. (అ. ఆ. అ.) పాముది. (ఎముక, విషము. మొ.)

**ఆహేరువు.** సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీఁచరకీ.

**ఆహోపురుషిక.** సం. వి. ఆ. స్త్రీ. అహోపురుషిక.

**ఆహ్నికము.** సం. వి. అ. న. 1. పగలుచేయఁదగిన కర్మము; 2. ఆహారము; 3. ప్రకరణసమూహము. విశే. పగలుచేయఁదగినది.

**ఆహ్లాదము.** సం. వి. అ. పుం. సంతోషము, ఎలమి.

**ఆహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పేరు; 2. పిలుపు.

**ఆహ్వయము.** సం. వి. అ. పుం. అభిధానము, పేరు.

**ఆహ్వానము.** సం. వి. అ. న. పూఁతి, పిలుపు.

**ఆళి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. చెలికత్తె; 3. అడ్డకట్ట. న్. పుం. తేలు. విశే. ఇ. నిర్మలమయిన మనసుగలది.

**ఆళిందము.** సం. వి. అ. పుం. అళిందము.

**ఆళుగ.** దే. వి. (చూ.) (రూ.) ఆళువ.

**ఆళువ.** దే. వి. ముత్తెపుఁజిప్పలవంటి ముండ్లచేతఁ గప్పఁబడిన యెల్లయంగములుగల యొకవిధమైన పంది, శల్యకము. ''ద్వి. కుందేలునుడుమునుగూర్మంబునేదుఁ, బందియాళువయునుభక్ష్యముల్ గాని, పంచనఖంబనిప్లవగంబుఁదినరు.'' సం. ''శల్యకశ్శ్వావిత్ గోధాశశఃకూర్మశ్చపంచమః.'' రా. కిష్కి-౦, కాం. (కొందఱు దీనిని నఖమృగమందురు.)

**ఆళువరి.** దే. వి. అలంగము, (రూ. ఆడువరి.)

**ఆళువారు.** దే. వి. హరిభక్తుఁడు. ''గీ. అనినమాఱువలుకనళికి యయ్యాళువా, రియ్యకొనియెఁబోవ.'' ఆము. ౨, ఆ.

**ఆళ్లకోస.** దే. వి. ఒకదినుసుకాకి.

**ఆళ్లు.** దే. వి. బ. (అరుగ+లు.) ధాన్యవిశేషము, కోద్రవము.

**ఆళ్వారు.** దే. వి. ఆళువారుయొక్క-రూపాంతరము. ''శా. అంచత్ప్రేమవశంవదుండగుచు నాయాళ్వారిఁజేరంగర, మ్మంచుం బిల్చిమురారి.'' పర. ౪, ఆ.

## ఇ.

**ఇ.** ఒకయక్షరము.

**ఇన్స్పెక్టరు.** ఆం. వి. సైవిచారణచేయువాఁడు.

**ఇంకు.** దే. అ. క్రి. వట్టు, శోషిల్లు.

**ఇంకుడు.** దే. వి. ఇంకుట. విశే. 1. ఇంకినది; 2. ఎండినది. ''సీ. ఇంకుడుచన్నులువంకచేతులుఁగడువలమైనగానుగవంటినడుము.'' పారిజా. ౪, ఆ.

**ఇంగము.** సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. ఆశ్చర్యము; 3. తెలివి. విశే. తిరుగునది.

**ఇంగలము.** వై. వి. నిప్పు. ''క. వంగడపువెదురుఁగోవపు, టింగలమునసేర్చికనినయాసిరి.'' పాండు. ౫, ఆ.

**ఇంగాలము.** ప్రా. వి. అ. పుం. బొగ్గు.

**ఇంగితము.** సం. వి. అ. న. 1. అభిప్రాయము; 2. బొమముడి లోనగువికారము.

**ఇంగిలము.** వై. వి. ఇంగలము. ''గీ. కెరలునాతేనితూపుటింగిలమునందు.'' అచ్చ. సుం, కాం.

**ఇంగిలాయి.** దే. వి. మత్స్యవిశేషము.

**ఇంగిలీకము.** వై. వి. రాగద్రవ్యవిశేషము, హింగుళము. ''గీ. ప్రాగ్దిశాకాంతనిండుగర్భంబునందు, సూర్యుఁ డుదయింపఁ బ్రొద్దులు వొచ్చియుండ, మొదలఁదీర్చినకొమ్మలకయొండ, నింగి యింగిలికానసఖ్యంగమార్చె.'' కాశి. ౧, ఆ.

**ఇంగిలీకము.** వై. వి. ఇంగిలికముయొక్క-రూపాంతరము. ''సీ. తరుణాంగుళిచ్ఛాయ దంటపుసరకట్టు లింగిలీకపువింతరంగులీన.'' సాన. ౧, ఆ.

**ఇంగుది.** సం. వి. ఈ. స్త్రీ. గారకీ.

**ఇంగువ.** వై. వి. కూరలుమొదలగువానికుపయోగపడువస్తువు, హింగువు.

**ఇంచిమంచి.** దే. వి. ఏ. రుచిగలభక్ష్యము. ''గీ. తనకు ననఁకూలయగునొక్క-దాసితోడ, మాలిమియొనర్చికొనియించిమంచిపెట్టి.'' శుక. 3, ఆ.

**ఇంచు.** యు. దే. అ. క్రి. 1. ఇంపగు; ''క. నీ కర్ణములకునించునెట్లుకార్యవచనముల్.'' భార. ఉద్యో. ౨, ఆ.—2. మనోజ్ఞమగు. ''ఎ, గీ. మెఱసితామేటివెన్నెలమిన్నయించె.'' (హరిశ్చంద్రకథయందు—ఎలమిఁగనఁ చెననియు, నలకథయందు—మేటివెన్నెలమిన్న ఇంచెననియు భేదము.) హన. 3, ఆ.—స. క్రి. కోరు. ''క. పల్వలలక్ష్మ్యుత్పల్వమగను, బులినమ్ములనించెలీల భూవరుఁడవటన్.'' (హరిశ్చంద్రకథయందు—నించెననియు, నలకథయందు—ఇంచెననియు భేదము.) హన. ౨, ఆ.—వై. వి. చెఱుకు.

**ఇంచుఁబోఁడి.** ద్వ. వి. (ఇంచు+పోఁడి.) 1. చెఱుకువలె మనోజ్ఞారాలగు ఆఁడుది; 2. ఆఁడుది; (చూ. అలరుఁబోఁడి.)

**ఇంచుక.** దే. అవ్య. కించిత్తు. (ఆమ్రేడితమునందు ఇంచించుక.)

**ఇంచుపాలకడలి.** ద్వ. వి. ఇక్షుసముద్రము.

**ఇంచుమించు.** ద్వ. వి. న్యూనాధిక్యము. ''గీ. నలినలీలనంచు నలినలిగాఁబించు, నించుమించులాడు నించుమించు, లేమనగవు చూపులు.'' విజ. ౧, ఆ.

**ఇంచువిలుతుఁడు.** ద్వ. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (రూ. ఇంచువిల్తుఁడు.) (ఇంచువిలుకాఁడనియు.)

**ఇంజేటి.** దే. వి. ఒకదినుసుకందకీ. (ఈఁజేటియొక్క-రూపాంతరము.)

**ఇంటరము.** దే. వి. ఇఱుకు, సంకటము. ''ఒంటరమింటరములు వలుకుటుచితమే.'' భార. ఉద్యో. ౪, ఆ.

**ఇంటికాఁపు.** దే. వి. (ఇల్లు+కాఁపు.) గృహస్థుఁడు.

**ఇంటిపట్టు.** దే. వి. (ఇల్లు + పట్టు.) గృహస్థధర్మము. "సీ. పసుపు నిగ్గులుదేఱుపాఁప జన్నిదమొప్పఁ బ్రమథాధిపతియింటిపట్టైపెం గె." స్వా. ౧, ఆ.

**ఇంటిపాప.** దే. వి. (ఇల్లు + పాప.) వెలకుఁగొన్న దాసి.

**ఇంటియాతఁడు.** దే. వి. (ఇల్లు + ఆతఁడు.) పెనిమిటి, భర్త, (రూ. ఇంటాతఁడు.)

**ఇంటిల్లిపాది.** దే. అవ్య. (ఇల్లు + ఇల్లు + పాది.) కుటుంబము వారందఱు.

**ఇంట్రపడు.** ద్వ. అ. క్రి. (ఇంట్రము + పడు.) సంకటపడు. "గీ. కడఁగికల్పాదిఁగ్రమ్మఱఁగలుగఁజేయఁ, దనకపనిగాసనట్టునో చ్చినజగముల, నోలిఁగంజోదరుండుని జోదరమున, నింట్రపడ కుండఁగానిల్పె నెదములిచ్చి." హరి. ఉ. ౯, ఆ.

**ఇంట్రము.** దే. వి. ఇంటరముయొక్క రూపాంతరము. "గీ. ఎదు రుగానెగుచెంచుచో నింట్రమయ్యెఁ, బెండ్లియిరువంక చుట్టంపుఁ బెద్దలకును." నై. ౬, ఆ.

**ఇండె.** దే. వి. 1. చీలిక, ఆస్ఫోటనము; 2. ఎముకకీలు.

**ఇండెవాయు.** దే. అ. క్రి. చీలు, ఆస్ఫోటితమగు.

**ఇంత.** ద్వ స. (ఈ + అంత.) 1. ఈకొలఁది; "ఎ, గీ. నీయోగ వైభవమింతయంతని పొగడనేనెంతదాన." కళా. ౩, ఆ.—2. ఇది యంతయు. "క. ఏనూరకయుంచెదుదోడె, వ్వారికిఁబో నింత నిక్కువంబెఱ్ఱంగిన్." భార. ఉద్యో. ౧, ఆ. (శబ్దముకంటెఁ బరమైన ఆ శబ్దముయొక్క అకారమునకువలె ఈలోనగు శబ్దముల కంటెఁ బరమైన అంతలోనగు శబ్దములయొక్క అకారమునకు లోపమని యెఱుంగునది. ఈకారము మొదలగువాని దీర్ఘమునకు హ్రస్వమగును.) ("వ. సర్వలోకాభిగమ్యుండగునమ్మహానుభావు నకు మనమభిగమ్యులమైతిమి. మనకింతకంటెను తెంపెయ్యది." ఇత్యాది స్థలములయందు ఇంతశబ్దము ఈయనుశబ్దముయొక్క అర్థము నిచ్చుచున్నది. "చ. కుంతియింతకున్, బడుగయిపాల లోఁబడినబల్లివిధంబుననుండకుండునే." ఇక్కడ ఇంతకున్ అనఁగా ఇంతకాలమునకు అని యర్థము. చూ. అంత.)

**ఇంతపట్టు.** ద్వ. స. (ఇంత + పట్టు.) 1. ఇదియంతయు; "మ. జనకుండున్ గురుభీష్ములున్ దగినకర్జంబాప్తులైనీకుఁబ్రీ, తినెఱుం గించుతెఱంగుగాదు తమబుద్ధింబోయినంధానమి, ట్లొనరంజేయక యున్నఁగృష్ణునకునిన్నొప్పించువారింతవ, ట్టునిజంబు." భార. ఉద్యో. ౩, ఆ.—2. ఇంతమాత్రము. "చ. అతులితవిష్ణుశక్తినము హాహితమూర్తివిక్రమ్ములెమ్మునం, తతభుజశక్తినిట్టి యవధానమొనర్పఁగ నీవకానిమ్మా, క్షితినొకరుండులేఁడధికకీర్తియుఁ బుణ్యముఁజేరు నిన్ననూ, ర్జితగుణయింతపట్టుతగఁజేయుము కావ్రుములోకమంత యున్." భార. అర. ౪, ఆ.

**ఇంతి.** వై. వి. ఆఁడుది, మగువ, వనిత.

**ఇంతియ.** ద్వ. స. (ఈ + అంతియ.) ఇంతమాత్రము. "మ. పెక్కండ్రకిం, తియకాలంబయియుండ నీమనముశాంతింబొం దఁగానేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ. (చూ. ఇంత.)

**ఇంతె.** ద్వ. స. ఇంతియయొక్క రూపాంతరము. (రూ. ఇంతే.)

**ఇందనుక.** ద్వ. క్రి. (ఇంత + దనుక.) ఇందాఁక.

**ఇందము.** దే. స. క్రి. ని. ఇదిగో తీసికొనుము. "జడలోరత్న మిందమనుచునిచ్చి." రామా. ౬, ఆ. (దీనికి బహువచనము ఇందండి. మొ.)

**ఇందఱు.** ద్వ. స. (ఇంత + వారు.) ఇంతశబ్దమునకు మనుష్యార్థకబహువచనరూపము, వీరందఱు. (ఈపురుషులందఱు. ఈ స్త్రీలందఱు. ఈస్త్రీపురుషులందఱు.) 2. ఇంతసంఖ్యగలవారు.

**ఇందాఁక.** ద్వ క్రి. (ఇంత + దాఁక.) ఇంతపర్యంతము.

**ఇంది.** సం. వి. ఈ. స్త్రీ. ఇందిర, రమ, లక్ష్మి.

**ఇందిందిరము.** సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద.

**ఇందిర.** సం. వి. ఆ. స్త్రీ. రమ, లక్ష్మి.

**ఇందీవరము.** సం. వి. అ. న. 1. నల్లగలువ; 2. తామర.

**ఇందీవరి.** సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీచర.

**ఇందు,** దే. అ. క్రి. 1. అడఁగు; "ఇందనియామఁచేఁబొదలు నేనఁగులు." య. ౪, ఆ.—2. ఇముడు. క్రి. ఇచ్చోట

**ఇందుఁడు.** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు, చందమామ.

**ఇందుగు.** దే. వి. చిల్ల, కతకము. "ఎ, గీ. అందుగులు గేదఁగులు మఱులిందుగులును." అచ్చ. సుం, కాం. (దీనిగింజచేత నీళ్లు తేఱును.)

**ఇందుప్పు.** ద్వ. వి. (ఇందు + ఉప్పు.) సైంధవలవణము.

**ఇందులకు.** దే. క్రి. 1. ఇచ్చోటికి; "ఇందులకి మ్మెయిన్ మనుజు లెన్నఁడువత్తురె." భార. ఆది. ౬, ఆ.—2. దీనికి "వ. ఇందు లకుఁబొందువడుప్రత్యుత్తరంబుల వినింగలంకిన బుద్ధి క్షోభం బుగా నింతకంటె నేమీమియబద్ధంబులువినంబడునో." ఆము. ౬, ఆ.

**ఇందువారము.** సం. వి. అ. పుం. సోమవారము.

**ఇందువు.** ఉభ. దే. వి. 1. చిల్లచెట్టు; "ఉ. ఇందువుగింజచే నుదకమెంతయు శీఘ్రముగం బ్రసన్నతన్, జెందునిధంబునన్." శివ. ఉ. ౩, ఆ.—2. చిల్లగింజ. "సీ. గాగహీనతమనో గ్రం థిఁద్రెంపఁగనీళ్లకలఁకనిందువుజూచితెలుచుభంగి." వ సి. 3, ఆ.— సం. ఉ. పుం. పలమెత్తువెండి.

**ఇంద్ర.** సం. వి. ఆ. స్త్రీ. మరువము. అ. పుం. ము. ఒక గ్రహయోగము.

**ఇంద్రకీలము.** సం. వి. అ. పుం. మందరపర్వతము.

**ఇంద్రకోశము.** సం. వి. అ. పుం. మంచె.

**ఇంద్రగోపము.** సం. వి. అ. పుం. ఆరుద్రపురుగు.

**ఇంద్రజాలము.** సం. వి. అ. పుం. కనుకట్టువిద్య.

**ఇంద్రజాలికుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రజాలము చేయు వాఁడు.

**ఇంద్రతూలము.** సం. వి. అ. న. దూదిప్రోవు.

**ఇంద్రద్రువు.** సం. వి. ఉ. పుం. ఏఱుమద్ది.

**ఇంద్రనీలము.** సం. వి. అ. పుం. నీలమణి, నల్లరాయి.

**ఇంద్రయవము.** సం. వి. అ. న. కొడిసెకాయ.

**ఇంద్రలుప్తకము.** సం. వి. అ. న. బట్టతల.

**ఇంద్రలుప్తకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) బట్టతలవాఁడు.

**ఇంద్రవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. ఇల్లింద.

**ఇంద్రవారుణి.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాఁవర.

**ఇంద్రసురసము.** సం. వి. అ. పుం. వావిలి.

**ఇంద్రాణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రునిభార్య; 2. ఒక మాతృక; (చూ. మాతృక.) 3. వావిలిచెట్టు.

**ఇంద్రాయుధము.** సం. వి. అ. న. మేఘములందు నానావర్ణమై ప్రతిఫలించుచు ధనురాకారముగా గానంబడెడి సూర్యకిరణము, రతనపుసిల్లు.

**ఇంద్రారి.** సం. వి. ఇ. పుం. అసురుఁడు, వేల్పువాయ.

**ఇంద్రావరజుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**ఇంద్రియము.** సం. వి. అ. న. 1. త్వగాది; (ఇవిపది.—త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము; (ఇవి జ్ఞానేంద్రియములు.) వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము (ఇవి కర్మేంద్రియములు.) మనస్సుతోడంగూడ ఏకాదశేంద్రియములనంబడు.) 2. రేతస్సు.

**ఇంద్రియార్థము.** సం. వి. అ. పుం. శబ్దాదివిషయము. (ఇవి యైదు.—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.)

**ఇంద్రుఁడు.** సం. వి. అ. పుం. 1. వేల్పుఱేఁడు; 2. ఒక ఆదిత్యుఁడు; (చూ. ఆదిత్యుఁడు.) 3. అంతరాత్మ.

**ఇంధనము.** సం. వి. అ. న. 1. చిదుగు; 2. వంటచెఱకు.

**ఇంపితము.** దే. విశే. (ఇంపు+ఇతము.) ఇంపైనది. (ఇది పోరితమువంటిది.)

**ఇంపు.** దే. వి. 1. ఆనందము; "అయింపే పరబ్రహ్మము." సావి. ౨, ఆ. 2. ఇచ్ఛ. "ఉ. ఓనితంబినిసుగంధి పటాభరణాదికంబుసీ, నమ్మదికించెనోయనుడునేడయినం బరికించితౌరసా, నెమ్మదియింపుగింపునని నీరజలోచనపల్కి వెండియుౝ." పర. 3, ఆ.—విశే. ఇష్టము. "క. అనిందితచరితములెసుమ్మునీమదికింపుల్." కళా. ౭, ఆ.

**ఇంబు.** దే. వి. ఇంపుయొక్క రూపాంతరము. "ఉ. ఇంబడరంగనియ్యకొనియెౝరజనీచరుఁ డేమిభాగ్యమో, యంబుజనాథ." ప్రభా. ౧, ఆ.

**ఇఁక.** దే. ద్ర. 1. ఇటుపైని; 2. మఱియు. "ఇమ్మునీశ్వరు సామర్థ్యమునింకఁజెప్పెద." రా. అర. ౧, ఆ.

**ఇఁగ.** దే. ద్ర. ఇఁకయొక్క రూపాంతరము.

**ఇక్క.** దే. వి. 1. స్థానము; "క. ఎయ్యదిసుఖములకు నిక్కయేర్పడఁజెపుమా." భార. అర. ౭, ఆ.—2. ఇల్లు.

**ఇక్కట్టు.** దే. వి. (ఇక్కు+కట్టు.) ఇక్కుపాటు, సంకటము. (ఇక్కు ఇఱుకుయొక్క మాఱురూపమని తెలియవలెను.)

**ఇక్కడ.** దే. వి. ఏ. (ఈ+కడ.) ఈచోటు. (చూ. అక్కడ.)

**ఇక్కము.** దే. వి. ఇఱుకటముయొక్క రూపాంతరము. "ఉ. ఎక్కడివాఁడవన్నకడునిక్కపుఁగాఁడవింజరించెదు." ఉ, హరి. ౨, ఆ.

**ఇక్కుపాటు.** దే. వి. (ఇఱుకు+పాటు.) ఇక్కట్టు. "ద్వి. అక్కటాపుణ్యాత్ముఁడైనసెకిట్టి, యిక్కుపాటునుగల్గెనేతంద్రియను చు." రా. సుం, కాం.

**ఇక్కువ.** దే. వి. 1. ఉనికి; "ఎచ్చటఁగంటిరోవిజయునిక్కువనిక్కువమానె." విజ. ౨, ఆ. "క. చక్కరవిలుకాఁడొకఁడే, నొక్కఁడఁదద్దైవరులము వియోగవ్యథచే, నక్కడనెపాలియుఁబోలియక, యిక్కువనిటవచ్చెనేనియిక్కడఁబోలియుౝ." (ఇక్కువౝ—ఇక్కడ జీవముతోననియర్థము.) రామా. ౬, ఆ.—2. జాడ; "ద్వి. ఇటుచెల్లుమాటలయిక్కువలెఱిఁగి." రా. యు, కాం.—3. కళాస్థానము; "ఇక్కువలంటి." నీలా. 3, ఆ.—4. స్థానము. "క. దిక్కులనెల్లఁబొగడ్తకు. నెక్కినయక్కజపుఁగడిమినేవారెఱుమీ, రిక్కడనుండియుమీమీ, యిక్కువలనుజనుఁడు దాన వేశ్వరులారా." రా. యు, కాం.

**ఇక్షుగంధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గోరిగాడిచెట్టు; 2 తెల్లనేల గుమ్మడిచెట్టు; 3. పల్లేరుచెట్టు, 4. ఉల్లిచెట్టు.

**ఇక్షుధన్వుఁడు.** సం. వి. న్. పుం. మన్మథుఁడు, ఇంచువిల్తుఁడు.

**ఇక్షునాళిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లచెఱకుచెట్టు.

**ఇక్షురము.** సం. వి. అ. పుం. ములుగోరింటచెట్టు.

**ఇక్షువణము.** సం. వి. అ. న. చెఱుకుతోఁట.

**ఇక్షువు.** సం. వి. ఉ. పుం. ఇంచు. చెఱకుచెట్టు. (దీనిభేదములు.—పుండ్రము, కాంతారము, తాపసము, కాండేక్షువు, సూచీపత్త్రము, నైపాలము, దీర్ఘపత్త్రము. ..)

**ఇక్షుశాకటము.** సం. వి. అ. న. చెఱకుపండెడు పొలము.

**ఇక్షూదము.** సం. వి. అ. పుం. చెఱకుసముద్రము.

**ఇక్ష్వాకువు.** సం. వి. ఉ. స్త్రీ. చేదుసొరచెట్టు. పుం. సూర్యవంశపురాజులలో నొకఁడు.

**ఇగము.** వై. వి. ఇవము, శైత్యము*.

**ఇగిరించు.** దే. అ. క్రి. 1. చిగిరించు; 2. ఎత్తునగు. "అనుమఁడలిగిమొగమిగిరింపౝ." య. 3, ఆ.

**ఇగిరిక.** దే. వి. హావిస్సు.

**ఇగిలించు.** దే. స. క్రి. పండ్లను వెలిపఱచు.

**ఇగిలింత.** దే. వి. ఇగిలించుట.

**ఇగురుఁబోఁడి.** దే. వి. స్త్రీ. 1. చిగురువలెమనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

**ఇగురు.** దే. అ. క్రి. ఇంకు. వి. 1. చిగురు; 2. పండ్లచుట్టు నుండుకండ.

**ఇగురుకొను.** దే. అ. క్రి. చిగిరించు, పల్లవించు.

**ఇగురుచు.** దే. అ. క్రి. చిగిరించు, (రూ. ఇగుర్చు.)

**ఇగురొత్తు.** దే. అ. క్రి. 1. చిగిరించు; 2. అనురక్తమగు. "వెడనవ్వునఁబ్రియుచిత్తంబిగురొత్త." భార. అర. ౭, ఆ.

**ఇగులుచు.** దే. స. క్రి. ఇగిలించు, (రూ. ఇగుల్చు.)

**ఇగో.** దే. ద్ర. ఇదిగోయొక్క రూపాంతరము. "వీఁడిగో గుజ్జుపుదొంగవచ్చె." జై. 3, ఆ.

**ఇగ్గు.** దే. అ. క్రి. వెనుకకొఱగు. (ఈగుయొక్క రూపాంతరము.) (ఇగ్గ మ్రొగ్గనీడ్చెను.) "ఉ. ఇగ్గెడువెన్నకుంబయికినీడ్చినఁదైటఁ దొలంగఁజేయఁగే, లొగ్గెడు." (ఇక్కడ ఒఱగుటమాత్రము అర్థము.) విజ. ౨, ఆ.

**ఇగ్గులాట.** దే. వి. ఇగ్గులాడుట.

**ఇగ్గులాడు.** దే. స. క్రి. వెనుకకీడ్చు. "చిరగతినిగ్గులాడకు వెసిగ్గ." రస. 3, గుచ్ఛము.

**ఇగ్రుచు.** దే. అ. క్రి. ఇగురుచుయొక్క రూపాంతరము. "ఎ, గీ. ఇగ్రుచుకోర్కులందనడెందమివతళింప." కవిక. 3, ఆ.

**ఇచ్చిపుచ్చుకోలు.** దే. వి. ఇచ్చిపుచ్చుకొనుట.

**ఇచేటు.** దే. వి. ఏ. ఇచ్చోటుయొక్క రూపాంతరము.

**ఇచోటు.** దే. వి. ఏ.——పై.——

**ఇచ్ఛె.** వై. వి. 1. ఇచ్ఛ; 2. చిత్తము*; "అనితసమాటకియ్య కొనుసన్నరుపల్కులకిచ్ఛ మెచ్చి." భార. మహా. ౧, ఆ.— 3. యదృచ్ఛ*. "క. ఎచ్ఛోటలనన్నవాఁడటఁ, డిచ్ఛోటికినేలరాఁ డొయిప్పుడనుడుఁదా, నచ్ఛటనంతర్హితుఁడై, యిచ్ఛఁజనియెఁదోఁచు నేటియెల్లిటిలోనన్." భార. విరా. ౫, ఆ.—విశే. అభీష్టము*. "క. సన్నిధిఁబన్నగహారుఁడు, పెన్నిధిఁగనిపొంగుచున్న పేదల క్రియన, య్యన్నాదమ్ములఁగనిమీ, కెన్నఁగనేవరములిచ్ఛయిచ్చెద వానిన్." ఉ, హరి. ౪, ఆ.

**ఇచ్ఛకము.** వై. వి. ప్రియవచనము*. విశే. ప్రియము*. "ఎట్లి చ్ఛకమయ్యెనీకునివి." కాశీ. ౨, ఆ.

**ఇచ్ఛకుఁడు.** వై. విశే. ఇచ్ఛకములాడువాఁడు*. "గీ. అప్పు డిచ్ఛకులగుచు బ్రాహ్మణులుకొందఱు." ఆము. ౪, ఆ.

**ఇచ్ఛగించు.** వై. స. క్రి. 1. ఇచ్ఛయించు; 2. అంగీకరించు*. "ఉ. నాతలపిచ్ఛగింపుమనినన్ బ్రభుఁడించుకయియ్యకోలు నన్." హరి. ఉ. ౭, ఆ.

**ఇచ్ఛగింత.** వై. వి. ఇయ్యకోలు, అంగీకారము.

**ఇచ్ఛగొండి.** వై. విశే. ఇచ్ఛకములాడువాఁడు. "సీ. ఇచ్ఛగొం డులకిచ్చియుచ్చమల్లులకిచ్చివారకయుబ్బించువారికిచ్చి." విక్ర. ౭, ఆ.

**ఇచ్ఛోటు.** దే. వి. ఏ. ఇచ్చోటుయొక్కరూపాంతరము.

**ఇచ్చు.** దే. స. క్రి. ఇడు, ఒసఁగు, దానముచేయు.

**ఇచ్చోటు.** దే. వి. ఏ. (ఈ+చోటు.) ఈస్థానము. (రూ. ఇచ్ఛోటు.)

**ఇచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. కాంక్ష, వాంఛ, ఇచ్ఛె.

**ఇచ్ఛావతి.** సం. వి. ఈ. స్త్రీ. సంభోగము తక్క తక్కినవిషయ ములందు ఇచ్ఛగలస్త్రీ, కాముక.

**ఇజాఫా.** హిం. వి. వృద్ధి, ఎక్కువ.

**ఇజారా.** హిం. వి. గుత్త.

**ఇజారు.** హిం. వి. కాళ్లకు తొడిఁగికొను లాగు.

**ఇజ్జెకు.** దే. వి. 1. శ్రమము; 2. సంకటము.

**ఇజ్జలము.** సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు*.

**ఇజ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. పూజ; 2. ఈవి; 3. యజ్ఞము; 4. సంగమము; 5. కుంటెనకత్తె.

**ఇజ్యుఁడు.** సం. వి. అ. పుం. బృహస్పతి. విశే. గురువు.

**ఇట.** దే. వి. ఏ. ఇక్కడ. "వాఁడిటవచ్చువాఁడొ యేనందులకేగు దాననో." భార. అర. ౨, ఆ. (చూ. అట.)—క్రి. ఈవల.

**ఇటఁబట్టి.** దే. అవ్య. ఇదిమొదలుకొని. "క. దివమకానియింక భువనంబులందిటఁ, బట్టిరాత్రిలేని యట్టుగాఁగఁ, జేసెనొక్క విధి." భార. విరా. ౨, ఆ.

**ఇటిక.** వై. వి. బంకమట్టితోఁజేసి కాలవేసినఱాయి.

**ఇటికపగడము.** వై. వి. మట్టిపగడము, తిక్కణిక.

**ఇటు.** దే. అవ్య. ఇట్లు. "ఉ. ఊహయొనర్పరోయతిశయోక్తుల వర్ణనలందునిట్టియ, వ్యాహతిసెల్లునంచునోయిటాడితిరి." కళా. ౧, ఆ.

**ఇటులు.** దే. అవ్య.———పై.———

**ఇటువంటి.** దే. విశే. ఇట్టి. "కాగాదిటువంటిపల్కనక." కళా. 3, ఆ.

**ఇటువలె.** దే. క్రి. ఇట్లు. "ఇటువలెవెదకియు." రామ. ౬, ఆ. (చూ. అటమట.)

**ఇట్చరము.** సం. వి. అ. పుం. షండము, ఆఁబోతు.

**ఇట్టలము.** దే. విశే. అగ్గలము, అధికము. "ఇట్టలపురియంబుసం బొదివిడాసె." భార. విరా. 3, ఆ. "క. ఇట్టలముగఁదగిలినట్టి యెఱ్ఱలువోలెన్." స్వా. ౪, ఆ.

**ఇట్టి.** దే. విశే. ఇటువంటి.

**ఇట్టిఁడు.** దే. విశే. (ఇట్టి+వాఁడు.) ఇటువంటివాఁడు. "గీ. ఎఱుఁగమేమెవ్వరము నతండిట్టిఁడగుట." భార. శాం. ౧, ఆ. (బ-ఇట్టిరు.)

**ఇట్టిక.** వై. వి. ఇటికఱాయి.

**ఇట్టు.** దే. అవ్య. ఇట్లు.

**ఇట్టులు.** దే. అవ్య.———పై.———

**ఇట్టువోలె.** దే. క్రి.———పై.——— "వ. నసఁగనియొంను సత్వముమసంబునబెగ్గిలిడాయునప్పుడి, మ్మునిపఁగుఁడిట్టువోలెఁ గృపమొక్కలమై శరభంబుగాఁగఁజేయునో." భాగ. శాం. 3, ఆ.

**ఇట్లు.** దే. అవ్య. 1. ఈప్రకారము; 2. ఇఁకమీఁదఁజెప్పఁబోవు ప్రకారము. "ధర్మజునకు రోమశుండిట్లనియె."

**ఇడ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకనాడి; (చూ. నాడి.) 2. నేల; 3. యజ్ఞమునందలి భక్షణపాత్రము; 4. బుధగ్రహముపెండ్లాము; 5. మాట; 6. ఆవు.

**ఇడిి.** దే. వి. ఒకతూరియావిరిని ఒకతూరియెసటను వండిసపిండిని తామరనూలిపోఁగంత సన్నముగా యంత్రమునఁబిండెడు భక్ష్య విశేషము, సేవియ. "వ. బుడుకులుసడుకులు నిడియుఁ జలి మిడియును." కాశీ. ౭, ఆ.

**ఇడికుడక.** దే. వి. భక్ష్యవిశేషము. "వ. ఏలకిః యులువెన్న మెఱుంగులునిడికుడకలుసడికుడకలు." హంస. ౧, ఆ.

**ఇడిక్కము.** సం. వి. అ. పుం. ఏడకము, పొట్టేలు.

**ఇడియు.** దే. అ. క్రి. చీలు, భేదిల్లు. "సీ. మారుతాహతిరాలు నారికేళఫలాళి నిడిసిజల్లించుపుండ్రేక్షురసను." పాండు. ౧, ఆ. "సీ. ఇదిచిల్కపోటులనిడియుదాడిమ ఫలంబులజాఱురస ముచాల్ పొరలువాఁక." చంద్ర.

**ఇడు.** దే. స. క్రి. 1. ఇచ్చు; 2. ఉనుచు.

**ఇడుగడ.** దే. వి. 1. అసూయ; "చ. తడయకమ్రొక్కియున్న వినతాసుతునప్పుడుసూచియాత్మలో, నిడుగడసేయుచున్ గడున హింపక." భార. ఆది. ౨, ఆ.—2. హీనత్వము. "చ. వెడ లఁగనీకగొందినిడి వేయివిధంబుల భంగపెట్టుచున్, జడకలుకట్ట నిచ్చినిజసంపదకుంజొరనీకనిచ్చలుం, గడియెడుకూడువెట్టుచును గాసియొనర్చుచు నేలతెంకిపై, నిడుగడసేయఁగావలయు నీలువు మాలినఅంకుటాంద్రకున్." విజ్ఞా. ఆచా, కాం. (ఇది విచారిం పఁదగినది.)

**ఇడుపు.** దే. వి. 1. చీలిక; "ఇడిసిన యిడుపులయెడలః" ఆము. ౬, ఆ.—2. గోడయిరుపార్శ్వముల మీఁదిచోటు. "గీ. దారువనవీథిశీతాంశుధరునిచంతు, శౌరిగోపాలకామినీచౌర్యకేళి, కామరసభావములుమించి కానఁబడఁగఁ, దీర్చియిడుపులయందుఁ జిత్రించినారు." నై. ౭, ఆ.

**ఇడుమ.** దే. వి. 1. ఆపద; "గీ. మగువఁగోల్పోయి కడునిడు మలఁగలంగు." అచ్చ. సుం, కాం.—2. అలసట, క్లేశము.

"గీ. విప్రవరులుభోగములకువేడ్క-సేయ, రిడుమలిహమునఁబడి కాంతురెలమిఁబరము, నందుసుఖము." మార్క. ర, ఆ.

**ఇడుమపాటు.** దే. వి. ఇడుమపడుట.

**ఇడ్డెన.** దే. వి. వానెనకుదురు.

**ఇతఁడు.** దే. స. పు. ఈపూజ్యుఁడు. (ఈతఁడుయొక్క-రూపాంతరము.)

**ఇతఃపరము.** సం. క్రి. విశే. అ. స. ఇఁకమీఁద.

**ఇతకరి.** వై. విశే. హితమైనది. "వ. ఇతకరిమాటల మొత్తంబుల నారలచిత్తంబులను గలంచె." భార. అను. ౧, ఆ.

**ఇతము.** ఉభ. వై. విశే. హితము. "ఎ, గీ. పలుపలుకఁదేలయింక నాచెలులుగిలులు, నేగుదెంచి పిన్ను మొనర్తు రితవెఱుఁగక." (ఇతము—ఇతమైనకార్యమని యర్థము.) కళా. 3, ఆ.—సం. (అ. ఆ. అ.) 1. తలఁపఁబడినది; 2. పొందఁబడినది.

**ఇతరుఁడు.** సం. స. (అ. ఆ. అ.) అన్యుఁడు. విశే. అధముఁడు.

**ఇతరేతరము.** సం. స. (అ. ఆ. అ.) పరస్పరము, ఒండొకటి.

**ఇతవరి.** వై. విశే. (ఇతవు+అరి.) హితముచెప్పువాఁడు.

**ఇతవు.** వై. విశే. హితము. "క. పితృపూజనమని యెవ్వరి, కితవు గఁజేయుదురుదీని నెఱిఁగింపుఁడివా." భార. అను. ౪, ఆ.

**ఇతవుఁడు.** వై. విశే. హితుఁడు. "చ. ఇట్టివారితవులుతండ్రికిఁ సుతుల కేమననేర్తుము పెద్దరాజులక." భార. ఉద్యో. ర, ఆ.

**ఇతికర్తవ్యత.** సం. వి. ఆ. స్త్రీ. ఇట్లు చేయఁదగినదనుట.

**ఇతిహాసము.** సం. వి. అ. పుం. తొల్లిటికథ.

**ఇత్తడి.** వై. వి. ఒకలోహము, (చూ. లోహము.) (రూ. ఇత్తళి.)

**ఇత్తిగ.** ద్వి. వి. (ఇరు+తిగ.) పాచికలమీఁదిమూఁడుబొట్లజత, దుందుభి.

**ఇత్రాలము.** సం. వి. అ. న. కరబుజముకీ.

**ఇత్వరము.** సం. వి. అ. పుం. ఇట్బరము, ఆఁబోతు.

**ఇత్వరి.** సం. వి. ఈ. స్త్రీ. అసతి, ఱంకుటాలు.

**ఇత్వరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. దరిద్రుఁడు; 2. నీచుఁడు; 3. క్రూరకర్ముఁడు; 4. బాటసారి.

**ఇది.** దే. స. ఈ శబ్దమునకు అమహదర్థక ప్రథమైకవచనము, ఈ యది. (ఈ యాఁడుది. ఈ పళ్ళెది. ఈ జడవస్తువు.) (చూ. ఈ.)

**ఇదిగో.** దే. ద్ర. (ఇది+కొమ్ము.) చూపుటనుతెలిపెడిని. (రూ. ఇదిగో. "క. పూఁబోఁడియొరసికొనిచనఁ, గాఁబయ్యెదయొడిసి పట్టెఁ గనుఁగొంటెచెలీ, లేఁబొన్ననబళిరాయిది, గోఁబురుషావ్యయము నిలుపుకొను సమయంబుల." కళా. ౧, ఆ.)

**ఇద్దఱు.** దే. స. రెండుశబ్దమునకు మహన్మహత్వర్థక బహువచనాదేశము, ఇరువురు.

**ఇద్ది.** దే. స. ఇదియొక్క-రూపాంతరము.

**ఇద్దుగ.** ద్వి. వి. (ఇరు+దుగ.) పాచికమీఁది రెండుబొట్లజత. "క. అత్తివంచిత్తిగదుగ, సత్తాదచౌకవంచచావంచీరై, దిత్తిగయద్దుగబద్రలు, చిత్తంబునఁదలఁచినట్లు చేతికిఁదెచ్చున." ఉ, హరి. 3, ఆ.

**ఇద్దుము.** దే. వి. (ఇరు+తూము.) రెండుతూములు.

**ఇద్ధము.** సం. వి. అ. పుం. ప్రకాశము. విశే. 1. పరిశుద్ధము; 2. ప్రకాశితము.

**ఇధ్మము.** సం. వి. అ. న. 1. చిదుగు; 2 వంటచెఱకు.

**ఇనాం, ఈనాం.** హిం. వి. బహుమతి, మాన్యము.

**ఇని.** ద్వి. స. పు. ఇన్నియొక్క-రూపాంతరము.

**ఇను.** దే. స. వృత్తియందు హల్లుపరముగుచో రెంటికాదేశముగా వచ్చునది. (ఇనుమడి, ఇనుమూఱు. మొ.)

**ఇనుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. రాజు; 3. మగఁడు.

**ఇనుకు.** దే. వి. బొంకుచేతఁగప్పఁబడినయల్పధాన్యము. "ఎ, గీ. తుషయుక్తములగునల్పధాన్యములు చింకయినుకపదంబునపేళ." ..., ధా. ద్వి. త్రై.

**ఇనుమడి.** దే. వి (ఇను+మడుఁగు.) రెట్టి, ద్విగుణము.

**ఇనుమడించు.** దే. స క్రి. రెట్టించు, ద్విగుణించు.

**ఇనుమద్ది.** దే. వి. (ఇనుము+మద్ది.) నల్లమద్ది, అశ్వకర్ణకముకీ.

**ఇనుమనుమఁడు.** దే. వి. మనుమనికొడుకు, ప్రపౌత్రుఁడు.

**ఇనుమిక్కిలి.** దే. విశే. అత్యధికము.

**ఇనుము.** దే. వి. ఒకలోహము, (చూ. లోహము.) కాలాయసము.

**ఇన్ని.** ద్వి. స. పు. (ఇంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) 1. ఈసమస్తము; 2. ఇంతసంఖ్యకలవి.

**ఇన్నూఱు.** దే. స. (ఇరు+నూఱు.) రెండునూఱులు.

**ఇన్మడి.** దే. వి. ఇనుమడియొక్క-రూపాంతరము.

**ఇన్మడించు.** దే. స. క్రి. ఇనుమడించుయొక్క-రూపాంతరము.

**ఇన్సాల్వెంటు.** ఆం. వి. దివాలాతీయుట.

**ఇపుడు.** ద్వి. వి. పు. ఇప్పుడుయొక్క-రూపాంతరము.

**ఇపు.** ద్వి. వి. పు. ఇపుడుయొక్క-రూపాంతరము. (చూ. ఇప్పుడు.)

**ఇప్ప.** దే. వి. మధూకముకీ.

**ఇప్పపూరాజెనములు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము.

**ఇప్పుడు.** దే. వి. పు. (ఈ+ప్రొద్దు.) ఈకాలము.

**ఇబ్బంది.** ద్వి. వి. (ఇను+బంది.) మిక్కిలి నిర్బంధము.

**ఇబ్బంది.** దే. వి. (ఇరు+పంది.) అడవిపందికిని ఊరఁబందికిని పుట్టినపంది. (సంధిని పకారమునకు బకారము. ఇది బెబ్బదిలోనగు వానివంటిది.)

**ఇబ్బందిగాఁడు.** దే. వి. (ఇబ్బంది+కాఁడు.) బెబ్బులికిని చిఱుత పులికిని పుట్టినపులి.

**ఇబ్బడి.** ద్వి. వి. ఇనుమడియొక్క-రూపాంతరము.

**ఇబ్బడించు.** దే. స. క్రి. ఇమ్మడించుయొక్క-రూపాంతరము.

**ఇబ్బెడ.** దే. వి. వృక్షవిశేషము. (హంస. ర, ఆ.)

**ఇభనిమీలిక.** సం. వి. ఆ. స్త్రీ. చాతుర్యము, నేర్పు.

**ఇభము.** సం. వి. అ. పుం. ద్విపము, ఏనుఁగు.

**ఇభ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగుకీ; 2. ఆఁడేనుఁగు. విశే. ఒడయురాలు.

**ఇమిడిక.** దే. వి. 1. అడఁకము; 2. పొందిక.

**ఇముడు.** దే. అ. క్రి. 1. అడఁగు; 2. పొందుపడు.

**ఇముడుకొను.** దే. అ. ప్రే ఇముడ్చుకొను. "గీ. గర్భమందు కమలగర్భాండశతములు, నిముడుకొనినటించునీశ్వరేశ." భాగ. ౧, స్కం. "క. అఘయార్త్తమృగాక్షిక్, దావెనుక నిముడుకొను చుక్, గాత్రముకాత్రమనివాని కరములుపట్టెన్." కళా. 3, ఆ.

**ఇముడుచే.** దే. ప్రే. ఇముడఁజేయు. (రూ. ఇముడ్చు.)

**ఇమ్మడి.** దే. వి. ఇనుమడియొక్క రూపాంతరము.

**ఇమ్మడించు.** దే. స. క్రి. ఇనుమడించుయొక్క రూపాంతరము.

**ఇమ్ము.** దే. వి. 1. స్థానము; "ఎ, గీ. అతులధైర్యంబునకు నీమసో త్తుఁడిమ్ము." ఉ, రా. ౫, ఆ.—2. విరివి; "చ. వినుమిటులు న్నయీజనుల విప్పుగనుంగొనవచ్చినంబురం, బునకిచటిమ్ముచాల దను బుద్ధిజనించెగణించిచూడుమా." హరి. ఉ. ౨, ఆ.—3. ఆనుకూల్యము; "క. తనకిమ్మగునంతకుదు, గ్గనుఁడిష్టుఁడపోలె నుండి సర్పమువోలెక్, దనకిమ్మగునునుగఱచును, ఘనదారుణకర్త గరళ ఘనదంష్ట్రలచేక్." భార. ఆది. ౬, ఆ.—4. ఇంపు; "క. విదితంబైయుద్యోగము, మొదలుగఁబదునొక్క పర్వములనెంతయునొ, ప్పిరమైయేనవపర్వం, బిదినా నుద్యోగపర్వమిమ్మగు సభలక్." భార. ఆది. ౧, ఆ.—5. ఉపాయము; "క. నెమ్మిగలవారిఁ బొల్లరు, తమ్ముల్లనివారివెనుకఁ దగులుదురధిక, త్వమ్మెటేఁగి యెవ్వేగిటొడకుదు, రిమ్మెఱుఁగనియట్టివారలిభపురనాథా." భార. ఉద్యో. ౨, ఆ.—6. సుఖము. "ఇమ్ములనున్నవాఁడెహరి." భాగ. ౧౦, స్కం. పూ. (ఈ యర్థమందు ఇది తఱచుగా ద్వితీయా బహువచనాంతముగానే ప్రయోగములయందుఁ గానఁబడు చున్నది.)—విశే. 1. అనుకూలము; "గీ. ఎత్తికొనిచనంగనిమ్మగు నట్లుగా, మెదలుచున్నవ్రయ్యలదిమిరెంటిఁ, గూడఁబెట్టె" భార. సభా. ౧, ఆ.—2. ఆమూలము; "వ. విచారపూర్వకబద్ధకార్యంబునకుదైవంబు ననుకూలంబగుంగావునసిమ్ముగా విచారింపవలయు." భార. అర. ౧, ఆ.—3. మనోజ్ఞము; "వ. సూపకారుండు వధ్యస్థానంబునకుంజని మనుష్యమాంసంబుఁదెచ్చియిమ్ముగావండిపెట్టిన." భార. ఆది. 2, ఆ.—4. యుక్తము; "వ. ఇమ్మగునవసరంబునఁదద్గృహద్వారంబునందు ఘోరానలంబుదరికొల్పి." భార. ఆది. ౬, ఆ.—5. స్పష్టము. "గీ. వృక్షశాఖాగ్రమునసున్నపక్షిశిరము, తెల్లముగఁజూచితేమహీవల్లభుండ, యని ననిమ్ముగఁ జూచితిననినవెండి, యుసుగురుఁడుధర్మజునకిట్టులనియెఁ బ్రీతి." భార. ఆది. ౫, ఆ.

**ఇమ్ముకొను.** దే. అ. క్రి. వసించు. "సీ. అఖర్వకలితుఁడాశత్రులయమ్మనాకులవృత్తి నిమ్ముకొనఁగఁజేసె." రాఘ. ౨, ఆ.

**ఇమ్ముదప్పు.** దే. వి. (ఇమ్ము+తప్పు.) ఇక్కట్టు, సంకటము.

**ఇయత్త.** సం. వి. ఆ. స్త్రీ. కొలఁది.

**ఇయ్య.** వై. వి. ఈయయొక్క రూపాంతరము. (దీనికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు. చూ. ఇయ్యకొను, ఇయ్యసేయు. మొ.)

**ఇయ్యకొను.** ద్వి. స. క్రి. ఈయకొనుయొక్క రూపాంతరము.

**ఇయ్యకోలు.** ద్వి. వి. అంగీకారము. "విచారవిమూఢునకైన నీవు పల్కినపలుకియ్యకోలగునె." భో. ౪, ఆ. (ఈయకోలుయొక్క రూపాంతరము.)

**ఇయ్యది.** దే. స. ఈయదియొక్క రూపాంతరము.

**ఇయ్యసేయు.** వై. అ. క్రి. (ఇయ్య+చేయు.) సమ్మతించు. (రాజ. 3, ఆ.)

**ఇర.** సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లు; 2. నీళ్లు; 3. నేల; 4. మాట; 5. మేర.

**ఇరమ్మదము.** సం. వి. అ. పుం. మేఘమునందలియగ్ని.

**ఇరవారు.** దే. అ. క్రి. (ఇరవు+అరు.) స్థిరపడు.

**ఇరవు.** దే. వి. స్థానము. వి—. స్థిరము. "క. ఇరవుగసిద్ధించునసఘ యిహపరసుఖముల్." భార. అర. ౪, ఆ. (ఇది అకారమధ్యము గాఁజెప్పుటకు సరియైన ప్రయోగముకనఁబడలేదు. అయినను శబ్దముచేవాడుకనుబట్టి యిట్లు వ్రాయఁబడియెను. చూ. ఇరువు.)

**ఇరవుకొను.** దే. అ. క్రి. 1. నెలకొను; 2. స్థిరపడు.

**ఇరవుపడు.** ద్వి. అ. క్రి. ఇరవుకొను.

**ఇరసాలు, ఇరుసాలు.** హిం. వి. ప్రభుత్వమువారికొమ్ము పంపుట.

**ఇరసాలునామా.** హిం. వి. పంపఁబడిన రూకలపట్టి.

**ఇరాలు.** దే. స. ఈరాలుయొక్క రూపాంతరము. "ఉ. అనగరంబు త్రోవను దినాధిపుఁడేగుచు దారికడ్డమై, పూనికనున్నకొలఁగని పోవఁగలేక యిరాలుమేనులక్, దానటుదిడ్డుదూటి చనెఁదథ్యము గాదనియంటిరేనియా, భానునిద్వాదశాత్ముఁడని పల్కఁగఁగారణమేమినిచ్చలుక్." రుక్మి. ౧, ఆ. (దీనికి ఇతరగ్రంథములందుఁ బ్రయోగము గానఁబడలేదు.)

**ఇరింగణము.** సం. వి. అ. పుం. వడిగాలి.

**ఇరిణము.** సం. విశే. (అ. ఆ. ఇ.) 1. చవుటిది (నేల); 2. పాడైనది. (రూ. ఈరిణము.)

**ఇరివిరి.** దే. వి. పోగరతోఁజేయఁబడిన రంధ్రము.

**ఇరు.** దే. స. వృత్తియందు హల్లుపరమగుచో రెంటికాదేశముగా వచ్చునది. (ఉదా. ఇరుగడ. మొ.)

**ఇరుఁదలపాము.** దే. వి. (ఇరు+తలపాము.) రెండుప్రక్కల తలలుగల సర్పవిశేషము, డుండుభము.

**ఇరుఁదలపులుఁగు.** దే. వి. (ఇరు+తలపులుఁగు.) రెండుతలలు గల పక్షివిశేషము, గండభేరుండము.

**ఇరుఁబుట్టువు.** దే. వి. (ఇరు+పుట్టువు.) 1. పక్షి; 2. బ్రాహ్మణుఁడు. "సీ. అరిది తేజునఁబడగలెత్తియునిరుఁబుట్టువు దొరలఁ గన్గొనిమూలఁదూఱుకొనుచు." అచ్చ. బాల, కాం.

**ఇరుగు.** దే. వి. 1. ప్రక్కయిల్లు; 2. ప్రక్క, (చూ. ఇరువు.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. "క. ఇరుచెవియెఱుఁగక యుండక్." ఉ, హరి. ౫, ఆ.)

**ఇరుగుడు.** దే. వి. శింశపా.

**ఇరుగురు.** దే. స. రెంటికి మహన్మహత్యర్థక బహువచనాదేశము, ఇద్దఱు.

**ఇరులు.** దే. వి. చీఁకటి, అంధకారము. (ఇరులునక్ అని ప్రయోగములు.)

**ఇరులుకొను.** దే. అ. క్రి. చీఁకటిపడు.

**ఇరులుగొంగ.** దే. వి. వెలుఁగుఱేఁడు, సూర్యుఁడు.

**ఇరువండ్రు.** ద్వి. స. (ఇరు+పండ్రు.) ఇరువదికి మహన్మహత్యర్థకరూపము, ఇరువదిమంది.

**ఇరువది.** ద్వి. స. (ఇరు+పది.) రెండుపదులు, వింశతి.

**ఇరువయి.** ద్వి. స. ఇరువదియొక్క రూపాంతరము. "ఇరువై నాలుగుమూళ్లమేర." కాశీ. ౧, ఆ.

**ఇరువాయికట్టు.** ద్వి. వి. మలమూత్రబంధరోగము.

**ఇరువు.** దే. వి. 1. పక్కయిల్లు; 2. పక్క; "క. అనినియతిచే యుటయును, మ్మునిపలుకులు కన్యకాసమూహంబెల్లక్, వినియట్లిరు

వులంజేరక, చననందొక్కర్తువిధివశంబునవిననిమీ." నిర్వ. ౨, ఆ.—3 స్థానము. "రగడ. మావులుదగుమరుమావులకిరువులు, దావులకును గడుదావులవిరువులు." య. ౪, ఆ. "సీ. నెఱనీటు కిరువువన్నిటిచెలువు." శకాం. ౪, ఆ. (ఇట్టు. ఇరువుకొను, ఇరువువడు ము.)

**ఇరువుడు.** దే. వి. ఇరుగుడుయొక్క రూపాంతరము **.**

**ఇరువురు.** దే. స. ఇరుగురుయొక్క రూపాంతరము.

**ఇరుస.** దే. వి. (ఇరు+కుంచము.) రెండు కుంచములు, ఆరతూము. "ఎ, గీ. ప్రస్థయుగళాఖ్యయిరుసనాఁబలుకఁబడును." ఆం, భా. ద్వి. వై.

**ఇరుసు.** / దే. వి. 1. బండియచ్చుము; 2. వీశపుమ్రానిదిమియడ్డుకొయ్య.

**ఇర్వది.** ద్వ. స. ఇరువదియొక్క రూపాంతరము.

**ఇఱి.** దే. విశే. ఇఱిసినది. (ఇఱిగొఁగిలి, ఇఱిగొను.) (ఇట్లును చెప్పవచ్చును. అప్పుడిది నలిలోనగువానివంటిది. అయినను దీనికి వర్ణస్తముగాఁ బ్రయోగము గానఁబడదు.)

**ఇఱికి.** దే వి. బాలక్రీడావిశేషము.

**ఇఱియు.** దే. అ. క్రి. నలఁగు (చూ. నలియు.)

**ఇఱుకటము.** దే. వి. ఇఱుకుచోటు. "క. తఱుచగుపెనునందడిలో, నిఱుకటమునఁబడ్డనృపతి." నై. ౪, ఆ. (ఇఱుకాటముయొక్క రూపాంతరము.)

**ఇఱుకాటము.** దే. వి. (ఇఱుకు+ఆట.) ఇఱుకటము. (చూ. అఱుకడము.

**ఇఱుకు.** దే. అ. క్రి. 1. కొంచెపుతావునసడఁగు; "గీ. ప్రాఁకియమ్మేటియిరుగుడుమ్రాఁకుఁజివురు, జొంపములలోననిఱికియజ్జోటిసారె, సారెకునురామరామయనీ పేరునుడువ, నొనరనాలించిసీతయంచునుజెలంగి." అచ్చ. సుం, కాం.—2. రెంటినందునఁజిక్కియదుముడువడు. "క. బిగువెడలిచీలయూడిన, నగచరుబిజంబులిఱుకనానొప్పిఁగడుక్, వెగడొందిమొఱలువెట్టుచుఁ, దెగియెక్‌మర్కటముదానిత్రిమ్మటవింటే." పంచ. నా. ౧, ఆ.—అం, ప్రే. 1. కొంచెపుతావునసడఁచు; "క. నిఖిలలోకభీకరుఁడగుస, ద్దనుజేంద్రునసాయాసం, బునఁజంకిటనిఱికియింద్రపుత్త్రుఁడచలుఁడై." నిర్వ. ౭, ఆ.—2. రెంటినందునఁజిక్కఁబట్టియదుము. "ఎ, గీ. ఉఱికికొక్కరకంఠంబునిఱికిచంపె." పంచ. నా. ౧, ఆ.—వి. 1. ఇఱుకటము; 2. గొంది. "పాతాళభవనకోటికెల్ల నుగ్రంబైనయిఱుకుననున్న మీఁతండ్రి." హరి. ఉ. ౭, ఆ.

**ఇఱుకుమ్రాను.** దే. వి. వెలుగులోపలికిఁబోవుద్వారమునందు ఒక్కొకమనుష్యుఁడుగా నంకటపడిపోఁదగినట్లు నాటినపంగకలగుంజలోనగునది.

**ఇఱుము.** దే. వి. మఱుఁగు. "వ. ఎడలిఱుములునందులరంధ్రంబులులేకుండనిండి." భాగ. ౫, స్క౦.

**ఇఱుముకొను.** దే. అ. క్రి. మఱుఁగుపడు. "ఇఱుముకొనందొడంగెదెసలేచినచీఁకటిని." రా. యు, కాం.

**ఇఱ్ఱి.** దే. వి. జింక, హరిణము. "క. మనసిజశాగంబునఁజెనఁ, గిన యిఱ్ఱినిలేడిఁజూచి." భార. ఆది. ౫, ఆ.

**ఇఱ్ఱింకులు.** దే. వి. బ. (ఇంకులు+ఇంకులు.) మిక్కిలియింకులు. "సీ. భౌమవారపువీరభద్రపల్లెరమిడుగృహదైవతంబులిఱ్ఱింకులింక." ఆము. ౪, ఆ. (ఇక్కడ ఇఱ్ఱింకులింక నసఁగా నిష్ప్రస్తుపడఁగాననియర్థము.) ("ఎవాఁడువింధ్యాద్రినిఱ్ఱింకులింకించె." భీ. ౨, ఆ. "ఉ. కన్నుఁగోనలఁ. దంపురేంబులైన దరహాసలవంబులుపద్మనేత్రయి. ఱ్ఱింకులుచేసెఁ బత్త్రముల యాఱు మిగాటుక చిమ్మచీఁకటిక్." స్క. ౭, ఆ. ఇత్యాదిస్థలములయందు ఇఱ్ఱింకులింకించె, ఇఱ్ఱింకులుచేసె అనఁగా జలరహితముచేసెననియర్థము.)

**ఇఱ్ఱిగోఱజేము.** ద్వ. ౧ కస్తూరి. "ఎ. ఎక్కయెఱుకుతెఁడు నక్కకొమ్ములునిఱ్ఱి, గోఱజంబుజున్నుఁదేనెపన్ను, వీలిగఱుల యంపకోలలునెలచెలఁ, గాఁచిచ్చికరయుగంబుమోచి." హ్రా. ౪, ఆ.

**ఇఱ్ఱియలు.** దే. వి. బ. ప్రక్క. పార్శ్వము

**ఇల.** సం. వి. ఆ స్త్రీ. 1. నేల; 2. బుధునిభార్య; 3. ఆవు. 4. మాట.

**ఇలకఅచు.** దే. స. క్రి. (ప్రాణము) బిగఁబట్టు. "గీ. కడిఁదిఱలుచేఁదిగుఱేకలకఅచినిలుపు. మరునికువలయశరముకంపముఁబోలుఁ, దార కడకఁటికైసారె చేరిచేరి, వేగమగుడుసలజ్జదృగ్విభ్రమములు." ఆము. ౫, ఆ. "గీ. అట్టుదూలనేయనాఁడ. మనసిల, కఅచిధైర్యమూఁదగాఁగనిలిచి." (ఇక్కడబిగఁబట్టుట మాత్రమర్థము.) రా. యు, కాం. (ఈలకఅచుయొక్క రూపాంతరము.)

**ఇలకోడి.** దే. వి. ఈలపురుగు, ఝిల్లిక.

**ఇలాకా.** హిం. వి. సంబంధము.

**ఇలాయి.** దే. వి. చుట్టవత్తులువేసెడు దివ్వటీ. "తగసూర్యప్రభలాయిలాయులును జంద్రజ్యోతులుక్." హంస. ౩, ఆ.

**ఇలారము.** దే. వి. ఇలువరముయొక్క మాఱురూపము.

**ఇలి.** దే. వి. మెతుకు. (అనితోఁచుచున్నది.) (ఈఁగకు ఇలి పాముకు బలిదొరకదు ఇత్యాది వ్యవహారము నూహించునది.)

**ఇలికము.** సం. వి. అ. పుం. ఎలుక.

**ఇలు.** దే. వి. ఇల్లుయొక్క రూపాంతరము. "క. లక్కయిలుగాలినదిమొదలు." భార. ఉద్యో. ౩, ఆ. (హల్లుపరమగుచో ఉత్వలోపము వికల్పముగానగు. "లక్కయిల్‌గాలిచి." భార. ఉద్యో. ౩, ఆ. మఱియు ఇది వృత్తియందు కులవాచకమగు. ఇలువేలుపు. "క. మనయింటిచేటుచూచితె." నిర్వ. ౯, ఆ.)

**ఇలుకు.** దే. వి. కీళ్లసరముదెడఁకుట. (నాచెయి యిలుకుపట్టినది.)

**ఇలుగు.** దే. అ. క్రి. (ఈలుగుయొక్క రూపాంతరము.) చచ్చు. "క. బలవిక్రమఘనులగువా, రిలిగినమనసేనమేదినీశ్వరవినుక, న్నులుచెడినట్లున్నది." భార. శల్య. ౧, ఆ.

**ఇలునింపడము.** దే. వి. వధూవరుల నూతనగృహప్రవేశము.

**ఇలుఱేఁడు.** దే. వి. (చూ.) గృహస్థుఁడు.

**ఇలువడి.** దే. వి. 1. కులీనత; "చ. వలనుగులంబులేనిపరివారముకోటియునేలనేర్చునె, గ్గలికయుభక్తిపెంపుమదిఁ గల్గిసుహృజ్జనమిత్రమూలబలం, బిలువడిగల్గనేనియిలయెల్లను నేలఁగఁ జాలువేయుర, జ్జలవినురాజునేర్పరియు శూరుఁడుఁగావలయుంజుమీనృపా." "సం. ఏకమేతత్సమవ్యేంద్రశూరైఃప్రాజ్ఞైర్బహుశ్రుతైః, కులీనైస్సహశక్యైతత్కృత్స్నాంజేతుంవసుంధరామ్." భార. శాం. ౩, ఆ.—2. మంచినడత. "ఇలువడినున్నఁజేసి." భాగ. ౧౦, స్కం. పూ.

**ఇలువరము.** దే. వి. 1. గోడలులేని యొత్తుడుగుడిసె; 2. తృణముచే నేర్పఱపఁబడిన పుట్టివంటిగూడ. "గీ. భూమినత్రితస్పృతదృష్టపూర్వమైన, బహుళసంపత్పరంపరపాదుకొనిన, గరిసెయవఁ

గోటయటనుంచగణనకెక్కె, నందుపైనంచు నిలువరిమనదివఁబు." (ఇలువారమనిపాఠాంతరము.) చంద్రా. ౧, ఆ.

**ఇలుసరుస.** దే. వి. వంశానుక్రమము.

**ఇలువారము.** దే. వి. ఇలువరియొక్క రూపాంతరము.

**ఇలువేలుపు.** దే. వి. కులదేవత.

**ఇల్కఅచు.** దే. స. క్రి. ఇలకఅచుయొక్క రూపాంతరము. "పడివడియానమిల్కఅచిపట్టుచు." రా. యు, కాం.

**ఇల్లంట్రము.** దే. వి. అల్లుఁడుమామగారియింటనే వాసముగానుండుట. (ఇది యిల్లటముయొక్క రూపాంతరము.) "ఇల్లంట్రమనఁగనిల్లల మనశ్వశురునిగృహాధివాసంబు చను." ఆం, భా. ద్వి. మ

**ఇల్లటము.** దే. వి. (ఇల్లు+అట.) ఇల్లంట్రము. "సీ. దాని వరుండు శాలీనాహ్వయుండిల్లట పుటల్లుఁడత్తయింటనువసించు." కళా. ౪, ఆ.

**ఇల్లడ.** దే. వి. (ఇల్లు+అడకము.) వదిలపఱచిపెట్టి అడిగినప్పుడు ఇమ్మని యేదేనియొకవస్తువును ఒకరివద్దదాఁచుట, న్యాసము. "చ. నన్నెదనమ్ముదేనియు, ల్లడయిడుభీమనర్జునునలంఘ్యబలాఢ్యులనావశంబునన్." సం. "భీమసేనార్జునౌశీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛమే." భార. సభా. ౧, ఆ.

**ఇల్లము.** మి. గ్రా. వి. (ఇరు+పలము.) రెండుపలములు. "ఇల్లమనంగనునెనఁగుద్విపలి." ఆం, భా. ద్వి. వై.

**ఇల్లరి.** దే. వి. (ఇల్లు+అరి.) ఇంటికప్పుము.

**ఇల్లలికము.** దే. వి. (ఇల్లు+అలికము.) ఇల్లటము.

**ఇల్లవ.** దే. వి. ఒకదినుసుచేప.

**ఇల్లామల్లి.** దే. విశే. కొండెగాఁడు, పిశునుఁడు.

**ఇల్లాలు.** దే. వి. (ఇల్లు+ఆలు.) గృహిణి, భార్య.

**ఇల్లి.** దే. వి. ఉపవాసము. "సీ. పస్తిల్లినుంకునిప్పస్తునిట్రనఁగను నుపవాసనంజ్ఞయైయొప్పుచుండు." ఆం, భా. ద్వి. బ్ర

**ఇల్లింద.** వై. వి. ఇంద్రవల్లి*.

**ఇల్లిగ్గులు.** దే. వి. బ. (ఇగ్గులు+ఇగ్గులు.) మిక్కిలి వెనుకకొఱగుటలు. "క. లొల్లియగువగలత్రొక్కున, నిల్లిగ్గులుగానవచ్చు హృదయములోనన్, మల్లామడియగుమదనుఁడు, మెల్లనఁగూర్చుం డెదాల్లిమినుమినుకనఁగన్." ఉ, హరి. ౫, ఆ.

**ఇల్లిముక్కు.** దే. వి. పసిలి నెత్తురుకాఱెడి ముక్కులోపలిభాగము.

**ఇల్లు.** దే. వి. ఉనికిపట్టు, ఇక్క, గృహము.

**ఇల్లెము.** వై. వి. మత్స్యవిశేషము. (చూ. అఱజెల్ల.)

**ఇల్వడి.** దే. వి. 1. ఇలువడియొక్క రూపాంతరము; (చూ. ఇలువడి.) 2. మంచినడత. "రాసుతులకెక్కడియిల్వడియంచు దుర్జనస్తోమమునిందసేయ." పర్త. ౯, ఆ.

**ఇల్వల.** సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము. అ. పుం. ము. మత్స్యవిశేషము. డు. ఒకానొకరాక్షసుఁడు.

**ఇవక.** వై. వి. శైత్యము*. "గీ. జలుబుసీతివతాళింపుచలువయివక, యనఁగశీతంబు." ఆం, భా. త్ర. ద.

**ఇవతల.** ద్వ. వి. (ఇవల+తల.) 1. ఈవలిప్రదేశము; 2. ఈపిమ్మట.

**ఇవతెళించు.** ద్వ. అ. క్రి. చల్లనగు. "ఎ, గీ. ఇగ్రుచుకోర్కులఁదనరెండదమివతళింప." కళా. 3, ఆ. (ఇవతాళించుయొక్క రూపాంతరము.)

**ఇవతాళించు.** ద్వ. అ. క్రి. (ఇవక+తాళించు.) ఇవతళించు. "గీ. ... ఇవతాళించుక ... బూన్పుఁజిప్పురమువన్ని." కళా. ౬, ఆ.

**ఇవతాళింపు.** ద్వ. వి. శైత్యము. (చూ. ఇవక.) (చూ. ఆరగింపు.)

**ఇవము.** వై. వి. 1. మంచు, హిమము; 2 శైత్యము*.

**ఇవముకొను.** ద్వ. అ. క్రి. ... "గీ. ... డిఁతిమంచ ననివముకొంటి." కాశీ. 3, ఆ.

**ఇవముమేపరి.** ద్వ. వి. వెలుఁగుఱేఁడు, సూర్యుఁడు. "ఎ, గీ. వాఁ, లివముమేపరికోలఁపుఁజక్క వలనూడు, మఱువునెరిరి." అచ్చ. యు, కాం.

**ఇవముసూడు.** ద్వ. వి. ఇవముమేపరి. "ఎ, గీ. ఇవముసూడు కొలఁపుచెకిమీనిబంటులు." అచ్చ. యు, కాం.

**ఇవల.** దే. వి. ఈవలయొక్క రూపాంతరము.

**ఇవిరించు.** దే. అ. క్రి. 1. చిగిరించు; 2. ఎల్లునగు. (ఇగిరించుయొక్క రూపాంతరము.)

**ఇవురు.** దే. అ. క్రి. ఇంకు. (హల్లుపరమగుచో వృత్తియందు కడపటి ఉకారమునకు లోపము వికల్పముగానగు. ఇవుర్వంటకము.) వి. చిగురు. (ఇగురుయొక్క రూపాంతరము.)

**ఇవురుచు.** దే. అ. క్రి. ఇగురుచుయొక్క రూపాంతరము. (రూ. ఇవుర్చు.)

**ఇవులుచు.** దే. స. క్రి. ఇగులుచుయొక్క రూపాంతరము. (రూ. ఇవుల్చు.)

**ఇవ్వల.** దే. వి. ఈవలయొక్క రూపాంతరము.

**ఇషణము.** సం. వి. అ. న. ఇచ్ఛ. (ఇషణత్రయము.–విత్తేషణము, పుత్రేషణము, దారేషణము.)

**ఇషము.** సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము.

**ఇషిక.** సం. వి. ఆ. స్త్రీ. ముండ్లదుబ్బు.

**ఇషీక.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిత్తరువువ్రాసెడి కుంచె; 2. ఏనుఁగు కనుగ్రుడ్డు, ఏనుఁగు భ్రూభంగము; (అనికొందఱు.) 3. ముండ్ల దుబ్బు.

**ఇషుధి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. తూణీరము, అమ్ములపొది.

**ఇషువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. బాణము, అమ్ము.

**ఇష్టక.** సం. వి. ఆ. స్త్రీ. ఇటికఱాయి.

**ఇష్టకాపథము.** సం. వి. అ. న. నీటివట్టివేరు.

**ఇష్టగంధము.** సం. వి. అ. న. నూఁగుదోస*. విశే. మంచివాసనగలది.

**ఇష్టము.** సం. వి. అ. న. 1. యజ్ఞకర్మము; 2. సంస్కారము. పుం. యజ్ఞము. విశే. 1. కోరఁబడినది; 2. ప్రియమైనది; 3. పూజింపఁబడినది.

**ఇష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. యజ్ఞము; 2. కత్తి; 3. కోరిక; 4. సంగ్రహశ్లోకము.

**ఇష్వాసము.** సం. వి. అ. పుం, న. ధనుస్సు, విల్లు.

**ఇష్వాసుఁడు.** సం. వి. అ. పుం. విలుకాఁడు.

**ఇసడిలు.** దే. అ. క్రి. విసుగు. "క. ఇసడిలకమటియుఁజనియు, వ్వసుధేశుఁడుదండకమునవర్తింపఁగఁదా, పసహింసాపరులగుగా, శ్వపులిరువురునేనుఁగూడికపటాకృతులన్." రా. అర. ౨, ఆ. (వ్రాఁతప్రతులయందీపాఠము కానఁబడుచున్నది.)

**ఇసిరో.** దే. అవ్య. (ఇసీ+రో.) ఇసీ. "ఇసిరో యిది పోరిపాడియే." భార. శా. ౧, ఆ.

**ఇసిఱింతలు.** దే. వి. బ. చలనము. "క. భూపాలమేటులఁగఁబోఁడుల, చూపులకుందాయునీడుసొంపగ్లగుటన్, మాసిన్నదియిసిఱింతల, చూపులసరగంట వెఱచుచున్నఁ జూచున్." సై. ౭, ఆ.

**ఇసిఱింతలువాఱు.** దే. అ. క్రి. (ఇసిఱింతలు+పాఱు.) చలించు, అదరు. "క. అంతటనిద్దఱమనసులు, కంతునిపసఁగలసి వింతకసమసరాలయన్, మంతనములఁబెదవులునిసి, ఱింతలువాఱంగసగవులెప్పలుఁగోరన్." విక్ర. ౭, ఆ.

**ఇసీ.** దే. అవ్య. నిందించుటనుతెలిపెడి. "ఇసీ యిటునాపనిసీవ చేసితి." భార. శాం. 3, ఆ.

**ఇసుక.** దే. వి. వి. ఒకటితోనొకటియంటని పొడినూకలవంటి మట్టి దినుసు, సికత.

**ఇసుకదాసరి.** దే. వి. ఒకదినుసుకూర, సైకతశాకము.

**ఇసుకదిన్నియ.** దే. వి. (ఇసుక+తిన్నియ.) ఇసుకదిబ్బ, సైకతము, (రూ. ఇసుకదిన్నె.)

**ఇసుకదొందు.** దే. వి. మత్స్యవిశేషము.

**ఇసుకపులకండము.** దే. వి. కండచక్కెర, మత్స్యండిక.

**ఇసుకబేలు.** దే. వి. ఒకానొకతీఁగ.

**ఇసుకమ్రాను.** దే. వి. ఉలిమిరి, వరుణము.

**ఇసుము.** దే. వి. వి. ఇసుక, వాలుక.

**ఇసుల్లు.** దే. వి. బ. తెక్కచెదలు, పక్షివల్మీకి.

**ఇస్తూ.** ఆం. వి. మరమేకు.

**ఇస్త్రి.** హిం. వి. చిన్నయినుపపెట్టెలో నిప్పులువేసి బట్టలమీఁద రాచి నునుపుచేయుట.

**ఇస్తిహారు.** హిం. వి. ప్రకటన.

**ఇస్తిహారునామా.** హిం. వి. ప్రకటనపత్రిక.

**ఇస్తువు.** దే. వి. సొత్తు, స్వామ్యము.

**ఇస్పేటు.** ఆం. వి. చీట్లాటయందలి యొక కాకితముపేరు. [స్పేడు.]

**ఇస్సిరో.** దే. అవ్య. ఇసిరోయొక్కరూపాంతరము. "శా. అంభోగర్భముచొచ్చిపాండుసుతబాహాగర్వదుర్వారసం, రంభంబోర్వక డాఁగియుండెనఁటరారాజిస్సిరో." భార. శల్య. ౨, ఆ.

**ఇస్సీ.** దే. అవ్య. ఇసీయొక్కరూపాంతరము. "క. అందఱురథికులుపఱవఁగ, నిందేటికిమున్నువచ్చితిస్సీయని." భార. విరా. ౫, ఆ.

**ఇహము.** సం. అవ్య. ఇహలోకము. "గీ. కుడిచికట్టినసుఖ్కిగా కిడుమపడుచు, నింటనున్నసుఖరుపార్థమేమికలదు, కడఁగియిహపైనఁబరమైనఁగాకదాన, యోరకుండుట నరునకుఁబౌరుషంబె." భో. ౨, ఆ.

**ఇహిహీ.** దే. వి. సప్రహర్షంబుగపకాసుండుత... యనిసవ్వెమదంబుపెంపునకు... "క. తగవామగవారికినిటు, మగువలయందెగువఁజూపమాద్యత్పీరుల్, జగతింగఱవాదొరవా, మగఁటిమిగలరాచఠందమాయిది యిహిహీ." రామా. ౫, ఆ.

**ఇళ.** సం. వి. ఆ. స్త్రీ. 1. బుధునిభార్య; 2. ఆవు; 3. మాట.

## ఈ.

**ఈ.** ఏకాక్షరము దే. స. ఎదుటనుండుదానిఁదెలుపును. "ఈ తెపము."

**ఈండ.** దే. వి. తాటిచెట్లలోనగువానిఁగేచి జరించెడుజాతి. (ఈండ్రవాఁడు, ఈండ్రది.)

**ఈండ్రము.** దే. వి. పీడనము. "గీ. ఎన్నఁడునినుఁబెట్టుమనుచు నిండ్రమునేయన్." భాగ. ౭, స్క౦.

**ఈండ్రవాఁడు.** దే. వి. ఈండ్రజాతివాఁడు. (ఈండ్రజాతిది, ఈండ్రది.)

**ఈండ్రించు.** దే. స. క్రి. పీడించు. "శా. ఈరీతింగుమతోక్తులంజనని తమ్మీండ్రింపనారాటమును, బోరాటంబుఘనంబులైన." కాశీ. ౪, ఆ.

**ఈఁక.** దే. వి. పక్షియీఁక.

**ఈఁకు.** దే. అ. క్రి. (రూ.) ఇంకు.

**ఈఁగ.** దే. వి. మక్షిక.

**ఈఁగపులి.** దే. వి. సాలెపురుగు.

**ఈఁగు.** దే. అ. క్రి. చొచ్చు, ప్రవేశించు. "క. ఈఁగంగాదిక తీర్థము, లీఁగంగానీవు దమ సమిద్ధాంబువులన్, దోఁగెడువారల గసగస, గ్రాఁగెడునంగారసింధుకల్లోలములన్." పాండు. ౧, ఆ.—స. క్రి. తొలఁగించు, నివర్తించు. "గీ. ఎల్లభంగులఱూ భంగమీఁగుమభవ." భాగ. ౬, స్కం. (ఈయర్థమందు ఇది నీఁగుయొక్కరూపాంతరము.)

**ఈఁజేటి.** దే. వి. ఇంజేటి. "తే. గునుకులూదర్లుబరపటల్ గోళ్లగొండు, లల్లిబియ్యము వెదురుబియ్యంబుగొట్టి, చెట్లునీఁజేట్లుఁ దుంగముస్తెయుబుసేత, గుంజుమొదలుగఁదినదొరఁకొనియెజనము." కాశీ. 3, ఆ.

**ఈఁటియ.** దే. వి. ఆయుధవిశేషము, కుంతము.

**ఈఁటె.** దే. వి. ఈఁటియయొక్కరూపాంతరము.

**ఈఁటెకాఁడు.** దే. వి. ఈఁటె ఆయుధముగాఁగలవాఁడు, కౌంతికుండు.

**ఈఁడు.** దే. అప. కల అను అర్థమునందువచ్చెడి ఒక పుంప్రత్యయము (ఆగడీఁడు, కష్టీఁడు మొ.)

**ఈఁత.** దే. వి. 1. ఈఁదుట; 2. (పశ్వాదులు) ఈనుట.

**ఈఁతకాఁడు.** దే. వి. ఈఁదెడువాఁడు.

**ఈఁతకొట్టు.** దే. అ. క్రి. ఈఁదు.

**ఈఁద.** దే. వి. ఈఁదర, చలిగాలి.

**ఈఁదర.** దే. వి.——పై.——

**ఈఁదాడు.** పై. వి. (ఈఁడు+తాడు.) గిఱకతాటిచెట్టు.

**ఈఁదు.** దే. అ. క్రి. ఈఁతకొట్టు. స. క్రి. దాఁటు. వి. 1. ఈఁత చెట్టు; (ఇది ద్వివిధము.—చిట్టీఁదు, పేరీఁదు.) 2. వాయువు. "క. ఈఁదునకుంగాదిలికొమరుఁడ." అ న్న. సుం, కాం.

**ఈఁదులాడు.** దే. అ. క్రి. (ఈఁదులు + ఆడు.) 1. ఈఁత కొట్టు; 2. వ్రేలాడు. "ఎ, గీ. ఈఁకెపోటులఁబడి ప్రేవు లీఁదులాడ." పాన్. ర, ఆ.

**ఈకువ.** దే. వి. తడి, ఆర్ద్రత.

**ఈకె.** ద్వ. స. ప (ఈ + అక.) ఈమె. (చూ. ఆక.)

**ఈకొను.** ద్వ. స. క్రి. ఈయకొనుయొక్కరూపాంతరము.

**ఈకోలు.** ద్వ. వి. ఈయకోలుయొక్కరూపాంతరము

**ఈక్షణము.** సం. వి. అ. న. 1. కన్ను; 2. చూపు.

**ఈక్షణిక.** సం. వి. ఆ. స్త్రీ. దైవజ్ఞ, వెఱ్ఱసాని.

**ఈగడ.** దే. వి. జాడ, పోబడి. "చ. సనిమాయయో, యిది యనిపిరికైనసొక యీగడవెల్లనాయంచునేరితిఁ." కళా. 3, ఆ. "క. కడుమేటియైనదొరచేఁ, బడినదిమీకొమ్ము వెచ్చపడనోపిననీ, గడకొంతదివ్వ వచ్చుఁ, జెడిదపురోదచేఁఘటింపనేరదొకటి యుఁ." పరి. ౫, ఆ.

**ఈగి.** దే. వి. ఈవి, త్యాగము

**ఈగికాఁడు.** దే. విశ. ఈవికాఁడు, త్యాగశీలుఁడు.

**ఈగిమ్రాను.** దే. వి. ఈవిమ్రాను, కల్పవృక్షము.

**ఈగు.** దే. అ. క్రి. ఇగ్గు. "ద్వి. ఈగిదిక్కరులు ఘీంకృతు లొనరించెఁ, గ్రాఁగినయసురులగతినబ్ధిలింకె." రా. యు, కాం.

**ఈచే.** దే. వి. (కాలుసేతుల) వంకర. "ద్వి. కాలకౌశికుఁడనఁగాఁ బేరువడసి, కాలీచఁజనుచు." హరిశ్చ. ౨, భా.

**ఈచేపడు.** ద్వ. అ. క్రి. (కాలుసేతులు) వంకరగు. "గీ. అధి పకాలీచపడఁగను గ్రాటవులకు నరిగి." పంచ. నా. ౧, ఆ.

**ఈచేఁబోవు.** దే. అ. క్రి. (ఈచ + పోవు.) ఈచపడు. "ఈచఁ బోయినచేతులు." ఉ, హరి. ౨, ఆ. "ద్వి. కాలీచఁబోయిన కట్టెఁడిమాల." హరిశ్చ. ౨, భా.

**ఈచో.** దే. అ. క్రి. (పాఁడిపసులపాలు) వట్టు.

**ఈచోకపోవు.** దే. అ. క్రి. (ఆవు) చావుదూడవేయు.

**ఈటు.** దే. విశ. 1. వ్యర్థము; 2. హాస్యము.

**ఈటువోవు.** దే. అ. క్రి. (ఈటు + పోవు.) 1. వ్యర్థమగు; 2. హాస్యమగు.

**ఈడ.** ఉభ. దే. వి. (ఈ+కడ.) 1. ఈచోటు; 2. ఒకదినుసు ఎఱ్ఱకిత్తలిక, పారేవతము. "రగడ. ఈడకుఁజెలిరాకీడకుఁగో యఁగ." య. ర, ఆ. సం. వి. ఆ. స్త్రీ. స్తోత్రము.

**ఈడఁబోవు.** దే. అ. క్రి. (ఈడన్ + పోవు.) వెనుదీయు, అప్రక్రమించు. "ఈడంబోవకవీఁకమైఁబోడువఁగా." భార. ఆది. ౧, ఆ. (చూ. ఈడు.)

**ఈడాడు.** దే. స. క్రి. (ఈడు+ఆడు.) మార్కొను. "ద్వి. ఓడకోడకుదేవియుగ్రరాక్షసుని, నీడాడినీచెఱనేవిడిపింతు." రా. అర, కాం.

**ఈడిక.** దే. వి. 1. గడ్డిలోనగువానిఁదెచ్చెడి బండిపరమువంటి సాధనవిశేషము; "సీ. అలరుఁదృణాద్యానయన సాధనవిశేషసం జ్ఞయీడికయన సరవడియన." ఆం, భా. ద్వి. క.—2. కంప తొడుగు. "తొడుగఙ్జయీడికసుసుముకంప, యసఁదసర్పను గంటకాదిభారము." ఆం, భా. ద్వి. వ.

**ఈడిగ.** దే. వి. ఈండ్ర.

**ఈడిగవాఁడు.** దే. వి. ఈడిగజాతివాఁడు. (ఈడిగజాతిది, ఈడిగది.)

**ఈడిగిలఁబడు.** ద్వ. అ. క్రి. (ఈడిగిలన్+పడు.) భయాదు లచేరానని మొండివేసికొనికూర్చుండు. "వ. అన్నిలింపారాతియు నుగుడవచ్చి తన్నుంగని భయంబుఁబొంది యద్దివిహాగామహాగామ యనుచునొక్కవృక్షంబిరుగేలంబట్టికొని యీడిగిలంబడియున్న బెట్టదల్చితరువువిడిపించియుత్తుకొనివియత్తలంబునఁకగసి పఱవం దొడంగిన." రా. అర. ౨, ఆ.

**ఈడిగిల్లు.** దే. అ. క్రి. ఈడిగిలఁబడు. "చ. అని జనయిత్రి వల్కెడు దుగాగతభాషలు యావనాశ్వపా, వనులకుఁజెప్పికొంత వడివారికహాస్యముపుట్టఁజేసియా, సనపరివక్కగాలు మొఱపెట్టు మనీడిగిలంగనందలం, బున వఁడఁ గట్టవైచుకొని పాండని చెప్పు సుదేవుఁడంతటన్." జై. ౨, ఆ.

**ఈడితము.** సం. విశ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

**ఈడు.** దే. అ. క్రి. 1. చాఁగు; 2. జాఱు. "గీ. శ్రద్ధగలిగి లోకసంగ్రహసంగంబు, నిడవిడిచియవ్వఁడీయుపాయ, ములభ జించువాఁడు మోక్షలక్ష్మిపతి, యగునొకింతసందియంబువలదు." భార. అశ్వ. ౧, ఆ.—స. క్రి. పిదుకు. "వ. గోవులకుంగ్రే పులవిడువకయు, విడిచివిడిచియీడకయు, ఈడియీడియీడిన పాలుకాఁచకయు." భాగ. ౧౦, స్కం. పూ.—వి. ప్రాయము. విశ. సమానము.

**ఈడుచే.** దే. ప్రే. తిగుచు, ఆకర్షించు.

**ఈడుపడు.** ద్వ. అ. క్రి. సమానమగు.

**ఈడుపు.** దే. వి. 1. ఆకర్షణము; 2. విలంబనము; 3. బ. బుగడలగొలుసు.

**ఈడుముంత.** దే. వి. వాలుపిదుకుపాత్రము.

**ఈడె.** దే. వి. ఎఱ్ఱకిత్తలియను నర్థమునందు ఈడయొక్కరూపాంతరము. "ఎ, గీ. ఈడెలుంగనివిభుఁజూపుఁడీచెలాఁ." భాగ. ౧౦, స్కం. పూ.

**ఈడేఱు.** దే. అ. క్రి. (ఈడు + ఏఱు.) 1. వర్ధిల్లు; "మ. నా తనయుండెంతయుఁబూఁటపూఁటకు సముద్యత్కాంతిసీడేఱఁ గా." మై. ౨, ఆ.—2. నెఱవేఱు, సిద్ధించు.

**ఈడ్గిలఁబడు.** ద్వ. అ. క్రి. ఈడిగిలఁబడుయొక్కరూపాంతరము.

**ఈడ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) పొగడఁదగినది.

**ఈతఁడు.** దే. స. ప. (ఈ+ఁడు.) ఇతఁడు.

**ఈతగాఁడు.** దే. స. (ఈతఁడు+కాఁడు.) ఈతఁడు. (స్వార్థమునకాఁడు.)

**ఈతల.** దే. వి. ఈవలిప్రదేశము.

**ఈతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అతివృష్ట్యాది; (ఇవి యాఱు.—వాన, వఱపు, ఎలుక, చిలుక, మిడుత, చేరువరాజు.) 2. ఉపద్రవము; 3. ఊరువిడిచిపోవుట.

**ఈదృశము.** సం. విశ. (అ. ఈ. అ.) ఇటువంటిది.

**ఈన.** దే. వి. చీఁపురుపుల్ల. (ఇది ఈనపుడక, ఈనపుల్ల అనియు చెప్పఁబడును.)

**ఈనిక.** దే. వి. పశువులీనుట, ఈఁత.

**ఈనియ.** దే. వి. ఈనె.

**ఈను.** దే. స. క్రి. 1. (పశ్వాదులు) ప్రసవించు; 2. కలిగించు. "ఉ. ఆనకశంఖదుందుభిమహారవముల్ దశదిక్కులం బ్రతి, ధ్వానములీనఁగా." జై. ౩, ౮.

**ఈనె.** దే. వి. ఆకులనరము, పర్ణసిరము. (ఈనియయొక్క రూపాంతరము)

**ఈనెగాజోలు.** దన్య. వి. బ. బాలక్రీడావిశేషము.

**ఈపి.** దే. వి. (తలయందుండెడు) ఈరు, లిక్ష.

**ఈపె.** దన్య. స. వి. (ఈ+అప.) ఈమె. (చూ. ఈకె.)

**ఈప్స.** సం. వి. అ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

**ఈప్సితము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**ఈబరి.** దే. విణ. నిష్ప్రయోజకుఁడు.

**ఈబరిగొట్టు.** దే. విణ.——పై.——

**ఈబిడె.** దే. స. ఈమె.

**ఈమిరి.** దే. వి. తడి, ఆర్ద్రత్వము.

**ఈము.** వై. వి. ఇవముయొక్క రూపాంతరము.

**ఈమె.** దన్య. స. వి. (ఈ+అమ.) ఈపూజ్యస్త్రీ. (చూ. ఆకె.)

**ఈయ.** వై. వి. అపేక్ష. (దీనికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు. చూ. ఈయకొను మొ.)

**ఈయకొను.** దన్య. స. క్రి. ఇయ్యకొను, అంగీకరించు.

**ఈయకోలు.** దన్య. వి. ఈయకొనుట, అంగీకారము.

**ఈయది.** దే. స. (ఈ+అది.) (చూ.) ఇది.

**ఈయన.** దే. స. వి. (ఈ+అన.) ఈతఁడు.

**ఈరము.** దే. వి. పొదరిల్లు, నికుంజము. "ద్వి. బీరముల్ మచ్చుచు భేదింపరాని, యూరముల్ చొచ్చుచు." గా. ౪౭, ౫౦.

**ఈరస.** వై. వి. 1. ఈర్ష్య; "మ. వెసఖండించునదల్పఁద్రుంచుఁ జఱచుఁ ద్రేయుఁ బెనంజెఱునీ, రసతోనొంచు." రా. యు, కాం.—2. కోపము*; 3. ద్వేషము*. (రూ. ఈరసము. కోపమునకు.—"క. ధీరుఁడులక్ష్మణుఁడుగ్రుహ, ద్వారంబునను డఁగనియెఁ దారాసుతుఁడా, తారాసుతునిన్ లక్ష్మణుఁ, డీరసమెసఁ గంగఁ జూచి యిట్లనిపలికెన్. క. రామునియనుజన్ముఁడనే, సౌమిత్రినిరామునాజ్ఞఁ జనుదెంచితిసౌ, త్రామిజవేచెప్పుమురు, గ్రామజుతోనవిన నతఁడుఁ దరణిజుతోడన్. ఉ. అచ్చుగరామభూవిభుని యానతిలక్ష్మణుఁడు గ్రతేజుఁడై, వచ్చినవాఁడువాకిటికవారితరోషముతోడ." రా. కిష్కిం, కాం.—ద్వేషమునకు.—"క. పెక్కండ్రతోడనీరస, మొక్కటఁబనికొనకతఁటఁగియున్న పగతుతో, నుక్కఁడి బంధుభావము, తక్కటిపగఱయెడవలయుఁదానెఱపంగన్." భార. శాం. 3, ఆ.

**ఈరసించు.** వై. అ. క్రి. 1. ఈర్ష్యపడు; 2. కోపించు*; 3. ద్వేషించు*.

**ఈరాలు.** దే. స. (ఈరు+ఆలు.) పండ్రెండు.

**ఈరిక.** దే. వి. మొలక, అంకురము.

**ఈరిణము.** సం. విణ. ఇరిణముయొక్క రూపాంతరము.

**ఈరితము.** సం. విణ. (అ. ఆ. అ.) త్రోయఁబడినది.

**ఈరు.** దే. వి. పేనుగ్రుడ్డు, లిక్ష. విణ. అల్పము. హీనము. (ఈరెండ. ఈరెలుఁగు మొ.) (దీనికి స్వతంత్రముగా ప్రయోగము లేదు.) స. సత్తిమునకు బహువచనరూపము. వృత్తియందు అచ్చు పరమగుచో రెంటికాదేశము. (ఈరాలు, ఈరేను మొ.)

**ఈరుచు.** దే. స. క్రి. (ఈర్పెనతో ఈళ్లను) ఈడ్చు, (రూ.) ఈర్చు.

**ఈరుపెన.** దే. వి. ఈళ్లనీడ్చెడుదువ్వెన.

**ఈరువాలు.** దే. వి. (ఈరు+వాలు.) అసివాలు.

**ఈరువు.** దే. వి. ఎఱచి, మాంసము.

**ఈరె.** దే. వి. ఒంటెనుజొట్టుపెనిసినవాలు.

**ఈరెండ.** దే. వి. (ఈరు+ఎండ.) కొంచెపాటియెండ.

**ఈరెలుఁగు.** దే. వి. (ఈరు+ఎలుఁగు.) హీనస్వరము.

**ఈరేను.** దే. స. (ఈరు+ఏను.) పదునాలుగు.

**ఈరేను.** దే. స. (ఈరు+ఏన.) పది.

**ఈర్పెన.** దే. వి. ఈరుపెనయొక్క రూపాంతరము.

**ఈర్మము.** సం. వి. అ. న. వ్రణము, పుండు.

**ఈర్య.** సం. వి. ఆ. స్త్రీ. ధ్యానమౌనాది వ్రతములయందు చాంచల్యములేక స్థిరుఁడైయుండుట. నడచుట నిలుచుట కూర్చుండుట పండుకొనుట మొదలైనవానియందు యతులు సమాధానము గలవారైయుండుట. (జనికాండము.)

**ఈర్ష్య.** సం. వి. ఆ. స్త్రీ. ఓర్వలేనితనము, ఈరసము.

**ఈర్ష్యాళువు.** సం. విణ. ఉ. ఈర్ష్యపడు స్వభావముగలవాఁడు, ఉడుకుబోతు.

**ఈలతాలులు.** దే. విణ. బ. 1. వక్రము; "గీ. వంకయైనతలంపెల్లవసుమతీశ, యరయమృత్యుపదంబగునార్జవాని, తంబు బ్రహ్మపదంబింత కథ్యమేల, యీలతాలతలంపులబీలువాలు" భార. ఆశ్వ. ౧, ఆ.—2. పరుషము. "ఎ, గీ. మరితెద్దుర్ణయుఁడుతోనతెరలెనేన, యపుడు సస్మిట కోలలనంకుశములఁ, జేలుకోలల త్రేటుల నీలతాల, యదలుపులవాహనంబులు చెదరిపఱచె." భార. ద్రో. 3, ఆ. (చూ. అలువుర్లు.)

**ఈలమి.** దే. వి. తెగలులోనగుహానితలచు, జొంపము. "వ. పూఁబొదరిండ్లయీలమిపమలుంగున." కళా. ౧, ఆ.—విణ. తఱచైనది. (చూ. ఇష్టింతులు.)

**ఈలము.** దే. విణ. తఱచు, సాంద్రము. "ఎ, గీ. ఈలమగు వెన్నెలలలోనఁదూఁటతూఁపె." విక్ర. ౬, ఆ. "గీ. పొదలు వేడ్కలనీలంపుఁబొదలుచొచ్చి." షట్. ౮, ఆ.

**ఈల.** దే. వి. 1. ఒకదినుసుకూఁతు; 2. చిప్పటకూఁత; 3. గోపకులు లోనగువారి సంకేతధ్వని; "వ. ఈలవెట్టుచుగోగణంబులఁజెదరందోలి." వి, పు. 2, ఆ.—4. సిగ్గు. "ఏడువుమీలయటంచు నాడివెపేము." స్వా. 3, ఆ.

**ఈలకఱచు.** దే. స. క్రి. ఇలకఱచు. "క. పాడుపునకునెగసి యొప్పటి, పడమటిదెసనిగిడిపెలుచఁబఱచినఁగూడం, గడురయము నఁజనియంచన్, గడఁగలేకీలకఱచికాకముపాఱెన్." భార. కర్ణ. ౨, ఆ.

**ఈలకూఁతలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "ఎ, గీ. పీల పాటలునరిచేసులీలకూఁతలు." వి, పు. 2, ఆ.

**ఈలగ్రద్ద.** దన్య. వి. ఒకదినుసుడేగ. విణ. లోభి. "గీ. పీమునలు పురందునెవాస్వఁడుగాఁజాలు, నిచ్చిపుచ్చుకొన్నయీలగ్రద్ద, మాను

నింపుగావృమానమీసుద్దులు, కలహాసులమొగంటకలియుగంబ." నై. 2, ఆ.

**ఈలపురుగు.** దే. వి. ఇలకోడి, చిమ్మట, ఝిల్లి.

**ఈలుగు.** దే. అ. క్రి. చచ్చు, మరణించు. "క. పవనసుతుచేత నాభూ, ధవుఁడీల్గనేని." భార. కర్ణ. ౨, ఆ. (నీలుగుయొక్క రూపాంతరము.)

**ఈలువు.** దే. వి. జాతివ్రత్యము. "ద్వి. కాలదేశాంతర క్రమను సంజెడని, యీలువాొక్కఁడమఱువింతియకాక, యునసినకోటలు నింప్లునదేలు, వనితలకెందునావరణములేకవు." గా. యు, కాం. "ఇలఁబతివ్రతలలో నీలువుగలయట్టిపల్లిని." కళా. ౪, ఆ.

**ఈల్గు.** దే. అ. క్రి. ఈలుగుయొక్క రూపాంతరము.

**ఈవ.** దే. వి. ఈగయొక్క రూపాంతరము.

**ఈవరి.** దే. విశే. (ఈవి+అరి.) ఈవికాఁడు. "క. సిరిగాచవేల్పు కడుని, వరితనమునసిటితాల్ప." య. ౫, ఆ.

**ఈవల.** దే. వి. (ఈ+వలను.) 1. ఈ ప్రక్క; 2. ఇటుపిమ్మట.

**ఈవి.** దే. వి. ఈగియొక్క రూపాంతరము.

**ఈవికాఁడు.** దే. విశే. ఈగికాఁడు, త్యాగశీలుఁడు.

**ఈవు.** దే. స. నీవునకురూపాంతరము.

**ఈవులమొదవు.** దే. వి. (దేవలోకమునందలి) కామధేనువు.

**ఈవులమ్రాను.** దే. వి. (దేవలోకమునందలి) కల్పవృక్షము.

**ఈవులరతనము.** ద్వ. వి. (దేవలోకమునందలి) చింతామణి.

**ఈశ.** సం. వి. ఆ. స్త్రీ. ఈషయొక్క రూపాంతరము.

**ఈశానము.** సం. వి. అ. న. ప్రకాశము, వెలుతురు.

**ఈశానుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**ఈశిత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) ప్రభువు, ఒడయఁడు.

**ఈశుఁడు.** సం. వి. అ. పుం. 1. రాజు; 2. శివుఁడు.

**ఈశ్వర.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**ఈశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

**ఈశ్వరుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. మన్మథుఁడు. విశే. 1. ఒడయఁడు; 2. ధనవంతుఁడు.

**ఈష.** సం. వి. ఆ. స్త్రీ. నాఁగటియేఁడికోల.

**ఈషిక.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుకనుగ్రుడ్డు.

**ఈసడము.** దే. వి. దూఱు, నింద.

**ఈసడించు.** దే. అ. క్రి. 1. రోఁతపడు; "గీ. అంతనొకనాఁడు నిర్మలస్వాంతమాని, వాళిభుజయింపఁబాత్రలో వ్రేలుదునిసి, పడిన మదినీసడింపకకడకుఁదిగిచి, వైచిభుజియించెనప్పతివ్రతలతల్లి." పాంచా. 3, ఆ.—2. కోపించు. "ఉ. ఆసుదతింగనుంగొనితఁడంగ నయప్పుడుహెచ్చినట్టివే, రీసునఁనీసడించుచు." కళా. 3, ఆ.— స. క్రి. నిందించు. "సీ. చండాలుఁడనిసారెసారెకునన్ను నీవీసడించుటపాటియేతలంప." హరిశ్చ. ౪, ఆ.

**ఈసపిట్ట.** ద్వ. వి. ఒకదినుసుచేప.

**ఈసు.** వై. వి. 1. ఈర్ష్య; 2. కోపము*. "వ. అంతఁబక్షివద నుండు నిబిడజ్వాలాకరాళంబగుకూలంబురాఘవుమీఁదఁబ్రయోగించిన నతండును నడుమనబాణిదునియలుసేసిన నీసునంబెట్టిగ నురనైరి మఱియునుందరతరంబ శతసహస్రసంఖ్యలంగతకూలం బులు భేదివాలంబులుఁ దోమరంబులుశరంబులుంబరఁగించి." సం. "కాశ్రతుద్వస్తశ్గానదశగ్రీవశ్శితాగ్రశరాన్." భార. అర. 2, ఆ.—3. వైరము*. "నాతుపద్రవముఁబెక్కువిధంబులఁజేసినీ సునన్." భార. సభా. ౧, ఆ.

**ఈసుకాఁడు.** వై. విశే. ఉసుకుఁబోతు, ఈర్ష్యాళువు.

**ఈహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక; 2. కడఁక.

**ఈహామృగము.** సం. వి. అ. పుం. 1. తోఁడేలు; 2. నాటకవిశేషము.

**ఈహితము.** సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**ఈహీ.** దే. అవ్య. ఇకి. "తక్కనబలాశ్రీశాభ్యకీటంబులిం, దవ్వం జెవ్వఁజొమేలెచే బెఱుఁగరీహీ." కుచే. ౨, ఆ.

**ఈళిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కత్తిపీఁట; 2. చురకత్తి.

**ఈళితము.** సం. విశే. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

## ఉ.

**ఉ.** ఒకయక్షరము.

**ఉంకించు.** దే. అ. క్రి. కడఁగు, యత్నించు. "గీ. ఎత్తసంసిక్తమైన ధరాతలమున, నార్తిఁబొరలుచు నూర్పులందందనంద, డింపఁదివం బువెడలనుంకింపఁజెప్ప, లొయ్యనొయ్యనయడఁగంగనున్నయధిపు." భాగ. సౌ. ౧, ఆ.

**ఉంకు.** దే. అ. క్రి. ఎగురు. "గి. సింహమించిన పౌరకాయయొగసి నట్లు, పేరుకొనినైచుతెల్లటిచీరవోలె, నుంకుచెందునిధంబుననుత్తరించు, తములపాకుసుక్కడు క్రియదాఁటెనిట్టి." ఉ, హరి. ౪, ఆ.—వి. నమ్మతి. "క. ఎక్కువకులంబునతనికి, నిక్కపుటాలైన దానినీచకులుండుం, కెక్కకబలిమింగవినినఁ, దక్కొనిచంపుటయ రాజధర్మంబెందున్." విజ్ఞా. ప్రా, కాం. (చూ. ఉంకుటుంగరము.)

**ఉంకుటుంగరము.** దే. వి. (ఉంకు+ఉంగరము.) వధూవరులు వివాహముచేసికొనఁటకు పరస్పరము సమ్మతించి మార్చుకొనఁడు యుంగరము.

**ఉంకువ.** దే. వి. అల్లుఁడు కన్యకార్థముమామకచ్చెడి ద్రవ్యము, శుల్కము. "భవదీయశౌర్యమేయుంకువచేసికృష్ణపురుషోత్తముచే కొనిపొమ్ము." భాగ. ౧౦, స్క౦. పూ.

**ఉంగ.** దే. వి. బిడ్డలకుఁబోసెడియుగ్గు. "క. అంగములుమిగుల నలియఁగ, నుంగేయుంగేయటంచునొకనిమిషమునో, రంగాయ వేయకేడ్చుచు, నంగీకృతబాల్యచేష్టనతఁడట్లుండన్." పర.౧, ఆ.

**ఉంగరపువ్రేలు.** దే. వి. (ఉంగరము+వ్రేలు.) చేతి చిటికెన వ్రేలికిముందువ్రేలు, అనామిక.

**ఉంగరము.** దే. వి. చేతివ్రేలియాభరణము, అంగుళీయకము.

**ఉంగిడి.** దే. వి. నాముసు ఆముదపాకులును మేయుటచేఁ గలుగు పసురోగవిశేషము.

**ఉంగుటము.** వై. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము. "గీ. మ్రొక్కనిలిచియతనిముందలమేదిని, నుంగుటమునఁవ్రాయుచున్నఁజూచి." నిర్వ. 3, ఆ.

**ఉంగ్రము.** దే. వి. ఉంగరముయొక్క రూపాంతరము.

**ఉంచు.** దే. ప్రే. ఉండఁజేయు, ఉనుచు.

**ఉంచుకొను.** దే. ప్రే. పెట్టుకొను.

**ఉంఛము.** సం. వి. అ. న. ధాన్యమేఱుకొని బ్రదుకుట, చేకె బ్రదుకు.

**ఉంట.** దే. వి. 1. ఉండు; "శీ. కలశవారిధిబయల్ నెలసికొమ్ము నఁగొట్టఁగంటివచ్చినవాఁడుటుంటపుడు." చంద్రి. ౧, ఆ.—2. ఉంగరుట. విశే. గుం డ్రము.

**ఉంటగాలము.** దే. వి. సీసపుగుండుకట్టిన యొకదినుసుగాలము.

**ఉండ.** దే. వి. మన్నులోనగువానిచేతఁ జేయఁబడిన గుళిక. "శ్లే. కవజాక్కలువాయఁగరనాళనుఁ జందురుంచూఁడుపటికఁపు టుండయనఁగ." పా. ౩, ఆ. - విశే. గుం డ్రము.

**ఉండక్రోవి.** దే. వి. చేతికఱ్ఱ, లాతము.

**ఉండసురియ.** దే. వి. ఆయుధవిశేషము. "వ. కొండగొఱయల నుండసురియలఁ జెండు జెండాడుచుండ." రా, వి. 3, ఆ.

**ఉండి.** దే. అవ. ఒక ప్రత్యయము. అవ్య. మొదలుకొని అనునర్థమును తెలుపునది. "క. ఏనొకటిచెన్న వించెద, దానవకులమథన పెద్దదడపుననుండిం, బూనినినిపింపఁగలపని, యూనోకాదో విచారమదితెలియఁదగుఁగా." (ఉండిగా–యువర్ణలోపము.) ఉ, హరి. ౫, ఆ.

**ఉండు.** దే. అ. క్రి. 1. వసించు; 2. వర్తించు; 3. శేషించు. "గీ. ఇందుబింబాస్యనారాక కెదురుచూచు, నయనములువేయువిరియించినాకభర్త, యుదిలకొనుచున్న వారార్తినున్న ముగురు, కాలయాపననేయఁగాఁగాదునీకు." నై. ౪, ఆ.

**ఉండ్ర.** దే. వి. వెలిచంద్ర, కదరముకీ.

**ఉండ్రము.** దే. విశే. గుం డ్రము, వర్తులము.

**ఉండ్రములు.** దే. వి. బ. ఉండ్రాలు, మోదకములు.

**ఉండ్రస.** దే. వి. ఉండ్రకీ.

**ఉందురము.** సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు.

**ఉందురువు.** సం. వి. ఉ. పుం.———పై.———

**ఉంపడము.** దే. వి. గుత్తగావేశ్యనుంచుకొనుట.

**ఉంబ.** వై. వి. గోవులయంభారవము.

**ఉంబళి.** దే. విశే. పన్నులేనిది. (ఉంబళిగ్రామము మొ.)

**ఉంభనము.** సం. వి. అ. న. నించుట.

**ఉంభితము.** సం. విశే. (అ. ఆ. అ.) నింపఁబడినది.

**ఉక్క.** దే. వి. ఉమ్మ, ఊష్మము.

**ఉక్కఁబట్టు.** దే. స. క్రి. వదలు. "క. నీకిష్టంబిచకానీ, నాకాపాపాత్ముఁజెప్పినంబదిలక్ష్మీల్, లేకున్నవిడుతుఁబ్రాణము, నీకైకూడుక్కఁబట్టినీలగ్రీవా." కాశీ. 3, ఆ.

**ఉక్కడఁగు.** దే. అ. క్రి. 1. ఉక్కుచెడు; "ఉక్కడఁగెన్ మగధేశుసైన్యముల్." భార. సభా. ౧, ఆ.—2. చచ్చు. (ప్రే. ఉక్కడఁచు.)

**ఉక్కడము.** వై. విశే. గొప్ప. "ఉ. ఉక్కడమైనమంచివాను వొప్పెడునాహయరత్న మెక్కినన్." సా. ౧, ఆ.

**ఉక్కడీఁడు.** వై. విశే. (ఉక్కడము + ఈఁడు.) బంటు, శూరుఁడు.

**ఉక్కణము.** దే. వి. కావలి, రక్షణము. "చ. కడిందిమగల్ దగునుక్కణంబుగా, భయమనుపేరులేకనిరపాయము గావిడి యించుచుఁజూమనఃప్రియమగుభంగి సేన నడపించె." నిర్వ. ౫, ఆ.

**ఉక్కరి.** సే. విశే. (ఉక్కు + అరి.) శౌర్యవంతుఁడు. "శే. ఉక్కరియై పొంచినక్కుచు నాకకోటులఁగూడఁజేయఁ దలవాలెనాఁడు." అచ్చ. యు, ౬.

**ఉక్కలు.** సే. వి. బ. ఉక్కడఁగు. "చ. చిఱుతగవాక్షపుఁ జడినను చెచ్చెరసజ్జముచేసినెరలు, క్కఱఁపిరంబు మైనదొంగవడ్డి ద్రొణియుసేఁజోకయ, సైతఁబఁటుమునుఁగ." భార. విరా. ౫, ఆ.

**ఉక్కుఁడు.** వై. విశే. శూరుఁడు, ధీరుఁడు. "మ. విలసచ్చక్రచతుష్కమైమునతదిద్విపిన్వగావేష్టనో, ష్ణవలనైకష్కుదతుశ్శశత్రి పయపస్తారా థన్నసై రెంమున్, జెలుఁగుల్ పూనిరకాంచనోన్నతరథంబే పెక్కుఁగా నెక్కుయు. క్కలుఁడైయేగెనుయుఁడున్సైన్యమున్ కొక సాన్వియుపొంత దరన్." హరి. పూ. ౪. ఆ.

**ఉక్కిశము.** యు. దే. ౬. ఇల్లువులెత్తివచ్చులను దెబ్బకొట్టక్కయుంచు కావలి, కోవృళము. "వ. అప్పుడప్పర్వత ప్రదేశంబునను కక్కశంబున్నయక్షకిన్నరులు" ఉ, హా. 3, ఆ –వై. పురాణ్యము మైనరాజమార్గము, ఉపనిష్కరము. "ఉపనిష్కరంబగుననక్కశమన." ఉం, భా. దిన్వ. నూ.

**ఉక్కిబిక్కిరి.** దే. విశే. ఊపిరితిరుగనిది.

**ఉక్కివము.** దే. వి. కపటము. "సీ. గాండీవమాదిగాఁగలయాయుధంబుల నుక్కివంబున నప్పుడొడిచికొనఁగ, మఱచినవాఁడయ్యె." భార. ఆర. ౧, ఆ.

**ఉక్కివుఁడు.** దే. విశే. కపటముగలవాఁడు. "సీ. కడుఁగ్రొవ్వితొల్లియొప్పుడునాకునేఁటేటఁజేయుపూజలునేడు నేయనొల్ల, నుక్కివుఁడైనదామోదరుకఱపులు విని యొక్కచిడికిగట్టునకుఁజేసిరి." హరి. పూ. ౭, ఆ.

**ఉక్కిస.** దే. వి. పొడిదగ్గు. "గీ. ఉక్కిసయును దగ్గుఁబిక్కిరిల్లె." భాగ. ౬, స్కం.

**ఉక్కీఁడు.** దే. విశే. (ఉక్కు + ఈఁడు.) మూర్ఖుఁడు. "ఉక్కీలయినేర్పులేక తమకించి పయింబడినొచ్చువారు." నిర్వ. 3, ఆ.

**ఉక్కు.** దే. అ. క్రి. 1. చచ్చు; "ద్వి. ఘోరాహవంబునఁగుంభకర్ణాది, వీరులుపెక్కండ్రు విపులవిక్రములు, ఉక్కిరిందఱు విభుండొక్కఁడుచిక్కె, నెక్కటిరఘురాముని తేఁచేమి గెలుచు." రా. యు, కాం.—2. సలఁగు. "ద్వి. కరములరామలక్ష్మణులనిద్దఱను, గరముక్కఁబట్టెరాక్షసుఁడుక్కుమీటె." రా. అర, కాం.—వి. 1. అయస్సారము; 2. శౌర్యము; "చ. అనినిపించినన్ బలమురాంతకులుక్కునఁజేర్చియవ్వనం, బునఁగలదైత్యకోటిఁబోరిపుచ్చకలోకముబాధమానదం, చునరిగి." వి, పు. ౭, ఆ.—3. స్థైర్యము. "క. ఎఱకలుగలకులశైలము, తెఱఁగుమెఱయరయమునెఱయదివికెనెగసిబి, ట్టుఱుమజలధరము క్రియను, క్కఱితదృసమెల్ల నదృవనార్చుచుఁ గడిమిన్." భార. ఆర. ౬, ఆ. (ఈ పదమునకర్థము పరాక్రమము బలము అని చెప్పుచున్నారుగాని ("క. చక్కనగుమనినరక్కసుఁ, డక్కజముగఁజెలిగివచ్చి యయ్యనిలజునీ, యుక్కునుబీరముఁజూచెదఁ, జిక్కఁగనిలువుమనికడు విజృంభించవడిన్." భార. ఆది. ౬, ఆ. "గీ. ఇవ్విధంబునఁబోరెదునింద్రతనయు, నుక్కుఁలావునునంతంతకెక్కుడయ్యె." భార. విరా. ౫, ఆ.) ఇత్యాది ప్రయోగములనుజూడ అది సరిగాతోఁచలేదు.)

**ఉక్కుతీఁగ.** దే. వి. (వీణలోనగువానికివేసెడు) ఉక్కుతంతి.

**ఉక్కుతునియ.** దే. వి. ఉక్కుతునుక. విశే. శూరుఁడు. "గీ. ద్రౌపదేయులుసౌభద్రసుతుండు, నుక్కుతునియలుగారె." భార. ఉద్యో. ౩, ఆ.

**ఉక్కుమడంగు.** దే. అ. క్రి. 1. ఉక్కుచెడు; "చ ఉఱక విరోధిసైన్యముల నుక్కుమడంగఁగనుఁగ్రుల్లనద్ధతిం, బఱప." భార. విరా. ౫, ఆ.—2. చచ్చు. (ప్రే. ఉక్కుమడఁచు. "ఎ, గీ. అనినివాతకవచులనుదానవులనాఁ, బొక్కరుండెక దెయుక్కుమడఁచె." భార. అర. ౪, ౬.)

**ఉక్కెఱ.** వై. వి. దక్కెరఁజెర్చిపొరఁటినరింపె

**ఉక్త.** సం. వి. ఆ. స్త్రీ. ఒకఛందస్సు. (చూ. ఛందస్సు.) విణ. చెప్పఁబడినది.

**ఉక్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. మాట; 2. సరస్వతి.

**ఉక్థము.** సం. వి. అ. న. సామవేదము.

**ఉక్షము.** సం. వి. న్. పుం. ఋషభము, ఎద్దు

**ఉఖ.** సం. వి. ఆ. స్త్రీ. వంటకుండ. ఆోరి.

**ఉఖ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉఖయందు వండఁబడినది, పైరరము.

**ఉగము.** దే. వి. ఆయువు. "క. పినవంగసికరమరయక, పూనిలింగా కట్టియెడలఁబోనఁగునెయేయం, గానమెకాలనియమగతి, శోనావేఁట మునియుగముఁద్రుంగించెదురక." నాఘ ౧, ఆ.

**ఉగాది.** దే. వి. చాంద్రాయణసంవత్సరాది.

**ఉగ్గడించు.** వై. అ. క్రి. మ్రోఁగు, శబ్దించు*. "బంగరుటంది యలుగ్గడింపఁగక." పాండు. ౨, ఆ.–స. క్రి. వచించు*; "గీ. అదియునుంగాక జనియించుటాదిగాఁగఁ, బనులలోనసపెరిగిన పాలసుండు, వావిమాలినపశుమార్గవర్తనంబు, నూనుటరిదియె యిదియేలయుగ్గడింప." హరి. ఉ. 3, ఆ. "హరినామాంకము లుగ్గడించుచు." లక్ష్మి. ౫, ఆ.

**ఉగ్గడువు.** వై. విణ. మిక్కిలి, అధికము. "చ. పేటుగంటియు, గ్గడువగునెత్తుటన్నుడిసి క్రక్కుడునెత్తుటఁగుంకుమచ్ఛవిం, బడసి." ఉ. హరి. ౪, ఆ.

**ఉగ్గము.** వై. వి. చేతఁబట్టుకొనిపోవుటకు అనుకూలముగా కలశాదుల ముఖమునఁ గట్టుత్రాడు.

**ఉగ్గళించు.** వై. అ. క్రి. నట్టువ్రదుకొలిపించు.

**ఉగ్గించు.** దే. స. క్రి. (పసుగుసెకలపోఁగులను) చేర్చు.

**ఉగ్గు.** దే. వి. 1. బిడ్డలకుఁ గలిపిపోసెడి చనుఁబాలామదము; "చ. అతనికిభూతనామమిడియాదరణంబునఁబ్రోచెనిందిరా, పతి కృపనేగుదెంచియలపద్మనివాసయుఁబాంచజన్యమక, చతురవుఁబాలడకవిమలసత్యముపేరిటిపాలతోడన, చ్యుతిపదభక్తి పేరిచము రుగ్గుగఁబెట్టుచుఁ బెంచెనర్థిలిక." పర. ౧, ఆ.—2. మదుత. "సీ. మేనియుగ్గులుమాన్పి మెదలకచిత్రరూపమునుభంగిఁ బర్వత భాతినుండె." వా. ౪, ఆ.

**ఉగ్గుడు.** దే. వి. మేర, మర్యాద. "ఎ, గీ. గడువనఁగ మేరయనఁగ నుగ్గుడటనంగ, సడరుమర్యాద." ఆం, భా. ద్వి. క్ష.

**ఉగ్గుపడు.** ద్వ. అ. క్రి. నుదుతపడు. "వ. జిగిదెగిబిగివదలి ప్రగ్గియుగ్గుపడి తరంగితాయమానంబైన సర్వాంగీణచర్మంబును." కవిక. ౫, ఆ.

**ఉగ్గులువాఱు.** దే. అ. క్రి. (నూలిపోఁగు.) మెలివడు.

**ఉగ్మలి.** దే. వి. ఆఁడుది, ఇంతి, మగువ, వనిత.

**ఉగ్ర.** సం. వి. ఆ. స్త్రీ. వస*. విణ. భయంకరురాలు.

**ఉగ్రంపశ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రూరుఁడు; 2. భయంకరుఁడు.

**ఉగ్రగంధ.** సం. వి. ఆ. స్త్రీ. 1 ఒకదినుసు ఓమము, 2. వస*

**ఉగ్రాక్షుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, వేఁడికంటివేలుపు.

**ఉగ్రాణము.** దే. వి. సామగ్రులుంచెడుగది, కొట్టము.

**ఉగ్రుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. శూద్రదాసియందు క్షత్రియునికిఁబుట్టి కొడుకుమదుచే ద్రుదుకువాఁడు. విణ. భయంకరుఁడు.

**ఉచిఁత.** దే. వి. ఉస్త, ఖండి*, (చూ.) ఉచ్చిఁత.

**ఉచితము.** సం. విణ (అ. ఆ. అ.) 1. తగినది; 2. ఉంచఁబడినది; 3. ఎఱుఁగఁబడినది; 4. కొలఁదియిడఁబడినది.

**ఉచ్చండము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉగ్రతాముగలది, 2. వడిగలది.

**ఉచ్చంద్రము.** సం. వి. అ. పుం. అపరరాత్రము.

**ఉచ్చట.** సం. వి. ఆ. స్త్రీ. వట్రువనుస్తి*.

**ఉచ్చము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉన్నతము, పొడవు.

**ఉచ్చయము.** సం. వి అ. పుం. 1. సమూహము; 2. ప్రోకముడి.

**ఉచ్చరణము.** సం. వి. అ. న. ఉచ్చారణము.

**ఉచ్చరించు.** సం. స. క్రి. వాక్రుచ్చు, చెప్పు.

**ఉచ్చరితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉచ్చరింపఁబడినది.

**ఉచ్చాటనము.** సం. వి. అ. న. 1. ఒకవిద్య; (చూ. విద్య.) 2. వెళ్లఁదోలుట.

**ఉచ్చారణము.** సం. వి. అ. న. ఉచ్చరించుట.

**ఉచ్చారము.** సం. వి. అ. పుం. పురీషము, విష్ఠ.

**ఉచ్చావచము.** సం. విణ. (అ. ఆ. అ.) బహుప్రకారములు గలది.

**ఉచ్చి.** దే. వి. శిరము, బ్రహ్మరంధ్రము.

**ఉచ్చిఁత.** దే. వి. ఉచిఁత*. "శి. చెవ్వలకిటెల్లయుచ్చిఁతకాయ లెంతేసి." య. ౧, ఆ.

**ఉచ్చిచ్చిరె.** దే. వి. కుక్కనుపిలుచుటయందగు ధ్వన్యనుకరణము.

**ఉచ్చైశ్శ్రవము.** సం. వి. అ. పుం. ఇంద్రునిగుఱ్ఱము, నిక్కువీనులజక్కి.

**ఉచుకరించు.** దే. అ. క్రి. (అనాదరముచే) ఉచుక్కుమను.

**ఉచుక్కు.** దే. వి. ఉచుకరించుటయందగు ధ్వన్యనుకరణము.

**ఉచ్చె.** వై. వి. కాలుమడి, మూత్రము*.

**ఉచ్చబుడ్డ.** ద్వ. వి. నీరుతిత్తి, క్లోమము.

**ఉచ్చమల్లి.** దే. వి. దినమొల ఆఁడుది, నగ్నిక. "వ. అయ్యవసరంబునఁ గోటవియనంగ నొక్కయుచ్చమల్లివచ్చి యడ్డపడిన నానగ్నికంజూచి." ఉ, హరి. ౬, ఆ.

**ఉచ్చు.** దే. అ. క్రి. నాటివెడలు. "ఎ, గీ. ఉరమువడిఁదాఁకి వీఁపుననుచ్చిపోయె." భార. భీష్మ* 3, ఆ.—వి. ఉరి, వాగుర.

**ఉచ్ఛిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) భుజింపఁగా మిగిలినది, ఎంగిలి.

**ఉచ్ఛృంఖలము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డపాటులేనిది,

**ఉచ్ఛూనము.** సం. విశే. (అ. ఆ. అ.) దట్టము.

**ఉచ్ఛ్రయము.** సం. వి. అ. పుం. ఉత్సేధము, పొడవు.

**ఉచ్ఛ్రాయము.** సం. వి. అ. పుం.——— వై.———

**ఉచ్ఛ్రితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెరిగినది; 2. పొడవైనది; 3. పుట్టినది.

**ఉచ్ఛ్వసితము.** సం. వి. అ. న. ఊపిరివెలికిఁబుచ్చుట. విశే. ఊపిరివెలికిఁబుచ్చినది.

**ఉచ్ఛ్వాసము.** సం. వి. అ. పుం. 1. ఊపిరివెలికిఁబుచ్చుట; 2. ఊఱట; 3. కలుఁజు; 4. ఆఖ్యాయికపరిచ్ఛేదము.

**ఉజాడు.** హిం. విశే. పాడయిన.

**ఉజ్జయిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకపట్టణము.

**ఉజ్జాసనము.** సం. వి. అ. న. వధము, కొల.

**ఉజ్జి.** దే. విశే. ఉద్దియొక్క రూపాంతరము.

**ఉజ్జీవనము.** సం. వి. అ. న. జీవనము, బ్రదుకు.

**ఉజ్జీవించు.** సం. అ. క్రి. జీవించు, బ్రదుకు.

**ఉజ్జృంభితము.** సం. వి. అ. న. చేష్ట. విశే. విరిసినది.

**ఉజ్జ్వలము.** సం. వి. అ. పుం. సింగారము. విశే. 1. వెలుఁగునది; 2. తెల్లనిది; 3. విరియునది.

**ఉజ్జె.** దే. వి. ఊహ.

**ఉజ్జెగిల్లు.** వై. అ. క్రి. తొలఁగు. "ముకుందాప్వపరముజ్జగిల్లుతజే." పాండు. 3, ఆ. (ప్రే. ఉజ్జగించు.)

**ఉజ్జెగొను.** దే. స. క్రి. (ఉజ్జె+కొను.) ఊహించు. "సీ. అవకీర్తికొడఁబడు నౌగాములెఱుఁగఁడు లజ్జాభిమానంబులుజ్జగొనఁడు." రుక్మాం. ౫, ఆ.

**ఉజ్జెనము.** వై. వి. విడుపు. "గీ. అనినవాసకారంబునుజ్జనమొనర్చి, యక్కుమారుఁడుసేమిరాయనుచునుండె." వి.ర. 3, ఆ.

**ఉజ్జెనసేయు.** వై. స. క్రి. (ఉజ్జెనము+చేయు.) విడుచు. "సంధ్యాభివందనశ్రద్ధయుజ్జనసేయు." కాశీ. ౪, ఆ.

**ఉజ్జెని.** వై. వి. ఉజ్జయిని. "మ. తానేగెను, జ్జనికిఁగానమ్మతిఁబాదుకంబువలనఁగానంతోషితసాప్వంతుఁడై." వి.క్రి. ౨, ఆ.

**ఉజ్జొయించు.** దే. స. క్రి. ఊహించు.

**ఉజ్జొవకల్లు.** ద్వి. వి. అగ్నిపర్వతమునుండివెడలఁగ్రక్కఁబడినఱాయి.

**ఉజ్ఝనము.** సం. వి. అ. న. విడుపు, ఉజ్జనము.

**ఉజ్ఝితము.** సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది.

**ఉటంకము.** దే. వి. టూకి, సంగ్రహము.

**ఉటంకి.** దే. విశే. 1. చొరవగలవాఁడు; 2. ధైర్యముగలవాఁడు.

**ఉటంకించు.** దే. స. క్రి. సంగ్రహించు.

**ఉటంకు.** దే. విశే. ఉటంకియొక్క రూపాంతరము.

**ఉటజము.** సం. వి. అ. పుం, న. 1. ఆకుటిల్లు; 2. ఇల్లు.

**ఉట్టంకణము.** సం. వి. అ. న. స్థాపనము.

**ఉట్టంకితము.** సం. విశే. (అ. ఆ. అ.) స్థాపింపఁబడినది,

**ఉట్టి.** దే. వి. కుండలులోనగునవియుంచుటకై దారములలోనల్లి వ్రేలఁగట్టెడియంత్రవిశేషము, శిక్యము.

**ఉట్టిచీల.** దే. వి. ఇరుప్రక్కల తలయేర్పడినచీల.

**ఉట్టిపడు.** దే. అ. క్రి. 1. ఉన్నట్టుండి కలుగు; 2. అతిశయించు. "ఆయతబంధురలంసనోద్ధతిఁగా నూర్జ్వసవేగముట్టిపడ." శేష. ౨, ఆ.

**ఉట్టు.** దే. అ. క్రి. కాఱు, స్రవించు. "గీ. ఆర్చినెత్తురులుట్టనమ్మస్తకముపట్టి, కొనియతండుదాత్తఘోరరవంబు, భ్రమరిపాఱికురునృపాలకునరదంబు, నందునైచియిట్టులనియెఁదిన." భార. ద్రో. ౫, ఆ.—వి. ఉప్పుపండఁజగినసేల.

**ఉట్రవడియము.** ద్వి. వి. ఒకదినుసువడియము.

**ఉట్లబొద్ది.** దే. వి. ఒకానొకచెట్టు.

**ఉఠాణి.** దే. విశే. గొప్ప, ఉన్నతము.

**ఉడాయించు.** హిం. క్రి. పాఱిపోవుట, హరించుట.

**ఉడికిల్లు.** దే. అ. క్రి. ఉడుకు, తపించు.

**ఉడిగము.** దే. వి. ఊడిగముయొక్క రూపాంతరము. "మహాస్త్రధర. అయ్యర్థులకుఁబుత్తెంచెభూనాథుసతియుడిగపుందోయజాతాక్షిచేతఁగా." నై. ౮, ఆ.

**ఉడివోవు.** దే. అ. క్రి. (ఉడిగి+పోవు.) తొలఁగు. "క. అడిసిగ్గులుతమకంబులు, నుడివోవఁగఁగేలికడఁకలాదవఁగ." మార్క. ౮, ఆ.

**ఉడుఁబోతు.** దే. విశే. (ఉడుగు + పోతు.) ఉడుగువాఁడు, విరతిశీలుఁడు.

**ఉడుఁబోతుపిందె.** దే. వి. కాపు ఉడిగినపిమ్మట చెట్లయందు కలిగెడుపిందె.

**ఉడుక.** వై. వి. వాద్యవిశేషము, హుడుక్కము.

**ఉడుకాటము.** దే. వి. ఉడుకాడుట.

**ఉడుకాడు.** దే. అ. క్రి. ఉడికిల్లు.

**ఉడుకు.** దే. అ. క్రి. తపించు. వి. తాపము.

**ఉడుకుఁబోతు.** దే. విశే. (ఉడుకు+పోతు.) ఈర్ష్యాళువు.

**ఉడుకువ.** దే. వి. ఊఱట, విరతి. "సీ. వావిరిపొదలెడివగపునందడిఁబడియురియుచునునికికినుడుకువయును." భార. విరా. ౨, ఆ.

**ఉడుక్క.** వై. వి. ఉడుకయొక్క రూపాంతరము.

**ఉడుగర.** దే. వి. 1. కానుక; "గీ. కడఁకరాసింగమునకుడుగరలొసంగె." అచ్చ. యు, కాం.—2. బహుమానము. "వ. ఇటుగావించియక్కరువలిపట్టిక్రమ్మఱియక్కొమ్మచేతిగుఱుతుగొనివచ్చిముద్దియ సుద్దియుద్దవిడినెఱిఁగించినఁబొంగిరాముండతనిఁగౌఁగిటంజేర్చి గారవించియుడుగరలిచ్చియనిచిన." య. 3, ఆ.

**ఉడుగు.** దే. అ. క్రి. కృశించు. స. క్రి. మాను. "ఉత్పలగంధినన్నుడిగియొడ్లనుబంపుము." భార. విరా. ౨, ఆ.

**ఉడుత.** దే. వి. వీఁపున మూడునిడుపుగీఱలుగల జంతువిశేషము, చిక్రోడము.

**ఉడుపకుక్క.** ద్వి. వి. (ఉడుము+కుక్క.) ఉడుములోనగువానివేఁటాడెడుతుచ్ఛశునకము, మొఱసడము. "క. జాగిలములు మొఱసడములు, సాగెఁగలసి చాపముక్తశరగతినందా, జాగిలములెదిరెఁబందుల, శైగోధాదికముగాలిశడరె సితరముల్." (ఇదిమఱి

యొకచో చెప్పఁబడినప్పుడు.) "సీ. మున్ను జాగిలములఁగూడి చన్న యుక్తి, యుడుపకుక్క లు కుందేళ్లనుందురువుల, నడుముల గ్రహింపఁబట్టలకడలఁబొదల, గిరులసరియలఁబనివట్టితిరుగు చోట." సా. ర. ఆ.

**ఉడుపము.** సం. వి. అ. న. ప్లవము, తెప్పమ్రాను.

**ఉడుపు.** దే. స్త్రీ. ఉడుగఁజేయు, ఉడిగించు.

**ఉడుపుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, చుక్కలఱేఁడు.

**ఉడుపుష్పము.** సం. వి. అ. న. 1. అశోకము; 2. తామర; 3. దాసనము.

**ఉడుము.** దే. వి. బల్లివంటిరూపముగల ఒకపెద్దజంతువు, గోధ.

**ఉడువు.** ఉభ. దే. స. క్రి. ఉడుగు. "ఉ. ఇంతయెకాముశక్తి నుడివింపఁగ శక్యమెయెట్టివారికిన్." భార. ఆది. ౭, ఆ.—సం. వి. ఉ. స్త్రీ, న. నక్షత్రము.

**ఉడుసర.** దే. వి. కాఁచి, వాయసి.

**ఉడ్కు.** దే. వి. ఉడుకువయొక్క రూపాంతరము. "చ. వల వదురోయఁబాండవులవారొకయుడ్కువలేనిత్రిమ్మటన్, బలమఱి వన్యసత్వములపాల్పడిచచ్చినచోటఁబూరియున్, మొలవదె." భార. విరా. 3, ఆ.

**ఉడ్డ.** దే. వి. 1. నాలుగు; 2. రాశి.

**ఉడ్డకేలువేలుపు.** దుస. వి. విష్ణువు, చతుర్భుజుఁడు.

**ఉడ్డమోమువేలుపు.** దుస. వి. బ్రహ్మ, చతుర్ముఖుఁడు.

**ఉడ్డా.** దే. వి. ఉడ్డయొక్క రూపాంతరము.

**ఉడ్డాడు.** దే. అ. క్రి. కలఁగు. "ద్వి. వేగనందునిపల్లెవెఱచి యుడ్డాడ, నలయకవర్షింపుఁడనిపల్కి యనుప." భాగ. ౧౦, స్కం. (ప్రే. ఉడ్డాడించు.)

**ఉడ్డీనము.** సం. వి. అ. న. పైకెగరుట, నెగడు.

**ఉడ్డుగుడుచు.** దే. అ. క్రి. ఊపిరిత్రిప్పలేకబాధపడు, తికమక లాడు "వ ఉదవాస్తోత్రంబున నుడ్డుగుడిచివెలుపలికఁబుట మెగయుచు." పాండు 3, ఆ.

**ఉడ్లపల్లంచి.** దే. వి. బాలికాక్రీడావిశేషము.

**ఉణుజా.** ద వి మత్స్యవిశేషము. (అప్ర.)

**ఉతక.** దే వి. ఉత్తరాసిఱిగెడుకొయ్య.

**ఉతము.** సం. విశ (అ. ఆ. అ.) ఊలము, నేసినది.

**ఉతుకు.** దే. స క్రి. ఉదుకు, గుంజు.

**ఉత్కంఠ.** సం వి ఆ. స్త్రీ. ఇష్టవస్తుప్రాప్తియందలి వేగిరపాటు, తహతహ.

**ఉత్కంపించు.** సం. అ. క్రి. అకంపించు, వణఁకు.

**ఉత్కటము.** సం. వి. అ. న. లవంగపుపట్ట. విశ. 1. అధిక మైనది; 2. మదించినది.

**ఉత్కము.** సం. విశ. (అ. ఆ. అ.) ఉత్కంఠకలది.

**ఉత్కరము.** సం. వి. అ. పుం. 1. సమూహము; 2. రాశి

**ఉత్కర్షము.** సం. వి. అ. పుం. శ్రేష్ఠ్యము, మేలు.

**ఉత్కలము.** సం. వి. అ. పుం. దేశవిశేషము.

**ఉత్కలిక.** సం. వి ఆ. స్త్రీ. 1. ఉత్కంఠ; 2. పెద్ద అల; 3. పూఁప.

**ఉత్కాసుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఉపేంద్రుఁడు. విగాన్యహ [illegible]

**ఉత్కారము.** సం. వి. అ. పుం. 1. ధాన్యము తూర్పెత్తుట; 2. ప్రోగుచేయుట.

**ఉత్కృష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) శ్రేష్ఠము, మేలుచేయు.

**ఉత్కోచము.** సం. వి. అ. పుం. లంచము.

**ఉత్క్రమణము.** సం. వి. అ. న. మీఁదికెగపోవుట.

**ఉత్క్రోశము.** సం. వి. అ. పుం. లకుముకిపిట్ట; గోరువంక. (అని కొందఱు.) పెద్దచప్పుడు. (అప్ర.)

**ఉత్క్షిప్తము** సం. విశ. (అ. ఆ. అ.) ఎగఁజిమ్మఁబడినది.

**ఉత్క్షేపము.** సం. వి. అ. పుం. ఎగఁజిమ్ముట.

**ఉత్ఖాతము.** సం. వి. అ. న. 1. గర్త డు; 2. విషమస్థలము. విశ. పెల్లగింపఁబడినది.

**ఉత్త.** దే. విశ. రిక్తము, శూన్యము.

**ఉత్తండెములు.** దే. వి. బ. అడవివారికి [illegible] విశేషము.

**ఉత్తంభనము.** సం. వి. అ. న. 1. నిలుపుట; 2. పొడిగించుట.

**ఉత్తంభించు.** సం. స. క్రి. 1. నిలుపు; 2. పొడిగించు.

**ఉత్తంభితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. నిలుపఁబడినది; 2. పొడిగింపఁబడినది.

**ఉత్తంసము.** సం. వి. అ. పుం, న. 1. పూఁగమ్మ; 2. సిగబంతి.

**ఉత్తప్తము.** సం. వి. అ. న. ఎండినమాంసము. విశ. 1. కదలినది; 2. కాఁచఁబడినది.

**ఉత్తమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తమురాలు; 2. చిఱుపాలతీఁగె. విశ 1 ముఖ్యము, 2. (ఐ [illegible]) [illegible]

**ఉత్తమర్ణుఁడు.** సం. [illegible] అప్పిచ్చువాఁడు.

**ఉత్తమాంగము.** [illegible]

**ఉత్తమము.** [illegible]

**ఉత్తర.** సం. వి. ఆ. స్త్రీ 1 [illegible] 2 [illegible] 3. [illegible] (అప్ర.) 2 [illegible] 1 [illegible] దిక్కుది, 2. మీఁదటి.

**ఉత్తరంగము.** సం. వి. [illegible] వట్టి అలలుగలది.

**ఉత్తరక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. (మృతుఁడుఁజేసిన) అపర కర్మము

**ఉత్తరగోక్కరము.** వై. వి. మహా[illegible]విశేషము.

**ఉత్తరణము.** సం. వి. అ న దాటుట.

**ఉత్తరదోశకరము.** సం. వి. అ. న. ఉత్తర[illegible]కారము. "శ్లో. ప్రివాయాశ్చధుజాయాశ్చ [illegible] [illegible]రేనకుర్యాదుత్తరదోశకరమ్." అని [illegible] ము.

**ఉత్తరపక్షము.** సం. వి. అ. పుం. సిద్ధాంతము.

**ఉత్తరఫల్గుని.** సం. వి. ఈ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**ఉత్తరభద్రపద.** సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**ఉత్తరవాసము.** సం. వి. అ. న. ఉత్తరీయము. "చ. చం(ద్ర) కపుకుతోడ నరియైనవెలిపట్టుపుట్టముత్తరవాసముగధరించి." నై. ౮, ఆ.

**ఉత్తరసాక్షి.** సం. వి. న్. పుం. సాక్షులకుటకుసాక్షి.

**ఉత్తరాషాఢ.** సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**ఉత్తరాసంగము.** సం. వి. అ. పుం. ఉత్తరీయము.

**ఉత్తరాసి.** దే. వి. తలుపు క్రిందితిరిగెడుకుబుసము.

**ఉత్తరించు.** ఉభ. దే. స. క్రి. ఖండించు "ఉత్తరించు భ్రమల పాతుని క్రొడుక్రియ." ఉ, హరి. ౪, ఆ. "ద్వి. పిలుపులుత్తరించు." గా. ఆర, కాం.—సం. దాటు.

**ఉత్తరీయము.** సం. వి. అ. న. పయిరవాసము.

**ఉత్తరుఁడు** సం. వి. అ. పుం. 1. సామంతునిచేరువనున్న రాజు; 2. విరాటునికొడుకు. విణ. ఉత్తముఁడు.

**ఉత్తరువు.** వై. వి. సెలవు, ఆజ్ఞ*.

**ఉత్తరేను.** దే. వి. అపామార్గముగ. (దీనినే ఉత్తరేణియని వాండురు.)

**ఉత్తరోత్తరము.** సం. క్రి. విణ. అ. న. పైపై.

**ఉత్తలపడు.** దృ. అ. క్రి. (ఉత్తలము+పడు.) 1. త్వరపడు; "విచీభుజావళి యాలింగనకేళి నుత్తలపడగ్." హరి. పూ. ౭, ఆ.—2. పరితాపపడు; "అనవినుచుం గలంగుహృదయంబునఁ దాపమునివ్వటిల్ల." (అమీంద.) "అనుచునుత్తలపడునయ్యవసరం బున." భార. విరా. ౫, ఆ.—3. వ్యత్యస్తమగు; "చ. కలఁగెఁ బయోనిధుల్ గిరులుకంపమునొందెఁజలించెభూమిది, క్కులుపడఁ కెక్కవియత్తలముగుబ్బటిలెగ్ గ్రహతారకంబులు, త్తలపడఁజొచ్చె." భో. ౪, ఆ.—4. కలఁతపడు.

**ఉత్తలపాటు.** దే. వి. (ఉత్తలపడుట.) 1. త్వరపడుట; 2. పరితాపపడుట; 3. వ్యత్యస్తమగుట; 4. కలఁతపడుట.

**ఉత్తలపెట్టు.** దే. స. క్రి. (ఉత్తలము+పెట్టు.) 1. త్వరపఱచు; 2. పరితాపపడఁజేయు; 3. వ్యత్యస్తముకావించు; 4. కలఁతపఱచు.

**ఉత్తలము.** దే. వి. 1. త్వర; 2. పరితాపము; "క. చిత్తంబునఁ దైకొనియెడు,నుత్తలమునడంచి విముఖపయోరుహముసఁద,లొక్కత్తెదు వెడనవ్వునఁ బ్రియు, చిత్తం బిగురొత్తఁజనియెఁజెలువయడవికిగ్." సం. "నవాభర్తాహసంతీవ హృదయేన విదూయతా." భార. అర. ౭, ఆ.—3. వ్యత్యాసము; 4. కలఁత. "ఉ. అత్తఱిఁగెంపుమీఁజిన ఘనావళియాకసమెల్లఁగప్పి క్రొ, న్నెత్తురు నెమ్ములుగ్ గురిసెనీరధి యెంతయుఘూర్ణమానమై, యుత్తలమంచెఁబంధ్యకములక్కొమొగిగ్ గదలెగ్ మహాల్కములల్, మొత్తము గట్టిరాలెబలములల్ వెఱఁగం దఁగఁజేటుతెల్పుచుగ్." నిర్వ. ౨, ఆ.

**ఉత్తానము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. లోఁతులేనిది; 2. వెలికిలినది.

**ఉత్తానశయుఁడు.** సం. వి. అ. పుం. వెలికిలి పరుండుబిడ్డ, డింభుఁడు.

**ఉత్తారకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దాటించువాఁడు.

**ఉత్తార్యము.** సం. విణ. (అ. ఆ. అ.) దాఁటఁదగినది.

**ఉత్తాలము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడవైనది; 2. తొట్రుపాటుగలది; 3. మేలైనది; 4. వికవియైనది.

**ఉత్తి.** వై. వి. ఉక్తి, ప్రశంస. "చ. కమనకనకాజమూర్తి జాలు పాత్రశుభగావనియాపనాశ్వదు, క్రిముపడిఁజొచ్చి యథ్వఁటితురంగ ముఁబావనిచ్చి... క్రీడి బుగంబునేనత, త్రుమితులఁ బునగ్ వినుతశౌర్యమునుత్తిగఁబెట్టిరెచ్చె నగ్." జై. ౧. ఆ. (ఇదియింకను విచార్యము.)

**ఉత్తీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) దాఁటఁబడినది.

**ఉత్తుంగము.** సం. విణ. (అ. ఆ. అ.) పొడవైనది.

**ఉత్తుండి.** సం. వి. ఈ. స్త్రీ. సురుజేగ.

**ఉత్తుఁడు.** వై. విణ. లేనివాఁడు. "గీ. ఎన్నియేఁడులు మనుజాని యెన్నఁగఁగ, వారిలోకమందున్నవేల్ వస్తువులు, నాకలోకమహా సుఖశ్రీకనాకఁ, దుత్తుఁడైయుండు నిర్మలచిత్తవృత్తి." భారా. అను. ౨, ఆ.

**ఉత్తేజనము.** సం. వి. అ. న. 1. ప్రేరేఁచుట; 2. వాఁడి చేయుట; 3. నడపుట; 4. పుచ్చుట.

**ఉత్తేజితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రేరేఁపఁబడినది; 2. వాఁడిచేయఁబడినది; 3. నడపఁబడినది; 4. పుచ్చఁబడినది.

**ఉత్థము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలిచినది; 2. పుట్టినది.

**ఉత్థానము.** సం. వి. అ. న. 1. కూర్చుండిలేచుట; 2. పురుషప్రమాణము; 3. ప్రయత్నము; 4 ముంగిలి; 5. యుద్ధము; 6. మలమూత్రాదిరోగవిశేషము; 7. సంతోషము; 8. సమాప్తి; 9. సైన్యము.

**ఉత్థాపకము.** సం. విణ. (అ. ఆ. అ.) లేపునది.

**ఉత్థాపనము.** సం. వి. అ. న. లేపుట.

**ఉత్థాపితము.** సం. విణ. (అ. ఆ. అ.) లేపఁబడినది.

**ఉత్థితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. లేచినది; 2. పుట్టినది; 3. పెరిగినది; 4. యత్నించినది.

**ఉత్పతనము.** సం. వి. అ. న. 1. ఎగయుట; 2. పుట్టుక.

**ఉత్పతితి.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఎగిరెడుస్వభావముకల వాఁడు.

**ఉత్పతితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎగసినది; 2. పుట్టినది.

**ఉత్పతిష్ణువు.** సం. విణ. ఉ. ఎగిరెడుస్వభావముగలవాఁడు.

**ఉత్పత్తి.** సం. వి. ఇ. స్త్రీ. జననము, పుట్టుక.

**ఉత్పథము.** సం. వి. అ. పుం, న. కానిత్రోవ.

**ఉత్పన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్థితము, పుట్టినది.

**ఉత్పలపత్రము.** సం. వి. అ. న. కలువఱేకు. బ. పిఱుఁదుల మీఁదినఖక్షతములు. "చ. ఒనరఁగఁజూడనింపెసఁగనుత్పలపత్రము లొప్పుచున్న పీ,ఘనతరసైకతంబుపయిఁగంటిరెకిన్న రకంబులారయం, దనుపమలీలనీఁదునొకయంబుజపాణికటినఖాంకముల్, గనుఁగొని సర్వగర్వములుగానొకయంగనపల్కెనవ్వుచుగ్." భాను. ౨, ఆ.

**ఉత్పలము.** సం. వి. అ. న. 1. కలువ; 2. చెంగల్వకోష్ఠుగ.

**ఉత్పలశారిబ** సం. వి. ఆ. స్త్రీ. సూమెనగ.

**ఉత్పశ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మీఁదుచూచువాఁడు.

**ఉత్పాటనము.** సం. వి. అ. న. పెఱుకుట.

**ఉత్పాటించు.** సం. స. క్రి. పెఱుకు.

**ఉత్పాటితము.** సం. విణ. (అ. ఆ. అ.) పెఱుకఁబడినది

**ఉత్పాతము.** సం. వి. అ. పుం. అవశకునము. (అనఁగా ఆబాల గోపజనప్రసిద్ధమైన వస్తుస్వభావమునకంటె భిన్నమైనవస్తురూపము. ఇది త్రివిధము.–దివ్యము, ఆంతరిక్షము, భౌమము అని. దివ్యము– అపూర్వగ్రహనక్షత్రములు పుట్టుట. ఆంతరిక్షము – పరివేషము ఇంద్రధనుస్సు మొదలగునవి... భౌమము– అపూర్వములైన చరాచరవస్తువులు కలుగుట. ఇవి దుష్ఫలోద్భవ ములు.)

**ఉత్పాదకము.** సం. వి. అ. పుం. శరభము. విణ. కలిగించునది.

**ఉత్పాదనము.** సం. వి. అ. న. ఆపాదనము, కలిగించుట.

**ఉత్పాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆపాదితము, కలిగింపఁబడినది.

**ఉత్పాదిల్లు.** సం. అ. క్రి. కలుగు. (చూ. ఉత్పాదించు.)

**ఉత్ప్రాసము.** సం. వి. అ. పుం. మర్మము దూషింపఁబడినట్లు పరిహాసము.

**ఉత్ప్రేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. హెచ్చరికలేమి.

**ఉత్ప్రేక్షించు.** సం. స. క్రి. ఉత్ప్రేక్ష కలుగఁజెప్పు.

**ఉత్ఫుల్లము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వికసించినది; 2. వెలసినది.

**ఉత్సంగము.** సం. వి. అ. పుం. 1. ఒడి; 2. తొడ; 3. అభినయహస్తవిశేషము. (వ్రేళ్లుచాఁచిపట్టినరెండుచేతులను మనికట్లయందు ముఁగూర్చిఱొమ్మునఁబట్టినది.)

**ఉత్సన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెల్లగింపఁబడినది; 2. పైకెత్తఁబడినది.

**ఉత్సము.** సం. వి. అ. పుం. ప్రస్రవణము, ఊట.

**ఉత్సర్గము.** సం. వి. అ. పుం. 1. త్యాగము; 2. దానము; 3. న్యాయము; 4. విడుపు; 5. సామాన్యము.

**ఉత్సర్జనము.** సం. వి. అ. న. 1. త్యాగము; 2. విడుపు.

**ఉత్సర్జించు.** సం. స. క్రి. విసర్జించు, విడుచు.

**ఉత్సర్జితము.** సం. విణ. (అ. ఆ. అ.) విడువఁబడినది.

**ఉత్సవము.** సం. వి. అ. పుం. 1. పండుగ; 2. కోరికలు కొనసాగుట; 3. గర్వము; 4. కోపము.

**ఉత్సహించు.** సం. అ. క్రి. యత్నించు, కడఁగు.

**ఉత్సాదనము.** సం. వి. అ. న. 1. నలుఁగు; 2. పెల్లగించుట; 3. పైకెత్తుట.

**ఉత్సాదించు.** సం. స. క్రి. 1. పెల్లగించు; 2. పైకెత్తు.

**ఉత్సాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నలుఁగుపెట్టఁబడినది; 2. పెల్లగింపఁబడినది; 3. పైకెత్తఁబడినది.

**ఉత్సారణము.** సం. వి. అ. న. కదలించుట.

**ఉత్సారించు.** సం. స. క్రి. కదలించు.

**ఉత్సారితము.** సం. విణ. (అ. ఆ. అ.) కదలింపఁబడినది.

**ఉత్సాహము.** సం. వి. అ. పుం. 1. ప్రయత్నము; 2. సూత్రము.

**ఉత్సాహవర్ధనము.** సం. వి. అ. పుం. వీరరసము.

**ఉత్సాహించు.** సం. అ. క్రి. ఉద్యమించు, కడఁగు. "శా. మరుద్రేత్రింబోలుపలులై ఘలీలఁగ నుఁదుత్సాహించె సోదర్యు కోశా." జై. ౬. ఆ.

**ఉత్సిక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అతిశయించినది; 2. గర్వించినది; 3. పొంగినది; 4. ప్రోక్షింపఁబడినది.

**ఉత్సుకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఇష్టమైనకార్యమునందు ఉద్యోగించినవాఁడు.

**ఉత్సృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁబడినది; 2. విడువఁబడినది.

**ఉత్సేకము.** సం. వి. అ. పుం. 1. అతిశయము; 2. గర్వము. 3. పొంగు; 4. ప్రోక్షణము.

**ఉత్సేకించు.** సం. అ. క్రి. 1. అతిశయించు; 2. గర్వించు. 3. పొంగు. స. క్రి. ప్రోక్షించు.

**ఉత్సేధము.** సం. వి. అ. న. శరీరము. పుం, న. పొడవు.

**ఉదంచనము** సం. వి. అ. న. 1. మూకుడు; 2. విజృంభించుట; 3. పైకెత్తుట.

**ఉదంచితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విజృంభించినది; 2. పైకెత్తఁబడినది.

**ఉదంతము.** సం. వి. అ. పుం. వృత్తాంతము, సుద్ది.

**ఉదంతుఁడు.** సం. వి. అ. పుం. 1. మంచిమనుష్యుఁడు; 2. వర్తకుఁడు.

**ఉదకము.** సం. వి. అ. న. జలము, నీరు.

**ఉదక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) చేదఁబడినది.

**ఉదక్య.** సం. వి. ఆ. స్త్రీ. రజస్వల, ముట్టుది.

**ఉదగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడవైనది; 2. భయంకరమైనది.

**ఉదజము.** సం. వి. అ. పుం. పసులఁదోలుట. విణ. నీటఁబుట్టినది.

**ఉదధి.** సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.

**ఉదన్య.** సం. వి. ఆ. స్త్రీ. నీళ్లుత్రాగనిచ్ఛ, నీరువట్టు.

**ఉదన్వంతము.** సం. వి. త్. పుం. సముద్రము, కడలి.

**ఉదపానము.** సం. వి. అ. పుం, న. కూపము, నుయ్యి.

**ఉదయనీయ.** సం. వి. ఆ. స్త్రీ. నవమాస్యేష్టి.

**ఉదయము.** సం. వి. అ. పుం. 1. పుట్టుక; 2. ఉన్నతి; 3. తూర్పుకొండ; 4. పొడవు.

**ఉదరంభరి.** సం. విణ. ఇ. తనపొట్టపోసికొనువాఁడు.

**ఉదరము.** సం. వి. అ. న. 1. కడుపు; 2. యుద్ధము.

**ఉదరిపడు.** దే. అ. క్రి. అదరిపడు. "గీ. ఉదరిపడిమేలుకని కన్నులువిదవిచ్చి, చూచికానదయట్టి యాబాలికనచట." హరి. ఉ. ౭. ఆ.

**ఉదరిపాటు.** దే. వి. 1. అదరిపాటు; "ద్వి. ఉదరిపాటు నదదంకోపరినుండి." విష్ణు. పూ. ౧. ఆ.–2. ఉలికిపాటు. "ఎ. గీ. అతనియాకారమునుజూచియదరిబెదరి, చెదరిపదములు తడఁబడనుదరిపాటు, గదుర." ఉ. రా. ౩. ఆ.

**ఉదరు.** దే. అ. క్రి. అదరు, చలించు. "సీ. ఉదరి క్రేళ్లుఱుకును సుగ్రకేసరులతో బెలగతొహులుకంక వెలికినెగయ." హరి. పూ. ౭, ఆ.

**ఉదర్కము.** సం. వి. అ. పుం. 1. రానగలకాలము; 2. రానగల ఫలము; 3. ఉన్నత్తిమ్ముల్లు.

**ఉదర్చి.** సం. వి. ఇ. పుం. అగ్ని. విణ. ప్రకాశము మంటలు గలది.

**ఉదవసితము.** సం. వి. అ. పుం, న. గృహము, ఇల్లు.

**ఉదశ్విత్తు.** సం. వి. త్. న. సగమునీళ్లుచేర్చినమజ్జిగ.

**ఉదస్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడినవాఁడు.

**ఉదాకరము.** సం. వి. అ. పుం. సముద్రము, కడలి.

**ఉదాత్తము** సం. వి. అ. పుం. 1. వేదమునందలిస్వరవిశేషము; (చూ. స్వరము.) 2. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**ఉదాత్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్పవాఁడు; 2. దయగలవాఁడు; 3. ఇచ్చువాఁడు; 4. ఉత్సాహముగలవాఁడు.

**ఉదానము.** సం. వి. అ. పుం. 1. కంఠమునందలిగాలి; 2. పాము; 3. బొడ్డు.

**ఉదారము.** సం. వి. అ. పుం. ధాన్యవిశేషము. ఊదరలు. "శ్లో. ప్రియంగవోపహ్యుదారాశ్చకోరదూషాస్సతీనకాః." విష్ణుపురాణము. ప్రథమాంశము. ౬, అధ్యాయము.

**ఉదారుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్చువాఁడు; 2. గొప్పవాఁడు; 3. తిన్నఁదనముగలవాఁడు.

**ఉదాసము.** సం. వి. అ. పుం. తగులమి.

**ఉదాసించు.** సం. స. క్రి. తిరస్కరించు.

**ఉదాసీనుఁడు.** సం. వి. అ. పుం. దండెత్తిపోవువానికి మిత్రుఁడగువానిదేశమునకు నావలిదేశపురాజు. విణ. తగులనివాఁడు, ఉదాసీనపుమాటలు, దుర్భాషలు.

**ఉదాస్థితుఁడు.** సం. వి. అ. పుం. 1. వాకటికావలివాఁడు; 2. స్వకర్మమునువదలినముని; 3. వేగులవాఁడు.

**ఉదాహరణము.** సం. వి. అ. న. చెప్పెడియర్థమునకు సరితూఁగునట్లు ఎత్తిచూపెడు అర్థాంతరము, తెలుపుట.

**ఉదాహరించు.** సం. స. క్రి. ఉదాహరణపఱచు.

**ఉదాహారము.** సం. వి. అ. పుం. ఉదాహరణము.

**ఉదాహృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉదాహరింపఁబడినది.

**ఉదితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది; 2. పుట్టినది.

**ఉదియ.** వై. వి. (ఉద్దియయొక్కరూపాంతరము.) యత్నము. "మ. వడిఁజుట్టుంజనియార్పుఁజేర్పుఁగదియన్వచ్చున్వెనన్ ప్రచ్చుఁజీ, ద్వడనొంచుంగబళించుఁజించుఁదొలఁగున్డాయున్ దెగన్ వ్రేయుపీ, ద్వడనొత్తున్దివికెత్తుఁగిట్టియుదియన్బట్టున్ బడంద్రొచుబ, ల్విడిఁద్రోచున్రుధిరంబుఁబీల్చుఁదెలుచన్ వీక్షించుఁగ్రోధంబునన్." రా. అర. ౨, ఆ.

**ఉదియగొను.** ద్వి. అ. క్రి. (ఉదియ+కొను.) యత్నించు. "శీ. ఒండొరునొప్పింపనుడుగకపెనఁగంగనొదవునదల్పులనుదియగొనుచు." రా. అర. ౨, ఆ.

**ఉదిరి.** దే. వి. ఉపాయము. "ఉదిరియఁగుగుమవాఁడు." ఐం. ద్రా. ౧, ఆ. విణ. తప్పుడు. "చె. ఇదికొలమెఱుఁగంగదుదిరిబంగారంపుపసిమి ప్రస్తుతు వచ్చుపట్టుగాని." పాండు. ౪, ఆ.

**ఉదిరిగొను.** దే. అ. క్రి. (ఉదిరి+కొను.) వండు, తపించు. "చ. పాల్పుపొంగయఁబునఁగిరినమదవారణఁబుచేన దిరిగొనియాపుదలించి కెంకటట్టనియ." (ఇక్కడ ఉదిలగొనియనియుండవచ్చును. అయినను ప్రతులయందు వా పాఠము ఇట్లున్నది.) ఉ, హరి. ౫, ఆ.

**ఉదిల.** వి. పరితాపము.

**ఉదిలకొను.** దే. అ. క్రి. ఉత్సాహపడు, పరితపించు. "ఉ, కీ. మరుఁడుదొడ్డ డంబుకుఁడుకూనకడఁని, చూపుగనుల క్రొవ్వాఁడిమిపాపనగా, కరికుచనగలఁబగువంగఁడు మంటె, పోయఁబొవకఁడెమిచెప్పుదునకొంత్ర వ ఇట్లుండవాగ్ని నదిలకొనియగ్నిదేవుండక్కాంతతోసకొంచబునన్నటనియె." శాం. సు. ౧, ఆ.

**ఉదీచి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరపుదిక్కు.

**ఉదీచ్యము.** సం. వి. అ. న. వరువేరు పుం. శరావతీనదియెల్లగాఁగలపశ్చిమోత్తరముల మధ్యదేశము. విణ. ఉత్తరపుదిక్కుది.

**ఉదీర్ణము.** సం. విణ (అ. ఆ అ.) ఉదారము. గొప్పది.

**ఉదుంబరపర్ణి.** సం. వి ఈ. స్త్రీ. దంతికీ.

**ఉదుంబరము.** సం. వి. అ. న. రాగి పుం. 1. మేడికీ; 2. గడప; 3. కుష్ఠ భేదము.

**ఉదుంబరుఁడు.** సం. వి. అ. పుం. నపుంసకుఁడు, పేడి.

**ఉదుకు.** దే. స. క్రి. ఉతుకు, గుంజు.

**ఉదుటు.** దే. వి. ఉద్ధతి. "మూర్ఛతొలంగినఁగన్నువిచ్చిపెరుదుటునలేచెలక్ష్మణనహోదరుఁడు." ఉ, రా. ౭, ఆ.—విణ. ఉద్ధతము.

**ఉదురు.** దే. వి. ఉదుటు. "ఉ. చెదరక యక్షులద్దనుజశేఖరు బిట్టెదరించిభీకర, ప్రదరపరంపరల్ గురిసి పైపయినైకవిధాయుధచ్చటల్, గుదిగొనవించిబీరముఁగొయనియార్చినచోమహోదరుం, డుదురునవొక్కఘోరగదయూనిక్కతొంతునిలీలనుగ్రుఁడై." ఉ, రా. 3, ఆ. (ఉదురుమిడుకు ఇత్యాదిపదప్రయోగమువలన నిది ప్రయోగవిరళముగానుండినను వ్రాయఁబడియెను.)

**ఉదురుమిడుకు.** దే. విణ. 1. ఉద్ధతుఁడు; 2. దుర్వినీతుఁడు.

**ఉదూఖలము.** సం. వి. అ. న. 1. రోలు; 2. గుగ్గిలపుచెట్టు.

**ఉదూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెండ్లియయినది; 2. బలిసినది; 3. వహింపఁబడినది.

**ఉద్గతము.** సం. విణ. (అ. ఆ. అ.) భేదించుకొని వెలికుఱికినది.

**ఉద్గతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఎగపు; 2. పుట్టుక. "జగదుద్గతికినిబీజము." ఆము. 3, ఆ.

**ఉద్గమనీయము.** సం. వి. అ. న. ఉదికినదోవతిజోడు. (కొందఱిది త్రిలింగమనియుదీనికర్థము ఉదికినదోవతి అనియు సహేతుకముగఁ జెప్పుచున్నారు.) విణ. ఎగయఁదగినది.

**ఉద్గమము.** సం. వి. అ. పుం. 1. ఎగపు; 2. పుట్టుక.

**ఉద్గమించు.** సం. అ. క్రి. ఎగయు.

**ఉద్గరణము.** సం. వి. అ. న. 1. క్రక్కుడు; 2. త్రేఁపు.

**ఉద్గాఢము.** సం. క్రి. విణ. అ. న. పెల్లు. విణ. అధికము.

**ఉద్గాత.** సం. వి. ఋ. పుం. యజ్ఞమునందుసామవేదితంత్రము నడపువాఁడు.

**ఉద్గారము.** సం. వి. అ. పుం. 1. క్రక్కుడు; 2. త్రేఁపు. (చూ. ఉద్భేదము)

**ఉద్గారించు.** సం. అ. క్రి. త్రేఁచు.

**ఉద్గీథము.** సం. వి. అ. పుం. సామవేదము. (సామవేదముయొక్క భాగమని యొకరు)

**ఉద్గీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) క్రక్కఁబడినది.

**ఉద్గూర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) పైకెత్తఁబడినది.

**ఉద్గ్రాహము.** సం. వి. అ. పుం. ఉగ్గము, ఎగఁబట్టుట (అని కొందఱు.)

**ఉద్గ్రీవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁబడిన మెడగల వాఁడు; 2. గర్వముగలవాఁడు.

**ఉద్ఘనము.** సం. వి. అ. పుం. చెక్కడము మ్రానిక మీఁదిగా క్రింద నుంచుకొనెడి బల్లలోనగునది, దాయి.

**ఉద్ఘము.** సం. విణ. అ. పుం. ఇది వృత్తియందు ఉత్తరపదమై శ్రేష్ఠతను తెలుపును. (ఉదా. గవోద్ఘము మొ.)

**ఉద్ఘాటనము.** సం. వి. అ. న. 1. ఏతము; 2. ఉగ్గడించుట; 3. భేదించుట.

**ఉద్ఘాటించు.** సం. స. క్రి. భేదించు, వ్రచ్చు.

**ఉద్ఘాటితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉగ్గడింపఁబడినది; 2. భేదింపఁబడినది.

**ఉద్ఘాతము.** సం. వి. అ. పుం. 1. ఇనుపగుదియ; 2. కాలి తొట్రుపాటు; 3. దెబ్బ; 4. ప్రారంభము.

**ఉద్ఘుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్ఘోషింపఁబడినది.

**ఉద్ఘోషము.** సం. వి. అ. పుం. మొఱ.

**ఉద్ఘోషించు.** సం. అ. క్రి. మొఱపెట్టు.

**ఉద్ద.** దే. ఉప. మిక్కిలి. (ఉద్దవడి, ఉద్దవిడి ఇత్యాదులు.) ఉద్దవడిక. — "ఉ. ఓమనుజేంద్ర నీవెనుకనుద్దవడింబఱతెంచుదాననీ, వామహనీయవేగమునకంకిలిసేయక తూఁగనోపినన్, గా మితసిద్ధి నొందు." భో. 2, ఆ.–ఉద్దవిడిక. "క. విడువిడుతురగముఁ బట్టక, విడువకమార్కొన్ననుద్దవిడిఁబ్రాణంబుల్, విడిపించికాని పాఱఁగ, విడువఁడకర్ణసుతుఁడనఁ బ్రవీరుఁడునగుచున్." జై. 8, ఆ.

**ఉద్దండము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడవైనది; 2. ఎక్కువైనది.

**ఉద్దండించు.** సం. అ. క్రి. 1. ఎక్కుడగు; 2. పొడవగు.

**ఉద్దంశము.** సం. వి. అ. పుం. మత్కుణము, నల్లి.

**ఉద్దరి.** దన్. వి. (ఉద్ద+దరి.) వాటమైనిక్కిలిపొడవైనగట్టు.

**ఉద్దరువు.** వై. వి. నేలలోనగునవి యుంచి పిసికొనెడి వడ్డీలేని యప్పు.

**ఉద్దానము.** సం. వి. అ. న. 1. కట్టు; 2. మరుపుట.

**ఉద్దాముఁడు.** సం. వి. అ. పుం. వరుణుఁడు. విణ. 1. కట్టు లేనివాఁడు; 2. స్వతంత్రుఁడు.

**ఉద్దాలము.** సం. వి. అ. పుం. విరిగి?.

**ఉద్దాలు.** దే. వి. బ. చెప్పులు. "ఎ, గీ. పాదములఁగిల్లుకట్టని పలుకుచుండు, కుచ్చుటుద్దాలుఁజెప్పట్టుఁగోలయమరు." హం. స. 3. ఆ.

**ఉద్ది.** దే. వి. 1. జోడు; 2. గూడలులోనగువానితోఁజిల్లునిల్లపాటను కాలువ మొదట వచ్చిక పక్షులుమొదలగువానిచేనేర్పఱుపఁబడిన నిల్లు; 3. సస్యవిశేషము. 4. ధాన్యవిశేషము. విణ. 5. సమానము.

**ఉద్దించు.** దే. స. క్రి. 1. జతపఱుచు; "వ. మనసుద్దఱము నద్దించుకొని కటార్లిసక్కటికయ్యంబుగావించుచుకోయ్యంబుకొలఁది సెఱపుదును." కళా. 5, ఆ.–2. పోలు "సీ. ఉదయాద్రితట మున నద్దించినను నుఁగొస్తుభింబనుదివాకరుఁడుదయించు." ఉ, హరి. 3, ఆ.

**ఉద్దికాఁడు.** దే. వి. 1. జతయైనవాఁడు; "భాస్వంతునియుద్ది కాఁడు." భల్లా. 4, ఆ.–2. చెలికాఁడు. "ఎద్దాపత్తిజోడు నుద్దికాఁడు" అచ్చ. ఉర, కాం.

**ఉద్దితము.** సం. విణ. (అ. ఆ. అ.) వద్ధము, కట్టఁబడినది.

**ఉద్దినము.** సం. వి. అ. న. పట్టపగలు.

**ఉద్దియ.** వై. వి. యత్నము.

**ఉద్దియసేయు.** వై. అ. క్రి. (ఉద్దియ+చేయు.) యత్నించు. "ఉ. నిద్దురమేలుకొన్మురజనిచరవర్గవతిసకుఁకుమం, బద్దినభంగి మింటనదెయామినిచెల్లెలుకాల్యసంధ్యరో, నద్దియసేయుచున్నయది యుష్ణమయూఖసుతప్రసూతికిన్, బ్రొద్దులుచొచ్చియున్నయవి పూర్వదిశాసరసీరుహాకుకిన్." నై. 5, ఆ.

**ఉద్దిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్దేశింపఁబడినది.

**ఉద్దీఁడు.** దే. వి. ఉద్దికాఁడు. "సీ. పిల్లదీపాడుచుఁజెనఁగునద్దిలచే గ్రుద్దులఁబడికందికుందికుంది." శేష. 3, ఆ.

**ఉద్దీపకము.** సం. వి. అ. పుం. కొండచీమ. విణ. వెలిఁగించునది.

**ఉద్దీపనము.** సం. వి. అ. న. 1. వెలుఁగుట; 2. విభావభేదము. (ఆలంబనగుణాదికము.)

**ఉద్దీపితము.** సం. విణ. (అ. ఆ. అ.) వెలిఁగింపఁబడినది.

**ఉద్దేశము.** సం. వి. అ. పుం. గుఱి.

**ఉద్దేశించు.** సం. స. క్రి. గుఱించు.

**ఉద్దేశ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) గుఱింపఁదగినది.

**ఉద్ద్యోతించు.** సం. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగు.

**ఉద్ద్రావము.** సం. వి. అ. పుం. ఈడఁబోక.

**ఉద్ద్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) ఈడఁబోయినది.

**ఉద్ధతము.** సం. విణ. (అ. ఆ. అ.) గర్వించినది.

**ఉద్ధతి.** సం. వి. ఇ. స్త్రీ. ఉద్వృత్తి, గర్వము.

**ఉద్ధరణము** సం. వి. అ. న. 1. పెకలించుట; 2. మీఁదికెత్తుట; 3. వాంతియెత్తినయన్నము.

**ఉద్ధరణి.** సం. వి. ఈ. స్త్రీ. నీళ్లెత్తిచేతఁబోసికొనెడు ఆచమనసాధన విశేషము.

**ఉద్ధరించు.** సం. స. క్రి. 1. పెల్లగించు; 2. మీఁదికెత్తు.

**ఉద్ధర్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఉద్ధరించువాఁడు.

**ఉద్ధర్షము.** సం. వి. అ. పుం. ఉత్సవము, పండుగ.

**ఉద్ధవము.** సం. వి. అ. పుం. 1. సంతసము, 2. యజ్ఞాగ్ని; 3. ప్ర. ఒక యాదవ్రుఁడు.

**ఉద్ధానము.** సం. వి. అ. న. పొయ్యి.

**ఉద్ధారకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉద్ధరించువాఁడు

**ఉద్ధారణము.** సం. వి. అ. న. ఉద్ధరించుట

**ఉద్ధారము.** సం. వి. అ. పుం. 1. ఉద్ధరుణ్ము; "సంపద్వృద్ధిక ముద్ధారః" అనివైజయంతి. అప్పు. (అనికొందఱు.) 2. పైకెత్తుట; 3. లేవనెత్తుట.

**ఉద్ధురము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. బరువైనది; 2. దట్టమైనది, 3. నిలుకడైనది.

**ఉద్ధూతము.** సం. విశే. (అ. ఆ. అ.) మీఁదికికదలింపఁబడినది

**ఉద్ధృతము.** సం. విశే. (అ. ఆ. అ.) పయికెత్తఁబడినది; 2. చేయఁబడినది, 3. అనుభవించి విడువఁబడినది

**ఉద్ధృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. గర్వము; 2. పైకెత్తుట.

**ఉద్ధ్వాతుఁడు.** సం. వి. అ. పుం. పొలిమేరవిధమును సామంతుల వలన విని దాని యనుభవాదులఁదెలిసి యాపొలిమేర నేర్పాటుచేసిన వాఁడు. విశే. పైకెత్తఁబడినవాఁడు.

**ఉద్బుద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తలఁపునకు వచ్చినది; 2. మేలుకొన్నది; 3. వికసించినది.

**ఉద్బోధకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తలఁపునకుఁ దెచ్చువాఁడు; 2. మేలుకొలుపువాఁడు.

**ఉద్బోధనము.** సం. వి. అ. న. తలఁపునకుఁదెచ్చుట.

**ఉద్బోధము.** సం. వి. అ. పుం. 1. తలఁపు; 2. మేలుకోలు; 3. వికాసము.

**ఉద్భటము.** సం. వి. అ. పుం. తాఁబేలు. విశే. అధికము.

**ఉద్భటుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు. విశే. అధికుఁడు.

**ఉద్భవము.** సం. వి. అ. పుం. జననము, పుట్టుక.

**ఉద్భవించు.** సం. అ. క్రి. జనించు, పుట్టు.

**ఉద్భాసితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశితము. వెలిఁగింపఁబడినది.

**ఉద్భిజ్జము.** సం. విశే. (అ. ఆ. అ.) భూమినిభేదించుకొనిపుట్టునది. (తరుగుల్మాది.)

**ఉద్భిదము.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——(ఇది దకారాంతముగాను కలదు.)

**ఉద్భిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) విరిసినది.

**ఉద్భూతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పుట్టినది; 2. పొడవైనది.

**ఉద్భేదము.** సం. వి. అ. పుం. 1. ఎగవ్రచ్చుట; 2. పుట్టుక.

**ఉద్భ్రమము.** సం. వి. అ. పుం. ఉబ్బించుట, ఊర్ధ్వభాగమును కదలించుట. (అనికొందఱు.) అవ్యవస్థితచిత్తత. (అనికొందఱు.) చమత్కారము. (అనికొందఱు.)

**ఉద్భ్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) తిరుగుడుపడినది.

**ఉద్యతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. యత్నించినది; 2. పైకెత్తఁబడినది.

**ఉద్యమ.** సం. వి. ఆ. స్త్రీ. యత్నము, కడఁక

**ఉద్యమము.** సం. వి. అ. పుం.——పై.——

**ఉద్యమించు.** సం. అ. క్రి. యత్నించు, కడఁగు.

**ఉద్యానము.** సం. వి. అ. న. 1. రాజుయొక్క సాధారణోద్యానము; 2. ప్రయోజనము; 3. వెడలుట

**ఉద్యాపనము.** సం. వి. అ. న. వెడలించుట.

**ఉద్యుక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ఉద్యోగించినది.

**ఉద్యోగము.** సం. వి. అ. పుం. యత్నము, కడఁక

**ఉద్యోగి.** సం. విశే. (ఇ. ఈ. ఇ.) ఉద్యోగముకలవాఁడు.

**ఉద్యోగించు.** సం. అ. క్రి. ఉద్యమించు, కడఁగు.

**ఉద్యోతించు.** సం. అ. క్రి. ప్రకాశించు.

**ఉద్యోతితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశితము.

**ఉద్రంగము.** సం. వి. అ. పుం. అంతరముననిలుచు వస్తువు.

**ఉద్రము.** సం. వి. అ. పుం. నీరుపిల్లి.

**ఉద్రిక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ఉద్రేకించినది.

**ఉద్రేకము.** సం. వి. అ. పుం. 1. విజృంభణము; 2. అతిశయము.

**ఉద్రేకించు.** సం. అ. క్రి. 1. విజృంభించు; 2. అతిశయించు.

**ఉద్వర్తనము.** సం. వి. అ. న. 1. ఎగయుట; 2. నలుఁగు; 3. రాయిడి. విశే. అతిక్రమించిననడతగలది.

**ఉద్వహ.** సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు.

**ఉద్వహనము.** సం. వి. అ. న. ఎగఁబట్టుట.

**ఉద్వహించు.** సం. స. క్రి. 1. ఎగఁబట్టు; 2. మోచు.

**ఉద్వహుఁడు.** సం. వి. అ. పుం. కొడుకు. విశే. పైకెత్తువాఁడు.

**ఉద్వాంతము.** సం. వి. అ. పుం. మదములేనియేనుఁగు. విశే. 1. క్రక్కఁబడినది; 2. భేదించుకొని వెలికుబికినది.

**ఉద్వాసనము.** సం. వి. అ. న. 1. తొలఁగించుట; 2. వధించుట.

**ఉద్వాహనము.** సం. వి. అ. న. 1. పెండ్లాడుట; 2. ఉత్కంఠ.

**ఉద్వాహము.** సం. వి. అ. పుం. వివాహము, పెండ్లి.

**ఉద్వాహిని.** సం. వి. ఈ. స్త్రీ. రజ్జువు, త్రాడు.

**ఉద్విగ్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్యవస్థతప్పినది; 2. వెఱపునొందినది.

**ఉద్వీక్షణము.** సం. వి. అ. న. మీఁదుచూచుట.

**ఉద్వృత్తము.** సం. విశే. (అ. ఆ. అ.) గర్వించినది.

**ఉద్వృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఉద్ధతి, గర్వము.

**ఉద్వేగము.** సం. వి. అ. న. పోఁక. పుం. 1. ఉబ్బించుట; ఊర్ధ్వభాగమునుకదలించుట. (అనికొందఱు.) అవ్యవస్థితచిత్తత. (అనికొందఱు.) చమత్కారము. (అనికొందఱు.) 2. వెఱపు.

**ఉద్వేగిల్లు.** సం. అ. క్రి. భీతిల్లు, వెఱచు.

**ఉద్వేజనము.** సం. వి. అ. న. 1. వెఱపు; 2. కలఁత.

**ఉద్వేజితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వెఱపింపఁబడినది; 2. కలఁతపెట్టఁబడినది.

**ఉద్వేలము.** సం. విశే. (అ. ఆ. అ.) అగ్గలము.

**ఉద్వేష్టనము.** సం. వి. అ. న. చుట్టుకొనుట.

**ఉద్వేష్టితము.** సం. విణ. (అ. ఆ. అ.) చుట్టుకోఁబడినది.

**ఉధ్మానము.** సం. వి. అ. న. అగ్నిత్రయణి, పొయ్యి.

**ఉనికి.** దే. వి. 1. ఉండుట. "క వేటకొంతెఱఁగున నారులకు, మాఱాడకయునికిలెస్స." భార. విరా. ౧. ఆ.—2. స్థితి. "నిర్వికారవృత్తినున్నయునికి." భార. ఆది. 3. ఆ.—3. స్థానము.

**ఉనుకువ.** దే. వి. ఉనికి, వాసము.

**ఉనుచు.** దే. క్రి. ఉండఁజేయు. ఉంచు.

**ఉన్నతము.** సం. విణ. (అ. ఆ. అ.) పొడవైనది.

**ఉన్నతి.** సం. వి. ఇ. స్త్రీ. ఔన్నత్యము, వృద్ధి.

**ఉన్నమనము.** సం. వి. అ. న. పైకెత్తుట.

**ఉన్నమితము.** సం. విణ. (అ. ఆ. అ.) పైకెత్తఁబడినది.

**ఉన్నయము.** సం. వి. అ. పుం. పైకెత్తుట.

**ఉన్నరూపు.** దే. వి. యథార్థము.

**ఉన్నవాఁడు.** దే. విణ. 1. అన్యుఁడు, "మ. అతివాసిద్ధము నాటిబాలకునకీయాకారమీవర్ణమీ, గతియీహాసవిలోకనస్వరము లీగాంభీర్యమీకాంతిమీఁ, దఁజేకొఁదగునున్నవారలకునాయాత్మేశు సారూప్యనం, గతిసిద్ధింపదుపేనియందుమిగులంగౌతూహలంబయ్యెడిఁ." భాగ. ౧౦, స్కం. ఉ.—2. ఉన్నట్టివాఁడు.

**ఉన్నాయము.** సం. వి. అ. పుం. ఉన్నయము.

**ఉన్నాహము.** సం. వి. అ. న. పుల్లనీళ్లు.

**ఉన్ని.** దే. వి. గొఱ్ఱెబొచ్చు.

**ఉన్నిద్రము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మేలుకొన్నది; 2. వికసించినది.

**ఉన్నె.** దే. వి. ఉండును, (రూ.) ఉన్నె.

**ఉన్మంథనము.** సం. వి. అ. న. 1. కదలించుట; 2. చంపుట.

**ఉన్మంథము.** సం. వి. అ. పుం. 1. చంపుట; 2. చిలుకుట.

**ఉన్మంథితము.** సం. విణ. (అ. ఆ. అ.) కదలింపఁబడినది.

**ఉన్మత్తము.** సం. వి. అ. పుం. ఉమ్మెత్త. విణ. వెఱ్ఱెత్తినది.

**ఉన్మదితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఉన్మాదముపట్టినవాఁడు.

**ఉన్మదిష్ణువు.** సం. విణ. ఉ.——పై.——

**ఉన్మనుఁడు.** సం. విణ. ప. ఉత్కంఠకలవాఁడు.

**ఉన్మాథము.** సం. వి. అ. పుం. 1. బోను; గాలము. (అనికొందఱు.) 2. వధము.

**ఉన్మాథుఁడు.** సం. వి. అ. పుం. వధించువాఁడు.

**ఉన్మాదకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ఉన్మదితుఁడు.

**ఉన్మాదనము.** సం. వి. అ. పుం. మన్మథునియొక్క యొకబాణము. (చూ. మన్మథుఁడు.)

**ఉన్మాదము.** సం. వి. అ. పుం. ఉన్మాదము. (ప్రియవియోగవిభవభ్రంశాదులచే చేతనా చేతనములయందు సమానముగాఁ బ్రవర్తించుట.)

**ఉన్మానము.** సం. వి. అ. న. తులామానము, తూనిక.

**ఉన్మార్గము.** సం. వి. అ. పుం. 1. చెడ్డనడత; 2. చప్పుత్రోవ.

**ఉన్మిలితము.** సం. విణ. (అ. ఆ. అ.) కొలువఁబడినది.

**ఉన్మిషితము.** సం. విణ. (అ. ఆ. అ.) విరిసినది.

**ఉన్మీలనము.** సం. వి. అ. న. వికసించుట, విరియుట.

**ఉన్మీలితము.** సం. విణ. (అ. ఆ. అ.) విరిసినది.

**ఉన్ముఖము.** సం. విణ. (అ. ఆ. అ.) మీఁదుచూచునది.

**ఉన్ముద్రము.** సం. విణ. (అ. ఆ. అ.) విరిసినది.

**ఉన్మూలము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వేరుతెగినది; 2. అడుగంటఁజెడినది.

**ఉన్మూలించు.** సం. న. క్రి. పెల్లగించు.

**ఉన్మూలితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వేరు తెగఁబారినది. 2. అడుగుతోఁ జెఱుపఁబడినది.

**ఉన్మేషము.** సం. వి. అ. పుం. వికాసము, రెప్పవిప్పు.

**ఉపకంఠము.** సం. వి. అ. న. దాపు. విణ. దాపైనది.

**ఉపకరణము.** సం. వి. అ. న. సాధనము. కొలముట్టు.

**ఉపకరించు.** సం. అ. క్రి. ఉపయుక్తమగు. ఉపకృ.

**ఉపకర్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఉపకరించువాఁడు. మేలు చేయువాఁడు.

**ఉపకారము.** సం. వి. అ. పుం. 1. మేలు; 2. చెదరిన పువ్వులోనగునది.

**ఉపకారి.** సం. విణ. (న్. ఈ. న్.) ఉపకర్త.

**ఉపకారిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉపకారముచేయుస్త్రీ, 2. ఉప్పరిగ; 3. ఉక్కళ.

**ఉపకార్య.** సం. వి. ఆ. స్త్రీ. ఉప్పరిగ. విణ. ఉపకరింపఁదగినది.

**ఉపకుంచిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టేలకి; 2. నల్లజీలకఱ్ఱ.

**ఉపకుల్య.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

**ఉపకృతము.** సం. వి. అ. న. ప్రయోజనము. విణ. ఉపకరింపఁబడినది.

**ఉపకృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఉపకారము. మేలు.

**ఉపక్రమము.** సం. వి. అ. పుం. 1. ఉపాయమునకు ప్రారంభించుట; 2. చికిత్స, 3. మంత్రులులోనగువారిని పరీక్షించుట; 4. విక్రమము.

**ఉపక్రమించు.** సం. అ. క్రి. స. క్రి. ప్రారంభించు. (ప్రాగా ఉఱకుఁడుకథచెప్పనుపక్రమించెను.) "అధ్వరకర్మమును క్రమించె." రామా. ర, ఆ.

**ఉపక్రోశము.** సం. వి. అ. పుం. నింద, దూఱు.

**ఉపగతము.** సం. విణ. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది.

**ఉపగతి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రాప్తి, పొందు.

**ఉపగమము.** సం. వి. అ. పుం. 1. అంగీకారము; 2. సమీపించుట.

**ఉపగూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కౌఁగిలింపఁబడినది; 2. దాఁచఁబడినది.

**ఉపగూహనము.** సం. వి. అ. న. 1. కౌఁగిలింత; 2. దాఁచుట.

**ఉపగ్రహము.** సం. వి. అ. పుం. 1. అనుకూలించుట; 2. ఉపయోగము; 3. చెఱఁబడ్డది; 4. చెఱ; 5. సూర్యాదిగ్రహము.

**ఉపగ్రాహ్యము.** సం. వి. అ. న. ఉపహారము, కానుక.

**ఉపఘ్నము.** సం. వి. అ. పుం. సమీపాశ్రయము, ప్రాఁకు.

**ఉపచయము.** సం. వి. అ. పుం. 1. పొడవు; 2. వృద్ధి.

**ఉపచరము.** సం. వి. అ. పుం. గోమహిష్యాదిగర్భగ్రహణము, వెద. గోమహిష్యాది ప్రథమగర్భము. (అనికొందఱు.)

**ఉపచరించు.** సం. స. క్రి. 1. సన్మానించు; 2. సేవించు.

**ఉపచరితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) సేవింపఁబడినవాఁడు, ఉపాసితుఁడు.

**ఉపచాయ్యము.** సం. వి. అ. పుం. యాగాగ్నియందు ఉపయోగింపఁదగినపేరు.

**ఉపచారము.** సం. వి. అ. పుం. 1. సన్మానము; 2. ఊడిగము; 3. లంచము; 4. వాడుక. (పంచోపచారములు.– స్నానము, పూజ, నైవేద్యము, ప్రదక్షిణము, నమస్కారము. షోడశోపచారములు. – ఆవాహనము, ఆసనము, పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.)

**ఉపచితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. కాలినది; 2. కూడఁబెట్టినది; 3. వర్ధిల్లినది.

**ఉపచిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. ఎలుకజీడిగీ.

**ఉపజాపకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) భేదముపుట్టించువాఁడు.

**ఉపజాపము.** సం. వి. అ. పుం. భేదోపాయము.

**ఉపజిహ్విక.** సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

**ఉపజీవి.** సం. విశ. (న్. ఈ. న్.) ఒకరిననుసరించి జీవించువాఁడు.

**ఉపజీవించు.** సం. స. క్రి. ఒకరిననుసరించి జీవించు.

**ఉపజీవిక.** సం. వి. ఆ. స్త్రీ. జీవనోపాయము.

**ఉపజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. ఉపదేశములేక తనంతట మొట్టమొదట పుట్టెడుజ్ఞానము. (వాల్మీకియొక్క శ్లోకనిర్మాణజ్ఞానమువంటిది.)

**ఉపతప్త.** సం. వి. ఋ. పుం. రోగము, తెవులు.

**ఉపతాపము.** సం. వి. అ. పుం. 1. సంతాపము; 2. రోగము; 3. తొందర.

**ఉపతాయి.** దే. వి. మల్లవిజ్ఞానము. "ఉపతాయిలోఁదసకొదవెడు తోరహత్తముచూపి." భార. విరా. ౨, ఆ. (ప్రయోగములు విశేషముగాదొరకమిచేతను దొరకిన రెండు ప్రయోగములును సందిగ్ధములుగానుండుటచేతను ఈయర్థనిర్ణయము మనస్సునకంత ప్రశస్తముగాఁ దోఁచలేదు.)

**ఉపత్యక.** సం. వి. ఆ. స్త్రీ. కొండచేరువనేల.

**ఉపద.** సం. వి. ఆ. స్త్రీ. ఉపగ్రాహ్యము, కానుక.

**ఉపదంశము.** సం. వి. అ. పుం. 1. ఊరుఁగాయ; 2. కొఱుకురోగము.

**ఉపదర్శకుఁడు.** సం. వి. అ. పుం. తప్పునడవకచూచుకొనువాఁడు.

**ఉపదానము.** సం. వి. అ. న. 1. అరణము; 2. కానుక.

**ఉపదిష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) ఉపదేశింపఁబడినది.

**ఉపదేశము.** సం. వి. అ. పుం. హితవచనము.

**ఉపదేశించు.** సం. స. క్రి. ఉపదేశముచేయు, పన్ను.

**ఉపదేష్ట.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) ఉపదేశించువాఁడు, ఉపదేశకుఁడు.

**ఉపదేహిక.** సం. వి. ఆ. స్త్రీ. చెదపురుగు.

**ఉపద్రవము.** సం. వి. అ. పుం. విప్లవము. హావడి.

**ఉపద్రష్ట.** సం. వి. ఋ. పుం. కార్యములవిచారించుకొనువాఁడు.

**ఉపధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ధర్మార్థకామములచేత మంత్రులోనగువారిచిత్తమును పరీక్షించుట; 2. (వ్యాకరణమున) కడపటియక్షరమునకు ముందటియక్షరము.

**ఉపధర్మము.** సం. వి. అ. పుం. పాషండధర్మము.

**ఉపధానము.** సం. వి. అ. న. 1. తలగడ; 2. విషము; 3. స్నేహము.

**ఉపధావించు.** సం. అ. క్రి. ప్రధావించు, పాఱు.

**ఉపధి.** సం. వి. ఇ. పుం. 1. కపటము; 2. బండికల్లు.

**ఉపధూపితము.** సం. వి. అ. పుం. సమీపించినయస్తమయము. విశ. 1. చావుసమీపించినది; 2. పొగవేయఁబడినది.

**ఉపనతము.** సం. విశ. (అ. ఆ. అ.) కదిసినది.

**ఉపనయనము.** సం. వి. అ. న. వడుగు, (రూ.) ఉపనయము, ఉపనాయము.

**ఉపనాహము.** సం. వి. అ. పుం. 1. తంతిమెట్టెడుబిరడ; 2. పుంటిమీఁదపూసెడుమందు.

**ఉపనిధి.** సం. వి. ఇ. పుం. చెప్పకచూపకయుంచినయిల్లడ, వాడిక.

**ఉపనిషత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. వేదాంతము; 2. ధర్మము; 3. ఏకాంతము.

**ఉపనిష్కారము.** సం. వి. అ. న. ఉక్కాశము, (రూ.) ఉపనిష్కరము.

**ఉపనీతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. వడుగైనవాఁడు; 2. సమీపమునకు తేఁబడినవాఁడు.

**ఉపన్యసించు.** సం. స. క్రి. 1. ఉనుచు; "వ. పురుషోత్తమునందుఁజిత్తంబుపన్యసించి." భాగ. ౨, స్కం.—2. ఉపన్యాసముచేయు.

**ఉపన్యాసము.** సం. వి. అ. పుం. ఏదేనియొకవిషయమునెత్తి విస్తరించిచెప్పుట.

**ఉపపతి.** సం. వి. ఇ. పుం. జారుఁడు, అంకుమగఁడు.

**ఉపపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కలిమి; 2. అంతము; 3. అర్హత; 4. కారణము; 5. దృష్టాంతము; 6. పుట్టుక; 7. వృత్తాంతము.

**ఉపపన్నము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉపపత్తికలది; 2. పుట్టినది.

**ఉపపాదకము.** సం. విశ. (అ. ఆ. అ.) కలిగించునది.

**ఉపపాదనము.** సం. వి. అ. న. కలిగించుట.

**ఉపపాదితము.** సం. విశ. (అ. ఆ. అ.) కలిగింపఁబడినది.

**ఉపప్లవము.** సం. వి. అ. పుం. 1. ఉత్పాతము; 2. ఉపద్రవము; 3. రాహువు.

**ఉపబర్హము.** సం. వి. అ. పుం. ఉపధానము, తలగడ.

**ఉపబృంహణము.** సం. వి. అ. న. చక్కఁగాపెరుగుట, సంవృద్ధి.

**ఉపబృంహితము.** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగాపెరిగినది, సంవర్ధితము.

**ఉపభుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁబడినది.

**ఉపభృత్తు.** సం. వి. త్. స్త్రీ. స్రుగ్భేదము.

**ఉపభోగము.** సం. వి. అ. పుం. అనుభవము.

**ఉపభోగ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁదగినది.

**ఉపమ.** ఉభ. వై. వి. ఉపాయము. "గీ. నృపవధూటినవపఘుంబు నుపమయొకటి, యాష్టలావలయోచి-చియప్పింతుము గ." "గీ. తత్తణంబు యొక్క-తన్కు-రుఁగల్పించి, యార్వ్యంత శిలయైనయట్టి, జనవరేణ్యు దేవిసమయింపఁదగునుపా, యంబుగఁజపియరుగుమని నవాఁడు." హరిశ్చ. ౫, ఆ.—సం. ఆ. స్త్రీ. 1. ఒక అర్థాలంకారము, (చూ. అలంకారము.) 2. పోలిక; 3. పోల్పఁదగిన చంద్రాది. విణ. ఉత్తరపదమైనచో సమానము.

**ఉపమరి.** వై. విణ. తెరవరి, ఉపాయశాలి.

**ఉపమాత.** సం. వి. ఋ. స్త్రీ. దాది. విణ. ఉపమానముచెప్పెడు వాఁడు.

**ఉపమానము.** సం. వి. అ. న. 1. పోలిక; 2. పోల్పఁదగిన చంద్రాది.

**ఉపమించు.** సం. స. క్రి. పోల్చు.

**ఉపమితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉపమింపఁబడినది, పోల్పఁబడినది.

**ఉపమితి.** సం. వి. ఇ. స్త్రీ. ఉపమానము, పోలిక.

**ఉపమేయము.** సం. వి. అ. న. పోలికయందలివిషయము. విణ. పోల్పఁదగినది.

**ఉపయమము.** సం. వి. అ. పుం. ఉద్వాహము, పెండ్లి.

**ఉపయాచితకము.** సం. వి. అ. న. అభీష్టసిద్ధికై దేవతలకీఁబడు ద్రవ్యము, మ్రొక్కుబడి.

**ఉపయామము.** సం. వి. అ. పుం. ఉపయమము.

**ఉపయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ఒదవ్రబడియైనది.

**ఉపయోగము.** సం. వి. అ. పుం. ఒదవుబడి.

**ఉపయోగించు.** సం. అ. క్రి. ఒదవు.

**ఉపరంధ్రము.** సం. వి. అ. న. తొలకు.

**ఉపరక్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. రాహువుచే పట్టఁబడిన వాఁడు; (చంద్రుఁడు లేక సూర్యుఁడు.) 2. వ్యసనార్తుఁడు.

**ఉపరక్షణము.** సం. వి. అ. న. దైత్తములవారు నడఁడిలేక తొలఁగించుట. శిబిరరక్షణముకొఱకు చుట్టుఁబెట్టినవెలుగులోనగునది. (అనీకాంరము.)

**ఉపరతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉడిగినది.

**ఉపరతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉడుకువ; 2. పురుషాయితము.

**ఉపరథ్య.** సం. వి. ఆ. స్త్రీ. పసులులోనగువానిరాకపోకలచేత నేర్పడిన ఊరిముందటిదారి, పుంత.

**ఉపరాగము.** సం. వి. అ. పుం. 1. రాహువు సూర్యచంద్రు లనుబట్టుట; 2. అన్యాయము; 3. గ్రహకల్లోలము; 4. వ్యసనము.

**ఉపరామము.** సం. వి. అ. పుం. ఉడుకువ.

**ఉపరుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

**ఉపరోధము.** సం. వి. అ. పుం. అవరోధము, అడ్డగింత.

**ఉపరోధించు.** సం. స. క్రి. అవరోధించు, అడ్డగించు.

**ఉపల.** సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లుపుగుండు; 2. పాషాణము; 3. మొరపజాయి. అ. పుం. ము. 1. రాయి; 2. రత్నము.

**ఉపలంభము.** సం. వి. అ. పుం. అనుభవము.

**ఉపలక్షణము.** సం. వి. అ. న. ఒకటిచెప్పుటచే ఇతరములును సామాన్యధర్మముచే తదితరస్థలములయందును ప్రవర్తించుట.

**ఉపలబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. తెలియఁబడినది.

**ఉపలబ్ధి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తెలివి; 2. పొందు.

**ఉపలాలనము.** సం. వి. అ. న. బుజ్జగము.

**ఉపలాలించు.** సం. స. క్రి. బుజ్జగించు.

**ఉపలాలితము.** సం. విణ. (అ. ఆ. అ.) బుజ్జగింపఁబడినది.

**ఉపలింగము.** సం. వి. అ. న. ఉపద్రవము.

**ఉపలిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) అలుకఁబడినది.

**ఉపలేపనము.** సం. వి. అ. న. గోమయము, అలుకుట.

**ఉపవడము.** దే. వి. మేలుకొనుట, అవబోధము. (ఉప్పవడము యొక్క రూపాంతరము.)

**ఉపవనము.** సం. వి. అ. న. ఆరామము, తోఁట.

**ఉపవర్తనము.** సం. వి. అ. న. దేశము, విలాతి.

**ఉపవసథము.** సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

**ఉపవసించు.** సం. అ. క్రి. భుజింపకుండు, పస్తుండు.

**ఉపవస్తము.** సం. వి. అ. పుం, న. ఉపవాసము.

**ఉపవాసము.** సం. వి. అ. పుం, న. పస్తు.

**ఉపవాహ్యము.** సం. వి. అ. పుం. రాజెక్కెడి యేనుఁగు, ఔపవాహ్యము.

**ఉపవిష.** సం. వి. ఆ. స్త్రీ. అతివస.

**ఉపవిష్టుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కూర్చుండినవాఁడు.

**ఉపవీతము.** సం. వి. అ. న. ఎడమభుజముమీఁదుగా కుడిపార్శ్వమున వ్రేలెడు జందెము.

**ఉపవేశము.** సం. వి. అ. పుం. ఆసన, కూర్చుండుట.

**ఉపశమము.** సం. వి. అ. పుం. 1. అడఁగుట; 2. ఓర్పు.

**ఉపశమించు.** సం. అ. క్రి. 1. అడఁగు; 2. ఓర్చు. (రూ. ఉపశమిల్లు.)

**ఉపశయము.** సం. వి. అ. పుం. వలయొడ్డి యాచెంతతానుదాఁగియుండుటకై త్రవ్వినపల్లము, మాటు.

**ఉపశల్యము.** సం. వి. అ. న. గ్రామముచేరువనేల.

**ఉపశాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అడఁగుట; 2. ఓర్పు.

**ఉపశాయము.** సం. వి. అ. పుం. 1. కావలివారు వరుసక్రమమున పండుకొనుట; 2. వరుస.

**ఉపశోభితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశించినది.

**ఉపశ్రుతము.** సం. విణ. (అ. ఆ. అ.) సమ్మతింపఁబడినది, ఒడఁబడినది.

**ఉపశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. శమభావనమప్పుడు దబ్బాటు సంగలిగెడిశుభాశుభసూచకమగు అన్యసంభాషణశ్రవణము; 2. ఒడఁబాటు.

**ఉపసంపన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. యజ్ఞార్థము చంపఁబడినది; (పశ్వాది.) 2. నీళ్లుపోసివండినది.

**ఉపసంవ్యానము.** సం. వి. అ. న. పరిధానము, దోవతి.

**ఉపసంహరించు.** సం. స. క్రి. 1. మరలించు; 2. సంహరించు.

**ఉపసంహారము.** సం. వి. అ. పుం. 1. మరలించుట; 2. సంహారము.

**ఉపసరము.** సం. వి. అ. పుం. (చూ.) ఉపచరము.

**ఉపసర్గము.** సం. వి. అ. పుం. 1. (క్రియాయోగమున.) ప్రాది; 2. ఉత్పాతము; 3. ఒకానొకరోగము.

**ఉపసర్జనము.** సం. వి. అ. న. అప్రధానము.

**ఉపసర్పణము.** సం. వి. అ. న. ఆశ్రయము, ప్రాపు.

**ఉపసర్పించు.** సం. స. క్రి. ఆశ్రయించు, ప్రాపుగొను.

**ఉపసర్య.** సం. వి. ఆ. స్త్రీ. తొలిచూలావు.

**ఉపసూర్యకము.** సం. వి. అ. న. సూర్యపరివేషము.

**ఉపస్కారము.** సం. వి. అ. పుం. సంబారము.

**ఉపస్థానము.** సం. వి. అ. న. 1. చేరిక; 2. సేవ.

**ఉపస్థితము.** సం. విణ. (అ. ఆ. అ.) చేరినది.

**ఉపస్థితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చేరిక; 2. తోఁచుట.

**ఉపస్పర్శము.** సం. వి. అ. పుం. 1. ఆచమనము; 2. స్పర్శము, 3. స్నానము.

**ఉపహతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉపద్రవమునొందినది; 2. నాశమునొందినది.

**ఉపహతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉపద్రవము; 2. నాశము.

**ఉపహారము.** సం. వి. అ. పుం. ఉపాయనము, కానుక.

**ఉపహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉంచఁబడినది.

**ఉపహ్వరము.** సం. వి. అ. న. 1. ఏకాంతము; 2. సమీపము.

**ఉపాంగము.** సం. వి. అ. పుం. 1. నుతిబొట్టెడితిత్తి; 2. మీమాంసాది. (అవి. ర.—మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము.)

**ఉపాంతము.** సం. వి. అ. పుం. 1. సమీపము; 2. మూల. విణ. సమీపించినది.

**ఉపాంశు.** సం. అవ్య. ఏకాంతము. "గంజాహారులుపాంశున భుజించునధముల." ఆము. ర, అ.—వి. ఉ. పుం. వు. జపభేదము.

**ఉపాకరణము.** సం. వి. అ. న. సంస్కారపూర్వకముగా వేదమును గ్రహించుట.

**ఉపాకర్మము.** సం. వి. న్. న. ——పై.——

**ఉపాకృతము.** సం. వి. అ. పుం. యజ్ఞమునందు అభిమంత్రించి చంపఁబడినపశువు. విణ. కుదియింపఁబడినది.

**ఉపాఖ్యానము.** సం. వి. అ. న. ఇతిహాసము.

**ఉపాగతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. వచ్చినది.

**ఉపాత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2 ఉపహరింపఁబడినది.

**ఉపాత్యయము.** సం. వి. అ. పుం. అతిక్రమణము, తుహరము.

**ఉపాదానము.** సం. వి. అ. న. 1. కారణము; 2. విషయముల వలనపాఱెడు ఇంద్రియములను మరలించుట.

**ఉపాదేయము.** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది.

**ఉపాధానము.** సం. వి. అ. న. 1. ఉంచుట; 2. ధరించుట; 3. కప్పుట.

**ఉపాధి.** సం. వి. ఇ. పుం. 1. ధర్మచింత; 2. కపటము; 3. కుటుంబమునందు మిక్కిలి యాసగలవాఁడు; 4. విశేషణము.

**ఉపాధ్యాయ.** సం. వి. ఆ. స్త్రీ. ఉపాధ్యాయత్వముచేసెడు ఆఁడుది.

**ఉపాధ్యాయాని.** సం. వి. ఈ. స్త్రీ. ఉపాధ్యాయునిపెండ్లాము.

**ఉపాధ్యాయి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఉపాధ్యాయత్వముచేసెడి ఆఁడుది; 2. ఉపాధ్యాయునిపెండ్లాము.

**ఉపాధ్యాయుఁడు.** సం. వి. అ. పుం. 1. వేదమును చదివించువాఁడు; 2. చదువుచెప్పువాఁడు.

**ఉపానహము.** సం. వి. హ్. స్త్రీ. చెప్పులు.

**ఉపాయనము.** సం. వి. అ. న. ఉపహారము, కానుక.

**ఉపాయము.** సం. వి. అ. పుం. 1. వెరవు; 2. పొందు (చతురుపాయములు.—సామము, భేదము, దానము, దండము. మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము. ఈమూటినిగూడఁజేర్చి సప్తోపాయములనికొందఱు నీతికోవిదులు చెప్పుదురు. మఱియు నాయకుఁడునాయికయొక్కకోపమును పోఁగొట్టునప్పుడు ఉపయోగించెడు ఉపాయములు ఆఱు.—సామము, భేదము, దానము, నతి, ఉపేక్ష, రసాంతరము.)

**ఉపార్జనము,** సం. వి. అ. న. సంపాదనము, గడన.

**ఉపార్జించు.** సం. స. క్రి. సంపాదించు, గడించు.

**ఉపార్జితము.** సం. విణ. (అ. ఆ. అ.) గడింపఁబడినది.

**ఉపాలంభము.** సం. వి. అ. పుం. మర్మముదూఱిపాఱనాడుట.

**ఉపాలంభించు.** సం. స. క్రి. మర్మముదూఱిపాఱనాడు.

**ఉపాలబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) మర్మముదూఱిపాఱనాడఁబడినది.

**ఉపావృత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) పలుమాఱు నేలఁబొర్లాడినది. (గుఱ్ఱము.)

**ఉపాశ్రయము.** సం. వి. అ. పుం. 1. ప్రాపు; 2. ఆనిక.

**ఉపాశ్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది.

**ఉపాసంగము.** సం. వి. అ. పుం. అమ్ములపొది.

**ఉపాసకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సేవకుఁడు.

**ఉపాసన.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. సేవ. అ. న. ము. 1. శరాభ్యాసము; 2. సేవ.

**ఉపాసము.** వై. వి. ఉపవాసము. "క. దినమొక్కొక్కటియొక్కఁగ, వనజాక్షుండుపవసించివత్సరమెల్లం, జనఁగానొక్కొకయుదియొ, క్కనుపాసంబుండియుశేనక్షత్రమునదపుడు." ఉ, హరి. ౨, ఆ.

**ఉపాసించు.** సం. స. క్రి. సేవించు, కొలుచు.

**ఉపాసిత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) ఉపాసించువాఁడు.

**ఉపాసితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపాసింపఁబడినవాఁడు, సేవితుఁడు.

**ఉపాసీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సమీపమందుఁ గూర్చున్నవాఁడు.

**ఉపాస్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఉపాసనము, సేవ.

**ఉపాస్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపాసింపఁదగినవాఁడు, సేవ్యుఁడు.

**ఉపాహితము.** సం. వి. అ. పుం. తోఁకచిచ్చు. విశే. ఆరోపితము.

**ఉపాహృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. గ్రహింపఁబడినది; 2. పట్టుపడినది.

**ఉపేంద్రుఁడు.** సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.

**ఉపేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. అశ్రద్ధ, ఒప్పరికము.

**ఉపేక్షకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపేక్షించువాఁడు, ఒప్పరికించువాఁడు.

**ఉపేక్షించు.** సం. స. క్రి. అశ్రద్ధచేయు, ఒప్పరికించు.

**ఉపేక్షితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపేక్షింపఁబడినవాఁడు, ఒప్పరికింపఁబడినవాఁడు.

**ఉపేత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) 1. ఉపాయములుగలవాఁడు; 2. సమీపించువాఁడు.

**ఉపేతము.** సం. విశే. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

**ఉపోదక.** సం. వి. ఆ. స్త్రీ. దుంపబచ్చలికీ. (రూ. ఉపోదకి. ఈ. స్త్రీ.)

**ఉపోద్ఘాతము.** సం. వి. అ. పుం. ఉదాహరణము.

**ఉపోషణము.** సం. వి. అ. న. ఉపవాసము, పస్తు.

**ఉపోషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పస్తున్నవాఁడు.

**ఉపోష్యము.** సం. విశే. (అ. ఆ. అ.) పస్తుండఁదగినది.

**ఉప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) విత్తఁబడినది. (నేల.)

**ఉప్తి.** సం. వి. ఇ. స్త్రీ. విత్తుట, వెద.

**ఉప్పత.** దే. వి. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొనుట.

**ఉప్పతించు.** దే. స. క్రి. ఓర్వలేనితనముచేత ఆడిపోసికొను. "ఉప్పతించివాఁడు సురసురనెనేమో." క్షేత్రయ.

**ఉప్పతిల్లు.** వై. అ. క్రి. పుట్టు, ఉత్పత్తియగు.

**ఉప్పన.** దే. వి. ఒకరసము. (చూ. రసము.)

**ఉప్పనఁబట్టెలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. పడఁతినీచూపులుప్పనఁబట్టెలాడించిచెలులవక్త్రములఁబూజింతుఁగాక." ఉ, హరి. ౫, ఆ.

**ఉప్పర.** దే. వి. త్రవ్వియు, గోడలుపెట్టియు బ్రదికెడుజాతి. (ఉప్పరవాఁడు, ఉప్పరది.)

**ఉప్పరము.** వై. వి. 1. ఆకాశము; 2. మీఁదు*. "దోమతెరలుప్పరమెత్తిరి." ఆము. ౫, ఆ. "నక్తంచరిమింటికుప్పరముగావెసదాఁటి." జై. ౫, ఆ.(వృత్తియందంత్యవర్ణలోపము. "ఉ. రథం, బుప్పరవీఁదోలుకొని యుగ్రగతింబఱతెంచితోఁకిసక." భార. విరా. 3, ఆ.)

**ఉప్పరి.** దే. వి. ఉప్పరవాఁడు, ఖనకుఁడు.

**ఉప్పరించు.** దే. స. క్రి. మల్లయుద్ధక్రియావిశేషము. "వ. మడమలమెడమలంచియునలంచియుఁ, బిక్కలమొక్కలంబునఁజప్పరించియునుప్పరించియు." ఉ, హరి. ౬, ఆ.

**ఉప్పరిగ.** వై. వి. మిద్దెమీఁదికట్టడము, మేడ.

**ఉప్పలవాయి.** దే. వి. బొట్టనజుట్టనవ్రేళ్లనదుము. "గీ. అంగుళాగ్రముల్ చిటికెనలందుమొదలు, లనఘదేవర్షితీర్థములనఁగఁబరఁగు, వరుసవలకేలియుప్పలవాయిపైత్రి, కంపుతీర్థంబుతర్పణకార్యమునకు." భార. అను. ౪, ఆ.

**ఉప్పలి.** దే. వి. కీడు, ఆపద.

**ఉప్పవడము.** దే. వి. (చూ.) ఉపవడము. "సీ. భూనాయకుండునుభోజనోత్తరమునఁబవళించియంతనుప్పవడమగుచు." పర. 3, ఆ.

**ఉప్పళము.** దే. వి. (ఉప్పు+అళము.) ఉప్పుపంటపెట్టెడునేల, ఉప్పుగాసులుండెడుచోటు. (అనికొందఱు.)

**ఉప్పళించు.** దే. వి. ఉప్పరించు. "ఎ, గీ. కాలిగెనఁజొరవచ్చుటగానిపించు, నడుగుపెసానఁబట్టియునప్పళించి. పోవనిచ్చువుగుడసేచిపోఁజేరు, నెడలసరిసేయనగుతిడపేక్షహస్తు." భార. విరా. ౨, ఆ. (ఉప్పరించు ఉప్పళించు ఈ రెండును సమానార్థకములుగా కనఁబడుచున్నవి.)

**ఉప్పి.** దే. వి. కుండలికీ. (ఇది ద్వివిధము-తెల్లయుప్పి, నల్లయుప్పి.)

**ఉప్పిఁడి.** దే. విశే. (ఉప్పు+ఇఁడి.) ఉప్పులేనిది, అలవణము.

**ఉప్పిరింత.** దే. వి. జ్యోతిష్మతికీ.

**ఉప్పు.** దే. స. క్రి. అవిరిపోఁకయుడికించు. (చూ. అవిఁచు.) వి. లవణము.

**ఉప్పుఁగండె.** దే. వి. (ఉప్పు+కండ.) ఉప్పుచమిరియెండఁబెట్టిన మాంసఖండము.

**ఉప్పుఁగడలి.** దే. వి. (ఉప్పు+కడలి.) లవణసముద్రము.

**ఉప్పుఁగాయ.** దే. వి. (ఉప్పు+కాయ.) ఊరుఁగాయ, ఉపదంశము. "మ. కప్పురపుందోయముమీఁగడల్ పెరుగులుప్పుంగాయలుఁ జమున్నగాఁ, బరిపూర్ణంబుగనారగించిరి." అని. ౧, ఆ.

**ఉప్పుఁగుందము.** దే. వి. (ఉప్పు+కుందము.) బాలక్రీడావిశేషము.

**ఉప్పుఁజేఁప.** దే. వి. (ఉప్పు+చేఁప.) ఉప్పుచమిరి యెండఁబెట్టిన మత్స్యము.

**ఉప్పుఁబట్టి.** దే. వి. (ఉప్పు+పట్టి.) కసంతట ఉప్పుపండెడునేల.

**ఉప్పుడు.** దే. వి. ఉప్పుట. (ఉప్పుడుబియ్యము.)

**ఉప్పువాము.** దే. వి. ఉప్పుపంటపెట్టెడుచోటు.

**ఉప్పెన.** వై. వి. 1. సముద్రోల్బణము*; 2. విజృంభణము*. "ఉ. తప్పకసర్వబాంధవవితానముఁబుత్రులునిష్టభృత్యులుఁ, జెప్పఁగనున్నవారలనిచిత్తములోఁనలరుంజనుండువా, రుప్పెనమోహరజ్జులనముద్ధతిఁగట్టుచుధర్మమ్మురోలఁద, న్నొప్పన సేయనున్నగనునుగ్రపుదాయలుగారె యారయఁ." శివ. ఉ. ౨, ఆ.

**ఉప్పొంగు.** దే. అ. క్రి. (ఉబ్బి+పొంగు.) 1. మిక్కిలి యుబుకు; 2. మిక్కిలి సంతోషించు; 3. విజృంభించు.

**ఉబలాటము.** దే. వి. జోలి. మిక్కిలి అభిలాషము. (అని కొందఱు.)

**ఉబుకు.** దే. అ. క్రి. పొంగు. వి. పొంగుట.

**ఉబుసు.** దే. వి. 1. పనిలేనికాలము; "క. కావునవిపంచిఁగైకొని, నివించుకగానపటిమనెఱపఁగవలయుఁన్, నావుడునట్టులకాకని, యావిద్యం బ్రౌఢుఁడుచ్చెనతనికిమిగులన్. వ. ఇవ్విధంబునంగల భాషిణిగాన విద్యాకౌశలంబుననతనియుబుసుఁబుచ్చె." కళా. 3, ఆ.—2. వృత్తాంతము. "ఉ. ఇంచినప్రొద్దు పోకడకునెవ్వరితోను బునేమిచెప్పదుఁన్." నిక్రు. ౬, ఆ.

**ఉబ్బ.** వై. వి. ఉక్క, ఊష్మము.

**ఉబ్బకము.** వై. వి. 1. ఆధిక్యము; 2. ఉత్సాహము. "చ. వలఁ బడిచిక్కుటాంజె వలపుచ్చుకపోవుటయొండెఁగాక వ, క్షులవ లఁగొంచుభారమునకుండమకింపక యుబ్బకంబునన్, వలగొనిపాఱు టొప్పు." పంచ. నా. ౨, ఆ.

**ఉబ్బతిల్లు.** వై. అ. క్రి. ఉబ్బు, పొంగు.

**ఉబ్బనీరు.** వై. వి. ఉమ్మనీరు.

**ఉబ్బరపోవు.** ద్వి. అ. క్రి. (ఉబ్బరము+పోవు.) చేష్టలుడిగి యేమితోఁచక అట్టెనిలుచు, నివ్వెఱపడు. "చ. ఇరువురుసీలసిర జనిభేక్షణలించినవేడ్కతోఁబర, స్పరమెదిరించికొంచనపుబంతులఁ దచ్చనవాటులాడఁగా, ధరణిపుఁడడ్డమైచనుడుఁదద్బుజదండము దాఁకిమిట్టిబి, ట్టురవడిఁజెందుక్రమ్మజెనసుబ్బరపోయిరిభామినీజ నల్." నై. 3, ఆ.

**ఉబ్బరము.** వై. వి. 1. కడుపుబ్బుట; 2. అతిశయము. "ప్రత్తి సంపత్తియుబొబ్బరయుబ్బరంబును." భీ. 3, ఆ.

**ఉబ్బరించు.** వై. అ. క్రి. 1. కడుపుబ్బు; 2. అతిశయించు. "ద్వి. ఉబ్బునూర్పులతోడనొకకొంతసేపు, ఉబ్బరింపకపట్టియూర కుండుచును." రా. యు, కాం. (ఇక్కడ ఉబ్బరింపక అనఁగా మీఱక అని యర్థము.)

**ఉబ్బలి.** దే. వి. బురద. "సీ. అలికిఁగేకులహాలాహలికిగద్దపెపికావ లికిమందపుఁగరువలికిఁగనరు, చిలికిసారెకుఁజేరి కులికియార్చుచి సాళికలికి రాచిలుకతెక్కలికిఁదొగల, చెలికిఁగప్రపుబూదివలికి మారునిపూవుములికి మొత్తములయంకిలికినంచ, కలికిమిన్నలబల్ర వలికిశారికలరవలికినామని పెద్దపులికిమృదుల, వలికిఁబన్నీటివాఁక యుబ్బలికిగంధ, ఫలికినికసితనుమవనస్థలికిఁగూర్చి, వెలికిఁగ్రమ్మఁగఁ జలుకలకొలికియెంత, యలికియులికెనోమముదూలఁబలికినేడు." రసి. ౬, ఆ. (చూ. ఉమ్మలి.)

**ఉబ్బసము.** వై. వి. ఊర్ధ్వశ్వాసరోగము.

**ఉబ్బు.** వై. అ. క్రి. 1. ఉబ్బరించు; 2. పొంగు; 3. లేచు; "ద్వి. ఇదియేమిమునినాథయీతటాకమున, నుదకంబులోా ఘూష ముబ్బుచున్నదియు." రా. అర, కాం.—4. సంతోషించు; 5. స్థూలించు. వి. సంతోషము.

**ఉభయము.** సం. స. ద్వి. 1. రెండవయవములుగలది; 2. గుడి యుత్సవపుఁగట్టడ. (గుడిపారుపత్తెకాఁడును లోకులునుజేరిచేయు నుత్సవము గనుక దీనికి ఉభయమని పేరుకలిగెను.)

**ఉమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. నూనెయగిసె*; 3. కాంతి; 4. పసుపు; 5. యశము.

**ఉమాదము.** వై. వి. ఉన్మాదముయొక్క రూపాంతరము.

**ఉమాపతి.** సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి.

**ఉమి.** వై. వి. ఉమ్మియొక్క రూపాంతరము.

**ఉమియు.** వై. స. క్రి. (ఎంగిలిలోనగువానిని) ఉమ్మివేయు, ఊసి వేయు.

**ఉముక.** దే. వి. పొట్టు, ఊక.

**ఉమేజువారు.** హిం. వి. ఉద్యోగమునకై కనిపెట్టియుండు వాఁడు.

**ఉమ్మ.** వై. వి. ఉబ్బ. ఊష్మము.

**ఉమ్మగిల్లు.** వై. అ. క్రి. ఆవిరిచే నుడుకు.

**ఉమ్మడి.** దే. వి. 1. పొత్తు; "ఉ. ఉమ్మడిసొమ్ముగాఁదనదయోసిన యంతయుసన్నివంకలన్, నెమ్మదిఁబాఱఁజల్లుచును నిల్లెముఁదాన ప్రదానంచుని, క్కమ్ముగవేఱుపడ్డతుదిఁగానఁగరాదె." భో. ౬, ఆ.—2. నిత్యపుఁగట్టడ. "సీ. శ్రీరంగవిభుప్రతిరోజు యరవ్వది వేల మాడలద్దెవునుమ్మడికినొసఁగె." జై. ౧. ఆ.—ద్ర. వీకరణము. "గీ. లేమబిక్షింపమాలాశిలీముఖములు, తొలగాతి శితసుమం యకములు, గాటముగఁబరిసినయుమ్మడిఁగాచుటయును, వసుమతీ జానిపరవశసాన్వితుఁడయ్యె." వసి. 3, ఆ. (ఇక్కడనిదిపూర్వక నిప్రయోగములయందొక్కటిపూర్వకముగానే కానఁబడుచున్నది. "సెక్కులబుల లశ్వజొక్కుమ్మడిఁగ్రొవ్వియుద్ధతపవలాదనిఁబో లఁగ." భార. ద్రో. ౨. ఆ. ఇత్యాదులు.)

**ఉమ్మదము.** వై. వి. ఉమ్మ, ఊష్మము.

**ఉమ్మనీరు.** వై. వి. ప్రసవజలము*.

**ఉమ్మలము.** దే. వి. 1. దుఃఖము; 2. శోకము. (చూ. ఉమ్మలించు.)

**ఉమ్మలి.** దే. వి. ఉబ్బలి. "వ. కమ్మకస్తురియుమ్మలింబడికదలమెదల లేనినీలాలకజాలంబులు." కళా. ౬, ఆ.

**ఉమ్మలించు.** దే. అ. క్రి. 1. దుఃఖించు; "గీ. ఒక్కరేయిసీ పాలనాయునికిఁగాఁగ, బలికిరొన్నారిమదిచెల్లినలముచరిత, పోయి వచ్చెదనని దివంబునకుఁబోవ, నుత్సహించెనమ్మనిమదినుమ్మలింప." సం. "దుఃఖితోధిరథశ్శ్రుత్వాశ్రుపబలాత్కృతః." భార. శల్య. ౨, ఆ.—2. శోకించు. "చ. నీకునైవగపుపుటదుబంధులురాజు దేవులున్, దిరియుదురింకవారిదగువీనతకోర్వక యుమ్మలించెదన్." సం. "దుర్యోధనశ్చామిత్రాఘ్నమహంపురుషర్షభ, పరతపుత్రా తు శోచామిగాంధారింపితరంచతే, భిక్షుకావిచరిష్యేతేశోచంతౌపృథ వీమిమామ్." భార. సౌ. ౧, ఆ.

**ఉమ్మలిక.** దే. వి. 1. దుఃఖము; "క. ఇమ్మహియెల్లనునీమది, యుమ్మలికకుఁజాలనొచ్చె." సం. "దుఃఖస్యైతస్య మహతో ధార్తరాష్ట్రకృతస్యవై." భార. ఉద్యో. ౧, ఆ.—2. శోకము. (రూ. ఉమ్మలికము. "ఉ. నమ్మదమారఁగామనుపఁజాలెడుమిత్రుఁ డడంగిపోవనీ, తమ్ములకుంజనించెవగదైన్యముమానఁగనెవ్వవేసుసం, చుమ్మలికంబుతోనరసులొక్కటఁగన్నుల నీరునించెనాఁ, గ్రమ్మఁ దొడంగెఁదేనియలుకైరవపట్టులలోనవెల్లెడన్." పా. ౮, ఆ.)

**ఉమ్మలికించు.** దే. అ. క్రి. 1. దుఃఖించు; 2. శోకించు. "చ. మేనిలో నునిచినవాఁడప్రాణములనుమ్మలికింపకుఁడించుకేని యుఁన్." భార. భీష్మ. 3, ఆ.

**ఉమ్మాదము.** వై. వి. చిత్తవిభ్రమము. (చూ.) ఉన్మాదము.

**ఉమ్మాయముత్తియము.** ద్వి. వి. శుద్ధమౌక్తికము.

**ఉమ్మి.** వై. వి. ఉమిసెడు ఎంగిలి, ఊర్తి.

**ఉమ్మెత.** వై. వి. ఉమ్మెత్తయొక్క రూపాంతరము.

రింపక చరింపయదుండదిచూచిశల్లికెం, తయునెగఁబోసిరోసమె దఁదార్కొనఁజేసిన." ఉ, రా. ౬, ఆ. స. క్రి. సూచించు. "సీ. మధునదంబెగఁబోసిమాకందమాలికా క్రీడానుషంగిభృంగి రవంబు." సా. ౬, ఆ.—ఎగఁబ్రాఁకు. అ. క్రి. మీఁదికిఁ బ్రాఁకు. "ద్వి. అచలంబుపైకిగుండనకచెట్టనక, కిచకిచధ్వనుల తోఁగిచకొట్టుకొనుచు, నెగఁబ్రాఁకియెక్కుచో." రా. కిష్కిం, కాం.—ఎగదువ్వ. స. క్రి. మీఁదికిదువ్వ. "సీ. డిగజాఱుకుం గురు లెగదువ్వకైతవంబున నెమ్మొగంబుపైమోముఁజేర్చి." కవి. 3, ఆ.—ఎగనూఁదు. స. క్రి. 1. పైకినూఁదు; 2. తిరస్కరించు. "సీ. వాంశికవంశికావైభవంబెగనూఁదెఁదాళికాధరకరతాళగరిమ." వసు. ౫, ఆ.—ఎగనెత్తు. స. క్రి. మీఁదికెత్తు. "సుగుడుఁదన్వేడు చునెగనెత్తిపట్టఁగా." కళా. 2, ఆ.—ఎగరోఁజో. వి. నిట్టూర్పు. (వాఁడు ఎగరోఁజుదిగరోఁజులుగాపరుగెత్తుచున్నాఁడు.) (ఇట్లు ఎగరొప్పు.)—ఎగవిడుచు. స. క్రి. ఊరకవిడుచు. "తెకతేరగనీ కెగవిడిచిపోయెదనె." కళా. 3, ఆ.—ఎగవేయు. స. క్రి. 1. అపహరించు; 2. చేసినదిలేదనిసాధించు. "ద్వి. ఎంతైనఁజేసి తానెగవేయఁగలుగు." సా. 2, భా.—ఎగవైచే. స. క్రి. ఎగుర వైచు. "శైలములెత్తికందుకముచందముగానెగవైచి." రామా. ౫, ఆ. ఇత్యాదులు.)

**ఎగచు.** దే. ప్రే. 1. ఎగయఁజేయు. "ఆ. వీరసేనసుతుఁడు పేరుం సుహంసల, నడబెడఁగుఁజూచినగుచువాని, నెగచియెగచి యందు నెగయకుండఁగనొక్క, హంసఁబట్టుకొనియెనతిరయమున." భార. అర. ౨, ఆ. (ఈప్రయోగమునుబట్టియు తగినయాధారములేకుం డుటఁబట్టియు ఎగచు అనునది వేఱొక పదమని గ్రహింపక యిట్లు ఎగయుధాతుప్రేరణరూపమని గ్రహించుటయే యుక్తము. చూ. ఎగయు.) (ఇది పొగచువంటిది.)—2. తఱుము. "క. అమ్మెయిని నోడితానుం, గమ్మఁడుహతశేషమయిన దానవబలముక్, గ్రమ్మజీ తనవచ్చినమా, ర్గమ్మునఁబాఱెను విహంగ గమకుండెగవక్." నిర్వ. 3, ఆ. (కొన్నియెడలధాతువునకు ప్రేరణమునందర్థభేదమును కలుగుమన్నది. చూ. కాఱించు.)

**ఎగతాళి.** దే. వి. గేలి, పరిహాసము.

**ఎగదిగ.** దే. క్రి. ఎగువదిగువలుగా. "ఎ, గీ. పగిలనకూఁతుసిం గారమెల్లఁబెక్కు, మాఱులెగదిగఁ గ్రేగంటఁబాఱఁజూచి." కళా. 2, ఆ.

**ఎగపు.** దే. వి. 1. గర్వము; 2. మండిపడుట. "ద్వి. బాగుమీ జినాగబందపుమొగపు, తీఁగదానికిఁగల్గఁదీఱదేయెగపు." భాగ. ౧౦, స్కం.

**ఎగయు.** దే. అ. క్రి. 1. ఎగురు; 2. పైకిలేచు. "క. మసమస కనయ్యెదిక్కులు, పసిక్రేపుఁదలంచితిరుగఁబడెగూళ్లకుం, తన మూజముకలకలములె, గసెవెడవెడకన్ను మొగిచెఁగమలవనంబుల్." జై. ౨, ఆ.

**ఎగవు.** దే. వి. ఎగురుట, ఉడ్డీనము.

**ఎగసన.** దే. క్రి. ఎగువగా. "సీ. తుదివ్రేలనెగసఁద్రొచిన పుది యబొట్టురుఫాలపట్టిక నుల్లసిల్ల." రా. అర. ౨, ఆ.

**ఎగసిపడు.** ద్వ. అ. క్రి. 1. ఎగిరిపడు; 2. గర్వించు; 3. మండిపడు.

**ఎగసిపాటు.** ద్వ. వి. 1. ఎగసిపడుట; 2. గర్వించుట; "క. భసలమనీకింతయెగసిపాటేమిటికిక్." రసి. ౮, ఆ. (ఇది మీఁది రెండర్థములకునుదాహరణము.)—3. మండిపడుట.

**ఎగసిల్లు.** దే. అ. క్రి. ఎగయు. (అప్ర.)

**ఎగాదిగ.** దే. క్రి. ఎగదిగయొక్కరూపాంతరము. "కాంచిసుమా లివెండియునెగాదిగఁజూచి." ఉ, రా. ౨, ఆ.

**ఎగు.** దే. విశే. వృత్తియందు ఎగువశబ్దమునకును ఎగురుశబ్దమునకును అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఎగుబుజములు, ఎగుబోద మొ.)

**ఎగుచు.** దే. స. క్రి. తఱుము. "క. అమ్మెయినినోడితానుం, దమ్ముఁ డుహతశేషమైనదానవబలముక్, గ్రమ్మజీతనవచ్చినమా ర్గమ్మునఁ బాఱెనువిహంగగమనుండెగువక్." నిర్వ. 3, ఆ.

**ఎగుడు.** దే. విశే. ఉన్నతము.

**ఎగుడుదిగుడు.** దే. విశే. 1. సమముకానిది, విషమము; (ఎగు డుదిగుడునేల.)—2. అసంగతము. (ఎగుడుదిగుడుమాటలు.)

**ఎగుదల.** ద్వ. వి. (ఎగువ+తల.) 1. పైభాగము; 2. వృద్ధి.

**ఎగుబుజము.** ద్వ. వి. ఉన్నతభుజము. "ఎ, గీ. పాలుపుమీ ఱుచు నెగుబుజంబులునఁదారు, జమలిమూఁపురములతోడ సమ రుమల్ల, రంపుటాఁబోతులునుబోలెఁబెంపుమీఱ, జెట్లుదనఁదెంచి రాన్నపుసేవకొఱకు." పర. 3, ఆ.

**ఎగుబోద.** ద్వ. వి. ఱెక్కలుమొలచి యెగిరెడు వయసువచ్చిన పక్షిపిల్ల.

**ఎగుమతి.** దే. వి. ఓడకు సరకులెక్కించుట.

**ఎగుమతిచేయు.** దే. స. క్రి. ఓడకు సరకులెక్కించు.

**ఎగురు.** దే. అ. క్రి. ఎగురుట.

**ఎగురులాడు.** దే. అ. క్రి. దుముకులాడు.

**ఎగువ.** దే. వి. 1. మీఁదు; 2. అధిక్యము. "క. తగవా మగవారికి నిటు, మగువలయందెగువఁజూప." రామా. ౫, ఆ.—విశే. ఉన్న తము. (వృత్తియందు అంత్యవర్ణలోపము.)

**ఎగ్గతెము.** వై. వి. ఏకాంతస్థలము. "ఎ, గీ. ఎగ్గతంబునఁదానుగార గిఁగాలెసఁబె." భార. ఆశ్ర. ౨, ఆ. "ఎ, గీ. అయ్యనవ్వయతఁ డెగతంపుఁజోట, సరయదిక్కెవ్వరునులేనియట్టితెగుట నొందఁ గలవామసునఁబల్క." భార. మా. ౧, ఆ.

**ఎగ్గాడు.** దే. స. క్రి. (ఎగ్గు+ఆడు.) దూషించు. "శా. తోడం బుట్టినవానిభంగమునకుక్దుఃఖించిమాకృష్ణునె, గ్గడంజూడకు మమ్మ." భాగ. ౧౦, స్కం. ఉ.

**ఎగ్గించే.** దే. స. క్రి. అనాదరించు. "శా. పేలామట్పదయెగ్గుమా వలననీకెగ్గింపఁగానేటికిక్." భాగ. ౧౦, స్కం. పూ.

**ఎగ్గు.** దే. వి. 1. కీడు; "ఉ. అగ్గిశరాంధలంచునటులర్జునునెక్కటి దాఁకఁగోరనీ, కెగ్గిది." భార. కర్ణ. ౨, ఆ.—2. అపకారము; "బ్రాహ్మణసీమలకెగ్గుసేయ." భో. 3, ఆ.—3. కీడుమాట; "ఎ గ్గునారుకతిపేరెసఁగుచుండు." ఆం, భా. ప్ర. వాగ్వ.—4. అప రాధము; "శా. పేలాయింతప్పృథాభిమానముక్రియాహీనుండవైనా విధం, బాలోకెంపకయెగ్గుచేసితివి." భో. 3, ఆ.—5. దోషము; "పనునెగ్గులుపట్టకుండినక్ బొందొసరుక్." భార. కర్ణ. ౧, ఆ.—6. అనాదరము. "శా. పేలామట్పదయెగ్గుమావలననీకెగ్గింపఁ గానేటికిక్." భాగ. ౧౦, స్కం. పూ.—7. బ. దూషణము. "చ. ఇతనికినన్నునిట్లుఱకయెగ్గులు పల్కఁగఁబోలుఁగాక." భార. సభా. ౨, ఆ.

**ఎగ్గుఱుకు.** దే. వి. (ఎగువ+గుఱుతు.) విషయసంగ్రహము. (ఎగ్గుఱుతులెక్క.) (రూ. ఎగ్గుర్తు.)

**ఎగ్గులాడు.** దే. స. క్రి. (ఎగ్గులు+ఆడు.) నిందించు.

**ఎచ్చిరిలు.** దే. అ. క్రి. వర్ధిల్లు. "గీ. ఏయుపాయంబుచేనైననె చ్చిరిలఁగ, నీకరాశినకులముఁ బరమేశ్వరుంపు, తున నునను తింక యొక్కటి మనమునందు, నున్న యదిదీనికొద్దియోయుక్తియింక." కా. ౬, ఆ. (రూ. ఎచ్చిల్లు. "గీ. నృపులకపులనమంనిషుం డ్రంబుల, నొచ్చిచరమదశకువచ్చిదనుజు, లెపుడు ప్రొద్దుగ్రుంకు నెపుడుమాకెచ్చిల్లఁ, గలుగుననుచుఁ బోరుసలుపుచుండ." రామా. ౫, ఆ.)

**ఎచ్చిలు.** దే. అ. క్రి. 1. ఎచ్చిరిలు. "చ. మఱునటినాటి వేకువ నమాన్యుఁడుమేల్కనివంతతమంతయుఁ, జెఱచిరికూఁడు రుంగొంటుకుఁజేకొనిముందఱఁజంద్రహాసుఁడై, చ్చిలెఁ బ్రకూడ మానసుచుఁజిత్తమునందలపోసిపినినే, తెఱఁగునన్వైనఁజంపెదయతి ప్ర రోత్తులుబోఁకుచేసెదన్." జై. ౫, ఆ.—2. బాగుపడు. "చ. నెఱయఁగ వంపరాని దరణీజమువంపఁగఁడంగెనేసియే, దైఱబలుఖడ్గ ధారజగతీధరశృంగముఁ వ్రేసెనేనిమీఁ, దెఱుఁగకబుద్ధిహీనసకునెంత యుబుద్ధులు చెప్పెనేనియె, చ్చిఱఁడొకవానరంబునకుఁ జెప్పిన సూచిముఖంబుచాడ్పునన్." పంచ. నా. ౧, ఆ.

**ఎచేటు.** దే. వి. ఏ. ఎచ్చోటుయొక్కరూపాంతరము. (చూ.) ఎచ్చోటు.

**ఎచేరించు.** దే. స. క్రి. ఎచ్చరించుయొక్కరూపాంతరము. "ద్వి. పచరించిమాయలుపన్నిభూపాలు, నెచరించికోయింపన్లోడెమ సను." నవ. 3, భా. (దీనికి ఈ ప్రయోగమొక్కటే కనంబడుట చేత ఇది యింకను విచారింపఁదగినది.)

**ఎచోటు.** దే. వి. ఏ. ఎచ్చోటుయొక్కరూపాంతరము, (చూ.) ఎచ్చోటు.

**ఎచ్చేటు.** దే. వి. ఏ.———పై.———

**ఎచ్చేరము.** దే. వి. ఎచ్చరిక. "వ. మఱియునయ్యెచ్చరలెచ్చరం బులఁగచ్చువదలి." కవిక. ౬, ఆ.

**ఎచ్చేరించు.** దే. స. క్రి. ఎచ్చరికచేయు.

**ఎచ్చేరింత.** దే. వి. ఎచ్చరిక. "ఉ. సింహకప్రంగిలింతలనగనగళి ధ్వనియెచ్చరింతలన్." పాంచా. 3, ఆ.

**ఎచ్చేరిక.** దే. వి. 1. అవధానము; "చ. మరలఁగఁబట్టఁగట్టఁగ నమస్తమరుద్గవిసన్నుఁగూర్చియె, చ్చరికధరింపఁబోలునన" పాండు. ౩, ఆ.—2. సూచన.

**ఎచ్చేరికించు.** దే. స. క్రి. ఎచ్చరించుయొక్కరూపాంతరము. "ఉ. కన్నిచ్చలువచ్చుచేడియలనెచ్చరికించుచుఘార్తకోటితో, మచ్చరికించుచున్." విక్ర. ౫, ఆ.

**ఎచ్చు.** దే. అ. క్రి. అధికమగు. వి. ఆధిక్యము. విణ. అధికము.

**ఎచ్చోటు.** దే. వి. ఏ. (ఏ+చోటు.) ఏస్థానము, (రూ.) ఎచోటు.

**ఎట.** దే. వి. ఏ. ఎక్కడ. "ఇచ్చనుపయెటఁబోయెదు." భార. అర. ౩, ఆ.

**ఎటవారె.** దే. వి. కుందురుకీ.

**ఎటు.** దే. అవ్య. ఎట్లు. "ఎటాడుకొన్ననుంజెల్లుఁగదమ్మనీకు." కళా. ౧, ఆ.

**ఎటులు.** దే. అవ్య.———పై.——— "ఏనెటులట్లనీవరసియిచ్చమె యింబసిగొమ్ము." భార. విరా. ౧, ఆ.

**ఎటువంటి.** దే. విణ. ఎట్టి. "మీరెటువంటిపెద్దవారు." కళా. 3, ఆ.

**ఎటువలె.** దే. క్రి. ఎట్లు. "ఎటువలెభీతినీకొదవె." సకల. ౯, ఆ.

**ఎట్టకునేని.** దే. అవ్య. ఎట్లకేని. "కొంతనేపువేల్పెక్కినఖంగినుం డిధృతినెట్టకునేనియుఁబూని." రా. అ. కాం.

**ఎట్టకేని.** దే. అవ్య. అతిప్రయాసమున. "గీ. ఇట్టులురియాడు చిత్తంబునెట్టకేని, నాను చెప్పినధర్మంబునకుఁజొరంగ, నూలు కొల్పె" భార. అను. ౧, ఆ.

**ఎట్టకేలకు.** దే. క్రి. ———పై.——— "ఎట్టకేలకుననుఁదేర్చున ప్పుడుబలంబులనెగురురాజుసూడ." భార. విరా. ౫, ఆ. "క. పెన్నిధిఁగనిపోవఁగ, నన్నకృపణుమాడ్కిఁజిత్తమూటాడఁగనా, కన్నెపరాధీనతనతి, ఖిన్నయగుచునింటికెట్టకేలకుఁజనియెన్." జై. ౫, ఆ.

**ఎట్టట.** దే. అవ్య. (ఎట్టు+ఆటు+అ.) ఎట్టయిన. "క. ముద మొదవఁగనుఁడెట్టట, బ్రదికనఁజాలునని దనియె." పద. ౩, ఆ. (చూ. తాలిమి.)

**ఎట్టపోగు.** ద్వ. వి. దండు. "చ. హరునకువెట్టఁజుట్టినయమాల యవాటికఁజేరియచ్చటన్, మరుఁడుతదీయశాసనమునన్ విరహిప్ర కరంబునొంపదు, పక్కరగతినెట్టపోగనఁగఁగ్గొనివచ్చినరీతివచ్చెఁ గ్రొ, వ్విరిరవదువ్వచాళ్లాని ఇదికమలయానిలవాహపోనముల్." చంద్ర.

**ఎట్టయెదురు.** దే. వి. ఏ. (ఎదురు+ఎదురు.) చక్కనియెదురు.

**ఎట్టి.** దే. విణ. ఎటువంటి.

**ఎట్టీఁడు.** దే. విశే. (ఎట్టి+వాఁడు.) ఎటువంటివాఁడు. "ఎట్టిఁ డునానిజేశుఁడు." రా. సుం, కాం. (బ. ఎట్టిరు.)

**ఎట్టు.** దే. అవ్య. ఎట్లు.

**ఎట్టులు.** దే. అవ్య.———పై.———

**ఎట్టువోలె.** దే. క్రి.———పై.———

**ఎట్టూ.** దే. అవ్య. ప్రశ్నమునుఁదెలుపును. "ఎట్టూయిట్టగునయ్య పల్కదయలేక." ఆను. ౬, ఆ. (ఆమ్రేడితమందు ఎట్టెటూ, ఎట్టెట్టూ. "అనటయునెట్టెటూతెలుపుమయ్యమహాత్మక." కళా. ౭, ఆ. "శా. ఎట్టెట్టూవినమైతినింకనొకమాటేర్పాటుగాఁజెప్పు మా." కాశీ. ౭, ఆ.)

**ఎట్లు.** దే. అవ్య. ఏప్రకారము. "క. అమరవరులందుఁబురుషో, త్తముఁడెట్లువిశేషమట్లుధరణింగలతీ, ర్థములందునుబుష్కరతీ, ర్థము కరమువిశేషమభిమతార్థప్రదమై." భార. అర. ౩, ఆ.

**ఎడ.** యు. దే. వి. 1. స్థానము; "పార్థులరుగునెడకు మనము నరిగి." భార. ఆది. ౬, ఆ.—2. అవకాశము; "ఉ. నిచ్చలు నిచ్చలోఁబొదలునీపితృభక్తికి జ్ఞానశక్తికిన్, మెచ్చితినచ్చితిన్ గరము నియ్యెడనియ్యెడయేలవేఁడుకొ, మ్మిచ్చెదఁజెచ్చరన్ నలయునీప్సిత ముల్ తఱమేనిదీననే, పొచ్చెమునొచ్చెముంజొరదుభూసురకేసరినమ్ము నావ్రుడున్." పాండు. ౩, ఆ.—3. దూరము; "క. కడు నెడగావుననదియి, క్కడవినఁబడదేమొ." కళా. ౪, ఆ.—4. గడు వు; "ఇప్పుడెడయిచ్చుటయుక్తమునాకు." భార. ఉద్యో. ౧, ఆ.—5. భేదము; "క. ఎడగొఁజఁగియుఁడమలోపల, నెడయెఱుఁగక ధర్మపథనమేతస్థితికిన్, నడిమింటివారలైరా, నడిమింటిరవిన్ హసిం చునవ్యప్రభలన్." రామా. 3, ఆ.—6. విఘ్నము; "క. నాకెం తయుఁబ్రియశిష్యుం, డీకపివరుఁడితనిపనికినెడకాకుండన్, బోక యుచితమనుకరణివి, భాకరుఁడపుడపరశిఖరిపైకరుగుటయున్." రా. సుం, కాం.—7. వ్యవహారము; "క. ఎనిమిదియేఁడులుశిశు వగు, నెనిమిదియేఁడులటబాలుఁడెడయెఱుఁగఁడుగా, వునబాలుఁ డెన్నిభంగుల, జనకునిఋణమరువఁజనదుచనునటమీఁదన్." సం. "గర్భస్థైస్సదృశోజ్ఞేయ అష్టమాద్వత్సరాచ్ఛిశుః, బాలఅషోడశాద్వ

స్నాత్వైగఁడశ్చేతిశిష్యతే, పరతోవ్యవహారస్తుస్వతంత్రస్తేతురా స్మృతః." విజ్ఞా. వ్య, కాం.—8. సంధి; "ద్వి. ఎడమాటలాడియా యిసవంశుఁదేరఁ, గడుహానుసంతుంచుగలిగనేనికు." రా. కిష్కిం. కాం.—9. దేవతా నైవేద్యవస్తువు. (ఇది విచార్యము.)—విశే. ఎలప్రాయముగలది. (ఎడదూడ, ఎడపడ్డ.)—క్రి. సమము. "ఎ, గీ. అంబినాభీష్ముఁడెడఁదునుమాడెనధిప." భార. భీష్మ. 3, ఆ. (ఆమ్రేడితమందు ఎడనెడ.)—వై. వి. హృదయము. "ఎడఁబోలివోనివేడుకలయేడ్తెఱసొంపున." నిర్వ. ౮, ఆ.

**ఎడఁద.** వై. వి. ఎద, హృదయము. "భీష్ముఁడర్ధరథుఁజేసియెడందఁ గలంచె." (కొన్ని ప్రతులయందు పాఠమిట్లున్నది. ఇదియ పొందికగాఁదోచెడి.) భార. శాం. ౧, ఆ.

**ఎడఁబాటు.** దే. వి. ఎడఁబాయుట, వియోగము. "సీ. సాదరం బుగ రఘుస్వామివెంటనెలక్ష్మణుండెడఁబాటులేకుండుసేవ్య, సేవక భావంబుచెన్నొంద." అధ్యా. బాల, ౫౦.

**ఎడఁబాపు.** దే. ప్రే. ఎడఁబాయఁజేయు.

**ఎడఁబాయు.** దే. స. క్రి. (ఎడ+పాయు) వీడు, వదలు.

**ఎడకట్టు.** దే. అ. క్రి. ఆవునవుంచు మంద చీముపట్టు. స. క్రి. చేర్చు. "సీ. ఇంద్రనీలములచేనెడకట్టి గ్రుచ్చిన రమణీయతార హారముధరించి." కాశీ. ౭, ఆ.

**ఎడకత్తియ.** ద్వి. వి. దూతిక, (రూ. ఎడకత్తె.)

**ఎడకాఁడు.** దే. వి. తార్చువాఁడు, దూత.

**ఎడకారు.** ద్వి. వి. మాఘమాసముమొదలు జ్యేష్ఠమాసములోపల పండించెడుపంట.

**ఎడగడ్డ.** ద్వి. వి. ఒడ్డు, గట్టు, దరి, తీరము.

**ఎడగిల్లు.** దే. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు.

**ఎడతాఁకు.** దే. అ. క్రి. చేరు, సంధించు. "వ. అంతట వారలు ప్రస్థానంబునకుం బ్రతిదినంబునెడతాఁకంగడంగినం దసమసంబున." పర. ౫, ఆ. "సీ. తన భూమివదలక ధనవంతులగువారియిండ్లకు నెడతాఁకుచెల్ల బ్రొద్దుఁ, జెరిమిథ్యానమస్కారముల్ సేయుచుఁ బ్రియములునయములు పెక్కుచూపి." హరిశ్చ. ౪, ఆ.

**ఎడతీయు.** దే. అ. క్రి. ఎడతెగు.

**ఎడతెగు.** దే. అ. క్రి. 1. ఎడపడు; 2. విడివడు. "క. ఒక్కకరినాథుఁడెడతెగిచిక్కెన్." భాగ. ౮, స్కం.

**ఎడతెఱపి.** దే. వి. వ్యవధానము. (తిరుణాళ్లకు జనులు ఎడతెఱపి లేక పోవుచున్నారు.) (చూ. ఎడతెర్పి.)

**ఎడతెర్పి.** దే. వి. ఎడతెఱపియొక్కరూపాంతరము. "చ. ఇద్దెస వచ్చెనేనియ, త్తెఱఁగయిపోయెయంచు నెడతెర్పిగఁగొందఱు పాయ వాఱఁగన్." భార. విరా. ౫, ఆ.

**ఎడత్రెచ్చు.** దే. అ. క్రి. ఎడతెగు. "క. పెనఁకువ యెడత్రెవ్వ కపడు, నెనిమిదిదివసములు సెల్లె." భార. శల్య. ౧, ఆ.

**ఎడదవ్వు.** దే. వి. అతిదూరము. "ఎ, గీ. విశ్వభర్త, యానతిచ్చిన యట్టులయధివసించెఁ, గాశికాపురికెడదవ్వుగలుగునడవి." కాశీ. ౭, ఆ.

**ఎడనీరు.** ద్వి. వి. 1. లేఁతటెంకాయలోనితియ్యనీరు; "సీ. ఎడ నీటిబొండ్లాలవడువున మెదడెల్లజాఱ్జైచినడొల్లువుఱ్ఱెగములు." ఆము. ౬, ఆ.—2. ఎడనీటికాయ. "సీ. ఎడనీరటంచననగుఁదచ్ఛ లాటువు." ఆం, భా. ద్వి. వ.

**ఎడపడు.** ద్వి. అ. క్రి. 1. ఎడతెగు; "క. ఎడపడక యహోరాత్రము, వడిగొనిచదివింప." భార. అర. ౩, ఆ.—2. పొరఁట పడు. "క. కుడిచినఁగడరుపకుండిన, నెడపడినదుఃకొండయచ్చు టెపుఁగిన్నపతియా, కుడిచినతెనిఁగనినప్పుడు, ఎడపడినాఁడనకొట్టి యిచ్చుఁపఁదగున్." సం. "ప్రతిభూస్థాపితోయస్తు ప్రకాశ్యంజని నాంధనమ్, ద్విగుణం ప్రతిదాతవ్యమృణకైస్తస్యద్య వేత్." విజ్ఞా. వ్య, కాం.

**ఎడపదడప.** దే. అవ్య. అప్పుడప్పుడు. "గీ. ఎడపదడప నినూ విభుఁడెచటనుండుఁ, గానరాఁడనిగృహభర్తకాంతనడుగ." కాశీ. ౪, ఆ.

**ఎడపు.** దే. ప్రే. ఎడయఁజేయు. "క. జనవినుతయగ్నిహోత్రం బున సంతానమున వేదములునెడపంగాఁ, జనదు." శాం. ఆది. ౪, ఆ.

**ఎడపెట్టు.** దే. స. క్రి. 1. తొలఁగించు; "గీ. ఎఱుఁగుమతఁడు నిన్నునెడపెట్టిపలికెనవాఁడు." భార. ద్రో. ౧, ఆ.—2. మాఱు వడ్డించుకొనుటకై యన్నమునుదగ్గఱయెత్తియుంచు.

**ఎడపోవు.** దే. అ. క్రి. దౌత్యముచేయు. (అప్ర.)

**ఎడమ.** దే. విశే. సవ్యము. (ఎడమకాలు, ఎడమచేయి మొ.—వృత్తియందు అంత్యవర్ణలోపము. ఎడకన్ను, ఎడవంక మొ)

**ఎడమడుగు.** దే. వి. 1. వ్యత్యాసము; (చూ. ఎడమడుపు) 2. వైషమ్యము. "క. ఉడుగుడుగుమోహనాస్త్రము, ఎడుపకు మనసెలుఁగుతోడవేగంబునన, య్యెడకేగుదెంచినారటుఁ. జెడ మడుగించుకయలేకయిట్లననాతోన్." భార. ఉద్యో. ౪, ౬.—విశే. వ్యత్యస్తము. "ఎ, గీ. వడుగుచందఁబుతన కెడమడుగు గాక. కొమరుగానేగనెలకట్టెగుజ్జువేల్పు." హరి. ఉ. ౧౦, ఆ.

**ఎడమడుపు.** దే. వి. 1. వ్యత్యాసము; "క. నడిసింపఁగఁబొడి సింపఁగ, నెడమడుపైకలఁగినప్పుడేర్పఱుపఁగనేఁ, గడునేర్తుఁజేర్చు నాదగు, కడిమియసైన్యమునకుగప్పసెనకావే." భార. ఉద్యో. ౪, ఆ.—2. వైషమ్యము. "క. అడలడఁచినెమ్మనమ్మున, వెదతెలి వొడఁగూర్చిమాటవేర్పడకుండన్, జడిముడిపడకనయంబున, నెడ మడు వొక్కించుకేక యిట్లనుసతితోన్." నిర్వ. ౮, ఆ.—విశే. వ్యత్యస్తము. (చూ. ఎడమడుగు.)

**ఎడమడువుపరుసడి.** దే. వి. మల్లబంధవిశేషము.

**ఎడము.** దే. వి. 1. చోటు; "అతిథులకునెడమిచ్చి." భార. అశ్వ. ౩, ఆ.—2. అవకాశము. "నాకు నాహారనిద్రలకెడము లేదు." భార. అర. ౫, ఆ.

**ఎడయిక.** దే. వి. ఎడఁబాటు, వియోగము.

**ఎడయు.** దే. అ. క్రి. తొలఁగు. "క. పీవురుపతులందుధర్మువెడ యకయుండున్." భార. ఆది. ౭, ఆ.—స. క్రి. ఎడఁబాయు. (ఇటీవలికవులుకొందఱు దీనినిసకర్మకముగాప్రయోగించుచున్నారు. పూర్వగ్రంథములయందుఁ బ్రయోగము కనఁబడలేదు. విచార్యము.)

**ఎడరు.** దే. అ. క్రి. భగ్నమగు. "చ. పడయకఘోరదస్యుసముద ర్శనపావకుచేదహింపఁగాఁ, బడిపరమేశ్వరోగ్రశరసావకదగ్ధపుర త్రయాభమై, యెడరిధరిత్రిమీఁదఁబడియెన్ జెడసౌంభకమంత సాల్వుఁడున్, బడియెమదీయచక్రపటుపాతరయంబునరెండు వ్రయ్యలై." భార. అర. ౧, ఆ.—వి. 1. ఆపద; "గీ. వలదు శంకింపనింద్రునివలనఁబుట్టు, నెడరువొందకయుండంగఁ గొడుకు నోపి, నంతగావుము కావంగనైనచావు, నపుడునన్నుఁదలంపుమే నదిమరల్తు." భార. శాం. ౧, ఆ.—2. భంగము; "చ. ఇది తగదంచునడ్డపడునింతకునేరకనభ్యులందఱున్, మదిమదినున్న యట్టియెడమానినికిందనుఁదానకాచికో, లొదవినదానఁజేసినభనొచ్చె ముదక్కనఁబొందునందనుల్, బ్రదికిరిగాకయయ్యెడరు రాచకొమా

రులకోర్చునట్టిదే.'' భార. ఉద్యో. ౧. ఆ.—3. నడుమ; ''గీ. అప్పాయుఁడనతి, నెత్తుకొనిపోవనిందందునెడరువేచె.'' పాండు. 3, ఆ.—4. ఎడారి. ''వ. ఎడరుసంజాలిపందిరిడియుదమనియు.'' (కొన్ని ప్రతులయందు ఎడవున అని పాఠమున్నది.) ఆము. ర. ఆ.

**ఎడలు.** దే. అ. క్రి. 1. వికలమగు; ''చ. అనవినిమేటిధర్మమగు నట్టిదియెయ్యది యుద్దియెప్పుడుం, గనియఁగఁబడియుండు నెస కంబుగనెయ్యదిని గ్రహించినన్, దనరుఁ బ్రమోదసిద్ధినియతంబుగ నెవ్వరితోడిసంధియెం, దునువికలంబుగాదు పరితోషమెలర్పను పన్యసింపవే. వ. అని దివ్యుండుపలికిన నాదివ్యబోధనుఁడిట్లనియె. గీ. వినుమహింసమేటియనఁజనుధర్మంబు, యోగక్షేమసుమనోసరం బండి, యుండుమనసుక్రొవ్వుఖండింపఁగామోద, మెనఁగుసుజన సంధి యెడలదెందు.'' భార. అర. 2, ఆ.—2. విచ్ఛిన్నమగు. ''కురువంశమెడలవచ్చిన.'' భార. స్త్రీ. ౨, ఆ.—స. క్రి. విసర్జించు. ''క. వందురివగలన్ దేహము, పొందెడలఁగఁజూచునన్నుఁ బొడఁగనిదివిఁదా, నెందులకేగుచునోగిరి, నందనదిగివచ్చికరుణ నాకిట్లనియెన్. మ. అతిసౌందర్యనిశాంతమైన సలక్ష్యంబిట్లుశోకా తురా, న్వితవైదీనిఁదొఱంగఁగాఁదగునె.'' స్వా. ౬, ఆ.

**ఎడవాఁడు.** దే. స. కడవాఁడు, అన్యుఁడు.

**ఎడవు.** దే. విశ. దవ్వు, దూరము. ''ఎ. గీ. తెరువు, నడపనచు జాలిఁగొని సంశయించువేళ.'' ఆము. ౬, ఆ.

**ఎడసాల.** దన్వ. వి. ప్రత్యేకమయినగది.

**ఎడాటము.** దే. వి. విషయము. ''సీ. నెపమేమియునులేక నీయెడాటమ్మునఁ బాడిఁదప్పఁడుగదాశౌరివుండు.'' భీ. ౨, ఆ. (దీనికి ఆట అని కొందఱు అర్థము చెప్పుచున్నారు.)

**ఎడారి.** దే. వి. చెట్లుచేమలులేనివిశాలపునిర్జలభూమి.

**ఎడారె.** దన్వ. వి. (ఎడ+ఆరె.) చెప్పులుకుట్టెడు చిన్నసూది.

**ఎడ్డ.** వై. వి. ఎడఁదయొక్కరూపాంతరము. ''క. చెడిపోకుఁడు సంసారము, కడతేర్పుఁడుశౌరిచరణకమలములడ్డం, దిడికొనుఁ డూరకకాలము, కడపకుఁడువివేకవిధిఁగడఁగుఁడునడవన్.'' లక్ష్మీ. ర, ఆ.

**ఎడ్డమి.** దే. వి. ఆపద. ''ఉ. ఎడ్డమియైనయప్పటికి నెవ్వరుఁ జేరరు లోకులేమియున్, సడ్డలుసేయనొల్ల రవసానపువేళల దండధారుచే, జడ్డలెకానిమేలుకొనసాగ దయో తలపోసిచూచినన్.'' వి. పు. ౫, ఆ.

**ఎడ్డము.** దే. వి. అడ్డంకి, నిరోధము. ''ఉ. ఏసుదినంబులన్నమున కెడ్డముపుట్టినయంతమాత్రలో, నేడుచుచున్న వాఁడవుమునీశ్వర.'' భీ. ౨, ఆ.

**ఎడ్డియ.** వై. విశ. మూఢుఁడు.

**ఎడ్డె.** వై. విశ. ఎడ్డియయొక్కరూపాంతరము.

**ఎడ్డెఁడు.** వై. విశ. ఎడ్డయొక్కరూపాంతరము. ''పిసాసియువంటి గరాసుఁగూడునీ, యెడ్డెఁడు.'' శు. (క. ౧, ఆ.)

**ఎడ్డెన.** దే. వి. భోజనపాత్రమునుంచుకొనెడి ఉన్నతపీఠము. ''సీ. వెండియెడ్డెనలపైవెలచితెచ్చినపైఁడిపళ్లెంబులాయితపఱచువారు.'' నై. ౬, ఆ. ''గీ. పసిఁడియెడ్డెనలనుమించుపద్మరాగ, భాజనంబుల వడ్డించుబహుపదార్థ, వితతులమరెనుమేరుసంగతసహస్ర, కరునిఁ బోదివిన చిత్రమేఘములకరణి.'' జై. ౮, ఆ.

**ఎడ్లు.** దే. వి. బ. (ఎద్దు+లు.) వృషభములు.

**ఎతఁడు.** దే. స. ఏ. ఏపూజ్యుఁడు. (ఏతఁడుయొక్కరూపాంతరము.)

**ఎతుబరికాఁడు.** దే. వి. ఎత్తుబరికాఁడుయొక్కరూపాంతరము.

**ఎత్తనగోల.** దే. వి. 1. గోనెలెత్తి యెద్దమీఁదవేయుటకు సాధనమైన కఱ్ఱ; ''సి. లసరుగోణ్యుద్ధారి దండాఖ్యయెత్తనగోలనాబట్టిన గోల యనఁగ.'' అం, భా. ద్వి. వై.—2. ఊఁతగానానించినకోల.

**ఎత్తనగోలు.** దే. వి. 1. మొదలు; 2. ప్రారంభము.

**ఎత్తరము.** దే. విశ. ఉన్నతము. ''సి. ఇలఁజుట్టువడుతుండముల మించిపూర్వాంగమెత్తరంబైపిఱుందత్తమిల్ల.'' స్వా. ౫, ఆ.

**ఎత్తరవు.** దే. విశ. ఎత్తరము, ఉన్నతము.

**ఎత్తళి.** దే. వి. కొఱముట్టు, సాధనము.

**ఎత్తికొను.** దే. అ. క్రి. కడఁగు, యత్నించు. ''గీ. ఎట్టికష్టుఁ డైననిట్టిపాపముసేయ, నెత్తికొనునెధరణిసివ్రుదక్క.'' భార. అర. ౬, ఆ.—స. క్రి. 1. అపహరించు; ''భూసురకాంతనెత్తికొనిపోవుటదోసముయామినీశ.'' వి. పు. ౬, ఆ.—2. వహించు; 3. ఉద్ధరించు. ''క. ఇపుడానన్నెత్తికొనన్, గృపపుట్టుటనీకు ...సకేవృత్తాంతం, బెపుడుకొనివచ్చితిచ్చటి, కపుడేననునెత్తికొంటి వనిలకుకూగా.'' (ఇది ... ఉదాహరణము.) రామా. 2, ఆ.

**ఎత్తికోలు.** దే. వి. 1. కడఁక, ప్రయత్నము; ''క. తరతరమ ప్రజలఁడునిమెడు, నరునప్పటియెత్తికోలునకుసురవిద్యా, ధరఖేచరులునభీతిన్, బొఁచిరి.'' భార. విరా. ౫, ఆ.—2. సంకల్పము. ''క. పదివేలఁజంపఁగానో, పుదునేననునెత్తికోలు పుట్టినయది.'' భార. ఉద్యో. ర, ఆ. ''వ. ఎప్పుడేనిమీరలడ్డమాడుదు రప్పుడశిపింతునిట్టిదనాయెత్తికోలు.'' భార. అను. ౨, ఆ.

**ఎత్తిపొడుచు.** దే. స. క్రి. దోషములెత్తిచెప్పిమర్మముదూఱునాడు.

**ఎత్తిలి.** దే. అవ్య. గట్టిగా. ''ఉ. ఎత్తిలికావుకావురని యేడ్చిలదీయప యోధరాగ్రముల్, కుత్తుకదాఁకఁబిల్చికొనిక్రోలె.'' హరి. పూ. ౫, ఆ.

**ఎత్తివేయు.** దే. స. క్రి. 1. తీసివేయు; (వానిపేరెత్తివేయుము.)—2. అలక్ష్యముచేయు. (నన్నెత్తివేసిమాటాడెను.)

**ఎత్తు.** దే. అ. క్రి. 1. కలుగు, పుట్టు; ''క. కౌరవులుసేయునవమతి, కారణముగఁగోపమెత్తు.'' భార. శాం. ౧, ఆ.—2. బయలుదేఱు. ''వ. ఎత్తెడుచోట్లనువిడిదలలయందునులోనుగానిప్పాణాదులైనయుద్భటచిహ్నంబులుప్రకటింపక.'' భార. విరా. 3, ఆ.—స. క్రి. 1. అపహరించు; (ఆ సొమ్మువాఁడేయెత్తినాఁడు.)—2. దండెత్తు; ''గీ. అని కెవ్వరిఁగొనియతండు, కౌరవులమీఁద నెత్తిరాఁగడఁగువాఁడు.'' భార. ఉద్యో. ౨, ఆ.—3. పైకెత్తు; ''చెవిప్రాణమెత్తుటసదె.'' హరి. ఉ. 2, ఆ.—4. గ్రహించు; (నీవాపుస్తకమునెత్తితివా.)—5. తీయు; (ఈబండిని నేను ఏలములో నెత్తితిని.)—6. (చల్లుడునీరు) పాఱించు; ''సీ. నీరెత్తువేళల నీరెత్తుఁబాదుపాదునకుఁ గాలువలుపొందుగనమర్చి.'' కళా. ర, ఆ.—7. ప్రస్తావించు; (అక్కడయీమాటయెత్తకుము.)—8. వహించు; (వాఁడుమంచిపేరెత్తెను.)—9. సంగ్రహించు. (ఇది మఱియొక గ్రంథమునుండి యెత్తివ్రాసినది.) (నోరెత్తు, పరుగెత్తు, భిక్షమెత్తు. ఇత్యాదులను వేఱువేఱు క్రియలుగాఁజెప్పుట యుక్తము.)—వి. 1. చదరంగపు ఎత్తు; 2. ఉన్నతి; ''ఉ. తమ్ములకెల్లఁబెద్దయగు తామరసోదరనాభికాసరో, జమ్మదివిశ్వమున్ విధివశమ్మునఁగాని సృజింపఁజాలదీ, తమ్ములయెత్తుచిత్రచరితమ్ము.'' వసు. ౫, ఆ.—3. ఉపాయము; ''గీ. ఇంతవట్టునునాపాలనిచటఁగూడె, నేమిసేయుదుఁబనికిఁదైయెత్తుదోఁచ, దనుచుఁజింతాపరంపరాత్యంతదంతు, రాంతరంగంబుతోనుండెనవ్విభుండు.'' రామా. 2, ఆ.—4. రెండుపీసెలకొలఁది; 5. తూనిక; ''సీ. తొలునాడుశోధ్యునిఁదులఁ దూఁచిమాతని యెత్తైనయొద్దికెల్లఁదాఁచి.'' విజ్ఞా. వ్య, కాం.—

6. ప్రయత్నము; "చ. విలసితమోహ దాహపరివేదనపొమ్మని యుత్తు పెట్టఁగా." హంస. ౧, ఆ.—7. పుష్పసరము; 8. బ. వలపు కత్తెవలచినవానికిచ్చుధనము. "సీ. పద్మాస్యపురినను భవనుసకీవ యెత్తులువెట్టుదనఁగరావలసెనిటకు. (ఇది పైయర్థమునకును ఉదాహరణము.) ఆము. ౨, ఆ.—విణ. ఉన్నతము. "సీ. ఔదలకుప ధానమగుసొంపుదీపింపఁగుడికరం బెత్తుగానిడిచెలంగి." శేప. ర, ఆ.

**ఎత్తుగడ.** దే. వి. (ఎత్తు+కడ.) 1. ఉపాయము; 2. యత్నము.

**ఎత్తుగడ్డలు.** ద్వి. వి. బ. ఎత్తుడుప్రాయ్యిగడ్డలు.

**ఎత్తుగున్న.** ద్వి. వి. లేఁతయేనుఁగుపిల్ల. "ఎ, గీ. అచటిమదపు టేనుంగులకమరకరటి, యెత్తుగున్న." చంద్రా. ౧, ఆ.

**ఎత్తుదెంచు.** దే. అ. క్రి. (ఎత్తు+తెంచు.) దండెత్తివచ్చు. "ఆ. కాలయవనుఁడనఁగఁగాల కల్పుఁడుశత్రుఁ, డేచినుఘురమీఁదనెత్తుదేర." హరి. ఉ. ౨, ఆ.

**ఎత్తుపెట్టు.** దే. స. క్రి. పురికొలుపు. "చ. విలసితమోహదాహ పరివేదనపొమ్మనియెత్తుపెట్టఁగా." హంస. ౧, ఆ.

**ఎత్తుబరికాఁడు.** దే. వి. దొంగ, చోరుఁడు.

**ఎత్తుభారము.** మి. విణ. పాడు.

**ఎత్తువచ్చు** దే. అ. క్రి. సరిపోలు. "వ. అతివిద్యానైపుణ్యను గలభూపకుమారులతోఁ బసులకాఁపరులెత్తువత్తురేయని క్రొవ్వస నవ్వుచుఁబలికెన." భాగ. ౧౦, స్కం. ఉ.

**ఎత్తువడు.** ద్వి. అ. క్రి. (ఎత్తు+పడు.) 1. ఛెడు; (వానిపేరు ఎత్తువడిపోయినది.)—2. లేవలేకపడు. "సీ. ఎత్తువడ్డమహోకుభృత్తులనతులితన్పతిఁజేరికిఁగొననిధీరభటులు." వసు. ౨, ఆ.

**ఎత్తువేయు.** దే. స. క్రి. తూఁచు.

**ఎత్తువోవు.** దే. అ. క్రి. (ఎత్తు+పోవు.) 1. చెడు; "గీ. శిల చిగురుఁబోఁడియైయుల్లసిలనొనర్చి, యెత్తువోయినగౌతమునిల్లునిలిపె." రామా. ర, ఆ.—2. తగ్గు. "క. అవియునునొకటికొకటికె, త్తువోకపెనఁగినను గసిమఘుత్రిపురహరుల్, నవరణతోమగుడంగాఁ, దివిచిరిఖేచరగణంబు దివిరినుతింపన్." ఉ, హరి. ౬, ఆ.

**ఎత్తెలు.** దే. వి. చేఁపలఁబట్టెడి అడ్డువల. "క. వెరవుననూఁదుల నెత్తెలఁ, గరములమత్స్యములఁబట్టికడుసంతసముం, బొరయుచుఁ ద్రాళ్లంగ్రువ్వఁగఁ, గరమూహించిమదిఁ బ్రాప్తకాలజ్ఞుఁడనున్." భార. శాం. 3, ఆ.

**ఎద.** యు. దే. వి. పశుఋతువు. "వ. ఎదపదనుసంబోదలుపెట్టలకుంజొట్టంబులై." సాన్వ. ర, ఆ.—వై. 1. హృదయము; 2. భయము*. "సీ. ఎదడిందిమదమొందిగదనొందిరోదఁజెందిపొదసందిపెదపందిమెదుపునొక్కఁడు." చంద్రా. ౨, ఆ.

**ఎదవడు.** వై. అ. క్రి. (ఎద+పడు.) భయపడు. "క. అవ్వేళ దివ్యబాణము, లెవ్వియుఁబనిసేయకున్న నెదవడిమదిలోఁ, గవ్వడి కవ్వడిదూలఁగ, నవ్వుచుఁజిత్రాంగదాతనయుఁడిట్లనియెన్." జై. 2, ఆ.

**ఎదావు.** దే. వి. (ఎద+ఆవు.) ఆఁబోతుచేర సమయమైనయావు.

**ఎది.** దే. స. ఏశబ్దమునకు అమహదర్థక ప్రథమైకవచనము. (ఏయాఁడుది, ఏపశ్వాది, ఏజడవస్తువు.) (ఏదియొక్కరూపాంతరము.)

**ఎదిరి.** దే. వి. విరోధి.

**ఎదిరించు.** దే. స. క్రి. ఎదురు.

**ఎదుగు.** వై. అ. క్రి. పెరుగు, వర్ధిల్లు.

**ఎదురాడు.** దే. అ. క్రి. (ఎదురు+ఆడు.) మాఱాడు.

**ఎదురు.** దే. స. క్రి.. ఎదిరించు.—వి. ఏ. 1. పురోభాగము; "క. ఒకమరికిరీటికట్టెది, రికినజేనుఁజేఁబోయిపేనిరెండవమాఁటి, యెక్కొనుటకోర్వఁగ లేరయి, కొకల్లఁగురురాజసేనయోధులలోనన్." భార. విరా. ౫, ఆ.—2. ఎదుటివాఁడు. "ఎదుర్కోర్వవలయు." భార. కర్ణ. ౧, ఆ.—3. వలపుకత్తెవలచినవానికిచ్చుధనము. "గీ. ఇంటిలోనున్నవస్తువులెదురువెట్టి." హంస. ౨, ఆ.—విణ. అన్యుఁడు. "పదపడిదుస్తరమగుసీ, పదుమూఁడవయేఁడుగడవఁబడుటయు రిదిత, మ్మెదురెఱుఁగమికైయాపద, లొదవినసైరించిరిట్టియునికియుఁ గలదే." భార. ఉద్యో. ౧, ఆ.

**ఎదురుకట్టుల.** దే. క్ర. ఎదుట. "క. అల్లంతనెదురుకట్టుల. నుల్లమలరఁగాంచి." భో. ౫, ఆ. (రూ. ఎదురుకట్ల. "గీ. గొల్లపడుచులుచనిగుంపుగూడిచూడ, ఆోలుదానెనత్రాడునుఁ బీలతోడ, నీడ్చికొనివచ్చితమయింటియెదురుకట్లఁ, దనరుదవళార్జునంబులఁ దగులఁబెట్టె." వి, పు. 2, ఆ.)

**ఎదురుకుత్తుక.** దే. వి. అంకిళ్లుపట్టుకొనెడు వ్యాధివిశేషము.

**ఎదురుకొను.** దే. అ. క్రి. ఎదురగు, అభిముఖమగు.—స. క్రి. ఎదిరించు. (వాఁడునన్నెదురుకొనినిలువనేరఁడు.) (రూ. ఎదుర్కొను.)

**ఎదురుకోలు.** దే. వి. 1. వివాహమునందుఁబెండ్లికొడుకువారు వధువింటివారు వరునికెదురుగాఁబోవుట; 2. పూజ్యులువచ్చునపుడు ఎదురుగాఁబోవుట. (రూ. ఎదుర్కోలు. "సీ. తనచక్రమునకునాతనిదివ్యతేజంబు గురుభావముననెదుర్కోలుసేయ." కళా. ౨, ఆ.)

**ఎదురుగడ.** దే. వి. (ఎదురు+కడ.) మాఱువ్రాసిన యొడంబడికలోనగునది. (ఎదురుగడయొడంబడిక, ఎదురుగడలెక్క మొ.)

**ఎదురుచు.** దే. అ. క్రి. ప్రతికూలమగు. (చూ. ఎద్రుచు)—స. క్రి. ఎదిరించు. "ఉ. తమ్ములువీఁగినంబలియుదగ్రతభీమునదిర్చి యార్చుచున్." భార. భీష్మ. ౨, ఆ. (రూ. ఎదుర్చు.)

**ఎదురుచుక్క.** ద్వి. విణ. కానిది. (చుక్క అనఁగా శుక్రుఁడు. శుక్రుఁడెదురగుట యనిష్టప్రదము కనుక లక్షణచే నీయర్థము కలుగుచున్నది.)

**ఎదురుచూచు.** దే. స. క్రి. వేచు, ప్రతీక్షించు.

**ఎదురుపడు.** ద్వి. అ. క్రి. 1. ఎదురుగావచ్చు; (దారిలోనాకు వాఁడెదురుపడెను.)—2. ఎదురుతిరుగు. (రూ. ఎదుర్పడు. "చ. యవనజరాసుతాదులకు నాజినెదుర్పడలేక." భాగ. 3, స్కం.)

**ఎదురుపాటు.** ద్వి. వి. ఎదురుపడుట. (రూ. ఎదుర్పాటు.)

**ఎదురుప్రొయు.** ద్వి. అ. క్రి. మాఱుచెలఁగు.

**ఎదురుఱొమ్ము.** ద్వి. వి. ఱొమ్మునడిమిభాగము.

**ఎదురేగు.** దే. అ. క్రి. (ఎదురు+ఏగు.) ఎదురుగాఁబోవు.

**ఎదురొత్తు.** దే. అ. క్రి. (ఎదురు+ఒత్తు.) మాఱొత్తు.—వి. బ. మాఱొత్తులు.

**ఎద్దడి.** దే. వి. దారిద్ర్యము. విణ. 1. దరిద్రము; 2. శూన్యము. "క. పసులకుమేపెద్దడియై." హరి. పూ. 2, ఆ.

**ఎద్దడినేల.** దే. వి. నిర్జలభూమి, మరుభూమి.

**ఎద్దము.** దే. వి. పట్టెతీరినయంచు. (ఎద్దపుచీర.)

**ఎద్ది.** దే. స. ఏదియొక్కరూపాంతరము, (చూ.) ఎది.

**ఎద్దు.** దే. వి. వృషభము. (బ. ఎడ్లు.)

**ఎద్దునాలుక.** దే. వి. గోజిహ్వశీ.

**ఎద్దుపట్టు.** దే. స. క్రి. ఎద్దినసువక్కహిసనుచేయు. "వ. వానిం బట్టికట్టింపుము. ఒండెనెద్దుపట్టంపుము." హరి. పూ. ౬, ఆ.

**ఎద్దుముల్లె.** దే. వి. ఒకదినుసుగడ్డి.

**ఎద్దురాసి.** ద్వ. వి. వృషభరాశి.

**ఎద్రుచు.** దే. అ. క్రి. (ఎదురుచుయొక్కరూపాంతరము.) ప్రతికూలమగు. "చ. ఎద్రిచినకాలపాకముననీగతిసీమదిఁగ్రోధవల్లికన్, బద్రిచినవారు." ఉ, హరి ౪, ఆ.

**ఎన.** దే. విశ. ప. సమానము. "నీకెనయెమానవనాథులు." భార. సభా. ౧, ఆ. "క. దీనికి, నెనకావుసుఁడీతలంపనేధర్మములున్." భార. అను. ౨, ఆ.

**ఎనమండ్రు.** దే. స. ఎనిమిదిమంది. (ఎనిమిదికె మహన్మహత్త్వార్థక రూపము.)

**ఎనమంపము.** ద్వ. వి. (ఎనిమిది+తూము.) ఎనిమిదితూములు.

**ఎనమనూలు.** దే. స. (ఎనిమిది+నూలు.) ఎనిమిదినూలులు, (గ్రా.) ఎనమన్నూలు.

**ఎనయిక.** దే. వి. 1. పొందిక. "క. నినుఁడీతగుసంబంధపు, పెనయికగనిమోచితెచ్చియిచ్చెసనరెచు, ల్కనిసరులు." ఆము. ౬, ౧.—2. సామ్యము.

**ఎనయు.** దే. అ. క్రి. సరిపోలు. "ఉత్ఫుల్లలోచనఁడావిష్ణుని మూర్తితోనెసయునీసన్మూర్తి." హరి. ఉ. ౫, ఆ.—స. క్రి. 1. పొందు; "చ. గసగసనెల్లప్రొద్దుఁగొనికాలెనువేఁడిమిఁబేర్చుభర్తమే, నెనయనుడగ్గఱన్సయిఁపక." హరి. పూ. ౧, ఆ.—2. పోలు. "చ. ఎనయుదెనీవుపౌరుషవిహీనుఁడవద్దివిజేంద్రనందనున్." భార. కర్ణ. ౨, ఆ.

**ఎని.** ద్వ. స.ప. ఎన్నియొక్కరూపాంతరము. (చూ. ఎన్ని.) (హల్లుపరమగుచో నిత్యలోపము వికల్పముగనగు. "వానికెన్తలల్ గలవు.")

**ఎనిక.** దే. వి. 1. గణనము. "క. తనకంటెనధికుఁబరసతి, నెనికమిగులఁదిట్టెనేనినేఁబదిపణముల్, తనకంటెహీనుఁదిట్టినఁ, దనరఁగఁ బండ్రెండుసరయుదండువుగలుగున్." విజ్ఞా. ప్రా, కాం. (ఈయర్థమునందిదియెన్నికయొక్కరూపాంతరము.)—2. నాలుగుపోఁగుల నూలుదారము.

**ఎనిమిది.** దే. స. ఏడునొకటి, (రూ.) ఎన్మిది.

**ఎనిమిదికాళ్లచేక్క.** ద్వ. వి. పూర్వభద్రపదానక్షత్రము.

**ఎనిమిదికాళ్లరిక్కనెల.** ద్వ. వి. భాద్రపదమాసము.

**ఎనియు.** దే. అ. క్రి. కలిసికొను.

**ఎనుచు.** దే. ప్రే. ఎనియఁజేయు, ఎనుపు.

**ఎనుపతేలు.** ద్వ. వి. (ఎనుము+తేలు.) నల్లతేలు.

**ఎనుపమోఁకాలు.** ద్వ. వి. ఒకానొకచెట్టు.

**ఎనుపసరము.** ద్వ. వి. (ఎనుము+పసరము.) బఱ్ఱె.

**ఎనుపు.** దే. ప్రే. ఎనియఁజేయు, ఎనుచు.

**ఎనుపుడు.** దే. వి. ఎనుచుట.

**ఎనుపెంటి.** ద్వ. వి. (ఎనుము+పెంటి.) బఱ్ఱె.

**ఎనుపోతు.** ద్వ. వి. (ఎనుము+పోతు.) దున్న, మహిషము.

**ఎనుబండ్రు.** ద్వ. స. ఎనుబదిమంది. (ఎనుబదికి మహన్మహత్త్వార్థక రూపము.)

**ఎనుబది.** ద్వ. స. (ఎనిమిది+పది.) ఎనిమిదిపదులు, అశీతి.

**ఎనుము.** వై. వి. బఱ్ఱె, మహిషి. (వృత్తియందు అంత్యవర్ణలోపము. ఎనుపెంటి, ఎనుపోతు మొ.)

**ఎన్నఁడు.** దే. వి. ప. (ఏ+నాఁడు.) 1. ఏకాలము; 2. ఎప్పుడు "ఎ, గీ. భూతములుగ్రాలునెన్నఁడేఁబుట్టినిండ్ల, నపుడువారాణసీక్షేత్రమైదుకోసు, లంతమేరయుపద్రవం బందకుండు." కాశీ ౨, ఆ. (ఎన్నఁడేనియనుచో ఏనిశబ్దమువాక్యాలంకారార్థము.) 3. ఎల్లప్పుడు. (ఇది యీ యర్థమందు ద్రుతాంతమునగు.)

**ఎన్నాళ్లు.** దే. వి. బ. (ఎన్ని+నాళ్లు.) ఎన్నిదినములు.

**ఎన్ని.** ద్వ. స. ప. (ఎంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) 1. ఎంతసంఖ్యకలవి; 2. అన్ని. "ఉ. ఏకపుత్త్రుఁడైన శత్రువులెన్నియు నేర్పుననేర్పరించెనే." (ఇదియు వర్ణాంతమైనప్పుడే ఈయర్థముకలదిగాఁగానంబడియెడిని.) భో. ౧, ఆ.—(చూ. ఎప్పఁడు.) (దీనికి ఏనిశబ్దము వెనుకఁజేరునపుడు అనేకము అనెడియర్థము కలుగుచున్నది. "పనగయ్యపుశకునంబులెన్నియేనిఁ గంటిని." భార. ఉద్యో. 3, ఆ.) (చూ. ఇన్ని.)

**ఎన్నిక.** దే. వి. ఎనిక. గణనము.

**ఎన్నికచేయు.** ద్వ. స. క్రి. ఎంచు, గణించు.

**ఎన్నికపెట్టు.** దే. స. క్రి.———పై.———

**ఎన్ను.** దే. స. క్రి. 1. ఆక్షేపించు; "సీ. చంద్రచంద్రాతపచందనశారదాశారదాంభోదకేసరులనన్ని." రసి. ౧, ఆ.— 2. గణించు. వి. సస్యాదిమంజరి. (వరియెన్ను మొ.)

**ఎన్నుపి.** దే. వి. అండువారేడ్చునప్పుడు అనుభవమునెంచియెంచి పాటగాఁబాడెడు చచ్చినవారిచారిత్రము.

**ఎన్నెము.** దే. వి. పురిటిపురుగు. (అప్ర.)

**ఎన్బది.** ద్వ. స. ఎనుబదియొక్కరూపాంతరము.

**ఎపుడు.** ద్వ. వి. ప. ఎప్పుడుయొక్కరూపాంతరము.

**ఎప్డు.** ద్వ. వి. ప. ఎపుడుయొక్కరూపాంతరము.

**ఎప్పటి.** దే. అవ్య. అప్పటి, మరల. "క. ఇవ్విధమునఁబురమంతయు, నివ్వలనవ్వలను రేఁగియెప్పటిజాలన్, ఱువ్వంగబెగడిరయమున, నవ్వనచరమేగెదట్టమగుకానలకున్." భో. ౫, ఆ.

**ఎప్పుడు.** ద్వ. వి. ప. (ఏ+ప్రొద్దు.) 1. ఏకాలము; 2. ఎల్లప్పుడు. "రేయిపగలునిద్రయునెప్పుడెఱుఁగక." భార. అర. ౨, ఆ. (ఇది యీయర్థమునందు ఎన్నఁడు శబ్దమువలె ద్రుతాంతముగాను గానంబడియెడి. "ఏమఱకుండునెనిజకృత్యములనెప్పుడును." భార. సభా. ౧, ఆ.)

**ఎబ్బె.** దే. వి. రోఁతపడుటయందుపయోగింపఁబడుమాట.

**ఎబ్బెర.** దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

**ఎబ్బెరాసి.** ద్వ. విశ. రోఁతకలవాఁడు (లేక) రోఁతకలది. (ఎబ్బెటికపువస్తురాశిలోఁజేరినది అని వ్యుత్పత్త్యర్థము.)

**ఎబ్బెటికము.** దే. వి. రోఁత. "సీ. తొడమీఁదనిడుకొనిదోషాచరాగ్రణియెత్తుకచనిలంకనేఁడుగాల, ముంచినయిల్లాలినించుకకొంచకమరలఁదాఁగొనివచ్చిమరులు హెచ్చి, యెబ్బెటికములేకయేలుచున్నాఁడు." ఉ, రా. ౬, ఆ.

**ఎమిడిక.** దే. వి. కడుపులోఁగలుగు పామువంటి తెల్లనిపురుగు, ఎమిడికపాము.

**ఎముక.** దే. వి. ఎమ్ముకయొక్క రూపాంతరము.

**ఎముకలవట్టు.** దే. విశే. వ్యాధిచే బక్కచిక్కినవాఁడు (లేక) బక్కచిక్కినది.

**ఎమ్ము.** దే. వి. ఎముక, అస్థి.

**ఎమ్ముక.** దే. వి.———పై.———

**ఎమ్మూట.** దే. వి. (ఎమ్ము+ఊట.) మూలగ. "నెఱవైనయెమ్మూట నెయ్యిగాఁగ." కవిక. ౨, ఆ.

**ఎమ్మె.** దే. వి. 1. మనోహరత్వము; "జాబిల్లియెమ్మెవిడంబించు నెమ్మొగఁబు." చంద్రా. 3, ఆ.—2. విలాసము. "ఒకనాఁడు వేలుపుటాడయఁజెమ్మెనసుఁగోరి." అచ్చ. బాల, కాం.

**ఎమ్మెకాఁడు.** దే. విశే. విలాసవంతుఁడు.

**ఎమ్మెలాఁడి.** దే. వి. (ఎమ్మెలు+ఆఁడి.) విలాసముగల ఆఁడుది, విలాసిని.

**ఎయుచు.** దే. స. క్రి. 1. వెంబడించు, అనుగమించు; "గీ. ఇట్లు పఱచుటయును నెంతయురయమున, నమ్మృగంబువెనుకనరిగియరిగి, యెయిదలేక." భార. అర. ౪, ఆ.—2. పొందు. "నీదుపూన్కి పారంబెయదఁగ." భార. విరా. ౨, ఆ.

**ఎయ్దు.** దే. స. క్రి. ఎయిదుయొక్క రూపాంతరము. (వెంబడించుటకు. — "నచివులఁజూచియిప్పుడవెనఁగమనమెయ్దుకతక్కినఁగ." భార. విరా. 3, ఆ.)

**ఎయ్యది.** దే. స. (ఏ+అది.) ఏది. "చ. ఏమిటికింగడంగియె, య్యదిదొరఁకొంటిమేలనుచునబ్జజుఁడిద్దఱఁజంచలాత్ములఁ, నదృ ఢులలెన్నఁగూర్చె జలనంబుననంచు." కళా. ౮, ఆ.

**ఎర.** దే. వి. 1. ఆహారము; "చ. ఫలముదళంబునుందొడిమఁజా యుటరాలినవానిఁగొంచునాఁ, కలికిరఁజేసి." భార. అను. ౫, ఆ. —2. బలి; "క. అప్పాంచాలో, గ్రసునొకనారనమునకును, నెర సేసె." భార. శల్య. ౧, ఆ.—3. వశ్యనము. "ఎరనొకసుండు భంబునసపింఁగని." భార. ఆది. ౧, ఆ.

**ఎరఁగు.** దే. అ. క్రి. 1. దిగు; "గీ. అవనికిరఁగిపోయియనని వ్రేసె." సం. "తతోవిరాటః ప్రస్కందద్రథాదధసుశర్మణః." భార. విరా. 3, ఆ.—2. నమస్కరించు. "గీ. ఎట్టిరాజులునుమహీ సురోత్తములెదు, రరుగుదెంచునప్పుడధికభక్తి, నెరఁగి ప్రియమువలికి తెరువిత్తురు." భార. ఆది. ౭, ఆ.

**ఎరఁగుడు.** దే. వి. నమస్కారము. "సీ. మ్రొక్కుదండముకేలు మోడ్పెరఁగుడు, నాఁగఁజెన్నొందునతతి." ఆం, భా. ద్వి. ప్ర.

**ఎరగలి.** దే. వి. మ్రాను ఒకటితోనొకటి ఒరసికొనఁగాపుట్టి అడవిని దహించెడి అగ్ని, కార్చిచ్చు, దావము.

**ఎరగొను.** దే. అ. క్రి. (ఎర+కొను.) పరవశమగు. "వ. మృణాళంబులాహారంబులుగమెసంగి యెరగొనిసుఖించురాజహం సంబులుంగల పులినస్థలంబులవలనను." మై. ౨, ఆ.—స. క్రి. మ్రింగు. "క. ఉరగమునెరగొనుగరుడుని, వెరవుననపుడతఁడు గగనవీధికిదాఁటెఁ." ఉ, హరి. ౫, ఆ.

**ఎరవలి.** దే. వి. ఎరగలియొక్క రూపాంతరము.

**ఎరవు.** దే. వి. 1. ఒకటిరెండుదినములువాడుకొనుటకైయడిగితెచ్చు కొనెడిసొమ్ము, యాచితకము; "క. లోభమ్మునసునొండ్లసొమ్ములు, రమ్మన్న నవచ్చునేయొరవునతమగునే." భార. అర. ౪, ఆ.—2. భేదము. "క. గురుభీష్మాదులమననములు, దురమునకుంజొరక యుండదురోధ్యగుఁడా, తురుఁడైయొడఁబఱపఁగని, ప్పరురునసెర వైనవేచ్చవడుబలమెల్లఁ." సం. "భీష్మద్రోణకృపాదీనాం భేదం సంజనయిష్యతి." భార. ఉద్యో. ౧, ఆ.—విశే. అన్యము. "చ. ఎరవుగఁ జూడసాగెహరికేక్షణపిన్నటనాటనుండియుఁ, బరిచితిఁ బూనిమంజుగతిమాధురియుఁ మృదువాగ్విభూతియుఁ, వరుసనె తెల్పి తల్లికడవారును దండ్రిభజించువారునై, గరిమముఁగన్న సద్విజశిఖామణులఁ వసులుబ్ధచిత్తయై." వసు. 3, ఆ.

**ఎరియు.** దే. అ. క్రి. 1. కాలు, మండు; "క. గురుకర్ణులయ ప్రాస్నల, నెరిసినయడి." భార. శల్య. ౨, ఆ.—2. పరితపించు. "క. సుకుమారుఁడతఁడుగోపా, లకవృత్తివహించియడవులం గ్రుమ్మరుచు, న్వికీనాకదాడుపగవా, రికినైననునకటనునమెరియదేవ గలఁగ." సం. "దూయామిభరత శ్రేష్ఠదృష్ట్వాతే భ్రాతరం ప్రియమ్." భార. విరా. ౨, ఆ.

**ఎరువంటి.** దే. వి. పంజెచెట్టు.

**ఎరువాటు.** దే. వి. (ఎరువు+వాటు.) ఎరువువైచుట. "సీ. సిరముక ప్రపుదుమ్మమరువంపుఁబొదులకెరువాటువైచినయింపుసొంపు." రా, వి. 3, ఆ.

**ఎరువు.** దే. వి. పైసుకైసెక్కనాళ్లుచేర్చిపెట్టినపేఁడ, పెంటపోగు. (ఎండచే పరితపించునదియని వ్యుత్పత్త్యర్థము.)

**ఎరుసు.** వై. వి. ఈర్ష్య. "గీ. వారిలోననగ్రవనజాక్షిచల్లాంబ, మజియుఁజిన్నపొలఁతిమల్లికాంబ, నవతులెరుసులేకనతతంబుమెలఁ గుచు, నవతులేకయుండ్రు నమ్మదమున." రాజ. ౧, ఆ.

**ఎర్కు.** దే. వి. ఎఱుకయొక్క రూపాంతరము. "కారెర్కుచందం బునఁ." హరి. పూ. ౯, ఆ.

**ఎఱ.** వై. వి. వానపాము*. "ఎరువుటెఱలకు." ఆము. ౨, ఆ. —విశే. ఎఱ్ఱనైనది. "నెత్తుటఁదోఁగినేలయెఱనింగితెఱంగుననుండె." భార. ద్రో. ౨, ఆ. (ఎఱ్ఱయొక్క రూపాంతరము.)

**ఎఱఁగు.** దే. అ. క్రి. 1. దిగు; "క. ఎఱఁగినయప్పెను వ్రేగున, విఱుగుటయును." భార. అను. ౧, ఆ.—2. నమస్కరించు. "సీ. తండ్రికిరేపుమ్రొక్కియాచార్యవిప్రులకువరుస, మజి మ్రొక్కునదివిరికెఱఁగుటచెక్కదే వార్చినంబునకుమున్న నక్కడకుఁ, జనఁగాదు." భార. అను. ౪, ఆ.

**ఎఱక.** దే. వి. 1. తెక్క, పక్షము; "క. ఎఱకలుగలకులశైలము, తెఱఁగుమెఱయ." భార. అర. ౬, ఆ.—2. భుజము. "ద్వి. చంద్రహాసంబెత్తిజానకివ్రేయ, నింద్రారిగమకింపనెఱకలువట్టి." రా. సుం, కాం.

**ఎఱగందు.** ద్వి. వి. (ఎఱ+కందు.) లేఁతబిడ్డ, శిశువు.

**ఎఱగన్ను.** ద్వి. వి. (ఎఱ+కన్ను.) శివునియొక్క అగ్నినేత్రము. ద్వా. ౭, ఆ.

**ఎఱగొను.** ద్వి. అ. క్రి. (ఎఱ+కొను.) కోపగించు. "ద్వి. ఎఱజీఁగియుబిసమిట్టులేలక్రోలెరవు, ఎఱగొన్నపెనుఁబాముసేలత్రొక్కదవు." రా. అర, కాం. "పేపజీయుండుటే యెఱగొంట గాఁగ." యు, కాం. (చూ. ఎఱ్ఱవాఱు.)

**ఎఱచి.** దే. వి. పొల, మాంసము. "క. ఉఱవగునారుగపంటలు, దొఱియలపాఁడియునుదఱచగుఁ బురుషులకుఁ, దెఱవలుచుట్ట ములయ్యెద, రెఱచియభుజియింతురఖిలసెల్లజనంబుల్." భార. అర. ౪, ఆ.

**ఎఱచిదిండి.** దే. వి. (ఎఱచి+తిండి.) అసురుఁడు. "సీ. బలిమిమై పోవుడుపట్టుఁడుకొట్టుఁడంచేత్తెఱఁదొడరియయ్యెఱచిదిండ్లు." అచ్చ. యు, కాం.

**ఎఱచిపిడుక.** దే. వి. చోరపుష్పి*.

**ఎఱబఱికము.** దే. వి. కోఁత. "చ. అఱమరయేలనేనిలుచు నా శ్రమదేశమునేడకాదెని, కెఱబఱికంబులేకయిఁకనిచ్చటనున్న తప స్వికాంపలం, దఱునుచితోపచారముఁగొనర్పఁగలారువివేకశాలినుల్, మఱతురెతెల్విదైవగతిమాన్పఁగనెవ్వరికైనశక్యమే." ఉ, రా. ౬, ఆ.

**ఎఱసంజె.** వై. వి. 1. సాయంసంధ్య; 2. ప్రాతస్సంధ్య. "సీ. ఎఱసంజకెంజాయకెదురుమొగ్గరములైకనుపట్టువల్కలాగ్రములుపూల." గామా. ౫, ఆ. "సీ. చిగురాకుటెఱసంజఁజిగికిఁ గొండురకోకములుభాసురతోరకములుగాఁగ." కా. ౨, ఆ.

**ఎఱుఁగు.** దే. స. క్రి. తెలియు.

**ఎఱుక.** దే. వి. 1. తెలివి; "క. చదివినయెఱుకలకు సరియె చదువనియెఱుకల్." లక్ష్మి. ౪, ఆ.—2. పరిచయము; "ఎఱుకపెఱుకెఁజేసుధనము." కు. ౧, ఆ.—3. సోదె; "గీ. భూతిడాఁచిపసుపుఁబూసిత్రిశూలహ, స్తంబుడాఁచిచేతసజ్జయమర, వెలఁదిమేనఁగల్లుపేరుండువెలఁదియై, యెఱుకయెఱుకయనుచునేగుదెంచె." వీర. ౨, ఆ.—4. గుఱుతు; "సీ. ఇటునేలజేజేలకెఱుకైనచెంగావిసుదసంజదగుకొండఁజూచినాఁడ." కా. ౫, ఆ.—5. జోస్యము. "గీ. రాజసభఁగేడుపుట్టెకు గాజ్యమడఁగు, ననుచునెఱుకచెప్పెడు జ్యోతిషాధములను, గుడుపుకొఱకుప్రాకృతిఁగొన్న శూద్రుఁ, బణసహస్రదండముగొనఁబాడిగలదు." విజ్ఞా. ప్రా, కాం.

**ఎఱుకత.** దే. వి. (ఎఱుక+త.) సోదెచెప్పునది, దైవజ్ఞ. "క. కడకంటఁగరుణవొడమఁగఁ, బడఁతులుతన్నెందతేనిపరివేష్టింపన్, మృదునతియాయెఱుకతతో, నడిగినకృత్యంబుఁజెప్పనగుమతిగలవే." వీర. ౨, ఆ.

**ఎఱుకచేయు.** ద్వ. స. క్రి. తెలియఁజేయు, తెలుపు. "లోని కెఱుకచేసి." భార. శాం. ౬, ఆ.

**ఎఱుకపడు.** ద్వ. అ. క్రి. విదితమగు. "క. కడునలుకయుఁ గూర్మియునే, ర్పడనెఱిఁగించునదివానిఫలకాలమునన్, బిడుగును గాడ్పునుజనులకుఁ, బడుటయునీచుటయునెఱుకపడియెడుభంగిన్." భార. ఆది. ౬, ఆ.

**ఎఱుకసాని.** ద్వ. వి. ఎఱుకత. "చ. అనవుడునెందతేనికమలాక్షులువేగమపాటివీధికిన్, జనిగిరిజాతయోయెఱుకసానినినుం బిలువంగఁబంచె." వీర. ౨, ఆ.

**ఎఱుకు.** దే. వి. 1. కిరాతుఁడు; "క. ఎఱుకనియెఱుఁగకమిమ్మున్, మఱకువమార్కొన్నతప్పుమఱవుఁడు." (ఇది కిరాతార్జునసంవాదఘట్టము.) భార. అర. ౧, ఆ.—2. వ్యాధుఁడు. "చ. ఎఱుకు కులంబునందుజనియించియుధర్మువులెల్లనిమ్ముగా, నెఱిఁగెదు." (ఇది ధర్మవ్యాధకౌశికసంవాదఘట్టము.) భార. అర. ౫, ఆ. "గీ. సాళువంబులు డేగలు జాగిలములు, వలలుజిగురులు నురులుబోనులు వహించి, బోయదొరలునునెఱుకులుబోడికలును, నడచిరిరువంక వేఁటసన్నాహమమర." భల్లా. 3, ఆ. (ఎఱుకు అనఁగా వ్యతిరేకలక్షణచే ఎఱుఁగనివాఁడు మూఢుఁడు అని వ్యుత్పత్త్యర్థము.)

**ఎఱుకువ.** దే. వి. ఎఱుక, తెలివి, జ్ఞానము.

**ఎఱుపు.** వై. వి. ఎఱ్ఱన, రక్తవర్ణము.

**ఎఱ్ఱ.** వై. వి. 1. వానపాము, గండూపదము*; 2. ఎఱుపు. "ద్వి. కొనకనులనునెఱ్ఱఘోరమైపర్వ." రా. సుం, కాం. "ఎఱ్ఱ కన్నులకుఁదెచ్చి." (ఇక్కడ విఱ్ఱకర్మము.) రా. యు, కాం.—విశే. ఎఱ్ఱనైనది. "కడునెఱ్ఱలయ్యెదిశలు." భార. అర. 3, ఆ.—[ఎఱ్ఱ అనువిశేషణముముందుగలసంజ్ఞావాచక శబ్దములు.—ఎఱ్ఱగందము (కుచందనము.), ఎఱ్ఱగడ్డ (నీరుల్లి*.), ఎఱ్ఱగన్నేరు (చండకము*.), ఎఱ్ఱగలిజేరు (వర్షాభువు*.), ఎఱ్ఱగిసె (లాలసి*.), ఎఱ్ఱగురిజ (కృష్ణల*.), ఎఱ్ఱగోరంట (కురవకము*.), ఎఱ్ఱచీమ (తైలపిపీలిక.), ఎఱ్ఱచేమంతి (రక్తసేవంతిక*.), ఎఱ్ఱతుమ్మెద (గండోలి.), ఎఱ్ఱతొగడ (కాకనాసిక*.), ఎఱ్ఱపులుము (కుష్ఠభేదము.), ఎఱ్ఱప్రత్తి (రక్తకార్పాసము.), ఎఱ్ఱమన్ను (శోణమృత్తిక.), ఎఱ్ఱమల్లె (ముచుండ*.), ఎఱ్ఱమీను (రోహితము.), ఎఱ్ఱములగ (మధుశిగ్రువు*.), ఎఱ్ఱమ్రాఁకు (పట్టిక*.), ఎఱ్ఱాముదపుఁజెట్టు (హస్తికర్ణి*.), ఇత్యాదులు.]

**ఎఱ్ఱగొల్ల.** వి. ఒకానొకజాతి. వా. ఆబోతివారు.

**ఎఱ్ఱన.** వై. వి. ఎఱుపు, రక్తవర్ణము. విశే. ఎఱ్ఱనిది. "క. పుష్పసికన్నులకయ నెఱ్ఱన." రా. యు, కాం. (చూ. అలకన.)

**ఎఱ్ఱనివేలుపు.** ద్వ. వి జ్వలనుఁడు, అగ్ని.

**ఎఱ్ఱపోతమ్మ.** ద్వ. వి. (ఎఱ్ఱపోతు+అమ్మ.) ఒకానొక గ్రామదేవత.

**ఎఱ్ఱవాఱు.** ద్వ. అ. క్రి. (ఎఱ్ఱ+పాఱు.) 1. ఎఱ్ఱనగు. "గీ. మొగముఁగన్నులునెఱ్ఱ, వాతెమిగులశోకసైకములకు." (ఇది రెండర్థములకు నుదాహరణము.) అను. ౫, ఆ.—2. కోపగిల్లు. "గీ. కుటిలమగునీకటాక్షంబుకువలయాక్షి, యించుకించుకనామీఁదనెఱ్ఱవాఱె, నిగిడిమఱలినభావంబు నిజముదెలిసె, శ్రవణకూపనిపాతైకశంకఁజూపె." నై. ౮, ఆ.

**ఎల.** దే. విశే. 1. యౌవనముగలది; "క. ఎలప్రాయమిచ్చితినినీ, కలఘుమతీయిచ్చెదనుమదాత్మజన్నల్లం, బలరఁగఁబెండిలికమ్మని, పలికిమఱియునాతపస్విపతియిట్లనియెన్." (దీనివెంబడిని.) "క. సజ్జనసుతనీ, వనమానముదక్కుమఁయా, వనమునుగైకొనుముకన్య వరియింపుతగన్." భార. అశ్వ. 3, ఆ.—2. స్వల్పము. "ఎల నగవు." (చిఱునగవు.)—3. సాక్షి. "గీ. ఎమ్మెకాఁడయగ్గియెల గాఁగఁబెండిలి, యైనచెలినిడించియకటయొంటి, నేఁగదగునె." అచ్చ. అ, కాం.—క్రి. విశే. స్వల్పముగా.—"ఎలనగుచున్." "ఎలచూచున్."

**ఎలగోలు.** దే. వి. 1. కలకలము; 2. ముందునడచుట; "చ. కులగిరిరాజనందనుఁడుగూరిమినాభువనాళిఁందిపన్, దలఁపఁదలంపులోపలనె దర్పకకేతనవల్లసంబులం, చలయెలగోలునంబుజవిశాలశిలీముఖతాండవంబులు, త్పలదళమండలాగ్రములుపైకొనునెట్టి వొతత్ప్రభావముల్." (ఇదిరెండర్థములకునుదాహరణము.) వసు. ౨, ఆ.—3. మొదటిప్రసరణము; "గీ. దవ్వులజల్లనితూఱసంతకమునుపటి, జల్లునీరూనివచ్చునజ్జల్లుమొదలి, గాలియెలగోలుచేఁ గొమ్మకదలిజల్లు, తలపడకమున్నె వంగుల్లఁదడిపెదరులు." అము. ౪, ఆ. (ఇక్కడ మొదలుశబ్దమునకుపూర్వమర్థము)—4. మొదట పటపటమనివచ్చువాన. "సీ. పుష్కలావర్తకాంభోధరవ్రాతంబు తెలగోలువర్షించునెన్నఁడేని." కాశీ. ౨, ఆ.—విశే. 1. ముందునడచునది; "అమ్మరునెలగోలుపాఁజులు." పా. 3, ఆ.—2. మొదటిది. "వ. ఒండొరువులమఱుపెట్టిచూచునెలగోలుచూపులనితరేతరధైర్యంబులు గంటివడ." పా. ౨, ఆ.

**ఎలదోఁట.** దే. వి. ఆరామము. "వ. అంతనమ్మహామునీంద్రుని యాజ్ఞానుసారంబునఁ దదివ్యమానంబుకలభాషిణివిహరించుచున్న యెలదోఁటలోనికిడిగియె." (క్రిందట) "ఉ. వసంతోరువిలాసభాసురపురోపవనంబునకేగియచ్చటన్." కళా. ౧, ఆ.

**ఎలనాఁగ.** దే. వి. 1. యౌవనముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**ఎలనీరు.** ద్వ. వి. లేఁతటెంకాయలోనితియ్యనినీరు. "ద్వి. ఎలనీటితోఁబ్రవహించెనందొకటి." రా. అ, కాం.

**ఎలమి.** దే. వి. 1. వికాసము; "సీ. ముదమునసెలమిఁగాంపాదవి నెమ్మోముపైఁదోఁపంగవచ్చినఁద్రోచిత్రోచి." భార. విరా. 3, ఆ. "పేరెలమిఁబొల్పుంజెందెనంభోజముల్." భార. ఉద్యో. ౨, ఆ.—2. సంతోషము.

**ఎలమికాఁడు.** దే. విశే. వికాసవంతుఁడు.

**ఎలయు.** దే. అ. క్రి. 1. చేరు; "సీ. ఏనుఁగుమదమునఁగలయు తేఁటుల మొత్తముల నీలిగొడుగులు చెలువుమిగుల." భార. భీష్మ. ౧, ఆ.—2. ప్రవేశించు; "సీ. వినుతొల్లిధర్మవర్తనులఁసహ్యంబు లైనదానవులుమహాగ్రహమున, నరులయందెలసిన." భార. శాం. ౫, ఆ.—3. కలుగు; "అద్భుతంబెలయఁగఁబుష్పవృష్టి గురియించిరి." భార. ఆర. ౭, ఆ.—4. ఆసక్తిపడు. "ఇంద్రియార్థములకునెలసినపురుషుండు." ఆర. ౫, ఆ.—స. క్రి. పొందు. "క. కడునే, లెలసిపరమసుఖముపొందుమిచ్ఛావృత్తిన్." భార. శాం. ౮, ఆ.

**ఎలరారు.** దే. అ. క్రి. (ఎలరు + ఆరు.) అతిశయించు.

**ఎలరు.** దే. వి. 1. అతిశయము; 2. వికసనము.

**ఎలరుచు.** దే. అ. క్రి. (రూ. ఎలర్చు. 1. అతిశయించు; "గీ. బలునకెప్పటికంటెనుబలమెలర్చె." హరి. ఉ. ౫, ఆ.—2. వికసించు; "వేగుజామిప్పలెలర్చుగాడ్పులకు." ఆము. ౫, ఆ.—3. సంతోషించు. "క. గురుఁడునుగృపుఁడునులోనగు, గురులను మోదింపబాహ్లీకుండుమొదలుగాఁ, గురుజాతియెలర్పఁగస, న్నరపతిభీష్మాభిషేచనంబొనరించెన్." భార. ఉద్యో. ౮, ఆ.)

**ఎలరుపు.** దే. వి. సంతోషము. (రూ. ఎలర్పు. "వచ్చినసంభ్రమంబుగరువంపు టెలర్పునునుల్లసిల్ల." భార. శాం. ౬, ఆ.)

**ఎలుఁగించు.** దే. అ. క్రి. కూయు. "సీ. ఇనుఁడున్నదెసనుండి యెలుఁగింపఁదొడఁగెఁబక్షులుమృగంబులునతిఘోరరుతుల." భార. ఆర. ౬, ఆ. (లక్షణప్రకారము ఎలిఁగించు అని యుండవలసియున్నను ప్రతులయందంతటపాఠ మిట్లేయున్నది. కావున అలక్షణమిక్కడ ప్రవర్తింపదని యెఱుఁగవలెను.)

**ఎలుఁగు.** దే. వి. 1. కంఠస్వరము; 2. ఎలుఁగుగొడ్డు. (రూ. ఎల్గు.)

**ఎలుఁగుగొడ్డు.** దే. వి. ఎలుఁగు, భల్లూకము.

**ఎలుఁగుబంటి.** దే. వి.——పై.——

**ఎలుక.** దే. వి. మూషకము. (దీనిభేదములు—కల్లెలుక, చిట్టెలుక, చుంచెలుక.)

**ఎలుకచెవి.** ద్వి. వి. మూషకపర్ణి.

**ఎలుకజీడి.** ద్వి. వి.——పై.——

**ఎలుకమెక్క.** దే. వి. ఒకానొకచెట్టు.

**ఎలువు.** దే. వి. ఎలుఁగుయొక్క రూపాంతరము.

**ఎల్ల.** దే. వి. పొలిమేర. ద్ర. సమస్తము. (ఇదియీయర్థమునందు ద్రుతాంతమైన అవ్యయముగానుండియు ఎప్పుడునుశబ్దమువలె ఎల్లయందున్ అని విభక్త్యంతముగాను, ఎల్లబోఁటిబాలుఁడు ఇత్యాది విధమున సమస్త పదముగాను బ్రయోగింపఁబడుచున్నది. మఱియు ఎల్లవినఁగన్, ఎల్లన్‌శిష్యులను ఇత్యాదిప్రయోగంబులును గానంబడియెడి.)

**ఎల్లమ్మ.** ద్వి. వి. (ఎల్ల+అమ్మ.) ఎల్లయందుండెడు నొకగ్రామదేవత.

**ఎల్లరు.** దే. స. ప. (ఎల్ల+వారు.) అందఱు. (దీనికేకవచనము ఎల్లవాఁడు.)

**ఎల్లవాఁడు.** దే. స. ఎవ్వఁడును. "సీ. వెరవిట్టిదెఱుఁగనివెంగలితనమని యెల్లవాఁడునుదనయెడఁజేఁగినట్టి, తెఱుఁగుననిజకార్యదృష్టిఁగనుంగొనును." భార. సా. ౧, ఆ.

**ఎల్లాఁపి.** దే. వి. (ఎల్ల+ఆఁపి.) 1. అడవియందుఁబోటుచేసికొని మిట్టయందుండి కొట్టదోఁచెడుదొంగ; 2. దొంగ.

**ఎల్లాఁపికత్తియ.** ద్వి. వి. దొంగతనముగల స్త్రీ, (రూ. ఎల్లాఁపికత్తె.)

**ఎల్లి.** దే. వి. 1. గొడుగు; 2. ప. రేపు.

**ఎల్లిదము.** దే. వి. చులుకఁదనము. (చూ. ఏలిదము.)-విశే. చులుకనిది. "ఇంతయెల్లిదమెయాశనికిన్‌మనయాజ్ఞ." భార. అశ్వ. ౧, ఆ. (ఇది ఏలిదముయొక్క రూపాంతరము)

**ఎల్లిసుఁడు.** దే. విశే. చులుకనివాఁడు. "చ. ఎల్లిదుఁడగువారికేటికి సలీలవిహారమువేడ్క సేయఁగన్." నిర్వ. ౫, ఆ.

**ఎల్లుండి.** దే. వి. రేపటికి ఆవలిదినము.

**ఎవఁడు.** దే. స. ఏవాఁడుయొక్క రూపాంతరము.

**ఎవతె.** దే. స. ఏ. ఎవరితెయొక్క రూపాంతరము.

**ఎవతి.** దే. స. ఏ. ఎవరితియొక్క రూపాంతరము.

**ఎవతుక.** దే. స. ఏ. (ఎవత+క.) ఏస్త్రీ. (ఇక్కడ స్వార్థమున కప్రత్యయము. కప్రత్యయముపరమగునపుడు ఉకారమువచ్చును, ఇట్లు ఇతరస్థలములయందును తెలియునది.)

**ఎవతె.** దే. స. ఏ. ఎవరితెయొక్క రూపాంతరము.

**ఎవయు.** దే. అ. క్రి. ఎగయుయొక్క రూపాంతరము.

**ఎవరిత.** దే. స. ఏ. (ఎవరి+త.) ఏస్త్రీ. (రూ. ఎవర్త.)

**ఎవరితి.** దే. స. ఏ. (ఎవరి+తి.)——పై——(రూ. ఎవర్తి.)

**ఎవరితె.** దే. స. ఏ. (ఎవరి+తె.)——పై.——(రూ. ఎవర్తె.)

**ఎవర్తుక.** దే. స. ఏ. (ఎవర్త+క.)——పై.——(చూ. ఎవతుక.)

**ఎవుచు.** దే. స. క్రి. ఎగుచుయొక్క రూపాంతరము. "మ. వైరిమనుజేంద్రశ్రేణికిన్‌గొంగనా, నవనింబేర్కొనియున్నయట్టివిజయక్ష్మాధీశ్వరున్ గాసిగా, నెవిచెన్‌ప్రోళనమ్మసిద్ధియని ప్రాయేటన్ బ్రగాఢోద్ధతిన్." నిర్వ. ౧, ఆ.

**ఎవ్వఁడు.** దే. స. ఏవాఁడుయొక్క రూపాంతరము. (ఎల్లవాఁడనుటకు.—"క. ఇమ్మహిధనవంతుఁడతఁడయెవ్వరికంటెన్." భార. ఆర. ౨, ఆ.)

**ఎవ్వత.** దే. స. ఏ. ఎవ్వరితయొక్క రూపాంతరము.

**ఎవ్వతి.** దే. స. ఏ. ఎవ్వరితియొక్క రూపాంతరము.

**ఎవ్వతుక.** దే. స. ఏ. (ఎవ్వత+క.) ఏస్త్రీ. (చూ. ఎవతుక.)

**ఎవ్వతె.** దే. స. ఏ. ఎవ్వరితెయొక్క రూపాంతరము.

**ఎవ్వరిత.** దే. స. ఏ. (ఎవ్వరి+త.) ఏస్త్రీ. (రూ. ఎవ్వర్త.)

**ఎవ్వరితి.** దే. స. ఏ. (ఎవ్వరి + తి.)——పై.——(రూ. ఎవ్వర్తి.)

**ఎవ్వరితె.** దే. స. ఏ. (ఎవ్వరి + తె.)——పై.——(రూ. ఎవ్వర్తె.)

**ఎవ్వర్తుక.** దే. స. ఏ. (ఎవ్వర్త+క.)——పై.——(చూ. ఎవతుక.)

**ఎవ్వల.** దే. వి. ఏవలయొక్క-రూపాంతరము. "క. ఇచ్ఛఫమునసే వర్ణము, సెవ్వలఁబొడలేకపోవ." హరి. ఉ. ౯, ఆ.

**ఎవ్వాఁడు.** దే. స. (ఏ+వాఁడు.) 1. ఏపురుషుఁడు; 2. ఎల్ల వాఁడు. (చూ. ఎవ్వఁడు.)

**ఎస.** దే. వి. ఆధిక్యము. "చ. వనరుహపత్రనేత్రయిటువాగెవదల్చ నకోర్కు-లకామనో, జనకెనయిచ్చిడిల్లపడఁజూచినఁజూచినవారు సెస్తిరే." కవిక. ౩, ఆ.—క్రి. విశే. అత్యంతము. "మ. అస మానస్థిరదానవైభవకళాహంకార సింహాసనా, గ్రసమాసీనుఁడుశ్రీఁ డొకండుకలుగంగానర్థియాచ్ఞారస, వ్యసనాభావబహూభవత్ఫలభ రవ్యాజంబునకానమ్రమై, యెననంక్రందనశాఖిబెందమునయందె క్కించుమందాక్షముకా." నై. ౫, ఆ.

**ఎసఁగు.** దే. అ. క్రి. 1. తనరు, అతిశయించు; "మనసుక్రొవ్వఫం డింపఁగామోదమెసఁగు." భార. ఆర. ౭, ఆ. (చూ. ఎడలు.) 2. విజృంభించు. "క. అప్పలుకులకలుకలుమది, నుప్పరమెగ యఁగనెసఁగెనుల్లాసముమై, నాప్పాఁగబరిగోలల, నొప్పించిన భద్రగజమునూర్కా-న్నగతికా." ఉ, హరి. ౫, ఆ.

**ఎసకము.** దే. వి. 1. అతిశయము; "క. ఆపల్లెలోననెవ్వఁడు, గోపతరుణులెల్లఁదనదుకోర్కి-నలుపులీ, లాపాత్రములుగఁజేయుట, కేపారఁగనుత్సహించియెసకపువేడ్కా-కా." హరి. పూ. ౭, ఆ.— 2. విజృంభణము; "గీ. అంతఁదెలిసిరాముఁడతికుపితాత్ముఁడై, యే ఋపాఋతెంచునెసకమెసఁగ, నప్రమేయశరములడరింపనతిసత్వ, రమునసేనుబ్రతిహతములుచేసి." భార. ఉద్యో. ౪, ఆ.—3. విధ ము. "వెండికొండపైఁగంధరఖండమున్నయెసకంబున." కాశీ. ౬, ఆ.

**ఎసకొను.** దే. అ. క్రి. పురికొను. (ప్రే. ఎసకొలుపు. "తనవా రణేంద్రమక్కు-రుకులవీరుమీఁదనెసకొల్పిన." భార. ఆర. ౬, ఆ.) దీనికి ప్రేరణమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి.

**ఎసటిపోఁతలు.** దే. వి. బ. (ఎసరు+పోఁతలు.) ఎసటవేయఁద గినబియ్యము. "సీ. ఇనుమాఋదంచినయెసటిపోఁతలటంచునౌనట్ల యుడికెదుగానియంచు." కళా. ౬, ఆ.

**ఎసరు.** దే. అ. క్రి. మీఋ. "క. ఇనుమంతకానిలేఁడీ, పసిబాలుఁ డుకుడువఁగూటిప్రాయమువాఁడి, పైనెసరిబహుభక్ష్యరాసులు, మెసవెడునిసువఁడుప్రతుష్టిమేకొనఁడుగదే." పాండు. ౪, ఆ. (చూ. రూ. ఏసరు.)—వి. వంటకై కాఁగఁబెట్టిననీరు.

**ఎసరేఁగు.** దే. అ. క్రి. విజృంభించు. "గీ. ఎడపకెసరేఁగినుతి యించెదిచటనతని." హరిశ్చ. ౧, ఆ.

**ఎసలారు.** దే. అ. క్రి. (ఎసలు+ఆరు.) అతిశయించు. "సీ. అని క్రమంబునవారలందఱుబింపులుపెంపెసలారవేరేవ్వఁబొగడి." భార. విరా. ౧, ఆ.

**ఎసలిక.** దే. వి. తీఱిక, అవకాశము.

**ఎసలు.** దే. వి. దొమ్మియుద్ధము. (ఇట్లు ఒకఁడు వ్రాసియు న్నాఁడు.)

**ఎసవు.** దే. అ. క్రి. ఎసఁగుయొక్క-రూపాంతరము. "వ. అప్పుల నదల్పులఁబొగడుటలందెగడుటలనెసవును లిఘతూర్యరవంబులంగె లువ." భార. కర్ణ. ౩, ఆ. (కొన్ని యచ్చుపుస్తకములయందును, వ్రాఁతపుస్తకములయందును ఈ పాఠమున్నది.)

**ఎసవెట్టు.** దే. స. క్రి. (ఎస+పెట్టు.) పురికొలుపు, ప్రేరించు. "లయగ్రాహి. కయ్యాలకెసవెట్టుచునుహాళిఁజలపట్టుచు సుమ ములఁ గిట్టుచునుబాలికలువేడ్కా-కా." కళా. ౬, ఆ.

**ఎళనీరు.** దృ. వి. ఎడనీరుయొక్క-రూపాంతరము.

**ఎళ్లము.** మి. గ్రా. వి. (ఏడు+పలము.) ఏడుపలములు. "గీ. ఉల్లసిలుసప్తపలినామమెళ్లమనఁగ." ఆం, శా. ద్వి. వై.

**ఎళ్లు.** దే. వి. బ. ఎడ్లుయొక్క-మాఋరూపము. "సీ. బండ్లుపెట్టి పుప్పై బరువులెక్కి-ంపు మీఁదెళ్ళన బూనవ్వకావళ్ళనును పు." హరి. పూ. ౬, ఆ.

## ఏ.

**ఏ.** ఒక యక్షరము. యు. ఏ. స. 1. ప్రశ్నమును దెలిపెడి; "ఏ లఁపు."—2. ఉద్దేశ్యమునుదెలిపెడి; "ఏకథలయందు." (చూ ఆ.)—అవ్య. 1. ప్రశ్నమున దెలిపెడి; "మంగళమేమనమాటల నకు." భాగ. ౧, స్కం.—2. మెచ్చుకొనుటనుదెలిపెడి; "వ నాయాడినమాటలకునయ్యుధిష్ఠిరుండుపలికినవచనంబులింతయె ప్పునేయని యగ్గించిన." భార. ఉద్యో. ౩, ఆ.—3. వ్యతిరేకమ నుదెలిపెడి; "ఎ, గీ. శాశ్వతుఁడయ్యెనేనృపాలయమ్మహీశ్వరుఁ డు." భార. ద్రో. ౩, ఆ.—4. ఎక్కు-వను దెలుపుటకు; (చూ మదిమది.) 5. దుఃఖమునుదెలిపెడి; "ఎ, గీ. కందమూలంబులా హారములుగఁ, బొదలఁబుట్టలఁబడియుండి పులుఁగుమెకను, లఱవ మేల్కు-సుచుండిరేయక్కా-టకట." భార. ఉద్యో. 3, ఆ.—6. విచా రమునుదెలిపెడి; "ఈదుర్యోధనుఁడింత గర్వియగునే." భార. ఉద్యో. 3, ఆ.—7. ప్రార్థించుటనుదెలిపెడి; "క. ఉంగేయుంగే యటంచునొకనిమిషమునో, రంగాయవేయకేడ్చుచు." పర. ౧, ఆ.—8. ఆఁనుదగుటనుదెలిపెడి. (అవునే, ఏమే మొ.)—వై. 1. మఱియొకదానిలేమినిదెలిపెడి; "నిన్నేయేఁబొండితిఁదుదకా." కళా. ౪, ఆ.—2. చూపుటనుదెలిపెడి*; "ఈషితిపాలుఁడే దశ రథేంద్రకుమారుఁడు." రామా. ౪, ఆ.—3. తనంతట అనునర్థ మునుదెలిపెడి*. "మ. దానినినీవేనృజయించితోయదియలానీతోడఁ గ్రీడింపఁగాఁ, దనమేనొక్కటిచాలదంచుఁ గడఁకకా ద్వైరూప్య ముందాల్చెనో." కళా. 3, ఆ.

**ఏఁకట.** దే. వి. 1. మిక్కి-లియపేక్ష; 2. అపేక్ష. "ఏఁకటఁ దీర్చి." సావి. 3, ఆ. "క. ఏఁకటవాయంగభిక్షలిడియెదరండీ." భీ. ౩, ఆ.

**ఏఁకరి.** దే. వి. కిరాతభేదము. "ఎ, గీ. కోయచెంచు, పరికియేనాది యేఁకరిపట్రయెఋకు, వేఁకరియనంగఁజెల్లితద్భేదములుగఁ, బొల్చు ను." ఆం, భా. ద్వి. షూ.

**ఏఁకరు.** దే. అ. క్రి. వాఁచిపోవు. "క. ఆఁకటఁజిక్కి-జలంబుల, కేఁకరిపెనుదప్పిఁబెదవులెండఁగనేఁడి, ట్టీకలనుఋలోననూరక, యాఁక టితోనేలనవయననిమనమురియకా." రుక్మాం. ౪, ఆ.

**ఏఁకారు.** దే. అ. క్రి. ఏఁకరుయొక్క-రూపాంతరము. "సీ. పొలసు కేఁకారి ప్రేఁగులుమాఁడియున్న ప్రేతవ్రాతముల భీదఱసనువాసె." ఉ, రా. ౭, ఆ.

**ఏఁచు.** దే. స. క్రి. కాఱించు, బాధించు. "ఉ. ఈకంతకృపావి హీనమతి నాతఁడునేఁచునెయన్నదమ్ములకా." భార. ఉద్యో. 3, ఆ.

**ఏఁజెల్ల.** దే. అవ్య. (ఏను+చెల్లె.) సంతాపమునుదెలిపెడిని. "ద్వి. ఏఁజెల్లయోయమ్మయీచక్కా-నన్న, రాజతేజముగలరత్నాలపెట్టె." హరిశ్చ. ౩, భా.

**ఏఁడాది.** దే. వి. (ఏఁడు+ఆది.) ఏఁడు, సంవత్సరము. "ఏఁడాది పెటఁగానిలుప్రము." ఉ, గా. ౭, ఆ. (ఏఁడాది అనుచో ఆదిశబ్దము నిరర్థకము. ఇట్టిశబ్దములు మహాకవిప్రయోగములయందు ఇంకను కొన్నికలవు. పంచాది, పాఱాది మొ.)

**ఏఁడీ.** దే. వి. ఎక్కడనున్నాఁడు. (వాఁడేఁడీ.) (రూ. ఏఁడీ. "ఏఁడీనాబలుమానికంబులకొటారు." అచ్చ. అ, కాం. ౨. ఏరి, ఏరీ. (వారేరి.) "వారేరీసిరిమూటకట్టుకొనిపోవంజాలిరే." భాగ. ౮, స్కం.)

**ఏఁడికోల.** దే. వి. నాఁగటికొయ్య, ఈష.

**ఏఁడు.** దే. వి. సంవత్సరము. స. 1. ఏపురుషుఁడు; 2. ఎల్ల వాఁడు.

**ఏఁడుడి.** దే. వి. (ఏఁడు+ఉడి.) ఆబ్దికము.

**ఏఁదర.** దే. వి. కుటుంబముతోఁజేరనిస్వతంత్రపుభుక్తు. (వాఁడు కొంతయేఁదరకట్టుకొన్నాఁడు.)—విశ. కుటుంబముతోఁజేరక స్వతంత్రమైనది. (నాకాయూరిలో ఏఁదరికమతముకలదు.)

**ఏఁదుము.** దే. వి. (ఏను+తూము.) అయిదుతూములు.

**ఏఁపు.** దే. వి. కాఁచియ, బాధ. "కుసుమాయుధునేఁపులకంతయా ర్వఁగా లేక." మార్క. ౪, ఆ.

**ఏఁబండ్రు.** దవ్. స. ఏఁబదిమంది. (ఏఁబదికిమహన్నహత్యర్థక రూపము.)

**ఏఁబది.** దవ్. స. (ఏను+పది.) అయిదుపదులు.

**ఏఁబలము.** మి. వి. (ఏను+పలము.) అయిదుపలములు. "సీ. పంచపలీసంజ్ఞపరఁగునేఁబలమన." ఆం, భా. ద్వి. వై. (ఇప్పటి వాడుకలో పదిపలములు.)

**ఏకకుండలుఁడు.** సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. కుబేరుఁడు.

**ఏకకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) అసహాయుఁడు; ఎక్కటి.

**ఏకగురువు.** సం. వి. ఉ. పుం. సహపాఠి, సతీర్థ్యుఁడు.

**ఏకచరము.** సం. వి. అ. పుం. అడవిపంది, ఒంటిగాఁడు. విశ. ఏకాంతమైనది.

**ఏకతమాడు.** దవ్. అ. క్రి. ఆలోచించు. "కూరిమిమంత్రితోడనల కూబరుఁడేకతమాడి." సావ. ౫, ఆ.

**ఏకితము.** వై. వి. 1. ఆలోచనకుఁదగినచోటు; 2. ఆలోచన*.

**ఏకతానుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఒకటమనసు చెల్లినవాఁడు, ఏకాగ్రుఁడు.

**ఏకతాళము.** సం. వి. అ. పుం. 1. లయతోడికూడిక; 2. తాళభేదము. (నాలుగక్షరములకాలము.)

**ఏకదంతుఁడు.** సం. వి. అ. పుం. వినాయకుఁడు, ఒంటికొమ్ము వేలుపు.

**ఏకదృష్టి.** సం. వి. ఇ. పుం. కాకి. విశ. ఒకచూపుకలది.

**ఏకదేశము.** సం. వి. అ. పుం. అంశము, భాగము.

**ఏకధురము.** సం. వి. అ. పుం. నాఁగటినైనను, బండినైనను మఱి దేనినైనను ఒక్కటిని లాగెడియెద్దులోనగునది.

**ఏకధురావహము.** సం. వి. అ. పుం.——పై.——

**ఏకధురీణము.** సం. వి. అ. పుం.——పై.——

**ఏకన.** దే. వి. అంచు. (బద్దకంచము ఏకననుంచుము.)

**ఏకపత్ని.** సం. వి. ఈ. స్త్రీ. పతివ్రత, క్రొత్తడి.

**ఏకపది.** సం. వి. ఈ. స్త్రీ. మార్గము, త్రోవ.

**ఏకపింగళుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**ఏకము.** సం. స. (అ. ఆ. అ.) 1. అన్యము; 2. అసహాయము; 3. ముఖ్యము; 4 స. ఒక్కటి.

**ఏకలము.** సం. వి. అ. పుం. అడవిపంది. (ఇదిదేశ్యపదముగా వాడఁబడుచున్నదిగాని పూర్వకవిప్రయోగములందట్లుగానఁబడ లేదు.) "ఉ. చేకొనియాకుపెటివిభుశ్రీపెదవేంకటుఁడెందియాత్రలో, నేకలసఘనంబుమహయెన్నదనేకలసద్గుణాప్తిచేఁ, గైకొనిశేషభోగములకన్నెఁదలంపదశేషభోగలీ, లాకలనంబుచేతఁగరులఁ గిరులఁ మదిచెప్పనేటికిఁ." రాఘ. ౧, ఆ.—విశ. అసహాయము.

**ఏకలీఁడు.** వై. వి. అడవిపంది, వరాహము. "మ. అంచన్నత్తసారంగరాట్, సహకారంబులనేకలీలసమయించఁ సాగె." (నలకథయందు అనేకలీలఁ అని, హరిశ్చంద్రకథయందు ఏకలీలఁ అనియు భేదము.) హస. ౨, ఆ.

**ఏకసర్గుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఏకతానుఁడు.

**ఏకహాయని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకయేఁడు ఈడుగల ఆవు పెయ్య. (ఏకాబ్ద అనియు.)

**ఏకాంగి.** సం. వి. న్. పుం. విరక్తుఁడైనవిష్ణుభక్తుఁడు. "క్రేవలనకాంగులుగా." ఆము. ౨, ఆ.—విశ. ఒంటివాఁడు.

**ఏకాండము.** వై. విశ అఖండము. "గీ. మలిచియేకాండముగనొక్కమానికమున, వేడ్కనెద్దానినిర్మించెవిశ్వకర్మ, యట్టిదేవేంద్రదత్తమహాగ్రనాప్న, పీటికాపేటిమామభూవిభునకొసఁగె." వై. ౬, ఆ. "ఏకాండపుఁదెంచీరలు." కవిక. 3, ఆ.

**ఏకాంతము.** సం. క్రి. విశ. అ. న. అత్యంతము. విశ. 1. మిక్కిలి; 2. ఇద్దఱకంటె నెక్కువజనములేనిది. (చోటు.)

**ఏకాకి.** సం. విశ. (న్. ఈ. న్.) ఏకకుఁడు.

**ఏకాక్షము.** సం. వి. అ. పుం. కాకి. విశ. ఒకకన్నుగలది.

**ఏకాగ్రుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఒకటమనసుచెల్లినవాఁడు; 2. కలఁకఁబాఱనివాఁడు.

**ఏకాదశము.** సం. స. న్. పదునొకండు. విశ. (అ. ఈ. అ.) పదునొకండవది.

**ఏకాదశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పదునొకండవతిథి; 2. పదునొకండుతంత్రులుగలపరివాదిని యనువీణ.

**ఏకాయనగతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఏకతానుఁడు.

**ఏకాయనుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.)——పై.——

**ఏకావళి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకయర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. ఒంటిపేటహారము.

**ఏకాష్ఠీల.** సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది*. అ. పుం. [ము. బక పుష్పము*.

**ఏకాహము.** సం. వి. అ. పుం. 1. ఒకదినము; 2. మృతిఁబొందినవారికిపదునొకండవనాఁడుచేయుశ్రాద్ధము.

**ఏకీభవించు.** సం. అ. క్రి. ఒక్కటియగు.

**ఏకీభావము.** సం. వి. అ. పుం. ఒక్కటియగుట, ఐక్యము.

**ఏకు.** దే. స. క్రి. 1. దూదినిచక్కఁజేయు; 2. దూయు. (కానీ నిన్నుఏకికాకులకువేసెద.)—వి. ఏకినదూదిచుట్ట. "గీ. ఏకువాఁడై చేసియుపుడేలపల్కెదు." చంద్ర.

**ఏకుడు.** దే. వి. దూదియేకుట. "సీ. తూలమ్ముదూన్పతికోఁచునేకుడ సంగ." అం, భా. ద్వి. షూ.

**ఏకె.** ద్వ. స. ఏ. (ఏ + అక.) ఏమె. (చూ. అకె.)

**ఏకోద్దిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ఒకఁడు ఉద్దేశింపఁబడిన వాఁడుగాఁగలది. (శ్రాద్ధము.)

**ఏకోను.** దే. వి. సమష్టి. (ఏకోనుకుమొత్తమెంత? మొ.)

**ఏగాని.** దే. వి. దుగ్గాని.

**ఏగు.** దే. అ. క్రి. చను, పోవు, గమించు.

**ఏగుదెంచు.** దే. అ. క్రి. (ఏగు + తెంచు.) 1. వచ్చు; "పరాశర నందనుఁడేగుదెంచె." భార. ఆది. ౬, ఆ.—2. పోవు. "చ. ఈయుపోతులనెల్లడించిసవనాశ్వముతోఁబురికేగుదెంచియు, మ్మహీప తిఁగాంచి యాతనిక్రమంబవుడేమని విన్నవించెదర్." జై. ౨, ఆ. (చూ. అరుగుదెంచు.)

**ఏగుపెండ్లి.** దే. వి. పెండ్లికడపట వధూవరులను ఊరేఁగించునట్టి వేడుక. "చ. జలనిధిసార్వభౌమతనుజాదనుజారులయేగుపెండ్లి నాఁడు." వసు. 3, ఆ.

**ఏగురు.** దే. స. (ఏను + గురు.) ఐదుగురు. (ఏనుసకు మహన్మహ త్వర్థకరూపము.)

**ఏగుస.** ద్వ. వి. (ఏను + కుంచము.) అయిదుకుంచములు. "సీ. ప్రస్థపంచకసంజ్ఞపరఁగునేగుసయన." అం, భా. ద్వి. వై.

**ఏచ.** దే. విణ. 1. గ్రామ్యము; "గీ. ఏచమాటలు జడగొన్న పేచుఁ గుకులు." య. ౧, ఆ. "వ. నరకట్లకెన్నెరలమెఱయమొరయిం చునేచపాటలతానమానంబులును." కాళ. 3, ఆ.—2. వక్రము. (ఏచకంకటిచుక్క.)

**ఏచకంకటిచుక్క.** ద్వ. వి. ఉత్తరాషాఢానక్షత్రము.

**ఏచు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "క. అది, యేచినకృపనాకు నానతిమ్ముమహాత్మా." విక్ర. ౨, ఆ.—2. పెరుగు; ఏచితసర్పిత లిర్చినక్రొవ్వుల." భార. ఆది. 3, ఆ.—3. విజృంభించు. "మ హేంద్రుతోనేచిపోరుబలుండువోలె." భార. స్త్రీ. ౨, ఆ.

**ఏట.** దే. వి. పక్షము. (రూ. ఏటను. "క. మాటలునేరకపలికిన, నోటమిగాఁగొనకకార్యమున్న నిజముఁదాఁ, బాటించినృపతిధర్మం, బేటముగాఁబాడినిర్ణయింపఁగవలయున్." విజ్ఞా. వ్య, కాం.)

**ఏటవాలు.** దే. వి. 1. వంపు; "ఏటవాలైనయదియాయరఁటిబా తెంత." (ఏటవాలైనయది ఒఱగినదియనియర్థము.) సాన్వ. 3, ఆ.— 2. పక్షపాతము.

**ఏటికపాము.** దే. వి. (చూ.) ఎమిడిక.

**ఏటికోళ్లు.** దే. వి. బ. 1. ప్రవరచెప్పిచేయునమస్కారము; 2. నమ స్కారము. "వ. కైలాసనిలయామీకుఁగోపులు, పళ్ళ్లలాటా మీకునేటికోళ్లు, గౌరీమనోహరా మీకునమస్కారము." "గీ. నలువ సేవించియిందిరానాథుఁగాంచి, యితరపరివారదేవతావితతికెల్ల, నేటి కోళ్లిచ్చియిక్కరమ్మేటిమునులు, మృడునిహాటక శైలంబుమీఁదినిలు వు." భీ. 3, ఆ.

**ఏటిరింత.** దే. వి. ఏట్రింత.

**ఏటితేఁడు.** దే. వి. (ఏఱు + తేఁడు.) సముద్రుఁడు, సరిత్పతి. "ఉ. ఏటితేఁ, డమ్మెయిత్రోవయీమిమదినల్గుచుఁదావిలుకేలఁబూ నుఁడున్." య. 3, ఆ.

**ఏటుు.** దే. వి. 1. బాణప్రయోగము; 2. బాణహతి.

**ఏటులాడు.** దే. అ. క్రి. (ఏటులు + ఆడు.) ఆయుధపాణులై పోట్లాడు. "వ. అబ్బినసకైదువులచేనేటులాడిరి." శశాం. ౫, ఆ.

**ఏట్రింత.** దే. వి. భారద్వాజపక్షి. (ఏటిరింతయొక్కరూపాం తరము.)

**ఏడ.** దే. వి. ఏ. ఎక్కడయొక్కరూపాంతరము. "ఏనేడనింద్రాదు లేడ." భార. అర. ౨, ఆ.

**ఏడక.** సం. వి. ఆ. స్త్రీ. గొఱ్ఱె. అ. పుం. ము. పొట్టేలు.

**ఏడగజము.** సం. వి. అ. పుం. తగిరిసచెట్టు.

**ఏడమూకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెవిటిమూఁగ; 2. మోసకాఁడు.

**ఏడాకుపొన్న.** ద్వ. వి. (ఏడు + ఆకుపొన్న.) ఒకదినుసుపొన్న, సప్తచ్ఛదముచెట్టు.

**ఏడాకులరఁటి.** దే వి. (ఏడు + ఆకుల + అరఁటి.) ఒకదినుసు అరఁటి, సప్తపర్ణముచెట్టు.

**ఏడాగోడము.** దే. విణ. విరుద్ధము. (ఏడాగోడపుమాట మొ.)

**ఏడాటలాడించు.** దే. స. క్రి. (ఏడు + ఆటలు + ఆడించు.) మిక్కిలిశ్రమపఱచు. (వాఁడు నన్ను ఏడాటలాడించినాఁడు.) (ఏడాటలాడించుట=సప్తవ్యసనములను గలుగఁజేయుట. అనఁగా సప్తవ్యసనములు గలిగినప్పుడు ఎంత శ్రమము కలుగునో అంత శ్రమమును గలిగించుట అని యర్థము ఉండవచ్చును.)

**ఏడిక.** వై. వి. పొట్టేలు, ఏడకము.

**ఏడు.** దే. స. ఆఱునొకటి.

**ఏడుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) చెవిటివాఁడు.

**ఏడుగడ.** దే. విణ. (ఏడు + కడ.) (గురువు, తల్లి, తండ్రి, పురు షుఁడు, విద్య, దైవము, దాత అని సప్తప్రకారములుగల) రక్షకము. "క. గురుఁడును దల్లియుఁ దండ్రియుఁ, బురుషుఁడు విద్య యును దైవమును దాతయునాఁ, బొరినేడు గడయుఁదానై, హరి ననురక్షించుఁగాత ననవరతంబున్." వాసి. ౧, ఆ.

**ఏడుగురు.** దే. స. ఏడుమంది. (ఏడునకుమహన్మహత్వర్థకరూ పము.)

**ఏడుచు.** దే. అ. క్రి. రోదనముచేయు. (రూ. ఏడ్చు.)

**ఏడుపు.** దే. వి. రోదనము. (రూ. ఏడ్పు.)

**ఏడూకము.** సం. వి. అ. న. (చూ.) మెత్తినగోడ. (రూ. ఏడు కము.)

**ఏడ్గడ.** దే. విణ. ఏడుగడయొక్కరూపాంతరము.

**ఏడ్తెఱ.** దే. వి. 1. అతిశయము; "దీవియలయేడ్తెఱశోయగమందె." భార. విరా. ౨, ఆ.—2. పరాక్రమము; "ఏడ్తెఱఁదనపూన్కిమై." భార. ఉద్యో. ౨, ఆ. "క. అతఁడెక్కుడుమదమొలయఁజేతియే డ్తెఱసూపెన్." భార. ద్రో. 3, ఆ.—3. విజృంభణము. "చ. ఏడ్తెఱగలయప్పుళత్రునవధీరితుఁజేయుటయొప్పఁగాకయే, పటినఁబ రాభవించిన జనావళినవ్వదె." భార. శల్య. ౨, ఆ.

**ఏడ్దుము.** ద్వ. వి. (ఏడు + తూము.) ఏడుతూములు.

**ఏణము.** సం. వి. అ. పుం. పెద్దకన్నులుగల నల్లయిఱ్ఱి.

**ఏణి.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దకన్నులుగల నల్లలేడి.

**ఏతఁడు.** దే. స. ఏ. (ఏ + ఁడు.) ఎతఁడు. (చూ. అతఁడు.)

**ఏతము.** ఉభ. వై. వి. నీళ్లెత్తెడు యంత్రవిశేషము, ఆరఘట్టము*. —సం. వి. అ. పుం. చిత్ర వర్ణము. విణ. 1. చిత్రవర్ణముగలది; 2. వచ్చినది.

**ఏతరి.** దే. విణ. దుర్నయపరుఁడు. "క. మీతరమువారలేతటె, నేతరి తెనమునఁదపస్విగృహకన్యకలన్, నీతభయవృత్తినేఁడిరొ, కోపముఁ దర్కింపకొరక్రొవ్వులటంచున్." స్వా. ౬, ఆ.

**ఏతాము.** వై. వి. ఏతముయొక్క రూపాంతరము.

**ఏతు.** దే. వి. ఉద్ధతి. "గీ. తనకనిష్టంబులగుకలిద్వాపరముల, కేతు సూపియుఁబోలెధాత్రీశ్వరుండు, నిత్యసత్రేతబుత్విక్ప్రణీతమైన, త్రేతసేవించెవిజితమిత్రేతరుండు." నై. ౧, ఆ. (ఈయర్థమింకను విచారణీయము.)

**ఏతుల.** దే. వి. చాఁపలల్లెడుమనుష్యజాతివిశేషము. "ఏతులకొమ్ము." ఆము. ర, ఆ.

**ఏతెంచు.** దే. అ. క్రి. (ఏగుదెంచుయొక్క రూపాంతరము.) 1. వచ్చు; 2. పోవు. "మ. అరదంబెక్కి ప్రమోదమేర్పడఁగన య్యక్రూరుఁడేతెంచుచున్." (వెనుక మటియొకచో.) "అరిగియరిగి." ఐ, పు. ౭, ఆ.

**ఏద.** దే. వి. ఒకానొకచెట్టు.

**ఏదడి.** దే. వి. ఒకదినుసు ఎలుఁగుగొడ్డు. (అప్ర.)

**ఏది.** దే. స. ఎది. అవ్య. ఎట్లు. "ఏదియేదియిదిచాలఁగ్రొత్తబళీ." కళా. ౧, ఆ.

**ఏదీ.** దే. వి. ఎక్కడనున్నది. "నీకుఁబౌరుషమేదీ." భార. ఉద్యో. ర, ఆ.—అవ్య. ఎట్లు. (చూ. ఏది.)

**ఏదు.** యు. దే. అ. క్రి. నశించు. "పెంపేదంగ్రూరతకోర్వరాదు." భార. ఉద్యో. ౩, ఆ. "గీ. అజశివాదికమగు నీ సమస్తజగము, నెందుఁబ్రభవించువర్తించునేదు." ఆము. ౬, ఆ. ("పారంబేదని లజ్జదోఁప." "పారంబేదనివంతయుంగలిగెనే." ఇత్యాదిస్థలములయందు పారంబేదిన అనియుండుననితోఁచెడి.)—వి. ముండ్లపంది, శల్యము.—వై. స. క్రి. పెంచు*. "రఘుకుమారునేదిరిదాదుల్." రామా. 3, ఆ.

**ఏదుడు.** దే. వి. విడుపు. (ఇట్లు ఒకానొక నిఘంటుకారుఁడు వ్రాసియున్నాఁడు, అది విచారింపఁ దగినది.)

**ఏదువేఁట.** దే. వి. వేఁటలోభేదము. "గీ. హెచ్చరికమించి తెరవేఁటయేదువేఁట, గంటవేఁటయుమొదలుగాఁగలుగువేఁట, లెన్నిగలవన్నియుఘటించి యన్నరేంద్రుఁ, డుగ్రమృగ భంజనక్రియోద్యుక్తుఁడయ్యె." రామా. ౨, ఆ.

**ఏధ.** సం. వి. ఆ. స్త్రీ. ధనాదిసమృద్ధి, నింపు. అ. పుం. ము. 1. చిదుగు; 2. వంటచెఱకు. (ఇదివెనుకటి రెండర్థములయందు సకారాంతక్లీబంబునగు.)

**ఏధితము.** సం. విణ. (అ. ఆ. అ.) వృద్ధిపొందినది.

**ఏనస్సు.** సం. వి. స్. న. 1. అపరాధము; 2. పాపము.

**ఏనాదము.** దే. వి. సముద్రతీరము.

**ఏనాది.** దే. వి. అడవియందు వాసముచేసెడి యొక హీనజాతివాఁడు.

**ఏనాళ్లు.** దే. వి. బ. (ఏను+నాళ్లు.) 1. అయిదుదినములు; 2. వివాహానంతరము వియ్యంకులొకరికొకరు పంపెడు సారె.

**ఏని.** దే. అవ్య. 1. పక్షాంతరమునుదెలిపెడిని; "అట్లయేని." (ఆపక్షమునననియర్థము.) "ఇట్లయేని" (ఈపక్షముననియర్థము.) "వినఁ జాలతే వినుము." (వినఁజాలతేఁజవినవలచుపక్షముననియర్థము.)—2. వికల్పమునుదెలిపెడిని; "హరినేనైనజానేని."—3. బొత్తిగా అనునర్థమునుదెలిపెడిని. "ఓటయొకింతయేనియు సుయోధనుచిత్తము నందులేదు." "ఏనునిక్క మక్షినసనటంగలంబెరిణికేశికమార్గము నొక్కఁడేనియున్." భార. ఉద్యో. 3, ఆ. (ఏనియునని ప్రయోగింపఁబడుటచే దీనిని ద్రుతప్రకృతికముగా గ్రహింపఁగూడదు. ఏనిన్ ఏన్ అనురూపములు యుష్మత్తను నిష్కమునలోపింపఁగానైనవనియెఱుంగునది. ఎందేని, ఎన్నఁడేని ఇత్యాదులయందలి యేని శబ్దము వాక్యాలంకారనిబద్ధమని యెఱుంగునది.)

**ఏనిక.** వై. వి. ఏనుఁగు. "చ. ఏనికగములతోయసంగఁదరుణీమణులుల్లములుల్లసిల్లఁగన్." రుక్మి. 3, ఆ.

**ఏనికతిండి.** ద్వ. వి. సింహము. "ఎ, గీ. వఱలునేనికతిండివారవ్ముసుదోలుత, గాఁగఁదానెక్కి." కళా. 3, ఆ.

**ఏనికదోమ.** ద్వ. వి. లొండపుదోమ, ఘూ.ని.క.

**ఏను.** దే. స. 1. అయిదు; (ఇందలి ఉకారము వికల్పముగ లోపించును. ఉదా. ఏన్పర్వంబులు.)—2. నేనుయొక్క రూపాంతరము.

**ఏనుఁగు.** వై. వి. ఏనిక. విణ. పెద్దది*. (ఏనుఁగుకలబంద, ఏనుఁగుకాలు, ఏనుఁగుతుమ్మి, ఏనుఁగుపల్లేరు, ఏనుఁగుజలగ, ఏనుఁగుబీఱము.)

**ఏనుఁగుకలబంద.** ద్వ. వి. నారకుపయోగించెడి పెద్ద కలబంద*.

**ఏనుఁగుకొమ్ములు.** ద్వ. వి. బ. శాలిధాన్యవిశేషము. "సీ. ఇప్పపూరాజనాలేనుఁగుకొమ్ములుమల్లెశ్రీగంధులుమదనగంధులు." హంస. ర, ఆ.

**ఏనుఁగడుగులు.** దే. వి. బ. (ఏనుఁగు+అడుగులు.) చిత్రవర్ణవస్త్రవిశేషము.

**ఏనుఁగుగొంగ.** ద్వ. వి. ఏనికతిండి, సింహము. (ఏనుఁగుఁబగఱ అనియు.)

**ఏనుఁగుఁబల్లేరు.** ద్వ. వి. పెద్దపల్లేరు*.

**ఏనుఁగుమోముసామి.** వై. వి. విఘ్నేశ్వరుఁడు, గజాననుఁడు.

**ఏనుఁగురాకాసిగొంగ.** ద్వ. వి. శివుఁడు, గజాసురవైరి.

**ఏనుఁగుసారము.** వై. వి. సప్తస్వరములలోనొకటి, నిషాదము.

**ఏనూఱు.** దే. స. (ఏను+నూఱు.) అయిదునూఱులు.

**ఏపరించు.** దే. స. క్రి. దుఃఖపఱచు. "ద్వి. ఏపరింపుదురె నన్నిట్లుమాయయ్య." హరిశ్చ. ౨, భా.

**ఏపారు.** దే. అ. క్రి. (ఏపు+ఆరు.) 1. అతిశయించు; 2. విజృంభించు. "క. తలవ్రయ్యలైననిష్ఠుర, కులిశగతింబగిలి కూలుకులపర్వతముం, దలపించుచుఁగురువృద్ధుం, డిలఁగూలెం బ్రతిబలంబులేపారంగాన్." భార. ద్రో. ౪, ఆ.

**ఏపు.** దే. వి. 1. ఆధిక్యము; "ఉ. ఉమావల్లభుఁడాదినాయకుఁడు వాసవవంద్యుఁడు వెండికొండపై, నెల్లగణంబులుంగొలువనేపునఁ బర్వతరాజపుత్రితో, నల్లలితాత్ముఁడైనకలసంపదలంగొలువుండె." భీర. ౧, ఆ.—2. విజృంభణము. (చూ. ఏపారు.) (ఈపదమును ఆధునికులు కొందఱు ప్రకారార్థమందుప్రయోగించియున్నారు.)

**ఏపె.** దే. వి. సాలము*. ద్వ. స. ఏ. (ఏ+అప.) ఏమె. (చూ. అకె.)

**ఏబిడ.** దే. స. ఏ. (ఏ+బిడ్డ.) ఏపె.

**ఏమఱిల్లు.** దే. అ. క్రి. ఏమఱు, ప్రమాదపడు. "సీ. పదబంధశిథిలతపాటిల్లఁగానీక యేచందములయందునేమఱిలక." కళా.

౧, ఆ. (ప్ర. ఏమఱచు. "వ. లవణాసురుమాయలుఁడేమఱం చితి, త్రలఁగొనిపోయినాలవకరస్థకరాసణమ్ప్ర సిద్ధికా." జై. ౬, ఆ.)

**ఏమఱు.** దే. అ. క్రి. ఏమఱల్లు. స. క్రి. "మంత్రగోపనము నేమఱుటయు." కళా. ౭, ఆ.

**ఏమఱుచు.** దే. ప్రే. ఏమఱఁజేయు.

**ఏమఱుపాటు.** దర్వ. వి. 1. అకస్మాత్తుగా. "గీ. అంతనొకనాఁడు పూఁదోఁటకాత్తగురుని, వెంటఁజనియందునల్లకావించినూతి, నీటిలో నిడఁజూడంగనెలఁతఁజూచె, విష్ణుచిత్తుఁడేమఱిపాటువెనుకఁగదిసి." పర. ౪, ఆ.—2. వంచనగా. "ఇట్లిగురుఁబోఁడులనేమఱిపాటు చంపినం, బేరును దెంపునుంగలదె." భో. ౫, ఆ.

**ఏమి.** దే. స. ప. ఏది. "ఏమికులంబునవాఁడొకో." విరా. ౧, ఆ. —అవ్య. ప్రశ్నమునుదెలిపెడిని. (వాల్లుపరమగునపుడును కడపట నుమివర్ణకమునకు వికల్పముగాలోపము. "శా. ఏలాయిందును సందుఁజాలెదవునీకే ల్పాఁతియేవెన్న లుకా, బాలుకా బాలక." హరి. పూ, భా. ౫, ఆ. "క. శివము క్రియనుండెదిదే." భాగ. ౯, స్క—౦.) (రూ. ఏమీ.)

**ఏమె.** దర్వ. స. ప. (ఏ+అమ.) ఏపూజ్యురాలు. (చూ. అక.)

**ఏయది.** దే. స. (ఏ+అది.) ఏది.

**ఏయు.** దే. స. క్రి. (బాణము) ప్రయోగించు. "గీ. వలుదనార సంబువత్సంబుదూఱఁగ, నేయుటయును." భార. కర్ణ. ౨, ఆ.

**ఏరండము.** సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

**ఏరనకడ.** దే. వి. డావరడంగి, దేవతాళముక.

**ఏరాది.** దే. వి. (ఎరవు+అది.) ఒకదానిసంతతియైన గుఱ్ఱము. "ఎ, గీ. అచటనున్నయుత్తమాశ్వములకు నేరాదిలేఖర్వభునితురం గము." చంద్రా. ౧, ఆ.

**ఏరాలు.** దే. వి. (ఎరవు+ఆలు.) తోడికోడలు. "సీ. ఏరాలిపట్టి బిట్టెత్తిచెక్కిలినొవ్వఁగఱచివాఁడేడ్చినఁ గౌఁగిలించు." పాండు. ౩, ఆ.

**ఏరాళము.** వై. వి. 1. అధికము; 2. అసంఖ్యము*. "క. ఓరాజవదనయచటన, నీరాజనమబ్బనాభునికినీనున్నా, రేరాళముహరి వల్లభలు." (ఏరాళము = ఏరాళముగాననియర్థము.) పాండు. ౨, ఆ. (చూ. హేరాళము.)

**ఏరు.** దే. వి. 1. ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి; "నేఁడేరుమోపిననీకుఁజూళ్ళనరేండ్రుదున్నానసుమీ." పర. ౫, ఆ.— 2. తలనొప్పి. "హెూరనరొదఁదలయేరువాడమ." చంద్ర.

**ఏరుగు.** దే. అ. క్రి. విష్ఠించు. వి. విష్ఠ.

**ఏరునేల.** దే. వి. భూపరిమాణవిశేషము. "గీ. ఏరునేలకొలఁదినెడ నెడవిడియుచు." భార. అశ్వ. ౩, ఆ.

**ఏరుపడు.** దర్వ. అ. క్రి. 1. తేటపడు; 2. నిర్ణయింపఁబడు; 3. బయలుపడు; 4. రూపువడు; 5. వేఱుపడు; "ఎ, గీ. ఏరుపడినాల్గుపాఁజాలైయెవ్వడెప్పు, డురుదురంబనుచున్న వానరు లఁజూచి." రామా. ౫, ఆ.—6. సిద్ధపడు. (చూ. ఏర్పడు.)

**ఏరుపాటు.** దర్వ. వి. ఏర్పాటునకు మొదటిరూపము.

**ఏరువాక.** దే. వి. దుక్కియొక్క ప్రారంభము.

**ఏర్చు.** దే. అ. క్రి. తలనొచ్చు. "గీ. తపముగావించువారిఁ, గని నదలయేర్చుఁగాదెయాఖండలునకు." పాండు. ౫, ఆ.—స. క్రి. 1. ఏర్పఱచు; "సీ. ఆఁకలిగొనుసప్పుడబ్బశాళ్ళములతో నూటికొక్కటియేర్చినోటికొసఁగి." శుక. ౧, ఆ.—2. చక్కఁ జఱచు; "క. కయ్యమునకాయత్తై, మునలేర్చివేగనిచటికిఁ, జను దెమ్ము." భార. ఉద్యో. ౪, ఆ.—3. దహించు. "గీ. ౨౦౦ యుండితివేనిఁదానేర్చునగ్ని." హ. ఆది. ౫, ఆ.

**ఏర్పడు.** దర్వ. అ. క్రి. 1. తేటపడు; "అతనినేర్పడనాకుఁజెప్పు వలయు." భార. ద్రో. ౫, ఆ.—2. బయలుపడు; "వ. తన వంచనంబేర్పడకుండఁగృతప్రణామంఁడై దాఁగిమిసప్రయోజనంబడి గిన." భార. ఆది. ౨, ఆ.—3. రూపగు; (దానికి అంగములేర్ప డెవి.)—4. నిర్ణయింపఁబడు. (క్షత్రియుఁడు గాఁడగు నేర్పడును.) 5. వేఱుపడు. "ఎ, గీ. ఇన్నిటను నొకచోట మేళవించి, యుం డునొకొక యేర్పడి యుండునొక్కొ." పాండు. ౧, ఆ. (ఏరుపడుయొక్క రూపాంతరము.) (ప్ర. ఏర్పరించు, ఏర్పఱచు. "మత్త. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును, నేర్పరించి యథావిధిక్, దేవమంత్రియుఁబోలెధర్మువుఁదెల్పె." భార. సభా. ౨, ఆ.)

**ఏర్పాటు.** దర్వ. వి. 1. నిర్ణయము. ("వందిబృందముల కేర్పా టొప్పఁగ." పాంచా. ౧, ఆ. 2. నియమము; 3. వివరణము. "శా. ఎక్కెట్టూ వినమైతి మిఁకనొకమాటేర్పాటుగాఁజెప్పవా." కళా. ౭, ఆ.) (ఏరుపాటుయొక్క రూపాంతరము.)

**ఏర్వు.** దే. వి. మంట

**ఏలు.** దే. స. క్రి. క్రిందనున్నవస్తువులనొకటొకటిగా ఎత్తు. "ఎ, గీ. తృణధాన్యమల్ప, మేపికొనివస్తుగాఁకలితిఅకుండు." భార. అశ్వ. ౪, ఆ.—వి. నది.

**ఏలుజోజి.** దర్వ. వి. ధాతకి.

**ఏలుపిడక.** దే. వి. నేలఁబడి యుండి యెండిపోయిన పేడకడి, కరీషము. (దీనిని ఏలునుగులనియుఁ జెప్పుదురు.)

**ఏలుపుచ్చ.** దే. వి. కలింగపత్రము.

**ఏలుమద్ది.** దే. వి. సదినర్షముక.

**ఏలుమల్లియ.** దర్వ. వి. వాసంతిక. (రూ. ఏలుమల్లె.)

**ఏలువ.** దే. వి. విలాతి, దేశము.

**ఏలువంగ.** దర్వ. వి. గండీరముక.

**ఏలువావిలి.** దే. వి. సప్తల.

**ఏల.** ఉభ. దే. అవ్య. ఎందుకు. (రూ.) ఏలా. వై. వి. 1. ఒక యేఱు; (దీనినే ఏలేఱందురు. ఇది పిఠాపురముసమీపమునఁ బాఱు చట్టిది.) 2. బ. శృంగారపుఁబాట*. "ఏలలుపాడుమ." అచ్చ. యు, కాం.—సం. ఆ. స్త్రీ. పేరేలక.

**ఏలకి.** వై. వి. ఏల. (దీనిభేదము చిట్టేలక.)

**ఏలకికాయ.** దర్వ. వి. 1. భక్ష్యవిశేషము; "వ. ఇడ్డెనలుతేనె తొలలుబుడుకులు నేలకికాయలు." హంస. ౧, ఆ.—2. ఏలా ఫలము.

**ఏలపాటలు.** దర్వ. వి. బ. బాలక్రీడావిశేషము. "ఎ, గీ. ఏల పాటలునరిబేసిలీలకూఁతలు." వి, పు. ౭, ఆ.

**ఏలము, వేలము.** హిం. వి. అమ్ముటలో నొకవిధము.

**ఏలము.** వై. వి. కల్లుగీచువాఁడు ఆతోఁపునందు పేసికొనెడు గుడిసె.

**ఏలముపట్టు.** దర్వ. వి. ఆలంబలనము. (చూ. నానగండ.)

**ఏలాపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కారేలకి.

**ఏలాము.** వై. వి. ఏలముయొక్క రూపాంతరము.

**ఏలావాలుకము.** సం. వి. అ. న. నూఁగుదోసకాయ. (రూ.) ఏలవాలుకము.

**ఏలి.** దే. విశే. కృత్రిమము. "ఏలిమాట." భార. ఉద్యో. 3, ఆ. "ఏలిసింగము." చంద్రా. ౨, ఆ.

**ఏలిక.** దే. వి. 1. రాజు; 2. ఒడయఁడు.

**ఏలికసాని.** దన్య. వి. దొరసాని, రాజ్ఞి.

**ఏలిదము.** దే. వి. చులుకఁదనము. "క. బాలుఁడనితలఁచిరిపుతో, నేలిదమునఁగలసియునికియిడికార్యమె." భార. ఆది. ౬, ఆ.—విశే. చులుకనిది. (చూ. ఎల్లిదము.)

**ఏలినవాఁడు.** దే. వి. ఏలిక, రాజు.

**ఏలు.** దే. స. క్రి. 1. పరిగ్రహించు; "క. అని హార్లోకృష్ణంబున, మనమలరఁగబలికిమత్స్యమనుజాధీశుం, డనిలసుతునేలెనాతఁడు, తనమనముననూఅడిల్లెదదవనరమునక." భార. విరా. ౧, ఆ. "చ. ఇరెనికులంబుఁజేరువినియేలఁదలంచినసేలుమేలునీ, కతిబలుఁడైనబంటుహృదయంబునరోషమువట్టితేనివ, ధ్యతకునిధింపనేలయి వండాతకుఁబొ త్రము." ఉ, హరి. ౫, ఆ.—2. పాలించు.

**ఏలుకొను.** దే. స. క్రి. ఏలు, పరిగ్రహించు.

**ఏలుఁకోటి.** మి. వి. ఏలుబడికిలోఁబడినజనము, ప్రకృతిజనము.

**ఏలుబడి.** దే. వి. ఏలుట, పాలనము.

**ఏవ.** దే. వి. రోఁత. "మున్నుగొంటినేవన్ననదండయొక్కమగవాఁడిడ." ఆము. ౧, ఆ.—విశే. రోఁతయైనది. (రూ. ఏవము. "సిగ్గేవంబేమియులేక." ఉ, హరి. 3, ఆ. "ఏవంబిచ్చరిత్రంబు." నిర్వ. ౬, ఆ.)

**ఏవకాఁడు.** దే. విశే. 1. రోఁతగలవాఁడు; 2. ఓర్వలేనితనము కలవాఁడు. "గీ. ఎడరుగాచిచెఱచునేవకాఁడగువాని, కంటెమేలు చూవెకాలయముఁడు." రా. యు, కాం.

**ఏవగించు.** దే. అ. క్రి. రోఁతపడు. "గీ. అన్యవర్ణుఁడుచీనుఁడీయ నకుఁగూఁతు, నెట్టులీవచ్చుననిమదినేవగించి, యాఁడ." భార. అను. ౧, ఆ.—స. క్రి. 1. నిందించు; "గీ. పౌరమెచ్చితినో బాఁపనయ్యనిన్నుఁ, దిరుగకీమాటనీమదిదిరమునేయు, హీనకులుఁడనియితఁడునన్నేవగించి, పలికెనాయాత్మకదియంపములికియయ్యె." హరిశ్చ. ౪, ఆ. 2. విడుచు. "అరిగాఁబంచమమేవగించినవలాల వేళ్వహింపదోళవై, ఖరిసూపక." వసు. ౧, ఆ.

**ఏవపడు.** దన్య. అ. క్రి. రోఁతపడు. "గీ. కిల్బిషంబుగోళకృష్ణూ త్రములకేవపడుట." భార. అను. 3, ఆ.

**ఏవల.** దే. వి. (ఏ+వలను.) ఏప్రక్క. (చూ. ఎవ్వల.)

**ఏవాఁడు.** దే. స. 1. ఏపురుషుఁడు; 2. ఎల్లవాఁడు. (చూ. ఎవ్వఁడు.)

**ఏవురు.** దే. స. ఏగురుయొక్కరూపాంతరము.

**ఏషణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నారాచాకృతియైనయగసాలెవాని త్రాసు; 2. పుంటికంటఁజొప్పించెడుశలాక.

**ఏష్యము.** సం. విశే. (అ. ఆ. అ.) కాఁగలది.

**ఏస.** దే. వి. విజృంభణము. (చూ. ఏసరేఁగు.) విశే. 1. గ్రామ్యము; "ఏసమాట."—2. వంకర. "వ. జేని యేసగాఁదీసి తడవిండ్ల నేసి క్రొవ్వనంగూసి డాసి." వసు. ౨, ఆ.

**ఏసరు.** దే. అ. క్రి. మీఱు. "అలపోతేసరరేఁగె." రుక్మాం. ౪, ఆ.

**ఏసరేఁగు.** దే. అ. క్రి. విజృంభించు. "గీ. ఇప్పుడనితాగ్రహంబు నసేసరేఁగి, యిప్పుడనిచేల్పుఁగొలనుబావిఁదిరిరేఁగి, వెలియఁగిసియుం చునున్నారు." ఉ. ౨, ఆ.

**ఏసి.** దే. అవ్య. 1. వంతును; (రెండేసి. మూఁడేసి మొ.) 2. కొలఁదినిదెలుపును. "ఇంతలేసిదొరలు."

## ఐ.

**ఐ.** ఒక యక్షరము.

**ఐంగుదము.** సం. వి. అ. న. గారపండు.

**ఐందవము.** సం. విశే. (అ. ఈ. అ.) ఇందుసంబంధమైనది. (ఇందుఁడు=చంద్రుఁడు.)

**ఐంద్రజాలికుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రజాలవిద్యనేర్చిన వాఁడు.

**ఐంద్రము.** సం. వి. అ. పుం. 1. ఒక గ్రహయోగము; 2. మాలకాకి.

**ఐంద్రియకము.** సం. విశే. (అ. ఆ. అ.) చక్షురాదీంద్రియ గోచరమైనది, ప్రత్యక్షము.

**ఐకకంఠ్యము.** సం. వి. అ. న. ఏకకంఠత్వము, ఒద్దిక.

**ఐకమత్యము.** సం. వి. అ. న. ఏకమతిత్వము, ఒద్దిక.

**ఐకాగారికుఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**ఐకాగ్ర్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఏకతానుఁడు.

**ఐక్యము.** సం. వి. అ. న. ఏకీభావము, ఒరిమ.

**ఐణము.** సం. విశే. (అ. ఆ. అ.) ఏణముయొక్క చర్మముమొదలైనది. (ఏణము=ఇఱ్ఱి.)

**ఐణేయము.** సం. విశే. (అ. ఆ. అ.) ఏణియొక్క చర్మముమొదలైనది. (ఏణి=లేడి.)

**ఐతి.** దే. విశే. వల్ల, శక్యము. (అయితియొక్కరూపాంతరము.)

**ఐతిహాసికుఁడు.** సం. వి. అ. పుం. ఇతిహాసములుతెలిసినవాఁడు. విశే. ఇతిహాసనంబంధముగలవాఁడు.

**ఐతిహ్యము.** సం. అవ్య. పారంపర్యముచేనగు ఉపదేశము. (ఇది అకారాంతనపుంసకమనికొందఱు.)

**ఐదు.** దే. స. నాలుగునొకటి. (అయిదుయొక్కరూపాంతరము.)

**ఐదుగురు.** దే. స. (ఐదునకు మహత్పహత్వర్థకరూపము.) ఐదుమంది. (అయిదుగురుయొక్కరూపాంతరము.)

**ఐదుపదిచేయు.** దే. అ. క్రి. 1. నమస్కరించు; 2. ఓడిపోవు. "సుస్థిరభుజశక్తినైదుపదిచేయరుదత్తినెతక్క." (ఓడిపోవువారును చేతులుకూర్చిమ్రొక్కుదురు కనుక దీనికి ఓడిపోవుట యనునర్థముకలిగెను.) ఆము. ౨, ఆ. (అయిదుపదిచేయుయొక్కరూపాంతరము.)

**ఐదుమోములవేల్పు.** దన్య. వి. శివుఁడు, పంచముఖుఁడు.

**ఐదువ.** దన్య. వి. (ఐదు+వన్నెలుగలది.) మాంగల్యముగలస్త్రీ. (వన్నెయనఁగా ఇక్కడ సుమంగలియొక్క అలంకారము. ఐదేవనఁగా.—మంగళసూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవాక్కు.) (అయిదువయొక్కరూపాంతరము.)

**ఐదువరాలు.** దృ. వి. (ఐదువ+అలు.) ఐదువ. (ఇక్కడ ఐదువశబ్దము విశేషణము. చూ. అలు.) (అయిదువరాలుయొక్క-రూపాంతరము.)

**ఐద్దాయిలు.** దే. వి. బ. (ఐదు+దాయులు.) వడ్లవాఁడు, కమ్మరవాఁడు, కంచరవాఁడు, అగసాలెవాఁడు, కాసెవాఁడు వీరి పనులు.

**ఐన.** దే. ద్వ. ముందుచెప్పఁబడినదానికి విరుద్ధమయినయర్థమును దెలుపును. "గీ. సివ్వతురమతిపసీకునిక్కన్నియు, నప్పగింపనేల యైననాదు, హృదయమలరుదీనియెడఁగడునార్ద్రమై, యుండుఁగానఁ జెప్పకుండరాదు." భాగ. విరా. ౧, ఆ. (ఇది ప్రత్యేకముగా వచ్చినప్పుడీయర్థము. మఱియొకపదముతోఁ జేరివచ్చినపుడు అనే కార్థములనిచ్చుచున్నది. "అలుకనైనఁ జెలిమినైన." ఇత్యాదిస్థలములయందు వికల్పమును దెలుపుచున్నది. "అక్కటయిట్లు వేఁడి కొననైనను బోయెదవో." ఇత్యాదిస్థలములయందు మిక్కిలితక్కువను దెలుపుచున్నది. "ఇంకనైననన్ను నేలయాలింపవు." ఇత్యాది స్థలములయందు సమయమగుటను దెలుపుచున్నది. ఇట్లు ఇంకను ఊహ్యంబులు.) (అయినయొక్క-రూపాంతరము.)

**ఐనిల్లు.** దే. వి. నట్టిల్లు, అంతర్గృహము. (అయినిల్లుయొక్క-రూపాంతరము.)

**ఐపు.** దే. వి. తప్పు, దోషము. (అయిపుయొక్క-రూపాంతరము.)

**ఐపోవు.** దే. అ. క్రి. 1. వెచ్చమైతీఱు; (సంబారములన్ని అయిపోయినవి.)–2. ముగియు. (వాఁడు ఉద్యోగముచేసి అయిపోయినది.) (అయిపోవుయొక్క-రూపాంతరము.)

**ఐమూల.** దే. విణ. మూలవాటు. (ఆయిల్లు ఐమూలగానున్నది.) (అయిమూలయొక్క-రూపాంతరము.)

**ఐర.** దే. వి. నేత్రరోగవిశేషము. "అక్షిరోగవిశేషమైరయనఁగ." ఆం, భా. ద్వి. మ. (అయిరయొక్క-రూపాంతరము.)

**ఐరకొను.** దే. అ. క్రి. చక్కఁబడు. "క. భీషణవనమునవాయు, శ్లేషవిశేషమునఁగ్రుళ్లిచిపుకకయచ్చో, నీషద్ద్రుజలేకమహా, ఘోషవృషంబునకునైరకొనికాల్వచ్చెన్." పంచ. వేం. ౧, ఆ. (అయిరకొనుయొక్క-రూపాంతరము.)

**ఐరావణము.** సం. వి. అ. పుం. ఇంద్రునియేనుఁగు, ఐరావతము.

**ఐరావతము.** సం. వి. అ. న. వంపులేనినిడుపాటియింద్రధనుస్సు. పుం. 1. ఇంద్రునియేనుఁగు; 2. ఒకానొకపాము; 3. మబ్బుమీఁదవచ్చెడిమబ్బు; (దీనిని రాజమేఘమందురు.) 4. నారదబ్బుడి; 5. నిమ్మడి.

**ఐరావతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మెఱపు; 2. కోలమెఱపు.

**ఐరేని.** దే. వి. ప. బచ్చెనపనిచేసిన పెండ్లికుండలు. "సీ. ఐరేని గొనివచ్చిరైదువల్ పాటలుపాడుచు శుభవేళ వేడుకలర." విజ. 3, ఆ. (అయిరేనియొక్క-రూపాంతరము.)

**ఐలబిలుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు, పైఁడిఱేఁడు.

**ఐలారము.** దే. వి. మూలికావిశేషము. (అయిలారముయొక్క-రూపాంతరము.)

**ఐలేయము.** సం. వి. అ. న. నూఁగుదోసడి.

**ఐవచ్చు.** దే. అ. క్రి. అచ్చివచ్చు. (అయివచ్చుయొక్క-రూపాంతరము.)

**ఐశ్వర్యము.** సం. వి. అ న. 1. అణిమాది; (అవి. ౮, అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.) 2. సంపద.

**ఐహికము.** సం. విణ. (అ. ఈ. అ.) ఇహలోకసంబంధమయినది.

## ఒ.

**ఒ.** ఒక యక్షరము. —అవ్య. సందేహమును దెలుపును. "పద్మ ... మకరందంబొ ... స్వరాసుధయొ." భాగ. విరా. ౧, ఆ.

**ఒంకియ.** వై. వి. ఒంకె.

**ఒంకె.** వై. వి. పాగమొదలైనవి తగిలించెడు చిలుకకొయ్య. (ఒంకియయొక్క-రూపాంతరము.)

**ఒంజిలి.** దే. వి. దుఃఖము. విణ. దుఃఖముకలవాఁడు (లేక) దుఃఖముకలది. (చూ. ఒందిలి.)

**ఒంటరము.** దే. వి. విరోధము. "క. ఒంటమిలేనివియొంటర, మింటరములుపలుకుటుచితమే." భార. ఉద్యో. ౪, ఆ.

**ఒంటరి.** దృ. వి. (ఒంటి+అరి.) అసహాయుఁడైనబంటు. "మ. పూర్వుఁడీఁ, గెగుడెందావలరాచయొంటరికముం గేరించుచుంజిన్నినన్." య. ౫, ఆ.—విణ. ఏకాకి.

**ఒంటరికాఁడు.** దృ. వి. 1. పంది, ఏకచరము; "సీ. క్రమ్మియొంటరికానిదొమ్మినొంచుయశంబుబయటిపల్లెలుగూల్చుబల్మికల్మి." చంద్రా. ౧, ఆ.—2. అసహాయుఁడయినబంటు. "ఒంటరికాండ్రనేకసూ, కరములగుప్పదెప్పమనఁగాఁబడఁగ్రుమ్మిరి." ఉ, రా. ౭, ఆ.—విణ. ఏకాకి. (స్వార్థమున కాఁడు.)

**ఒంటరిపాటు.** దృ. వి. ఒంటి, ఏకాకిత్వము.

**ఒంటరీఁడు.** దృ. వి. (ఒంటరి+ఈఁడు.) అసహాయుఁడైనబంటు. "సీ. ఒంటరియెక్కటీఁడొంటరీఁడొంట్రింపునానేకభటునికినామములగు." ఆం, భా. ద్వి. ష. (స్వార్థమున ఈఁడు.)

**ఒంటి.** వై. వి. ఏకాకిత్వము. "క. ఒంటిమెయినుండఁగాము, క్కంటికినాకచ్ఛపంబుగొరుంబట్టం, గంటయరిది." భార. అను. ౧, ఆ.

**ఒంటింపు.** దే. వి. 1. ఆనుకూల్యము; 2. వీఁడు పిఁడీయాపనిని జేయవలయునని యేర్పఱచునేర్పాటు. (చూ. అరగింపు.)

**ఒంటికంటిగాము.** దృ. వి. చుక్క, శుక్రుఁడు.

**ఒంటికాఁడు.** దృ. వి. పంది, ఏకచరము. విణ. 1. ప్రియురాలినెడఁబాసినవాఁడు, వియోగి; "సీ. అనురక్తిరేఁచు నూతనసారసాటోపమొంటికాండ్రకుఁదెంపులొసఁగునెచట." (హరిశ్చంద్రకథయందు పందులకనియు, నలకథయందు వియోగులకనియు అర్థము.) హన. ౨, ఆ.—2. ఏకాకి.

**ఒంటికొమ్మువేలుపు.** దృ. వి. వినాయకుఁడు, ఏకదంతుఁడు

**ఒంటిపాటు.** వై. వి. ఏకాంతము. "ఒంటిపాటుచేకూడినది."

**ఒంటిపోఁగు.** దృ. వి. బలరాముఁడు, ఏకకుండలుఁడు. (చూ. విశావిశ.)

**ఒంటియ.** వై. వి. ఒంటె, లొట్టిపిట.

**ఒంటియడుగుఁగత్తెర.** దృ. వి. మల్లబంధవిశేషము.

**ఒంటు.** దే. అ. క్రి. ఇముడు, అనుకూలించు. స. క్రి. చేరు. "రగడ. కమలములంటుచుఁగలువలనొంటుచు." శశాం. ౨, ఆ. —వి, 1. గ్రామసమూహము; 2. బ. పురుషులకర్ణభూషణము.

**ఒంటుకొను.** దే. స. క్రి. చేరు. "ఎ, గీ. ఒంటిపాటుననవాప్తి లుఁగంటినంటి, యొంటుకొనఁజూచియోహెూయయుక్తమనుచు."

**ఒంటె.** వై. వి. ఉష్ట్రము. (ఒంటియయొక్కరూపాంతరము.)

**ఒంటెపులి.** ద్వి. వి. మృగవిశేషము. (అప్ర.)

**ఒంట్రింపు.** ద్వి. వి. అసహాయుఁడైనబంటు. (చూ. ఒంటరీఁడు.)

**ఒంట్లు.** యు. దే. వి. బ. (ఒంటు+లు.) పురుషుల కర్ణభూషణము. వై. అంకెలు.

**ఒండు.** వై. స. 1. అన్యము; 2. ఏ. ఏకము.

**ఒండె.** దే. ద్ర. 1. అటుకానిపక్షమున. "చ. అప్పురుషసింహులుభూరితపోధనుల్మనం, బునఁగలుషించిరేనియుఁ దపోమహిమక్షమిము నిర్దహింతురొం, డెనతులితాస్త్రశక్తిని వడిందును మాడుదురాజినిందఱక్." భార. ఆర. ౫, ఆ. (మీఁద ఏనిశబ్దము కదిసియు ప్రయోగింపఁబడును. "గీ. అష్టమీవాసరంబునయందు నొండె, నొండెనేని చతుర్దశినిండుభక్తిఁ, బూజగావించి యెవ్వఁడు భూమినున్న, దుర్గసేవింప దురితంబుతొలఁగునంద్రు." భీ. ౬, ఆ.) 2. కాని. "సీ. సమకట్టిసైన్యంబుసైన్యంబుతో నొండెఁదొడరిమీమువ్వురతోడనొండె, నిద్దఱతోనొండె నెక్కటియొక్కనితోనొండెఁబొడిచెదదోర్బలమున." భార. సభా. ౧, ఆ.

**ఒండేని.** దే. అవ్య. (ఒండెక్+ఏని.) ఒండె. "మ. అనుషంగంబుననొండె నొండెను విహారాపేక్షనొండేని ఘు, ర్ణనిరాసంబుననొండెఁదీవ్రభయసంత్రాసార్థమొండేనియు, న్యనియోగంబుననెవ్వఁడేమునుఁగు గంగాంభఃప్రవాహంబునక్, జనుఁడాతండును బుండరీకనయనాశాసించుపాపౌఘముల్." కాశీ. ౫, ఆ.

**ఒండొండ.** దే. అవ్య. (ఒండు+ఒండు+అ.) క్రమక్రమముగా. "ఇప్పుడొండొండపొంగి కలయఁబాఱుఁ బయోధులు గ్రముగ." భార. ఆర. ౪, ఆ.

**ఒందిక.** దే. వి. ఒద్దిక. "సీ. కలశపాథోరాశి కన్యకారత్నంబునొందికతోఁగూడి యున్నవాని." వి, పు. ౫, ఆ. (ఒద్దికయొక్కరూపాంతరము.)

**ఒందిలి.** దే. వి. దుఃఖము. విణ. దుఃఖముకలవాఁడు (లేక) దుఃఖముకలది. "వాఁడుధనహీనుఁడగుచు సంతాపమొంద విడుతురు బంధులవ్విధముననొందిలియైచేయునదిలేక." భాగ. ౧౦, స్క. ఉ.

**ఒందు.** దే. అ. క్రి. కలుగు. "పౌరచిత్తములకత్యానందమొందఁగ." భార. ఆది. ౮, ఆ.—స. క్రి. పొందు.

**ఒక.** వై. స. (వృత్తియందు ప్రత్యయములోపించినరూపము.) 1. ఒక్క; 2. ఒకానొక. (ఒకించుక, ఒకింత ఇత్యాదులయందు ఇది యల్పార్థకమని యెఱుంగునది.)

**ఒకఁడు.** వై. స. 1. అన్యుఁడు; 2. ఏ. ఏకుఁడు (లేక) అన్యము, ఏకము.

**ఒకట.** వై. ద్ర. 1. ఏకకాలమున; (చూ. ఒక్కొట.) 2. కూడ. (చూ. ఒక్కట.)

**ఒకటి.** వై. స. ఏ. 1. ఏకము; 2. అన్యము.

**ఒకత.** వై. స. ఏ. ఒకరితయొక్కరూపాంతరము.

**ఒకతి.** వై. స. ఏ. ఒకరితియొక్కరూపాంతరము.

**ఒకతుక.** వై. స. ఏ. (ఒకత+క.) (చూ.) ఒకరిత. (చూ. ఎవతుక.)

**ఒకతె.** వై. స. ఏ. ఒకరితెయొక్కరూపాంతరము.

**ఒకరిత.** వై. స. ఏ. (ఒకరి+త.) 1. ఏకస్త్రీ; 2. అన్యస్త్రీ. (రూ.) ఒకర్త.

**ఒకరితి.** వై. స. ఏ. (ఒకరి+తి.)——పై.——(రూ.) ఒకర్తి.

**ఒకరితె.** వై. స. ఏ. (ఒకరి+తె.)——పై.——(రూ.) ఒకర్తె.

**ఒకరుఁడు.** వై. స. (చూ.) ఒకఁడు.

**ఒకరువుఁడు.** వై. స.——పై.——

**ఒకర్తు.** వై. స. ఏ. (ఒకర్త+ఉ.) (చూ.) ఒకరిత.

**ఒకర్తుక.** వై. స. ఏ. (ఒకర్త+క.)——పై.——(చూ. ఎవతుక.)

**ఒకానొక.** వై. విణ. (వృత్తియందు ప్రత్యయములోపించిన రూపము.) ఉద్దేశింపఁబడని. (ఒకానొకపురుషుఁడు, ఒకానొకస్త్రీ, ఒకానొకమృగము మొ.) (దీనిని ప్రత్యయముతోచేర్చి చెప్పునపుడు మహదర్థమున ఒకానొకఁడనియు, మహత్యర్థమున ఒకానొకతయనియు, అమహదర్థమున ఒకానొకటియనియు రూపములు.)

**ఒకొ.** దే. అవ్య. సందేహమునుదెలుపును, (రూ.) ఒకో. "క. ఈమేలు ప్రజకొనర్చిన, యామహిమకునెలవుగొఁతియగ్రతనయుఁడో, భీముఁడొకొతమ్ముకుఱ్ఱలొ, కోమటియెవ్వరొకొతలఁపుకొలఁదికి మీఱెక్." భార. ద్రో. ౨, ఆ.

**ఒకొఁడు.** వై. స. (చూ.) ఒకఁడు. (చూ. ఒక్కొఁడు.)

**ఒకొట.** వై. ద్ర. (చూ.) ఒకట.

**ఒకొటి.** వై. స. ఏ. (చూ.) ఒకటి.

**ఒకొత.** వై. స. ఏ. ఒకొరితయొక్కరూపాంతరము.

**ఒకొతి.** వై. స. ఏ. ఒకొరితియొక్కరూపాంతరము.

**ఒకొతుక.** వై. స. ఏ. (ఒకొత+క.) (చూ.) ఒకరిత. (చూ. ఎవతుక.)

**ఒకొతె.** వై. స. ఏ. ఒకొరితెయొక్కరూపాంతరము.

**ఒకొరిత.** వై. స. ఏ. (ఒకొరి+త.) (చూ.) ఒకరిత, (రూ.) ఒకొర్త.

**ఒకొరితి.** వై. స. ఏ. (ఒకొరి+తి.)——పై.——(రూ.) ఒకొర్తి.

**ఒకొరితె.** వై. స. ఏ. (ఒకొరి+తె.)——పై.——(రూ.) ఒకొర్తె.

**ఒకొరుఁడు.** వై. స. (చూ.) ఒకఁడు.

**ఒకొరువుఁడు.** వై. స.——పై.——

**ఒకొర్తు.** వై. స. ఏ. (ఒకొర్త+ఉ.) (చూ. ఒకరిత.)

**ఒకొర్తుక.** వై. స. ఏ. (ఒకొర్తు+క.)——పై.——(చూ. ఎవతుక.)

**ఒక్క.** వై. స. ఒకయొక్కరూపాంతరము. (చూ. ఒక.)

**ఒక్కఁడు.** వై. స. ఒకఁడుయొక్కరూపాంతరము.

**ఒక్కట.** వై. ద్ర. ఒకటయొక్కరూపాంతరము. (కూడ అనుటకు. —"అతనితోడనొక్కటఁబుట్టెనునొకకన్యకృష్ణనా." భార. ఆది. ౭, ఆ. "నలుండుదమయంతి నాశ్వాసించుచునొక్కటఁజని." భార. ఆర. ౨, ఆ.)

**ఒక్కటి.** వై. స. ఏ. ఒకటియొక్కరూపాంతరము.

**ఒక్కత.** వై. స. ఏ. ఒక్కరితయొక్కరూపాంతరము.

**ఒక్కతి.** వై. స. ఏ. ఒక్కరితియొక్క రూపాంతరము.

**ఒక్కతుక.** వై. స. ఏ. ఒకతుకయొక్క రూపాంతరము.

**ఒక్కతె.** వై. స. ఏ. ఒక్కరితెయొక్క రూపాంతరము.

**ఒక్కప్రొద్దు.** వై. వి. వ్రతాదులచేనియమముతోఁజేయునట్టి యొక్కపూఁటభోజనము.

**ఒక్కరిత.** వై. స. ఏ. ఒకరితయొక్క రూపాంతరము. (రూ. ఒక్కర్త.)

**ఒక్కరితి.** వై. స. ఏ. ఒకరితియొక్క రూపాంతరము (రూ. ఒక్కర్తి.)

**ఒక్కరితె.** వై. స. ఏ. ఒకరితెయొక్క రూపాంతరము. (రూ. ఒక్కర్తె.)

**ఒక్కరుఁడు.** వై. స. ఒకరుఁడుయొక్క రూపాంతరము.

**ఒక్కరువుఁడు.** వై. స. ఒకరువుఁడుయొక్క రూపాంతరము.

**ఒక్కర్తు.** వై. స. ఏ. ఒకర్తుయొక్క రూపాంతరము.

**ఒక్కర్తుక.** వై. స. ఏ. ఒకర్తుకయొక్క రూపాంతరము.

**ఒక్కెఱ.** వై. వి. ఉగ్రభావము*. చ. "వఱలఁగరాముఁడంతనన వద్యుఁడువచ్చిమహాప్రలాపియై, యఱచుచునున్నతల్లినిగృతాంత వశీకృతుఁడైన తండ్రినో, క్కెఱఁగనితీవ్రశోకపరిఖేదహతుండయి." భారం. అర. 3, ఆ.—విం. ఉగ్రము. "క. వెఱచఱవనీరిలోనో, క్కెఱగానొకమొసలిచూడ్కికి నగోచరమై, పఱతెంచికుంభసంభవు, చిఱుదొడవడిఁబట్టుకొనియెశిష్యులుబెదరన్." భార. ఆది. ౫, ఆ.

**ఒక్కో.** దే. అవ్య ఒకో. (రూ. ఒక్కొ.)

**ఒక్కోఁడు.** వై. స. ఒకోఁడుయొక్క రూపాంతరము. "స్రగ్ధర. క్రూరేషావ్రసంబులేదొక్కోఁడు." రాఘ. ౨, ఆ.

**ఒక్కోటు.** వై. ద్ర. ఒకోటయొక్క రూపాంతరము. (చూ.) ఒకట. (ఏకకాలమునననుటకు.—"క. ఇటఁబాండవకౌరవులొ, క్కొటనం దఱుగురునఖ్యఁగొని." భార. ఆది. ౫, ఆ.)

**ఒక్కోటి.** వై. స. ఏ. ఒకోటియొక్క రూపాంతరము.

**ఒక్కోత.** వై. స. ఏ. ఒక్కొరితయొక్క రూపాంతరము.

**ఒక్కోతి.** వై. స. ఏ. ఒక్కొరితియొక్క రూపాంతరము.

**ఒక్కోతుక.** వై. స. ఏ. ఒకోతుకయొక్క రూపాంతరము.

**ఒక్కోతె.** వై. స. ఏ. ఒక్కొరితెయొక్క రూపాంతరము.

**ఒక్కోరిత.** వై. స. ఏ. ఒకోరితయొక్క రూపాంతరము. (రూ. ఒక్కొర్త)

**ఒక్కోరితి.** వై. స. ఏ. ఒకోరితియొక్క రూపాంతరము. (రూ. ఒక్కొర్తి.)

**ఒక్కోరితె.** వై. స. ఏ. ఒకోరితెయొక్క రూపాంతరము. (రూ. ఒక్కొర్తె.)

**ఒక్కోరుఁడు.** వై. స. ఒకోరుఁడుయొక్క రూపాంతరము.

**ఒక్కోరువుఁడు.** వై. స. ఒకోరువుఁడుయొక్క రూపాంతరము.

**ఒక్కోర్తు.** వై. స. ఏ. ఒకోర్తుయొక్క రూపాంతరము.

**ఒక్కోర్తుక.** వై. స. ఏ. ఒకోర్తుకయొక్క రూపాంతరము.

**ఒగరు.** వై. వి. చక్కఁగాఁబండని దానిమ్మలోనగువానిరుచి, తువరము. (చూ. రసము.) "సీ. బిగికందకుండలేఁజిగురాకు గొనివచ్చి యొగరెల్లఁబుచ్చితిపొనఁగకున్న." విక్ర. ౫, ఆ.

**ఒగరుచే.** వై. అ. క్రి. ఒగరగు. "సీ. నుబ్బివాఁడునాఁచువల్పుల గొంతొగర్చిలేఁబొలవల్చుగాలివేఁబోకనెజేఁగి." అను. ౨, ఆ.

**ఒగి.** దే. ద్ర. క్రి. విం. క్రమముగా. "ఉభయపక్షములవారి, నుద్ధరింతురందరయొగిఁబిండమిడినవారు." (ఇక్కడ ఒగిన్ అనఁగా విధిక్రమముగాననియర్థము.) భార. అర. ౨, ఆ. (ఇట్లిక్కడక్కడ సందర్భానుసారముగా అర్థము నెఱుఁగునది.)

**ఒగిదిగ.** దే. వి. జేడబిల్ల. "సీ. కన్నెగేదఁగిఱేకుసున్నగిలగఁజేఁజి యొగిదిగగాఁబెట్టెనొక్కచెలికె." చమ. ౧, ఆ. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.)

**ఒగుడు.** దే. వి. జొన్నలోనగువానియొండినయాకు.

**ఒగుడుకఱచు.** దే. అ. క్రి. కృశించు.

**ఒగ్గము.** దే. వి. (చూ.) అవపాతము. "క. ఒగ్గములుత్రవ్వి పడుమని, యొగ్గెడు పెనుఁదెరల వలల నుగ్రమృగములన్, దగ్గఱిసెఁ జంపువేడుక, వెగ్గలమైచిత్తమందు వేఁటాడింపన్." భాగ. ౧, స్కం.

**ఒగ్గు.** దే. అ. క్రి. మొనయు. "ఉ. ఏయుక్కనలేఁ యొట్టిపని కొగ్గునెయంచొక కొందఱాడఁగన్." పాంచా. ౨, ఆ.—స. క్రి. 1. (వల) పఱచు, ఒడ్డు; (చూ. ఒగ్గము.) 2. చాఁచు. "ఎ, గీ. ఆనెలంతమెడకునడ్డంబుగామెడ, యొగ్గెవృద్ధసతియనూనకృపను." కళా. 3, ఆ.

**ఒగ్గుబల్ల.** దే. వి. తరిమెనపట్టెను కొయ్యకాధారమైనబల్ల.

**ఒచ్చెము.** దే. వి. 1. కొఱఁత, న్యూనత; "గీ. అధ్వరారంభమింతొప్పునయ్యదక్ష, శివునిఁదోడ్తేనియొక్కయొచ్చెంబకాని." కాశీ. 2, ఆ.—2 అవమానము. "చ. మానినికందనుఁదానకాచితో, బూద వినదానఁజేసి సభనొచ్చెముదక్కినఁ జొందునందనుఁడ్, బ్రదికెరిగాక." భార. ఉద్యో. ౧, ౬.

**ఒచ్చెల.** దే. అవ్య. ఓ చెల్లయొక్క రూపాంతరము. "ఒచ్చెలనిన్నుఁ జూచి వగనొందెదుఁజిత్తము." భో. ౫, ఆ. (రూ. ఒచ్చెల్ల. "క. అచ్చుగఁబ్రయాగలోపల, విచ్చలవిడిఁదనదుమేను విడిచినసమనుజుం, డొచ్చెల్లయేమిచెప్పదుఁ, జెచ్చెరఁగను నిష్టకామ్యసిద్ధిభరిత్రిన్." భో. ౧, ఆ.)

**ఒజ్జ.** వై. వి. 1. ఉపాధ్యాయుఁడు; "క. వరుసనుదాత్తప్రముఖ, స్వరములుకనుబొమ్మసంజ్ఞజాలకయుండన్, బొరిఁబొరిఁగఱపుచు వటువుల, నురుధృతిఁజదివించుచున్న యొజ్జయుఁగడఁకన్." పర. ౨, ఆ.—2. పురోహితుఁడు*; "సీ. రాజునొజ్జలమంత్రరక్షాబలంబునరాఁ బొందుగాదయ్యెరాక్షసునకు." వై. ర, ఆ.—3. యాజకుఁడు*. "గీ. భక్ష్యభోజ్యలేహ్యపానీయములమీఁద, సదములోనివిప్రజనులమీఁద, వెగడుపడఁగఁబాఱివెఱసింనయొజ్జలు, సప్త యోగవిభులుదప్పిపఱవ." భార. ఆది. ౨, ఆ.

**ఒజ్జనము.** వై. వి. ఒజ్జఁదనము, ఉపాధ్యాయత్వము.

**ఒజ్జబంతి.** వై. వి. ఉపాధ్యాయుఁడు చూపినపద్ధతి, మేలుబంతి. "సీ. తనకులాచారవర్తన వైష్ణవాచార పర్యాయములకొజ్జబంతియనఁగ." పాండు. ౧, ఆ.

**ఒజ్జసాని.** వై. వి. ఉపాధ్యాయునిభార్య. "ద్వి. కపటమేర్పడఁగ నొంగాకనిపోయి, చపలాక్షుఁడాయొజ్జసానికిట్లనియె." పారిజా. ౨, భా.

**ఒట్టు.** దే. అ. క్రి. కలుగు. "ఉ. అట్టినృపాలకీటములనాఁటనెదుర్పఁగలేనివానియు, ట్లొట్టినభీతిమైనిటుపయోధిశరణ్యుఁడవైతివి." భాగ. ౧౦, స్కం. ఉ.—స. క్రి. 1. ఉంచు; "ఉ. ఇట్టిదిక్రూర

కృత్యమని యించుకకొంకక లక్కఁయింటఁజ, చ్చొచ్చితి." భార. శల్య. ౨, ఆ.—2. రగుల్చు. "ఒట్టినమంటవోలెఁగడునుగ్రతఁ జేర్చిన." నిర్వ. ౪, ఆ. "క. పట్టుదురుకొఱవ్రలనువడిఁ, బెట్టుదురిసిపుత్రికలను బెనుమంటలయం, దొట్టుదురొడల్లనలియఁ. మట్టుదు రప్పాపచిత్తు మత్తుంబెలుచన్." (ఇక్కడ ఒట్టుటయనఁగా కాల్చుటయని యర్థము.) భాగ. 3, స్కం.—వి. శపథము.

ఒడఁగూడు. దే. అ. క్రి. 1. సిద్ధించు; 2. చేరు. "క. అమవసగావ్రననేఁడ, క్కమలజుఁగొలువఁగమహర్షిగణములుఁబిత్రసం. ఘములునుబోదురుబ్రహ్మం, డమునంగలవారలందొడంగూడంగన్." భార. ఆది. ౫, ఆ. (ప్రే. ఒడఁగూర్చు.)

ఒడఁబడిక. ద్వ. వి. 1. సమ్మతి; "ఎ, గీ. ఒడఁబడికగానఁబడరేక యొడలునులియు, నెపముమైఁగొఁగిటికెదుర్చునీరజాక్షి, యుపమయును భూమివల్లభునుల్లమునకుఁ, గ్రొత్తచవిగొల్పెమజివేళ కొన్నినాళ్లు." కవిక. 3, ఆ.—2. సమ్మతించి వ్రాసియిచ్చిన వ్రాఁత.

ఒడఁబడు. ద్వ. అ. క్రి. 1. సమ్మతించు; 2. అనుకూలించు; "చ. కడుఁజనువాఁడునైపురుపకారియుదక్షుఁడునైనమంత్రిపెం, పడరఁగరాజపుత్రుల మహాధనవంతులఁ జేసివారితో, నొడఁబడి పక్షమేర్పడఁగనుండఁడుగా." భార. సభా. ౧, ఆ.—3. సంతోషించు. "సమున్నతపీఠమ్మునఁనుంచియథావిధిపూజలొడంబడఁజేసి." భార. ఆది. ౭, ఆ. (ప్రే. ఒడఁబఱచు.)

ఒడఁబాటు. ద్వ. వి. సమ్మతి. విణ. సమ్మతము. "క. అప్పరయముఁడిప్పలుకుల, కొప్పితిమీప్రతిమలోననొకచిటికెనవ్రేల్, తప్పకయుండఁగనిప్పుడ, యొప్పించెదనొప్పఁజెప్పుమొడఁబాటనియెన్." (ఇక్కడ ఒడఁబాటనఁగా ఒడఁబడ్డద్రవ్యమని తెలియవలెను.) పర. ౫, ఆ.

ఒడగోలుకొను. దే. స. క్రి. అడగోలుకొనుయొక్కరూపాంతరము. "వ. మనుష్యుండుపుట్టినకోలెనిడుమలంబడిగడించినయొడమి పుడమితేఁ డలిగిగడియతడవులోన నొడగోలుకొనశక్తుండగు నట్లగృహాగతుండగునతిథి తిరస్కృతుండై యతనిపూర్వార్జిత సుకృతంబులన్నియు నపహరింపంజాలు." భో. 3, ఆ. (ఇక్కడ అడగోలుకొననియే యుండవచ్చును. అయినను ప్రతులయందిట్లు ఒకారాదిగాఁ గానఁబడుచున్నది.)

ఒడపి. దే. వి. గండి, రంధ్రము. "క. జుఱుజుఱుకనినెత్తురువెలి, కుఱుకుచు రొదసేయ నజితియొడపినెయూర్చుల్, పఱవమిడిగ్రుడ్లవడఁకుచుఁ, గొఱప్రాణముతోడఁ దన్నుకొను నమ్మెదవుర్." ఆము. ౨, ఆ.

ఒడమి. దే. వి. ధనము. "వ. మాతరుండు కఠోరవచనంబులాడినఁ బింగళుండంగలార్చిన దండుండుదండించినం జక్కంబడమిఁ దనయొడమిఁ దానడిమి కడిమి నిజంబుగారవి గారవించి." ఉ, హరి. ౬, ఆ. (దీనిని ఎదంతముగా వాడెదరుగానిప్రతులయందిది యికారాంతముగానే కానఁబడియెడి. ప్రయోగశైలినిజూడ నిట్లుండుటే యుక్తమని తోఁచుచున్నది. చూ. ఒడగోలుకొను)

ఒడయఁడు. దే. వి. మగఁడు. "అడిగియాతండొడయండగు మాన్యపాత్రజకని." భో. 3, ఆ.—విణ. స్వామి.

ఒడయుఁడు. దే. వి. మగఁడు. "గీ. యువతిమండలములకొడయుఁడవుగమ్ము." జై. ౫, ఆ.—విణ. స్వామి.

ఒడయురాలు. దే. విణ. (ఒడయుఁడు + ఆలు.) స్వామినీ.

ఒడలిచూపొడయఁడు. దే. వి. ఇంద్రుఁడు. అచ్చ. కిష్కిం, కాం.

ఒడలు. దే. వి. మే, మేను, దేహము.

ఒడి. దే. వి. 1. తొడపైభాగము, ఉత్సంగము; 2. ఒడుపు; "ఒడి దప్పినపాముఁబోలెనుండఁగ." ఉ. హరి. 3, ఆ.—3. పశుయోని.

ఒడిఁబ్రాలు. దే. వి. బ. గర్భాధానాదికాలములయందు స్త్రీలకు ఒడియందుఁబోసెడు బియ్యము.

ఒడికట్టు. దే. అ. క్రి. కడఁగు, యత్నించు. "లోకనిందకొడిగట్టితివి." రామా. ౫, ఆ.—వి. ఒడ్డాణము.

ఒడికము. దే. వి. ఉపాయము. "చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్కమహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ భారమచ్చటిది గ్రక్కున భూమికడిగ్గఁద్రోవఁగాఁ, గడు సుకరంబు." పంచ. నా. ౧, ఆ.—విణ. 1. మనోజ్ఞము; "కుడిచినపిమ్మటం గుసుమకోమలి విస్తృత సంస్తరంబుగా, నొడికపుశయ్యచేసి." భార. ఆర. ౫, ఆ.—2. యుక్తము. "తంత్రులో క్కవరుసదీటిమెట్టులొడికంబుగనొత్తి." ఉ, రా. ౬, ఆ.

ఒడికారము. దే. వి. ఉద్రేకము. "రగడ. కారనకెయొడికారపుఁగింకన." య. ౪, ఆ. (ఇదియింకను విచార్యము.)

ఒడిత్రాడు. దే. వి. వేఁటాడుటకు తగినసాధనవిశేషము. కాశి. 3, ఆ. (చూ. తీపుఁద్రాడు.)

ఒడిదామర. ద్వ. వి. (ఒడి + తామర.) వృక్షవిశేషము.

ఒడిదారము. దే. వి. స్త్రీలమొలనూలు. "ద్వి. మొనసిశోణాటంకములయొడిదార, మునకుఁగాఁదగదెయమ్ముద్దియఁజేర." భాగ. ౧౦, స్కం.

ఒడిపిలి. దే. వి. ఆహారవిశేషము. (అప్ర.)

ఒడియు. దే. అ. క్రి. కొంచెముపైకెగురు. "ఎ, గీ. ఒడిసి తల పట్టితిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకుకొసరించుకయులేకకూలఁదాఁచె." భార, విరా. ౨, ఆ. "ఎ, గీ. పడకతఁడువానిముందల యొడిసితిగిచి, పుడమిఁబడఁద్రోచిబలిమినుక్కడఁగఁబట్టి." జై. 3, ఆ.—స. క్రి. తిగియు, అకర్షించు. "సీ. అపవర్గఫలసిద్ధిహేత నైనఁజేపట్టుకైవడిబహుఫలోత్కరముఁబొడిసి." పాండు. ౨, ఆ.

ఒడిసియ. దే. వి. ఒడిసెగడ్డ.

ఒడిసె. దే. వి. ఒడిసియయొక్కరూపాంతరము.

ఒడిసెల. ద్వ. వి. ఱాలువిసరివేయుటకై యేర్పఱుపఁబడిన యొకవిధపుత్రాడు, క్షేపణి. "ఒనరుదంచనముల నొడిసెలలను జాలంగ నెందునునవరించుట." హరి. ఉ. ౨, ఆ.

ఒడిసెలకాఁడు. ద్వ. వి. ఒడిసెలవేయువాఁడు. "ఒడిసెలకాం డ్రను నొడ్డుఁడెందు." హరి. ఉ. ౧, ఆ.

ఒడుచు. దే. ప్రే. ఓడించు. "పారిజాతంబుఁగొనునెడఁదొడరి వృత్రభేదినొడిచితి." హరి. ఉ. ౭, ఆ.

ఒడుదొడుకు. దే. వి. 1. సమముకామి, వైషమ్యము; "క. తరుణీమణిజఘనమునకు, దొరగాక తృణంబుఁబూనితుదిలేకవసుం, ధరయొడుదొడుకులఁబడుమహి, ధరములుచట్టువడితావుతరలకయుండున్." రసి. ౨, ఆ.—2. సంకటము. "వ. అడవికడకొత్తికొని నడచియొడుదొడుకగుడు." స్వా. ౪, ఆ.—విణ. సమముకానిది, విషమము.

ఒడుపు. దే. వి. 1. లక్ష్యముపెట్టిదాఁటినదాఁటు; "ద్వి. ఒడుపు దప్పినయట్టియురగంబుఁబోలె." హరిశ్చ. ౧, ఆ.—2. పూనిక; "వ. పెద్దయుంబ్రొద్దునకునతండు దైవాధీన్యంబునం జైతన్యంబు నొందిక్రమ్మఱ నాతోఁ బరిచర్యసేయందలంచిన నప్పుడయ్యొడుపు దప్పింపనొండువెరవుదొరకమిఁదానట్లాడంబడి యొడపల్కినవిధంబునుంజెప్పి." భో. ౪, ఆ.—3. లాభము.

**ఒడ్డగి.** సం. వి. రంజకస్వరాన్నులు జతచేసియేర్పఱచిన ఆయుత విశేషము.

**ఒడ్డగిల్లు.** దే. అ. క్రి. 1. ఒఱగు; "క. నాకృసుంభీషణుండో, హేలాహేనాళాపములనె మోడించితిరే, సైపచ్చినబలవంతుల, నావ నథైయునొడ్డగిల్లనట్లనెయుండెఙ్. క. మీరేలవంచవలయును." రామా. ౭, ఆ.—2. అతిశయించు; "క. అపుడ, ప్లవభుక్కుల కు ద్వవప్లవంభుక్కులకుఙ్, గలయొయ్యనందుఁజైకొని, గెలుపునఁ గపిసేరుకొడ్డగిలపోఁకొనినఙ్." రామా. ౮, ఆ.—3. చిప్పిల్లు, ఉప్పొంగు. "క. విడఁను మొక్కినఁ దల్లులు, జడ్డసనంకములను విచిచన్నులపుడెఁదా, లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డుపడండడేపి చికెజలములననఘా." భాగ. ౧, స్కం.

**ఒడ్డగెడవు.** దే. వి. ఒక ప్రక్క క్రిందికొఱగిమఱియొక ప్రక్కపైకి లేచుట, వాటుపడుట. "గీ. కెడసహాయములొడ్డగెడవయ్యెరథములు." భార. భీష్మ. ౨, ఆ. "క. మునుపరగౌరీపరిణయ, మునకఫలామరులసంయములుగూడినన్రే, గునసుస్థిరభూస్థలి గ్రుం, గనుదక్షిణభూమియొడ్డగెడవైయుండెఙ్." పర. ౧, ఆ.

**ఒడ్డనము.** యు. దే. వి. 1. పందెము; "గీ. వాహసంబులుసారెలు వాఁడితరము, లూర్జితాక్షము లసువులునొడ్డనములు, గాఁగఁబోరెపుసిద్యూతకర్మమందు, నెనఁగజయమునపజయమెవ్వఁడెఱుఁగు." భాగ. ౬, స్కం.—2. వ్యూహము. "క. అపుడూపములగు శూలొ, డ్డనములు ప్రస్ఫురితములు దృఢంబులుఁగాఁదీ, ర్చినఁగాక తెఱంగగునే, యనిమొనలేర్పఱచె." భార. భీష్మ. ౩, ఆ.—వై. 1. ఔత్తములోనగువానిచేతఁజేయఁబడినకేడెము; "చ. పలకలునొడ్డనంబులును వారణసేయఁగఁగత్తికొంతముల్, బలుసబళంబులఙ్ వెనుకఁబన్నఁగ." ఉ, హరి. ౬, ఆ.—2. కేడెము*. "చ. అనుభ్రసనద్ధులంబులగు నాక్రమణంబుల వానినెల్లనొ, డ్డనమునఁ గియాఁగిసుదృఢంబగు ఖడ్గముచేతఁగొన్నితు, త్తునియలుసేయు చుఙ్ గిరిని దుర్దమతీవ్రచపేటమైకడం, గిసహరిలీలఁ గూల్పఁ దొడఁగెఙ్ గరిసన్నిభదైత్యపఙ్క్తులఙ్." హరి. ఉ. ౭, ఆ.

**ఒడ్డాణము.** వై. వి. 1. యోగపట్టె*; "సీ. వఁడేయమైనయొడ్డాణంబులవణిచేనక్కళించినపట్ట మక్కళించి." స్వా. ౧, ఆ.—2. స్త్రీలునడుమున బిగికైధరించుకొనెడు బంగారులోనగువానిపట్టెడ*. "సీ. మొలనూలునొడ్డాణమునునేవళంబుఁ బుంజాలదండయు బన్నసరముమొగపుఁ, దీఁగయు." కళా. ౭, ఆ.

**ఒడ్డాది.** వై. వి. ఓఢ్రదేశము.

**ఒడ్డారము.** దే. వి. 1. ద్వేషము; "వ. మనకు నక్కచెలియలిబిడ్డలకు నొడ్డారంబులేమిటికి నేకకార్యపరత్వంబున నడ్డంబులేక బ్రదుకుదము. తొల్లియన్యోన్యవిరోధంబులనలంగితిమి." భాగ. ౮, స్కం.—2. మాఱొడ్డుట, ప్రతిఘటించుట. "వ. చుఱుకుమినుకుతేని కొండుకుకడకుంజనిభయరసంబులొలుకంబలుకులు పలికినంగనలినకరాకయొడ్డారంబులొడ్డనేని." రామా. ౬, ఆ.

**ఒడ్డారించు.** దే. అ. క్రి. 1. ద్వేషించు; "ద్వి. ఎదిరియొడ్డారింపనెవ్వరివశము." హరిశ్చ. ౧, ఆ.—2. మాఱొడ్డు. "క. ఒడ్డారించివిషంబున, కడ్డముచనుదెంచికావనధిపులులేమిఙ్." భాగ. ౮, స్కం.

**ఒడ్డిమి.** దే. వి. ఒడ్డు, పందెము. "వ. ఆశకునియాడి యుధిష్ఠిరుం డొడ్డిన యొడ్డిమియెల్లగెలుచుచు వచ్చె." భార. ఉద్యో. ౧, ఆ.

**ఒడ్డియ.** వై. వి. ఒడ్డెవాఁడు.

**ఒడ్డీఁడు.** వై. వి. 1. ఓడ్రదేశపురాజు; 2. ఉడ్డీనగతిగలపావురాయి*. "సీ. ఘనమైనకండక్రొవ్వునఁబాఱుతెంచినయొడ్డీని పెనులావులూడఁదన్ని." (ఇక్కడ శ్లేష.) వై. ౧, ఆ.

**ఒడ్డు.** యు. దే. స. క్రి. 1. పందెమిడు; "వివిధవస్తువాహన నివహంబులొడ్డి." భార. ఆర. ౩, ఆ.—2. (వల) పఱచు, పన్ను; "గీ. దాయలొడ్డినమాయజూదంబుకుఁదుల(ఁబ)డి." భార. విరా. ౩, ఆ.—3. చాఁచు; "గీ. అనిననాఁడపుడు భయమునఁ దియోక్త లోన, నొరులయొుగికినకటచేయొడ్డకుండు, నట్టివానికివలసనె యనుచుఁగరము, సాఁచెనవ్విప్రుదనకునిర్భయముతోడ." భార. శాం. ర, ఆ.—4. మొనయించు; "గీ. ఇట్లెఱుఁగు, ప డిగాఁగఁబూనిపలుకంగఁజెవియొడ్డి, యాదరించువారినందుఁగని." భార. ఉద్యో. ౧, ఆ.—5. అడ్డగించు; "దుర్గదక్రీడఁ జరించుగాజుహారకేశవులొడ్డినఁగావ." భాగ. ౧, స్కం.—6 దాఁటు. "వేగ వట్టొడ్డియల్లసవెడలి." భార. శాం. 3, ఆ.—వి. 1. పేరము; 2. పందెము; "వ. తనకొడుకు విరోచనుండునంగిర సుందను విప్రుకొడుకు సుధన్వుండునుదమతమప్రాణంబులొడ్డుగానొడ్డి." భార. ఉద్యో. ౨, ఆ.—3. వ్యూహము; "పేరుకుక్కనఁగ్రొంచ చందమగునొడ్డుగలంగఁగఁజేసి." భార. భీష్మ. ౨, ఆ.—4. ప్రానికి; "మ. ఒక్కయొడ్డునబాష్పంబుఝురంబులుప్పతిలె బోటుం బాటుగానెంతయుఙ్." స్వా. 3, ఆ.—5. అడ్డపాటు. "క. బిడ్డనిఁగరములఁబొమ్మున, నడ్డంబుగఁబట్టిపదములల్లన నిడుచుఙ్, జడ్డనఁగావలివారల, యొడ్డుగడచి పురిటి సాలయొయ్యన వెడలెఙ్." భాగ. ౧౦, స్కం. పూ.—విశ. 1. స్థూలము; (వాఁడొడ్డుపొడుగుగాఁబెరిగినాఁడు.)—2. పెద్ద; "ఒడ్డులగము."—3. అధికము; "ఒడ్డుగానిట్టూర్పులొలయఁబోగులు." స్వా. 3, ఆ.—4. విశాలము. "వ. పయోధికన్నబిడ్డలుంబోనియొడ్డు చెఱువులచేతను." భీ. ౧, ఆ.—వై. స. అన్యుఁడు. "ఏమొనఁగినట్టివృత్తులుచెల్లునే. ఒత్తొరవొడ్డులవలనఁబుట్టదుగదా." భార. ఉద్యో. ౧, ఆ.—వి. ఏకకుఁడు.

**ఒడ్డె.** వై. వి. ఒడ్డియయొక్కరూపాంతరము.

**ఒడ్డోఱకము.** దే. విశ. (ఒడ్డు+ఒఱకము.) ఎగుడుదిగుడైనది. (భూమి.)

**ఒత్తగిల్లు.** దే. అ. క్రి. 1. ప్రక్కకొఱగు; "గి. ఒత్తగిలియాఁడ." కవిక. ర, ఆ.—2. ఒఱగు; "చ. చెలిభుజపీఠినొత్తగిలిచిల్కనుదువ్వుచువాలుఁగన్నుఁగ్రే, వలకుదధారచేరనొకవారవిలాసినిసారొసుతుఙ్." స్వా. ౫, ఆ.—3. అంటుకొను. "సె. స్తూణంబునీచమైకన్నులువెల్లనైయుదరంబువీఁపుతోనొత్తగిల్ల." కాశీ. ౬, ఆ.

**ఒత్తడము.** దే. వి. ఒత్తుట. విశ. తఱుచు.

**ఒత్తడి.** దే. వి. 1. రాపు, సమ్మర్దము; "ఒండొరులయొత్తడింబొడిపొడియై." స్వా. ౫, ఆ.—2. తఱుచుఁదనము; "సీ. ఒడికంపునరిగయొత్తడినరంబునమించుమిసిమిక్లైపుఁగెంపుమేలివాగె." చంద్రా. ౩, ఆ.—3. బాధ. (అనికొందఱు.)

**ఒత్తరము.** దే. వి. ముమ్మరము, ఉద్రేకము. (చూ. అత్తరము.)

**ఒత్తరించు.** వై. స. క్రి. 1. మించు*; "సీ. వితతవీరాగ్రహావేశాతిదర్పిత చిత్తులైయొండొరునొత్తరించు, నుగ్రమపెల్లాద్ధతి." భార. శల్య. ౩, ఆ.—2. ఆక్రమించు*. "గీ. యువవనోజాంగలక్షేత్రమొత్తరించి, గరుసువడదున్నమదనలాంగలికులములు, కామినీమణిముక్క." పాండు. 3, ఆ.

**ఒత్తియాడు.** దే. స. క్రి. (ఒత్తి+ఆడు.) ఒత్తు. (చూ. లంగ గొను, ఊఁగాడు.)

**ఒత్తిలి.** దే. అవ్య. 1. గట్టిగా; "ఉ. చిత్తజరాజ్యసంపదయశేషము గైకొనిసౌఖ్యమందఁగా, నుత్తులుదారనాఁ బురవనోపవనంబులు చొచ్చియిచ్చఁబూ, గుత్తులవ్రాలి తేనియలు కుత్తుకబంటిగఁగ్రోలి

లీలన్లై, నొత్తిలిమ్రొయుచింపుచసుకొత్తుచునంచుమదాం డంపవు ల్.'' విక్ర. ౧, ఆ.—2. పట్టుగా. ''క. పనిదియంలయుచేచుఁ గుదుఁ, గానవృథాశోకవహ్నిఁగాలమికిని సే, మంనసమునఁ గృప కలిమికేఁ, గానొత్తిలిదేవగుహ్యగతియుఁ దెలిపితిఁ.'' భార. స్త్రీ. ౧, ఆ.

**ఒత్తిల్లు.** దే. అ. క్రి. ప్రక్కకొఱగు, ఒత్తగిల్లు. (రూ. ఒత్తిలు. ''ఒత్తిలిరిత్తపైకొనుచు.'')

**ఒత్తు.** దే. అ. క్రి. 1. పొడుచుకొను; ''ఎ, గీ. కటికిసేలఁగంన్లు లొత్తనిద్రపోయెదునయ్యె.'' భార. ఆది. ౬, ఆ.—2. ఒఱగు; ''చ. గరువునకొత్తఁజెంగలువకచ్చుఘటించినమాలెఁజుట్టెఁజెం, దిరి కతెఱంగునంబసిఁడితీఁగలునించినజిల్గుపాగ.'' స్వా. ౫, ఆ.—3. ఘనమగు. ''ఉ. ఉల్లము వ్రక్కలైకలఁగనొత్తినమూర్ఛవహించి ధారుణిం, ద్రెళ్లిన.'' జై. ౨, ఆ. (చిగురొత్తు ఇత్యాదులయందలి ఒత్తు ఇంచుక్కవంటిదనితెలియునది.)—స. క్రి. 1. అదుము; ''రథ ముద్దండాగ్రతుండంబునం బట్టుంగ్రిందికినొత్తునెత్తు.'' రా. ఆర. ౩, ఆ.—2. (కాళ్లు) పిసుకు; ''గీ. కుడుపునిద్రయు వర్జించియడుగులొత్తు, చుండిరి.'' భార. అను. ౩, ఆ.—3. (శంఖమును) ఊఁదు; ''చ. పిడుగులపిండుబిట్టులియుపెల్లు సఁబార్థుఁడు శంఖమొత్తినన్.'' భార. విరా. ౪, ఆ.—4. బలాత్కరించు; ''ఇమ్మెయినన్నునొత్తియడిగిన.'' భార. ఉద్యో. ౩, ఆ.—5. (పంట) నొక్కు; ''మోవిదంతశిఖనొత్తె.'' కళా. ౧, ఆ.—6. తుడుచు; ''క. అశ్రులుమపి, యునుగ్రమ్మంగర తలమున నొత్తుచుఁజూచున్.'' భార. మౌ. ౧, ఆ.—7. త్రోయు; ''చ. ఒదవెడిజవ్వనంబువెలికొత్తఁగఁబయ్యెదసిగ్గుఁగూడిబి, ట్టదుమఁగ.'' ఆము. ౫, ఆ.—8. చేర్చు; ''క. అత్తఱిగంధర్వవిభుం, డత్తామరసాక్షివదనమక్కునఁగృపతో, నొత్తి.'' స్వా. 3, ఆ.—9. తీర్చు; ''వ. తమ్మెఱుఁగనిదుష్టాత్ములనడుమంగూర్చుండుటయు నవ్వెంబరవిత్తులఱచువీటేఁడియఱపులకువంకలొత్తిమాఱుసెప్పుట యునొప్పకయుండు.'' భార. ఉద్యో. 3, ఆ.—10. ఆక్రమించు, ''క. అనదలసంబునుబెడిదపుఁ, దనమునులేకుండఁబరఁగిదరియొత్తెడునే, ఋనుబోలెనొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురంగ్రమంబుననధిపా.'' భార. శాం. 3, ఆ.—11. (అంట్లు) త్రొక్కు. ''సీ. అంట్లొత్తువేళల నంట్లొత్తునెలమిగా న్పించులేఁ గొప్పులవంచివంచి.'' కళా. ౪, ఆ.—వి. 1. అదుముడు; ''సీ. చేదోయియొత్తునఁజేసినెత్తురులైనయవయవంబులునోరసవర చేయు.'' నై. ౩, ఆ.—2. తఱుచుఁదనము; ''వ. మట్టలెత్తుకొని యొత్తుగలపొదరుటడవులుచొరంబాఱుపిడికడితి కదుపునురవడికి.'' స్వా. ౪, ఆ.—3. మెత్త; ''సీ. పసిఁడికుందియనలోపలఁ బట్టుపొత్తులయొత్తుననొఱఁగికూర్చుండనేర్చె.'' వి, పు. ౨, ఆ.—4. ఆక్రమణము; ''వ. పరులయొత్తులేనిరాజ్యంబుపూజ్యమహిమంబరఁగు.'' భార. ఉద్యో. ౩, ఆ.—5. బ. బిడ్డలచేతియొక దినుసుబంగారుసొమ్ము.—విశ. తఱుచు. ''ఉ. ఒత్తుగమాంసముల్ మడుఁగుటోగిరముల్ ఘృతశర్కరాదులున్, గుత్తుకబంటిమేసి.'' హరిశ్చ. ౧, ఆ.

**ఒత్తుకమ్మి.** ద్వ. వి. బొద్దులకు ప్రక్కలకమ్మివలె నేర్పఱచెడు తద వయవవిశేషము.

**ఒత్తుకాఁడు.** దే. వి. సుతిపోయువాఁడు. ''వ. అతండునుగుణధ్వనితంత్రీనాదంబుగా నావిండ్లవారొత్తుకాఱుగా గాండీవంబు వీణ గావినోదంబు సలిపె.'' భార. విరా. ౫, ఆ.

**ఒత్తుకొను.** దే. అ. క్రి. పొడుచుకొను. స. క్రి. ఆక్రమించుకొను. ''క. వారుదెసఁబొత్తుకొనియుధ, రారాజ్యంబిచ్చిపోయిరా పోరో.'' భార. ఉద్యో. ౩, ఆ.

**ఒత్తుడు.** దే. వి. 1. అదుముడు, పీడనము; ''ఉ. ఎవ్వతెం, బెట్టినవాఁడెవ్వారయ పీరికదానికినొత్తుడొఁజుమీ.'' కవిక. ౪, ఆ.—2. కాకితములోపనుకది వ్రాయునప్పుడు మెత్తనైదానిక్రింద నుంచుకొనఁబడు కాకితములోనగునది.

**ఒత్తుపడు.** ద్వ. అ. క్రి. (ఒత్తు+పడు.) అదుముడుపడు. ''ఎ, గీ. ఒత్తువడికాండవాదిఘ పొర్చ్చయముల, వసముజొబ్బెల.'' హరి. పూ. ౨, ఆ.

**ఒత్తొరవు.** దే. వి. (ఒత్తు+ఒరవు.) మిక్కిలియదుముడు, సంపీడనము. ''చ. ప్రజఁదిక్లేశంపుఁబసులపగిదిఁ [illegible] వ్రుదేవసుతొత్తొరవు లేక బ్రదుకునట్లు.'' విక్ర. ౪, ఆ.

**ఒదరు.** దే. అ. క్రి. 1. విజృంభించు; ''సే. వలఁతులైవిగిడెడు వలుదకోడకులచే నొదరిచేసాఁచుమృత్యువులుఁబోలె.'' లక్ష్మీ. ౪, ౬.—2. సంభ్రమించు. ''ద్వి. అశవుడుపోవతామ్రాక్షుఁడై చూచి, కనలుచుఁగటములుప్పటములైయదరి, నొడలెల్లఁగంపింప నొదరుచుఁబలికె.'' రా. బాల, కాం.—స. క్రి. నిందించు. ''దుర్యోధనుండుబిదురుందూలనొదరి.'' సం. ''ధిగస్తుక్షత్తారమితి బ్రువాణః.'' భార. సభా. ౩, ఆ.

**ఒదరుచే.** దే. స. క్రి. ఊఁడఁదీయు. (రూ. ఒదర్చు.) (చూ. అంట.)

**ఒదలు.** దే. అ. క్రి. వర్థిల్లు. ''గీ. అనిననాచంద్రవతాళివాక్యముల భంగి, భూరినియమముతోనభిచారహోమ, మొదలఁగావింపనగ్ని యథోచితముగఁ, జెలఁగి దక్షిణవలమానశిఖల వెలిఁగె.'' భాగ. ౧౦, స్కం. ఉ. (పొదలుయొక్కరూపాంతరము.)

**ఒదవు.** వై. అ. క్రి. 1. కలుగు; ''క. పార్థునపమూ, ర్థకళేబర మెదురఁగనిరొదవుశోకమునన్.'' జై. ౨, ఆ.—2. ఉపయోగించు*; ''సీ. సఫలమీతురగంబుజన్మంబుధర్మజుండొనరించు క్రతువునకొదవెఁగాన.'' జై. 3, ఆ.—3. యుక్తమగు*. ''క. ఇదియంతయుఁ దగఁగనికొని, మదినిస్సారంపువిద్యమరగకబంధ, చ్ఛిదఁజేయునాత్మవిద్యకు, నొదవఁదొడఁగినాఁడనుడుగనుద్యమ మెట్లున్.'' లక్ష్మీ. ౪, ఆ.

**ఒదవుబడి.** ద్వ. వి. ఉపయోగము. విశ. ఉపయుక్తము.

**ఒదిఁగిలు.** దే. అ. క్రి. ప్రక్కకొఱగు, ఒత్తగిల్లు. ''చ. ఒదికిలి పాన్పుపైఁబతికినొయ్యనఁగేలుతలాఁపుచేసి.'' ఉ, హరి. ౫, ఆ.

**ఒదిగిల్లు.** దే. వి. బ. ఒదిగిలుటలు.

**ఒదివిరిప్రాలు.** దే. వి. బ. ధాన్యవిశేషము. ''సీ. క్రొత్తగోని యల బియ్యమువర్లు నెమిలివన్లు, నొదివిరిప్రాలును నొనరంగఁ బోసి చాఁపలుమంచములుమీఁదబలియఁగట్టు.'' హరి. పూ. ౬, ఆ.

**ఒదుఁగఁబాఱు.** దే. అ. క్రి. (ఒదుఁగన్+పాఱు.) ఒదుఁగు. ''బ్రాహ్మణుండొదుఁగఁబాఱకనిల్చి.'' భార. అను. 3, ఆ.

**ఒదుఁగు.** దే. అ. క్రి. తొలఁగు. ''గొరిజలత్రొక్కునంబ్రిదిలికుండలిభర్తయొదుంగ.'' లక్ష్మీ. 3, ఆ.

**ఒదుఁగువడు.** ద్వ. అ. క్రి. (ఒదుఁగు+పడు.) తొలఁగు. ''క. ఒదుఁగువడయోజనత్రయు, ముదలంబగువిమతసైన్యములనీరీతిన్, మదమడఁచి.'' జై. ౫, ఆ.

**ఒదుఁగుపాటు.** ద్వ. వి. ఒదుఁగువడుట, తొలఁగుట.

**ఒదుగు.** దే. అ. క్రి. సమృద్ధమగు. (చూ. ఒదువు.) వి. సమృద్ధి. విశ. సమృద్ధము. ''క. ముబ్బిదలకొసని నవకపుఁ, బల్లవములతోడ ముక్తిభామచెక్కులకుం, బల్లెరుపూవులగుపువు, లుల్లసిలుసలక్కశాక మొదుగుగఁగొనుచున్.'' ఆము. ౪, ఆ.

**ఒదుగుపడి.** దే. వి. సమృద్ధి.

**ఒదువు.** దే. అ. క్రి. 1. క్రమ్ము; "గీ. అవనిముంచెఱంబొప్పొంబు లపమెఱుచ, నొక్కయుమ్మడిడెక్కం పుక్కుమిగిలి, యు నవమించిరమైనైన గ్రదిశా, పొదువఁజేరల్కఁజెదవులొంచ ముదర." మార్క. ౬, ఆ. (పొదువుయొక్కరూపాంతరము.)–2. సమృద్ధమగు. "ఘనమొదువంగఁబుచ్చుకొని." మార్క. ౨, ఆ.–వి. సమృద్ధి. విశే. సమృద్ధము. (ఒదుగుయొక్కరూపాంతరము.)

**ఒద్ద.** దే. వి. దాపు, సమీపము. "క. వచ్చెనువృగుసం, దనుఁడు నిజసందనకుఁ బ్రియ, మొనరింపఁగఁదలఁచిదానియొద్దకుఁ బ్రీతిన్." భార. ఆది. 3, ఆ.

**ఒద్ది.** దే. వి. ఒకానొకచెట్టు.

**ఒద్దిక.** దే. వి. 1. అనుకూల్యము; 2. ఒకవస్తువునకు సరియొస్తుగా నుంచితూఁచెడు జాయిలోనగునది, ప్రతిమానము. "సీ. తొలు నాడుకోఘ్యనీఁదులఁ దూఁచియాతని యెత్తుగనొద్దికలెల్లదాఁచి." విజ్ఞా. వ్య, కాం.

**ఒద్దియ.** దే. వి. సమృద్ధి. (అప్ర.)

**ఒద్దె.** దే. వి.——సై.——

**ఒనగూడు.** దే. అ. క్రి. సిద్ధించు. (ఒడఁగూడుయొక్కరూపాంతరము.) (ప్రే. ఒనగూర్చు.)

**ఒనరించు.** దే. ప్రే. ఒనర్చు, చేయు.

**ఒనరిక.** దే. వి. పొందిక, పొంకము.

**ఒనరు.** దే. అ. క్రి. 1. కలుగు; "సీ. భూతగణంబులచేతనీవారి సత్త్వమునకునెన్నొనరనీసనిశివుండు." నిర్వ. ౭, ఆ.–2. పొసఁగు, సరిపడు. "ఇదియుసదియునొనరుటెట్లొకొ." కళా. ర, ఆ.–3. ఒప్పు. "సమాప్తినొనరెన్ధరణీధర యూమఖంబు." (సమాప్తిన్ సమాప్తిచేతననియర్థము.) భార. సభా. ౨, ఆ.–వి. 1. పొందిక; 2. ఇంపు. "సీ. రామభద్రుండుగరంబుదూరంబుగానరిగి యంతటను దామరలుదృష్టి, కొనరుగైకొని." రాఘ. 3, ఆ.

**ఒనరుచు.** దే. ప్రే. ఒనరించు, చేయు.

**ఒనరుపడు.** ద్వి. అ. క్రి. పొందుపడు.

**ఒనవెట్టుకొను.** దే. అ. క్రి. (ఒనరు+పెట్టుకొను.) పొంచు వేయు. "సీ. ఓగిరంబుహరింపనొనవెట్టుకొనియైనవేగునంతకుఁజేసె జాగరంబు." కాశీ. ర, ఆ.

**ఒప్పందము.** దే. వి. అమ్మెడువాఁడును, కొనెడువాఁడును ఈవెలకు ఈసంకు నింతమాత్రము ఇచ్చెదననికాని తీసికొనియెదననికాని చేసికొనెడు ఏర్పాటు.

**ఒప్పగించు.** వై. స. క్రి. అప్పగించుయొక్కరూపాంతరము.

**ఒప్పగింత.** వై. వి. అప్పగింతయొక్కరూపాంతరము.

**ఒప్పనము.** వై. వి. అర్పణము. "సీ. ఒఱఁగత్తిపెటికనీకొప్పనమిదె యంచుసత్తికిఁ గత్తిచెయ్యెత్తిమ్రొక్కె." కళా. 3, ఆ. (అప్పనముయొక్కరూపాంతరము.)

**ఒప్పనసేయు.** వై. స. క్రి. అప్పనసేయుయొక్కరూపాంతరము. (చూ. ఉప్పెన.)

**ఒప్పమి.** దే. వి. 1. కీడు; "క. మున్నుగలగోపవర్గము, నిన్నుంగనికొలిచిభక్తినీపనిచేయఁగా, మన్ననమానిసివైనీ, వున్నంగడుసేలకొతయొప్పమిగలదే." భార. విరా. ౧, ఆ.–2. తప్పు. "నాయొప్పమియేమిసంఘటిలెనొక్కొయటంచు." కళా. ర, ఆ.

**ఒప్పరము.** దే. వి. జలదారి. "సి. రూపగాణపుటమ్ముతూమొప్పరముజలదారియంచనఁ గనుదసరునుజల, నిర్గమము." ఆం, భా. ప్ర. వారి.

**ఒప్పరికము.** వై. వి. ఉపేక్ష.

**ఒప్పరికించు.** వై. స. క్రి. ఉపేక్షించు. "గోర్యోన్నతు ప్రసనందసునినొప్పరికించితి." నిర్వ. ౬, ఆ. "నన్ను నిట్లొప్పరికించుట నీకుఁజాడియే." "క. నీవొకయపకృతినాకుం, గారింపవు నిన్నుపేక్షగైకొనివిడువన్." రా. బాల. కాం. "ఉ. .సున్ ఘటించినబుధ్యోత్తము నొప్పరికించ్చునమ్మహా, పాపికినన్నిజన్మములఁ బాయునొక్కో క్రిమికీటజన్మముల్." విక్ర. ౫, ఆ.

**ఒప్పారు.** దే. అ. క్రి. (ఒప్పు+ఆరు.) ఒప్పు. "శా. ఆరూఢస్థితిసెల్లదేశములునొప్పారున్ ప్రకాశంబుగన్." శాప. ఆ. ర, ఆ.

**ఒప్పించు.** వై. స. క్రి. ఒప్పగించు.

**ఒప్పిదము.** దే. వి. (ఒప్పు+ఇదము.) 1. అందము; "క. ళ్లయొప్పిదమాఁడుకట్టనుజవ్వలను సేయంగ." భార. విరా. ౧, ఆ.–2. అలంకారము; "చ. ఒప్పిదము లొనర్పఁబంచిరిగభీంవిభూతి యెలర్పఁపీటికెన్." హరి. ఉ. 3, ఆ.–3. విధము. "క. మంత్రంబునదె, ట్టిదముగఁబడవైచినయొ, ప్పిదమునశస్త్రమునఁగూల్చె భీష్ముని సూతున్." భార. భీష్మ. ౨, ఆ.–విశే. మనోజ్ఞము.

**ఒప్పు.** దే. అ. క్రి. 1. ఒప్పిదమగు, 2. తగు; 3. సమ్మతించు. వి. 1. అందము; "ఆకామినియొప్పుఁజూచిక్కితగులుమీఱెన." భార. ఆర. ౬, ఆ.–2. తప్పుకామి; "క. ఒప్పగునోతప్పగునో, యిప్పటికిందోఁచుకార్యమిది." ఉ, హరి. ర, ఆ.–8. సమ్మతి. "గీ. గంధమాల్యాదివానవల్ గ్రమ్ముదేరఁ, దోఁడుకొనివచ్చిరప్పుడా తోయజాక్షి, సరసుఁడున్నట్టికేళికాసదనమునకు, బలిమిచేనొప్పుచేతనుబద్ధముఖులు." అని. ౧, ఆ.

**ఒప్పుకొను.** దే. స. క్రి. సమ్మతించు, అంగీకరించు.

**ఒప్పుకోలు.** దే. వి. ఒప్పుకొనుట.

**ఒప్పులాఁడి.** దే. వి. (ఒప్పులు+ఆఁడి.) 1. చక్కఁదనముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**ఒబ్బట్లు.** దే. వి. బ. (ఒమ్ము+అట్టు.) భక్ష్యవిశేషము, పోళి.

**ఒబ్బిడి.** దే. వి. 1. పంటనుపేపడి; 2. నాశము. (ఇంటనున్న వడ్లగింజలన్నియు నొబ్బిడియైనవి.)

**ఒమ్మచ్చు.** ద్వి. వి. (ఒమ్ము+అచ్చు.) మణులను పొదుగుటకు బంగారుతోచేసెడు పీఠస్థానము.

**ఒమ్మిక.** దే. వి. ఇమిడిక, పొందిక. "ద్వి. సమ్మదంబునఁబన్నశాలగావించి, యొమ్మికగుసులనందునిచినవాఁడ." రా. అ, కాం.

**ఒమ్ము.** దే. అ. క్రి. ఒప్పు, సరిపడు. (ఈసెట్లునాకుఒమ్ములేదు.)–వి. బలుపు, స్థౌల్యము. విశే. పెద్ద, స్థూలము.

**ఒయ్యారము.** దే. వి. 1. విలాసము; "చ. పుట్టుగ్రుంగకుగ, ట్టనుదనరెండుచేతులనొయ్యారము మీఱఁగనేలకొమ్మదా, ల్చిన." య. ౫, ఆ.–2. సౌందర్యము. "ఎ, గీ. రతివిధంబునఁగనునొయ్యారమునఁబొందలి." చంద్ర. (ఒయ్యారముయొక్క రూపాంతరము.)

**ఒయ్యారి.** దే. వి. 1. విలాసముగల స్త్రీ; 2. సౌందర్యముగల స్త్రీ. విశే. సౌందర్యముగలది. "ఉ. ప్రేలునొయారిగ్రొమ్ముడుబు వెన్ను కెలంకులచోముహుర్ముహు, ర్లొలసటింప." రామా. ౧, ఆ. (ఒయ్యారియొక్కరూపాంతరము.)

**కంబూకము.** సం. వి. ఉ. పుం. కంచుకము, శత్రువు.

**కంసము.** సం. వి. అ. పుం. న. 1. కంచు; 2. కంచుగిన్నె; 3. పానపాత్రము. పుం. వు ఒక రాక్షసుఁడు.

**కంసారాతి.** సం. వి. ఇ. పుం. కృష్ణుఁడు, వెన్నుఁడు.

**కకపాల.** వై. వి. సన్యాసులు తలచుగాఁజంకనుబెట్టుకొనెడి యొక దినుసుసంచి. "శ్రీ. కకపాలకేదారకటకము ద్రిశపాణిఁగుఱుదలా రాముతోఁగూర్చిపట్టె." సావి. ౧, ఆ. (కక్కపాలయొక్క రూపాంతరము.)

**కకవికలు.** వై. వి. బ. యథాయథలు*. "క. కకవికలుగఁబోట్లా డుచు, వికలిల్లెడునాకడింపిరులయందుఁగన్." కళా. ౮, ఆ.

**కకావికలు.** వై. వి. బ. కకవికలుయొక్క రూపాంతరము. "ఉ. ఈడితశక్త సంగజగతీశ్వరుసైనికులట్టు చెంచుమెం, డాడఁగ నాత్త సైనికదయంబు కకావికలై కలంగియు, శ్రీడతఁబాఱఁబోచ్చుట యు." కళా. ౮, ఆ.

**కకుత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. ఎద్దుమూఁపురము; 2. రాజచిహ్నము. వి. శ్రేష్ఠము.

**కకుదము.** సం. వి. అ. పుం, న.———పై.———

**కకుద్మంతము.** సం. వి. త్. పుం. ఎద్దు. విశ. గొప్పమూఁపురము గలది.

**కకుద్మతి.** సం. వి. ఈ. స్త్రీ. శ్రోణి, పిఱుఁదు.

**కకుప్పు.** సం. వి. భ్. స్త్రీ. 1. దిక్కు; 2. శోభ; 3. సంపెఁగ దండ; 4. అల్లినజడ.

**కకుభము.** సం. వి. అ. పుం. 1. వేఱుమద్ది*; 2. వీణెకరిపె; 3. రాగభేదము.

**కక్కపాల.** వై. వి. కకపాల. "ఎ, గీ. కక్కపాలయుఁగక్షభాగ మునఁబూని." విక్ర. ౨, ఆ.

**కక్కరము.** వై. విశ. కఱకు. "ద్వి. ఎక్కుడుమునుడిగిబ్బయెన్ములు సొమ్ము, కక్కరంబగుతోలుకట్టెడువలవ." భాగ. ౮, స్కం.

**కక్కసపడు.** వై. అ. క్రి. (కక్కసము+పడు.) 1. బాధ పడు; 2. సంకటపడు. (చూ. కక్కసించు, కక్కసము.)

**కక్కసపెట్టు.** (కక్కసము+పెట్టు.) దృ. స. క్రి. 1. బాధ పఱచు. "వ. ఇక్కరణికక్కసులంగక్కసపెట్టె." రామా. ౭, ఆ.—2. సంకటపఱచు. (చూ. కక్కసము.)

**కక్కసము.** వై. వి. 1. కళ. "కక్కసంబులకొనదనదగాఁగ త్రేసియును." వై. ౪, ఆ.—2. బాధ*; (చూ. కక్కసించు.) —3. సంకటము*. "క. చేరినఁగాపారాఖ్యుఁడు, రారమ్మనిమిగుల నాదరమ్మునఁజొంటిం, పారనొనఁగెఁగక్కసమని, గోరపడకయిదు సాత్వికులచరితంబుల్." పర. ౧, ఆ.—విశ. 1. కఠినము; "ఉ. ఈ కక్కసపుందనంబుకొఱగాదనిసారెకుబుద్ధిచెప్పినన్." ఉ. రా. ౭, ఆ.—2. కష్టము*. "క. ఒక్కనిబిరివికినెదొరల్, పెక్కంద్రే నొక్కనొకనివెంబడినసుఁగుల్, పెక్కంద్రుసిలువఁబసులగుఁ, గక్కసముకుదింపఁజెంపఁగాఁగాకుండున్." ఆము. ౪, ఆ.

**కక్కసించు.** వై. స. క్రి. 1. బాధించు*; "ఉ. పోయిన పిమ్మటంజనక పుత్రివదల్పులఁ గక్కసింపఁగాఁ, బోయెదురాక్షసి నిచయముంగని." రామా. ౬, ఆ.—2. సంకటపఱచు*. (చూ. కక్కసము.)

**కక్కిరిబిక్కిరి.** దే. విశ. తొఱుమాఱు.

**కక్కు.** దే. స. క్రి. 1. కడుపులోనిది వెలిపుచ్చు; 2. వెడలించు. "పై. సంకుసేయుమియునుసభలోనులూకునిఁ బంచియాడించిన పరుసఁదనమును, గక్కంచి." భార. భీష్మ. ౨, ౧.—౧. అంపము జాయిలోనగువానికిఁగలుగఁజేసెడుగఱుకు. (ఈయర్థమందిది కఱకు యొక్క రూపాంతరము.)

**కక్కుఁదెవులు.** దే. వి. (కక్కు+తెవులు.) వ్యాధివిశేషము.

**కక్కుడు.** దే. వి. కక్కుట.

**కక్కుఱితి.** దే. వి. 1. అత్యర్థి; 2. లోభము. "వ. కెఱుపులఁ బెట్టిపిరినడకించితోలంగెద మన్నవట్టిక, కక్కుఱితియకాని నైవమును కూలముగాదు." వై. ౬, ఆ.

**కక్కుఱితికాఁడు.** దే. విశ. 1. అత్యర్థిగలవాఁడు; 2. లోభి "ద్వి. కడఁగిపీనుఁగుమీదఁగంచంబుపెట్టి, కుడుపఁగాఁజూచు కక్కుఱితికాఁడితఁడు." హరిశ్చ. ౨, భా.

**కక్కువాయి.** దృ. వి. కాసరోగవిశేషము.

**కక్కెర.** వై. వి. పక్షివిశేషము. "గీ. గ్రద్దయునుగాకిశముజును గక్కెరయును." హరిశ్చ. ౨, ఆ. (క్రక్కెరయొక్క రూపాంతరము.)

**కక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. కచ్చె; 2. పోటి. అ. పుం. ము. 1. చంక; 2. కసము; 3. గడ్డి; 4. పొద; 5. ఎండినయడవి.

**కక్షపాల.** సం. వి. ఆ. స్త్రీ. కకపాల. "ఎ, గీ. అక్షమాలను వస్తులకక్షపాల." సా. 3, ఆ.

**కక్ష్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. తొట్టికట్టు; 2. మొలనూలు; 3. ఏనుఁగు నడుమునఁగట్టెడుమోకు; 4. వాఁకుడుపు*.

**కగ్గము.** వై. వి. కత్తి, ఖడ్గము.

**కచ.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడేనుఁగు. అ. పుం. ము. 1. వెంట్రుక; 2. కట్టు; 3. ఎండినపుండు. డు. బృహస్పతికొడుకు.

**కచంకనము.** సం. వి. అ. స. నిర్ణయింపఁబడినదినమునందుంచెడి యంగళ్లవరుస, సంత.

**కచంగల.** సం. వి. ఆ. స్త్రీ. జంతువులు మిక్కిలి తిఱుచుగాఁగల నేల.

**కచిక్కు.** దే. వి. పొడుచుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. చికటూరిఁగొందికచిక్కునఁబొడిచె." విష్ణు. ఉ. ౪, ఆ.

**కచేలము.** సం. వి. అ. న. జాబుమడుపు.

**కచేరి, కచ్చేరి.** హిం. వి. కొలువుకూటము, ఉద్యోగశాల.

**కచోలము.** సం. వి. అ. పుం. మానవిశేషము.

**కచ్చరము.** సం. విశ. (అ. ఆ. అ.) మయిలది.

**కచ్చా.** హిం. విశ. పచ్చి, తక్కువ, నీచమైన.

**కచ్చి.** దే. వి. (సాలెవాఁడు) లేక కొయ్యలను పడుగునందుఁ జొప్పించెడు సందు.

**కచ్చించు.** యు. దే. స. క్రి. సాలెలులోనగువానినడపు. వై. అ. క్రి. కచ్చుఁగట్టు. "క. కచ్చించిమల్లులిద్దఱు, మచ్చరమునుబాఫు మెఱయమత్తకరులుఁరెం, డిచ్చఁజనుదెంచుచాడ్పున, నచ్చటికేఁతెం చినిలిచిరధిపతియెదురన్." హరి. పూ. ౯, ఆ.

**కచ్చిక.** దే. వి. కాలిన పిడకతునుక.

**కచ్చితము.** వై. విశ. ఎచ్చుతక్కువలులేక సరిగానుండునది*.

**కచ్చియ.** వై. వి. కలహము*.

**కచ్చె.** వై. వి. కచ్చియయొక్కరూపాంతరము.

**కచ్చెపోతు.** దృ. విశే. కలహశీలుఁడు.

**కచ్చేరి.** వై. వి. 1. న్యాయవిచారణస్థలము; 2. వినోదగోష్ఠి.

**కచోరము.** వై. వి. కచ్చూరకముకీ. (దీనినే గంధకచోరమందురు.)

**కచ్ఛ.** వై. వి. 1. వెనుకఁజెక్కుకొనెడు దోవతికొంగు; 2. కాసె; "గీ. కచ్ఛయమరఁబట్టికాళ్లునుజేతులు, వ్రేలమత్తగజములీలమెఱయు, ముష్టిబలువునెఱయముక్కునవాతను, నెత్తురోలుక మల్లునెత్తివైచె." భార. విరా. ౨, ఆ.–3. గోఁచికీ. "సీ. మొలకచ్ఛకట్టుసైమలఁగినపచ్చనినుసుఁగొంగుదింపుగానులివికట్టె." హరి. పూ. ౭, ఆ.

**కచ్ఛడము.** యు. దే. వి. దూదిజీలకఱ్ఱలోనగువానిఁదెచ్చెడుబండి. వై. కౌపీనము. "ఎ, గీ. ఇనుపకచ్ఛడాల్‌కట్టుకొనుమువిముచ్చు లెల్ల." సా. ౨, ఆ.

**కచ్ఛ.** యు. దే. స. క్రి. సారెలులోనగువానినడపు. వి. 1. గర్వము; "సీ. వరుసతోనోషధీవల్లీమతల్లులుకాంతివైభవలక్ష్మికచ్ఛవదల." కాశీ. ౧, ఆ.–2. తేకు; "ఉ. పంచశిలీముఖుండు తురబాణమునన్‌జగమెల్లగెల్చియు, భ్యంచితపుష్పవృష్టిమరుదావళినింపఁగనిప్పుడల్లుము, డ్రించినజాడఁదెల్పెసుదతీమధుపంబుపరిచ్ఛదచ్ఛటా, కంచుకితోత్పలంబుతుదకచ్ఛునఁజిక్కియ చంచలాకృతిన్." వసు. ౪, ఆ.–3. సిగబంతి. "ఎ, గీ. భానుబింబంబుపాడిచేఁబ్రభాతలక్ష్మి, కబరిభారంబుమీఁదిచెంగలువకచ్ఛ." కాశీ. 3, ఆ.–4. పెద్దవాసాము. వై. అన. "సీ. క్షీరోదమధ్యస్థలీరత్నసగగుహాగర్భనివాసంబుకచ్ఛవదలి." పాండు. ౨, ఆ.

**కచ్ఛకొను.** దే. స. క్రి. ఆశించు. "వారలీమేలంబుల్‌పచరించికచ్ఛకొనిరే." కసి. ౫, ఆ.

**కచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిమ్మట; 2. ఒకమాతృక. (చూ. మాతృక.) అ. పుం. ము. 1. వెనుకచెక్కుకొనెడుదోవతికొంగు; 2. గోఁచి; 3. కసెము; 4. ఓడయంగము; 5. దరి; 6. పూదోఁట; 7. ప్రక్క; 8. నందివృక్షము.

**కచ్ఛటిక.** సం. వి. ఆ. స్త్రీ. కౌపీనము, గోఁచి.

**కచ్ఛపము.** సం. వి. అ. పుం. 1. తాఁబేలు; 2. ఒకనిధి; 3. మల్లబంధవిశేషము.

**కచ్ఛపి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతాఁబేలు; 2. సరస్వతియొక్కవీణె; 3. మొటిమ.

**కచ్ఛుర.** సం. వి. ఆ. స్త్రీ. 1. గంట్లకచోరముకీ; 2. రేగడిమొలకీ; 3. వాఁకుడుకీ.

**కచ్ఛురుఁడు.** సం. వి. అ. పుం. జారుఁడు. విశే. గజ్జిగలవాఁడు.

**కచ్ఛువు.** సం. వి. ఊ. స్త్రీ. విచర్చిక, గజ్జి.

**కచ్ఛూరకము.** సం. వి. అ. పుం. గంధకచోరముకీ.

**కచ్ఛూరము.** సం. వి. అ. పుం. గంట్లకచోరముకీ.

**కజ్జలము.** సం. వి. అ. స. 1. కాటుక; 2. చీఁకటి. పుం. మబ్బు.

**కజ్యా, ఖజ్యా.** హిం. వి. పోరు, జగడము.

**కజ్జాయము.** వై. వి. కజ్జాయము, భక్ష్యము. "క. జాయంబులిందెన్నెనున్నవిక్రొత్తయట్టికల." పాండు. ౪, ఆ. (కజ్జెముయొక్కరూపాంతరము.)

**కజ్జెము.** వై. వి. కజ్జాయము, భక్ష్యము. "కజ్జంబులుసుసాన్లు గంధమాల్యంబులు ఘృతసాస్త్రసుకులుత్రత్తైః." భార. ఉద్యో. 3, ఆ.

**కజ్జాయము.** వై. వి. (కజ్జెముయొక్కరూపాంతరము.)

**కజ్జూరము.** వై. వి. ఖర్జూరముకీ. "మ. సువాసన్లట్కలిగొట్లు నందుగులు కజ్జూరంబు లబ్బెందులున్." యు. ౫, ఆ.

**కట.** దే. అవ్య. సంతాపమునుదెలుపును. "గీ. కటవియోగిలోకంబులుకటకటంబడ." పా. ౨, ఆ. (రూ. కహ. ఆమ్రేడితమందు కటకట, కటకటా.)

**కటంబకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) కూటులువండెడువాఁడు.

**కటంభర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. కటుకరోహిణికీ; 3. గొంటెమగోరుకీ.

**కటకట.** దే. వి. కొఱుకుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (పంట్లు కటకటకొఱికెను.) (చూ. గొండ్రించు.)

**కటకటఁబడు.** దృ. అ. క్రి. (కటకట+పడు.) 1. కోపించు; "గీ. అనినఁగటకటఁబడియిట్టులాడుటెల్ల, నతనివిజయమునొందియు మనుటగాదె." సం. "ఇత్యుక్తః కుపితో రాజా మత్స్యః పాండవమబ్రవీత్." భార. విరా. ౫, ఆ.–2. బాధపడు. "క. వందిజనంబులుమాగధ, బృందంబులు సంస్తుతింపఁబెంపొందుచుమ్రో, లందిరిగెడు క్రవ్యాదుల, క్రందున నీవిను లిపుడు గటకటఁబడవే." భార. ద్రో. ౨, ఆ.

**కటకటాలు.** దే. వి. బ. ఇనుపకమ్ములులోనగువానిచే నేర్పఱచెడి యడ్డు, (రూ.) కటకటాకమ్ములు.

**కటకము.** సం. వి. అ. పుం, న. 1. కడియము; 2. కొండనడుము; 3. ఏనుఁగుకొమ్మునకువేసెడుపొన్ను; 4. రాజధాని; 5. సముద్రమునందుఁగలిగెడి యుప్పు.

**కటకరము.** వై. వి. గంధర్వమృగము. "సీ. గంధర్వమానుగడంతి కటకరమంచనఁగాను." ఆం. భా. ద్వి. సిం.

**కటకాముఖము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (జేట్టన నడిమివ్రేళ్లసందునఁ బొటనవ్రేలుచొప్పించి యఱచేతిచాయవ్రాల్చి యుంగరపువ్రేలిని జిటికెనవ్రేలిని నించుకంతవంచి పాడవుగాఁబట్టినది.)

**కటకారుఁడు.** సం. వి. అ. పుం. 1. చాఁపలల్లువాఁడు; 2. మేదరవాఁడు.

**కటపెట.** దే. వి. ఒరయుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. కతినోరుదంష్ట్రలుకటపెటనొరయ." భాగ. ౭, స్కం.

**కటభి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మానేరుతీఁగ; 2. ఒకానొక మ్రాను.

**కటము.** సం. వి. అ. పుం. 1. ఏనుఁగుచెక్కిలి; 2. చాఁప; 3. అతిశయము; 4. పీనుఁగు; 5. ప్రతిజ్ఞ; 6. మొల; 7. శ్మశానము.

**కటాక్షము.** సం. వి. అ. పుం. 1. కడకన్ను; 2. కడకంటిచూపు.

**కటాక్షించు.** సం. స. క్రి. కడకంటఁజూచు.

**కటాదము.** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు.

**కటారి.** వై. వి. 1. కత్తి. "చ. కలకలనవ్వుచున్నృపశిఖామణిహొన్నుగనీబులోనియి, ట్టలపుమెఱుంగుచాయల బెడంగుకటారిజరీనదూసిమం, త్రులుగనఖాద్రుమస్తము కఱుక్కునఁద్రుంచె." ఉ, రా. ౭, ఆ.–2. బాఁకు. "కలికిమిటారియంగజుకటారి." శశాం. ౪, ఆ.

**కటారికత్తియు.** వై. వి. కటారికత్తి. (కటారి+కత్తి.) "... కటారికత్తియుఁ." క. ౧, ఆ. (చూ. కటారి కత్తి.)

**కటారికాఁడు.** వై. విణ. కటారిగలవాఁడు. "... విరుదుకటారికాం ..." క. ౫. ఆ.

**కటారు.** వై. వి. కత్తి. "వ. కత్తియుఁ, ... మొక కేలసి ... పెన ... కటారుసఁ." "గీ. చొచ్చెఁగొలఁకునేలకు, ... కటారుఁబోలి." ఉ, రా. ౭, ఆ. (ఈ గ్రంథకర్త ప్రయోగములయందు ... యుకారాంతము గానుపయుక్తమైన్నది.)—2. బాఁకు

**కటాహము.** సం. వి. అ. పుం. 1. నూనెలోనగునవికాఁచెడి కడవ; 2. కప్పెర; 3. తాఁబేటివెన్నుచిప్ప; 4. ఎకానొక దీవి; 5. అప్పుడే కొమ్ములు వెలువడిన యనుపదూడ.

**కటి.** సం. వి. ఇ. స్త్రీ. మొల. ఈ. స్త్రీ. పిప్పలి*.

**కటికి.** వై. వి. మాంసమమ్మువాఁడు. "గీ. కటికవానిల్లునాటికెఁగన్న పెట్టె." పల్నా. ౧, ఆ.—2. వెండిబెత్తమువాఁడు*. "వ. బంగారుకటికపోవబెత్తంబులసలనఘటియిల్లఁగటికవారుసారెకు బరాబరిసేయుచునేగుదేర." కళా. ౭, ఆ. (కట్టికయొక్కరూపాంతరము.) (చూ. కట్టిక.)

**కటికమెకము.** వై. వి ఖడ్గమృగము.

**కటికి.** దే. విణ. 1. అధికము. "కటికివవ్వ."—2. కఠినము. "కటికి నేల."—3. సాంద్రము. "కటికిచీఁకటి."

**కటినము.** సం. వి. అ. న. పత్రఫలాదులుంచెడుబుట్ట.

**కటిల్లకము.** సం. వి. అ. పుం. 1. కప్ప; 2. కాఁకరతీఁగె*; 3. నల్లగన్నేరు*.

**కటీరము.** సం. వి. అ. పుం. మొల. "సీ. పట్టసూత్రమయంబు పసిఁడియొడ్డాణమేయిగురుఁబోఁడి కటీరమెక్కెనొక్కొ." కాశీ. ౪, ఆ.

**కటుంభర.** సం. వి. అ. స్త్రీ. కటుకరోహిణి*.

**కటుక.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి*. అ న. ము. సొంటి పిప్పలి మిరియములు.

**కటుక్కు.** దే. వి. కొఱుకుటయందగు ధ్వన్యనుకరణము.

**కటుతుంబి.** సం. వి. ఈ. స్త్రీ. చేఁదుగల సొరకాయ*.

**కటుమరలు.** దే. వి. బ. చెక్కిళ్ల మీఁదిభాగములు, పనువు. "సీ. తళుకుఁజెక్కులువెల్లఁదనముమెల్లనఁదాల్చెఁ గనరానికటుమరల్ పెనుపునొందె." చంద్రా. ౧, ఆ.

**కటురోహిణి.** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి*.

**కటువు.** ఉభ. వై. వి. పాడె. సం. వి. ఉ. స్త్రీ. 1. కటుకరోహిణి*; 2. నల్లావ; 3. ప్రేంకణము*. న. కానిపని. పుం. 1. కారము; 2. వాసన. విణ. 1. ఇంపుకానిది; 2. కారముగలది; 3. మచ్చరముగలది; 4. వాఁడిమిగలది; 5. వాసనగలది.

**కటోలవీణ.** సం. వి. ఆ. స్త్రీ. మాలవీణె, కిన్నెర.

**కట్ట.** దే. వి. 1. మోపు; 2. చెఱువులోనగువానికట్ట. అవ్య. సంతాపమునుదెలుపునది, (రూ.) కట్టా.

**కట్టకడ.** దే. వి. (కడ+కడ.) అన్నిటికిఁగడ.

**కట్టడ.** దే. వి. 1. నియమము; "క. ఏయేకట్టడలెవ్వరి, కాయాకట్టడలుతప్పకధిపతిప్రజలన్, నాయమునఁబ్రోవవలయుఁగృ, పాయుతుఁడైశక్కరాదిబాధలుడుపుచున్." కళా. ౭, ఆ.—2. తీరు. "క. పరలమునివేషంబుల, కాఁటముసఁ... యోడలికట్టడయుమ్ము శ్రీరాముఁడయకంబును, పేఁరముఱునెయట్లకా ... ప్రకటంబయ్యెన్." నిర్వ. ౧౦, ఆ.

**కట్టడచేయు.** దే. స. క్రి. ఆజ్ఞాపించు. "సీ. జనసేనాపతిర్నందనునియజ్ఞ బర్హిసింపఁదగో, రిననుంగట్టడ చే ... వారిఁ గొంచుఁబొమ్మంచు" వై. ..

**కట్టనము.** దే. వి. 1. కానుక; "సీ. గాఁడీవికనిమెలుకట్టనంబు మర్చిసప్తపేటికలందు సంఘటించి." వై. ౭, ఆ.—2. బంధనము. "ఉక్కుటులులరాకట్టనపుటెడల గైకొనసఱకుట." హరి. ఉ. ౨, ఆ.

**కట్టరము.** వై. వి. నాట్యబంధము, (చూ. కంబ.)

**కట్టిఁడి.** దే. విణ. (కట్టు+ఇఁడి.) క్రూరుఁడు. "శా. ఆనీచుం డోకనాఁడువాఁడిమిఁజతురావ్యవాన్విహుం ... గాసంచరువ్వలు గట్టియేగుప్రజలంగట్టిండియెదోఁచినీ, ... యుచునుంచె డక్కిగొనిమధ్యాహ్నరపాపాటు, గ్లానింపన్మయార్తికాసరముఁబో లంజాలినల్దిక్కులన్." పాండు. ౫, ఆ.

**కట్టిక.** వై. వి. వెండిబెత్తమువాఁడు*. "ద్వి. కటికకట్టెలుసాఁగు బలాయనంగ, నేతాఁకువలెఁదారుఁడతెంచిమ్రొక్కి." రా. కిష్కిం, కాం.

**కట్టియ.** వై. వి. 1. కట్టె; 2. దండము; "సీ. కట్టియఁజేకొని చేగం, బట్టియుబుసుపోకఁబోఁలనుఁబట్టెనటాలుకన్, దొట్టినక్రొవ్విలుగలయవి, చెట్టడిచినఁజేటుఁడేమిచెప్పంబులుఁగొడ." స్వా. ౪, ఆ.—3. బాణము*. "ఉ. కట్టియవైచెనన్నదురుగాఁడఖవత్తనయుండుమాద్రిలేఁ, బట్టిని." భార. శల్య. ౧, ఆ.

**కట్టు.** దే. అ. క్రి. 1. (అవులోనగునది) గర్భముధరించు; 2. నిబద్ధమగు. "కట్టువిణ్మూత్రములు." మార్క. ౨, ఆ. (అంచెలుగట్టు, అంటలుగట్టు, అట్టుకట్టు, కరుడుకట్టు, కాలువలుగట్టు, గెలలుగట్టు, ఇత్యాదులయందిది అనుధాత్వర్థమని యెఱుంగవలయు.)—స. క్రి. 1. బంధించు; 2. ఆరోపించు; "క. దోషరహితకన్యకపై, దోషంబులుగట్టిరిత్తదూషించిన." విజ్ఞా. ఆచా, కాం.—3. కూడఁబెట్టు; "క. ముకట్టినకర్మఫలంబులు, నెట్టనభోగింపకుండనేర్తురెమనుజుల్." భార. ఆది. ౫, ఆ.—4. నిర్మించు; (ఇల్లుకట్టు లోనగునది.)—5. (వస్త్రము) ధరించు; "సీ. కట్టంగఁ దొడఁబుయ్యఁబెట్టఁగొఱంతలేకానందమందెనుసర్దులుండు." నిర్వ. ౧, ఆ.—వి. 1. బంధము; 2. తోఁటికట్టు; 3. వస్త్రధారణము; "కాళ్లయొప్పిదమాఁదుకట్ట నుజ్జ్వలముచేయంగ." భార. విరా. ౧, ఆ.—4. నిబంధనము; 5. నిర్బంధము; 6. ప్రదేశము; "ఉ. ఓర్తులతాంగితేపెడు, కట్టుసముంగిటంగసవృగాంద్రయుఁబుచ్చుచుఁ జేతిచీఁపురుం, గట్టయుఁదాను జొచ్చెఁగఁఱకంతుని సోంకృతినాదదేవునిన్." కాశీ. ౬, ఆ. (ఇట్లు చనుకట్టులోనగునవి.)—7. మితి; "క. ఏడన్మీకొలమింటన్, జూడము ముంగురులఁగూడుచుం గొనబునని, ట్లీడెబికట్టుతప్పిన, చేడియ నీకసైనఁదెంప్లిసయం దగదే." య. 3, ఆ.—8. ఉడికినకందిపప్పులోనగువానిరసము, యూషము; 9. (పొల్లయొక్క) సమూహము. "గీ. సామరదివ్యక్షుఖఖస్థరక్షఃపిశాచ, పుంజమహిభుక్పతత్రిప్రభంజనములు, సోఁకవెఱఁబాఱెఁగల్లొనఘూర్ణవాత, ఘట్టనలఁబాఱుసనుఁబోల్లకట్టునోలె." ఆము. ౪, ఆ.

**కట్టుఁగంబము.** ద్వి. వి. (కట్టు+కంబము.) ఏనుఁగులోనగువానిఁ గట్టునట్టి స్తంభము. "గీ. కట్టుఁగంబంబువిఱుచునుగ్రంపుగజము." హరి. పూ. ౯, ఆ. "వ. వసపార్శ్వకట్టుఁగంబంబులకుం దార్చిబంధించిన." (ఇక్కడ కుక్కనుగట్టు నట్టిస్తంభము.) స్వా. ౪, ఆ.

**కట్టుఁగొంగు.** దే. వి. (కట్టు+కొంగు) కోకయొక్క కట్టుకొను చెఱఁగు.

**కట్టుఁగొమ్మ.** దే. వి. (కట్టు+కొమ్మ.) అనకట్ట.

**కట్టుఁగొయ్య.** దే. వి. (కట్టు+కొయ్య.) నాఁగటిమేఁడి.

**కట్టుఁగోక.** దే. వి. (కట్టు+కోక.) మొలను ధరించెడు వస్త్రము, అంతరీయము. (ఇట్లు కట్టుబట్ట యనఁగును.)

**కట్టుక.** దే. వి. గర్భస్రావము

**కట్టుగడ.** దే. విశే. చేర్చిపెట్టినది. (గ్రామ్యము.)

**కట్టుగొఱ్ఱు.** దే. వి. (కట్టు+కొఱ్ఱు.) పసులను గట్టుటకు నేల్మునఁ బాఁతినగుంజ, మేధి.

**కట్టుదొన.** దృ. వి. కోసెలు. "సీ. వనచరిత్రామృగయునకటమృగములజనులవినుయకట్టుదొనలుగాఁగ." చంద్రా. ౫, ఆ.

**కట్టుపకాసి.** దృ. వి. రణోద్యుక్తుఁడైన శూరుఁడు. "ఉ. కట్టుపకాసి వేర్వధృతకాయుఁడు సత్ప్రతిహారివాలకుంటు." నిరం. ౪, ఆ.

**కట్టుపకాసు.** దే. విశే. అచలుఁడు. "చ. కనుఁగొనిపార్థుడుండవుడు కట్టుపకాసయి వీఁకఁదాఁకినన్." భార. భీష్మ. ౨, ఆ.

**కట్టుపడు.** దృ. అ. క్రి. బద్ధమగు.

**కట్టుపాటు.** దృ. వి. 1. కట్టుపడుట; 2. నిబంధనము.

**కట్టుబండి.** దే. వి. సకలపరికరసహితమైన శకటము. "ఉ. మొన్న మేరుగిరిపాటినిశాచరినంతచేసెనే, డేపునఁగట్టుబండి నిదెయింద ఱుఁజూడఁగనింతచేసె." వి, పు. ౭, ఆ.

**కట్టుబడి.** దే. వి. బంటునకిచ్చెడుమాన్యము. "సీ. ఇగురుకైజీతపు టెక్కటీలకు గుజ్జుపఱుపుమామిడికట్టుబడిగఁజెసి." చంద్ర.

**కట్టుమట్టు.** దే. వి. 1. పసులనుగట్టుచోటు; (దీని నీ యర్థమందు కట్టుముట్టని వాడుచున్నారు.) 2. ఉనికిపట్టు; "సీ. పాకారి ముఖ్య దిక్పాలకనిలయంబు గ్రహతారకంబులకట్టుమట్టు." భల్లా. 3, ఆ.—3. ఏర్పాటు. "వ. దుష్టనిగ్రహశిష్టపరిగ్రహంబుగాన పట్టణంబును గ్రీవాజ్ఞనడవంగట్టుమట్టుచేసి." రామా. ౫, ఆ.

**కట్టుమామిడి.** దే. వి. చిలుకలులోనగునవి కొఱకకుండ పండ్లు మూసికట్టఁబడిన మామిడిచెట్టు.

**కట్టుమ్రాను.** దే. వి. తెప్ప, ప్లవము.

**కట్టువ.** దే. వి. వెలుగు, వృతి. "సీ. అటతిప్పలు వ్రచ్చిపాటబండులుగూల్చికట్టువలన్నియుఁగాడుచేసి." అచ్చ. సుం, కాం.

**కట్టె.** వై. వి. కట్టియయొక్కరూపాంతరము.

**కట్టెడ.** దే. వి. ఎడనెడ కట్లుగల సర్పవిశేషము.

**కట్టెపాఁపర.** దృ. వి. ఒకానొకచెట్టు.

**కట్టెవిఱుపుమాట.** దృ. వి. పరుషవచనము, కఠినోక్తి.

**కట్నము.** దే. వి. కానుక. "క. నానాదేశంబులధర, జేనాథులు గట్నమిచ్చినెపఁబుత్తేరంగా." హరి. పూ. ౮, ఆ. (కట్టనము యొక్కరూపాంతరము.)

**కట్ఫలము.** సం. వి. అ. పుం. పినగుమ్ముడుచెట్టు.

**కట్ల.** వై. వి. ఒకానొకతీఁగ, ఖట్వ.

**కట్లంక.** దే. వి. వరునడ్డలపైనుంచెడి యొంటిగుడ్డ.

**కట్లగుదియ.** దృ. వి. ఆయుధవిశేషము, ముసుండి.

**కట్లజెట్టి.** దే. వి. కట్లుగల పెద్దజెట్టి.

**కట్లపండ.** దే. వి. ఎడనెడ బంగరుకట్లు గ్రుచ్చిన కట్లపూసల సరము.

**కట్లపురుగు.** దృ. వి. సర్పవిశేషము.

**కట్లబల్ల.** దృ. వి. (కట్లు+బల్ల.) కత్తికట్లమడుపుబల్ల.

**కట్లమారి.** దే. విశే. కట్లుగలది. "వ. కన్నెగోయతు లున్నవాసెంయంచు గట్లమారుల నక్కిగట్లు వసిగా." చంద్ర.

**కట్లసంచి.** దే. వి. (కట్లు+సంచి.) చుట్టు అంచెప్పుకుచ కుట్టిన సిడుపాటి గుండుసంచి.

**కట్లి.** వై. వి. మంచెపుకోల.

**కట్లియ.** దే. వి. బంగారు తూనికసంచి.

**కట్లె.** దే. వి. కట్టియయొక్కరూపాంతరము.

**కట్వాంగము.** సం. వి. అ. పుం. దుండిగముచెట్టు.

**కఠము.** సం. వి. అ. పుం. కంఠస్వరము. డు. 1. ఒకానొకఋషి; 2. ఆ ఋషిచెప్పిన ఋక్కులను జదువువాఁడు; 3. ఆ ఋక్కులను దెలిసినవాఁడు.

**కఠారము.** సం. వి. అ. పుం. 1. కత్తి; "క. ప్రతిఘటియింపఁగ వచ్చునె, ప్రతిభటులకు ననమనమరఫల్గునతోడన్, శతకోటిదృఢకఠార, హతశాత్రవతోడ లెంగనచిప్పనితోడన్." భీ. ౧, ఆ. "క. ఘోరక్రోధంబునన, వీరోత్తమునాజ్ఞనొక్కనైనసన్నక్రం, చారిచిరప్పు డపట్టెక, ఠారింబునముక్కుఁజెవులుడగ్గఱఁగోయన్." సం. "ఉద్వృత్యోద్ధఁచిచ్ఛేదకర్ణనాసంమహాబలః." రా. అర. ౧, ఆ.— 2. బాఁకు. "వ. కఠార కుఠారగదాదండ భిండివాల కరవాల శూలము సలముద్గరతోమరచక్రాదినానాయుధపరివృతబాహుదండుండును." వీర. ౪, ఆ. "వ. కఠారంబులఁబొడిచియుఁ గుఠారంబులనఱికియు." రా. యు, కాం.

**కఠంజరము.** సం. వి. అ. పుం. నల్లగగ్గెరచెట్టు.

**కఠిన.** సం. వి. ఆ. స్త్రీ. బెల్లపుచక్కెర. అ. న. ము. వంటకుండ. విశే. గట్టి.

**కఠిని.** సం. వి. ఈ. స్త్రీ. ఘటిక, బలపము.

**కఠిల్లకము.** సం. వి. అ. పుం. 1. కప్పు; 2. కాఁకరచెట్టు. 3. నల్లగగ్గెరచెట్టు.

**కఠిల్లు.** దే. వి. హతియందగుధ్వన్యనుకరణము. "వ. పరిహసితసితేతరపాషాణపాటవంబులగు విషాణపరిఘంబులొండొంటిందాఁకి కఠిల్లు పెఠిల్లు మనంబోరు కారుపోతుల కోలాహలంబులం ప్రతిశబ్దంబులీనుకొనలును." స్వా. ౪, ఆ.

**కఠోరము.** సం. విశే. (అ. ఆ. అ.) కఠినము, గట్టి.

**కడ.** వై. వి. 1. దిక్కు; "గీ. దిక్కరాయఁడుతమిమీఱరేవెలందిఁ, దెండ్లియగుననికడయనుపేరఁటాలు, మొసనియైరేసినీటికైముంచుప సిఁడి, కుండయనఁబ్రొద్దుమున్నిటఁగ్రుంకెనంత." అచ్చ. అర, కాం.—2. అంతము*; "సీ. నిడుపునఁదూరుపుఁబడమరయైరెండు కడలునంబోనిధిఁగదిసియుండు." భార. భీష్మ. ౧, ఆ.—3. దూరము*; "వ. ప్రాణవల్లభుండున్నవనంబునకరిగి కడనయుండి పరికించి." కళా. ౪, ఆ.—4. పార్శ్వము*; "సీ. హయము క్రేళ్లుఱుకునోయని రెండుకడలందువాగెవట్టిరిమత్స్యవత్సపతులు." కళా. ౭, ఆ.—5. సమీపము*; "క. కడునసురక్తియునేర్పునను, గడఁకయుఁగలవారినుఱకగడవఁగనెగ్గుల్, నొడివెడువివేకశూన్యుల, కడనుండెడుసంతకంటెఁ గష్టముగలదే." ఆము. 3, ఆ.—6. స్థానము*. విశే. అంత్యము*. "వ. ఎయ్యదికడగానిమక్కళ్ళఘుండనగుదు." భార. శాం. ౧, ఆ.

**కడంగరము.** సం. వి. అ. పుం. 1. వాల్లు; 2. వాల్లుకసవు.

**కడంగరీయము.** సం. వి. అ. పుం. వాల్లుకసవుమేయునట్టి యెద్దు.

**కడంబము.** సం. వి. అ. పుం. కలంబము, కూరనాళ.

**కడంక.** దే. వి. యత్నము. "ఉ. దానినం. టంపఁబమేక్ వరాహము పెంపు నదర్పిని మయ్యెన నయ్యెడక్." విక్ర. 3, ఆ.

**కడకొఱవి.** దే. వి. కాలికొనగిలిపోగనుడికట్టె. "క. జ్ఞాతులుతమలోఁ బొందినఁ, బలోమోదమునఁబెలఁగిచెలువొందుదుర, స్నేహించాసిన పగఁబొ, పాతిఁగడకొఱవులట్ల పొగయుదురధిపా." భా. ఉద్యో. ౨, ఆ.

**కడఁగు.** దే. అ. క్రి. యత్నించు. "క. మునినాథసీప్రమునును, బ్రాహ్మణుపనుజాలుమఱికడంగఁడు." ఉ, హరి. ౫, ఆ.

**కడఁజు.** దే. వి. గోకర్ణమృగము. "సీ. గోకర్ణచామంబగనుగడంజు కడఁజూ." ఆం, భా. ద్వి. సిం.

**కడఁతె.** దే. వి. కంటికడప్రక్కచోటు, కణత. "ఎ, గి. కడంత యసఁగనుఁబాశ్వప్రమంతకారి." ఆం, భా. ద్వి. మ.

**కడఁతి.** దే. వి. గండభేరుండమృగము. "పులులఁద్రుంచికడంతులం దునిమి." శుక. ౧, ఆ.

**కడఁబడు.** ద్వి. అ. క్రి. (కడమ+పడు.) తగ్గు. "క. హరిసూకర రూపంబున, హరిహాదిమృగాకృతుల మహాస్తులజంబై, హరసుతుఁడు పూజ్యులైయుం, దరె వారలగౌరవము కడంబడియనొకో." పంచ. వేం. ౧, ఆ.

**కడకుఁబోవు.** ద్వి. అ. క్రి. (కడకున్+పోవు.) బహిష్టయగు.

**కడకొఱవి.** దే. వి. కాలఁగామిగిలినకట్టె. "ద్వి. పొంతయొల్కఁ బలోపఁబొడవడికాలి, కొంపచిక్కిన కడకొఱవులఁదెచ్చి." హరిశ్చ. ౨, భా.

**కడగండ్లమారి.** దే. విశ. కష్టశీలుఁడు.

**కడగండ్లు.** దే. వి. బ. (కడ+కండ్లు.) కష్టము.

**కడగట్టు.** ద్వి. స. క్రి. (కడ+కట్టు.) నిర్ణయించు. "క. మును మున్నకాచెయార్యులు, వినుతనిజజ్ఞానదృష్టివిధిఁదిరముగఁగ, న్గొని కడగట్టినవారీ, తనియాదృశభావచేష్టితములఖిలములున్." హరి. పూ. ౮, ఆ.

**కడగన్ను.** ద్వి. వి. (కడ+కన్ను.) కటాక్షము.

**కడగొట్టు.** ద్వి. అ. క్రి. (కడ+కొట్టు.) చచ్చు. "మ. కెడసెన్ దుష్పలుడింకవేసెనెలుఁగుల్ గిట్టెన్బులుల్ సింగముల్, కడగొట్టెన్." పా. ౧, ఆ.—విశ. కడపటి. (కడగొట్టుకొడుకు, కడగొట్టుచెల్లెలు మొ.)

**కడచేను.** ద్వి. అ. క్రి. 1. చచ్చు; "సీ. జననాథశల్యుండు సమసె సౌబలుఁడు గీటడఁగె నులూకుండుమడిసెసకల, సంశప్తకులుఁగడచనిరి." భార. శల్య. ౧, ఆ.—2. సహించు; "గీ. ఇట్లు చేసిశక్తియెల్లనుగడచన్న, సతఁడునేలవ్రాలెనతిరయమున." భార. అను. ౧, ఆ.—3. మునియు. "క. అనఘాయీయజ్ఞమువిధి, సనాథ ఋత్విక్ప్రయోగసంపూర్ణంబ, య్యెనుగడచననేరదునడు, మనయు దుగునుభూసురోత్తమనిమిత్తమునన్." భార. ఆది. ౨, ఆ.—స. క్రి. దాటు. "క. వననిధినవలీలంగడ, చనువానిప్రసాదమొంది సతులు గృహంబుల్, ధనములుసఖిలసుఖంబులు, మనమారంగాం తురోలిమర్కటులెల్లన్." రా. కిష్కిం, కాం.

**కడచు.** దే. అ. క్రి. 1. గతించు; "క. చింతింపకు కడచినపనికి."—2. చచ్చు; "క. మహాహవమునన్నె, వ్వనిచేజటాయువుబిల్గెను, ఘనుఁడా దశరథసఖుండు గడచనయకటా." రా. కిష్కిం, కాం.—3. సహించు; "శ్రీ. అతివేగపవన దంద్రమ్ముంబునఁగానికడచు నెమోహాంధకారధరము." భాను. ౪, ఆ.—4. మేరమీఱు; "ఎ, గి. ధరణిధరములుగూలంగధరఁగవడఁక, జలధు లుప్పొంగికడవఁగ." మార్క. ౨, ఆ.—5. హెచ్చు. "క. నడిగల్గిహానసగతికిం, గడవఁబఱచువారున." భో. ౫, ఆ.—స. క్రి. దాటు. "గీ. అలసుమంతునివిడ్కొనియుక్కవఁగె, ఘనులుగంగానదిఁగడచి." రామా. ౫, ఆ.

**కడచుక్క.** వై. వి. రేవతీనక్షత్రము.

**కడతెగు.** ద్వి. అ. క్రి. సమాప్తమగు. "క. ఉమునుండలంబు దాఁకను, వడినేగితిఁగోటదాఁట వచ్చునొయంచున్, గడతెగక యంతకంతకుఁ, బొడవయ్యెనునాకుదాఁటిపోగాదయ్యెన్." మై. ౨, ఆ.

**కడతేఱు.** ద్వి. అ. క్రి. 1. చచ్చు; "సీ. శాస్త్రలముఖుఁడీల్గెస్త నితహస్తుఁడుసెల్లెదీర్ఘజిహ్వుఁడు గడతేఱిపోయె." అచ్చ. సుం, కాం.—2. తీఱు; "అట్లకాదె విషమజ్వరంబుకడతేఱునె." భో. 3, ఆ.—3. సమాప్తమగు. "సీ. ధ్రువమండలంబునరుంధతిఁగను శక్తికంటికిఁగలుగంగఁ గానకున్న, ముక్కునవలపలఁజెక్కవాసిన యట్లుదోఁచినఁబూర్ణచంద్రుఁడుమలినుఁ, డైకానవచ్చిననాయువు సంవత్సరంబునఁ గడతేఱురాజముఖ్య." భార. శాం. ౬, ఆ.

**కడప.** యు. దే. వి. ఇంటిగడప, దేహళి. (కొన్నిదేశములయందిట్లు పకుషాదిగా వాడుచున్నారు.)—వై. కదంబమునకే.

**కడపల.** వై. వి. అంతము. "ఎ, గి. ఏది మొదలేదికడపలయేది మధ్యము." భీ. ౬, ఆ.

**కడపు.** దే. ప్రే. 1. ఇయ్యకపొమ్మను; "ఏపట్టునసర్థులంగడప." భో. 3, ఆ.—2. చంపు; "సీ. ప్రక్కనిద్రితుఁడైన రాకొమారు నిఁజేరి బిగియారఁగుత్తుకపిసికికడపి." హరిశ్చ. ౫, ఆ.—3. త్రోలు; "అరదంబుదారకుండుగడప." ఉ, హరి. ౪, ఆ.—4. వదలు. "చ. నీయనుజులనల్వురంగడపుమర్తునుచేఁతకు సమ్మతించితిన్." భార. ఉద్యో. ౪, ఆ.

**కడపుఁజేయి.** దే. వి. (కడపు+చేయి.) చుఱుకును, అతిక్రమము, "సీ. వైరిసైన్యాబ్ధిలోవచ్చు గెల్పులనావఁగడఁజేర్చుప్రాఁకుడుఁ గడపుఁజేయి." పా. ౧, ఆ.

**కడమ.** దే. వి. 1. కొఱఁత; "క. కడమయొకింతయువలదని." హరి. ఉ. 3, ఆ.—2. శేషము. "క. మొదలసెనాకుంగలిగిన, యదిశంఖసుదర్శనాంకనాదిసహితమ్మై, పొదలెడిప్రపత్తియిఁకనడ, పెదఁగడమయుఁబడుచునిమ్ముప్రేమదలిర్పన్." పర. ౪, ఆ.

**కడమపడు.** ద్వి. అ. క్రి. కొఱఁతపడు.

**కడముంత.** ద్వి. వి. కొయ్యముంతవంటి చిన్నమట్టిపాత్రము.

**కడముట్టు.** ద్వి. అ. క్రి. 1. సమాప్తమగు; "సీ. తనసేవగాఁ బురందరుఁడు గట్టించుకెంపులహజారముకడముట్టెనొక్కొ." కళా. 3, ఆ.—2. సిద్ధించు. "క. సివలనస కడముట్టిన, దైవశ మహిమయును." పాండు. ౧, ఆ.

**కడయొత్తు.** ద్వి. వి. (కడ+ఒత్తు.) గృహవిశేషముయొక్క చుట్టు గోడయందలి కంబములమీఁది దూలము.

**కడలి.** దే. వి. మున్నీరు, సముద్రము.

**కడలికూఁతురు.** దే. వి. సిరి, లక్ష్మి.

**కడలిఱేఁడు.** దే. వి. నీటిరాయఁడు, వరుణుఁడు.

**కడలివెన్న.** దే. వి. చంద్రుఁడు. "రగడ. కడలివెన్నయువేఁడి వేలుపుగాడ్పునగ్గియు నెల్లగాములు." అచ్చ. యు, కాం.

**కడలు.** దే. వి. బ. "సీ. తూరెడుపయ్యెదడుఃఖాంబుశీథిలోపఁ గడలు దండంబుగఁగడలుకొనఁగ." హరి. పూ. ౯ ఆ.

**కడలుకొను.** దే. అ. క్రి. 1. అతిశయించు; "క. వడువక కావేరినియం, పదుకొస్నానంబుసేయుననఘులకు సిరుల్, గడలు కొను." శేష. ౪, ఆ.—2. ఉప్పొంగు; "గీ. ఇవిస్ఫథముసఁ గృష్ణుఁడేగినపిదపటి, కథవినంగనాకుఁగౌతుకంబు, మనమునిండి గడలుకొనుచున్నయదివివ, రించిచెప్పు మునివరేణ్యయనుడు." భార. ఉద్యో. 3, ఆ.—3. వ్యాపించు. (చూ. కడలొత్తు. "వీఁకంగేసరంబుల్గడలొ్కొన." భార. ఉద్యో. ౩, ఆ.)

**కడలొత్తు.** ద్వి. అ. క్రి. (కడలు+ఒత్తు.) వ్యాపించు. "కేసరమూలములజిగికడలొత్తి." హరి. పూ. ౮. ఆ.

**కడవ.** వై. వి. పెద్దకుండ*.

**కడవఁబడు.** ద్వి. అ. క్రి. (కడవక్+పడు.) గతించు. "గీ. కడవఁబడియున్నవహ్నిగ, గడుకొనిపడినవియకానిక్రమ్మసుమలం, బడనీనింకక్." భార. ఆది. ౨, ఆ. (స్వార్థమునపడు.)

**కడవతీటు.** ద్వి. వి. వాద్యవిశేషము, తుడుము.

**కడవసము.** దే. వి. తోలు. "క. కడవసములుగోలలుగ, ప్వడములుఫిరలధనంబు." భార. ఆది. ౭, ఆ.

**కడవాఁడు.** ద్వి. విణ. 1. అన్యుఁడు; 2. కనిష్ఠుఁడు. "సీ. గారాపు మీతల్లికడవాఁడఁగానియేగ ణుతింపఁగడవాఁడఁగాఁజూమ య్య." స్వా. ౫, ఆ.

**కడవెల్లు.** ద్వి. అ. క్రి. సమాప్తమగు. స. క్రి. దాటు. "ఎ, గీ. విరహవారిధినేఁగడవెల్లు టెపుడు." ప్రభా. 3, ఆ.

**కడసరము.** దే. వి. శ్వేనవిశేషము. "సీ. కన్నెలేడులమీఁదగాటంపు బీరంపుఁగడసరంబులఁజోఁపిగండడంచి." రసి. ౧, ఆ.

**కడాని.** దే. వి. అపరంజి, తప్తకాంచనము.

**కడారము.** సం. వి. అ. పుం. గోరోజనమువంటి వర్ణము. విణ. గోరోజనమువంటి వర్ణముగలది.

**కడాసము.** దే. వి. కడవసముయొక్క రూపాంతరము. "సీ. చర్మ నామముకడాసముకడవసమన." ఆం, భా. ద్వి. బ్ర.

**కడి.** దే. వి. 1. కబళము; 2. వాసన. "సీ. కడివోదునాకిమ్ము పడఁతి యాగేదంగి ననఁ గడివోమిముందటికిఁజూడు." ఆము. ౨, ఆ.

**కడిఁది.** దే. వి. ఆపద. "క. అడిద్రాగుడనకయిప్పటి, కడిఁదికినే మాంసమైనగ్రక్కునఁగొనిరం, డెడసేయకనుచుననిపినఁ, గడువడి నలువురునుబోయిగహనములోనక్." పంచ. నా. ౧, ఆ.—విణ. 1. అధికము; "చ. ఆత్మశరీరకర్తనం, బనఘుఁడు చేసిచేసి తన యంగమునం గలమాంసమెల్లఁబె, ట్టిననుగపోతభాగము కడిందిగ డిందుచునుండెనత్తులక్." భార. అర. 3, ఆ.—2. అశక్యము; "ఎ, గీ. నవసిపావని యనుదినముఁ బరప్రేమ్యలై, యునికిథలఁప నర్థమునకచూవె, యట్టిదుఃఖలబ్ధమైనట్టియర్థంబు, విడుచుటెవ్విధ మునఁగడిఁదికాదె." భార. అర. ౬, ఆ.—3. కఠినము. "చ. అనుపమముల్ రతిస్మరులయాటకు సర్వములంచుఁగప్పిపె, ట్టినపువు బంతులీనతికడిందిచనుంగవ." కళా. ౭, ఆ.

**కడికండలు.** ద్వి. వి. బ. ఖండఖండములు. "ఖడ్గరోమునిమేను కడికండలుగఁజేసి." య. 3, ఆ.

**కడిగొను.** దే. అ. క్రి. (కడి+కొను.) కబళించు. "క. మెచ్చిన మచ్చికగలిగిన, నిచ్చిననీవచ్చుఁగాక యిచ్చునొరులకుక్, ఊచ్చుఁ గడిగొనఁగవచ్చునె. చిచ్చులఅమాపమ్ముపడిన శిశువసకుఁదక్కక్." భాగ. ౮, స్కం.

**కడితము.** వై. వి. ఘట్టించిన నల్లపటపులెక్కపుస్తకము*. "ఉ. దక్కఁగవ్రాసితిన్ముసఁపటమునఁదుండుసుళ్లసాపముల్, లెక్క యెఱుంగరాదులవలేశమువానికిసెట్టెవ్రాసియుం, దక్కజమిప్పుడొ క్కటియునష్టముకాపములేదుదేవనే, దక్కడితంబుగట్టియిడిసట్టుల యున్నది కప్పదేపముపక్." పాండు. ౫, ఆ.

**కడితి.** దే. వి. గోకర్ణమృగము. "వ. పిడికడితికదుపు నురవడికి ఐజిగిపడిన విటపి విటపంబుల." స్వా. ౪, ఆ.

**కడిమి.** యు. దే. వి. 1. అతిశయము; "ఎ, గీ. కినిసియాఁకటి కడిమినయ్య నిలుపుఁడు." ఉ, రా. ౫, ఆ. "క. తెలికమునిదు కానన, పాళికవెలువడికుటంగపాళికపాఎం, బాళికలుబాళికడిమిక్, బాలికఁదెచ్చిరివిహారవవనంబునకుక్." వసు. 3, ఆ.—2. ఆధిక్యము; "చ. వెరవునలావునఁగడిమిబీరమునంబోలుపొందురాచ దేవర." య. ౩, ఆ.—3. పరాక్రమము. "గీ. నీలుఁడంత కఱకుఁ దేలువెంప్రుకలరా, కాసిబంటుఁబోడివికడిమినొక్క, కడి సిఁడిపికైచెఁగడిమిజేజేలుమి, న్నఁ జెలంగిక్రానుచుఁబొగ డఁగ." అచ్చ. యు. కాం. (ఈ యర్థము ప్రశస్తముగాఁ దోఁచ లేదు.)—వై. కదపక్. (దీనిభేదములు—నీరుకడిమి, బట్టకడిమి)

**కడిమిడి.** దే. విణ. పచ్చికగలది. (నేల.) "వ. పచ్చనికడిమిడి పట్టునం జటాయువుందలంచిదర్భపూతంబుగాఁ బిండంబువెట్టి." నం. "శకునాయ దదౌ రామోరమ్యే హరితశాద్వలే." రా. అర. ౨, ఆ.

**కడియపుటట్టు.** ద్వి. వి. (కడియము+అట్టు.) భక్ష్యవిశేషము. "సీ. బుడుకులుసుకియలుఁగడియంపుటట్లువెన్నప్పాలుపడియంబు లప్పడాలు." కళా. ౭, ఆ.

**కడియము.** వై. వి. హస్తభూషావిశేషము, కటకము.

**కడిలము.** వై. వి. ఒకానొకచెట్టు.

**కడివోవు.** దే. అ. క్రి. (కడి+పోవు.) చెడు. "తాల్మికడివోయిన నించుకలజ్జలావునక్." ఉ, హరి. ౫, ఆ. "ద్వి. ఎలనవ్వుకడి వోవదెనఁగదుదప్పి." హరిశ్చ. ౧, ఆ.

**కడు.** దే. క్ర. అత్యంతము. (వృత్తియందచ్చుపరమగుచో డకార మునకు టకారదేశమయి యాదేశంబగు.) ఉదా. కట్టనుఁగు, కట్టనువు, కట్టలుక, కట్టాణి, కట్టాయితము, కట్టావి, కట్టెండ, కట్టెదురు, కట్టెఱ్ఱ మొ. (చూ. ముడియ.)

**కడుఁదురు.** వై. వి. కందురీఁగ, గండోలి.

**కడుకొను.** దే. అ. క్రి. 1. అతిశయించు; "క. వెలయాలివలపు కడుకో, వెలకుఁగవగలేకవాఁడువెడఁజీఁకటులక్, గలవారియిండ్ల చెలులకుఁ, గలవారపుసొమ్ముపెరఁజిగెకొనఁజొచ్చెక్." శేష. ౪, ఆ.—2. ఉత్సహించు. "క. కడఁగివృకోదరుఁడనురక్, బడఁగ వడికైచి వామపాదంబునఁజే, ద్వడవానిలొమ్ముఁదాఁచెక్, గడు కొనియసురయునులేచికడునుద్ధతుఁడై." భార. ఆది. ౬, ఆ.

**కడుగు.** దే. అ. క్రి. ప్రక్షాళించు. వి. బియ్యములోనగునవి కడిగిననీరు, తండులోదకము.

**కడుజా.** దే. వి. శ్వేనవిశేషము. (చూ. అణుజా.)

**కడుపు.** వై. వి. 1. కుక్షి; 2. గర్భము.

**కడుపుమంట.** ద్వి. వి. ఓరువలేనితనము, ఈర్ష్య.

**కడుపూఁద.** ద్వి. వి. (కడుపు+ఊఁద.) 1. జలమలములుకట్టి కడుపుబ్బరించెడివకురోగము; "గీ. నరిడిపుప్పుకప్పునావురుగడు

ఘూఁద, యుదరుఁద్రిక్కయనఁగనడరి." హరి. పూ. ౬, ఆ.-2. ఈర్ష్య.

**కడుపేడు.** దే. వి. (కడుక్+పేడు.) మేదరవాఁడు కట్టుకట్టెడు సన్నని వెదురుపేడు.

**కడువు.** దే. అ. క్రి. కడుగుయొక్క రూపాంతరము.

**కడెము.** వై. వి. కడియముయొక్క రూపాంతరము.

**కడ్గు.** దే. అ. క్రి. ప్రక్షాళించు. "అడుగులుకడ్గి." భార. అశ్వ. ౪, ఆ.—వి. బియ్యములోనగునవికడిగిననీరు. (కడుగుయొక్క రూపాంతరము.)

**కడ్డాయము.** దే. వి. బోము, బలాత్కారము.

**కడ్డీ.** వై. వి. 1. బలపపుఁగోల; 2. పాళము*; 3. పుడక. (చూ. కడ్డీ.)

**కడ్పు.** వై. వి. 1. కుక్షి; "ఘాతములున్నవిగాక కడ్పునన్." హరి. పూ. ౫, ఆ.—2. గర్భము. (కడుపుయొక్క రూపాంతరము.)

**కడ్మి.** యు. దే. వి. 1. అతిశయము; 2. ఆధిక్యము; 3. పరాక్రమము. "సురేశ్వరునిఁగడ్మింబట్టితున్నాడనోపినపుత్త్రుందగనిత్తు." రా. బాల. కాం.—వై. కడపటి. (కడిమియొక్క రూపాంతరము.)

**కణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయీఁగ; 2. జిలకఱ్ఱ; 3. పిప్పలి*. అ. పుం. ము. 1. నీటిబొట్టు; 2. నూక; 3. లేశము.

**కణఁక.** దే. ౯. కడఁకయొక్క రూపాంతరము. "సీ. కణఁకనిచ్చలుఁ బ్రదక్షిణముగాఁదిరుగుచుఁజెలఁగియుండునుగల్పజీవియగుచు." భాగ. ౫, స్కం. ౨, ఆ.

**కణఁకు.** దే. వి. ఇంగలము. "ఎ, గీ. శౌరిదివిహరించుకపులొక్కచోటఁగూడి, కడిఁదిచలిచేతమేనులుకమవడంక, రాత్రిమెఱుఁగారుఖద్యోతరాజిఁజూచి, కణఁకుకాఁబోలునని సీతుగాయుచుండ." పంచ. నా. ౧, ఆ.

**కణఁగు.** దే. అ. క్రి. కడఁగుయొక్క రూపాంతరము.

**కణఁజము.** వై. వి. 1. ధాన్యముంచెడుపాఁతఱ; "చ. అలవిబుధాలయాహినిలయమ్ములనెప్పుడుతోడఁబుట్టవుల్, దలకొనియుండఁగాగరిసెలంగణఁజమ్ములనెత్తరామిచే, నిలిచినకుప్పకావలికి నిల్పుదురప్పురిఁగొంగుబత్తెపుం, గొలువునకియ్యకొల్పిహలికుల్ బికిరమ్ము పొనంగువేలుపుక్." చంద్రా. ౧, ఆ.—2. ధాన్యముంచెడు గరిసె*. "సీ. కడలిరాయఁడుమిన్నగలమిన్నగమిడాఁపఘటియించుబంగారుకణఁజమనఁగ." ఉ, రా. ౧, ఆ. (ఇక్కడ కోటనుత్ప్రేక్షించినాఁడు.)

**కణఁజూ.** దే. వి. కడఁజుయొక్క రూపాంతరము.

**కణఁత.** దే. వి. కడఁతయొక్క రూపాంతరము.

**కణఁతి.** దే. వి. కడఁతియొక్క రూపాంతరము. "చ. పులులుకురంగముల్ కరటిపోతము లేదులు మన్నుఁబిల్లులు, ప్పులుకణఁతుల్ కిటుల్ చెవులపోతులుకొర్నవగంష్టువల్లుకం, బులుచమరీమృగంబులెను బోతులుకస్తురిపిల్లులాదిగాఁ, గలమృగరాజిఁ జెక్కువిహాగంబులఁగానకలంపెదండ్రికిక్." కాశీ. 3, ఆ.

**కణయము.** సం. వి. అ. పుం. కుంతవిశేషము. "వ. కణయ కంపణ ముసల ముద్గర పరిఘ పరశ్వధ కరవాల భిండివాల ప్రముఖ ప్రహరణంబులు." ఉ, హరి. ౪, ఆ.—శరవిశేషము. (అనికొందఱు.)

**కణిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. నీటిబొట్టు; 2. గోదుమరవ; 3. అత్యంతసూక్ష్మవస్తువు; 4. నెల్లి*.

**కణిఁతి.** వై. వి. రోగవిశేషము; కంతి. (కడితియొక్క రూపాంతరము.)

**కణిశము.** సం. వి. అ. న. సస్యమంజరి, ఎన్ను.

**కణిష్ఠము.** సం. విశ. (అ. ఆ. అ.) కడుఁగొంచెము.

**కణీయస్సు.** సం. విశ. (స. ఈ. స.)———వై.———

**కణుఁదురు.** వై. వి. కడుఁదురీఁగ.

**కణుజూ.** దే. వి. కడుజుయొక్క రూపాంతరము.

**కణ్వము.** సం. వి. అ. న. పాపము. పుం. సు. ఒకానొకఋషి.

**కత.** వై. వి. 1. కథ; "క. కతలుగమాసంసార, స్థితులెల్లనుజెప్పె." సావి. 3, ఆ.—2. వృత్తాంతము*. "మ. అక్కఁ గతెల్లక్ విని పక్షికంఠుఁ డడ లల్కంచెంచె నుద్వేలుఁడై." రామా. ౬, ఆ.

**కతకము.** సం. వి. అ. పుం. చిల్ల*.

**కతన.** వై. ద్ర. కారణముచేత.

**కతము.** వై. వి. 1. కారణము; "క. క్రమమునఁజేసినప్ర, శ్నము లకుఁబ్రత్యుత్తరంబుసత్తలినయ్య, త్తముఁడెవ్వఁడిచ్చునతనిక, తమునను శాపాంతమగుబుధస్తుతనీకుక్." భార. ఆర. ౪, ఆ.—2. గుఱుతు. "క. రతిపతిహాశాహాళిందన, యతిశైర్యధనంబుఁగొల్లలాడనటంచుక్, గతమిచ్చుకరణినిచ్చెం, బతియొకతెలనాకుమడుపుఁ బ్రాణేశ్వరికిక్." (కతమిచ్చుకరణిక్—తెలుపువిధమున నని యర్థము.) రామా. ౪, ఆ.

**కతుక్కు.** దే. వి. కొఱుకుటయందగు ధ్వన్యనుకరణము. "గీ. ఒక్కనక్కవలఁగతుక్కునఁగొఱికితా, నవలఁజనఁగఁ వెంటఁ దవిలెబలము." శుక. ౧, ఆ.

**కత్తరి.** దే. విశ. 1. నానావర్ణములుగలది, శబలము; (కత్తరియావు, కత్తరియెద్దు మొ.)—2. వర్ణసాంకర్యముగలది. "క. ఉత్తమసతి శూద్రునితోఁ, జిత్తజసుఖకేలివాంఛఁజేసినఁబ్రాయ, శ్చిత్తమున శుద్ధిఁబొందును, గత్తరిపురుషునకుఁ బాయుగర్భంబైనక్." విజ్ఞా. ఆచా, కాం.

**కత్తరిగలయు.** దే. అ. క్రి. (కత్తరి+కలయు.) సంకరమగు. "క. పెరుగుగనువర్ణమనుగలిపిన, కరఁగిక్ వర్ణాశ్రమములుకత్తరిగలయుక్." జై. ౮, ఆ.

**కత్తరిల్లు.** దే. అ. క్రి. చలించు. "ఎ, గీ. ...గత్తరిల్ల." నై. ౭, ఆ.

**కత్తలాని.** వై. వి. తెల్లనిగొరిజయుఁ దేహముపెంపుగలుగు నల్లగుఱ్ఱము. "అందఱుకత్తలానిగములు." అన్న. బాల, ౬ ౦. (చూ. కర్తలాణము.)

**కత్తళిఁడు.** వై. వి.———వై.———

**కత్తళము.** దే. వి. బొందలము, కవచము. "ఉ. పొంచాలుకనెల్లఁదీవ్రశరజాలములంబొలియించికానిమా, పొంగుపుష్పఁగత్తళము." సం. "నాహాలాన్ సర్వసాంబాలాంగానామాహేశ్వరవచాపు." భార. శల్య. ౨, ఆ.

**కత్తళీఁడు.** దే. విశ. (కత్తళము+వాఁడు.) కవచము తొడిగినవాఁడు, వర్మితుఁడు.

**కత్తి.** వై. వి. 1. ఖడ్గము; 2. మంగలికత్తి, క్షురిక*; 3. మల్లబంధవిశేషము*. "సీ. కల్లంబు రాటలబు కత్తికొట్టిన తొట్టి రూఢింపు బదిపోటు రొండిమ్రేటు." ఆం, భా. టస్. ష.

**కత్తికాసు.** వై. వి. వడ్లవాని ఆయుధవిశేషము.

**కత్తిపిడిక.** వై. వి. ఈండ్రవాని కస్తులబుట్ట.

**కత్తిపీట.** వై. వి. కూరలుతఱుగుటకుఁ బీటయందమర్చిన కత్తి, ఈళిక.

**కత్తిమందు.** దృ. వి. 1. కత్తియొఱకు పూయునవ్వము; 2. గద్దలపై పూయుమందు.

**కత్తియ.** వై. అప. ఒకానొకస్త్రీ ప్రత్యయము. (అంటుకత్తియ, చెలికత్తియ మొ.)

**కత్తియము.** దే. వి. అంకెలయడ్డబంతి.

**కత్తిరించు.** వై. ప్రే. వస్త్రములోనగువానిఛేదించు. "ఎ. గీ. హత్తిమిత్తిచందంబునహత్తివెదఁడ, కత్తిఁగుత్తికనుఁబిఱాదఁగత్తిరించి, సత్తిమత్తిల్లబలిసేసెసత్తినొక్కఁ, డనిపతియిచ్చ మెలుమేలనుచుమెచ్చ." చంద్రా. ౩, ఆ.

**కత్తిరిల్లు.** వై. అ. క్రి. భిన్నమగు. "గీ. అలనిరెండుతొడలను వెసఁగత్తిరిలఁగనఱకె." శుక. ౧, ఆ.

**కత్తివాతియమ్ము.** వై. వి. (కత్తివాయి+అమ్ము.) అర్ధచంద్రబాణము. "గీ. వాఁడియైనకత్తివాతియమ్మునుగొని, పగకుశిరముచెక్కలెగయగొజేగె." సం. "ఏవముక్త్వాసనాస్తస్యపంచచక్రేవృకోదరః, అర్ధచంద్రేణబాణేన." భార. అర. ౬, ఆ.

**కత్తువ.** దే. వి. 1. మన్ను కెల్లగించెడు గసిక; 2. గనిమ.

**కత్తృణము.** సం. వి. అ. న. 1. కామంచిగడ్డి; 2. నాఁచు.

**కత్తె.** వై. అప. కత్తియయొక్కరూపాంతరము.

**కత్తెము.** దే. వి. కత్తియముయొక్కరూపాంతరము.

**కత్తెర.** వై. వి. 1. కత్తిరించెడు ఆయుధము; 2. భరణి మూడు నాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమందును సూర్యుఁడుండుకాలము; 3. కృత్తికానక్షత్రము. "సీ. పూచినకొఱవిపూఁబోదరింటిచందానఁగత్తెరయొక్కచోఁగదలకుండె." కాశీ. ౧, ఆ. కత్తెరవలె మృగములను ఖండించుటచే కుక్కకియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.)

**కత్తెరకాలు.** దృ. వి. అందలపుకాళ్లకు అడుగున పోటిగానమర్చెడు మార్పుకాలు.

**కత్తెరగాయము.** దృ. వి. గవాక్షవిశేషము. "మ. కత్తెరగాయంబులగండ్లమంగడలనందిం గొమ్మకొమ్మాకానిరం, తరముఁజూసాదనదీవెలెత్తి." ఉ. హరి. ౩, ఆ.

**కత్తెరచీల.** దృ. వి. మీటమునసలచీలవదలిరాకుండదాని చివర రంధ్రమున నడ్డముగా వేసెడు చీల.

**కత్తెరబావిలీ.** దృ. వి. స్త్రీకర్ణభూషావిశేషము.

**కత్తెరవంగ.** వై. వి. పెద్దవంగకీ.

**కత్తెరవాసము.** దృ. వి. ఎదురెదురుగాఁ గత్తెరవలెనుంచెడు వాసము.

**కత్రి.** దే. వి. జక్కిణియను ఆటయొక్క ఒకయంగము. "సీ. లాగుమైసిరియుఁబల్లటియుఁగత్రియుదెల్కువిలసిల్లుజక్కిణివిధమొకర్తు." ఉ. రా. ౬, ఆ.

**కత్రించు.** వై. స. క్రి. కత్తిరించుయొక్కరూపాంతరము. "ద్వి. కత్రించికొనిపోయెఁగంఠమాత్రములు." రా. యు, కాం.

**కథ.** సం. వి. ఆ. స్త్రీ. ఇంచుక సత్యమైన కల్పితప్రబంధము. (కాదంబర్యాది.)

**కథకుఁడు.** సం. వి. (పు. ఆ. ఇ.) 1. కథచెప్పెడువాఁడు; 2. చెప్పెడువాఁడు.

**కథనము.** సం. వి. అ. న. చెప్పుట.

**కథించు.** సం స. క్రి. చెప్పు. "క. అనుటయువైశంపాయనుఁ, డనఘా చెప్పెదఁ దయడిగి కమ్మొకశుభలాంఛనమాముఖామ మాత్రం, గొనియాడి కథించు నీడుకోరికయలరన్." హరి. ఉ. ౫, ఆ.

**కథితము.** సం. వి. (అ. ఆ. ఇ.) చెప్పఁబడినది.

**కద.** యు. దే. అవ్య. ప్రసిద్ధివెలిపెడి. "ఎ. గీ. అతివచియుసర్వవీక్షించునప్పుడుకద, యాకరెచ్చంద్రచంద్రిక యింపొనర్చు." ఉ. రా. ౪, ఆ. (రూ. కదా. చూ. కాదా.)—వై. వి. 1. కథ; 2. వృత్తాంతము. "క. మొదలనొకవేఁగువానిం, గదలదయఁగఁబనిచి పిదపఁగాగ్రసునేయం, బదిలమనిపలికె రఘుఁడు." రా. యు, కాం.

**కదంబకము.** ఉభ. వై. విశే. మిశ్రము. "చ. వినీలకేశముల్, ముడివడకుండఁ దీర్చివిరులుంగురువేరుఁగదంబకంబుగాఁ, బొడవుగఁ గొప్పవెట్టి." పంచ. నా. ౩, ఆ.—సం. వి. అ. న. సుంపు. పుం. తెల్లావలు.

**కదంబము.** ఉభ. వై. విశే. మిశ్రము. "సీ. పన్నీటితోఁగదంబము చేసిపూసినమృగనాభిపసరాచనగరుదెలుప." ఆము. ౩, ఆ. (వృత్తియందంతర్గవర్ణలోపంబు వికల్పంబుగానగు. కదంబకాళి.)—సం. వి. అ. న. సుంపు. పుం. 1. కడిమి; 2. తెల్లావలు.

**కదంబించు.** వై. అ. క్రి. మిళితమగు. "సీ. సాంబ్రాణిధూపవాసనఁగదంబించు పీఠుల మంగళద్రవ్యములుఘటించి." వై. ౭, ఆ.—అం, ప్రే. మిళితముచేయు. "సీ. గంబురామించఁగదంబించి కొందఱుకలికికన్నియలు దాగా లోనంగ." భాను. ౩, ఆ.

**కదధ్వము.** సం. వి. న్. పుం. కాపథము, చెడుత్రోవ.

**కదనము.** సం. వి. అ. న. 1. పాపము; 2. యుద్ధము; 3. హింస.

**కదను.** హిం. వి. అశ్వగతివిశేషము.

**కదన్నము.** సం. వి. అ. న. చెడ్డకూడు.

**కదము.** వై. వి. అశ్వగతివిశేషము, ఆస్కందికము.

**కదరము.** సం. వి. అ. పుం. 1. వెలిచంద్రకీ; 2. రోగవిశేషము; 3. అంపము.

**కదరె.** దే. అవ్య. (కద+రె.) సంతాపమునుదెలిపెడి. "గీ. రాతిరెల్లఁ, గడిఁదివలవంతనెకలయగ్గలపుటార్తి, నెంతబడలెనొకదరెయయ్యెమ్మెకాఁడు." రసి. ౪, ఆ. (రూ. కదరే. "ఈ వ్యాజసాధ్యం తుఁడు రుక్మియుఁబ్బఁగదరే." రుక్మి. ౩, ఆ.)

**కదర్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పిసినిగొట్టు.

**కదలాడు.** దే. అ. క్రి. (కదలి+ఆడు.) చలించు. "మద్దికాయలుకడుంగదలాడఁగ ముద్దుగాఁబొందిక జగిపాలబుగ్గలును." పు. ౩, ఆ. (చూ. ఊఁగాడు.)

**కదలిక.** దే. వి. 1. చలనము; "ఎ. గీ. కదలికలజాఱుజలుఁగుఁ బయ్యెదలతోడ." పర. ౪, ఆ.—2. యత్నము. "క. ఇదివేళగాదు చౌరంబడి, వెదకఁగననియున్నయతనివెరవుత్రిలోకా, ధ్యుదయాంకురార్పణంబీ, కదలికయాచేస్తునన్నగతిరవిగ్రుంకెన్." రామా. ౬, ఆ.

**కదలు.** దే. అ. క్రి. 1. చలించు; 2. ప్రయాణమగు; 3. యత్నించు. "గీ. నరుఁడుగాండీవమునసొండుసారిఁగూర్చి, యతివఁదెగటార్తుననుచుఁగట్టలుకతోడఁ, దీవ్రతరబాణమొకటిసందించియేయఁ,

గదలఁగన్గొనిపల్కె నాకాశవాణి." జై. ౫, ఆ.—వి. 1. చలనము; "సీ. ఉఱఁపులసందడిదండడించినత్రాల్లికదలు శిరఃకంపగతులమెఱ యు." భాగ. అ. 2, అ.—2. యత్నము. "చ. పొదిఁవి నభోవి హారమునఁ బుష్పకుబోలెనలంగకుండన, మ్మదనసమానుఁబట్టికొనిమా నవదానవదేవకోటికిన్, గదలెఱుఁగంగనీకచని కాంచె నుషానతిఁ జిత్రరేఖయా, ముదితకురాకపోకలోకమూఁడుముహూర్తములయ్యె నయ్యెడన్." ఉ, హరి. ౫, ఆ.

**కదలుచే.** దే. ప్రే. కదలించు. (రూ. కదల్చు.)

**కదలుడు.** దే. వి. ప్రయాణము. "మీరలిప్పుడేకదలుడుచాటి చెప్పఁజెఱుఁగన్." శకాం. ౪, ఆ.

**కదళి.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోలపొన్న*; 2. దొండ*; 3. బూరుగు*. అ. పుం. ము. 1. అరఁటి*; 2. కోలపొన్న*.

**కదళి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అరఁటి*; (దీనిపుష్పము శిలీంధ్రము.) 2. ఏనుఁగునంబారిమీఁదిటెక్కెము; 3. ఇరువదియంగుళములనిడివిగలలేడి. న్. పుం. ఇరువదియంగుళములనిడివిగలయిఱ్ఱి. (అనికొందఱు.)

**కదించే.** దే. ప్రే. కదియించుయొక్కరూపాంతరము. "చ. తలుపుగదించినూత్రములుత్రాసునఁగూర్చుచునున్నవాఁడిసీ." హంస. ౨, ఆ. (కదించియనఁగా నిక్కడ మూసియని యర్థము.)

**కదియఁబడు.** ద్వి. అ. క్రి. (కదియన్+పడు.) కదియు. "క. పఱతెంచికదియఁబడియే, త్తైఱవ్రేసినమోముదాఁకి తిరిగెగరుడి యు, త్తఱివేహరి చక్రంబు నఁ బెడ, మఱిపైచెనుదనుజునసుజుమస్తకముతె గన్." నిర్వ. ౭, ఆ. (స్వార్థమునపడు.)

**కదియించు.** దే. ప్రే. కదియఁజేయు.

**కదియు.** దే. అ. క్రి. 1. దగ్గఱవచ్చు; క. అకలకలమునమేల్కని, యాకిలఁకుల యిండ్లరాజులది యేమనుచున్, వేకదియన్గని." భార. సౌ. ౧, ఆ.—2. సమానమగు. "మధ్యాక్కర. పదుగు రఁబోలెడుసుతులనూఱ్వురఁబడయంగవలతొ, పదుగురనూర్వురకెనయగు సుతులఁబడయఁగవలతొ, వదలకవేవురుసుతులఁబడయఁగవలతొవేవురకుఁ, గదియంగనుత్తమున్నొక్కరుఁబడయఁ గమలాక్షి వలతొ." భార. ఆర. ౨, ఆ.—స. క్రి. చేరు. "క. కృతనిశ్చయుఁడగుశేషుని, ధృతరాష్ట్రుండనెడు ఫణికదిసియిట్లను." జై. 2, ఆ.

**కదుకొను.** దే. అ. క్రి. (కదుకు+కొను.) అతిశయించు. "చ. కదుకొనివేఁడిబాష్పములు గ్రమ్మిపయింబయిఁబర్వ." రా. యు, కాం. (కొందఱు కదుకొని అని వ్రాసి అప్రశస్తప్రాశమని చెప్పియున్నారు. ఆదియుక్తముగాఁ దోఁచలేదు.)

**కదుపు.** వై. వి. 1. సజాతీయపశుపక్ష్యాదిసమూహము, కులము*; (ఎనుపకదుపు, జక్కికదుపు, పందికదుపు, లేటికదుపు, గూబకదుపు, చిల్కకదుపు, తేటికదుపు మొ.)—2. గోసమూహము*. "క. కరులందోలెనుభీముఁడు, వెరవునగోపకుఁడుకదుపువెలిచినమాడ్కిన్." భార. భీష్మ. ౨, ఆ.

**కదుము.** దే. స. క్రి. ఆక్రమించు. "క. బహువిధోగ్రాస్త్రములన్, బిదురుపలుగనొనరించిరి, కదిమి మనాభాదిదనుజ గణదేహంబుల్." ప్రభా. ౫, ఆ.—వి. దెబ్బతగిలినచోటనెత్తురుకట్టుకొనివాఁచువాఁపు.

**కదురు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "మోముఫెల్లఁదనమునఁ గదురన్." భార. ద్రో. ౨, ఆ.—2. కలుగు; "సీ. ఇచ్చట దిక్కులేరెవ్వరునాకనుభయమునమేనఁగంపంబుపుట్టఁ, జేయంగనేమి యుపాయంబులేమినాననమునవెల్లఁధనంబుగదుర." భార. విరా. ౨, ఆ.—3. విజృంభించు. "చ. ప్రిదులనిశౌర్యసంపదలఁ బెట్టినదండలుద్రెవ్వకేకదుం, గదురుచుహుంకరించుచున్నుగదుర్వఁ బాపుచునట్లయట్లయం, చదెయిదెయంచు దట్ప్వగను మంచుఁదగన్ బళియంచు నెందుఁగన్, జెదరుటలేకయ్యుదుపదినేయకపోరిరివేరువాఱుచున్." కళా. ౭, ఆ.—వి. నూలువడకెడుకదురు, తర్కువు.

**కదుష్ణము.** సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విశ. ఇంచుకవేఁడిగలది.

**కదే.** దే. అవ్య. ప్రసిద్ధినిదెలుపునది. (రూ. కదే. "చ. తెలియఁగఁ జూచిచెప్పనుగదే యని డెందమునందలంచె." వై. ౫, ఆ.) "చ. గాండీవంబుదివ్యాస్త్రసం, పతియుంబెట్టినయట్లయుండమఱుఁ జింతంబాపరాదోకదే." (ఇక్కడఁగదే యనునది యనుప్రయోగము నందువచ్చినదియని తెలియవలయును.) భార. ఉద్యో. 3, ఆ.

**కద్దుము.** దే. విశ. దట్టము. "క. ఎద్దులుమఱుఁగులుగాఁజని, కద్దుములైచేరుపెన్మెకంబులనాలో, నుద్దవిడినొంచిరలవున, నద్దిరయని యయ్యయాతి యబ్బురపడఁగన్." య. ౨, ఆ.

**కద్రువ.** సం. వి. ఊ. స్త్రీ. పన్నగులతల్లి.

**కద్రువు.** సం. వి. ఉ. పుం. గోరోజనమువంటివర్ణము. విశ. గోరోజనమువంటివర్ణముగలది.

**కద్వదుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) నిందింపఁదగుమాటలాడువాఁడు.

**కన.** దే. ద్ర. ఇది వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును. "క. ఈహయరత్నముగనమన, సాహిణమునసున్న." జై. ౪, ఆ.

**కనకచ్ఛద.** సం. వి. ఆ. స్త్రీ. గేదఁగి*.

**కనకతప్పెట.** ద్వి. వి. పటహము.

**కనకన.** దే. వి. నిప్పునందలి యధికప్రకాశము.

**కనకనమను.** దే. అ. క్రి. (కనకన+అను.) (నిప్పు) మిక్కిలి ప్రకాశించు. "గీ. కనలుచీఁకటిరక్కసికన్నులందుఁ, దొరఁగు కనకనమనునిప్పుఁదునుకలనఁగ." య. ౨, ఆ.

**కనకనలాడు.** దే. అ. క్రి. (కనకనలు+ఆడు.)——పై.——

**కనకము.** సం. వి. అ. న. బంగారు. పుం. 1. ఉమ్మెత్త*; 2. సంపెఁగ*; (మఱియుఁగనకపర్యాయములన్నిదీనికినామములగును.) 3. కాంచనము*; 4. నల్లబిగలు; 5. నాగకేసరము*; 6. మోదుగు*.

**కనకాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. పయిఁడికంటిపక్షి.

**కనరు.** దే. వి. 1. కందగడ్డలోనగువానియందలినస; 2. ఒగరు. "శా. తారుణ్యాతిగమాతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వస, ద్ధారాధూపితసువ్యదంబుహృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో, ద్గారంబుంగనరార్చుభోగులకు." ఆము. ౨, ఆ.—విశ. అహితము. "ఉ. ఓ రావణనాదుబుద్ధివినరా కనరా కనరా శుభస్థితుల్." నమ. 3, ఆ.

**కనలు.** దే. అ. క్రి. 1. కోపగించు; 2. మండు. "అనలజ్వాలలొక్కుమ్మడింగనలన్." హరి. పూ. ౬, ఆ.—వి. 1. కోపము; "కన్నులంగనలునఁగెంపుపెంపడరఁగా." హరి. ఉ. ౪, ఆ.—2. మంట. "కనలుటగ్గిఁద్రోయించి." లక్ష్మీ. ౪, ఆ.

**కనస్టేబిలు.** ఆం. వి. పోలీసు బంట్రోతు.

**కనారిలు.** దే. అ. క్రి. కోపగించు. "చ. మర్త్యకోటిబల, స్నము గడతేత నింతటఁగనారిలి వేల్పులమీఁదఁజూపుడి, క్రమమదిమేలు గాదు." ఉ, రా. 3, ఆ.

**కనికరము.** దే. వి. 1. కరుణ; 2. శోకము. "శ. తపపుందనయులతేమికిఁ, గనికరముండుచును." భల్లా. 3, ఆ.

**కనికరించే.** దే. అ. క్రి. 1. కరుణించు; 2. శోకించు.

**కనిపట్టు.** దే. స. క్రి. వెదకిపట్టు. "చ. పరిమెయిఁబాఱువానిఁ గనిపట్టివెసన్‌ బెడకేలు గట్టితెచ్చిరి." భార. శాం. 3, ఆ.

**కనిపించు.** దే. ప్రే. కనఁజేయు. అ. క్రి. (కను+ఇంచు.) కనఁబడు, ప్రత్యక్షమగు. (స్వార్థమున ఇంచు. సంధిని వర్ణాధిక్యము.)

**కనియు.** దే. అ. క్రి. మాఁగు. "ఎట్టిదెప్పుడుంగనియఁగఁబండియుండు." భార. ఆర. 2, ఆ.

**కనిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. చిటికెనవ్రేలు. అ. పుం. ము. కొలఁదికి రెండరత్నులుకొలవడినయేనుఁగు. విశే. డు. 1. తమ్ముఁడు; 2. మిక్కిలి యల్పుఁడు; 3. మిక్కిలి కొంచెమైన వయస్సుగలవాఁడు.

**కనీనిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కంటినల్లగ్రుడ్డు; 2. చిటికెనవ్రేలు.

**కనీయుఁడు.** సం. విశే. (ప్. ఈ. ప్.) 1. మిక్కిలియల్పుఁడు; 2. తమ్ముఁడు; 3. మిక్కిలి కొంచెమైన వయస్సుగలవాఁడు.

**కనీసము.** వై. విశే. అధమము*.

**కను.** దే. స. క్రి. 1. చూచు; 2. ప్రసవించు; 3. తెలియు; "క. అప్పలుకునం, గనియెనుదనపలుకుతప్పుగానతఁడుమదిన్‌." భార. శా. ౨, ఆ.—4. పొందు; "అధ్యయనంబునదేవభావముం గనునవనీసుపర్వుఁడు." భార. ఆర. 2, ఆ.—5. భాగ్యముఁబొందు. "ఆ. పురుషవృషభులయినపురుషులతోడన, యరిగివరమభక్తిఁబరిచరింపఁ, బోవఁగనుటనీవు పుణ్యంబుచేసితి." "క. సమరమున బహుబలద, ర్పముచూపనుగంటి." భార. సభా. ౨, ఆ. వి. 1. నేత్రము; 2. చెఱకులోనగువానిగనుపుక్రిందిగుంట. "కనుగలవింటఁజొక్కపుఁజిపుల్ పుట్టించి." వసు. 3, ఆ. (హల్లుపరమగుచో ఉకారమునకు వైకల్పికముగ లోపంబగు. ఉదా. కన్గలిగెను.)

**కనుఁగొను.** దే. స. క్రి. (కను+కొను.) 1. చూచు, వీక్షించు; 2. తెలిసికొను.

**కనుఁబాటు.** దే. వి. (కను+పాటు.) 1. దృష్టి; "గీ. శివుని కనుఁబాటుదాఁకనిచిత్తభవుఁడొ." విక్ర. ౫, ఆ.—2. దృష్టిదోషము. "సీ. దర్పంబుకనుఁబాటు దాఁకకుండఁగ గొడుగులపెల్లు ఖచరదృక్కోటినాఁగు." భార: భీష్మ. ౧, ఆ.

**కనుఁబ్రాము.** దే. స. క్రి. (కను+ప్రాము.) వంచించు. "క. అనుజన్మవధూగమనం, బొనరించినద్రోహివగుటనొర్వక నిన్నున్, గనుఁబ్రామిసంహరించిన, ననుఁజెందునె దుష్కృతంబు నగచరతిలకా." రామా. ౫, ఆ.

**కనుక.** దే. ద్ర. 1. హేతువునుదెలుపును; 2. వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును. "ఉ. భూసుతకోసమేఁగనుక బొంకితినేనియుఁబెద్దకాలముం, జేసిననాతపంబురహిఁజెందకనిష్ఫలమౌ." ఉ, రా. ౫, ఆ.

**కనుకట్టు.** దే. వి. జాలవిద్యావిశేషము.

**కనుకని.** దే. వి. సంభ్రమము. "క. దినదినమునకుఁగృశించెను, గనుకనియును ద్రపయు నిరవకాశతఁబొలెన్‌." కళా. 2, ఆ.

**కనుకలి.** దే. వి. చూపు. "చ. కనుకలి నిల్పుచిత్రఫలకంబునఁగాంచిన యింతినెమ్మనం, బునఁగడునింతకింతపరిపూర్తివహించెనొ." ప్రభా. 3, ఆ.

**కనుకుట్టు.** దే. విశే. బాధకుఁడు. "విరాళికల్కిప్రోగులకనుకుట్టు." రా, వి. 3, ఆ.

**కనుకుట్టుఁదనము.** ద్వి. వి. (కనుకుట్టు+తనము.) ఈర్ష్య. "వ. కనుకుట్టుఁదనంబున నతనిధిష్ణ్యంబునకు విఘ్నంబుగావింపం దలంచి." భో. ౬, ఆ.

**కనుకూలి.** దే. వి. ధాన్యరూపమయిన కూలి.

**కనుగుఁజేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**కనుచీఁకటి.** దే. వి. సంధ్యాకాలమందలి లేఁచీఁకటి.

**కనుపట్టు.** దే. అ. క్రి. చూపట్టు, గోచరమగు.

**కనుపాప.** దే. వి. కంటిలోనిప్రతిమ.

**కనుపాలవిత్తులు.** దే. వి. బ. కుసుమాంజనము.

**కనుపు.** దే. వి. వెదురుచెఱకులోనగువానియందెడనెడనేర్పడియుండుముడి, పర్వము. (ఇట్లు పరుషాదిగాఁ గొన్నిదేశములందు వ్యవహారము.)

**కనుపుగొట్టు.** దే. స. క్రి. (కనుపు+కొట్టు.) 1. ఖండించు; "వ. కాలుబలంబులం గనుపుగొట్టినంగాలు చెయి తల డొక్కయని యేఱుపాటులేక వండందటెగినయట్లున్నయెడలును." భార. భీష్మ. 3, ఆ.—2. భంగపఱచు. "వ. అందుమందాకినీనందనుండమందపరాక్రమక్రీడం గాంగేయబలంబులం గనుపుగొట్టె." భార. భీష్మ. ౨, ఆ.

**కనుపులగుండ్లు.** దే. వి. బ. (కనుపులు+గుండ్లు.) మణిమయమైన హస్తభూషావిశేషము.

**కనుపెట్టు.** దే. అ. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. "బెట్టుకూపెట్టుచునిట్లుపోరఁ గనుపెట్టుకయుక్కరుఁడుండి." ఆము. ౬, ఆ. (ఇది వావిళ్లయందు కనిపెట్టు అని యున్నది.)

**కనుపొట్టలు.** దే. వి. బ. కంటిపైక్రిందిరెప్పలు.

**కనుబంటి.** దే. వి. జీలుగుపక్షి. "వ. కౌశికంబుడబ్బుగబ్బులుఁగు గాళి కనుబంటిపైఁడికంటిలోనగు తిర్యక్కులు." ఆము. ౬, ఆ.

**కనుబడి.** దే. వి. ఉత్పత్తి.

**కనుమ.** దే. వి. 1. సందు; "వ. ప్రవాహంబు నిజప్రవహణగుణంబువిడువక ప్రవహణద్వారంబువెదకుచుంజిరకాలంబునిలిచియేనియుంగనుమ గలిగినఁబ్రవహించుచందంబున." కవిక. ౪, ఆ.—2. కొండలనందుత్రోవ. "వ. మునుములంగనుమలొనరించుకొనంబంచి." స్వా. ౪, ఆ.

**కనుము.** దే. వి. 1. మకరసంక్రమణమునకు ఆవలిదినము; 2. తృణవిశేషము, శరము.

**కనుమూయు.** దే. స. క్రి. వంచించు. "సీ. కపురంపుఁబలుకంచుఁగనుమూసియక్కటా బూదిగప్పిననిప్పు పాదుకొల్పి." చంద్ర. (దీనికి కర్మపదము క్రిందిపాదమునందున్నది.)

**కనుమూసిగంతలు.** దే. వి. బ. కన్నులుగప్పియాడెడియాట. "మ. ఓ మనగుంటల్‌కనుమూసిగంతలును గంబాలాటలోనైనఖేలనముల్." కళా. ౬, ఆ.

**కనుమొఱఁగు.** దే. స. క్రి. వంచించు. "మ. సిరినొక్కప్పుడు కన్మొఱంగిహరితన్‌ జేరన్‌ బ్రహర్షించునుర్వరకున్‌." ఆము. ౧, ఆ.

**కనువినికి.** దే. వి. పాము, చక్షుశ్శ్రవము. "వ. ఇది కనువినుకుల నెలవ్రపట్టిచే విరివిగాఁజెప్పంబడిజగంబులెఱిఁగినదగుటంజేసి." య. 3, ఆ.

**కనువెచ్చ.** దే. విశే. నులివెచ్చ, కదుష్ణము.

**కన్కని.** దే. వి. కనకనియొక్క రూపాంతరము. (చూ. సగ్గన మొగ్గిన.)

**కన్గంట.** దే. క్రి. (కంటన్+కంటన్.) ప్రత్యక్షముగా. "తాఁ జూచి కన్గంటనయ్యుమప్రాణేశ్వరునెట్లుమ్రింగుమనె." భాగ. ౮, స్క.

**కన్గొను.** దే. స. క్రి. కనుఁగొనుయొక్క రూపాంతరము.

**కన్న.** దే. అవ. ఒకానొక ప్రత్యయము. "అహితవాక్యము మున్న విన్నయన్నినదముకన్నఁదిన్ననయి." వసు. ౨, ఆ.

**కన్నగాఁడు.** వై. వి. (కన్నము+కాఁడు.) కన్నముపెట్టి దొంగిలించెడు దొంగ, ఖనకుఁడు.

**కన్నడ.** దే. వి. అలము, ఉపేక్ష. "సీ. ఒకనిమాటునవైరినుక్కడఁగించినవారు శౌర్యమెన్నఁగన్నడయొనర్చి." చంద్రా. ౧, ఆ.

**కన్నడము.** వై. వి. భాషావిశేషము*.

**కన్నడి.** వై. వి. ఒకానొక కర్ణాటదేశస్థుఁడు*.

**కన్నడించు.** దే. స. క్రి. ఉపేక్షించు.

**కన్నడీఁడు.** దే. విశ. (కన్నడ+ఈఁడు.) ఉపేక్షచేయువాఁడు.

**కన్నపెట్టు.** ద్వ. స. క్రి. (కన్నము+పెట్టు.) కన్నమువేయు. "ఉ. నానాధనసంపదాఢ్యసదనంబులునిత్యముఁగన్న పెట్టఁగన్." పర. ౪, ఆ.

**కన్నపోవు.** ద్వ. అ. క్రి. (కన్నము+పోవు.) కన్నమువేయఁబడు. "వ. నాగపట్టణప్రసిద్ధబుద్ధాయతనంబుగన్నపోయె." పర. ౫, ఆ.

**కన్నము.** వై. వి. దొంగ లోపలికిఁ బోవుటకై గోడయందుఁజేసెడి రంధ్రము.

**కన్నయ్య.** వై. వి. (కన్నఁడు+అయ్య.) కృష్ణుఁడు. ద్వ. (కన్న+అయ్య.) కన్నతండ్రి.

**కన్నఱ.** దే. వి. దుఃఖము. "ఉ. తలిదండ్రులువారెటనున్నవారొయీ, కన్నఱఁజూడఁబాలయితిఁగావిధినేమనిదూఱనేరుతున్." రామా. ౨, ఆ.

**కన్నఱి.** దే. విశ. (కన్నఱ+ఇ.) దుఃఖితుఁడు. "వ. నిర్జరులు జర్జరులుగా మేఘంబులుమోఘంబులుగాఁగిన్నరులుగన్నఱులుగా భూతంబులుభీతంబులుగా." ఉ, హరి. ౬, ఆ.

**కన్నరవు.** దే. వి. కన్నడ, ఉపేక్ష. "౨, గీ. కన్నరవుసేయఁగచ్ఛపాకారగరిమఁ, గరిమరాళికయానసీచరణమహిమ." వసు. ౪, ఆ.

**కన్నవిటి.** దే. విశ. (కన్ను+అవిటి.) చీకు, అంధుఁడు. "క. చెవిటికిశంఖధ్వని క, న్నవిటికిదీపంబుషండుఁడగుపురుషునకున్, యువతియు ఖలునకునుపకృతి, శవమునకిడుభూషణములుజగతివ్యర్థముగున్." భల్లా. ౪, ఆ.

**కన్నాకు.** దే. వి. (కన్ను+ఆకు.) తమలపాకు కట్టయందు మొదటనుండెడియాకు. విశ. 1. అగ్రేసరుఁడు; "గమికిఁగన్నాకయి గాలియరయు." సావి. ౪, ఆ.—2. ముఖ్యుఁడు. "క. కన్నాకు మనకుభీష్ముఁడు." భార. భీష్మ. ౧, ఆ.

**కన్నాతి.** దే. వి. మల్లబంధవిశేషము. బ. మల్లవిద్యావిశేషము.

**కన్నియ.** వై. వి. 1. పెండ్లికానిపడుచు; 2. కూఁతురు; (చూ. కన్నె.) 3. ఒకానొకరాశి; 4. ఆఁడుది. "రాత్రియన్ కన్నియఁ గూర్మిఁజక్కఁదనకౌఁగిటఁజేర్చి." లక్ష్మీ. 3, ఆ.—విశ. 1. క్రొత్త*; (కన్నియగేదఁగిపూఁతేకు, కన్నియమెఱుంగు మొ.)—2. చిన్న. (చూ. కన్నె.)

**కన్నియలేడి.** ద్వ. వి. కారండవము. "ద్వి. కొక్కెరబెగ్గురు కొంగ రాపులుఁగు, కక్కెర యాడెలు కన్నియలేడి." హరిశ్చ. ౧, భా.

**కన్నీరు.** ద్వ. వి. (కన్ను+నీరు.) హర్షశోకములవలన కన్నులఁ గాఱెడు నీరు, అశ్రువు.

**కన్ను.** దే. వి. 1. నేత్రము; 2. చూపు; "గీ. వచ్చిరెండకన్ను వానకన్నునునెఱుం, గనిపురంధ్రులు." భార. ఆశ్ర. ౧, ఆ. (మఱియు వాఁడు నాయుంగరముమీఁద కన్నువేసినాఁడు. చూ. సిరి మూడవయర్థము.)—3. జాడ; "వ. అనిపలుకుచున్నయంగదుపరుషభాషణంబులకురోషించినఁదప్పటికన్నెఱింగి నలువురు రక్కసులు గ్రక్కునసవ్వాలినందనుం బొదివిపట్టిన." సం. "ఇంగితజ్ఞాస్తతోభర్తుశ్చ్యత్వారోరజనీచరాః, చతుర్ష్వంగేషుజగృహుః." భార. అర. ౭, ఆ.—4. వెదురులోనగువానిగనుపు క్రిందిగుంట; (కన్నులవిలుకాఁడు మొ.)—5. బండిచక్రము; "గీ. కన్నతల మానికము బండికన్ను జగిలె, కాఁడునై." అచ్చ. అ, కాం.—6. వంతెనద్వారము; 7. నెమలిపురికన్ను; 8. మృదంగాది వాద్యభాండముఖముసందేర్పఱపఁబడినవృత్తనీలమండలము; "వ. ఎందేనియుఁగన్నువేయుటమృదంగాదివాదిత్రంబులయందు." ఆము. ౪, ఆ.—9. వలయందలిరంధ్రము; "వ. ప్రాంతవలయునుంబోలెఁగన్నులుచెదరి." కవిక. ౪, ఆ.-10. వ్రణాదిరంధ్రము.

**కన్నునీరు.** ద్వ. వి. కన్నీరు. (దీనికి సుకవుల మహాకవి ప్రయోగములు కనఁబడుచున్నవి.)

**కన్నుమొఱఁగు.** దే. స. క్రి. కనుమొఱఁగు, వంచించు.

**కన్నులమ్రాను.** దే. వి. చెఱకు, ఇక్షువు.

**కన్నులవిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు. "ద్వి. కన్నులవిలుకాఁడుగ్రాఁచెధైర్యంబు." విష్ణు. పూ. 3, ఆ. (ఇట్లు కన్నులవిలుతుఁడు మొ.)

**కన్నె.** వై. వి. కన్నియయొక్క రూపాంతరము. (కూఁతునకు.—"ద్వి. కన్నెలనూర్వురఁగడురూపవతులఁ, గనియె." రా. బాల, కాం.—క్రొత్తకు.—కన్నెనెయ్యము, కన్నెకలువ, కన్నెకూరిమి, కన్నెచెంగల్వ, కన్నెతమ్మి, కన్నెతావి, కన్నెయీఁడు మొ.—చిన్నకు.—కన్నెమావి, కన్నెసురపొన్న.)

**కన్నెగోరుకోఁత.** ద్వ. వి. కన్యకల గోళ్లుత్రియువిధి.

**కన్నెబావి.** వై. వి. నీళ్లులేనిబావి, కోనేటివంటిపెద్దబావి. (అని కొందఱు.)

**కన్నెము.** దే. వి. కోడి గుంజకాయ.

**కన్నెఱికము.** ద్వ. వి. 1. కన్యాత్వము; 2. వంకకన్యాప్రథమసంగమము. "నీకన్నెఱికమునకుఁగంటసరియిచ్చినదిమొన్న కాదఁటవే." క్షేత్రయ.

**కన్నెలేడి.** ద్వ. వి. కన్నియలేడియొక్క రూపాంతరము. "సీ. కొక్కెరపూరేడుగోర్వంకలావుకపాన్నంగిలోవెల కన్నెలేడి." య. ౨, ఆ.

**కన్నోటు.** దే. వి. (కన్ను+ఓటు.) బెదరు, భయము.

**కన్పట్టు.** దే. అ. క్రి. కనుపట్టుయొక్క రూపాంతరము.

**కన్మొఱఁగు.** దే. స. క్రి. కనుమొఱఁగుయొక్క రూపాంతరము.

**కన్య.** ఉభ. వై. విశ. క్రొత్త*. "నెయ్యవుఁగన్యకలనసవాలుఁ దూపులజయించి." (రామాయణార్థమందు నెయ్యవుఁగన్యకలనసవాలుఁదూపులననియు, భారతార్థమందు నెయ్యవుఁగన్యకలకాసన

హాలుఁదూపులననియుభేదము.) రాఘ. ౧, ఆ. (ఇక్కడ రామాయణార్థమునందు సహితము కన్యయను శబ్దమును తత్సమముగానేచెప్పి యర్థమును సరిపఱపవచ్చునని కొందఱు చెప్పుదురు. కన్యాశబ్దము వికృతినిజెందినప్పుడే క్రొత్తయను నర్థముకలిగి తెనుఁగు ప్రయోగములందు సాధారణముగా వాడఁబడుచున్నది. సంస్కృతమునందాయర్థముకలిగి వాడఁబడునట్లుకానము. సంస్కృతమునందులేనియర్థములు వికృతియందుఁ గలుగుట సహజము.)—సం. వి. ఆ. స్త్రీ. 1. పెండ్లికానిపడుచు; 2. కూఁతురు; 3. ఒకరాశి; 4. ఆఁడుది; 5. కలబందచెట్టు; 6. పొట్లచెట్టు.

**కన్యక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పెండ్లికానిపడుచు; 2. చెల్లెలు; 3. పెద్ద యేలకిచెట్టు.

**కన్యాకుబ్జము.** సం. వి. అ. న. పురవిశేషము. పుం. కొమ్ముపొట్లచెట్టు.

**కపటము.** సం. వి. అ. పుం, న. కైతవము, కవ్రడు.

**కపటించు.** సం. అ. క్రి. కపటమెంచు. "ద్వి. కపటించెదైవంబు కతలేలయింక." రా. ఆర, కాం.

**కపర్దము.** సం. వి. అ. పుం. 1. గవ్వ; 2. శివునిజడముడి.

**కపర్ది.** సం. వి. న్. పుం. శివుఁడు, ముక్కంటి.

**కపాటము.** సం. వి. కవాటముయొక్కరూపాంతరము.

**కపాలభృత్తు.** సం. వి. త్. పుం. శివుఁడు, ముక్కంటి.

**కపాలము.** సం. వి. అ. పుం, న. 1. తలపుఱ్ఱె; 2. కుండలో సగువానిపెంచిక; 3. గుంపు.

**కపాలి.** సం. వి. న్. పుం. శివుఁడు, పునుకతాలుపు.

**కపి.** సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. చిల్లమఱ్ఱి; 3. విష్ణువు.

**కపింజలము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము, కముఁజు.

**కపికచ్ఛువు.** సం. వి. ఊ. స్త్రీ. 1. ఎలుకజీడిచెట్టు; 2. దూలగొండిచెట్టు.

**కపిచూతము.** సం. వి. అ. పుం. అంబాళముచెట్టు.

**కపిత్థము.** సం. వి. అ. పుం. 1. వెలఁగచెట్టు; 2. అభినయహస్తవిశేషము. (నడిమివ్రేలుమొదలగు మూఁటిని ముడిఁచి బొటనవ్రేలిని, చూపుడువ్రేలిని కొనలుకూర్చి పట్టినది.)

**కపిల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆగ్నేయదిశయందలి యాఁడేనుఁగు; 2. పుల్లావు; 3. ఇరుగుడుచెట్టు; 4. కంపుటిరుగుడుచెట్టు; 5. రేణుకయను గంధద్రవ్యముచెట్టు. అ. పుం. ము. గోరోజనమువంటివర్ణము. విణ. గోరోజనమువంటి వర్ణముగలది.

**కపిలుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొకముని; 2. విష్ణువు; 3. అగ్ని.

**కపిలె.** దే. వి. ఎడ్లనుగట్టితోలి నీరెత్తెడి యంత్రవిశేషము, మోట.

**కపిలోహము.** సం. వి. అ. న. ఆరకూటము, ఇత్తడి.

**కపివల్లి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలిచెట్టు.

**కపిశ.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నయెఱ్ఱచీమ. అ. పుం. ము. 1. చిల్లమఱ్ఱి; 2. పసుపుమీఱిన యెఱుపు. విణ. పసుపుమీఱిన యెఱుపుగలది.

**కపిశీర్షము.** సం. వి. అ. న. 1. కోటకొమ్ము; 2 గోడపైచివర.

**కపీతనము.** సం. వి. అ. పుం. 1. అంబాళముచెట్టు; 2. కలుజువ్విచెట్టు; 3. దిరిసెనముచెట్టు; 4. రావిచెట్టు.

**కపురము.** వై. వి. కర్పూరము. "కపురపుఁగమ్మతావి." వసు. ౨, ఆ.

**కపోణి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. కూర్పరము, మోఁచేయి.

**కపోతపాలిక.** సం. వి. ఆ. స్త్రీ. కొణిగయందేర్పఱచిన పావురపుగూఁడు.

**కపోతము.** సం. వి. అ. పుం. 1. గువ్వ; 2. పావురము; 3. అభినయహస్తవిశేషము. (వ్రేళ్లుచాఁపఁబడిన రెండుచేతులను ప్రక్కలుకూర్చి బోలుగాఁ బట్టినది.)

**కపోతాంఘ్రి.** సం. వి. ఇ. స్త్రీ. గువ్వగుత్తిచెట్టు.

**కపోలము.** సం. వి. అ. పుం. గండము, చెక్కిలి.

**కప్ప.** దే. వి. జలజంతువిశేషము, మండూకము.

**కప్పకులుపు.** దే. వి. కారకముచే అఱకాలియందులేచెడుగుల్ల.

**కప్పచిప్ప.** దే. వి. నీటియందలిగుల్ల, శంబూక.

**కప్పడము.** వై. వి. 1. చినిఁగినవస్త్రము; "క. కడవసములు కోలలు క, ప్పడములు వీరలధనంబు." భార. ఆది. ౭, ఆ.—2. వస్త్రము. "సీ. కప్పుఁగప్పడమును గస్తూరియును గాటుకయునివేదింతుము కాళికకు." పా. ౨, ఆ.

**కప్పతాళము.** మి. వి. ముద్దబీగము.

**కప్పనావురు.** దే. వి. చిఱుకప్పకాటుచేత పసులకుఁగలిగెడు పాననపురోగము. "గీ. నరిడిపుప్పుకప్పనావురు కడుపూఁద, యదరుఁద్రిక్కయనఁగనడరి." హరి. పూ. ౬, ఆ.

**కప్పము.** దే. వి. ప్రజలురాజునకిచ్చెడిధనము, కరము.

**కప్పరపడు.** ద్వి. అ. క్రి. (కప్పరము+పడు.) సంభ్రమపడు. "క. అప్పకుమారులఁగనెసని, చెప్పినవాల్మీకివచ్చిసీతాసుతులం, గప్పరపడిచూచిమనం, బుప్పొంగి పురస్కృతాగ్నిహోత్రుం డగుచున్." జై. ౬, ఆ.

**కప్పరపాటు.** ద్వి. వి. కప్పరపడుట. "గీ. తెల్లతమ్మివిరులఁదెగడుకన్నులవాసి, నవసుధాద్రవంబునవ్వువానిఁ, గనియెవేల్పుపిండుకప్పరపాటుతోఁ, గన్నులందునున్నకఱవుదీఱ." భాగ. ౬, ౫౦.

**కప్పరము.** దే. వి. తొట్రుపాటు, సంభ్రమము.

**కప్పలి.** వై. వి. ఓడ, నావ*. "సీ. విరహాంబురాశిదాఁటి రథాంగములు బోరగిలనిడ్డ పసిఁడికప్పలియనంగ." పర. ౩, ఆ. "క. చెప్పెడిదేమిఁకనొకచో, దెప్పరమగునుక్కుజీనుదిగవైచినఁదె, న్నెప్పనఁగదలకయుండెడి, కప్పలివిధమునసనుదేరుకదలకనిలిచెన్." శుక. ౨, ఆ.

**కప్పిరి.** దే. వి. (కప్పు+ఇరులు.) కొంచెపాటిచీఁకటి.

**కప్పు.** దే. అ. క్రి. క్రమ్ము. "విషముద్భవిల్లినగ్గడలనువిస్ఫులింగములుకప్పఁగబర్వెన." భార. ఆది. ౨, ఆ.—స. క్రి. ఆచ్ఛాదించు. వి. 1. ఆచ్ఛాదనము; 2. ఇంటిపైకప్పు; 3. నలుపు; 4. చీఁకటి; "చ. తనపయిరాజురావెనఁబతంగుఁడుకాలవశార్తిసేగుచో, మునుకొనికప్పుమూఁకయునుమట్టె." హంస. ౮, ఆ.—5. దంతక్షతము. "చ. తామరకొమరాలు మాటెనలిమండలిపేరిటికప్పులన్నియున్." హంస. ౮, ఆ.

**కప్పుఁగుత్తుకపుల్గు.** దే. వి. (కప్పు+కుత్తుకపుల్గు.) నెమలి. "సీ. కప్పుఁగుత్తుక పుల్గుగములపెల్లుదొలంగెఁదెలిమొగుల్ చదలనేడ్తెఱఁజెలంగె." అచ్చ. కిష్కిం, కాం.

**కప్పుఁదెరువరి.** దే. వి. (కప్పు+తెరువు+అరి.) అగ్ని, కృష్ణవర్త్మ.

**కప్పడము.** దే. వి. ఆచ్ఛాదనము.

**కప్పరించు.** దే. అ. క్రి. (కప్పు+తెంచు.) క్రమ్ము. "చ. ఉఱుముచునెల్లెడంబెకుగుబ్రగ్గితించడఘోరవిమూర్తియై, యదిమువేఁగప్పరెంచు విలయాభ్రముచాడ్పున." భార. ద్రో. ౧, ఆ.

**కప్పుబల్ల.** దే. వి. దూలముమీఁద గోడుగుబల్లతన్ను బల్లలకు నడుమ నుండెడి పలక.

**కప్పుమల.** దే. వి. కాటుకకొండ, అంజనపర్వతము.

**కప్పుమేనిగాము.** దు. వి. (కప్పుమేను+గాము.) శనిగ్రహము.

**కప్పురగంధి.** వై. స్త్రీ. వి. కర్పూరగంధమువంటి గంధముగల స్త్రీ. "ఉ. వేలుపుం, గప్పురగంధులెక్కిరిధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్." పా. 3, ఆ. (దీనిని కప్పురగంధియని శుద్ధవైకృతముగానే చెప్ప వచ్చును.)

**కప్పురపుటనఁటి.** దు. వి. (కప్పురము+అనఁటి.) కర్పూర కదళికి.

**కప్పురపుబెండ.** దు. వి. (కప్పురము+బెండ.) ఒకానొకబెండ, గంధమూలము కి.

**కప్పురపువంగ.** వై. వి. (కప్పురము+వంగ.) ఒకానొకవంగ, కూటవార్తాకి కి.

**కప్పురబోగి.** వై. వి. సస్యవిశేషము. "ద్వి. పాలుపుగైకొనక కప్పురబోగివేఁగె." విష్ణు. పూ. 3, ఆ.—బ. ధాన్యవిశేషము. (వృత్తియందేకవచనాంతము.) "ఉ. కప్పురబోగివంటకముఁ గమ్మని తాలిఁపుసొజ్జపిండితో, నొప్పులుగాభుజించిరి." భీ. ౨, ఆ.

**కప్పురము.** వై. వి. కర్పూరము. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణమునకు వికల్పముగ లోపంబగు. కప్పురపిడెము మొ.)

**కప్పుఱాయి.** దే. వి. నీలమణి.

**కప్పెర.** వై. వి. 1. కపాలము; "చ. కఱచినపీనుఁగుల్ వెడఁద కప్పెరయుల్ మొలఁబచ్చితోళ్లునుం, బుఱియలపేరులున్ మెదడుఁ బూఁతకుజమ్మనిమూఁగునీఁగలుం, బెఱికినవాలు లొమ్మువయిఁ బేరిన నెత్తురుఁద్రేవుడున్ గడున్, బిఱుములచూపులున్ దఱచుబీఱ నరంబులుఁగల్గుహూపమై." ఉ, హరి. ౨, ఆ.—2. భిక్షాపాత్రము. "సీ. కడునబ్బురంబైనపాదుపుగుబ్బలిజోగి శిరముపై కెంపుఁగప్పెరయునంగ." పర. 3, ఆ. (దీనికిఁ గొందఱు కటాహమనియు నర్థము చెప్పుచున్నారు. ఆ యర్థమును కొప్పెరశబ్దమునకుఁ జెప్పుట సాధువని తోఁచుచున్నది.)

**కప్రము.** వై. వి. కప్పురముయొక్కరూపాంతరము. (వృత్తియందుఁ గప్పురశబ్దమువలె నెఱుంగునది. "గీ. అచ్చరలునందనంబునఁ దెచ్చుకొనుమ, రాగసుమములుహర్మ్యవాతాయనముల, చెంతఁగాలూఁదితప్పరస్త్రీలకొసఁగి, వేఁడికొనిపోవుదురుకప్రపీడియములు." చారుదేష్ణచరిత్రము.)

**కప్రములక.** దు. వి. (కప్రము+ములక.) కప్పురపువంగ కి.

**కఫము.** సం. వి. అ. పుం. శ్లేష్మము, తెమడ.

**కఫి.** సం. విశే. (న్. ఈ. న్.) కఫరోగములవాఁడు.

**కబంధము.** సం. వి. అ. న. నీరు. పుం, న. తల తెగిత్రుళ్లెడు శరీరము. పుం. సముద్రము.

**కబంధుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొక రాక్షసుఁడు; 2. కేతువు.

**కబరము.** సం. విశే. (అ. ఆ. అ.) మిశ్రము, కలసినది.

**కబరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కొప్పు; 2. వాయింట కి; 3. ఇంగువ ద్రావము.

**కబళనము.** సం. వి. అ. న. మ్రింగుట.

**కబళము.** సం. వి. అ. పుం. గ్రాసము, కడి.

**కబళించు.** సం. స. క్రి. మ్రింగు.

**కబాడము.** దే. వి. ఎడ్లమీఁదవేసితెచ్చెడు కసవులోనగువాని జంట మోపు.

**కబాయి.** దే. వి. అంగీ. "సి. నవపుష్పవనమునానామణుల్ గ్రుచ్చినపచ్చపట్టుకబాయిబాగునెఱప." కళా. ౫, ఆ. (రూ. కబాయీ. "రగడ. బావరలుసైరిణులుచక్కనికబాయీలు." హంస. ౫, ఆ.)

**కబురు.** హిం. వి. సమాచారము.

**కబ్బపుఁగూరుపరి.** దు. వి. (కబ్బము+కూరుపరి.) కావ్యము రచించువాఁడు, కవి. "క. అనియెల్లవేల్పులనుచే, ర్కొనికబ్బపుఁగూరుపరులగురునిఁగడంకం, గొనియాడి." అచ్చ. బాల, కాం.

**కబ్బము.** వై. వి. 1. కావ్యము; 2. ప్రబంధము కి. "క. వివిధార్థదీపకముమూ, డవకబ్బమధర్వమయముదంచితరసభా, వవిశేషభూషితంబై, భువినెనుబదియేడువృత్తములతోభిల్లున్." పర. ౨, ఆ.

**కబ్బిలి.** దే. వి. కల్లమ్మువాఁడు, శౌండికుఁడు.

**కబేలా.** హిం. వి. ఇంటిపత్రము.

**కమండలువు.** సం. వి. ఉ. పుం, న. సన్యాసులుంచుకొనెడు గిండివంటి మట్టిపాత్రము. పుం. జోవ్వి కి.

**కమటము.** దే. వి. అగసాలెవానికుంపటి. "చ. కమటము కట్లె సంచి యొరగల్లును గత్తెర సుత్తె చీర్ణమున్, ధమనియు ప్రావణంబు మొలత్రాసునుబట్టెడ నీఱుకాఱుసా, నము పటుకారు మూసబలు నాణెపరీక్షలమచ్చులాదిగా, సమరఁగభద్రకారక సమాహ్వయుఁ డొక్కరుఁడుండు నప్పురిన్." హంస. ౨, ఆ.

**కమఠము.** సం. వి. అ. న. భిక్షాపాత్రము. పుం. తాఁబేలు.

**కమఠి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు, డులి.

**కమతకాఁడు.** దే. వి. (కమతము+కాఁడు.) కమతముచేయు వాఁడు.

**కమతము.** దే. వి. కమ్మతముయొక్కరూపాంతరము.

**కమతీఁడు.** దే. వి. (కమతము+ఈఁడు.) కమతకాఁడు. "సీ. వెదురుచేల్ కలుపుదీసిదినంబుఁగాపాడుకమతీలుమాఁకకలములు సుమ్ము." పా. ౧, ఆ.

**కమనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) మనోహరము, ఇంపైనది.

**కమనుఁడు.** దే. విశే. (అ. ఆ. అ.) ఇచ్ఛగలవాఁడు, కాముకుఁడు.

**కమరు.** దే. అ. క్రి. కాలు, "కమరెనాటెక్కలుకమరవయ్యేననుజాపత్కమ్ములు." సం. "తతోదగ్ధా విమాపక్షౌ సదగ్ధాతు జటాయుషః." భార. ఆర. ౭, ఆ.—వి. 1. కాలినకంపు; "క. అన్నంబు కమరువలచుచు, నున్నది." షో. ౫, ఆ.—2. కమ్మరుయొక్కరూపాంతరము. "ఎ, గీ. కటిభరంబునవజ్రాలకమరుదాల్చి." కాశీ. ౭, ఆ.

**కమరుచు.** దే. ప్రే. కమరఁజేయు, కాల్చు. "ద్వి. రమణీయగజవాజిరథశాలలోలిఁ, గమరిచి." రా. సుం, కాం. (రూ. కమర్చు.)

**కమల.** సం. వి. అ. స్త్రీ. 1. లక్ష్మి; 2. ఉత్తమురాలు. అ. న. ము. 1. తామర; 2. ఎఱ్ఱతామర; 3. నీరు; 4. మందు; 5. కడుపులో నొకప్రక్కనుండెడి యెఱ్ఱనిమాంసము; 6. రాగి. పుం. శివునిచేతియిఱ్ఱి. న. ప్రస్న.

**కమలచ్ఛదము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము, రాపులుఁగు.

**కమలవల్లభ.** సం. వి. ఆ. స్త్రీ. పిన్నవరగోఁగు*.

**కమలాప్తుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. విష్ణువు.

**కమలాఫలము.** సం. వి. ఫలవిశేషము, కిచ్చలిపండు.

**కమలాసనుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

**కమలిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరకొలను; 2. తామరతీఁగ.

**కమలు.** దే. అ. క్రి. 1. కందు; "చ. కమలెనశేషకోకనదకైరవపఙ్క్తులుశైవలంబులున్." భార. ఆది. ౭, ఆ.—2. కాలు. "మ. ఇనచండాంశులఁబక్షముల్కమలి యేనెచ్చోటికిం బోవ లేకునికిన్." రా. కిష్కిం, కాం.

**కమలోత్తరము.** సం. వి. అ. న. కుసుమపువ్వు.

**కమసాలవాఁడు.** వై. వి. లోహకారుఁడు.

**కమాను.** అన్యదే. వి. ప్రయాణము, విల్లు.

**కమి.** దే. వి. కమికిలి. "సీ. కాంతాజనంబులు కమియారనిడుదురే పురములోఁదర్కాల పుణ్యభిక్ష." భీ. 3, ఆ. (ఇది పిడి శబ్దమువంటిదని తోఁచెడి, ప్రయోగాంతరము గనఁబడలేదు.)

**కమికిలి.** దే. వి. వంపఁబడిన వ్రేళ్లుగల పుడిసిలి.

**కమిచీ.** హిం. వి. చేబుకు.

**కమిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) కమనుఁడు.

**కమియు.** దే. అ. క్రి. 1. కవియు; "సీ. కమియునుద్ధతవారణముఁద్రిప్పునేనదాచారధౌరేయుహుంకారరవము." భాను. ౧, ఆ.—2. నలఁగు; "క. కనలినిశాచరికేలు, కుక్కనఁ గమియఁగఁ బట్టి భీతిగొనఁదిగిచివడిన్." రా. సుం, కాం. — 3. మాఁగు. "చ. క్రమమునఁబిందెలుం బనరుఁగాయలుఁగాయలుదోరపండులుం, గమిసినపండులుంగెలలుగట్టితదున్నతశాఖలన్నియుం, దమమయమైతలిర్పఁగ." హరి. పూ. ౬, ఆ.

**కమిషన్.** ఆం. వి. బేరముచేసినందు కిచ్చుపెచ్చుద్రవ్యము.

**కమీజు.** ఆం. లోన ధరించుచొక్కా.

**కముఁజు.** వై. వి. కసింజలపక్షి. "ద్వి. కముఁజులఁజిలుకలఁగ్రౌంచపక్షులను, భ్రమయించుపూరేళ్లఁబావురంబులను." సా. 3, భా.

**కముచు.** దే. స. క్రి. 1. గ్రహించు; "నడిమిచేక్కఁగమిచివిధికరంబునఁదూఁచె." నై. ౫, ఆ.—2. మ్రింగు. "సీ. అమృతాపహరణార్థమరుగుపక్షిస్వామిగతిఁబుళిందశ్రేణిఁగమిచికమిచి." స్వా. ౪, ఆ.

**కమ్మ.** దే. వి. 1. స్త్రీకర్ణభూషణము; 2. పత్రిక; "గీ. వలఁతిబంటులనిరువురఁబిలిచిమేలి, కమ్మయొసఁగిన." అచ్చ. బాల, కాం.—బ. 3. శూద్రవిశేషము. "వ. వెలమలనఁగమ్మలన." భీ. ౧, ఆ.—విణ. 1. పులుపులేనిది; (కమ్మఁగూర మొ.)—2. మధురము; (కమ్మనీరు మొ.)—3. వాసనగలది. (కమ్మనూనియ మొ.)

**కమ్మగాడ్పు.** దే. వి. మలయమారుతము. "ఎ, గీ. అఖిలభువనైకమోహకుండైనమాధ, వునకునీవనవాసిరంజన మయత్న, కార్యలేశమ్మునమ్మంచుఁగమ్మగాడ్పు, గడిమిమ్రోయించెఁగలకంఠకంఠఘంట." హంస. ౨, ఆ.

**కమ్మచ్చు.** వై. వి. (కమ్మి+అచ్చు.) అగసాలెవాఁడు కమ్మితీసెడి కొఱముట్టు. "ఉ. మెచ్చినమైత్రిఁబద్మినులకెల్లఘనాత్యయకారకుండుగా, మ్మచ్చుపడంగఁజేయుటకునైయలక్రౌంచనగంబుపేరిక, మ్మచ్చన నిచ్చితద్గిరి యందలి వెండిసలాకపిండునా, వచ్చెమరాళమాలికలు వ్రాలెఁగొలంకులవక్త్రమంకృతిన్." ఆము. ౪, ఆ.

**కమ్మటము.** దే. వి. అగసాలెవానికుంపటి. "మ. ప్రతిసూర్యుండనకమ్మటంబు మఖవద్భాశాసమన్కాలు రో, హితమన్పేరిటియూఁదుఁగ్రొవిచపలోపేతాంబరాంభోదసం, తతియన్మచ్చులనంచి కావిరనునిద్ధాటీకమున్గన్పడన్, జపసొన్నారితెఱంగునందనరెవర్ణావేశమిన్నంగడిన్." చంద్రా. ౪, ఆ.

**కమ్మటీఁడు.** దే. వి. (కమ్మటము+ఈఁడు.) అగసాలెవాఁడు, స్వర్ణకారుఁడు.

**కమ్మతము.** దే. వి. అనేకులుచేరిచేయుసేద్యము, కృషి.

**కమ్మతీఁడు.** దే. వి. (కమ్మతము+ఈఁడు.) కమతకాఁడు, కృషీవలుఁడు. "కల్పకంబులపంటకమ్మతీఁడు." స్వా. ౫, ఆ.

**కమ్మన.** దే. వి. 1. కమ్మఁదనము; (చూ. కమ్మ.) 2. మాధుర్యము; 3. సౌరభము. (ఇది విశేషణమగుచో ఇకారాంతమగును.) "కడుఁదియ్యనికమ్మని పండులింపు సొంపారఁగనానియాని." భార. ఆర. ౬, ఆ.

**కమ్మనిమ్మ.** దే. వి. నిమ్మపండువంటివర్ణముగలకిత్తలి, తియ్యనిమ్మ, శర్కరాంకము.

**కమ్మనీరు.** ద్వ. వి. మకరందము. "మ. ఉరుశక్తిన్మధుమాసదోగ్ధపిదుకన్ జ్యోత్స్నగవి చంద్రమ, స్స్ఫురదూధఃప్రవిముక్తమైన నిబిడజ్యోత్స్నపయఃపూరమున్, విరియంబాఱెనగొజ్జెఁగల్గురియమున్నీరైనయక్కమ్మనీ, రురహింగూడినసేర్వరించుగముల్తైరోలంబకాదంబముల్." ఆము. ౫, ఆ.

**కమ్మనూనియ.** ద్వ. వి. సంపెఁగమొదలగువానిఁజేర్చి చేసినతైలము. "సీ. అతఁడుతైలాభ్యంగమడిగినఁబతికమ్మనూనియఁదెప్పించిమేనుశిరము, నర్థ్యక్తములుసేయ." భార. అను. ౨, ఆ. (రూ. కమ్మనూనె.)

**కమ్మపంజాలు.** దే. వి. బ. పంజాలకమ్మలు. "వ. కమ్మపంజాలవజ్రంపుఁజకచకల నకనకలుపిడుకొని." స్వా. 3, ఆ.

**కమ్మపిల్లి.** ద్వ. వి. పునుఁగుపిల్లి, మార్జారిక.

**కమ్మర.** వై. వి. ఇనుముపనిచేసి బ్రతికెడుజాతి. (కమ్మరవాఁడు, కమ్మరది.)

**కమ్మరి.** వై. వి. (కమ్మర+ఇ.) 1. కమ్మరవాఁడు; 2. బాణకారుఁడు*. "గీ. నెలయుకేజవరాలుఁబెండిలికినెదురు, నెడలఁదటియనుకమ్మరికడయనంగఁ, గ్రాలుబిరుసులునెఱపినఁబూలుఁబొగయు, నెగసెననమింటరిక్కలునిరులుఁబర్వె." అచ్చ. అ, కాం.

**కమ్మరీఁడు.** వై. వి. (కమ్మర+ఈఁడు.) 1. కమ్మరవాఁడు; 2. బాణకారుఁడు*. "వ. తెరువరులగెలువందరలుమరునకుం దఱియను కమ్మరీఁడు వెరవునంజేసియునిచిన కఱకుటమ్ములగుంపులసొంపునం బెంపారుకలువక్రొవ్విరులును." నీలా. 3, ఆ.

**కమ్మరు.** దే. వి. కమరు, మొలనూలు.

**కమ్మరుబొందు.** దే. వి. రెండుగాడికమ్ములనడిమిబిగిబద్ద.

**కమ్మరేను.** దే. వి. కశేరుకము*.

**కమ్మవిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు, సురభిసాయకుఁడు. "ఎ, గీ. కమ్మవిలుకాఁడుమెఱయుశృంగారవనము, లోనిగురివెందపొదక్రిందవానినునిచి." విక్ర. ఆ. ౭, (ఇట్లు కమ్మవిలుతుఁడు మొ.)

**కమ్మి.** వై. వి. 1. నెదురులోనగువానికమ్మి; 2. బంగారులోనగు వానికమ్మి*; 3. వస్త్రపుఁగమ్మి*; "సీ. గజచర్మమెన్నఁడోకానినిచ్చలు గట్టుపసిఁడికమ్ములపట్టుపచ్చడంబు." భీ. ౧, ఆ.—4. బండి కంటికడకమ్మి*. "వ. పంద్రెండంచులునాఱుకమ్ములునుమూడు తొలులుంగలిగి." సం. "యస్యైకంచక్రంద్వాదశారంషణ్నే మిత్రినాభి సంవత్సరాత్మకంసమామనంతి." భాగ. ౫, స్కం. ౨, ఆ. 5. సెముబొద్దు.

**కమ్మిబండి.** దృ. వి. కమ్మివేసిన మ్రానిచక్రపుబండి.

**కమ్మిరించు.** దే. స. క్రి. మూయు. "క. ఇలుసొచ్చిసకలభాండం, బులుశోధింపంగనొక్కనూలదెసనుదొం, పులసంధిఁగమ్మిరించిన, సలసల మనుపేఁడిపాయసమ్ముఁగనుఁగొనెౕ." భో. 3, ఆ.

**కమ్ము.** వై. స. క్రి. కమ్మిగాచేఁగఁగొట్టు*. "సీ. మేటిజమ్మేటియ సటఁగ్రొమ్మించుసొంచుఁ, బొదివిమదనప్రతాపాగ్నిఁ బుటమువెట్టి, తమ్మిగద్దియదాఁకటఁగమ్మియట్టి, కొమ్మఁగావింపఁబోలు నెత్తమ్మిచూలి." వసు. ౨, ఆ.

**కమ్మెరాకు.** దే. వి. (కమ్మెర+ఆకు.) కారపు నల్లపములపాకు.

**కమ్రము.** సం. విశ. 1. ఇంపైనది; 2. ఇచ్చకలది.

**కయాహము.** సం. వి. అ. పుం. ఎనుపదూడ.

**కయిఫు.** హిం. వి. మత్తు.

**కయివారము.** యు. దే. వి. గనిమయంచు. వై. వి. స్తోత్రము*. "ఉయగ్రాహి. రసాలములవేడ్కఁగయివారనులుసేయుచునుధీర ముకురాస్యల్." భాను. ౨, ఆ.

**కయ్య.** దే. వి. మడి. (చూ. క్రయ్య.)

**కయ్యపుఁదిండి.** దే. వి. (క్రయ్యము+తిండి.) కలహాశనుఁడు, నారదుఁడు. "గీ. కూర్మిఁగయ్యంపుఁదిండి, తపసి కన్నాకు కత వినుతపసిఁజూచి, యిట్టులనియె." అచ్చ. సుం, కాం.

**కయ్యము.** దే. వి. జగడము, యుద్ధము.

**కయ్యర.** దే. వి. హీనజాతి వర్తకము.

**కయ్యాలక్రచ్చ.** దే. విశ. కలహశీలుఁడు. "సీ. కయ్యాల క్రచ్చయైకాలుద్రవ్వచు సదా మండువాఁడతిశాంతమహితుఁడ య్యె." పాండు. ర, ఆ.

**కర.** యు. దే. వి. తీరము. "క. హరిభక్తితేపగాదు, స్తరసంసారాబ్ధిఁ గడచుసాధుజనులకుం, గరయై." లక్ష్మీ. ౧, ఆ.—వై. విశ. తీక్ష్ణ ము. (కరసాన.)

**కరంకము.** సం. వి. అ. పుం. 1. లోపల నేమియులేని బొండ్ల పుఁజిప్ప; 2. డొక్క; 3. తల.

**కరంజము.** సం. వి. అ. స. పులిగోరుచె. పుం. కానుగుచె.

**కరండము.** సం. వి. అ. పుం. 1. కత్తి; 2. తేనెపెర; 3. కరా టము. (ఇది యీ యర్థమున మూడు లింగములందునగు.)

**కరంబము.** సం. వి. అ. పుం. 1. కంపిల్లముచె; 2. మేళనము.

**కరంభము.** సం. వి. అ. పుం. పెరుగుతోఁగలిపిన పేలపిండి.

**కరఁగు.** దే. అ. క్రి. ద్రవించు. "రమణభుజా నిపీడనఁగరంగిన కాంతల." లక్ష్మీ. 3, ఆ.—అం, ప్రే. కరఁగించు. "ఎ, గీ. కుసు మశాయుని బాణముల్గూడనైదుఁ, గరఁగినేరిమివాటించికరువుగట్టి, ప్రోదిచేసి చైతన్య సంపుటము తగఘు, టించిరోకాకయిట్టిచేడియ బుగలరె." భార. విరా. ౨, ఆ.—వి. కరఁగుట. (చూ. కరఁగు పడు.)

**కరఁగుపడు.** ధ్వ. అ. క్రి. (కరఁగు+పడు.) కరఁగు. "వ. కొత్తు కాంకురంబు కరఁగువడ వెఱఁగుపడి." సా్వ. ౬, ఆ.

**కరఁచు.** దే. ప్రే. కరఁగఁజేయు.

**కరక.** ఉభ. దే. వి. హారీతకిచె. సం. ఇ. ఆ. స్త్రీ. అ. పుం. వడ గల్లు. అ. స. ము. పుట్టగొడుగు. పుం, స. 1. గిండివంటి పాత్రము; 2. లోపల నేమియులేని బొండ్లపుఁజిప్ప. పుం. 1. దాళిమ్మచె; 2 పక్షివిశేషము.

**కరకంచు.** దే. వి. (కరక+అంచు.) కరక్కాయనీటితో వ్రాసిన యంచు.

**కరకణి.** దే. వి. వేఁటాడుటకు ఉపయుక్తమగు సాధనవిశేషము. "గొరః లత్తళములు కరకణీలు." రుక్మాం. 3, ఆ.

**కరకర.** దే. వి. వ్రాయుటయందగు ధ్వన్యనుకరణము.

**కరకరి.** దే. వి. 1. క్రూరభావము; "కరకరిగూఁటఁగత్తియిడఁగా." సా్వ. 3, ఆ.—2. ద్వేషము. "కళింగజంబులగుగంధగజంబుల కుంభరాజితోఁ గరకరిపుట్టఁగాఁగలదు." నై. ౫, ఆ.

**కరకసా.** వై. విశ. కఱకు. (కరకసానేల.)

**కరక్కాయ.** దే. వి. (కరక+కాయ.) కరకచెట్టుకాయ.

**కరగసము.** వై. వి. ఱంపము, క్రకచము.

**కరగోడ.** ద్వ. వి. (వెలుగునాటుటకై.) పొడిమట్టితో నేర్పఱచిన గోడ.

**కరజము.** సం. వి. అ. స. పులిగోరుచె; పుం. 1. గోరు; 2. కా నుగుచె.

**కరటు.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రయాసముచేతఁ బిదుకఁదగిన యావు, అబ్జి; 2. కాఁచిచె. అ. పుం. ము. 1. కాకి; 2. కుసుమ పువ్వు; 3. గోఁదురుఁగప్ప; 4. ఏనుఁగుచెక్కిలి; 5. నింద్య జీవనము; 6. వాద్యవిశేషము; 7. ఏకాదశాహాదిశ్రాద్ధము.

**కరటి.** సం. వి. న్. పుం. గజము, ఏనుఁగు.

**కరడము.** దే. వి. అల. "సీ. కాంతాదిసుఖముసైకతవేదికాస్థలి కంద ర్పవికృతులు కరడములును." భీ. ౫, ఆ.

**కరడు.** దే. వి. 1. అల; "సీ. గగనంబుతోరాయుకరడులుగలజలం బివిరి పాడఱినయర్ణవము కరణి." భార. ద్రో. ౨, ఆ.—2. పక్షి విశేషము.

**కరణకమ్మలు.** దే. వి. బ్రాహ్మణజాతివిశేషము.

**కరణము.** సం. వి. అ. స. 1. లెక్కవ్రాయువాఁడు; 2. బవాది; (ఇవి. ౧౧.—బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగవము, కింస్తుఘ్నము.) 3. కొఱ ముట్టు; 4. ఇంద్రియము; 5. కారణము; 6. క్రియాభేదము; 7. పని; 8. క్షేత్రము; 9. గీతభేదము; 10. నృత్యభేదము; 11. పూఁత; 12. రతిబంధము; 13. శరీరము. పుం. డు. శూద్రస్త్రీకిని వైశ్యునకును బుట్టినవాఁడు. (త్రికరణములు.— మనస్సు, వాక్కు, కర్మము.)

**కరణి.** దే. వి. విధము. "క. ఒక్కఁడ సర్వగతుండై, యెక్కడు క్రియవాసుదేవుఁడితఁడని పెద్దల్, మ్రొక్కఁగనుండుజనార్దనుఁ, డక్కరణియనన్యమెఱుఁగవైతిదురాత్మా." హరి. ఉ. ౬, ఆ.

**కరణికము.** వై. వి. కరణమువానిపని.

**కరణీయము.** సం. విశ. (అ. ఆ. అ.) చేయఁదగినది.

**కరతిత్తి.** వై. వి. వస్త్రపుసంచి. "ద్వి. కుదియకకరతిత్తిగొనిదాని వ్రే య." హరిశ్చ. ౨, భా.

**కరతోయ.** సం. వి. అ. స్త్రీ. గౌరీవివాహకాలమందు ఈశ్వరుని హస్తమువలనఁ బుట్టిన యేఱు.

**కరదము.** సం. వి. అ. పుం. ఉపహారము, కానుక.

**కరదివియ.** వై. వి. దివ్వటీ.

**కరదివ్వియ.** వై. వి.——పై.——

**కరదివ్వె.** వై. వి. కరదివ్వియయొక్క-రూపాంతరము. "ద్వి. కరము నఁబూనినఖడ్గప్రకాశ, మరుదుగాఁగరదివ్వెయై త్రోవఁజూప." హరిశ్చ. ౧, భా.

**కరదీపిక.** సం. వి. ఆ. స్త్రీ. దివ్వటీ.

**కరపక్క.** దే. వి. వర్ణహీనమైన కెంపుఱాయి.

**కరపత్త్రము.** సం. వి. అ. న. క్రకచము, ఱంపము.

**కరపుచ్చె.** దే. వి. హోమకర్కటికీ.

**కరఫలము.** సం. వి. అ. పుం. గుజ్జునుసు దోమెడుసు గొఱపము.

**కరభుజము.** దే. వి. ఇత్త్రాలముకీ.

**కరబూజా.** హిం. వి. ఒకపండు.

**కరభము.** సం. వి. అ. పుం. 1. మణికట్టుమొదలు చిటికెనవ్రేలి మొదలుదాఁకఁగల చేతివెలుపలిచోటు; 2. ఒంటెపిల్ల.

**కరమర్దము.** సం. వి. అ. పుం. కలివెకీ.

**కరము.** ఉభ. దే. అవ్య. అత్యంతము. (వృత్తియందు దీనికి వాఁడి శబ్దము పరమగుచో మువర్ణలోపము మహాకవిప్రయోగములయందుఁ గానఁబడుచున్నది. "కరవాఁడిచూపులు." కరవాఁడిసఖములు.) — సం. వి. అ. పుం. 1. చేయి; 2. కిరణము; 3. తొండము; 4. కప్పము; 5. వడగల్లు.

**కరరుహము.** సం. వి. అ. పుం. నఖము, గోరు.

**కరవటము.** వై. వి. బరణి*. "గీ. పొదలియొండొండదివియును భువియుదిశలుఁ, బొదివికొనియెడిచీఁకటిప్రోవువలన, మిక్కుటం బుగఁగాటుకగ్రుక్కినట్టి, కరవటంబన జగదండఖండ మమరె." లక్ష్మి. 3, ఆ.

**కరవాఁక.** దే. వి. సముద్రపుఁగట్టు నోరనుండెడి బురదనేల.

**కరవాయి.** దే. వి. లోహకారుఁడు సుత్తెతోఁ బాత్రములను చాఁ గఁగొట్టునప్పుడు ఒత్తుసుగా వానిలోపలఁ జొప్పించెడి మొనవం పు దిమ్మెమొగపు యినుపకమ్మి.

**కరవాలము.** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**కరవాలు.** వై. వి. ——పై.—— "క. తివిరికరవాలుసేకొని, అవఆవలెసఁగంగనత్తెఆవపైఁజనుచో." అచ్చ. యుం, కాం.

**కరవాళిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కత్తిపీట; 2. చేరకత్తి.

**కరవీరము.** సం. వి. అ. పుం. 1. కత్తి; 2. గన్నేరుకీ. 3. డు. ఒకానొక రాక్షసుఁడు.

**కరశాఖ.** సం. వి. ఆ. స్త్రీ. అంగుళి, వ్రేలు.

**కరసాన.** వై. వి. రత్నములుమొదలగువాని సానఁబట్టెడుచక్రాకార మైనసాన. "సీ. కలువలెన్నటికిశోభిలకుండఁజేసినభానునిఁగరసానఁ బట్టవలదె." భాను. 3, ఆ.

**కరహాటము.** సం. వి. అ. పుం. 1. తామరదుంప; 2. మంగకీ.

**కరా.** వై. విణ. తీక్ష్ణము. (కరాచురి మొ.) కరయొక్క-రూపాంతరము.

**కరాచురకత్తి.** వై. వి. ఖడ్గము. "డాకెలంకునసిరాజికరాచురకత్తి." సాన్వ. ర, ఆ. (చురకత్తి, చురి, చూరి ఈ శబ్దములు కరాశబ్దపూర్వకమైనప్పుడు ఖడ్గవాచకములుగాఁ బ్రయోగములం గానఁబడు చున్నవి.)

**కరాచురి.** వై. వి. (చూ.)——పై.—— "వ. కటికనకమేఖలా ఘటితంబగు చేఱు కరాచురి మరకతంపుఁబిడిమెఱుంగులు." సాన్వ. ౫, ఆ.

**కరాచూరి.** వై. వి. (చూ.)——పై.—— "క. రాచూరితిప్ప విభునిక, రాచూరిందెగినిరంతరము సమరమ్మగి, లోచనలమదన శాస్త్రా, లోచనలందఖిలవర్తిలు దురభియాతుల్." రామా. ౧, ఆ.

**కరాటము.** వై. వి. బరణి*. "సీ. పమ్ముకాటుకకరాటమ్ముఘూకారాతి దుష్కీర్తిసంభృతరోదసీతలమ్ము." చంద్రా. ౧, ఆ. (కరవటము యొక్క-రూపాంతరము.)

**కరాపువు.** వై. వి. అవంగము.

**కరారు.** హిం. వి. ఏర్పాటు, నిర్ణయము.

**కరారునామా.** హిం. వి. ఒడంబడికపత్త్రము.

**కరాళము.** సం. వి. అ. న. 1. నల్లగగ్గెరకీ; 2. వెన్నెముక. పుం. నఖరసమునూనె. విణ. 1. ఒడ్డుమిట్టయినది; 2. పొడవైనది; 3. వెఱపుఁబుట్టించునది.

**కరాళించు.** దే. అ. క్రి. 1. బొబ్బరించు; "వ. గిరిగహ్వరకా ననంబులఁదర్పలంబడిదరికొనియెరగలిగొనికాలుకాలానలంబుకయివ డింగదిసికరాళించి." సిర. ర, ఆ.—2. సకిలించు. "ద్వి. ఎక్కినదైతేయులిటునటుపడఁగ, లెక్కసేయకకరాళించుగుఱ్ఱములు." రా. యు, కాం.—స. క్రి. నిందించు. "ద్వి. వక్కసేయనిలేకివాఁడని నన్ను, లెక్కసేయకకరాళించెనీరాజా." హరిశ్చ. ౨, భా.

**కరి.** ఉభ. దే. వి. 1. నిదర్శనము; "చ. తదీయతప్పలతకుఁబ్రాసప్ప మాపెకరి." ఆము. ర, ఆ.—2. మేర. "క. ఖాండీరవటము కరిగా." హరి. పూ. ౭, ఆ.—విణ. సాక్షి. "దినకరపవనాగ్నితు హినదీప్తులుకరిగాఁ." భార. ఆది. ౨, ఆ.—సం. వి. న్. పుం. 1. ఏనుఁగు; 2. కోఁతి.

**కరిఖలము.** సం. వి. అ. పుం. వేదుకగానాడెడుజూదము.

**కరిణాలు.** దే. వి. బ. సాలెవారిలో నొకతెగవారు.

**కరిణి.** సం. వి. ఈ. స్త్రీ. ధేనుక, ఆఁడేనుఁగు.

**కరిది.** దే. వి. చర్మవాద్యవిశేషము. "ఎ, గీ. కవడ యనసురుమ యనఁగను గరిది యనఁగఁ, దప్పెట యనంగవాద్యభేదములుచెలఁ గు." అం, భా. ప్ర. నా.

**కరిపిప్పలి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి.

**కరిమాచలము.** సం. వి. అ. పుం. సింహము.

**కరివె.** దే. వి. ఇత్తడిలోనగువానితోఁజేసి పీఠాదండమును బొదివి కొనియుండునట్లు సారకాయపయినమర్చెడు తదంగము, కకుభము.

**కరివెద.** దే. వి. నేల దున్ని విత్తుటకు వాన నెదురుచూచుట.

**కరిసనము.** వై. వి. కృషి. "క. అరులుమిగులఁగొనిరాజులు, నరులఱినెంతయును భయమొనర్తురుధరణీ, సురులుగడఁగివాణిజ్య ము, గరిసనమునుజేయఁగలరు కలికాలమునన్." భార. ఆర. ర, ఆ. (చూ. కర్షనము.)

**కరిసించు.** వై. స. క్రి. ఘర్షించు. "సీ. కంఠీరవమునైనఁగరిసించు టయకాని యొరసి వెన్నీనిఘోటోచ్చయంబు." బహులాశ్వచరిత్రము.

**కరిసె.** వై. వి. కాలుపలను*. "కరిసెయసంగనుగాలుపలంబొప్ప." ఆం, భా. ద్వి. వై.

**కరీరము.** సం. వి. అ. పుం, న. వెదురుమొలక. పుం. 1. కుండ; 2. వెణుతురుచె.

**కరేరిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగుకొమ్ముమొదలు; 2. విమ్మట.

**కరీషము.** సం. వి. అ. పుం, న. 1. ఎరువు; 2. ఏటుపిడక; 3. పిడక.

**కరుగు.** దే. వి. 1. పోఁతపోసెడియచ్చు; "చ. కరుగునఁబోయు మాడ్కినొడికంబుగఁజాతమలంచుకైవడిన్." చంద్రా. ౨, ఆ.— 2. వరిపొట్టకజ్జ.

**కరుడు.** దే. వి. 1. గట్టిపడిన ముద్ద; "గీ. కలసిశుక్లశోణితములు కరుడుగట్టి, వినుమమేధ్యమధ్యమునఁబ్రవృద్ధిఁబొంది, కాలవశత నప్పిండమంగంబులెల్లఁ, గలిగి శిశువయిమారుత గతియెలర్ప." భార. స్త్రీ. ౧, ఆ.—2. దినదినము వ్రాసెడు సంకీర్ణపులెక్క.

**కరుడుగట్టు.** దే. అ. క్రి. (కరుడు+కట్టు.) గట్టి, ముద్దయగు. (చూ. చేలచేలన.)

**కరుణ.** సం. వి. ఆ. స్త్రీ. కనికరము. అ. పుం. ను. 1. ఒకానొక చెట్టు; 2. ఒకరసము. (చూ. రసము.)

**కరుణించు.** సం. అ. క్రి. కనికరించు.

**కరుమల.** వై. వి. (చూ.) కమ్మర*. (కరుమలవాఁడు, కరుమలది.)

**కరువ.** వై. వి. కొండ. "క. గట్టనగుబ్బలియనఁగఁగరువయనంగ." ఆం, భా. ద్వి. వై.

**కరువలి.** దే. వి. గాలి, వాయువు.

**కరువలిపట్టి.** దే. వి. 1. భీముఁడు; 2. హనుమంతుఁడు. (ఇట్లు గాడుపుఁబట్టి, గాలిచూలి మొ.)

**కరువలిరిక్క.** ద్వ. వి. స్వాతీనక్షత్రము.

**కరువలివిందు.** దే. వి. అగ్ని, వాయుసఖుఁడు. "సీ. వచ్చెఁ బోమనరాజువారితోఁ గరువలివిందుసన్నిధినెంతపొందువచ్చె." రామా. ౬, ఆ.

**కరువు.** యు. దే. వి. కరుగుయొక్క రూపాంతరము. "చ. సరియగునిట్టివెట్టనివిసర్పము నంచటమీఁదిసృష్టికై, శరధిపదిజ్ఝరుజ్జ్వలితచండతరాతపవహ్నినాఱఁగాఁ, గరువులజొండువీనిపయింగట్టినసం గనుపట్టెవెచ్చలన్, గరికిరికాసరాంగములఁ గప్పినరోంపులునంద యాఱఁగన్." ఆము. ౨, ఆ.—వై. గర్భము. "క. చరువులు నమ్మునిచెప్పిన, తరువులుపడ్వడియె సుతకుఁ దల్లికి నట్ల, య్యిరువురు నుపయోగింపఁగఁ, గరువులుఁదత్తత్ప్రకారకలితములయ్యెన్." భార. అను. ౧, ఆ.

**కరుసు.** వై. వి. పరుషోక్తి*. "సీ. కటుకుకరుసుకాటుకాట్లోడ్డాము పరుసుపరుసనయనఁగనిష్ఠురమువెలయు." ఆం, భా. ప్ర. వాగ్వ.

**కరూశము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**కరేకరము.** సం. వి. అ. న. పిడికిటిబోటు.

**కరేటువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. పెద్దకక్కెర.

**కరేణువు.** సం. వి. ఉ. స్త్రీ. ఆఁడేనుఁగు. పుం. 1. ఏనుఁగు; 2. కొండగోఁగుచె.

**కరోటకము.** సం. వి. అ. న. వస్త్రములుపెట్టెడుపెట్టె, బొక్కెస.

**కరోటి.** సం. వి. ఇ. స్త్రీ. తలయెముక, పుఱ్ఱె.

**కర్కంధువు.** సం. వి. ఊ. పుం, స్త్రీ. 1. రేఁగుచె; 2. గంగరేఁగుచె.

**కర్కటికి.** సం. వి. ఈ. స్త్రీ. గొమ్మకాఁకరచె.

**కర్కటము.** సం. వి. అ. పుం. 1. ఎండ్రి; 2. కక్కెర; 3. చెఱకుచె; 4. నూఁగుదోసచె; 5. బూరుగుకాయ; 6. ఒకరాశి; (చూ. రాశి.) 7. అభినయహస్తవిశేషము. (రెండుచేతుల వ్రేళ్లను నొకటొకటిసందున నదికినట్టుగాఁ గూర్చిపట్టినది.)

**కర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. దోసచె.

**కర్కము.** సం. వి. అ. పుం. 1. అందము; 2. అద్దము; 3. ఎండ్రి; 4. కుండ; 5. తెల్లగుఱ్ఱము; 6. నిప్పు. విశే. 1. తెల్లనిది; 2. మంచిది.

**కర్కరము.** సం. వి. అ. న. కంకరజాయి. పుం. అద్దము. విశే. కఱకైనది.

**కర్కరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. దోసచె; "ఘృతపిండనిభకర్కరీఖండములతోడ." ఆము. ౨, ఆ.—2. గిండివంటి మట్టిపాత్రము.

**కర్కరేటువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. పెద్దకక్కెర.

**కర్కశము.** సం. వి. అ. పుం. 1. కంపిల్లనుచె; 2. కసిందచె; 3. చెఱకుచె. విశే. 1. కనికరములేనిది; 2. కఱకైనది; 3. గట్టిది; 4. తెగువగలది; 5. నొప్పించునది.

**కర్కారువు.** సం. వి. ఉ. పుం. గుమ్మడిచె.

**కర్కోటకము.** సం. వి. అ. పుం. 1. ఒకానొకపాము; 2. మారేడుచె.

**కర్కోటము.** సం. వి. అ. పుం. నుట్టుకాఁకరచె.

**కర్కోలకము.** సం. వి. అ. న. తక్కోలపుచెట్టు. (రూ. కర్కోలికము.)

**కర్చూరము.** సం. వి. అ. న. బంగారు. పుం. గంట్లకచోరముచె.

**కర్జకాయ.** దే. వి. భక్ష్యవిశేషము.

**కర్జము.** వై. వి. పని, కార్యము.

**కర్ణజలూక.** సం. వి. ఆ. స్త్రీ. చెవిఁజొరుపాము.

**కర్ణజలౌకము.** సం. వి. స్. పుం.———వై.———

**కర్ణధారుఁడు.** సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు, అరకాటి.

**కర్ణపత్రము.** సం. వి. అ. న. కర్ణిక, చెవికమ్మ.

**కర్ణపూరము.** సం. వి. అ. పుం. 1. కంగేలిచె; 2. కడపచె; 3. పుష్పాదులచేఁ జేయఁబడిన చెవికమ్మ; 4. దిరిసెనుచె; 5. నల్లగలువ.

**కర్ణము.** సం. వి. అ. పుం. 1. చెవి; 2. కన్నము; 3. చుక్కాని. 4. డు. కుంతి మొదటికొడుకు.

**కర్ణలత.** సం. వి. ఆ. స్త్రీ. చెవితమ్మె.

**కర్ణవేష్టనము.** సం. వి. అ. న. కుండలము, పోఁగులు.

**కర్ణాకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. వినికివరుస.

**కర్ణాటము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**కర్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. చెవికమ్మ; 2. తొండముచివర; 3. తామరదుద్దు; 4. చేతినడిమివ్రేలు; 5. బాణవిశేషము.

**కర్ణికారము.** సం. వి. అ. పుం. 1. కొండగోఁగుచెట్టు; దీనికి దోహదక్రియ నల్లాపము; 2. రేలచెట్టు.

**కర్ణీరథము.** సం. వి. అ. పుం. బాలకాదిక్రీడాశకటము.

**కర్ణేజపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సూచకుఁడు, కొండెకాఁడు.

**కర్త.** సం. వి. ఋ. పుం. బ్రహ్మ. విశే. చేయువాఁడు.

**కర్తనము.** సం. వి. అ. న. 1. కత్తిరించుట; 2. స్త్రీలు రాట్నము వడుకుట; 3. కయివడిముష్టి.

**కర్తరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తెర; 2. భరణి మూడునాలుగు పాదములయందును, కృత్తికయందును, రోహిణి మొదటిపాదమునందును సూర్యుఁడుండుకాలము.

**కర్తరీముఖము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలినివంచి చూపుడువ్రేలిమొదటఁగూర్చి యుంగరపువ్రేలిని వంచి చూపుడునడిమివ్రేళ్లను గత్తెరవలెఁబట్టినది.)

**కర్తలాణము.** సం. వి. అ. పుం. తెల్లనిగొరిజతోఁగవెంట్రుకలు గలనల్లగుఱ్ఱము, కత్తలాని. "శ్లో. పూర్వవత్సర్వశుక్లాంగస్త్వచా కృష్ణోభవేద్యది, వర్ణోనామ్నా సవిజ్ఞేయఃకర్తలాణస్తురంగమః" అని శివతత్త్వరత్నాకరము. "క. అల్లునికినిచ్చెధాత్రీ, వల్లభుఁడనురక్తినమరవల్లభుహరితో, నుల్లసమాడంజాలెడు, తెల్లనియొక కర్తలాణ తేజోవాయముఁ." నై. ౬, ఆ. (ఉచ్చైశ్శ్రవముతో దీని సరిఁబోల్చి తెల్లని యని విశేషణమిచ్చియుండుటచేత నిక్కడ నిది యశ్వమాత్రపరమని యెఱుంగునది.)

**కర్తవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) చేయఁదగినది.

**కర్తారి.** సం. వి. ఈ. స్త్రీ. కత్తెరవంగచెట్టు.

**కర్దమము.** సం. వి. అ. పుం. పంకము, అడుసు.

**కర్పటము.** సం. వి. అ. పుం. 1. వస్త్రము; 2. చినిఁగినవస్త్రము, మాసినవస్త్రము. (అని కొందఱు.)

**కర్పరము.** సం. వి. అ. పుం. 1. తలపుఱ్ఱె; 2. కొప్పెర; 3. శస్త్రభేదము.

**కర్పరాలము.** సం. వి. అ. పుం. కొండగోనుగుచెట్టు.

**కర్పరి.** సం. వి. ఈ. స్త్రీ. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము.

**కర్పూరగంధి.** సం. వి. ఆ. స్త్రీ. కప్పురగంది.

**కర్పూరభోగి.** సం. వి. న్. న. (చూ. కప్పురబోగి.)

**కర్పూరము.** సం. వి. అ. పుం, న. ఘనసారము, కప్పురము.

**కర్బుర.** సం. వి. ఆ. స్త్రీ. కలిగొట్టుచెట్టు. అ. న. ము. 1. నీరు; 2. బంగారు. పుం. 1. పాపము; 2. చిత్రవర్ణము. విశే. చిత్రవర్ణముగలది.

**కర్బురుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

**కర్మంది.** సం. వి. న్. పుం. పారాశరి, సన్న్యాసి.

**కర్మకరుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) పనివాఁడు.

**కర్మకారుఁడు.** సం. వి. అ. పుం. కమ్మరవాఁడు. విశే. వెట్టికిపని చేయువాఁడు.

**కర్మఠుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నెఱవేరుదాఁక నొక పని చేయువాఁడు.

**కర్మణ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. కూలి; 2. జీతము.

**కర్మము.** సం. వి. న్. న. 1. కారకవిశేషము; 2. పని. (రూ. కర్మువు.) (తర్కశాస్త్రమునందలి పంచవిధకర్మములు:—ఉత్క్షేపణము, అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము.) (షట్కర్మములు.—యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము. షోడశకర్మములు.—గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము.)

**కర్మయుగము.** సం. వి. అ. న. కలియుగము.

**కర్మసాక్షి.** సం. వి. న్. పుం. సూర్యుఁడు, చేయువులసాకిరి.

**కర్మారము.** సం. వి. అ. న. వెదురు.

**కర్మారుఁడు.** సం. వి. అ. పుం. కమ్మరవాఁడు.

**కర్మేంద్రియము.** సం. వి. అ. న. పాయూపస్థపాణి పాదవాక్కులలో నేదేనొకటి.

**కర్వలి.** దే. వి. కరువలియొక్క రూపాంతరము.

**కర్షకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఈడ్చువాఁడు; 2. దున్నుకొని బ్రదుకువాఁడు.

**కర్షణము.** సం. వి. అ. న. 1. ఈడ్చుట; 2. దున్నుట; 3. ఒరయుట.

**కర్షఫలము.** సం. వి. అ. పుం. తాండ్రచెట్టు.

**కర్షము.** సం. వి. అ. పుం, న. పదునాఱుమాషములయెత్తు. పుం. ఒరయిక.

**కర్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఈడువఁబడినది; 2. దున్నఁబడినది; 3. ఒరయఁబడినది.

**కర్షువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. కాలువ; 2. యజ్ఞార్థమైనదుక్కిపంగ. (అని కొందఱు.) పుం. పిడకనిప్పు.

**కర్సనము.** వై. వి. కరిసనముయొక్క రూపాంతరము. "గీ. కాఁపులాపువెరవుకలిగికర్సనముసేయంగ." భార. సౌ. ౧, ఆ. "ద్వి. కడఁగికేదారాదికంబులనెపుడు, నడలనిశక్తిఁగర్సనమొనరించు." భాగ. ౫, స్కం.

**కఱ.** వై. వి. 1. నలుపు; "చ. వెడకఱవడ్డమోముఁబటువేదనఁగందినయంతరంగముఁ, బడుగయియున్నమేనునయి." హరి. పూ. ౮, ఆ.—2. మఱక*. "మ. కఱయుఁ మాఁగుపులేకపుట్టిన షుభాంగంబద్భుతాపాదియై, నెఱయఁ." హరి. పూ. ౫, ఆ.

**కఱకంఠుఁడు.** వై. గ్రా. వి. శివుఁడు, గరళకంఠుఁడు.

**కఱకరి.** వై. విశే. (కఱకు+అరి.) కఠినుఁడు. "వివిధాయుధంబులంగఱకరియై." (కఱకరి అనఁగా ఇక్కడ సమర్థుఁడని యర్థము.) స్వా. ర, ఆ.

**కఱకఱ.** దే. వి. కందుట, ప్రొద్దుపొడుచుట, ఒరయుట, తఱుఁగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (కఱకఱఁగందె, కఱకఱఁబొడిచె, కఱకఱనొరయు, కఱకఱఁదఱుఁగు.)

**కఱకటి.** దే. వి. బాధ. "చ. ఎఱుఁగరుగాయొకద్భుతమునీచెలీదీర్ఘదీర్ఘమాడనా, యఱతఁ దగిల్చిపోవుఁదనవారముపోయిననేనుఁబోవుదుఁ, మఱవకవెంటఁబోవ జలమగ్నతనొనదిపున్నమైననఁ, గఱకటిఁబెట్టిపొమ్మనుగుఁ గానినిజార్తియెఱుంగదేమియుఁ." ఆము. ౫, ఆ.

**కఱకు.** వై. వి. 1. కర్కశత్వము, కాఠిన్యము. "సీ. కోకంబులకుఁ బ్రేఁడికుండలకఱకుమోపంబయు సరసతనబ్బెనేని." హరి. ఉ. ౭, ఆ.—2. బ. పరుషవచనము. "ద్వి. కఱకులాడెడుమాడ్కిఁ గాడుమీఁదటను." రా. యు, కాం.—విశే. 1. కఠినము; 2. పరుషము. (కఱకునేల, కఱకుమాట మొ.)

**కఱకుగిలు.** వై. అ. క్రి. బిరుసగు. "వ. పుంజుకొని పెడలినిడు దలయియ్యుంచుకఱకుగిలునాసాకేశంబులును." కవిక. ౫, ఆ.

**కఱకుట్లు.** దే. వి. బ. కఱ్ఱుకుట్లుయొక్కరూపాంతరము. (దీనిని కఱుకుట్లు అనియు, కఱుకుట్లు అనియు ఉభయవిధముగా వాడుచున్నారు.)

**కఱకుదుమ్ము.** ద్వి. వి. ఇసుక. "శి. మలయానిలముచేదుమారంబురేఁగుసౌగంధికంబురజంబుకఱకుదుమ్ము." స్వా. ౫, ఆ.

**కఱచు.** దే. స. క్రి. 1. అభ్యసించు; 2. కాటుచేయు. "వ. మునిపోలనడిచియుంబొడిచియు, రజ్జువుచేనెత్తియుమొత్తియు, కరంబులంజఱచియుఁగఱచియు, పదాహతులమెట్టియుఁగిట్టియు." శేష. ౪, ఆ.

**కఱటి.** దే. విశే. వంచకుఁడు. "క. మఱచిసఁదలఁపింపఁగనగు, నెఱుఁగనినాఁడెల్లపాట్లనెఱిఁగింపనగున్, మఱియెఱిఁగియెఱుఁగనొల్లని, కఱటిం దెలుపంగఁగమలగర్భునివశమే." భార. ఆది. ౪, ఆ. "సీ. మానంబుపిటిఁబోమసఁగి ప్రేతలఁజిక్కి వఱచినయది యెయీకఱటిమాపు." హరి. పూ. ౯, ఆ.

**కఱత.** వై. వి. 1. చేష్ట; 2. దుశ్చేష్ట*. "చ. కఱతలు పెద్దవీని కెటుకాఁటయఁటెబెట్టెడుమానకేమిటన్, నెఱఁకులుమీటుచుండుఁదన నీచపుమాటలువీనిఁబట్టిక, చ్చఱఁబరిమార్పఁజేసిన యుపాయములన్నియుగొడ్డుపోయెనీ, వుఱకవధింపఁగావలయునుగ్రపుమాయల నిద్దురాత్మునిన్." లక్ష్మీ. ౪, ఆ.

**కఱతలాఁడు.** వై. విశే. (కఱతలు+ఆఁడు.) దుశ్చేష్టుఁడు. "క. కదలినమొత్తదు నెక్కడఁ, గదలెదవటు కఱతలాఁడ కదలుమయేఁజూ, చెదననుచుఁబోయియిమ్ముల, ముదితనిజకుటుంబకార్యములఁదత్పరయై." హరి. పూ. ౫, ఆ.

**కఱద.** వై. వి. బుద్ధి*. "గీ. గోలయిట్టికాఁబుఁగోనలోనినొంటి, డించిచనఁగనగునెయించుకైన, నిసుమకలుగనేరదిపుసుమాయన్నకు, వింతకఱదలెల్లవిసువుమింక." అచ్చ. అర, కాం. "క. పిఱుతివియకనాముందఱఁ, దెఱవాయిప్పగిదినాడఁ దెఱవామేల్మేల్, కొఱమాలినయిప్పేఁడి, కఱదలునీకెవ్వరిపుడుకఱపిరిచెపుమా." అచ్చ. అ, కాం.

**కఱమూపము.** వై. వి. గృహధూమము, ఘనఘమూపము. "గీ. విరహపరితాపవేదనవేఁగుచున్న, చక్రవాకాంగనలకటాక్షములయగ్గి, నావహిల్లినకఱదూపమనఁగనొప్పు, నుడుగణాధీశబింబంబునడిమిమచ్చ." భీ. ౨, ఆ.

**కఱనూనె.** ద్వి. వి. (కఱ్ఱ+నూనె.) మ్రానితైలము.

**కఱపు.** దే. ప్రే. బోధించు. వి. దుర్బోధన. "గీ. శకునికఱపువిని యసన్మార్గవృత్తికిఁ, జొచ్చియిట్టియెదరుతెచ్చుకొనియె." భార. భీష్మ. ౧, ఆ.

**కఱవ.** దే. వి. ఒకానొక మూలిక.

**కఱవాఁడు.** దే. వి. ఎండినచేప.

**కఱవు.** దే. వి. 1. క్షామము; "కఱవుపయింగఱవుపారయుచు, వెఱపుపయిన్ వెఱపుదోఁచవిడువనియడుమం, బొఱఁగమిపైఁబురుషుఁ డీడ్పుఁ, దొఱఁగమిఁజేడ్పడుచునడఁచుదుష్కర్మములన్." భార. శాం. ౪, ఆ. "క. తగవామగవారికినిటు, మగువలయందెగువఁ జూపమావృశవీరుల్, జగతింగఱవాదొంటివా, మగఁటిమిగలరాచవందమా యిది యిపుడీ." గామ. ౫, ఆ.—2. పూరియిండ్లుకప్పనపుడు పర్వఱచుకొనుమితి. "సీ. కఱవుగేస్తులయిండ్లఁగప్పనేతలయంద సుడివడికలఁగుటల్ మడుఁగులంద." అచ్చ. భా, కాం.

**కఱి.** వై. వి. పశుయోని*. విశే. నల్లనిది.

**కఱిపక్కము.** వై. వి. కృష్ణపక్షము.

**కఱియ.** వై. విశే. కృష్ణవర్ణము. "సీ. కఱియనెన్నొసఁటిఁదెట మ్రోఁకుఁ బ్రాఁకుబంగరుదీఁగ క్రియఁదూలఁగ దృశాటి." పాండు. ౫, ఆ.

**కఱివేము.** ద్వి. వి. కఱివేఁపాకుచెట్టు, కాలశాకము.

**కఱివేలుపు.** ద్వి. వి. వెన్నుఁడు, కృష్ణుఁడు.

**కఱివేల్పురిక్క.** ద్వి. వి. శ్రవణనక్షత్రము.

**కఱుకు.** దే. స. క్రి. రాచు. "ఎ, గీ. కఱకుటం ధ్రుఘ్రులనిడికంబిగజ్జెగదలఁ, గఱికినెఱినెఱఁగోరెమ్ముకయునువిఱుగ, విఱిచెవడిఁ గైజునొకపెద్దవేసడంబు." స్వా. ౪, ఆ.—వి. మందాకుమాడ్చి రాచినపొడి.

**కఱుకుట్లు.** దే. వి. బ. కఱ్ఱుకుట్లుయొక్కరూపాంతరము. "సి. కఱుకుట్లగతిరౌతులుఱికికాల్బలములగ్రుచ్చిరినెబాలగుడులుగాఁగ." చంద్ర.

**కఱుక్కు.** దే. వి. నఱకుటయందగు ధ్వన్యనుకరణము. "ఘోద్రుమస్తము కఱుక్కునఁద్రుంచె." ఉ, రా. ౭, ఆ.

**కఱుగోల.** దే. వి. (కఱ్ఱు+కోల.) వాఁడివేసడు ఇనుపకమ్మి, చూఁడుఁగోడువు.

**కఱుదు.** వై. వి. సేర్పు*. "వ. బిరుదులందాపుచుఁగఱుదులం జూపుచు." ఉ, రా. ౨, ఆ. "వ. దీనికఱుదులెంతయరుదులు చూచితే." ప్రభా. 3, ఆ. "క. కఱుదులమాటలమమ్ముం, గుఱుచవడుగయేలయింతగొసెక్కింపన్." హరి. ఉ. ౧౦, ఆ.

**కఱుదులాఁడు.** వై. విశే. (కఱుదులు+ఆఁడు.) సేర్పరి. "క. కఱుదులాఁడగుచక్రి కపటంపుటనుపునఁదనుమోసపుచ్చిన." హరి. ఉ. ౭, ఆ.

**కఱ్ఱ.** యు. దే. వి. కొయ్య. వై. 1. నలుపు; "గీ. తెఱుఁజప్పులు దొడినున్నగఱ్ఱతడుపు, తెలమితోఁగట్టి." హరి. పూ. ౫, ఆ.—2. మఱక*.

**కఱ్ఱకుట్లు.** దే. వి. బ. ఇనుపసలాకయందు గ్రుచ్చికాల్చెడు మాంసఖండము, శూల్యము.

**కఱ్ఱమడ.** దే. వి. పెల్లగింప నుపయుక్తమైన ఆయుధవిశేషము. "గీ. గడ్డపాఱలఁ బాఱలఁ గఱ్ఱమడల, వెడఁదగుద్దండ్ల నాఁపుట్ల విరియఁ ద్రవ్వ, నందు నిద్రించుచున్న కాలాహిగెరలి, తూలిపాఱంగఁ గొందఱఁదోలితోలి." పంచ. నా. ౧, ఆ.

**కఱ్ఱి.** వై. వి. అర్జునుఁడు*. విశే. నల్లనివాఁడు. "ఎ, గీ. తెల్లదామరతేకులట్లుల్లసిల్లు, కన్నుదోయినొప్పారెడుకఱ్ఱియాతఁడు." హరి. పూ. ౯, ఆ.

**కఱ్ఱు.** దే. వి. నాఁగటిదుంపయందమర్చెడి యినుపపాళము, కృషకము.

**కఱ్ఱుకుట్లు.** దే. వి. బ. (చూ.) కఱ్ఱకుట్లు. "సీ. నీరువెళ్ళఁగనొత్తి నిప్పులనందందకమ్మగాఁగాల్చినకఱ్ఱుకుట్లు." రుక్మాం. 3, ఆ.

**కఱ్ఱుగుద్దలి.** ద్వి. వి. తొల్లిక. "సీ. త్రవ్వటంబులతటఁ ద్రవ్వటంబులువెట్టఁ దగినట్టికఱ్ఱుగుద్దలిగడించి." శశా. ౪, ఆ.

**కల.** ఉభ. దే. వి. స్వప్నము. సం. ఆ. స్త్రీ. 1. ముప్పదికాష్ఠలకాలము; 2. చంద్రునియొక్క పదునాఱవభాగము; 3. భాగము; 4. స్త్రీరజస్సు; 5. మొదలిసొమ్మువడ్డి; 6. శిల్పము. అ. న. ము. రేతస్సు. విశే. 1. అవ్యక్తమధురము; (ధ్వని) 2. అజీర్ణము. (కలలు అఱువదినాలుగు.–ఇతిహాసము, ఆగమము, కావ్యము, అలంకారము, నాటకము, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, దురోదరము, దేశభాషాలిపిజ్ఞానము, లిపికర్మము, వాచకము, అవధానము, స్వరశాస్త్రము, శాకునము, సాముద్రికము, రత్నశాస్త్రము, రథాశ్వగజకౌశలము, మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము, గంధవాదము, ధాతువాదము, ఖనివాదము, రసవాదము, జలవాదము, అగ్నిస్తంభము, ఖడ్గస్తంభము, జలస్తంభము, వాక్స్తంభము, వయస్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము, కాలవంచనము, పరకాయప్రవేశము, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఐంద్రజాలికము, అంజనము, దృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్రౌషధాదిసిద్ధి, చోరకర్మము, చిత్రక్రియ, లోహక్రియ, అశ్మక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మక్రియ, అంబరక్రియ, అదృశ్యకరణము, దూతీకరణము, మృగయ, వాణిజ్యము, పాశుపాల్యము, కృషి, ఆసవకర్మము, ప్రాణిద్యూతకౌశలము.)

**కలంకము.** సం. వి. అ. పుం. 1. గుఱుతు; 2. ఇనుపచిట్టెము; 3. దూఱు.

**కలంకారి.** దే. వి. వ్రాఁతపనివస్త్రము.

**కలంజము.** సం. వి. అ. పుం. గంజాయి.

**కలందాను.** హిం. వి. కలములుంచు పెట్టె.

**కలంబము.** సం. వి. అ. పుం. 1. కూరనార; 2. బాణము.

**కలంబి.** సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలికూర.

**కలఁక.** దే. వి. 1. కలఁగుట; 2. కంటిజెవులు.

**కలఁకఁబాఱు.** దే. అ. క్రి. (కలఁక+పాఱు.) కలఁతపడు. "కలఁకంబాఱె మఱందిఁజెల్లెలినువక్రక్రోధుఁడైపట్టి." భాగ. ౧౦, స్క-౦. పూ.–

**కలఁకపాటు.** దే. వి. కలఁతపడుట. "వ. ఇక్కలంకపాటు తక్కినభయంబునకుంగాదుసుండు." కళా. ౪, ఆ.

**కలఁకువ.** దే. వి. 1. కళ్లము; 2. స్థానము; 3. యుద్ధము*. (కలను యొక్క రూపాంతరము. చూ. కలను.)

**కలఁకువ.** దే. వి. కలఁత. "పెక్కుకలంకువలమదింగూరినసైన." వాసి. ౫, ఆ.

**కలెక్టరు.** ఆం. వి. జిల్లాకు అధికారి.

**కలఁగఁబడు.** దే. అ. క్రి. (కలఁగ+పడు.) కలఁగు, సంక్షోభించు. "క. సాత్యకికో, ల్తలకోర్వక నీబలముగలంగంబడియె." భార. ద్రో. ౪, ఆ. (సార్థమునపడు.)

**కలఁగఁబాఱు.** దే. అ. క్రి. (కలఁగ+పాఱు.)——పై.—— "కలఁగంబాఱితోలంగెవారుణబలౌఘంబుల్." హరి. ఉ. ౭, ఆ.

**కలఁగు.** దే. అ. క్రి. కలఁకఁబాఱు, కలఁతపడు.

**కలఁచియాడు.** దే. స. క్రి. (కలఁచి+ఆడు.) కలఁచు. "గీ. ఇట్లు కౌరవానీకంబునెల్లఁగలఁచి, యాడిభీష్మునిదెసఁబోవ." భార. విరా. ౫, ఆ.

**కలఁచు.** దే. ప్రే. కలఁగఁజేయు.

**కలఁత.** దే. వి. క్షోభము.

**కలఁతపడు.** దే. అ. క్రి. కలఁగు, సంక్షోభించు.

**కలకంఠము.** సం. వి. అ. పుం. 1. అవ్యక్తమధురధ్వని; 2. కోకిలము; 3. పావురము; 4. హంస.

**కలకల.** దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము.

**కలకలము.** సం. వి. అ. పుం. 1. గుంపుగనుబుట్టిన పెద్దమ్రోఁత, ఉలుఉలము; 2. సర్జరసము.

**కలకాలము.** మి. వి. ఎల్లప్పుడు.

**కలగలపు.** దే. వి. (కలపు+కలపు.) 1. కలుపుఁగోలుతనము; 2. కలుసుఁగూడు. (రూ. కలగల్పు, కలుసుఁగూడుకు.–"చో. ఒక కొన్నికలగల్పులొకకొన్ని బహుసాకొకకొన్నిరీతుల యారభ్యపగలు." పాండు. ౪, ఆ.)

**కలగుండు.** దే. వి. కలఁత, క్షోభము.

**కలగుండుగొను.** దే. అ. క్రి. (కలగుండు+కొను.) కలఁగు. "ఎ, గీ. చేదిమగధశక యాదిసేన, లెల్లఁజెదరఁదవలఁదల్లడపడఁగల, గుంపుగొనఁగఁజేసెఁగుంభజుండు." భార. ద్రో. ౧, ఆ.

**కలగుండుపడు.** దే. అ. క్రి. (కలగుండు+పడు.) కలఁగు.

**కలగుండువెట్టు.** దే. స. క్రి. (కలగుండు+పెట్టు.) కలఁచు. "సీ. సాత్యకియేచి ధృష్టద్యుమ్నుఁడునుదాను గురుసైన్యముఁగలగుండువెట్ట." భార. భీష్మ. ౩, ఆ.

**కలగూర.** దే. వి. (కలపు+కూర.) పెక్కుదినుసులుకలిసిన కూరాకు.

**కలగొను.** దే. అ. క్రి. (కలపు+కొను.) 1. కలఁగు; "గీ. పక్షిమృగజాతులెల్లనుభ్రమసియుట్లు, నట్టుఁగలగొనిచెదరె." భార. విరా. ౪, ఆ.–2. వ్యాపించు. "ఎక్కువివర్ణతతోఁ జలపలంగలగొనెనారటంబు." ఉ. హరి. ౫, ఆ.

**కలజువ్వి.** దే. వి. కందరాలముక్కి.

**కలతెలుఁగు.** దే. వి. యాథార్థ్యము.

**కలధౌతము.** సం. వి. అ. న. 1. వెండి; 2. బంగారు; 3. అవ్యక్తమధురధ్వని.

**కలధ్వని.** సం. వి. ఇ. పుం. 1. అవ్యక్తమధురధ్వని; 2. కోకిలము; 3. నెమలి; 4. పావురము.

**కలన.** సం. వి. అ. స్త్రీ. 1. ఎఱుఁగుట; 2. పొందుట.

**కలను.** వై. వి. 1. కళ్లము; "క. పొలమిల్లులోఁటగ్రామము, కలను పసులు మేయుకో లనుకాల్వినస్పకారం, తలతోఁ నంగముచేసినఁ, గలయం బిరిసుట్టివానిఁగాల్చఁగవలయుఁ." సం. "క్షేత్రవేశ్మవనగ్రామవివీతఖలదాహకాః, రాజపత్న్యభిగామీచదగ్ధవ్యాస్తుకటాగ్నినా." విజ్ఞా. వ్య, కాం.–2. స్థానము; "ఎ, గీ. ఏబలంబుదనకునెక్కుడుగలిగెన, బ్బలమునేలపోరుకలనుగాఁగ, నిమఁడుసీతుగాలి వెనుకగామెుననడ, పించినడవ నంభవించుజయము." భార. శాం. ౨, ఆ.–3. యుద్ధము*. "క. అప్పుడ, ప్పులభుక్కులకనన్యవనస్వనభుక్కులకుం, గలనయ్యె." రామా. ౭, ఆ.

**కలప.** దే. వి. 1. నాఁగటిదుంప; 2. ఇల్లుకట్టుటకు ఉపయోగించెడు మ్రాను.

**కలపకట్టియ.** వై. వి. (కలము+కట్టియ.) వ్రాసెడుకలము.

**కలపడము.** దే. వి. ఒకటితోనొకటి కలయుట. "రగడ. కలపడంబులుగలయుచిచొక్కంపుఁగస్తురిరస్తుచీఁతెలు." శుక. ౧, ఆ.

**కలపతాల్పు.** దే. వి. 1. బలరాముఁడు; 2. శూద్రుఁడు.

**కలపసగంప.** దే. విశే. కలహశీలుఁడు. "చ. కలపసగంపయైన పనికాలుసనోరుస పాడుకాసకె, పన్నలనుఁబరిభ్రమించుచు సుపా యుపుఁ జేలరిమాటలాడిపే, రుఁడమదిక్షైననూతకవిరోధమొనర్చుచు నుండెడు." పారి. పూ. ౫, ఆ.

**కలపసఁబిండి.** దే. వి. (కలపసము+పిండి.) క్షోభము. "క. కలపసఁజతిసలఁడిచ్చుట, మెలఁగుటమాలిం ద్రవిన్నమేలగుసేప్రే, ప్రాలోకసురియఁద్రిప్పిన, కలపసఁబిండైనఁజెలిమికత్తెలునగరే." ఉ, హరి. ౬, ఆ.

**కలపము.** దే. వి. 1. కలపుట; "క. లలయింతెనోకతెతేనికిఁ, గంపుఁబుసఁజేసితావిగప్రైసనూనెక." య. ౪, ఆ.—2. పరిమళ ద్రవ్యములను జేర్చి కలపినచందనము. "సీ. కలపంబులభినవగంధంబులుఁగూర్చితనవ్వనసలఁదుదుసనువుగాఁగ." భార. విరా. ౧, ఆ.

**కలపు.** దే. ప్రే. కలయఁజేయు. "మగలయిలుపరుసఁగలపెను." రాఘ. ౨, ఆ. వి. కలయుట. "ఇరుపురమనములకలపు." మాఘ. ౫, ఆ.

**కలబంద.** దే. వి. ఒకానొక మందుచెట్టు, కస్వ. (దీనిభేదము ఏనుఁగుఁగలబంద.) (ఒక నిఘంటువునందు ఇది కలుబంద అని వ్రాయఁబడియున్నది.)

**కలభము.** సం. వి. అ. పుం. ఏనుఁగుగున్న. ముప్పదియేండ్ల యేనుఁగు. (అని కొందఱు.) (తద్విశేషములు.—బాలము, పోతము, వికము.)

**కలమము.** సం. వి. అ. పుం. 1. వ్రాసెడు కలము; 2. వరి పైరు; 3. లత్తుక.

**కలమరి.** దే. విశే. (కలము+అరి.) ఓడయెక్కిపోవువాఁడు. "గీ. దక్షిణసఁగలమరికిసారథియుఁగర్త, ధారుఁడునుబోలెనాత్మకుఁడాను నుపథ, వర్తిసైకవిధాయిగావలయుయోగ, ధారణానిశ్చయుండగు ధీరుఁడధిప." భార. శాం. ౫, ఆ.

**కలము.** ఉభ. దే. వి. 1. ఓడ; "గీ. బ్రదుకుమీఁదియాసపాయంగఁబెట్టితిఁ, జుచ్చువంటివేఁకివచ్చినపుడ, జలధినట్టనడుమసాంయాత్రికుఁడుకలం, బవిసినపుడుధనమునాసవోలె." కాశీ. 3, ఆ.—2. పంద్రెండుతూములకొలఁదిగలపరిమాణవిశేషము. "గీ. అంత నారాజగోవిందుఁడధికభక్తి, నల్లునకు నాఁడుబిడ్డకు సరణమిచ్చె, ముదముతోడ మున్నూటయాఁబదిగలముల, హేమతండులములు జను లెల్లఁబొగడ." పర. 3, ఆ.—వై. లేఖిని. సం. అ. న. రేతస్సు.

**కలముఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**కలయ.** దే. ద్ర. అంతట. "వ. కొలువుకలయంగనుంగొని." భార. ఉద్యో. ౨, ఆ. (రూ. కలయఁగ.)

**కలయంపి.** దే. వి. దుమ్ముఁడఁగుటకై కస్తూరిచందనములోనుగాఁగల సుగంధవస్తువులఁగలపిచల్లెడునీరు. (కలాఁపి యొక్క రూపాంతరము.)

**కలయఁబడు.** ద్వి. అ. క్రి. (కలయఁక్+పడు.) కలయు. "ఎ, గీ. కలయఁబడిమూఁపుమూఁపునఁదలఁగఁద్రోయ, రానినందడి నడచుపౌరవ్రజంబు, నరయుచును." జై. 3, ఆ. (స్వార్థమున పడు.)

**కలయిక.** దే. వి. సంగమము.

**కలయు.** దే. స. క్రి. కూడు. "కంటిసిగలయుంగనామనము." (హరిశ్చంద్రకథయందు కంటిని కలయంగఁక్ అనియు హరిశ్చంద్రకథయందు కంటిని కల అంగనా అనియు భేదము.) హరి. ౨, ఆ.

**కలరవము.** సం. వి. అ. పుం. పారావతము, పావురము.

**కలరూపు.** ద్వి. వి. యాథార్థ్యము.

**కలలము.** సం. వి. అ. పుం, న. 1. గర్భపిండము; 2. మావి.

**కలవ.** దే. వి. 1. కలయుట; 2. కలసిన యిసుకయు, సున్నమును. విశే. కలసినది.

**కలవంటకము.** దే. వి. (కలపు+వంటకము.) నూవుపొడిలోనగు వానితోఁగలపినవంటకము, చిత్రాన్నము.

**కలవడు.** ద్వి. అ. క్రి. (కలపు+పడు.) కలయు. "క. కలవడి మాటలఁబ్రియముల." రుక్మాం. ౧, ఆ.

**కలవరపడు.** ద్వి. అ. క్రి. (కలవరము+పడు.) కలఁతపడు.

**కలవరపోవు.** దే. అ. క్రి. (కలవరము+పోవు.) కలవరపడు.

**కలవరము.** దే. వి. 1. కలఁగు; 2. చింత.

**కలవరించు.** దే. అ. క్రి. మైమఱచిమాటాడు. "సీ. చెలరేఁగరాయంచ చేరువమెలఁగుచోఁగలికినెన్నడలంచుఁగలవరించు." అచ్చ. అర, కాం.

**కలవరింత.** దే. వి. మైమఱచినమాట. "వ. ఇదియేమయ్యా వెండియుమదాశయుండును మధురలాలసయునుగలాపూర్ణుండును సంచుఁ బలుకుచున్నవారు. దేవరకునెప్పుడు నవియ కలవరింతలై యున్నయవి." కళా. ౫, ఆ.

**కలవాఁడు.** దే. విశే. 1. ఆప్తుఁడు; "ఉ. శాంతనవుండుసర్వకురుసంతతికెంగలవాఁడుకాఁడె." భార. ఉద్యో. ౨, ఆ.—2. ధనవంతుఁడు; "సీ. ఆరకూటకలాపమర్హమేకలవాని పెనర్హనే నిర్జరేశ్వరునకు." నై. ౪, ఆ.—3. శక్తుఁడు. "వినుమాపనిసెల్లఁ బాండుపుత్రులెకలవారు." భార. ఉద్యో. 3, ఆ.

**కలవింకము.** సం. వి. అ. పుం. 1. ఊరఁబిచ్చుక; 2. కుఁకటిమూఁగ అను పక్షి.

**కలశము.** సం. వి. అ. పుం, న. ఈ. స్త్రీ. ఘటము, కుండ.

**కలశాబ్ధి.** సం. వి. ఇ. పుం. పాలసముద్రము.

**కలశి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కోలపొన్న; 2. పెరుగుఁజిలి కెడుకుండ.

**కలహంస.** సం. వి. అ. పుం. 1. ధూమ్రవర్ణములైన ముక్కు కాళ్లుఱెక్కలుగలహంస; 2. రాజహంస; 3. రాజశ్రేష్ఠుఁడు. (రూ. కలహంసము.)

**కలహము.** సం. వి. అ. పుం, న. జగడము. పుం. 1. యుద్ధము; 2. కత్తియొఱ.

**కలహాంతరిత.** సం. వి. ఆ. స్త్రీ. ముందు కోపముచేఁ బ్రియుని విడనాడి వెనుక పరితాపమునొందెడునాయిక. (చూ. నాయిక.)

**కలహాశనుఁడు.** సం. వి. అ. పుం. నారదుఁడు, అరివేరపుఁదపసి.

**కలహించు.** సం. అ. క్రి. జగడమాడు.

**కలాచి.** సం. వి. ఈ. స్త్రీ. తమ్మపడిగము.

**కలాదుఁడు.** సం. వి. అ. పుం. 1. అగసాలెవాఁడు; 2. చంద్రుఁడు.

**కలాపకము.** సం. వి. అ. పుం. ఏనుఁగుమెడసంకెల.

**కలాపన.** దే. వి. కలఁత.

**కలాపము.** ఉభ. దే. వి. కలఁత. సం. అ. పుం. 1. ఇరువది యైదు పేటలుగల స్త్రీల యొడ్డాణము; 2. నెమలిపురి; 3. అమ్ముల పొది; 4. భూషణము; 5. సమూహము.

**కలాపి.** దే. వి. (కలఁత+అఁపు.) కలయంపి. (సంధిని వర్ణలోప వర్ణవికారములు.) "సీ. కలాపికలయంపి చానపి, యసగోముఖాఖ్యలై యలరుచుండు." ఆంధ్రా. ద్వి. పు. సం. ఇ. న్. పుం. 1. నెమలి; 2. జువ్విచెట్టు.

**కలాయము.** సం. వి. అ. పుం. గుండ్రనిసెనగలు.

**కలాయి.** హిం. పాత్రలకు తగరము పూయుట.

**కలాలి.** హిం. వి. కల్లుసారాయలమ్మువాఁడు.

**కలాలుఖానా.** హిం. వి. కల్లుసారాయలమ్ము దుకాణము.

**కలావరు.** ఆం. వి. చీట్లాటలో నొక కాకితముపేరు.

**కలాసి.** హిం. వి. ఓడమీఁది పనివాఁడు.

**కలి.** ఉభ. దే. వి. పులియఁబెట్టినకడుగునీరు. సం. ఇ. స్త్రీ. కల్లెము. పుం. 1. జగడము; 2. ఒక యుగము; 3. యుద్ధము; 4. శూరుఁడు.

**కలింగలు.** అర. వి. అలుఁగు.

**కలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. మొగ్గ; 2. కల్లెము.

**కలికము.** దే. వి. శైత్యనివారణార్థము కంటికివేసెడుమందు.

**కలికారము.** సం. వి. అ. పుం. 1. కూఁకటిమూఁగయనుపక్షి; 2. వచ్చపిట్ట; 3. నెమలియడుగుచెట్టు.

**కలికి.** దే. వి. 1. మనోజ్ఞురాలగు ఆఁడుది; 2, ఆఁడుది. విశే. మనోజ్ఞము. "సీ. దనుజకుద్ధాంతకాంతాకటాక్షములతోఁగలికికాటు కలకుఁగానివావి." ఉ, హరి. 3, ఆ.

**కలిగొట్టు.** దే. వి. పాటలిచెట్టు.

**కలితనము.** దే. వి. సామర్థ్యము. "గీ. అరులగుణములైనసగ్గింతు రెవ్వడుఁ, గలయబెరసినపుడుకలితనంబు, మెఱయుదురుమహా త్ములు." భార. విరా. ౪, ఆ.

**కలితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱుఁగఁబడినది; 2. పొందఁబడినది.

**కలితి, కల్తి.** హిం. వి. మిశ్రితము, స్వచ్ఛముకానిది.

**కలిద్రుమము.** సం. వి. అ. పుం. తాండ్రచెట్టు.

**కలిమము.** దే. వి. మాంసము. "వ. అప్పుడచంపితిత్తొలిచిగాలి గొనవైచిన కుక్క కలిమంబు గనుంగొని." భాగ. శాం. 3, ఆ.

**కలిమారకము.** సం. వి. అ. పుం. నెమలియడుగుచెట్టు.

**కలిమి.** దే. వి. 1. కలుగుట; "ఇట్టిమహిమకలిమికిఁగతమెయ్యది." భార. అర. ౪, ఆ.—2. సంపద. "క. కలిమియచుట్టలఁజేర్చును." భార. శాం. ౧, ఆ. (రూ. కల్మి.)

**కలిమిచెలి.** దే. వి. లక్ష్మి.

**కలిమిదండుగ.** ద్వి. వి. నేరములేకున్నను ధనవంతునియొద్ద రాజు పుచ్చుకొనెడు ధనము.

**కలియు.** దే. స. క్రి. పొందు. (కలుపు, కలుపుఁగోలు ఇత్యాది సాధారణ ప్రయోగంబులంబట్టి ఇట్లు ఇకారమధ్యముగాను వ్రాయఁబడియె.)

**కలిలము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱుఁగరానిది; 2. చొర రానిది,

**కలివె.** దే. వి. కరమర్దముచెట్టు.

**కలీయము.** సం. వి. అ. పుం, న. కల్లెము.

**కలు.** యు. దే. వి. 1. బండిచక్రము; "సీ. ఆదిమనోమయం బగునొక్కచక్రంబుఁగల్పించెబ్రహ్మజగద్ధితముగఁ, గల్పించియా బండికలుఁదొల్చెసత్యలోకంబుననుండి యాకమలగర్భుఁడు." కాశీ. ౧, ఆ.—2. ఱాయి. "సె. ఏనుగ్రేఁగంటనొక్కించుకచూచినఁ గలుదెందమైనను గరఁగుననిన." లక్ష్మి. ౨, ఆ.—వై. 1. మద్యము; "కలుద్రావంబనిపూనియాదవ్రులు." ఉ, హరి. ౪, ఆ.—2. మద్య విశేషము. (చూ. కల్లు.)

**కలుఁగాను**గు. దే. వి. (కలు+కానుగు.) త్రాయంతిచెట్టు.

**కలుఁగు.** దే. వి. 1. బొక్క; 2. గుహ. "క. కనువడినక్కలుఁగు మొగన్, బసుకొన్నటిత్రోచివెనుకపనులాతనికే, వ్వడఁజేసిపిడు నేరిసఁ, గడఁకంబజలెల్లనన్నుఁగనుఁగొనియెలమిన్." అచ్చ. కిష్కిం, కాం.

**కలుఁజు.** దే. వి. చెఱుపులోనగువాని నీళ్లుపోవుటకు ఱాతితోఁగట్టిన మూర్గము.

**కలుక్కు.** దే. వి. మనసు నొచ్చుటయందగు అనుకరణము. "ఇత్తె అఁగువినఁగలుక్కుమనదే పఃవారిమసఃబున." సా. 3, ఆ.

**కలుక్రాంత.** దే. వి. కలుఁగానుగుచెట్టు.

**కలుగచ్చ.** దే. వి. ఒక దినుసుగచ్చచెట్టు.

**కలుగానుగ.** దే. వి. ఱాతిగానుగ. "క. చెఱకొకటికలుగఁగామరు, చెఱకున్ లోనైతిమనుచుఁజెఱకులగమినే, తదేఁగలుగానుగలాడుదు, రెచేఁగి ప్రజల్ సుగుణులన్నరేంద్రునిపేటన్." రామా. ౧, ఆ.

**కలుగు.** దే. అ. క్రి. 1. అగు; "చ. మునుమనచేతభంగపడి ముచ్చిరియుండుటఁజేసిపాండుసం, దనులునునెత్తివత్తురుచితంబుగ సంగరమెట్లుఁగల్గు." భార. ఉద్యో. ౪, ఆ.—2. ఉండు; "గీ. ఇట్టి విక్రమంబునిట్టిసామర్థ్యంబుఁ, గలదెయొరులకిజ్జగంబునం దు." భార. ఆది. ౨, ఆ.—3. ఓపు; "గీ. సింహకవచంబు దొడిగినఁజెనఁటికుక్క, గంధగజగంధమునకునుగలదెనిలువ." హరి. ఉ. ౬, ఆ.—4. పుట్టు; "వ. గర్గునకుశినిజన్మించె, శినికిగార్గ్యుం డుగలిగె." భాగ. ౯, స్కం.—5. కూడు. "మ. కలికీమాటలు వేయునేటి కిఁకయీకాయంబుతోవానితోఁ, గలుగన్ భాగ్యము కల్గ కున్నవిభునింగాఁజేయుమీవీనిరాఁ, గలజన్మంబున" అని. ౨, ఆ.—స. క్రి. పొందు. "కరుణగలుగుమమ్మకమలనేత్ర." భార. ఆది. ౭, ఆ. "అంతయెఱుకలేనె." భార. అర. ౧, ఆ. (రూ. కల్గు.)

**కలుచే.** వై. వి. 1. దోషము; "క. కలుగుందోఁషమియమవనఁ, గలుగునెయంపటనెయమృతకరునకునాశం, బలఘుపరవస్తువునకుం, గల దెయభావంబుమనసుగాననికలుచన్." భార. శాం. ౪, ఆ.—2. కలఁత*; (చూ. కలుచపడు.) 3. క్రోధము*. "మ. కలుచన్ గోశబిలంబువెల్వడియదః ఖడ్గాహిపైవచ్చుచోఁ, జలనం బించుకలేకయీతనిరిపుస్త్రీపాలసంఘాతమో, చెలహస్తాంబురుహం గుళీమయమహాసిద్ధౌషధీపల్లవాం, చలముల్ మేసిభజించు జాంగలి కతన్ సంగ్రామరంగంబులన్." నై. ౫, ఆ.

**కలుచపడు.** వై. అ. క్రి. కలఁతపడు. "వ. తదవ్ధోపాయం బునకుపాయంబూహించి యొద్దియుంగానకకలుచపడిపెలుచనంతి పురంబువెలువడి కొలువుకూటంబునకువచ్చి సింహాసనాసీనుండై." లక్ష్మి. ౫, ఆ.

**కలుపు.** దే. ప్రే. కలియఁజేయు. వి. 1. పైరులోనికసవులోనగు నది; 2. పెరుగు. "ఒల్పుఁబప్పులు పొడికూరగుంపు కలుపున్ వడియంబులు." శశాం. 3, ఆ.

**కలుపుఁగోలు.** దే. వి. (కలుపు+కోలు.) అభేదము. (రూ. కల్పుఁగోలు. "మ. సనుపుంజాట్టములెంచఁజేనిగలరిఁటన్ వారుమా నైనసం, బునఁబోరానుదుఃకట్టవారలకుఁగల్పుంగోలువుట్టింపనిం, పునమన్నింపవెనికొన్నైనుమృగంబుల్ మానిమేల్పొంపమ, స్నన నాంచిన మా .. మైనమణిచ్ఛునన్ మూలికైనన్ మునీ." చంద్రా. 3, ఆ.)

**కలుపుఁగోలుతనము.** ద్వి. వి. అభిన్నత్వము. "వ. నటద్వల్లీ మతల్లియుంబోలెనుల్లసిల్లియల్లిబిల్లిఁజెచ్చి కోలువలపుదెలుపుకలు పుఁగోలుతనంబులు నలుపుమనిట్టనియె." రామా. ౫, ఆ.

**కలుము.** వే. వి. కలుషగంధము. "ఎ, గీ. కలుమునాఁగఁగలుష గంధమధవ." ఆం. భా. ప్ర. ౧.

**కలువ.** సై. వి. ఒకానొకజలపుష్పము, ఉత్పలము*. "చెలువలొన రించు బలుపలువఁకుఁబైనలముకలువలకు." య. ౫, ఆ.

**కలువకంటి.** ద్వి. వి. (కలువ+కన్ను.) 1. కలువఱేకులవంటి కన్నులుగల యూఁడుది; 2. ఆఁడుది.

**కలువపడము.** సై. వి. (కలువ+పడము.) ఉత్సావాదికాలములలో ధ్వజస్తంభములోనగువానియందు వ్రేలఁగట్టెడు బంగారు కలువ పూపంచ. "వ. బహిర్భిత్తర్కానికాయవిరచిత కురంగనాభిగోము ఖోపరిశుంభితరంగవల్లీ మతల్లికామనోజ్ఞమూక్తికమండలీపాండిత్యం బు లప్పురంపకాంతంబులగుచు నుత్తుంగహర్మ్య శిఖరకేతుసంఘసంఘ ట్టా తకలితపతితాంతరిక్షఖండలక్ష్యమాణ నక్షత్ర సముత్ప్రేక్షా సంఘటనవిచక్షణంబులై వీక్షణపర్వంబునిర్వహింపఁ జెంపుమీ ఱుచుం దవవలంబనలంబమానవివిధాంబుద కదంబకంబుడంబు చూపు కలువపడంబులును." కళా. ౨, ఆ. "వ. కమనీయహేమ దండంబుల రామణీయకంబులం దొంగలికొనుకాంచన కల్హారం బులు నెలకొల్పి కలమునెత్తినభోభాగంబునం బెడంగడరుకలువ పడంబులును." గా. ఆ, కాం.

**కలువము.** దే. వి. మందునూఱెడు ఱాయి.

**కలువరాయఁడు.** సై. వి. చంద్రుఁడు. (ఇట్లు కలువఱేఁడు లోనగునవి.)

**కలువఱేకు.** ద్వి. వి. 1. కలువపూఱేకు; బ. 2. పిఱుఁదుల మీఁది నఖక్షతములు.

**కలువలదాయ.** సై. వి. సూర్యుఁడు. "కలువలదాయవంగడపుఁ దొడవ." అచ్చ. యు, కాం.

**కలువవిందు.** ద్వి. వి. చంద్రుఁడు, కుముదబాంధవుఁడు. "గీ. కరము లోఁబుట్టువగుటనో కలువవిందు, కందుదనయందుఁదాల్చె లక్ష్మణకుమార." రామా. ౬, ఆ. (ఇట్లు కలువచెలి మొ.)

**కలువు.** దే. అ. క్రి. కలుగుయొక్క-రూపాంతరము. (పుట్టుటకు.— "ఉ. ఓయన్నవపట్టినిన్ గనినయన్నవసుంధరసింధుజాతిలో, వన్నియకెక్కు-నీవు గలువన్ నియతోన్నతిఁగాంచెఁ దండ్రియున్." వసు. ౫, ఆ.—పొందుటకు.—"క. రారాపులేలచేసెదు, రారానన్ గలువఁగలువరారామేడన్.")

**కలుషము.** సం. వి. అ. న. పాపము. పుం. దున్నపోతు. విశే. కలఁకఁబాఱినది.

**కలుషించు.** సం. అ. క్రి. కలఁకఁబాఱు.

**కలుసుఁగూర.** ద్వి. గ్రా. వి. (కలుసు+కూర.) అనుకుగావం డినకూర. "సీ. కలుసుఁగూరలును బజ్జులుఁదియ్యచేరులుఁబంచ దారలు నానవాలుజున్ను." జై. 3, ఆ. (వ్యవహారమునందు కనఁబడుటకాక గ్రంథములయందును నీ పదమిట్లు కనఁబడు చున్నది.)

**కల్కము.** సం. వి. అ. పుం, న. 1. కపటము; 2. పాపము; 3. నెయ్యినూనెలోనగువానియందు అడుగుననిలిచినమడ్డి; 4. మలము; 5. మలసామాన్యము; 6. తాండ్రకీ. విశే. డు. పాపాత్ముఁడు.

**కల్కి.** ఉభ. దే. వి. విశే. కలికియొక్క-రూపాంతరము. (చూ. కలికి.) సం. వి. ఇ. పుం. విష్ణ్వవతారవిశేషము.

**కల్పన.** సం. వి. ఆ. స్త్రీ. అయిత్తముసేయుటకై యేనుఁగునకుఁగట్టిన నిడుత్రాడు. అ. న. ము. 1. క్లృప్తి; 2. రచన.

**కల్పము.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మదినము; 2. న్యాయము; 3. ప్రళయము; 4. వేదాంగమైనవిధి; 5. శాస్త్రము.

**కల్పవృక్షము.** సం. వి. అ. పుం. 1. కోరినవస్తువులిచ్చెడు దేవవృక్షసామాన్యము, వేల్పుమ్రాను; 2. తద్విశేషము. (ఇవి ౫.—మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరి చందనము.)

**కల్పాంతము.** సం. వి. అ. పుం. ప్రళయము, త్రుంగుడు.

**కల్పించు.** సం. స. క్రి. 1. కలిగించు; 2. రచించు.

**కల్మషము.** సం. వి. అ. న. పాపము. పుం. 1. నరకవిశేషము; 2. నలుపు. విశే. నల్లనిది.

**కల్మాషము.** సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము; 2. నలుపు. డు. రాక్షసుఁడు. విశే. 1. చిత్రవర్ణముకలది; 2. నల్లనిది.

**కల్య.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము. అ. న. ము. వేకువ. విశే. 1. చెవిటిమూఁగ; 2. నేర్పరి; 3. ఉపాయముకలది; (మాట.) 4. శుభమైనది; (మాట.) 5. రోగములేనిది; 6. సంపాదింపఁ బడినది.

**కల్యవర్తము.** సం. వి. అ. పుం. ప్రాతర్భోజనము.

**కల్యాణము.** సం. వి. అ. న. 1. శుభము; 2. చొక్కపుబం గారు.

**కల్ల.** దే. వి. 1. అసత్యవచనము; "శా. ఓయబ్జాక్షియేమంచువి, భ్రాంతింబల్కెదుకల్లయున్ నిజముపిడ్పాటొందఁగా." కళా. 3, ఆ. —2. తప్పు; "క. తనకల్లఁదెలుపదేకద, మన కల్లలలోంగిబుద్ధిమంతు నొకనినే, ర్పనమెల్లనెరాకొమరుని, మనమెల్లనఁదెలిసిరాఁగమనమం పఁదగున్." సా. ౨, ఆ.—3. మోసము; "గీ. పురుకతొల్పు విల్లుదునిమెఁదాటకఁజంపె, ఖరునిఁదేర్చెవాలిఁగడవఁబనిచెఁ, గల్ల జింకఁద్రుంచెగండగొడ్డలితాల్పు, గరువమడఁచెనతనికడిమియ నదె." అచ్చ. యు, కాం.—4. పరుషవచనము; "సీ. తనతల్లి విసివినిన్నను గొన్నికల్లలాడుటయునే వెళ్లిపోవుటయుఁగలదు." పర. 3, ఆ.—5. తోఁటలోనగువానివెలుగు. "వెలికల్లవైతురావేల్పుల కుడుపుచో." ఉ, హరి. ౪, ఆ.—విశే. 1. అసత్యము; 2. పరు షము.

**కల్లతనము.** దే. వి. 1. చెడ్డనడత; "గీ. అన్నమీతండ్రికోపగాఁడొ నొకాఁడొ, యీవుపొసగించుదుర్వృత్తమెటేఁగెనేని, గల్లతనములు పలుమాఱుఁగప్పిపుచ్చు, నట్టినామీఁదఁ జంపంగనలుగకున్నె." సం. "అచ్ఛాదయామితేనిత్యంపత్యుస్తవ్యగ్రకుచేష్టితమ్." కాశీ. ౪, ఆ.—2. వంచన. "ఉ. కల్లతనంబుగాకపొడకట్టినపూర్వపు రీతినేఁడునా, యుల్లమునందునుండుము సమున్నతతేజముతోడభక్తి రం, జిల్లినచూపుగూడవిధిఁజెందినప్రౌఢబుధాళినీడమా, తల్లిదయా మతల్లిప్రణతద్రుమకల్పకవల్లిభారతీ." భాగ. ౬, స్కం.

**కల్లము.** దే. వి. మల్లబంధవిశేషము. (చూ. కత్తి.)

**కల్లరి.** దే. విణ. (కల్ల+అరి.) 1. అసత్యముపలుకువాఁడు; 2. తప్పు చేసినవాఁడు; "గీ. తల్లినామీఁదనటులేనితప్పుమోపె, నటమది ననుంగుతండ్రితౌనదియెనిశ్చ, యంబుచేసెనట యిఁకఁగాదన్నఁ బోనె, యేరిననేలకల్లరియేనయగుదు." సా. ౨, ఆ.—3. దుష్టుఁడు (లేక) దుష్టురాలు; "క. అల్లదెతౌటకయనియెడు, కల్లరిరాకాసి పొగరుగదురఁగవచ్చెన్." అచ్చ. బా, కాం.—4. వంచకుఁడు. "క. కల్లరితొలువేలు పుతేఁ, డల్లనఁజెఱవట్టుకొనుచునరుగుచు నున్నాఁడు." అచ్చ. ఆర, కాం.

**కల్లరీఁడు.** దే. విణ. (కల్లరి+ఈఁడు.) కల్లరి. (స్వార్థమున ఈఁడు.)

**కల్లరుజా.** దే. వి. మత్స్యవిశేషము. "మిసికల్లరుజాతేలుమీను." హంస. ౪, ఆ. (చూ. అరుజా.)

**కల్లు.** యు. దే. వి. 1. కన్ను; "సీ. వేవేల్పుతలఁపఁగనినచంద్రు లను బండికండ్లుగాఁగంన్లుగాఘనతఁజేసె." భల్లా. ౧, ఆ. (ఈ యర్థమునఁనీప్రయోగమొక్కండకానఁబడియెడి.)—2. బండికన్ను; "వ. దాపటికల్లుక్రుంగినందేరుఘూర్ణిల్లె." భార. కర్ణ. 3, ఆ.— 3. జాయి. "గీ. గగనహరినీలశైలశృంగమునసుండి, వొల్పడెఁ బ్రొద్దుజేగుఱుఁగల్లువోలె." నై. ౫, ఆ.—వై. 1. మద్యము; "ఉ. ఉత్పలగంధిసన్న డిగియొడ్లను బంపుము కల్లుతేర." భార. విరా. ౨, ఆ.—2. మద్యవిశేషము*. "ద్వి. సారాయియొక మేలునరవినిబాటెఁ, బారెఁగల్లునునొక్కపావనతటిని." రా. అ, కాం.

**కల్లుపెంట.** ద్వి. వి. కల్లమ్మెడుచోటు, షండ.

**కల్లువడు.** ద్వి. అ. క్రి. (కల్లు+పడు.) స్తంభించు. "వ. గుండె జల్లుమని కల్లువడి మునితల్లజు పదపల్లవంబులం బ్రెళ్లియిట్లంటి." స్వా. ౫, ఆ. "క. భల్లంబొక్కటివింటను, మెల్లనసంధించినిలిచి మేవెంచికిటిఁ, బెల్లుళికిపడఁగనేసినఁ, గల్లువడక్ లేచియంతఁగడు వడితోడన్." (ఇందు కల్లువడక్—దీనికి కర్తృత్వస్నేసిసఁబోయు.) భల్లా. ౨, ఆ.

**కల్లెలుక.** దే. వి. (కల్ల+ఎలుక.) పొలములలోఁగలుఁగులయం దుండెడి యెలుక. "గీ. ఉడుముగరిమిడికొక్కుదొందడియువెల్ల, యెలుకకల్లెల్కతఱచునునేమిచెప్ప." స్వా. ౪, ఆ.

**కల్లేడు.** దే. వి. పక్షివిశేషము. "సీ. తెక్కతొఁకునప్రక్కనిక్కి ప్రక్కలునొక్క, నుఱకకల్లేటి నొక్కొరణంబు." స్వా. ౪, ఆ.

**కల్లేఱు.** దే. వి. (కల్లు+ఏఱు.) వీరభద్రపర్వతపాదమూలమునఁ బాఱెడియొకనది. "సీ. పాతెనశైలంబుపాదమూలంబునఁ గల్లేటి తోవృద్ధగంగవాసి." కాశీ. 3, ఆ.

**కల్లోలము.** సం. వి. అ. పుం. 1. పెద్దయల; 2. సంతోషము. డు. శత్రువు.

**కల్లోలిని.** సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

**కల్వ.** వై. వి. కలువయొక్కరూపాంతరము.

**కల్వము.** దే. వి. కలువముయొక్కరూపాంతరము.

**కల్హారము.** సం. వి. అ. న. ఇంచుక యెఱుపునుదెలుపునుగలిగి మిక్కిలి పరిమళముగలకలువ, సౌగంధికము.

**కవ.** దే. వి. 1. జేత; (జక్కవకవ మొ.)—2. యుగళము; (కన్నుఁగవ మొ.)—బ. 3. కుళలవులు; "ఎ, గీ. కవలుకవవీణెలూని ద్రాక్షాఫలోప, మానమానితవాల్మీకి మానిరచిత, చారు రామాయణ శ్లోకసమితిగాన, లీలఁబరియింప." ఉ, రా. 2, ఆ.—4. నకుల సహదేవులు. "మ. కవలేతెంచిరివేడ్కనొండొరులకుంగయ్యంపుమైఁ జెప్పుచున్." భార. భీష్మ. ౧, ఆ.

**కవకవ.** దే. వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము; "చ. కవకవ నవ్వియక్షతురగంబుమెడకౌఁగనయుత్తరీయమున్, లవ్వఁనుతవిల్చె." జై. ౬, ఆ.—2. పలుకుటయందగు ధ్వన్యనుకరణము; "కవకవఁ బలికెనుకసటి." ఉ, రా. 2, ఆ. (ఈయర్థమునకీప్రయోగ మొక్కటియకానంబడియెడి.)—3. ప్రాలుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. కపటంపుఁబక్షులకవకవమనుచు, విప్రులేపముందఱ వెఱవకవాలె." పర. 3, భా. (ఈ కృతిసక్తోవలము అఘనికుఁ డుగాఁ గానఁబడియెడి. కానీ ప్రయోగము విచారింపఁదగినది.)

**కవచము.** సం. వి. అ. పుం. 1. బొందలము; 2. తప్పెట; 3. కల జువ్వి?.

**కవట.** దే. వి. పెద్దకొమ్మ, స్కంధశాఖ. "సీ. కవటలొండొంటితోఁ గదియుచునెడములు ద్రెంగిపబ్బగసొంపు మిగులుదాని." భార. విరా. ౧, ఆ. విణ. లేఁత. (కవటాకు.)

**కవడె.** దే. వి. వాద్యవిశేషము. "ఎ, గీ. కవడెయనఁనుడుయనఁ గను గరిడియనఁగఁ, దప్పెటయనఁగవాద్యభేదములుచెలఁగు." ఆం, భా. ప్ర. నాట్య.

**కవణకాఁడు.** దే. విణ. మల్లగమనమునుచేసినవాఁడు. "కవణ కాఁడనమీఱుచునవేది." ఆం, భా. ద్వి. ష.

**కవణము.** వై. వి. గుఱ్ఱముమొదలగువానియొక్క ఉలవలుబులోను గాఁగలభక్ష్యము. "చ. ఇంటనకట్టిగడ్డియున్, గవణమునేడుచూపఁ బతికట్టడచేయఁగఁబోలుఁబావనీ." జై. ౨, ఆ. "చేరుడుబియ్యా లకవణంపుటేనుఁగుగములుకదల." ఉ, హరిశ్చ. 3, ఆ.

**కవను.** దే. వి. కనవు. "సీ. గడ్డిగాదనుగవతముకసవుకవసు, పుల్లు పూరియనంగఁ జెల్లునుదృణసంజ్ఞ." ఆం, భా. ద్వి. వ.

**కవరు.** ఆం. వి. కాగితపుసంచి, పైకప్పు.

**కవఱులు.** దే. వి. బ. పాచికలు. "ఎ, గీ. కవఱుబింకించివైవఁ గొప్పవియునవలి, కరమునసమర్ప." ఆము. ౧, ఆ.

**కవలు.** దే. వి. వేదాదిపఠనమునందుఁగొంతసామ్యముచేనొకటివిడఁ బడి మఱియొకటివచ్చి కలయుట. "సీ. ఎడనెడనుగవళ్లఁదడఁ బడకుండఁగుఱుతులుమదిఁబాదుకొలిపినిలిపి." కళా. ౪, ఆ.

**కవలుకొను.** దే. అ. క్రి. వేదాదిపఠనమునందుఁ గొంత సామ్యముచే నొకటి విడఁబడి మఱియొకటివచ్చికలయు. "ఎ, గీ. కమలజానివేదపఠనంబుకవలుకొనియె." విక్ర. ౪, ఆ.

**కవలువోవు.** దే. అ. క్రి. (కవలు+పోవు.) కవలుకొను. "గీ. పాఠమొనరించుతఱిఁదోడుపడుగురునకుఁ, గవలువోకుండఁబుత్త్రుఁ డొకలువకంటి." పాండు. ౨, ఆ.

**కవాటము.** సం. వి. అ. పుం, న. ఈ. స్త్రీ. తలుపు.

**కవాడము.** అర. వి. ఎద్దులుమోయు బరువు.

**కవాతు.** హిం. వి. దండువారుచేయు సాధకము.

**కవి.** సం. వి. ఇ. స్త్రీ. కళ్లెము. పుం. 1. కవిత్వముచెప్పువాఁడు; 2. పండితుఁడు; 3. శుక్రుఁడు; 4. వాల్మీకి.

**కవించే.** దే. ప్రే. కవియించుయొక్కరూపాంతరము. "చ. కృత్యనాయుధో, త్కటవనమాలహస్తయునుగానొనరించికవించెరాజుపైన్." భాగ. ౬, స్కం.

**కవిక.** సం. వి. ఆ. స్త్రీ. ఖలీనము, కళ్లెము.

**కవిచేయు.** దే. అ. క్రి. కవియు. "గీ. తోడఁగవిచేయుదురు వానితోరమించు, కాంతలందఱు." (ఇక్కడ కవిచేయుదురు అనఁగా సహగమనముచేయుదురని యర్థము. రెండుమూడు ప్రతుల

యందును ఈ పాఠమేయున్నది. ఉండినను ప్రయోగాంతరము దొరకమిచే ఈ పదమిట్లే యుండవచ్చునను నిశ్చయను పుట్టినది కాదు.) జై. ౫. ఆ.

**కవియు.** దే. అ. క్రి. పరుఁ. "క. యవనశకసైన్యములు పైఁ, గవిసిన." భార. కర్ణ. ౨, ఆ.

**కవియుదెంచు.** దే. అ. క్రి. (కవియు+తెంచు.) కవియు. "గీ. హస్తిపురి పేరుగలమదహస్తినెక్కి, క్రాలుకావలిమూఁకలుకవియు దేర, నప్రగజముపైఁబర్జన్యుఁడనఁగనంప, వానపరఁగవికర్ణుండువచ్చి తాఁకె." భార. విరా. ౫, ఆ. (స్వార్థముసతెంచు.)

**కవిరి.** వై. వి. తాంబూలముతోఁగూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచులోనగు వస్తువులుచేర్చి చేసినయుండ.

**కవిల.** వై. వి. కపిలవర్ణము. "అక్కర. అవసరజ్ఞుఁడయి వ్యాసుఁడే పెంచెనంతనత్తపసి, కవిలగడ్డంబునుగవిలజడలునుగవిలకన్నులును, దవిసయున్నవసల్లనైనదీర్ఘపుఁదనువునుజూచి, యువిదకన్నుంగవమొగిచితెఱవకయుండెభయమున." భార. ఆది. ౪, ఆ. (ఇక్కడ వకారప్రాసముగనుక కవిలగడ్డమనియే చెప్పవలయును. అప్పుడు కపిల అనునది వైకృతమగుచున్నది.)

**కవిలియ.** దే. వి. కవిలె. "క. అనిపలుకునమ్మహామతిఁ, గనిజముఁ డిట్లనియెనీదుకవిలియచీవ్రా, సినలిపియున్నదొలేదో, కనుఁగొను మీసారిలెన్నగాగణకవరా." పాండు. ౫, ఆ.

**కవిలె.** దే. వి. ఘట్టించిన సీలపటపువగ్గులెక్కపుస్తకము. "సీ. కవిలెలోనున్నప్రకారంబుప్రజపాపపుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప." ఉ, రా. 3, ఆ. (కవిలియయొక్కరూపాంతరము.) (ఇప్పుడు దీనిని తాటాకుల లెక్కపుస్తకముగా వాడుచున్నారు.)

**కవోష్ణము.** సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విశే. ఇంచుక వేఁడి గలది.

**కవ్యము.** సం. వి. అ. న. పితృదేవతల కియ్యఁదగిన యన్నము.

**కవ్వడి.** దే. వి. (కవ+వడి.) రెండుచేతుల వడిగలవాఁడు, అర్జునుఁడు. "క. కడఁగిద్రుపదానుజుఁడునె, వ్వడిఁగవ్వడినేసెనూఱు వాఁడిశరంబుల్, కడునలిగివానినన్నియు, నడుమనతునియంగనేసె నరుఁడస్త్రములన్." భార. ఆది. ౬, ఆ.

**కవ్వపుఁగొండ.** ద్వి. వి. (కవ్వము+కొండ.) మంథాద్రి. "చ. కమఠతనూవిలాసమునఁ గవ్వపుఁగొండధరించిదేవనీ, వమృతముఁ దెచ్చియాశ్రితజనావలికిచ్చితి." లక్ష్మీ. 3, ఆ. (ఇట్లు కవ్వపు మలలోనగునవి.)

**కవ్వము.** దే. వి. పెరుగుచిలికెడు సాధనము, మంథానము.

**కవ్వు.** దే. స. క్రి. 1. కబళించు; 2. అపహరించు.

**కశ.** సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱములోనగువానిఁ గొట్టునట్టి చబుకు. అ. పుం. ము. పూతిమార్జాలము.

**కశిపువు.** సం. వి. ఉ. పుం. 1. అన్నము; 2. వస్త్రము; 3. అన్నవస్త్రములు; 4. పఱుపు. "శ్లో. సత్యాంక్షితౌకింకశిపోఃప్రయాసైర్బాహౌస్వసిద్ధేహ్యుపబర్హణైఃకిమ్." భాగ. ౨, స్కం.

**కశేరుక.** సం. వి. ఆ. స్త్రీ. వెన్నెముక. అ. న. ము. 1. కష్మరేఁగుగీ; 2. కొట్టిగడ్డ.

**కశ్మలము.** సం. వి. అ. న. మూర్ఛ. విశే. మలినము.

**కశ్యము.** సం. వి. అ. న. 1. గుఱ్ఱమునడుము; 2. మద్యము. విశే. కశకుఁదగినది.

**కష.** సం. వి. ఆ. స్త్రీ. దక్షునికూఁతులలో నొకతె. అ. పుం. ము. 1. ఒరగల్లు; 2. సాన. డు. సానపెట్టుటమొదలగుపనులచేజీవించెడు నొకనికృష్టపుజాతివాఁడు. "శ్లో. కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా ఆభీరకంకాయవనాఃకషాదయః, యేన్యేచ పాపాయదుపాశ్రయాశ్రయాశ్శుద్ధ్యంతితస్మైప్రభవిష్ణవే నమః." భాగ. ౨, స్కం.

**కషణము.** సం. వి. అ. న. ఒరయిక.

**కషాయము.** సం. వి. అ. పుం, న. 1. ఒగరు; 2. ఔషధరసము; 3. పూసికొనెడుచందనాది; 4. చందనాదులపూఁత. విశే. 1. ఎఱ్ఱనిది; 2. వాసనగలది.

**కషాయిక.** సం. వి. ఆ. స్త్రీ. నీరుదోమ.

**కష్టపడు.** మి. అ. క్రి. (కష్టము+పడు.) దుఃఖపడు.

**కష్టపాటు.** మి. వి. కష్టపడుట.

**కష్టము.** సం. వి. అ. న. 1. దుఃఖము; 2. పాపము. విశే. 1. దుఃఖముగలది; 2. పాపముగలది; 3. చొరరానిది; (అష్టకష్టములు—దేశాంతరగమనము, భార్యావియోగము, ఆపత్కాలమందు బంధుదర్శనము, ఉచ్ఛిష్టభక్షణము, శత్రుస్నేహము, పరాన్నప్రతీక్షణము, భంగము, దారిద్ర్యము.)

**కసటు.** వై. వి. 1. పాపము; "సీ. దురితంబులెన్నఁ సుదొఅయక వెలుఁగొందుకమలాప్తకులమునఁగసటుకలిపి." భార. శాం. ౬, ఆ.—2. మాలిన్యము*. "సీ. కసటువోఁదీటెండఁగరఁగికఱ్ఱలసంటి గమగమవలచుచొక్కపుజవాజి." సాఌ. ౨, ఆ.

**కసమస.** దే. వి. తొట్రుపాటు. "క. అంతటనిద్దఱుమనసులు, కంతునిపనఁగలసెవింతకసమసలొలయన్, మంతనములఁజెదపులనిసి, జింతలువాఱంగనగవుతెప్పలుఁగోరన్." విక్ర. ౫, ౧౩.

**కసరతు.** హిం. వి. సాధకము.

**కసరు.** దే. అ. క్రి. చలించు. "ద్వి. పసిఁడిసలాకసుపాణిసుత్తియము, కసరకనిలుచుక్రొక్కారుమెఱుఁగు." భాగ. 2, స్కం.—స. క్రి. కోపించు. "క. అంపఁదగువారిఁగసరుచునంపి." సాఌ. ౫, ఆ.—వి. 1. కోపము; "ఎ, గీ. అలఁతఁబానుపుపైఁబొరలాట తెలుపఁ, దెగువలోలోననేనవ్వసగవుపెలుపఁ, గలఁక మామీఁదిపనిలేనికనుతెలుపఁ, బొలఁతిరేలునీయునికియఃపులుగుగాద." ఆము. ౫, ఆ.—2. వానగాలి, ఝంఝ. "వ. పెల్లడరు నిట్టూర్పుగాడ్పుల విసరులం గసరెత్తి." సాఌ. 3, ఆ. 3. పెచ్చు, లాభము.

**కసవు.** వై. వి. 1. గడ్డి; 2. ఇంటిపెంట*. "సీ. గల్లుగల్లునరత్నకంకణంబులుమ్రోయగంధవాహునియాలుకసవునూడ్చు." భీ. 3, ఆ.

**కసవుఁగుప్ప.** ద్వి. వి. (కసవు+కుప్ప.) 1. పొరకతో నూడ్చి చేర్చిన పెంట, అవకరము; 2. గడ్డివామి.

**కసాయి.** దే. వి. కటికవాఁడు, సౌనికుఁడు.

**కసి.** దే. వి. 1. కోపము; (వానినికసితీఱఁగొట్టితిని.) 2. దురద; "క. చేతులకసిపోఁగయ్యము, సేతవిలెడునట్టి విధముచింతింపునను, శ్రీతునిఁగాఁగరుణించుట, యూతజెనెసకొల్పరానియాగిమహో." హరి. ఉ. 2, ఆ.—3. కోరిక. "ద్వి. గోఁచిగట్టిననాటఁ గోలెఁబీనుఁగుల, మోచిగడించినమూలధనంబు, కసిదెండపువ్వుల గతిరాసిపోసి, పానఁగునావాతసపొక్కలెన్నితివి." హరిశ్చ. ౨, భా.—విశే. వృత్తియందుఁ గసిడిశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగామిగిలినరూపము. (కసికాటు మొ.)

**కసెంద.** వై. వి. కానమర్దముగీ. (దీనిభేదము తీఁటకసింద.)

**కసిడి.** దే. విశే. అల్పము. "ఎ, గీ. అగునయేనియునటువంటిమగనితోడఁ, గాపురముసేయు నతిదొడ్డ గరితయగుచుఁ, గసిడికోఁతకు

నోర్చిపోవనివికోసక, ధాతదూఱక సంద్రిచేతికువగవక." పాండు. ౪, ఆ.

కసిమసఁగు. దే. అ. క్రి. విజృంభించు. "సీ. కసిమసంగినమారి కడఁగిజీవుల మీఁదను గ్రతఁగబియునట్లురవడించి." భార. ఉద్యో. ౨, ఆ.—స. క్రి. 1. ఖండించు; "క. నావుడుఁగల్పాంతభఙి, గ్రైవేయకజాగ్రదుగ్రగతిఁగదిసిదశ, గ్రీవుఁడసిఁగసిమసంగిన, లావరియగుపులుఁగుతేఁడులావబిపడియెన్." రామా. ౫, ఆ.— 2. చంపు. "క. అసురులమాయోపాయులఁ, గసిమసఁగఁగసఁట మఖంబుగావఁగసఁటతో, వసుఁడొకఁడఁటనసువులఁగ్రొ, న్నిసువు లనడిగెనఁటమునులు నిర్మోహులుకా." రామా. ౪, ఆ.

కసిమసి. దే. వి. తొట్రుపాటు. "క. పశువులఁబొరిగొనిమఖములు, విశదములుగఁజేయునరునివీక్షించితమున్, విశసనముచేయునోయని, కసిమసిబెగడొందు భూతగణమునరేంద్రా." భాగ. ౭, స్కం.

కసిమిరి. దే. వి. తీఁట. "దానవ్యుండైననాకీవే చేతులుచేసితికసిమిరిం కెట్లోర్తున్." ఉ, హరి. ౫, ఆ.

కసీదా, కసీదు. హిం. వి. వస్త్రముమీఁద పూలుబుట్టాలుకుట్టుట.

కసీసము. వై. విశ. నల్లనిది*. "ఉ. ఇంగిలీకంబునందడిపియెత్తుక సీసపురెంటెమోయునన్, నింగిగరుత్పరంపరలనిగ్గనలేఁడొగ రెక్క." ఆము. ౪, ఆ.

కసు. దే. విశ. వృత్తియందుఁ గసురుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (కసుగాయ మొ.)

కసుఁగందు. దే. వి. (కసురు+కందు.) 1. లేఁతబిడ్డ; "దండకిముః కావుకావంచునేడ్పుల్గలిర్పంగసుంగందవై." పా. ౩, ఆ.— 2. నలుపు. "ఉ. కసుఁగందొకయించుకలేకతిన్నసై, పున్నమచంద్రునొప్పిదముఁబోలెడుమోమునసవ్వడేఁటఁగన్." (ఇందుఁ గసురుశబ్దమునిరర్థకము.) వై. ౧, ఆ.

కసుగందు. దే. అ. క్రి. (కందు+కందు.) మిక్కిలివాడు. "క. కుసుమాయుధుబాణంబులఁ, గసుగందిభవద్వియోగకలుమతనర్పా, వసరంబులనర్చకులిడు, కుసుమములకువెఱచువహ్నికువలయనేత్రా." వై. ౪, ఆ. "మ. అసురాధీశనమర్పితంబులగుపీలారామకల్పద్రుమ, ప్రసవంబుల్ కసుగందవయ్యె." (ఇక్కడవాడుట మాత్రమునందుఁ బ్రయోగింపఁబడియున్నది.) భీ. ౪, ఆ.—వి బ. మిక్కిలి వాడుటలు. "క. వసివాళ్లువాడియప్పడు, వసంతసమయంపుటెండవలనన్నెజీవోఁ, గసుగందులుకందినవవ, కుసుమలతికవోలెమిగులఁగోమలియొప్పెన్." కళా. ౪, ఆ.

కసుగు. దే. అ. క్రి. నలఁగు. "ద్వి. విసిగినఁగసిగినవెడనిద్ర నొంది, సునలినమనలిన." పారిజ్ఞ. ౨, భా.—అం. ప్రే. 1. నలఁచు; 2. పులుము; 3. బాధించు. "ద్వి. వేఁడుకొను మాటమటిబెట్టుచెవులు, గసలుకూలమునాటికసిగినట్లైన, నుల్లంబు గలఁగిబిట్టులికి." నవ. ౨, భా.

కసుబా. హిం. విశ. అధికారులుండు గొప్ప గ్రామము.

కసుమాలము. వై. విశ. మలినము. "మ. మునువుక్ముచ్చట యుక్ రవాన్యమున నున్నద్రించినానాదివో, కసులాస్థానముకూడి యాడుదురుశ్రీకాశీప్రదేశంబునన్, గనవైపుట్టెడుభాగ్యమైనమనకుంగల్పింపదాదైవమీ, కసుమాలంబగునాకమేలయనియుత్కంఠాతిరేకంబునన్." కాశీ. ౭, ఆ. (ఇక్కడ మలినమనఁగా పాపిష్ఠ మనియర్థము.)

కసురు. దే. వి. లేఁతకాయ. "పెంపెసనినపండుకాయకసురేమియు నైననుసేరితించు." రా. యు, కాం. (దీనికివృత్తియందంత్యవర్ణలోపమునుఁ లేఁతయనునర్థమునుఁగలుగును. కసుఁగందు, కసుగాయ, కసుగాఁపుపూపవయసుమిటారి మొ.)

కసెము. వై. వి. కస్పెముయొక్కరూపాంతరము.

కస్తి. దే. వి. దుఃఖము. "ఉ. మానసికవ్యధల్ రుజలుమాన్పఁగనోపినపుణ్యరాసిగం, గానదిఁజేరియుండియునుగస్తిపడందగునయ్య." ఉ, రా. ౬, ఆ.

కస్తురి. వై. వి. కస్తూరి. "చ. కస్తురికలయంపులేలతమచొక్కపుఁ జూపులయింపుకల్గ." కళా. ౮, ఆ.

కస్తురిపట్టియలు. వై. వి. బ. 1. పుష్పవిశేషము; 2. ధాన్యవిశేషము. "గీ. పచ్చగన్నెరుకస్తురిపట్టియలును, గుత్తిమల్లెలుఁ ద్రొక్కిగాఁగూర్చిమటియు, సకలజాతులఁబోషింపశక్తిలిగి, గోలికులుపైత్యుఁదెగడుదురవ్యరమున." భాను. ౧, ఆ. (రూ. కస్తురిపట్టెలు.)

కస్తురిపసుపు. ద్వ. వి. గంధహరిద్ర.

కస్తురిపిల్లి. వై. వి. గంధమృగము.

కస్తురివీణియ. వై. వి. కస్తూరియుండెడి జంతుబొడ్డు; మృగనాభి. "వ. కస్తురివీణియలును, బిల్లిగడ్డలును." ఫిల్హ. ౩, ఆ.

కస్తూరి. ఉభ. దే. వి. కుక్కపేరు. "సీ. కరుఁదురీఁగయుఁబోలె వడిఁదోలికఱచి యాకస్తూరిదుప్పులగావుపట్టు." సా. ౧, ఆ.— సం. ఈ. స్త్రీ. మృగమదము, కస్తురి.

కస్పెము. వై. వి. సీళ్లు చిరచిరయనెడు నేల.

కహకహ. సం. వి అ. స్త్రీ. రాక్షసహాసనమునందగు ధ్వన్యనుకరణము. "మహోగ్రగర. గళోరక్తక్రోడనిర్యత్కహకహానినదోద్గాఢహాసంబు భూభృ, ద్బిలముల్ మ్రోయింప." స్వా. ౪, ఆ.

కహారము. సం. వి. అ. పుం. గృహవిశేషముయొక్క నడిమికంబము, నిట్రాడు.

కహ్వము. సం. వి. అ. పుం. బకము, వక్కకొంగ.

కళ. ఉభ. దే. వి. 1. మూర్ఛ; "గీ. ధరనుసీమీఁదనిడివార్ధిఁదరుచునపుడు, హరునిమెడకందెహరియురంబందెఁగెంపు, సమరసంసముకళనొందెనహహతెలిసె, ఘనజగత్కుక్షివగుటకాకమరవర్య." చంద్రా. ౧, ఆ.—2. రెమ్మ. "సీ. దక్షిణహస్తపద్మంబులఁదాల్చి నలితంపుఁ బువ్వురుకళలతోడ." పర. ౩, ఆ. (దీనికీయర్థ మీగ్రంథమునందే కనఁబడుచున్నది.)—సం. ఆ. స్త్రీ. 1. ముప్పది కాష్ఠలకాలము; 2. చంద్రునిలోపదునాఱవభాగము; 3. భాగము; 4. స్త్రీరజస్సు; 5. మొదలిసొమ్మువడ్డి; 6. శిల్పము.

కళత్రము. సం. వి. అ. న. 1. పెండ్లాము; 2. పిఱుఁదు; 3. కోట.

కళపెళ. దే. వి. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. వలకాఁగలకుఁదోడు కళపెళనుడుకు నూనియలుచల్లకురమ్మనెలఁతలార." రసి. ౪, ఆ.

కళవరము. దే. వి. మల్లబంధవిశేషము. "గీ. కళవరానకుఁజొచ్చి డొక్కరముహత్తి." ఉ, హరి. ౩, ఆ.

కళవసము. దే. వి. తోలు. "చర్మనామముకళొనము కళవసమన." ఆం, భా. ద్వి. బ్ర.

కళవళపడు. ద్వ. అ. క్రి. (కళవళము+పడు.) 1. కలఁత పడు; "క. నావుడుదేవానీవర, నేవకులకు నెందుఁగేడుచెందునె నిక్కం, బీవిన్నపమనరామ, త్త్వాపల్లభుఁడాత్తలోనఁగళవళపడుచున్." వై. ౬, ఆ.—2. తొట్రుపడు. "క. వరబలుఁడగుమను

మను మని, శరసంఛిన్నాంగులగుచుసమరవిముఖులై, హరిరాజముఁ గనిపఱచెదు, కరిబృందముఁబోలెఁజనిరికళవళపడుచున్." భాగ. ౪, స్క-ం.

**కళవళపాటు.** ద్వి. వి. (కళవళపడుట.) 1. కలఁతపాటు; "చ. వలపులవెచ్చ హెచ్చఁజెలువంబగు నెమ్మెయిగ్రాఁగసోలుచున్, గళవళపాటుతోఁ జెలిమికత్తెలదూఱుచునుండి వెండియున్." నీలా. 3, ఆ.—2. తొట్రుపాటు. "వేఁడుచుఁబోయి రెంతయుంగళవళపాటుతో." ఉ, రా. ౫, ఆ.

**కళవళము.** దే. వి. 1. కలఁత; "చ. నిలిచినభీతియున్ వడఁకు నివ్వెఱపాటునుభూరిలజ్జయున్, గళవళమున్జనింప." హరిశ్చ. ౫, ఆ.—2. తొట్రుపాటు. "క. పిలిచి ప్రతివచనమొదవమిఁ, గళవళమునవిల్లుసొచ్చికానక." సం. "త్వరావాన్ సంభృతిం వక్ష్యే." కాశీ. ౫, ఆ.

**కళవళించు.** దే. అ. క్రి. 1. కలఁతపడు; "వ. కళవళించుడెందమ్ములతో నందఱుఁదరతరమ్ములైకూడి గోవిందుపిఱుందందగిలితమ లోన." హరి. పూ. ౭, ఆ.—2. తొట్రుపడు. "ఎ, గీ. ముద్దుమోములల్లార్చుచోమూఁపులందుఁ, గర్ణభూషణజాలంబుకళవళింప." (ఇక్కడ కళవళించుట అనఁగా చలించుట అని యర్థము.) ఉ, హరి. ౫, ఆ.

**కళానిధి.** సం. వి. ఇ. పుం. చంద్రుఁడు, చందమామ.

**కళాయి.** దే. వి. 1. సీలిమందుకాఁచెడు గంగాళము; 2. ఇత్తడి పాత్రములలోనగువానికిఁబూసెడు సీసపుపూఁత.

**కళావతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కళలనుదెలిసినయాఁడుది; 2. తుంబురునివీణ.

**కళాసము.** దే. వి. కళవసముయొక్క-రూపాంతరము. "ఉ. లాలసఁగ్రొత్తబెబ్బులికళాసముఁబెట్టిరియాసనంబుగా." నై. ౬, ఆ.

**కళాసించు.** దే. అ. క్రి. అలయు. "ఎ, గీ. రతిఁగళాసించి వచ్చినఁమణామెఱయఁ, గొలనువెలువడివచ్చిరాజలజముఖులు." విక్ర. ౫, ఆ.

**కళింగి.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది. అ. న. ము. కొడిసెకాయ. పుం. 1. ఒకానొకదేశము; 2. కూఁకటిమూఁగయనెడుపక్షి; 3. నెమలియడుగుచెట్టు.

**కళుకు.** దే. వి. 1. కాంతి; "ఎ, గీ. గడితపడునట్టివెన్నెలకళుకులమర." య. ౫, ఆ.—2. పొడి; "తెక్కు-ంగలమణులకుం బసిఁడికళుకులకునీడగుచువెలయఁగఁబరాగములు." కళా. ౧, ఆ.—3. పక్షిగాశేషము.

**కళేబరము.** సం. వి. అ. న. శరీరము, మేను.

**కళ్యము.** వై. వి. కళ్లెము. "సీ. కళ్యాలఁబదిలంబుగానిగుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టుసకెయ్య కొలుపువెరవు." భార. విరా. ౧, ఆ.

**కళ్ల.** దే. వి. శైత్యముచే గట్టిపడినయుమ్మి. "కొమరొందుతెలినురువ్వులుమియుకళ్లలుగాఁగ." అచ్చ. కిష్కి-ం, కాం. (ఇట్లు పరుషాదిగా కొన్నిదేశములయందు వ్యవహారము.)

**కళ్లము.** వై. వి. ధాన్యమునుజేసెడుచోటు, ఖలము.

**కళ్లాము.** వై. వి. కళ్లముయొక్క-రూపాంతరము.

**కళ్లియము.** వై. వి. కళ్లెము. "కత్తులకళ్లియంబొరయఁగా." కవిక. ౨, ఆ.

**కళ్లెము.** వై. వి. గుఱ్ఱమునోటఁ దగిలించునది, ఖలీనము. (కళ్లియము యొక్క-రూపాంతరము.)

## కా.

**కా.** ఉభ. దే. అవ్య. కదా. "చ. ఉడుపతివంశకర్తమహిమోన్నతి కెయ్యదిమేర నాఁడుపాల్, కడలిజనించినప్పుడు దశంబుగనంటినమేనిజడ్డువోఁ, గడుగుకొనంగనబ్బనినికాళిపునౌదలయేటఁబాదముల్, తడఁబడనోలలాడుచుహాళాహాళిగావడిసీఁదులాడెడిన్." (నాఁడుపాల్కడలిజనించినప్పుడనుదానికికర్త ఉడుపతి. అది అధ్యాహార్యము.) జై. ౧, ఆ. దే. ద్ర. ఇది అవధారణార్థకావ్యయముమీఁద వచ్చినపుడు ఇత్యర్థకమగును. "వ. అదియునుదనకమ్మను జేశ్వరుండపాయంబుసేయునకాఁదలంచి." భార. అర. ౨, ఆ.—సం. వి. ఆ. స్త్రీ. కాకియఱచుటయందగు ధ్వన్యనుకరణము. "క. ఆకులతఁబొందిపలుకుచుఁ, గాకాయనిచంచుతెఱచి కదునఱచుచునీ, రాకరమునమునిఁగెడున, క్కా-కింగనిహంసపరమకారుణ్యమునన్." భార. కర్ణ. ౨, ఆ.—విశ. కుత్సితశబ్దమునకు వృత్తియందు వచ్చెడి ఆదేశము. (కాపురుషుఁడు మొ.)

**కాంక్ష.** సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

**కాంక్షించు.** సం. స. క్రి. ఇచ్ఛించు, కోరు.

**కాంక్షితము.** సం. విశ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**కాంచనము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. అకరువు. పుం. 1. ఉమ్మెత్తచెట్టు; 2. సంపెఁగచెట్టు; (చూ. కనకము.) 3. కాంచేనముచెట్టు; 4. నాగకేసరముచెట్టు; 5. పొన్నచెట్టు; 6. మద్దిచెట్టు.

**కాంచనారము.** సం. వి. అ. పుం. కాంచేనముచెట్టు.

**కాంచని.** సం. వి. ఈ. స్త్రీ. హరిద్ర, పసుపు.

**కాంచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒంటిపేటగల ఆఁడుదానిమొలనూలు; 2. ఒకానొకపట్టణము.

**కాంచేనము.** వై. వి. కోవిదారముచెట్టు.

**కాంచు.** దే. స. క్రి. 1. చూచు; 2. పొందు; 3. బిడ్డనుకను; 4. భాగ్యముఁబొందు. "క. సలిసాయలొాక్షికతిపయ, దినములఁ జూడంగఁగాంతులిఁవిరిసలుని." భార. అర. ౨, ఆ.

**కాంజికము.** సం. వి. అ. న. ఆరనాళము, కలి. (రూ. కాంచికము.)

**కాండపటము.** సం. వి. అ. పుం. తిరస్క-రిణి, తెర.

**కాండపృష్ఠుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఆయుధములచేత బ్రదుకువాఁడు, శస్త్రాజీవుఁడు.

**కాండము.** సం. వి. అ. పుం, న. 1. కావ్యపరిచ్ఛేదము; సమూహము. (అనికొందఱు.) 2. బాణము; 3. జలము; 4. ఆకులలోనగువానియీనె; 5. తామరలోనగువానికాఁడ; 6. వరిలోనగువానిపోఁచ; 7. ముండ్లులోనగువానిదుబ్బు; 8. మోదుగులోనగువానికఱ్ఱ; 9. చెట్టుబోదె; 10. గుఱ్ఱము; కుత్సితము. (అనికొందఱు.) 11. ఏకాంతము; 12. సమయము.

**కాండీరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) బాణమును ధరించినవాఁడు, దండమును ధరించినవాఁడు (అనికొందఱు.)

**కాండేక్షువు.** సం. వి. ఉ. పుం. ములుగొలిమిడిచెట్టు.

**కాంద్ర.** దే. వి. తృణవిశేషము. "సీ. అచ్చోటఁగసవుగాంద్రంతయుఁబుచ్చియత్నంబునదివనత్రయంబువెదకి." వాసి. ౫, ఆ.

**కాంద్రు.** దే. వి. పులికూయుటయందగు ధ్వన్యనుకరణము. "వ. పొఱమ్ముఱొమ్ము కెలంకులం గాఁడఁగాంద్రుకాంద్రుమనిరొప్పి." సావి. ౪, ఆ.

**కాంత.** సం. వి. అ. స్త్రీ. 1. కోరఁదగిన ఆఁడుది; 2. ఆఁడుది; 3. ప్రేంకణముచెట్టు. అ. పుం. ము. 1. ఇనుము; 2. (చంద్ర సూర్యాదుల కిరణముల తగులుటవలన నీరును, అగ్నియు వెడలునట్టి) ఱాయి. (చంద్రకాంతము, సూర్యకాంతము, అయస్కాంతము మొ. వీని యర్థములు ఆయాయిశబ్దము కడఁజూచునది.)

**కాంతలకము.** సం. వి. అ. పుం. నందివృక్షము.

**కాంతారము.** సం. వి. అ. పుం, న. 1. పేరడవి; 2. పోరాని త్రోవ. పుం. తెలుపుకలసినఎఱ్ఱచెఱకు.

**కాంతాళపడు.** దృ. అ. క్రి. (కాంతాళము+పడు.) ఈర్ష్యపడు. "రగడ. తాలమెక్కి దెతాలకెటుకాంతాళపడుపంతాలదానవు." చంద్ర.

**కాంతాళము.** దే. వి. 1. ఈర్ష్య. "రగడ. ఇంతి దివిటీనొరయు నిదిగో పింతాళంబు, లింతవిరవాదివిరికేల కాంతాళంబు." ఉ, రా. ౬, ఆ. "ద్వి. అంతటనిలువకహరిదిక్కుఁజూచి, కాంతాళమునఁబల్కెఁ గ్రమ్మఱఁగనలి." విష్ణు. పూ. ౨, ఆ.—2. తాలిమిలేమి. "క. అని యువిళ్లూరుచుమది, ననయమ్ముఁదలపోయు నున్నఁవిఁగాంతాళం, బునఁబోరలు నిట్టూర్పులఁ, బున కోర్వక యవస్థఘాటి బోటింబలికెన్." ప్రభా. 3, ఆ.

**కాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. జిగి; 2. కోరిక.

**కాంతుఁడు.** సం. వి. అ. పుం. మగఁడు. విణ. ఒప్పిదముగలవాఁడు.

**కాందవికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) పిండివంటలుచేయువాఁడు.

**కాందిశీకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వెఱపుచేఁబాఱెడువాఁడు.

**కాంపిల్యము.** సం. వి. అ. పుం. కంపిల్లముచెట్టు.

**కాంబవికుఁడు.** సం. వి. అ. పుం. సంకుపూసలులోనగునవి చేసియమ్మెడువాఁడు.

**కాంబళము.** సం. విణ. (అ. ఈ. అ.) కంబళిచేఁగప్పఁబడినది. (రథము.)

**కాంబోది.** దే. వి. సస్యవిశేషము. "ద్వి. వేఁగెఁగాంబోదివావిరి వంకెడొంక." విష్ణు. పూ. 3, ఆ.

**కాంభోజము.** సం. వి. అ. పుం. 1. ఒకానొకదేశము; 2. కాంభోజదేశపుగుఱ్ఱము; 3. వెలిచంద్రచెట్టు; 4. పొన్నచెట్టు.

**కాంభోజి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకరాగము; 2. వెలిచంద్రచెట్టు; 3. కారుమినుముచెట్టు; 4. బండిగురివెందచెట్టు.

**కాంస్యకారుఁడు.** సం. వి. అ. పుం. కంచరవాఁడు.

**కాంస్యము.** సం. వి. అ. న. 1. కంచు; 2. బంగారువెండి లోనగువానిచేఁజేయఁబడినపానపాత్రము.

**కాఁక.** దే. వి. 1. జ్వరము; 2. తాపము; 3. తపము; "ఉ. ఇంతియమృదూక్తిమాధురికినిఘురనంబెనవోలఁజాలకా, ద్దంతము నోడిమధ్యము గుణాశ్రయమైనెఱకాఁకనెన్నిజ, స్వాంతరముల్ వహించియు." వసు. ౨, ఆ.—4. కోపము; "ఉ. కాఁకనెదిర్చినంగ రముఖంబున హెచ్చినరాజవంశముల్, గూఁకటివేళ్లతోఁబెరికి." జై. ౧, ఆ.—విణ. ఉష్ణము. (కాఁకవెలుఁగు మొ.)

**కాఁకర.** వై. వి. కారవేల్లముచెట్టు. (దీనిభేదములు.—అడవికాఁకర, కొమ్ముకాఁకర, గొడ్డుఁగాఁకర, పొట్టికాఁకర.)

**కాఁకరవత్తి.** వై. వి. బాణసంచువిశేషము.

**కాఁకవెలుఁగు.** దే. వి. సూర్యుఁడు, ఉష్ణరశ్మి. "క. చుక్కలరాజొక్కెడఁజొక్కఁ, డక్కజపువెలుంగువ్రాదయమందుజనించెన్, నిక్కమసేతెల్పు క్రియనెద, చిక్కం గొనస్తుబముఁదాల్చి కోరికలెల్చన్." గామా. 3, ఆ.

**కాఁగు.** దే. అ. క్రి. 1. కపించు; 2. కోపపడు. "ద్వి. కాఁగి వస్త్రములేనివిప్రుతిఁదిట్టి, తాఁగకయొకసూతిలోఁబడద్రొబ్బి." భాగ. ౯, స్కం.—వి. పెద్దబాన.

**కాఁగుడు.** దే. వి. కపించుట. తపనము.

**కాఁచర.** వై. వి. కానర్త. "ఎ, గీ. కానరయనఁగాఁచరయనఁ గాశాదనివమాహ్వయము లగుభవ." అం, భా. ద్వి. వ.

**కాఁచి.** వై. వి. కాకమాచిచెట్టు.

**కాంచు.** దే. ప్రే. కాఁగఁజేయు. వి. ఒకానొక యంగవేదినుసు.

**కాంచువడియము.** దృ. వి. కవిరియుండె. (చూ. కైరవణి.)

**కాఁడ.** వై. వి. 1. కూరాకులోనగువానికాడ; 2. తోడిమ.

**కాఁడి.** దే. వి. 1. పులియఁబెట్టిన కడుగునీరు; 2. ఎద్దులమెడ లగువాని మెడమీఁదనుంచెడు బండిలోనగువానియుగము. "క. పలుపులుఁగాఁడులుపగ్గం, బులుఁదనయస్సంబులడిరిపాడిచేసినపి, చ్చులవిడఁబాఱడిఁతప్పఁ, బులనెయ్యఁడుదివిజరాజుపుత్త్రుఁడుకృప తోన్." భార. విరా. ౫, ఆ.

**కాఁడిగట్టు.** దృ. వి. ఒక్కరొకరిసేలలకు హద్దుగానేర్పఱచిన కట్ట.

**కాఁడు.** దే. అవ. ఒకానొకపుంప్రత్యయము. (పోఁగఁబుకాఁడు మొ.)—అ. క్రి. నాటు. "సీ. కాఁడినవిషకంటకములు మెల్పునఁ బుచ్చితనివెచ్చఁబాదపద్మములుగాఁచి." జై. ౬, ఆ. "ఉ. భానుఁడు శీతభానుఁడుగన్ గాఁడినమేషుకాళిమవికారముదూరమునేయ." పాండు. ౪, ఆ.

**కాఁదారి.** దే. వి. అర్ధరాత్రము. "మ. అంతఃపురాం, గనలం గన్నుమొఱంగి యప్పురమునం గన్నేలుకాఁదారిప్రా, ద్దునభీమే షుఁడుసానివాడకరుగన్ ధూర్తప్రకారంబునన్." భీ. ౧, ఆ.

**కాఁదారిమాఁదారి** దే. వి.______వై.______"గీ. వడివడింజని పట్టియోవాలుగంటి, నీకుఁజేరేమియెవ్వఁడు నీదుమగఁడు, పూని కాఁదారిమాఁదారిప్రొద్దుకాడ, నెందుఁబోయెదుతలిదండ్రులెవ్వ రనుడు." య. ౨, ఆ.

**కాఁపడము.** దే. వి. నొప్పిగలిగినచోట వేఁడివస్తువుతో నొత్తుట.

**కాఁపు.** దే. వి. 1. కాఁపురము; "మ. అలపన్నిద్దఱు సూరులం దునునముద్యల్లీలఁగాఁబున్నవె, గ్గలపుందాపమువాపనా." అము. ౧, ఆ.—2. గృహస్థుఁడు; "దొడ్డిఁబెట్టినవేల్పుగిడ్డికాఁపు." సాక్షి. ౧, ఆ.—3. పంటపెట్టువాఁడు. "గీ. కాఁపులావృవెరవుఁ గల్గికర్షనముచే, యంగవృష్టితెగినయట్లుకలుగ, ఫలముకల్గు." భార. సా. ౧, ఆ.—4. శూద్రుఁడు. "క. ఓకాఁపయిందురమ్మని, సాకతమునఁజేరఁబిలిచికథనవిధిజ్ఞం, డాకనఁపుకట్టడించియు, నాకుల మతివిచ్చిచూడనవ్వడునడుమన్." భో. ౪, ఆ.

**కాఁపుడు.** దే. వి. కాఁచుట.

**కాఁపురము.** దే. వి. 1. నివాసము; 2. సంసారము. "సీ. ఏమేటియడుగుఁగెందామరబల్లాఁపురపుశేర్లతేనిబ్రంపుఁదెప్ప." అచ్చ. బాల, కాం.

**కాఁపురించు.** దే. అ. క్రి. కాఁపురముచేయు, వసించు.

**కాఁబట్టి.** దే. అవ్య. (కాన్+పట్టి.) హేతువునుదెలుపును, కనుక.

కాఁబట్టు. దే. అ. క్రి. (కాఁ+పట్టు.) కావలసియుండు. (అది నాకు కాఁబట్టదు.)

కాఁబడు. దృ. అ. క్రి. (కా+పడు.) అగు. "చెలిమికాఁ బడుఁగాకటుమాటలాడెనట." జై. ౨, ఆ. (స్వార్థమునపడు.)

కాఁబోలు. దే. ద్ర. (కా+పోలు.) కానేమొ.

కాక. ఉప. దే. అవ్య. 1. ఆశీరాద్యర్థమును దెలుపును. (అట్టుల కాక, ఉండెదుఁగాక మొ.)–2. తక్క-నను నర్థమును దెలుపును. "సీ. నీవు నలుపకుఁ జేర్చితో దేవినైనఁగాక." భార. అర. ౨, ఆ.–సం. వి. ఆ. స్త్రీ. 1. కాఁచికీ; 2. కాకిదొండకీ; 3. కారుకాల్లికీ; 4. కుక్క-మేడికీ; 5. వెలమసందికీ. అ. న. ము. కాకులసమూహము. పుం. 1. కాకి; 2. ఒకానొకచెట్టు.

కాకచించ. సం. వి. ఆ. స్త్రీ. గురిజకీ.

కాకచించి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

కాకజంఘ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకిదొండకీ; 2. వెలమసందికీ.

కాకజంబుక. సం. వి. ఆ. స్త్రీ. కాకినేరేడుకీ.

కాకతాళీయము. సం. విశే. (అ. ఆ. అ.) కకి వ్రాలఁగా తాటిపండు పడిన పిధమువంటిది.

కాకతిందుకము. సం. వి. అ. పుం. కాకితుమ్మికకీ.

కాకతుండఫల. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండకీ.

కాకతుండము. సం. వి. అ. పుం. 1. అగరువు; 2. కాహళమను వాద్యవిశేషము; 3. బాణవిశేషము.

కాకనాసిక. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండకీ.

కాకపక్షము. సం. వి. అ. పుం. పిల్లజుట్టు, కూఁకటి.

కాకపీలుకము. సం. వి. అ. పుం. కాకితుమ్మికకీ.

కాకపుష్టము. సం. వి. అ. పుం. కోయిల.

కాకమల్లి. సం. వి. ఈ. స్త్రీ. అడవిమల్లెకీ.

కాకమాచి. సం. వి. ఈ. స్త్రీ. కాఁచికీ.

కాకము. సం. విశే. (అ.) అల్పము.

కాకముద్గ. సం. వి. ఆ. స్త్రీ. కాకిపెసరకీ.

కాకరుహము. సం. వి. అ. పుం. సువ్వలు.

కాకలము. సం. వి. అ. పుం. కాగితము.

కాకలీ. సం. వి. ఈ. స్త్రీ. సూక్ష్మమైన యవ్యక్తమధురధ్వని.

కాకాంగి. సం. వి. ఈ. స్త్రీ. కాకిదొండకీ.

కాకాదని. సం. వి. ఈ. స్త్రీ. పెద్దకాఁచికీ.

కాకాక్షిన్యాయము. సం. వి. అ. పుం. కాకిచూపువలె నేదేనొక ప్రక్క- కొఱగుట.

కాకి. ఉభ. వై. వి. కాకము. విశే. అల్పము. (కాకికలువ మొ.)–సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకాకి; 2. కాఁచికీ.

కాకికలువ. వై. వి. అల్లిపువ్వు, కాకోత్పలము.

కాకిచిప్ప. దృ. వి. నీటియందలిగుల్ల, శంబూక. "క. అక్కడ లేఁగాకిచిప్పలు." య. 3, ఆ.

కాకిచెఱకు. దృ. వి. చెఱకువంటి తృణవిశేషము, తేజనకము.

కాకిచావు. దృ. వి. ఆకస్మికపు మృతి.

కాకిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కర్షమునందు నాలవపాలు; 2. కాలిచెముకోల; 3. ఒకగవ్వ; 4. తూనికభాగము; 5. ఎఱ్ఱగురిజకీ.

కాకితము, కాగితము. హిం. వి. వ్రాయుపత్రవిశేషము.

కాకితీపు. దృ. వి. మూర్ఛావిశేషము.

కాకితుమ్మికి. దృ. వి. నల్లతుమికి, కాకతిందుకముకీ.

కాకిదొండ. వై. వి. అడవిదొండ, కాకతుండఫలకీ.

కాకినేరెడు. దృ. వి. నేలనేరెడు, కాకజంబువుకీ.

కాకిపెసర. దృ. వి. పిల్లపెసర, కాకముద్గకీ.

కాకిబంగారు. దృ. వి. పీతాభ్రకము.

కాకిబాతు. దృ. వి. ఒకవిధమైన అడవిబాతు.

కాకిమేడి. దృ. వి. బమ్మమేడి, కాకోదుంబరికకీ.

కాకివుక్కలు. దృ. వి. బ. ధాన్యవిశేషము.

కాకివుల్లు. దృ. వి. తృణవిశేషము. (దీని పుల్లలచే నొక వ్రాయుదురు.)

కాకివెదురు. దృ. వి. గుంద్రముకీ.

కాకిసొమ్ము. వై. వి. కాకితీపు.

కాకు. దే. వి. 1. గాసి; "క. పాకారిదురాలోక, ప్రాకారాకరపు రపరాధవపరిపా, కాకులులై కాకులవలెఁ, గాకైదనఁబొబ్బిరెల్ల కడలకుసనురుల్." రామా. ౬, ఆ.–2. తిరస్కారము. "క. పరతత్వమెఱుఁగకూరక, పరమర్షులతో డనేసపరముఁడనినచుడ్ల, పరలెల్లఁగాకునేయఁగ, దురహంకృతిఁబలుకఁదగునె తోయజగర్భా." కాశీ. ౫, ఆ.–విశే. 1. వ్యర్థము; "నినువేఁడుకార్యముఁగాకు చేయకచేయుమీ." మై. ౧, ఆ.–2. శూన్యము. "ద్వి. నైకుంఠనగరంబువనజారికరము, శోకనికుముదంబు జోకఁగాకయ్యె." విష్ణు. పూ. ౨, ఆ.

కాకుఁడు. సం. వి. అ. పుం. పిచ్చుకకుంటు.

కాకుదము. సం. వి. అ. న. తాలువు, దవుడ.

కాకున్నె. దే. అవ్య. (కాక+ఉన్నె.) నిశ్చయమును దెలుపును. "గీ. అడవిఁ దన్నుఁబాసి యరిగినఁ బిలిగకా, కున్నెయుట్లుచేయనువిదగడఁగె." (అలిగెకాకున్నె–అలిగినది నిశ్చయమనుట.) భార. అర. ౨, ఆ.

కాకువు. సం. వి. ఉ. స్త్రీ. శోకభయాదులచేఁ గలిగెడు ధ్వనివికారము.

కాకృత్యము. సం. వి. అ. న. 1. అకార్యము; 2. పశ్చాత్తాపము.

కాకేందువు. సం. వి. ఉ. పుం. కాకితుమ్మికకీ.

కాకేమి. దే. అవ్య. (కాక+ఏమి.) మఱియొకదాని లేమినిదెలుపును. "వ. అశుచిభావంబునంగాకేమియప్పరమపతి వ్రత మదీయదృష్టిగోచరగాకున్నదయ్యె." (అశుచిభావంబునంగాకేమి–అశుచిభావమునసేయనుట.) భార. ఆది. ౧, ఆ.

కాకోత్పలము. సం. వి. అ. న. కాకికలువ.

కాకోదరము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

కాకోదుంబరిక. సం. వి. ఆ. స్త్రీ. కాకిమేడికీ.

కాకోలము. సం. వి. అ. న. నరకవిశేషము. పుం, న. విషభేదము. పుం. మాలకాకి. డు. కుమ్మరి.

కాకోలి. సం. వి. ఈ. స్త్రీ. కారుకాల్లికీ.

**కాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అడవితొగరిచెట్టు; 2. తొగరిచెట్టు; 3. తొగరిమన్ను.

**కాగడా.** దే. వి. (కాఁగు+గడ.) కొయ్య లేక గుడ్డతోనే యేర్పఱచిన చేతిదివ్వటీ. ''జగతీజ్యోతులుకాగడాలు.'' హంస. 3, ఆ.

**కాగిస.** దే. వి. మత్స్యవిశేషము.

**కాచకామఁడు.** సం. వి. అ. పుం. గాజుపనివాఁడు.

**కాచము.** సం. వి. అ. న. గాజుప్వ. పుం. 1. గాజుపూస; 2. గాజుమన్ను; 3. కావడియుట్టి; 4. నేత్రరోగవిశేషము; 5. కాసు. ''శ్లో. కాచాయనీచంకమనీయవాచా, మోచాఫలస్వాదుముచానయాచే, దయాకుచేలేధనదత్కుచేలే, స్థితేకుచేలే శ్రీగ మాకుచేలే.''

**కాచస్థాలి.** సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టుచెట్టు.

**కాచితము.** సం. విణ. (అ. ఆ. అ.) కావడియుట్టియందుంచఁబడినది. (కుండలోనగునది.)

**కాచు.** దే. అ. క్రి. 1. (కాయ) కాచు; 2. (ఎండ) కాయు. (''గీ. నిడుదత్రాళ్లూనిబయలనెప్పుడుఁదిరుగుచుఁ, బొనఁగము ప్రొద్దుమువ్వేసములఁజెలఁగుచు, వెలుఁగులెల్లెడఁగాచుచునలరునిల్లు, వేఁటకాఁడప్పు డెంతయుఁదేటమీఱె.'' ఈ యర్థమందు కాచుచున్నది సాధువుకాదు. అచ్చ. అ, కాం.)—స. క్రి. 1. బాధలు తొలఁగించిరక్షించు; ''మముంగావుము ప్రోవుము.'' హరి. పూ. 2, ఆ. 2. ఎదురుచూచు; 3. సహించు. ''మనంబునఁబొంగు విషాదరోషముల్ గావంగలేక.'' భార. ఉద్యో. 3, ఆ.

**కాజి.** దే. వి. 1. ఒకానొకచెట్టు. ''వెలితమ్మికాజిపువ్వులు ముద్దుంగ.'' పా. 2, ఆ. 2. మహమ్మదీయుల ఆచారి.

**కాటకము.** దే. వి. కఱవు, క్షామము.

**కాట్రా.** హిం. వి. పెద్దత్రాసు.

**కాటిగాఁడు.** దే. వి. పక్షివిశేషము.

**కాటిపాపఁడు.** దే. వి. (కాడు+పాపఁడు.) గొల్లవాఁడు. ''ద్వి. కాటిపాపఁడు పసిఁగాచుచునుండ.'' భాగ. ౪, స్కం.

**కాటిపాపలవాండ్రు.** దే. వి. బ. జాలవిద్యచేసెడి ఆటవికజన విశేషము.

**కాటిఱేఁడు.** దే. వి. (కాడు+ఱేఁడు.) ముక్కంటి, శివుఁడు. ''గీ. మునుపుపడినమెకముఁగొనివచ్చిమిడిగ్రుడ్లు, పొడిచినీటశిరముఁదడిపితోఁకఁ, గోసిధూపమిచ్చిమీసంబుపెకలించి, కానుకిచ్చి కాటిఱేనిఁగొలిచి.'' కాళ. 3, ఆ.

**కాటు.** దే. వి. 1. కఱచుట; 2. కఱచినగాయము; ''మాకఱచిన కాట్లకుఁ శిశువుకాయముతోలునునుగ్గదయ్యె.'' లక్ష్మీ. ౪, ఆ.— 3. మాఁడి యడుగంటుట.

**కాటుక.** దే. వి. అంజనము.

**కాటుకకొండ.** ద్వి. వి. అంజనపర్వతము. (ఇట్లు కాటుకగుబ్బలి లోనగునవి.)

**కాటుకపట్టు.** దే. అ. క్రి. నలుపుపాఱు. ''క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండముచెమ్మయుష్ణకిరూక్షార్కవిభా, రహితతఁగాటుకపట్టెను, రహిచెడియనంధతమసరాసులుబెరసెన్.'' స్వా. 3, ఆ.

**కాటుకపిట్ట.** ద్వి. వి. ఖంజరీటము.

**కాటుకఱాయి.** దే. వి. సౌవీరాంజనము.

**కాటుకతేకులపాము.** దే. వి. పుల్ల పింజెర.

**కాటులాడు.** దే. అ. క్రి. (కాటులు+ఆడు.) కలహించు. ''సీ. అసుఖదంబైనరాజ్యామిషమునకుఁ గుక్కలభంగిఁదమలోనఁ గాటులాడి.'' భార. శాం. ౧, ఆ.

**కాటువోవు.** దే. అ. క్రి. (కాటు+పోవు.) మాఁడియడుగంటు.

**కాట్రగడ.** దే. వి. కంటకోట.

**కాట్రేఁడు.** దే. వి. కాటిఱేఁడుయొక్క రూపాంతరము. ''సీ. కాట్రేడమెకములకడుపురాఁజేయుమీఁదంకనొక్కటిసీచేతికిత్తు.'' య. 2, ఆ.

**కాడు.** వై. వి. 1. శ్మశానము; ''సీ. దివ్యమందిరములఁదిరిగెడు నరుఁడైన నొగిఁగాడుకావకయుండలేఁడు.'' భల్లా. ౧, ఆ.— 2. అడవి*. 3. నాశము*.

**కాడుచేయు.** వై. స. క్రి. నాశముచేయు. ''గీ. ఒక్కనదిపొంత గార్హస్థ్యయుక్తమైన, పుణ్యతపమాచరించుచుఁబున్నజనులు, తారు బంధులుఁదామరతఁపరగుచుఁ, గూడియుండంగనెంతయుఁగాడు చేసె.'' భీ. ౪, ఆ.

**కాడుపడు.** వై. అ. క్రి. 1. కలఁతపడు; ''క. కూడమ్మికొంద్రు జనములు, బాడబులాగమములమ్మి బ్రదుకుదురెద్దున్, జేడియలమ్ముదురచ్చోటు, కాడుపడినకలియుగమునఁగౌరవముఖ్యా.'' హరి. ఉ. ౯, ఆ. ''సీ. కాలుకొన్నంతయుఁగడువేగమునఁబాటికనుకని దెసలందుఁగాడుపడియు.'' నిర్వ. ౪, ఆ.—2. కనఁబడకపోవు, నష్టమగు. ''చ. వసయుఁడొకండువాఁడు గుణధాముఁడుక్రీడన వాంఛసాంద్రకా, వనమునకేగికాడుపడిసందడవంజనుదెంచియెం దుఁగానను.'' సం. ''భూరిద్యుమ్నంసుతంసష్ట మన్వేష్టుంవనమాగతః.'' భార. శాం. 3, ఆ. ''గీ. కుడిచికూర్చుండిమీరేలకొఱఁతయైన, కుమ్ములాడెదరోయన్నదమ్ములార, గొడ్డెగ్రొవ్వియుసెలగను గొడిఁకినట్లు, కటకటామీవివేకంబుకాడుపడఁగ.'' భీ. ౪, ఆ. (ప్రే. కాడుపఱచు.)

**కాడ్పడు.** వై. అ. క్రి. కాడుపడుయొక్క రూపాంతరము. (కలఁతపడుటకు —''ఉ. వృత్రునిఁజంపినప్పుడెసురేంద్రునిమేకొనెబ్రహ్మహత్యత, ద్గాత్రముకంపమొందెమదికాడ్పడియెన్.'' ఉ, రా. 2, ఆ.— నష్టమగుటకు.—''కరులుహరుల్ రథంబులునుగాడ్పడె.'') (ఇక్కడ కాడ్పడెననఁగా నశించెనని యర్థము.) ఉ, రా. 2, ఆ.

**కాణము.** ఉభ. వై. వి. గుఱ్ఱముమొదలగువానియొక్క యులవలు లోనుగాఁగలభక్ష్యము. ''ఎ, గీ. బియ్యములునునేయిపెరుగును గూరగా, యలునువంటకట్టియలునుగడ్డి, కాణములునుచెల్లుగానొడఁగూర్చిని, గూఢవృత్తిఁదానుఁ గూడనడచె.'' భార. ఉద్యో. ౧, ఆ.—సం. అ. పుం. కాకి.

**కాణయాచి.** దే. వి. చిరకాలవాసస్థానము. ''క. తెరువునజఘన పయోధర, భరమునసడుగలసియిడఁగఁబతియాఁతగనై, కరమిచ్చు నాకునవ్వలి, కరమదినీకాణయాచిగాయుంగరమా.'' రామా. ౬, ఆ.—విణ. చిరకాలానుభవముగలది. (చూ. కాణాచి.)

**కాణాచి.** దే. వి. కాణయాచియొక్క రూపాంతరము. (చిరకాల వాసస్థానమునకు.—''శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవుప్రియవక్తృత్వంబు కాణాచివి, ద్యావైశద్యముదిక్కుధర్మమునకుందార్కాణమర్యాదకున్, ధావౌచిత్యముఃజీవగజ్జహితశిష్టవ్రాతసంతోషణ, శ్రీవత్రాంగియ జాతశత్రుఁడుమహీభృన్మాత్రుఁడేచూడఁగన్.'' విజ. ౧, ఆ.— చిరకాలానుభవముకలది అనుటకు.—''క, మగఁడాపట్టంబునఁధలఁ,

వెగఁగొట్టినఁగొట్టుఁగాకకెకతేరగఁటి. కెగవిడిచిపోయెద నెప్రావగనా కాణాచియైనవలపులపంటక౯." కళా. 3, ఆ.)

**కాణాదము.** సం. వి. అ. పుం. కణాదఋషి ప్రోక్తన్యాయ శాస్త్రము.

**కాణుఁడు.** సం. వి. అ. పుం. ఒంటికంటివాఁడు.

**కాత.** దే. ద్ర. ఆశీరర్థమునందు తద్ధర్మార్థక క్రియలకను ప్రయుక్త మగుశబ్దము. "అఖిలభూపములకునానందమగుఁగాత." మొ. మార్క. ౮, ఆ.

**కాతరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) అధీరుఁడు, భయశీలుఁడు. (అనికొందఱు.)

**కాతా, ఖాతా.** హిం. వి. వ్యాపారములలో సంబంధము, లెక్క.

**కాతాళము.** దే. వి. కోపము. "క. మాతంగదభటాళిప, రీతుఁ డిగుచుఁద్రోవపుండరీకుఁడుచూపక౯, గాతాళంబు కనిలు వక, పాతాళంబునకునేగిపోఁజాలుచేయుక౯." జై. ౭, ఆ.

**కాత్యాయని.** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి, 2. నగముపదు పుచెల్లి కావిచీరఁగట్టినవిధవ.

**కాదంబము.** సం. వి. అ. పుం. 1. ధూమ్రవర్ణములైనముక్కు కాళ్లుకెక్కలుగలహంస; 2. బాణము.

**కాదంబరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకగ్రంథము; 2. ఆఁడు కోయిల; 3. గోరువంక; 4. మద్యము; 5. సరస్వతి.

**కాదంబిని.** సం. వి. ఈ. స్త్రీ. మేఘపఙ్క్తి.

**కాదా.** దే. అవ్య. (కాదు+ఆ.) కదా. (దీనియొక్క మాఱురూప ములు.—కద, కదా.)

**కాదాచిత్కము.** సం. విశ. (అ. ఆ. అ.) ఒకానొకప్పుడు కలు గునది.

**కాదె.** దే. అవ్య. (కాదు+ఎ.) కదా. "వర్ణతతినాత్రమకోటిని వాఁడుకాదెనేసె." భార. శాం. ౧, ఆ. (రూ. కాదే. క. ఏనేమి తప్పుచేసితి, నోఁసలినదళాక్షనీనియోగంబునఁగా, దేవాఁడుజలధి నుండుట, మాని యిటకు వచ్చినాఁడ మగువలుఁదాను౯." వి, పు. ౭, ఆ.) (దీనియొక్క మాఱురూపములు. కదె, కదే.)

**కాద్రవేయుఁడు.** సం. వి. అ. పుం. కద్రువకొడుకు, పాము.

**కాన.** యు. దే. అవ్య. తెనుఁగునసంబోధనంబున అనుప్రయుక్తమగు శబ్దము. (తల్లికాన, సామికాన మొ.)—ద్ర. కనుక. వై. వి. అడవి.

**కానఁబట్టు.** దే. అ. క్రి. (కానక్+పట్టు.) కనఁబడు. "ఏకా అంతయునుగానంబట్టదెప్పట్టున౯." రా. యు, కాం.

**కాననము.** సం. వి. అ. న. 1. అడవి; 2. ఇల్లు; 3. బ్రహ్మ ముఖము.

**కాననివాఁడు.** దే. విశ. అంధుఁడు. "ఉ. కాననివానినూఁతగొని కాననివాఁడువిశిష్టవస్తువుల్, కాననిభంగి." భాగ. ౭, స్క౦.

**కానరానిమేక్క.** ద్వి. వి. అభిజిన్నక్షత్రము.

**కాని.** యు. దే. అవ్య. 1. వికల్పమునుదెలుపును; (నేనుకాని రేపుకాని వచ్చును. చూ. కానీ.)—2. తక్కననునర్థమునుదెలుపును. "ఉ. కోపాలనమేచియున్న నిబిడాటవిపై బ్రసరించుతీవ్రదా, వానలుఁబోలిశాత్రవచయంబుపయింగవియించినిల్చినంగాని." భార. ఉద్యో. ౨, ఆ.—వై. వి. వీనమునవాలవభాగము. "క. కాని వ్వయంబెన్నఁడునొక, కానియుఁజేయంగఁదగదుకార్యముగలచో, మానతధనంబుఁద్భృణముగ, మానవపతిచేయునదిస మగ్రవిభూతిక౯." రుక్మాం. 3, ఆ. ("క. ఏనుగలిగియుండఁగనె, వాన్నికినిను ముద్దుసేయవాలాయమగుక౯, గానియిటమీఁదనెవ్వఁడుఁ, గానికిఁ గైకొనక చుల్కఁగాఁ జూచుఁజుమీ." ఇత్యాది స్థలములయందు కానికిఁగైకొనక అనఁగా లక్ష్యపెట్టక అని యర్థము.)

**కానిక.** దే. వి. కానుక, ఉపహారము. "వృషముఁగానికయిచ్చికరుణ జనింపఁబలికె." భార. అను. ౫, ఆ.

**కానిపించు.** దే. అ. క్రి. ప్రత్యక్షమగు. "గీ. కానిపించియేమి కావలయునువరం, బడుగుమనిన." కళా. ౨, ఆ. (కనిపించు అనుదానికి నైతము ఈయర్థము కలదు.) ప్రే. కనఁజేయు.

**కానీ.** దే. అవ్య. 1. అంగీకారమునుదెలుపును; "శా. మానిక్రోధ విఘాతపత్రములతూ మాతోనపత్రల్కదా, కానీరండని." ఆము. ౨, ఆ.—2. కానియొక్క రూపాంతరము. "మ. నిరవద్యస్థిరభక్తి తోడననుఁగానీశంభుఁగానీరమే, శ్వరుఁగానీగుఱియించి." కాశీ. ౨, ఆ.

**కానీనుఁడు.** సం. వి. అ. పుం. 1. కన్యకకొడుకు; 2. వ్యాసుఁ డు; 3. కర్ణుఁడు.

**కాను.** దే. వి. నీళ్లుకలియనిమజ్జిగ, మథితము.

**కానుక.** దే. వి. కానిక. "క. సకలావనీశులిచ్చిన, యకలంకసువర్ణ రత్నహయధనవస్త్ర, ప్రకరంబులుమొదలగుకా, నుకలందుకొనక సుమోదనని నియమించెక౯." భాగ. ౧౦, స్క౦. ఉ.

**కానుగు.** దే. వి. కరంజవృక్షము. (దీని భేదములు—గంట్లకానుగు, తీఁగె కానుగు, నిప్పువన్నెగుత్తులకానుగు.)

**కానుపు.** దే. వి. 1. ప్రసవము; 2. వీక్షణము. "అది కలలోని కానుపయి." హరి. ఉ. ౭, ఆ.

**కాన్క.** దే. వి. కానుకయొక్క రూపాంతరము. "సీ. సుములుగాఁ బోలుచుపూగములఁజెన్నొందుపూగములఁగొన్నింటిఁగైకాన్కచేసి." చంద్ర.

**కాన్పించు.** దే. కానిపించుయొక్క రూపాంతరము.

**కాపంతము.** దే. వి. కుక్కనుగట్టెడికొయ్య. "ఎ, గీ. శ్వగళ కావ్యంబువెలయుఁగాపంతమనఁగ." ఆం, భా. ద్వి. ఘ.

**కాపథము.** సం. వి. అ. న. నీటివట్టివేరు. (నామలింగానుశాసన మునందిది ఇష్టకాపథమని యిష్టశబ్దపూర్వకముగాఁ బఠింపఁబడి యున్నను నిఘంటున్వంతరములయందిట్లు తద్విరహితముగాఁ జెప్పఁబడి యున్నది.) పుం. కుత్సితపుత్రోవ.

**కాపరి.** దే. వి. (కాపు+అరి.) రక్షకుఁడు. "ఉ. కావరిలేనినొంటి యలకైవడిఁగంటకచోరకోటిచే, నేపఱియున్నదీభువనమీశుఁడు కృష్ణుఁడులేమి." భాగ. ౧, స్క౦.

**కాపాడు.** దే. అ. క్రి. (కాపు+ఆడు.) బాధలు తొలఁగించి రక్షించు.

**కాపి.** ఆం. వి. వ్రాఁతనేర్చుటకు పైనపెట్టు వఱవడి; నకలు.

**కాపిలము.** సం. వి. అ. న. సాంఖ్యశాస్త్రము.

**కాపిశాయనము.** సం. వి. అ. న. మద్యము, కల్లు.

**కాపిశేయము.** సం. వి. అ. పుం. పిశాచము.

**కాపు.** దే. వి. 1. కాయలుకాచుట; 2. బాధలుతొలఁగించిరక్షించుట.

**కాపుగడ.** దే. వి. రక్షణము. "ద్వి. అన్యాయములుచేసియర్థము లొగొనక, మాన్యతఁబ్రోతువేమటికాపుగడల." రా. అ, కాం.

**కాపురుషుఁడు.** సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు.

**కాపేయము.** ఉభ. దే. వి. కృపణత. (అప్ర.) సం. అ. న. కపిస్వభావము.

**కాపోతము.** సం. వి. అ. న. 1. కపోతముల సమూహము; 2. అంజనవిశేషము.

**కాప్యకారము.** సం. వి. అ. పుం. మనసున పాపముంచి మాటాడుట.

**కాఫి.** ఆం. వి. ఒక విత్తనము.

**కామ.** దే. వి. 1. తామరలోనగువానికాఁడ; "గీ. కఱకు బెండతాఁకినతొగకామభంగిఁ, బాఁపతేనిమేనెంతయుబలముతఱిఁగి స్రుక్కె." హరి. పూ. ౭, ఆ.—2. గొడుగులోనగువానిదండము; "చ. గొడుగుగఁజేసెగోవులకు గోపకుమారులభుఁ నగంబుని, ట్లొడఁబడవచ్చుఁబొమ్మనఁగనొప్పెడు శ్రేష్ఠులు వంజమూడ్కియై, యడరినమీఁది మేఘతతియావృతియైశిఖరంబుగుబ్బయై కడుబెడఁగొందెహస్తమను కామతిరంబుగఁదాల్చిపొల్చుటఁ." హరి. పూ. ౭, ఆ. (కనకపు కామతోమరము, పడగకామ, బంగరుకామకుంచె ఇత్యాదు లెఱుంగునది.)—3. మగగుఱి; 4. చూచుకము. (చూ. మిన్నటుకు.)

**కామంచి.** వై. వి. కత్తృణము†.

**కామంజిక.** సం. వి. ఆ. స్త్రీ. కామంచిగడ్డి.

**కామకూటము.** సం. వి. అ. పుం. 1. వేశ్యాప్రణయము; 2. వేశ్యావిభ్రమము.

**కామకేళి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. సురతము.

**కామధేనువు.** సం. వి. ఉ. స్త్రీ. కోరినవస్తువులిచ్చెడి వేల్పుటావు.

**కామన.** సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ. అ. పుం. ము. అశోకము†. విణ. 1. ఇచ్ఛగలది; 2. చక్కనిది.

**కామనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్ఛగలవాఁడు; 2. చక్కనివాఁడు.

**కామపాలుఁడు.** సం. వి. అ. పుం. వాలి, బలరాముఁడు.

**కామము.** సం. వి. అ. న. 1. కామ్యము; 2. రేతస్సు. పుం. ఇచ్ఛ. క్రి. విణ. అ. న. ఇచ్ఛవచ్చినట్టు.

**కామయితృ.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) కాముకుఁడు.

**కామల.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. కామాల. అ. పుం. ము. 1. మరుభూమి; 2. వసంతఋతువు. విణ. డు. కాముకుడు.

**కామాంకుశము.** సం. వి. అ. పుం. నఖము, గోరు.

**కామాటము.** వై. వి. మోటపని*. "మ. అనిశమంత్రులు నాప్తులుందొరలుదేవామాత్యులుఁ జాలుఁదే, రనయంతేసల వృద్ధయాని మితకాంద్రభానుపుత్రాదులఁ, వినుమీచంపకపట్టిఁ తెచ్చి దినముఁనీయింటి కామాటపుం, బనికింజొచ్చెదమన్న దాఁకనిది చెంపల్ శ్రేతుమత్యుద్ధతిఁ." రామా. ౫, ఆ.

**కామాటి.** వై. విణ. (కామాటము+ఇ.) మోటపనిచేయువాఁడు.

**కామాల.** వై. వి. రోగవిశేషము.

**కామి.** సం. వి. ఇ. స్త్రీ. ఇచ్ఛ. పుం. 1. కాముకుఁడు; న్, 2. జక్కవ; 3. పావురము. విణ. కాముకుఁడు.

**కామిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రియసంగమమునందు మిక్కిలి యాశగలయాఁడుది; 2. ఆఁడుది; 3. ఆఁడుజక్కవ; 4. ఆఁడుపావురము; 5. బదనిక.

**కాముఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**కాముకము.** సం. వి. అ. పుం. 1. ఇరుగుడు†; 2. తినాసము†. విణ. ఇచ్ఛగలది.

**కాముకి.** సం. వి. ఈ. స్త్రీ. సంభోగమునందిచ్ఛగల ఆఁడుది.

**కాముకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఇచ్ఛగలవాఁడు.

**కామ్యము.** సం. వి. అ. న. అగ్నిహోత్రాది. "శ్లో. ఇష్టాపూర్తస్యకామ్యానాం త్రివర్గస్యచయోవిధిః." భాగ. ౩, స్కం.—విణ. కోరఁదగినది.

**కాయ.** దే. వి. 1. చెట్టునఁగాచెడుకాయ; 2. కఠినవస్తుసంస్పర్శముచే హస్తాదులయందుకాచెడుకాయ, కిణము; "ఉ. మున్నటులున్న పాణితలముల్ బలుకాయలుకాఁచెఁజూచితే." సం. "ఇత్యస్య దర్శయామాసకిణవంతౌకరావుభౌ." భార. విరా. ౨, ఆ.—3. నేత్రరోగవిశేషము; 4. పెసలులోనగువానిపైతోలు, శింబ, (ఇట్లు పూర్వపు కొన్ని నిఘంటువులయందు వ్రాయఁబడియున్నది.) "సీ. పెసరగలుగోదుమల్ మినుములుతిలలుముద్గములు మున్నుగఁగల కాయధాన్యములు." ఉ, రా. ౫, ఆ.—5. జూదమునందలిసారె లోనగునది; 6. వీణెసొరకాయ. "సీ. వీణెలగవ్వసెరల్ వెదలించి చెఱఁగులపెఱుఁగు రాఁగాయల మీఁదఁదుడిచి." హరిశ్చ. ౨, ఆ.

**కాయకంటి.** దే. వి. (కాయ+కన్ను.) కుబేరుఁడు.

**కాయకన్ను.** దే. వి. కాయకాచిన కన్ను.

**కాయకము.** దే. వి. జీవనము.

**కాయజలము.** సం. వి. అ. న. మూత్రము.

**కాయజుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**కాయపెండలము.** దే. వి. పెండలముదినుసు.

**కాయమానము.** సం. వి. అ. న. పందిరి.

**కాయము.** ఉభ. దే. వి. చాలెంతకిచ్చెడుమందు, సర్వస్వ. సం. అ. పుం. 1. శరీరము; 2. సమూహము; 3. స్వభావము; 4. గుఱి. విణ. ఋషిదేవతాకము.

**కాయస్థ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక†; 2. కరక†.

**కాయస్థుఁడు.** సం. వి. అ. పుం. 1. కరణమువాఁడు; 2. పరమాత్ముఁడు.

**కాయిక.** సం. వి. ఆ. స్త్రీ. నానాఁటివడ్డి. "శ్లో. కాయావిరోధినీశశ్వత్పణపాదాదికాయికా." విజ్ఞా. వ్య, కాం.—విణ. శరీరసంబంధమయినది.

**కాయిదా, ఖాయిదా.** హిం. వి. విధి, నిర్ణయము.

**కాయిలా, ఖాయిలా.** హిం. విణ. ఆరోగ్యములేని.

**కాయు.** వై. అ. క్రి. ఎండవెన్నెలలోనగునది ప్రకాశించు. "గీ. వెల్లమడుఁగుఁగోక విచ్చినరీతిఁబా, లాఱఁబోసినట్టియందమునను, బిండిచల్లినట్లుపండువెన్నెలలుకా, యంగఁదొడఁగెఁ జలువలమర నంత." కళా. ౫, ఆ.

**కాయువు.** దే. వి. అనురాగము. (చూ. కాయ్యువు.)

**కాయ్యువు.** దే. వి. కాయువుయొక్కరూపాంతరము. "చ. కరమనురాగముల్లమునఁగ్రమ్మఁగనమ్మృగిపుచ్ఛమూలమును, గరమున నంటుచుఁ నృపతికామవికారముఁబొందిపేఁకఁడ, త్వరమతియైతనుండివియఁ చార్థిపుచిత్తమెఱింగియేలనీ, కరమునఁబుచ్ఛమూలమిటుకాయ్యువునఁ బట్టెదు మేదినీశ్వరా." మార్క. ౫, ఆ.

**కార.** సం. వి. ఆ. స్త్రీ. 1. చెఱ; 2. చెఱసాల; 3. దూతిక; 4. [illegible]; 5. సువర్ణకారిక. అ. పుం. ము. 1. కప్పము; 2. నిశ్చయము; 3. నుంచుకొండ: 4. యత్నము; 5. వధము.

**కారంధమము.** సం. వి. అ. పుం. కన్నెలేడి.

**కారంధమి.** సం. వి. ఇ. పుం. 1. కంచుపనివాఁడు; 2. రస వాది.

**కారంభ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రేంకణము.

**కారకము.** సం. వి. అ. న. కర్త్రాదిషట్కము. విశే. చేయునది.

**కారగ్గి.** ద్వ. వి. (కారు+అగ్గి.) దావానలము. "ఎ, గీ. ఎగ్గతం బునఁదానుగాఱగ్గిఁగాలెనటె." భార. అశ్వ. ౨, ఆ.

**కారడుగు.** ద్వ. వి. (కారు+అడుగు.) 1. రెండవకారు; 2. అల్పధాన్యము.

**కారణ.** సం. వి. ఆ. స్త్రీ. యాతన. అ. న. ము. 1. హేతువు; 2. కొఱముట్టు; 3. వధము.

**కారణికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) పరీక్షకుఁడు.

**కారపుఁజెక్క.** వై. వి. (కారము+చెక్క.) ద్రాక్షత్వక్కు.

**కారపుఁబడుగు.** ద్వ. వి. (కారము+పడుగు.) గట్టినూలిపడుగు. "కారంపుఁబడుగులుకండెలకప్పెర." హంస. ౨, ఆ.

**కారము.** వై. వి. 1. షడ్రసములలోనొకటి, కటువు; (చూ. రసము.) 2. చవుడు*; "చ. అంబరమునఁబుట్టినట్టిమలపంకముకారములోననద్దఁగా, విరిసినయట్లు." భార. శాం. 3, ఆ.—నూలుతడిపెడి యొకానొకద్రవద్రవ్యవిశేషము*; 4. బిడ్డలకుఁబోసెడిమందు*. "శీ. పసిఁదహతహపెట్టమనలెడికార్చిచ్చు కారంపుమందుగా నారగించి." చమ. ౧, ఆ.

**కారయితి.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) చేయించువాఁడు.

**కారవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంగువమ్రాను; 2. ఓమము; 3. నల్ల జీలకఱ్ఱ; 4. నదాప.

**కారవేల్లము.** సం. వి. అ. పుం. కాఁకర.

**కారాకు.** దే. వి. (కారు+ఆకు.) పండుటాకు. "క. భారమున నలిచిత్రెంపక, కారాకులుడుల్లినట్లుకర్షములెల్లన్, దారపెడవాయవలయుట, సారకృపందెలియఁజెప్పెశౌరియతనికిన్." భార. భీష్మ. ౧, ఆ.

**కారాకూరము,** దే. విశే. కలఁగినది. "కారాకూరంబులై రాక్షసుల హృదయముల్ కాడ్పడన్." ఉ, రా. ౧, ఆ.

**కారాటు.** దే. వి. వ్యాపనము.

**కారించే.** సం. స. క్రి. బాధించు. "క. వైరముగొనిదైత్యుఁడుదుర్వారభుజారంభరోషరభసాకులుఁడై, కారింపఁదొడఁగెనమరులఁ, బోరులుతనకున్ వినోదములుగాఁగడిమిన్." లక్ష్మి. ౨, ఆ.

**కారిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. సూత్రాదివివరణశ్లోకము; 2. యాతన; 3. చేయుట; 4. మంగలిలోనగువానిపని; 5. నట్టువుని పెండ్లాము.

**కారికము.** దే. విశే. చలువచేయనిక్రొత్తది. (వస్త్రము,) అనాహతము.

**కారిజెము.** వై. వి. కడుపులో నీరుతిత్తిక్రిందనుండెడు మాంసఖండవిశేషము, కాలఖండము. "గీ. పెల్చుముడుసువంటపిండి తాలింపులు, సన్నగూరకారిజంబుక్రొవ్వు, పొదలుమారిషములు పాయసగుజ్జంబులు, సంబుజాతగంధులనువుపఱచి." రుక్మాం. 3, ఆ.

**కారిత.** సం. వి. ఆ. స్త్రీ. అప్పుతీసికొన్నవాఁడు తన యక్కఱకొలఁదిని తానుగా నేర్పఱచుకొన్నవడ్డి, ఒడఁబాటువడ్డి. "శ్లో. వృద్ధిస్సాకారితాయాధమర్ణకేనస్వయంకృతా." విజ్ఞా. వ్య, కాం.

**కారీషము.** సం. వి. అ. న. కరీషములసమూహము. (కరీషము= పేడపిడక.)

**కారు.** యు. దే. వి. 1. అడవి; "కారుచిచ్చు."—2. ఎండకాలముచల్లెడు వరిధాన్యము; (కారువడ్లు.)—3. ముదిమి; "కారాకు."—4. నస; "కారుపిండె."–5. చౌడు; "వానకారుపొలంబునఁ గల్గెనేనియుఁగొల్చుగావింపనేర్చునే." భార. సా. ౧, ఆ.—వై. 1. కాలము; "ననకారు."—2. వర్షకాలము*; "క్రొక్కారుమెఱుంగు." (చూ. కైపు.)—3. జ్యేష్ఠమాసముమొదలు నాలుగేసినెలలకాలము*; "ముక్కారు."—4. నలుపు. "కారుమొగులు."

**కారుకొను.** ద్వ. అ. క్రి. నల్లఁబాఱు. "క. కారుకొనిమేఘజాలా, కారంబునఁజాలనొప్పెఁగౌరవసైన్యం, బారూఢివీరరసవి, స్ఫారంబైయంతఁదోఁచెఁబాండవబలమున్." భార. భీష్మ. ౨, ఆ.

**కారుకొమ్ముమెకము.** ద్వ. వి. దుప్పి.

**కారుకొత్తి.** వై. వి. కాకోలి.

**కారుఖానా.** హిం. వి. పనిచేయు స్థలము.

**కారుకొల్లి.** వై. వి. కాకోలి.

**కారుకోడి.** ద్వ. వి. అడవికోడి.

**కారుగచ్చ.** ద్వ. వి. వాగుజి.

**కారుచిచ్చు.** ద్వ. వి. ఎరగలి, దావానలము.

**కారుచే.** దే. ప్రే. కాఁడించు. (రూ. కార్చు. "చ. కవవటు డించియేగునుకఁగా సురెఁ గొంకులఁగార్చి." ఆము. ౬, ఆ.)

**కారుజెనము.** ద్వ. వి. శణపుష్పిక.

**కారుణికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కనికరముగలవాఁడు, కృపాళువు.

**కారుణ్యము.** సం. వి. అ. న. దయ, కనికరము.

**కారునూవు.** దే. వి. జర్తిలము.

**కారుపెసర.** దే. వి. ముద్గపర్ణి.

**కారుపోఁక.** ద్వ. వి. శైలపూగము.

**కారుపోతు.** దే. వి. అడవిదున్న, కాసరము.

**కారుబుడమ.** దే. వి. తీవ్రగంధము.

**కారుమినుము.** దే. వి. మాషపర్ణి.

**కారుమునగ.** ద్వ. వి. వనశిగ్రువు.

**తారువు.** సం. వి. ఉ. పుం. విశ్వకర్మ. విశే. 1. శిల్పి; 2. చేయువాఁడు.

**కారూరు.** దే. వి. (కారు+ఊరు.) అడవిపల్లె. "వ. పల్లియలు వైచికోడెలంబట్టి పెనఁచికారూళ్లజట్టికాఱులకు వసంబుచేయుబరవసంబెసంగఁగ్రుమ్మరువారును." హరి. పూ. ౫, ఆ.

**కారె.** వై. వి. [illegible]. "[illegible]." ఆం, భా. ద్వి. వ.

**కారెము.** దే. వి. మళ్లకు నీళ్లెత్తెడు తాటిదోనె.

**కారేలకి.** ద్వ. వి. (కారు+ఏలకి.) ఏలాపర్ణి.

**కారోత్తమము.** సం. వి. అ. పుం. కల్లుతేట.

**కార్కరకము.** సం. వి. అ. పుం. పాలసముద్రము.

**కార్కశ్యము.** సం. వి. అ. న. కఱకుఁదనము.

**కార్కొను.** దే. అ. క్రి. 1. నల్లఁబాఱు; (కారుకొనుయొక్క రూపాంతరము.) 2. సందడించు. "కార్కొన్నకోర్కుల్." య. ౫, ఆ. (కాఱుకొనుయొక్క రూపాంతరము.)

**కార్చిచ్చు.** దే. వి. కారుచిచ్చుయొక్క రూపాంతరము.

**కార్చు.** దే. ప్రే. 1. కారుచుయొక్క రూపాంతరము. (చూ. కారుచు.) 2. కాఱుచుయొక్క రూపాంతరము. (చూ. గలఁతియు.)

**కార్జము.** వై. వి. కారిజముయొక్క రూపాంతరము.

**కార్తస్వరము.** సం. వి. అ. న. స్వర్ణము, బంగారు. (చూ. కనకము.)

**కార్తాంతికుఁడు.** సం. వి. అ. పుం. జ్యోస్యుఁడు.

**కార్తికము.** సం. వి. అ. పుం. ఒకానొక నెల.

**కార్తికికము.** సం. వి. అ. పుం. కార్తికము.

**కార్తికేయుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి, కందుఁడు.

**కార్తె.** వై. వి. 1. కృత్తికానక్షత్రము; "కార్తెఁబాయనమబ్జగర్భుని తారమాషములు." భార. అను. ౨, ఆ.—2. సూర్యుఁడుండు నక్షత్రము*. (చిత్తకార్తె, స్వాతికార్తె మొ.)

**కార్పటికుఁడు.** సం. వి. అ. పుం. 1. కోమటి; "ద్విత్రీణ్యహానిసంభ్రామ్యనకార్పటికసత్తమః." కాశీ. 30. అధ్యా.—2. తీర్థముమోసికొనిపోయెడు బాటసారి.

**కార్పణ్యము.** సం. వి. అ. న. కృపణత్వము.

**కార్పాసము.** సం. వి. అ. పుం. న. ప్రత్తి. విశ. (అ. ఈ. అ.) నూలిచేత నేయఁబడినది. (చీర.)

**కార్పాసి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రత్తిచెట్టు.

**కార్మణము.** సం. వి. అ. న. మూలికచేతఁజేసెడి యుచ్చాటనాది క్రియ, చిల్లింగి. విశ. నెఱవేఱుదాఁకఁ బనిచేయునది.

**కార్ముఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) కర్మశీలుఁడు.

**కార్ముకము.** సం. వి. అ. న. విల్లు. పుం. వెదురు*. విశ. పనియందు నేర్పరి.

**కార్యదర్శి.** సం. విశ. (న్. ఈ. న్.) పని నిర్వహించువాఁడు.

**కార్యము.** సం. వి. అ. న. 1. పని; 2. హేతువు.

**కార్షాపణము.** సం. వి. అ. పుం, న. 1. పదియాఱుపణముల యెత్తు; 2. కర్షమెత్తు వెండిటంకము.

**కార్షికము.** సం. వి. అ. పుం. కర్షమెత్తు వెండిటంకము.

**కార్షుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) దున్నుకొని బ్రదుకువాఁడు, కాఁపువాఁడు.

**కార్ష్యము.** సం. వి. అ. పుం. మద్ది*.

**కాఱియ.** వై. వి. యాతన. "క. వేఱొకవిలుగొనివిమతుఁడు, తూఱఁగహరిమేననాటెఁదొమ్మిదియమ్ముల్, మాఱెనుబదింటఁబొది వెళ్, గాఱియగా మఱియుఁబఱపెగమిగొనఁదూపుల్." హరి. ఉ. ౧, ఆ.

**కాఱియపడు.** వై. అ. క్రి. యాతనపడు. "క. మనుజావరింపక మనుజాం, గనమనుజాశనువరించికాఱియపడునే." రా. సుం, కాం.

**కాఱియపెట్టు.** వ్య. స. క్రి. యాతనపఱచు. "క. పాపేసనాతని వెనుకను, పాఱతినంప్రార్థనాప్రభాషణములతోఁ, దేవిమఱలియ ష్మునిమిముఁ. గాపయిపెట్టితిఁగచేయకటయనుచుదయన్." భార. అను. ౫, ఆ.

**కాఱు.** దే. అ. క్రి. 1. స్రవించు; 2. రాలు. "ఉ. కోఱలు దీటుచున్ నయనకోణములన్ దహనస్ఫులింగముల్, కాఱఁగ." హరి. పూ. ౪, ఆ.—వి. 1. అజ్ఞానము; "క. వేఱుగఁగనినంబ్రకృతికిఁ, జూఱవిడిచినట్లతనదుసుజ్ఞానమున, క్కాఱువిడిచితనకం టెను, మీఱనొకటిలేమిగాన్పుమెయికొనవలయున్." భార. అను. ౪, ఆ.—2. కట్టు; 3. నీఱుకాఱు; (చూ. ఊఁదుఁగ్రోవి.) 4. బ. అనృతవచనము; "గీ. ఇవముసూడు కొలపుశేలికల్ ముస్నెందుఁ, గాఱులాడిరనినకతయెఱుంగము." అచ్చె. అ, కాం.—5. పరుషవచనము; "క. తడవులఁబట్టియునాతో, విదువక వర్తించుఁగానుపీనములీలేఁ, దెడయకయితఁడిట్లుండఁగఁ, గడునుడికి మదంబకొన్నికాఱులుపలికెన్." పర. 3, ఆ.—6. వ్యర్థవచనము. "ఉ. ఆఱడిపోకయున్ ఫలములందుటయుం గనిపల్కనేరమిన్, మాఱటనోరిభాసనయి మాటలుచిత్తమునందునిల్పకేఁ, గాఱులు ప్రేలెదన్." భార. ఉద్యో. 3, ఆ.—విశ. సాంద్రము. "క. కాఱడవిఁబఱచుమృగముల, నూఱడకయతిగిచి." భార. ఆది. ౪, ఆ.

**కాఱుకొను.** దే. అ. క్రి. సందడించు. (చూ. కార్కొను.)

**కాఱుచు.** దే. ప్రే. కాఱఁజేయు.

**కాఱ్ఱోడ్డెము.** దే. వి. పరుషోక్తి. "సీ. కఱకుకరునుకాఱుకొఱోడ్డెము పరుసుపరుసనయనఁగనిష్ఠురమువెలయు." ఆం, భా. ప్ర. వాగ్వి.

**కాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టు*; 2. నల్ల జిలకఱ్ఱ; 3. నల్ల తెగడ*; 4. నీలి*; 5. మంజిడి*. అ. పుం. ము. 1. సమయము; 2. నలుపు; 3. చావు. విశ. నల్లనిది. (కాలత్రయము—భూతభవిష్యద్వర్తమానములు. కాలపంచకము—ప్రాతస్సంగవమధ్యాహ్నపరాహ్ణసాయంకాలములు.)

**కాలకంఠము.** సం. వి. అ. పుం. 1. ఊరఁబిచ్చుక; 2. కాటుకపిట్ట; 3. కూకురుగుండెంగ; 4. నెమలి; 5. వేఁగిస*.

**కాలకంఠిక.** సం. వి. ఆ. స్త్రీ. అలక్ష్మి, పెద్దమ్మ.

**కాలకంఠుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. యముఁడు.

**కాలకము.** సం. వి. అ. పుం. పుట్టుమచ్చ.

**కాలకూటము.** సం. వి. అ. పుం. విషభేదము.

**కాలఖండము.** సం. వి. అ. న. (చూ.) కారిజేము.

**కాలజ్ఞము.** సం. వి. అ. పుం. 1. కోడి; 2. కోయిల.

**కాలజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. జ్యోస్యుఁడు.

**కాలటుక.** దే. వి. (కాలు+అటుక.) కుండలుంచుటకై రెండు మొనలు ఇరుప్రక్కల గోడలయందుఁబొదిగి యుఁతగాఁ గొట్టునుంచి యడ్డముగా నమర్చిన మ్రాను.

**కాలధర్మము.** సం. వి. అ. పుం. మరణము, చావు.

**కాలపత్రి.** సం. వి. ఈ. స్త్రీ. గచ్చె*.

**కాలపృష్ఠము.** సం. వి. అ. న. 1. కర్ణునివిల్లు; 2. విల్లు. పుం. 1. ఒకదినుసు ఇఱ్ఱి; 2. రాభులుఁగుపక్షి.

**కాలమేషి.** సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చేకీ.

**కాలమేషిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లతెగడకీ; 2. మంజిడికీ.

**కాలరి.** దే. వి. (కాలు+అరి.) 1. పదాతి; "కాలరిపోఁజాలనేలఁ జమిరి." అచ్చ. సుం, కాం.–2. నడచువాఁడిచ్చేడుపన్ను; 3. సమాచారమును దెలిసికొనిపోయిచెప్పువాఁడు, దూత. "వ. మనముకెనగలకాలరులవేగంబుచ్చి శల్యశేకయజరాసంధలనయదృష్టకేతు ప్రభృతులయిన భూపతులకును వారివారిబంధుమిత్రజనంబులకు తెఱిఁగించుటకార్యంబు." సం. "దూతాగచ్ఛంతుశీఘ్రగాః." భార. ఉద్యో. ౧, ఆ.

**కాలరు.** అం. వి. చొక్కామెడపట్టి.

**కాలశాకము.** సం. వి. అ. పుం. కటివేముకీ.

**కాలశేయము.** సం. వి. అ. న. గోరసము, చల్ల.

**కాలసూత్రము.** సం. వి. అ. న. ఇనుపతంతులుగల నరకవిశేషము.

**కాలస్కంధము.** సం. వి. అ. పుం. 1. చీఁకటిమ్రాను; 2. తుమ్మికకీ; 3. వేఁగిసకీ.

**కాలస్థాలి.** సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టుకీ.

**కాలానుసార్యము.** సం. వి. అ. న. 1. ఇరుగుడుకీ; 2. నల్ల అగలుకీ; 3. జాతిపువ్వుకీ.

**కాలాయసము.** సం. వి. అ. న. అయస్సు, ఇనుము.

**కాలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. పార్వతీభేదము; 3. ద్రౌపది; 4. బొగ్గు; 5. నలుపు; 6. చీఁకటి; 7. ఆఁడుకాకి; 8. నూఁగారు; 9. పొగమంచు; 10. బంగారునందలి దోషము; 11. మద్యము; 12. క్రొత్తమబ్బు; 13. మబ్బుగుంపు; 14. వైవర్ణ్యము; 15. నెలవడ్డి; 16. జటామాంసికీ; 17. తేలుకొండికీ; 18. పొట్లకీ.

**కాలిత్రోవ.** దే. వి. (కాలు+త్రోవ.) ఒకఁడు నడచిపోఁదగిన మార్గము, ఏకపది.

**కాలినడ.** దే. వి. (కాలు+నడ.) పాదచారము.

**కాలిపుట్టువు.** దే. వి. (కాలు+పుట్టువు.) శూద్రుఁడు.

**కాలిబంటు.** ద్వి. వి. (కాలు+బంటు.) పదాతి.

**కాలిబోను.** దే. వి. (కాలు+బోను.) మృగములకాళ్లుతగులుకొననొడ్డియుండెడియురితో నంతనపఱచిన మ్రాను. "వ. బినయొడ్డి నంఘటించినకాలిబోనులంబడి." సావి. ౪, ఆ.

**కాలియ.** వై. వి. పిశాచము*. "ఉ. కాలియపట్టినట్లుకడుఁగంది కృశుండయిపీడివెంద్రుకల్, తూలఁగలాంఛనధ్వజముతోలఁగుడంబుదగఁ ధరించిప్రే, తాలయమెల్లఁగ్రుమ్మరుచు నాయతులన్నియుఁగొంచురాజాపెఁ, మాలతనంబునొందెఁ గొఅమాలినదైవము చెయ్దునక్కటా." మార్క. ౧, ఆ.

**కాలీచి.** సం. వి. ఈ. స్త్రీ. న్యాయవిచారణస్థలము.

**కాలీయము.** సం. వి. అ. న. నల్ల అగలుకీ. విణ. కాలసంబంధి.

**కాలు.** దే. అ. క్రి. దగ్ధమగు. వి. 1. పాదము; 2. పాతిక; 3. మంచపుఁగోడుతోనగునది. "కంగటికాలునమ్మఁదగుకైదువు." జై. ౫, ఆ.

**కాలుఁడు.** సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. శనైశ్చరుఁడు; 3. శివుఁడు.

**కాలుకొను.** దే. స. క్రి. కాలూఁదు. (ప్రే. కాలుకొలుపు. చూ. కాల్కొను.)

**కాలుచు.** దే. ప్రే. కాలఁజేయు, దహించు. (రూ. కాల్చు.)

**కాలుదివియ.** ద్వి. వి. కాగడా.

**కాలుద్రవ్వు.** దే. అ. క్రి. (కాలు+త్రవ్వు.) కారణములేకయు యుద్ధమునకు యత్నించు. (చూ. కాల్ద్రవ్వు.)

**కాలుద్రొక్కు.** దే. అ. క్రి. (కాలు+త్రొక్కు.) కదియు.

**కాలుబలము.** మి. వి. పదాతిసేన.

**కాలుమడి.** దే. వి. మూత్రము. (చూ. కాల్మడి.)

**కాలుమడుచు.** దే. అ. క్రి. మూత్రవిసర్జనముచేయు.

**కాలుమానిసి.** ద్వి. వి. పదాతి. "మ్రొగ్గునేనుంగుఁబడుకాలుమానిసియును." భార. ద్రో. 3, ఆ.

**కాలువ.** దే. వి. 1. నీళ్లుపాఱుటకుఁద్రవ్వినమార్గము, కుల్య. "గీ. లోనిజాతొట్టి నిండికాలువఁగఁజాగి." ఆము. ౬, ఆ.– 2. పరంపర. "అలిగియర్జునుఁడు వాలంప కాలువలోలి నడరించుటయు." భార. భీష్మ. 3, ఆ.

**కాలుష్యము.** సం. వి. అ. న. కలఁక.

**కాలేయకము.** సం. వి. అ. న గంధకాష్ఠవిశేషము. పుం. మ్రానిపసుపు.

**కాలేయము.** సం. వి. అ. న. (చూ.) కారిజేము.

**కాలేయులు.** సం. వి. అ. పుం. బ. కాలకేయులనెడు రాక్షసులు.

**కాల్కొను.** దే. స. క్రి. కాలుకొనుయొక్కరూపాంతరము. "క. జనపతిపంచినదూతను, జననాథునిపంపుగాకసత్కారముగ్గ, కొనఁగ భుజింపఁగనిటఁగా, ల్కొనినిలువఁగనుచితమానెకుమతీనాకుఁ." రా. కిష్కిం, కాం.

**కాల్ద్రవ్వు.** దే. అ. క్రి. కాలుద్రవ్వుయొక్కరూపాంతరము. "క. ముట్టినపగఱపొంపునడచుటయొప్పుఁ, వినుకయ్యమునకుఁగాల్ద్ర, వ్వినఁబాటిలుదురితమెట్టివిభునకునైనఁ." భార. శాం. 3, ఆ.

**కాల్నడ.** దే. వి. కాలినడయొక్కరూపాంతరము. "సీ. ఏమెూనుండనీవిట్లొంటిఁగాల్నడ నేగుచున్కికిఁగతమెద్దియొక్కొ." భార. భీష్మ. ౧, ఆ.

**కాల్మడి.** దే. వి. కాలుమడియొక్కరూపాంతరము. "సీ. చనిచని యోరగచ్ఛగఁజేసినిలుచుండికాల్మడివిడుచుఁదక్కకచెలంగి." భల్లా. 3, ఆ. "మడువులుపసులకాల్మడిఁబ్రచ్చె." హరి. పూ. ౫, ఆ.

**కాల్మడుచు.** దే. అ. క్రి. కాలుమడుచుయొక్కరూపాంతరము.

**కాల్యకము.** సం. వి. అ. పుం. కచోరముకీ.

**కాల్యము.** సం. వి. అ. న. వేకువ. పుం. కచోరముకీ. విణ. కాలమునందు యోగ్యమయినది.

**కాల్వ.** దే. వి. కాలువయొక్కరూపాంతరము.

**కాల్వురు.** దే. వి. బ. పదాతి.

**కావచికము.** సం. వి. అ. న. కవచము దొడిగినవారి సమూహము.

**కావటి.** సం. వి. ఈ. స్త్రీ. కావడి.

**కావడి.** వై. వి. నీళ్లుమొదలైనవిమోసికొనివచ్చుటకై రెండుకొనల యందును ఉట్లమర్చిన వెదురు బ్రద్ద.

**కావడించు.** వై. స. క్రి. కావడియందెత్తు. "వ. సంజాదులు చేవడింబ్రావడించక కావడించిప్రొద్దస్తమించునంతకునిజనిశాంతంబునకుంబఱతెంచునప్పుడు." పాండు. 3, ఆ.

**కావరము.** దే. వి. క్రొవ్వు, మదము.

**కావరించు.** దే. అ. క్రి. క్రొవ్వు, మదించు.

**కావరుఁడు.** దే. విణ. దుర్మదుఁడు. "ఈకావరుఁగష్టచిత్తునధికంబుగనమ్ముదునీవు." భార. అర. ౬, ఆ.

**కావలము.** దే. వి. పాపము. "ఎ, గీ. దేవపూజలఁబోలివోని కావలంబు, బ్రాహ్మణోపాస్తిఁబోలివోనిపాపచయము, సచ్యుతానంతగోవిందహరిమురారి, యనితలంచినయప్పుడయడఁగిపోవు." వి, పు. 3, ఆ.

**కావలయు.** దే. అ. క్రి. (కాఁగా+వలయు.) 1. అగుట యావశ్యమగు; (ఆ పని యిప్పుడకావలయును.) 2. అపేక్ష్యమగు; (1. నాకాసొమ్ము కావలయును. 2. ఆ యిల్లు కట్టుటకింక నూఱు రూపాయలు కావలయును.) 3. అగు. (వాఁడు నీకేమికావలయును.) (ఇక్కడ ఏమియనఁగా ఏవిధమైన బంధువు అని యర్థము.) (రూ. కావలెను.)

**కావలి.** దే. వి. రక్షణము. "క. వెలినుండుఁడిచ్చటికేఁగా, వలినేనుండంగఁ జొచ్చువారుంగలరే." ఉ, హరి. ౨, ఆ.

**కావలికాఁడు.** దే. విణ. రక్షకుఁడు.

**కావలిబొట్టు.** దవ్. వి. బిడ్డలకు రక్షగానుంచెడు నల్లని తిలకము. (చూ. కావిరిబొట్టు.)

**కావా.** దే. వి. అశ్వమండలగతి. "క. ఆవనముఁలఁగీరావలి, యావలితగతిఁ భ్రమించు నందంబలరెఁ, గావాతిరిగెడుమారుని, మావులునానపుడునికటమండలగతులఁ." భద్రా. ౪, ఆ.

**కావారి.** సం. వి. ఈ. స్త్రీ. మొగలాకులోనగువానితో నేర్పఱపఁబడిన గొడుగు.

**కావి.** దే. వి. ఎఱుపు. బ. కాషాయవస్త్రము.

**కావించు.** దే. ప్రే. కాఁజేయు.

**కావిగొను.** దే. అ. క్రి. (కావి+కొను.) ఎఱ్ఱనగు. "కన్నుఁగవ ధవళరుచుల్కావిగొన." స్వా. ౨, ఆ.

**కావితాలుపు.** దే. వి. సన్న్యాసి, కాషాయధారి.

**కావిరి.** దే. వి. నలుపు. "ఉ. నావుడురోషవహ్నివలనంబొగరేఁగినభంగిమోమునం, గావిరిపర్వ." ఉ, హరి. ౫, ఆ. "ద్వి. కావిరిచీఁకటుల్గవిసెలోకముల." విష్ణు. పూ. 3, ఆ.

**కావిరిబొట్టు.** దవ్. వి. కావలిబొట్టు. "సీ. ఫాలభాగంబుపైఁబరఁగుకావిరిబొట్టుకామునిగెల్చినకన్నుగాఁగ." (పాఠాంతరము కావలిబొట్టు.) భాగ. ౧౦, స్క౦. పూ.

**కావితాయి.** దే. వి. ఎఱ్ఱని సుద్దతాయి.

**కావు.** దే. వి. 1. అఱచుటయేడ్చుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "సీ. కావుకావనుటరక్కసులమూఁకనెకాని ననిచెనీయెడసింహనాదవిహృతి." పాండు. ౧, ఆ.–2. పాఁతఱలోనగువానిపైకప్పు; (కావుపాఁతఱ.) "వ. ఎనరుగాఁదేటలగులేడినల్లటు గ్రుమ్మరించి లవణకణసంచయంబునించి లావుగాఁగావుఁగప్పి." స్వా. ౪, ఆ.–3. కావలిబొట్టు. "సీ. కనుదోయిఁదిన్నఁగాఁగాటుకతీరిచి నుదుటపైనునుఁగావు కుదురుకొల్పి." చంద్రా. ౨, ఆ.

**కావుట.** దే. వి. అగుట. "ఇది సిద్ధముకావ్రవెపెంగి." భార. ఆది. ౧, ఆ.

**కావుత.** దే. ద్ర. (చూ.) కాత.

**కావున.** దే. ద్ర. హేతువును దెలుపునది.

**కావేరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక యేఱు; 2. పసుపు; 3. వెలయాలు.

**కావేషము.** గ్రా. వి. ద్వేషము, పగ.

**కావ్యము.** సం. వి. అ. పుం. కబ్బము. (పంచకావ్యములు.— రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, మాఘము, భారవి.)

**కావ్యుఁడు.** సం. వి. అ. పుం. శుక్రుఁడు.

**కాశము.** సం. వి. అ. పుం, స. తెల్లు. పుం. ఒకానొకదేశము.

**కాశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకపట్టణము; 2. శ్రమము. "అపశ్యత్క-పిసైన్యంతత్ జితకాశ్యగ్రతఃస్థితమ్." ఇత్యాది. భార. అర.

**కాశ్మరి.** సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడుచెట్టు.

**కాశ్మర్యము.** సం. వి. అ. పుం.——పై.——

**కాశ్మీరజన్మము.** సం. వి. న్. న. కుంకుమపువ్వు.

**కాశ్మీరము.** సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు; 2. మెట్టతామర దుంప. పుం. ఒకానొకదేశము.

**కాశ్యపి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి. ఇ. పుం. అనూరుఁడు.

**కాషాయము.** సం. వి. అ. పుం. కావిచీర.

**కాష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పదునెనిమిది ఱెప్పపాట్లకాలము; 2. దిక్కు; 3. మేర; 4. మ్రానిపసుపు. 5. అతిశయము. అ. న. ము. కఱ్ఱ.

**కాష్ఠతక్షుఁడు.** సం. వి. క్ష్. పుం. వడ్లవాఁడు.

**కాష్ఠపాటలి.** సం. వి. ఇ. స్త్రీ. తెల్లకలిగొట్టుచెట్టు.

**కాష్ఠీల.** సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటిచెట్టు.

**కాస.** వై. వి. కాసె. "చల్లాడంబులమీఁదటఁ బిగువుకాసల్కట్టి." అని. ౪, ఆ. (ఇది తఱచుగా ఎదంతముగానే వాడఁబడుచున్నది.)

**కాసమర్దము.** సం. వి. అ. పుం. కసిందచెట్టు.

**కాసము.** సం. వి. అ. పుం. క్షవథువు, దగ్గు.

**కాసర.** వై. వి. ఒకానొకచెట్టు.

**కాసరము.** సం. వి. అ. పుం. మహిషము, ఎనుపోతు.

**కాసరవడ్లు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము.

**కాసా.** దే. వి. దాసీపుత్రుఁడు.

**కాసారము.** సం. వి. అ. పుం. సరస్సు, కొలను.

**కాసించు.** వై. స. క్రి. కాసెగాఁగట్టు. "ద్వి. కడుపైలవెలికగా సించి." హరిశ్చ. ౨, భా.

**కాసియ.** వై. వి. కాసె. "కట్టైబిగియందనకాసియ." రామా. ౬, ఆ.

**కాసీఁడు.** దే. వి. (కాసె+ఈఁడు.) ఱాతిపనివాఁడు, శిలాకుట్టకుఁడు. "ఎ, గీ. ఒక్కనాఁడుకాసీలకిట్లనునయముమీఱ." పద. ౫, ఆ.

కాసీసము. సం. వి. అ. న. మయిలుతుత్తము.

కాసు. వై. వి. 1. ద్యూతములో పాలవభాగము*; ద్యూతములో పది యవభాగము. (అరికాలబిలు.) 2. ధనము*. "సీ. చెల్లియాత్రలు సేయంగఁదివిసెవచ్చి, సానివారింద్లకరుగంగ సమయమగునె, యం తయునుగాకకాంచనాస్త్రదపరలు, కాంతలకునియ్యమాచేతఁగాసు లేదు." భల్లా. ౫, ఆ.

కాసె. యు. దే. వి. జాయిలోలుమపని. వై. దట్టి. (కాసియయొ క్క రూపాంతరము.) "మ. జగిమైరెాఁపునుదమ్మిమైమలుఁగుడా చేఁగల్వచేశక్తియుఁగా, సిగపూమొగ్గల తాయెతుల్ బిగువుకాసంజె క్కనంజాలఁబో, భృగుసుస్వేదఁగెతేకువంకియునుజాయల్ మీఁట గాఁబూవుదీఁ, గెగుబెందావలరాచయొంటరికడుంగేరించుచుంఱిమ్మి వణ." యు. ౫, ఆ.

కాసెనిల్కడ. ద్వ. వి. మల్లబంధవిశేషము. "సీ. కాసనిల్కడ గళకత్తెంజోడింపు సరసింగమునరిబిత్తరముకేర్లి." అం, భా. ద్వి. ఉ.

కాసెయులి. దే. వి. (కాసె+ఉలి.) జాయితొలిచెడి ఉలి, టంకము.

కాసెపోయు. దే. అ. క్రి. (కాసె+పోయు.) (వస్త్రమును) గోఁచివలె వెనుకచెక్కు.

కాహళ. సం. వి. ఆ. స్త్రీ. 1. వాద్యవిశేషము; 2. ఒకానొక అప్సరస్త్రీ. అ. పుం. ము. 1. కోడి; 2. సద్దు. విణ. 1. అన వ్యయము; (మాట,) 2. ఎండినది; 3. చెడ్డది; 4. పెల్లయినది. (తెనుఁగుకావ్యములందు వాద్యమను నర్థమందును తఱుచుగ ఇది పుంలింగముగాఁ గానఁబడుచున్నది. "సీ. పణవమర్దళశంఖపటహ కాహళవేణుభేరీధ్వనులమిన్నుపిక్కటిలఁగ." భాగ. ౧౦, స్కం. పూ. మొ.)

కాహళి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాద్యవిశేషము; 2. యౌవనస్త్రీ.

కాహళిక. సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము.

కాహళికుఁడు. సం. వి. అ. పుం. కాహళియూఁదువాఁడు. "క. త్రికభృఙలకుఁజెతుమ్మ కృలకుఁ, బ్రకటంబుగనెందునీవరాజివనుచుఁ గౌ, తుకమునఁగాహళికునిపోఁ, లికఁదాఁదద్బిరుదకాహళిక పూరిం చెఁ." పర. ౫, ఆ.

కాళంజి. వై. వి. తమ్మపడిగము, పతద్గ్రహము. "సీ. తమ్మిక్రొవ్విరి గిండికొమ్మయొక్కతె తాల్పఁగలువకాళంజియొకర్తుశేర." చంద్ర.

కాళయుక్తి. సం. వి. ఇ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవ త్సరము.)

కాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. పార్వతీభేదము; 3. బొగ్గు.

కాళింగము. సం. వి. అ. పుం. 1. పినుఁగు; 2. నేలగుమ్మడికాయ. డు. ఒకానొకపాము.

కాళింగి. సం. వి. ఈ. స్త్రీ. పుచ్చకాయ.

కాళింది. సం. వి. ఈ. స్త్రీ, ఒకానొకయేఱు, యమున.

కాళిందీభేదనుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

కాళిక. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) కాలిక.

కాళియ. వై. వి. వాద్యవిశేషము, కాహళిక. "మత్త. హరోఁ, గాళియల్ బహువస్త్రభూషణ గంధముల్ హరిశర్పణం, బోలిఁజేసిన వారు..." రుక్మాం. ౨, ఆ.

కాళియుఁడు. సం. వి. అ. పుం. సర్పవిశేషము.

కాళె. వై. వి. కాళేయయొక్క రూపాంతరము.

## కి.

కి. దే. అవ. షష్ఠీవిభక్తియందువచ్చెడు ప్రత్యయము. (హరికి, గిరికి, శ్రీకి, ప్రీకి మొ.)

కిసె. దే. వి. 1. కోపము. "ఉ. పంకజనాభమాపడినపాటులు రాజ్యముకోలుపోకయుఁగా, గింకకుమూలమై." భార. ద్రో. 3, ఆ. (కినుకయొక్క రూపాంతరము.)—2. పసులను మేఁకలను చం పెడు వ్యాధివిశేషము.

కింకరుఁడు. సం. వి. అ. పుం. పరిచారకుఁడు.

కింకిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గజ్జె; 2. చిఱుగంట.

కింకిరాతము. సం. వి. అ. పుం. 1. కోయిల; 2. చిలుక; 3. వన్నెచెట్టు. (రూ. కింకిరాటము.)

కింకిరాతుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. (రూ. కింకి రాటుఁడు.)

కింకిరి. దే. వి. 1. కోపము; "మిముదుర్వాస్యపారులంజూచి కొంకక మాకింకిరికిం జెలంగిన." ఉ, హరి. ౪, ఆ.—2. రోఁత. (చూ. కింకిరిపడు.)

కింకిరిపడు. ద్వ. అ. క్రి. 1. కోపగిల్లు; "క. అతఁడెంతరేఁగి తిట్టిన, మతిఁగింకిరిపడకయపుడుమాటాడకయా, నతయుగుచువవ్వ తివ్రత, యతనినతిశ్రేష్ఠుఁగాఁగనాత్మఁదలఁచుచుఁగా." మార్క. ౨, ఆ.—2. రోఁతపడు. "ద్వి. అడరుదుర్గంధంబుకడుమాత్రమైనఁ, గింకిరిపడక." హరిశ్చ. ౨, భా.

కింకిరిపాటు. ద్వ. వి. 1. కోపపడుట; "చ. మనమునవోకిలించి మఱు మాటకుఁగింకిరిపాటుతోఁడుగా, మునిపతియల్లనవ్వ." ఉ, హరి. 3, ఆ.—2. రోఁతపడుట. (చూ. కింకిరిపడు.)

కింగిరి. దే. విణ. అల్పము.

కించిత్తు. సం. అవ్య. ఇంచుక.

కించులికము. సం. వి. అ. పుం. మహీలత, ఎఱ్ఱ.

కించులుకము. సం. వి. అ. పుం. మీఁదిగాలి.

కించే. వై. విణ. అల్పుఁడు. "వ. మీరలాజ్ఞాభంగంబుగావించు నక్కించునొక్కించుకంతయువిచారింపకపట్టుకొనిపోయి మత్పురో హితులముందఱంబెట్టిరండు." జై. ౪, ఆ.

కింజల్కము. సం. వి. అ. పుం. కేసరము, అకరువు.

కింజాఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిరర్థక జన్మముకలవాఁడు.

కింపచానుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) లోభి, పిసినిగొట్టు.

కింపాకము. సం. వి. అ. పుం. కాంజీరముచెట్టు. విణ. మూఢుఁడు.

కింపురుషము. సం. వి. అ. పుం. భారతాదివర్షములలో నొకటి. (చూ. వర్షము.)

కింపురుషుఁడు. సం. వి. అ. పుం. అశ్వముఖమును నరశరీర మునుగల దేవయోనివిశేషము.

కింవదంతి. సం. వి. ఈ. స్త్రీ. జనులాడుకొనుమాట, నానుడి.

కింశారువు. సం. వి. ఉ. పుం. 1. బాణము; 2. వరిముల్లు; 3. రావులుఁగు.

**కింశుక.** సం. వి. ఆ. స్త్రీ. మానేరు†. అ. పుం. ము. మోదుగు†. (దీనిమొగ్గ అంగారితము.)

**కింస్తుఘ్నము.** సం. వి. అ. పుం. బవాదికరణములలో నొకటి. (చూ. కరణము.)

**కికకిక.** దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. "చ. లుకలుక మస్తకంబు చెవులుంగ్రమితొల్వఁగఁబుట్టెఁడాఁకటన్, నకనకనేను శోలిభవనంబులవెంటనునెవ్వరెవ్వరేఁ, గికకికనవ్వరిస్సనుచుఁ గేళ్ల నుఱువ్వఁగమోరతీపుతోఁ, జకచకపాఱుతెంచునృపసత్తమయేమని విన్నవించెదన్." భల్లా. ౨, ఆ.

**కికాకిక.** దే. వి. కికకికయొక్కరూపాంతరము. "మిగులరొదగాఁ గికాకికనగుచు." కళా. ౧, ఆ.

**కికి.** సం. వి. న్. పుం. చాషము, పాలపిట్ట.

**కికీదివి.** సం. వి. ఇ. పుం.——పై.——

**కికురించు.** దే. స. క్రి. వంచించు. "సీ. కికురించిరిచ్చిపుచ్చి కొనుచోటులవారలాఁకకులోనుగాకప్పద్రోచి." సాన. 3, ఆ.

**కికురింత.** దే. వి. మోసము, వంచన.

**కికురు.** దే. వి.——పై.——

**కికురువెట్టు.** దే. స. క్రి. (కికురు+పెట్టు.) వంచించు. "గీ. దశరథకుమారనీవిదుతప్పుటడుగు, లుల్లముననమ్మఁగాఁజాలమొండు రెండు, తప్పుటడుగులమునుజగత్త్రయముఁగొంటి, బలిఁగికురువెట్టి యనిబుధుల్పలికిరపుడు." రామా. 3, ఆ.

**కికురువోడుచు.** దే. స. క్రి. (కికురు+పోడుచు.) వంచించు. "క. పోరుదురుకికురువోడుచుచుఁ, దూఱుదురుభయంబులేక తోరపుటిరవుల్, జాఱుదురుఘనశిలాతటి, మీఱుదురెన్నంగరాని మెలఁకువలన్నృపా." భాగ. ౧౦, స్కం. పూ.

**కిక్కస.** దే. వి. క్రోవివంటి తృణవిశేషము, నలము.

**కిక్కురించు.** దే. స. క్రి. కికురించుయొక్కరూపాంతరము. "గీ. చేతికొండయొకనిచేనిచ్చితలనున్న, కొండదొంతికుదురుకొననమర్చి, మగుడనడుగవాఁడునగచరుల్నగవానిఁ, గిక్కురించిపోయివెక్కిరించు." రా. యు, కాం.

**కిక్కురింత.** దే. వి. కికురింతయొక్కరూపాంతరము.

**కిక్కురు.** దే. వి. కికురుయొక్కరూపాంతరము.

**కిక్కురువెట్టు.** దే. స. క్రి. కికురువెట్టుయొక్కరూపాంతరము. "నన్నిటుల్ కిక్కురువెట్టఁ జూచెదు." రసి. 3, ఆ.

**కిక్కస.** దే. వి. మిక్కిలి కదియిక. "దండకము. భయభ్రాంతుఁడై పాఱనుంకించు నక్కించుఁ గంసుంద్రిలోకీనృశంసున్నియుద్ధ క్రియాపద్ధతిం గిక్కసన్గొంతుక్రోల్నొక్కి." పా. 3, ఆ.

**కిఖి.** సం. వి. ఇ. స్త్రీ. చిన్ననక్క, కొంకనక్క.

**కిగ్గాడి.** వై. విణ. అంబేద. "సీ. తననిడిదికిరంభననుపవైతనితిట్టు కిగ్గాడియ సురకుఁగేలుమొగిచి." ప్రభా. ౧, ఆ. "గీ. పూనికర్ణాత్మజుఁడువృషసేనుఁడాత్త, హయముదాఁటించినట్టివాఁగల్లయదిగో, నాటికదియబ్బురముగానిపీటిలోని, నేటికిగ్గాడిగుజ్జాలుదాఁటుచుండు." కళా. ౮, ఆ.

**కిచకిచ.** దే. వి. పక్షులులోనగువాని కూఁతయందగు ధ్వన్యనుకరణము. (చూ. కిచకొట్టు.)

**కిచకొట్టు.** దే. అ. క్రి. కూయు. "ద్వి. కిచకిచధ్వనులతోఁగిచ కొట్టుకొనుచు." రా. కిష్కిం, కాం.

**కిచ్చడి, కిచిడీ.** దే. వి. నానావస్తువులుచేర్చివండిన చిత్రాన్నవిశేషము. "సీ. సద్యోఘృతంబులుచక్కెరలుక్కెరల్పచ్చళ్లుకిచ్చళ్లు పాయసనులు." ఉ, రా. ౬, ఆ.

**కిటకిట.** దే. వి. వీణెమొదలగువాని బిరడత్రిప్పుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. శ్రుతులువిజ్జోడైనచోఁదంత్రిబిగివిరాఁ బీడించి కిటకిట బిరడత్రిప్ప." వై. ౧, ఆ.

**కిటి.** సం. వి. ఇ. పుం. వరాహము, పంది.

**కిటికి.** దే. వి. గవాక్షము.

**కిటుకు.** దే. వి. 1. కపటము. "చ. కటకటమిమ్మువంటిగుణగణ్యులపుణ్యులఁజెప్పరానిసం, కటములఁబెట్టియిట్టికొఱగాములుచేసితిఁ బెక్కునాకునీ, కిటుకనేమిమేలుకలిగెన్." వి, పు. ౭, ఆ.— 2. మర్మము. "కామినియందిపుడేమిగాంచియీకిటుకుగడించి పల్కెదు." కళా. ౫, ఆ.

**కిట్టము.** సం. వి. అ. న. మలసామాన్యము.

**కిట్టికోల.** దే. వి. ఇఱికించుటకుఁగా నొకతట్టు కొనలఁజేర్చికట్టిచిన్న కోలలతో నేర్పఱుపఁబడిన సాధనము.

**కిట్టిమము.** సం. వి. అ. న. ఉప్పునీళ్లు.

**కిట్టు.** దే. అ. క్రి. స. క్రి. సమీపించు. "భీమాగ్రజుండాజిఁగిట్టినఁ బట్టన్." భార. ద్రో. ౧, ఆ. "గీ. వీరుఁగిమ్మీరుఁడనుసు, రారి నిశ్చలభీకరాకారుఁగిట్టి." భార. ఆర. ౧, ఆ.

**కిణము.** సం. వి. అ. పుం. కఠినవస్తుసంస్పర్శముచే హస్తాదులయందుఁ గాచెడికాయ.

**కిణిహి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను†; తెల్లగినియ†.

**కిణ్వము.** సం. వి. అ. న. 1. పాపము; 2. సురాబీజము.

**కిత.** దే. వి. దేవతార్పణమునకై కళ్లమున నొకదెసఁబోసెడు మూడు దోసిళ్లరాశి.

**కితవము.** సం. వి. అ. పుం. ఉమ్మెత్త†.

**కితవుఁడు.** సం. వి. అ. పుం. జూదరి. విణ. మోసకాఁడు.

**కితాబు.** హిం. వి. బిరుదు.

**కిత్తనార.** దే. వి. చాఁగనార, మోఁటుగుడ్డ.

**కిత్తలి.** దే. వి. నారంగజాతీయము, నాదేయి†.

**కిత్తి.** వై. వి. అగ్ని*. "గీ. అగ్గియనఁగిత్తనంగఁజిచ్చనఁగవెలయుఁ, జేతనాచేతనాగ్ని." ఆం, భా. ప్ర. స్వ.

**కిదుకు.** దే. అ. క్రి. 1. బిడ్డలునిద్రలేచునపుడాలస్యముచే నొకవిధముగామూలుగు. "సీ. మేల్కొన్నతెఱఁగునమెల్లనఁగనువిచ్చి క్రేఁగంటఁజూచుచుఁగిదికిసీల్లి." భాగ. ౧౦, స్కం. పూ.— 2. బిడ్డలుతల్లిదండ్రులులోనగువారినేదేనికావలసివీడించునపుడొకవిధముగామూలుగు. "ద్వి. వత్తునేనునునన్నువదలకతిగిచి, యెత్తుకొమ్మనుచుఁజెల్లెనఁగుదైన్యమునఁ, గిదుకుచు." హరిశ్చ. ౧, భా.

**కినియు.** దే. అ. క్రి. 1. కోపించు; 2. సమీపించు. "గీ. కినిసి పాణినాళీకంబుశౌనుపుటయును, నంతలోఁబడకదియుమోహప్రకటన, మానితన్నిచినయతిమానతుంగ, తరునెనసితొనెగ్రహణగోచరతఁదొఱఁగె." హస. ౨, ఆ.

**కినుక.** దే. వి. అలుక, కోపము.

**కినుకకాఁడు.** దే. విణ. కోపముగలవాఁడు.

**కినుపు.** దే. వి. కోపము. "ఎ, గీ. అనుచుఁగ్రేఁగంటనీరసంబంకురింపఁ, గినుపుకిలికించితమునాత్మఁగీలుకొనఁగ." కాశీ. ౪, ఆ.

**కినువడు.** దృ. అ. క్రి. (కినుపు+పడు.) కోపపడు. (చూ. కిన్వడు.)

**కిన్క.** దే. వి. కినుకయొక్క రూపాంతరము.

**కిన్నర.** సం. వి. ఆ. స్త్రీ. వీణావిశేషము, కిన్నెర.

**కిన్నరుఁడు.** సం. వి. అ. పుం. అశ్వముఖంబును నరశరీరమును గలదేవయోనివిశేషము. "గ. కిమనేనగృహీతేనవాకిన్నరయుగళేన ప్రయోజనమిదముపశ్రుతమశ్వముఖద్వయమ్." కాదంబరి.- నరముఖమునశ్వశరీరమునుగల దేవయోనివిశేషమనికొందఱు. "శ్లో. బింబోష్ఠంబహుమనుతేతురంగవక్త్రశ్చుంబంతంముఖమిహాకిన్నరంప్రియాయాః, శ్లిష్యంతంముహురితరోపిసం నిజస్త్రీముత్తుంగస్తనభరభంగభీరుమధ్యామ్." మాఘము.

**కిన్నరేశుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు, పైఁడిఱేఁడు.

**కిన్నెర.** వై. వి. వీణావిశేషము. "సీ. శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజువసిఁడికిన్నెరవీణెవలుకుఁదోఁడు." వై. ౧, ఆ.

**కిన్వడు.** దృ. అ. క్రి. కినువడుయొక్క రూపాంతరము. "చ. జనపునిఁగన్నఁగిన్వడుదుదుష్కలబంధులఁగాంచినంగఁడుఁ,గనలుదు." హరి. పూ. ౯, ఆ.

**కిఫాయతు.** హిం. వి. లాభము.

**కిముడు.** దే. విణ. అల్పము. "సీ. సైకంబుకొంచెము నన్నంబుతో డెముచిఱుకిముడుసదులేచిఱుతలేఁత, కొద్దియన్నువసంగనుగొఱలు నల్పము." ఆం, భా. కృ. వి.

**కిమ్మతు.** హిం. వి. వెల.

**కిమ్మీరము.** సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము; 2. నారదబ్బ. విణ. చిత్రవర్ణముగలది.

**కిమ్మీరుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకరాక్షసుఁడు.

**కియ్య.** దే. వి. (క్రిందు+య.) ఒక యక్షరముక్రిందియకారము.

**కియ్యవడి.** దే. వి. ఒకయక్షరము క్రిందియత్వము.

**కిరణము.** సం. వి. అ. పుం. మయూఖము, వెలుఁగు.

**కిరము.** సం. వి. అ. పుం. పంది.

**కిరాటుఁడు.** సం. వి. అ. పుం. వైశ్యుఁడు, కోమటి.

**కిరాతతిక్తము.** సం. వి. అ. పుం. నేలవేము.

**కిరాతము.** సం. వి. అ. పుం. 1. అల్పతనువు; 2. నేలవేము.

**కిరాతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కిరాతస్త్రీ; 2. పార్వతి; 3. గంగ; 4. కుంటెనకత్తె.

**కిరాతుఁడు.** సం. వి. అ. పుం. నెమలిపింఛము ధరించి అడవియందు తిరిగెడు బోయ.

**కిరానా.** హిం. వి. చిల్లరదినుసులు.

**కిరాయి.** హిం. వి. బాడుగ, కూలి.

**కిరి.** సం. వి. ఇ. పుం. వరాహము, పంది.

**కిరీటము.** సం. వి. అ. పుం, న. ఒకవిధమైన రాజులతలపాగ, బొమిడికము.

**కిరీటి.** సం. వి. న్. పుం. 1. అర్జునుఁడు; 2. కోడి.

**కిరీటిపచ్చ.** వై. వి. మరకతము. "చ. మొలకమెఱుంగుకెంపుమొనముక్కులసిక్కుకిరీటిపచ్చజా, చిలుకలకోళ్లతోఁజికిలిచెంద్రికవన్నియపట్టుపట్టెతోఁ, దొలఁకుపసిండివ్రాఁతతెరతోనెఱతావులమేలుకట్టుతోఁ, ఱుకవలుఛిందుముత్తియపుఁజప్పరమంచము పైమహాన్నతిఁ." వసు. ౪, ఆ. "క. చెలులు ప్రసంగవశమ్మున, నలకెంగసువిజయభవనమనిసన్ నవలా, తెలియవినన్‌గలయఁగనున్, బలుమఱుబాగాకిరీటిపచ్చలటన్నన్." విజ. 3, ఆ.

**కిరుదెస.** వై. వి. రొండిలోనివాతరోగము. "సీ. గృధ్రసిపేరగుకిరుదెసయనఁగ." ఆం, భా. ద్వి. మ.

**కిరుసు.** దే. వి. ఇరుప్రక్కల వాదరగలిగి వాటమైనకత్తి. "చ. అపగతధైర్యుఁజేసె సను నత్తటి నాశుకవాణివేణిచో, క్కపుఁబసకాముబల్కిరిసుకత్తియుఁబోలెనరాళపార్శ్వమై, యుపరికృతప్రసూనరచనోజ్జ్వలతావిభవంబుచేతదం, తపుఁబిడికైవడిన్ మొదలుతద్దయు నింపుజనింపఁజేయఁగన్." కళా. ౭, ఆ.

**కిర్లి.** దే. వి. మల్లబంధవిశేషము. (చూ. కాసెనిల్కడ.)

**కిఱకిఱ.** దే. వి. రథనేమిధ్వని.

**కిఱు జెప్పు.** దే. వి. కిఱ్ఱుఁజెప్పుయొక్క రూపాంతరము. "చ. గుఱుగుఱ్ఱుంచెడసందిబిట్టాఱలునఘ్రోరారిసేయంఘ్రికిం, గిఱుఁజెప్పైనవిధంబునామనములోఁగీలించినట్లయ్యెడున్." వై. ౫, ఆ.

**కిఱుకు.** దే. వి. త్రిప్పు. "చ. కిఱుకులఁబెట్టిపిరినడకించితొలంగుదమన్నవట్టిక, క్కుచేతియకానిదైవమనకూలముగాదు." వై. ౬, ఆ.

**కిఱుకుపొడుచు.** దే. అ. క్రి. తిరుగు. "వ. ఉఱుములకులికిపడక కిఱుకు పొడుచుచుఁ బింఛంబులు కొంచెంబులుసేయకవిప్పి దెప్పరంబుగఁగొప్పచునర్తనంబులుసేయుమయూరంబులును." భాగ. ౧౦, స్కం. పూ.

**కిఱుదు.** దే. విణ. హీనము. (కిఱుదునేల మొ.)

**కిఱ్ఱు.** దే. వి. ధ్వన్యనుకరణవిశేషము.

**కిఱ్ఱుఁజెప్పు.** దే. వి. (కిఱ్ఱు+చెప్పు.) కిఱ్ఱుమనుచెప్పు. (ఇట్లు కిఱ్ఱుమెట్టు.)

**కిలకిల.** దే. వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. "చ. సకినలకూఁకలంగిలకిలన్నగుమోహనశయ్యనున్నెడన్." వసు. ౬, ఆ.- 2. ధ్వన్యనుకరణవిశేషము. "సీ. పలుకుపల్కనకు నిలగిలపువేఁడిమి రాలఁ గిలకిలల్ గుల్కుచిల్కలకుఁదోఁడు." య. ౫, ఆ.

**కిలకిలలాడు.** దే. అ. క్రి. (కిలకిలలు+ఆడు.) కిలకిలధ్వనిచేయు. "సారెసారెకుఁగిలకిలలాడుచున్ మిగులఁగేకలుకొట్టుదురు." నీలా. ౨, ఆ.

**కిలకొట్టు.** దే. అ. క్రి. మ్రోఁగు, చెలఁగు. "సీ. గిలకొట్టియట్టెచక్కిలిగిలియనిపెట్టి కిలకొట్టినవ్వనవ్వాలయఁజేసి." చంద్రా. ౨, ఆ.

**కిలాతము.** దే. వి. గుజ్జము. "ఉ. విన్ననవేగుతామరలవిందుకిలాతపునీడలెవ్వడున్; వెన్నెలరాచరాలఁగనివెళ్లకనీళ్లమునింగియున్నవి, మ్మన్నులటంచుఁజెంచితలుమాటికి నమ్ములనేసినాటమిన్, మిన్నకసిగ్గునంగదలి మెల్లనఁబోవుదురిండ్లపల్లకున్." య. ౨, ఆ.

**కిలారము.** దే. వి. పసులమంద, ఘోషము.

**కిలారి.** దే. వి. (కిలారము+ఇ.) గొల్లవాఁడు.

**కిలారించు.** దే. అ. క్రి. కిలకిలమని మ్రోఁగు.

**కిలారుచు.** దే. అ. క్రి. 1. కిలకిలమని మ్రోఁగు; 2. బొబ్బరించు. (రూ. కిలార్చు. బొబ్బరించుటకు.)-"ఉ. సింగముగాలివెంబడినచేరికురంగముఁబట్టునట్లుచం, ద్రాంగదుజీవముల్ గొనికిలార్చెదబెట్టుగనిన్నుఁదీర్చెదన్." చంద్రా. ౬, ఆ.

**కిలాసము.** సం. వి. అ. న. సిబ్బెము. విశ. సిబ్బెముగలది.

**కిలాసి.** సం. విశ. (న్. ఈ. న్.) సిబ్బెముగలవాఁడు, సిష్మలుఁడు.

**కిలింజకము.** సం. వి. అ. పుం. కటము, చాప.

**కిలికించితము.** సం. వి. అ. న. రోషాశ్రుహర్షభీత్యాదులసంకర రూపమగు స్త్రీయొక్క శృంగారచేష్టావిశేషము.

**కిల్బిషము.** సం. వి. అ. న. 1. పాపము; 2. తప్పు; 3. రోగము; 4. చెడ్డవిషము.

**కిల్లాకు.** దన్. వి. (కిల్ల+ఆకు.) చీటి. "గీ. ఇదియునూరకయంటిఁ గాకేలనీకు, మాకవిల్విసబంటుకిల్లాకుపోవఁ, దొత్తుకొడుకులువాలెఁదోడ్తోదిగంత, భూమిపతులంపుచున్నారుకామితములు." నళా. 2, ఆ.

**కివకివ.** దే. వి. ధ్వన్యనుకరణవిశేషము. "సీ. చెవిగూఁటనెలకొన్న కవపిట్టకివకివల్మొనసి నాద్రబ్రహ్మమినుమడింప." చంద్రా. 3, ఆ.

**కివ్వ.** దే. అ. క్రి. మడియు.

**కిశోరము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుపిల్ల; 2. తైలపర్ణి.

**కిశోరుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు. విశ. యౌవనావస్థ కలవాఁడు.

**కిష్కువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. 1. జేన; 2. ముంజేయి; 3. మూర.

**కిసమస.** దే. వి. వ్యథ. "క. గుసగుసలువోయివలపుల, కిసమస లనితెలిసిరసికకిసలయపాణుల్, బిసకిసల కుసుమరసములు, వెస మసలకతెచ్చిశిశిరవిధిలాలసలై." విజ. 3, ఆ.

**కిసరు.** దే. వి. 1. అంటుసోఁకుటవలన పసిబిడ్డలకుఁగలిగెడుదోషము; 2. కోపవికారము. "క. ఒకఁగిరగస్త్వార్య స్యముులం, గొనరి జనుల్ వార్ధినీ రుక్రోలితివిరిణ్, సనికైమాకిష్మనిక, న్కిసరుడు గంగావనవ్వగించెడుకరణిణ్." ఆము. ర, ఆ.

**కిసలము.** సం. వి. అ. న. కిసలయముయొక్క రూపాంతరము.

**కిసలయము.** సం. వి. అ. న. పల్లవము, చిగురు.

**కిసుమిసు.** దే. వి. లఘుద్రాక్ష.

**కిస్తీ.** హిం. వి. వంతుచొప్పున చెల్లించు ద్రవ్యము, వాయిదా.

**కిస్తీబందీ.** హిం. వి. వాయిదాల యేర్పాటు.

**కిస్తుపండుగ.** ఆం. వి. క్రీస్తుజన్మదినోత్సవము.

## కీ.

**కీఁచు.** దే. వి. ధ్వన్యనుకరణవిశేషము. "చ. నిజాస్త్రవేదనణ్ వనచర కాంతచెట్టులిరినాథునికొఁగిలివానికీచుకీఁ, చనికడుబస్మరించుచు." భో. ౫, ఆ.

**కీఁచుబిళ్ల.** దే. వి. అదిమినపుడు కీఁచుకీఁచనునట్లు లోపల విల్లుపెట్టి కుట్టిన బటువుతలగడ.

**కీఁచుబుఱ్ఱ.** దే. వి. కీచుబిళ్ల.

**కీకటము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. ఒకానొకదేశము. విశ. 1. పిసినివాఁడు; 2. పేదవాఁడు.

**కీకసము.** సం. వి. అ. న. ఎముక. పుం. నులిపురుగు.

**కీచకము.** సం. వి. అ. పుం. గాలితాఁకున మ్రోఁగెడివెదురు. డు. ఒకానొక రాక్షసుఁడు.



**కీఁచట్లాడు.** దే. అ. క్రి. (కీచు+ఆటలు+ఆడు.) కలహించు.

**కీటకము.** సం. వి. అ. పుం. సామాన్యమగుపురుగు. విశ. కఠినము.

**కీటమణి.** సం. వి. ఇ. పుం. మిణుఁగుఱుఁబురుగు.

**కీటు.** దే. వి. గోడపెట్టునపుడు ఒకతడవయుంచెడు మట్టిపొడవు.

**కీడు.** వై. వి. 1. అశుభము*; "ఉరువాోవ. మీఁదుపరికింపకున్నఁగీడ్పాటిల్లకున్నె." భార. స్త్రీ. ౨, ఆ.—2. తప్పు*; "గీ. కృష్ణ కృష్ణయసంతయేకీడులేదు, వీరిదెసవెత్తులైపుతాలరతమఁ, దీర్పరాని యూపెసుఁజిచ్చుఁదెచ్చుకొనిరి, కరుణనీవిప్రవమ్యలఁగావవలయు." లక్ష్మీ. ర, ఆ.—3. దోషము*; "గీ. తామ్రమూఁదిగఁగలయట్టి ధాతుచయము, కొలిమినిడియూఁదఁగీడెల్లఁబొలియునట్లు, ప్రాణపవననిగ్రహమునఁగ్రాఁగిపోవు, ననఘయింద్రియజనితదోషాలియెల్ల." మార్క. 3, ఆ.—4. పాపము*. "క. అదిపాపము దానికినా, మదినెప్పుడువగచువిమలమానసయక్కీ, డుదొలఁగునట్లుగాన, తృదార్థదానము లుచేయుతొత్సుకమునణ్." భార. ఆశ్ర. ౧, ఆ.—5. అపకారము. విశ. 1. అధమము; "నీవేమిటనిమ్మహాధ్వరంబుకీడంటి." భార. ఆశ్వ. ర, ఆ—2. అశుభకరము*; "క. కీచేకువంశముసకలనిరాక." భార. ఉద్యో. 3, ఆ.—3. దుష్టము*. "వ. వారలకలంపులుకీడు." భార. ఉద్యో. 3, ఆ. (హల్లుపరమగుచో దీనియుత్వమునకు వికల్పముగా లోపము వచ్చును. చూ. అశుభము అను నర్థము నుదాహరణము.)

**కీడుపడు.** వై. అ. క్రి. తక్కువపడు. (చూ. కీడ్వడు.)

**కీడుపాటు.** వై. వి. తక్కువపాటు. "చ. ఇదికడుముద్దరాలుపను లెవ్వియుఁజేయఁగనేరదెంతయుణ్, మృదువాకకీడుపాటునకు మేకొనఁజాలదు." భార. విరా. ౧, ఆ.

**కీడ్వడు.** వై. అ. క్రి. కీడుపడుయొక్క రూపాంతరము. "ఉ. అస్త్రసంతాడనశక్తికీడ్వడియెఁ దభ్యము బ్రాహ్మణశక్తియెక్కుడు." భార. ఆర. ర, ఆ.

**కీడ్పాటు.** వై. వి. కీడుపాటుయొక్క రూపాంతరము.

**కీత.** దే. విశ. తక్కువ, నికృష్టము. (కీతనేల మొ.)

**కీదృశము.** సం. విశ. (అ. ఈ. అ.) ఎటువంటిది.

**కీనాశుఁడు.** సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. రాక్షసుఁడు. విశ. 1. ఒంటిసున్నచోఁజంపెడువాఁడు; 2. దున్నెడువాఁడు; 3. పిసినివాఁడు; 4. పేదవాఁడు.

**కీరము.** సం. వి. అ. పుం. 1. చిలుక; 2. ఒకానొకదేశము.

**కీరితి.** వై. వి. యశము. "సీ. ఎవనికీరితితిరుభృద్ధవటభృద్ధవబుధవాయనద్ధవన మిద్ధహరిణరుచిరము." హంస. ౧, ఆ.

**కీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. కప్పఁబడినది; 2. చెదరినది; 3. నొప్పింపఁబడినది.

**కీర్తనము.** సం. వి. అ. న. స్తుతి, పొగడిక.

**కీర్తనీయము.** సం. విశ. (అ. ఆ. అ.) పొగడఁదగినది.

**కీర్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. యశము; 2. విరివి; 3. రేఁట; 4. అడుసు.

**కీర్తించు.** సం. స. క్రి. స్తుతించు, పొగడు.

**కీర్తితము.** సం. విశ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

**కీలక.** సం. వి. అ. పుం, 1. ఒక సంవత్సరము. ము. 2. పశువుఁగట్టెడుగూటము.

**కీలకము.** దే. వి. మర్మము.

**కీలము.** సం. వి. అ. పుం. 1. మేకు; 2. చిల్లకోల; 3. మంట; 4. మోఁచెయి; 5. లేశము. (ఇది కడపటి యర్థము తక్కతక్కిన యర్థములయందు ఆకారాంత స్త్రీలింగముసగును.)

**కీలరి.** వై. విశే. (కీలు+అరి.) కీలెఱిఁగినవాఁడు.

**కీలారము.** దే. వి. కీలారముయొక్క రూపాంతరము. "క. ఆరాజలోక నాఁడాక్షీ, లారముపసిఁజూడవచ్చిలావణ్యతను, శ్రీరుచులనొప్పి సింహాక్షి, శోరము క్రియనున్నక్రేపుఁ జూచిముదమునన్." భో. ౬, ఆ.

**కీలారి.** దే. వి కీలారియొక్క రూపాంతరము. "క. కీలారిపనమున కునేఁజాలుదును." సం. "గోసంఖ్యాతాభివిషాత్యమివిరాటస్యమహీపతేః." భార. విరా. ౧, ఆ.

**కీలాలము.** సం. వి. అ. న. 1. నెత్తురు; 2. నీళ్లు.

**కీలి.** సం. వి. న్. పుం అగ్ని, నిప్పు.

**కీలించు.** సం. స. క్రి. తగులుచు.

**కీలితము.** సం. విశే. (అ. ఆ. అ.) కట్టఁబడినది, బద్ధము.

**కీలు.** వై. వి. 1. సులభముగా ఇటునటువంగుటతిరుగుటలోనగు వాని కనుకూలముగా నేర్పఱచినమఱ (లేక) సూత్రము*; "మ. ఒకమాణిక్యపుబొమ్మయెట్టివగకీలోజాళువాజాలవ, ల్లిక బాగాల్ కపురంపుటాకుమడుపుల్ వేతెచ్చిరాజున్నచా, యకునందియ్యనతం డులేనగవుతోనవ్వేళనవ్యాళక, న్యకకెంగేలనొసంగఁగైకొనియెనయ్యాటంబువాటిల్లఁగన్." విజ. ౧, ఆ.—2. మ్రానులోనగు వానిపైపూసెడి యొకానొకద్రవద్రవ్యము*; (తాటిపట్టెలకుకీలు పూసిరా?)—3. మర్మము*; "క. లోకంబుననాకీటం, బాకైటభవైరియెల్లయాత్మలకునభీ, ష్టాకాంక్షయొక్కచందమ, యాకీలెఱుఁగంగవలదెహృదయములోనన్." వై. 3, ఆ.—4. ఉపాయము*. "క. వినిసృపకన్యారత్నము, తనమదిఁదలపోసిచూచిదానికినొకకీల్, గనియెనుబుద్ధిచతుర్గుణ, మనుటనతులయందునిశ్చితార్థమనంగన్." భో. ౬, ఆ. (హల్లుపరమగుచో దీనియుత్వమునకు వికల్పముగా లోపమువచ్చును. కీల్బొమ్మ మొ.)

**కీలుకాఁడు.** వై. వి. సూత్రధారి. "సీ. కీలుకాఁడెడలింపఁగెడసిన బొమ్మలకైవడిఁ బటుతురంగవ్రజంబు." భార. ద్రో. 3, ఆ.

**కీలుకొను.** ద్వి. అ. క్రి. 1. తగులు; "ప్రేమంబాత్మలోఁ గీలుకో." వై. 3, ఆ.—2. నాటు. "గీ. శోకవారిధిపారంబు నాకుఁబొంద, నేలవచ్చుఁజిత్తంబునఁగీలుకొనియ, నహ్యమైకర్ణమరణోపజనితమైన, పరిభవంబనుశల్యమాతురతఁజేయ." భార. కర్ణ. ౧, ఆ. (ప్రే. కీలుకొలుపు.)

**కీలుగంటు.** ద్వి. వి. జాఱుగాముడిచిన వెంట్రుకలదూముడి, ధమ్మిల్లము.

**కీలుపడు.** వై. అ. క్రి. తగులు. (ప్రే. కీలుపఱచు. "ఎ, గీ. యావనలీలావికాసవహోన, హేలనాదులఁజిత్తంబుగీలుపఱచి." భాగ. ౫, స్కం. ౧, ఆ.)

**కీశపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను.

**కీశము.** సం. వి. అ. పుం. కోఁతి. విశే. దిసమొలది.

**కీశవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను.

**కీస.** దే. అవ్య. కొంచెము. "గీ. సంధ్యవార్వనిభ్రాష్టుణుఁడు, కీసతక్కువహూద్రుండుకేవలంబు." కాశీ. ౫, ఆ.

**కీసర.** దే. వి. తిత్తిలోనగువానిలోపలిపొర. "చ. ముదుక రుమాలు గుడ్డ భుజమ్మాలముసం గడితంబుమీఁదఁ బ్రాఁ, తదియగు, దుప్పటంబుమొలత్రాసును గీసరయుండుతిత్తిన, న్నదినెలవంకనామము వినాయకునుంగర మంగుళంబునన్, బొదువఁగ రత్నగుప్తుఁడు సమున్నతి నింటికిరాఁ బ్రియంబునన్." హంస. ౪, ఆ.—విశే. అల్పము. (కీసరపాలు మొ.)

## కు.

**కు.** ఉభ. దే. అప. షష్ఠీవిభక్తియందువచ్చెడు ప్రత్యయము. (రామునకు, సోమునకు మొ.)—సం. వి. ఉ. స్త్రీ. భూమి. (ఇది తెనుఁగున వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడదు. కుతలము, కుధరము ఇత్యాదిసమస్తపదములు ప్రయోగింపఁబడును.) విశే. వృత్తియందుఁ గుత్సిత శబ్దమునకువచ్చునాదేశము. (కుజనుఁడు, కుతర్కము మొ.)

**కుంక.** దే. వి. బాలవిధవ, రండ.

**కుంకటి.** వై. వి. (కూఁకటియొక్క రూపాంతరము.) 1. జొట్టు*; 2. పిల్లజుట్టు*. విశే. ప్రధానము*. (కుంకటివేరు.)

**కుంకుడు.** దే. వి. ఫేనిలము.

**కుంకుడుఁబురుగు.** దే. వి. ఒకానొక యెఱ్ఱపురుగు.

**కుంకుమపువ్వు.** మి. గ్రా. వి. (కుంకుమము+పుష్పు.) ఒకానొక అంగడిదినుసు, అగ్నిశిఖము.

**కుంకుమము.** సం. వి. అ. న. కుంకుమపువ్వు.

**కుంకుమ.** వై. వి. నుదుటఁబెట్టికొను రాగద్రవ్యవిశేషము, చెందిరము*. "మ. పురసౌధోన్నతకేతుఘట్టనలసంభోజారిపద్మాప్తులం, దిరవైకప్పతలిర్పఁబద్మవదనల్ హేలాగతిన్ మిత్రుఁడం, చురవింగుంకుమునింపఁగా నరుణుఁడైచూపట్టెఁగాదేనిభా, స్కరబింబంబునఁ గందుచెందునెకదాజాబిల్లియందుంబలెన్." చంద్రా. ౧, ఆ.

**కుంచము.** సం. వి. అ. పుం. మానవిశేషము, కుంచేము.

**కుంచిక.** సం. వి. ఆ. స్త్రీ. బీగముతీసెడువంకర ఇనుపకమ్మి, కుంచెకోల. "సీ. దంష్ట్రికార్గళితాహితతఫణోగ్రకవాటకుంచికాయితశాతచంచుకంబు." చంద్రా. ౧, ఆ.

**కుంచితము.** సం. విశే. (అ. ఆ. అ.) వక్రము, వంకరైనది.

**కుంచియ.** వై. వి. 1. కుచ్చు; 2. చిత్రమువ్రాసెడుతూలిక; 3. చామరము*; "చ. అతులితభక్తిఁబూర్వదిశయందు ననుగ్రహయనవ్వధూటితోఁ, గుతుకముమీఱఁగాఁబసిఁడికుంచియవైచుచుఁగొల్వుసేయ." కళా. ౮, ఆ.—4. కుచ్చెయిడినవస్త్రము*; 5. సాలెవాఁడు పడుగునరిచేసెడుసాధనము*. (చూ. కుంచె.)

**కుంచె.** వై. వి. 1. కుచ్చు; "సీ. శత్రురాజులకునచ్చరలనాకర్షించు సమరేంద్రజాలపింఛంపుఁగుంచె." పా. ౧, ఆ.—2. చిత్రమువ్రాసెడుతూలిక; 3. చామరము*; "సీ. జాలపాదమునంఘ్రిఁ గీలితంబగుసితాబ్జముభాతిఁగుంచెహస్తమునవ్రేల." పాండు. ౨, ఆ.—4. కుచ్చెయిడినవస్త్రము*; "ద్వి. స్థిరచిదానందవీచికఁబోలు కుంచె, మఱియొకభుజమునసమార్తలయంగ." విష్ణు. ఉ. ౫, ఆ.—5. సాలెవాఁడుపడుగుసరిచేసెడుసాధనము*. "సీ. కుంచెముగ్గపుగుంత గూటంబుపగ్గంబు పరఁటెత్రొక్కుడుపట్టెపలకదోనె." హంస. ౨, ఆ.—6. గోడకు సున్నముకొట్టెడుమట్ట*. (కుంచియయొక్క రూపాంతరము.)

**కుంచెకోల.** ద్వి. వి. కుంచిక.

**కుంచేము.** వై. వి. నాలుగుముంతలు.

**కుంచు.** దే. ప్రే. కృంగఁజేయు. "కొంచెముగానిజాంగకముఁ గుంచి." కవిక. ౨, ఆ.

**కుంజము.** సం. వి. అ. పుం, న. 1. పొదరిల్లు; 2. ఏనుఁగు కటుమరలు; 3. ఏనుఁగుకొమ్ము.

**కుంజర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఏఱుజాజికీ; 2. కలిగొట్టుకీ. అ. పుం. ము. 1. ఏనుఁగు; 2. వెంప్రుక; 3. ఉత్తరపదమైనచో శ్రేష్ఠము.

**కుంజరాశనము.** సం. వి. అ. పుం. పిప్పలము, గావికీ.

**కుంజలము.** సం. వి. అ. న. పులియఁబెట్టినకడుగునీరు.

**కుంట.** వై. వి. 1. కొలను; 2. పల్లము; 3. చెఱువు*; 4. భూపరిమాణవిశేషము*.

**కుంటదూలము.** దే. వి. కడదూలమునకునుగోడకును నడ్డముగా నుంచుచిన్నదూలము. (దీనిని గుంటదూలమనియు వాడెదరు.)

**కుంటముక్కు.** దే. వి. మత్స్యవిశేషము.

**కుంటి.** దే. విణ. 1. కాలువిఱిగినవాఁడు, ఖంజుఁడు; "చ. అలుఁగులబ్రుంధియందులమృగావలియుఙ్ విహగంబులుఙ్భయా, కుల గతిఁబొందిమూఁగలునుగుంటులుఁజీకులునైనయట్లులై." భార. ఆర. ౧, ఆ.—2. స్వభావమునఁగాలులేనివాఁడు, పంగువు. "ఎ, గీ. నీప్రతాపంబుతనవలెనిఖిలతమము, నడఁపఁగాలేదొతానేలయరుగు దెంచుఁ, గుంటిసారథితోనల్లకుముదవైరి." కా. ౫, ఆ.

**కుంటిగాము.** ద్వ. వి. శనిగ్రహము.

**కుంటు.** దే. అ. క్రి. కాలునేలఁజక్కఁగామోపకనడచు. విణ. కాలు లేనివాఁడు. "క. ఖింటికదానీతనయుని, కొంటెతనముఁబీరిమాని కుటిలాలకన, కుంటునకునిత్తురఁటయిటు, వంటివిపోపెక్కునోళ్ల వారలమాటల్." భో. ౫, ఆ.

**కుంటుగించు.** దే. అ. క్రి. కుంటు.

**కుంటుపడు.** ద్వ. అ. క్రి. 1. కుంటియగు; "క. అరయఁగ నాలుగువిధములఁ, బరఁగుఁజతుష్పాదవృత్తిఁబరఁగినగోవృష్, దొర యుచునందొకఁడెడలిన, నరవరసద్ధర్మవర్తనముకుంటుపడుఙ్." భార. అను. ౪, ఆ.—2. చెడు; "మ. అపుడుద్దాలకుఁడా గ్రహించినిజభార్యంజూచినిర్భాగ్యురా, లపవిత్రంబగుపార్వణం బు నవలీలం బెంటపైవైచికుం, టుపడంజేసితిశ్రాద్ధకర్మనికన్నో నల్ చిగుర్పంగవే, శపియించెఙ్ఘనవింధ్యశైలవనిఁబాషాణత్వ ముంజెందఁగఙ్." జై. ౪, ఆ.—3. తగ్గు; "క. తొంటినడకుంటు పడినం, బంటుఁదనముకుంటుపడకపరుషధ్వనితో." రామా. ౭, ఆ.—4. తెగు. "గీ. అనుచుఁదానన్నమాటచేకొనితడయక, ఘనభుజుండుసుమిత్రనందనుఁడుజిష్ణుఁ, డరిఁగరముగుంటుపడనే యనుజుగెలుపు, గాంచి మోదించెనరతనటించుచక్రి." రాఘ. ౪, ఆ.

**కుంటుపిచ్చుక.** దే. విణ. కాలులేనివాఁడు, పిచ్చుకకుంటు. "సీ. తాపననెద్దియాధారమాదివిఁబ్రాఁకుపితృవర్యులకుఁ గుంటుపిచ్చు కలకు." పాండు. ౫, ఆ.

**కుంటువాఱు.** దే. అ. క్రి. (కుంటు+పాఱు.) బలహీనమగు. "సీ. గుదియఁజేకొనెఁదర్పకుంటువాఱిజముండుకుదిరెరక్కసుఁడు శోకుడుఁదనమున." అచ్చ. బాల, కాం.

**కుంటెన.** వై. వి. తార్చెడువాఁడు*. "సీ. కుంటెననిన్నంపెఁ గోర్కెనొకఁడు." రాజ. ౨, ఆ.

**కుంటెనకత్తె.** వై. వి. తార్చునట్టి స్త్రీ.

**కుంటెనకాఁడు.** వై. వి. తార్చువాఁడు. "క. మనసిజుఁడిద్దఱ కును గుం, టెనకానితనంబుచేసెడిం గనుఁగొనఁగఙ్." విక్ర. ౭, ఆ. (స్వార్థమునకాఁడు.)

**కుంటెనకుచ్చులు.** వై. వి. బ. ఈస్పులనెడు కర్ణభూషావిశే షము.

**కుంటెనముడి.** ద్వ. వి. తాటాకులపుస్తకము దారము నడుమనుం డెడు ముడి.

**కుంటెనీఁడు.** వై. వి. (కుంటెన+ఈఁడు.) కుంటెనకాఁడు. "సీ. కుంటెనీలకునిచ్చికోడిగీలకునిచ్చిమిన్నకవారకామినులకిచ్చి." విక్ర. ౭, ఆ. (స్వార్థమున ఈఁడు.)

**కుంఠనము.** సం. వి. అ. న. మొక్కపోవుట.

**కుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) మొక్కపోయినది.

**కుంఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మూఢుఁడు; 2. సోమరి.

**కుండ.** వై. వి. 1. మట్టిపాత్రము*; 2. మేడమీఁదికలశము*; "మ. మేడలతుదఙ్దార్కొన్నబంగారుకుం, డలుమిన్నెటనుగాను పించుచునువిన్నాణంపుఁదెల్పింగడుఙ్, విలసిల్లఙ్." య. ౧, ఆ. —3. ఇరుసుతగిలించెడుబండికంటిసడిమిగుబ్బ*; "వ. మున్ను కొండొకక్రుంగినచక్రంబుకుండమునుఁగందిగఁబడిన." భార. కర్ణ. ౩, ఆ.—4. బ. ఏనుఁగుకుంభస్థలము*. "సీ. కుండలుదాల్చికన్గొ నలనీరొలుకచేతులుసాఁపుకడయేనుఁగులనుఁరోసి." అచ్చ. బాల, కాం. (వృత్తియందుపాత్రమాత్రపరము. కంచుకుండ మొ.) (సంస్కృతమునందుఁజెప్పఁబడనియర్థము లనేకములు తెనుఁగు గ్రంథములయందుఁ జెప్పఁబడియుండుటంజేసి దీనిని వైకృతము గానే గ్రహింపవలయును.)

**కుండకీటుఁడు.** సం. వి. అ. పుం. 1. చెడిపోయినబ్రాహ్మణస్త్రీ కొడుకు; 2. దాసినికామించినవాఁడు; 3. చార్వాకవచనదక్షుఁ డగువాఁడు.

**కుండగోఁకరి.** ద్వ. విణ. (కుండగోఁకు+అరి.) వంటవాఁడు, ఔదనికుఁడు. "ద్వి. కుండగోఁకరిఁజేసికువలయేశులకు, వండి పెట్టఁగఁజేసి." నళ. ౨, భా.

**కుండపోఁగులు.** ద్వ. వి. బ. కుండలవిశేషము. "సీ. కుండపోఁ గులుచిప్పగొడ్డండ్లునెలగోలలొప్పారుపలువంకయుంగరములు." నీలా. ౩, ఆ.

**కుండమార్చు.** ద్వ. స. క్రి. ఒకటినిచ్చి మఱియొకటిని బుచ్చు కొను.

**కుండమార్పు.** ద్వ. వి. ఒకటినిచ్చి మఱియొకటిని బుచ్చుకొనుట, వినిమయము. "చండాంశుసుతుపోల్కిఁగుండమార్పులుగాక." కా. ౫, ఆ.

**కుండము.** సం. వి. అ. న. 1. వంటకుండ; (ఈ యర్థమునందిది ఆకారాంత స్త్రీలింగమునగు.) 2. గుడిలోనిగుంట; 3. నిప్పుల గుండము; 4. తూనికగుండు. పుం. కొండ.

**కుండలము.** సం. వి. అ. న. 1. పోఁగులు; 2. గుంద్రన; 3. త్రాడు.

**కుండలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఉప్పికీ; 2. తిప్పతీఁగ; 3. కుం డలాకారనృత్యము, గొండ్లి. "ఎ, గీ. దండలాసకవిధమునఁగుండ లియును." భార. విరా. ౧, ఆ.—న్. పుం. 1. పాము; 2. నెమలి; 3. వరుణుఁడు. విణ. పోఁగులుగలవాఁడు.

**కుండలించు.** సం. స. క్రి. మన్నచుట్టు. "క. పురకాంతలకొనల కుఙ్, సరిపడదనిబ్రహ్మయాకసమునారసివే, నరిదానిఁగుండలించిన, నరణిఙదివిముట్టియచటిసాలంబలరుఙ్." చంద్రా. ౧, ఆ.

**కుండలీకరణము.** సం. వి. అ. న. మన్నచుట్టుట.

**కుండానుగు.** ద్వ. వి. (కుండ+అనుగు.) గోరక్షకీ.

కుండి. సం. వి. ఈ. స్త్రీ. కమండలువు, గిండి.

కుండుండు. సం. వి. అ. పుం. మగఁడుండఁగఁ జారునకుఁ బుట్టిన కొడుకు.

కుండ్రుక్కాచి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లబల్లి.

కుంతము. సం. వి. అ. పుం. 1. ఈఁటె; బల్లెము. (అనికొండ బు.) 2. అడవిగోడుములు.

కుంతలము. సం. వి. అ. పుం. 1. వెండ్రుక; 2. నాఁగలి; 3. యవలు; 4. ఒకానొకదేశము.

కుంతాలము. సం. వి. అ. పుం. శ్రీతాళము*.

కుంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పాండురాజుపెండ్లాము; 2. రేణుక యను గంధద్రవ్యము; 3. గుగ్గిలపుఁజెట్టు.

కుంథనము. సం. వి. అ. న. మూలుగు.

కుంప. వై. వి. స్తంభము*.

కుందకము. దే. వి. 1. అభ్యంతరము; 2. లోపము.

కుందనము. దే. వి అపరంజి.

కుందము. సం. వి. అ. పుం, న. మొల్ల*. పుం. 1. ఒకనిధి; 2. బండికంటి తిరుగుడు.

కుందారము. సం. వి. అ. పుం. వరాహము, పంది.

కుంది. దే. వి. జాయిలోనగువానిచేఁ జేయఁబడిన కుదురు.

కుందికాల్లు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. అంద లము.)

కుందియన. దే. వి. కుంది. "సీ. పసిఁడికుందియనలో వలఁబట్టు పొత్తుల యొత్తున నొఱగికూర్చుండనేర్చె." వి, పు. 2, ఆ.

కుందు. దే. అ. క్రి. 1. క్రుంగు; "దిగ్గజముల్ మదమేదికుందె." భార. అర. ४, ఆ.—2. తగ్గు; "వ. వెనకుందకవేగిరంపుఁబయ నంబులయ్యును బ్రజలనోలాకుపడనీక." భార. విరా. 3, ఆ.—3. దుఃఖించు; 4. కాలచక్కఁగానేలపానించకనడచు; 5. శోకించు. "గీ. బ్రస్తావర్గ్యమునఁదవంబులనుత్తమ, దానములనుబడ యఁదలఁచునట్టి, గనులకంటె సౌఖ్యకారిణి యగుగలిఁ, బొందెనీ కుచుండుకుందనేల." భార. ద్రో. ౨, ఆ.—వి. 1. తక్కువ; "హెచ్చుకుందాడియు." వై. 2, ఆ.—2. దుఃఖము; 3. శోకము.

కుందుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు.

కుందురుకి. సం. వి. ఈ. స్త్రీ. అందుగు*. (రూ. కుందరుకి.)

కుందురువు. సం. వి. ఉ. పుం. కుందురుపుక్కమనెడు గంధద్రవ్యము. (రూ కుందరువు.)

కుందుటెల్లు. దే. వి. ఇక్ష్వాకి*.

కుందువు. సం. వి. ఉ. పుం. కుదురుపుక్కమను గంధద్రవ్యము.

కుందెన. దే. వి. 1. కుంది; 2. రోలగుంట. "వ. సురుచిర కామినీమణులశోభితలీలలరత్నమండలి, ఖచితముకాంచనోజ్జ్వల దిక్ స్వరరూపమునైనకుందెనల్, బ్రచురవిశేషధాన్యమిడిపాడుచు దంచిరికంకణధ్వనుల్, రుచిరములై జనావలికిలోలతమిక్కిలి చేయుచుండఁగన్." భల్లా. ४, ఆ. 3. ఒకానొకచెట్టు. (కుంది యనయొక్కరూపాంతరము.)

కుందెనగిఱి. దే. వి. కుందెనగుడి అను బాలక్రీడావిశేషము.

కుందెనగుడి. దృ. వి. బాలక్రీడావిశేషము. "సీ. చిట్లపొట్లా కాయ సిరిసింగణావత్తి గుడుగుడు గుంచాలుకుందెనగుడి." కాశీ. 3, ఆ.

కుందెలు. దే. వి. కుందేలుయొక్కరూపాంతరము. "వంటయిల్ కుందెలుచొచ్చె." భార. ఆది. ౬, ఆ.

కుందేటికొమ్ము. దే. వి. (కుందేలు+కొమ్ము.) గడ్డదినుసు, శశ శృంగము. విణ. శూన్యము.

కుందేలు. దే. వి. చెవులపోతు, శశము.

కుంపటి. దే. వి. చలికాఁచుకొనుటలోనగువానికై నిప్పులుంచెడు పాత్రవిశేషము, హసంతి.

కుంపె. దే. వి. తాంబూలపాత్రము. (చూ. కంపె.)

కుంపెరుగు. దే. వి. (కుండ+పెరుగు.) అడుగుపెరుగు, ద్రప్సము. "ఎ, గీ. కుంపెరుగునాఁగద్రప్సమగును." ఆం, భా. ద్వి. వై.

కుంఫిణి. ఆం. వి. ఆంగ్లేయ ప్రభుత్వమువారు.

కుంబ. సం. వి. ఆ. స్త్రీ. యూపముచుట్టు మిక్కిలి దుర్గమముగా నిడినవెలుగు. యజ్ఞశాలచుట్టునిడినవెలుగు. (అనికొందఱు.)

కుంభకము. సం. వి. అ. పుం. ఊపిరి బిగఁబట్టుట.

కుంభకారుఁడు. సం. వి. అ. పుం. కులాలుఁడు, కుమ్మరి.

కుంభము. సం. వి. అ. న. గుగ్గిలపుఁజెట్టు. పుం. 1. కుండ; 2. ఏనుఁగు కుంభస్థలము; 3. ఒకరాశి.

కుంభసంభవుఁడు. సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు; 2. ద్రోణుఁడు.

కుంభాండము. సం. వి. అ. పుం. గుమ్మడి*. డు. ఒకానొక రాక్షసుఁడు.

కుంభాభిషేకము. సం. వి. అ. పుం. క్రొత్తగా గుడికట్టించి అందు ప్రతిష్ఠచేసిన విగ్రహమునకు కుంభమునం దుదకమునించి మంత్రపూతమైన ఆ యుదకముచేత చేయించెడు స్నానము.

కుంభి. సం. వి. ఈ. స్త్రీ. 1. కలిగొట్టు*; 2. పినగుమ్ముడు*; 3. తీఁగపాఁచి; 4. వంటకుండ. న. పుం. 1. ఏనుఁగు; 2. కుమ్మరవాఁడు; 3. మొసలి.

కుంభించు. సం. స. క్రి. (ఊపిరి.) బిగఁబట్టు.

కుంభిక. సం. వి. ఆ. స్త్రీ. తీఁగపాఁచి.

కుంభిని. సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

కుంభీనసము. సం. వి. అ. పుం. 1. విషజ్వాలలు క్రక్కెడు పాము; 2. పాము.

కుంభీరము. సం. వి. అ. పుం. నక్రము, మొసలి.

కుంభుఁడు. సం. వి. అ. పుం. 1. వైశికుఁడు; 2. కుంభకర్ణుని కొడుకు.

కుకరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఈచఁబోయిన చేయిగల వాఁడు.

కుకుందరము. సం. వి. అ. న. పిఱుఁదిమీఁదిగుంత.

కుకూలము. సం. వి. అ. న. పసినాటినగుంట. పుం. కుమ్మ. (చూ. అగ్ని.)

కుక్క. వై. వి. వేపి, శునకము. విణ. కుత్సితము*.

కుక్కగొడుగు. దృ. వి. పుట్టగొడుగు, ఛత్త్రాకము.

**కుక్కతోళసి.** వై. వి. ఫణిర్జకము*.

**కుక్కపాల.** దు. వి. వటపత్రిక*.

**కుక్కబూరుగు.** దు. వి. బూరుగుదినుసు*.

**కుక్కముల్లు.** దు. వి. వ్యాధివిశేషము.

**కుక్కమూతిపిందె.** దు. వి. కాపుడిగినప్పుడు గలిగెడు కుక్కమూతివంటి మూతిగలపిందె.

**కుక్కమేడి.** దు. వి. కాకోదుంబరిక*.

**కుక్కవాయింట.** దు. వి. శ్వానబర్బర*.

**కుక్కి.** దే. వి. 1. పల్లము; 2. త్రాస్లువదలి పల్లముపడినమంచము. "ఉ. కొఱమాలినకుక్కిమీఁదనీ, యోజ ననాథుపాటుపడనోగితమైతెమదీయవల్లభా." భో. ౫, ఆ.—విణ. లోఁతు "ద్వి. ఆకుక్కిమూతిలో నారీతినున్న, యాకవినుతఁగాంచి యద్భుతంబంది." భాగ. ౯, స్క౦.

**కుక్కిపడు.** దు. అ. క్రి. (కుక్కి+పడు.) పల్లముపడు. "గీ. కుక్కిపడినమిగులఁగొంగోడువోయినఁ, గుఱుచయైన మిగులఁ గొంచెమైన, మలినమైననేత పలుచనైననుసల్లు, లున్ననుల్కమంచ మొప్పదంద్రు." వి, పు. ర, ఆ.

**కుక్కుటము.** సం. వి. అ. పుం. 1. కోడి; 2. కపటము; 3. కుక్క; 4. మిణుఁగురులు.

**కుక్కుటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకోడి; 2. అసత్యపునడక.

**కుక్కుభము.** సం. వి. అ. పుం. అలజము, గంపపులుఁగు.

**కుక్కురము.** సం. వి. అ. న. 1. గండివనము*; 2. మాచిపత్రి*. పుం. కుక్క.

**కుక్షి.** సం. వి. ఇ. పుం. జఠరము, కడుపు.

**కుక్షింభరి.** సం. విణ. ఇ. పొట్టపోసికొనువాఁడు.

**కుచందనము.** సం. వి. అ. న. 1. ఎఱ్ఱగందము; 2. కుష్ఠము; 3. బుజేపత్రి.

**కుచము.** సం. వి. అ. పుం. స్తనము.

**కుచరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరులదోషమును చెప్పెడువాఁడు. నికృష్టపుమాటలాడువాఁడు. (అనికొందఱు.)

**కుచాననము.** సం. వి. అ. న. చూచుకము.

**కుచ్చితము.** వై. విణ. నాలి, కుత్సితము.

**కుచ్చితుఁడు.** వై. విణ. చెనఁటి, కుత్సితుఁడు.

**కుచ్చె.** వై. వి. వస్త్రభంగము, నెఱి*.

**కుచ్చెతీయు.** దు. స. క్రి. (రత్నములను) సానఁబట్టు.

**కుచ్చెల.** దే. వి. 1. ఎనిమిదిగొట్టులకొలఁది; "ఉ. పాంథకోటులఙ్, గుచ్చెలపట్టునందెరువుకొట్టుదురప్పురివారభామినుల్." చంద్రా. ౧, ఆ.—2. కంకులతోడి జొన్నచొప్పలోనగువానిప్రోగు.

**కుచ్చెళ్లు.** వై. వి. బ. (కుచ్చె+లు.) 1. ఆఁడుదానికోకకుచ్చె, వలిభము*; 2. బాలికాక్రీడావిశేషము*. (చూ. అచ్చనగండ్లు.)

**కుచ్చెలిగంత.** వై. వి. సన్న్యాసులులోనగువారుధరించెడు బొంత. "ఉ. గ్రుచ్చినరత్నరాజిరుచిగుచ్ఛము లుం బలువన్నె పట్టునూ, లుక్కచ్చులుఁగల్గియొప్పతనకుచ్చలిగంతయు." పర. ౧, ఆ.

**కుచ్చెలిబొంత.** వై. వి.———పై.——— "సీ. చెలువగు కలువమొగ్గలుబడల్ గానాఁచుపాలుపైనకుచ్చలిబొంతగాఁగ." య. ౩, ఆ.

**కుచ్చె.** వై. వి. 1. పట్టులోనగువానికుచ్చు; 2. బ. కొనచెవినుంచుకొనెడి భూషణవిశేషము*; 3. స్త్రీలు జడయందుఁజేర్చియల్లుకొనెడి భూషణవిశేషము*

**కుచ్చెమీను.** వై. వి. మిక్కిలి పుచ్ఛముగలచేఁప, గండోలము.

**కుచ్చెలమెకము.** వై. వి. (కుచ్చులు+మెకము.) చమరీమృగము.

**కుజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. సీత; 2. పార్వతి. అ. పుం. ము. చెట్టు.

**కుజంభిరుఁడు.** సం. వి. అ. పుం. చంపి దోఁచుకొను దొంగ.

**కుజనుఁడు.** సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు.

**కుజుఁడు.** సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.

**కుటజము.** సం. వి. అ. పుం. కొండమల్లె*. (ఇది వర్షర్తువుఁ బూచును.)

**కుటజుఁడు.** సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు; 2. ద్రోణుఁడు.

**కుటన్నటము.** సం. వి. అ. న. కయివడిముస్తె*. పుం. దుండిగము*.

**కుటపము.** సం. వి. అ. పుం. 1. ఇంటికోఁట; 2. ధాన్యమానవిశేషము. డు. ఒకానొకముని.

**కుటము.** సం. వి. అ. పుం, న. కుండ. పుం. 1. గుడిసె; 2. చెట్టు.

**కుటరము.** సం. వి. అ. పుం. పెరుగుచిలికెడు కంబము, తరిగంబము.

**కుటాక.** దే. వి. పక్షివిశేషము.

**కుటి.** సం. వి. ఇ. స్త్రీ. బుడిపి. ఈ. స్త్రీ. 1. గుడిసె; 2. సీల్లమోసెడు పనికత్తె; 3. మురయనెడు గంధద్రవ్యము.

**కుటిక.** సం. వి. ఆ. స్త్రీ. గుడిసె.

**కుటిల.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. విణ. వంకరైనది.

**కుటిలిక.** సం. వి. ఆ. స్త్రీ. మంగలవాఁడు వెండ్రుకలూడఁదీసెడుసాధనము, తండసము.

**కుటీరము.** సం. వి. అ. పుం. గుడిసె.

**కుటుంబము.** సం. వి. అ. పుం. పెండ్లాముబిడ్డలులోనగువారు.

**కుటుంబి.** సం. వి. న్. పుం. కుటుంబపోషకుఁడైనవాఁడు.

**కుటుంబిని.** సం. వి. ఈ. స్త్రీ. కుటుంబపోషకురాలగు స్త్రీ.

**కుటుఁడు.** సం. వి. అ. పుం. కూలిపనివాఁడు.

**కుట్టకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఛేదించువాఁడు.

**కుట్టడము.** దే. వి. కుట్టుపని. "సీ. అవికకుట్టడపుఁదోరపునిగ్గుజంటీలు తనులతొద్యుతికిఁగైదండయొసఁగ." శుక. ౧, ఆ.

**కుట్టనము.** సం. వి. అ. న. ఛేదనము.

**కుట్టని.** సం. వి. ఈ. స్త్రీ. కుంటెనకత్తె.

**కుట్టమితము.** సం. వి. అ. న. దంతపీడనాదులచేఁ గోపభావమభినయించినను లోపల మిక్కిలి యానందముపొందునట్టి స్త్రీలయొక్క శృంగార చేష్టావిశేషము.

**కుట్టాకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కుట్టకుఁడు.

**కుట్ప్రారము.** సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

**కుట్ప్రారుగలు.** దే. వి. బ. (కుఱుచ+అరుగలు.) కోద్రవవిశేషము.

**కుట్ప్రావలు.** దే. వి. బ. (కుఱుచ+అవలు.) సర్పవిశేషము.

**కుట్టిమము.** సం. వి. అ. పుం, న. ఱాతికట్టినపునేల, నెలకట్టు. పుం. దానిమ్మ చె.

**కుట్టియ.** దే. వి. గుదస్థానము.

**కుట్టు.** దే. స. క్రి. 1. ఆకుకుట్టు; 2. గుడ్డలుకుట్టు; 3. తేలులో నగునవికుట్టు. "గీ. మనువుఁగొననుత్సహించినమనుజుఁబట్టి, కుట్టి నిర్జించుమధుకరకులమునట్లు." భార. ఆర. ౧, ఆ. (ఇట్లు చీమ కుట్టెను మొ.) వి. 1. కుట్టుడు; 2. పొయిలో క్రిక్కిఱిసియుండు బూడిదలోనగునది; 3. కొంచెపు కడుపునొప్పి.

**కుట్టుకొండె.** ద్వి. వి. చెవికుట్టుకమ్మి, కుట్టుపోఁగు.

**కుట్టుడాకు.** దే. వి. (కుట్టుడు+ఆకు.) పుల్లియ, విస్తర.

**కుట్టుడు.** దే. వి. కుట్టుట.

**కుట్టుపోఁగులు.** దే. వి. బ. ఉంగరమువంటి వట్టిపోఁగులు.

**కుట్టుపోయు.** దే. స. క్రి. కుట్టు.

**కుట్టుసుఱు.** దే. వి. (కుఱుచ+ఉసుఱు.) కొంచెము మిగిలియున్న ప్రాణము.

**కుట్టె.** దే. వి. కుట్టియయొక్కరూపాంతరము.

**కుట్మలము.** సం. వి. అ. న. నరకవిశేషము. పుం. అరవిరి మొగ్గ.

**కుట్ర.** దే. విశే. కుత్సితము. "లేఁగుట్రనునంగవుఁ గలుగుకోమలి." విజ. ౩, ఆ.

**కుట్రపువాఁడు.** దే. వి. కుట్టుపనిచేయువాఁడు, సూచికుఁడు.

**కుఠరము.** సం. వి. అ. పుం. (చూ.) కుటరము.

**కుఠారము.** సం. వి. అ. పుం. స్వధితి, గొడ్డలి.

**కుఠేరకము.** సం. వి. అ. పుం. నల్లగగ్గెర చె.

**కుడతా.** హిం. వి. చొక్కాయి.

**కుడపము.** సం. వి. అ. పుం. ధాన్యమానవిశేషము, మానిక.

**కుడి.** దే. వి. కుడుపు. "క. కడుపునకందియునందని, కుడి." పంచ. నా. ౪, ఆ.—విశే. అపసవ్యము. (కుడికన్ను, కుడికాలు, కుడిచేయి, కుడిప్రక్క మొ.)

**కుడితి.** దే. వి. బియ్యములోనగువాని కడుగునీరు, తండులీణము.

**కుడినీరు.** ద్వి. వి. త్రాగఁదగినజలము. "కుడినీరుమేడలు." వసు. ౪, ఆ.

**కుడిపి.** వై. విశే. కురూపి. "క. గ్రక్కునవెలువడితనచేఁ, జిక్కల గుదివోలెనున్నసురుచిరహారం, బక్కుడిపియఱుతవైచుచు." భో. ౫, ఆ.

**కుడిమివాఁడు.** దే. వి. పాములవాఁడు, విషవైద్యుఁడు.

**కుడియెడుగుపరుసడి.** దే. వి. మల్లబంధవిశేషము.

**కుడిశము.** సం. వి. అ. పుం. మత్స్యవిశేషము.

**కుడుంగము.** సం. వి. అ. పుం. 1. పొదరిల్లు; 2. బోడతరము చె.

**కుడుక.** దే. వి. తక్కెడతట్ట. "గీ. అక్కపోతమున్న తక్కెడకుడుకత్రే శైక." శివ. ౩, ఆ.

**కుడుచు.** దే. స. క్రి. 1. అనుభవించు; "క. అప్పుడతఁడటులు సెప్పఁగఁ, దప్పఁదలఁచినఫలంబుతగఁగుడువకపోఁ, జొప్పడునె." భార. శల్య. ౧, ఆ. (దిగులుకుడిచి ఇత్యాదులయందు దిగులును బొందియనియర్థము.)—2. త్రాగు; (చన్నుగుడిచెను.) 3. భుజించు. "వానవనందనుఁడు కుడువక గుడువక." భార. ఆది. ౫, ఆ.

**కుడుపరి.** దే. విశే. (కుడుపు+అరి.) 1. అనుభవించువాఁడు; 2. భుజించువాఁడు. "సీ. తెలిగడలినిగరువలికుడుపరిదొరపఱపుపయినిదురబెరయునుఱియ." అచ్చ. అర, కాం.

**కుడుపు.** దే. ప్రే. కుడువఁజేయు. వి. 1. అనుభవము; "క. ఎడపడకుండంగుడిచిన, కుడుపుప్రమాణంబుగాదుకొన్న తెఱంగున్, బడసినతెఱఁగునుదెలుపని, యడికుడుపునఁబాడిగెలువదభినవదండీ." విజ్ఞా. వ్య, కాం.—2. భోజనము. "గీ. కుల్యయందుఁద్రిరాత్రముకుడుపు దక్కి." భార. అను. ౩, ఆ.

**కుడుము.** దే. వి. భక్ష్యవిశేషము, మోదకము.

**కుడ్చు.** దే. స. క్రి. కుడుచుయొక్కరూపాంతరము.

**కుడ్యకారుఁడు.** సం. వి. అ. పుం. గోడపెట్టువాఁడు.

**కుడ్యమత్స్య.** సం. వి. ఆ. స్త్రీ. బల్లి.

**కుడ్యము.** సం. వి. అ. న. 1. గోడ; 2. పూఁత.

**కుణకము.** సం. వి. అ. పుం. పిల్ల. "వ. మఱియునాభరతుండు నిత్యనైమిత్తికక్రియాకలాపంబునిర్వర్తించునెడనంతనంతలేచి హరిణకుణకంబుం జూచుచుఁగించిత్స్వస్థహృదయుండై దానినాశీఃపరంపరల నభినందించుచుంజుంబనాదులం బ్రీతిచేయుచు నతిమోహంబునం బెంచుచుండునెడ." సం. "తస్యహవావైణకుణక ఉచ్చైస్తరాం తస్మిన్కృతనిజాభిమానస్య హరహస్తత్పోషణ పాలనప్రీణనలాలనానుధ్యానేనాత్మనియమా స్సహయమాఃపురుషపరిచర్యాదయ ఏకైకశఃకతిపయేనాహర్గణేనవియుజ్యమానాః కిలసర్వ ఏవోదవసన్." భాగ. ౫, స్కం. ౧, ఆ.

**కుణపము.** సం. వి. అ. పుం. 1. పీనుఁగు; 2. దుర్గంధము.

**కుణి.** సం. వి. ఇ. పుం. నందివృక్షము. విశే. ఈచఁబోయిన చేయిగలవాఁడు.

**కుణింజము.** సం. వి. అ. పుం. వనవాస్తుకము, చెంచలికూర.

**కుతకుత.** దే. వి. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము. (తుకతుకకు మాఱురూపము.)

**కుతపము.** సం. వి. అ. పుం, న. 1. దినముయొక్క యెనిమిదవ భాగము; (చూ. దినము.) 2. వాద్యము; 3. మేఁకత్రుప్పటి కంబళి; 4. దర్భ.

**కుతపుఁడు.** సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టినదానికొడుకు; 2. సూర్యుఁడు.

**కుతస్త్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అసభ్యము, (మాట.)

**కుతిక.** దే. వి. కుత్తికయొక్కరూపాంతరము. "ఉ. ఈయవివేకపుంబనులకిట్లు తొడంగితివొప్పదింతయు, న్యాయముగాలిఁబోయెడు దురాగతముల్ విని పాపబుద్ధిన, య్యోయిటువంటిముద్దుల నపహారిముందల పట్టియాడ్చికో, కోయనికూయఁగాఁగుతికఁగోసినలోకము వారుతిట్టరే." వి, పు. ౭, ఆ. (చూ. కుత్తిక.)

**కుతికంటు.** దే. వి. (కుతిక+అంటు.) బంగారుతేకుతోఁబట్టిగా మెడకంటియుండునట్లు చేసియుంచుకొనెడు స్త్రీభూషణవిశేషము. "సీ. బొగడలుసానుఁగ్రోవులు తీఁగె మెడనూలు కుతికంటుసరిపెణగుండ్లపేరు." హంస. ౩, ఆ.

**కుతినీ.** దే. వి. ఒకదినుసుపట్టు. "సీ. కుతినీతలాడ తళుక్కుపసిండి చందువానిలువుటద్దములుపన్నీటిగిండ్లు." రసి. ౫, ఆ.

**కుతిల.** దే. వి. బాధ. "సీ. వినుసృపాలకయూళ్లవెంబడిదేవరగుళ్ల పంచలఁజేరి కుతిలఁగుడిచి." హరిశ్చ. ౪, ఆ. (చూ. కుతిల పెట్టు.)

**కుతిలపడు.** ద్వ. అ. క్రి. బాధపడు. "క. మితికడచినబుణ దాతలు, వెతపెట్టఁగనూరుచొరకవెలివెలిఁదిరుగు౯, దతిఁగూడులేక యాఁకటఁ, గుతిలపడునతండుగుప్వకుత్తుకతోడ౯." పాండు. 3, ఆ. (ప్రే. కుతిలపఱచు.)

**కుతిలపాటు.** ద్వ. వి. కుతిలపడుట. "సీ. ఎఱుఁగఁడుమత్తిల్లి పరఁటిపుట్టువుగ్రుక్కగొనినయప్వుడుగలకుతిలపాటు." య. ౧, ఆ.

**కుతిలపెట్టు.** దే. స. క్రి. బాధించు. "ఎ, గీ. అరాజకత్వ, దోషజాతమైనదురితబాహుళ్యంబు, కుతిలపెట్టభూమియతలము నకుఁ, బోవ." సం. "తతఃకాలేనపృథివీపీడ్యమానాదురాత్మభిః." భార. శాం. ౨, ఆ.

**కుతుక.** దే. వి. కంఠము. "సీ. చేతమున్మెనవాలుచిలువసూడిగ ములునొనలమిక్కిలికన్నువిసపుఁగుతుక." రాజ. 3, ఆ. (ఇట్లు ఉకారమధ్యముగాను బ్రతులయందుఁ గానఁబడుచున్నదిగాని యట్టిద యని నిర్ధారణచేయుటకుఁ దగిన ప్రయోగము దొరకినదికాదు.)

**కుతుకము.** సం. వి. అ. న. అనుభవింపని కోరికయందలియాన, తమి.

**కుతుపము.** సం. వి. అ. పుం. చేతిసిద్దె.

**కుతువు.** సం. వి. ఊ. స్త్రీ. సిద్దె.

**కుతూహలము.** సం. వి. అ. న. 1. కుతుకము; 2. నాయికకు మనోజ్ఞమైన వస్తువును చూచుటయందుఁగల లోలత్వము. విశ. ప్రశస్తము.

**కుత్కీలము.** సం. వి. అ. పుం. కొండ. "ఉ. కీలకకాలజిత్ప్రముఖ వీరులుమున్నకుశాశుగాహతి౯, గూలిరిరక్తధారలుబుగుల్లొనలక్ష్మణః మ్రోలధాతుకు, త్కీలమునాల్గువంకలనతిత్వరమాణసమీరవర్తనో, న్మూలితసంప్రఫుల్లసుమనోభరకింశుకవాటికైవడి౯." జై. ౬, ఆ. (కొన్ని నిఘంటువులయందుఁ గుకీలమనియునున్నది.)

**కుత్తిక.** దే. వి. గొంతు, కంఠము. "ఎ, గీ. హత్తిమిత్తిచందంబున హత్తివెడఁద, కత్తిఁగుత్తికనుబిఱానఁగత్తిరించి, సత్తిమత్తిల్లబలిచేసిసత్తి నొక్కఁ, డవనిపతియిచ్చమేలుమేలనుచుమెచ్చ." చంద్రా. ౨, ఆ.

**కుత్తుక.** దే. వి. కుత్తిక. (చూ. కుతుక.)

**కుత్స.** సం. వి. ఆ. స్త్రీ. నింద, దూఱు.

**కుత్సనము.** సం. వి. అ. న.——పై.——

**కుత్సించు.** సం. అ. క్రి. రోఁతపడు. "సీ. కుత్సింపకుంబెట్టు లుత్సర్గవిణ్మూత్రలాలాద్రవశ్లేష్మజాలమునకు." కాశీ. ౪, ఆ.—స. క్రి. దూఱు.

**కుత్సితము.** సం. విశ. (అ. ఆ అ.) నికృష్టము, కీడ్వడినది.

**కుథము.** సం. వి. అ. పుం. 1. దర్భ; 2. ఏనుఁగుమీఁదఁబఱచెడి యొజ్జకంబళి. చిత్రకంబళము. (అనికొందఱు.) (ఈ యర్థము నందాకారాంత స్త్రీలింగమును గలదు.)

**కుదప.** దే. వి. రొంపిదుక్కి.

**కుదరము.** సం. వి. అ. పుం. గుల్మము. "శ్లో. కుదరస్సాప్యుష్ణప కారస్తుక్షారః పాకతోఽజుహూరాణః." ఆ, పా. ద్వి. క్ష.

**కుదించు.** దే. ప్రే. కుదియించు, కుదియఁజేయు. "జమదగ్ని సూనుగర్వముఁగుదించి." జై. ౬, ఆ.

**కుదికిలఁబడు.** దే. అ. క్రి. ముఖముపైకెత్తుకొని ముడ్డినేలమోవ గొంతుగూర్చుండు. "ద్వి. కుదికిలఁబడితన్నుకొనగుంజెలవియఁ, గదిసియన్నీలుమోఁకాళ్లఁదాటించె." రంగ. యు. (స్వార్థమున పడు.)

**కుదికిలు.** దే. అ. క్రి.——పై.——"వ. అచ్చోరవకువాను దేవుండుశీనకంబునంబూఁచిన శైనేయుండుకుదికిలిగదనడాకేల దాపించిన." ఉ, హరి. 3, ఆ.

**కుదియు.** దే. అ. క్రి. 1. అడఁగు; "సీ. మదినిగిర్చినమాట మగువనీపెంపునఁ గుదిసినానాలుకతుదికిరాదు." భార. విరా. ౨, ఆ.—2. క్రుంగు; "ఎ, గీ. కదును వ్రేఁగు, గలుగునట్టివంట కట్టియమోపట్టు, గుదియమోచితెచ్చె." భార. అశ్వ. 3, ఆ.—3. తగ్గు; "మొదలఁబెనిచిపిదపఁగుదియింప." ఆము. ౪, ఆ.—4. మరలు, నివర్తిల్లు. "లలిఁబ్రసరించు నింద్రియములంగుది యించి." మార్క. 3, ఆ.

**కుదిర.** వై. వి. గుల్మము. "సీ. వెలిపట్టునిద్దంపుఁదళుకులపుట్టఁబు మెలపారుపులుఁగుభంజళులకుదిర." కవిస. ౧, ఆ.

**కుదిరిక.** దే. వి. 1. అమరిక; 2. నిలుకడ; 3. నెమ్మది.

**కుదిలిక.** దే. వి. కుదులుట.

**కుదుకనగోలు.** దే. వి. వంచన. "ద్వి. కుదుకనగోలుకైకొనకనా ధనము, వదలుముమున్నువిశ్వామిత్రుబుణము, మితితోడఁజెల్లించి మీఁదనెల్లయిన, ధృతిఁదీర్తునీబత్తెదినములలెక్క." "ద్వి. ఆలిని బుత్రునిసంగడిఁబెట్టి, కాలకౌశికుఁడనుకష్టునకమ్మి, కూర్చినధనమెల్లఁ గుదుకనగోలు, నేర్పునఁగైకొంటినీకుసిద్ధించె." హరిశ్చ. ౨, భా.

**కుదుచు.** దే. ప్రే. కుదించు. "ఎ, గీ. కదిసినుగ్గోళ్లకొవలనఁగుదిచి పట్టి." య. ౨, ఆ.

**కుదుప.** దే. వి. 1. దుర్మాంసపిండము; 2. వంచన. "చ. అసు రేశ్వరుఁడప్పుడుకాలుఁజేయిలా, వటీరభసంబునంగుదుపనక్కడ నిక్కడనూడఁజూచిమై, గిఱుపఁగ." నిర్వ. ౭, ఆ.

**కుదుపు.** దే. విశ. స్వభావమునఁగాలులేనివాఁడు, పంగువు. "ఉ. దేవతలెల్లఁదక్కఁగలదీవులకు౯దివికేగునట్టిచోఁ, బోవఁగలేకకుంటి కుదుపుంజఱువేల్పులుదైత్యదానవుల్, సేవకులైమహీవిభునిచేనధి కారనియోగవృత్తికై, జీవితమందనిల్చిరిత్యజింపఁగఁజాలకజన్మదేశము ల్." కాశీ. ౫, ఆ. "గీ. కుంటికుదుపులశక్తులుకున్ధరోగు, లంధు లును వృద్ధులునుబాలురాదిగాఁగఁ, గాశికరుగంగలేని పిసాములెల్ల, మోక్షమును బొందుదురుగాకదక్షవాటి." భీ. ౫, ఆ.

**కుదురు.** దే. అ. క్రి. 1. అనుకూలమగు; 2. స్థిరమగు; 3. స్వస్థ మగు. వి. 1. అమరిక; 2. అగసాలెవానికుంపటి; "గీ. బొమ్మ యనుపేరియగ సాలెపూఁటచెలిని, గోరియలరించుటకుఁజదల్కుదు టఁగాఁచి, నీటముంచినమేటివన్నియపసిండి, పూదెయనఁగ్రుంకుఁ గడలిలోఁబ్రొద్దువ్రాలె." నీలా. 3, ఆ.—3. నిలుకడ; 4. నెమ్మది; 5. కుండలోనగునవికుదిరికగానిలుచుటకేర్పఱచిన పీఠము; "వ. ఉపేంద్రాయేప్రకారంబునమహార్ణవంబుడగ్గటి తరువవచ్చు. దీనికిఁజేరునఁగుధురునుగవ్వంబునునేమిగావలయు." పీర. 3, ఆ.—6. పాదు; "చ. కలికిచయికర్తురాముని జగత్త్రయమో హనరూపదివ్యమం, గళపటునిగ్రహంబుపసఁ గాంచుతమింగటిఁ బూనిమేఖలా, వలయముఁగీలుకొల్పమఱవందిగజాలినయప్పుడ

వస్త్రహా, కులమ శకోమలాంగలతకుంగుదుఱుంబలె నొప్పెఁ జుట్టు నఁడా." గాథా. ౪, ఆ.—7. ప్రాపు. "క. కరితురగరథ సమితిఁబొం, పెరిగోయెను సాదులక్ష్మిపెం పుకెల్లన్, నరసిరుహాసన చేపు, దురుగానొనరి చెవఁడాంతూపాలమెనఁగన్." భార. విరా. ౨, ఆ.

**కుదురుకొను.** దే. అ. క్రి. కదలకనిలుచు, నెలకొను. "కుదురు కొనెడాగిరీంద్రములు." విక్ర. ౨, ఆ. (ప్రే. కుదురుకొలుపు.)

**కుదురుచు.** దే. ప్రే. కుదురఁజేయు, కుదిరించు. (చూ. కుదుర్పు.)

**కుదురుపడు.** ద్వ. అ. క్రి. 1. నెలకొను; 2. స్థిరపడు. (రూ. కుదుర్పడు. "క. అనపినికిరీటికర్ణను, తునిమస్తమురథముపైఁగుదు ర్పఁబడి." జై. ౭, ఆ.) (ప్రే. కుదురుపఱచు.)

**కుదురుపాటు.** ద్వ. వి. కుదురుపడుట.

**కుదులు.** దే. అ. క్రి. అదురు, చలించు.

**కుదువ.** దే. వి. తాకట్టు, ఆధి.

**కుదువపెట్టు.** దే. స. క్రి. తాకట్టుంచు.

**కుద్దాలము.** సం. వి. అ. పుం. 1. త్రవ్వఁనట్టి యొకానొక సాధ నము, గుద్దలి; 2. కాంచనము*.

**కుధరము.** సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

**కునటి.** సం. వి. ఈ. స్త్రీ. మణిసిల. నేపాళదేశపు మణిసిల. (అని కొందఱు.)

**కునాశకము.** సం. వి. అ. పుం. పిఁటకసింద*.

**కునికిపడు.** ద్వ. అ. క్రి. తూఁగిపడు.

**కునికిపాటు.** ద్వ. వి. తూఁగిపడుట, ప్రమీల.

**కునుకు.** దే. అ. క్రి. తూఁగు.

**కున్న.** వై. వి. కూనయొక్కరూపాంతరము. (బిడ్డకు.—"క. నిన్నింత వానిఁజేసిన, యన్నాలుగుమోములతఁడుహరిపొక్కిటియం, దున్న వెలితన్మియూనిన, కున్నయగుటతెలిసివిడువుకోపముతండ్రీ." లక్ష్మీ. ౫, ఆ.)

**కున్నఁడు.** వై. వి. బాలుఁడు.

**కున్ననము.** సం. వి. అ. న. 1. గాజుచిప్ప; 2. పెద్దకుండ.

**కుపసము.** వై. వి. (కుప్పసముయొక్కరూపాంతరము.) 1. అర చట్ట; "సీ. గురుపత్నినాకొక్కకుపసంబుఁగుట్టుముచలిగాలియొడ లిపైఁబొలయకుండ." కాశీ. ౭, ఆ.—2. నిడుచట్ట; 3. అవిక; 4. పాముయొక్కపైతోలు*. "ద్వి. కుపసంబులూడ్చినక్రూర సర్పముల, నుపమింపననువులై." రా. యు, కాం. (చూ. కుప్ప సము.)

**కుపితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కోపించినవాఁడు, క్రోధ నుఁడు.

**కుపూయము.** సం. విశే. (అ. ఆ. అ.) కుత్సితము.

**కుప్ప.** దే. వి. ధాన్యములోనగువాని రాశి.

**కుప్పఁగూర.** దే. వి. కుప్పవడుట. "హేమమొసఁగెఁగుప్పఁగూ రలునమగ్రకుతూహాలుఁడై." భార. ఆశ్వ. ౧, ఆ. "మ. సము ద్యద్వేగుఁడైతోలితో, వ్వఁఆఁబెట్టెన్‌శరజాలమున్ బిఱుఁదఁ గుప్పం గూరవాటించుచున్." నిర్వ. ౫, ఆ.

**కుప్పతిలు.** దే. అ. క్రి. కుప్పవడు. "కూలినభద్రనాగములుఁ గుప్పతిలంబడుచేరులున్." జై. ౫, ఆ.

**కుప్పనఁగూర.** దే. వి. కుప్పవడుట. "క. అప్పుడుగురుపుత్రా ద్రిం, గప్పఁగవజ్రోపమానకాండములువెసన్, గుప్పనఁగూరవఱ పనరుఁ, డప్పరుసఁదనమునకోర్చియతఁడుంబెనఁగెన్." భార. కర్ణ. ౨, ఆ. "అప్పుడు సతియునుబతియును, నొప్పుగసమదృష్టి నుండిరుచితొనకులై, కుప్పనఁగూరలుగామరుఁ, డప్పుష్పల కోల లేయనదనయ్యెననన్." భో. ౭, ఆ.

**కుప్పము.** దే. వి. 1. గ్రామము; 2. చెంబడివారిపల్లె.

**కుప్పవడు.** ద్వ. అ. క్రి. (కుప్ప+పడు.) కుప్పగాఁజేరు.

**కుప్పసము.** వై. వి. 1. అరచట్ట; "చమురైనతోల్కుప్పసంబు." ఆము. ౬, ఆ.—2. నిడుచట్ట; "ద్వి. పన్నుగాముదుకకుప్పసములు తొడిగి, చెన్నారబద్దలుచేతులఁబట్టి." రా. యు, కాం.—3. అవిక; "కుప్పసముల్వదల్చిరి." ఆము. ౫, ఆ.—4. పాముయొక్క పైతోలు*. "క. మంగళచరిత్రయగుసీ, తాంగననపవాదభీతుఁడగు నాకుఁద్యజిం, పంగఁదగునేఁడుదుష్టభు, జంగముతొలిప్రాఁతకుప్ప సంబూడ్చుగతిన్." జై. ౬, ఆ.

**కుప్పి.** దే. వి. అవాక్పుష్పి*.

**కుప్పించు.** వై. అ. క్రి. ఊపిరిపట్టు*. "పయికెంగుప్పించి లంఘించుచోన్." రామా. ౬, ఆ.

**కుప్పిగంతుకొను.** ద్వ. అ. క్రి. దుముకు. "గీ. వ్యోమకేశు జడలనుండియవ్వాహిని, కుప్పిగంతుగొనిఁగ్రుంగెధరణి." భో. ౭, ఆ.

**కుప్పిగంతులు.** ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. కుప్పిగం తులు పిడిగుద్దులాటలు పిల్ల దీపులు గొబ్బిళ్లు గూవనాలు." వి, పు. ౭, ఆ.

**కుప్పీలు.** దే. వి. బ. బాలికాక్రీడావిశేషము.

**కుప్పె.** వై. వి. 1. మెడనిడుపుగాఁగలకాచపాత్రవిశేషము; "వ. కప్పురంపుఁగుప్పెలంగుప్పరించిన సరసమధురసంబులు." పా. ౨, ఆ.—2. గొడుగుమీఁదిగుబ్బ*; "ద్వి. పెదపెద్దపసిఁడికుప్పెలు మీఁదనొప్పఁ, బ్రవిమలంబగు నెనుబదివేలసంఖ్య, ధవళాతపత్ర ముల్ దనుజులుపట్ట." రా. యు, కాం.—3. ఇత్తడిలోనగువానితోఁ జేసియెద్దుకొమ్ముకొనఁదగిల్చెడుగుబ్బ*; 4. స్త్రీశిరోభూషావిశేష ము*; "ఎ, గీ. అడరబెడఁగైన నిడువాలుజడనడల్చి, కుప్పెకన్పడ నవరంపుఁగొప్పఁబెట్టి, మరియుముంగిటనిలుచుండిమొలకనగవు, లెసఁగనిటభాగ్యరేఖయాహేమరేఖ." హంస. ౧, ఆ.—5. గిండి లోనగువానిమీఁదిమూఁత*. "క. చాలఁగనమృతముబాలుఁడు, క్రోలుటకైనినిచికసకకుంభంబులపై, నీలపుఁగుప్పెలునిలిపిన, పోలి కఁజనుమొనలఁగప్పుపాలఁతికినొప్పెన్." లక్ష్మీ. 3, ఆ.

**కుప్పెంట.** దే. వి. హరితమంజరి*.

**కుప్పెకోల.** ద్వ. వి. బాణవిశేషము, క్షుద్రకము. "వ. సాత్య కితఱిమిమనమొనసఱుముచేయందొడంగినద్రోణుండు మార్కొని యిరువదేనుకుప్పెకోలలనతనిచేతనేటులువడి." సం. "సాత్యకిః పంచవింశత్యాక్షుద్రకాణాంసమార్పయత్." భార. ద్రో. 3, ఆ.

**కుప్యము.** సం వి. అ. న. వెండి బంగారుఁదక్కతక్కిన లోహము.

**కుబుసము.** దే. వి. తలుపునకుఁ గ్రిందుమీఁదులనుంచెడు కొయ్యము.

**కుబేరకము.** సం. వి. అ. పుం. నందివృక్షము.

**కుబేరాక్షము.** సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము. "సీ. క్రీడించునొకవేళ తోడిబాలురఁగూడిఘుక్షీణగతిఁగుబేరాక్షకేళి." పాండు. ౪, ఆ.

**కుబేరాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టుచెట్టు.

**కుబేరుఁడు.** సం. వి. అ. పుం. ధనదుఁడు, పైఁడిఱేఁడు.

**కుబ్జ.** సం. వి. ఆ. స్త్రీ. పొట్టిది. అ. పుం. ము. 1. గజవిశేషము; 2. ఒకానొకచెట్టు. విణ. మఱుగుజ్జు.

**కుబ్జిక.** సం. వి. ఆ. స్త్రీ. గొజ్జఁగి. "కుబ్జికాభద్రతరణిర్బృహత్పత్రాతికేసరా, మహాసహా." ధన్వంతరినిఘంటువు.

**కుమారకము.** సం. వి. అ. న. చొక్కపుబంగారు. పుం. 1. గుఱ్ఱపుపిల్ల; 2. చిలుక; 3. ఉలిమిరిచెట్టు.

**కుమారి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కూఁతురు; 2. పెండ్లికానిపడుచు; 3. పార్వతి; 4. ఒకానొకయేఱు; 5. జంబూద్వీపము; 6. నల్లపిచ్చుక; 7. కలబందచెట్టు; 8. చేమంతిచెట్టు; 9. పిన్నగోరంట. (అనికొందఱు.) 10. విరజాజిచెట్టు.

**కుమారిలు.** దే. అ. క్రి. కుములు. "క. మానవతియిట్లుమానని, మానక్రోధములచేఁగుమారిలిచింతా, ధీనగతినుండమదిలో, నూనినప్రేమమునసంబుజోదరుఁడనియె." పా. ౧, ఆ.

**కుమారుఁడు.** సం. వి. అ. పుం. 1. కొడుకు; 2. బాలుఁడు; 3. స్కందుఁడు; 4. (నాట్యోక్తియందు) యువరాజు.

**కుమి.** దే. వి. కుసూలవిశేషము. "ఎ, గీ. తద్విశేషనామంబులు తనరుచుండుఁగొట్టెకూటుపాడకకుమిబొట్టయనఁగ." ఆం, భా. ద్వి. వై.

**కుముఖము.** సం. వి. అ. పుం. పంది.

**కుముటు.** దే. అ. క్రి. ఓకరకై కంఠబిలమున వికారమెత్తు. వి. ఓకరకై కంఠబిలముననెత్తువికారము.

**కుముద.** సం. వి. ఆ. స్త్రీ. 1. గుమ్ముడుచెట్టు; 2. పేఁకుచెట్టు. అ. న. ము. 1. ఎఱ్ఱదామర; 2. తెల్లగలువ. పుం. 1. నిరృతిదిక్కునందలి యేనుఁగు; 2. ఒకానొకపాము.

**కుముదబాంధవుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, కలువవిందు.

**కుముదిక.** సం. వి. ఆ. స్త్రీ. పినగుమ్ముడుచెట్టు.

**కుముదిని.** సం. వి. ఈ. స్త్రీ. తెల్లకలువతీఁగ.

**కుముదుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొక కోఁతి; 2. ఒకానొక రాక్షసుఁడు.

**కుముద్వంతము.** సం. విణ. (త్. ఈ. త్.) తెల్లకలువలు తఱుచుగాఁగలది. (దేశము.)

**కుముద్వతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లకలువతీఁగ; 2. కుశుని పెండ్లాము.

**కుములు.** దే. అ. క్రి. లోలోపలఁదపించు. "క. అనిబుజ్జగించియొయ్యన, నెనరంటినమనముతోడనెచ్చెలిపలుకన్, దనలోఁగుములుచసీమం, తినిపైనిగనిగనివెలుఁగునెలఁ గనిపలికెన్." చంద్ర.

**కుమ్మకు.** హిం. వి. సహాయము, తోఁడు

**కుమ్మర.** వై. వి. కుండలుచేసి జీవించెడుజాతి. (కుమ్మరవాఁడు, కుమ్మరది.) విణ. నలుపు*. (కుమ్మరగువ్వ, కుమ్మరపానిక మొ.)

**కుమ్మరగువ్వ.** ద్వ. వి. పక్షివిశేషము, ఖంజరీటము.

**కుమ్మరచెట్టు.** ద్వ. వి. ఒకానొకచెట్టు.

**కుమ్మరత.** ద్వ. వి. కుమ్మరది.

**కుమ్మరపురుగు.** వై. వి. ఒకానొకపురుగు, యమకీటము.

**కుమ్మరపానిక.** ద్వ. వి. కృష్ణముఖజముచెట్టు.

**కుమ్మరపోలికచెట్టు.** ద్వ. వి. ఒకానొకచెట్టు.

**కుమ్మరసారెచుక్క.** ద్వ. వి. విశాఖానక్షత్రము.

**కుమ్మరి.** వై. వి. (కుమ్మర+ఇ.) కుమ్మరవాఁడు.

**కుమ్మరించు.** దే. ప్రే. కుమ్మరిలఁజేయు.

**కుమ్మరింపు.** దే. వి. మల్లబంధవిశేషము. "శ్లే. కన్నాల చాంగణ కందణంబు తిఱిఁగి గొంతుమాఱునుజేబ కుమ్మరింపు." ఆం, భా. ద్వి. త్ర.

**కుమ్మరిలు.** దే. అ. క్రి. 1. నీళ్లులోనగునవి కుండలోనగువానియందుండిపడు; 2. రాలు. "మిడిగ్రుడ్లుసుఱనిప్పులు కుమ్మరిలఁగ." హరి. పూ, ౫, ఆ.

**కుమ్మి.** దే. వి. కుమికి మొదటిరూపము. "శ్లే. మూసికుట్లిడిచి కుమ్ములకొల్చి పైపెత్తు లూడ్వఁడు పస్తైసనుండుననని." సాంప. ౪, ఆ.

**కుమ్ము.** దే. స. క్రి. 1. నలియఁగొట్టు; 2. పొడుచు. వి. పొట్టునిప్పు, కుకూలము.

**కుమ్ముసుద్ది.** ద్వ. వి. సంకేతవృత్తాంతము.

**కుమ్మె.** దే. వి. పోటు. "క. కుమ్మెలువాఁడిసబంగరు, బొమ్మరములయెమ్మెఁగడకుఁబొమ్మను." సా. ౨, ఆ.

**కుమ్మెలువోవు.** దే. అ. క్రి. గాయమగు. "ఉ. కుమ్మెలుబోవనొక్కి చెలిక్రోలినతేనియ కావిమోవితో." శశాం. ౪, ఆ.

**కుయి.** దే. వి. 1. మొఱ; "మ. దవధూమంపుఁదమంబులోఁదమరసద్రవ్యంబుపంకేజబాం, ధవభానుప్రతతుల్ హరింపఁగుయిపెట్టన్వెళ్లుఘూన్యోరుకూ, పవితానంబనఁజూడఁజూడఁబుడమింబాటిల్లిపైవిప్పులై, యవనంబంచుల నాడఁగానెగసివాత్యాళిఁ జక్రములే." ఆము. ౨, ఆ.—2. రక్షణము. "సీ. పసులకైకుయివోయి పరులశస్త్రములచేననిలోననమసినయట్టివారు." రుక్మాం. ౨, ఆ. (కుయ్యియొక్కరూపాంతరము.)

**కుయ్యి.** దే. వి. 1. మొఱ; "కుయ్యిడశక్తిలేదుదరగోళములోపలనున్నవాఁడ." భాగ. ౧, స్కం.—2. రక్షణము.

**కురంగమము.** సం. వి. అ. పుం. హరిణము, జింక.

**కురంగము.** సం. వి. అ. పుం. 1. జింక; 2. కోఁతి.

**కురంటక.** సం. వి. ఆ. స్త్రీ. తుమ్మిచెట్టు. అ. పుం. ము. 1. పచ్చగోరంటచెట్టు; 2. పచ్చచేమంతిచెట్టు. పచ్చపుష్పములుగోరంట; పచ్చపువ్వుల పెద్దగోరంట. (అనికొందఱు.)

**కురండము.** సం. వి. అ. పుం. అండవృద్ధి, బుడ్డ.

**కురపము.** సం. వి. అ. పుం. గుఱ్ఱముదోమెడు గొఱపము.

**కురము.** దే. వి. పశువులకుఁ గలిగెడు శీతరోగము.

**కురరము.** సం. వి. అ. పుం. ఉత్క్రోశము, లకుముకిపిట్ట. గోరువంక. (అనికొందఱు.) పెన్నడపులుఁగు. (అనికొందఱు.)

**కురరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గొఱ్ఱె; 2. ఆఁడులకుముకి.

**కురవకము.** సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగోరంటచెట్టు; దీనికి దోహదక్రియ ఆలింగనము. 2. ఎఱ్ఱచేమంతిచెట్టు. ఎఱ్ఱపువ్వుల పెద్దగోరంట; ఎఱ్ఱపువ్వుల ములుగోరంట. (అనికొందఱు.)

**కురాళము.** దే. వి. చప్పరము. "మ. గుజ్జరి నిద్దా తగటీ కురాళములలో సంపెంగ పూఁబాన్పులన్." చంద్ర.

**కురాసాని.** దే. వి. ఒకానొకదేశము.

**కురిచీ.** దే. వి. కూర్చుండుటకై యున్న పీఠము. 'వజ్రపుటేళ్లనున్నట్టిలు మేల్వెండికురిచీలు.'' పర. ౧, ఆ.

**కురిడి.** దే. వి. లోపలి సీరిచెడనకొబ్బెర.

**కురిమిడి.** దే. వి. మడిచుట్టువేసినకట్ట, గనిమ.

**కురియు.** దే. స. క్రి. వర్షించు. అం, ప్రే. కురియించు. ''ఎ, గీ. అసురకామినీనేత్రతోయములుకురిసి, యంబుదద్యుతిం ద్రిదశ నస్యంబుఁ బ్రోచు, నెవ్వఁడవ్విష్ణుఁడు.'' హరి. పూ. ౪, ఆ.

**కురుంబము.** సం. వి. అ. పుం. సమూహము, గుంపు.

**కురుఁజు.** దే. వి. 1. దూలముమీఁదిగుజ్జు; 2. మంచె. ''ఉ. అప్పుడవారుదీర్పురుల నందులకున్ సపుకూర్పజాళువా, యొప్పులకుప్ప లైమెఱయుచుండెడుమేరువులం గురుంజులుం, జప్పరిములోని తా నములు వర్ష్మమునాయితపెట్టి.'' విజ. ౨, ఆ.

**కురుజీ.** దే. వి. చిన్నకంట్లము.

**కురుజు.** దే. వి. 1. జున్ను; ''ఎ, గీ. కురుజులేనియడకాదిదికుసుమ రసము.'' శశాం. 3, ఆ.—2. శ్వేనవిశేషము; 3. బాణపునంచు వగ. ''వ. కురుజులుకుండబిఱుసులునంపెంగపూలబిఱుసులు.'' హంస. 3, ఆ.—4. ఈఁకలురాల్చినపక్షి.

**కురుప.** దే. వి. గొఱ్ఱెతుప్పటకంబళినేయు గొల్ల.

**కురుపగొఱ్ఱె.** దే. వి. దేహమునందు నిడుపుబొచ్చుగలగొఱ్ఱె.

**కురుమ.** దే. వి. గొఱ్ఱెతుప్పట కంబళినేయు గొల్లజాతి. (కురుమ వాఁడు.)

**కురుబిస్తము.** సం. వి. అ. పుం. బంగారముయొక్క పలము. (రూ. కురువిస్తము.)

**కురులు.** దే. వి. 1. ముంగురులు; ''సీ. ప్రస్వేదముసం దోఁగి ఫాలంబుతోనంటి యుగ్మలినీకురు లొప్పుగంది.'' భార. విరా. ౨; ఆ. ''కూఁకటివేఁడిఁతోఁగురులుకూడకమున్న.'' కళా. ౧, ఆ.—2. వెండ్రుక*. ''సీ. కొప్పుమెల్లనవిచ్చికురులుచిక్కుడలించి తలయంటెనేర్పుతోఁబాలంటియొకతె.'' యా. ౪, ఆ.

**కురువ.** దే. వి. కొండమీఁది కాలిత్రోవ.

**కురువిందము.** సం. వి. అ. పుం. 1. మాణిక్యవిశేషము; (ఇది కాలపురమునందు పుట్టినది, పసుపుదాళికలది, మధ్యమజాతి రత్నము.) (చూ. మాణిక్యము.) 2. అద్దము; 3. ఇంగిలికము; 4. నిడుముస్తె; 5. వ్రీహివిశేషము.

**కురువు.** సం. వి. ఉ. న. ఒక వర్షము. (చూ. వర్షము.) పుం. 1. ఒకానొకరాజు; 2. ఒకానొకదేశము; 3. అన్నము.

**కురువేరు.** దే. వి. (కురులు+వేరు.) ఒకానొకవేరు, హ్రీబేరము.

**కురుళము.** సం. వి. అ. పుం. ముంగురులు. ''శేలలాశ్చేభ్రమరకాః కురుళా భ్రమరాలకాః.'' వైజయంతీనిఘంటువు.

**కుర్కురము.** సం. వి. అ. న. గండివవనము*. పుం. కుక్క.

**కుర్దనము.** సం. వి. అ. న. క్రీడ. (రూ. కూర్దనము.)

**కుర్పరము.** సం. వి. అ. పుం. కూర్పరము, మోఁచెయి.

**కుర్వాణుఁడు.** సం. వి. అ. పుం. పనివాఁడు. విణ. చేయు వాఁడు.

**కుఱఁగలి.** దే. వి. సమీపము. ''వ. తఱుచుగభాగునందను నిధానమునందు నభీష్టవస్తువుల్, గుఱుతులుమీఱఁగొంచరుగు కోవిదకోటుల నమ్మదాత్తువుల్, వఱదలువాఱుఁ బ్రస్తుతరవంబులుమిన్నులురాయుచుండునన, కుఱఁగటశోకజాత్తువులుఁ గోయను నేడ్పులు నుప్పతిల్లెడున్.'' జై. ౧, ఆ.

**కుఱకఱ.** దే. విణ. అల్పము. ''క. ఎఱసంజనెఱసివిరిసెం, జిఱు చీఁకటులెగసె గగనసీమన్ బలసెన్, గుఱుకుఱతెగలైకనఁబడి, తఱచై వెనువెనుకపెక్కుతారలుదోఁచెన్.'' రామా. 2, ఆ.

**కుఱినువ్వులు.** దే. వి. బ. తిలవిశేషము.

**కుఱు.** దే. విణ. వృత్తియందుఁగుఱుచశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. కుఱుగద్దియ, కుఱుగనుపు, కుఱుగటె, కుఱుగేలు, కుఱుమావు మొ. అచ్చుపరమగుచో ఆకారమునకు టకారద్విత్వ మాదేశంబగు. కుట్టారుగ, కుట్టుముక, కుట్టుసుఱు, కుట్టూపిరి, కుట్టూరుపు మొ.)

**కుఱుకు.** దే. వి. ప్రోవు, రాశి. ''మ. కుఱుకుల్ గట్టెభటాంగకంబులురణక్షోణిం బ్రవాహంబులై, వఱచెన్ నెత్తురు.'' భార. ద్రో. ౪, ఆ.

**కుఱుగడ.** దే. వి. (కుఱుచ+గడ.) దండము. ''విఱిగిపడిన కుఱుగడలును.'' జై. ౫, ఆ.

**కుఱుచ.** దే. వి. 1 హ్రస్వస్వరము; 2. బ. నాట్యవిశేషము. ''పేరముల్ కుఱుచలుద్రొక్క.'' వసు. ౫, ఆ.—విణ. హ్రస్వము. (కొన్నియెడలవృత్తియందంత్యవర్ణలోపము. చూ. కుఱు.)

**కుఱుచపడు.** దే. అ. క్రి. తగ్గు.

**కుఱుపు.** దే. వి. వ్రణము.

**కుఱుమట్టము.** దే. విణ. వినతము, వినమ్రము. ''క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, నఱిముఱిగుబురులకుఁజనుచు హరిహరియను చున్, మఱుఁగుచు నులుకుచు దిరదిరఁ గుఱుమట్టపుఁబొట్టివడుగు గొంతనటించెన్.'' భాగ. ౮, స్క—౦.

**కుఱుమాడు.** దే. వి. ఇంటిమూలకప్పు.

**కుఱువు.** దే. వి. తొడ, ఉత్సంగము. ''ఎ, గీ. కుఱువుపైనున్న కిన్నరయుఅక్కతోఁచి.'' పాండు. ౫, ఆ.

**కుఱ్ఱ.** దే. వి. 1. కోడెయనుపోతు; 2. కొడుకు; ''గీ. ఎన్నఁగొమరులుకల్గకయున్నవారి, కిందునందును నెమ్మదిపొందదనుచుఁ, బుడమి వేలుపుఁ బెద్దలునుడువుచుందు, రట్లగుటఁగుఱ్ఱలిఁగనాకునబ్బవలయు.'' అచ్చె. బాల, కాం.—3. బాలుఁడు; ''గీ. కోరుమెద్దియైనఁగుఱ్ఱనీవు.'' భాగ. 2, స్క—౦.—4. బిడ్డఁడు.

**కుఱ్ఱఁడు.** దే. వి. 1. కొడుకు; 2. బాలుఁడు; 3. బిడ్డఁడు. ''సీ. కొడుకుఁగుఱ్ఱఁడుచన్నుఁగుడువకట్లుండవిచారించిమేదరసాని యపుడు.'' పర. ౧, ఆ.

**కుఱ్ఱి.** దే. వి. పాఁడియావు, ధేనువు. ''అంతధనంబునునట్టిరాజ్యమున్, గొననగునయ్యయిచ్చిడిపికుఱ్ఱికి.'' భార. ఆది. 2, ఆ.

**కుఱ్ఱు.** దే. అ. క్రి. కూయు.

**కులకము.** సం. వి. అ. న. 1. ఒక క్రియతో ముగిసెడు పద్యముల సమూహము; 2. చేదుపొట్ల*. పుం. 1. కాకితుమ్మిక*; 2. పుట్ట.

**కులకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కులశ్రేష్ఠుఁడు.

**కులట.** సం. వి. ఆ. స్త్రీ. అసతి, ఱంకుటాలు.

**కులపర్వతము.** సం. వి. అ. పుం. ప్రధానపర్వతము. (ఇవి. ౭. ''మహేంద్రోమలయస్సహ్యశ్శుక్తిమాన్ గంధమాదనః, వింధ్యశ్చపారియాత్రశ్చసప్తైతేకులపర్వతాః.'' త్రికాండశేషము.)

**కులపాలిక.** సం. వి. అ. స్త్రీ. తల్లిదండ్రులచేనిచ్చి పెండ్లిచేయఁబడిన స్త్రీ.

**కులము.** సం. వి. అ. న. 1. వంశము; 2. తెగ; 3. ఇల్లు; 4. ఊరు; 5. శరీరము; 6. చేదుపొట్లకాయ.

**కులసంభవుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మంచివంశమునందుఁ బుట్టినవాఁడు.

**కులస్త్రీ.** సం. వి. ఈ. స్త్రీ. కులపాలిక.

**కులాయము.** సం. వి. అ. పుం. 1. పక్షిగూఁడు; 2. చోటు.

**కులాలము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము, గంపపులుఁగు.

**కులాయి.** హిం. వి. తలమీఁదనుంచు టోపి.

**కులాలి.** సం. వి. ఈ. స్త్రీ. కనుపాలవిత్తులు.

**కులాలుఁడు.** సం. వి. అ. పుం. కుమ్మరవాఁడు.

**కులి.** సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడుకాయ. ఇ. పుం. చేయి. "కులిర్హస్తోభుజాదళిః." త్రికాండశేషము.

**కులికము.** సం. వి. అ. పుం. 1. ఒకానొక చెట్టు; 2. ఒకానొక పాము.

**కులికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కులశ్రేష్ఠుఁడు.

**కులిశము.** సం. వి. అ. పుం, న. వజ్రాయుధము. పుం. మత్స్యవిశేషము.

**కులీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మంచికులమునఁబుట్టినవాఁడు.

**కులుకము.** సం. వి. అ. న. నాలుక ముటికి.

**కులుకు.** దే. అ. క్రి. శృంగారముగ కదులు. స. క్రి. 1. పూయు; "చ. అలఘుతదీయఖేలనలనాడెడునన్నులగుబ్బచన్నులన్, గులికిన యేణనాభినవకుంకుమసంకుమదాంకపంకసం, కలితకలేపములకరఁగి గమ్మనికమ్మనితావులీనఁద, జ్జలములఁదేలిభోగులనఁజాలిరిచెల్వపుఁజలవ్వెందొరల్." హంస. ౧, ఆ.—2. పోయు; "సీ. గొజ్జంగపూనీరుకులికిమేదించినకమ్మకస్తురిమేనఁగలయనలఁదు." కాశీ. 3, ఆ.—3. వెదచల్లు; "నాగరదధిగంధముల్ కులుకుకట్టుప్రసాదపుమూటతోడుతన్." పర. ౪, ఆ.—4. వేయు. "క. గంబూరకులికియనురా, గంబూరమనంబుచల్లఁగాఁబన్నీటన్, బింబోష్ఠియతనిపాదా, బ్జంబుంగడిగించెఁగూర్మినకియలచేతన్." సా. ౨, ఆ.—అం. ప్రే. కదిలించు. "ఎ, గీ. పల్లకునుదేఁటిచిన్నిపావలకుఁగులికి, పువ్వుఁదేనియయుగ్గులుపోసిపోసి." య. ౪, ఆ.—వి. 1. శృంగారపుకదిలిక; (కులుకులాఁడి మొ.) 2. వణఁకుట. "సీ. వనివాల్గువాడెడువదనాబ్జములతోడ నలపుఁదెల్పెడుకుల్కుఁబెలుఁగుతోడ." పర. ౪, ఆ.

**కులుకులాఁడి.** దే. వి. (కులుకులు+ఆఁడి.) కులుకుగల స్త్రీ.

**కులుపు.** దే. వి. శోభ.

**కుల్మాషము.** సం. వి. అ. న. పులియఁబెట్టిన కడుగునీరు. (కుల్మాషాభిషుతమని యేకపదముగాఁగొందఱు.) పుం. 1. గుగ్గిళ్లు, 2. గోధూమవిశేషము. యవవిశేషము. (అనికొందఱు.)

**కుల్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. కాలువ; 2. నీళ్లుపోయెడుస్రోవి; 3. తిప్పతీఁగ. అ. న. ము. 1. ఎముక; 2. తొలిచినకొండదొన; 3. మాంసము; 4. మానవిశేషము. విశే. 1. మంచికులమునఁబుట్టినది; 2. కులమునకు హితమైనది.

**కుల్యుఁడు.** సం. వి. అ. పుం. గౌరవింపఁదగిన మనుష్యుఁడు.

**కువ.** దే. వి. కువ్వయొక్క-రూపాంతరము. "క. ఏవిధాస్త్రకోవిదుఁడువా, నవివానిదఁబురభ్యసారథులమహిన్, గవలువడనేసి నుగ్రా, వమునకునువాఁడువిముఖుఁడై వడిఁబఱవన్." భార. ఆది. ౬, ఆ.

**కువలము.** సం. వి. అ. న. 1. కలువ; 2. ముత్యము; 3. రేఁగుఁబండు. త్రి. రేఁగుకాయ.

**కువలయము.** సం. వి. అ. న. ఉత్పలము, కలువ.

**కువలాయికము.** సం. వి. అ. పుం. పాంసజాతివిశేషము.

**కువాడము.** వై. వి. కువ్వాడముయొక్క-రూపాంతరము.

**కువాదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పరులదోషమును పలుకువాఁడు. నిక్కృష్టపుమాటలాడువాఁడు. (అనికొందఱు.)

**కువాళము.** యు. దే. వి. వాహనములోనగువానిగప్పుసెన. "సీ. వాహనాద్యాచ్ఛాద్యవస్త్రసంజ్ఞ, తనరుఁగువాళమంచనఁగ." ఆం, భా. ౭౭ మ.—వై. కపటము*. (ఈ యర్థమునందిది కువాడము యొక్క-రూపాంతరము.)

**కువిందుఁడు.** సం. వి. అ. పుం. తంతువాయుఁడు, సాలెవాఁడు.

**కువేణి.** సం. వి. ఈ. స్త్రీ. చేపలఁబట్టివేయుబుట్ట.

**కువేలము.** సం. వి. అ. న. కువలము, కలువ.

**కువ్వ.** దే. వి. కుప్ప, రాశి.

**కువ్వాడము.** వై. వి. కపటము*.

**కుశ.** సం. వి. ఆ. స్త్రీ. త్రాడు. అ. న. ము. నీళ్లు. పుం, న. దర్భ. పుం. 1. ఒక ద్వీపము; 2. పలుపు.

**కుశలము.** సం. వి. అ. న. 1. క్షేమము; 2. తృప్తి; 3. పుణ్యము. విశే. నేర్పరి.

**కుశాలు.** హిం. వి. సంతోషము.

**కుశి.** సం. వి. ఈ. స్త్రీ. కఱ్ఱు. ఇనుముతోఁజేసినవస్తువు. (అనికొందఱు.)

**కుశికము.** సం. వి. అ. పుం. అయోవికారము.

**కుశికుఁడు.** సం. వి. అ. పుం. విశ్వామిత్రునితండ్రి.

**కుశీలవుఁడు.** సం. వి. అ. పుం. 1. నానాదేశసంచారకుఁడైన నట్టువుఁడు; 2. నానాదేశసంచారకుఁడైన బట్టువాఁడు; 3. వాల్మీకి.

**కుశుఁడు.** సం. వి. అ. పుం. రామునిపెద్దకొడుకు. విశే. 1. పాపము చేసినవాఁడు; 2. మదించినవాఁడు.

**కుశేశయము.** సం. వి. అ. న. పద్మము, తామర.

**కుషీ. ఖుషీ.** హిం. వి. సంతోషము.

**కుష్ఠము.** సం. వి. అ. న. 1. వ్యాధివిశేషము, పులుము; 2. చెంగల్వకోష్టుకాయ. పుం. విషభేదము.

**కుసి.** దే. వి. గండియందుఁ జొప్పించుటకుఁగాను సన్నఁగాఁజెక్కిన మంచపుపట్టెలోనగువానిచివర. "గీ. కూలినప్పుడెరయఁగుసులెల్ల విఱుగును."

**కుసిగుంపులు.** దే. వి. బ. శ్రమము, బాధ. "సీ. కుసిగుంపులిడకేమి కొన్నయంగడిలోన మాఱుబేరములేలెమంజువాణి." చంద్ర.

**కుసిలించు.** దే. అ. క్రి. అతృప్తిచే దుఃఖించు.

**కుసిలింత.** దే. వి. అతృప్తిచే దుఃఖించుట.

**కుసిని.** అవ్య. దే. గ. పంటయిష్టి.

**కుసీదము.** సం. వి. అ. న. వడ్డికిచ్చి జీవనముచేయుట. విశే. డు. వడ్డికిచ్చి జీవనముచేయువాఁడు.

**కుసీదికుఁడు.** సం. విశే. (అ. ఇ. అ.) వడ్డికిచ్చి జీవనముచేయువాఁడు.

**కుసుంభము.** సం. వి. అ. న. 1. కుసుమపువ్వు; 2. బంగారు. పుం. కమండలువు.

**కుసుంభరాగము.** సం. వి. అ. పుం. బయటికిమాత్రము విశేషముగాఁగనఁబడి లోపల బొత్తిగాలేని అనురాగము. (చూ. పూర్వరాగము.)

**కుసుమ.** యు. దే. వి. 1. ఒకానొకచెట్టు; 2. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము "మ. పొరిదింబేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులుం బుష్పముం, జరులున్మామిడిగుత్తులున్ గుసుమలున్ సంపెంగలున్బచ్చగ, న్నెరుపూఁబాళలుఁగల్గిరాజనముకాంతిందారుములేసూపిచే, లరుదారన్నగుఁబూవుఁదోఁటల బలాకానీకదంభంబునన్." ఆము. ౧, ఆ.—వై. వి. 1. కుసుంభపుష్పము; "సీ. పసిఁడికమ్ములతోడి కుసుమపూవన్నియ సిద్దంపుఁబుట్టంబునెఱియఁగట్టి." కాశీ. ౭, ఆ.—2. కుసుంభవర్ణము*. "ఎ, గీ. కుముదకేదారముననుండిక్రొత్తవిరియు, కమలషండంబులకువేడ్కఁగాపువచ్చు, కొదమతుమ్మెదకడఱెక్కఁగుసుమవెట్టి, నభినవంబైనప్రథమసంధ్యాగమంబు." నై. ౭, ఆ.

**కుసుమము.** ఉభ. వై. వి. కుసుంభవర్ణము*. "క. కుసుమంబద్దినవిధమునఁ, బసుపునహత్తించినట్లుబంగారమునన్, బసనిచ్చినగతి సంధ్యా, వసరంబుననింగియరుణవర్ణంబయ్యెన్." నై. ౭, ఆ.—దే. బ. ధాన్యవిశేషము. "సీ. బలుతీఁగమల్లెలుపార్జించితిమి చాలఁ గుసుమముల్ చేలుకగాఁ గూర్పలేమె." కవి. ౧, ఆ.—సం. వి. అ. న. 1. పువ్వు; 2. కంటితెవులు; 3. స్త్రీరజస్సు; 4. పండు.

**కుసుమాంజనము.** సం. వి. అ. న. పుష్పాంజనము.

**కుసుమ.** దే. వి. పుంచుసందలి మొలక.

**కుసుమేషువు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**కుసులు.** దే. అ. క్రి. కుసిలించు.

**కుసూలము.** సం. వి. అ. పుం. ధాన్యముంచెడుగరిసె.

**కుస్మృతి.** సం. వి. ఈ. స్త్రీ. నికృతి, కుత్సితభావము.

**కుస్తరించు.** దే. స. క్రి. 1. ఊఱడించు; "గీ. స్వాగతముచేయునేనాఁడుఁజంద్రమౌళి, కాంక్షితంబిచ్చునేనాఁడు గాళగళుఁడు, కాశిలోఁబడ్డమానభంగంబువాయఁ, గుస్తరించునెననుశూలి కుంభజన్మ." భీ. 3, ఆ.—2. సమాధానపఱచు; "పంచశరవ్యథన్ దలఁకుభావమునేగతిఁ గుస్తరింతు." విక్ర. ౬, ఆ.—3. సవరించు; "సీ. సీమంతపథమునఁజేర్చుక్కనవరించి కురులపైఁజిన్నిపూఁగుస్తరించి." కాశీ. ౭, ఆ.—4. చఱచు. "చ. కనఁదగుతెల్లమానికపుఁ గప్పులనొప్పెడు చప్పరాలలోఁ, దనపాడవైననీడఁగని తాళకయేనుఁగటంచుఁగొమ్ములన్, జెనకఁగవచ్చికోటపయిఁ జేసినముత్తెపు సింగపుంగమిన్, గనుఁగొని తొఱువేల్పుదొరగా రతఁడొదలఁగుస్తరింపఁగన్." యు. ౧, ఆ.

**కుస్తుంబరి.** సం. వి. ఈ. స్త్రీ. ధాన్యాకము, కొత్తిమిరి.

**కుస్తుంబురువు.** సం. వి. ఉ. న._____ పై._____

**కుస్తుభుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. సముద్రుఁడు. (అని కాండము.)

**కుహకము.** సం. వి. అ. పుం. వంచన, మోసము.

**కుహకుఁడు.** సం. వి. అ. పుం. జారుఁడు, అంకుమగఁడు.

**కుహన.** సం. వి. ఆ. స్త్రీ. అర్థాపేక్షచేతనగు కపటచర్య. అ. పుం. ము. 1. ఎలుక; 2. పాము. విశే. ఈర్ష్యగలది.

**కుహరము.** సం. వి. అ. న. 1. గుహ; 2. బెజ్జము. పుం. ఒకానొకపాము.

**కుహళి.** సం. వి. ఆ. స్త్రీ. కాళె. "దిక్పథవాటీకుహళింప్రతిధ్వనులు సంపాదింప." జై. ౫, ఆ.

**కుహళి.** సం. వి. ఈ. స్త్రీ. పోఁకపొత్తి. (చూ. పొత్తిమూడవయర్థము.)

**కువాళి.** సం. వి. ఆ. స్త్రీ. కుహళియొక్కరూపాంతరము. "కాహళీతుకుహాళాస్యాత్." అ, పా. ప్ర. నాట్య.

**కుహువు.** సం. వి. ఊ. స్త్రీ. 1. చంద్రకళకానరానియమావాస్య; 2. కోకిలధ్వని.

**కుహేళిక.** సం. వి. ఆ. స్త్రీ. ధూమిక, మూడమంచు.

**కుళాయి.** వై. వి. కుల్లాయియొక్కరూపాంతరము. "క. ఉరముల మణిహారంబులు, కరములఁగటకాంగుళీయకప్రముఖములున్, శిరములమిసిమికుళాయలు, ధరియించిచెలంగిరఖిలతరుచరముఖ్యుల్." ఉ, రా. ౫, ఆ.

**కుళింగము.** సం. వి. అ. పుం. అడవిపిచ్చుక.

**కుళీరము.** సం. వి. అ. పుం. కర్కటకము, ఎండ్రకాయ.

**కుళుత్థము.** సం. వి. అ. పుం. ఉలవలు.

**కుళుత్థిక.** సం. వి. ఆ. స్త్రీ. కనుపాలవిత్తులు.

**కుళుపు.** దే. వి. ఉంగరమునకుఁబొదిగెడు విశాలమగుమణివిశేషము. "చ. సరసిజసంభవుండుపురసారసగేహినికిన్రచించున, చ్చెరువగుసీలపుంగుళుపుచెక్కినమేలిపసిండిముద్దుటుం, గరమనమింటితోనొరయికన్గనుపట్టెడుగోపురస్ఫుర, ద్గురుతరశాతకుంభరుచి గుంభిత సాలము వీట మీటగున్." చంద్రా. ౧, ఆ.

**కుల్లా.** వై. వి. కుల్లాయియొక్కరూపాంతరము. "జిగిపొంగుబురుసాపనిబెడంగుగలకుల్లా నింగికిఁదళత్తళలొసంగ." రా, వి. ౩, ఆ.

**కుల్లాయి.** వై. వి. పటరచితమకుటము. "క. తలగలిగిన కుల్లాయలు, కలవు." సా. ౩, ఆ.

**కుళ్లు.** దే. అ. క్రి. క్రుళ్లుయొక్కరూపాంతరము.

**కుళ్లుపోతు.** దే. విశే. క్రుళ్లుపోతుయొక్కరూపాంతరము.

## కూ.

**కూ.** దే. అవ్య. పిలువఁగా పామరజనులెచ్చరించుకొనుటయందు వచ్చును.

**కూఁక.** దే. వి. అఱపు. "క. ఆఁకట మలమల మాఁడుచుఁ, గూఁకలువెట్టుచును బయటఁ గువలయసురుల, క్షాఁకల నుండఁగ నీకీ, వీకన్భుజియింపఁ దగునె విప్రవరేణ్యా." శివ. ౧, ఆ.

**కూఁకటి.** వై. వి. 1. జుట్టు*; "గీ. వాఁడియైనకత్తివాతియమ్మునుగొని, పగతుశిరముచెక్కలెగయగొఱిగి, నరులకెల్లఁజూడనవ్వగునట్లుగాఁ, గలయనైదుకూఁకటులనొనర్చె." భార. అర. ౬, ఆ.—2. పిల్లజుట్టు*; "సీ. ఉదకబిందుకలాపముట్టియుట్టిపడంగఁగర

మొప్పముద్దుకూఁకట్లతోఁడ.'' సం. ''తోయార్ద్రకాకపక్షాగ్రమ్.'' కాశీ. ౪, ఆ.—విశే. ప్రధానము. ''కూఁకటివేఁడితోఁగురులుకూడక మున్న.'' కళా. ౧, ఆ. (ఇట్లు కూఁకటివేరు మొ.)

**కూఁకటిపువ్వె.** ద్వి. వి. పక్షివిశేషము.

**కూఁకటిమూఁగ.** ద్వి. వి. పక్షివిశేషము, కళింగము.

**కూఁకరించు.** దే. అ. క్రి. కూఁకలువేయు. ''రేఁచివారినిగూఁకరించిపోవు.'' సత్య. ౪, ఆ.

**కూఁత.** దే. వి. కూయుట.

**కూఁతకైదువు.** దే. వి. శంఖము.

**కూఁతనేల.** దే. వి. కోసునేల, క్రోశము.

**కూఁతపట్టు.** దే. వి.——పై.——

**కూఁతవేటు.** దే. వి.——పై.——''సీ. విసుమిచ్చుటికేఁగూఁతవేటుదూరంబునఁగలదొక్క హ్రదమునిర్మలజలంబు.'' హరిశ్చ. 3, ఆ.

**కూఁతురు.** దే. వి. కొమార్త, పుత్త్రిక.

**కూఁతురుబుడమ.** దే. వి. ఏలావాలుకము?.

**కూకీ.** దే. వి. పారావతవిశేషము. (కొందఱు హ్రస్వాంతముగాను వ్రాసియున్నారు.)

**కూకు.** దే. వి. పాలపిట్టగుడు, ఆమిక్ష. ''సీ. ఆమిక్షనంజ్ఞయై యలరుఁగూకు.'' ఆం, భా. ద్వి. బ్ర.

**కూకుదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వరుని సత్కరించి యలంకృతురాలగు కూఁతునిచ్చువాఁడు.

**కూకురుగుండెఁగి.** దే. వి. పక్షివిశేషము, దాత్యూహము.

**కూచి.** దే. విశే. 1. (యుద్ధయాత్రకు సైనికులు హెచ్చరికపడుటకై) యుద్ధవాద్యములను వాయించుట; ''వ. అప్పుడుభయపార్శ్వవర్తులైబలసికలసికొలిచియున్న చంద్రాదులవిలోకించిపయనంబయిరండు పొండనిపంచి కూచినేయ నియమించి.'' చంద్ర. 3, ఆ.—2. వాఁడి. ''ఉ. చూచుతఱిఁ మనోభవుఁడుచొచ్చి పరస్పరవీక్షణంబుల, న్కాచిమెఱుంగుబల్ చిలుకుఁగోలలపాలయినొచ్చియెందునా, హాచనలేనియానరవరాత్మజులంజిగురాకుఁగత్తి చేఁ,గాచుటలేకయడ్డపునఱికఁదొడఁగెఁవడిసజ్జసజ్జగఁ.''చంద్రా. ౨, ఆ.

**కూచిమారుఁడు.** సం. వి. అ. పుం. పురుషజాతులు నాల్గింటిలో నొక జాతివాఁడు.

**కూచేము.** దే. వి. 1. గూటము; 2. స్తంభము.

**కూజా.** హిం. వి. పాత్రవిశేషము.

**కూటకము.** సం. వి. అ. న. ఏఁడికోలలేనినాఁగలి, గొఱు. పుం. వెండ్రుకలకొప్పు.

**కూటమి.** దే. వి. 1. కూడిక; 2. సురతము.

**కూటము.** ఉభ. దే. వి. 1. కొలువుకూటము; ''క. అలుకుఁడు మృగమదమునఁ ముగ్గులువెట్టుండుకప్పురమునఁగుంకుమమునగో, డలుపూయుఁడుమణిదామక, ములుగట్టుండు పెద్దకూటమునసొంపారఁ.'' భార. ఉద్యో. 3, ఆ.—2. చావడి. సం. వి. అ. పుం, న. 1. అబ్బు; 2. ఆకాశమునలోనగునది; 3. కపటము; 4. కఱ్ఱు; 5. కొండకొమ్ము; 6. గవను; 7. గారడము; 8. దుఃఖము; 9. ప్రోగు; 10. బొంకు; 11. బోను; 12. సంపెట. పుం. 1. ఇల్లు; 2. విఱిగిన కొమ్ముగల యెద్దు.

**కూటశాల్మలి.** సం. వి. ఇ. స్త్రీ. కొండబూరుగు?.

**కూటస్థము.** సం. విశే. (పు. ఆ. అ.) ఎల్లకాలము నొక్కరీతిగను యుండెడు నది. (ఆకాశాదికము.)

**కూటాగారము.** సం. వి. అ. న. మేడమీఁది యిల్లు.

**కూటాము.** దే. వి. కూటముయొక్క రూపాంతరము.

**కూటినీళ్లు.** దే. వి. బ. పుల్లనీళ్లు, ఆరనాళము.

**కూటిముత్యము.** ద్వి. వి. మనుష్యులచేఁ జేయఁబడునట్టి ఒక దినుసు ముత్యము.

**కూటు.** దే. వి. ధాన్యముంచుటకు వెంటితోనేర్పఱచెడు గరిసె.

**కూటుఁడు.** సం. వి. అ. పుం. జాయిలోలుచువాఁడు, కసీఁడు.

**కూటువ.** దే. వి. 1. గుంపు; ''క. తోవలాఁకొదమజక్కవ, కవలారకడిందిశోయగపుఁదుమ్మెదకూ, టువలారమీరిపుసుమా, నవలారతనంబుఁజూచి నాకేచెపుడా.'' అచ్చ. అర, కాం.—2. ప్రోగు. ''క. వీటీపాటీరాగరు, పాటకటాటంకమణిమయాభరణంబుల్, కూటువలుగనిడి యెదనిఁక, జోటీమాటాడిముద్దుమాపంగదవే.'' రసి. 3, ఆ.

**కూటువమూఁక.** దే. వి. ప్రోత్సాహపఱచి యక్కడక్కడఁబెరికి తెచ్చిన పిటికిబలము. ''చ. అడవులఁగొందలంబడి మహాపదరూపతి చన్నవారిని, ప్పుడుకొనివచ్చికృష్ణుఁడొక ప్రోవుగఁగూటువమూఁకఁగూర్చినఁ.'' భార. ఉద్యో. ౨, ఆ.

**కూటువు.** దే. వి. 1. గుంపు; ''సీ. చవ్వలతోఁజెందొవపువ్వుల తోనసలుంబుట్టువులతోఁ జిలుకకూటువులతోఁడ.'' అచ్చ. అర, కాం.—2. ప్రోగు. (చూ. కూటువ.)

**కూడ.** దే. క్ర. సహితమనునర్థమునుదెలుపునది. ''వ. కృష్ణుండు పూతనచన్నుఁబాలతోఁడఁగూడఁబ్రాణంబులుగ్రోలుటయును.'' వి, పు. 2, ఆ.

**కూడఁబడు.** ద్వి. అ. క్రి. (కూడన్+పడు.) చేరు. ''క. ఇత్తెఱఁగుననభలోపలఁ, దత్తఱమునఁగూడఁబడినదర్పితసామం, తోత్తములలోనవిపదుఁడు, మత్తద్విపలీలమనసుమండనిటులనఁ.'' ఉ, హరి. ౫, ఆ. (సార్థమున పడు.)

**కూడఁబెట్టు.** దే. స. క్రి. (కూడన్+పెట్టు.) 1. చేర్చు; ''క. కట్టకపుడువకయొరులకుఁ, బెట్టకతమతండ్రికూడఁబెట్టినసిరిఁదాఁ, గట్టియుఁగుడిచియునొరులకుఁ, బెట్టియుఁదనయిచ్చవెచ్చపెట్టఁదలంచఁ.'' విక్ర. ౨, ఆ.—2. తొర్చు.

**కూడముట్టు.** దే. స. క్రి. తఱుముకొనిపోవు.

**కూడలి.** దే. వి. రెంటిమూటికూడిక. (కూడలిత్రోవ.)

**కూడలితాయి.** దే. వి. ఎల్లతాయి.

**కూడలివాయి.** ద్వి. వి. రెండు వంచలుచేరెడు మూలనేర్పఱచిన నీటిదారి.

**కూడిక.** దే. వి. చేరిక, సంయోగము.

**కూడు.** దే. అ. క్రి. తగు. ''కూడునెనమయంబుదప్పఁగ.'' భార. శాం. ౧, ఆ.—స. క్రి. పొందు. అం, ప్రే. కూర్చు. (లెక్కఁ గూడు, సతిఁగూడు.)—వి. అన్నము.

**కూడుదల.** దే. వి. లాభము.

**కూణి.** సం. విశే. ఇ. కుణియొక్క రూపాంతరము.

**కూన.** వై. వి. 1. పిల్ల; 2. బిడ్డ. ''క. కూనలఁగానలకుఁబనుపు కొననేరుతునే.'' అచ్చ. బాల, కాం.

**కూనసుంతే.** వై. వి. మీటమొదలు ఆరెకు పల్లము. "గీ. ప్రాన మీటుగనెగయు గోమాయువవ్వు, దెకతాళ ప్రమాణను ప్లైగసికూన, గుంగలోఁబడి గుగ్రస్సువెఖ్ఖుకునాల్క, నడుముకఅచుకనఅచుచు జెడిసిమడిసె." హంస. ౧, ఆ.

**కూని, ఖూని.** హిం. వి. నరహత్య.

**కూపకము.** సం. వి. అ. పుం. 1. ఓడకంబము; 2. పిటేఁది మీఁదిగుంత; 3. చెలమ; 4. చేతిసిద్దె.

**కూపము.** సం. వి. అ. పుం. 1. నుయ్యి; 2. చెలమ; 3. ఓడ కంబము; 4. పిటేఁదిమీఁదిగుంత.

**కూపారము.** సం. వి. అ. పుం. సముద్రము. "అపారపారః కూపారోరత్నమీనాభిధాకరః" ధనంజయనిఘంటువు.

**కూపి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కుప్పె; 2. గాజుకుప్పె.

**కూపెట్టు.** దే. అ. క్రి. (కూయి + పెట్టు.) 1. అఱచు; "క. తాఁపించెధనదువదపము, గూపెట్టఁగఁగాలకంరుకొడుకు." కాశీ. ౭, ఆ.—2. మొఱయిడు. "క. పపన్నల్ కూపెట్టినవినితీర్పుము." అము. ౮, ఆ.

**కూబరము.** సం. వి. అ. పుం. బండినొగ. విణ. మనోజ్ఞము.

**కూయి.** దే. వి. 1. మొఱ; "గీ. అకటయాఁడుకూయినాలకూయి నిలాఁతి, వారికైనసరయవలయునవిన." భార. విరా. ౩, ఆ.—2. రక్షణము. "చ. అసమునమీఁదెఱుంగకమహాగ్రహవృత్తిఁగడం గిచెచ్చెరన్, బసులకుఁగూయిగాఁజనియెఁబాపఁడు." భార. విరా. ౫, ఆ.

**కూయు.** దే. అ. క్రి. 1. అఱచు; 2. మొఱపెట్టు.

**కూర.** వై. వి. 1. వ్యంజనము*; 2. తోఁటకూరవంకాయలోనగు నది*.

**కూరటు.** దే. వి. పొరలుట.

**కూరపసుపు.** దే. వి. కూరలలోచేర్చెడు పసుపు.

**కూరము.** సం. వి. అ. న. అన్నము, వంటకము.

**కూరాడు.** దే. వి. కాఁచిన కలి.

**కూరిచి.** దే. అవ్య. ఉద్దేశార్థమునందు ద్వితీయావిభక్తితో చేరివచ్చునది. (రామునిఁగూరిచి, సోమునిఁగూరిచి.) (రూ. కూర్చి:)

**కూరిమి.** దే. వి. చెలిమి, స్నేహము, (రూ.) కూర్మి.

**కూరు.** దే. అ. క్రి. 1. కలుగు; "క, శోకము, గూరన్ గద్గదిక నెలుఁగుకుత్తుకఁదగులన్." భార. భీష్మ. ౩, ఆ.—2. దుస్సిపోవు. "వాఁడికైదువుల్ కూరఁగనాటినన్." భార. ఉద్యో. 3, ఆ.—స. క్రి. పొందు. "కుజనులువృద్ధింగూరుదురు." హరి. ఉ. ౯, ఆ.

**కూరుకు.** దే. అ. క్రి. నిద్రించు. ("ఉ. ఘృతంబలిమాత్రవోసినన్, గూరికికూర్కియాక్షణమ గొబ్బునమండినదీపమోయనన్." ఇక్కడ కూరుకుటయనఁగా మందముగామండుట అని యర్థము. నై. 3, ఆ.)—వి. నిద్ర. "కూరుకురాదురేయినాకెన్నఁడు." భాగ. ౧౦, స్కం. పూ. (రూ. కూర్కు.)

**కూరుకొను.** దే. అ. క్రి. చొచ్చు. అం, ప్రే. చొప్పించు, క్రుక్కు. (రూ. కూర్కొను. చొచ్చుటకు.—"కూర్కుల్ కూర్కొనెన్ గంట." రామా. 3, ఆ.—క్రుక్కుటకు.—"సీ. వీనుశంతను సుతుండు, గురుఁడునువిదురుండుఁగూర్కొనికూర్కొని చెవులఁ బోయమెసవిశేషకార్య, వచనములు." భార. స్త్రీ. ౧, ఆ.)

**కూరుచే.** దే. అ. క్రి. ప్రియపడు. ప్రే. కూడఁబెట్టు. (రూ. కూర్చు. ప్రియపడుటకు.—"ఇతనికిఁగూర్తురేనిధనమిత్తురు." భార. సభా. ౩, ఆ.)

**కూరుచుండు.** దే. అ. క్రి. (కూరిచి + ఉండు.) ఆసీనుఁడగు. "నడచుచుఁగూరుచుండుచును." కాశీ. ౫, ఆ. (రూ. కూర్చుండు.)

**కూరుపరి.** దే. విణ. (కూరుపు + అరి.) కూర్చునట్టివాఁడు, ఘటకుఁడు, (రూ.) కూర్పరి.

**కూరుపు.** దే. వి. ఘటన, (రూ.) కూర్పు.

**కూర్చము.** సం. వి. అ. పుం, న. 1. దర్భపిడికిలి; 2. కనుబొమలనడుము; 3. పెరిగినమీసగడ్డములు; 4. మెచ్చు; 5. మోసము.

**కూర్చశీర్షము.** సం. వి. అ. పుం. జీవకమనెడిగంధద్రవ్యము†.

**కూర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కుంచెకోల; 2. జున్ను; (ఇది ద్వివిధము-దధికూర్చిక, తక్రకూర్చిక.) 3. చిత్రమువ్రాసెడు తూలిక; 4. మొగ్గ; 5. సూది.

**కూర్చుండఁబడు.** ద్వ. అ. క్రి. (కూర్చుండన్ + పడు.) కూర్చుండు. "గీ. ఇంతపాపంబుచేయంగనెత్తికొందు, రయ్య రాజ్యలోభంబుననఖిలబంధు, జనులవధియింపఁదొడఁగితినని రథంబుమీఁదఁగూర్చుండఁబడియెఁజీయూఁదికొనుచు." భార, భీష్మ. ౧, ఆ. (స్వార్థమున పడు.)

**కూర్పరము.** సం. వి. అ. పుం. 1. మోఁచెయి; 2. మోఁకాలు.

**కూర్పాసకము.** సం. వి. అ. పుం, న. 1. అరచట్ట; 2. ఱవిక.

**కూర్మము.** సం. వి. అ. పుం. 1. తాఁబేలు; 2. ఒక యుపవాయువు. (చూ. వాయువు.)

**కూలంకష.** సం. వి. ఆ. స్త్రీ. ఏఱు. అ. పుం. ము. సముద్రము.

**కూలఁబడు.** ద్వ. అ. క్రి. (కూలన్ + పడు.) కూలు, పడు. "కూలఁబడెన్ దిశల్." రామా. ౮, ఆ. (స్వార్థమున పడు.)

**కూలము.** సం. వి. అ. న. 1. దరి; 2. గుంట; 3. మట్టిలో నగువాని దిబ్బ; 4. మూఁకవెనుక.

**కూలి.** దే. వి. 1. పనిచేసినదానికిఁగానిచ్చెడు ధనము; "గీ. నేదవిదునిచేతవిన్నాణిచేతను, దపసిచేతఁబిన్నదానిచేత, రాయబారిచేత రాజపురుషుచేతఁ, గూలిపుచ్చుకొనుటచాలఁదప్పు." విజ్ఞా. ప్రా, కాం.—2. పన్ను. "గీ. నీవుమాధర్మములలోననృపవరేణ్య, కూలియాఱవభాగంబుగొనుచుమమ్ముఁ, గావఁబూనినకతమునఁగాదెయొండు, చింతయెఱుఁగకరేలునిద్రింతుమేము." మార్క. ౫, ఆ.

**కూలు.** దే. అ. క్రి. 1. పడు; (చూ. కూలుచు.) 2. చచ్చు; "ఉ. కూలెడువారెపాండవులుఘోరపుఁబోరనొకండొకండయా, చాలెడువారలెల్లమునుజావఁగ్రమంబున సేనలన్నియున్, గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదురు." భార. ఉద్యో. ౩, ఆ.

**కూలుచే.** దే. ప్రే. 1. పడఁజేయు; 2. చంపు. (రూ. కూల్చు. పడఁజేయుటకు.—"గీ. దుష్టచిత్తుఁడైన కష్టదుర్యోధను, శిరముఁ దన్నువాఁడధరణిఁగూల్చి." భార. సభా. ౩, ఆ.)

**కూష్మాండము.** సం. వి. అ. పుం. 1. గుమ్మడి†; 2. పిశాచభేదము; 3. భ్రూణవిశేషము. (రూ. కూశ్మాండము.)

**కూసము.** వై. వి. కుప్పసముయొక్కరూపాంతరము.

**కూళ.** వై. విణ. 1. క్రూరుఁడు; "పూవిలుతుఁడుకూళవాఁడిజెడి వేదనకోరువఁజాల." రసి. 3, ఆ.—2. కుత్సితుఁడు*. (చూ. కూళుఁడు.)

**కూళుఁడు.** వై. విశే. 1. కుత్సితుఁడు*; "క. పండుగపబ్బం బైనను, గొండనియొకకాసునీనికూళునిచీసీ, లంజనువెడలఁగఁ దోలుము, బండాటమువీనివలపుపనికాదిచటన్." భల్లా. ౫, ఆ.— 2. మూఢుఁడు*. "ఉ. లాలితరూపయౌవన విలాసమనోహరయై తనర్చునీ, లాలకనిద్రవోవఁగనియాదటఁగౌఁగిట మేలుకొల్పఁగా, జాలకయాత్మఁదక్కిన విచారములొందఁగనూరకుండునా, కూళుఁడు కామరాజ్యమునకున్ వెలిగాఁడె తలంచిచూడఁగన్." షో. ౨, ఆ.

# కృ.

**కృకణము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము, కక్కెర.

**కృకము.** సం. వి. అ. పుం. కంఠనాళము, బొండుగు.

**కృకరము.** సం. వి. అ. పుం. 1. ఒక యుపవాయువు; (చూ. వాయువు.) 2. కక్కెర.

**కృకలాసము.** సం. వి. అ. పుం. 1. ఊసరవెల్లి; 2. తొండ.

**కృకవాకువు.** సం. వి. ఉ. పుం. 1. కోడి; 2. మయిలచాయ తొండ; 3. నెమలి.

**కృకాటిక.** సం. వి. ఆ. స్త్రీ. పెడతల. పెడతలయందలి ముచ్చిలి గుంట. (అనికొందఱు.)

**కృచ్ఛ్రము.** సం. వి. అ. న. 1. పాపము; 2. బాధ; 3. సాంతపనాదివ్రతము.

**కృతకము.** సం. విశే. (అ. ఆ. అ.) మనుష్యులచేఁ జేయఁబడినది, కృత్రిమము.

**కృతకర్ముఁడు.** సం. విశే. (న్. ఈ. న్.) నేర్పరి.

**కృతకాద్రి.** సం. వి. ఇ. పుం. క్రీడించుటకొఱకు నేర్పఱపఁబడిన పర్వతము, చేఁతగట్టు.

**కృతకృత్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కృతార్థుఁడు.

**కృతఘ్నుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చేసినమేలు మఱచినవాఁడు.

**కృతజ్ఞము.** సం. వి. అ. పుం. శ్వానము, కుక్క.

**కృతజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చేసినమేలు తలఁచువాఁడు.

**కృతపడు.** మి. అ. క్రి. (కృతము+పడు.) 1 కడచు; "వ. దేవా వగచినం గృతపడినకార్యంబు క్రమ్మఱంబొడమునే." భార. కర్ణ. ౧, ఆ.—2. విడఁబడు. "సీ. సురకరులీయద్రిఁజరియించునేనిక కొదమలఁగృతపడ్డకొదమలొక్కొ." మార్క. ౧, ఆ.

**కృతపుంఖుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) గుఱితప్పకయేయువాఁడు, కృతహస్తుఁడు.

**కృతమాలకము.** సం. వి. అ. పుం. నల్లగూబ.

**కృతమాలము.** సం. వి. అ. పుం. తేలికి.

**కృతము.** సం. వి. అ. న. ఒక యుగము. క్రి. విశే. పెల్లు. విశే. చేయఁబడినది; 2. నొప్పింపఁబడినది.

**కృతముఖుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నేర్పరి.

**కృతలక్షణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) గుణములచేతఁ బ్రసిద్ధిఁజెందినవాఁడు.

**కృతసాపత్నిక.** సం. వి. ఆ. స్త్రీ. అధ్యూఢ, మొదటిపెండ్లాము.

**కృతహస్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. గుఱితప్పకయేయువాఁడు; 2. నేర్పరి.

**కృతాంతము.** సం. వి. అ. పుం. 1 అశుభకర్మము; 2. భాగ్యము; 3. సిద్ధాంతము.

**కృతాంతుఁడు.** సం. వి. అ. పుం. యముఁడు, జేముఁడు.

**కృతార్థుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నెఱవేఱినపనిగలవాఁడు, ధన్యుఁడు.

**కృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చేయుట; 2. ప్రబంధము; 3. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు) 4. నొప్పించుట. న్. పుం. చదువరి. విశే. 1. నెఱవేఱినపనిగలవాఁడు; 2. నేర్పరి.

**కృతుఁడు.** సం. వి. అ. పుం. కడుపుకూటివాఁడు.

**కృత్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది.

**కృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తోలు; 2. ఒకనక్షత్రము; 3. చెట్టుపైపట్ట; 4. బుజపత్రికి.

**కృత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**కృత్తివాసుఁడు.** సం. వి. స్. పుం. శివుఁడు, ముక్కంటి.

**కృత్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. చేయుట; 2. ఒకానొకదేవత. అ. న. ము. పని. విశే. ధనాదులచే భేదింపఁదగినది. (శత్రుగృహాది.)

**కృత్రిమధూపకము.** సం. వి. అ. పుం. అనేక పరిమళవస్తువులు కూర్చిచేసిన ధూపము.

**కృత్రిమము.** సం. వి. అ. న. ఉప్పుదినుసు. పుం. చిల్లమడ్డి. విశే. మనుష్యులచేఁ జేయఁబడినది.

**కృత్స్నము.** సం. వి. అ. న. 1. కడుపు; 2. నీళ్లు. విశే. అంతయు.

**కృప.** సం. వి. ఆ. స్త్రీ. దయ, కనికరము.

**కృపణము.** సం. వి. అ. పుం. పురుగు.

**కృపణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1 లోభి; 2. కుత్సితుఁడు.

**కృపాణము.** సం. వి. అ. పుం. కరవాలము, కత్తి.

**కృపాణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తి; 2. కత్తెర.

**కృపాళువు.** సం. విశే. ఉ. కనికరముగలవాఁడు.

**కృపీటము.** సం. వి. అ. న. 1. కడుపు; 2. నీళ్లు.

**కృపీటయోని.** సం. వి. ఇ. పుం. అగ్ని, నిప్పు.

**కృపుఁడు.** సం. వి. అ. పుం. ద్రోణుని మఱఁది.

**కృమి.** సం. వి. ఇ. పుం. 1. పురుగు; 2. చెట్టుమీఁది నల్లపురుగు; 3. లక్క.

**కృశము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. బక్క; 2. సన్నము.

**కృశానువు.** సం. వి. ఉ. పుం. అగ్ని, నిప్పు.

**కృశానురేతసుఁడు.** సం. వి. స్. పుం. శివుఁడు.

**కృశాశ్వి.** సం. వి. న్. పుం. నటుఁడు, నట్టువుఁడు.

**కృశించు.** సం. అ. క్రి. 1. బక్కచిల్లు; 2. సన్నగిల్లు.

**కృషకము.** సం. వి. అ. పుం. కఱ్ఱు, (రూ.) కృషికము.

**కృషాణుఁడు.** సం. వి. అ. పుం. సేద్యకాఁడు.

**కృషి.** సం. వి. ఇ. స్త్రీ. సేద్యము, కరిసనము.

**కృషికుఁడు.** సం. వి. అ. పుం. సేద్యకాఁడు, (రూ.) కృషకుఁడు.

**కృషీవలుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**కృష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఒకసారి దున్నఁబడినది; (నేల) 2. ఈడువఁబడినది.

**కృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దుక్కి. పుం. చదువరి.

**కృష్ణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయేఱు; 2. ద్రౌపది; 3. ద్రాక్షచెట్టు; 4. ఓలిచెట్టు; 5. పిప్పలిచెట్టు. అ. న. ము. 1. ఇనుము; 2. మిరియము. పుం. 1. నలుపు; 2. కాకి; 3. కోకిలము; 4. దున్న; 5. కృష్ణపక్షము; 6. నల్లనికనుపుగలమందపిచ్చుక. విశే. నల్లనిది.

**కృష్ణకర్ముఁడు.** సం. విశే. (న్. ఈ. న్.) దురాచారుఁడు.

**కృష్ణపాకఫలము.** సం. వి. అ. పుం. కలివెచెట్టు.

**కృష్ణపాకి.** సం. వి. ఈ. స్త్రీ. నల్లగురిగింజ.

**కృష్ణఫల.** సం. వి. ఆ. స్త్రీ. కారుగచ్చెచెట్టు.

**కృష్టభేది.** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణిచెట్టు.

**కృష్ణల.** సం. వి. ఆ. స్త్రీ. గురిజెచెట్టు.

**కృష్ణలోహితము.** సం. వి. అ. పుం. నలుపుమించఁగలసిన యెఱుపు. విశే. నలుపుమించఁగలసినయెఱుపుగలది.

**కృష్ణవర్త్మ.** సం. వి. న్. పుం. 1. అగ్ని; 2. దురాచారుఁడు; 3. రాహువు.

**కృష్ణవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. కమ్మేరాకుతీఁగ, నల్లతీఁగ.

**కృష్ణవృంత.** సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టుచెట్టు; 2. కారుమినుముచెట్టు.

**కృష్ణసారకము.** సం. వి. అ. పుం. నల్లవెదురుచెట్టు.

**కృష్ణసారము.** సం. వి. అ. పుం. 1. నల్లయిఱ్ఱి; 2. ఇరుగుడుచెట్టు; 3. జెముడుచెట్టు. (రూ. కృష్ణశారము.)

**కృష్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. తవిఁదలు; 2. నల్లావలు; 3. నల్ల పిచ్చుక.

**కృష్ణుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. అర్జునుఁడు; 3. వ్యాసుఁడు.

**కృసరము.** సం. వి. అ. న. 1. పులగము; 2. శ్రాద్ధమున నిమంత్రితులకు అభ్యంజనకాలమందు కలిపియిచ్చెడు నువ్వులు బెల్లము.

**క్లృప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ఏర్పాటుచేయఁబడినది.

**క్లృప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఏర్పాటు.

## కె.

**కె.** దే. విశే. వృత్తియందు కెంపుశబ్దమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరమగునపుడు నుమాగమమును తదితరములు పరమగునపుడు మీఁదిదానికి ద్విత్వమునువచ్చును. కెంగేలు, కెంజేడ, కెంజాయ, కెంజిగి, కెంజిగురు, కెందలిరు, కెందళుకు, కెందామర, కెందొవ, కెంబట్టు, కెంబువ్వ, కెంబెదవి, కెన్నురువు, కెమ్మొక్క, కెమ్మోవి మొ.)

**కెందమ్మి.** ద్వి. వి. (కెంపు+తమ్మి.) ఎఱ్ఱదామర.

**కెంపు.** దే. వి. 1. పద్మరాగమణి; 2. ఎఱుపు. "క. ఇనుఁడుతన కడకునేతెం, చినరాగముఁబొందుటదియుచితమనఁగాఁగెం, పున మెఱసిపశ్చిమాశాం, గనజననంభావనములగౌరవమందెన్." భార. విరా. ౨, ఆ.—విశే. ఎఱ్ఱనిది. "చ. కనుఁగొని కుంకుమంపుఁదిలకంబుగదిద్దిరికెంపుఁబుప్పొడుల్." చమ. ౧, ఆ. (ఈ యర్థమున వృత్తియందుఁ గొన్నియెడల సంత్యవర్ణలోపము. చూ. కెం.)

**కెంపుకంటి.** దే. వి. (కెంపు+కన్ను.) కోయిల.

**కెంపుగాము.** ద్వి. వి. గ్రహవిశేషము, అంగారకుఁడు.

**కెంపుసవతు.** ద్వి. వి. నక్షత్రవిశేషము, స్వాతి.

**కెడ.** దే. వి. పార్శ్వము. "గీ. కృపుఁడువృషసేనుఁడునువారికెడన కూడి, పార్థుతనువునఁదూపులువఱపిరి." భార. ద్రో. ౪, ఆ.

**కెడపు.** దే. ప్రే. 1. పడఁజేయు; "చ. మిడుకమదగ్రజన్మఁగుశ మీఁదికిఁగట్టుకపోయి బావిలోఁ, గెడపితివి." జై. 3, ఆ.—2. త్రోయు; "క. ఒకతూపునరఘువీరుఁడు, మకరాకరమధ్యసీమమారీచునురాం, తకుఁబడఁగెడపె." రామా. ౪, ఆ.- 3. చంపు. "నిర్మూలంబుగ శత్రులం గెడపి." ద్వా. ౮, ఆ.

**కెడయిక.** దే. వి. 1. పడుట; 2. చావు.

**కెడయు.** దే. అ. క్రి. 1. పడు; "సీ. వరములువడయంగశిరములుకెడయంగఁబట్టి-కఁడుఁడుపీరిపాలఁగనియె." ఉ, హరి. ౨, ఆ.—2. చచ్చు.

**కెడవు.** దే. వి. పాటు, పతనము.

**కెరకొట్టు.** దే. అ. క్రి. (కెరలు+కొట్టు) కలకలకూయు.

**కెరలియాడు.** దే. అ. క్రి. (కెరలి+ఆడు.) చెలరేఁగు. "గీ. బాణాసురుండు, దనుజసుందరీసహితుఁడైమనసులోనఁ, గెరలియాడుచు మధుపానకేళిఁదేలి, యాహవముఁగోరుచుండె." ఉ, హరి. ౫, ఆ.

**కెరలు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "కెరలుకోర్కుల." స్వా. ౬, ఆ.—2. ఆగ్రహించు; "క. వసుధేశముక్కుడుస్సిన, పసరముక్రియఁగెరలితిట్టెఁబక్కునబుషి." స్వా. ౬, ఆ.— 3. కూయు; "ఎ, గీ. ప్రమదమునఁదేఁటులెలుగెత్తిపాడుచోట, శారికలనంగశాస్త్రముల్ చదువుచోటఁ, గీరకలకంఠములుక్రొవ్వి కెరలుచోటఁ, బావురములారజంబులుపలుకుచోట." స్వా. 3, ఆ.— 4. విజృంభించు; "మహాస్రగ్ధర. హారోదగ్రీలంగెరలెనతఁడ సంక్లిష్టదోర్దండకండూ, యనఘోరస్ఫారవీరాహవము తనకుసభ్యగ్రమైతోఁచెనంచున్." హరి. ఉ. ౭, ఆ.- 5. సంభ్రమించు. "ద్వి. వరకపీంద్రులుమహావంశవర్ధనులు, కెరలిపాఱుదురెప్రాకృతులచందమున." రా. యు, కాం.

**కెరలుచు.** దే. ప్రే. కెరలఁజేయు.

**కెరలువోడుచు.** దే. అ. క్రి. (కెరలు+పొడుచు.) 1. వర్ధిల్లు; "గీ. గరిమనీరీతిమెల్లనఁగెరలువొడిచి, చెలఁగియాడంగ." భాగ. ౫, స్కం. ౧, ఆ.—2. విజృంభించు. "గీ. అతనిచేతనున్న యమృతకుంభముఁజూచి, కెరలువొడిచిసురలఁగికురువెట్టి, పుచ్చుకొనిరియసురపుంగవులెల్లను, మాఱులేకబలిమిమానవేంద్ర." భాగ. ౮, స్కం.

**కెలఁకు.** దే. స. క్రి. 1. కలపెట్టు; "వ. ఇందులకుం బొందుపడుప్రత్యుత్తరంబుల వీనింగెలంకినబుద్ధి క్షోభంబుగానింతకంటె నేమేమియుబద్ధంబులువినంబడునో." ఆము. ౬, ఆ.—2. పెల్లగించు. "భగునికన్నులుకెలఁకె." కాశీ. ౭, ఆ.—వి. 1. దిక్కు; "చ. కురిసెఁబ్రచండవృష్టి ఘనఘోషముఁలెల్లకెలంకులన్ భయం, కరములుగా." భార. అర. 3, ఆ.—2. పార్శ్వము.

**కెలను.** దే. వి. 1, దిక్కు; 2. పార్శ్వము. (రూ.) కెలఁకు.

**కెలయు.** దే. అ. క్రి. విజృంభించే. "ద్వి. కెలయుచునినుసీవె కీర్తించుకొనెదు, ఘలజుండుపను(దానకొనియాడుకొనునె." రా. ఆర, కాం.

**కెలవు.** దే. వి. అనురాగము. "క. పలువురకొకభామినిపైఁ, దలఁపునునొకవారసతికెఁదగఁబలువురపై, వలపునుమృగవిహగాదుల, కెలవురసాభానమయ్యెకీతినెల్లన్నజా." కా. 3, ఆ.

**కెలసము.** దే. వి. అక్కఱ, పని. "వ. ఇంతటికెలసంబుఁదీర్పనైనవలదే." భార. అర. ౬, ఆ. "ఉ. ఏనునీ, చుట్టమనై భుజాబలముసొంపుననీకెలసంబుఁదీర్చెదజా." భార. అర. ౫, ఆ.

**కెల్లగించే.** దే. స. క్రి. 1. పెల్లగించు; 2. రేఁచే

**కెళకుళి.** వై. వి. కేళాకూళియొక్కరూపాంతరము.. "సీ. ఈకెళకుళి లోనవెలనాగప్రోదిరాయంచలకవలనిందించియాడె." పా. 2, ఆ.

**కెళవు.** దే. వి. దూరము. "క. అనఘుఁడుసత్యమెరూపై, జనియించినవాఁడుపేఁ డసాధ్యుండీవే, శనుబ్రద్యుమ్నాదులనిట, నునిచి మనము కెళవుతొలఁగి యుండుదమనుచుజా." జై. ౫, ఆ. ("క. అంగననిలిచినబాహువు, లుంగొనును నేర్పరించు లోకములకుర, త్నాంగదకాంచీభేదము, లుంగెళవులనడిమియునకులుజానూగారుజా." ఆము. ౫, ఆ. ఇందుకెళవుల అనుపాఠముతప్పు. కెలఁకుల అని యుండుననితోఁచెడి.)

**కెళానుళి.** వై. వి. కేళాకూళియొక్కరూపాంతరము. "సీ. ఈకెళాకుళిచెంతరాకేందుబింబాన్య తివిరియంచకునడల్ దిద్దుచుండె." రసి. 3, ఆ.

**కెళాకూళి.** వై. వి.———పై.———

## కే.

**కే.** దే. వి. ధ్వన్యనుకరణము. "క. నాయింటంబదికడవల, నేయిపెరుగుపాలుఁద్రావినీప్రియతనయుం, డోయమ్మకడవలన్నియుఁ, గేయనిబోరగిలఁద్రోచికేరుచువచ్చెజా." హరి. పూ. ౫, ఆ.

**కేక.** ఉభ. దే. వి. పెద్దకూఁత. సం. ఆ. స్త్రీ. నెమలికూఁత.

**కేకయము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**కేకరము.** సం. వి. అ. పుం. 1. కడకన్ను; 2. మెల్లకన్ను.

**కేకరించే.** ఉభ. దే. అ. క్రి. 1. కేకలువేయు; "ద్వి. క్రీడించి మలయుచుఁగేకరించుచును." నవ. 3, భా.—2. నకిలించునట్లు శబ్దించు.—సం. స. క్రి. కటాక్షించు. "గీ. ఇంద్రునిదిక్కుఁ, గేకరించియుఁజూడకకృష్ణుఁడచలి, తాసనుండయియుండెననాదరమున." హరి. పూ. 2, ఆ.

**కేకరింత.** దే. వి. 1. కేకలువేయుట; 2. గొంతడుపుతీఱుటకు నకిలించునట్లు శబ్దించుట. "సీ. ఒదవెడుగాద్గద్యమదరిసాటునఁ బల్కరింపఁబుట్టెడుకేకరింతదెలుప." ఆము. ౫, ఆ.

**కేకరుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) మెల్లకంటివాఁడు.

**కేకి.** సం. వి. న్. పుం. మయూరము, నెమలి.

**కేకిసలు.** దే. వి. బ. 1. చప్పట్లు; "ఎ, గీ. అనుచునవ్వుచునరళోక్తులాడుకొనుచుఁ, గేకిసలుకొట్టుచునువడిఁగేకలిడుచు, ననిమిషాంగనలత్తపోవనముఁజొచ్చి, వచ్చియచ్చట భూదేవవరునిఁగాంచి." శేష. ౧, ఆ.—2. అంజలులు. "రగడ. శ్వేతాద్రిస్థలిసింహాలోచనున, కెలమినిఁగేకిసలిచ్చుచుభక్తిని." హంస. ౭, ఆ. "గీ. కిసలములకేలయింతకేకిసలమసల." బహు. ౨, ఆ.

**కేటత్రాడు.** దే. వి. యమపాశము. "క. పితరదొరకేటత్రాటజా, జితనంబునఁదిబియ." నీలా. ౧, ఆ.

**కేటాయించు, ఖేటాయించు.** గ్రా. క్రి. వేఱుపఱుచు.

**కేడ.** దే. విశే. కాస్తుఁడు.

**కేడించు.** దే. అ. క్రి. స. క్రి. క్రీడించుయొక్కరూపాంతరము.

**కేడెము.** వై. వి. డాలువాలు, ఖేటకము.

**కేతకి.** సం. వి. ఈ. స్త్రీ. పచ్చపూమొగలి, గేదఁగి.

**కేతనము.** సం. వి. అ. న 1. టెక్కెము; 2. గుఱుతు; 3. ఇల్లు; 4. నిమంత్రణము.

**కేతుమాలము.** సం. వి. అ. న. ఒకవర్షము. (చూ. వర్షము.)

**కేతువు.** సం. వి. ఉ. పుం. 1. ఒక గ్రహము; (చూ. గ్రహము.) 2. టెక్కెము; 3. గుఱుతు; 4. అగ్ని; 5. కాంతి; 6. ధూమకేతువు.

**కేదరము** సం. వి. అ. పుం. కేదారముయొక్కరూపాంతరము.

**కేదారము.** సం. వి. అ. పుం, న. వరిమడి. పుం. 1. కొండ; 2. పాదు; 3. ఒకానొక పుణ్యక్షేత్రము.

**కేదారుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**కేనిపాతకము.** సం. వి. అ. పుం. (చూ.) అరిత్రము.

**కేమము.** సం. వి. అ. న. పులిచిరికాయ.

**కేయూరము.** సం. వి. అ. న. అంగదము, బాహుపురి.

**కేరజెము.** వై. వి. ఒకానొకపక్షి. "సీ. మూలసందులనుండి మూల్గుడాబలక్రందు గుంపు కేరజేపుకయ్యంపుపోదలు." చంద్రా. ౨, ఆ. (దీని నొకానొక యాధునికకవి కేర్జమని ప్రయోగించినాఁడు.)

**కేరడము.** దే. వి. 1. ఉపేక్ష; "సీ. అయ్యెంతికనపాపలందుమిక్కిలికూర్మిబెరయసంజ్ఞాదేవిబిడ్డలైన, ముప్వురసుగేరడముసేయ." హరి. పూ. ౧, ఆ.—2. తిరస్కారము; "సీ. అస్త్రేశమనుమనినద్దిరాయెటుచూతుననకకేరడమెవ్వఁడలవరించు." ఉ. హరి. ౫, ఆ.—3. తిరస్కారపుమాట; "ఉ. బాడబహూరునింజెనకుపార్థివులెవ్వరటంచుఁగేరడం, బాడబలాయిదేటిమదమంచు భృగూద్వహగర్వవార్ధికిజా, బాడబమాప్రతాపముఁగనంబడఁజేసి." ఉ, రా. ౧, ఆ.—4. వంకరమాట. "గీ. తప్పుగలచిత్తమోలభాత్ప్రపణితిఁ, గేరడములాడునతిమధ్యధీర." కా. ౨, ఆ.

**కేరడించే.** దే. స. క్రి. వక్రముచేయు. "సీ. భ్రమరకంబులచిక్కువాపవేయననింక భ్రమరకంబులచిక్కువాయుననుచుఁ, బృథులకుచంబులుబ్బించకేయనఁబృథులకుచప్రకాశకాలంబటంచుఁ, గరఁగెఁబోవరతిలకంబనపున్నెహకలనఁగరఁగువరతిలకమనుచుఁ, గడుమొరయింపకేకటకంబులనమ్రోయుఁగటకముల్ శుభయత్నగరిమననుచుఁ, జెలివలుకుఁగేరడించుచు." వసు. ౫, ఆ.

**కేరళము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**కేరించే.** దే. అ. క్రి. విజృంభించు. "మ. పూవుఁదేఁ, గెసుదెందావలరాచయొంటరికడుంగేరించుచుం జిమ్మెనజా." య. ౫, ఆ.

**కేరు.** దే. అ. క్రి. 1. ఉత్సహించు; "క. భృత్యులఁదీర్పరులైనయు, మాత్యులుకన్గొనిప్రమోదమతిసకలజన, స్తుత్యముగమంగళోచిత, కృత్యములొనరింపుఁడనినఁగేరుచువారుజా." రుక్మి. ౨, ఆ.—2. కుతూహలపడు; "హరిఁగనవచ్చెఁగేరుచుజా." రుక్మి. ౫, ఆ.—3. విజృంభించు. "కువలయాధిపు పాటలువాడినంగరంబలరుచుఁ గేరికేరినగు." కళా. ౬, ఆ.—స. క్రి. 1. తిరస్కరించు; "క. రంగుగనెన్నడుమునని, స్నుంగేరెనటంచుఁగినుకమాల్కొనగరితజా,

త్రిం గిలివోనిక్కంబుగ, సింగమకలచందమెల్లఁజెపుమానరగన్." అచ్చ. అర, కాం.—2. పరిహసించు. "వ. సంగడీలంజీరువారును సంగఃభీరులంగేరువారును." పా. ౪, ఆ.

**కేరుపు.** దే. వి. విజృంభణము. "క. గారాబునఁజెరిగినళ్ళం, గారాంబుధిగానిగఁడుసుగా దొకనాఁడున్, గేరుపులగాసిఁబెట్టెదు, సూరాసుకహూడసూనసుకుమారసుమీ." పాంచా. ౫, ఆ.

**కేలు.** వై. వి. ఏ. 1. చేయి; 2. తొండము. "కరినాథుకేల్నిడుదకొమ్ములతో బెరయఁగఁద్రుంప." భార. అర. ౬, ఆ.

**కేలుమొగ్గ.** వై. వి. చేమోడ్పు, అంజలిబంధము.

**కేవడము.** వై. వి. కేడెముయొక్క రూపాంతరము. "సీ. మిహిపసిండిపరుంజామొహదాకెలఁకునరావృగుజ్జరివన్నె కేవడంబు." సా. ౪, ఆ.

**కేవరి.** దే. వి. (కేవు+అరి.) కేవుపుచ్చుకొనువాఁడు.

**కేవలము.** సం. వి. అ. న. నిర్ణయింపఁబడినది. విణ. 1. అంత; 2. ఒకటి.

**కేవలుఁడు.** సం. వి. అ. పుం. పరమాత్మ.

**కేవు.** దే. వి. ఓడకిచ్చెడుకూలి.

**కేశకారము.** సం. వి. అ. పుం. కరఫలము, గొఱపము.

**కేశఘ్నము.** సం. వి. అ. న. బట్టతల.

**కేశపాశి.** సం. వి. ఈ. స్త్రీ. చూడ, సిగ.

**కేశము.** సం. వి. అ. పుం. 1. వెంట్రుక; 2. కురువేరు*.

**కేశముష్టి.** సం. వి. ఇ. పుం. తేనెమ్రాను.

**కేశవము.** సం. వి. అ. పుం. పొన్న*.

**కేశవుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. విణ. మంచివెంట్రుకలు కలవాఁడు.

**కేశవేశము.** సం. వి. అ. పుం. కబరి, కొప్పు.

**కేశాంబునామము.** సం. వి. అ. న. కురువేరు*.

**కేశి.** సం. వి. న్. పుం. ఒకానొకరాక్షసుఁడు. విణ. మంచివెంట్రుకలుకలవాఁడు.

**కేశికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) మంచివెంట్రుకలుకలవాఁడు.

**కేశిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. కల్లతీఁగ; 2. పద్మపుతీఁగ. విణ. మంచివెంట్రుకలుగలది. (ఆఁడుది.)

**కేశుఁడు.** సం. వి. అ. పుం. వరుణుఁడు.

**కేసరము.** సం. వి. అ. న. ఇంగువ. పుం, న. అకరువు. పుం. 1. సింహములోనగువాని మెడమీఁదివెంట్రుక, జూలు; 2. నాగకేసరము*; 3. పొగడ*; 4. పొన్న*.

**కేసరి.** ఉభ. వై. వి. 1. ఒకానొకమృగము; "కేసరియనఖేచరమగు." ఆం, భా. ద్వి. సిం.—2. ఒకదినుసు వరిపైరు. బ. అ ధాన్యము. సం. వి. న్. పుం. 1. సింహము; 2. గుఱ్ఱము; 3. నాగకేసరము*; 4. పొన్న*.

**కేళకుళి.** వై. వి. కేళాకూళియొక్క రూపాంతరము. "ఎ, గీ. అంబుధులు కేళకుళులు కులాచలములు, మేడ లలచక్రగిరి చుట్టుగోడగాఁగ, నవసిఁబాలించెకుద్ధాంతభవనమట్ల, కీర్తిలక్ష్మీకళత్రుఁడీక్షితివరుండు." కవిక. ౨, ఆ.

**కేళకూళి.** వై. వి. కేళాకూళియొక్క రూపాంతరము. "ఎ, గీ. నంతనంబునఁ బూఁదేనెజాలువాఱఁ, గమ్మగందపుముద్దలగట్టువెట్టి, కాలువలుదీర్చిన పసిండికేళకూళి, నిండితొలఁకాడుచున్న దేనీలవేణి." విక్ర. ౫, ఆ.

**కేళాకూళి.** వై. వి. క్రీడాసరస్సు. "క. లోకాలోకమహీధర, మేకోటకులాచలములుకృతకాద్రులుకే, ళాకూళులుజలరాసులు, శ్రీకరధృతిసాంద్రుఁడౌహరిశ్చంద్రునకున్." కవి. ౧, ఆ.

**కేళి.** సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. పురుషులు స్నేహమున స్త్రీలులోనగువారిని గద్దించుట కొట్టుట పరిహసించుట మొదలుగాఁగలది; 2. ఆట; 3. ప్రియునితోడి విహారమునందలి నాయికయొక్క క్రీడ.

**కేళిక.** వై. వి. నృత్యము*. "జక్కిణికొరవంజివేసములఁగేళిక సల్పిరి." రామా. ౨, ఆ.

**కేళికీలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నవ్వించువాఁడు.

## కై.

**కై.** దే. అవ. చతుర్థీవిభక్తియందువచ్చెడు ఒక ప్రత్యయము. వి. 1. చేయి; "చిలుకంగైనుంచకేచిల్కపల్కులోనీపల్కులోకాంచలేము." ఉ, రా. ౬, ఆ.—2. తొండము. (కయియొక్క రూపాంతరము.)

**కైంకర్యము.** సం. వి. అ. న 1. ఊడిగము; 2. భగవంతునికిని, భగవద్భక్తులకును జేసెడి యూడిగము.

**కైక.** వై. వి. కైకేయి. "క. కైకానీపూనినపని, కైకాకైకందినట్టియనుఁగుంగొడుకి, కైకానలకేగెడు." అచ్చ. అ, కాం. (కయికయొక్క రూపాంతరము.)

**కైకట్టు.** ద్వి. వి. సందర్భము. (కయికట్టుయొక్క రూపాంతరము.)

**కైకానుక.** దే. వి. రాజులులోనగువారిని జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము. "మ. పులిగోరుల్పెరతేనెకస్తురిమెకంబుల్పుస్గుజవ్వాదిపి, ల్లులుగోరోజనమిఱ్ఱులుంబికిలిపూలుఁజల్లులున్మోవిపం, డులుఁగుందేళ్లునుజాఅపవ్వసెలవిండ్లుంబాఅవాతంపక, ట్టెలుఁగైకానుకలిచ్చిబోయదొరబిడ్డల్గాంచిరాభూవిభున్." రామా. ౨, ఆ. (కయికానుకయొక్క రూపాంతరము.)

**కైకేయి.** సం. వి. ఈ. స్త్రీ. కేకయరాజుకూఁతురు.

**కైకొను.** దే. అ. క్రి. పూను. "క. మాకుంబుణ్యముసాలమి, గాకేమిజగత్త్రయంబుఁగావంబ్రోవం, గైకొన్ననీవుసకలవి, వేకివిమాదుఃఖమెఱుఁగవేమధుమథనా." ఉ, హరి. ౪, ఆ.—స. క్రి. 1. గ్రహించు; 2. లక్ష్యపెట్టు. "క. తనకొలఁదినుపాయంబులు, పొనరిచిధనవంతుఁడగుటభూపగుణముని, ర్ధనునినిజప్రజయునుగై, కొనదువిరోధులును సరకుగొనరుకుమారా." భార. శాం 3, ఆ. (కయికొనుయొక్క రూపాంతరము.)

**కైకొలుపు.** దే. ప్రే. కైకొనఁజేయు. "క. నావుడు మానవనాథుఁడు, కేవలపురుషుండెవాఁడుకీడొందుపనుల్, గావించునెమదిబెదరం, గావలదని చెప్పిదొరలుకైకొలుపుటయున్." భో. ౪, ఆ. (కయికొలుపుయొక్క రూపాంతరము.)

**కైకోల.** దే. వి. గుడ్డలునేసిబ్రదికెడు ఒకానొకజాతి. (కైకోలవాఁడు, కైకోలది.) (కయికోలయొక్క రూపాంతరము.)

**కైకోలు.** దే. వి. 1. అంగీకారము; "సీ. నీవకాకెవ్వరునేర్తురీపనికియ్యకొమ్మనియతనికైకోలువడని." భాగ. ౧, స్కం.—2. గ్రహ

ాము. ''శా. గంగం దాల్చి తివృత్తిమాంగమున నగ్గై కోలుగా వించితి, ర్ధాంగికారిము.'' కా. ౧, ఆ. (కయికోలుయొక్క రూపాంతరము.)

**కైచాఁపులు.** ద్వి. వి. బ. నమస్కృతి. ''మం, రగడ. నిబిడస్థలిలోని బిడాకార, స్వామికి మతిఁ గైచాఁపులొనంగుచు.'' హంస. ర, ఆ. (కయిచాఁపులుయొక్క రూపాంతరము.)

**కైజీతము.** ద్వి. వి. బత్తెము. (కయిజీతముయొక్క రూపాంతరము.)

**కైజా.** దే. వి. వాగెను వెనుకకీడ్చి కట్టుట. ''క. ఆకోలాహలమరుదని, యాకర్ణించుచు విభుండు హయము డిగిహుసా, రైకైజా చేసి మహా, నోకహాతలమున నిలిచి కనుంగొనుచుండఁగ.'' చంద్రా. ౨, ఆ. (కయిజాయొక్క రూపాంతరము.)

**కైజాఱు.** దే. అ. క్రి. ఒఱగు. (కయిజాఱుయొక్క రూపాంతరము. ''నడలిన సీవి యోరకయి జాఱిన ముత్తెపుఁ జేఱుచుక్క.'' భాను. 3, ఆ.)

**కైజు.** దే. వి. పక్షివిశేషము. ''౨, గీ. కటికి నెటినెటిఁ గోలెమ్ము కయును విఱుగ, విఱిచె వడిఁ గైజు నొక పెద్దవేసడంబు.'' స్వా. ర, ఆ. (కయిజుయొక్క రూపాంతరము.)

**కైటభారి.** సం. వి. ఇ. పుం. హరి, వెన్నుఁడు.

**కైడర్యము.** సం. వి. అ. పుం. 1. కఱివేము*; 2. పినగుమ్ముడు*.

**కైత.** వై. వి. కవిత్వము. ''ఉ. పూఁత మెఱుంగులుం బలెన బూపబెడంగులు చూపునట్టివా, కైతలు.'' పెద్దన చెప్పిన మాలికావృత్తము. (కయితయొక్క రూపాంతరము.)

**కైతవము.** సం. వి. అ. న. 1. కపటము; 2. జూదము.

**కైదండ.** దే. వి. హస్తావలంబము. (కయిదండయొక్క రూపాంతరము.)

**కైదారకము.** సం. వి. అ. న. కేదారముల సమూహము. (కేదారము=వరిమడి.)

**కైదారికము.** సం. వి. అ. న.——పై.——

**కైదార్యము.** సం. వి. అ. న.——పై.——

**కైదు.** దే. వి. కైజోయొక్క రూపాంతరము. ''ఉ. దూరముగాఁగ నేగు కయిదుం గని డేగ టమీఁదనుండియుఁ, దారునఁ దారి.'' చంద్రా. ౨, ఆ. (మొదటిరూపము కయిదు.)

**కైదువు.** దే. వి. ఆయుధము. ''క. పారిమిడుఁగుఱులెగసి కైదువుల పాడిరాలెఁ.'' భార. ద్రో. ౫, ఆ. (అధునికకవులు దీనిని అకారాంతముగాఁ బ్రయోగించెదరు. ''చ. కరమున శైలభేదియగు కైదువ యున్న శచీకళత్రుఁడో.'' హరిశ్చ. ర, ఆ. ఇత్యాదులు.) (కయిదువుయొక్క రూపాంతరము.)

**కైపదము.** వై. వి. కవిపరిజ్ఞానపరీక్షార్థము పూరింపనిచ్చెడి పద్యాంశము, సమస్య. ''ఉ. కైపదమిచ్చు వారలును గ్రక్కునఁ బద్యముఁ జెప్పు వారలుఁ.'' భో. ౨, ఆ. (కయిపదముయొక్క రూపాంతరము.)

**కైపు.** దే. వి. 1. లాహిరి; (ఈ రూపము హాడుకయందుఁ గనఁబడుచున్నది. చూ. కైవు.) 2. అందము; ''ఉ. ఎల్లరు నంత మేలుకొని యిందుముఖుల్ ముఖమజ్జనాదికం, బల్లనఁ దీర్చి కైపుగఁ దులాంబరముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబులుం బరిమళంబులుఁ దాలిచి.'' రామా. ౨, ఆ.—3. విజృంభణము; ''క. దీపమడఁగఁ జీకటియును, గోపమడఁగ శాంతిగుణముఁ గొఱ్ఱకను క్రియనా, టోపోద్భటమగు వేసవి, కైపుసడిలఁ దోఁచెఁ గారు కాలము దళమై.'' పాండు. ర, ఆ.—4. విధము. ''గీ. రావణునిఁ జెట్ట పట్టిన రాజ్యలక్ష్మి, కైపుతోఁ బెంచు లంకపొంకంబు గాంచి.'' రామా. ౬, ఆ. (కయిపుయొక్క రూపాంతరము.)

**కైఫియతు.** హిం. వి. ఒకసంగతి వివరము.

**కైముడి.** ద్వి. వి. వాద్యవిశేషము. (కయిముడియొక్క రూపాంతరము.)

**కైమోడుపు.** ద్వి. వి. నమస్కృతి. ''మం, రగడ. మాహురమందనమానతి విడిసిన, కాలమేఘునకుఁ గైమోడుపులని.'' హంస. ర, ఆ. (కయిమోడుపుయొక్క రూపాంతరము.)

**కైరఁడు.** దే. వి. ఈ పేరుగల గుజ్జము. (కయిరఁడుయొక్క రూపాంతరము.)

**కైరవడి.** వై. వి. తాంబూలముతోఁ గూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచులోనగు వస్తువులు చేర్చి చేసినయుండ, ఖాదిరము. (కయిరవడియొక్క రూపాంతరము.)

**కైరవము.** సం. వి. అ. న. తెల్లగలువ.

**కైరవిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగలువల సమూహము; 2. తెల్లగలువలుండుకొలను.

**కైరవుఁడు.** సం. వి. అ. పుం. 1. జూదరి; 2. పగవాఁడు.

**కైలాగు.** దే. వి. కైదండ. (కయిలాగుయొక్క రూపాంతరము.)

**కైలాటకాఁడు.** దే. విశే. (కైలాటము+కాఁడు.) మాయోపాయముగలవాఁడు. (కయిలాటకాఁడుయొక్క రూపాంతరము.)

**కైలాటము.** దే. వి. మాయోపాయము. ''తానునుగజాస్యుఁడు లక్ష్మియుఁ జేసినట్టి కైలాటమునఁ ఘటిల్లెసకలార్థము.'' కాశీ. ౬, ఆ. (కయిలాటముయొక్క రూపాంతరము.)

**కైలాసము.** సం. వి. అ. పుం. కుబేరుని యునికిపట్టు, వెండికొండ.

**కైలు.** హిం. వి. పండిన ధాన్యపు కొలఁత.

**కైవడి.** దే. వి. 1. ప్రకారము. ''సీ. కరులఁ ద్రుంచెడు వేళ గిరులఁ దున్నాడు సంక్రందను కైవడిగానవచ్చు.'' భార. శల్య. ౧, ఆ.—2. పోలిక. ''గీ. అతనిమేను కుంతియట్టుల కైవడియరయ.'' భార. శాం. ౧, ఆ. (కయివడియొక్క రూపాంతరము.)

**కైవడిముస్తె.** వై. వి. తుంగముస్తె*. (కయివడిముస్తెయొక్క రూపాంతరము.)

**కైవర్తము.** సం. వి. అ. న. కైవడిముస్తె*.

**కైవర్తి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**కైవర్తుఁడు.** సం. వి. అ. పుం. చేపలఁ బట్టువాఁడు, జాలరి.

**కైవల్యము.** సం. వి. అ. న. అపవర్గము, మోక్షము.

**కైవారము.** ఉభ. దే. వి. గనిమయంచు. వై. స్తోత్రము*. (చూ. కయివారము.)—సం. అ. న. వందిస్తోత్రము. ''ఈ కైవారదుర్భాషణంబులకుం గాని యతండు మెచ్చఁడు.'' నై. ౭, ఆ.

**కైవారి.** సం. వి. న్. పుం. వంది. ''మ. కమలాక్షస్తరఘుస్తరాబ్జభవులుం గైవారులు.'' హరి. పూ. ౧, ఆ.

**కైవు.** దే. వి. (కైపుయొక్క రూపాంతరము.) ఉన్మాదము. ''క. కైవెక్కినవాని మేనుగరమున నిమిరెఁ.'' ఉ, హరి. ౨, ఆ. (మొదటి రూపము కయివు.)

**కైవ్రాలు.** దే. అ. క్రి. 1. ఒఱగు; ''బలుమఁ బండులచాయఁ దనర్చి పండి కైవ్రాలిన రాజనంబులకు.'' విక్ర. ర, ఆ.—2. పక్షులలోనగునవి క్రిందికి దిగు; ''సీ. నఖపాళిబెడఁగు మూన్పకుమంచు నడుములు కైవ్రాలె నాస్ఫటికాక్షమాలికదగ.'' ఉ, రా. 3, ఆ.—3. పడు. ''వ. వియత్తలంబునం బాటికైవ్రాలు ధారలఖాదర్శం

బులుదకెసి." అము. ౪, ఆ. (కయివ్రాలుయొక్క రూపాంతరము.)

**కైవ్రాలుచే.** దే. ప్రే. కైవ్రాలఁజేయు. (కయివ్రాలుచుయొక్క రూపాంతరము.)

**కైశికము.** సం. వి. అ. న. వెండ్రుకలసమూహము.

**కైశికి.** సం. వి. ఈ. స్త్రీ. ఒక కావ్యవృత్తి. (చూ. వృత్తి.)

**కైశోరము.** సం. వి. అ. న. వయోవిశేషము. "వ. బాల్యకౌమార కైశోరవయో విశేషంబులవింశతిహాయనంబులుకడచు." భాగ. ౭, స్కం.

**కైశ్యము.** సం. వి. అ. న. కైశికము.

**కైసాటిచేమక్క.** ద్వ. వి. హస్తనక్షత్రము. (కయిసాటిచుక్కయొక్క రూపాంతరము.)

**కైసేఁత.** ద్వ. వి. అలంకారము. (కయిసేఁతయొక్క రూపాంతరము.)

**కైసేయు.** ద్వ. స. క్రి. 1. అలంకరించు; "క. ఆసమయమునఁ గుమారిం, గైసేసి." విక్ర. ౪, ఆ.—2. పూజించు. "మ. తనకుం దానప్రతిష్ఠితుండయినయాదవోర్వరథ్వఁడసినే, మును పూజించితిఁ దొల్తటఁబారియునంభోజాతగర్భుండును, గనికైసేసిరియంతమీఁద సురులన్ గంధపుష్పలన్ జేరియ, ర్చనములన్ చేసిరి మీరుఁజేయుఁడు ఈగజాసపుష్కన్యమారాధనల్." భీ. ౪, ఆ. (కయిసేయుయొక్క రూపాంతరము.)

## కొ.

**కొంకనక్క.** ద్వ. వి. చిన్నజాతినక్క, కిఖి. "ఉ. చీమలుఁ గాకులుం గ్రిములుజింకలునక్కలుఁ గొంకనక్కలున్." భార. అశ్వ. ౨, ఆ.

**కొంకర.** దే. వి. వంపు. (అక్షరములు వంకరకొంకరగా ఉన్నవి.)

**కొంకరలువోవు.** దే. అ. క్రి. (కొంకరలు+పోవు.) శైత్యాదులచేఁ గాళ్లుఁజేతులులోనగునవివిగిడికొను. "చ. నినుఁదనచంకవైచి కొనినీరనిధాసచతుష్టయంబునన్, జనిచనిసాంధ్యకృత్యములు సల్పెమునంతకుఁద్రిప్పితెచ్చితేం, పుననటువైచికొంకరలువోయిన నిమెయిచక్కనొత్తిపో, ననిచినవాలినందనుఁడనంగదుఁడన్ దశకంఠ వింటివే." రామా. ౭, ఆ.

**కొంకి.** దే. వి. 1. వంపుచీల; 2. దోఁటి; 3. బ. ముచ్చిలిగుంతకుఁబార్శ్వములనుండెడి యెముకలు; 4. మోఁకాలిచిప్పకు లోతట్టు రెండుప్రక్కలనుండెడి యెముకలు. (కొంకివ్రేళ్లనుచోఁ గొంకెవలెనుండు వ్రేళ్లని తెలియవలెను.)

**కొంకు.** దే. అ. క్రి. 1. భయపడు; "క. శంకింపవలదుపోలఁగ, బొంకితిమునుకాననాంతమునమ్రుచ్చులకుం, గొంకి." విక్ర. ౭, ఆ.—2. వెనుదీయు; 3. సంకోచించు. వి. 1. భయము; 2. వెనుదీయుట; "గీ. తొడలపై నిద్రవోయెడు దుష్టమృగముఁ, గొంకుకొనరింతయునులేకకూలఁద్రోవు." విక్ర. 3, ఆ.—3. సంకోచము.

**కొంకుపాటు.** ద్వ. వి. 1. భయపడుట; "సీ. పరులుతిట్టిన చోటఁ బ్రత్యుత్తరములేక ప్రాణహానికిఁగొంకుపాటులేక." కవిక. ౪, ఆ.—2. సంకోచపడుట. "శకుంగనికోమలికొంకుపాటుతో." హంస. 3, ఆ.

**కొంకువోవు.** దే. అ. క్రి. (కొంకు+పోవు.) కొంకరలువోవు. "చ. ఆపదం, బొరయకయుండఁజేయుమ ప్రభూతపుసీతునఁగొంకుఁబోయెడున్." (ఈతఁడు అను కర్తృపదమధ్యాహార్యము.) భార. శాం. 3, ఆ.

**కొంగ.** వై. వి. బకము*.

**కొంగకాళ్లవాఁడు.** ద్వ. విశే. నిడుపుమోఁకాళ్లవాఁడు, ఊర్ధ్వజ్ఞువు.

**కొంగవాలు.** వై. వి. మాదిగకత్తి. "ఉ. కుక్కలనొంపఁజూచి మఱికొందఱు కొన్నిటిఁ గొంగవాలులన్, బక్కలుసించినన్." య. ౨, ఆ.

**కొంగు.** దే. వి. వస్త్రపుచెఱఁగు.

**కొంగుమాయు.** దే. అ. క్రి. బహిష్ఠయగు.

**కొంగోడువడు.** ద్వ. అ. క్రి. (కొంగోడు+పడు.) ఒడ్డిగిల్లు, ఒఱగు. "సీ. కలఁగివారిఘులపంకము నివ్వటిల్లెనఁగులపర్వతములు కొంగోడువడియె." మై. ౨, ఆ.

**కొంగోడువోవు.** దే. అ. క్రి. (కొంగోడు+పోవు.)———పై. ———(చూ. కుక్కివడు.)

**కొంచించు.** దే. అ. క్రి. సంకోచించు. "క. కొంచింపకవడిఁ బెన్నిధిఁ, గాంచినపేదయునుబోలె ఘనతరహర్షో, దంచితమానసుఁడైయా, పంచాననమధ్యఁజేరిపల్కెన్ బ్రేమన్." ౦సి. ౫, ఆ.

**కొంచియము.** వై. వి. న్యూనత. (చూ. కొంచెము.) విశే. అల్పము*. "గీ. చంద్రశేఖరునిఁ బ్రసంగవశంబునఁ, గొలిచి నాకుభక్తికొంచియంబు." కాశీ. 3, ఆ.

**కొంచెకత్తె.** వై. విశే. (కొంచెము+కత్తె.) 1. అల్పురాలు; 2. సామాన్యరాలు.

**కొంచెకాఁడు.** ద్వ. విశే. (కొంచెము+కాఁడు.) 1. అల్పుఁడు; 2. సామాన్యుఁడు.

**కొంచెతనము.** వై. వి. (కొంచెము+తనము.) సన్నఁదనము, అల్పభావము. "గొనబుఁగొనుకొంచెతనము." అచ్చే. అర, కాం.

**కొంచెపడు.** వై. అ. క్రి. (కొంచెము+పడు.) 1. తక్కువపడు; "వ. తంత్రీనీప్రసాదంబునసన్నియు సమకూరెడుంగాక కొంచెపడియెడునే." భో. ౬, ఆ.—2. సన్నగిల్లు. "సీ. కడు దొడ్డకటితటికడుఁగొంచెపడియుండె." చంద్రా. ౨, ఆ.

**కొంచెము.** వై. వి. న్యూనత. "ఉ. నీకునీ, కొంచెమువచ్చునెల్ల హరిఁగోరినుతింపమి నార్యపూజితా." భాగ. ౧, స్కం.—విశే. అల్పము*. (కొంచియముయొక్క రూపాంతరము.)

**కొంచె.** వై. వి. 1. ఒకానొకకొండ; 2. ఒకానొకపక్షి. "ఉ. తెక్కలుచించికంఠమున తేకులువాపిశిరంబు వ్రచ్చిపే, రుక్కునఁ గొంచచంద మగునొడ్డుగలంగఁగఁజేసి." భార. భీష్మ. ౨, ఆ.

**కొంచెదీవి.** వై. వి. క్రౌంచద్వీపము.

**కొంచెమల.** వై. వి. క్రౌంచపర్వతము.

**కొంచెమొగ్గరము.** ద్వ. వి. క్రౌంచవ్యూహము.

**కొంచెసారము.** వై. వి. మధ్యమస్వరము.

**కొంచె.** యు. దే. వి. ముఱికిచెమట. "పరఁగుఁగొంచనఁగను ముఱికిచెమట." ఆం, భా. ప్ర. నా.—వై. అ. క్రి. సంకోచించు. "సీ. కొంచకనీరిలోముంచుచునెత్తుచుఁగారించితీరంబు నేరఁబెట్టు." భార. ఆది. ౫, ఆ.

**కొంజె.** వై. అ. క్రి. సంకోచించు. "క. అంజకబాలకుఁడని యును, గొంజకదయమాలిరాజకుంజరయంతన్, కుంజరమును డీకొలిపెను, గుంజరపాలకుఁడుగోపకుంజరుమీఁదన్." భాగ. ౧౦, స్కం. పూ. (కొంచెయొక్క రూపాంతరము.)

**కొంట.** దే. వి. కొనుట. (అనుప్రయుక్తమైన కొనధాతువునకును రూపమిట్లెఱుంగునది. కనుఁగొంట, కయికొంట, పయికొంట మొ.)

**కొంటె.** దే. విశ. అకార్యశీలుఁడు. "క. వింటికదా నీలనయుని, కొంటెతనముపేరిమానికుటిలాలకన, క్కుంటునకునిత్తురఁటయిటు, వంటివిపోపెక్కునోళ్లవారలమాటల్." భో. ౫, ఆ.

**కొండ.** వై. వి. మల, పర్వతము.

**కొండకంది.** ద్వ. వి. సస్యవిశేషము. బ. ఆఢాన్యము.

**కొండకాకి.** వై. వి. ఒకదినుసుకాకి, అద్రికాకము.

**కొండకాలువ.** వై. వి. సెలయేఱు, ఝురము.

**కొండగుఱుతు.** ద్వ. వి. సామాన్యలక్షణము.

**కొండగోనుగు.** ద్వ. వి. అక్షోటము.

**కొండగొఱ్ఱె.** వై. వి. గాడిదెవంటి మృగవిశేషము, రౌహిషము.

**కొండగోఁగు.** ద్వ. వి. కర్ణికారము.

**కొండచిలువ.** ద్వ. వి. కొండపాము, అజగరము.

**కొండచీమ.** ద్వ. వి. ఒకదినుసుచీమ, ఉద్దీపకము.

**కొండచూలి.** ద్వ. వి. పార్వతి. "గీ. సందినెక్కిమాళినిందు రోచులుపర్వ; శూలివచ్చెఁగొండచూలితోడ." భాగ. ౯, స్కం. (ఇట్లు కొండరాచూలి.)

**కొండజొన్న.** వై. వి. సస్యవిశేషము. బ. ఆఢాన్యము.

**కొండతంగేడు.** ద్వ. వి. ఒకదినుసు తంగేడు.

**కొండత్రిమ్మరి.** ద్వ. వి. కోఁతి. (ఇట్లు తిప్పత్రిమ్మరి, మలత్రిమ్మరి మొ.)

**కొండనాలుక.** ద్వ. వి. చిఱునాలుక, గళశుండిక.

**కొండపగతుఁడు.** ద్వ. వి. ఇంద్రుఁడు, గోత్రారి. "సీ. కొండపగతుపట్టికోడలినిండువేఁకటిఁగాచినట్టిచేకత్తివాఁడు." రా, ఏ. ౨, ఆ.

**కొండపలుకు.** ద్వ. వి. పర్వతబిలమునందలి ప్రతిధ్వని. "ఎ, గీ. కొమరుఁబిల్వనియులపల్కుకొండపల్కు." చంద్రా. ౧, ఆ.

**కొండపిండి.** వై. వి. వృక్షవిశేషము. "సీ. కొండపిండియనంగఁ బిండికొండయనంగనగభేదసంజ్ఞగానలరుచుండు." ఆం, భా. ద్వి. వ.

**కొండప్రత్తి.** వై. వి. ఒకదినుసుప్రత్తి.

**కొండబూరుగు.** ద్వ. వి. కూటశాల్మలి.

**కొండబెండ.** ద్వ. వి. కచ్ఛురకము.

**కొండమల్లె.** వై. వి. గిరిమల్లిక.

**కొండమామిడి.** ద్వ. వి. కోశామ్రము.

**కొండమారేడు.** ద్వ. వి. గంధగర్భము.

**కొండము.** వై. వి. గుంటడము. "ఎ, గీ. కుండాఖ్యవెలయుఁ, చుండుగుండమనంగనఁగొండమనఁగ." ఆం, భా. ద్వి. వై.

**కొండముచ్చు.** ద్వ. వి. నల్లనిమూతిగలకోఁతి.

**కొండముసువ.** ద్వ. వి.——వై.——

**కొండయల్లుఁడు.** ద్వ. వి. (కొండ+అల్లుఁడు.) ముక్కంటి, శివుఁడు.

**కొండవీఁడు.** ద్వ. వి. ... మనంతుఁడు. "... కొండవీని హాటకకుసుమోపహారంబులు ప్రతిదినంబు పుష్పవల్లి..." భోజ. ౫, ఆ.

**కొండల్లము.** వై. వి. (కొండ+అల్లము.) ఒకదినుసు అల్లము, తృణపుష్పక.

**కొండవారు.** ద్వ. వి. బ. కొండయందుండు బోయలు.

**కొండాటము.** దే. వి. సంతోషము. "గీ. వారునితోడిదకొండాటమైలతొంగి, యుగ్రతాపంబుసైరింపకున్నఁజూచి." శివ. ౧, ఆ.

**కొండాడు.** దే. స. క్రి. పొగడు. స్తుతించు.

**కొండి.** దే. వి. 1 తేలుతోఁక; 2. ఱెక్కలుపురుగులయందుఁగ పైపు తేలుతోకవంటి యవయవమ్ము.

**కొండిక.** వై. విశ. 1. చిన్న*; "క. అనిపలికిహరికిరీటిఁ, గనుఁగొనికొండికవునివునావునకు, మునుగోఁ బాడియనప్రను." భార. ఉద్యో. ౧, ఆ. "క. ఒంటుఁగొదలేదుతూరువుఁ, గొండపయిం బ్రొద్దువొడిచెఁగొన్నాయిఁకనే, దండంబడకుండఁగూఁతురు, కొండికయనకంపవలయుఁగూరిమిననుచుక్." య. ౪, ఆ. "క. దండిలబలినైజగములు, నిండఁబెరుగుచున్న వేళనీయడుగునభూ, మండలమతిసూక్ష్మాకృతిఁ, గొండికమప్పయుఁ బోలఁగొమరొందుహరీ." పాండు. ౨, ఆ.—2. బాలుఁడు*. (ఇది యుకారమధ్యమనుటకుఁదగినప్రయోగము దొరకినదికాదు. చూ. కొండొక.)

**కొండియ.** దే. వి. కొండె.

**కొండియము.** దే. వి. కొండెము. "కొండియమునంధిభేదనమన్యకర్మోపజీవనము." భార. అను. ౨, ఆ.

**కొండియుఁడు.** దే. విశ. కొండెముచెప్పువాఁడు, పిశునుఁడు. "ఉ. క్రూరుఁడులోభియుక్తశఠుఁడుఁ గొండియుఁడుక్ జడుఁడుక్ గృతఘ్నుఁడుక్, నేరనివాఁడుబొంకరియునిందకునోర్చునతండుపందయుక్, ధీరతలేనిదుర్నయుఁడతివ్యసనత్వముగల్గుభృత్యుఁడుక్, జెరుపమక్కభూపతికిఁజెట్టయొనర్చునరేశ్వరోత్తమా." భార. శాం. ౩, ఆ.

**కొండీఁడు.** దే. విశ. (కొండియము+ఈఁడు.)——పై.—— "సీ. కొండీనినాలుకరెండుగాఁజీరెడు నలఘగంబులఁజూడుమవనినాథ." మార్క. ౨, ఆ.

**కొండె.** దే. వి. రాజులులోనగువారుమొగముపట్టువేసికొనెడువెంట్రుకలముడి. (కొండియయొక్కరూపాంతరము.)

**కొండెంగ.** వై. వి. కొండయందుండెడు నల్లకోఁతి. "ద్వి. బడుగు, కొండెంగవీనివెక్కురుతలఁదఱుఁగ." హరిశ్చ. ౨, భా.

**కొండెకత్తె.** ద్వ. విశ. (కొండెము+కత్తె.) కొండెముచెప్పునది. (ఆఁడుది.)

**కొండెకాఁడు.** దే. విశ. (కొండెము+కాఁడు.) కొండెముచెప్పెడువాఁడు.

**కొండెము.** దే. వి. లాడి. "సీ. కొట్లుబేహారులగొనబుటంగడులంద తఱచుగాఁగొండెముల్ తలుపులంద." అచ్చే. బాల, కా. (కొండియముయొక్కరూపాంతరము.)

**కొండెవల.** దే. వి. చేఁపలఁబట్టుటకు ఒకఁడువేసెడువల.

**కొండొక.** వై. విశ. 1. కొంచెము*; (కొండొకసేపు.) 2. చిన్న*; "కొండొకనవతియు." రాఘ. ౧, ఆ.—3. బాలుఁడు*. "క. అకటకటయుత్తరుఁడుకొం, డొకకాంభోజుండునుంగడుక్ బాలుఁడు." భార. స్త్రీ. ౨, ఆ.

**కొంప్ర.** దే. వి. మక్కించిదున్నినచాలు. "క. ధిఁగొంప్రవేలు పండుఁగా." కాశీ. ౮, ఆ.

**కొంప్రకైదువు.** దే. వి. నాఁగలి. "ఎ, గీ. కొంప్రకైదువుబల్లిదు కూర్మితోడు." రా, వి. ౧, ఆ.

**కొంత.** వై. స. (కొంచెము+అంత.) ఇంచుకకొలఁది. "కొంత దవ్వు." (చూ. ఇంత.)

**కొంతము.** వై. వి. ఆయుధవిశేషము, కుంతము. "క. గొంతాన నొక్కఁడుదెబ్బలిఁ, గొంతానంజదిమిమెచ్చికొనఁజేసినచో." శుక. ౧, ఆ.

**కొందఱు.** వై. స. (కొంత+వారు.) కొంతశబ్దమునకు మహన్మహత్త్వర్థకబహువచనరూపము.

**కొందలపడు.** ద్వ. అ. క్రి. (కొందలము+పడు.) కలఁతపడు, సంక్షోభించు.

**కొందలపాటు.** ద్వ. వి. కొందలపడుట.

**కొందలము.** దే. వి. కలఁత, క్షోభము. "మ. కలఁగెందోయధి సప్తకంబుగిరివర్గంబెల్లనూటాడెనం, చలతంబొందెవసుంధరావలయ మాశాచక్రమల్లాడెఁగొం, దలమందెత్రిదశేంద్రుపట్టణముపాతాళంబుఘూర్ణిల్లెనా, కులమయ్యెగ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయుఁడా." భార. విరా. ౮, ఆ.

**కొందలించు.** దే. అ. క్రి. కలఁతపడు. "వ. అప్పుడు పంది కదుపులవెనువెంటండవిలి కొందలింపంజిందఱవందఱగాఁజేసి." ఉ, హరి. ౮, ఆ.

**కొందు.** దే. స. క్రి. సజ్జెగసఱకు.

**కొంప.** దే. వి. ఇల్లు. (నింద మొదలగు సమయములయందే యిది ప్రయోగింపఁబడును.)

**కొంపోవు.** దే. స. క్రి. (కొని+పోవు.) తీసికొనిపోవు. "క. చంపినఁజంపుమునన్నటు, కొంపోకుండినసుజాలు." ప్రభా. ౩, ఆ.

**కొకిబికి.** దే. విశే. చక్కనతప్పినది. "సీ. కొకిబికివేసంపుగూని వీఁపులమీఁద మూఁడుపంగలయూఁటెమోపినాఁడు." సావి. ౮, ఆ.

**కొక్కరాయి.** వై. వి. బకము*.

**కొక్కరించు.** దే. అ. క్రి. 1. (కోఁతి) వెక్కిరించు; "ద్వి. కొనచెవుల్ జెక్కించికొక్కరించుచును." రా. సుం, కాం.—2. పక్షులుకాళ్లతోకెల్లగించు. "గీ. కుప్పలైయున్నయెరువెల్లఁగొక్కరించి." పంచ. నా. ౩, ఆ.

**కొక్కరింత.** దే. వి. కొక్కరించుట.

**కొక్కిస.** దే. వి. మల్లబంధవిశేషము.

**కొక్కు.** దే. వి. పందికొక్కు.

**కొక్కురవుతు.** ద్వ. వి. వినాయకుఁడు.

**కొక్కెర.** వై. వి. బకము*. "వ. ఒక్కమహాబకంబువచ్చె. అది పద్మభవునకుంబ్రసాదపాత్రంబగుచు నాళీజంఘుండురాజధర్ముండు నను పేళ్లంబరఁగు. ఆ కొక్కెరకునమ్మఱ్ఱినివాసంబైయుండు." భార. శాం. ౩, ఆ.

**కొక్కెస.** దే. వి. ఒకానొకచెట్టు.

**కొక్కొరొక్కో.** దే. వి. కొక్కొరొకోయొక్కరూపాంతరము. "కొక్కొరొకోయని కుక్కుటంబులుకూసె." కాశీ. ౩, ఆ.

**కొక్కొరొక్రో.** దే. వి. కోడికూయుటయందగు ధ్వన్యనుకరణము. "కొక్కొరోకోయనికూయఁజేయతఁడు." నై. ౭, ఆ.

**కొజ్జా.** దే. వి. రాణివాసపు కావలివాఁడు. "వీథులఁదిరుగంగ వెనఁదలాఁకులుపట్టి కొజ్జానుజేసిరో." భో. ౮, ఆ.

**కొటారము.** దే. వి. ధాన్యాదిరాసులుండెడుచోటు. "ఎ, గీ. తోఁటచేనుకొటారంబు దొడ్డియనెడు, నానలన్నియునినుమంత లయ్యె." వసు. ౨, ఆ.

**కొటారి.** దే. వి. ఉగ్రాణపువాఁడు.

**కొటారు.** దే. వి. 1. ధాన్యాదిరాసులుండెడిచోటు; "ఎ, గీ. తేరులాకొమ్ముటేనుఁగుబారులావ, సారులాచొక్కటపురాచదారులాకొ, టారులాతీరులాగొనబారునౌర, ప్రోలియొయ్యారమేరికిఁ బొగడనరిది." అచ్చ. బాల, కాం. 2. ఉప్పుకొటారు.

**కొటిక.** వై. వి. కొట్టిక, గ్రామము. "నిటలాక్షుగుడిలేనికొటిక నున్నయతండు." జై. ౧, ఆ.

**కొటికాఁడు.** దే. వి. కొట్టికాఁడుయొక్కరూపాంతరము. "ఉ. అప్పుకొటికాండ్రుకృపఁ వలకలిపిల్లవ్రేల్, ముట్టఁగఁగోసి మంత్రివరుముందటఁబెట్టికృతప్రణాములై." జై. ౭, ఆ.

**కొట్టకొన.** దే. వి. (కొన+కొన.) అన్నిటికిఁగొన.

**కొట్టడి.** వై. వి. సామగ్రులుంచెడుగది, కోష్ఠము.

**కొట్టము.** యు. దే. వి. నృత్యవిశేషము. "సీ. ఆటయంచనఁగ నాట్యంబొప్పెసఁగుఁగొట్టమనఁగహల్లీసకంబలరుచుండు." ఆం, భా. ప్ర. నా.—వై. పసులులోనగువానిఁగట్టెడుచోటు*.

**కొట్టరువు.** దే. వి. కొటారుయొక్కరూపాంతరము.

**కొట్లాడు.** దే. అ. క్రి. (కొట్టు+ఆడు.) 1. జగడమాడు; 2. బాధపడు. "క. కట్టాత్రికరణమెఱుఁగక, పుట్టినదురితముల నపుడపాలియింపనియా, కట్టెఁడిదేహంబుడిగినఁ, గొట్లాడునుబిట్టు నరకకూపంబులలోఁ." భాగ. ౬, స్కం.

**కొట్టాము.** యు. దే. వి. ఒకానొకదేశము. "కోనబిట్టేర్చెఁగొట్టా నఁదగిలె." సావి. ౧, ఆ.—వై. పసులులోనగువానిఁగట్టెడు చోటు*. (ఈ యర్థమునందిది కొట్టముయొక్కరూపాంతరము.)

**కొట్టి.** దే. వి. వేగు. (కోటియొక్కరూపాంతరము. చూ. కొట్టి కాఁడు.)

**కొట్టిక.** వై. వి. కొటికయొక్కరూపాంతరము.

**కొట్టికాఁడు.** దే. వి. వేగరి. "క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడునగుచునతనినెలవగునడవిఁ, జొరఁగొట్టికాండ్రు పెక్కుము, పరికించియెటింగికలయఁబడికూఁతలిడఁగా." ఆము. ౩, ఆ. (పాఠాంతరము కోటికాఁడు.)

**కొట్టు.** యు. దే. స. క్రి. ప్రహరించు. వి. ప్రహారము. వై. సామగ్రులుంచెడుగది. "కొట్లుబేహారులగొనబుటంగడులంద." అచ్చ. బాల, కాం.

**కొట్టుపడు.** ద్వ. అ. క్రి. వ్యయమగు.

**కొట్టులాడు.** దే. అ. క్రి. (కొట్టులు+ఆడు.) పోట్లాడు.

**కొట్టులాట.** దే. వి. కొట్టులాడుట.

**కొట్టె.** దే. వి. మట్టియొఱలయంతటిదళముగలకాఁగు. "ఎ, గీ. తద్విశేషసమాఖ్యలుతనరుచుండు, కొట్టెకూటుపాడకకుమిబొట్ట యనఁగ." ఆం, భా. ద్వి. వై.

**క్రొట్నము.** దే. వి. 1. వడ్లదంపకము; 2. వివాహాలంత్రవిశేషము; 3. ఊడిగము. "శా. ఇట్టట్టెందును బోవరాకవగతోనెల్ల ప్పుడుకా వేలుపుల్, వెట్టింగొట్నముఁజేయ." య. ౨, ఆ.

**క్రొట్ర.** దే. వి. పిండిలోనగువానినుడుకఁబెట్టుటకుఁ బెట్టెడియెసరు. "వ. కీచకతండులంబులంబిండిగొట్టికొట్రఁబోసియుప్పి గొప్పలుగాఁజేసియావించినకుడుములబానలు." కాశీ. 3, ఆ.

**క్రొట్లమారి.** దే. విణ. (కొట్లు + మారి.) కొట్లుపడుస్వభావముగలవాఁడు. "సీ. తాళముల్ చూడఁగీర్తనపాత్రములటంచుఁగొట్లమారులజోడుకూర్పఁదగునె." చంద్ర.

**క్రొట్లాట.** దే. వి. కొట్టులాటయొక్క రూపాంతరము. "ఎ, గీ. తానగోసిడికొట్లాటతగులుపఱచు." భల్లా. 3, ఆ.

**క్రొడమ.** దే. వి. ముఖభాగమునఁగట్టులేకనడుమవలవలెనల్లికగలయూఁతవంటియొకమత్స్యగ్రహణసాధనవిశేషము. (చూ. అడ్డకొడమ.)

**క్రొడవలి.** దే. వి. కోసెడుసాధనము, లవిత్రము.

**క్రొడి.** వై. వి. దీపశిఖ*. "సీ. కొడిఁబుట్టుకాళిమాంకురపుమేఘములకుమెఱుఁగులై చూపుఁగ్రొమ్మించులలర." పాండు. ౨, ఆ.

**క్రొడిది.** దే. వి. ఒకానొకచెట్టు. "కొడిదిపూనలనంటుకొలిపినమొలత్రాడు." పంచ. వేం. ౧, ఆ.

**క్రొడిదిలి.** దే. వి. 1. వంచినచేర; 2. పుడిసిలి.

**క్రొడిమె.** దే. వి. 1. అపదూఱు; "ఎ, గీ. మదికివలసినయట్లచేయుదురుగాని, వట్టికొడిమెలునాకునుగట్టఁజనదు." కళా. ౫, ఆ.—2. పాపము; "చ. జడముడి జాహ్నవీతట నిశాకరపోతముఁజూచియెవ్వరీ, కొడిమెలుగట్టిపెండ్లికొడుకుంగడియారముమోవఁజేసిరి." జై. ౧, ఆ.—3. చేఁపలబుట్ట. "సీ. కువేణిచెలంగుఁగొడిమెయంచనఁగను." అం, భా. ప్ర. వారి.

**క్రొడిమెలాఁడు.** దే. విణ. (కొడిమెలు + ఆఁడు.) పాపాత్ముఁడు.

**క్రొడిసె.** వై. వి. కొండమల్లె, కుటజము†. (దీనికాయ ఇంద్రయవము.)

**క్రొడిసెపాల.** దే. వి. కొడిసెవిత్తు.

**క్రొడుఁగురు.** దే. వి. దీపముయొక్క చిట్టెము.

**క్రొడుకఁడు.** వై. వి. కొడుకు, పుత్రుఁడు*.

**క్రొడుకు.** వై. వి.——పై.——

**క్రొడుపు.** దే. వి. 1. గంటలోనగువానివాయించెడు సన్నకొయ్య, కోణము. "ఉ. క్రంగనగంటపైఁగొడుపువ్రాలుటయెన్నఁడు నాఁటమండియుణ్." నై. 3, ఆ. "గీ. క్రొమ్మెఱుఁగుదీఁగెతళుకులకమ్మపసిఁడి, కొడుపుతాఁకులఘూర్ణిల్లెఘోరభంగి, దర్పకోద్దండ దండయాత్రకునుబోలె, భూరితరమేఘమాలికభేరిభేరి." రామా. ౬, ఆ.—2. బలపములోనగువానికోపు; 3. తంతిమీటుటకుబంగారులోనగువానితోఁజేసివ్రేలికివేసికొనెడుగోరు; 4. వెదురుకనుపులనడిమిభాగము.

**క్రొడుము.** దే. వి. బిందెవంటికుండ.

**క్రొమ్కు.** వై. వి. కొడుకుయొక్క రూపాంతరము.

**క్రొడ్డి.** దే. వి. కొడిదియొక్క రూపాంతరము. "సీ. నివురుగప్పనిచంద్రనిప్పుకైవడినున్నదీకొడ్డిపూసనీకెవ్వఁడిచ్చె." జై. 3, ఆ.

**క్రొణజ్జా.** దే. వి. వాకిటి కావలియిల్లు.

**క్రొణత.** దే. వి. 1. కుక్కగుగట్టెడుకొయ్య; 2. మల్లపరికరవిశేషము. "సీ. తత్పావనంబులైనఁగుఁగంబములకొణత." అం, భా. దశ. ష. (రూ. కొణతము. కుక్కగుగట్టెడుకొయ్యకు.—"సీ. విడుదుగల్గినయింటఁజెరిగినఁగోణతంబుగప్పినంతనకుక్క వెదకుఁజెప్ప." వేణుగోపాలశతకము.—మల్లపరికరవిశేషమునకు.—"అమరంగ్రొవిన్ రితేనెచాలుకొణతా లందండలాగించి." శశాం. ౨, ఆ.)

**క్రొణఁగె.** దే. వి. కుప్ప, దిబ్బ. "వ. మగరాలగోడలనీడలందు అంగలించుక్రీడాపులినంపుఁగొణింగెలంజెలంగు." కృష్ణ. ౧, ఆ.

**క్రొణిగ.** దే. వి. ముంజూరు. "సీ. నెలప్రలై చెలువారునిలువులపిలపిల్లి కొణిగఁబారావత కులముచదర." సాన. ౬, ఆ.

**క్రొణిద.** దే. వి. జాతిభేదము.

**క్రొణిదిలి.** దే. వి. కొడిదిలియొక్క రూపాంతరము.

**క్రొణుఁగురు.** దే. వి. కొడుఁగురుయొక్క రూపాంతరము.

**క్రొణుజు.** దే. వి. పిడుఁజు.

**క్రొతిమిరి.** వై. వి. కొత్తిమిరియొక్క రూపాంతరము.

**క్రొతుకు.** దే. అ. క్రి. 1. వర్ణలోపముగామాటాడు; 2. సంకోచించు. "చ. అతితరుమారమారవిశిఖాగ్నిశిఖాపరితాపభీతిఁ, యస్మతివ లమిన్న నిన్ని చటికెంపెడిచో మటియేమిపల్కెనీ, మతిఁ గొతుకంగనేలచెపుమా." రసి. ౫, ఆ.—వి. 1. వర్ణలోపముగలమాట; "గ్రచ్చుకొతుకునాఁగగ్రస్తాఖ్యవిలసిల్లు." అం, భా. ప్ర. వాగ్వి.—2. సంకోచము.

**క్రొతుకుపడు.** ద్వి. అ. క్రి. 1. (మాట) లుప్తవర్ణమగు; 2. సంకుచితమగు. "క. కొతుకుపడురతికిఁజతురత." హంస. ౨, ఆ.

**క్రొత్తిమిరి.** వై. వి. దనియాలపైరు. బ. దనియాలు.

**క్రొత్తెము.** దే. వి. తాటిపండ్లయందునిత్తులేనికండ.

**క్రొత్వాలు.** హిం. వి. పోలీసు అధికారి.

**క్రొద.** దే. వి. కొదవయొక్క రూపాంతరము. "ఉ. నాతమ్ముని ముద్దుమాటలుకొదల్పడఁబల్కెడుచిల్కబోదని, త్యమ్మునుబొత్తునంగుడుచు నర్మిలిచేడ్పడు." నిర్వ. ౫, ఆ.

**క్రొదమ.** దే. వి. 1. పశుపక్ష్యాదులపిల్ల; (సింగపుఁగొదమ, అంచకొదమ, లేఁటికొదమ మొ.)—2. ఆఁడుమేఁకపిల్ల. విణ. 1. యౌవనముతలచూపినది; (పశుపక్ష్యాదికము.) (కొదమపెంటి, కొదమతుమ్మెద మొ.)—2. దృఢము. (కొదమపిడుగు మొ.)

**క్రొదరు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "సీ. కోర్కులతమకంబు కొదరియుఁదాలిమి పొందునసందంద క్రిందువడఁగ." హరి. ఉ. ౭, ఆ.—2. చెదరు; 3. రేఁగు.

**క్రొదవ.** దే. వి. కొఱత. "గీ. నీప్రాపుగలిగి, యుండఁగానిట్టికొదవమాకొదవనేల." రామా. 3, ఆ.

**క్రొదుక.** దే. విణ. తక్కువ. "ఎ, గీ. తక్కువకొఱంతయొచ్చెముతగ్గుకుందు, కొదవలొచ్చుకొదుకయనఁబొదలున్యూనము." అం, భా. తృ. వి.

**క్రొదుకు.** దే. అ. క్రి. కొతుకుయొక్క రూపాంతరము. (సంకోచించుటకు.—"క. ఒదుఁగుచులక్షణమెఱుఁగక, కొదుకుచుఁభ్రాసంబువడియుఁగూడకమీఁదుల్, వెదకుచుఁబదసంధులుచెడ, నదుకుచువెడకవితచెప్పునతఁడుంగవియే." కవిగజాంకుశము.)

**క్రొదుపు.** దే. స. క్రి. ఏదేనినోటనేసికొనిమ్రింగక ఊరక్షనములు.

**కొద్ది.** దే. వి. కొలఁదియొక్క-మాఱురూపము. "ద్వి. కొద్దిగాముత్తెంపు కొనల[illegible], మద్దికాయలడాలుపలయఁజెక్కు-ళ్లు." రా. బాల, కాం. (ఈ [illegible]ను ప్రాచీనకవుల ప్రయోగములందు కనఁబడలేదు.)

**కొన.** వై. వి. 1. చివర; 2. చెట్టుకొమ్మచివర*. "చ. తొఁదల పోనిహరించెనాకులుం, గొనలనుజొంపములెనిమిద కొమ్మలుచేయునుం గ్రమంబునన్." భార. శాం. 3, ఆ.

**కొనకొను.** దృ. అ. క్రి. యత్నించు. "వ. అమ్మెయింబలితుండు కొనకొనికొలుకకుఁడుట యెటెంగిరోమఖుండిట్లనియె. క. తగునే యిట్లుకృతార్థుఁడ, వగునీ కురి కొలుకకిట్టులాలన్యముచేఁ, తగటా కృతప్నునకునెల, వగు టులునే కొలుపకడఁకనద్రోహుఁడవై." భార. శాం. 3, ఆ. (ఇది గ్రంథములయందుఁ గొన్నిచోట్లనరకొదిగాఁగనఁబడుచున్నది.)

**కొనటి.** వై. విశే. అంగహీనుఁడు. "గీ. రూపవిహీనులుదారురూపు, గలిగితొలుమేనఁగొనటులఁబలికినారు." భార. అను. ౫, ఆ.

**కొనరిక్క.** వై. వి. రేవతీనక్షత్రము. "క. కొనరిక్క-పేరిపొలఁతుక, పెనిమిటివైనాఁగలియునుబెనుతొటోసిడం, బునుబూనిరవళికాంద్రన్, దునిమిపుడమిపడఁతిత్రేగుద్రోయుదువుగదా." అచ్చ. బాల, కాం.

**కొనలిడు.** దృ. అ. క్రి. (కొనలు+ఇడు.) వర్ధిల్లు. "క. ప్రయత్న దోకయించుకైనన్, దయ్యదుకొనలిడియెఁదృష్ణ." భాగ. ౯, స్క.

**కొనలొత్తు.** దృ. అ. క్రి. (కొనలు+ఒత్తు.)———పై.——— "ద్వి. కొనిపోయివేడ్క-లుకొనలొత్తనపుడు, వినుతొర్ఘ్యపాద్యాది విధులఁబూజించి." రా. బాల, కాం.

**కొనసాగు.** దృ. అ. క్రి. 1. వర్ధిల్లు; "క. అనవృదు సాత్యకి మోమునఁ, గొనసాగనితెలివిదోఁపఁగుశలమునీచె, ప్పినవారికెల్లనసుటయు." ఉ, హరి. ౪, ఆ.—2. సిద్ధించు.

**కొని.** దృ. స. ప. కొన్నియొక్క-రూపాంతరము. "క. మనజపతి యివ్విధంబునఁ, దనచెలి యింటికిని ముచ్చుఁదప్పనవొప్పి, చినయట్టులమదినినరకు, గొనకమఱచియున్నయెడను గొనిదినములకున్." నిర్వ. ౭, ఆ. (హల్లుపరమగుచో ఇకారలోపము. "కొన్ని గొడంగికొన్ననిని." పాండు. ౪, ఆ.) (చూ. కొన్ని.)

**కొనిపోవు.** దే. స. క్రి. తీసికొనిపోవు.

**కొనియాట.** దే. వి. (కొనియాడుట.) 1. నుతించుట; "మీరు విజయాశ నసుం గొనియాటఁజేసియో, గాదనకియ్యకొంటి." భార. ద్రో. ౧, ఆ.—2. ఆదరించుట; 3. కాపాడుట; "సీ. తలఁపంగనాద్యమైతనరుధర్మమునెప్డుఁ గొనియాటనాస్తికగోష్ఠిఁజనమి." భార. ఆర. ౫, ఆ.—4. కొలుచుట. "క. కడుఁగొత్తలునీవిటు నను, బడుగుంబాటించిమిన్ను ప్రాఁకించెదునీ, యడుగులుగొనియాటకుఁబని, వడుపనియాతనికిమున్నపాడియెపొగడన్." హరి. ఉ. ౮, ఆ.

**కొనియాడు.** దే. స. క్రి. (కొని+ఆడు.) 1. నుతించు; 2. ఆదరించు; "క. అనినఁబితృదేవతలుమా, కునునీకునునరకగతియ గుంజొప్పునీ, మనమునమావచనంబులు, కొనియాడకవిడిచితేనికుల జలధిశశీ." మార్క. ౭, ఆ.—3. కాపాడు. "ఎ, గీ. అవని పుత్రకులుదాని, నెంగిళులుపెట్టికొనియాడనెలమిఁజెరిగి." భార. కర్ణ. ౨, ఆ.

**కొనివచ్చు.** దే. స. క్రి. తెచ్చు.

**కొను.** దే. అ. క్రి. 1. నాటు; "అనలాస్త్రంబట్లువక్షంబవియఁ [illegible]గాననా." మార్క. ౭, ఆ.—2. సరిపడు. "కుటిలబుద్ధులిచటఁ గొనవు." భార. విరా. ౪, ఆ.—స. క్రి. 1. అపహరించు; "వ. పాత్రిచీరఁగొనిపసిరికపురుగగు." మార్క. ౨, ఆ.—2. వెలకుఁదీయు; 3. గ్రహించు; "గుడియలురోఁకంట్లుకొనివీఁకమోఁదియు." రా. యు, కాం.—4. తీసికొను; "ఎ, గీ. అతివపిండుఁ, గరులఁదురగములను నరదంబులనుగొని, యరుగుదెంచె." భార. సూ. ౧, ఆ.—5. పట్టుకొను; "ఇందుఁగ్రోల్లొనపులిగొనన్ వడిఁజొచ్చినన్." భార. ఆది. ౮, ఆ.—6. పరిగ్రహించు; "క. వినుమిచ్చెదననియామియుఁ, గొనియెదననిపలికి పిదపఁగొనకునికియున, త్యనృతంబులు." భార. శాం. ౪, ఆ.—7. లక్ష్యపెట్టు; "క. మిమునెల్లమిగులుభుజగ, ర్వముమదముంగలఁడు కొనఁడరాతులనధిపా." భార. ఉద్యో. ౪, ఆ.—8. త్రేయు. "భీమపార్థులును గోకొమ్మంచునొక్కు-మ్మడిన్గవియన్." భార. భీష్మ. 3, ఆ. "క. ముసువడినమెకముఁగొనిచని, కనుగ్రుడ్డుపెకల్చి కత్తిఁగడిగికటారిం, గొనితోఁకవడిచియొకఁడొ, ననఁగనురాళించె నయ్యయాలికిఁగడఁకన్." య. ౨, ఆ.

**కొనుగోలు.** దే. వి. 1. క్రయము; 2. నట్టువుఁడుకొలిపించుట.

**కొనుజు.** దే. వి. పిడుఁజు. "సీ. ఎరువుతిప్పలుగొని యెల్లమందలుఁగొను జెక్కి-మేపులచోటుత్రొక్కఁబడియె." హరి. పూ. ౫, ఆ.

**కొనుబడి.** దే. వి. కొనగోలు, క్రయము.

**కొనుమొదలు.** దే. వి. కొనుటకిచ్చినధనము.

**కొన్నాళ్లు.** దృ. వి. బ. (కొన్ని+నాళ్లు.) కొన్నిదినములు.

**కొన్ని.** దృ. స. ప. (కొంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) కొంతసంఖ్యగలవి. (చూ. ఇన్ని.)

**కొపురు.** వై. వి. 1. శిఖరము*; "క. దాఁటుటయుఁగొండకొపురులు, బీఁటలువాపెను." అచ్చ. కిష్కిం, కాం.—2. ఉన్నతి*. "గీ. గొనబుఁగొను, కొంచెతనముఁ బిఱుఁదుఁగొపురుకునుబొక్కిలి, లోఁతునెన్ననెనగలుగుటయరిది." అచ్చ. ఆర. కాం. (కొప్పరము యొక్క-రూపాంతరము.)

**కొప్పరము.** వై. వి. 1. శిఖరము*; 2. మూఁపు*; "ఎ, గీ. కొప్పరముమూఁపటంచన నొప్పునంసము." ఆం, భా. ద్వి. వ.—3. విజృంభణము*. "వ. కొప్పరంబులదెప్పరంబులం దెలిపియు నిలిపియు." ఉ, హరి. ౬, ఆ. విశే. విజృంభితము. "రోగముల్ కొప్పరమైనచో." దాశరథిశతకము.

**కొప్పరించు.** వై. అ. క్రి. 1. అతిశయించు*; "వ. శేవెలుంగుజాచిప్పలంగప్పరంపుఁగుప్పెలంగొప్పరించిననరనమధురనంబులు నించి." పా. ౨, ఆ.—2. విజృంభించు*. "వ. ఝుణఝుణఝుంకారంబులుం దదీయపరస్పర ఘుర్ఘణక్రేంకారంబులుం దమహుంకారంబులును ముప్పిరిఁగొనంగొప్పరించియు." ఉ, హరి. ౪, ఆ. "సీ. కొప్పరింపఁగమింటఁగ్రొవ్వాఁడిరోమముల్ చొచ్చివెళ్లినతొలుల్చుక్క-గుంపు." చంద్రా. ౧, ఆ.

**కొప్పరింత.** వై. వి. 1. అతిశయించుట*; 2. విజృంభణము*.

**కొప్పు.** దే. వి. 1. తలయందుదోఁపినవెంద్రుకలముడి; 2. ఇంటి కొన; "క. లలిఁగొప్పెక్కించితిమధు, పులకుకులనునడుగుపఱచి పుష్పాస్త్రామా, లలకుసుమంచంబులుబాఁ, పలకునుబీఁటలనుమాట బళినిజమయ్యెన్." చంద్ర.—3. ఇంటి నడికొప్పు, మొగుడు.

**కొప్పెర.** వై. వి. వెడల్పుముఖముగలపెద్దపాత్రము, కటాహము. "గీ. రానివారలనువైవుఁ, దరసికాఁగినచమురుకొప్పెరలలోన." జై. ౪, ఆ.

**క్రొప్రము.** వై. వి. శిఖరము*. "ఉ. పున్నమచందురుందెగడు పొంకపుమోములరాచకన్నియల్, క్రొన్నెలజాలమేలిపనికొప్రపు మేడలనాటలాడ." నీలా. ౧, ఆ. (కొప్పరముయొక్కరూపాంతరము.)

**కొబ్బెర.** దే. వి. చిప్పతీసినటెంకాయ.

**కొబ్బెరకాయ.** దే. వి. టెంకాయ.

**కొబ్బెరపండు.** దే. వి. కొబ్బెరకాయ. "చక్కెరకొబ్బెరపండు లుంద్రముల్ మెక్కెడుపొంపజందెములమేటికి." నీలా. ౧, ఆ.

**కొబ్బెరయుండ.** దే. వి. (కొబ్బెర+ఉండ.) భక్ష్యవిశేషము, కూండము.

**కొమ.** దే. వి. 1. శాఖ; 2. అందుది. (కొమ్మయొక్కరూపాంతరము.)

**కొమరసామి.** వై. వి. కుమారస్వామి. "సీ. కొక్కొరోకోయని కొమరసామిరథంబు కంఠంబుసాంచిక్రొక్కారమిచ్చె." భీ. ౨, ఆ.

**కొమరాలు.** ద్వి. వి. (కొమరు+ఆలు.) 1. యౌవనవతి; 2. సౌందర్యవతి. "గీ. చాలముద్దరాలుజవరాలుకొమరాలు." భాగ. ౯, స్కం. (చూ. కొమరు.)

**కొమరిత.** వై. వి. కూతురు. "ఎ, గీ. అతనునారాచమైన, రాచకొమరితంబాంచాలిఁజూచునపుడు." పాంచా. ౨, ఆ.

**కొమరు.** వై. వి. 1. వృత్తియందు కొమిరెశబ్దమునకగు ఆదేశము; (కొమరాలు మొ.) 2. మనోజ్ఞత*. "సీ. వదనంబు కొమరుభావన చేసివేఱుగనుదుటిసొంపలకలనొదుఁగఁబడఁగ." భార. విరా. ౧, ఆ.—విశే. మనోజ్ఞము.

**కొమరుఁడు.** వై. వి. కొడుకు, పుత్త్రుఁడు.

**కొమరుఁదనము.** వై. వి. (కొమరు+తనము.) యౌవనము. "తోఁచుటలేనికొమరుందనములేనిచెలువంబు." కళా. ౪, ఆ. (చూ. కొమరు.)

**కొమరుఁబాయము.** వై. వి. (కొమరు+పాయము.) యౌవనము. "క. నీకొమరుంబాయముమిక్కిలి, కొమరొందెను." కళా. ౪, ఆ. (చూ. కొమరు.)

**కొమరులు.** దే. వి. బ. మేలుదూలముమీఁదిగుజ్జులు.

**కొమరేఱు.** ద్వి. వి. (కొమర+ఏఱు.) స్వామిపుష్కరిణి. "గీ. దివ్యవాహినిఁగొమరేటఁదీర్థమాడి." భీ. ౨, ఆ.

**కొమారి.** వై. వి. కూఁతురు. "గీ. ఈకొమరుఁబాయపుమిటారిరా కొమారి." చంద్ర.

**కొమారిత.** వై. వి.——వై.——"పల్లకియెక్కియాదొర కొమారిత." పాంచా. ౨, ఆ.

**కొమారుఁడు.** వై. వి. కొడుకు, పుత్త్రుఁడు. (బ. కొమారులు, కొమాళ్లు.)

**కొమార్త.** వై. వి. కొమారితయొక్కరూపాంతరము. "సీ. మున్నున న్నెఱుఁగుదువిన్నాతివృషపర్వుఁడనుతొలువేల్పురాయనికొమార్త." య. ౪, ఆ.

**కొమిరె.** వై. వి. యౌవనముగలస్త్రీ*. "కొమిరెలులేరెనీకుఁబది కోటులు." ఉ, రా. ౪, ఆ.

**కొమ్మ.** దే. వి. 1. శాఖ; 2. అందుది; 3. కోటకొమ్మ, కపిశీర్షము; "చ. కడఁగిరసాతలంబుభుజగంబులువెల్వడివచ్చికొమ్మలన్, బడగలువిచ్చియాడునెడఁబంకజమిత్త్రుఁడురాహుశంకఁబె, ల్లడరెడు భీతితోనరదమట్టునునిట్టునుదోలునిమ్నకున్, బొదవ్రుచునేమిచెప్ప ననఁబొల్పుసగడ్తయుఁగోటయున్బురిన్." భో. ౨, ఆ.

**కొమ్మత్రిమ్మరి.** దే. వి. కోఁతి. "కొమ్మత్రిమ్మరివాఁడు." అచ్చ. యు, కాం.

**కొమ్మనఁటి.** దే. వి. (కొమ్మ+అనఁటి.) కదళీవిశేషము*. "ఎ, గీ. పనసపండ్లదపండ్లకొమ్మనఁటిపండ్లు." రసి. ౧, ఆ.

**కొమ్మనగొర్తెపిండిచెట్టు.** ద్వి. వి. పూతిక.

**కొమ్మనగొలిమిడి.** దే. వి. మూలభలి*.

**కొమ్మనగోర.** దే. వి. వృక్షవిశేషము.

**కొమ్మమెకము.** ద్వి. వి. కోఁతి, శాఖామృగము. "కొమ్మమెకంపు వెల్లివలు." దు. 3, ఆ.

**కొమ్మి.** దే. వి. ఒకానొకచెట్టు.

**కొమ్ము.** దే. వి. 1. ఉకారముయొక్కరూపాంతరనామము; 2. ఎద్దు లోనగువానికొమ్ము; 3. మాదిగవాఁడు క్రొవ్వుఁచుకొనెడు పాత్రము; 4. పసుపులోనగువానియొంటిన నిడుపాటిగడ్డ; 5 చిమ్మనఁగ్రోవి; "చ. తొడవులుతీసిక్రొమ్మెఱుఁగుదువ్వలువల్ కడవేసిజిల్గుపా, వడఁబొగఁగట్టిమేలిరసవాలికకొమ్ములువట్టియుద్ధులే, ర్పడఁగవగూడియల్లవలరాయనిక్రొవ్వరిఁబోఁడికేళిన్రావడనియొ యారిదారికనుపట్టఁగొలంకునఁజేరిరెంతయున్." చంద్ర. 6. పల్లకి బొంగు; "సీ. మొగలిఱేకల్లికతొగకాఁడచట్టముకుఱుగన్నచెఱకు క్రొమ్మెఱుఁగుఁగొమ్ము." (ఇక్కడ అందలముయొక్క వర్ణనము.) చంద్రా. 3, ఆ.—7. ఏనుఁగుయొక్కదంతము; "ఉ. కొన్నిటి హస్తముల్ చదియఁగొన్నిటిఁగొమ్ములుదుమ్ముధూళిగా." భార. భీష్మ. ౨, ఆ.—8. పందికోఱ; "సీ. నీటికిఁగామునిఁగినసేలచేడియఁ గొమ్ముకొనుబ్బనెత్తినఘోణిపివ." పా. ౧, ఆ.—9. ఊఁదెడి యొకానొకవాద్యము; "వ. గుమ్మెటలచటులరవమ్మునగొమ్మలనినదమ్మునుజెలంగె." కాశీ. 3, ఆ.—10. శాఖ; "సీ. కలఁచుపున్నాగంబులలరుఁగొమ్ములమహెూన్నతిగలయనభీకమతులనైన." హస. ౨, ఆ.—11. శిఖరము; "క. గుబ్బలికొమ్మెక్కిటిఁగడు, నిబ్బర ముగఁబెటికేయాతనికన్ వైచినవాఁ, డుబ్బుసెడకమలత్రిమ్మరి, బెబ్బులిపైమొనలవాలుపేర్మిన్ వైచెన్." అచ్చ. యు, కాం.—12. కొన; "సీ. ధనువుక్రిందటి కొమ్ముధరణిపై మోపిమీఁదటికొమ్మువామహస్తము నఁబట్టి." భో. ౫, ఆ.—13. ఉత్సాహము; "గీ. అంతగోపసింహుఁడనురకొమ్ములువట్టి, ధరణిద్రొబ్బిత్రొక్కిదైత్యభటుల, కొమ్ము వీడసురలకొమ్మువర్ధిలవాని, కొమ్మువెఱికిమొత్తికూల్చెఁదివిప." భాగ. ౧౦, స్కం. పూ.—14. బలము. "క. కొమ్మాదానవనాథుని, కొమ్మాహవమునకుఁదొలఁగె గురువిజయముగై, కొమ్మామెచ్చితినిచ్చెదఁ, కొమ్మాభరణములనీవుకోరినవెల్లన్." భాగ. ౧౦, స్కం. ఉ. 15. గవుండ్లవాఁడు బందముతగిలించెడు కత్తిపిడికలోని వంకర కొయ్య.

**కొమ్ముకాఁకర.** ద్వి. వి. కారవేల్లవిశేషము*.

**కొమ్ముకాఁడు.** దే. వి. 1. వరాహము; 2. అగసాలెవాఁడు. "సీ. నరకహేతుహిరణ్యహరణవృత్తిఁజరించుకొమ్ముకాని భజించు కొదవలెల్ల." వసు. ౧, ఆ.—3. కొమ్ముఁదెడుమాదిగవాఁడు. "సీ. మాతంగసదృశుఁడౌమనుజుండు తగుబోయఁడనఁగనుగొమ్ము కాఁడనఁగ." అం, భా. ద్వి. ఖ.

**కొమ్ముచేఁప.** దే. వి. ఒకానొక అందుమత్స్యము, శృంగి.

**కొమ్ముటేనుఁగు.** దే. వి. (కొమ్ము+ఏనుఁగు.) మగయేనుఁగు. "కొమ్ముటేనుఁగువిభీషణతంజనుదెంచుకైవడిన్ ధనుజవరుండువచ్చె." విక్ర. ౫, ఆ.

**కొమ్ముపెసర.** దే. వి. సస్యవిశేషము. వి. ఆదాన్యము.

**కొమ్ముమాచకమ్మ.** దే. వి. కొమ్ములుగల మాచకమ్మ.

**కొమ్ముగాఁడు.** దే. వి. కొమ్మూఁదెడు మాదిగవాఁడు.

**కొయ్యకూర.** ద్వ. వి. (కోయు+కూర.) కోయఁదగిన నల్లతోఁట కూర.

**కొయ్య.** దే. వి. 1. కఱ్ఱ; 2. మ్రాను.

**కొయ్యగాలు.** దే. వి. (కోయు+కాలు.) కోఁతకోసినమోడు.

**కొయ్యకూర.** ద్వ. వి. కొయుకూరయొక్క-రూపాంతరము.

**కొరడా.** హిం. వి. చేబుకు, జాటి.

**కొరడు.** యు. దే. వి. వంకరగాక సరిగానుండెడి యింద్రధనుస్సు. వై. సుద్దకూలు.

**కొరద.** దే. వి. మత్స్యవిశేషము. "సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱమీ నులుచే ముచ్చంగి బేడిస జెల్లచాఱమీను." హంస. ౪, ఆ.

**కొరవంజి.** దే. వి. 1. ఎఱుకువాఁడు. "క. ఒడయుని పేరిటియూ చిఱు, బుడుతనికెనగానఁగానఁబురుడింపఁగని, కృ-డిబోయలలో మచేయె, ఘృ-డుచాయలమలలమెలఁగుకొరవంజులలోన్." చం ద్రా. ౨, ఆ.—2. ఎఱుకుది. "ఏయేభూములుచూచినావెకొర వంజీ." శుక. ౧, ఆ.

**కొరవి.** వై. వి. ఎఱ్ఱగోరంటపూ. "చ. కనఁదిలకంబుఁ గేసరముగ్గు మియల్ రహిఁబాడఁ బ్రేంకణం, బునిమురమావినవ్వసుర పొన్న ముఖాంబుజ మెత్తఁజంపకం, బునెఱకప్పుఁగిటంగొరవిమూర్ఛ-న వావిలితన్నవంజుళం, బునుఁడువగోఁగునైతమణిపూచుసురద్రుమ మన్నిపువ్వులన్." పా. ౪, ఆ.

**కొరనానిగండు.** ద్వ. వి. క్రూరమృగవిశేషము.

**కొరి.** దే. వి. తెప్పనడిమివెంద్రుక, అర్ధము. "సీ. కలివోసినాన్చిన గ్రచ్చకాయలభంగికొరిదూలినట్టిదృగ్గోళకములు." కాశీ. 3, ఆ.

**కొర్నవగండు.** ద్వ. వి. కొరసానిగండు. (చూ. కణఁతి.)

**కొఱ.** దే. వి. 1. కొఱఁత; "క. ముఱిముఱిచీఁకటిరాలనం, దఱు రాజులనమరముడిగితగనెల్లిటికిన్, గొఱగలకలనగునడుఁవుఁడు, నెఱ వగుగోవర్ధనాద్రినేలకుననుచున్." ఉ, హరి. ౪, ఆ.—2. ప్రయో జనము; "ద్వి. తజేచనుదేరనాతనికుక్షివలనఁ, గొఱగలయొకమంచి కొడుకుజనించె." భాగ. ౮, స్కం.—3. మత్స్యవిశేషము; (కొఱ్ఱయొక్క-రూపాంతరము.)—4. శిల్పము. "సీ. కొఱమించు పగడంపుగుంద్రకంబంబులు వలుదతామరకెంపుఁదలుపుగ ములు." అచ్చ. అ, కాం.—విశ. ప్రయోజకము. "క. మఱచితి రేయదువిభుఁడిం, దఱకును బురియొప్పగించి తగనేగుటయి, త్తఱి నదిచూఱలువోవఁగఁ, గొఱయగునేమగతనంబుఁగులముసుమన కున్." హరి. ఉ. ౬, ఆ.

**కొఱఁకు.** దే. వి. 1. పసులుమేయుకంచె, వివీతము; 2. పక్షు లెరయేఱితినుచోటు. "ద్వి. కొఱఁకులుమానిపక్షులుగూండ్లసేరె." పారిజ. ౧, భా. (కొఱనుయొక్క-రూపాంతరము.)

**కొఱఁత.** దే. వి. తక్కువ. "క. అంతటఁగడలందెల్లఁగొ, ఱంత యొకింతయునులేకఱంపిల్లెనిరుల్." అచ్చ. సుం, కాం.

**కొఱఁతనుఱుకు.** దే. స. క్రి. (కొఱఁతన్+ఉఱుకు.) అకార్యము చేయు. "గీ. కొఱఁతనుఱుకుగాని కొడుకెన్నఁడునుగార్య, తంత్ర మునకుఁజొరఁడు." భార. స్త్రీ. ౧, ఆ. "వ. కృష్ణుఁడెప్పుడుం గొఱఁతనుఱుకఁడిన్ననాడునుండిన్నకొలందులం బోయెడువాఁడు గాఁడనుచుఁబల్కు." హరి. పూ. ౭, ఆ.—విశ. అకార్యముచేయు వాఁడు. "వ. వారుగదామీఁదెఱుంగక కొఱఁతనుఱుకులై చెడు తెరువునంబోయెడువారు." భార. ఉద్యో. ౨, ఆ.

**కొఱకచ్చు.** దే. వి. కొఱవి, అలాతము. "చ. అలమరునాజ్ఞశిత కరునవ్వలరమ్మనిచెప్పిగుంపులై, యలిబలముల్ వియోగి హృదయం బులుమాఁడఁగవచ్చినట్టివె, న్నెలకొఱకచ్చులోయనఁగనిండినచీఁకటి మీఁదనింగిఁజు, క్క-లుగనుపట్టెవచ్చి పొడకట్టెశశాంకుఁడునంతఁ దూర్పునన్." రామా. ౨, ఆ.

**కొఱకు.** దే. అప. చతుర్థీవిభక్తియందువచ్చెడు ఒక ప్రత్యయము. "సీ. పవనేరితములైన పాదపాంసువులనిం దఱఁగృతార్థులఁజేయు కొఱకొయనియు." కళా. ౨, ఆ.

**కొఱకొఱ.** దే. వి. కోపవికారము. "క. తెఱవలకనుపులలోనే, ర్తెఱఁబెటిగెడుప్రోడరేయిత్రిమ్మరిదొరపైఁ, గొఱకొఱనూర్పులు నిగుడుచు, తెఱఁగునగాటంపుటూర్పుఁదెమ్మెరలడరెన్." అచ్చ. బాల, కాం.

**కొఱకొఱలాడు.** దే. అ. క్రి. (కొఱకొఱలు+ఆడు.) కోప గించు.

**కొఱగామి.** దే. వి. (కొఱ+కామి.) 1. అకార్యము; "క. వెఱ వకకలలోఁజేసిన, కొఱగామికివగచుచోటగుణరత్నముచే, కుఱెనీకు నలిగితన్నినఁ, బఱపుపయింబడినయట్లుపద్మదళాక్షి." ఉ, హరి. ౫, ఆ.—2. దుర్లక్షణము; "క. ఆకొఱగాములఁగనుఁగొని." స్వా. ౪, ఆ.—3. దోషము. "క. ఇక్కొ-ఱగాములలోపల, నొక్క-టిసీ చిత్తవృత్తినొందవెనా." సం. "కచ్చిదేతై ర్మహాదోషైర్నస్పృష్టోసి నరాధిప." భార. ఉద్యో. ౨, ఆ.

**కొఱడు** దే. వి. 1. ఆయుధవిశేషము; "ఉ. భూరిధృతింబసిండి జలపోఁతకటార్లుఁగొఱల్లుఁబూని." కళా. ౮, ఆ.—2. మ్రాని మోడు, స్థాణువు. "గీ. కొఱడుగనిను స్త్యఁడనుశంకఁగూరినట్లు." వా. ౨, ఆ.

**కొఱడుకోల.** దే. వి. ఆయుధవిశేషము. "చ. కొనలుమొనల్పడన్ గొఱడుకోలవిధంబునదూయఁజెక్కు-చ, క్క-నికుఱుమట్టపుంజిఱుత కట్టియనోరికొనంగి." చంద్రా. ౨, ఆ.

**కొఱడుపాఱు.** దే. అ. క్రి. తిమురుపట్టు.

**కొఱను.** దే. వి. 1. పసులుమేయుకంచె; "క. కొఱనుగనాఁగిన పొలమును, నెఱయంగరిసనముగల్గునేలయుసరి." విజ్ఞా. ప్రా, కాం. (చూ. కలను.)—2. పక్షులెరయేఱితినుచోటు. (చూ. కొఱఁకు.)

**కొఱపము.** వై. వి. గుఱ్ఱమునుదోమెడు గొఱపము. (ఇట్లు పరు షాదిగాఁగొన్నిదేశములయందు వ్యవహారము.)

**కొఱప్రాణము.** మి. వి. కుట్టుసుఱు. "క. జాఱుజాఱుకనినెత్తురు వెలి, కుఱుకుచు రొదసేయనజెలియొడపినెయూర్పుల్, పఱవమిడి గ్రుడ్లవడఁకుచుఁ, గొఱప్రాణముతోడఁదన్ని కొనునమ్మెదవృక్." ఆము. 3, ఆ.

**కొఱముట్టు.** దే. వి. పనిముట్టు, ఉపకరణము.

**కొఱలు.** దే. అ. క్రి. 1. ఉండు; "క. పిఱుఁదంగురుధరణీ పతి, యఱచేతంబ్రాణములుగనభియాతిబలం, బుఱనితెగువముంద టఁజెన్, గొఱలుటచిత్తమునఁబెట్టికొనివిహరించెన్." భార. స్త్రీ. ౨, ఆ.—2. ప్రకాశించు. "చ. కొఱలెడితేజఁచేఁబసిఁడిగుబ్బలి యున్ పఱివెండికొండయున్, గరఁగునటంచునంద్రములుకాఁకల నింకునటంచు." య. 3, ఆ.—స. క్రి. పొందు. "ఎ, గీ. శాం తిఁగొఱలివిప్ర, కులముదైవస్వరూపం బగుటమనంబు, నందుదృఢ

ముగనిల్పి.’’ భార. అను. ౫, ఆ. (ఆదికవుల ప్రయోగములు మొదటి యర్థమునందును ఈ యర్థమునందునే కానఁబడుచున్నవి.)

**కోఱవ.** దే. వి. ఒకానొక తక్కువజాతి. (కొఱవవాఁడు, కొఱవది.)

**కోఱవత.** దే. వి. కొఱవది.

**కోఱవి.** దే. వి. కొఱకచ్చు. ‘‘ఎ, గీ. కొఱవిఁద్రిప్పినయొప్పున మెఱసెఁబార్థు, గాండివము.’’ భార. ఆర. ౬, ఆ.

**కోఱవిచీమ.** దే. వి పెద్ద యెఱ్ఱచీమ.

**కోఱవిదయ్యము.** దష. వి. పిశాచభేదము. ‘‘ఎ, గీ. గగనమను రుద్రభూమినేకతమతిరుగు, నదరులు మిసెడుకొఱవిదయ్యంబు వీఁడె.’’ నై. ౨, ఆ.

**కోఱవోవు.** దే అ. క్రి. (కొఱ+పోవు.) మూర్ఛిల్లు. ‘‘క. విను మమ్మెయినిర్దేశం, బుననవ్వాగ్దేవిమూర్ఛవోయినయట్లే, మినిబలుక కుండిపదపడి, వినయంబుననజానిశరణువేఁడెలతాంగీ. వ. అనిన బ్రాహ్మణిపతితో బ్రహ్మమాటకుంగొఱవోయినవాణియేమిటందేఱె.’’ భార. అశ్వ. ౨, ఆ.

**కోఱసంది.** దష. వి. ఆయము, జీవస్థానము. ‘‘క. పఱతెంచికరి మదమునే, డ్తెఱఁదొండంబెత్తి వ్రేయచెప్పటికమునన్, గొఱసంది తాఁకినేలకు, నొఱగినసింగంపుఁగొదమయొప్పమరంగన్.’’ నిరష. ౧౦, ఆ.

**కోఱు.** దే. వి. కొఱ్ఱుయొక్కరూపాంతరము. ‘‘క. నెఱిమాలిబందె వట్టిన, నఱిముఖేఁజంపిననుగజము నశ్వసుమ్మున్చైచ్చె, పఱిగొనిన నట్టివారలఁ, గొఱులఁదిగిచిచంపుటొప్పఁ గువలయపతికిన్.’’ విజ్ఞా. ప్రా, కాం.

**కోఱుకు** దే. స. క్రి. కఱచు. వి. మేహరోగవిశేషము.

**కోఱ్ఱ.** దే. వి. 1. మత్స్యవిశేషము, పారీసము; 2. సస్యవిశేషము. బ. ఆధాన్యము, ప్రియంగువు.

**కోఱ్ఱు.** దే. వి. మేకు, శూలము.

**కోల.** దే. వి. 1. పాపము; 2. హింస.

**కోలఁకు.** వై. వి. కొలనుయొక్కరూపాంతరము.

**కోలఁకువు.** వై. వి.——పై.—— ‘‘కొలంకువుకలంకంబొందఁ గాఁజొచ్చి.’’ భాగ. ౮, స్కం.

**కోలఁది.** దే. వి. పరిమితి. విశ. శక్యము. ‘‘వ. ఇప్పుడు రాజకులంబులు కొలందికిమిగిలి నాకు భరియింపంగొలందిగాకయున్నయవి.’’ హరి. పూ. ౫, ఆ.

**కోలకోల.** వై. వి. కలకలము. ‘‘చ. కొలకొలమంచునుండుసిత కోకనదప్రభవప్రసూతనా, కొలువిదితొంటినాఁడతిథికోటులనందడి.’’ నై. 3, ఆ.

**కోలగాఁడు.** దే. వి. (కొలత+కాఁడు.) ధాన్యము కొలుచువాఁడు.

**కోలగారము.** దే. వి. ధాన్యము కొలతకిచ్చెడు కూలి.

**కోలత.** దే. వి. 1. పరిమాణము; 2. ధాన్యములోనగువానిని కొలుచుట.

**కోలను.** వై. వి. గుంట, సరస్సు. (రూ. కొలఁకు.)

**కోలము.** వై. వి. 1. వంశము; 2. సజాతీయప్రాణిసమూహము. ‘‘సీ. కలకలపలుకుచిల్కల కొలంబులఁజాల నలరుపొన్నలుమూఁగి యలరులాఁగి.’’ యు. ౪, ఆ.

**కోలారకము.** దే. వి. ధాన్యమును కొలుచుట. ‘‘ఎ, గీ. కొలువడి కొల్లారకంబనఁగొలుచుటకగు.’’ వేం.

**కోలారము.** దే. వి. కొల్లారముయొక్కరూపాంతరము.

**కోలారు.** దే. వి.——పై.——

**కోలారుబండి.** దే. వి. కొల్లారుబండియొక్కరూపాంతరము. ‘‘సీ. తండోపతండమ్మైగఁగోపలములుంచుపథములందుఁగొలారుబండ్ల నాఁగి.’’ శుక. ౧, ఆ.

**కోలి.** దే. వి. బిల్లగోడాడుచపుడుబిల్లఁబెట్టికొట్టుటకుఁద్రవ్వినచిన్న పల్లము. ‘‘గీ. కూడిగిరులుఁదరులుఁగొల్లంబుఁబల్లంబు, సరసిమిట్ట పుట్టలడవిఁదడవి, యోషితొలులుఁగొలులునోలంబుసాలంబు, సూచిక్రంతగుంతచొచ్చివచ్చి.’’ ఉ, హరి. ౫, ఆ.

**కోలికి.** దే. వి. 1. ముక్కునంటినకంటిమూల; 2. పాకములోనగు వానితగిల్చెడువంకరకమ్మి; 3. పరిపాకము. ‘‘వ. కార్యంబును గొలికికివచ్చియున్నయది.’’ పర. 3, ఆ. ‘‘ద్వి. వినుసేఁడు ముఖమునసెత్తురుప్రామి, కొనిగుల్లపఱపక కొలికికిరావు.’’ హరిశ్చ. ౨, భా.

**కోలికిపూస.** దే. వి. కొలికికిఁదగిలించెడుపూస. ‘‘మ. పాలు పారన్ శిరదంగనాతిలకమంభోజాకరంపుంజొకా, కొలికింౘామర కొల్కిపూసలెసఁగిఅక్కఁజేసిక్రొంచాద్రిఁదా, దలలీలందగురెండు దార్లఁజెలువారన్ వచ్చురాయంచబో, దలపేరన్ ధరియించెనచ్ఛ తరముక్తాదామమెంతేరహిన్.’’ చంద్ర.

**కోలికిముడి.** దే. వి. వదలుముడి.

**కోలిపించు.** దే. అ. క్రి. నట్టువుఁడు కొనుగొలుచేయు. ప్రే. ధాన్యాదికము కొలువఁజేయు.

**కోలిమి.** దే. వి. కమ్మరినిప్పుంచెడుపల్లము. ‘‘గీ. తామ్రమాదిగఁగల యట్టిధాతుచయముఁ, గొలిమినిడియూఁదఁగీడెల్లఁబొలియునట్లు, ప్రాణపవననిగ్రహమునఁగ్రాఁగిపోవు, నసఘయింద్రియజనితదోషాలియెల్ల.’’ మార్క. 3, ఆ.

**కోలిమితిత్తి.** దష. వి. కొలిమియూఁదెడుతిత్తి, భస్త్ర.

**కోలుచు.** దే. స. క్రి. 1. ఉపాసించు; ‘‘క. ధరణీశ్వరుఁడమ్ముని వరుఁ, బురాతనమునిప్రకాశుఁబుణ్యాత్మునిరం, తరకృతభక్తిసపర్యా, వరివస్యండగుచుభక్తివదలకకొలిచెన్.’’ భార. సభా. ౧, ఆ.—2. సేవించు; 3. ధాన్యాదికము కొలతచేయు. వి. 1. ధాన్యము; ‘‘సీ. వాన, కారుపొలంబునఁగల్గెనేనియుఁగొల్చుగావింపనేర్చునేకల విధమున, వలనేర్పడఁగదున్నఁబొలములోనైనవర్షంబులేకున్నధాన్యంబులగునె.’’ భార. శా. ౧, ఆ.—2. వరిధాన్యము. ‘‘క. కొలుచుయవలుసెనగలుమినుములుతిలలావలుకుళుత్థములుముచ్చిలినన్.’’ మార్క. ౨, ఆ.

**కోలుపు.** దే. అ. క్రి. 1. నట్టువుఁడుకొలిపించు; 2. నమ్మలించు; ‘‘క. మనసుకొలుపదనికినిపుడు.’’ భార. భీష్మ. 3, ఆ.—3. సరిపడు; ‘‘క. ఈపేదమాటలెల్లను, గోపవివశుఁడైననాకుఁ గొలుపవు ముగ్ధా.’’ భార. అను. ౧, ఆ. ‘‘గీ. హీనమతికిబుద్ధులేలకొలుపు.’’ పంచ. నా. ౧, ఆ. ‘‘సామమువెండిభేదమున్ దానముఁగొల్పకుండినఁ గదామఱిదండనము.’’ భో. ౪, ఆ.—4. చెల్లు. ‘‘ద్వి. మఱఁగకవాపన్నమాయలన్నియును, గొలుపవువీనిపై.’’ హరిశ్చ. ౧, భా.—అం. ప్రే. 1. పురికొలుపు; ‘‘క. అలిగిదశార్ణాధిపుఁడు, కొలిపెనుభగదత్తుమీఁదఁగ్రూరగజము.’’ భార. భీష్మ. 3, ఆ.—2. పుట్టించు; ‘‘సీ. తపనమండలముశస్త్రపరం పరలఁగప్పికదనమంతయునుజీఁకట్లుకొలుప.’’ జై. 3, ఆ.—3. (కను) గీటు, సైగ చేయు. ‘‘క. అనియిత్తెఱఁగునఁబాఱుఁడు, వినిపించినగొల్లతేఁడు వేడ్కలుమదిలో, ననలెత్తఁగఁదనమ్రోలన్, గనుపట్టుననుంగుఁబట్టిఁ గనుకొల్పుటయున్.’’ నీలా. ౧, ఆ.—4. అనుప్రయుక్తమై

కొన గొయ్యప్రసక్రొత్త గనుకొందువచ్చెడిరూపము. (అడలుకొలుపు, పురికొలుపు మొ.)—వి. గ్రామశక్తికిచేసెడి యుత్సవము.

**కొలువడి.** దే. వి. (కొలుచు+వడి.) కొలత. (చూ. కొలారకము.)

**కొలువాసములు.** దే. వి. మత్స్యవిశేషము, రాజీవము.

**కొలువు.** దే. వి. 1. ఆస్థానము; "గీ. వచ్చికొలువుచొచ్చినెచ్చెలి పిందుకం, బంకసిలువంబనిచియల్లనల్లఁ, గదిసిప్రౌఢవనితకైవడి ముద్దియ, ముద్దుపుట్టఁదనకుమ్రొక్కుటయును." భార. విరా. ౧, ఆ.—2. సేవ; 3. ఉత్సవవిశేషము. "ఎ, గీ. తద్విశేషంబు చొప్పఁదేవ, తంతు పాకన నంపు జాతర కొలువన." ఆం, భా. ప్ర. నా.

**కొలువుకాఁడు.** దే. వి. సేవకుఁడు.

**కొలువుకూటము.** దే. వి. ఆస్థానమండపము.

**కొలువుగొను.** దే. స. క్రి. (కొలువు+కొను.) సేవకునిగాపరిగ్రహించు. "క. కొలువుగొనుమొల్లకుండుట, కలిగినఁబొమ్మనుట యంతకంటెనుమేలు." భార. విరా. ౧, ఆ.

**కొలువుడుకాఁడు.** దే. వి. కొలువుకాఁడు, సేవకుఁడు.

**కొలె.** దే. ద్ర. మొదలుకొని యనునర్థమునుదెలుపునది. "భూపాలుఁ డారామక్షోణికిఁ జన్ననాఁటఁగొలె." వసు. ౪, ఆ. (కోలె యొక్కరూపాంతరము.)

**కొల్ది.** దే. వి. విశే. కొలఁదియొక్కరూపాంతరము. "నెవ్వడిఁజే కొల్దిగఁదీసి." సీలా. 3, ఆ.

**కొల్ను.** దే. వి. కొలనుయొక్కరూపాంతరము. "ఉ. అంతటఁ బ్రొద్దిఁ గ్రుంకుటయునాశకంబుగజేంద్రరోహిణీ, కాంతునిఁగొల్ను చూచుటకుఁగాఁదొడితెచ్చితి." పంచ. నా. 3, ఆ.

**కొల్ల.** దే. వి. దోఁపుడు, అభ్యవస్కందనము.

**కొల్లకత్తె.** దప. విశే. కొల్లపెట్టునది. (ఆఁడుది.)

**కొల్లకాఁడు.** దే. విశే. కొల్లపెట్టువాఁడు.

**కొల్లకొట్టు.** దే. స. క్రి. 1. కొల్లపెట్టు; 2. (అధికలాభముగ) సంపాదించు.

**కొల్లగొను.** దే. స. క్రి. (కొల్ల+కొను.) కొల్లపెట్టు.

**కొల్లపెట్టు.** దే. స. క్రి. అపహరించు.

**కొల్లలాడు.** దే. స. క్రి. (కొల్లలు+ఆడు.) దోఁచుకొను, అపహరించు.

**కొల్లవోవు.** దే. అ. క్రి. (కొల్ల+పోవు.) చూఱపోవు.

**కొల్లాడు.** దే. స. క్రి. (కొల్ల+ఆడు.) కొల్లపెట్టు. "క. కొల్లాడిరికైవల్యలక్ష్మినమరుబుమునులుఁ." కాశీ. ౨, ఆ.

**కొల్లాబండి.** దే. వి. గాడీ.

**కొల్లాయపంచె.** దే. వి. చిన్న అంగవస్త్రము.

**కొల్లారము.** దే. వి. సదుమ బయలును నాలుగుప్రక్కలఁ గట్టడమునుగల యిల్లు.

**కొల్లారు.** దే. వి.——సై.——

**కొల్లారుబండి.** దే. వి. కొల్లాబండి. (చూ. గొలారుబండి.)

**కొల్లి.** దే. వి. ఒకానొకచెట్టు.

**కొస.** దే. వి. 1. కొన; "సీ. మునమునమనఁజుట్టికొనవెండ్రుకలు నట్టిపూఁపున్నినియందియలులియఁదాఁచి." కవిక. ౪, ఆ.—2. ఉపయుక్తముకాని తృణాదులయగ్రాంశము.

**కొసరు.** దే. అ. క్రి. 1. విజృంభించు; "చ. కొసరివసంతకాలమునఁగోయిల క్రొచ్చినభంగినేర్చిన, బ్బిసరుహనేత్ర." కాశీ. ౫, ఆ.—2. సంకోచించు. "క. ఏమీయిపుడొకవిన్నప, మేమైనం జెప్పకొనననపేక్షించినయ. ట్లైమోముతోఁచుచున్నది, యోమునివర కొసరనేల యొగిఁజెప్పుమనఁ." పర. ౫, ఆ.—స. క్రి. ప్రార్థించు. "సీ. జోగిణిఁగొసరిబైసుకవెట్టిపలకపైసారెలువోయించినరము చూచి." ఉ, హరి. 3, ఆ.—వి. 1. కోరిక; "చ. కిసలయపత్త్రకఁ మకరకేతననూతన వార్తలన్నియుఁ, బొసఁగలిఖించి యందుఁదల పూవులుఁదమ్మయునానసేయునా, కొసరుతెలంగెటింగి కుచకుంభములంబలిఁదాల్చు నన్ను నఁ, తనమునవ్రాసియిచ్చినఁ గవాచెలికత్తెలకేను మ్రొక్కుదుఁ." ఉ, హరి. ౫, ఆ.—2. ఏదేనొకవస్తువును దీసికొన్నదానికిచ్చెడుపెచ్చు; 3. ప్రార్థనము; "ఉ. మ్రొక్కులుపల్కుమోడివిసరుల్ కసరుల్ కొసరుల్ చెలంగ." శశాం. 3, ఆ.—4. సంకోచము. "ఎ, గీ. సింహబలుఁడత్యుదగ్రతఁజగురుఁబోఁడి, పజ్జఁగదువడిఁదగిలికోపంబుగదుర, నాడిసి తలపట్టితిగిచిమహోగ్రవృత్తిఁ, గొంకుకొసరించుకయులేకకూలఁ దాఁచె." భార. విరా. ౨, ఆ.

## కో.

**కో.** దే. వి. అఱపునందగు ధ్వన్యనుకరణము.

**కోంకణము.** సం. వి. అ. న. ఆయుధవిశేషము. పుం. ఒకానొకదేశము. (చూ. దేశము.)

**కోగిరి, ఖోగిరి.** హిం. వి. గుఱ్ఱపుజీను.

**కోఁగు.** దే. స. క్రి. గొఱుగు. "సీ. ముండనసంజ్ఞయులరుచునుండును, గోఁగుటబోడింపుగొఱుగుటయన." అం, భా. ద్వి. బ్ర.

**కోఁచె.** దే. వి. పిఱికి, భీరువు.

**కోఁచెవాఱు.** దే. అ. క్రి. (కోఁచ+పాఱు.) భయపడు. "చ. భిదురధరుండుఁజక్రియునుబెట్టుగదీర్ఘవిచారమెంతనే, యుదురఁటదైత్యుఁడెంతబలియుండొకదాయనికోఁచవాఱకి, ట్లుదుటునవానిఁ ద్రుంతునననొక్కనినంపినసంటిచాలదే." ప్రభా. ౨, ఆ.

**కోఁడు.** దే. స. క్రి. బియ్యములోనగువానిని చేటలోఁబోసికొని ప్రక్కవాటుగా నిటునటుత్రిప్పు.

**కోఁత.** దే. వి. కోయుట, లవనము.

**కోఁతపట్టు.** దే. అ. క్రి. కోఁతకోయనారంభించు.

**కోఁతపడు.** దప. అ. క్రి. ఖండితమగు. "క. ఏయంగముఁగొని శూద్రుఁడు, పాయక విప్రునకుఁదానుబాధకుఁడగువాఁ, డాయంగముకోఁతపడక, పోయెదనసరాదుతనకు భూపతిచేతఁ." విజ్ఞా. ప్రా, కాం.

**కోఁతి.** దే. వి. మల్లు, వానరము.

**కోఁతిపుల్లలు.** దే. వి. బ. మగ్గపుపలకదారములను మీఁదికిఁదిగెచ్చెడు పుల్లలు.

**కోఁతిమామిడి.** దే. వి. అంబాళముॆ.

**కోఁదాడు.** వై. వి. తాళవృక్షవిశేషము. "ముక్కుదాడిమబీజ మొగలింగకోఁదాడు." హంస. ౪, ఆ.

**కోక.** దే. వి. వలువ, వస్త్రము. "ఉ. కోకయునాసనంబుగొనుగాఁ శయనాదులుఁదానయైజయో, త్సేకముతోడనాగకులశేఖరుఁడుర్ధ్వజవాహనాదికా, స్తోకవపుర్విశేషములతో గరుడుండుఁబురంబు సర్వముఁ, దాకొనికాచుచున్నకుముదప్రముఖుల్ సతతంబుఁగొల్వఁగఁ." పర. ౧, ఆ.

**కోకనదము.** సం. వి. అ. న. 1. చెంగలువ; 2. చెందమ్మి.

**కోకము.** సం. వి. అ. పుం. 1. జక్కవ; 2. తోఁడేలు; 3. బల్లి; 4. కప్ప; 5. ఈఁదుచెట్టు.

**కోకిలము.** సం. వి. అ. పుం. పికము, కోయిల.

**కోకిలాక్షము.** సం. వి. అ. పుం. ములుగొలిమిడిచెట్టు.

**కోగెల.** వై. వి. కోవెల, కోకిలము.

**కోట.** వై. వి. 1. దుర్గపురము; "సీ. కోటయేమఱకెప్పుఁబాటించి గడ్డియు ఖాణంబుఁగొల్పునగట్టియలును, నేయినూనెయునునానాయుధమ్ములునౌషధములునాభీలయంత్రములుఁగూప, ములులోనుగానందు వలయువానినమగ్రములుగసంపాదించి." భార. శాం. ౨, ఆ.—2. పట్టణముచుట్టుగల ప్రహరి*.

**కోటఁడు.** వై. వి. గుడ్లగూబ.

**కోటము.** సం. వి అ. పుం. కోటఁడు, గుడ్లగూబ. "ఘూకః కోటోదివాభీతః." త్రికాండశేషము.

**కోటరము.** ఉభ. దే. వి. కోడంట్రము. "చ. అరయమిఁజేసిక్రోడలనకప్పుడుదాసిగఁజేసెనమ్మహా, పురుషునిపాలికింబతులు పోవఁగవీరలతోనయేనుఁజె, చ్చెరఁజనికోటరంబుఁదగఁజేయుదునోయటుఁగాకపాడిమై,వరవృడమోపిచేయుదునొవారికిమాధవనిశ్చయింపుమా." భార. ఉద్యో. 3, ఆ.–సం. అ. పుం, న. చెట్టుతొఱ్ఱ.

**కోటటికము.** దే. వి కోడటికముయొక్క-రూపాంతరము. "చ. పలుకుపడంతియేయు విదపజ్జలఁగోటటికంబుసేయు." రామా. ౧, ఆ.

**కోటవి.** సం. వి. ఈ. స్త్రీ. దిసమొలది, ఉచ్చేమల్లి.

**కోటానఁగోటులు.** మి. వి. బ. (కోటులు+కోటులు.) అసంఖ్యములు. "క. హాటకములుదక్షిణగాఁ, గోటానఁగోటులొసఁగి కుంభినియెల్లన్, బాటించిధారవోసెను, హాటకగర్భప్రభావుఁడగు వరరుచికిన్." విక్ర. ౫, ఆ.

**కోటి.** ఉభ. దే. వి. వేగు. "క. చెడవిటేగియడవిఁబడియెడ, నెడగట్టులతుదలఁగోటియిడిలోఁగడకున్, దడుకువొడిపించియాకుల, గుడిసెలవసియించెమంత్రిగురుభటయుతుఁడై." ఆము 3, ఆ.—సం. ఇ. స్త్రీ. 1. అంచు; 2. అతిశయము; 3. వింటికొప్పు; 4. చివర; 5. సంఖ్యావిశేషము.

**కోటికాఁడు.** దే. వి. వేగువాఁడు. "క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడునగుచునతనినెలవగునడవిన్, జొరఁగోటికాండ్రు టెక్కెము, పరికించియెటేంగికలయఁబడికూఁతలిడన్." ఆము. 3, ఆ. (పాఠాంతరము కొట్టికాఁడు.)

**కోటివర్ష.** సం. వి. ఆ. స్త్రీ. పిక్క-చెట్టు.

**కోటిశము.** సం. వి. అ. పుం. మట్టిగడ్డలుకొట్టెడుకొయ్య. (రూ. కోటీశము.)

**కోటీరము.** సం. వి. అ. పుం. కిరీటము, బొమిడికము.

**కోటు.** ఆం. వి. చొక్కాయి.

**కోటేరు.** దే. వి. దుక్కి-కిఁబోవునపుడుగాని దుక్కి-యైమరలివచ్చునపుడుగాని దుంపమీఁదుగాకాఁడికి తగిలించిన నాఁగలి. "గీ. అడుసుదుక్కి-యైయూమడికరుగుదెంచె, హాలికుఁడొక్కఁడుతన్నగరాత్రియుండు, చేతియుగ్గంపుఁగుండలతోఁజిన్నకోల, తోడనాఁగంటికోటరుదోలుకొనుచు." పర. ౫, ఆ.

**కోట్టము.** సం. వి. అ. పుం. దుర్గపురము.

**కోట్టారము.** సం. వి. అ. పుం. నీటిపల్లము.

**కోట్రము.** దే. వి. కోటరముయొక్క-రూపాంతరము. "సీ. వైవాహికక్రియావ్యసనంబుకొన్నాళ్లు కొన్నాళ్లు కొడండ్రకోట్రములును." వి, పు. ౫, ఆ.

**కోత్రము.** సం. వి. అ. పుం. మండలాకారమైనకుష్ఠము.

**కోర్టు.** ఆం. వి. న్యాయసభ.

**కోడంట్రము.** దే. వి. కోటటికము. "క. ఓరమణీమణినీకోడంట్రమునెఱుఁగరువారుయోగరననిశ్చలతన్." కళా. 2, ఆ.

**కోడంట్రికము.** దే. వి.———వై.——— "క. పకపకనగిదశకంఠుఁడు, నకేశాతనుజానకునీవృసతిపైకోడం, ట్రికమెపుడుచేసితినీ, మొకమేనేనెఱుఁగఁదెల్పుమునిజంబనినన్." ఉ, రా. ర, ఆ.

**కోడటికము.** దే. వి. (కోడలు+టికము.) కోడంట్రము.

**కోడలు.** దే. వి. (కొడుకు+ఆలు.) కొడుకుయొక్క-పెండ్లాము, స్నుష. (హల్లుపరమగుచో వికల్పముగానత్వలోపంబగు. "క. కలదాశూద్రవనతికిశి, కలదాననఁజాలునొకవికారపుఁగోడల్, వలదాలోలకటాక్షాం, చలదామ నిబద్ధతరుణజన ఖంజనయై." పాండు. 3, ఆ.) (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

**కోడాడు.** దే. అ. క్రి. బాధపడు. "కోడాడఁగఁబట్టిచంపెవడి." భాగ. ౯, స్కం.

**కోడి.** వై. వి. అజ్జవాలు, కుక్కుటము.

**కోడిగ.** దే. వి. రత్నముల యిరువదింటి సంజ్ఞ.

**కోడిగము.** దే. వి. విలాసచేష్ట. "సీ. కడఁకఁజేసినకోడిగముల కెల్లను బ్రతిచేసకుటలొకకొన్నిదినములందు." అని. ౧, ఆ. "ఉ. ఈ కోఁతివిటుండుచేయువెడకోడిగముల్గనిమాటివత్తురే." భల్లా. ౫, ఆ.

**కోడిగీఁడు.** దే. విణ. (కోడిగము+ఈఁడు.) కోడిగముచేయువాఁడు. "సీ. కుంటెనీలకునిచ్చికోడిగీలకునిచ్చివిస్నకవారకామినులకిచ్చి." విక్ర. 2, ఆ.

**కోడిపేఁట.** వై. వి. నాగ చివరక్రింద నెత్తుగానుంచెడు మోపుడుకొయ్య, అనుకర్షము.

**కోడిబడి.** దే. వి. పసిబాలురకుఁజేసియిచ్చెడు భక్ష్యవిశేషము. "లడ్వాలుకోడిబజ్లు." హంస. ౧, ఆ.

**కోడియ.** దే. వి. కోడెదూడ, వత్సతరము.

**కోడీ.** దే. వి. కోడిగ.

**కోడు.** దే. వి. 1. మంచముంలోనగువానికంబము; 2. ఊరిదరి, నీటిపల్లము.

**కోడుతాలు.** దే. అ. క్రి. పండినపైరు మిక్కి-లియెండు.

**కోడె.** దే. వి. 1. కాఁడిమరపఁదగినదూడ; 2. విటుఁడు. "ఎ, గీ. అడిగినంతయురోయిచ్చినట్టిక్రొత్త, కోడెఁజేకొనితనువెళ్లఁగొట్టుటయును, బ్రాఁతితనమునలంజయఁబాయలేక, వ్రీడయించుకలేకచేబోడిబొజఁగు." కవిక. ర, ఆ.—విణ. తరుణము. "కోడెనాగముంబుఁగులతేఁడుతన్నికొనిపోవుతెఱంగు." రామా. ౬, ఆ. (కోడియయొక్క-రూపాంతరము.)

**కోడెకాఁడు.** దే. వి. విటుఁడు. "వనలగుకోడెకాఁడ్రకునుదం గెటిజిన్నులు." రామా. ౧, ఆ.

**కోడెరవుతు.** ద్వ. వి. శివుఁడు, వృషభవాహనుఁడు.

**కోణంగి.** వై. వి. అంగములనువికారముగాఁజూపివిచ్చుమెత్తెడుదాసరి. "సీ. ఆశించునెపుడునత్యాసక్తినమ్మహానటుఁడునేనగరిఁగోణంగి యగుట." వైజ. ౧, ఆ.

**కోణపుఁడు.** సం. వి. అ. పుం. నైరృతుఁడు, మూలతేఁడు.

**కోణము.** సం. వి. అ. పుం. 1. ఇల్లులోనగువానిమూల; 2. అంచు; 3. గంటలోనగువాని వాయించెడుకోడుపు; 4. దుడ్డుగోల; 5. వాద్యవిశేషము.

**కోణుఁడు.** సం. వి. అ. పుం. శనైశ్చరుఁడు.

**కోదండము.** ఉప. దే. వి. బాలురనుదండించుటకైపట్టుకొనిత్రేలా డునట్లుమీఁదఁగట్టెడుత్రాడు. సం. అ. న. 1. విల్లు; 2. నాలుగు మూరలవిల్లు; 3. వెదురువిల్లు. పుం. 1. కనుబొమ; 2. ఒకా నొకదేశము.

**కోద్రంగము.** సం. వి. అ. పుం. మంచె. "కోద్రంగస్తుతమంగ స్స్యాత్." ఆ, పా. ద్వి. పు.

**కోద్రవము.** దే. వి. అ. పుం. కోరదూషము, అళ్లు.

**కోన.** యు. దే. వి. గోసమూహము. వై. 1. అడవి; "గీ. గోల యిట్టికారుఁగోనలలోనినొ్ంటి, డించిచనఁగఁజనునె." అచ్చ. ఆర, కాం.—2. కొన; "కన్గోనలం దంద్రయెక్కుడుదోఁచెఁ." హరి. ఉ. 3, ఆ.—3. మూల; "సీ. క్రొంజీఁకటులుగ్రమ్ముకోనలఁగో నల ఘనమైనమోగిపుంగవులగవుల." సా. 3, ఆ.—4. కొండల యందలిమఱుఁగుచోటు*; "మానికపుఁగోనలలోనెలమావికోన లో." వసు. 3, ఆ.—5. దేశవిశేషము*. "కోనవిట్టేర్చెఁగొట్టానఁ దగిలె." ఆము. ౧, ఆ.

**కోనత్రిమ్మరి.** ద్వ. వి. కోఁతి, వనచరము. "కోనత్రిమ్మరిబిరు దులు," అచ్చ. యు, కాం.

**కోనమనికి.** ద్వ. వి కోఁతి, వనౌకము. "కోనమనికిబంటుకలికి." అచ్చ. కిష్కిం, కాం. (ఇట్లు కోనటెంకి మొ.)

**కోనఱేఁడు.** ద్వ. వి. నైరృతుఁడు, కోణపుఁడు.

**కోనెఱు.** ద్వ. వి. కోనేఱుయొక్కరూపాంతరము.

**కోనేఱు.** ద్వ. వి. (కోన+ఏఱు.) చుట్టుమెట్లుగల నలుచదరపు గుంట, పుష్కరిణి.

**కోపకత్తె.** మి. గ్రా. విశే. (కోపము+కత్తె.) కోపముగలది. (ఆఁడుది.)

**కోపకాఁడు.** మి. గ్రా. విశే. (కోపము+కాఁడు.) కోపముగల వాఁడు.

**కోపగించు.** వై. స. క్రి. కోపించు.

**కోపగిల్లు.** వై. అ. క్రి. కోపపడు.

**కోపన.** సం. వి. ఆ. స్త్రీ. కోపముగల ఆఁడుది. విశే. కోపము గలది.

**కోపము.** సం. వి. అ. పుం. క్రోధము, కినుక.

**కోపి.** సం. విశే. (న్. ఈ. న్.) కోపముగలవాఁడు.

**కోపించు.** సం. స. క్రి. కోపగించు.

**కోపు.** దే. వి. 1. బలపములోనగువానికడ్డి; 2. కడ్డి; 3. అందము; "గీ. కత్తలానులయేపుమేల్కట్లకోపు, మదురుగోడలమెఱుపువాల్ని గలయొఱపు." రసి. ౧, ఆ.—4. వింటికొప్పు; "చ. మృతసర్పము నొక్కటివింటికొపునన్, బనివడితెచ్చివైచెనటుబ్రహ్మమునీంద్రుని యంసవేదికన్." భాగ. ౧, స్కం.—5. బ. నమస్కారము; "వ. కైలాసనిలయామీకుఁగోపులు. వళ్ళ్యల్లలాటామీకునేటికోళ్లు. గౌరీమనోహరామీకునమస్కారము." భీ. 3, ఆ.—6. నాట్యము తీర్పు; "మ. నాలిగా, డ్పులపేరంగలనట్టువుల్గలవఁగోపుల్బ్ పులేఁదీవపా, త్రలకు." య. ౪, ఆ.—7. నిమిత్తము; "చ. వేఁటకో, పునసవరించినన్దెరలుబోనులుగైకొనకొక్కయిట్టివ, చ్చినఁజనుదెంచినాఁడ." య. 3, ఆ.—8. పార్శ్వము; "సీ. కరకంకణంబులుగల్లనఁజెలులిరుకోపులఁజేరివీచోపులిడఁగ."శశాం. ౪, ఆ.—9. విధము; "వ. కోపంబురూపంబుగైకొన్నకోపునసహం కరించి." ఉ, రా. ౮, ఆ.–10. సమయము; 11. చేఁపలగుడి గ్రుచ్చునట్టిసూది; 12. మద్యము; మద్యమ్ముపేళ్లు, తనరుసారాయి కోపన. వేం.

**కోపుదారుఁడు.** దే. వి. సరకులను బైటనుండితెచ్చియమ్మెడు వాఁడు.

**కోపుగాఱు.** దే. అ. క్రి. (కోపు+పాఱు.) అందగించు.

**కోమ.** దే. వి. 1. గోపురమువలె పెరిఁగిన పుట్టచివర; "ద్వి. మెఱుఁగుఁగోఱలనువల్మీకముల్వెడలి, యుఱుపుట్టకోమలనుబికి." హరిశ్చ. ౧, భా.—2. ఆఁడుది. "గద్దరికారుజింకకోమా." అచ్చ. ఆర, కాం.

**కోమటి.** వై. వి. వైశ్యుఁడు. "భృత్య మాత్రవర్తించుపేదకోమటు లము." మార్క. ౭, ఆ.

**కోమలము.** సం. వి. అ. స. నీళ్లు. విశే. మృదువు.

**కోమలి.** వై. వి. 1. చక్కఁదనముగల ఆఁడుద*; 2. ఆఁడుది*.

**కోమలికము.** వై. వి. చక్కఁదనము. "క. ఈముక్కిచెవులీ మొగ, మీమేలిమిపాలుపుగలదెయేచెలువకునీ, కోమలికమెఱుఁగుట కునై, రాముఁడుమెలఁగించిచూచెరమణీనిన్నున్." రా. ఆర, కాం. ౧, ఆ.

**కోయ.** దే. వి. ఒకజాతిబోయ. "రగడ. కోయలరులివెకోయకిఁకఁ జెలికోయననవిలుకోయగనలును." చంద్ర.

**కోయష్టికము.** సం. వి. అ. పుం. చీకుఁగొక్కర.

**కోయిల.** యు. దే. వి. 1. గుడి; 2. ఒకానొకదివ్యస్థలము. "క. కోయిలఁదిరుమలఁబెరుమా, కోయిలఁదిరుపతులఁగుంభకోణాదికపు, ణ్యాయతనంబులమాయం, బైయెక్కడఁబోయెనొకొమురాంతకు ప్రతిమల్." కాశీ. ౫, ఆ.—వై. కోకిలము. "చ. కోయిలల యెలుంగులోలిఁగొనియింపుగఁజిల్కలతోడనెమ్మిమై, నలవడమాట లాడి." హరి. పూ. ౮, ఆ.

**కోయు.** దే. స. క్రి. 1. తీఁగలులోనగువానిఛేదించు, లవించు; 2. పువ్వులులోనగువాని గిల్లు.

**కోర.** దే. వి. 1. గిన్నె; "ఎ, గీ. నాకుమిమ్మువంటిలోకోత్తరుల కియ్యఁ, గలిగెనింతకంటెఘనతగలదె, యనుచుఁగోరలోనిఘనసార గంధంబు, వలసినట్లయొసఁగెవారలకును." వి, పు. ౭, ఆ.— 2. కల్లుత్రాగెడుగిన్నె, చషకము; "ఉ. అందఱుఁగైకొనంబనిచి యాదటఁగాంతయుఁదానునొక్కకో, రందనుపారదివ్యమదిరామధు రామృతపానకేలియం, దందయొనర్పఁగాఁదొడఁగె." లక్ష్మీ. 3, ఆ. —3. తట్ట. "ఉ. కూరిమిమంత్రితోడనలకూబరుఁడేశతమాడిపెద్ద బం, గారపుఁగోరఁగల్పవనికాజినికాంతములైనచీరలున్, హారవిభూ షణావళియు నమ్మిథునంబునకుంబ్రియంబుతో, నారదునానిచేత

నదనంజదివించెఁగుబేరుపేరుగాఁగ." స్వా. ౫, ఆ.—విగ. పెద్ద. (కోరమీనము, ముచ్చుగోర.)

**కోరంగి.** సం. వి. ఈ. స్త్రీ. చిట్టేలకి‡.

**కోరకము.** సం. వి. అ. పుం, న. 1. మొగ్గ; 2. అరవిరిమొగ్గ; 3. తామరతూఁడు; 4. తక్కోలము‡.

**కోరకొండె.** దే. వి. బిడ్డలులోనగువారికి ముఖపార్శ్వమునవేసెడు కొండె.

**కోరగించు.** వై. అ. క్రి. 1. ముకుళించు*; "ఆ. కొమ్మకన్నగవఁకు కోరగింపఁగఁబూచి, తఱచుజొత్తుగ్రుక్కదానసంబు." (గవఁకు—కర్త.) స్వా. 3, ఆ.—2. మొలకెత్తు. "సీ. జలదానిలంబునఁబులకించెనోయనఁగుటజభూజంబులు కోరగించె." విక్ర. ౪, ఆ.

**కోరటు, కోర్టు.** ఆం. వి. న్యాయసభ.

**కోరడి.** దే. వి. ఆవరణముగావేసినపొడి మట్టిగోడ, కరగోడ.

**కోరదూషము.** సం. వి. అ. పుం. కోద్రవము, అళ్లు.

**కోరవాయి.** ద్వ. వి. కోష్ణశీఘ్రస్థమగువాయువు. "ఎ, గీ. కోరవాయియనఁగోష్ణశీఘ్రస్థవాయువొప్పు." ఆం, భా. ద్వి. మ.

**కోరవోవు.** దే. అ. క్రి. (కోర+పోవు.) కొంకరలువోవు. "శరీరముకోరవోవఁగా." విక్ర. ౧, ఆ.

**కోరసిగ.** ద్వ. వి. కోరకొండె. "గీ. కోరసిగవేయువోటనెకొష్టుపుట్టి, చెటిచెననికానియెంతైనఁజేయవచ్చు." రామా. ౨, ఆ.

**కోరా.** దే. విశే. కారికము, అనాహతము. (వస్త్రము.)

**కోరాడు.** దే. స. క్రి. (కోరి+ఆడు.) 1. ఏనుఁగులోనగునవి కొమ్ములతో నేలఁబొడిచిదుమ్మెత్తిపైకిఁజల్లు; "ఎ, గీ. ఘనరజోవృష్టికై మీఁదికన్నుమొగుడఁ, గటిదెసలునిక్కబరితోలుకదలఁగీలు, మదములిక్తతనదులకీఁదదనుకృద్వ్ర, షాళితోఁ దేంట్లుపఱవఁగోరాడెఁగరులు." ఆము. ౪, ఆ. "సీ. ఈకొండసెలయేటిలీశ్వరువృషభంబుకోరాడుకూలముల్ గూడియొప్పు." హరి. ఉ. ౬, ఆ.—2. పందిముట్టెతోనేలకెల్లగించు; (చూ. క్రోడాడు.) 3. దుమ్ములోనగువానినెత్తిపైకిఁజల్లు. "తెలిదమ్మిధూళిఁగోరాడిరికంతుదంతులన." రామా. ౧, ఆ. (ఇది క్రోడాడు అను క్రియకు మాఱురూపముగాఁ దోఁచుచున్నది.)

**కోరాబంగారు.** దే. వి. మట్టపుబంగారు.

**కోరింద.** దే. వి. లక్కగలిగెడి యొకానొకతీఁగ, జతూక.

**కోరిక.** దే. వి. 1. ఇచ్ఛ; "క. ఈకథయెవ్వరుచదివినఁ, గైకొన్నవివిన్నఁగోరికనువ్రాసినవా, రేకాలముశంభునికృప, నాకల్పముగందురైహికాముష్మికముల్." భల్లా. ౫, ఆ.—2. కోరుట; "కోరికయునోల్లమియులేక." భార. శాం. ౬, ఆ.—3. వరము. "నలువకోరికలొసఁగెడినాఁడు." అచ్చ. యు, కాం.—విశే. అభీష్టము. "తగుకోరికలిచ్చెఁ బుళిందకోటికిఁగ." ఉ, రా. ౭, ఆ.

**కోరికి.** దే. వి. ఇచ్ఛ. "చ. ఇత్తెఱంగుకో, ర్కికిఁగతమేమిపాండవులగెల్చిధరణ నగమీఁదలంచితే." భార. ద్రో. ౧, ఆ. (రూ. కోర్కి.)

**కోరు.** యు. దే. స. క్రి. 1. ఇచ్ఛించు; 2. కోరాడు. (దీనికి గ్రంథములయందు కోరాడు అని యే ప్రయోగము.) వై. వి. ధనేతరవస్తురూపమైనకప్పము*. "అరులకుఁగోరువెట్టితిఁగదానినుఁదమ్ముఁడ." రామా. ౮, ఆ.

**కోర్టు.** ఆం. వి. న్యాయసభ.

**కోఱ.** వై. వి. దంష్ట్ర*. "ఉ. కోఱలుదీటుచుఁ గనఁడునకోణములన్ వహనస్ఫులింగముల్, కఱఁగ." హరి. పూ. ౪, ఆ.

**కోఱడము.** దే వి. 1. అపహాస్యము; "చ. వశిగొనికాలకేయభటవర్గముద్రోచిసఁదానుసేసలున్, గడఁగనిశాచరేశ్వరుఁడుక్రందుగఁదాకెరణంబునందడిన్, దొడిఁ ఒడవ్రేసెఁదివ్రతరదోరతనికొదనసీడఁబోకకో, ఆడముఁజెట్టుగిట్టినమఱందినెఱుంగకదుర్దాంతుఁడై." నిర్వ. ౫, ఆ.—2. బ. అపహాస్యవచనము. "చ. ధనదునియొద్దకేగియుచితంబుగఁబల్కిపురంబుఁబాసిపో, మ్మనిమునుచెప్పుకోఱడములాడినమద్భుజశక్తియంబుజా, ననవరశక్తి మూలబలశక్తియెఱుంగఁగఁ జాటిచెప్పిర, మ్మనిచతురాతి ఘాపణఁబ్రహస్తునిఁబుచ్చెసురారిలంకకున్." నిర్వ. 3, ఆ.

**కోల.** ఉభ. దే. వి. 1. దండము; "ఎ, గీ. గొయ్యి, కోలఁద్రవ్వినమాత్రఁజాలాశయాన, నేలసిద్ధింపనేర్చు." భాఁ. అశ్వ. 3, ఆ.—2. బాణము; "సీ. కోలఁదెగవెట్టఁగరాని కోలలుహరిమీఁద నేసెదిగ్భాగంబులెల్లఁగప్ప." హరి. ఉ. ౪, ఆ.—3. వంటకట్టె; "సీ. బెడిదంపుఁగోలలు బెడఁగొందబహువర్ణచిత్రితొడనముపైచీరకాఁగ." భార. విరా. ౧, ఆ.—4. మగటిమి. "గీ. గుదముసందేనమాఱులుఁగోలనొక్క, మాఱుదాపలిచేఁ బదిమార్లు రెండు, చేతులనుసేడుమాఱులుఁ బ్రీతిమన్న, శమరిశౌచంబుచేయుటచమురుఁదనము." విజ్ఞా. ఆచా, కాం.—విశే. దీర్ఘము. (కోలనిమ్మ మొ.)—సం. వి. ఆ. స్త్రీ. 1. చవ్యమనుగంధద్రవ్యము‡; 2. పిప్పలి‡.

**కోలంబకము.** సం. వి. అ. పుం. వీణెయొక్కనర్వాంగము.

**కోలకము.** సం. వి. అ. న. 1. తక్కోలపుచెట్టు; 2. మిరియము.

**కోలక్రోఁతులు.** దే. వి. బ. కోఁతికొమ్మంచియనుబాలక్రీడావిశేషము. (చూ. అందలము.)

**కోలగగ్గర.** దే. వి. కాళ్లకుదారమునుపెనఁచియెద్దులను మూటకట్టుగా కట్టెడుకట్టు. ("గీ. అసియుఁబాత్రయుఁదేఁబంపియాంత్రవల్లిఁ, గోలగగ్గరద్రోయఁదక్కజముతోడ, నొఱగిరక్కసుతోడైన్యవిరహితముగ, ధర్మమెఱిఁగించుసూక్తినాతండువలికె." (ఇక్కడ కోలగగ్గరయనఁగాకాళ్లకుదారమునుపెనఁచి యెద్దులను మూటకట్టుగాకట్టెడుకట్టువంటికట్టనితెలియునది.) ఆము. ౬, ఆ.)

**కోలజొన్న.** దే. వి. ఒకదినుసుజొన్న, ఔద్దాలకము.

**కోలదబ్బ.** దే. వి. ఒకదినుసు దబ్బ‡.

**కోలదళము.** సం. వి. అ. పుం. నలియనెడు గంధద్రవ్యము‡.

**కోలదివియ.** ద్వ. వి. వెలుతురుకట్టెలదివటీ. "గీ. వారునంత్రమించివడిఁగోలదివియలు, గొనుచు నలిప్రమిగులఁ గూడఁబాటి, నృత్తశాలఁజొచ్చి." "సం. సహసైవసమాజగ్ముర్దాదాయోల్కాన్సహస్రశః." భార. విరా. ౨, ఆ. (రూ. కోలదివ్వె.)

**కోలనిమ్మ.** దే. వి. నిడుపుదినుసునిమ్మ‡.

**కోలపాల.** దే. వి. అర్కపుష్పిక‡.

**కోలపొన్న.** ద్వ. వి. అంఘ్రిపర్ణిక‡.

**కోలము.** ఉభ. దే. వి. వేషము. "గీ. గగనరంగస్థలంబునమిగులఁ బ్రొఢి, మమునఁగాళికనీలికోలమునటింపఁ, బొరిమొగంబునరాలు నిప్పుకలనంగ, గుంపులై రాలెమహీనింద్రగోపతతులు." ఆము. ౪, ఆ.—సం. అ. న. రేఁగుఁబండు. పుం. 1. పంది; 2. తెప్ప; 3. ఒడి; 4. కౌఁగిలి.

**కోలమెఱుఁగు.** దే. వి. నిలువుమెఱుఁగు, ఐరావతి. "శిఖిదిక్కునందు వేక్షువఁగోలమెఱుఁగుల్మెఱసె." హరి. పూ. ౭, ఆ.

**కోలలవాడు.** దే. వి. బ. వేత్రధరులు. "వ. సైనికులంజేరుకొని వానియెక్కించిపురికొలుపుకోలలవారియెలుంగులును." ఉ, హరి. 3, ఆ.

**కోలవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలిచెట్టు.

**కోలవస.** దేశ్య. వి. జటిలము.

**కోలాటకమ్మ.** దే. వి. ఒకదినుసుకమ్మ. "సీ. కడియాలుఁదెక్కు-జోకలయుంగరములు ముంగరయును గోలాటకమ్మజోడు." (పాఠాంతరము. ముంగరయుఁగోలాటంపుఁగమ్మజోడు.) కళా. 2, ఆ.

**కోలాటము.** దే. వి. (కోల+ఆట.) చేతులఁగోలలుంచుకొని యాడెడియాట. (చూ. అతుకడ.)

**కోలాహలము.** సం. వి. అ. పుం. కలకలము, అలబలము.

**కోలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రేఁగుచెట్టు; 2. గంగరేఁగుచెట్టు.

**కోలు.** దే. వి. 1. అను ప్రయుక్తమైనకొనుధాతువునకు భావార్థక రూపము; (ఇచ్చుకోలు, పుచ్చుకోలు మొ.)—2. కొల్ల. "క. మున్నగనేఁగారణముగ, నన్నియుసుమలనుభవించిరనుజాలుకోరికా, గన్నారఁజూతుఁగానిజ, గన్నులభీష్మునకుఁగోలు గాసీఁజాలక." భార. భీష్మ. 3, ఆ.—విశే. పెద్ద. (కోలుపులి, కోలుమొసలి, కోలుమూఁపులు మొ.)— క్రి. విశే. మిక్కిలి. (కోలుమసఁగు.)

**కోలుకాఁడు.** దే. వి. 1. నియమించెడియధికారి; "క. పులి కోలుకాఁడుగావున, నలయకవరుసెటేఁగివాని ననుపఁగనొకనాఁ, డొలసియొకచెవులపోతుకుఁ, గలయఁగనీవరునయనుచుఁగ్రక్కునఁజెప్పెక." పంచ. నా. ౧, ఆ.—2. కావలివాఁడు; 3. సుంకరి క్రిందిబంటు.

**కోలుకొను.** దే. అ. క్రి. 1. ఉత్సహించు; 2. తేఱుకొను, 3. వర్ధిల్లు. (రూ. కోల్కొను. ఉత్సహించుటకు.—"బంధువర్గముక, ఘోరముగావధించుటకుఁ గోల్కొనకున్నదిబుద్ధి." భార. ఉద్యో. ౪, ఆ.—తేఱుకొనుటకు.—"క. సరసూనునపుడుకర్ణజుఁ, డిరుమూఁడుశిలీముఖంబు లెదనించిననొ, చ్చిరయంబునఁగోల్కొనివా, నరదముఁదునిమెక నకేతుహయసూతముగక." జై. 2, ఆ.—వర్ధిల్లుటకు.—"క. దీపమడఁగఁజీఁకటియును, గోపమడఁగశాంతిగుణముఁ గోల్కొనుక్రియ." పాండు. ౪, ఆ.)

**కోలుతల.** దే. వి. 1. ఎదుటనిలిచి యుద్ధముచేయుట; 2. (యుద్ధ) సన్నాహము. (రూ. కోల్తల. ఎదుటనిలిచి యుద్ధముచేయుటకు.—"వ. శకునికడంగియోధవరులతోమీరు కోల్తలసేయుండేను బెడ ముట్టువఁదాఁకిధర్మనందనాదులనమయించెదనంచునముద్ధతింగదిసె." సం. "యుద్ధ్యధ్వమగ్రతోయోధాః పృష్ఠతోహన్మి పాండవాన్." భార. శల్య. ౧, ఆ.—యుద్ధసన్నాహమునకు.—"వ. సుశర్మతమ్ముండు సంగతంబుగాఁగోల్తలసేసి రథసమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని." భార. విరా. 3, ఆ. "అనికింగోల్తలసేయ." అచ్చ. యు, కాం.)

**కోలుపడు.** ద్వి. అ. క్రి. 1. చెడు, నశించు; 2. అగపడు. స. క్రి. పోఁగొట్టుకొను. (రూ. కోల్పడు. చెడుటకు.—"క. ద్రోణాచార్యునియుగ్రపు, బాణంబులకోర్చియతఁడుపడుసంతకున, క్షీణధృతిననమనమర, క్షోణినిలిచికర్ణుచేతఁగోల్పడియెఁగదే." భార. కర్ణ. 3, ఆ.—అగపడుటకు.—"మ. అడవింగోల్పడుప్రాణి యెయ్యదియు లేకాటోపమేపారన, చ్చెదుగండుగ్రతఁదద్రవ్యజంబు దెనకుక శీఘ్రంబయేతెంచె." హరి. పూ. ౭, ఆ.—పోఁగొట్టుకొనుటకు.—"క. తన, లలనంగోల్పడియెనతఁడులంకేశ్వరుచేక." భార. అర. 3, ఆ. "ఉ. భవదాత్మజుఁగోల్పడెఘోషయాత్రలోక." భార. ఉద్యో. ౨, ఆ.) (ప్రే. కోలుపఱుచు.)

**కోలుపాటు.** ద్వి. వి. 1. చేటు; 2. పోఁగొట్టుకొనుట. (రూ. కోల్పాటు. చేటునకు.—"శా. కుంతీసూనునిచేతఁగర్ణునికనింగోల్పాటుపాటిల్లునే." భార. కర్ణ. 3, ఆ.—పోఁగొట్టుకొనుటకు.—"గీ. ఘనశిరాజ్యముకోల్పాటుఁదండ్రిచావు, నిష్టబంధువియోగంబు దుష్టయాతు, నిష్ఠురారణ్యవాసంబు నేఁడునాదు, దేహదాహంబునేసెపై దేహికతన." రా. అర, కాం. ౨, ఆ.)

**కోలుపోక.** దే. వి. పోఁగొట్టుకొనుట. "ఉ. పంకజనాభమాపడిన పాటులురాజ్యము కోలుపోకయుక." భార. ద్రో. 3, ఆ. (చూ. కోలుపోవు.)

**కోలుపోవు.** దే. అ. క్రి. చెడు. "గీ. ఇట్టులగుటయెఱిఁగియెల్ల భంగులరహా, స్యంబుకోలుపోనియట్లుగాఁగ, నడరునిడుకోర్కికను రూపమెట్టిది, యట్టిభోగభంగిననుభవింపు." (ఇక్కడ చెడుట యనఁగా బయలుపడుట.) భార. విరా. ౨, ఆ.—స. క్రి. పోఁగొట్టుకొను. "సీ. తాతలచేఁబాలితంబైనమత్పురంబిటుకోలుపోదునేహీనవృత్తి." మార్క. ౬, ఆ. (ప్రే. కోలుపుచ్చు.)

**కోలె.** దే. వి. వెన్నుకోసినకాఁడ. ద్ర. కొలె. "దాని వత్సంబునిన్నటఁగోలెనడుగకయుఱుచుచున్నయదియు." భార. ఆది. ౭, ఆ. "ఎ, గీ. ఇతఁడు పుట్టినకోలెననెనకమెసఁగ, దర్పమునవర్తిల్లె." భార. విరా. ౧, ఆ.

**కోలెమ్ము.** దే. వి. (కోల+ఎమ్ము.) వీఁపునడుమఁ బూసపూసగా గొలుసువలెఁబెనఁచుకొనియుండెడి యెముక, కశేరుక. (ఇట్లు కోలెముక, కోలెమ్ముక.)

**కోవ.** దే. వి. 1. బిడ్డలకు గొంతునందుఁగలిగెడు వ్యాధివిశేషము. (చూ. అరిమి.) 2. పుట్టకోమ.

**కోవిదారము.** సం. వి. అ. పుం. కాంచనముచెట్టు.

**కోవిదుఁడు.** సం. వి. అ. పుం. విద్వాంసుఁడు, చదువరి.

**కోవు.** దే. వి. అన్వుసఁదగు ధ్వనిస్వరణము. "కోవునవార్చినక దెసలకుంజరముల్ బెదరెక." కాశీ. ౨, ఆ.

**కోవురము.** దే. వి. శత్రువునుబట్టుటకై పొంచెడుపొంచు. "గీ. ఉదయగిరిమీఁదఁగోవురంబుండినిగుడు, నహితరవిరశ్మిచేబద్ధుఁడగుచుఁదోడి, బలఁగమైనట్టిచుక్కలవలన త్రోవఁ, జూపనేతెంచెనస వేగుఁజుక్కవొడిచె." స్వా. 3, ఆ.

**కోవెల.** యు. దే. వి. గుడి. "కోవెలపారుపత్తెమునకుంబనిపూనియు." ఉ, రా. 2, ఆ.—వై. కోకిలము. "సీ. తులకించు మూడవతొలిపల్కురవళికోవెలకూఁతలకునొక్కవింతనెఱప." య. ౨, ఆ.

**కోశకారము.** సం. వి. అ. పుం. ఒకదినుసుచెఱకు.

**కోశఫలము.** సం. వి. అ. న. తక్కోలపుచెట్టు.

**కోశము.** సం. వి. అ. పుం, న. 1. కత్తియొఱ; 2. గ్రుడ్డు; 3. జాజికాయబెరడు; 4 ఒకదివ్యము; (చూ. దివ్యము.) 5. పుస్తకము; 6. బొక్కసము; 7. కరఁగిపోసినవెండిబంగారముల ముద్ద; 8. ముష్కము; 9. మొగ్గ. (తత్త్వవిషయమున పంచకోశములు.—అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము.) (రూ. కోషము.)

**కోశాతకి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవడచెట్టు; 2. ఉత్తరేనుచెట్టు; 3. పొట్లచెట్టు.

**కోశామ్రము.** సం. వి. అ. పుం. కొండమామిడిచెట్టు.

**కోష్టు.** వై. గ్రా. వి. మందుదినుసు, చెంగల్వకోష్టు.

**కోష్ఠము.** సం. వి. అ. పుం. 1. లోకడుపు; 2. సామగ్రు లుంచెడు కొట్టు; 3. గాదె.

**కోష్ణము.** సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విశే. ఇంచుకవేఁడిగలది.

**కోసము.** దే. అవ్య. నిమిత్తమును దెలుపునది. "ఉ. భూసుతకోస మేఁగనుక బొంకితినేనియుఁబెద్దకాలముం, జేసినసాతపంబురహిఁ జెందకనిష్ఫలమా." ఉ, రా. ౮, ఆ.

**కోసలము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**కోసు.** వై. వి. రెండువేలవిండ్లపట్టుకొలఁది, క్రోశము.

**కోస్తా.** ఆం. వి. సముద్రతీరము.

**కోహకము.** సం. వి. అ. పుం. దేహమణంచుకొన్నపిల్లి.

**కోహళము.** సం. వి. అ. పుం. 1. కాహళమనువాద్యము; 2. బజాఱుమాట.

**కోహళుఁడు.** సం. వి. అ. పుం. నాట్యశాస్త్రప్రవర్తకుఁడైన యొక ముని.

**కోహెూ.** దే. వి. పరిహాసమునందగు ధ్వన్యనుకరణము. "వ. కేలువలచికోహెూయనిగేలిసేయుగణికాకదంబంబులచప్పటలు." ఆము. ౪, ఆ.

**కోళై.** దే. విశే. ఆశ్చర్యముఁబొందినవాఁడు, విలక్షుఁడు. "సీ. కోళైనాఁగనువెఱఁగుపడువాఁడనఁగను విస్మయాన్వితసంజ్ఞవెలయుచుండు." ఆం, భా. తృ. వి.

## కౌ.

**కౌ.** దే. వి. వృత్తియందు కొనుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (కౌఁదీఁగ మొ.) (కవుయొక్క-రూపాంతరము.)

**కౌంతి.** సం. వి. ఈ. స్త్రీ. రేణుకయను గంధద్రవ్యము.

**కౌంతికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) ఈఁటెకాఁడు.

**కౌఁగిలి.** వై. వి. భుజాంతరము, క్రోడము. (కవుఁగిలియొక్క-రూపాంతరము.)

**కౌఁగిలించు.** వై. స. క్రి. ఆలింగనముచేయు. (కవుఁగిలించుయొక్క-రూపాంతరము.)

**కౌఁగిలింత.** వై. వి. ఆలింగనము. (కవుఁగిలింతయొక్క-రూపాంతరము.)

**కౌఁగిలింపు.** వై. వి. కౌఁగిలింత. (కవుఁగిలింపుయొక్క-రూపాంతరము.) "సీ. తరితీపెఱుంగనితలిరులేవడిచూపుకరఁగింపనెఱుఁగని కౌఁగిలింపు." చంద్ర. (చూ. ఆరగింపు.)

**కౌఁజు.** వై. వి. కపింజలము. "సీ. కౌఁజుపాఁజులఁబోవఁగానీక వానినో రణములఁబఱపిశిక్షింబతునిమి." రసి. ౧, ఆ. (కవుఁజుయొక్క-రూపాంతరము.)

**కౌకృత్యము.** సం. వి. అ. న. 1. అకార్యముచేయుట; 2. పశ్చాత్తాపపడుట.

**కౌక్కుటికుఁడు.** సం. వి. అ. పుం. 1. కపటముకలవాఁడు; 2. చేరువచూచుచుఁబోయెడివాఁడు.

**కౌక్షింభర్యము.** సం. వి. అ. న. పొట్టపోసికొనువానితనము.

**కౌక్షేయకము** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**కౌచు.** దే. వి. చేపమీఁది పొలుసు. (కవుచుయొక్క-రూపాంతరము.)

**కౌటతక్షుఁడు.** సం. వి. అ. పుం. స్వతంత్రముగా పనిచేయు వడ్లంగి.

**కౌటికుఁడు.** సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులనుజంపి విక్రయించి జీవించువాఁడు.

**కౌటిల్యము.** సం. వి. అ. న. వంకరతనము.

**కౌడు.** వై. వి. కపటము. "క. అనుటయునతిమత్సరతఁ, జెనఁగెడు వారలనుగౌడుఁబెట్టిపఱచికై, కొనియెదశీవస్తువులని, మనమునమూహించిచతురమతియేపారఁ." షో. ౨, ఆ. (కవుడుయొక్క-రూపాంతరము.)

**కౌణపుఁడు.** సం. వి. అ. పుం. నైరృతుఁడు, మూలతేఁడు.

**కౌతుకము.** సం. వి. అ. న. 1. అనుభవింపని కోరికయందలి యాశ; 2. కోరిక; 3. పెండ్లియందుచేతఁగట్టుకొనెడు తోరము; 4. పండుగ; 5. స్త్రీపురుషపరిహాసము; 6. పైపైవచ్చినమేలు; 7. సంతోషము; 8. పాటలోనగు సుఖము.

**కౌతూహలము.** సం. వి. అ. న. అనుభవింపనికోరికయందలి యాశ, తమి.

**కౌద్రవీణము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆళ్లుపండునది. (పొలము.)

**కౌను.** దే. వి. 1. నడుము; 2. వింటినడుము. "చ. పిడికెఁడు కౌనుఁ గొప్పఁగని ప్రేమఁద్రివక్రనమాంగిఁజేసితేఁ, బిడికెఁడు కౌనుఁగొప్పఁబయిఁజేర్పుగుణంబునుగంటినంచు." ఆము. ౧, ఆ. (వృత్తియందిది పూర్వపదంబగునపుడును వర్ణంబునకు వికల్పంబుగ లోపంబగు. "అనదుకౌఁదీఁగయల్లాడుచుండ." భార. విరా. ౪, ఆ. సూదిజగాకవుఁ, లేఁగుట్రనునుంగవుఁ అని ఉత్తరపదముగా నుండునపుడు అంత్యోకారంబునకు లోపముగలుగ కొందఱు చెప్పియున్నారు.) (కవునుయొక్క-రూపాంతరము.)

**కౌపము.** సం. వి. అ. న. నూతిజలము.

**కౌపీనము.** సం. వి. అ. న. 1. గోఁచి; 2. అకార్యము; 3. గుహ్యప్రదేశము.

**కౌబేరము.** సం. వి. అ. న. 1. చెంగల్వకోష్టు; 2. ఒకదినుసు పిండివంట.

**కౌమారము.** సం. వి. అ. న. బాల్యమునకు అవలివయోవస్థ.

**కౌమారి.** సం. వి. ఈ. స్త్రీ. ఒక మాతృక.

**కౌముదము.** సం. వి. అ. పుం. కార్తికమాసము.

**కౌముది.** సం. వి. ఈ. స్త్రీ. చంద్రిక, వెన్నెల.

**కౌమోదకి.** సం. వి. ఈ. స్త్రీ. విష్ణువుయొక్క గద.

**కౌరు.** దే. వి. వర్ణాధిక్యము. (కవురుయొక్క-రూపాంతరము. "క. చివురావాతెఱ నల్లని, కవురానునుపోఁగవెంద్రుకలు." హంస. 3, ఆ.)

**కౌలటినేయుఁడు** సం. వి. అ. పుం. భిక్షుకియైన పతివ్రత కొడుకు.

**కౌలటేయుఁడు.** సం. వి. అ. పుం. 1. భిక్షుకియైన పతివ్రత కొడుకు; 2. అంకుటాలికొడుకు.

**కౌలటేరుఁడు.** సం. వి. అ. పుం. అంకుటాలికొడుకు.

**కౌలవ.** సం. వి. అ. పుం. ఒకకరణము. (చూ. కరణము.)

**కౌలీనము.** సం. వి. అ. న. 1. గొప్పవంశమునందలిపుట్టుక; 2. గుహ్యము; 3. పశుపక్ష్యాదుల జగడము; 4. జగడము; 5. నిందింపఁదగినపని.

**కౌలు.** దే. వి. రాజులోనగువారు ప్రజలలోనగువారికిచ్చునట్టి యొడంబడిక. "క. ఈళయునిళింవయునుబం, గాళయుమొదలైన పేరుగలదీవులలో, మేలైననరకులాతని, కౌలున దిగు మాటనిజముగల వాఁడగుటన్." శుక. ౧, ఆ. (కవులుయొక్కరూపాంతరము.) కౌలుఖత్తులు.

**కౌలేయకము.** సం. వి. అ. పుం. కుక్క. విణ. మంచికులమునఁ బుట్టినది.

**కౌశలము.** సం. వి. అ. న. నేర్పరితనము.

**కౌశలి.** సం. వి. ఈ. స్త్రీ. కుశలప్రశ్నము.

**కౌశల్యము.** సం. వి. అ. న. కౌశలము.

**కౌశికము.** సం. వి. అ. పుం. 1. గుగ్గిలపుచెట్టు; 2. గుడ్లగూబ; 3. ముంగిస.

**కౌశికి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక యేఱు; 2. పార్వతి.

**కౌశికుఁడు.** సం. వి. అ. పుం. 1. విశ్వామిత్రుఁడు; 2. ఇంద్రుఁడు; 3. నిఘంటువు తెలిసినవాఁడు; 4. పాములవాఁడు.

**కౌశేయము.** సం. విణ. (అ. ఆ. అ.) పట్టుది. (చీర.)

**కౌసీద్యము.** సం. వి. అ. న. 1. కుసీదభావము; 2. ఆలస్యము; 3. కునికిపాటు.

**కౌస్తుభము.** సం. వి. అ. పుం. విష్ణువక్షస్థలమునందలి మణి.

**కౌక్షుత్రీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉలవలు పండునది. (పొలము.)

## క్ర.

**క్రంగు.** దే. వి. మ్రోఁగుటయందగు ధ్వన్యనుకరణము. (చూ. కొడుపు.)

**క్రంత.** యు. దే. వి. 1. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁ దీసికొనిపోయెడి ప్రధాన ద్రవ్యము; "వ. ప్రకృతికాంతక్రంత సురకాంతలఁగూడుకొనినంతరింప." ఆము. ౬, ఆ.—2. రచ్చ. "ద్వి. తనజాడఁదెలిసి క్రంతకుఁదీసిరేని." హరిశ్చ. ౨, భా.—వై. 1. సందుత్రోవ*; "సీ. రచ్చలుక్రంతలురాజమార్గంబులువిపణిదేశంబులువిశదములుగఁ, జేసిరి." భాగ. ౧౦, స్కం. పూ.—2. రంధ్రము*. "నృపాలుదేహముం గ్రంతలుచేసిచొచ్చె విశిఖంబులు." జై. ౨, ఆ.

**క్రందనము.** సం. వి. అ. న. 1. అరుపు; 2. ఏడ్పు; 3. పిలుపు.

**క్రందితము.** సం. వి. అ. న. 1. ఏడ్పు; 2. పిలుపు.

**క్రందిల్లు.** వై. అ. క్రి. మ్రోఁగు. "క. అందముగ వీరకాహళ, దుందుభినిస్సాణశంఖతూర్యంబులొగిన్, గ్రందిల్లె." వీర. ర, ఆ.

**క్రందు.** వై. అ. క్రి. 1. మ్రోఁగు; 2. నిలపించు*. "ఎ, గీ. కృతఘ్నునగ్రకంటకసముదయము మీఁదఁ, * గ్రందనదిమియు." భార. అను. ర, ఆ.—వి. 1. మ్రోఁత; "సీ. సిరిఁబాసియును నొక్కచింతయులేకవీచులక్రందడంగినజలధివోలె." భార. శాం. ర, ఆ.—2. సందడి*; 3. ఉపద్రవము*; "గీ. ఏలవ్రేపల్లె పెద్దవారిట్లువెట్టి, గొనిరిక్కృష్ణుఁబోనిచ్చినఁగ్రూరులైన, రక్కసులు లోనుగాఁజేయు క్రందులెల్ల, నడుపఁదమకు దిక్కైనవాఁడొరుఁడుగలఁడె." హరి. పూ. ౮, ఆ.—4. తఱచు*. "క. ప్రస్పందితపాతకరవముల, క్రందునధర్మజుఁడుమేలుకనియె." భార. ద్రో. ౨, ఆ.

**క్రందుకయ్యము.** ద్వి. వి. దొమ్మియుద్ధము. "గీ. క్రందుకయ్యంబులోన నరాతిభయద, బాహువిక్రమనీవిట్లుపాదచారి, వగుటవలదని." భార. భీష్మ. ౨, ఆ.

**క్రందుకొను.** ద్వి. అ. క్రి. 1. అతిశయించు; "కనివిసయంబు క్రందుకొనఁగాఁబ్రణమిల్లి." జై. ౭, ఆ.—2. తఱచగు. "క. గగనమునసురవిమానము, లగణితముగఁగ్రందుకొనియె." భార. అర. ర, ఆ. (ప్రే. క్రందుకొలుపు.)

**క్రంప.** దే. వి. కంపకు మొదటిరూపము.

**క్రకచపత్రము.** సం. వి. అ. పుం. తేఁకుచెట్టు.

**క్రకచము.** సం. వి. అ. పుం. 1. అంపము; 2. వెణుతురుచెట్టు.

**క్రకరము.** సం. వి. అ. పుం. 1. కక్కెర; 2. అంపము; 3. వెణుతురుచెట్టు. విణ. బీదవాఁడు.

**క్రక్కస.** వై. విణ. కఠినము. "ఉ. ఆక్రక్కసజవ్వనింగరము గారవమొప్పఁగఁ జూచియిట్లనున్." నై. ౫, ఆ.

**క్రక్కు.** దే. స. క్రి. కడుపునవికారమెత్తితిన్నదివెడలనుమియు. వి. 1. కడుపునవికారమెత్తితిన్నదివెడలనుమియుట; 2. వ్యాధివిశేషము.

**క్రక్కెర.** వై. వి. కక్కెరకు మొదటిరూపము, క్రకరము.

**క్రచ్చఱ.** దే. ద్ర. క్రి. విణ. (క్రచ్చు+అఱన్.) 1. నిష్కల్మషముగా; "చ. జగత్త్రయంబుఁగ్రచ్చఱభవదీయరక్షణమునంది వెలుంగుచునుండు." భార. అర. ౭, ఆ.—2. శీఘ్రముగా. "చ. క్రచ్చఱమునివర్గవాహనుఁడవైచనుదెమ్మనుము." భార. ఉద్యో. ౧, ఆ. "క్రచ్చఱఁదనక్రేవనున్నఘనచాపముఁదాల్చి." రా. యు, కాం.

**క్రచ్చు.** దే. స. క్రి. చుట్టుకొను. "వ. మచ్చరంబిచ్చంబెచ్చు పెరుగంజెచ్చెరంజొచ్చిక్రచ్చి." రామా. ౫, ఆ.—వి. పేనిన త్రాడులోనగువానియందు ఉపయుక్తముకాని తృణాదులయంశము.

**క్రచ్చుకొను.** దే. స. క్రి. చుట్టుకొను. "క. వచ్చివసురాజశేఖరుఁ, డిచ్చినముద్రికలతొంగియెదుట నిడిచెలుల్, క్రచ్చుకొని యడుగనిట్లను, నచ్చేడియతనయుదంతమాద్యంతంబున్." వసు. ర, ఆ.

**క్రతుధ్వంసి.** సం. వి. న్. పుం. శివుఁడు, జన్నపుగొంగ.

**క్రతుభుజుఁడు.** సం. వి. జ్. పుం. దేవత, జన్నపుఁదిండి.

**క్రతువు.** సం. వి. ఉ. పుం. 1. యజ్ఞము; 2. ఒకానొక ఋషి.

**క్రథనము.** సం. వి. అ. న. వధ, కొల.

**క్రన్న.** దే. ద్ర. క్రి. విణ. 1. శీఘ్రముగా. "తరల. తరుణి ద్రౌపదియిట్లు పాండవధార్తరాష్ట్రులదైసభ్, కరపరస్పరకోపవేగము క్రన్నఁబాచి." భార. సభా. ౨, ఆ.—2. సమ్మట; "గీ. మున్న నన్నోటువడిమఱితన్ను నోటు, పడియెనోతన్నమున్నోటువడి విభుండు, క్రన్ననన్నోటువడియెనోయన్ననాకు, నెఱుఁగఁజెప్పుము దీనినీవెఱుఁగుదేని." భార. సభా. ౨, ఆ.—3. మరల. "గీ. ఇన్నరేంద్రుచేతమున్నగృహీతమై, యున్ననాకరంబుక్రన్ననింక, నొరులకర్హమగునె." భార. ఆది. 3, ఆ.

**క్రమణము.** సం. వి. అ. న. అడుగిడుట.

**క్రమము.** సం. వి. అ. పుం. 1. పొరిది; 2. అడుగిడుట; 3. అణుముట; 4. బలిమి; 5. వడఁకు.

**క్రమించు.** సం. స. క్రి. 1. అతిక్రమించు; "మందాఘాంచలములఁ గ్రమించి కులభ్రప్రోద్ధతుల్ దాఁటి." అని. 3, ఆ.–2. ఆక్రమించు. "అద్రక్రథరుని జరయను రాక్షసి వెరవునఁబట్టి క్రమించుచుఁబోండని." భార. సభా. ౧, ఆ.

**క్రముకము.** సం. వి. అ. న. 1. పోఁక; 2. తమ్మలము. పుం. 1. పోఁకచెట్టు; 2. ఎఱ్ఱలొద్దుగుచెట్టు; 3. గంగరావిచెట్టు; 4. నాగముస్తెచెట్టు; 5. ప్రత్తిచెట్టు.

**క్రమేలకము.** సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె.

**క్రమ్మఱఁబడు.** ద్వ. అ. క్రి. (క్రమ్మఱ్+పడు.) క్రమ్మఱు. "పోవుచువచ్చుచుఁ గ్రందు క్రమ్మఱంబడుటయు." భార. ఉద్యో. 3, ఆ. (స్వార్థమునఁ బడు.)

**క్రమ్మఱిల్లు.** దే. అ. క్రి.——పై.——"పఱచినదేవకీసుతుఁడు పక్కునననవ్వినఁ గ్రమ్మఱిల్లి." పాండు. ౪, ఆ. (చూ. క్రమ్మఱిలు.)

**క్రమ్మఱు.** దే. అ. క్రి. మరలు. "క్రమ్మఱఁజూచుం జెవిదార్చి నిల్చు మలయుఁ గా." భార. అర. ౬, ఆ.

**క్రమ్మఱుచు.** దే. ప్రే. క్రమ్మఱఁజేయు. "ఉ. ద్రోణభీష్మదులసన్నిధానమున నమ్మెయిఁబల్కి నపల్కు నప్పుడు, గాదని పద్మనందనుఁడు గ్రమ్మఱిచెఁ గదుపేరకోపముల్." భార. అర. 3, ఆ.

**క్రమ్ము.** దే. అ. క్రి. 1. కవియు; "తదంగదేశమునఁదు మేఘములెల్ల కెలంకులం గడుఁ గ్రమ్మి." భార. అర. 3, ఆ.–2. పైకుబుకు; "ఎ, గీ. రమణిపారిఁబోరిఁ గన్నీరు క్రమ్మఁజుట్టు, మెలఁగికాకుల గ్రద్దలఁ దోలఁగనడుచు, చున్నయది." భార. స్త్రీ. ౨, ఆ.–3. వ్యాపించు. "రక్తజలంబు పైపయిం గ్రమ్మఁగ." రా. అర. ౨, ఆ.

**క్రమ్ముదల.** దే. వి. క్రమ్ముట.

**క్రమ్ముదెంచు.** దే. అ. క్రి. (క్రమ్ము+తెంచు.) పైకుబుకు. "సీ. బంధులకగపడ్డఁ బాయునన్వయమనఁకలఁక మైఁజెమటలు క్రమ్ముదేర." భార. విరా. ౨, ఆ. (స్వార్థమున తెంచు.)

**క్రయము.** సం. వి. అ. పుం. 1. వెల; 2. (వెలయిచ్చి) కొనుట.

**క్రయవిక్రయికుఁడు.** సం. వి. అ. పుం. (సరకును) కొని యమ్మెడువాఁడు, బేహారి.

**క్రయించు.** సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను, విలుచు.

**క్రయికుఁడు.** సం. వి. అ. పుం. (సరకును వెలయిచ్చి) కొను వాఁడు, విలువకాఁడు.

**క్రయ్య.** దే. వి. కాలువ. "క్రయ్యలుగట్టియున్న రుధిరస్థలులఁ గా." రా. యు, కాం.

**క్రయ్యఁబడు.** ద్వ. అ. క్రి. (క్రయ్యక్+పడు.) కలయు. "క. వెయ్యేండ్లయినను నీతోఁ, గ్రయ్యంబడియున్న వాఁడఁగాను సుఖములఁ గా." భాగ. ౯, స్కం. (స్వార్థమున పడు.)

**క్రయ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) కొనుటకు అంగడియందు పఱపఁబడినది. (సరకు.)

**క్రయ్యు.** దే. అ. క్రి. కలయు. (చూ. క్రయ్యఁబడు.)

**క్రల్లవడు.** ద్వ. అ. క్రి. ఎండు. "క. తరులెల్లఁ గ్రల్లవడఁగా, విరళములై నీడలున్న విధమొప్పెనహా, స్కరరుచులతోడఁ దలపడి, యరవరలైతుమురుతుమురులైపడిన క్రియఁగా." హరి. పూ. ౬, ఆ.

**క్రవ్యము.** సం. వి. అ. న. మాంసము, పొల.

**క్రవ్యాత్తు.** సం. వి. ద. పుం. రాక్షసుఁడు. విశే. మాంసము తినువాఁడు.

**క్రవ్యాదుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు. విశే. మాంసము తినువాఁడు.

**క్రవ్యాశి.** సం. వి. ఇ. పుం.——పై.——

## క్రా.

**క్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. (చూ.) క్రమణము.

**క్రాఁక.** దే. వి. కాఁకయొక్క రూపాంతరము. (చూ. క్రాఁగు.)

**క్రాఁగు.** దే. అ. క్రి. కాఁగుయొక్క రూపాంతరము. (తపించుటకు.–"దుర్వారదవప్రకోపమునఁ గ్రాఁగె." భార. శాం. ౧, ఆ.)

**క్రాఁగుడు.** దే. వి. కాఁగుడుయొక్క రూపాంతరము.

**క్రాఁచు.** దే. ప్రే. కాఁచుయొక్క రూపాంతరము.

**క్రాయకుఁడు.** దే. వి. అ. పుం. (చూ.) క్రయికుఁడు.

**క్రాయు.** దే. స. క్రి. 1. ధ్వనిపూర్వకముగా క్లొలాసిగువానిని కంఠమునుండి నోటికిఁదెచ్చికొను; "సీ. ఫవరి లాఁగిరాలపల్లవచాలకంబులు కొమ్మదీర్చ్ఛాయలఁ గ్రాఁచియుమియు." కాశీ. ౪, ఆ.–2. క్రక్కు; "మిరుంగియుఁగ్రాయు." నై. ౫, ఆ.–3. ఉమియు. "కడలిని చిక్కలఫిముల్ క్రాసె." ఆము. ౪, ఆ.

**క్రారు.** దే. వి. (క్రయ్య+రు.) (జడ్డయై యొక యనుసంధుల్) కలయురేఖము.

**క్రారవడి.** దే. వి.——పై.——(స్వార్థమున వడి.)

**క్రాలు.** దే. అ. క్రి. 1. (టెక్కు–ము) అల్లలాడు; "వ. ఈరాజనీరాజనకరణంబులకు రండనుచు నమరకాంతలఁ బిలుచు నోజం గ్రాలు నూతనకేతనంబులును." రా. అ, కాం.–2. గిరగిరఁదిరుగు; "క. నేలకునల్లేడుపొడవునఁ, గ్రాలుచుమును మెఱయు గురునిరథచక్రములు." భార. ద్రో. ౫, ఆ.–3. చెరఁగు; "ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁ బోలుచు నిస్ఫులింగముల్, క్రాలఁగ దేవసంఘములు కంపమునొందఁగ." భాగ. ౬, స్కం.–4. సంచరించు; "ఎ, గీ. గాలిపడగయాకసమునఁ గ్రాలుత్రోవ." ఉ, హరి. ౫, ఆ.–5. సంచలించు; "ద్వి. పలెవధూమణియొన్ని చందములఁ, గ్రాలుచునున్నాఁడఁగట కటాయనవు." రా. అర, కాం.–6. సంభ్రమించు; "క. ఆలోనన భోజపతిని, వాలమ్ములఁ బొదివి రెల్లవారలు దానఁ గా, దూలకతఁడు బలువిలుగొని, క్రాలుచునాభీమముఖ్య రథికుల ముంచెఁ గా." భార. ద్రో. ౪, ఆ.–7. వర్తిల్లు; "క. కైలాసనగమునందును, గ్రాలెడు ప్రావృట్పయోధరము చందమునఁ గా, లాలితకటిభాగంబున, నీలాంబరమమరు రాముని బొడగాంచెఁ గా." వి, పు. 2, ఆ.–8. ప్రవర్తిల్లు. "చ. గుణమిదిదోషమిట్టిదనికొంతయుఁ జింగినఁగాక యిట్టులని, గ్గుణతయపట్టిక్రాలుతమకుందగువారలు చెప్పసామ్యభాషణమునిరర్థకంబు." నిర్వ. ౬, ఆ.

**క్రాలుగంటి.** దే. వి. (క్రాలు+కన్ను.) 1. చలించునట్టికన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. (తరళేక్షణ.)

## క్రి.

**క్రి.** దే. విశే. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుపపరకేములు వెరమునకు నవ్వుడు సుమాగమమును తదితరములు పరమునగునపుడు పరవర్ణము సహ ద్విత్వమును వచ్చును. ఉదా. క్రిందల, క్రియ్యాస్థల ము.) (ఇది దీర్ఘాంతమునకు. చూ. క్రీ.)

**క్రించు.** వై. విణ. అల్పుఁడు*. "ఉ. నీప్రేమకుఁబచ్చుదానునకుఁ గ్రించుఁడనంబున నెగ్గుచేసితిన్." భాగ. ౯, స్కం. (కించు యొక్క రూపాంతరము.)

**క్రించుఁడు.** వై. విణ.——వై.——"మ. జననిందంబడలేక నిన్నుఁగరిన పాపంతంబుతోఁగాననం, బునఁద్రోయించితపప్పుచా లకజగంబుల్ చూచి శోకింపఁగ్రిం, చునిచందంబునరచ్చపెట్టితి నటంచుండాఁగిపోనేలపాం, పునఁదేడించికొకసారిసి నగుమొగంబుం జూపవే జానకీ." ఉ, రా. ౭, ఆ.

**క్రిందల.** దే. వి. (క్రిందు+తల.) క్రిందగుతల. "సీ. మోముఁ దప్పికిఁదేటి మొత్తమైపాగవర్వఁ త్రేలుఁ గ్రిందలగాఁగవృక్షశాఖ." పాండు. ౨, ఆ.

**క్రిందు.** దే. వి. 1. అధోభాగము; "గీ. వృష్టితటిదిడ్డజనఁద్రావఁ గ్రిందనుండి." ఆము. 2, ఆ.—2. గతకాలము. (క్రింద జరిగిన వన్ని పోని ఇఁక జరగవలసినది యోచింపుము.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. క్రి. క్రీ.)

**క్రిందుపడు.** దవ్వ. అ. క్రి. అడుగుపడు. "క. తనవామపదాంగుష్ఠం, బున నదిమె దశాస్యుభుజ స్తములు క్రిందుపడన్." ఉ, రా. 3, ఆ. (ప్రే. క్రిందుపఱుచు.)

**క్రిక్కి.** దే. వి. బట్టువాఁడు, వంది. "ఎ, గీ. బట్టుక్రిక్కిలసఁ బొరకులకురాగిల్లు." వేం.

**క్రిక్కిఱించు.** దే. అ. క్రి. క్రిక్కిఱియు. "క. పలుకునెడఁ బార్థుసేనా, కలకలములునిజపురోపకంఠ నరణిది, క్కులఁ గ్రిక్కిఱింప." జై. ౮, ఆ.

**క్రిక్కిఱియు.** దే. అ. క్రి. (క్రిక్కు+ఇఱియు.) ఎడములేక వ్యాపించు. "చ. వాఁడుఱఱనిశాతసాయకములోక్కమొగింబడి సేనియందుఁగ్రి, క్కిఱియఁగఁజేసి." భార. విరా. 3, ఆ. (కొన్ని చోట్ల వృత్తియందంత్య వర్ణలోపము. క్రిక్కిఱిచన్నుదోయి మొ.)

**క్రిక్కు.** దే. వి. కిఱుకుయొక్క రూపాంతరము.

**క్రిమి.** సం. వి. ఇ. పుం. 1. పురుగు; 2. చెట్టుమీఁది నల్లపురుగు; 3. లక్క.

**క్రిమిఘ్నము.** సం. వి. అ. పుం. వాయువిళంగము*.

**క్రిమిజము.** సం. వి. అ. న. అగురువు, అగలు.

**క్రిమినల్.** ఆం. విణ. నేరములసంబంధమైన.

**క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ధాత్వర్థము; 2. చేయుట; 3. చేష్ట; 4. పని; 5. ఆరంభము; 6. పూజ; 7. ఉపాయము; 8. చికిత్స; 9. ప్రాయశ్చిత్తము; 10. వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖితము సాక్ష్యములోనగునది; 11. శిక్ష; 12. విధము. "సీ. అంకిలిమేల్కనునతనిధృష్టద్యుమ్నుఁబట్టిన క్రియఁదలపట్టియీడ్చి." భార. సౌ. ౧, ఆ. (కడపటి యర్థమునకు తెనుఁగునమాత్రము ప్రయోగము.)

**క్రియాకారము.** సం. వి. అ. పుం. ప్రతిజ్ఞ.

**క్రియాకారుఁడు.** సం. వి. అ. పుం. క్రొత్త శిష్యుఁడు.

**క్రియావంతుఁడు.** సం. విణ. (త్. ఈ. త్.) పనియందు పూనిక గలవాఁడు.

**క్రియ్యు.** వై. అ. క్రి. కృశించు. "ఉన్నమీనములెల్లఖిన్నఁబు లైవగఁగ్రిస్సియున్న." భాగ. ౧౦, స్కం. పూ.

## క్రీ.

**క్రీ.** దే. విణ. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు నిందివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీనీడ, క్రీయూట మొ. ఇక్కడ దీర్ఘాంతమునుగాన నిందుసున్నయును పర వర్ణమునకు ద్విత్వమునురాదయ్యె. చూ. క్రి.)

**క్రీఁగడుపు.** దవ్వ. వి. (క్రిందు+కడుపు.) పొత్తికడుపు.

**క్రీఁదొడ.** దే. వి. (క్రిందు+తొడ.) తొడకులోపలిభాగము.

**క్రీవాడ.** దవ్వ. వి (క్రిందు+వాడ.) పాటిపొలము.

**క్రీడ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆట్లాట; 2. పరిహాసము; 3. దూఱు.

**క్రీడి.** వై. వి. కవ్వడి, అర్జునుఁడు.

**క్రీడించు.** సం. అ. క్రి. ఆడ్లాడు.

## క్రు.

**క్రుంకు.** దే. అ. క్రి. 1. మునుఁగు, 2. అస్తమించు; 3. చచ్చు. "శా. తంగ్రకీర్ణమనస్కదాః పరిపుల్ ఎచక్రాయుసుండించెలోఁ, గ్రుంకెంబోయనిభీతులైరి." ఉ, హరి. ౬, ఆ—వి. మునుక.

**క్రుంకుడు.** దే. వి. అస్తమయము. (చూ. క్రుంకుడుగట్టు.)

**క్రుంకుడుగట్టు.** దవ్వ. వి. అస్తపర్వతము. "సీ. నలిరేయుఁబగ లునునడకకానఁగరాదు పుట్టుగ్రుంకుడుగట్టుపెట్టెరండు." య. 3, ఆ.

**క్రుంకుమల.** దవ్వ. వి.——వై.——(ఇట్లు క్రుంకుమెట్టు మొ.)

**క్రుంగఁబడు.** దవ్వ. అ. క్రి. (క్రుంగన్+పడు.) క్రుంగు. "సీ. బలభరంబునఁగ్రుంగఁబడునదిర్వమ్రోఁగుకు పణులాదికూర్మం బుఁబడఁకుదూఱ." గా. యు, ౫౦. (స్వార్థమున పడు.)

**క్రుంగిలు.** దే. అ. క్రి.——వై.——"రెమ్మిపోఁకనుడియా డ్చినఁగ్రుంగిలిరెండుకొంగులుంబిగ్గనడంచుచున్ విడిచిపట్టుదు." విజ. ౨, ఆ.

**క్రుంగు.** దే. అ. క్రి. 1. క్రిందికి అడఁగు; 2. దిగఁబడు.

**క్రుంచము.** సం. వి. చ్. పుం. క్రౌంచపక్షి, కొంచ.

**క్రుక్కు.** దే. స. క్రి. 1. వేలులోనగువానిఁజేతిబొటనవ్రేలి గోటితోచేదుపు; 2. అడఁచు; "సీ. పొడముఁరసావేశమునవచ్చు నర్గోత్తులోదవినాలుకకురాకుండఁగ్రుక్కి." సాన. 3, ఆ.—3. తుఱుగు. "ఉ. అక్కమలాయతాక్షుఁడు భయంకరబాహుబలుదైత్యు కుక్షిలోఁ, గ్రుక్కినఁదద్దయుంబలిసిరోగము పేఱులచేతమేనికిన్, వెక్కసమైనచందమున విహ్వలభావముచేసె." వి, పు. ౭, ఆ.

**క్రుక్కుడు.** దే. వి. క్రుక్కుట.

**క్రుధ.** సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక. (ఇది ధకారాంతమునగు.)

**క్రుద్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కోపము నొందినవాఁడు.

**క్రుమ్మరిల్లు.** దే. అ. క్రి. క్రుమ్మరు, (రూ. క్రుమ్మరిలు.)

**క్రుమ్మరు.** దే. అ. క్రి. సంచరించు, తిరుగు.

**క్రుమ్ము.** దే. స. క్రి. పొడుచు. "ఈటియలఁగ్రుమ్మి." య. ౨, ఆ.—వి. (కొమ్ముల) పొడుపు.

**క్రుమ్ముడు.** దే. వి. (కొమ్ముల) పొడుపు.

**క్రుమ్ముడుపడు.** దవ్వ. అ. క్రి. (క్రుమ్ముడు+పడు.) పోటుపడు.

**క్రుమ్ములాడు.** దే. అ. క్రి. (క్రుమ్ములు+ఆడు.) క్రుమ్ముకొని పోట్లాడు. "గీ. కొనరకాఁబోతునాఁబోతుఁగ్రుమ్ములాడ, నడిమిరేఁ బెయ్యదెనవచ్చెనాకునిపుడు." కాశీ. ౨, ఆ.

**క్రుయ్యఁబాఱు.** ద్వి. అ. క్రి. (క్రుయ్యక్+పాఱు.) క్రుయ్యు. "సీ. పలుకనెంతయుఁగ్రుయ్యఁబాఱెననుఁజెక్కు-లందంద తడిపెడునశ్రువారి." హరి. ఉ. 3, ఆ. (స్వార్థమున పాఱు.)

**క్రుయ్యు.** వై. అ. క్రి. 1. కృశించు; "చ. వడఁకుచు రోమ కోటినిలువంబడి మేనులుదూలఁగన్నులం, దుడుగకబాష్పముల్ వడియుచుండఁదలల్ దిగవైచినోరఁగ్రే, గుడుదొరఁగంగనెంత యుఁనుగ్రుస్సి ఖురంబులువ్రస్సి పుచ్ఛలు, గ్గడువుగఁగాఱఁ దద్దయును గాఱియఁబొందె వ్రజంబునంబశుల్." హరి. పూ. ౬, ఆ.—2. వెనుదీయు*. "ఉ. ఎయ్యెడఁగయ్యముల్ గలవొ యెవ్వ రుచివ్వలకుట్టుహింతురో, క్రుయ్యకయుంచుఁగోరివెనఁగ్రుమ్మరుచుం డుదునెందునేను." హరి. పూ. ౭, ఆ.

**క్రుష్టము.** సం. వి. అ. న. 1. ఏడుపు; 2. నద్దు.

**క్రుళ్లగించు.** దే. అ. క్రి. (మనసులో) దుఃఖించు.

**క్రుళ్లగింత.** దే. వి. (మనసులో) దుఃఖించుట.

**క్రుళ్లు.** దే. అ. క్రి. 1. క్రుళ్లగించు; "సీ. కోపశోకంబులఁ గ్రుళ్లుచుఁదనలోనమండుచు దితిచాలమఱుఁగఁదొడఁగె." భాగ. ౬, స్కం.—2. అవియు; "గీ. పిన్నయయ్యునుగుణములఁబెద్ద గాన, వానిజీవనమేమియుహీనపడక, యుండెనయ్యన్నిఁగనుఁగొని గుండెలెల్లఁ, గ్రుళ్లుచుండంగవదినెలుకుందికుంది." భో. ౬, ఆ.—3. (కాలమతిక్రమించుటచే ఫలాదులు) నలుపుపాఱిచెడు.

**క్రుళ్లుపోతు.** దే. విశే. క్రుళ్లగించుస్వభావముగలవాఁడు.

### క్రూ.

**క్రూరము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నొప్పించునది; 2. భయంకరమైనది; 3 గట్టిది.

**క్రూరు.** దే. విశే. వాఁడి. "గీ. క్రూరుమొనవెట్టిసెట్టులుకొంద ఱుజ్జ్వల, లాయుధములుఁగంకటములునమరన్నఁ, జూచిచావని వారనిచూడఁజీర, నరుగకున్నవికంకగృధ్రాదులికి." భార. స్త్రీ. ౨, ఆ. (దీనికి ప్రయోగాంతరము దొరకినదికాదు.)

### క్రే.

**క్రే.** దే. విశే. వృత్తియందు క్రేవశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. క్రేగన్ను, క్రేగయి ము.)

**క్రేఁటు.** దే. అ. క్రి. 1. గొంతడుపుళీఱుటకు సకిలించునట్లు శబ్దించు; "వ. ఉమ్మలికయింతయేటికినుటయునబ్బోటిగ్రేఁటుచు నిట్లనియె." స్వా. ౬, ఆ.—2. తొట్రుపడు. "ఉ. అమాన చీఁకటిం, గ్రేఁటుచునేగుదెంచెనదురేయినిజోరుఁడుకన్నపెట్టఁ గజ." భల్లా. ౧, ఆ.

**క్రేఁటుకొను.** దే. అ. క్రి. గొంతడుపుళీఱుటకు సకిలించునట్లు శబ్దించు. "క. పాటితకరిదంతద్యుతి, పాటల్చరగండఫలకభాగం బులపైఁ, గాటుకకన్నీరొలుకఁగ, మాటవెడలఁగ్రేఁటుకొనుచుమా నినిపలికెజ." స్వా. 3, ఆ. (స్వార్థమున కొను.)

**క్రేగన్ను.** దే. వి. (క్రేవ+కన్ను.) కడకన్ను, కటాక్షము.

**క్రేగయి.** ద్వి. వి. (క్రేవ+కయి.) హస్తాగ్రము. "చ. మంచ పుఁగోడుతాలుపరిమన్నిక-బిడారపుమెట్టుఁగ్రేగయిం, గొంచకయెత్తి నట్టినిను." అచ్చ, యు, కాం.

**క్రేడి.** దే. వి. సంబారములతోఁ గలసిన కాకులలోనగు ఎత్తువన్ను.

**క్రేడించు.** దే. అ. క్రి. తొలఁగు. "క. పేడితిమెమేమురణమునఁ, గ్రేడికిఁగ్రేడించిరాక గెలుపేయదియే, చ్చోడఁగిపోయెనోకామా, తోడిబవరమిట్లుగానదొలఁగినఁదగునే." భార. ద్రో. ౧, ఆ.—స. క్రి. అలక్ష్యముచేయు. "౨, గీ. ఉఱుకయాఁకుడుకునేరఁదప యఁజొచ్చె. వ. ఇట్లు గ్రేడించి గాంగేయుండించినఁడిపెతనయు దంబురయంబున. క. పఱపిరథికులనసూతుల, నఱకన." భార. భీష్మ. ౨, ఆ. (దీనికి గ్రామ్యరూపము క్రేడించు.)

**క్రేడిసేయు.** దే. స. క్రి. (క్రేడి+చేయు.) పరిహాసముచేయు. "వ. విలయమార్తాండమండలంబువేఁడమింగ్రేడిసేయుమూఁడవ బాణంబు తూణంబునందిగుచునప్పుడు." జై. ౫, ఆ.

**క్రేణి.** దే. వి. 1. ఉన్నతపదము. "క. మించిఘనమానప్రజనెరి, యించుదురాత్ములకుఁగ్రేణియిచ్చుటపతియా, హాంచినిశించిన చెఱువని, యించితెకులకులమునఁగ్రహించుటకాదే." కళా. ౨, ఆ.—2. పరిహాసము. "ఉ. నారియొకర్తుచొక్కపుగనఁగలచక్కని చిన్నపొన్నకుం, జెరిప్రసూనగుచ్ఛములశేపముగోసియుఁగ్రేణితో స్తుతి, భూరుహమెక్కుమన్ననగిహూయుఁగఁజేయుడు నాకెంత యుక్, మేరుపుగాదు నానదినమేరువనందగహూచెఁగ్రమ్మఱజ." చమ. ౧, ఆ.

**క్రేణించు.** దే. స. క్రి. అలక్ష్యముచేయు. "౬. కమలమొక్కటి నేను గాన్కగానిచ్చినఁగనునన్నఁగ్రేణింపఁజనునెసకదు." రామా. ౧, ఆ. (క్రేడించుయొక్కరూపాంతరము.)

**క్రేణిసేయు.** దే. స. క్రి. (క్రేణి+చేయు.) పరిహాసముచేయు. "ఉ. ఆయతబాహులుక్ వెడఁదయైన సమున్నతవక్షముక్ సరో, జాయతలోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం, గాయజుఁగ్రేణిసేయు నసఁగాశిఖమీఱ ననంగవిభ్రమ, శ్రీయును బెంపునుం గలుగఁజేసి విధాత్రుఁడుపేడిఁజేసెనే." భార. విరా. ౧, ఆ. (క్రేడిసేయుయొక్కరూపాంతరము.)

**క్రేతొట్టు.** దే. అ. క్రి. (క్రేవ+తొట్టు.) గట్టువియు. "వ. క్రేతొట్టుకడల్లకైవడిఁగలయఁబెరయ." ఉ, హరి. 3, ఆ.

**క్రేపు.** దే. వి. 1. దూడ; "క. క్రేపులరూపములనేఁజరిఁచెద ననుచుక." భాగ. ౧౦, స్కం. పూ.—2. (పర్వతి) శిఖరము. "గిరిక్రేపులు మూఁపులు." స్వా. 3, ఆ.

**క్రేయము.** సం. విశే. (అ. ఆ. అ.) (వెలయిచ్చి) కొనఁదగినది. (నరకు.)

**క్రేయో.** దే. వి. వెడలఁగొట్టుటయందగు ధ్వన్యనుకరణము. "శా. ఈయోషిద్బాడబులక్ధనంబుఁగొని క్రేయోయంచు మర్త్యాళిదు, ర్న్యావల్వల్కుఁబురంబులో వెడలఁబంపంబాడి." భల్లా. 3, ఆ.

**క్రేవ.** దే. వి. పార్శ్వము. "శ్రీవిబుధద్రుమద్యుతులుక్రేవలఁ దోఁపఁగ." కవిక. ౧, ఆ. (వృత్తియందంత్యవర్ణలోపము. చూ. క్రే.)

**క్రేవు.** దే. వి. సింహనాదమునందగు ధ్వన్యనుకరణము. "౨, గీ. కంకరుఁడునందిపైనెక్కిహుంకరించి, యతిశయార్భటిక్రేవున నార్చిపేర్చి." అని. ౪, ఆ.

**క్రేళ్లు.** దే. వి. బ. ఉన్నతి. "సీ. రోహిణాద్రియపెక్కురూపులై యున్నట్లు శ్రీడాచలంబులక్రేళ్లుగలిగి." రా. యు, కాం.

**క్రేళ్లుదాఁటు.** దే. అ. క్రి. 1. ఎగిరిపడు; "ద్వి. మీలు, క్రేళ్లుదాఁటుచుమాటికినిసముద్రోల, కల్లోలములఁదేలుక్రమముఁ గన్గొంటె." విష్ణు. పూ. ౨, ఆ.—2. గంతులిడు. "సీ. అడ్డంపు

నిడుపుటాఁబడలగతిమన్నఁబిళ్లుడొంకలనుండి క్రేళ్లుదాఁట." హా. ౨, ఆ.

**క్రేళ్లుబ్బు.** దే. అ. క్రి. (క్రేళ్లు+ఉబ్బు.) అతిశయించు. "సీ. ఉఁజాలంబులుచాత్రిప్రపనులించకమున్న క్రేళ్లుబ్బువారియకీర్తిపం కము." క. ౫, ఆ.

**క్రేళ్లువాఱు.** దే. అ. క్రి. (క్రేళ్లు+పాఱు.) గంతులిడు. "తే. మలఁగిగజఘంధముఁద్రుంచి తొలఁగనుటికి, కెంపుదళుకొత్తువాలు తోఁక్రేళ్లువాఱు, నావృకోదరుపైఁ గవియంగఁజేయి, వీచెసేనకుఁ దాళింగఱఘఁడుగడఁగి." భార. భీష్మ. ౨, ఆ.

**క్రేళ్లుఱుకు.** దే. అ. క్రి. (క్రేళ్లు+ఉఱుకు.) 1. ఎగిరిపడు; "శా. కెలిమైనొక్కటలీలఁగ్రేళ్లుఱికెడువాలుగళాగలమేలుడించి." భార. విరా. ౨, ఆ.—2. గంతులిడు; "సీ. హయముక్రేళ్లుఱు కునోయని రెండుకడలందు వాగెపట్టెరిమత్స్యవత్సపతులు." కళా. ౨, ఆ.—3. దూఁకు. "క. క్రేళ్లుఱికెందొలఁగంబగతుని, యఱ కడనుండిభూమిమీఁదికబ్బలిచ్చుండుఁ." హరి. పూ. 2, ఆ.

## క్రై.

**క్రైలు.** దే. వి. ధాన్యమునఁజిచికొలుచుట, ఒబ్బిడి. ("వ. క్రైలుగ నఱికెపగలుంజిత్తుముజ్జాడుసహజసాహసులును." ఉ, హరి. ౪, ఆ. ఇక్కడ క్రైలుగననఁగాసర్వనాశముగననియర్థము. గ్రంథములయం దిట్లు రేఫసహితముగానిది కానఁబడుచున్నది.)

**క్రైలుదారి.** దే. వి. క్రైలుచేయించెడి యధికారి.

## క్రొ.

**క్రొ.** దే. విశే. వృత్తియందుఁగ్రొత్తశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికంటెఁ బరములైనపరుషసరళస్థిర వర్ణములకు ద్విత్వముకలుగును. క్రొక్కన్ను, క్రొక్కారు, క్రొగ్గండి, క్రొచ్చెలిక, క్రొత్తఱఁగ, క్రొత్తలిరు, క్రొత్తావి, క్రొన్నన, క్రొన్నలువు, క్రొన్నరువు, క్రొన్నెత్తురు, క్రొన్నెల, క్రొన్నెయి, క్రొమ్మంచు, క్రొమ్మడుఁగు, క్రొమ్మావి, క్రొమ్మించు, క్రొమ్మిసుఁగులు, క్రొమ్ముడి, క్రొమ్మెదడు, క్రొమ్మెఱుఁగు, క్రొమ్మొగడ, క్రొమ్మొన, క్రొమ్మొలక, క్రొవ్వాఁడి, క్రొవ్విరి, క్రొవ్వెద, క్రొవ్వేఁడి మొ. కొన్నిచోట్లఁదత్సమపదము పరమగునపుడును ద్విత్వముకానఁబడుచున్నది. "సీ. పుష్కలావర్తకంబులులోనుగాఁగలక్రొమ్మేఘములు వృష్టికురియ కుండ." భీ. 3, ఆ కొన్నియెడల పరుషములుపరములగునపుడు దీనికి నుమాగమమువచ్చును. క్రొంజాయ, క్రొంజెమట, క్రొందమ్మి, క్రొందలిరు, క్రొంబంట, క్రొంబదను, క్రొంబసిఁడి, క్రొంబసిమి, క్రొంబట్టము, క్రొంబువ్వు, క్రొంబోఁగ, క్రొంబొగడ మొ.) (కొన్నిచోట్లఁ దత్సమపదములు పరమగునపుడును నుమాగమము కానంబడియెడి. ఉదా. క్రొంబులకలు మొ.)

**క్రొంకి.** దే. వి. కొంకియొక్కరూపాంతరము.

**క్రొంచె.** వై. వి. కొంచయొక్కరూపాంతరము.

**క్రొక్కారము.** దే. వి. కోడికూఁత. "కార్కోడిగముల క్రొక్కారంపునందడి." చంద్రా. ౨, ఆ.

**క్రొత్త.** దే. విశే. 1. నూతనము; "సీ. క్రొత్తముత్యములతో రుద్రాక్షమాలిక లష్టోత్తరశతంబులమరఁదాల్చి." కాశీ. ౧, ఆ. —2. అపూర్వము. "క. తద్దా, రుణశలలీవృష్టిమిగులఁగ్రొత్తయగుచున్ క్షణములకత్యద్భుతకా, రణమైతనరారె." కళా. ౬, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. క్రొ.)

**క్రొత్తడము.** దే. వి. కోటబురుజు. "సీ. క్రొత్తడంబులకెంపుఁ గ్రొత్తడంబులరంగు నింగికిఁదోఁపువన్నియలునింప." య. ౧, ఆ.

**క్రొత్తడి.** దే. వి. మగనాలు. "చ. అదిపుణ్యచరిత్రకులాగ్రగణ్యక్రొ, త్తడిసకలంబుఁజూడసభదైన్యముఁబొందుటఁజూచిపాక్షికిఁ." భార. ఉద్యో. 3, ఆ.—పతివ్రత. (అనికొందఱు.)

**క్రొత్తముట్టు.** దే. వి. వడుకనారంభించినప్పుడు ఏకునుండి కదురునకంటించెడునూలు. "సీ. కళ్యాలఁ బురిలేకచాఁగఁదీసి కదురునకంటించెడునూలు... బదిలంబుగానిగుణ్ణంబులఁ గ్రొత్తముట్టునకియ్యకొలుపువెరవు." భార. విరా. ౫, ఆ.

**క్రొత్తళము.** దే. వి. క్రొత్తడముయొక్కరూపాంతరము.

**క్రొన్నెలలు.** దే. వి. బ. కపోలోరుకటోపరిప్రదేశములయందలి నఖక్షతములు.

**క్రొమ్మి.** వై. వి. ఎఱ్ఱగోరంటకు. "సీ. కొరవినాఁగ్రోవినాఁగ్రొమ్మి నాఁగఁ, గురవకనామమహా." ఆం, భా. ద్వి. వ.

**క్రొవ్విదము.** దే. వి. (క్రొవ్వు+ఇదము.) 1. దుష్కార్యము; "గీ. ఆలుబిడ్డలేనియట్టిత్రిమ్మరియగు, కొయ్యగాకకూడుకుదుటఁ బెట్టి, కుడుచువారలిట్టిక్రొవ్విదంబులుచేయఁ, జొచ్చుటిచ్చగించి చూతురయ్య." భార. ఉద్యో, ౨, ఆ.—2. పరువము. "సీ. విరియనూఁకించుక్రొవ్విదపుమల్లియ మొగ్గలెలతావిఁజొక్కించు నిక్కలందు." లక్ష్మి. 3, ఆ.

**క్రొవ్వు.** దే. అ. క్రి. మదించు. వి. 1. మదము; 2. మెదడు.

**క్రొవ్వుగొను.** దే. అ. క్రి. (క్రొవ్వు+కొను.) మదించు. "సీ. పరువంపుఁజినుకులపనఁ గ్రొవ్వుగొనితేలగిలఁబడువానకోయిలల యొప్పు." హరి. పూ. ౯, ఆ.

## క్రో.

**క్రోఁతి.** దే. వి. కోఁతియొక్కరూపాంతరము. "ద్వి. ఆక్రూరత కుఁగాకయగచరుల్పఱవ, నోక్రోఁతులారమీకులుకనేమిటికి." రా. యు, కాం.

**క్రోడము.** సం. వి. అ. న. ఆ. స్త్రీ. 1. ఒడి; 2. ఱొమ్ము. అ. పుం. పంది.

**క్రోడాడు.** దే. స. క్రి. 1. (ఏనుఁగులోనగునవి) కొమ్ములతోఁ బొడుచు; "క. ఏడాకుపొన్నకొమ్మలఁ, గ్రోడాడెడునడవిగొరు కొదమలుమోద, క్రీడఁదనరుచాడ్పునఁబై, నోడికలయిపువ్వుఁదేనెలురలఁగనొప్పెన్." హరి. పూ. 2, ఆ. "సీ. గోడలుక్రోడాడికోవెలల్నుగ్గాడి పందిళ్లుపడఁద్రోచిబండ్లువిఱిచి." (ఇందు కర్త యెద్దులు.) నీలా. 3, ఆ.—2. (పంది)ముట్టెతోనేలకెల్లగించు; "వ. మహాదేహంబులగు వరాహంబులుచొచ్చి ఘోషంబునవెల్లచోట్లుంగ్రోడాడందొడంగె." హరి. పూ. ౬, ఆ.—3. (ఏనుఁగు లోనగునవి) కొమ్ములతోఁబొడిచిదుమ్మెత్తిపైకిఁజల్లు; 4. (దుమ్ములోనగువాని) ఎత్తిపైకిఁజల్లు. (చూ. కోరాడు.)

**క్రోడీకరణము.** సం. వి. అ. న. 1. ఆలింగనము; "ఆలింగనంతథా క్రోడీకరణంచాంకపాల్యపి." అ, పా. తృ. సం.—2. క్రోడీకరించుట.

**క్రోడీకరించు.** సం. స. క్రి. ఒకటిగాచేర్చు.

**క్రోడుఁడు.** సం. వి. అ. పుం. శనిగ్రహము.

**క్రోధన.** సం. వి. ఆ. స్త్రీ. చెండికి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విశే. కోపముగలది.

**క్రోధము.** సం. వి. అ. పుం. కోపము, కినుక.

**క్రోధి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విశ. కోపముగలవాఁడు.

**క్రోధించు.** సం. అ. క్రి. కోపగిల్లు.

**క్రోయు.** దే. స. క్రి. విషమముగాచాఁచు. "క. నాలుకలు గ్రోయువహ్నులు, నాలుగుదిక్కులసమర్చినడుమనిలిచినూ, ర్యాలోకనపరుఁడై మును, గాలొక్కటిమోపినిలిచెఘర్మపువేళన్." లక్ష్మీ. ౨, ఆ. "నాలుకలుక్రోయుమహోరగరాజయుగ్మముం జేరి." భార. అర. ౬, ఆ.

**క్రోలు.** దే. స. క్రి. 1. అనుభవించు; "ఎ, గీ. ప్రియుండుఁ, బ్రియయుఁగ్రోలిరి నూతనప్రేమరసము." హరి. ఉ. ౭, ఆ.— 2. తిను; "క. నాలుకలురెండునిన్నుం, గ్రోలనెకల్పించెనలువఘోరాహికిన, న్నాలిగ్రహమపుడ తెగఁదినఁ, జాలదుమ్మృదుపవనవిరహిజనదురితమునన్." స్వా. 3, ఆ.—3. త్రాగు; "క. చాలఁగ నిచ్చలువెన్నయుఁ, బాలుంగుడకగొనితల్లిపట్టికెసెలవిన్, వ్రేలిడి యింతింతియకాఁ, గ్రోలించునవెరవుతోడ రుచిగొలుపుక్రియన్." హరి. పూ. ౫, ఆ.—4. గ్రహించు; "చ. పొలఁతుక కాంతి యింతపొలివోవఁగనీకెనలారుతారని, శ్చలతఁగడంగిక్రోలికొనఁజాలుటఁగీచకముఖ్యలోచనం, బులునయనంప్రధానమనుపూర్వవచస్థితితప్పకుండఁగా, నెలమివహించెఁదక్కఁగలయింద్రియవర్గము ధిక్కరించుచున్." భార. విరా. ౨, ఆ. (కొఱలుయొక్క రూపాంతరము.)—వి. క్రోవి. "బెబ్బులిగొంతుక్రోల్గఱచిపెళ్లున మూర్ఛెడద్రెళ్లదాఁటుచున్." ఆము. 3, ఆ.

**క్రోలుకసవు.** ద్వి. వి. తృణవిశేషము, సడము.

**క్రోలుచు.** దే. అ. క్రి. కూయు, శబ్దించు. ప్రే. క్రోలఁజేయు. (రూ. క్రోల్చు. శబ్దించుటకు.—"చ. కొనరివనంతకాలమునఁగోయిలక్రోల్చినభంగినేర్చ్పన, బ్బినరుహనేత్ర." కాశీ. ౫, ఆ.—క్రోలఁజేయుటకు.—"వీనులతేనెయైకురియ వింతగఁగావ్యరసంబుఁగ్రోల్చి." లక్ష్మీ. ౧, ఆ.)

**క్రోవ.** దే. వి. సరము. "సురాంతకు భాగ్యరత్నపుంగ్రోవ." రామా. ౭, ఆ.

**క్రోవి.** యు. దే. వి. 1. గొట్టము; 2. ఆనుపోసెడుగొట్టము; "సీ. పరిపరియచ్చులు చరికుండ యూడితచీడుదబ్బలుదండెనాడెక్రోవి." హంస. ౨, ఆ.—3. తుపాకి; "సీ. చేతిక్రోవులువైచి బీతుచెయ్యులఁబాతె బగ్గముపాడై తుపాకిమూఁక." రా, వి. ౫, ఆ.—4. బుడ్డి; "సీ. కపురంపుబరణిచిల్కలదివ్వెకంబంబునిల్వటద్దంబుపన్నీటిక్రోవి." నీలా. 3, ఆ.—5. భూమిలోపలనీళ్లు వచ్చుటకేర్పఱచినమార్గము; "చ. కొలఁకులవాఁగులన్నదులఁగ్రోవులబావులనిర్ఝరంబులన్, గలయఁగరోసిరోసి." భార. అర. ౪, ఆ.—6. మూస. "ఉ. కాలకళొదుఁడెండయను కాంచనరేణువు ప్రత్యగాళనాఁ, గ్రాలెడు క్రోవిఁగూర్చికరఁగంగ." కళా. ౮, ఆ.—వై. కురవకము. "పేచితనర్చితలిర్చినక్రోవుల." భార. ఆది. ౪, ఆ.

**క్రోశము.** సం. వి. అ. పుం. రెండువేల విండ్లపట్టుకొలఁది, కోసు.

**క్రోష్టము.** సం. వి. అ. పుం, న. గెనుసు.

**క్రోష్టుపుచ్ఛిక.** సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న, పొర్లుగాడి.

**క్రోష్టువిన్న.** సం. వి. ఆ. స్త్రీ. నక్కతోఁక పొన్న.

**క్రోష్టువు.** సం. వి. ఉ. పుం. జంబుకము, నక్క.

**క్రోష్ట్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడునక్క; 2. తెల్లనేలగుమ్మడి; 3. లాంగలి. (లాంగలి శబ్దమునకు పరిగొజ్జయు, సిరుపిప్పలియు నర్థములు.)

## క్రౌ.

**క్రౌంచదారణుఁడు.** సం. వి. అ. పుం. గుహుఁడు, కుమారస్వామి.

**క్రౌంచము.** సం వి. అ. పుం. 1. ఒకానొక కొండ; 2. ఒకానొక ద్వీపము; (చూ. ద్వీపము.) 3. ఒకానొక పక్షి.

**క్రౌర్యము.** సం. వి. అ న. క్రూరభావము.

## క్ల.

**క్లమథము.** సం. వి. అ. పుం. శ్రమము, బడలిక.

**క్లమము** సం. వి. అ. పుం.——పై.——

## క్లా.

**క్లాంతము.** సం. విశ. (అ. ఆ. అ.) బడలినది.

**క్లాంతి.** సం. వి. ఇ. స్త్రీ. క్లమము, బడలిక.

## క్లి.

**క్లిన్నము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆర్ద్రము, తడిసినది.

**క్లిశితము.** సం. విశ. (అ. ఆ. అ.) దారిద్ర్యాదులచేత క్లేశము నొందినది.

**క్లిష్టము.** సం. వి. అ. న. ఒకానొక శబ్దదోషము. విశ. 1. దారిద్ర్యాదులచేత క్లేశమునొందినది; 2. పూర్వోత్తర విరుద్ధమయినది. (వాక్కు.)

## క్లీ.

**క్లీతకము.** సం. వి. అ. న. అతిమధురము.

**క్లీతకిక.** సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.

**క్లీబము.** సం. వి. అ. న. నపుంసకము. విశ. విక్రమములేనిది.

## క్లే.

**క్లేదము.** సం. వి. అ. న. ఆర్ద్రత, తడి.

**క్లేశము.** సం. వి. అ. పుం. 1. దుఃఖము; 2. కోపము; 3. వ్యవసాయము.

## క్లో.

**క్లోమము.** సం. వి. న్. న. కడుపులో నొకప్రక్కనుండెడి యెఱ్ఱనిమాంసము, నీరుతిత్తి. (అనికొందఱు.)

## క్వ.

**క్వణనము.** సం. వి. అ. పుం. వీణలోనగువాని మ్రోఁత.

**క్వణము.** సం. వి. అ. పుం.——పై.——

**క్వథితము.** సం. విశ. (అ. ఆ. అ.) చక్కఁగా కాఁగినది.

**క్వయినా.** ఆం. వి. శీతజ్వరముల కౌషధము.

## క్వా.

**క్వాణము.** సం. వి. అ. పుం. క్వణముయొక్క రూపాంతరము.

**క్వాథము.** సం. వి. అ. పుం. బాధ.

**క్వాథోద్భవము.** సం. వి. అ. న. మ్రానిపసుపునవండిన అం జనవిశేషము.

## క్వి.

**క్విణ్రెంటు.** ఆం. వి. మాన్యములమీద సేయఁబడు అల్పమైన పన్ను.

## క్ష.

**క్షంత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) క్షమిత, ఓర్పరి.

**క్షణద.** సం. వి. ఆ. స్త్రీ. రాత్రి. అ. న. ము. నీళ్లు.

**క్షణదుఁడు.** సం. వి. అ. పుం. జోస్యుఁడు.

**క్షణనము.** సం. వి. అ. న. వధము, కొల.

**క్షణప్రభ.** సం. వి. ఆ. స్త్రీ. తటిత్తు, మెఱపు.

**క్షణము.** సం. వి. అ. పుం. 1. ఘటికయందాఱవపాలు; 2. తిరునాళ్లు; 3. పండుగ; 4. వ్యాపారములేమి; 5. సమయము.

**క్షణియించు.** సం. స. క్రి. భోజనార్థమువరించు. "వ. అయ్యా నీవతిథివిమాయింటం గృతభోజనుండవైపొమ్మనిక్షణియించిన." భార. ఆది. ౧, అ. (రూ. క్షణించు.)

**క్షతజము.** సం. వి. అ. న. రక్తము, నెత్తురు.

**క్షతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. గాయమునొందినది; 2. నాశమునొందినది.

**క్షతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. గాయము; 2. నాశము.

**క్షత్త.** సం. వి. ఋ. పుం. 1. శూద్రస్త్రీయందు క్షత్రియునికిఁ బుట్టినవాఁడు; (క్షత్రియస్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడని పాఠాంతరము.) 2. దాసీపుత్రుఁడు; 3. ద్వారపాలకుఁడు; 4. బ్రహ్మ; 5. సారథి.

**క్షత్రబంధువు.** సం. విణ. ఉ. స్వధర్మములేక క్షత్రియునకు బంధుమాత్రుఁడైనవాఁడు. (ఇది నిందయందువచ్చును.)

**క్షత్రము.** సం. వి. అ. న. శరీరము, మేను.

**క్షత్రియ.** సం. వి. ఆ. స్త్రీ. రాచేడి.

**క్షత్రియాణి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**క్షత్రియి.** సం. వి. ఈ. స్త్రీ. రాచవాని పెండ్లాము.

**క్షత్రియుఁడు.** సం. వి. అ. పుం. రాచవాఁడు.

**క్షత్త్రుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**క్షప.** సం. వి. ఆ. స్త్రీ. రాత్రి, రేయి.

**క్షపణకుఁడు.** సం. వి. అ. పుం. బౌద్ధమతస్థుఁడు.

**క్షపణము.** సం. వి. అ. న. అశుచిభావము. విణ. సిగ్గులేనిది.

**క్షపాకరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**క్షమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఓర్పు; 2. నేల. అ. న. ము, యుక్తము. విణ. చాలునది.

**క్షమి.** సం. విణ. (న్. ఈ. న్.) సహిష్ణువు, ఓర్పరి.

**క్షమించు.** సం. స. క్రి. ఓర్చు. (క్షమియించు అనియు.)

**క్షమిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) సహిష్ణువు, ఓర్పరి.

**క్షముఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. శక్తుఁడు; 2. హితుఁడు.

**క్షయము.** సం. వి. అ. పుం. 1. అఱుఁదెవులు; 2. తగ్గుదల; (ఇది త్రివర్గమునందొక్కటి. చూ. వర్గము.) 3. ప్రళయము; 4. ఇల్లు.

**క్షయించు.** సం. అ. క్రి. క్షీణించు, తగ్గు.

**క్షయ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) క్షయింపఁదగినది.

**క్షరము.** సం. వి. అ. న. నీళ్లు. పుం. మబ్బు.

**క్షవథువు.** సం. వి. ఉ. పుం. 1. తుమ్ము; 2. దగ్గు.

**క్షవము.** సం. వి. అ. పుం. 1. తుమ్ము; 2. సల్లావలు.

## క్షా.

**క్షాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఓర్వఁబడినది.

**క్షాంతి.** సం. వి. ఇ. స్త్రీ. క్షమ, ఓర్పు.

**క్షాత్రము.** సం. వి. అ. న. క్షత్త్రధర్మము.

**క్షామము.** సం. వి. అ. పుం. కఱవు. విణ. కృశము.

**క్షారకము.** సం. వి. అ. పుం. 1. కసుగాయ; 2. (పక్షులు మత్స్యములులోనగువానిఁ బట్టివేసెడు) బుట్ట; 3. పసరుమొగ్గ, మొగ్గలగుమి. (అనికొందఱు.)

**క్షారము.** సం. వి. అ. పుం. 1. ఉప్పు; 2. కారము; "త్రిరాత్రముభయోరధశ్శయ్యా. బ్రహ్మచర్యమ్ క్షారలవణవర్జనంచ." అని ఆపస్తంబసూత్రవాక్యము. — 3. గాజు; 4. బూడిద; 5. ఉప్పుతిత్తి.

**క్షారాబ్ధి.** సం. వి. ఇ. పుం. ఉప్పుసముద్రము.

**క్షారితము.** సం. విణ. (అ. ఆ. అ.) కాఱినది.

**క్షారితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు.

**క్షాళనము.** సం. వి. అ. న. కడుగుట.

**క్షాళితము.** సం. విణ. (అ. ఆ. అ.) కడుగఁబడినది.

## క్షి.

**క్షితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నేల; 2. ఉనికి; 3. చిటికవేయు నంతకాలము; 4. నాశము.

**క్షితిధరము.** సం. వి. అ. పుం. పర్వతము, నేలతాలుపు.

**క్షితిపతి.** సం. వి. ఇ. పుం. రాజు, నేలతేఁడు.

**క్షిప.** సం. వి. ఆ. స్త్రీ. క్షేపణము, ప్రేరేపించుట.

**క్షిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోయఁబడినది; 2. వైవఁబడినది.

**క్షిప్నువు.** సం. విణ. ఉ. తిరస్కరించువాఁడు.

**క్షిప్రము.** సం. క్రి. విణ. అ. న. శీఘ్రము, విణ. వడిగలది.

**క్షిప్రశ్యేనము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము, పట్టెంత.

**క్షియ.** సం. వి. ఆ. స్త్రీ. క్షయము, తగ్గుదల.

## క్షీ.

**క్షీణము.** సం. విశ. (అ. ఆ. అ.) క్షయించినది.
**క్షీణించు.** సం. అ. క్రి. క్షీణమగు.
**క్షీబుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) క్రొవ్విననవాఁడు.
**క్షీరకాకోలి.** సం. వి. ఈ. స్త్రీ. పిస్నపాలతీఁగె.
**క్షీరము.** సం. వి. అ. న. 1. పాలు; 2. నీళ్లు. (ఘనక్షీరము, ఘనసారము.)
**క్షీరమోరట.** సం. వి. ఆ. స్త్రీ. చేఁగొండతీఁగె.
**క్షీరవిదారి.** సం. వి. ఈ. స్త్రీ. నల్లనేలగుమ్ముడుతీఁగె.
**క్షీరశుక్ల.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లనేలగుమ్ముడుతీఁగె.
**క్షీరాబ్ధి.** సం. వి. ఇ. పుం. పాలసముద్రము.
**క్షీరావి.** సం. వి. ఈ. స్త్రీ. చిఱుపాలతీఁగె.
**క్షీరాశము.** సం. వి. అ. పుం. హంస.
**క్షీరిక.** సం. వి. ఆ. స్త్రీ. పాలచెట్టు.
**క్షీరోదకన్యాయము.** సం. వి. అ. పుం. నీళ్లనుపాలునుగలసి నట్లొక్కటిగాఁ గలసియుండు ధర్మము.
**క్షీరోదము.** సం. వి. అ. పుం. పాలసముద్రము.

## క్షు.

**క్షుణ్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) పొడిచేయఁబడినది.
**క్షుణ్ణుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) వ్యుత్పన్నుఁడు.
**క్షుతము.** సం. వి. అ. న. త్. స్త్రీ. తుమ్ము.
**క్షుతాభిజననము.** సం. వి. అ. పుం. నల్లావలు. (క్షుధాభిజననమని కొందఱు.)
**క్షుత్తు.** సం. వి. ధ్. స్త్రీ. ఆఁకలి, బుభుక్ష.
**క్షుద్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఈఁగ; 2. తేనెటీఁగ; 3. వేశ్య; 4. అంగహీనయగు ఆఁడుది; 5. నాట్యమాడెడు ఆఁడుది; 6. హింసించెడు ఆఁడుది; 7. పులిచింతతీఁగె; 8. వాఁకుడుతీఁగె.
**క్షుద్రకము.** సం. వి. అ. పుం. బాణవిశేషము, కుప్పెకోల. "శ్లో. అథైనం పంచవింశత్యా క్షుద్రకాణాం సమాచినోత్." భార. భీష్మ. "శ్లో. సాత్యకిః పంచవింశత్యాక్షుద్రకాణాం సమార్పయత్." భార. ద్రో.
**క్షుద్రము.** సం. విశ. (అ. ఆ. అ.) (చూ. క్షుద్రుఁడు.)
**క్షుద్రమూలకము.** సం. వి. అ. న. పిన్నముల్లంగితీఁగె.
**క్షుద్రశంఖము.** సం. వి. అ. పుం. నత్తగుల్ల.
**క్షుద్రుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. అధముఁడు; 2. అల్పుఁడు; 3. లోభి; 4. హింసకుఁడు.
**క్షుధ.** సం. వి. ఆ. స్త్రీ. క్షుత్తు, ఆఁకలి.
**క్షుధితము.** సం. విశ. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నది.
**క్షుపము.** సం. వి. అ. పుం. కుఱుచకొమ్మలును, ఊడలునుగల చెట్టు.
**క్షుబ్ధము.** సం. విశ. (అ. ఆ. అ.) కలఁతపెట్టఁబడినది.
**క్షుభితము.** సం. విశ. (అ. ఆ. అ.)——పై.——
**క్షుమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. నూనెయగిసెతీఁగె.
**క్షురకము.** సం. వి. అ. పుం. 1. గొలిమిడితీఁగె; 2. పల్లేరుతీఁగె; 3. బొట్టుగుతీఁగె.
**క్షురప్రము.** సం. వి. అ. పుం. అర్ధచంద్రబాణము. "అర్ధచంద్రః క్షురప్రస్స్యాత్" అని హలాయుధనిఘంటువు.
**క్షురము.** సం. వి. అ. పుం. 1. మంగలికత్తి; 2. గొలిమిడితీఁగె; 3. పల్లేరుతీఁగె.
**క్షురి.** సం. వి. న్. పుం. మంగలి.
**క్షురిక.** సం. వి ఆ. స్త్రీ. మంగలికత్తి.
**క్షుల్లకము.** సం. వి. అ. పుం. నత్తగుల్ల. విశ. 1. అల్పము; 2. నీచము; 3. పేద.

## క్షే.

**క్షేత్రజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. జీవుఁడు. విశ. నేర్పరి.
**క్షేత్రము.** సం. వి. అ. న. 1. వరిమడి; 2. గణితశాస్త్రవిశేషము; 3. పెండ్లాము; 4. శరీరము; 5. సిద్ధస్థానము. (ఏనుఁగు యొక్క హస్త, వదన, దంత, శిరో, నయన, కర్ణ, గ్రీవా, గాత్రో, రః, కాయ, మేఢ్ర, పదములు పండ్రెండును క్షేత్రములనఁబడును.)
**క్షేత్రాజీవుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దున్నుకొని బ్రదుకువాఁడు.
**క్షేత్రియము.** సం. విశ. (అ. ఆ. అ.) మడియందుఁ బుట్టినది. (తృణము.)
**క్షేత్రియుఁడు.** సం. విశ. అ. పరదారరతుఁడు.
**క్షేపణము.** సం. వి. అ. న. ప్రేరేఁపించుట.
**క్షేపణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఓడనడపుగడ; 2. ఒకానొక వల.
**క్షేపము.** సం. వి. అ. పుం. 1. చిమ్ముట; 2. త్రుళ్లు; 3. దూఱు; 4. పూఁత; 5. ప్రేరణము.
**క్షేపిష్ఠము.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి క్షిప్రము. (క్షిప్రము=శీఘ్రము.)
**క్షేపీయము.** సం. విశ. (న్. ఈ. న్.)——పై.——
**క్షేమ.** సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.
**క్షేమంకరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మేలుచేయువాఁడు.
**క్షేమతండులము.** సం. వి. అ. పుం. ప్రయాణకాలమందు వట్టి చేతఁబోక యింటనుండి కొంఁచెముగాఁ గట్టికొనిపోయెడు బియ్యము.
**క్షేమము.** సం. వి. అ. పుం, న. 1. కలిగినది చెడకుండుట; 2. శుభము. పుం. బలురక్కసితీఁగె.
**క్షైత్రము.** సం. వి. అ. న. క్షేత్రముల సమూహము. (క్షేత్రము=వరిమడి.)

## క్షో.

**క్షోణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నేల; 2. ముంజతృణముచే నల్లిన బ్రహ్మచారి మొలత్రాడు.
**క్షోదము.** సం. వి. అ. పుం. 1. నూఱుట; 2. పొడి.
**క్షోదిష్ఠము.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి క్షుద్రము. (క్షుద్రము=అల్పము.)

**క్షోదీయము.** సం. విశే. (స. ఈ. స.) మిక్కిలి క్షుద్రము. (క్షుద్రము=అల్పము.)

**క్షోభము.** సం. వి. అ. పుం. 1. కలఁత; 2. దోఁపుడు.

**క్షోభించు.** సం. అ. క్రి. కలఁతపడు.

**క్షోభితము.** సం. విశే. (అ. ఆ. అ.) కలఁతపెట్టఁబడినది.

## క్షౌ.

**క్షౌద్రము.** సం. వి. అ. న. 1. తేనె; 2. నీళ్లు.

**క్షౌమము.** సం. వి. అ. న. 1. నారచీర; 2. నూనెయగిసె నార చీర; 3. ఉందేటిత్రుప్పటిచీర. పుం, న. 1. తెల్లచీర; 2. యుద్ధార్థమువాకిటిమండపముమీఁదఁగాని, కొత్తళముమీఁదఁగాని యేర్పఱచినగది.

**క్షౌరము.** సం. వి. అ. న. మంగలిపని.

**క్షౌరికుఁడు.** సం. వి. అ. పుం. మంగలి.

## క్ష్ణు.

**క్ష్ణుతము.** సం. విశే. (అ. ఆ. అ.) వాఁడిచేయఁబడినది.

## క్ష్మా.

**క్ష్మా.** సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. నిద్ర. అ. న. ము. 1. స్థానము; 2. రాక్షసుఁడు.

**క్ష్మాజము.** సం. వి. అ. పుం. చెట్టు.

**క్ష్మాభృత్తు.** సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు.

## క్ష్వి.

**క్ష్వింక.** సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱని మొగముగల ఆఁడుకోఁతి. అ. పుం. ము. ఎఱ్ఱని మొగముగల మగకోఁతి.

## క్ష్వే.

**క్ష్వేడ.** సం. వి. ఆ. స్త్రీ. 1. సింహనాదము; 2. వెదురు సలాక. అ. న. ము. 1. ఆవడపుల్వ; 2. ఎఱ్ఱఆల్లెడుకాయ. పుం. 1. చెవుడు; 2. మ్రోఁత; 3. విషము. విశే. 1. పొందరానిది; 2. వంకరైనది.

**క్ష్వేడితము.** సం. వి. అ. న. సింహనాదము.

**క్ష్వేళ.** సం. వి. ఆ. స్త్రీ. సింహనాదము. అ. పుం. ము. విషము.

**క్ష్వేళితము.** సం. వి. అ. న. సింహనాదము.

## ఖ.

**ఖ.** ఒక యక్షరము.

**ఖంగుఖింగు.** దే. వి. ఆయుధము లొకటితో నొకటి తాఁకు నప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. "ఉత్సాహ. నిబ్బరంపుటార్పు టీని జనించె నంత నెల్లెడో, డబ్బుడుబ్బు ఖంగుఖింగుఖంగుఖింగు మఖాధ్వనుల్." కళా. ౮, ఆ.

**ఖంజ.** సం. వి. ఆ. స్త్రీ. ఛందోవిశేషము. విశే. కుంటిది.

**ఖంజనము.** సం. వి. అ. పుం. మండఁడిచ్చుక. కాటుకపిట్ట. (అనికొండము.)

**ఖంజపాదము.** సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము, గంజ నగాలు.

**ఖంజరి.** సం. వి. ఈ. స్త్రీ. వాద్యవిశేషము. "సీ. కాహళదుందుభి ఖంజరీమర్దళ భేరీరవంబులుబోరుకలఁగ." భాను. ౪, ఆ.

**ఖంజరీటము.** సం. వి. అ. పుం. మందపిచ్చుక. కాటుకపిట్ట. (అనికొండము.)

**ఖండ.** సం. వి. ఆ. స్త్రీ. గర్భాధానాది విధిప్రతిపాదకగ్రంథము. "శ్రౌతులఁ దప్పవట్టుదుఁ ఖండలముష్టిఁబీడ్వఁగనినప్పుడు." ఆము. ౬, ఆ.

**ఖండకము.** సం. వి. అ. పుం, న. గోఁచి.

**ఖండనము.** సం. వి. అ. న. నఱుకుడు.

**ఖండపరశువు.** సం. వి. ఉ. పుం. 1. శివుఁడు; 2. పరశు రాముఁడు; 3. రాహువు; 4. సున్నముపూయువాఁడు; 5. ఖండామలకమనెడు మందు.

**ఖండము.** సం. వి. అ. పుం, న. తునుక. పుం. 1. పులకండము; 2. రత్నదోషము.

**ఖండశర్కర.** సం. వి. ఆ. స్త్రీ. పులకండము.

**ఖండా.** వై. గ్రా. వి. పెద్దకత్తి. "సీ. ఒండొంటిఁగొట్టుచో ఖండా లుక్రంగుక్రంగునఁదాఁకి పెనుమిడుంగుఱులుగ్రక్క." కళా. ౮, ఆ.

**ఖండించు.** సం. స. క్రి. ఖండముచేయు, నఱుకు.

**ఖండిక, ఖంద్రిక.** గ్రా. చిన్నపల్లె.

**ఖండికము.** సం. వి. అ. పుం. ధాన్యవిశేషము.

**ఖండిత.** సం. వి. ఆ. స్త్రీ. నాయకుఁడు రాత్రి మఱియొకదాని యింటికిఁపోయి యా చిహ్నములతోరాఁగా చూచి కోపమునొందిన నాయిక, (చూ. నాయిక.)

**ఖండితము.** సం. విశే. (అ. ఆ. అ.) నఱుకఁబడినది.

**ఖండీ.** హిం. వి. పుట్టి.

**ఖండీరము.** సం. వి. అ. పుం. పచ్చపెసలు.

**ఖండువా.** గ్రా. వి. పైవస్త్రము.

**ఖంబు.** సం. వి. అ. న. 1. ఆకాశము; 2. స్వర్గము; 3. అభావము; 4. ఇంద్రియము; 5. తెలివి; 6. పట్టణము; 7. వరిమడి; 8. సుఖము; 9. సున్న. (చూ. కంబు.)

**ఖగము.** సం. వి. అ. పుం. 1. పక్షి; 2. బాణము; 3. గ్రహము.

**ఖగుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. వేలుపు.

**ఖగేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

**ఖచరము.** సం. వి. అ. పుం. 1. పక్షి; 2. మేఘము; 3. గాలి.

**ఖచరుఁడు.** సం. వి. అ. పుం. 1. దేవుఁడు; 2. సూర్యుఁడు.

**ఖచించు.** సం. స. క్రి. చెక్కు, పొదుఁగు. (ఖచియించు అనియు. "క. ఖచియించినవజ్రంబుల, రుచులనుబొలుపారునీవు రులుబెరయంగన్." భార. ఉద్యో. ౪, ఆ.)

**ఖచితము.** సం. విశే. (అ. ఆ. అ.) చెక్కఁబడినది.

**ఖజపము.** సం. వి. అ. పుం. మిఱ్ఱి.

**ఖజాక.** సం. వి. ఆ. స్త్రీ. గరిఁటె.

ఖజానా. హిం. వి. ధనాగారము.

ఖటిక. సం. వి. ఆ. స్త్రీ. బలపము.

ఖటిని. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

ఖట్టి. సం. వి. ఇ. స్త్రీ. పాడె.

ఖట్టిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గద్దియ; 2. పాడె.

ఖట్టికుఁడు. సం. వి. అ. పుం. వేఁటకాఁడు.

ఖట్వ. సం. వి. ఆ. స్త్రీ. పర్యంకము; మంచము.

ఖడ్గము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. ఖడ్గమనెడు మృగము; 3. ఖడ్గమృగముకొమ్ము.

ఖడ్గి. సం. వి. న్. పుం. ఖడ్గమృగము. విణ. కత్తిగలవాఁడు.

ఖతమాలము. సం. వి. అ. పుం. 1. పొగ; 2. మబ్బు.

ఖతిలకము. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఖత్తు. హిం. వి. రీతి, ఉత్తరము.

ఖదిర. సం. వి. ఆ. స్త్రీ. ముసుఁగుఁదామర. అ. పుం. ము. చంద్రుఁడు.

ఖదిరుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

ఖద్గి. దే. వి. బలము. "స్రగ్ధర. ఖద్గింజెండాసు మ్రాఁకుల్ కవుఁగిటికొలఁదుల్ కత్తినొక్కొక్కగాతఁ." సా. ౪, ఆ.

ఖద్యోతము. సం. వి. అ. పుం. మిడుఁగుఱుఁబురువు.

ఖద్యోతుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఖనకము. సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు, (రూ. ఖానకము.)

ఖనకుఁడు. సం. వి. అ. పుం. 1. ఉప్పరవాఁడు; 2. కన్నపుదొంగ. విణ. త్రవ్వెడువాఁడు.

ఖని. సం. వి. ఇ. స్త్రీ. రత్నములుపుట్టెడుచోటు; గని, (రూ. ఖాని.)

ఖనిత్రము. సం. వి. అ. న. 1. గడ్డపాఱ; 2. గుద్దలి.

ఖనిత్రి. సం. వి. ఈ. స్త్రీ. పాఱ.

ఖపుటుఁడు. సం. వి. అ. పుం. అన్నమాకులోఁబెట్టుకొనకచేతఁబెట్టుకొనిభుజించువ్రతముగలవాఁడు.

ఖపురము. సం. వి. అ. పుం. 1. పోఁకజెబర; 2. పోఁకమ్రాను; 3. మ్రానిబంక; 4. నాగముస్తె.

ఖర. సం. వి. ఆ. స్త్రీ. డావరడంగిచెట్టు. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) న. ము. 1. ఎండుపోఁక; 2. వాఁడిమి; 3. వేఁడిమి. విణ. 1. వాఁడిమిగలది; 2. వేఁడిమిగలది.

ఖరకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

ఖరకుటి. సం. వి. ఈ. స్త్రీ. మంగలియిల్లు.

ఖరణసుఁడు. సం. విణ. (న్. అ. ఆ. అ.) వాఁడియైనముక్కుగలవాఁడు, గద్దముక్కువాఁడు.

ఖరపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. వాయింట.

ఖరమంజరి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను.

ఖరము. సం. వి. అ. పుం. గాడిద.

ఖరాగా. హిం. క్రి. విణ. సరిగా, స్థిరముగా.

ఖరాశ్వ. సం. వి. ఆ. స్త్రీ. ఓమము.

ఖరీదు. హిం. వి. వెల.

ఖరుఁడు. సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు. విణ. 1. వాఁడిమిగలవాఁడు; 2. వేఁడిమిగలవాఁడు.

ఖరువు. సం. వి. ఉ. పుం. 1. గర్వము; 2. గుఱ్ఱము; 3. పల్లు; 4. శివుఁడు. విణ. తెల్లనిది.

ఖర్చు. హిం. వి. వ్యయము.

ఖర్జువు. సం. వి. ఊ. స్త్రీ. 1. తీఁట; 2. ఒకానొక పురుగు; 3. చిట్టీఁదు.

ఖర్జూరము. సం. వి. అ. న. వెండి. పుం. 1. తేలు; 2. పేరీఁదు; 3. బ. ధాన్యవిశేషము.

ఖర్జూరి. సం. వి. ఈ. స్త్రీ. చిట్టీఁదు.

ఖర్పరము. సం. వి. అ. పుం. 1. బిచ్చమెత్తెడుకప్పెర; 2. తలపుఱ్ఱె.

ఖర్పరి. సం. వి. ఈ. స్త్రీ. పాలతుత్తము.

ఖర్పరుఁడు. సం. వి. అ. పుం. దొంగ.

ఖర్వటము. సం. వి. అ. పుం. కొండదొననాశ్రయించియుండెడుపల్లె. కమ్మరి వడ్లంగిలోనగువారుండెడుపల్లె. (అనికొందఱు.) నన్నూఱు గ్రామములుగల పరగణాకు ముఖ్యగ్రామము. (అనికొందఱు.) (ఖర్పటమని కొన్ని పుస్తకములయందుఁ గానఁబడుచున్నది.)

ఖర్వము. సం. వి. అ. న. సంఖ్యావిశేషము. విణ. 1. అధమము; 2. పొట్టి.

ఖలతి. సం. విణ. ఇ. బట్టతలవాఁడు.

ఖలపువు. సం. విణ. (ఊ. ఊ. ఉ.) కళ్లమునూడ్చువాఁడు.

ఖలము. సం. వి. అ. న. 1. చోటు; 2. నేల; 3. పాపము. పుం. కళ్లము. విణ. 1. అధమము; 2. క్రూరము; 3. నీచము.

ఖలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. కళ్లముల సమూహము; 2. ఖలుల సమూహము; 3. మురయనెడు గంధద్రవ్యము.

ఖలీనము. సం. వి. అ. పుం, న. గుఱ్ఱపుకళ్లెము, (రూ. ఖలినము.)

ఖల్య. సం. వి. ఆ. స్త్రీ. 1. కళ్లములసమూహము; 2. ఖలుల సమూహము.

ఖల్లము. సం. వి. అ. పుం. 1. తోలు; 2. పల్లము; 3. వస్త్రవిశేషము; 4. వానకోయిల.

ఖల్వాటుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) బట్టతలవాఁడు.

ఖసూచి. సం. విణ. ఇ. ప్రతిభలేనివాఁడు.

ఖస్థసము. సం. వి. అ. పుం. గసగసా.

ఖళూరిక. సం. వి. ఆ. స్త్రీ. సాముకూటము, గరిడీ.

## ఖా.

ఖాండవము. సం. వి. అ. న. ఇంద్రునియొక్క ఒకానొక వనము.

ఖాట్రి. సం. వి. ఇ. స్త్రీ. పాడె, (రూ. ఖాటిక.)

ఖాణము. వై. గ్రా. వి. గుఱ్ఱము మొదలగువానియొక్క యుంలవలులోనుగాఁగలభక్ష్యము. "క. వీణాక్షీనవ్వుడువెడనిం, గాణింగొనియలరుఁదూపుగమింఁజక్కెరయే, ఖాణముగాఁగలిగినఁ, ఖాణము దొరపింఱుపింఱుగాఁడఁగనేవాఁ." విజ. ౧, ఆ.

**ఖాతకము.** సం. వి. అ. న. అగడ్త, (రూ. ఖాతిక.)

**ఖాతము.** సం. వి. అ. న. పుష్కరిణి, కోనేఱు.

**ఖాతకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) 1. త్రవ్వెడువాఁడు; 2. అప్పుతీసెడువాఁడు.

**ఖాదకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) 1. తినువాఁడు; 2. అప్పు తీసెడువాఁడు.

**ఖాదనము.** సం. వి. అ. న. 1. తినుట; 2. తిండి; 3. పల్లు.

**ఖాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

**ఖాదిరము.** సం. వి. అ. పుం. కవిరియుండ.

**ఖాద్యము.** సం. వి. అ. న. తినఁదగినబండము. విణ. తినఁదగినది.

**ఖావందు.** హిం. వి. యజమాని, స్వంతగాఁడు.

**ఖాముఖా.** హిం. క్రి. విణ. అగత్యముగా, గట్టిగా.

**ఖాయము.** హిం. విణ. స్థిరము, శాశ్వతము, రూఢి.

**ఖారి.** సం. వి. ఈ. స్త్రీ. పుట్టి. ఇద్దుము. (అనికొందఱు.)

**ఖారీకము.** సం. విణ. (అ. ఆ. అ.) పుట్టెఁడు విత్తులు విత్తఁదగినది. (పొలము.)

**ఖాలీ, ఖాళీ.** హిం. విణ. ఆక్రమింపఁబడని, ఉత్త.

**ఖాసా.** హిం. విణ. స్వంత.

## ఖి.

**ఖిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) ఖేదమునొందినది.

**ఖిలము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దున్ననిది (నేల); 2. చెడినది. (దున్నని నేలయను నర్థమునందు నపుంసకమని కొందఱు.)

**ఖిలీభవించు.** సం. అ. క్రి. చెడు. "వ. ఉభయలోకమార్గంబును ఖిలీభవించుంగావున." కాశీ. ౫, ఆ.

## ఖు.

**ఖుద్దున.** హిం. క్రి. విణ. స్వంతముగా.

**ఖురణసుఁడు.** సం. విణ. (న్. అ. ఆ. అ.) బుఱ్ఱముక్కువాఁడు.

**ఖురము.** సం. వి. అ. పుం. 1. గొరిజ; 2. నఖమనెడు గంధద్రవ్యము.

**ఖురముఖము.** సం. వి. అ. న. బూరగొమ్ము.

**ఖురళి.** సం. వి. ఈ. స్త్రీ. సాము, (రూ. ఖురళిక.)

**ఖురాకము.** సం. వి. అ. పుం. మృగవిశేషము.

**ఖురాలకము.** సం. వి. అ. పుం. ఇనుపబాణము.

**ఖుర్దనము.** సం. వి. అ. న. క్రీడ, ఆట.

**ఖులాసా.** హిం. వి. సౌఖ్యము, నెమ్మది.

**ఖుల్లకము.** సం. విణ. (అ. ఆ. అ.) క్షుల్లకము, అల్పము.

**ఖుల్లను.** హిం. వి. వివరము.

## ఖే.

**ఖేంఖాణము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము.

**ఖేచరము.** సం. వి. అ. పుం. మృగవిశేషము.

**ఖేచరుఁడు.** సం. వి. అ. పుం. వేలుపు. విణ. ఆకాశమున సంచరించువాఁడు.

**ఖేటకము** సం. వి. అ. న. 1. డాలువాఱు; 2. గ్రామవిశేషము.

**ఖేటము.** సం. వి. అ. పుం, న. 1. పంటకాఁపులుండెడుపల్లె; వర్తకులుండెడుపేట. (అనికొందఱు.) 2. డాలువాఱు; 3. కఫము. విణ. అధమము.

**ఖేదము.** సం. వి. అ. పుం. శోకము.

**ఖేయము.** సం. వి. అ. న. అగడ్త. పుం. నీళ్లుపాఱుటకుఁగట్టిన అనకట్ట. "శ్లో. సేతుశ్చద్విప్రకారోజ్ఞేయఃఖేయోబద్ధస్తథైవచ, తోయప్రవర్తనాత్ఖేయోబద్ధస్స్యాన్నివర్తనాత్" అని నారదుఁడు. సం. విజ్ఞా. వ్య, కాం. వ్యాఖ్యానము.

**ఖేల.** సం. వి. ఆ. స్త్రీ. క్రీడ, ఆట.

## ఖై.

**ఖైదీ, కైదీ.** హిం. వి. చెఱలో నుంచఁబడినవాఁడు.

**ఖైదు, కైదు.** హిం. వి. చెఱ, కారాగృహము.

## ఖో.

**ఖోడుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కుంటివాఁడు.

**ఖోలకము.** సం. వి. అ. పుం. 1. కుల్లాయి; 2. పోఁకచిప్ప; 3. పుట్ట.

## ఖ్యా.

**ఖ్యాతము.** సం. విణ. (అ. ఆ. అ.) వాసికెక్కినది.

**ఖ్యాతి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి, వాసి.

## గ.

**గ.** ఒక యక్షరము.

**గంగ.** ఉభ. దే. విణ. 1. పూజ్యము; (గంగగోవు మొ.) 2. పెద్ద. (గంగరావి మొ.)—సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. (పంచగంగలు.—కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి. ఆకాశగంగమందాకిని, పాతాళగంగభోగవతి.)

**గంగడోలు.** దే. వి. ఆవులకును, ఎద్దులకును మెడక్రింద వ్రేలాడెడు తోలు, సాస్న.

**గంగమయిలావు.** య. వి. (గంగమయిల+ఆవు.) నలుపును పసుపునుగలసిన వర్ణముగల ఆవు.

**గంగమ్మ.** య. వి. (గంగ+అమ్మ.) ఒకానొక గ్రామదేవత, (రూ. గంగనమ్మ.)

**గంగరావి.** దే. వి. బ్రహ్మదారువృక్షము.

**గంగరేను.** దే. వి. పెద్దరేఁగు, లికుచవృక్షము.

**గంగాజలములు.** సం. వి. అ. న. బ. ధాన్యవిశేషము. "సీ. అర్థిఁబ్రయాగ గంగాజలంబులార్జింపనార్జింపఁగానోపమెట్లుగంగాజలంబులు." కవి. ౧, ఆ.

**గంగాధరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, మిన్నువాఁకతాలుపు.

**గంగాళము.** దే. వి. ఇత్తడి రాగిలోనగువానితోఁజేసిన నీళ్లకొప్పెర.

గంగి. దే. విశే. 1. పూజ్యము; (గంగెద్దు.) 2. యజ్ఞియము. "శా. అన్నా చెల్లెలనయ్యెదర్కెవిదుపునీకన్నంబుపెట్టింతునా, హ్వాన్నాథుల్కెద్విజగంగికుజ్జునకటాహింపసింపనేలయ్య." భాగ. ౯, స్క-౦ "గంగిగోవువంటిసాదుబాలపనికినినుజనునె పలువ యనఁగ." కళా. ౭, ఆ.

గంగెద్దు. దే. వి. (గంగి+ఎద్దు.) బిచ్చపుదానకులు శృంగారించి తీసికొనివచ్చెడి యెద్దు, (రూ. గంగిరెద్దు.)

గంజ. సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లమ్మెడియిల్లు; 2. గని. (ఒకానొక కవి గంజాపోలలుపాంశునభుజించియని ప్రయోగించియున్నాఁడు. అక్కడ గంజాశబ్దమునకు గంజాయి యర్థమగుచున్నది. అది విచారణీయము.) అ. పుం, న. ము. బండారము. పుం. తిరస్కారము.

గంజి. వై. వి. అన్నరసము*.

గంజిగుల్ల. వై. వి. నీటిబుగ్గవలె లేచెడి బొబ్బ.

గంజితోరక. ద్వి. వి. గంజిమీఁది మీఁగడ.

గంజె. దే. వి. కృషికి యోగ్యమైన భూమి.

గంజెనగాలు. ద్వి. వి. బాలక్రీడావిశేషము. "గంజనగాలన ఖంజపాదక్రీడగాఁజెలంగు." ఆం, భా. ద్వి. కూ.

గంజాయి. వై. వి. కైపుపుట్టించునట్టి యొక వస్తువు, కళంజము. "ద్వి. గంజాయితినెనేమి కలుద్రావెనేమి, యంజకధనమిచ్చునతఁడెనామెచ్చు." హరిశ్చ. ౨, భా.

గంజో. దే. వి. బజారు. (అప్ర.)

గంట. యు. దే. వి. గడ్డిదుబ్బు, తృణస్తంబము. వై. 1. వాద్యవిశేషము; 2. కాలవిశేషము.

గంటకట్టు. దే. అ. క్రి. గంటయేర్పడినదియగు.

గంటము. దే. వి. తాటాకు వ్రాయుటకు నుపయుక్తమైన యుక్కుసాధనము.

గంటలమ్మ. వై. వి. (గంటల+అమ్మ.) ఒకానొక గ్రామదేవత.

గంటవేఁట. ద్వి. వి. వేఁటలో భేదము. (చూ. పదువేఁట.)

గంటి. దే. వి. 1. గాయము, క్షతి; "సీ. వినుమొక్కనాఁడత్తపస్విక్రేల్మాటిదర్భ, గంటిఁగూరయసరుగాఁజినసర్తించె, నతఁడు తపముసిద్ధికాత్మఁబొంగి." సం. "క్షతేకిలకరేరాజ్ఞ స్తస్యశాకరసోద్రవత్." భార. శల్య. ౨, ఆ.—2. ధృఖము. "శరల. చిలువతెంకిమెకంబు చెట్టనిచెప్పుకొందురుకల్లయూ, పొలఁతినెమ్మొగముం గడంకకుఁ బోలఁజాలక నెమ్మదిన్, గలఁగిచుక్కలరాయఁడెంతయుగంటివెల్వెలఁబాఱెఁగా, కలరువిల్తునిమేనమామకు నయ్యకాకొదగల్గునే." యు. ౪, ఆ.

గంటు. దే. స. క్రి. గాయముచేయు. "ఉ. వేదుణుగొన్న మానవుని వేమఱుగంటియు బిట్టుకాల్చియున్, మోఁదియునీటఁద్రొక్కియునుమున్నొకనితీర్పఁగడంగువెజ్జునట్లు." లక్ష్మీ. ౫, ఆ.—వి. 1. గనుపు; "సీ. కన్నుకనుపు గంటు గను వంచనఁగఁ బర్వమమరు." ఆం, భా. ద్వి. వ.—2. ముడి; 3. రూకలముడి; 4. వెంద్రుకలముడి.

గంటుబారంగి. ద్వి. వి. ఒకానొక మందుచెట్టు.

గంటువెట్టు. దే. స. క్రి. (గంటు+పెట్టు.) (కోపముచే మొగము) ముడుచు. "వ. అనియాడిమొగంబుగంటువెట్టుకొనియున్న మరదినందనుదిక్కుమొగంబై." భార. ఉద్యో. ౪, ఆ.

గంటె. దే. వి. 1. గరిటె; 2. పజ్జపైరు. బ. పజ్జలు.

గంటెకాసు. దే. వి. ఒకానొకచెట్టు.

గంట్లకచోరము. ద్వి. వి. షడ్గంధికి*.

గంట్లకానుగు. దే. వి. షడ్గంధము*.

గంట్లము. దే. వి. గర్భిణులకోరిక, దోహదము. "సీ. పూలలేనెల యందుఁజూలాలిగోర్వంకపెండుగంట్లంబులుపెట్టిపెట్టి." యు. ౪, ఆ.

గండ. దే. వి. మ్రుక్కుబడి. (గండదల, గండదీపము మొ.)

గండఁడు. వై. వి. శూరుఁడు. "గండఁడుశంభుఁడు." పర. ౪, ఆ.

గండకత్తెర. వై. వి. మెడ కత్తిరించుకొనెడి యొకవిధము కత్తెర. "ద్వి. దండిపెద్దలమనోధైర్యంపులతకు, గండకత్తెరలీనికలికివాల్చూపు." విష్ణు. ఉ. ౪, ఆ.

గండకము. సం. వి. అ. పుం. 1. ఖడ్గమృగము; 2. జోస్యము; 3. భేదము; 4. విఘ్నము; 5. సంఖ్యావిశేషము.

గండగొడ్డలి. వై. వి. పరశువు. "సీ. పులులమొత్తంబుల బోనులఁ జొరఁదోలిగండగొడ్డండ్లచేఁజెండిచెండి." రసి. ౧, ఆ.

గండగొడ్డలితాలుపు. ద్వి. వి. పరశురాముఁడు.

గండడఁగు. ద్వి. అ. క్రి. (గండు+అడఁగు.) 1. పరాక్రమహీనుఁడగు; "చ. పగతుండుగండడఁగికాతరభావమునెమ్మనంబునన్, దనికినసర్వయత్నములుదక్కినృపాలవముత్కరంబుతోన్. వ. సేనాసముదయంబులనెల్ల దివియించుకొనినిస్తేజండైతనవచ్చిన త్రోవనగిఁజె." హరి. ఉ. ౨, ఆ.—2. చచ్చు. "చ. సమధికకాలనేమిగుణశాలిబినీవుదరస్థలోకనం, ఘములకుఁగీడొనర్తువనికైటభదానవభేదియంతరం, గములెవెడలించెఁగాని నినుగండడఁగించకపోయె నిందిరా, రమణిఁదలంచిరాత్రిచరర్గానిమగన్నులకేడధర్మముల్." వసు. ౪, ఆ.

గండదల. దే. వి. "మునుబావమఱఁదులిమ్ములనంబికకుగండదల లియ్య." భో. ౫, ఆ. (చూ. గండ.)

గండపెండరము. ద్వి. వి. గండపెండారముయొక్కరూపాంతరము. "సీ. పొనఁగనొదలలపాన్పుమిడికమ్ములుపూని డాకాల గండపెండరముమర్చి." అచ్చ. యు, కాం.

గండపెండారము. ద్వి. వి. (గండఁడు+పెండారము.) శూరులు బిరుదుగా కాలనుధరించెడి యందియ. "సీ. కడుమించు డాకాలిగండపెండారంబుమెల్లనవదలించెమెలఁతయొకతె." యు. ౪, ఆ.

గండభేరుండము. సం. వి. అ. పుం. పక్షివిశేషము. (పక్షివిశేషమని చెప్పుచున్నారుగాని ప్రయోగములయందు మృగపర్యాయములతోఁడ జేర్చి చెప్పఁబడియున్నది.)

గండమాల. సం. వి. ఆ. స్త్రీ. మెడచుట్టు గడ్డలులేచెడు వ్యాధివిశేషము.

గండము. సం. వి. అ. పుం. 1. పీసఁగు చెక్కిలి; 2. చెక్కిలి; 3. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 4. ఖడ్గమృగము; 5. సంద్రాయి; 6. గుఱుతు; 7. గుజ్జుపుసొమ్ము; 8. పుండు; 9. పొక్కు; 10. నీటిమీఁది బుగ్గ.

గండరగండఁడు. వై. వి. శూరులకెల్ల శూరుఁడు.

**గండరించు.** దే. అ. క్రి. పుట్టు. "ఎ, గీ. ప్రళయకాలానల మున, గండరించిన రూపంబు కరణిభీమ, దతిభయంకరాకారత నతిశయిల్లె." భార. విరా. ౨, ఆ.—అం. ప్రే. పుట్టించు. "సీ. నవకల్పలతికలనవకంబునాతిగా శ్రీనందనుఁడు గండరించినట్లు." మార్క. 3, ఆ.

**గండరులు.** వై. వి. బ. తునుకలు.

**గండవుపు.** దే. వి. పడియచ్చు. "చ. కరువుననభోసిరో విధుని కాంతి సుధాబ్ధితరంగఁదెచ్చిగం, దరువొనరించిరో." భార. అను. ౧, ఆ.

**గండపడము.** వై. వి. తెర. "క. ఉండిరికాంతయుఁబతియును, గండపడముమాటునందుఁగడునింపులతో, నిండినవేడ్కలతనరఁగ, నొండొరులం జూడఁగన్నులువ్విళులూరన్." హం. ౭, ఆ.

**గండశైలము.** సం. వి. అ. పుం. 1. కొండనుండి జాఱిపడిన పెద్దఱాయి; 2. కోయిల; 3. నొసలు.

**గండాడు.** దృ. అ. క్రి. (గండు+ఆడు.) రమించు. "క. చండాలితోడ్వెఱుండొగి, గండాడినవక్షము నధగము వ్రాసితగన్, దండుపుగొని దేశంబున, నుండకయుండంగనడుచు టుచితము పతికిన్." విజ్ఞా. ప్రా, కాం.

**గండారు.** దే. వి. చెఱసాల. "పచ్చగండార్లలో." య. ౪, ఆ.

**గండాలి.** సం. వి. ఈ. స్త్రీ. తెలగఱిక.

**గండి.** వై. వి. 1. బిలము*; "ఉ. సన్నపుగండియొక్కటిరసాతల మార్గముఁబోలెనిమ్మై, యున్ననదండుకుంభిబెలినుండఁగఁదాన నహోయనూరుదై, మిన్నకయుందుఁజొచ్చినిమేడలఁజారునికేత నంబులన్, జెన్నుగనొక్కప్రోలుగనిచేరఁగఁబోవఁగనందులోప లన్." భో. ౫, ఆ.—2. రంధ్రము*; "చ. భుజంగులపృథ యస్థలుల్ వాడిచికొంచకతోడనపోటుగండ్లదూ, ఱెలలనయౌర యొక్కొకతఱంబుఁబోండ్లుకటారికత్తియల్." కళా. ౧, ఆ.—3. సందు*; "గండిగాంచినరుతేరిపథంబునఁబోయిరేపునన్." భార. ద్రో. 3, ఆ.—4. నీళ్లధికముగావచ్చుటచేతఁ దెగిన చెఱువు కట్టనందు*.

**గండికి.** వై. వి. గండియొక్కరూపాంతరము.

**గండిదొంగ.** దృ. వి. కన్నపుదొంగ, ఖనకుఁడు.

**గండివనము.** వై. వి. గ్రంథిపర్ణము†.

**గండీరము.** సం. వి. అ. న. చిట్టీకూర. పుం. 1. పేఱువంగ†; 2. తురుజకూర.

**గండీరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చిట్టికూర; 2. ములుకెముడు†.

**గండు.** వై. వి. 1. పౌరుషము*; 2. బలము*; 3. పశుజాతి యందు మగది*. "క. ఒడలుబ్బనిక్కిముందటి, యడుగులుధర నూదిచిందునలబలమునకున్, జడియకొకొగబ్బిగండై, క్కడుకడి మిం దివిచెఁగ్రుంగికొమ్ములయుడుముల్." హం. ౪, ఆ.

**గండుఁడు.** సం. వి. అ. పుం. శూరుఁడు.

**గండూపదము.** సం. వి. అ. పుం. కించులికము, ఎఱ్ఱ.

**గండూపది.** సం. వి. ఈ. స్త్రీ. ఇలి, ఆఁడుఎఱ్ఱ.

**గండూషము.** సం. వి. అ. పుం. 1. పుక్కిలింత; 2. పుడి కిలి; 3. తొండముచివర.

**గండూషించు.** సం. స. క్రి. పుక్కిలించు.

**గండె.** వై. వి. చేప. "గీ. తొనుసురమానినృపతనుల్ దాల్చియకట, కామినీతతినడికించుకంతెనట్టె, గండెయును । నల్లదాఁటరిగాఁడుఁ గిరియు, హరియునైపోవుటయెమంచిదనుయుగంబు." ఆము. ౫, ఆ.

**గండోలము.** సం. వి. అ. పుం. కుచ్చులమీను.

**గండోలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱతుమ్మెద; 2. కఱుదుర్వీగ, (రూ. గంధోలి.)

**గండ్ర.** యు. దే. విశ. 1. ధృష్టుఁడు; 2. పెద్దది. (గండ్రచీమ ము.) బ. పరుషము. "శా. తండ్రినాఖునను గ్రహింపఁగదైద్యంబంచుఁబ్రార్థించినన్, గండ్రల్ గానటులాడిధిక్కృతులఁబో కాల్గంటివి." స్వా. ౫, ఆ.—వై. వి. ఖండములు. "ఉ. అక్తటి నమ్ముకుందుఁడు తదక్షసహస్రశరాననంబులన్, గత్తిమొగంపుటమ్ము లను గండ్రలునేయుచు" అని. ౪, ఆ.

**గండ్రచీమ.** దే. వి. పెద్ద నల్లచీమ, ఉలంగవము.

**గండ్రించు.** వై. స. క్రి. ఖండించు. "వ. గండగొడ్డండ్లగం డ్రించినఁగిలెడసినజంత్రంబులక్రియ." కవిక. ౨, ఆ.

**గండ్రికలు.** వై. వి. బ. ఖండములు. "గండ్రికల్ చేసినేలన్ నిం డించెదుష్పులన్." య. ౨, ఆ.

**గంత.** ఉభ. వై. వి. 1. మెత్తగాఁ బఱచుకొనుటకై ప్రాఁతగుడ్డలను జేర్చి దట్టముగాఁగుట్టిన బొంత*; "ఉ. గ్రుచ్చినరత్నరాజిరుచి గుచ్ఛములుంబలుపన్నెపట్టునూల్, కుచ్చులుగల్గియొప్పుతనకుచ్చులి గంతయు." వర. ౧, ఆ.—2. ఎద్దులోనగువానిమీఁదవేసెడు గంత*.—సం. విశ. (ఋ. ఈ. ఋ.) పోవువాఁడు.

**గంతవ్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పోఁదగినవాఁడు.

**గంతు.** దే. వి. దుముకు. "ఓరినీగంతులడంగిపోవ." రా. యు, కాం.

**గంతుకొను.** దే. అ. క్రి. 1. దుముకు; "వ. ఇక్కడవచ్చి యేమేమి దురుక్తులాడెడినో చూచెదంగాక యనుచునొక్కొఖకుగం తుగొని." రా. సుం, కాం.—2. చచ్చు. "మ. కడసెకాదుష్పులు డింకవేసెనెలుఁగుల్ గిట్టెంబులుల్ సింగముల్, కడగొట్టేకామనుఁ బిట్లగంతుకొను." హ. ౧, ఆ.

**గంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. గాడీబండి.

**గందపట్టె.** వై. వి. తలుపుమీఁదనమర్చెడి యడ్డుకొయ్య. "మ. శమగాంభీర్యధృతిక్షమార్జవదయాశౌర్యప్రమోదాదికో, త్తమనానా గుణరత్నకోశనిలయోద్యత్కాంచనద్వారబం, ధమహాస్తంభధనాన బాహుఁడగునాధాత్రీశువక్షఃకవా, టముపైనెప్డాకొగందపట్టెగతి నుండన్ నాదుకేల్ సేర్చుటల్." కళా. ౭, ఆ.

**గందపుఁగొండ.** వై. వి. (గందము+కొండ.) మలయపర్వతము. (ఇట్లు గంధపుమల ము.)

**గందపుమ్రాను.** దృ. వి. (గందము+మ్రాను.) చందనవృక్షము.

**గందపొడి.** దృ. వి. (గందము+పొడి.) కొన్ని గంధద్రవ్యములఁ జేర్చి చేసిన పొడి, చూర్ణము.

**గందము.** వై. వి. చందనము*.

**గంధకము.** సం. వి. అ. పుం. అంగడి మందుదినుసు.

**గంధకారి.** సం. వి. ఈ. స్త్రీ. ముదుఁగుఁదామర†.

**గంధకుటి.** సం. వి. ఈ. స్త్రీ. మురయనెడు గంధద్రవ్యము†.

**గంధగజము.** సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

**గంధగర్భము.** సం. వి. అ. పుం. కొండమారెడు†.

**గంధనము.** సం. వి. అ. న. 1. ఎఱిఁగించుట; 2. నలుగిడుట; 3. నొప్పించుట; 4. వెలిఁగించుట.

**గంధనాకులి.** సం. వి. ఈ. స్త్రీ. నర్పాక్షీతీ.

**గంధపిండీతకము.** సం. వి. అ. పుం. వెలితీ.

**గంధఫలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రేంకణముతీ; 2. సంపెఁగ మొగ్గ, (రూ. గండఫలి.)

**గంధమాదనము.** సం. వి. అ. పుం. 1. ఒకానొక కొండ; 2. ఒకానొక కోఁతి; 3. మగతుమ్మెద; 4. మదపుటేనుఁగు.

**గంధము.** సం. వి. అ. పుం. 1. వాసన; 2. గంధకము; 3. గర్వము; 4. లేశము; 5. సంబంధము.

**గంధమూలము.** సం. వి. అ. పుం. 1. అడవికచోరముతీ; 2. కొండవెండతీ.

**గంధమూలి.** సం. వి. ఈ. స్త్రీ. గంట్లకచోరముతీ.

**గంధమూషి.** సం. వి. ఈ. స్త్రీ. చుంచు, చుచుందరి.

**గంధమృగము.** సం. వి. అ. పుం. పునుఁగుపిల్లి.

**గంధరసము.** సం. వి. అ. పుం. బోళము, గోపము.

**గంధరాజము.** సం. వి. అ. పుం. ఒకానొక గంధద్రవ్యముతీ.

**గంధర్వము.** సం. వి. అ. పుం. 1. మృగవిశేషము; 2. గుఱ్ఱము; 3. అంతరపిశాచము; 4. మగకోయిల.

**గంధర్వహస్తకము.** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

**గంధర్వుఁడు.** సం. వి. అ. పుం. 1. దేవయోనివిశేషము; 2. పాటపాడువాఁడు.

**గంధవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కల్లు; 2. వ్యాసునితల్లి; 3. నేల; 4. ఒకానొక పట్టణము.

**గంధవహ.** సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.

**గంధవహుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, గాలి, (రూ. గంధవాహుఁడు.)

**గంధసారము.** సం. వి. అ. పుం. చందనము, గంధము.

**గంధాఖువు.** సం. వి. ఉ. పుం. గంధమూషి, చుంచు.

**గంధాశ్మము.** సం. వి. న్. పుం. గంధకము.

**గంధిక.** సం. వి. ఆ. స్త్రీ.———వై.———

**గంధిని.** సం. వి. ఈ. స్త్రీ. మురయనెడి గంధద్రవ్యముతీ.

**గంధిలము.** సం. వి. అ. పుం. పెద్దజాతినక్క, వఱడు. విశ. వాసనగలది.

**గంధోత్తమ.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము, కల్లు.

**గంప.** దే. వి. వెదురుబద్దలుతోనగువానితో నల్లినది, కండోలము.

**గంపపులుఁగు.** దే. వి. కుక్కుటము.

**గంబుర.** వై. వి. కర్పూరము. "ఉ. కారుమెఱుంగురాచిలుకకస్తురి మీఁటవదాఱువన్నెబం, గారమురస్తుకుప్పెతెలిగంబురవెన్నె లమేటి కేటయొ, య్యారపుటెంకియందములకన్నిటికిం దగువట్టుగొమ్మనిం, గారపుదొంతియైనతలకాంతనయోయొడఁబాయనేర్తునే." శుక. ౧, అ. (రూ. గంబురము.)

**గంబురా.** వై. వి.———వై.——— "సీ. గంబురామించఁగదం బించికొందఱుతలికిన్నియలుబాగాలొసంగ." భాను. ౨, అ.

**గంబూర.** వై. వి. కర్పూరము. "క. గంబూరకులికెయుకురా, గంబూరమనంబుచల్లఁగాఁబన్నటకా, బింబోష్ఠియళసిపాదా, బ్జం బుంగడిగించెఁగూర్చితిశయలచేతకా." సా. ౨, అ. (రూ. గంబూరము. "సీ. తావిగంబూరంపుఁదీవిసిమొగమొక్క-పలుకింత నాపయిఁజిలుకరాదె." వసు. ౬, అ.)

**గంభారి.** సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడుతీ.

**గంభీరము.** సం. విశ. (అ. ఆ. అ.) లోఁతుగలది.

**గంభీరవేది.** సం. వి. న్. పుం. తోలుదోఁగునట్లును నెత్తురుకాఱునట్లును కండయూడునట్లును బరిగోలలతోడను అంకుశములతోడను పొడిచి యెంతబాధపెట్టినను ఒళ్లెఱుఁగకుండునట్టి మదపుటేనుఁగు.

**గంభీరిమ.** సం. వి. న్. పుం. గంభీరభావము.

**గగనము.** ఉభ. వై. విశ. దుర్లభము*. "సీ. గగనఘంటాపథ క్రమణశీలునకెంత గగన మయ్యె అతొంగికొనుచదలు." వసు. 3, అ.—సం. వి. అ. న. ఆకాశము.

**గగురు.** దే. వి. భయహర్షాదులచేత మేనివెంట్రుకలు నిక్కపొడుచుట, రోమాంచము.

**గగురుపాటు.** ద్వ. వి. రోమాంచముకలుగుట.

**గగురుపు.** దే. వి. రోమాంచము. (రూ. గగుర్పు. "గగుర్పు కూర్పు." చంద్ర.)

**గగురుపొడుచు.** దే. అ. క్రి. రోమాంచితమగు.

**గగురుపొడుపు.** దే. వి. గగురుపాటు. (రూ. గగుర్పొడుపు. "సీ. మొగలిపూఁబొదలు మోమునఁజేర్చుచీరగాఁబూరిమోపులు గగుర్పొడుపుగాఁగ." అచ్చ. కిష్కి౦, కాం.)

**గగ్గు.** యు. దే. అ. క్రి. సంకోచించు. వై. వి. సంకోచాదులచేతఁ గలిగెడుగొంతుడుపు, గద్గదిక. "సీ. గగ్గునావెలయుగద్గదిక." ఆం, భా. ప్ర. శ.

**గగ్గురు.** దే. వి. గగురుయొక్కరూపాంతరము.

**గగ్గులకాడు.** దే. వి. ధాన్యమురాల్చిన కంకులసమూహము. "క. సిగ్గువడివిరియఁబాటిరి, బగ్గనఁబొరిపుచ్చువీరభద్రునిఘాటికా, నుగ్గు లయియుపురునవురయి, గగ్గులకాడైవికావికలయియమర్త్యుల్." కాశీ. ౭, అ. (ఇత్యాది ప్రయోగములయందు గగ్గులకాడై అనఁగా గగ్గుల కాటివంటిదైయనుట. నిస్సారమై అని యర్థము.)

**గగ్గులు.** దే. వి. బ. గింజలురాల్చిన కంకులు. (గగ్గులు జల్లలో పోసి తీసికొనిరా.)

**గగ్గెర.** దే. వి. ఒకానొకచెట్టు. (ఇది తెల్లగగ్గెర, నల్లగగ్గెర అని ద్వివిధము.)

**గగ్గోలు.** దే. వి. కలత, క్షోభము. "గీ. అపుడుకొందఱుమృగ యులయ్యడవిఁదూటి, ఘూరముగనెల్లకడలుగగ్గోలుగాఁగఁ, గూత లిడినొంపుటయుమృగకులముకలఁగి, బయలు వెడలినఁగాంచియ ప్పార్థివుండు." రసి. ౧, అ.

**గగ్గోలువడు.** ద్వ. అ. క్రి. (గగ్గోలు+పడు.) కలఁగు, క్షోభించు. "ద్వి. వీనొక్కరుండనన్నీటఁదోడొకరిఁ, గానకబెగడినల డలుచూచుచును, బడలుచుగగ్గోలువడిమోరటిలుచు." విష్ణు. పూ. 3, అ.

**గచ్చ.** దే. వి. గ్రచ్చకు మొదటిరూపము.

**గచ్చు.** యు. దే. వి. 1. కాంతి; "క్రాలెడు పచ్చపట్టు నును గచ్చులక్రొమ్మెఱుఁగైదలింప." పారి. పూ. ౬, అ.—2. పూఁత; "చ. ఇలఁగలవస్తుసంతతులకెల్లను గచ్చిడుమట్టివిఖ్యాతపా, టల

రుచియింకవేఱయొకడాలిఁకవచ్చునెలక్కనీటమమ్మలమిన." ఆము. ౫, ఆ.—3. సారపూరఁ. "పసిఁడిగచ్చరఁగు." ఆము. ౪, ఆ.—వై. విశే. వర్ణలోపముగాని, పదలోపముగాని కలిగినది. (మాట.) "సీ. గచ్చుకొదుకునాఁగగ్రస్తాఖ్యవిలసిల్లు." ఆం, భా ప్ర. వాగప.

**గచ్చుకొను.** దే. స. క్రి. పట్టుకొను. "క. ఉచ్చైశ్రవమగు నసపై, విచ్చలవిడిసెక్కరౌతు వృద్ధశ్రవుఁడై, హెచ్చెసనివేల్పు రేఁడం, గచ్చుకొనిహసించులీలఁగల్గుహయంబుల్." చమ. ౧, ఆ.

**గచ్చెలాఁడి.** దే. వి. (గచ్చులు+ఆఁడి.) బయటికి యోగ్యురాలి వలె నటించునట్టి ఆఁడుది.

**గచ్చెవిచ్చెగు.** దే. అ. క్రి. (గచ్చువిచ్చు+అగు.) (కార్య) వైకల్యమగు. "గీ. ఆఱుమూడయ్యెగచ్చువిచ్చయ్యెననఁగ, బెడసి బుసివోయెననఁగనుజెడియెననఁగ, నాఖ్యలగుకార్యవైకల్యమయ్యె ననుటకు." ఆం, శే.

**గజకర్ణము.** సం. వి. అ. పుం. ఏనుఁగు చెవివంటి యొకదినుసు విసనకఱ్ఱ.

**గజత.** సం. వి. ఆ. స్త్రీ. గజసమూహము.

**గజదంతము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

**గజనిమీలనము.** సం. వి. అ. న. కపటము.

**గజభక్ష్య.** సం. వి. ఆ. స్త్రీ. అందుగు¶.

**గజము.** సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; (గజజాతులుమూఁడు. భద్రము, మందము, మృగము అని. త్రివిధగజములకును మాన భేదముచే అరాళము, అత్యరాళము, మధ్యము, కనిష్ఠము, వామ నము అని నామములుగలవు. మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాతృకము, మాయుకము, పంచమంగళము అని గజ భేదములనేకములు కలవు. గజముయొక్క శిరఃపిండములు కుంభ ములు. కుంభముల క్రిందిచోటు ఆరక్షము. వానినడిమిచోటు విదువు. చెక్కిలి కటము. నొసలు అవగ్రహము. కనుగ్రుడ్డు ఈషిక. కడగంటిచోటు నిర్యాణము. కర్ణమూలము చూళిక. దంత మూలము కరీరిక. దంతమధ్యము శంఖము. అడ్డముగా విసరఁబడిన కొమ్ముదెబ్బ పరిణామము. నొసటిబుడిపివాతకుంభము. వాతకుం భము క్రిందిచోటువాహిత్థము. వాహిత్థము క్రిందికొమ్ములతోవలి చోటు ప్రతిమానము. తొండము శుండ. తొండముచివరకర్ణిక. తొండమున వచ్చు తుంపురులు వమథువు. ముఖమునందలి బొట్ల గుంపు పద్మకము. మూఁపు ఆసనము. మోఁకాలు ప్రోహము. మోఁ కాలి క్రిందిచోటు సందానము. పిక్కకుముందటిచోటు అయస్కా రము. ప్రక్కచోటు పక్షభాగము. ముందటిచోటు దంతభాగము. ముందటికాళ్ల పిక్కలు మొదలుగాఁగలచోటు గాత్రము. వెనుకటికాళ్ల పిక్కలు మొదలుగాఁగలచోటు అవరము. మెడనుగట్టెడుగొలుసు కలాపకము. కాళ్లఁగట్టెడుగొలుసు త్రిపది. నడుమునఁగట్టెడు మోకు వరత్ర. దీనిని అయితముసేయునపుడు మెడనుగట్టెడుత్రాడు కజ్జిన. వీఁపుమీఁదఁబఱచుకంబళము విధానము. గంత శారి. ఇది నీళ్లమునుఁగుట నిర్వాణము. దీని అలంకారము శృంగారము. దీనిఁ బట్టుటకుత్రవ్వెడుపల్లము అవపాతము. దీనికిఁ గలిగెడు పిత్తజ్వ రము పాకలము. మదము దానాది. దానాదులు. ౘ, చూ. మద ము.)—2. మూఁడడుగులకొలఁది; 3. వాస్తుస్థానవిశేషము.

**గజయాన.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగునడవంటినడగల ఆఁడుది; 2. ఆఁడుది. (ఇట్లు ఇభయాన మొ.)

**గజరిపువు.** సం. వి. ఉ. పుం. సింహము, ఏనుఁగుగొంగ.

**గజాననుఁడు.** సం. వి. అ. పుం. వినాయకుఁడు, ఏనుఁగుమోము సామి.

**గజిబిజి.** దే. వి. 1. కలఁత; "క. గజదైత్యుఁడివ్విధంబున, గజి బిజిసేయంగఁగాశికానగరమునన్, బ్రజనిత బయకంపమునన్, బ్ర జతామరపాకునీళ్లభంగిఁదలంకెన్." కాశీ. ౬, ఆ.—2. నలఁగు డు; "సీ. రాజితబహువిధరథసమూహముఁజొచ్చిగజిబిజియగు నట్లుకలఁచికలఁచి." భార. విరా. ౫, ఆ.—3. సందడి. "వ. అయ్యవసరంబునఁగలా పూర్ణుండుతదాగమనంబునకెదురుచూచు చుండివారిగజిబిజికొంత చేరువనువినంబడిన." కళా. ౭, ఆ.— విశే. 1. కలఁగినది; 2. నలఁగినది.

**గజిబిజించు.** దే. అ. క్రి. కలఁగు. "వ. అట్టియెడఁదదీయ సైన్యంబు గజిబిజించిన." ఉ, హరి. 3, ఆ.

**గజ్జి.** వై. వి. తీఁటకుఱుపు, కచ్చువు.

**గజ్జియ.** దే. వి. గజ్జె.

**గజ్జె.** దే. వి. కింకిణి. (గజ్జియయొక్క రూపాంతరము.)

**గజ్జెగొలుసు.** ద్వ. వి. స్త్రీపాదాభరణవిశేషము, పాఁజేబులు.

**గజె.** వై. విశే. పెద్ద*. (ఉదా. గజనిమ్మ.)

**గజెగజె.** దే. వి. వడఁకుటయందగుననుకరణము. "గీ. వానఁదడి యుచుగజగజవడఁకుచున్న, సుతసతీమానిపుత్రులఁజూచివగచి." హరిశ్చ. 3, ఆ.

**గజెనిమ్మ.** ద్వ. వి. లకుచము¶.

**గజెము.** దే. వి. తుపాకికి మందుగట్టించెడి యినుపసలాక.

**గజ్జె.** దే. వి. తొడసందు, వంక్షణము.

**గజ్ఝె.** వై. వి. మదము*. "ఎ, గీ. కాలకంధరవాహంబుగజ్ఝెరేఁగె." పాండు. ౪, ఆ.

**గజ్జెరము.** వై. వి. ఖర్జూరము¶.

**గటక.** దే. వి. పిండితోఁజేసినజావ.

**గట్ట.** వై. వి. సిద్దెనోటికివేసిగట్టించెడు బిరడ.

**గట్టన.** వై. వి. గట్టించుట. (గులకపోసి గట్టనచేసినాఁడు.)

**గట్టి.** దే. విశే. 1. కఠినము; 2. దృఢము; 3. ఉచ్చైర్నాదము కలది. (వాఁడు గట్టిమాటాడుఁడు.)

**గట్టించు.** వై. స. క్రి. గట్టనచేయు.

**గట్టినబోది.** దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. చిడుగుడువ్వఁ పోటిచెండుగట్టినబోదియల్లియుప్పనఁబట్టెయప్పళాలు." కాశీ. 3, ఆ.

**గట్టివ.** ద్వ. విశే. (గట్టి+వా.) ధూర్తుఁడు. "ఉ. గట్టివచేఁతలుఁ బసలుఁగల్లఁదనంబులు నీవుపుట్టఁగాఁ, బుట్టినవెందులేని పలుఁబో కల మాయలునీకువెన్నతోఁ, బెట్టినవౌటెఱంగియును బేలతనంబునఁ నిన్నునమ్మినా, గుట్టునుదేజముఙ్మిగులఁగోల్పడిపోయితి నేమి సేయుదుఙ్." పా. ౧, ఆ.

**గట్టివా.** ద్వ. విశే. 1. గట్టిగ మాటలాఁడువాఁడు, గట్టిగ మాటలాఁడునది; "తే. తవిలిపలుమఱుఁజెవులుచీఁదఱగొనంగ, బిట్టు మొఱసెదు వనత్రాగినట్టులిట్టు, గట్టివాజోడలెట్టుగాఁ బట్టువడియె. బెట్టుగానిన్ను వెసఁజెఱఁబట్టియిడను." నీలా. 3, ఆ.—2. ధూర్తుఁడు, ధూర్తురాలు. "గట్టివాయొక్కతె." ఉ, రా. 3, ఆ. (గట్టివకు మొదటిరూపము.)

**గట్టివాఁడు.** దే. విశే. సమర్థుఁడు. (మహత్వమహదర్థకరూపము గట్టిది.)

**గట్టివాయి.** ద్వ. విశే. గయ్యాళి, ధూర్తురాలు.

**గట్టు.** వై. వి. 1. తీరము; 2. కొండ.*

**గట్టుఁద్రిమ్మరి.** ద్వి. వి. (గట్టు+త్రిమ్మరి.) కోఁతి, అగచరము. "అగ్గట్టుం ద్రిమ్మరి మొనకానిఁబట్టితెచ్చెద." అచ్చ. సుం, కాం. (ఇట్లు తిప్పత్రిమ్మరి, మలత్రిమ్మరి మొ.)

**గట్టుతాలుపు,** ద్వి. వి. విష్ణువు, నగధరుఁడు.

**గట్టుదాయ.** వై. వి. ఇంద్రుఁడు, నగవైరి.

**గట్టువాలు.** ద్వి. వి. సైరంధ్రి. (పర్వతమువలెఁ బ్రవర్తించునది– అనఁగా పురుషసాంగత్యముఁగోరక ధైర్యముతో నుండునదియని వ్యుత్పత్త్యర్థము.)

**గట్టురాచూలి.** ద్వి. వి. పార్వతి, గిరిజ.

**గట్టుల ఱేఁడు.** ద్వి. వి. హిమవంతుఁడు, నగాధిపుఁడు. (ఇట్లు గట్టులరాయఁడు, గట్లరాయఁడు మొ.)

**గట్టువాలు.** దే. వి. విచ్చలవిడియై యొకరియిండ్లనుండి శృంగారించుటలోనగు పనులుచేయునట్టి ఆఁడుది. "మ. రాజెలమిఁ దెచ్చిన గట్టువాలిదియనన్ హృద్యక్రియావిద్యఁజే, తలనైయుండుదు." హరి. పూ. ౯, ఆ.

**గట్టువిలుకాఁడు.** ద్వి. వి. శివుఁడు, శైలధన్వుఁడు. (ఇట్లు గుబ్బలివిలుకాఁడు మొ.)

**గట్టువిలుతుఁడు.** ద్వి. వి.——పై.——(ఇట్లు మలవిలుతుఁడు మొ.)

**గ్రట్రాచూలి.** ద్వి. వి. గట్టురాచూలియొక్క రూపాంతరము. "శా. ఎట్రాశేషుఁడుపోతరించినభలో నెగ్గాడెనారత్నమీఁ, డట్రా వాసుకితక్షకాదిధృతరాష్ట్రామాత్యకర్కోటకుల్, చట్రానిల్తురుగాక నన్ను సమరక్షోణిన్ విజృంభించియా, గట్రాచూలి విభుండెదిర్చిన నహంకారంబు వారించెదన్." జై. ౭, ఆ.

**గడ.** వై. వి. 1. నిడుపాటికోల; (ఏతపుగడ, చెఱకుగడ, వెదురుగడ, దొమ్మరిగడ మొ.)—2. సమూహము; "సీ. మక్కువఁదేఁకువదక్కులోఁదవిలియాడెడుచక్రవాకపుగడలతోడ." నిర్వ. ౮, ఆ.—3. ఓడకంబము*; "క. గడకట్టినయోడపగిది, నడయాడుఁ గ్రియాభియుక్తుఁడటనిష్క్రియుఁడై, యొడిసెలఱాయిపడినకయి, వడిఁదత్త్వముఁ గలయుబంధువర్గముతోడన్." శివ. ౩, ఆ.—4. కంబము*. "సీ. పరిభూతబిసపద్మఘాతులుచేతులు కదళికాయుగళంబుగడలుతొడలు." (ఇక్కడ గడయనఁగా అరఁటిచెట్టుయొక్క అడుగుభాగము.) రా. సుం, కాం.

**గడగడ.** దే. వి. వడఁకుటయందగుననుకరణము.

**గడగడలాడు.** దే. అ. క్రి. (గడగడలు+ఆడు.) వడఁకు. (వాఁడు నన్నుచూచిన గడగడలాడును.)

**గడచీల.** ద్వి. వి. ఏతపుబానయందమర్చియుండెడు దండెపుఁబీఁటలుతగుల్చుటకు గడతలనుండెడు చీల.

**గడన.** వై. వి. 1. ఎన్నిక; "సీ. దట్టించిగంధమాదనముఁదేఁడని కానిఘనసారపాళికిగడనలేదు." (కడమలేదు అని పాఠాంతరము.) జై. ౫, ఆ.—2. స్తోత్రము; "గీ. అనిసరౌద్రరసము మనమున నడరంగఁ, బడగయెత్తునురగ పాలురేఖ, నెవయఁజేతిసారెఁగొని త్రేసెఁబతిపేడి, గడనయుడుగుమన్ననుడుగవనుచు." భార. విరా. ౫, ఆ.—3. సంపాదనము*. "క. గడనగలమగనిఁజూచిన, నడుగడుగుకుమడుఁగులిడుదురతివలుతమలో."

**గడనకత్తె.** వై. వి. భోగముది, వేశ్య.

**గడనపడఁతి.** ద్వి. వి.——పై.——

**గడప.** దే. వి. వాకిటి క్రిందిభాగము, దేహళి. (చూ. కడప.)

**గడబడ, గడిబిడి.** గ్రా. వి. అల్లరి, అతితొందర.

**గడము.** ఉభ. దే. వి. కుండలోనగువాని మూఁత. "ఎ, గీ. గడియనగడంబు, నాఁగనుమటూడికపిధానమూగిరీత." ఆం, భా. ప్రది.—సం. అ. పుం. 1. గండుచేఁప; 2. విఘ్నము.

**గడవంచె, గడమంచె.** హిం. వి. మూఁటలక్రిందనుంచునది.

**గడసాదన.** వై. వి. సాము, వ్యాయామము.

**గడసె.** దే. వి. అటుక. (అప్ర.)

**గడి.** దే. వి. ఎల్ల, సీమము. "క. పరఁగునుసీమావాహిని, విరజయనఁగనచటనొకటివిమలామృతని, ర్ఝరపూర్ణయగుచునదిగడి, పరమపదమునకుభవప్రపంచంబునకున్." పర. ౧, ఆ.

**గడించు.** వై. స. క్రి. 1. సంపాదించు; (గడియించు అనియు.) 2. కల్పించు. "కామినియందిపుడేమిగాంచియాకిటుకుగడించి పల్కెదు." కళా. ౫, ఆ.

**గడికాళ్లువేయు.** దే. స. క్రి. (రెండు రెండు పశువులను) ఒక్కొక్కకాలుచేర్చి లంకెవేయు. (అన్నలను పొలములో గడికాళ్లు వేసిరా.)

**గడితపడు.** వై. అ. క్రి. (గడితము+పడు.) గట్టిపడు. "ఎ, గీ. వలరాచమేపుడుకంటివేల్పు, జడలలోనుండివడియుచుగడితపడిన, తేటవేలుపుటేటిపన్నీటిబొట్టు, లనఁగఁజుక్కలుకనుపట్టెనలరుఁదెలివి." య. ౩, ఆ.

**గడితము.** వై. వి. 1. తఱచు; "క. మిడుతలగడితముఁదోలుకరి, పిడుగులబెడిదంబుఁజిలువపిండులవడియున్, జడివానసెల్లునడరఁగఁ, గడునడరఁగఁజేసెఁగ్రోఁతిగమినత్తూపుల్." అచ్చ. యు, కాం.—2. ముదుగు. విశే. 1. తఱచైనది; 2. ముదుగైనది. "సీ. గడితంపుటెలుఁగుతోల్కప్పిననొప్పారు బలుతేరువేయిమావులువహింప." హరి. ఉ. ౭, ఆ.

**గడిత్రాడు.** దే. వి. (రెండు రెండు పశువులను) ఒక్కొక్కకాలుచేర్చి లంకెవేసెడుపలుపు.

**గడిదేఱు.** దే. అ. క్రి. (గడి+తేఱు.) సమర్థుఁడగు. (వాఁడు అన్నిట గడిదేఱినాఁడు.)

**గడిదొంగ.** దే. వి. ఒళవెఱిఁగినదొంగ.

**గడిపోతు.** దే. విశే. ఆఁబోతు.

**గడియ.** వై. వి. 1. ఇరువదినాలుగు నిమిషములకాలము; 2. గడెమ్రాను.

**గడియారము.** వై. వి. కాలపరిమాణమును దెలుపునట్టి యొక యంత్రము. "అనలినాయతాక్షుగడియారమునందు." పా. ౩, ఆ.

**గడు.** దే. వి. దారువిశేషము. "సీ. ఖండంబువెలయఁజెక్కిన గడుదారుభేదంబు." ఆం, భా. ద్వి. వ.

**గడులుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కుబ్జుఁడు, మఱుగుజ్జు.

**గడువు.** ఉభ. దే. వి. నిర్ణయకాలము. సం. ఉ. పుం. కణఁతి.

**గడుసరి.** దే. విశే. (గడుసు+అరి.) 1. అసాధ్యుఁడు; 2. కఠినుఁడు; (స్వార్థమున అరి.) 3. ధైర్యముగలవాఁడు. "క. గడుసరియగుశశకమొయ్యఁగదియఁగఁబోవన్." పంచ. నా. ౧, ఆ.

**గడుసు.** దే. వి. 1. కాఠిన్యము; 2. ధైర్యము. (చూ. గడుసువడు.) విశే. 1. అసాధ్యము; 2. కఠినము.

**గడుసువడు.** ద్వ. అ. క్రి. (గడుసు+పడు.) ధీరుఁడగు. "క. వెడవెడదురవ్వవహారవు, నడవడిగడిదేటి గురుజనములశిక్షింపఁగ, గడుసువడివిప్రతనయుఁడు, నడికోరిచివంగపరక చాటుగ మానెఁగ." పాండు. 3, ఆ.

**గడే.** వై. వి. గడియయొక్క రూపాంతరము.

**గడేకారి.** అర. వి. బల్లెముగలవాఁడు, పోకిరి.

**గడ్డ.** వై. వి. 1. దుంప; 2. వ్రణము; 3. మంటిపెల్ల*; "క. ఘనతరమగుస్త్రీగౌరవ, మునమునిఁగినపాపముఖలమునఁరూపుసెడుఁగ, దెనువునసగ్గలికఁబోగడు, గనినపయోరాశిఁ బడ్డ గడ్డయుఁబోలెఁగ." భార. అను. ౨, ఆ.—4. ద్వీపము*. "ఘనసాగరభీకరవీచికా సముత్కరపరిఖాంతమైననడుగడ్డకువచ్చి." భో. ౫, ఆ.

**గడ్డపలుగు.** ద్వ. వి. గుంటకపలుగు. (చూ. గుంటక, పలుగు.)

**గడ్డపారు.** ద్వ. వి. నేలపెల్లగించెడు సాధనవిశేషము, ఖనిత్రము. "గీ. వాఁడుకళ్యాసురుండనవసుధఁబరఁగు, కల్యరూపత నవనిఁదచ్ఛలలచయము, గడ్డపారులకైవడిఁగానుపించి, పేర్చుటఖనిత్రకులఁడనుపేరుఁగలఁడు." కళా. ౬, ఆ.

**గడ్డప్రాయ్య.** ద్వ. వి. గడ్డలుగా పర్వులుచినప్రాయ్య. (చూ. ప్రాయ్య.)

**గడ్డము.** వై. వి. 1. చిబుకము*; 2. శ్మశ్రువు*. "వ. అర్ధనారికావునం బురుషుండునుగాఁడు. గడ్డంబుకలిగినకతంబున యోషగాదు." కాశీ. ౭, ఆ.

**గడ్డి.** దే. వి. కసవు, తృణము.

**గడ్డిపాము.** దే. వి. ఒకవిధమైన పాము.

**గడ్డిపిట్ట.** ద్వ. వి. పక్షివిశేషము. "సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చికల్ పసువుముద్దలు." రసి. ౧, ఆ.

**గడ్డిబొద్దు.** దే. వి. చుట్టకుదురు.

**గడ్డు.** దే. విణ. 1. అసాధ్యము; 2. మిక్కిలి. (గడ్డుపనులు, గడ్డుబుకు మొ.)

**గడ్డుకొను.** దే. అ. క్రి. అతిశయించు. "వ. యాదఃపతిమేదురామృతంబుజిడ్డున గడ్డుకొనిన పూషాదిత్యువదనంబున నుప్పతిల్లు త్రుళ్లుమెఱుంగులు." భీ. ౫, ఆ.

**గణకుఁడు.** సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు; 2. కరణము వాఁడు. (మేదిన్యాదినిఘంటువులయందిది ఇకారమధ్యమముగా నున్నది.)

**గణగణ.** దే. వి. ఘంటాధ్వనియందగునను కరణము. (గంట గణగణ మ్రోఁగుచున్నది.)

**గణన.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. ఎన్నిక.

**గణనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎంచఁదగినది.

**గణపతి.** సం. వి. అ. పుం. వినాయకుఁడు.

**గణము.** సం. వి. అ. పుం. 1. సమూహము; 2. ప్రమథుల సమూహము; 3. సేనావిశేషము. (ఇరువదియేడురథములు అన్నియేనుఁగులు ఎనుబదియొక్క గుఱ్ఱము నూటముప్పదియైదురుకాల్బలను గలది.)

**గణరాత్రము.** సం. వి. అ. న. పెక్కురాత్రులసమూహము.

**గణరూపము.** సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టు.

**గణహాసకము.** సం. వి. అ. పుం. 1. నల్లకచోరము; 2. బలురక్కసి.

**గణాధిపుఁడు.** సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు; 2. శివుఁడు.

**గణి.** సం. వి. ఇ. పుం. సాంగముగా వేదాధ్యయనము చేసినవాఁడు.

**గణించు.** సం. స. క్రి. 1. ఎంచు; 2. లక్ష్యపెట్టు.

**గణిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. వేశ్య; 2. ఆడేనుఁగు; 3. అడవిమొల్లచెట్టు; 4. నెల్లిచెట్టు.

**గణికారిక.** సం. వి. ఆ. స్త్రీ. నెల్లిచెట్టు.

**గణితము.** సం. వి. అ. న. గణితశాస్త్రము, అంకవిద్య. విణ. ఎంచఁబడినది.

**గణితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎంచఁదగినది.

**గణిల్లు.** దే. వి. ఎద్దు అంకెవేయుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. గంధలోభానుబంధిపుష్పంధయముల, ఝుంకృతులచేఁగణిల్లనఱంకెలిడుచు, విషమశరుపేరజన్నియవిడిచిరనఁగ, గ్రొవ్విచరియించుచునవ్వేటగోడెగాఁడ్లు." కవిక. ౧, ఆ. (గంటలుగణిల్లని మ్రోఁగుచున్నవి. వాఁడు గణిల్లని మాటలాడుచున్నాఁడు.)

**గణుతి.** వై. వి. 1. ఎన్నిక; 2. స్తోత్రము*; 3. లక్ష్యము*. (చూ. గణుతించు.)

**గణుతించు.** వై. స. క్రి. 1. ఎంచు; "మీతెచ్చినవస్తుకోటి గణుతింపఁగ్రొత్తర్థఁబొంటె." నిర్వ. ౭, ఆ.—2. స్తోత్రముచేయు*; 3. లక్ష్యముచేయు*. "దిగ్గనలేచిపోయె గణుతింపక." నిర్వ. 3, ఆ.

**గణెము.** దే. వి. వేషధారులు ధరించెడి లక్కబొమ్మ.

**గణేయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎంచఁదగినది.

**గణ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఎంచఁదగినవాఁడు.

**గతపడు.** మి. అ. క్రి. (గతము+పడు.) 1. కడచు; 2. చచ్చు. "ద్వి. పాతకేశులగురాత్మసావలిచెప్పు, గతపడ్డయమ్మహాకాయునిఁదలఁచి." రా. యు, కాం.

**గతము.** సం. వి. అ. న. పోక. విణ. 1. పోయినది; 2. తెలియఁబడినది.

**గతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పోక; (ధనగతులుమూఁడు—దానము, భోగము, నాశము.) 2. త్రోవ; 3. నారిపుంటికంటిత్రోవ; 4. తెలివి; 5. ఉపాయము; 6. బాల్యములోనగుదశ; 7. విధము. (ఈ యర్థమునకు తెనుఁగున వాడుక.)

**గతించు.** సం. అ. క్రి. 1. కడచు; 2. చచ్చు.

**గతుకు.** దే. స. క్రి. ఎంగిలితిను. "క. ప్రతిగృహమునెపుడుఁదిరుగుచు, నతిశయజనభుక్తశేషమాతురవతినై, గతుకుచు." బ్ర. ౨, ఆ.—వి. ఎంగిలితినుట.

**గత్త.** దే. వి. ఎరువు. (రూ. గత్తము.)

**గత్తర.** దే. వి. ఉపద్రవము. (వాఁడు చాల గత్తరపడ్డాఁడు.)

**గత్తు.** దే. వి. మూత్రగంధము.

**గద.** సం. వి. ఆ. స్త్రీ. గుదియ. అ. పుం. ము. తెవులు. డు. కృష్ణుని తమ్ముఁడు.

**గదమాయించు.** గ్రా. క్రి. గద్దించు.

**గదాగ్రజుఁడు.** సం. వి. అ. పుం. గదునియన్న, విష్ణువు

**గదాధరుఁడు.** సం. వి. అ. పుం. గదనియన్న, విష్ణువు.

**గది.** ఉభ. దే. వి. ఇంటిలోపలియఱ. సం. వి. న్. పుం. గదను ధరించినవాఁడు, విష్ణువు. విణ. తెవులుగలవాఁడు.

**గదుకు.** దే. స. క్రి. ఎంగిలితిను. "చ. కదిసిననోరువాయి యొరు కబ్బపుదొంతులనత్పదార్థముల్, గదుకుచునెట్టివారిఁబొడగన్నను గుఱ్ఱినిన్నెహాసౌఖ్యముల్, మదికిననహ్యమైతునకమార్గమునంజరి యించుచున్నదు, వ్పదకవులెల్లమత్కవితఁదప్పులుపట్టకవిం ద్రుకావు తన్." వాసి. ౧, ఆ.—వి. ఎంగిలితినుట. (గతుకుయొక్క రూపాంతరము.)

**గదుము.** దే. స. క్రి. గద్దించు. "క. అని బహువిధముల మక రాం, కునినిరసించుచు వధూటికోపమిగుర్వన్, ఘనభీకరకరములచే, ఘనవేణింగదుముతుహినకరుఁగనుఁగొనుచున్." భాను. 3, ఆ.

**గదుముకొను.** దే. స. క్రి.——పై.——"క. మరుఁడార్చి పోకుపోకని, విరితూపులగదుముకొనుచువెన్దదుమంగా." య. ౫, ఆ. (స్వార్థమున కొను.)

**గదురు.** దే. వి. చెడుకంపు, దుర్గంధము. "చ. ముదమునసోమ కాసురుఁడు ముచ్చిలి యచ్చలమారఁగొన్న ప్రాఁ, జదువులుతెచ్చి తజ్జరసాంద్రతరాంత్రములంటికట్టుబ, ల్గదురుదొరంగఁగీర్తియను గంగఁదొలంచివిధాతృవిస్ఫుర, ద్వదనసరోజగంధలలితంబులు చేసితి గాజగన్నిధీ." పాండు. ౩, ఆ.

**గద్గదము.** సం. విణ. (అ. ఆ. అ.) డగ్గుత్తికపడినది. (మాట.)

**గద్గదస్వరము.** సం. వి. అ. పుం. 1. ఎనుపోతు; 2. డగ్గుత్తిక పడిన యెలుఁగు.

**గద్గదిక.** సం. వి. ఆ. స్త్రీ. డగ్గుత్తిక.

**గద్ద.** వై. వి. పక్షివిశేషము, గృధ్రము.

**గద్దగోరు.** వై. వి. చోరసాధనవిశేషము. "క. బలపముఁగన్నపుఁగత్తి యుఁ, దలముల్లునుజొక్కునీలిదట్టియుసుముఁజీ, మలక్రోలుగద్దగో రును, ములుబంతియుఁగత్తెరయును మొదలగువానిన్." పర. ౪, ఆ.

**గద్దముక్కువాఁడు.** ద్వి. విణ. (చూ.) ఖరణసుఁడు.

**గద్దఱి.** దే. విణ. దిట్టతనముకలది. "తద్గృహసీమవసింపనియ్యదీ గద్దఱిగద్ద." ఉ, రా. ౭, ఆ.

**గద్దఱికాఁడు.** దే. విణ. దిట్టతనముకలవాఁడు. "ఉ. అద్దిరపీని తీవియు నొయారము దిట్టతనంబుఁజేవయున్, దద్దయునబ్బురంబెద కుఁదార్కొనఁజేయఁదొడంగెనిట్టిబల్, గద్దఱికాఁడువాఁడినిజగంబులు గెల్చుటదేమివింత." అచ్చ. సుం, కాం. (స్వార్థమున కాఁడు.)

**గద్దించు.** దే. అ. క్రి. కోపమున అదలించు. "మ. వనితాచూచితె కొన్ని భూరుహములీవామేక్షణల్ వింతగాఁ, గనినన్ నవ్వినఁదన్నఁ జైనుమిసినన్ గద్దించినన్ గూర్చిపా, డిన మూర్కొన్నను ముట్టి నన్ నరసగోష్ఠింబల్కినన్ గౌఁగిలిం, చిన నంతంతఁదనర్చుఁగేవల తపస్వి శ్రేణిచందంబునన్." రామా. ౧, ఆ.

**గద్దియ.** వై. వి. 1. ఉన్నతపీఠము; 2. సింహాసనము*. (చూ. గద్దె.)

**గద్దువ.** దే. వి. గడ్డము. "సీ. వెడలిగద్దువమోవపీడియంబులుచేసి కాంతుఁ జెంపలు మోవగందమలఁది." కవిక. ౪, ఆ.

**గద్దె.** వై. వి. 1. ఉన్నతపీఠము; 2. సింహాసనము*; "సీ. ఉచి తంబులగుషోడశోపచారంబులునాగద్దెకతిభక్తినాచరించి." విక్ర. ౩, ఆ. (గద్దియయొక్క రూపాంతరము.)—3. వరహా; "సీ. పది వేలమొదవులుపదివేలగద్దెలపసిఁడియు నిమ్మహీపతులకిమ్ము." భార. అర. 3, ఆ.—4. పాదు*.

**గద్దెపాంకము.** ద్వి. వి. పరువుసకుఁదగినగౌరవంపుమాట. "సీ. కలవిలేనివికొన్నికొలువునఁగూర్చుండిగద్దెపాంకము చెప్పఁగలరు గాక." చంద్రా. 3, ఆ.

**గద్యము.** సం. వి. అ. న. వచనము. విణ. చెప్పఁదగినది.

**గద్యాణము.** సం. వి. అ. న. ఒక బంగారునాణెము, వరహా.

**గనగన.** దే. వి. 1. తపించుటయందగు ధ్వన్యనుకరణము; "సీ. వేసవి గనగనవేఁగుచ్రాలిపైనగ్గినల్లడమండసర్కుఁజూచి." నిర్వ. 3, ఆ.—2. మండుటయందగు ధ్వన్యనుకరణము. "క. అనుటయుహం సుఁడుగనగనఁగనలి." ఉ, హరి. ౪, ఆ. (కర్మధారయ సమాసము నందు దీనికి నిగాగమంబువచ్చును. "గనగననినిప్పులు.")

**గనప.** దే. విణ. పెద్ద. "గీ. నెత్తురొండొండవెల్లువైనేలఁబెద్ద, కాలువలు గట్టిపాఱంగఁగడుఁదనర్చి, కావిసెలయేఱులురలెడుగనపకొండ, కరణినొందెబాణుఁడుబాహుకర్తనమున." హరి. ఉ. ౮, ఆ.

**గనయము.** దే. వి. 1. పోఁకముడి; "సీ. అనయంబుఁదీన్నని యనువుసగనయంబు ప్రిదులంగమెలఁగిచొక్కొదవఁజేయు." భార. స్త్రీ. ౩, ఆ.—2. వింటికొప్పు. "క. గొనయంబునెక్కఁ ద్రోచిన, గనయంబునకెక్కుకున్నఁగ్రమ్మినతమకం, బునవిల్లువిడి చివేల్పొక, యనిమిషభటుఁడనికివెడలెనడిదముఁగొనుచున్." పా. ౪, ఆ.

**గని.** వై. వి. 1. బంగారులోనగునవి పుట్టుచోటు; 2. బిలము*. "చ. అనవుడునిప్పురోత్తమమునందు మహాబిలమొప్పచుండుదా, నను గుహయొక్కటెప్పుడును నవ్యముగాఁ గనుపట్టునందులో, నను పమమైనగుండుగలదందును నేడుబిలంబులుండున, గ్గనులఁజరిం చుఁ దుమ్మెదలకైవడి నెప్పుడువానిప్రాణముల్." మై. 3, ఆ.

**గనిమ.** దే. వి. మడికిఁజుట్టు నేర్పఱచిన చిన్నకట్ట.

**గనియ.** వై. వి. ఖండము*. "గీ. మేనిగనియలన్నియు సంధానకర ణినదికి." రా. యు, కాం.

**గనీబు.** దే. వి. ఒఱ. "చ. కలకలనవ్వుచున్ నృపశిఖామణిహా న్నుగనీబులోనియి, ట్టలపుమెఱుంగుచాయలబెడంగుకటారిజరీన దూసిమం, త్రులుగనశూద్రుమస్తము కఱుక్కునఁద్రుంచె." ఉ, రా. ౭, ఆ.

**గనుపు.** దే. వి. వెదురుచెఱకులోనగువానియందెడనెడనేర్పడియుండు ముడి, పర్వము. (చూ. కనుపు.)

**గనె.** వై. వి. గనియయొక్క రూపాంతరము. "సీ. సమధురస్థూల దాడిమబీజములతోడఁ దనుపారు రసదాడి గనెలతోడ." ఆము. ౩, ఆ.

**గన్నెరాకమ్ము.** ద్వి. వి. (గన్నెరు+ఆకు+అమ్ము.) గన్నెరాకువంటి యలుఁగుగల బాణవిశేషము. "వ. అట్లుతొఁకినసతండుదొరల గన్నెరాకమ్ములఁజెక్కుపఱచె." భార. భీష్మ. 3, ఆ.

**గన్నెరు.** దే. వి. గన్నేరుయొక్క రూపాంతరము.

**గన్నేరు.** దే. వి. కరవీరము*. (ఎఱ్ఱగన్నేరు, తెల్లగన్నేరు, పచ్చ గన్నేరు అని ఇది త్రివిధము.)

**గపటిక.** సం. వి. ఆ. స్త్రీ. వరిగప్పెరు.

**గప్పాలు.** హిం. వి. బంభాలు, అతిశయపుమాటలు.

**గబీలు.** దే. వి. మంటయందగు ధ్వన్యనుకరణము. (అ యడవి గబీలున మండుకొన్నది, కడుపులో గబీలుమనుచున్నది.)

**గబ్బాటు.** దే. వి. కలఁత. విణ. వెలతక్కువైనది. (పసుపు, కంద, చేమ, గెనుసు, పెండలము మొదలగువస్తువులు.)

**గబ్బి.** వై. వి. గాంభీర్యమునుబట్టి కుక్కకియ్యఁబడిన పేరు. "చ. పులియఁను బూచిగాఁడసురపోతులరా జనుమంతిగాఁడు చెం, గలువ సివంగి భైరవ్రుఁడు కత్తెర సంపెఁగ పెండిసింధు మ, ల్లెల గుది వాయువేగి చిటెలింగఁడు సాళ్వఁడు వత్సనాభియే, కలముల మిత్తి గబ్బి యనఁగాఁగలవానిగ్రహించి యుద్ధతిన్." స్వా. ౪, ఆ.—విశే. గర్వముగలవాఁడు. "రాచబిడ్డయైయుండి గబ్బితనం బెఱుంగఁడు." ఉ, హరి. ౫, ఆ.

**గబ్బిడాయి.** దే. వి. గబ్బిలము, తైలపాయిక.

**గబ్బిలము.** దే. వి. ———పై.———

**గబ్బిలాయి.** దే. వి. గబ్బిడాయియొక్క రూపాంతరము.

**గబ్బిలి.** దే. వి. కిడికిలి. (గబ్బెఁడుకూరతే.)

**గబ్బిస.** దే. వి. ఒకానొక మూలిక.

**గబ్బు.** యు. దే. వి. దుర్గంధము. "సీ. పాలసినగబ్బుకంపులు శాకుముట్టెడు సెనల్లతిరునామమెచటదోంక." జై. 3, ఆ.—వై. 1. గర్వము; "సీ. పచ్చిబంగారుకుప్పలుచేయఁగారాదె గబ్బు మిచేనవారికుబ్బులందు." పాండు. ౧, ఆ.—2. మదము*.

**గబ్బుచీకఁటి.** దే. వి గాఢాంధకారము.

**గబ్బుచెంకమెకము.** ద్వ. వి. ఏనుఁగు.

**గబ్బులుఁగు.** దే. వి. ఒకానొక శకునపుపక్షి, భాసంతము. "వ. కౌశికంబు డబ్బు గబ్బులుఁగు గొళికనుఁబెంటి పైఁడికంటి లోనగు తిర్యక్కులు భావిప్రయోజనసూచకంబులైయున్నయవి." ఆము. ౬, ఆ.

**గభస్తి.** సం. వి. ఇ. స్త్రీ. అగ్నిపెండ్లాము. పుం. 1. సూర్యకిరణము; 2. సూర్యుఁడు.

**గభీరము.** సం. విశే. (అ. ఆ. అ.) గంభీరముయొక్క రూపాంతరము.

**గభీరిమ.** సం. వి. న్. పుం. గంభీరిమయొక్క రూపాంతరము.

**గభోళి.** సం. వి. ఇ. స్త్రీ. ఒఱగుదిండు, ప్రగ్రీవము.

**గమకము.** ఉభ. దే. వి. యత్నము. "గమకమునసెదుర." య. ౧, ఆ.—విశే. 1. అధికము; "వ. అతనిమీఁదితమకంబు గమకంబై పర్వె." య. ౫, ఆ.—2. మనోజ్ఞము. "ద్వి. అందులఁగడుపని హరువుచిత్తరువు, లందంబుగాఁదీర్చివారినీలకరుల, గమిగమిచిన పటికంపుసింగముల, గమకమాసోపానగతులనేర్పఱచి." రా, బాల, కాం.—సం. వి. అ. పుం. సంగీతశాస్త్రమునందు స్వరవిన్యాసభేదము. విశే. తోఁపఁజేయునది.

**గమకించు.** దే. అ. క్రి. యత్నించు. "ద్వి. చంద్రహాసంబెత్తి జానకిప్రేయ, నింద్రారిగమకింప." రా. సుం, కాం.

**గమగమ.** దే. వి. వాసనకొట్టుటయందగు సనుకరణము. "గమగమ వలచు చొక్కపుజవాజి." స్వా. ౨, ఆ.

**గమగమించు.** దే. అ. క్రి. గమగమయని వాసనకొట్టు. "ఎ, గీ. కప్పురపువీడియపుతావి గమగమింప." శేష. ౪, ఆ.

**గమనము.** సం. వి. అ. న. 1. పోక; 2. ప్రయాణము; 3. తలఁపు. "ఉ. సంగరముంగరంబుగమనంబునభావనసేయరైరి." సై. 3, ఆ.

**గమనించు.** సం. అ. క్రి. 1. పోవు; 2. తలఁచు. "నింతువు నాదుకోర్కిగమనింతువుకేళికహార్మికంబు." శశాం. ౪, ఆ.

**గమనిక.** ఉభ. దే. వి. విధము. "వ. ముఖ్యవరాహంబుగమనిక నున్నతక్షమంక్షి." భాగ. ౯, స్కం.—సం. ఆ. స్త్రీ. నడపు. "సి. మంత్రివర్తనసుఁదంత్ర, గమనికయును వివిధములైనదాన విధులుబహుళత్యాగములునలోక, సంస్తుతములయ్యె." భార. ఆశ్వ. ౪, ఆ.

**గమము.** సం. వి. అ. పుం. 1. పోక; 2. ప్రయాణము; 3. త్రోవ.

**గమాయించు.** దే. అ. క్రి. గమగమించు. "మ. పరమాన్నంబులుఁబిండివంటలునుసూపంబుల్‌గమాయించుపం, క్తిరసంబుల్." అని. ౧, ఆ.

**గమి.** దే. వి. సమూహము. విశే. తఱచు. "గమిమెఱుఁగులడరునారసమున." భార. కర్ణ. 3, ఆ.

**గమించు.** సం. అ. క్రి. పోవు. (గమియించు అనియు.)

**గమికత్తె.** ద్వ. వి. అంతఃపురమునందు కావలియుండెడు ఆఁడుది. "క. గమికత్తెలతోనపుడా, క్రమమెఱిఁగింపంగవారుగ్రక్కునఁజేత, ప్రమదప్రదమైయొప్పెడు, ప్రమదవసముచేరియపుడు ప్రమదంబెసఁగన్." శశాం. ౪, ఆ.

**గమికాఁడు.** దే. వి. 1. అధిపతి; "సీ. కయ్యానజక్కులగమి కానిముక్కంటికిఁగుతిలపెట్టుటలుసికతనఁగాదె." య. 3, ఆ.—2. సేనాధిపతి; "క. అక్కరఁజేబోరుటక్కరి, ఠక్కసిగమికాండ్ర, ముప్పిరన్మానిసితేఁ, డొక్కొక్కకఱకుటమ్మునఁ, జిక్కంగానీక తలలుసిదిమెన్గినుకన్." అచ్చ. అర, కాం.—3. ముఖ్యజనుఁడు. "గీ. అనుఁడునందులోగమికాండ్రుఠతనిఁజూచి, దేవరకునిట్టియక్కఱదీర్పఁగాక, యెన్నటికిమేమునీసొమ్ముఁదిన్నవార, మిందఱమునసితముముఁకలెల్లఁజూపి." పర. ౫, ఆ.

**గమికొను.** దే. అ. క్రి. ప్రోగువడు. "క. వేఱొకవిలుగొనివిమతుఁడు, తూఱఁగహరిమేననాటెఁదొమ్మిదియమ్ముల్, మాఱెనుబదింటఁ బొదివెన్, గాఱియగామఱియుఁబఱపెగమిగొనఁదూపుల్." హరి. ఉ. ౧, ఆ.

**గమ్మతు.** హిం. వి. వేడుక.

**గమ్ము.** దే. వి. వాసనకొట్టుటయందగు సనుకరణము. "ఎ, గీ. గమ్ముఁబిసాళివలపులుగుమ్మరించు, కమ్మజవ్వాదిఁదలయంటెఁగలికి యొకతె." వసు. ౫, ఆ.

**గమ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) పొందఁదగినది.

**గయ.** సం. వి. ఆ. స్త్రీ. తీర్థవిశేషము. అ. పుం. ము. పశువు. డు. ఒక చక్రవర్తి.

**గయాళము.** దే. వి. గయ్యాళముయొక్క రూపాంతరము.

**గయాళి.** దే. విశే. గయ్యాళియొక్క రూపాంతరము.

**గయాళించు.** దే. అ. క్రి. గయ్యాళించుయొక్క రూపాంతరము.

**గయాళు.** దే. వి. సేద్యముచేయుటకుఁ దగనిపొలము.

**గయ్యాళము.** దే. వి. ధిక్కారపుమాట.

**గయ్యాళి.** దే. విశే. (గయ్యాళము + ఇ.) ధిక్కరించి మాటాడునది.

**గయ్యాళించు.** దే. అ. క్రి. ధిక్కరించి మాటాడు. "క. నీవిచ్చో మెఱయితవయి, కావరమునవలసినట్లుగయ్యాళింపం, గావెఱచి పెద్దమొఱగా, నేవిరినివారిఁదగిలియేలవచింతున్." కళా. 3, ఆ.

**గర.** దే. వి. గడ్డ, ముద్ద.

**గరకట్టు.** దే. అ. క్రి. గడ్డకట్టు. "క్రమ్మెడుశోణితంబుగరకట్టఁగ." జై. ౬, ఆ.

**గరకొను.** దే. అ. క్రి. గరకట్టు, గడ్డకట్టు.

**గరగ.** వై. వి. 1. చిన్నకుండ*; "ద్వి. వరుణుండుతనచక్కెవిన్నించి వచ్చి, గరగకడవడిమీఱఁగాఁగాచియుండు." రా. సు., ౬౦.— 2. నీళ్లుత్రాగుటలోనగువాని కుపయోగించెడు చిన్నపాత్రము. "గీ. గరగలోనఁగిన నరుఁడుభూసురులకొసఁగ్రు, నాచమనముఖ కర్మంబులందుమష్ట, భాగఫలమొందు." భార. అను. ౨, ఆ.

**గరగడ.** దే. వి. (గరగ+గడ.) నూనెమొదలయినవి చిన్ననోరుగల పాత్రములలోఁ బోయుటకు అడుగున ఆదోఁకవలె క్రొవియమర్చి చేసిన విశాలముఖపాత్రవిశేషము.

**గరగర.** దే. విశే. నిర్దోషము, నిర్మలము. "సీ. ఏనువంటలవాఁడనై యానరేంద్రుఁ, గొలిచిగరగరగాఁగూడుఁగూరచిత్త, మునకువచ్చిన యాచందమునఁనొసర్చి, నేర్చిమెలఁగుదుఁగరమునుఁ తెలియ." భార. విరా. ౧, ఆ. (కర్మధారయ సమాసమునందు దీనికి నిగాగమంబువచ్చును. గరగరనినెత్తురులు మొ.)

**గరగరిక.** దే. వి. 1. నైర్మల్యము; "సీ. రతిరయచ్చన్నసూత్రమునఁజిక్కకముత్తెములురాలుగరగరికలువహింప." ఆము. ౧, ఆ.— 2. అందము. "గీ. చెలువమెడతుంటవిల్లునిచిందమరయ, నండు నిరుగడవైచినకుందనంపు, నరులుపూఁబోఁడిచేతులుచాలఁనరయఁ, గాకయుండిన నీగరగరికగలదె." య. ౪, ఆ.

**గరణి.** సం. వి. ఇ. పుం. ఒకకరణము. (చూ. కరణము.)

**గరదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విషముపెట్టువాఁడు.

**గరము.** సం. వి. అ. పుం. 1. ఒకకరణము; (చూ. కరణము.) 2. కృత్రిమవిషము. "గరస్తుకృతకంవిషమ్." అ, పా. ప్ర. భో.

**గరవడు.** ద్వ. అ. క్రి. (గర+పడు.) గడ్డకట్టు. "సీ. కరఁగు వెన్నఁడులేకగరవడ్డయామంచుదెచ్చియున్నతమునాఁదీర్చిరొక్క." భో. ౭, ఆ.

**గరళము.** సం. వి. అ. న. 1. విషము; 2. కసవుప్రోగు; 3. కొలఁది.

**గరాగరి.** సం. వి. ఈ. స్త్రీ. డావరడంగి*, (రూ. ఘరాగరి.)

**గరాసు.** వై. విశే. దుష్టుఁడు*.

**గరిఁటె.** దే. వి. ఇనుముతోఁగాని, యిత్తడితోఁగానిచేసిన తెడ్డు, (రూ. గంటె.)

**గరిడి.** వై. వి. 1. సాము; "గరిడిసాదనలవేడ్కలఁగొంతదడవు." కళా. ౭, ఆ.—2. సాముకూటము*; "మనమెుక్కగరిడిఁజేసిన సామెకద." చంద్ర. (రూ. గరిడీ. "కెంపుటారుడుబిల్లలగరిడీలు." వసు. ౪, ఆ.)—3. చోటు*; "ఎ, గీ. దక్షవాటిక సకలతీర్థములకిరవు, దక్షవాటికసకలవిద్యలకుగరిడి, దక్షవాటికవిభవంబుతానకంబు, దక్షవాటికశివునియంతఃపురంబు." భీ. ౬, ఆ.—4. సమీపము*. "సీ. ఆసవనక్షోణియందును నరసులగరిడి నిష్టపురాణ పరిచితిఁ బ్రియ, మందెదునమయంబునన్." రాఘ. ౨, ఆ.

**గరిడిముచ్చు.** ద్వ. వి. మంచివానివలె దగ్గఱఁజేరియుండి నమయముచూచి దొంగిలించెడుదొంగ. "ఎ, గీ. సంయమియునా యకంజూచిజాంబవతియు, సత్యభామయుభోజాత్మజయునుహరి యు, గురువులుగగానకలలెల్లగరిడిముచ్చుఁ, దనముతోనేర్చితివిగద యనుచుఁబలికి." కళా. ౨, ఆ.

**గరిడియ.** వై. వి. బుట్ట. "క. ఫలభారము దుర్భరమని, వెలఁదియ చటనొక్కవృక్షవిటపంబుననిని, మ్ములగరిడియఁదగిలిచియు, జ్ఞప్తి పరశువుఁగొనుచుమృదులసంభ్రమలీలన్." భార. ఆర. ౭, ఆ.

**గరిత.** వై. వి. 1. ఇల్లాలు; 2. పతివ్రత*. "అతనిదేవేరిసీతమ్మ కడిఁదిగరితయయ్యేని." అచ్చ. యు, కాం.

**గరిమ.** సం. వి. న్. పుం. గొప్పతనము, (రూ. గరిమము.)

**గరిమిడికొక్కు.** దే. వి. పందికొక్కు, మూషిక. "గీ. ఉరుము గరిమిడికొక్కుదిందడియు." సాన్వ. ౪, ఆ.

**గరివడియము.** వై. వి. వటకవిశేషము.

**గరివించు.** వై. అ. క్రి. గర్వపడు. "నేర్చెగరివింపమెప్పింప నేర్చె." కవిక. 3, ఆ.

**గరిష్ఠము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి గురువు.

**గరిసె.** వై. వి. 1. ధాన్యముంచెడుకొట్టు*. "గీ. భూమినత్తు తప్పుతప్పపూర్వమైన, బహుళసంవత్సరంపరపాదుకొనిన, గరిసె యనఁగోటయటమించఁగణనకెక్కు, నందుపయినుంచునిలువారమునడి వంబు." చంద్ర. ౧, ఆ.—2. మానవిశేషము*.

**గరిసెబావి.** వై. వి. మల్లెలతో గరిసవలెనల్లి భూమిలోపలికి కుంచి యెత్తెడు నూయి.

**గరీబు.** హిం. వి. బీదవాఁడు.

**గరు.** దే. వి. రోమాంచము. "గీ. మేనఁగరుదాల్చ ఁజాలెవచ్చె మెడలు నొచ్చె." కాశీ. 3, ఆ.

**గరుజు.** హిం. వి. అక్కర, అగత్యము.

**గరుటామంతుఁడు.** వై. వి. గరుత్మంతుఁడు.

**గరుటాలమంతుఁడు.** వై. వి. గరుటామంతుఁడుయొక్కరూపాంతరము. "సీ. కంబమయ్యరొమేలుకలిగినఁకొక్కగరుటాలమంతునిఁగానుకిత్తు." య. ౨, ఆ.

**గరుడకంబము.** వై. వి. (గుడియందలి) గరుడస్తంభము. "సీ. గరుడుల గరుడకంబములనె కట్టి గంధర్వుల గంధర్వకతుల నడిచి." ఉ, రా. ౨, ఆ.

**గరుడధ్వజుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

**గరుడపచ్చ.** వై. వి. మరకతము. "సీ. గరుడపచ్చలచాయగల వచ్చి గందనికూరలుకైవలాంకురములయ్యె." వై. ౭, ఆ.

**గరుడసరులు.** వై. వి. బ. మేలయిన శాలిధాన్యవిశేషము.

**గరుడాగ్రజుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతునియన్న, అనూరుఁడు.

**గరుడి.** వై. వి. గరుత్మంతుఁడు. "క. పఱతెంచికదియఁబడియే, దైత్యేంద్రునినమోముదాఁకితిరిగెగరుడియ, తటిహరిచక్రంబునఁదెడ, మటిపైచెనుదనుజానుజుమస్తకముదెగన్." నిర్వ. 3, ఆ.

**గరుడిరవుతు.** వై. వి. విష్ణువు, గరుడవాహనుఁడు.

**గరుడుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, గరుడి.

**గరుత్తు.** సం. వి. త్. పుం. పక్షము, తెక్క.

**గరుత్మంతము.** సం. వి. త్. పుం. పక్షి.

**గరుత్మంతుఁడు.** సం. వి. త్. పుం. గరుడుఁడు, గరుడి.

**గరుపాటు.** ద్వ. వి. గగురుపాడుపు. "చ. అనవినిగుండెజల్లనఁగ నచ్చెరుపాటునుటిచ్చపాటునె, క్కొనగరుపాటునుంగదురఁ గొం డొకసేపటు లూరకుండి." శకాం. 3, ఆ.

**గరుపాటుమొన.** ద్వ. వి. పందిమూతిముట్టె.

**గరుపొడుచు.** దే. అ. క్రి. రోమాంచితమగు. "క. గరుపొడిచిన మేనునుదలఁకుమనమునుటిచ్చవడినచూపునునై." భార. విరా. ౪, ఆ.

**గరుషు.** వై. విశే. గులకఱాలచేత గట్టిదైనది. (గరుపనేల.)

**గరువము.** వై. వి. 1. గరిష్ఠము; "గీ. పునుకతోల్పువిల్లుదునిమెఁ దాటకఁజంపె, ఖరునిఁదేర్చెవాలిఁగడవఁబనిచెఁ, గల్లజింకఁద్రుంచెగండగొడ్డలితాల్పు, గరువమడఁచెనతనికడిమియనదె." అచ్చ. యు, కాం.—2. గౌరవము; "చ. ఇంతయుఁగా, వనితయెఱుంగ నైతి గరువంపు విచారములేదునీయెడన్." భార. ఆర. ౬, ఆ.—3. విరివి*. "మ. గరువంబారఁగనెకునన్నియునువక్కాణింపఁగా నేటికిన్." వి, పు. ౧, ఆ.

**గరువు.** యు. దే. వి. చెంప "చ. గరువునకొత్తఁజెంగలువకచ్చు సుటించినమోటిఁజొల్పెఁజెం, దిరికతెఱంగునంబసిఁడితీఁగలునించిన జల్లుపాగ." స్వా. ౫, ఆ.—వై. విశ. గులకఱాలచేగట్టియైనది. (నేల.) "వ. గరువునేలలగుంటలోసరించి." స్వా. ౪, ఆ.

**గరుసు.** యు. దే. వి. 1. మర్యాద, మేర; "క. దురమునఁజొట్టజి కంబను, గరుసిడికొనుచేల కలుగుఁగౌరవనాథా." భార. ద్రో. ౫, ఆ. "గీ. ఏకభోగంబుగాఁగనేలేఱుగరుసు, కడలెసీమంబు గౌతమిగంగయవధి, కప్పురపుఁగ్రోవిక్షేత్రఖండమవధి, యేలెవిశ్వ కుటుంబిభీమేశ్వరుండు." భీ. ౫, ఆ.—2. తోలు. "సీ. దొన దొనమునసీఁగతుల్లైలయూపేరుపడక్రొంపలను వ్రేలెడుగరుసుల." ఆము. ౬, ఆ.—వై. విశ. గులకఱాలచేత గట్టియైనది. (నేల.) "సీ. గరువుగరుసునాఁగ ఖరభూమి పిలసిల్లు." ఆం, భా. ద్వి. భూ.

**గర్గరి.** సం. వి. ఈ. స్త్రీ. పెరుగుచిలికెడుకుండ, తరిగడవ.

**గర్జ.** సం. వి. ఆ. స్త్రీ. 1. (మేఘములోనగువాని) ధ్వని; 2. సింహనాదము.

**గర్జనము.** సం. వి. అ. న. 1. (మేఘములోనగువాని) ధ్వని; 2. కోపము.

**గర్జించు.** సం. అ. క్రి. 1. (మేఘములోనగునవి) ధ్వనించు; 2. కోపించు.

**గర్జితము.** సం. వి. అ. న. (మేఘములోనగువాని) ధ్వని. పుం. మదపుటేనుఁగు.

**గర్తము.** సం. వి. అ. పుం. 1. పల్లము; 2. పిఱుఁదులమీఁది గుంతలు; 3. త్రిగర్తదేశవిశేషము.

**గర్తాటము.** సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు.

**గర్దభము.** సం. వి. అ. న. తెల్లగలువ. పుం. 1. గాడిద; 2. గంధవిశేషము.

**గర్దభాండము.** సం. వి. అ. పుం. కలజువ్వి.

**గర్ధనము.** సం. విశ. (అ. ఆ. అ.) ఇచ్ఛగలది, గృధ్నువు.

**గర్భకము.** సం. వి. అ. న. వెంట్రుకలలోపల ముడుచుకొన్న పూదండ.

**గర్భము.** సం. వి. అ. పుం. 1. కడుపు; 2. కడుపులోనిపిండము; (గర్భ సంస్కారములుమూడు. ఆధానికము, పుంసవనము, సీమంతోన్నయనము.) 3. బిడ్డ; 4. ఒక నాటకసంధి. (చూ. సంధి.)

**గర్భాగారము.** సం. వి. అ. న. లోపలిగది, ఓవరి.

**గర్భాశయము.** సం. వి. అ. పుం. గర్భమును బొట్టుకొనియుండెడు సంచి, మావి.

**గర్భిణి.** సం. వి. ఈ. స్త్రీ. చూలాలు, అంతర్వత్ని.

**గర్ముత్తు.** సం. వి. త్. న. తృణసస్యవిశేషము, గంటె.

**గర్వము.** సం. వి. అ. పుం. 1. అహంకారము; 2. మదము.

**గర్వి.** సం. విశ. (న్. ఈ. న్.) గర్వముగలవాఁడు.

**గర్వించు.** సం. అ. క్రి. గర్వపడు.

**గర్వితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) గర్వించినవాఁడు.

**గర్హణము.** సం. వి. అ. న. నింద, దూఱు.

**గర్హించు.** సం. స. క్రి. నిందించు, దూఱు.

**గర్హితము.** సం. విశ. (అ. ఆ. అ.) నిందింపఁబడినది.

**గర్హ్యవాది.** సం. విశ. (న్. ఈ. న్.) (చూ.) కదర్యుఁడు.

**గర్హ్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. అధముఁడు; 2. నిందింపఁదగినవాఁడు.

**గఱగఱ.** దే. వి. భక్ష్యములు నములుటయందగు ధ్వన్యనుకరణము. (వరుగులుగఱగఱ నములుచున్నాఁడు.)

**గఱగఱలాడు.** దే. అ. క్రి. (గఱగఱలు+ఆడు.) గఱగఱయని మ్రోఁగు.

**గఱగొఱ.** దే. వి. తక్కువ. "చ. తలిమిసుశర్మతమ్ములును దానను నాజికి నన్నుఁబిల్వనే, నెఱుఁగనియట్టులుండు టిదియే పురుషార్థము వారినెల్లనే, ద్రైలనుఱుమాడఁబంపుము కడిందిగఁజూడకు నీకునేమియుం, గఱగొఱగాదుపొమ్మికదుఁగష్టమునాకును దాత్తమానసా." భార. ద్రో. ౧, ఆ.

**గఱి.** వై. వి. 1. ఱెక్క; 2. బాణముఱెక్క. "మ. విచిత్రుండున, త్తఱినేసెన్ దెగనిండనారసమునన్ దైత్యారివక్షంబునన్, గఱిదోఁపన్." ఉ, హరి. ౪, ఆ.

**గఱిక.** దే. వి. ఒకదినుసు కసవు, దూర్వ.

**గఱికచెక్క.** ద్వి. వి. పచ్చికతోడిమట్టిపెల్ల, పచ్చికపెల్ల. (గఱిక మోడిచెక్క అనియు.)

**గఱికమ్మి.** ద్వి. వి. (గఱుకు+కమ్మి.) గఱిబద్ద. (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

**గఱికసూదులు.** ద్వి. వి. బ. శాలిధాన్యవిశేషము.

**గఱిచిప్ప.** ద్వి. వి. ముత్యపుఁజిప్ప.

**గఱిబద్ద.** ద్వి. వి. (గఱుకు+బద్ద.) గఱుకుతోడి తాటాకుబద్ద. (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

**గఱుకు.** దే. వి. కొడవలిలోనగువాని కక్కు. "గఱుకులకల్లెంబు గాడ్దకేల."

**గఱుగు.** దే. వి. ఒకానొకచెట్టు.

**గఱువ.** వై. విశ. 1. పెద్ద; "గీ. చిఱుతవానికింతగఱువతనంబిదినన్నె." భార. సభా. ౨, ఆ.—2. గొప్పవాఁడు. "గఱువల్ చవిగానిశఠల్వచింతురే." ప్రభా. 3, ఆ.

**గఱ్ఱు.** దే. వి. త్రేఁచుటయందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. విషముమ్రింగిన పెన్నుద్దివేల్పుత్రేఁడు, మనసిజారాతిమ్రింగిగఱ్ఱనఁగఁ ద్రేఁచు." కాశీ. ౪, ఆ.

**గఱ్ఱె.** దే. వి. మత్స్యములఁబట్టెడు సాధనవిశేషము. (దీని ఆకారము తిట్టెవంటిదిగాని యిది మిక్కిలి పెద్దది.)

**గలఁతియ.** వై. వి. గిండిచెంబు. "చ. అలికులవేణినోర్తుఁగని హస్తములన్ ముఖమజ్జనాంబువుల్, గలఁతియయెత్తిపోయనవి గార్చుచునుండెనతండుదోయిటన్." నై. ౬, ఆ.

**గలగల.** దే. వి. 1. కదలుటయందగు ధ్వన్యనుకరణము; "గీ. గలగల కటకకాననములుగ్రక్కదలఁగ." రామా. 2, ఆ.—2. భూషణ

ములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "గలగల మ్రోయు నందెలును." కళా. ౬, ఆ.

**గలతరించు.** దే. అ. క్రి. (మేను) జల్లుమను. (నాకు ఒళ్లంతయు గలతరించుచున్నది.)

**గలబ.** దే. వి. కలఁత. "ద్వి. క్రతుకర్మములకువిఘ్నములుగావించి, క్షితిమీఁదగలబలుచేయుఁడెల్లెడల." భాగ. ౭, ౫౦.

**గలబరించు.** దే. అ. క్రి. కలఁగు. (నాకు బుద్ధి గలబరించి పోయెను.)

**గలబా, గల్బా.** హిం. వి. కలఁత, తాఱుమాఱు.

**గలిజెరు.** దే. వి. గలిజేరుయొక్క రూపాంతరము.

**గలిజేరు.** దే. వి. పునర్నవ**.

**గలిబిలి.** దే. వి. సందడి. (అక్కడ మిక్కిలి గలిబిలిగానున్నది.)

**గలీబు.** హిం. వి. తలఁగడ యొఱ.

**గల్ల.** దే. వి. 1. పొల్ల; 2. మాదిగవాఁడు తోలునానవేసెడు చట్టి.

**గల్లము.** సం. వి. అ. పుం. చెక్కిలి.

**గల్లు** దే. వి. భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "గల్లుననందియల్గదలంగ." కళా. ౩, ఆ. (ఆమ్రేడితము నందు గల్లు గల్లు, గలుగల్లు. "అందియ లంఘ్రుల గల్లుగల్లనన్." భీ. ౫, ఆ. "గాజులుగలుగల్లనన్." నీలా. ౧, ఆ.)

**గవఁకు.** దే. వి. గవనుయొక్క రూపాంతరము.

**గవతము.** దే. వి. కసవు. (చూ. కవను.)

**గవను.** దే. వి. దుర్గపురద్వారము, గోపురము.

**గవయము.** సం. వి. అ. పుం. గురుపోతు.

**గవరన.** వై. వి. ఎఱుపు. "సీ. కడుపుమండించునాఁకటిచిచ్చు సెకతాఁకిగవరనైయున్నకన్గవలవారు." వై. ౭, ఆ.

**గవర్నమెంటు.** ఆం. విణ. ప్రభుత్వసంబంధమైన.

**గవర్నరు.** ఆం. వి. దేశప్రభువు.

**గవలము.** సం. వి. అ. న. ఎనుపకొమ్ము. పుం. నల్లయెనుఁబోతు.

**గవాక్షము.** సం. వి. అ. పుం, న. కిటికీ. పుం. డు. ఒకానొక కోఁతి.

**గవాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పిన్నపాపరి*; 2 బుడమ*.

**గవాదని.** సం. వి. ఈ. స్త్రీ. 1. పసులుమేయుకంచె, కొట్టము; 2. పెద్దపాపరి*.

**గవి.** ఉభ. దే. వి. 1. గుహ; "మ. గవిలోదెబ్బలిడాఁగిగ్రుక్కను మెఱవంగాఁగాంచిరాజేసె." సా. ౪, ఆ.—2. పల్లము. "గాత ముగవియనఖాతంబు." ఆం, భా. ప్ర. పా.—సం. ఈ. స్త్రీ. ఆవు.

**గవిలెము.** దే. వి. గంధములోఁజూచికలిపెడు విత్తు.

**గవీనము.** సం. విణ. (అ. ఆ. అ.) అంతకుముందు ఆవులు మేసి నది, ఉండినది. (చోటు.)

**గవుండ్లవాఁడు.** వై. వి. సారాయమ్మువాఁడు, కల్లుగీచువాఁడు. (అనికొండఱు:)

**గవేధుక.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. అడవిగోదుమలు, వట్టివడ్లు.

**గవేధువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ.——పై.——

**గవేషణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆమంత్రణార్థము వెదకుట; 2. వెదకుట.

**గవేషించు.** సం. స. క్రి. వెదకు. అరయు.

**గవేషితము.** సం. విణ. (క. అ. ఆ.) అన్వేషితము, వెదకఁబడినది.

**గవ్య.** సం. వి. ఆ. స్త్రీ. ఆవులమంద. అ. న. ము. 1. అల్లెత్రాడు; 2. రాగద్రవ్యము. విణ. 1. ఆవుపాలలోనగునది; 2. ఆవునకు హితమైనది. (పంచగవ్యములు. పాలు, పెరుగు, నెయ్యి, పంచితము, పేడ.)

**గవ్యూతి.** సం. వి. ఇ. స్త్రీ. రెండుకోసులకొలఁది.

**గవ్వ.** దే. వి. శంఖముదిచుసు, కపర్దకము.

**గవ్వచౌకము.** దే. వి. వెలిగారము. "మ. దరమాశానికపాపలాంచలములన్ సంధ్యాప్రకాశోదయుం, బొఁగావించిపిరించిచేకొనిన సూర్యుండన్వపదాంవ్వన్నె బం, గరపుంబూదియకైయద్వపశివేర్షన్ గాలమన్ బచ్చు చె, చ్చెంఁజల్లించిసగవ్వచౌకమనమించెందారకా చక్రముల్." నై. ౮, ఆ.

**గశికము.** సం. వి. అ. పుం. గసి.

**గస.** దే. వి. ఉబ్బసము.

**గసగసలు.** వై. వి. బ. ఒకదినుసు విత్తులు*.

**గసి.** యు. దే. వి. మేకు. "సీ. వసులుగసులు ప్రోఁగువాఱు పెం ప్రుకత్రాళ్లుబలువింప్లునమ్ములుబల్లెములును." హరిశ్చ. ౨, ఆ. —వై. నేయిలోనగువానియందడుగుననిలిచిన మట్టికి.

**గసిక.** దే. వి. 1. త్రవ్వుటకనువుగా కొనచెక్కినకొయ్య; 2. శలాక; "ద్వి. మండువల్కులఁజేరిమానవమాంస, ఖండంబులొండొండగసికలఁగ్రుచ్చి." హరిశ్చ. ౨, భా.—3. బాణము. "ద్వి. అనివిడుకొలిపిన నమ్మాటహృదయ, మునవాఁడిగసికయై మునుమిడి గాఁడ." విష్ణు. పూ. ౧, ఆ.

**గసిబిసి.** దే. వి. విణ. గజిబిజియొక్క రూపాంతరము. (కలఁగినది యనుటకు— "సీ. ముసలపాతంబులగసిబిసిగామొత్తిసునిశితోద్యత పరశువులనఱకి." రా. యు, కాం.)

**గస్తీలు.** దే. వి. బ. (గస్తు+ఈలు.) కావలివారు. (పైగస్తీలు వచ్చి నారు.)

**గస్తు.** దే. వి. (రాత్రివేళ దొంగతనములోనగునవి జరగకుండుటకై కావలివారు) ఊరుతిరిగికాచుకావలి. "ద్వి. అలీలఁగొఱవిదయ్యం బులదివెవ్, కోలలవారిఁగాఁగొనిగస్తుతిరిగి." హరిశ్చ. ౨, భా.

**గహనము.** సం. వి. అ. న. 1. అడవి; 2. గుహ; 3. దుఃఖము. విణ. 1. ఎఱుఁగరానిది; 2. చొరరానిది.

**గహరము.** సం. వి. అ. న. పాయిక్రిందికట్టెడుకట్టె.

**గహ్వరము.** సం. వి. అ. న. 1. అడవి; 2. గుహ; 3. నెపము. పుం. పొదరిల్లు.

**గహ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

**గళంతిక.** సం. వి. ఆ. స్త్రీ. గిండిచెంబు.

**గళకంబళము.** సం. వి. అ. పుం. (చూ.) గంగడోలు.

**గళకత్తెర.** వై. వి. మల్లబంధవిశేషము. (చూ. కాసెనిల్కడ.)

**గళగండము.** సం. వి. అ. పుం. (చూ.) గండమాల.

**గళగళ.** దే. వి. చెప్పుటయందగు ధ్వన్యనుకరణము. "గీ. అతఁడు తొలునాడుచదివినయంతవట్టు, గళగళనిచెప్పెఁదండ్రియక్కజము నొంద." పర. ౫, ఆ.

**గళనము.** సం. వి. అ. న. జాఱుట.

**గళము.** సం. వి. అ. పుం. 1. కుత్తుక; 2. సజ్జరసము.

**గళశుండిక.** సం. వి. ఇ. స్త్రీ. కొండనాలుక.

**గళాంకురము.** సం. వి. అ. పుం. అంగిటిముల్లు, కొండనాలుక. (అనికొందఱందురు.)

**గళితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. జాఱినది; 2. తినఁబడినది.

**గళ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. కంఠముల సమూహము; 2. పోటగళ్ళముల సమూహము.

**గళ్లె.** దే. వి. (చూ.) కళ్లె.

**గళ్లెము.** దే. వి. పాలమీఁగడవంటి లేఁతకొబ్బెర.

## గా.

**గాంగము.** సం. విశే. (అ. ఈ. అ.) గంగది.

**గాంగుఁడు.** సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి.

**గాంగేయము.** సం. వి. అ. న. బంగారు. పుం. ఒకానొక చేఁప.

**గాంగేయుఁడు.** సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి.

**గాంగేరుకము.** సం. వి. అ. పుం. బలుసుకీ.

**గాంగేరుకి.** సం. వి. ఈ. స్త్రీ. బీఱకీ.

**గాండివము.** సం. వి. అ. పుం, న. 1. అర్జునుని విల్లు; 2. విల్లు. (రూ. గాండీవము.)

**గాండ్రించు.** దే. అ. క్రి. (ముఖము) ఉబ్బు.

**గాండ్ల.** దే. వి. నూనె అమ్మి జీవించెడుజాతి. (గాండ్లవాఁడు, గాండ్లది.)

**గాంధర్వము.** సం. వి. అ. న. పాట. పుం. 1. కన్యావరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము. (చూ. వివాహము.) 2. దినముయొక్క ఏడవభాగము. (చూ. దినము.)

**గాంధర్వుఁడు.** సం. వి. అ. పుం. గంధర్వుఁడు.

**గాంధారము.** సం. వి. అ. పుం. 1. ఒక స్వరము; (చూ. స్వరము.) 2. సింధూరము; 3. ఒకానొకదేశము.

**గాంధారి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గంజాయి; 2. ధృతరాష్ట్రుని భార్య.

**గాంభీర్యము.** సం. వి. అ. న. గంభీరభావము.

**గాఁజెర.** దే. వి. ఒకానొకదుంప. "ఎ, గీ. అల్లముల్లిపసుపుముల్లంగివెల్లుల్లి, గాఁజరయును మొదలుగాఁగఁగలవు." హంస. ౪, ఆ.

**గాఁడి.** దే. వి. 1. తొలిచికాని, త్రవ్వికాని నిడుపుగా నేర్పఱచిన పల్లము; (గాఁడిపలక మొ.)—2. పసులునీరుత్రాగుటకుగాఁడి యేర్పడఁజాతితోఁగట్టినతొట్టి, నిపానము; 3. పసులఁగట్టుచోటఁ గసువువేయుటకుఁ బలకలులోనగువానితో గాఁడిగానేర్పఱచిన స్థానము. "ఎ, గీ. కామగవిఁగట్టనిదికదాగాఁడిపట్టు." ఉ, రా. ౪, ఆ.

**గాఁడిప్రొయ్య.** దే. వి. గాఁడిత్రవ్వి యేర్పఱచినపొయ్య. (చూ. ప్రొయ్య.)

**గాడీ.** హిం. వి. బండి.

**గాఁడు.** దే. వి. కామమదము.

**గాగర.** దే. వి. (స్త్రీలుకట్టుకొను) పావడ.

**గాజె.** వై. వి. ధాన్యముపోయుటకు మట్టియొఱలచే నేర్పఱచిన బొట్ట, కుసూలము*.

**గాజొపరుఁజు.** ద్వి. వి. పరుఁజుయొక్కరూపాంతరము. "సీ. ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము, జరపరుంజుననంగను బరఁగునదియె, చనునునెమ్మలిపరుఁజుగాజాపరుఁజన." ఆం, భా. ద్వి. ష.

**గాజు.** వై. వి. 1. ఒకదినుసు మన్ను. "గాజుకాఁగు." భల్లా. 3, ఆ.—2. బ. గాజుమట్టితోఁజేసిన వలయములు.

**గాజుప్పు.** ద్వి. వి. (గాజు+ఉప్పు.) ఒకానొక ఉప్పు, కాచము.

**గాజులవాండ్రు.** ద్వి. వి. బ. గాజులమ్మెడు బలిజెలు.

**గాజువాఱు.** ద్వి. అ. క్రి. (గాజు+పాఱు.) కాంతిహీనమగు. "గీ. నెఱయనర్థిలిసెనయునీనెమ్మొగంబు, ఘనభుజంగవిషవ్యాప్తి గాజువాఱె, రాహుకబళితరోహిణీరమణుమాడ్కి, నుండఁగనుఁగొని యేసెట్టులుంటకుజ్జ." మార్క. ౧, ఆ. "ఉ. కందవు గాజువాఱవు వికారమునొందవుపూతిగంధముం, జెందవువాడవప్వరముసీమలనెల్లెడవామకర్ణముల్, క్రిందుగదీర్ఘనిద్రలధరిత్రిశయించినజంతుదేహముల్." కాశీ. 3, ఆ. "గీ. గాజువాఱుదుచరణపంకజయుగంబు, హస్తతలములకెంజాయలణఁగిపోవు, కాదువేఱొక్కరూపంబుకన్నదోయి, యొడలిలోఁబ్రాణములుడాఁగియుండఁబోలు." హరిశ్చ. ౫, ఆ.

**గాటము.** వై. విశే. అధికము. "గాటముగాఁదనర్చుకుతుకంబుల." కళా. ౧, ఆ.

**గాటు.** వై. వి. కారము. (పొగాకుపొడి మిక్కిలి గాటుగానున్నది.)

**గాఁడిగడుగు.** దే. స. క్రి. (గాఁడి+కడుగు.) సంచయసము చేయు.

**గాడి.** దే. వి. రథవిశేషము. (రూ. గాడీ. "చిత్రలలితగతినొప్పనేనూఱుగాడీలు." భార. ఆది. ౮, ఆ.)

**గాడిద.** వై. వి. గార్దభము, గాలిగాఁడు. (రూ. గాడ్ద.)

**గాడిదకాళ్లవాఁడు.** ద్వి. విశే. ముట్టుమోఁకాళ్లవాఁడు, సంజ్ఞువు.

**గాడిదగడపర.** ద్వి. వి. వృషగంధికకీ.

**గాడిదపులి.** ద్వి. వి. దుమ్ములగొండి, కొర్నవగండు.

**గాడుపు.** దే. వి. గాలి, వాయువు. (రూ. గాడ్పు.)

**గాడుపుచూలి.** దే. వి. 1. భీముఁడు; 2. హనుమంతుఁడు.

**గాడుపుపట్టి.** దే. వి.———పై.———

**గాడుపుమేపరి.** దే. వి. సర్పము, పవనాశనము.

**గాడుపుసంగడీఁడు.** దే. వి. అగ్ని, వాయుసఖుఁడు.

**గాఢము.** సం. క్రి. విశే. అ. న. పెల్లు. విశే. అధికము.

**గాణ.** వై. వి. 1. పాటకాఁడు; "సీ. పోయెంబోననుఁబిల్వఁజేయక తానొకనెఱగాణయైవిద్యనెఱపుటెట్లు." కళా. ౨, ఆ.—2. పాటకత్తె. "వ. మధురకిన్నరీనిక్వణంబులరాణంద్రాణచెఱచు విన్నాణంబులుగొలుపుటెలుంగులవేల్పుగాణలుపాడు లక్ష్మీనారాయణుల కల్యాణంబుపాటలందీటుకొనుతిన్ననిరవంబులంగలసి." స్వా. ౫, ఆ.

**గాణాపత్యము.** సం. వి. అ. న. ఒకమతము. (చూ. మతము.)

**గాణిక్యము.** సం. వి. అ. న. గణికల సమూహము.

**గాణీ.** వై. వి. పాటకత్తె. "వ. వేల్పుగాణీలపాణీరీతమాణిక్యవీణామధురరాణామృతంబులఁ గరఁగి." వసు. ౨, ఆ.

**గాణుఁడు.** వై. వి. పాటకాఁడు. "శా. పక్షంబుల్ లలిఁదాల్చి కీరనిభదివ్యద్వాణులుం గాణులుఁ" హరి. ఉ. 2, ఆ.

**గాణేయము.** సం. విణ. (అ. ఆ. అ.) గణనీయము.

**గాత.** ఉభ. వై. వి. దెబ్బ. (చూ. ఖడ్డి.) సం. వి. పుం. పాట పాడువాఁడు.

**గాతము.** వై. వి. పల్లము*. "ఉ. ఆతఁడు నంబడించుకొనియాకరి చొప్పుననేగియేగితా, నాతతగుల్మమధ్యమున నారసికట్లొనిదానిఁబట్టి రా, గాతముఁద్రవ్వియాకలము గప్పినఁగానక కూలెవారణం, బాతత పక్షముల్ తునుమనంబుధిఁగూలిన కొండకైవడిఁ." వాసి. ౫, ఆ.

**గాతి.** వై. వి. తిండి, గ్రాసము, "ఎ, గీ. చెఱకులసఁబెల్లమును జూపిచిన్నవాండ్రఁ, జంపితోడవ్రులుగొనివచ్చు సాహసమునఁ, బావములకెల్లనొడికట్టి పాయకెపుడు, శ్వేతుఁడీరీతిలంజయగాతికొఱకు." భల్లా. 3, ఆ.

**గాతుకలఁగు.** దే. అ. క్రి. భేదిల్లు. "సీ. కణఁతలెల్లనుగాతుకలఁగి దిక్కరులకుఁబొటపాటఁగన్నీటిబొట్లుపడియె." రామా. ౭, ఆ.

**గాత్రము.** ఉభ. దే. విణ. స్థూలము. సం. వి. అ. న. 1. శరీరము; 2. అవయవము; 3. ఏనుఁగుయొక్క ముందటిపిక్కలు లోనగుచోటు. (ఈ యర్థమునందిది ఆకారాంత స్త్రీలింగము నగును.)

**గాథ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చరిత్రము; 2. పద్యము; 3. పాట; 4. చక్కఁబఱుపఁబడనిభావ.

**గాథకుఁడు.** సం. వి. అ. పుం. పాటకాఁడు.

**గాద.** దే. వి. చెమటకాయలతఱచు.

**గాదము.** దే. వి. 1. పైరులోని కసవు; 2. అకు; "ఎ, గీ. జగతి నేరాజకుమారాజుచరణయుగముఁ, గాంచికొలువనివానినేఁగాననెందు, గాదమునమాటుపడియున్నకాయఁబోలె, నుజ్జయినిడాఁగియున్ననీ వొకఁడుదక్క." విక్ర. ర, ఆ.

**గాదిలి.** దే. వి. ప్రేమము. "గాదిలితనయుఁడు." భార. అశ్వ. ర, ఆ.

**గాదె.** వై. వి. గాజెయొక్క రూపాంతరము.

**గాధము.** సం. వి. అ. పుం. 1. మిట్ట; 2. కోరిక.

**గాధేయుఁడు.** సం. వి. అ. పుం. గాధికొడుకు, విశ్వామిత్రుఁడు.

**గానము.** సం. వి. అ. న. గీతము, పాట.

**గానుఁగ.** దే. వి. నూనెఁదీసెడియంత్రము, పరంజము.

**గానుఁగపిండి.** ద్వి. వి. తెలికపిండి.

**గాబ.** దే. వి. తృణవిశేషము. (ఇక్కడ గాబనిండ పెరిగి ఉన్నది.)

**గాబము.** (గాబయొక్క రూపాంతరము.)

**గాబరా.** హిం. వి. భయము, తొందర, కలవరము.

**గాబు.** దే. వి. కొప్పెర. "ఎ, గీ. గాబుకొప్పెరయనఁగనుగర్వరము." అం, భా. ద్వి. వై.

**గామ.** దే. వి. పిపీలికావిశేషము. "ద్వి. కలగొనిచీమలగామల వలెను, జెలఁగుచుముందఱిశిశువులాడఁగను." హరిశ్చ. ౨, భా.

**గామిడి.** వై. విణ. శ్రేష్ఠుఁడు. "మ. ఊరిగామిడిబాఁపల్ చను దెంచి కద్రుపదభూమీభర్తయిల్ చేరఁగ." పాంచా. ర, ఆ.

**గాము.** వై. వి. 1. సూర్యాదిగ్రహము; "క. గాముబుధుండరుణి మరుచి, యామయనాళికములబ్ధమగ్రజముకులం, బామహితత్వముదేవత, హైమవతిజకారమునకునాగమశరణిఁ." కవిస. ౧, ఆ.—2. పిశాచము, "గీ. అనుచుఁబెలుచనొంపసచ్చటిజనములు, కలఁగియపుడుమేలుకాంచిచూచి, భయముతోఁపఁగడిఁదిబలుగాముగాఁదమ, యుల్లములఁదలఁచియొదిఁగియుండ." భార. సౌ. ౧, అ.

**గాములఱేఁడు.** ద్వి. వి. సూర్యుఁడు, గ్రహపతి.

**గాయకము.** దే. వి. మర్మము. "ఆగాయకపుజంకె." సా. ౨, ఆ.—విణ. గూఢము. "గాయకపుసుద్దులు." సా. 3, ఆ.

**గాయకుఁడు.** ఉభ. వై. విణ. గ్రహణశక్తిగలవాఁడు. సం. వి. అ. పుం. పాటపాడువాఁడు.

**గాయత్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మంత్రవిశేషము; 2. ఒక చందస్సు, (చూ. ఛందస్సు.) ఈ. స్త్రీ. న్. పుం. చంద్రకీ.

**గాయని.** సం. వి. ఈ. స్త్రీ. పాటపాడునది.

**గాయనుఁడు.** సం. వి. అ. పుం. పాటపాడువాఁడు.

**గాయమానము.** దే. వి. శస్త్రవిద్యావిశేషము. "ఎ, గీ. నఱుకుపరువడిగాయమానంబువిసరు, మొనలనంగనుదచ్ఛేదములుచెలంగు." అం, భా. ద్వి. ష.

**గాయము.** దే. వి. కత్తిలోనగువాని తాఁకుడు, క్షతి.

**గార.** దే. వి. 1. గోడలోనగువాని పూఁతకై ఇసుకఁజేర్చిదంచిన సున్నము; 2. మణిదోషవిశేషము; 3. ఇంగుదిక్.

**గారడము.** వై. వి. 1. విషమంత్రము; 2. మాయ*. "గీ. గారడపురక్కసునినెందుఁగానకుండి." అచ్చ. యు. కాం.

**గారడి.** వై. వి. (గారడము+ఇ.) పాములవాఁడు, అహితుండికుఁడు. "ఎ, గీ. వ్యాళసంగ్రాహినామమైవఱలునార, డీఁడసం గనుబాములవాఁడనంగ, గారడియనంగహస్తసంగతకుదంగ." అం, భా. ప్ర. పా.

**గారడీఁడు.** వై. వి. (గారడము+ఈఁడు.)——వై.——

**గారము.** వై. వి. గారవముయొక్క రూపాంతరము. (గొప్పతనమునకు.—"గీ. జోగిబొబ్బమెకమయిగారపుంగుజ్జలెవ్వరు." అచ్చ. బాల, కాం.—ప్రేమమునకు.—"ఇలనెందుఁదల్లిదండ్రులగారవూరఁగాఁబెరిగి." ఘో. ౬, ఆ.

**గారవము.** వై. వి. 1. గొప్పతనము; 2. ప్రేమము*. "క. ఆరాజర్షియుదానికిఁ, గారణమమ్మునియకాఁబ్రకాశజ్ఞానో, దారమతినెఱిఁగి కన్నియ, గారవమునఁగొని పులస్త్యకడకుంజనియెఁ." నిర్వ. ౨, ఆ.

**గారవించు.** వై. స. క్రి. 1. గౌరవపఱచు; 2. ఆదరించు. "సీ. కార్తికేయునిఁకూలిగారవించి, ముద్దాడునెడఁ జూచిమోదంబు ఖేదంబుఁ బొడమనెమ్మనములోఁగొడుకునిట్లు, పాటింపఁడేఁదండ్రి పని యేమి." ఉ, హరి. ౫, ఆ.

**గారవిల్లు.** వై. అ. క్రి. గౌరవపడు, (రూ. గారవిలు. "సీ. తన వంశకర్తనుత్సలబాంధవునిఁబోలుఁ గరములర్థిలిఁజాఁచిగారవిలుట." విజ. ౨, ఆ.)

**గారాబము.** వై. వి. 1. గొప్పతనము; "క. వారలలోఁగౌసల్యా, నారీమణియఖిలపావనశ్రీమద్గ, ర్భారూఢలక్షణంబుల, గారాబముఁ జెందెవిభుఁడు కడురంజిల్లఁ." రామా. 3, ఆ.—2. ప్రేమము*. "శా. మావారందఱునన్ను భాగ్యవతిగామన్నించిగారాబముఁ, గావింపందగుదాన." శృం. 3, ఆ.

**గారాబు.** వై. వి. గారాబముయొక్క రూపాంతరము. (ఈ పదము కలదని నిర్ణయించుటకుఁదగిన గ్రాంధికప్రయోగము దొరకినది కాదు.)

**గారాము.** వై. వి. గారవముయొక్క రూపాంతరము. (గొప్పతన మునకు.—"క. ఈరమణిక్రియావతియును, పేరనుబరఁగుననిపల్కి ప్రేమముతోడన్, గారామారఁగఁబెనిచిన." రామా. ౭, ఆ.—ప్రేమమునకు.—"నీదుగారాపుఁబట్టి." భార. స్త్రీ. ౨, ఆ.)

**గారు.** దే. అవ. పూజ్యత్వమును దెలుపునది. (అయ్యగారు, అమ్మగారు.)

**గారుడము.** సం. వి. అ. పుం. 1. గరుడపచ్చ; 2. విషమంత్రము. విశ. గరుడునిది.

**గారుడికుఁడు.** సం. వి. అ. పుం. పాములవాఁడు.

**గారుత్మతము.** సం. వి. అ. న. పచ్చ, మరకతము.

**గారె.** వై. వి. అచ్చుమినుపపప్పువడ. (చూ. ఔఁగు.)

**గార్దభము.** సం. వి. అ. పుం. గాడిద, రాసభము.

**గార్భిణము.** సం. వి. అ. న. గర్భిణులసమూహము. (గర్భిణి=చూలాలు.)

**గార్హపత్యము.** సం. వి. అ. పుం. ఒక శ్రౌతాగ్ని.

**గార్హస్థ్యము.** సం. వి. అ. న. గృహస్థధర్మము.

**గాలకాఁడు.** దే. వి. (గాలము+కాఁడు.) చేఁపలనుపట్టువాఁడు, కైవర్తుఁడు. "అనిమిషముగాలకానికెట్లు." భార. అను. ౫, ఆ.

**గాలము.** దే. వి. చేఁపలనుబట్టుటకు ఉక్కుకస్తితో వంకరగాఁజేసిన సాధనము, బడిశము. (దీనిభేదములు ఉంటగాలము, గోరుగాలము అని. ఇదియె గోరుగాలము.)

**గాలవము.** సం. వి. అ. పుం. లొద్దుగుచెట్టు. పు. ఒకానొకముని.

**గాలాము.** దే. వి. గాలముయొక్క రూపాంతరము. "సీ. వాలారుగోరుపెన్గాలాముచేసినేజేజేహిరణ్యాక్షశిశుకమునకు." పాండు. ౨, ఆ.

**గాలి.** దే. వి. 1. వాయువు; 2. మృగములదేహవాసన. "సీ. ఎగుచుకూఁతలుముట్టెయెత్తిబిట్టాలించిగమికిఁగన్నాకయిగాలియరయు." స్వా. ౪, ఆ.—3. పిశాచము. (దీనికి గాలిసోఁకినట్లున్నది.)

**గాలించు.** దే. స. క్రి. 1. బియ్యములోనగువానిని నీళ్లలోపోసి రాళ్లులేకశోధించు; 2. వెదకు. "కోటగవఁకులారసిబలితంపుఁదేరులుగాలించి." అచ్చ. యుం, కాం.

**గాలికుంటు.** దే. వి. పశువులకు గొరిజలయందు పుండుపడెడు వ్యాధి.

**గాలిగాఁడు.** దే. వి. గాడిద. "తేవృగుజ్జముగాలిగాఁడుగాడిదయనఁగనుఖరమురాగిలుచుండు." వేం.

**గాలిగుడి.** ద్వ. వి. సూర్యచంద్రులకుఁ జుట్టునేర్పడెడు మండలము, పరివేషము.

**గాలిగొను.** దే. అ. క్రి (గాలి+కొను.) గాలిపాఱు. (చూ కలిమము.)

**గాలిగ్రుడ్డు.** దే. విశ. పేద. (అప్ర.)

**గాలిచూలి.** దే. వి. 1. అగ్ని; 2. భీముఁడు; 3. హనుమంతుఁడు. (ఇట్లు గాలిపట్టి, గాలిబిడ్డఁడు మొ.)

**గాలిదిండి.** దే. వి. (గాలి+తిండి.) సర్పము, పవనాశనము. "గీ. మీలుకప్పలుతాఁబేళ్లుగాలిదిండ్లు, మొసళ్లు లెంద్రులునెగడులుమొదలుగలుగు, నీరుత్రిమ్మరిపద్ధువులు." అచ్చ. యు, కాం.

**గాలినెచ్చెలి.** దే. వి. అగ్ని, వాయుసఖుఁడు.

**గాలిపంట.** దే. వి. నిర్ణయములేనిపంట.

**గాలిపటము.** ద్వ. వి. బాలక్రీడాసాధనవిశేషము.

**గాలిపడగ.** ద్వ. వి. గాలిపటము. "గీ. ఆలజాలంబునీరిలోనాను జాడ, గాలిపడగయాకసమునఁగ్రాలుత్రోవ, నిదురలోపలఁగల దోఁచునీడఁబిదపఁ, గానవచ్చునెయప్పుడ గన్నఁగాక." ఉ. హరి. ౫, ఆ.

**గాలిమాట.** దే. వి. లోకప్రవాదము, జనశ్రుతి.

**గాలిమేపరి.** దే. వి. సర్పము. (ఇట్లు గాలిమేఁతరి మొ. చూ. గాలిదిండి.)

**గాలివాన.** దే. వి. గాలితోడివాన, ఝంఝ.

**గాలివేఁత.** దే. వి. 1. గాలికొట్టుట; 2. జ్వరభేదము.

**గావు.** దే. వి. బలి. "గీ. గొప్పచింబోతుకదుపులఁగూర్చినీకు, గావువెట్టింతుఁజుమ్మియోగంగనమ్మ." నీలా. ౧, ఆ.

**గావుకోడి.** ద్వ. వి. మూలికావిశేషము.

**గావుపట్టు.** దే. స. క్రి. 1. చంపు; "సీ. కడుఁదురీఁగయుఁభోలె వడిఁదోలికఱచి యాకస్తూరిదుప్పులగావుపట్టు." సా. ౧, ఆ.—2. నాశముచేయు. "ద్వి. పొదలెడుపురుషార్థములగావుపట్టి, మదము మాత్సర్యంబుమట్టిమల్లాడి." విష్ణు. పూ. 3, ఆ.—వి. గట్టిపట్టు.

**గాసటబీసట.** దే. వి. సలక్షణముగానిచదువు. "ఉ. భాషరభారతార్థములభంగులనిక్కమెఱుంగనేరమిన్, గాసటబీసటేచదివిగాథలు త్రవ్వితెనుంగువారికిన్, వ్యాసమునిప్రణీతపరమార్థముతెల్లఁగఁజేసినట్టియ, జ్ఞానకల్పులందలఁతునాద్యులనన్నయతిక్కనార్యులన్." లక్ష్మీ. ౧, ఆ.

**గాసము.** వై. వి. ఆహారము. "వ. పసరేఁగిబేసంబులుగాసంబులు గొని." భాగ. ౮, స్కం.

**గాసి.** దే. వి. శ్రమము. (నాకిప్పుడు మిగుల గాసిగానున్నది.)

**గాసిఁబడు.** ద్వ. అ. క్రి. (గాసిన్+పడు.) బాధపడు. "క. స్త్రీసంతోషించుతెఱం, గానపడనిమనసుగలుగునట్టియధముఁడి, చోఁ చనడిఁగనుఁజనియచోఁ, గాసింబడు జమునిభటులుగాఁజేయవెట్టన్." భార. అశ్వ. ౪, ఆ.

**గాసిఁబెట్టు.** దే. స. క్రి. (గాసిన్+పెట్టు.) బాధించు. "క. అసభసమ్మైయినీదు, శ్యాసనుండపాండుపుత్రసతిఁగ్రూరాత్మం, దైశంకలేకపెద్దయు, గాసింబెట్టంగనెఱిఁగికలఁగినమదితోన్." భార. స్త్రీ. ౨, ఆ.

**గాసిచేయు.** ద్వ. స. క్రి. నాశముచేయు. "చ. అనవుడుశస్త్రదంబుతోలఁకాడఁగనిక్కమునట్లకాకయు, వననిధిదాఁటిలంకయును వానివనంబునుగానిచేసినం, దనుఁదెగఁజూచివచ్చినవిధంబదియల్పులచేతఁదీరునే." నిర్వ. ౭, ఆ.

**గాసియగు.** దే. అ. క్రి. (గాసి+అగు.) నాశమగు. "ఎ, గీ భూపతిలేకున్నమంత్రిజనము, అధిపకృషిసేయుటయును బేహారమాడు, టయునుగోరక్షకావించుటయును మొదలు, గాఁగబ్రదికెడితెరువులుగాసిగావె." భార. శాం. ౨, ఆ.

**గాసిల్లు.** దే. అ. క్రి. 1. బాధపడు; 2. శ్రమపడు; 3. కోపపడు. (రూ. గాసిలు. బాధపడుటకు.—"క. మునియిట్లునెమ్మిఁగాంచినఁ, గనియతఁడాఁకొనుటఁజేసిగాసిలియుంచోఁ, గనువాఁడన్నోశన్నభక్ష్యం, బనుచుండఁగవచ్చితివిప్రప్రియంబుగనసుఢ్యున్." భార. అశ్వ. 3, ఆ.—కోపపడుటకు.—"క. వాసవుఁడునందగోపుఁడు, చేసినయపరాధమునకుఁజిత్తములోనన్, గాసిలిమేఘగణంబుల, లో సంవర్తాఖ్యజలదలోకముఁబిలుచన్." వి. పు. ౭, ఆ.) (మొదటి రెండర్థములకును ప్రేరణమందు రూపము గాసించు.)

**గాహనము.** సం. వి. అ. న. స్నానము, మునుక.

**గాహితము.** సం. విశే. (అ. ఆ. అ.) మునిఁగినది.

**గాళకుఁడు.** దే. విశే. 1. ధీరుఁడు; "ఉ. గాళకులాపురీభటశిఖామణులెక్కటియుక్కుతునుక్కలా, భీలతరాశనుల్ చిదిమిపెట్టినబంటులువైరికల్లబే, తాళుఁడువచ్చిడగ్గఱిన దబ్బఱగా దొకదెబ్బతీయఁగాఁ, జాలుదురేమిచెప్పమఱిసాదనమేలున సాహసంబునన్." విజ. ౧, ఆ.—2. ప్రౌఢుఁడు. "గీ. అనుచునెల్లవేల్పులనుగొల్చి మునుకబ్బ, ములనుఁగన్నగాళకులనుదలఁచి." నీలా. ౧, ఆ. "గీ. గోలగానిమిగులగాళకురాలుగా దింతి." నీలా. 3, ఆ.

## గి.

**గి.** దే. అప. నిందయందుహ్రస్వాదియైన అమ్రేడితశబ్దముయొక్కయాద్యక్షరమునకువచ్చెడియాదేశము. (చంద్రుఁడుగింద్రుఁడు, చిలుకగిలుక, వరములుగిరములు మొ.)

**గింగురు.** దే. వి. వింటినారినుండి బాణము వెడలుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. తెగగింగురనఁబాపిదృష్టి సంధించి, తెగ నేయుటయు." హరిశ్చ. ౧, భా.

**గింజ.** దే. వి. 1. విత్తు; 2. బ. ధాన్యము.

**గింజుకొను.** దే. వి. బిడ్డలు వెలికిలఁబండుకొనియేడ్చునప్పుడు కాళ్లువిదిలించు. "శ్రీరమ్యాంఘ్రియుగంబుగింజుకొనుచున్." హరి. పూ. ౫, ఆ.

**గింటెన.** దే. వి. దింటెనచూ.

**గింటెము.** దే. వి. జంటనేతవస్త్రము. "గీ. మడఁతపసిమిడిగింటెముల్ మంజిడిజిగి, చోమతెరమంచములుహసంతులుజవాది, యగలుసిరులుచిన్నెలుగాఁగనతఁడుకడపెఁ, జలినెలలు." కళా. ౭, ఆ.

**గిండి.** దే. వి. సన్నపుమెడగలచెంబు, భృంగారము.

**గిచ్చు.** దే. స. క్రి. గీచుయొక్కరూపాంతరము.

**గిజిగాఁడు.** దే. వి. పచ్చపిట్ట.

**గిజ్జిగాఁడు.** దే. వి. గిజిగాఁడుయొక్కరూపాంతరము.

**గిజగిజ.** దే. వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.

**గిజగిజగొను.** దే. అ. క్రి. (గిజగిజ+కొను.) తత్తఱపడు. "క. తఱచగుచుఁబింజపింజయుఁ, గఱచుచుమిడుఁగుఱులుసెదరఁగడు మిడుతలచాల్, తెఱఁగున నడపెడుచిలుకలు, గిఱికొనఁ బఱపుట యువాఁడుగిజగిజగొనుచున్." అచ్చ. యు, కాం.

**గిజగిజలాడు.** దే. అ. క్రి. (గిజగిజలు + ఆడు.) —— పై ——

**గిజోరు.** దే. వి. మామిడిపండుతొలనగువానియందుండుజేనము.

**గిటక.** దే. విశే. పొట్టి, వామనుఁడు.

**గిటగిట.** దే. వి. పండ్లుకొఱుకుటయందగు ధ్వన్యనుకరణము. "వ. ఇటటెలుండుగిటగిటంబండ్లుకొఱికి." స్వా. ౫, ఆ.

**గిటగిటన.** దే. విశే. 1. అల్పము; "వ. హేమకూటంబుగిటగిటన" కాశీ. ౧, ఆ.—2. కృశము; "వ. నానాటికినగుచున్నయట్ల గిటగిటనగుచున్నది." ఆము. ౫, ఆ.—3. సూక్ష్మము. "వ. అందులకు సామగ్రిగిటగిటన." ఆము. ౧, ఆ. (విశేషణమగుచో "గిటగిటనినడుము." చూ. అలకన.)

**గిటగిటమను.** దే. అ. క్రి. (గిటగిట+అను.) వడఁకు. "క...... ర్రేఁగునగిటగిట, మనుసెన్నడుమేమయగునొ యనియడుకొంకన్, గనకపుఁగట్టిడినాఁడో, ఇనజాసనుఁడనఁగ వనితవళులింపెడుగున్." ప్రభా. ౨, ఆ.

**గిట్ట.** దే. వి. 1. పశువులకాలిగోరు. ఖురము; 2. బాణము. "వనసునేడుతూపుల వృషభునిఁదొమ్మిదిగిట్టల." అచ్చ. యు, కాం.

**గిట్టించు.** దే. అ. క్రి. గిట్టుబడియగు. ప్రే. చావఁజేయు.

**గిట్టింపు.** దే. వి. 1. గిట్టుబడి; 2. చావు. (చూ. అరగింపు.)

**గిట్టు.** దే. అ. క్రి. 1. అనుకూలించు; 2. చచ్చు; 3. సహించు.

**గిట్టుబడి.** దే. వి. అమ్మకమునందలి లాభము.

**గిడస.** దే. విశే. పొట్టి, గిటక, వామనము.

**గిడిగిల్లు.** దే. వి. బ. నమస్కారము. "రగడ. భక్తిసారమునఁబ్రజలు జగత్పతి, కినసంచెంచిన గిడిగిల్లోయని." హంస. ౪, ఆ.

**గిడిసు.** దే. వి. పలుహవిశేషము. "వ, గీ. తుడుమునంగనుదముకు నాగిడియయనఁగ, నాగజంబనఁదద్వైరనామములగు." (ఇక్కడ తచ్ఛబ్దమునకు తమ్మటమర్థము.) అం, భా. ప్ర. సా.

**గిడుగు.** దే. క. కామలేనిగొడుగు.

**గిడ్డ.** దే. విశే. పొట్టి, వామనుఁడు.

**గిడ్డంగి.** అన్య. దే. వి. 1. సరకులుంచియుంచెడు యిల్లు; 2. చెఱసాల.

**గిడ్డి.** వై. వి. ఆవు, ధేనువు". "వేల్పులగిడ్డికానినాడనవెమోషతర్ణకము." కాశీ. ౬, ఆ.

**గిడ్డు.** దే. వి. శ్యేనవిశేషము.

**గిత్త.** దే. వి. 1. ఎద్దుపట్టనికోడె; 2. వృషభము.

**గిద్ద.** దే. వి. శాలయందు నాలవభాగము.

**గిద్దు.** దే. వి. గిడ్డుయొక్కరూపాంతరము.

**గినియ.** వై. వి. కటభి*చూ.

**గినుమాడు.** దే. స. క్రి. (గినుము+ఆడు.) వంచించు. "మ. తనునాహ్వాయిచుఁజేసిరేపుగృహకృత్యంబుల్పొనర్పిందొడం, గిసతల్లింగినుమాడి." హరి. పూ. ౫, ఆ.

**గినుము.** దే. వి. వంచన.

**గిన్నియ.** దే. వి. గిన్నె.

**గిన్నె.** దే. వి. త్రాగెడుగిన్నె, చషకము. (గిన్నియయొక్కరూపాంతరము.)

**గిబ్బ.** దే. వి. 1. అచ్చుటెద్దు; 2. వృషభము. "వ. ఆఁకొనిన బెబ్బులికినబ్బినగిబ్బలవిధంబునం బడినబలుతూనుములను." ఉ, హరి. 3, ఆ.

**గిబ్బరౌతు.** ద్వి. వి. శివుఁడు, వృషభవాహనుఁడు.

**గిర.** సం. వి. అ. స్త్రీ. వాక్కు.

**గిరక.** దే. వి. నూతిరాట్నము, ఘటయంత్రము.

**గిరగిర.** దే. వి. తిరుగుటయందగు ధ్వన్యనుకరణము. "చ. ప్రచండమండలా, గ్రముజళిపించుచున్గిరగిరందిరుగన్నెగవైచిపట్టుచున్." కళా. ౬, ఆ.

**గిరణము.** సం. వి. అ. న. మ్రింగుట.

**గిరదా.** హిం. విశే. గుండ్రని, జాట్టును చుట్టియుండు చెంద్రుకలు.

**గిరవు.** దే. వి. కుదువ. "సీ. కనుదోయిమేటిఁగలుకరంటుకూపుల కడగిరవుగాఁబెట్టితేహరిణనయన." విక్ర. ౭, ఆ.

**గిరసు.** దే. వి. పంచ. పాటుంబోతు, పిటిక, సమంఛిరుష.

**గిరాకి.** గా. విశ. వెల యధికమైన, ప్రియమైన.

**గిరాటువేయు.** దే. స. క్రి. (జాయి) ఋవ్వు.

**గిరి.** సం. వి. ఇ. స్త్రీ. మ్రింగుట. పుం. 1. కొండ; 2. అచ్చన గాయలు; 3. నేత్రరోగవిశేషము. విశ. పూజ్యము.

**గిరిక.** సం. వి. అ. స్త్రీ. 1. చిట్టెలుక; 2. శేలగ; 3. వసురాజు భార్య; 4. పార్వతి; 5. ఎథవ; 6. అడవిమల్లెచెట్టు. పుం. ము. బొంగరము.

**గిరికర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. దింటెనచెట్టు.

**గిరిగిటలు.** దే. వి. బ. ఆడునప్పుడు వాయించెడు కంచుతాళము. "ద్వి. పసిడిపానంబు, గిరగిటల్ గాఁబట్టికేళికల్ సేయు." భల్లా. ౨, భా.

**గిర్గిటులు.** దే. వి. బ. గిరిగిటలుయొక్కరూపాంతరము. "ద్వి. గెడ గూడిపసిఁడిగిరిటలఁగేళికలు." భల్లా. ౨, భా.

**గిరిజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. మాదిఫలముచెట్టు. అ. న. ము. 1. అభ్రకము; 2. ఆయము; 3. శిలాజిత్తు. విశ. కొండ యందుఁబుట్టినది.

**గిరిధరుఁడు.** సం. వి. ఉ. పుం. విష్ణువు, గట్టుతాలుపు.

**గిరిమల్లిక.** సం. వి. అ. స్త్రీ. కొండమల్లెచెట్టు.

**గిరియకము.** సం. వి. అ. పుం. అచ్చనగాయలు.

**గిరిశుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, కొండయల్లుఁడు.

**గిరిసెము.** వై. వి. శిరీషముచెట్టు.

**గిరిస్తని.** సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

**గిరీశుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. హిమవంతుఁడు; 3. బృహస్పతి.

**గిఱిక.** దే. విశ. గిటక, పొట్టి.

**గిఱికతాడు.** ద్వి. వి. హింతాలముచెట్టు.

**గిఱి.** దే. వి. వలయాకారపురేఖ. (వాఁడు గీచినగిఱిదాఁటఁడు.)

**గిఱికొను.** దే. స. క్రి. చుట్టుకొను. "క. ఉఱికమదీయాంగం బులు, గిఱికొనునట్లేయుటయును." భార. ఉద్యో. ౪, ఆ.

**గిఱిపిల్లాఁడి.** దే. వి. స్త్రీలు కాలధరించెడి మూడవ వ్రేలి పిల్లాణి.

**గిఱుకు.** దే. స. క్రి. 1. అక్షరములు బటువుగానేర్పడవ్రాయక వంకరకొంకరగాగీచు; 2. తప్పువ్రాఁతను తుడుచు. వి. తుడుపు.

**గిఱుక్కు.** దే. వి. మరలుటయందగు ననుకరణము. "గిఱుక్కునఁ మరలివ్రేసెనొకండొకజాలెడేఁగ." చంద్రా. ౨, ఆ.

**గిఱుపు.** దే. స. క్రి. 1. (కన్ను) త్రిప్పు; "సీ. అనిపల్కిక్రమ్మ ఆఁజనఁ జూచుచోపేరిత్రేఁడు జోదులఁగన్గిఱిపియదల్చుటయు." అచ్చ. యు, కాం.—2. కదలించు. "ఇక్కడనక్కడనూడఁజూచి మేగిఱుపఁగ." నిర్వ. ౭, ఆ.

**గిఱ్ఱు.** దే. వి. తిరుగుటయందగు ననుకరణము. (గిఱ్ఱునఁదిరిగె.) (ఇది మఱికొన్ని యర్థములందునువచ్చును. "ద్వి. దుడిదుడివచ్చి తత్తోయంబులొడికి, నడికిగిఱ్ఱునుచుఁదొండములువేవేగ, ముడిచి పాఱెడిని." రా. అర, కాం. ఆమ్రేడితమునందు గిఱ్ఱుగిఱ్ఱు. "ద్వి. గిఱ్ఱుగిఱ్ఱునఁగులగిరులనూఁగించు, నొత్తైవాయువులుబిట్టూల యుచు వినరె." భాగ. ౧౦, స్కం.)

**గిఱ్ఱుపురుగు.** ద్వి. వి. చెట్లయందుండి యెల్లప్పుడు గిఱ్ఱుమని కూయునట్టి యొక పురుగు.

**గిలక.** దే. వి. 1. గిలగిలమ్రోఁగుబాలక్రీడాసాధనము; 2. గిల గిలమనిమ్రోఁగెడి యినుపఁగటిబిల్ల. "గిలకలున్న వెదురుఁగోలఁ బట్టి." పంచ. నా. ౨, ఆ.

**గిలకచెట్టు.** దే. వి. ఘంటారవచెట్టు.

**గిలకబండి.** దే. వి. చిన్నచక్రములబండి.

**గిలకరించు.** దే. స. క్రి. 1. గిలకొట్టు; 2. చిలుకు; "సీ. దుగ్ధాబ్ధి గిలకరింతురెనిలింపులుతొల్లి యాయాసవముచవియెటేఁగిరేని." రుక్మాం. 3, ఆ.—3. మ్రోఁగు. "ఎ, గీ. మొలకనగవులుమొగ మున గులకరింపఁ, దళుకుఁదేనియనుడువులఁదొలకరింపఁ, గలికి చూపులువీనులబలకరింప, శాలపునడపులనందియల్ గిలకరింప." చంద్రా. 3, ఆ.

**గిలకొట్టు.** దే. స. క్రి. 1. వ్రేళ్లతోకలఁచు; "షే. కెరలించి యమృతంబు గిలకొట్టఁగారాదెముద్దుఁజూపెడి వీరిమోవులందు." పాండు. ౧, ఆ.—2. కుదిలించు; "ఉ. పాలడలోనఁబోసి చనుఁబాలు నెయింగిలకొట్టి." స్వా. ౧, ఆ.—3. వ్రేళ్లతో పుణుకు. (చూ. కిలకొట్టు.)

**గిలగిలచెట్టు.** దే. వి. గిలకచెట్టు.

**గిలాబ.** హిం. వి. గచ్చుచేయుట.

**గిలి.** దే. వి. భయము. (పులిపోయిననుగిలిపోలేదు.)

**గిలిగించు.** దే. స. క్రి. గిలిగింతపెట్టు. "చ. వెలికిలిపజ్జమీఁదఁ గడువిప్పుగుకన్నులచాయలొప్పఁజె, క్కిలిగిలిగించి వ్రేతలునగిఁ వఁగ." హరి. పూ. ౮, ఆ.

**గిలిగింత.** దే. వి. చక్కిలిగింత.

**గిలిగింతచెట్టు.** దే. వి. గిలకచెట్టు, గిలగిలచెట్టు.

**గిలిగిచ్చ.** దే. వి.——పై.——

**గిలిగిలి.** దే. వి. గిలిగింత. "చ. కెళవులవారిచూపుగిలిగిల్లుమొఱం గఁగవేళగోరుచుణ్." నై. ౬, ఆ.

**గిలిగిలించు.** దే. స. క్రి. (చూ.) గిలిగించు.

**గిలిగిలింత.** దే. వి. గిలిగింత. "సీ. లలిఁగపోలంబులుగిలిగిలిం తలువుచ్చినవివ్వంపఁగలకలనవ్వినవ్వి." హరి. పూ. ౫, ఆ.

**గిలుకు.** దే. వి. మెట్టెలులోనగువానియందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. గిలుకుమెట్టెలచవ్వళ్లుగులకరింప." హరిశ్చ. ౨, ఆ.

**గిలుపు.** దే. స. క్రి. (కన్ను) గిఱుపు. "వ. అచ్చెలులువిభునకుం గన్నుగిలిపి." రామా. ౪, ఆ. (గిఱుపుయొక్కరూపాంతరము.)

**గిలుబాడు.** దే. స. క్రి. (గిలుబు+ఆడు.) అపహరించు. "గిలు బాడుఁదల్లిపైఁగలపసిండి." పాండు. 3, ఆ.

**గిలుబు.** దే. వి. అపహారణము.

**గిలుబుకొను.** దే. స. క్రి. గిలుబాడు. "రగడ. సురువిందన దెగిలుబుకొనియెఁబయ్యరదొంగ." స్వా. 3, ఆ.

**గిలుబుసేయు.** ద్వి. స. క్రి. (గిలుబు+చేయు.)——పై.—— "కృతవీర్యనర్థంబుగిలుబుసేసికొనిడాఁచియున్నవారని భార్గవులనెల్లఁబలికిన." భార. ఆది. ౭, ఆ.

**గిల్లకన్ను.** దే. వి. మెల్లకన్ను. "సీ. వింతవానిఁగటాక్షవీక్షణంబు నఁజూచుకేనలయొప్పివహించు గిల్లకన్ను." సం. "కటాక్షయతి వాన్యంవైకేకరాక్షీతుసాభవేత్." కాశీ. ౨, ఆ.

**గిల్లచూపు.** దే. వి. మెల్లచూపు. "ద్వి. పిల్లికన్నులు బల్లపెరిగిన కడుపు, గిల్లచూపులుఁజాలఁగిజికొన్నబొచ్చు." నవ. 3, ఆ.

**గిల్లు.** దే. స. క్రి. 1 నఖక్షతముచేయు; 2. ఆకులలోనగువానిఁ గోయు. వి. నఖక్షతము.

**గిల్లుడు.** దే. వి. నఖక్షతము.

**గివులు.** దే. స. క్రి. గీఱుయొక్క-రూపాంతరము. "చ, గీ. వెడలు బితెండకుసుకరద్వృక్షముడిగి, వార్షికమెయిక్క-త్రోటినిరవ్యంక పక్ష, తులనుగివులుచువెజ్జిచూపులనురంబు, కెలఁకులుగనుంగొన చుఁగానఁగేకులుండె." ఆము. ౪, ఆ.

**గిళనము.** సం. వి. అ. న. తినుట.

**గిళితము.** సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

## గీ.

**గీ.** దే. అవ. నిందయందు దీర్ఘాదియైన ఆమ్రేడితశబ్దముయొక్క- ఆద్యక్షరమునకువచ్చెడి యాదేశము. (దేవుఁడుగీవుఁడు, పాలిగీలి, సాత్వికిగీత్వకి మొ.)

**గీఁక.** వై. వి. పీనుఁగుకూఁత, బృంహితము.

**గీఁకు.** దే. స. క్రి. కత్తిలోనగువానితోఁగీఁచు.

**గీఁటు.** దే. స. క్రి. 1. (పండ్లు) కొఱుకు; "మ. అగ్నపిడి గోడాపెకాపపాన్ప్రగ్రుండురాజునయోనిన్నసెఱంగరాకదలుఁడం చుల్ బండ్లుగీఁటకవడిన్." పాంచా. ౪, ఆ.—2. (కన్ను) గిలుపు; "క. మునుదక్షుఁడభవుఁబలుకఁగఁ, గనుఁగీఁటినభగునిఁబట్టి కన్నులుపెకలిం, చెనునందీశ్వరుఁడచ్చటి, జనములహాహారవంబునం దడిగొలుపన్." భాగ. ౪, స్క-ం.—3. చిమ్ము. "క. తూలుచు డగ్గఱికోఁగిటఁ, గిలించుచుఁగన్నునీరుగీఁటియతెనిపై, ధూళివెనఁ దుడిచినెమ్మొగ, మూలోకించుచునుబున్యుఁడనుఁజానికనియెన్." వాసి. ౪, ఆ. (చూ. నాఁడు రెండవయర్థము నుదాహరణము)

**గీఁత.** దే. వి. గీటు, రేఖ.

**గీఁతకట్టియ.** ద్వి. వి. వడ్లవాఁడు గీఁతలుగీయుట కుపయోగించెడుపలక, (రూ. గీఁతకట్టె.)

**గీచు.** దే. స. క్రి. గీటుగీచు.

**గీటడఁగు.** దే. అ. క్రి. చచ్చు. "సీ. జననాథశల్యుఁడునమసె సాలుఁడు గీటడఁగెనులూకుండుమడిసెసకల, సంశప్తకులుఁగడచనిరి." భార. శల్య. ౧, ఆ. (ప్రే. గీటడఁచు.)

**గీటు.** దే. వి. గీఁత, రేఖ.

**గీటునఁబుచ్చు.** దే. స. క్రి. అనాదరించు. "క. వినివినినివానిచందం, బునఁగీటునఁబుచ్చి." జై. ౮, ఆ. "వ. వీఁడునంయమివరుమాటగీటునంబుచ్చితనవలసినట్లుచేయువాఁడయ్యె." భార. సా. ౨, ఆ.

**గీట్లబద్ద.** ద్వి. వి. కాకితములలోనగువానియందు గీట్లువేయుట కుపయోగించెడు కోల.

**గీతము.** సం. వి. అ. న. పాట. విణ. పలుకఁబడినది.

**గీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పద్యభేదము; 2. పాట.

**గీఁపెట్టు.** ద్వి. అ. క్రి. (గీఁక+పెట్టు.) 1. పీనుఁగుకూయు; "సీ. కేల్గలమెకములగీపెట్టుటలునుమావులనకిలింతల్గలవుఁదేర్ల, రొదలు కాలరులయార్పులువాయిదమ్ములమ్రోఁతలునొక్క-టై." అచ్చ. యు, కాం.—2. మొఱపెట్టు; "సీ. అలమిగీపెట్టింతుమలుకఁగోఁలలు నూఁటిపైవచ్చుభూదారవతులనైన." హంస. ౨, ఆ.—3. శబ్దించు. "క. మదిరాక్షిజంఘలంగజా. గదలగుసూదాఁకఁగావ, గాహళలవియే, నమగుపడకగీఁట్టక, పదకుడివోఁగోగదేర్చిపలుకకయున్నె." పాండు. 3, ఆ. (గీఁపెట్టు ఇది మట్టుపెట్టుట యుక్తము.)

**గీము.** వై. వి. ఇల్లు. "సీ. పరిశోధయయుష్మత్పాపనలుపనిజామమృతుప్వపనిల్చుగీముగాదె." ఉ. రా ౫, ఆ.

**గీయు.** దే. స. క్రి. గీఁతగీయు.

**గీరనంగింజెలు.** దే. వి. బ. బాలికా క్రీడావిశేషము. (చూ. అచ్చనగండ్లు.) (రూ. గీరనగింజెలు.) "ఉ. వాడుచిరత్నరత్నమయసౌధములన్ బరినైనైకనన్యకల్, గీరనగింజెలాడుటకుఁ గ్రిందడజాందినదివ్వరత్నముల్, పౌరులుత్రొక్కు-చుంజుఁగఁబాడుకొనన్ ధరణీపురంధ్రికిన్, బాకరత్నగర్భయన నామముపెట్టిరిసక్క-శిక్షరుల్." శకాం. ౨, ఆ.

**గీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రింగుట.

**గీర్వాణము.** సం. వి. అ. పుం. దేవభాష.

**గీర్వాణుఁడు.** సం. వి. అ. పుం. దేవుఁడు. వేల్పు. గీర్వాణ.

**గీఱ.** దే. వి. గీఁత, రేఖ.

**గీఱు** దే. స. క్రి. 1. గోఁకు; 2. భేదించు. "క. గీఱుగీఱునవ్వక్ కులబుద్ధిఁగల్పైపచయముల్." లక్ష్మీ. ౧, ఆ.

**గీఱుగాజులు.** ద్వి. వి. బ. ఒకవిధమైన గాజులు.

**గీఱుడు.** దే. వి. 1. గోఁకుడు; 2. భేదనము.

**గీఱునామము.** దే. వి. గీఱగలిగిననామము. "సీ. కట్టుఁజెప్పులు గొప్పగీఱు నామంబులు మొలఁజెక్కు-గత్తులునిలువుపిగలు." నీలా. 3, ఆ.

**గీలు.** దే. అ. క్రి. స్రవించు. "చ, గీ. మనరజోవృష్టికిమీఁదికన్న మొగుడఁ, గటిదెనలునిక్క-బరితోలుగడలగీలు, మదముతిక్తతనదుల కేఁదదనుకృరద్వృ, పాలితోఁదేంట్లుపలవఁగోరాడెఁగరులు." ఆము. ౪, ఆ.

**గీవు.** దే. వి. గిరవుయొక్క-రూపాంతరము. (అప్ర.)

**గీష్పతి.** సం. వి. ఇ. పుం. బృహస్పతి, (రూ. గీర్పతి.)

## గు.

**గుంజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గురిజ*; 2. అవ్యక్తమధురధ్వని; 3. ఉప్పళము; 4. తప్పెట.

**గుంజాటన.** గ్రా. వి. వ్యసనము.

**గుంజిలిపెట్టు.** దే. స. క్రి. గోపనముచేయు. "నీచేవయిటెంగి కాదెమునుచెప్పక గుంజలి పెట్టియున్కి-." పంచ. వేం. ౪, ఆ.

**గుంజిళ్లు.** దే. వి. బ. చేతులుకట్టుకొని రెండుకాళ్లుచేర్చిపెట్టి కూర్చుండిలేచుట.

**గుంజె.** వై. వి. స్తంభము*.

**గుంజెనుసుఁగు.** దే. స. క్రి. పరిహాసముచేయు. వి. ఎలుఁగు గొడ్డాట.

**గుంజు.** దే. స. క్రి. 1. ఈడ్చు; "సీ. కరముష్టిదండమొక్క-ఁడు శిరసివోనైచెనంజకొక్క-ఁడు శిఖగుంజియడిచె." హరిశ్చ. ౪, ఆ. ("సీ. అనిచిన్నికూఁకటిఁబెనఁచినజడఁబట్టిగుంజ యూడిచిచెంపఁగొట్టితిట్టి." హరిశ్చ. ౫, ఆ. ఇత్యాదిస్థలములయందు ఈడిచి కొట్టియనఁగా చేయిచక్క-గాఁజాఁచి కొట్టియనియర్థము.)—2. ఉదుకు. "సీ. పాదంబులిరుచేతఁబట్టిగుంజాండు జర్జరితంబుగావీనిఁజట్టుజాత." కాశీ. 3, ఆ.—వి. 1. తాడు ఈఁదులోనగు

వానిమోవఁ్రమొదలు; ...". ఈఁతగుంజుమొదలుగఁదినదొరఁకొనియె ఆనము." కాశ. ౩, ఆ.-2. తాటిచేఁగమొనయందు బుఱ్ఱలోనుండెడు గిజురు. (కొన్నిచోట్ల పుల్లలోని మొదటికిని అర్థమగుచున్నది.)

**గుంజులాడు.** దే. స. క్రి. (గుంజులు+ఆడు.) లాగులాడు.

**గుంట.** వై. వి. 1. గోలను; 2. పల్లము; 3. భూపరిమాణవిశేషము; 4. చెఱువు*; "సీ. దేశసైశాల్యమర్థసిద్ధికినిమూల, మిలయొకం తైవగుంటకాల్వలురచించి, నయముఁజేవకునరిఁగోరునను నొనంగి, ప్రబలఁజేసినసర్థధర్మములుపెరుఁగు." ఆము. ౪, ఆ.

**గుంటక.** దే. వి. దున్ని విత్తులుచల్లినవెనక నేల సవరచేయుసాధనము.

**గుంటక్రోవ.** ద్వ. వి. ఒకదినుసు పిరంగి.

**గుంటగలగర.** ద్వ. వి. భృంగరాజము‡.

**గుంటగలిజేరు.** ద్వ. వి.———వై.———

**గుంటచోళ్లు.** ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. అలంపులు.)

**గుంటమూలము.** వై. వి. గృహవిశేషములయందు కడయొత్తుల మీఁదనుండి గుజ్జులనడిమికిఁ జొప్పించెడి చిన్నదూలము.

**గుంటనక్క.** వై. వి. చిన్నజాతినక్క, కిఖ.

**గుంటప్రాయ్య.** ద్వ. వి. గుంటత్రవ్వి యేర్పఱచినపొయ్యి. (చూ. ప్రొయ్యి.)

**గుంటి.** దే. వి. 1. చేసిభాగము; 2. దున్నుటమొదలగువాని కేర్పఱచుకొన్నభాగము.

**గుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) (దూళిమొదలగువానిచే) కప్పఁబడినది.

**గుండ.** యు. దే. వి. గుడ్డయొక్కరూపాంతరము. "సీ. ఎండగట్టిన కావిగుండలకెంజాయచిగురుజొంపంబులచెన్నుఁబెంప." య. ౨, ఆ.—వై. పొడి.

**గుండఁగి.** దే. వి. నీరుకోడి.

**గుండఁడు.** దే. వి. దాసుఁడు. "గుండనికెంబసిండిపనిగోర." హంస. ౫, ఆ.

**గుండకము.** సం. వి. అ. పుం 1. దుమ్ము; 2. నూనెపాత్రము; 3. అవ్యక్తమధురధ్వని.

**గుండగొయ్య.** ద్వ. విణ. (గుండ+కొయ్య.) దుష్టుఁడు.

**గుండము.** వై. వి. నిప్పులగుంట. "ద్వి. ఈగుండములుత్రొచ్చి యొలమిఁజుట్టియును, జాఁగిలిపడియుండుసర్పముల్ పెక్కు." రా. యు, కాం.

**గురఁడా.** దే. విణ. ధీరుఁడు.

**గుండిగ.** వై. వి. వెడల్పునోరుగల లోహపాత్రము*.

**గుండియ.** దే. వి. హృదయము. "సీ. పాంచజన్యధ్వని పర్విన గుండియలవిసిచేష్టింపలేకలసియలసి." హరి. ఉ. ౭, ఆ.

**గుండిలము.** సం. వి. అ. పుం. మద్దెలమ్రోఁత.

**గుండీ.** వై. వి. బరణి*; బొత్తాను.

**గుండు.** వై. వి. 1. గుండ్రపుకాయి*; 2. తూనికగుండు; 3. పిరంగిగుండు*; "చ. వేలుపుఁదొరతుపుగొప్పపిరంగినిజాయ సుతిదులోఁ, గొఱతెడుపిన్న మానికపుగుండుఘటించియగాదు చేసినన్." కవి. ౪, ఆ.—4. కపిలెగుండు*; 5. పెద్దకాయి*; "గీ. వెదురఘనమైనయొకశిలఁగెడియఁబోయి, విరులకండూతి వాయ బిట్టొరసికొనఁగ, నంటుకొనెనధ్వరాశ్వమగ్గుంటితోడ, జిసురు గడతొఁకివివాగంబుగగిలిసట్లు." వై. ౪, ఆ.—6. కొండ. "స్త్రీ. నిడుదవెన్ను గయాళి తొడవుల దొరయుండుగుండుగండెనఁగఁ గై చెండుచేసి" అచ్చ. సుం, కాం.

**గుండుకొను.** ద్వ. స. క్రి. చుట్టుకొను. "క. గుండుకొనిచూచు మానిసి, తండముఁదోలఁగంగఁద్రోచితక్కరివెసనా, చండాలు దెచ్చిభూజన, మండలికభిషిక్తుఁజేసెమంత్రులుచూడన్." హంసి. ౪, ఆ.

**గుండుగిలు.** వై. అ. క్రి. చుట్టువడు. "చ. జయమునఁబొంగి పెల్లుగనిశాచరవల్లభుఁడార్వసేనలున్, బ్రియమున నొక్క పెట్టనలి రేఁగిరవంబు చెలంగనార్చినన్, భయమునదండుగుండుగిలఁ బాఱుడునాసమవర్తియెంతయున్, రయమునసుద్భటారుణతురంగ సమూహరథాధిరూఢుఁడై." నిర్వ. ౫, ఆ.

**గుండుగుత్త.** వై. వి. సమస్తస్వాతంత్ర్యముతోడ నిచ్చెడుగుత్త.

**గుండుజెల్ల.** ద్వ. వి. పెద్దగంప.

**గుండుపులుఁగు.** ద్వ. వి. చక్రవాకము.

**గుండుములుపుగాఁడు.** దే. వి. పక్షివిశేషము.

**గుండె.** దే. వి. 1. హృదయము; 2. మనసు. "గీ. తల్లిచనుఁబాలు గ్రుక్కుఁడుతక్కనయవి, పుట్టెఁడును నొకరూపనుభూమిఁబరఁగు, నుడువుబొంకయ్యెఁ జన్నిత్తుఁదొడలమీఁద, గుండెవట్టియుంచు కలెడవుండవన్న." హరి. పూ. ౫, ఆ. (గుండియయొక్కరూపాంతరము.)

**గుండెకాయ.** దే. వి. హృదయము. "గీ. కపటధర్మకంచుకంబున వెలసిరి, గాని సత్యపురుషకారపరులు, కారుపాండుసుతులువారల నమ్మంగఁ, గాదుచేతగుండెకాయయిడిన." భార. శల్య. ౨, ఆ.

**గుండ్ర.** వై. విణ. వృత్తియందు గుండ్రమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. గుండ్రకంబము, గుండ్రకడుపు మొ.)

**గుండ్రతుంగ.** ద్వ. వి. (గుండ్రము+తుంగ.) ఒకదినుసు ముస్త‡.

**గుండ్రన.** వై. వి. వర్తులత*.

**గుండ్రము.** వై. విణ. వర్తులము*. (కొన్నియెడల వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. గుండ్ర.)

**గుండ్రలు.** దే. వి. బ. 1. పిండికొట్టిచెరుగఁగా వెనుకనిలిచిన ఉండలు; 2. చెటకురాట్నపుకంబములు. "మ. ఇలకున్ వ్రేఁగుగఁ బండుతీరవనపుంక్రేతుచ్ఛటల్ తీవుల, గ్గలమైవ్రాల నురుస్వనంబులెనఁగంగాఁద్రిప్పరాట్నంపుగుం, డ్రలునాఁదేనెకొలంకులంబొరలిపారన్ విచ్చుపంకేరుహం, బులనాడెందొలుకంఁదేటివల యంబుల్ తారఝంకారముల్." ఆము. ౪, ఆ.

**గుండ్రలుకొలుపు.** దే. అ. క్రి. గుడ్లగూబకూయు. "క. కాకంబులువాపోయెడి, ఘూకంబులునగరఁబగలుగుండ్రలుకొలిపెన్." భాగ. ౧, స్కం.

**గుండ్రాయి.** ద్వ. వి. (గుండు+ఱాయి.) పొత్తరము.

**గుండ్రించు.** దే. అ. క్రి. కడుపుత్రిప్పు.

**గుండ్రింపు.** దే. వి. గుండ్రించుట. (చూ. ఆరగింపు.)

**గుంత.** వై. వి. 1. పల్లము; (చూ. కొలి.) 2. పటేఁదిమీఁది గుంట*. (గుంటయొక్కరూపాంతరము.)

**గుంద్ర.** సం. వి. అ. స్త్రీ. 1. నాగముస్త‡; 2. ప్రేంఖణము‡. పుం. ము. కాకిచెఱకు‡.

**గుంధము.** సం. వి. అ. పుం. గంధము.

**గుంపించు.** దే. స. క్రి. 1. కుప్పవేయు; "క. ఘూకంబులున్న గుహాకును, వాకిటఁగాస్తములుఁద్రుణముపడిగుంపింపఁగా, వేకదిని చిరంజీవియు, దాకొనితననుక్కుకొఅవిఁదగిలించెవడిగా." పంచ. నా. 3, ఆ.—2. అతిక్రమించు. "క. చంపినఁజచ్చెదననుచును, గంపింపకయోరిపడుచకరినోక్తులనగా, గుంపించెదుచాపునకుం, దెంపరియైపదరువానిలెఱఁగుసఁగుమతీ." భాగ. 2, స్కం.

**గుంపు.** దే. వి. ప్రాణిసమూహము.

**గుంపెన.** దే. వి. 1. ఒకానొకచెట్టు; "ఎ, గీ. పూగములనవ్య కుసుమపరాగమెసఁగె, నిమ్మలందునులేతపూరెమ్మలమరె, నసలఁ జెనఁగొనెఁజిన్నిగుంపెనలగుంపు, అభినవంబగు నావసంతాగమమున." కవి. ౨, ఆ.—2. విజృంభణము.

**గుంఫనము.** సం. వి. అ. న. మాటలులోనగువాని కూర్పుట.

**గుంఫము.** సం. వి. అ. పుం. 1. మాటలులోనగువానికూర్పు; 2. బాహుభూషణము.

**గుంఫించు.** సం. అ. క్రి. గుంఫితమగు. "మ. అసురాంతకమర్థితంబులగు లీలారామ కల్పద్రుమ, ప్రసవంబుల్ కసుగందవయ్యో విలసత్పాటీరగోరోచనా, ఘుసృణాలేపనపంకితాకలనమైగుంఫించె." భీ. ౪, ఆ.

**గుంఫితము.** సం. విణ. (అ. ఆ. అ.) కూర్పఁబడినది.

**గుంబము.** దే. వి. గుమ్మముయొక్క రూపాంతరము.

**గుగ్గిలపుఁజెట్టు.** దృ. వి. గుగ్గులువృక్షము

**గుగ్గిలము.** వై. వి. గుగ్గులువృక్షపుబంక*.

**గుగ్గిళ్లు.** దే. వి. బ. ఉడుకవేసినసెనగలులోనగునవి, అభ్యూషము.

**గుగ్గులువు.** సం. వి. ఉ. పుం. గుగ్గిలపుఁజెట్టు.

**గుచ్ఛకము.** సం. వి. అ. పుం. 1. పూగుత్తి; 2. నెమలిపురి; 3. పొద; 4. ముప్పదిరెండు మణులుగ్రుచ్చినహారము.

**గుచ్ఛము.** సం. వి. అ. పుం.——పై.——

**గుజరీ, గుజిరీ.** గ్రా. వి. సంతచోటు.

**గుజస్తా.** హిం. విణ. గడచిపోయిన.

**గుజారతు.** హిం. వి. వశము.

**గుజగుజ.** దే. విణ. పీడితము. "క. గజముమదముడిగితిరుగుచు, గుజగుజయైగేఁకవెట్టఁగులితము విడిచెగా, భుజబలముచెడఁగనింద్రుఁడు, గజబిజితోఁబొంగదెననుఠకడిమిజగంబుల్." భాగ. ౬, స్కం.

**గుజగుజఱేకులు.** దే. వి. బ. బాలిక్రాక్రీడావిశేషము. "గుజగుజఱేకులుగొబ్బిళ్లు." హంస. ౫, ఆ.

**గుజగుజలాడు.** దే. అ. క్రి. (గుజగుజలు+ఆడు.) త్రొక్కటపడు. "ద్వి. ఈవిధినుత్తరంబీకయొండొరులు, నీవ్రునీవనిచూచి నిఖిలసన్మునులు, గుజగుజలాడఁగన్గొని." పారిజా. ౧, ఆ.

**గుజగుజపోవు.** దే. అ. క్రి. (గుజగుజ+పోవు.) త్రొక్కటపడు. "క. కాచినకావలివారలు, చూచిభయాకులతనొంది ప్రుక్కుచుఁదమలో, నోచెల్లయిట్లుదానవ, రాచూలికిఁజూలునిలిచెరాయిబృంగిగా. క. అనిగుజగుజపోవుచు." భాగ. ౧౦, స్కం. ఉ. (వ్యా. గుజగుజలుపోవు. "క. గుజగుజలుపోవుచున్నారును, గజిబిజయయ్యునార్తు." భాగ. ౧౦, స్కం.)

**గుజరాతి.** వై. వి. 1. ఘూర్జరదేశము*; "సీ. గుజరాతికెంపులు గోమేధికంబు లుదారవజ్రములుముక్తాఫలములు." కవి. 3, ఆ.—2. ఘూర్జరభాష*. "ఎ, గీ. ఆరబిపారసిగుజరాతియాదెమర్చి, తెనుఁగు కన్నోజమొదలుగాఁదెలిసెప్రౌఢ, దారిగన్నట్టివాఁడు." య. ౧, ఆ.—3. నాట్యవిశేషము*. "సీ. నాట్యభేదంబుల నావు ముల్ వనరుజక్కిడిగుజరాతిదేఱజలకఁగ." హం. భా. ప్ర, నా.

**గుజిరీ.** వై. వి. ఘూర్జరదేశము. "గద. చెప్పుఁజూపుఁగరాదుముక్కుముసిముసిగుజకీతివారులు." శుక. ౧, ఆ.

**గుజోతి.** దే. విణ. పరవంతుఁడు.

**గుజ్జరు.** దే. వి. గిడుసుయొక్క రూపాంతరము.

**గుజ్జరాతి.** వై. వి. ఘూర్జరదేశము*, 2. ఘూర్జరభాష*. (గుజరాతియొక్క రూపాంతరము.)

**గుజ్జరి.** వై. వి. ఘూర్జరదేశము. "గుజ్జరినిద్రాగతటక్కురాణులులో." చంద్ర. (రూ.) గుజ్జేరి. (గుజరీయొక్క రూపాంతరము.)

**గుజ్జు.** యు. దే. వి. అనకగురసద్రవ్యము. "సీ. గుజ్జుగాఁగాఁచిన గోక్షీరపూరంబు జమిలిమండెఁగలపైఁజల్లిచల్లి." వై. ౭, ఆ.—వై. 1. కుబ్జత్వము*; "ద. తనయులగుజ్జమానటకుఁ దండ్రిగనుంగొని వంతసించి." రా. బా, కాం.—2. పొట్టియెద్దు*. "గీ. మేటి గుజ్జులఁగట్టినపాటబండి, యెక్కి శీఘ్రంబుమందకునేగెనెలమి." హరి. పూ. ౫, ఆ.—3. గుంటకగుజ్జు*; 4. దూలపుగుజ్జు*; 5. బండిపఱపుగుజ్జు*. విణ. పొట్టివాఁడు*. "గీ. గూనివాఁడును బిచ్చకకుంటుగుజ్జుఁ, గొలుచులమ్ముచోఁగ్రచ్చులుకలపినరకుఁ, దూఁచిపెట్టెడుచోటులఁదూన్కిపఱపి, పూర్వభవమున లోభంబుఁ బొందినారు." భార. అను. ౫, ఆ.—6. పొపటపు గుజ్జు.

**గుజ్జుపొట్ల.** వై. వి. పొట్టికాయలుగల పొట్ల*.

**గుజ్జుమామిడి.** దృ. వి. పొట్టిదినుసుమామిడి, రాజామ్రము*.

**గుజ్జువేలుపు.** దృ. వి. వినాయకుఁడు.

**గుజ్జనగూళ్లు.** దే. వి. బ. 1. (గుజ్జె+ఎన+కూళ్లు.) బాలక్రీడావిశేషము; (చూ. అచ్చనగండ్లు.) 2. బాలికలాడుకొను నప్పుడు గురుగులతో వండిన వంటకము.

**గుటక.** దే. వి. ఒకతూరి నోటఁబోసికొని మ్రింగెడు నీళ్లులోనగువాని కొలఁది.

**గుటగుట.** దే. వి. 1. అన్నముడుకుట నీళ్లుత్రాగుటలోనగువాని యందగు ధ్వన్యనుకరణము; 2. పండికూఁత; "క. వడిసులికొలు పుటయుసునిరు, గడలకా వెనువంకఁజేరికఱవఁగఁగినుకకా, గుడినెడమదిరుగునెడమకా, గుడిదిరుగుకా సాగిపోకగుటగుటలడరకా." య. ౨, ఆ. (ఒకానొకచోఁ బులికూఁతగాను బ్రయోగింపఁబడియున్నది.)—3. బ. పెద్దలేకపుమాటలు. "వ. అటమటమ్మునవిద్య గొనుటయుంగాకగుటగుటలుగురువుతోనా." సాన. ౫, ఆ.

**గుటుకు.** దే. వి. గుటుక్కుయొక్క రూపాంతరము. "క. కటుక మగువిమమువిమధర, కటకంబగుకేలఁబూని కౌతూహలియై, ఘుటికా సంసిద్ధుఁడు రస, ఘుటికయనుంబోలెశివుఁడుగుటుకునమ్రింగె." భీ. ౪, ఆ. (ఆమ్రేడితమునందు గుటుగుటుకు. "గ్రుక్కగ్రుక్కకుగుటుగుటుకుమనుచు." భాగ. ౧౦, స్కం. పూ.)

**గుటుక్కను.** దే. అ. క్రి. (గుటుక్కు+అను.) చచ్చు.

**గుటుక్కు.** దే. వి. మ్రింగుటయందగు ధ్వన్యనుకరణము. "ఈ. భువనకోటిగుటుక్కునమ్రింగిపుత్తునే." కవిక. ౨, ఆ.

**గుట్ట.** వై. వి. 1. చిన్నకొండ; "వ. నలునింబిలిచినీవువానర వరులుతెచ్చి యుండిచ్చుగట్టుగుట్టలం గట్టకట్టినవసధికట్టువడు." రామా. ౭, ఆ.—2. రాశి*; "వ. నెమ్ములరాసులును, ప్రేవుల ప్రోవులును, కండలతిప్పలును, శిరంబులగుట్టలునుంగలిగి." నిర్వ, శేషము. ౧౧, ఆ.—3. కొండ. "సీ. వలిమెట్టునాకుఁగావలి పట్టుచేవరసామిగుట్టకునేను సామినౌడయ." చంద్రా. ౨, ఆ.

**గుట్టు.** వై. వి. మర్మము*.

**గుట్టుఁబేసు.** దవ్య. వి. (గుట్టు+పేసు.) రాజమంత్రము బయలు పడుట. "చ. పలుకులువేయునేమిటికిఁబార్థివుఁడాత్మభుజాభృతక్ష మా, తలముసగుట్టుఁబేసుబహుధాయరయించియడంచిచంచలా, త్ములగమిలోమెలఁగుపురుషుండను బోలెనశంకనించుచున్, మెలఁ గఁడయేనిరాజఫలమేయదిరాజ్యముదుఃఖలబ్ధికే." ఆము. ౪, ఆ.

**గుట్టుసాకిరి.** వై. విశే. వాది తనవ్యవహారము గెలుచుటకొఱకు రప్పింపఁగావచ్చి దాఁగియుండి ప్రతివాదియొక్క మాటలన్నియుఁ జక్కఁగావిన్న సాక్షి.

**గుడ.** సం. వి. ఆ. స్త్రీ. 1, గుళిగ; 2. జెముడు*; 3. ద్రాక్ష*. అ. పుం. ము. 1. బెల్లము; 2. గోలి; 3. ఏనుఁగుకవచము.

**గుడక.** వై. వి. 1. టెంకాయబుఱ్ఱలోనగునది*; 2. పాలడ*. "క. చాలఁగనిచ్చలువెన్నయుఁ, బాలుంగుడకగొనితల్లిపట్టికిసెల విన్, వ్రేలిడియింతింతియకాఁ, గ్రోలించునువెరవుతోడరుచిగొలు పుక్రియన్." హరి. పూ. ౫, ఆ.

**గుడత్వక్కు.** సం. వి. త్. న. లవంగపుఁబట్ట.

**గుడత్వచము.** సం. వి. అ. న.——పై.——

**గుడపుష్పము.** సం. వి. అ. పుం. ఇప్ప*.

**గుడఫలము.** సం. వి. అ. పుం. గోనుగు*.

**గుడాక.** సం. వి. ఆ. స్త్రీ. నిద్ర.

**గుడాకు.** మి. వి. గ్రా. (గుడము+ఆకు.) బెల్లముతోఁజేర్చి మర్దించిన పొగాకు.

**గుడాకేశుఁడు.** సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. శివుఁడు.

**గుడారము.** వై. వి. వస్త్రముచేత నేర్పఱచిన యిల్లు, దూష్యము.

**గుడారు.** వై. వి. గుడారము. "క్రొందళుకుఁజందురు కావిగుడారులో." భాను. ౨, ఆ.

**గుడి.** యు. దే. వి. 1. ఇకారరూపాంతరనామము; 2. పరివేషము; "సీ. పరివేషనామంబుభాసిల్లుచుండునుగుడియనఁబరిదినాగుడు సనాఁగ." ఆం, భా. ప్ర. ది.—3. వలయాకారపురేఖ. "గీ. పరిఖగుడివోలెఁదనచుట్టుఁదిరిగియుండ." నై. ౨, ఆ.—వై. దేవాలయము*.

**గుడిక.** సం. వి. ఆ. స్త్రీ. గుళిగ.

**గుడికట్టు.** దే. వి. గ్రామము నాలుగుదిక్కుల యెల్లలయేర్పాటు.

**గుడికొను.** దే. అ. క్రి. క్రమ్ము. "క. వడముడిశల్యునిఁ దొడిఁబడఁ, బుడిసిటిపట్టుగను బట్టి పుడమివడంకన్, బడవైచినయెడ నౌడలన్, గుడికొనుదుమ్మతఁడుతుడిచికొనుచుంజనియెన్." పాంచా. ౨, ఆ. "క. అడలుచుఁబెదవులుతడుపుచు, గుడికొనుకన్నీరుగ్రుక్కికొనుచున్మదిలో, నుడుగనినెంజిలినేమియు, నుడువనియమ్మానధనుఁగనుంగొనివేగన్." స్వా. 3, ఆ.

**గుడిగి.** దే. వి. మోఁకాలివఱకుఁదొడిగికొను వస్త్రకవచము.

**గుడిగుడి.** దే. విశే. అల్పము. "ద్వి. గుడిగుడికన్నీరుగ్రుక్కుచు." పారిజ. ౨, భా.

**గుడిచుట్టు.** దే. వి. చంద్రసూర్యులకుఁ జుట్టునేర్పడు మండలాకారము, పరివేషము.

**గుడిజెల్ల.** దవ్య. వి. మత్స్యవిశేషము.

**గుడిదిరుగు.** దే. అ. క్రి. (గుడి+తిరుగు.) గుండ్రముగాతిరుగు. "క. కుమ్మరిసారెగుడిదిరుగుకొనెడువిధమునన్." జై. ౫, ఆ.

**గుడిసె.** యు. దే. వి. ఒకవిత్తు చింతపండు. వై. స్తంభములుగోడలునుంచక మెల్లెలునాటితృణాదులతో నేర్పఱచిన చిన్నయిల్లు.

**గుడుక్కు.** దే. వి. గుటుక్కుయొక్కరూపాంతరము. (ఆమ్రేడితమునందు గుడుగుడుక్కు. "ద్వి. ఉడుగకవెడలు నిట్టూర్పుల తోడ, గుడుగుడుక్కున మ్రింగుగ్రుక్కిళ్లతోడ." నళ. ౫, భా.)

**గుడుగుడు.** గ్రా. వి. 1. చిన్నహుక్కా; దే. వి. 2. పరుగెత్తుటయందగు ధ్వన్యనుకరణము (గుడుగుడుమని పరుగెత్తివచ్చెను.)

**గుడుగుడుగుంచెములు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. కుందెనగుడి.)

**గుడుగురావిలము.** దే. వి. పక్షివిశేషము. "సీ. కార్కొడిగముల క్రొక్కారంపు సందడిగుడుగురావిలములబెడఁగుసారము." చంద్రా. ౨, ఆ.

**గుడుసరి.** దే. విశే. (గుడుసు+అరి.) కపటముగలవాఁడు.

**గుడుసు.** దే. వి. పరివేషము. (చూ. గుడి.)—విశే. గుండ్రము. "సీ. గుడుసైనపూవింటఁగూడికమ్మనితూపుకటకాముఖపుఁగేలఁగరముమెఱయ." నై. ౭, ఆ.

**గుడుసుకయిదువు.** దే. వి. విష్ణుచక్రము. (ఇట్లు గుడుసువాలు మొ.)

**గుడుసువడు.** దవ్య. అ. క్రి. (గుడుసు+పడు.) గుండ్రమగు. "క. మార్వీటంకృతిదిక్కులఁ, బర్వఁగశార్ఙ్గంబుగుడుసువడఁదిగుచుచు." హరి. ఉ. ౬, ఆ.

**గుడూచి.** సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

**గుడ్డ.** దే. వి. వస్త్రము.

**గుడ్డము.** దే. వి. చేను. "క. ఎడ్డెతనపుఁగ్రైనేఁతల, రడ్డులునడచిరి పురస్సరద్బాభర్యముగా, గుడ్డంబుచక్కఁగట్టం, బడ్డమహాశక్తిదివ్య భవనంబునకున్." పాండు. 3, ఆ.

**గుడ్డాము.** దే. వి. గుడ్డముయొక్కరూపాంతరము.

**గుడ్డి.** దే. వి. అట్టచెమ్మ ఆటలో వెలికిలఁబడ్డ ఒంటికాయ.

**గుణకము.** సం. వి. అ. పుం. పెంచెడులెక్క.

**గుణపడు.** మి. అ. క్రి. (గుణము+పడు.) చక్కఁబడు.

**గుణము.** సం. వి. అ. పుం. 1. ఐశ్వర్యాది; (ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము. ఇవి భగవంతుని షడ్గుణములు.) 2. త్యాగశౌర్యాది; 3. త్రాడు; 4. వడము; 5. అల్లెత్రాడు; 6. మడుఁగు; (ఇనుమడుఁగు, ముమ్మడుఁగు మొ.) 7. శబ్దాది; (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. ఇవి యైదు భూతగుణములు.) 8. శుక్లాది; 9. సంధ్యాది; (ఇవి యాఱు—సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము.) 10. సత్త్వాది; (ఇవి మూడు—సత్త్వము, రజస్సు, తమస్సు. వీనికి శక్తులనియు నామాంతరము కలదు.) 11. ఇంద్రియము; 12. అప్రధానము; 13. అలవాటు. (కావ్యగుణములు—శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి, అని పది.)

**గుణవృక్షకము.** సం. వి. అ. పుం. ఓడకంబము.

**గుణాలయము.** సం. వి. అ. పుం. గుడారము.

**గుణి.** సం. వి. న్. పుం. విల్లు. విణ. గుణముగలవాఁడు.

**గుణించు.** సం. స. క్రి. గుణకముచేయు.

**గుణితము.** సం. వి. అ. న. హల్లులతో అచ్చులను హల్లులనుజేర్చి చెప్పుట. విణ. గుణింపఁబడినది.

**గుణు[illegible].** సం. వి. అ. పుం. భీముఁడు. విణ. వంటవాఁడు.

**గుణ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) గుణింపఁదగినది.

**గుత్త.** వై. వి. ఫలప్రదమైన యొకసొత్తును ఆ సొత్తుగలవానికి తగ్గ లాభము తగిన ధనమిచ్చి తన యనుభవమున నుంచుకొనుట.

**గుత్త[illegible]ఁడు.** దవ్య. విణ. గుత్తయెత్తినవాఁడు.

**గుత్తగొను.** దవ్య. స. క్రి. (గుత్త+కొను.) గుత్తయెత్తు. "క. ఇక్క లికి[illegible]గొనుఁబో, తక్కకదివిసిమిషమున్నదైవతవిటులక్." క[illegible]. 3, ఆ.

**గుత్తము.** వై. వి. 1. కచ్చితము*; (గుత్తపుకంచెల.) 2. బిగువు" క[illegible]. ?, ఆ.

**గుత్తి.** వై. వి. 1. పూవులోనగువానిగుచ్ఛము; 2. చీలమండ. "[illegible] గుత్తులకొలఁదికిఁగ్రుత్తంబులైపడియున్నపాదంబులొక్కొక్కచోట." నిర్వ. ర, ఆ.

**గుత్తికగువ్వ.** దవ్య. వి. గువ్వగుత్తిక*.

**గుత్తికవ్వము.** దవ్య. వి. వెదురుకొయ్యచివరనుచీల్చి దారముతోఁ గట్టి యేర్పఱచిన కవ్వము.

**గుత్తిపండ్లు.** దవ్య. వి. బ. గుత్తులుగుత్తులుగా పండెడు ఒక విధమైన పండ్లు.

**గుత్తిమల్లెలు.** వై. వి. బ. ధాన్యవిశేషము. "గీ. పచ్చగన్నెరుకస్తురి పట్టియలును, గుత్తిమల్లెలుఁబ్రౌఢిగాఁగూర్చిమజీయు, నకలజాతులఁబోషింపశక్తిగలిగి, హాలికులుచైత్రుఁదెగడుదురప్పురమున." భాను. ౧, ఆ.

**గుత్తివడు.** వై. అ. క్రి. (గుత్తి+పడు.) ముడుఁగు. "ఎ, గీ. కొన్నిచేతంబులివముచే గుత్తివడియె." కాశీ. ౧, ఆ.

**గుత్సకము.** సం. వి. అ. పుం. పూగుత్తి, గుచ్ఛకము.

**గుత్సము.** సం. వి. అ. పుం. 1. వరిలోనగువానిగంట; 2. పూగుత్తి; 3. ముప్పదిరెండుమణులుగ్రుచ్చినహారము; 4. గండి వనము*.

**గుదగుదలాడు.** దే. అ. క్రి. (గుదగుదలు+ఆడు.) డగ్గుత్తికతో నేడ్చు.

**గుదము.** సం. వి. అ. న. పాయువు, మూడి.

**గుది.** దే. వి. 1. ఆకులులోనగువానిగ్రుచ్చినసరము; "క. అనియొక గుదిమీలనడుమ, నెనయంగాఁదూటికఅచియిరుదౌడలఁద్రా, డొనరంగఁబట్టికొనిగ్రు, చ్చినచందము దోఁప మూర్ఛఁజెందిన భంగిన్." భార. శాం. 3, ఆ.—2. గుత్తి. "క. పదనెఱిఁగిచికిలిచేసిన, మదనునినునుఁదూపుఁదెగలుమధుఁడిగురులమేల్, పొదులని డెనసఁగమొగ్గల, గుదులుతలిరుఁగొమ్మలందుగుదిగొనిపొదలెన్." ఉ, రా. ౬, ఆ.

**గుదికాలు.** దే. వి. చీలమండకు దిగువనుండుపాదము వెనుకటి భాగము, పార్ష్ణి.

**గుదికూర్పు.** దే. వి. (చూ.) గుంఫనము.

**గుదిగజ్జ.** దే. వి. (గుది+కజ్జ.) దుష్టమగుగోవు మొదలుగాఁగలవానికి మెడనుగట్టెడు కొయ్య.

**గుదిగుంజెలు.** దవ్య. వి. బ. పసులదొడ్డిలోనగువానిద్వారమందు నిలువుగాఁ పాఁతిన కంబములు.

**గుదిగొను.** దే. అ. క్రి. (గుది+కొను.) 1. అతిశయించు; "ద్వి. మదివికారముగాఁ చెమ్మెచెమ్మరించె, గుదిగొనెవలపుకోర్కులు నందడించె." పల్నా. పూ. 3, ఆ.—2. చుట్టుకొను; "క. మొగ్గలు, గుదులుతలిరుఁగొమ్మలందు గుదిగొని పొదలెన్." ఉ, రా. ౬, ఆ.—3. మూటకట్టుగాఁ గూడుకొను. "మ. మదిరాపానవిదగ్ధచేష్టలఁగనుక్రమత్తిల్లిరక్తాయుఁడై, యెదురుండక్కు నెఱుంగలేకమిగులన్ పొదుపుమవాటిల్లఁగాఁ, బదములోతొట్రుపడఁగఁజొక్కుచుమతిభ్రాంతిన్బడంచాఱుచున్, గుదిగొంచున్వెడపాటఁబాఱుచు దుకూల్ప్రేలుచున్ గాలుచున్." హరిశ్చ. ర, ఆ.

**గుదిత్రాడు.** దే. వి. పూడకాలికిఁగట్టుత్రాడు.

**గుదిత్రోయు.** దే. స. క్రి. కాళ్లుకట్టిత్రోయు. "క. ఇదెయిచ్చెద నదెయిచ్చెద, నదపదనని యానఁజూపిపలువెఱఁగులనా. హృదయముఁబొందించితివఁక, గుదిత్రోసెదనేఁడునిన్నుఁగొంకకయుండన్." హరిశ్చ. ర, ఆ. "ద్వి. అటఁజనుచుండమిధాత్రపరిభ్రాంతి, నటియించినాలుచునతిక్రకుండు, గుదిత్రోసినట్లుహాసురునాథయనుచుఁ, జిక్కిలఁబడిహరిశ్చంద్రుఁడోసనియె." హరిశ్చ. ౨, భా.

**గుదియ.** వై. వి. 1. నాలుగుమూరలనిడివిగలదండము; "క. ఇవె ప్రేఁపయడవిప్రమథులు, ముదమునశతకోటిసంఖ్యముసరికొని ప్రియం, బుదలిర్పదీనఁగోలలు, గుదియలుఁగైకొంద్రుతమకుఁ గోరిధరింపన్." హరి. ఉ. ౬, ఆ.—2. గుదిగజ్జ.

**గుదియకట్టెలు.** దవ్య. వి. బ. గుదిగుంజలకడ్డముగాఁజొప్పించెడు కట్టెలు.

**గుదియతాలుపు.** దవ్య. వి. యముఁడు, దండధరుఁడు. "క. కొండలుపిండియొనర్తునొ, గండెనఁగఁగనలువగ్రుడ్లనగాచితునొ తే, చెండుదునొగుదియతాలుపు, కండలుగుండియలువెల్లఁగమినొంపుదునో." అచ్చ. సుం, కాం.

**గుదివడు.** దవ్య. అ. క్రి. (గుది+పడు.) కట్టువడు. "నిశ్చేష్టంబదద్వంద్వముల్ గుదివడ్డన్ బెగడొందియున్." భార. విరా. 3, ఆ.

**గుదె.** వై. వి. గుదియయొక్కరూపాంతరము.

**గుద్దలి.** వై. వి. వేళ్లుమొదలగునవి పెల్లగించెడు సాధనము, కుద్దాలము.

**గుద్దలించు.** వై. స. క్రి. 1. గుద్దలితోఁ బెల్లగించు; 2. వెదకు. "సీ. దండపాణ్యానవభాండేశ్వరంబులుఁ గుక్కుటస్థానంబుగుద్దలించి." కాశీ. ౨, ఆ.

**గునగున.** దే. వి. వేగముగా నడచుటయందగు ననుకరణము.

**గునపనకోడి.** దవ్య. వి. వనకుక్కుటము.

**గునపము.** దే. వి. గడ్డపాఱ, ఖనిత్రము. "ఎ, గీ. బలితంపు టినుపకట్లమరనొప్పు, వెండిగునపంబులోకాకవెండికట్ల, యినుపగునపంబులో యనఁదనరికురిసె, నెంతయును జిత్తజల్లుగనేదుముండ్లు." కళా. ౬, ఆ.

**గునామొలనూలు.** దే. వి. బిడ్డలుకట్టుకొనెడు కటిసూత్రవిశేషము. "ఉ. కెంపులరావిరేకజుమికీల్పులిగోరును జందమామసో, న్నంపుసరాలుగాజులు గునామొలనూల్ రవగజ్జె లందియల్." భానుమద్విజయము. ౧, ఆ.

**గునియు.** దే. అ. క్రి. 1. నర్తించు; ''వ. కావళ్లుమోచికొని యొండొరులతోడం బంతంబులాడుచు గునిసిగునిసి నడుచువారు ను.'' (ఇక్కడ గునిసియనఁగా ఇటునటుప్రక్కకుమేనువాల్చి యనుట.) వి, పు. ౭, ఆ.—2. కులుకు. ''సీ. నేలజేరాడకకేలఁగు చ్చెలుపూను కొనియాడిగపుఁజెలులేగునిసినడవ.'' శుక. ౧, ఆ.

**గునిసాడు.** దే. అ. క్రి. (గునిసి+ఆడు.) 1. నర్తించు; ''ఉ. క్రొన్నెలవంటినెన్నుదుటఁగుంతలములేగునిసాడుచున్నయా, చిన్నికుమారుఁగాంచి.'' బ్ర. ౫, ఆ.—2. కులుకు. (చూ. గుని యు.) (దీని మొదటిరూపము గునిసియాడు. ''ద్వి. కొండలుతల నెత్తిగునిసియాడుచును.'' రా. యు, కాం.) (చూ. ఊఁగాడు.)

**గునుకు.** దే. అ. క్రి. కొద్దిపరువుగా పరువెత్తు. వి. తృణవిశేషము. బ. తృణధాన్యవిశేషము.

**గునుపు.** దే. వి. విలాసవిశేషము.

**గున్న.** వై. వి. పిల్ల. (ఏనుఁగుగున్న, పందిగున్న, మామిడిగున్న మొ.)

**గున్నంగి.** దే. వి. పక్షివిశేషము.

**గుప్తకేళి.** సం. వి. ఈ. స్త్రీ. బాలక్రీడావిశేషము, దాఁగిలిమూఁతలు.

**గుప్తము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. కాపఁబడినది; 2. దాఁచఁబడినది.

**గుప్తరాగము.** సం. వి. అ. పుం. కేతకి, మొగలి*.

**గుప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కాపాడుట; 2. దాఁచుట; 3. చెఱ సాల; 4. పాఁతఅ.

**గుప్పళించు.** దే. స. క్రి. 1. వస్త్రము మొదలగువాని ఉసుము; 2. పుక్కిలించు; ''సీ. ననసీటగుప్పళించెనుగళావతియోర్తుజిగి మోవిబీఁటికలెగయకుండ.'' భాను. ౨, ఆ.—3. ఉంచు. ''గీ. అప్పుడొప్పులకుప్పకుప్పవిభులఁ, దప్పకందఱఁబ్రభులఁగందర్ప నిభుల, గొప్పకన్నులతెప్పలుబిప్పికనుచు, నిప్పుపూదండఁగొని నడల్‌గుప్పళించె.'' పాంచా. ౨, ఆ.

**గుప్పించు.** దే. స. క్రి. 1. (బాణాదులను) ప్రయోగించు; ''మ. కల్పాంతభైరవభీమాకృతినేచిభీష్ముఁడు శరవ్రాతంబు గుప్పించినన్.'' భార. భీష్మ. 3, ఆ.—2. కురియు. ''క. రప్పించి యధికసంభ్రమ, ముప్పొంగఁగనందగోపుఁడున్న వ్రజముపై, దెప్ప రపుఝాలవర్షము, గుప్పింపుఁడు గోగణములు గోపులు మడి యన్.'' వి, పు. ౭, ఆ.

**గుప్పిలి.** దే. వి. పిడికిలి. ''వ. గొప్పకన్నుఁగవఁగప్పురంపురజం బొప్పఁగుప్పుగుప్పనగుప్పిళ్లకొలందిగగుప్పుచు.'' రసి. 3, ఆ.

**గుప్పు.** దే. స. క్రి. 1. ఉంచు; ''ఉ. చెప్పినఁబ్రీతులైయతనిఁ జెచ్చెరఁదోఁకొనిపోయిబూరెలుం, బప్పునునెయ్యిఁబాయసముఁ బక్వఫలాదులునేత్రతృప్తిగా, గుప్పిరిమున్ పథశ్రమముగూరిననునికి దప్పిరిఅ.'' భో. ౭, ఆ.—2. చల్లు; ''సీ. పుయ్యరేకెమ్మోవిఁ బూఁదేనెసతులార గుప్పరేకపురంబుకొమ్మలార.'' చంద్ర.—3. (దూడపాలుత్రాగునప్పుడుతలతో) పొదుఁగునుపొడుచు; (చూ. అంటే.)—4. (బాణాదులను) ప్రయోగించు; ''మారుతూపు లంగుప్పిరిపీపు.'' ఉ, రా. ౬, ఆ.—5. విసరివైచు. ''గుదియల గుండ్లను జదియగుప్పియదరంటగడియలో నాఁగిపట్టుదుననువాఁ డును.'' హరి. పూ. ౬, ఆ.—వి. ఎగయుటయందును, మ్రోయు టయందును, వాననకొట్టుటయందును, వైచుటయందుననగు ననుకర ణము. (పొగగుప్పననెగయుచున్నది.) ''దేవదుందుభులుగ్రక్కున ధింధిమినాదవైఖరిన్ గుప్పునమ్రోసె.'' శశాం. ౨, ఆ. ''వ. కప్పురంపుటనఁటిగుప్పనంగప్పుతొవ్వల.'' ఉ, రా. ౬, ఆ. ''సీ. గుప్పుగుప్పనమోచికొనియున్నవలలతోఁ బలలంపుఁబొత్తగల్పాఱ వైచి.'' హ్వా. ర, ఆ.

**గుప్పున.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా. ''ఉ. అప్పుడువేళగాఁ దెలిసియచ్చెరువారఁగ మోడ్పుకేలుతో, గుప్పునమ్రోలవాలి.'' రామా. ౬, ఆ.

**గుబక.** వై. వి. తలుపుగందపట్టెమీఁదిగుబ్బ.

**గుబగుబ.** దే. వి. కోకిలధ్వనియందగు ధ్వన్యనుకరణము. ''సీ. గుబ గుబమనిపల్కుకోవెలపల్కులువినియవినేస్తువాయనుచునవ్వ.'' శశాం. ౨, ఆ.

**గుబాలు.** దే. వి. 1. గుబేలుయొక్కరూపాంతరము; ''గుబాలు నన్ లకుముకుల్ క్రందైపడున్ లేచు.'' ఆము. ౧, ఆ.—2. పగులుట యందగుధ్వన్యనుకరణము. ''దవులుగుబాలునంబగుల.'' శేష. ౧, ఆ. (ఇది యాకారమధ్యమనుటకుఁ దగినప్రయోగము దొరకి నదికాదు ) (చూ. గుబేలు.)

**గుబాళించు.** దే. అ. క్రి. వాననకొట్టు. ''వ. మించుపూవుతొవ్వల గుబాళించుతనపర్ణశాలఁబ్రవేశించె.'' ఉ, రా. ౭, ఆ.

**గుబిలి.** దే. వి. 1. ఒకానొకశకునపుపక్షి, కనకాక్షి; ''ఎ, గీ. వెల యుఁగనకాక్షిసకినాలపులుఁగుగుబిలి, పైఁడికంటినా.'' ఆం, భా. ద్వి. సిం.—2. గులిమి.

**గుబుకు.** దే. స. క్రి. 1. గుముకుయొక్కరూపాంతరము.

**గుబురు.** దే. వి. 1. దట్టము; 2. సమూహము. ''ద్వి. సరసమం దారమంజరులుగోయుచును, సురివెందపందిళ్లగుబురుడాయుచు ను.'' విష్ణు. పూ. ౨, ఆ.

**గుబులు.** దే. వి. 1. గుప్పనికొట్టువాసన. ''క. చొక్కపునడతోఁ దళుకుం, బుక్కాగుమగుమలుతట్టుపునుఁగుగుబులునల్, దిక్కుల నిండఁగనెంతయుఁ, జక్కనికాళిందియనెడుజవ్వనివచ్చెన్.'' చమ. ౧, ఆ. 2. భయము, గుండెకొనుట.

**గుబులుకొను.** దే. అ. క్రి. గుప్పనివాననకొట్టు. ''క. మేనన్, గొనబగు జవ్వాది తావి గుబులుకొనంగన్.'' శశాం. 3, ఆ.

**గుబుసు.** దే. వి. కిటుకు, కపటము.

**గుబేలు.** దే. వి. పడుటయందగు ధ్వన్యనుకరణము. ''క. మఘవా హితుఁడున్, దనపాటునఁనేరొఅగన్, బెనుగుబ్బలిపడినగతిగుబే లునఁబడియెన్.'' రామా. ర, ఆ.

**గుబ్బ.** వై. వి. 1. కుచము*; 2. గొడుగుమీఁదిగుబ్బ*; ''సీ. మండువేసవినాటిమార్తాండబింబంబుగోడగించుపసిండిగుబ్బతో డ.'' కాశీ. ర, ఆ.—3. తలుపు గందపట్టెమీఁదిగుబ్బ*; ''గీ. ఉదుటుగుబ్బలుగలతల్పుటురముఁజూచి.'' ఆము. ౨, ఆ.—4. బా ణమునలుఁగుక్రిందిగుబ్బ*. ''వ. ఒకటి రెండు మూడుగొరకల నెఱకలుగాఁడగుబ్బకొలందికిందిగవైచి.'' హ్వా. ర, ఆ.— విణ. గుండ్రమైనది*. ''గుబ్బచనుంగవ.''

**గుబ్బటిల్లు.** వై. అ. క్రి. తిరుగుడువడు*. (రూ. గుబ్బటిలు. ''చ. కలఁగెఁబయోనిధుల్ గిరులుకంపమునొందెఁజలించెభూమిది, క్కులువడఁకెన్ వియత్తలముగుబ్బటిలెన్ గ్రహతారకంబులు, త్తల పడఁజొచ్చె.'' భో. ర, ఆ.)

**గుబ్బతిల్లు.** వై. అ. క్రి. 1. అతిశయించు*; ''ఉ. షట్పదీ, మాలికఁదోఁచునబ్బురపుమబ్బులయుబ్బులుగుబ్బతిల్లఁగన్.'' వసు, ౧, ఆ.—2. ఉప్పొంగు*. (రూ. గుబ్బతిలు. ఉప్పొంగు టకు.—''క. బాలహరిణములఁజూచిన, క్రోలుపులిగతిన్ మనంబు గుబ్బతిలఁగ.'' జై. ర, ఆ.)

**గుబ్బన.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా. ''చ. గుబ్బనఁబలిచిత్త వృత్తిఁగనిభట్టి విదర్భుఁడుఁదానువేడుకన్.'' విక్ర. ర, ఆ.

**గుబ్బలాఁడి.** దృ. వి. (గుబ్బలు+ఆఁడి.) యౌవనముగల ఆఁడుది, యువతి.

**గుబ్బలి.** దే. వి. కొండ, పర్వతము.

**గుబ్బలివిలుకాఁడు.** దే. వి. శివుఁడు, శైలధన్వుఁడు. "క. అబ్బటువుపాలుదాల్పును, గుబ్బలివిలుకాఁడునంచగుజ్జుపుజాదుఁగ్, గొబ్బునవడ్డమువచ్చిన, నిబ్బరముగఁబోరనేఁడునిన్నుఁదెగటార్తుఁగ్." అచ్చ. యు. కాం.

**గుబ్బసరము.** వై. వి. పెక్కుదినుసుమణులుగ్రుచ్చినసరము. "కై. సరివాటుగాఁగఁగేనరములుగ్రుచ్చినగురివెందవిరిగుబ్బసరముతోడ." కళా. 3, ఆ.

**గుబ్బిక.** దే. వి. పక్షులులోనగువానికిఁబెట్టెడియురి. "గీ. జారకిరిపక్కులకుమోటునరనశలక, ములకుఁగట్టువయుపకాంతముఖ్యచలక, సంఘములకునుగుబ్బిక." హంస. ౨, ఆ.

**గుబ్బిరి.** దే. వి. ఒకానొకచెట్టు.

**గుబ్బిలికాఁడు.** దే. వి. పక్షివిశేషము. (చూ.) గుబిలి.

**గుబ్బు.** దే. వి. గుండెయదురుటయందగు ననుకరణము. "క. నిబ్బరపుదప్పిమంటలు, ప్రబ్బినధృతిలేకనేత్రపదహస్తంబుల్, గొబ్బున విపృతములగుచును, గుబ్బనుచున్నట్టికూఁతఁగూలెన్నేలఁగ్." భాగ ౧౦, స్క౦. పూ. (చూ. గుబ్బుమను.)

**గుబ్బుమను.** దే. అ. క్రి. (గుబ్బు+అను.) గుండెగుబ్బనియదరు. "దాననుగుండెగుబ్బుమన." కళా. ర, ఆ.

**గుబ్బురను.** దే. అ. క్రి. (గుబ్బు+అను.)———పై.——— "గీ. దండుసులభంబెపురుషవేదండులకును, గూచికావింపగుండెయల్గుబ్బురనఁగ." రా, వి. ౨, ఆ. (ఆమ్రేడితమునందు గుబ్బుగుబ్బురను. "వ. గుబ్బుగుబ్బురను నాదంబుల బ్రహ్మాండంబులన్నియు నదిరి." వీర. 3, ఆ.)

**గుబ్బెత.** వై. వి. (గుబ్బ+ఎత.) గుబ్బలాఁడి, యువతి.

**గుమగుమ.** దే. వి. 1. గుమగుమయనువాసన; (చూ. గుబులు.) 2. వాసనకొట్టుటయందగు ననుకరణము. "గుమగుమవలచు."

**గుమాను.** హిం. వి. అనుమానము.

**గుమాస్తా.** హిం. వి. క్రింది యుద్యోగస్థుడు.

**గుమి.** దే. వి. గుంపు, సమూహము.

**గుమికాఁడు.** దే. వి. కాకి, వాయసము.

**గుమితి.** దే. వి. గుమ్మితియొక్కరూపాంతరము. "శా. బాణావంకిణిఁబెద్దశత్తిగుమితిఁ బాణాసనప్రౌఢిమఁగ్, ద్రోణాచార్యులకైనఁ బల్కుదురునేర్పుల్." శశాం. ౨, ఆ.

**గుమిలి.** దే. వి. పక్షివిశేషము. (గుబిలియొక్కరూపాంతరము.)

**గుముకు.** దే. స. క్రి. పిడికిటితోపొడుచు.

**గుముడు.** వై. వి. గుమ్మడుయొక్కరూపాంతరము.

**గుమురు.** దే. వి. గుబురుయొక్కరూపాంతరము. (సమూహమునకు.—"ద్వి. తమతమవీథులఁదమదులోఁగిళ్ల, గుమురులుగాఁగూడి కొనిపల్కిరపుడు." రా. యు, కాం.)

**గుమ్మ.** దే. వి. పాలుపిండునప్పుడువచ్చెడుధార. "గుమ్మెఁడుపాలనామతునఁబంబరిత్యక్తిజనించఁగాని." భో. ర, ఆ.

**గుమ్మఁడు.** దే. విణ. అలంకరించుకొనువాఁడు.

**గుమ్మటము.** దే. వి. దీపముంచెడు కాళిత్రపుకూఁడు.

**గుమ్మడి.** వై. వి. కూష్మాండముఁ.

**గుమ్మతిలు.** దే. అ. వి. చెవికమ్మలవంటిచెవుసొమ్ము.

**గుమ్మము.** దే. వి. వాకిలి. ద్వారము.

**గుమ్మెత.** దే. వి. ఆయుధవిశేషము. "తమ్మిగుమ్మితిఁగాజేకొనిపేఁకమైమొఁలుచిమ్మఁదొడంగెన." శశాం. 3, ఆ.

**గుమ్ము.** దే. స. క్రి. పిడికిటితోపొడుచు. వి. 1. పిడికిటిపోటు; 2. వాసనకొట్టుటయందగు ననుకరణము. "ద్వి. నెమ్మేఁబొదలఁగొనిపిందివిపల, గుమ్ముననడివారి గురియించుదాని." అభిమన్యు సుందరి.

**గుమ్ముపా.** వై. వి. శ్రీపర్ణి. (ఇది ద్వివిధము—పెదగుమ్ముడు, చినగుమ్ముడు అని. ఇదే పెదగుమ్మడు.)

**గుమ్మెట.** దే. వి. వాద్యవిశేషము, డమరుము.

**గుమ్మెత.** దే. వి.———పై.———

**గుమ్మెతకాఁడు.** దే. వి. గుమ్మెతవాయించువాఁడు. "గుమ్మెతకానిగంటలఁగ్." హంస. ౫, ఆ.

**గుర్గుర.** వై. వి. పందికూఁత. "శి. గురగురధ్వనులనిష్ఠురముగఁబరిగినవెలసిబ్రహ్మాండంబునెదురుమ్రోయ." హరి. పూ. ర, ఆ.

**గురణము.** సం. వి. అ. న. యత్నము, (రూ. గూరణము.)

**గురిగి.** దే. వి. ఆఁడుపడుచులు ఆడుకొను చిన్నపిడత.

**గురిగింజె.** దృ. వి. (గురిజె+గింజె.) గురిజపూస, శిలాపాక.

**గురిజె.** వై. వి. గుంజ. (ఇది త్రివిధము—ఎఱ్ఱగురిజ, తెల్లగురిజ, నల్లగురిజ అని. ఇదే యెఱ్ఱగురిజ.)

**గురివెంద.** దృ. వి. (గురిజె+వెంద.) గుంజ.

**గురు.** దే. వి. మృగవిశేషము, గవయము. "ఎ, గీ. గురులఁదార్కొన్నవిత్రిగాగురులఁదార్చి." భల్లా. 3, ఆ.

**గురుగు.** తే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు, ఘూరుండి.

**గురుజె.** దే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు, ఉత్తుండి.

**గురువు.** ఉభ. దే. వి. వేగపుపరుగు. (చూ. గురువుదేఱు, గురువులువాఱు.) సం. ఉ. పుం. 1. ఉపాధ్యాయుఁడు; 2. బృహస్పతి; 3. కులముపెద్ద; 4. తండ్రి; 5. తండ్రితోఁబుట్టినవాఁడు; 6. తాత; 7. అన్న; 8. మామ; 9. మేనమామ; 10. రాజు; 11. కాపాడువాఁడు. విణ. 1. అలఘువు; 2. గొప్పది; 3. భరింపఁగూడనిది.

**గురువుదేఱు.** దే. అ. క్రి. (గురువు+తేఱు.) జట్టునచిప్పిలు. "త్రెవ్వఁడుగంటులఁగురువుదేఱుచు నెత్తురురాకమున్న." రా. యు, కాం.

**గురువులువాఱు.** దే. అ. క్రి. (గురువులు+పాఱు.) 1. వేగపుపరుగుపాఱు; "శీ. విరులగుత్తులమీఁద గురువులువాఱుచు ముద్దిచ్చు తేఁటులమొరపములకు." మార్క. ౫, ఆ.—2. అతిశయించు. "క. ఒండొరువులతోఁబెనఁగవేడ్కలుల్లంబులతో, గురువులువాఱఁగ." భార. ద్రో. ౧, ఆ.

**గురుసు.** దే. వి. 1. జీవస్థానము; "క. తురగములనూతుఁజంపినగురువతిపాలివాఁకయతనిగురుసునసేయఁగ్, గరమలిగిధనువుఁదునుముడు, బరవనమటియొరునిశిరిపైకింబోయెఁగ్." భార. ద్రో. ౫, ఆ.—2. మేర. "చ. దంతగాండముల్, గురుసులఁగూడిరాఁదిరిచిఘూర్ణనిశాచరకోటిమోఁదుచుఁగ్." రా. యు, కాం.

**గుర్తించు.** దే. స. క్రి. గుఱుతుపట్టు.

గుర్విణి. సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

గురువు. వై. వి. అధికము. "ఉ. మాలియడ్డమై, బోరనవచ్చి యవ్విహగపుంగవ కేతనునేసెనెంతయున్, గూ్రరములైనయమ్ములకు గురువుగదానవులుత్సహింపఁగన్." నిర్వ. 3, ఆ.

గుర్వెట్టు. దే. అ. క్రి. గుఱువెట్టుయొక్క రూపాంతరము. "శా. కాలుంగేలునెఱుంగకున్న కరణింగన్నోడ్చి గుర్వెట్టుచున్." భాగ. ౧౦, స్క-౦. పూ.

గుఱక. దే. వి. నిద్రయందలిధ్వని.

గుఱగుఱ. దే. వి. ఒకవిధమైన దురద.

గుఱి. దే. వి. 1. లక్ష్యము; "అమ్మహాసురుఁడు గుఱియుఁగఁజేసికాత శరకోటికి." భార. ద్రో. 3, ఆ.—2. గుఱుతు; "గీ. వసుధలో నెట్టె శ్రీగలవారివేని, కరభములుదాస్యములెనేయుసరసిజాక్షి, యూరువులకెల్లటన్న దైదారుమోచు, గొడుగులునుపలకలకమల్ గుఱుతుగాఁగ." ఆము. ౫, ఆ.—3. దృష్టాంతము; "గీ. గాలవుండ గుఱియుఁగాఁజెమనకు." భార. ఉద్యో. 3, ఆ.—4. నిర్ణయము; "క. వానెమ్మరమునఁగలయను, మానము పరతత్త్వబోధమహిమ నుడుపృవు, జ్ఞానిధియాతుల్కమునిం, పూనఁగఁగైకొనుటయనుచునాఁ గుఱిచేసెన్." వర. ౪, ఆ.—5. మితి. "సీ. ఏదేవుఁడింతకునింతయై యంతకునంతయై గుఱిలేకయతిశయిల్లు." పాండు. ౫, ఆ.

గుఱించు. దే. స. క్రి. 1. ఉద్దేశించు; "గీ. ఇట్టిమిముగుఱించి హీనకార్యంబైన, మాకుఁబ్రశయముగుచుమగువలార, భయమొనర్చె." కవిక. ౬, ఆ.—2. నిర్ణయించు. "సీ. ఓడముల్ త్రవ్వించి యురుకొడ్డనియమించి యువ్వలవ్వలవలలిడ గుఱించి." రామా. ౨, ఆ.

గుఱికట్టు. దే. వి. 1. అంచు; 2. మితి.

గుఱికాఁడు. దే. విశ. లక్ష్యముతప్పక యేయువాఁడు, కృతహస్తుఁడు.

గుఱికొండి. దే. వి. ఆయము, జీవస్థానము.

గుఱికొను. దే. స. క్రి. లక్షించు. "చ. తఱియనులోహకారకుఁడుదగ్రతఁ బక్షిమశైలశృంగముల్, గుఱికొని." రసి. ౪, ఆ.

గుఱిచి. దే. అవ్య. కూర్చి ప్రత్యయమునకుపర్యాయము. "సీ. అబ్జానుఁడుతన్ను నర్థితోగుఱిచియజించుటగోరిసృజించెనురల." హరి. పూ. ౨, ఆ.

గుఱుకొను. ద్వి. అ. క్రి. యత్నించు. "క. గుఱుకొని కార్యాకార్యము, లెఱుఁగక దుశ్చరితుఁడయియుహితుఁడగునేనిన్, మఱవక గురునైననుజను, లెఱుఁగఁగశాసించునదిమహీశుఁడుబుద్ధిన్." భార. ఆది. ౬, ఆ.

గుఱుగుఱ్ఱు. దే. వి. ఒఱలుటయందగు ధ్వన్యనుకరణము. "గుఱుగుఱ్ఱంచెడసంచిబిట్టాఱలున్నర్థోరాహి." నై. ౮, ఆ.

గుఱుతు. దే. వి. 1. చిహ్నము; "క. విసుమేఁకగొఱియలుమొదవు, లెనుములు తురగములు గజములెందొకటియురెం, డును మూడునునేనును నా, లునునేడునునుండునదిగుఱుతునీకుండన్." మార్క. ౪, ఆ.—2. మేర. "సీ. దిక్కెవ్వరునులేనిదీనులనురలఁ గైకొన్నటీకరుణకు గుఱుతుగలదె." లక్ష్మీ. ౫, ఆ.

గుఱుపాడుచు. దే. అ. క్రి. గుఱకపెట్టు. "సీ. పిచులతొఁకున నేమునర్దవరవ మడఁగిపోవఁగ గుఱుపాడుచువారు." రా. యు, కాం.

గుఱుములు. దే. వి. బ. గింజలు.

గుఱువెట్టు. దే. అ. క్రి. (గుఱు + పెట్టు.) గుఱకయిడు. "క. అటిముటివారలుచనిమే, నెఱుఁగకనిద్రుఁలనూర్పుటీఁదలుగొఱలన్, గుఱువెట్టుచుఁగొండవలెన్, వెఱఁగొప్పఁగనున్న కుండపీనుల జూడున్." అచ్చ. యు, కాం.

గుఱ్ఱపుఁజొక్కు. వై. వి. (గుఱ్ఱము + చుక్క.) అశ్వినీనక్షత్రము.

గుఱ్ఱపుఁబీఁట. వై. వి. (గుఱ్ఱము + పీఁట.) ద్వారబంధముమీఁద నుంచెడు గుఱ్ఱపుమూతికొయ్య.

గుఱ్ఱపుమోము వేల్పు. ద్వి. వి. (గుఱ్ఱము + మోమువేల్పు.) కింపురుషుఁడు.

గుఱ్ఱపుసారము. వై. వి. (గుఱ్ఱము + సారము.) సప్తస్వరములలో నొకటి, ధైవతము.

గుఱ్ఱము. వై. వి. అశ్వము. (దీనికి బహువచనమునందు గుఱాలనియు రూపముగలదు. "క. లలితనిజవామకరతల, కలితకనత్కంబుకాంతికలకలనవృష్టిన్, గలువలచెలిగిలిగింతల, నలువగుఱాలంబిసాళినలువగుఱాలన్." పాండు. ౨, ఆ.)

గుఱ్ఱు. దే. వి. 1. కోపమునందగు ననుకరణము; "ఎట్టివారిఁబోడగన్న నగుఱ్ఱని." వాసి. ౧, ఆ.—2. నిద్రయందగు ధ్వన్యనుకరణము. (గుఱ్ఱెత్తెను.) (ఆమ్రేడితమునందు గుఱ్ఱుగుఱ్ఱు.)

గులక. వై. వి. ఒకదినుసుకాయి.

గులకరించు. దే. అ. క్రి. రమ్యమగు. "ఎ, గీ మొలకనగవులు మొగమునగులకరింప." చంద్రా. 3, ఆ.

గులగుల. దే. వి. 1. పుట్టలనుకోరాడుటయందగు ననుకరణము; "వ. ఎలుంగులు గులగులం బుట్టలునిశితనిజనఖరకులికకోటులం గోరాడ." స్వా. ౪, ఆ.—2. బ. చూర్ణము; "చ. కలితనిరూఢిరేఖఁదిరుగంబడిగర్జిలు శంఖకోటులన్, గులగులలైతముంగడుము కొన్నతదాత్తజరత్నవర్గముల్, తలఁచిగుణావళుల్ గలిగిదండలఁబాయకయుండెనోయనన్, నలలితతారహారములఁజందనగంధికిశంబురాజిలెన్." భాను ౨, ఆ.—3. నలఁగుడు; "క. వాఁడునుగులగులలైలావగ, లినమైబిదిలించికొనుచులేచెఁగిడుకుచున్."పాండు. ౪, ఆ.—4. దురద. (గుఱగుఱయొక్క రూపాంతరము.)

గులప. దే. వి. గుఱ్ఱపువాఁడు.

గులాము. వై. వి. దాసుఁడు*, దాసురాలు*.

గులాబి. హిం. వి. పుష్పవిశేషము.

గులి. సం. వి. ఈ. స్త్రీ. 1. గోలీ; 2. తీఁటగుల్ల.

గులిబి. దే. వి. గులిమియొక్క రూపాంతరము. (ఇట్లు బకారోపధముగాఁ గొన్ని దేశములందు వ్యవహారము.)

గులిమి. దే. వి. కర్ణమలము, పింజూషము.

గులిమికదురు. దే. వి. గులిమితీసికొనెడి వెండిలోనగువానిపుల్ల.

గుల్మము. సం. వి. అ. పుం. చీలమండ.

గుల్మము. సం. వి. అ. పుం. బోదలేనిచెట్టు; 2. వ్యాధివిశేషము; 3. సేనావిశేషము; (తొమ్మిదిరథములు అన్నియయేనుఁగులు ఇరువదేడు గుఱ్ఱములు నలువదేవురు కాల్వురునుగలది.) 4. సైన్యరక్షణము; 5. పురాభిముఖమైన రాజమార్గము.

గుల్మిని. సం. వి. ఈ. స్త్రీ. ఉలపము, పొదరు.

గుల్ల. వై. వి. 1. కప్పచిప్ప; 2. బొబ్బ. విశ. 1. అల్పము; (గుల్లకావి, గుల్లపుటీక మొ.)—2. బోలు*. (గుల్లకట్టె మొ.)

**గుల్లకాఁడు.** దృ. విశ. ఏమిలేనివాఁడు, అకించనుఁడు. "గుల్ల కాఁడైమనయింటికిగుఱుతులకుఁగవచ్చిని." క్షే. త్రయ.

**గుల్లపడు.** వై. అ. క్రి. అవమానపడు. (దీనికిఁ బ్రయోగము ప్రేరణ మఁ జేకానఁబడుచున్నది. "ద్వి. నినునేఁడుముఖముననెత్తుకు ప్రా ము, కొనిగుల్లపఱపకకొలికికిరావు." హరిశ్చ. ౨, భా.)

**గుల్లాము.** వై. వి. గులాముయొక్క రూపాంతరము.

**గువాకము.** సం. వి. అ. పుం. పోఁకచెట్టు, (రూ. గూవాకము.)

**గువ్వ.** దే. వి. అడవిపావురము, కపోతము.

**గువ్వకరిగొను.** దే. స. క్రి. చుట్టుకొను. "క. అచ్చోటిశీర్ణవాసు లు, వచ్చితగునెదీఁకఁ బుణ్యవాహినినిటువా, క్రుచ్చితివనివడిసం దిటు, గచ్చుకడలినట్లుగువ్వకరిగొనితిట్టక." జై. ౪, ఆ.

**గువ్వకుత్తుక.** దే. వి. (అఁకటిచేఁగలుగు) హీనస్వరము. (చూ. కుతిలపడు.)

**గువ్వకుత్తుకపడు.** దృ. అ. క్రి. (అఁకటిచేత) హీనస్వరమగు. "ద్వి. నవ్వగఁగుండుచునీరసాన్నములఁ, గ్రొవ్విబట్టురెగువ్వకుత్తుక పడక." హరిశ్చ. ౨, భా.

**గువ్వకోలుకొను.** దే. స. క్రి. గువ్వకరిగొను. (రూ. గువ్వకో ల్కొను. "గీ. మఱియునమ్మాయలాడి కోమటిసెలంత, సందటను గువ్వకోల్కొనియగడునేయ." శుక. ౧, ఆ.)

**గువ్వగుత్తి.** దృ. వి. కపోతాంఘ్రి.

**గువ్వగుత్తుక.** దే. వి.——పై.——

**గుసగుస.** దే. వి. రహస్యపుమాటలచప్పుడు.

**గుసగుసలువోవు.** దే. అ. క్రి. గుసగుసయనిమాటలాడు. "క. మెత్తముగరె మనమెపుడుఁది, లోత్తమచక్కఁదన మీతలోదరియెదు టన్, మెత్తఁబడె దానిచెలువని, యత్తఱి గుసగుసలువోయిరచ్చర లెల్లన్." విజ. 3, ఆ.

**గుహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కొండయందు తొలువఁబడిన గొప్ప బిలము; 2. వల్లము; 3. నక్కతోఁకపొన్న చెట్టు.

**గుహాశయము.** సం. వి. అ. పుం. వ్యాఘ్రము, పులి.

**గుహుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి, కందుఁడు.

**గుహ్యకుఁడు.** సం. వి. అ. పుం. దేవయోనివిశేషము.

**గుహ్యకేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**గుహ్యము.** సం. వి. అ. న. 1. ఏకాంతము; 2. స్త్రీపురుషుల గుఱి; 3. తాఁబేలు; 4. నెపము. విశ. దాఁచఁదగినది.

**గుళిక.** సం. వి. ఆ. స్త్రీ. రసమణిలోనగునది.

**గుళిగ.** వై. వి. ——పై.——

**గుళుచ్ఛము.** సం. వి. అ. పుం. పుష్పశోభనగువాని గుత్తి, గుచ్ఛము.

**గుళ్లు.** దే. వి. బ. ఘందెనగుడియను బాలక్రీడావిశేషము. "సీ. కుప్పిగంతులుపిడిగ్రుద్దులాటలు పిల్లదీపులుగొబ్బిళ్లుగూవనాలు, గుళ్లుదాఁగిలిముచ్చులుగోడిపట్టెలు." వి, పు. ౭, ఆ.

## గూ.

**గూండ్ర.** దే. వి. గుడ్లగూబకూఁత.

**గూండ్రించు.** దే. అ. క్రి. (గుడ్లగూబ) కూయు.

**గూఁటి.** వై. వి. పంది, సూకరము.

**గూఁటిగువ్వ.** దే. వి. (గూఁడు+గువ్వ.) ఇంటఁబాల్చిన పక్షి.

**గూఁడు.** దే. వి. 1. పక్షిగృహము; 2. గోడయందు దీపముంచుట కేర్పఱచినచోటు; 3. (పెంపుడుచిలుకలలోఁగనునియుంచుడు) పంజరము; 4. ఆశ్రయస్థానము.

**గూఁడుకొను.** దే. వి. పక్షి. ఏకోద్దృపము. "గీ. తెలిగూఁడు కానుపుతేజీవజీవులచే విప్పుగాఁ గొదలేని మెప్పులగు." అచ్చ. సుం, కాం.

**గూఁడుబండి.** దే. వి. చాఁపకట్టినబండి.

**గూటము.** వై. వి. 1. వడ్లవాని మొకాలొక కొలముట్టు*; 2. గుంజ*; 3. మేకు*; 4. మూదిగవాని ఒక కొలముట్టు.

**గూటాము.** వై. వి. గూటముయొక్క రూపాంతరము.

**గూడ.** దే. వి. 1. వారుపు చేయుటకై కోలబట్టియుండు జమ్ముగూడ; 2. తిరుపకూడ; 3. నీళ్లచల్లెడు వెదురుబుట్ట; 4. ప్రాపులలో నగు నడియుంచెడుబుట్ట; 5. మత్స్యముంచుబట్టై పాదరవిశేషము; 6. దొప్ప. "తోలుగూడచేఁ దివిచిన నేఁడివారయసను." భో. 3, ఆ.

**గూడకట్టు.** దే. వి. కచ్చముపేఁకకు వెనఁదో పదెయుఁడకట్టు.

**గూడపాల.** దే. వి. దూపెన, శారిబ.

**గూడబాతు.** దే. వి. బకవిశేషము.

**గూడారము.** వై. వి. గుడారముయొక్క రూపాంతరము.

**గూడారు.** వై. వి. గూడారముయొక్క రూపాంతరము.

**గూడెము.** దే. వి. కొండదొనలాశ్రయించియుండెడుబోయపల్లె. "సీ. విన్నుక్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడెమేలువాఁడుడి నోరిమేలువాఁడు." అచ్చ. బాల, కాం.

**గూఢపాత్తు.** సం. వి. త్. పుం. కానరానికాళ్లది, పాము.

**గూఢపురుషుఁడు.** సం. వి. అ. పుం. చారుఁడు, వేగువాఁడు.

**గూఢమణి.** సం. వి. ఇ. స్త్రీ. బాలిక్రీడావిశేషము.

**గూఢము.** సం. వి. అ. న. 1. రహస్యము; 2. స్త్రీ పురుషుల గుఱి. విశ. దాఁచఁబడినది.

**గూఢసాక్షి.** సం. విశ. (న్. ఈ. న్.) (చూ.) గుట్టుసాకిరి. (వీఁడు కృతసాక్షులేవ్వరిలో నొకఁడు. చూ. సాక్షి.)

**గూథము.** సం. వి. అ. న. పురీషము, విష్ఠ.

**గూన.** దే. వి. పెద్దకుండ.

**గూనివాఁడు.** దే. విశ. (గూను+వాఁడు.) కుబ్జుఁడు.

**గూను.** దే. వి. నడుముమీఁదివంపు.

**గూనుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) విష్ఠించినవాఁడు.

**గూనుగిల్లు.** దే. అ. క్రి. గూనుకలుగు. "వ. కపటకిటి జఠరకమఠ భుజగవరివృద్ధులు గూనుగిల్లంబడ." కాశీ. ౬, ఆ.

**గూబ.** యు. దే. వి. కర్ణమూలము. "గీ. అతనిచెవులు గూబలంటఁ జెటికి." రామా. ౫, ఆ.—వై. గుడ్లగూబ.

**గూబతేడ.** దే. వి. మహాబలచెట్టు.

**గూబరి.** దే. వి. మూదిగవాఁడు. "సీ. ఆసాదిగోనంగిమాదిగ గూబరి యన మాతంగుఁడను." ఆం, భా. ద్వి. భా.

**గూవనాలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. కుప్పిగంతులు.)

**గూహనము.** సం. వి. అ. న. గోపనము, దాఁచుట.

## గృ.

**గృంజనము.** సం. వి. అ. న. ఎవముతిన్న పశువుయొక్క మాంసము. పుం. వెల్లుల్లి.

**గృధ్నువు.** సం. విణ. ఉ. ఇచ్ఛగలవాఁడు, గర్ధనుఁడు.

**గృధ్రము.** సం. ౧. అ. పుం. గద్ద. విణ. పిసినివాఁడు.

**గృధ్రసి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) కిరుచెనకీ.

**గృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకతూరి యీనిన యావు; 2. పాఁచి తీఁగ.

**గృహకచ్ఛపము.** సం. వి. అ. పుం. (నూతెడు) సన్నెకల్లు.

**గృహగోధిక.** సం. వి. ఆ. స్త్రీ. మునలి, బల్లి.

**గృహద్రుమము.** సం. వి. అ. పుం. పాలతేఁకుకీ.

**గృహపతి.** సం. వి. ఇ. పుం. 1. గృహస్థుఁడు; 2. మంత్రి; 3. విడువకయిచ్చువాఁడు.

**గృహమణి.** సం. వి. ఇ. స్త్రీ. దీపము, దివ్వె.

**గృహము.** సం. వి. అ. న. 1. ఇల్లు; 2. పెండ్లాము. "జాయాచ గృహిణీగృహమ్." అనిమ్హాలాయుధనిఘంటువు. (ఇది యీ రెండర్థములయందును పుంలింగమునగును. అప్పుడు బహువచనాంతము.)

**గృహమృగము.** సం. వి. అ. పుం. శ్వానము, కుక్క.

**గృహమేధి.** సం. వి. న్. పుం. (చూ.) గృహస్థుఁడు.

**గృహస్థుఁడు.** సం. వి. అ. పుం. భార్యను పరిగ్రహించిధర్మార్థకామములఁడపుచు వేదపారముపైశ్వదేవాదిహోమము అతిథిపూజపితృతర్పణము భూతబలియుననెడుపంచయజ్ఞములను జేయుచు ప్రవర్తించువాఁడు, ఇలుతేఁడు. (రూ. గృహస్థు.)

**గృహస్థూణము.** సం. వి. అ. న. ఇంటినడిమికంబము, నిట్రాడు.

**గృహావగ్రహణి.** సం. వి. ఈ. స్త్రీ. దేహళి, గడప.

**గృహి.** సం. వి. న్. పుం. (చూ.) గృహస్థుఁడు.

**గృహిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇల్లాలు; 2. ఎత్తుతుమ్మెద; 3. కణుఁదురీఁగ.

**గృహీతము.** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁబడినది.

**గృహీతి.** సం. వి. ఇ. స్త్రీ. గ్రహింపఁజాలినబుద్ధి. "ఊహాపోహాక్షమాచార్వీ గృహీతిర్గ్రహణక్షమా." అ, పా. ప్ర. ధీ.

**గృహ్యకము.** సం. వి. అ. పుం. పెంపుడుమృగములోనగునది, దీమము. విణ. పరాధీనము.

**గృహ్య.** సం. వి. ఆ. స్త్రీ. శాఖానగరము. అ. న. ము. కర్మబోధకగ్రంథము. పుం. పెంపుడుమృగములోనగునది. విణ. 1. స్వాధీనము; 2. పరాధీనము.

## గె.

**గెంటసము.** దే. వి. పరుషవచనము. "గీ. అనుచుననవింటిపెనుచంటనాఁకరాని, గెంటనములాడి." వసు. ర, ఆ.

**గెంటించు.** దే. అ. క్రి. చలించు. "వ. నిత్యప్రసాదయసుయశోదశయ్యనొయ్యనఁజిన్ని నల్లనయ్యనునిచిచయ్యననయ్యవవ్వకూఁతునెత్తుకొని మరలనింటికిగెంటింపకవచ్చి." భాగ. ౧౦, స్క౦. పూ.

**గెంటు.** దే. అ. క్రి. 1. చలించు; "గాంగేయవమంధరాధరము గెంటినగెంటఁడు." హరిశ్చ. 3, ఆ.—2. తొలఁగు. "మాసిరుల్ గెంటకయుండఁ గావు." య. ౨, ఆ.—స. క్రి. 1. త్రోయు; (పీఁడువానిని మెడపట్టిగెంటినాఁడు.)—2. ప్రయోగించు. "పంచాస్త్రంబులం గెంటి భాస్కరపౌత్రుందెరలించి." జై. ౫, ఆ.—వి. చలనము. "గీ. అనుడులేవునాకునాశంకలెవ్వియు, నెన్నిమార్లు చూడుమన్నఁజూతుఁ, బడఁతికలదెజాతిపతిమకుఁజక్కలి, గింతనాదుధృతికిగెంటులేదు." కళా. 3, ఆ.

**గెంటువడు.** ద్వ. అ. క్రి. (గెంటు+పడు.) తప్పు. "క. వెంటనెరిపుసేనలనద, రంటఁదబిమిపవనజుఁడుగదాహతి నొక్కఁడుగా, గెంటువడకుండఁ బీనుఁగుఁ, బెంటలుగావించె దివిజబృందము పొగడన్." జై. 3, ఆ.

**గెంటెము.** దే. వి. జంటనేఁతవస్త్రము. విణ. దట్టము. "మదిగాగెంటెంపుంజలముప్పతిల్ల." స్వా. ౫, ఆ.

**గెగ్గలు.** దే. వి. గేలి, పరిహాసము. (అప్ర.)

**గెడ.** దే. వి. 1. జత; "క. కడువేడ్కతోడ నీకుం, గొడుకయ్యెడు సంతకంబెఁ గోర్కియుఁగలదే, జడుఁడనకనన్నుఁ గయికొని, గెడ సేయుమునన్నుఁగార్తికేయునితోడన్." ఉ, హరి. ౫, ఆ.—2. సమీపము; (చూ. గొంటు.) "ఉ. దిగ్గియనంచతూఁడుగొనితీరవనేత్రుపువంకమీఁదుగా, నగ్గెడపుల్లకేసరమునందువసింపఁగ." ఆము. ౫, ఆ.—3. వేఁటకుఁదగినయొకానొకసాధనము. "క. వడదోల్లును ముప్పిళ్లును, నడిదంబులు వెడఁదవాతియలుఁగులపాదులున్, దడవిండ్లుఁబందిగోల్లును, గెడలున్ధరియించి భటులుకెలఁకులఁ గొల్వన్." భల్లా. 3, ఆ.

**గెనయు.** దే. అ. క్రి. పుష్టియగు. "రసాసతిధేనువుఁజేసి లోకములెగెనయఁగ నెట్లుపాలుపిదికెన్." వి, పు. ౨, ఆ.

**గెనసు.** దే. వి. ఒకానొకగడ్డ, ఆలువు.

**గెబ్బు.** దే. స. క్రి. 1. అపహరించు; "గీ. నువ్వుఁబువ్వునవ్వ జవ్వనినాసిక, చివురునవురుజవురునువిదమోవి, మబ్బునబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి, మెఱపునొఱపునెఱపుఁదెలవమేను." విజ. ౧, ఆ.—2. గ్రహించు. "గీ. వానకందువమలలపైవ్రాలు మొగులు, చాలునరికట్టఁజాల్చెంచుజవ్వనులకు, నిబ్బరపుఁ దూపుతడవింటఁబ్రబ్బఁజేసి, మబ్బుపైఁబాఱుమెకములగెబ్బుకొంత." ఉ, రా. ౭, ఆ.

**గెఱ.** దే. వి. రేఖ. "సీ. గెఱవ్రాసిమాయనంగీకరించినభంగివసనంబుగట్టకవచ్చువాని." భాగ. ౧, స్క౦.

**గెల.** దే. వి. పండ్లయొక్కయు, కాయలయొక్కయు గొల.

**గెలివి.** దే. వి. సంతోషము. (వాఁడు మిక్కిలి గెలివితో నున్నాఁడు.)

**గెలివిడి.** దే. వి. గెలివియొక్క రూపాంతరము.

**గెలుచు.** దే. అ. క్రి. పోవు. "ఎ, గీ. జడభోరత్నమిందయనుచు, నిచ్చితెలతెలవాఱంగనిచ్చగెలువు, మనిలజాయంచుదీవించియనుపుటయును." రామా. ౬, ఆ.—అం, ప్రే. పుచ్చు. "క. కంకుఁడయిధర్మజుఁడువల, లాంకుండైవాయుజుఁడుబృహన్నలయైని, శ్శంకుఁడుపార్థుఁడుహయగో, కింకరులైకవలుఁడొల్లిగెలువరెదినముల్." భో. ౭, ఆ.—స. క్రి. జయించు.

**గెలుపు.** దే. వి. 1. జయించుట; "గీ. పలువురొకనిగెలుపుగెలుపుగాదోడిన, వాఁడుగాఁడితండువారికాజి." మార్క. ౮, ఆ.—2. జయము.

**గెలుపుకాఁడు.** దే. విణ. జయశీలుఁడు.

**గెలుపుకొను.** దే. స. క్రి. జయించు. (రూ. గెల్పుకొను. "సీ. నినుగెల్పుకొనివాఁడినానకెడి వేయిచేతులజేనిగెడపినబలియు గెలిచె." అచ్చ. సుం, కాం.)

గెలువము. దే. వి. గెలుపు; జయము.

గెల్లి. దే. వి. ఉప్పుకుప్ప.

గెల్లు. వై. వి. కలకల ధ్వని.

## గే.

గేందుకము. సం. వి. అ. పుం. బాలురు ఆడుకొనెడు చెండు, కందుకము.

గేడెకాళ్లవాఁడు. దే. విణ. కొంగకాళ్లవాఁడు.

గేదఁగి. వై. వి. పచ్చపూమొగలి*. "ఠగడ. తలఁపమరుబాఁకు గేదఁగికిరాగిల్లకుము." ఉ, రా. ౬, ఆ. (ఇది శివపూజకనర్హము.)

గేదె. దే. వి. 1. పొట్టిబత్తె; 2. బత్తె.

గేదెచెలప. దే. వి. మూడేండ్ల యెనుపదూడ.

గేయము. సం. వి. అ. న. పాట. విణ. 1. పాడఁదగినది; 2. పాడునది.

గేరంజము. సం. వి. అ. పుం. (చూ.) కేరజేము.

గేలి. వై. వి. పరిహాసము*.

గేలికొట్టు. దే. స. క్రి. పరిహసించు. "రాజులగణింపకతిట్టుచు గేలికొట్టుచున్." పాంచా. 3, ఆ.

గేలికొను. ద్వ. స. క్రి. పరిహసించు. "సీ. ఇంద్రుఁడు చను దెంచియేలయిచట, దునియెదవనినన్నమునుజాధిపతితనకోర్కి-చెప్పిన గేలికొనుచుఁజనియె." సం. "అపహాస్యతతశ్శక్రోజగామ త్రిదివం పునః." భార. శల్య. ౨, ఆ.

గేస్తు. వై. వి. (చూ.) గృహస్థుఁడు.

గేస్తుఁడు. వై. వి.——వై.——"ఎ, గీ. మన్న గేస్తుఁడునన్న యుమిన్నునీరు, ప్రొద్దునెలగాప్పులెవ్వానిరూపులయ్యె." నీలా. ౧, ఆ.

గేస్తురాలు. ద్వ. వి. (గేస్తు+ఆలు.) ఇల్లాలు.

గేహము. సం. వి. అ. పుం, న. గృహము, ఇల్లు.

గేహళి. సం. వి. ఈ. స్త్రీ. (దీనిని దేహళీపర్యాయముగా వాడు చున్నారు.)

గేహి. సం. వి. న్. పుం. గృహస్థుఁడు.

గేహిని. సం. వి. ఈ. స్త్రీ. ఇల్లాలు.

## గై.

గైరికము. సం. వి. అ. న. 1. పర్వత ధాతువిశేషము; 2. బంగారు.

గైరేయకము. సం. వి. అ. పుం. కారుపోఁక.

గైరేయము. సం. వి. అ. న. సిలాజిత్తు.

## గో.

గో. దే. అవ్య. చూపుటయందువచ్చును. (అదిగో, ఇదిగో మొ.)

గోంగ. దే. వి. పగతుఁడు, శత్రువు.

గోంగడి. దే. వి. కంబళి. "క. గోంగడులెగరఁగగైచుచుఁ, జంగున దాటుచునుజెలఁగిదప్పట లిడుచున్, భోంగుచుఁగృష్ణునిఁబొగడు చుఁ, ద్రుంగినరక్కసునిఁజూచి తుళ్ళికొమరుల్." భాగ. ౧౦, పూ.

గోంగడికాఁడు. దే. వి. పక్షివిశేషము. "వ. నేలనెమలిడాలు గోంగడికాఁడు." చంద్రా. ౨, ఆ.

గోంగళి. దే. వి. గోంగడియొక్క-రూపాంతరము.

గోంగళిపురుగు. ద్వ. వి. (చూ.) కంబళిపురుగు.

గోంజె. దే. వి. గొబ్బులు. "సీ. గొజ్జెనవంజలగొంజనావంధ్య చూ." అం, భా. దిష్. వై.

గోంటరి. దే. విణ. (గోంటు+అరి.) 1. కుత్సితుఁడు; "ఉ. కోయిలపేరిగారడపుగొంటరితొలుతురాజుమున్దరటన్, మాయవహించిలేఁజుగురుమారునికస్తుల మ్రింగ." శశాం. ౨, ఆ.—2. కపటుఁడు. "సీ. గొంటరిఘాతకీస్తునుకోమలియఁగమలయఁగఁజేయునేరలమటంచు." హంస. ౪, ఆ. (స్వార్థమున అరి.)

గోంటి. దే. విణ. దుష్టురాలు. "శా. అంతోకేశవ్వరుఁడాచరాచర విధుంఁడాబాలగోపాలుఁడా, బాలత్వంబునగోంటిగంటిడికనన్ బాలెంతచందంబునన్, బాలిండ్లన్ విషమానివచ్చులమదిన్ భావించి." భాగ. ౧౦, పూ. (ఇక్కడ ఇకారము స్త్రీవిషయక మైన ప్రత్యయమని యెఱుంగునది.)

గోంటు. యు. దే. విణ. దుష్టుఁడు. "శా. కపటాంతేవాసినైశాంబరిన్, గొంటుంజందముమీఱశిష్యులెగడంగూర్చుండి చర్చారతిన్." స్వా. ౫, ఆ.—వై. వి. బందనలేనివక్క*.

గోంటుకాఁడు. ద్వ. విణ. కఠినుఁడు. "గొంటుకాఁడుమువ్వగోపాలరాయఁడు." క్షేత్రయ. (స్వార్థమున కాఁడు.)

గోండిలి. వై. వి. 1. కుండలాకారనృత్యము*; "సీ. తెరలెత్తినప్త సాగరములు పొరలంగవరుణుండు గొండిలిపరిథవించ." ఉ, హరి. ౪, ఆ.—2. నృత్యము*; 3. నర్తకి*.

గోండ్లి. వై. వి. 1. కుండలాకారనృత్యము*; "సీ. జలదేవతాహస్త చామరానిలములు కుటిలాలకములకు గొండ్లిగఱప." కాశీ. ౫, ఆ.—2. నృత్యము*; "ఉ. చందనగంధబిందుమణిసౌధతలంబుల గొండ్లినల్పఁగా." వసు. ౧, ఆ.—3. నర్తకి*. "క. లలితగగనరంగంబున, నలయక ప్రొమ్మెయుఁగుగొండ్లియైయాడెడిచో, నలవడియెమొగులుతెరలును, బొలుపగువడగండ్లగములపుష్పాంజలులున్." హరి. పూ. ౬, ఆ. (గొండిలియొక్క-రూపాంతరము.)

గోండెము. దే. వి. గొండ్లెము. (చూ. కొండెము.)

గోండ్లెము. దే. వి. తలుపుచిలుకు.

గోంతి. వై. వి. పాండురాజభార్య.

గోంతు. దే. వి. 1. కంఠము; 2. కంఠధ్వని; (నీగొంతువినినేనిక్కడికి వచ్చితిని.) 3. కుత్తుటానము. (వాఁడు గొంతుగూర్చున్నాఁడు.)

గోంతుక. దే. వి. కంఠము. "ఉ. దానవుఁన్, గొంతుకత్రుంచి కైకొనియెఁగొంకకతన్నుమితొర్కచాపమున్." జై. ౬, ఆ. (స్వార్థమునక ప్రత్యయము.)

గోంతుకపోఁక. ద్వ. వి. గొంతుముందఱప్రక్క-పోఁకవలెనుండెడియెముక, గొంతుముడి.

గోంతుమాలు. దే. వి. మల్లబంధవిశేషము.

గోంతుముడి. దే. వి. గొంతుకపోఁక.

గోంతెమకోరిక. దే. వి. కోరఁదగని కోరికలనుగోరుట.

గోంతెమగోరు. దే. వి. (గొంతెమ+కోరు.) ప్రసారణి*.

గోంది. దే. వి. మూల. "ఉ. ఉదయార్కు-నిరాకనడంగెఁజీఁకటుల్, గొందులనందులన్ గుహలగుట్టలచెట్లులదాటుమాటునన్." ఆని. 3, ఆ.

**గొగ్గి.** దే. వి. వచ్చుతప్పుకైనది. "గొగ్గిపండ్లు." (మొ.)

**గొజ్జంగ.** వై. వి. గొజ్జెఁగ యొక్క రూపాంతరము. "రగడ. చిఱుతేంట్లకొనఁగొనకుత్తినపూఁజిగొజ్జెంగ, యెలుఁగెకదిత్రావంతరేలయుటు వజ్జెంగ." హ్మ. 3, ఆ.

**గొజ్జెఁగ.** వై. వి. ఒకానొకపూఁజెట్టు. "ఎ, గీ. చిలుకుఁదేనియ తోడిగొజ్జెంగపూవు, దలగడయమర్చియందునాచెలువనునిచి." కళా. ౬, ఆ.

**గొటగొట.** దే. వి. గొంతురించుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "ద్వి. గొటగొటగొంతురించికొలలొండొంటి, గటగటఁ దాఁకింపగర్వంబుగలఁగి." నవ. 3, భా. "సీ. క్రోల్పులుల్ మత్తిల్లి గొటగొటమనిరొప్పి బలుసింగములనైనఁబట్టఁజూచు." ౨. ౧, ఆ. "ద్వి. ఊరుపులునిసుదలైగొటగొటనిగుడ." హరిశ్చ. ౨, భా.

**గొట్రము.** దే. వి. క్రోవి.

**గొట్టి.** దే. వి. ఒకదినుసుగడ్డ, కశేరుకము.

**గొట్టు.** దే. వి. 1. దౌష్ట్యము; "ద్వి. గొట్టుసేయఁగ దొరఁకొంటి వేయనుచుఁ, బట్టలీకదిపాణిపద్మంబుఁదట్టె." విష్ణు. ఉ. ౪, ఆ.— 2. విరోధి. "జక్కవలగొట్టు." రా, వి. 3, ఆ. (చూ. తడకట్టు.) విశే. 1. కఠినము; "వ. నట్టడవులలో మీపట్టంపుదేవిని విడిచి పెట్టివచ్చితినని యీగొట్టుమాట దిట్టతనంబుతో నధిపతింజేరియింక నెట్టువిన్నపంబుసేయుదు." ఉ, రా. ౬, ఆ.—2. దుర్లభము; "రగడ. గొరగొరఁటనించితివో కలిగొట్టు గొట్టుగఁగోయఁబోనఁగవు." (గొట్టుగన్=దుర్లభముగా-పూర్ణముగాననుట.) వసు. 3, ఆ.—3. దుష్టము. "ఉ. గొట్టుతనానఁదన్ వెడలఁగొట్టినఁ దిట్టను రట్టడంచుతోఁ, బుట్టువనొటనొండనకపోయితి." ఉ, రా. ౨, ఆ.

**గొట్రె.** వై. వి. ఘోటజటికి.

**గొట్లె.** వై. వి. రేఁగుచెట్టు.

**గొడఁగు.** దే. స. క్రి. గొణఁగు. "ఉ. కొన్నిగొడంగికొన్ననిసి కొన్నితుసారములాడిమానరా, కెన్నికనిన్నినాళ్లకివియిన్నికూటికిఁ బిచ్చపాటికో, మ్మన్నమహాప్రసాదమనిహర్షరపోల్లనదాసనాజ్ఞయై, యున్నలినాక్షిపర్తయిడి నన్నియకైకొనుముక్షధాన్యముల్." పాఁడు. ౪, ఆ.

**గొడగ.** వై. వి. పిడికోలలేనినాఁగలి.

**గొడగర.** దే. వి. చెప్పులుకుట్టిజీవించెడుజాతి. (గొడగరవాఁడు, గొడగరది.)

**గొడగరి.** దే. వి. (గొడగర+ఇ.) మాదిగవాఁడు. "గీ. చాకి బోయవాఁడు జలగరిగొడగరి, కుక్కనూనగాఁడుకోడిపంది, బొడ్డు క్రిందియంగములు విప్రుఁజోఁకిన, నచటుఁగడుగవలయునంద్రు బుధులు." విజ్ఞా. అచా, కాం.

**గొడవ.** దే. వి. 1. ఆపద; "క. తలచుగమెకములఁబొరిగొను, మఱపునవచ్చితిమిదవ్వ మనపాలమిటకి, త్తఱినగునిమిత్తములు నృప, కొఱగావిదెమనకుఁబెద్దగొడవగుననినన్." స్వా. ౪, ఆ.— 2. తప్పు; "చ. అడుగకకానిడాఁచిన పదార్థములిచ్చుటనీతి కాదునీ, వడిగితికాననిప్పుడు నమర్పణచేసితినింకనాయెడన్, గొడవలులేవు." వి, పు. ౬, ఆ.—3. దుఃఖము; "గీ. నీవుచది వింతువనఁచునన్నియునఁవిడిచి, బిచ్చమెత్తంగరాదుగాబేలతపసి, కడవనాడకుబాలునీగొడవయేల, వెజ్జుఁదనమేలయనిమదిలజ్జవొడమి." స్వా. ౫, ఆ.—4. అడ్డి; 5. కలఁత.

**గొడారి.** దే. వి. గొడగరియొక్క రూపాంతరము. "ద్వి. మూలకు మూంతంబుమఱిగొడారికిని, దోలునుచన్నట్లు." భాగ. ౪, స్కం.

**గొడిగ.** వై. వి. గులకజాయి.

**గొడియ.** దే. వి. అందలముయొక్క ఒకానొక అవయవము. "సీ. మొగలిరేకల్లికతోఁగకాఁడచట్టముకుఱుగన్నుచెఱకుక్రొమ్మెఱుఁగుకొమ్ము, జిగిగుల్కులే మావిచిగురుటాకుపడమ్ముతోఁగరునెత్తామరతూఁడుగొడియ, లలరారుకురువేరుతళుకుబల్ముసనాబుపరువంపుఁబోగడపూబటువుదిండ్లు, పొన్నాకుమేల్పచ్చవన్నియపన్నాగమనఁటిక్రొవ్విరిగుత్తిగొనబుఁగుచ్చు; బొండుమల్లియపఱపుకప్పురపుటాఱగు, వలపువిరవాదిబటువుబిల్లలునుగలుగు, నందలమువేల్పుఁ దొయ్యలులనుసరింప, నెక్కియొకకొన్నిపయనంబులేగియంత." చంద్రా. 3, ఆ.

**గొడుగు.** దే. వి. ఆతపత్రము, ఛత్రము.

**గొడుగుగడ్డి.** దే. వి. గుడ్డికామంచి, అతిచ్ఛత్రము.

**గొడుగుబల్ల.** దే. వి. తలుపుమీఁది కుంబునముతిరిగెడు పట్టె.

**గొడుగుమెట్టెలు.** దే. వి. బ. వాటముపెట్టి ఓరలు సన్నగాఁ దీర్చిన వెడలుపుమెట్టెలు.

**గొడె.** దే. వి. గొడియయొక్క రూపాంతరము. "సీ. అపరంజ మొసలివాయనుసులశిరసుతోఁగనుపులుతొమ్మిది గల్గుకొమ్ము, నలసూర్యపుటపుఁబన్నాగంబుసరిగమేల్కట్టుపనుల హెచ్చుపట్టుకుచ్చు, లుదిరికంకణములింపొనఁగు దంతపు గొడెల్నయముమించినముసనాబుపటము." రా, వి. ౨, ఆ.

**గొడ్డ.** దే. వి. 1. బిఱుసు. 2. బ. బిఱుసుమాట. "ఎ, గీ. నాడు నేడునుదమయీడులేఁడటంచు, గొడ్డలాడుదురొండొరులొడ్డులేక." రా, వి. ౧, ఆ.—విశే. బిఱుసైనవాఁడు. "ద్వి. ఘుటికసిద్ధుఁడుఱాయికొట్టినగొడ్డ, యటమటకాఁడుమహామాయలాఁడు." హరిశ్చ. ౨, ఆ.

**గొడ్డగము.** వై. విశే. బాధకము. "క. గొడ్డగపుజరావ్యాధుల, కడ్డమగున్ మృత్యుదుఃఖహరమైమిగులన్, దొడ్డగుసుఖదమువెండియు, నొడ్డాణపుబంధమెలమియోగీంద్రులకున్." శివ. ఉ. ౨, ఆ.

**గొడ్డలి.** వై. వి. చెట్లునఱకెడుసాధనము, కుఠారము.

**గొడ్డు.** దే. వి. 1. గొడ్రాలితనము; "గొడ్డుపోఁగికనియెఁగొడుకు నెంతయుమూర్తి, మంతునెలఁతలందుమహితభాగ్య, యొక్కతియ యశోదయురివ్పైననుచవ్రే, పల్లెఁబొగడిరెల్లపడఁతుకలును." హరి. పూ. ౫, ఆ.—2. ఈననిపశువు; "గీ. గొడ్డుబడుగుఁదెవ్రులు గొంటిఁగ్రేపెడలిన, దాని నెచ్చటేనినూనమైన, యట్టిదానినొకట నాయాసపడియున్న, దానినీరుగోప్రదానవిదులు." భార. అను. ౨, ఆ.—3. గొడ్రాలు; "ఉ. నాయెడఁదప్పుపట్టదుమనంబున నానతిగొడ్డుగావునన్." వి, పు. ౬, ఆ.—4. పశువు. "సీ. అనివిలాపింపనూరార్చియేటికిఁగ్రేపుఁబాసిగొడ్డొఱలెడిపగిదినడలెదు." జై. ౬, ఆ.—విశే. శూన్యము. (గొడ్డంబలి=నూఁకలులేనియంబలి అని యర్థము.) (ఇట్లు గొడ్డుజావ, గొడ్డుసంకటి.) గొడ్డేఱు=నీళ్లులేనియేఱు అని యర్థము. గొడ్డుచెట్టు=ఫలములేనిచెట్టు అని యర్థము.

**గొడ్డుఁగాఁకర.** ద్వ. వి. (గొడ్డు+కాఁకర.) కర్కటకికి.

**గొడ్డుఁబోతు.** దే. విశే. (గొడ్డు+పోతు.) నిష్ప్రయోజకుఁడు.

**గొడ్డురాలు.** దే. వి. (గొడ్డు+ఆలు.) బిడ్డలుకనని ఆఁడుది, వంధ్య.

**గొడ్డువోవు.** దే. అ. క్రి. (గొడ్డు+పోవు.) వ్యర్థమగు. "మీనిఁ బట్టిక్రచ్చఱఁబరిమార్పఁజేసినయుపాయములన్నియుగొడ్డువోయె." లక్ష్మీ. ౪, ఆ. ("చ. ముసుమముగొడ్డువోయిరనిముష్టరతంబెడనాడినట్టిదుర్జనుల." భార. శల్య. ౨, ఆ. ఇత్యాదిస్థల

ములయందుగొడ్డువోవుటయనఁగా పౌరుషహీనమగుట అర్థము.) ("క. అనిచదివిలవ్వఁడురాఘవ, మనుజేశునితల్లిచిరమాతఁటకీతొ, జననికుశలవులనిరువురఁ, గనియునకటగొడ్డువోయెఁగడపటనను చుశా." జై. ౬, ఆ. ఇత్యాది స్థలములయందు గొడ్డువోవుట యనఁగా గొడ్రాలగుట అర్థము.)

**గొడ్డేఱు.** దే. స. క్రి. (గొడ్డు+ఏఱు.) నుత్తయెత్తు. "సీ. బొడ్డు పల్లెనుగొడ్డేఱెమోనపోతి, నెట్లుచెల్లింతుఁడంకంబులేడునూర్లు." వి. (చూ. గొడ్డు.)

**గొడ్రాలు.** దే. వి. గొడ్డురాలుయొక్క రూపాంతరము. "కనని గొడ్రాలుబిడ్డకా." పాండు. 3, ఆ.

**గొణఁగు.** దే. అ క్రి. మాటవెడలకనోటనె గొణగొణయను (గొ డఁగుయొక్క రూపాంతరము.)

**గొణగ.** వై. వి. గొడగయొక్క రూపాంతరము.

**గొణగొణ.** దే. వి. గొణఁగుటయందగు ధ్వన్యనుకరణము.

**గొణగొణలాడు.** దే. అ. క్రి. (గొణగొణలు+ఆడు.) గొణగొ యను.

**గొణిజే.** దే వి. గొణిదయొక్క రూపాంతరము.

**గొణిద.** దే. వి. తలుపు గ్రంధెతగిలించెడి యినుపచీల.

**గొతుపు.** దే. వి. నీలమణివిశేషము. "సీ. కప్పురాలనఁగనగనుపట్టు నీలముల్ గొతుపునాఁడద్భేదమతిశయిల్లు." ఆం. భా. ద్వి. వై.

**గొత్తు.** దే. వి. వెన్న మొదలగునవి పాసిపోయినకంపు.

**గొద.** దే. వి. ఆఁకలి, తృష్ణ.

**గొదకొను.** దే. అ. క్రి. 1. అతిశయించు; "ఉ. ఆగలిననిక్కఁ జూచినఖులందఱునేమిటువచ్చుటేమిసీ, లాగిదియేమియింతిశెది లక్షణమేదనుదెమ్మలెమ్మనకా, ప్రేగరిమంబునాఁపుచునాకించుక లేవఁగఁబూనుమాననా, లాగొదకొన్నసిగ్గునఁజెలుల్ బలిమింధనఁ డివ్వఁగోరుచుకా." కళా. ౭, ఆ.—2. తృప్తిపడు; "వ. కేయింటి యాఁకటిపెల్లునగొదకొని కవిచించుచువులందిరిచిత్తుంచియానుచు." భార. విరా. ౨, ఆ.—3. విజృంభించు. "క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁజెదరంగనీకగాండీవివెనకా, బొదివియటుగడపె నవియును, గొదకొనితమపాలముసొచ్చెగోపాలురతోకా." భార. విరా. ర, ఆ.

**గొదగొద.** దే. వి. పగ, విరోధము. "క. నానావిధిహాగములననయ, కోవిదయారెంటికెలగొదగొదపొడమెకా." పంచ. వేం. 3, ఆ.

**గొనకొను.** దే. అ. క్రి. యత్నించు. "నపర్వవృత్తికిక గొనకొనఁ డేవి విక్కమునికుంజర యేల." భార. శాం. ౬, ఆ.—ప్రే. గొన కొలుపు. "క. విక్రమమునకుం, గొనకొల్పితిట్లుశీరల." భార. అశ్వ. ౧, ఆ. (చూ. కొనకొను.)

**గొనప.** దే. వి. అఁజెగిననాఁగేలు. విణ. పొట్టి. (గొనపకోడి మొ.)

**గొనబు.** దే. వి. మనోజ్ఞత. విణ. మనోజ్ఞము.

**గొనబుకాఁడు.** దే. విణ. అందగాఁడు, సుందరుఁడు.

**గొనము.** దే. వి. గొనపయొక్క రూపాంతరము. (ఇది యిట్లుమకారో పధముగాఁ గొన్ని గ్రంథములయందు వ్రాయఁబడియున్నది.)

**గొనము** వై. వి. శౌర్యాదిగుణము.

**గొనయము.** వై. వి. వింటినారి, మౌర్వి.

**గొనుగు.** దే. వి. గుడఫలముకీ.

**గొప్ప.** దే. విణ. పెద్ద, అధికము.

**గొప్పలు.** యు. దే. వి. బ. వరిమడిలోననఁటవానియందు కొం చెము పొడవుగానుఁడెడుచోట్లు. (గొప్పలు క్రమ్మెనన్నారు.) వై. చూరుపట్టె, గోపానసి.

**గొబ.** వై. వి. 1. గుహ; "ఎ, గీ. పఱచునురవడిఁబొడమునిబ్బ రపుమ్రోఁత, కొండగొబల్లెఁజొచ్చియుండెండఁబెరుఁగ." హరి. ఉ. ౫, ఆ.—2. గొంది. "క. మూర్గాలంబులుసెలఁగుచు, గర్జిం చెనుగొబలనడఁగి." ఉ. హరి. ౫, ఆ.

**గొబడి.** దే. వి. పక్షివిశేషము.

**గొబ్బండు.** దే. వి. (గొప్ప+పండు.) పెద్దపండు. "సీ. పాకవే గానంభవరిపాటిఁదనుయంతఁబగిలినపనసగొబ్బండ్లశేనము." పాం డు. ౧, ఆ.

**గొబ్బరము.** దే. వి. ఎరువు.

**గొబ్బి.** దే. వి. 1. ధనుర్మాసదినముల సాయంకాలములయందు గడప లక్షుమందు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుచుఁ జుట్టివచ్చి జరపించెడు నాక వేడుక; 2. సమస్తాడినప్పుడు బాలికలు పాటలు పాడి చేతులుతట్టుచుఁ జుట్టివచ్చి జరపించెడి యొక వేడుక; 3. ఇత్తురకముకీ.

**గొబ్బిళ్లు.** దే. వి. బ. 1. బాలక్రీడావిశేషము; (చూ. కుప్పిగంతు లు.) 2. బాలికాక్రీడావిశేషము; "సీ. గుజగుజతేకులుగొబ్బిళ్లు." హంస. ౫, ఆ. (గిరులపైగొబ్బిళ్లుగోరాడుచుకా అనుచోటగొబ్బి ళ్లవలెఁగోరాడుటయని తోఁచుచున్నది.)—3. నమస్కారము. "రగడ. వజ్రపురీస్థావరమైచిక్కిన, గోపప్రియునకుగొబ్బిళ్లనుచును." హంస. ర, ఆ.

**గొబ్బున.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా.

**గొయ్య.** దే. వి. పల్లము, గర్తము.

**గొరక.** వై. వి. 1. ఇనుపబాణము; "గీ. క్రొవ్విననడగొండకైవడి గునుకునొక్క, యింటిగానిమహీనాథుఁడొదిగియేయ, గొరకమే నుచ్చిధరఁగాఁడకిరమువినరె, లేదనృక్పునమనుచుఁదెల్పెడునసంగ." సాం. ర, ఆ.—2. మృగవిశేషము.

**గొరకకెట్టె.** వై. వి. అలుఁగుగల చేతికట్టె.

**గొరగ.** దే. వి. మైలారునుగొలిచెడి యొకానొకమతస్థుఁడు. "ఉ. గొరగయ్యమైలారుఁగొనియాడునొకవేళ నొసటిపైబండారుపసుపు దాల్చి." కాశీ. ౭, ఆ.

**గొరగొర.** దే. వి. వేగము. "క. ఇరువంకలఁదన్నుఁబొదివి, గొరు వంకలుదుమ్మెదలుసుగోయిలలుండ, క్కిరిచిలుకలుఁబురిపులుఁ గులు, గొంగొరరామరుఁడువెడలెఁగొమ్మఁగలంపకా." నీలా. 3, ఆ.

**గొరిజె.** వై. వి. గొరిసెయొక్క రూపాంతరము.

**గొరిసె.** వై. వి. పశువులకాలిగిట్ట, ఖురము.

**గొరిసెగాలి.** ద్వ. వి. పశువుల గొరిసెలనడుమ పుండై పురుగులు పడెడి వ్యాధి.

**గొరువంక.** వై. వి. గోరువంకయొక్క రూపాంతరము. "క. గొరు వంకయన్నమాటల, మరువంకఁదలంతుగలిగిమగువఁదమలో, వెరువింకనేమికలదని,యిరువంకలవగలఁబొగిలిరెంతయువంతకా." విక్ర. ౭, ఆ.

**గొలకు.** వై. విణ. నీచుఁడు. "గీ. తానుజెడుటగాక తక్కినవారిని, జెలువఁజూచెనొరగొలకుపడుచు." లక్ష్మి. ర, ఆ.

**గొలపము.** వై. వి. గుజ్జుమునదోమెడు సాధనము, శేకకారము. (ఇట్లు నరళాదిగాఁ గొన్నిదేశములయందు వ్యవహారము.)

**గౌటీయ.** వై. వి. గొట్టీయయొక్క-రూపాంతరము. "క. ఉఱవగు నారుగవంటలు, గౌటియలపాఁడియునుదఱుచగుఁ౯." భార. అర. ౪, ఆ.

**గౌఱుగు.** దే. స. క్రి. క్షౌరముచేయు.

**గౌత్రె.** వై. వి. గొత్త్రెయొక్క-రూపాంతరము. "గౌత్రెతోళ్లు." పాంచా. ౨, ఆ.

**గౌత్త్రీయ.** వై. వి. గొత్త్రె.

**గౌట్లు.** దే. వి. 1. ముప్పదిరెండు కుంటలకొలఁది; 2. దున్నిన పొలముమీఁదదున్నెడుయంత్రము.

**గౌట్టె.** వై. వి. మేషి. (గొట్టీయయొక్క-రూపాంతరము.)

**గౌల.** వై. వి. పంద్లములోనగువానియొక్క-గెల. "చ. తొలిగుబ్బలిఁ గొండగోఁగుపూ, గౌలయలరించెనాఁబొడిచెఁగోకనదాప్తుఁడు పాటలద్యుతిఁ౯." పా. ౨, ఆ.

**గౌలక.** యు. వై. వి. కలకలధ్వని. దే. బ. తొటిచన్నులు.

**గౌలగౌల.** వై. వి. 1. కలకలధ్వని; "సీ. జమిలిముక్కాలి పిసాళి బల్మ్రోఁతకుఁ గౌదమకోయిలచాలుగౌలగౌలలకు." నీలా. 3, ఆ.—2. ధ్వన్యనుకరణము. "వ. రంభాదిమరుద్రంభోరువులకలికి నునుపోగపలుకులకలకలంబునగౌలగౌలమనుకౌతుకాగారంబుపొత్తెంచి." స్వా. ౫, ఆ.

**గౌలిమిడి.** దే. వి. ఇక్షురకము*.

**గౌలివె.** దే. వి. తృణవిశేషము. బ. తృణదాన్యవిశేషము.

**గౌలుగు.** దే. వి. గొనుగుయొక్క-రూపాంతరము.

**గౌలుసు.** దే. వి. 1. చేతధరించెడియొకసొమ్ము; 2. ఏనుఁగుకాలు గట్టెడునిగళము; 3. సంకెల. "సీ. శుకకదంబము గౌలుసులచే నిబద్ధమైవారాంగనాగారకారఁబడఁగ." ఆము. ౨, ఆ.

**గౌలుసుమోడి.** దే. వి. విడివిడిగాలేక గౌలుసువలె నొకటితో నొకటి పెనఁగొన్నవ్రాలు.

**గౌల్ల.** యు. దే. వి. 1. ద్వారపాలకుఁడు; "క. ఇదియేమిఁచుక వారిం, చెదమనుచుఁగడంగనీదుచిత్తమునకురా, దదిరిపడిమొన్న గౌల్లల, నదటఱఁబొడిపించువాఁడవైతివరేంద్రా." పర. 3, ఆ.—2. ధనపాలుఁడు. "ద్వి. తొలుతమంత్రిపురోహితులుయువ రాజు, దళవాయిగౌల్లలంతఃపురీకర్త, లాజ్ఞాధికుఁడుఁదీర్పునతఁడు నెచ్చెలియుఁ, దజ్ఞుఁడైసెలవులేఖజేఁజేయునతఁడు, నగరంబుపాలించునరనాయకుండు, తగవరిధర్మశాస్త్రముదెల్పువాఁడు, చనవరి యుఁదలారిసారెదుర్గములఁ, దనకలినుంచునాతఁడునసంబరఁగు, వారలలెఱఁగుసర్వంబునానాట,నేరుపాటుగవిందెయేకతంబునను." రా. అ, కాం.—వై. పశువులనుమేపియు పాలుపెరుగు అమ్మియు జీవించెడుజాతి*. (గౌల్లవాఁడు, గౌల్లది.)

**గౌల్లఁడు.** వై. వి. గోపాలకుఁడు.

**గౌల్లజిడ్డు.** ద్వ. వి. ఖూలిని*.

**గౌల్లతె.** వై. వి. గోపిక. "గీ. అనఁగవేఱొక్క-గౌల్లతయమ్మవినుము, చానలోవలయపపిండిపంచదార, యొదువఁగలిపిమూలనుడాఁచియుండ వచ్చి, తినియెనంతయుఁగృష్ణుండుదేవరాన." హరి. పూ. ౫, ఆ.

**గౌల్లదొందు.** దే. వి. మత్స్యవిశేషము. "ఎ, గీ. అల్లెదమ్ముప్పుఁజేఁపయుగౌల్లదొందు." హంస. ౪, ఆ.

**గౌల్లము.** వై. వి. లోఁతుగలపల్లము. (చూ. కౌలి.)

**గౌల్లియన.** దే. వి. గౌల్లెన. "క. పసిఁడిజలపోసనంబుల, నసను రుచింబొలుచుగౌల్లియనలున్నతిఁబెం, పెనఁగెంబసిండిగుబ్బలి, పసినిసుఁగులగతిఁదదంకభాగస్థములై." కవిక. ౨, ఆ.

**గౌల్లు.** వై. వి. కలకలధ్వని.

**గౌల్లెన.** దే. వి. గుడారము. "మ. ఎల్లిగౌల్లెనలెత్తింతువిరోధులంబునిధివెల్లింజౌల్లజల్లింపఁగ౯." ఉ, హరి. ౪, ఆ. (గౌల్లియనయొక్క-రూపాంతరము.)

**గౌల్లెనబండి.** దే. వి. గాడీ. "ఉ. పల్లకులన్ మహాశ్వములభద్రగజంబుల సందలంబుల౯, గౌల్లెనబండ్లన్ నడకగుఱ్ఱపుమోటుల వేసడంబుల౯, బెల్లుగనెక్కి-పౌరజన బృందముఁబోఁబురినైదునాళ్లు భూ, వల్లభుఁడుండితాఁగదలెవాయుజముఖ్యులతోడవేడుక౯." జై. ౨, ఆ.

**గౌసరు.** దే. వి. తాపము. (చూ. గౌవరువోవు.)

**గౌవరువోవు.** దే. అ. క్రి. తపించు. "ఎ, గీ. కొన్నిదేశంబులెండచేగౌవరువోయె." కాశీ. ౧, ఆ.

**గౌహరు.** దే. వి. ఉపద్రవము. "పంచచామరము. జొహారు మీకుఁజల్లగాఁగఁజూడుఁడో సమీరకం, జహారులారమంటమారిశంబరారిఁగూడిన౯, గౌహారునేయనేలసారెకుఁజలంబున౯భుజం, గహారుపాదమానమీరుకాఁకలింకఁ జేసిన౯." సా. ౨, ఆ.

## గో.

**గో.** దే. అవ్య. చూపుటయందువచ్చును. (అదిగో, ఇదిగో మొ.)

**గోండుఁడు.** సం. వి. అ. పుం. పామరజాతివాఁడు. విణ. ఉఱుకుబొడ్డువాఁడు.

**గోంద్రించు.** దే. అ. క్రి. 1. (పులి) కూయు; (చూ. గోంద్రిల్లు.) 2. (ఎలుఁగు) కూయు. "ద్వి. గొటగొటగోండ్రించి కోఱలొంచొంటి, గటగటఁదాఁకింపగర్భంబుగలఁగి." నవ. 3, భా.

**గోంద్రిల్లు.** దే. అ. క్రి. (పులి) కూయు. (రూ. గోంద్రిలు. "ద్వి. బిలములగుహలందుబెబ్బులుల్ దిఱుత, పులులుగోంద్రిలుచుండు." నళ. 3, భా.)

**గోంద్రు.** దే. వి. అంగలార్చుటయందగు ధ్వన్యనుకరణము. "చ. ఆకొళ్ళునాడువాలభుజగింగనిగోంద్రనియంగలార్చుచు౯." ఆము. 3, ఆ.

**గోఁకు.** దే. స. క్రి. 1. గీఁకు; 2. గీఱు.

**గోఁకుడుపాఱ.** దే. వి. దోఁకుడుపాఱ.

**గోఁగు.** దే. వి. గోనుయొక్క-రూపాంతరము. (ఇది ద్వివిధము. ఊరగోఁగు, కొండగోఁగు, అని. ఇదియె ఊరగోఁగు.)

**గోఁచి.** దే. వి. కచ్చడము, కౌపీనము.

**గోఁచికట్టు.** దే. వి. బ్రహ్మచారి. "ఎ, గీ. ఆనలన్నియుమొదలంటఁగోసియున్న, గోఁచికట్టునకటువంటిగొడవగడప, రాకమెడఁ జుట్టుకొనియెనూరకయకార్య, కరణశీలురకెప్పాటఁగలదె సుఖము." పాండు. ౫, ఆ.

**గోఁచికాఁడు.** దే. వి బ్రహ్మచారి. విణ. నిర్ధనుఁడు. భల్లా. ౫, ఆ.

**గోఁచిపాఁతఁడు.** ద్వ. వి. బ్రహ్మచారి. "ద్వి. ఓరినాపంచిన యుడిగమేమైనఁ, గోరినేయుచునొఱగొడ్డెంబులేక, కొలిచెదవేని యీగోఁచిపాఁతనికి, వలచినధనమంతవట్టునునిచ్చి, బంటుగానేలుదుఁబరఁగనిన్ననిన." హరిశ్చ. ౨, ఆ.

**గోఁజాట.** దే. వి. గోఁజాడుట. (ఇదేమి యెప్పుడుచూచినను ఈగోఁజాట.)

**గోఁజాడు.** దే. స. క్రి. (గోఁజు+ఆడు.) పీడించియడుగు. (స్వార్థమున ఆడు.) (ఏల ఊరక గోఁజాడుచున్నావు.)

**గోఁజు.** దే. స. క్రి. గోఁజాడు. (వీడు ఊరక నన్ను గోఁజుచు న్నాఁడు.) వి. గోఁజాట. (ఇదేమి పెద్ద గోఁజుగా ఉన్నది.)

**గోఁటు.** దే. వి. 1. కోకయంచునచేర్చికుట్టెడు సన్ననిసరిగపట్టె; 2. ఒయ్యారము; 3. రేఖ; 4. బ. చేతనుంచుకొనెడు స్వర్ణకటక విశేషము.

**గోఁటుకత్తె.** దృ. విణ. ఒయ్యారముగలది.

**గోఁటుకాఁడు.** దే. విణ. ఒయ్యారముగలవాఁడు.

**గోఁదు.** దే. వి. బందన.

**గోఁదురు.** దే. వి. పెద్దకప్ప.

**గోకంటకము.** సం. వి. అ. పుం. 1. పల్లేరుకాయ; 2. గోవులగొరిసె.

**గోకర్ణము.** సం. వి. అ. పుం. 1. కడితివృగము; 2. జిత్త; 3. కంచరగాడిద; 4. పాము; 5. ప్రమథగణవిశేషము.

**గోకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. చాఁగకీ.

**గోకిలము.** సం. వి. అ. పుం. 1. రోఁకలి; 2. నాఁగలి.

**గోకులము.** సం. వి. అ. న. ఆవులమంద.

**గోకులికము.** సం. వి. అ. పుం. అడుసుపడఁబడినయెద్దు. (కొన్ని పుస్తకములయందు గోగుణికమని పాఠము కానఁబడుచున్నది.)

**గోక్షురకము.** సం. వి. అ. పుం. పల్లేరుకాయ.

**గోగంధనము.** సం. వి. అ. పుం. ఎదురుగాలి.

**గోగ్రంథి.** సం. వి. ఇ. పుం. 1. పసులకొట్టము; 2. ఏఱుపిడక; 3. బెండకాయ.

**గోచరము.** సం. వి. అ. పుం. 1. ఇంద్రియార్థము, (చూ. విషయము.) 2. విషయము.

**గోచరించు.** సం. అ. క్రి. అగపడు. అం, ప్రే. అగపఱచు. "ఎ, గీ. కాంతఁగందువపెట్టెనీకడకుమేలు, చెప్పవచ్చినదన్న శిక్షింపఁదగునె, మొనసి హితముదరించినముండమున్కు, కోఁత పడుననుమాటనక గోచరించె." కాశీ. ౬, ఆ.

**గోచారము.** సం. వి. అ. పుం. సూర్యాదిగ్రహములయొక్క మేషాదిరాసులసంచారము.

**గోజిహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. ఎద్దునాలుకచెట్టు, బెండ.

**గోటాపన.** వై. వి. పక్షియాఁక. "క. నేటుకొనిపంన్నుకొఱుకుచుఁ, జీటికిమాటికినిగనరుచిలుకకొలుకా, బోటులకలయించెదునీ, గోటాపనయెన్నఁడింకగూఁటంబడునో." నీలా. 3, ఆ.

**గోడ.** వై. వి. కుడ్యము.

**గోడకాలు.** దృ. వి. కరగోడ. "సీ. కమ్మఁదేనియనీళ్లుగట్టిపుప్పొడి మట్టిగోడకాల్దీర్చిన ప్రోడతనము." రా, వి. 3, ఆ.

**గోడగించు.** దే. అ. క్రి. 1. మాటాడు; "సీ. గొల్లయిల్లాండ్రతో గోడగించుటఁజేసి పరకామినీసహోదరతఁజూప." పా. ౧, ఆ.—2. శబ్దించు. "ఉ. మగతుమ్మెదప్రోదలుగోడగించుచుం, కారము కారమయ్యె." కవిక. 3, ఆ.—స. క్రి. తిరస్కరించు. "సీ. మండువేసవినాటిమార్తాండబింబంబు గోడగించుపసిండిగుబ్బ కోడ." కాశీ. ౪, ఆ.

**గోడచేర్పు.** దృ. విణ. జముఁడు. "ద్వి. మొండరిదట్టిదప్పడు గోడచేర్పు." హరిశ్చ. ౨, భా.

**గోడా.** వై. వి. గుఱ్ఱము. "క. జోడనలునిబ్బరంబులు, వేజాం బులు మెఱయరాజవేసుక తోడక, గోడాదుమికింపఁగజత, కూడిరి దొరలెల్ల భటులకుమెరెనుకొని యేక." ఉ, రా. 2, ఆ.

**గోడాడు.** దే. అ. క్రి. (గోడు+ఆడు.) దుఃఖించు. "ద్వి. కూడియుంగకదగగొంటిపిచాలు, గోడాడకిప్పోటఁగూర్చుండుమను చు." అభిమన్యుచెప్పద.

**గోడి.** దే. విణ. 1. అణఁగుడు; 2. వంపు. "సీ. కూనిపోఁపుల మీఁదగోడియైబోటెత్తిచవద్దకంకాళ్ళఖండములను." కాశీ. 3, ఆ.

**గోడిగ.** వై. వి. ఆఁడుగుఱ్ఱము.

**గోడిపట్టెలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "ఎ, గీ. గుబ్బ దాఁగిలిముచ్చులుగోడిపట్టె, లేలపాటలు సరిబేసులీలకూఁత, లాది గాశైశవక్రీడలాడిరచట, రామకృష్ణులుగోపదారకులఁగూడి." వి, పు. 2, ఆ.

**గోడిపడు.** దృ. అ. క్రి. (గోడి+పడు.) 1. అణఁగు; "శర్వరి గోడివడంగలేచి." రామా. ౬, ఆ.—2. వంపగు. "వ. ఝూం కారితపత్రధారావిహారంబుగగోడివడిడిగ్గునప్పుడు." వై. ౨, ఆ.

**గోడివెట్టు.** దే. స. క్రి. (గోడి+పెట్టు.) వంచు.

**గోడు.** దే. వి. దుఃఖము. "క. వరమమునీంద్రసమరమృతి, కురువీరులమాననములగోడుడుగదవ, శ్యాకుణవెలయలోకంబ, చ్చెరువందఁగఁజూపవేవిచిత్రపుమహిమకా." భార. ఆశ్ర. ౨, ఆ.

**గోడెము.** దే. వి. కొండదొనన్నాశ్రయించియుండెడు బోయపల్లె.

**గోణము.** వై. వి. గోవణముయొక్క రూపాంతరము. "ఉత్సాహ. కావిగో, ణములుగట్టువారినైననగుచుఁజత్తెజొండుచి, శ్రమములుగలఁచి చెఱచు." శివ. ఉ. ౨, ఆ.

**గోణాము.** వై. వి. గోణముయొక్క రూపాంతరము.

**గోణె.** ఉభ. దే. వి. ఎద్దు. సం. ఈ. స్త్రీ. గోనె.

**గోతము.** దే. వి. 1. జనుపనారనంచి; 2. మల్లులుపాదనకొఱకు జాళ్లు నించియుంచుకొనెడు గోనె. "స్రగ్ధర. గ్రుద్దుకాగోత్రా చలంబుల్ గులగులలయిపోగోతముల్ గ్రుద్దులీలకా." స్వా. ౪, ఆ.

**గోతాము.** దే. వి. గోతముయొక్క రూపాంతరము.

**గోతి.** దే. వి. ఆఁడుది. "క. జ్ఞాతులయెడగోవులయెడ, గోతుల యెడధర్మమెడలిక్రూరుఁడగుటకా, ర్యాతురవిప్రోపేక్షా, నీతిబిస ములవహరించునిపుణతయరయకా." భార. అను. 3, ఆ.

**గోతుంబ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పిన్నపాపరకాయ; 2. పుచ్చకాయ; 3. బుడమకాయ.

**గోత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. గోవులగుంపు.

**గోత్రభిదుఁడు.** సం. వి. ద్. పుం. ఇంద్రుఁడు.

**గోత్రము.** సం. వి. అ. న. 1. వంశము; 2. పేరు; 3. గొడుగు; 4. అడవి; 5. బలిమి; 6. పరిమడి. పుం. కొండ.

**గోత్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గోవులఁగాచువాఁడు.

**గోద.** దే. వి. ఎద్దు.

**గోదరి.** దే. వి. ముచ్చివాఁడు.

**గోదారణము.** సం. వి. అ. న. హలము, నాఁగలి.

**గోదారి.** వే. వి. కెన్నకాఁచినమట్టి.

**గోదావరి.** సం. వి. ఈ. స్త్రీ. నదివిశేషము.

**గోదు, గోందు.** హిం. వి. తుమ్మజిగురు.

**గోదుమ.** వై. వి. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము.

**గోదుమపూసలు.** ద్వి. వి. బ. స్త్రీకంఠభూషావిశేషము.

**గోధ.** సం. వి. ఆ. స్త్రీ. ఉడుము. ఆ. స్త్రీ. అ. న. అల్లెత్రాటి దెబ్బతాఁకకుండుటకైయుడుముతోలులోఁగుట్టి చేతికిఁదొడిగికొన్న కవచము.

**గోధనము.** సం. వి అ. న. గోకులము.

**గోధాపది.** సం. వి. ఈ. స్త్రీ. చెప్పుపట్టె*.

**గోధి.** సం. వి. ఇ. పుం. నొసలు, అలికము.

**గోధిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉడుము; 2. సరుడుము.

**గోధుహుఁడు.** సం. వి. హ్. పుం. గొల్లవాఁడు.

**గోధూమము.** సం. వి. అ. పుం. 1. గోదుమలు; 2. నారదము*.

**గోనర్దము.** సం. వి. అ. న. కయివడిముస్తె*. పుం. బెగ్గురుపక్షి.

**గోనసము.** సం. వి. అ. పుం. కొండచిలువ. (రూ. గోనాసము.)

**గోనియ.** వై. వి. గోనె*.

**గోను.** దే. వి. గోఁగు, తీక్ష్ణవృక్షము.

**గోనె.** వై. వి. అడ్డముగానడుమఁగుట్టుపోసిధాన్యమునించి యెద్దు మీఁదవేసెడు జనుపనారపట్టలసంచి*. (గోనియయొక్క-రూపాంతరము.)

**గోనెసంచి.** ద్వి. వి. గోతము.

**గోపతి.** సం. వి. ఇ. పుం. 1. ఆఁబోతు; 2. ఇంద్రుఁడు; 3. రాజు; 4. శివుఁడు; 5. సూర్యుఁడు.

**గోపనము.** సం. వి. అ. న. 1. దాఁచుట; 2. కాపాడుట.

**గోపము.** సం. వి. అ. పుం. బోళము.

**గోపానసి.** సం. వి. ఈ. స్త్రీ. చూరుపట్టె, గొవ్వలు.

**గోపాయితము.** సం. విశే. (అ. ఆ. అ.) కావఁబడినది.

**గోపాలుఁడు.** సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. రాజు.

**గోపి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లది; 2. మామెన*.

**గోపిక.** సం. వి. ఆ. స్త్రీ. గొల్లది, వ్రేత.

**గోపిచందనము.** సం. వి. అ. న. ఒకదినుసుసుద్దమన్ను. (రూ. గోపీచందనము.)

**గోపీతము.** సం. వి. అ. పుం. ప్రభాతము, వేకువ.

**గోపీథము.** సం. వి. అ. పుం. సీటిదొన.

**గోపుఁడు.** సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. రాజు; 3. గోవులకధిపతి; 4. అనేక గ్రామముల కధిపతి.

**గోపుచ్ఛము.** సం. వి. అ. పుం. కోఁతి.

**గోపురము.** సం. వి. అ. న. 1. గవను; 2. వాకిలి; 3. కైవడిముస్తె*.

**గోప్యుఁడు.** సం. వి. అ. పుం. ఊడిగపువాఁడు. విశే. కావఁదగినవాఁడు.

**గోమంతుఁడు.** సం. వి. త్. పు. గోవులకొడయుఁడు.

**గోమయచ్ఛత్రము.** సం. వి. అ. న. కుక్కగొడుగు.

**గోమయము.** సం. వి. అ. పుం, న. పేఁడ.

**గోమాయువు.** సం. వి. ఉ. పుం. నక్క, జంబుకము.

**గోమారి.** మి. వి. (గోవు+మారి.) పసులకుఁబట్టెడి చెక్కుడురోగ.

**గోమి.** సం. వి. న్. పు. 1. గోవులకొడయుఁడు; 2. నక్క. విశే. గోవులుగలవాఁడు.

**గోమించు.** దే. స. క్రి. గోముచేయు. "క. ఈమాడ్కి-నమితభోగ, శ్రీమెఱయుచునొక్క-నాఁడుచిత్తముపనిజ, స్వామియుఁదలిదండ్రులుఁదను, గోమించినపడతఁదలఁచికొనియతఁడెలమిన్." శుక. ౧, ఆ.

**గోము.** దే. వి. శ్రమమెఱుఁగనితనము, సౌకుమార్యము.

**గోముఖము.** సం. వి. అ. న. 1. అలుకుట; 2. కొంకరవంకరగాఁగట్టినయిల్లు; 3. వాద్యవిశేషము. పుం. 1. మొసలి; 2. సురంగవిశేషము.

**గోమేధికము.** సం. వి. అ. న. పసుపువన్నెగల రత్నవిశేషము. (అచ్చుపుస్తకములయందు గోమేదకమను పాఠము కానఁబడుచున్నది.)

**గోర.** వై. వి. గోరువంకపక్షి. "సీ. పికిలిపిట్టలుగడ్డిపిట్టలుగోరలు బంగరుపిచ్చికల్పసుపుముద్దలు." రసి. ౧, ఆ.

**గోరంక.** వై. వి.——పై.——(ఇది ప్రయోగమునందు మృగ్యమైనను వ్యవహారమునందు రూఢము.)

**గోరంకువు.** సం. వి. ఉ. పుం. 1. గోరువంకపక్షి; 2. దిక్షమొలవాఁడు; 3. బట్టువాడు.

**గోరఁట.** వై. వి. కురంటకము*. "రగడ. కొమ్మవేగిరమేటికే కొనగోరగోరఁటవిరులుగిల్లుము." పా. ౪, ఆ.

**గోరగింత.** వై. వి. భయంకరత్వము.

**గోరతనము.** దే. వి. దౌష్ట్యము. "ఎ, గీ. గోరతనములుమానఁరా కొడుకుఁగుజ్జ." కాశీ. ౪, ఆ.

**గోరప.** దే. వి. గట్టిమ్రోఁత.

**గోరపడు.** ద్వి. అ. క్రి. (గోరము+పడు.) రోఁతపడు. "క. చేరినఁగాపారాఖ్యుఁడు, రారమ్మనిమిగులనాదరమ్మునఁజోటిం, పారనొసఁగెఁగక్క-సమని, గోరపడకయువినుసాత్విళులచరితంబుల్." పర. ౧, ఆ.

**గోరము.** దే. వి. 1. దేహముయొక్క- అస్వాస్థ్యము; 2. ఆపద; "క. జగములుచెడిపోవుతఱిన్, మొగులుతెగల్మింటదట్టముగఁగ్రమ్ముకవా, సగురియుచందమ్మునఁజి, న్కగముల్గురిసెడినిదేమిగోరముచెప్పుమా." అచ్చ. యు, కాం.—3. రోఁత. విశే. రోఁతగలది. "ఉ. పాపపురాచజాతిగుణభంగులెఱుంగుదువేమిచెప్పన, య్యోపెనుగోరముల్." కళా. ౭, ఆ.

**గోరసము.** సం. వి. అ. పుం. కాలశేయము, మజ్జిగ.

**గోరి.** హిం. వి. కట్టినసమాధి.

**గోరించు.** దే. అ. క్రి. ఎగయు. శశాం. ౩, ఆ.

**గోరింపు.** దే. వి. ఎగపు. శశాం. ౪, ఆ.

**గోరు.** వై. వి. 1. నఖము*; 2. తంతిమీటుటకుబంగారులోనగువానితోఁజేసి వ్రేలికివేసికొనెడు ప్రతినఖము*; "ఉ. హస్తముపైఁడి

గోళ్లుఖిం, పారతిసేయుదగ్నతునిసం పెరగముబుక్కలుబుపోలెమింపం గ౯." సా౯. ౫, ఆ.—3. అరంటిపువ్వులోపలనుండెడివస్తువిశేషము*. "గీ. కొప్పువిప్పు, మెఱయుగోళ్లుమ్రుచ్చులుంగెంపుం గుఱులుగావె." ఉమ. ౫, ఆ.—విణ. అల్పము*. (గోరు వెచ్చ మొ.)

**గోరుగల్లు.** దృ. వి. (మంగలిగోళ్లుతీసెడి) ఇనుపసలాక, నఖోత్పాటని. "దూరవీక్షార్థియాగోరుగంటహృతాక్షుండయ్యె." కళా. 3, ఆ.

**గోరుగాలము.** దృ. వి. చేపలనుబట్టుటకు ఉక్కుకమ్మితో వంకర గాఁజేసినగాలము, బడిశెను.

**గోరుగొండి.** దృ. వి. గోరుగల్లు. (చూ. గోర్గొండి.) "గీ. వాఁడి గోర్గొండిఁగన్నులుదోఁడియైన, నసుగులడిదంబుచేతఁజక్కడిచి యైన, నొండుకడకేగుటలుమానియుండవలయు, దక్కమాటలు దక్షవాటంబునందు." భీ. ౬, ఆ.

**గోరుచిక్కుడు.** దృ. వి. చిన్నదినుసుచిక్కుడు.

**గోరుచీరణము.** దృ. వి. గోటివలె కొనయందువంపుగలయులి.

**గోరుచుట్టు.** దృ. వి. 1. గోటిచుట్టులేచెడు పుండు; 2. ఒక దినుసుగడ్డ.

**గోరుపడము.** వై. వి. కంబళి. "ఉ. భూరినదీప్రవాహమునఁ బోయెడునల్లనియచ్ఛభల్లముఁ౯, గోరుపడంబుగాఁదలఁచి." చెన్న. 3, ఆ.

**గోరుపులాడు.** దే. స. క్రి. (గోరుపులు+ఆడు.) 1. పుట్ట చెండ్లాడు; 2. ఎగురవేయు. "గురుకుచగుబ్బచిన్నగవ గోరుపులాడును బుట్టచెండ్ల." చంద్రా. ౨, ఆ. (ఈచోట ఒక పాఠమిట్లున్నది. మఱియొకచోట గోర్పిళులాడును అని యున్నది. విచార్యము.) (చూ. లంగగోను, గోర్పిల్లాడు.)

**గోరువంక.** వై. వి. శారికపక్షి.

**గోరొత్తు.** దృ. వి. (గోరు+ఒత్తు.) నఖక్షతము. "సీ. ఒఱపైన మెఱుఁగుగోరొత్తు సందులతోడరాలుచుండెడు గంధరసముతోడ." శౌను. ౨, ఆ.

**గోరోచన.** సం. వి. ఆ. స్త్రీ. గోరోజనము.

**గోరోజనము.** వై. వి. ఆవులకడుపులోనుండియెత్తెడ యొక వస్తువు.

**గోర్ధము.** సం. వి. అ. న. తలమెదడు, మస్తిష్కము.

**గోర్పడము.** వై. వి. గోరుపడముయొక్కరూపాంతరము. "సీ. కోరగించెడికొండగోఁగుఁబువ్వులచాయదీవన్నెగోర్పడంబెట్లు గలిగె." జై. 3, ఆ.

**గోర్పిల్లాడు.** దే. స. క్రి. (గోరు+పిల్లు+ఆడు.) 1. పుట్ట చెండ్లాడు; "రథరథ్యవ్రాతముం జేతులఁ౯గోర్పిల్లాడుచు." రామా. ౬, ఆ.—2. ఎగరవేయు. చంద్రా. ౨, ఆ. (రూ. గొర్పిపులాడు.)

**గోర్వంక.** వై. వి. గోరువంకయొక్కరూపాంతరము.

**గోఱజెము.** వై. వి. గోరోజనము. "గీ. గోఱజంబుజాన్నచాఱ పప్పు." సా౯. ౪, ఆ.

**గోల.** ఉభ. దే. విణ. ముగ్ధుఁడు, ముగ్ధ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాఁగు; 2. గోదావరి; 3. మణిసిల. నేపాళదేశమునఁబుట్టిన మణిసిల. (అనికొందఱు.)

**గోలకము.** సం. వి. అ. పుం. 1. కాఁగు; 2. గోలీ.

**గోలత్తికి.** సం. వి. ఆ. స్త్రీ. ఉడుముండపిచ్చుక.

**గోలాంగూలము.** సం. వి. అ. పుం. 1. కొండముచ్చు; 2. కోఁతి.

**గోలించు.** దే. స. క్రి. చనుకుపోసివేయు.

**గోలిహము.** సం. వి. హ. పుం. మొక్కపుఁజెట్టు.

**గోలీ.** వై. వి. ఆటలాడుకొను చిన్నగాజుగుండ.

**గోలీఢము.** సం. వి. అ. పుం. మొక్కపుఁజెట్టు.

**గోలు.** దే. వి. పేకుబొద్దునకు ప్రక్కనేర్పఱచెడు సన్నని పేకు బొద్దు.

**గోలుగోలు.** దే. వి. పక్షులయందగు ధ్వన్యనుకరణము. "వ. దృగ్గోళకంబులవేఁడికన్నులవెడలగోలుగోలునసేడ్చిర." నై. ౧, ఆ.

**గోలురించు.** దే. అ. క్రి. (పులి) కూయు.

**గోలెము.** వై. వి. కాఁగు. "గీ. మగనిరాకయెఱఁగిమగువయొయ్యన అంకు, మగనిఁదెచ్చియింటిమఱుఁగునందుఁ, గల్లుగోలెమునసుగడియించియామీఁద, గంపదబ్బువెట్టెఁగదలకుండ." భల్లా. ౧, ఆ.

**గోలోమి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగఱికె; 2. వసలుజేడకీ; 3. వసకీ; 4. నెలగొలిమిడికీ.

**గోల్గోలు.** దే. వి. గోలుగోలుయొక్కరూపాంతరము. "గోల్గోలున నేడ్చెన్." పర. ౪, ఆ.

**గోవ.** దే. వి. యౌవనము. (చూ. గోవాళ్లు.) విణ. మనోజ్ఞము. (గొవపని మొ.)

**గోవందిని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రెంకణముకీ.

**గోవణము.** వై. వి. కౌపీనము. "గీ. వృక్షశాఖాంచలంబుపైవ్రేలుచున్న, కోటిసంఖ్యలసిర్పావిగోవణములు." కాశి. ౨, ఆ.

**గోవమొలత్రాడు.** దే. వి. మగవానిమొలనూలు, శృంఖలము.

**గోవావు.** దే. వి. (గోవ+ఆవు.) సాధువుకానియావు, కరట. "వ. దూడలంగుడువవిడిచిడుగ్గదోహనంబునకుఁజేరవచ్చిన బెదరిపసుల సందుసందుఁజొచ్చిపోవ గోవావుఁ వెనుదగిలిసాధుపసులచాటునం బొంచి కూడముట్టితలకోలలు వెట్టియాఁగువారును." వి. పు. ౭, ఆ.

**గోవాళ్లు.** దే. వి. బ. (గోవ+వారలు.) యౌవనముగలవాఁడు. "శీతుఁదగినగోవాళ్లుమహిజ౯నెమకినగాదె." సా౯. ౪, ఆ.

**గోవిందుఁడు.** సం. వి. అ. పుం. 1. కృష్ణుఁడు, 2. గోవుల కొడయఁడు; 3. బృహస్పతి.

**గోవిట్టు.** సం. వి. ష. స్త్రీ. గోమయము. పేఁడ.

**గోవు.** సం. వి. ఓ. స్త్రీ. 1. ఆవు; (దీని ధ్వని హంభా. శిరోదేశము నైచికము.) 2. కన్ను; 3. దిక్కు; 4. బాణము; 5. భూమి; 6. వాక్కు; 7. బ. నీళ్లు. పుం. 1. ఎద్దు; 2. కిరణము; 3. స్వర్గము; 4. చంద్రుఁడు; 5. వజ్రాయుధము.

**గోవృషము.** సం. వి. అ. పుం. ఆఁబోతు.

**గోశీర్షము.** సం. వి. అ. న. పసుపువన్నెగల చందనము, హరిచందనము.

**గోశ్రేణి.** సం. వి. ఈ. స్త్రీ. తంగేడుకీ.

**గోషా, ఘోషా.** హిం. వి. అంతఃపురము, రాణివాసము.

**గోష్ఠము.** సం. వి. అ. న. గోవులమందయుండుచోటు.

**గోష్ఠశ్వుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) లోకంఁజెడుచూడఁ మండునుఁడు కాని పరులను ప్రశంసించువాఁడు.

**గోష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సభ; 2. సల్లాపము.

**గోష్పదము.** సం. వి. అ. న. 1. గోవుయొక్క అడుగుకొలఁది; 2. గోవుగొరిసెయుఁడినగుంట; 3. గోవులుతిరిగెడిచోటు.

**గోసంఖ్యుఁడు.** సం. వి. అ. పుం. గొల్లవాఁడు.

**గోసఁగి.** వై. వి. మాలవాఁడు. "క. ఓరోరిరాచవాఁడా, రారానా కెంటఁబిరుగురాగోసఁగినై, పోరాడిమాడబెచ్చెదఁ, గోరాడీయప్పుఁ పెర్చుకొంగా సెలువగా." హరిశ్చ. ४, ఆ.

**గోసడుచు.** దే. స. క్రి. (గోసు+అడుచు.) నిందించు. "వ. మనలక్షుధూర్జటితోడఁగోసడిచికామత్వంబసట్టిపాం, డనిచక్రంకు నిఁజూపిత్రోచినసురేంద్రాదులనరోజాక్షునిఁ, గనియెగ్గుల్ ప్రక టించినఁ గినిసిలోకంబులవిసరాగా నటం, డనుమానింపకపూనె సైన్యశులసంహారంబుగావింపఁగాఁ." నిర్వ. ౨, ఆ.

**గోసన.** వై. గి. చాటించుట.

**గోసము.** సం. వి. అ. పుం. 1. బోళము; 2. వేకువ.

**గోసర్గము.** సం. వి. అ. పుం. ప్రభాతము, వేకువ.

**గోసు.** వై. వి. 1. అపదూఱు*; "క. కఱుదులమాటలమన్ముఁ, గుఱుచవడుగయేలయింపిగోసక్కొవరా." హరి. ఉ. ౧౦, ఆ.— 2. దూఱు*; "ఈగోసేలచుట్టాలలోఁ." హరి. పూ. ౫, ఆ.—3. దోషము*. "ఉ. అక్కటనేనుపేద్కపడియానెపుఁనానవ మర్థిఁదేరనోం, డొక్కనిక్కష్టలక్ బనుపనోపకచెప్పినదీనిసివుగో, సక్కఁగఁజేసినిన్నునతిహీనవిధాననియుక్తఁజేఁతగా, నిక్కమయుమ్మ లించి తిదినెయ్యముతియ్యముక్ల్మియేసఖీ." భార. విరా. ౨, ఆ.

**గోస్తనము.** సం. వి. అ. పుం. నలువదిపూసలసరము.

**గోస్తని.** సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష*.

**గోస్వామి.** సం. వి. న్. పుం. 1. గోవులకొడయఁడు; 2. (నాట్య పరిభాషయందు) ఇతరరాజాయొక్క కొడుకు.

**గోహరి.** దే. వి. పరాక్రమము. "సీ. హరికిశోరములగోహరికి శోషిలని దురాస్వరగర్వోప పిరిభటులు." వై. ౬, ఆ.

**గోళకుఁడు.** సం. వి. అ. పుం. విధవకు అంకుమగనియందు పుట్టినకొడుకు.

**గోళము.** సం. వి. అ. న. మండలము.

**గోళి.** వై. వి. కూరాకుదినుసు.

**గోళ్లకుతికెంటు.** దవ్య. వి. స్త్రీకంఠభూషావిశేషము.

**గోళ్లగొండి.** దవ్య. వి. తృణవిశేషము. బ. తృణధాన్యవిశేషము. "గీ. గుసుకులూదర్లుబరపటల్గోళ్లగొండు, లల్లిబియ్యంబువెదురు బియ్యంబుగొట్టి, చెట్లుసీఁజేట్లుఁదుఁగముష్టియలునీత, గుంజు మొదలుగఁదినదొరఁకొనియెజనము." కాశీ. 3, ఆ.

## గౌ.

**గౌండ్లవాఁడు.** వై. వి. గవుండ్లవాఁడుయొక్కరూపాంతరము.

**గౌఁడు.** వై. వి. 1. సారాయమ్మువాఁడు; 2. కాఁపువారి పట్టపు పేరు. (గవుఁడుయొక్కరూపాంతరము.)

**గౌడము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**గౌడసరము.** దవ్య. వి. భూషావిశేషము, చెంపసరము. "క. మొగపుఁ, దిరిగెయునాణిముత్తెపుఁజేర్లునందిదండలునూడిగములు గౌడసరములున." కళా. 2, ఆ. (గవుడసరముయొక్కరూపాంతరము.)

**గౌడి.** సం. వి. ఈ. స్త్రీ. పద్యములయొక్క యొకరీతి. (చూ. రీతి.)

**గౌణము.** సం. విశే. (అ. ఈ. అ.) అముఖ్యము.

**గౌతమి.** సం. వి. ఈ. స్త్రీ. నదివిశేషము.

**గౌతముఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొకముని; 2. జనుఁడు.

**గౌద.** దే. వి. చెంప. (గవుదయొక్కరూపాంతరము.)

**గౌధారము.** సం. వి. అ. పుం. ఉడుముయొక్కపిల్ల.

**గౌధేయము.** సం. వి. అ. పుం.——పై.——

**గౌధేరము.** సం. వి. అ. పుం.——పై.——

**గౌర.** దే. వి. బేహారి, వర్తకుఁడు. "క. ఈరీతినకలధర్మక, శారదుఁ డగునతనిమాటజవదాఁటకయు, గౌరమనుచున్నఁడన్నగ, రీరత్నం బెలునట్టినృపవరుఁడెలమిఁ." శుక. ౧, ఆ. (గవురయొక్క రూపాంతరము.)

**గౌరము.** సం. వి. అ. న. ఆకరువు. పుం. తెల్లావలు. విశే. 1. ఎఱ్ఱనిది; 2. తెల్లనిది; 3. పసుపుపచ్చనిది; 4. స్వచ్ఛ మయినది.

**గౌరవము.** సం. వి. అ. న. గొప్పతనము.

**గౌరవించు.** సం. స. క్రి. గొప్పపఱచు.

**గౌరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. సమర్తాడనికన్యక.

**గౌరు.** దే. వి. 1. పీనుఁగు; 2. పెద్దకాళె. "వ. గౌరు గుమ్మెట తమ్మటంబు." ఆము. ४, ఆ. (గవురుయొక్కరూపాంతరము.)

**గౌరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, చందమామ.

**గౌలు.** దే. వి. 1. దుర్గంధము; "గీ. మూఁడువేళలఁ బురువులఁ దోఁడివేసి, నీళ్లచేఁగాలువోవంగనెమ్మిఁగడిగి." భల్లా. ౨, ఆ.— 2. గంధము. "ద్వి. ఆయర్ధరాత్రంబునవ్వడామట్టేఁ, బాయక వసియించుబహుపిశాచములు, మానిసిగౌలువల్లఱుఁబనిగొనుచు." హరిశ్చ. ౧, భా. (గవులుయొక్కరూపాంతరము.)

**గౌలేయకము.** సం. వి. అ. పుం. కారుపోఁక.

**గౌష్ఠీనము.** సం. వి. అ. న. అంతకుముందు గోవులమందయున్న చోటు.

**గౌసెన.** వై. వి. పిడెమొదలగువానిమీఁదియొఱ. "విండ్లగౌసనల్." సావి. ४, ఆ. (గవుసెనయొక్కరూపాంతరము.)

**గౌళి.** దే. వి. శకునములు చెప్పెడుబల్లి. (గవుళియొక్కరూపాం తరము.)

## గ్ర.

**గ్రంథకుటి.** సం. వి. ఈ. స్త్రీ. వ్రాసెడిగది.

**గ్రంథనము.** సం. వి. అ. న. రచన, కూర్పు.

**గ్రంథము.** సం. వి. అ. పుం. 1. కావ్యము; 2. ముప్పదిరెండ క్షరములశ్లోకము; 3. ధనము.

**గ్రంథి.** సం. వి. ఇ. పుం. 1. కంతి; 2. కనుపు; 3. ముడి; 4. గండివనము*.

**గ్రంథిక.** సం. వి. అ. స్త్రీ. కల్లితీఁగ. అ. న. ము. 1. పిప్పలి వేరు; 2. గండివనము*. పుం. 1. గుగ్గిలపుఁజెట్టు; 2. వెణు తురు*.

**గ్రంథికుఁడు.** సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు; 2. యుధిష్ఠిరుని కడగొట్టుతమ్ముఁడు.

**గ్రంథితము.** సం. విణ. (అ. ఆ. అ.) కూర్పఁబడినది, గ్రథితము.

**గ్రంథిపర్ణము.** సం. వి. అ. న. 1. గండివనము*; 2. పచ్చాకు; 3. మాచిపత్రి.

**గ్రంథిలము.** సం. వి. అ. పుం. 1. ములువెలఁగ*; 2. వెణుతురు*. విణ. గనుపులుగలది.

**గ్రందె.** వై. వి. దారబందములోనగువాని నిలువులయందు బిగఁగొట్టిన చీలలకు తగిలించెడు తలుపులయందలి యినుపపట్టె*.

**గ్రక్కతిల్లు.** దే. అ. క్రి. బెదరు. "క. మొక్కెముపామినీదయ, నెక్కడనుండొద్దుపొడుచుపెటుఁగగనీవే, డక్కనియుందుముదాయలు, గ్రక్కతిలంగడుపుర్లల్లక దలకయుండగ." రామా. ౨, ఆ.

**గ్రక్కదలు.** దే. అ. క్రి. (కదలు+కదలు.) మిక్కిలికదలు.

**గ్రక్కన.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ. "శీ. కినుకమీఱననంత గిరిఁగ్రిందుపడఁజేసెఁగం బంబు మెట్టగ్రక్కనఁగదల్చె." పా. ౧, ఆ.

**గ్రక్కున.** దే. ద్ర. క్రి. విణ.——వై.——"క. ఆచార్యుఁ సుతీవ్రతనా, గావములేయఁగఁద్రుంచెగ్రక్కున." వార. భీష్మ. ౨, ఆ. "క. రాముఁడుగ్రక్కునలక్ష్మణుచేతివిల్లుగొని." య. 3, ఆ.

**గ్రచ్చ.** దే. వి. కాలపత్రి*. (వాడుకయందుగచ్చ.)

**గ్రచ్చకాయలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "ఓ. డాఁగిలిముచ్చులాటలుగ్రచ్చకాయలు వెన్నెలకుప్పలుకన్నుబిల్ల" కాళ. 3, ఆ.

**గ్రచ్చు.** వై. విణ. వర్ణలోపముగాని, పదలోపముగాని కలిగినది. (మాట.)

**గ్రథనము.** సం. వి. అ. న. 1. కూర్పు; 2. గ్రుచ్చుట.

**గ్రథితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కూర్పఁబడినది; 2. గ్రువ్వఁబడినది.

**గ్రద్ద** వై. వి. గద్ద, గృధ్రము.

**గ్రద్దగోరు.** వై. వి. చోరసాధనవిశేషము. (చూ. గద్దగోరు.)

**గ్రద్దన.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ.

**గ్రమ్మన.** దే. ద్ర. క్రి. విణ.——వై.——"క. తమ్ములతో నపుడాస్థా, నమ్మునఁగొలువుండిధర్మనందనుఁడుప్రమో, దమ్మునఁదమ్ముఁడరమ్మని, గ్రమ్మనఁగదియంగభీముఁగౌఁగిటఁజేర్చెన్." జై. 3, ఆ.

**గ్రసించు.** సం. స. క్రి. 1. కబళ్లు; "సుదంహరిలీలజాలము తృణంబుగ్రసించె." కవి. ౧, ఆ.—2. తిను; 3. మ్రింగు.

**గ్రసిష్ణువు.** సం. విణ. ఉ. 1. తినువాఁడు; 2. మ్రింగువాఁడు.

**గ్రస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తినఁబడినది; 2. మ్రింగఁబడినది; 3. వర్ణలోపముగాని, పదలోపముగాని కలిగినది. (మాట.)

**గ్రహణము.** సం. వి. అ. న. 1. రాహువు సూర్యచంద్రులను బట్టుట; 2. గ్రహించుట; 3. ఆదరించుట; 4. చెఱపడినప్రాణి; 5. చేయి; 6. బుద్ధి.

**గ్రహణి.** సం. వి. ఈ. స్త్రీ. అతిసారరోగము, ప్రవాహిక.

**గ్రహపతి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

**గ్రహము.** సం. వి. అ. పుం. 1. సూర్యాది; 2. గ్రహించుట; 3. అనుగ్రహము; 4. చెఱ; 5. రాహువు సూర్యచంద్రులను బట్టుట; 6. పూతనాది; 7. ఊర్ధ్వాకారమైన యజ్ఞపాత్రవిశేషము; 8. యుద్ధప్రయత్నము; 9. రాహువు.

**గ్రహయాళువు.** సం. విణ. ఉ. గ్రహించువాఁడు.

**గ్రహరాజు.** సం. వి. న. పుం. 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు.

**గ్రహించు.** సం. స. క్రి. 1. కైకొను; 2. తీసికొను; 3. తెలిసికొను. (గ్రహియించు అనియు.)

**గ్రహీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహించువాఁడు.

**గ్రహీత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.)——వై.——

**గ్రహీసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గాలిసోఁకినవాఁడు.

## గ్రా.

**గ్రాంథికము.** సం. విణ. (అ. ఈ. అ.) గ్రంథమందిది.

**గ్రాఁజె.** దే. వి. ఒకానొకచెట్టు. "ఎ. గీ. కడిమిచిగిరించెగ్రాఁజ వంగడమునవిచె." పాండు. ౪, ఆ.

**గ్రాద.** దే. వి. కదుము "మేనఁపెనగ్రాదలుకట్టఁగమోఁదు కొంచు." వాసి. ౨, ఆ.

**గ్రామటిక.** సం. వి అ. స్త్రీ. పల్లె.

**గ్రామణి.** సం. వి. ఈ పుం. మంగలి. విణ. 1. గ్రామాధిపతి; 2. ముఖ్యుఁడు.

**గ్రామత.** సం. వి. ఆ స్త్రీ. గ్రామములసమూహము.

**గ్రామతక్షుఁడు.** సం. వి. అ. పుం గ్రామము కర్పెఁడై వడ్లంగి.

**గ్రామము.** సం. వి. అ. పుం. 1. ఊరు; 2. షడ్జాదిస్వరము; 3. (శబ్దాదిపూర్వకమైనపుడు) సమూహము (ఉదా. శబ్ద గ్రామము, గుణగ్రామము)

**గ్రామసింహము.** సం. వి అ. పుం. శునకము, కుక్క.

**గ్రామీణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. వేశ్య. విణ. ఊరిది.

**గ్రామ్యధర్మము.** సం. వి. అ. పుం. సురతము.

**గ్రామ్యము.** సం. వి. అ. న. 1. అర్థదోషములతోఁగూడిన మాటలు; 2. శబ్దదోషములతో గూడిన మాటలు; 3. రతిబంధవిశేషము. విణ. 1. అసభ్యమైనది; (మాట.) 2. పామరము.

**గ్రావము.** సం. వి. న్. పుం. 1. కొండ; 2. ఱాయి.

**గ్రాసము.** సం. వి. అ. పుం. కబళము.

**గ్రాహకము.** సం. వి. అ. పుం. డేగ. విణ. గ్రహించునది.

**గ్రాహము.** సం. వి. అ. పుం. 1. గ్రహించుట; 2. చెఱ; 3. ఒకానొక నీరుపాము. మొసలి. (అనికొందఱు.)

**గ్రాహి.** సం. వి. న్. పుం. వెలఁగ*.

**గ్రాహ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁదగినది.

## గ్రీ.

**గ్రీవ.** సం. వి. ఆ. స్త్రీ. 1. మెడ; 2. మెడనరము.
**గ్రీష్మము.** సం. వి. అ. పుం. 1. వేఁడిమి; 2. వేసంగి.

## గ్రు.

**గ్రుక్క.** దే. వి. 1. మ్రింగుట, గ్రాసము; 2. ఊపిరి. (వాఁడు గ్రుక్కపట్టలేఁడు.)
**గ్రుక్కగొను.** దే. స. క్రి. మ్రింగు.
**గ్రుక్కలుమ్రింగు.** దే. అ. క్రి. 1. అపేక్షపడు; "వ. మునుకొనిమూఁడుమూలలను ముప్పదిగ్రుక్కలు మ్రింగి." హంస. 3, ఆ.—2 సంకోచించు. (పం గ్రుక్కలు మ్రింగెదవు చెప్పుము.)
**గ్రుక్కిలి.** దే. వి. గ్రుక్క.
**గ్రుక్కిళ్లుమ్రింగు.** దే. అ. క్రి. 1. అపేక్షపడు; "గీ. చందమామచెలుల, కెంపుమోములసుధ గ్రుక్కిళ్లు మ్రింగ." శకుం. ౫, ఆ.—2. సంకోచించు. (చూ. గ్రుక్కలుమ్రింగు.)
**గ్రుక్కుమిక్కను.** దే. అ. క్రి. (గ్రుక్కుమిక్కు+అను.) మాటాడనోరెత్తు. "క. ఒక్కతెనె గ్రుక్కుమిక్కన, దిక్కెవ్వనినెరతి నుంటె." హంస. ౪, ఆ.
**గ్రుక్కుమిక్కుమను.** దే. అ. క్రి.——పై.——"చ. బలిమిఁదదీయులప్పుడు సభానునిముఖ్యులరెట్టఁబట్టియా, తలఁబడ నైచుచుందమకుఁదామెయువారణఁదత్తదాసనం, బులుగొనికూరుచుం డిరితపోధనులుకాసురలుకావెడంగుసా, టొలయఁగ గ్రుక్కుమిక్కు మనకుండిరొదుంగుచుసక్కడక్కడన్." ప్రభా. ౧, ఆ.
**గ్రుచ్చు.** దే. అ. క్రి. నాటు. "చ. మూఁడుమూఁడుశితకాండము లందగ గ్రువ్వనేసినన్." భాగ. ౪, స్కం.—అం, ప్రే. 1. నాటించు; "గీ. ఏడుబాణములవి, రోధిసర్వమర్మంబుల గ్రుచ్చుట యును." హరి. ఉ. ౧౦, ఆ.—2. తూర్చు. (సూదిని దారము గ్రుచ్చుము.)
**గ్రుడ్డి.** దే. విణ. అంధకుఁడు.
**గ్రుడ్డింగిలాయి.** దే. వి. (గ్రుడ్డి+ఇంగిలాయి.) ఇంగిలాయి భేదము.
**గ్రుడ్డికామంచి.** దే. వి. గొడుగుగడ్డి, అతిచ్ఛత్రము.
**గ్రుడ్డికొక్కరాయి.** దృ. వి. కోయష్టికము.
**గ్రుడ్డివాటు.** దే. విణ. (గ్రుడ్డి+పాటు.) దైవికము. (వానికీపని గ్రుడ్డివాటుగా కలిగినది.)
**గ్రుడ్డు.** దే. వి. 1. గ్రుడ్డితనము; "క. కనిగ్రుడ్డున్ వినియుఁ జెవుడుకాదెతలంపన్." శేష. ౪, ఆ.—2. కనుగ్రుడ్డు; "సీ. మెడమెట్టిగోర్గొండిమెఱికిపుచ్చుఁడు వీనిగ్రుడ్డుచెక్కులనెత్తురులు స్రవింప." కాశీ. 3, ఆ.—3. పక్షిలోనగువాని అండము. "సీ. అడుగులతొఁకునఁబుడమిగ్రక్కదలనార్పులఁదమ్మికానుపుగ్రుడ్డువగుల." అచ్చ. యు, కాం.
**గ్రుడ్డుకానుపు.** దే. వి. 1. పక్షి; 2. సర్పము. "సీ. గ్రుడ్డుకానుపుతేఁడుగ్రుడ్డుకానుపుతేఁడు గుజ్జంబుఁబాన్పునైకొమరు మిగుల." అచ్చ. బాల, కాం. (దీనికి సరియైన సంస్కృతశబ్దము అండజము.)
**గ్రుడ్లగూబ.** దృ. వి. ఘూకము.

**గ్రుద్దు.** స. క్రి. పిడికిటితోపొడుచు. వి. పిడికిటిపోటు.
**గ్రుద్దులాట.** దే. వి. గ్రుద్దులాడుట.
**గ్రుద్దులాడు.** దే. అ. క్రి. (గ్రుద్దులు+ఆడు.) ఒకరినొకరు గ్రుద్దుచు పోట్లాడు.

## గ్రై.

**గ్రైవము.** సం. వి. అ. న. మెడనుగట్టెడుత్రాడు.
**గ్రైవేయకము.** సం. వి. అ. న. మెడనుజెట్టెడుసొమ్ము.
**గ్రైవేయము.** సం. వి. అ. న. మెడనుగట్టెడుత్రాడు.

## గ్రొ.

**గ్రొచ్చు.** దే. క్రి. గుద్దలిలోనగువానితో పల్లముచేయు. "గీ. గ్రొచ్చికోరాడి త్రవ్వికులతలమెల్ల." భాగ. ౯, స్కం. (వ్రాఁత యందిది పరుషాదిగాను గానఁబడుచున్నది.)
**గ్రొయ్యు.** దే. అ. క్రి. పల్లముపడు. "గీ. అమ్మహోత్తుండు బహువిధయజ్ఞదక్షి, ణార్థముగవిప్రవరులకునర్థినిచ్చు, గోగణం బులగొరిజల గ్రొప్పియయ్యెఁ, గాదె యీసరోవరముజగన్నుతముగ." భార. అర. ౪, ఆ.

## గ్ల.

**గ్లహము.** సం. వి. అ. పుం. జూదమునందలి పందెము.

## గ్లా.

**గ్లాని.** సం. వి. ఇ. స్త్రీ. శ్రమముచేతఁగలిగిన దౌర్బల్యము.
**గ్లానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తెవులుగొంటు.
**గ్లాసు.** ఆం. వి. అద్దము, అద్దపుపాత్ర.
**గ్లాస్నువు.** సం. విణ. ఉ. తెవులుగొంటు.

## గ్లౌ.

**గ్లౌ.** సం. వి. ఔ. పుం. చంద్రుఁడు, చందమామ.

## ఘ.

**ఘ.** ఒక యక్షరము.
**ఘంట.** సం. వి. ఆ. స్త్రీ. 1. కాలపరిమాణవిశేషము; 2. రాగవిశేషము; 3. వాద్యవిశేషము; 4. మొక్కపుఁజెట్టు.
**ఘంటాపథము.** సం. వి. అ. పుం. పదిబారలు వెడల్పుగల రాజమార్గము, బాట.
**ఘంటారవ.** సం. వి. ఆ. స్త్రీ. గిలగిచ్చ.
**ఘట.** సం. వి. ఆ. స్త్రీ. 1. సమూహము; 2. ఏనుఁగుల సమూహము; 3. ఘటనము. అ. న. ము. ఎళనీరుకాయ. పుం. 1. కుండ; 2. ఏనుఁగుకుంభస్థలము; 3. శిఖరము; 4. పాడు నుయ్యి; 5. ఊపిరిలోనికిఁదీసి నిలుపుట.
**ఘటకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ఘటిల్లఁజేయువాఁడు.
**ఘటదాసి.** సం. వి. ఈ. స్త్రీ. విటీవిటులను తార్చెడియింతి.
**ఘటన.** సం. వి. ఆ. స్త్రీ. కూర్పు.

**ఘటయంత్రము.** సం. వి. అ. న. నూతిగిరక. "గీ. పొంతఘటయంత్రనరముఁద్రిప్పచుజపించు, మగువధృతిదూలమద్యాస్యహ్నమంత్రవాది, సురుచిరవితానదంభకౌసుంభధారి, తుహినధారాగృహాంగిబిందువులుసెదర." అను. ౫, ఆ.

**ఘటశాసి.** సం. వి. న్. పుం. తార్కికుఁడు.

**ఘటిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇరువదినాలుగు నిమిషములకాలము; 2. గడెమ్రాను; 3. బలపము.

**ఘటిల్లు.** సం. అ. క్రి. కలుగు.

**ఘటీకారము.** సం. వి. అ. పుం. గడియారము.

**ఘటీకారుఁడు.** సం. వి. అ. పుం. కుమ్మరవాఁడు.

**ఘటీయంత్రము.** సం. వి. అ. న. 1. ఏతము; 2. నీళ్లుచేఁదెడు రాట్నము.

**ఘట్టన.** సం. వి. ఆ. స్త్రీ. గట్టించుట.

**ఘట్టము.** సం. వి. అ. పుం. 1. తీరము; 2. సుంకముమొదలయినవి తీయుచోటు; 3. వనగిరి ప్రాయదేశము.

**ఘట్టితము.** సం. విశే. (అ. ఆ. అ.) గట్టింపఁబడినది.

**ఘనము.** సం. వి. అ. న. 1. నృత్యాదిమధ్యమానము; 2. కంచుతాళములోనగువాద్యము; 3. నడిమిపెరుగు. (ఈ యర్థము నామలింగానుశాసన వ్యాఖ్యానమునందుమాత్రము కనఁబడుచున్నదిగాని యితర నిఘంటువులయందుఁ గనఁబడదు.) పుం. 1. తుంగముస్తెకీ; 2. దిటవు; 3. మబ్బు; 4. విరివి; 5. సమ్మెట. విశే. 1. దట్టమైనది; 2. దిటవుగలది.

**ఘనరసము.** సం. వి. అ. పుం. 1. నీళ్లు; 2. కర్పూరము; 3. గుళిగ; 4. చెట్టుబంక; 5. మజ్జిగ; 6. చాఁగకీ. విశే. దట్టమయినది.

**ఘనశ్రోణి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

**ఘనసారతరువు.** సం. వి. ఉ. పుం. కర్పూరపుఁటికీ.

**ఘనసారము.** సం. వి. అ. పుం. కర్పూరము.

**ఘనాఘనము.** సం. వి. అ. పుం. 1. కురియునట్టిమేఘము, తొలుమొగులు; 2. హింసించునట్టి మదపుటేనుఁగు.

**ఘనాఘనుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**ఘనీభవించు.** సం. అ. క్రి. ముద్దకట్టు.

**ఘనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) గొప్పవాఁడు.

**ఘనోపలము.** సం. వి. అ. పుం. వడగల్లు.

**ఘరట్టము.** సం. వి. అ. పుం. తిరుగలి.

**ఘర్ఘరము.** సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ; 2. కొండదారి; 3. గర్భముమ్రోఁత; 4. వాకిలి, ఒకవిధమైన తలుపు. (అనికొందఱు.)

**ఘర్ఘరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చిఱుగంట; 2. వీణావిశేషము; 3. స్వరభేదము.

**ఘర్మము.** సం. వి. అ. పుం. 1. ఎండ; 2. చెమట; 3. ఏనుఁగుహృదయమునందలి మదము; 4. వేఁడిమి; 5. వేసంగికాలము.

**ఘర్షణము.** సం. వి. అ. న. ఒరయిక, రాయిడి.

**ఘర్షణాలము.** సం. వి. అ. పుం. నూతెడుగుండు, పాత్రము.

**ఘర్షించు.** సం. స. క్రి. రాయిడిచేయు.

**ఘస్మరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తిండిపోతు.

**ఘస్రము.** సం. వి. అ. పుం. దినము. విశే. నొప్పించునది.

## ఘా.

**ఘాంటికుఁడు.** సం. వి. అ. పుం. వేకువను రాజులనిద్రమేల్కొలిపెడువాఁడు, బోధకరుఁడు.

**ఘాట.** సం. వి. ఆ. స్త్రీ. పెడతల, పెడతలయందలి ముచ్చిలిగుంట. (అనికొందఱు.)

**ఘాటు.** ఆం. వి. సంరక్షకభటుల సముదాయము.

**ఘాతము.** సం. వి. అ. పుం. 1. దెబ్బ; 2. బాణము.

**ఘాతించు.** సం. స. క్రి. చంపు.

**ఘాతిని.** సం. విశే. (ఈ.) చంపునట్టిది.

**ఘాతుకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చంపువాఁడు; 2. నొప్పించువాఁడు.

**ఘారిక.** సం. వి. ఆ. స్త్రీ. భక్ష్యవిశేషము, గారె.

**ఘాసము.** సం. వి. అ. పుం. లేఁతపచ్చిక.

## ఘీ.

**ఘీంకారము.** సం. వి. అ. పుం. ఏనుఁగుఘీఁక.

**ఘీంకృతి.** సం. వి. ఇ. స్త్రీ.———పై.———

## ఘు.

**ఘుటము.** సం. వి. అ. పుం. ఘుటిక, చీలమండ.

**ఘుటిక.** సం. వి. ఆ. స్త్రీ. కాలిగుత్తి, చీలమండ.

**ఘుణము.** సం. వి. అ. పుం. మ్రానుతొలుచుపురుగు.

**ఘుణాక్షరన్యాయము.** సం. వి. అ. పుం. మ్రానియందు నుసిపురుగుతొలువఁగా నేర్పడిన యక్షరముయొక్క న్యాయము.

**ఘుర్ఘురము.** సం. వి. అ. పుం. పందికూఁత.

**ఘుర్ఘురించు.** సం. అ. క్రి. (పంది) కూయు.

**ఘుర్మురము.** సం. వి. అ. పుం. కుమ్మరపురుగు.

**ఘుష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) చాటింపఁబడ్డది.

**ఘుసృణము.** సం. వి. అ. న. కుంకుమపువ్వు.

## ఘూ.

**ఘూకము.** సం. వి. అ. పుం. గుడ్లగూబ.

**ఘూర్జరము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**ఘూర్ణనము.** సం. వి. అ. న. తిరుగుడు.

**ఘూర్ణితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తిరుగుడుపడినది; 2. కూరుకుపాటుపడినది.

**ఘూర్ణిల్లు.** సం. అ. క్రి. తిరుగుడుపడు. (అధునికకవులు కొందఱు దీని మ్రోఁగులయను నర్థమునందుఁ బ్రయోగించియున్నారు.)

## ఘృ.

**ఘృణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కనికరము; 2. రోఁత.

**ఘృణి.** సం. వి. ఇ. పుం. కిరణము, వెలుఁగు.

ఘృతకోశాతకి. సం. వి. ఈ. స్త్రీ. నేతిబీర.

ఘృతము. సం. వి. అ. న. 1. నెయ్యి; 2. నీరు. విణ. వెలిఁగినది.

ఘృతేళిక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱచీమ.

ఘృతోదము. సం. వి. అ. పుం. నేతిసముద్రము.

ఘృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాఁచితీఁగ; 2. పోటి; 3. రాయిడి. పుం. 1. కిరణము; 2. పంది.

## ఘో.

ఘోంట. సం. వి. ఆ. స్త్రీ. 1. పోఁకచెట్టు; 2. రేఁగుచెట్టు.

ఘోటకము. సం. వి. అ. పుం. తురగము, గుఱ్ఱము.

ఘోటజటి. సం. వి. న్. పుం. గొట్టెచెట్టు.

ఘోటిక. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుగుఱ్ఱము, గోడిగ.

ఘోట్టాణము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. ఒకానొక దేశము.

ఘోణ. సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.

ఘోణి. సం. వి. ఈ. స్త్రీ. పనికదోమ. న్. పుం. పంది.

ఘోరదర్శనము. సం. వి. అ. పుం. వ్యాఘ్రము, పులి.

ఘోరము. సం. వి. అ. పుం. నక్క. విణ. భయంకరము.

ఘోరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. విణ. భయంకరుఁడు.

ఘోలి. సం. వి. ఈ. స్త్రీ. ఒకదినుసుకూరాకు, గోళి.

ఘోష. సం. వి. ఆ. స్త్రీ. నదాపకీ. అ. పుం. ము. 1. గొల్లపల్లె; 2. ఆవులమంద; 3. ఉఱుము; 4. కంచు; 5. చేఁతిబీఱకీ.

ఘోషకము. సం. వి. అ. పుం. చేఁతిబీఱకీ.

ఘోషణ. సం. వి. ఆ. స్త్రీ. చాటించుట.

ఘోషవతి. సం. వి. ఈ. స్త్రీ. వీణె.

ఘోషించు. సం. అ. క్రి. మ్రోయు.

ఘోషుఁడు. సం. వి. అ. పుం. గొల్లవాఁడు.

## ఘ్రా.

ఘ్రాణతర్పణము. సం. విణ. (అ. ఆ. అ.) మంచివాసనగలది.

ఘ్రాణము. సం. వి. అ. న. ముక్కు. విణ. మూర్కొనఁబడినది.

ఘ్రాణించు. సం. స. క్రి. ఆఘ్రాణించు, మూర్కొను.

ఘ్రాతము. సం. విణ. (అ. ఆ. అ.) మూర్కొనఁబడినది.

## చ.

చ. ఒకయక్షరము.

చంకరము. సం. వి. అ. పుం. 1. తేరు; 2. చెట్టు.

చంక్రమణము. సం. వి. అ. న. దాఁటుట.

చంగము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నేర్పరి; 2. చక్కనిది.

చంచ. సం. వి. ఆ. స్త్రీ. 1. చాఁప; 2. కసవుతోఁజేసినబొమ్మ.

చంచరీకము. సం. వి. అ. పుం. భృంగము, తుమ్మెద.

చంచల. సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱుపు; 2. లక్ష్మి. అ. పుం. ము. 1. గాలి; 2. మందపిచ్ఛుక. విణ. చలించునది.

చంచలించు. సం. అ. క్రి. చలించు.

చంచలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కాముకుఁడు.

చంచుఁడు. సం. వి. అ. పుం. చెంచువాఁడు.

చంచువు. సం. వి. ఉ. స్త్రీ. పక్షిముక్కు. పుం. ఆముదపుచెట్టు.

చండ. సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లకచోరముకీ; 2. బలురక్కెసకీ. అ. పుం. ము. చింతచెట్టు.

చండకము. సం. వి. అ. పుం. వ్యాఘ్రము, పులి.

చండాంశువు. సం. వి. ఉ. పుం. సూర్యుఁడు, వేఁడివెలుఁగు.

చండాతకము. సం. వి. అ. పుం, న. వేశ్యలచల్లడము.

చండాతము. సం. వి. అ. పుం. గన్నేరుకీ.

చండాలుఁడు. సం. వి. అ. పుం. మాలవాఁడు. (రూ. చాండాలుఁడు.)

చండి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. కోపముగల ఆఁడుది; 3. మిక్కిలి ప్రేమగల ఆఁడుది; 4. చంపునట్టి ఆఁడుది.

చండించు. సం. అ. క్రి. మిక్కిలి కోపించు.

చండిక. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

చండిమ. సం. వి. న్. పుం. వాఁడిమి.

చండిలము. సం. వి. అ. పుం. చక్రవర్తమనుకూరాకు.

చండిలుఁడు. సం. వి. అ. పుం. 1. మంగలి; 2. శివుఁడు.

చండుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాక్షసుఁడు; 2. యమకింకరుఁడు. విణ. 1. మిక్కిలి కోపముగలవాఁడు; 2. వాఁడిమిగలవాఁడు.

చందన. సం. వి. ఆ. స్త్రీ. మామెనకీ. అ. న. ము. కుంకుమపువ్వు. పుం, న. గంధము.

చందిరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. "సీ. సనకాది సంయమీశ్వర లోచన చకోరచందిరుండు సుధాబ్ధిమందిరుండు." వై. ౧, ఆ.

చంద్రకము. సం. వి. అ. పుం. నెమలిపురికన్ను.

చంద్రకాంతము. సం. వి. అ. న. కపటము. పుం. చలువ ఱాయి.

చంద్రకి. సం. వి. న్. పుం. 1. నెమలి; 2. కవుఁజు.

చంద్రచ్ఛందము. సం. వి. అ. పుం. వేయిపేటలుగల హారము.

చంద్రజ్యోతి. సం. వి. స్. పుం. బాణపునంచువగ, పగలువత్తి. "సీ. బిఱుసులుచివ్వలుబెడఁగుఁజంద్రజ్యోతులునునభంబెల్ల వెలుంగఁజేయ." రసి. ౬, ఆ.

చంద్రబాల. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకికీ.

చంద్రబీజము. సం. వి. అ. న. రజతము, వెండి.

చంద్రభాగ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు.

చంద్రము. సం. వి. అ. పుం. 1. కర్పూరము; 2. నీళ్లు; 3. బంగారు; 4. కంపిల్లముకీ.

చంద్రముఁడు. సం. వి. స్. పుం. చంద్రుఁడు.

చంద్రశాల. సం. వి. ఆ. స్త్రీ. 1. పైమేడ; 2. వెన్నెల.

చంద్రశేఖరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, నెలతాల్పు.

చంద్రసంజ్ఞము. సం. వి. అ. పుం. కర్పూరము.

**చంద్రహాసము.** సం. వి. అ. పుం. 1. కత్తి; 2. రావణునికత్తి.

**చంద్రాతపము.** సం. వి. అ. పుం. చంద్రిక, వెన్నెల.

**చంద్రాపీడుఁడు.** సం. వి. అ. పుం. చంద్రశేఖరుఁడు.

**చంద్రిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. వెన్నెల; 2. కుసుమపువ్వు.

**చంద్రుఁడు.** సం. వి. అ. పుం. చేందమామ, నెల.

**చంద్రోదయము.** సం. వి. అ. పుం. 1. ఉల్లెడ; 2. ఔషధ విశేషము.

**చంపకము.** సం. వి. అ. పుం. సంపెఁగ. (దీనికి దోహదక్రియ ముఖరాగము. కర్ణికారమునకు నల్లాపమును, కురవకమునకు ఆలింగనమును దోహదక్రియలని యెఱుంగునది. తక్కినవి ఆయాయిశబ్దము క్రింద వ్రాయఁబడియున్నవి.)

**చకితము.** సం. వి. అ. న. 1. భయము; 2. నాయికకు దేనిచేతనైనను ప్రియునియెదుట కలిగెడు భయసంభ్రమము.

**చకితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) భయపడినవాఁడు.

**చకోరకము.** సం. వి. అ. పుం. వెన్నెలపులుఁగు, (రూ. చకోరము.)

**చక్రకారకము.** సం. వి. అ. పుం. పులిగోరు.

**చక్రడోల.** సం. వి. ఆ. స్త్రీ. ఆంకులరాట్నము.

**చక్రధరము.** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**చక్రధరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, విణ. గ్రామపువళుకుకాఁడు.

**చక్రపక్షము.** సం. వి. అ. పుం. హంస.

**చక్రపాణి.** సం. వి. ఇ. పుం. విష్ణువు, చుట్టుకైదువుతాల్పు.

**చక్రమర్దనము.** సం. వి. అ. పుం. తగిరిస.

**చక్రము.** సం. వి. అ. న. 1. ఆయుధవిశేషము; 2. బండికల్లు; 3. గుంపు; 4. దండు; 5. రాష్ట్రము; 6. గ్రామపువళుకు; 7. కుమ్మరిసారె; 8. నీటిసుడి; 9. చిన్ననాణెము. పుం. జక్కవ. (దీని పర్యాయములన్నియు జక్కవకగు.)

**చక్రల.** సం. వి. ఆ. స్త్రీ. వత్తురవముస్తె.

**చక్రవర్తి.** సం. వి. న్. పుం. సార్వభౌముఁడు, రారాజు.

**చక్రవర్తిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. సార్వభౌమురాలు; 2. కోరింద.

**చక్రవాకము.** సం. వి. అ. పుం. జక్కవపక్షి.

**చక్రవాళము.** సం. వి. అ. న. 1. గుంపు; 2. మండలము. పుం. చుట్టుఁగొండ.

**చక్రవృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. వడ్డికివడ్డి. "శ్లో. వృద్ధేరపివృద్ధిశ్చక్రవృద్ధిరుదాహృతా." విజ్ఞా. వ్య, కాం.

**చక్రాంగము.** సం. వి. అ. పుం. 1. జక్కవ; 2. హంస.

**చక్రాంగి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుహంస; 2. కటుకరోహిణి.

**చక్రి.** సం. వి. న్. పుం. 1. విష్ణువు; 2. జక్కవ; 3. పాము; 4. రారాజు; 5. కుమ్మరి.

**చక్రీవంతము.** సం. వి. త్. పుం. గార్దభము, గాడిద.

**చక్షుశ్శ్రవము.** సం. వి. స్. పుం. పాము, కనువినికి.

**చక్షుష్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. కనుపాప; 2. [illegible] అనుపి. అ. పుం. ము. 1. మొగలి; 2. పుండరీకమను చెట్టు నీరు కంటికిహితమైనది.

**చక్షువు.** సం. వి. స్. న. నేత్రము, కన్ను.

**చటక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుపిచ్చుక; 2. ఆఁడుపిచ్చుక పిల్ల; 3. పిప్పలివేరు. అ. పుం. ము. పిచ్చుక.

**చటకారి.** ఆం. వి. ఈ దేశమునఁబుట్టిన ఆంగ్లేయసంతతివాఁడు.

**చటకాశిరము.** సం. వి. స్. న. పిప్పలివేరు.

**చటాకు.** హిం. వి. సేరులో పదునాఱవవంతు.

**చటులము.** సం. విణ. (అ. ఆ. అ.) చలించునది.

**చణకము.** సం. వి. అ. త్రి. సెనగలు.

**చతురంగము.** సం. వి. అ. న. చదరంగము.

**చతురంగబలము.** సం. వి. అ. పుం. తేలు.

**చతురంతయానము.** సం. వి. అ. న. పల్లకి.

**చతురము.** సం. వి. అ. న. గజశాల. పుం. అభినయహస్తవిశేషము. విణ. నేర్పరి.

**చతురస్రము.** సం. విణ. (అ. ఆ. అ.) చదరము.

**చతురశ్రికము.** సం. వి. అ. పుం. ముళువెలఁగ.

**చతురాననుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

**చతురిమ.** సం. వి. న్. పుం. నేర్పరితనము.

**చతురుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి.

**చతుర్గతి.** సం. వి. ఇ. పుం. తాఁబేలు.

**చతుర్థి.** సం. వి. ఈ. స్త్రీ. చవితి. విణ. నాలుగవది.

**చతుర్దంతము.** సం. వి. అ. పుం. ఇంద్రునియేనుఁగు, చవుదంతి.

**చతుర్దశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు పదునాలవతిథి; 2. పదునాలుగుతంతులుగల పరివాదినియనువీణ. విణ. పదునాలుగవది.

**చతుర్భద్రము.** సం. వి. అ. న. బలయుక్తములైన ధర్మార్థకామమోక్షములు.

**చతుర్భుజుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, ఉడ్డకేలు వేలుపు.

**చతుర్వర్గము.** సం. వి. అ. పుం. ధర్మార్థకామమోక్షములు.

**చతుర్హాయని.** సం. వి. ఈ. స్త్రీ. నాలుగేండ్ల ఆవు.

**చతుశ్శాలము.** సం. వి. అ. న. నాలుగిండ్లభవంతి.

**చతుష్కము.** సం. వి. అ. న. 1. చదుకము; 2. చవిక; 3. నాలుగు.

**చతుష్కి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దకోనేఱు; 2. దోమతెర; 3. నాలుగుపేటలుగలహారము.

**చతుష్టయము.** సం. వి. అ. న. నాలుగు.

**చతుష్పథము.** సం. వి. అ. న. చదుకము. పుం. మంచవిశేషము.

**చతుష్పథుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

**చతుష్పదము.** సం. వి. అ. పుం. 1. ఒక కరణము; (చూ. కరణము.) (రూ. చతుష్పాత్తు.) 2. నాలుగుకాళ్లజంతువు. (రూ. చతుష్పాదము.)

**చతుష్షష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అఱువదినాలుగు; 2. అఱువదినాలుగుకళలు; (చూ. కల.) 3. ఋగ్వేదము.

**చత్వరము.** సం. వి. అ. న. 1. ముంగిలి; 2. వ్రతముపూనినవానికి పండుకొనుటకు చక్కఁజేసినభూమి. అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరించినస్థానము. (అనికొందఱు.)

**చత్వరి.** సం. వి. ఈ. స్త్రీ. శ్రవణషష్ఠమైనబుద్ధి.

**చత్వరిక.** సం. వి. ఆ. స్త్రీ. బాలవిధవ.

**చపల.** సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱుపు; 2. లక్ష్మి; 3. ఱంకుటాలు; 4. పిప్పలి. పుం. ము. 1. కోఁతి; 2. చేఁప; 3. చేలుపుటాయి; 4. పాదరసము. క్రి. విణ. అ. న. త్వరితము. విణ. 1. కదలునది; 2. నిలుకడలేనిది; 3. వడిగలది.

**చపలత.** సం. వి. ఆ. స్త్రీ. రాగద్వేషాదులచే పనులయందుఁగలుగు తబ్బిబ్బు.

**చపేటము.** సం. వి. అ. పుం. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి. (రూ. చపటము.)

**చమత్కారము.** సం. వి. అ. పుం. నేర్పు, హాఱుపు.

**చమత్కృతి.** సం. వి. ఇ. స్త్రీ.——పై.——

**చమరము.** సం. వి. అ. న. 1. వింజామరము; 2. సవరము. పుం. సవరపుమెకము.

**చమరి.** సం. వి ఈ. స్త్రీ. 1. ఆఁడుసవరపుమెకము; 2. చిగురుకొమ్మ.

**చమరికము.** సం. వి. అ. పుం. కాంచనముచెట్టు.

**చమసము.** సం. వి. అ. పుం, న. చతురస్రమైన యజ్ఞపాత్రము. పుం. పక్షిపిల్ల.

**చమసి.** సం. వి. ఈ. స్త్రీ. సోఁపుపిండి.

**చమువు.** సం. వి. ఊ. స్త్రీ. 1. ఏడ్నూటయిరువదితొమ్మిదిరథములు అన్నియేనుఁగులు రెండువేలనూటయెనుబదియేడుగుఱ్ఱములు మూఁడువేలనాన్నూటనలువదియైదురుకాల్వురునుగలసేన; 2. సేన.

**చమూరువు.** సం. వి. ఊ. పుం. కలదులేదనుతోఁక కలిగితెల్లఁగానైనను, నల్లఁగానైనను, నానావర్ణములుకలదిగానైనను నుండెడు మృగవిశేషము. (దీనితోలు జనులుపయోగపఱచుకొందురు.)

**చయము.** సం. వి. అ. పుం. 1. సమూహము; 2. కోటకొఱడు; 3. సంగ్రహము.

**చరకము.** సం. వి. అ. పుం, న. వైద్యశాస్త్రము, కూర్చిన రెండు వస్త్రములు. (అనికొందఱు.)

**చరణము.** సం. వి. అ. న. 1. తినుట; 2. తిరుగుట; 3. నడవడిక. పుం, న. 1. పాదము; 2. వేరు; 3. ఋగ్వేదాది; 4. కులము.

**చరణాయుధము.** సం. వి. అ. పుం. కోడి, అజ్జవాలు.

**చరమక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. అంత్యకర్మము.

**చరమము.** సం. విణ. 1. కడపటిది; 2. పడమటిది.

**చరమాద్రి.** సం. వి. ఇ. పుం. అస్తపర్వతము.

**చరము.** సం. వి. అ. పుం. ఒకానొక జూదము. విణ. 1. కదలునది; 2. తిరుగునది.

**చరాచరము.** సం. వి. అ. న. జగత్తు. విణ. 1. తిరుగునది; 2. తిరుగునదియుఁ దిరుగనిదియునైనది.

**చరించు.** సం. ఉ. త్రి. తిరుగు. స. క్రి. చేయు. "వ్రతముల్ చరించెనఫలేచ్ఛగాగంధకస్థుండు." భార. ఆర. ౬., ఆ.

**చరితము.** సం. వి. అ. న. నడవడి. (రూ. చరిత.)

**చరిత్రము.** సం. వి. అ. న.——పై.——(రూ. చరిత్ర.)

**చరిష్ణువు.** సం. విణ. ఉ. తిరుగునది, జంగమము.

**చరుఁడు.** సం. వి. అ. పుం. 1. వేగువాఁడు; 2. అంగారకుఁడు.

**చరువు.** సం. వి. ఉ. పుం. 1. హవ్యము; 2. హవ్యమువండెడు కుండ.

**చర్చ.** సం. వి. ఆ. స్త్రీ. 1. విచారము; 2. చింత; 3. చేతనిడిన కుంకుమములోనగునది, కుంకుమములోనగువానిపూఁత. (అనికొందఱు.)

**చర్చరి.** సం. వి. ఈ. స్త్రీ. చప్పట.

**చర్చించు.** సం. స. క్రి. విచారించు.

**చర్చిక్యము.** సం. వి. అ. న. చేతనిడినకుంకుమములోనగునది, కుంకుమములోనగువానిపూఁత. (అనికొందఱు.)

**చర్పటము.** సం. వి. అ. పుం. 1. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి; 2. ఒకానొకమందుచెట్టు.

**చర్పటి.** సం. వి. ఈ. స్త్రీ. ఒబ్బట్టు.

**చర్మకష.** సం. వి. ఆ. స్త్రీ. నంబరేనుచెట్టు.

**చర్మకారము.** సం. వి. అ. పుం.——పై.——

**చర్మకారుఁడు.** సం. వి. అ. పుం. మాదిగవాఁడు.

**చర్మచటక.** సం. వి. ఆ. స్త్రీ. చీకురువాయి.

**చర్మణ్వతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకయేఱు; 2. అరఁటిచెట్టు.

**చర్మప్రసేవిక.** సం. వి. ఆ. స్త్రీ. కొలిమితిత్తి, భస్త్ర.

**చర్మభేదిక.** సం. వి. ఆ. స్త్రీ. ఆరెసూది.

**చర్మము.** సం. వి. న్. న. 1. తోలు; 2. కేడెము.

**చర్మి.** సం. వి. న్. పుం. 1. కేడెముధరించినవాఁడు; 2. భూజపత్రముచెట్టు.

**చర్య.** సం. వి. ఆ. స్త్రీ. నడచుట, నిలుచుట, కూర్చుండుట, పండుకొనుటలయందు సమాహితుఁడగుట, ఈర్య.

**చర్వణ.** సం. వి. ఆ. స్త్రీ. ఈఁగ. అ. న. ము. నములుట.

**చర్వితము.** సం. విణ. (అ. ఆ. అ.) నమలఁబడినది.

**చర్షణి.** సం. వి. ఈ. స్త్రీ. ఱంకుటాలు.

**చల.** సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి. అ. పుం. ము. వణఁకు. విణ. వణఁకుగలది.

**చలదళము.** సం. వి. అ. పుం. రావిచెట్టు.

**చలనము.** సం. వి. అ. న. 1. కదలుట; 2. తిరుగుట; 3. చల్లడము. విణ. కదలునది.

**చలమంచము.** సం. వి. అ. పుం. తూఁగుమంచము.

**చలాకీ, చలాకీ.** హిం. విణ. చుఱుకైన.

**చలానా.** హిం. వి. ఆయావస్తువులపట్టి, జాబితా.

**చలాచలము.** సం. విణ. (అ. ఆ. అ.) కదలునది.

**చలామణీ, చలావణీ.** హిం. విణ. వాడుకలోనుండు, చెల్లుబడియైన.

**చలాయించు.** హిం. క్రి. జేపగించు, పాజెపోవు.

**చలించు.** సం. అ. క్రి. కదలు.

**చలితము.** సం. విశే. (అ. ఆ. అ.) కదలింపఁబడినది.

**చవిక.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. చవ్యము.

**చవ్య.** సం. వి. ఆ. స్త్రీ. వస. అ. న. ము. మందుదినుసు.

**చషకము.** సం. వి. అ. పుం, న. 1. కల్లుత్రాగెడుగిన్నె; 2. గిన్నె; 3. గిండి; 4. ఒకదినుసుకల్లు.

**చషాలము.** సం. వి. అ. పుం. యూపస్తంభశిరోభాగమునందలి దారుమయమైనకడియము, రాజసూయమునందు యూపస్తంభము నడుగునఁదగిల్చెడి యినుపకడియము. (అనికొందఱు.)

## చా.

**చాంగేరి.** సం. వి. ఈ. స్త్రీ. పులిచింత.

**చాంచల్యము.** సం. వి. అ. న. చపలత్వము.

**చాండాలిక.** సం. వి. ఆ. స్త్రీ. మాలవీణ, కిన్నెర.

**చాంద్రమానము.** సం. వి. అ. న. చంద్రునిగతిఁబట్టి యేర్పడెడు కాలపరిమాణము.

**చాంద్రాయణము.** సం. వి. అ. పుం. భుజింపఁదగిన ముప్పదిరెండు కబళములలో చంద్రునియొక్క క్షయవృద్ధులననుసరించి క్రమమున కృష్ణపక్షమందు ఒక్కొక్కకడిగా తగ్గించుచు శుక్లపక్షమునందు ఒక్కొక్కకడిగా హెచ్చించుచు భుజించి యాచరించెడి యొకానొక వ్రతము.

**చాందిని.** హిం. వి. మేలుకట్టు.

**చాందీ.** హిం. విశే. మెఱుఁగులేని.

**చాంద్రి.** సం. వి. ఈ. స్త్రీ. వెన్నెల, జ్యోత్స్న.

**చాంపేయము.** సం. వి. అ. న. బంగారు. పుం. 1. అకరువు; 2. నాగకెసరము; 3. సంపెఁగ.

**చాకచక్యము.** సం. వి. అ. న. చకచకభావము.

**చాకిరి.** హిం. వి. నీచమైన కొలువు.

**చాకు.** హిం. వి. కత్తి.

**చాకోరము.** సం. వి. అ. న. చకోరపక్షులగుంపు.

**చాక్రికుఁడు.** సం. వి. అ. పుం. 1. వేకువను రాజులనిద్ర మేల్కొలిపెడువాఁడు; 2. గాండ్లవాఁడు.

**చాటకైరము.** సం. వి. అ. పుం. 1. పిచ్చుక; 2. పిచ్చుక మగపిల్ల.

**చాటుకారము.** సం. వి. అ. పుం. బంగారుపూసలుగ్రుచ్చిన యొంటిపేటహారము.

**చాటువు.** సం. వి. ఉ. పుం, న. ప్రియమైనమాట.

**చాతకము.** సం. వి. అ. పుం. వానకోయిల.

**చాతురి.** సం. వి. ఈ. స్త్రీ. చతురత్వము, నేర్పు.

**చాతుర్మాస్యము.** సం. వి. అ. న. ప్రతిసంవత్సరము ఆషాఢశుద్ధముమొదలు కార్తికశుద్ధమువఱకు నాలుగునెలలుచేసెడి యొకానొక యజ్ఞము.

**చాతుర్యము.** సం. వి. అ. న. చాతురి, నేర్పు.

**చాతుర్వర్ణ్యము.** సం. వి. అ. న. బ్రాహ్మణాదిచతుర్వర్ణములు.

**చాదస్తము.** గ్రా. వి. వెఱ్ఱితనము.

**చాదస్తుఁడు.** గ్రా. వి. వెఱ్ఱివాఁడు.

**చాపము.** సం. వి. అ. పుం. ధనుస్సు, విల్లు.

**చాపలము.** సం. వి. అ. న. చాంచల్యము.

**చాపల్యము.** సం. వి. అ. న.——పై.——

**చామరపుష్పము.** సం. వి. అ. పుం. 1. పోఁకచెట్టు, 2 మామిడి; 3. మొగలి; 4. ఱెల్లు.

**చామరము.** సం. వి. అ. న. వింజామరము. (దీనికి ముపర్గలోపమున కానంబడియెడి. "చామరలోకవలిడ." భార. శా. ౧, ఆ.)

**చామీకరము.** సం. వి. అ. న. బంగారు, కనకము.

**చాముండ.** సం. వి. ఆ. స్త్రీ. ఒక మాతృక. (చూ. మాతృక.)

**చారటి.** సం. వి. ఈ. స్త్రీ. మెట్టదామర.

**చారణుఁడు.** సం. వి. అ. పుం. 1. నానాదేశసంచారకుఁడైన నట్టువుఁడు; 2. నానాదేశసంచారకుఁడైన బట్టువాఁడు; 3. ఒక జాతిఖేచరుఁడు.

**చారము.** సం. వి. అ. పుం. 1. వేగు; 2. నడ; 3. చేఁగ.

**చారవాయువు.** సం. వి. ఉ. పుం. పడమటిగాలి.

**చారిత్రము.** సం. వి. అ. న. చరిత్రము.

**చారిమము.** సం. వి. న్. పుం. ఒప్పిదము.

**చారుఁడు.** సం. వి. అ. పుం. వేగువాఁడు.

**చారువు.** సం. వి. ఉ. పుం. బృహస్పతి. విశే. ఒప్పిదమైనది.

**చార్చిక్యము.** సం. వి. అ. న. చేకనిడిన కుంకుమములోనగునది, కుంకుమములోనగువానిపూఁత. (అనికొందఱు.)

**చార్మణము.** సం. వి. అ. న. చర్మముల సమూహము.

**చార్వాకుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొకమతమువాఁడు; 2. ఒకానొకరాక్షసుఁడు.

**చార్జి.** ఇం. వి. నేరస్థాపన. ఒప్పగింత, అధీనము.

**చార్వి.** సం. వి. ఈ. స్త్రీ. ఊహాపోహక్షమమైనబుద్ధి.

**చాలనము.** సం. వి. అ. న. 1. చలింపఁజేయుట; 2. జల్లెడ.

**చాలని.** సం. వి. ఈ. స్త్రీ. జల్లించెడు జల్లెడ.

**చాషము.** సం. వి. అ. పుం. పాలపిట్ట, కికీదివి.

## చి.

**చింక.** దే. వి. 1. చిన్నకాలువ; 2. బ. రెల్లలలోనుండు జొన్నలు.

**చింకలిక్క.** వై. వి. ఎఱ్ఱని మొగముగల కోఁతి.

**చింగోటి.** దే. వి. ఆయుధవిశేషము.

**చించ.** సం. వి. ఆ. స్త్రీ. చింత.

**చించు.** దే. ప్రే. చినుఁగఁజేయు.

**చింత.** ఉభ. వై. వి. చింతచెట్టు. సం. వి. ఆ. స్త్రీ. 1. తలఁపు; 2. వగపు.

**చింతకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) చింతించువాఁడు.

**చింతగుల్ల.** నై. వి. బరుడుతోనుండు చింతపండు.

**చింతన.** సం. వి. ఆ. స్త్రీ. పలుమాఱు తలఁచుట.

**చింతనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) చింతింపఁదగినది.

**చింతపండు.** ద్వ. వి. ఏ. బరడూడ్చిన తింత్రిణీఫలములముద్ద.

**చింతామణి.** సం. వి. ఇ. పుం. కోరినకోరికలనిచ్చెడు దేవమణి.

**చింతించు.** సం. అ. క్రి. వగచు. (రూ. చింతిల్లు.)

**చింతితము.** సం. విశే. (అ. ఆ. అ.) చింతింపఁబడినది.

**చింత్యము.** సం. విశే. (అ. ఆ. అ.) చింతింపఁదగినది.

**చింద.** నై. వి. చీపురుపిట్ట. "గీ. పాదివేఁటఁజూడఁబదరెడుగాఁటేని, మదినెఱింగితడవ్రమనినవెలిచె, కొఁజుకారుకోడి కక్కెరపూరేడు, చిందలున్నగూండ్లుచేరఁదెచ్చి." య. ౨, ఆ.

**చిందము.** దే. వి. శంఖము. "వ. దేవనంఘుంబుశంఖంబిచ్చె. అదికారణంబుగా నాచిందంబుదేవదత్తంబనంబరఁగె." భార. విరా. ౪, ఆ.

**చిందఱ.** యు. దే. వి. విజృంభణము. "ఉ. అంతట నొక్కచెంచు కడు సగ్గలికం జని పందిపోటుమై, చెంతకుఁబోవఁ జూచుటయుఁ జిందఱఁగొమ్ముల నెత్తిపట్టె." య. ౨, ఆ.—నై. 1. తూఁటు; "ద్వి. చెవులుసిందఱలువోఁజెలఁగెఁజమ్మటలు." హరిశ్చ. ౧, భా.—2. ఖండము*. "సీ. తనదేహమిటులు చిందఱలౌననెడురీతిఁ గులుకుగుబ్బలువాఁడి గోళ్లవ్రచ్చి." సా. ౨, ఆ.

**చిందఱగొను.** దే. అ. క్రి. (చిందఱ+కొను.) విజృంభించు. "సీ. అడఁపంగవచ్చిననదటునఁజిందఱ గొనియెట్టిబలియురఁగొనక కవియు." పారి. పూ. ౬, ఆ.

**చిందఱరేఁగు.** దే. అ. క్రి. ఆవేశమెత్తు. "వ. నందినితనవత్సంబుఁబట్టుకొనవచ్చినజనులకలిగిచిందఱరేఁగి." భార. ఆది. ౭, ఆ. (చూ. చీఁదఱరేఁగు.)

**చిందఱవందఱ.** దే. వి. 1. తునుక; "వ. ఉదంచితంబులగుబాణపరంపరలచేతనరాతిసైన్యంబులందుఁజిందఱవందఱలగునరదంబులును." కళా. ౮, ఆ.—2. కలగుండు. (చూ. చిట్టాడు.) విశే. కలగుండువడినది. "క. వెఱవకుఁడు వెఱవకుఁడుసిం, దఱవందఱగాకుఁడేల ధైర్యముఁ బూలన్." ఉ, హరి. ౫, ఆ.

**చిందఱవందఱచేయు.** దే. స. క్రి. ఖండించు. "సీ. మదభరభీషణమాతంగములమట్టిచిందఱవందఱచేసిచేసి." భార. విరా. ౫, ఆ.

**చిందఱవోవు.** ద్వ. అ. క్రి. (చిందఱ+పోవు.) తూఁటువోవు. "సీ. చెవులుచిందఱవోవఁజెలఁగుకవీంద్రులపోరంటిమాశనివారవుజడి." కళా. ౭, ఆ.

**చిందఱసేయు.** ద్వ. స. క్రి. (చిందఱ+చేయు.) భేదించు. "చ. ఒడిసెలఱాతిచందమునసుర్వడిసింగిణికోలపాఱుకై, వడిలగుడాఁకటంబలుచువైఖరి బిస్సునసాళువంబుదూ, ఱెడుక్రియఁ దూఱఁబాఱికిటిబృందముఁజిందఱసేసెఁజెంచులా, యెదురునబాపురేశనినరేశునిమెచ్చఁగఁ జేసితౌనన౯." సా. ౧, ఆ. (రూ. చిందఱలుసేయు.)

**చిందాడు.** దే. అ. క్రి. (చిందు+ఆడు.) చిందులుద్రొక్కు.

**చిందియ.** దే. వి. (చూ.) చిందె.

**చిందిలి.** దే. విశే. చలించినది. "ఉ. మీరిటఁబూని యాక్రమము మేకొనిచేసినదివ్యరాజ్యల, క్ష్మీరమణీయవైభవము చిందిలివందిలిగాక తక్కుఁబెం, పారఁగనాకు." లక్ష్మీ. ౨, ఆ.

**చిందిలిపడు.** ద్వ. అ. క్రి. సంభ్రమించు. "వ. ఇందుండు చిందిలిపడసాగె." కాశీ. ౨, ఆ.

**చిందిలిపాటు.** ద్వ. వి. చిందిలిపడుట, వేగిరపాటు. "ద్వి. తిన్నఁగా నతనిచిందిలిపాటు మాన్చి." విష్ణు. ఉ. ౫, ఆ.

**చిందిలు.** దే. అ. క్రి. చలించు. "మదీయకాంతుపైఁజేసినభక్తి యెన్నఁడునుజిందిలదేని." పంచ. నా. ౧, ఆ.

**చిందు.** దే. అ. క్రి. 1. నీళ్లు పాత్రమునందుండి తొనఁకిపడు; 2. రాలు; "విరులుచింద౯." స్వా. ౨, ఆ.—3. వ్యాపించు. "క. ఒడలుబ్బనిక్కిముందఱ, యడుగులుధరనూఁది చిందు నలబలమునకు౯, జడియకొకగబ్బిగండె, క్రుడుకడిమిఁదివిచెఁగ్రుంగి కొమ్ములయుడుము౯." స్వా. ౪, ఆ.—స. క్రి. వెచ్చముసేయు. "గీ. చంపిధార్మికుండు సతిఁబొందిమతిభ్రష్ట, చారిబొంకినత్యశాలియార, గించినదుపవాసికేడించిశూరుండు, చిందిధనియు నగువిచిత్రసరణి." ఆము. ౪, ఆ.—వి. 1. గీతప్రబంధవిశేషము. "సీ. గీతంబుదరువుజక్కిణి చిందుమొదలుగా నొక్కొక్కవర్ణంబునగ్గడించి." వి, పు. ౭, ఆ.—విశే. చెదరినది. "సికతాసేతువు నిమ్నగారయముచేఁజిందైనచందాన." ఉ, హరి. ౪, ఆ.

**చిందుగ.** దే. వి. వృక్షవిశేషము. "సీ. తాండ్రచందనమేపెదా సానమెఱ్ఱదాసానము చిందుగచాఱజొన్న." హంస. ౪, ఆ.

**చిందుద్రొక్కు.** దే. అ. క్రి. (చిందు+త్రొక్కు.) నర్తనము చేయు. "ఉ. బంగరుఁదళ్కుఁజెక్కులను బంజులకమ్మలడాలు చిందుద్రొక్కఁగ." ఉ. రా. 3, ఆ. (రూ. చిందులుద్రొక్కు. "సీ. వీఁజెపోనందుని విరిఁబోఁడిముందఱమొనసి చిందులు ద్రొక్కు ముద్దులాఁడు." నీలా. 3, ఆ.)

**చిందుపరువు.** దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. వెన్నెలకుప్పలు వ్రేలుబొట్టన సిరిసింగన్నవత్తియుఁ జిందుపరువు." హంస. 3, ఆ.

**చిందువ.** దే. వి. 1. చిన్నపెట్టె. "సీ. చిటిచాఁప ధూపంబు చిందువ బకదారిపంజరంబులు శొమ్ముబరణిమంచి, నీళ్లగిండియు." సురా.—2. వృక్షవిశేషము. (చూ. చిందుగ.)

**చిందువందు.** దే. విశే. చెదరినది. "వ. తొలిమిచిందువందై." స్వా. 3, ఆ.

**చిందువందుచేయు.** దే. స. క్రి. చెదరఁగొట్టు. "వ. అందంద ముందటంగ్రందుకొను మణిమయస్యందనంబులంజిందువందుచేసియును." జై. 3, ఆ.

**చిందె.** దే. వి. జెట్లకుల్లాయ. (చిందియయొక్క రూపాంతరము.)

**చింపి.** దే. విశే. చినిఁగినది. "వ. చింపులైనమైమఱువులును." జై. ౫, ఆ.

**చింపిలి.** దే. వి. నిప్పుసోఁకినట్లుండు కొనలుగలిగి బిరుసెక్కిన చిన్న వంకరవెండ్రుకలు. "పల్లచింపిలితల." హరిశ్చ. ౪, ఆ.

**చింపు.** దే. ప్రే. చించుయొక్క రూపాంతరము.

**చింబు.** దే. వి. మేఁక, అజ.

**చింబోతు.** దే. వి. (చింబు+పోతు.) మేఁకపోతు.

**చికటూరి.** దే. వి. చిక్కటూరియొక్క రూపాంతరము. "సీ. చికటూరి వీరులప్రకటాహవముమాన్చు చికటూరి పొదలికల్‌చెన్ను మిగుల." శశాం. ౨, ఆ.

**చికమక.** దే. వి. చిక్కు. "క. పికమాయభినవమణిదీ, పికమాడ్కి వెలుంగునిందుబింబాననయో, పికమాలిటొందుఁగుందెనో, చికమకలంబెట్టకిపుడు చెపుమామాకు౯." రసి. ౬, ఆ.

**చికిచికి.** దే. విశే. చిన్న. "వ. చెదరినచికిచికివెండ్రుకలుపాదుప్ర టంజిఱుమొగులుమొలకలుబలసిన కొఱనెలకుంబాటియగునెన్నుదురుళనున్నచెమరులుతుఱంగలింప." హరి. పూ. ౫, ఆ.

**చికిత్స.** సం. వి. ఆ. స్త్రీ. (రోగమునకుఁజేయు.) ప్రతిక్రియ.

**చికిత్సకుఁడు.** సం. వి. అ. పుం. వైద్యుఁడు, వెజ్జు.

**చికిత్సించు.** సం. అ. క్రి. చికిత్సచేయు.

**చికినము.** వై. వి. చికినివక్క.

**చికిని.** వై. వి. చోయవక్క.

**చికిలి.** దే. వి. తుడిచి చక్కచేయుట.

**చికిలికాఁడు.** దే. వి. (కత్తులు మొదలైనవానిని) చికిలిచేయువాఁడు.

**చికిలిచేయు.** దే. స. క్రి. తుడిచి చక్కచేయు. "సీ. శృంగారరసమునఁజికిలిచేయించినకంతుమోహనసాయకంబులనఁగ." రుక్మాం. ౧, ఆ.

**చికిలు.** దే. అ. క్రి. చనవుచేసేద్చు. "సీ. కల్లరితనమునకై తల్లి కోపించిచేయెత్తికొట్టినఁజికిలిచికిలి." శేష. 3, ఆ.

**చికీర్ష.** సం. వి. ఆ. స్త్రీ. చేయనిచ్ఛ.

**చికీర్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) చేయనిచ్ఛింపఁబడినది.

**చికీర్షువు.** సం. విశే. (ఉ.) చేయనిచ్ఛగలవాఁడు.

**చికురము.** సం. వి. అ. పుం. 1. వెండ్రుక; 2. కొండ; 3. పక్షివిశేషము; 4. పాము; 5. ముంగిస; 6. వృక్షవిశేషము. విశే. కదలునది.

**చిక్క.** సం. వి. ఆ. స్త్రీ. పోఁక. అ. న. ము. చికినపువక్క. పుం. చుంచెలుక.

**చిక్కంటె.** దే. వి. తలచిక్కుదీసికొనెడి నిడుపుదువ్వెన.

**చిక్కటూరి.** ద్వ. వి. (చికి+కటారి.) చిన్నకటారి. "గీ. చికిలిచేసినమరుచేతిచిక్కటూరి." కవి. 3, ఆ.

**చిక్కణము.** సం. వి. అ. న. 1. చికినివక్క; 2. ఏనుఁగుహృదయమదము. పుం, న. పోఁక. విశే. 1. తఱచైనది; 2. నును పైనది.

**చిక్కన.** వై. వి. 1. తఱచు; (చిక్కనిపాలు.) 2. బలము*; "ఉ. చిక్కనిపోటుమానిసివిసీవినువారలునవ్వసేమిగా, నెక్కుడుమాటలాడెదవు." భార. ఉద్యో. ౧, ఆ.—3. దార్ఢ్యము*. "క. చిక్కనిరదండముగొనిపాములఁ, గనినప్పుడయడువఁదొడఁగె." భార. ఆది. ౧, ఆ. (చూ. అలకన.)

**చిక్కనాబిల్లలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. ఓటిల్లుచిందఱ.)

**చిక్కపట్టు.** దే. వి. (చిక్కని+పట్టు.) నిర్ణయము.

**చిక్కము.** వై. వి. 1. ఉట్టి; 2. తీఁగలులోనగువానితోనల్లి పసులమూతికిఁదగిలించెడుబుట్ట*; 3. దారముతోనల్లినసంచి*.

**చిక్కసము.** సం. వి. అ. న. యవలపిండి.

**చిక్కు.** దే. అ. క్రి. 1. కృశించు; 2. తక్కు; 3. తగులు; 4. దొరకు; 5. మిగులు. వి. 1. మెలి; 2. సంకటము.

**చిక్కుడు.** దే. వి. ఒకానొకతీఁగ.

**చిక్కుతాళము.** మి. వి. ఒకదినుసుబీగము.

**చిక్కుపడు.** ద్వ. అ. క్రి. 1. చిక్కగు; 2. సంకటపడు.

**చిక్కుపాటు.** ద్వ. వి. చిక్కుపడుట, సంకటపాటు. "చ. చిక్కుపాటునం [illegible] ప్రలంబారిదోయుగా." మా. ౭, ఆ.

**చిక్కువడు.** ద్వ. అ. క్రి. (చిక్కు+పడు.) 1. చిక్కగు; 2. సంకటపడు. "మ. [illegible] పైన్యంబుఁజి, క్కువడంజేయఁగ." భార. భీష్మ. 3, ఆ.

**చిక్కొట్టు.** దే. స. క్రి. (చీ+కొట్టు.) ఛీఛీయను. "క. [illegible] పెలుచకుఁ, జెక్కుటికినూరుమెచ్చుఁదెంపిలికఁగాఁ." ఉ, హరి. ౫, ఆ.

**చిక్కోల.** దే. వి. (చిక్కు+కోల.) చిక్కంటె.

**చిక్రోడము.** సం. వి. అ. పుం. ఉడుత.

**చిగిరించు.** దే. అ. క్రి. చిగురుచు, పల్లవించు.

**చిగిరింత.** దే. వి. తృణవిశేషము.

**చిగురాకుదిండి.** దే. వి. (చిగురు+ఆకు+తిండి.) పికము. "సీ. చిగురాకుదిండ్లపల్లవమంటకెనఁగుపల్లవమంటపమునకలంగనుసిచి." చంద్ర.

**చిగురాకువిలుకాఁడు.** దే. వి. (చిగురు+ఆకువిలుకాఁడు.) మన్మథుఁడు. "చిగురాకువిలుకానిచేతిచక్రమురీతి." శశాం. 3, ఆ.

**చిగురు.** దే. వి. పల్లవము. విశే. లేఁత. (చిగురుఁగొమ్మ.) (హల్లు పరమగుచో దీనికడపటియుకారము వికల్పముగ లోపించెడి. "చిగుర్నగుమోవి.")

**చిగురుఁగొమ్మ.** దే. వి. (చిగురు+కొమ్మ.) చిగిరించిన లేఁతకొమ్మ, పూచినలేఁతకొమ్మ. (అనికొందఱు.)

**చిగురుఁబోఁడి.** దే. వి. (చిగురు+బోఁడి.) 1. చిగురువలె మనోజ్ఞరాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోడి.)

**చిగురుకొను.** దే. అ. క్రి. చిగిరించు. "గీ. సొగసునగవులు మొగమునఁజిగురుకొనఁగ." (ఇక్కడ చిగురుకొనఁగ అనఁగా పుట్టఁగా ననియర్థము.) చంద్రా. 3, ఆ.

**చిగురుచు.** దే. అ. క్రి. 1. చిగిరించు; 2. ఎఱ్ఱనగు. (రూ. చిగుర్చు. "కన్గొనల్ చిగుర్పంగ." జై. ౪, ఆ.)

**చిగురువిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు. (ఇట్లు చిగురువిలుతుఁడు మొ.)

**చిగురొత్తు.** దే. అ. క్రి. (చిగురు+ఒత్తు.) 1. చిగురుచు; "క. మసమునఁగయ్యపువేడుక, చిగురొత్త." (ఇక్కడ చిగురొత్త అనఁగా పుట్టఁగా ననియర్థము.) భార. ద్రో. ౧, ఆ.—2. అనురక్తమగు. "చిత్తముచిగురొత్త." (చూ. ఒత్తు.)

**చిచ్చఱ.** వై. విశే. (చిచ్చు+అఱ.) అగ్నిమయము. "చ. చిఱునగవొప్పగాండివముచెచ్చెర నజ్యముచేసిసేనలు, క్కఱరభసంబుమైనడరెఁగవ్వడిద్రోణియునీడఁబోకయ, త్తఱిఁదఱుమంగ వస్త్రములుదందడిఁదార్కొనిమండుచుండెఁఱ, చ్చఱపిడుగుల్వడిందొరఁగుచాడ్పుననంబరవీథినుగ్రమై." భార. విరా. ౫, ఆ.

**చిచ్చఱకంటి.** ద్వ. వి. (చిచ్చఱ+కన్ను.) శివుఁడు.

**చిచ్చి.** దే. అవ్య. బిడ్డలకుజోలలుపాడునపుడునిద్రాపరిహారార్థము చెప్పఁబడుమాట. (రూ. చిచ్చీ.)

**చిచ్చు.** వై. వి. 1. అగ్ని; 2. తాపము. "సీ. ఈ వెండ్రుకలుపట్టి యీడ్చినయాచేయి తొలుతగాఁభోరిలో దుస్ససేను, తను వింతలిం

తలుతునిదుల్లైచెడకి హాపకుయు స్న గని యుదుకాణుగాక. యులు పాలఁ బోఁకుపుసుట్టిచిచ్చే యిది.'' భార. ఉద్యో. 3, ఆ.

**చిచ్చుబుడ్డు.** న్వ. వి. బాణముసంచునగ.

**చిచ్చుఱ.** వై. విశ. (చిచ్చు+ఉఱ.) అగ్నిమయము. ''చ. వెఱ వకుమన్న పోటుకుఱుకిరులతోఁ జకశక్యమేనిన, తైఱఁగదియే లసీవు దుగు తేరికేసారథిగన్మునాజ్ఞఁజ, చ్చుఱపిడుగెట్టులట్టడరిశూరుల మొత్తమునుగ్గునేసెదఁ, బఱపెదనేఁ రాజాధృతిఁ బాపెద గోవులఁ గ్రస్మ జించెదఁ.'' భార. విరా. ౪, ఆ.

**చిటచిట.** దే. వి. 1. కాఁగిననూనెయందు నీటిబొట్టుపడఁగాఁ గలుగు నట్టి ధ్వన్యనుకరణము; ''సీ. నఖముఖోల్లేఖ పరాస్తనఖముక్తహాప్యాం బుపటిమదీపపుఁ జటచిటలుదెలుప.'' ఆము. ౫, ఆ.—2. మిడుఁ గుఱులుచెదరుట లోనగువానియందగు ధ్వన్యనుకరణము; ''క. కటకటములదరఁగన్నులఁ, జటచిటనిప్పుకలుచెదర.'' ఉ, గా. 2, ఆ. ''ఇరుగంటనిప్పుకల్ చిటచిటరాల.'' రా, వి. ౫, ఆ.— 3. మంటయందగు ధ్వన్యనుకరణము.

**చిటచిటమను.** దే. అ. క్రి. (చిటచిట+అను.) మండిపడు.

**చిటచిటలాడు.** దే. అ. క్రి. (చిటచిటలు+ఆడు.)——పై. —— ''చ. చటచిటమాన గోరిహరిసర్వమయుండ లెయుంచుఁ బట్టితోఁ, జటజిటలాడియిందుఁగనఁజేయుమునీవని దైత్యుఁడాడి నఁ, బటపటజాతికంబమిరువాదులుగా నరసింహమూర్తివై, కుటిల నఖాగ్రకుంచికల గ్రుచ్చివెవానియురఃకవాటముఁ.'' పా. 3, ఆ.

**చిటపాట.** దే. వి. 1. ఈర్ష్యచేఁగలిగెడు స్త్రీయొక్క కోపము; ''చ. కుటిలకటాక్షవీక్షణముఁగోమలనూత్నకపోలరాగముఁ, జటుల సమంచిత భ్రుకుటినంవలనంబును జూచువేడుకఁ, జటపాటరేఁచె రాజునరసీరుహనేత్రకుఁగామకేళికిఁ, గటువులుకానిమానములకా వె ప్రదీపనసిద్ధిహేతువుల్.'' నై. ౭, ఆ.—2. ఆకులుతినుటయందగు ధ్వన్యనుకరణము; ''క. నటనపరకేకిపాత్ర, స్ఫుటయవనికలన మొగిల్లుపాదివెఁ భూభృ, త్తటులనవియాకుదినుచిట, పాటరవములు చెలఁగెఁదాళములచప్పుళ్లై.'' ఆము. ౪, ఆ.—3. చినుకులుపడుట యందగు ధ్వన్యనుకరణము; ''క. అటమున్న మొగులుబలియుచుఁ, జిటపొటమనిపాటపాటఁజినుకులుపడఁజొ, చ్చుటయాదిగాఁగఁదన పెని, మిటితడియునొయనిసుగాత్రి మిగులవగపుతోఁ.'' కళా. ౪, ఆ.—4. కాయలురాలుటయందగు ధ్వన్యనుకరణము. ''ద్వి. చిమిడికాయలు నేలఁజిటపొటరాల.'' హరిశ్చ. ౧, భా.

**చిటాలు.** దే. వి. ధ్వన్యనుకరణము. ''వ. మిటారంపుఁగటారంబు లఁజిటాలుచిటాలునఁదుటారంబడరహుటాహుటిం బటాపంచలుగఁ దఱుముచు.'' అచ్చ. యు, కాం.

**చిటి.** దే. విశ. 1. చిన్న; ''చిటిపాప.'' 2. సన్నము. ''చిటి చాఁప.'' (చిట్టియొక్క రూపాంతరము.)

**చిటికె.** వై. వి. 1. నడిమివ్రేలిని పెద్దవ్రేలితోఁగూర్చి ధ్వనింపఁ జేయునంతకాలము; 2. నడిమివ్రేలిని పెద్దవ్రేలితోఁగూర్చి ధ్వనిం పఁజేయుట*.

**చిటికరించు.** వై. అ. క్రి. చిటికవేయు.

**చిటికరింత.** వై. వి. చిటిక.

**చిటికాఁడు.** దే. వి. పొట్టిగానుండుటచేత కుక్కకియ్యఁబడిన పేరు. (ఇది చిటిలింగఁడు అనుదానికి పర్యాయము.) విశ. చిన్న వాఁడు.

**చిటికెన.** దే. వి. చిన్నవ్రేలు, కనిష్ఠిక. ''చ. ఇటుతగునయ్య విప్రుఁడవహీనగుణాఢ్యుఁడవీవునీకునే, మిటికెటువంటిదౌష్ట్యము శమించునెమజ్జనకుండువిన్నఁద, క్కటిజనులేమియంద్రు మదిఁ గాంక్షయొకల్లినవగ్నిసాక్షిగాఁ, జటికెనవట్టికాకవృథచేయుటధర్మమె కన్యకాప్తముఁ.'' భో. ౪, ఆ.

**చిటికెనబొద్దులు.** దే. వి. బ. కాలిచిటికెనవ్రేళ్లయందుంచు కొనెడు భూషావిశేషము.

**చిటిగొట్టె.** ద్వ. వి. చిన్నజాతిగొట్టెచెట్టు.

**చిటితాళము.** మి. వి. మ్రానితోఁజేసినతాళవిశేషము. ''సీ. చిటి తాళము బుచంక పుటికనొక్కొకమాటుగతిరయమ్మునఁదాఁకికలసి మొరయ.'' ఆము. ౬, ఆ.

**చిటిపొటి.** దే. విశ. అల్పము. ''క. చిటిపొటి నవ్వులుకనుఁగవఁ, బొటమరిలఁ.'' సా. 3, ఆ. (పొట్టిశబ్దముయొక్క రూపాంతరము పొటి. చిటిపొటిశబ్దములు రెండుచేరియుండుటవలన అత్యల్ప మనియు నర్థము చెప్పవచ్చును.)

**చిటిబొద్దులు.** దే. వి. బ. చిటికెనబొద్దులు.

**చిటిముత్తెములు.** ద్వ. వి. బ. ధాన్యవిశేషము.

**చిటిలింగఁడు.** ద్వ. వి. చిన్నలింగమువలెనుండుటచే కుక్క కియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**చిటివ్రేలు.** దే. వి. చిటికెనవ్రేలు.

**చిటుకను.** దే. అ. క్రి. చిటుక్కనుయొక్క రూపాంతరము. ''సీ. చెవిదార్చి వినిచీమ చిటుకన్నఁ బాఁజెసెలవి వెంపరలాడుఁ జెట్టు లెల్ల.'' స్వా. ౪, ఆ.

**చిటుకుపొటుకు.** దే. వి. వానవెలిసినపిమ్మట చెట్టుమీఁదనుండి బొట్లుపడునపుడు కలుగు ధ్వన్యనుకరణము.

**చిటుకుపొటుకుమను.** దే. అ. క్రి. (చిటుకుపొటుకు+అను.) పలుకు. (వాఁడు చిటుకుపొటుకుమనక ఉన్నాఁడు.)

**చిటుకురను.** ద్వ. అ. క్రి. (చిటుకు+అను.) చిటుక్కని మ్రోఁగు. ''గీ. చీమచిటుకురన్నఁ జిమ్మటజిఱ్ఱన్న, నెదురమూషకములు మొదలుకొనిన, నిదురలేకభూమినిగ్గరుఁడాలించు, నప్పుడబలకాలి చప్పుడనుచు.'' పంచ. వేం. ౪, ఆ.

**చిటుక్కను.** దే. అ. క్రి. (చిటుక్కు+అను.)——పై.——

**చిటులు.** దే. అ. క్రి. చిట్లు. ''చిటులుగందపుఁబూఁత.''

**చిట్టి.** దే. వి. 1. ఆశ్చర్యము. ''ఉ. నీదుమహత్త్వమెంతయుం, జిట్టలుగాదె.'' భార. అర. ౫, ఆ. ''వానివర్తనముచెప్పంజిట్టలు.'' నిరవ. 2, ఆ. ''క. మునినాథచెప్పఁజిట్టలు, మనయనిరుద్ధుండు నిన్నమగువలుగొలువఁ, దనయింటరాత్రినెమ్మది, నునికిగలిగెఁబిద పనున్నయునికినయడఁగెఁ.'' ఉ, హరి. ౬, ఆ.—2. చిన్నపొద. ''వ. కరివరకరేణువులు వంప గుంపుచెడి యిట్టట్టువడి తిట్టగు చిట్టల సంకటంబులగుడొంకలును.'' స్వా. ౪, ఆ. ''పగడపుఁ జిట్టలఁ.'' వసు. ౧, ఆ. విశ.—కల్పితము. (ఇది చిట్టగానున్నది.)

**చిట్టంటుచేఁతలు.** దే. వి. బ. (చిట్టి+అంటుచేఁతలు.) విలా సము. ''ద్వి. కైకేయి, వరవుడామంథరవడినేగుదెంచి, చిట్టంటు చేఁతలఁజెండుదట్టుటయు.'' రా. బాల, కాం.

**చిట్టంటులు.** దే. వి. బ. (చిట్టి+అంటులు.) నఖదంతక్షతాది. ''ఎ, గీ. అంతకంతకుఁజిట్టంటులంటియంటి, చెలువలకుయౌవన ముబిందుసేయనున్న, మానగుణబద్ధుమన్మథమంత్రసిద్ధు, రుచిరరస వృద్ధునాయనిరుద్ధుఁజూచి.'' (ఇక్కడ అంటియనఁగా చేసియని యర్థము.) ఉ, హరి. ౫, ఆ. ''సీ. చిట్టంటుచేఁతలసిగ్గుకీలెడలించి పలికింపనల్లనఁబలుకుటయును.'' (ఇక్కడ వృత్తియందేకవచనాం తము.) భో. ౪, ఆ.

**చిట్టకము.** వై. వి. 1. శృంగారచేష్ట*; ''ఉ. ఇంతులుకూడిచిట్టకములిట్లొనరింపఁగనించుకేనియుఙ్, వింతతెఱంగులేకధరణీధరముంబలెనున్నయాదృఢ, స్వాంతుని౯ జూచిజాపతిమ చక్కిలిగింతలువోలెఁగంటిరే, యెంతయురిత్తవోయె మనయిందఱచేష్టలునంచునవ్వుచు౯.'' పర. 3, ఆ.—2. లీల*; ''క. నీకొడుకునీకయిచ్చితిఁ, గైకొనుమువిరించిచిట్టకాలకులోనై, నాకుఁబగయగుటనంగము, లేకున్నాఁడతఁడుకొఱఁతలేదతనివయి౯.'' ఉ, హరి. ౨, ఆ.—3. కపటము*. చిట్టకంపుఁద్రాగుడుగనినన్నలన్నగిరి.'' ఆము. ౨, ఆ.

**చిట్టచివర.** దే. విశే. (చివర + చివర.) అన్నిటికిచివర.

**చిట్టతుమికి.** దే. వి. రావణవృక్షము.

**చిట్టమిడుచు.** దే. అ. క్రి. చిటికవేయు. ''సీ. సకలాంగకంబులుజాడుకోఁబులకించిచెయ్యెకించుకయెత్తిచిట్టమిడిచి.'' నై. ౫, ఆ.

**చిట్టా.** హిం. వి. దినపులెక్క.

**చిట్టాడు.** దే. అ. క్రి. (చిట్టి+ఆడు.) 1. సంచరించు; ''మ. రణక్షితియుంబీనుఁగుపెంటచేసెఁజెనయంజిట్టాడఁగాశక్యమే.'' భార. ద్రో. 3, ఆ. ''సర్వసేనాంగాంగంబులమీఁద గాలియునుజిట్టాడంగనీక.'' (ఇక్కడ చిట్టాడుటయనఁగా సోఁకుటయనియర్థము.) భార. ఉద్యో. ౨, ఆ.—2. ప్రసరించు; ''సీ. సిగ్గులేఁదెరవాసిచిట్టాడుచూపులునవవిలాసమునకునవకమొసఁగ.'' షో. ౮, ఆ.—3. తప్పటడుగులిడు; ''సీ. చిట్టాడునాడునాచిటికెనవ్రేల్వట్టుచేతులాయివిముద్దుచిన్నికూన.'' సా. 3, ఆ.—4. చలించు. ''క. కందోయిచల్లఁగానిటు, గందోయి నృపాల లెన్నగానిఁకనొకమా, ఱందఱముందఱనీవని, చిందఱవందఱలగుట్టుచిట్టాడంగ౯.'' సా. 3, ఆ.—5. క్రీడించు. ''సీ. పొన్నక్రొవ్విరివంటిపొక్కిలిగిలిగింతలలరఁ జిట్టాడెడునట్టివేళ.'' శుక. ౧, ఆ.

**చిట్టాముదపుఁజెట్టు.** ద్వ. వి. (చిట్టాముదము+చెట్టు.) బల.

**చిట్టాముదము.** ద్వ. వి. (చిట్టి+ఆముదము.) 1. చిట్టాముదాలనూనె; 2. బ. చిట్టాముదపువిత్తులు.

**చిట్టి.** దే. వి. సోలయందునాలుగవ భాగమయిన మానవిశేషము. విశే. చిన్న. ''ఎ, గీ. మలయపవనుండుపలుమాఱుమలయకుండ, నలరుచిట్టిగవాక్షంబులరసియరసి, యెందుఁగందర్పతాపంబుడిందుపడక, చెలువనీరాకమదినపేక్షించునంత.'' విక్ర. ౪, ఆ. (ఇత్యాదిప్రయోగములంబట్టి చిట్టడవి, చిట్టాన, చిట్టీఁదు, చిట్టుడుకు, చిట్టెండ, చిట్టేలకి ఇత్యాదులయందుఁ బూర్వమునందుండునది చిట్టిశబ్దముగాని చిఱుతశబ్దముకాదని తోఁచుచున్నది.)

**చిట్టియ.** దే. వి. (చూ.) చిట్టె.

**చిట్టియము.** దే. వి. (చూ.) చిట్టెము.

**చిట్టీఁదు.** దే. వి. (చిట్టి+ఈఁదు.) ఖర్జూరి🌴.

**చిట్టీడ.** దే. వి. (చిట్టి+ఈడ.) క్షుద్రరక్తనారంగము🌴.

**చిట్టు.** దే. వి. తవుడుకలిసిన సన్ననూక.

**చిట్టుడుకునీళ్లు.** ద్వ. వి. బ. (చిట్టి+ఉడుకునీళ్లు.) పొంగునీళ్లు.

**చిట్టుములు.** దే. వి. బ. (చిట్టి+ఉములు.) గర్భిణికిఁగలిగెడియొకానొక లక్షణము.

**చిట్టె.** దే. వి. 1. వస్త్రములయంచులయందునేసెడు చిన్నకమ్మి; 2. వెదురుగనుపు. (చిట్టియయొక్కరూపాంతరము.)

**చిట్టెము.** దే. వి. ఇనుముకాఁచునప్పుడు వచ్చెడుమునికి, కింఘాణము. (చిట్టియముయొక్కరూపాంతరము.)

**చిట్టెలుక.** దే. వి. (చిట్టి+ఎలుక.) చిన్నజాతియెలుక, గిరిక.

**చిట్టేలకి.** ద్వ. వి. (చిట్టి+ఏలకి.) ఉపకుంచిక🌴.

**చిట్లపొట్లాకాయ.** దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. కుందెనగుడి.)

**చిట్లు.** దే. అ. క్రి. 1. పగుల్లువాఱు; 2. మిక్కిలి కోపించు. వి. వృత్తాంతము. ''క. ఇట్లయ్యనుభ్రుసుఁదమతో, జట్లువడసికోర్కులక్కజంబుగఖులీ, చిట్లెఱిఁగినఁగార్యముతుది, నెట్లగునోయనుచునుండనింతటిలోన౯.'' భో. 3, ఆ. (చిటులుయొక్కరూపాంతరము.)

**చిట్లుకట్టియ.** ద్వ. విశే. మిక్కిలి కోపముగలవాఁడు.

**చిట్లుకట్టె.** ద్వ. విశే. చిట్లుకట్టియయొక్కరూపాంతరము.

**చిడిపి.** దే. విశే. 1. అల్పము; ''అంతధనంబునునట్టిరాజ్యముఙ్గొననగునయ్యయిచ్చిడిపికుజ్జికి.'' భార. ఆది. ౭, ఆ.—2. పరుషము. ''గీ. కొన్నిజేవ్రులుచిడిపిజాల్గొలికిబ్రదుకుఁ, గొన్నినునుసోఁగవెన్నెలక్రోలిపొదలు.'' నై. 3, ఆ. ''గీ. విశ్వరూపభవద్భూరివిభవమహిమ, నెంతవర్ణింపఁజాలుమాయామనంబు, ప్రాఁతపైచీరచెఱఁగునబడుగువాఁడు, హేమశైలంబుచిడిపిజాలెన్నిమడుచు.'' నై. ౮, ఆ.

**చిడిముడి.** దే. వి. తొట్రు. ''ద్వి. చిడిముడిఁదనపైఁటచేఁదడియొత్తి.'' సా. 3, భా.

**చిడిముడిపడు.** ద్వ. అ. క్రి. తొట్రుపడు. ''వ. అయ్యన్నయుందమ్ముండునువెఱఁగుపడియునుంజిడిముడిపడక.'' భార. ఆర. ౭, ఆ.

**చిడిముడిపాటు.** ద్వ. వి. చిడిముడిపడుట, తొట్రుపాటు. ''చిడిముడిపాటుపాదములఁజెందఁగ.'' ఉ, హరి. ౬, ఆ.

**చిడుగు.** దే. విశే. అల్పము. ''క. వెడబడుగుంజడదారుల, చిడుగుంబోడుములఁదిరుగఁజేయుటయరుదే.'' చంద్రా. 3, ఆ.

**చిడుగుడు.** దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. ఉప్పలపోటి.)

**చిడుము.** దే. వి. తీఁటకుఱుపు.

**చిత.** సం. వి. ఆ. స్త్రీ. 1. సొద; 2. ప్రోగు. విశే. 1. కప్పఁబడినది; 2. చేర్పఁబడినది.

**చితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సొద; 2. ప్రోగు.

**చితుకు.** దే. అ. క్రి. ఖుఱుపులోనగునవి నలఁగు.

**చిత్త.** వై. వి. చిత్రానక్షత్రము; ఒక కార్తెపేరు.

**చిత్తగించు.** వై. అ. క్రి. మనన్కరించు. ''గీ. ఓకుమారనీకునొకకథచెప్పెద, సర్వతత్వశాస్త్రసమ్మతంబు, సఖిలలోకసేవ్యమైనయర్థంబిది, వినుముచిత్తగించియనఘచరిత.'' వాసి. 3, ఆ.—స. క్రి. 1. తలఁచు; ''గీ. తండ్రినీవునాకుదయతోడనిచ్చిన, వరముచిత్తగించివలయుతెఱఁగు, నమయనముచితముగనమకట్టుమయ్యయీ, రాకుమారులవిధిఁబోకయుండ.'' భార. విరా. ౧, ఆ.—2. యోచించు. ''గీ. తల్లియైననేలతన్నుదునుతుఁడైన, నేలననుశపించునీవ్వృగాక్షి, యేనుగానునుతుఁడనీయమతల్లియుఁ, గాదుచిత్తగింపుకర్తసాక్షి.'' వి, పు. 3, ఆ.

**చిత్తడి.** ద్వ. వి. (చిత్త+తడి.) మిక్కిలితడి. ''క్రొంజెమటచిత్తడినంటి.'' భాను. ౪, ఆ.

**చిత్తము.** సం. వి. అ. న. మనసు, మానసము, మది.

**చిత్తర.** దే. వి. మత్స్యవిశేషము.

**చిత్తరువు.** వై. వి. 1. ఆశ్చర్యము; "తనతుక్కారంబులేజీఁ జివుక్కునదాఁటించి సుదించిచిత్తరువుబాగుల్మేఅనాడించె." కళా. ౫, ఆ.—2. పటమునందు రూపమువ్రాయుట; "క. కరువుసగండరువునఁజ, త్తరువుసనినచంద్రరుచులఁదారలరుచులన్, హారిహారవిధాతృలకుసే, హారిణముసరిరూపువడయనలవియెయింకన్." రా. అర, కాం. ౨, ఆ.—3. పటమునందువ్రాసినరూపము. "ఉ. జగతీవర చిత్రమపాంగదృష్టిచేఁ, దప్పకచూచిరాజసుతతానునుజిత్తరువయ్యెనత్తఱిన్." కవిక. 3, ఆ. (వృత్తియందుఁ గడపటివర్ణము వికల్పముగా లోపించును. చిత్తరుబొమ్మ మొ.)

**చిత్తడి.** ద్వ. వి. (చిత్త+తడి.) వర్షఋతువు.

**చిత్తిని.** వై. వి. స్త్రీజాతివిశేషము.

**చిత్తు.** ఉభ. దే. వి. 1. దిద్దిచక్కపఱపని మొదటవ్రాసినవ్రాఁత; 2. మొదట గుణించుకొనులెక్క. సం. త్. స్త్రీ. జ్ఞానము.

**చిత్య.** సం. వి. ఆ. స్త్రీ. శొాద. అ. న. ము. గోరీ.

**చిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. మాయ; 3. ఎలుకజీడి*; 4. గుమ్మడి*; 5. పిన్నపావర*; 6. బుడమ*. అ. న. ము. 1. ఆశ్చర్యము; 2. చిత్తరువు; 3. నానావర్ణము; 4. బొట్టు. విశ. 1. ఆశ్చర్యకరమైనది; 2. నానావర్ణములుగలది.

**చిత్రకంఠము.** సం. వి. అ. పుం. కపోతము, గువ్వ.

**చిత్రకము.** సం. వి. అ. న. బొట్టు. పుం. 1. చిఱుతపులి; 2. ఆముదపుచెట్టు; 3. గుమ్మడి*; 4. చిత్రమూలము.

**చిత్రకాయము.** సం. వి. అ. పుం. చిఱుతపులి.

**చిత్రకారుఁడు.** సం. వి. అ. పుం. చిత్తరువువ్రాయువాఁడు, ముచ్చి.

**చిత్రకుఁడు.** సం. వి. అ. పుం. ——పై.——

**చిత్రకృత్తు.** సం. వి. త్. పుం. తినాసము*.

**చిత్రగుప్తుఁడు.** సం. వి. అ. పుం. 1. యమునివద్ద లెక్కవ్రాయువాఁడు; 2. యముఁడు

**చిత్రతండుల.** సం. వి. ఆ. స్త్రీ. వాయువిడంగము*.

**చిత్రదండము.** సం. వి. అ. పుం. కంద*.

**చిత్రపక్షము.** సం. వి. అ. పుం. 1. కవ్వుజు; 2. నెమలి.

**చిత్రపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న*.

**చిత్రబింబము.** సం. వి. అ. పుం. కామరూపముగలతొండ, ఊసరవెల్లి.

**చిత్రభాను.** సం. వి. ఉ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**చిత్రభానువు.** సం. వి. ఉ. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు.

**చిత్రరథుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొక గంధర్వుఁడు; 2. ఒకానొక విద్యాధరుఁడు; 3. సూర్యుఁడు.

**చిత్రవాలము.** సం. వి. అ. పుం. పాలపిట్ట.

**చిత్రశిఖండిజుఁడు.** సం. వి. అ. పుం. బృహస్పతి.

**చిత్రశిఖండులు.** సం. వి. న్. పుం. మరీచ్యాదిసప్తమహర్షులు.

**చిత్రించు.** సం. న. క్రి. చిత్రమువ్రాయు.

**చిత్రిక.** దే. వి. త్రాను నునుపుపఱచెడు వడ్లవాని కొఱముట్టు, త్రోపుడు.

**చిత్రిణి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) చిత్తిని.

**చిత్రితము.** సం. విశ. (అ. ఆ. అ.) చిత్రింపఁబడినది.

**చిదక.** దే. విశ. చప్పట. (చిదకముక్కువాఁడు మొ.)

**చిదగొద.** దే. వి. భేదము, వ్యత్యాసము. "క. మొదలసపాయం బెన్నుట, పిదపనుపాయంబులెక్కపెట్టుటతగుసే, చిదగొదలఁ గాదెనున్నొకి, ముదికొక్కెరయనుఁగుసుతులముంగిసకిచ్చెన్." పంచ. వేం. ౧, ఆ.

**చిదియు.** దే. అ. క్రి. నలఁగు. "చిదియవుకొండపైఁబడిన." హరి. ఉ. ౫, ఆ. "వ. ముక్కులుచదిసియుఁజెక్కులుచిదిసియు." ఉ, హరి. 3, ఆ.

**చిదుకు.** దే. అ. క్రి. చిప్పిలు. "చ. పదములుకొంకువోఁబిసికి ప్రక్కలప్రుక్కడలించిదంశవం, శదమసవృత్తినింపాసఁగిసాస్ర నఖంబుల దుర్విసెత్తురుల్, చిదికెడుగంట్లభూరజముచిల్కముఖస్థతృణంబు ద్రోచియు, మ్మొదవుమృదుక్రియకానడపిముంగిటఁబం దిటెరాటఁగట్టుచున్." పాండు. ౫, ఆ.

**చిదుగు.** దే. వి. ఎండిన చిన్నపుల్ల, సమిధ.

**చిదుపు.** దే. ప్రే. చిదియఁజేయు.

**చిదుము.** దే. స. క్రి. 1. గిల్లు; "అదటునంజదిమినసెఱుంగక." స్వా. ౨, ఆ.—2. పువ్వులులోనగువానిఁగోయు; "వ. నాసికాతిలప్రసూనంబునఖశిఖరాగ్రంబునమొదలంటఁజిదిమితి." భీ. 3, ఆ.—3. త్రుంచు; "చ. కొన్నికంఠముల్, చిదుముదునేలరక్తపరిషిక్తముగాఁగరవాలలీలలన్." భార. సౌ. ౧, ఆ. "సీ. అధిపుమైముద్రింపనలయువేటొకరామతుదగోళ్లఁగుశములు చిదిమితెచ్చు." కవిక. ౬, ఆ.—4. వైచు. "క. మండూకమకరకచ్ఛప, గండూపదడుకుళిరకలహంసకకా, రండవబకములవెండిఁబ, సిండినిగావించి గంగఁజిదుముదురువ్రతుల్." సం. "అభ్యర్చ్యగంధకుసుమైఃగంగాయాంప్రక్షిపేద్వ్రతీ." కాశీ. ౫, ఆ.—వి. చిగురు. "సీ. చిదుముఁడీచిదుములుమదకోకిలాబలాప్రభునకుఁబల్లవపాణులార." చంద్ర.

**చిదురలు.** దే. వి. బ. 1. సూక్ష్మఖండములు; "సీ. జంభారిదోస్స్తంభదంభోళిహతిఁదూలిచెదరినతారాద్రిచిదురలనఁగ." (ఇందు విషయము తారకామండలము.) భాను. 3, ఆ.—2. సూక్ష్మభాగములు. "క. కళలుంగాష్ఠలుతోనుగఁ, గలచిదురలఁగూర్చుకొనుచుఁ గాలంబుజనం, బులవడ్డికిచ్చునాతని, వలెనలవడఁబొదివితనకు వశ్యులఁజేయున్." భార. శాం. ౪, ఆ. "గీ. అయ్యుధిష్ఠిరు రాజసూయంబుచిదుర, పాలుపోలదీమఖము:" (ఇక్కడ వృత్తియందేకవచనాంతము.) భార. అర. ౬, ఆ.

**చిదురుపలు.** దే. వి. బ.——పై.——"క. మదమునత్రుత్రోయువొక్కటఁ, బదునాలుగుతోమరములుపరఁగించినసే, ర్వొదవఁ గఁబవనజుఁడన్నిటిఁ, జిదురుపలుగఁజేసెఖడ్గచిత్రనిహతులన్." భార. భీష్మ. ౨, ఆ. (రూ. చిదుర్పలు. "చ. కొనకొనిరాజులేయుశరకోటిపరంపరఘట్టనంబులన్, దునుకలుప్రక్కలున్నొగిఁ జిదుర్పలుఁదుత్తుమురైపడంగ." భో. ౫, ఆ.)

**చిద్రుపలు.** దే. వి. బ. చిదురుపలుయొక్కరూపాంతరము. "చ. శరీరపుం, జిద్రుపలుసేరుఁదత్పతులచేతులఁగాకకులంబువాతులన్." ఉ, హరి. ౪, ఆ. (చూ. చిదురుపలు.)

**చిన.** దే. విశ. చిన్నయొక్కరూపాంతరము. "చినకత్తి." అచ్చ. యు, కాం.

**చిని.** దే. విశ. 1. చిన్న; 2. మనోజ్ఞము. (చిన్నియొక్కరూపాంతరము.)

**చినుఁగు.** దే. అ. క్రి వస్త్రాదికము ఛిన్నమగు. "చ. అనిపనజాక్షుఁడీకరణినానతియిచ్చినఁదత్కృపారసం, బనుపెనువాననుబ్బిన క్రియకౌరయమారఁగఁదత్ప్రదేశమున్, ధనువునవారియై నిగిడి దాని శరమ్ముకరమ్ముదాఁకినన్, దునుఁగుఁజినుంగుఁ ద్రిలుఁగడుఁదూలుజగజ్జనజన్మలక్ష్యముల్." పాండు. ౫, ఆ.

**చినుకు.** దే. అ. క్రి. కాఱు. "ఎ. గీ. వృష్ణివీరుఁడుడిదఁక్షునివిల్లు దునిమె, నర్ధచంద్రబాణంబుననఁడువేఱ, వింటనిశితక్షురప్రంబు వెలయఁదొడిగి, సినివరునినోరనెత్తురుచినుకనేసె." ఉ, హరి. ౪, ఆ.—అం, ప్రే. కార్చు, కురియు. "లలాటఫలకంబందందఘర్మాంబువుల్ చినుకన్." సావి. ౫, ఆ. "వ. మేఘంబులునెత్తురుసినికెడు." రా. యు, కాం.—వి. వర్షబిందువు. (రూ. చినుకు.)

**చినుకుఁబూస.** దే. వి. (చినుకు+పూస.) ముత్యము.

**చిన్న.** దే. విశే. 1. అల్పము; 2. కనిష్ఠము.

**చిన్నటనాడు.** దే. వి. (చిన్న+నాడు.) బాల్యసమయము.

**చిన్నది.** దే. వి. (చిన్న+అది.) బాలిక. విశే. చిన్నయైనది.

**చిన్ననాడు.** దే. వి. బాల్యసమయము.

**చిన్నము.** దే. వి. 1. నాలుగు గురిగింజలయెత్తు; "ఎ, గీ. చిన్ననాడుబ్రియునొకచిన్నమంత, మాటయాడినవినితాపమగ్నవగుదు." కళా. ౪, ఆ.—2. నాలుగుగురిగింజలయెత్తుగల బంగారునాణెము. "చ. మునిబుణమేగతిన్ మొదలుముట్టఁగఁదీర్చెదవొక్కచిన్నమున్, జనపతిచేతలేదుజలజాతదళేక్షణవిత్తమెవ్విధం, బునసమకూరెడిన్ మితికిబోంకఁగనేరఁడొకింతయైననీ, పెనిమిటియిట్టిశీలమ్మునఁబృథ్విఁజరింపఁగఁబోలదేరికిన్." హరిశ్చ. 3, ఆ.

**చిన్నరిపొన్నరి.** దే. విశే. చిన్నారిపొన్నారియొక్కరూపాంతరము.

**చిన్నతీకము.** దే. వి. చిన్నతనము.

**చిన్నవాఁడు.** దే. వి. బాలుఁడు. విశే. చిన్నయైనవాఁడు.

**చిన్నవోవు.** దే. అ. క్రి. (చిన్న+పోవు.) ఖిన్నుఁడగు. (ప్రే. చిన్నపుచ్చు.)

**చిన్నారి.** దే. విశే. మనోజ్ఞము. (చిన్నారిచిగురు, చిన్నారిజాబిల్లి, చిన్నారినూఁగారు, చిన్నారిమొగము మొ.)

**చిన్నారిపొన్నారి.** దే. విశే. మనోజ్ఞము. "సీ. చిన్నారిపొన్నారిచెక్కుటద్దములపైఁజిఱునవ్వుమొలకలు చెంగలింప." విక్ర. ౭, ఆ.

**చిన్ని.** దే. విశే. 1. చిన్న; 2. మనోజ్ఞము. "చిన్నిరామచంద్రునినగుమోముదామరసిరుల్ కనుపండువుగాఁజెలంగ." రాఘ. ౨, ఆ.

**చిన్నిదము.** దే. వి. 1. చిన్నపువ్వు; 2. బంగారు.

**చిన్నివువు.** దన్య. వి. 1. భూషావిశేషము; "రగడ. కుటిలాలకములమీఁదఁజిన్నిపువుఁగుస్తరించునచ్చుగమణికర్ణిక." కాశీ. ౬, ఆ.—2. బ. నమస్కృతి. (రూ. చిన్నిపువ్వు. నమస్కృతికి.—"రగడ. అష్టభుజస్థలినష్టభుజానకును, జిత్తమురంజిలఁజిన్నిపువ్వులని." హంస. ౪, ఆ.)

**చిన్నిపూఁతుక.** దన్య. వి.———పై.———

**చిన్నియ.** వై. వి. 1. గుఱుతు; (చూ. చిన్నె.) 2. విలాసము*. "చిలుకలకొల్కి-నీవెడఁగుఁ జిన్నియలెన్నఁగఁగ్రొత్తలు." నీలా. ౨, ఆ.

**చిన్నె.** వై. వి. చిన్నియయొక్కరూపాంతరము. (గుఱుతునకు.—"గీ. నలువకైనఁగన్గొనఁగరాకటక్కరి, వగుచుజోగితెగలయందెడాఁగి, కొలముగోనమువూపుగలుగకయుండుమనీ, కిట్టిరాచచిన్నెలేలయిపుడు." అచ్చ. యు, కాం.—విలాసమునకు.—"క. నెలబాలుఁజూపినునుగి, న్నెలఁబాలునునెయ్యసోకినెలఁతుకలాచి, న్నెలబాలకుఁద్రావించుచు, నెలమిం గ్రీడింపఁజేసి రింపలరారన్." రుక్మి. ౧, ఆ.)

**చిన్నెలాఁడి.** దన్య. విశే. (చిన్నెలు+ఆఁడి.) విలాసవతి.

**చిన్నెలాఁడు.** దన్య. విశే. (చిన్నెలు+ఆఁడు.) విలాసవంతుఁడు.

**చిపిటము.** సం. వి. అ. పుం. అడుకులు. విశే. చప్పటముక్కువాఁడు.

**చిప్ప.** దే. వి. 1. కప్పుచిప్ప; "ద్వి. చిప్పలుగుల్లలుఁజిక్కంగఁదన్ను, నిప్పుడఘూళిగానింకించువాఁడ." రా. యు, కాం.—2. కల్లు త్రాగెడుగిన్నె; "క. కనకపుఁ, జిప్పలనిండించి మదము చిప్పిలుచుండన్. ఉ. అందఱుఁగైకొనంబనిచియాదటఁగాంతయుఁదానునొక్కకో, రందనుపారదివ్యమదిరామధురామృతపానకేళియం, దందరయొనర్చఁగాఁదొడఁగె." లక్ష్మీ. 3, ఆ.—3. టెంకాయచిప్ప; 4. తామేటివీఁపుచిప్ప; "సీ. తలచూపలేకచిప్పలుపూని వంతలమెలఁగెడు తామేటిమేటినవ్వ." అచ్చ. బాల, కాం.—5. భూగోళమునందర్ధభాగము; "ద్వి. కనకమయాండమొక్కటిచేసిదానిఁ, బనిపూనియన్నిటిపైనిఁదేలించెఁ, బైచిప్పక్రిందిచిప్పయునొప్పమీఱ." విష్ణు. పు. 3, ఆ.—6. ముత్తెపుఁజిప్ప; "సీ. ఏకటికతులపాలిండ్లపైగంబూరనవహారములచిప్పకవుచుమాన్చు." అము. ౨, ఆ.—7. మోఁకాటిచిప్ప; 8. తునుక; "ద్వి. అప్పుడాకపిసేనయంగంబులెల్లఁ, జిప్పలుచిద్రుపలైచెదరంగఁజూచి." రా. యు, కాం.—9. తలపుఱ్ఱె; 10. చేపమీఁదిపొలుసు. "గీ. అడుగునడుగునఁబోడముచిహ్నంపుమీల, మేనిచిప్పలువోలెనానానిలింప, కనకకోటీరహీరాగ్రమర్దనమున, మెఱుఁగువచ్చినఖపఙ్క్తిమించువాని." పాండు. 3, ఆ.—విశే. అల్పము.

**చిప్పకత్తి.** దే. వి. చెట్లుమొదలైనవిఁగఁఆకెడు మోటకత్తి.

**చిప్పకసవు.** దన్య. వి. భూస్తృణము. (ఇట్లు చిప్పగడ్డి.)

**చిప్పకూఁకటి.** దన్య. వి. పిల్లజుట్టు.

**చిప్పగొడ్డలి.** దన్య. వి. చెట్లునఱకెడుగొడ్డలి. "సీ. కుండపోఁగులు చిప్పగొడ్డండ్లుసెలగోలలొప్పారుపలువంకయుంగరములు." నీలా. 3, ఆ.

**చిప్పపెడక.** దే. వి. ఇంటిపార్శ్వముల కప్పు.

**చిప్పము.** దే. వి. పెద్దమూట.

**చిప్పముత్తెము.** దన్య. వి. కృత్రిమమౌక్తికము.

**చిప్పమూతి.** దే. వి. కళాహీనమగు ముఖము.

**చిప్పిల్లు.** దే. అ. క్రి. నీటిబొట్టురూపనగునవి లోపలనుండి పైకుబుకు. "క. అప్పుడుపదిపదియమ్ములఁ, దప్పకయాదవులబ్రహ్మదత్తకుమారుల్, నొప్పింపరుధిరధారలు, చిప్పిల్లనివారులేరుసేనలలోనన్." ఉ, హరి. ౪, ఆ. (రూ. చిప్పిలు.)

**చిప్పవాఁడు.** దే. వి. కుత్రపువాఁడు.

**చిబుకము.** సం. వి. అ. న. గడ్డము. (రూ. చీబుకము.)

**చిబుకు.** దే. స. క్రి. చప్పరించు. "సీ. కోమలతరపదాంగుష్ఠంబుచిబుకుచునెడనెడనవ్వుచునేడ్చుచుండు." జై. ౭, ఆ.

**చిమచిమ.** దే. వి. గాయపుమంటయందగుననుకరణము. "సీ. మొనవంటమొనసినొక్కినొక్కు-చేఁగెంపుటధరంబు చిమచిమయనీనయట్లు." అని. ౨, ఆ.

**చిమటు.** దే. వి. చిమ్మటయొక్కరూపాంతరము.

**చిమిడికి.** దే. వి. చిముడిననన్నము.

**చిముటాలు.** దే. వి. బ. క్షౌరమప్పుడు తిండిసముతో వెంట్రుక లూడఁదీయుట.

**చిముటు.** దే. స. క్రి. సైఁగకు కన్నుమూసితెఱచు.

**చిముడు.** దే. అ. క్రి. 1. అన్నముపాకముమీఱనడికెముద్దయగు; 2. పాకముచెడు.

**చిముడుచు.** దే. ప్రే. చిముడఁజేయు. "అజాండమంతయుఁ జిమిడిచెదన్." రామా. ౭, ఆ. (రూ. చిముడ్చు.)

**చిమ్మ.** దే. వి. జలకణసమూహము. "మ. అనిసంజత్తముజల్లసత్ శారుగునయ్యంభోజపత్త్రాక్షిలో, చనగోళంబులఁజిమ్మలైచిలుపలై జాలైతరంగంబులై, చనుదోయింగొనబౌకురంగమదచర్చల్ జాఱి పోనొక్కయొ, డ్డునబాష్పంబుఝరంబులుప్పతిలెబోటుంబా టుగానెంతయున్." సావి. 3, ఆ.

**చిమ్మచీఁకటి.** దే. వి. గాఢాంధకారము, అంధతమసము. "ద్వి. వివరింపుమిదెప్రొద్దువేగుజామయ్యెఁ, గవిసినచిమ్మచీఁకటివెల్లఁ బాఱె." హరిశ్చ. ౨, భా.

**చిమ్మట.** దే. వి. ఈలపురుగు, ఝిల్లిక.

**చిమ్మదిరుగు.** దే. అ. క్రి. గిరగిరఁదిరుగు. "ఎ, గీ. చిమ్మదిరుగుచు నిలువకశిరమువ్రాల." భాగ. ౧౦, స్కం. పూ.

**చిమ్మనగ్రోవి.** దే. వి. (చిమ్మనము+గ్రోవి.) జలక్రీడయందు నీళ్లుచిమ్మెడుగొట్టము, శృంగము.

**చిమ్మనము.** దే. వి. చిమ్ముట. "గీ. చారుతరనాభియనెడుగంభీర సరసిఁ, గడఁగిక్రీడించుమరునిశృంగారరసపుఁ, జిమ్మనపుఁగ్రోవి దారనాఁజెన్నుమీఱుఁ, బడఁతినూగారుకన్నులపండువగుచు." ప్రభా. ౨, ఆ. (దీనికి వ్యస్తప్రయోగము కనఁబడలేదు.)

**చిమ్నీ.** ఆం. వి. పొగగూడు, పొగగొట్టము.

**చిమ్మిరేఁగు.** దే. అ. క్రి. మిక్కిలి విజృంభించు. "వ. ఇత్తెఱంగునసుగ్రీవుండు మూర్ఛిల్లిననుల్లంబులఖేదక్రోధంబులు క్రమ్మం జిమ్మిరేఁగి. క. గజగవయగవాక్షాదులు, గజిబిజియదలుపులుపెలఁగఁగదిసీగురుగిరి, వ్రజములుగురియఁగఁగనుఁగొని, రజనీచరరాజు రౌద్రరసవివశుండై." రామా. ౭, ఆ.

**చిమ్మిలి.** దే. వి. నువ్వులును, బెల్లమును కొట్టిచేసెడియుండ.

**చిమ్ము.** దే. స. క్రి. 1. మీటు; 2. వైచు. వి. 1. పొడుచుట; "సీ. క్రొవ్వాఁడికొమ్ములకొనలచిమ్మునవలాహకసమూహమువకావకలుగాఁగ" అని. ౪, ఆ.—2. వైచుట. "మరుచేచిగురాకడిదమ్ము చిమ్ములన్ దావడఁకెంబురూరవుఁడు." భాగ. ౯, స్కం.

**చిమ్ముడు.** దే. వి. చిమ్ముట, విక్షేపము.

**చిమ్ముబిల్లలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. చీఁకటిమొటికిళ్లుచిమ్ముబిల్లలునెట్లు బొట్టనగోలలుబొమ్మరాలు." వి, పు. ౭, ఆ.

**చిమ్ములాట.** దే. వి. చిమ్ములాడుట, ఒకరిమీఁదనొకరు చిమ్ముకొనుట.

**చిమ్ములాడు.** దే. స. క్రి. (చిమ్ములు+ఆడు.) ఒకరిమీఁదనొకరు చిమ్ముకొను.

**చియ్య.** దే. వి. కండ.

**చిరంటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఐదువరాలు; 2. జవరాలు.

**చిరంతనము.** సం. విణ. (అ. ఆ. అ.) బహుదినములది, ప్రాఁతది.

**చిరక్రియుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తామసించి కార్యము చేయువాఁడు.

**చిరజీవి.** సం. వి. న్. పుం. 1. కాకి; 2. విష్ణువు. విణ. చిరకాలము జీవించువాఁడు.

**చిరత్నము.** సం. విణ. (అ. ఆ. అ.) చిరంతనము.

**చిరమర.** దే. వి. భేదము. "చెలిమివేర్పాటనుచిరమరలకుఁజోరక." భార. శాం. ౧, ఆ.

**చిరము.** సం. అవ్య. బహుకాలము.

**చిరరాత్రము.** సం. వి. అ. న. 1. రాత్రులసమూహము; 2. పెక్కురాత్రులు.

**చిరాకు.** దే. వి. కోపము. "పంచచామరము. పరాకురాకురాకమంచుఁబారసీకభూపతుల్, చిరాకుమీఱదట్టమైనసింగిణీలకోరులన్, జిరాగుజాలనేసిడాసిచిల్లుపొల్లుచేయుచున్, నిరాకరించిమించి వచ్చునేర్పుచూచితేనృపా." కృష్ణ. 3, ఆ.

**చిరాయువు.** సం. వి. స్. న. బూరుగుచెట్టు. పుం. వేలుపు.

**చిరి.** సం. వి. ఇ. పుం. చిలుక.

**చిరిక.** సం. వి. ఆ. స్త్రీ. పురాతనమలము.

**చిరిపి.** దే. వి. తైలమార్జకము.

**చిరిబిల్వము.** సం. వి. అ. పుం. కానుగుచెట్టు.

**చిరిమిడి.** దే. వి. భక్ష్యవిశేషము. "వ. వడలామవడలొబ్బట్లు సారెసత్తులుసేవెలుఁజిరిమిళ్లు." హంస. ౧, ఆ.

**చిరుఁగు.** దే. అ. క్రి. చినుఁగు. "గీ. నరపతులకీర్తిపటములుచిరుఁగకుండ." ఉ, హరి. ౪, ఆ. "ఉ. అంధకవైరినాయెడదయాగుణసంపదగల్గెనేనినీ, స్కంధమునందనాయొడలిచర్మముపాయకయుండుఁగాకదు, ర్గంధములేకకర్కశముగాకచిరుంగకవెండికొండపైఁ, గంధరఖండమున్నయొసకంబుననీవరమేవరించెదన్." కాశీ. ౬, ఆ.

**చిరుక.** సం. వి. ఆ. స్త్రీ. ఈలపురుగు, చిమ్మట.

**చిరుగడము.** దే. వి. తియ్యకందచెట్టు. (చూ. చిరువడము.)

**చిరుగుడు.** దే. వి. వ్యాధివిశేషము, ఎజ్జిపులుము.

**చిరుతలుకవియు.** దే. అ. క్రి. మిఱుమిట్లుగొను. "ద్వి. కుహనావటునిఁగనుఁగొనిసభాసదులు, కనుఁగవల్ చిరుతలుగవియఁగఁ దిరుగ." భాగ. ౭, స్కం. (ఇట్లు చిరుతలుక్రమ్ము, చిరుతలువాఱు.)

**చిరునామ.** వై. వి. జాబులమీఁదను, లెక్కలమీఁదను వ్రాయువ్రాఁత.

**చిరువడము.** దే. వి. చిరుగడముయొక్క రూపాంతరము. "క, అరుదుగనపుడొక్కొకయెడ, మరకతమణిపాత్రగగనమండలమయ్యెన్, జిరువడములపాకముకళ, ధరుఁడయ్యెంజుక్కలయ్యెద్రాక్షఫలంబుల్." నై. ౬, ఆ.

**చిర్నవ్వు.** ద్వ. వి. చిఱునవ్వుయొక్క రూపాంతరము.

**చిర్భటము.** సం. వి. అ. పుం. నక్కదోసచెట్టు.

**చిఱచిఱ.** దే. వి. కోపవికారము.

**చిఱచిఱలాడు.** దే. అ. క్రి. (చిఱచిఱలు+ఆడు.) మండిపడు.

**చిఱి.** వై. వి. చిట్టియొక్క రూపాంతరము.

**చిఱు.** వై. విశే. వృత్తియందు చిఱుత శబ్దమునకు సంధివశమున లో పింపఁగా మిగిలినరూపము. (ఉదా. చిఱుగజ్జె, చిఱుగెంపు, చిఱుచెమట, చిఱుచెయ్యి, చిఱుచేఁప, చిఱుదోఁట, చిఱుపొక్కు మొ.)

**చిఱుగాలి.** దృ. వి. (చిఱుత+గాలి.) మందమారుతము. "ఎ, గీ. కరఁగఁదేలుచుఁబూఁదీఁగఁదగులువడుచు, వచ్చుచిఱుగాలిఁజొక్కున కిచ్చమెచ్చి." భార. అను. ౧, ఆ.

**చిఱుగూబ.** వై. వి. (చిఱుత+గూబ.) పైడికంటి.

**చిఱుత.** వై. వి. 1. చిన్నపులి; 2. సాముచేసెడువారు త్రిప్పెడు చిన్నకోల*. విశే. చిన్న*. "క. వినిభీష్ముఁడనియెఁ జిట్లని యానతియియ్యఁదగునెయమ్మెయినాప, ల్కినఁపలుక్కులుమతిసాతౌ, ల్పినవ్రతమునఁజెఱుపనంతచిఱుతనెచెప్పుమా." భార. ఆది. ౪, ఆ. "గీ. చిఱుతవానికింతగఱువతనంబిది, నన్నెవృద్ధజనములున్న చోట." సం. "యద్యపీషిసభామధ్యే బాలస్థవిరభాషితమ్."భార. సభా. ౨, ఆ. (తఱుచుగా వృత్తియందు అంత్యవర్ణమునకు లోపము. చూ. చిఱు.)

**చిఱుతనగోఁడు.** దృ. వి. (చిఱుత+కోఁడు.) బాలక్రీడావిశేషము. "సీ. చిఱుతనగోఁడాడవిఱుతురుపెల్లనగజదంతిమొకవ్రేలఁ గరమువట్టి." చమ. ౩, ఆ.

**చిఱుతనబిల్లలు.** దృ. వి. బ. (చిఱుత+బిల్లలు.) బాలికాక్రీడావిశేషము. "ఎ, గీ. పేర్మిఁజెలఁగేఁగిచిఱుతనబిల్లలాడు." రుక్మి. ౧, ఆ.

**చిఱుతుక.** వై. విశే. (చిఱుత+ఉక.) చిన్నవయసుగలది*. (ఆఁడుది.)

**చిఱుతేకు.** దృ. వి. (చిఱుత+తేఁకు.) భార్గీ*.

**చిఱుదిండి.** దృ. వి. (చిఱుత+తిండి.) భక్ష్యము. "సీ. చిఱుదిండితనవారిమొఱఁగి యాహారించు నతివసూకరజాతియందుఁ బుట్టు." కాశీ. ౨, ఆ.

**చిఱుదొడ.** దృ. వి. (చిఱుత+తొడ.) పిక్క, జంఘ. (చూ. ఒక్క-అ.)

**చిఱునవ్వు.** దృ. వి. (చిఱుత+నవ్వు.) స్మితము.

**చిఱునాలుక.** దృ. వి. (చిఱుత+నాలుక.) వ్యాధివిశేషము, గళశుండిక.

**చిఱుపాల.** దృ. వి. (చిఱుత+పాల.) క్షీరావి*.

**చిఱుపులి.** దృ. వి. (చిఱుత+పులి.) చిత్రకము.

**చిఱుబంతిపసుపు.** వై. వి. (చిఱుత+బంతిపసుపు.) పూసికొనుపసుపు. "సీ. సిద్ధవాహినినీటఁజిఱుబంతిపసుపాడి క్రీడికాలాక్షిక్షైనేయఁదోఁడఁగె." భీ. ౨, ఆ. "క. అంతటఁగనుపట్టెనుభా, స్వంతుఁడుచరమాద్రిమీఁదవారుణదిక్పీ, మంతినిజఫాలకేళికిఁజిఱు, బంతిపసుపుముద్దనన్నెపైనిడుభంగిన్." జై. ౨, ఆ. (ఇది బంతిపసుపనియుండవచ్చుననితోఁచుచున్నదిగాని దొరకిన యీ రెండు ప్రయోగములయందును చిఱుశబ్దపూర్వకముగానే కానఁబడుచున్నది.)

**చిఱుబొద్ది.** దృ. వి. (చిఱుత+బొద్ది.) పాఠ*.

**చిఱుము.** దే. అ. క్రి. విజృంభించు. "ద్వి. చిఱిమివసిష్ఠకాశికులకోపొగ్నె, లఱుకలోకంబులాపాలికిఁగొనుచు." హరిశ్చ. ౧, భా.—స. క్రి. చిమ్ము. "మందరమంగుటంబునన్ జిఱిముదునే." రా. అర, కాం. ౨, ఆ.

**చిఱువడ్లు.** దృ. వి. బ. (చిఱుత+వడ్లు.) ధాన్యవిశేషము, అణువు.

**చిఱువాలు.** వై. వి. (చిఱుత+వాలు.) ఇత్తడిగాఁజేసినవాలు, ఉపవాలు. "చం. చేమఱు. కృ—నిఁయుఁజిఱువాలుకెల్లుపక నాహింపచిమఁజెఁచినన్." శుక. ౧, ఆ.

**చిఱువేరు.** దృ. వి. (చిఱుత+వేరు.) పెద్దవేరుయొక్క ఉపయుక్తమైన యొకసన్నవేరు.

**చిఱుసెనగలు.** దృ. వి. బ. (చిఱుత+సెనగలు.) చిన్నజాతి సెనగలు, మసూరము.

**చిట్టి.** తే. వి. 1. కోపము; 2. చింపిరి. (చిత్తభ.)

**చిట్టచిట్టి.** తే. వి. సంభ్రమము. "ద. చిట్టచిట్టనఁబాముదేనుభ్రలవేఱువేఁబంబిలుచువారును." కా. పు. ౭, ఆ.

**చిట్టలువోఁడుచు.** తే. అ. క్రి. (చిట్టలు+పొడుచు.) సంభ్రమించు. "వ. పసులువెసఁదరిగిమున్న విద్విచ్చుంఁడుఁజిచ్చిన జాడఁగ్రైకానిద తీణదిశకుఁజిట్టలుపొడుచుచుఁదెరలంబాఱిన." భార. విరా. ౪, ఆ.

**చిట్టి.** వై. వి. ఒకదినుసుకూరాకు, తంటుబీయము.

**చిట్టిపట్టె.** దృ. వి. బాలక్రీడావిశేషము.

**చిట్టు.** దే. వి. కోపము.

**చిట్టుద్ది.** దృ. వి. (చిఱుత+ఉద్ది.) చిన్నయుద్ది. "వ. అని యిట్లు పలికితానునుబలభద్రుండునుబెన్నద్దులయియితరవల్లవులెల్లనద్దిఁచుకొనిచిట్టుద్దులైవచ్చిసమయంబున." భాగ. ౧౦, పూ.

**చిట్టుమను.** దే. అ. క్రి. (చిట్టు+అను.) 1. కోపించు; 2. బుసకొట్టు. "సీ. పాఠలూనిమేతొలుపులఁజిట్టుమనిపెఱకొలుపుచురెండునాల్కలుదలిర్ప." అచ్చ. బాల, కాం.

**చిట్టుముట్టాడు.** దే. అ. క్రి. (చిట్టుముట్టు+ఆడు.) పెనఁగులాడు. "అదరికోర్కులుచిట్టుముట్టాడ." భార. విరా. ౨, ఆ. "వ. మసరుకవిసినవనలులాయఁబులపోలికంజిట్టుముట్టాడుచు." భో. ౫, ఆ.—స. క్రి. భేదించు. "వ. త్రైశ్లీడిమొలలంగశారమ్ములువెఱికి త్రెలుగనఱికి పగలంజిట్టుముట్టాడుసహజపాపములను." ఉ, హరి. ౪, ఆ. "ద్వి. చేకొనిశవములఁజిట్టుముట్టాడు, కాకఘూకానేకకంకగృధ్రములు." రా. యు, కాం.

**చిలచిల.** దే. వి. వట్టుటయందగుననుకరణము. "క. విరులఁ జిగుర్లనుజొరుప్రగ, సిరిగందపుటనకొంకింతచిలచిలమనిపే, గిరమ వఱువట్లుగొనఁగఁదుఁ, బొరలెడితరలాక్షితొపముంగనికలఁకన్." కళా. ౬, ఆ.

**చిలవ.** దే. వి. నీరుకోడి.

**చిలికించు.** దే. స. క్రి. చల్లు.

**చిలిచిమము.** సం. వి. అ. పుం. కిన్క-నకనమనందుండెడి తేలువంటిచేఁప, తేలుమీను.

**చిలిపి.** దే. విశే. 1. అల్పము; "మ. నరుఁడత్తాపముఁజేరికోల్తొగిచి వింతల్ నీళరీరంబునన్, దిరుగంబుట్టులువెల్లెనర్పములువర్తింపనా దరుల్ జానుకున్, దృఢదేశంబు లఁబు ల్లెగొండ్లకణువ్రాతంబు వర్తింపన్, కరయన్ వానములేకయీచిలిపి మత్తాకేమిప్రాపయ్యెదున్." వై. ౮, ఆ.—2. నిక్పష్టము. "సీ. కల్పవృక్షములిందుఁగలఙుపీరుహములుపెద్దలింగమలిటఁజిలిపి జాలు." రుక్మాం. ౫, ఆ. (చిడిపియొక్కరూపాంతరము.)

**చిలిమిడి.** దే. వి. అశోకము*.

**చిలివిలిపోవు.** దే. అ. క్రి. (చిలివిలి+పోవు.) సందడించు. "చిలివిలిపోవ్వకోరికలుచిత్తములందలలెత్తి." వి. క్రి. ౪, ఆ.

**చిలుక.** వై. వి. శుకము. (చూ. తేఁటి.)

**చిలుకకూర.** వై. వి. హిలమోచికీ.

**చిలుకకొయ్య.** ద్వి. వి. వస్త్రములుమొదలైనవి యుంచుటకుఁగాను గోడయందుకొట్టిన చిలుకవంటియాకారముగలకొయ్య, నాగదంతకము.

**చిలుకడ.** ద్వి. వి. (చిలుకు+కడ.) పగ్గములోనగువాని కొనను వేసెడి కొలికిముడి.

**చిలుకతాళి.** ద్వి. వి. మీఁద నిరుప్రక్కల చిలుకరూపేర్పఱచిన పతకము.

**చిలుకత్తు.** ద్వి. వి. (చిలుకు+అత్తు.) కవచవిశేషము.

**చిలుకముక్కు.** ద్వి. వి. శుకనాసికీ.

**చిలుకయారె.** వై. వి. (చిలుక+ఆరె.) ఒకదినుసు మాదిగసూది.

**చిలుకరవుతు.** వై. వి. మన్మథుఁడు.

**చిలుకరించు.** దే. స. క్రి. చిలికించు. (ఒకానొకఁడు చిలుకరింపు అని కృదంతముగా ప్రయోగించియున్నాఁడు.)

**చిలుకలకొలికి.** ద్వి. వి. చిలుకకొలికివంటికొలుకులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**చిలుకు.** దే. అ. క్రి. 1. చిందు; "క. ఆత్మానందరసంబొకకణ, మైనఁజిలుకనీక." భార. శాం. ౬, ఆ.—2. ప్రసరించు; "సీ. చిలికినచోనెల్లసిరి వెలయించు నీయవనీశుదరహాసమమృతనిధియొ." హంస. 3, ఆ.—3. మీఱు. "చేఁదుమ్రింగెదవంచుఁజిలికినవ్వేఘృతాచి." స్వా. 3, ఆ.—స. క్రి. 1. చల్లు; "చ. శరజ్జలజాక్షికుండమం, డలిసలిలంబు కల్మషమడంగమొగిల్విరియొండగాఁచుచోఁ, జిలుకునిశారజఃపటలిచెన్నువహించె." ఆము. ౫, ఆ.—2. త్రచ్చు. వి. 1. కొలికి; "సీ. శిథిలత్వమొందినచెంగావిజడముడిచిలు కూడినెలపువ్వుచెంపవట్ట." పాండు. ౫, ఆ.—2. గొండ్లెము; 3. బాణము; "సింగిణినొకదొడ్డచిలుకుఁగూర్చి." అచ్చ. కిష్కిం, కాం.—4. బాణముయొక్కయలుఁగు. "సీ. కలికి పెన్నెరులింద్రశిలలయందమఁజూపుఁజూపుక్రొన్నవిల్తుతూపు చిలుకు." వసు. ౪, ఆ.

**చిలుకుడు.** దే. వి. చిలుకుట.

**చిలుగు.** దే. వి. దీర్ఘయష్టికీ.

**చిలుప.** దే. వి. కొంచెముగఁజేరినిలిచినసెల్లు. (చూ. చిమ్మ.) విశ. అల్పము. "ద్వి. చిలుపచెమ్మటలుక్రొంజెక్కులమించ." విష్ణు. పూ. ౧, ఆ. (ఇది ద్రవవస్తువునకే విశేషణముగాఁ గానఁబడుచున్నది. అప్పుడు చిలుపని అని రూపము. "ఎ, గీ. చిలుపచిలుపనినేతులజిడ్డుదేఱు." స్వా. ౪, ఆ.)

**చిలుము.** దే. వి. 1. రాగిలోనగు లోహములయందుఁగల ముఱికి; 2. విషము.

**చిలుమువాలు.** ద్వి. విశ. తులువ, కుత్సితుఁడు.

**చిలువ.** దే. వి. (చిలుము+వా.) పాము, విషధరము.

**చిలువతాలుపు.** దే. వి. శివుఁడు. "దళవాయియైకొల్చుఁజిలువతాల్పు." అచ్చ. సుం, కాం.

**చిలువతిండి.** దే. వి. 1. గరుత్మంతుఁడు; "ఎ, గీ. చిలువతిండిపులుమాయిపైమెలఁగువాఁడు." ఉ, రా. ౫, ఆ.—2. నెమలి. "చిలువతిండులకుఁజెచ్చెరనాటతెమిమీఱె." అచ్చ. కిష్కిం, కాం.

**చిలువఱేఁడు.** దే. వి. సర్పరాజు, శేషుఁడు.

**చిలువాయనము.** దే. విశ. చిల్లర, క్షుద్రము. "సీ. చిలువాయనపు వేల్పుఁగొలముఁగొల్వకవాసుదేవునారాధించుతెలివియొకటి." పాండు. ౨, ఆ.

**చిలువాలు.** దే. వి. (చిఱువాలుయొక్కరూపాంతరము.) ఇవురఁగాఁచినపాలు, ఆనవాలు. "ద్వి. ఫలవిశేషంబులుపాయసాన్నములు, చిలువాలువెన్నలుజీనిచక్కెరలు." రా. బాల, కాం.

**చిల్ల.** యు. దే. వి. కతకముకీ. వై. శల్యము. "క. వినుచిల్లయిడినయాయుధ, మునువిషలిప్తమగుశస్త్రమునునెట్టియుని, త్రుని పైనైఁ బ్రయోగించిననరపతినరకమునవసించునృపాలా." భార. శాం. ౨, ఆ.

**చిల్లకోల.** ద్వి. వి. తోమరము.

**చిల్లగొండి.** దే. విశ. కలహకారి.

**చిల్లపెంకు.** దే. వి. (చిల్లర+పెంకు.) పగిలినకుండయొక్క చిన్న పెంకు.

**చిల్లపెంచు.** దే. వి. (చిల్లర+పెంచు.)——వై.——

**చిల్లమడ్డి.** ద్వి. వి. అఁదుగు బంకతోఁజేసిన ధూపద్రవ్యము.

**చిల్లము.** ఉభ. దే. వి. హుక్కాకునిప్పుపెట్టుకొనెడుపాత్రము. సం. అ. పుం. 1. చీపరపిట్ట; 2. తడికన్ను. విశ. తడికంటిది. (రూ. చుల్లము.)

**చిల్లర.** దే. వి. 1. చింతపండుమిరపకాయలులోనగుసరకు. "సీ. మదహస్తిగనిగిత్తబెదరిచిల్లరగోనెఁబడవైచికదలునప్పంటిగోఁడు." రా, ని. ౨, ఆ.—2. కొంచెపాటినాణెము. విశ. సామాన్యము. (చిల్లరవేల్పులు.)

**చిల్లరకాఁడు.** దే. విశ. సామాన్యుఁడు.

**చిల్లాడము.** దే. వి. ఆయుధవిశేషము. (రూ. చిల్లాణము.)

**చిల్లాభుఁడు.** సం. వి. అ. పుం. బందిపోటుదొంగ.

**చిల్లి.** ఉభ. దే. వి. తూఁటు. సం. ఈ. స్త్రీ. చిట్టికూర.

**చిల్లింగి.** దే. వి. మూలికచేతఁజేసెడి యుచ్చాటనాదిక్రియ, కార్మణము.

**చిల్లు.** దే. వి. చిమ్ముటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "వ. చంద్రశాలాఖేలనాలోలనాళీకలోచనాలోచనంబుల మరీచివీచికల పెల్లు చిల్లునంజిమ్మనగ్రోవులఁజిమ్ముగంధసారకస్తూరికానీరధారాప్రసారంబులతెఱంగెఱింగింప." కళా. ౨, ఆ. (ఆమ్రేడితమందు చిల్లుచిల్లు. "వ. చిల్లుచిల్లునవెల్లు." కళా. ౭, ఆ.)

**చిల్లుపొల్లు.** దే. వి. సంక్షోభము. (చూ. చిరాకు.)

**చిల్లులువోవు.** దే. అ. క్రి. (చిల్లులు+పోవు.) తూంట్లుపడు. "పటురోమతాడనకజిరిఁగియజాండకర్పరముచిల్లులువోవఁగ." లక్ష్మి. 3, ఆ.

**చిల్లోటి.** దే. వి. ఒకదినుసు డాలువాటు.

**చివఁగి.** దే. వి. చివ్వఁగియొక్కరూపాంతరము. (చూ. చివ్వఁగి.)

**చివక.** దే. వి. సన్నని చిన్ననిడుపాటికొమ్మ.

**చివచివ.** దే. వి. గమనాదులయందగునసుకరణము. "వడిఁజివచివకారెండడుగులెదురేగి." కళా. ౭, ఆ. "చివచివడానివిల్లు రఘుశేఖరుఁడెత్తికదల్చి." రామా. ౪, ఆ.

**చివర.** దే. వి. కొన, అగ్రము.

**చివికివెలను.** దే. వి. కాకజంఘకి.

**చివుక.** దే. వి. కాలురూపాయ.

**చివుకపిట్ట.** వై. వి. ఒకదినుసుగబ్బిలము, జరుక

**చివుకపిల్లి.** వై. వి. ఒకదినుసు మార్జాలము.

**చివుకు.** దే. అ. క్రి. 1. తడియుటచే సారహీనమగు; "సీ. నీటి లోఁజివుకకనిలిచిక్రమ్మరుపూన్కి కరిసకర్పరముచుక్కానుబెగుళ్ళ." పాండు. ౨, ఆ.—2. సారహీనమగు. "చివికినవిల్లుత్రుంచుట యుఁజేడియనోంచుటయుఁ." అచ్చ. యు, కాం.—వి. ఎగయుట లోనగువానియందగుననుకరణము. (చివుక్కుయొక్క రూపాంతరము.) "ద్వి. చివుకునమింటికెగయునిప్పులకుప్పలు." నిష్క. ప్ర. ౨, ఆ.—విశే. సారములేనిది. "గీ. తొలుపలుకువాడువం బులవలఁతిచివుకు, విల్లుతునిమితిసని చాలవిజ్జువీఁగు, చున్నవాఁ డవు." అచ్చ. బాల, కాం.

**చివుక్కు.** దే. వి. దాఁటుటలోనగువానియందగుననుకరణము. "చివుక్కునదాఁటించి." కళా. ౫, ఆ. "చివుక్కునసెక్కి." ఉ, రా. ౭, ఆ. "చివుక్కునన్నెగసి." చంద్రా. ౨, ఆ.

**చివుక్కురుమను.** దే. అ. క్రి. (చివుక్కురు+అను.) (తన్నెవ రేని యొకమాటచెప్పినను మర్మము బయలుపడినను) మనసుకలఁగు. (మర్మము బయలుపడెనని మనసుకలఁగుటకు.—"క. అనవినిమనసు చివుక్కురు, మనఁగఁబ్రభావతివివర్ణమగువదనముతోఁ, గనుపట్టుడు నింతనెముగి, సెనెకార్యంబేల యింత చింతిలననుచుఁ." ప్రభా. 3, ఆ. చూ. చెయువు.)

**చివురు.** దే. వి. చిగురుయొక్కరూపాంతరము. "గీ. చివురుసవురు జవురునువిదమోవి." విజ. ౧, ఆ.

**చివ్వ.** దే. వి. 1. కలహము; "ఉ. ఎవ్వఁడురోరితానునొకయెక్కుడు వీరుఁడపోలెరాత్రిమైఁ, జివ్వకువచ్చిముచ్చిమిగఁజేరినవాఁడు." ఉ, హరి. 3, ఆ.—2. సన్ననిచిన్ననిడుపాటికొమ్మ; "చిగురుం జివ్వలుజిహ్వలైతనర." పర. ౨, ఆ.—3. బ. బాణపునంచువగ. (చూ. చంద్రజ్యోతి.)

**చివ్వఁగి.** దే. వి. సివంగి. (తఱుచుగా వ్రాఁతప్రతులయందు ఇట్లు పరుషాదిగానేకానఁబడుచున్నది.)

**చివ్వలాఁడి.** దే. విశే. (చివ్వలు+ఆఁడి.) కలహశీలురాలు. "గీ. తగవుచెప్పంగనిన్నుఁబ్రార్థనయొనర్చి, యెవ్వరిచటికిఁదెచ్చి రోచివ్వలాఁడి." హరిశ్చ. ౪, ఆ.

**చివ్వు.** దే. స. క్రి. చెక్కు. "ఉ. తోరపుమోటకత్తులవెదుళ్లనవ గ్రముగాఁగఁగొట్టినే, ర్పారఁగఁజివ్వి." పర. ౧, ఆ.

**చివ్వున.** దే. ద్ర. క్రి. విశే. శీఘ్రముగ. "చివ్వునఁజేరుదము." భార. వా. ౧, ఆ.

**చిహ్నము.** సం. వి. అ. న. 1. గుఱుతు; 2. తెక్కెము.

## చీ.

**చీ.** దే. అవ్య. ధిగర్థకము. "అవిముక్తమహిమెల్లఁజీయనంగ." ఉ, హరి. 3, ఆ.

**చీఁకటి.** దే. వి. (చీఁకు+కట్టు.) అంధకారము. (నీవు చీఁకటితో లేచిరమ్ము—ఇక్కడ చీఁకటితోననఁగా తెల్లగా తెల్లవాఱకముందని యర్థము.)

**చీఁకటిగాము.** ద్వి. వి. రాహువు.

**చీఁకటిగొంగ.** దే. వి. సూర్యుఁడు.

**చీఁకటిచెట్టు.** దే. వి. తమాలము.

**చీఁకటితప్పు.** దే. వి. జారత్వము. "సీ. చీఁకటితప్పుచేసినసరో రుహనేత్ర, గూబయైవసియించుఁగాక." కాశి. ౨, ఆ.

**చీఁకటిమొటికిల్లు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. చీఁ కటిమొటికిల్లు చిమ్ముబిల్లలు సెట్టుబొమ్మరిల్లు బొమ్మరాలు." ... పు. ౭, ఆ.

**చీఁకటియాఁగి.** దే. వి. (చీఁకటి+ఆఁగి.) చిచ్చుదోమ.

**చీఁకిలి.** దే వి. చీఁపురుఁగట్ట, సమ్మార్జని.

**చీఁకు.** దే. స. క్రి. 1. చప్పరించు; "సీ. ...జీకలేఁపనుఁ దదియుట్టఁజీఁకెకములుపచ్చికీఁసములు." ఆము. ౬, ఆ.—2. చుం బించు. "పెదవులు చీఁకుచుఁ." నా. సు, కాం.

**చీఁకు.** దే. వి. గ్రుడ్డితనము, అంధత్వము. (ఈ యర్థముననిట్లు దీనిని సబిందుకముగాఁజెప్పుట చీఁకటిశబ్దమునకు వ్యుత్పత్తిని కల్పిం చుటకు అనుకూలముగానున్నది. ఇట్లు చెప్పుటచే ప్రయోగములకు విరోధము కనఁబడదు.) విశే. అంధుఁడు. (ఇట్లు చీఁకుకొక్కెర, చీఁకురించు, చీఁకువాలు అను నీపదములను సబిందువులుగా గ్రహింపవలెను.)

**చీఁద.** వై. వి. చిందపక్షి. "గీ. చీఁదమొదలుగాఁగఁబాదివేఁటుకు మీఁలు, పిట్టలెల్లగూండ్ల బిట్టుచెలఁగు." య. ౧, ఆ.

**చీఁదఱ.** యు. దే. వి. ఉపద్రవము. "మ. ఎలదేఁటుల్ తమచాలుఁ గన్నవలపైనిందీవరభ్రాంతిచే, మెలఁగం జేరలఁగప్పుకోనలవిగామిం జీఁదఱంజెందియు, చ్చలఁగాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుషత్వంబుల, య్యలిభీతిఁ ముకుళీకృతాక్షియగుసత్యాకాంత నీక్షించుచుఁ." పా. ౪, ఆ.—వై. తూఁటు.

**చీఁదఱగొను.** యు. దే. అ. క్రి. (చీఁదఱ+కొను.) 1. ఉప ద్రవపడు; 2. ఆవేశమెత్తు. "సీ. చీఁదఱగొనిపాఱుచోఁదరు శ్రేణులుదుర్వాతహతిఁబోలెఁదుమురుగాఁగ." భో. ౬, ఆ.—ద్వి. తూఁటువోవు. "గీ. చెవులుచీఁదఱగొనంగ, బిట్టుమొరసెదువస త్రాగినట్టు." నీలా. 3, ఆ.

**చీఁదఱరేఁగు.** దే. అ. క్రి. ఆవేశమెత్తు. "ఉ. చీఁదఱరేఁగినట్లు రిపుసేనలనెల్లనుముట్టి రోఁకటఁ, మోఁదుచు." హరి. ఉ. ౧, ఆ.

**చీఁదఱలువోవు.** ద్వి. అ. క్రి. (చీఁదఱలు+పోవు.) తూఁటు వోవు. "శ్రుతిపుటములుచీఁదఱలువోవ." భో. ౬, ఆ.

**చీఁదు.** దే. స. క్రి. (చీమిడిబయలుపుచ్చుచు ముక్కుని ఊపిరివెలి కిరా) మొదటిరెండువ్రేళ్లతో ముక్కునదుము.

**చీఁపురు.** దే. వి. చీఁపురుఁగట్ట, సమ్మార్జని.

**చీకాకు.** దే. వి. (చీకు+ఆకు.) 1. చివికిన ఆకు; 2. శ్రమము, నలఁకువ. "క. వేల్పులు, చీకాకునఁబడిరికలఁగి శ్రీహరిదక్కన్." భాగ. ౮, స్కం. విశే. శ్రమమునొందినది, నలఁగినది. "క. ఈశరణింబడిమొగముల, రాకాసియొనర్చినట్టిరాయిడిచేతం, జీకా కగుచునువేలుపు, లాకజిదేవరకునొడువ నరుగుచునెదుటన్." యయా. ౨, ఆ.

**చీకాకుపడు.** ద్వి. అ. క్రి. 1. బలహీనమగు; 2. శ్రమపడు.

**చీకిరేను.** దే వి. ఒకానొకచెట్టు.

**చీకిలించు.** దే. అ. క్రి. మిఱుమిట్లుగొను. "సీ. చీకిలించుక యుండుఁ అగురుతెప్పలలోనఁగునుమసాయకవైరినొసలికన్ను." కాశి. 3, ఆ.

**చీకిలిమాకిలి.** దే. విశే. కొక్కిరిబిక్కిరి. "క. సెలవుూదాలుపు మసపూ, జలుమెచ్చునెయనిమదిఁ బ్రచారింపకుచీ, కిలిమాకిలిగా సల్లిన, చెలఁడిసెరల్ నా చెసంతసించుటలేదే." సా. ౧, ఆ.

**చీకు.** దే. విశే. 1. అంధము, అంధుఁడు; "కన్నులుచీకులై." భార. శల్య. ౧, ఆ. "చీకునకత్యసుపమసుమాపవస్యనమును." భార. సభా. ౨, ఆ.—2. నిస్సారము. "గీ. పార్వతీవిభుండు పాఱవైచినచీకు, విల్లువిఱిచివిఱ్ఱవీఁగఁదగునె." అధ్యా. బాల, కాం. (ఈ యర్థమునందిది చివ్వకుయొక్క రూపాంతరము.)

**చీకుకొక్కెర.** దప. వి. కోయష్టికము.

**చీకురించు.** దే. అ. క్రి. అంధమగు. "సీ. పంకేరుహంబులు బాగుగావికసించెఘూకముల్కన్నులుచీకురించె." సురా.

**చీకురువాయి.** దే. వి. ఒకదినుసుగబ్బిలము, జతుక.

**చీకువాలు.** దే. వి. చీఁకటి. "క. భూపాలకపరమేశ్వరు, కోపానలకీలలంటికొనికమలినలం, కాపతికీర్తియొకోయని, చూపింపఁగఁ జీకువాలురోదసినిండెన్." రా. యు, కాం.

**చీకొట్టు.** దే. స. క్రి. చీచీయను, ధిక్కరించు.

**చీటకము.** వై. వి. చిట్టకముయొక్క రూపాంతరము. (లీలకు.— "గీ. హస్తములరెంటనందంద నదిమియదిమి, తొటిపండారగించెడు చీటకమున, సత్యయంబునబ్రహ్మాండమాస్వదించు, భైరవుండిచ్చుఁ గాతశోభనముమనకు." కాశీ. ౫, ఆ.)

**చీటి.** దే. వి. 1. ఖండపత్రిక; "సీ. కుంతలస్థలికినేగుఁగరిస్థునిచీటి కమసేయకేతకీగర్భదళము." వసు. ౧, ఆ. "సీ. చెక్కుచెమ్మట చేలచెఱఁగునఁదుడుచుట చెలిమికినదితుదిచీటియేమొ." ఉ, రా. ౬, ఆ.— 2. పత్రిక. "వ. అనినవచ్చానచెచ్చెరనచ్చీటివిచ్చి పుచ్చుకొని నెచ్చెలికిచ్చినవదియిట్లనిచదువందొడంగె." రసి. ౫, ఆ.

**చీటికిమాటికి.** దే. ద్ర. మాటిమాటికి. "ఉ. చీటికిమాటికిందెసలు చిల్లులువోవఁగఁజేసె హేషలన్." కాశీ. ౪, ఆ.

**చీడ.** దే. వి. సస్యాదులను చెఱిచెడి యొకానొకపురుగు. "ఎ, గీ. అఖిలతృణలతాతరునిచయంబుఁజీడ, వట్టె." హరి. పూ. ౭, ఆ.

**చీడు.** దే. వి. పుంజేముతక్కువయగువార. (వార=ఎనిమిదిపుంజెములనూలు.)

**చీడుదబ్బ.** దే. వి. నూలిచీడుతగిలించుటకు వెదురుబ్రద్దలతో గుమ్మటమువలెఁ గట్టఁబడిన సాలెవాని సాధనము. (చూ. ఊడిత.)

**చీనము.** సం. వి. అ. స. బంగారు. పుం. 1. ముప్పదియంగుళములపొడవుగలిగిగువ్వవన్నెగలిగినజింక; 2. ధాన్యవిశేషము; 3. నూలు; 4. వస్త్రవిశేషము; 5. గుజ్జుపుపల్లమునకుక్రిందవేసెడు మెత్త. (అని యొకఁడు.) 6. ఒకానొకదేశము.

**చీపర.** దే. వి. పక్షివిశేషము, అతాయి.

**చీపు.** దే వి. అరఁటిగెలయందలి యొకభాగము.

**చీమ.** దే. వి. పిపీలిక.

**చీమిడి.** దే. వి. నాసామలము, శింఘాణము.

**చీము.** దే. వి. చెడితెల్లనైననెత్తురు, పూయము.

**చీముంత.** దే. వి. చెంబు.

**చీర.** వై. వి. వస్త్రము*. "రజకుఁబోరిగొనికొనియెఁజీరలు." హరి. ఉ. ౫, ఆ. (ఇది వాడుకయందే స్త్రీవస్త్రమాత్రపర్యాయముగా గానఁబడుచున్నది.)

**చీరచింపు.** దప. వి. మత్స్యవిశేషము.

**చీరణము.** దే. వి. చిన్నయులి.

**చీరపిట్ట.** వై. వి. చీరపేను.

**చీరపేను.** దప. వి. గుడ్డసంటుకొనియుండు తెల్లనిపేను, ఖేసకము.

**చీరపోతు.** దప. వి.———సై.———

**చీరము.** సం. వి. అ. న. 1. కౌపీనము; నారచీర. (అనికొందఱు.) వస్త్రవిశేషము. (అనికొందఱు.) 2. రేఖ; 3. జిలుగువ్రాఁత; 4. నలువదిపూసలు గ్రుచ్చినసరము.

**చీరి.** ఉభ. దే. వి. లక్ష్యము. "కొసందుద్రుపదాత్మజుఁడగ్గురుఁబోరఁజీరికిన్." భార. ద్రో. 3, ఆ. "ఉ. దారుణదైత్యసాయకవితాన విజృంభణమాత్తలోపలన్, జీరికినైనఁగైకొనక." హరి. ఉ. ౪, ఆ. (షష్ఠ్యంతముగానే యిది ప్రయోగములందుఁ గానఁబడుచున్నది.)—సం. ఈ. స్త్రీ. ఈలపురుగు.

**చీరిక.** దే. వి. చీలిక.

**చీరు.** దే. స. క్రి. 1. చీలుచు; "ఉ. ఘోరగదావిదారణవిఘూర్ణితశాత్రవకుంభికుంభముల్, చీరుచు." భార. అర. ౬, ఆ.— 2. పిలుచు. "శా. ఈరూపంబున సంస్తుతిందొలఁగిమీరేచింత లంజెంతలం, జీరంగోరక." ఉ, హరి. ౪, ఆ.

**చీరుక.** సం. వి. ఆ. స్త్రీ. ఈలపురుగు, ఝిల్లి.

**చీరుడు.** దే. వి. 1. చీల్చుట; 2. పిలుపు.

**చీర్ణము.** దే. వి. చీరణముయొక్క రూపాంతరము.

**చీఱు.** దే. స. క్రి. 1. గీఱు; 2. చీల్చు. (ఇట్లు అలఘురేఫముగా ఒకానొకఁడు వ్రాసియున్నాఁడుగాని దానికి ప్రయోగము దొరకినదికాదు.)

**చీఱుడు.** దే. వి. చీల్చుట, విదారణము.

**చీల.** దే. వి. మేకు, కీలము:

**చీలమండ.** దే. వి. కాలిమడమల కిరుప్రక్కలనుండు కీలు, గుల్ఫము.

**చీలి.** దే. వి. పిల్లి, మార్జాలము.

**చీలిక.** దే. వి. పాయ, బ్రద్ద.

**చీలు.** దే. అ. క్రి. విదారితమగు.

**చీలుచు.** దే. ప్రే. చీలఁజేయు, విదారించు. (రూ. చీల్చు.)

**చీవరము.** సం. వి. అ. న. భిక్షుకునివస్త్రము.

**చీవాట్లు.** దే. వి. బ. గద్దింపుమాటలు.

## చు.

**చుంబకము.** సం. వి. అ. పుం. 1. త్రాసుముల్లు; 2. సూదంటుఱాయి.

**చుంబకుఁడు.** సం. వి. అ. పుం. 1. పెక్కుగ్రంథములయందు ఇంచుకించుక చదివినవాఁడు; 2. ముద్దుపెట్టుకొనువాఁడు; 3. మోసకాఁడు.

**చుంబనము.** సం. వి. అ. న. ముద్దు.

**చుంబించు.** సం. స. క్రి. ముద్దుపెట్టుకొను.

**చుక్రము.** సం. వి. అ. న. చింతపండు. పుం. 1. పులుసు; 2. పుల్లప్రబ్బ*.

**చుక్రిక.** సం. వి. ఆ. స్త్రీ. పులిచింతకూర.

**చుచుందరి.** సం. వి. ఈ. స్త్రీ. చుంచెలుక. (రూ. చుందరి.)

**చుబుకము.** సం. వి. అ. న. చిబుకము, గడ్డము.

**చులుకము.** సం. వి. అ. పుం. 1. చేర; 2. పుడిసిలి; 3. ముంత; 4. చిఱుతపులి.

**చుల్లి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రొయ్యి; 2. పొర.

## చూ.

**చూచుకము.** సం. వి. అ. పుం, న. స్తనాగ్రము, అంచె.

**చూడ.** సం. వి. ఆ. స్త్రీ. 1. నెమలిజుట్టు; 2. జుట్టు; 3. చూరు; 4. బావులపురి.

**చూడామణి.** సం. వి. ఇ. పుం. 1. అలంకారార్థము తలయందుంచుకొనెడు రత్నము; 2. గురిగింజ.

**చూడాల.** సం. వి. ఆ. స్త్రీ. వట్రువముస్తెకూర.

**చూడాలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) జుట్టుగలవాఁడు.

**చూతము.** సం. వి. అ. పుం. ఆమ్రము, మామిడికూర.

**చూర్ణకము.** సం. వి. అ. పుం. పేలపిండి.

**చూర్ణకుంతలము.** సం. వి. అ. పుం. అలకము, నెఱికురులు.

**చూర్ణము.** సం. వి. అ. న. గందవొడి. పుం, న. సున్నము. పుం. 1. దుమ్ము; 2. పొడి.

**చూర్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. గద్యభేదము; 2. గ్రంథభేదము.

**చూలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పిల్లజుట్టు; 2. ఏనుఁగుచెవిమొదలు; 3. నాటకాంగము.

**చూష.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగునడుమునఁగట్టెడు తోలుమోకు, దూష్య.

**చూషకము.** సం. వి. అ. పుం. నరిగాలి.

**చూషణము.** సం. వి. అ. న. పీల్చుట.

## చె.

**చె.** దే. విశే. వృత్తియందు చెన్నుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషము పరమగునపుడు నుమాగమము. ఉదా. చెంగావి మొ.)

**చెంక.** దే. వి. చెంప, కపోలము.

**చెంగఁగొట్టు.** దే. స. క్రి. (చెంగట+కొట్టు.) ఓడించు. "సింగంపుగుంపులఁజెంగఁగొట్టినవాఁడు."

**చెంగనాలు.** దే. వి. బ. 1. గంతులు; 2. నమస్కృతి.

**చెంగలి.** దే. వి. విశే. సమీపము, కుఱఁగలి.

**చెంగలించు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "చ. కనుఁగొని యద్భుతంబును వికాసము భక్తియుఁజెంగలింప." వి, పు. ౭, ఆ.—2. ప్రకాశించు; "వ. కుముదంబులుముదంబంద, లాంగలి చెంగలించె." కాశీ. 3, ఆ.—3. విజృంభించు; "ఎ, గీ. అంతఁ దనియకపుదిఁజాలనాగ్రహించి, మఱియుఁదక్కినయోధులమద మడంచి, పగటిసూర్యునిగతిఁబ్రతాపమునమించి, సింహనాదంబు గావించెఁజెంగలించి." జై. ౭, ఆ.—4. హసించు. "ఉ. విందు లవిందులంచుఁదనువేడుకనెత్తుకొనంగఁ బిల్వనిం, పొందఁగనేగి పైఁబడుచునుబ్బునఁగేరుచుఁజెంగలించుచుఁ, నందిలిపట్టియాడు మననాట్యములాడుచుముద్దులఁగొమహా, నందమొనర్చెబాలికదినంబునఁబుట్టపుఁబూవుఁబోండ్లకుఁ." కళా. ౬, ఆ.

**చెంగలింపు.** దే. వి. చెంగలించుట. (ఇట్లు కృదంతముగా నొకానొకఁడు ప్రయోగించినాఁడు. చూ. ఆరగింపు.)

**చెంగలువ.** ద్వి. వి. (చెన్ను+కలువ.) 1. ఎఱ్ఱకలువ, హల్లకము; 2. ప్రియముచే కుక్కకు ఇయ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**చెంగల్వకోష్టు.** వై. గ్రా. వి. పారిభాష్యముకూర.

**చెంగావి.** దే. వి. (చెన్ను+కావి.) మనోజ్ఞమైనయెఱుపు, (అనఁగా) ఎఱ్ఱదాళువర్ణము. (చెంగావిచీర మొ.)

**చెంచు.** దే. అ. క్రి. 1. తొలఁగు; "గీ. చక్రములుపొంగెదస్యసంచయమడంగఁ, దమముచెంగద్విజప్రతాపముచెలంగ, సరసులందెల్లఁగమలాతిశయమెసంగ, జగమువిందగునినుఁడుతేజమునఁబ్రబల." రసి. ౫, ఆ.—2. వెనుదీయు. "క. అంగజునిగెలిచె నొక్కఁడ, గాంగేయుఁడుతమకునలవిగాదనిమహిభృ, త్పుంగవులీవ్రతమోపక, చెంగిరిసీకలవియైనఁజేయుమునియతిక." జై. ౧, ఆ.—వి. 1. చెఱఁగు; 2. వాద్యవిశేషము. "వ. కొఱనెలతో నెదుకును దురులుగలచదురాంత్రుకొంద అంబుర్భుహకరంబులందంబుఅలుపీణెలుడక్కులుఁ బిల్లనగ్రోవులుఁ గిన్నెరలుఁ జెంగులు పాంగంబులుఁదాళంబులు మొదలగుజంత్రంబులుగొని." ఉ, రా. ౫, ఆ.

**చెంచెత.** వై. వి. శబరకాంత. (చూ. చెంచు.) ("క. మంచిఫలంబులుహరిచే, నించికరాలంబనములనెగడుచునిద్రక్రీ, డించెదరంగనచూడుము, చెంచితలకాబింఛపత్రచేలాంచితలఁ." భాగ. ౧౦, స్కం. పూ. ఈ ప్రయోగముచేత తవర్ణకంబు పరంబగునపుడు ఇకారంబును వచ్చుననితోఁచెడి.)

**చెంచేడము.** దే. వి. శ్యేనవిశేషము.

**చెంచేలి.** దే. వి. ఒకదినుసుకూరాకు, ఖుణుంజము.

**చెంచు.** వై. వి. శబరుఁడు. "గీ. చెంచునింటికిఁబోయిచెంచెతకుఁబ్రియము, చెప్పినమ్మించితలమీఁదఁజెయ్యిపెట్టి, వెఱకుమనితన్మఖంబుననెఱుకతేనిఁ, గాంచియాతనితోడసఖ్యంబుచేసి." కాశీ. ౫, ఆ.

**చెండాడు.** దే. స. క్రి. (చెండి+ఆడు.) ఖండించు. "ఉ. వేడుకఁజూడుమేనబటువిక్రమకౌతుకలీలఁజేర్చి చెం, డాడెదవైరులఁ." భార. కర్ణ. 3, ఆ. (చూ. ఊఁగాడు.)

**చెండు.** దే. స. క్రి. ఖండించు. "క. చండగతివీరరథికులఁ, జెండుచు." భార. ద్రో. ౨, ఆ.—వి. 1. కందుకము; 2. పూబంతి; 3. బాలక్రీడావిశేషము. (చూ. ఉప్పలపోటి.)

**చెండుదానిమ్మ.** ద్వి. వి. కాయలులేక పూవులుమాత్రము చెండువలెఁబూచెడి యొకదినుసుదానిమ్మకూర.

**చెండుబెండాడు.** దే. స. క్రి. (చెండుబెండు+ఆడు.) ఖండించు. "గీ. సర్వదివ్యాస్త్రదుర్వారసారయుతని, వాలకవచాదిరక్షోర్జితాళులరణ, విహరణోత్సాహదైవతవిమతసేన, పైనదరిచెండుబెండాడెఁబ్రభుయుతముగ." రాఘ. 3, ఆ. (ఒకానొకకవి చెండుబెండొనరించియని ప్రయోగించియున్నాఁడు.)

**చెంత.** దే. వి. చేరువ, సమీపము.

**చెందమ్మి.** దే. వి. (చెన్ను+తమ్మి.) ఎఱ్ఱతామర, కోకనదము.

**చెందిరము.** వై. వి. కుంకుమము, సిందూరము.

**చెందిరిక.** యు. దే. వి. కమ్మపైదుద్దు. "చ. గరువునకొత్తఁజెంగలువకచ్చుఘటించినమాళిఁజొట్టెఁజెం, దిరికతెఱంగునంబనిఁడిల్లఁగలు

నించినజిల్గుపాగ." సా. ౫, ఆ.—వై. 1. కుసుంభపుష్పము; 2. కుసుంభవర్ణము*. "చ. పడఁతియొకర్తుచెందిరికపావడఁబైతడి యొత్తివైవ." వసు. ౫, ఆ. (చూ. చెంద్రిక.)

**చెందు.** దే. అ. క్రి. కలుగు. "ఉ. మిత్రులచేఁతలన్ సుఖముమే కొనునంటయుఁజెందుదుఃఖముల్, శత్రులచెయ్ది సంటయును." భార. శాం. ౧, ఆ.—స. క్రి. పొందు.

**చెందుప్పు.** ద్వి. వి. (చెందు+ఉప్పు.) ఇందుప్పు, సైంధవము. "సీ. ఇందుబింబముఁజూచి చెందుప్పుగలుసావి యఱులెత్తినాకంగ నాసపడిన." కాశీ. 3, ఆ.

**చెందొవ.** దే. వి. (చెన్ను+తొవ.) ఎఱ్ఱగలువ, హల్లకము.

**చెంద్రము.** వై. వి. సిందూరము. "సీ. పొనఁగుచెంద్రపుబిళ్ల బొట్టువైఁగనుపట్టుతళుకుఁ గస్తురిరేఖశోలవుదలిపె." ఉ, రా. ౬, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. చెంద్రకావి మొ.)

**చెంద్రవంకలు.** వై. వి. బ. ధాన్యవిశేషము.

**చెంద్రిక.** యు. చెందిరికయొక్కరూపాంతరము. (కమ్మపైదుద్దునకు. — "ఉ. ఇంద్రజురాకదక్షజనకేర్పడఁగాశుభలేఖ వ్రాసివే, చెంద్రికచుట్టియందుపయిఁజెంద్రికవన్నియసాలుచుట్టిని, స్తంద్రతఁదానముద్రయిడిచారులచేఁబనిచెన్." విజ. 3, ఆ.—కుసుంభపుష్పమునకు.—"సీ. చికిలిపసిండివ్రాఁతనునఁజెంద్రికవన్నియమేలుకట్టునన్." వసు. ౬, ఆ.—కుసుంభవర్ణమునకు.—"చెంద్రిక పావడ." సా. ౫, ఆ.)

**చెంప.** దే. వి. 1. కపోలము; 2. పార్శ్వము. "సీ. ఆబోయవాఁడును నాపిల్లజట్టిగాఁగొనిపట్టుకొనిపోయికొండచెంపఁ, జంపువాఁడై." భో. ౪, ఆ.

**చెంపకల్లి.** దే. వి. స్త్రీభూషావిశేషము.

**చెంపకాయ.** దే. వి. చెంపదెబ్బ.

**చెంపకొప్పు.** దే. వి. ప్రక్కకొఱగించివేసినకొప్పు. "సీ. వలయితసుమదామవలయమధ్యంబునఁగుల్కుప్రాగ్దిశచెంపకొప్పునఁగ." భాను. 3, ఆ.

**చెంపసరులు.** ద్వి. వి. బ. స్త్రీభూషావిశేషము.

**చెంబు.** వై. వి. రాగిమొదలయినవానితోఁజేసిన చిన్న నోరుగల స్వల్పపాత్రము*.

**చెంబుతల.** ద్వి. వి. బట్టగట్టినతల. "ఎ, గీ. చెంబుతలవానినవటుకచంబువాని." ఆము. ౬, ఆ.

**చెకడా.** వై. వి. సరకులుతెచ్చెడు రెండెద్దులబండి*.

**చెకపికలాడు.** దే. స. క్రి. తొందరపెట్టు. "ఎ, గీ. చెండిచెకపికలాడమాయుండెనేని." సా. ౧, ఆ.

**చెకము.** దే. వి. వస్త్రముమొదటిబద్ద.

**చెకుముకి.** దే. వి. నిప్పుకలుగుటకై యొకదినుసుఱాతితోఁ దాఁకించెడియుక్కుతునుక. "సీ. వెలుఁగురాచలువకుప్పలపాలిచెకుముకివముదగ్రకాననసామిధేని." చంద్రా. ౨, ఆ.

**చెక్క.** వై. వి. మ్రానులోనగువాని పలుచనిఖండము.

**చెక్కకొణుజా.** ద్వి. వి. చెక్కపిడుఁజా.

**చెక్కచెట్టు.** ద్వి. వి. ఎఱ్ఱచాయవేయుటకుపయోగించెడు చెక్కగల యొకదినుసుచెట్టు.

**చెక్కడము.** దే. వి. (రత్నములను) పొదుఁగుట. "సీ. కటకంబుచేరి క్రీకటభర్త పనిచెక్కడపుచొక్కటపుమకుటంబుదాల్చె." పాంచా. ౧, ఆ.

**చెక్కతొపి.** వై. వి. బేలుదారిగోడమొదలగువానిమీఁదపూసినగారనుజాచి మట్టపఱచెడు పీఁపునపిడియమర్చిన గుండ్రనిదువుజేసెడు చిన్నపలక.

**చెక్కపిడుఁజా.** ద్వి. వి. పశువులమేనిరక్తముఁబీల్చెడి యొకదినుసు పిడుఁజు.

**చెక్కియము.** దే. వి. చెక్కెము.

**చెక్కిలి.** దే. వి. చెక్కు, కపోలము.

**చెక్కు.** యు. దే. స. క్రి. (రత్నములను) పొదుఁగు. వి. 1. చెక్కడము; "బంగరువుఁజెక్కులఁజెలంగుచవుకట్టులమెఱుంగు." రా, వి. ౨, ఆ.—2. చెక్కిలి. వై. స. క్రి. చెక్కలుచేయు.

**చెక్కు.** ఆం. వి. హుండీ.

**చెక్కుడుపాఱ.** ద్వి. వి. గడ్డిచెక్కెడుపాఱ.

**చెక్కెము.** దే. వి. ఎముకలయందుండునెయ్యి. "ఉ. కొంచకకాఁజుమీఁదనృపకుంజరుఁడేసినఁద్రాటబాణముం, టించినమాడ్కిఁజెంచడపుదేగవడింజనిగిట్టిపట్టిమేకన్, జించినఁగాలిమూలగయుఁజెక్కెముఁ జక్కెరనద్దియిచ్చియే, తెంచెనొకండు దాలవిటిదీటుచులావులు గూడదువ్వుచున్." చంద్రా. ౨, ఆ. (చెక్కియము యొక్కరూపాంతరము.)

**చెచ్చెర.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ. "చ. చెచ్చెరఁగొనిరమ్ము నీదయినశిల్పకళాకుశలత్వమేర్పడన్." భార. సభా. ౧, ఆ.

**చెట్ట.** వై. వి. 1. కీడు*; "పరమధర్మశీలపాంచాలికిఁజెట్టచేసిరి." భార. ఆశ్ర. ౧, ఆ.—2. చేయి*. "దేవునిచెట్టఁబట్టికొని." ఉ, హరి. ౬, ఆ.—విణ. దుష్టుఁడు*. "మనమెంతచెట్టలమొ." భార. ద్రో. ౫, ఆ.

**చెట్టపట్టు.** ద్వి. స. క్రి. (చెట్ట+పట్టు.) పెండ్లియాడు. వి. పెండ్లి.

**చెట్టు.** దే. వి. 1. గుల్మము; 2. వృక్షము.

**చెట్టుఁద్రిమ్మరి.** దే. వి. (చెట్టు+త్రిమ్మరి.) వానరము, వృక్షచరము. "క. అచ్చెట్టుంద్రిమ్మరి, మొనకాండ్రురుజాలవానమొగిఁగురియుటయున్." అచ్చ. యు, కాం.

**చెట్టుగట్టు.** దే. అ. క్రి. (చెట్టు+కట్టు.) చెట్టుగానేర్పడు. "తే. భక్తిసంయుక్తియనుపోఁత పాలనొయ్యఁ, జెట్టుగట్టుచుమునిశాఖనిట్టచూప." పాండు. 3, ఆ.

**చెట్టునట్టు.** దే. వి. వానరము. "గీ. చెట్టునట్టుమొనకాఁడువెండియునిట్టులనియె." అచ్చ. సుం, కాం.

**చెట్టుప.** దే. వి. తెక్క. "ఉ. కోమలతామ్రచూళికలక్రొవ్వెఱసంజకుఁబ్రోదివెట్టని, స్సీమకళోరతారరుతిఁజెట్టుపలార్చుచునట్టులెత్తివి, క్రామమపోలెఁగూసె విలసచ్చరమాచలకూటపక్కణ, గ్రామటికాకుటీరశిఖరంబులఁగుక్కుటచక్రవాళముల్." నై. ౭, ఆ.

**చెట్టుపడు.** ద్వి. అ. క్రి. స్తంభించు. "వ. అట్టిరట్టువినినప్పుడచెట్టువడిపుట్టినకోపంబుఁబట్టఁజాలక పాపపుణ్యంబులు కట్టిఁడిప్రజమీఁదంబెట్టిపట్టభద్రుండిట్టిబెట్టిదంపుంబనిచేసె." ఉ, రా. ౬, ఆ.

**చెడగరము.** దే. విణ. క్రూరము, క్రూరుఁడు. "మరుఁడుచెడగరమ్మనుమా." భద్రా. ౨, ఆ.

**చెడనాడు.** దే. స. క్రి. (చెడన్+ఆడు.) నిందించు. "ఉ. అవనజాక్షినిట్లుచెడనాడిననక్కటనోరునొవ్వదే." నిరవ. ౭, ఆ.

**చెడిప.** దే. వి. (చెడిన+అప.) అంకుటాలు, అనతి. "ఎ, గీ. చెడిపతోఁజాలఁబోరామిచేయఁజనదు." సం. "నచదుర్భగయా క్వాపినఘక్ష్వాంకురుతేనతీ." కాశి. ౩, ఆ.

**చెడు.** దే. అ. క్రి. 1. కనఁబడకపోవు; "వాఁడంతలోఁజచ్చెనోచెడెనోయెక్కడఁబోయెనో." ఉ, హరి. ౪, ఆ.—2. కొల్లపోవు; "చెడినసొమ్మెవ్వనిచేనుండువానిని." విజ్ఞా. ప్రా, కాం.—3. నశించు. "కడుఁగ్రొవ్వివేఁకువచెడియనీపాటుండు." భార. అర. ౪, ఆ.

**చెడుగఁడు.** దే. వి. (చెడుగు+అఁడు.) క్రూరుఁడు. "మ. అడవింగోల్పడుప్రాణియెయ్యదియు రేకాటోపమేపారన, చ్చెడు గండుగ్రతఁద్రద్విజంబుదెసపక్షశ్రీఘ్రంబయేతెంచె." హరి. పూ. ౭, ఆ.

**చెడుగు.** దే. వి. అశుభకార్యము. (పీఁడుమంచిచెడుగులకు ఒదవు వాఁడు.) విశే. 1. క్రూరము. "కడుంజెడుగీపాడపాఁపపురుషు." భార. అను. ౧, ఆ.—2. దుష్టురాలు. "క. అనిచెనకుచునది తనుడా, సినమునికోపించియోసిచెడుగవెఱపుమా, లినసుఁగదియఁగ వచ్చెదు, మునుకొనియీమందె మేలమునకోర్వఁజామీ." భో. ౪, ఆ.

**చెడ్డ.** వై. వి. కీడు*. (మంచిచెడ్డలు.) విశే. దుష్టము*. (చెడ్డపని.)

**చెడ్డి.** దే. వి. మోఁకాలివఱకుఁ దొడిగికొను గుడిగి.

**చెడ్డు.** దే. స. క్రి. తొడచఱచు.

**చెత్త.** దే. వి. తృణము.

**చెదరఁబడు.** ద్వి. అ. క్రి. (చెదరన్+పడు.) చెదరు. "ఉ. రాలినభూషణాలిచెదరంబడియున్నశతాంగకోట్లు." రా. యు, కాం.

**చెదరు.** దే. అ. క్రి. నీళ్లబొట్టులోనగునవి యెగిరిపడు. వి. 1. చెదరుట; 2. కలఁత. "క. అనిచెప్పుచునెటకేనియుఁ, జన నుద్యోగించురాజసత్తముఁగనియ, వ్వనితమదిఁజెదరుగదురన, తని కిట్లనుమోమునందుదైన్యముదోఁపన్." భో. ౭, ఆ. (ఇది యొకా నొకచో నుకారమధ్యమముగాఁ గానఁబడుచున్నది. చూ. అదురు.)

**చెదలు.** వై. వి. పుట్టపెట్టుచీమ*.

**చెదవట్టు.** ద్వి. అ. క్రి. (చెదలు+పట్టు.) చెదలుపట్టు. "చెద వట్టినభాగ్గవుడొక్కఁగాంచి." వా. 3, ఆ.

**చెదారము.** దే. వి. తృణలేశము. "ఎ, గీ. చెడ్డయింటి చెదారమై శివునికరుణ, నివ్వటిలునిరవ్వదేనేండ్లనిన్నుఁదలఁచి." కాశీ. ౪, ఆ.

**చెనఁగి.** దే. వి. చెన్నఁగియొక్క రూపాంతరము. (ధాన్యవిశేషము నకు.—"ఎ, గీ. తెల్లనల్లచెనంగులుఁదీవసరులు." హంస. ౪, ఆ.)

**చెనఁటి.** దే. విశే. 1. కుత్సితము; "గీ. హాహరిశ్చంద్రకనకపర్యంక తలము, నందుఁబొందునీయంగమేయకటచెనఁటి, నేలఁగూల్చెనే యదినేడునీచదైవము." మార్క. ౧, ఆ.—2. వ్యర్థము; "విప్ర వలిమాటలుంజెనఁటియయ్యెనె." భో. ౬, ఆ.—3. శూన్యము. "క. ఏనేయఁదొడఁగదొనలుచెనఁటులైయుండె." భార. మా. ౧, ఆ.

**చెనకు.** దే. స. క్రి. 1. ఎదిరించు; "గీ. నర్మవిలసితసృష్టిచేసలిన భవుఁడె, నకినయేనుండ." హన. ౧, ఆ.—2. తాఁకు. "సీ. గుజ్జు మామిడిబావగోరొత్త నీవు గాయనీచేతఁజెనకెగయ్యాళియొకతె." రామా. ౩, ఆ.—వి. 1. ఎదిరించుట; "క. మననేనపేర్చిపెల్లా, ర్చినఁజూచిఘటోత్కచుండుచెలఁగిచెనకుఁజే, కొనియిదిమాయ ఘటింపఁగ, ననురూపంబైనవేళయనితలఁచివెనన్." (చెనకుఁజేకొని మాయఘటింపఁగ నిదియనురూపంబైన వేళయనియన్వయము. చెన కుఁజేకొని = ఎదిరించియనియర్థము.) భార. భీష్మ. ౩, ఆ.—2. తాఁకుట; "గీ. దినదినంబునుగనికాటుఁజెనకువలన, దప్పిదీఱని తమకంబు." పాండు. 3, ఆ.—3. (గోటి) నొక్కు. "సీ. ఏవన్నెకానికీలావణ్యవతిగోటి చెనకులుకళలూరఁజేయునొక్కొ." ఉ, రా. ౪, ఆ.

**చెనయు.** దే. స. క్రి. 1. ఎదిరించు; "ఎ, గీ. నీపీటికి సధికరక్ష, చేసియేఁజాయకుండెదఁజెనసియొందు, నెంతబలియుండునిన్ను జయింపలేఁడు." హరి. ఉ. ౭, ఆ. "వానినాహవమునశూలికైనఁ జెనయశక్యము." నిర్వ. ౩, ఆ.—2. తాఁకు; 3. రోలు. చీఁకటి నూతులఁజెనయునేత్రంబులు." భాగ. ౧౦, స్కం. పూ.

**చెనుపరి.** దే. విశే. గ్రామ్యము. (మాట.) "సీ. చెదరినకేశముల్ చెనుపరిమాటలువికృతస్వరంబును వెలయఁగలిగి." రా. బాల, కాం.

**చెన్నఁగి.** దే. వి. 1. పొట్టిలెంకాయచెట్టు, అఖండుకము; 2. బ. ధాన్యవిశేషము. "గీ. గన్నెరులు నేన్గకొమ్ములుచెన్నఁగులును." వేం.

**చెన్నఁటి.** దే. విశే. చెనఁటియొక్క రూపాంతరము. (కుత్సితము నకు.— "ఈచెన్నఁటిపాఁపపుర్వొకటిచేయఁగనోపెనె." హరి. పూ. ౭, ఆ.)

**చెన్నఁటిపోవు.** దే. అ. క్రి. (చెన్నఁటి+పోవు.) వ్యర్థమగు. "రణప్రయత్నవిధిచెన్నఁటిపోవునె." హరి. ఉ. ౧౦, ఆ.

**చెన్నచెర్ల.** దే. వి. లాంగలి*.

**చెన్నచెఱకు.** దే. వి. అగ్నిశిఖ*.

**చెన్ను.** దే. వి. 1. అందము; "మ. కలయంగూర్చిఁజెమర్చునంగ ములలగ్నంబైనసన్నంపుమం, జులకోశేయమునందుమించుకమల స్తోమంబుచేఁ జూచెనో, క్కలతొతన్వెచెలంగిపొంగుమదికాంక్షల్ దీరమేనెల్లఁగ, న్నులుగావించికుమారుజవ్వనము చెన్నంజూచుచం దంబునన్." స్వా. ౫, ఆ.—2. విధము. "వ. జీవనంబులువిడిచి విమలజ్ఞానవశంబునముక్తులగు పురుషరత్నంబులచెన్నునఁజెన్ను వదలిమిన్నువిడిచివాయువశంబులై వెలివిరిసిచనుమేఘంబులును." భాగ. ౧౦, స్కం. పూ. (వృత్తియందు దీనికి ఎఱుపు అర్థము. చూ. చె.)

**చెన్నుఁడు.** దే. విశే. అందకాఁడు.

**చెప్పు.** దే. స. క్రి. వచించు. (దీనికిఁ ప్రార్థనాద్యర్థమునందు ద్విత్వము వికల్పముగ లోపించును. చెపుము, చెపుఁడులోనగు నవి.) వి. పాదరక్ష.

**చెప్పుడుమాట.** దే. వి. ఒకరు చెప్పినట్టిమాట.

**చెప్పుతట్టు.** దే. వి. గోధాపది*.

**చెమట.** దే. వి. స్వేదము.

**చెమటకాయ.** దే. వి. ఎండవేఁడిమిచేత దేహమునందుఁగలిగెడు చిన్నగుల్ల.

**చెమటగొట్టు.** దే. విశే. చెమటపట్టినవాఁడు.

**చెమటపట్టు.** దే. అ. క్రి. చెమటపోయు.

**చెమటపోయు.** దే. అ. క్రి. చెమటగలసియగు.

**చెమరించు.** దే. అ. క్రి. చెమటపోయు. "క. కమలోదరారుణ ములై, నమగుల్ఫములైమృదుత్వసంయుక్తములై, విమలారుణనఖర ములై, చెమరింపనియడుగులొసఁగుసిరిమనుజాలకున్." కాశీ. ౪, ఆ. "కుచద్వయంబునర్తింపలలాటరేఖచెమరింపఁగ." పా. ౩, ఆ.

**చెమరు.** దే. వి. 1. చెమట; "క. తాడిన దేండమున సేనపడి యుండెమరుకా." పాండు. ౫, ఆ.—2. చెమరుంగాకి. "చెవ్రల పోసెదుఁయ్యెఁజెమరుడావెసఁజూపె." ఉ, గా. ౬, ఆ.

**చెమరుఁబోతు.** దే. విఁ. మిక్కిలి చెమటగలవాఁడు.

**చెమరుచు.** దే. అ. క్రి. 1. చెమటపోయు; 2. చెమ్మగిల్లు. (చూ. చెమర్చు, చెమటపోయుటకు. — "గంద్రాప్తయైనఁజెమర్చునింపికకటా." ఉ, హరి. ౨, ఆ.)

**చెమికలు.** దే. వి. బ. నేయునప్పుడు పేకనూలు అదికేసు నూలిపుసికలు. "ఎ, గీ. గంపడొల్లకళాసంబుకడురుచెమిక, నూలు." హంస. ౨, ఆ. (ఇక్కడ వృత్తియందేకవచనాంతము.)

**చెముడు.** వై. వి. సింహాసనము*. (వావిళ్లకయందు నరళాదిగా నుండినను ఇట్లు పరుషాదిగా కొన్ని పుస్తకములయందు వ్రాయఁబడియున్నది.)

**చెమ్మ.** దే. వి. విః. తడి.

**చెమ్మగిల్లు.** దే. అ. క్రి. తడిగలదియగు.

**చెమ్మట.** దే. వి. చెమటయొక్క రూపాంతరము. "ఒదవ్రఁజెమ్మటఁ జత్తంబుచెదరి." శ్రీరా. విరా. ౨, ఆ.

**చెమ్మయొలుకు.** దే. అ. క్రి. (చెమ్మ+ఒలుకు.) చెమ్మగిల్లు. "క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండముచెమ్మయొలికెకూష్మ ర్కవిభా, రహితతగాటుకవక్సైన, రహిచెడియనసంధతమసరాసులు జెరసెణ." పాన్థ. 3, ఆ.

**చెమ్మరించు.** దే. అ. క్రి. చెమరించుయొక్క రూపాంతరము. "కనుపాద్యంతముఁజెమ్మరింప." ఉ, రా. 3, ఆ.

**చెయి.** వై. వి. 1. హస్తము; 2. తొండము*; "క. తేరులఁజెయిగలమెకములు." అచ్చ. యు, కాం.—3. రెండుమూరలకొలఁది*. (చెయియొక్క రూపాంతరము.)

**చెయిదము.** వై. వి. పని, కృత్యము, చేష్ట. "క. మునియేమిసేయు రుక్షిణిఁ, గొనఁగారణమేమిమిథూర్తగోపాలుఁడుచే, సినచెయిదమేమి చెప్పదు, మనమెరియదప్రాణ మైనమ గఁడిట్లయినకా." పా. ౧, ఆ.

**చెయిది.** వై. వి.——పై.——(చూ. చెయ్ది.)

**చెయువు.** వై. వి.——పై.——"క. కళలంటికి రఁచితనచెయు, వులఁజొక్కెడుతపసిమదిచివుక్కురుమనఁగా, నలకూబరనిడుమిడు రా, యలసితివనిపలికెమన్మథాలివిశతణ." కళా. 3, ఆ.

**చెయువులసాకిరి.** వై. వి. సూర్యుఁడు, కర్మసాక్షి. "క. చెయువులసాకిరికజ్జఁడు." అచ్చ. యు, కాం.

**చెయ్దము.** వై. వి. చెయిదముయొక్క రూపాంతరము. "శా. ఈరంగంబునవారుమీఘనెదుర్నైయేమేనిఁజెయ్దంబుపైఁ, జేరంజూతురు." హరి. పూ. ౯, ఆ.

**చెయ్ది.** వై. వి. చెయిదియొక్క రూపాంతరము. "ఉ. రాజసె, న్నాలతనంబునొందెఁగొఱమాలినదైవముచెయ్దినక్కటా." మార్క. ౧, ఆ.

**చెయ్యి.** వై. వి. చెయియొక్క రూపాంతరము. (తొండమునకు.)— "క. చెయ్యిగలమెకపుదారుల." అచ్చ. బాల, కాం.

**చెయ్వు.** వై. వి. చెయువుయొక్క రూపాంతరము. "ఎలర్చుచెయ్వు లంజిత్తజకేళిఁదేలె." భార. ఉద్యో. ౨, ఆ.

**చెరఁప.** దే. వి. చెంప.

**చెరచెర.** దే. ద్ర. క్రి. విశ. శీఘ్రముగ. (చెరచెరరమ్ము.) (చెచ్చెరకు మొదటిరూపము.)

**చెరిమ.** దే. వి. నాసాపుటము. "ఎ, గీ. పెరుగునడలుసఁదనముకుఁజెరిమలదర." గా. యు, కాం.

**చెరలాటము.** దన్వ. వి. చెరలాడుట, విహారము. "రగడ. అలము కొనిపెంటిఁజెరలాటములుఁగూటములుఁ, జలిపెనహి పక్షిమృగఝాలములుఁగేలకులు." రాఘ. ౨, ఆ. (చూ. చెరలాడు.)

**చెరలాడు.** దన్వ. అ. క్రి. (చెరలు+ఆడు.) 1. విహరించు; "సీ. చెక్కుటద్దములపైఁజెరలాడుఁజెరలాడి శ్రవణావతంసము జరులుముట్టు." భీ. ౪, ఆ.—2. వ్యాపించు; "సీ. చెక్కుటద్దములపైఁజెరలాడునప్పుడు కస్తూరికాపత్రకములుఁబోలె." నై. ౬, ఆ.—3. సంచరించు. "చ. ఇటువలెజవ్వసంపుమదమెచ్చఁగ నెచ్చెలులిచ్చమెచ్చఁగా, నటునిటుఁజెంతవారుచెరలాడఁగ." ఉ, గా. ౧, ఆ.

**చెరవము.** వై. వి. వంటకును, నీళ్లుకాఁచుటకును ఉపయుక్తమయిన యిత్తడిపాత్రము*. (రూ. చెరవ.)

**చెరికి.** దే. విశ. ధూర్తుఁడు.

**చెరుగు.** దే. స. క్రి. బియ్యములోనగువానిఁ జేటతోచెరుగు.

**చెరువు.** దే. స. క్రి. 1. గ్రుచ్చు; "చ. గజాశ్వభటకాయములం గుదిగ్రుచ్చినట్లుగాఁ, జెరువుచు." భార. భీష్మ. 3, ఆ.—2. చెక్కు. "సీ. పసిఁడికెంజాయనింపెసలారుజడముడిఁజెరివినమందారసుర భిసుమ, మాలికపైఁగ్రాలులోలాళిపటలంబు పింఛాతపత్రంబు పేర్మిఁతనకు, నొనఁగ." హరి. ఉ. 3, ఆ.—వి. చెక్కుట. "వ. మలయానిలంబుమలయుపలు చనిరావులకువలయుఁజెరువులుపెరిని." ఉ, హరి. ౫, ఆ. 3. తటాకము. (చూ. దొరువు.)

**చెఱ.** వై. వి. 1. కారాగృహము; "క. నఱకుటయర్థముగొనుటయుఁ, జెఱవనుచుటకట్టియడిచిచేడ్చాటొందణ, బఱచుటమొదలుగఁగల పలు, దెఱఁగులఁదగవుమెయినడపుధీరవిచారా." భార. శాం. ౨, ఆ.—2. నిర్బంధము. "చ. వేచెఱయుడిగించితల్లికిఁబ్రసిద్ధిగఁజూపవె నీదుకృత్యముల్." హరి. ఉ. ౮, ఆ.

**చెఱఁగు.** వై. వి. 1. అంచు*; "చ. పుడమిచెఱంగులెత్తియిటు బోరగిలంబడఁద్రిప్పినైపుమే." రామా. 2, ఆ.—2. కొంగు*; "చ. అవికయుఁబట్టుపుట్టముచెఱంగుమఱుంగయియుండిక్కఁజేసె." నై. 2, ఆ.—3. దిక్కు*. "గీ. నేలనాలుగుచెఱఁగులనృపుల కొలువు, అందు నేనువర్తించితినవనినాథ." భార. విరా. ౨, ఆ.

**చెఱఁగుమాయు.** దన్వ. అ. క్రి. బహిష్ఠయగు. "ఎ, గీ. చెఱఁగు మాసినమూన్నాళ్లసిగ్గుతోడఁ, బలిమిలోకనమార్గంబుపరిహరించి." కాశీ. ౨, ఆ.

**చెఱకడము.** దే. వి. బెల్లము. "సీ. వడిఁబెట్టిలోఁజెఱకడముసాఁ చాలూన్పఁ జెలఁగునంబారంపుఁ జింతపండు." ఆము. ౨, ఆ.

**చెఱకు.** దే. వి. ఇక్షువు. "క. కఱకంఠునేయవిల్లగు, చెఱకుంజెఱ కైనవంటచెఱకుంజెఱకే." ఉ, హరి. ౬, ఆ.

**చెఱకువిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (ఇట్లు చెఱకువిలుతుఁడు.)

**చెఱగొను.** దన్వ. స. క్రి. చెఱపట్టుకొను. "చ. ననుఁజెఱగొంచు రావణుఁడు నానొకరక్కసుఁడేఁగుచున్నవాఁడు." రా. అర, కాం. ౨, ఆ.

**చెఱచు.** దే. ప్రే. 1. చెడఁజేయు; 2. పోఁగొట్టు. "క. కావఁ గొనిపోయియేమఱి, గోవులఁదాఁజెఱచెనేనిగొల్లఁడుపతికిణ, గోవుల వెలయరుపందగు." విజ్ఞా. ప్రా, కాం. (ఇట్లకారమధ్యముగా ప్రయోగము కొందఱమతము. చూ. తొఱఁగు.)

**చెఱచెఱలాడు.** దే. అ. క్రి. (చెఱచెఱలు+ఆడు.) కోపమున మండు. (వానిముఖము చెఱచెఱలాడుచున్నది.)

**చెఱపట్టు.** దే. స. క్రి. నిర్బంధముచేసిపట్టు. "అమరులయాలువు టాంద్రనుజెఱపట్టితి." భార. అర. ౭, ఆ.

**చెఱపనచేట.** దే. విణ. నాశకుఁడు, నాశకురాలు. "క. అఱిమించి చొచ్చినిల్లటు, చెఱచితినిఁకఁబుట్టినిల్లుచెఱచెదననియే, పఱరెంచితి రెండిండ్లకుఁ, జెఱపనచేటవయితేమిచేసెడిదనుచున్." జై. ౪, ఆ.

**చెఱపు.** దే. ప్రే. (చూ.) చెఱచు. వి. కీడు.

**చెఱపోవు.** దే. అ. క్రి. నిర్బంధముచేత పట్టుపడు. "వ. సైంధవు చేతం బాంచాలి చెఱపోయె." భార. అర. ౬, ఆ.

**చెఱమ.** దే. వి. నాసాపుటము. "క. పఱచునొకకడితిఁబతిముకుఁ, జెఱమలకైయే యఁజప్పచినఁగఁగనదియు, క్రుఅఁగాఁడి డుస్సిసా టిన, నటిముటిఁజాఁబరువు వాటి యల్లటు వడియెన్." స్వా. ౪, ఆ.

**చెఱపడు.** వై. అ. క్రి. (చెఱ+పడు.) చెఱపోవు. "క. ఖలు చేఁజెఱవడిభీతిన్, గలఁగెడుసీతఁగని." రా. అర, కాం. ౨, ఆ.

**చెఱి.** దే. అవ్య. ఒక్కొకనికి. "చెఱివేయివేయిధేనువులనిచ్చె." భార. సభా. ౧, ఆ.

**చెఱుక.** దే. అవ్య. చెఱి.

**చెఱుచు.** దే. ప్రే. నశింపఁజేయు. "వ. పదంబులువిఱిచియుఁ బార్శ్వంబు లగలఁజెఱిచియు." భాగ. ౬, స్కం. (ఇట్లు ఉకార మధ్యముగా ప్రయోగము కొందఱమతము.)

**చెఱుపరి.** దే. విణ. (చెఱుపు+అరి.) నాశకుఁడు. "గీ. తొలుత జగమొంటఁజనిమంటఁగలపునీతుఁ, గొంపచెఱుపరిపారుగునుగూడె నిపుడు." చంద్ర.

**చెఱుపు.** దే. ప్రే. (చూ.) చెఱుచు. వి. కీడు.

**చెఱుము.** దే. స. క్రి. జాచు.

**చెఱువు.** దే. వి. తటాకము. "క. చెఱువునడుమ౦సినను,బెను, వెఱ మెకములుచెదరిననువివేకనిధియు, క్రుఱిబహుళ సైన్యమఱిముఱేఁ, బఱచిననాఁగంగరాదుబలియురకైనన్." భార. శాం. ౩, ఆ.

**చెలఁగు.** దే. అ. క్రి. 1. ఉత్సహించు; "ఉ. పాఱకి, ట్లున్నగతిం జెలంగుమనియుద్ధవిశారదుఁడైమురారితాఁ, జెన్నొందవన్ సుదర్శన ముఁజేతధరించెఁబ్రయోగకాంక్షతోన్." ఉ, హరి. ౬, ఆ.—2. శబ్దించు; "మృదంగానకదుందుభుల్ సెలఁగ." భార. ఆది. ౮, ఆ.—3. సంతోషించు; "చ. కలిమియులేమియున్ సతముగా వవిచెందినచోఁజెలంగుచున్, గలఁగుచునున్కిధీరులప్రకారమె." భార. అర. ౭, ఆ.—4. ఒప్పు; (చూ. చెఱకడము.)—5. ప్రకాశించు; "చందమామకడునింగిఁజెలంగిమెలంగెనెంతయున్." రామా. ౨, ఆ.—6. బొబ్బరించు; "చ. కనుఁగొనియర్ధచంద్ర విశిఖంబడరించినఁగర్ణసూతిము, త్తునియలుసేయుచుంజెలఁగ." జై. ౭, ఆ.—7. వికసించు. "సీ. ఆరాజదర్శనంబబ్బకయుండిన నేయ నోత్పలంబులే క్రియఁజెలంగు." రవి. ౫, ఆ.

**చెలఁది.** దే. వి. సాలెపురుగు. "సీ. సులిగొన్నచెలఁది పురువ్వుల నూలివల్లినా నలరెడుముడుతకన్బొమలవలన." కళా. ౩, ఆ.

**చెలఁదితెర.** ద్వ. వి. సాలెపురుగునేసిననేఁత, ఆశాబంధము. (చూ. చీకిలిమాకిలి.)

**చెలగము.** వై. వి. సాలెపురుగు.

**చెలగు.** దే. స. క్రి. ఖండించు. (చూ. తెలవు.)

**చెలమ.** దే. వి. ఎండిపోయినయేఱులోనగువానియందు నీళ్లకొఱకు త్రవ్వెడుపల్లము, కూపము.

**చెలయు.** దే. అ. క్రి. విజృంభించు. స. క్రి. చిమ్ము. (రూ. సెలయు.)

**చెలరేఁగు.** దే. అ. క్రి. (చెలగి+రేఁగు.) మిక్కిలి విజృంభించు.

**చెలవు.** దే. స. క్రి. చెలగుయొక్కరూపాంతరము. "కర్తలంజెల వియు." అచ్చ. యు, కాం.

**చెలి.** దే. వి. 1. ఆఁడుది. విణ. స్నేహితుఁడు, స్నేహితురాలు.

**చెలిక.** దే. వి. చీటిసేల.

**చెలికత్తియ.** ద్వ. విణ. స్నేహితురాలు, (రూ.) చెలికత్తె. (స్వార్థమునకత్తె.)

**చెలికవెలుఁగు.** దే. వి. కాకజంఘి.

**చెలికాఁడు.** దే. విణ. స్నేహితుఁడు. (స్వార్థమునకాఁడు.)

**చెలికారము.** దే. వి. స్నేహము. "ఉ. ఖేచరవాహినీనలినఖేలన పట్వదపక్షమారుత, శ్రీచెలికారమై." భల్లా. ౧, ఆ.

**చెలిది.** దే. వి. 1. చర్మరోగము; 2. మేహరోగము. (రూ. చెల్ది.)

**చెలిమరి.** దే. విణ. (చెలిమి+అరి.) చెలికాఁడు, చెలికత్తె.

**చెలిమి.** దే. వి. స్నేహము.

**చెలిమికత్తియ.** ద్వ. విణ. చెలికత్తియ, (రూ.) చెలిమికత్తె. "క. కలసెదఁబతినతఁడిచ్చట, మెలఁగుటమాతండ్రివిన్నమేలగునేప్రే, వులతోనసురియఁద్రిప్పిన, కలపనఁబిండైనఁ జెలిమికత్తెలునగరే." ఉ, హరి. ౫, ఆ.

**చెలిమికాఁడు.** దే. విణ. చెలికాఁడు. "ఎ, గీ. సృష్టికర్తెత్తితొలు నుజచెలిమికాఁడు." కాశీ. ౧, ఆ.

**చెలిమిచుక్క.** ద్వ. వి. అనూరాధానక్షత్రము.

**చెలియ.** దే. వి. ఆఁడుది, ఇంతి, మగువ, వనిత.

**చెలియలికట్ట.** దే. వి. సముద్రపుగట్టు, వేల. "ధర్మజవారిరాశికిం జెలియలికట్టవాఁ న." భార. ఉద్యో. ౪, ఆ. (రూ. చెల్లెలికట్ట.)

**చెలియలు.** దే. వి. చెల్లెలు. "అధిపనారదుచెలియలికొడుకప్పుడవ్వ తుండు." భార. శాం. ౧, ఆ. (దీని మొదటిరూపము చెల్లియలు.)

**చెలువ.** దే. వి. (చెలువు+అ.) 1. అందముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**చెలువము.** దే. వి. అందము, సౌందర్యము.

**చెలువు.** దే. వి.———పై.———

**చెలువుఁడు.** దే. వి. 1. ప్రియుఁడు; "చ. చెలువుఁడుకైవసం బనుచుఁజెల్లుబడింబచరించిపల్కెనా, కలికి." కళా. ౧, ఆ.—2. విటుఁడు; "క. వేచేతులవాఁడురెండుచేతుల, చెలువునిచేఁ జిక్కె." ఉ, హరి. ౬, ఆ.—3. సుందరపురుషుఁడు.

**చెల్క.** దే. వి. చెలికయొక్కరూపాంతరము. "ఉ. అంటలుగట్టి చెల్కలకు నాంద్రుసుబిడ్డలుఁగూరకోయఁబో." ఆము. ౩, ఆ.

**చెల్లు.** దే. స. క్రి. చెలగుయొక్కరూపాంతరము. (చూ. తికమక.)

**చెల్ల.** దే. ద్ర. సంతాపమునదెలుపునది. "ఉ. శ్రీతిజగంబుచిత్తము లఁటెంపువహింపఁగనిట్లు చెల్లఁబ్రా, చేతసుఁడమఖంబునకుశిష్య యుతంబుగవచ్చె." నిర్వ. ౧, ఆ.

**చెల్లఁబో.** దే. అవ్య. (చెల్లన్+పో.)———పై.——— "ద్వి. చెల్లఁబోనేనేల శ్రీరాముసమ్మి, వచ్చితి." రా. కిష్కి౦, కాం.

"క. ఎల్లకుమారికలును దను, వల్లభులనసంత సూపవంతులఁగన్నల్, చల్లఁగఁ జూతురుదీనికిఁ, జెల్లంబోయిట్టిమగఁడుసేకుఱెనఁగా." భో. ౫, ఆ.

**చెల్లచెదరు.** దే. విణ. (చెదరు + చెదరు.) మిక్కిలి చెదరినది. "గీ. అఱయదెసలేక నేఘనంబడవిలోనఁ, జెల్లచెదరయ్యె." హరి. పూ. ౭, ఆ.

**చెల్లరే.** దే. అవ్య. చెల్లఁబో. "చ. నరుఁడనువిహీనసాధనుఁడు నాకె దుర్జెలఁద్రుళ్లియాడఁడె, ల్లరేయిటుచూడఁగాఁదగునె." హరి. ఉ. ౭, ఆ. (రూ. చెల్లరే. "శా. రాజీవాక్షులనేఁచుపాతకివిచంద్రా రాజవాసీవుకీ, రాజత్వంబునఁజక్రముల్ మనియెనోఁరంజిల్లెనస్సంత తుల్, తేజంబంచెనోడింజెనోయుహాభయోద్రేకంబు రాఁజెల్లరే. రాజైపుట్టుటక్షమాత్రఁలమేరాజౌటదోషార్థమే." వసు. ౪, ఆ.)

**చెల్లాచెదరు.** దే. విణ. చెల్లచెదరుయొక్క రూపాంతరము. "క. అనిలాస్త్రంబు ప్రయోగిం, చినదిచొక్కాకులట్లచెల్లాచెదరై, చనఁ జేసెఁబెలుచశాత్రవ, జనులంబ్రాకారమస్త్రసంవృతమయ్యెన్." హరి. ఉ. ౬, ఆ.

**చెల్లియలు.** దే. వి. చెలియలు, చెల్లెలు.

**చెల్లు.** దే. అ. క్రి. 1. అయిపోవు; "గీ. చేతికాసులెల్లఁజెల్లంగ వచ్చిన." భల్లా. 3, ఆ.—2. కడచు; "చ. అనటయుశంభుఁడి ట్లనుదయన్ బలిభిక్షముపెట్టలేమిఁగుం, దినచెలిఁజొట్టముంబిలిచి దీనతవాపియపాపవృత్తిఁజె, ల్లినతొలుబాముగల్గునరులెన్నఁగమన్నఁ విధాత నిష్కృపా, త్మునిసతిలోభయూపి తునిదుర్గతిదుఃఖతుఁజేయుఁ బార్వతీ." భార. అను. ౫, ఆ.—3. కొనసాగు; "సీ. తలవంచు కొనిభవద్భర్తసీకోరికచెల్లించెఁగదలెకచ్చేయవలయు." జై. ౬, ఆ.—4. చచ్చు; "క. వినుముధృతరాష్ట్రనందను, లనిలతనయుచేతఁ బొలిసిరందఱునింకొ, క్కనుజుండునితండునుని, ల్చినవారయ్యిరు వురిపుడుచెల్లెదరెట్లున్." భార. శల్య. ౧, ఆ.—5. తగు; "సీ. చేరియన్యులు ప్రవేశింపఁజెల్లనిరాజశుద్ధాంత మేలీలఁ జొరఁగఁగలఁడు." రుక్మి. ౨, ఆ.—6. శక్యమగు; "ఉ. వాఁడుతనయుగ్రతఁ జూపెదనన్న మీమహీ, వల్లభువారికేలయమవహ్నులకైననురూపుతో డఁబోఁ, జెల్లదు." కర్ణ. ౧, ఆ.—7. సాగు; "శా. తల్లీనిన్నుఁ గనుంగొనంబడయుటన్ ధన్యుండనైతిన్ జగం, బెల్లన్ నిన్నునుతించి మ్రొక్కినధనాధీశోన్నతిన్ నిత్యమై, చెల్లున్." ఉ, హరి. ౪, ఆ.—8. చేరు. (నాకు రూకలుచెల్లెను.) విణ. చేరినది. (చెల్లురూపాయలు ముప్పది.)

**చెల్లుబడి.** దే. వి. అధికారము. (చూ. చెలువుఁడు.) విణ. సిద్ధిఁ బొందినది. "మ. హిమశైలాత్మజ తావకీనకృపచే నేనింతపర్యంతమీ, క్షమపైనాడినమాటచెల్లుబడిగా నత్యప్రతిజ్ఞాభిధా, నముసార్థం బగునట్లుగ్రుష్మరితి." చంద్రా. 3, ఆ.

**చెల్లెలు.** దే. వి. చెల్లియలుయొక్క రూపాంతరము.

**చెల్వ.** దే. వి. చెలువయొక్క రూపాంతరము.

**చెవి.** వై. వి. 1. శ్రవణము; 2. రాట్నములోనగుయంత్రముల యందుఁగల తదవయవవిశేషము; 3. తాళపుచెవి.

**చెవికొంక.** ద్వ. వి. కొనచెవి.

**చెవిచొరుపాము.** ద్వ. వి. కర్ణజలూక.

**చెవిటి.** ద్వ. విణ. (చెవి+అవిటి.) చెవిటివాఁడు, బధిరుఁడు. (చూ. కన్నవిటి.)

**చెవిటిమూఁగ.** ద్వ. విణ. చెవుడును, మూఁగతనమును గలవాఁడు ఏడమూకుఁడు.

**చెవియాకు.** ద్వ. వి. (చెవి+ఆకు.) 1. లక్కాకు; 2. కమ్మ. "మ. పసుపుంగుంకుమకజ్జలంబునను గూర్పానంబుతాంబూల ముస్, గుసుమంబుల్ కబరీభరంబుచెవియాకుల్ మంగళాలం కృతుల్." సం. "కూర్పాసకంచతాంబూల మంగళ్యాభరణం శుభమ్, కేశసంస్కారకబరీ కరకర్ణవిభూషణమ్." కాశీ. ౨, ఆ.

**చెవుడు.** వై. వి. చెవులువినని రోగము, బాధిర్యము.

**చెవుడుపడు.** వై. అ. క్రి. చెవుడుగలదియగు. (ప్రే. చెవుడు పఱచు.)

**చెవుడుపాటు.** వై. వి. చెవుడుపడుట, చెవిటితనము.

**చెవుడ్పడు.** వై. అ. క్రి. చెవుడుపడుయొక్క రూపాంతరము. "వాస్తావప్రతికర్ణముల్ మనసిజుఁడు చెవుడ్పడఁజేసనక్కటా." వై. ౪, ఆ.

**చెవుడ్పాటు.** వై. వి. చెవుడుపాటుయొక్క రూపాంతరము. "తప్పటుఘోషంబులదిక్తటంబులుచెవుడ్పాటొంద." రుక్మి. ౫, ఆ.

**చెవులపిల్లి.** వై. వి. చెవులపోతు.

**చెవులపూవులు.** వై. వి. బ. కర్ణభూషావిశేషము. "ఎ, గీ. చెవుల పూవులుబవిరెలుచేరుచుక్క, కొప్పువలయునవవరించిగొప్ప మీఱ." కళా. ౭, ఆ.

**చెవులపోతు.** ద్వ. వి. కుందేలు, శశకము.

**చెవ్వ** దే. వి. శిశువులకు పుట్టినతోడనేకలుగు వ్యాధివిశేషము.

**చెవ్వాకు.** ద్వ. వి. చెవియాకుయొక్క రూపాంతరము.

## చే.

**చే.** వై. అప. తృతీయావిభక్తియందువచ్చు ప్రత్యయము. వి. 1. హస్తము; "క. చేసఱచినవ్వుచుంబరి, హాసోక్తులుమెఱయుచుండ." హరి. ఉ. ౭, ఆ.—2. తొండము*. "వ. అతనిరాజ్యంబునంగన వుకబళించిచేయెత్తిమొఱవెట్టుటకరులయుంద." ఆము. ౪, ఆ.

**చేఁత.** వై. వి. 1. చేయుట*; "క. వారొకయాగ్రహవృత్తిం, గూరియధర్మఁబుసేఁతకుం జాలరు." భార. ఉద్యో. ౧, ఆ.—2. కృత్యము*. "ఉ. పూఁతపసిండివంటివలపుంబచరించుకులం బుసీతికిన్, లేఁతగదమ్మయిత్తెఱఁగులేమసురాంగనలెల్లనిట్టినీ, చేఁతకు మెత్తురమ్మదయసేయకతిన్నసిమేనువెన్నెలన్, వేఁతురటమ్మయింతకను వేఁదుఱుసెల్లునటమ్మయింతికిన్." స్వా. 3, ఆ.—విణ. కృత్రిమము*. (చేఁతగట్టు మొ.)

**చేఁతకాఁడు.** ద్వ. విణ. క్రియావంతుఁడు. "సీ. చలియిక్క దిండియందెలజెనిజిగిచేగసింగాణిఁజెఱచినచేఁతకాఁడ." అచ్చ. అ, కాం.

**చేఁతగట్టు.** వై. వి. కృతకాద్రి. "సీ. పైఁడిమెట్టుకలెక్కి పైకేగిచేఁత గట్లందుడాఁగురు మూఁతలాడియాడి." య. 3, ఆ.

**చేఁతరాసి.** వై. వి. ఒకానొకఘూరాకుచెట్టు, ఝరసి. (రూ. చేఁత లాసి.)

**చేఁతఱికము.** దే. వి. కీడు. "క. ప్రాఁతయగుమంత్రితనకుం, జేఁతఱికముచేసెననుచుశిక్షించియొరున్, లాఁతింబెట్టిననీఁతలుఁ, బోఁతలునైరాజువిడుచుఁ బొందకమూఁకల్." పంచ. నా. ౧, ఆ.

**చేఁతిదొండ.** ద్వ. వి. చేఁదుగలదొండ, తిక్తతుండికేరి*.

**చేఁతిదోస.** దే. వి. చేఁదుగలదోస, తిక్తకర్కటి*.

**చేఁతిపుచ్చ.** దే. వి. చేఁదుగలపుచ్చ, తిక్తకాళింగి*.

**చేఁతిపొట్ల.** ద్వ. వి. చేఁదుగల పొట్ల, పటోలిక*.

**చేఁతిబీఱ.** దే. వి. చేఁదుగలబీఱ, కటుకోశాతకీ.

**చేఁతిసొర.** దే. వి. చేఁదుగలసొర, కటుతుంబీ.

**చేఁత్రాడు.** దే. వి. (చేఁదు+త్రాడు.) నీళ్లుచేఁదునట్టి త్రాడు.

**చేఁద.** దే. వి. (చేఁదు+అ.) నీళ్లుచేఁదెడుపాత్రము. "క. అంతట నొకనాఁడిరువ్వర, యింతులునుంగూడినూతికేఁగిజలంబ, త్యంతముఁ దమిఁజేఁదెడితఱి, నెంతయునొండొంటేఁదాఁకెనిద్దఱచేఁదల్." పర. ౫, ఆ.

**చేఁదు.** దే. అ. క్రి. ఆకర్షించు. "ద్రోణముల్ దివియుదోర్దండంబులంజేఁదియేసిరి." స్వా. ౪, ఆ.—వి. షడ్రసములలో నొకటి, తిక్తము.

**చేఁప.** దే. వి. మత్స్యము.

**చేఁపు.** దే. అ. క్రి. పాలుద్రవించు. వి. పాలద్రవము. (చూ. నెమరుచు.)

**చేఁపుడు.** దే వి. చేఁపుట. "పాలచేఁపుడుఁజనుదోయిపొంగు." హంస. ౨, ఆ.

**చేకట్లు.** ద్వి. వి. బ. హస్తభూషావిశేషము. "సీ. కొమ్మవాతెఱతో గుణమ్ముగైకొనవచ్చి కరినవిద్రుమముచేకట్లఁబడియె." (ఇక్కడ మణియొకయర్థముచేతికట్లు.) వసు. ౨, ఆ.

**చేకత్తి.** ద్వి. వి. చిన్నకత్తి, కరవాలిక. "మ. వలలుఁబోనులుఁ జిక్కములుచలుదులుఁ వాకట్టుమందుల్ తెరల్, సెలకట్టెల్ తడవింట్లు నమ్ములపొదుల్ చేకత్తులుంబట్టియుం, బులుపందిఁటెలు నీలి దట్లుపిడియమ్ముల్ పూనిలీలఁ విశ్వం, ఖలవృత్తిందెరవేఁటకాంద్రు కొలువంగావచ్చె రాజన్నతిఁ." రామా. ౨, ఆ.

**చేకానుక.** ద్వి. వి. రాజులలోనగువారినిఁ జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము.

**చేకుఱు.** దే. అ. క్రి. 1. లభించు; "క. వెఱవకకలలోఁజేసిన, కొఱగామికివగచుచోటగుణరత్నముచే, కుఱెనీకునలిగితన్నినఁ, బఱుపుపయింబడినయట్లు పద్మదళాక్షీ." ఉ, హరి. ౫, ఆ.—2. సిద్ధించు. (చేకూరుయొక్కరూపాంతరము.)

**చేకూడు.** ద్వి. అ. క్రి. హస్తగతమగు. (ప్రే. చేకూరుచు.)

**చేకూరు.** దే. అ. క్రి. చేకూడుయొక్కరూపాంతరము.

**చేకొణద.** దే. వి. క్షీరమోరటీ.

**చేకొణుజు.** దే. వి. పచ్చవర్ణముగలచెదలు, శిథిలి.

**చేకొణుదు.** దే. వి. ——పై.—— "చేకొణుదులువేళ్లసీమ ఱందు." కాశీ. ౬, ఆ.

**చేకొను.** ద్వి. స. క్రి. 1. గ్రహించు; "క. సీకతమునసాదాస్యము, ప్రాకటముగఁబాయుననినపలుకెదలోనఁ, జేకొనియాఱడి నిర్గత, శోకస్థితినున్నదానఁజూవెఖగేంద్రా." భార. ఆది. ౨, ఆ.—2. ఆదరించు; "క. తనయుండుతల్లిదండ్రులు, పనిచినపనిచేయఁడేనిపలుకెదలోఁజే, కొనఁడేనివాఁడుతనయుం, డనఁబడునే పితృధనమునకర్హుండగునే." భార. ఆది. 3, ఆ.—3. జయించు. "క. మాయాదాస్యమువాయును, పాయమునేయుండునన్నుఁబనుపుండిష్టం, బేయదిదానినిదెత్తున, జేయుండనైయమరవరులఁజేకొనియైనన్." భార. ఆది. ౨, ఆ. (ప్రే. చేకొలుపు.)

**చేగ.** దే. వి. చేవ. "క. ఈగొనములఁగడుఘీఱుచుఁ, జాగపుమెఱవడినివేల్పు జన్నియనునెలన్, వేగన్నులదొరమ్రాఁకుల, చేగంగయికొననియాగిచెలువపుశిబికన్." య. ౧, ఆ.

**చేగలమెకము.** ద్వి. వి. (చే+కలమెకము.) ఏనుఁగు, కరి.

**చేగలవాఁడు.** ద్వి. వి. (చే+కలవాఁడు.) ఈవిగలవాఁడు, వదాన్యుఁడు.

**చేగోడి.** దే. వి. (చే+కోడి.) భక్ష్యవిశేషము, కోడివడ.

**చేట.** దే. వి. చెరిగెడుసాధనము, శూర్పము.

**చేటకొల్లారు.** దే. వి. మూడుపక్కలనుచేరికకట్టడముగల యిల్లు.

**చేటగోళ్లబోటి.** ద్వి. వి. (చేటగోరు+బోటి.) శూర్పణఖ. "ఆ. సంతసించియతని చెంతకట్టులువోవఁ, జేటగోళ్లబోటి బూటకంబు, దెలిసియివ్వలంతిడిటముప్పుఁగాదాని, ముక్కుఁజెవులు నొకటఁజెక్కెవైచె." అచ్చ. అర, కాం.

**చేటచేఱు.** దే. వి. ఆఁడువారియొక్క యొకవిధమైన కోకకట్టు.

**చేటరిక్క.** ద్వి. వి. విశాఖానక్షత్రము.

**చేటి.** సం. వి. ఈ. స్త్రీ. పనికత్తె. (చూ. చేటిక.)

**చేటు.** దే. వి. నాశము.

**చేటుఁడు.** సం. వి. అ. పుం. 1. పనివాఁడు; 2. శృంగారనాయకునియొక్క యొకానొకసచివుఁడు. విణ. నికృష్టుఁడు.

**చేట్లకొఱవి.** దే. విణ. నిర్భాగ్యుఁడు.

**చేడియ.** వై. వి. ఆఁడుది, తొయ్యలి, వనిత*.

**చేడె.** వై. వి. చేడియయొక్కరూపాంతరము.

**చేడ్పడు.** ద్వి. అ. క్రి. 1. బాధపడు; "క. కడఁగివృకోదరుఁ డసురన్, బడఁగవడిన్ వైచివామ పాదంబునఁజే, డ్పడవానిఱొమ్ముఁదాఁచెన్." భార. ఆది. 2, ఆ.—2. చలించు. "క. కడు భయమునమాతలిచే, డ్పడిరథచోదనమునంద పాటవుఁడైనన్." భార. అర. ౪, ఆ.

**చేడ్పాటు.** ద్వి. వి. చేడ్పడుట, బాధ. "సింగంబాఁకటితో గుహాంతరమునంజేడ్పాటుమైనుండి." భార. విరా. ౪, ఆ.

**చేత.** వై. అవ. తృతీయావిభక్తియందువచ్చు ప్రత్యయము.

**చేతకి.** సం. వి. ఈ. స్త్రీ. కరకీ.

**చేతన.** సం. వి. ఆ. స్త్రీ. తెలివి. విణ. ప్రాణముగలది.

**చేతముకు.** ద్వి. వి. చిన్నతముకు.

**చేతవులు.** ద్వి. అ. క్రి. 1. లభించు; "క. చేతులకబ్బెఁగయ్యము, సేతవిలెడునట్టివిధముఁచింతిఁపు." హరి. ఉ. 2, ఆ.—2. నష్టివచ్చు.

**చేతస్సు.** సం. వి. స్. న. మానసము, మనసు, మది.

**చేతాఁకు.** ద్వి. వి. సాహసము. "క. నాతోఁదలపోయకరో, పాతురతన్ బ్రతినవట్టితివసీనాథ, వ్రాతంబువినఁగనిట్టులు, చేతాఁకునదెప్పరంబునేసితికంటే." సం. "సైంధవంశోప్యస్మిహాంతేతి తత్సాహసమిదంకృతమ్; అనంమంత్ర్య మయాపార్థ మతిభారోయము ద్యతః." భార. ద్రో. ౨, ఆ.

**చేతిబిడ్డ.** ద్వి. వి. (చేయి+బిడ్డ.) పసిబిడ్డ.

**చేతివ్రాలు.** ద్వి. వి. బ. (చేయి+వ్రాలు.) హస్తరేఖలు.

**చేతోభవుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**చేదండ.** ద్వి. వి. హస్తావలంబము.

**చేదర్సెనము.** వై. వి. చేకానుక. "ఎ, గీ. నెమ్మినీరీతిఁజేదర్సెనమ్ము లొసఁగి, ప్రియులసన్నిధిమ్మర్గగర్భితముగాఁగఁ, బ్రౌఢగోపాంగవలుకమప్రాఁతవలపు, వెల్లివిరిఁజేసిరిందిరావల్లభునకు." జై. 3, ఆ.

**చేదివియ.** వై. వి. దివ్వటీ.

**చేదోడు.** ద్వి. విశే. (చే+తోడు.) కార్యసహాయుఁడు, కార్య సహాయురాలు. "క. ఆదేవ దేవినకుఁ, జేదోడుగఁదోఁటపనులు చేయుచునుండెఁ, బైదలికిభుత్తెమాఘుక, రోదనశేషంబుగరుణ నొసఁగుచునతఁడుఁ." పర. 3, ఆ.

**చేను.** దే. వి. 1. పంటనేల; "గీ. నింగియనియెడిప్రత్తిచేనికినిరక్త, బలియఁడిరనంగనెఱసంజతొలుసమర." కళా. ౭, ఆ. "మ. శారి దింజేర్చినతీఁగెమల్లియలుఖర్జూరంబుబుంబుపవ్వమం, జరుబుఁ మామిడిగుత్తులుఁ గుసుమలుఁ సంపెంగలుఁ బచ్చగ, న్నెరు పూఁబాళలుగల్గిరాజనముకాంతిందారుములూనిచే, లరుదారఁ నగుఁబూవుఁదోఁటలబలాకారకదంభంబునఁ." ఆము. ౧, ఆ.—2. అడవి. "సీ. అలకంబమయ్యలౌనైనదేమోకానిసింగముక్కటి యైనఁజేలలేదు." య. ౧, ఆ. (దీనియుత్పత్తంబునకు ఒకానొకచో లోపంబు గానంబడియెడి. "ఆ. వెలుగుచేన్నేసినఁ, గాచువారలెం దుఁగలరెజగతి." ఉ, హరి. ౫, ఆ.)

**చేపట్టు.** ద్వి. స. క్రి. 1. అవలంబించు; 2. గ్రహించు; 3. పెండ్లియాడు. "క. నాపలుకుల్లంఘింపక, భూపాలకవారిఁ శ్రీతిభోగినులనుగాఁ, జేపట్టెనుమతనేలినఁ, గాపట్యములేకనిన్నుఁగా పెదనెపుడుఁ." హరిశ్చ. ౨, ఆ.—వి. 1. అవలంబము; "క. ఆపర్వతశిఖరస్థలి, ప్రాపునకొకయెఱుకుపల్లెపటుతరలోకై, కాపాదితసౌఖ్యశ్రీ, చేపట్టయివెలయుబుధవశీకరమగుచుఁ." భల్లా. 3, ఆ.—2. అనుగ్రహము; "క. నీచేపట్టొకయించుక, గోచరము గఁగంటిఁగానఁగొంకకయుంకే, నాచరితశుభవచఃపూ, జాచతురత మెఱసెదను బ్రసన్నుఁడవగుమీ." హరి. ఉ. 3, ఆ.—3. స్థానము. "శా. రారయ్యాయనిశుద్ధిమచ్చరణగోత్రాదేవతాపుత్రుని, స్సైరాగ్ని ప్రభుఁగూరుచుండనిడిమ్రోల్ చేపట్టుగావించినీ, రారంబండిన ప్రాంతరాజనపుదివ్యాన్నంబు నొక్కింతవా, గ్ధారాఘోతనుఁగుండ యూర్చియొసఁగెఁ రంభాపలాశంబునఁ." పాండు. ౪, ఆ.

**చేపట్టుకుంచేము.** ద్వి. విశే. ఎవ్వరేదికోరినను దాని నెఱవేర్చు వాఁడు. "సీ. చేపట్టుకుంచమకీఁదరంగదభంగశృంగారశాస్త్రప్రసంగలోలుఁ, డమ్మహారాజదేవేంద్రుఁడు." శుక. ౧, ఆ.

**చేపడు.** వై. అ. క్రి. 1. చిక్కు; "కౌఁగిటంజేపడఁబట్టి." ఉ, హరి. 3, ఆ.—2. లభించు. "అట్లైననిచ్చలుఁజేపడుఁగాదె యీ సుభగుఁజెందెడుభాగ్యము." భాగ. ౧౦, స్కం. పూ.

**చేపెట్టె.** వై. వి. చిన్నపెట్టె, మంజూష.

**చేబ.** దే. వి. మల్లబంధవిశేషము.

**చేబదులు.** దే. వి. చేతి అప్పు, అల్పకాలమునకుదీసినయప్పు.

**చేబాడిస.** ద్వి. వి. చిన్నబాడిస.

**చేబోడి.** ద్వి. విశే. నిర్ధనుఁడు. "ఎ, గీ. బాఁతితనమునలంజియఁ బాయలేక, క్రీడయించుకలేకచేబోడిబోఁజఁగు." కవిక. ౪, ఆ.

**చేమ.** దే. వి. శాకభేదము, ఆలుకము.

**చేమంతి.** వై. వి. ఒకానొకపూఁజెట్టు.

**చేమంతిపువ్వు.** వై. వి. భూషావిశేషము.

**చేమటియావు.** దే. వి. చిత్రవర్ణముగల గోవు.

**చేమపూరాజనములు.** ద్వి. వి. బ. ధాన్యవిశేషము.

**చేమిరి.** దే. వి. పేరుటకై పాలలోమజ్జిగమిడుచుట.

**చేమోడుచే.** ద్వి. అ. క్రి. మ్రొక్కు, నమస్కరించు. (రూ. చేమోడ్చు.)

**చేమోడుపు.** ద్వి. వి. నమస్కారము. (రూ. చేమోడ్పు.)

**చేయమ్ము.** వై. వి. (చేయి+అమ్ము.) చేతితో ప్రయోగించెడుబాణము. (చూ. అసిఁబోవు.)

**చేయలఁతి.** ద్వి. వి. విశే. (చే+అలఁతి.) సమీపము. "చేయలఁతికిఁజేరినంజదిమినట్టులుదూరముదాఁటు." రా. ఆర, కాం. ౨, ఆ. "పఱచుఁదవ్వుగఁజేయలంతినిలుచుఁ." భార. ఆర. ౬, ఆ.

**చేయి.** వై. వి. 1. హస్తము; 2. కిరణము*; "మ. తొగసూడల్గిన తస్మిముద్దియకుఁజేతుల్ సాఁపినిద్దంపుమేల్, జిగిఁగన్పట్టుమడుంగు దువ్వలువలిచ్చెంగూర్మినానంచచాల్, డిగియెఁ." అచ్చ. అ, కాం.—3. తొండము*; "ఉ. భీముఁడుదగ్రతంగదియఁబెల్లగునా కరిచేతిశీకర, స్తోమమునం దురంగములుతోఁగి." భార. ద్రో. ౧, ఆ.—4. పక్షము*; (ఈ వ్యవహారమునందు వాఁడు ఎదుటిచేయిగా ఉన్నాఁడు.) 5. పట్టు*; "చేయీకకుప్పించిచిప్పసదాఁటుచు." హరిశ్చ. ౨, ఆ.—6. రెండుమూరలకొలఁది*.

**చేయితోడు.** ద్వి. విశే. (చేయి+తోడు.) చేదోడు. "సీ. ఆది కల్పంబునాడఖిలప్రపంచంబు సృజియించు బ్రహ్మకుఁజేయిదోడు." భీ. ౧, ఆ.

**చేయు.** వై. స. క్రి. 1. ఒనర్చు, కావించు; 2. నిర్వహించు. "తే. పనికిమేపు గల్గినఁజాలు నసురలేమి, సేసెదకుపోవనిండని చేయఁగలుగు, గొల్లలకునెల్లఁజెప్పఁగ." హరి. పూ. 2, ఆ.

**చేర.** దే. వి. ఇంచుకవంచఁబడినచేయి, ప్రసృతి. "ఉ. తీరిచినట్టులున్నవిగదేకనుబొమ్మలుకన్నులంటిమా, చేరలఁగొల్వఁగావలయు." విజ. ౧, ఆ.

**చేరిక.** దే. వి. 1. కూడిక; 2. సమీపము.

**చేరు.** యు. దే. అ. క్రి. 1. ఒఱగు; 2. సమీపించు. "అశ్రీతుల్ పల్కినపాతకంబునకుఁజేరెంగాలమివ్వేళ." జై. 2, ఆ.—స. క్రి. పొందు. వి. 1. మిరియములోనగుసంబారములుచేర్చికాఁచిన చింతపండురసము; 2. సమీపము. "వ. వడివడిమీఁదికడసడరు చుబీరపుఁగుప్పలై తిప్పలకుంగొప్పలగుదుప్పలకుఁగాక బెగ్గడిలి నేలకుడిగ్గు పెంజిలువలంబోలె మోరులచేరులమలఁకలైజాఱుసెలయేఱులును." య. ౨, ఆ.—వై. 1. సరము*; "ఉ. మఱి పాపటముత్తియంపుఁజే, రుందులకించుకస్తురియురూఢిగబాహుల లీలనొప్పఁగ." కళా. 2, ఆ.—2. త్రాడు*; "గీ. అమరుల మృతాంబునిధిలోని యమృతరసము, వెండిచేరులఁబటికంపుఁగుండకట్టి, చేదుకొనియెదరోనాఁగశీతరోచి, మెఱుఁగుమెయితోనయ్యలమిన్నువ్రాఁకె." పా. ౨, ఆ.—3. గొలుసు*. (ఉయ్యాలచేరులు మొ.)

**చేరుగడ.** దే. వి. 1. సమీపము; 2. దిక్కు, శరణము. "క. వారలకయేలమాధవ, కౌరవులకుమఱియునీజగంబులకెల్లఁ, జేరుగడ నీవనీపలు, కారయవేదంబుగాదెయఖిలంబునకుఁ." భార. ఉద్యో. 3, ఆ. "క. ఆదియుమధ్యమునంతము, నాదేవేశునకులేమినవ్యయుఁడతఁడీ, వేదములకు నానావిధ, వాదములకుఁజేరుగడభవచ్ఛేపి నృపా." భార. శాం. ౪, అ.—విశే. సమీపమైనది.

**చేరుగొండి.** దే. వి. చేరివచ్చినపెండ్లాము. విశే. 1. చేరివచ్చినది; 2. దుష్టము. (ఇది చేరుగొండి అవు.)

**చేరుచే.** దే. ప్రే. చేరఁజేయు.

**చేరుచుక్క.** వై. వి. పాపటబొట్టు. "మ. పగలుఁరేయునను ప్రకాశతనుజీవంజీవబంధుండుశాం, పగుముత్యంబులచేరుచుక్కగమిపై వ్యాజంబునంజేరుచు, క్కగమింగూడియనేకరూపములతోఁ గన్పట్టెనానొప్పగుఁ, నగరీహేమశిరోగృహాగ్రవిహారన్నారీముఖాంభోజముల్." అని. ౧, ఆ.

**చేరుడులు.** దే. వి. బ. తెల్లఁగాదంచనిబియ్యములోనగునది. (రూ.) చేరుళ్లు. (వృత్తియందేకవచనాంతము. చేరుడుబియ్యము, చేరుడునువ్వులు మొ.)

**చేరువు.** దే. వి. సమీపము. (రూ. చేర్వు.)

**చేరుబడి.** దే. వి.———పై.———

**చేరువ.** దే. వి. 1. సమీపము; 2. సమూహము; "సీ. చల్లనిశలఁ పురాచల్లమీఁదట నల్ల జీర్కులాడెడువేల్పుఁజేరువలును." య. ౨, అ.—3. సేన. విశే. సమీపమైనది.

**చేరువకాఁడు.** దే. వి. 1. ఒక సమూహమునకధిపతి; "ఎ, గీ. చెంచుచేరువకాఁడొకండు, వచ్చినృపతికిఁగానుకలిచ్చినిలిచె." చం. ద్రా. ౨, ఆ.—2. సేనాధిపతి; "గీ. కలరునాకిట్టిచేరువకాండ్రు చేవ."* రామా. 2, ఆ.—3. కావలివాఁడు. (ఇది వాడుక యందలి యర్థము.)

**చేర్కోల.** ద్వ. వి. చేఱుకోలయొక్క రూపాంతరము. "ఎ, గీ. పసిడిగిలుకలచేర్కోలఁ బరిఢవించి." కాశీ. 3, ఆ.

**చేర్చుక్క.** వై. వి. చేరుచుక్కయొక్క రూపాంతరము. "సీ. చేర్చుక్కగానిడ్డచిన్నిజాబిల్లిచేసిందూరతిలకంబుచెమ్మగిల్ల." స్వా. ౧, ఆ.

**చేర్లకోల.** ద్వ. వి. చేఱులకోలయొక్క రూపాంతరము. (చూ. కొఁటీరు.)

**చేర్వ.** దే. వి. చేరువయొక్క రూపాంతరము. (సమీపమునకు.)-"మ. చేర్వకుమీరురాఁగనివసింపకయిచ్చటికొండలెల్లనీ, యుర్వినడంగ నన్నఁదగు." ఉ, రా. 2, ఆ.

**చేఱు.** వై. వి. చేరుయొక్క రూపాంతరము. (చూ. చేఱుకోల.)

**చేఱుకోల.** ద్వ. వి. బండిగుఱ్ఱములు, దుక్కియెద్దులు లోనగువానిఁ గొట్టెడుజాటి. "ఎ, గీ. అపుడునమ్మెటకోలలయంకుశముల, చేఱుకోలలవ్రేటులనీఱతౌఱ, యదలుపులవాహనంబులుసెదరిపఱచె." భార. ద్రో. 3, ఆ. "వ. రాజన్యులందఱుపమ్మెటలువెట్టి గుఱ్ఱంబులందోలియు నంకుశంబులూనియేనుంగులందఱిమియుఁ జేఱుకోలలనడిచిరథ్యంబులంబఱపియు." హరి. ఉ. ౧, ఆ. (రూ. చేరుకోల.)

**చేఱుబొందు.** ద్వ. వి. కొట్టెడుతోలుపట్టెడ.

**చేఱులకోల.** ద్వ. వి. చేఱుకోల. (చూ. చేర్లకోల.)

**చేలని.** సం. వి. ఈ. స్త్రీ. జూదమునందలిసారె.

**చేలము.** సం. వి. అ. న. వస్త్రము. (రూ.) చేల. (దీని వైకృతము. సేల.) విశే. అధమము.

**చేవ.** దే. వి. 1. సారము; 2. ధైర్యము. "వ. అప్పుడునృపాలుండు హేమమరాళసాంత్వ నాలాపబలంబుననెట్టకేలకు మనంబునం జేవదెచ్చుకొని." నై. ౪, ఆ. (చేగయొక్క రూపాంతరము.)

**చేవలఁతి.** ద్వ. విశే. అధీనము. "క. కావునచరులకుఁదక్షే, త్రావాసమొనర్పనైహికాముష్మికముల్, చేవలఁతులగుచుఁదలకొను, నావృషనామృషుగుణించినారదుఁడనియెన్." పాండు. 3, ఆ. "సీ. నాచిత్తమేకీడునకుఁజేవలంతిగాకేప్రొద్దునీయందయె లయుఁగాత." హరి. ఉ. ౫, ఆ.

**చేవాఁడికాఁడు.** ద్వ. వి. చేచుఱుకుగలవాఁడు, దొంగ.

**చేవాటు.** వై. వి. విశే. సమీపము. "ద్వి. చెలువారనిచటికిఁజేవాటునేలఁ, గలదొకనిర్మలకమలాకరంబు." హరిశ్చ. ౧, భా.

**చేవిచ్చు.** ద్వ. అ. క్రి. దండముపెట్టు.

**చేవిప్ప.** ద్వ. వి. దండము.

**చేవెలుఁగు.** ద్వ. వి. దివటీ.

**చేవ్రాలు.** ద్వ. వి. బ. సంతకము.

**చేష్ట.** సం. వి. ఆ. స్త్రీ. వ్యాపారము.

**చేష్టించు.** సం. అ. క్రి. చేష్టలుచేయు.

**చేష్టితము.** సం. వి. అ. న. 1. గతి; 2. చేష్ట.

**చేసి.** దే. అవ్య. తృతీయావిభక్త్యర్థకము. (తొల్పుటఁజేసి, బాహుశక్తిఁజేసి, సంప్రయోగమునఁజేసి, దీననుజేసి, ధర్మతనూభవులసఁజేసి, బహువేదఘోషముఁలఁజేసి మొ.)

**చేసేత.** వై. క్ర. (చేతన్ + చేతన్.) 1. ఒకరొకరిచేతిమీఁదుగా*; "శా. చేసేతంబృథివీశులందుకొఁగాశిసింధుతోయంబులం, జేసెన్ మజ్జనమున్." నిర్వ. ౧, ఆ. (ఈ యర్థమునందొకానొకకవిచే చే అని ప్రయోగించియున్నాఁడు. "చెలువల్కొందఱు హేమకుంభములతోఁ జేచేనొసంగన్." పా. ౨, ఆ.)—2. అప్పుడే*. "క. చేసినఘములత్పలముం, జేసేతంగుడిచెఁగాని శిశువునెడనునా, చేసినక్రౌర్యములేవే, జేసితిమాలోఁడుకీడుచెందదునన్నన్." సం. "ఇచ్ఛయేహకృతంపాపం నద్యస్తం చోపసర్పతి." భార. శాం. 3, ఆ.

## చై.

**చైతన్యము.** సం. వి. అ. న. 1. తెలివి; 2. ప్రాణము.

**చైత్యము.** సం. వి. అ. న. 1. కట్టడము; 2. గుడి; యజ్ఞశాల. (అనికొందఱు.) 3. బౌద్ధాలయము; 4. గాద. పుం. ఉద్యానవనమందలిమ్రాను, రచ్చమ్రాను. (అనికొందఱు.)

**చైత్రము.** సం. వి. అ. న. 1. గుడి; 2. గోరీ. పుం. 1. ఒక నెల; (చూ. మాసము.) 2. ఒకానొకకొండ.

**చైత్రరథము.** సం. వి. అ. న. కుబేరునితోఁట.

**చైత్రసఖుఁడు.** సం వి. అ. పుం. మన్మథుఁడు.

**చైత్రసారథి.** సం వి. ఇ. పుం.———పై.———

**చైత్రికము.** సం. వి. అ. పుం. చైత్రమాసము.

## చో.

**చోక్షము.** సం. విశే. (అ ఆ. అ.) 1. తీక్ష్ణము; 2. పరిశుద్ధము; 3. మనోజ్ఞము; 4. సమర్థము.

**చోచము.** సం. వి. అ. న. 1. టెంకాయ; 2. లవంగపుపట్ట; 3. భుజించివిడిచినయన్నములోనగునది.

**చోదకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. త్రోలువాఁడు; 2. ప్రేరేపించువాఁడు.

**చోదనము.** సం. వి. అ. న. త్రోలుట.

**చోదము.** సం. వి. అ. న. లవంగపుపట్ట.

**చోద్యము.** సం. వి. అ. న. 1. ఆశ్చర్యము; 2. ప్రశ్నము. విశే. త్రోలఁదగినది.

**చోరపుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కట్లతీఁగ; 2. పద్మపుతీఁగ.

**చోరము.** సం. వి. అ. పుం. గంధద్రవ్యవిశేషము.

**చోరితము.** సం. విశే. (అ. ఆ. అ.) దొంగిలింపఁబడినది.

**చోరీ.** హిం. వి. దొంగతనము.

**చోరుఁడు.** సం. వి. అ. పుం. దొంగ, తస్కరుఁడు.
**చోలము.** సం. వి. అ. పుం. 1. కుప్పసము; 2. అవిక.
**చోషము.** సం. వి. అ. పుం. పీల్చుట.
**చోష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పీల్చఁదగినది.

## చౌ.

**చౌరము.** సం. వి. అ. పుం. చోరపుష్పి¶.
**చౌరికే.** సం. వి. ఆ. స్త్రీ. చౌర్యము, దొంగతనము.
**చౌరుఁడు.** సం. వి. అ. పుం. తస్కరుఁడు, దొంగ.
**చౌర్యము.** సం. వి. అ. న. దొంగతనము.
**చౌలము.** సం. వి. అ. న. జుట్టుపెట్టి తలవెండ్రుకలుతీయుట.

## చ్యు.

**చ్యుతము.** సం. విణ. (అ. ఆ. అ.) జాఱినది, ప్రస్తము.
**చ్యుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. జాఱుపు; 2. విముపు.

## చే.

**చే.** ఒక యక్షరము.
**చేంక.** వై. వి. బాహుమూలము, కక్షము.
**చేంకతాలి.** దృ. వి. చేంకను దగిలించుకొనుమూట.
**చేంకిలి.** వై. వి. చంక, కక్షము. (చూ. ఇఱుకు.)
**చేంగలించే.** దే. అ. క్రి. చలించే. "గీ. కమ్మకస్తురిచెక్కులఁ గరఁగిజాఱఁ, జన్నుఁగవమీఁదిపయ్యెదచంగలింప." వై. ౧, ఆ.
**చేంగు.** దే. వి దాఁటుటయందగుననుకరణము. "చంగునదాఁటు చూపులిరుచక్కనిజేడిసలేమొ." విజ. ౧, ఆ.
**చేంటిపాప.** దే. వి. (చన్ను+పాప.) స్తన్యపానముచేసెడుబిడ్డ.
**చేండి.** వై. వి. పార్వతి. విణ. 1. మూర్ఖపుఁబట్టుగలవాఁడు*; "దక్కనేనిపచ్చడికలపంగవెండి యనుజండితనంబున వచ్చి వచ్చిపో, రెడుమొనలు." భార. విరా. ౫, ఆ.–2. క్రూరుఁడు*. "చ. చండితనంబునసీవుగన్నసీ, యనుపమకీర్తికింతట నమాప్తియొనర్పఁగఁజూవెవచ్చితిఁ." హరి. పూ. ౯, ఆ.
**చేండిపోతు.** దృ. విణ. మూర్ఖపుఁబట్టుగలస్వభావముగలవాఁడు.
**చేంద్ర.** దే. వి. ఖదిరము¶. (దీనిభేదము వెలిచంద్ర, దానినే ఉంద్రయందురు.)
**చేందమామ.** వై. వి. చంద్రుఁడు.
**చేందమామగుర్రుక్కిళ్లు.** దృ. వి. బ. అధరామృతము. "గీ. ఎలమిసుముహూర్తమునఁదెరయెత్తునంత, బ్రేమమదిమీఱఁగాఁజంద మామచెలుల, కెంపుమోవులసుధకుగుర్రుక్కిళ్లు మ్రింగ, ఖీతిఁగలిగెఁజందమామగుర్రుక్కిళ్లనాడు." కళా. ౫, ఆ. (ఇట్లు చందమామనుటకలు. ఈ యర్థమింకనువిచార్యము.)
**చేందమామపక్కె.** దృ. వి. మత్స్యవిశేషము.
**చేందమామపులుఁగు.** దృ. వి. చకోరము.
**చేందము.** వై. వి. 1. ఛందస్సు; 2. విధము*. "సీ. పదబంధశిథిలతపాటిల్లఁగానీక యేచందములయందునేమిజిలక." కళా. ౧, ఆ.

**చేందా.** దే. వి. ఉపహారము, కానుక. "శా. ఆందోళింపఁగఁజేసె ముందుగఁజరాహార్యంబులంకేశ్వరుం, డెందుందుర్జయుఁడింద్రుఁ డీడొరయుచోనేమెంచునోవాఁడుశాం, పొందంగానిక యిత్తునంచుఁ దలిగట్టుత్కంఠతో నెత్తుమేల్, చందాగొంపు లెఱుంగనందవలకె భాస్వద్విజంబుముం దూర్చునన్." ఉ, గా. ౪, ఆ.
**చేందిరిక.** వై. వి. వెన్నెల.
**చేందు.** వై. వి. 1. చంద్రుఁడు; "గీ. అంతమాగధకాంతాస్య మొత్తనవ్యశ, మంద్రునతినిద్ర మేల్కని హరివరంపు, శాంపుచే మోముకళలిమ్మడింపనగుదు, రెందుననిముందెజాతెనాఁజందుగ్రుంకె." రా, వి. ౧, ఆ.–2. అందము*; "సీ. నకలరక్షోపాయ చణములై భుజముల శంఖచక్రంబులుచందమీఱ." శశాం. ౧, ఆ.–3. నెల*. విణ. 1. అందమైనది*; 2. యోగ్యమైనది*. "ఉ. వీనహితంబుచెప్పనిటులేచిదురాచరణంబులిమ్మెయిన్, మానవరోగిచందయినమం దఱువుందెవ్వ లంటఁదాఁకినన్, గానియెఱుంగఁడప్ప ప్రతికారముగల్గునెయట్లునోలెన్, దైవనికృష్టవృత్తిఫలమందితలఁచెదుగాక మ్మటన్." నిర్వ. ౪, ఆ.
**చేందుగు.** దే. వి. వృక్షవిశేషము. "మ. సురపొన్నల్కలిగొట్లు చందుగులుకర్జూరంబులబ్బెంచఁదలున్." యు. ౫, ఆ.
**చేందుగుపెట్టె, చేందుకాపెట్టె.** దృ. వి. సొమ్ములులోనగు వాని నుంచుకొనెడు చిన్నపెట్టె.
**చేందురకావి.** దృ. వి. (చేందురము+కావి.) సిందూరవర్ణము.
**చేందురజోతి.** వై. వి. బాణపుసంచేవగ, పగలువత్తి.
**చేందురపూవు.** వై. వి. (చేందురము+పూవు.) కుసుంభపుష్పము.
**చేందురమామ.** వై. వి. చంద్రుఁడు. "ఉ. చల్లనివాఁడుమా నెలపు చందురమామ కడంగివేఁడుముల్, చల్లనివాఁడుమాయచటి చందనశైలసమీరుఁడు." కా. ౨, ఆ.
**చేందురము.** వై. వి. సిందూరము. "ద్వి. చందురంబులును బుస్తకమునుగోపి, చందనంబునుజూచిచనదునూనమ్మ." హరిశ్చ. ౨, భా. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము వికల్పముగాలోపించును. చందురకావి మొ.)
**చేందురా.** దృ. వి. చంద్రకాంతము. "ఎ, గీ. కప్పురపురేఖఁదగు నెమ్మొగంబునందు, రహిని లోకింపమది చందురాకరంగు." ఉ, రా. ౪, ఆ.
**చేందురుఁడు.** వై. వి. చందమామ, చంద్రుఁడు.
**చేందురుకూనలు.** వై. వి. బ. నక్షత్రము. (ఇట్లు చందురు పిల్లలు.)
**చేందురువంకలు.** వై. వి. బ. 1. చందురుకూనలు; 2. సందిటి నక్షత్రములు. (అనికొందఱు.)
**చేందువ.** వై. వి. చందువాయొక్కరూపాంతరము. "సీ. పట్టుచందువజాలవల్లికబాగాలపెట్టెనంబెళగచ్చుబిరడబరణి." రుక్మాం. ౪, ఆ.
**చేందువా.** వై. వి. మేలుకట్టు.
**చేంద్రకావి.** దృ. వి. చందురకావియొక్కరూపాంతరము. "గీ. అలవనంతభరాకాంతుఁడరుగుదేర, రాచిలుకచాలుపచ్చతోరణము గాఁగ, పొంద్రగతిఁగట్టుమేల్కట్టుచంద్రకావి, యంశుకంబులు నాఁబూచెగింశుకంబు." రామా. ౧, ఆ.
**చేంద్రము.** వై. వి. చందురముయొక్కరూపాంతరము. "సీ. చక్రవాకములకుఁజల్లఁగామందుఁద్రాఁగించినచంద్రంపుగిన్నెయనఁగ." ఉ, హరి. 3, ఆ. (వృత్తియందు చందురమునకువలె కార్యము నెఱుంగునది. చంద్రకావి మొ.)

**చేంపు.** దే. ప్రే. చేవఁజేయు.

**చేంపుడుగట్టు.** ద్వి. వి. వధస్థానము.

**చేకచేక.** దే. వి. పరువ్వటయందును, పాఱుటయందును అగునను కరణము. "చ. చికిలిపసిండిప్రాఁతనును చెంద్రికవన్నియమేలు కట్టునం, జకచకఁబర్వ." వసు. ౬, ఆ. "మోరత్రిపుత్రోఁజకచకఁ బాఱుతెంచు." భల్లా. ౨, ఆ.

**చేక్క.** వై. విశే. 1. సుందరము; 2. ఋజువు*. "గీ. చక్కనా పాలికేతెంచునొక్కవీఁడు." భార. శల్య. ౨, ఆ.

**చేక్కఁజేయు.** వై. స. క్రి. (చక్క + చేయు.) 1. సవరించు; 2. పాడుచేయు; 3. ముగించు. "గంగానందనుఁగూల్చి ద్రోణు పని చక్కంజేసి." భార. భీష్మ. ౨, ఆ.

**చేక్కఁదనము.** వై. వి. (చక్క + తనము.) 1. సౌందర్యము; 2. ఋజుభావము. "సీ. కమలలోచనకుంతలములువక్రములని తనువల్లికకుఁజక్కఁదనమునొసఁగి." విక్ర. ౪, ఆ.

**చేక్కఁబడు.** వై. అ. క్రి. (చక్క + పడు.) సరిపడు. "క. ఎదిరిందమయట్టులకా, మదిఁదలఁచినఁబొసఁగుఁగాకమాకుంగుడు మిం, డిదెమీరువ్రక్కఁగొనుఁడని, చదురడిచినమనసుపొందు చక్కంబడునే." భార. ఉద్యో. ౧, ఆ.

**చేక్కఁబెట్టు.** ద్వి. స. క్రి. (చక్క + పెట్టు.) 1. సరిచేయు; "అసురప్రకృతినక్కంబెట్టఁగావచ్చునే." హరి. ఉ. 2, ఆ.— 2. నాశముచేయు. "క. చాలనివారింగొని, యేచక్కంబెట్టువాఁడ నేఁబాండవులన్." భార. ఉద్యో. ౨, ఆ.

**చేక్కటి.** యు. దే. వి. 1. కార్యము; "చ. నీకునొకచక్కటి యెక్కటి వేఁడఁగల్గెనే. గీ. కలుగుటయుమీరువిచ్చేయుకారణమున, సందియములేదుమీయట్టిసంయములకు, నేమికార్యంబుగలిగెనోయి ఋఁగరాదు, తెలుపవేనాకునిర్మలధీనిధాన." ఉ, హరి. ౪, ఆ.— 2. దిక్కు; "గీ. కంబెనాంగేయునతనిచక్కటిశిఖండిఁ, బెట్టుము." భార. భీష్మ. 3, ఆ.—3. స్థానము. "సీ. గగనంబునడిమిచక్కటి నొప్పునరుణాంశుకరణిఁగౌస్తుభమువక్షమునవెలుఁగ." హరి. ఉ. ౪, ఆ.—వై. 1. ఆర్జవము*; "క. ఎక్కడనడచును సత్యం, బెక్కడధర్మంబుపరఁగునెక్కడఁగలుగుం, జక్కటినిలుచుంగృష్ణుం, డక్కడనతఁడున్నకడననగుజయమధిపా." సం. "యతస్సత్యంయతో ధర్మో యతో హ్రీరార్జవంయతః, తతోభవతిగోవిందో యతఃకృష్ణస్తతో జయః." భార. ఉద్యో. ౨, ఆ.—2. న్యాయము*. "చక్కటి లేనియాలమునఁజంపెననక వలదు." భార. శల్య. ౨, ఆ.—విశే సరి*. "భీష్ముండుకడంక మైనడుచుచోటికిఁజక్కటిగాఁగ." భార. భీష్మ. ౧, ఆ.

**చేక్కడుచు.** ద్వి. స. క్రి. (చక్కు + అడచు.) 1. ఖండించు, "గీ. అసుగులడిదంబుచేతఁజక్కడిచియైన" భీ. ౬, ఆ.— 2. చంపు. "ఇక్కడినేఁజక్కడిచెదెనియుఁజూతునశాక." భార. భీష్మ. 3, ఆ.

**చేక్కన.** వై. వి. 1. అందము; 2. సరి*. "సాకుఁజక్కనైపోవక నిలువ." భార. ఆది. ౪, ఆ. (విశేషణముగుచో చక్కనివాఁడు. చూ. అలకన.)

**చేక్కనయ్య.** వై. వి. (చక్కని + అయ్య.) మన్మథుఁడు. "ఎ, గీ. పూర్ణచంద్రముఖినేఁచకయ్యయోచక్కనయ్య." వసు. 3, ఆ.

**చేక్కాడు.** ద్వి. స. క్రి. (చక్కు + ఆడు.) 1. ఖండించు; 2. చెంపు.

**చేక్కి.** దే. వి. 1. స్థానము; "సీ. అవ్విటనడిచక్కినభిరామశుభ విభాధగధగాయితమొక్క నగరుగాంచె." పాండు. ౨, ఆ.— 2. వాద్యవిశేషము. "వల్లకిచక్కికాహళయు." కాశీ. ౧, ఆ.

**చేక్కియ.** దే. వి. పార్శ్వము. "ఎ, గీ. అయ్యెఱుకురాజు, ముం దఱను జక్కియలనొక్కమొగిననిలిచి." భార. అర. ౧, ఆ.

**చేక్కిలము.** వై. వి. భక్ష్యవిశేషము.

**చేక్కిలి.** వై. వి. చంకిలియొక్కరూపాంతరము.

**చేక్కిలిగింత.** ద్వి. వి. (చక్కిలి + గిలిగింత.) అన్యకరస్పర్శము చేతఁగలిగెడు చంకమొదలైన యంగములసంకోచము.

**చేక్కిలిగింతలువోవు.** ద్వి. అ. క్రి. (చక్కిలిగింతలు + పోవు.) అన్యకరస్పర్శముచేత చంకమొదలైన యంగములు సంకోచపడు. కళా. ౧, ఆ.

**చేక్కిలిగిలి.** ద్వి. వి. చక్కిలిగింత.

**చేక్కీ.** దే. వి. పల్లకిలోనియడుగుచట్టము.

**చేక్కీపంచదార.** ద్వి. వి. గడ్డకట్టినతెల్లచెక్కెర.

**చేక్కు.** వై. వి. 1. ఆఱు; 2. ఖండము.

**చేక్కుచేయు.** వై. స. క్రి. ఖండించు. (చూ. చెండి.)

**చేక్కెర.** వై. వి. పంచదార, శర్కర.

**చేక్కెరతిండి.** ద్వి. వి. చిలుక. "చక్కెరతిండితత్తడివెసందుమి కించుచు." ఉ, రా. ౪, ఆ.

**చేక్కెరబుగడ.** ద్వి. వి. భక్ష్యవిశేషము. "వ. సుకియ లమృత కలశమ్ములు సొఁగులుఁ జక్కెరబుగడలుక్కెరలు." హంస. ౧, ఆ.

**చేక్కెరవిలుకాఁడు.** ద్వి. వి. మన్మథుఁడు. (చూ. ఇక్కువ.) (ఇట్లు చక్కెరవిలుతుఁడు.)

**చేగుసు.** దే. వి. చేవుడుయొక్క మొదటిరూపము.

**చేచ్చవుకము.** వై. విశే. (చవుకము + చవుకము.) సరియైనచౌకము.

**చేచ్చు.** దే. అ. క్రి. కాలముచేయు, మరణించు.

**చేచ్చెడి.** దే. వి. చండాలజాతిభేదము.

**చేచ్చుదు.** దే. విశే. చచ్చినది. (చచ్చుడుబాకి మొ.)

**చేటాలు.** దే. వి. వ్రేయుటయందగు ధ్వన్యనకరణము. "సీ. చండి కాజానేయగండప్రకాండముల్ వీఁకఁజటాలువ్రేయవచ్చు." కా. ౫, ఆ.

**చేటిల్లు.** దే. వి. వ్రేయుటయందగు ధ్వన్యనుకరణము. "గీ. బాహు లెత్తిచటిల్లునఁబడితళించి." ఉ, హరి. ౬, ఆ.

**చేటులువడు.** ద్వి. అ. క్రి. (చేటులు + పడు.) మొక్కవోవు. "సీ. సర్వభూతంబులశాసింపఁజాలెడు జములాత్రగిరియందుఁ జటులువడునె." సం. "భవేత్కుంఠితసామర్థ్యస్సకథంగిరిమాత్రకే." కాశీ. ౨, ఆ.

**చేట్ట.** యు. దే. వి. 1. కొంచెముధాన్యముపోసినచిన్నగోనె; 2. తొడకు వెలుపలిభాగము. వై. 1. కవచము; "ఉ. చట్టలుదీరియుండొడలు చక్కలుచేసియుఁజెండివైచియున్, బొట్టలుచించియున్ మెడలు బోరనఁద్రుంచియుఁబోరొనర్పఁగన్." రా. యు, కాం.—2. చొ క్కాయ; "సీ. పైతాణియరచట్టపైనిగ్గుచిప్పిలుజవాజీవాసనల్ నివ్వటిలఁగ." భాను. ౪, ఆ.—3. పూఁత*. "సీ. చాదువు గుబ్బలినెలపురుటింటియిడుపునఁ జఱచినగందంపుఁజట్టలనఁగ." పా. ౨, ఆ.

## చో.

**చోఁ.** దే. వి. అచ్చోటఁ, ఇచ్చోటఁ, కానిచోటఁ, లేనిచోటఁ ఇత్యాది సమాసపదములయందు, ఉత్తరపదమైనచోటు శబ్దముయొక్క సప్తమీ విభక్తిరూపమునందు టవర్ణము లోపింపఁగా మిగిలినది. (ఉదా. అచ్చోఁ, ఇచ్చోఁ, కానిచోఁ, లేనిచోఁ మొ.) (ఇది కొన్నియెడల అప్పుడు అనునర్థమునిచ్చుచున్నది. "ప్రాణహాని తప్పించుచో." ఇత్యాదులు.)

**చోటు.** దే. వి. తావు, ప్రదేశము.

**చోడి.** దే. వి. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము. (చోళ్లు.)

**చోడు.** దే. వి. సోడు, బ్రహ్మరంధ్రము. "చ. దలమగుపచ్చకప్పురపుఁదావులు పైఁబయిఁ జోడుముట్ట." విక్ర. ౧, ఆ. (ఇది తఱచుగ సకారాదిగానే వాడఁబడుచున్నది.)

**చోడుమ.** దే. వి. చోద, కష్టము.

**చోద.** దే. వి.——పై.——

**చోపు.** వై. స. క్రి. 1. కలఁచు; 2. త్రోలు*; "ఎమ్మెయిఁ జోపినఁ బోవక మూఁగెడుఁ బక్షితతుల్." భార. స్త్రీ. ౨, ఆ.—3. తఱుము*. "ద్వి. సమ్మదంబుగఁజోపిజయమొందుఁగాక." భాగ. ౧౦, స్కం.—వి. కలఁత. "పోఁగువాటించిగొబ్బునఁజోపువెట్టించి." రామా. ౨, ఆ.

**చోపుడు.** వై. వి. కలఁత. "గీ. కలయఁజోపుడువెట్టింపఁగరియుఁ గిరియుఁ, గాసరముఁగేసరియుదుప్పికడితియెలుఁగుఁ, బులియుమొదలగుమెకములు కలఁకదొలఁకఁ, జెదరినలుదిక్కులకుఁబాఱెసదరిబెదరి." ఉ, రా. ౨, ఆ.

**చోపుడుఁగోల.** ద్వ. వి. (చోపుడు+కోల.) చోపుపెట్టుకోల. "వ. అత్తఱిందత్తఱంబునమొత్తంబైచోపుడుఁగోలలుగొనికెలంకులపాలంబులఁబులుఁగులంజోపుచు." స్కా. ౪, ఆ. (ఇట్లు చోపుడుఁగట్టె.)

**చోపుదారుఁడు.** హిం. వి. వేత్రధరుఁడు.

**చోలు.** దే. వి. మత్స్యవిశేషము. "సీ. చోలువైవారాశిఁదూఱిచోరునిజీరిమీరుచారు విహారమేలుకొనుము." ఉ, రా. ౫, ఆ.—విణ. బాలుఁడు.

**చోలుబుడుత.** దే. వి. 1. చోలుమీనుపిల్ల; 2. చేఁపలవంటికన్నులుగలయాఁడుది. "సీ. అనిమిషాక్షీమునుంగునాటలాడెదవేమెపడఁతుక నేఁ జోలుబుడుతఁగానె." చంద్ర. .

**చోలువాఁడు.** దే. విణ. బాలుఁడు. "సీ. అడపంబుచోలువాఁడెడవాయ కెడనెడమడిచినతెలనాకుమడుపులొసఁగ." ఉ, రా. ౬, ఆ.

**చోలా.** వై. వి. చొక్కాయ. (అప్ర.)

**చోవి.** దే. వి. బూరెలమీఁదమూఁతగాపెట్టెడుపిండి.

**చోళ్లు.** దే. వి. బ. (చోడి+లు.) ఒకదినుసు తవిఁదెలు. "క. ఉలవలు కందులు కోద్రవ, ములు కంబులు రాజమాషములు ననుములు చో, ళ్లులు తవిఁదెలు నూఁదరలును, గలవనియిడఁజనదుపై తృకమ్మునవధిపా." వి, పు. ౪, ఆ.

## చౌ.

**చౌ.** వై. స. నాలుగు. (చవుయొక్కరూపాంతరము.) విణ. వృత్తియందుచౌకమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (చౌడోలు మొ.)

**చౌక.** దే. విణ. 1. అగ్గువ; 2. తక్కువ. "ఎ, గీ. నాటిప్రియము, చౌకయైనట్టియిచ్చటఁజనదు నిలువ." అము. ౫, ఆ. (చవుకయొక్కరూపాంతరము.)

**చౌకటులు.** ద్వ. వి. బ. చౌకట్టులుయొక్కరూపాంతరము. (పోఁగులకు.—"సీ. బలుముత్తియపుఁజౌకటులడాలునిద్దంపుబవిరిగడ్డముమీఁదఁజవుకళింప." సీలా. ౨, ఆ.) (మొదటిరూపము చవుకటులు.)

**చౌకట్టులు.** ద్వ. వి. 1. నాలుగుముత్యములుచేర్చికట్టినపోఁగులు; (చవుకట్టులుయొక్కరూపాంతరము. "లయగ్రాహి. బంగరుపుఁజెక్కులఁజెలంగుచవుకట్టుల మెఱుంగుబలుచక్కలపయిఁగినిసి జంగల్, చెంగునఁగొనఁ." రా; వి. ౨, ఆ.)—2. దోరణపుఁబట్టెమీఁద కపిలెబిల్లకు ఆధారముగా ఇరుప్రక్కలనమర్చెడు గుజ్జలు; 3. చేట్టము.

**చౌకము.** వై. వి. 1. చదరము*; 2. నిడుపువెడల్పులుసరిగాఁగలతుండుగుడ్డ*; 3. అశ్వగతివిశేషము*. "చ. జవమునభంజళిఁ మురళిఁజౌకమునఁ నడసైదుదారలఁ." రా. బాల, కాం.—స. నాలుగు. "ద్వి. అడిగినధనముఁ జయ్యనఁ జౌకమెన్ని." (చౌకమెన్ని అనఁగా చౌకముగా ఎన్నియనియర్థము. రూపాయలు నాలుగేసిగా ఎంచుటవాడుక.) హరిశ్చ. ౨, భా. (చవుకము యొక్కరూపాంతరము.)

**చౌకసేయు.** దే. స. క్రి. (చౌక+చేయు.) తక్కువపఱచు. "గీ. పౌరసతులనరసభాషామృతంబుల, సౌనలితనిచెవులసోఁకనేని, గొల్లసతులతోడికూరిమితలపోసి, యితఁడుచౌకసేయకేలమాను." విపు. ౭, ఆ. (చవుకసేయుయొక్కరూపాంతరము.)

**చౌకళి.** ద్వ. వి. (చౌ+కాళ్లు.) ఆఁడువారికోకలనేఁతయందు నూలిపోఁగులచేత నేర్పడిన చచ్చౌకపుటిల్లు. "చ. సుహాణులచౌకాటపుఁజౌకళి కట్టువర్గముఁ, గమ్మఁబ్రియమొప్పనిచ్చికుతుకస్థితి నవ్వసుమంతునప్పుడ, యొయ్యడయండుపంప." శుక. ౧, ఆ. (చవుకళియొక్కరూపాంతరము.)

**చౌకళించు.** ద్వ. అ. క్రి. (చౌకళి+ఇంచు.) నాలుగుకాళ్లుపైకెత్తి దాఁటు. "క. అనగరువెడలియొకకే, లీనగకూటాగ్రమెక్కి లీలాగతినం, ధానముసఁజౌకళించెఁ, వానరవీరుండశోకవనిలోపలికిఁ." రామా. ౬, ఆ. (చవుకళించుయొక్కరూపాంతరము. "ఎ, గీ. చెవులరుద్రాక్షపోఁగులు చవుకళింప." స్కా. ౧, ఆ.)

**చౌకళింత.** ద్వ. వి. 1. చౌకళించుట; 2. అశ్వగతివిశేషము. (చూ.) వల్గితము. (చవుకళింతయొక్కరూపాంతరము.)

**చౌకాఁడిగుదియ.** ద్వ. వి. నాల్గుపక్కలుతీరిన యినుపదండము. "చౌకాఁడిగుదియలమోఁదిన." కవిక. ౨, ఆ. (చవుకాఁడిగుదియయొక్కరూపాంతరము.)

**చౌకారము.** వై. వి. నబ్బు. (చవుకారముయొక్కరూపాంతరము.)

**చౌకాలిపీఁట.** ద్వ. వి. నాలుగుకాళ్లుగల యెత్తుపీఁట. (చవుకాలిపీఁటయొక్కరూపాంతరము.)

**చౌకీ.** వై. వి. సుంకరిమెట్టు*. (చవుకీయొక్కరూపాంతరము.)

**చౌకు.** దే. వి. చేఱుకోల, కశ. (చవుకుయొక్కరూపాంతరము.)

**చౌకుచెట్టు.** దే. వి. ఒకానొక విదేశవృక్షము.

**చౌగంటి.** ద్వ. వి. (చౌ+కంటి.) 1. అగ్నిదేవుఁడు; 2. శరభమృగము. (చవుగంటియొక్కరూపాంతరము.)

**చౌటుప్పు.** దే. వి. (చౌటి+ఉప్పు.) రౌమకము. (చవుటుప్పుయొక్కరూపాంతరము.)

**చౌడు.** దే. వి. 1. చౌటినేల; 2. చౌటిమన్ను. (చవుడుయొక్క రూపాంతరము.)

**చౌడోలు.** వ్య. వి. (చౌ+డోలి.) పీనుగుకంపుమీఁద కూర్చుండుటకమర్చినడోల్కి. (చతుర్డోలుయొక్క రూపాంతరము.)

**చౌతా.** వై. వి. డోలి. (చత్రాయొక్క రూపాంతరము.)

**చౌతి.** వై. వి. పక్షమందు నాలుగవతిధి. (చవుతియొక్క రూపాంతరము.)

**చౌతు.** దే. వి. ఒకవింతైనపుల్లాయ. "సీ. బూడిద్రుంగినమొగంబునగౌవకట్టుమైనపుమైలచ్రాఁడౌతునావెలుంగ." ఆము. ౬, ఆ. (చవుతుయొక్క రూపాంతరము.)

**చౌదంతి.** వై. వి. ఇంద్రునియేనుఁగు. (చవ్రదంతియొక్క రూపాంతరము.)

**చౌదరి.** వై. వి. గ్రామమునకైనను, పరగణాకైనను పెత్తనకాఁడగు కాఁపు*. (చవ్రుదరియొక్క రూపాంతరము.)

**చౌపదము.** వై. వి. నాలుగుమూలలు*. "సీ. దంతిదంతమ్ములాతముగఁద్రిప్పుచునామఁజౌపదమ్ము లక్షఁబిశాచమొకటి." వై. ౫, ఆ. (చవ్రుపదముయొక్క రూపాంతరము.) (ఈ యర్థమింకను విచార్యము.)

**చౌపుటము.** వై. వి. (చౌ+పుటము.) నాలుగుకాళ్లుపైకెత్తి దాఁటెడుదాఁటు. "సీ. లేళ్లభంగినిజౌకళించిచౌపుటములొక్కమ్మడి పదునైదునఁటికియుఁటికి." అని. ౨, ఆ. (చౌకళించి అని యుండుటచే ఇక్కడ దాఁటుమాత్రమర్థము. (చవ్రుపుటముయొక్క రూపాంతరము.)

**చౌరు.** దే. వి. తీపుతోకలసిన యించుక ఉప్పు. (చవురుయొక్క రూపాంతరము.)

**చౌలు.** వై. వి. బ. ముత్తెపుకాంతి*. నిజ. ౧, ఆ. (చవులుయొక్క రూపాంతరము.)

**చౌషష్టి.** వై. గ్రా. స. అఱువదినాలుగు. "ఎ, గీ. ఖగములగములు చవుషష్టికళలుఁగళలు." రుక్మాం. ౫, ఆ. (చవుషష్టియొక్క రూపాంతరము.)

**చౌసాల.** వై. వి. చుట్టుకొల్లావు. (చవ్రసాలయొక్క రూపాంతరము.)

**చౌసీతి.** వై. స. ఎనుబదినాలుగు. (చౌసితిబంధములు.) (చవుసీతియొక్క రూపాంతరము.)

## ఛ.

**ఛ.** ఒకయక్షరము.

**ఛందము.** సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. వశము.

**ఛందస్సు.** సం. వి. స్. న. 1. పద్యలక్షణముచెప్పెడు శాస్త్రము; (ఛందస్సులు ఇరువదియాఱు.—ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి.) 2. వేదము; 3. యథేచ్ఛమైన నడవడిక; 4. ఇచ్ఛ.

**ఛగల.** సం. వి. ఆ. స్త్రీ. బొడ్డీ. అ. న. ము. నీలికోక. పుం. 1. [illegible]; 2. పిడకనిప్పు.

**ఛట.** సం. వి. ఆ. స్త్రీ. 1. గుంపు; 2. వరుస.

**ఛడాయించుట.** గ్రా. క్రి. ఎచ్చుచేయుట.

**ఛడి.** హిం. వి. చువ్వ, బెత్తము.

**ఛత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. గుఱ్ఱిగామంచికీ; 2. అడవిసదాపకీ; 3. కొత్తిమిరికీ; 4. పుట్టగొడుగు. అ. న. ము. గొడుగు. (కృష్ణచ్ఛత్రము కావారి.)

**ఛత్రభంగము.** సం. వి. అ. పుం. 1. రాజ్యనాశము; 2. స్వాతంత్ర్యము; 3. ముండమోపితనము.

**ఛత్రాకము.** సం. వి. అ. న. పుట్టగొడుగు.

**ఛత్రాకి.** సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షికీ.

**ఛత్రాతిఛత్రము.** సం. వి. అ. పుం. గడ్డిదుబ్బు.

**ఛదనము.** సం. వి. అ. న. 1. ఆకు; 2. ఈఁక; 3. ఱెక్క; 4. కప్పు.

**ఛదము.** సం. వి. అ. పుం. 1. ఆకు; 2. ఈఁక; 3. ఱెక్క; 4. గండివసముకీ; 5. చీఁకటిమ్రాను.

**ఛది.** సం. వి. స్. న. ఇంటికప్పు, పటలము.

**ఛద్మము.** సం. వి. న్. న. 1. నెపము; 2. మోసము.

**ఛన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఏకాంతము; 2. కప్పఁబడినది.

**ఛర్దనము.** సం. వి. అ. న. వమనము. పుం. వేముకీ.

**ఛర్ది.** సం. వి. ఇ. స్త్రీ. ఛర్దనము, వమనము.

**ఛలము.** సం. వి. అ. న. 1. నెపము; 2. వెనుదీయుట; 3. ఒకయభిప్రాయముతో చెప్పిన పదమునకు మఱియొక యభిప్రాయము చేసికొని యుత్తరముచెప్పుట. (ఇది వాదదోషములలో నొకటి.)

**ఛవి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి; 2. కిరణము.

## ఛా.

**ఛాందసుఁడు.** సం. వి. అ. పుం. వేదము చదివినవాఁడు, శ్రోత్రియుఁడు.

**ఛాందోగ్యము.** సం. వి. అ. న. ఒకానొక ఉపనిషత్తు.

**ఛాగము.** సం. వి. అ. పుం. మేఁకపోతు, అజము.

**ఛాగి.** సం. వి. ఈ. స్త్రీ. మేఁక, అజ.

**ఛాతము.** సం. విశే. (అ. ఆ. అ.) నఱకఁబడినది, ఛిన్నము.

**ఛాత్రము.** సం. వి. అ. న. పెద్ద తేనెతెట్టె.

**ఛాత్రుఁడు.** సం. వి. అ. పుం. శిష్యుఁడు, చట్టు.

**ఛాదనము.** సం. వి. అ. న. కప్పుట, ఛదనము.

**ఛాదితము.** సం. విశే. (అ. ఆ. అ.) కప్పఁబడినది, ఛన్నము.

**ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. 1. నీడ; 2. కాంతి; 3. శోభ 4. వర్ణము; 5. ప్రతిబింబము; 6. సూర్యునిభార్య; 7. రక్షణము; 8. లంచము; 9. వరుస; 10. ఇంచుక. (కాంతిశోభలక్షణభేదము అలంకారగ్రంథమునందు చూచునది.)

**ఛాయాకరుఁడు.** సం. వి. అ. పుం. గొడుగుపట్టువాఁడు. విశే. నీడనుగలుగఁజేయువాఁడు.

**ఛాయాతరువు.** సం. వి. ఉ. పుం. నీడచేతనే మిక్కిలి ఉపయోగకరముగానుండెడు పెద్దచెట్టు.

**ఛాయాపుత్రుఁడు.** సం. వి. అ. పుం. శని, చాయపట్టి.

## ఛి.

**ఛిద.** సం. వి. ఆ. స్త్రీ. ఛేదము, నఱుకుట.

**ఛిదురము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఛేదించునది; 2. భాగించునది.

**ఛిద్రము.** సం. వి. అ. న. 1. బెజ్జము; 2. తప్పు.

**ఛిద్రితము.** సం. విశే. (అ. ఆ. అ.) బెజ్జమువేయఁబడినది, ఛిద్రము.

**ఛిన్న.** సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ. విశే. ఛేదింపఁబడినది.

**ఛిన్నరుహ.** సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ.

## ఛు.

**ఛురిక.** సం. వి. ఆ. స్త్రీ. చురకత్తి, శస్త్రి.

**ఛుల్లి.** సం. వి. ఈ. స్త్రీ. చుల్లి, ప్రొయ్యి.

## ఛే.

**ఛేకము.** సం. వి. అ. పుం. పెంపుడుమృగము (లేక) పెంపుడు పక్షి. విశే. నాగరికము.

**ఛేకానుప్రాసము.** సం. వి. అ. పుం. రెండేసివ్యంజనాక్షరములు జతజతగా ఎడనెడఁ జెప్పఁబడు అనుప్రాసభేదము. "పంచచామరము. స్ఫురత్కృపా బల ప్రతాప భూతి ధైర్య భూభరా, ర్చిరంగ దాన బుద్ధివైఖరిక్ హరిక్ హరిక్ సుధా, హరుక్ హరుక్ గిరిక్ గిరిక్ మహానలుక్ నలుక్ రమా, గురుక్ గురుక్ జయింతు వౌదగుక్ నృసింహభూవరా." కా. ర, ఆ.

**ఛేత్త.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) ఛేదించువాఁడు.

**ఛేత్తవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ఛేదింపఁదగినది.

**ఛేదనము.** సం. వి. అ. న. 1. ఛేదించుట; 2. భేదము.

**ఛేదము.** సం. వి. అ. పుం. 1. నఱుకుడు; 2. తునక; 3. భిన్నాంకమునందు క్రిందిసంఖ్య.

**ఛేదించు.** సం. స. క్రి. 1. నఱుకు; 2. త్రుంచు.

**ఛేదితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది.

**ఛేదితవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ఛేదింపఁదగినది.

**ఛేద్యము.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

## ఛో.

**ఛోటిక.** సం. వి. ఆ. స్త్రీ. చిటిక.

## జ.

**జ.** ఒకయక్షరము.

**జంగమము.** సం. విశే. (అ. ఆ. అ.) తిరుగునది, చరిష్ణువు.

**జంగముఁడు.** సం. వి. అ. పుం. జంగమువాఁడు.

**జంగలము.** సం. వి. అ. పుం, న. మాంసము. విశే. జనములేనిది. (చోటు.)

**జంఘ.** సం. వి. ఆ. స్త్రీ. వట్టికాలివెనుకటిభాగము, పిక్క.

**జంఘాకరికుఁడు.** సం. వి. అ. పుం. దూరముగ సమాచారము తెలిసికొనిపోయి వచ్చిచెప్పి జీవించువాఁడు, పరుగెత్తువాఁడు. (అనికొందఱు.)

**జంఘాలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి వడిగనడచువాఁడు.

**జండా.** హిం. వి. టెక్కెము, ధ్వజము.

**జంతుఫలము.** సం. వి. అ. పుం. మేడిపండు.

**జంతువు.** సం. వి. ఉ. పుం. ప్రాణముకలది, చేతనము.

**జంతె.** దే. వి. కలుఁపుపోవ్రనట్టు దున్ను పనిముట్టు, దంతె.

**జంత్రము.** సం. వి. అ. న. యంత్రము. "సీ. రహివృట్టజంత్రగాత్రములజాల్ గరఁగించు విమలగాంధర్వంబువిద్యమాకు." సావి. ౩, ఆ.

**జంపతులు.** సం. వి. ఇ. పుం. ద్వి. ఆలుమగలు, దంపతులు.

**జంబాలము.** సం. వి. అ. పుం. 1. అడుసు; 2. పాఁచి.

**జంబీరము.** సం. వి. అ. పుం. 1. నిమ్మ; 2. మరువము. (చూ. జంభీరము.)

**జంబుకము.** సం. వి. అ. పుం. నక్క, ఫేరవము.

**జంబుకుఁడు.** సం. వి. అ. పుం. 1. వరుణుఁడు; 2. నీచుఁడు.

**జంబువు.** సం. వి. ఊ. స్త్రీ. ఉ. న. నేరెడుపండు. ఊ. స్త్రీ. 1. నేరెడుచెట్టు; 2. నేరెడుదీవి; 3. నేరెటేఱు.

**జంభభేది.** సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

**జంభము.** సం. వి. అ. పుం. 1. నిమ్మ; 2. పల్లు; 3. తింటి. డు. ఒకానొకరాక్షసుఁడు.

**జంభలము.** సం. వి. అ. పుం. నిమ్మ. డు. జినదేవుఁడు.

**జంభారి.** సం. వి. ఇ. పుం. 1. ఇంద్రుఁడు; 2. వజ్రాయుధము.

**జగచ్చక్షువు.** సం. వి. స్. పుం. సూర్యుఁడు, జేగముకన్ను.

**జగతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. లోకము; 2. జనము; 3. భూమి; 4. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.)

**జగత్తు.** సం. వి. త్, న. జగము. పుం. గాలి. విశే. తిరుగునది.

**జగత్ప్రాణుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, గాలి.

**జగము.** సం. వి. త్, న. జగత్తుయొక్కరూపాంతరము.

**జగలము.** సం. వి. అ. పుం. 1. మంగ; 2. మద్యపిష్టము. విశే. మోసకాఁడు.

**జగ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) తినఁబడినది, భక్షితము.

**జగ్ధి.** సం. వి. ఇ. స్త్రీ. భోజనము, కుడుపు.

**జఘనము.** సం. వి. అ. న. 1. మడికట్టు; 2. మొల.

**జఘనేఫల.** సం. వి. ఆ. స్త్రీ. బమ్మమేడి, కుక్కమేడి. (అనికొందఱు.)

**జఘన్యజుఁడు.** సం. వి. అ. పుం. శూద్రుఁడు. విశే. తమ్ముఁడు.

**జఘన్యము.** సం. వి. అ. న. 1. మగగుఱి; 2. తోఁక; 3. గొరిసె. విశే. 1. వెనుకటిది; 2. దూఱఁదగినది.

**జట.** సం. వి. ఆ. స్త్రీ. 1. జేడ; 2. ఊడ; 3. మాంసి.

**జటాయువు.** సం. వి. ఉ. స్. పుం. 1. గుగ్గిలపుచెట్టు; 2. ఒక గృధ్రము, సంపాతితమ్ముఁడు.

**జటాలము.** సం. విశే. (అ. ఆ. అ.) జేడలుగలది.

**జటావల్లి.** సం. వి. ఈ. స్త్రీ. రుద్రజేడ.

**జటి.** సం. వి. న్. పుం. 1. జువ్విచెట్టు; 2. జడలుగలసన్యాసి.

**జటిల.** సం. వి. ఆ. స్త్రీ. 1. మాంసిచెట్టు; 2. పిప్పలిచెట్టు. అ. పుం. ము. సింహము. విశే. జడలుగలది.

**జటులము.** సం. వి. అ. పుం. పుట్టుమచ్చ, తిలకము.

**జఠరము.** సం. వి. అ. పుం. కడుపు. విశే. 1. ముదిసినది; 2. కఠినమైనది.

**జడ.** సం. వి. ఆ. స్త్రీ. దురదగొండిచెట్టు. అ. న. ము. సీస్లు. విశే. 1. చల్లనైనది; 2. తెలివిలేనిది; 3. మూఁగది.

**జడత.** సం. వి. ఆ. స్త్రీ. మనస్సును, అంగమును చేష్టలు ఉడిగియుండుట.

**జడధి.** సం. వి. ఇ. పుం. జలధి, సముద్రము.

**జడిమ.** సం. వి. న్. పుం. జడత్వము. (చూ. జడిమము.)

**జడులము.** సం. వి. అ. పుం. పుట్టుమచ్చ, జటులము.

**జడ్జి.** ఆం. వి. న్యాయాధిపతి.

**జతుక.** సం. వి. ఆ. స్త్రీ. చిఱ్ఱకపిట్ట. అ. న. ము. 1. లక్క; 2. ఇంగువ.

**జతుకృత్తు.** సం. వి. త్. స్త్రీ. కోరిందచెట్టు.

**జతువు.** సం. వి. ఉ. న. లాక్ష, లక్క.

**జతూక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిందచెట్టు; 2. చిఱ్ఱకపిట్ట.

**జత్రువు.** సం. వి. ఉ. న. ద్వి. మూఁపులయొక్క సంధియెముకలు, కొంకులు.

**జనంగముఁడు.** సం. వి. అ. పుం. మాలవాఁడు.

**జనకుఁడు.** సం. వి. అ. పుం. 1. తండ్రి; 2. ఒకానొకరాజు.

**జనత.** సం. వి. ఆ. స్త్రీ. జనసమూహము.

**జననము.** సం. వి. అ. న. 1. పుట్టుక; 2. వంశము.

**జనని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి; 2. దయ; 3. కోరిందచెట్టు.

**జనపదము.** సం. వి. అ. పుం. 1. దేశము; 2. గ్రామము, గ్రామసమూహము. (అనికొందఱు.)

**జనపదుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు.

**జనము.** సం. వి. అ. పుం. 1. ప్రజ; 2. ఒకానొక లోకము. విశే. పామరుఁడు.

**జనయిత.** సం. వి. ఋ. పుం. తండ్రి, జనకుఁడు.

**జనయిత్రి.** సం. వి. ఈ. స్త్రీ. తల్లి, జనని.

**జనశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. జనులు చెప్పుకొనెడు వృత్తాంతము, నానుడి.

**జనాంతము.** సం. వి. అ. పుం. దేశము, జనపదము.

**జనాభా.** హిం. వి. జనసంఖ్య.

**జనార్దనుఁడు.** సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.

**జనాశ్రయము.** సం. వి. అ. పుం. జనులుచేరియుండునట్టి చోటు, మండపము.

**జని.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఆఁడుది; 2. పెండ్లాము. ఈ. స్త్రీ. 1. కోడలు; 2. కోరిందచెట్టు. ఇ. పుం, స్త్రీ. పుట్టుక.

**జనువు.** సం. వి. ఉ. స్. న. పుట్టుక, జననము.

**జనుషాంధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పుట్టుగ్రుడ్డి.

**జన్మము.** సం. వి. అ. పుం, న. న్. న. పుట్టుక, ఉద్భవము.

**జన్మి.** సం. వి. న్. పుం. జంతువు, మేతాలువు.

**జన్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లి చెలికత్తె; 2. తోడిపెండ్లికూఁతురు; 3. సుఖము. అ. న. ము. 1. యుద్ధము; 2. అంగడి; 3. దూఱు.

**జన్యుఁడు.** సం. వి. అ. పుం. 1. తండ్రి; 2. తోడిపెండ్లికొడుకు. విశే. 1. పుట్టఁదగినవాఁడు; 2. పుట్టించువాఁడు.

**జన్యువు.** సం. వి. ఉ. పుం. 1. జంతువు; 2. అగ్ని; 3. బ్రహ్మ.

**జప.** సం. వి. ఆ. స్త్రీ. దాసనముచెట్టు. అ. పుం. ము. 1. మంత్రావృత్తి; 2. వేదాధ్యయనము.

**జపించు.** సం. స. క్రి. జపముచేయు.

**జప్యము.** సం. వి. అ. న. గాయత్ర్యాదిమంత్రము. విశే. జపింపఁదగినది.

**జబరు, జబరుదస్తీ.** హిం. వి. బలాత్కారము.

**జమాదారు.** హిం. వి. రౌతులపైయధికారి.

**జమాయించు.** గ్రా. క్రి. ఆడంబరముగానుండుట.

**జయ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. పార్వతియొక్క చెలికత్తె; 3. తిథివిశేషము; (చూ. తిథి.) 4. కరకచెట్టు; 5. తక్కిలిచెట్టు; 6. నెల్లిచెట్టు. అ. పుం. ము. 1. ఒక సంవత్సరము; (చూ. సంవత్సరము.) 2. గెలుపు.

**జయంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రునికూఁతురు; 2. పార్వతి; 3. టెక్కెము; 4. తక్కిలిచెట్టు.

**జయంతుఁడు.** సం. వి. అ. పుం. 1. ఇంద్రునికొడుకు; 2. భీముఁడు; 3. శివుఁడు.

**జయఘంట.** సం. వి. ఆ. స్త్రీ. ఘంటావిశేషము, జేగంట.

**జయనము.** సం. వి. అ. న. 1. జయించుట; 2. గుఱ్ఱములోనగువాని కవచము.

**జయపెట్టు.** మి. అ. క్రి. జయజయ అని దీవించు. "క. ఉపేంద్రత్వం, బునసుంచుమునకలలోకములుజయపెట్టన్." వి, పు. ౭, ఆ.

**జయవారము.** సం. వి. అ. పుం. మంగళవారము.

**జయించు.** సం. స. క్రి. గెలుచు.

**జయుఁడు.** సం. వి. అ. పుం. 1. ఇంద్రునికొడుకు; 2. యుధిష్ఠిరుఁడు.

**జయ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) గెలువశక్యమైనది.

**జర.** సం. వి. ఆ. స్త్రీ. ముసలితనము, ముదిమి.

**జరఠము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముదిసినది; 2. కఠినమైనది; 3. గట్టియైనది; 4. పసుపుకలిసిన తెలుపువర్ణముగలది.

**జరద్గవము.** సం. వి. అ. పుం. ముసలియెద్దు.

**జరాభీరువు.** సం. వి. ఉ. పుం. మన్మథుఁడు.

**జరాయుజము.** సం. విశే. (అ. ఆ. అ.) మావివలనఁబుట్టినది.

**జరాయువు.** సం. వి. ఉ. స్. పుం. 1. మావి; 2. జటాయువు.

**జరుఁడు.** సం. విశే. (త్. ఈ. త్.) ముసలివాఁడు. "క. ఉశనుఁడతనికిశాపమిచ్చె జరుఁడైయుండన్." వి, పు. ౬, ఆ.

**జర్జరము.** సం. వి. అ. న. 1. పాంచి; 2. ఇంద్రునిపెక్కెము. విణ. శిథిలమైనది.

**జర్జరితము.** సం. విణ. (అ. ఆ. అ.) శిథిలమైనది. "క. గర్జద్ఘనుఁ డైపగతుర, జర్జరితాంగులుగఁజేసిసాయకజాల, స్ఫూర్జనచూపఱు వొగడఁగ, నిర్జరవరనందనుండునిమిషార్ధమునన్." భార. విరా. ౫, ఆ.

**జర్జరీకము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెక్కుతూంట్లుగలది; 2. శిథిలమైనది.

**జర్తిలము.** సం. వి. అ. పుం. అడవినువ్వులు.

**జలచరము.** సం. వి. అ. పుం. జలమునందు సంచరించెడు జంతువు.

**జలజము.** సం. వి. అ. న. 1. తామర; 2. శంఖము.

**జలదము.** సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. ముస్తెకీ.

**జలధరము.** సం. వి. అ. పుం. మేఘము, నీటితొల్పు.

**జలధి.** సం. వి. ఇ. పుం. 1. సముద్రము; 2. నక్క.

**జలనిధి.** సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.

**జలనిర్గమము.** సం. వి. అ. పుం. నీళ్లు వెలికిఁబోవుట కేర్పఱచిన తూములోనగునది, భ్రమము.

**జలనీలి.** సం. వి. ఈ. స్త్రీ. శైవాలము, పాంచి.

**జలము.** సం. వి. అ. న. 1. నీళ్లు; 2. కురువేరు; 3. ఎఱ్ఱతామర. విణ. జడము.

**జలముచము.** సం. వి. చ్. పుం. మబ్బు, మేఘము.

**జలవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. నీరుగొలిమిడికీ.

**జలశుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. కప్పచిప్ప, శంబూకము.

**జలాశయము.** సం. వి. అ. న. నీటివట్టివేరు. పుం. నీటితొంకి.

**జలూక.** సం. వి. ఆ. స్త్రీ. 1. జేలగ; 2. అంతరదామర.

**జలోచ్ఛ్వాసము.** సం. వి. అ. పుం. అలుఁగు, పరీవాహము.

**జలౌకసము.** సం. వి. ఈ. స్. స్త్రీ. 1. జేలగ; 2. జలజంతువు. (జలగయను నర్థమందు సకారాంత స్త్రీలింగనిత్యబహువచనాంత మనికొందఱు.)

**జల్దీ.** హిం. విణ. త్వరయైన.

**జల్పనము.** సం. వి. అ. న. ఉపయుక్తముకాని పెక్కుమాటలాడుట.

**జల్పము.** స[illegible]. అ. పుం. ఊరకమాటలాడెడి యుపయుక్తము కానిమాట.

**జల్పాకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఉపయుక్తముకాని పెక్కుమాటలాడువాఁడు, ప్రేలరి.

**జల్పితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉపయుక్తముకాక మిక్కిలి చెప్పఁబడినది; 2. చెప్పఁబడినది.

**జవ.** సం. వి. ఆ. స్త్రీ. దాసనముకీ. అ. పుం. ము. వడి. విణ. వడిగలది.

**జవనము.** సం. వి. అ. న. వడి. పుం. వడిగలగుఱ్ఱము. విణ. వడిగలది.

**జవనిక.** సం. వి. ఆ. స్త్రీ. తెరచీర, కాండపటము.

**జవాది.** సం. వి. ఇ. పుం. సంకుమదము, జేవాజి.

**జవాను.** హిం. వి. బంట్రౌతు, బలశాలి.

**జహ్నుతనయ.** సం. వి. ఆ. స్త్రీ. గంగ, మిన్నేఱు.

**జహ్నువు.** సం. వి. ఉ. పుం. 1. ఒకానొకరాజర్షి; 2. విష్ణువు.

## జా.

**జాంగలము.** సం. వి. అ. న. ఆవడబీఱకాయ. పుం. 1. కపుఁజు; 2. మెరకనేల.

**జాంగలి.** సం. వి. ఇ. స్త్రీ. విషముఁబోగొట్టువిద్య. ఈ. దూలగొండికీ.

**జాంగలికుఁడు.** సం. వి. అ పుం. విషవైద్యుఁడు, గారడీఁడు.

**జాంఘికుఁడు.** సం. వి. అ. పుం. (చూ.) జంఘాకరికుఁడు.

**జాంబవము.** సం. వి. అ. న. 1. నేరెడుపండు; 2. బంగారు.

**జాంబూనదము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. ఉమ్మెత్తకీ.

**జాగర.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. జాగారము. అ. పుం. కవచము.

**జాగరిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) మేలుకొనియుండువాఁడు, జాగరూకుఁడు.

**జాగరూకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ——పై.——

**జాగర్య.** సం. వి. ఆ. స్త్రీ. మేలుకొనియుండుట.

**జాగా.** హిం. వి. స్థలము, ఎడము.

**జాగీరు.** హిం. వి. రాజు బహుమానముగానిచ్చుభూమి.

**జాగ్రత్.** సం. వి. త్. స్త్రీ. ఒకయవస్థ. (చూ. అవస్థ.) విణ. మేలుకొనియుండువాఁడు. (దీనికి తెనుఁగున వ్యస్తముగా ప్రయోగములేదు.)

**జాడీ.** ఆం. వి. బుడ్డివంటి చెంబు.

**జాడ్యము.** సం. వి. అ. న. జడత, జడ్డు.

**జాతకర్మము.** సం. వి. న్. న. పుట్టినప్పుడుచేయుక్రియ. (చూ. కర్మము.)

**జాతకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పుట్టినవాఁడు.

**జాతము.** సం. వి. అ. న. 1. సమూహము; 2. సామాన్యము; 3. పుట్టుక. విణ. పుట్టినది.

**జాతరూపము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. ఉమ్మెత్తకీ; 3. పుట్టినరూపము. విణ. పుట్టినరూపముకలది.

**జాతవేదుఁడు.** సం. వి. స్. పుం. అగ్ని, నిప్పు.

**జాతాపత్య.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు.

**జాతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కులము; 2. పుట్టుక; 3. సామాన్యము; 4. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 5. పద్య భేదము; 6. ప్రాయిస్సు; 7. జాజికాయ; 8. జాజికీ; 9. ఉసిరికకీ; 10. కంపిల్లముకీ. (పురుషజాతులు నాలుగు.—భద్రుఁడు, దత్తుఁడు, కూచిమారుఁడు, పాంచాలుఁడు. స్త్రీజాతులు నాలుగు.—పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి. పదునెనిమిదిజాతులు.—బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, తిలఘాత, లుబ్ధక, చండాల, మాతంగజాతులు.)

**జాతికోశము.** సం. వి. అ. న. జాజికాయ.

**జాతిపత్రి.** సం. వి. ఈ. స్త్రీ. జాపత్రి.

**జాతుషము.** సం. విణ. (అ. ఈ. అ.) జతువువలనఁ గలిగినది. (జతువు=లక్క.)

**జాతోక్షము.** సం. వి. అ. పుం. కాలుపట్టినయెద్దు.

**జాత్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మంచికులమందుఁబుట్టినది; 2. చక్కనిది; 3. మేలైనది.

**జానపదము.** సం. వి. అ. పుం. 1. దేశము; 2. గ్రామము.

**జానపదుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు.

**జాని.** సం. వి. ఇ. స్త్రీ. 1. ముదిత; 2. వ్యుత్పత్తియందు జాయాశబ్దమునకు ఆదేశముగా వచ్చురూపము. ("జానికిజానిక ఫల్" మొ.)

**జానువు.** సం. వి. ఉ. పుం, న. మోఁకాలు.

**జాపకము.** సం. వి. అ. న. గంధకాష్ఠవిశేషము, కాలేయకము.

**జాపకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) జపముచేయువాఁడు.

**జాపము.** సం. వి. అ. పుం. 1. జపము; 2. వేదాధ్యయనము.

**జాప్యము.** గ్రా. వి. జాగు.

**జాఫరా.** హిం. వి. ఒకవర్ణము.

**జాబాలుఁడు.** సం. వి. అ. పుం. మేఁకలమేపువాఁడు, కురుపవాఁడు.

**జాబితా.** హిం. వి. పట్టి.

**జామాత.** సం. వి. ఋ. పుం. 1. అల్లుఁడు; 2. పెనిమిటి; 3. ప్రొద్దుతిరుగుడుచెట్టు.

**జామి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కులకాంత; 2. తోఁడఁబుట్టినది. ఈ. జామికి. విణ. సోమరి.

**జాయ.** సం. వి. ఆ. స్త్రీ. (అగ్నిసాక్ష్యముగా పెండ్లాడిన) పెండ్లాము.

**జాయమానము.** సం. విణ. (అ. ఆ. అ.) కలుగుచున్నది.

**జాయా.** హిం. వి. నష్టము, చెఱుపు.

**జాయాజీవుఁడు.** సం. వి. అ. పుం. నట్టువుఁడు.

**జాయువు.** సం. వి. ఉ. స్త్రీ. ఔషధము, మందు.

**జారిణి.** సం. వి. ఈ. స్త్రీ. ఱంకుటాలు, స్వైరిణి.

**జారీ.** హిం. వి. ఆజ్ఞయగుట, నెరవేఱ్పు.

**జారుఁడు.** సం. వి. అ. పుం. ఱంకుమగఁడు, ఉపపతి.

**జాలకము.** సం. వి. అ. న. 1. మొగ్గ; పసరుమొగ్గ. (అనికొందఱు.) మొగ్గలసమూహము. (అనికొందఱు.) కసుగాయ. (అనికొందఱు.) 2. వల; 3. పక్షిగూఁడు; 4. కపటము; 5. మునగకాయ. పుం, న. కిటికి.

**జాలపాదము.** సం. వి. అ. పుం. 1. బాతు; 2. హంస.

**జాలము.** సం. వి. అ. న. 1. కిటికి; 2. వల; 3. సమూహము; 4. మొగ్గ; 5. కపటము. పుం. 1. మాయ; 2. కడపి.

**జాలి.** సం. వి. ఈ. స్త్రీ. పొట్ల, వటోలికి.

**జాలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. వలవంటి నేఁతగల వస్త్రము; 2. ఇనుపకవచము; 3. విధవ. అ. న. ము. ఊరివళుకు. పుం. సాలెపురుగు.

**జాలికుఁడు.** సం. వి. అ. పుం. 1. చెంబడివాఁడు; 2. బోయవాఁడు. విణ. మోసకాఁడు.

**జాల్మఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పనినేని దక్కఁగా యోచింపకచేయువాఁడు; 2. క్రూరుఁడు; 3. పామరుఁడు.

**జాస్తి.** హిం. విణ. ఎక్కువ, అధికము.

**జాహ్నవి.** సం. వి. ఈ. స్త్రీ. గంగ, మున్నేఱు.

జి.

**జింక.** దే. వి. ఇఱ్ఱి, హరిణము.

**జింకతలచుక్క.** దు. వి. మృగశీర్షనక్షత్రము.

**జింకతలచుక్కనెల.** దు. వి. మార్గశీర్షమాసము.

**జింకతాలుపరి.** దే. వి. (జింకతాలుపు+అరి.) 1. చంద్రుఁడు; 2. శివుఁడు. "సీ. జింకతాలుపరియు జింకతాలుపరియు నుత్తరదియుననుఁగుసైయొప్పుచుండ." అచ్చ. బాల, కాం. (సాభిప్రాయమున అరి.)

**జింకతాలుపు.** దే. వి.____________

**జింకపొక్కిలి.** దే. వి. 1. మృగనాభి; 2. కస్తూరి. "సీ. ఓలిఁదగుచోట్ల వారిఁ గూర్చుండఁబెట్టి, నిపుణులట్టులు మంచిగంధములు జింక, పొక్కిలియుఁగప్పురము గందపొడి మొదలగు, నంచిసరకులచే నాదరించియుండె." అచ్చ. బాల, కాం.

**జింకరవుతు.** దు. వి. వాయువు, మృగవాహనుఁడు.

**జింగి.** సం. వి. ఈ. స్త్రీ. మంజిష్ఠి.

**జింజిరి.** దే. వి. గొలుసు.

**జిగట** దే. వి. బంకన.

**జిగమిష.** సం. వి. అ. స్త్రీ. పోవనిచ్ఛ.

**జిగమిషువు.** సం. విణ. ఉ. పోవనిచ్ఛగలవాఁడు.

**జిగి.** దే. వి. వన్నెపెలుఁగు, కాంతి.

**జిగిని.** హిం. వి. సుడిన ఘరించు నొక ధూపదానము.

**జిగిమ్యానము.** గ్రా. వి. పిసినితనము.

**జిగిలి.** దే. విణ. చిక్కనైనది.

**జిగీష.** సం. వి. అ. స్త్రీ. 1. గెలువనిచ్ఛ; 2. ప్రయత్నము; 3. అతిశయము.

**జిగీషువు.** సం. విణ. ఉ. గెలువనిచ్ఛగలవాఁడు.

**జిగురు.** దే. వి. 1. పచ్చులనుబట్టుటకై కోలమీఁగాని, దారముమీఁగాని చమిరెడుబంకన; "జిగురుగడ, జిగురుకాఁడ." 2. జిగురుపూసినదారము. "సీ. జిగురంటినట్టుల పక్షిరాగిలె వోనీకయూ పింగాగి మనుఁబోతుఁజెండిపైచు." పా. ౧, ఆ.

**జిగురుకోను.** దే. అ. క్రి. బంధనగొను. "క. జిగురుకొన్నరణస్ఫూర్తిఁదెలుఁగుమాని." కాశి. 3, అ.

**జిఘత్స.** సం. వి. అ. స్త్రీ ఆఁకలి, క్షుత్తు.

**జిఘత్సువు.** సం. విణ. ఉ. ఆఁకలిగొన్నవాఁడు, క్షుధితుఁడు.

**జిఘాంస.** సం. వి. అ. స్త్రీ. చంపనిచ్ఛ.

**జిఘాంసువు.** సం. వి. ఉ. పుం. శత్రువు. విణ. చంపనిచ్ఛగలవాఁడు.

**జిఘృక్ష.** సం. వి. అ. స్త్రీ. గ్రహింపనిచ్ఛ.

**జిఘృక్షువు.** సం. విణ. ఉ. గ్రహింపనిచ్ఛగలవాఁడు.

**జిష్ణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మూర్ఖుఁడగువాఁడు.

**జిజ్ఞాస.** సం. వి. ఆ. స్త్రీ. తెలియనిచ్ఛ.

**జిజ్ఞాసువు.** సం విశే. ఉ తెలియనిచ్ఛగలవాఁడు.

**జిట్ట.** దే. వి. 1. వెదురుయొక్కయెన్ను; "చ. బలిమిఁకసేమిచెప్ప వినుపండువెదుళ్లవలీలమోరత్రో, పులఁబడఁజొప్పవంచుకొను పోలికవంచితదగ్రధాన్యముల్, సెలవులఫేనముట్టిపడ జట్టలతోడన చప్పరించున, ప్పాలమువరాహపోతములు భూవరతొండములేని యేనుఁగుల్." స్వా. ౪, ఆ.–2. ఒకదినుసు పక్షిజాతియొక్క సాధారణమైనపేరు; (ఇది యనేకభేదములు కలది.) 3. జేన.

**జిడికిరింత.** దే వి. మోసపుమాట. హరిశ్చ. ద్వి. ౨, భా.

**జిడ్డుఁడలి.** దే వి. జిడ్డుకడలియొక్కరూపాంతరము. "చ. అత్యున్నతిఁగన్న జిడ్డుఁడలిసుద్ధతమైవెలిదీవిచెన్నగుఙ్." పాండు. 3, ఆ.

**జిడ్డ.** దే. వి. కలఁత. (అప్ర.)

**జిడ్డి.** దే. వి. మోటుగుడ్డ. విశే. మోటైనది.

**జిడ్డు.** దే. వి. 1. నేయిలోనగువానియందలి మెఱుఁగు; 2. వృక్షవిశేషము. హంస. ౪, ఆ.

**జిడ్డుకడలి.** దే. వి. పాలసముద్రము. (ఇట్లు జిడ్డునీరావని.)

**జిడ్డుకొను.** దే. అ. క్రి. జిడ్డగు. "క. కాయద్యుతిజిడ్డుకొనఁగ." పాండు. ౪, ఆ.

**జితకాశి.** సం. విశే. (న. ఈ. న.) యుద్ధమునందు జయించినవాఁడు.

**జితపడు.** వై. అ. క్రి. (జితము + పడు) 1. స్థిరపడు; 2. వాడుకపడు*; 3. అనుకూలపడు*.

**జితము.** ఉభ. వై. విశే. స్థిరము. సం. (అ. ఆ. అ.) జయింపఁబడినది.

**జితించు.** వై. అ క్రి. జితపడు.

**జితేంద్రియుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఇంద్రియనిగ్రహముగలవాఁడు.

**జిత్తు.** వై. వి. మోసము, మాయ*. "గీ. జిత్తులకుటెంకియగునింద్ర జిత్తుచేత." సా. 3, ఆ.

**జిత్తులమారి.** ద్వ. విశే. జిత్తులుచేయువాఁడు.

**జిత్వరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) జయశీలుఁడు.

**జిద్దు.** దే. వి. జగడము, కలహము.

**జినుఁగు.** వై. వి. విశే. జిలుఁగుయొక్కరూపాంతరము. (సూక్ష్మమునకు. "ద్వి. కనుఁగొనిమిముఁజెక్కుగతులఁజీరుచును, జినుఁగుఁబయ్యెదకొంగుఁజించిబంధించి." గా. కిష్కిం, కాం. "జినుంగుపచ్చడంబు." హంస. ౧, ఆ.

**జినుఁడు.** సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. విష్ణువు. విశే. 1. మునలివాఁడు; 2. జయశీలుఁడు.

**జిన్న.** దే. వి. వృక్షవిశేషము.

**జిబిలిక.** దే. వి. ఒకదినుసుబీఱ, నిశాంకుశి.

**జిబ్బుటీ.** దే. వి. గబ్బిలము.

**జిబ్బుడాయి.** దే. వి.——పై.——

**జిమ్మ.** దే. విశే. మిక్కిలి, అధికము.

**జిమ్ము.** దే. అ. క్రి. (ద్రవవస్తువు) జిఱ్ఱునవెలికుఱుకు. "ఉ. క్రమ్మెముశోణితంబుకరగట్టఁగ గంటులవెంటబెట్టుగా, జిమ్మఁగ." జై. ౬, ఆ.

**జియ్య.** వై. వి. 1. దేవుఁడు*; "ఎ, గీ. జియ్యయిఁకనైనఁ బ్రోవవేచిత్తగించి." య. ౨, ఆ.–2. రాజు*. "అపుడప్పక్కమగండురక్కసులజియ్యందాఁకి." రామా. ౫, ఆ.

**జియ్యరు.** వై. వి. వైష్ణవసన్న్యాసి*. "వ. అద్దేవుని కోవెలకు సంప్రంబుసకుం గర్తయగుజియ్యరుకు విన్నవించిన." పర. 3, ఆ.

**జిరా.** దే. వి. 1. కవచము; (జీరాయొక్కరూపాంతరము.) "సింగిణీలకోరులఙ్ జిరాగుజాలనేసి." కృష్ణ. 3, ఆ.–2. బాణము. "తలిరుజిరావజీరు బలుదాడికినోడి." నీలా. 3, ఆ.

**జిరాయతి.** దే. వి. దుక్కి, కృషి.

**జిఱ.** దే. వి. తిరుగుటత్రిప్పుటలయందగు ధ్వన్యనుకరణము. "సీ. వడిజిఱ్ఱఁదిరిగిమ్రొగ్గెమునదావళ్ళులుఁదోనరూపతణెనయాధోరణులును." జై. ౫, ఆ. (ఆమ్రేడితమునందు జిఱజిఱ. "ద్వి. జిఱజిఱఁ ద్రిప్పెదశేషునినైన, వెఱచర్వఁజేసెద విహగేంద్రునైన." రా యు, కాం.)

**జిఱకొట్టు.** దే. అ. క్రి. జిఱ్ఱునఁదిరుగు. "ద్వి. చెరలాడుజిఱకొట్టుఁజెలఁగిపేరెంబు, దిరుగు." హరిశ్చ. ౧, భా.

**జిఱ్ఱ.** దే. వి. జిఱయొక్కరూపాంతరము. "జిఱ్ఱఁదిరుగు." భార. కర్ణ. ౧, ఆ. (జిఱ్ఱనందిరిగి అనునపుడు జిఱ్ఱ అనునట్లుగా తిరిగి అని యర్థము.)

**జిఱ్ఱత్రాడు.** దే వి. పిరియెక్కించినత్రాడు. హరిశ్చ. ద్వి. ౧, భా.

**జిఱ్ఱు.** దే. వి. 1. చిమ్మటకూఁత; "గీ. చీమచిటుకురన్నఁజిమ్మట జిఱ్ఱన్న, నెదురమూషకములుమెదలుకొనిన, నిదురలేకభూమినిర్జరుఁడాలించు, నప్పుడబలకాలిచప్పుడనుచు." పంచ. వేం. ౪, ఆ.–2. చీఁదుటయందగు ధ్వన్యనుకరణము. "వెందుపీడువచ్చినఁదలయంటఁగట్టుకొని జిఱ్ఱునఁజీఁదుచు." భో. ౪, ఆ.

**జిఱ్ఱున.** దే. ద్ర. క్రి. విశే. చటాలున, శీఘ్రముగ. "చ. చిటికెనవ్రేలిగోరఁగొని జిఱ్ఱునఁదీసెనలోచనంబు." భీ. ౬, ఆ.

**జిల.** దే. వి. నవ, దురద, కండూతి.

**జిలకఱ.** వై. వి. జీలకఱయొక్కరూపాంతరము.

**జిలకఱ్ఱ.** వై. వి.——పై.——

**జిలమ.** దే. వి. 1. ఒకదినుసు వరిపైరు; 2. బ. ఒకదినుసు వడ్లు.

**జిలిబిలి.** దే. విశే. 1. అల్పము; "జిలిబిలిసిగ్గు."–2. మందము; "జిలిబిలిగాడ్పు."–3. సూక్ష్మమై అవ్యక్తమధురమైనది. "జిలిబిలిపాట."–4. శృంగారప్రయుక్తమైనది. "జిలిబిలిచెయ్వులు."

**జిలిబిలిచీర.** ద్వ. వి. చిన్నచిన్న మళ్లుగల సన్ననిపట్టుచీర.

**జిలిబిలిజెల్లి.** దే. వి. పాపటబొట్టు, లాలాటికము.

**జిలుఁగు.** వై. వి. సూక్ష్మవస్త్రము. విశే. 1. అల్పము*; 2. మందము*; "ఎ, గీ. మొలకనగవులుమురిపంపుజిలుఁగునడలు." అచ్చ. బాల, కాం. (ఇట్లు జిలుఁగునవ్వమొ.)–3. సూక్ష్మము*. (జిలుఁగువెన్నెల మొ.) (రూ. జిల్గు. సూక్ష్మవస్త్రమునకు.–"జిల్గెతక్కనగుయావతమొత్తునటంచునన్యముఙ్." ఆము. ౧, ఆ.–అల్పమునకు.–"ఇంతవుజిల్గుంబనియంతసేసి." ఆము. ౫, ఆ.–సూక్ష్మమునకు.–"సీ. కామినీమణిజిల్గుఁగొనసంతముసేయుఁగొమ్మకనొ్బమదోయికోటిసేయు." రుక్మి. ౪, ఆ.)

**జిలుగు.** యు. దే. వి. సన్నపుప్వి. వై. అ. క్రి. గొలుసుమోడిగా వ్రాయు. వి. 1. గొలుసుమోడివ్రాఁత; 2. చిక్కు*. "చ. జిలుగులఁ జెట్టఁగా వెదకుచీఁకటి సోఁకుచుఁ బిల్లలోఁ యనఁ." య. ౨, ఆ.

**జిలువు.** వై. వి. జిలుఁగుయొక్క రూపాంతరము. య. ౪, ఆ.

**జిలేబి.** హిం. వి. భక్ష్యవిశేషము.

**జిల్ల.** దే. వి. బిల్లగోడాటయందలిబిల్ల.

**జిల్లా.** హిం. వి. కలక్టరువంటి గొప్ప యుద్యోగస్థుని యధీనమున నుండు ప్రదేశము.

**జిల్లి.** హిం. వి. మాంసముపైనుండు సన్నని చర్మము.

**జిల్లు.** దే. వి. 1. శైత్యాధిక్యమును తెలుపుటయందగు ననుకరణము; (నీళ్లు జిల్లనియున్నవి, చేతులు కాళ్లు జిల్లుమనియున్నవి.)—2. కాఱుటయందగు ధ్వన్యనుకరణము. "క. తెల్లనిమేననుసమ్మృతము, జిల్లున జల్లించుచుపాడుఁగుశితశృంగములుఁ, జెల్లుగనద్దులకోర్కులు, వెల్లిగొలుపుమొదవుపాలవెల్లినిబుట్టెన్." భాగ. ౧, స్క౦.

**జిల్లెడు.** దే. వి. అర్కవృక్షము.

**జిల్లేడు.** దే. వి. జిల్లెడుయొక్క రూపాంతరము.

**జిల్లేడుకాయ.** దే. వి. 1. భక్ష్యవిశేషము; 2. జిల్లేడుయొక్క కాయ.

**జివురు.** దే. వి. జిగురుయొక్క రూపాంతరము.

**జివ్వు.** దే. వి. ఎండుటలోనగువానియందగు ననుకరణము. "హృదయమధ్యంబు జివ్వనియెండెనేని." వై. ౮, ఆ.

**జివ్వన.** దే. క్రి. విణ. శీఘ్రముగ. "చెట్టుచెట్టునకుజివ్వనజివ్వనదాఁటు." రామా. ౬, ఆ.

**జివ్వురు.** దే. వి. చిముడుటయందగు ననుకరణము. "ద్వి. కమరిపువ్వులు మ్రందఁగాజివ్వురనుచుఁ, జమిడికాయలునేలఁజిటపొటరాల." హరిశ్చ. ౧, భా.

**జిష్ణువు.** సం. వి. ఉ. పుం. 1. ఇంద్రుఁడు; 2. అర్జునుఁడు. విణ. జయశీలుఁడు.

**జిహాస.** సం. వి. ఆ. స్త్రీ. విడువనిచ్ఛ.

**జిహాసువు.** సం. విణ. ఉ. విడువనిచ్ఛగలవాఁడు.

**జిహీర్ష.** సం. వి. ఆ. స్త్రీ. హరింపనిచ్ఛ.

**జిహీర్షువు.** సం. విణ. ఉ. హరింపనిచ్ఛగలవాఁడు.

**జిహ్మగము.** సం. వి. అ. పుం. పాము. విణ. 1. వంకరగాఁబోవునది; 2. మెల్లఁగాఁబోవునది.

**జిహ్మము.** సం. వి. అ. న. తగరవృక్షము. విణ. 1. వంకరైనది; 2. చొరవలేనిది.

**జిహ్వ.** సం. వి. ఆ. స్త్రీ. నాలుక. (జిహ్వయందలి ముటికె పులకము.) అ. న. ము. జిహ్మవృక్షమువేరు.

**జిహ్వామూలీయము.** సం. వి. అ. పుం. కకారమునకుముందు ఊర్ధ్వాధోముఖములుగానుంచెడు అర్ధచంద్రాకృతియగు విసర్గము.

**జీండ్రము.** దే. వి. దురవస్థ.

**జీగురు.** దే. వి. జిగురుయొక్క రూపాంతరము. (బంధనము. "క. మణితెరలుఁజిక్కములువం, కరబోసులుఁ ద్రాళ్లనురులుకాలురులు నజీ, గురుగండెలుతెలముళ్లున్, గరిచిలుకులు నిగ్గులులోనఁగాఁ గొంచువెనన్." య. ౧, ఆ.

**జీడి.** దే. వి. 1. భల్లాతకము; (దీనిభేదము ఎలుక జీడి.) 2. ముంత మామిడి మామిడిమొదలగువాని తొడిమనుండుబడు పాలు.

**జీడిమామిడి.** దే. వి. మోరటి. (దీని కాయలయందలి చిలుపప్పు.)

**జీడియ.** దే. వి. జీడె.

**జీడె.** దే. వి. భక్ష్యవిశేషము. (జీడియయొక్క రూపాంతరము.)

**జీతగాఁడు.** ద్వ. విణ. (జీతము+కాఁడు.) జీతముపుచ్చుకొని పని చేయువాఁడు.

**జీతము.** వై. వి. సంబళము, వేతనము.

**జీనపటము.** దే. వి. దట్టి. "ఉ. ఆననిం, జెంగఁగబోయి మస్తమునజీనపటంబునఁగంచుపోరకే, యానిబులాదిగా వెదకియున్." ని, పు. ౬, ఆ.

**జీనము.** వై. వి. గుఱ్ఱపుపల్లమునకు క్రిందవేయుడు సుస్త.

**జీని.** దే. విణ. నాణెమైనది. ("జీనిదక్కర, జీనిపని, జీనిపువ్వు, జీనివల, జీనివ్రాఁతదుప్పటము" మొ.) వి. గుఱ్ఱపుపల్లము.

**జీనిగిరివాఁడు.** దే. వి. మచ్చివాఁడు.

**జీను.** దే. వి. లంగరు. "క. చెప్పుడిచేమిఁకనొకచో, దెప్పరమగు నుక్కు జీనుదిగవైచికపెన్, నెవ్వునఁగదలకయుండెడు, కప్పలిభంగమునవదేరుకదలకనిలిచెన్." శుక. ౨, ఆ.

**జీనుఁగ్రోవి.** దే. వి. పాములవాఁడు ఊఁదెడు బుఱ్ఱ.

**జీనుఁడు.** సం. విణ. (అ. ఆ. ఆ.) ముసలివాఁడు.

**జీనువ.** ద్వ. వి. (జీను+వాయి.) పక్షివిశేషము. "జీనువనుక్కు తోడఁబ్రతిసేయఁగవచ్చిన గోర." పంచ. పం. ౪, ఆ.

**జీనువాయి.** ద్వ. వి. జీనువపక్షి. శశాం. ౨, ఆ.

**జీబిలిక.** దే. వి. జబిలికయొక్క రూపాంతరము

**జీబు.** దే. వి. 1. ఆఁడుదానికట్టుఁగోక; "కటిజీబుదుసదాజీబమర." ఆము. ౫, ఆ.—2. ఆకులుతీఁగలులోనగువానిపొదువు; "సీ. చివురుజొంపముమావిజీబుమాయముచేసి పనిఁజేయుమన్మథుగఁదాఁబ్రబలుటను." విజ. ౧, ఆ.—3. తొడుసులోనగువాని మోపుమీఁదివేఁచు. విణ. ఆకులుఁదీఁగలులోనగువానిచేత దట్టమైనది.

**జీబుకొను.** దే. అ. క్రి. దట్టమగు. "ంగడ. నఁరియునేలజీబుకొన్నదంశవనము." సాన్వ. 3, ఆ.

**జీమూతము.** సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. కొండ; 3. దావరడంగి.

**జీర.** వై. వి. గీఱ, రేఖ. "ఇవి సింగపుగోరిజీరలు." గా, వి. 3, ఆ.

**జీరకము.** సం. వి. అ. పుం. జిలకఱ్ఱ.

**జీరణము.** సం. వి. అ పుం.——పై.——

**జీరా.** దే. వి. కవచము, కవచవిశేషము. (అనికొందఱు.)

**జీరాడు.** దే. అ. క్రి. (జీరి+ఆడు.) వస్త్రముకొంగులోనగునది నేలఁబడిపొరలు. "ద్వి. వసుధపైజీరాడువలివాటుతోడ." రా. సుం, కాం. (మొదటిరూపము జీరియాడు. చూ. ఈఁగాడు.)

**జీరు.** దే. అ. క్రి. నేలకురాయు. స. క్రి. గీఱు.

**జీరుకాడు.** దే. అ. క్రి. (జీరుక+ఆడు.) జీరాడు.

**జీరుకు.** దే. వి. 1. జరుగుడు; 2. బ. జరుగుడాట. (చూ. జీర్కు.) విశ. జరుగునది. "క. మీఱకకరములఁగరములు, గారవములనూఁదిబారుగామెట్లుకడుఁ, జీరుకుజతనంబునఁజను, నీరము కడడిగ్గినీవునీవనిచొరఁగఁ." సూర్యతనయాపరిణయము. 3, ఆ.

**జీరుకుబండ.** దే. వి. 1. జీరుకులాడెడుబండ; 2. బ. జీరుకుబండాట. "సీ. తొగరాచలుపమేడమగజాకొణిఁగెలొవపలకల జీరుకుబండలాడి." చంద్రా. ౧, ఆ.

**జీరులాడు.** దే. అ. క్రి. (జీరులు+ఆడు.) జీరాను. "ద్వి. పట్టుదుప్పటినేలపైజీరులాడె." సా. ౪, భా.

**జీరువాఱు.** దే. అ. క్రి. (జీరు+పాఱు.) 1. జరుగు; "వ. చిలుపచిలుపసెత్తురులు జొత్తిల్లినవేలంగాలూఁదనేరక జీరువాఱె యు." ఉ, హరి. 3, ఆ.–2. తొలఁగు; "జిలుఁగుంబయ్యెదజీరువాఱె." నై. ౬, ఆ.–3. వ్యాపించు. "సీ. మకరకుండలవజ్ర మాణిక్యదీప్తులు చెక్కుటద్దములపైజీరువాఱ." కాశీ. ౧, ఆ.

**జీర్కు.** దే. వి. జీరుకుయొక్కరూపాంతరము. (జీరుకు ఆటకు.– "సీ. చల్లనితలఁపుఱాచట్లమీఁదటఁ జల్లజీర్కులాడెడువేల్పుఁజేరువలును." య. ౨, ఆ.)

**జీర్కుబండ.** దే. వి. జీరుకుబండయొక్కరూపాంతరము. (జీరుకుబండాటకు.– "జతనంబుసహస్తములూఁడిజీర్కుబండలదిగజాఱెరి." పా. ౪, ఆ.)

**జీర్ణము.** సం. వి. అ. పుం. జిలకఱ్ఱ. విశ. 1. అఱిగినది; 2. చినిఁగినది; 3. ప్రాఁతది.

**జీర్ణవృంతము.** సం. వి. అ. పుం. తెల్లలొద్దుగు చెట్టు.

**జీర్ణించు.** సం. అ. క్రి. జీర్ణమగు, అఱుగు.

**జీర్ణుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ముదిసినవాఁడు.

**జీలకఱ.** వై. వి. జిలకఱ్ఱ, జీరకము.

**జీలకఱ్ఱ.** వై. వి. జీలకఱయొక్కరూపాంతరము.

**జీలుగు.** దే. వి. బొందుబెండు, సితపీర్య.

**జీవ.** సం. వి. ఆ. స్త్రీ. 1. వీణెమొదలగువాని తంతి చక్కఁగా మ్రోఁగుటకుఁగాను దానిక్రిందనుంచెడు కంబళిపీఁచులోనగునది; 2. పాలకూర; 3. వింటినారి; 4. వస; 5. భూమి; 6. భూషణధ్వని. అ. పుం, న. ము. 1. ప్రాణము; 2. తత్వము; 3. స్వరూపము; 4. పరమాత్మ; 5. విలంబితనృత్యము. పుం. 1. బ్రతుకుతెరువు; 2. వేఁగిస చెట్టు.

**జీవంజీవము.** సం. వి. అ. పుం. 1. వెన్నెలపులుఁగు; 2. వన్నెపులుఁగు; 3. వృక్షవిశేషము.

**జీవంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. జమ్మి; 2. తిప్పతీఁగ; 3. పాలకూర; 4. బదనిక.

**జీవకము.** సం. వి. అ. పుం. వేఁగిస చెట్టు.

**జీవకుఁడు.** సం. వి. అ. పుం. ప్రాణి. విశ. 1. జీవించువాఁడు; 2. వడ్డిచేత బ్రతుకువాఁడు; 3. కొలువుడుకాఁడు; 4. పిసినివాఁడు; 5. పాములవాఁడు.

**జీవగఱ్ఱ.** మి. వి. గ్రా. జీవనౌషధము, జీవాతువు.

**జీవచ్ఛవము.** సం. వి. అ. పుం, న. బ్రతికియుండుశవము, మనుపీనుఁగు.

**జీవదంతము.** సం. వి. అ. పుం. ఏనుఁగు జీవించియుండఁగా కోసియెత్తినదంతము. (దీనికి కాంతియధికము.)

**జీవదుఁడు.** సం. వి. అ. పుం. 1. వైద్యుఁడు; 2. శత్రువు. విశ. జీవమునిచ్చువాఁడు.

**జీవధనము.** సం. వి. అ. న. గోవులులోనగునది.

**జీవన.** సం. వి. ఆ. స్త్రీ. పాలకూర. అ. న. ము. 1. బ్రతుకు; 2. బ్రతుకుతెరువు; 3. నీళ్లు.

**జీవని.** సం. వి. ఈ. స్త్రీ. పాలకూర.

**జీవనీయ.** సం. వి. ఆ. స్త్రీ. పాలకూర. అ. న. ము. నీళ్లు.

**జీవనౌషధము.** సం. వి. అ. న. బ్రతుకఁజేసెడుమందు, జీవగఱ్ఱ.

**జీవన్ముక్తుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) జీవించియుండియు జ్ఞానముఁగొని సమస్తబంధములను ఖండించి బ్రహ్మనిష్ఠుఁడై ముక్తిఁ బొందినవాఁడు.

**జీవన్మృతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) జీవించియుండియు చచ్చినవాఁడు.

**జీవరత్నము.** సం. వి. అ. న. శ్రేష్ఠరత్నము.

**జీవవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. గోవులు, గుఱ్ఱములు మొదలగువానిని కాపాడి బ్రతికెడిబ్రతుకు.

**జీవశాకము.** సం. వి. అ. పుం. తోఁటకూర, మాఁరిపను.

**జీవసువు.** సం. వి. ఊ. స్త్రీ. బ్రతికియున్నబిడ్డలుగల ఆఁడుది.

**జీవాంతకము.** సం. వి. అ. పుం. 1. కొయ్యతోఁటకూర; 2. చిట్టికూర.

**జీవాంతకుఁడు.** సం. వి. అ. పుం. 1. పిట్టవేఁటకాఁడు; 2. ఒకానొకరాక్షసుఁడు.

**జీవాతువు.** సం. వి. ఉ. పుం, న. 1. జీవగఱ్ఱ; 2. బ్రతుకు; 3. వంటకము.

**జీవాత్మ.** సం. వి. న్. పుం. దేహి, జీవుఁడు.

**జీవి.** సం. వి. న్. పుం. ప్రాణి. విశ. జీవించువాఁడు.

**జీవించు.** సం. అ. క్రి. బ్రతుకు.

**జీవిక.** సం. వి. ఆ. స్త్రీ. బ్రతుకుతెరువు.

**జీవితకాలము.** సం. వి. అ. పుం. ఆయువు.

**జీవితము.** సం. వి. అ. న. 1. ప్రాణము; 2. జీతము.

**జీవితేశుఁడు.** సం. వి. అ. పుం. 1. ప్రాణనాయకుఁడు; 2. యముఁడు.

**జీవుఁడు.** సం. వి. అ. పుం. 1. ప్రాణి; 2. బృహస్పతి.

## జు.

**జుంగము.** సం. వి. అ. పుం. బొద్దికూర, వృద్ధదారకము.

**జుగుప్స.** సం. వి. ఆ. స్త్రీ. 1. రోఁత; 2. దూఱు; 3. దయ.

**జుష్టము.** సం. వి. అ. న. ఎంగిలి. విశ. సేవింపఁబడినది.

**జుష్యము.** సం. విశ. (అ. ఆ. అ.) సేవింపఁదగినది.

**జుహురాణము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము. (రూ. జుహూరాణము.)

**జుహువు.** సం. వి. ఊ. స్త్రీ. ప్రుగ్భేదము.

## జూా.

**జూటము.** సం. వి. అ. పుం. 1. శివునిజేడముడి; 2. జేడముడి.

**జూటా.** హిం. విశే. అబద్ధమైన.

**జూతి.** సం. వి. ఇ. స్త్రీ. వేగము, జవనము.

**జూర్ణము.** సం. వి. అ. పుం. జొన్నపైరు.

**జూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. జ్వరము, వేఁకి.

## జృ.

**జృంభ.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం, న. ము. 1. ఆవులింత; 2. ఒళ్లువిఱుచుకొనుట; 3. వికాసము.

**జృంభణము.** సం. వి. అ. న. 1. ఆవులింత; 2. ఒళ్లువిఱుచుకొనుట; 3. అతిశయము; 4. వికాసము.

**జృంభించు.** సం. అ. క్రి. 1. విజృంభించు; 2. ఆవులించు.

**జృంభితము.** సం. వి. అ. న. ఆవులింత. విశే. 1. పెరిగినది; 2. వికసించినది.

## జె.

**జెండా.** హిం. వి. టెక్కెము, ధ్వజము. "సీ. మఘభూపసైనికమండలిలాలుజెండాలనందలిరాకు డాలునిగిడె." కవి. ౨, ఆ.

**జెట్టి.** దే. వి. 1. మల్లుఁడు; 2. శూరుఁడు. "ఎ, గీ. తక్కువెక్కుడెడలఁజెక్కుంద్రనేమేమి, నేనెవినమెయట్టిజెట్టినిన్ని, దినములిట్లులొడరిపెఁగియునీచేత, నేఁడువినఁగవలసెవేఁడిపలుకు." భార. భీష్మ. 3, ఆ.—విశే. శ్రేష్ఠుఁడు. "యోగీశ్వరులుఁగాననట్టిజెట్టి." భాగ. ౧౦, స్కం.

**జెన.** దే. వి. గ్రుడ్డులోనుండెడు పసుపువర్ణపునీరు.

**జెముడు.** వై. వి. సింహుండము[?]. (దీని భేదములు ములుజెముడు మొ.)

**జెయిలు.** ఆం. వి. కారాగృహము.

**జెటి.** దే. వి. జెట్టియొక్కరూపాంతరము.

**జెటిపోతు.** దే. వి. జెట్టిపోతుయొక్కరూపాంతరము.

**జెట్టి.** దే. వి. పెక్కుకాళ్లుగల ఒకానొకపురుగు, ఆధారిక.

**జెట్టిపోతు.** దే. వి. సర్పవిశేషము.

**జెల.** వై. వి. భూమిలోపలనుండి పైకుబికివచ్చు సంతతజలధార, బుగ్గ*.

**జెల్ల.** దే. వి. మత్స్యవిశేషము. (చూ. కొరద.)

**జెష్ట.** వై. వి. గ్రా. పెద్దమ్మ. (ఇది వాడుకలోనిది.)

## జే.

**జే.** వై. అవ్య. 1. జయజయయనుదీవన; 2. నమస్కారము*. "క. క్షితిదేవమాళియతివి, స్మితుఁడైచేదోయిమోడ్చి జేయనుచు సమ, స్కృతులలరఁజేసిశివ్యన, హితుఁడైతనయాశ్రమమునకేతెంచె న్నృపా." శివ. ౨, ఆ. (చూ. జేజే.)

**జేంద్ర.** దే. వి. నేతనేసి జీవించెడి యొకానొకజాతి. (జేంద్రవాఁడు, జేంద్రది.)

**జేగంట.** వై. వి. గెలుపులోనగు సమయములందుకొట్టెడు పెద్దఘంట. "సీ. అరయువెన్నుఁడెదేవరని వేల్పుగమిచాటఁగానెత్తుపైఁడిజేగంటయనఁగ." య. ౨, ఆ.

**జేగుటించు.** దే. అ. క్రి. ఎఱ్ఱనగు. (చూ. జేగుఱు.)

**జేగుఱు.** దే. వి. ఎఱుపు. విశే. ఎఱ్ఱనిది. "ద్వి. గొనబుకురుల్ కొప్పుఁగూడకకప్పు, కొనినసెన్నుదుటజేగుఱుబొట్టువెలయ." పణ్డి. పూ. 3, ఆ.

**జేగుఱుఁబురువు.** ద్వ. వి. ఇంద్రగోపము. (చూ. జేవుఱుఁబురువు.)

**జేజె.** వై. వి. వేలుపు, దేవుఁడు*. "దండకము. జేజెలుంబ్రాంతజేజేలుఁదేజారఁగాఁజేరి." అచ్చ. యు, కాం.

**జేజే.** వై. వి. 1. జయజయయనుదీవన; "క. జేజేయనిజగమెంచఁగ." ఉ, రా. ౧, ఆ.—2. నమస్కారము*; "సీ. జేజేహరాజాదిగాజీవపూజాసమాజోచితాంఘ్రిపంకేజసీకు." ఉ, రా. ౧, ఆ.—3. దేవుఁడు*. "సీ. వాలారుగోరుపెఁగాలాముచేసినే జేజేహిరణ్యాక్షశిశుకమునకు." పాండు. ౨, ఆ.

**జేజేగట్టు.** వై. వి. మేరుపర్వతము.

**జేజేపట్టు.** ద్వ. వి. స్వర్గము, సురాలయము.

**జేడియ.** దే. వి. జేజ.

**జేడె.** దే. వి. బురదనేల. (జేడియయొక్కరూపాంతరము.)

**జేత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) జయించువాఁడు.

**జేతవ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) జయింపఁదగినవాఁడు.

**జేన.** దే. వి. పంద్రెండు అంగుళములకొలఁది, వితస్తి.

**జేపెట్టు.** ద్వ. స. క్రి. దీవించు. "ఎ, గీ. భూమిఁజిరకాలమేలుమాస్వామియనుచుఁ, బ్రజలుజేపెట్ట." ఉ, రా. ౮, ఆ.

**జేబు.** దే. వి. ఆఁడుదానికట్టుఁగోక. (జీబుయొక్కరూపాంతరము.) (కొన్ని గ్రంథములయందు పాఠమిట్లు కనఁబడుచున్నది.)

**జేబు.** హిం. వి. చొక్కాయిసంచి.

**జేమనము.** సం. వి. అ. న. భోజనము, కుడుపు.

**జేయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) జయింపఁదగినవాఁడు.

**జేరుబందు.** హిం. వి. టంగువారు, చబుకు.

**జేవుటించు.** దే. అ. క్రి. జేగుటించుయొక్కరూపాంతరము. "అనినంగన్నులుజేవుటింప." సా. ౫, ఆ.

**జేవుఱు.** దే. విశే. జేగుఱుయొక్కరూపాంతరము. (చూ. జేగుఱుఁబురువు.)

**జేవుఱుగండ్లు.** దే. వి. బ. కోటలోనుండి తుపాకులు కాల్చెడు రంధ్రములు.

## జై.

**జైత్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) జయించువాఁడు.

**జైనము.** సం. వి. అ. న. ఒకానొకమతము. (చూ. మతము.) పుం. డు. జైనశాస్త్రమును చదివినవాఁడు.

**జైవాతృకుఁడు.** సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. పంటకాఁపు; 3. వైద్యుఁడు. విశే. దీర్ఘాయువుగలవాఁడు.

## జో.

**జోంగకము.** సం. వి. అ. న. అగురుచందనము. పుం. అగురు వృక్షము.

**జోటి.** సం. వి. ఈ. స్త్రీ. దుప్పటి.

**జోటింగుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**జోనళము.** సం. వి. అ. పుం. 1. రక్తవర్ణాధికకృష్ణవర్ణము; 2. జొన్నపైరు. విశ. రక్తవర్ణాధికకృష్ణవర్ణముకలది.

**జోనాళము.** సం. వి. అ. పుం. జొన్నపైరు.

## జ్ఞ.

**జ్ఞపితము.** సం. విశ. (అ. ఆ. అ.) చంపఁబడినది.

**జ్ఞప్తము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.

**జ్ఞప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తెలివి; 2. తలఁపు.

## జ్ఞా.

**జ్ఞాత.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) తెలియువాఁడు.

**జ్ఞాతము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలియఁబడినది.

**జ్ఞాతవ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలియఁదగినది.

**జ్ఞాతి.** సం. వి. ఇ. పుం. 1. దాయాదుఁడు; 2. తండ్రి.

**జ్ఞాతేయము.** సం. వి. అ. న. జ్ఞాతిత్వము.

**జ్ఞానము.** సం. వి. అ. న. మోక్షవిషయమైనబుద్ధి, తెలివి.

**జ్ఞాని.** సం. వి. న్. పుం. 1. జోస్యుఁడు; 2. కోఁడి. విశ. జ్ఞానముగలవాఁడు.

**జ్ఞానేంద్రియము.** సం. వి. అ. న. తెలిసికొనెడి యింద్రియము. (చూ. ఇంద్రియము.)

**జ్ఞాపకము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలియఁజేయునది.

**జ్ఞాపనము.** సం. వి. అ. న. తెలియఁజేయుట.

**జ్ఞాపితము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.

## జ్ఞే.

**జ్ఞేయము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలియఁదగినది.

## జ్యా.

**జ్యా.** సం. వి. ఆ. స్త్రీ. 1. వింటినారి; 2. నేల; 3. తల్లి.

**జ్యాని.** సం. వి. ఇ. స్త్రీ. 1. ముదిమి; 2. హాని; 3. ఏఱు.

**జ్యాయుఁడు.** సం. విశ. (స్. ఈ. స్.) 1. మిక్కిలి వృద్ధుఁడు; 2. మిక్కిలి శ్రేష్ఠుఁడు; 3. అగ్రజుఁడు.

## జ్యే.

**జ్యేష్ఠ.** సం. వి. ఆ స్త్రీ. 1. ఒకనక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. నాయకుఁడు మిక్కిలి ప్రేమయుంచిననాయిక; 3. పెద్దమ్మ; 4. బల్లి. అ. పుం. ము. 1. ఒకనెల; 2. హంస.

**జ్యేష్ఠుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. అగ్రజుఁడు; 2. మిక్కిలి వృద్ధుఁడు; 3. మిక్కిలి శ్రేష్ఠుఁడు.

## జ్యో.

**జ్యోతి.** సం. వి. స్. న. 1. వెలుఁగు; 2. నక్షత్రము; 3. కన్ను. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు.

**జ్యోతిరింగణము.** సం. వి. అ. పుం. మిడుఁగుఱుఁబురువు, ఖద్యోతము.

**జ్యోతిర్లత.** సం. వి. ఆ. స్త్రీ. మానేరుతీఁగ.

**జ్యోతిశ్చక్రము.** సం. వి. అ. న. చంద్రసూర్యాదిగ్రహనక్షత్రమండలము.

**జ్యోతిషము.** సం. వి. అ. న. జోస్యము. (చూ. అంగము.)

**జ్యోతిషికుఁడు.** సం. వి. అ. పుం. జోస్యుఁడు.

**జ్యోతిషుఁడు** సం. వి. అ. పుం.——పై.——

**జ్యోతిష్మతి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) జ్యోతిర్లత.

**జ్యోత్స్న.** సం. వి. ఆ. స్త్రీ. 1. వెన్నెల; 2. వెన్నెలరేయి.

**జ్యోత్స్ని.** సం. వి. ఈ. స్త్రీ. 1. వెన్నెలరేయి; 2. పొట్లకాయ.

## జ్యౌ.

**జ్యౌతిషికుఁడు.** సం. వి. అ. పుం. జ్యోతిషికుఁడు.

**జ్యౌత్స్ని.** సం. వి. ఈ. స్త్రీ. వెన్నెలరేయి.

## జ్వ.

**జ్వరము.** సం. వి. అ. పుం. ఆర్తి, వేఁడి.

**జ్వరితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) జ్వరముగలవాఁడు, వేఁడిగలవాఁడు.

**జ్వలనము.** సం. వి అ. న. మంట. పుం. అగ్ని.

**జ్వలించు.** సం. అ. క్రి. 1. మండు; 2. ప్రకాశించు.

**జ్వలితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మండినది; 2. ప్రకాశించినది.

## జ్వా.

**జ్వాల.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. మంట, అర్చి.

**జ్వాలాజిహ్వుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. పార్వతి యొక్కదూత.

## జెం.

**జెంకించు.** వై. స. క్రి. బెదరించు. కాశీ. ౪, ఆ.

**జెంకు.** వై. అ. క్రి. 1. భయపడు; 2. సంకోచపడు*. వి. 1. భయము; 2. సంకోచము*.

**జెంకె.** వై. వి. జంకెనయొక్కరూపాంతరము. "క. హుంకారములు నదల్పులు, జంకెలుధిక్కారములును సంస్తుతులునుబీ, రాంకోక్తులు నిశ్శ్వహాబధ, శంకృతులునుబెరసియుద్భటంబుగఁబెరిగెన్." భార. భీష్మ. ౨, ఆ.

**జెంకెన.** వై. వి. బెదరింపు. "చ. జంకెననెబిచూపుచూచిపలికెం జలితాధరపల్లవాగ్రయై." పా. ౧, ఆ.

**జెంకెయొనర్చు.** రూ. స. క్రి. (జంకె+ఒనర్చు.) బెదరించు. "దప్పుడుచేయకుండుమని జంకెయొనర్చిన." భాగ. ౧౦, స్కం. పూ.

**జెంగ.** వై. వి. 1. పిక్క; "సీ. లలితచందనలేపకలితసుందరవళీ సోపానములజంగఁజూఁపియెక్కు." పు. ౧, ఆ.—2. దాఁటు*. "జలధిలంఘనునందుజంగయెఱఁగి." కా. ౫, ఆ.

**జెంగగొను.** ద్వ. స. క్రి. (జేంగ+కొను.) దాఁటు. "గగనాంగణమహీతలభుజంగనిలయంబుల్ జంగగొనునేర్పరి." పా. ౩, ఆ.—ద్వ. అ. క్రి. (జంగ+కొను.) దుముకు. ("జేంగల్ చెంగునఁగొని." అని యొకచో భిన్నముగాఁ బ్రయోగము కనఁబడుచున్నది. చూ. చౌకట్టులు మొదటియర్థము నుదాహరణము.)

**జెంగనడక.** ద్వ. వి. కాలుచాఁచిపెట్టినడచునడక. (జేంగనడపు అనియు.)

**జెంగము.** వై. వి. జేంగమువాఁడు. (జంగమువారిలో పూజ్యుఁడైన వానిని జంగమయ్య జంగముదేవర అని చెప్పుదురు.)

**జెంగాళెము.** వై. విణ. నిడువాటు*. "వ. పొలిసినపచ్చియేనిక తోలువచ్చడంబుజంగాళంబుగావైచుకొని." భీ. ౩, ఆ.

**జెంగి.** దే. వి. అగ్నిప్రసారణము.

**జెంగియ.** దే. వి. జేంగె.

**జెంగిలి.** దే. వి. 1. గోసమూహము; "వ. ముంగలియైజంగిలి వెలుచుగోపాలుపోలిక." ఉ, హరి. ౬, ఆ.—2. పశుసమూహము. "ఏనుంగుజంగిలి." య. ౧, ఆ. "సింగంపుజంగిలి." య. ౩, ఆ. (జంగిలి అనఁగా స్వల్పసేనాధిపతి అని ఒక నిఘంటుకారుఁడు వ్రాసియున్నాఁడు.)

**జెంగుపిల్లి.** వై. వి. అడవిపిల్లి.

**జెంగె.** దే. వి. ఒకదినుసుగజ్జె. "సీ. గండపెండరములుగంటలు జంగెలుగిలుకపావాలుచెల్వలరఁదొడిగి." రాజ. ౩, ఆ. (జంగియయొక్క రూపాంతరము.)

**జెంజెడ.** దే. వి. చీల.

**జెంజా.** దే. వి. గుంపు, సమూహము.

**జెంజాటము.** దే. వి. తగులము. "క. ఓటమితోనెల్లప్పుడు, పాటవమునఁబనులుసేసిబాలురతోనే, యాటలకుఁబోకయొకజం, జాటంబునులేకభక్తినలుపుదునఘా." భాగ. ౧, స్కం.

**జెంజాడి.** వై. వి. జముదాడియొక్క రూపాంతరము. (దీనిని జంజాళియనియు చెప్పుచున్నారు.)

**జెంట.** వై. వి. జత. ద్ర. 1. వెంట*; "శా. జంటన్ వచ్చిన సారమేయములు నీసైన్యంబులున్ మాయవే." ఉ, హరి. ౩, ఆ.—2. సమీపమునకు*. "క. వెంటఁబడిపొడుచుగోవుల, జంటఁ జనకు." భోజ. ౬, ఆ. (జేమటయొక్క రూపాంతరము.)

**జెంటముక్కాలి.** ద్వ. వి. (జంటమూఁడు+కాలు.) తుమ్మెద, షట్పదము. "శా. కాలికిఁగేలుసాఁపియుడిగంబునమ్రొక్కుచు రాచమిన్నయి, ల్లాలికి నాఁడెమైనజవరాలికి దోసపునీరుతాల్పు వెన్, గాలికి జోగికాటువని గారపుడెందపుఁదమ్మిజంటము, క్కాలికిమేరమీఱెడు జగంబులమేలికినేలచూలికిన్." అచ్చ. యు, కాం.

**జెంటమోమువేలుపు.** ద్వ. వి. అగ్నిదేవుఁడు.

**జెంటి.** దే. వి. జరిగవట్టె.

**జెంటీ.** దే. వి. జంటియొక్క రూపాంతరము. "సీ. అవికకుట్టడపుఁ తోళ్లపుని[illegible]జంటీలు[illegible]తాడ్లు[illegible]గైధండయొనఁగ." [illegible] ౧, ఆ.

**జెంటు.** వై. అ. క్రి. జంటపడు. (అప్ర.)

**జెంత.** దే. విణ. ధూర్తురాలు. "నతులెంతజంతలౌర." శశాం. ౪, ఆ.

**జెంతపట్టు.** దే. అ. క్రి. కలుపుతెగి చక్కఁగా పండుటకై పైరు నడుమదున్ను.

**జెంతిక.** వై. వి. 1. భక్ష్యవిశేషము; 2. ఆ భక్ష్యమునుచేసెడు యంత్రవిశేషము*. "మ. పాలఁతీచూచితెతేఁటితెక్కరవగాడ్పుం బోదలేఁదాఁకుజో, కలచేజాఱుమెఱుంగుపుప్పొడుల రేకల్ మీఱెగుత్తమ్ములై, యలరుంబెజ్జపుమావిజంతికలఁజెన్నారన్ వనీదేవతా, కలకంఠీ మణులొత్తునాన్తెలగతిన్ గన్వొందుగావించుచున్." చంద్ర.

**జెంతికవుండు.** ద్వ. వి. అనేకరంధ్రములుగల వ్రణము.

**జెంత్రకాఁడు.** వై. వి. (జేంత్రము+కాఁడు.) సూత్రధారుఁడు. (చూ. జేంత్రము.)

**జెంత్రము.** వై. వి. 1. సూత్రము*; "వ. వినుముదేహధారి స్వతంత్రుండుగాఁడు. జంత్రకానిచేతిజంత్రపుబొమ్మకైవడినీశ్వరతంత్రపరాధీనుండై సుఖదుఃఖంబులందునర్తనంబులుసలుపు." భాగ. ౧౦, స్కం. పూ.—2. సూత్రపుబొమ్మ*. (చూ. గంద్రించు.)

**జెందియము.** వై. వి. జన్నిదముయొక్క రూపాంతరము.

**జెందెము.** వై. వి. జందియముయొక్క రూపాంతరము.

**జెంపము.** దే. వి. అంకెవన్నెతగిలించెడు సుదారములోనగునది. "ముత్తియంపుజంపములు చొక్కంపుఁగెంపుటంకెవన్నెలు." రసి. ౧, ఆ.

**జెంపాడు.** దే. అ. క్రి. (జంపు+ఆడు.) కదలు.

**జెంపారు.** దే. అ. క్రి. (జంపు+ఆరు.) మందమగు.

**జెంపాలు.** దే. వి. జోలపాట.

**జెంపు.** దే. వి. 1. ఆలస్యము; "క. మీవారెఱుఁగుటయెన్నఁడు, కావించుటయెన్నఁడింకఁగల్యాణంబున్, నీవేలజంపునడపెదు." విజ. ౩, ఆ.—2. ముత్యములులోనగువానికుచ్చు (లేక) జాలరు; "వ. తారకలగుంపుజగజంపుగాళతపత్త్రశత్రుండాతపత్త్రతయంగీకరింప." (జగజంపు అనుచో జగ అనునది విశేషణము.) ఆము. ౬, ఆ. "ఎ, గీ. అక్కుఁజేరిచిచన్నిచ్చిచొక్కటంపు, కెంపువిడి కెంపుజంపునసొంపునింపు, జాతిమగజాతితొట్లహర్షమునఁబెట్టి, రమణదాదులుపెనుప నారాచపట్టి." చంద్రా. ౩, ఆ.—3. సన్నఁదనము. "క. కెంపారెడు నధరంబును, జంపారెడు నడుము." భాగ. ౮, స్కం.—విణ. నిడివైనది. "జంపుకురులతోడ." ఇలాదేవీయము.

**జెంపులు.** ద్వ. వి. బ. (జేంపు+పూలు.) చెంపసరము.

**జెంపె.** వై. వి. తాళభేదము. (పదియక్షరములకాలము.)

**జెంబు** యు. దే. వి. తృణవిశేషము, జమ్ము. వై. జంబువు. (చూ. జేంబేఱు.)

**జెంబుగూడ.** దే. వి. జేమ్మతో గూడవలెనల్లినది.

**జెంబేఱు.** ద్వ. వి. (జేంబు+ఏఱు.) జంబూనది. "జంబేటి కాలువ." కాశీ. ౭, ఆ.

**జెక్కర.** దే. వి. నది. "సీ. కలివేల్పుచూడ్కిజక్కరలుబ్బి ఫాలిక బలుగ్రచ్చుఁబైరులుపండఁగలవె." నీలా. ౧, ఆ.

**జెక్కరరాయఁడు.** ద్వ. వి. సముద్రుఁడు, సరిత్పతి.

**జెక్కలించు.** దే. స. క్రి. గెలిచేయు. (అప్ర.)

టెంకియ. దే. వి. టెంకె.

టెంకె. దే. వి. మాదిగవాఁడు బెజ్జముచేసెడు సూది. (టెంకియ యొక్క రూపాంతరము.)

టెక్కి. దే. వి. దాసరికుల్లాయ. "గౌదకట్టుకసె చేరుల టెక్కియు." ఆము. ౬, ఆ.

టెక్కియము. దే. వి. టెక్కెము.

టెక్కు. దే. వి. యౌవనాదులవలనఁగలుగు గర్వచేష్ట. "ఎ, గీ. జక్కవలుగేరఁగలువల టెక్కు జార." చంద్ర.

టెక్కులాఁడి. దే. విశే. (టెక్కులు+ఆఁడి.) టెక్కులుగలది. (ఆఁడుది.) ఉ, రా. ౪, ఆ.

టెక్కులాఁడు. దే. విశే. (టెక్కులు+ఆఁడు.) టెక్కులుగల వాఁడు.

టెక్కువ. దే. వి. టెక్కు. "ఎ, గీ. అఖిలకళలందుఁదోఁడుసీడ గుచుమెలఁగు, నధిపునకుఁబాలమున్నీటియాఁడుబిడ్డ, యరిది మక్కువఁడెక్కువనవిరతంబు, సురముడింపక యతఁడుతన్నుపచరింప." కళా. ౫, ఆ.

టెక్కెపుగాము. దృ. వి. (టెక్కెము+గాము.) కేతుగ్రహము.

టెక్కెము. దే. వి. ధ్వజము. (టెక్కియముయొక్క రూపాంతరము.)

## టే.

టేంకణము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

టేఁకి. దే. వి. మత్స్యవిశేషము.

టేఁకు. దే. వి. తేకు, క్రకచపత్రము.

టేఁకుదీవి. దృ. వి. శాకద్వీపము.

టేపు. ఆం. వి. నాడా.

టేపు. దే. వి. మండుటయందగు ధ్వన్యనుకరణము. "ఉ. లావున వైరిదర్పమువెలార్పకయాఁకలిగొన్న చేతులన్, భావభవారిపాదము లఁబట్టివరాక్రమకేళిఁగోరితిన్, టేపునమండియున్న మటిటెక్కె ముకాలినయప్పు నంగరం, బేవలనైనఁ గల్గునవియోన్ హరుఁడొం డొకమోదమేటికిన్." ఉ, హరి. ౫, ఆ.

## టై.

టైము. ఆం. వి. కాలము.

టైలరు. ఆం. వి. కుట్టుపనివాఁడు, దర్జీ.

## టో.

టోకు. దే. వి. 1. మొత్తము; 2. జెట్టు భుజముతో భుజము తాఁకించుట. "మ. లేగాడ్పుసా, దనజోదులే తగసాముచేయుటకుఁగాం తౌకం టెటోకియన్నఁగన్." చంద్ర.

టోపి. దే. వి. పట్టులోనగువానితోఁ జేర్చఁబడిన కిరీటము. "చ. జిలుఁగు మృణాళతంతుకృతచేలముతోఁబిగురాకుటోపితో." రా, వి. ౫, ఆ.

టోలా. హిం. వి. సంఘు.

టోలి. హిం. వి. పైసలో ఎనిమిదవ భాగము.

## ఠ.

ఠ. ఒక యక్షరము.

ఠంగుఠింగు. దే. వి. ఆయుధము లొకటితో నొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. (చూ. ఖంగుఖింగు.)

ఠక్కుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మోసకాఁడు.

ఠక్కురుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేలుపు.

ఠలాయించు. హిం. క్రి. అటునిటు తిఱుగు.

ఠవఠవ. దే. వి. శ్రమము. "క. దిబిబిసరుహ బాంధవసైం, ధవసం ఘంటెంతదప్పిదగలేకరుగున్, ఖుఖసంతదప్పినేమును, ఠవఠవలే కరుగుదుముహుటాహుటినడలన్." స్వా. ౧, ఆ.—అడ్డంకి. (అని కొందఱు.)

ఠవణించు. దే. ప్రే. ఠవణిల్లఁజేయు, కావించు. "క. ఠవణింతు నొక్క శ్రీఖా, గవతచరిత్రంబుపరమకల్యాణనము, ద్భవభవనం బుఁజతుర్థశ, భువనమహారత్నసూత్రముగఁదగు నరణిన్." పాండు. ౧, ఆ.

ఠవణిల్లు. దే. అ. క్రి. 1. ప్రవర్తిల్లు; "సీ. ఎవ్వఁడుఠవణిల్లు నెల్లజీవులయందుఁబూనలకోనున్న బొందుపోలె." కాశీ. ౫, ఆ.—2. ఒప్పు. "సీ. శ్రీపాదములఁబైఁడిచిఱుగజ్జియలతోడఠవ ణిల్లగండపెండారమమర." కాశీ. 3, ఆ.

ఠవర. దే. విశే. నేర్పరి. "క. కొమ్మవయిఁబక్షపాతము, నెమ్మెయినెఱపుదువిదేలయేఁచెదవకటా, కమ్మఁగనవాతుచక్కర, కమ్మగమాటాడు ఠవరకలకంఠవరా." విజ. 3, ఆ.

ఠవళి. దే. వి. మోసము, కపటము. "క. బంతిమొగంబులరక్కసుఁ, డెంతయునుపైళంబరవళియేఱుపడంగన్." అచ్చ. అర, కాం.

ఠవళికాఁడు. దే. విశే. మోసకాఁడు. "క. అటులున్నఠవళికానిన్, దటుకునఁబోడఁగాంచి." అచ్చ. యు, కాం.

ఠవిణ. దే. వి. డవిణయొక్క రూపాంతరము. "సీ. గ్రహరాజరథము మునుగల జయాంకంబుగా డాకొల్పువజ్రంపుఠవిణయనఁగ." భాను. 3, ఆ.

## ఠా.

ఠాకురు. హై. వి. గ్రా. 1. దేవత; 2. అధిపతి*; 3. తండ్రి*; 4. గురువు*. (ఇది వాడుకలోనిది.)

ఠాణా. హిం. వి. కావలిదండు, కావలిస్థలము.

ఠాయము. హై. వి. గ్రా. ఠాయియొక్క రూపాంతరము. "చ. ప్రమదయొకర్తుమాధవునిఁబాడివిపంచిధరించికేలనం, భ్రమమునఁ దంత్రిమీటుచుఁదిరంబుగఠాయముచేసియొక్క రా, గముతగనాల పించిమధగస్వరజాతులువేఱువేఱుగా, నమరఁగఁబాడెఁ దన్ రమ ణుఁడౌననదారువులంకురింపఁగన్." భాగ. ౧౦, స్కం. పూ.

ఠాయి. హై. వి. గ్రా. స్వరస్థాయి. "చ. ఠాయియు, ద్దిరస్ఫురితంబుమమ్మయనఁదేనియ లొల్కెడిజిల్లుపాటతోఁ, దరుణివిపంచిమీటె." ఉ, రా. ౬, ఆ.

ఠావు. హై. వి. గ్రా. స్థానము*. "క. ఈవిధమునసాహసము, గోవిందుఁడుగాచి కరుణకొనసాఁగంగా, గోవర్ధనాద్రిఁదొల్లిటి, ఠావున నిడి మహిమతో విడంబించుటయున్." వి, పు. ౭, ఆ.

## ఠి.

**ఠింగణా.** దే. విణ. 1. బాలుఁడు; "గీ. సంగతియెయోయిసు మంతఠింగణావు, తత్వనిర్ణయవాదంబుతరమెనీకు." ఆము. ౪, ఆ.—2. పొట్టివాఁడు.

**ఠికానా.** హిం. వి. ఆశ్రయము, గతి.

## ఠీ.

**ఠీవి.** దే. వి. వైభవము. "సీ. ఠీవియుఁదేజంబాడియుమగఁటిమిఁ దాల్మివడిఁగల్మినుడి వానికడిఁదిమేలు." అచ్చ. యు, కాం.

## ఠే.

**ఠేవ.** దే. వి. 1. ఒప్పిదము; "మ. తనదుర్వారశరప్రతాపశిఖి చేతంబుట్టుపేరాహితా, వనిరాట్పట్టణధన్యసాళిఁ గొనిఠేవన్ వన్నెగా వించునో, రనిజశ్రీకరకీర్తిదర్పణము శ్రీరంగక్ష్మానాథనం, దన రత్నంబగువేంకటాద్రి జయపద్మాదర్శసార్థంబుగన్." రామా. ౧, ఆ.—2. విధము. "మన్నగరియొప్పుబలభిన్నగరిఠేవన్." సా. ౫, ఆ.

## ఠో.

**ఠోలా.** దే. వి. తెగ, సమూహము.

## డ.

**డ.** ఒక యక్షరము.

**డంక.** దే. విణ. దిట్ట. "గీ. కొంకులేనివెతలఁగుందెడిముగుదల, డంకతనముమీఱజంకులేక, బింకమునఁగలంచెదింకనెన్నఁడునీకు, వంకగల్గదోటుజింకతాల్ప." నీలా. 3, ఆ.

**డంకా.** వై. వి. డక్కయొక్కరూపాంతరము.

**డంగు.** దే. అ. క్రి. దంగుయొక్కరూపాంతరము. (చూ. డంచే.)

**డంగురము.** దే. వి. చర్మవాద్యవిశేషము.

**డంచే.** దే. ప్రే. దంచేయొక్కరూపాంతరము. "డంపుదునేకు భృత్యరివృథంబుల." కాశీ. 2, ఆ.

**డంబము.** వై. వి. 1. శ్లాఘింపించినవేషము*; 2. ప్రతిష్ఠ*. (చూ. డంబు.)

**డంబరము.** సం. వి, అ. పుం. ఒజ్జృంభణము. "సీ. వాగ్డంబరము నఁగైవారంబుచేసిలితగుదువాచస్పతిత్వమునకీవు." కాశీ. ౪, ఆ.

**డంబు.** వై. వి. 1. కపటము; "పంచచామరము. నరాదుఁడీ మృగంబు డంబునన్ వనంబుతోనఁగానరా." ఉ, రా. ౧, ఆ.—2. శ్లాఘింపించినవేషము*; "ద్వి. తనడంబుతప్పకధనికులయిండ్ల, కనుభునఁజనివారికనురాగమొదవ, రిత్తమొ్రక్కులుమొ్రక్కి." హరిశ్చ. ౨, భా.—3. కాంతి*; (చూ. క్రొత్తడము.)—4. గర్వము*; "మ. క్షితినాతమ్మునఁడునేను దిగ్విజయముగా జేయంగఁడాయగాఁ గడిగా, బ్రతిపిరప్రకరంబు డంబుమెయిఁగప్పంబొప్పనంబీకయే, కతమూడంగలరే నరేశ్వరశిరోగర్వంబు సర్వంబుఁగా, పితిమీకాన వరప్రసాదమున మీపెంపెల్లెడన్ జెల్లఁగన్." ఉ, హరి. ౪, ఆ.—5. ప్రతిష్ఠ*; "ద్వి. నరుఁడుడంబునకుజన్మముచేసెనేని, నర నాథవైశసనమునదుఃఖించు." భాగ. ౬, స్కం.—6. విధము*. "సీ. తనదివ్యమకుటంబు తనడంబుననంత మణిసంతతద్యోతమ హిమఁగాంచ." ఉ, రా. ౧, ఆ.—విణ. అధికము*. "క. దంబు గఁబంచమహోళ, ధ్వంబులుమొ్రయంగ." రా. అ, కాం.

**ఢక్క.** వై. వి. వాద్యవిశేషము, ఢక్క.

**డక్కి.** వై. వి. డక్క, డమరువు. (ఆనిక్గొందఱు.)

**డక్కు.** దే. అ. క్రి. దక్కుయొక్కరూపాంతరము. "ఉ. అక్కట మందభాగ్యునకుసట్టితనూభవరత్న మెవ్విధిన్, డక్కునె." భార. ద్రో. ౨, ఆ.

**డక్కొను.** దే. అ. క్రి. దక్కొనుయొక్కరూపాంతరము.

**డగర.** దే. వి. పిశాచము. "గీ. మగువగాదురయిదిపెనుడగరగాని." కళా. 3, ఆ.—విణ. గంటు. "౧, గీ. చొక్కముగఁబాటపాడు నొక్కొక్కచోట, డగరకోయిలలెల్లఁజుట్టబికమరయ." ఉ, రా. ౭, ఆ.

**డగరము.** దే. వి. కీడు. "గీ. కెలనివారికినెంతటికీడువచ్చె, నేనిఁదొలఁగించుహరితనకెగ్గునేయు, వెడఁగుఁజెఱుపఁజెయెదిరికి మడఁచువాఁడు, తనకుడగరంబుచెఱుచుటెంతటిభరంబు." ఉ, హరి. ౫, ఆ. (చూ. దగరము.)

**డగ్గర.** దే. వి. డగరయొక్కరూపాంతరము.

**డగ్గఱ.** దే. వి. విణ. దగ్గఱయొక్కరూపాంతరము. "చ. అతినిష్ఠుర ఘోర విశాల దండతా, డనములుచేయుచున్ జమునిడగ్గఱకుంగొని పోయిచూప." భల్లా. 3, ఆ.

**డగ్గఱించే.** దే. అ. క్రి. దగ్గఱించేయొక్కరూపాంతరము. "వాని కింగాలముడగ్గఱించె." ఉ, రా. 3, ఆ.

**డగ్గఱు.** దే. అ. క్రి. దగ్గఱుయొక్కరూపాంతరము. "క. వెఱ చఱచివెగడుపడిని, వ్వెఱఁగందుచుఁగురుబలంబుబీరులతనిడ, గ్గఱ కంతనంతఁజూడఁగ, నుఱకనదీసుతుఁడుదాఁకెనుద్భటభంగిన్." భార. భీష్మ. ౨, ఆ.—"సీ. యజ్ఞంబుఁజూడరమ్మనివేఁడుకొనివారిఁ గదలింపనేఁడుడగ్గఱుటదెలిసి." జై. ౮, ఆ. (చూ. డగ్గఱ.)

**డగ్గు.** దే. అ. క్రి. వి. దగ్గుయొక్కరూపాంతరము.

**డగ్గుత్తిక.** దే. వి. (డక్కు+కుత్తిక.) గద్గదస్వరము, గాద్గద్యము. "మ. అనిడగ్గుత్తికతో మహాభయముతోనాకంపితాంగంబుతో." భాగ. ౧౦, స్కం. పూ.

**డజన్.** ఆం. వి. పండ్రెండు, డజన్‌బాజీ, చాలదెబ్బలు.

**డప్పి.** దే. వి. దప్పియొక్కరూపాంతరము. (శ్రమమునకు.—"వ. నీవ్రుకడుదూరంబువచ్చిడప్పితి, ఇంకమరలుటలెస్స, అనిపలికిన నప్పతివ్రతయిట్లనియె. గీ. నాథుడప్పియొక్కడిదిమనంబుభర్తృ, చరణపంకజాసక్తమైకరముభక్తి, నలరుచున్నదినతులకునన్యమెట్టి, దియునుధర్మమెభర్తృసంశ్రయమెకాక." భార. అర. 2, ఆ.)

**డప్పు.** దే. వి. తప్పెట, తమ్మటము.

**డబడబ.** దే. వి. ఉద్ధతి. "సీ. పొలనాడురాముఁడైబూతంపుఁ జిల్కలఁ గొట్టినడబడబల్ గట్టువడియె." చమ. ౨, ఆ.

**డబ్బఱు.** దే. వి. దబ్బఱుయొక్కరూపాంతరము. "గీ. డబ్బఱులు పల్కువారికడ్డంబుకలదె." కాశీ. ౪, ఆ.

**డబ్బా.** దే. వి. తుపాకిమందులోనగునవి యుంచుకొనెడు తోలు పెట్టె.

**డబ్బాటు.** దే. క్రి. విణ. అవ్య. అకస్మాత్తుగా. "క. ఒకనాఁడ జాండునీనీ, డకుడబ్బాటరుగుదెంచుటయు." భార. శాం. 3, ఆ. (ఒకానొకఁడు డబ్బాటుమైనని ప్రయోగించియున్నాఁడు. అది విచారణీయము.)

**డబ్బాటుసాకిరి.** ద్వ. విణ. ప్రసంగవశమునవచ్చి యెల్లకార్యములు తెలిసికొనినసాక్షి, యదృచ్ఛాభిజ్ఞుఁడు.

**డబ్బి.** దే. వి. బరణి.

**డబ్బు.** యు. దే. స. క్రి. బొంకాడు. (వాఁడొకడబ్బుడబ్బెను.) వి. 1. బొంకు; 2. రెండుదుగ్గానులరాగినాణెము; 3. ధనము; 4. ఒకానొకశకునపుఁబక్షి. (చూ. గబ్బులుఁగు.) విశ. బొంకైనది. "ఇవి మిక్కిలిడబ్బులునిలువుముచాలు." పర. ౫, ఆ.–వై. డంబము*.

**డబ్బుడుబ్బు.** దే. వి. ఆయుధము లొకటితోనొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. (చూ. ఖంగుఖంగు.)

**డబ్బుర.** దే. వి. 1. వెడలుపాటినోరుగల లోహపాత్రవిశేషము; 2. గిన్నె. (చూ. దబ్బుర.)

**డమరము.** సం. వి. అ. పుం. కొల్లమొదలగు దేశోపద్రవము, హావడి.

**డమరుకము.** సం. వి. అ. పుం. డమరువుయొక్క రూపాంతరము.

**డమరుగము.** వై. వి. చర్మవాద్యవిశేషము.

**డమరువు.** సం. వి. ఉ. పుం. 1. డమరుగము; 2. చమత్కారము.

**డమాయి.** వై. వి. చర్మవాద్యవిశేషము.

**డమారము.** వై. వి. డమాయి.

**డమాను.** హిం. వి. తెఱచాప.

**డమ్మను.** దే. అ. క్రి. (డం+అను.) చేచ్చే.

**డమ్మారము.** వై. వి. డమారముయొక్క రూపాంతరము.

**డయనము.** సం. వి. అ. న. 1. బాలకాదులక్రీడాశకటము; 2. పక్షిగతి.

**డయ్యు.** దే. అ. క్రి. 1. బలహీనమగు, బడలు. "ఇంచుకనేపు పోరులకాడయ్యుటతప్పె." భార. భీష్మ. 3, ఆ.–2. కృశించు. "ఎ, గీ. ఏమిగొఱఁతయయ్యెనిట్లుడయ్యనుదను, చ్ఛాయదఱఁగియుండ." సం. "అయం త్వాం శకునిః ప్రాహవివర్ణం హరిణమ్ కృశమ్." భార. సభా. ౨, ఆ.

**డలాయతు.** హిం. వి. బిళ్లబంత్రౌతు.

**డల్లి.** హిం. వి. ముద్ద.

**డవాలీ.** హిం. వి. బంత్రౌతు బిళ్లతగిలించుపట్ట.

**డవిణ.** దే. వి. డంకా.

**డహువు.** సం. వి. ఉ. పుం. గజనిమ్మ.

డా.

**డా.** దే. విశ. ఎడమ, సవ్యము. (డాకడ, డాకన్ను, డామూఁపు మొ.)

**డాంబికుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రజాలాదిమాయలు చేయువాఁడు.

**డాఁకొను.** దే. అ. క్రి. దాఁకొనుయొక్క రూపాంతరము. (ప్రే. డాఁకొలుపు.)

**డాఁగనమ్రుచ్చులు.** దే. వి. బ. డాఁగురుమూఁతలు. "సీ. తనదాడికరిడాఁగుననురీతిఁజెలికాండ్రకదనడాఁగనమ్రుచ్చులాడనేర్చు." రా, వి. ౨, ఆ. (రూ. డాఁగనమ్రుచ్చిల్లు. "క. అచ్చిన్నిచెలువడాఁగన, మ్రుచ్చిల్లను నాల్గుగంబములయాటలు మేల్, మచ్చులనుగచ్చకాయలు, నచ్చసగండ్లాడునరివయస్యలతోడన్." పాంచా. ౧, ఆ.) (దాఁగనమ్రుచ్చులుయొక్క రూపాంతరము.)

**డాఁగిలిమూఁతలు.** దే. వి. బ. డాఁగురుమూఁతలు. (దాఁగిలిమూఁతలుయొక్క రూపాంతరము.)

**డాఁగిలిమ్రుచ్చులు.** దే. వి. బ.——పై.——"సీ. డాఁగిలిమ్రుచ్చులాటలు గచ్చకాయలు వెన్నెలకుప్పలు తన్నుబిల్ల." కాశీ. 3, ఆ. (దాఁగిలిమ్రుచ్చులుయొక్క రూపాంతరము.)

**డాఁగు.** దే. అ. క్రి. దాఁగుయొక్క రూపాంతరము. (చూ. డాఁచే.)

**డాఁగుడుమూఁతలు.** దే. వి. బ. (చూ. డాఁగురుమూఁతలు.) చమ. ౧, ఆ.

**డాఁగురించే.** దే. ప్రే. 1. దాఁచే; "ఉ. ఏమటుపోకశౌరిమదినేర్పడముగానిడాఁగురించెనో, యేమిటి కెందుఁబోయిరొ నరేంద్రయెఱుంగను." భార. సౌ. ౧, ఆ.–2. వంచించే. "గీ. అతివమొఱఁగి, మగఁడుఁబలిడాఁగురించిభామయుఁదిరుగుదురు." హరి. ఉ ౯, ఆ. (దాఁగురించుయొక్క రూపాంతరము.)

**డాఁగురింత.** దే. వి. 1. డాఁగురించుట; 2. బ. డాఁగురుమూఁతలు. "ద. డాఁగురిం, తలుహరితోడనాడుదురుతద్వనవిఘులయందుగోపికల్." హరి. పూ. ౭, ఆ. (దాఁగురింతయొక్క రూపాంతరము.)

**డాఁగురుమూఁతలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. పైఁడిమెట్టికలెక్కి పైకేగిచేఁతగట్లందుడాఁగురుమూఁతలాడియాడి." య. 3, ఆ. (దాఁగురుమూఁతలుయొక్క రూపాంతరము.)

**డాఁచే.** దే. ప్రే. దాఁచేయొక్క రూపాంతరము. "వృకోదరుండొకండతఁడికిఁజొచ్చి దోర్బలముడాఁపకపోరెడు." భార. భీష్మ. ౨, ఆ.

**డాఁపు.** దే. ప్రే. దాఁపుయొక్క రూపాంతరము.

**డాక.** దే. వి. 1. విజృంభణము; "అత్తొలితొలిడాకకేవెఱచి." ఆము. ౪, ఆ.–2. శౌర్యము. "క. లగ్గలకునట్లుకోటకు, డగ్గఱితనమొనలనెల్లడాకఁదఱిమి." ప్రభా. ౫, ఆ.

**డాకడ.** ద్వి. వి. 1. ఎడమపార్శ్వము; 2. ఉత్తరపుదిక్కు.

**డాకలి.** దే. వి. దాకలియొక్క రూపాంతరము.

**డాకల్లు.** దే. వి. దాకల్లుయొక్క రూపాంతరము.

**డాకిని.** సం. వి. ఈ. స్త్రీ. పిశాచస్త్రీ.

**డాకురు.** దే. స. క్రి. (కాళ్లు) తేలగిలవేయు.

**డాకొను.** దే. అ. క్రి. దాకొనుయొక్క రూపాంతరము. "ఎ, గీ. డాకొనుచుఁబద్మజాండభాండంబునిండి." భాను. 3, ఆ. (ప్రే. డాకొలుపు.)

**డాక్టరు.** ఆం. వి. పెద్ద వైద్యుఁడు, పండితుఁడు.

**డాగు** దే. వి. 1. గుఱుతు; "సీ. గాఢనాళీకనంగ్రస్తుఁడైనేఁడునీడాగువాఁడువాణీవిలాసి." వసు. 3, ఆ.–2. వాఁత; "చ. విరహిజనమ్ములకమరుఁడువీఁపులడాగులువేయఁబూనిని, ప్కరుణనిజప్రతాపశిఖఁగ్రాఁచఁగఁగ్రాఁగు నలాకలోయనన్, ధరపయినెల్లెడలదరులదట్టములై చిగురాకుజొంపముల్, నిరుపమలీలఁబొల్పెఁదరుణీకనుఁగొంటెమిటారిచూపులన్." చంద్ర.–3. మఱక.

**డాత్యూహము.** సం. వి. అ. పుం. చేఁదుగలచేఁప.

**డాపల.** దే. వి. ఎడమభాగము. "క. పటుశరములమీఁదికిడా, పటికిఁవలపటికినపరభాగమునకుమఁం, దటికిఁజదలనడపెనము, త్కటరయమునశిరముఁగండుక క్రీడగతిన్." భార. ద్రో. ౪, ఆ.

**డాపలించు.** దే. అ. క్రి. ప్రదక్షిణముగు. "క. అరయుదము గానియిమ్మో, హారకునకును డాపలించియరదముఁబోని, మ్మురవడి." భార. విరా. ४, ఆ.

**డాపు.** దే. వి. విశే. దాపుయొక్క రూపాంతరము. "కర్ణకుండల రుచిరాళిఫలక్యములడాపునల్లనఁజూంచి." వసు. 3, ఆ.

**డాపురము.** దే. వి. విశే. దాపురముయొక్క రూపాంతరము.

**డాబు.** దే. వి. 1. పక్షివిశేషము; "మూలనందులనుండిమూల్గుడా బులక్రందు." చంద్రా. ౨, ఆ.–2. జేందెమువరె వేసికొనెడు తోలుపట్టె.

**డాబా.** దే. వి. బోడిమిద్దె.

**డాబు.** యు. దే. వి. దినుసులపట్టిక. వై. డంభము, అతిశయపు మాటలు.

**డామరము.** సం. వి. అ. పుం. 1. డమరముయొక్క రూపాంతరము; "వ. కదీయదేశముల్, తలఁకకయుండురోగభయతస్కర డామరవర్జితంబులై." భార. ఆది. ०, ఆ. (గ్రంథములయందు డాంబరమని కనఁబడుచున్నదిగాని దానికి ఆకరమేమియుఁ గానఁ బడలేదు.)—2. శివోక్తతంత్రవిశేషము.

**డాయి.** దే. వి. దాయియొక్క రూపాంతరము.

**డాయు.** దే. అ. క్రి. డాయుయొక్క రూపాంతరము.

**డాలించు.** వై. స. క్రి. డాలువాఱుచూను.

**డాలు.** యు. దే. వి. 1. కాంతి; 2. కెక్కెము. వై. డాలు వాఱు.

**డాలుకాఁడు.** దృ. విశే. డాలువాఱుచేతఁ బట్టినవాఁడు.

**డాలువాఱు.** దృ. వి. డాలు, కేడెము.

**డావరడంగి.** దే. వి. దేవతాశము*.

## డి.

**డింకవేయు.** దే. అ. క్రి. వేచ్చే. "కెడసినదుర్వ్యలుడిఁకవేసె నెలుఁగుల్ గిట్టెబులుల్." సా. ౧, ఆ.—డింకాకొట్టురూపాంతరము.

**డింకీలు.** దే. వి. బ. మల్లవిద్యావిశేషము.

**డింకు.** దే. అ. క్రి. చేచ్చే.

**డింగరీడు.** వై. వి. 1. సేవకుఁడు; 2. భక్తుఁడు*. "వ. కట కటాక్షైలభారికనుంగులగు డింగరీలు దయాశుభులు కావలవదే." అము. ౬, ఆ.

**డింగరుఁడు.** సం. వి. అ. పుం. సేవకుఁడు.

**డింగిల్లు.** దే. వి. బ. నమస్కారవిశేషము.

**డించు.** దే. ప్రే. దించుయొక్క రూపాంతరము. (చూ. డిగు.)

**డిండిమము.** సం. వి. అ. పుం. రాయడిగిడిగిడియను వాద్య విశేషము.

**డిండీరము.** సం. వి. అ. పుం. ఫేనము, నురుఁగు.

**డిందు.** దే. అ. క్రి. 1. అడఁగు; "ఆసానలంబిఱువోవ్వక బోద అందుడిందుఁబోదముక." భార. అర. ౬, ఆ.–2. ఇంకు; "ఉ. తోలువానలుకురియఁగఁడ, జ్వలనివహముదైత్యబిభుని సంత ప్తాంగం, బులయందుడిందెవార్ధి, జ్వలనశిఖలడిందుజలధిజలి యమ్ముల్లోరిజ." లక్ష్మీ. ౨, ఆ.–3. క్రుంగు; "సీ. అతిరథ సాంక్రియిన్యార్భటనిర్భరభరంబునసేలపాతాళమునకుడింద." మార్క. ౬, ఆ.–4. మ్రగ్గు. "చ. తనయంగనమునంగలమాంసమెల్లఁదె, ట్టినను గపోతభాగము కడిందిగ డిందుచునుండెనత్తులక." భార. అర. 3, ఆ.—వి. అడఁకువ.

**డిందుపడు.** దృ. అ. క్రి. 1. అడఁగు, శమించు; "క. అనుడు నతఁడుతనచిత్తం, బునఁదోఁచినవిధము ధర్మపుత్రునితోని, ట్లనిచె ప్పెనాతనికిఁబు, ట్టినయుత్తలపాటుకొంతడిందుపడంగక." భార. విరా. ౧, ఆ.–2. సమాధానపడు. "గీ. తొడిగినట్టితూపుదోన లోనవైచిన, దనుకడిందుపడదుమనసునాకు." రామా. ౭, ఆ. (ప్రే. డిందుపఱచు.)

**డిందుపాటు.** దృ. వి. ఉపశాంతి. "వ. అయ్యపస్మారంబునకు ...ఏమిటనుడిందుపాటులేకుండిన." విక్ర. 3, ఆ.

**డింపు.** దే. వి. దింపుయొక్క రూపాంతరము. "ద్వి. పెద్దలబాలుర బెలయునానతులఁ, దద్దయుడింపుఁదలంచుకొనుచు." (ఇక్కడ డింపునక అనఁగా దీనత్వముతోనని యర్థము.) భాగ. ౧౧, స్కం.

**డింబము.** సం. వి. అ. పుం. 1. కొల్లమొదలగు దేశోపద్రవము; 2. భయము; 3. పక్షిగ్రుడ్డు; 4. ఊపిరితిత్తుల దెసప్రక్కనుండెడు మాంసగోళము; 5. కడుపు నెడమప్రక్కనుండెడు మలాశయము.

**డింభము.** సం. వి. అ. పుం. 1. పిల్ల; 2. గ్రుడ్డు.

**డింభుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వెలికిలఁదిరిగి పరుండినవాఁడు; (బిడ్డ.) 2. మూర్ఖుఁడు.

**డిగఁద్రావు.** దే. అ. క్రి. దిగు. (చూ. దిగఁద్రావు.)—స. క్రి. విడుచు. (చూ. డిగ్గఁద్రావు.) (దిగఁద్రావుయొక్క రూపాంతరము.)

**డిగఁబడు.** దృ. అ. క్రి. దిగఁబడుయొక్క రూపాంతరము.

**డిగనాడు.** దే. స. క్రి. దిగనాడుయొక్క రూపాంతరము.

**డిగనుఱుకు.** దే. అ. క్రి. (డిగక+ఉఱుకు.) దిగువకు దుముకు.

**డిగియ.** వై. వి. డిగ్గియయొక్క రూపాంతరము. "క. తిరుకొళము నూయిలోటయుఁ, జెఱువుమడువులొండుకుంటచెలమపడియకో, నెఱబుగ్గవాఁగుదొనలు, వరిగుండముకాల్వడిగియబావిదొరువులక." హంస. ४, ఆ.

**డిగు.** దే. అ. క్రి. 1. డిగ్గు; "డిగకుఁడువాహనంబులుకడింది మగంటిమికోలుపోవ." భార. ద్రో. ४, ఆ.–2. తగ్గు. "ఎ, గీ. బలంబునుజలంబు, డిగకనలవృమైబోరెనాడియుబకంబు." మార్క. ౨, ఆ. (దిగుయొక్క రూపాంతరము.)

**డిగుడు.** దే. వి. దిగుడుయొక్క రూపాంతరము.

**డిగువ.** దే. వి. విశే. దిగువయొక్క రూపాంతరము. (క్రిందునకు.— "ద్వి. డిగువనున్నాఁడు." రా. యు, కాం.)

**డిగ్గఁద్రావు.** దే. అ. క్రి. దిగు. (చూ. దిగఁద్రావు.)—స. క్రి. విడుచు. "గీ. మర్మభేదులైనమార్గణంబులకోహ, టించినిగ్గఁజలము డిగ్గఁద్రావి." భార. కర్ణ. ౧, ఆ. (డిగఁద్రావుయొక్క రూపాంతరము.)

**డిగ్గదాఁటు.** దే. అ. క్రి. డిగనుఱుకు. "క. అతం, డదిడిగ్గ దాఁటి ధైర్యా, న్వదమతి నభిమన్యుఁజేరి పైకింజనియోక." భార, భీష్మ. ౨, ఆ. (అది—దానినుండియని యర్థము.)

**డిగ్గన.** దే. ద్ర. క్రి. విశే. దిగ్గనయొక్క రూపాంతరము. "ద్వి. గద్దియమీఁదడిగ్గనడిగ్గనుటేకి." రా. యు, కాం.

**డిగ్గనాడు.** దే. స. క్రి. డిగనాడుయొక్క రూపాంతరము.

**డిగ్గనుఱుకు.** దే. అ. క్రి. డిగనుఱుకుయొక్క రూపాంతరము.

**డిగ్గి.** దే. వి. అగ్ని. (అప్ర.)

**డిగ్గియ.** నై. వి. నడబావి. "సీ. అలరునెత్తమ్ములకలిమిఁజెల్వగుడిగ్గియలతీరభూములనల్లవొంది." భార. శాం. 3, ఆ.

**డిగ్గు.** దే. అ. క్రి. దిగు. "తదీయోదప్రపూరంబుజాలైడిగ్గుచున్." పు. ౧, ఆ.—వి. తక్కువ. "ఎ, గీ. ఒక్కరూపకానియెక్కుడు డిగ్గును, గానరాదుముఖవికాసమునకు." నిర్వ. ౧, ఆ. (డిగుయొక్కరూపాంతరము.)

**డిగ్గుడు.** దే. వి. డిగుడుయొక్కరూపాంతరము.

**డిగ్గువడు.** ద్వి. అ. క్రి. (డిగ్గు+పడు.) తక్కువపడు. "ఉ. నీయనంబుచే, గాలిమెసంగుత్రేనియొడికంబునఁజొక్కలసోయగంబును, త్యాలబెడంగుడిగ్గువడునట్లుగఁజేసినచాగపుంబలీ." య. ౪, ఆ.

**డిమము.** నం. వి. అ. పుం. నాటకభేదము. (చూ. నాటకము.)

**డిమ్మరి.** దే. వి. దిమ్మరియొక్కరూపాంతరము. "క. వనితలపురుషులయెడఁబు, ట్టినయదితావెల్లివిరిసెడిమ్మరితనము." భార. శాం. ౬, ఆ.

**డిమ్మి.** ఆం. వి. ఒకవిధమైన దట్టపుకాగితము.

**డిల్లపడు.** ద్వి. అ. క్రి. (డిల్లము+పడు.) (భయాదులచే) సత్వహీనమగు. "తనువృద్ధతఘర్మజలంబుఁదాల్చుచున్ డిల్లపడంగ." భార. విరా. ౭, ఆ.

**డిల్లపాటు.** ద్వి. వి. డిల్లపడుట.

**డిల్లపోవు.** ద్వి. అ. క్రి. (డిల్లము+పోవు.) డిల్లపడు. "ద్వి. అనిపల్కగుండెజల్లనిడిల్లపోయి." పా. ౪, భా.

**డిల్లము.** దే. విణ. (భయాదులచే) సత్వహీనమైనది. "గీ. భీమనందనుచావునఁ గ్రీడిఁ డించి, ధర్మతనయుండు బాష్పంబుధార లడర, మేనుడిల్లంబుగాఁదేరి మీఁదవివశుఁ, డగుచుఁ జదికిలఁబడుటయునచ్యుతుండు." భార. ద్రో. ౫, ఆ. "వ. అత్తలోదరియుల్లంబుడిల్లంబుగాఁదొడంగిన." (ఇక్కడ డిల్లమునకు ఉత్సాహహీనమైనదని యర్థము.) ఉ, హరి. ౫, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. ఉదా. డిల్లపడు మొ.)

**డిస్ట్రిక్టు.** ఆం. వి. జిల్లా, కలెక్టరుక్రిందనుండు దేశము.

డీ.

**డీ.** దే. అవ్య. తలతో పొడుచుట.

**డీకు.** దే. వి. ప్రేరేఁపణ. (చూ. దీకు.)

**డీకొను.** దే. అ. క్రి. 1. పురికొను; 2. కవియు. స. క్రి. ఎదిరించు. "ద్వి. నన్నుడీకొనకవేమగుడిపొమ్ము." రా. సుం, కాం.—(ప్రే. డీకొలుపు.—పురికొలుపుటకు.—"ద్వి. కరులడీకొలిపినఁగరులపైఁగవిసి." రా. యు, కాం.—కవియించుటకు.—"క. ఆయనమదిడీకొలుపలేక వ్యాకులమతియై." సా. ౭, ఆ.)

**డీకోలు.** దే. వి. డీకొనుట.

**డీనము.** నం. వి. అ. న. మీఁదికెగురుట.

**డీలించు.** దే. ప్రే. డీలఁజేయు, నడలించు. "గీ. నగముడీలించి బాహులుదిగిచికొనఁగ." నిర్వ. ౪, ఆ.

**డీలు.** దే. అ. క్రి. డిల్లపడు. (చూ. దీలు.) విణ. డిల్లము. (వానిపని డీలైపోయినది.)

**డీలుపడు.** ద్వి. అ. క్రి. డిల్లపడు.

**డీలుపాటు.** ద్వి. వి. డీలుపడుట. "డీలుపాటుప్రకటదైన్యంబుఁదోఁప." నై. ౭, ఆ.

డు.

**డు.** దే. అప. బిందుపూర్వకమై ప్రథమైకవచనమునందువచ్చు ఒకానొక ప్రత్యయము. (ఉదా. రాముఁడు, భీముఁడు మొ.) మఱియు నిది క్రియలయందునువచ్చును. (ఉదా. మ్రొక్కుచున్నాఁడు, మ్రొక్కెఁడు, మ్రొక్కుఁడు మొ.) ద్ర. ఇది ఆనంతర్యార్థమునందువచ్చును. (ఉదా. కొట్టుడును, తిట్టుడును మొ.)

**డుంకు.** దే. అ. క్రి. తగ్గు.

**డుంఢుకము.** సం. వి. అ. పుం. దుండిగముకి. విణ. డు. 1. అల్పుఁడు; 2. క్రూరుఁడు.

**డుండుభము.** సం. వి. అ. పుం. ఇరుదలపాము.

**డుక్కు.** దే. అ. క్రి. మఱుఁగుపడు. "ఉ. అక్కటదిక్కులేమి రజతాచలమెక్కఁడుపెల్లగించె వే, లొక్కఁడువంచెమేరు మఱియొక్కఁడువింధ్యమునేలఁజొచ్చె నొం, డొక్కఁడుతూపునన్ గెడపెనఁఁక్కనఁగ్రౌంచము సంచునప్పురిన్, డుక్కినగట్లయోజనెగడున్ నవరత్నవినూత్నసౌధముల్." చంద్రా. ౧, ఆ. "వ. కాలువలనుతప్పికాలు వలనఁడుక్కుకాలుబలంబులును." చంద్రా. ౬, ఆ.

**డుబుడక్క.** ద్వి. వి. డుబుడక్కవానివాద్యము. "ఉ. డాకఁదలిర్చుమబ్బు డుబుడక్క మెఱుంగుమెఱుంగుపట్టునం, జోఁకబలాకికాసమితిచుక్కలనామపురేకనమ్మిబల్, కేకసరోజభేకముల కీడునుమేలునుదెల్పుకూఁకగా, జోకఘనాగమంబురహిఁజొచ్చెమహిన్ డుబుడక్కవాఁడనన్." చంద్రా. ౪, ఆ.

**డుబుడక్కవాఁడు.** ద్వి. వి. వేషమువేసికొని డుబుడక్కను వాయించుచు మేలుకీళ్లను దెలిపెడి యొక జాతిబిచ్చపుజోగి. "ఎ, గీ. వచ్చెనచటికి డుబుడక్కవాఁడొకండు." హంస. ౭, ఆ.

**డుయ్యు.** దే. అ. క్రి. స. క్రి. 1. దుయ్యుయొక్కరూపాంతరము. (బాణాదికమునాటి వెడలుటకు.—"క. అదియుక్కుఁగాఁడిడుస్సిపాఱెన." స్వా. ౪, ఆ.)

**డుర్జుచ్చి.** దే. అవ్య. యుద్ధమునకు పిలుచుటయందుపయోగింపఁబడునది.

**డులడుల.** దే. వి. డుల్లుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. డులడులచుక్కలడుల్లుకైవడిని." రా. యు, కాం.

**డులుచు.** దే. ప్రే. డుల్లఁజేయు. (రూ. డుల్చు.)

**డుల్లు.** దే. అ. క్రి. 1. పడు; "గీ. రత్నకేతనములురాజితశేఖరం, బులునురుచిరఘంటికలునుబార్థు, బాణనిహతిఁదునిసిపడెఁగౌరవుల చేటు, తెలుపఁడుల్లునుల్కములనుబోలె." భార. విరా. ౫, ఆ. —2. ఊడు. "వ. శాండిలియనునొక్కతపస్విశాపంబునఁబక్షంబులుడుల్లియతని యనుగ్రహంబునంగ్రమ్మఱవచ్చిన." భార. ఉద్యో. 3, ఆ.

డూ.

**డూయు.** దే. అ. క్రి. స. క్రి. దూయుయొక్కరూపాంతరము.

డె.

**డెందము.** దే. వి. ఉల్లము, హృదయము.

**డెక్క.** దే. వి. పశువుల కాలిగిట్ట, ఖురము. "శే. కఠినకుద్దాలవక్త్రములయ్యెనీజన్నెముఁ డెక్కలక్కొందమూలములకు." పాండు. ౫, ఆ.

**డెక్కు.** దే. స. క్రి. అడ్డగించు, నివారించు.

**డెక్కొను.** దే. అ. క్రి. (డెక్కు+కొను.) నెలకొను.

**డెప్ప.** దే. వి. కొండమీఁదినమున్నైనచోటు, నెత్తము.

**డెప్పరము.** దే. వి. ఆపద. "క. ముందటియుత్పాతములకు, డెందంబులనోర్చియిప్పటికిఁబాయఁగలే, కిందుండఁగమనకిప్డా, డ్కొందనుకఁగానికడిఁదిడెప్పరమొందెన్." హరి. పూ. ౬, ఆ. "డెందముమీఁదిచెందొవకు డెప్పరమేమియులేదు." (ఇక్కడ ఆపద అనఁగా చలనము అని యర్థము.) ఉ, హరి. ౫, ఆ.- విశే. 1. అశక్యము; "అతనిందెగఁజూచుటగోరకాజిఁబట్టికొనుటగోరితి విస్మయముడెప్పరమెంతయు." భార. ద్రో. ౧, ఆ.–2. దుస్సహము. "ఎ, గీ. డెప్పరంబుగాఁగడెబ్బదిశరములు, నినిచెరామచంద్రుసనుఁజూనేన." రా. యు, కాం. (దీనికి సందర్భానుసారముగా అసాధ్యము దుర్లభము మొదలగు అర్థములును గలుగును.) (దెప్పరముయొక్క రూపాంతరము.)

**డెప్పరించు.** దే. అ. క్రి. అశక్యమగు.

**డెప్పు.** దే. స. క్రి. దెప్పుయొక్క రూపాంతరము.

**డెబ్బండ్రు.** దప. స. డెబ్బదిమంది. (డెబ్బదికి మహన్మహత్యర్థక రూపము.)

**డెబ్బది.** దప. స. (ఏడు+పది.) ఏడుపదులు, సప్తతి.

## డే.

**డేఁగురి.** సం. వి. ఆ. స్త్రీ. జయఘంటిక, జేగంట.

**డేక్చా.** హిం. వి. పెద్ద వంటపాత్ర.

**డేగ.** దే. వి. సాధారణపు పక్షులను కుందేలులోనగు స్వల్పమృగములను వేటాడెడు ఒకదినుసుపక్షి, శ్యేనము. (దీని భేదములు అనేకములు. చూ. అణుజు.)

**డేగాట.** దే. వి. (డేగ+ఆట.) పెండ్లి అయిదవనాడు సమీపబంధువులు పెండ్లికొడుకును, పెండ్లికూఁతును మూఁపులమీఁద నెత్తుకొని వారిచే మాలలు మార్పింప డేగలవలె ఎగిరియాడెడు ఆట.

**డేరా.** దే. వి. గుడారము. "ఎ, గీ. అభినవశృంగారగౌరవమునఁ, జాలఁదనరారెడేరాహజారమునను." రసి. 3, ఆ.

## డై.

**డైరీ.** ఇంగ్లీ. ఆం. వి. దినచర్య.

## డొ.

**డొంక.** దే. వి. 1. నడిచి పల్లముగానేర్పడిన కాలిదారి; 2. పొద; "సీ. పాలచేరులువట్టితూలింపబలిమినీడ్చుకొనిడొంకలఁదూటిచుట్లఁబెట్టు." సావి. ౪, ఆ.–3. కోన. "వ. కరినరకరేణువులు వంపగుంపుచెడి యుట్టుట్టువడితిట్టలగుచిట్టల సంకటంబులగుడొంకలును." సావి. ౪, ఆ.

**డొంకు.** దే. అ. క్రి. 1. ఇంకు; "క. వెల్లువముంచిపిదపనీ, రెల్లనువెసడొంకఁగొలననెనఁగెడుచంచత్ఫుల్లారవిందములక్రియ, నల్లనవదనములుతోఁచెనాశ్చర్యముగాన్." నిరవ. 3, ఆ.–2. ఎండు; "క. ధరణీపంకంబులింకెఁదటినులుడొంకెన్." రా. కిష్కిం, కాం.–3. అడఁగు. "దరస్మితవిలాసపుఁజంద్రికడొంకి." సావి. 3, ఆ.–వి. వంకర. "ద్వి. గూనుడొంకులుదీఱ." రా. అ, కాం.

**డొంకెన.** దే వి. వంకర అలుఁగుగల యీఁటె. "వ. అయ్యార్వురుగాంధారకుమారులు నయ్యలావంతుంబొదివి సెలకట్టెలవాట్ల డొంకెనలపోట్లనొప్పించిన." భార. భీష్మ. 3, ఆ. "ఈఁటెలడొంకెనలంగటార్లబల్కత్తులసత్తలంబులను." కళా. ౮, ఆ.

**డొంగ.** దే. వి. దొంగయొక్క రూపాంతరము. "గీ. డొంగవలె వచ్చియుక్కడడొంగినావదేమయా." వైజయంతీవిలాసము.

**డొంగు.** దే. అ. క్రి. డాఁగు. (దొంగుయొక్క రూపాంతరము.) వి. చెట్టులోనితొఱ్ఱ.

**డొకారము.** దే. వి. లోను, అంతరాళము. (చూ. డొకారముచొచ్చు.)

**డొకారముసొచ్చు.** దే. అ. క్రి. (డొకారము+చొచ్చు.) లోనగు, లోపడు. "చ. పరబలభీకరంబగునపారసముద్ధతిఁగాంచి వజ్రియై, పురివరణంబుమూఁడుజగముల్గయికొన్న మహాభయంబునన్, గరకరివానియొక్కట డొకారముసొచ్చుకులాద్రులోయనన్, నిరుపమలీలసాధములనేకములుల్లసిలున్బురంబునన్." చంద్రా. ౧, ఆ.

**డొక్క.** దే. వి. 1. ఒడలియెముకలగూఁడు, కంకాళము; కడుపు. (అనికొందఱు.) 2. టెంకాయబొండ్లపుచెక్క.

**డొక్కబుఱ్ఱ.** దే. వి. తేగపాటివీడినతాటివిత్తు.

**డొక్కరము.** వై. వి. మల్లబంధవిశేషము. "గీ. కళవరానకుఁజొచ్చిడొక్కరముహత్తి." ఉ, హరి. 3, ఆ.

**డొక్కు.** దే. అ. క్రి. ముదియు. విశే. ముదిసినది.

**డొగరు.** దే. వి. 1. అపరాధము; 2. నింద.

**డొప్ప.** దే. వి. దొప్పయొక్క రూపాంతరము. "ఎ, గీ. డొప్పచెవులునుగొగ్గిపండులునుగలిగి." నై. ౭, ఆ.

**డొలుచు.** దే. ప్రే. డొల్లఁజేయు. (రూ. డొల్చు. "సీ. కల్పించియాబండి కలుడొల్చెనత్యలోకంబుననుండియాకమలగర్భుఁ, డదిడొల్లిగిరివిష్టపాంతరంబులుదాఁటి క్రమముతో భూమిచక్రమునవ్రాలె." కాశీ. ౧, ఆ.)

**డొల్ల.** దే. వి. చేటవలె మూఁడుప్రక్కలయందు అడ్డుపలకగల బల్లలోనగునది. బుఱ్ఱ. (అనికొందఱు.)

**డొల్లు.** దే. అ. క్రి. 1. పొర్లు; (దొర్లుయొక్క రూపాంతరము.) (చూ. డొలుచు.)–2. పడు. "క. విందునితలయిల, పైడొల్లఁగనేసెఁ దీవ్రభల్లప్రహతిన్." భార. ద్రో. 3, ఆ.

## డో.

**డోఁకు.** దే. అ. క్రి. ఓకిలించు. స, క్రి. గడ్డిలోనగుదాని నెదురుగాఁజెక్కు. (ఈ యర్థమందు ఇది దోఁకుయొక్క రూపాంతరము.) వి. ఓకిలింత.

**డోఁగియాడు.** దే. అ. క్రి. (డోఁగి+ఆడు.) దోఁగాడు. "సీ. కొమరొప్పఁదనుఁదానకూర్చుండఁగానేర్చెనాడకాడకుడోఁగియాడనేర్చె." చంద్రా. ౨, ఆ. (రూ. డోఁగాడు.)

**డోఁగు.** దే. అ. క్రి. దోఁగుయొక్క రూపాంతరము.

**డోకడా.** దే. వి. నూఱువపాలు.

**డోరము.** సం. వి. అ. న. చేతఁగట్టుకొనెడు వ్రతసూత్రము, తోరము.

డోరము౹౹. దే. వి. బ. కత్తిమీఁదిచాఱలు.

డోరియా. హిం. వి. చీర.

డోల. సం. వి. ఆ. స్త్రీ. 1. డోలి; 2. తొట్లు; 3. నీలిచెట్టు. అ. పుం. ము. అభినయహస్తవిశేషము.

డోలనము. సం. వి. అ. న. ఊఁచుట, ఊఁపు.

డోలాబ్జము. సం. వి. అ. న. కలువపువ్వు.

డోలి. వై. వి. ఉయ్యాలవంటి అందలము, డోల.

డోలిక. సం. వి. ఆ. స్త్రీ.— —వై.——

డోలు. వై. వి. చర్మవాద్యవిశేషము. "సీ. బేరుమృదంగడోల్లతప్పెటలు కాళెలుపిల్లఁగ్రోవులుతుడుములుభేరిమెఱయ." అచ్చ యు, కాం.

డోసు. ఆం. వి. ఔషధముపరిమాణము, మద్యపానము.

డోసుగాఁడు. ఆం. వి. త్రాఁగుబోతు.

ఢా.

ఢాలు, ఢవులు. దే. వి. మదింపు, రీతి.

డ్రె.

డ్రెస్సరు. ఆం. వి. సహాయవైద్యుఁడు.

ఢ.

ఢ. ఒక యక్షరము.

ఢక్క. సం. వి. ఆ. స్త్రీ. యశఃపటహము, ఢంకా.

ఢక్కాముక్కీ. హిం. వి. సంకటము, ఇబ్బంది.

ఢమామిక. సం. వి. ఆ. స్త్రీ. ఢమాయి.

ఢా.

ఢాలము. సం. వి. అ. న. డాలువాఱు, పలకము.

ఢు.

ఢుండి. సం. వి. ఇ. పుం. గణేశుఁడు.

ఢులి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు, కమఠి. (చూ. డులి.)

ఢో.

ఢోలము. సం. వి. అ. పుం. డోలు.

ణ.

ణ. ఒక యక్షరము.

త.

త. ఒక యక్షరము. దే. అవ. కులవాచకముగస్త్రీ ప్రత్యయము. (చాకిత, వ్రేత మొ.)

తంకర. దే. వి. తుచ్ఛధాన్యము.

తంగు. దే. వి. టంగుయొక్క రూపాంతరము.

తంగువాఱు. దే. వి. టంగువాఱుయొక్క రూపాంతరము.

తంగేడు. దే. వి. తంగేడుయొక్క రూపాంతరము.

తంగేడు. దే. వి. గోశృణి.

తంట. దే. వి. 1. కలహము; 2. చాడీ; 3. శ్రమము; 4. అప్పు; 5. మోసము. "ఉ. ఒంటిగబూదిపూసిజడ లుట్టిపడగా బులితోలు పూనిము, క్కంటిమునీవలెకాదపుముగైకొనిచేయఁజ చేతికబ్బినగా, గంటికివచ్చునొక్కకలకంఠికిమేనసగంబొసంగఁజే, తంటలకేమి ముచ్చుజడదారులదారులఁ గొంతెఱుంగుదుగా." చంద్రా. 3, ఆ.

తంటా. దే. వి. తంటయొక్క రూపాంతరము.

తంటియము దే. వి. కంబెము*.

తంటెము. దే. వి. ప్రపున్నాటము*. (తంటియముయొక్క రూపాంతరము.)

తండకము. సం. వి. అ. పుం. 1. నిర్దేటింటికి అడ్డముగావేసెడు దంతె; 2. వృత్తవిశేషము.

తండసము. ఉభ. దే. వి. మంగలవారము వెరతుర ఊడఁజెవి కెడు సాధనము, కుటిలిక. (ఒకానొక నిఘంటువునందు తంటన మని వ్రాయఁబడియున్నది.)—సం. వి. అ. పుం. కమ్మరకొలిమి.

తండా. వై. వి. 1. లంబాడీలసమూహము*; 2. సరకునింపిన గోనెలసమూహము*.

తండిరి. దే. వి. తండ్రికి మొదటిరూపము. "ఎ, గీ. అనినవారలిట్టు లనిరితండిరిచావు, వినియువెనుకచేసి చనఁగసగునె." భో. ౬, ఆ.

తండు. దే. స. క్రి. (ఇయ్యవలసిన ధనమును) పోయి అడుగు.

తండుగోల. దే. వి. (తండు+కోల.) చేపలఁబొడిచెడు చిల్ల కోల, మండము. "సీ. చుంగులల్లాడుగోఁచులుతండుగోలల నెట్టుకొల్పినమీలపుట్టికలును." పంచ. వేం. ౧, ఆ.

తండురీణము. సం. వి. అ. పుం. 1. కడుగునీరు; 2. పురుగు; 3. బొబ్బరలు.

తండులము. సం. వి. అ. పుం. 1. బియ్యము; 2. వాయు విడంగము*.

తండులీయము. సం. వి. అ. పుం. 1. ధాన్యము; 2. చిట్టికూర.

తండువు. సం. వి. ఉ. పుం. ఊ. స్త్రీ. త్రెడ్డుకొయ్య. ఉ. పుం. నందికేశ్వరుఁడు.

తండేలు. దే. వి. ఓడపెత్తనగాఁడు.

తండేలు. దే. వి. తండెలుయొక్క రూపాంతరము.

తండ్రి. దే. వి. అబ్బ, జనకుఁడు. (చూ. తలిదండ్రులు.)

తండ్రితండ్రి. దే. వి. తాత, పితామహుఁడు.

తంతి. వై. వి. పీఠెలోనగువానికివేసెడు ఉక్కుకమ్మి.

తంతియలు. దే. వి. బ. మెట్లు. "ద. అనిమిషకోటిదైత్యవధ మాత్రనుమరవ్రకయుండఁదెల్పఁగా, వెనుకొనికోటతంతియలవెంబడి గాడిగివచ్చినందనం, దనుఁగనన్న చోఁబిద పదానిసమున్న తిఁ జెప్ప నేటికిక." భద్రా. ౧, ఆ.

తంతు. యు. దే. వి. ఉత్సవవిశేషము. వై. ఉభయార్థసాధకమైన ఉపాయము.

తంతుకాష్ఠము. సం. వి. అ. న. 1. సాలెవాని నాడె; 2. నూలు వడికెడు కదురు.

తంతుకీటము. సం. వి. అ. పుం. పట్టుపురుగు.

తంతునాగము. సం. వి. అ. పుం. సర్పాకారమైన జలజంతువిశే షము, నెగడు.

**తంతునాభము.** సం. వి. అ. పుం. సాలెపురుగు.

**తంతుభము.** సం. వి. అ. పుం. సర్షపము, ఆవాలు.

**తంతువాయము.** సం. వి. అ. పుం. తంతునాభము.

**తంతువాయుఁడు.** సం. వి. అ. పుం. సాలెవాఁడు.

**తంతువు.** సం. వి. ఉ. పుం. 1. నూలిపోఁగు; 2. తంతునాగము.

**తంతెలు.** దే. వి. బ. తంతియలుయొక్క రూపాంతరము.

**తంత్రకము.** సం. విశే. (అ. ఈ. అ.) క్రొత్తది. (వస్త్రము.)

**తంత్రము.** సం. వి. అ. న. 1. ఉభయార్థసాధకమైన ఉపాయము; 2. స్వరాష్ట్రచింత; 3. వ్యాకరణశాస్త్రము; 4. కుటుంబవ్యాపారము; 5. ఉత్తమమైన ఔషధము; 6. సిద్ధాంతము; 7. ప్రధానము; 8. మగ్గము, నూలిపడుగు; (అనికొందఱు.) 9. పరివారము; 10. ఒకానొక వేదశాఖ; 11. హేతువు; 12. ఇట్లు చేయఁదగినదనుట.

**తంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తంతి; 2. తిప్పతీఁగ; 3. నరము.

**తందనము.** వై. వి. మాటిమాటికి తానశబ్దపూర్వకముగాచేసెడు రాగాలాపము. "చ. జగడపుఁగూటిసత్తరువుసారెకుఁగోరుచుబిరి వారినిక్, దగిలెదుతందనాలజడదారి." కళా. 3, అ.

**తందర.** వై. వి. తూఁగు, కునికిపాటు, తంద్ర.

**తంద్ర.** సం. వి. ఆ. స్త్రీ.——పై.——

**తంద్రి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**తంపర.** దే. వి. తామరగుంపు, షండము. "తామరతంపర."

**తంపి.** దే. వి. 1. దాలిగుంట; 2. కలహము.

**తంబ.** దే. వి. ఒకానొకతీఁగ, శింబి.

**తంబళ్.** దే. వి. శివార్చనచేసె బ్రతికెడుజాతి. (తంబళవాఁడు, తంబళది.)

**తంబళి.** దే. వి. (తంబళ్+ఇ.) తంబళవాఁడు. "ఎ, గీ. పెట్టెమూ కుడులఁ మొగలిఱేపత్రి, మట్టిదూపార్తిదీపముఁబెట్టుచమురుఁ, బొందుపఱచుకమునిమాపుపూజసేయఁ, గ్రొత్తకాణాచితంబళిపొత్తుకొని యె." హంస. ౧, అ.

**తంబి.** దే. వి. తమ్ముఁడు. (ఇది వాస్తల్యసంబోధనమునందు వాడఁబడును.)

**తంబుగ.** దే. వి. మెడ నిడుపుగానుండెడు చెంబు.

**తంబుఱ.** దృ. వి. (తంతి+బుఱ్ఱ.) పాటపాడువారు శ్రుతికైయుంచుకొనెడు తంత్రీవాద్యవిశేషము. "ఉ. తంబుఱమీటివేల్పొకతె తానములెంతయువిస్తరించిరా, గంబుసరస్తిఱాలుగఁగఁబలుమోవు లుబ్బల్లఁదింపన, యగ్గంబుఱనీమనోహరకులా గ్రణిమీఁదిపదంబు పాడినక్, గ్రొంబులకల్ జనించెనభకుక్ దలవాంఛిరివైణికాగ్రణుల్." ఉ, రా. ౬, అ. (రూ. తంబురా.)

**తకరారు.** హిం. వి. వివాదము.

**తకతక.** దే. వి. తొళమునందగు ధ్వన్యనుకరణము.

**తకపికలాడు.** దే. అ. క్రి. (తకపికలు+ఆడు) ఇట్టట్టుచలించు. "నవరత్నపుఁబాపటబొట్టుమోమునందకపికలాడ." కళా. ౪, అ.

**తకాబి.** హిం. వి. సేద్యముచేయుటకై సహాయముగా నియ్యఁబడు [illegible]

**తక్కటి.** దే. వి. మూఁడుముఖములుగల దీపారాత్రికపుతట్ట.

**తక్కరి.** వై. విశే. (తక్కు+అరి.) టక్కరి. "వ. కళవళంబు తక్కితక్కరి స్త్రీయంబునసల్లనియుల్లంబుకల్లవింపం జేసియనిపి." జై. ౭, అ.

**తక్కిడి.** వై. వి. మోసము*. (చూ. తక్కిడికాఁడు.)

**తక్కిడికాఁడు.** వై. విశే. మోసకాఁడు. "క. ఉక్కిడనేలతేఁడు లఁ, డక్కునఁగనఁబ్రాము నన్ను టకుఁదెచ్చి సబల్, తక్కిడికాఁడవు నీకీ, చిక్కనిమగతనముఁదెల్పనీల్పితికాదే." అచ్చ. సుం, కాం.

**తక్కిలి.** వై. వి. ఒకానొకచెట్టు.

**తక్కు.** యు. దే. అ. క్రి. తప్పు. "వ. ఉత్తరకుందక్కఁబాండ వేయవంశవధూజనంబులకు గర్భంబులేకయుండె." భార. సౌ. ౨, అ.—స. క్రి. విడుచు. "ధర్మమందక్కఁటకోర్వఁజాలుదునె." భార. భీష్మ. 3, అ.—వి. మిగులు. విశే. ఇతరము. "గీ. అట్టి గర్భంబునిలుపుతక్కన్నిగర్భ, ములునుభవదస్త్రమునదగ్ధములుగఁ జేయుము." భార. సౌ. ౨, అ.—వై. అ. క్రి. టక్కుచేయు. (చూ. టక్కు అనునర్థము సుదాహరణము.) ("ద్వి. వెన్నుఁడ య్యాగ్రరెయెన్నితక్కులతక్కు." విష్ణు. ఉ. ౪, అ. ఇక్కడ ఇది సకర్మకము.)—వి. టక్కు. "ద్వి. నక్కు, తక్కులునీవట్టితౌనకంబులును, గొలుపవుమాయెడ." హరిశ్చ. ౧, భా. (ఈ యర్థమందు ఇది టక్కుయొక్కరూపాంతరము.)

**తక్కుడు.** దే. వి. తక్కుట. "వినయంబుతక్కుడస్థైర్యముఁదేక యున్నె." నిర్వ. ౪, అ. (ఇక్కడ తక్కుట అనియే యుండ వచ్చును.) అయినను ప్రతులయందిట్లు కానఁబడుచున్నది.

**తక్కులాఁడి.** దృ. విశే. (తక్కులు+ఆఁడి.) టక్కులాఁడి.

**తక్కులాఁడు.** దృ. విశే. (తక్కులు+ఆఁడు.) టక్కులాఁడు.

**తక్కువపడు.** దృ. అ. క్రి. కొఱఁతపడు.

**తక్కువపాటు.** దృ. వి. కొఱఁతపాటు. "ఉ. అట్టులైననీ, తక్కువపాటులేకప్రమదంబునదేవపదంబునొందుదుర్." భార. ఆర. ౬, అ.

**తక్కె.** యు. దే. వి. రెండుమీసెలయెత్తు. వై. తక్కిలి*.

**తక్కెడ** వై. వి. 1. పేములతట్టలుగ్రుచ్చి వ్రేలవేసినత్రాసు; (చూ. కుడక.) 2. తక్కిలి*.

**తక్కెలి.** దే. విశే. అల్పము.

**తక్కెలి.** వై. వి. తక్కిలి*.

**తక్కేడ.** వై. వి.——పై.——(తక్కెడయొక్కరూపాంతరము.)

**తక్కేలు.** వై. వి.——పై.——(తక్కెలియొక్కరూపాంతరము.)

**తక్కొను.** దే. అ. క్రి. (తల+కొను.) పూనుకొను. "నరుఁడు తక్కొనసేర్పునె తన్నుమ్రుచ్చిలక్." భార. ఆది. ౪, అ. (చూ. ఉంకు.)

**తక్కోలకము.** సం. వి. అ. న. తక్కోలపుచెట్టు, తక్కోలఫలము. (అనికొందఱు.)

**తక్తు.** హిం. వి. సింహాసనము.

**తక్రము.** సం. వి. అ. న. పాతికపాలునీళ్లుచేర్చినమజ్జిగ.

**తక్రాటము.** సం. వి. అ. పుం. పెరుగుచిలికెడుకవ్వము.

**తక్షకుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒక సర్పరాజు; 2. వడ్లవాఁడు.

**తక్షణము.** సం. వి. అ. న. (మాను) చెక్కుట.

**తక్షణి.** సం. వి. ఈ. స్త్రీ. మానుచెక్కెడుసాధనము, బాడిస.

**తక్షుఁడు.** సం. వి. న్. పుం. తక్షకుఁడు, వడ్లవాఁడు.

**తగటి.** దే. విశే. (తగటు+ఇ.) సరిగది. (రూ. తగటీ.) "మ. తలిరుంగైదువురాయఁడధ్వగులపై దండెత్తిలేగాలిబె, స్తలచేఁ బంపిన పండుటాకుతగటీ జాబుల్ కనుంగొంచువిం, తలుగావారికిఁజైత్రుఁడిచ్చు బురుసాదట్టీలు ముత్యాలతో, వలముల్ వోలెఁ దగుం జిగుళ్లఁ గలికావారమ్ములీరమ్ములన్." చంద్ర. (చూ. కురాళమ్ము.)

**తగటు.** దే. వి. సరిగ. "గీ. తగటుఁజీరలురతనంపుఁదళ్కుఁదొడవులు." అచ్చ. బాల, కాం.

**తగడు.** దే. వి. బంగారులోనగువానితేకు. "క. లలితాంగివెన్ను పట్టియు, తళతళమనుకుందనంపుఁదగడుం దెగడున్." పాండు. 3, ఆ.

**తగరము.** ఉభ. వై. వి. లోహవిశేషము. సం. అ. పుం. 1. పొట్టేలు; 2. నందివర్ధనము.

**తగరు.** వై. వి. పొట్టేలు.

**తగరురవుతు.** వై. వి. అగ్ని.

**తగవరి.** దే. వి. (తగవు+అరి.) న్యాయాధిపతి. "క. భగవంతుఁడు గోవిందుఁడు, జగతింబెడవాసిచనినశాసింపంగాఁ, దగవరులులేమి దుర్జను, లెగసిమహాసాధుజనులనేఁచెదరకటా." భాగ. ౧, స్కం.

**తగవు.** దే. వి. 1. తగుట; "క. కపునమ్మియునికియునునె, క్కుడు నమ్మియును మశీల కుశలతకాదె, య్యెడనైనను బుద్ధిశోధిసి, తడవి కనఁగొనఁగవలయుఁదగవుతమియున్." భార. శాం. ౨, ఆ.— 2. న్యాయము; "గీ. చేటుగాలమైనఁ జెట్టమాటలునెజీ, గాని తెరువువట్టికర్జములును, దగవులట్లతోఁచుఁదగియెడునవియవి, నీతులనిమనమునవిశ్చయించు." సం. "అనయోనయసంకాశః." భార. ఉద్యో. ౨, ఆ.—3. ధనాదినిమిత్తమైన జేగడము; 4. పెండ్లప్పుడు పెండ్లికూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహుమానము. విశే. తగినది, యుక్తము. "క. తగుఁబగదీర్పుటయిమ్మెయిఁ, దగవగునేనెత్తురెత్తిత్రావుట." భార. స్త్రీ. ౨, ఆ. (చూ. ఇహిహీ.)

**తగవుగోరి.** దే. విశే. (తగవు+కోరి.) సంధిచేయువాఁడు. "వ. తగవుగోరియుంబోలెఁ గూడఁబెట్టుచు." కవిక. ర, ఆ.

**తగాదా.** హిం. వి. వ్యాజ్యము, తగవు.

**తగిరిస.** దే. వి. తంటెము, ప్రపున్నాటము.

**తగు.** దే. అ. క్రి. యుక్తమగు.

**తగుకత్తి.** ద్వి. వి. సాదనకు ఉపయుక్తమైన ఆయుధవిశేషము.

**తగులఁగట్టు.** దే. స. క్రి. (తగులన్+కట్టు.) తగిలించు.

**తగులఁబడు.** ద్వి. అ. క్రి. (తగులన్+పడు.) తగులు, చిక్కు. (స్వార్థమున పడు.)

**తగులఁబెట్టు.** దే. స. క్రి. (తగులన్+పెట్టు.) 1. తగిలించు; 2. కాల్చు.

**తగులము.** దే. వి. 1. ఆసక్తి; "క. మగలడఁకువనుండకతమ, తగులమపాటింతురెట్టితగులంబైనన్, మగువలయెడఁదలనడఁగున్, దగవువిడిచియడిచిపడరుధైర్యముపేర్మిన్." భార. విరా. ౨, ఆ.—2. అడ్డపాటు. "చ. ఎడపకమున్నమింటిపయినేతగులంబునులేమిమూఁకలన్, వెడలెడుచోఁగరోరఘునబృందములడ్డమువడ్డవానిపై, యిడియఁజవోష్మఁబొ తెడురవిందులదట్టపుబండికండ్లచప్పుడుగతిమ్రోసెరేవగలు భూరిభయంకరగర్జలత్తఱిన్." ఆము. ర, ఆ.

**తగులాటకత్తె.** ద్వి. వి. (తగులాటము+కత్తె.) తగులాటముగల ఆఁడుది.

**తగులాటము.** దే. వి. (తగులు+ఆట.) తగులు, బంధము. (ఇది పోరాటము మాటాటమువంటిది.)

**తగులు.** దే. అ. క్రి. 1. చిక్కు; (పుస్తకమంతయు వెదకితిని అపదమెక్కడ నాకు తగులలేదు.)—2. పట్టు; (ఆ యిల్లుకట్టుటకు కర్చు ఏమి తగిలెను?)—3. తాఁకు; (గడపతగిలి తల బొప్పికట్టినది.)—4. సక్తమగు; (అందు నాబుద్ధి తగులదు.)—5. అంటు; (నా కాలమన్ను తగిలినది.)—6. పొసఁగు. (ఒక పనితగిలి ఊరికి వెళ్లితిని.) అం, ప్రే. తగుల్చు. (చూ. తందనము.)—స. క్రి. వెంబడించు. (వాఁడు నన్ను తగిలినాఁడు విడువలేదు.)—వి. 1. ఆసక్తి; "గీ. ఎంతయోటువడిన నంతియజూవంబు, నందుఁ దగులుఁజలమునతిశయిల్లు." సం. "యదా యథా హి నృపతిః పుష్కరే స్వైవజీయతే, తథా తథా వ్యవై ద్యూ తేరాగో భూయోభివర్ధతే." భార. ఆర. ౨, ఆ.—2. అభిలాష; "సిగ్గెఱుఁగని తగులు." వి, పు. ౨, ఆ.—3. తగులాటము. "తల్లితగులూడి." కళా. ర, ఆ.

**తగులుకొను.** దే. అ. క్రి. తగులుకొను. (ఆ గుడిసె తగులుకొన్నది.)—స. క్రి. వలచు.

**తగులుకోలు.** దే. వి. తగులుకొనుట.

**తగులుగొండి.** దే. విశే. (విటుని) తగులుకొనునట్టిది.

**తగులుచు.** దే. ప్రే. తగులఁజేయు. (రూ. తగుల్చు.)

**తగులుడు.** దే. వి. తగులుట. "క. పానముజూదమువేఁటయు, మానినియునుభూపతులకుమధురవినోద, స్థానములగునైనను దగ, వైనవిధముదక్కఁదగులుడాపదదెచ్చున్." (తగులము అని అచ్చుపుస్తకములయందున్నది.) భార. శాం. 3, ఆ.

**తగులుదల.** దే. వి. తగులుడు.

**తగులుబడి.** దే. వి. పట్టుబడి.

**తగులువడు.** ద్వి. అ. క్రి. (తగులు+పడు.) పట్టువడు, చిక్కు. "గీ. దశరథమహానరేంద్రనందనునిచేత, సతనువిక్రమధరుచేత మదిఁదలంకి, యామహీనాథనాగకన్యాలలామ, తగులువడెనప్పుడేమిచోద్యంబొ తలఁప." రామా. ర, ఆ.

**తగులువాటు.** ద్వి. వి. తగులువడుట.

**తగ్గు.** దే. అ. క్రి. 1. తక్కువగు; 2. వెనుకకుఁదీయు; 3. తెగిపడు. "క. తగ్గెడుఁగారణములేకతడఁబడిపడగల్." భార. విరా. ర, ఆ.—వి. 1. తక్కువ; 2. త్రివర్గమునందొకటియగు క్షయము. (చూ. త్రివర్గము.)

**తగ్గుదల.** దే. వి. తక్కువ.

**తచ్చన.** దే. వి. 1. కపటము; "ద్వి. తచ్చనఁదమయింటఁదద్దినంబనుచు, మునులననియమించిముదమొప్పఁదెచ్చి." రా. అర, కాం.—2. పరిహాసము. (చూ. ఉబ్బరపోవు.)

**తచ్చనలాడు.** దే. అ. క్రి. (తచ్చనలు+ఆడు.) పరిహాసము చేయు. "ద్వి. వరవజ్రకుండలోజ్జ్వలగల్లరుచులు, దరహాసలక్ష్మితోఁదచ్చనలాడ." విష్ణు. పూ. 3, ఆ.

**తచ్చనసేయు.** ద్వి. స. క్రి. (తచ్చన+చేయు.) పరిహసించు. "ఉ. వచ్చిపయోజపత్రములవ్రాలెడుతుమ్మెదదొమ్మిమూఁకలన్, దచ్చనసేయుచున్." పాండు. ౧, ఆ

**తటుకా.** దే. వి. నిశ్చేష్టత.

**తటకాపడు.** దృ. అ. క్రి. చేష్టలుడక్కు. "ఉ. విస్మయాక్రాంత మనఃబుతోడఁబులకల్ దొలఁకఁగఁగ నుతెప్పవేయక, క్కొంతమహాభిలావ(దటకాపడిచూచెఁగుమారిశేఖరుఁ." నా. ౨, ఆ.

**తటకాపాటు.** దృ. వి. తటకాపడుట.

**తటతట.** దే. వి. గుండెలదురుటలోనగువానియందగునను కరణము. "క. తటతటగుండియలదరఁగ." విక్ర. ౭, ఆ. (మఱియు. "జెక్కులుటటతటకొట్టుకొనుచు." ప్రభా. ౩, ఆ. "తటతట పెనుగాలివిసరి." శేష. ౧, ఆ. తక్కినచోట్లను అర్థవిశేషములయందిట్లేయుంగునది.)

**తటమట.** దే. వి. మోసము. "క. తప్పకకనుచుంటివారితటమటలంగఁ." ఇలాదేవీయము. ౨, ఆ.—విశే. 1. మోసముగలది; (చూ. తటవట.)—2. కలఁతనొందినది. "క. ఇటునేయకున్న నిటమీఁ, దటమనయసురాశ్వయంబుఁ దక్కినజగముల్, గుటిలుఁడగునీనిమాటలఁ, దటమటగమనంబులూనితప్పఁగనడచుఁ." లక్ష్మీ. ౪, ఆ.

**తటమటించు.** దే. స. క్రి. 1. మోసపుచ్చు; "ద్వి. పచ్చపైకము కూడఁబడినదిలేదు, తచ్చనల్ పచరించితటమటించెదవా." హరిశ్చ. ౨, భా.—2. కలఁచు. "సీ. కస్తురీకులసిరిఁదటమటింపఁగఁజాలు మెఱుఁగుకన్నులుతలఁదిరిగిరాఁగ." భాగ. ౪, స్క౦.

**తటము.** సం. వి. అ. న. వరిమడి. పుం, న. 1. ఏటి ఒడ్డు; 2. ప్రదేశము. పుం. కొండచఱియ.

**తటవట.** దే. వి. మోసము. (చూ. తటమట.)—విశే. 1. మోసము గలది; "ద్వి. తటవటమాటలు." సా. ౫, భా.—2. కలఁతనొందినది. (చూ. తటమట.) (తటమటయొక్క రూపాంతరము.)

**తటవటచేయు.** దృ. స. క్రి. మోసపుచ్చు. "ద్వి. తల్లి దండ్రులఁబాపితటవటచేసి." ధర్మా. ౧, భా.

**తటస్థము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సమీపమునందున్నది; 2. ఒనఁగూడినది.

**తటస్థించు.** సం. అ. క్రి. 1. సమీపించు; 2. ఒనఁగూడు.

**తటస్థుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) న్యాయస్థుఁడు.

**తటాకము.** సం. వి. అ. పుం, న. చెఱువు. (రూ. తటాగము.)

**తటాన.** దే. ద్ర. క్రి. విశే. తటాలునయొక్క రూపాంతరము. "అనిలజుఁడుతటాననేతెంచి." రామా. ౭, ఆ.

**తటాయించు.** దే. స. క్రి. అడ్డగించు, నివారించు.

**తటాలు.** దే. వి. గుండెయదరుటయందగుననుకరణము. "గుండియతటాలనఁగ." జై. ౬, ఆ.

**తటాలున.** దే. ద్ర. క్రి. విశే. అతిశీఘ్రముగ. "మునియటురాఁదటాలుననమున్నతపీఠమునిగ్గి." వసు. ౨, ఆ.

**తటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఏటి ఒడ్డు; 2. ప్రదేశము.

**తటిత్తు.** సం. వి. త్. స్త్రీ. మెఱుపు, విద్యుత్తు.

**తటిత్వంతము.** సం. వి. త్. పుం. మేఘము, మబ్బు.

**తటినీ.** సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

**తటుకున.** దే. ద్ర. క్రి. విశే. తటుక్కునయొక్క రూపాంతరము. "వీనుమదత్తురంగముల్ దటుకుననఁబట్టెదఁ." జై. ౪, ఆ.

**తటుక్కున.** దే. ద్ర. క్రి. విశే. తటాలున. "విల్లుటతటుక్కున ధారణిఁవైచి." రామా. ౨, ఆ.

**తట్ట.** దే. వి. 1. వెదురుబద్దలులోనగువానితోనల్లినపల్లిక; (ఎండుపుతట్ట, తక్కెడతట్ట మొ.) "వల్లతోఁగూడఁదట్టెండవలసివచ్చె."—2. ఇత్తడిలోనగు లోహముతోచేసిన తబుకు; (పిబ్బితట్ట, వక్కతట్ట మొ.)—3. చిన్నగంప.

**తట్టగిల్లు.** దే. అ. క్రి. తట్టయగు.

**తట్టము.** దే. వి. టంగువాఱు. "పొట్టపట్టెడగాఁగఁగట్టినపెనుఁబాఁపతట్టంబుతోడ." కళా. ౩, ఆ.

**తట్టన.** వై. వి. ధైర్యము*. "వ. అత్తరుణికరకౌశలంబునఁదట్టనయుంబుచ్చిపెట్టువెరవును." ఉ, హరి. ౩, ఆ.

**తట్టాడు.** దే. స. క్రి. (తట్టు+ఆడు.) (అడుగులు) ఇట్టట్టు ఇడు. "సీ. రెండుమూఁడడుగు లొండొండఁదట్టాడునప్పుడు త్రివిక్రమలీలబుద్ధిఁజూచు." లక్ష్మీ. ౩, ఆ.

**తట్టి.** దే. వి. 1. కంచెము; 2. వేఁటతెర. "సీ. తట్టికివచ్చియిట్టట్టు వోనేరనిలేళ్ళవిధంబునలీలయెడలి." నిర్వ. ౫, ఆ.

**తట్టు.** హిం. వి. పొట్టిగుఱ్ఱము.

**తట్టు.** యు. దే. అ. క్రి. 1. కలుగు; "ఒకప్పుడుల్ వెగటుతట్టని నింపుమనంబువాఁడు." భద్రా. ౧, ఆ.—2. తోఁచు. "క. అట్టియుపాయమునీకుం, దట్టినన్నుపుపొందుమాటఁ దలఁపుము." హంస. ౨, ఆ.—స. క్రి. 1. చఱచు. "సీ. కేలఁదట్టినపట్లఁ గోలఁగొట్టినయట్లకరికానరాదులు కలఁగిపఱవ." రామా. ౬, ఆ.—వి. శబ్దదోషములలోనొకటి. "చ. జవరఁదనంబుగల్గిమటజల్లిని బొల్లునుదట్టుప్రోవనుం, దవులక." భల్లా. ౧, ఆ.—వై. 1. దరి; 2. పార్శ్వము*.

**తట్టుచేయి.** దృ. వి. కోటకొమ్మమీఁది అవయవవిశేషము. (చూ. ద్వి. రా. యు, కాం.)

**తట్టుపునుఁగు.** దృ. వి. తట్టియెత్తిన మేలైనపునుఁగు. "సీ. అలరుకస్తురీతినెలలికివాకింద్లచెంతలవైచిపోయినతట్టుపునుఁగు." యయా. ౧, ఆ.

**తట్టుముట్టాడు.** దృ. స. క్రి. (తట్టుముట్టి+ఆడు.) (దారిద్ర్యము) చుట్టుకొను. "తట్టుముట్టాడునిట్టిపేదఱికము." భాగ. ౧౦, స్కం. ఉ.

**తట్టువ.** వై. వి. 1. అశ్వము; "సీ. కనలూనుకీనాశకాసరమ్మును బోలెఁ గవిసితట్టువగుంపు జవిరిజవిరి." సాన్వ. ౪, ఆ.—2. కుత్సితాశ్వము*. (రూ. తట్టువము. కుత్సితాశ్వమునకు.—"ఉ. అందలికత్తలానిగము లందఁగగాడుపుతట్టువాలతోఁ, బందెమువైచి." అచ్చ. బాల, కాం.)

**తట్టువడు.** దృ. అ. క్రి. (తట్టు+పడు.) బాధపడు. "వ. బిట్టెసంగునాఁకటందట్టువడి." సాన్వ. ౪, ఆ.

**తట్ర.** వై. వి. బంగారుపనిచేసి బ్రతికెడుజాతి*. (తట్రవాఁడు, తట్రది.)

**తడ.** దే. వి. 1. అడ్డి; 2. కడ; "అల్లిపోవనాతడనొకనేరమునైనఁగల దాయను." య. ౫, ఆ.—3. ధనస్సు¶. (దీని భేదము గూబతడ.)

**తడఁబడు.** దృ. అ. క్రి. (తడ + పడు.) 1. తొట్రుపడు; 2. వ్యత్యాసపడు; "చ. అళులుఁగచంబులుల్ లతలు నంగములుల్ బువుగుత్తులుల్ కుచం, బులునుజిగుళ్ళఁబాణులును 'బువ్వవిశానమునుమందహాసముల్, గలసితడంబడఁ." కళా. ౩, ఆ.—3. చలించు. "చ. అధికభీతిసీదుహృదయంబిటుమీఁదటభీమధామదం, డధరునిరోధళంకఁదడంబడునేని." హంస. ౨, ఆ. (ప్రే. తడఁబఱచు.)

**తడఁబాటు.** దృ. వి. (తడఁబడుట.) 1. వ్యత్యాసము; ''చ. బరవసమొప్పగాలితడఁబాటుమెయిన్ గవిఁదూఱియొక్కకు, ర్కుర ముతమంబులోవెరఁజికోఁఆలచేఁగబళించిపొట్టపెం, జెరఁగుడుమం చుఁదెచ్చికనిచేవదొఱంగఁగ త్రుంచివైచె.'' స్వా. ౪, ఆ.–2. చల నము. (చూ. తడఁబడు.)

**తడక.** దే. వి. 1. ఈఁత బ్రద్దలులోనగువానితోనల్లి గుడిసెలకు నమర్చెడు తలుపు; 2. పక్షులవేఁటాడువాఁడు మఱుఁగుగా నుంచుకొనుసాధనము. ''క. కట్టలుకఁదడక చాటునఁ, బిట్టలనరి గోలఁదిగిచిబిఱుసునతెక్కల్, పట్టినిఱిచిచిక్కములోఁ, బెట్టుచు విహరించె లోకభీకరలీలన్.'' భాగ. ౭. స్కం. (ప్రయోగముల యందు తడకయనియు, వ్యవహారమునందు తడికయనియు కానఁ బడుచున్నది. తడకయని యుండుటయే సాధువనితోఁచెడి.)

**తడకట్టు.** దే. స. క్రి. అడ్డగించు. వి. అడ్డగింత. ''చ. చలువల రచ్చపట్టు జలజంబులతుట్టువిరాలికల్కిప్రో, గులకనుకట్టు జక్కవలగొట్టు చకోరులమేలియట్టురే, పొలఁతుకతాలిబొట్టు సమస్పంద డకట్టు సరోజసాధముల్, గలచెలితోడఁబుట్టు తొలుగట్టుపయిన్ గన పట్టెనంతటన్.'' రా, వి. 3, ఆ.

**తడకాలు.** దే. వి. మల్లబంధవిశేషము.

**తడగము.** దే. వి. తణగముయొక్క మొదటిరూపము. ''ద్వి. ఒడలి చీరనెఱుంగకుదరంబుపెద్ద, తడగంబుగ తిఁదోఁప.'' హరిశ్చ. ౨. భా.

**తడప.** దే. వి. పట్టగానుండునార.

**తడపెట్టు.** దే. స. క్రి. తడఁబఱచు. ''కోర్కుల క్రందుచేష్టితం బులఁదడపెట్ట.'' హరి. ఉ. ౨, ఆ.

**తడయు.** దే. అ. క్రి. ఆలస్యముచేయు.

**తడవ.** దే. వి. తేప, మాఱు, ఆవృత్తి.

**తడవాడు.** దే. అ. క్రి. (తడవి+ఆడు.) 1. దోఁగాడు; 2. తడఁ బడు. ''క. తడవాడిరిబలకృష్ణులు, తడవాడిరివారిఁజూచిసగరం భాదుల్, తడవాడిరరులుభయమునఁ, దడవాడిరిమంతనములఁ దపసులువేడ్కన్.'' భాగ. ౧౦, స్కం. పూ. (మొదటిరూపము. తడవియాడు. దోఁగాడుటకు.—''గీ. తడవియాడెవసుంధరాస్థలము నందు, విశ్వపతితత్వమనుమణివెదకురీతి.'' కాళ. 3, ఆ.)

**తడవిల్లు.** దే. వి. తడ బ్రద్దలతోఁజేసినవిల్లు. (చూ. విల్లు.)

**తడవు.** దే. అ. క్రి. 1. చేతులతో అట్టిట్టుప్రాఁకు; ''సీ. కను నిద్రగానమిఁదొడరుచువడిగొనినడవఁగనేరకతడవుచున్న.'' భార. ఆది. ౬, ఆ.–2. దోఁగాడు. ''సీ. ముద్దులుదొలఁకాడ మ్రోఁ కాలఁగేలనుదడవుచునెందునుదారితారి.'' హరి. పూ. ౫, ఆ.– స. క్రి. 1. నిమురు; ''ఎ, గీ. పీనినీవిప్పడణ్ణులువిడిచితడవ మనుడు.'' భార. ద్రో. 3, ఆ.–2. వెదకు; ''క. ఎడయిన్నునా కొకించుక, తడవెదనాబుద్ధియంద.'' హరి. ఉ. ౭, ఆ.–3. ప్రస్తా వించు; ''వ. ద్వారకానగరంబునంగలభాషిణిగానంబువినుచున్న సిద్ధుండు తత్ప్రశంసా ప్రసంగంబునమణికంధరునిమాటతడవుట యు.'' కళా. 3, ఆ.–4. విచారించు; ''గీ. అతనిగుణములెన్నఁ గఁజతురాస్యుఁడయిన, నచతురాస్యుఁడుధిషణుండునధిషణుండు, ధరనహీనుండుహీనుండుదక్షముఖుల, దక్షముఖులనమఱివేతాతడవ నేల.'' కళా. ౮, ఆ.–5. రక్షించు. ''ఎ, గీ. తల్లిగొనునన్న పానముల్ తన్నుఁదడవ.'' మార్క. ౨, ఆ.–వి. 1. ఆలస్యము; ''క. ఈవాయుపుత్రుఁడాజిన్, ద్రావుదునేదున్ననేనురక్తంబని యెన్, ద్రావఁగశక్యంబేనిన్, ద్రావుమనంగాదెయింకఁదడవేమిటి కిన్.'' భార. ఉద్యో. ౪, ఆ.–2. చిరకాలము. (అంతమొదలగు శబ్దములు ముందువచ్చునపుడు ఇది కేవలము కాలవాచకమగును. ఉదా. అంతతడవు, ఇంతతడవు, ఎంతతడవు, కొంతతడవు మొ.)

**తడవుడు.** దే. వి. వెదకుట, అన్వేషణము.

**తడవులనిడుపఁడు.** దే. వి. శేషుఁడు, అనంతుఁడు. ''క. నుడు వులపడఁయుకనైనన్, దడవులనిడుపనికైనఁదరమేయెన్నన్.'' అచ్చ. యు, కాం.

**తడి.** దే. వి. 1. తేమ; 2. నీరు. ''తడితలడిగ్గిముంప.'' అను. ౪, ఆ.–విశ. తేమగలది, ఆర్ద్రము.

**తడిక.** దే. వి. తడకయొక్కరూపాంతరము.

**తడికద్రోపరి.** దే. వి. (తడిక+ త్రోపరి.) తడిక త్రోసివేసి లోప లఁదూఱెడు దొంగ.

**తడిపొడి.** దే. విశ. కొంచెము తడిగలిగి పొడిగానుండునది.

**తడియు.** దే. అ. క్రి. ఆర్ద్రమగు.

**తడియొత్తు.** దే. వి. (తడి+ఒత్తు.) తడితుడుచుకొనుగుడ్డ. ''సీ. నిసిముస్సెనిలుపుట వెరవుగాదనచు నోతడియొత్తులనుమేనిత్రెళ్లుతు డిచి.'' చంద్ర.

**తడుకు.** దే. వి. తోఁటలోనగువాని చుట్టునేర్పఱచెడువెలుగు. ''వ. మట్టలెత్తుకొని యొత్తుగలపొదరుటడవులుచొరఁబాఱు పిడికడితి కదుపునరవడికివిఱిగిపడినవిటపివిటపంబులం దడుకువోడిచినగతి నొందునెడలును.'' స్వా. ౪, ఆ.

**తడుకున.** దే. ద్ర. క్రి. విశ. తటుకునయొక్కరూపాంతరము. ''చ. ముడిఁగి ముసుంగుతో వెనుకముందునుజూడకవచ్చి లోనికిం, దడుకునఁబోయి.'' కవిక. ౪, ఆ.

**తడుపు.** దే. ప్రే. తడియఁజేయు. వి. 1. గోఁచి; ''గీ. కిఱ్ఱు చెప్పులుతొడినున్నగఱ్ఱతడుపు, తెలమితోఁగట్టి.'' హరి. పూ. ౫, ఆ.–2. చిన్న వస్త్రము. ''ఎ, గీ. తడుపుగట్టకనిల్లాడఁదగవుగాదు.'' సం. ''ననగ్నాస్నాతిచక్వచిత్ '' కాశీ. ౨, ఆ. ''ఎ, గీ. దయనొక వధూటిమొలవన్నెతడుపుఁజుట్టు.'' జై. ౮, ఆ.–విశ. తడిసినది. (వస్త్రము.) ''గీ. పడఁతులయొడ్డఁదడుపుసావడలువిడిచి.'' భాన. 3, ఆ.

**తడుపుదాలుపు.** దే. వి. (తడుపు+తాలుపు.) బ్రహ్మచారి.

**తడుము.** దే. అ. క్రి. ఆలోచించు. ''క. అడిగిననృపసుతఁగానని, నాడివెడినొకదే మనంబునొవ్వనవిభుం, డుడురాజవదననడు గఁగఁ, దడుమనయొకకొంత ప్రౌఢపడఁబడఁ జొచ్చెన్.'' భాగ. ౯, స్కం.–స. క్రి. నిమురు. ''పృథుభీషణబాహులసాలువం బులన్ దడిమికెరల్చుచుంజనిరి.'' స్వా. ౪, ఆ.

**తణగము.** దే. వి. ఎద్దుమీఁదనీళ్లుతెచ్చెడు తోలునంచి.

**తణగాము.** దే. వి. తణగముయొక్కరూపాంతరము.

**తతము.** సం. వి. అ. న. వీణలోనగువాద్యము. పుం. గాలి. విశ. 1. విరివియైనది; 2. వ్యాపించినది.

**తతి.** ఉభ. దే. వి. సమయము. (చూ. కులిలపడు.)–సం. ఇ. స్త్రీ. సమూహము.

**తత్తిమ్మా.** హిం. విశ. మిగిలిన.

**తత్తడి.** దే. వి. గుఱ్ఱము, అశ్వము, వాహనము.

**తత్తబడ.** దే. వి. పరివారము. ''క. చిత్తంబూరకకలఁచెదు, నెత్తను నాతోడనాడనేరుపుగలదే, బొత్తుగలసినీవునునీ, తత్తబడలురండు గెలిచెదంబరువడితోన్.'' ఉ, హరి. 3, ఆ.

**తత్తఱ.** దే. వి. (తఱ+తఱ.) సంభ్రమము. "ద్వి. దరిఁజేరుకరము వత్తఱమగ్గలాడు." హా. ఉ. కాం. (రూ. తత్తఱము. "చ. తత్తఱ మునఁనేగుదెంచి ప్రమదంబునఁనిట్టగనుఁగొంటినీయ్యెడన్." రుక్మాం. ౫, ఆ)

**తత్తఱపడు.** ద్వి. అ. క్రి. సంభ్రమించు.

**తత్తఱపాటు.** ద్వి. వి. తత్తఱపడుట.

**తత్తఱపెట్టు.** దే. స. క్రి. తత్తఱపఱచు. "క. మనసిజుఁడిద్దఱకున గుం, తెనకాసతనంబు చేసెడింగనఁగొనఁగన్, జనవులుమాటలు ననువులుఁ, వన ప్రసంబులకలుసుగలుగఁదత్తఱపెట్టెన్." విక్ర. ౯, ఆ.

**తత్తఱించు.** వై. అ. క్రి. 1. సంభ్రమించు; 2. చలించు (చూ. తత్తఱిల్లు.)

**తత్తఱిల్లు.** వై. అ. క్రి. 1. సంభ్రమించు; 2 చలించు. (రూ. తత్తఱిలు. చలించుటకు.—"సీ. కమఁదీఁగసాఁగుచుబడుఁగునెన్న మముబెక్కుచిక్కుళంబుగఁదత్తఱిలుచునిక్కి..." కళా. ౭, ఆ.)

**తత్తెర.** దే. వి. సారాయిపోసెడుతిత్తి.

**తత్పురుషుఁడు.** సం. వి. (అ. ఆ. అ.) (ఒకట) ఆనగలవాఁడు

**తత్రత్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అక్కడ కలిగినది.

**తత్త్వజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తత్త్వము తెలిసినవాఁడు.

**తత్త్వము.** సం. వి. అ. న. 1. పరమాత్మ; 2. స్వభావము; 3. నృత్యాది విలంబితమానము. (పంచవింశతి తత్త్వములు.—అష్ట ప్రకృతులు షోడశవికారములు పురుషుఁడు.)

**తథాగతుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

**తథ్యము.** సం. వి. అ. న. సత్యము. విణ. సత్యమైనది.

**తదాత్వము.** సం. వి. అ. న. ఆకాలము.

**తదియ.** వై. వి. పక్షమునందు మూడవతిధి.

**తదీయము.** సం. వి. (అ. ఆ. అ) తత్సంబంధమైనది.

**తద్గుణము.** సం. వి. అ. పుం. 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. ఆగుణము.

**తద్ద.** దే. అవ్య. అత్యంతము. "తద్దతగదు, తద్దనెమ్మి." భార. ఆది. ౮, ఆ. (ఇదియు నువర్ణాంతమునగును. "తద్దయురమ్యము." భార. ఆది. ౮, ఆ.)

**తద్దినము.** సం. వి. అ. న. ఆదినము. (వాడుకయందు మృతిపొం దినదినము.)

**తద్దె.** దే. వి. పండుగ. (అట్లతద్దె, ఉట్లతద్దె మొ.)

**తనకలి.** దే. వి. చిక్కు. (చూ. గొల్ల. దే. కడపటి ఉదా.) విణ. 1. చిక్కుగలది; "చ. పెనిమిటిరెండుదాడిచనిపెంపునఁగ్రమ్మ ఱబాఁకపేడియం, బునుసిరిగందముల్ విరులు ముట్టకయుండఁ దగున్ బోలంతితే, జునఁగడునొప్పు మట్టనపుశొమ్ములతోఁగుఱు మాపుచీరతోఁ, దనకలికొప్పుతోమిగులఁదార్కొనుముత్తెపుసేసబొట్టు తోన్." య. ౮, ఆ.—2. చిక్కులఁబెట్టువాఁడు. "క. ఱూద రివి సుమాళివినెఱ, వాదివి తనకలివిగెలువవచ్చునటేదా, మోదర నిను మాకసుటయు, నాదెసఁగనుఁగొనకపిలువుమనెజాంబవతిన్." ఉ, హరి. ౩, ఆ.

**తనఖా.** హిం. వి. తాకట్టు, దత్తపత్రము.

**తనఖీ, తనిఖీ.** హిం. వి. విమర్శ.

**తనము.** ఉప. వై. అప. భావార్థమునందువచ్చెడు నొక ప్రత్యయము. (గొప్పతనము, చిన్నతనము మొ.)—సం. వి. అ. పుం. 1. చందనము; 2. చిత్తము.

**తనయ.** సం. వి. ఆ. స్త్రీ. పుత్రిక, కూఁతురు.

**తనయుఁడు.** సం. వి. అ. పుం. పుత్రుఁడు, కొడుకు.

**తనరారు.** ద్వి. అ. క్రి. (తనరి+ఆరు.) 1. ఉన్నతమగు; "సీ. నెగసినకొనలేచి నింగియంతంతకునవులఁద్రోయఁగఁదనరారుదాని." భార. విరా. ౧, ఆ. -2. అతిశయించు.

**తనరు.** వై. అ. క్రి. 1. అతిశయించు; "క. అనఁవారునఁదుఁ గొందఱు, ఘనుఁడీతఁడువీరికంటెఁగార్ముకవిద్యన్, దనరినవాఁడయి దీనికి, మొనసెంగాకన్యుఁడిట్లు మొనయంగలఁడే." భార. ఆది. ౭, ఆ.—2. విజృంభించు*; "చ. కనుఁగొనికోపవేగమునఁగన్నుల నిప్పులుగాలసంగముల్, తనరఁగసాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ." భార. విరా. ౩, ఆ.—3. ఒప్పు*. "క. నలువగలలోఁతు పొక్కిలి, నలువగలభుజంబులుందనరుసిరినంటున్, గలిమిదొర సీకుమారుఁడు, కలిమిహీకామిహిరమూర్తిగాకన్యుండే." రామా. ౮, ఆ.

**తనరుచు.** వై. అ. క్రి. తనరుయొక్కరూపాంతరము. (రూ. తనర్చు.—అతిశయించుటకు —"ఉమ్మలికతనర్చ." అచ్చ. యు, కాం.—విజృంభించుటకు.—"తనర్చన్ భుజాగ్రములు." భార. ఉద్యో. ౩, ఆ.)—అం, ప్రే. తనరఁజేయు. "చ. అనవినిగుబ్బసంబొడ మునల్కకునెచ్చెలులైకనుంగవన్, గనలెడుదట్టకెంపునఁమొగంబు నఁబొడ్మెడుఘర్మజాలకం, బునునిటలంబునందనరుభ్రూకుటియున్ భయమున్ దనర్చ." లక్ష్మీ. ౮, ఆ.

**తనరువు.** వై. వి. 1. పొడవు; 2. అతిశయము. (రూ. తనర్పు. పొడవునకు. — "వ. అదియునునూఱుయోజనంబులవెడల్పున నూటయేఁబదియోజనంబులనిడుపునైదుయోజనంబులతనర్పునుం గలిగి." సం. "పంచయోజనముచ్ఛ్రితా." భార. సభా. ౧, ఆ.—అతిశయమునకు.—"భుజంగప్రయాతము. వినీతుండవైధర్మవేదిత్వబుద్ధిన్, దనర్పొందుసీవు." భార. స్త్రీ. ౧, ఆ.) (దీనికిఁ గొందఱు వెడలువు అని అర్థము వ్రాసియున్నారు.)

**తనాబి** దే. వి. స్తంభములమీఁదిగోడకుక్రిందవేసెడు పెద్దపలక.

**తని.** వై. విణ. 1. అల్పము; "సీ. కాఁడినవిషకంటకములుమెల్పు నఁబుచ్చితనివెచ్చఁబాదపద్మములుగాఁచి." జై. ౬, ఆ. 2. సూక్ష్మము. "సీ. ప్రాల్మాలిమిగుల నార్పనికమ్మక్రొమ్ముడిఁదనిమొగ్గవిర వాదిదండవిరియ." ఆము. ౩, ఆ.

**తనిమము.** సం. వి. న్. పుం. 1. కార్శ్యము; 2. విస్తారము; 3. శరీరత.

**తనియు.** దే. అ. క్రి. ఆపోవు, తృప్తిపడు.

**తనివి.** దే. వి. ఆపోక, తృప్తి.

**తనివు.** దే. వి. తనివి. (కొన్ని వ్రాఁతపుస్తకములయందును, అచ్చుపుస్తకములయందును ఈ పాఠము కనఁబడుచున్నది. దీనిని సాధువుగానే గ్రహింపవచ్చును. అప్పుడు ఇది ఉలివులోనగువానివంటిదని తెలియవలెను.)

**తనివోవు.** దే. అ. క్రి. (తనివి+పోవు.) తనియు "ఉ. ముష్టామర్తమునిల్పిసీముఖాం, భోరుహావిభ్రమంబుతనివోవఁగఁగ్రోలిమదీయలోచనో, దారమధువ్రతాలిముదమందెడునట్లులుగానొనర్పవే." మార్క. ౧, ఆ.

**తనిసను.** దే. అ. క్రి. (తనివి+చను.) తనియు. "క. తని సనితె నైవమాయని, యను." రా. యు, కాం.

**తను** దే. విశే. వృత్తియందు తనువుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "క. అచటఁబొలయునల్లని, తనుగాలిం దేచె లక్షితనాస్వంతుండై." నిర్వ. ౪, ఆ.

**తనుకు.** దే. అ. క్రి. 1. కలుగు; "క. ధరణికవగ్రహభయంబు దనుకకయుండఁగ." భార. సభా. ౨, ఆ.–2. జ్వలించు; "క. కొన్నివ్రచ్చుడులోపలన, ల్లని క్రిమియయితోఁచి మఱియులస్తకవక్త్రం, బునఁబామైవిషవహ్నులు, తనుకఁగఁగురుపీనుఁగఁఅచిపక్షుఁడరిగెన్." భార. ఆది. ౨, ఆ.-3. ప్రకాశించు; "క. మొగమునఁదనికెనకెంపుతోడమునిపతియుండెన్." ఉ, హరి. ౪, ఆ.–4. తపించు. "ద్వి. అనుటయునెట్లతండంబుధిఁద్రచ్చెఁ, దనుకకమందరధరమెట్లుమోచె." భాగ. ౮, స్కం.-- వి. తాపము. "గీ. కులనగములైన వ్రయ్యలైకూలునట్లు, గానొనర్చెడికైదువాకరణిఁగప్ప, భావమొందిక్రమ్మఱవచ్చి పాకశాస, నునికరమునేరెనెంతయుఁదనుకుఁబొచ్చి." హరి. పూ. ౪, ఆ. (రూ. తనుకు.)

**తనుత్రము.** సం. వి. అ. న. కవచము, బొందలము.

**తనుత్రాణము.** సం. వి. అ. న.——పై.——(శిరస్త్రాణము శిరస్కము, ముఖత్రాణము దలపము, ఉదరత్రాణము నాగోదము, జంఘాత్రాణము మంఖుణము, బాహుత్రాణము బాహులము, అంగులీత్రాణము గోధ.)

**తనుపారు.** దే. అ. క్రి. (తనువు+ఆరు.) 1. తనియు; "ప్రమదములుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలువోయి." హరి. పూ. ౮, ఆ.–2. చల్లనయగు. "క. కనియాపద్మాకరమునఁ, దనుపారెడునీరు ద్రావితమనేసలువా, రునఁవిశ్రమించిరానే, చనకములగుతరుల నెడసైకతములపై." ఉ, హరి. ౪, ఆ.

**తనుపు.** దే. ప్రే. తనియఁజేయు. వి. 1. తనివి; "చ. కనుఁగొని గారవంబునఁమొగంబునఁగేలుఁ బురఃప్రసారముగ్, దనుపును నమ్రభావమునుదంతమరీచులసామినిర్గమం, బునుదమలోఁగడల్గొనఁగ." భార. విరా. ౧, ఆ.–2. శైత్యము; "గీ. మహితవర్షదానమహిమనాలుగునెల, లిలకుఁదనుపొనర్చునింద్రుకరణి." మార్క. 3, ఆ.–3. శైత్యోపచారము; "చ. కనుఁగొనినత్యభామమదిఁగంపమునొందకనాటియున్నయా, ఘనిశితబాణముగ్ దెబ్బ కిశోణితముగ్ గరపల్లవప్రమా, ర్జనముననొయ్యఁబాపుచును జామరమారుతనంప్రయుక్తిచేఁ, దనుపొనరించివల్లభుగతవ్యథుఁజేసె ముహూర్తమాత్రలోన్." హరి. ఉ. ౪, ఆ.–4. పితృయజ్ఞము; 5. తడి. సా. ౨, ఆ. (రూ. తన్పు.)

**తనుమధ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. సన్ననినడుముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**తనుపడు.** ద్వ. అ. క్రి. (తనుపు+పడు.) చల్లఁబడు. "క. కనఁగొనియించుకసేపునఁ, దనుపడుననిపలికెఁబిదపఁదనుపడుటయునున్." భార. శాం. ౬, ఆ.

**తనువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. దేహము; 2. తోలు. విశే. 1. చిన్న; 2. బక్క; 3. సన్నము.

**తనూజుఁడు.** సం. వి. అ. పుం. తనయుఁడు, కొడుకు.

**తనూనపాత్తు.** సం. వి. త్. పుం. అగ్ని.

**తనూభవుఁడు.** సం. వి. అ. పుం. తనూజుఁడు, కొడుకు.

**తనూరుహము.** సం. వి. అ. న. 1. వెండ్రుక; 2. ఱెక్క. (రూ. తనురుహము.)

**తన్ను.** దే. స. క్రి. 1. పాదముతో తాడనముచేయు; 2. ఒరయు. "చ. మెలఁతలుమిన్నదన్నువెలిమేడలఁగ్రీడలునల్పుచుండి." రామా. ౧, ఆ.–వి. పాదతాడనము.

**తన్నుఁగోల.** దే. వి. (తన్ను+కోల.) ఏటవాలుగా పోటిపెట్టిన కోల.

**తన్నుబల్ల.** దే. వి. ద్వారముయొక్క అరిగాళ్లమీఁద వేసెడుపలక.

**తన్నుబిల్ల.** దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. డాఁగిలిమ్రుచ్చులు.)

**తన్నులాడు.** దే. అ. క్రి. (తన్నులు+ఆడు.) ఒకరికొకరు తన్నుకొను.

**తన్మయము.** సం. వి. (అ. ఈ. అ.) తత్స్వరూపమైనది.

**తన్మాత్రము.** సం. వి. అ. న. శబ్దాది. (పంచతన్మాత్రములు.– శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.)

**తన్వి.** ఉభ. దే. వి. తనివియొక్క రూపాంతరము. విజ. ౨, ఆ.– సం. ఈ. స్త్రీ. 1. కృశించినదేహముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**తపతప.** దే. వి. ఱెక్కలుకొట్టుకొనుటయందగు ధ్వన్యనుకరణము. "గీ. కోడి తపతప ఱెక్కలుకొట్టుకొనుచుఁ, గూయుక్రమమొప్ప మీఱె." కళా. ౮, ఆ.

**తపనము.** సం. వి. అ. న. 1. తాపము. (ఈ యర్థమున నిది తెనుఁగు ప్రయోగములయందు స్త్రీసమముగాఁ గానఁబడియెడి. "అక్కఱ. వనమునఁబడియు రెండేఁడులజ్ఞాతవాసమొక్కేఁడు, జనపదంబున నుండితపననయ్యేండ్లుసలిపి." భార. ఆది. 3, ఆ.) 2. నాయికకు ప్రియవియోగకాలమందు మన్మథావేశముచేకలిగెడు చేష్ట. పుం. 1. వేసంగికాలము; 2. నరకవిశేషము; 3. జీడి.

**తపనీయము.** సం. వి. అ. న. స్వర్ణము, బంగారు.

**తపనుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**తపము.** సం. వి. అ. పుం. వేసంగికాలము. స్. న. 1. తపస్సు; 2. ఒక లోకము; (చూ. లోకము.) 3. చాంద్రాయణాది పుణ్యకర్మము. పుం. 1. శిశిరఋతువు; 2. మాఘమాసము.

**తపసి.** వై. వి. 1. తపస్వి; 2. గారచెట్టు. "చ. అపరిమితానురాగసుమనోలతయై చిగురాకుచేతులం, దపసిని గౌఁగిలించె వనితాయిదె రంభ తలంప రంభదా, నపరిమితానురాగసుమనోలతయై చిగురాకుచేతులన్, దపసినిగౌఁగిలించు టుచితంబెకదాయనినవ్వె రంభయున్." స్వా. 3, ఆ.

**తపస్య.** సం. వి. ఆ. స్త్రీ. వ్రతచర్య. అ. పుం. ము. ఫాల్గునమాసము.

**తపస్వి.** సం. వి. న్. పుం. తపముచేయువాఁడు. విశే. కనికరింపఁదగినవాఁడు.

**తపస్విని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తాపసురాలు; 2. కటుకరోహిణి; 3. జటామాంసి.

**తపారము.** దే. వి. ఒకదినుసు కుల్లాయి. "సీ. పాటలానిలములారప్పఁగఁదపారపుచుంగు లలరుఁదావికిమూఁగునలులఁజోప." ఆము. ౨, ఆ.

**తపారు.** దే. వి. తపారముయొక్క రూపాంతరము.

**తపించు.** సం. అ. క్రి. 1. తాపమునొందు; 2. తపస్సుచేయు.

**తపోధనుఁడు.** సం. వి. అ. పుం. తపస్సేధనముగాఁగలవాఁడు, తపస్వి.

**తప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడినది, కాఁచఁబడినది.

**తప్పకాయ.** దే. వి. పిత్తుపట్టనికాయ.

**తప్ప.** దే. వి. గింజపట్టని ధాన్యము.

**తప్పిదము.** దృ. వి. (తప్పు+ఇదము.) దోషము. (తప్పుయొక్క రూపాంతరము.)

**తప్పు.** యు. దే. అ. క్రి. తక్కు. "బలిమిఁ జేకొనరాదు సామము సఁదప్పక." జై. 2, ఆ.–వై. తప్పుచేయు. "పాపబుద్ధులన్నదెసఁ దప్పిరి." భార. ఉద్యో. 3, ఆ.–స. క్రి. అతిక్రమించు*. "ధర్మప్రసంచితంబుఁదప్పనివారల." భార. ఆది. 3, ఆ. – వి. తప్పిదము.

**తప్పడు.** వై. వి. తప్పట.

**తప్పుమనపడు.** వై. అ. క్రి. (తప్పుడు+పడు.) 1. తప్పుపడు; 2. సరితప్పు.

**తప్పుదల.** దృ. వి. తప్పట.

**తప్పుదారి.** వై. వి. తప్పుత్రోవ, అపథము.

**తప్పుదెబ్బలు.** దృ. వి. బళ్లయందు ప్రొద్దుపోయి వచ్చినందుల్కై వచ్చిన క్రమముఁబట్టి బాలురను ఉపాధ్యాయులుకొట్టెడు ఒకటి రెండు మొదలగు దెబ్బలు.

**తప్పెట.** వై. వి. 1. చర్మవాద్యవిశేషము; (చూ. బెరి.) 2. వనకు ఉత్తము*†.

**తఫావతు.** హిం. వి. భేదము, లోపము, తక్కువ.

**తఫిసీలు.** హిం. వి. వివర్ణము.

**తబము.** వై. వి. తపస్సు "సీ. గాలియోగిరముగాఁగనసీటిలోనఁదబములానర్చెడునిరాబారిగములు." య. ౨, ఆ.

**తబుకు.** దే. వి. పిములపాకుతట్ట.

**తబేలా.** హిం. వి. గుఱ్ఱపులాయము.

**తబ్బిబ్బు.** దే. వి. తడఁబాటు, విపర్యయము. "వ. మంతనపువేళల మాటలతబ్బిబ్బుసంబుట్టుపొలయలుకలందలలువంచి." సాం. 3, ఆ.

**తబ్దీలు.** హిం. వి. మార్పు.

**తమంగము.** సం వి. ఇ. పుం. మంచె, తమగము.

**తమకపడు.** దృ. అ. క్రి. (తమకము+పడు.) 1. త్వరపడు; "క. ఈకరణివచ్చురురగముఁ, బైకొనిపట్టంగఁదమకపడుపుత్రుని న్యాలోకించివలదువేగము, సికినివారించిమనుమనింగనుఁగొన్నన్." జై. ౨, ఆ.–2. మోహపడు. (చూ. తమకము.)

**తమకము.** దే. వి 1. త్వర; "క. ఎత్తెడువేగమువిండుబు, తత్తఱమునవిఱుగనేయుతమకమునయినం, జత్తములుకృపాణరణా, యత్తములుగనిలకునుజేకిరావీరవరుల్." ఉ, హరి. ర, ఆ.–2. మోహము. "ద్వి. తమవిలాసంబులఁదమయుపాయములఁ, దమకంబుపుట్టించి." రా. బాల, కాం.

**తమకి.** దే. విశే. (తమకము+ఇ.)-1. త్వరగలవాఁడు; "క. వినుగర్భిణిప్రజబ్రదుకున, కనురూపములైనయట్టియాహారంబుల్, గొనగతిఁబతిధరణిప్రజ, మనికికిఁదగనడచునదితమకిగాకెపుడున్." భార. శాం. ౨, ఆ.–2. మోహముగలవాఁడు. (చూ. తమకము.)

**తమకించు.** దే. అ. క్రి. 1. త్వరపడు; "ఉక్కలయియిట్లుసృష్టి పనికిం దమకింపఁగఁజన్నె." హరి. పూ. ౧, ఆ.–2. చలించు. "వ. వలఁబడిచిక్కులొందివలత్రచ్చుకపోవుటయుండెఁగాకపక్షులువలఁగొంచుభారమునకుం దమకింపక యుబ్బకంబునన్, గలగొనిపాఱువెట్టు." పంచ. నా. ౨, ఆ.

**తమకు.** దే. అ. క్రి. చలించు. "సీ. తమకన్నులకువీఁగితమకు చందంబునఁ బెల్లుగాఁగల్వలు తల్లడిల్ల." య. 3, ఆ.–వి. విధము. "వ. వలరాజునెత్తపలకతమకునంగనుపట్టువీఁపునసేపారి." పాండు. 3, ఆ.

**తమగము.** వై. వి. మంచె. "క. తమగమునకెదురుయదుస, త్తమగణ్యునిఁజూచిఖడ్గధరుఁడైయెదిరెన్, తమగమివారలువీరో, త్తమగణవిభుఁడనఁగఁగంసధరణీపతియున్." భాగ. ౧౦, స్కం. పూ.

**తమటము.** సం. వి. అ. పుం. తప్పెట. "సీ. తమటనిస్సాణమృదంగభేరీశంఖరవములు బోరనరమిఁజెలంగ." రుక్మా. ౧, ఆ. (చూ. తమ్మటము.)

**తమము.** సం. వి. స్. న. 1. చీఁకటి; 2. ఒక గుణము; (చూ. గుణము.) 3 శోకము. పుం, న. రాహుగ్రహము.

**తమరము.** సం. వి. అ. న. లోహవిశేషము, తగరము.

**తమస్విని.** సం. వి. ఈ. స్త్రీ. త్రియామ, రాతిరి.

**తమామ.** హిం. విశే. అంత.

**తమాయించు.** దే. అ. క్రి. స్తిమితమగు, శమించు.

**తమాలపత్రము.** సం. వి. అ. న. 1. బొట్టు; 2. మక్కరికాపత్రము; 3. చీఁకటిమ్రాను.

**తమాలము.** సం. వి. అ. న. బొట్టు. పుం. 1. కత్తి; 2. ఉలిమిరి†; 3. చీఁకటిమ్రాను.

**తమాషా.** హిం. వి. వేడుక.

**తమి.** ఉభ. దే. వి. 1. త్వర; "గీ. తమయభీష్టకేళితమినొతిర్యగ్జంతు, వనియొ సనుగణింపకవివ్విధమునఁ, జెప్పకొనఁగవింటి నప్పలుక్కలేనునా, నడుమఁగదలిపోవజడిసియుంటి." కళా. ౫, ఆ.–2. కుతూహలము; "క. తనివిసనకయవలికతయుఁదమినడుగుటయున్." అచ్చ. అ, కాం.–3. అపేక్ష; "ద్వి. అందఱెప్పుడుపోదురనివెచ్చనూర్చు, నెందుపైఁదమిలేక యేకాంతమరయు." విష్ణు, ఉ. ర, ఆ.–4. వలపు. (చూ. తమికొను.)–సం. ఇ. ఈ. స్త్రీ. 1. రాతిరి; 2. చీఁకటి.

**తమిఁద.** దే. వి. రాగిపైరు. బ. రాగులు. (చూ. తవిఁద.)

**తమికొను.** దే. అ. క్రి. 1. త్వరపడు; 2. కుతూహలపడు; 3. అపేక్షపడు; 4. మోహపడు. (ప్రే. తమికొల్పు. మోహపఱచుటకు.–"సీ. వేల్పురాయని ప్రోలవెలయునాఁడెపుటచ్చరలనెల్లఁదమికొల్పికలసినాఁడ." అచ్చ. అర, కాం.)

**తమిరె.** దే. వి. కాఁడినడిమిచీల, శమ్య.

**తమిస్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. చీఁకటిరేయి; 2. చిమ్మచీఁకటి. ఆ. స్త్రీ. అ. న. ము. చీఁకటి. న. కోపము.

**తముకు.** దే. వి. చర్మవాద్యవిశేషము, తుడుము. "సీ. తరలిరమ్మనినఁజేతముకొక్కటియకాని పేర్కొనవెఱతురుపెదడమూయి." చంద్రా. ౧, ఆ.

**తములపాకు.** దృ. వి. (తములము+ఆకు.) నాగవల్లీదళము. (రూ. తములపుటాకు.)

**తములము.** వై. వి. తమ్ములముయొక్క రూపాంతరము.

**తమ్మ.** దే. వి. 1. చర్విత తాంబూలము; 2. తంబ†.

**తమ్మంటు.** దే. వి. (తమ్మి+అంటు.) కుండలము. "సీ. పునక తమ్మంటులఁబోలుచుపీనుల వారునొనలమిక్కిలిచూపులెసఁగువారు. పాండు. ౧, ఆ.

**తమ్మటము.** సం. వి. అ. పుం. తమటము, తప్పెట. "వ. శంఖ కాహళభేరీ పటహ ఝల్లరీ పణవ మర్దళతమ్మటప్రముఖనిఖలవాద్య నిర్ఘోషంబులును." కళా. ౭, ఆ. "తమ్మటభేరీముఖనిస్వనములు గెఁగె." రుక్మాం. ౪, ఆ. "వ. అతితుములతమ ఢమామికా తమ్మ భేరికా పటహ దుందుంభికాదివాదిత్రగంభీరఘోషసంరంభంబు." వసు. ౬, ఆ. "శ్లో. రాజకన్యావివాహే హుకేవలం తమ్మటధ్వనిః." అని చాటువు. (ప్రయోగములిట్లున్నవి. కొందఱు తమట తమ్మట శబ్దములను దేశ్యములుగా వ్రాసియున్నారు.)

**తమ్మతేసుకు.** దే. వి. తమ్మపడిగము.

**తమ్మళి.** దే. వి. తంబళియొక్కరూపాంతరము. "క. అగ్రహారము లొసఁగ, దమ్మళిజోస్యములున్న విధమ్మున." రుక్మాం. ౫, ఆ.

**తమ్మళి.** దే. వి. తంబళియొక్కరూపాంతరము.

**తమ్మి యు.** దే వి. వృక్షవిశేషము. వై. 1. పద్మము; 2. పద్మవ్యూహము*. "సీ. తమ్మిఁదాల్చినవానిఁ దమ్మిఁదొల్చినవానిఁ దమ్మిమొల్చినవానిఁ దారసించు." కా. ౧, ఆ.

**తమ్మికంటి.** దస్. వి. (తమ్మి+కన్ను.) 1 కమలములవంటికన్నులు గల ఆఁడుది, కమలాక్షి; 2. ఆఁడుది; 3. విష్ణువు, కమలాక్షుఁడు. (ఇట్లు తామరకంటి మొ.)

**తమ్మికెంపు.** దస్. వి. పద్మరాగమణి. "సీ. మగమానికములక్రొన్నిగనిగల్దులకింపబలుతమ్మి కెంపుమేల్పసలునింప." నీలా. ౨, ఆ. (ఇట్లు తామరకెంపు మొ.)

**తమ్మిచూలి.** దస్. వి. బ్రహ్మ, పద్మయోని. "గీ. భాగవతముతెలిసి పలుకుటచిత్రంబు, శూలికైనఁదమ్మిచూలికైన." భాగ. ౧, స్కం.
(ఇట్లు తామరచూలి మొ.)

**తమ్మిదీవి.** వై. వి. పుష్కరద్వీపము.

**తమ్మిదొర.** దస్. వి. సూర్యుఁడు, పద్మినీవల్లభుఁడు. "గీ. అల్లకాశనిమునివేషమధిగమించి, పంపకడఁదమ్మిదొరచూలిపంపవచ్చి, గాన్పుకొమరుండురామలక్ష్మణులఁగాంచి, పలికెభయభక్తియుక్తులే ర్పడఁగనిట్లు." రామా. ౫, ఆ.

**తమ్మిపగతుఁడు.** దస్. వి. చంద్రుఁడు, అబ్జారి.

**తమ్మిపుట్టు.** దస్. వి. బ్రహ్మ, అబ్జయోని. "సీ. పుట్టునూఁగను దమ్మిపుట్టుఁగాగ్గానేసి వరఁగుప్రసాదవైభవము వాఁడు." భాస. ౧, ఆ.

**తమ్మియ.** దే. వి. 1. చెవితమ్మె; 2. పలువుతమ్మె.

**తమ్మియింటిగరిత.** దస్. వి. లక్ష్మి, పద్మాలయ.

**తమ్ముఁడు.** దే. వి. వెనుకఁబుట్టినవాఁడు, అనుజుఁడు. (వృత్తియందు తమ్ముగమి, తమ్ముగుఱ్ఱ, తమ్ముదోయి, తమ్ముప్రోవు మొ.)

**తమ్ములము.** వై. వి. తాంబూలము. "చ. అతిఁడదిచూచిభీతిఁద, మ్ములమిలవైచినన్ నగిరిమూఁగినరాజకుమారులందఱున్." (ఈ యుదాహరణమునందలి తక్కిన ముందఱిభాగమును అడపకడఁజూచునది.) వై. ౭, ఆ.

**తమ్ములవిందు.** దస్. వి. సూర్యుఁడు, పద్మబాంధవుఁడు. (చూ. జొట్టలుఁగు.)

**తమ్మువాఁడు.** దే. వి. తమ్ముఁడు. (చూ. తమ్ముఁడు.)

**తమ్మె.** దే. వి. 1. చెవియొక్క అడుగుభాగము; 2. పసులమెడను దగిలించెడు పలువుయొక్క ముందుభాగము. (తమ్మియయొక్క రూపాంతరము.)

**తయారు.** హిం. విశే. సిద్ధమైన.

**తయునాతి.** హిం. వి. కాచికొనియుండుట.

**తరంగము.** సం. వి. అ. పుం. ఊర్మి, అల.

**తరంగిణి.** సం. వి. ఈ. స్త్రీ. తటిని, నది, ఏఱు.

**తరండము.** సం. వి. అ. పుం, న. 1. ఓడ; 2. గాలపుదారము కట్టిన కొయ్యలోనగునది; 3. పుట్టి.

**తరఁగ.** వై. వి. అల. "సీ. కుంభజామీఁదమార్గానవచ్చునంభోధి తరఁగలగమిఁ బోలురురగచయము." భాస్క. అర, కాం.

**తరకటించు.** వై. అ. క్రి. తర్కించు.

**తరకటింపు.** వై. వి. తర్కము. (చూ. ఆరగింపు.)

**తరకసము.** దే. వి. అమ్ములపొది, తూణీరము. "సీ. రాణవొప్పారు రాణంబునిఁగిఁడిపిక కులకోరీలతరకసంబు." సారం. ౪, ఆ.

**తరకసా.** దే. వి. తరకసముయొక్కరూపాంతరము.

**తరక్షువు.** సం. వి. ఉ. పుం. సివంగి, మృగాదనము.

**తరగంపియ.** దే. వి. తరగంపె.

**తరగంపె.** దే. వి. ఒకదినను అంపము. (తరగంపియయొక్క రూపాంతరము.)

**తరగతి.** మి. గ్రా. వి. (తరము+గతి.) తరమును దెలిపెడుభాగము.

**తరగతిగుండ్లు.** మి. గ్రా. వి బ. స్త్రీలకంఠభూషావిశేషము.

**తరణము.** సం. వి. అ. న. దాఁటుట. పుం. ఓడ.

**తరణి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఓడ; 2. దాఁటుట; 3. పిన్నగోరంటి*, చేమంతి*. (అనికొందఱు.) పుం. 1. సూర్యుఁడు; 2. సముద్రము.

**తరతరము.** దే. అవ్య. క్రి. విశే. (తరము+తరము.) 1. క్రమముగా; "వ. కద్రూగర్భాండంబులుతరతరంబవిసిన." భార. ఆది. ౧, ఆ.—2. పరంపరగా. "మేముతరతరంబయాశ్రితులము." భార. మహా. ౧, ఆ.

**తరపణ్యము.** సం. వి. అ. న. ఓడనడపువానికిచ్చెడుకూలి, కేవు.

**తరపు.** దే. స. క్రి. పోఁగొట్టు, హరించు. "గీ. సత్యభామమనియమంబుజరపినాఁడు, నిత్యనైమిత్తికాదులనెరపినాఁడు, దండిఁలోభాదిగుణములఁదరపినాఁడు, మంచిగుణములుతనయందుమరపినాఁడు." భాగ. ౬, స్కం.

**తరఫు.** హిం. వి. పక్షము, దేశము.

**తరబడి.** దే. వి. (తరము+బడి.) తరము.

**తరబియ్యతు.** హిం. వి. నేర్పు.

**తరము.** ఉభ. దే. వి. 1. పురుషాంతరము; "క. నిరతంబుబ్రహ్మ మొదలుగ, వరుసనయెడతెగకయిట్లువచ్చినవంశం, బురుభుజనీపుండఁగనీ, తరమునవిచ్చిన్నమగుటధర్మువెయనినన్." భార. ఆది. ౪, ఆ.—2. మానము; "క. నీయెఱుఁగనియవియులేవునిక్కపుఁదరముల్." (చూ. దీనివెనుకటిపద్యము.) భార. ఉద్యో. ౪, ఆ.—3. సామ్యము; "సీ. నరపుంగవులుగానినరపుంగవులుగారు తరమెన్నవరధర్మధర్మభృతుల." వసు. ౧, ఆ.—4. వరుస; "ఉ. అత్తెరవేఁటకాండ్రుయమునాంబుతరంగపరంపరాకృతిన్, మత్తరమైన

సూకిఁ నయిచ్చి—ిముఁగిని.'' స్వా. ౭, ఆ.—5. ఉసుసు. ''ాల ముష్టుం వెెసా ప్రులఁగపనిసూపులలో పలమేల్ తరంబులు.'' విజ. ౧, ఆ.—౯. 1. అక్కసము; 2. శక్తము; ''మీరుమద్దనఘుజశక్తికిక్ష దరముగాదు.'' ఉ, హరి. ౪, ఆ.—3. సమానము. ''గీ. సాటి జంటే బెజం పాలహాలముకఁ, పాటిగాక్న హరి త్రావిధంగముకఁ, దరముశౌదామినీదామధామమునకుఁ, గరముపాలుపొందు దీనియం గములకాంతి.'' సై. 3, ఆ.—సం. వి. అ. పుం. దాఁటుట.

తరలు. దే. అ. క్రి. ప్రయాణమగు. (చూ. తమకు.)

తరవరి. వై. వి. పట్టాకత్తి. ''వ. తరవరులఁకెరవరులకిచ్చియుమెచ్చి యు.'' ఉ, హరి. ౬, ఆ. (చూ. తరవలి. ''వ. తరవలికత్తులం దుస్తునుగామొత్తి.'' ఉ, హరి. ౪, ఆ.)

తరవాణి. దే. వి. పుల్లనీళ్లు.

తరవాయి దే వి. 1. సమయము; ''ద్వి. దనజెలినాకురాఁదం వాయిగాన, వచ్చితి.'' రా. యు. కాం.—2. ఉపక్రమము; ''లాఁకులమా ఁవాయుడుగ.'' ఆము. 3, ఆ.—3. అనుక్రమము; ''.., .. పగఱలోననొకనిపాల్పెట్టుమెట్టవాఁ, జైనసమయఁ జూచియనసువాఁడ, నట్టిభంగిచాలదం చేనితరవాయి, గొనివధింతు శత్రుకోటినెల్ల.'' భార. కర్ణ. ౧, ఆ.—4. తడవ. ''గీ. ఒక్కతర వాయిదొరఁకొనియొకటినొకటిఁ, బృథుభుజాదండమునఁబెట్టిపెలు చనూఁచె.'' హరి. పూ. ౭, ఆ.—5. మిగిలినది.

తరవారి. సం. వి. ఇ. పుం. కత్తి, పట్టాకత్తి. (అనికొండలు.)

తరసము. సం. వి. అ. న. మాంసము, పాల.

తరస్వి. సం. వి. న్. పుం. పులి. విణ. 1. బలిమిగలవాఁడు; 2. వడిగలవాఁడు.

తరస్సు. సం. వి. స్. న. 1. బలిమి; 2. వడి.

తరహా. హిం. వి. విధము, రీతి.

తరళము. సం. వి. అ. పుం. హారమధ్యరత్నము. విణ. 1. చలించునది; 2. అనురాగముగలది; 3. ప్రకాశించునది.

తరళితము. సం. విణ. (అ ఆ. అ.) చలించినది.

తరళేక్షణ. సం వి. ఆ. స్త్రీ. 1. చలించుకన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. (దీనికి తెనుఁగున సరియైనపదము త్రాలుగంటి.)

తరాజు. దే. వి. త్రాసు. (రాజీలుతెరాజీలు.)

తరాసు. దే. వి. తరాజుయొక్కరూపాంతరము.

తరి. ఉభ. వై. వి. త్రచ్చుట, మథనము*. ''క. తరతరమ తరువఁ దరువక, దరియందుదయఁబునొందెధన్వంతరిపా, గరమునఁగడు గరగరనై, కరమునఁగరనుమసునమృతకలశముఁదాసుక.'' భీ. ౪, ఆ.—సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఓడ; 2. పొగ; 3. మబ్బు; 4. మాగాని.

తరించు. సం. స. క్రి. (సముద్రముతోనగువానిని ఓడలోనగు సాధనములచే) దాఁటు.

తరికాఁడు. వై. విణ. త్రచ్చువాఁడు ''క. తరికాండ్రలోననొకఁ డేఁట, తరిగడవకుఁగుదురునాఁక త్రాడఁటచేతుల్, తరిగవ్వంబున దానఁట, హారిహారిహారిచిత్రలీలహారియేయొఱఁగుక.'' భాగ. ౫, స్కం.

తరిగంబము. వై. వి. (తరి+కంబము.) పెరుగుత్రచ్చెడు స్తంభము, కుటరము.

తరిగడవ. వై. వి. (తరి + కడవ.) పెరుగుత్రచ్చెడు కుండ, మంథని.

తరిగొండ. వై. వి. (తరి+కొండ.) మంథాద్రి. ''సీ. తరిగొండ కృతాబ్ధిఁద్రచ్చు చోఁగుదురైనముదుకకచ్ఛపనములుమూఁడుపదులు.'' కాశీ. ౬, ఆ.

తరిగొట్టు. ద్వ. వి. ఒకదినుసు కూరాకు, లాంగలి.

తరిగోల. ద్వ. వి. (తరి+కోల.) కవ్వము, మంథానము.

తరిచెట్టు. ద్వ. స క్రి. (పెరుగు దేవతాదులకు) నివేదనముచేయు.

తరిటెె. దే. వి. రెండు పెండెలు బిగించెడు గోనెపట్ట. (రూ. తరిటి.)

తరితీపు. ద్వ. వి. 1. ఉపేక్ష; ''ను. సరసాలాపసుధారసంబయిసఁ గాంక్షంగ్రోలఁగానియ్యవే, తరితీపేల.'' ఉ, రా. ౬, ఆ.—2. ఉదృతి. ''కులముతోఁచరితీపుకలిగిమిఁచినమేటి.'' (ఇక్కడ మథన మాధుర్యమర్థాంతరము.) స్వా. ౫, ఆ.—3. ఆపేక్ష. ''క. తన, దండను దేదండయానతరితీపువగల్, మెండుకొననుఁడ.'' శశాం. ౨, ఆ.

తరితీపుచేయు. ద్వ. అ. క్రి. (తరితీపు + చేయు.) గర్వించు. స. క్రి. ఉపేక్షించు. ''క. నిన్ననిటులతరిలినని, ల్లాలితనమెల్లఁ బోయెనె, యేలాతరితీపుసేసియిట్లుడికెంపక.'' భో. ౪, ఆ

తరిత్రాడు. ద్వ. వి. పెరుగుత్రచ్చెడుత్రాడు, మంథరజ్జువు.

తరిదాలుపు. ద్వ. వి. (తరి+తాలుపు.) మంథపర్వతమునుధరి యించినవాఁడు, విష్ణువు. (రూ. తరిదాల్పు. ''సీ. తరిదాల్పుపా క్కిటితమ్మికన్నునితొవియల్లనల్లెనలసజల్లిచల్లి.'' లక్ష్మీ. ౧, ఆ.)

తరిపట్టు. దే. స. క్రి. (తరి + పట్టు.) (దేవతలనుద్దేశించి పెరుగును) త్రచ్చకనిలుపు. ''జన్నెలందరివట్టుజాడగలదె'' ఉ, హరి. ౪, ఆ.

తరుచు. వై. స. క్రి. చిలుకు, మథించు*. ''క. తరువఁబడునబ్ధి క్రియనేనతిరుగఁబడియె.'' భార. భీష్మ. 3, ఆ.

తరుణము. ఉభ. దే. వి. సమయము. సం. అ. న. కుబ్జపుష్పము. పుం. ఆముదపుఁజెట్టు. విణ. 1. యౌవనముగలది; 2. క్రొత్తది. (రూ. తలునము.)

తరుణి. సం. వి. ఈ. స్త్రీ. 1. యౌవనము గల ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. తలుని.)

తరుణిమ. సం. వి. న్. పుం. యౌవనము, జవ్వనము.

తరుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) యౌవనముగలవాఁడు.

తరువడి. దే. వి. తటిమెన. ''సీ. బంగారుగొలుసులుఁబవడంపుఁ దరువడికోళ్లును వింతబాగులబోగడలు.'' కళా. ౨, ఆ.

తరువాయి. దే. వి. అనంతరము. ''గీ. వినుముతరువాతికథలునని స్తరముగ.'' నిర్వ. ౪, ఆ.

తరువు. ఉభ. దే. వి. ఇయ్యవలసినధనాదికమునిమ్మనిచేయునిర్బంధము. ''గీ. తరువుపనిచెనుదనదుకింకరులవారు, నేగిధనమువచ్చు టకునై యిట్టునట్టుఁ, బరుసఁదనములుచూపితద్వేరచితాప, మాను లైక్రమ్మఱఁగవచ్చిమనుజపలికె.'' పర. ౪, ఆ.—సం. ఉ. పుం. చెట్టు.

తరువుకత్తె. ద్వ. విణ. తరువువచ్చినది.

తరువుకాఁడు. దే. విణ. తరువువచ్చినవాఁడు. ''ఎ, గీ. వెరఁగు నొందుచుఁదనమీఁదితరువుకాండ్రఁజూచి.'' పర. ౪, ఆ.

తర్కము. సం. వి. అ. పుం. 1. ఊహ; 2. అధ్యాహారము; 3. కారణము; 4. కోరిక; 5. ఒక శాస్త్రము. (చూ. శాస్త్రము.)

తర్కారి. సం. వి. ఈ. స్త్రీ. తక్కిలితీ.

**తర్కించు.** సం. అ. క్రి. తర్కముచేయు.

**తర్కుటము.** సం. వి. అ. న. (నూలు) వడుకుట.

**తర్కులాసకము.** సం. వి. అ. పుం. నూలువడుకునప్పుడు కదురు క్రిందనుంచుకొనెడు చిప్ప.

**తర్కువు.** సం. వి. ఉ. పుం. (నూలువడికెడు) కదురు

**తర్చు.** వై. న. క్రి. తరుచుయొక్క రూపాంతరము. "మ దేవాసురుల్, ఖరశౌర్యోన్నతి, జేర్చిపేర్చిరిసు ఘాకల్లోలినీవల్లభున్." వీర. 3, ఆ. (అనేక గ్రంథములయందు పారనిట్లు కనఁబడుచున్నది.)

**తర్జనము.** సం. వి. అ. న. అదలుపు.

**తర్జని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రదేశిని, జొట్టనవ్రేలు

**తర్జించు.** సం. న. క్రి. అదలించు.

**తర్జుమా.** హిం. వి. భాషాంతరము.

**తర్దువు.** సం. వి. ఊ. స్త్రీ. మ్రానిగరిఁటె, త్రెడ్డు.

**తర్ణకము.** సం. వి. అ. పుం. అప్పుడు పుట్టినదూడ.

**తర్తసకము.** సం. వి. అ. పుం. కాకిగూఁడు.

**తర్పణము.** సం. వి. అ. న. తృప్తి, తనివి.

**తర్మము.** సం. వి. న్. న. యూపస్తంభపుకొన.

**తర్లు.** దే. అ. క్రి. ప్రయాణమగు. "ఇటఁదర్లిపోఁగదే." భాగ. ౯, స్కం. (తరలుయొక్క రూపాంతరము.)

**తర్షణము.** సం. వి. అ. న. దప్పిగొనుట.

**తర్షము.** సం. వి. అ. పుం. 1. దప్పి; 2. ఇచ్ఛ.

**తర్షితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దప్పికొన్నవాఁడు.

**తఱక.** దే. వి. గింజేపట్టని ధాన్యము. "క. తఱకలచొప్పయచాలున్, మఱచియుఁదలపాలముదిక్కు మసలెడిపనికిన్, వెఱతుననిపిటెకితనముస, నెఱిబిఱుగుదుగాకనత్య నిష్ఠఁదలఁపుచే." ... ౪, ఆ.

**తఱచు.** దే. వి. బాహుళ్యము. "క. అఱిముఱినడరినరథికుల, తఱచునకు." భార. భీష్మ. ౨, ఆ.—విశే. 1. బహుళము; 2. అధికము. "క. పసిగొనుచమేయవచ్చిన, పసిఁగొనుచంగ్రోలుపులులు బలిసెన్నృపనీ, యసియాడునేనియచ్చట, నసియాడుం దఱచు వెఱచు నఱచున్బఱచున్." రామా. ౨, ఆ. "రగడ. కలుగొట్లుప్రాఁకువేడ్కలెసీకుఁదఱచెదను, నలినాక్షికడిమిగండమునకే వెఱచెదను." సా్వ. 3, ఆ. (ఈ ప్రయోగముల విధముఁజూడఁగా ఇది యిట్లు అకారమధ్యమముగానే యుండవలెనని యేర్పడుచున్నది. కొందఱు ఉకారమధ్యమముగా వ్రాసియున్నారు. అది యట్లుండవలెననుటకుఁ దగిన ప్రయోగము చిక్కినదికాదు.)

**తఱటు.** దే. న. క్రి. కళతోకొట్టు. వి. 1. కళ; "క. ఏమోకవితల్, మొఱిగెడుకుకవులఁబదవ్యపుఁ, దఱటులఁగొనివ్రేయవలదెతజ్ఞులునభలన్." నన్నయభట్టీయ ఛందస్సు.—2. మౌర్ఖ్యము. "సీ. కుఱుచ చేతులుమిడిగ్రుడ్లునుగడుకొన్న తఱటులు మఱిచెంచుఁ దనములమర." భార. అర. ౧, ఆ.—విశే. మూర్ఖము. (తఱటువెఱ్ఱి.)

**తఱటుగొను.** దే. స. క్రి. (తఱటు+కొను.) కళతోకొట్టు.

**తఱటుసేయు.** ద్వ. స. క్రి. (తఱటు+చేయు.) —— పై. ——"క. శితికంఠసుతుఁడుఖచర, స్తుతుఁడై యాయచ్చరూపుతురికినివాహ్నం, దితధారితక్లప్తతరే, చితవల్గితగతులఁదఱటుసేసిన నదియున్." పాండు. ౧, ఆ.

**తఱతెఱ.** దే. వి. తత్తఱ. (వానికి తఱతెఱ యెత్తినది.)

**తఱతెఱలాడు** దే. అ. క్రి. (తఱతెఱలు+ఆడు.) తత్తఱపడు. (వాఁడు ఆ మాట విని తఱతెఱలాడుచున్నాఁడు.)

**తఱపి.** దే. వి. 1. ఆఱునెలలదూడ, బసవుయను; 2. తారుణ్యము. "సీ. మెఱపులోవ జ్రంపుటాఱపులోశశిరేఖతఱపులో యావటూ్తిమునికోఱలు." పాండు. ర, ఆ.—విశే. తరుణము. "సీ. తఱపివెన్నెలలోనిధావళ్యమొకకొంకవసుధాకర్దమద్రవము గాఁగ." కాశీ. ౧, ఆ.

**తఱపియావు.** దే. వి. (తఱపి+ఆవు.) బహుకాలమునకుముందిని నయావు, బసవుయణి.

**తఱలు.** దే. అ. క్రి. 1. చలించు; "చ. ఒఱగెవసుంధరాస్థలి నుపోరగనాథుఁడు క్రుంగెఁ గూర్మముం, దఱలె." రా. యు, కాం.—2. సంభ్రమించు. "సీ. ద్వాదశాదిత్యులుతఱలికానిననై సఁగల్పశతంబులఁ గ్రాఁగఁడు." వా. ౨, ఆ.—స. క్రి. విడుచు. "ద్వి. తఱలకుధైర్యంబుఁదలఁగకుమస్తు, మఱవకునీస్వామిహితంబుననుచు." పరిక్ష్. ౨, భా.

**తఱలుచు.** దే. ప్రే. తఱలఁజేయు. (చూ. తెఱల్చు.—విడిపించుటకు. — "సీ. కల్పశాఖనిగెల్చికస్తుకీర్తిమరల్చిఖచరువార్తఁదఱల్చి మనునదల్చి." కళా. ౧, ఆ.)

**తఱి.** దే. వి. 1. సమయము; "క. వినముఁదెఱివేచిరిపుమూఁక, పునమోనఁగవలయునమయముఁగనఁగొంగ్ర, కన్నఁగడవశిలాస్థలివై, చినచాప్పునసేర్పు మెఱయఁజెఱచుట యొప్పున్." భార. శాం. 3, ఆ.—2. సమీపము; "సీ. ననుఁగోరిపుంజాయూపుసఁజేరిసదు రేయితఱినింటితచేఁబొంచియఱచుటయును." అచ్చ. బాల, కాం.—3. త్రాడులోనగువాని యొత్తుడురేఖ; "చ. తీఁగచుట్టునె, త్తఱులయియున్నపాఁపతరిత్రాటిమలంకల." కాశీ. ౫, ఆ.—4. వృత్తియందు తఱిమోనతెగ్గమునకు మీఁదివర్ణములులోపింపఁగా మిగిలినరూపము. (తఱిగోడు.)—5. బ. వళి. "తరఁగల నిరసించుతఱులవారి." భాను. ర, ఆ.

**తఱిగొను.** దే. అ. క్రి. (తఱి+కొను.) యత్నించు. "క. అఱువర్ధికోటులుకసివరు, లుఱకజగత్త్రయముఁబెలుచ సువ్వెత్తుగొనన్, దఱిగొన్నయట్లునడువఁగ, నెఱసికుముదుఁడరుగుదెంచినృపవరుఁ గనియెన్." భార. అర. ౭, ఆ.

**తఱిమెన.** దే. వి. మ్రానుచిలుకుట. (దీనికి వృత్తియందంత్యవర్ణములులోపించును. చూ. తఱి.)

**తఱిమెనఁబెట్టు.** దే. స. క్రి. (తఱిమెనన్+పెట్టు.) మ్రానుచిలుకు.

**తఱియఁబడు.** వై. అ. క్రి. (తఱియన్+పడు.) తఱియు. "ఉ. అట్టిదియైననాఁడ తఱియంబడిమూర్ఖునంబుసేయరే." భార. విరా. ర, ఆ. (స్వార్థమునపడు.)

**తఱియు** యు. దే. అ. క్రి. సమీపించు. "గీ. మెఱుఁగుమెఱసిన చాడ్పునఁదఱియఁజొరును." భార. విరా. ౫, ఆ.—వై. స. క్రి. 1. అతిక్రమించు; "చ. అమ్మహానదినుచక్షువునాలిలసిల్లుఁదద్వనం, బునుగొలనుఁవడిందఱిసిపోయి నగంబులతిక్రమించి." మార్క. ర, ఆ.—2. దాఁటు. "సీ. ఉగ్రంబులైన యాయుధములమొనలపైనుఱుకుటయంభోధిఁదఱిసిచనుట." భార. అర. ౬, ఆ.

**తఱిపడు.** ద్వ. అ. క్రి. (తఱి+పడు.) ఒత్తుడుపడు. (చూ. గోడి.)

**తఱుఁగు.** దే. అ. క్రి. తగ్గు, క్షయించు. "క. వెఱఁగుపడివార్షరాగము, తఱిఁగినఁగడువెల్లనైవదనములు వ్రాలన్, దెఱఁగేదిఱిచ్చవడిరి, త్తఱిఁదత్పరిజనములెల్లఁదద్దయువంతన్." భార. అర. ౭, ఆ.

"ఉ. చవ్వ మెక్కి యొక్కమ్మడినంకురించులతయొప్పదఱుంగదె సీనుగానమిఁ." నిర్వ. ౫, ఆ. "శీ. మఱుఁగుఁబూఁబొదలఁ గ్రమ్మఱు గుసుచ్చ పుదారితఱుగుసైఁగొనుఁజల్లతఱుఁగుగాలి." చంద్ర.

**తఱుగరి.** దే. వి. (తఱుగు+అరి.) తఱుగుబేరకాఁడు.

**తఱుగాకు.** దే. వి. (తఱుగు+ఆకు.) కాయుగూర.

**తఱుగు.** దే. స. క్రి. 1. ఖండించు; 2. చించు. "దానివస్త్రార్ధంబుతఱిగె." భార. అర. ౨, ఆ.—వి. అమ్మెడువానికిని, గొనెడు వానికిని నొక సరకును వెలకుదిర్చి తీసియిచ్చి వారివద్ద నూటికింత యని దీసికొను ద్రవ్యము. (చూ. తఱుఁగు.)

**తఱుచే.** దే. వి. (చూ.) తఱచు.

**తఱుపు.** దే. వి. 1. పేఁడాది వయసుచెల్లిన ఆఁబుదూడ; 2. మణి విశేషము.

**తఱుము.** దే. అ. క్రి. 1. కవియు; "క. తఱుమరునామీఁద నత్యుదగ్రతవారుఁ." భార. ఉద్యో. ర, ఆ.—2. త్వరితపడు. "వ. విరాటునగరంబున కనతిదూరంబగు కాంతారంబునఁదఱిమి పోవుసమయంబున." భార. విరా. ౧, ఆ.—స. క్రి. 1. వెంబడించిపరుగెత్తించు; "క. మనయోధావలి, ఱెచ్చవడియెవారి మొనదఱిమికొనివచ్చెఁ." భార. ద్రో. ౧, ఆ.—2. బలాత్కరించు; "ఎ, గీ. ఇయ్యకొనుమనితఱిమె నిల్లెంతదఱిమినను." భార. అను. ౧, ఆ.—3. తఱిమెనఁబెట్టు.

**తఱులమెకము.** ద్వ. వి. 'తఱులమోరమెకము యొక్కరూపాంతరము. "ఎ, గీ. తఱుల, మెకముబంటులపై హెచ్చరికలవెడలె." అచ్చ. యు, కాం.

**తఱులమోరమెకము.** ద్వ. వి. కోఁతి, వలీముఖము. "గీ. అంతఁబ్రొద్దుచాలియానతిఁగడలకుఁ, దఱులమోరమెకపుదాఁటులేగి." అచ్చ. యు, కాం.

**తఱువు.** దే. అ. క్రి. తగ్గు. స. క్రి. ఖండించు.

**తఱుసలి.** దే. విశ. ఉద్ధతుఁడు.

**తఱ్ఱి.** దే. విశ. నీచుఁడు.

**తఱ్ఱు.** దే. విశ.———పై.———"తఱ్ఱులతోడిపొత్తిడక." దాశరథిశతకము.

**తల.** యు. దే. వి. 1. శిరము; 2. శిరసువెండ్రుకలు; "తలయుంజీరయువీడ." హరి. పూ. ౫, ఆ.—3. కొన; "వ. పొంగపల్లియకురయంబుకంజనిపుల్లఫలసంగరంబై కయిఁగలంబు. క. కొనవచ్చిపుల్లప్రోళ్ళనఁ, దనకంగాఁజేసి." భార. శాం. 3, ఆ.—4. పూనిక; "క. ఒలచెడిపాఱకబాహా, బలమొప్పఁగనాదువృష్టిపథమునధృతితో, నిలిచిననిష్ఠురవిశిఖా, ర్చులముంచి మదీయనఖనిసూడిటఁదీర్తుఁ." భాగ. ౧౦, స్కం. ఉ.—5. ఎత్తు; "క. వారొకతలయేనొకతల." భార. ఉద్యో. ౧, ఆ.—6. ముందు భాగము; "గీ. నాఁడుసభనాడిసంతయునేఁడుసేయు, నట్టులున్నాఁడుమొనతలననిలసుతుఁడు." భార. భీష్మ. 3, ఆ.—7. మొత్తము; "క. ఒకఁడొకఁడుపాండవులఁదాఁ, కకస్సైన్యోపేతగాఢగతినందఱునో, క్కొకతలగాఁదలపడివా, రికడంకయుడుపఁగవలయుఁ గ్రీడయపోలెఁ." శల్య. ౧, ఆ.—8. ఎద; "చ. దోర్బలపరాక్రమభీకరులైనవారిను, ద్ధురగతినెట్టుమార్కొనియెదొకడు వింతలుపుట్టెనీతలఁ." మార్క. ౬, ఆ.—9. సమయము. "క. మెలగుదెఱమెలఁగిక్రమ్మఱు, తలనొకమరియేమఱించిదాడిమెయిందో, ర్బలమునుమాఱునిపైఁబడినా, చలమునెఱకిపోదుమీకుఁజాటితిఁజూండీ." నిర్వ. ౭, ఆ.—విశ. మొదలు. "గీ. అతిరథులకెల్లఁదలతంత్రి యట్టివాఁడు, అసురవిభుఁడుఘటోత్కచుండు." భార. ఉద్యో. ర, ఆ.—వై. వి. 1. చోటు; "ఉ. అకఁడత్తలదాఁటియెంతయుభయాతురుఁడైతొలఁగంగఁబాఱెనఁ." హరి. ఉ. 3, ఆ.—2. రంగము; "చ. అనితలసీవుపాండుతనయావలికెప్పుడుమేలుచేయినా, తనయులకుంబరాక్రమముతక్కువయుంబ్రకటింపవిందు." భార. భీష్మ. ౨, ఆ.—3. పక్షము*. "క. ఒకతలసమస్తజగములు, నొకజనార్దనుఁడునిలిచియొకతలయైనఁ, సకలమ్మునసారమతం, డొకరుఁడసారంబుచాలనుత్కృష్టమగుఁ." భార. ఉద్యో. ౨, ఆ. (ఇది శిరసు, శిరసువెండ్రుకలు, కొన, పూనిక, అనునర్థములు తక్కతక్కిన యర్థములయందు సమస్తపదముగానే ప్రయోగముల యందు కానఁబడుచున్నది.)

**తలంటు.** దే. అ. క్రి. వి. తలయంటుయొక్కరూపాంతరము.

**తలఁకించు.** దే. అ. క్రి. చలించు. "ఉ. ఆమదవతీరమణీయతనే మరుండుదా, నప్పరమేశపక్ష్మనయనాంబుజగర్భులనైన వ్రేల్మిడిఁ, ద్రిప్పలఁబెట్టునంచువినుతించి మదిం దలఁకించివెండియుఁ." విక్ర. ౫, ఆ.—ప్రే. తలఁకఁజేయు.

**తలఁకు.** దే. అ. క్రి. 1. చలించు; "క. అప్పరుసునబాణాసురుఁ, డప్పటికప్పటికిఁదలఁకెనధికభయమునఁ." ఉ, హరి. ౬, ఆ.—2. భయపడు. "చ. దేవతా, దులవలనఁ భయంబుద్రుపదుం డెఱుఁగండుతదీయదేశముల్, తలఁకకయుండురోగభయతస్కరడామరవర్జితంబులై." భార. ఆది. ౮, ఆ.—వి. 1. చలనము; 2. భయము.

**తలఁగు.** దే. అ. క్రి. తొలఁగు. "క. నలుఁడునుధరణీరాజ్యము, తలఁగఁగసర్వంబునపహృతంబైనఁగడుఁ, దలరి." భార. అర. ౨, ఆ.—అం, ప్రే. తొలఁగించు. "సీ. ఉత్తమక్షత్రియుం డొరులదుఃఖంబులు తలఁగంగఁబుట్టినధర్మశీలుఁడు." భార. ఆది. ౬, ఆ.

**తలఁగుడు.** దే. వి. తొలఁగుట.

**తలఁచు.** దే. స. క్రి. 1. ఎంచు; 2. ధ్యానించు; 3. స్మరించు.

**తలఁపు** దే. వి. 1. తలఁచుట; "మ. విపినావాసముగూఢచర్యయునగావింపం దలంపొప్పదే." భార. ఉద్యో. ౧, ఆ.—2. అభిప్రాయము; "బాల్యమునఁ దలఁచుతలఁపుఁ గీడుచేసి." భార. సౌ. ౧, ఆ.—3. కోరిక; "క. మనకడకునేమిటికివ, చ్చెనొకోయే నిమ్మహాత్మచెప్పినపనులె, ల్లనజేయువాఁడఁగోరిన, కనకాంబరమణులుతలఁపుగడవఁగనిత్తుఁ." భార. విరా. ౧, ఆ.—4. చింత; "సీ. తలఁపులనందడిదండడించినఁదాల్మికదలుశిరఃకంపగతులమెఱయ." భార. అర. ౭, ఆ.—5. జ్ఞప్తి; "సీ. మునునీవనుగ్రహించినమాటఁదలఁపునేసినఁజాలు బొంకవీవనుచుఁదలఁతు." కళా. ౭, ఆ.—6. హృదయము. "క. తలఁపునఁజూచినచూపును, వెలిఁజూచినచూపునొక్కవిధమయియున్నఁ, నెలకొనిఘంటాకర్ణుఁడు, నలినాక్షునినామకీర్తనంబొనరించెఁ." ఉ. హరి. ౨, ఆ.

**తలఁపుచేయు.** దే. అ. క్రి. ఎంచు, భావించు. "గీ. చెలువ వనజవైరి శృంగారభావంబు, కన్నులారఁజూచికాంక్షతోడ, మదనబాణభిన్నహృదయుఁడైయాతని, తలఁపుతెలిసితగులఁదలఁపుచేసె." వి, పు. ౫, ఆ

**తలఁపుచూలి.** దే. వి. మన్మథుఁడు, భావజుఁడు

**తలఁపుమిన్న.** ద్వ. వి. చింతామణి. "ద్వి. తలఁపుమిన్నయుఁ గామితములిచ్చుమొదవు, వెలిగారునలనిక్కువీనులఁజెక్కి." విష్ణు. ర, ఆ. (ఇట్లు తలఁపురతనము, తలఁపుఱాయి.)

**తలఁపుఱాయి.** దే. వి. చింతామణి. "ఉ. చానతలంపుఱాచలుపచట్టులు వేలుపుఁజెట్లుఁగమ్మపూఁ, దేనియకాల్వపట్టులు మదీయ

నిశాంతమునందనర్చు." రామా. ౫, ఆ. (ఇట్లు తలఁపుర శనము మొ.)

**తలఁపుసాక్షి.** దృ. విశ. ఈ కార్యము నిశెఱేఁగియుంచుమని పలుమాఱు వాదిచే తెలిపింపఁబడినసాక్షి, స్మారితుఁడు.

**తలఁబ్రాలు.** దే. వి. (తలక్ + ప్రాలు.) వివాహకాలమందు వోసిల్లతో తలమీఁదఁబోయు నక్షతలు.

**తలకట్టు.** దే. వి. 1. అకారముయొక్క రూపాంతరనామము; 2. పాగ కట్టుట; 3. పాగ. విశ. కన్నాకు, ముఖ్యము. "గీ. సన్నుతిది కెంచుటయనీదునైపుణముల, కెల్లదలకట్టు." హరి. ఉ. 2, ఆ.

**తలకడచు.** దే. స. క్రి. తలమీఱు, అతిక్రమించు. "క. తలకడచి కడచుద్రోణుని, యలవుఁజలంబునునహింపక." భార. భీష్మ. ౨, ఆ.

**తలకాఁడి.** దే. వి. బరువు అధికమై రెండెద్దులకంటె హెచ్చుగా కట్టవలసినప్పుడు నంకనచేసి మొదటికాఁడికి ముందుకట్టెడు మఱి యొకకాఁడి, ప్రాసంగము.

**తలకాయ.** దే. వి. తల, శిరము. "సీ. ప్రేతులనరములఁబెనఁ చినతలకాయ పేరులుగళేమునఁబెనఁగొనంగ." హరిశ్చ. 3, ఆ.

**తలకూడు.** దే. అ. క్రి. సిద్ధించు. "నాకోరినకోర్కినేఁడుతల కూడెనరేశ్వర." భార. అర. 2, ఆ. (ప్రే. తలకూర్చు. "సీ. తగిననహాయంబుతలకూర్చుకొనివగసాధింపవలయు నుత్సాహలీల." పంచ. నా. ౧, ఆ.)

**తలకెడవు.** దే. విశ. తలక్రిందు. "సీ. మునుమించినిడుమోర ముంచిదూఁటినమహాజడధిపూరముతలకెడవుగాఁగ." హరి. పూ. ౪, ఆ.

**తలకొట్లమారి.** దే. విశ. (తలకొట్లు + మారి.) 1. శిరశ్ఛేదనము పొందినవాఁడు; 2. అవినీతుఁడు.

**తలకొను.** దే. అ. క్రి. 1. కలుగు; "చ. నెలకొనినంగమంబున జనించునుగామము కామవృద్ధిచేఁ, దలకొనుఁగ్రోధ మట్టిచెడిదం బగుక్రోధమునందనర్చుమో, హ లతికమోహవృత్తినుదయంబగు విస్మృతి విస్మృతింజనుక్, దలఁపఁగబుద్ధి బుద్ధిచనినక్ మఱితాఁ జెడుమానవుండిలక్." శేష. ౧, ఆ.–2. యత్నించు. "నంత తిఁబడయఁదలకొనుము." హరి. పూ. ౪, ఆ.—స. క్రి. తాల్చు, వహించు. "క. ఇలనీకైకొన్న తెఱఁగు, తలఁపఁగధర్మంబొకాదొ దైవమెఱుంగుక్, వలవనిచింతయుడిగిధృతిఁ, దలకొనిపాలింపు యజ్ఞదక్షుఁడవగుచుక్." భార. శాం. ౧, ఆ.–(ప్రే. తల కొల్పు. "చ. సుకృతములందుకుంబరమశోధనమైనమదర్చనాదిని, ద్ధికిఁధరణీజనంబులమదిక్దలకొల్పనకాదెయేఁగృపా, ధికతదవతార నముద్ధిణవిహారముపూనుటల్ దురా, త్మకులకుఁదన్మహామహిమదర్శన ముక్ వృథయేమిసేయుదుక్." కళా. ౮, ఆ.)

**తలకొనుదెంచు.** దే. అ. క్రి. (తలకొను + తెంచు.) తలకొను, కలుగు. "క. వగరును, దలయేరునుసుక్కినయునుదలకొనుదెం చెక్." భార. ఆది. 3, ఆ. (స్వార్థమున తెంచు.)

**తలకొఱివి.** దే. వి. అపరకర్మముచేయువాఁడు శవముతొట్టునసుం చెడునిప్పు. "ద్వి. కొంతచిక్కినకడకొఱవులఁదెచ్చి, కుఱుప్రోగు గానిడికొడుకునందునిచి, కొఱవిసొక్కటఁదలకొఱవిడఁబూని." హరిశ్చ. ౨, భా.

**తలకోల.** దే. వి. సాధువుకానియావును పిదుకునపుడు కొనను త్రాడుకట్టి దాని కొమ్ములకు తగిలించి పట్టుకొనెడుకోల. "గీ. ఆవుఁబిదుకఁబోయియలివేఁతెయొక్కతె, దూడవెనుకకాళ్లతోడనావు, నడఁగఁగట్టియొద్ది యాఁబోతుఁదలకోలఁ, బట్టియుట్టుగట్టెబయలు పిదికె." వి, పు. 2, ఆ.

**తలకోలు.** దే. వి. తలకొనుట.

**తలక్రిందు.** దే విశ. 1. అధోముఖము; 2. విలోమము.

**తలగడ.** దృ. వి. (తల + కడ.) 1. (పండుకొనునపుడు) తల యుంచుకొనెనుదిక్కు; "గీ. సూర్యుదక్షిణములోనదొరకెనట్టి, దిక్కునతలగడగాఁగనిద్రించెనేని, మేలుతక్కినదిక్కులుమేదినీశ, యధికరోగంబుగానించునరిబుధులు." వి, పు. ౪, ఆ.–2. తల క్రింద ఎత్తుగానుంచుకొనెడు సిసుపాటిదిండు. ఉపధానము.

**తలగడుగు.** దే. వి. (తల + కడుగు.) తలంటు, అభ్యంగనము. "చ. తలగడుగంగమర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో, జ్జ్వలకల మాన్నభోజనము చందనచర్చ ప్రసూనదామకం, బులు గపు రంపువిడ్యములు భూషణవస్త్రములు గల్గి నిచ్చలుం, బుట్టుకడు గంగఁబడ్డనును మున్నెనుఁ బోలుచువాలుచుంబురిక్." పాండు. 3, ఆ.

**తలగాము.** దృ. వి. రాపులు. "ద్వి. తలగాముముట్టనితనువెందు రేఖ." భాగ. ౮, స్క.

**తలగుంజె.** దృ. వి. నిట్రాడు.

**తలచీల.** దే. వి. మీటనుమునసన జేర్చి బిగించెడుచీల.

**తలచేమురు.** దే. వి. నూనె.

**తలచోవడి.** దే. వి. ఇంటిముందవచేచోవడి.

**తలచుట్టు.** దే. వి. 1. పాగకట్టుట; 2. పాగ, ఉష్ణీషము. "సీ. రారాజు ద్రోణ, తనయుండుఁజుట్టినతలచుట్లునల్లనియవి సూత పుత్రుశిరోంబరంబు, పచ్చనియది కుంభభవకృపాచార్యుల యు ష్ణీషములువెల్లలు." భార. విరా. ౫, ఆ.

**తలచూపు.** దే. అ. క్రి. పొడచూపు, తోఁచు. "చ. అతనితపో మహత్వమున కచ్యుతుఁడెంతయుమెచ్చికూర్తమై, వితతపయోధివీథి ఘనవీచులతోఁదలచూపుచుక్." భోజ. ౧, ఆ.

**తలడిల్లు.** దే. అ. క్రి. తల్లడిల్లుయొక్కరూపాంతరము. "విర క్తులుతలడిల్లువేళలు." భాగ. ౧౦, స్క. పూ. (చూ. తలడించు.)

**తలతల.** దే. అవ్య. మనుష్యునికి మనుష్యునికి. "చ. తలతలపాలు పత్తెములు తద్దయుమించెగిరీశుచెంగటక్." చంద్రా. ౧, ఆ.

**తలత్రాడు.** దే. వి. ఎద్దుకొమ్ములకుఁగట్టెడు కుచ్చులతోడిత్రాడు.

**తలదువారము.** దృ. వి. తలవాకిలి. "సీ. తలదువారంపుఁబొం తలనంటిపోదియలును నిండుఁగుండలునొనరనిలిపి." అచ్చ. అ, కాం.

**తలదట్టు.** దే. వి. వేరుపురుగుకొఱికిమోపులెండుట.

**తలపడు.** దృ. అ. క్రి. 1. ప్రారంభించు; "క. పాండవుతోన, చ్చులమునఁబోరఁగదొష్టికిఁ, దలపడితివి." జై. 2, ఆ.–2. పర్వ డు.—స. క్రి. 1. ఎదిరించు; "చ. శలభమువహ్నిమీఁదఁజనుచంద మునాదెన్నపాలుఁడర్జునుం, దలపడఁబోక." భార. ద్రో. ౫, ఆ.— 2. తాఁకు. "వ. నాకేశుండునుముదిందాఁకినతెఱంగునరారాజుందల పడి." భార. శల్య. ౨, ఆ. "ఉ. ఏలినవానిఁగాంచిమొనలెల్లను నెంతయుదర్పమెక్కియా, భీలనిశాతహేతిరుచిభీకరలీలనెదిర్చి మత్స్యభూపాలకసైన్యరాజిఁదలపడ్డ." భార. విరా. 3, ఆ.

**తలపాటు.** దృ. వి. (తలపడుట.) 1. ప్రారంభము; "ఉ. నావుడునక్కుమారుఁడుమనంబుననెంతయురోసియిట్లనం, భావి తుఁడైన వానితలపాటరయక్నగుఁబోటుకాదె." నిర్వ. ౧౦, ఆ.– 2. ఎదిరించుట. "వ. ఉగ్రసేనబలదేవసాత్యకికృతవర్మలుమున్నుగా వెడలిప్రతివీరులందలపడిరట్టితలపాటునవాయంబులమీఁదివారు హయారోహకులందాఁకిపెనంగ." హరి. ఉ. ౬, ఆ.

**తలపెట్టు.** దే. అ. క్రి. ప్రారంభించు. అం, ప్రే. తలపడఁజేయు, ఎదిరింపఁజేయు. "క. బలమునుశౌర్యముఁదేజముఁ, గలఁడనికౌరవులునమ్మికర్ణునితోఁ, దలపెట్టిరినీబాణం, బులఁగూలెడునాఁడుఁగీర్తిఁబొందెదునిన్నున్." భార. కర్ణ. 3, ఆ.–స. క్రి. ప్రస్తావించు. "క. తలపెట్టకుఁడీకనెన్నఁడుఁ, గలనైననుమత్ప్రసంగకారణమునవ, ర్తిలినట్టియీకథాస్థితి, నిలనిట్టివిగోరఁదివియనేఁబాయిషాటుల్." కళా. ౫, ఆ.

**తలపాలము.** దే. వి. పొలిమేరవెంబడినున్న పొలము. "క. పాదుకేఁగనేనిక్. వినుతలపాలమునసకానినిలువదు సుమ్మీ" భార. ఉద్యో. ౨, ఆ. (చూ. ఎఱక.)

**తలపోఁత.** దే. వి. 1. చింత; "ఉ. దేవుఁడొమానియోయని మదిఁదల పోఁతలునాకెకానినిక్, వేవురువేయిచందముల నిందయొనర్చెదరు." పర. ౨, ఆ.–2. ఆలోచన, విచారము. "ఒండు తలపోఁతలులేఁతలు." ఉ. హరి. ౪, ఆ. "నన్నునెత్తెఱఁగునసైనఁ బొందఁగమదిందలపోఁతయకల్గెనేని." భార. ఉద్యో. ౧, ఆ.

**తలపోయు.** దే. అ. క్రి. (తలఁపు+పోయు.) 1. చింతించు, 2. ఆలోచించు, విచారించు.

**తలబీకనకాయ.** దే. విశే. కలఁతనొందినది. "క. చిలువదళవాయు లప్పుడు, తలబీకనకాయలైయథాయథలైరూ, కులువత్తులునై మొనతల, నిలువకశేషాహికడకునెజెచెడిపోలున్." జై. ౭, ఆ. (దీనిని తలబీకరకాయ అని వాడుచున్నారు.)

**తలమాటు** దే. వి. చేటు, నాశము. "క. అలఘురఘువంశమునకున్, దలమాటించుకయులేమితథ్యముగానీ, వలసనమస్తంబునునేఁ, దెలిసితినామనముకలఁకతీఱెమహాత్మా." నిర్వ. ౯, ఆ.

**తలమానికము.** ద్వి. వి. అలంకారార్థము శిరమునందుంచుకొనెడు రత్నము. విశే. శ్రేష్ఠము. "క. కన్నియతలమానికమగు, నన్నాఁగటిచాలు పేరియతివల్." రామా. ౫, ఆ.

**తలమెంచు** దే. అ. క్రి. ముందుమించు. "క. పెల్లుకొనఁగురిసిరప్పుడు, పల్లగఁదమచూడ్కులకును దలమించేఁగభూ, వల్లభుపైఁబురభామలు, కొల్లలుగాలాజమిళిత కుసుమాంజలులన్." కవిక. 3, ఆ.

**తలమిగులు.** దే. అ. క్రి. ముందుమిగులు. "క. తలమిగిలివచ్చు బాహ్లికు, నిలుమని విశిఖముల నొంచె." భార. ద్రో. ౧, ఆ.

**తలమీఱు.** దే. అ. క్రి. ముందుమీఱు. "క. మీఱుననుగృహస్థధర్మము, మేరకుఁదలమీఱె చనక." పాండు. ౪, ఆ.

**తలము.** ఉభ. దే. వి. శతము. విశే. శక్యము. "తలమే బ్రహ్మకునైన." స్వా. ౨, ఆ. (తరముయొక్క రూపాంతరము.)–సం. వి. అ. న. 1. ఱంటిదెబ్బతగులకుండ చేతికితొడుగుకొనెడి ఆత్తెము; 2. అడవి; 3. కారణము; 4. పాతాళలోకము. పుం, న. 1. స్వరూపము; 2. క్రిందిభాగము; 3. కాళ్లచేతుల క్రింది భాగము. పుం. 1. తాటిచెట్టు; 2. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి; 3. కత్తియొక్క పిడి; 4. ఎడమచేతి తంతిమీటు.

**తలముదప్పు.** దే. అ. క్రి. (తలము+తప్పు.) అశక్యమగు. "గీ. తలముదప్పినమెలం, కువలకల్పులియ్యకొనుటతగునె." భార. విరా. ౧, ఆ. "సీ. తనరూపునకుఁదోడు తలముదప్పినగర్వ మరగంటఁజూడఁజేయరిగినపుడు." కాశీ. ౭, ఆ.

**తలమునక.** దే. వి. 1. శిరస్స్నానము; 2. శిరఃప్రమాణము, తలబంటి. (రూ. తలమున్క. "ఉ. అక్షరశాయతేక్షణ కటాక్షవిలాస రసప్రవాహముల్, కుత్తుకబంటితామరలకున్ దలమున్కలు గండుమీలకున్." విజ. 3, ఆ.)

**తలముల్లు.** దే. వి. బ. 1. వేఁటకానిసాధనము; (చూ. జీగురు.) 2. దొంగయొక్క సాధనము. (చూ. గద్దగోరు.)

**తలయంటు.** దే. అ. క్రి. (తల+అంటు.) తలమీఁద (నూనెపెట్టి) రాచు. "ఉపాధ్యాయునకుఁబ్రియమునఁదలయంటుచుండ." పర. ౫, ఆ.–వి. తలమీఁద (నూనెపెట్టి) రాచుట, అభ్యంగము.

**తలయంపి.** దే. వి. 1. (పండుకొనునపుడు) తలయుంచుకొనెడు దిక్కు, తలగడ; "గీ. అంతఁడుపవళింపమునుగౌరవాధినాథుఁ, డరిగితలయంపిదెసనున్నతానసమున, నుండెఁబదపడికాల్కడయొద్దకల్గఁ, జనిపినమ్రుఁదైనిలుచుండెసవ్యసాచి." సం. "పశ్చాచ్చైవకృష్ణస్యనిషసాదవరాసనే." భార. ఉద్యో. ౧, ఆ.–2. తలక్రిందనుంచుకొనెడు నిడుపాటిదిండు. (తలాఁపియొక్క రూపాంతరము.)

**తలయెత్తు.** దే. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. మొలచు. "చ. తొలుపాఁబమోధరధారఁదోఁగున, య్యిలఁదలయెత్తుక్రొత్తపులు నేపునవే పులకల్పెనూలతన్, మొలవంగనున్నవివ్వి." పాండు. ౨, ఆ.

**తలరు.** దే. అ. క్రి. 1. చలించు; "ఉత్సాహ. అతులశౌర్యుఁడనిలతనయుఁడమితవాహినీపదా, హతిధరిత్రిదలరనిట్టులరిగి." సం. "సకంపయన్నివమహీంబలేనచతురంగిణా." భార. సభా. ౧, ఆ.–2. చింతించు; "అన్నాకపతియుసిగ్గెదఁగదురన్. తలరి." సం. "సతూష్ణీంచింతయన్వీరోదేవరాజఃప్రతాపవాన్." భార. ఉద్యో. ౧, ఆ.–3. కలఁగు; "వ. లోకాపవాదభయంబునకుం దలరి." భార. ఆర. ౭, ఆ.-4. సంభ్రమించు; "క. మలగొంగమొదలుగలవే, ల్పులనందఱఁబాఱఁదజెమిలోఁగని కడిమిన్, దలరుకొడుకు." అచ్చ. యు, కాం.–5. ఒప్పు "క. లలినలరుగొమ్మలనువ, ర్తిలిసద్ద్విజరాజసంగతిఁ దగినువర్ణో, జ్జ్వలమైసుమనోభినుతిన్, దలరిపురముకోటతోఁటతనరుఘనశ్రీన్." కవి. ౧, ఆ. (ఈ యర్థమునకు నితరగ్రంథములయందు ప్రయోగము కనఁబడలేదు.)

**తలవంపు.** దే. వి. 1. తలవంచుట; 2. మానభంగము. "సీ. తేఁకువలేకపుత్తెంచినయప్పాండవజ్యేష్ఠునకుఁదలవంపుగాఁగ." భార. ద్రో. ౪, ఆ.

**తలవరి.** వై. వి. తలారివాఁడు. "చ. తలవరులింతయుందెలిసితల్లడమందుచుఁగుందుచున్నవా, రిలఫయిలేని దొంగనిపుడెచ్చటఁదెచ్చెదమంచు." పర. 3, ఆ.

**తలవాకిలి.** దే. వి. ఇల్లులోనగువాని మొదటిద్వారము. "ద్వి. వాఁడెపోమనతలవాకిటనున్నవాఁడు." హరిశ్చ. ౨, భా.

**తలవిడి.** దే. వి. తలనఱికిన తాటిచెట్టులోనగు తృణద్రుమము యొక్క తలతుండు. (తలవిడితుండు, తలవిడిబ్రద్దలు.)

**తలవీడు.** దే. వి. పురఃప్రదేశము, సమీపప్రదేశము. "క. కులకన్యకలకువేడుక, దలవీడులఁబరులతోడితగుమాటలకున్, దలకొనఁదగునేగురుజన, ములుగాకత్తెఱఁగువారుపురుషార్థనిధీ." భార. అను. ౧, ఆ.

**తలవు.** దే. అ. క్రి. తొలఁగు. "చ. పువ్వులొరులుగోయనీకతలఁపుండనియొప్పగజంకెనేయుచున్." నిర్వ. ౭, ఆ.–అం, ప్రే. తొలఁగించు. (తలఁగుయొక్క రూపాంతరము.)

**తలసాల.** ద్వి. వి. ఇంటితలవాకిలి. "ద్వి. తలసాలవెడలెడుదాఁకనాదెసకు, మలయుచూడ్కులుగలమంచినీమోము, కన్నులఁగప్పినకైవడిఁదోఁచు, చున్నది." హరిశ్చ. ౨, భా.

**తలా.** దే. అవ్య. క్రి. విశే. చెఱి. "ఉ. అందఱకుందలాయొకటి స్వార్థముగల్గుటదోఁపఁబల్కె" ప్రభా. ౫, ఆ.

**తలాఁపి.** దే. వి. (తల+ఆఁపి.) (చూ.) 1. తలయంపి; (2. అర్థమునకు.—"చ. ఒదికిలిపాన్పుపైఁబలికినొయ్యనఁగేలు తలాఁపిచేసి." ఉ, హరి. ౫, ఆ.)

**తలాటము.** దే. వి. (తల+ఆట.) పికిలిపిట్టతెక్కలులోనగువానిచే కేర్పఱచి గుఱ్ఱమునెత్తిని నిలువుగానమర్చెడు తురాయి. "ఎ, గీ. పీకిలికుంచెలాటంబుపేరొజంబు, మణులమొగముట్టుఁబన్నిసాహిణి యొకండు, కర్తయెదుటికిఁ గొనివచ్చెగంధవాహ, బాంధవంబగు నష్టహాసైంధవంబు." స్వా. ర, ఆ. (చూ. పోరాటము.)

**తలాడ.** ద్వ. వి. తలగడయొక్కరూపాంతరము. "పట్టుతలాడ యుఁగొహళఁదిపచ్చనునుంబఱపు." పాంచా. ౫, ఆ.

**తలారి.** వై. వి. రాత్రులయందు దొంగతనముపోక కావలికాచు దొరతనపుబంటు. (తలవరియొక్కరూపాంతరము.)

**తలారించు.** దే. అ. క్రి. మరలు. "వ. కోమలఘాసఖాదనకుతూహలంబులంజిక్కిమక్షువలం గ్రేపులందలంచితలారింపక." భాగ. ౧౦, స్క౦. పూ.

**తలి** దే. వి. ల్లియొక్కరూపాంతరము.

**తలికె.** దే. అవ్య. ముందు. (ప్రొద్దుపొడువక తలికెవచ్చినాఁడు మొ.)

**తలిమము.** సం. వి. అ. న. 1. దూదిపఱుపు; 2. మేలుకట్టు, 3. జాతికట్టనపునేల; 4. కత్తి.

**తలియ.** వై. వి. భోజనపాత్రము. "గీ. తలియఁబెట్టిన యశనంబుఁ దలఁగఁద్రోసి, పిదపఁగుడిచెదననువాఁడుబేలగాఁడె." భో. ర, ఆ.

**తలిరు.** దే. వి. చిగురు, పల్లవము. "క. కలయఁగఁగరములఁజరణం, బులనురమునశోణితంబు బోరనఁదొరఁగన్, దలిరెనఁగిననడమామిడి, చెలువొనఁబఱతెంచెభీమసేనుఁడచటికిన్." భార. భీష్మ. 3, ఆ.

**తలిరుఁబోఁడి.** దే. వి. (తలిరు+పోఁడి.) 1. చిగురువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

**తలిరుచు.** దే. అ. క్రి. 1. చిగిరించు; 2. సంతోషించు; 3. అతిశయించు. (రూ. తలిర్చు. సంతోషించుటకు.—"క నేఁడున్నదుఁడైపుయోధనుఁడుతం, డ్రిదలిర్పఁగనేగుఁగరిపురికిఁ గొనియెలమిన్." భార. ద్రో. ౧, ఆ.—అతిశయించుటకు.—"రూపునశాశ్వనేయులసరియనఁదలిర్చు." భార. అర. ౭, ఆ.)

**తలిరుదిండి.** దే. వి. (తలిరు+తిండి.) కోయిల, పికము. "సీ. నకికెందలిరుదిండులకువందనమొనర్చి చిగురుటాకులుపాదయుగళిఁజేర్చి." విజ. 3, ఆ.

**తలిరుపు.** దే. వి. తలిరుచుట. (రూ. తలిర్పు. "క. మునివరనాదగు చిత్త, మ్మునఁగౌతూహలముచాల మొలతెంచితలి, ర్పునసలరారెదు." భార. అను. ర, ఆ.).

**తలిరువిలుతుఁడు.** దే. వి. మన్మథుఁడు. (రూ.) తలిరువిల్తుఁడు. (ఇట్లు తలిరువిలుకాఁడు.)

**తలివము.** వై. వి. శయ్య. "క. తలివములెక్కిడివెన్నెల, పులుఁగులఁగనితనదుమదినిబొదలువిరాళిన్." య. ౨, ఆ.

**తలుకు.** దే. వి. తళుకుయొక్కరూపాంతరము. "సీ. మొలకనవ్వుల వాఁడుతలుకారుతొలుకారుబలుకార్మొగులఁగేరుపాలుపువాఁడు." అచ్చ. సుం, కాం.

**తలుగు.** దే. వి. పసులఁగట్టెడుపలుపు, సందానము. "క. తలుగులపొదియొకదెసఁజె, య్యలదామెనయొక్కవలననునైయుండన్." భార. విరా. ౧, ఆ.

**తలుపు.** దే. వి. పనిచేసినవాకిటి మూఁతపలక, కవాటము.

**తలోదరి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది.

**తల్గడ.** ద్వ. వి. తలగడయొక్కరూపాంతరము.

**తల్గు.** దే. అ. క్రి. తలఁగుయొక్కరూపాంతరము. (తొలఁగించుటకు. —"ప్రభుత్వమెలర్పఁగఁదాక్షియూఁదిదుస్తరతరమానసవ్యథలు తల్గుము." భార. అర. ౬, ఆ.) వి. తలుగుయొక్కరూపాంతరము.

**తల్చు.** దే. స. క్రి. తలఁచుయొక్కరూపాంతరము. "తద్భాషణములుచిత్తమునఁ దల్చుచుండుటఁజేసి." భాగ. ర, స్క౦.

**తల్పము.** సం. వి. అ. న. 1. దూదిపఱుపు; 2. అట్టడి; 3. భార్య.

**తల్లఁపి.** దే. వి. తలాఁపియొక్కరూపాంతరము. (1. అర్థమునకు.—"కరవీరపుఁజాయలదట్టిఁజుట్టివేతల్లఁపిదిక్కునందునిడి." రా, వి. 3, ఆ.)

**తల్లకెడవు.** దే. విశ. తలకెడవుయొక్కరూపాంతరము.

**తల్లక్రిందు.** దే. విశ. తలక్రిందుయొక్కరూపాంతరము. "సీ. విటతాటనములుగావిటిగిచక్రములతోఁ దల్లక్రిందైనరథవ్రజములు." జై. ౨, ఆ.

**తల్లజము.** సం. వి. అ. పుం. వృత్తియందు ఉత్తరపదమై శ్రేష్ఠతనుదెలుపును. (ఉదా. కుమారీతల్లజము మొ.)

**తల్లడకుడుచు.** ద్వ. అ. క్రి. (తల్లడము+కుడుచు.) తల్లడించు.

**తల్లడపడు.** వై. అ. క్రి. (తల్లడము+పడు.) చలించు. "క. అనిమొనసాల్వుఁడుప్రద్యు, మ్ననిశాతశరాలివిద్ధమర్మ్ముండయ్యున్, ల్చనమూర్ఛవోయిపడియెన్, దనరథముపయిన్ధరిత్రితల్లడపడఁగన్." భార. అర. ౧, ఆ.

**తల్లడపాటు.** వై. అ. క్రి. తల్లడపడుట, చలనము.

**తల్లడపెట్టు.** ద్వ. స. క్రి. (తల్లడము+పెట్టు.) 1. చలింపఁజేయు; 2. బాధపెట్టు. "క. పెల్లుగఁదేల్లుంగాకులుఁ, దల్లడపెట్టంగనొఱలెదరునోరెండన్." మార్క. ౨, ఆ.

**తల్లడము.** వై. వి. చలనము. "ఉ. తామరపాకుపీరువలెఁదల్లడమందిరి పౌరులందఱున్." ఉ, హరి. 3, ఆ.

**తల్లడిల్లు.** వై. అ. క్రి. చలించు. "ఎ, గీ. వచ్చెనకులుఁడమితవాహినీపదహతిఁ, దల్లడిల్లుచుండధరణితలము." సం. "ఇంద్రప్రస్థంవివేశాథకంపయన్నివమేదినీమ్." భార. సభా. ౧, ఆ. (రూ. తల్లడిలు. "లతాంగినేత్రముల్చటులతలజ్జఁదల్లడిలె." స్వా. ౫, ఆ.) (తల్లడించు అనియు.)

**తల్లి.** ఉభ. దే. వి. జనని. విశ. 1. మొదటిది; 2. ముఖ్యము. (ఉదా. తల్లికొండ్ర, తల్లిగోడ మొ.) సం. ఈ. స్త్రీ. జేవరాలు.

**తల్లికొండ్ర.** దే. వి. మొదటికొండ్ర.

**తల్లిగోడ.** ద్వ. వి. ఇంటికి ముఖ్యమైన ప్రక్కగోడ.

**తల్లితల్లి.** దే. వి. 1. తల్లినిగన్నతల్లి; 2. లక్ష్మి.

**తల్లియొఱ.** దే. వి. నూతిపైయొఱ.

**తల్లివేరు.** దే. వి. ముఖ్యమైనవేరు.

**తవన.** దే. వి. కృష్టకాలము. "ఋతువుతవనతప్పెంచి." పర. ౨, ఆ.

**తవరము.** వై. వి. ఒక లోహము, తగరము.

**తవళి.** దే. వి. తవళి, అసత్యము.

**తవాయి.** దే. వి. (చూ.) తెల్లు, ఉపద్రవము, తప్పుగాళి.

**తవిఁద.** దే. వి. రాగిపైరు. "క. అఱవకుగం టెలవిఁదయు." (చూ. అఱవకు.) బ. అధాన్యము. (చూ. తవ్విఁద.)

**తవు.** దే. అ. క్రి. తగుయొక్క రూపాంతరము. (చూ. కవిల.)

**తవుఁకేపాము.** దే. వి. (తవుడు+పాము.) మలుఁగుచేఁప.

**తవుడు.** దే. వి. బియ్యముమీఁది పొట్టు, కంబూకము.

**తవులఁబడు.** ద్వ. అ. క్రి. తగులఁబడుయొక్క రూపాంతరము. "క. తవులంబడఁడెందుసత్యవద్ర బలమునన్." భార. ఉద్యో. ౨, ఆ.

**తవులు.** దే. అ. క్రి. స. క్రి. తగులుయొక్క రూపాంతరము. (చిక్కుటకు.—"క. భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి." భార. ఆర. ౧, ఆ.—సక్తమగుటకు.—"క. భవదీయబాహుపీఠిన్, దవిలిన భూదేవి." కా. ౫, ఆ.—తగులమునకు.—"చ. ఎందునుందవులోక యింతలేక సతతంబుఁజరించునముల్లసద్గతిన్." మార్క. ౨, ఆ.)

**తవులుకొను.** దే. అ. క్రి. స. క్రి. తగులుకొనుయొక్క రూపాంతరము. (ప్రే. తవులుకొలుపు. రగులుకొలుపుటకు.—"సీ. చతురస్రకలితవిస్తృతహోమకుండంబుఁ ద్రవ్వించి పావకుఁదవులు కొల్పి." జై. ౫, ఆ.)

**తవులుచు.** దే. ప్రే. తగులుచుయొక్క రూపాంతరము. (రూ. తవుల్చు.)

**తవులుపడు.** ద్వ. అ. క్రి. తగులువడుయొక్క రూపాంతరము.

**తవెల.** దే. వి. నోరు వెడల్పుగానుండు కుండవంటిలోహపాత్రము. "క. కమ్మనితావులుచల్లఁగఁ, గమ్మనియాజ్యంబుహాటకపుఁదవెలలఁ బోం, కమ్ముగవంచిరి." రా, వి. 3, ఆ.

**తవ్వ.** దే. వి. రెండు శోలలకొలఁదిగల మానవిశేషము.

**తవ్విఁద.** దే. వి. తవిఁదయొక్క రూపాంతరము. "క. ఉలవలు చామలుకోద్రవ, ములుకందులురాజమాషములునిష్పావం, బులు చణకంబులుదవ్విం, దలుజొన్నలుఁగాని కూర్పఁ దగుధాన్యంబుల్." జై. ౪, ఆ.

**తష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) బాడిసలోనగువానిచే చెక్కఁబడినది.

**తసి.** దే. వి. దట్టమగు నాఱువరుస, నడ.

**తసిలీబు.** హిం. వి. బహుమానము.

**తసుకు.** దే. అ. క్రి. ప్రేమకలిగినట్టు చేష్టించు. వి. 1. ప్రేమ గలిగినట్టుచేయు చేష్ట; 2. టక్కు.

**తసుకులాఁడి.** దే. విశే. (తసుకులు+ఆఁడి.) తసుకులుగలది.

**తస్కరించు.** సం. స. క్రి. దొంగిలించు.

**తస్కరుఁడు.** సం. వి. అ. పుం. దొంగ, చోరుఁడు.

**తస్స.** దే. వి. దుర్గంధము.

**తహతహ.** దే. వి. తమకము, వ్యసనము. (చూ.) కుతుకము. "క. ఉప్పరమెగసియజాండము, చిప్పలురాలంగమేరుశిఖరంబులపైఁ, గుప్పించిదాఁటుకొందునొ, తప్పకనామనసులోనితహతహతీఱన్." కాశీ. ౧, ఆ.

**తహతహపడు.** ద్వ. అ. క్రి. తమకపడు, వ్యసనపడు, కుతూహలపడు.

**తహతహపెట్టు.** దే. స. క్రి. తమకపఱచు, కుతూహలపఱచు. "క. తహతహపెట్టితిఁగానినుఁ, గుహనామృగవాంఛ." రామా. ౫, ఆ.

**తహశ్శీలు.** హిం. వి. పన్ను, సిస్తు.

**తహశ్శీలుదారు.** హిం. వి. సిస్తువ్యవహారముచూచు ఉద్యోగస్థుఁడు.

**తళతళ.** దే. వి. 1. మిఱుమిట్లుకొలుపుకాంతి; "సీ. అరుణాంబుజంబులయంతర్దళంబులతళతళలకుజిగిదళముకొల్పి." భార. ఉద్యో. ౨, ఆ.—2. మెఱయుటయందగు అనుకరణము. "క. పార్థునిపైన, గ్గలికనడరెఁదాటిసిడము, తళతళమనిమెఱయఁ గురుపితామహుఁ డధిపా." భార. భీష్మ. ౨, ఆ.

**తళిగ.** వై. వి. 1. భోజనపాత్రము; 2. భగవన్నివేదనార్హమైన యన్నము*.

**తళియ.** వై. వి. తళిగయొక్క రూపాంతరము. (భోజనపాత్రమునకు. — "ఎ, గీ. మీతళియపసాదంబుకల్మియునుజన్మ, పావనము గాదె." పర. 3, ఆ.)

**తళుకు.** దే. వి. మిక్కిలి ప్రకాశము.

**తళుకొత్తు.** దే. అ. క్రి. (తళుకు+ఒత్తు.) మిక్కిలి ప్రకాశించు. "క. చిత్తంబునఁబైకొనియెడు, నుత్తలమునడంచిముఖపయోరుహము నఁద,ళ్కొత్తెడువెడనవ్వున." భార. ఆర. 2, ఆ. (చూ. ఒత్తు.)

**తళుక్కు.** దే. వి. మెఱయుటయందగు అనుకరణము. (ఆమ్రేడితమునందు తళుకుతళుక్కు. "సీ. ఫాలభాగమునవజ్రాలపాపటబొట్టుతళుకుతళుక్కనితాండవింప." శశాం. 3, ఆ.) (చూ. గల్లు.)

**తళ్లు.** దే. వి. బ. చెఱువులోనగువానియందు గాలిచేత ఉబికి దరిని మోఁదెడు చినచిన్న అలలు. "సీ. తమమోములకునుల్కితగవ ణంకెడునట్లుతళ్లుకొట్టెడుసీటిటితమ్ములలర." య. 3, ఆ.

## తా.

**తా.** దే. స. తాను అనుదానికి ప్రాతిపదికము.

**తాండవము.** సం. వి. అ. పుం, న. 1. ఉద్ధతిమైన నృత్యము; 2. తృణవిశేషము.

**తాండవించు.** సం. అ. క్రి. ఉద్ధతముగా నృత్యముచేయు.

**తాండ్ర.** దే. వి. విభీతకము*.

**తాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) బడలినది.

**తాంతి.** సం. వి. ఇ. స్త్రీ. బడలిక.

**తాంత్రికుఁడు.** సం. వి. అ. పుం. 1. సిద్ధాంతమునెఱిఁగినవాఁడు; 2. విషవైద్యుఁడు.

**తాంబాళము.** దే. వి. తాంబూలము మొదలగునవి యుంచుకొనుటకు ఉపయోగమగు ఇత్తడిలోనగువానితోఁజేసిన పెద్దతట్ట.

**తాంబూలము.** సం. వి. అ. న. 1. వక్కాకు; 2. పోఁక.

**తాంబూలవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. తమలపాకుతీఁగ.

**తాంబూలి.** సం. వి. ఈ. స్త్రీ.——వై.——

**తాకత్తు.** హిం. వి. శక్తి, బలము.

**తాఁకించు.** దే. స. క్రి. శ్రమపఱచు. "క. అఁకొనివచ్చినవిప్రులఁ, దాఁకింపకయశనమిడుముతత్పరమతి." భో. ౬, ఆ.—ప్రే. తాఁకఁజేయు.

**తాకీదు.** హిం. వి. ఆజ్ఞాపత్రిక.

**తాఁకు.** దే. అ. క్రి. మార్కొను. "గీ. మనబలంబులుపాండుకుమారసైన్య, సమితితోఁదాఁకె." భార. భీష్మ, ౨, ఆ.—స. క్రి.

1. అంటు; 2. (యుద్ధమున) ముట్టు. "చ. తాఁకెనమ్మరుజవరుణ్ కుఱుందుపటుమార్గణసంపిహితాంబరంబుగాన్. క. తాఁకినఁబో గడుందగియెడు, వీఁకంబతిద్రోణుబాణవృతుఁజేయ." భార. ద్రో. ౧, ఆ.—వి. తాఁకుట. "ఆతఁడుదక్కనోరులుభీష్ముతాఁకోర్వరు." భార. ఉద్యో. ౪, ఆ.

తాఁకుడు. దే. వి. తాఁకుట, స్పర్శము. "క. అరుదెంచియటఁగ ముండెడి, యరుదెంచితాకుతాఁకుడై." సా. ౨, ఆ.

తాఁకుడువేఁకి. దే. వి. వరుసమేరకువచ్చెడు జ్వరము.

తాఁకుదల. దే. వి. (తాఁకు+తల.) యుద్ధప్రారంభము. "గీ. బంటులుత్సహించి పగఅపోయిరిపోయి, రచుఁగడఁగిబొబ్బలా స్ఫులెనఁగ, నతిరయముననడరునట్లుగదొరసము, ద్ధతియొనర్పవల యుఁదాఁకుదలల." భార. శాం. ౨, ఆ.

తాఁగలి. దే. వి. పల్లపుమడి.

తాఁచు. దే. స. క్రి. తన్ను. "ఎ, గీ. ఒడిసితలపట్టితిగిచిమహో గ్రవృత్తిఁ, గొంకుకొనరించుకయులేక కూలఁదాఁచె." సం. "అథైనాంపశ్యతోరాజ్ఞఃపాతయిత్వాపదావధీత్." భార విరా. ౨, ఆ.

తాజా. హిం. వి. క్రొత్త, చేర్చిన.

తాఁటు. దే. వి. 1. చెట్టు పైపట్టు; 2. మోసము. "ద్వి. ఒక్కరి పూఁట తాఁటలుచేసిధనముఁ, జక్కనఁగైకొనిజరగినపిదప." హరి శ్చ. ౨, భా.

తాఁటకత్తె. ద్వ. వి. మోసకత్తె. (చూ. లోట.)

తాఁటదమ్మఁడు. ద్వ. వి. జీవనార్థము సన్యాసివేషము ధరించిన వాఁడు, లింగి.

తాఁడి. దే. వి. తాండ్ర, విభీతకము*.

తాఁపు. దే. వి. తన్ను, పాదతాడనము. "చ. అనిమరలంగఁజూచు తెజిసద్ధళకంతుఁడు చండభానుసం, దనుకడకాలికై యొడియఁ దక్కపినాథుఁడుచాలదయ్యెనో, మునుపటితన్నుగొమ్మనుచుమో ములపైనొకతాఁపుతాఁచినన్, గినిసియతండుఁదైకుపకెఁగేసరికేసరి మీఁదికింబలెన్." రామా. ౭, ఆ.

తాఁబేలు. దే. వి. తాబేలు, కూర్మము.

తాకట్టు. దే. వి. (తాకు+కట్టు.) అప్పుతీసికొన్నవానియొద్దనుం చెడి యీడు.

తాకు. దే. వి. కాలిటాకు. "సీ. కారుమొనళ్లవాకట్టుమందులుచర ణాంగుళంబులఁదాకుటుంగరములు." పంచ. వేం. ౧, ఆ.

తాగడించు. దే. స. క్రి. (తాకు+గడించు.) నిర్బంధించు. "గీ. హరికి మామనగుదు నటమీఁదశ్రీదేవి, తండ్రి నూరకేల తాగడింప." భాగ. ౯, స్కం.

తాగాఁడి. దే. వి. (తాకు+కాఁడి.) జాతితోఁగాని, మ్రానితోఁగాని హంసపాదాకారముగా నూతిముఖమున నేర్పఱచెడు బంధనము, వీనాహము.

తాగాణి. దే. వి. తాగాఁడియొక్కరూపాంతరము.

తాగు. దే. స. క్రి. (నీళ్లులోనగునవి) త్రాగు.

తాగుఁబోతు. దే. విశే. నియతిలేక మద్యపానముచేయు స్వభా వముగలవాఁడు.

తాచు. వై. స. క్రి. 1. చెక్కు, ఖచించు; "సీ. చెలఁగుచు మంచిపచ్చలుదెచ్చిమేలేర్చి దట్టంబుగాఁగూర్చితాచితాచి." య. ౪, ఆ.—2. తొలుచు*; "సీ. పాథోధిజలయుక్తిఁబాఁచిపట్టినదిశా కరులునాఁ జకుమరకతపుఁగరులఁ, గరులలోఁడకుచిక్కఁగబళించి మ్రింగినహరులునాఁ దొండమొప్పగుఁదద్దు, హరులఁదాచినతొప లమరు." ఆము. ౧, ఆ.—3. అవలంబించు*. (చూ. అవలం బము.)

త్రాజు. దే. వి. కుప్పాయ.

తాటంకము. సం. వి. అ. పుం. దంతిఘములోనగువానిచేఁ జేయఁ బడిన చెవికమ్మ.

తాటాడూటము. దే. విశే. చక్కనతప్పినది. "క. తోఁటలు లెస్సయున్నవి, తాటాదూటలనులుగావు తాపసుఖుండన్, జెటలు." అప్ప. ౪, ఆ.

తాటించు. వై. స. క్రి. కొట్టు. (చూ. ఆస్ఫోటించు.)

తాటికపైడ. ద్వ. వి. తాటిగిజిపాము.

తాటిగిజిపాము. ద్వ. వి. తాటిచెట్టుమీఁదనుండెడిపాము.

తాటిపడగవాఁడు. ద్వ. వి. 1. బలరాముఁడు; 2. భీష్ముఁడు.

తాటిరిక్క. వై. వి. జ్యేష్ఠానక్షత్రము.

తాటిరిక్కనెల. ద్వ. వి. జ్యేష్ఠ మాసము.

తాటోటు. దే. వి. టక్కు, మోసము. "ద్వి. కాటుకకన్నీరు కరమునఁదుడిచి, తాటోటులెఱుఁగనిదానిచందమున." సా. ౪, భా.

తాడకు. సం. వి. ఆ. స్త్రీ. సుత్తె.

తాడనము. సం. వి. అ. న. కొట్టుట.

తాడించు. సం. స. క్రి. తాటించు, కొట్టు.

తాడితము. సం. విశే. (అ. ఆ. అ.) కొట్టఁబడినది.

తాడు. యు. దే. వి. త్రాడు. వై. తాటిచెట్టు. "గీ. తాళ్లుతెగ రావణాదిశాత్రవులయాంద్ర, తాళ్లుతెగునిట్లయనెడుచందమున." రామా. ౫, ఆ.

తాత. ఉభ. దే. వి. తండ్రికితండ్రి. వై. బ్రహ్మ. "క. సీతెఱఁగర యఁగఁదెమ్మెర, మేతఅవంగడపుతేఁడుమినుసీకవాఁడున్, దాతయు నాతనినాతియు, నేతురెయొక్కించుకైననిక్కవమొదవన్." అచ్చ. యు, కాం.—సం. అ. పుం. తండ్రి. విశే. కనికరింపఁదగినవాఁడు. (సంస్కృతిమైనపుడు దీనికి తెనుఁగునఁ బ్రయోగము కనఁబడదు.)

తాత్పర్యము. సం. వి. అ. న. అభిప్రాయము.

తాదృశము. సం. విశే. (అ. ఈ. అ.) అటువంటిది.

తానకము. వై. వి. 1. జెట్లు నిలుచుండుపీటయందలి భేదము; "వింతతానకంబులనిలిచికదిసినప్పుడు." భార. విరా. ౨, ఆ.—2. స్థానము*. "అంచకాఁపులకుఁదానకమై కడలుల్లసిల్ల." పారి. ఉ. ౬, ఆ.

తానము. ఉభ. వై. వి. 1. స్నానము; 2. స్థానము. "క. తానం బాడిమనీషివి, తానంబునకర్థమిచ్చి తానంతటనం, తానంబనఁదగి మగనం, తానంబుననతఁడుముదముతానంబయ్యెన్." రా, వి. ౨, ఆ.—సం. అ. పుం. తన్నకారముతో పాడెడుపాట.

తానవము. సం. వి. అ. న. తనుత్వము.

తాను. దే. స. తాశబ్దమునకు ప్రథమైకవచనము.

తాప. దే. వి. 1. నిచ్చెన; "కపిలునింగలపుఁజూపుసెకలంగలయు నానగరువంగడముమోక్షోత్తుంగమణిసౌధమునకున్ గడపుఁదాప." పా. ౨, ఆ.—2. మెట్టు. "వారిదేవతల్ దొలఁకులకేలఁదాపనిడి తోమఁగలంకడఁగెన్." ఆము. ౪, ఆ.

**తాపము.** సం. వి. అ. పుం. 1. సంతాపము; 2. బాధ. (తాపత్రయము.—ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము.)

**తాపసతరువు.** సం. వి. ఉ. పుం. గారచెట్టు.

**తాపసుఁడు.** సం. వి. అ. పుం. తపస్సుచేయువాఁడు, తపసి.

**తాపి.** యు. దే. వి. 1. మస్తము; 2. జోడ. వై. 1. బేలుదారి*; 2. బేలుదారి గోడపెట్టునపుడు గారను అడుసును ఎత్తివేసి జాళ్లను పెట్టి సరిపఱచెడు కొయ్యపిడివేసిన మట్టాకువంటి యినుపసాధన విశేషము*; 3. చెక్కు—తాపి.

**తాపించు.** వై. స. క్రి. 1. నెలకొలుపు, నిలుపు; "ద్వి. అబ్జాభమీధరంబు, నడిచక్కి-దేవతానగముఁదాపించి." విష్ణు. పూ. 3, ఆ.—2. చెక్కు; "క. సురుచిరపల్లవరుచిసుం, దరతనువగు సీతఁగదిసిదశముఖుఁజొప్పెక్, బఁగఁగఁగాంచనకాంచిక్, వెరవుగఁదాపించియున్న నీలముఁబోలెక్." రా. అర, కాం.—3. నోఁదు*. "క. తాపించెఘనదువదనముఁ, గూపెట్టఁగఁగాలకంఠుకొడుకు." కాశీ. 2, ఆ.

**తాపింఛము.** సం. వి. అ. పుం. చీఁకటిమ్రాను.

**తాపికత్తియ.** ద్వ. వి. సంధానముచేయునది. (రూ. తాపికత్తె. "చ. ఇలుగలనైనవెల్వడనియీ లువుటాంద్రకుఁదాపికత్తెవై." అము. ౫, ఆ.)

**తాపికాఁడు.** దే. వి. సంధానము చేయువాఁడు. "గీ. తానచోరులకునుదాపికాఁడైవేష, ధారిమిన్న కేనితపమునేయు, చున్నయట్లుపలుకకున్నవాఁడు." భార. ఆది. ౪, ఆ.

**తాపిత.** దే. వి. మేలైన పట్టువస్త్రము. "సీ. పచ్చతాపితదట్టిఁబసమించు పచ్చరాచిలుకక్రొంబిడివంకియలవరించి." చంద్రా. ౨, ఆ. (రూ. తాఫితా.)

**తాపితము.** సం. విశే. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడినది.

**తాపీ.** యు. వి. తాపియొక్క-రూపాంతరము.

**తాపు.** వై. స. క్రి. చెక్కు. "పెనుదుఃనికములుదాపినవెడందపాకమున." సిలా. ౧, ఆ.—వి. అవలంబము*. "ఎ, గీ. వీడుపాతాళములక్రిందియిఱుకుగొంది, కరిగితోయాత్తుడైయున్న ధరణిఁజూచి, మొగముఁదాపుగనిచ్చినిర్వుద్రశక్తి, గరిమగడలొత్తఁగానెత్తెఁగరుణఁబ్రభుఁడు." హరి. పూ. ౪, ఆ.

**తాబందు.** దే. వి. పావడ, గాగర.

**తాబేదారు.** హిం. వి. తక్కువపనివాఁడు.

**తామర.** వై. వి. తామరపువ్వు, కమలము. (చూ. తమ్మికంటి, తమ్మికెంపు, తమ్మిచూలి.)

**తామరచెలి.** ద్వ. వి. సూర్యుఁడు, పద్మమిత్రుఁడు. "సీ. చెలిమితోఁదామర చెలిపట్టెయనిచినచిఱునరంజీయొక్క-చెలువపూన." యు. ౧, ఆ.

**తామరతంపము.** ద్వ. వి. తామరతంపరయొక్క-రూపాంతరము.

**తామరతంపర.** ద్వ. వి. 1. తామరలసమూహము, కమలవంతము; 2. అభివృద్ధి. "తామరతంపరైనచెలులుఁజుట్టలుఁగలసి." భార. ఉద్యో. 3, ఆ.

**తామరతూపరి.** ద్వ. వి. (తామరతూపు+అరి.) మన్మథుఁడు.

**తామరపాకు.** ద్వ. వి. (తామర+ఆకు.) పద్మపత్రము. (చూ. తల్లాడము.)

**తామరసము.** సం. వి. అ. న. 1. తామర; 2. బంగారు; 3. రాగి.

**తామలకి.** సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక*.

**తామసము.** ఉభ. దే. వి. ఆలస్యము. "ఉ. నావుడుసత్యభామనిజనాథునకిట్లను నేలతామసం, బీవిబుధాధినాయకమహీరుహముం బెకలించిలోకనం, భావితమైననీపలుకుపంతముసెల్లమదీయగేహకేళీవనవాటివేడుకదలిర్పఁగనిల్పుము జీవితేశ్వరా." పా. ౪, ఆ.—సం. అ. పుం. పాము. విశే. తమోగుణముగలది.

**తామసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చీఁకటి; 2. పార్వతి.

**తామసించు.** దే. అ. క్రి. ఆలస్యముచేయు. "గీ. చెల్లదొక్కింతయునుదామసింపనిచట." జై. 3, ఆ.

**తామసుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) 1. తమోగుణముగలవాఁడు; 2. దుష్టుఁడు.

**తామిస్రము.** సం. వి. అ. న. 1. చీఁకటి; 2. చీఁకటిమయమయిన నరకము.

**తామేలు.** దే. వి. తాఁబేలుయొక్క-రూపాంతరము. (చూ. ఇంచు.)

**తామ్రకుట్టకుఁడు.** సం. వి. అ. పుం. రాగిపనివాఁడు, శాల్బకుఁడు.

**తామ్రచూడము.** సం. వి. అ. పుం. 1. కోడి; 2. అభినయహస్తవిశేషము.

**తామ్రపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకయేఱు; 2. పడమటిదిక్కునందుండెడు ఆఁడేనుఁగు.

**తామ్రము.** సం. వి. అ. న. రాగి. పుం. ఎఱుపు. విశే. ఎఱ్ఱనిది.

**తామ్రాక్షము.** సం. వి. అ. పుం. కోయిల. విశే. ఎఱ్ఱనికన్నులుగలది.

**తాయము.** దే. వి. అరుదగువస్తువు.

**తాయి.** వై. వి. తల్లి*. "సీ. కన్నబిడ్డలకేవఁగాందిశీకులఁబ్రోవ బంగారుతాయిమారంగశాయి." పాంచా. ౧, ఆ.

**తాయెతు.** ద్వ. వి. తాయెత్తుయొక్క-రూపాంతరము. "ఎ, గీ. ఇమ్ముగామేల్పసిండితాయెతులుమొల్ల, విరిసరుల్ దట్టముగఁజుట్టివేసినట్టి, యొరసిగమీఁదఁబైచెంగులునిచికట్టి, నట్టెబురుసారుమాల్ చౌయల్ బిట్టుదనర." రసి. ౧, ఆ.

**తాయెత్తు.** ద్వ. వి. (తాయి+ఎత్తు.) తల్లి బిడ్డలకుఁగట్టెడు రక్షాబంధము.

**తార.** ఉభ. దే. వి. సుషిరవాద్యవిశేషము. సం. ఆ. స్త్రీ. 1. బృహస్పతిభార్య; 2. వాలిభార్య. ఆ. స్త్రీ. ఆ. న. ము. 1. కనుగ్రుడ్డు; 2. నక్షత్రము.

**తారక.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. 1. కంటి నల్లగ్రుడ్డు; 2. నక్షత్రము. అ. న. ము. కన్ను.

**తారకజిత్తు.** సం. వి. త్. పుం. తారకాసురుని జయించినవాఁడు, కుమారస్వామి.

**తారకాణ.** దే. వి. దృష్టాంతము. (రూ. తారకాణము.)

**తారకాణించు.** దే స. క్రి. 1. దృష్టాంతపఱచు; 2. ఋజువులించు. "గీ. అనఘమతులార నన్నుఁజిత్రాంగియెదుట, మనిచి తారకాణించంగఁగనుకనిట్టి, కల్లనావల్లగోరంతగలిగనేని, యాజ్ఞకే నర్హుఁడనుజుమీయనియనుడును." సా. ౨, ఆ.

**తారకుఁడు.** సం. వి. అ. పుం. 1. మాలిమికాఁడు; 2. ఒకానొకరాక్షసుఁడు. విశే. దాఁటించువాఁడు.

**తారణ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విశే. తరింపఁజేయునది.

**తారతమ్యము.** సం. వి. అ. న. తరతమభావము, న్యూనాధిక్యము.

**తారము.** ఉభ. దే. వి. నాలుగుకాసులనాణెము. "సీ. అమరశైలముఁజన్నమంతగాఁవలపోసియిఃశాచలముఁదారమెత్తుచేసి." కా. ౫, ఆ.—సం. అ. న. వెండి. పుం. 1. పులుగడిగినముత్తెము; 2. ముత్తెముపులుగడుగుట. విశే. గట్టి. (మ్రోఁత.)

**తారసము.** దే. వి 1. సమీపము; 2. తలపాటు. "క. ఈరీతి నుభయబలములుఁ, దారసముఁబోరునెడ." జై. ౫, ఆ.—విశే. సమీపించినది. "చ. కటకరవంబుబోరుకలఁగఁగరమణుల్ తెరచీర వంచినన్, దటుకునరాజుమోమెదుటఁదారసమైన." సా౯. ౫, ఆ.

**తారసించు.** దే. అ. క్రి. తారసిల్లు.

**తారసిల్లు.** దే. అ. క్రి. 1. సమీపించు; 2. వ్యాపించు. (రూ. తారసిలు. సమీపించుటకు.—"ఉ. అత్తఱిరెండుసేనలురయంబునఁ దారసిలెంగడంకమై, నుత్తరదక్షిణార్ణవములొండొకటిన్వడిఁదాఁకె నోయనన్." కళా. ౭, ఆ.—వ్యాపించుటకు.—"సీ. తనకరారు ణరుచుల్ఘనలతాదులఁదారసిలినవ్యకిసలయావళులనింప." ఉ. రా. ౧, ఆ.)

**తారాడు.** దే. అ. క్రి. (తారి+ఆడు.) 1. తిరుగులాడు; 2. జీరాడు. "మ. అలపర్జన్యుఁడుకేకిపాత్రములగుంపాడించు చోమేఘమం, డలపున్మద్దెలగ్రుంగలేవనుమరున్మార్దంగికుండర్థినె, త్తలలిన్నేలకువ్రాలుచున్ నెగయుచుందారాడునత్తెల్లజ, ల్లులుఁ గెంగుచ్చులునయ్యెధారలునుదర్లోలేంద్రగోపంబులున్." ఆము. ౪, ఆ. (చూ. ఊఁగాడు.)

**తారాపథము.** సం. వి. అ. పుం. ఆకాశము, మిన్ను.

**తారాపీఁట.** ద్వ. వి. ఎద్దువెన్నుమీఁదవేసెడుపీఁట.

**తారి.** వై. వి. ఆటాడించెడు సూత్రధారి*.

**తారీఖు.** హిం. వి. ఆంగ్లేయమాసములో దినము.

**తారు.** దే. అ. క్రి. 1. సంచరించు; "సీ. కానలోఁదారుమృగంబులకైవడిఁ గ్రైౕనియసమాస్త్రకర్షకలన." రాఘ. ౧, ఆ.—2. పోవు; "అతనిజీవరేఖసౌదామనిపోలెనెచ్చటికిఁదారెడినో." వా. ౨, ఆ.—3. కదియు. "సీ. ఏవిహంగముఁగన్నసెలుఁగులిచ్చుచుసారెకునుసైకతంబులఁగూడఁదారు." సా౯. 3, ఆ.

**తారుకొను.** దే. స. క్రి. కదియు. (ప్రే. తారుకొలుపు. చూ. తార్కొను.)

**తారుచు.** దే. ప్రే. తారఁజేయు, కదియించు. (రూ. తార్చు.)

**తారుపు.** దే. వి. 1. తార్చుట; 2. బరణి. (చూ. తార్పు.)

**తారుణ్యము.** సం. వి. అ. న. యౌవనము, జవ్వనము.

**తారేయుఁడు.** సం. వి. అ. పుం. 1. అంగదుఁడు; 2. బుధుఁడు.

**తార్కాణ.** దే. వి. తారకాణయొక్కరూపాంతరము. "నీకిచ్చిన దేవివాక్యమునకున్ దార్కాణగా నామజన్మములన్ వింటిగదమ్మ." ప్రభా. 3, ఆ. (రూ. తార్కాణము.)

**తార్కాణించు.** దే. స. క్రి. తారకాణించుయొక్కరూపాంతరము. (దృష్టాంతపఱచుటకు.—"వ. తనతలంపుయథార్థంబగుట తార్కాణించె." ప్రభా. ౪, ఆ.)

**తార్కికుఁడు.** సం. వి. అ. పుం. తర్కశాస్త్రము తెలిసినవాఁడు.

**తార్కొను.** దే. స. క్రి. తారుకొనుయొక్కరూపాంతరము. "ధనవంతు గర్వంబు తార్కొనకేలుండు." పంచ. నా. ౧, ఆ. (ప్రే. తార్కొలుపు. "తదీయమూర్తివిభవధ్యానంబుగావించిచిత్తము సర్వాంగపుమన్ననక్రియలన్దార్కొల్పి." భాగ. ౪, స్కం.)

**తార్క్ష్యుఁడు.** సం. వి. అ. పుం. 1. గరుత్మంతుఁడు; 2. అనూరుఁడు.

**తార్పు.** దే. వి. తారుపుయొక్కరూపాంతరము. (బరణికి.—"గీ. కలువచెలిదొంగరాయిడికలుగునింక, ననుచుమునుమున్నపద్మినితన నికాన, ధనమునించినీటనిడుగాగితార్పుఁబోలెఁ, బశియెఁబడమటి కడలిలోఁబద్మహితుఁడు." రామా. ౨, ఆ.)

**తార్పులాడు.** దే. అ. క్రి. (తార్పులు+ఆడు.) (పెంపుడు పొట్టేలు కోడి మొదలగునవి) జగడమాడు. "గొఱ్ఱెపోతులన్ బెడఁగుగఁదార్పులాడఁగనుబెట్టు." భల్లా. 3, ఆ.

**తార్యము.** సం. విశే. (అ. ఆ. అ.) తరింపఁబడఁగినది.

**తాలు.** దే. అ. క్రి. 1. అడఁగు; "ఇలధప్రకటంబుమహీరుహాంబుపైఁదాలుతెఱంగుసేసె." ఉ, హరి. 3, ఆ—2. మఱుఁగుపడు. "సీ. నడనేర్పలేదాయెననుచుగాయుంచకుఁ దడవయ్యె నను చూఁదాఁదాఁటెనోకతె." య. ౫, ఆ.

**తాలుమాలు.** దే. వి. క్రమముతప్పుట, వ్యత్యాసము. విశే. క్రమముతప్పినది, వ్యస్తవ్యస్తము.

**తాలుమాలుపడు.** ద్వ. అ. క్రి. (తాలుమాలు + పడు) వ్యత్యస్తమగు.

**తాలకి.** సం. వి. ఈ. స్త్రీ. తాటికల్లు.

**తాలధ్వజుఁడు.** సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. భీష్ముఁడు.

**తాలపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. మురయనెడు గంధద్రవ్యము*.

**తాలము.** సం. వి. అ. న. హరిదళము. పుం. చాఁపఁబడిన బొటన వ్రేలి నడిమివ్రేలి నడిమికొలఁత.

**తాలాంకుఁడు.** సం. వి. అ. పుం. బలరాముఁడు.

**తాలి.** ఉభ. దే. వి. మంగళసూత్రము. "తాలివిభుండుగట్టిన మొదల్." పాండు. ౪, ఆ.—సం. ఈ. స్త్రీ. నేలయుసిరిక*.

**తాలించు.** దే. స. క్రి. (కూరమొదలగువాని) తిరుగఁబోయు.

**తాలింపు.** దే. వి. 1. తిరుగఁబోఁత; "వ. తాలింపులకమ్మని కంపు." కాశీ. ౨, ఆ.—2. తాలించినకూర. "మ. తిరువారాధనమిట్లొనర్చిధరణీదేవాన్వయశ్రేష్ఠుఁడా, హరికర్పించుటఁబావనంబులగుశాల్యన్నంబులన్నేతులన్, వరుగుల్ చేరులుపప్పులప్పడములన్దాలింపులన్బూపముల్, పరమాన్నంబులుఁబెట్టునెట్టన భుజింపన్దల్లికిన్దండ్రికిన్." పాండు. ౨, ఆ. (చూ. ఆరగింపు.)

**తాలిక.** దే. వి. పెలిక. "సీ. నడినెత్తిమస్తిపాలిడితాలికలొనర్చి కడలుకొల్పినగొప్ప జడలద్రిండు." శుక ౨, ఆ.

**తాలిబొట్టు.** ద్వ. వి. మంగళసూత్రపుబొట్టు.

**తాలిమి.** దే. వి. 1. క్షమ; 2. ధైర్యము. "క. పడఁతియెట్టట ప్రాణము, పిడికిటఁబెట్టుకొని నేఁడుప్రియుతోనీవె, ప్వాడుబలెఁ బలుకకయుంచుక, తడవుండుము మాకుఁగాను దాలిమితోడన్." కళా. ౭, ఆ.

**తాలిమికత్తె.** ద్వ. విశే. క్షమావంతురాలు.

**తాలిమికాఁడు.** దే. విశే. క్షమావంతుఁడు.

**తాలీశిన.** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక*.

**తాలీసపత్త్రము.** సం. వి. అ. న. 1. తాళిసపత్త్రి; 2. నేలయుసిరికతీఁ.

**తాలు.** దే. వి. ఎన్నుతీసి యెండిపోయినపైరు.

**తాలుచు.** దే. స. క్రి. 1. ధరించు; 2. (నూలు) పిరిపెట్టు; 3. తిరికలుచేయు; 4. దారములోనగువానిపేను; 5. పిండిలోనగువానియందు మెఱికలులోనగువానిని చేటతో తట్టియెత్తు. (చూ. తాల్చు. తిరికలుచేయుటకు.—"సీ. అనుకువెన్నెలఁదాల్చి తునిచినేవలుచేసి వెన్నెలపాలనుజున్నోనర్చి." య. ౨, ఆ.—దారములోనగువానిని పేనుటకు. — "గీ. ఎనఁగునంతౌపభరమున నిట్టునట్టుఁ, బొరలుళయ్యాతలఁబునఁబుష్పఁబోఁడి, తిప్పురువిరహానలంబునదివ్వెయెత్తఁ, జిత్తజాతుండువత్తిఁ దాల్చినవిధమున." ఉ, హరి. ౫, ఆ.)

**తాలువు.** సం. వి. ఉ. న. దవుడ, కాకుదము.

**తాలూకా.** హిం. వి. జిల్లాలో నొకభాగము.

**తాల్మి.** దే. వి. తాలిమియొక్కరూపాంతరము.

**తావకాళ్లు.** దే. వి. బ. (తావలము+కాళ్లు.) తలమెత్తువాఁడు కాళ్లుంచుకొనుటకు నమర్చినపట్టెలు. (తావకోళ్లు. అని కొందఱందురు.)

**తావకీనము.** సం. విశ. (అ. ఆ. అ.) నీది, త్వదీయము.

**తావడము.** దే. వి. రుద్రాక్షలులోనగునవిగ్రుచ్చినహారము. "ముత్తియంబులందావడముల్ఖచించినవిధంబున." నై. ౭, ఆ.

**తావరము.** వై. విశ. స్థిరమైనది.

**తావలము.** దే. వి. 1. స్థానము; "సీ. తావలంబైయొప్పునేవీడు కల్పపాదపకామధేనుచింతామణులకు." పు. ౧, ఆ. "ఉ. నావిని యింకనేమియుఖిసన్నణకోవిదనీకొకెంతయున్, దావలమెద్ది." (ఇక్కడ స్థానమనఁగా అవకాశమని యర్థము.) కళా. ౬, ఆ.—2. ఆధారము. "క. క్రమమున శిష్టాచార, క్రమమెఱుఁగఁగ ధర్మమునకుఁ గడువాటంబై, విమలంబగుచిత్తమున, త్వమునునహింసయును దనకుఁ దావలములగున్." భార. అర. ౫, ఆ.

**తావళము.** దే. వి. తావడముయొక్కరూపాంతరము. "మ. చైత్రుఁడిచ్చుబురుసాదట్టీలుముత్యాలతా, వళముల్వోలెఁదగుం జిగుళ్లుఁగలికావారమ్ములీరమ్ములన్." చంద్ర.

**తావి.** దే. వి. పరిమళము.

**తావిగట్టు.** ద్వి. వి. మలయపర్వతము. "తావిగట్టుకడసంద్రము లోపలిదీవి." య. ౨, ఆ. (ఇట్లు తావిగుబ్బలి మొ.)

**తావినూనె.** దే. వి. తావిగలనూనె, అత్తరు.

**తావిమోపరి.** దే. వి. గాలి, గంధవహుఁడు.

**తావివిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు.

**తావు.** దే. వి. తావలము, స్థానము, కాశిదము.

**తావుకొను.** దే. అ. క్రి. నెలకొను, నిలుచు. "ఉ. ఇద్దెనన్, దానుసహించియేమిగతిఁదావుకొనన్మెయిఁబ్రాణమర్జునా." భార. మా. ౧, ఆ.

**తావేలువేయుట.** హిం. క్రి. పోల్చిచూచుట, సంప్రతించుట.

**తాహతు.** హిం. వి. శక్తి, బలము.

**తాళకము.** సం. వి. అ. న. 1. పర్వతధాతువిశేషము; 2. హరిదళము; 3. తొగరిమన్ను; 4. చిన్నబీగము.

**తాళగించు.** వై. అ. క్రి. తాళమువేయు. "గీ. ఓర్తుకరతాళమొఱరింప నోర్తునమద, గీతిఁబచరింపజతిఁదాళగింపనోర్తు. మధుమదిరారసోల్లాసమత్తయగుచు, నాడెనొక్క తెలలితాంగి హరిగతుల." లక్ష్మి. ౨, ఆ.

**తాళగిరి.** వై. వి. తాళమువేయువాఁడు.

**తాళపత్త్రము.** సం. వి. అ. న. 1. తాటాకు; 2. చెవాకు.

**తాళము.** ఉభ. దే. వి. మల్లబంధవిశేషము. "క. పెలుకుఁజేతాళంబిమదిఁ, దలఁచియనువుగాక ధరణితలముఁగరపుటం, బులనప్పళించెవాఁడు, కొల్లలువారవ్వఁగవిడిచిమెఱసెఁగుంతీ సుతుఁడున్." భార. విరా. ౨, ఆ.—సం. అ. న. బీగము. పుం. 1. పాడునపుడు చేతులతో చఱచెడి చఱపు; 2. తాటిచెట్టు; 3. పరుఁజు; 4. పాడునపుడు జరగెడు కాలపరిమాణము; 5. తాళమువేసెడు కంచువాద్యము.

**తాళమూలిక.** సం. వి. ఆ. స్త్రీ. నేలతాడుతీఁ.

**తాళవృంతము.** సం. వి. అ. న. విసనకఱ్ఱ, వ్యజనము.

**తాళి** ఉభ. దే. వి. 1. పతకము; "వ. హృదయసదమండగుమదసునకుఁబొడముభీభత్సరసంబురుచిరవక్షస్థలంబునం దోఁచినవిధంబున నీలంపుతాళితళుకునంఘటింప." చంద్ర.—2. హారవిశేషము. "మ. రఘురామస్వామిస్వగ్రీవఁబా, యనివైడూర్యపుఁదాళిఁగైకొనితదీయగ్రీవనుంచెన్గృపన్." ఉ, రా. ౫, ఆ. (చూ. తాళీ.)—సం. ఈ. స్త్రీ: శ్రీతాళముతీఁ.

**తాళించు.** దే. స. క్రి. జూదమాడునపుడు క్రిందవేయుటకై పాచికలను చేతనుంచుకొని యటునటుత్రిప్పు. "వ. తాళించు పాచికలపోలిక." ఉ, హరి. 3, ఆ.

**తాళిక.** దే. వి. ఓర్పు, క్షమ. విశ. చాలినది, క్షమము.

**తాళిసపత్త్రిరి.** వై. వి. ఒకానొకమందుదినుసు. (రూ. తాళిసపత్త్రి.)

**తాళీ.** దే. వి. తాళియొక్కరూపాంతరము. (హారవిశేషమునకు.—"సీ. పుఱుఁగురాపచ్చబల్చిలుకతాళీయొక్కసుదతిపేరురమునఁగుదురుపఱప." రసి. ౧, ఆ. "ఎ, గీ. గొలుసులుంగరములు నురుగులునుబతక, ములునదాళీలునేవళంబులును." అన్వ. సుం, కాం.)

**తాళీకుఁడు.** దే. విశ. కార్యమును ముగించువాఁడు.

**తాళు.** దే. అ. క్రి. 1. తాళికయగు; (అది నాకంటికె తాళియుండలేదు. ఆ సొమ్ము నూఱు రూపాయలు తాళును.) 2. సహించు; "ద్వి. కరుణఁ, దాళిప్రోచుటమీకుధర్మమైయుండు." రా. కిష్కిం, కాం.—3. నిదానించు. (నీవు రెండు దినములు తాళిరా.)

**తాళుకొను.** దే. అ. క్రి. తాళు. (స్వార్థమున కొను.)

## తి.

**తింట.** దే. వి. తినుట, భుజించుట. "తరల. కులగురుండువసిష్ఠుఁడంతఖుకుక్షికుండెలుదింటలో, పలనెఱింగి." భాగ. ౯, స్కం.

**తిండి** దే వి. 1. భోజనము; 2. ఆహారము. "సీ. ఉపవాసములఁదద్దయుఁనగృశింపకమేనుతిండిచేఁ బోషించుచుండెనేని." హై. 3, ఆ.

**తిండికత్తియ.** ద్వి. విశ. మిక్కిలి తినునట్టి స్వభావముగలది, భక్షకురాలు. (రూ. తిండికత్తె.)

**తిండికాఁడు.** దే. విశ. మిక్కిలి తినునట్టి స్వభావముగలవాఁడు, భక్షకుఁడు.

**తిండిపోతు.** దే. విశే. తిండికాఁడు, తిండికత్తె.

**తిండీఁడు.** దే. విశే. (తిండి+ఈఁడు.) తిండికాఁడు.

**తింత్రిణీ.** సం. వి. ఈ. స్త్రీ. చింతచెట్టు. (రూ. తింతిడి.)

**తింత్రిణీకము.** సం. వి. అ. న. చింతపండు. (రూ. తింతిడీకము.)

**తిందుకము.** సం. వి. అ. పుం. తుమ్మికి[?].

**తికమక.** దే. వి. 1. కలఁత; "చ. తికమకగాఁగఁజేసినలుదిక్కుల నాక్ఫటిసేయుసారమే, యకములఁజెల్లికొట్టిన బుమాడుచునొక్క వరాహమేగె." సా. ౧, ఆ.–2. తొట్రుపాటు; (చూ. తికమకగొను.)–3. అంగములయొక్క అస్వాధీనత. "ఎ, గీ. ఉవిదపిండు క్రోడనవవిమానముతోడఁ, దనదువిద్యతోడధరణిఁద్రెళ్లి, తిరిగిలేవలేకతికమకగుడువంగ." భాగ. ౬, స్కం.

**తికమకగొను.** దే. అ. క్రి. (తికమక+కొను.) తొట్రుపడు; "క. ఒకమొకముగాకదివిజులు, తికమకగొనివైరులెల్లదీకొనితమ్ముఁ, బకపకనగవకవకలై, లుకలుకఁబరువెత్తిరోడిలోఁగొనుభీతిన్." భాగ. ౬, స్కం.–2. (అంగములయొక్క) అస్వాధీనతను పొందు (చూ. తికమక.)

**తికమకలాడు.** దే. అ. క్రి. (తికమకలు+ఆడు.) 1. తొట్రుపడు; (చూ. తికమకగొను.)–2. (అంగములయొక్క) అస్వాధీనతను పొందు. (చూ. తికమక.)

**తిక్క.** దే. వి. పిచ్చి, ఉన్మాదము. (త్రిక్కయొక్కరూపాంతరము.)

**తిక్కగొను.** దే. అ. క్రి. (తిక్క+కొను.) వెఱ్ఱెత్తు.

**తిక్కటమక్కట.** దే. వి. కలఁత, క్షోభము.

**తిక్కడి.** దే. వి. నూలువడికెడు చిప్పకదురు.

**తిక్కణిక.** సం. వి. ఆ. స్త్రీ. ఇటికపగడము.

**తిక్త.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి[?]. అ. న. ము. చేఁతిపొట్ల[?]. పుం. చేఁదు. విశే. చేఁదైనది.

**తిక్తశాకము.** సం. వి. అ. పుం. 1. ఉలిమిరి[?]; 2. చేంద్ర[?].

**తిగ.** వై. న. మూఁడు, త్రికము.

**తిగకంటి.** ద్వి. వి. (తిగ+కన్ను.) శివుఁడు, త్ర్యంబకుఁడు. "సీ. పగలింటికడనాడుతిగకంటియొకిమీనిగడితంపునిడువాలుజడలనంగ." అచ్చ. అ, కాం.

**తిగపంచే.** ద్వి. న. నాలుగు, చతుష్కము.

**తిగియు.** దే. స. క్రి. తివియు, ఆకర్షించు.

**తిగుచు.** దే. స. క్రి.———పై.——— "క. స్రోతోవేగముపటుగతి, వీతబలుందిగుచునట్లువిషయములీడ్చ్చున్, జేతోబలసంభృతయో, గాతిశయుఁడుగానివానినంచితచరితా." భార. శాం. ౫, ఆ.

**తిగ్మము.** సం. వి. అ. న. వేఁడిమి. విశే. వేఁడిమికలది.

**తిట్ట.** దే. వి. రాశి. "మ. తలలంజేతులఁగాళ్లులన్దనువులన్ధాత్రిస్థలిన్బెక్కుతి, ట్టలుగావించి." భార. ద్రో. ౫, ఆ. ("గీ. అప్పుడేపడంగియున్నిసేనలుభీష్మ, రథముపొంతకొదిఁగెరౌద్రరసవి, నోదియైనయర్జునుఁడుధనుశ్చాలన, దీప్తమూర్తియగుచుఁదిట్టకుఁజికె." (ఇక్కడ తిట్ట అనఁగా బలముల తిట్ట అని యెఱుంగునది.) భార. విరా. ౫, ఆ.)

**తిట్టాట.** దే. వి. తిట్టాడుట. "క. తిట్టాటలంకుమ్ముచ్చిమి, యిట్టివివాదములచోటనెవ్వరికైనన్, నెట్టనసాక్షిగఁగొనఁజను, నట్టియెడన్సాక్షిగుణములరయరుపెద్దల్." విజ్ఞా. వ్య, కాం.

**తిట్టాడు.** దే. స. క్రి. (తిట్టు+ఆడు.) తిట్టు. (స్వార్థముక ఆడు.) (చూ. తిట్టాట.)

**తిట్టు.** దే. స. క్రి. 1. శపించు; "ఉ. అవిధినుండునంతటనొక పృషుసునిన్నుఁ జూచుచోమణి, గ్రీవునిపేరుదోఁచె మదికిన్మణికంధర యేకదేశసా, మ్యావగుణంబుచేఁదనినాఁడనియన్నను మద్దిచెట్లుగా, దైవశమానితిట్టినవిధంబుమనంబునఁబాఱెనంతటన్." కళా. ౪, ఆ.–2. నిందించు. "చుట్టంబులుఁజెలులుందిట్టరె." భాగ. ఉద్యో. 3, ఆ.–వి. 1. శాపము; "గీ. అతండు, తత్పదద్వంద్వమునకువందనమొనర్చి, తపసితిట్టునఁ బ్లవమయ్యెఁదక్షణంబ." పాండు. ౫. ఆ.–2. నింద. "ఎ, గీ. జగము, చేతఁదిట్టులు పడునట్లుచేసిపోయితేల." భార. ఉద్యో. ౧, ఆ.

**తిట్టువడు.** ద్వ అ. క్రి. (తిట్టు+పడు.) నిందింపఁబడు.

**తిట్టువాటు.** ద్వి. వి. (తిట్టువడుట.) నింద. "ద్వి. ఆలిఁగోల్పడిపోయియక్కటామగుడఁ, చేలేఁడితండన తిట్టువాటునకు, వెఱచితెచ్చితిఁగానివెలఁదినిన్నొల్ల." రా. యు, కాం.

**తిడిమ్మి.** దే. వి. రథముపాఱునప్పటి మ్రోఁతయందగు ధ్వన్యనుకరణము. (రూ. తిడిమి.) "క. పొడవులకునింగిచాలని, కడమకు బలెఁబుడమికిందిగంబడుసెమ్ముల్, పిడుగులు ద్రవ్వఁగవెడలెన్, దిడిమితిడిమ్ములు సెలంగఁదేరులువాఱన్." రామా. ౮, ఆ.

**తితఉవు.** సం. వి. ఉ. పుం, న. జల్లెడ.

**తితిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. క్షాంతి, ఓర్పు.

**తితిక్షువు.** సం. విశే. ఉ. క్షమించునట్టి స్వభావముగలవాఁడు, ఓర్పరి.

**తిత్తి.** వై. వి. 1. ఒలిచికొలిమియూఁదుటకు అనువుగా నేర్పఱచిన మేఁకతోలు; (కొలిమితిత్తి.) 2. మృగములతోలు*; "వ. వాఁడు లగుకత్తులందిత్తులొలిచి." స్వా. ౪, ఆ.–3. ఒలిచినుతిపోయుట కేర్పఱచినతోలు*; (తిత్తిపోయుము.) 4. ఒలిచిసారాయికొనిపోవుటకు అనువుగానేర్పఱచిన మేఁకతోలు*; (సారాయితిత్తి.) 5. తోలుసంచి*; (కత్తులతిత్తి.) 6. సంచి*. (వక్కాకుతిత్తి.)

**తిత్తికాఁడు.** వై. విశే. తిత్తిపోయువాఁడు.

**తిత్తిరి.** సం. వి. ఇ. పుం. తీతువుపిట్ట.

**తిథి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. పాడ్యమిలోనగునది; (శుక్లపక్షము మొదలనుండి క్రమముగా ఐదేసి తిథులు నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణయను నామములు కలవియగును.). 2. శ్రాద్ధదినము.

**తినాసము.** వై. వి. నెమ్మి, తినిశము[?].

**తినిశము.** సం. వి. అ. పుం. తినాసము[?].

**తిను.** దే. స. క్రి. భుజించు.

**తినుకు.** దే. అ. క్రి. ముక్కిముక్కి విష్ఠించు. వి. ముక్కిముక్కి విష్ఠించుట.

**తిన్న.** దే. విశే. 1. మనోజ్ఞము; "సీ. కస్తూరికాతిలకంబునెన్నొసలిపైఁ దిన్నగాఁ గొనగోట దిద్దిదిద్ది." శేష. ౪, ఆ.–2. యుక్తము; "బుధరక్షతిన్నగాఁబూనువారు." పాండు. ౨, ఆ.–3. స్వస్థము; "ద్వి. కన్నులు తెఱవకుగ్రసమాధిఁబూని, తిన్నగాఁబదివేలదివ్యవర్షములు, తపముగావించె." విష్ణు. పూ. 3, ఆ.–4. ఋజువు; (నీవు ఈ దారిని తిన్నగాపొమ్ము ఊరు అగపడును.) 5. సామ్యము. "క. నాపలుకుఁదొట్టి యాగ్రహ, దీపితుఁడగుటుడిగిమదికిఁదిన్నఁదనమునీ, వాపాదింపుముచలమును, గోపముఁ గ్రౌర్యంబువిడువుగుణరత్ననిధీ." భార. సా. ౧, ఆ.

**తిన్నన.** దే. ఇ. 1. మనోజ్ఞత; 2. యుక్తత; 3. స్వస్థత; 4. సౌమ్యత; 5. ఋజుభావము. (విశేషణమగుచో "తిన్నని యెఱుఁగు." పాండు. 3, ఆ. "తిన్ననియుపాయము." భార. విరా. ౨, ఆ. మొ. చూ. తిన్న, అలకన.)

**తిన్నియ.** దే. వి. తిన్నె. "సీ. తిన్నియలలికిముత్తియపుమ్రుగ్గులు వెట్టి పసిఁడిగోడలరంగుఁబనులువ్రాసి." అచ్చ. అ, కాం.

**తిన్నె.** దే. వి. అరఁగు, వేదిక. (తిన్నియయొక్కరూపాంతరము.)

**తిపురుకట్టు.** దే. అ. క్రి. వ్యాపించు. "ద్వి. తాటంకవజ్రాంశుదాళధళ్యములు, తేటచెక్కులమీఁదఁదిపురుకట్టఁగను." విష్ణు. ఉ. ౪, ఆ.

**తిప్ప.** వై. వి. 1. చిన్నకొండ*; 2. కొండ*; "తిప్పబిడారుం ద్రిప్పనిచేరుఁగ." య. ౨, ఆ.—3. దిబ్బ*. "బలుకప్రంపుట సంటికప్పురపుఁదిప్పల్." వసు. ౧, ఆ.

**తిప్పకాయ.** దే. విణ. ఆకతాయ.

**తిప్పఁతీగ.** దే. వి. గుడూచి†.

**తిప్పతిమ్మిరి.** ద్వ. వి. కోఁతి, అగచరము. "గీ. తిప్పతిమ్మరినా డెల్లఁ దిరిరిప్రోవుము." అచ్చ. కిష్కిం, కాం.

**తిప్పతెల్లు.** ద్వ. వి. ఇత్కుకము†.

**తిబిరి.** దే. వి. మాఱుపాటు. (వాఁడు ఈ పనిలో కొంచెము తిబిరి చేసినాఁడు.) విణ. అల్పము. "సీ. మత్స్యోదరమ్యు మావుపెన్నె అకఁగుట్టినయోటితిబిరిదండెయునుమెఱయ." ఆము. ౬, ఆ.

**తిబ్బి.** దే. వి. ముందటికి కుట్టుపోనిచ్చుచు వెనుకకు మరలించి మరలించికుట్టెడు గట్టికుట్టు. (దీనికి డిబ్బియనికూడ వాడుకకలదు.)

**తిమి.** సం. వి. ఇ. పుం. నూఱుయోజనముల పొడువుగలచేఁప.

**తిమింగిలము.** సం. వి. అ. పుం. తిమినిమ్రింగెడుచేఁప.

**తిమితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆర్ద్రము, తడిసినది.

**తిమిరము.** సం. వి. అ. న. 1. చీఁకటి; 2. నేత్రరోగవిశేషము.

**తిమిరి.** దే. వి. తిమ్మిరియొక్కరూపాంతరము.

**తిమిరిమీను.** ద్వ. వి. ఒకదినుసుచేఁప.

**తిమురు.** దే. అ. క్రి. 1. త్వరపడు; "క. రమణీజనంబుకల్యాణమువాడఁబవిత్రతూర్యనాదములెసఁగఁగ, ముముహూర్తమైనవేళ్లలఁ, దిమురువఘూవరులనడిమితెరయెత్తుటయుఁ." కవిక. 3, ఆ.—2. ఉద్రేకించు; "ద్వి. భ్రమసియచ్చటిమునిప్రవరులువడఁకఁ, దిమిరిదండము కేలఁద్రిప్పుచులేచి." హరిశ్చ. ౧, భా.—3. ఒళ్లువిఱుచు; 4. గర్వించు. వి. 1. తిమ్మిరి; 2. గర్వము. "క. తమి యెల్లఁదీర్చితమప్రియ, తముఁడగురాజస్తమింపఁదఁడెగొనివచ్చెఁ, దిమురునఁజండప్రభుఁడని, కుముదంబులుమోముమోడ్చికుముదము లయ్యెఁ." రసి. ౫, ఆ.

**తిమురుకొను.** దే. అ. క్రి. ఆగ్రహముతో పెనఁగులాడి వదలించుకొను. (నేను పట్టితిని వాఁడు తిమురుకొనిపోయినాఁడు.)

**తిమ్మ.** దే. విణ. స్వస్థము. (చూ. తిమ్మవడు.)

**తిమ్మఁడు.** దే. వి. (తిరుమల+ఁడు.) కోఁతి, వానరము.

**తిమ్మదియ్యము.** దే. వి. (తిమ్మ+తియ్యము.) రత్యుత్పత్తి.

**తిమ్మన.** దే. వి. స్వస్థత. (చూ. తిమ్మవడు, అలకన.)

**తిమ్మనము.** వై. వి. మజ్జిగపులుసు.

**తిమ్మప్పఁడు.** ద్వ. వి. (తిరుమల+అప్పఁడు.) వేంకటేశ్వరస్వామి. "కొండమీఁదితిమ్మప్పనివంటికావ్యపతియబ్బుటయబ్బురము." రా, వి. ౧, ఆ. (రూ. తిమ్మప్ప.)

**తిమ్మవడు.** ద్వ. అ. క్రి. (తిమ్మ+పడు.) స్వస్థపడు, సేదదేఱు. "సీ. ఇనవంశమణితమ్ముఁడునుదానుబడలికల్ దీర్చికూర్చుండిరితిమ్మవడియె, బలమెల్ల." రామా. ౭, ఆ.

**తిమ్మిరి.** దే. వి. స్పర్శముతెలియని వ్యాధివిశేషము.

**తిమ్ము.** దే. స క్రి. దీవించు. (నేను వానిని తిట్టనులేదు, తిమ్మనులేదు.) (దీనికి ప్రత్యేక ప్రయోగములేదు.)

**తియ్య.** దే. విణ. మధురము. ("సీ. తమతియ్యపలుకులు ప్రమదరాగాంబుధిఁదనరారుమవ్వంపుఁదరఁగలనఁగ." (ఇక్కడ మధురము అనఁగా వినఁదగినది అని యర్థము.) లక్ష్మీ. ౧, ఆ. "సీ. కలికి పల్కులుతియ్యకపురంపుఁబలుకులు పాలఁతిచూపులునిల్చిపొదలు మెఱపులు." (ఇక్కడ మధురమనఁగా వాసనగలది అని యర్థము.) చంద్ర.)

**తియ్యఁబోఁడి.** దే. వి. (తియ్య+పోఁడి.) 1. చెఱుకువలెమనోజ్ఞురాలగు ఆఁడుది; "శా. ద్రోవదఁ, తియ్యంబోఁడివరింపఁగా వసుధకేతేఁజూచునాదిత్యులో." పాంచా. 3, ఆ.—2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

**తియ్యకంద.** మి. వి. కసరులేనికంద†.

**తియ్యగూర.** ద్వ. వి. (తియ్య+కూర.) పులుసుచేరని కమ్మగూర. "వ. చేరులుఁదియ్యగూరలుఁబచ్చడులుబజ్జులు." కాశీ. ౭, ఆ.

**తియ్యదానిమ్మ.** ద్వ. వి. తియ్యనివిత్తులుగల దానిమ్మ†.

**తియ్యన.** దే. వి. తియ్యఁదనము, మాధుర్యము. (విశేషణమగుచో తియ్యనిపలుకులు మొ. చూ. అలకన.)

**తియ్యనిమ్మ.** దే. వి. కమ్మనిమ్మ, శర్కరాంకము†.

**తియ్యమామిడి.** దే. వి. సహకారము†.

**తియ్యము.** దే. వి. 1. ప్రియవచనము, సాంత్వనము; "తియ్యములేనిచాగమును." ఉ, హరి. ౫, ఆ.—2. ప్రియము. "గీ. నా కునిఁ, దెలపనేలపలుకుఁదియ్యమేల." భార. అర. ౬, ఆ.

**తియ్యమునగ.** ద్వ. వి. ఎఱ్ఱమునగ, మధుశిగ్రువు†.

**తియ్యమ్రాను.** దే. వి. చెఱకు, ఇత్కువు†.

**తియ్యవిలుకాఁడు.** దే. వి. మన్మథుడు, స్వాదుధన్వుఁడు. "ఎ, గీ. తియ్యవిలుకానివిడివడ్డదీమమనఁగ." విక్ర. ౭, ఆ. (రూ. తియ్యవిల్కాఁడు. ఇట్లు తియ్యవిలుతుఁడు.)

**తిరపడు.** వై. అ. క్రి. (తిరము+పడు.) స్థిరపడు, కుదురుకొను. "చ. గరుడునిడిగ్గవిడ్కొలిపికంసవిరోధిపురంబులోపలఁ, దిరపడిదారకుంబనిచితేరలపాటుగఁదేరనెక్కి." ఉ, హరి. 3, ఆ.

**తిరము.** వై. విణ. స్థిరము. "క. అరిగరమునసేఁదాల్చిన, నరిగరమునగేంద్రధీరుఁడైనంజెడఁడే, యరిదిరమైనన్నడుగుల, యరిదిరమై కాభిలాషులగునృపతులకుఁ." ఉ, హరి. ౪, ఆ.

**తిరశ్చీనము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డముగాఁ బోవునది.

**తిరస్కరించు.** సం. స. క్రి. అనాదరముచేయు, తెగడు.

**తిరస్కరిణి.** సం. వి. ఈ. స్త్రీ. తెరచీర, ప్రతిసీర.

**తిరస్కారము.** సం. వి. అ. పుం. అనాదరము, తెగడిక.

**తిరస్కృతము.** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది, తెగడఁబడినది.

**తిరస్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. తిరస్కారము.

**తిరస్తు.** దే. వి. సప్తాంగములలో నొకటి, రాష్ట్రము.

**తిరి.** దే. వి. 1. జట; "ఉ. ఈబసుమంబుకప్పుర మెయీతిరివేణియె పట్టుచీరలే, యీబిరుసైనవల్కలము లీతపమిష్టమనోజభోగమే." ఉ, నా. 3, ఆ.—2. సుడి. "నిమ్ననాభులుతిరులయ్యె." కవిక. ౪, ఆ.

**తిరిక.** దే. వి. మెలిక.

**తిరిగివచ్చు.** దే. అ. క్రి. ప్రదక్షిణమగు. "గీ. తండ్రిపనుపున నంతబుధరణియెల్లఁ, దిరిగిరాఁద్రవ్వి." హరి. పూ. ౨, ఆ.—స. క్రి. పరివేష్టించు. "క. కనియక్కైలాసతటం, బుననమరులు తమవిమానములుడిగ్గిజనా, ర్దనుఁదిరిగివచ్చికొలువఁగఁ, గనువిచ్చె నతండునియమగతిసెల్లుటయుఁ." ఉ, హరి. ౨, ఆ.

**తిరితీపులాడు.** దే. అ. క్రి. (తిరితీపులు+ఆడు.) పెనఁగులాడు. "ద్వి. తిట్టివారునుదానుఁదిరితీపులాడి." హరిశ్చ. ౨, భా.

**తిరిపగాఁడు.** దే. వి. (తిరిపము+కాఁడు.) భిక్షుకుఁడు.

**తిరిపగొట్టు.** దే. విశే. (తిరిపము+గొట్టు.) విరక్తుఁడుకాక భిక్షమెత్తువాఁడు.

**తిరిపము.** దే. వి. భిక్షము. "క. సరినెలఁతలెన్నియేనియుఁ, దెరుఁవులధనమునుగడించి తెచ్చుకొనఁగనో, తరళాక్షియొక్కదాసరి, తిరిపపుబాఁపనికివలచితిరుగుటతగునే." పర. 3, ఆ.—విశే. భిక్షుకుఁడు. "సీ. కడఁదిరిపంబవైకాంతయుసీవును దేశంబులందెల్లఁదిరిగి తిరిగి." కవిక. ౪, ఆ (వృత్తియందు మువర్ణలోపము. "ఎ, గీ. తిరిపజోగిఁదగునెదేవ్రుఁడనఁగ." వీర. ౧, ఆ. మొ.)

**తిరిపరి.** దే. విశే. (తిరిపము+అరి.) తిరిపగాఁడు. "క. ఇదిధర్మం బకులీనుల, కిదివిధిమాతాపితృప్రహీనులకహహా, యిదికట్టడతిరిపరులకు; నెదిరిందనునెఱుఁగకునికికేలామాటల్." కాశీ. ౨, ఆ.

**తిరియు.** దే. స. క్రి. భిక్షమెత్తు, భిక్షించు. "బంధులురాజుదేవులుఁదిరియుదురింక." సం. "హతపుత్రౌతుశోచామిగాంధారీం పితరంచతే, భిక్షుకౌవిచరిష్యేతేశోచంతౌపృథివీమిమామ్." భార. సౌ. ౧, ఆ.

**తిరిపడు.** ద్వ. అ. క్రి. (తిరి+పడు.) కలఁతపడు.

**తిరిపెట్టు.** దే. స. క్రి. (తిరి+పెట్టు.) కలఁతపఱచు. "వనటతిరిపెట్టఁ." భార. స్త్రీ. ౨, ఆ.

**తిరీటము.** సం. వి. అ. న. కిరీటము. పుం. లొద్దుగు.

**తిరు.** దే. విశే. శ్రీప్రదము. (తిరునామము, తిరుమేను మొ.)

**తిరుఁడు.** వై. విశే. స్థిరుఁడు.

**తిరుకాపు.** దే. వి. భగవంతునియొక్క అలంకారము. "వ. రంగనాయకునినమారాధకులుతదారాధనంబునకువచ్చి తిరుకాపులువుచ్చి క్రమంబునంబంచపాత్రవిమర్శనంబుసేయుచు." పర. 3, ఆ

**తిరుకొలను.** దే వి. పుష్కరిణి. "క. తిరుకొలనునూయిలోటయుఁ, జెఱువుమడువు." హంస. ౪, ఆ.

**తిరుగఁబడు.** ద్వ. అ. క్రి. (తిరుగన్+పడు.) 1. ఎదిరించు; (నాతో వాఁడు తిరుగఁబడ్డాఁడు.) 2. తిరుగు; "క. కడునంభ్రమమునఁదిరుగం, బడియెదరిదియేమితెలుఁగుపండుపు." హరి. పూ. ౭, ఆ.—3. మరలు; "గీ. దానివినియునునపుడురాధాసుతుండు, తిరుగఁబడనిమనంబుతోధీరవృత్తిఁ, దల్లికిట్లను." భార. ఉద్యో. ౪, ఆ.—4. విపరీతమగు. "క. ఏవిధిసుఖదముదుఃఖద, మ్మైవెనదుఃఖదము సుఖదమ్మైతిరుగఁబడుఁ." లక్ష్మీ. ౪, ఆ. (సావర్ణమున పడు.)

**తిరుగఁబోఁత.** దే. వి. తిరుగఁబోయుట, తొలింపు. "క. క్రొంబొంగపుఁగూరవగతిరు, గంబోఁతల." రా. వి. 3, ఆ.

**తిరుగఁబోయు.** దే. అ. క్రి. (తిరుగన్+పోయు.) తొలించు.

**తిరుగడ.** ద్వ. వి. (తిరుగు+గడ.) మఱపెట్టినగొట్టము.

**తిరుగలి.** దే. వి. (తిరుగు+కలు.) 1. పిండిమొదలైనవి విసరెడు శిలాయంత్రము, ఘరట్టము; 2. (తిరుగు+కలి.) భ్రమము. "క. అనిగద్గదకంఠంబున, వినిపించినఁ గుంభి తాను వికవికనగుచున్, గనుతిరుగలిగాకాసతి, మనపెట్టినచోటలేక మఱి యెందరిగన్." భో. ౪, ఆ. (ఈ యర్థమునందు 'కలి' భావార్థమునందు వచ్చిన ప్రత్యయము.)

**తిరుగాడు.** దే. అ. క్రి. (తిరుగు+ఆడు.) తిరుగు, సంచరించు. "అనిమిషరాట్సుతుండుతిరుగాడెడుసేనలతోడ." జై. ౮, ఆ. (రూ. తిరుగులాడు.)

**తిరుగు.** దే. అ. క్రి. 1. సంచరించు; "సీ. శివగణసమితిలో సేనానిశౌర్యంబుమెచ్చకతిరిగెడుమేటులార." ఉ, హరి. ౬, ఆ.—2. పరిభ్రమించు; "నేలదిర్దిరందిరిగె." భార. ఆర. ౪, ఆ.—3. వెనుకకుమరలు; "క. సుతులునమరమునఁదిరుగక, మృతులైసద్గతికిఁజనినమేలిమియస్మ, స్మతిఁదలఁచివరముత్కృ్రచ, రితమనియప్పనికివగవఁబ్రీతియకలుగుఁ." భార. ఆశ్ర. ౧, ఆ.—4. మరలవచ్చు. "వ. తృతీయంబైనద్వాపరయుగంబు తిరుగుసమయంబున." భాగ. ౧, స్కం. (వానికి వయసుతిరిగినది.)—స. క్రి. పరివేష్టించు. "క. చుట్టంబులుఁజెలులుందనుఁ, జుట్టుఁదిరిగియుండ." నై. ౨, ఆ.—వి. తిరుగుట. "క. తలముచ్చట్టులుదిరిగినఁ, దలపోయఁగనోరిలోనిదయకడియన్న, ట్టిలనేతిరుగులుతిరిగినఁ, గలుగదుగతివిష్ణుసేవఁగానించుకయుఁ." పాండు. ౪, ఆ.

**తిరుగుఁబోతు.** దే. విశే. (తిరుగు+పోతు.) తిరుగునట్టి స్వభావముగలవాఁడు, తిరుగునట్టి స్వభావముగలది.

**తిరుగుడు.** దే. వి. 1. తిరుగుట, భ్రమణము; 2. మాఱుపాటు; (అందులో ఒక తిరుగుడు ఉన్నది చూచినారా.) 3. మఱ; 4. చక్రము. "ఎ, గీ. సరకుసేయదుతిరుగుళ్లఁజోమపిఱుఁదు." హంస. ౪, ఆ.

**తిరుగుడుచీల.** దే. వి. తిరుగుడునొక్కులుగలచీల, మఱ.

**తిరుగుడుత్రాఁడు.** దే. వి. పక్షులనుబట్టెడుసాధనవిశేషము. "ద్వి. తిరుగుడుత్రాళ్లనుదెఱఁగొప్పఁగట్టి." నళ. 3, భా.

**తిరుగుడునొక్కు.** దే వి. తిరుగుడు, మఱ.

**తిరుగుడుపడు.** ద్వ. అ. క్రి. పరిభ్రమించు.

**తిరుగుడుపాటు.** ద్వ. వి. తిరుగుడుపడుట. "నాకముదెగ్గలంబునన్ దిరుగుడుపాటుఁజెప్పిన." నిర్వ. 3, ఆ.

**తిరుగుడుబిల్ల.** దే. వి. స్త్రీల శిరోభూషణవిశేషము.

**తిరుగుదల.** దే. వి. మరలుట, నివర్తనము.

**తిరుగుమొగము.** ద్వ. విశే. 1. అభిముఖము; (వ్యాధి కొంచెము తిరుగుమొగముగానున్నది.) 2. విముఖము. "గీ. ఉచితనేపథ్యయుతలయ్యునురగసతులు, నిఘ్ననిజమాళిమణిఘృణివిఘ్నలబ్ధి, సభికసంకేతములకురేలరిగియరిగి, తిరుగుమొగమైనచిక్షులతెరువులివిర." పాండు. ౨, ఆ.

**తిరుగువాఱు.** దే. స. క్రి. (తిరుగు+పాఱు.) పరివేష్టించు. "ఎ, గీ. శరభశంబుననాపుట్టఁదిరుగువాఱి." పంచ. నా. ౧, ఆ.

**తిరుచిన్నము.** ద్వ. వి. సన్నగాళె.

**తిరుచూర్ణము.** వి. ౧. పసుపుబియ్యముచేర్చి చేసి వైష్ణవులు నొసటనుంచుకొనెడుపొడి. "భవళోర్ధ్వపుండ్రములయందుఁగ నుక్కెతిరుచూర్ణమొప్ప." పర. 3, ఆ.

**తిరుచు.** దే. స. క్రి. తిరియుయొక్క రూపాంతరము.

**తిరునాళ్లు.** దే. వి. దేవోత్సవము. "తెప్పతిరునాళ్లరా." ఆము. ౨, ఆ.

**తిరునీఱు.** దే. వి. శైవులు నొసట నుంచుకొనెడు గోమయపిండ భస్మము.

**తిరుపగూడ.** దే. వి. (తిరు+గూడ.) వైష్ణవులు తిరుమణిపెట్టె మొదలైనవి యుంచి చేంకను దగిలించుకొనెడు తాటాకులబుట్ట. "ఒకచంకఁదిరుపగూడ." పాంచా ౧, ఆ. (ఇది తామరపాకు వంటిది.)

**తిరుపతి.** దే వి. విష్ణుక్షేత్రము. "గీ. వినుమతల్లినూటయెనిమిదితిరుపతు, లందునెన్నవేంకటాచలంబు, రంగధామమునుగరంబునన్న తిఁగాంచు, గ్రహములందుశశియురవియుఁబోలె." పర. ౪, ఆ.

**తిరుపు.** దే. వి. తిరుగుట. (చూ. తిరుపులుగట్టు. ఇది విఱుపు వంటిది.)

**తిరుపులుగట్టు.** దే. అ. క్రి. (తిరుపులు+కట్టు.) వ్యాపించు. "చ. మరునిరిదూపురూపుపవమాపురాయారపుచూపురూరెలకా. దిరుపులుగట్టు." పంచ. వేం. ౪, ఆ.

**తిరుమజ్జనము.** మి. వి. భగవంతుని యభిషేకము. "తనుఁబ్రశస్తహముకా దిరుమజ్జనంపుసేవనలరఁజేయువాని." పర. 3, ఆ.

**తిరుమణి.** ద్వి. వి. (తిరు+మన్ను.) వైష్ణవులు నొసటనుంచుకొనెడు ధవళమృత్తిక. "క. నడుముక్కుమోవఁదీర్చిన, కడుఁదోరపుఁదిరుమణియునుఁగావివలువ్రజో, ప్పడఁగంఠంబునఁదిరుమణి, వడమునుబధరియించివైష్ణవవుచేషముతోకా." పర. 3, ఆ.

**తిరుమణివడము.** మి. వి. తామరపూసలదండ. (చూ. తిరుమణి.)

**తిరుమన్ను.** ద్వి. వి. తిరుమణి. "ఎ, గీ. పట్టెతిరుమన్నుబెదరు కెంపుట్టుచూపు." ఆము. ౬, ఆ.

**తిరుమల.** ద్వి. వి. వేంకటాచలము. "క. ధరఁగలతిరుపతులొక్కడ, వరుసకొనిముకుందమూర్తివర్గమునతఁడ, చ్చెరువుగనుతించెనెడ నెడఁ, దిరుమలదేవరనుదిరిగితిరిగిపొగడుచుకా." పర. ౨, ఆ.

**తిరుమాళిగ.** ద్వి. వి. (వైష్ణవపరిభాషయందు) గృహము. "క. జననాయకుఁడంతటనతి, వినయతఁదిరుమాళిగలకువేంచేసెదరో, యనిశేల్మొగుచువైష్ణవ, జనులకావీక్షించిపిచనియెజలకంబునకుకా." పర. 3, ఆ.

**తిరుముడి.** దే. వి. వైష్ణవుఁడు. "గీ. అట్లుపెండ్లియాడి యాత్రపురికినేగి, మామకిచ్చినట్టిమాటపట్టు, తప్పకనుదినంబుఁ దనిపె వైష్ణవనహ, స్రమునభీష్టభోజనములచేత. క. అనుదినమువేయు తిరుముడి, కినిమృష్టాన్నముల నారగింపులిడకయా, యనఘుజయింపఁదుమున్నుగఁ, దనవనిశయుఁ దానునెట్టి తాళ్వర్యంబో." పర. ౪, ఆ.

**తిరువడికోల.** దే. వి. దాసరివాని దీపస్తంభము. "వ. తోరంపుఁ దిరువడికోలల రంధ్రగోళంబుల." ఆము. ౪, ఆ.

**తిరువరంగములు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము.

**తిరువారాధనము.** మి. వి. (తిరు+ఆరాధనము.) (వైష్ణవపరిభాషయందు) దేవతార్చన. (చూ. తాలింపు.)

**తిరువు.** దే. అ. క్రి. స. క్రి. వి. తిరుగుయొక్క రూపాంతరము.

**తిరోధానము.** సం. వి. అ. న. మఱుఁగుపాటు.

**తిరోభావము.** సం. వి. అ. పుం. మఱుఁగుపడుట.

**తిరోహితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మఱుఁగుపడినవాఁడు.

**తిర్గు.** దే. అ. క్రి. స. క్రి. వి. తిరుగుయొక్క రూపాంతరము. (చూ. దిరదిర.)

**తిర్యక్కు.** సం. విణ. (చ్. ఈ. చ్.) అడ్డముగాఁబోవునది.

**తిలికి.** దే. వి. మత్స్యవిశేషము.

**తిల్లి.** దే. వి. బుట్టవలె తాటియీనలతోనల్లిన మత్స్యగ్రహణ సాధన విశేషము. (చూ. అడ్డకొడమ.)

**తిల్లిగొట్టు.** దే. విణ. (చూ.) తిరిపగొట్టు.

**తిలకము.** సం. వి. అ. న. 1. సౌవర్చలమనెడియుప్పు; 2. కడుపులో కుడిప్రక్కనుండెడు ఎఱ్ఱనిమాంసము, నీరుతిత్తి. (అని కొందఱు.) పుం, న. బొట్టు. పుం. 1. నల్లగుఱ్ఱము; 2. పుట్టుమచ్చ; 3. బొట్టుగుచెట్టు; (దీనికి దోహదక్రియ వీక్షణము.) 4. పొట్లచెట్టు. విణ. శ్రేష్ఠము.

**తిలకాలకము.** సం. వి. అ. పుం. పుట్టుమచ్చ.

**తిలకించు.** దే. అ. క్రి. 1. ప్రకాశించు; "చ. సురుచిరపానపాత్రమున సుందరియొక్కతెకేలనిండుచం, దురుఁడుప్రకంపితాంగకముతోఁదిలకించెఁదదానినాంబుజ, స్ఫురితవికాసవైభవముసొంపులడంకువముచ్చిలింపఁజె, చ్చెరఁజనుదెంచిపట్టువడిచేడ్పడిభీతివడంకుచాడ్పునకా." లక్ష్మీ. 3, ఆ. — 2. ప్రసన్నత నొందు. "క. అత్తలకుమ్రొక్కితక్కటి, క్రొత్తడులందఱకుఁబ్రియముకొనలునిగుడఁగా, నత్తటిఁ దిలకించె." హరి. ఉ. ౪, ఆ. "తిలకించిచూడదుతిలకతరుపు." విక్ర. ౧, ఆ. — స. క్రి. చూచు. "క. పొనఁగకా, బలుకఁగనేర్తుగదాయని, చిలుకందిలకించిప్రియముచిలుకంబలికెకా." విక్ర. ౭, ఆ. (ఈ యర్థము ఆదికవుల ప్రయోగములందు కానఁబడదు.)

**తిలఘాతకుఁడు.** సం. వి. అ. పుం. గాండ్లవాఁడు.

**తిలతండులన్యాయము.** సం. వి. అ. పుం. నువ్వులును, బియ్యమును గలసినవిధము.

**తిలతండులము.** సం. వి. అ. న. ఆలింగనవిశేషము.

**తిలపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. న్. పుం. రక్తచందనము.

**తిలపేజము.** సం. వి. అ. పుం. పొల్లనువ్వులు. (రూ. తిలపింజము.)

**తిలయంత్రము.** సం. వి. అ. న. గానుఁగ.

**తిలలు.** సం. వి. అ. పుం. బ. నువ్వులు. (ఇది సంస్కృతమున నిత్యబహువచనాంతముకాదు.)

**తిలిత్సము.** సం. వి. అ. పుం. కొండచిలువ. (రూ. తిలిత్సము.)

**తిల్యము.** సం. విణ. (అ. ఆ. అ.) తిలలుపండునది. (పొలము.)

**తిల్వము.** సం. వి. అ. పుం. లొద్దుగు, లొద్రుచెట్టు.

**తివ.** వై. స. తిగయొక్క రూపాంతరము. "క. తివిరికరవాలుసేకొని, ఆవలవలెనఁగంగసత్తెఆవపైఁజనుచోఁ, దివజడలరేయిద్రిమ్మరి, వుఫుఁబోఁడియొకర్తునెయ్యమునసడ్డంబై." అచ్చ. సుం, కాం.

**తివాసి.** వై. వి. మేలైన చిత్రాసనము. "చ. విరితొగచందువాతెగల వేడుకయానడియంకణంబులోఁ, బఱచినరత్నకంబళిని బాగగుసూరెపుటంపుగద్దియకా, వలువమెఱుంగుబంగరపువన్నెజగాజురు సాతివాసిపై, ధరణిజతోవసించెఁబతితక్కతళాడలఁజేతులూను

చుఁడా." ఉ, రా. ౬, ఆ. (చూ. తివాసి.) ("రగడ. గొప్పలగు పోకల్లకనిచేకొంటిమివెకట్టాణివూసలు, చెప్పఁజూపఁగరాదుమక్కుమఱిమఱిగుజరీతివాసులు." శుక. ౧, ఆ. ఈ ప్రయోగముచేత అకారాంతముగాను నేర్పడుచున్నది. "నగాసుతివాసుపై" ఈ ప్రయోగముచేత ఉకారాంతముగా నేర్పడుచున్నది.)

**తివియు.** దే. స. క్రి. తిగియుయొక్క రూపాంతరము. (చూ. అలవి.)

**తివుచు.** దే. స. క్రి. తిగుచుయొక్క రూపాంతరము. "క. రవిస్పృశమించునువర్ణము, రవియమగుడఁగిరణతతులరసమంటయుఁదాఁ, దివుచును." భార. శాం. ౬, ఆ.

**తివుట.** దే. వి. కోరిక. "ఊఱటచెయ్యివలందివుటలూరఁగ." హరి. ఉ. 2, ఆ.

**తివ్రరు.** యు. దే. స. క్రి. కోరు. "గీ. ఏమికారణమునసింద్రుఁ ఖాండవమగ్ని, దేవుఁడట్లుకాల్పఁదివిరె." సం. "కిమర్థంభగవానగ్నిఃఖాండవందగ్ధుమిచ్ఛతి." భారం. ఆది. ౮, ఆ.—వై. అ. క్రి. 1. త్వరపడు*; "క. తివిరియభోజ్యంబగుమా, నవమాంసము తోడభోజనముపెట్టినవాఁడవు" భార. ఆది. 2, ఆ.—2. కుతూహలపడు*; "క. తివిరిసుతజన్మమెన్నం, డవునొకొదేవరునికరుణనుచునునవప, ల్లవకోమలాంగియంబిక, ధవళేక్షణవిమలశయనతలముననున్నన్." భార. ఆది. ౪, ఆ.—3. యత్నించు*; "సీ. తివిరిసరస్వతీతీరంబునందునిశ్చింతుఁడైతపముప్పఁజేయుచున్న, యాదధీచికడకుసరిగివేఁడుండు." భార. అర. 3, ఆ.—4. మ్రోఁగు*; "దేవదుందుభివ్రాతంబుదివిరె." భార. ఉద్యో. ౪, ఆ.—5. కోపపడు*. "తివిరితీక్ష్ణక్షత్రకులభూమినివహములకు." హరిశ్చ. 3, ఆ. (కడపటి యర్థమునకు ఆ ప్రయోగ మొక్కటే కానఁబడుచున్నది.)

**తిష్యఫల.** సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక*.

**తిష్యము.** సం. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము; 2. పుష్యమాసము; 3. కలియుగము.

## తీ.

**తీ.** వై. స. వృత్తియందు తిగశబ్దమునకగు ఆదేశము. (తీవంచ.)

**తీంట్రము.** దే. వి. తీఁట, దురద, కండూయ.

**తీంద్ర.** దే. వి. 1. ప్రకాశము; (చూ. తీండ్రించు.)—2. వేఁడిమి; "గీ. అతివపూర్ణేందుభీతిఁదదక్షశాలఁ, దెండియతడందునినుమడితీండ్రఁదోఁప, మింటిపైనుంటకాదనియింటిపైకిఁ, దెచ్చుకొంటిననుంచుఁబెకఁజెచ్చవెడలు." ఆము. ౫, ఆ.—3. తేజము; "ఎ, గీ. అరుణకిరణసహస్రాభమభ్రగంబు, నగువిమానంబుపై నెక్కినిగమశర్మ, తీండ్రఁబుంద్రేక్షుకోదండుతండ్రిఁబోలి, పరమధామంబునకుఁబోవుపథమునందు." పాండు. 3, ఆ.—4. చుఱుకు, చొరవ. "శా. మదికాదీండ్రల్గల్గినవారికేకరణినేనికావిద్యరాకుండునే." స్వా. ౫, ఆ. "సీ. సురలుబంతులుసాఁగిసుధమిథస్సువ్యూహఁద్రావుతీండ్రఁదేఁటులుపూవుఁదేనెలాన." పాండు. ౨, ఆ.

**తీండ్రము.** దే విశే. తీక్ష్ణము, ప్రచండము "క. తీండ్రమగు రోషమునమీ, తండ్రినిమిత్తమునఁజక్రిదారుణమూర్తిన్, వేండ్రము విడువఁడుమెల్లనఁ, దండ్రీశీతలునిఁజేసిదయసేయఁగదే." భాగ. 2, స్కం.

**తీండ్రించు.** దే అ. క్రి. 1. ప్రకాశించు; "వ. తీండ్రించు శశిమండలంబునవెడలు శిశిరకిరణప్రణాళికామిళదమృతరసస్రావంబునంజేసి." స్వా. ౬, ఆ.—2. జ్వలించు. "సీ. చంద్రనివ్వులుఁబోలెఁదీండ్రించుకనుమించు తెరఁగనొంటి పైనెక్కఁజాఱు." స్వా. ౪, ఆ. (తీండ్రించుయొక్క రూపాంతరము.)

**తీఁగ.** వై. వి. 1. లత; "ఎ, గీ. కన్నెక్రొక్కాఱుమెఱుఁగుఁదీఁగయునుబోలె." నై. 3, ఆ.—2. స్త్రీలుమెడనుధరించెడు బంగారుపట్టెడ*; "ఉ. శోణితలేంద్రుఁజూడ నొకకొమ్మవడింబఱతెంచెనుల్లస, ద్వేణిధరంబుతోమొగవుతీఁగవలగ్నమునందమర్చియు, ద్రాణముతీఁగఁగానిడి మెడకావలగో సడిచాలమిన్గొనల్, పాణులనుండఁగొను మజెబాగుగఁగానుకపట్టుకైవడిన్." కళా. ౭, ఆ.—3. మొలనూలు*. "ఉ. కట్టిరిసన్నపుందనపుఁగావిఁగటిసెటిమేటితీఁగపై, నొట్టిరి." విక్ర. ౪, ఆ.—4. వీణమొదలగు వానితంతి*.

**తీఁగఁబోఁడి.** ద్వ. వి. (తీఁగ+బోఁడి.) 1. తీఁగవలె మనోజ్ఞాంగులగు ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. తీవఁబోఁడి.) (చూ. అలరుఁబోఁడి.)

**తీఁగకానుగు.** ద్వ. వి. మర్కటి*.

**తీఁగగట్టిక.** ద్వ. వి. నిడుపుగట్టిక, గాడాలి*.

**తీఁగజోజి.** వై. వి. ఒకదినుసుజోజి*.

**తీఁగతుమడి.** ద్వ. వి. దీర్ఘమూలక*.

**తీఁగపాల.** ద్వ. వి. క్షీరావి*.

**తీఁగబచ్చలి.** ద్వ. వి. కలంబి*.

**తీఁగమల్లి** గ. వై. వి. 1. మల్లికావిశేషము; 2. బ. ధాన్యవిశేషము. (చూ. కుసుమ.)

**తీఁగమల్లె.** వై. వి. తీఁగమల్లియొక్క రూపాంతరము. (ధాన్యవిశేషమునకు.—"సీ. బలుతీఁగమల్లెలుపార్జించితిమిచాలఁ గుసుమముల్ చులుకగాఁగూర్పలేమె." కవి. ౧, ఆ.)

**తీఁగమెఱుఁగు.** ద్వ. వి. 1. ఉఱుములేని మెఱపు; 2. ప్రొద్దుతిరుగుడుచెట్టు.

**తీఁగమోడి.** ద్వ. వి. వ్రాఁతపని.

**తీఁగయిల్లు.** ద్వ. వి. (తీఁగ+ఇల్లు.) పొదరిల్లు, నికుంజము.

**తీఁగయెలుఁగు.** ద్వ. వి. (తీఁగ+ఎలుఁగు.) హీనస్వరము. "ద్వి. అనితీఁగయెలుఁగునసాకోమలాంగి, లసనాథుఁబేర్కొనితానేడ్చుకొనుచు." నళ. ౪, భా.

**తీఁగలువాఱు.** ద్వ. అ. క్రి. (తీఁగలు+పాఱు.) వ్యాపించు. "ఉ. తీఁగలువాఱుపార్శ్వగతదృష్టిఁదగన్గలయంగఁజూచినన్." కవిక. ౬, ఆ.

**తీఁగవిలుకాఁడు.** ద్వ. వి. మన్మథుఁడు. (ఇట్లు తీఁగవిలుతుఁడు.)

**తీఁగసరులు.** వై. వి. బ. ధాన్యవిశేషము. (రూ. తీవసరులు. "ఎ, గీ. తెల్లనల్లచెన్నంగులుదీవసరులు." హంస. ౪, ఆ.)

**తీఁగసాఁగు.** ద్వ. వి. (తీఁగ+సాఁగు.) వర్ధిల్లు. "తీఁగసాఁగనవ్వు." (ఇక్కడ తీఁగసాఁగన్ అనఁగా దీర్ఘముగాననుట.) వి, పు. ౬, ఆ.

**తీఁగియ.** వై. వి. 1. తీఁగయొక్క రూపాంతరము. (లతకు.—"ఎ, గీ. అలరుఁదీఁగియతోనుద్దియయినయట్టి, కొమ్మనెమ్మనువలపులుగొలుపుటరుదె." కవి. ౧, ఆ.) (చూ. తీఁగ.)

**తీఁగె.** వై. వి. తీఁగియయొక్క రూపాంతరము. (లతకు.—"చ. కలువలపేరుపేరుకొనఁగాఁగుముదమ్ములు మన్మథాంబకం, బులుగను తింపఁగాఁగమలముల్ కమలంబులపుట్టుపూర్వముల్, తెలియఁగ

బంకజాసనుఁడు గాఁ దేఁకసు... సుమనంగుఁడు, గుబుచవలమ్ము వెన్నె యుసఖమై... బోలెనెచ్చనే." అని. ౫, ౭.)

**తేఁట.** దే. ౨. 1. ఒకవిధమైన గజ్జి; 2. దురద. "చేతులతేఁట నోవమైఁదేఁటలుపుచ్చి." రా. యు, కాం.

**తేఁటకసెంద.** దే. ౨. తేఁటకసివెందయొక్క రూపాంతరము.

**తేఁటకసివెంద.** దే. ౨. తేగడిదూల, కచ్చురీ.

**తేఁటకోవెల.** దే. ౨.——పై.——

**తేఁడిరెంచు.** దే. అ. క్రి. ప్రకాశించు. "ఎ, గీ. త్రిభువనస్థానపతియైనదివసకరుని, ప్రాక్పతీహారపాలుండుప్రాచినోసలె, ఘృగాలీలాంబుధిమంబుబసరుబాపు, తేరిసారథియజ్ఞసైతేఁడిరించె." కాశీ. 3, అ. (చూ. తీండ్రించు.)

**తేఁపురము.** దే. ౨. ఆగడము. "క. దాఁపురములేక నీక్రియఁ, గాఁపురములుసేయుచున్నగరిశలలోనఁ, తేఁపురములువాత్రుర్తురె, కాఁపులనీవంటివారిఁగానవెతులువా." పంచ. వేం. ౪, అ.

**తీక్ష్ణకంటక.** సం. ౨. ఆ. స్త్రీ. కంచారిమొక్క.

**తీక్ష్ణగంధ.** సం. ౨. ఆ. స్త్రీ. 1. ఓమము; 2. నల్లావలు. అ. పుం. ము. 1. మునగ; 2. పెద్దతుమ్మి; 3. నెరసంద.

**తీక్ష్ణతుండము.** సం. ౨. అ. పుం. మశకము, దోమ.

**తీక్ష్ణము.** సం. ౨. అ. న. 1. వేఁడిమి; 2. విషము; 3. పోరు; 4. ఇందుప్పు; 5. ఇనుము. పుం. గాజుప్పు. విణ. 1. చేదు కైనది; 2. వాఁడియైనది.

**తీఁడు.** దే. స. క్రి. వాఁడిచేయు. "గీ. బరుసుకరసానఁదీడినపంది పోట్లు, భూరి భుజవీరములయందుఁ బొందుపఱచి." పంచ. వేం. ౨, ఆ.

**తీతువు.** వై. ౨. తిత్తిరిపక్షి.

**తీఁతెరగా.** హిం. క్రి. విణ తొరుమారుగా, ఆరుమూడు.

**తీనియ.** దే. ౨. తిన్నియయొక్క మొదటిరూపము. "సీ. పూని పాఁపజగంబుబోరియదొచ్చివెడంద తీనియ యలవర్చి దానియందు." అచ్చ. యు, కాం.

**తీనె.** దే. ౨. తీనియయొక్క రూపాంతరము.

**తీపారు.** దే. అ. క్రి. (తీపు+ఆరు.) మనోజ్ఞమగు. "తెలి నవ్వుల్ వెలిదమ్మినెమ్మొగములన్ దీపార." హరి. పూ. ౭, ఆ.

**తీపి.** దే. ౨. 1. ఒక రసము, మాధుర్యము; (చూ. రసము.) 2. ఇచ్ఛ. "క. ముదియనిబిరెంపుచిక్కను, బ్రదికెడి తీపియను విషయ పక్షిస్పృహయుక్." భాగ. ౯, స్కం.—విణ. మధురము.

**తీపు.** దే. ౨. 1. మాధుర్యము; 2. యాతన. "సీ. తెల్లగుర్లములు తేలగిల్లితీపులువుట్టి దోపములాపొందుగఁదొట్టగిల్ల." కవిక. ౫, ఆ.—విణ. మధురము. (చూ. తీపి.)

**తీపుఁద్రాడు.** దే. ౨. (తీపు+త్రాడు.) వేఁటాడుటకుఁదగినసాధన విశేషము. "వ. ఉరులునురిగోలలుబోనులుఁజిక్కంబులుబిరుసుఁ గండెలుఁదీపుఁద్రాళ్లునొడిత్రాళ్లుఁదలములుఁగొని." కాశీ. 3, ఆ.

**తీయ.** దే. విణ. తియ్యయొక్క మొదటిరూపము.

**తీయన.** దే. ౨. తియ్యనయొక్క మొదటిరూపము. "ఉ. ఆయమ రాచలంబుధనువై విలుసిల్లిఁగ విష్ణువమ్ముగా, వేయువిధంబులంబరిధ విల్లైడుశింజినిఁగూర్చినట్టిశూ, లాయుధునొక్కమాత్రమున నం గము భ్రయ్యఁగమోదిమించితో, దీయనివింటనేవెనుకతీయనిబీర మునకా మనోభవా." చిత్రభారతము. (చూ. తియ్యన.)

**తీయము.** దే. ౨. తియ్యముయొక్క మొదటిరూపము. (ప్రయము కు.—"క. వీయనువారికినిట్టుద, వీయముగానుండి వచ్చువిపుల శ్రమముర్, దీయనుదంబొనరిచికడుఁ, దీయముగనుసింపఁగా యుతిర్ష్టుఁడనియెన్." విజ. 3, ఆ.)

**తీయు.** దే. అ. క్రి. 1. తొలఁగు; (చూ. తీయము.) 2. కృశించు; (నొప్పిచేత వాని దేహము మిక్కిలి తీసినది.) 3. తగ్గు. (చెఱువులో నీళ్లు తీసినవి.) స. క్రి. 1. ఈడ్చు; "సీ. కదిసితోముని గారుగఱచివెంబడిఁదీయుఁదినితోడనెవేఁదెరువుకట్టు." చంద్రా. ౨, ఆ.—2. కొను; (వానివద్ద వేయు లంచము తీసినాఁడు.) 3. వెలయిచ్చికొను; (ఈ గుఱ్ఱమును వేయు ఇన్నూటయూపాయలకు తీసినాఁడు.) (ఇది తెనుఁగుదేశమునందీయర్థమున వాడఁబడదు.) 4. వేయు. "క. గానిలియప్పులవారలు, తీసినకొట్టులనగలవె." పారిజా. ౪, ఆ.

**తీరము.** సం. ౨. అ. న. 1. దరి; 2. తగరము.

**తీరు.** దే. అ. క్రి. 1. చెక్కఁబడు; "ఉ. తీరినతత్తడిక్ జవగతిక్ బుటసుల్ దుమికించుచాడ్పునక్, దీరనితత్తడిక్ జవగతిక్ బుటసుల్ దుమికించువాఁగెబెం, పారభిగించిపైకుబికియుబ్బురమంది వయాళివేళన, య్యారెబలంబుభాటిబళియాలివయంచువజీరులెం చఁగన్." చంద్రా. ౨, ఆ. ("ద్వి. ఓరిసీగర్వోక్తులుబ్బున మదముఁ, దీరెనేయనుచుఁగద్దించివాఁడపుడు." (ఇందు నరించు అనునర్థమున లఘురేఫము కానఁబడుచున్నది. ఈ గ్రంథమునందు ప్రక్షిప్తవాక్యములు అనేకములుండుటవలన ఇది యీ కవిప్రయుక్తమనియు, సాధువనియు నమ్ముటకు అవకాశములేదు.) రా. అర, కాం.) 2. శక్యమగు. "శా. అ, నాకేళప్రియనందనుంతెనకి మాన ప్రాణముల్ గావఁగా, నీకుందీరునె." నిర్వ. ౭, ఆ.—౨. 1. చక్కన; 2. విధము.

**తీరుకు.** దే. ౨. నాట్యగతివిశేషము.

**తీరుచు.** దే. ప్రే. 1. తీర్పుచేయు; 2. చక్కఁబఱచు, దిద్దు; "తీరిచినట్టులున్న శిశదేకనుబొమ్మలు." విజ. ౧, ఆ.—3. నృత్తగీత వాద్యములు నమమగుకావించు. (చూ. తీర్చు.)

**తీరుపరి.** దే. ౨. (తీరుపు+అరి.) 1. న్యాయాధిపతి; 2. చారుఁడు. విణ. 1. అధికారి; 2. కార్యనిర్వాహకుఁడు. (రూ. తీర్పరి. చారునకు.—"పంచినఁదీర్పరుల్ నచివుపాలికినేగికృత్యప్రణాములై." జై. ౫, ఆ.—అధికారికి.—"ఎ, గీ. తత్పురంబుతీర్పరిఁ దనదుమర్మాటిపయున, మునకుఁదోడడిగె." పర. ౫, ఆ.—కార్య నిర్వాహకునకు.—"సీ. రాజుగ్రనేనుఁడై రాజిల్లఁదాను దీర్పరితనం బెంతయుఁబ్రభుతతోడ, నడపువాఁడయ్యె." హరి. ఉ. ౨, ఆ.)

**తీరుపు.** దే. ౨. 1. న్యాయము; 2. చెక్కఁబాటు; 3. నృత్తగీత వాద్యములు నమమగుట. "సీ. అభినయంబులకోపులరుదైనతీరుపుల్ వెలయఁగాఁబదచాళివిధమొకర్తు." ఉ, రా. ౬, ఆ. (రూ. తీర్పు. చక్కఁబాటునకు.—"చ. ఇత్తెఱఁగొకచాలువాని బలుతీర్పునఁగాకపొసంగనేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ.)

**తీరువ.** దే. ౨. కాఁపులు ధాన్యములోనగునవి పంటపెట్టి తీసికొని పోవునపుడు నేలయొక్క స్వాతంత్ర్యమునుబట్టి రాజునకు చేర వలసిన భాగమునకిచ్చెడు ధనము.

**తీర్చు.** దే. ప్రే. (తీరుచుయొక్క రూపాంతరము.) 1. తీర్పుచేయు; 2. చెక్కఁబఱచు, దిద్దు. "తెవులుగొంటులనైనదీర్చి." భార. విరా. ౧, ఆ.—3. నృత్తగీతవాద్యములు నమమగుకావించు. "సీ. తీవిఁదాళములుగ్గడించు చోఁదీర్చు చో వింతగాఁ జేరఁజవిధమొకర్తు." ఉ, రా. ౬, ఆ.—(తీఱుచుయొక్క రూపాంతరము.) 1. నాశము చేయు; "తీర్పవలయువానినెల్లఁదీర్చు." భార. ఉద్యో. ౨, ఆ.—

2. పాపు. "ఎ, గీ. నీవునుసావద, కోర్చిభంగపాటుతీర్చికొను ము." భార. విరా. ౧, ఆ.

**తీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) దాటcబడినది.

**తీర్థమాట.** మి. వి. తీర్థమాడుట, స్నానము. "చ. తెరలకకాశికా నగరి దేవళటcగిణిc దీర్థమాటకైయరుగుచు." కాశీ. ౫, ఆ.

**తీర్థమాడు.** మి. అ. క్రి. (తీర్థము+ఆడు.) స్నానముచేయు. (స్నానములాడు అనియు. "గోదావరింజీర్థములాడి." భీ. ౪, ఆ.) (ప్రే. తీర్థమార్చు. "ఉ. సంభృతభక్తిభావనc ద్రిసంధ్యమునందును నాతcడింగిణుల్, కంధుcద్రివిష్ణపేశ్వరునిcజంద్రకళాధరుcదీర్థమార్చుచి, ప్రాంభమునc గరాంబురుహాసంగతమంగళశాతకుంభకుంభాంభితగంధసారరసయోగనుగంధిసవాంబుధారలc." కాశీ. ౬, ఆ.)

**తీర్థము.** సం. వి. అ. న. 1. మహర్షులుస్నానముచేసిన పుణ్యోదకము; 2. పుణ్యనది; 3. రేవు; 4. నూతియొద్ది తొట్టి; 5. పుణ్యక్షేత్రము; 6. యజ్ఞము; 7. శాస్త్రము; 8. ఉపాయము; 9. పాత్రము; 10. స్త్రీరజస్సు; 11. ఉపాధ్యాయుడు; 12. మంత్రి.

**తీర్థవాసి.** సం. విణ. (న్. ఈ. న్.) తీర్థసేవచేయువాడు.

**తీఱిక.** దే. వి. అక్క-ఱ, పోరామి. "క. వేఱొకతెఱంగునవారు లకు, మాఱాడకయునికిలెస్స మనుజేంద్రునకుc, దీఱమిగలచోటు లcదా, మీఱికడcగివచ్చి పెంపుమెయికొనవలయుc." భార. విరా. ౧, ఆ.

• **తీఱిక.** దే. వి. తీఱుబడి, అవకాశము.

**తీఱు.** దే. అ. క్రి. 1. నశించు; "అల్పకాలంబుననతcడుc దీఱె." భార. ఉద్యో. ౪, ఆ.—2. పాయు. "క. ఎదcబరితాపము, తీఱcగcబైపిచెనన్నదీపవనంబుల్." భార. ఆది. ౪, ఆ.—3. అవకాశపడు. (నాకు తేపు తీరునుగాని నేడు తీఱదు.)—వి. సంధి. "రాజ్యముపాలులేక తీఱునకొడcబాటుగల్గిననెఱుంగమి వెట్టిరె." భార. ఉద్యో. 3, ఆ.

**తీఱుగడ.** దే. వి. 1. ముగియిక; "నేcడుసంగ్రామమునకుc దీఱుగడయగుcగాకని." భార. భీష్మ. ౨, ఆ.—2. తీఱిక.

**తీఱుచు.** దే. ప్రే. 1. నశింపcజేయు; 2. పాపు. (చూ. తీర్చు.)

**తీఱుదల.** దే. వి. ముగియిక. "ఎ, గీ. మోముమోమునcగదియించి ముద్దుగొనుట, యదియమోహంపుcబ్రనికిcదీఱుదలయేమొ." ఉ, రా. ౬, ఆ.

**తీఱుపడు.** ద్వ. అ. క్రి. నశించు. "గీ. దేశకాలాంతరంబులc దీఱుపడని, బుద్ధిసౌందర్యమెక్కు-డద్భుతముగాcగ." పంచ. వేం. ౧, ఆ. (ఈ పదప్రయోగ మీగ్రంథమునందే కానcబడుచున్నది.)

**తీఱుపాటు.** ద్వ. వి. తీఱిక, అవకాశము.

**తీఱుపు.** దే. ప్రే. తీఱుచు. (రూ. తీర్పు. "సీ పెతరులఋణముc దీర్పెడునూనుcజెందనిదౌర్భాగ్యశీలుగోత్రమ్ము త్రమ్ము." రాఘ. ౧, ఆ.) (ఈ పదప్రయోగము విచారణీయము.)

**తీఱుబడి.** దే. వి. తీఱుపాటు, అవకాశము.

**తీలగు.** దే. అ. క్రి. (తీలు+అగు.) అడcగు. "ఉ. తీలగుకంతు వెంబడిని తెమ్మెరలుc దవిదీప్తికల్కి-పా, తాళముపట్టుచుండి." ఆము. ౨, ఆ. (చూ. తీలుపడు.)

**తీలు.** దే. వి. అడకము. (చూ. తీలగు.)

**తీలుపడు.** ద్వ. అ. క్రి. తీలగు. "గీ. ఇట్టులత్యుగ్రమగుగ్రీష్మమేనరేcగి, కాలవశమునc దనుధానతీలుపడియెc, దెచ్చు వెరిగెట్టి దియు పెచ్చిపేర్చుకెల్ల, ప్రగుటకెయనిలోకోక్తిచాటుcగాదె." పాండు. ౪, ఆ.

**తీవ.** వై. వి. తీcగయొక్క-రూపాంతరము. "గీ. అనతివమ్ముయిపుడెనీయానతీవc, బోcడికూరిమిమదిలోనcబూనివేగ, దానవారినిదెత్తు." రుక్మి: ౨, ఆ.

**తీవంచె.** ద్వ. న. (తిగ+వంచ.) నాలుగు.

**తీవరపడు.** వై. అ. క్రి. (తీవరము+పడు.) త్వరితపడు.

**తీవరపాటు.** వై. వి. తీవరపడుట.

**తీవరము.** వై. వి. త్వరితము*. "క. ఆవనజాక్షినిడగ్గఱి, తీవరమునc గొంగుcబట్టి తిగిచెంగినుకc." కళా. 3, ఆ.

**తీవరించు.** వై. స. క్రి. త్వరితపఱచు*. "చ. మేలొందవెడుcబో యిరమ్మనుచు నొజ్జలువేముఱుcదీవరింపcగాc." శకాం. ౪, ఆ.

**తీవరుcడు.** సం. వి. అ. పుం. 1. చేcపలcబట్టువాcడు, కైవర్తుcడు; 2. సముద్రుcడు.

**తీవియ.** వై. వి. తీcగియయొక్క-రూపాంతరము. "ఎ, గీ. పారుపు మెఱుయంగcబాతరలాడుగడన, వెలcదుకలుపవడంపుcదీవియలు గాcగ." అచ్చ. బాల, కాం.

**తీవిరము.** దే. వి. తీcట, కcడూయ.

**తీవె.** వై వి. తీవియయొక్క-రూపాంతరము.

**తీవ్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లావలు; 2. కటుకరోహిణి; 3. తీcగగజికే*.

**తీవ్రగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ఓమము. అ. పుం. ము. కారుబుడమ*.

**తీవ్రము.** సం. క్రి. విణ. అ. న. పెల్లు. విణ. 1. అధికము; 2. మిక్కి-లివేcడిమిగలది; 3. కారముగలది.

**తీసివేయు.** దే. స. క్రి. 1. ఖండించు; (నీవు నా తల తీసివేయుదువా.) 2. ఎత్తివేయు. (వానిని ఉద్యోగమునుండి తీసివేసిరి.)

## తు.

**తుంగ.** ఉభ. దే. వి. తృణవిశేషము, ముస్త. సం. ఆ. స్త్రీ. జమ్మి*.

**తుంగభద్ర.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. అ. పుం. ము. మదపుటేనుcగు.

**తుంగము.** సం. వి. అ. పుం. 1. కొండ; 2. పొన్న*. విణ. పొడవైనది.

**తుంగి.** సం. వి. ఈ. స్త్రీ. వాయింటె*.

**తుంట.** యు. దే. వి. 1. తునుక; 2. చెఱకు*. "ఉ. గెల్వవె ముజ్జగంబును, ద్దండత నొక్క-తుంటవిలుదాలిచియంటినcగందు తూపులc." వసు. 3, ఆ.—వై. విణ. దుష్టుcడు.

**తుంటరి.** ద్వ. విణ. (తుంట+అరి.) దుష్టుcడు. "ద్వి. తుంటరి జోగి." హరిశ్చ. ౨, భా. (స్వార్థమున అరి.)

**తుంటవిలుతుcడు.** దే. వి. మన్మథుcడు, ఇక్షుధన్వుcడు. (రూ. తుంటవిల్తుcడు "గీ. చెలువమెడతుంటవిల్తునిచిందమరయ." య. ౪, ఆ.) (ఇట్లు తుంటవిలుకాcడు.)

**తుంటె.** దే. వి. కటిపార్శ్వభాగము, రొండి. "సీ. కండూతిక్రైయుcగర్భశంబగుతుంటెcబీcటవెట్టినమ్రాను పెల్లగిల్ల." పావ్. ౪, ఆ.

**తుంటెకూర.** ద్వ. వి. తూcటికూరయొక్క-రూపాంతరము. "గీ. తుంటికూరపొన్నగంటికూర." వి, పు. ౪, ఆ.

**తుంపెము.** ఉప. వై. వి. ఖండము. "వ. పాండవాగ్రజుండలని కోదండంబుతుంపెంబులుచేసెన." భార. ద్రో. ౨, ఆ.—సం. అ. న. 1. పక్షిముక్కు; 2. నోరు; 3. మొగము.

**తుండి.** సం. వి. ఇ. స్త్రీ. ఉబుకుబొడ్డు. పుం. 1. పక్షిముక్కు; 2. మొగము. న. పక్షి.

**తుండించు.** వై. స. క్రి. ఖండించు, ఛేదించు. "వ. కరంబులు ఖండించియు శిరంబులుతుండించియు." ఉ, హరి. ౬, ఆ.

**తుండికేరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. దొండతీగె; 2. ప్రత్తిచెట్టు.

**తుండిభుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఉబుకుబొడ్డువాఁడు.

**తుండిలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

**తుండు.** వై. వి. తుంపెము. ఖండము.

**తుంపెము.** వై. వి.——పై.——(చూ.) తుంచె.

**తుంతుర్వము.** సం. వి. అ. పుం. తుంపురు.

**తుందపరిమృజుఁడు.** సం. వి. అ. పుం. సోమరి.

**తుందము** సం. వి. అ. న. కడుపు, ఉదరము, కుక్షి.

**తుంది.** సం. వి. ఇ. న. కడుపు. పుం. ఉబుకుబొడ్డు. విశే. (న. ఈ. న.) బొజ్జకడుపువాఁడు.

**తుందిభుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. బొజ్జకడుపువాఁడు; 2. ఉబుకుబొడ్డువాఁడు.

**తుందిలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

**తుందుడుకు.** దే. వి. (తుడుకు+తుడుకు.) 1. సంతాపము; "చ. చులుకననన్నుఁగన్నమనసుక్ లయమందఁగఁ జేసినన్నుత్క్, గెలువఁగఁ బూనియున్న మునికీటములక్ వివవాదిమొగ్గపే, కలుఁగుల పాలుచేసి జయమందుదుఁ దుందుడుకాఱునట్లుగాఁ, గొలపగదీర్చు కోనికొడుకుం గొడుకే మదిలోఁదలంపఁగక్." చంద్రా. 3, ఆ.—2. విచారము; "వ. బుద్ధిలేనిజనులాడుకొనుచున్నదులకొన్నితద్ద యువగపుత్తో నొద్దనున్నతమ్ముల కెఱిఁగించియద్దశరథునిపెద్దకొడుకు తుందుడుకుమెంచుకొనవెండియులమ్ముఁబుంగనుంగొని." ఉ, రా. ౬, ఆ.—3. కలత, క్షోభము. "ద్వి. ఈమునిమాటలెంతేవింత లగుచుఁ, దోఁచుచున్నవియని తుందుడుకొంది." విష్ణు. ఉ. ౫, ఆ.—విశే. యోచింపకత్వరపడిచేయువాఁడు. (ఇది ద్విరుక్తముగానే ప్రయోగములంజూపఁబడు.)

**తుందునుకలు.** దే. వి. బ. (తునుకలు+తునుకలు.) చిన్నచిన్న ఖండములు. "వ. పరిఘాఘాతంబులఁబలకలతోడనపునుకలు తుందునుకలైరూపుచెడిమడిసినచోట్లును." కవిక. ౨, ఆ.

**తుంగుభము.** సం. వి. అ. పుం. సర్షపము, ఆవలు.

**తుంపర.** వై. వి. గాలిచేతచెదరిపడు నీరుతోనగువానిబొట్టు, శీకరము. "ద్వి. భవ్యవీచీవరంపరలఁదుంపరల." విష్ణు. ఉ. ౪, ఆ.

**తుంపిల్లి.** దే. వి. బ. తూరవాన.

**తుంపురు.** వై. వి. తుంపర. "సీ. కనుకులైతమ్మిపైఁగ్రమ్మమంచును బోలె మొగమునఁజెమటతుంపురులెలర్ప." య. 3, ఆ.

**తుంపెసలాడు.** దే. అ. క్రి. (తుంపెసలు+ఆడు.) 1. చలించు; "చ. తొకతోకమాటలుక్ నొనలఁదుంపెసలాడెడునుంగరంపు వెం, ద్రుకలును మద్దికాయలుగడుక్ గదలాడఁగముద్దుగారుపాం, దికజగిపాలబుగ్గలును." పు. ౨, ఆ.—2. ఊఁగాడు; "సీ. బిన ధుక్కిఁగ్రొవ్విడితుంపెసలాడురాయంచకొడమవెట్టినతెలిగ్రుడ్లనంగ." చంద్ర.—3. నర్తించు. "సారలతోగుమచ్ఛములు తుంపెసలాడ." పా. ౨, ఆ.

**తుంపెసలు.** దే. వి. చలనము. (చూ. తుంపెసలాడు.)

**తుంపెసలుగునియు.** దే. అ. క్రి. తుంపెసలాడు, చలించు. "సీ. కొఱనెలపైఁదోఁచునిరులునాఁజెలుకొందినోనటిపైఁగురులు తుంపెసలుగునియ." భాగ. ౧౦, స్క౦. ఉ.

**తుంబకము.** సం. విశే. (అ. ఆ. అ.) (చూ.) సంగ.

**తుంబి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తుమ్మిక; 2. సొరకాయ.

**తుంబిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. బండిచక్రము నడిమిరంధ్రము, తూము; 2. సొరకాయ.

**తుకతుక.** దే. వి. 1. సంతాపము; "ద్వి. తుకతుకలేకకీర్తులుమిన్నుముట్ట, నకలరాజ్యమునొకనంయమికిచ్చి." హరిశ్చ. ౧, భా.—2. కోపము; "ద్వి. క్రోధిచిపోనిమ్ముఁకఁదుకతుకమాని." హరిశ్చ. ౧, భా.—3. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము; "క. తనచేతనె కొరబలములఁ, దునిమించుటకింద్రజిత్తుతుకతుకనడికెన్." రామా. ౬, ఆ.—4. కాఁగుటయందగు ధ్వన్యనుకరణము. "తుకతుకఁగ్రాఁగ నేటికి." చంద్రా. ౨, ఆ.

**తుకము.** దే. వి. విత్తనాలచల్లకపు అంచన.

**తుకాటము.** దే. వి. ముక్కిలి ప్రాఁతది.

**తుక్కు.** దే. విశే. అల్పము. (అది చెడెఁబో తుక్కు.)

**తుక్కుడు.** దే. విశే. పనికిమాలినది.

**తుక్ఖారము.** సం. వి. అ. పుం. గుజ్జము, ఘోటకము.

**తుచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. చిట్టెలుక.

**తుచ్ఛము.** సం. వి. అ. న. దుఃఖము. విశే. శూన్యము.

**తుజాలకము.** సం. వి. అ. పుం. ఆరుదొండతీగ.

**తుజేగు.** దే. విశే. త్వరపడువాఁడు.

**తుటాయించు.** దే. స. క్రి. అలక్ష్యపఱచు.

**తుటారము.** దే. వి. 1. దిట్టతనము; "ఉ. మాటికిమాటికింజలము మానకజక్కవపెంట్లఁదమ్మిలే, బోటులనేఁచెదాజగముచుట్టమూడా యఁగ వచ్చె నింకనీ, యాటలుడించి వేజరగుమంచునువెన్నెల తేనికేర్పడక్, జాకెనసనంగఁగూఁటలిడెఁజాఁగెఁదుటారపుటజ్జవాళ్లముల్." అచ్చ. అ, కాం.—2. పరుషవచనము. (చూ. గొడఁగు.)

**తుటారి.** దే. విశే. (తుటారము+ఇ.) 1. దిట్టతనముగలది; (చూ. తుటారికత్తియ.) 2. పారుష్యముగలది. "కేవలముఁదుటారికొరి." చంద్ర.

**తుటారించు.** దే. స. క్రి. తిరస్కరించు. "చూరుంబేర్కొని దూఱుగంధవహుఁ, బల్మాఱుఁదుటారించు." శుక. ౧, ఆ.

**తుటారికత్తియ.** ద్వ. విశే. 1. దిట్టతనముగలది; "చ. గాజులు గలుగల్లనక్ జాఱుఁజాఱుపులచేఁదెరువర్లఁజెందముల్, గలఁపు దురందులక్ బొలముకాఁపరికాఁపుదుటారికత్తియల్." నీలా. ౧, ఆ.—2. పారుష్యముకలది. (చూ. తుటారికత్తె. పారుష్యముకల దానికి.—"ఉ. కంతుదురాపతాపహతిఁగ్రాఁగుచునజ్జగవన్నెకాడున, న్నెంతతుటారికత్తెయనియొగ్గులువల్కెనో." దశి. ౪, ఆ.) (స్వార్థమున కత్తియ)

**తుటారికాఁడు.** దే. విశే. 1. దిట్టతనముగలవాఁడు; 2. పారుష్యముగలవాఁడు. (స్వార్థమునకాఁడు.)

**తుటుక్కు.** దే. వి. గుండెలు అదురుటయందగు ధ్వన్యనుకరణము. (ఆమ్రేడితమునందు తుటుకుతుటుక్కు. "చ. తటుకున మంచెడిగ్గదొరదట్టిబిగింపఁగఁజూచురాజాదు, పుటికటిఁగట్టుపార్థి

ప్రఁడు ప్రజ్ఞలుపల్కుచుఁగార్ముకంబుచెం, గటికరుదెంచికాంచి ఖిలుకైఁగదలింపఁగనోడిగుండియల్, తుటుకుతుటుక్కునన్ దిగులు దొట్టినభూభుజుఁడయ్యెనయ్యెడన్." పాంచా. ౨, ఆ.) (చూ. గల్లు.)

**తుట్టుము.** దే. వి. సమూహము. "క. అటులేగినతోలువేలుపుఁ, దుట్టుములఁబోడగాంచి." అచ్చ. యు, కాం.

**తుట్టతుద.** దే. వి. (తుద+తుద.) కేవలము తుద.

**తుట్టమర.** దే. అవ్య. క్రి. విశ. బొత్తిగా. (పిల్లవాఁడు తుట్టమర చదువఁడు.)

**తుట్టియ.** దే. వి. తుట్టె. (తుట్టియయొక్క రూపాంతరము.)

**తుట్టు.** దే. వి. నష్టి. (ఈ వ్యాపారములో నాచేతిసొమ్ముతుట్టుపెట్టు కొన్నాను.) విశ. నాశకుఁడు. "జలజంబులతుట్టు." రా, వి. 3, ఆ. (చూ. తడకట్టు.)

**తుట్టె.** దే. వి. సమూహము. "సీ. దొనదొనమనుచుఁగతుట్టెలరూపే ఋపడక క్రంపలను వ్రేలెడుగరుసుల." అము. ౬, ఆ. (తుట్టియ యొక్క రూపాంతరము.)

**తుట్టెగట్టు.** దే. అ. క్రి. (తుట్టె+కట్టు.) (పురుగులుపట్టి) ఉండగట్టు.

**తుట్టెపురుగు.** ద్వి. వి. సామాన్యసర్పము. "క. ఈతుట్టెపురుగు లేమగు, నీతేజీవచ్చినపుడు." రామా. ౮, ఆ.

**తుట్రు.** దే. వి. మంచువంటితూరవాన, ఊడ్చినకుప్ప. (అనికొం డదు.)

**తుడుచు.** దే. స. క్రి. 1. తడిపోవనొత్తు; 2. ఊడ్చు. "క. వర వృక్షఁగలపితనయిలు, పరువడిఁదుడువంగఁగృష్ణఁబనుచువగన్ భా, సురరాజ్యవిభవమొప్పవి, దురుఁ జెచ్చెరఁబంచెదానిఁ దోడ్కొనీ తేరన్." సం. "ఏహిక్షత్త ద్రౌపదీమానయస్వ ప్రియాంభార్యాం సమ్మతాంపాండవానామ్, సమ్మార్జతాంవేశ్మపరైతుశీ ఘ్రంతత్రాస్తుదాసీ భిరపుణ్యశీలా." భార. సభా. ౨, ఆ.

**తుడుపు.** దే. వి. 1. తుడుచుట, మార్జనము; 2. తప్పవ్రాలను గిఱికినగిఱుకు.

**తుడుము.** దే. వి. 1. వాద్యవిశేషము, మస్తువు; "సీ. కైదువుల్ విండ్లునుగత్తళంబులుఁదీర్చి బూరలుఁ దుడుములు బుగ్గఁగలిపి." అచ్చ. సుం, కాం.—2. తుటుముయొక్క రూపాంతరము. "క. నడుమొంజెమదియునతనిది, కడలిన్ నగమువడియొకసగంబిలఁబ డనం, దడవులుఁగొండలుఁగ్రోఁతుల, తుడుములుఁజెక్కొక్క పరియతుత్తుమురయ్యెన్." రామా. ౮, ఆ.

**తుడ్చు.** దే. స. క్రి. తుడుచుయొక్క రూపాంతరము. "ఉరమున నంచుఁదుడ్చు." భో. ౫, ఆ.

**తుతినాగము.** దే. వి. లోహవిశేషము.

**తుత్తి.** దే. వి. తుత్తిరియొక్క రూపాంతరము.

**తుత్తిరి.** దే. వి. కంగునీపత్రము?.

**తుత్తుంభిక.** సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము. (చూ. తమ్మటము.)

**తుత్తునియలు.** దే. వి. బ. (తునియలు+తునియలు.) చిన్నచిన్న తునుకలు.

**తుత్తుమురు.** దే. వి. (తుమురు+తుమురు.) మిక్కిలి తుమురు. (తుమురు=పొడి.)

**తుత్థ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టేలకి?; 2. నీలిచెట్టు. అ. న. ము. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము. పుం. అగ్ని.

**తుత్థాంజనము.** సం. వి. అ. న. మయిలుతుత్తము.

**తుద.** దే. వి. 1. చివర, అగ్రము; 2. కడ, అంతము.

**తుది.** దే. వి. కడ, అంతము.

**తుదిముట్టు.** దే. అ. క్రి. చేష్ట్చు. "క. ఇటమొదలువాలియుచటి కిఁ, బవపడిచనుదెంచెనేనివిగ్నహమునఁ దై, తుదిముట్టును." అధ్యా. కిష్కి౦, కాం.

**తుదిరేయి.** దే. వి. కల్పాంతము.

**తుదివాఁడు.** దే. విశ. కడపటివాఁడు, కనిష్ఠుఁడు. "తుదివాఁడు వలసిపెట్టఁగఁగొనవాఁడు." భార. అను. ౨, ఆ.

**తునికకోల.** దే. వి. (తూనిక+కోల.) తూఁచునట్టికోల. "క. ముచు వెండికొండఁదూఁచిన, తునికోలగదామడియవోర్దండము." రామా. ౮, ఆ.

**తునికోలదుడ్డు.** దే. వి. గవుండ్లవాఁడు కల్లుబుడ్డి వ్రగిలించుకొని పోయెడు తునికోలవంటి దుడ్డుకోల.

**తునియ.** దే. వి. తునక, ఖండము.

**తునియు.** దే. అ. క్రి. తునుఁగు, ఖండితమగు.

**తునుఁగు.** దే. అ. క్రి.——పై.——"క. ప్రుక్కతునింగిన కాళ్లును, ఱెక్కలునైపడ్డపక్కితెరింగని." అచ్చ. అర, కాం.

**తునుక.** దే. వి. తునియ, ఖండము.

**తునుమాడు.** దే. స. క్రి. (తునుము+ఆడు.) 1. ఖండించు; "గీ. విరథుఁడయ్యెనసురథుండువిపులచాప, హస్తుఁడైతూణమున బాణమందుకొనఁగ, నలుకరెట్టింపనర్ధచంద్రాశుగమునఁ, గ్రీడితు నమాడెనతనిదక్షిణభుజంబు. అట్లుఖండితబాహుఁడయ్యెను." జై. ౫, ఆ.—2. చంపు. (చూ. తునుము.)

**తునుము.** దే. స. క్రి. 1. ఖండించు; "క. మూర్ధునిఁబొంద్రా, వనివిభునినీవ్రుసూడఁగఁ, దునుముదుఁనేఁజెల్లెల నఁదుత్తునియలు గాన్." ఉ. హరి. 3, ఆ.—2. చంపు. (చూ. తుష్ట. చంపు టకు.—"మ. వినుఁడీ సర్వజనంబులుంగడఁగియా విప్రుణ్దురా లాపుదు, ర్జనునిన్ దున్మెదనస్మదీయకమహాచాపోగ్రనిస్త్రుక్తధా, ణని పాతచ్ఛిదుఁగాఁగరక్త జలశోణక్షోణిసంసిక్తుఁగాఁ, గనుఁడీ యాదురి తాత్మునంచునతిశీఘ్రప్రాప్తకోదండుఁడై." భార. అర. ౪, ఆ.)

**తున్నకము.** సం. వి. అ. పుం. నందివృక్షము.

**తున్నవాయుఁడు.** సం. వి. అ. పుం. కుట్రపువాఁడు, సూచి కుఁడు.

**తున్నాడు.** దే. స. క్రి. తునుమాడుయొక్క రూపాంతరము.

**తుపాకి.** దే. వి. (సిపాయులు మందుగుండువేసి గట్టించికాల్చెడు) ఇనుపక్రోవి. (చూ. జబరజంగి.)

**తుపాను.** దే. వి. గాలివాన.

**తుపాసి.** వై. వి. ఒక భాషను మఱియొక భాషతో చెప్పెడు వాఁడు.

**తుపుక్కు.** దే. వి. ఉమియుటయందగు ధ్వన్యనుకరణము. (తమ్మ తుపుక్కని యుమిసినాఁడు.)

**తుప్ప.** దే. వి. చిన్నపొద. "క. తుమ్మెదలీత్రుళ్లుపెద్దతుప్పలఁ బట్టన్." నీలా. 3, ఆ.

**తుప్పటిల్లు.** వై. అ. క్రి. తనియు. "ఎ, గీ. అప్పటప్పటికినిజి హ్వతుప్పటిల్ల, నామెతలెజెంగనీతుపారాద్రికతన." (వ్రాఁతప్ర తులయందు జిహ్వత్రుప్పడుల్ల అని యున్నది.) సావి. ౨, ఆ.

తుప్పర. వై. వి. తుంపర, శీకరము.

తుప్పలుమూలు. దే. అ. క్రి. (తూలు+తూలు.) మిక్కిలి చలించే. "గీ. ఆపఁడుమవెఱచిచాల, దూరముగఁబోయితుప్పలు మాలియుండె." భార. శాం. ౫, ఆ.

తుప్పు. దే. వి. ఉమియుటయందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. ఉమిసెఁదుప్పునమొగముపైనొక్కరుండు." పరిక్ష. ౪, ఆ. (ఆమ్రేడితమునందు తుప్పుతుప్పు. "వ. విలూనఘ్రాణగళితంబైవా తెఱకువచ్చునెత్తురు తుప్పుతుప్పున నుమియుచు." రామా. ౮, ఆ.)

తుభము. సం. వి. అ. పుం. మేఁకపోతు, ఛాగము

తుమికి. దే. వి. తుమ్మికి, తిందుకము ‡.

తుమురు. దే. వి. సూక్ష్మఖండము. "వ. పలుదెఱఁగులైనగదాప్ర హాతులందునియలు పఱియలు దుముళ్లునైసీసకంబులుకత్తళంబులు ధరాతలంబునందొరంగె." భార. శల్య. ౨, ఆ.

తుములము. సం. వి. అ. న. దొమ్మియుద్ధము. పుం. తాండ్ర ‡.

తుమ్మ. దే. వి. అరిమేదము ‡.

తుమ్మి. వై. వి. ఒకదినుసు కూరాకు.

తుమ్మికి. దే. వి. తుమికియొక్కరూపాంతరము.

తుమ్ము. దే. అ. క్రి. క్షుతముచేయు. వి. క్షుతము.

తుమ్మెద. దే. వి. పూఁదేనెఁద్రావెడి యొకదినుసు నల్లఱెక్కల పురుగు, భ్రమరము.

తుమ్మెదకంటు. ద్వ. వి. సంపెఁగ ‡. (చూ. మొగడ.)

తుమ్మెదమామిడి. దే. వి. కోశామ్రము ‡.

తురంగమము. సం. వి. అ. పుం. గుఱ్ఱము, అశ్వము.

తురంగము. సం. వి. అ. పుం.——పై.——

తురక. వై. వి. తురకవాఁడు, మ్లేచ్ఛుఁడు.

తురకదొగ్గలి. ద్వ. వి. ఒకదినుసు దొగ్గలి ‡.

తురకపికిలి. ద్వ. వి. ఒకదినుసు పికిలిపిట్ట.

తురకజాయి. ద్వ. వి. బొంతజాయి.

తురకవేము. ద్వ. వి. తృణనింబము ‡.

తురకాణ్యము. గ్రా. వి. తురకజనము, తురక ప్రభుత్వము.

తురగము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. హృదయము.

తురా. దే. వి. తురాయియొక్కరూపాంతరము. "నిద్రామెఱుఁగుందు రాగులుక." శశాం. ౫, ఆ.

తురాయి. దే. వి. 1. నిడుపుకాఁడపెట్టికట్టిన పూబంతి; 2. తల నుంచెడు భూషావిశేషము.

తురాషాహుఁడు. సం. వి. హ. పుం. ఇంద్రుఁడు.

తురి. సం. వి. ఈ స్త్రీ. కండెలుంచి నేసెడు యంత్రము, నాడె.

తురికి. వై. వి. గుఱ్ఱము. (చూ. తఱటుసేయు.)

తురితము. వై. అవ్య. క్రి. విశ. శీఘ్రము.

తురీన. వై. ద్ర. క్రి. విశ. తటాలున. "తురీనలేచునట్టిజాడ దోఁప." య. ౩, ఆ.

తురీయము. సం. వి. అ. న. బ్రహ్మము, విశ. నాలుగవది.

తురుంభము. సం. వి. అ. పుం. పూలదండలు మొదలగునవి తుఱిమునకొప్పు.

తురుజె. దే వి. ఒకదినుసు కూరాకు, గండీరము.

తురుపు ఆం. వి. గుత్తపుదండు.

తురుష్కము. సం. వి. అ. పుం. 1. చిల్లమడ్డి; 2. ఒకానొక దేశము.

తురుష్కుఁడు. సం. వి. అ. పుం. తురకవాఁడు.

తుర్యతుండి. సం. వి. ఈ. స్త్రీ. పిండిదొండ ‡.

తుర్యము. సం. విశ. (అ. ఆ. అ.) తురీయము.

తుఱఁగలి. దే. వి. ప్రకాశము. "సీ. ధూమంబువోదివిసఁదుఱఁ గలిమెఱుఁగులునలఁగిమాసినదీప కళికభంగి." భార. విరా. ౧, ఆ.

తుఱఁగలించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "గీ. అవనిగం పింప లలితపీతాంబరంబు, చెఱఁగుదూలఁజక్రాంశులుదుఱఁగ లింప." భార. భీష్మ. ౨, ఆ.—2. అతిశయించు. "పంచచామ రము. మెఱుంగుఁబోఁడికిట్లుచల్వమీఁదమీఁదఁజేసినన్, గుఱంగ టన్నిలంగరాకమూర్తివెచ్చ హెచ్చఁగాఁ, దుఱంగలించుచింతతోడ చూచెపల్కరంతవే, మఱున్మరున్మరున్మృగాంకమత్తకోకిలాదు లన్." విజ. ౩, ఆ.

తుఱఁగలిగొను. దే. అ. క్రి. (తుఱఁగలి+కొను.)——పై. ——(ప్రకాశించుటకు.—"క. మఱునాఁడయగుటలెన్నగ, నెఱఁ గెనినుండపుడువేఁడియెడలినదీప్తుల్, తుఱఁగలిగొనఁబశ్చిమగిరి, చఱికిననతిదూరమున విశదుఁడై తోఁచెన్." భార. మా. ౧, ఆ.—అతిశయించుటకు.—"చ. వెఱవకుమోకుమారపదివేలవిధంబుల నైననిన్ను నే, మఱవమతేడకుంజనుటమానిసుఖంబునదక్షవాటికన్, దుఱఁగలిగొన్న నమ్మదముతో గమనింపుముభీమనాయకుం, డఱగొఱ లేనివేల్పునిఖిలాభ్యుదయంబులునీకునయ్యెడున్." భీ. ౨, ఆ.)

తుఱుగు. దే. స. క్రి. (బలవంతమున లోపలవేసి) క్రుక్కు. "తఱిగికండలు నోరఁ దుఱిగెదరదె." మార్క. ౨, ఆ.

తుఱుతు. వై. వి. వేగిరపాటు*. "క. పిఱికితనంబును జలమును, గొఱకొఱయిాలేని గొనముగుఱితప్పుటయున్, దుఱుతున బిగియును గల్లయు, నెఱుఁగఁడతండించుకయునెల్లెడలందున్." నీలా. ౧, ఆ.—క్రి. విశ. శీఘ్రము. (నీవక్కడికిపోయితుఱుతుగరమ్ము.)

తుఱుము. యు. దే. స. క్రి. తుఱుముపీఁటతో పొడిపొడిచేయు. వి. పొడి. వై. స. క్రి. 1. (కొప్పుగా) ముడుచు*; "క. వల పలిదిక్కునకించుక, మలఁగంగాఁదుఱిమి." భార. విరా. ౧, ఆ.—2. (కొప్పున) చెరువు*. "రగడ. నేర్పుమైనల్లయది నెఱు లఁదొలుపూఁదుఱిమె." స్వా. ౩, ఆ —వి. కొప్పు*.

తుఱుముపీఁట. ద్వ. వి. తుఱుముటకనువుగా చివరను పండ్లేర్పఱ చిన వంకరయినుపకమ్మిచెక్కిన పీఁట.

తుఱ్ఱు. వై. వి. వేగిరపాటు*. క్రి. విశ. శీఘ్రము. (తుఱుతు యొక్కరూపాంతరము.)

తుల. సం. వి. ఆ. స్త్రీ. 1. త్రాసు; 2. దూలము; 3. నూఱు పలములకొలఁది; 4. పోలిక; 5. ఒక రాశి. (చూ. రాశి.) (తులా సూత్రము ప్రగ్రాహము.)

తులకించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "ద్వి. నలినబంధుఁడు పూర్వనగశిఖరమునఁ, దులకించెనరుణకాంతులుదిక్కులలమ." విష్ణు. ఉ. ౫, ఆ. — 2. కుతూహలపడు. "ఉ. ఈవిరిఁబోఁడిఁ గొఱానుమిదేటికినందియమంచుఁగూరిమిన్, దేవరయానతిచ్చినమదిం దులకించుచుఁబెండ్లియాడునీ, రావలరాజునన్నును దిరంబగుసొంపు నఁబెంపు మీఱఁగాఁ, గావునఁగూఁతుఁగావలసి కాదనకీచనవీయఁగాఁ దగున్." య. ౪, ఆ.

**తులకింపు.** దే. వి. ప్రకాశము. "క. వాతెఱకునమృతమేతుల, నేతులకింపుల పిసాళిమిసిమికిఁ గ్రొమ్మిఁ, చేతులచేతులకబ్జము, లేతులలేతులవెలందులీచెలితులయే." విజ ౧, ఆ. (చూ. అఁగింపు.)

**తులము.** దే. వి. పలమునందు మూడవభాగము (లేక) రూపాయయెత్తు.

**తులసి.** సం. వి. ఈ. స్త్రీ. తొళసిచే.

**తులాకోటి.** సం. వి. ఇ. పుం అందె, నూపురము.

**తులామానము.** సం. వి. అ. న. త్రాసునతూఁచెడుతూనిక.

**తులితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సరిపోల్పఁబడినది; 2. తూఁచఁబడినది.

**తులుచే.** దే. విశే. వేగముగలది. (చూ. తులుచేన.)

**తులుచేన.** దే. వి. వేగము. (విశేషణమైనచో. "ద్వి. తులుచని గాలిచేఁదొడిమలుద్రిదిలి, గలగలరవములఁగారాకుడుల్లె." భాగ. ౧౦, స్కం.) (చూ. అలకన.)

**తులువ.** దే. విశే. కుత్సితుఁడు. "చెలువలొనరించుబలుచలువలకుఁ బైనలముకలువలకుఁ దేఁటులను తులువలకు." య. ౫, ఆ.

**తులువకత్తి.** ద్వి. వి. వంపుచురకత్తి.

**తుల్యము.** సం. విశే. (అ. ఆ. అ.) సమము, సరి.

**తువర.** దే. వి. తువ్వరయొక్కరూపాంతరము.

**తువరము.** సం. వి. అ. పుం. ఒక రసము, ఒగరు (చూ. రసము.) విశే. ఒగరైనది. (రూ. తూవరము.)

**తువరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తొగరిచే; 2. అడవితొగరితీఁగ; 3. తొగరిమన్ను.

**తువాల.** అం. వి. చేతిగుడ్డ.

**తువ్వర.** దే. వి. తూర. "క. ముఫ్వరమీఁదమరందపుఁ, దువ్వరఁ జల్లుచు." జై. ౪, ఆ.

**తుషము.** సం. వి. అ. పుం. 1. ఉముక; 2. తాండ్రచే.

**తుషారము.** సం. వి. అ. పుం. 1. మంచు; 2. తుంపర. విశే. చల్లనిది.

**తుషితుఁడు.** సం. వి. అ. పుం. గణదేవతావిశేషము. (వీరు ముప్పదియాఱుమంది.)

**తుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. సంతోషము.

**తుష్టుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సంతోషము పొందినవాఁడు.

**తుస్సి.** దే. విశే. ఒగరైనది. (నేల.)

**తుస్సు.** వై. విశే. నీచము. (తుస్సుపెంజెర.)

**తుస్సుపెంజెర.** ద్వి. వి. పెంజెరభేదము.

**తుహినకరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, చలివెలుఁగు.

**తుహినము.** సం. వి. అ. న. హిమము, మంచు.

## తూ.

**తూ.** దే. వి. తూపాడుచుటయందగు ధ్వన్యనుకరణము. "తూయని పలుమాఱుఁదూపాడిచి." విక్ర. ౫, ఆ. (చూ. తూపాడుచే.)

**తూఁగాడు.** దే. అ. క్రి. (తూఁగి+ఆడు.) 1. ఊఁగు; "సీ. తూఁగాడుహారపట్టుకలదీప్తివెలవెల్లనగుదీపరుచులనుసతకరింప." హరి. పూ. ౫, ఆ.—2. చలించు. "గీ. రయముమెఱయంగనొక్కనారసముఫాల, దేశమునయందునాటించితీవ్రశక్తి, నరముసైచినఁ దూఁగాడియుఱగనూఁది, పట్టియక్కృపవ్రణుఁడుదేర్చెఁబరశురాము." భార. ఉద్యో. ౪, ఆ. (మొదటిరూపము తూఁగియాడు. "వ. పరివహపవనఘుంపానఁపాతంబులందూఁగి యాడుకరుళ్ల చప్పుళ్లు." నై. ౫, ఆ.) (చూ. ఊఁగాడు.)

**తూఁగు.** దే. అ. క్రి. 1. ఊఁగు; (తూఁగుమంచము.) 2. కూరుకు; (వాఁడు తూఁగిపడుచున్నాఁడు.) 3. చలించు; "సీ. తూఁగెడునునుఁగురుల్ దోఁతెంచుఘుగ్గాంబువులఁదోఁగినుదుటిపైమలఁగుచుండ." నిర్వ. ౫, ఆ.—4. తూనికపడు; "గీ. వినఁముతులనిడియెత్తుచో వేయునశ్వ, మేధములకంటె సత్యంబుమిగులఁ దూఁగుఁ, గానసత్యయుక్తుండవుగమ్ముగొమ్ము, దెమ్ము మస్తు రిమ్మసకు నిడెనకునింక." మార్క. ౧, ఆ.—5. నడచు. "ఉ. ఓమను జేంద్రనీవెనుక నుద్దవడింబఱతెంచుదానని, వామహాసియవేగమున కంకిలిసేయక తూఁగనోపినక్, గామితసిద్ధినొందు." భో. ౭, ఆ. "గీ. అందుకతమునసీయింతికెందుఁదగినఁ, జెలువునెవ్వనిఁగూర్చునో సలువయనుచు, వంతనున్నాఁడఁగాక యూవాలుగంటి, పెండ్లితూఁగించుటదియెంతపెద్దమాట." భో. 3, ఆ. — వి. 1. ఊఁగుట; (తూఁగుటుయ్యెల.) 2. కూరుకుపాటు. (నాకు తూఁగువచ్చుచున్నది.)

**తూఁగుటుయ్యల.** ద్వి. వి. ఉయ్యాలమంచము. "సీ. తూఁగుటుయ్యలఁదూఁగుచోఁ గొంతచెదరినయరవిరివన్నె బాగట్లయుండ." కళా. ౨, ఆ. (రూ. తూఁగుటుయ్యాల. "సీ. గుజ్జామాపులనల్లుకొని త్రేలునునుఁదీఁగతూఁగుటుయ్యాలలనూఁగి యూఁగి." పు. ౨, ఆ.)

**తూఁగుపలక.** ద్వి. వి. తాపివాఁడు గోడలమట్టము చూచుటకై జాయిత్రేలఁగట్టిన నిడుపాటిపలక.

**తూఁగుమంచము.** ద్వి. వి. ఉయ్యాలమంచము. "బంగారుకోళ్లతూఁగుమంచముపై." య. ౫, ఆ.

**తూఁచు.** దే. ప్రే. తూఁగఁజేయు, తూనికవేయు.

**తూఁట.** యు. దే. వి. తుంట, ఖండము. వై. విశే. దుష్టుఁడు. (చూ. తూఁటరి.)

**తూఁటకట్టు.** దే. అ. క్రి. ఖండితమగు.

**తూఁటరి.** వై. విశే. (తూఁట+అరి.) దుష్టుఁడు. "ఈ తూఁటరి దోసకారి పెనుదోసి యజామిళుఁడు." భాగ. ౬, స్కం. (స్వార్థమున అరి.)

**తూఁటాడు.** దే. స. క్రి. (తూఁటు+ఆడు.) వేధించు, జర్జరితముచేయు. "బలిమిఁవేవురుపార్థ్వరక్షకులెదుర్పడఁదున్మితూఁటాడి." జై. ౭, ఆ.

**తూఁటికూర.** దే. వి. ఒకదినుసుకూరాకు, నళి. (చూ. తుంటికూర.)

**తూఁటు.** దే. వి. చిల్లి, రంధ్రము.

**తూఁటుకట్టు.** దే. అ. క్రి. తూఁటుపడు, తూఁటుపోవు. "గీ. తమతమవీరకంఖంబులెల్ల, దొరలునొత్తిరిదివిమ్రోఁతఁదూఁటుకట్ట." భార. ఉద్యో. ౪, ఆ.

**తూఁడరి.** వై. విశే. తూఁటరియొక్కరూపాంతరము. "క. నాఁడెల్లవారునీపూఁ, బోఁడివలదుమానుమనఁగఁబుయిలోడకతొఁ, దూఁడరియైతజ్జేయఁబడిన, వాఁడితనికినేఁడువగవవలదనువారుక్." భో. ౬, ఆ.

**తూఁడు.** దే. వి. తామరపువ్వులోనగువానినేరు, బిసము. "తమిలేఁదూండ్లాబాహువులు." విజ. ౧, ఆ.

**తూఁడుముంటె.** దే. వి. (తూఁడు+తిండి.) హంస. "గీ. తూఁడు దిండుమావ వోరిజంగడంబుఁబట్టె." అచ్చ. యు, కాం.

**తూఁటికొమ్ము.** దే. వి. పిల్లంగ్రోవి, మురళి.

**తూఁకము.** దే. వి. ఫ్రాసిక. "శా. తూఁకంబుల్ సెడిరేరులాకస మునఁ బోలంబులై తూలఁగా." జై. ౭, ఆ.

**తూఁకు.** దే. వి. తూఁకముయొక్క రూపాంతరము. "క. విరుఁడుండఁ జిత్రచిత్తియు, దురమోఁదరింపఁ గనోక్క తూఁకున." హరి. ఉ. ౧౦, ఆ.

**తూఁకొను.** దే. అ. క్రి. (తూఁకు+కొను.) తూఁగు. "చ. అవు మంచి ప్రతాపుఁడగునాఙ్కరినాథుఁడు భ్రష్టదృష్టికి, దుష్టాత్మకు నంబుచినతఁడుతూఁకొనివారిఁ గ్రహంబుసేఁగఁ, గ్రహణముసేయ." గా. బాల, కాం. (తూఁఱు+కొను.) చొచ్చు. "దుసికిలఁబాఱు చీఁకటులు మూఁకొనుచుండెడుకేలుగంటుఁ." హంస. ౪, ఆ.

**తూణము.** సం. వి. అ. పుం. అమ్ములపొది. (ఇది ఆకారాంత స్త్రీలింగముగాను, ఈకారాంత స్త్రీలింగముగాను గలదు.)

**తూణీరము** సం. వి. అ. పుం. తూణము, అమ్ములపొది.

**తూదము.** సం. వి. అ. పుం. గంగరావి.

**తూనరతుక్కము.** దే. వి. బాలక్రీడావిశేషము.

**తూనిక.** దే. వి. (త్రాసుతో) తూఁచుట, ఉన్మానము.

**తూనికకోల.** దే. వి. త్రాసుదండె.

**తూనికవేయు.** దే. స. క్రి. తూఁచే.

**తూనిఁగ.** దే. వి. తూనీఁగయొక్క రూపాంతరము. "ఉ. తూనిఁగ లాడెఁదోయనిధిఁదోరపు మ్రోఁతజనించెఁబట్టుకలై, కానఁబడెన్ బలాకములుకప్పయెలుంగులుమించెనిర్జల, స్థానమునందుఁగుంజముతు దక్ గృకలాసమునిల్చినింగికై, యాననమెత్తెభూమిరజమంగములన్ బెరయించెఁబిచ్చుకల్." విక్ర. ౪, ఆ.

**తూనీఁగ.** దే. వి. ఒకదినుసు ఈఁగ, పతంగిక.

**తూపరము.** దే. వి. చిల్లి, రంధ్రము.

**తూపరాణ.** దే. వి. నీళ్లు బయటికివచ్చే తూము. (చూ. ఒప్ప రము.) (రూ. తూపరాణము.)

**తూపరాణి.** దే. వి._____పై._____"వ. గుడిలాపరాతూప రాణికడనిలిచి." ఆము. ౬, ఆ.

**తూపి.** వై. వి. గుడిలో మూలవిగ్రహము ఉండెడుచోటికి మీఁద విమానమువలె ఎత్తుగాకట్టిన కట్టడము.

**తూపు.** దే. వి. బాణము.

**తూపురిక్క.** ద్వి. వి. శ్రవణనక్షత్రము.

**తూపురిక్కనెల.** ద్వి. వి. శ్రావణమాసము.

**తూపొడుచే.** దే. స. క్రి. ఉమియు. (చూ. తూ.)

**తూబరము.** సం. వి. అ. పుం. కాలమున కొమ్ములుమొలవని యెద్దు.

**తూబరుఁడు.** సం. వి. అ. పుం. 1. ప్రాయమున గడ్డము, మీస మురాని మగవాఁడు; 2. అంతఃపురపు కావలివాఁడు.

**తూము.** వై. వి. 1. బండిచక్రము నడిమిరంధ్రము; 2. నీళ్లు బయటికివచ్చునట్లు ద్వారమేర్పఱచికట్టినకట్టడము; "విలసన్మక్తాకళావచ్ఛలంబునఁ దూమేర్పడఁబెట్టి." వసు. ౫, ఆ.—3. నాలు గుతుంచేములకొలఁది*; 4. సూదిచెవి*. "ఉ. ఇందుధరుండ నేను వరమిచ్చెదవేఁడుము మానిలోకనం, క్రందననావృథుక్ దక్షి కన్నవయల్లనవిచ్చిచూచినీ, విందుధరుండవేని వరమిచ్చెదవేనియుఁ సూదితూములో, నందగదారముఁజొరఁగ నాకిపుడిమ్ము వరమ్ము సత్కృపన్." పర. ౧, ఆ.—5. నగలమోపునందలి రంధ్రము.

**తూర.** దే. వి. 1. వానబొట్టు; (తువరయొక్క రూపాంతరము.) 2. మత్స్యవిశేషము. (చూ. తూల.)

**తూరనగోలలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. అంద లము.)

**తూరనతుంకములు.** దే. వి. బ._____పై._____"సీ. తూరన తుంకాలు గీరపగింజలు పిల్లదీపాలంకిబిల్లగోడు." కాళ. ౩, ఆ.

**తూరి.** దే. వి. తడవ, ఆవృత్తి. (ఇది ఏకాద్యర్థకశబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడును. ఉదా. ఒకతూరి, ఈతూరి మొ.)

**తూరు.** దే. అ. క్రి. (సన్నగా) తూరపడు. (దీనినిచొచ్చే అను అర్థమందును కొందఱు లఘురేఫముగా ప్రయోగించియున్నారు. ప్రామాణిక ప్రయోగములయందట్లు కనఁబడలేదు.) వి. ధాన్య ముతో కలసియున్న గల్లపొట్టు మొదలైనది.

**తూరుపాఱఁబట్టు.** దే. స. క్రి. (తూరు+పాఱన్+పట్టు.) గల్లపొట్టులోనగునవి యెగిరిపోవునట్లుగా చేటలోనగువానితో ధాన్య ములోనగువానిని పైకెత్తి క్రిందుగాఁబోయు. (రూ. తూర్పాఱఁ బట్టు.)

**తూరుపు.** దే. వి. సూర్యుఁడుదయించెడు దిక్కు, ప్రాగ్దిశ. (రూ. తూర్పు.)

**తూరుపుఁగొండ.** ద్వి. వి. ఉదయాద్రి, పూర్వపర్వతము.

**తూరుపుఱేఁడు.** దే. వి. ఇంద్రుఁడు, పూర్వదిక్పతి.

**తూరుపెత్తు.** దే. స. క్రి. (తూరుపు+ఎత్తు.) 1. ధాన్యాదిక మును ఎత్తి తూరుపుగాలికివిడుచు; 2. ఏదేని గాలివాటముగా ఎత్తి విడుచు; "గీ. రట్టుగానన్ను మగనాలిఁబట్టెడాసి, తౌరమెుట్టో యనుచు దుమ్ముతూరుపెత్తు." శుక. ౨, ఆ.—3. వెంద్రుకలు పాయఁదీసి అడ్డముగా మీఁదికెత్తిపట్టు. "గీ. ఎలయుసీత్కారముల తోడనీళ్లుగ్రుక్కి, యంట్లునంట్లునుబరికించియంట్లఁబొడిచి, గోరు ముక్కలడిగదువ్వితూరుపెత్తి, నెఱులఁగ్లిసవేలనన్నింటిఁదిగిచి." పాండు. ౩, ఆ.

**తూర్చు** దే. ప్రే. తూఱుచుయొక్క రూపాంతరము. "ఉ. దుర్వా చికసూచికాంకుర పరంపరఁదూర్చెదుమాటిమాటికిన్, నాచెవు లందు." నై. ౪, ఆ.

**తూర్ణము.** సం. క్రి. విణ. అ. న. త్వరితము. విణ. వడిగలది.

**తూర్పిడి.** దే. వి. తూరుపాఱఁబట్టుట.

**తూర్పెత్తు.** దే. స. క్రి. తూరుపెత్తుయొక్క రూపాంతరము.

**తూర్యము.** సం. వి. అ. న. వాద్యము. పుం, న. వాద్యపు మ్రోఁత.

**తూఱఁబడు.** ద్వి. అ. క్రి. (తూఱన్+పడు.) తూఱు. "సీ. పాఱఁజాలకముట్టఁబడిజాడదప్పంగఁదోలఁగిపెన్ గొందులఁ దూఱఁ బడియు." నిర్వ. ౪, ఆ. (స్వార్థమున పడు.)

**తూఱు.** దే. అ. క్రి. చొచ్చు. "పాములుపుట్టలోనికిన్ దూఱిన యట్లుగా." భార. భీష్మ. ౨, ఆ. "ద్వి. నాతెల్లగరులబాణము లింద్రజిత్తు, వేతూఱిచనినేఁడువెనలంకఁబడును." రా. యు, కాం.

**తూఱుచు.** దే. ప్రే. తూఱఁజేయు.

**తూల.** దే. వి. పండుచేఁప, ఝషము.

**తూలఁబాఱు.** దే. అ. క్రి. (తూలన్ + పాఱు.) 1. తూలు, చలించు; 2. తొలఁగు. "తూలంబాఱయుఁబీఱువోక." కా. ౨, ఆ. (స్వార్థమున పాఱు.)

**తూలనాళిక.** సం. వి. ఆ. స్త్రీ. దూదిచుట్ట, ఏకు.

**తూలపోవు.** మి. అ. క్రి. (తూలము + పోవు.) చిన్నపోవు. "సీ. చిన్నవోయినికొడుకులుసేయఁగలుగు, దొరలువిడిదలకరిగిరిఫఁగ భిమ, నేనుకొడుకునగ్గించుచుఁజెలఁగివారు, చెన్నుఁబొంపారఁజని రాష్ట్రతిబిరములకు. వ అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులుతూలపోవఁటసెప్పినవిని." భార. భీష్మ. ౨, ఆ. (ప్రే. తూలపుచ్చు. "ఉ. తమ్ముఁడనీవునాకొలఁదితథ్య మెఱుంగకనాకు నీచభా, వమ్మగు నెంగిఁజేసితివి వాసవయియ్యడితిప్రసూతవం, శిమ్మఖిలమ్ముఁదార్చ నొకనన్నపుటీఁకనయిట్టినన్నుని, విమ్మెయిఁదూలపుత్తెయని యూతగా రోచులఁగెంపెలర్పఁగన్." భార. ఉద్యో. 3, ఆ.)

**తూలము.** సం. వి. అ. న. 1. గంగరావిసీ; 2. ఆకాశము. పుం, న. దూది.

**తూలాడు.** దే. అ. క్రి. (తూలి + ఆడు.) తూలు, చలించు. "ఎ, గీ. అలసిమేనులుదూలాడనిలిచిరంత, నంతనయోధ్యదముఖ్య లా హవముదక్కి." భార. విరా. ౫, ఆ. (దీని మొదటిరూపము తూలియాడు. "గీ. గగనమండలమునఁగాలాయసపుఁదెర, మాలకాకిపడగతూలియాడ." నై. ౭, ఆ. చూ. ఊఁగాడు.)

**తూలి.** ఉభ. దే. వి. (తూల + ఇ.) చేఁపలనుబట్టి జీవించెడి యొకానొక జాతివాఁడు. సం. ఈ. స్త్రీ. తూలిక.

**తూలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నయీఁక; 2. వ్రాసెడు కలము; 3. చిత్రమువ్రాసెడు వాగర.

**తూలికాఁడు.** దే. వి. తూలి. (స్వార్థమున కాఁడు.)

**తూలు.** దే. అ. క్రి. 1. చలించు; "గీ. వరరథాశ్వసుభటవర్గమెల్లనుగల్గి, చాలినంతభూమియేలఁగల్గి, తగినమంత్రిలేనిధరణీశురాజ్యంబు; గాలిఁదూలుదీపకళికఁబోలు." విక్ర. 3, ఆ.—2. తొలఁగు. "పయ్యెదనగముదూలించి." భార. విరా. ౨, ఆ.

**తూలు.** హిం. విశే. అనగత్యముగా పెంచిచెప్పిన తూలుమాటలు, తిట్లు.

**తూలుచు.** దే. ప్రే. (తూలఁజేయు.) 1. చలింపఁజేయు; "ఉ. ఘనస్ఫుటనిశ్వసితానలంబులన్, దూలిచెదేవయానములఁదోరములైన భుజంగసంఘముల్." రా. యు, కాం.—2. తొలఁగించు. "బుభుక్షసంఘముల తేజముఁదూలిచె." సా. ౧, ఆ. (రూ. తూల్చు.)

**తూష్ణీకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మాటలాడక ఊరకుండువాఁడు, తూష్ణీంశీలుఁడు.

## తృ.

**తృట్టు.** సం. వి. ష్. స్త్రీ. 1. దప్పి; "తృట్టైకదొట్ట." పాండు. ౫, ఆ.—2. ఇచ్ఛ.

**తృణగ్రాహి.** సం. వి. న్. పుం. పచ్చ, మరకతము.

**తృణజలూక.** సం. వి. ఆ. స్త్రీ. తృణములయందు సంచరించెడు జలగవంటియొకదినుసుపురుగు. "సీ. తనపూర్వభాగమెత్తి, వేఱొంటిపైఁబెట్టివెనుకభాగంబెత్తగమకించు తృణజలూకయునుబోలె." భాగ ౧౦, స్కం. పూ.

**తృణత.** సం. వి. ఆ. స్త్రీ. 1. తృణభావము; 2. విల్లు.

**తృణద్రుమము.** సం. వి. అ. పుం. తాటిచెట్టులోనగునది.

**తృణధాన్యము.** సం. వి. అ. న. విత్తకపండెడు గుఱుగుసివ్వరి యూసరిలోనగునది.

**తృణధ్వజము.** సం. వి. అ. పుం. వెదురు, వేణువు.

**తృణపుష్పిక.** సం. వి. ఆ. స్త్రీ. కొండయల్లమునీ.

**తృణము.** సం. వి. అ. న. 1. కిక్కసలోనగుగడ్డి; 2. గంటె చామలోనగుపైరు.

**తృణరాజము.** సం. వి. అ. పుం. 1. తాటిచెట్టు; 2. గిఱకతాటిచెట్టు; 3. టెంకాయచెట్టు.

**తృణశూన్యము.** సం. వి. అ. న. మల్లె. (రూ. తృణశూన్య ము)ః. (ఇది ఆకారాంత స్త్రీలింగమునగును.) అ. పుం, న. ఆ. స్త్రీ. మొగలిపండు. విశే. తృణములేనిది.

**తృణీకరించు.** సం. స. క్రి. తృణముగాఁజేయు, అలక్ష్యము చేయు.

**తృణ్యా.** సం. వి. ఆ. స్త్రీ. గడ్డిమోపు.

**తృతీయము.** సం. స. (అ. ఆ. అ.) మూడవది.

**తృతీయాకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) మూడుచెల్లదున్నినది. (నేల.)

**తృతీయాప్రకృతి.** సం. వి. ఇ. స్త్రీ. నపుంసకుఁడు, పేడి. (రూ. తృతీయప్రకృతి.)

**తృప్తము.** సం. వి. అ. పుం. పురోడాశము. విశే. తృప్తిపొందినది.

**తృప్తి.** సం. వి. ఇ. స్త్రీ. తనివి, తర్పణము.

**తృప్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తనివినొందినవాఁడు.

**తృష.** సం. వి. ఆ. ష్. స్త్రీ. 1. దప్పి; 2. ఇచ్ఛ.

**తృషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. దప్పిగొన్నవాఁడు; 2. ఇచ్ఛగొన్నవాఁడు.

**తృష్ణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇచ్ఛ; 2. దప్పి.

**తృష్ణక్కు.** సం. విశే. జ్. 1. ఇచ్ఛగొన్నవాఁడు; 2. దప్పిగొన్నవాఁడు.

## తె.

**తెంకాయ.** దే. వి. టెంకాయయొక్కరూపాంతరము.

**తెంకి.** దే. వి. స్థానము. (టెంకియొక్కరూపాంతరము.)

**తెంచు.** దే. ప్రే. తెగఁజేయు. (త్రెంచుయొక్కరూపాంతరము.)

**తెండు.** దే. అ. క్రి. పరుండు, శయనించు. (చూ. తేఁడు.)

**తెందెప్పలు.** దే. విశే. బ. (తెప్పలు + తెప్పలు.) అపారము. "క. అందలమందలలేకివు, డందలమందలయియున్నవయ్యమెకంబుల్, చెందామరకొలనువలెన్, దెందెప్పలవేమిచెప్పదేవుఁడెఱుంగున్." సా. ౧, ఆ. (రూ. తెందేపలు. "ఎ, గీ. పోటచెఱువు, నందుఁదెందేపలుగనిరుల్ క్రందుకొనఁగ." య. ౧, ఆ.)

**తెంపరి.** దే. విశే. (తెంపు + అరి.) సాహసికుఁడు. "ఉ. సింహాకిశోరవృత్తిగ, ర్జింపుచునున్నవాఁడుమదిమృత్యుభయంబినుమంత లేకయీ, తెంపరి." జై. ౨, ఆ.

**తెంపి.** దే. వి. 1. విధవ; 2. తెంపుయొక్కరూపాంతరము. "ఎడతెంపిగఁగొందఱుపాయవాఱుఁగన్." భార. విరా. ౫, ఆ.

**తెంపు.** దే. క్రి. ... 1. తెగుట; 2. తెగులు.

**తెకతెక.** దే. వి. ఉమ్మలిక, క్రాగుట, యిగముటలయందగు ధ్వన్యనుకరణము. "గీ. చిత్తములెకతెకనడికమెత్తబడియె." పర. ౧, ఆ. "తెకతెకక్రాగు తప్తిపరితేనియ." పా. ౪, ఆ. "తెకతెక పకలెగయు." రామా. ౫, ఆ.

**తెకతేర.** దే. విశ. (తేర+తేర.) బొత్తిగా సంబంధములేనిది. "తెక తేరయిదియేమియొకరిసొమ్మె." పా. ౪, ఆ.—క్రి. విశ. నిష్కా ర్యర్థము. "ఎ, గీ. ప్రాణమేటికిఁ దెకతేర పొవుకొనఁగ." పం. చ. తం. 3, ఆ. "తెకతేరగనికిగవడిచిపోయెదనె." కళా. 3, ఆ.

**తెక్కరము.** దే. వి. విలాసము.

**తెక్కలి.** వై. వి. 1. దొంగతనము*; "తెక్కలిబందియేదిక్కులం దుందఱుచిడెన్." భార. శాం. ౨, ఆ.—2. వంచన*; "మహో న్నతపేరమలంకరించుచుఁ, దెక్కలిఁదాఁకిదాతయిలఁ ద్రెళ్లెమునన్నుఁ గఁజేసె." భార. శల్య. ౨, ఆ.—3. ప్రమాదము*. "క. ఉక్కట నాగుమపుత్రుం, దెక్కలిఁగోల్పడితిని." భో. ౪, ఆ —విశ. వంచకము*. "తెక్కలిమృత్యుభయంబు." భాగ. ౬, స్కం.

**తెక్కలికాఁడు.** ద్వ. వి. దొంగ. (చూ. చోచ్చిల్లు.) విశ. వం చకుఁడు*. "క. హితమొనరించెదనంచుఁ, ధృతరాష్ట్రతనూభవ పకుఁ దెక్కలికాఁడై, మృతియొనరించెందానును, మృతుఁడయ్యెన భ్రాతృపుత్రమిత్రయుతముగన్." భార. స్త్రీ. ౨, ఆ.

**తెక్కలిపాటు.** వై. వి. విపత్తు. "ఉ. ఎక్కడనెల్లలోకముల నెవ్వరుఁ గోరనికోర్కి నేఁడుమా, తెక్కలిపాటుకై తివిరి దేహము వేడఁగవచ్చి నారము." భాగ. ౬, స్కం.

**తెక్కు.** దే. వి. టెక్కుయొక్కరూపాంతరము. పా. ౫, ఆ.

**తెగ.** దే. వి. 1. సజాతీయసమూహము; "క. వినురక్కసులున వేల్పులు, ననియెడునిరెండుతెగలనాశుక్రుఁడునీ, ఘనుగడనడ పెడువారు." య. 3, ఆ.—2. సమూహము; "క. బలుగాలిఁదూ లుమబ్బుతె, గలచాడ్పున." అచ్చ. యు, కాం.—3. విధము; "ద్వి. అగలకమునినాథునవ్వనకొక్క, తెగసేయవలయునోదేవియె ట్లయిన." హరిశ్చ. ౨, భా.—4. పక్షము; "ఎ, గీ. బాలలు స్వపక్షమున సెలపక్షమునను, జల్లుపోరాడఁగనుఁగొంచునరసిఁదేలె. క. తనతెగమగువలురఘురా, ఘునితెగకామిన.లమించిముంచిన." ఉ, రా. ౬, ఆ.—5. (ఎక్కుపెట్టిన) అల్లెత్రాడు; "ఎ, గీ. అతఁడు మూర్ఛ, తెలిసి యొకకోలఁదెగనిండఁదిగిచియేసె." ఉ, హరి. 3, ఆ.—6. (అల్లెత్రాటిని) ఎక్కుపెట్టుట; "ద్వి. నాతెగ కేలసినాకివిల్ నిలుచు." రా. బాల, కాం.—7. నిడుపు. "క. పొగరెక్కినమూఁపురముబుఁ, దెగగలవాలములుశైలదేహంబులు భూ, గగనములునిండఱంకెలు, మిగులమెఱయువృషభగణముమెల్లన నడచెన్." భాగ. ౧౦, స్కం. పూ.—క్రి. 1. నిశ్శేషముగా; "క. తెగఁదీర్పకతెగటార్పక." భార. శాం. 3, ఆ.—2. ఖండిత ముగా. "తెగనాడవలదునభలను."

**తెగఁగొట్టు.** దే. స. క్రి. (తెగన్+కొట్టు.) నఱకు. (వాని తల తెగఁగొట్టెను.)

**తెగఁజూచు.** దే. స. క్రి. (తెగన్+చూచు.) చెంపు. "క. మి న్నుఁదెగఁజూచినద్గతి, కెమ్మెయిఁబోవంగనేర్తునేను." భార. అను. 3, ఆ. (ఇందుపూర్వావయవమైన తెగ అనునది అంత్యావయవ మైనచూచుక్రియకువెనుకను ప్రయోగములయందు కానంబడియెడి. "క. నీచమతినన్నునెవ్వఁడు, చూచిననారాత్రిలోనఁజూతురుతెగఁ దా, రాచపలు." భార. విరా. ౧, ఆ.

**తెగఁబడు.** ద్వ. అ. క్రి. (తెగన్+పడు.) తెగించు. (సాధ్వర్థమున పడు.)

**తెగఁబాటు.** ద్వ. వి. (తెగన్+పాటు.) తెగఁబడుట. "చ. తగినతెఱంగుచేసినను దానినెఱుంగరుచెట్టగాంచినన్, దెగడుదు రెల్లభంగిజగతీజనముల్ విశమ్ముగా కయున్, బగతునినాయిఁతంపుఁ దెగఁబాటునఁజైపడి గెల్వనేర్చినన్, మగఁటిమిదూలుచే ద్రొసంగు మాలఁగ దానవుఁజంపుమెమ్మెయిన్." నిర్వ. ౧౦, ఆ.

**తెగఁబాఱు.** దే. అ. క్రి. (తెగన్+పాఱు.) తెగించు. "గీ. నీవుగెల్చినదాస్యంబు నీకునేను, జేయఁగలదానన్ను గెల్చిననునీవు, నాకుఁజేయంగఁగలదానవికడింపి, పన్నిదముచఱుమనితెగఁబాఱి పలికె." భార. అను. ౧, ఆ. (సాధ్వర్థమున పాఱు.)

**తెగచు.** దే. అ. క్రి. కలఁగు. "ఎ, గీ. దేవయానఁగనుంగొనితెగచి వగచి." యు. 3, ఆ.

**తెగటాఱు.** దే. అ. క్రి. (తెగటు+ఆఱు.) చచ్చు, నశించు. "క. లోకంబులుతెగటాఱఁగ." భాం. ఆం. ౪, ఆ. "వేవురుసం శప్త కాగ్రేసరులుతెగటారిరి." భార. కర్ణ. ౨, ఆ.

**తెగటాఱుచు** దే. ప్రే. తెగటాఱఁజేయు. (రూ. తెగటార్చు. "వ. అర్ధానన్నుఁదెగటార్చిదానివరియించె." మార్క. ౭, ఆ.)

**తెగటు.** దే. అ. క్రి. త్రుళ్లు. "వ. అట్లయినసందలిబంధుమిత్ర సహాయజనంబులుగలసి నవ్వుచుం దెగటుచునునికిమనమనంబు లకుఁబ్రియంబునెయు." భార. ఉద్యో. ౧, ఆ.—వి. త్రుళ్లు.

**తెగడ.** వై. వి. త్రివృత్తి. (దీని భేదములు తెల్లతెగడ, నల్లతెగడ. ఇదే తెల్లతెగడ.)

**తెగడు.** దే. అ. క్రి. ఉపేక్షింపఁబడు. "క. మిగులఁగడగండ్లఁ బడియున్, దెగడకవారెల్లనిపుడు నీమేనల్లుం, డగుకటివేలుపుకత మున, నొగినసుఖులతోడనిల్చియుండిరిసుమ్మీ." నీలా. ౧, ఆ.—స. క్రి. 1. తిరస్కరించు; 2. ఉపేక్షించు; "గీ. త్రెళ్లింపుము పొలఁతియనచుఁదెగడకదానిన్." అచ్చ. బాల, కాం.—3. నిం దించు. "చ. తగినతెఱంగుచేసినను దానినెఱుంగరు చెట్టగాంచినన్, దెగడుదురెల్లభంగిజగతీజనముల్." నిర్వ. ౧౦, ఆ.—వి. నింద. "క. హితకా, ర్యగతులఁజెప్పఁగఁదెగడకుఁ, బొగడకు." భార. కర్ణ. ౧, ఆ.

**తెగవేయు.** దే. స. క్రి. నఱకు. (దానితల తెగవేసెను.)

**తెగించు.** దే. అ. క్రి. సాహసించు.

**తెగు.** దే. అ. క్రి. 1. ఖండితమగు; 2. ఛిన్నమగు; 3. చచ్చు. "నరనాయకులునుజచ్చిరికుమారులుఁగలయందఱుఁదెగిరి." భార. శల్య. ౧, ఆ.—4. తీర్పగు; "క. తెగదిప్పుడుమూన్నెల్లకుఁ, దగ వమగఁగరండు." జై. ౭, ఆ. (త్రెగుయొక్కరూపాంతరము.) —5. సాహసించు. "ఉ. ఓరిదురాత్మనీకుఁదెగనొల్లకయుండుట నీపరాక్రమం, బారసికాదురా." ఉ, హరి. ౪, ఆ.

**తెగుడు.** దే. వి. తెగుట, విచ్ఛేదము.

**తెగుదల.** దే. వి. 1. అంతము; "ఎ, గీ. ఈమనోగ్లానికిఁదెగుదలెద్ది చెపుమ." నిర్వ. ౯, ఆ.—2. క్షయము. "గీ. రాత్రి తెగుదల దినమేలరాకయుండు." భార. అర. ౫, ఆ.

**తెగుదారి.** దే. విశ. (తెగువ+దారి.) 1. సాహసికుఁడు, సాహ సికురాలు; "ధవునెడఁబాసివచ్చుతెగుదారికినాకిఁకవంతయేల." ఉ, రా. ౬, ఆ.—2. దాత. "కడుసొంపులుగాఁబొగడించుకోఁ జామీతలఁపుననిప్పుడింతతెగుదారులమైతిమి." ప్రభా. ౧, ఆ.

**తెగుదెంపు.** దే. వి. (తెగు+తెంపు.) తీర్పు. "మ. యమసూ నుండనుఁగృష్ణుఁజూచిబకదాల్భ్యవ్యాసకణ్వాదినం, యములుండఁ దెగుదెంపుచేయకిటులేలావారిఁబొమ్మంటి." జై. ౭, ఆ.

తెగుబడి. దే. వి. 1. తెగుట; 2. దుక్కి; 3. ఆమ్లకము.

తెగులు. దే. వి. 1. వ్యాధి; 2. చీడ.

తెగులుగొంటు. దే. విశే. వ్యాధిగ్రస్తుఁడు, వ్యాధిగ్రస్తురాలు, వ్యాధిగ్రస్తము.

తెగులుగొను. దే. అ. క్రి. (తెగులు+కొను.) వ్యాధిగ్రస్తమగు.

తెగువ. దే. వి. 1. సాహసము; 2. దాతృత్వము.

తెగువడు. దృ. అ. క్రి. (తెగుడు+పడు.) వేఱుపడు. "తెగువడికచ్ఛపముపోక." పంచ. నా. ౨, ఆ.

తెచ్చు. దే. స. క్రి. తీసికొనివచ్చు, ఆనయించు.

తెట్టగిలఁబడు. దృ. అ. క్రి. (తెట్టగిలన్+పడు.) తెట్టగిల్లు. (సామర్థ్యమున పడు.)

తెట్టగిల్లు. దే. అ. క్రి. నిస్సారమగు.

తెట్టతెరువు. దే. వి. (తెరువు+తెరువు.) నడివీధి. (ఇట్లు తెట్ట తెన్ను.)

తెట్టియ. వై. వి. 1. తెట్టువ*; 2. తేనెపెర*; 3. తృణకాష్ఠాది భారము*.

తెట్టు. దే. వి. పట్టణమునకైనను, కోటకైనను బయట చెట్టు నేర్పఱచిన కంపకోట.

తెట్టువ. వై. వి. 1. సమూహము; "వ. బట్టబయలనిలిచిహాచుటకు చెట్టులికియిట్టలంబగుమొగుళ్ల తెట్టువలలోమఱుఁగుపడి." ఉ, రా. 3, ఆ.—2. నీటియందు గాలికొక్కప్రక్కచేరిన తృణాదిసమూహము*. "గీ. వెల్లిడొంకిచనఁదోఁచునురువుతెట్టువలనంగ." ఆష్ట. 3, ఆ.

తెట్టువగట్టు. దృ. అ. క్రి. (తెట్టువ+కట్టు.) నీటియందు తృణాదికముగాలికొక్కప్రక్కచేరు. "తీరములఁదెట్టువగట్టుసరోజరేణువుల్." నిర్వ. ౧, ఆ. (రూ. తెట్టువలుగట్టు. "వ. చతురంగం బులయవయవంబులుఁజామరచ్ఛత్రకేతుశకలంబులుఁగోదండగదాదండాదిహేతిఖండంబులుం దెరసిపాఱునెత్తురు టేఱులఁ దెట్టువలుగట్టె." భార. ద్రో. ౪, ఆ.)

తెట్టువలుగొను దృ. అ. క్రి. (తెట్టువలు+కొను.) తెట్టువలుగట్టు. (చూ. తెట్టెలుగట్టు.)

తెట్టువు. దే. వి. తెట్టుయొక్క రూపాంతరము.

తెట్టె వై. వి. తెట్టియయొక్క రూపాంతరము.

తెట్టెము. వై. వి. మొత్తము*.

తెట్టెలుగట్టు. దృ. అ. క్రి. (తెట్టెలు+కట్టు.) రాశిపడు. "వ. తెట్టువలుగొన్నమాంసంబులునుదెట్టెలుగట్టినయసిశకలంబులును." కళా. ౮, ఆ.

తెట్టెలుగొను. దృ. అ. క్రి. (తెట్టెలు+కొను.) తెట్టెలుగట్టు. "వ. తెట్టెలుగొనం గూలినకాలుబలంబులును." ఉ, హరి. 3, ఆ.

తెడ్డు. వై. వి. 1. కొయ్యగరిఁటె; 2. పడవత్రోసెడు పలక. (త్రెడ్డుయొక్క రూపాంతరము.)

తెడ్డుమూతికొంగ. దృ. వి. జలపక్షివిశేషము.

తెనమణు. దే. అ. క్రి. శయనించు. "క. హాత్తుకొనియొక్కకొందఱు, నత్తెరువుంగట్టఁబనిచియందఱుక్రియఁదాఁ, దిత్తొకటియుఁగొని తెనమణి, యుత్తరముత్తరమటంచు నొక్కప్రొద్దుకడన్ లేచి." (కొన్ని పుస్తకములయందు తెణమణి అని పాఠమున్నది.) ఆము. ౫, ఆ.

తెనుఁగు. వై. వి. తెలుఁగుయొక్క రూపాంతరము.

తెన్ను. దే. వి. దారి; మార్గము. "తెన్ను నకేనుగాదనను." య. 3, ఆ.

తెన్నుండు. దే. అ. క్రి. పరుండు, శయనించు.

తెప్ప. దే. వి. 1. తెప్పకొయ్య, కట్టుమ్రాను; 2. ప్రోవు. "సీ. తెప్పలైనెత్తావిఱప్పలైపుప్పొళ్లురులగందకొడిత్రోవఁజలుకవలదు." వసు. ౧, ఆ. (తేపయొక్క రూపాంతరము.)

తెప్పదెరలఁగ. దే. త్ర. క్రి. విశే. అతివేగముగా. "గీ. తెప్పదెరలంగబండులేతెంచుచున్న, యవిమహాత్ముతన్నె మిజాతౌరవములు గడఁకనెడ్డసదపమిలోప్పెనుసిరాలి, యులివృనియుల్లమునఁగడు నలుకపుట్టి." భార. అను. ౪, ఆ.

తెప్పలఁదేలు. దే. అ. క్రి. (తెప్పలన్+తేలు.) ఓలలాడు. (ప్రే. తెప్పలఁదేల్చు. "క. అప్పురుషోత్తముఁడునన్ను నట్టురసాబ్ధిన్, దెప్పలఁదేల్చి." కళా. ౬, ఆ.)

తెప్పిర్లు. దే. అ. క్రి. తెప్పిరిల్లుయొక్క రూపాంతరము. "దశావతారదండతమూర్ఛిల్లియుంతనతెప్పిర్లి." ఉ, రా. 3, ఆ.

తెప్పిరిల్లు. దే. అ. క్రి. అపాయమునుండి తేఱు. (చూ. తెప్పిఱు.)

తెప్పిఱు. దే. అ. క్రి. తెప్పిరిలు. "క. పెక్కతిరలుఁగులువేనలు, నెవెవడనెల్లెడలఁగలయసిరితిరుగంటి, తిరుపసిలుద్రావకతె, తెప్పఱవెట్టకొకత్రునైన్యభీమునమూర్ఛ." భార. ద్రో. 3. ఆ.

తెప్పున. దే. త్ర. క్రి. విశే. శీఘ్రముగా.

తెబక. దే. వి. మొత్తము, సమూహము.

తెమడ. దే. వి. శైత్యముచేఁగలిగెడు శ్లేష్మము.

తెమలు. దే. అ. క్రి. చలించు. "క. జముదూతవోలెనచటికి, నమదగతిన్ వేటకాఁడు చనదేరంగా, దెమలకహిరణ్యకుండురి, దుమువులుగాఁగొటికిబొక్కదూఱంబాఱెన్." పంచ. నా. ౨, ఆ.

తెమలుచు. దే. ప్రే. (తెమలఁజేయు.) ఉనుము. (రూ. తెమల్చు. "రొంపివోవనీటఁదెమల్చి." భార. అను. 3, ఆ.)

తెమ్మ. వై. వి. తేమయొక్క రూపాంతరము. "క. తెమ్మెరలుసిమ్మమదగరు, ధమ్ములతెమ్మలకునమ్మదంబులఁజనిహం, జమ్ములతుమ్మెదకొమ్మల, సిమ్మగుకరటమ్ములొమ్మనిభముఖుఁగొలుతున్." కవిస. ౧, ఆ.

తెమ్మెర. దే. వి. (తెమ్మ+ఎర.) 1. చల్లగాలి, మలయమారుతము; "క. తెమ్మెరసోఁకితెమ్మెర." నిజ. 3, ఆ. (ఎరశబ్దమునకు వృత్తియందు గాలి యర్థమని తెలియవలయును.) 2. గాలి. (చూ. తెమ్మ.)

తెర వై. వి. 1. మఱుఁగుచీర*; "చ. తెరయునుమేలుకట్టుఁదగు దీవియలున్ బోలుపొందు." భార. సౌ. ౧, ఆ.—2. అడ్డువల*; "క. ఇటువలెవేటాడకుతటిఁ, దటుకునసొకయిట్టితెరలుదాఁటి వడింబెం, గటనఱుక నెఱుకదొరలా, ర్చుటయుకన్ రాజులును దానిచొప్పునఁజనఁగన్." య. ౨, ఆ.—3. అల*. "తెరలెత్తి సప్తసాగరములుఁబొరలంగ." ఉ, హరి. ౪, ఆ.—4. బ. పరంపర. "క నరవరులయ్యెయిదిక్కుల, కరిగిమహీపతులచేతనరిగొనిధనముల్, దెరలుగఁదెచ్చినమార్గము, పరువడినెఱిఁగింపునాకుఁ బరమమునీంద్రా." భార. సభా. ౧, ఆ.

తెరతెర. వై. వి. పరంపర*. (వానికి దగ్గు తెరతెరగా వచ్చుచున్నది.)

తెరల. దే. వి. కవణము, కబళము.

తెరలఁబాఱు. దే. అ. క్రి. (తెరలన్+పాఱు.) తొలఁగు. "మ. తెరలంబాఱెఁగలంగిగోవులుకడున్ దీనంబులై యోలుచున్." హరి. పూ. ౬, ఆ. (సామర్థ్యమున పాఱు.)

**తెరలిక.** దే. వి. గుంపు, సమూహము.

**తెరలు.** దే. అ. క్రి. 1. తెగ్లు; "క. ఖరకరకరహతి నలనలఁ, దెర లెడుమల్లీమరందవీచికచుట్టుఁ బొ." పాండు. ౧, ఆ.—2. బయలు దేఱు; "క. పురజనములెల్లఁ గుందటఁ, దెరలినసిమ్మటనువాసుదేవ్రుఁ గమకమ, స్ఫురణము ద్రిక్కిఁ జెప్పఁగ, నరుదెంచిన సుతునితోడ నతఁడిట్లనియెన్." జై. 3, ఆ.—3. కలఁగు; "క. అనిలోఁ దెంబుట తొలఁగుట, యనఁ నెవ్వరు నరుఁగాక." భార. కర్ణ. 3, ఆ. "ఊరుప్పు లక్ దెరలిమహార్ణవోదకము త్రిప్పికొనన్." లక్ష్మీ. 3, ఆ.— 4. తొలఁగు*. "పురికొనుచుండెరలుచు." భార. భీష్మ. ౨, ఆ.

**తెరలుచు.** దే. ప్రే. తెరలఁజేయు. (తొలఁగించుటకు.—"క. నరుఁ డాకరఫకునియరుమతిఁ, జోరఁదలఁచునెమనుజసేనసురబలమైనన్, దెరలిచికొనివచ్చేలబడి, గరుగఁదగఁ గలయునెడకు." భార. ద్రో. ౪, ఆ. (చూ. తెరల్చు.)

**తెరలుడు.** దే. వి. బయలుదేఱుట, ప్రయాణము.

**తెరవాఱు.** ద్వి. అ. క్రి. (తెర+పాఱు.) జిడ్డుదేఱితెరగట్టు. (తెర=అల.) "చ. ద్రవిడకుటుంబినుల్ పసుపురాచినతన్ను పుఁదాప క్రిందనం, బువులెరవాఱఁగా." ఆము. ౧, ఆ.

**తెరవేఁట.** ద్వి. వి. తెరయెత్తి ఆడెడు వేఁట. (చూ. పదువేఁట.)

**తెరవేఁటకాఁడు.** ద్వి. వి. తెరయెత్తివేఁటాడెడు వేఁటకాఁడు. "ఉ. అత్తెరవేఁటకాండ్రు యమునాంబు తరంగపరంపరాకృతిన్, ముత్తరమైనసూకరసముత్కరముంగని వేఁటకాండ్రు విల్లెత్తకమున్నె రాజమదికెక్కెడునట్లుగవీనిమిత్తికిం, బుత్తమటంచుఁ బట్టెడలు బోరున డుయ్యభయంకరార్భటిన్." (ఇక్కడ వేఁటకాండ్రు అనఁగా విలువేఁటకాండ్రు అని అర్థము.) సావి. ౪, ఆ.

**తెరువరి.** దే. విశే. (తెరువు+అరి.) దారినడచువాఁడు, పథికుఁడు.

**తెరువాటీఁడు.** దే. విశే. (తెరువాటు+ఈఁడు.) తెరువాటు కాఁడు.

**తెరువాటు.** దే. వి. (తెరువు+అటు.) (దొంగలు) దారిగట్టి కొట్టుట, అభిగ్రహము. "తెరువాటువలనఁ దస్కరులచేతఁ జేటొంది ధనము వాంఛించినతఁడు." భార. అను. ౨, ఆ. ("తెరు వాటుకొట్టి, తెరువాటుకొట్టె." ఇత్యాది స్థలములయందు తెరు వాటుగా కొట్టుటయని తెలియవలెను. అప్పుడు తెరువాటునకు దారికట్టుటమాత్రమర్థము.)

**తెరువాటుకాఁడు.** దే. వి. దారికట్టికొట్టి దోఁచుకొనుదొంగ, పరిపంథి.

**తెరువు.** దే. వి. దారి, మార్గము. "వ. ఇట్లుపన్నగారినగారిపోరువు తెరువునంజనునప్పుడు." ఉ, హరి. ౬, ఆ.

**తెర్లు.** దే. వి. నీళ్లులోనగునవి కాఁగి సలసలపొంగు. వి. నీళ్లులోనగు నవి కాఁగి సలసలపొంగుట. (తెరలుయొక్క రూపాంతరము.)

**తెర్వు.** దే. వి. తెరువుయొక్క రూపాంతరము. (చూ. కట్టిఁడి.)

**తెఱ.** దే. విశే. తెఱపయయినది. (ఉదా. తెఱగంటి, తెఱవ మొ.) (దీనికి వ్యస్తముగా ప్రయోగము కనఁబడదు.)

**తెఱఁగు.** దే. వి. 1. విధము; "క. ఆఱడిఁ జెందుట నీకుమేల్తెఱం గేతలఁపఁగన్." అచ్చ. యు, కాం.—2. క్రమము; "పౌరజనులు జానపదులుతెఱఁగుతో నిచ్చ ననుసరింతురె." భార. ఆశ్ర. ౨, ఆ.—3. చక్కన; "క. వెఱఁగుపడిహర్షరాగము, దఱిఁగినఁగడు వెల్లనైవదనములు వ్రాలన్, దెఱఁగేదిదిచ్చవడిరి." భార. అర. ౭, ఆ.—4. సంధి. "ఉ. కౌరవపాండవుల్ తెఱఁగుగైకొని శాంతతఁ బొందియున్కి మే, లారయనాకునీకుఁగులమంతకునీన్నపకోటికిరిప్ కన్, బోరిలమైన నింతకున బుట్టుమహాపదకావ్యసర్గధరి, త్రీరమ ణాగ్రగణ్యగణుతించి యవశ్యముఁ బొందొనర్పవే." భార. ఉద్యో. 3, ఆ.

**తెఱఁగుపడు.** ద్వి. అ. క్రి. (తెఱఁగు+పడు.) సంధియగు. "గీ. మాటపొందెడిఁ గిమోటమైనల్లనఁ, జేరికౌరవేంద్రు చిత్తవృత్తి, కని గుణంబుగాఁగనానతుండగుచుఁ బ్రా, ర్థించియడుగుకున్నఁ దెఱఁ గువడదు." భార. ఉద్యో. ౧, ఆ. (ప్రే. తెఱఁగువఱచు.)

**తెఱపి.** దే. వి. 1. వివేకము; "చ. ఎఱిఁగినవాఁడు కర్షచదు వెల్లఁ మాని హరిస్వరూపమున్, నెఱయనెఱుంగుఁడాను మది చేరువుదూవు గుణాన రక్తుఁడై, తెఱకువలేక క్రమ్మరుచుదేహధనా ద్యభిలాషయుక్తుఁడై, యెఱుఁగనివానికిం దెలియనీశ్వరలీలలెఱుంగఁ జెప్పమా." భాగ. ౧, స్క. ౧.—౨. ఉపాయము. "క. కనఁగొని యిదినుని యాశ్రమ, మనితంగాతహావొడమియఁ చటికరిగిననాకున్, గనఁ గనుఁగొనకతెఱకువయని." సాం. ౨, ఆ.

**తెఱకొను.** దే. అ. క్రి. (తెఱలు+కొను.) (చూ.) తెఱలు. (సంప్రర్థమున కొను. ప్రే. తెఱకొలుపు.)

**తెఱగంటి.** దే. వి. (తెఱ+కన్ను.) 1. అనిమిషుఁడు; "తెఱ గంటిమూఁకలఁగడింది బలంబు సడాసి." ఉ, రా. ౪, ఆ.—2. అని మిషస్త్రీ. "గీ. కులుకుఁబాయంపుముద్దులగుమ్మగలుగు, బాగను కానికేఁ దెఱగంటిచిగురుఁబోండ్లుఁ, బులుఁగురాచేడియలునఁజక్కఁ లవెలంది, కలునువీనలకంటి చెల్వంబునిఁకేల." సీలా. ౨, ఆ.— 3. చేఁప, అనిమిషము.

**తెఱగంటిఱేఁడు.** దే వి. ఇంద్రుఁడు, లేఖర్షభుఁడు.

**తెఱచు.** దే. స. క్రి. తెఱపచేయు. "ఎ, గీ. నీకరంబులుద్రోవక చీఁకటియును, జెఱచుటకు ఫాలనేత్రంబుతెఱవవలసె." భార. అను. ౪, ఆ.

**తెఱనోటిమెకము.** ద్వి. వి. (తెఱనోరు+మెకము.) సింహము, పంచాస్యము. "గీ. పంచముఖసంజ్ఞపార్వతీపతికిఁగాక, హరి యనఁ శుభాహ్వయంబు శ్రీహరికిఁగాక, యిట్టి తెఱనోటిమెకముల కేలయనుచుఁ, గనలియుగ్రంబులైనసింగములఁ గెడపె." రామా. ౨, ఆ. (ఇట్లు తెఱవామెకము.)

**తెఱప.** దే. వి. 1. తెఱచుట; 2. ఉపశమనము. విశే. మఱుఁగు లేనిది. (తెఱపనేల.)

**తెఱపి.** దే. వి. సందు, అవకాశము. "క. తెఱపిగనిదానవేశ్వరుఁ, డుఱకకృపాణమునసాకుగోత్తిమునెఱకల్, నఱకినఁ గూలెనతండిల, నఱవఱలైపవనహతమహాభ్రమువోలెన్." భార అర. ౬, ఆ.

**తెఱపుమఱపు.** ద్వి. వి. (చిత్తస్వాస్థ్యము తప్పినప్పుడు కలుగు) తబ్బిబ్బు. (వాఁడు జేన్నిపుట్టి తెఱపుమఱపు మాటలాడు చున్నాఁడు.)

**తెఱలు** దే. అ. క్రి. (వానన) బయలువెడలు.

**తెఱవ.** దే. వి. (తెఱ+వా.) ఆఁడుది, ఇంతి. "క. ఉఱవగు నారుగపంటలు, గొఱియలపాఁడియునుదఱచగున్ బురుషులకున్, దెఱవలు చుట్టములయ్యెద, రెఱచియ భుజియింతురర్థినెల్లజనం బుల్." భార. అర. ౪, ఆ.

**తెఱవు.** దే. అ. క్రి. తెఱఁగుయొక్క రూపాంతరము. "క. పిఱితి వియక నాముందఱఁ, దెఱవాయిప్పగిదినాడఁదెఱవా." అచ్చ. అ, కాం.

**తెఱ్ఱ.** దే. విశే. తెఱయొక్క రూపాంతరము. "సీ. బొక్కిబొమ్మును నూఁదబొడ్డునుమిడిపండ్లు తెఱ్ఱనోరును బాఁచి దేఱు మొగము." భల్లా. ౪, ఆ.

**తెల.** వై. విశే. తెల్లయొక్క రూపాంతరము. (ఆమ్రేడితమునందు తెలతెల.) "తెలతెలవేగినప్డు." (తెలతెల—తెలతెలగానని యర్థము.) పార. షా. ౧, ఆ. "క. తలయుంజీరయునోడలున తెలతెలగా." పంచ. నా. ౪, ఆ.)

**తెలగా.** వై. వి. 1. త్రిలింగదేశమునందలి యొక శూద్రజాతి; 2. బ. ఆజాతివారు. (వృత్తియందు దీర్ఘమునకు హ్రస్వము. ఉదా. తెలగబలిజెలు.)

**తెలచు.** దే. స. క్రి. తెలుచుయొక్క రూపాంతరము. (ఇట్లు అకార మధ్యముగా గ్రంథములయందు కానఁబడుచున్నది. ఆ పక్షమున ఇది వెలచు క్రియవంటిదిగా నుండవచ్చును.)

**తెలతెలఁబోవు.** ద్వి. అ. క్రి. (తెలతెల+పోవు.) వెలవెలఁబోవు.

**తెలతెలవాఱు.** ద్వి. అ. క్రి. (తెలతెల+వాఱు.) 1. తెలతెలఁ బోవు; "క. తొలువేల్పుల మొగములు తెల, తెలవాఱఁగఁ దెల్ల వాఱెఁ దెఱవలమోముల్." అచ్చ. బాల, కాం.–2. తెల్లగాతెల్ల వాఱు. "క. తెలతెలవాఱెడివేళను." భాగ. ౧౦, స్కం. ఉ.

**తెలనాకు.** ద్వి. వి. తెల్లనాకుయొక్క రూపాంతరము. "సీ. అడ పంబుతొయ్యలిమడిచియిచ్చినతెలనాకుచిలికచేతియఁదయుండ." కళా. ౨, ఆ.

**తెలవాఱు.** ద్వి. అ. క్రి. తెల్లవాఱుయొక్క రూపాంతరము. "క. తెలవాఱెనపుడుదీపపుఁ, గళికలతోఁదెల్లవాఱఁగాఁదనమోముల్." హంస. ౨, ఆ.

**తెలి.** వై. విశే. 1. తెల్లనిది; "తెలిసవ్వ."–2. నిర్మలము. "ద్వి. తెలిజెందమున జలదేవత నిలిపి." రా. యు, కాం.

**తెలికపిండి.** వై. వి. గానుఁగపిండి, పిణ్యాకము.

**తెలికలు.** వై. వి. బ. నువ్వులు. (వృత్తియందు ఏకవచనాంతము. తెలికపిండి మొ.)

**తెలికవాఁడు.** వై. వి. గాండ్లవాఁడు.

**తెలిగంటి.** ద్వి. వి. (తెలి+కన్ను.) ఆఁడుది, ధవళాక్షి. "సీ. దొప్పృదశ్రీనిల్పు ధవళాంబుజముపోల్కిఁ దెలిగంటినెమ్మోముతెల్ల సయ్యె." ఉ, రా. ౨, ఆ.

**తెలిగాము.** వై. వి. గ్రహవిశేషము, శుక్రుఁడు.

**తెలిగొను.** ద్వి. అ. క్రి. (తెలి+కొను.) ప్రమాణముచేయించు. "క. ముచ్చునుబట్టినమాత్రన, చెచ్చెరదండింపకతనిచేఁదెలిగొని." విజ్ఞా. ప్రా, కాం.

**తెలిదమ్మి.** వై. వి. (తెలి+తమ్మి.) తెల్లదామర, పుండరీకము.

**తెలిదమ్మికంటి.** ద్వి. వి. (తెలిదమ్మి+కన్ను.) విష్ణువు, పుండరీకాక్షుఁడు. "చ. అని తెలిదమ్మికంటి మదినంటిపెనంగొనుకూర్మి నాడినన్." సీలా. ౨, ఆ.

**తెలిపక్కము.** వై. వి. శుక్లపక్షము.

**తెలిపిట్ట.** వై. వి. హంస, శ్వేతగరుత్తు. "సీ. తెలిపిట్టగమిఁజేరఁ దీసితద్దయుబుద్ధి దెలిపి మెల్లననడల్ దీర్పరాదె." సీలా. ౨, ఆ. (ఇట్లు తెలిపులుఁగు మొ.)

**తెలిమెకము.** వై. వి. సింహము.

**తెలిమొదవు.** ద్వి. వి. కామధేనువు.

**తెలియ.** వై. వి. తెలె.

**తెలియు.** దే. అ. క్రి. 1. విదితమగు; "వ. దేవతలకుందెలియ నట్టిది యాతనికిందెలియు." భార. ఉద్యో. ౨, ఆ.–2. విశద మగు; "క. కుళిందకుఁడాద్యంతమును దెలియవినిపించెన్." జై. ౮, ఆ.–3. మేలుకొను; "తెలియకనిద్రించుమగువఁజూచి." పంచ. నా. 3, ఆ.–4. ప్రసన్నతనొందు. "క. చలముకొని యొరులనడుపుట, బలియుండైతెంపునెసిబవరమునకుఁదాఁ, దెలి యుటకాదేయనికురు, కులముఖ్యుఁడుపొంగియతనిఁగొనియాడెఁద గన్." భార. భీష్మ. ౧, ఆ.–స. క్రి. ఎఱుఁగు. "సర్వముఁ దెలిసితినంచుగర్వితమతిన్విహరించితి." భ. ౧, శతకము.

**తెలియేఱు.** ద్వి. వి. ఆకాశగంగ.

**తెలివి.** దే. వి. 1. దేహాత్మాదిభేదజ్ఞానము; 2. వివేకము; "ఇత్తెలి వమనంబునన్ జొనుపు." భార. ద్రో. ౨, ఆ.–3. ప్రకాశము; "గీ. అనిముఖవికాసమడఁగఁగాదిశలకుఁదెలివివచ్చె." రామా. ౮, ఆ.–4. కాంతి; "ఎ, రి. తేటవేలుపుటేటివన్నెటిబొట్టు, లనఁగఁజుక్కలుకనుపట్టెనలరుదెలివి." య. ౨, ఆ.–5. వికాసము; "క. అశంకరుముఖకమలంబుతెలివిగాంచిముదమునన్." భార. ద్రో. ౨, ఆ.–6. ప్రసన్నత; "గీ. నీకుశీఘ్రఁదేర్పుట నెఱయకాదె, సిద్ధమెవ్వారిఁదెలివొందఁజేయనేర్తు." భార. ఉద్యో. 3, ఆ.–7. (నిద్ర) తేఱుట; "క. కలఁగిన పెద్దమనుష్యువినుఁ, తెలివిఁబొరయుసల్లఁదాన." భార. శాం. 3, ఆ.–8. తెలుపు. "దిఙ్ముఖంబులవింతతెలివిసేరె." పాన్. 3, ఆ.

**తెలివికత్తె.** ద్వి. విశే. వివేకముగలది, ప్రాజ్ఞ.

**తెలివికాఁడు.** దే. విశే. వివేకముగలవాఁడు, ప్రాజ్ఞుఁడు.

**తెలివిడి.** దే. వి. 1. దృష్టాంతము; 2. తెలియఁజేయుట.

**తెలుఁగు.** వై. వి. తెనుఁగు, ఆంధ్రము.

**తెలుచు.** దే. స. క్రి. 1. మ్రొక్కు; "క. దేవానాంప్రియుల మ్రొక్కితెలుతుఁగుకవులన్." (కుకవులన్—కుకవులనుగూర్చియనుట, కుకవులకుననియుప్రయోగము.) రాఘ. ౧, ఆ.–2. తేర్చు; "క. ద్రోణులచిత్తముశాంతివొందఁజేయుట, మమఁదెలుచుట." భార. విరా. ౪, ఆ. "నీళ్లకలఁకనిందుపురాచితెలుచుభంగి." వాసి. 3, ఆ.–3. ప్రార్థించు. "క. కోకిలములఁదెలిచినఁబలు, గాకుల పాదిఁబొదలునట్టికష్టపుఁబులుఁగుల్, నాకునసహ్యములనియా, హాకూఁతలు మానఁగలవె యవిప్రార్థనలన్." కళా. ౬, ఆ. (రూ. తెల్చు.–తేర్చుటకు.–"తెల్తుర్ త్రిలోకంబులన్." హరి. ఉ. ౮, ఆ.) (చూ. తెలియు, తెలుపు.)

**తెలుపారు.** ద్వి. అ. క్రి. (తెలుపు+ఆరు.) తెల్లనగు. (రూ. తెల్వారు. "సీ. దుగ్ధార్ణవంబునందువిశాలరమణీయమగునొక్క దీవితెల్వారియుండు." భార. శాం. ౬, ఆ.)

**తెలుపు.** యు. దే. ప్రే. (తెలియఁజేయు.) 1. ఎఱిఁగించు; "క. ఈనారీరత్నముమా, లోనెవ్వరికర్హమగుదెలుపవేకరుణన్." భో. ౭, ఆ.–2. మేలుకొలుపు; "క. కడుఁబడపునిద్రవోయితిఁ, బడఁతీననుఁదెలుపవలదె." భార. ఆర. ౭, ఆ.–3. తేర్చు. (చూ. తెయ్యము.)—వి. ఊఱట.—వై. 1. ధావళ్యము; 2. పరిశుద్ధి*; (చూ. తెలుపువాఱు.) 3. మేహరోగము*. విశే. ధవళము. (రూ. తెల్పు. ఊఱటకు. — "పాలయలుకలనుదెల్పులునటించుచు." మార్క. ౧, ఆ.)

**తెలుపుడు.** దే. వి. ఎఱుక. "తెలుపుడుదెల్పుచప్పుడును." రామా. ౮, ఆ. (రూ. తెల్పుడు.)

**తెలుపుడుసేయు.** ద్వి. స. క్రి. (తెలుపుడు+చేయు.) ఎఱిఁగించు. "రాజునెడఁదప్పకయిప్పనియొప్పమీఱఁగాఁ, దెలుపుడు సేసి." రుక్మి. ౧, ఆ. (రూ. తెల్పుడుసేయు.)

**తెలుపువాటు.** దృ. అ. క్రి. (తెలుపు+పాటు.) తెలుపారు. "సీ. కనుపులో బొప్పారుకొమకున్నబుద్ధి తెలుపు వాటగనగన తెలుపువాటె." లక్ష్మి. 3. ఆ.

**తెలె.** వై. వి. భోజనపాత్రము. "క. ఇనుపతెలె మంటితెలె. తెనుచేయునాకు పెంకఁబీటపయిణ్బో, జనమొనరించుటగదని, మునుచెప్పిరిజాకలకాదిమునివరుతెల్లన్." విజ్ఞా. ఆచా. కాం. (తెలియయొక్క రూపాంతరము.)

**తెల్ల.** వై. విశ. 1. ధవళము; 2. స్పష్టము. (చూ. గానటబినట.) [తెల్ల అనువిశేషణముముందుగల సంజ్ఞావాచకశబ్దములు.—తెల్లకలిగొట్టు (కాసుపాటలిళీ.), తెల్లకాకి (ధ్వాంక్షము.), తెల్లకొక్కెర (బలాక.), తెల్లగగ్గెర (అర్జకముళీ.), తెల్లగడ్డ (లశునము.), తెల్లగన్నేరు (శ్వేతకరవీరముళీ.), తెల్లగచిక (శతశర్కళీ.), తెల్లగలిజేరు (క్షీరపత్రముళీ.), తెల్లగినియ (సునాభముళీ.), తెల్లగిసె (ముశంగిళీ.), తెల్లగురిజె (మధుస్రవళీ.), తెల్లగురిగింజె (శ్వేతపాకిళీ.), తెల్లగోరంట (సైరేయకముళీ.), తెల్లచెఱుకు (తేజనకముళీ.), తెల్లజేనము (వృత్తపర్ణిళీ.), తెల్లజిలకఱ్ఱ (అజాజిళీ.), తెల్లజిల్లేడు (అలర్కముళీ.), తెల్లతెగడ (త్రివృతళీ.), తెల్లదామర (పుండరీకము.), తెల్లదింటెన (అశ్వఖురిళీ.), తెల్లదీవి (శ్వేతద్వీపము.), తెల్లనేలగుమ్మడు (విదారిళీ.), తెల్లపులుగుడు (శ్వేతవాతంగినిళీ.), తెల్లములక (శ్వేతబృహతిళీ.), తెల్లయిరుగుడు (శ్వేతపత్రముళీ.), తెల్లయుప్పి (మాక్తికఫలళీ.), తెల్లబొద్దుగు (జీర్ణవృంతముళీ.), తెల్లవట్టివేరు (లామజ్జకము.), తెల్లవన (హైమవతిళీ.), తెల్లవావిలి (శ్వేతసురసళీ.), తెల్లావలు (సిద్ధార్థము.) ఇత్యాదులు.]

**తెల్లడాలుమెకము.** దృ. వి. సింహము. "క. ఓలిమెయిఁదెల్లడాలుమె, కాలిత్తులమీఁదనడరుకైవడి." అచ్చ. యు, కాం.

**తెల్లన.** వై. వి. తెలుపు. విశ. తెల్లనిది. "క. ఆకులు మిక్కిలి తెల్లన." రామా. యు, కాం. (ముందువిశేషణమగుచో "క. తెల్లని తామరగద్దియ." అచ్చ. బాల, కాం.) (చూ. అలకన.)

**తెల్లనాకు.** దృ. వి. (తెల్లని+ఆకు.) తెల్లని నన్నపు తములపాకు. (ఇక్కడ తెల్లన అనఁగా తెల్లదాకు అని యర్థము.)

**తెల్లనార.** దృ. వి. మత్స్యవిశేషము.

**తెల్లనిదొర.** దృ. వి. 1. శివుఁడు; "క. పెల్లుసెకఁజల్లువిసమా, తెల్లనిదొరకుతుకమోవఁదినిబ్రదుకుటనీ, చల్లఁదనంబునఁగాదే, కల్లోలవతీమతల్లిగంగాతటినీ." ఐజ. ౧, ఆ.—2. బలరాముఁడు.

**తెల్లని.** వై. విశ. తెల్లముయొక్క రూపాంతరము.

**తెల్లము.** వై. విశ. స్పష్టము*. "క. ఇదియేమితెఱఁగుదీనికి, మొదలెయ్యదినాకుఁదెల్ల ముగఁజెప్పుఁడు." భార. ఆది. ౬, ఆ.

**తెల్లయేనుఁగు.** దృ. వి. (తెల్ల+ఏనుఁగు.) ఇంద్రునివెల్లయేనుఁగు, ఐరావతము.)

**తెల్లవాటు.** దృ. అ. క్రి. (తెల్ల+పాటు.) 1. ఉదయమగు; "గీ. తెల్లవాటుటగన్గొనియెల్లవారు." నీలా. 3, ఆ.—2. తెల్లనగు; "ఎ, గీ. తెల్లవాటుచున్నదివియలల్లార్చుచు." భార. ఉద్యో. ౨, ఆ.—3. సారహీనమగు. (వానిపనితెల్లవాటెను.)

**తెవ.** దే. వి. సమూహము. "సీ. సొంపారుతెలిముత్తియంపుజొంపపుటెల్లితెవలునిద్దంపుసురుపులుగాఁగ." అచ్చ. బాల, కాం. (తెగయొక్క రూపాంతరము.)

**తెవడు.** దే. స. క్రి. తిరస్కరించు. "నవపద్మదళములఁదెవడు మెటిులగుఁగనుదోయి." భార. అశ్వ. ౨, ఆ. (తెగడుయొక్క రూపాంతరము.)

**తెవులు.** దే. వి. తెగులుయొక్క రూపాంతరము. "క. కనుఁగొని కృష్ణుఁడుబలుఁడే, శ్రవకిట్లనుఁవాయములకుఁదెవులుగడువెనమ్మెఁ, జన నిచ్చుట కార్యశ, వనఘాకొనిరమ్ము రథమునల్లనవెనుకన్." హరి, పూ. 3, ఆ.

**తెవులుఁగొంటు.** దే. విశ. తెగులుగొంటుయొక్క రూపాంతరము. "సీ. తెవులుగొంటులనైనఁదీర్చి సంకటమునకోర్చిముందటియట్లరూపు సేయ." భార. విరా. ౧, ఆ.

**తెవులుఁగొను.** దే. అ. క్రి. తెగులుగొనుయొక్క రూపాంతరము.

**తెవులుపడు.** దృ. అ. క్రి. (తెవులు+పడు.) వ్యాధిగ్రస్తమగు. "ఎ, గీ. విశ్వసించినసీరుద్రావిననునిద్ర, పోయిననుజాలుకొన్న నుబొర్లుచున్నఁ, దెవులువడ్డనుగుంపైనదిట్టచెడినఁ, జంపఁడనుకంపనెట్టిహింస్రంబునైన." కాశీ. ౪, ఆ.

**తెవ్వగొంటు.** దే. వి. తెవులుగొంటుయొక్క రూపాంతరము. "ఉ. వ్రేఁకనిబందివానికినిబ్రనికిన్ బలికిన్ వివాదికిన్, వ్రేఁకనిమోపువానికినివృద్ధునికిన్ గసుఁజిన్నబిడకున్, వ్రేఁకటియాఁడుమానిసికి వేఁదుటువానికిఁ దెవ్వగొంటుకున్, దేఁకువతోఁడొలంగునదితెల్లముగా నెదురేగుదెంచినన్." విజ్ఞా. ప్రా, కాం.

## తే.

**తేఁకు.** దే. వి. టేఁకుయొక్క రూపాంతరము.

**తేఁకువ.** దే. వి. 1. ధైర్యము; "క. తేఁకువయలరఁగనీగలిఁ, దోకొని చనిచదలరల్నతోరణపట్టికల్, ప్రాఁకెడుఘనగృహములన, ప్పూఁకల విడియించెరాజముఖ్యుండంతన్." భో. ౪, ఆ.-2. భయము. "క. వీఁకమెయిఁగ్రీడికొడుకున్, దాఁకఁగనీకొడుకుదలఁచితటిమి కవిసెఁబే, రాఁకటితోనున్నహరిన్, దేఁకువచెడిచేరుకరిగతింగురుముఖ్యా." భార. ద్రో. ౨, ఆ. "ఉ. అల్లనయింతియిల్లనియి నారసివాసవుకల్మిలేమియున్, దెల్లముగానెఱింగికొనితేఁకువలేకిటవచ్చుటొప్పునా, యుల్లముశంకితంబగుచునుండఁగవేగిరపాటుమేలె." భార. ఉద్యో. ౧, ఆ.

**తేఁజెట్టు.** దే. వి. తెంకాయచెట్టు, నారికేళవృక్షము.

**తేఁటి.** దే. వి. తుమ్మెద, భ్రమరము. "గీ. ఏలప్రేలెదుతేఁటియింతేటికలుగ, సంత్రశలసన్నగాలియోసన్నగాలి, చెల్లునేరోషరసమింత చిలుకచిలుక, సాకెకుందింపచందమాచందమామ." రామా. ౬, ఆ.

**తేఁడు.** దే. అ. క్రి. తెండు, శయనించే. "గీ. అతివపూర్ణేందు భీతిఁదదక్షశాలఁ, దేఁడియతఁడందునినుమడితింద్రఁదోఁప, మింటిపైనుంట కాదని యింటిపైకిఁ, దెచ్చుకొంటెనటంచుఁబెక్కాడ్చెనెడలు." (కొన్ని ప్రతులయందు తెండి అని పాఠమున్నది.) ఆము. ౫, ఆ.

**తేగ.** దే. వి. తాటిమొలక.

**తేగడ.** దే. విశ. తేసినది. (నానెము.)

**తేగము.** వై. వి. ఈవి, త్యాగము.

**తేగాకత్తి.** దృ. చేరకత్తి.

**తేజనకము.** సం. వి అ. పుం. కాకివెదురుళీ.

**తేజనము.** సం. వి. అ. పుం. వెదురు, వేణువుళీ.

**తేజని.** సం. వి. ఈ. స్త్రీ. చోఁగళీ.

**తేజస్సు.** సం. వి. స్. న. 1. ప్రకాశము; 2. ప్రభావము; 3. పరాక్రమము; 4. రేతస్సు. (రూ. తేజము.)

**తేజస్వి.** సం. విశే. (న్. ఈ. న్.) తేజస్సుగలవాఁడు.

**తేజి.** దే. వి. 1. మేలుజాతిగుఱ్ఱము; "ఉ. కోమటులెల్లనర్థపులు గుఱ్ఱనుతెల్లనుదేజులప్పురిన్." విక్ర. ౧, ఆ.—2. గుఱ్ఱము.

**తేజితము.** సం. విశే. (అ. ఆ. అ.) వాఁడిచేయఁబడినది, శాతము.

**తేజీ.** దే. వి. తేజియొక్కరూపాంతరము. (మేలుజాతిగుఱ్ఱమునకు.—"క. అల్లునికినిచ్చె ధాత్రీ, వల్లభుఁడనురక్తినమరవల్లభుహరితో, సుల్లసమాడంజాలెడు, తెల్లనియొకకత్తలానితేజీహయముల్." నై. ౬, ఆ.)

**తేజరిల్లు.** వై. అ. క్రి. ప్రకాశించు. (రూ.) తేజరిలు.

**తేజు.** వై. వి. 1. ప్రకాశము; "క. జేజేరారాబాజోజే, గాజిగినోగిఁ దొగడినెగడఁగాఁజోలెడుమేల్, తేజోనెడుకుత్తుకగల, జేజేకున్ మొగులుదారిసిగజేజేకున్." అచ్చ. బాల, కాం.—2. కాంతి; "గీ. నీలయనుపేరఁదేజోననివ్వటిల్లు, నింతిపెండిలికతతెఱఁగెట్టులనిన." నీలా. ౧, ఆ.—3. ప్రతాపము. "గీ. తేజుగలవారియందు నందియము లేక." అచ్చ. బాల, కాం.

**తేట.** దే. వి. 1. నైర్మల్యము; 2. ప్రసన్నత; 3. తేఱినమజ్జిగలోనగునది. విశే. 1. నిర్మలము; (నీళ్లు మిక్కిలి తేటగా ఉన్నవి.) 2. ప్రసన్నము; (ఇప్పుడు వీని ముఖము తేటగా ఉన్నది.) 3. విశదము. (తేటగా మాటాడుము.)

**తేటతెల్ల.** ద్వ. విశే. 1. మిక్కిలి స్పష్టము; 2. స్పష్టము. "సీ. అనితేటతెల్లగానప్పుడవివరించిపల్కకతొడిఁబడఁబడఁతినతని, కమ్మితివి." హరిశ్చ. ౪, ఆ.

**తేటపడు.** ద్వ. అ. క్రి. విశదమగు. "లలనాజన్మప్రకారంబుతేటపడంగాంచెద." వసు. ౨, ఆ.

**తేటిక.** దే. వి. తెప్ప.

**తేడా.** వై. వి. హెచ్చు.

**తేది.** వై. వి. (సౌరమానమునందు) దినము*.

**తేనియ.** దే. వి. తేనె.

**తేనియతిండి.** దే. వి. తుమ్మెద, మధుపము. "సీ. ముఖమంబురుహమనిముమ్మరంబుగనప్పళించుతేనియతిండిలేఁకలనఁగ." పాండు. 3, ఆ.

**తేనె.** దే. వి. మధువు. (పుట్టతేనె, పెరతేనె అని దీనిభేదములు అనేకములుకలవు.) (తేనియయొక్కరూపాంతరము.)

**తేనెగద్ద.** ద్వ. వి. పక్షివిశేషము.

**తేనెగాజు.** దే. వి. కాచవలయవిశేషము.

**తేనెటీఁగ.** దే. వి. (తేనె+ఈఁగ.) తేనెకూర్చెడియీఁగ, సరఘ.

**తేనెతిండి.** దే. వి. తేనియతిండియొక్కరూపాంతరము.

**తేనెతొల.** దే. వి. భక్ష్యవిశేషము.

**తేనెదానిమ్మ.** ద్వ. వి. తియ్యదానిమ్మ†.

**తేనెమామిడి.** దే. వి. తియ్యమామిడి†.

**తేనెమ్రాను.** దే. వి. కేళముష్టి†.

**తేనెయరఁటి.** దే. వి. (తేనె+అరఁటి.) బూడిదవర్ణపుపండ్లుగల నల్ల అరఁటి†.

**తేప.** దే. వి. 1. తడవ; 2. తెప్ప. "ఉ. కోపమునంహరింపుమదు కుంజరపాండవకోటికెల్లనుం, దేపవుగావెవీవు." భార. భీష్మ. ౨, ఆ.

**తేమ.** వై. వి. తడి. విశే. తడిగలది*. (నేల మిక్కిలి తేమ.) (సంస్కృతమునందువలెఁగాక కొంచెము అర్థభేదము కలిగియుండుట వల్లను కుండమొదలగు దీనివంటి శబ్దములు కొన్ని వైకృతముగా వాడఁబడియుండుటవల్లను ఇదియు వైకృతముగా వ్రాయఁబడియెను.)

**తేమగిల్లు.** వై. అ. క్రి. చెమ్మగిల్లు, ఆర్ద్రమగు.

**తేమనము.** సం. వి. అ. న. 1. తడియుట; 2. మజ్జిగపులుసు.

**తేమము.** సం. వి. అ. పుం. స్తేమము, తడియుట.

**తేమానము.** దే. వి. వర్షి. (కొందఱు తేర అని యొకయర్థము వ్రాసియున్నారు. దానికి తెనుఁగునందు ప్రయోగము కనఁబడలేదు.)

**తేమ్రాను.** దే. వి. తెంకాయ మ్రాను.

**తేయాకు.** దే. వి. (తే+ఆకు.) తే అను ఒకచెనసు ఆకు. (తే అనునది అన్యదేశ్యము.)

**తేయు.** దే. అ. క్రి. అఱుగు.

**తేర.** దే. వి. 1. తేట; (చూ. తేరకొను.) 2. సంబంధములేమి. (చూ. తేరకాఁడు, తేరకత్తె.) విశే. సంబంధములేనిది. (తేరమాట, తేరసొమ్ము మొ.) (చూ. తెకతేర.) క్రి. విశే. 1. వ్యర్థముగా; "శా. నానాసుఖో, పాత్తంబైనవయోనిధానమిది యయ్యాతేరయీవచ్చునే." భాగ. ౯, స్కం.—2. అనాయాసముగా. "తేరతురగతస్కరులఁబట్టి." జై. ౬, ఆ.

**తేరకత్తియ.** ద్వ. విశే. సంబంధములేనిది, అన్యురాలు. (రూ. తేరకత్తె. "ఉ. మఱివారలువశ్యులైనఁదా, నెవ్వరినోల్లకొక్కటయి యింద్రుఁడు చంద్రుఁడటంద్రుబోటిదా, నివ్వలఁదేరకత్తెయగు." ఆము. ౫, ఆ.)

**తేరకాఁడు.** దే. విశే. సంబంధములేనివాఁడు, అన్యుఁడు. "క. ఊరుబాహుబలముగల్గియు, వెరవిఁడినైతేరకానివిధమున నకటా, కరుణయెదలోనఁదలఁపక, దురమునజమువాతనిన్నుఁద్రోచితిఁబుత్రా." గా. యు, కాం. (ఈ పదమునకు తేరకడనుండు అర్థములను బట్టి ఇతరములైన అర్థముల నూహించునది.)

**తేరకు.** దే. ద్ర. క్రి. విశే. 1. వ్యర్థముగా; "క. తేరకుమదీవ్వర భటులఁదెగటార్చినయ, వైవ్వరినిఁకందెగఁజూచెద." ఉ. రా. 3, ఆ.—2. అనాయాసముగా. (వానికిసొత్తు తేరకువచ్చెను.)

**తేరకుఁదేర.** దే. అవ్య. క్రి. వి. (తేరకున్+తేర.) మిక్కిలి అనాయాసముగా. "బళిరాతేరకుఁదేరచిక్కెనిటులీబంగారుకుండ." పాండు. 3, ఆ.

**తేరకొను.** దే. అ. క్రి. తేటపడు. "ఎ, గీ. మోముఁ, దేరకొనఁ జూచినపుడకన్నీరువడిసె." (తేరకొనన్=తేటపడ. ఇట్లంతట గ్రహించునది.) సావి. 3, ఆ. (దీనికి క్రియావిశేషణమునందే ప్రయోగము కానఁబడియెడి.)

**తేరు.** దే. అ. క్రి. కలుగు. "సీ. తనరుచొక్కపురాణమునిదంపతులుదమకంబులుదేర నెయ్యంబుమీఱ." రాఘ. ౧, ఆ.—వి. 1. రథము; 2. బండి. "క. మిన్నునకారకనెగయుదు, తన్ననమర్థుండుగాఁడుతల్పగతుండీ, చిన్నికుమారుఁడుతేరే, విన్ననవున నెగసెకీనివిధమెట్టిదియో." భాగ. ౧౦, స్కం. పూ.

**తేరుకాఁడు.** దే. వి. (చూ.) రథికుఁడు.

**తేరుపూన్పరి.** దే. వి. (తేరుపూన్పు+అరి.) సారథి. "మాళ్లుతెట్ట కుంగుదురగుతేరుపూన్పరియు." అచ్చ. ఉ. కాం.

**తేజి.** దే. వి. కాఁచితేజీనసెయ్య.

**తేజిచూపు.** దే. వి. తేఁకొనఁజూచుట. "జంకెలుతేజిచూపు లెక సక్కఁములుఁ." భాగ. ౧౦, స్కం. ఉ.

**తేఱు.** దే. అ. క్రి. 1. తేటపడు; "కామినీకాంతులకంకఁ దేఱె." స్వా. 3, ఆ.—2. ప్రసన్నతనొందు; "తేఱెబలదేవుఁడు." హరి. ఉ. ౪, ఆ.—3. ఊఅడిల్లు; 4. తేఱుకొను; (వాఁడు ఇంకను తేఱ లేదు.) 5. తెప్పఱు; "క. తేఱుదురరిపులనిప్పుడ, మీఱుదురని గడిఁది మూర్ఛమెయినిట్లున్నా, రాఱనితేజంబులతో, నీఱుపయింగ వసియున్ననిప్పుకఁబోలెఁ." రా. యు, కాం.—6. కలుగు; "ఉ. శోయగంబుస్రైఁచేఱఁగఁ బ్రౌఢదంపతులతీరుసఁజెంపెసలారిరిద్ద ఱుఁ." హరి. ఉ. 2, ఆ.—7. ముగియు; (చూ. తేఱుచే.) 8. తేఁకొను. "క. ఓజ్రేఁదసీకుమదివే, మాఱునుగందంగనేలమానని కనుకఁ, దేజికనుఁగొనఁచోమజే, మాఱుపడంగలరెయెట్టిమన్ని లయినఁ." అచ్చ. అర, కాం. (ఇట్లు తేజిచూచు మొ.) (దీనికి ఈయర్థమున క్త్వార్థమునందే ప్రయోగము కానఁబడుచున్నది.)

**తేఱుకొను.** దే. అ. క్రి. స్పష్టతనొందు.

**తేఱుగడ.** దే. వి. 1. ముగియిక; 2. తెలివిడి.

**తేఱుచే.** దే. ప్రే. (తేఱఁజేయు.) 1. ప్రసన్నతనొందించు; 2. చేంపు. (ఈ యర్థమునందు తీఱుచు అనియే ఉండవచ్చును. అయినను వ్రాఁతప్రతులయందు పెక్కుచోట్ల తేఱుచు అని కానఁబడుచున్నది.) (రూ. తేర్చు.) ప్రసన్నతనొందించుటకు.—"గీ. తలఁకికురుపతి తొను జుట్టలునుసాంబుఁ, దెఱవతోఁదగఁగొనివచ్చి తేర్చుటయును, దెజెబలదేవుఁడు." హరి. ఉ. ౪, ఆ.—చంపుటకు.—(చూ. గరువము.)

**తేలగిలఁబడు.** ద్వ. అ. క్రి. (తేలగిలఁ+పడు.) తేలగిల్లు. "సీ. పరువంపుఁజినుకులపనఁగ్రొవ్వగొనితేలగిలఁబడువానకోయి లలయొప్ప." హరి. పూ. ౯, ఆ. (స్వార్థమున పడు.)

**తేలగిల్లు.** దే. అ. క్రి. 1. పైకితేలు; (చూ. తీపు.) 2. పరవశమగు. (రూ. తేలగిలు. పరవశమగుటకు.—"ద్వి. మీఱిన మదమునమెయితేలగిలఁగ." హరిశ్చ. ౨, భా.)

**తేలవేయు.** దే. స. క్రి. తేలగిలఁజేయు. (వాఁడు కన్నులు తేలవేసినాఁడు.)

**తేలాడు.** దే. అ. క్రి. (తేలి+ఆడు.) తేలు. "గీ. చులుకనిదిగానఁదేలాడెఁజూపులపుడు." రస. 3, గుచ్ఛము. (దీని మొదటి రూపము తేలియాడు. "ఎ, గీ. అంబికానాయకధ్యానహర్షజలధి, మధ్యమునఁదేలియాడెడుమనసుమనసు." భీ. 3, ఆ.) (చూ. ఊఁగాడు.)

**తేలిక.** దే. వి. లఘుత్వము. విశే. లఘువు.

**తేలిపోవు.** దే. అ. క్రి. 1. హానిచేయకతొలఁగిపోవు; (వానికి వచ్చిన ఆపద తేలిపోయెను.) 2. తొలఁగిపోవు. "మత్తకోకిల. అసంఖ్యయాదవసేనకుఁ, దేలిపోవక చక్కనయ్యెడు ధీరులెవ్వరు పోరులఁ." భార. ఆది. ౭, ఆ.

**తేలు.** దే. అ. క్రి. 1. నీళ్లలో మునుఁగక మీఁద సంచరించు. "వ. మునుంగుచుందేలుచు." భీ. ౫, ఆ.—2. నీళ్లలో క్రీడించు; "శా. సంసారార్ణవసారమన్మథసుధాసారంబునందేలఁగఁ." ఉ, హరి. ౨, ఆ.—3. స్నానముచేయు; "సీ. మంగళస్నానసంభ్రమముదెల్పెడురీతిఁగెలనఁగెందామరకొలనఁదేలి." విజ. ౧, ఆ.—4. తేలగిల్లు; "తేలెడుకన్నుదోయి." పాండు. 3, ఆ.—5. పొడచూపు. "సెలవుల్ వెనసాకుచుఁబ్బోయె వృక్షమండలి కయితేలుచుఁ." ఆము. 3, ఆ.—వి. వృశ్చికము.

**తేలుకొండి.** దే. వి. వృశ్చికాళి.

**తేలుచే.** దే. ప్రే. తేలఁజేయు. (రూ. తేల్చు.)

**తేలుమణె.** మి. వి. తేలుకొండి.

**తేలుమీను.** ద్వ. వి. (జ్యో.) చిచ్చిమము.

**తేలుమొన.** దే. వి. తేలుకొండి.

**తేలురాసి.** ద్వ. వి. వృశ్చికరాశి.

**తేలువాఱు.** దే. అ. క్రి. (తేలు+పాఱు.) పుట్టు. "చ. ఆకి వినుతించుచున్నహృదయంబునక్షత్క్రపతేలువ్వాఱఁగాఁ, గనుఁగొని." రుక్మాం. ౧, ఆ.

**తేవ.** దే. వి. ఉత్సవవిశేషము.

**తేవనము.** సం. వి. అ. న. 1. ఆటతోఁట; 2. ఆట.

## తై.

**తైజసము.** సం. వి. అ. న. బంగారు వెండిలోనగుధాతుద్రవ్యము. పుం. రాజసగుణము.

**తైజసావర్తని.** సం. వి. ఈ. స్త్రీ. బంగారులోనగునవి కరఁగుమూస.

**తైతిలము.** సం. వి. అ. న. ఒక కరణము. (చూ. కరణము.) పుం. మంజెఁగ.

**తైత్తిరము.** సం. వి. అ. న. తిత్తిరిపక్షుల సమూహము.

**తైరు.** దే. వి. పెరుగు, దధి. పాంచా. ౪, ఆ. (మొదటిరూపము తయిరు.)

**తైర్థికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తీర్థసేవ చేయువాఁడు.

**తైలపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చిల్లమడ్డి; (ఇది దేవదారుబంకచే చేయఁబడి సరళద్రవమను పేరుగలది.) 2. తీతచందనము.

**తైలపాయిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. గబ్బిలము; 2. ఎఱ్ఱతోఁటకూర.

**తైలము.** సం. వి. అ. న. నూనె. (ఇది ఏరండాదిశబ్దపూర్వకమైనప్పుడు తత్తద్ద్రవద్రవ్యమును తెలియఁజేయును. ఏరండతైలము మొ.)

**తైలికుఁడు.** సం. వి. అ. పుం. గాండ్లవాఁడు.

**తైలీనము.** సం. విశే. (అ. ఆ. అ.) తిలలుపండునది. (పొలము.)

**తైషము.** సం. వి. అ. పుం. పుష్యమాసము, పౌషము.

## తొ.

**తొంక.** దే. వి. తోఁకయొక్కరూపాంతరము. "సీ. తొంకతోఁ జుట్టికడంకమింటికివైచినిడువాల్కపాలదిండిఁబుడమిఁగెడపి." అచ్చ. సుం, కాం.

**తొంగలి.** దే. విశే. 1. వాలునది; "తొంగలిఱెప్పలందొలఁగఁ ద్రోయుచు." స్వా. ౨, ఆ.—2. స్రవించునది. "ఉ. తొంగలిపువ్వుఁదేనియలదూఁకొనిమత్తిలితుమ్మెదల్ పయిం, బొంగుచ వ్రాల." య. ౪, ఆ.

**తొంగలించు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "క. కనియను రాగవికాసము, తనమనమునఁదొంగలింపఁదగగాఢాలిం, గనమాచరించినెయ్యెరి, బునఁగుశలప్రశ్న చేసిముదమునఁబలికెఁ." భాగ.

౩, స్కం.—2. ప్రకాశించు; "అనిశమురాంతకుండుదరహాసము మోమునఁదొంగలింప." ఉ, హరి. ౨, ఆ.—3. వికసించు; "గీ. సేముఖాంబుజాతనిర్ముక్తహరికథా, మృతముఁద్రావఁద్రావమేను వొదలె, పంతమానెనీరువట్టునాఁకలియును, దూరమయ్యెమనముఁ దొంగలించె." భాగ. ౧౦, స్కం. పూ.—4. వర్ధిల్లు; "ఉ. ధర్మమునఙ్మనంబుసతతంబుఁబ్రవృద్ధముగా మనంబునఙ్, ధర్మము నొంగలింప." మార్క. 3, ఆ.—5. ప్రసరించు; "సమ్మదాశ్రు వులొకనుఁగవఁదొంగలింప." విక్ర. ౨, ఆ.—6. నిక్కు. సై. ౧, ఆ.

**తొంగలిగొను.** దే. అ. క్రి. (తొంగలి+కొను.) తొంగలించు. "క. తొంగలిఱెప్పలమెఱుఁగులఁ, దొంగలిగొనుమేను." షో. ౨, ఆ.

**తొంగలిపాట్లు.** ద్వి. వి. బ. నమస్కృతి. "రగడ. కృష్ణకోటి యనుక్షేత్రములోని మధుద్విషునకునిదె తొంగలిపాట్లని." హంస. ౪, ఆ.

**తొంగిళ్లు.** దే. వి. బ. నీళ్లలోనగువానిబొట్లు. "ద్వి. తొంగిళ్ల గార్చిరితోనెత్తివిడుచు." (తొంగిళ్లు=తొంగిళ్లగా=బొట్టుబొట్టుగా.) భల్లా. 3, భా. "ద్వి. అనిశంబుబెజ్జమహాదేవితాను, జననియై ప్రాణేశుఁదనయుఁగావించి, తొంగిళ్లపైనిడిలింగమూర్తికిని, యంగన గావించె నభ్యంజనంబు." (తొంగిళ్లపైనిడి ఇక్కడ తొంగిళ్లు అనఁగా నూనెబొట్లు.) భల్లా. 3, భా. (ఇక్కడ ప్రాసయతిగా నున్నది. ఇది సంప్రదాయముకాదు.)

**తొంగు.** దే. అ. క్రి. 1. వాలు; "క. అంగనయిస్సాళ్లకుముని, చెంగటికింబాఱిపాఱి సేవలుగావిం, చంగాఁబోదువు నేఁడటు, తొంగియుఁజూడవఁడేమిదోసముచేసితి." విజ. 3, ఆ. -2. శయనించు. "ఎ, గీ. ఇందఱకునిట్టిసేమర్మమెఱుకపడఁగఁ, దొడరిబయలేలపడితివేతొంగియున్న, సుంకరీతలమూటకుసుంకమెంత, యనుట యిట్లమ్మచెలిమోసమగుఁగదమ్మ." చమ. ౨, ఆ. (ఈ యర్థమం దుక్త్వర్థకముమాత్రమే కానఁబడుచున్నది.)

**తొంట.** దే. వి. 1. చెట్టుపట్ట, తివ్వక్కు; 2. కనవువెంట.

**తొంటచేతివాఁడు.** ద్వి. వి. (తొంటచేయి+వాఁడు.) ఈచేఁబోయిన చేయికలవాఁడు, కుకరుఁడు.

**తొంటచేయి.** ద్వి. వి. ఈచేఁబోయినచేయి.

**తొంటి.** దే. విశే. తొల్లిటి. (తొంటిపుట్టువు.)

**తొండ.** దే. వి. సరటము.

**తొండపుఁద్రాడు.** ద్వి. వి. (తొండము+త్రాడు.) కపిలెబొక్కెన తోఁకకుకట్టెడు త్రాడు. (దీనిని తొండాపుఁద్రాడం దురు.)

**తొండపుదోమ.** ద్వి. వి. (తొండము+దోమ.) నిడుపుముక్కుగల యొకదినుసు పెద్దదోమ, ఘూణి. (ఇదే యేనికదోమ.)

**తొండము.** వై. వి. 1. గజహస్తము*; 2. కపిలెబొక్కెనతోఁక*.

**తొండరూపురిక్క.** ద్వి. వి. పుష్యమీనక్షత్రము.

**తొండాడు.** దే. స. క్రి. త్వరపఱచు.

**తొండి.** దే. వి. దొండియొక్కరూపాంతరము.

**తొండు.** దే. విశే. ప్రాలుమాలినవాఁడు, సోమరి.

**తొండొరు.** దే విశే.———వై.———

**తొండ్లి.** దే. వి. ఒకానొకచెట్టు. హంస. ౪, ఆ.

**తొంద.** వై. వి. బొజ్జపెట్టినవాఁడు, తుందిలుఁడు.

**తొందర.** వై. వి. (తొర+తొర.) 1. మిక్కిలి సంభ్రమము; 2. సంభ్రమము; 3. బాధ. (చూ. తొందరచేయు.)

**తొందరచేయు.** వై. స. క్రి. బాధించు. "చ. విలవిలనైరృతిఙ్ విగతపిమ్మనిఁజేసితివార్ధినాథునిఙ్, దొలుతజయించితిఙ్ బవనుఁ దొందరచేసితి." అని. ౫, ఆ.

**తొందరపడు.** వై. అ. క్రి. సంభ్రమించు.

**తొందరపాటు.** వై. వి. తొందరపడుట.

**తొందళము.** దే. వి. రెండుమూడు దినుసుల కూరలుచేరిన దప్పళము.

**తొందు.** వై. విశే. (చూ.) తొంద.

**తొంబ.** గ్రా. వి. గుంపు, మూఁక.

**తొంబండ్రు.** ద్వి. స. బ. తొంబదిమంది. (తొంబదికి మహన్మహత్యర్థకరూపము.)

**తొంబది.** ద్వి. స. (తొమ్మిది+పది.) తొమ్మిదిపదులు.

**తొంబనూఱు.** ద్వి. స. (తొంబది+నూఱు.) తొంబదినూఱులు. "గీ. తొంబనూఱునుదొంబదితొమ్మిదియును, జలజములఁబూజ చేసెను శార్ఙ్గపాణి." భీ. ౬, ఆ.

**తొకతొక.** దే. విశే. (చూ.) తొక్కు. (మాట.) (చూ. తుంపిన లాడు.)

**తొక్క.** వై. వి. చెట్టులోనగువానితోలు, పట్ట.

**తొక్కట.** దే. వి. సంకటము. "సీ. రిక్కరాయనిఁబాయఁ దొక్కటగల్గినట్లొక్కటమై కార్శ్యముప్పతిల్ల." శశాం. ౫, ఆ. (రూ. తొక్కటము. "క. తామరసనేత్రఖీనల, తోమొనసిజయింప లేకతొక్కటమునసెం, తోమలఁకలఁబడి స్రుక్కుచు, వేమఱు వెక్కులులుగ్రాఁగివేఁగుచునుండెఙ్." రసి. ౨, ఆ.) (త్రొక్కటయొక్కరూపాంతరము.)

**తొక్కటపడు.** ద్వి. అ. క్రి. సంకటపడు. "ఎ, గీ. దైన్యమాకారమైనచందమునసున్న, వానిఁదమయన్నఁగనుఁగొనివారు వెఱఁగు, పడిబెయంపడి తొక్కటపడికటకటఁ, బడిదిగుల్పడివడఁకుచుభక్తిఁజేరి." ఉ, రా. ౬, ఆ. (త్రొక్కటపడుయొక్కరూపాంతరము.).

**తొక్కటపాటు.** ద్వి. వి. సంకటపాటు. "చ. వలుదపిఱుందు భారమునవారని తొక్కటపాటుమీఱఁగా." ఉ, రా. ౭, ఆ. (త్రొక్కటపాటుయొక్కరూపాంతరము.)

**తొక్కిస.** దే. వి. మల్లబంధవిశేషము.

**తొక్కు.** దే. స. క్రి. ఉప్పునుకారమునుచేర్చిమామిడికాయలులోనగువానిని ఱోటిలోవేసి చిదియఁగొట్టు. వి. ఉప్పును కారమును చేర్చి ఱోటిలోవేసి చిదియఁగొట్టిన మామిడికాయలోనగువాని ముద్ద. విశే. అవ్యక్తము. (బిడ్డలమాట.) "క. కలయనూరార్చెఁ దనతొక్కుపలుకులొప్ప. వ. వానియవ్యక్తవచనంబులువినియం దఱునేద్పుడిగిరి." భార. ఆది. ౬, ఆ. "సీ. ముద్దియయల తొక్కుముద్దారుపలుకులువినఁగనుత్తలపడువేడుకయును." (ఇక్కడ సిగ్గుచేత తొక్కు అని యెఱుంగునది.) హరి ఉ. 3, ఆ.

**తొక్కుడు.** దే. విశే. ఉప్పునుకారమునుచేర్చి ఱోటిలోవేసితొక్కినది. (మామిడికాయలోనగునది.)

**తొగ.** యు. దే. వి. 1. కలువ; 2. సమూహము; "తరల. అగములెక్కుచు మిన్నుముట్టుచుహుంకరించుబలంబుతో, మృగమదంబునడంగఁజేయుచుతేనికప్పు చెలంగఁగా, నగలుఘీంకృతిఁగా

గాఢకోటులఁబొఁగపెట్టుచునుఁడెను, తొంగతొంగల్ వెడవింటబోయ సఁదొడుకవచ్చినవాఁడలో." విజ. 3, ఆ.—3. విధము; "ఎ, గీ. తొంగలగమలఁబుడుకులొంగులు రాజిల్లంగఁ, గడలుమిన్నుముట్టకడలు గాఁగఁ, బొడిచెఁశీతకరుఁడు." భాగ. ౧౦, స్కం.—వై. వి. కష్టము. "ద్వి. తొంగలుజానకియింకఁదొలఁగఁగాఁగనైచు." గా. యు, కాం.—విశే. కష్టుఁడు. (చూ. సమూహారును అర్థమున దాహరణము.)

**తొంగకంటి.** దే. వి. (తొంగ+కన్ను.) 1. తొంగలవంటి కన్నులు గల ఆఁడుది; 2. ఆఁడుది.

**తొంగచెలికాఁడు.** దే. వి. చంద్రుఁడు, కుముదబాంధవుఁడు.

**తొంగట.** దే. వి. గుడ్డలునేసి బ్రదికెడు ఒకానొకజాతి. (తొంగట వాఁడు, తొంగటది.) "తొంగటసెట్టి." విజ. (తొంగటరేకు మొ.)

**తొంగడు.** దే. వి. లోపలికణఁగుట. "ద్వి. తొంగడించుకయులేక తోరముగాక, మిగులవస్త్రములునైమించుపెందొడలు." గా. యు, కాం.

**తొంగర.** వై. వి. ఒగరు, గువరము.

**తొంగరి.** వై. వి. 1. కందిచెట్టు; 2. అడవికందిపోఁగ; 3. సురాష్ట్రదేశపు మన్ను.

**తొంగరు.** దే. వి. 1. ఎఱ్ఱనగాలు; 2. ఎఱుపు. (చూ. కసినము.) విశే. ఎఱ్ఱనిది. "క. అగలుంగుంకుమపుష్పమను, దొంగరుంజేలలున సీతుఁద్రోవంగలవే." పాండు. ౪, ఆ.

**తొంగరుకొను.** దే. అ. క్రి. ఎఱ్ఱనగు. (ప్రే. తొంగరుకొలుపు. ఆము. ౨, ఆ.)

**తొంగఱేఁడు.** దే. వి. చంద్రుఁడు. (రూ.) తొంగలఱేఁడు. (ఇట్లు తొంగదొర.)

**తొంగవిందు.** దే. వి. చంద్రుఁడు, కుముదబాంధవుఁడు. "సీ. తొంగవిందురాచల్వజగతివన్నియమీఱసురపొన్నపుప్పొడి కురియఁ నొడఁగె." భాను. ౨, ఆ. (ఇట్లు తొంగచుట్టము.)

**తొంగసూడు.** దే. వి. సూర్యుఁడు. "క. తొంగసూడుగ్రుంకె దట్టం, బుగఁజీఁకటుతొందవెరిక్కమొత్తమువొడమెన్." నీలా. 3, ఆ.

**తొచ్చియము.** వై. వి. (చూ.) తొచ్చెము.

**తొచ్చెము.** వై. వి. తుచ్ఛవచనము. "వ. రఘువరులనచ్చరితొచ్చయంబులనుచ్చరించుచుఁదొచ్చెంబులఁజొచ్చునేయుచు." రామా. ౫, ఆ. (తొచ్చియముయొక్కరూపాంతరము.)

**తొటతొట.** దే. వి. 1. తొరఁగుటయందగు ధ్వన్యనుకరణము; "క. తొటతొటపుప్పులుదొఱఁగఁగ." భల్లా. ౨, ఆ.—2. పడుట యందగు ధ్వన్యనుకరణము. "క. తొటతొటచినుకులువడివడిఁ, దటపటపెనుగాలివిసరిధారాళంబై, పొటపొటకురియఁగఁదొడఁగెన్, బెటపెటనుఱుముచునువానఁబిడుగులువడియెన్." శేష. ౧, ఆ. (వాడుకయందు తుటతుట అని కనఁబడుచున్నది.)

**తొట్ట.** దే. విశే. స్థూలము. (పెదవి.) "సీ. అత్యంతగాఢదంతాగ్రపీడనమునఁ దొట్టవాతెఱనెత్తురుట్టిపడఁగ." నై. ౭, ఆ.

**తొట్టగిలఁబడు.** ద్వ. అ. క్రి. (తొట్టగిలన్+పడు.) తొట్రుపడు. "క. పెట్టకపోవనియాఁకటఁ, దొట్టగిల్లఁబడుచుఁబడుచుదరదురఁజునివే, నట్టింటఁగ్రుచ్చుచుండిన, నెట్టుననన్జాలకమ్మ గేక్షణభీతిన్." పాండు. ౪, ఆ.

**తొట్టగిల్లు.** దే. అ. క్రి. 1. అతిశయించు; (చూ. తీపు.)—2. కలుగు. "దానివెమ్మెయిన్దరలఁగఁ దీయలేకవగదట్టముగా మదిఁదొట్టగిల్ల." భాగ. ౧౦, స్కం. (రూ. తొట్టగిలు.)

**తొట్టి.** దే. వి. 1. నోరు వెడల్పును అడుగుసన్నమునైన గంపవంటి మట్టిపాత్రము; 2. పసులు నీళ్లు త్రాగుటలోనగువాని కుపయుక్తముగ ఱాతితోఁగట్టినకట్టడము; 3. కొప్పెర. "చ. తడియకముందు నైలపరిషిక్తకటాహముపోలుదానురన్, నొడికెలిపట్టెరాహుల్పు విధుం గాంచెంచినటితిఁ బూపఁగ్రొ; మ్ముదుఁగుంకతోఁగఁఫిత్రకరిమాడ్కిసుకన్యఁడుచొచ్చెబిట్టుగా, నశేషమనూనెతొట్టిబలియుర్ హరిదాసులుసత్యసంపదన్." హై. ౪, ఆ.

**తొట్టికట్టు.** దే. వి. లోఁగిలి. "సీ. దురిమలోఁదెఱగంటిదొంన గెల్చిననాటి కదలువ్రాసినతొట్టికట్లుదాఁటి." య. ౪, ఆ.

**తొట్టియ.** దే. వి. నేయువాఁడు నూలుకండెనుంచుకొనెడు నాళె.

**తొట్టిల.** దే. వి. తొట్ల. "(చం.) దంగఁగల్ కదలించు కల్పతొట్లిలఁ గుమారుఁగూఁతును పుట్టించి." (పాఠాంతరము తొట్టెల.) వసు. 3, ఆ.

**తొట్టు.** దే. అ. క్రి. 1. వ్యాపించు; "ఎ, గీ. జనములానందముఁదేలజగములెల్లఁ, దొట్టనిండారువెన్నెలనిట్టవోసెచె." నిర్వ. ౬, ఆ.—2. ప్రవహించు; "మహాస్రగ్ధర. శత్రుసీరవ్రజంబున్, దుసమధ్యదచ్ఛేదితంబు దొరఁగినమువ్వలలెతొట్టెనయ్యుర్విభూమిన్." భార. ఆర. ౫, ఆ.—3. స్రవించు; "కన్నులబాష్పముల్ దొట్ట." భాగ. ౯, స్కం.—4. ఎగదట్టు; "క. ధరిత్రీవిభుఁడువేయిచేతుల, నావాహినిసిరులొట్టుసట్టుగఁబట్టెన్." ఖి. పు. ౬, ఆ.—5. నిండుకొను; "వ. పీగ వేశంబునరాజద్వారంబు సందొట్టిరి." పా. ౪, ఆ.—6. నాటు; "తొట్టినబాణముల్ తొలఁగఁద్రొచి." గా. యు, కాం.—7. జరగు. "పొట్టలుచీలిసఁదొట్టువారు." గా. యు, కాం.—స. క్రి. 1. స్పృశించు; "సీ. గురుమెకంబులనట్లు కూల్చినకీడుదాఁదొలఁగునేశిరసులఁ దొట్టుకొనక." పు. ౨, ఆ.—2. అవలంబించు; (చూ. తిన్నశబ్దము కడ సౌమ్యము అనునర్థమున దాహరణము.) — 3. మొదలుకొను. "క. వనకేళీకౌతుకమునఁ, జనియెను శర్మిష్ఠఁదొట్టినఖులెల్లముదంబునఁగొలిచిరాఁగ." భార. ఆది. 3, ఆ.—(ఈ యర్థమునకు క్త్వార్థమునందే ప్రయోగము.) వి. 1. చెఱువులోపలి పొలము; 2. స్పృక్కు; "గీ. చాలుఁబాలువగవఁగాలంబుగాదిది, లంకచేరగాజ్యలక్ష్మిగట్టెగఁ, గొఱఁగెల్లెఁదీఱఁ గోర్కులుసమకూఱఁ, దొట్టువాసెసింకదొసఁగులేదు." రా. యు, కాం.—3. పడుటయందగు ధ్వన్యనుకరణము; "క. అట్టెవిరిపట్టికోలన్, దొట్టున యంత్రంబుపడెను." పాంచా. ౨, ఆ.—4. తెట్టువ. (అనికొందఱు.)

**తొట్టుకొను.** దే. అ. క్రి. తొట్టు. (వ్యాపించుటకు.—"క. తొట్టుకొనినంజకెంపు, ప్పట్టునరఁబొసిసితగభస్తినెదురుకో, నట్టెనిరివచ్చుటకునై, పట్టినకెంబట్టుదిడ్డిపాలకినోలెన్." రామా. ౨, ఆ.) (స్వార్థమున కొను.)

**తొట్టువ.** దే. వి. తెట్టువ. (దీనికియర్థము ఒకానొకచో వ్రాయఁబడియున్నది.)

**తొట్టె.** దే. వి. తొట్టియయొక్కరూపాంతరము.

**తొట్టెల.** దే. వి. తొట్ల. (చూ. తొట్టిల.)

**తొట్రు.** దే. వి. తొట్రి.

**తొట్రిలఁబడు.** ద్వ. అ. క్రి. (తొట్రిలన్+పడు.) తొట్రుపడు, సంభ్రమించు. "చ. మొగంబునసత్రులువెల్లిగొల్పఁదొట్రిలఁబడుఁజల్లనఁజెదరుజెందముఁగూడఁగఁ దెచ్చునన్నఁగే, వశమునముట్టనెవ్వరికిఁవచ్చుననన్." భార. విరా. ౨, ఆ.

**తొట్రిల్లు.** దే. అ. క్రి. 1. తడఁబడు; "ఎలుంగుగద్గదికన్ దొట్రిల్లన్." శర. ౨, ఆ.—2. భేదిల్లు. "సీ. భగదత్తుగజమ్ము

పల్లునుఁజేసికి పటుభల్లమునఁజేసిపక్షివనిత, కడుప్రదొట్రిల్లిన." మార్క. ౧, ఆ. (రూ. తొట్రిలు, తడఁబడుటకు.—"మ. ఆతని పజ్జన్దగఁదానునేగెఁ బుపర్వంబున్ పొరింద్రొట్రిలన్." భార. అర. ౭, ఆ. "క. ఓయమునానదిరీయం, దాయతముగనాతువల యుపవనాబాంబున్, జేయఁగరావోతేనో, తోయములనిపిలిచెనెలుఁగుతొట్రిలఁబెలుచన్." హరి. ఉ. ౨, ఆ.)

**తొట్రు.** దే. వి. సంభ్రమము.

**తొట్రుకొను.** దే. అ. క్రి. తొట్రుపడు. "గీ. తొట్రుకొను నడలునువెడదొక్కుకులుకు, ఉల్లములనిగ్గెలుంగమియును ఘటించి, జవ్వనులకును మరలనైవముఁదెచ్చె, వారుణియునెట్టిసిద్ధౌషధీరసంబొ." కపిక. ౪, ఆ. (ప్రే. తొట్రుకొలుపు.)

**తొట్రుపడు.** ద్వి. అ. క్రి. 1. సంభ్రమించు; "తొట్రుపడుచునిట్లనియె." భార. విరా. ౪, ఆ.—2. తడఁబడు. "చరణ యుగంబు తొట్రుపడ." భార. శల్య. ౧, ఆ.

**తొట్రుపాటు.** ద్వి. వి. తొట్రుపడుట, తడఁబాటు. "శ్రీ. బెగడంతకంతకుమిగిలినని తిక్కఁబదములకటఁదొట్రుపాటుజెందె." భార. విరా. ౨, ఆ.

**తొట్ల.** దే. వి. బిడ్డలుపండుకొను ఉయ్యాలతొట్టి. "శా. జోలల్పాడియాడింతురా, లావణ్యాంబునిధుల్ వధూమణులుతొట్లం బెట్టిరాజాత్మజన్." పాంచా. ౧, ఆ. (తొట్టిలయొక్క రూపాంతరము.)

**తొట్లియ.** దే. వి. తొట్ల. "వ. చుట్టునున్న సభాసదులనుగొంద ఱను గట్టెదురరెండవదేవేంద్రుండునుంబోలెనపూర్వవైభవంబున నున్నయొక్కరాజునుఁదనియగ్రభాగంబునఁబసిండి తొట్లియలో నున్నయొక్కచక్కనిబాలికనుంజూచి." కళా. ౫, ఆ.

**తొట్టె.** దే. వి. తొట్లియయొక్క రూపాంతరము.

**తొడ.** దే. వి. గజ్జెకు మోఁకాలికి నడిమిభాగము, ఊరువు.

**తొడఁకు.** దే. అ. క్రి. తొనఁకు. "ఎ, గీ. నిగుడునాయువుతొడఁకనినిండుకుండ." చంద్రా. ౧, ఆ.

**తొడఁగు.** దే. అ. క్రి. 1. ప్రారంభించు; "అసుడీకార్యంబు సేయంగ నేలతొడంగెన్." భార. శాం. ౨, ఆ. "సునదట్టపుఁ బులకల్ జనింపఁగఁదొడంగె." భో. ౭, ఆ.—2. మొదలుకొను. "వ. పాడ్యమిదొడంగి పదునాలుగుదివసంబులొక్కొక్క గింజయుఁ గాఁదూమెఁడువడ్లు నమకూర్చి." భార. అర. ౬, ఆ. (ఈ యర్థమునకు ప్రయోగము క్త్వార్థమునందేయని యెఱుంగునది.)

**తొడపుట్టువు.** దే. వి. వైశ్యుఁడు, ఊరుజుఁడు.

**తొడబెల్లము.** దే. వి. తొడగిల్లుట.

**తొడయు.** దే. స. క్రి. 1. తుడుచు; "సీ. మణికుడ్యములు కుంకుమంబునఁజెలువొందఁదొడసిరి మెఱుఁగులుదులఁగలింప." హరి. ఉ. ౩, ఆ.—2. కడుగు. "వ. పెండ్లిదొరలు సుగంధోదకంబులం జేతులుతొడసి." నై. ౭, ఆ.

**తొడరిక.** దే. వి. అనుసరణము.

**తొడరు.** దే. అ. క్రి. 1. కలుగు; "ఒకింతయుందొడరదు నొప్పి." లక్ష్మీ. ౪, ఆ.—2. యత్నించు; "క. ఊరకయుండక పలుకుర, తోరపమెనఁగంగఁబలుకఁదొడరకయుమదిన్, జేరువగల నాగరికులుఁ, దారుఁగలసిపలుకవలయు ధరణీశుకడన్." భార. విరా. ౧, ఆ.—3. సక్తమగు; "క. అరయఁగవిషయములెంతయు, దురంతములువానియందుఁదొడరినఁజేటుం, బొరయుదురుదొడర కున్నన్, బరమపదవియమ్మహానుభావులకునగున్." భార. శాం. ౪, ఆ.—4. తొట్రుపడు. "క. ఏచినపొదలఁబడల్పడఁ, ద్రోచుచుముండ్లకునునల్లఁదొలఁగుచుదిక్కుల్, చూచుచుఁదొడరుచుఁద్రెళ్లుచు, లేచుచులతిఁ దాఁగినంచరించుచునరిగెన్." భార. అర. ౨, ఆ.—స. క్రి. 1. అనుసరించు; "సీ. కడఁగిజన్నపుఁదిండ్లుఁదొడరఁద్రిమ్మరుప్రేతకుక్షులగుమితోడఁగూడియాడు." సిలా. ౧, ఆ.—2. ఎదిరించు; "సీ. బకదైత్యుఁదొడరియుఁగ్రూరుపఱఁజేసిరక్షించె నేకచక్రపురంబు." భాగ. విగా. ౧, ఆ.—3. ప్రార్థించు; "వ. ఇప్పగిదిననిచిరామునకు కడాలేనిసిరులఁదొడరికడలికడగఁగలపుడని లడవేలె." యు. ౩, ఆ.—4. అనుకరించు. "దేహరుచి నైవమున్ నవమల్లికారుచిన్ దొడర." పా. ౪, ఆ.—5. ఎదిరించు. "క. కదునధికుతోడఁదొడరిన, బొడిచిననాడిచినన బుధిపు పురుషగుణంబే, ర్వాఁడుఁగాక హీననోడుచుట, కడిఁదియెపౌరుషము దానఁగలుగునె చెపుమా." భార. సభా. ౧, ఆ.

**తొడరువు.** దే. వి. యత్నము. "సీ. దైవమిట్లుకలఁచునేవీరినుదిమది, నండిఘోరమైనయుద్ధమునకుఁ, దొడవలయునట్టి తొడరువు కానించి, కొనిరిచీకురాజుకొడుకులేచి." భార. శల్య. ౧, ఆ.—విణ. మొదటి. "ద్వి. తొడలపైనున్నయాతొడరువుకొడుకుఁ, దొడిఁబడఁగడఁబడఁద్రోసియగ్రమున." భాగ. ౭, స్కం.

**తొడవు.** దే. వి. భూషణము. "తొడవులుతొడువతొడవుతొడవు." భాగ. ౧౦, స్కం. పూ. (ఇది తొడుధాతుకృదంతము. నగవులో నగువానివంటిది.)

**తొడి.** దే. వి. త్వర, సంభ్రమము. "శా. నాయింటంబుట్టెడువం చుఁగంసుఁడుతొడిన్ హింసించెనేయన్నలన్." భాగ. ౧౦, స్కం. పూ. (ఆమ్రేడితమునందు తొడిఁదొడి. "చ. నదచిత్రావళిన్ దనుజనాధులమేనులుసించికంరముల్, తొడిఁదొడిఁద్రుంచి." భాగ. ౯, స్కం.)

**తొడిఁబడు.** దే. అ. క్రి. (తొడిన్+పడు.) 1. చలించు; "ఉ. లోఁబొక్కుచువేఁడియూర్పుఁదగఁబుచ్చితొడింబడికొంతసేపువే, ల్పెక్కినభంగినుండిధృతినెట్టకునేనియుఁబూని." గా. ౭, కాం. "క. సందసవసవాసముతన, డెందముఁగుందింపఁగాఁదొడింబడితానన్, సందసవసవాసమువిభుఁ, డొందెరఘూత్తమునిఁ బాసి యుండం గలఁడే." రాఘా. ౫, ఆ.—2. చెదరు; "క. వర్ధింపఁగనెంగిలితొడిఁ, బడ్డ వెసన్ వటకంబుఁబాయనిదఁదగున్." విజ్ఞా. ఆచా, కాం.—3. తొట్రుపడు. "నేను సీతలఁపుపద్ధతిగాకిపుడేమి మీచేవర్తిలితిఁ దొడింబడన్." కళా. ౬, ఆ.

**తొడికిలు.** దే. స. క్రి. ఒడియు. (చూ. తొట్టికడకొప్పెర అను సర్థము నుదాహరణము.)

**తొడితెచ్చు.** దే. స. క్రి. తోడితెచ్చుయొక్క రూపాంతరము. "మహర్షులం గడియఁబోయి నమస్కృతులాచరించిభక్తింగరముల్ మొగిడ్చితొడితెచ్చి." ఉ, రా. ౧, ఆ.

**తొడిమ.** దే. వి. ఆకు, పూవు మొదలగువానితలనుండెడుకాఁడ, వృంతము.

**తొడు.** దే. స. క్రి. 1. సొమ్ములులోనగువాని తొడుగు; "ఉర్వీశు లెల్లనొండొరులఁగడవఁగడువేడ్కఁదొడిపూసికట్టి." భార. ఆది. ౭, ఆ.—2. బాణముతొడుగు. "వెండియునేసుబాణములువేతొడి ధర్మజునొవ్వనేయ." భార. భీష్మ. ౩, ఆ. ("కుసుమఁగట్టుఁదొడున్ దనయిచ్చ నొక్కఁడున్." "మించుతొడవులుదొడినొక మించుఁబోఁడి." "తొడుపింటివాఁడ్వుచన్ త్రోవఁబోవక." "తొడినకంకటములఁ దొడవులవిలసిల్లు, మణులఘృణులదెసలమూఁగువిరియ." "కట్టందొడంబుయ్యఁ బెట్టఁగొఱంతలే కానందమందెడు నర్థులందు." ఇత్యాది ప్రయోగంబులును కానంబడుటచే తొడు అనునది యొక ప్రత్యేకక్రియయనియే గ్రహింపవలెను.)

**తొడుకు.** దే. స. క్రి. 1. పట్టు; "సీ. జెడఁగాడుకాలాహిఁదొడుక నేరఁగారుతొడుకుఁడల్లఁగాకతొఁదొడుకుమనిన." పాండు. ౫, ఆ.—2. పడెసిపట్టు; కవిక. ౪. ఆ.—3. పడియు; "గీ. పాలముఁలోఁ నఁదొడెకిపుచ్చిపట్టుకైవడి." ద్వా. 2, ఆ.—4. గ్రహించు. "సీ. అందందవక్షోరుహాములదిఁపులు నోవఁదొడుకనిచ్చుట యెట్లు దుర్ధరము." కాశీ. ౪, ఆ.—వి. 1. అవ్వ; "క. ఉడుకావిడకున్న దిమది, పదుకామిడుకంగనరకపణవంజనునే, కొడుకానడుకానల కిటు, దుడుకానాపాలిపుడుకుఁ దొడుకానీకుఁడా." అచ్చ. అ. కాం.—2. దొంగమేఁత. "క. తొడుకుదినఁబో వ్రుపసరము, బడిఁ బోకును." భో. ౬, ఆ.

**తొడుకొను.** దే. స. క్రి. 1. తోడుకొనుయొక్క రూపాంతరము. "చ. కడువెరవేదినేఁ బ్రథమగర్భవతిఁ సతిఁ బుట్టినింటికిఁ, దొడుకొని వచ్చుచో." విక్ర. ౫, ఆ—2. తొడుగుకొను. (చూ. పాగ.) (రూ. తొడికొను.)

**తొడుగఱ.** దే. వి. తొడుగజ్జయొక్క రూపాంతరము. "క. తడి కంటనెపుడుఁదఱుఁగక, కడిదటేఁగినవడియుఁదటేఁగిగాసింబుడ మిం, బడినఁగనరాకమంచపుఁ, దొడుగఱపైఁరట్టె రుజలతోనేమం దుఁడా." శా. 3, ఆ.

**తొడుగజ్జ.** దే. వి. (తొడుగు+కజ్జ.) ముండ్లకంపమోపు.

**తొడుగు.** దే. స. క్రి. 1. (భూషణాదులను) ధరించు; "సీ. మదనాహితునినామమంత్రంబునుదుగువాఁ డొడికంపుఁబాములఁ దొడుగువాఁడు." భల్లా. ౨, ఆ.—2. (వింటబాణము) సంధించు. "ఎ, గీ. పొడుగుమడుగునుగాంచినయడుగువాఁడు, పిడుగు వడుగునరిపుఁగొంచునుడుగువాఁడు, చెడుగులుడుగునట్లుగ నమ్ముఁ దొడుగువాఁడు, బుడుగువడుగురూపునబలినడుగువాఁడు." చంద్రా. ౧, ఆ.—వి. 1. ఆభరణము; "క. ఉడురాజముఖుల కెల్లను, దొడుగయ్యెడునాకుఁదొడుగుఁదొడుగఁగనేలా, తొడుగులుదొడిగినఁగొఱఁతని, యుడురాజోత్తంసుఁజూడనొక్కతె వచ్చెఁడా." వీర. 3, ఆ.—2. కవచము; "సీ. తొడుగులునడలి కుత్తుకలెండిమిక్కిలివెడరూపులైపడ్డవీరభటులు." జై. ౨, ఆ.—3. బాణము; 4. గవుసెన; 5. ముండ్లకంపమోపు. "గీ. కంప తొడు గీడ్చినట్లేదుకానఁజన్న, తెరువెఱుంగుచు." సా. ౪, ఆ.

**తొడుపు.** దే. వి. 1. (చూ.) అనుసు; 2. కవచము; 3. చెప్పినది మరల చెప్పుట.

**తొడువు.** దే. స. క్రి.. వి. తొడుగుయొక్క రూపాంతరము.

**తొడుసు.** దే. వి. సంబంధము.

**తొడ్గు.** దే. స. క్రి. వి. తొడుగుయొక్క రూపాంతరము. (భూషణముధరించుటకు.—"గురుపత్నినేఁడయక్కుండలంబులుదొడ్గుదివసము." భార. ఆది. ౧, ఆ.)

**తొత్తటికము.** దే. వి. (తొత్తు+అటికము.) తొత్తుఁదనము.

**తొత్తు.** దే. వి. 1. బానిస, దాసి; 2. లంజియ.

**తొత్తులమారి.** దే. విణ. తొత్తులయిండ్లకుఁబోవు స్వభావముకలవాఁడు.

**తొన.** దే. వి. తొల. విణ. రక్షకము. "గీ. తోడుదొనయైనచుట్టంబు దొరకుటెట్లు." జై. ౧, ఆ.

**తొనఁకు.** దే. అ. క్రి. తొలఁకు. "తేనియల్ తొనఁకనివాని." వసు. 3, ఆ.—వి. తొట్రుపాటు. "క. ఉల్లంబులబలు, తొనఁకు -శూరఁగనిఁకిఁ దొలఁగఁదోలిరిరథముల్." భార. కర్ణ. ౬, ఆ.

**తొన్నుండు.** దే. అ. క్రి. తెన్నుండు, శయనించు.

**తొపారము.** దే. వి. తోపారముయొక్క రూపాంతరము. "క. దోఁపులుకిసిచెంచులు, మోరలవేసినదొపారములు వీడిచిన, స్వాపగనదువివ్వితెక్కల, నారజనుగడేగనేఁటలాడిరి వేక్కన్." భావద్విజయము. ౨, ఆ.

**తొప్పదోఁగు.** దే. అ. క్రి. (తోఁగు+తోఁగు.) మిక్కిలితోఁగు. "ఉత్సాహ. తుములబాణపటలవృష్టిఁదొప్పదోఁగిరిర్వురున్." భార. అర. 2, ఆ. (రూ. తొప్పఁగఁదోఁగు. "నెత్తుటన్దొప్పఁగఁ దోఁగియున్నవవతోయజనాభుని." హరి. పూ. ౫, ఆ. ప్రే. తొప్పదోఁచు, తొప్పఁగఁదోఁచు. "నిలింపులఁదొప్పదోఁచె." స్వా. యు, కాం. "ఉ. భవదీయవచోమృతవారిధారచేఁ, దొప్పఁగఁ దోఁచినన్నుఁ బరితోషితమానసఁగా నొనర్పవే." భో. 3, ఆ.) (తొప్ప అనుదానికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు.)

**తొప్పటిల్లు.** దే. అ. క్రి. ఒఱగు. (రూ. తొప్పటిలు.)

**తొప్పఱు.** దే. అ. క్రి. ———పై.——— "మ. వెఱచిల్లంబుధిసాధనందనులు దోర్వీర్యంబు సాలించియుఁ, దఱుఁబాఱఁగ నిశాచరేంద్రుఁడుజయోత్సాహంబునన్వెన్నడిన్, దఱుమంగా. బ్రజఁజేయివీచుచునసుద్యద్వేగుఁడైతోలితొ, ప్పఱఁబెట్టెన్ శరజాలమున్బిఱుఁదఁగుప్పంగూరనాటించుచున్." నిర్వ. ౫, ఆ.

**తొప్పలుదోరలు.** దే. విణ. బ. కోటానఁగోటులు. "ఉ. తొత్తులువోలె దక్కుదురుతొప్పలుదోరలుముక్తిభామినుల్." కాశీ. ౨, ఆ.

**తొప్పి.** దే. వి. తోపియొక్క మొదటిరూపము. "గీ. హరిగదాభిఘాతమల్లంతఁదోఁచిన, వరమునిమ్ముఁగావవలఁతియగునె, వెఱ్ఱివారపిడుగు వేచినతలతొప్పి, యాఁగునేవివేకమైనవలదే." ఉ, హరి. ౪, ఆ.

**తొబక.** దే. విణ. నిత్తులురాలినది. (మిరపకాయలోనగునది.)

**తొమ్మండ్రు.** దే. స. బ. తొమ్మిదిమంది. (తొమ్మిదికి మహన్మహత్సార్థకరూపము.)

**తొమ్మంగుము.** ద్వ. వి. (తొమ్మిది+తూము.) తొమ్మిది తూములు.

**తొమ్మనూఱు.** దే. స. (తొమ్మిది+నూఱు.) తొమ్మిది నూఱులు. వి, పు. ౨, ఆ. (రూ. తొమ్మన్నూఱు.)

**తొమ్మాడు.** దే. వి. నాశము. (దానిని తొక్కి తొమ్మాడుచేసినారు.)

**తొమ్మిది.** దే. స. ఎనిమిదియు నొకటి.

**తొయ్యలి.** దే. వి. ఆఁడుది, ఇంతి. "సీ. మించితొవులుగ్రమ్మ మంచిగందమ్మునన టకలియిడియుఁదొయ్యలియొకర్తు." యు. ౪, ఆ.

**తొర.** వై. వి. 1. వేగిరపాటు; "పండటంచువిభ్రాంతివహించియాఁకటితొరన్ రవిపైకెగసెన్." ఉ, రా. ౫, ఆ.—2. ఆపద. "ఉ. బానిసగాఁగనీవికచపద్మదళేక్షణదారఁబోసిన, స్నానమువీఁట నాకొనఁగుమీభవదీయకృతాపరాధముల్, పూనికనేనుగైకొని ప్రభుత్వముకానఁబడంగ నిల్చియు, వ్వానికిలోఁగకెంతతొరవచ్చినఁగాచెదనిన్నుఁగూరిమిన్." హరిశ్చ. ౪, ఆ. (ఈ యర్థము విచారింపఁదగినది.)—క్రి. విణ. త్వరితము*. "ద్వి. తోడవ్వరునులేక తొరతోడమీరు, విచ్చేయునపుడె." విష్ణు. పూ. 3, ఆ.

**తొరఁగు.** దే. అ. క్రి. 1. స్రవించు; "బాష్పముల్కంటఁదొరంగుచుండఁదిరుగందిరుగంగనుఁగొంచు." విజ. ౧, ఆ.—2. ప్రవహించు; "సీ. కరుణారసము పొంగితొరఁగెడుచాడ్పున శశిరేఖ నమృతంబుజాలువాఱ." భార. విరా. ౧, ఆ.—3. పడు; "క. వీరులగుసాల్వయోధలు, నారాచావళులుగప్పినారథమువయిన్,

సారథిమీఁదఁదురంగము, చారుధ్వజవితతులకుఁ బసంఖ్యాతము గన్. వ. తొరఁగిన." భార. అర. ౧, ఆ.—4. వ్రాఁతు. పంచ. నా. ౧, ఆ. (గ్రంథములయందు అంతట ఇది యిట్లు అకార మధ్యమముగానే కనఁబడుచున్నది. అయినను ఒక మహా కవిమాత్రము ఉకారమధ్యముగా ప్రయోగించియున్నాఁడు.)

**తొరపడు.** వై. అ. క్రి. వేగిరపడు. "ద్వి. బంతిఁ, గూర్చున్న యెంతరార్కులకమృతంబు, మార్చితానిటరాకమసలెనటంచుఁ, దొర పడుచున్నదైత్యులకు." విష్ణు. ఉ. ౪, ఆ.

**తొరలు.** దే. అ. క్రి. 1. కలుగు; "ద్వి. తొరలెడుజనవృష్టి దోసంబుపాయ, నిరుమేలనారతులిచ్చునట్లాలయు." భాగ. ౭, స్కం.—2. మారు. (చూ. తొరలుచు, తొర్లించు.)

**తొరలుచు.** దే. ప్రే. మార్చు, బదిలించు. (రూ. తొరల్చు. "ఉ. ఆయతికాసికీక మమరాలయముఖ్యములాపఁడర్థత్వ. స్థాయి యుఁడై నిజోర్వినగునష్టికిఁదద్ధనముం దొరల్చిరా, జాయతనంబుఁ జేర్చుమటియట్టిదపథ్యముగానొంటిగాఁ, డేయధికారికావలయు నించుకతిన్నను వాఁడెరూపటుఁన్." ఆము. ౪. ఆ.)

**తొరితొరి.** దే. అవ్య. క్రి. విశ. లెస్సగా.

**తొరుఁగు.** దే. అ. క్రి. తొరఁగుయొక్క రూపాంతరము. (పడు టకు.—"వ. ఖలీనంబులువిలీనంబులైనఫేనంబులుతొరుఁగనిరుగడ లఁగదలు కర్ణచామరంబులినుమడింపక." ఉ, హరి. ౪, ఆ.)

**తొరువు.** దే. స. క్రి. తొర్లించు.

**తొర్లించు.** దే. ప్రే. వేసీల్లుచల్లార్చు. (తొరలించుయొక్క రూపాం తరము.)

**తొఱ.** దే. వి. తొఱ్ఱయొక్క రూపాంతరము.* "క. తొఱలోపలనొక పెనవొక, యఱగానొనరించిచిగురుటాకులడుగునన్, బఱచిన సదికడుమెత్తని, పఱపుగ నచ్చోటనాఁడుఁబట్టెంగనియెన్." భో. ౪, ఆ.

**తొఱఁగు.** దే. స. క్రి. విడుచు. "క. భంగించియితరకాంతఁదొ, ఱంగుటతప్పోతడంబఱచిపురుషులకున్." కళా. ౭, ఆ.—వి. విడి వడుట. "ఎ, గీ. పర్వదాఁటులలోఁదొఱఁగెఱుఁగఁబడునె." ఉ, హరి. ౪, ఆ.

**తొఱఁగుచోచ్చు.** దే. అ. క్రి. (పసులు) తప్పించుకొనిపోవు. విజ్ఞా. ప్రా, కాం.

**తొఱఁగుపోవు.** దే. అ. క్రి. (తొఱఁగు+పోవు.)———పై. ———"గీ. తొఱఁగుపోకుండమెకములుగఱవకుండఁ, బాఁడి తఱుఁగకయుండనాపాటిగొల్ల, లిచ్చమెచ్చఁగనీదృష్టికెక్కఁగదుపు, నరయనేర్తునన్నేలుముధరణినాథ." భార. విరా. ౧, ఆ.

**తొఱట.** దే. వి. తొఱ్ఱ, కోటరము.

**తొఱటలువాఱు.** దే. అ. క్రి. (తొఱటలు+పాఱు.) రంధ్ర ములుపడు. "క. పెక్కులుచీమలువెళువడివడిఁ, దొలిచెశరీ రాస్థులెల్లఁదొఱటలువాఱన్." జై. ౭, ఆ.

**తొఱతేనె.** దే. వి. పుట్టతేనె.

**తొఱవు.** దే. స. క్రి. వి. తొఱఁగుయొక్క రూపాంతరము.

**తొఱుద్రొక్కు.** దే. వి. (త్రొక్కు+త్రొక్కు.) గట్టిత్రొ క్కుడు. (చూ. చొఱిగాఁడు.)

**తొఱ్ఱ.** దే. వి. చెట్లయందేర్పడెడు పెద్దరంధ్రము, కోటరము.

**తొఱ్ఱి.** దే. వి. ముందటిపండ్లులేనినోరు. "తొఱ్ఱియక్కరంబు." ఆము. ౬, ఆ.

**తొఱ్ఱివాఁడు.** దే. వి. తొఱ్ఱినోటివాఁడు.

**తొఱ్ఱు.** దే. వి. ఉన్ని, మొదవు. "సీ. ఆరణోచ్చారణోద్ధతులయ్యె నిలతొఱ్ఱుకంబళులుకృషులేంగర్షిణులకు." నా. ౫, ఆ.

**తొఱ్ఱుపట్టు.** దే. వి. ఉన్నిబట్ట, కంబళము. "గీ. ఘనభుజుం డునకుఁడు తనతొఱ్ఱుపట్టుల, విశ్రుతుంచిభువనవిశ్రుతుండు." భార. ఆది. ౭, ఆ.

**తొల.** దే. వి. పనసపండులోనగువాని తొల, తొన. "పనసతొల."

**తొలఁకాఁడు.** దే. అ. క్రి. (తొలఁకి+ఆడు.) 1. తొనఁకు; "శ్రీ. ప్రవహించునెచ్చోటఁబరిపూర్ణసంపదఁదొలఁకాడుచునపాం దుద్దనదులు." కాశి. ౨, ఆ.—2. చలించు; (చూ. తొలఁకు.)— 3. అతిశయించు; "అనవృష్టుసమ్మదంబు దొలఁకాడఁగ." నిర్వ. ౭, ఆ.—4. ప్రకాశించు. "వ. నేత్రాంచలంబులనలంతినవ్వు దొలఁకాడ." నై. ౪, ఆ. (మొదటిరూపము తొలఁకియాడు.) (చూ. ఊఁగాడు.)

**తొలఁకు.** దే. అ. క్రి. 1. తొనఁకు; "సీ. చున్నెటిజలముసుస్థి తొలంకెడునవిడాచేతమణికమండలుతొనంగి." పా. ౫, ఆ.— 2. చలించు; "వ. తొలకరిమించుకన్నెగల తీఁగలతోయజతార హారకాం, తులఁదగునవ్వుక్రొన్ననలతోనలతోరపుగుబ్బచన్నులన్, దొలఁకెడుకొనుచంచలతతోలతతోఁదగుమేనితావికిన్, మలయగు కొవ్వుగేదఁగులతోఁగులతోయదవేణిమించెసన్." ఉ, రా. ౬, ఆ.— 3. అతిశయించు; "చ. వెలవెలఁబాఱుమోముపయివిన్నఁదనంబు దొలంకుచుండఁగన్." య. ౪, ఆ.—4. ప్రకాశించు. "సీ. కుఱుమాపుచడిమంపుఁ గోకలోఁ దొలఁకెడు కంపమానకితంబ కాంతిపెంపు." కళా. ౪, ఆ.—వి. 1. చలనము; "చ. కడుఁ బెనుమంటలైనయురకంబుతొలంకునవారిబిందువుల్, మిడిసిసమీప భూజములమీఁద వెసంబడిమండుచుండెనె, క్కుడురథనంబుతో దివియకోలలకైవడిభంగసంగతిన్, బొడమినఫేనముల్ మెఱసి బోరనఁజల్లినవిప్పులోయనన్." వి, పు. ౭, ఆ.—2. అల. "వారి దేవతల్ తొలఁకులకేలఁదాపనిడితోమఁగలంకడఁగెన్." ఆము. ౪, ఆ.

**తొలఁగఁబాఱు.** దే. అ. క్రి. (తొలఁగన్+పాఱు.) తొలఁగు. "క. బలమఱెధ్రువుఁడహితునిదో, ర్బలవిభవముసైఁపలేకపరిభవ దైన్యా, కలనమునకోర్చిశత్రులు, చెలఁగఁదొలఁగఁబాఱె దేవసేనలు గలఁగన్." హరి. ఉ. ౧౦, ఆ. (సార్థమునపాఱు.)

**తొలఁగు.** దే. అ. క్రి. ఒదుఁగు, అపసరిల్లు. "క. పర్వడలోపగ తురనువె, లార్వక లోకంబునకుఁ దొలంగకకుదురై, నేర్పునమనః పవనములు, గూర్పకయోగీశ్వరుండగునెయెబ్బంగిన్." శివ. ౧, ఆ.

**తొలఁగుడు.** దే. వి. తొలఁగుట, అపసరణము.

**తొలఁగుబావ.** ద్వి. వి. దాయ, శత్రువు. (చూ. చేక్కువాలు.)

**తొలఁచు.** దే. ప్రే. తొలఁగఁజేయు. స. క్రి. 1. కడుగు; "చ. ముదమునసోమకాసురుఁడుమ్రుచ్చిలియచ్చలమారఁగొన్నప్రాఁ, జదువులుతెచ్చితజ్జఠరసాంద్రతరాంత్రములంటికట్టుబల్, గదురు దొరంగఁ గీర్తియనఁగంగఁ దొలంచి విధాతృవిస్ఫుర, ద్వదనసరోజ గంధలలితంబులు చేసితిగాజగన్నిధీ." పాండు. ౨, ఆ.— 2. తొడయు. "క. తొలఁచినమరుసాయకములు." భో. 3, ఆ.

**తొలకరి.** ద్వి. వి. 1. (చైత్రవైశాఖమాసములయందుకురియు) వాన; "చ. వెలిచినకన్నునీరుజడివెచ్చనిచన్నులమీఁదివేఁడియున్, దొలకరిఘర్మతోయములతోఁగలసెన్ మెయిమ్రానుపాటుతోఁ,—నెలుఁ గునరాలుపాటొదవె నెక్కువివర్ణతతోన లోపలన్, గలకొనెనార టంబు పులకంబులతోఁబొడతెంచెఁగంపమున్." ఉ, హరి. ౫,

ఆ. (తొలకరివానయనియు కలదు.) 2. వర్షర్తువు. "సీ. ప్రబల నక్షత్రపలప్రాసాద భానస్థై తొలకరినిదికుతూహలమునిలుపు." (ఇక్కడ ఇదియనఁగా విమానము) వసు. 3, ఆ. (తొలఁకు+కారు.) (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

**తొలకరించు.** దే. అ. క్రి. 1. (చైత్రవైశాఖమాసములయందు) వానకురియు; 2. వానకురియు; (చూ. గిలకరించు.) 3. పుట్టు. "సీ. తొలకరించినటించుమొలకసిగ్గులచేతనుడివడికడకొత్తచూపు తోడ." విక్ర. ౭, ఆ.

**తొలకరిసూడు.** దే. వి. హంస.

**తొలకు.** దే. వి. మృగముల వెనకకాలిమూలమునకును, ప్రక్కకును నడిమిచోటు, ఉపరంధ్రము. "ద్వి. ముత్తియముల, తొలకులు రక్తబిందువులైనపొడలు." రా. అర, కాం.

**తొలి.** దే. వి. 1. ముందు; (తొల్లియొక్క రూపాంతరము.) 2. మొదలు; (ఆమ్రేడితమునందు తొలితొలి. "తొలితొలితల సూపు తమఃప్రరోహతతులు." లక్ష్మీ. 3, ఆ.)–3. రంధ్రము; "సీ. కొప్పరింపఁగ మింటఁ గ్రొవ్వఁ శిరోమముల్ చొచ్చి వెళ్లిన తొలుల్ చుక్కగుంపు." చంద్రా. ౧, ఆ.–4. చక్రమధ్య రంధ్రము, పిండిక. (చూ. అంచు.)–విణ. 1. ముందటిది; (తొలిజాము.) 2. మొదటిది. (తొలిముద్ద మొ.)

**తొలిక.** దే. వి. తొలి, రంధ్రము. "క. పలుచనినెత్తురుమడువులఁ, బొలిచెన్ రథనేమివలయములుహతరణవీ, రులుదూఱఁగరవిబింబము, తొలికైరుచిదూలనీడదోఁచినమాడ్కిన్." కవిక. ౨, ఆ. (స్వార్థమున కప్రత్యయము.)

**తొలు.** దే. విణ. వృత్తియందు తొలుతశబ్దమునకును, తొలుకుశబ్దమునకును మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. తొలుచూలు, తొలుమబ్బు మొ.)

**తొలుకారు.** ద్వి. వి. (తొలుకు+కారు.) 1. వర్షర్తువు; "సీ. కరటిఘటాకోటికటనిర్గళన్మదాసారంబు తొలుకారుఁజేరఁబిలువ." ఉ, హరి. ౪, ఆ.–2. (తొలుత+కారు.) ముక్కారుపంటలలో మొదటికారుపంట.

**తొలుకు.** దే. స. క్రి. కురియు, వర్షించు. (వృత్తియందు అంత్యవర్ణలోపము. తొలుకారు, తొలుమొగులు మొ.)

**తొలుకుడుపు.** దే. వి. (తొలుత+కుడుపు.) అన్నప్రాశనము.

**తొలుగట్టు.** ద్వి. వి. (తొలుత+గట్టు.) ఉదయాద్రి, పూర్వపర్వతము. "ఉ. రేగన్నియతేనిమేనుతొలుగట్టుతుదన్ బొదలెన్ గ్రమంబునన్." వసు. ౬, ఆ. (తొలితొలుశబ్దములుసమానార్థకములుగాన తొలుపూర్వకములైన యిట్టి శబ్దములను తొలిపూర్వకములుగాను వాడుకొనవచ్చును. అయినను తొలుకారు, మలుకారు; తొలుచూలు, మలుచూలు; తొలుసంజ, మలుసంజ అని ఇత్యాదులు వ్యవహారమునందును, ప్రయోగములందును గానఁబడుటచేతను, తొల్చదువులు, తొల్బాము, తొల్వేలుపు అను ఇత్యాది శబ్దములయందు ఇకారలోపసంపాదనముకంటె ఉకారలోపసంపాదనము సులభసాధ్యముగానుండుటచేతను ఇట్లు తొలుశబ్దపూర్వకముగా నుండుటయే యుక్తమని తోఁచెడి.)

**తొలుఁజదువులు.** దే. వి. బ. (తొలుత+చదువులు.) వేదము. (రూ. తొల్చదువులు.) "చ. లలితశిరీషపుష్పమృదులంబులు నీచరణంబులక్కటా, యిలయిదిరూక్షమిట్టులలయించుటగాదని ప్రార్థనామృదూ, క్తులుఘెలఁగంగవేపొదివితొల్చదువుల్ తగువిన్నపంబులన్, బలుమఱుఁజేయుచందమునబంగరుటందియలుగ్గడింపఁగన్." పాండు. ౨, ఆ. (ఇట్లు తొలుపలుకులు, తొలుమినుకులు.)

**తొలుచు.** దే. స. క్రి. 1. రంధ్రముచేయు; "క్రిములు దొలుచే." భార. అను. ౫, ఆ.–2. తోఁడు. "క. పులుఁగులును మెకంబులునుం, గొలిచితినిన." భార. స్త్రీ. ౨, ఆ. (రూ. తొల్చు.–తోఁడుటకు.–"ఖరతరవజ్రతుండములఁగన్నులు తొల్వఁగ." మార్క. ౨, ఆ.)

**తొలుత.** దే. వి. 1. ముందు; (చూ. పనికతిండి.) 2. మొదలు. విణ. మొదటిది. (1. "తొలుతటివారు." 2. "తొలుతపట్టి." "తొలుతటిపట్టి.") క్రి. మొదట. (ఆమ్రేడితమునందు తొలుదొలుత.) "ఎ, గీ. తొలుదొలుతఁ గృష్ణవర్తకుఁ గళయొనంగి." వసు. ౪, ఆ. (రూ. తొలుదొల్త. "సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తుంద్రించునసిలోహమునవెచ్చనైజనించె." స్వా. ౧, ఆ.)

**తొలుదీవి.** ద్వి. వి. (తొలుత+దీవి.) జంబూద్వీపము. "కల్యాణపరంపరలతొలుదీవి." వసు. ౧, ఆ.

**తొలుచీటిరిక్క.** ద్వి. వి. (తొలుత+నీటిరిక్క.) పూర్వాషాఢానక్షత్రము.

**తొలుపంది.** దే. వి. (తొలుత+పంది.) ఆదివరాహము. (రూ. తొల్పంది. "తే. గీ. జాళువాకంటితొలువేల్పు నేలయెల్లఁ, గొంచు వినదారి ఓంకిళ్తెంచుచున్నఁ, బూనితొల్పందిగున్నవైవానిఁజీఁజీ, కోఱకొనమన్నదాల్పవేకోరిసీవు." అచ్చ. బాల, కాం.)

**తొలుపక్కము.** ద్వి. వి. (తొలుత+పక్కము.) శుక్లపక్షము, పూర్వపక్షము.

**తొలుఁబలుకులు.** దే. వి. బ. (తొలుత+పలుకులు.) వేదము.

**తొలుమినుకులు.** దే. వి. బ. (తొలుత+మినుకులు.) వేదము.

**తొలుమొగులు.** దే. వి. (తొలుకు+మొగులు.) వర్షించుచున్న మేఘము, ఘనాఘనము. "రగడ. తొలుమొగుల్ తెగఁదెగడుసెమ్మెయితోరపుంజిగికడలఁగప్పఁగ." అచ్చ. యు, కాం.

**తొలురిక్క.** ద్వి. వి. (తొలుత+రిక్క.) అశ్వినీనక్షత్రము.

**తొలురిక్కనెల.** ద్వి. వి. ఆశ్వయుజమాసము.

**తొలువేలుపు.** దే. వి. (తొలుత+వేలుపు.) 1. బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు; 2. అసురుఁడు, పూర్వదేవుఁడు.

**తొలుసంజె.** ద్వి. వి. (తొలుత+సంజె.) ప్రాతస్సంధ్య. "సీ. ఒకదివిఁదొలుసంజయున్నేవమునఁబొందునుదయించుమలుసంజయొండుదీవి." కాశీ. ౧, ఆ.

**తొల్కరి.** దే. వి తొలకరియొక్కరూపాంతరము. ("చ. తరుణులు చంచలాలకలుతక్కరభాండనికాయమంబుదో, తక్కరములు పాలు దేనెలుఘృతంబులువానలఖండఖండశి, ర్కరలునుద్రాక్షపండ్లు వడగంచులు శోభనభుక్తివేళతో, ల్కరినమయంబుపేరెలమిఁగైకొనకుండునెభోక్తృసన్యముల్." నై. ౬, ఆ.)

**తొల్కరించు.** దే. అ. క్రి. తొలకరించుయొక్కరూపాంతరము. (చైత్రవైశాఖమాసములయందు వానకురియుటకు.–"చ. పొలఁతుకకున్ వనీవిహృతిఁబుట్టినసేదలుతొల్కరించినన్." కవిక. ౪, ఆ.)

**తొల్లి.** దే. వి. 1. ముందు; 2. బిలము. (చూ. వటువు.) విణ. ముందటిది. ("తొల్లిఁటివారు" "తొల్లింటివారు.")

**తొల్లించు.** దే. ప్రే. తొర్లించుయొక్కరూపాంతరము.

**తొల్లిక.** దే. వి. త్రవ్వటకుపయుక్తమైన పాఱవంటి చిన్నసాధనము. "భయమనుతొల్లికన్ విమలభావవసుంధరఁజెల్లగించి." కాళ. ౪, ఆ.

**తొవ.** దే. వి. కలువ. "వనజములుల్లపిల్లఁగఁదొవల్ మొగిడన్." మార్క. 2, ఆ. (తొగయొక్కరూపాంతరము.)

**తొవర.** వై. వి. విశే. తొగరయొక్క రూపాంతరము.

**తొవరి.** వై. వి. తొగరియొక్క రూపాంతరము.

**తొవరు.** దే. వి. విశే. తొగరుయొక్క రూపాంతరము. (ఎఱ్ఱనిదను టకు.—"తొవరుపుట్టములుఁగెంబుళ్ళుఁదాల్చి." అచ్చ. యు, కాం.)

**తొస్స.** దే. వి. ఉచ్చారణలోపము.

**తొస్స.** దే. విశే. బోసి, బొక్కి.

**తొళ్ళక.** దే. విశే. పలుచనిది.

**తొళసి.** వై. వి. తులసి. "తొళసిపేరు." సిలా. ౧, ఆ.

## తో.

**తో.** దే. అవ. తృతీయావిభక్తియందువచ్చు ఒకానొక ప్రత్యయము. ద్ర. 1. కూడ; "సీ. యోధవీరులు ప్రతాపోగ్రవాక్యములఁ దోఁదనఁజాట్టిరాఁజేకితానవిభుఁడు." భార. భీష్మ. ౧, ఆ.—2. వెంబడి. "సీ. వడిఁజిఱ్ఱదిరిగిమ్రొగ్గెడుమదావళములుఁదోన రూపఱినయాధోరణులున." జై. ౫, ఆ.

**తోఁక.** దే. వి. పశ్వాదులపుచ్ఛము. "క. వీఁకచెడిఘనగదాహతిఁ, దోఁకయుఁగదలింపలేకదున్నహవీడఁ, మోఁకరిలఁబడియెనేలకు, శోఁకోర్వకదిగ్గజంబుసుడిసుడిగొంచుఁ." భాగ. ౮, స్కం.

**తోఁకస్తంభె.** ద్వ. వి. ఆఁదోఁకగానేర్పఱచిన స్తంభము.

**తోఁకచిచ్చు.** ద్వ. వి. నిప్పురగిలించిన పిడకలవరుస. సా్వ. ౧, ఆ.

**తోఁకచుక్క.** ద్వ. వి. ధూమకేతువు.

**తోఁకపురువు.** ద్వ. వి. పుచ్ఛముగల క్రిమివిశేషము. (రూ. తోఁకపురువ్వు.) "నోరఁబెల్లుగాఁబొరఁగఁతోఁకపురువ్వులు." హరి. ఉ. ౬, ఆ.

**తోఁకమిరియము.** ద్వ. వి. చేలువమిరియము.

**తోఁగు.** దే. అ. క్రి. 1. మునుఁగు; "క. ఈగంగాదికతీర్థము, లీఁగంగానీవుదమనమిద్ధాంబువులఁ, దోఁగెడువారలగనగన, గ్రాఁగెడునంగారసింధుకల్లోలములఁ." పాండు. ౧, ఆ.—2. తడియు. "ఉ. లోఁగకవారలవ్వనములోవిహరించి రొకల్లొకల్లకై, యేగుచుఁగమ్మపూఁబొదరులీఁగుచుఁదేనియసోనవానలఁ, దోఁగుచుఁదూఁగుటుయ్యెలలఁదూఁగుచునొక్కతె కోయుగుత్తికిఁ, మూఁగుచుఁగంతువీణెలన మ్రోఁగుచు నొండొరుచేరు లాఁగుచుఁ." కళా. 3, ఆ.

**తోఁచిగాఁడు.** దే. వి. శ్వానవిశేషము. "సీ. పాదదూఱునొక మేటి పూరేటివెలికిఁబోఁ దోలకైకొనెనొక్క తోఁచిగాఁడు." సా్వ. ౪, ఆ.

**తోఁచే.** దే. వి. మాదిగవాఁడు, మాతంగుఁడు.

**తోఁచు.** దే. అ. క్రి. 1. ఉదయించు; "క. మీతండ్రికినేమ్ము త్స్యలు, నైతోఁచినవాఁడ." భార. ద్రో. ౫, ఆ.—2. భావముదయించు; (అది నాకు సరియని తోఁచెను.) 3. ప్రత్యక్షమగు. "ఉ. గోపికయోర్తుతొల్లిహరిఁగూర్చితపంబొనరింప దానిని, ప్రాపరతఁమదింగరఁగిశార్ఙ్గియుఁదోఁచిన." పాండు. ౨, ఆ.—ప్రే. తోఁపఁజేయు.

**తోఁట.** దే. వి. 1. ఉపవనము; 2. గృహోపవనము. "గీ. అభ్రపదవినేతెంచియయ్యెబలయున్న, తోఁటలోనికిడిగియె నద్భుతము నాఁగ." కళా. ౨, ఆ.—3 ఉత్రమము. "ఒక్కతవనీ తోఁట గాంచి." దు. ౨, ఆ.

**తోఁటకాఁపు.** దే. వి. తోఁటవాఁడు.

**తోఁటకూర.** ద్వ. వి. ఒకదినుసు కూరాకు, మారిషము. (దీని భేదము నల్లతోఁటకూర.)

**తోఁటపోఁక.** ద్వ. వి. ఒకదినుసుపోఁక, భూపూగము.

**తోఁటమాలియ.** ద్వ. వి. తోమాలియయొక్క మొదటిరూపము.

**తోఁటమాలె.** ద్వ. వి. తోఁటమాలియయొక్క రూపాంతరము.

**తోఁటమొల్ల.** ద్వ. వి. కుందము.

**తోఁటవాఁడు.** దే. వి. వనపాలకుండు. "గీ. కోరితోఁటవాఁడు కుసుమఫలంబులు, కోయుసట్టురాజుగొనఁగవలయు, నవ్వనంబు నఱకియంగారములుసేయు, వంగియైనభూమిపాలుఁగాదె." భార. శాం. ౨, ఆ.

**తోట్రా.** హిం. వి. ఒకవిధమైన మందుసామాను.

**తోఁటీఁడు.** దే. వి. (తోఁట+ఈఁడు.) తోఁటవాఁడు.

**తోఁడు.** దే. స. క్రి. 1. కెల్లగించు; (చూ. గోఁకుగోండి.) 2. నాలిపోఁగుతీసిచుట్టు.

**తోఁడుఁబోతు.** దే. వి. వంపుచేయుట, ఆగ్రహము. విశే. వంపుచేయువాఁడు, కర్షణశీలుఁడు. "తోఁడుఁబోఁడుగఁబెఁగిట్టినవానిఁ బిసాసిఁజేసి." చంద్ర.

**తోఁడెలు.** దే. వి. తోఁడేలుయొక్క రూపాంతరము. "క. అధిపు కైపట్టిరిదె, బ్బలిమహిషమెలుఁగుగిటిదోఁ, డెలుమొదలగువానిఁ గొన్నిఁటినివేఁటకరుల్." సా్వ. ౪, ఆ.

**తోఁడేటికడుపుమేటి.** ద్వ. వి. (తోఁడేలు+కడుపుమేటి.) భీముఁడు, వృకోదరుఁడు.

**తోఁడేలు.** దే. వి. అడవికుక్క, వృకము. (రూ. తోఁడేలు. ఇట్లు వువర్ణాంతముగా కొందఱు చెప్పుచున్నారు.)

**తోఁతెంచు.** దే. అ. క్రి. (తోఁచు+తెంచు.) 1. ఉదయించు; "క. ఈతెరువునఁజరియించుచు, నేతెఱఁగుననైనఁదప్పనేనియుఁ బురుషుం, డాతతనాకసుఖముఁగనఁ, దోఁతెంచునుమగుడనద్భుతుల వంశమునఁ." భార. శాం. ౫, ఆ.—2. కనఁబడు; "క. కేతన కపిభయదంబై, తోఁతేరఁగఁజక్రధరచతురసారథ్య, ద్యోతితవల్గన చారు, శ్వేతహరులుమెఱయువచ్చువీరునిఁగంటె." భార. కర్ణ. 3, ఆ.—3. ప్రత్యక్షమగు; "మ. మతివైవస్వతుచేఁదలంపఁబడి యమ్మశ్వంబు దోఁతెంచె." భార. అర. ౪, ఆ.—4. వచ్చు. "క. విషదూషితలముహరిఁగ, ల్మషరహితునినంటవళమెమూకునను చుని, రివ్వనయుతఁదొలంగుగతిఁద, ద్విషమోర్షులుతీరములకువెనఁ దోఁతెంచెఁ." హరి. పూ. 2, ఆ. (సార్థమున తెంచు.)

**తోఁప.** దే. వి. వంకటి.

**తోఁపిక.** దే. వి. తలఁపు.

**తోఁపు.** దే. వి. 1. పెంపుడువనము; 2. ఎఱుపు; "సీ. క్రొత్తడంబులకెంపుక్రొత్తడంబులరంగుసింగిరిఁదోఁపువన్నియలునింప." య. ౧, ఆ.—3. తోఁపిక; "సీ. తోఁచుతోఁపులనెల్లఁదోడ్తోడ దులిచ్చినిరాలంబనుఁడైనయతఁడొకండు." భార. ఆశ్వ. ౧, ఆ.—4. పకియలులోసగువానిమూఁతపిండి.

**తోఁబుట్టు.** దే. వి. (తోఁ+పుట్టువు.) తోడఁబుట్టువు. "సీ. దుగతిగమొగములజగజెట్టితోఁబుట్టుపొగడువారలసట్టు పుడుకుఁ జెట్టు." అచ్చ. బాల, కాం.

తోఁబుట్టుగు. దే. వి. (తోడ్ + పుట్టుగు.) తోడఁబుట్టువు. "గీ. సొరిదిఁ బాండుకుమారులు దోఁబుట్టువులు ఖండించి." జై. ౭, ఆ.

తోఁబుట్టువు. దే. వి. (తోడ్ + పుట్టువు.) ——పై.—— "వడిఁదోఁబుట్టువు తోడఁగూడి." చంద్రా. ౧, ఆ.

తోకము. సం. వి. అ. న. అపత్యము, బిడ్డ.

తోకొను. దే. స. క్రి. తోడుకొనుయొక్క రూపాంతరము. "క. దాశరథి నామమును బుత్త్రునకుం బెట్టి కొడుకునకును సేగెడువానికిన్, దో కొనిపోయెదననిశుచి. లోకంబునకరిగెఁ ద్రిదశలోకస్థితుఁడై." భార. అను. ౩, ఆ.

తోక్మము. సం. వి. అ. న. గుణేక్ష. పుం. 1. పచ్చన; 2. పచ్చయవలు. వి. పచ్చనిది.

తోటరి. దే. వి. మూల. చండాలుఁడు. "క. నాటకయివేండ్లవాఁ డవ, మాటచినికృతఘ్నుబుదలఁచిమానసమునన, త్తోటులమీఁదనబంధులు, గీఁటుకొనఁజుదుష్టబుద్ధికృత్రిమబుద్ధిన్." జై. ౭, ఆ.

తోడ. ద. అవ్య. తృతీయావిభక్తియందువచ్చు నొక ప్రత్యయము. ద్ర. 1. కూడ; "వాఁడెరూపంబునసెందుఁ జొచ్చెనెటఁబోయెందోడఁదానేగి." భాగ. ౧౦, స్కం. పూ.—2. వెంబడి. "తోడనగీర్వాణవధూటికిన్." స్వా. ౨, ఆ.

తోడంటు. దే. వి. (తోడు + అంటు.) చేమిరి. "సీ. మొదవుల నెన్నేఁబిదికిన పాల్గాఁచియొకరఁదోడంటుతోఁ సుట్టఁబెట్టి." శుక. ౧, ఆ.

తోడఁబుట్టు. దే. వి. (తోడన్ + పుట్టు.) తోడఁబుట్టువు.

తోడఁబుట్టుగు. దే. వి. (తోడన్ + పుట్టుగు.) ——పై.—— (చూ. తోఁబుట్టుగు.)

తోడఁబుట్టువు. దే. వి. (తోడన్ + పుట్టువు.) సహోదరుఁడు, సహోదరి.

తోడనము. సం. వి. అ. న. ఖండనము.

తోడా. దే. వి. హస్తభూషావిశేషము.

తోడికోడలు. దే. వి. (తోడన్ + కోడలు.) మగనితోడఁబుట్టినవానిభార్య, యాత.

తోడిచూలు. దే. వి. (తోడన్ + చూలు.) తోడఁబుట్టువు.

తోడితెచ్చు. దే. స. క్రి. పిలుచుకొనివచ్చు. "ఎ. గీ. కన్నమిడఁగరాత్రిఁగన్నచోమ్రుచ్చులఁ, దోడితెచ్చి కేలుత్రుంచివైచి, వాఁడికొఱులఁదిగిచివారిఁజంపుటరాజ, ధర్మమనుచుమాన్పదండి చెప్పె." విజ్ఞా. ప్రా, కాం. (ప్రే. తోడితెప్పించు. "ఎ, గీ. దేవయతనిఁదోడితెప్పింపుమన్నింపు." భాగ. ౧౦, స్కం. ఉ.)

తోడియల్లుఁడు. దే. వి. (తోడన్ + అల్లుఁడు.) షడ్డకుఁడు.

తోడివాఁడు. దే. వి. (తోడన్ + వాఁడు.) తోడనున్నవాఁడు.

తోడు. దే. వి. 1. ఆన; "క. సీతోడుసీసమానులు, భూతావలిలోననెందుఁబుట్టరుపురుషుల్." హరి. ఉ. ౭, ఆ.—2. తోడఁబుట్టువు. "ఎ, గీ. శిలమఖిలంబునిదిపిల్లిశిలమనుచుఁ, జదువులివియెల్లఁజిలుకలచదువులనుచుఁ, దోడివారలునవ్వనాతోడయేల, బేలవైతివియీగుణంబేలనీకు." పాండు. 3, ఆ.—3. చేమిరి.—విణ. సహాయము.

తోడుఁబాలు. ద్వి. వి. (తోడు + పాలు.) పాల్పుసిండఁబోవునపుడు పాలదుత్తలోనుంచుకొనెడు నీళ్లు.

తోడుకొను. దే. అ. క్రి. (పాలు) పేరు. స. క్రి. పిలుచుకొను (చూ. తోడికొను.) (ఈ యర్థమందు దీనికి భూతార్థక అసమాపక క్రియగానే ప్రయోగము.)

తోడుచేల్ల దే. వి. చేమిరిపెట్టుమజ్జిగ.

తోడుత. దే. ద్ర. తోడ. "గీ. కౌరవాన్వయజాతులైగారవమునఁ, బెరిగినట్టిమీరొంటొకనరునిఁగొలిచి, మనలివర్తిల్లిమానావమానములకు, నోర్చియుడఁకువతోడుతనునికియరిది." భార. విరా. ౧, ఆ.

తోడుతో. దే. ద్ర. వెంబడిని.

తోడుతోడ. దే. ద్ర. ——పై.——

తోడునీడ. దే. విణ. సహాయుఁడు. "సీ. గెడతోడునీడలై క్రీడించునచ్ఛాత్రులంతకు నెంతచింతింతురొక్కొ." స్వా. ౨, ఆ.

తోడుపడు. ద్వి. అ. క్రి. సహాయపడు.

తోడుపాటు. ద్వి. వి. తోడుపడుట, సాహాయ్యము.

తోడుపెట్టు. దే. స. క్రి. చేమిరిపెట్టు.

తోడువోవు. దే. అ. క్రి. (తోడు + పోవు.) సరియగు. "క. పిడుగులకుఁదోడువోయిన, కడిఁదిశరములు." ఉ, గా. ర, ఆ.

తోడెము. దే. వి. కొంచెము, లేశము.

తోడ్కొను. దే. స. క్రి. తోడుకొనుయొక్క రూపాంతరము. (చూ. తోడితెచ్చు.)

తోడ్తెచ్చు. దే. స. క్రి. తోడితెచ్చుయొక్క రూపాంతరము. (చూ. తోడితెచ్చు.) "మ. ననుసైరంధ్రికడంగివేర్కొనినదానన్ బెంపుమైఁబిల్చితో, జనితోడ్తెచ్చితివి." భార. విరా. ర, ఆ.

తోడ్తో. దే. ద్ర. తోడుతోయొక్క రూపాంతరము. (చూ. త్రెక్కొను.)

తోడ్తోడ. దే. ద్ర. తోడుతోడయొక్క రూపాంతరము.

తోడ్పడు. ద్వి. అ. క్రి. తోడుపడుయొక్క రూపాంతరము.

తోడ్పాటు. ద్వి. వి. తోడుపాటుయొక్క రూపాంతరము.

తోతెచ్చు. దే. స. క్రి. తోడితెచ్చుయొక్క రూపాంతరము. "ద్వి. ఈతఁడుమీకార్యమీడేర్పఁదలఁచి, తోతేరఁబనిచినదూతలవిభుఁడు." రా. కిష్కిం, కాం.

తోత్రము. సం. వి. అ. న. 1. (ఏనుఁగును పొడిచెడు) బరిగోల; 2. (పసులనదోలెడు) మునికోల.

తోదనము. సం. వి. అ. న. 1. నొప్పించుట; 2. (పసులనదోలెడు) మునికోల.

తోదు. దే. వి. వరుసకట్టు.

తోనిగాఁడు. దే. వి. శ్యేనవిశేషము.

తోపరా. హిం. వి. ఉలవలసంచి.

తోపాటు. దే. అవ్య. వలె. "సీ. తనపుత్రుతోపాటు చనఁబాలొసంగుచుఁ గూరిమితోఁబెంచెఁగొన్నినాళ్లు." బ్ర. 3, ఆ.

తోపారము. దే. వి. డేగలముఖమునకుఁగట్టెడు తోలుగంత.

తోపి. దే. వి. టోపియొక్క రూపాంతరము. (చూ. టోపి.)

తోపు. హిం. విణ. ఒకవిధమైన ఎఱుపు.

తోమకము. దే. వి. తోముట. "వ. పిడుకగొఱపంపుఁదోమకంబునంబుటపుటనై." ఆము. ర, ఆ.

తోమరము. సం. వి. అ. పుం, న. చిల్లకోల, సర్వల.

**తోమాలియ.** ఎవ్. వి. (తోట + మాలియ.) తోమాలె. "సీ. నైచుఁదోమాలియనైజయంతికాంతివలయిసువత్సకవాటునటను." పాండు. ౨, ఆ.

**తోమాలె.** దవ్. వి. ఆకులు పుష్పములు కూర్చికట్టినదండ, వనమాల. "సీ. బాహుల మధ్యంబునఁ బవడంపుఁడవ్వుతులపచ్చలతోమాలె యచ్చుపడేచి." వై. ౫, ఆ. (తోమాలియయొక్క రూపాంతరము.)

**తోము.** దే. స. క్రి. (మురికిపోవ) రుద్దు.

**తోముడు.** దే. వి. (మురికిపోవ) రుద్దుట.

**తోయగాఁడు.** దే. విశే. (తోయము + కాఁడు.) విధముగలవాఁడు. "క. పలుదోయంబుల జగములఁ, బలుదోయములందుమించి భాసిల్లెడియా, పలుదోయగాఁడువల్లవ, లలనాకరతోయములఁజెలంగుచుఁదడియుణ్." భాగ. ౧౦, స్క-ం. పూ.

**తోయజము.** సం. వి. అ. న. తామర, నీటిపుట్టుగు.

**తోయజాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరవంటికన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. (దీనికి సరియైనపదము పేరుఁగున తప్పి కంటి.)

**తోయదము.** సం. వి. అ. న. నెయ్యి. పుం. 1. మబ్బు; 2. తుంగ.

**తోయధి.** సం. వి. ఇ. పుం. సముద్రము, మున్నీరు.

**తోయపిప్పలి.** సం. వి ఈ. స్త్రీ. నీరుపిప్పలి.

**తోయము.** ఉభ. దే. వి. 1. విధము; "క. తోయజనంభవనాక్షి, తోయము నివరింపుచాలుఁదోఁచిననేనా, తోయము వారికినన్యుల, తోయములం జెందకుండ ధ్రువమెఱఁగింతుణ్." భాగ. ౨, స్క-ం.—2. తెగ; "క. చెలరేఁగిరెండుతోయం, బులపేరంటాండ్రుఁజిత్తములనెంతయునే, డ్క-లుమీఱఁజల్లులాడిరి, తలఁకకయభినవకుభాక్షతవ్రాతములణ్." కళా. 2, ఆ.—3. తడవ; "మాగఘుఁడు సేనలతోఁబదియేడుతోయముల్ దిక్కు-లఁబాఱఁడే." భాగ. ౧౦, స్క-ం. ఉ:—4. పరివారము; "మ. నద్భుటవ్రజముణ్ దోయము చేసియున్నసుఖయైవర్తించుచుండెణ్ బరిణ్." భో. ౫, ఆ.—5. సమయము. "క. తోయనులుదెమ్మమాక్షి, తోయమువేఁటాడు పేఁదొల్లిపొడమదీ, తోయమ్ముక్రియజలదాహము, తోయమువారలునులేరుదున్నహమనఘా." భాగ. ౧, స్క-ం.—సం. అ. న. ఉదకము.

**తోయరుహము.** సం. వి. అ. న. తామర, నీటిపుట్టుగు.

**తోయలి.** దే. వి. తొయ్యలియొక్క మొదటిరూపము.

**తోరణము.** సం. అ. పుం. న. 1. పుష్పమాలికాదులుగట్టుటకై గృహమునకు వెలుపల స్తంభద్వయము చేత నేర్పఱుపఁబడిన ద్వారము; 2. మంగళార్థముగా ఆ తోరణమునకుఁగట్టెడు మావిడాకులోనగువానివరుస. (రూ. తోరణ. "క. తనుచూడ్కు-లు, తోలుతగనీలోత్పలములతోరణగట్టణ్." కళా. 3, ఆ.)

**తోరమల్లి.** దే. వి. వజ్రమువలె తెల్లగానుండు అల్పమణి విశేషము.

**తోరము.** వై. వి. వ్రతసూత్రము. "సీ. పసిఁడితోరముతోడిబాహువల్లవనెత్తిసారెకుఁ బొదలపైఁ జాఁచిచాఁచి." స్వా. 3, ఆ.—విశే. 1. స్థూలము; "తోరపుముత్తియములు." భార. అశ్వ. 3, ఆ.—2. అధికము*; "తోరపువేదనస్సైఁపలేక." విక్ర. ౨, ఆ.—3. బలిష్ఠము*. "క. ఆరెండుబలములందును, దోరంబైయున్న యట్లు తోఁచెంబాండు, క్ష్మారమణసుతుబలమునర, నారాయణులు నిశ్చీరినినాకుంజూడణ్." భార, భీష్మ. ౧, ఆ.

**తోరహత్తము.** వై. వి. మల్లబంధవిశేషము. "తోరహత్తింబునను బొత్తమూరి." ఉ, హరి. 3, ఆ.

**తోరహత్తు.** వై. విశే. నమృద్ధము*. "ఉచితంబుల్ ద్రవ్యముల్ తోరహత్తులుగాఁగూర్చి." రామా. 3, ఆ.

**తోలు.** దే. స. క్రి. (పసులులోనగువాని) నడపించు. వి. చర్మము.

**తోలుక.** దే. వి. తోలు, చర్మము. (స్వార్థమున క ప్రత్యయము.)

**తోలుచే.** దే. ప్రే. తోలఁజేయు, తోలించు. "క. భగ్నవ్రతుఁ దోలుపలేదుముండ్లగానులమీఁదణ్." రుక్మాం. ౨, ఆ.

**తోలుదాలుపు.** దే. వి. (తోలు+తాలుపు.) శివుఁడు, కృత్తివాసుఁడు. (రూ. తోలుదాల్పు. "గీ. తోలుదాల్పు విల్లుదునిమిన సజ్జాణఁ, జూచి." అచ్చ. బాల, కాం.)

**తోవ.** దే. వి. కొటిక, వలభి. ఆం, భా.

**తోలువాయిదము.** దవ్. వి. తోలుకప్పినవాద్యము, ఆనద్ధము.

**తోసిరాజు.** మి. వి. తొలఁగఁదగినరాజు. "చ. కలికిముఖారవిందమలకల్వలరాయనిఁ దోసిరాజనుణ్." విజ. ౧, ఆ. (ఇది చదరంగమునందలి పరిభాష. చెనిని భాషాంతరమందు నహా అందురు.)

## తౌ.

**తౌ.** దే. అ. క్రి. తగుయొక్క రూపాంతరము. (చూ. కవిల.) (మొదటిరూపము తవు.)

**తౌటిపాము.** దే. వి. (తౌడు + పాము.) మలుఁగుచేఁప. (మొదటి రూపము తవుటిపాము.)

**తౌడు.** దే. వి. బియ్యముమీఁదిముతికె, కంబూకము. (మొదటి రూపము తవుడు.)

**తౌర్యత్రికము.** సం. వి. అ. న. నృత్తగీతవాద్యములు.

**తౌలఁబడు.** దవ్. అ. క్రి. తగులఁబడుయొక్క రూపాంతరము. (మొదటిరూపము తవులఁబడు. "క. తవులంబడఁడెందునత్యుదగ్రబలమునణ్." భాగ. ఉద్యో. ౨, ఆ.)

**తౌలు.** దే. అ. క్రి. తగులుయొక్క రూపాంతరము. (వెంబడించుట.— "చ. సుస్థిరునినుమావిభుండనుమతిణ్ వెనుదౌలెదమాదరంబునణ్." రాఘ. 3, ఆ.) (మొదటిరూపము తవులు. చిక్కుటకు.—"క. భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి." భార, అర. ౧, ఆ.—సక్తమగుటకు. —"భవదీయబాహుబలిణ్, దవిలినభూదేవి." కా. ౫, ఆ.—తగులమునకు.—"చ. ఎందునం, దవులొకయింతలేక సతతంబుఁజరించునమ్ముల్లసద్గలిణ్." మార్క-. ౨, ఆ.)

**తౌలుకొను.** దే. అ. క్రి. స. క్రి. తగులుకొనుయొక్క రూపాంతరము. (మొదటిరూపము తవులుకొను. ప్రే. తౌలుకొలుపు. రగులుకొలుపుటకు. — "సీ. చతురస్రకలితవిస్తృతహోమకుండంబుఁద్రవ్వించిపావకుఁదౌలుకొలిపి." వై. ౫, ఆ.)

**తౌలుచు.** దే. ప్రే. తగులుచుయొక్క రూపాంతరము. (మొదటి రూపము తవులుచు. (రూ. తవుల్చు.) "వీనులఁజూచుపెంజెముఁ దవిల్చినకంచము." ఉ, హరి. ౨, ఆ.)

**తౌలువడు.** దవ్. అ. క్రి. తగులువడుయొక్క రూపాంతరము. (మొదటిరూపము తవులువడు.)

**తౌల్యము.** సం. వి. అ. న. సామ్యము.

## త్య.

**త్య-క్తము.** సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది.

**త్యజనము.** సం. వి. అ. న. వర్జనము. విడుపు.

**త్యజించు.** సం. స. క్రి. వర్జించు, విడుచు.

**త్యాగము.** సం. వి. అ. పుం. 1. ఈవి; 2. విడుపు.

**త్యాగి.** సం. వి. (న్. ఈ. న్.) 1. ఈవికాఁడు; 2. శూరుఁడు.

**త్యాజ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) విడువఁదగినది. (జ్యోతిశ్శాస్త్రమునందు దోషయుక్తమైన కొంతకాలము త్యాజ్యమని చెప్పఁబడును.)

## త్ర.

**త్రంపి.** దే. వి. దాఁటి. "ఉ. అనవుత్రంపిఁబెట్టిహృదయుఁడును కాఁగునయోగవానసా, ఘ్రాణపుటిపుగాఁచుటకువాగమపావకముక్ దగిల్చియా, యానవిబోరమత్కృతాగస్థైకరియస్రకుఁదజ్జలంబుపైఁ బోసిన నీకరీంమది పొందియుఁబోఁదనె యుల్లయాఅనుక్." ఉ, హరి. ౪. ఆ.

**త్రచ్చన.** వై. వి. 1. చిలుకుట; 2. చెక్కుట.

**త్రచ్చు.** వై. స. క్రి. తరుచుయొక్కరూపాంతరము.

**త్రప.** సం. వి. ఆ. స్త్రీ. 1. సిగ్గు; 2. అంకుటాలు.

**త్రపిష్ఠుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి సిగ్గుగలవాఁడు.

**త్రపువు.** సం. వి. ఉ. న. 1. తగరము; 2. ఉ. న. న. సీసము.

**త్రపులము.** సం. వి. అ. న. సీసము.

**త్రపుస.** సం. వి. ఆ. స్త్రీ. చేఁదుగలదోసకాయ.

**త్రమ్ము.** దే. స. క్రి. దుమ్ముచేయు. వి. దుమ్ము. "సీ. పెతరుల ఋణముదీర్చెదునా నుఁజెందనిదౌర్భాగ్యశైలుగో త్రమ్ముత్రమ్ము." రాఘు. ౧, ఆ.

**త్రయము.** సం. న. అ. మూటిసమూహము.

**త్రయి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మూఁడువేదములు; 2. మూటిసమూహము; 3. ఏనుఁగుకాలిసంకెల; 4. కుటుంబముగల ఆఁడుది; 5. మంచిమనస్సుగల ఆఁడుది; 6. ఒక విద్య. (చూ. విద్య.)

**త్రయీతనువు.** సం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

**త్రయీధర్మము.** సం. వి. అ. పుం. వేదవిహితధర్మము.

**త్రయోదశము.** సం. న. (అ. ఈ. అ.) పదుమూడవది.

**త్రయోదశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు పదుమూడవ తిథి; 2. పదుమూఁడుతంతులుగల పరివాదిని యను వీణ. విణ. పదుమూడవది.

**త్రవ్వు.** దే. స. క్రి. త్రవ్వుయొక్కరూపాంతరము. "సీ. పెంథాళి యెనఁగనందందకార్ద్రవు నుదగ్రతమహాతలముగ్రక్కదలుచుండ." శూర్క, ౬, ఆ.

**త్రవ్వికోల.** దే. వి. త్రవ్వుకోలయొక్కరూపాంతరము.

**త్రవ్వటము.** దే. వి. త్రవ్వుట. "సీ. త్రవ్వటంబులతటేఁ ద్రవ్వటంబులువెట్టుఁ దగినట్టికజ్జుగుద్దలిగడించి." (కజ్జుగుద్దలి=తొల్లిక.) కళా. ౪, ఆ.

**త్రవ్వటించు.** దే. స. క్రి. త్రవ్వు.

**త్రవ్విత౦డము.** దే. విణ. అసంఖ్యము. "సుమేరురత్నంబు లన్నియుఁద్రవ్వితండమ్ములుగాని." హరి. ఉ. ౪, అ. "చ. కొడుకులుఁగూఁతులుంగలిగిగుజ్జులులేనిశపిండుఁబల్లకిల్ల్, గొడుగులుఁ ద్రవ్వితండముగఁ గూరిమితో మనఁ బెక్కు లేంద్రునిక్." య. ౪, ఆ.

**త్రవ్వు.** దే. స. క్రి. 1. ఖననముచేయు; "చక్రప్రకారాఁ తిప్పలుచోరఁద్రవ్వఁడు." హరి. ఉ. ౧, ఆ.—2. ఖండించు; "క. రుద్రానుచరులుపద్దయు, గౌద్రులయిరోధిశితిఁద్రవ్వఁగ సమరం, బుద్రిక్తమయ్యె." హరి. ఉ. ౧౦, ఆ.—3. పుట్టు పూర్వోత్తరములనెత్తు; "ఉ. వీరలుపెద్దత్రవ్వకొకవెంటనొదంబడి తేజితాంతులై, కౌరవకోటిఁగూడిమనఁగామదిఁగోరుటపెంపుఁదాల్చియుఁ, గారుణికత్వముఁ దగవుఁగాదె." భార. ఉద్యో. ౧. ఆ.—4. ప్రస్తావమునకుఁదెచ్చు. "గీ. అనినవవ్వుచువారితోనవ్విభుండు, మీకునిన్నిత్రవ్వఁగనేలమిన్నకున్నఁ, బోదె." హరి. పూ. ౭, ఆ.

**త్రవ్వుకోల.** దే. వి. గుద్దలి, కుద్దాలము.

**త్రసకము.** సం. వి. అ. న. గడ్డిపరక.

**త్రసము.** సం. విణ. (అ. ఆ. అ.) తిరుగునది, జంగమము.

**త్రసరము.** సం. వి. అ. పుం. పంటెకఱ్ఱ. నూలుచుట్టుట. (అని కొందఱు.)

**త్రసరేణువు.** సం. వి. ఉ. స్త్రీ. సంజ్ఞాదేవి. పుం. ముప్పదిపరమాణువులకొలఁది.

**త్రస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) భయపడినది.

**త్రస్తరి.** దే. వి. పరిహాసము. "క. ఒకనాఁడుసకలయాదవ, నికరంబులతోడఁ గాందినీసుతుఁ బిలిపిం, చికడుంబ్రియపూర్వకముగఁ బ్రకటవినోదములునడపెఁబరిహాసములన్. వ. ఇవ్విధంబుననక్రూరచిత్తంబక్రూరంబుగాఁ ద్రస్తరులుచేసియిట్లనియె." వి, పు. ౬, ఆ.

**త్రస్తరించు.** దే. అ. క్రి. పరిహాసమాడు. "తాపింఛరుచితోడఁ ద్రస్తరించెడుమేన." భాగ. ౧౦, స్కం. ఉ.

**త్రస్నువు.** సం. విణ. ఉ. భయపడువాఁడు.

**త్రస్స.** దే. వి. వేదాధ్యయనము చేయునపుడు నోటనుంతిరాలెడు తుంపర, బ్రహ్మబిందువు. "సీ. భ్రమరనాదముపేరఁ గొమరుఁడధ్యయనించుతఱిరాలినెఱసినత్రస్సలనఁగ." చంద్ర.

## త్రా.

**త్రాఁచు.** దే. వి. సర్పము. "సీ. స్ఫటలమణుల్ మీఱుశాంతమై శ్వేతమైనట్టిత్రాఁచొక్కటిచుట్టుకుండు." ఆము. ౪, ఆ.

**త్రాగు.** దే. స. క్రి. పానముచేయు. (చూ. త్రావు.)

**త్రాగుడు.** దే. వి. పానము. "చిట్టకంపుఁద్రాగుడు." ఆము. ౨, ఆ.

**త్రాడు.** దే. వి. 1. పేనినదారము, పాశము; 2. కిరణము. (చూ. కాచే.)

**త్రాడుదాలుపు.** దే. వి. (త్రాడు+తాలుపు.) వరుణుఁడు, పాశి. "త్రాడుదాలుపుమేలిరతనముల్ గొనితెచ్చు." అచ్చ. సుం, కాం.

**త్రాడుపడు.** ద్వి. అ. క్రి. (త్రాడు+పడు.) 1. కృశించు; 2. దారమగు. "సీ. పాథోధివల్లభుపాళివల్లిమతల్లిదర్పంబు దిగఁద్రావి త్రాడుపడియె." భీ. ౪, ఆ.

**త్రాణ.** వై. వి. బలము, శక్తి. "త్రాణల్ తప్పితద్వగల్గిమాత్రులగ చుక్ దైన్యంబునొందక్." వి, పు. ౨, ఆ.

**త్రాణము.** సం. వి. అ. న. 1. కలుకానుగుకాయ; 2. కాపు. విణ, కావఁబడినది.

**త్రాత.** సం. వి. ఋ. పుం. కాచువాఁడు.

**త్రాతము.** సం. విశే. (అ. ఆ. అ.) కావఁబడినది.

**త్రాపుషము.** సం. విశే. (అ. ఈ. అ.) త్రపువుచేత చేయఁబడినది.

**త్రాయంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కలుకానుగుకీ; 2. కలుగ్రాంతికీ.

**త్రాయమాణ.** సం. వి. ఆ. స్త్రీ. కలుకానుగుకీ. విశే. కావఁబడుచుండునది.

**త్రావు.** దే. స. క్రి. త్రాగుయొక్క రూపాంతరము. "క. ఈ వాయుపుత్రుఁడా జిక్, ద్రావుదునేడుస్సనేనఁ రక్తంబనియెక్." భార. ఉద్యో. ౪, ఆ.

**త్రావుడు.** దే. వి. త్రాగుడుయొక్క రూపాంతరము.

**త్రాసము.** సం. వి. అ. పుం. 1. భయము; 2. మణిదోషవిశేషము.

**త్రాసు.** దే. వి. తూఁచెడుతుల. (తరాసుయొక్క రూపాంతరము.)

## త్రి.

**త్రింశత్తు.** సం. స. త్. స్త్రీ. ముప్పది.

**త్రింశము.** సం. స. (అ. ఆ. అ.) ముప్పదవది.

**త్రిక.** సం. వి. ఆ. స్త్రీ. నూతిగిరక. అ. న. ము. 1. మూటిసమూహము; 2. ముడ్డిపూస; 3. శొంటి పిప్పలి మిరియాలు; 4. కరక తాడియుసిరికలు; 5. మూఁడుదారులు కలయుచోటు.

**త్రికంటకము.** సం. వి. అ. పుం. 1. ములుబెముడుకీ; 2. పెద్ద పల్లేరుకీ; 3. మత్స్యవిశేషము.

**త్రికకుత్తు.** సం. వి. ద్. పుం. 1. త్రికూటపర్వతము; 2. విష్ణువు; 3. అభినయహస్తవిశేషము.

**త్రికటుకము.** సం. వి. అ. న. శొంటి పిప్పలి మిరియాలు. (రూ. ఉ. న. త్రికటువు.)

**త్రికాష్ఠి.** సం. వి. ఇ. న. (చూ.) త్రిక్కటి.

**త్రికూటము.** సం. వి. అ. న. ఇందుప్పు. పుం. ఒకానొక పర్వతము.

**త్రికోణము.** సం. వి. అ. న. మూఁడు మొనలుకలసినరూపము.

**త్రిక్క.** దే. వి. తిక్కయొక్క రూపాంతరము.

**త్రిక్కటి.** వై. వి. ఆయుధవిశేషము.

**త్రిక్కు.** దే. అ. క్రి. తక్కు. "ఉ. తిలయంత్రమునఁ బ్వలఁ బీడనేయున, ట్లక్కటికంబుమాలి ప్రజ నాఅడినొంపుదు నొంప నైతినా, త్రిక్కకఁణంగిపోదురుసరిత్తులనూళులువోవ్వకైవడిక్." వా. ౪, ఆ.—వి. చిక్కు; బాధ. "ఉ. ఒక్కఁడుతెచ్చుకొండ తలనుండఁగ మీఁదనయిత్తుకొంచునాం, డొక్కఁడు నింగికెన్నగని యురిప్చలింపఁగ దాఁటిక్రందునక్, ద్రిక్కులువెట్టనొల్లఁజన రేయనిక్రమ్మఱఁబాఱివాఁడువే, ఒక్కనగంబుపూనియరుదందఁగ ముందటవచ్చువానికిక్." రా. యు, కాం.

**త్రిగర్త.** సం. వి. ఆ. స్త్రీ. అంకుటాలు. అ. పుం. ము. ఒకదేశము.

**త్రిగుణాకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) మూఁడుచాళ్లు దున్నినది. (పొలము.)

**త్రితయము.** సం. స. అ. న. మూఁడు.

**త్రిదండము.** సం. వి. అ. న. మనోదండము, వాగ్దండము, కర్మదండము అను మూఁడు దండములు. పుం. మనోదండము, వాగ్దండము, కర్మదండము అను మూఁడు దండములుగల సన్యాసాశ్రమము.

**త్రిదండి.** సం. వి. న్. పుం. మనోదండ, వాగ్దండ, కర్మదండము లను మూఁడు దండములుగల సన్యాసి.

**త్రిదశాలయము.** సం. వి. అ. పుం. స్వర్గము, వేల్పుఁబ్రోలు.

**త్రిదశుఁడు.** సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

**త్రిదివ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. అ. పుం. ము. స్వర్గము.

**త్రిదివేశుఁడు.** సం. వి. అ. పుం. త్రిదశుఁడు, వేల్పు.

**త్రిదోషము.** సం. వి. అ. న. వాతపిత్తశ్లేష్మములు.

**త్రిద్యుస్పృక్కు.** సం. వి. శ్. పుం. స్త్రీ. మూఁడువారములు కూడిన తిథి. (చూ. అవమము.)

**త్రిధాముఁడు.** సం. వి. న్. పుం. 1. అగ్ని; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. యముఁడు.

**త్రిపతాకము.** సం. వి. అ. న. మూఁడురేఖలుగల నొసలు. పుం. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలినివంచి చూపుడు వ్రేలి మొదలుగాఁగూర్చి యుంగరపు వ్రేలినివంచి కడమ వ్రేళ్లనుజాఁచిపట్టినది.)

**త్రిపథగ.** సం. వి. ఆ. స్త్రీ. గంగానది, ముత్రోవ ద్రిమ్మరి.

**త్రిపది.** సం. వి. ఈ. స్త్రీ. ఏనుఁగుకాలిసంకెల.

**త్రిపుండ్రము.** సం. వి. అ. న. నొసటనుంచిన విబూదిలోనగు వాని మూఁడురేఖలు.

**త్రిపుట.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టేలకీ; 2. తెల్లతెగడకీ; 3. మల్లెకీ. అ. పుం. 1. ఒక తాళము; (ఏడక్షరములకాలము.) ము. 2. దరి; 3. సరము.

**త్రిపురము.** సం. వి. అ. న. మయునిచే నిర్మింపఁబడిన మూఁడు పురములు. పుం. బంగిచెట్టు.

**త్రిపురాంతకుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు. (ఇతనికి త్రిపురసంహారమప్పుడు తేరు భూమి, చక్రములు సూర్యచంద్రులు, గుఱ్ఱములు వేదములు, చాపము మేరువు, నారి శేషుఁడు, బాణము విష్ణువు.)

**త్రిప్పట.** దే. వి. తిరుగుట, పర్యటనము. "క. ఇటువలెవెదకి యుఁడమత్రి, ప్పటగురుఁడిఁబోతులమంత్రపరసంబెటుల, ట్లట మటమైపోఁజూచినఁ, గటకటఁబడియింకొక పుడుకపులడియానక్." రామా. ౬, ఆ.

**త్రిప్పరి.** దే. విశే. (త్రిప్పు + అరి.) త్రిమ్మరి.

**త్రిప్పికొను.** దే. అ. క్రి. తిరిగికొను. (ప్రే. త్రిప్పికొలుపు. "సీ. అల్లనవాఁడెడునప్పుడకొక్కమ్మవాలెఱతొవధైర్యంబు త్రిప్పికొలుప." భార. అను. ౧, ఆ.)

**త్రిప్పియాడు.** దే. ప్రే. (త్రిప్పి + ఆడు.) త్రిప్పు. "గీ. చత్రి త్రిప్పియాడియలతోఁద వ్రేసిపా, దములఁజదుపఁజూచి." భార. శల్య. ౧, ఆ. (స్వార్థమున ఆడు.)

**త్రిప్పు.** దే. ప్రే. తిరుగఁజేయు. "చ. అపుడుసుబుద్ధిసైన్యములనన్నియు నొక్కమొగంబుగా నమ, ర్చి పురికిఁగానికల్ మగుడఁ ద్రిప్పి." జై. ౫, ఆ.—వి. తిరుగుడు. "చ. అనితరతత్వశీలరగు నట్టిమహాత్ములు మాయ చేయుత్రి, ప్పునఁబడిపోక." లక్ష్మీ. ౫, ఆ.

**త్రిష్టుడుత్రాడు.** దే. వి. (చూ.) తిరుగుడుత్రాడు. "ద్వి. తెగటేటిమబ్బులు త్రిష్టుడుత్రాళ్ల." నళ. 3, భా.

**త్రిష్టుత్రాడు.** దే. వి. (చూ.) తిరిత్రాడు.

**త్రిఫల.** సం. వి. ఆ. స్త్రీ. 1. కరకతాడి యుసిరికలు; 2. ద్రాక్షా కాశ్మర్యఖర్జూరఫలములు; 3. జాజీలవంగపూగఫలములు.

**త్రిభండి.** సం. వి. ఈ. స్త్రీ. తెల్లతెగడ.

**త్రిమూర్తి.** సం. వి. ఇ. పుం. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు అను పేర్లుగల మూఁడు శరీరములుగలవాఁడు.

**త్రిమ్మట.** దే. వి. 1. త్రిప్పట; 2. ఆపద. (చూ. ఇడుమ.)

**త్రిమ్మటకాఁడు.** దే. విశే. త్రిమ్మరి. "క. అవనిసుతుఁడర్ధరథుఁడా, ధృతవర్ముఁడుపిన్ననాఁడు త్రిమ్మటకాఁడై, మతిహీనతశస్త్రాస్త్ర. ప్రతతి పరిశ్రమములేకపాలసుఁడగుటన్." భార. ఉద్యో. ౮, ఆ.

**త్రిమ్మరి.** దే. విశే. ఇచ్చవచ్చినట్టు తిరుగువాఁడు. "క. నమ్మఁడిది వగునుపాయము, పొమ్మనవుడునూరువెడలిపోయిఁ జిచ్చన్, ద్రిమ్మరుతెఱఁగుఁదప్పలి, ద్రిమ్మరియనియెల్లవారుఁ దెగడెడునటుగాన్." భో. 3, ఆ.

**త్రిమ్మరీఁడు.** దే. విశే. (త్రిమ్మరి+ఈఁడు.) త్రిమ్మరి. "తుష్మెద త్రిమ్మరీఁడు." వసు. 3, ఆ. (స్వార్థమున ఈఁడు.)

**త్రిమ్మరు.** దే. అ. క్రి. సంచరించు. "భక్తకోటులలో నేలం ద్రిమ్మరు నాత్మవు." ఉ, హరి. ౨, ఆ.—స. క్రి. చుట్టివచ్చు. "క. అనవరతమువిధియోగంబుననే ద్రిమ్మరుదు సచరభూధరముఁ బ్రియమ్మున." భార. ఆర. 3, ఆ.

**త్రియామ.** సం. వి. ఆ. స్త్రీ. 1. రాతిరి; 2. పసుపు; 3. యమునానది.

**త్రిరాత్ర.** సం. వి. ఆ. స్త్రీ. ముట్టుది. అ. న. ము. మూఁడు రాత్రులు. పుం. 1. యాగవిశేషము; 2. పట్టణమునందలి వెదురుపొద.

**త్రిలింగము.** సం. వి. అ. పుం. శ్రీశైలదక్షారామకాళేశ్వరముల నెడు మూఁడు లింగస్థానములకు నడుమనుండు దేశవిశేషము. విశే. మూఁడు లింగములుగలది.

**త్రిలోచనుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి. (ఇట్లు త్రినేత్రుఁడు మొ.)

**త్రివత్సము.** సం. వి. అ. పుం. మూఁడేండ్ల కోడెదూడ.

**త్రివర్గము.** సం. వి. అ. పుం. 1. ధర్మార్థకామములు; 2. సత్వరజస్తమములు; 3. క్షయస్థానవృద్ధులు; 4. త్రికటుకము; 5. త్రిఫల.

**త్రివిక్రముఁడు.** సం. వి. అ. పుం. మూఁడులోకములను మూఁడడుగులుగా కొలిచిన విష్ణువు.

**త్రివిష్టపము.** సం. వి. అ. న. స్వర్గము, వేల్పుఁబ్రోలు.

**త్రివృత.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లతెగడ.

**త్రివృత్తు.** సం. వి. త్. స్త్రీ.———పై.———

**త్రివేణి.** సం. వి. ఈ. స్త్రీ. గంగానది.

**త్రిశంకువు.** సం. వి. ఉ. పుం. 1. ఒకానొకరాజు; 2. పిల్లి; 3. మిడుత.

**త్రిశిఖము.** సం. వి. అ. న. 1. త్రిశూలము; 2. సిగదండ. పుం. డు. ఒకానొక రాక్షసుఁడు.

**త్రిశూలము.** సం. వి. అ. న. ఆయుధవిశేషము, ముమ్మొనవాలు.

**త్రిశృంగము.** సం. వి. అ. పుం. పరికెగడ్డి.

**త్రిషవణము.** సం. వి. అ. న. 1. మూఁడుసవనములు; (ప్రాతస్సవనము, మధ్యందినసవనము, సాయంసవనము. చూ. సవనము.) 2. మూఁడుకాలములు.

**త్రిష్టుప్పు.** సం. వి. భ్. స్త్రీ. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.)

**త్రిసంధ్యము.** సం. వి. అ. న. పూర్వాహ్ణ మధ్యాహ్నపరాహ్ణ సంధ్యలు.

**త్రిసీత్యము.** సం. విశే. (అ. ఆ. అ.) మూఁడు చాళ్లుదున్నినది. (పొలము.)

**త్రిసూత్రము.** సం. వి. అ. న. బ్రహ్మసూత్రము. పుం. వైదూర్యవిశేషము.

**త్రిస్రోత.** సం. వి. స్. స్త్రీ. 1. గంగానది; 2. నదీవిశేషము.

**త్రిహల్యము.** సం. విశే. (అ. ఆ. అ.) (చూ.) త్రిశీత్యము

**త్రిహాయణి.** సం. వి. ఈ. స్త్రీ. మూఁడేండ్లపెయ్య.

## త్రు.

**త్రుంగు.** దే. అ. క్రి. 1. తునుకలగు; "తురగస్యందనవారణప్రకరముల్ ద్రుంగన్." భార. ద్రో. ౪, ఆ.—2. నశించు.

**త్రుంగుడు.** దే. వి. 1. నాశము; 2. ప్రళయము.

**త్రుంగుడుపడు.** ద్వి. అ. క్రి. (త్రుంగుడు+పడు.) నశించు. "క. ధూమధ్వజుఁడాజ్యవృష్టిఁ ద్రుంగుడువడునే." భాగ. ౯, స్కం.

**త్రుంచు.** దే. ప్రే. (త్రుంగఁజేయు.) 1. తునుకలుచేయు; 2. చంపు; "ద్వి. ఆయుధిష్ఠిరుఁడంతనాత్మీయజనుల, రోయకయనిలోనఁ ద్రుంచినపనికి." భాగ. ౧, స్కం.—3. ఉత్తరించు. "దుకూలముల్ త్రుంచి త్రుంచికట్టనిచ్చిన." ఉ, హరి. ౮, ఆ.

**త్రుంపు.** దే. వి. ఖండము. "త్రుంపులైనచామరములు." జై. ౪, ఆ.

**త్రుంపుడు.** దే. వి.———పై.———

**త్రుక్క.** దే. వి. త్రుళ్లు, గర్వము.

**త్రుటనము.** సం. వి. అ. న. తెగుట.

**త్రుటి.** సం. వి. ఇ. స్త్రీ. 1. లఘ్వక్షరముయొక్క చతుర్థభాగోచ్చారణముచేయునంతటి కాలము; 2. ఇంచుక; 3. సంశయము; 4. చిట్టేలకి.

**త్రుటితము.** సం. విశే. (అ. ఆ. అ.) తెగినది.

**త్రుట్టియ.** దే. వి. త్రుట్టె.

**త్రుట్టె.** దే. వి. సమూహము. "ఉ. మట్టినబిట్టుమిట్టిపడి మానిసముత్థితుఁడయ్యెమేనిపైఁ, బెట్టినపుట్టబెట్టవిసిబీఁటలువాఱ శిరశ్శకుంతముల్, చట్టుపలెత్తిముందఱికి సాగఁదలంపఁజటాచ్ఛటాటవిన్, ద్రుట్టెలుగట్టినిద్రలుమరుద్భుగధీశకులంబుమేల్కనన్." (త్రుట్టెలుగట్టి=గుమిగూడి.) పాండు. ౪, ఆ. (త్రుట్టియయొక్క రూపాంతరము.)

**త్రుష్టు.** దే. వి. 1. ఇనుముమీఁదిముఱికి; "గీ. పూవుఁదేనియ వడిసినమావిచిగురు, మీఁదనంటిచరించుతుమ్మెదదలిర్చు, నమయమాటనుసనినేయిచమిరిమరుఁడు, త్రుప్పవోఁ దోముఖడ్గంబు తునుకయనఁగ." పాండు. ౧, ఆ.—2. అరుచి. "ఎ, గీ. అప్పటప్పటికినిజిహ్వ త్రుప్పుడుల్ల." సావి. ౨, ఆ.

**త్రుప్పుడు**. దే. వి. పశుపక్ష్యాదులమేని రోమము. "ఎత్తురగరథ ధ్వజాది నొక త్రుప్పుడు గాలదు." (రథధ్వజాదిని త్రుప్పుడు అనఁగా తునకయని యర్థము.) భార. విరా. ౫, ఆ. "ఎ, గీ. నక్కఁ గ్రోల త్రుప్పుడుల్పు వసంతవేళ." జై. ౧, ఆ. "సీ. పల్లి చీమలవ క్రబల్లాతకీయుఁబోలె నెఱ్ఱ త్రుప్పుట నొప్పుకత్తైవాని." (అదిశబ్దముచేత మనుష్యునిమేని రోమమును గ్రాహ్యమని తెలియు నది.) ఆము. ౬, ఆ.

**త్రుస్సు**. దే. వి. నీళ్లుచిమ్ముటయందగు ధ్వన్యనుకరణము. "ఉ. మట్టతమూర్ధతిఁ గరిముఖంబునఁ బిలిచి గౌతమీనదిఁ, బుట్టినసప్రవాహజలపూరముఁ ద్రుస్సుననూఁదుచుఁ." భీ. ౫, ఆ.

**త్రుళ్లగించే**. దే. అ. క్రి. ఎగురు.

**త్రుళ్లగింత**. దే. వి. ఎగురుట. "వ. బలిష్ఠంబులగుతిర్యక్శాఖలపైఁ ద్రుళ్లగింతలుపెట్టుచు." (త్రుళ్లగింతలుపెట్టు=ఎగురు.) భో. ४, ఆ.

**త్రుళ్లింత**. దే. వి. 1. ఎగిరిపాటు; కళా. ४, ఆ.—2. గర్వము.

**త్రుళ్లియాడు**. దే. అ. క్రి. (త్రుళ్లి+ఆడు.) 1. ఎగిరిపడు; "సీ. ఇరువంకలందునఁ విరులతేనియ గ్రోలుదొరలుమోదంబునఁ ద్రుళ్లియాడ." హరి. ఉ. ౬, ఆ.—2. గర్వించే. (స్వార్థమున ఆడు.)

**త్రుళ్లు**. దే. అ. క్రి. 1. ఎగిరిపడు; 2. గర్వించు. వి. 1. ఎగిరిపాటు; 2. గర్వము.

**త్రుళ్లుఁబోతు**. దే. విశే. (త్రుళ్లు+పోతు.) త్రుళ్లునట్టి స్వభావముగలవాఁడు.

**త్రుళ్లుపిండి**. ధ్వ. వి. స్ఫోటకము కనిపించినప్పుడు పోలేరమ్మకు కొట్టిపెట్టెడుపిండి.

**త్రుళ్లుమింత**. దే. వి. త్రుళ్లగింత. (గ్రంథములయందు రూప మిట్లు కానఁబడుచున్నది.)

## త్రె.

**త్రెంచే**. దే. ప్రే. త్రెగఁజేయు.

**త్రెంపు**. దే. ప్రే. త్రెంచేయొక్క రూపాంతరము.

**త్రెక్కొట్టు**. దే. అ. క్రి. ఎగఁదట్టు. "క. ఇక్కరణిజోదు లేర్పడి, పెక్కండలఁ బోరఁ బెరుగుపెనుఁజివ్వలమి, న్నెక్కి కలహాళి కన్నులఁ, ద్రెక్కొట్టినవిడకకఅభ్రదీఅఁ మెక్కెఁ." రామా. ౮, ఆ.

**త్రెక్కొను**. దే. స. క్రి. 1. చెఱచే; "ఈపాపంబునిఁ ద్రెక్కొనుఁ." భార. అర. ౬, ఆ.—2. చేంపు; "ఉ. అక్కట తండ్రి లేనిమమునమ్మెయిఁ బెంచినతాతని మ్మెయిఁ, ద్రెక్కొనఁగాదు." భార. భీష్మ. 3, ఆ.—3. కలఁచే; "ఉ. మ్రొక్కినవాద రింపక నరుండు వియన్నదిశాపవాక్యముల్, త్రెక్కొననా గ్రహంబుఁ పలేకకుమారునిఁదన్నె." జై. ౫, ఆ.—4. మ్రింగు; "వ. ప్రతిభటులు ప్రయోగించు వివిధాస్త్రశస్త్రవ్రాతంబులు నోరుదెఱచి త్రెక్కొనుచు." మార్క. ౬, ఆ.—5. త్రాగు. "క. శ్లేష్మో ధనుఁడగునరుఁడు, ద్భాజితగతినడుమ మెఱసిబడబాగ్నిదలం, బైజల నిధిఁ ద్రెక్కొనియెడు, భోజంగురుబలముపేర్చియుడిపెఁ దోడ్తోఁ." భార. విరా. ౫, ఆ.

**త్రెక్కోలు**. దే. వి. త్రెక్కొనుట.

**త్రెక్కోలుకొను**. దే. స. క్రి. చేంపు. "గీ. క్రూరమృగ సంచయంబుఁ ద్రెక్కోలుకొనియె." వి. పు. ౬, ఆ.

**త్రెగు**. దే. అ. క్రి. (చూ.) తెగు.

**త్రెడ్డు**. వై. వి. (చూ.) తెడ్డు.

**త్రెయ్యు**. దే. అ. క్రి. తెగు. "త్రెస్సినజంఘులుందొడలు." రా. యు. కాం.

**త్రెస్సన**. దే. వి. చేక్కన, సౌందర్యము.

**త్రెవ్వు**. దే. అ. క్రి. తెగు, ఖండితమగు. "సీ. మెచ్చుకయెదురైన మృత్యువుమెడద్రొక్కి క్రొవ్వాఁడికోఱలు త్రెవ్వఁదాఁచి." హరి. పూ. ४, ఆ.

**త్రెళ్లు**. దే. అ. క్రి. పడు. "ఉ. ప్రల్లదనేదియిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై, త్రెళ్లెన." నం. "సపపాతమహాబాహు ర్వజ్రాహతఇవాచలః." భార. సభా. ౨, ఆ. (చూ. పాంపు రెండవయర్థము.)

## త్రే.

**త్రేఁచే**. దే. అ. క్రి. త్రేఁపువిడుచే, ఉద్గారించే. "క. విరహిబృందార్తిగఁ ద్రేఁ, చెందేఁటులువాసంతిక, విందుఁ." సాన. ౬, ఆ. (త్రేనుచుయొక్క రూపాంతరము.)

**త్రేఁపు**. దే. వి. త్రేఁచుట, ఉద్గారము. (త్రేనుపుయొక్క రూపాంతరము.)

**త్రేగుడు**. దే. వి. జిగటపాఱిన యెంగిలిలోనగునది. (చూ. త్రుయ్యు, త్రేవుడు.)

**త్రేజరి**. ఆం. వి. ధనాగారము, ద్రవ్యసంబంధమైన.

**త్రేత**. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక యుగము; (చూ. యుగము.) 2. మూఁడగ్నులు. (గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము.)

**త్రేనుచే**. దే. అ. క్రి. త్రేఁచే.

**త్రేనుపు**. దే. వి. త్రేఁపు.

**త్రేన్చు**. దే. అ. క్రి. త్రేనుచేయొక్క రూపాంతరము.

**త్రేన్పు**. దే. వి. త్రేనుపుయొక్క రూపాంతరము.

**త్రేవుడు**. దే. వి. త్రేగుడుయొక్క రూపాంతరము. "బ్రొమ్ముపయిఁ జేరిన నెత్తురుఁ ద్రేవుడుఁ." ఉ, హరి. ౨, ఆ. "తెఱనోరఁ ద్రేవుడుతొఁగసాఁగ." కాశీ. ౬, ఆ.

## త్రై.

**త్రైగుణ్యము**. సం. వి. అ. న. 1. సత్త్వరజస్తమోగుణములు; 2. శైత్యసౌగంధ్యమాంద్యములు.

**త్రైలోక్యము**. సం. వి. అ. న. త్రిలోకముల సమాహారము.

**త్రైవర్గికుఁడు**. సం. విశే. (అ. ఈ. అ.) ధర్మార్థకామములయందిచ్ఛ గలవాఁడు.

**త్రైవిద్యుఁడు**. సం. వి. అ. పుం. వేదము తెలిసినవాఁడు.

## త్రొ.

**త్రొక్కట**. దే. వి. (చూ.) తొక్కట. (రూ.) త్రొక్కటము.

**త్రొక్కటపడు**. ధ్వ. అ. క్రి. (చూ.) తొక్కటపడు.

**త్రొక్కటపాటు**. ధ్వ. వి. (చూ.) తొక్కటపాటు.

**త్రొక్కు.** దే. స. క్రి. పాదముతో నదుము. ''చ. బోరుకసల యించు ఁల్లుగొని త్రొక్కినచోటులఁ ద్రొక్కువాజిపైఁ, బనుపడ నెక్కి.' పాం. ౨, ఆ.—వి. త్రొక్కుడు. ''ఉ. గొరిజలత్రొక్కు నం బ్రిదిలికుఁ డలిచిర్తయొదుంగ.'' లక్ష్మీ. 3. ఆ.

**త్రొక్కుడు.** దే. వి. 1. త్రొక్కుట; 2. ఆపద; ''ఉ. త్రొక్కుడుదాక మీవరుసరోయకవేఁడుదురేజగంబులఁ.'' భాగ. ౬, స్కం. 3. పక్షికపము.

**త్రొక్కుడుఁగమ్మి.** ద్వి. వి. (త్రొక్కుడు+కమ్మి.) కడప క్రిందిపలక, రిల.

**త్రొక్కుడుపట్టె.** ద్వి. వి. 1. త్రొక్కుడుఁగమ్మి; 2. బ. సాలెవాఁడునేయునప్పుడు త్రొక్కెడు చెక్కలు.

**త్రొక్కుడుపలక.** ద్వి. వి. జాళ్లపనివాని కాళ్లక్రింది పలక.

**త్రొక్కుడుబిల్ల.** దే. వి. బాలక్రీడావిశేషము.

**త్రొక్కుడువడు.** ద్వి. అ. క్రి. (త్రొక్కుడు+పడు.) త్రొక్కువడు. ''త్రొక్కుడువడ్డభోగిగతిమ్రోఁగి.'' కళక. ౨, ఆ.

**త్రొక్కువడు.** ద్వి. అ క్రి. (త్రొక్కు+పడు.) త్రొక్కుడువడు. ''వ. అప్పళువులచేతంబోటువడియును వ్రేటువడియును ద్రొక్కువడియును జిక్కువడియును.'' హరి. పూ. ౬, ఆ.

## త్రో.

**త్రోచు.** దే. అ. క్రి. 1. వడిగొను; ''క. అచీఁకటినొక్కండును, ద్రోచివనఁగరామికనతిదూరంబునవా, గ్గోచరముగానియున్నతి, నేచినవటవిటపినీడనెలమివసించెఁ.'' విక్ర. ౫, ఆ.—2. వూను; ''సహాయులై యార్యులుత్రోచిచెప్ప.'' నిర్వ. ౪, ఆ.—3. నడచు; ''వడిఁద్రోచియేగి.'' హన. ౫, ఆ.—4. కవియు; ''త్రోచిరివీఁకవానరులు తూలిరిరక్కసులు.'' రా. యు, కాం.—5. మీఱు. ''ఉ. త్రోచినశోకవేదనలతోడఁగుమారకనీముఖాబ్జముఁ, జూచినయప్పుడెల్లమదిచుఱ్ఱను.'' జై. ౧, ఆ.—స. క్రి. 1. త్రోయు; ''ఎడసొచ్చినవిఘ్నవిశేషముఁ ధృతిఁ ద్రోచుచు.'' భార. అను. ౫, ఆ.—2. ఉపేక్షించు; ''గీ. బలిమిమున్నేల తెచ్చితిప్పుడఁతివగుడఁ, ద్రోచిపుచ్చంగఁదగునయ్య.'' భార. ఉద్యో. ౪, ఆ.—3. చెంపు. ''సీ. సాఘునమ్మతముగాసామజంబునితండు గాచివాఁడీతండుత్రోచినాఁడు.'' ఉ, హరి. ౨, ఆ.

**త్రోటి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పక్షిముక్కు; 2. చేఁపముక్కు; 3. చేఁకుకి.

**త్రోద్రోపు.** దే. వి. (త్రోపు+త్రోపు.) మిక్కిలిత్రోపు.

**త్రోద్రోపులాడు.** దే. స. క్రి. (త్రోద్రోపులు+ఆడు.) మిక్కిలిత్రోయు. (బలాత్కారముచేసి త్రోయు అని యర్థము.) ''గీ. సిగ్గువెనుకకుఁదిగియంగనగ్గలంపు, రాగరజ్జువుముంగలసాగఁదివియ, నందులకుఁదోడుత్రోద్రోపులాడఁజెలులు, నడుమఁబిరుసీఁకులయ్యె నప్పుడఁతికపుడు.'' రామా. ౪, ఆ.

**త్రోపడు.** ద్వి. అ. క్రి. (త్రోపు+పడు.) త్రోయఁబడు. ''త్రోపడియిరులు పటాపంచలైపాఱె.'' పాం. 3, ఆ.

**త్రోపనంగొలివి.** దే. విశ. (త్రోపు+కొలివి.) ఉభయభ్రష్టుఁడు, ఉభయభ్రష్టురాలు. ''మ. వనితానీపతితోడఁగూడవలదే వారేలవీరేలనీ, కనిన న్నాయనిరుద్ధుఁడున్న యెడకెల్లైనఁ వెలార్తేనిఁటో, యనసాతండు కులాభిమానఘనుఁడైయేయారికిత్రోవయం, చనుమానించినఁద్రోపనఁగొలివిఁ జేయంజూచితే క్రమ్మఱఁ.'' ఉ, హరి. ౫, ఆ.

**త్రోపరి.** దే. విశ. (త్రోపు+అరి.) త్రోయువాఁడు.

**త్రోపాటు.** ద్వి. వి. త్రోపడుట.

**త్రోపాడు.** దే. స. క్రి. (త్రోపు+ఆడు.) త్రోయు. ''మ. మగుడఁగీచకుఁబట్టవాఁడునబలోన్మాదంబునఁబాహుగ, ర్వగరిష్ఠుండగునాహిడింబరిపుఁడీవ్రక్రోధుఁడైపట్టిబె, ట్టుగఁద్రోపాడఁగ.'' భార. విరా. ౨, ఆ.

**త్రోపు.** దే. వి. 1. త్రోయుట; ''సీ. పూతనాఘాతంబుఁజేసనేతరమైనశకటంబుత్రోపునజరణసిహతి.'' భార. సభా. ౨, ఆ.—2. నిరాకరణము; ''క. విడిచినసెప్పటిచనియా, గడములుచేసెదవునిన్నుఁగాచుటమాకుఁ, గడువ్రేఁగుదుర్జనునినిలఁ, దడయకయెటుకమెయిఁద్రోపుతగుమందెఁదుఁ.'' హరి. పూ. ౫, ఆ.—3. నిషేధము. ''క. ఈమాటకుకోరమణీ, నామది ముదమందెఁగాన నాతికి సడియే, లామేటితలంపనుద్రో, పేమియులేదోపివినుముహితవచనంబుల్.'' భార. అశ్వ. ౨, ఆ.

**త్రోపుడు.** దే. వి. 1. త్రోపు; 2. (చూ.) చిత్రిక.

**త్రోపుడుపెట్టు.** దే. స. క్రి. త్రోపుడుతోమ్రాను నునుపు పఱచు.

**త్రోపువడు.** ద్వి. అ. క్రి. (త్రోపు+పడు.) త్రోపడు. ''ఏయనువునఁదృష్ణత్రోపువడు.'' భార. శాం. ౫, ఆ.

**త్రోపుసేయు.** ద్వి. స. క్రి. (త్రోపు+చేయు.) నిరాకరించు. ''క. ఎవ్వరునఁ జనితగనా, డిననతఁడుత్రోపుసేయక, నన్నుఁగైకొను.'' భార. అశ్వ. ౧, ఆ.

**త్రోయు.** దే. స. క్రి. తొలఁగనూకు. ''క. సేరుపునంబల్లేరులూడ్చి త్రోయుచుఁజనుచుఁ.'' ఆము. ౬, ఆ.

**త్రోలు.** దే. స. క్రి. (చూ.) తోలు.

**త్రోవ.** దే. వి. దారి, మార్గము. ''క. ఇంద్రియములగోచరముల, కుంద్రోవలుసేసి.'' ఉ, హరి. ౨, ఆ.

**త్రోవరి.** దే. విశ. (త్రోవ+అరి.) మార్గము నెఱిఁగినవాఁడు.

## త్ర్య.

**త్ర్యంగటము.** సం. వి. అ. న. ఒకదినము చిక్కము. పుం. డు. శివుఁడు.

**త్ర్యంబకసఖుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు, ముక్కంటిచెలి.

**త్ర్యంబకుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**త్ర్యబ్ద.** సం. వి. ఆ. స్త్రీ. మూఁడేండ్లపెయ్య.

## త్ర్యూ.

**త్ర్యూషణము.** సం. వి. అ. న. శొంటి, పిప్పలి, మిరియాలు. (రూ. త్ర్యుషణము.)

## త్వ.

**త్వక్కు.** సం. వి. చ. స్త్రీ. 1. తోలు; 2. చెట్టుపట్ట; 3. లవంగపుపట్ట; 4. నార.

**త్వక్పత్రము.** సం. వి. అ. న. 1. లవంగపుపట్ట; 2. ఇంగుపాకు.

**త్వక్షీరము.** సం. వి. అ. న. తవక్షీరి. (ఇది ఆకారాంత స్త్రీలింగమును, ఈకారాంత స్త్రీలింగమునగును.)

**త్వక్సారము.** సం. వి. అ. పుం. వెదురు.

**త్వచము.** సం. వి. అ. న. లవంగపుపట్ట. పుం. 1. తోలు; 2. చెట్టుపట్ట.

**త్వచిసారము.** సం. వి. అ. పుం. త్వక్సారము, వెదురు.

**త్వర.** సం. వి. ఆ. స్త్రీ. సంభ్రమము, వేగిరపాటు.

**త్వరితము.** సం. క్రి. విశ. అ. న. శీఘ్రము. విశ. వడిగలది.

**త్వష్ట.** సం. వి. ఋ. పుం. 1. విశ్వకర్మ; 2. ద్వాదశాదిత్యులలో నొకఁడు; (చూ. ఆదిత్యుఁడు.) 3. వడ్లవాఁడు. (విశ. అ. ఆ. ఆ.) చెక్కఁబడినది.

## త్వా.

**త్వాదృశము.** సం. విశ. (అ. ఈ. అ.) నీవంటిది.

## త్వి.

**త్విట్టు.** సం. వి. ష్. స్త్రీ. 1. ఆగి; 2. మంట; 3. వెలుఁగు. (ఇది త్విష అని ఆకారాంత స్త్రీలింగమునగును.)

**త్విషాంపతి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు, వెలుఁగుతేఁడు.

## త్స.

**త్సరువు.** సం. వి. ఉ. పుం. కత్తిలోనగువాని పిడి.

## ద.

**ద.** ఒక యక్షరము.

**దంగు.** దే. అ. క్రి. బియ్యములోనగునది పైతవుడుపోవునట్లు మెదుగు.

**దంగుడు.** దే. విశ. దంచినది. (దంగుడుబియ్యము.)

**దంచేన.** దే. వి. పెద్దపిరంగి. "ద్వి. దంచనగుండ్లచేఁ దాఁకించి కడిమి, ముంచినలగ్గయిమ్ములవిడిపించి." రా. యు, కాం. "ద్వి కూలునేనుంగులుఁగుంభమధ్యముల, వ్రాలుమావతులుఁబైవ్రాలు దంచనలు." రా. యు, కాం. (రూ. దంచనము. "ఒనరుదంచనములనాడిసెలలనుజాలంగనెందును సవరించుట." హరి. ఉ. ౨, ఆ. చూ. జెబురుజేంగి.) (దేఁచనమని వక్రాదిగాను కానఁబడుచున్నది.)

**దంచే.** దే. ప్రే. దంగఁజేయు, దంపు.

**దంట.** యు. దే. వి. జేంట. (చూ. దంటమోములదేవర.)—వై. విశ. 1. దిట్టతనముగలవాఁడు; "తగదిదియంచుఁదెల్పఁగలదంటలు గల్గమిఁజేసి." అచ్చ. సుం, కాం.—2. నేర్పరి*. "సీ. ఈదంట మాటలునిట్టిభావంబులవిధమునేనిచ్చినవిద్యలకట." కళా. ౫, ఆ.

**దంటమోములదేవర.** ద్వ. వి. అగ్ని. "ఎ, గీ. దంటమోములదేవర తనివిదీర, బుగులుకొనిమెక్కెఁదద్దయబ్బురముగాఁగ." అచ్చ. యు, కాం.

**దంటు.** వై. వి. జొన్నలోనగువానికాఁడ.

**దండ.** యు. దే. వి. 1. సమీపము; "క. దండకమనుకానకుఁజని, యుండఁగరావణునిచెలియలొగికలుకకై, దండకురాలక్ష్మణుఁడది, ముండాడఁగముక్కుచెవులుమునుకువమాన్చెక." య. 3, ఆ.—2. ప్రాపు; "ఉ. కోరితలంపసింహమునకుఁ దామటిసింహమెకాక దండపెం, పారంగజంబుకంబగునెయబ్బిపరీతనమస్తధారణీ, భారముఁబూనికీర్తిరమఁబాయనియాతనికెందుఁ బ్రాపుకా, శీరమణుండు దేవగణసేవ్యుఁడుశంభుఁడుగాకమర్త్యుఁడే." హరిశ్చ. ర, ఆ. (చూ. దండగోల.)—3. ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతో పొడువఁగా నేర్పడిన బొరుసు.—వై. హారము*. "క. ఆదండజడలదండను, వేదండగఁజెలఁగఁజెరివివేదండగతిక, వేదండము చేమెఱయఁగ, నాదండధరారిఁబోలెనాడుచువచ్చెక." వి, పు. ౧, ఆ. (ఇది కుండశబ్దమువంటిది.)

**దండకడియము.** వై. వి. సందెదండ, కేయూరము.

**దండకము.** సం. వి. అ. పుం. 1. వృత్తవిశేషము; 2. అరణ్యవిశేషము; (ఈ యర్థమునందిది ఆకారాంత స్త్రీలింగమునగును.) 3. దేశవిశేషము, చెట్టుబోదె. విశ. వంచకము.

**దండకవిలియ.** ద్వ. వి. ప్రాఁతలెక్క పుస్తకపుకట్ట.

**దండగోల.** దే. వి. (దండ+కోల.) ఊఁత, అవలంబము. "సీవటుదండగోలగుచునిల్చెనఁజాలు." వై. ౧, ఆ.

**దండచేయి.** వై. వి. సందిలి, ప్రగాడము. (రూ. దండచే. "గి. దండచేలావుగలయట్టివడుదువెదురు." చంద్రా. ౨, ఆ.)

**దండచేరు.** ద్వ. వి. సందిటఁగట్టుకొనెడుతోరము. "సీ. అలుగునేనుంగుకై యలుఁగుఁబూనఁగనేలయండనీదండచేరుండెనేని." చంద్రా. ౨, ఆ.

**దండధరుఁడు.** సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. రాజు.

**దండనము.** సం. వి. అ. న. దండించుట.

**దండనాయకుఁడు.** సం. వి. అ. పుం. సేనాధిపతి.

**దండనీతి.** సం. వి. ఇ. స్త్రీ. కామందకాద్యర్థశాస్త్రము.

**దండపడు.** ద్వ. అ. క్రి. 1. సమీపించు; (చూ. దండపాటు.)—2. ఎద్దుముడ్డిమీఁద ముల్లుకోలతో పొడువఁగా బొరుసుగానేర్పడు.

**దండపాటు.** ద్వ. వి. దండపడుట, సమీపించుట. "చ. బలములపాటుదాయతలపాటునుజూచెదుదండపాటుకో, త్తలక్షోడఁబాటులెస్సయనిలక్ష్మణుఁడన్నయనుజ్ఞగాంచి." రామా. ౯, ఆ.

**దండపాశికుఁడు.** సం. వి. అ. పుం. చోరోపద్రవములేక పట్టణమును కాపాడెడి యధికారి.

**దండము.** ఉభ. దే. వి. నమస్కారము. "వ. పాండురంగానీకు దండంబు." భీ. 3, ఆ.—సం. అ. పుం, న. దుష్టుకఱ్ఱ. పుం. 1. చతురుపాయములలో నొకటి; (ఇది వధించుట, ధనముహరించుట, పీడించుట అని మూఁడువిధములుగలది. చూ. ఉపాయము.) 2. రాజశిక్ష; 3. చెట్టుబోదె; 4. కాఁడ; 5. కవ్వము; 6. వాద్యమువాయించెడుకోడుపు; 7. దండు; 8. అడ్డముగా తీర్చినవ్యూహము; 9. గర్వము; 10. పీడనము; 11. వధము; 12. బార; 13. గుఱ్ఱము; 14. తోఁకతెగినయెద్దు; 15. హారమునందలిపేట; 16. కప్పము; 17. జేత; 18. సమూహము. (వేతండదండంబులు మొ.) వేదండతండంబులు అని తకారాదిగా గ్రంథములయందు కనఁబడుచున్నది. (దాని కాకరమేమియుఁ గానరాదు.)

**దండయాత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. దిగ్విజయము; 2. యుద్ధయాత్ర; 3. అధ్వరయాత్ర.

**దండలాసకము.** సం. వి. అ. పుం. నృత్యవిశేషము, కోలాటము. "సీ. కుండలీప్రేరణీ దండలాసకముఖ్యనృత్యంబులచ్చరల్ నెఱపుచుండ." శు. ౧, ఆ.

**దండవిష్కంభము.** సం. వి. అ. పుం. తరిగంబము.

**దండసిల్లు.** దే. అ. క్రి. 1. ఇఱుకుకొను; "వ. మగువకుచద్వయంబునడుమునంబడి రాయిడి దండసిల్లెమో." సై. 3, ఆ.— 2. అదుముకొనబడు, అణఁగు. (చూ. దండసిల్లు. అదుముకొనబడు టకు.—"సీ. వందశూకాక్షీకులలు దండసిలంగఁదాటించుచేకాల భర మహోశ." కాశీ. 2, ఆ.)

**దండాట.** దృ. వి. (దండ+ఆట.) (చూ.) డేగాట.

**దండాహతము.** సం. వి. అ. న. మజ్జిగ, కాలశేయము.

**దండి.** ఉభ. దే. వి. 1. ప్రతాపము; "ఉ. చండకరాన్వయాంబునిధిచంద్రుఁడుభూరమణుండతండుకా, గుండియవాఁడువేలుపులఁగోటులసంఘములభూతధాత్రిపై, నుండఁగశీకకాశిపురిచొక్కఁడు రాజ్యముసేయుచెట్టులీ, దండికిమెచ్చినాఁడను ప్రతాపవిహీనుఁడు భూమిపాలుఁడే." కాశీ. ౫, ఆ.—2. శౌర్యము. "గీ. కడలి హస్తంబులను రెండు కడలనున్న, రెండుపలుకుపెనఁబట్టిదండి మెఱయు, నడిమిదిరమెక్కఁకనుఁగఱసంబులైన, పాదఘట్టనముల చేతఁబగులఁదన్నె" వి, పు 2, ఆ.—విశే. 1. ప్రతాపవంతుఁడు; 2. శౌర్యవంతుఁడు; "గీ. పగునెయస్తునయాపెంటిశిసముశీకు, దండివైలెమ్మనసుపెదజేనివిడిచి." భార. భీష్మ. ౧, ఆ.— 3. సమృద్ధము; "ద్వి. రెండడుగులనెధరిత్రియుదివియు, దండిగాఁ గొలిచి." రా. బాల, కాం.—4. గొప్ప. "ద్వి. నిండుకొలంకులోనిండారవిరిసి, దండియారక్తనంధ్యకపువ్వవునఁగ." విష్ణు. పూ. ౨, ఆ. — సం. వి. న్. పుం. 1. ఒకానొకకవి; 2. యముఁడు; 3. ద్వారపాలకుఁడు. విశే. దండముగలవాఁడు.

**దండించు.** సం. స. క్రి. దండనముచేయు.

**దండిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కిన్నెర; 2. హారమునందలి పేట.

**దండితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దండింపఁబడినవాఁడు.

**దండియ.** వై. వి. 1. కిన్నెర; 2. వీణె*; "గీ. పిదపఁజేతిదండియ యటుపెట్టికేలు, మొగిచిభక్తిరసంబొత్తుముంచుకొనఁగ, నఖలవేదాంతవిద్యారహస్యభావుఁ, గోరికీర్తించెఁబ్రభుభునన్నారదుండు." హరి. ఉ. 3, ఆ.—3. తంబుర*; "సీ. సెలసిహాహాహూహూపుల దండియలఁదంత్రిద్రెవ్వసింగిణులుగాఁదిగిచితిగిచి." ఆము. ౧, ఆ.—4. పల్లకిబొంగు*; 5. త్రాసుకోల*; 6. పసుసునేలరాచుకొనకుండమగ్గపుగుంతకెదుట అడ్డముగాపాఁతినకొయ్య*; (చూ. క్రో.వి.) 7. పేతపుకడవకుమీఁద సడ్డముగానుంచి కట్టెడుకొయ్య*.

**దండియము.** వై. వి. 1. వస్త్రములు ఎండవేయుటకొనగువానికిఁ గాను అడ్డముగాకట్టెడు దారము (లేక) కొయ్య*; "వ. అచ్చటనిచ్చందనయిచ్చనుండిదండియంబుపైవ్రాలె." పాండు. ర, ఆ.—2. గరిడిసాధనలలో నొకవిధము*.

**దండు.** వై. వి. 1. సేన; 2. సమూహము. "గీ. తివిరిజేజేలుమానిసితిండికాండ్రు, దండులుగఁగూడిపాలేటిత్రచ్చుకతన." అచ్చ. బాల, కాం.

**దండుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుని ప్రక్కనుండువారలలో నొకఁడు; (దండుఁడు, పింగళుఁడు, మాఠరుఁడు అని వీరు ముగ్గురు. సూర్యుఁడు దైత్యులకు వరమియ్యక విఘ్నముచేయుటకు రుద్రాగ్నియములు క్రమంబుగ పై మూఁడు నామములతో వర్తింతురు.) 2. యముఁడు.

**దండుగ.** వై. వి. 1. రాజు ధనవంతుని బలాత్కారముచేసి పుచ్చుకొనెడు ధనము; "ద్వి. కలవారిఁగనిదండుగలువెట్టినృపుఁడు." విష్ణు. పూ. 3, ఆ.—2. అధికారి యపరాధివలన నపరాధమునకుఁగాను పుచ్చుకొనెడు ధనము. (చూ. దండుగు.) 3. నష్టము.

**దండుగు.** వై. వి. దండుగయొక్కరూపాంతరము. (అధికారి యపరాధివలన నపరాధమునకుఁగాను పుచ్చుకొను ధనమునకు.—"క. అ కుగని త్రుచ్చినచ్చుసి, బొంకినెపంబుననేచోఁసిపుచ్చినదనిచే, అంకుసదండువుగొను క్రియఁ, గొంకకయే చూఱుదండుగుంగొనవలయుఁ." విజ్ఞా. ప్రా, కాం.)

**దండుదివియ.** వై. వి. దీపపుసెమ్మె.

**దండుబాట.** దృ. వి. (చూ.) మంటాపథము. (ఇట్లు దండుదారి.)

**దండులంజె.** వై. వి. బజారు.

**దండువ.** వై. వి. దండుగయొక్కరూపాంతరము.

**దండువు.** వై. వి. దండుగుయొక్కరూపాంతరము. "క. కావఁగొనిపోయియేమఱి, గోవులఁదాఁజెఱచెనేని గొల్లఁడుపతికిన్, గోవులవెలయువుదగు, భూవరునకుఁ గొంతదండువును బెట్టఁదగున్." విజ్ఞా. ప్రా, కాం.

**దండూరావేయు.** హిం. క్రి. తప్పెటకొట్టిచాటించు.

**దండె.** వై. వి. దండియయొక్కరూపాంతరము. (కిన్నెరకు.—"ఉ. త్రివర్ణేతరజాతిమెచ్చిదయనిడ్డప్రసాదముదండెసోఁచిశ్ర, ద్ధాతియంబునఁజనితిసంది." ఆము. ౬, ఆ.—పల్లకిబొంగునకు.—"సీ. వెలయింపఁబన్నాగములకుఁబైనిడినయబ్బురపుదండెలువోలెబొమలుదనర." కళా. 2, ఆ.—పసుగునేలరాచుకొనకుండమగ్గపుగుంతకెదుట అడ్డముగాఁబాఁతిన కొయ్యకు.—"సీ. పరివరియచ్చులు చరికుండయూడితచీదుదబ్బలుదండెనాఁడెక్రోవి." హంస. ౨, ఆ.)

**దండెత్తు.** దృ. అ. క్రి. (దండు+ఎత్తు.) యుద్ధప్రయత్నము చేయు. "మ. తనలోఁజొచ్చినశాంకరీజ్వరముపైదండెత్తఁగల్పించెన, ద్దనుజారాతిప్రతిజ్వరంబు." ఉ, హరి. ౬, ఆ.

**దండెపుఁబీఁటలు.** వై. వి. బ. (దండెము+పీఁటలు.) గడచీల తగుల్చుటకు దండెపు నడుమగ్రుచ్చిన రంధ్రములుగల రెండు పీఁటలు.

**దండెము.** వై. వి. దండియముయొక్కరూపాంతరము. (గరిడీసాధనలలో నొకవిధమునకు.—"సీ. దండెముల్ త్రోసినఁ గండెముల్ గల భుజాకాండమ్ములనుసొసకత్తులమర." శశాం. 3, ఆ.)

**దండ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దండింపఁదగినవాఁడు.

**దంతధావనము.** సం. వి. అ. న. పలుదోముట. పుం. చంద్ర. †.

**దంతభాగము.** సం. వి. అ. పుం. ఏనుఁగు ముందటిభాగము.

**దంతము.** సం. వి. అ. పుం. 1. పల్లు; (దంతములపాఁచి=పిప్పిక.) 2. కొండసడుము; 3. పొదరిల్లు; 4. పొడవుటాయి.

**దంతశఠ.** సం. వి. ఆ. స్త్రీ. పులిచింత †. అ. పుం. ము. 1. నిమ్మ †; 2. వెలఁగ †; 3. చింత †; 4. నారదము †.

**దంతావళము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, సామజము.

**దంతి.** సం. వి. ఈ. స్త్రీ. ఒక చెట్టు. న్. పుం. 1. ఏనుఁగు; 2. కొండ. విశే. కోఱపంటివాఁడు.

**దంతియ.** వై. వి. 1. మిద్దెటింటికి అడ్డముగావేసెడుపట్టె; 2. అచ్చుకట్టుదంతె*.

**దంతురము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రక్కలణఁగినదుము పొడవైనది.

**దంతురుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మిట్టపండ్లవాఁడు.

**దంతె.** వై. వి. దంతియొక్క రూపాంతరము. (మిద్దెటింటికి అడ్డముగా వేసెడు పట్టెకు.— "సీ. దట్టమాణికిదంతెలమీఁదబలిపుగెంపుగాపలకలమర." భాను. ౪, ఆ.)

**దంత్యము.** సం. విణ. (అ. ఆ. అ.) దంతములందు పుట్టినది.

**దందడి.** దే. వి. తొందర. "నేత్రములఁ బ్రమోదబాష్పములందందడి గ్రందుకొనంగ." మార్క. ౭, ఆ.— విణ. తెఱపిలేనిది. "శి. కడఁగి దర్పంబుతోనడచుచుమేమిట్లుదందడిదుముకంబుగాఁబొంచుటయును." భార. అర. ౪, ఆ.

**దందడించు.** దే. అ. క్రి. రేఁగు. "సీ. ఇలఁపుల నందడిదందడించినఁదాల్మి కదలు." భార. అర. ౭, ఆ.

**దందడివెట్టు.** దే. స. క్రి. (దందడి + పెట్టు.) రాయిడిచేయు. "బలముర్గఁదయంబడి గోవ్రజంబులఁ దందడి వెట్టకుండఁబిఱుఁదన నడపింపఁగఁబంచి." భార. విరా. ౪, ఆ.

**దందన.** వై. వి. మాయ, జాలము*.

**దందనకత్తియ.** వై. విణ. జాలముచేయునది. (చూ.) దందనకత్తె.

**దందనకాఁడు.** దృ. విణ. జాలముచేయువాఁడు.

**దందశూకము.** సం. వి. అ. పుం. సర్పము. డు. రాక్షసుఁడు.

**దంధనము.** సం. విణ. (అ. ఆ. అ.) శాశ్వతముకానిది. "ఎ, గీ. నవ్వలబ్ధపదార్థంబుచందమునను, దలఁచి చూడంగవట్టిదంధనము ధనము." పు. ౧, ఆ.

**దంపకట్టె.** దృ. వి. (దమ్ము + కట్టె.) (చూ.) దంపనాఁగలి.

**దంపతులు.** సం. వి. ఇ. పుం. ద్వి. ఆలుమగలు.

**దంపనాఁగలి.** వై. వి. (దమ్ము + నాఁగలి.) అడుసునదున్నెడు నాఁగలి.

**దంపు.** దే. ప్రే. దంచుయొక్క రూపాంతరము. "వ. సారములం దంపియుసైంధవంబులందంపియు." భాగ. ౬, స్కం.— వి. దంపుడు.

**దంపుటిల్లు.** దే. వి. (దంపు + ఇల్లు.) దంచునట్టి యిల్లు.

**దంపుడు.** దే. వి. దంచుట, దంపు.

**దంభము.** సం. వి. అ. పుం. 1. కపటము; 2. తప్పు.

**దంభోళి.** సం. వి. ఇ. పుం. వజ్రాయుధము, జాతివాలు.

**దంశనము.** సం. వి. అ. న. 1. కాటు; 2. కవచము. పుం. పల్లు. (రూ. దంశనము.)

**దంశము.** సం. వి. అ. పుం. 1. అడవియీఁగ; 2. కాటు; 3. కవచము.

**దంశి.** సం. వి. ఈ. స్త్రీ. అడవిదోమ

**దంశిక.** సం. వి. ఆ. స్త్రీ. పటుకాఱు.

**దంశితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కాటుపడ్డవాఁడు; 2. కవచముతొడిగినవాఁడు.

**దంష్ట్ర.** సం. వి. ఆ. స్త్రీ. కోఱపల్లు.

**దంష్ట్రాయుధము.** సం. వి. అ. పుం. వరాహము, పంది.

**దంష్ట్రి.** సం. వి. న్. పుం.——పై.——

**దక్కినంపురాయఁడు.** వై. వి. (దక్కినము + రాయఁడు.) దక్షిణదిక్కునకధిపతి, యముఁడు. "దక్కినంపురాయనిబీడునకు." అచ్చ. యు, కాం. (ఇట్లు దక్కినపుఱేఁడు మొ.)

**దక్కినము.** వై. వి. దక్షిణపుదిక్కు.

**దక్కు.** దే. అ. క్రి. అనుభవయోగ్యమగు. విణ. అనుభవయోగ్యము. "సెవిజా గ్రజిదీనిన చ్చెదక్కఁగనిజకాంతకు." పా. ౪, ఆ.

**దక్కోను.** దే. అ. క్రి. (దక్కు + కొను.) స్వస్థం బగు. "నరుఁడుదక్కొనఁనేర్చునెలన్నముచ్చిలక." భార. ఆది. ౪, ఆ. ("నెమ్మెయిదక్కొనఁడబ్బెపెంపుచే." (ఇక్కడ దక్కొను అనఁగా కలుగునట్టి అని యర్థము.) విక్ర. ౨, ఆ.)

**దక్కోలు.** దే. వి. దక్కొనుట. విణ. స్వస్థము. "శీ. ధనబాధ నిధులను దక్కొలుగాఁగొని జూదగాఁడు..." రా. యు, కాం.

**దక్కోలుపడు.** వ్వి. అ. క్రి. (చూ.) దక్కొను.

**దక్షాయ్యము.** సం. వి. అ. పుం. గృధ్రము, గద్ద.

**దక్షిణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞములోనగువానియందు బుత్విజులులోనగువారికి ఇచ్చెడు ధనము; 2. కుడిదిక్కు.

**దక్షిణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కుడి; 2. కుడిదిక్కుది.

**దక్షిణస్థుఁడు.** సం. వి. అ. పుం. తేరునడపువాఁడు.

**దక్షిణాగ్ని.** సం. వి. ఇ. పుం. ఒక శ్రౌతాగ్ని. (చూ. అగ్ని.)

**దక్షిణాపథము.** సం. వి. అ. పుం. వింధ్యపర్వతము మొదలు కొని సేతువువఱకుఁగల దేశము.

**దక్షిణీయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దక్షిణ యియ్యఁదగిన వాఁడు.

**దక్షిణుఁడు.** సం. వి. అ. పుం. అనేక నాయికలయందు సమముగా ప్రవర్తించు నాయకుఁడు. (చూ. నాయకుఁడు.) విణ. 1. కుటిలముగాక చక్కనైనమనస్సుకలవాఁడు; 2. దాక్షిణ్యము కలవాఁడు; 3. నేర్పుగలవాఁడు.

**దక్షిణ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దక్షిణకుఁ దగినవాఁడు.

**దక్షిణేర్మము.** సం. వి. న్. పుం. బోయవానిచేత కుడిప్రక్క గాయముచేయఁబడిన మృగము.

**దక్షుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒక ప్రజాపతి; (చూ. ప్రజాపతి.) 2. ఒకానొక ముని. విణ. నేర్పరి.

**దఖలు.** హిం. వి. ప్రవేశము.

**దగ.** వై. వి. 1. తాపము; "క. పేవంకమననుసీతా, దేవినివెదకఁదగునెనిర్వధిక ఘులునిదశ, గ్రీష్మవథింపుదమీదగ, యేవగమూన్పెదవోతెలుపుమిపుడినతనయా." రామా. ౫, ఆ.— 2. దప్పి*. "సీ. పెనుదప్పిదగదొట్టఁజనిరెట్టవడఁ గొట్టెనుడుమీఁదబెళకుగవ్వనొక్కయుణుజు." స్వా. ౪, ఆ.

**దగదగ.** దే. వి. మెఱయుటలోనగువానియందగుననుకరణము. (కెంపు దగదగ మెఱయుచున్నది, ప్రొయ్యి దగదగ మండుచున్నది మొ.)

**దగదగమను.** దే. అ. క్రి. దగదగయని ప్రకాశించు. "క. దగదగమనియెడికెంపున." య. ౨, ఆ.

**దగర.** దే. వి. విణ. డగరయొక్క రూపాంతరము.

**దగరము.** దే. వి. డగరముయొక్క రూపాంతరము.

**దగరు.** దే. వి. యుద్ధసాధనవిశేషము. "వ. కొంకిమన్నుదగరు మొదలుగాఁగల సాధనంబులచేఁ జీకాకుపఱిచియు." ఉ. హరి. 3, ఆ.

**దగల్బాజీ.** హిం. వి. దొంగ, మోసకాఁడు.

**దగా.** హిం. వి. మోసము.

**దగ్గఱ.** దే. వి. సమీపము. (రూ. దగ్గఱ.)

**దగ్గఱించు.** దే. అ. క్రి. సమీపించు. (రూ. దగ్గఱించు.)

**దగ్గఱు.** దే. అ. క్రి.——వై.——"గీ. దగ్గఱెముపార్థవేళ మోదశరథేంద్ర." రామా. ౪, ఆ. (చూ. రూ. దగ్గఱు.)

**దగ్గు.** దే. అ. క్రి. కాసనుచేయు. వి. కాసము.

**దగ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. సూర్యుఁడున్న దిక్కు. విశ. కాల్పఁబడినది.

**దగ్ధిక.** సం. వి. ఆ. స్త్రీ. మాఁడినవంటకము, మాఁడు.

**దచ్చపుక.** వై. న. (దంట+చపుకము.) ఇరునాలుగు, దచ్చి. "దచ్చొకచౌవంచయుత్తిగబారాదుగయించుఁజిల్కరొదలుద్దీపింప." కళా. ౩, ఆ.

**దచ్చి.** దే. స. దచ్చొక. అష్టకము.

**దచ్చికాళ్లమెకము.** ద్వి. వి. శరభము, అష్టాపదము.

**దటాయించు.** హిం. క్రి. కోపగించు, అదమాయించు.

**దట్టన.** దే. వి. అదలుపు, తర్జనము. "గీ. ముష్టిఘట్టనంబులనదలించుదట్టనలకు." ఉ, హరి. ౬, ఆ.

**దట్టము.** దే. వి. పావడ. "సీ. దట్టంబుసీకట్టినట్టిచెంగావికిబాగుగాదనికేలఁబైఁటనిమిరి." సా౨. ౬, ఆ.—విశ. 1. తఱచు; (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును. "దట్టకెంపు" మొ.)—2. విరళము. "సీ. గట్టిమైమఱుపులుదట్టములొగావించునవియునునెఱఁకునోనాడునవియు." భార. విరా. ౩, ఆ.

**దట్టా.** దే. వి. సిద్దెమూతికివేసెడు మంటిమూఁత.

**దట్టి.** వై. వి. దిండు, కాసె.

**దట్టించు.** యు. దే. స. క్రి. అదలుచు. "క. దట్టించియెవ్వరేమని, ఘట్టించిరొచాలఘనకుఁబరపక్షంబుల్." భాగ. ౭, స్కం.—వై. దట్టికట్టు. "సీ. అల్లులుదట్టించియంఘ్రులగజ్జెలుమొరయఁదన్నుదురోలెముమ్మరముగ." భాగ. ౧౦, స్కం. పూ.

**దట్టీ.** వై. వి. దట్టియొక్కరూపాంతరము. "గీ. అట్టియెడనుబచ్చపట్టుదట్టీచేత, నొప్పుతనదుప్రియునినుజ్జ్వలంపు, తీవిసెఱపుచెంద్రకావిదట్టీచేతఁ, బరునిగుఱి తెచెంగెసురవధూటి." కళా. ౩, ఆ.

**దట్టుఁడు.** వై. విశ. దిట్టతనముగలవాఁడు. "ఉ. పుట్టినయాఱునాళ్లకును బొంపిరివోయి జగంబులన్నియున్, దట్టుఁడవైజయించితి." భార. అర. ౫, ఆ.

**దడ.** యు. దే. వి. వణఁకు. వై. 1. కొయ్యత్రాసు; "కిసలయంబులతోడఁగెంగేలు దడఁబెట్టి." ఉ, హరి. ౫, ఆ.—2. (చూ.) దాళా*.

**దడకట్టు.** ద్వి. స. క్రి. (నెయ్యి నూనె మొదలగునవి కీయుపాత్రములనుగాని అవి యుంచియున్న పాత్రములనుగాని) సరియెత్తు ఱాలను దడకట్టనుంచితూఁచు.

**దడదడ.** దే. క్రి. విశ. వడిగా. (వాఁడు దడదడ చదువుచున్నాఁడు, వీఁడు దడదడ వచ్చెను మొ.)

**దడదడమను.** దే. అ. క్రి. దడదడ కొట్టుకొను. "క. గడగడవడఁకుచునుడువులు, తడఁబడ సిగ్గడరనెడఁద దడదడమనఁగా, ఇడుముంజెమ్మటనొడలుం, దడియదశాస్యుఁగనిరంభతడయకపలికెన్." ఉ, రా. ౪, ఆ.

**దడబడ.** దే. వి. ఆటోపము, ఆవేగము.

**దడెము.** యు. దే. విశ. దట్టము. "దడెముగమర్దళధ్వనులుఁదాళంబులుఁబిక్కటిల్ల." ఉ, రా. ౬, ఆ. (దళముయొక్క మొదటి రూపము.)—వై. వి. 1. సేన; "క. వడిఁబురసువెడలివిడిసిన, దడెములపైనడువవిజిగిపత్పరసన్మా, ర్పడికొందఱుబలములుహూ, పడఁగంజెడిపోయిరంత నడరినభీతిన్." రా. బాల, కాం.—2. సమూహము*. "క. కొడుకులుఁదానునగుజ్జిపు, దడెములఁగరిఘటలభటరథవ్రాతములన్, బుడమిచలింపఁగద్రుపదుఁడు, కడువేడుకఁ దోడుసూపెఁ గొంతేయులకున్." భార. ఉద్యో. ౧, ఆ.

**దడి.** దే. వి. వెదురుచాఁపతోనగువానితో నేర్పఱచిన మఱుఁగు. "వట్టివేళ్లనదడిగట్టి." కళా. ౬, ఆ.

**దడిగ.** దే. వి. (చూ.) అరిగ. "చ. వెడలెడునప్పుడీవిభునివేడ్కయెటింగివృకోదరుండుఁగ, వ్వడియును చిన్నతమ్ములునువైభవమొప్పనలంకరించియె, క్కుడుమెఱయన్ బ్రదానభటఘోటకదంతిరథప్రతానముల్, దడిగలుఁగుంచెలుంగొడుగుదండములున్ విలసిల్లవచ్చినన్." భార. అశ్వ. ౩, ఆ.

**దడిబము.** వై. వి. పఱుపు, మెత్త, తల్పము, శయ్య.

**దడిమము.** యు. దే. విశ. సన్నము. "దడిమంపుఁజేలలఁదడెయొత్తి." కళా. ౨, ఆ.—వై. వి. పఱుపు.

**దడియ.** దే. వి. కొండచేరువనేల, ఉపత్యక. "గీ. కర్షకులకునెలవుగ్రామసీమావళి, యవులనడవులిందులాటవికుల, కడవులందుఁగొండదడియలుమనబోంట్ల, కింతవట్టుఁదెలియనెఱుఁగవలయు." హరి. పూ. ౨, ఆ.

**దడియఁబడు.** ద్వి. అ. క్రి. (దడియన్+పడు.) దడియు. (రూ. దడియఁగఁబడు. "సీ. దండియలునుమీఱుదడియంగఁబడకయంతకయటుపొండుగంధర్వముఖ్యులు." లక్ష్మీ. ౧, ఆ.) (సార్థమునపడు. మహా కవిప్రయోగములయందు పడధ్వనుబంధముపరమగుచుండఁగా అగుధాతువుయొక్క తుమున్నర్థకరూపము పూర్వాగమముగా కానఁబడుచున్నది.)

**దడియము.** దే. వి. పదిసేరులయెత్తు. అయిదుసేరులయెత్తు. (అని కొందఱు.)

**దడియు.** దే. అ. క్రి. వణఁకు.

**దడెము.** దే. వి. దడియముయొక్కరూపాంతరము.

**దడ్డియము.** దే. వి.——వై.——

**దణా.** వై. వి. సేన. "భుజంగప్రయాతము. దణాపెద్దయాజ్ఞన్ సుధాభుగ్విరోధ్య, గ్రణీసేనలన్ మించెగంభీరభేరీ, ధణంధాణముల్." ఉ, రా. ౨, ఆ.

**దణాయఁడు.** వై. వి. సేనానాయకుఁడు. "పంచచామరము. దణాయలున్ దలారులున్ ముదంబునంగ్రమంబుగా, క్షణక్షణంబునుం గబుర్లుసారెసారెదెల్పఁగా." కృష్ణ. ౨, ఆ.

**దణి.** వై. వి. ప్రభువు, ఱేఁడు*.

**దత్తకుఁడు.** సం. వి. అ. పుం. దత్తపుత్రుఁడు.

**దత్తము.** సం. వి. అ. న. ఈవి. విశ. ఇయ్యఁబడినది.

**దత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఈవి, దానము.

**దత్తు.** వై. వి. స్వీకారము*.

**దత్తుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొకరాజు; 2. దత్తాత్రేయుఁడు; 3. ఒకజాతి పురుషుఁడు. (చూ. పురుషుఁడు.) విశ. ఇదువయుంచఁబడినవాఁడు.

**దద్దడము.** దే. వి. చిన్నగుడి, బోడిమిద్దె. "గీ. అట్టిపెనువానలోన సరోభిఘానుఁ, డొక్కనికిఁ బ్రయాసంబుననొదిగియుండఁ, జాలు నల్పాంతరావకాశంబుతోడి, కడపగలయొక్క-జాతిదద్దడముఁజేరె." పర. ౧, ఆ. "సీ. వంకదారకుఁజేరి వాకిటిదద్దడంబులుసెచ్చి కొమ్మలమోకువైచి." ఉ, హరి. 3, ఆ.

**దద్దతిల్లు.** దే. అ. క్రి. తబ్బిబ్బుపడు. "సీ. ఇంతలోననయార యెన్ని తబ్బిబ్బులు దద్దఱిల్లకుఁడంచుధర్మసివీఁపు, చఱచి." కళా. ౫, ఆ.

**దద్దఱు.** దే. అ. క్రి.——వై.——

**దద్దరము.** దే. వి. దద్దడముయొక్క-రూపాంతరము.

**దద్దిర్లు.** దే. అ. క్రి. దద్దఱిల్లుయొక్క-రూపాంతరము.

**దద్దు.** వై. వి. 1. రోగవిశేషము; 2. చీమకుట్టుటలోనగువానిచేఁ గలిగెడు బుడిపె*.

**దద్దురు.** వై. వి. రోగవిశేషము, దద్దు.

**దద్రుఘ్నము.** సం. వి. అ. పుం. తగిరిస*.

**దద్రురుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దద్దురోగముగలవాఁడు.

**దద్రువు.** సం. వి. ఉ. పుం. రోగవిశేషము, దద్దు.

**దధి.** సం. వి. ఇ. న. 1. పెరుగు; (దీని భేదములు అర్శోఘ్నము, ప్రాగ్రటము, అఘనము.) 2. సరళమను ధూపద్రవ్యము; 3. మద్ది*.

**దధిత్థము.** సం. వి. అ. పుం. వెలఁగ*.

**దధిఫలము.** సం. వి. అ. పుం.——వై.——

**దధిబుసము.** సం. వి. అ. న. మీఁగడతీసిన పెరుగు. (మీఁగడ పెరుగు అర్శోఘ్నము.)

**దధ్యుదము.** సం. వి. అ. పుం. పెరుగుసముద్రము.

**దనియాలు.** వై. వి. బ. కొత్తిమిరివిత్తులు, ధాన్యాకము.

**దనియు.** దే. స. క్రి. కూడు, సంగమించు.

**దనివు.** దే. వి. కూడిక, సంగమము. "ఎ, గీ. దనివుమొదలైన చిగురొత్తుతమకమునకు." భార. విరా. ౩, ఆ.

**దనుక.** దే. ద్ర. వఱకు, పర్యంతము.

**దనుకు.** దే. స. క్రి. 1. తాఁకు; "చ. దీనమై, దనుకదుదీనఁబొద నులు దాఁకదు నాదగువేఁడి మేమియుఁ." భార. అను. 3, ఆ.—2. పొందు. "క. మనకిమ్మడ్కి-ందనుకఁగరానికడిఁది దెప్పర మొందెఁ." హరి. పూ. ౬, ఆ. (రూ. దన్కు. "ఒల్లఁబాటు దన్క-డించుకేనియుఁ." భార. స్త్రీ. ౧, ఆ.)

**దనుజుఁడు.** సం. వి. అ. పుం. అసురుఁడు, తొలివేల్పు.

**దఫా.** హిం. వి. తడవ.

**దప్పము.** దే. విణ. దట్టము. "ఈతెలిదప్పపుఁగప్పురంపుబల్లిథులు." భాను. 3, ఆ.

**దప్పళము.** దే. వి. పులుచగాఁజేసిన వ్యంజనవిశేషము, పులుసు.

**దప్పి.** దే. వి. 1. నీరువట్టు; "వ. ఆధర్మజుండుదప్పికొర్వకనీళ్లు త్రావుటకై సరోవరంబులోనికిడిగుటయు." భార. అర. ౭, ఆ.—2. శ్రమము. (చూ. డప్పి.)

**దప్పిక.** దే. వి. దప్పియొక్క-రూపాంతరము. (స్వార్థమున కప్రత్యయము.)

**దబకాయించు.** హిం. క్రి. అదుము, గదమాయించు.

**దబదబ.** దే. వి. తలుపులోనగునవి తట్టుట పరుగెత్తుట మొదలగు వానియందగు ధ్వన్యనుకరణము. (దబదబ తలుపుతట్టుచున్నాఁడు. దబదబ పరుగెత్తుచున్నా[...]ము.)

**దబరా.** హిం. వి. వెడల్పయిన గిన్నె, బొగిణె.

**దబాయించు.** హిం. క్రి. అదుము, నెట్టు.

**దబ్బ.** యు. దే. వి. నారంగవిశేషము*. "గీ. పనసపండులుదబ్బ పండ్లనంటిపండ్లు." నీలా. ౨, ఆ. (దీని భేదములు కోలదబ్బ, నాఁదబ్బ.)—వై. 1. దర్భ*; "సీ. చెంగల్వవిరికయ్యెఁగమొత్తు టకులుక్కు-బిబ్బోకరాశికదబ్బపాన్పు." పాంచా. 3, ఆ.—2. బద్ద; 3. వెదురుబద్ద*.

**దబ్బడము.** దే. వి. మూకుడు.

**దబ్బడిం**[redacted]**స.** క్రి. 1. మూకుటితో మూయు; 2. చేతుతో

**దబ్బనము.** దే. వి. గోనెకుట్టెడు సూది.

**దబ్బయుంగరము.** దవ్. వి. పవిత్రపుముడివలె బంగారుతో చేసిన యుంగరము. "కమలాక్షునియంగుళిదబ్బయుంగరంబప్పర కాలుఁడెంతయును నారసిచూచి." పర. ౪, ఆ.

**దబ్బఱ.** దే. వి. 1. బొంకు; 2. మోసము; "గీ. వినిపుడమి తేఁడులెంతయువెఱఁగుపడుచు, సద్దిరాకొండకుద్దియైకొద్దిగాక, యున్నవిలుదెచ్చియందఱున్న మొందఁ, జేసెబోలీప్డుఁడుదబ్బఱ చేసినేఁడు." అచ్చ. బాల, కాం.—3. విపత్తు. "దవ్. పసనుఁ డెబ్బఁగిదబ్బఱవచ్చెననుచు." రా. యు, కాం.—4. తప్పు. (చూ. బుజే.) విణ. 1. బొంకుకాఁడు; 2. మోసకాఁడు. "క. నెఱ యంగా నీఛందము, తెఱఁగెఱుఁగకకవితచెప్పఁదివురునతఁడుదబ్బఱచీకుచీకుగుజ్జమఁ, బఱపినగతినిఖిలవోన్యపదనిరతుఁడగుఁ." కవిజనాశ్రయము.

**దబ్బఱకత్తియ.** దవ్. విణ. దబ్బఱలాడునది. (స్వార్థమున కత్తియ.)

**దబ్బఱకాఁడు.** దే. విణ. దబ్బఱలాడువాఁడు. (స్వార్థమున కాఁడు.)

**దబ్బఱి.** దే. విణ. (దబ్బఱ+ఇ.) దబ్బఱకాఁడు, దబ్బఱకత్తియ. (స్వార్థమున ఇప్రత్యయము.)

**దబ్బవాఁడు.** దవ్. వి. మేదరవాఁడు.

**దబ్బవ్రేలు.** దవ్. వి. పవిత్రపువ్రేలు, అనామిక.

**దబ్బాటు.** దే. క్రి. విణ. డబ్బాటుయొక్క-రూపాంతరము.

**దబ్బిచిప్ప.** దే. వి. తాటిచెట్టుబద్దలుచేసెడుసాధనము.

**దబ్బు.** దే. స. క్రి. చెప్పు. వి. 1. మాట; "ఉ. ఉల్లములోననేమ నుచు నుందువొయేనొకదబ్బుదబ్బెదఁ." సా. ౧, ఆ.—2. దబ్బడము.—3. చఱచుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "క. గొబ్బునలేచిబుజంబులు, దబ్బునఁజఱచుకొని." నీలా. 3, ఆ.

**దబ్బుడు.** దే. వి. మూఁత, దబ్బడము.

**దబ్బున.** దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా. (నీవు పోయి దబ్బునరా.)

**దబ్బుర.** దే. వి. దబ్బురయొక్క-రూపాంతరము. (గిన్నెవు. చూ. రుక్మి. 3, ఆ.)

**దబ్బువెట్టు.** దే. స. క్రి. (దబ్బు+పెట్టు.) మూయు. (చూ. గోలెము.)

**దభ్రము.** సం. విశే. (అ. ఆ. అ.) సూక్ష్మము, సన్నము.

**దమథము.** సం. వి. అ. పుం. 1. క్లేశమునోర్చుతనము; 2. దండనము.

**దమనము.** సం. వి. అ. న. అణచుట. పుం. దవనము.

**దమనుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకానొక ముని; 2. శూరుఁడు. విశే. అణఁచువాఁడు.

**దమము.** సం. వి. అ. పుం. 1. దండోపాయము; 2. క్లేశమునోర్చుతనము; 3. ఇంద్రియనిగ్రహము; 4. అణఁచుట; 5. అడుసు.

**దమి.** సం. విశే. (న్. ఈ. న్.) అణఁచువాఁడు.

**దమించు.** సం. స. క్రి. అణఁగఁద్రొక్కు, అణఁచు. (దమియించు. అనియు.)

**దమితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అణఁపఁబడినవాఁడు; 2. తపఃక్లేశసహనముగలవాఁడు.

**దమునసుఁడు.** సం. వి. స్. పుం. అగ్నిహోత్రుఁడు.

**దమ్మఁడు.** వై. విశే. కపటములేనివాఁడు*. "గీ. దమ్మఁడిఁకనేఁడు నాచేతఁ దగులువడియెఁ, గౌశికునిఁ బ్రీతిఁబొందింపఁ గలిగెనాకు." హరిశ్చ. ౪, ఆ.

**దమ్మము.** యు. దే. వి. నాలుగుకాసులనాణెము. వై. ధర్మము.

**దమ్మిడి.** దే. వి. అయిదుకాసులనాణెము. రెండుకాసులనాణెము. (అనికొందఱు.)

**దమ్ము.** వై. వి. అడుసు, పంకము.

**దమ్ముకొను.** వ్య. అ. క్రి. అడుసగు, పంకిలమగు.

**దమ్యము.** సం. వి. అ. పుం. మోయుటకును, దున్నుటకును బనుపఱుపఁదగిన వయసుగలకోడె.

**దయ.** సం. వి. ఆ. స్త్రీ. కృప, కనికరము.

**దయచేయు.** మి. అ. క్రి. కరుణించు. "దయచేసితప్ప్రార్థితములైనవరములు నొసఁగి." పాండు. ౫, ఆ. స. క్రి. ఇచ్చు. "క. నిద్రదయచేయుమనియెను, రద్రోహియుసమరవరులురదనాంకురచం, చద్రుచులునిగుడనవ్వుచు, భద్రుము మాకదియ యనఁగఁబద్మజుఁడిచ్చెన్." నిర్వ. 3, ఆ. (మఱియు నిది గొప్ప వారిని రండు పొండు అనుటయందును ఉపయోగింపఁబడును.) (రూ. దయసేయు.)

**దయాళువు.** సం. విశే. ఉ. కనికరముగలవాఁడు.

**దయిత.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రియురాలు; 2. ఆఁడుది.

**దయితుఁడు.** సం. వి. అ. పుం. ప్రియుఁడు. విశే. ఇష్టుఁడు.

**దయ్యము.** వై. వి. 1. దేవుఁడు; "సీ. పూనియరిగెదయ్యమానెమ్మనంబులవేడుక లన్నియు వృథచనంగ." రాఘ. 3, ఆ.—2. వేలుపు; "దయ్యపుమూఁకలుపైఁడికొండపైననయముఁగాఁపురంబులుగ." య. ౧, ఆ.—3. విధి; "క. అయ్యిరువదెఱఁగుల కప్పుడు, కయ్యమునకుఁ బరమసాధకంబుగఁగలిగెన్, ముయ్యంచుతుంగ యచ్చట, దయ్యమునేర్పునవిను సెప్పెదం గురునాథా." భార. శా. ౧, ఆ.—4. పిశాచము*. "ఉ. భవత్తనూజకే, దయ్యము సోఁకెనోమిగులఁదాపము నొందుచు నాఁడునాఁటికిన్, దయ్యఁపోడంగి." భో. ౫, ఆ.

**దయ్యు.** దే. అ. క్రి. డయ్యుయొక్కరూపాంతరము.

**దర.** వై. వి. వెల, క్రయము*.

**దరఁటము.** దే. వి. ఎనిమిదిడబ్బులనాణెము.

**దరము.** సం. వి. అ. పుం, న. 1. భయము; 2. శంఖము; 3. గొయ్యి. అవ్య. ఇంచుక. (దరహాసము మొ.)

**దరహాసము.** సం. వి. అ. పుం. చిఱునవ్వు.

**దరాం.** అం. వి. ఒక కొలఁత, మద్యపానము.

**దర్ఖాస్తు.** హిం. వి. విన్నపము.

**దర్జా.** హిం. వి. మెట్టు, స్థితి.

**దరి.** ఉభ. వై. వి. 1. గట్టు; "వ. గురుజనభక్తియుంగపటగోపకుమారపదాబ్జసక్తియున్, దరులుగ." పాండు. ౪, ఆ.- 2. మేర*; "ఎ, గీ. మఱియుదరిలేనిసొగసులేమఱకచేసి." నీలా. 3, ఆ.— 3. సమీపము*. "సీ. చల్లనిసురపొన్నచాయలచాయలసరుదారు మాణిక్యదరులదరుల.' సా. 3, ఆ.—సం. ఈ. స్త్రీ. గుహ.

**దరికొను.** దే. అ. క్రి. 1. మండు; "దరికొననాఁకటన్ దనవిదాహముపుట్టిన." భాగ. శాం. 3, ఆ.—2. కాలు. "మ. ఆశేషంబు బంగారుగు, బ్బలియందొక్కెడఁ జెందినం దరికొనెన్ భస్మావశేషంబుగాన్." ఉ, హరి. ౬, ఆ. (ప్రే. దరికొలుపు.)

**దరితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) భయబడినవాఁడు.

**దరిద్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) బీదవాఁడు.

**దరిబేసి.** దే. వి. దైన్యముగలవాఁడు, దీనుఁడు. "సీ. భుజమునఁ గూబరంబు ధరించుకొనిసోలుదరిబేసియగుచు బేతాళుఁడొకఁడు." జై. ౫, ఆ.

**దరిమిల.** హిం. క్రి. విశే. తఱువాత.

**దరిసించు.** వై. స. క్రి. 1. చూచు; "క. మిమ్మున్, దరిసించుసభిమతంబున, నరుదెంచుచునుండి." విక్ర. ౫, ఆ.—2. కానుకగానిచ్చు*. "ద్వి. తనదేవినేతెచ్చిదరిసింతుననుచు." భల్లా. ౨, భా.

**దరిసెనము.** వై. వి. రాజులులోనగువారిని చూడఁబోవునపుడు తీసికొనిపోయి యిచ్చెడు కానుక*. "క. గిరిరాజాతన్నుడగ్గఱ, నరుదెంచివినమ్రుఁడగుచు సబ్జదళాక్షిన్, దరిసెనముపెట్టినిలిచినఁ, గరుణయుమోదంబుఁ బుట్టఁ గఱకంఠునకున్." వీర. ౧, ఆ.

**దర్జీ.** హిం. వి. కుట్టుపనిచేయువాఁడు.

**దరుజు.** దే. వి. గచ్చుపూతతో రాళ్లనుకలుపుట.

**దరువు.** వై. వి. 1. గీతివిశేషము; 2. తాళము*.

**దరువుచేయు.** వై. అ. క్రి. తాళమువేయు.

**దర్దుర.** సం వి. ఆ. స్త్రీ. దుర్గ. అ. పుం. ము. 1. కప్ప; 2. మబ్బు.

**దరోబస్తు.** హిం. విశే. అంత.

**దర్పకుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**దర్పణము.** సం. వి. అ. పుం. అద్దము, ముకురము.

**దర్పము.** సం. వి. అ. పుం. 1. గర్వము; 2. కస్తూరి.

**దర్పించు.** సం. అ. క్రి. గర్వించు, త్రుళ్లు.

**దర్బారు.** హిం. వి. కచ్చేరీ, కొలువుకూటము, ఒక రాగము.

**దర్భ.** సం. వి. అ. పుం. తృణవిశేషము, కుశము.

దర్భముద్రిక. సం. వి. ఆ. స్త్రీ. దబ్బయుంగరము. "సీ. శోకించు వృద్ధభూసురుఁ డాత్మపితృదత్తదర్భముద్రికఁ జిత్తంబు గలఁగి." పాండు. 3, ఆ.

దర్యాప్తు. హిం. వి. విచారణ.

దర్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. మిల్లి; 2. గరిటె; 3. పాము యొక్క పడగ.

దర్వీకరము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

దర్శకుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు. విణ. 1. చూపెడువాఁడు; 2. నేర్పరి.

దర్శనము. సం. వి. అ. న. 1. చూపు; 2. కన్ను; 3. అద్దము; 4. బుద్ధి; 5. తెలివి; 6. కల; 7. శాస్త్రము; 8. ధర్మము.

దర్శని. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) ఉపరథ్య.

దర్శనీయము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁదగినది.

దర్శము. సం. వి. అ. పుం. 1. అమావాస్య; 2. అమావాస్య నాఁడు చేయఁదగిన యిష్టి; 3. చూపు.

దర్శయితృ. సం. విణ. (ఋ. ఈ. ఋ.) చూపువాఁడు.

దర్శించు. సం. స. క్రి. చూచు, వీక్షించు.

దర్శితము. సం. విణ. (అ. ఆ. అ.) చూపఁబడినది.

దర్సెనము. వై. వి. దరిసెనముయొక్క రూపాంతరము. (చూ. చేర ర్సెనము.)

దలపము. సం. వి. అ. పుం. ముఖత్రాణము. (చూ. తను త్రాణము.)

దలారి, దలాలి. హిం. వి. తరగరి.

దలిమము. దే. విణ. సన్నము. "క. ఎలనాగయోర్తుదలిమపు, వలిపంబులుగట్టనిచ్చె వడినడుగులఁబో, వలదో డిగెనో కతెయొక్క తె, తలఁబోవడయొత్తితిగిచితలయార్చెఁదగన్." య. ౪, ఆ. (దడిమముయొక్క రూపాంతరము.)

దల్లు. వై. వి. జల్లుయొక్క రూపాంతరము. (వానకు.)—"క. సెల్లు కొనఁగురిసిరప్పుడు, దల్లుగఁదమచూడ్కు లకునుదలమించుచుభూ, వల్లభుపైఁబురభామలు, కొల్లలుగాలాజమిళితకుసుమాంజలులన్." కవిక. 3, ఆ.

దవ. దే. వి. దుమ్ము, చెఱకుకొన. (అనికొందఱు.)

దవంత్రి. దే. వి. అగడ్త, కందకము.

దవనము. వై. వి. వాసనగల మూలికావిశేషము.

దవము. సం. వి. అ. పుం. 1. కార్చిచ్చు; 2. అడవి.

దవసము. దే. వి. కొలుచు, ధాన్యము.

దవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి దవ్వైనది.

దవీయము. సం. విణ. (స్. ఈ. స్.) ——పై.——

దవ్వ. దే. వి. మ్రానినడిమి మెత్తనిభాగము.

దవ్వు. వై. విణ. దూరము. (ఇది ద్వితీయాబహువచనాంతమైనచో దూరదేశమర్థమగుచున్నది. "అక్కర. ఎదురనుదవ్వులఁజూచిన పొడవులెల్లఁదక్షణము, కదియఁగా." భార. అర. ౨, ఆ.)

దశ. సం. వి. ఆ. స్త్రీ. 1. అవస్థ; 2. వత్తి; 3. బ. బద్దె.

దశకము. సం. స. అ. న. పది.

దశనము. సం. వి. అ. న. కఱచుట. పుం. 1. పల్లు; 2. శిఖరము.

దశనవాససు. సం. వి. స్. న. పెదవి, పలువలువ.

దశబలుఁడు. సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

దశమి. స. వి. ఈ. స్త్రీ. పక్షమునందు పదియవతిథి. విణ. పదియవది. స్. మిక్కిలి వృద్ధుఁడు.

దశమిస్థుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. నష్టవీర్యుఁడు; 2. వృద్ధుఁడు.

దశాహము. సం. వి. అ. పుం. మృతిపొందినవానికి పదియవ నాఁడుచేయు శ్రాద్ధము.

దష్టము. సం. విణ. (అ. ఆ. అ.) కఱవఁబడినది.

దసరా. వై. వి. దశరాత్రిపండుగ.

దసిలీ. దే. వి. 1. ఒకదినుసుపట్టు, మొగ్గపట్టు; "దసిలీనూలుపట్టె యల్లికబెడంగు." కళా. ౨, ఆ.—2. వదలు.

దసువంది. దే. వి. గ్రుడ్డులాటకు జెట్టీలను గూర్చువాఁడు.

దసెన. దే. వి. ఆయుధవిశేషము. (అప్ర.)

దస్కతు. హిం. వి. చేవ్రాలు.

దస్తరము, దస్త్రము. కాకిదములమూట.

దస్తావేజు. హిం. వి. వ్రాతపూర్వకమైన సాధనము.

దస్తు. హిం. వి. పోగుచేసిన సొమ్ము.

దస్తూరి. హిం. వి. వ్రాఁత. "గీ. సారముగ వ్రాసియున్న దస్తూరిఁ జూచి." కృష్ణ. 3, ఆ. (ఈ యన్యదేశ్యమీగ్రంథమునందు మాత్రము కనఁబడెడి.)

దస్యుఁడు. సం. వి. ఉ. పుం. 1. శత్రువు; 2. దొంగ.

దస్రులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీదేవతలు.

దహనము. సం. వి. అ. న. కాల్చుట. పుం. 1. చిత్రమూలము; 2. జీడి.

దహనుఁడు. సం. వి. అ. పుం. అగ్ని. విణ. దుష్టుఁడు.

దహించు. సం. స. క్రి. కాల్చు.

దళకొను. దే. అ. క్రి. దళముకొనుయొక్క రూపాంతరము. "దళ కొనియున్న తొంటిసుకృతంబున." విక్ర. ౪, ఆ.

దళగించు. దే. అ. క్రి. దళముకొను, దట్టమగు.

దళనము. సం. వి. అ. న. 1. ఖండించుట; 2. భేదించుట.

దళము. ఉభ. దే. వి. ఆధిక్యము. "క. దండుపుదానెక్కు నొప్పి దళమునసెపుడున్." విజ్ఞా. ప్రా. కాం.—విణ. 1. అధికము; "చ. బిలముఖపక్షిసీధరణిభృత్పతివారిధినిర్ఝరభ్రమిన్, దళముగమున్ను ద్రావినసుధారసధారగుణంబునం జూమీ." సా. ౫, ఆ.—2. తఱచు; 3. దట్టము.—సం. వి. అ. న. 1. ఆకు; 2. దండు; 3. హరిదళము; 4. భాగము.

దళముకొను. దే. అ. క్రి. అధికమగు. "క. దుర్యోధనునెమ్మదికి భయంబుదళముకొనంగన్." శల్య. ౧, ఆ. (వ్రే. దళము కొలువు.)

దళవరి. యు. దే. వి. (దళము+వరి.) ధాన్యవిశేషము. వై. సేనాధిపతి.

దళనాయకుఁడు. వై. వి. 1. సేనాధిపతి; (చూ. దలవీకనాయ.)- 2. ఒంటరికె నాయకుఁడైన యుద్యోగస్థుఁడు.

దళసంచి. దే. వి. (దళము+సంచి.) దళముజాతి.

దళసరి. వ్య. వి. (దళము+సరి.) ఘనత. "వ. సందయశోదాదు తెనగోపగోపికాజనంబులు హరిదళసరియెఱుంగక." భాగ. ౧౦, స్క-౦. పూ.-వి-. 1. తఱచు; (నేఁతదళసరిగానున్నది.) 2. మందము. (ఈ రాగితగడు మిక్కిలి దళసరి.)

దళించు. సం. స. క్రి. 1. ఖండించు; 2. భేదించు.

దళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఖండింపఁబడినది; 2. భేదింపఁబడినది; 3. వికసించినది.

## దా.

దా. దే. ఇ. దాయొక్క రూపాంతరము. (చూ. దాపల.)

దాంతి. సం. వి. ఇ. స్త్రీ. బ్రహ్మచర్యాదితపఃక్లేశము నోర్చుతనము.

దాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడఁపఁబడినవాఁడు; 2. తపఃక్లేశమునోర్చువాఁడు.

దాంపత్యము. సం. వి. అ. న. దంపతిభావము.

దాంభికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) దంభముగలవాఁడు.

దాఁక. దే. ద్ర. దనుకయొక్క రూపాంతరము.

దాఁకొను. దే. అ. క్రి. (దాఁగు+కొను.) మఱుఁగుపడు. "ఉ. మించినయాము పేనుఁగుల మీఁదికిఁజంగునదాఁటియాదలల్, చించిన గోళ్లలోఁదవిలిచిందినముత్యములెల్లఁజట్లపై, మంచునఁజేరి దాఁకొనినమాటికినమ్ముఁ ద్రవిస్త్రవిద్య, చ్చెంచునెలంతలేఱు దుమసింగపుజాడలెఱింగియచ్చటన్." య. ౨, ఆ. (స్వార్థమున కొను.)

దాఖలా. హిం. వి. ఋజువు, సాక్ష్యము.

దాఁగనముచ్చులు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు.

దాఁగర. దే. వి. ఎండువుఁదట్ట, ప్రసేవకము. "గీ. వరుగుతో దాఁగరనెండవలసినట్లు." ఉ, హరి. ౪, ఆ.

దాఁగిలిమూఁతలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము, గుప్తక్రీడ. "ఉ. నవ్వనుసిగ్గుఁగూడివదనంబునదాఁగిలిమూఁతలాడఁగన్." అని. 3, ఆ.

దాఁగిలిముచ్చులు. దే. వి. బ.——వై.—— "ఉ. చేతులు వ్రేసిపాటయునుజెచ్చెరదాఁగిలిముచ్చులాడియున్." వి, పు. ౭, ఆ.

దాఁగు. దే. అ. క్రి. మఱుఁగుపడు, తిరోహితమగు.

దాఁగురించు. దే. స. క్రి. 1. దాఁచు; 2. వంచించు. (చూ. దాఁగురింత.)

దాఁగురింత. దే. వి. 1. దాఁగురించుట; 2. బ. దాఁగురుమూఁతలు. (చూ. దాఁగురింత.)

దాఁగురుమూఁతలు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు.

దాఁచు. దే. ప్రే. దాఁగఁజేయు. "చ. మద్ఘనతరరాజ్యసంపదలు దాఁచక సర్వమునీకునిచ్చితిన్." హరిశ్చ. 3, ఆ.

దాఁటమగుపరుపడి. దే. వి. మల్లబంధవిశేషము.

దాఁటమగుమొన. దే. వి.——వై.——

దాఁటు. యు. దే. అ. క్రి. లంఘించు. (చూ. ఉంకు.) స. క్రి. 1. తరించు; (వాఁడాయేఱుదాఁటివచ్చెను.) 2. ఉల్లంఘించు. (నేఁడు నామాట దాఁటఁడు.) వి. లంఘనము.—వై. సమూహము. "సీ. గాయంచదాఁటులు మ్రోయుబేడేటులు గృహసరోరుహములఁగేళినలుప." వి.క్ర. 3, ఆ.

దాఁటుకట్టు. వ్య. అ. క్రి. గుంపుగూడు. "గీ. చినుకులోఁ గూడఁజలిగాలిచెలఁగఁజూచి, దాఁటుకట్టుచు మృగములుదాఁటుచుండ." పంచ. నా. ౨, ఆ.

దాఁటుకొను. దే. అ. క్రి. లంఘించు. "ఎ, గీ. మొగ్గిదాఁటుకొనిసముద్రతిరిపట్టిచబట్టె." హరి. ఉ. ౯, ఆ. (స్వార్థమున కొను.)

దాఁపన. దే. వి. దాఁచుట.

దాఁపరము. దే. వి. దొంగిలించుట. (చూ. దాఁపరీఁడు.)

దాఁపరించు. దే. స. క్రి. దొంగిలించు. "గీ. ముద్దులాఁడయి త్రేతలమొఱఁగిపాలు, వెన్నలునుదాఁపరింపఁగఁ దన్నుఁబట్టి, తల్లి త్రోలితోదామెనత్రాటఁగట్ట, నితఁడకాఁడెమద్దులఁగూల్చియేపు మూపె." హరి. ఉ. ౫, ఆ.

దాఁపరీఁడు. దే. వి. (దాఁపరము+ఈఁడు.) దొంగ. "సీ. వీడ పేమందలోవెన్నలుదొంగిలి దర్పించిమెక్కినదాఁపరీఁడు." భాగ. ౧౦, స్క-౦. పూ.

దాఁపటికము. దే. వి. (దాఁపన+ఇకము.) దాఁపురము, గోపనము.

దాఁపు. దే. ప్రే. దాఁచు. "ద్వి. ఆపదవచ్చినయపుష్టాదేమున్న, దాఁపినధనమిచ్చితగుఁబత్నిఁగావ." హరిశ్చ. ౨, భా.

దాఁపుడు. దే. వి. దాఁచుట, గోపనము.

దాఁపురము. దే. వి. 1. మఱుఁగుపుచ్చుట, గోపనము; "గీ. ఇంతిసిగ్గుగదాయనియింతదాఁకఁ, దలఁపుదాఁచితిలోలోఁగుమారిలఁగవచ్చు, నదియుఁగాకేనులాఁతినేయకటనీకు, రమణినాపట్టునను దాఁపురంబువలదు." కళా. ౬, ఆ.—2. దాఁచినసొమ్ము. "మ. కావలయువేళ కావచ్చికొంపోదునే, నివినీపెట్టియనాదుదాఁపురముగా నిందుండనిమ్మిన్నియున్." సా. ౨, ఆ.

దాక. యు. దే. వి. 1. వెడలుపునోరుగల యటిక; 2. బోగిణి. వై. ద్రాక్ష.

దాకలి. దే. వి. (దాయి+కలు.) కాఁచిసాగఁగొట్టేఁడు ఇనుము బంగారులోనగువానికి ఊఁతగా క్రిందనుంచెడు ఇనుపముద్దలోనగునది, నిఘాతిక. "దాకటిమీఁదఁబెట్టిపెడిదంబుగనంపెటవేయ." రత్న.

దాకల్లు. దే. వి. (దాపు+కల్లు.) బండికంటి కడకమ్మి, నేమి.

దాకొను. దే. అ. క్రి. (దాపు+కొను.) సమీపించు. "లగనము దాకొనియె." అచ్చ. అ, కాం.

దాక్షాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. రోహిణీనక్షత్రము; 3. అశ్విన్యాదినక్షత్రము; 4. భూమి.

దాక్షిణ్యము. సం. వి. అ. న. మొగమోటము.

దాక్షిణ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దక్షిణకు తగినవాఁడు. (రూ. దక్షిణ్యుఁడు.)

దాగలి. దే. వి. దాకలియొక్క రూపాంతరము.

దాడి. వై. వి. 1. శత్రుజయార్థముదండెత్తిపోవుట; (చూ. జోడఁగి.) 2. గర్జము.

దాడికాఁడు. వై. వి. తెగులవాఁడు. "చ. ఇదెచనుదెంచెచైత్రుఁడని యెల్లవనంబులకుంబ్రమోదముల్, పొదలఁగమేలివార్తగొనితేరనవచ్చినదాడికాఁడనన్, మృదువసదేవతాముఖసమీరమెదుర్కొనె

నల్లనిల్లెనం, పొదివంగదకీ ణానిలమునూననునోహరిణీలసంబు నజా." లక్ష్మీ. ౨, ఆ.

**దాడిచేయు.** వై. అ. క్రి. దండెత్తు.

**దాడినిమ్మ.** వై. వి. దానిమ్మ*. "మత్తకోకిల. పూచెనిమ్మలుదాడి నిమ్మలుఁబొన్నలున్ సురపొన్నలున్." య. ౪, ఆ.

**దాడిమపుష్పకము.** సం. వి. అ. పుం. సులుమోదుగు*.

**దాడిమము.** సం. వి. అ. పుం, న. దానిమ్మ. (రూ.) దాడింబము*. (ఇది ఈకారాంతస్త్రీలింగమునగును.) పుం. ఏలకి*.

**దాడిమ్మ.** వై. వి. దానిమ్మ*.

**దాడియాడు.** ద్వి. స. త్రి. (దాడి+ఆడు.) మార్కొను. "ద్వి. ఈడఁబోవకయింద్రుఁడీమసవీఁడు, దాడియాడుచువస్తుతతిఁగొల్ల విడిచి." భాగ. 2, స్కం.

**దాఢ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోఱపల్లు; 2. సమూహము.

**దాణ.** వై. వి. ఉలవలులోనగు గుఱ్ఱమునాహారము. "పతటిఁగల లోననుంబడెఁడుదాణయెఱుఁగను." హంస. ౫, ఆ.

**దాణము.** దే. వి. సుంకము, శుల్కము.

**దాత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) ఇచ్చువాఁడు.

**దాతికట్టు.** దే. వి. (దాయి+కట్టు.) (చూ.) ఉద్ఘనము.

**దాత్యూహము.** సం. వి. అ. పుం. 1. కూకురుగుండఁగి; 2. వానకోయిల.

**దాత్రము.** సం. వి. అ. న. కొడవలి, లవిత్రము.

**దాదాపు.** దే. వి. (దాపు+దాపు.) మిక్కిలి సమీపము.

**దాది.** వై. వి. పాలిచ్చి పెంచుతల్లి.

**దాదలి.** వై. వి.——వై. ——

**దాదుంగ.** దే. వి. (దాయి+దుంగ.) (చూ.) ఉద్ఘనము.

**దానము.** సం. వి. అ. న. 1. ఈవి; (దశదానములు.—గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము, లవణదానము. —షోడశమహాదానములు.—గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథదానము, గజదానము, అశ్వదానము, ఛాగదానము, మహిషీదానము.) 2. ఏనుఁగుకపోలమదము; 3. పాలనము; 4. ఛేదనము; 5. శుద్ధి; 6. చతురుపాయములలో నొకటి. (ఇది పంచవిధము.—తనకుఁగల ధనమంతయునిచ్చుట, ఎక్కడనేని ధనము తీసికొన్నచో దానికిఁ దాననుకూలుఁడైయుండుట, అపూర్వవస్తువుల నిచ్చుట, ఒకని ధనముఁబుచ్చుకొనఁ బ్రవర్తింపఁజేయుట, అప్పు తీర్చుట అని. చూ. ఉపాయము.)

**దానవారి.** సం. వి. ఇ. పుం. దేవత, వేల్పు.

**దానవుఁడు.** సం. వి. అ. పుం. దనుజుఁడు, తొలువేల్పు.

**దానశౌండుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి యీవికాఁడు, వదాన్యుఁడు.

**దానిమ్మ.** వై. వి. దాడిమము*.

**దాపనము.** సం. వి. అ. న. దండుగగొనుట.

**దాపరము.** దే. వి. ప్రాప్తి.

**దాపరించు.** దే. అ. క్రి. ప్రాప్తించు.

**దాపలి.** దే. వి. డాపల, ఎడమభాగము. "చ. కటకటకాశికాపురి నొకానొకనిర్ఘురిఁ గన్నుమోడ్చియు, స్ఫుటకసువిచ్చునక్షుడిభాగముఁగన్గొనిచో వ్యసమందుదా, పటిదెసఁజూచియచ్చెరువుపాటు వహించుమనస్సరోజనం, పుటమునఁనాఁడులాగుమగపోఁడిమియుంగలజంతుసంతతుల్." కాశీ. 3, ఆ. (డాపలయొక్క రూపాంతరము.)

**దాపలించు.** దే. అ. క్రి. డాపలించుయొక్క రూపాంతరము. "వ. బకవైరిదాపలించితిరిగిన." శార. కిల్స. ౨, ఆ.

**దాపించు.** దే. అ. క్రి. సమీపించు.

**దాపితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దండుగగొనఁబడినవాఁడు, సాధితుఁడు.

**దాపు.** దే. వి. 1. సమీపము; 2. భయము. "మత్తకోకిల. దాపులేనిరణంబు నేటికెదానవోత్తమచూడఁగాన్." మై. ౧, ఆ.

**దాపురమగు.** దే. అ. క్రి. (దాపురము+అగు.) ప్రాప్తించు.

**దాపురము.** దే. వి. ప్రాప్తి. "వ. బుధులకునవనిధులదాపురంబునువిపులజయలక్ష్మికిఁగాఁపురంబును." రామా. ౧, ఆ.

**దాప్యము.** సం. విశే. (అ. ఆ. అ.) దండుగగొనఁదగినది.

**దామని.** సం. వి. ఈ. స్త్రీ. దామెనత్రాడు.

**దామము.** సం. వి. న్. పుం, న. (పసులఁగట్టెడు). 1. తలుగు; 2. హారము.

**దామర.** దే. వి. 1. ఉరిత్రాడు; "చ. ఎలమిమనోజలుబ్ధుఁడెలయించిన జక్కవదీముపెంటిపే, రెలుఁగునఁబిల్చిచూడ్కిఁగదియించి యెదుర్కొని మేనుమేనుని, శ్చలగుణసంగతింబెనఁచిచక్రము దామరతెంకిఁజేర్పఁద, త్కలకలశంకఁబోలెవిహాగంబులువీడెఁగులాయపూటముల్." వసు. ౪, ఆ.—2. మండలాకారకుష్ఠము.

**దామెన.** వై. వి. పెక్కుతలుగులుగల నిడివిత్రాడు.

**దామోదరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

**దాయ.** దే. వి. 1. జ్ఞాతి; 2. శత్రువు. "దాయధనంబు." భార. అను. ౨, ఆ. "దాయగెల్వుమసురేంద్రా." ఉ. రా. ౨, ఆ.

**దాయఁగట్టు.** దే. స. క్రి. (దాయన్+కట్టు.) (చూ.) ఉట్టుకట్టు.

**దాయకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఇచ్చువాఁడు.

**దాయము.** ఉభ. దే. వి. 1. పాచికలు గవ్వలుమొదలైనవానియందలి పందెము; "ద్వి. ఇదియేమొయిపుడుదాయంబుపడనీక తంబని." విష్ణు. పూ. ౨, ఆ.—2. గవ్వలాట; 3. విపత్తు. "ద్వి. దాయంబుతలనిట్టిదైన్యంబుతగునె." హరిశ్చ. ౨, భా.—సం. అ. పుం. 1. పంచుకొనఁదగినతండ్రిసొత్తు; 2. ఈవి; 3. అరణము; 4. కట్నము; 5. ఉల్లకుట్టుమాట.

**దాయాదుఁడు.** సం. వి. అ. పుం. 1. జ్ఞాతి; 2. పుత్త్రుఁడు.

**దాయి.** ఉభ. దే. వి. (చూ.) దాకలి. "చ. గరళపుముద్దలోహమవగాఢమహాశనికోట్లు నస్మెటల్, హరునయనాగ్నికొల్మి యురగాధిపుకోఱలుపట్టుకార్లు ది, క్కరటిశిరంబుదాయి లయకాలుఁడు కమ్మరి వైరివీరసం, హరణగుణాభిరాముఁడగుమైలముభీమనఖడ్గసృష్టికిన్." భీమనచాటుధార.—సం. విశే. (న్. ఈ. న్.) ఇచ్చువాఁడు.

**దాయు.** దే. అ. క్రి. డాయు, సమీపించు.

**దార.** ఉభ. వై. వి. 1. నీటిచాలు; "రగడ. తమ్మిపుప్పొడిమీఁదిజలములదారదారకయుండఁజల్లుము." పా. ౪, ఆ.—2. దాస్యము*;

"ద్వి. దారలెక్కలకున్నైతెరువులుపెట్టి, దారలనమ్మించిదనములు గొనెడి, కరెంచిత్తులులేరు." హరిశ్చ. ౨, భా.—3. క్రమము*. "ఎ, గీ. తప్పునాడకలొల్లింటిదారచెడక." ఉ, హరి. 3, ఆ.— సం. వి. అ. పుం. బ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము.

దారకుఁడు. సం. వి. అ. పుం. 1. బాలకుఁడు; 2. కృష్ణునిసారథి. విణ. చీల్చువాఁడు.

దారణ. వై. వి. వెల, క్రయము*. "దారణవాసికైకొదల్పెట్టుచు." ఆము. ౬, ఆ.

దారణము. సం. వి. అ. న. చీల్చుట.

దారదము. సం. వి. అ. పుం. 1. విషభేదము; 2. పాదరసము; 3. ఇంగుళ.

దారబందము. వై. వి. ద్వారబంధము.

దారము. దే. వి. నూలిత్రాడు.

దారి. వై. వి. 1. మార్గము*. విణ. ధరించువాఁడు. (జేడదారి ము.)

దారించు. సం. స. క్రి. చీల్చు.

దారితము. సం. విణ. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

దారిద్ర్యము. సం. వి. అ. న. బీదతనము.

దారుకీటము. సం. వి. అ. పుం. (చూ.) ఘుణము.

దారుణము. సం. వి. అ. పుం. భయానకరసము. విణ. భయంకరము.

దారున. దే. ద్ర. క్రి. విణ. తటాలున. "వ. దారునసెదుర్తైరి వైభవనిరూఢిఁజెలంగెడు కొందఱంగనల్." కళా. 3, ఆ.

దారువు. సం. వి. ఉ. న. 1. కొయ్య; 2. దేవదారువు*; 3. ఇత్తడి.

దారుహరిద్ర. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపు.

దారుహస్తకము. సం. వి. అ. పుం. కొయ్యతెడ్డు.

దారోగా. హిం. వి. పైయధికారి.

దార్ఢ్యము. సం. వి. అ. న. దిటవు.

దార్వాఘాటము. సం. వి. అ. పుం. వడ్రంగిపిట్ట.

దార్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. మ్రానిపసుపు; 2. బెండు*.

దార్వికా. సం. వి. ఆ. స్త్రీ. 1. బెండు*; 2. మ్రానిపసుపున వండిన అంజనవిశేషము.

దాలి. దే. వి. పాలుకాఁచుటలోనగువానికిఁజేర్చినపిడకలప్రోగు.

దాల్చిని. హిం. వి. సుగంధద్రవ్యవిశేషము.

దావ. దే. వి. తగవు. "దావలఁజెనఁచి." ద్వి. హరిశ్చ. ౧, భా. (ఇది విచార్యము.)

దావంతము. దే. వి. దుఃఖము. "ద్వి. దైవమాయామోహ తప్పించి పుమనుచు, దావంతమున మదిఁదలపోయుచుండె." సా. 3, భా.

దావము. సం. వి. అ. పుం. 1. అడవి; 2. కారుచిచ్చు.

దావరడంగి. దే. వి. దావరడంగియొక్కరూపాంతరము.

దావరి. దే. విణ. ధీరుఁడు. "క. దేవరఁగొలిచెదననవుడు, నీవిధముననీతపుడెంగెడెవ్వఁడునఃగడుణ, దావరికాఁటోలునుఁబీ, డీవీరుఁడుమలయుననుచుహృదయంబలరఁజ." భా. ౫, ఆ.

దావరీఁడు. దే. విణ. (దావరి + ఈఁడు.) దావరి. (స్వార్థమున ఈఁడు.)

దావా. హిం. వి. వ్యాజ్యము.

దావికము. సం. విణ. (అ. ఆ. అ.) దేవికానదియందుఁబుట్టినది.

దాశపురము. సం. వి. అ. న. కయివడిముస్తె*.

దాశార్హుఁడు. సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.

దాసనము. దే. వి. జపకే*.

దాసరయ్య. వై. వి. (దాసరి + అయ్య.) తాఁజేలు. "క. వలఁజిక్కకచనెమృగము, వ్వలఁజిక్కనుదాసరయ్యవలవనిజాలిక్, దలఁకంగనేలనేఁడీ, కొలఁదికిఁగూరయ్యె ననుచుఁగొనిపోవృకజిత్." పంచ. నా. ౨, ఆ.

దాసరి. వై. వి. విష్ణుసేవకుఁడైన శూద్రుఁడు*. "క. వ్యాసనము లైనయాభర, ణీసురపుంగవులనెల్లనిరసించికటా, యీనభనగ్రాహ్యున యొక, దాసరిఁగొనివచ్చియొసఁగఁదగునెదురాత్మా." పర. ౨, ఆ.

దాసరికొయ్య. ద్వ. వి. మత్స్యవిశేషము. (చూ. కొరద.)

దాసరిగాఁడు. ద్వ. వి. (దాసరి+కాఁడు.) తాఁజేలు.

దాసరిపాము. ద్వ. వి. సర్పవిశేషము.

దాసి. సం. వి. ఈ. స్త్రీ. 1. వెలకుఁగొన్న పనికత్తె; 2. కాకిదొండ*; 3. నల్లగోరంట*.

దాసుఁడు. సం. వి. అ. పుం. 1. వెలకుఁగొన్న పనివాఁడు; 2. శూద్రుఁడు; 3. జ్ఞాని; 4. చేపలఁబట్టువాఁడు. (ఈ యర్థమున నిది శకారోపథమునకు.)

దాసేయుఁడు. సం. వి. అ. పుం. పనివాఁడు. విణ. దాసికిఁ బుట్టినవాఁడు.

దాసేరుఁడు. సం. వి. అ. పుం.——పై.——

దాస్యము. సం. వి. అ. న. సేవ, పని.

దాహకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కాల్చువాఁడు.

దాహము. సం. వి. అ. పుం. 1. కాలుట; 2. దప్పి.

దాహరి. వై. వి. దాసరియొక్కరూపాంతరము. "వ. కహకహ నవ్వియద్దాహరికి సురద్రోహి యిట్లనియె." ఆము. ౬, ఆ.

దాళా. యు. దే. వి. పడియొక్క హెచ్చుతక్కువ. వై. (నెయ్యి, నూనె మొదలగునవి తీయు పాత్రములనుగాని, అవి యుంచియున్న పాత్రములనుగాని) సరియెత్తుజాలను దడతట్టనుంచి కూఁచుట.

దాళి. సం. వి. ఈ. స్త్రీ. సెనగలులోనగువానిపప్పు.

దాళిమ్మ. వై. వి. దాడిమ్మయొక్కరూపాంతరము.

దాళీకుఁడు. దే. విణ. కార్యకర్త.

దాళు. దే. వి. వర్ణలేశము. "ద్వి. రసమెక్కియానెలురయమున బలిసెఁ, బనుపుదాళెక్కియేర్పడఁబల్చలగుచు." భాగ. ౧౦, స్క.

దాళువ. వై. వి. దోడ.

దాళువా. దే. వి. శరదృతువు మొదలుకొని నీరానరానువండెడు పల్లపువంట.

ది.

ది. దే. అవ. సంబంధమును దెలుపునది. (నాది, నీది, వానిది, వీనిది ము.)

**దించు.** దే. ప్రే. దిగఁజేయు. "ఎ, గీ. తెగువనాగ్రహబుద్ధియు దింపనైతి." రా. యు, కాం.

**దించెన.** దే. వి. గిరికర్ణికి.

**దిండీఁడు.** దే. విశే. (దిండు + ఈఁడు.) కాసెకట్టినవాఁడు.

**దిండు.** దే. వి. 1. నిడుపాటి గుండ్రపు తలగడ; 2. నిడుపాటి గుండ్రపు తలగడవలె చెక్కఁబడిన మ్రాను; (గుంటకదిండు, గొర్తిదిండు, పాపనపుదిండు మొ.) 3. మెఱుఁగుబిళ్లలోనగునవి యంటించెడు జాళ్లపనివాని సానతిరుగుడుకొయ్య; 4. దట్టి. "సునుపగుపచ్చపట్టునఁ గనుంగొననొప్పగుదిండుగట్టి." హరి. పూ. ౬, ఆ.

**దిందిం.** దే. వి. దిమిదిమియొక్కరూపాంతరము.

**దింపు.** తె. వి. వ్రేలుట, లంబనము.

**దింపులువోవు.** దే. అ. క్రి. (దింపులు+పోవు.) వ్రేలాడు. "సీ. అందందవక్షోరుహములుదింపులువోవఁదొడుక నిచ్చుట యెట్లుదుర్ఘనము." కాశీ. ౪, ఆ.

**దిక్కమొగములు.** వై. విశే. బ. భయముచేత దిక్కున కొకరుగా పాఱినవారు. "గీ. ఒక్కమొగముగాక యుటికిరిసైనికుల్, దిక్కమొగములగుచుఁ జిక్కుభటులు, మ్రొక్కిరీటియలుతటుక్కునఁ బడవైచి, యక్కిరీటియెదుటనాఁగఁగలరె." విజ. 3, ఆ.

**దిక్కామొగములు.** వై. విశే. బ. దిక్కమొగములుయొక్క రూపాంతరము. "సీ. పోయినపోకలైపోయిరిసిద్ధులు దిక్కామొగములైరి దిగధిపతులు." పా. ౫, ఆ.

**దిక్కు.** సం. వి. శ. స్త్రీ. 1. దిశ; 2. శరణము.

**దిగ.** దే. అవ. దిగువశబ్దమునకు వృత్తియందు ఆదేశముగావచ్చిన రూపము. (వృత్తియందు ఇది అర్థవిశేషముల నిచ్చుచున్నది.—దిగఁబోఁత. వి. దిగువకు వ్యాపించుట. (వానికి చెమట ఎగఁబోఁతలు దిగఁబోఁతలుగానున్నది.) — దిగరోఁజు. వి. కుట్టూపిరి. (వాఁడు ఎగరోఁజు దిగరోఁజులుగా పరుగెత్తుచున్నాఁడు.) ఇత్యాదులు.)

**దిగంబరుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. భైరవుఁడు. విశే. దిసమొలవాఁడు.

**దిగఁదీయు.** దే. స. క్రి. దిగఁదుడుచు.

**దిగఁదుడుచు.** దే. స. క్రి. (దిగన్ + తుడుచు.) (దృష్టిదోషము మొదలైనవానికి ఉప్పు మిరపకాయలోనగువాని) చుట్టివేయు.

**దిగఁదుడుపు.** దే. వి. దిగఁదుడుచుట. (చూ. దిగఁదుడుచు.)

**దిగఁద్రావు.** దే. అ. క్రి. (దిగన్ + త్రావు.) దిగు. "క. కన్నంతనతనయేనిక, దున్నదిగంద్రావిరభసదోలాయితహా, రోన్నతవక్షస్థలుఁడై, యన్నలినాక్షునకువంచెనాత్మశిరంబున్." హరి. పూ. ౭, ఆ.—స. క్రి. విడుచు. "విశిష్టవృత్తి దిగఁద్రావియసాధువనంగనుండు." భార. ఆర. ౭, ఆ.

**దిగఁబడు.** ద్వి. అ. క్రి. (దిగన్ + పడు.) 1. దిగు; "గీ. పంకముగొరిజదిగంబడిపఱవలేవు, మన్నులివ్వేళరేగటిమన్నులందు." స్వా. ౪, ఆ. (స్వార్థమున పడు.)—2. అడఁగు; "ధాత్రియుం దిగంబడు." లక్ష్మీ. ౫, ఆ.—3. జాఱు. "గీ. తోఁచినట్టి, పిండమెడలియైనఁబిదపదిగంబడదయ్యె." భార. కర్ణ. 3, ఆ.

**దిగదిగ.** దే. వి. వచ్చుట పోవుట విసరుట మెఱయుటలోనగు వానియందగు ననుకరణము. "నేలకుందిగదిగనింగినుండియరుదెంచిరి." "దిగదిగనరిగి." "దిగదిగవిసరి." "గీ. అబ్బురుచిఁదూర్పు దిగదిగయంచుమెఱసె."

**దిగనాడు.** దే. స. క్రి. (దిగన్ + ఆడు.) విడుచు.

**దిగవిడుచు.** దే. స. క్రి. (దిగన్ + విడుచు.)——పై.—— "మగనిదిగవిడిచి." విజ్ఞా. ఆచా, కాం.

**దిగసన.** దే. ద్ర. క్రి. విశే. దిగువగా. "ఎగసనఁద్రోయుమన్న దిగసనఁద్రోసెడు."

**దిగు.** దే. అ. క్రి. 1. మీదనుండి క్రిందికివచ్చు; 2. దిగుమతి యగు; "క. మేలైనసరకులాతని, కొలుసదిగు." శుక. ౧, ఆ.—3. ప్రయాణమైపోవునపుడు దారిలోవిడియు; 4. దిగఁబడు. "గీ. కడుపుదిగెనంచుఁబారులుకలఁగఁబడఁగ." భాగ. ౧౦, స్కం. పూ.

**దిగుచు.** దే. ప్రే. దించు. "క. కొఱులదిగిచిచంపుటొప్పుఁగువల యపతికిన్." విజ్ఞా. ప్రా, కాం.

**దిగుడు.** దే. విశే. 1. ఆనతము; (నేల ఎగుడుదిగుడుగానున్నది.)—2. తక్కువ. (చూ. దిగ్గుడు.)

**దిగుదల.** ద్వి. వి. (దిగుడు+తల.) క్రిందిభాగము.

**దిగుమతి.** దే. వి. (ఓడలోనున్న సరకును రేవునందు) దించుట.

**దిగులు.** దే వి. గుండెయదరు.

**దిగులుపడు.** ద్వి. అ. క్రి. దిగులొందు.

**దిగులుపాటు.** ద్వి. వి. దిగులుపడుట.

**దిగువ.** దే. వి. క్రిందు. "గిరిదిగువ." విశే. క్రిందైనది. "దిగువలోకములు."

**దిగువాటు.** ద్వి. వి. (దిగుడు+పాటు.) దిగువ. "క. మినుకుమినుకనెడిమింటన్, బోనపానయలతెల్లమబ్బు పొంతనుదిగువాటునసదె కలదోలేదో, యనుమాత్రముగాఁగఁగంటివా నృపతనయా." సా. ౧, ఆ.

**దిగువాయి.** దే. విశే. తక్కువ.

**దిగువాఱు.** దే. అ. క్రి. (దిగుడు+పాఱు.) 1. మీఁదనుండి క్రిందికిపడు; "ద్వి. వెగటుననవ్వరుల్ వెన్నునిమీఁద, దిగువాఱఁబోయించి." విష్ణు. పూ. ౧, ఆ.—2. కాఱు; "వ. దృక్కోణంబులదిగువాఱుకన్నీరుచెన్నారుకర్ణద్వయీగోళకంబులునిండి." స్వా. 3, ఆ.

**దిగ్గన.** దే. ద్ర. క్రి. విశే. తటాలున. "ద్వి. కడునొగలలమిదిగ్గన నేలతోడ, నడిచియు." రా. యు, కాం.

**దిగ్గనాడు.** దే. స. క్రి. దిగనాడుయొక్కరూపాంతరము.

**దిగ్గియ.** వై. వి. డిగ్గియయొక్కరూపాంతరము. (చూ. గెడ రెండవ యర్థము నుదాహరణము.)

**దిగ్గు.** దే. స. క్రి. దిగుయొక్కరూపాంతరము. "గీ. చేరియరదంబుఁదగ్గృహద్వారసీమ, దిగ్గియరుదెంచి ప్రణమిల్లిదేవయిపుడు, నీకుమారులసౌభాగ్యనిధులబుధుల, డించివచ్చితి గంగాతటీవనతిని." రామా. ౫, ఆ.—వి. భయమునందగుననుకరణము. "గీ. దేవతల మనంబుదిగ్గనంగ." నిర్వ. 3, ఆ.

**దిగ్గుడు.** దే. విశే. దిగుడుయొక్కరూపాంతరము. (తక్కువకు.—"అవిద్యధిమాకుసెవిద్యధిన్ దెలిసిననీడుగాఁగలఁడెదిగ్గుడుమాకు." రామా. ౧, ఆ.)

**దిగ్గున.** దే. ద్ర. క్రి. విశే. దిగ్గనయొక్కరూపాంతరము.

**దిగ్గురను.** దే. అ. క్రి. (దిగ్గు + అను.) భయముచే హృదయము దిగుమను. (సంధియందు వర్ణాధిక్యము.)

**దిగ్గోలు.** దే. వి. కోయుటయిపిసకు ముందుపిఱుది.

**దిగ్ధము.** సం. వి. అ. పుం. విషముపూసినబాణము. విణ. పూయcబడినది.

**దిగ్బంధము.** సం. వి. అ. పుం. 1. మంత్రముచేకట్టెడు దిక్కులకట్టు; 2. సాలెపురుగు.

**దిగ్భ్రమము.** సం. వి. అ. పుం. దిక్కులు తబ్బిబ్బు. (వాస్తవార్థము ఇదిగానుండినను వాడుకయందు భ్రమపర్యాయముగానే కానcబడుచున్నది.)

**దిచ్చరి.** వై. వి. వ్యభిచారిణి. "క. తెచ్చికుసూలములోపలc, జొచ్చినబొజుcగెగసియెగసిచూడcగనపుడా, దిచ్చరిహెచ్చరికంబ్రియు, గ్రుచ్చికలిక్రియలసొంపుగులుకుచునుండెన్." పంచ. వేం. ౧, ఆ.

**దిచ్చెమొగము.** ద్వి. విణ. అదృశ్యము.

**దిట.** వై. వి. దార్ఢ్యము, శక్తి*. "క. దిటచెడిలోcబడెదైత్యుcడు, సటికిన్ దంష్ట్రావిభిన్నశత్రుమహోర, స్తటికిన్ ఖరఖురపుటికిన్, గటితటహాతకమలజాండఘటికిన్ గిటికిన్." భాగ. 3, స్కం.

**దిటము.** వై. వి. ధైర్యము*. "గీ. అతితరాభీప్సితావృతస్వాంతయగుచుc, గొంతదిటమూనియున్నయనంతరమున." రసి. ర, ఆ.— విణ. దృఢము. "చాలదిటంబగుభక్తిపూని." రసి. ౬, ఆ.

**దిటవు.** వై. వి. దార్ఢ్యము. విణ. దృఢము.

**దిట్ట.** వై. వి. దార్ఢ్యము, శక్తి*. (చూ. తెవులువడు.) — విణ. 1. దార్ఢ్యముగలవాcడు; "వ. అఖండలాయఖండలాఘవాలాపంబులం గోపంబు పుట్టించితి. దిట్టవేనిగట్టితనంబేర్పడ నిప్పర్వతశిఖరంబుcబెఱుకుము." పాంచా. 3, ఆ.—2. ధైర్యముగలవాcడు; "ఉ. దీనివిలాసముంగనిమదింగడుసోలరెయెట్టిదిట్టలున్." రసి. 3, ఆ.—3. సామర్థ్యముగలవాcడు*. "క. ఈడుదుడుకుcగోcతిcగొనిచని, మీదిట్టతనంబులెల్లమెఱయcగనిపుడోc, గాదనకతోcకcగాలిచి, పీదులపీదులనుత్రిప్పివిడువుcడుకడcకన్." అచ్చ. సుం, కాం.

**దిట్టcడు.** వై. విణ. ధైర్యముగలవాcడు. "ఉ. నేడిట్టcడనైతినెల్లవిమ్మc దెల్లముగా వినవోర్తు నంజయా." భార. భీష్మ. ౧, ఆ.

**దిట్టము.** వై. వి. నిర్ణయము, చిక్కcబట్టు*.

**దిడ్డి.** దే. వి. 1. గవనిలోనగువాని ప్రక్కనుండు చిన్నవాకిలి; 2. చిన్నవాకిలి. "క. సుమcబైcడికావిచెఱcగులc, బనుపడియెడి దిడ్డితోడిపల్లకికదలెన్." య. ర, ఆ.

**దితము.** సం. విణ. (అ. ఆ. అ.) నఱకcబడినది.

**దితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అసురులతల్లి; 2. నఱకుట.

**దితిసుతుcడు.** సం. వి. అ. పుం. దితికొడుకు, దైత్యుcడు.

**దిద్దు.** దే. స. క్రి. 1. శిక్షించు; "గీ. ముదితమేలుమేలుకొదవలేదెందునీ, యనఘచరితు దిద్దు మనుచుcజనియె, జాంబవతియునొక్క సంవత్సరముదాcకc, బాటనేర్చెమునికిcబాటవమున." కళా. ౨, ఆ.—2. సవరించు. "శా. ఆయిద్దఱుంగేలిభి, స్నాలంకారములొక్కరొక్కరికినింపొనట్లుగాదిద్దుచున్." కళా. 3, ఆ. "క. సునుపగుమృగమదపంకం, బునcదీనియదిద్ది." (ఇక్కడ సవరించుట అనcగా అలుకుట. ఇట్లు సందర్భానుసారముగా అక్కడక్కడ వర్థము సూహించునది.) రసి. ర, ఆ.

**దిద్దుగడ.** దే. వి. దిద్దుపాటు.

**దిద్దుసు.** దే. వి.——పై.——

**దిద్దుపాటు.** ద్వి. వి. 1. సవరించుట; 2. శిక్షించుట.

**దిద్దుబడి.** దే. వి. దిద్దుపాటు.

**దిదృక్ష.** సం. వి. ఆ. స్త్రీ. చూడనిచ్ఛ.

**దిదృక్షువు.** సం. విణ. ఉ. చూడనిచ్ఛగలవాcడు.

**దిధక్ష.** వి. ఆ. స్త్రీ. కాలువనిచ్ఛ. "లంకాపురీదిధక్షాదీక్షారూక్షప్రతాపు." రామా. ౭, ఆ.

**దిధక్షువు.** సం. విణ. ఉ. కాలువనిచ్ఛగలవాcడు.

**దిధిషువు.** సం. వి. ఊ. స్త్రీ. మాఱుమనువుది. ఉ. పుం. మాఱుమనువుదానిమగcడు.

**దినకరుcడు.** సం. వి. అ. పుం. సూర్యుcడు.

**దినబత్తెము.** మి. గ్రా. వి. (దినము + బత్తెము.) దినదినమునిచ్చెడు బత్తెము. "నీకు మొదలన్ దినబత్తెమునేనొడంబడన్." హరిశ్చ. ర, ఆ.

**దినము.** సం. వి. అ. న. 1. దివసము, పగలు. (దినభాగములు పదునేను —రౌద్రము, శ్వేతము, మైత్రము, శారభటము, సావిత్రము, విజయము, గాంధర్వము, కుతపము, రౌహిణేయము, విరించము, సోమము, నిర్ఋతి, మాహేంద్రము, వరుణము, భటము.)

**దినవెచ్చము.** మి. గ్రా. వి. (దినము+వెచ్చము.) దినదినముజేరగెడువెచ్చము. "సీ. దినవెచ్చమునకునై తనమేనcగలసొమ్ముగొదుకక బచ్చింటcగుదువవైచు." పాండు. 3, ఆ.

**దినసరి.** దే. వి. 1. సస్యవిశేషము; "ద్వి. దినసరిసరియయ్యెc దీటైనంబావు." విష్ణు. పూ. 3, ఆ.—2. బ. ధాన్యవిశేషము.

**దినాంతము.** సం. వి. అ. పుం. సాయంకాలము, మాపు.

**దినారి.** వై. వి. (చూ.) దీనారము. ("ఒకానొకచోటసుబుద్ధికాంచెcజెంపొంద దినారిటంకములనుంచిన కాంచనకుంభము." (ఇక్కడ దినారిశబ్దమునకు పైcడిమాత్రమర్థము.) పంచ. నా. ౧, ఆ.)

**దినుసు.** దే. వి. 1. ప్రకారము; 2. వస్తువు. (చూ. దినుస్సు.)

**దినుస్సు.** దే. వి. దినుసుయొక్కరూపాంతరము. (వస్తువునకు.— "గట్టిదినుస్సుజాయిఅప్పయు." కళా. ౬, ఆ.)

**దిన్న.** దే. వి. వృక్షవిశేషము. "సంపాతితాcడియుశరభుండుదిన్నయునీలుండుమట్టియు." అచ్చ. యు, కాం. (జిన్నయొక్కరూపాంతరము.)

**దిబ్బ.** వై. వి. 1. ఉన్నతభూమి*; 2. కుప్ప*.

**దిబ్బడము.** దే. వి. దబ్బడముయొక్కరూపాంతరము.

**దిబ్బెము.** వై. వి. దీపము.

**దిమాకు.** హిం. వి. గర్వము, అధికారము.

**దిమిదిమి.** దే. వి. మద్దెలమ్రోతయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. దిమిదిమియనుచుమద్దెలమ్రోయ." రా. కిష్కిం, కాం.

**దిమ్మ.** వై. వి. 1. దిబ్బ, కుప్ప*; "గీ. తమ్మికొలcకులనోలాడితమ్మిపూపుc, గొమ్మలుకదల్చికపురంపుదిమ్మలెక్కి." అచ్చ. బాల, కాం.—2. భ్రమము*. "గీ. ఇట్లువైచిదానవిలమీcదనసుజాండు, దిమ్మcదిరిగిపడుటcదేటిచూచి." రామా. 3, ఆ.

**దిమ్మరి.** వై. విణ. (దిమ్మ+అరి.) 1. భ్రమకలవాcడు, భ్రమకలది; 2. మత్తుకలవాcడు, మత్తుకలది. "ఉ. అమ్మకచెల్లనేనువెలయూలనో దిమ్మరినై పురంబునన్, ద్రిమ్మరcజూచెనో." శుక. ౨, ఆ.

**దిమ్మరీఁడు.** వై. విణ. (దిమ్మరి + ఈఁడు) మత్తుకలవాఁడు. "సీ. ఱక్కసగమినూను చక్కనివగకాఁడు చిమ్మచీఁకటిఁజిమ్ముదిమ్మరీఁడు." శశాం. ౨, ఆ. (స్వార్థమున ఈఁడు.)

**దిమ్మిస.** దే. వి. నేలచేదును.

**దిమ్ము.** యు. దే. వి. సమూహము. "ఉ. తుమ్మెదదిమ్ముఁబొమ్మను చుఁగ్రోచునిగారపుశోగపెన్నెఱుల్." రసి. 3, ఆ.–వై. 1. భ్రమము; "ఆమఘవాత్మజన్మనొకయమ్మునదిమ్మునఁగూలనేసి." రామా. ౫, ఆ. "వనచరేంద్రులకు దిమ్మునఁదలల్‌దిరుగంగ" రామా. ౬, ఆ. "మానని పెక్కుదిమ్మనపొమ్మనిల్లి." సా. ౨, ఆ. "ద్వి. తెలివొందిమదిలోనిదిమ్ముపోవిడిచి." హరిశ్చ. ౧, భా.–2. మత్తు*. (చూ. దిమ్మరి.)

**దిమ్ముపట్టు.** ద్వ. అ. క్రి. (దిమ్ము+పట్టు.) 1. భ్రమగొను; "క. ముక్కున నోరనునెత్తురు, గ్రక్కుచుఁదలదిమ్మువట్టి కడుదైన్యముతో, నొక్కింత యూరెలుంగున, నక్కమలదళాక్షుఁజూచి యతఁడిట్లనియెన్." వి, పు. 2, ఆ.–2. మత్తుగొను. (పనికి తలదిమ్ము పట్టినది.)

**దిమ్మె.** దే. వి. 1. తామరపుష్పములోని దుద్దు; 2. కొయ్యబిరడ; 3. రాళ్లలోనగుణానితో నేర్పఱచిన చిన్నమిట్ట.

**దిమ్మెస.** దే. వి. కాసెవాని ఒక కొఱముట్టు.

**దిరదిర.** దే. వి. తిరుగుటయందగు ననుకరణము. "గీ. దిరదిరనుదిర్గి ధరణికిఁనొరగునప్పుడు." భల్లా 3, ఆ.

**దిరిసెనము.** వై. వి. (చూ.) గిరిసెనము†.

**దిరిసెము.** వై. వి. దిరిసెనముయొక్కరూపాంతరము. "సీ. దిరిసెంపుఁబువ్వులఁదెగడుదోర్వల్లరీయుగమునఁగౌఁగిటికొనరఁజేర్చ." రా. యు, కాం.

**దిర్దిర.** దే. వి. దిరదిరయొక్కరూపాంతరము. "మూఁడులోకమ్ములు దిర్దిరందిరుగు." భార. ఆది. ౪, ఆ.

**దిలాసా.** హిం. వి. హెచ్చరిక, ధైర్యము.

**దివటీ.** వై. వి. ఇనుపనలాకకు గుడ్డలుచుట్టి ముట్టించెడు దీపము. (చూ.) దివ్వటీ.

**దివము.** సం. వి. అ. న. 1. ఆకాశము; 2. స్వర్గము; 3. పగలు.

**దివసము.** సం. వి. అ. పుం, న. దినము, పగలు.

**దివస్పతి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

**దివాంధము.** సం. వి. అ. పుం. గుడ్లగూబ, ఘూకము.

**దివాకరుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు, పగటివేల్పు.

**దివాకీర్తి.** సం. వి. ఇ. పుం. 1. మంగలవాఁడు; 2. మాలవాఁడు.

**దివాణము.** వై. వి. 1. రాజుకొలువుకూటము*; "ఉ. పాండుఁడు దివాణమున్ నెఱయనించినఁగ్రేలెదుదుర్మదాంధులన్, బోఁడిమి మాల్చి." ఆము. ౨, ఆ.–2. కొలువుకూటము*. "పుణ్యలక్ష్మికిన్ మొదలిదివాణముల్." పాండు. ౧, ఆ.

**దివాను** హిం. వి. మంత్రి.

**దివాభీతము.** సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ; 2. కలువకొలను.

**దివాభీతుఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**దివాలా.** హిం. వి. వ్యవహారముచెడి కలుగు నష్టము.

**దివి.** సం. వి. వ్. స్త్రీ. 1. ఆకాశము; 2. స్వర్గము. (ఆధునికకవులు కొందఱు దీనిని వైకృతముగా వాడియున్నారు.) ఇ. పుం. పాలపిట్ట.

**దివిజుఁడు.** సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

**దివిదారికొమ్ము.** ద్వ. వి. రెండిటికొమ్ములను ఇరుప్రక్కల మొనలుగా జేతపఱచి యేర్పఱచిన మల్లసాధనవిశేషము.

**దివియ.** వై. వి. 1. దీపము; "చ. నవవికచారవిందరుచినవ్వెడు కన్నులచాయచుక్కలన్, దివియలమాయఁజేయ." ఉ, హరి. ౪, ఆ.–2. దివటీ*. "క. చవుదంతిదివియన్నదిలో, నవగాహమొనర్చి చల్లునలవమధులొనా, దివియలచుక్కలుదోఁచఁగ, దివియలవారిఁ గొని యవుడు తెగువఁదలూరుల్." సా. 3, ఆ. (దీవియయొక్క రూపాంతరము.)

**దివియకంబము.** వై. వి. దీవియకంబముయొక్కరూపాంతరము. "సీ. బంగారుదివియకంబములపైనిరువంకదీపికాకాంతులు తేజరిల్ల." అని. 3, ఆ.

**దివియకోల.** ద్వ. వి. దివటీ. (చూ. తొలఁకుకడ చలనము అను నర్థము నుదాహరణము.)

**దివిషదుఁడు.** సం. వి. ద్. పుం. దేవత, వేల్పు.

**దివు.** దే. అ. క్రి. దిగుయొక్కరూపాంతరము. "క. మగలయిలు వరునగలపెను, దగవరులొకఁడొకఁడొకొక్కతనయు రుచిరకౌ, ర్యగతినుతిఁజెందఘునకీ, ర్తిగ నలరంగఁరు ద్రోవదివ రక్రమతన్." రాఘ. ౨, ఆ.

**దివె.** వై. వి. దివియయొక్కరూపాంతరము.

**దివెకంబము.** వై. వి. దివియకంబముయొక్కరూపాంతరము.

**దివెదారికొమ్ము.** ద్వ. వి. దాసరుల దీపస్తంభము. (చూ. జోడమ్ము.)

**దివౌకసము.** సం. ఇ. స్. పుం. 1. పక్షి; 2. చాతకపక్షి. (రూ. దివోకసము.)

**దివౌకసుఁడు.** సం. వి. స్. పుం. దివిషదుఁడు, వేల్పు. (రూ. దివోకసుఁడు.)

**దివ్య.** ఉభ. వై. వి. దివియయొక్కరూపాంతరము. (చూ. దివ్యాఱుపుఁబ్రువ్వ.)–సం. ఆ. స్త్రీ. ఉసిరిక†.

**దివ్యచక్షువు.** సం. వి. స్. పుం. సుగంధవిశేషము. విణ. 1. జ్ఞానదృష్టిగలవాఁడు; 2. మంచి కన్నులుగలవాఁడు; 3. గ్రుడ్డివాఁడు.

**దివ్యము.** సం. వి. అ. న. 1. మహా వ్యవహారములయందు జయింపఁదగిన శపథము, బాస; (ఇది పంచవిధము.–తులాదివ్యము, అగ్నిదివ్యము, జలదివ్యము, విషదివ్యము, కోశదివ్యము అని. చూ. సం. విజ్ఞా. వ్య, కాం.)–2. లవంగము. పుం. ఉత్పాత విశేషము. (చూ. ఉత్పాతము.)–విణ. 1. దివియందుఁబుట్టినది; 2. ఒప్పునది.

**దివ్యాఱుపుఁబ్రువ్వ.** ద్వ. వి. (దివ్య+ఆఱుపు+ప్రువ్వ.) దీపమునార్పునట్టి యొకానొకపురుగు. "గీ. గువవ్‌గ్రద్ధ దివ్యాఱుపుఁబ్రువ్వగూబ, యిల్లుసొచ్చినశాంతిసేయింపవలయు." భార. అను. ౪, ఆ.

**దివ్యోపపాదుకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అయోనిసంభవదేవాది.

**దివ్వటీ.** వై. వి. దివటీయొక్కరూపాంతరము. "సీ. పృథుల ప్రదక్షిణార్చిర్మేదురములైన దివ్వటీలనమట్టినివ్వటిల్ల." విజ. 3, ఆ. (ఒకానొక నిఘంటుకారుఁడు దివ్వటి అని ప్రాసాంతముగానును వ్రాసియున్నాఁడు.)

**దివ్వియ.** వై. వి. దీవియయొక్క-రూపాంతరము. (చూ. దివ్వియ కంబము.)

**దివ్వియకంబము.** వై. వి. దీవియకంబముయొక్క-రూపాంతరము. "క. అయ్యయ్యుయవ్వగాకయనుచును, దియ్యమెనఁగరాజుఁజూచిదివ్వి యకంబం, బియ్యకొనియపూర్వపుఁగథ, నెయ్యంబునఁజెప్పఁదలఁ చినెజేనిట్లనియెన్." విక్ర. ౬, ఆ.

**దివ్వె.** వై. వి. దివ్వియయొక్క-రూపాంతరము. "క. నవ్వులునల్లా పంబులు, నివ్వటిలన్ బంధుమిత్రనివహంబులతో, బువ్వంబులు భుజియించిరి, దివ్వెలునలుదిక్కులందుఁదేజములెసఁగన్." బ్ర. ౫, ఆ.

**దివ్వెకంబము.** వై. వి. దివ్వియకంబముయొక్క-రూపాంతరము. "ఉ. కాంతిరేఖాసవరప్న దీపకళికన్ దనగారెడుదివ్వెకంబమున్." విక్ర. ౬, ఆ.

**దివ్వెకోల.** దే. వి. దివియకోలయొక్క-రూపాంతరము. (చూ. గస్తు.) (ఒకానొక నిఘంటుకారుఁడు దివెవ్వనకోల అని వ్రాసి యున్నాఁడు.)

**దివ్వెసుడి.** దృ. వి. గోడయందు దీపముపెట్టుగూఁడు.

**దిశ.** సం. వి. ఆ. స్త్రీ. దిక్కు, ఆశ, దెస.

**దిశ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) దిక్కునందుఁ బుట్టినది.

**దిష్టము.** సం. వి. అ. న. భాగ్యము. పుం. సమయము. విణ. ఉప దేశింపఁబడినది.

**దిష్టాంతము.** సం. వి. అ. పుం. మరణము, చావు.

**దిసంతడుచు.** దే. స. క్రి. (దిసంతు+అడుచు.) దూఱు. "మ. అపగోఁదల్లిఁగడున్ దిసంతడిచియూరాద్యంతమున్ బైపయిన్ వెద కన్ బల్వరఁబంచి." పర. ౩, ఆ.

**దిసంతు.** దే. వి. దూఱు, నింద.

**దిసంతుకొట్టు.** దే. స. క్రి. దిసంతడుచు. "ఉ. పట్టఁగలేమి కొండొరులఁ బల్లఱుఁజాల దిసంతుకొట్టుచున్." కళా. ౬, ఆ. (రూ. దిసంతులుకొట్టు. "చెలినొంచితని దిసంతులుకొట్టె మేనక." సాన. ౩, ఆ.)

**దిసమొల.** దృ. వి. వస్త్రహీనమైనమొల. (వీఁడు దిసమొలతో నున్నాఁడు.)

**దిసమొలవాఁడు.** దృ. విణ. వస్త్రహీనమైన మొలగలవాఁడు, దిగంబరుఁడు. (చూ. దిస్సమొలవాఁడు.)

**దిసమొలవేల్పు.** దృ. వి. 1. శివుఁడు; 2. కాలభైరవుఁడు. "దిసమొలవేల్పుసాహిణపుఁదేజాలు." పు. ౨, ఆ.

**దిస్సమొల.** దృ. వి. దిసమొలయొక్క-రూపాంతరము.

**దిస్సమొలవాఁడు.** దృ. విణ. దిసమొలవాఁడుయొక్క-రూపాం తరము. "ఎ, గీ. దిస్సమొలవానిఁ బసిఁగానఁద్రిప్పువాని." పాండు. ౧, ఆ.

**దిస్సమొలవేల్పు.** దృ. వి. దిసమొలవేల్పుయొక్క-రూపాంతరము. (కాలభైరవునకు.—"దిస్సమొలవేల్పుందత్తడుల్." రామా. ౨, ఆ.)

**దిస్సు.** దే. వి. పాముబుసకొట్టుటయందగు ధ్వన్యనుకరణము. "గీ. అడ్డిపేరిటికుండలితాంగభోగి, దిస్సునందనపడగయెత్తెనాయనంగ." కళా. ౮, ఆ.

## దీ.

**దీ.** దే. అవ్య. డీయొక్క-రూపాంతరము.

**దీకు.** దే. వి. డీకుయొక్క-రూపాంతరము. "క. ఏనపుడుధర్మపాశా, సీనఁడనైకోపమునకుదీకొనరింపం, గానేరకున్నమయిమయిఁ, భోఁ య్యెంగాకయింకఁ బొమ్మాయి చటన్." (కోపమునకు దీకొనరిం పంగా నేరకున్న అనఁగా కోపింపకయుండఁగానని తాత్పర్యము.) భార. విరా. ౫, ఆ.

**దీకొను.** దే. అ. క్రి. స. క్రి. డీకొనుయొక్క-రూపాంతరము. (ఎదిరించుటకు. — "ధృతిఁదనుదేవదానవులుదీకొనలేరనియున్న." రామా. ౭, ఆ.)

**దీకోలు.** దే. వి. డీకోలుయొక్క-రూపాంతరము.

**దీక్ష.** సం. వి. ఆ. స్త్రీ. యజ్ఞాదిక్రియారంభమునందు అనుష్ఠింపఁ బూనుకొనెడు ఆచారనియమము.

**దీక్షించు.** సం. అ. క్రి. దీక్షవహించు.

**దీక్షితుఁడు.** సం. వి. అ. పుం. సోమముగల యజ్ఞమునందు దీక్ష వహించినవాఁడు.

**దీటు.** దే. స. క్రి. సరిచేయు. "చ. తిలకముదీర్చుచున్ గురులు దీటుచు." ఆక్షి. ౨, ఆ. "బెళ్కుచుఁబయ్యెదకొంగుదీటు." హంస. ౨, ఆ. "తంత్రులొక్కవరుసదీటి." ఉ, రా. ౬, ఆ. —విణ. ఏ. సరి. "నీకీసురలైనదీటగుదురే." ఉ, రా. ౨, ఆ.

**దీటుకట్టు.** దే. అ. క్రి. దీటుకొను. "వ. దేవదుందుభిధ్వానంబు రోదసీకుహరంబునందీటుకట్టె." నై. ౬, ఆ.

**దీటుకొను.** దే. అ. క్రి. నిండుకొను. "దివిదీటుకొనంగఁజెలంగి యార్వ." భార. కర్ణ. ౧, ఆ. "శస్త్రాస్త్రసంచయమున నభంబు దీటుకొనునట్లుచేయ." భార. విరా. ౫, ఆ. "గీ. ఆర్వనులు నిఖిల, దిశలయందునునభమునదీటుకొనియె." మార్క. ౬, ఆ. ("ఉ. అందుజనించియనేకదైత్యులే, దిక్కునఁదారయైజగముదీటు కొనన్ గడునిండఁబర్వనన్." (ఇక్కడ నిండన్ అనునది అతిశ యార్థకము.) మార్క. ౬, ఆ.)—స. క్రి. 1. సవరించు; "వ. చంచూపుటంబులదీటుకొనిదాఁటుకొనిశతకోటి నఖనఖముఖత్రో టింబరిపాటిందదంగంబుభంగంబుగాఁజించిచెండాడుచు." రామా. ౫, ఆ.—"తే. గీ. మాటిమాటికి మీసముల్దీటుకొనుచు." హరిశ్చ. ౮, ఆ.—2. సరిపోలు. "గీ. ఒక్కతరలాక్షియప్సరో యువతివోలెఁ, జూచెఁగనుఱెప్పవెట్టకరాచవాని, తేటితెక్కలగజే యమ్మదీటుకొనఁగ." నై. ౬, ఆ.—(ప్రే. దీటుకొలుపు. "ఎ, గీ. దివ్యబాణజాలంబులు దీటుకొలిపి." భార. ఉద్యో. ౮, ఆ.)

**దీదివి.** సం. వి. ఇ. పుం, న. అన్నము. పుం. బృహస్పతి.

**దీధితి.** సం. వి. ఇ. స్త్రీ. కిరణము, వెలుఁగు.

**దీన.** సం. వి. ఆ. స్త్రీ. ఎలుక. విణ. దీనురాలు.

**దీనారము.** సం. వి. అ. పుం. పైఁడినాణెము.

**దీనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దరిద్రుఁడు; 2. దర్పము డిగినవాఁడు; 3. భయపడినవాఁడు.

**దీపకము.** సం. వి. అ. న. ఒక యర్థాలంకారము. (చూ. అలంకా రము.) పుం. 1. ఓమము; 2. దీపము; 3. (చూ.) దీమము. విణ. వెలిఁగించునది.

**దీపము.** సం. వి. అ. పుం. 1. దీపిక; 2. ఈఁగ; 3. బయిర వానము; 4. మయూరశిఖి.

**దీపవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. దీపపువత్తి.

**దీపవృక్షము.** సం. వి. అ. పుం. దీపస్తంభము.

**దీపావళి.** సం. వి. ఇ. స్త్రీ. నరకచతుర్దశిమఱునాటిపండుగ.

**దీపిక.** సం. వి. ఆ. స్త్రీ. దీపము, దివ్వె.

**దీప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెలిఁగినది; 2. కాలినది; 3. మండినది.

**దీప్తి.** సం. వి. ఇ. స్త్రీ. కాంతి, వెలుఁగు.

**దీప్యకము.** సం. వి. అ. పుం. 1. ఓమము; 2. యవలవిద్యము; 3. నెమలిజొట్టు.

**దీప్యము.** సం. వి. అ. పుం. ఓమము.

**దీమము.** వై. వి. పక్షిమృగాదులను పట్టుటకై వేఁటకానిచే పెంపఁబడినపక్షి మృగములోనగునది. (ఇక్కడ వేఁటకాఁడు అనునది ఉపలక్షణము.) "ఎ, గీ. మగలనలయింపుమనునిపెమంబులన.గ." రుక్మాం. ౧, ఆ. (దీనికి ఒక నిఘంటుకారుఁడు ఇల్లు అని యర్థము వ్రాసియున్నాఁడు.)

**దీమసము.** దే. వి. 1. ధైర్యము; "గీ. ఎట్టిలావెట్టిదీమసమెట్టి తెగువ, యెట్టికడిమి." హరి. ఉ. 3, ఆ. "ద్వి. సంశయాతీతమైన, మతిలేకపల్కెదీమసమునెంపునను." హరిశ్చ. ౨, భా.—2. ఉపాయము. "దీనిఁబాపికొను దీమసమెట్టిదియొక్కొ." భార. విరా. ౨, ఆ.

**దీము.** వై. వి. దీమముయొక్క రూపాంతరము. "గీ. క్రోధమొదవ బండగుల్ల(బ్రా)ఁకుదీములఁ, గెరలితాఁకికొమ్ములురులఁదగిలి, వానిలేవనీక్కాసకకొనిపోవుఁ, బోతరించి యుట్టిపోతు లచట." స్వా. ౪, ఆ.

**దీర్ఘకోశిక.** సం. వి. ఆ. స్త్రీ. పేనుఁగుజలగ, దుర్నామ.

**దీర్ఘజంఘుము.** సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి. విణ. నిడుపాటి పిక్కగలది.

**దీర్ఘదర్శి.** సం. వి. న్. పుం. 1. విద్వాంసుఁడు; 2. గద్ద. విణ. దూరపు యోచనకలవాఁడు.

**దీర్ఘదేహి.** సం. వి. ఈ. స్త్రీ. పందికొక్కు, మూషిక.

**దీర్ఘనిద్ర.** సం. వి. ఆ. స్త్రీ. చావు, పెద్దనిదుర.

**దీర్ఘపత్రము.** సం. వి. అ. పుం. తెల్లగలిజేరు†.

**దీర్ఘపృష్ఠము.** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**దీర్ఘము.** సం. విణ. (అ. ఆ. అ.) నిడుద, ఆయతము.

**దీర్ఘమూల.** సం. వి. ఆ. స్త్రీ. తీఁగతుమడి†.

**దీర్ఘవృంతము.** సం. వి. అ. పుం. దుండిగము†.

**దీర్ఘసూత్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) చిరక్రియుఁడు.

**దీర్ఘాయువు.** సం. వి. స్. పుం. 1. కాకి; 2. మార్కండేయుఁడు; 3. బూరుగు†; 4. జీవకమను గంధద్రవ్యము. విణ. పెక్కేండ్లు బ్రదుకువాఁడు.

**దీర్ఘిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) డిగ్గియ.

**దీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చీల్పఁబడినది; 2. భయపడినది.

**దీలు.** దే. అ. క్రి. డిల్లపడు. "సీ. అతివమిక్కిలిదీలెనాలసింపఁగ నేలచల్లగాఁబన్నీరుచల్లరమ్మ." య. ౫, ఆ.—విణ. డిల్లము. "అరుణాంశుండుహిమద్యుతక్షరజనిదీలై." ఆము. ౫, ఆ. (డీలుయొక్క రూపాంతరము.)

**దీలుపడు.** ద్వ. అ. క్రి. డీలుపడుయొక్క రూపాంతరము. "త్రిపురవైపుల్లెూడవదీలుపడితిని." ఫి. ౪, ఆ.

**దీవన.** దే. వి. ఆశీర్వాదము. "క. తాఁబాలుఁదానుమునిశా, సనమునవర్ణెడియెక్కనమధికపరస్థఁ, బునఁబోల్చిబ్రాహ్మణులదీ, వనలెనఁగఁగ ధర్మసుతుండువాళవలీలన్." భార. అర. 3, ఆ.

**దీవనఁబ్రాలు.** దే. వి. (దీవన+ప్రాలు.) అక్షతలు, సేసలు. "ఎ, గీ. జగముగెల్వంగదండెత్తుమగనిమీఁద, లీలఁదిచల్లుదీవనఁ బ్రాలనంగ, వేఁడివెలుఁగెండఁ గ్రాఁగినవిన్ను మేన, నెక్కొనుచెమటబొట్టులనాఁజుక్కలమరె." పా. ౨, ఆ.

**దీవసము.** దే. వి. ధైర్యము. "క. గోవులకుపెనుకయ్యెపెనఁ, బోవ్రచునున్నారుగడవఁబోవకయుండక్, బోవలయునస్త్రపసియెడు, పీవసమెడఁగలిగనేనిదేవర కడకన్." భార. విరా. 3, ఆ. (దిమసముయొక్క రూపాంతరము.)

**దీవి.** వై. వి. నీటినడిమిదిబ్బ.

**దీవించు.** దే. స. క్రి. ఆశీర్వదించు.

**దీవియ.** వై. వి. దివ్వె, దీపము. "తెరయునమేలుకట్టుఁదగుదీవియలున్ బోలుపొంద." భార. సౌ. ౧, ఆ.

**దీవియకంబము.** వై. వి. దీపస్తంభము. "క. దీవియకంబంబుకనుకును, జీవముగల్పించికథలు చెప్పింపంగాఁ, బ్రాంకీన్యముకలిగియున్, వివిధమునదప్పఁజెప్పటిదినిపుణతయే." విక్ర. ౬, ఆ.

**దీవె.** వై. వి. దీవియయొక్క రూపాంతరము. "సీ. వేయుమానికపుదీవెలతోడిపడగలు మ్రొల్చునేదేవునిమలఁకపాన్పు." ఉ, హరి. ౨, ఆ.

**దీవెన.** దే. వి. దీవనయొక్క రూపాంతరము. "చ. దీవెనలొసరించి రవిపుని వేయువిధంబుల సన్నుతించుచున్." శశాం. ౫, ఆ. (ఆధునిక గ్రంథములయందే యీ రూపము కానఁబడుచున్నది.)

**దీవెనకోల.** దే. వి. నమస్కారము. "రగడ. వృద్ధపురస్థలివిజయువిపాత్రయ, దేవునికిదిగోదీవెనకోలని." హంస. ౪, ఆ.

## దు.

**దుంకము.** దే. వి. రంధ్రము.

**దుంగ.** దే. వి. మ్రానిమొద్దు.

**దుండగము.** వై. వి. 1. దౌష్ట్యము; "గీ. పెద్దతోలితోడ బిగువుదామెనతోడఁ, బడినమద్దిచెట్లనడుమముద్దు, బైనతొక్కఁబలుకులాడుచునిలుచున్న, కపటబాలుదుండగములుచూచి." వి, పు. 2, ఆ.—2. కీడు*. "గీ. ద్రుపదుఁబీటిలోనదొమ్మికయ్యమురేఁచెఁ, బసులఁబట్టైవిరటుపట్టణమున, మఱియునెన్ని లేవుమార్తాండతనయుండు, తొడరిమనపుఁజేయుదుండగములు." జై. ౧, ఆ.

**దుండగీఁడు.** వై. విణ. (దుండగము+ఈఁడు.) దుష్టుఁడు*. "గీ. పీఁడకృష్ణుఁడు పెనుదుండగీఁడు మనకుఁ, జిక్కెఁబోనీకుఁడీయంచుఁజేరవచ్చి." వి, పు. 2, ఆ.

**దుండతీకము.** వై. వి. దుండగము*.

**దుండి.** దే. వి. దొరసాని. (చూ. వరను.)

**దుండిగము.** వై. వి. పెనుమ్రాను, దుండుకము†.

**దుండుబలి.** దే. విణ. సోమరి.

**దుంత.** దే. వి. దున్న, మహిషము.

**దుంతరవుతు.** ద్వ. వి. యముఁడు.

**దుంపెలము.** వై. వి. (చూ.) దుండిగము.

**దుందుకము.** వై. వి.——వై.——

**దుందుభి.** సం. వి. ఇ. స్త్రీ. పాచికయందలి ఇత్తిగ. పుం. 1. భేరి; 2. వరుణుఁడు; 3. ఒక సంవత్సరము; (చూ. సంవత్సరము.) 4. ఒకానొక రాక్షసుఁడు.

**దుంసుము.** దే. వి. చక్రాకారపుదివటీ. "చ. వడిఁదనుఁబొఱఁగాఁ దఱుమువాసరకర్తనుచేతిభానుఁడఁ, బెడిదపుదుందుమార్చికసుఁ జొచ్చుచరోదసి పెరిసంటచే, సుడుగక పొచ్చుచేయుసమదోద్ధత కాస్తి మొగంబునందు నొ, ప్పెడుమదబిందుబృందమున దెంపెసఁగెన్ గడనంతకాచ్చికన్." కళా. ౮, ఆ.

**దుంగుఱు.** దే. వి. జోంటుఱుయొక్కరూపాంతరము.

**దుంప.** దే. వి. 1. నేలనులోనగువానిగడ్డ; 2. నాఁగేటిగొఱగ.

**దుంపకచ్చెలి.** దే. వి. ఉపోదకి.

**దుంపరాష్ట్రము.** ద్వ. వి. గాస్త్ర విశేషము. (దీని భేదము సన్నాస్త్రము.)

**దుంబాలా.** హిం. వి. పన్నులేక యీనాముగానిచ్చిన భూమి.

**దుంబోడి.** దే. వి. (దుమ్ము+పొడి.) (మెంతి జిలకఱచేర్చి చేసిన) సన్నని కారపుపిండి. "క. త్రొంబొగపుఁగూరవగలిరు, గంబోఁతల మెంతిజీలకఱ్ఱలవలపుం, దుంబొళ్లతావిసెగరుల, గంబూరజగంబు నోగడఁగానటుమసెసెన్." గా. వి. ౨, ఆ.

**దుఃఖపడు.** మి. అ. క్రి. (దుఃఖము+పడు.) నొగులు. (ప్రే. దుఃఖపఱుచు.)

**దుఃఖపాటు.** మి. వి. దుఃఖపడుట. "కులాచారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు." భార. ఉద్యో. 3, ఆ.

**దుఃఖపెట్టు.** మి. స. క్రి. (దుఃఖము+పెట్టు.) దుఃఖపఱుచు.

**దుఃఖము.** సం. వి. అ. న. బాధ, వ్యథ, నొగులు.

**దుకాణము.** దే. వి. అంగడి, పసారము.

**దుకూలము.** సం. వి. అ. న. 1. తెల్లవస్త్రము; 2. సన్నవస్త్రము.

**దుక్కి.** దే. వి. దున్నుట, కృషి. (దీని భేదములు రొంపిదుక్కి, వెలిదుక్కి.)

**దుక్కిటెద్దు.** దే. వి. (దుక్కి+ఎద్దు.) దున్నుటకుపయోగించెడి యెద్దు, హాలికము. (టుగాగమము సాధారణముగా ఉకారాంతపదములకు విధింపఁబడినదైనను దుక్కిటెద్దు, మిద్దెటిల్లు ఇత్యాదులయందును ప్రవర్తిల్లుచున్నది.)

**దుక్కివాలు.** ద్వ. వి. నాఁగలి, హలము. "దండకను. దుక్కివాల్ భూనిపేరుక్కునన్ రేఁగవా." నీలా. ౨, ఆ.

**దుక్కివాలుదాలుపు.** ద్వ. వి. (దుక్కివాలు+తాలుపు.) బలరాముఁడు, హలాయుధుఁడు.

**దుగ.** వై. స. రెండు, ద్వయము.

**దుగమొంగములపులుఁగు.** ద్వ. వి. గండభేరుండపక్షి. (రూ. దుగమొగంబులపుల్గు. — "సీ. కులుకుచుఁబలికింపఁజలుకబారులు గాళ్లదుగమొగంబులపుల్గుఁదొగలుగాని." అచ్చ. అ, కాం.)

**దుగమొంగములవేల్పు.** ద్వ. వి. అగ్ని. "క. దుగమొగముల వేల్పును, బ్బగదరికొనిఖాల్పఁబోఁడఁగెఁ ద్రోలెల్లెడలన్." అచ్చ. యు, కాం.

**దుగిమేఁడు.** వై. వి. బ్రహ్మ, నలువ.

**దుగుణము.** వై. స. దుగ. ఉ, హారి. 3, ఆ.—విశే. రెండింతలు.

**దుగులము.** దే. వి. వరహాలో పదియాఱవభాగము.

**దుగ్గ.** వై. వి. 1. కాళి; "శీ. దుగ్గమ్మకారుపోతులలోనఁజేయుమీ తోలుముద్దగానిస్తుదుంపినొకటి." య. ౨, ఆ.—2. పార్వతి.

**దుగ్గాని.** వై. వి. (దుగ+కాని.) రెండు దమ్మిడ్లు. (టంకములకు పదియాఱుడబ్బులుకనుక ఆ లెక్కప్రకారము ఇక్కడ కానియనఁగా దమ్మిడి.)

**దుగ్గి.** వై. దుగ్గ, పార్వతి.

**దుగ్గు.** దే. విశే. సూపముచెడినది. (శృంగము.)

**దుగ్ధము.** సం. వి. అ. న. పాలు. విశే. 1. పిదుకఁబడినది; 2. నిండఁబడినది.

**దుగ్ధిక.** సం. వి. అ. స్త్రీ. చిఱుపాలకి.

**దుట్టుపు.** దే. వి. జోట్టుపుయొక్కరూపాంతరము.

**దుడిదుడి.** దే. వి. (చూ.) గుసగుస. "ద్వి. అడవియేనుఁగులు నీరానకీనదికి, దుడిదుడినచ్చి." రా. అర, కాం.

**దుడుకఁడు.** వై. విశే. (దుడుకు+అఁడు.) దుష్టుఁడు. "క. ఉడుకుఁడుమఘతిపుకథనము, విడువనుజాంపగిదిఁదిరుగువికనన మునసే, నొడివినసాడుపులునొసుఁడు, దుడుకనిఁబాదిపింపమాట్లు దుర్గభమధిపా." భాగ. ౭, స్కం. (ఇట్టివి చెడుగఁడు, నిడుపఁడు మొ.)

**దుడుకు.** వై. వి. 1. దౌష్ట్యము*; "అందపుఁజూచి యింత దుడుకాయనిదూఱఁగ." వి, పు. ౭, ఆ.—2. ఉద్ధతి*. "ద్వి. మనుజేంద్రసుతయొక్కమనవిగావింపు, వినఁదగు దుడుకుగావింపఁగరాదు." పా. ౨, భా.—విశే. 1. దుష్టము; "క. ఈదుడు టఁగోఁతిఁగొనిచని." అచ్చ. సుం, కాం.—2. ఉద్ధతము*. (నీకు నోరు మిక్కిలి దుడుకు.)

**దుడ్డు.** యు. దే. వి. డబ్బు. వై. 1. లావుకఱ్ఱ, దండము; (చూ. కంతి.) 2. గద*. విశే. మోటుకాఁడు*. "క. దుడ్డునకుఁ బోయినట్టాక, డ్రెడ్డుసుపుంబొయసంబుదెచ్చియతనిచే, నిడ్డనడిచిపడకనలెడి, గ్రుడ్డులుగెలియంగఁదెఱచి కొనిరనుఁగొనచున్." భో. 3, ఆ.

**దుడ్డుఁగఱ్ఱ.** ద్వ. వి. (దుడ్డు+కఱ్ఱ.) లావుకఱ్ఱ, దండము. (ఇక్కడ దుడ్డుశబ్దము స్థూలమాత్రపరము.)

**దుడ్డుఁగోల.** ద్వ. వి. (దుడ్డు+కోల.) (చూ.)——వై.——

**దుడ్డె.** దే. విశే. 1. బాలకుఁడు; "క. దుడ్డెలురాకటుమసలిరి." కు. ౨, ఆ.—2. ధూర్తుఁడు, ధూర్తురాలు. "ఎ, గీ. దుడ్డెనమునఁదిరుగునారెడ్డిసాని." హంస. ౪, ఆ.

**దుత్త.** దే. వి. చిన్నబుంగ. (చూ. బుంగ.)

**దుత్తాయి.** దే. వి. కుఱుచే అరచేట్ట.

**దుత్తూరము.** ఉభ. దే. వి. కపటము. సం. అ. పుం. ఉమ్మెత్త.

**దుగ్ధతుంబి.** సం. వి. ఈ. స్త్రీ. పాలానుగు.

**దుద్దు.** దే. వి. 1. తామరపుష్పములోనిదిమ్మె, కర్ణిక; 2. తొటుకు జోటుమీఁది చెంద్రిక; "చ. అదియునుగాకరాయసపుటూర్పులగంటములూకుదుద్దులున్, వదలకమోచిచూచి." హంస. ౪, ఆ.—3. బ. ఒకవిధము చెవికమ్మలు. (దుద్దుఁగమ్మలు.) విశే. అనశ్యము.

**దుద్దెక్కు.** దే. అ. క్రి. అతిశయించు. "ద్వి. పెద్దయు(గ్రమి దంబు ఖేతియుఫక్తి, దుద్దెక్కి తనలోన(దొ(త్రు)కొనంగ." బస. ౧, ఆ.

**దుద్రుమము.** సం. వి. అ. పుం. పచ్చనీరుల్లి*.

**దును.** దే. స. క్రి. దున్నుయొక్క రూపాంతరము. "క. దునకయు వెదపెట్టకయుఁ, దనరెనఖిలసస్యములు నధారుణి." హరి. పూ. ౧, ఆ.

**దునుకు.** వై. వి. బాధ. "మ. తనఘూరధ్వనికిఁ గలంగ(బడుతత్సై న్యంబుదైన్యంబునఁ, దునుకొందఁ." ఉ, హరి. ౫, ఆ.

**దునెదారి.** వై. విశే. 1. కత్తి చేతధరించిన శూరుఁడు*; (చూ. దునేదారి.)–2. శూరుఁడు*. "ద్వి. తొంగచూపుదునెదారిలోఁడఁ బట్టికొనంగ." విష్ణు. ఉ. ౪, ఆ.

**దునేదారి.** వై. విశే. దునెదారియొక్క రూపాంతరము. (కత్తి చేత ధరించినశూరునకు.)–"మ. పదరుందస్తాడిసాముచెంతఁగడుశేవఁ వచ్చులేమావిక్రొం, బదనుంగెందలిరాకుడాకవలపు బాబాయి క్కడుంగంపుతేఁ, టిదునేదారులవెండిగిండిగమిసాటిఁకాం చుఁబూఁదేనెసం, పదనొక్కించుకవిచ్చుక్రొమ్మొగడ జొంపంబుల్ వసీపీఘలఁ." చంద్ర.

**దున్న.** దే. వి. 1. మహిషము; "ఈ. కాలునిదున్ననందిసయి గంటలుదున్నకమంటినామహా, కాలునినందిదున్నసయికర్దమమగ్న తలేకమంటినా, హాళికులెన్న(డుందెగనియూరులచేలను జొక్కుమ త్తునుం, నాలిలినేరుసాగిరిలఁ గల్గుపసింగొనిపెదమున్నగఁ." ఆము. ౪, ఆ.–2. పురుషపశువు. (చూ. దిగ(ద్రా)వు.)

**దున్నపోతు.** దే. వి. దున్న, మహిషము. (దున్ననేదున్నపోతు అనియు వాడుచున్నారు.)

**దున్ను.** దే. స. క్రి. దుక్కిచేయు, కృషిచేయు.

**దుప్పటము.** వై. వి. వెలగల సన్నపాటి వెడల్పువస్త్రము*. "సీ. బంగరువన్నెదుప్పటముఁగప్పెడువాఁడుపక్కిరాతేజిపై నెక్కు వాఁడు." బ్ర. ౧, ఆ.

**దుప్పటి.** వై. వి. 1. కప్పుకొనువస్త్రము, నిచోళము; 2. దుప్ప టము*. "సీ. బంగారుతగటుదుప్పటిబిగ్గమొలఁజుట్టికేలఁజొక్క పుఁబిల్లఁగ్రోలువట్టి." సిలా. ౧, ఆ.

**దుప్పటీ.** వై. వి. దుప్పటము*. "ఎ, గీ. మిసిమిబంగారుతళుకుల మేలిదుప్ప, టీచెఱంగులు." ఉ, రా. ౬, ఆ. (దుప్పటియొక్క రూపాంతరము.)

**దుప్పి.** దే. వి. 1. మృగవిశేషము, చమూరువు; "చ. బూడిద పండునుబోలెబూఁదుపా, రెడునొకదుప్పికెంగవియఁ బ్రేలిభయ జ్వరతప్తచిత్తమై." పాండు. ౫, ఆ.–2. జింక, మృగము. "వ. అప్పుడప్పుడమితేఁడయ్యేటనీఁడుచో నొక్కపెడిదుప్పిచేరిన దానితోఁ(గఁబట్టుకొనియె." (మీఁద అమృగి అని యున్నది.) మార్క. ౫, ఆ.

**దుబారా.** హిం. విశే. రెట్టింపు, వ్యర్థపు.

**దుబాసి.** హిం. వి. భాషాంతరము చేయువాఁడు, వ్యవహారము జఱుపువాఁడు.

**దుబ్బ.** దే. వి. ఆఁడుగుఱ్ఱి.

**దుబ్బు.** వై. వి. గడ్డిలోనగువాని గంట, తృణస్తంబము.

**దుమగతికేతు.** వై. వి. అరిష్టసూచకమైన నక్షత్రవిశేషము, ధూమకేతువు.

**దుమదుమ.** దే. విశే. ముక్కలై తడిగలది. "క. సమదగజదాన ధారల, దుమదుమలైయున్న పెద్దత్రోవలతోఁడఁ, రవణీయము య్యెనప్పురి, రమణుఁడువచ్చినఁ గరంగురమణియుఁబోలెఁ." భాగ. ౯, స్కం. "క. తమపాటచినుకుచినుకుల, దుమదుమగాఁ దడిసినట్టిదువ్వలువలతో." కళా. 3, ఆ.

**దుమా.** దే. వి. క్రయుటయందగుధ్వన్యనుకరణము. "దుమాయ నిక్రాయు." ఉ, హరి. ౨, ఆ.

**దుమారము.** దే. వి. దుమ్ము. "సీ. మలయానిలముచేదుమారమ్ము రేఁగుసౌగంధికమ్ములరజమ్ము కణకుదుమ్ము." సావి. ౫, ఆ.

**దుమాలు.** దే. విశే. సమూలము. "ద్వి. కొంపొకనెపులోనఁగొట్టి దుమాలు, బెంచుగానాపూవ్రబృందంబునిలలు." భాగ. ౬, స్కం.

**దుము.** దే. వి. దుమ్ముయొక్క రూపాంతరము. (ఆమ్రేడితమునందు దుముదుము. "వనమువెలుకుదుఁగఁ దుముదుముగాఁ." రామా. ౬, ఆ.)

**దుముకు.** దే. అ. క్రి. 1. ఉఱుకు; 2. గంతువేయు. వి. గంతు.

**దుముకులాడు.** దే. అ. క్రి. (దుముకులు+ఆడు.) గంతులు వేయు.

**దుముక్కు.** దే. వి. ఉఱుకులయందగుధ్వన్యనుకరణము. "గీ. దుముక్కు కొట్టికిదుముక్కుననదనసేన, నరసకుపీకరామచంద్రుఁ గాంచి." గామా. ౯, ఆ.

**దుముదారు.** దే. వి. (దుము+దారు.) దండు. "స. నకుటుంబ ముగవీఁగిచరమశైలముఁజేరుతుహినాంశుదుముదారుదొరయనంగ." సావి. 3, ఆ.

**దుముదుములాడు.** దే. అ. క్రి. (దుముదుములు+ఆడు.) దుమ్ములురేఁగు, నిప్పులురేఁగు. (వీని ముఖము దుముదుములాడు చున్నది.)

**దుమ్ము.** దే. వి. దుమారము, ధూళి.

**దుమ్ములగొండి.** దే. వి. మృగవిశేషము, కొర్నవగండు.

**దుయుముడి.** దే. వి. దూయుముడియొక్క రూపాంతరము.

**దుయ్యు.** దే. అ. క్రి. దూయుయొక్క రూపాంతరము. (వెడలు టకు.–"వ. నిన్నుశపింపనేమెంతవారమని యుపచారోక్తులుపలు కుచు డుస్సిపోయిరి." భో. 2, ఆ.)

**దురంతము.** సం. విశే. (అ. ఆ. అ.) అంతములేనిది.

**దురతిక్రమము.** సం. విశే. (అ. ఆ. అ.) అతిక్రమింపఁగూడ నిది.

**దురత్యయము.** సం. విశే. (అ. ఆ. అ.) చేటులేనిది.

**దురద.** దే. వి. 1. జిల; 2. కసరు.

**దురదకంద.** ద్వ. వి. కసరుగలకంద, మహాకందము.

**దురదగొండి.** దే. వి. దూలగొండి, కండూరకి*.

**దురదగోవెల.** దే. వి.——పై.——

**దురదుర.** వై. ద్ర. క్రి. విశే. శీఘ్రముగా. "క. దురదుర దుర మునకేపుగ, దురదుర గేభములతోనె దురదురరులనం, దళేదళే దళేగనిశాతో, దరిదళీయంజేరికడుబెదరిహారికనియెఁ." రుక్మి. ౫, ఆ.

**దురదృష్టము.** సం. వి. అ. న. దౌర్భాగ్యము.

**దురధిగమము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కష్టముచేతపొందఁ దగినది; 2. కష్టముచేత చదువఁదగినది.

**దురధ్వము.** సం. వి. అ. పుం. చెడ్డత్రోవ, కదిధ్వము.

**దురపిల్లు.** దే. అ. క్రి. 1. శోకించు; "వ. నీచిత్తంబునొప్పించిటినవిధర్మజుండెంత దురపిల్లెడునోయెఱింగెదుగాక." సం. "సశోచన్నరశార్దూలశాంతింనైవాథగచ్ఛతి." భార. శల్య. ౨, ఆ.—2. తపించు; "క. అనుచుమదనవేదనాభరంబునందురపిల్లుచు." మార్క. ౪, ఆ.—3. కలఁగు. "కామనంబుచే పెట్టి కలంచినట్లు దురపిల్లెడు." జై. ౬, ఆ.

**దురభిగ్రహము.** సం. వి. అ. పుం. ఉత్తరేను*. విణ. గ్రహింపఁగూడనిది.

**దురము.** వై. వి. 1. యుద్ధము; (చూ. ఎరక్రు.)—2. వేగము*. "ఉ. రమణక్రమక్రమంబునదురంపువగలనటియించెనింతగా." శశాం. 3, ఆ.

**దురవాపము.** సం. విణ. (అ. ఆ. అ.) పొందఁగూడనిది.

**దురా.** దే. వి. దురాయియొక్క రూపాంతరము. "క. నుదురాజిగిత్రొన్నెలచె, న్నదురాగతమనునుదేంట్లనుదురావెట్టుల్, నదురాయనిముంగురులె, న్నదురానెఱివేఁజీవగడురాజసముల్." శశాం. 3, ఆ.

**దురాకృతము.** సం. వి. అ. న. అకృత్యము. క్రి. విణ. అకృత్యముగా.

**దురాచారము.** సం. వి. అ. పుం. చెడ్డనడవడి. విణ. చెడ్డనడవడికలది.

**దురాచారుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డనడవడికలవాఁడు.

**దురాడము.** దే. వి. ఒఱగుదిండు. "ఇంద్రగోపపుంబట్టుదురాడముల్." పాంచా. ౫, ఆ.

**దురాత్ముఁడు.** సం. విణ. (న్.) చెడ్డమనస్సుగలవాఁడు.

**దురాధర్షము.** సం. వి. అ. పుం. తెల్లావలు. విణ. తిరస్కరింపఁదగనిది.

**దురాధర్షుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁదగనివాఁడు.

**దురాపము.** సం. విణ. (అ. ఆ. అ.) పొందఁగూడనిది.

**దురాయి.** దే. వి. ఆజ్ఞ. "సీ. జగదధిష్ఠానభానస్వజ్యోతియగువాఁడుబ్రహ్మాదులదురుడురాయివాఁడు." కృష్ణ. ౧, ఆ.

**దురారోహ.** సం. వి. ఆ. స్త్రీ. బూరుగు*. అ. పుం. ము. తొండ. విణ. ఎక్కఁగూడనిది.

**దురాలభ.** సం. వి. ఆ. స్త్రీ. తీటకసింద*. విణ. లభింపనిది.

**దురాలాపము.** సం. వి. అ. పుం. చెడుమాట.

**దురాలోకము.** సం. విణ. (అ. ఆ. అ.) చూడఁగూడనిది.

**దురాశ.** సం. వి. ఆ. స్త్రీ. వ్యర్థమైన ఆశ.

**దురాసదము.** సం. విణ. (అ. ఆ. అ.) పొందఁగూడనిది.

**దురితము.** సం. వి. అ. న. పాపము, కలుషి.

**దురుసు.** దే. వి. కాఠిన్యము. "ద్వి. ఇంతదురుసుగైకొనుటనీదోషంబుగాదు." విష్ణు. పూ. ౨, ఆ.—విణ. కఠినము. "సీ. దురుసుదండనలతోధరయేలుదొరఁగన్నపింపొసాపరుండనియెంచరతని." ఉ, రా. ౬, ఆ.—క్రి. విణ. శీఘ్రము. "వేటకుల్దురుసుగమూర్ఛదస్త్రములునూతె." ఉ, రా. ౫, ఆ.

**దురోదరము.** సం. వి. అ. న. 1. జూదము; 2. పందెము.

**దురోదరుఁడు.** సం. వి. అ. పుం. జూదరి.

**దుర్గ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. నల్లపిచ్చుక; 3. ...చెట్టు. అ. న. ము. కోట. విణ. పోఁగూడనిది.

**దుర్గంధము.** సం. వి. అ. పుం. గబ్బు. విణ. గబ్బుగలది.

**దుర్గతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నరకము; 2. బీదతనము.

**దుర్గతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దరిద్రుఁడు, బీద.

**దుర్గమము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పోఁగూడనిది; 2. పొందఁగూడనిది.

**దుర్గి.** సం. వి. ఈ. స్త్రీ. దుర్గ, పార్వతి.

**దుర్ఘటము.** సం. విణ. (అ. ఆ. అ.) ఘటింపనిది.

**దుర్జనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దుష్టుఁడు.

**దుర్జయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గెలువఁగూడనివాఁడు.

**దుర్జాతి.** సం. విణ. (ఇ.) దుర్జనుఁడు.

**దుర్జ్ఞేయము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱుఁగఁగూడనిది.

**దుర్దాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) అణఁపఁబడనిది.

**దుర్దినము.** సం. వి. అ. న. మబ్బుకమ్మినదినము, ముసురుప్రొద్దు.

**దుర్దురూటుఁడు.** సం. వి. అ. పుం. నాస్తికుఁడు.

**దుర్ధరము.** సం. విణ. (అ. ఆ. అ.) ధరింపఁగూడనిది.

**దుర్ధర్ష.** సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పి*. విణ. తిరస్కరింపఁదగనిది.

**దుర్ధర్షుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁదగనివాఁడు.

**దుర్నయము.** సం. వి. అ. పుం. అన్యాయము, దుర్నీతి.

**దుర్నామ.** సం. వి. న్. స్త్రీ. ఏనుఁగుజెలగ. అ. న. ము. మూలరోగము.

**దుర్నిరీక్ష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) చూడఁగూడనిది.

**దుర్నివారము.** సం. విణ. (అ. ఆ. అ.) నివారింపఁగూడనిది.

**దుర్బలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బక్కవాఁడు.

**దుర్బిణి.** హిం. వి. దూరవస్తుదర్శనయంత్రము.

**దుర్భగుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ద్వేషింపఁదగినవాఁడు.

**దుర్భరము.** సం. విణ. (అ. ఆ. అ.) భరింపఁగూడనిది.

**దుర్భాగ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దురదృష్టుఁడు.

**దుర్భిక్షము.** సం. వి. అ. న. క్షామము, కఱవు.

**దుర్మతి.** సం. వి. ఇ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. దుర్బుద్ధికలవాఁడు.

**దుర్మరణము.** సం. వి. అ. న. (విషభక్షణాదులచేత చచ్చెడు) చెడ్డచావు.

**దుర్ముఖి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**దుర్ముఖుఁడు.** సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు. విణ. అసంబద్ధ వచనములాడువాఁడు.

**దుర్వర్ణము.** సం. వి. అ. న. 1. వెండి; 2. నూఁగుదోస*. విణ. చెడ్డవర్ణముగలది.

**దుర్వహము.** సం. విణ. (అ. ఆ. అ.) వహింపఁగూడనిది.

**దుర్విధుఁడు.** సం. విణ. (అ. ఆ. ఈ.) 1. దరిద్రుఁడు; 2. దుర్జనుఁడు.

**దుర్వినీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వినయములేనివాఁడు, అవినీతుఁడు.

**దుర్హృదుఁడు.** సం. వి. ద్. పుం. పగవాఁడు. విణ. చెడ్డ మనసుకలవాఁడు.

**దులదుల.** దే. వి. సంభ్రమము. "క. దులదులఁదుమ్మెదలుతమ్మి తుటుములవెడలెన్." హంస. ౧, ఆ.

**దులాబి.** హిం. వి. దూబరదిండి.

**దులి.** సం. వి. ఇ. స్త్రీ. ఆఁడుతాఁబేలు. పుం. ముని.

**దులుపు.** దే. స. క్రి. 1. (ప్రక్కలసంటుకొనియుండుగింజ లను) రాల్చు; "గీ. గాదెతెఱచిచూచికలబియ్యమన్నియుఁ, జెగిస నంటుఁజొచ్చితిరుగువాఱఁ, దుడిచిదులిపియొక్కదోసెఁడుండిసఁ దెచ్చి, వారిజాక్షివండివారమోపి." భో. ౬, ఆ.—2. విదిలించు.

**దున.** వై. స. దునయొక్కరూపాంతరము.

**దువారము.** వై. వి. వాకిలి. "సీ. కదళికాస్తంభముల్కనకకుంభం బులుఁ దలదువారంబులఁదగులుపఱచి." రసి. ౬, ఆ.

**దువాళము.** దే. వి. వేగమున అంతమేరయు సమముగాపాఱెడి యశ్వధార. (చూ. ధార.) ప్లుతము.

**దువాళి.** దే. వి. దువాళముయొక్కరూపాంతరము.

**దువాళించు.** దే. అ. క్రి. దువాళముచేయు. అం, ప్రే. దువా ళముచేయించు. (చూ. శోమాయించు.)

**దువ్వ.** దే. వి. దుమ్ము, ధూళి.

**దువ్వటము.** వై. వి. దుప్పటము. "ద్వి. దువ్వటంబులమీఁదఁ దోయజనేత్ర, యెవ్వియుఁబనికిరావిచ్చలఁజెలియుము." భాగ. ౧౦, స్కం.

**దువ్వలువ.** ద్వి. వి. (దువ+వలువ.) 1. దుప్పటము; 2. కట్టు కోక.

**దువ్వి.** వై. వి. 1. పులి; "సీ. దువ్వులుతోఁచులుచివ్వంగులడి తపుమెకములునవరపుమెకములిర్లు." రసి. ౧, ఆ.—2. చిఱుత పులి*. "ఎ, గీ. ఒకదువ్విప్వైరమెత్తి, కఱవవచ్చినన్మునికడకుఁ బాఱు, తెంచెనాకుక్క." భార. శాం. 3, ఆ.

**దువ్వు.** యు. దే. స. క్రి. 1. (దువ్వెనతో తల) చిక్కుదీయు; 2. నిమురు. "ద్వి. కలితదక్షిణకరాగ్రమునదువ్వుటయు." రా. యు, కాం.—వై. వి. 1. పులి; "దువ్వుఁజూచినక్కయొడలు గాల్చుకొన్నవడువున." ఉ, హరి. ౪, ఆ.—2. చిఱుతపులి*. (చూ. దువ్వి.)

**దువ్వెన.** దే. వి. దువ్వుటకు ఉపయుక్తమైన సాధనము, కంకతిక.

**దుశ్చ్యవనుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**దుష్కరము.** సం. విణ. (అ. ఆ. అ.) చేయఁగూడనిది.

**దుష్కృతము.** సం. వి. అ. న. పాపము. విణ. దుష్టముగా చేయఁ బడినది.

**దుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డది.

**దుష్పత్రము.** సం. వి. అ. పుం. 1. నల్లకచోరము†; 2. బలు రక్కెస†.

**దుష్ప్రధర్షిణి.** సం. వి. ఈ. స్త్రీ. ములక†.

**దుష్ప్రభ.** సం. వి. ఆ. స్త్రీ. మైలచాయతొండ.

**దుష్ప్రాపము.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) దురాపము.

**దుసికిల్లు.** దే. అ. క్రి. 1. జాఱు; 2. తప్పించుకొను. (రూ. దుసికిలు. జాఱుటకు.—"గీ. అట్టివేసవిబెడిదంపువెట్టకతన, హస్త ముచెమర్చిసారెకులస్తకంబు, దుసికిలఁగఁగాఁజెనవరింపవశముగాక, పుష్పబాణునిచెఱకువిల్పుడమిఁబడియె." అము. ౨, ఆ.— తప్పించుకొనుటకు.—"చ. మోనపుచ్చెనే, దుసికిలిడాఁగిపోయి యొకతుచ్ఛుఁడునేఁడనిచింతనొందుచున్." గామా. ౪, ఆ.)

**దుస్తరము.** సం. విణ. (అ. ఆ. అ.) తరింపఁగూడనిది.

**దుస్తు.** దే. వి. 1. వస్త్రము; "సీ. శుభశోభనములదుస్తుకొనంగ వెక్కముంగలకు నద్దిలుసేయఁ గలరుగాక." చంద్రా. 3, ఆ.— 2. అందము. "శా. అస్తోకక్రతుహోమధూమముల చాయల్ తీర్థకుండంబులన్, దుస్తైతోఁపఁగ." చంద్రా. 3, ఆ.

**దుస్త్యజము.** సం. విణ. (అ. ఆ. అ.) విడువఁగూడనిది.

**దుస్స్పర్శ.** సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు†. అ. పుం. ము. ఈఁట కసింద†. విణ. తీక్ష్ణమైన స్పర్శముకలది.

**దుస్సర.** దే. వి. దూసరయొక్కరూపాంతరము.

**దుస్సలహా.** గ్రా. వి. చెడు ఆలోచన.

**దుస్ససేనుఁడు.** వై. వి. దుర్యోధనుని తమ్ముఁడు. "ఎ, గీ. హీనుఁ డైనదుస్ససేనునివధియించి, వేఁడిరక్తమానువాఁడఁగడఁగి." భార. సభా. ౨, ఆ.

**దుస్సహము.** సం. విణ. (అ. ఆ. అ.) సహింపఁగూడనిది.

**దుహిత.** సం. వి. ఋ. స్త్రీ. కూఁతురు.

**దుహ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) దోహనముచేయఁదగినది. (దోహనము=పాలుపిదుకుట.)

## దూ.

**దూఁకలి.** వై. వి. బాధ. (చూ. ఆకట.)

**దూఁకు.** దే. అ. క్రి. దుముకు. "సీ. అనిలంబురీతిఁజవ్వనదూఁకి ధరణిపైఁబడములు నిలుపకపఱచిపఱచి." అని. ౪, ఆ.

**దూఁకుడు.** దే. విణ. ఎగుడుదిగుడు.

**దూఁకొను.** దే. స. క్రి. (దూఁటు+కొను.) 1. ఆస్వాదించు; "ఉ. తొంగలిపుష్పుఁదేనియలదూఁకొనిమత్తిలితుమ్మెదల్ పయిన్, బొంగుచువ్రాల." య. ౪, ఆ.—2. పొందు. "క. ఆయుంగ రంబుగైకొని, తోయజముఖి మోహమూర్ఛ దూఁకొనియుండెన్." రామా. ౬, ఆ.

**దూఁట.** దే. వి. అరఁటియూఁచె.

**దూఁటు.** దే. స. క్రి. తాగుచు. "వ. తల్లులందూఁటికుడుచు తలపిదూడలు." భాగ. ౧౦, స్కం. పూ. "సీ. ఎండ్రికాలిటి కిననెగసియొక్కించుకతొలఁగిశితత్రోటిదూఁటితినుచు." అము. ౨, ఆ.

**దూఁటుకొను.** దే. అ. క్రి. ఎగురు. "వ. వాని నిశ్వాసపవ నంబు భువనంబున ధూమదహనజ్వాలాభీలంబైనంవత్సరంబున కొక్కమాఱువెలువడిభూనభోంతరంబెల్లను నిరంతరశీకరాఱపట

లంబు మూఁడుకోశంబుఁజేయు." సం. "ఆస్యనిశ్వాసవాతేనరజ ఉద్ధూయతేమహత్." భార. అర. ౪, ఆ.

**దూఁపఱతిండి.** దే. విణ. (దూయు+పఱ+తిండి.) మిగులఁ బెట్టక యెంతయున్నను అంతయు వెచ్చించితినువాఁడు.

**దూఁపిడి.** దే. వి. (దూయు+పిడి.) నాలుతోఁడునపుడు చీఁదు తగిలించుటకు నిలిపెడు పీఁటమమర్చినకొయ్య.

**దూఁగలి.** దే. వి. (దూపము+కలి.) కలిదూపము.

**దూడ.** దే. వి. పశుశిశువు. (ఆవుదూడ, ఎనుపదూడ.) "అలయక లేడిపాడగుమినాఁగెడుక్రోల్పులలఁ బవధించు." ఉ, రా. ౭, ఆ. "అమ్మలకలు రెంటికిం బోడమమానుగదూడలునాళ్ళు." పంచ. నా. ౫, ఆ.

**దూడపాల.** దే. వి. శారిబ.

**దూత.** సం. వి. అ. పుం. 1. రాయబారి; 2. కుంటెనకాఁడు. (రూ. దూతుఁడు.)

**దూతి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. కుంటెనకత్తె. (రూ. దూతిక.)

**దూత్యము.** సం. వి. అ. న. 1. దూతభావము; 2. దూతకర్మము; 3. దూతస్వభావము.

**దూదె.** దే. వి. విత్తుతీసినప్రత్తి, తూలము.

**దూదిదబ్బ.** దే. వి. తోలుదళముగానుండెడుదబ్బ.

**దూదినిమ్మ.** దే. వి. మాతులుంగకము.

**దూనము.** సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడినది, సంతాపితము.

**దూప.** దే. వి. దప్పి. "సీ. వికటంపుటెఱకలవిసరునను వ్పొంగు తుప్పరకొందంబుదూపడంగ." హరి. ఉ. ౫, ఆ.

**దూపటిల్లు.** దే. అ. క్రి. 1. దప్పిగొను; 2. పరితపించు. సావి. 3, ఆ. (రూ. దూపటిలు. దప్పిగొనుటకు.—"ద్వి. కడుదూపటిలి యుదకంబులుగ్రోలఁ, దడయకయయ్యేటిదరికేఁగుదెంచి." నవ. 3, భా.)

**దూపము.** వై. వి. వాసనగలపొగ. "సీ. తఱచుగాఁబుట్టినతావిదూపపుఁబొగల్ కుప్పలై మెలఁగుమొగుళ్లుగాఁగ." ("తావిదూపపుఁ బొగల్." ఇది ప్రౌఢప్రయోగమని యెఱుంగునది.) య. ౪, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. దూగలి, దూపార్తి.)

**దూపార్తి.** వై. వి. (దూపము+ఆర్తి.) దూపమువేసెడు పాదము పెట్టినతట్ట.

**దూపించు.** దే. అ. క్రి. 1. దప్పిగొను; 2. పరితపించు. "క. క్రొవ్వుదలఁచిపనిమేయుటఁ, జేఁపినపాళ్లలయెండచేఁబాంథజనల్, దూపింపమికఁ జూడంపిన, యాపాఁనాయనఁగ నదుల నంచులు మెఱసెన్." ఆము. ౪, ఆ.

**దూపిల్లు.** దే. అ. క్రి.———పై.———(పరితపించుటకు.—"వ. పార్వతీవల్లభుండుతనకుఁజేసిన యవమానంబునన్నుల్లంబునందుదూపిల్లుచుండె." భీ. ౨, ఆ.) (రూ. దూపిలు, దప్పిగొనుటకు.— "ఉ. ఆనమయంబునందుఁదమసాపగఁదాపన పుత్త్రుఁడాత్మవిద్యాసముదగ్రులైనతలిదండ్రులుధూపిలియుండవారలన్, గానిల కుండఁగుండనుదకంబులుముంపఁగ నాధరావరా, గ్రేనరుఁ జేసెసాధ్వనికరిధ్వనియంచువిచారఖిన్నుఁడై." రామా. ౨, ఆ.)

**దూఁబ.** దే. విణ. అధముఁడు. "భృతికివేదంబుచెప్పెడిదూఁబ." ఉ, రా. 3, ఆ.

**దూబూచి.** ద్వి. వి. (దూయు+బూచి.) 1. బాలక్రీడావిశేషమునందగు ననుకరణము; "ఎ, గీ. కనుమొఱంగిచెలుల్ మఱుంగున నడంగఁ, దొంగిచూచి దూబూచియన్నంగికాకి, కన్నగ." సా. ౧, ఆ. — 2. వి. బాలక్రీడావిశేషము. "సీ. పచ్చగాజనుఁగుఁగ్రొంబనుల సారణగండ్ల బుడిబుడిఁ బొదలెదూబూచులాడి." చంద్రా. ౧, ఆ.

**దూముడి.** దే. వి. దూయుముడియొక్కరూపాంతరము.

**దూయు.** దే. అ. క్రి. 1. పాఱు; "గీ. దూసిరిండ్లకు కుదూసి సట్లు." రుక్మి. ౫, ఆ.—2. బాణము నాటివెడలు. (చూ. దుయ్యు.) —స. క్రి. 1. పిడికటితో ఆకులులోనగువానినూడఁదీయు; (చింతాకు దూసికొనిరమ్ము.)—2. తీయు. "సీ. తౌతలంత్రులనాటి నిస మెల్లఁబోకార్చి తులువయైయప్పలుదూయఁజొచ్చె." శేవ. ౪, ఆ.

**దూయుతీఁగ.** ద్వి. విదూసరతీఁగె.

**దూయుముడి.** దే. వి సులభముగా నూడఁదియునట్లు ఘొనమడిఁచివేసినముడి. "సీ. ప్రష్టస్రజంఘం బుపట్టుఁదోరపుదూయుముడి యేయనాయాసమునవెవిడువ." రామా. ౭, ఆ.

**దూరదర్శి.** సం. వి. న్. పుం. 1. విద్వాంసుఁడు; 2. గద్ద. విణ. దూరపుయోచనకలవాఁడు.

**దూరము.** సం. విణ. (అ. ఆ. అ.) దవ్వు.

**దూర్వ.** సం. వి. ఆ. స్త్రీ. గఱిక.

**దూఱు.** దే. స. క్రి. నిందించు. (చొచ్చు అనునర్థమున తూఱు శబ్దముకడ చూచునది.) వి. నింద.

**దూఱుదుంకెన.** దే. వి. బాలక్రీడావిశేషము.

**దూఱుపడు.** ద్వి. అ. క్రి. (దూఱు+పడు.) నిందింపఁబడు.

**దూలి.** దే. వి. దురద, జిల, నవ, కండూతి.

**దూలిగొండి.** దే. వి. దురదగొండి.

**దూలగోవెల.** దే. వి. దురదగోవెల.

**దూలపోతు.** దే. వి. ఎప్పుడును దూలగలవాఁడు.

**దూలము.** వై. వి. ఇంటికురుఁజాలకాదరుఫ్రగానమర్చెడు మ్రాను.

**దూషణము.** సం. వి. అ. న. దూషించుట. పుం. ను. ఒకానొక రాక్షసుఁడు.

**దూషించు.** సం. స. క్రి. నిందించు, దూఱు.

**దూషిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కంటిపుసి; 2. వాగర; 3. సాలెపురుగు.

**దూష్య.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగు నడుమునఁగట్టెడు తోలుమోకు. అ. న. ను. 1. గుడారము; 2. వస్త్రము. విణ. దూషింపఁదగినది.

**దూసర.** దే. వి. పత్సాదని.

**దూసరి.** దే. వి. 1. తృణవిశేషము; 2. ని. తృణధాన్యవిశేషము.

## దృ.

**దృంభువు.** సం. వి. ఊ. స్త్రీ. పాము. "శా. జంబూద్వీపములోననెంతయుఁబ్రశస్తంబైనదీనిన్ననట, దృంభూకుండలజూటకోటరకుటీభృత్స్వర్ధునీవీచికా, లంబిస్వన్ననవేందుకందళసుధాలంకారవాగ్వైఖరిన్, జంబూకావ్యముచేసెదన్ బుధజనశ్లాఘానిరాఘాతన్." జై. ౧, ఆ.

నకీబు. దే. వి. వెండిబెత్తమువాఁడు, వేత్రధరుఁడు. "చాఁగుబళి యంచు నకీబులు మ్రోయ." స్వా. ౫, ఆ.

నకులము. సం. వి. అ. పుం. ముంగిస. డు. యుధిష్ఠిరుని తమ్ముఁడు.

నకులేష్ట. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షి.*

నక్క. వై. వి. జంబుకము*. (దీని భేదములు వఱడు, గుంట నక్క.) విణ. క్షుద్రము*. (చూ. నక్కదోస మొ.)

నక్కతోఁకకసవు. ద్వి. వి. సింహపుచ్ఛి.* (దీనిని కొందఱు నక్కతోఁకపొన్న అందురు.)

నక్కతోఁకపొన్న. ద్వి. వి. క్రోష్టువిన్న.* (దీనిని కొందఱు నక్కతోఁకకసవు అందురు.)

నక్కతోఁకబియ్యము. ద్వి. వి. ధాన్యవిశేషము.

నక్కదోస. ద్వి. వి. చిర్భటము.*

నక్కనరము. ద్వి. వి. ఒకదినుసు వేఱు.

నక్కనేరెడు. ద్వి. వి. కాకినేరెడు.*

నక్కవిరిగి. ద్వి. వి. క్షుద్రశ్లేష్మాతకము.*

నక్కీ. హిం. వి. మోటుజేరీ.

నక్కీళ్లు. ద్వి. వి. బ. (నక్కు+కీళ్లు.) పక్కపండ్లకీళ్లు.

నక్కు. దే. అ. క్రి. ఒదుఁగు. "ఉ. నాలితనంబునేర్చుకొనినక్కుచు నక్కుచువాడవాడవే, లాలవలీలతావలికెలంకులనుండిటువచ్చి వచ్చిదం, భోళియుఁబోలెమీఁదఁ బడిపోయెడుఁబల్లఱుఁ బిల్చి తెల్పవే, తాళుకొనంగ నీయనుఁగుతండ్రికి ధన్యవిచారమారుతీ." రామా. ౭, ఆ.—వి. 1. మ్రానియతుకు; (ఇది నక్కుదూలము.) 2. బంగారపుబిల్ల; "గీ. నక్కుచెక్కుఁజెక్కునాతుక చెక్కులు." చంద్ర.—3. బంగారు నఱకఁగా నడుమఁ గనుపట్టెడు నిగ్గు; 4. నాఁగటికఱ్ఱు.

నక్కెర. దే. వి. కంది, తొగరి.*

నక్కేఱు. ద్వి. వి. (నక్క+ఏఱు.) ఒకానొకచెట్టు.

నక్తంచరము. సం. వి. అ. పుం. గుడ్లగూబ.

నక్తంచరుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు, రేద్రిమ్మరి.

నక్తకము. సం. వి. అ. పుం. 1. చినిఁగినవస్త్రము; 2. మాసినవస్త్రము; 3. వస్త్రము; 4. నల్లగూబ.

నక్తమాలము. సం. వి. అ. పుం. కానుగు.* (రూ. నక్తమారము.)

నక్తము. సం. వి. అ. న. రాత్రి. "గీ. సోమవారవ్రతంబతిశుభద మగుచు, నొనరునుపవాసయుక్తుఁడౌనఘమతికి, నక్తమునఁనేకభుక్తి యొనర్చెనేని, శివుఁడుసుప్రీతుఁడగు నిజం బవనినాథ." శేష. ౬, ఆ.

నక్రము. సం. వి. అ. న. 1. అడ్డకమ్మి; 2. త్రొక్కుడుకమ్మి. పుం. మొసలి.

నక్షత్రమాల. సం. వి. ఆ. స్త్రీ. ఇరువదియేడుముత్యములు గ్రుచ్చినయొంటిపేటహారము.

నక్షత్రము. సం. వి. అ. న. అశ్వినిమొదలగు రిక్క. (ఇవి యిరువదియేడు.—అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి అని అభిజిత్తు అని ఇరువదియెనిమిదవ నక్షత్రము ఒకటి కలదందురు.)

నక్షత్రేశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, రిక్కరాయఁడు.

నఖము. సం. వి. అ. పుం, న. గోరు. పుం. గంధద్రవ్యవిశేషము.

నఖముఖాల. సం. క్రి. వి. అన్నిదిక్కుల.

నఖరము. సం. వి. అ. పుం, న. నఖము, గోరు. (దీనికి ఆయుధవిశేషమును అర్థమగుచున్నది.)

నఖరాయుధము. సం. వి. అ. పుం. కోడి.

నఖోత్పాటని. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) గోరుగల్లు.

నగ. దే. వి. 1. భూషణము; 2. లోహపాత్రము; 3. పొగాకు దూదిలోనగువాని కంట్లపుమూట; 4. సిద్దెలజోడు.

నగదు. హిం. వి. నాణెరూపమైన సొమ్ము.

నగధరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, గట్టుతాలుపు.

నగము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. చెట్టు.

నగరము. సం. వి. అ. న. పట్టణము, పురము.

నగరి. సం. వి. ఈ. స్త్రీ. పట్టణము, పురము.

నగరు. దే. వి. 1. రాజగృహము; "వలలుఁడనంగనీనగరవంటలవాఁడయినిల్చి." భార. విరా. ౫, ఆ. (చూ. దొరఁకొను.)— 2. దేవగృహము. (చూ. చేఱుచుకడకొట్టు అనుసర్థము నుదాహరణము.)

నగవరి. దే. విణ. (నగవు+అరి.) నవ్వుగలవాఁడు.

నగవు. దే. వి. నవ్వు, హాసము.

నగవైరి. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, గట్టుదాయ.

నగాధిపుఁడు. సం. వి. అ. పుం. హిమవంతుఁడు, గట్టులఱేఁడు.

నగారా. హిం. వి. పెద్దఢంకా.

నగాసు. హిం. వి. చిత్రము.

నగు. దే. అ. క్రి. 1. హసించు; 2. అపహసించు. "వ. అయ్యాయురేవ్విదవిద్యయెనిమిది నెలలభ్యసించిహర్షించి యతనిముందటి కరిగియుండందనగుచున్న." మార్క. ౫, ఆ.—వి. హాసము. "క. నగునగువెన్నెలనిగనిగ." అచ్చ. బాల, కాం.

నగుఁబాటు. ద్వి. వి. (నగు+పాటు.) అపహాసము. "వ. నీవు లోకంబుచేతనగుఁబాటు పొందంగలవాఁడవనికర్ణుండుచెప్పిన." సం. "రాజ్ఞాంహాస్యోభవిష్యసి." భార. అర. ౬, ఆ.

నగౌకసము. సం. వి. స్. పుం. 1. పక్షి; 2. సింహము; 3. శరభము.

నగ్గు. దే. వి. నుగ్గు. "సీ. రథ్యసారథికేతురథికాంగనిర్దళనప్రౌఢిఁదేరులునగ్గుచేసి." మార్క. ౮, ఆ. (దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.)

నగ్నహువు. సం. వి. ఉ. ఊ. పుం. నానాద్రవ్యములచేత చేయఁబడిన సురాబీజము, కిణ్వము.

నగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కన్యక; 2. దిసమొలయాఁడుది.

నగ్నుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. బట్టువాఁడు. విణ. దిసమొలవాఁడు.

నచ్చిక. దే. వి. నమ్మిక. (చూ. నచ్చు.)

**నచ్చిగ.** దే. వి. నచ్చికయొక్క-రూపాంతరము. (చూ. నచ్చిగ.)

**నచ్చు.** దే. స. క్రి. నమ్ము. "క. ద్రోణభీష్ములలావుల్, నచ్చియుఁ గర్ణుండొక్కఁడ, యిచ్చుఁదనకు విజయమనియు నెంతయుఁబొంగుక." భార. ఉద్యో. 3, ఆ.-వి. 1. ఆలస్యము; 2. బాధ.

**నచ్చుకాఁడు.** దే. విశే. 1. అలసుఁడు; 2. బాధకుఁడు.

**నచ్చుకుప్ప.** దే. విశే. నచ్చుగొట్టు.

**నచ్చుగొట్టు.** దే. విశే. నచ్చుపెట్టువాఁడు.

**నచ్చుపెట్టు.** దే. స. క్రి. తొందరపెట్టు, బాధించు.

**నజరానా.** హిం. వి. అపరాధము, రాజులకిచ్చు కానుక.

**నజరు.** హిం. వి. సముఖము, సౌందర్యము, కానుక.

**నజ్జు.** దే. వి. నలుజుయొక్క-రూపాంతరము. "చ. ఒక పెనుఁబాఁపతేఁకుచలమొప్పరసాతలసీమకుఁజుక్, రకములుభూతిధాత్రికిసెల్‌దివికిఁబగిలియున్నట్లుగా, మెకమెకవాటుతోడనిన స్సింగకపోరెపుడుక్ ద్రిలోకకం, టకుఁడవుగానసెయొడలునజ్జుగఁజేసికుర౦గలాంఛనా." సాన్వ. 3, ఆ.-విశే. మిక్కిలి నలఁగినది.

**నటనము.** సం. వి. అ. న. 1. నాట్యము; 2. నటన, కపట ప్రవర్తనము.

**నటము.** సం. వి. అ. పుం. 1. ఇరుగుడుచెట్టు; 2. దుండిగముచెట్టు.

**నటవాలు.** దే. వి. అశ్వగతివిశేషము. (చూ.) రేచితము.

**నటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వేశ్య; 2. నట్టువుని పెండ్లాము; 3. కాకిదొండచెట్టు; 4. గువ్వగుత్తిచెట్టు.

**నటించు.** సం. అ. క్రి. 1. నర్తించు; 2. వర్తించు; 3. కపటముగా ప్రవర్తించు.

**నటుఁడు.** సం. వి. అ. పుం. నట్టువుఁడు.

**నటుపెడ్డు.** ఆం. విశే. సొమ్ము చెల్లింపకుండ టప్పాద్వారా పంపఁబడిన.

**నట్ట.** దే. వి. పాచిక. "నట్టలు రెండుఁదానజతనంబునఁజేకొని." భో. 2, ఆ.

**నట్టకనడుము.** దే. వి. (నడుము+నడుము.) సరినడుము. "నట్టకనడురేయి." వేం. పంచ. ౧, ఆ.-(ఇతర గ్రంథములయందు దీనికి ప్రయోగము మృగ్యము.)

**నట్టడవి.** ద్వ. వి. (నడుము+అడవి.) అరణ్యమధ్యము. "క. నీపాదంబుల్, పట్టికొనఁగవచ్చినమము, నట్టడవినిడించిపోవన్యాయమె కృష్ణా." భాగ. ౧౦, స్క-ం. పూ.

**నట్టనడుము.** దే. వి. (నడుము+నడుము.) సరిమధ్యము. "మలథపువేణినట్టనడుమక దెగిచేతికిఁదున్క-చిక్కు-." ఉ. రా. 3, ఆ.

**నట్టాడు.** ద్వ. అ. క్రి. (నట్టువ+ఆడు.) 1. నర్తించు; 2. చలించు. "నట్టాడునడుము." భాగ. ౯, స్క-ం.

**నట్టిల్లు.** దే. వి. (నడుము+ఇల్లు.) 1. గృహమధ్యము; (చూ. కొట్టగిలఁబడు.) 2. గర్భగృహము. "సీ. మలిపించెబంగారముల దేవగృహములుతూర్పించెనట్టిండ్లకుందనమున." భీ. ౪, ఆ.

**నట్టు.** యు. దే వి. 1. వాసస్థానము; "గీ. అపుడుగొల్లసాయఁడందంబుగాఁదన, నట్టులలరఁజేయునట్టుగాను, నేర్పుగల్గువారినేర్పరించి." నీలా. 3, ఆ.-2. స్థానము; "గీ. వారిఁదద్దయున్నర్తిలిగారవించి, బంతిమోములదొరతనబంతిఁగుడువఁ, బెట్టివీడెంబులిడియొక్క-నట్టునందు, నెమ్మిఁగూర్చున్న చోఁబినతమ్ముఁడనియె." అచ్చ. యు, కాం.-3. ఆలస్యము; (పలనట్టుచేసెదవు, వేగపొమ్ము.) 4. ఆటంకము; (ఆ పనికి నట్టువచ్చినది.) 5. నస్యరోగవిశేషము. నై. నట్టువ్రుడు.

**నట్టుకొట్టు.** దే. అ. క్రి. ఆలస్యముచేయు. "క. పలికెననిన్నఁగాదనభీ, తిలియుటునటునట్టుకొట్టులేఱవ చెఱఁగుఘా, తలవిభుఁడు చూచి." కళా. 2, ఆ.

**నట్టుకొను.** దే. అ. క్రి. కుదురుకొను, నెలకొను. "వ. పట్టుగల పటికంపుజాచట్టునేలలనట్టుకొని." సాన్వ. 3, ఆ.

**నట్టుగుఁడు.** నై. వి. నట్టువ్రుడు.

**నట్టుపులుఁగు.** ద్వ. వి. నట్టువపులుఁగుయొక్క-రూపాంతరము. "సీ. విషధరాగమనంబెవేఁడుచుఁగేకలువెట్టునిఖండు లీనట్టుపులుఁగులు." రుక్మి. 3, ఆ.

**నట్టువ.** నై. వి. 1. ఆట, నర్తనము; "వ. మయూరయువతిలేనియలాని పూనిమట్టిలి తిత్తఅంబునం దిరుగుచేటిమొత్తంబులయెలకు లనన్నగరువలెగట్టువనట్టువగఱప." య. ర, ఆ.-2. నట్టువ్రుఁడు. (చూ. అజ్జాడు.)

**నట్టువకాఁడు.** ద్వ. వి. నట్టువ్రుఁడు.

**నట్టువడు.** ద్వ. అ. క్రి. (నట్టు+పడు.) అడ్డిపడు.

**నట్టువపులుఁగు.** ద్వ. వి. నెమిలి, నర్తనప్రియము. (ఇట్లు నట్టువ పిట్ట.)

**నట్టువవాఁడు.** ద్వ. వి. (నట్టువ+వాఁడు.) నట్టువ్రుఁడు. (చూ. బూతు రెండవయర్థము నుదాహరణము.)

**నట్టువ్రుఁడు.** నై. వి. (వేశ్యలకాటగఱపు) నటుఁడు. (నట్టుగుఁడు యొక్క-రూపాంతరము.)

**నట్టువోజ్జ.** నై. వి. (నట్టువ+ఒజ్జ.) నాట్యోపాధ్యాయుఁడు. "గీ. నట్టువోజ్జనైమెలఁగుదునగలులందు." భార. విరా. ౧, ఆ.

**నట్టేఱు.** దే. వి. (నడుము+ఏఱు.) నదీమధ్యము.

**నట్టోట్లు.** దే. వి. బ. జలధారలులోనగునవి నిరంతరముగావడియుడిగినవెనుక అచ్చోట నిలిచినిలిచిపడెడుబొట్లు. "నవమాలికలతేనెనట్టోట్లుపడుచోట." సాన్వ. 3, ఆ.

**నట్వాలు.** దే. వి. నటవాలుయొక్క-రూపాంతరము.

**నడ.** దే. వి. నడక, గమనము.

**నడక.** దే. వి. 1. గమనము; 2. ప్రవర్తనము.

**నడగఁడు.** దే. వి. (నడ+కాఁడు.) గుఱ్ఱము, హయము. "క. ఆలోనఁజంద్రహాసుఁడు, మేలుకనుచునపుడుతత్సమీపనరణ్యప్ర, శాలితముఖుఁడైనడగని, బోలెమునఁగదల్చి నగరముఁబ్రవేశించెక." జై. ౮, ఆ.

**నడగొట్టు.** దే. అ. క్రి. (నడ+కొట్టు.) నిలుచు, ఉండు. "క. పోకనడగొట్టితేనియు, రాకింతుఁజుమీమొగంబురాచట్టుపయుక్, శ్రీకాళికనిందించిన, నీకింతటనేలపోవుసీచచరిత్రా." భీ. ౨, ఆ.

**నడచు.** దే. అ. క్రి. 1. గమనించు; "వ. పతంగపతివసుమతికి నవతరించివసుదేవసుతునితలంపునతనుగుణంబుగనడచికడచి." ఉ. హరి. ౬, ఆ.-2. ప్రవర్తించు.

**నడజోదు.** ద్వ. వి. కాలిబంటు, పదాతి. "వ. అడిదంబులఁబొడిపొడిగా నడుచునడజోదుభటులును." ఉ. హరి. ర, ఆ.

**నడత.** దే. వి. నడవడి, ప్రవర్తనము.

**నడతెంచు.** దే. అ. క్రి. (నడచు+తెంచు.) నడచు, పోవు. "ఉ. పాండవకోటినూతనుతుప్తై నడతెంచినచందమెట్టులా, కొండల

సూతినవ్వనుఖకాఁడముతొఁకునరూపుమాసిపో, కుంపుటయుట్లు కల్గె." భార. కర్ణ. ౧, ఆ. "ద్వి. నేఁడసీసుకకు, నగవుపుట్టించుచు నడతెంచునెడల." రా. ఉ, కాం. (స్వార్థమున తెంచు.)

**నడదెవియ.** ద్వ. వి. దివటీ. "సీ. నడదివియలునేసెనగరికిమాఁకి క్యమకుటముల్ పూనినమనుజపతుల." భార. విరా. ౫, ఆ.

**నడపు.** దే. ప్రే. నడవఁజేయు వి. 1. గమనము; "సీ అల్లఁ వనంబునయనువుమైకొనఁజూచునడపుకాంతికి వింతతొడవుగాఁగ." భార. విరా. ౧, ఆ.—2. ప్రవర్తనము.

**నడబావి.** ద్వ. వి. నడచిపోవుటకు మెట్లేర్పఱచిన బావి.

**నడము.** సం. వి. అ. పుం. కెక్కెసకనవు. (చూ. నళము.)

**నడయాడు.** దే. అ. క్రి. (నడ+ఆడు.) 1. సంచరించు; "క. గడకట్టినయోడపగిది, నడయాడుఁగ్రియాభియుక్తుఁడటనిష్క్రియుఁడై, యొడిసెలజాయిపడినక్షయి, వడిఁదప్పముఁగలయు బంధువర్గము తోడన్." శివ. ఉ. ౨, ఆ.—2. చలించు. "ద్వి. నరులు, నడయాడుచున్నకిన్నరసతుల్ నడవ." రా. సు, కాం.

**నడవ.** దే. వి. 1. తలవాకిటికిని, నడిమివాకిటికిని నడిమిచోటు, అళిందము; 2. సేతువు; "గీ. అవియునవలీలనందందయందు కొనుచు, నడవఁగావించుచున్నయన్నలునిసేతు, కర్మకౌశలమీక్షించు గగనచరుల, కనిమిషత్వంబుచరితార్థమయ్యెనపుడు." రా. యు, కాం.—3. మార్గము. "వ. కూలినబాళితెఱంగుననడవలేక." కవిక. ౪, ఆ.

**నడవడి.** దే. వి. నడత, చరిత్రము.

**నడవడిక.** దే. వి. నడవడియొక్కరూపాంతరము. (స్వార్థమున క ప్రత్యయము.)

**నడి.** దే. వి. నడుమునకు వృత్తియందుఁగలుగు నడిమి అను రూపము నందు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినది. (చూ. నడికట్టు, నడిప్రేలు మొ.)

**నడికట్టు.** దే. వి. (నడిమి+కట్టు.) మగవారు బిగువునకై నడుమునఁగట్టుకొనెడు కట్టు, సారసనము.

**నడికట్టుత్రాడు.** దే. వి. ఏనుఁగు నడుమునఁగట్టెడుత్రాడు, కక్ష్య. "క. వెండియునిట్టటుకదలక, యుండనతండతులబలర యోద్ధతిమహాసీ, యుండగుచువానిఁదన్నే, దండమునడికట్టుత్రాళ్లఁ దగబంధించెన్." కళా. ౮, ఆ.

**నడికిరేయి.** ద్వ. వి. (నడిమికిన్+రేయి.) అర్ధరాత్రము. "గీ. నడికిరేయివచ్చిననునొవ్వఁబలికినఁ, గలుగునయ్యజయము." భార. భీష్మ. 3, ఆ. (రూ. నడికిరే. "రేపువత్తుననిపోయినడికిరే యర్థితోఁజనుదెంచు." భార. అర. ౭, ఆ.) (బ. నడికిరేలు. ఆము. ౫, ఆ.)

**నడితి.** దే. వి. నడతయొక్కరూపాంతరము.

**నడిప్రేలు.** దే. వి. (నడిమి+ప్రేలు.) మధ్యమ.

**నడు.** దే. వి. వృత్తియందు నడుముశబ్దమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. నడునెత్తి, నడుముక్కు, నడురేయి మొ. నడునెత్తిలోనగువానియందు పూర్వ పదార్థమునకు ప్రాధాన్యమని యెఱుంగవలెను.)

**నడుకు.** దే. అ. క్రి. వడఁకు, కంపించు. "ఉ. వాఁడుండఁగఁ బోయిపుల్లననడుంకుచుభూవిభుఁజేరినమ్రుఁడై." నిర్వ. ౨, [illegible]—వి. కంపము. (నన్నుఁజూడఁగానే వానికి నడుఁకుపుట్టెను.)

**నడుకొను.** దే. అ. క్రి. (నడుఁకు+కొను.) కంపించు. "క అనుచునొడఁబాటులేక, న్ననునయ్యుత్తరునినోఁగలనడుకొననిడి." భార. విరా. ౪, ఆ.

**నడుగుంట.** ద్వ. వి. (నడుము+గుంట.) తల నడిమిపల్లము, బ్రహ్మరంధ్రము. "సీ. చమురూరనడుగుంటనిమురుచుఁదల యంటి." చంద్రా. ౨, ఆ.

**నడుచు.** దే. అ. క్రి. నడచుయొక్కరూపాంతరము. "సీ. నగ జామనోనాథునగరికినడుచువారెడపక్రొన్నెలముడుచువారు." భల్లా. ౨, ఆ.

**నడుచొచ్చు.** దే. అ. క్రి. (నడుము+చొచ్చు.) నడుమప్రవేశించు. "ద్వి. ఎనసినుగ్రీవుతో నేనుబోరాడ, ననునేయఁదగునయ్య నడుచొచ్చినీవు." రా. కిష్కిం, కాం.

**నడుదింపు.** దే. వి. మాంసవిశేషము. "వ. మృగంబులనడుదింపు నంజుడు నమలినయతం డంఘుండునుబంగుండునునైయావిర్భ వించు." మార్క. ౨, ఆ.

**నడునడు.** దే. వి. నడుఁకుటయందగు ననుకరణము. "నడునడు నడిఁకివారలభయంబువేఁడిన." భార. ద్రో. ౨, ఆ.

**నడుపు.** దే. ప్రే. వి. నడపుయొక్కరూపాంతరము.

**నడుమంతరము.** మి. వి. (నడుము+అంతరము.) 1. కౌను; 2. మధ్యకాలము. (చూ. నడుమంత్రము.) విశే. మధ్యకాలమునఁ గలిగినది. "గీ. వెలఁదినడుమింతమాత్రనేవిట్టువీఁగె, నహహనడు మంతరపుఁగల్మికదినిజంబు." అని. 3, ఆ. (ఇది మొదటివిశేష్యార్థమునకును, విశేషణార్థమునకును ఉదాహరణము.) (చూ. నడుమంత్రము.) (సమానార్థకములైన రెండు పదములుచేరి ఒక పదముగా వాడఁబడుచున్నది. ఇది దున్నపోతువంటిదనవచ్చును. అయిన అవి రెండును తెనుఁగుపదములు. ఇందు ఒకటి తెనుఁగు, ఒకటి సంస్కృతము.)

**నడుమంత్రము.** మి. గ్రా. వి. 1. కౌను; (చూ. విశేషణార్థము నుదాహరణము.) 2. మధ్యకాలము. "నడుమంత్రంబునబల్మిఁ దెచ్చుకొని." ఉ, రా. ౨, ఆ.—విశే. మధ్యకాలమునఁ గలిగినది. "క. నడుమంత్రముకుచభారము, నడుమంత్రముసైఁపదు." శృం. ౨, ఆ. (నడుమంతరముయొక్కరూపాంతరము.)

**నడుము.** దే. వి. 1. కౌను; 2. మధ్యభాగము. "దున్ససేనువిల్ నడిమికిఁద్రుంచి." భార. కర్ణ. ౧, ఆ. (వానికి నడుము వదలెను, ఇత్యాదిస్థలములయందు అర్థవిశేషమని యెఱుంగునది.)

**నడుముకట్టుకొను.** దే. అ. క్రి. సిద్ధపడు. (వాఁడు దేనికిని నడుముకట్టుకొని వచ్చుచున్నాఁడు.)

**నడురేయి.** ద్వ. వి. (నడుము+రేయి.) నడికిరేయి. (రూ. నడురే. "ఆనిష్టానిధిగేహసీమనడురేయాలించినక్రొమ్రోయు." మొ. ఆము. ౧, ఆ.)

**నడువడి.** దే. వి. నడవడియొక్కరూపాంతరము.

**నడ్డి.** దే. వి. పూర్వకాయము వెనుకకు వంగియుండుట. (పూర్వ కాయము ముందటికి వంగియుండుట గూను.) విశే. చప్పట. "ద్వి. నరసినగడ్డంబునడ్డినాసికయు." నళ. 3, భా.

**నడ్డిగుంట.** ద్వ. వి. (చూ.) కుకుందరము.

**నడ్డిముక్కువాఁడు.** దే. విశే. (చూ.) అవటీటుఁడు.

**నడ్తి.** దే. వి. నడితియొక్కరూపాంతరము.

**నడ్డు.** దే. వి. నడుముయొక్కరూపాంతరము. "తే. గీ. వారలకు మనకుఁ, బొసఁగుసే నడ్డుఁబెట్టిన పూరిగాలు." ఉ, హరి. ౫, ఆ.

**నడ్వ్య.** సం. వి. ఆ. స్త్రీ. కిక్కి-సవామి.

**నడ్వ్వలము.** సం. విశే. (శ్. ఈ. శ్.) కిక్కి-సకనవ్వగలది. (దేశము.)

**నడ్వ్వలము.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

**నతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వంగినది; 2. వంకరైనది; 3. లోఁతైనది. "నతనాభిక." స్వా. ౨, ఆ.

**నతి.** సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము, మ్రొక్కు.

**నత్త.** దే. వి. గుల్లయందుండు పురుగు.

**నత్తగుల్ల.** దృ. వి. క్షుద్రశంఖము.

**నత్తి.** దే. వి. తడఁబడుచుమాటాడెడు వాగ్దోషవిశేషము.

**నత్తివాఁడు.** దే. విశే. నత్తిగలవాఁడు, అత్తేపల్కుఁడు.

**నత్తు.** దే. అ. క్రి. తడఁబడుచుమాటాడు. వి. ముక్కుపోఁగు. భద్రా. ౨, ఆ.

**నదము.** సం. వి. అ. పుం. 1. పడమరగాఁబాఱెడియేఱు; 2. (నీటి) మడుగు; 3. సముద్రము; 4. మ్రోఁత.

**నది.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఏఱు; 2. ఆమడకు మీఁటిపాఱెడి యేఱు.

**నదీమాతృకము.** సం. వి. అ. పుం. ఏఁటినీళ్లచేత పండెడు పైరు గలదేశము.

**నదీసర్జము.** సం. వి. అ. పుం. ఏఱుమద్దిచెట్టు.

**నద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; 2. పైకెత్తఁబడినది, నిక్కినది. (అనికొందఱు.)

**నధ్రి.** సం. వి. ఈ. స్త్రీ. టంగువాఱు, వరత్ర.

**నన.** దే. వి. 1. పువ్వుము; "మ. వనితల్ నవ్వఁగఁగాఁగిలింపఁగన నిశ్వాసింప గానంబొనం, గ్పనదల్పక బలుకక ముఖాసవము గూర్పక దన్న నంటక ననల్, మొనపుకబొన్న కురంటకంబుఁ దిలకంబుకసిందువారంబుఁ బ్రేం, కనమున నంపెఁగగోఁగునుక వకుళముక గంకేలియుక మావియుక." రామా. ౧, ఆ.-2. మొగ్గ; "చ. కుసుమములెల్లఁగామినుల కొప్పులనుండ నటుం డలేనిసి, గ్గనఁగఁగ వంగినట్లు జనియించె ననల్." ఆము. ౫, ఆ.-3. చిగురు. (చూ. ననుచు.)

**ననంద.** సం. వి. ఋ. స్త్రీ. మగనితోఁడఁబుట్టినది. (రూ. ననాంద.)

**ననఁబోఁడి.** దే. వి. (నన+పోఁడి.) 1. పువ్వుమువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2. ఆఁడుది. "పురుషుఁడవెంచిచూడననఁబోఁడివిగావు." బ్ర. 3, ఆ. (చూ. అలరుఁబోఁడి.)

**ననకారు.** దృ. వి. ఋతువిశేషము, వసంతము.

**ననసీరు.** దృ. వి. పువ్వురసము, మకరందము. (చూ. బీఁటిక.)

**ననయు.** దే. అ. క్రి. 1. పూచు; 2. చిగిరించు. (అప్ర.)

**ననవిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు, పువ్వువిల్తుఁడు. "చ. ననవిలుకాఁడమన్మథయనాథవధూవధపాతకం బునిక, గొనిమునిఁగించె." నై. ౨, ఆ. (ఇట్లు ననవింటివాఁడు మొ.)

**ననవిలుతుఁడు.** దే. వి.——పై.——(రూ. ననవిల్తుఁడు. "విరహులగెల్వవచ్చు ననవిల్తుఁడటంచు." భాను. ౨, ఆ.)

**ననుఁబ్రాయి.** దే. వి. (నాను+ప్రాయి.) చక్కగా ఉడుకని బియ్యము.

**ననుఁబ్రాయివడు.** దృ. అ. క్రి. (ననుఁబ్రాయి+పడు.) ననుఁబ్రాయియగు. "క. విరుసింకగాకనడిమికి, మురియక ననుఁబ్రాయివడిచిముడుఁబాఱకయే, బెరికెయును లేకమిక్కిలి, గరగరనగునేఱుప్రాలకలమాన్నంబుల్." నై. ౫, ఆ.

**ననుచు.** దే. అ. క్రి. 1. పూచు; (చూ. చోఁదుకబ్బముకడ రెండవ యర్థము నుదాహరణము.) 2. చిగిరించు; "పచిననిచిపూచికాచి పండిన." య. ౧, ఆ.-3. మొగ్గయెత్తు; (చూ. నన.) 4. అనురాగమొందు; "క. ననిచినప్రియుఁడవ్వదర్థవ్వ." రా. కిష్కి-ం, కాం.-5. అతిశయించు; "ద్వి. ననిచినకడిమిమైనన్నసాధించి." రా. సుం, కాం.-6. ఇంపగు. (చూ. ననుపు.) (ప్రే. ననిపించు.)

**ననుపు.** దే. వి. 1. అనురాగము; "క. ననుపునఁజనిరతనివేణు నాదంబునకుక" వి. పు. 2, ఆ.-2. అతిశయము; "గీ. మన ముతోనిండియున్న దినసపుఁగూర్మి." నై. 2, ఆ.-3. ఇంపు. "ననుపుగవినిలక్షణమొసర్చు." కా. ౨, ఆ. (చూ. ననుపుకాఁడు.)

**ననుపుకత్తె.** దృ. విశే. 1. ప్రియురాలు; 2. విటురాలు.

**ననుపుకాఁడు.** దే. విశే. 1. ప్రియుఁడు; "చుక్కలఱవరాం డ్రకుక ననుపుకాఁడు." రామా. ౨, ఆ.-2. విటుఁడు. "సీ. ననుపుకాఁడయివేల్పునాగవాసముఁగూడి మహిమగోల్పడియెనేమాం డకర్ణి." స్వా. ౨, ఆ.

**ననుపువడు.** దృ. అ. క్రి. (ననుపు+పడు.) స్నేహపడు. "పెక్కుదినంబులుననుపువడియునునెడరుగలిగిన నాంజొకరునిం గూడుకొనుటదినప్పభావగుణంబు." కవిక. ౪, ఆ.

**నన్న.** దే. విశే. కుఱుచే.

**నన్నూఱు.** దే. స. (నాలుగు+నూఱు.) చతుశ్శతము.

**నన్నుకాఁడు.** దే. విశే. ననుపుకాఁడుయొక్క రూపాంతరము. "సీ. చనిచూడఁగల్గినఁజాలుఁజేయునునన్నుకానిఁగాఁబూవిలుకాని నైన." (ఇక్కడ శ్లేషగనుక మొదటియర్థము అనుపుకాఁడు అని తెలియవలెను.) య. ౧, ఆ.

**నన్బ్రాయి.** దే. వి. ననుఁబ్రాయియొక్క రూపాంతరము. "సీ. రాగి లోహండినన్బ్రాయిలేకుఁడంగవండిదింపనిప్వరువంటకంబు." కాశీ. 3, ఆ.

**నపుంసకుఁడు.** సం. వి. అ. న. షండుఁడు, పేడి.

**నప్త.** సం. వి. ఋ. స్త్రీ. మనుమరాలు. పుం. 1. మనుమఁడు; 2. మునుమనుమఁడు.

**నప్త్రి.** సం. వి. ఈ. స్త్రీ. మనుమరాలు.

**నఫా.** హిం. వి. లాభము.

**నభము.** సం. వి. స్. న. ఆకాశము. పుం. 1. శ్రావణమాసము; 2. మేఘము; 3. వర్షాకాలము; 4. బిసతంతువు; 5. తమ్మపడిగము; 6. ముక్కు.

**నభసంగమము.** సం. వి. అ. పుం. పక్షి, పిట్ట.

**నభస్యము.** సం. వి. అ. పుం. భాద్రపదమాసము.

**నభస్వంతుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, గాలి.

**నమనము.** సం. వి. అ. న. వంగుట, నమ్రముగుట.

**నమలు.** దే. స. క్రి. తిను, భక్షించు. "నమలమాంసంబు." భార. అర. ౫, ఆ.

**నమస్యితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అర్చితుఁడు,

**నమస్కరించు.** సం. స. క్రి. చేమోడ్చు.

**నమస్కారము.** సం. వి. అ. పుం. చేమోడ్పు.

**నమస్కారి.** సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుఁదామరతీఁ.

**నమస్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము.

**నమస్య.** సం. వి. ఆ. స్త్రీ. పూజ, సపర్య.

**నమస్యితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అర్చితుఁడు.

**నమస్సు.** సం. వి. స్. న. నమస్కారము. "ఎ, గీ. నసమ్మృడాది కసుమనస్సునకునమస్సు." ఆము. ౬, ఆ. (దీనికి ఇతర గ్రంథములయందు ప్రయోగము మృగ్యము.)

**నమించు.** సం. స. క్రి. నమస్కరించు. "వ్యాసునినమించు." కాశీ. ౧, ఆ. (దీనికి ప్రయోగాంతరము కనఁబడదు.)

**నమితము.** సం. విణ. (అ. ఆ. అ.) వంగినది, నమ్రమైనది.

**నమిలి.** దే. వి. నెమిలియొక్కరూపాంతరము. "సీ. ప్రణవాక్షరాభ్యాస పరిపాటిఁబాటించునానావిధంబులనమిలిపింఛు." భీ. ౩, ఆ. (చూ. నెమిలి.)

**నముచిసూదనుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**నమూదు, నమోదు.** హిం. విణ. కనపఱచఁబడిన, వివరింపఁబడిన.

**నమూనా.** హిం. వి. మాదిరి.

**నమేరువు.** సం. వి. ఉ. పుం. సురపొన్నచెట్టు. (దీనికి దోహదము హసితము. చూ. దోహదము.)

**నమ్మకము.** దే. వి. నమ్మిక, విశ్వాసము.

**నమ్మదుంప.** దే. వి. గొట్టిగడ్డ, కశేరుకము.

**నమ్మి.** దే. వి. నెమిలి. "సీ. లయదప్పకుండమెల్లనెసోగపురివిచ్చి నమ్మిబోదలుపేరణములుత్రొక్క." చంద్ర. (నెమ్మియొక్కరూపాంతరము.)

**నమ్మిక.** దే. వి. నమ్మకముయొక్కరూపాంతరము.

**నమ్మిగ.** దే. వి. నమ్మికయొక్కరూపాంతరము. "క. తగుమాటలాంబికేయుం, డగుననికైకొనునెయెన్నఁడైననుగొడుకుల్, మగఁటిమిగలఁడనియెఱుఁగ,నమ్మిగఁజూచుచునుండుమవిషముమ్రింగినయేనిన్." భార. ఉద్యో. ౧, ఆ.

**నమ్ము.** దే. స. క్రి. నమ్మకముచేయు, విశ్వసించు.

**నమ్రము** సం. విణ. (అ. ఆ. అ.) వంగినది, నతము.

**నయ.** దే. వి. అందము. "సీ. నయకలవ్రేళ్లమట్టియలుఁబిల్లాండ్లిడి పాయవట్టముమెట్టెఁబడఁతియొర్తు." ఆము. ౬, ఆ. (దీని మొదటిరూపము నయము.)

**నయగారము.** దే. వి. (నయము+కారము.) 1. మృదుత్వము; "క. ప్రియమైరమణీయమణీ, మయమైయతిచిత్రమంజుమంజీరములన్, నయమైనచిలుకపలుకుల, నయగారమునందెలంగినయగారమునన్." సా. ౧, ఆ.—2. మృదువచనము. "సీ. పలుకుదీయములఱవెలిగొడుగులుగావెనయగారములలోనినగవుపసలు." రామా. ౭, ఆ. (కారము అనునది భావమునందువచ్చెడు ఒకానొకప్రత్యయము. చూ. చెలికారము మొ.)

**నయగారి.** దే. విణ. (నయగారము+ఇ.) మృదుత్వముగలవాఁడు, మృదువచనముగలవాఁడు. "నయగారిననుమనాథుఁడాశ్లేషింప." చంద్ర.

**నయనము.** సం. వి. అ. న. 1. కన్ను; 2. పొందించుట.

**నయము.** ఉభ. దే. వి. 1. లాభము; "గీ. నయముపేదకుఁగోరుననునోసంగి." ఆము. ౪, ఆ.—2. నునుపు; "మ. ము. సౌరభ్యమునివ్వటిల్లఁగ మనోమోదంబునందేఁటుల, ల్లనసోకఁ వెడలంగతేకులునమ్ముల్లానంబునందింకమై, కన్నయందెక్కుచుఁ గ్రందు పొందెడలీల గేసరంబుల్గడ, లొక్కనఁ దోడ్తోపుష్పభ్బ్రఁ జేరెలమిఁబొల్పుంజెందెనంభోజముల్." భార. ఉద్యో. ౨, ఆ.—3. మృదుత్వము; "చ. నినుపులోకర్తచేతఁగమనీయతాంతములున్న నొక్కడన్, గనుఁగొనిమూర్ధ యొక్కతె వికాసియైనవకంపుఁదీఁగఁబో, సినయిలగొమ్మగుత్తిసపిచేరినయంబునఁబట్టకోయఁజూ, చిన నదియల్లనవ్వ నదిసిగ్గుపడన్ గనియార్చిరంత టన్." (నయమునన్=మృదుత్వమున—అనఁగా తిన్నగాననుట.) నిర్వ. ౭, ఆ.—4. అందము. "ఎ, గీ. సొలపువలపులుగొలుపు నిచ్చలపుఁదెలుపు, సగపుమల్లెలకోకవింతనయముఁదెలుప." య. ౧, ఆ.—విణ. 1. చౌక; 2. నునుపైనది; 3. మేలైనది; "ద్వి. కల్లిబోటి యాట నయంబయి." విష్ణు. పూ. ౨, ఆ.—4. మృదువైనది; 5. అందమైనది. (చూ. నయగారముకడ మృదుత్వము అనునర్థము నుదాహరణము.) — సం. వి. అ. పుం. 1. నీతి; 2. పొందించుట; 3. ద్యూతవిశేషము.

**నయించు.** సం. స. క్రి. పొందించు.

**నర.** దే. వి. 1. ముదిమిచే వెంట్రుకలయందుఁగలుగుతెలుపు, పలితము; 2. ముదిమిచేత తెల్లఁబాఱినవెంట్రుక. "క. అబ్భపు, నలనొకనరయున్నఁజూపితరలాక్షియనున్." మార్క. ౭, ఆ.

**నరకఁడు.** వై. విణ. దుష్టుఁడు*. "నరకానీవాకెతొఁకె." హంస. ౩, ఆ.

**నరకము.** సం. వి. అ. పుం. దుర్గతి. (నరకములు ౨౧. — తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్రవనము, తాపనము.) డు. ఒక యసురుఁడు.

**నరకాంతకుఁడు.** సం. వి. అ. పుం. కృష్ణుఁడు.

**నరగ.** దే. వి. వాద్యవిశేషము, భేరి.

**నరగజెము.** దే. వి. నరగయొక్కరూపాంతరము.

**నరపాలుఁడు.** సం. వి. అ. పుం. రాజు, తేఁడు.

**నరపు.** దే. వి. నర, పలితము. (నరపగడ్డము, నరపమీసము అని ప్రయోగములయందు కానఁబడుటంజేసి వృత్తియందు వర్ణవికారమని తెలియవలెను.)

**నరము.** ఉభ. దే. వి. నాడి. సం. అ. న. రామకర్పూరముతీఁ.

**నరయు.** దే. అ. క్రి. ముదిమిచే వెంట్రుకలు తెలుపగు.

**నరవ.** దే. వి. కొండత్రోవ.

**నరవాహనుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**నరసింగఁడు.** వై. వి. నృసింహుఁడు. "నరసింగయకృష్ణుఁడు." కళా. ౧, ఆ.

**నరసింగము** వై. వి. మల్లబంధవిశేషము*.

**నరాజి.** దే. వి. కత్తి, ఖడ్గము. "సీ. ఒక్కొక్కకెందలిరుదయించెదరురాజితోరమైతనరెఁగంతునినరాజి." కృష్ణ. ౪, ఆ. (రూ. నరాజీ. "సీ. తననరాజీ చిల్వకును మార్తురాతెండ్లయునునుగాడు పులింపులొనఁగుచుండ." య. ౧, ఆ.)

**నరిగి.** దే. వి. గొఱ్ఱెలశరీరవర్ణవిశేషము. హంస. ౨, ఆ.

**నరిడి.** దే. వి. గుండెయుబ్బరపు పశురోగవిశేషము. (చూ. అడుగు ద్రిక్క.)

**నరియడు.** దే. వి. నక్క. "సీ. నరియఁడు మెరువాఁగెగరుడి యుఁ దాలయునెడమఁ బండియువచ్చి కుడిని నిలిచె." ఉ, రా. ౬, ఆ.

**నరియు.** దే. అ. క్రి. నరయుయొక్క రూపాంతరము. "క. సుర కుంజరములకొమ్ములు, నురిసెక్ దొండములు విరిసె మోములు నరిసెక్, బొరిఁబొరినఖలాంగంబులు, నెరిసెం జిత్తంబులు విరిసె నిరిసె జగంబుల్." లక్ష్మీ. ౪, ఆ.

**నరుఁడు.** సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. అర్జునుఁడు; 3. ఒక ఋషి.

**నరువు.** దే. వి. నరవుయొక్క రూపాంతరము. (చూ. నరియు.)

**నరేంద్రుఁడు.** సం. వి. అ. పుం. 1. రాజు; 2 పాములవాఁడు.

**నర్తకి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; 2. ఆఁడేనుఁగు; 3. గుఱ్ఱపుత్తికీ.

**నర్తకుఁడు.** సం. వి. అ. పుం. 1. నట్టువుఁడు; 2. పాసుల వాఁడు. విణ. ఆడెడువాఁడు.

**నర్తనప్రియము.** సం. వి. అ. పుం. నెమిలి, నట్టువపులుఁగు.

**నర్తనము.** సం. వి. అ. న. నటనము, ఆట.

**నర్తించు.** సం. అ. క్రి. నర్తనముచేయు, ఆడు.

**నర్తిల్లు.** సం. అ. క్రి.——వై.——(చూ. నర్తిలు. "హారముల క్కునసర్తిలంగ." రుక్మి. ౧, ఆ.)

**నర్మద.** సం. వి. ఆ. స్త్రీ. ఒకయేఱు. అ. పుం. ను. నర్మసచివుఁడు.

**నర్మము.** సం. వి. న్. న. పరిహాసము, మేలము.

**నర్లి.** దే. వి. అపేక్ష. "ఉ. వియపురాలవైతిగదవేయిపుడత్తపు తొంటివావినో, తోయజనేత్రుఁగాంచినవవధూమణినీసుతఁ బెండ్లి యాడఁగా, నాయకు నాకుమాయనకువర్తిలిహత్తగనత్తవావిచే, నాయువు గల్గువాఁడవుసటంద్రు శుభంబగు దీసనెంతయుక్." విజ. ౩, ఆ. (ఇది అర్తిలియొక్క మొదటిరూపము.)

**నఱకు.** దే. స. క్రి. ఖండించు. "క. నఱకెక్ దత్సేనఁ బార్థనందనుఁడవడిక్." భార. ద్రో. ౧, ఆ. "క. సుత్రామజ యాదుష్ట మతి నఱకఁబంపునెడక్." జై. ౮, ఆ.—వి. నఱుకుడు.

**నఱకుడు.** దే. వి. ఖండనము.

**నఱకుడుపడు.** దస్. అ. క్రి. (నఱకుడు+పడు.) ఖండితమగు. "క. పడుతలలుఁ దఱచునఱుకున్న, వడుచేతులుఁ జడినిబెండువడు గుండెలుఁజే, డ్పడుమేనులుఁ గడుఁద్రొక్కుడు, వడువడుగులుఁ బక్కిముఖుని భటులకుఁగలిగెక్." ఉ, రా. ౪, ఆ.

**నఱవ.** దే. వి. అఱవకు మొదటిరూపము. "సీ. నఱవలనైనను నలు వైన నెరవున ముట్టి యంటఁగఁబట్టికట్టివిడువ." (ఇట్లూకపాఠము.) భార. విరా. ౧, ఆ.

**నఱుకు.** దే. స. క్రి. నఱకుయొక్క రూపాంతరము. "వ. వాజుల కుఱికియువాలంబులనఱికియు" భాగ. ౬, స్కం.—వి. నఱుకుడు.

**నఱుకుడు.** దే. వి. నఱకుడుయొక్క రూపాంతరము.

**నఱుకుపరువడి.** దే. వి. శస్త్రవిద్యావిశేషము.

**నఱుకుబియ్యము.** దే. వి. (చూ.) నుఁగ్రాయి.

**నఱుకులాడు.** దే. స. క్రి. (నఱుకులు+ఆడు.) ఒకరినొకరు నఱుకుకొను.

**నఱుక్కు.** దే. వి. ఊగులుపడుటయందగు నను కరణము. "క. అప్పుడు సురనాయకుఁడు, కుప్పలియుఁ బడఁగుచు హరుని గొఱువఁ గడఁజనుటక్, ముప్పిరిగొనియెడువగలో, నప్పులుసిఁ జూచెగుండియ నఱుక్కనఁగక్." చంద్రా. ౩, ఆ.

**నఱుజు.** దే. వి. అజ్జ్య. "క. నఱుజుమెయుపూనియాద, బ్బఱ బొలఁచుకలోఁ జూచె." అచ్చ. కిష్కిం, కాం.

**నఱునూడు.** దే. స. క్రి. (నఱుము+ఊడు.) పొడిచేయు. "క. పెఱవారలధికభీతిక్, విఱిగిచనిరిభీష్ముఁడేచిగిరఁ భుకులం, దఱుఁ జూచిరాచకొమకుల, నఱుమనూడుభీముఁడిట్లు నఁడుఁగందగనె." భార. భీష్మ. ౨, ఆ.

**నఱుము.** దే. స. క్రి. పొడిచేయు. వి. పొడి. "చ. భటులు లెక్కడు మిక్కిలిసేనపాడుగా, నఱుమయిరథ్యకృష్ణుఁ డునినాదము నూగగనాంతరంబునక్, దఱచుగ గొప్పశస్త్రవితతిదానవసైన్యముఁ గూం చఁజన్యముక్." భార. ద్రో. ౩, ఆ.

**నఱ్ఱె.** దే. వి. 1. ప్రయాణముచేత విరుకఁదగినయాత్ర; (చూ. అఱ్ఱ.) 2. ప్రయాణముచేత బండిలాగుసవానికి పూన్పఁదగిన యెద్దు. "క. గుజ్జులముపురుపుమెచ్చని, నఱ్ఱలఁగట్టినరథముల నంద వ్రజముల్, బుజ్జులయార్పులుచెలఁగఁగ, దొడ్డులగనిచెంతుఁ దోలిరి లేశా." భాగ. ౧౦, స్కం. పూ.

**నల.** వై. విణ. నల్లయొక్క రూపాంతరము. (చూ. నలమేనిదొర.)

**నలఁక.** దే. వి. నలఁకువ.

**నలఁకువ.** దే. వి. 1. వ్యాధి; 2. శ్రమము; 3. బాధ. "ఎ, గీ. నెమ్మిదక్కరములు మృణాళములనుచుఁ, బొడిచిపొడి చి నోట్కిఁ దగులడకయున్న, విడిచివిడిచినలంకువనడలు నట్టి, బడుగుటం చలఁగాంచియప్పార్థిపుండు." చంద్ర.

**నలఁగు.** దే. అ. క్రి. 1. నలియగు; 2. పీడితమగు; "చ. పొదివనభోవిహారముసఁబూవుగుబోలెనలంగకుండన, మ్మదనమూనఁ బట్టకొని." ఉ, హరి. ౫, ఆ.—3. చెడు; "సీ. తూపుకంటఁ జెలంగ రూపునుఁ బసలంగఁబంచబాణుఁడుమేరిపాలఁ గనియె." ఉ, హరి. ౨, ఆ.—4. శ్రమపడు. "వ. ఇదుమపాట్లకుఁజొచ్చినలంగి తంచునె, క్కుడుమనుకంబుతోడఁదలద్రుచ్చికపుంగిటఁగూర్చెనంత టక్." కళా. ౪, ఆ.

**నలఁగుడు.** దే. వి. పీడనము.

**నలఁగుడుపడు.** దస్. అ. క్రి. (నలఁగుడు+పడు.) పీడితమగు.

**నలఁగుడు పెట్టు.** దే. స. క్రి. (నలఁగుడు+పెట్టు.) పీడించు. "అద్ధశకంధరుఁడూర్ధ్వలోకముల్ నలఁగుడువెట్టనెంచి." ఉ, రా. ౫, ఆ.

**నలఁచు.** దే. ప్రే. నలఁగఁజేయు. "ఘనాతిచండకాండవృష్టిక్ నలంప వచ్చు." రాఘ. ౨, ఆ.

**నలకూబరుఁడు.** సం. వి అ. పుం. కుబేరునికొడుకు.

**నలదము.** సం. వి. అ. న. 1. వట్టివేరు; 2. పూఁదేనె.

**నలమేనిదొర.** దస్. వి. విష్ణువు, కృష్ణుడు. "సీ. లీలమైకూలం బుఁగేలఁబూనినవాఁడు నలమేనిదొరతూపుగలుగువాఁడు." కృష్ణ. ౧, ఆ.

**నలి.** ఉభ. దే. వి. 1. రోగము; 2. పొడి. విణ. 1. నలఁగినది; "సీ. మఱికొందఱిక్కి మార్కొనినలియైనయలకనవాపాత్రునంటి రాఁజె." సాన్. ౧, ఆ. (ఆమ్రేడితమునందు నలినలి. "గీ. నలిన

లీలనంచునలినలిగావించు." విజ. ౧, ఆ.)—2. సన్నము. "గీ. వశలలావృననలికొనబలిసినిలువ." లక్ష్మీ. ౨, ఆ.—క్రి. అత్యం తము. "ద్వి. నలిరేఁగిచి త్రాంగిసగరికిఁబోయె." సా. ౨, భా.—క్రి. విశ. యోగ్యముగా. "గీ. నాదు ప్రశ్నములకునలినుత్త రములిచ్చి, వారిగొనుముసేవువలసినట్లు." భార. ఆర. ౭, ఆ "ఎ, గీ. పురుషులుఁగాంతలుఁగామభార్గ, లీలలెసఁగఁ గ్రోధాదులు లేకరుజయు, జరయునెఱుఁగకనలిఁజరింతురుదివంబు, నందునం గతనిర్భగానందమొంద." భార అను. ౫, ఆ. సం. వి. ఈ. స్త్రీ. గువ్వగుత్తికత్రీ.

**నలికండ్లపాము.** దే. వి. నలికీఁచు, రక్తపుచ్ఛిక.

**నలికము.** దే. వి. సన్నఁదనము, నునుత్వము.

**నలికిరి.** దే. వి. నలికండ్లపాము.

**నలికీఁచు.** దే. వి.——వై.——

**నలినలి.** దే. విశ. మిక్కిలి నలఁగినది. "సీ. తోరంపుగొరిజల త్రొక్కునవాడలెల్ల నలిగులియైసర్పనాథుఁపొదుఁగ." హరి. పూ. ౭, ఆ.

**నలిగొట్టు.** దే. విశ. సన్నమగునది. "ద్వి. సన్నరమ్మనిపిల్చునలి గొట్టునలుకు." హరిశ్చ. ౨, భా.

**నలితింది.** దే. వి. చిఱుదిండి.

**నలినము.** సం. వి. అ. న. 1. తామర; 2. నీరు.

**నలిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తామర; 2. తామరకొలను; 3. తామరతీఁగ; 4. తామరతంపర; 5. మిన్నేఱు.

**నలియు.** దే. అ. క్రి. నలఁగు. "వ. ప్రక్కలునలిసియుడొక్కలు నులిసియు." ఉ. హరి. 3, ఆ.

**నలు.** దే. స. వృత్తియందు హల్లుపరమగుచో నాలుగున కాదేశముగా వచ్చురూపము. (ఉదా. నలుగడ, నలుమూల మొ.)

**నలుఁగు.** దే. అ. క్రి. నలియగు. (నలఁగుయొక్క రూపాంతరము.) వి. 1. స్నానమప్పుడు మేనఱాచుకొనుటకు కొన్ని గంధద్రవ్యములు చేర్చి నూఱినపిండి, ఉద్వర్తనము; "నున్నఁదనంబుగానలుఁగు నూఁజేయు." భార. విరా. ౨, ఆ.—2. స్నానమప్పుడు పెండ్లి కూఁతునకును, పెండ్లికొడుకునకును మేననలుఁగుపిండిపెట్టినలఁచుట. "క. అంతటనృపుఁడంతఃపుర, కాంతలఁగుంకుమహిమాంబుకస్తూరి కలన్, వింతగనలుంగులిడుమని, కుంతీనందనులఁబెండ్లికొడుకులఁ జేసెన్." పాంచా. ౪, ఆ.

**నలుఁగుడు** దే వి. నలఁగుడు.యొక్క రూపాంతరము.

**నలుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒక రాజు; 2. ఒక వానరుఁడు; 3. పితృదేవత.

**నలుకువ.** దే. వి. 1. రోగము; 2. బాధ. "వ. కావునసలుకనలుకు వకునిలుకడయగుటందానినిడువవలయు." య. 3, ఆ.

**నలుగురు.** దే. స. నాలుగునకు మహన్మహత్వర్థక బహువచనాంతా దేశము.

**నలుచే.** దే. ప్రే. నలియఁజేయు.

**నలుతుము.** ద్వ. వి. (నాలుగు + తూము.) నాలుగుతూములు, ద్రోణము.

**నలుపు.** యు. దే. ప్రే. నలుచేయొక్క రూపాంతరము. వై. వి. నీలవర్ణము. విశ. నీలవర్ణముగలది. "గీ. జ్యోత్స్ననాఁగదమిస్ర నానుభియభార్య, ఉడుపతికినందునొకతెతెలొప్పర్తునలుపు." వై.

**నలువ.** ద్వ. వి. (నాలుగు+వా.) బ్రహ్మ, చతుర్ముఖుఁడు.

**నలువండ్రు.** ద్వ. స. నలువదిమంది. (నలువదికి మహన్మహత్వర్థకరూపము)

**నలువది.** ద్వ. స. (నాలుగు + పది.) నాలుగుపదులు.

**నలువు.** దే. వి. 1. ఒప్పిదము; "ఎ, గీ. నవవిధంబైనహరిభక్తి నలువుమెఱసి." (ఇక్కడ నలువుమెఱసి అనఁగా నలువై అని యర్థము.) పర. ౨, ఆ.—2. సామర్థ్యము. "వ వలచుట్టునఁ జెట్టుదండగొని నిలువనలువుగలపుళిందులఁగొందఱినేసి." సాష్ట. ౪, ఆ.—విశ. ఒప్పిదమైనది.

**నలువురు.** దే. స. నలుగురుయొక్క రూపాంతరము.

**నలుసాల.** ద్వ. వి. (నాలుగు + సాల.) చుట్టుకొల్లారు.

**నలుసు.** దే. వి. తృణాదిలేశము, రేణువు. "చ. సురలకుగుఁజెక్కడను శూరులడెందములోని కొఱ్ఱు ఖీ, చరతతికంటిలోనలుసు సాఘ్యలకొంగుననున్నచిచ్చు భూ, సురులకునెల్లనాఁడుమెడఁ జుట్టినపాము మునీంద్రకోటిపైఁ, బొరిఁబడనున్నయాపిడుగుఁ బొల్పఱఁజేసితినీవుగాఘవా." రా. యు, కాం.

**నల్గురు.** దే. స. నలుగురుయొక్క రూపాంతరము.

**నల్తుము.** ద్వ. వి. నలుతుముయొక్క రూపాంతరము.

**నల్ల.** యు. దే. వి. నెత్తురు. "నల్లద్రావుడుదొర." అచ్చ. సుం, కాం.—వై. 1. నలుపు; "గీ. అమ్మహాశ్వంబుధవళదేహంబునందు నల్లగలిగిననీవిష్ణునాకుదాసి, వగుము." భార. ఆది. ౨, ఆ.—2. బొగ్గు*. విశ. నలుపైనది. "ఈ నల్లతిరునామమెచటదొరక?" జై. 3, ఆ.—[నల్ల అను విశేషణము ముందుగల సంజ్ఞావాచక శబ్దములు.—నల్లకస్తోరము, (చోరముత్రీ.) నల్లగగ్గెర, (కరింజరముత్రీ.) నల్లగజిక, (బాలతృణముత్రీ.) నల్లగలువ, (ఇందీవరము.) నల్లగింటెన, (నీలపుష్పిత్రీ.) నల్లగినియ, (గినియత్రీ.) (గినియనే నల్లగినియయందురు.) నల్లగిసియ, (అతసిత్రీ.) నల్లగురిగింజే, (కృష్ణపాకి.) నల్లగురిజే, (కృష్ణగుంజత్రీ.) నల్లగూబ, (కృతమాలకము.) నల్లగొలిమిడి, (నీలదూర్వత్రీ.) నల్లగోరంట, (అర్తగళముత్రీ.) నల్లచీమ, (మర్కటపిపీలిక.) నల్లచెఱకు, (అనిక్షువుత్రీ.) నల్లచేవ, (కృష్ణాలుకముత్రీ.) నల్లజీలకఱ్ఱ, (కారవి.) నల్లతుమికి, (కాకతిందుకముత్రీ.) నల్లతెగడ, (కాలమేషికత్రీ.) నల్లతోటకూర, (కాలమారిషముత్రీ.) నల్లదిరిసెనము, (ఇరుగుడుత్రీ) నల్లదోమ, (తీక్ష్ణతుండము.) నల్లనేలగుమ్ముడు, (క్షీరవిదారిత్రీ.) నల్లపిచ్చుక, (పోతకి.) నల్లపులుగుడు, (కృష్ణకాంభోజిత్రీ.) నల్లపెసలు, (శింబికము.) నల్లబుడుసర, (కాకమాచిత్రీ.) నల్లమద్ది, (అశ్వకర్ణముత్రీ.) నల్లయిరుగుడు, (కృష్ణశింశపత్రీ.) నల్లయుప్పి, (దుర్ధర్షత్రీ.) నల్లయుమ్మెత్త, (హేమికత్రీ.) నల్లరంటి, (కృష్ణరంభత్రీ.) నల్లవావిలి, (శేఫాలికత్రీ.) నల్లవెదురు, (కృష్ణసారకముత్రీ.) నల్లావలు, (రాజిక.)]

**నల్లగ్రుడ్డు.** ద్వ. వి. కంటిలోని నల్లనిగ్రుడ్డు, కనీనిక.

**నల్లచ్చిగాఁడు.** ద్వ. వి. (నల్ల+ లచ్చేనము+కాఁడు.) పక్షివిశేషము, భరద్వాజము.

**నల్లతీఁగ.** వై. వి. కన్నెగొఱుతీఁగ, కృష్ణవల్లి.

**నల్లదాసరిగాఁడు.** ద్వ. వి. (నల్లదాసరి+కాఁడు.) తాఁబేలు, కమఠము. (చూ. గండె.)

**నల్లద్రావుడు.** దే. వి. (నల్ల + త్రావుడు.) రాక్షసుఁడు, అస్రపుఁడు. "ఎ, గీ. అల్లనల్లద్రావుడుమూఁకలఁద్రెళ్ళఁజేసి." అచ్చ. అర, కాం.

**నల్లన.** వై. వి. నలుపు, కృష్ణవర్ణము. (విశేష-ముగుచో. "ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబుపైఁ, జల్లెడువాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వురా, జెల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబుఁదెచ్చెనో, మల్లియలారమీపొదల మాటునలేఁడుగదమ్మచెప్పరే." భాగ. ౧౦, స్కం. పూ. భా. అలకన.)

**నల్లనయ్య.** వై. వి. (నల్లని+అయ్య.) కటిచేల్పు, కృష్ణుఁడు. "ద్వి. అన్నచిపిప్రముసన్నడిగినవెల్ల, నన్నల్లనయ్యమాయానాటకంబు." విష్ణు. పూ. ౧, ఆ.

**నల్లపూస.** ద్వి. వి. కొందఱు ముత్తయిదువలు గ్రుచ్చిమెడను గట్టుకొనెడు చిన్న నల్లగాజుపూస.

**నల్లమందు.** ద్వి. వి. అభిని.

**నల్లమడుఁగు.** ద్వి. వి. మిక్కిలి లోఁతుగల మడుగు.

**నల్లవడు.** వై. అ. క్రి. (నల్ల+పడు.) నల్లనగు.

**నల్లవలువతాలుపు.** ద్వి. వి. బలరాముఁడు, నీలాంబరుఁడు.

**నల్లవో.** దే. అవ్య. పౌరా. "ఉ. నల్లవొనిక్కమాటెన్నుపనందనుండటద్రోణుఁడొక్కఁడుౙ." భార. విరా. ర, ఆ. (రూ. నల్లహో. "గీ. ఇంతప్రొద్దుకిరీటికట్టెదురనిలువ, వెఱవకున్నపుద్రోణుండవింటివాఁడు, నల్లహోతనయున్నసేనకునొకండ, బలిమిఁదలమీఱునేయిట్లునిలువవలదె." భార. విరా. ౫, ఆ.)

**నల్లి.** దే. వి. (నల్ల+ఇ.) పఱుపులయందుండి నెత్తురుత్రాగెడు పురుగు, మత్కుణము.

**నల్లిండ్లు.** దే. వి. బ. (నల్ల+ఇండ్లు.) అగ్రహారము. "క. సుతుఁడునుగుడినిధిచెఱువును, గృతియునునల్లిండ్లువనముకీతిలొపలసం, తతులెంచులోననెన్నఁగఁ, గృతివలనంగలుగునంత్రముకీర్తియు గతియుౙ." మై. ౧, ఆ. (ఔపాసనధూమముచే నల్లనివని యెఱుఁగునది.)

**నల్లిక.** దే. వి. నలికండ్లపాము.

**నల్లె.** దే. వి. జీన. (చూ. అంటసిల్లు.)

**నల్లెరు.** దే. వి. నల్లేరుయొక్కరూపాంతరము.

**నల్లేరు.** దే. వి. ఒకదినుసు తీఁగ, వజ్రవల్లి.

**నల్వది.** ద్వి. న. నలువదియొక్కరూపాంతరము.

**నల్వము.** సం. వి. అ. పుం. నన్నూఱుమూరలదూరము.

**నల్వురు.** దే. న. నలువురుయొక్కరూపాంతరము.

**నవ.** దే. వి. జల, దురద, కండూతి.

**నవటాకు.** హిం. వి. సేరులో ఎనిమిదవవంతు.

**నవఁత.** దే. వి. 1. నవయుట; "ద్వి. తెవులునుముదిమియుఁదీవ్రవేదనయు, నవఁతయులేనిప్రాణంబులుగాన." గా. కిష్కిం, కాం.—2. దుఃఖము. "ద్వి. నారచీరలుజడల్ నవఁతమైఁదాల్చి, నారాకఁగోరుచున్నమహామహుండు." రా. అర, కాం. (అలఁతవంటిది.)

**నవకము.** ఉభ. దే. వి. మృదుత్వము. "గీ. నవశిరీషసుమంబుల నవకమునకు, నన్నదమ్ములుపోనీయడుగుఁదమ్ము, లెంతదూరమ్ము నడిపింపనిచ్చగించె, నొక్కొనిర్దయమైననీయుల్లమిపుడు." నై. 3, ఆ.—సం. అ. న. తొమ్మిది.

**నవక్షారము.** సం. వి. అ. పుం. నవాసారము.

**నవగోజ.** దే. వి. పెద్దగుడారము.

**నవతి.** సం. స. ఇ. స్త్రీ. తొంబది.

**నవనము.** సం. వి. అ. న. స్తోత్రము, పొగడ్త

**నవనీతము.** సం. వి. అ. న. అప్పుడు చిలికియెత్తినవెన్న.

**నవమము.** సం. విశే. (అ. ఆ. అ.) తొమ్మిదవది.

**నవమాలిక.** సం. వి. ఆ. స్త్రీ. విరజాజి.

**నవమి.** సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు తొమ్మిదవతిథి. విశే. తొమ్మిదవది.

**నవము.** సం. వి. అ. పుం. స్తోత్రము. విశే. క్రొత్త.

**నవయు.** దే. అ. క్రి. 1. (రోగాదులచేత) కృశించు; "క. జనిలపందనుఁడు మహిమా, దర్పగర్మిఁడగుచుడస్సిన, నాగముక్రిందనుండునుస్నె నవసివసమునౙ." భారా. ఆ. ౫, ఆ.—2. శుష్కించు. "సీ. వెడలునిట్టూర్పులనేఁడిమిసవ నివయుచు పల్లవములుగా కుఁబోల." భార. అర. 2, ఆ.

**నవరంగము.** సం. వి. అ. న. గృహవిశేషము. "మ. పడ్పపడ్పద నాంతరాళనవరంగిషోడశస్తంభంబున, జ్యోతుల వజ్రవజ్రతేజఘనంబు నిధి భాసురయోపజిహ్వస్థలిౙ." పాండు. ౫, ఆ.

**నవరు.** దే. వి. నగరుయొక్కరూపాంతరము. "క. వివిధాల్పాసంబులకుౙ, నవల్లలోఁదోఁచుకీనుఁకుఁదోస్తేకాం, తివిధానంబుననిరనన, మవ్వనుబురోహితునిచేతననవరతంబుౙ." భారా. శాం. ౨, ఆ.

**నవల.** దే. వి. ఆఁడుది, ఇంతి. "క. అన్నవలముద్దుమోమున, దిన్ననినెన్నడుము నగవు దేఱెడుకన్నుల్." విక్ర. ౫, ఆ. (రూ. నవలా. "మ. నతనాభీనవలానొకానొకమరుస్నారీ శిరోరత్నముౙ." సా. ౨, ఆ.)

**నవాతు.** దే. వి. మిక్కిలి తెల్లనిగడ్డ చక్కెర. (చూ. నవర.)

**నవారు.** హిం. వి. మంచమునకల్లునూలుపట్టె.

**నవాసారము.** వై. వి. ఒకదినుసు ఉప్పు.

**నవి.** దే. వి. కరగోడపెట్టుటకు నిడుపున త్రవ్వియెత్తినమట్టిపల్లము.

**నవీనము.** సం. విశే. (అ. ఆ. అ.) నూతనము, క్రొత్త.

**నవుకరి.** హిం. వి. కొలువు.

**నవుకరు.** హిం. వి. కొలువుకాఁడు.

**నవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నవీనము; 2. నతింపఁదగినది.

**నవ్వు.** దే. అ. క్రి. 1. హసించు; 2. వికసించు. "ఎ. గీ. చూతపున్నాగకురవకాశోకతరులు, నవ్వెనవ్వులు పువ్వులైనివ్వటిల్ల." గామా. ౨, ఆ. (ఇది పైరెండర్థములకు నుదాహరణము.)—స. క్రి. 1. పరిహసించు; "ఉ. అవ్వలనెన్నిలేవిట మహాగహనంబునఁగుంజవృక్షముల్, దవ్వులెయప్పుడున్నయడిదామనకుందగు కాణయాచియే, యివ్విధిమున్నయేనెఱిఁగి యెంతయుఁజెప్పనసాదరంబుతో, నవ్వితిగానిపుట్టదుమనంబునమీఁదటిహానిధ్వనిన్." పంచ. వా. ౧, ఆ.—2. అపహసించు. "గీ. నువ్వుఁబువ్వునవ్వుజవ్వనినాసిక." విజ. ౧, ఆ.—వి. 1. హాసము; 2. వికాసము; (చూ. హసించు, వికసించు అను నర్థముల యుదాహరణము.) 3. పరిహాసము; "క. అనృతముపాతకమగునే, ననువనితలయెడనుబెండ్లి నవ్వులనమృతివ, చ్ఛినసర్వధనముచెడుచో, విన మదిపాపంబుగాదు విమలచరిత్రా." సం. "ననర్మయుక్తమనృతంహినస్తి నస్త్రీషురాజన్న వివాహకాలే, సగురవ్వర్థేనాత్మనోజీవితార్థే పంచానృతాన్యాహురపాతకాని." భార. శాం. 3, ఆ.—4. అపహాసము. (వాని బ్రతుకు నవ్వులపాలైనది.)

**నవ్వుఁబాటు.** ద్వ. వి. (నవ్వు+పాటు.) నగుఁబాటు, అవహాసము. "ఎ, గీ. నాకతంబున వచ్చిన నవ్వుఁబాటు, మాటువడఁజేసెఁ గీర్తిమగనిఁ దెత్తు." ఉ, హరి. ౫, ఆ.

**నవ్వుటాలు.** దే. వి. నవ్వులాటయొక్క మాఱురూపము. "ఉ. నావ్రుసున నవ్వుటాలకని నన్ బవనాత్మజ యింతయేటికిన్." భార. ఉద్యో. 3, ఆ. "గామసాస్వమితౌనవ్వుటాలటులొక్కమ్మునఁదత్కృపిద్వయము వ్రయ్యంజేసె." (నవ్వుటాల-నవ్వుటాలగా.) అధ్యా. ఆర, కాం.

**నవ్వులబండి.** దే. విశే. నవ్వేడు స్వభావముకలది.

**నవ్వులాట.** దే. వి. (నవ్వులు+ఆట.) పరిహాసము.

**నశించు.** సం. అ. క్రి. నాశమగు.

**నశ్వరము.** సం. విశే. (అ. ఆ. అ.) నశించునది.

**నష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నాశమునొందినది; 2. మఱుఁగుపడినది.

**నష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. నాశము; 2. ద్రవ్యనాశము.

**నస.** ఉభ. దే. వి. 1. దురద; 2. ఉపద్రవము. (ప్రాద్ధునలేచిన నసన నాకు పెద్దదిగానున్నది.) సం. ఆ. స్త్రీ. నాసిక.

**నసగూఁటి.** దే. విశే. (నసగూఁడు+ఇ.) కామోద్రేకముకలది, జారిణి. "సీ. విసవెట్టెకసరెత్తియెసరేఁగుననగూఁటి పూఁబోండ్లు తమయిండ్లపొంతకరుగ." హంస. ౧, ఆ.

**నసగూఁడు.** దే. వి. కామోద్రేకము. "నసగూఁడుఁగడున్ జపలస్వభావలై." పంచ. నా. ౨, ఆ.

**నసనసి.** దే వి. దురద, కండూతి.

**నసుకు.** దే. వి. అసత్యపుమాట. విశే. అసత్యము.

**నస్తితము.** సం. వి. అ. పుం. ముకుద్రాడుకుట్టినయెద్దు.

**నస్యోతము.** సం. వి. అ. పుం._____పై._____

**నళ.** సం. వి. అ. పుం. సంవత్సరవిశేషము. (చూ. సంవత్సరము.)

## నా.

**నా.** దే. స. నేను అనుదానికి ప్రాతిపదికము.

**నాంచారు.** అర. వి. ఒకదేవత.

**నాంది.** సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతలు బ్రాహ్మణులులోనగువారు చేయునట్టి ఆశీర్వాదము; 2. నాటకప్రారంభమునందు జరపెడు మంగళము; 3. భేరి.

**నాందీకరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆశీర్వాదము చేయువాఁడు; 2. భేరివాయించువాఁడు.

**నాందీవాది.** సం. విశే. (న్. ఈ. న్.)_____పై._____

**నాఁగటిచాలుకూర.** ద్వ. వి. తఱిగొఱ్ఱ, లాంగలికి.

**నాఁగటిచాలుపేరియతిని.** ద్వ. వి. సీత. "క. కన్నియతలమానికమగు, నన్నాఁగటిచాలుపేరియతివన సిరికిం, బెన్నద్దినెత్తుకొనిచని, యెన్నేచుఁడురథముమీఁదనిడుకొనికడిమిన్." రామా. ౫, ఆ.

**నాఁగటిచిప్ప.** ద్వ. వి. (నాఁగలి+చిప్ప.) (నాఁగటి) పణత.

**నాఁగటిజోదు.** వై. వి. (నాఁగలి+జోదు.) బలరాముఁడు, హలాయుధుఁడు. "ఉ. లాలసరీగజాంకుశుఁడులావుననాఁగటిజోదునసఁగెం, గేలనగీటడంచిబలుగెల్పుఁబయిండి నెలంతినెలకొఁ, జాలినవాఁడు." య. ౧, ఆ.

**నాఁగటిదుంప.** ద్వ. వి. (నాఁగలి+దుంప.) (చూ. నాఁగటిచిప్ప.)

**నాఁగలి** వై. వి. దున్నెడుసాధనము, లాంగలము. "గీ. స్కంధపీఠంబుమీఁదనాఁగలిదగిల్చి." హరి. ఉ. ౧, ఆ.

**నాఁగు.** దే. వి. ధాన్యమునకు వడ్డిగానిచ్చు ధాన్యము. "సీ. అచటరెడ్డికొమాళ్ల నలహలాయుధపాణినాఁగునకడుగు ధాన్యంబుకొంత." పాంచా. ౧, ఆ.

**నాఁగురు.** వై. వి. నాగినికి.

**నాఁగెలు.** వై. వి. నాఁగలియొక్కరూపాంతరము.

**నాఁగేలు.** వై. వి. నాఁగెలుయొక్కరూపాంతరము.

**నాఁచికోలు.** దే. వి. (నాఁచికొనుట.) అపహరించుకొనుట. "ఉ. ఫల్గునుఁడుందదఱిమీఁదసైంధవ, ప్రాణమునాఁచికోలునరపాలతలంపఁగమర్త్యకృత్యమే." భార. శల్య. ౧, ఆ.

**నాఁచు.** దే స క్రి. అపహరించు. "ఉ. ఏఁడుగదమ్మనాహృదయచిత్తమునాఁచినవాఁడునమ్మలి." అని. ౨, ఆ.—వి. తీఁగపాఁచి, కుంభిక.

**నాఁడు.** దే. వి. 1. ఆకాలము; "ఉ. వేఁడినవేఁడిమాటనృపనిరుఁడుసైఁపకకర్ణరంధ్రముల్, చూఁడినభంగిఁదాఁకుటయు ప్రక్కిమనంబున నొచ్చినిన్ననే, నాఁడునృపాలపుత్రివని నమ్మివరించితీఁగాకయిమ్మెయిన్, నేఁడొకకాలసర్పమయినీవిటునేయుటనాకుఁదోఁచునే." రా. అ, కాం.—2. ఆదినము. "క. నాఁటికయిదేండ్లవాఁడను, మాటవినికృతంబుదలఁచి మానసమునన, త్తోఁటులమీఁదనుబంధులు, గీఁటుకొనుచు దుష్టబుద్ధికృత్రిమబుద్ధిన్." జై. ౭, ఆ. [నాఁడు అనుటకు ఆనాఁడు అనియు నొకానొకచోట ప్రయోగము కానఁబడుచున్నది. "క. ఏనాఁడుబ్రహ్మపుట్టెనొ, యేనాఁడుప్రజాసమృద్ధినిర్ధరగనెనో, యానాఁడెనిలువసేడని, యీనిడముఁగట్టితిన్ నరేశ్వరయనినన్." ఉ, రా. ౭, ఆ. వృత్తియందు కేవల కాలవాచకమును దినవాచకమునగు. "చిన్ననాఁడు." "నానాఁడు" మొ. ప్రామాణిక కవిప్రయోగములందిది నిర్భిందువుగానును గానంబడియెడి. "క. మీటుగలరథికులననొక, నాటికివేవురవధింతునరుశరములునో, నాటిఁడవైచునంతకు, వేటాడెదఁబ్రతిబలింబు నీరులనెల్లన్." ("మీటుగలరాజరథికుల్క, నాటికివేవురవధింతు" అని వ్రాఁతప్రతులయందు పాఠము కనఁబడుచున్నది.) భార. ఉద్యో. ౪, ఆ. "ఉ. నాటికి నెట్టిదైవఘటనంబుననో నినునొల్లకెంతయున్, గాటపుఁగోపముం బెనుపఁగాదనుసమ్మెయి నంటిఁగాకపూఁ, దోఁటకుజీతకాంద్రుమవతొల్లిటివారలులేరెనీవిధుం, జేటికిఁబోవఁగావలయునీవటుపోవఁగనేలకాఁతుగా." కళా. ౪, ఆ. మఱియు చూ. రేన్నాళ్లు, మూన్నాళ్లు మొ.] 3. కాలము. (ఆనాఁడు, ఏనాఁడు, ఎల్లనాఁడు.)

**నాఁడెము.** వై. వి. నాణెమునకు మొదటిరూపము. (చూ. నాణెకత్తె, నాణెకాఁడు.)

**నాఁషఱాయి.** దే. వి. (నాను+ఱాయి.) నిషశిల. (దీనిని త్రొక్కినను ఆ చోట నొప్పికలుగును.)

**నాకబలి.** సం. వి. ఇ. పుం. (చూ.) నాగవల్లి. "ఫాలుపుమీఱఁగనాకబలికృత్యములుసల్పి." కళా. ౭, ఆ.

**నాకము.** సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. ఆకాశము.

**నాకిని.** సం. వి. ఈ. స్త్రీ. దేవతాస్త్రీ.

**నాకు.** దే. స. క్రి. లేహనముచేయు.

నాకులి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షీక.

నాకు. వృ. సం. వి. ఉ. పుం. 1. పుట్ట, 2. కొండ; 3. ముని.

నాకేశుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

నాక్రము. సం. వి. అ. పుం. నక్రముయొక్క ముఖమువంటి ముఖముగల నక్క.

నాగ. వై. విశే. 1. పూజ్యము*; (నాగబెత్తము మొ.) 2. పెద్ద*. (నాగగన్నేరు మొ.)

నాగఁడు. వై. వి. శేషుఁడు.

నాగకేసరము. సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు.

నాగకేసరులు. దృ. వి. బ. ధాన్యవిశేషము.

నాగగన్నేరు. దృ. వి. ఒకదినుసుగన్నేరు. "నాగగన్నేరులు మూనాళ్ల సొబగు." పల్లా. 3, ఆ.

నాగజిహ్విక. సం. వి. ఆ. స్త్రీ. మణిశిల.

నాగదంతకము. సం. వి. అ. పుం. గొండ్లెముతగిలించెడు నాగవాసము.

నాగదాళి. దే. వి. ఒకదినుసు ముండ్లచెట్టు.

నాగనేరెడు. దృ. వి. ఒకదినుసు నేరేడుక.

నాగపడగలదండ. మి. గ్రా. వి. స్త్రీకంఠభూషావిశేషము. "ద్వి. భాసురంబగునాగపడగలదండ, యాసలఁజేరె నయ్యతివ యెదండ." భాగ. ౧౦, స్క౦. (చూ. నాగపడగలు.)

నాగపడగలు. మి. గ్రా. వి. బ. పాఁపపడగవలె నేర్పడియుండు కణ్ఠభూషావిశేషము.

నాగపసాని. వై. వి. నాగవల్లినడపెడు ముత్తయిదువ.

నాగపాశము. సం. వి. అ. పుం. 1. వరుణునియాయుధము; 2. రతబంధవిశేషము.

నాగపెంజెర. దృ. వి. ఒకదినుసు పెంజెర.

నాగప్పసాని. వై. వి. నాగపసానియొక్క రూపాంతరము.

నాగబంధము. వై. వి. సర్పాకారరచన. (చూ. ఎగవు.)

నాగబల. సం. వి. ఆ. స్త్రీ. బిఱక.

నాగబెత్తము. వై. వి. పొన్నువేసి మంత్రపూతమైన చిన్నపేము. "చ. లలితపుబూదిపూఁతయును లాతపుఁగోలయుఁ గక్షపాలయుక్, మలగొనుచిన్నికెంజడలు మంతులపొత్తము నాగబెత్తముక్, బలిగనుపట్టుకన్నెరయు లాహిరిమోదము సింగినాదముక్, జెలువలరంగనొప్పనొకసిద్ధుఁడుసింగపువారువంబుతోక." కళా. ౨, ఆ.

నాగమల్లె. వై. వి. ఒకదినుసు మల్లె, అష్టపత్రిక.

నాగము. సం. వి. అ. న. 1. తత్తు; 2. తగరము; 3. రతబంధవిశేషము. పుం. 1. పాము; 2. ఏనుఁగు; 3. కొండ; 4. గ్రహము; 5. గొండ్లెముతగిలించెడునాగవాసము; 6 మబ్బు; 7. ఒక ఉపవాయువు; (చూ. వాయువు.) 8. ముస్తెక; 9. నాగకేసరముక; 10. పొన్నక; 11. (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము. (అష్టనాగములు. అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కుళికుఁడు, పద్మఁడు, మహాపద్మఁడు, కర్కోటకుఁడు.)

నాగముస్తె. వై. వి. భద్రముస్తకముక.

నాగరంగము. సం. వి. అ. పుం. నారంగము, నారింజక.

నాగరము. సం. వి. అ. న. 1. శొంఠి; 2. ముస్తెక; 3. నాగరదేశీయాక్షరము. పుం. గోరంటక. విశే. నగరముసంబుట్టినది.

నాగరికత. సం. వి. ఆ. స్త్రీ. నాగరము.

నాగరికము. సం. విశే. (అ. ఆ. అ.) నాగరమైనది.

నాగలోకము. సం. వి. అ. పుం. పాతాళము.

నాగవనము. సం. వి. అ. న. ఒక కరణము. (చూ. కరణము.)

నాగవలి. వై. వి. నాగవల్లియొక్క రూపాంతరము.

నాగవల్లి. ఉభ. వై. వి. పెండ్లిలో నాలవనాఁడు జరగు శుభకార్యము. "గీ. నాగవల్లిమెంచెనానాముసిఁఁ పు, న్నాగవల్లికిచ్చి బాగుదీర్చి, త్యాగమెల్లియచుచుఁదక్క వాఁడాసఁగు, నాగవల్లి మాత్రనాఁడలంపు." పాంచా. ౪, ఆ.- సం. ఈ. స్త్రీ. తమలపాకుతీఁగ (దీని తొడిమవ్యాధికరము.)

నాగవాసము. ఉభ. దే. వి. గొండ్లెముతగిలించెడు కొండు కొలువంచిన యినపకన్ని. వై. 1. వేశ్యాసమూహము*; "సీ. ననుపుకాఁడయివేల్పునాగవాసముఁగూడిమహీమగోల్పడియేసేమాందక్షి." సారం. ౨, ఆ.--2. ఆటమేళము*. "సీ. నాఁడెంపుఁ గోటలనాగవాసంబులఁగొమ్మలుఁగొమ్మలుగొనబుసప." అచ్చ. బాల, కాం.—సం. అ. పుం. నాగలోకము.

నాగసంభవము. సం. వి. అ. న. సింధూరము.

నాగసరము. వై. వి. 1. పాములవాఁడు ఊఁదెడుబుఱ్ఱ; 2. సన్నాయి*. "ద్వి. కంచుకొమ్ములుబూరగలునాగసరము, లంచితపటహకాహళములునరుమ." నల. ౨, భా.

నాగసుగంధ. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షీక.

నాగస్వరము. సం. వి. అ. పుం. పాములవాఁడు ఊఁదెడుబుఱ్ఱ.

నాగా. హిం. వి. శూన్యము, సున్న, విడిచిపెట్టఁబడినది.

నాగాంతకుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

నాగిని. ఉభ. వై. వి. లోకాంతరముపొంది దేవతాత్వమువహించిన ముత్తయిదువ. సం. ఈ. స్త్రీ. గొల్లజిడ్డుక.

నాగుఁబాము. దృ. వి. (నాగు+పాము.) నాగము.

నాగులు. వై. వి. బ. నాగుఁబాము. "నాగులచవితివ్రతము." క్షేత్రయ.

నాగువు. వై. వి. నాగుఁబాము. "గీ. పాతకముచేసియైననుబరితసించి, ధరణిదానంబుచేసినధన్యుఁడనుచు, నయ్యపమముదక్షమిది నిర్జరాధినాథ, కుబుసమూడ్చినమేటినాగువునుబోలె." భీ. ౫, ఆ.

నాగోదము. సం. వి. అ. న. ఉదరత్రాణము.

నాజూకు. హిం. విశే. సున్నితమైన, నాణ్యమైన.

నాట. సం. వి. అ. పుం. రాగవిశేషము.

నాటకము. ఉభ. వై. వి. 1. నర్తనము; "దండకము. పెన్నాటకంబైనక్రాల్గన్నులక." పాండు. ౪, ఆ.—2. ప్రవర్తనము*, "గీ. పుండరీకాక్షునకుశౌరిపూజలిచ్చె, నందయముటచూడబదరికాశ్రమమునందు, నాఁగబిందుమయ్యెరుఫురనాటకంబుఁ, జెప్పి చెప్పులకుఁబండుపుసేయుమనఘ." ఉ. హరి. ౨, ఆ.—సం. అ. న. నాట్యప్రధానమైపద్యగద్యాత్మకమైనగ్రంథవిశేషము. (ఇవి.— ౧౦. నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము.) పుం, న. నాటకగ్రంథముయొక్క నాట్యము.

**నాటకసాల.** వై. వి. నాట్యశాల. "చ. చిలుకలకొల్కి తల్కి యొక చేసియనాటకసాలనేడప్తె, నిలువుననాడుచుండి." సా. ౫, ౭.

**నాటు.** దే. స. క్రి. గ్రుచ్చుకొను. "క. మీటుగలరథికులను నొక, నాటికవేప్రకవధింతునకుతరకులునో, నాటిపడవైచునంతకు, వేటా డెదఁబ్రతిబలంబుకోరులనెల్లన్." భార. ఉద్యో. ౪, ఆ.—అం, ప్రే. గ్రుచ్చు. "శక్తిదశకంబు నవ్వరుపైనాటినన్." ఉ, హరి. 3, ఆ.—స. క్రి. (నేలను) నాటులోనగువాని గ్రుచ్చు. "ఎ, గీ. నాటె మందారతరువ్రలుకోఁటలందు." భీ. ౫, ఆ.—వి. 1. నాట్నము; (అచేనియందు నాటు ముగిసినదా.) 2. నాటుట. "మున్నడిసయ హాస్యకూటములునాటిననాటులనెంబడిన్." చంద్రా. ౧, ఆ.

**నాటుకొను.** దే. అ. క్రి. నెలకొను. "గీ. నాటనుండియుఁగం ను సునాటుకొన్న, దిగులుపెంపుసవసుదేవదేవకులను, మిగులఁ బదిలంబుగావించిమెదలనీక, యొక్కకారాగృహంబుసనునిచియుం డె." వి, పు. 2, ఆ. (ప్రే. నాటుకొలుపు.) "క. ఆమాట మదినిబెట్టక, నామీఁదంగనికరంబు నాటుకొలుపుచున్, వేమొనలు పెచ్చిరక్కసి,గామిడిఁగడపుమనియతనికడఁగడుఁజెపుమా." అచ్చ. సుం, కాం.

**నాటుపురము.** అం. వి. పల్లెటూరు.

**నాట్నము.** దే. వి. నాటులోనగువాని నాటుట. (దీనికి మొదటి రూపము నాటనము.)

**నాట్యము.** సం. వి. అ. న. 1. నృత్యము; 2. నృత్తగీతవాద్య ములకూడిక.

**నాడా.** హిం. వి. సన్ననినూలుపట్టె.

**నాడి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నరము; 2. గడియకాలము; 3. నారి కురుపు; 4. ఈనె; 5. కాఁడ; 6. తెల్లగఱిక; 7. మోసకాని నడక. (ప్రాణాయామవిషయములు నాడులుమూడు. ఇడ, పింగళ, సుషుమ్న.)

**నాడింధముఁడు.** సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.

**నాడిక.** ఉభ. దే. వి. దేశము. "క. అన్నాతియునోడయఁడునటు, లన్నారనిసిఫుకోస కరుదెంచినచో, నన్నాయన్నాడికనా, యన్నా నాకుకొనఁజాలునట్టిదెచెపుమా." అచ్చ. అ, కాం. (నాడు యొక్కరూపాంతరము.)—సం. ఆ. స్త్రీ. గడియకాలము.

**నాడీవ్రణము.** సం. వి. అ. పుం. నారికురుపు.

**నాడు.** దే. అ. క్రి. నాటు. "క. తోడసహాయసూతులనో, నాడఁగ నేయుటయు నతఁడునలిగికడఁకవిల్, గ్రీడయపోలెన్ గొనిమెంబు, నాడఁగనిగిడించెఁద్రిదశ నారాచంబుల్." భార. కర్ణ. ౨, ఆ.—వి. 1. దేశము; 2. జనపదము. "వ. ఇవ్విశ్వంభర నేద్వీపంబున నే దేశంబున నేనాటనేవీటనే త్రోవనే క్రేవనేవేళ నెవ్వండేమిసేయఁ దలంచె." ఆము. ౪, ఆ.

**నాడె.** దే. వి. నడుమనూలికండెనుంచి నేసెడు సాలెవాని సాధన విశేషము. (చూ. క్రోవికడ అనుపోసెడుగొట్టము అనునర్థము నుదాహరణము.)

**నాణకము.** సం. వి. అ. న. రూపాయలోనగునాణెము.

**నాణెకత్తె.** వై. విశ. (నాణెము+కత్తె.) నాణెముగలది. (మొదటి రూపము నాఁడెకత్తె.)

**నాణెకాఁడు.** వై. విశ. (నాణెము+కాఁడు.) నాణెముగలవాఁడు. (మొదటిరూపము నాఁడెకాఁడు.)

**నాణెము.** వై. వి. 1. ముద్రింపఁబడిన రాగి, వెండి, బంగారముల బిల్ల; 2. ఇచ్చిపుచ్చుకొనుటయందలి యోగ్యత*; 3. నాగరికత*. (నాఁడెము యొక్కరూపాంతరము.)

**నాతము.** దే. వి. బత్తెము. "ఉ. కొల్చినపేదసాదలన్, దప్పని తనాతములఁదన్నుట భూషణమయ్యెఁబుత్రకా." రా, వి. ౨, ఆ.

**నాతి.** దే. వి. ఆఁడుది, ఇంతి.

**నాతుక.** దే. వి. (నాతి+ఉక) నాతియొక్కరూపాంతరము. (స్వార్థమున ఉక.)

**నాదము.** సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

**నాదారు.** హిం. విశ. లేమిడిగల, చిక్కిన.

**నాదించు.** సం. అ. క్రి. మ్రోఁగు. "గీ. గంటనాదించినవిశాగంను తేఁటి, మొరయుచందాసజలధరములురీతి, నురుమగీచిన భాతి నయ్యుత్పలాప్తు, నారిరణమున మ్రోసెనాదారకపుడు." శశాం. ౫, ఆ.

**నాదు.** వై. వి. ధ్వని. "ఎ, గీ. నాదుమొలనూలిగంటలనాదువినక." సా. ౨, ఆ.

**నాదేయము.** సం. వి. అ. పుం. కైవడిముస్తె*. విశ. నదీసంబంధమైనది

**నాదేయి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కేతకి*; 2. నాదనము*; 3. తక్కిలి*; 4. దాసనము*; 5. నీరుప్రబ్బ*; 6. కాకినేరేడు*; 7. నలనేరేడు*.

**నాధము.** సం. వి. అ. పుం. ముకుత్రాడు.

**నాధవంతుఁడు.** సం. విశ. (త్. ఈ. త్.) పరాధీనుఁడు.

**నాధుఁడు.** సం. వి. అ. పుం. 1. పెనిమిటి; 2. ఱేఁడు; 3. ఇంద్రుఁడు.

**నాన.** వై. వి. సిగ్గు*. "క. మాయయ్యకుఁబాయకవని, సేయుచు దీవించి ప్రియము సేయుచునుండున్, మీయయ్యయేటిమహిమలు, నాయొద్దనెపలుకనీకునానయులేదే." భాం. ఆది. 3, ఆ.

**నానఁబ్రాలు.** దే. వి. (నానన్+వ్రాలు.) నానబియ్యము.

**నానగండు.** వై. విశ. సిగ్గుమాలినవాఁడు. "చ. చిలుకలు గప్పె పెస్మెరలు శీతమయూఖుఁడు దేఁటులాదిగాఁ, గలననవిల్తుసాధనని కాయములేలముపట్టులంగనా, కులమటుగానదానివిడఁగొట్టకత్రుట్టె దొట్టనీతగా, గులమని విత్తుకీఁగెదరు కొందఱు బోడలునానగాండలై." పాండు. ౫, ఆ.

**నానబియ్యము.** దే. వి. (నానన్+బియ్యము.) నానఁబెట్టిన క్రొత్తచేరుడుబియ్యము, లాజను.

**నానారూపము.** సం. విశ (అ. ఈ. అ.) పలువెఱఁగులుగలది.

**నాను.** దే. అ. క్రి. ద్రవద్రవ్యమునోఁకున బహుకాలముండు. వి. నానుక్రోవి.

**నానుక్రోవి** దే. వి. కంఠాభరణవిశేషణము.

**నానుచు.** దే. ప్రే. నానఁజేయు. "గీ. అలరుదేనియనానిచిమొలక గట్టి." పాండు. 3, ఆ. (రూ. నాన్చు. చూ. కొరి.)

**నానుడి.** దే. వి. (నాను+నుడి.) 1. (చూ.) కింవదంతి; 2. సామెత. "చ. వింటలేదెయిం, టగెలిచిరచ్చగెల్వమనునానుడి నానుడి నిశ్చయంబగున్." సా. ౨, ఆ.

**నానుడు.** దే. విశ. తడిసినది. (నానుడునేల.)

**నానుడువాన.** దే. వి. విసువకకురిసెడు పొడిపొడిచినకుల వర్షము.

**నానుపు.** దే. ప్రే. చేలువచేయు.

**నానుబోర.** దే. వి. మాంసముగల బొమ్మ.

**నాన్తెల.** దే. వి. భక్ష్యవిశేషము. (చూ. జేంతిక.)

**నాపసాని.** వై. వి. నాగపసానియొక్కరూపాంతరము. "ఉ అప్పుడునాపసాని చతురత్రికమండలిపేమకుంభికల్, ముప్పది మూటిఁజొట్టునిడిముత్తియముల్ ఘటియించితంతులం, దొప్పఁగఁజుట్టి దేవతలినుత్కటభక్తినిబాడుకొంచుఁదాఁ, జెప్పినరీతి వంవడులఁ జేయఁగజేసెఁ దదర్క్షకృత్యముల్." భల్లా. ౪, ఆ.

**నాపితుఁడు.** సం. వి. అ. పుం. మంగలవాఁడు.

**నాభి.** సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి. పుం, స్త్రీ. బొడ్డు. పుం. 1. వసనాభి; 2. బండికంటికడిమితూము; 3. తిలకము; 4. క్షత్రియుఁడు; 5. చక్రవర్తి.

**నాభిజన్ముఁడు.** సం. వి. న్. పుం. బ్రహ్మ, పొక్కిలిచూలి.

**నామకరణము.** సం. వి. అ. న. బిడ్డలకు పేరుపెట్టుట. (చూ. కర్మము.)

**నామకా, నాముకా.** గ్రా. క్రి. విణ. పేరుకు.

**నామగుంట.** దన్. వి. (నామము+గుంట.) గళగర్తము.

**నామధేయము.** సం. వి. అ. న. అభిధానము, పేరు.

**నామమడఁచు.** మి. స. క్రి. (నామము+అడఁచు.) చంపు. "క. జననియుఁదండ్రియుఁదొలుబా, మునఁజేసినపాపకర్మమునఁగాక మయో, ధనుఁడుమొదలైననూర్వర, ననఘుఁడుధర్మజుఁడునామ మడఁపఁగఁదగునే." భార. స్త్రీ. ౨, ఆ.

**నామము.** ఉభ. దే. వి. నొసటపెట్టుకొనెడు బొట్టు. "ఎ, గీ. మంచికపురంపు గీఱునామములుదీర్చి." (ఇక్కడ స్త్రీ ప్రశంస.) చంద్ర. "మ. నొసలన్నామమొకింతదాల్చిసనుజాలున్ సిక నెవ్వరలై, సనుపూజ్యుల్." (ఇక్కడ పురుషప్రశంస.) పర. 3, ఆ.—సం. న్. న. నామధేయము.

**నామరులు.** దే. వి. (నాము+మరులు.) పాచికలు. "చ. బలేత పుఁ బద్మజాండ మనుపాళి ఘటించటమీఁదఁబడ్డజీ, వులనెడుసారె లుంచి రహిపుట్టఁగనమ్మిహిరేందు నామముల్, కలిగిననామరుల్ ని యలౌకికచిత్రదుర్దరంబుగా, సలరమతోడనాడుకమలాత్ముడు మైకొనెఁగంటె జూదముల్." చమ. ౧, ఆ.

**నామర్దా.** హిం. విణ. పుంస్త్వములేనివాఁడు, పిరికివాఁడు.

**నామా.** హిం. వి. వ్రాఁతపూర్వకమైనది. (కరారునామా, రాజీనామా, వాకాలతునామా మొ.)

**నాము.** దే. వి. జొన్నలోనగువానికొయ్యగాలునచిగిరించినమొలక. (దీనిని పసులుతిన్నను మృతినొందును.)

**నాముష్కి, నామూష్కి.** హిం. వి. అవమానము.

**నాయఁకరము.** దన్. వి. (నాయఁకుఁడు+కరము.) ఆధిపత్యము. "దళవాయినాయఁకరపుఁబట్టముసనిలిచి." పాండు. ౧, ఆ.

**నాయఁకవాడి.** దన్. వి. సేద్యపుపనులను పర్యామరికచేసెడు దివాణపుబంటు. (రూ. నాయఁకవాళి.)

**నాయఁకుఁడు.** వై. వి. 1. అధిపతి; "ఎ, గీ. ఎఱుకునాయంకుఁడొక్కరుఁడువచ్చి, పుడమిరావేల్పురాయనికడనునిల్చి." చంద్రా. ౨, ఆ.—2. పన్నిద్దఱుభటులకధిపతి*. "ద్వి. శిలువఁ, బుచ్చెనాయఁకులనప్పుడపడవాళ్ల." గా. యు, కాం.

**నాయఁడు.** వై. వి. 1. ప్రభువు; "గొల్లలనాయఁడైపరఁగుచుం డకుమంద." కలా. ౨, ఆ.—2. బలిజెకులలోనగువారి పట్టపుఁ బేరు*.

**నాయకము.** సం. వి. అ. పుం. పతకమునడిమిరత్నము.

**నాయకుఁడు.** సం. వి. అ. పుం. 1. అధిపతి, (సాధారణనాయకులు నలుగురు.—ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు.) — 2. శృంగారరసాలంబనపురుషుఁడు. (వీరు నలుగురు.—అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు.)—విణ. శ్రేష్ఠుఁడు.

**నాయన.** దే. వి. (నా+అన.) తండ్రి, జనకుఁడు. (ఇది వాత్సల్య సంబోధనమునందు సంబోధ్యశబ్దమునకు మారుగాఁ బ్రయోగింపఁబడును.)

**నాయము.** ఉభ. వై. విణ. న్యాయయుక్తము. (ఇది సిక నాయము కాదు.)—సం. వి. అ. పుం. 1. ప్రాపణము; 2. నీతి.

**నాయిక.** సం. వి. ఆ. స్త్రీ. శృంగారరసాలంబనస్త్రీ. (త్రివిధ నాయికలు.—స్వీయ, పరకీయ, సామాన్య అష్టవిధనాయికలు.—స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.)

**నార.** దే. వి. 1. చీల్చిన తొటిమట్టలోనగునది; 2. జేనములో నగువానిపీఁచు; 3. కూరమీఁదిపీఁచు, కడంబము; 4. తొడలో నగువానిపీఁచు; 5. బ. చెట్టుమీఁదిపట్ట, వల్కలము. "ఉ. నారలు గట్టికూరలశిసంబుగనుగ్రవసంబులోఁదపో, భారమునంగృశుండ యినబ్రాహ్మణుఁడు." భార. ఆను. ౨, ఆ.

**నారంగము.** సం. వి. అ. పుం. 1. నారింజకాయ; 2. అమడబిడ్డ; 3. పిప్పలిరసము. ను. విటుఁడు.

**నారకము.** సం. వి. అ. పుం. నరకము, నిరయము.

**నారట్టము.** సం. వి. అ. పుం. బీటికనేల.

**నారణపక్కి.** వై. వి. నారాయణపక్షి.

**నారదబ్బ.** దే. వి. ఒకదినుసుదబ్బకాయ.

**నారదము.** సం. వి. అ. పుం. నారంగము, నారింజకాయ.

**నారదుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకదేవముని.

**నారమడి.** దే. వి. ఒకదినుసునారతోనేసిన మడివస్త్రము.

**నారము.** సం. వి. అ. న. నరులసమూహము. పుం. 1. అప్పుడు పుట్టినదూడ; 2. బ. నీళ్లు.

**నారసము.** వై. వి. (చూ.) నారాచము. "క. చేరివికర్ణునికరి నొక, నారసముఁగూల్చికదిసినరపతినొంచెన్." భార. విరా. ౫, ఆ.

**నారాచము.** సం. వి. అ. పుం. 1. అచ్చము ఇనుపబాణము; "సర్వలోహస్తుయేబాణానారాచాస్తేప్రకీర్తితాః" అని ప్రమాణము.—2. నీటియేనుఁగు.

**నారాచి.** సం. వి. ఈ. స్త్రీ. బంగారునఱకెడు కొఱముట్టు, పానము, అగసాలెవాని యినుపత్రాసు. (అనికొందఱు.)

**నారాజి.** దే. వి. నరాజియొక్కరూపాంతరము. "ఎ, గీ. రకపుఁ జికిలిసిరాజినారాజిఁబన్ని." చంద్రా. ౨, ఆ. (రూ. నారాజీ.)

**నారాయణపక్షి.** సం. వి. న్. పుం. పక్షివిశేషము.

**నారాయణము.** సం. వి. అ. న. తైత్తిరీయమనువేదభాగమునం దొకపన్నము.

**నారాయణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. లక్ష్మి; 3. పిల్లపీచరకాయ.

**నారాయణుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. సూర్యుఁడు; 3. చంద్రుఁడు; 4. బ్రహ్మ; 5. శివుఁడు; 6. అగ్ని.

**నారి.** ఉభ. దే. వి. వింటియల్లెత్రాడు. "గీ. అపుడువిల్లెక్కు-పెట్టి వాలారుతూపు, నారిఁగూర్చినిశాచరనారిఁగూర్చి, కాఁడనేసెఁదదీయ వక్షస్స్థలంబు, రాముఁడమోఘశరశరలాఘవుఁడు." రామా. ర, ౧.—వై. నరము. (నాడిపుటిపు.)—సం. ఈ. స్త్రీ. ఆఁడుది.

**నారింజ.** వై. వి. నారంగముకాయ.

**నారికడము.** వై. వి. నారికేళముకాయ.

**నారికాయ.** దే. వి. అల్లెత్రాటితాఁకుడువలన చేతఁగలిగిన కిణము.

**నారికుఱుపు.** ద్వి. వి. సెలపుండు, నాడీవ్రణము.

**నారికేళము.** సం. వి. అ. పుం. టెంకాయచెట్టు.

**నారుచే.** దే. క్రి. నాఁడఁజేయు. (రూ. నార్చు. "మరుఁడువెడ వెడననార్చు." ఆము. ర, ఆ.)

**నాఱు.** దే. వి. నాట్నమునకుఁగాను దట్టముగా విత్తులువేసిమొలచిన మొలకలు.

**నాలము.** హిం. వి. గుఱ్ఱపుగిట్టలకువేయు ఇనుపబిళ్ల, లాడము.

**నాలాయకు.** హిం విశే. తగని, లాయకుకాని.

**నాలి.** దే. వి. కుత్సితపుపని. (వాఁడు కూలినాలిచేసి జీవనము చేయుచున్నాఁడు.) విశే. 1. కుత్సితము; "క. నాలుకలురెండు నిన్నుం, గ్రోలనేకల్పించెనలువఘోరాహికిన, న్నాలిగ్రహమువు డుతెగఁదినఁ, జాలదమృదుపవనవిరహోజనదురితమునన్." స్వా. 3, ఆ. — 2. మందము; "నాలిగాలి." — 3. వంచకము. "వ. నాలియేడ్పులేడ్చుప్రియలననునయింప." స్వా. 3, ఆ.

**నాలిక.** దే వి. నాలుకయొక్క రూపాంతరము. "వ. నాలికలు వేలికలవిధంబునందూల." జై. 2, ఆ.

**నాలికచేఱు.** ద్వి. వి. 1. తృణవిశేషము; 2. నాలికచేఱ్లు తినుటవలన పసులకు నాలుకయందు ముండ్లవలెఁ గలిగెడు వ్యాధి విశేషము.

**నాలికి.** హిం. వి. పల్లకి. (నాలకి, నాల్కి. రూపాంతరములు.)

**నాలిబూతము.** ద్వి. విశే. కుత్సితుఁడు, కుత్సితురాలు.

**నాలిముచ్చు.** దే. విశే. కుత్సితుఁడు. "గీ. తెలివిగలుగువారికెలన నుండెడుమీకు, నాలిముచ్చునడకనడకగాదు." చంద్ర.

**నాలుక.** దే. వి. 1. జిహ్వ; "క. వికచముఖుఁడగుచుశాత్రవు, లకుహితులగునట్టివారలంగని భూపా, లకుఁడెదకత్తెరయున నా, లుకబెల్లమునైకలయఁబలుకఁగావలయున్." భార. శాం. 3, ఆ.— 2. బ. సర్పజిహ్వకలు; "గీ. అప్రమత్తుండవగుచుఁబద్మాక్ష నీవు, మ్రింగుడుపుచాలనాఁకటమెఱసియపుడు, నాలుకలుక్రోయుభూరిపన్నగమువాఁతఁ, బడినయెలుకను భక్షించుపగిదినఘ." భాగ. ర, స్కం.—3. జ్వాలలు. "ఉ. అఘోరపుశక్తినాలుకలు క్రోయుమెఱుంగులుప్రజ్వరిల్లఘం, టారవమభ్రవీధినిగుడఙ్ గదఁగేలనమర్చి." భార. ద్రో. ౫, ఆ. "నాలుకలోఁగ్రోయుచు."-(ఈ ప్రయోగమువలన నాల్కక్రోయు అని యొక క్రియగా ఎత్తుటకు అనువుకాదు.) రా. యు. కాం.

**నాలుగు.** దే. స. మూడునొకటి. (రూ. నాల్గు.) (వృత్తియందు బహుపరమగుచో లువర్ణముమీఁది ఉకారమునకును, గువర్ణంబునకును లోపంబగు. "నాల్గాలు, నాల్నాళ్లు" మొ.)

**నాలువు.** దే. స. నాలుగుయొక్క రూపాంతరము.

**నాల్క.** దే వి. నాలుకయొక్క రూపాంతరము. "గీ. నాసికాగ్రంబువంగుటనాల్కనల్ల, నగుటవదనంబుకడునెఱ్ఱనగుటయుష్ణ, వాసబంబులుపూనిసరథమునెక్కి, యమునిదెసఁజనఁగలగంటయునాయువడఁచు." మార్క 3, ఆ.

**నాల్గుకన్నులవేల్పు.** దే. వి. అగ్ని. "సీ. నాల్గుకన్నులవేల్పు నకువేల్పులెన్నినిచేసిమేలేమియుఁ జెందకున్న." అచ్చ. బాల, కాం.

**నావ.** సం. వి. ఔ. స్త్రీ. ఓడ, తరణి.

**నావి.** దే. వి. సస్యరోగము.

**నావికుఁడు.** సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు, కర్ణధారుఁడు.

**నావురు.** వై. వి. నాఁగురుయొక్క రూపాంతరము.

**నావ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నావచేదాఁటఁదగినది.

**నాశము.** సం. వి. అ. పుం 1. చేటు; 2. కనఁబడమి; 3. అను భవములేమి.

**నాశిల్లు.** సం. అ. క్రి. నవయు. (రూ. నాశిలు. "క. ఈసరణిఁ గామతంత్రా, భ్యాసపరిశ్రాంతిమిగులఁబరవశమైనన్, నాశిలె ధాతుక్షయమై, మానసులోపలసవాఁడుమరణమునొందున్." జై. ౫, ఆ.)

**నాస.** సం. వి. ఆ. స్త్రీ. 1. ముక్కు; 2. (చూ. అడ్డకమ్మి.)

**నాసత్యులు.** సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీదేవతలు.

**నాసామణి.** సం. వి. ఇ. పుం. ముక్కర.

**నాసి.** దే. వి. పిల్లి, మార్జాలము.

**నాసిక.** సం. వి. ఆ. స్త్రీ. ముక్కు, ఘ్రాణము.

**నాసిరిల్లు.** వై. అ. క్రి. నశించు.

**నాసీరము.** సం. వి. అ. న. 1. సేనాముఖము; 2. దర్పము.

**నాస్త.** హిం. వి. చల్దిభోజనము, ఫలాహారము.

**నాస్తికత.** సం. వి. ఆ. స్త్రీ. పరలోకములేదనెడుబుద్ధి.

**నాస్తికుఁడు.** సం. వి. అ. పుం. పరలోకములేదనువాఁడు.

**నాస్తిక్యము.** సం. వి. అ. న. నాస్తికత.

**నాళము.** ఉభ. దే. వి. లాడము. సం. అ. పుం, న. 1. తామర లోనగువానికాఁడ; 2. క్రోవి; 3. చిమ్మనఁగ్రోవి; 4. అగసాలె వాని ఊఁదుఁగ్రోవి. (ఇది ఆకారాంత స్త్రీలింగమునగును.)

**నాళి.** సం. వి. ఈ. స్త్రీ. కూరయొక్క నార.

**నాళికేరము.** సం. వి. అ. పుం. నారికేళముయొక్క రూపాంతరము.

**నాళీకము.** సం. వి. అ. న. 1. తామర; 2. తామరతంపర. పుం. 1. బాణము; 2. బాణపుములికి.

**నాళీకాసనుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

## ని.

**ని.** దే. అవ. ద్వితీయైకవచనమందువచ్చెడు ఒక ప్రత్యయము (రాముని, సోముని, హరిని, గిరిని మొ.)

**నింకెఱ.** దే. అవ్య. క్రి. విశ. శీఘ్రము.

**నింగి.** దే. వి. ఆకాశము. "క. నింగికయిఖుం జెయెత్తివె, నంగోయని మాఱ్పేఁబతీ సంహతిఁ దప్పల్, రింగని మ్రోయఁ గుజాగ్రము, కొంగలకొలను గెడికొట్టినిలఁబడక." సాప్వ. ౪, ఆ.

**నింగిచూలి.** దే. వి. వాయుపు, సభస్వంతుఁడు.

**నింగిమిరి.** దే. వి. సువర్చల చెట్టు.

**నింగివడు.** దప్వ. అ. క్రి. (నింగి+పడు.) అస్తమించు. "శా. ఆద్రి తేయతనూజ నింగినడఁగా సూర్యంబు పైనొక్కనా, చేదిక్కుం జెలి పింజుమెండుకొనఁగా సేకొంతని ద్రాదతిక, మోదింపక." ఉ, హరి. ౫, ఆ.

**నింగిసిగ.** దప్వ. వి. శివుఁడు, వ్యోమకేశుఁడు. "ఉ. క్రొన్నెలఁ దాల్చు నింగిసిగకుం గనుగందని పూలదండయా, వెన్ను నిమించుఁ గాలిబొట వ్రేలికిఁ బోఁతురు." రామా. ౫, ఆ.

**నించు.** దే. ప్రే. నినుచుయొక్క రూపాంతరము. నిండఁజేయు, నిండించు.

**నింటు.** దే. వి. జలపూరము. "క. కంటెను కన్నులపంటువు, మంటి మనుచుఁ దద్దుఁబోసుమ ఘువాహినిసె, న్నింటం దేలుచు నమ్మద, కంటకి తొంగులయియేగి కాంచిరి వరునక." హరి. ఉ. ౬, ఆ.

**నిండఁబడు.** దప్వ. అ. క్రి. (నిండక+పడు.) నిండు. "గీ. వెన్నఁ బెక్కులగుచు నెక్కుడఁ జూచిన, నడచు వారు నడవఁగడఁగు వారు, విడియువారు మడియువిడెత్తువారునై, నేలయీనినట్లు నిండఁబడిరి." రా. యు, కాం. (స్వార్థమున పడు.)

**నిండారు.** దే. అ. క్రి. (నిండు+ఆరు.) నిండు. "క. అనిసకుని సింహబలము, ద్దనుసవలోకించి ద్రుపదరాజసుతయయి, ట్లనుఁదన మనమునసిండా, రిననమ్మోదంబు వెలివిరిసి బెరయంగాక." భార. విరా. ౨, ఆ.

**నిండు.** దే. అ. క్రి. పూర్ణమగు. వి. పూర్ణత. విశ. పూర్ణము. "ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము." భార. ఆది. ౧, ఆ.

**నిండుకొను.** దే. అ. క్రి. నిండు. "క. గుండియజల్లనమదిలో, నిండుకొనిన భీతినావిసర్జలచిత్తుం, డుండకనలుగడలకున, య్యండ విడిచిపఱవఁదలఁచు నానమయమునక." శేష. ౨, ఆ. (ప్రే. నిండుకొలుపు. స్వార్థమున కొను.) (బియ్యము నిండుకొన్నవి, పసుపు నిండుకొన్నది; ఇట్టిచోట్ల నిండుకొనుటయనఁగా అయిపోయినవని యర్థము.)

**నింద.** సం. వి. ఆ, స్త్రీ. 1. దూఱు; 2. అపదూఱు.

**నిందించు.** సం. స. క్రి. దూఱు.

**నిందితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దూఱఁబడినవాఁడు.

**నింద్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దూఱఁదగినవాఁడు.

**నింపాది.** దే. విశ. (నింపు+ఆది.) సమృద్ధము. (కొలనిలో నీళ్లు నింపాదిగానున్నవి.)

**నింపారు.** దే. అ. క్రి. నినుపారుయొక్క రూపాంతరము.

**నింపిరి.** దే. వి. ముఱికి, మలము.

**నింపు.** దే. ప్రే. నించుయొక్క రూపాంతరము. వి. సమృద్ధి. "నిద్ర పుఁజెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప." కళా. ౬, ఆ. (నినుపుయొక్క రూపాంతరము.)

**నింబతరువు.** సం. వి. ఉ. పుం. వారిజేను చెట్టు.

**నింబము.** సం. వి. అ. పుం. వేము చెట్టు.

**నికటము.** ఉది. దే. వి. నిర్బంధము. సం. అ. న. సమీపము. విశ. సమీపమైనది.

**నికము.** దే. వి. నిక్కముయొక్క రూపాంతరము. "గీ. క్షీణసంకల్ప జాలుఁడై చిత్తశుద్ధిఁ బొందు, నికము బ్రహ్మత్వమును." అధ్యా. ఉ, కాం.

**నికరము.** ఉభ. దే. విశ. త్రోపుడుపోఁగా మిగిలినది.—సం. అ. పుం. 1. సమూహము; 2. నిధి. విశ. శ్రేష్ఠము.

**నికర్షణము.** సం. వి. అ. న. ఇల్లులోనగువానివెనుకటిభాగము. పట్టణముచుట్టువాఁడేఁబయలు. (అనికొందఱు.)

**నికష.** సం. వి. ఆ. స్త్రీ. రాక్షసులతల్లి. అ. పుం. ము. 1. ఒరగల్లు; 2. సాన.

**నికషాత్మజుఁడు.** సం. వి. అ. పుం. నిరృతి.

**నికామము.** సం. క్రి. విశ. అ. న. యథేచ్ఛము.

**నికాయము.** సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. తెగ; 3. లక్ష్యము; 4. ప్రోగు; 5. పరమాత్మ.

**నికాయ్యము.** సం. వి. అ. పుం. గృహము, ఇల్లు. (రూ. నికాయ్యము.)

**నికారణము.** సం. వి. అ. న. వధము, కొల.

**నికారము.** సం. వి. అ. పుం. 1. వంచన; 2. ధాన్యము ప్రోగు చేయుట; 3. వంతనిష్పేడనమువలనఁ గలిగిన ముఖవికారములో నగునది.

**నికాశము.** సం. వి. అ. పుం. నిశ్చయము. విశ. తుల్యము.

**నికుంచకము.** సం. వి. అ. పుం. కొల.

**నికుంజము.** సం. వి. అ. పుం, న. పొదరిల్లు.

**నికుంభము.** సం. వి. అ. పుం. దంతి చెట్టు. ఇు. కుంభకర్ణుని కొడుకు.

**నికురుంబము.** సం. వి. అ. న. సమూహము, గుమి.

**నికృంతనము.** సం. వి. అ. న. ఛేదనము, నఱకుడు.

**నికృతము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. దూఱఁబడినది; 2. వంచింపఁబడినది; 3. త్రోపుడుచేయఁబడినది.

**నికృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. బెదరుమాట; 2. వంచన; 3. త్రోపుడు.

**నికృత్తము.** సం. విశ. (అ. ఆ. అ.) నఱకఁబడినది.

**నికృష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) అధమము.

**నికేతనము.** సం. వి. అ. న. గృహము, ఇల్లు. (రూ. నికేతనము.)

**నికోచకము.** సం. వి. అ. పుం. ఊడుగ చెట్టు.

**నిక్కచ్చి.** దే. వి. నిర్బంధము, నికటము. (వాఁడాయప్పునకైనన్ను చాలనిక్కచ్చి చేయుచున్నాఁడు.)

**నిక్కము.** దే. వి. 1. నిశ్చయము; "క. మేనులకెల్లను జీవుఁడు, తానే గోవిందుఁడొకఁడు తండ్రియున్నాఁ, డానిక్కము తనకబ్బెను." లక్ష్మీ. ౪, ఆ.—2. యథార్థము; "చ. మానముఁ జలముం దెగం దొలఁగె నామగుడం బురికొంటలేదని, క్కము సెపుమా." భార. కర్ణ. ౧, ఆ.—3. సత్యము; "నిక్కము రూపగువానిభక్తిగమ్యుఁ డలంతుక." భార. శాం. ౨, ఆ.—విశ. 1. సత్యమైనది; "గీ. ఒరునినింక నేనువరియింపనిది నిక్కము, మనిన." మార్క. ౮, ఆ.—2. అసత్యర్థము. "వ. అనసికేఁబరజిత్తనునిక్కంపు పేరివాఁడుపుట్టె." హరి. పూ. 3, ఆ.

**నిక్కల.** దే. వి. (నిక్కము+కల.) కన్నది యనుభవమునకు వచ్చెడు కల. "క. నాకలనిక్కలయయ్యెడు, శోకింపకుమమ్మ." భాగ. అ. ౬, ఆ

**నిక్కపుడు.** వై. వి. నిష్కపటము.

**నిక్కవోడుచే.** దే. అ. క్రి. (నిక్కు+అ+పొడుచే.) నిక్కగ నిలుచే. (మేనవెంట్రుకలు నిక్కవొడిచె.)

**నిక్కాక.** దే. వి. (నిండు+కాఁక.) మిక్కిలికాఁక. (దేహము నిక్కాఁకగానున్నది.)

**నిక్కు.** దే. అ. క్రి. 1. ఉన్నతమగు; 2. గర్వించే; 3. అతిశయించే; "వ. అనీకంబు లనేకంబులు పొడవడఁగనిక్కినపయం బునందక్కినరయంబు గలబలంబులుగళవళించిమగిడినిగిడినగరం బుచొచ్చిన." ఉ, హరి. ౬, ఆ.—4. వర్ధిల్లు. "గి. మించి వృశ్చికాదిపంచమాసములనౌ, క్కొక్కగడియరాత్రి నిక్కెనడుచు." భాగ. ౫, స్కం. ౩, ఆ.—వి. 1. ఉన్నతి; "చ. ఎనిమిది తొవ్రులందొడరియేపునవెప్పుడునామజూఱఁగా, నెనయుచుఁగెంపు రేకలుపయింబొలుపొందఁగనందునేచుఁగుల్, దనరుచునుండునాక సముఁదాఁకెడునిక్కునఁజూపరబ్బురం, బునపెలయేళ్లతోడ నడయాడెడుజేగుఱుఁగొండలోయనన్." య. ౧, ఆ.—2. గర్వము.

**నిక్కుఁబోతు.** దే. విశే. (నిక్కు+పోతు.) గర్వస్వభావముగలవాఁడు.

**నిక్కుడు.** దే. వి. ఉన్నతి. హరిశ్చ. ౪, ఆ.

**నిక్కువము.** దే. వి. నిక్కముయొక్కరూపాంతరము. (యథార్థము కదు. — "ద్వి. నెఱయవానికిఁగలనీతిశాస్త్రములు, కొఱమాలియుండు నిక్కువమిద్ధంబు." రా. యు, కాం.)

**నిక్కువీనుల జక్కి.** దే. వి. (చూ. ఉచ్చైశ్శ్రవము.) (చూ. శలఁపుమిన్న.)

**నిక్వణము.** సం. వి. అ. పుం. వీణలోనగువాని మ్రోఁత.

**నిక్వాణము.** సం. వి. అ. పుం.———వై.———

**నిక్షేపము.** సం. వి. అ. పుం. 1. చెప్పిచూపియుంచినయిల్లడ; 2. నిధి.

**నిక్షేపించే.** సం. స. క్రి. పాఁతు, పూడ్చు.

**నిఖాతము.** సం. విశే. (అ. ఆ. అ.) త్రవ్వఁబడినది.

**నిఖిలము.** సం. విశే. (అ. ఆ. అ.) సర్వము, ఎల్ల.

**నిగణము.** సం. వి. అ. పుం. హోమధూమము.

**నిగదము.** సం. వి. అ. పుం. స్పష్టముగాచెప్పుట.

**నిగదించే.** సం. స. క్రి. స్పష్టముగాచెప్పు. "క. మానువజన్మము నొందిన, మానవులకులభ్యమానమరణులకుమహా, జ్ఞానులకుఁ జేయవలయువి, ధానము నిగదింపఁబడియెధరణీనాథా." భాగ. ౨, స్కం.

**నిగనిగ.** దే. వి. మెఱయుటయందగు ననుకరణము. "నిగనిగయను క్రొమ్మెఱుంగు." కళా. ౨, ఆ. (విశేషణముగుచో నిగనిగని=నిగనిగయను కాంతిగలది. "ఎ, గీ. నిగనిగనిసంజకెంజాయ పొగ మసఁదెగడు." వసు. ౬, ఆ.)

**నిగమము.** సం. వి. అ. పుం. 1. వేదము; 2. అంగడివాడ; 3. మార్గము; 4. పట్టణము.

**నిగముఁడు.** సం. వి. అ. పుం. బేహారి, వణిజుఁడు.

**నిగర్ణము.** సం. వి. అ. న. మ్రింగుట. పుం. కంఠము.

**నిగరము.** ఉభ. వై. విశే. శ్రేష్ఠము. "నిగరంపుఁబగడంపుజిగి నొట్టుమొగముట్టు." ఉ, నా. ౭, ఆ.—సం. వి. అ. పుం. మ్రింగుట.

**నిగళము.** సం. వి. అ. పుం, న. 1. ఏనుఁగుకాలిసంకెల; 2. సంకెల. (రూ. నిగడము.)

**నిగా.** హిం. వి. దృష్టి, విచారణ. (రూ. నిఘా.)

**నిగాదము.** సం. వి. అ. పుం. నిగదముయొక్కరూపాంతరము.

**నిగారము.** ఉభ. వై. విశే. శ్రేష్ఠము. "ఉ. కుందనమెందునుం దొరయకొమ్మనిగారపు మేనిచాయకున్." శలా. ౧, ఆ. "క. ఇట్టినిగారపుగోనముల, తిట్టలఁగనికరముమాలితెంపొదవంగాఁ, గట్టడవ్రలకుంబన నుంగఁ, గట్టాయిన్మ దుకఁడెంతకట్టఁడిచెప్పుఁడా." అచ్చ. అ, కాం. (నిగరముయొక్కరూపాంతరము.)—సం. వి. అ. పుం. మ్రింగుట.

**నిగాళము.** సం. వి. అ. పుం, న. గుఱ్ఱపుమెడ సమీపపుచోటు.

**నిగిడారు.** దే. అ. క్రి. (నిగిడి+ఆరు.) వ్యాపించే. "ఉ. నవ్వకనవ్వునెమ్మొగమునన్ నిగిడారెడువింతకాంతియున్." ఉ, హరి. ౫, ఆ. (చూ. ఊఁగాడు.)

**నిగుడు.** దే. అ. క్రి. 1. వ్యాపించే; "సీ. సమధికదర్పదుర్జయములై నిగిడెడు నింద్రియంబులగుదియించితెచ్చి." భార. అశ్వ. ౪, ఆ.—2. నిక్కు; "వ. తోలూచ్చుమహానాగంబునుంబోలెఁ గరవాలంబు తొనయొఱవెలికి నిగుడుచున్నయది." భార. ఉద్యో. ౨, ఆ.—3. చాఁగు; "క. మొగిచినచేతులుముందట, నిగిడించి." భార. విరా. 3, ఆ.—4. పఱఁగు; "వ. విచ్చలవిడిఁదనమయంబుగాగగనంబుననిగుడుసచ్చక్రంబుంగనుంగొని." ఉ, హరి. 3, ఆ. "సాత్యకిడిభకుపైసాయకదశకంబునిగిడింప." ఉ, హరి. ౪, ఆ.—5. విజృంభించే; "సీ. నెత్తుటఁదోఁగియునిగిడిపోరెడు వీరులలరినసడమోదుగులవిధంబు." భార. శల్య. ౧, ఆ.—6. వేగిరపడు; "చ. గరుడునిడిగ్గి వీక్కొలిపి కంసవిరోధిపుంబులోపలన్, దిరపడిదారకుంబనిచి తేరలవాటుగఁదేరనెక్కనం, గరకుతుకంబుతో వెడలిగర్వితులెల్లనుదల్లడిల్లనీ, ఘురరవపాంచజన్యఁడగుడున్ నిగిడెన్ గనిపొంద్రుఁడత్తఱిన్." (చూ. దీనివెనుక.) ఉ, హరి. 3, ఆ.—7. కవియు; "క. భగదత్తునినాకవ్వడి, వెగడొందఁగఁజేసియతనివెలియేచుఁగుఁగెం, పుగఁజేసిననాతండును, నిగిడెన్ బాంచాలమేదినీపతిమీఁదన్." భార. భీష్మ. 3, ఆ.—8. చక్కఁబడు; "క. బెడిదముగఁగత్తిగొడ్డటఁ, బొడువఁదెగినమ్రానిఁజిగురు పొడముఁ బలుకులన్, జెడఁ దునిసినకార్యంబుని, గుడనేరదుపిదపనెట్టిగురువంశనిధీ." భార. ఉద్యో. ౨, ఆ.—9. చిప్పిల్లు. (చూ. నిపుడు.)

**నిగుడుచే.** దే. ప్రే. నిగుడఁజేయు. (రూ. నిగుడ్చు.)

**నిగుడుతెంచే.** దే. అ. క్రి. (నిగుడు+తెంచు.) నిక్కు. ("గీ. నగవుమొలకమొగంబుననిగుడుదేర." ఇక్కడనిగుడుదేరన్ అనఁగా మొలవఁగానని యర్థము. రామా. ౮, ఆ.) (సార్థమున తెంచు.)

**నిగులు.** దే. వి. కట్టెనిప్పుమీఁదిభస్మము. "ఎ, గీ. నిగులులోనిప్పతీరుననీచరిత్ర, మెఱుఁగఁబడదు." ఉ, రా. ౫, ఆ.

**నిగూఢము.** సం. విశే. (అ. ఆ. అ.) మఱుఁగుపుచ్చినది.

**నిగూహనము.** సం. వి. అ. న. మఱుఁగుపుచ్చుట.

**నిగ్గడి.** దే. విశే. కఠినము. "అవియకనిగ్గడియైనయినుపగుండియయట." భార. స్త్రీ. ౨, ఆ.

**నిగ్గు.** దే. అ. క్రి. నిప్పచల్లు. (నాతో సరిగా వాఁడు నిగ్గలేఁడు.)–వి. 1. ఉత్కృష్టకాంతి; 2. వస్త్రలేశము. (చూ. ఇంటిపట్టు.)–విశే. క్రొత్తపుడుపోఁగా మిగిలినది.

**నిగ్రహము.** సం. వి. అ. పుం. 1. త్రిప్పాటు; 2. బెదరుమాట; 3. చెఱ; 4. మేర.

**నిగ్రహించు.** సం. స. క్రి. త్రిప్పాడు.

**నిఘంటువు.** సం. వి. ఉ. పుం. పదపదార్థములను తెలియఁజేసెడు గ్రంథము.

**నిఘసము.** సం. వి. అ. పుం. చదువుపుస్తకము.

**నిఘసము.** సం. వి. అ. పుం. భోజనము, కుడుపు.

**నిఘాతిక.** సం. వి. ఆ. స్త్రీ. ఇనుమునుపెట్టి కొట్టెడి యినుపముద్ద, దాఁకలి.

**నిఘ్నుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) లోఁకువైనవాఁడు, అధీనుఁడు.

**నిచయము.** సం. వి. అ. పుం. సమూహము, గుంపు.

**నిచితము.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యాపింపఁబడినది.

**నిచులము.** సం. వి. అ. పుం. 1. ఏట్టిగన్నేరు*; 2. కప్పుకొను దుప్పటి.

**నిచోళము.** సం. వి. అ. పుం. 1. గవ్రసెన; 2. కప్పుకొను దుప్పటి.

**నిచ్చెన.** వై. వి. పైకెక్కఁదగినసాధనము, నిశ్రేణి.

**నిచ్చెనపంజా.** ద్వి. వి. దివటీలకమ్ములమర్చిన నిచ్చెనవంటిసాధనము. "నిచ్చెనపంజులారతులు నగ్నిజ్యోతులుఁ వెల్గఁగన్." హంస. 3, ఆ. (నిచ్చెనదివ్వెపంజాఅనియు. "ఉ. అచ్చపుఁ శ్రేష్ఠమీఁదభవళాంకుఁడుయామవతిన్ వరింపఁగా, వచ్చునటంచు మున్ను నలువంకలఁదత్సమయాధికారిదా, నెచ్చెలికిన్‌బహుప్రభలనింపులుగుల్కఁగఁదీర్చినట్టియా, నిచ్చెనదివ్వెపంజాలన నిండెఁ దవానలరేఖలద్రుల్." భాను. 3, ఆ.)

**నిచ్చ.** వై. అవ్య. 1. సదా; "శా. ఆపద్మోద్భవుసోలగంబునకు దివ్యదీప్తిపిన్నల్ నిచ్చరా, రోఫారో." వసు. ౨, ఆ.–2. ప్రత్యహము. "సీ. నిచ్చయొక్కమృగంబునీకుఁ గట్టడగాఁగఁ బ్రీతినాహారంబుపెట్టఁగలము." పంచ. నా. ౧, ఆ. "మ. భవనంబుల్ వడిఁజొచ్చునిచ్చశిఖదీపశ్రేణిదంభంబునన్." చంద్ర.

**నిచ్చయము.** వై. వి. నిశ్చయము. "క. మెచ్చగునేనంపానకు, వచ్చినఁదుదిసంధి మనలవారలకొలఁదుల్, నిచ్చయముచేసియెటు వలెఁ, జొచ్చితిమనకింకనొండుచొప్పులుగలవే." రా. యు, కాం.

**నిచ్చలము.** వై. వి. నిశ్చయము*. "ఉ. నిచ్చలమమ్మహామహునినేత్రములబ్జములౌటవాసవా." కవిక. ౬, ఆ. (చూ. నిచ్చలు.)–విశే. 1. నిశ్చలము; "క. వచ్చినఁగుబేరసూనుఁడు, నచ్చెలువలు నెదురుగాఁగనరిగియతనికిన్, నిచ్చలమగుతాత్పర్యం, బచ్చుపడఁగ మ్రొక్కి వతఁడు నల్లననుచున్." కళా. 3, ఆ.–2. నిర్దోషము*; "ఉ. నిచ్చలమైనకెంపులునునీలమణుల్ వరమౌక్తికంబులున్." శుకం. ౨, ఆ.–3. నిరంతరము*. "సీ. నిచ్చలంబైనతేనియవానజడిసొంపులాలితదానధారాళిగాఁగ." రాఘ. ౨, ఆ.

**నిచ్చలు.** వై. వి. నిశ్చయము*. "ఎ, గీ. నీకుఁజేయలంతిగానిచ్చలు చెలియయిత్తు." హరి. ఉ. 2, ఆ.–అవ్య. సదా. "ఉ. నిచ్చలు నిచ్చలోఁబొదలునీపితృభక్తికిజ్ఞానశక్తికిన్, మెచ్చితి." పాండు. ౨, ఆ. "మ. అమరద్వీపవతీపయోవిహరణప్రాంచత్స్వరస్త్రీలవ, భ్రమణభ్రంకషమండ పాగ్రములనిచ్చల్ క్రీడగావించుచేత, ద్రుమసేవాంచుముచేఁబనేఁబుపత్పుభావక్షరాదాంచుగాదివ్యగా, జముపేపా శిరంజిన్నిరాశి యనిమేషత్వంబునావించుటల్." కవి. ౧, ఆ.

**నిజము.** సం. వి. అ. న. స్వభావము. విశే. 1. తనది; 2. శాశ్వతమైనది.

**నిజాయతీ.** హిం. విశే. న్యాయమైన, సత్యమైన.

**నిజమరి.** వ్యు. విశే. (నిజము+అరి.) సత్యశీలుఁడు. "క. తానాక్కనిజమరివలెన్, బూనిపలికె." భా. ౬, ఆ.

**నిజము.** వై. వి. 1. సత్యవచనము*; (నిజముచెప్పుము.)–2 నిశ్చయము*. "ఎ. మునుపునిజముపెట్టితిముద్దుఁగుమారుఁడటంచు నానిత్యం, బనిపలుకంగవింటినినుజేరతలఁజనికెంగనుంబుమో, వాని యతఁడంటరంఫయనియామకొనంగ వినంబడుమామనం, బునసిపు చెన్నమాపెటుంగుఁ బోఁడియకావలయున్ నిజంబుగన్." "క. ఎప్పుడిదినిశ్చయంబుగ, నప్పరమమునీంద్రుఁజేరియడుగఁగవలయున్." కళా. ౧, ఆ.–విశే. సత్యము*. "వ ఒకటఁగొఱంత లేదుగురుసోద్దన్యపాలనయోపచారముల్, సకలమునవ్యసించితి నిజం బది మంచివిధంబు." (నిజంబు+నిజముగానను.) లక్ష్మి. ౪, ఆ. "క. నినుమప్పలుకులుపాటిగఁ, గొనిదుర్యోధనుని తోడఁ గొంటినినిగను, న్ననిజముగానఁటుఁగనుచిఁ, జనిరాధేయునకు వెలిచక్కనియేనిన్నున్." భార. కర్ణ. 3, ఆ.

**నిటలము.** సం. వి. అ. పుం, న. నుదురు, ఫాలము.

**నిటలాక్షుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**నిటాలము.** సం. వి. అ. పుం, న. నిటలముయొక్క రూపాంతరము.

**నిట్ట.** దే. వి 1. ప్రవాహము; "సౌఖ్యంపునిట్ట." భార. విరా. ౨, ఆ.–2. స్తంభము; "అనఁటినిట్టలపైపొరలూడిరాలుకర్పూరపు దీపి." కవిక. 3, ఆ.–3. స్థానము; "సీ. నిట్టలఁద్రొచుచునెలవులకలమేకలెల్లనుజెగియెక్కయేర్పడంగ." భార. విరా. ౧, ఆ. "ద్వి. మూఁడుమూర్తులనిట్ట మ్రొక్కులగుట్ట, వేఁడివేలుపుప్రభవించెఁడిమార్పునను." హరిశ్చ. ౧, భా.–4. నిక్క. "గీ. భక్తిసంయుక్తియనుపోఁటపాలనోయ్యఁ, జెట్టుకట్టుచుమునిశాఖనిట్టచూప, నిజమనోమార్గసంపదన్నీలవర్ణ, కైతవంబునలోఁజెగగలయనూరె." పాండు. 3, ఆ.–విశే. 1. నిక్కినది; "గీ. కన్నమాత్రనతఁడుకల్మషంబులఁబాసి, విమలచిత్తుఁడగుచునిశదభక్తి, నిట్టరోమములకుఁబట్టగుచానంద, బాష్పనేత్రుఁడగుచుఁ బ్రణుతిచేసె." భాగ. ౬, స్కం.–2. సరియైనది. "ఎ, గీ. నిట్టతొడనఁబొడవు చేనిక్కనాఁడు." స్వా. ౪, ఆ. (చూ. నిట్టనిలుచు మొ.)

**నిట్టకనిలుచు.** దే. అ. క్రి. నిట్టనిలుచు. "క. ఇలుగాలికాలినిట్టక, నిలిచిననిట్రాడువోలెనిజరథమటులై, పొలియక నిలఁబడిరాకా, సులతోఁడుండుటకునగుచుఁజూచిరివేల్పుల్." (ఇక్కడ స్వార్థమున కకారాగమమనియెఱుంగునది.) రామా. ౮, ఆ.

**నిట్టకనిలువు.** దే. వి. సరినిలువు. (రూ. నిట్టకనిల్వు.) "ఉ. నిట్టకనిల్వునంగలఁగినేత్రయుగంబునఁబాష్పపూరముల్, దొట్టఁగఘర్మతోయములతోఁబులకాంకురజాలమెల్లెడన్, బుట్టఁగఁదొల్లియిల్లలుకఁ బూనియొనర్చినమంటిముద్దఁదాఁ, బెట్టెఁదదీయపాత్రనది భిక్షయ కాఁగొనిపోయెసిద్ధుఁడున్." భో. 3, ఆ. (చూ. నిట్టకనిలుచు.)

**నిట్టగ్రమ్ము.** దే. అ. క్రి. (నిట్ట+క్రమ్ము.) నిట్టవొడుచు. "సీ. చామలనగుమోముఁజందురుపొడుపునరాగాంబుధులునిట్టగ్రమ్మ ననుట." లక్ష్మి. ౨, ఆ.

**నిట్టనిలుచు.** దే. అ. క్రి. సరిగానిలుచు. "ఎ, గీ. భవనఘటనకు మొదలికంబమునుబోలె, భువనములకెల్లనీవాదిభూతుఁడగుచు, నిట్టనిలుచున్కిచేఁగాదెనెట్టుకొనియె, గెంటుగుంటునులేకలక్ష్మీకళత్ర." పాండు. ౨, ఆ.

**నిట్టనిలుచుండు.** దే. అ. క్రి. సరిగా నిలుచుండు. "గీ. మేదిని భాను శృంగమిన్నుముట్టి, నిట్టనిలుచుండిచూచె నిర్నిమిషసృష్టిఁ, వినయనుష్ఠానకాలంబు దప్పకుండు, బ్రాహ్మణుఁడు లేపకడఁబోలె భూరి పాదుప." కాశీ. ౧, ఆ.

**నిట్టరాడు.** దే. వి. మూలములేని యింటినడిమి పొడుగుకంబము, కహారము.

**నిట్టలము.** దే. విశే. ఇట్టలమునకు మొదటిరూపము. "నింగికనెలకుం బొడవునిట్టలమై." భాగ. ౬, స్కం.

**నిట్టవొడుచు.** దే. అ. క్రి. (నిట్ట+పొడుచు.) 1. ఉప్పొంగు; 2. రోమాంచితమగు; 3. విజృంభించు. "ఎ, గీ. భూనభోంతర దిక్పరిపూర్ణమైన, నిఖలరూపులుతెల్లనైనివ్వటిల్ల, నిండిశంఖోప తండమైనిట్టవొడిచెఁ, బండువెన్నెలకన్నులపండువగుచు." భాను. 3, ఆ.

**నిట్టు.** దే. వి. 1. ఉపవాసము; "శి. పంటగుడారు క్రిందంటె వెల్లువనిరు ప్రాయిపేఁగఁదొట్టెనప్రూఁటనిట్టు." ౧, వి. ౨, ఆ.— 2. క్షామము. "క. దుస్సకవెదపెట్టకయు, తృష్ణముల్లైనట్టిపుల బహుసస్యంబుల్, సన్నసఁబందుఁబ్రాణుల, కున్నిట్టనమాట లేదు గోరంతైనన్." మార్క. ౪, ఆ.—విశే. శుష్కము. (చూ. నిట్టుపాసము.)

**నిట్టుపాసము.** ద్వి. వి. (నిట్టు+ఉపాసము.) శుష్కోపవాసము. కేశి. ౭, ఆ.

**నిట్టూరుచు.** ద్వి. అ. క్రి. (నిడుద+ఊరుచు.) నిట్టూర్పు విడుచు. (రూ. నిట్టూర్చు.)

**నిట్టూరుపు.** ద్వి. వి. (నిడుద+ఊరుపు.) దీర్ఘనిశ్వాసము. (రూ. నిట్టూర్పు.)

**నిట్ర.** దే. వి. నిలువు. (రూ. నిట్రము. కలము అంతనిట్రముగా పట్టుకొనకుము.)

**నిట్రాడు.** దే. వి. నిట్టరాడుయొక్క రూపాంతరము. (చూ. నిట్టని లుచు.)

**నిట్రాయి.** దే. వి. (నిట్ట+ఱాయి.) పొడుగుఱాయి. "వ. అయ్యవదగాకిఅంకుటాలింగాలం గేలంబొడిచిపెడమరలందిగిచినిట్రాత నేఁతపగ్గంబునబంధించికాలికుండునిద్రించె." పంచ. వేం. ౧, ఆ.

**నిట్రించు.** దే. స. క్రి. నిలువుగానుంచు.

**నిట్రిల్లు.** దే. అ. క్రి. ఉపవాసముండు.

**నిట్రు.** దే. వి. ఉపవాసము. "సీ. దశమినాఁడేకభుక్తముసేసియవలి నాఁడోర్చి జాగరముతోనుండునిట్రు." ఆము. ౪, ఆ.—విశే. శుష్కము. (చూ. నిట్రుపాసము.) (నిట్టుయొక్క రూపాంతరము.)

**నిట్రుపాసము.** ద్వి. వి. (నిట్రు+ఉపాసము.) శుష్కోపవాసము.

**నిడివి.** దే. వి. దైర్ఘ్యము. విశే. దీర్ఘము. "గీ. ఇట్టివేనవితపేఁబగలిట్టి నిడివి, యైనసయిరించునేదివిజారియనుచు." లక్ష్మీ. 3, ఆ.

**నిడు.** దే. విశే. వృత్తియందు నిడుదశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. నిడుమోము, నిడువాలు మొ.)

**నిడుచేను.** దే. అ. క్రి. (నిడుద+చేను.) చాఁగు. "క. పడి నొడుకఱచివలకేల్, నిడుచనఁగనయముసఁదెనఁచి నీల్గిబలంబే, ర్పడఁకిల్లువంప సోఁకక, యుడిగిరీనృపసుతులుకొందఱోయ్యన లజ్జన్." భార. ఆది. ౭, ఆ.

**నిడుద.** దే. విశే. నిడుపు, దీర్ఘము.

**నిడుదవెన్ను.** దే. వి. సర్పము, దీర్ఘపృష్ఠము. "సీ. నిడుదవెన్నగయాళితొడవులదొరయుండుగుండుగండడసఁగఁగైచెండుచేసి." అచ్చ. సుం, కాం.

**నిడుపఁడు.** దే. వి. (నిడుపు+అఁడు.) సర్పము.

**నిడుపకమ్ములు.** ద్వి. వి. (నిడుపు+కమ్ములు.) కడపకునిరుప్రక్కలనుండు నిలువులు.

**నిడుపు.** దే. వి. నిడివి. విశే. నిడివిగలది.

**నిడుముస్తె.** ద్వి. వి. (నిడుద+ముస్తె.) తుంగ*.

**నిడువెంట్రుక.** దే. వి. (నిడుద+వెంట్రుక.) రోమాంచము. "క. జడనుండాపమునిద్రయు, నిడువెంట్రుకతోడనెగయ నిట్టూర్పులుసం, దడిగొనివడిగొన." ఉ, హరి. ౬, ఆ.

**నిడువెంట్రుకవెట్టు.** దే. అ. క్రి. (నిడువెంట్రుక+పెట్టు.) (చూ. నిట్టవొడుచు.) "చ. సరసిజనాభిబంధుజనసంతతిఁగయ్యపు నేలఁజూడఁగా, విరవిరవోయిమేననిడు వెంట్రుకవెట్టుచుఁ గంప మొందె." భార. భీష్మ. ౧, ఆ.

**నితంబము.** సం. వి. అ. పుం. 1. పిఱుఁదు; 2. మొల; 3. కొండనడుము; 4. మూఁపు; 5. దరి.

**నితంబిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. గొప్పపిఱుఁదులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**నితాంతము.** సం. క్రి. విశే. అ. న. పెల్లు. విశే. అధికము.

**నిత్తెమల్లె.** వై. వి. మల్లికావిశేషము. "సీ. సెలాంబరంబులునిత్తెమల్లెలుకొండగోఁగులుమల్లెలుగొరఁటలును." భల్లా. 3, ఆ.

**నిత్యము.** సం. క్రి. విశే. అ. న. ఎల్లప్పుడు. విశే. ఎడతెగనిది.

**నిదర్శనము.** సం. వి. అ. న. దృష్టాంతము. పుం. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**నిదాఘము.** సం. వి. అ. పుం. 1. వేసఁగి; 2. వేఁడిమి; 3. చెమట.

**నిదానము.** ఉభ. వై. వి. అత్రపడక విచారించుట*. (వాసియోగ్యత నిదానముమీఁద తెలియును.) — సం. అ. న. 1. ఆదికారణము; 2. పెయ్యపలుపు; 3. రోగనిర్ణయము. (చూ. స్కంధము.)

**నిదానించు.** వై. అ. క్రి. అత్రపడకవిచారించు. (నిదానించక కాని గుణాగుణములుతెలియవు.)

**నిదిగ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) పెంపఁబడినది.

**నిదిగ్ధిక.** సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు*.

**నిదిధ్యాసనము.** సం. వి. అ. న. మఱిమఱితలఁచుట.

**నిదుర.** వై. వి. నిద్ర. "క. పురరక్షణముద్యోగంబుగ, నరవరచే యంగవలయునమ్మఁగలుగున, త్పురుషులయెడఁదగుఁగుసుపుసు, దురమొదలగుఆశనిపనులదోషంబులుగన్." భార. ఆశ్ర. ౧, ఆ.

**నిదురపోతు.** ద్వి. విశే. నిదురపోవుస్వభావముకలవాఁడు, నిద్రాళువు. "క. వినియువినవురణభీరువు, మనుజాధమునిదురపోతు మందునివకటా, నినుఁజక్రవర్తిఁజేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడునుగలఁడే." భాగ. ౯, స్కం.

**నిదురవోవు.** ద్వి. అ. క్రి. (నిదుర+పోవు.) నిదురించు.

**నిదురించు.** వై. అ. క్రి. నిద్రించు. "క. నిదురించినశిశువాఁ కొని, కిదుకుచు." భాగ. ౧౦, స్కం. పూ.

**నిదేశము.** సం. వి. అ. పుం. 1. పనుపు; 2. చెప్పుట; 3. దాపు

**నిద్దేష్ట.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఆజ్ఞాపించువాఁడు.

**నిద్దము.** వై. విణ. 1. నునుపుగలది; "నిద్దపుఁజెక్కులు." కళా. ౩, ఆ.—2. స్నేహముగలది. "సీ. తల్లిదండ్రులకునిద్దపుఁబిడ్డ యై తల్లి కు శూశ్రుషచేసినశుద్ధమతులు." కాశీ. ౩, ఆ.

**నిద్దా.** వై. విణ. నునుపుగలది. "ను. తళుకుంబ్రోద్దువెలుంగు క్రొంబసిఁడిసిద్దాచోపుడుంగట్టియుఁ." చంద్రా. ౧, ఆ. (నిద్దముయొక్క రూపాంతరము.)

**నిద్దుర.** వై. వి. నిదురయొక్క రూపాంతరము. "ఏమిచెప్పనిద్దురముకుమున్నగాఁదెలిసి." (రామాయణార్థమునందు నిద్దుర మునుమున్నగానని యు, ధాంలార్థమునందు ఇద్దఱమును మున్నగానని యు జేయకులు.) రాఘ. ౪, ఆ.

**నిద్దురపోతు.** దప. విణ. నిదురపోతుయొక్క రూపాంతరము. "పే. ఉలిఫలాపేక్షచేసలరకనిద్దురపోతునగాక పెంపుడునగాక." భల్లా. ౪, ఆ.

**నిద్దురవోవు.** దప. అ. క్రి. నిదురవోవుయొక్క రూపాంతరము.

**నిద్ర.** సం. వి. ఆ. స్త్రీ. నిదుర.

**నిద్రవోవు.** మి. అ. క్రి. నిద్రచేయు.

**నిద్రాళుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నిదురపోతు.

**నిద్రాళువు.** సం. విణ. ఉ.———పై.———

**నిద్రించు.** సం. అ. క్రి. నిద్రపోవు.

**నిద్రిల్లు.** సం. అ. క్రి. నిద్రించు. (యా. నిద్రిలు. చూ. త్రుళ్లు.)

**నిధనము.** సం. వి. అ. న. కులము. పుం, న. 1. చావు; 2. చేటు.

**నిధానము.** సం. వి. అ. న. 1. ఉంచుట; 2. పాఁతఱ.

**నిధి.** సం. వి. ఇ. పుం. పాఁతఱ. (నవనిధులు.—పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము.)

**నిధువనము.** సం. వి. అ. న. 1. కలయిక; 2. వడఁకు.

**నిధ్యానము.** సం. వి. అ. న. దర్శనము, చూపు.

**నినదము.** సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

**నినాదము.** సం. వి. అ. పుం. నినదముయొక్క రూపాంతరము.

**నినుచు.** దే. ప్రే. నించుయొక్క రూపాంతరము. "క. అనుటయు రసలింగమునిడు, తనవ్రత్రువ ప్రేఁపనజ్జెదంతపు బరణిఁ, నినిచిన యొకపనరిదియది, యనిచెప్పకపూసెఁదప్పతాంబుజయుగళిఁ." పాఖ. ౧, ఆ.

**నినుపారు.** దే. అ. క్రి. (నినుపు+ఆరు.) పూర్ణమగు. "క. నినుపారెడిచూడ్కి వారి నెమ్మొగములపైఁ, దనుపారుచుఁబోలయు." భార. అశ్వ. 3, ఆ.

**నినుపు.** దే. వి. నింపుయొక్క రూపాంతరము. "కన్నులఁ నినుపులుగ్గాఁగబాష్పములు నివ్వటిలంగ." భో. ౭, ఆ. (వృత్తియందు అంత్యవర్ణమునకు లోపము. "నినుపల్కు." య. ౧, ఆ.)

**నిన్న.** దే. వి. (నిరు+నాడు.) కడచినదినము.

**నిపఠము.** సం. వి. అ. పుం. పాఠము, చదువు.

**నిపతించు.** సం. స. క్రి. నిపాతముచేయు.

**నిపము.** సం. వి. అ. పుం. కుండ, కలశము.

**నిపాఠము.** సం. వి. అ. పుం. నిపఠముయొక్క రూపాంతరము.

**నిపాతనము.** సం. వి. అ. న. దిగద్రొబ్బుట.

**నిపాతము.** సం. వి. అ. పుం. 1. పడుట; 2. (వ్యాకరణమునందు) సాధారణలక్షణసంబంధింపక ఏర్పడఁబడినశబ్దము; 3. అవ్యయము.

**నిపాతించు.** సం. స. క్రి. పడఁద్రోయు.

**నిపానము.** సం. వి. అ. న. పసులులోనగునవి నీళ్లుత్రాగుటకై నూతివద్ద జాయిలోనగువానితో నేర్పఱచినతొట్టి.

**నిపుణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి, కుశలుఁడు.

**నిప్పచ్చు.** దప. వి. (నిఱు+పచ్చు.) నాశము.

**నిప్పచ్చరము.** వై. వి. దారిద్ర్యము*. "సీ, గీ. మెలఁతుకలమిన్ననిద్దంపుమేల్పసిండి, కలుగకుండినమదిలోన గాటమగుచు, నిచ్చలును హెచ్చుకలఁకనిప్పచ్చరంబు, పెనుచుటుటులెంకఁబరికింపఁబుడమిమీఁద." నీలా. ౩, ఆ.—విణ. శూన్యము. "గీ. బోధమల్పంబుగర్వమధ్యున్నతంబు, శాంతినిప్పచ్చరంబుమత్సరముఘనము, కూపమండూకములుఁబోలెఁగొంచెమెఱిఁగి, పండితంమన్యులైనవేదండికులకు." భీ. ౧, ఆ.

**నిప్పటి.** దే. వి. నిప్పట్టుయొక్క రూపాంతరము. "ధానుమండలముమాఁడిననిప్పటివోలెనుండు." గామ. ౫, ఆ.

**నిప్పట్టు.** దే. వి. (నిప్పు+అట్టు.) ఆకులుమీఁదకప్పి నిప్పులోవేసి కాల్చెడి భక్ష్యవిశేషము.

**నిప్పస్తు.** దే. వి. (నిఱు+పస్తు.) ఉపవాసము.

**నిప్పు.** దే. వి. 1. అగ్ని; 2. బ. అగ్నికణము. "క. అప్పుడుక్రోధముగన్నుల, నిప్పులురాల్చంగ." భార. భీష్మ. 3, ఆ.

**నిప్పుఁదిండి.** దే. వి. (నిప్పు+తిండి.) పక్షివిశేషము.

**నిప్పుక.** దే. వి. 1. అగ్ని; "ద్వి. మఱుపడ్డనిప్పుకమాడ్కినున్నాఁడు." పరిశ్చే. ౩. భా.—2. బ. అగ్నికణము. "క. కురిసెఁ, గనగనగనమనుచు నిప్పుకలుకుప్పలుగఁ." పాండు. ౫, ఆ.

**నిప్పువన్నెగుత్తులకానుగు.** దప. వి. అంగారవల్లరి*.

**నిబంధనము.** సం. వి. అ. న. 1. ఏర్పాటు; 2. బంధము; 3. (చూ.) ఉపనాహము; 4. హేతువు.—విణ. కూర్పఁబడ్డది.

**నిబంధము.** సం. వి. అ. పుం. 1. మలమూత్రబంధము; 2. బంధము; 3. వర్ణాశనము మొదలైనది.

**నిబంధించు.** సం. స. క్రి. 1. బంధించు; 2. అడ్డగించు.

**నిబద్ది.** వై. విణ. నిజేము, సత్యము*. (వానిమాటనిబద్దిగా నెంచఁగూడదు.)

**నిబద్దించు.** వై. స. క్రి. నిజేపఱచు*. "క. లేదన్ననిబద్దించును జూడకున్నఁబరితాపించుఁ." రాధామాధవసంవాదము.

**నిబద్దిలించు.** వై. స. క్రి. నిబద్దించుయొక్క రూపాంతరము. "ను. పొందుగనీ ఘద్దినిబద్దిలించుజవభద్రుండాగ్రహంబందుచోఁ." ఉత్తరహరిశ్చంద్రకావ్యము.

**నిబద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. బంధింపఁబడినది; 2. అడ్డగింపఁబడినది.

**నిబర్హణము.** సం. వి. అ. న. వధము, చంపుట.

**నిబర్హితము.** సం. విణ. (అ. ఆ. అ.) చంపఁబడినది.

**నిబిడము.** సం. విణ. (అ. ఆ. అ.) సాంద్రము, దట్టము.

**నిబిడీకరించు.** సం. అ. క్రి. దట్టముచేయు.

**నిబిడీకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) నిబిడముగాఁ జేయఁబడినది.

**నిబిరీసము.** సం. విశే. (అ. ఆ. ఇ.) నిబిడము.

**నిబోధనము.** సం. వి. అ. న. చూపు, ఆలోకనము.

**నిబ్బద్ధ.** వై. విశే. నిబద్ధియొక్క రూపాంతరము.

**నిబ్బరము.** వై. వి. ఆత్మగతివిశేషము. (చూ.) ధ్రువము*. "ఉ. బలునిబ్బరమునకుఁ బ్రతిగాకగరుడియనామధేయుని వాహనం బనఁ దగి." ఉ, రా. ౧, ఆ.—క్రి. విశే. పెల్లు. "క. హరిచూచివెఱఁగుపడఁగ, వృరుషప్రహారణమువచ్చివచ్చిందునిని, బ్బరముగఁ దాఁకినవడఁకేక, బోరినాతఁడు వజ్రనిపాతభూధరము క్రియక." హరి. పూ. ౪, ఆ.—విశే. అధికము. (చూ. గొబ.)

**నిబ్బరించు.** వై. అ. క్రి. 1. అతిశయించు; "ఉ. ముఖాంబుజంబునక, గప్పులు వ్రాలఁగాఁదివురుకైవడియుబ్బునని బ్బరించుచునక." చంద్ర.—2. నిదానించు*.

**నిబ్బరికము.** దే. వి. కరుణ. "గీ. నిబ్బరికమేదియుకమేదినీవరేణ్య, వనమునకుపోవువేగఁబోవంగఁబ్రొద్దు, గడపలేనందుచేతఁజల్కుఁగొనిదాని, చేతఁగొంతయుబుసుపోకఁజేలఁగుసంత." సా. ౨, ఆ.

**నిబ్బరించు.** యు. దే. అ. క్రి. కరుణించు. "ఉ. నిన్ను నెనమ్మియున్నయెడ నిబ్బరికింపకచోరత్నత్తినా, కన్నియఁదెచ్చుటింతయుకుగానివిధంబనికాకదూఱుటల్." వర. ౪, ఆ.—వై. ఉప్పొంగు. "వ. అగ్గుబ్బలిపోయగంపుటుబ్బునకుమైనిబ్బరికింపనబ్బరపడియబ్బలియుండు తనతోన." య. ౨, ఆ.

**నిభము.** సం. వి. అ. పుం. నెపము. విశే. సమానము.

**నిభాయించు.** హిం. క్రి. సహించు, తాళు.

**నిభృతము.** సం. విశే. (అ. ఆ. అ.) తీర్పఁబడినది.

**నిమంత్రణము.** సం. వి. అ. న. శ్రాద్ధభోజనాదులయందు తగినవారిని నియమించుట.

**నిమంత్రించు.** సం. స. క్రి. శ్రాద్ధభోజనాదులయందు తగినవారిని నియమించు.

**నిమంత్రితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిమంత్రింపఁబడినవాఁడు.

**నిమజ్జనము.** సం. వి. అ. న. మజ్జనము, స్నానము.

**నిమటాయి.** దే. వి. ఒకదినుసుతీఁగ.

**నిమాజు.** హిం. వి. ప్రార్థన, పూజ. (రూ. నమాజు.)

**నిమయము.** సం. వి. అ. పుం. (వస్తువుల) మారుపు.

**నిమిత్తకాఁడు.** దృ. వి. (నిమిత్తము+కాఁడు.) బరువుమోసెడుపనివాఁడు. (చూ. కామాటము.)

**నిమిత్తము.** వై. వి. నియమనము. (చూ. నిమిత్తకాఁడు.)

**నిమిత్తము.** సం. వి. అ. న. 1. కారణము; 2. శకునము; 3. గుఱి; 4. గుఱుతు.

**నిమిషము.** సం. వి. అ. పుం. 1. తెప్పవేయుట; 2. తెప్పవేయునంతకాలము.

**నిమీలనము.** సం. వి. అ. న. 1. కనుమూయుట; 2. చావు.

**నిముకళ్ళు.** దే. వి. (నిమురు+కళ్లము.) 1. కైలుచేసినకళ్లమునందలి యుడుగుధాన్యము; 2. కొలత.

**నిముసు.** దే. స. క్రి. హస్తస్పర్శనముచేయు, తుడుచు. "ద్వి. కన్గూడిచూచియక్కటదాదిచన్ను, నిముకనేరనిచిన్ని నెత్తురుగాఁ." హరిశ్చ. ౨, భా.

**నిమురు.** దే. స. క్రి. (ప్రేమమునశరీరమును) అల్లనతడవు. "నిద్రపోవంగమెల్లనని మిరియొత్తి." వి, పు. ౭, ఆ. "ఆక్కుమున్నపైనిమిరి." గామా. ౪, ఆ.

**నిముసము.** వై. వి. (చూ.) నిమిషము.

**నిమేషము.** సం. వి. అ. పుం. నిమిషముయొక్క రూపాంతరము.

**నిమ్నగ.** సం. వి. ఆ. స్త్రీ. ఏఱు, నది.

**నిమ్నము.** సం. విశే. (అ. ఆ. అ.) లోఁతు, గభీరము.

**నిమ్మ.** దే. వి. జంబీరము*.

**నిమ్మళము.** వై. విశే. 1. నిశ్చింతము*; 2. స్వస్థము*.

**నిమ్మళించు.** వై. అ. క్రి. 1. నిశ్చింతమగు*; 2. స్వస్థమగు*.

**నియంత.** సం. వి. ఋ. పుం. తేరునడపువాఁడు. విశే. నడపువాఁడు.

**నియంతవ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁదగినవాఁడు; 2. ఆజ్ఞాపింపఁదగినవాఁడు.

**నియంత్రణ.** సం. వి. ఆ. స్త్రీ. అడ్డగింత.

**నియంత్రితము.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

**నియతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నియమముగలది; 2. నిత్యమయినది.

**నియతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నియమము; 2. భాగ్యము.

**నియమనము.** సం. వి. అ. న. నియమించుట, ఏర్పాటు.

**నియమము.** సం. వి. అ. పుం. 1. ఏర్పాటు; 2. కట్టు; 3. పనుపు; 4. ప్రతిజ్ఞ; 5. శరీరముకంటె భిన్నములైన మృత్తు లాదులు సాధనములుగాఁగలిగి నిత్యముగా నాచరింపఁదగిన యొకయోగాంగము. (ఇది దశవిధము.—తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము. చూ. అంగము.)

**నియమించు.** సం. స. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.

**నియమితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నియమింపఁబడినది; 2. కట్టఁబడినది.

**నియమ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నియమింపఁదగినది.

**నియాతనము.** సం. వి. అ. న. దిగద్రొబ్బుట.

**నియామకుఁడు.** సం. వి. అ. పుం. 1. (రూ.) అరకాఁడు; 2. (చూ.) తండేలు. విశే. నియమించువాఁడు.

**నియామము.** సం. వి. అ. పుం. నియమముయొక్క రూపాంతరము.

**నియుక్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నియోగింపఁబడినవాఁడు.

**నియుతము.** సం. వి. అ. న. సంఖ్యావిశేషము, లక్ష.

**నియుద్ధము.** సం. వి. అ. న. బాహుయుద్ధము.

**నియోక్తవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నియోగింపఁదగినది.

**నియోగము.** సం. వి. అ. పుం. ఆజ్ఞ, పనుపు.

**నియోగి.** సం. విశే. (న్. ఈ. న్.) నియోగముగలవాఁడు.

**నియోగించు.** సం. స. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.

**నియోగ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నియోగింపఁదగిన వాఁడు.

**నియోజనము.** సం. వి. అ. న. ఆజ్ఞాపనము, పంపు.

**నియోజ్యుఁడు.** సం. వి. అ. పుం. పనివాఁడు, భృత్యుఁడు.

**నియోద్ధ.** సం. వి. ఋ. పుం. బాహుయుద్ధముచేయువాఁడు.

**నియ్యోగి.** వై. వి. 1. మంత్రి; 2. ఒకతెగ బ్రాహ్మణుఁడు*.

**నిరంకుశ.** సం. వి. ఆ. స్త్రీ. జిబిలిక?. విశే. అడ్డములేనిది.

**నిరంజన.** సం. వి. ఆ. స్త్రీ. పున్నమ. అ. పుం. ము. యజ్ఞమున పుడగిన చిత్రవర్ణహరిణము. విశే. 1. కాటుకలేనిది; 2. దోషము లేనిది.

**నిరంతరము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. దట్టము; 2. ఎడ తెగనిది.

**నిరకు.** హిం. వి. అంగడివెల.

**నిరతము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి ఆసక్తికొన్నది.

**నిరతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి ఆసక్తి.

**నిరత్యయము.** సం. విశే. (అ. ఆ. అ.) నాశములేనిది.

**నిరపరాధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అపరాధములేని వాఁడు.

**నిరపాయము.** సం. విశే. (అ. ఆ. అ.) అపాయములేనిది.

**నిరపేక్షము.** సం. విశే. (అ. ఆ. అ.) అపేక్షలేనిది.

**నిరయము.** సం. వి. అ. పుం. దుర్గతి, నరకము.

**నిరర్గళము.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డములేనిది.

**నిరర్థకము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రయోజనములేనిది.

**నిరవగ్రహుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డపాటులేనివాఁడు, స్వతంత్రుఁడు.

**నిరవధికము.** సం. విశే. (అ. ఆ. అ.) మేరలేనిది.

**నిరసనము.** సం. వి. అ. న. 1. తిరస్కారము; 2. ఆక్షేపము; 3. వధము; 4. ఉమియుట.

**నిరసించు.** సం. స. క్రి. 1. తిరస్కరించు; 2. విడుచు.

**నిరస్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. త్వరితముగాఁ జెప్పఁబడినది; (మాట.) 2. తిరస్కరింపఁబడినది; 3. వెడలఁగ్రక్కఁబడినది; 4. న్యాయముచే త్రోయఁబడినది; 5. ప్రయోగింపఁబడినది. (బాణము.)

**నిరాకరణము.** సం. వి. అ. న. తిరస్కారము.

**నిరాకరిష్ణువు.** సం. విశే. ఉ. తిరస్కరించువాఁడు.

**నిరాకారము.** సం. వి. అ. పుం. 1. తిరస్కారము; 2. ఆకాశము.

**నిరాకారుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. పరమాత్ముఁడు. విశే. ఆకారములేనివాఁడు.

**నిరాకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) న్యాయముచే త్రోయఁబడినది, నిరస్తము.

**నిరాకృతి.** సం. వి. ఇ. స్త్రీ. తిరస్కారము. విశే. 1. రూపము లేనివాఁడు; 2. వేదముచదువనివాఁడు.

**నిరాఘాటము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొలఁదిలేనిది; 2. మేరలేనిది.

**నిరాతంకము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. భయములేనిది; 2. వ్యాధిలేనిది.

**నిరాపనింద.** వి. (గ్రా.) వి. అపదూఱు. "క. పినతల్లిబిడ్డగరగనో, పినతల్లికిఁగానవచ్చి పిలిచిననయ్యో, గరిగఁ ముకేశవారిఁ, కని కరమునిరాపనిందగట్టఁదగునె." సా. 3, ఆ.

**నిరాబారి.** వై. వి. ముని*. (చూ. తపము.)

**నిరామయము.** సం. వి. అ. పుం. రోగములేమి. విశే. రోగము లేనిది.

**నిరాయాసము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆయాసములేనిది.

**నిరాయుధము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆయుధములేనిది.

**నిరాలంబము.** సం. విశే. (అ. ఆ. అ.) అవలంబములేనిది.

**నిరాశము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆశలేనిది.

**నిరాసకము.** సం. విశే. (అ. ఆ. అ.) నిరసించునది.

**నిరాసనము.** సం. వి. అ. న. నిరసనముయొక్క రూపాంతరము.

**నిరాహారము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆహారములేనిది.

**నిరీక్షణము.** సం. వి. అ. న. దర్శనము, చూపు.

**నిరీక్షించు.** సం. స. క్రి. దర్శించు, చూచు.

**నిరీక్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) చూడఁబడినది.

**నిరీశము.** సం. వి. అ. న. (చూ.) గొడగ.

**నిరు.** వై. అవ్య. గతార్థకము. (నిరుడు, నిన్న, నిప్పచ్చ మొ.)

**నిరుకడము.** దే. వి. ఒకానొకచెట్టు.

**నిరుకళము.** వై. విశే. నిరర్గళము. "ఎ, గీ. నిగమనూపురములు మ్రోయ నిరుకళముగ." పాండు. ౩, ఆ.

**నిరుకు.** దే. వి. 1. నిర్ణయము; 2. నిర్ణయముచేసినవెల.

**నిరుక్తము.** సం. వి. అ. న. ఒక వేదాంగము. (చూ. అంగము.) విశే. చెప్పఁబడినది.

**నిరుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అర్థనిర్వచనము; 2. అలంకార విశేషము.

**నిరుడిమావియావు.** దే. వి. (నిరుడిమావి+ఆవు.) ఒకతూరి యీనిన ఆవు, గృష్టి.

**నిరుడు.** దే. వి. (నిరు+ఏఁడు.) కడచినసంవత్సరము.

**నిరుద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) నిరోధింపఁబడినది.

**నిరుపద్రవము.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపద్రవములేనిది.

**నిరుపమము.** సం. విశే. (అ. ఆ. అ.) ఉపమలేనిది.

**నిరూఢము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రసిద్ధికెక్కినది.

**నిరూఢి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి.

**నిరూపణము.** సం. వి. అ. న. 1. అరయిక; 2. చూపు; 3. తార్కాణ.

**నిరూపించు.** సం. స. క్రి. నిరూపణముచేయు.

**నిరూపితము.** సం. విశే. (అ. ఆ. అ.) నిరూపింపఁబడినది.

**నిరూప్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నిరూపింపఁదగినది.

**నిరూహము.** సం. వి. అ. పుం. మిగిలినవాక్యము, విశే. 1. ఊహ లేనిది; 2. నిశ్చయింపఁబడినది.

నిర్ఋతి. సం. వి. ఇ. స్త్రీ. పెద్దమ్మ. పుం. 1. దిక్పాలవిశేషము; 2. దినముయొక్క పంచదశభాగము. (చూ. దివసము.) విశే. ఉపద్రవములేనిది.

నిరోధము. సం. వి. అ. పుం. 1 అడ్డు; 2. చేటు.

నిరోధించు. సం. స. క్రి. అడ్డగించు.

నిర్గంధము. సం. విశే. (అ. ఆ. అ.) గంధములేనిది.

నిర్గతము. సం విశే. (అ. ఆ. అ.) వెడలఁబడినది.

నిర్గతి. సం. వి. ఇ. స్త్రీ. వెడలఁబాటు, నిర్గమనము.

నిర్గమనము. సం. వి. అ. న.——సై.——

నిర్గమము. సం. వి. అ. పుం.——సై.——

నిర్గమించు. సం. అ. క్రి. వెడలఁబడు.

నిర్గళనము. సం. వి. అ. న. వెలికెజాఱుట.

నిర్గళితము. సం. విశే. (అ. ఆ. అ.) వెలికెజాఱినది.

నిర్గుండి. సం. వి. ఈ. స్త్రీ. 1. వావిలిచెట్టు; 2. నల్లవావిలిచెట్టు.

నిర్గుణుఁడు. సం. వి. అ. పుం. భగవంతుఁడు. విశే. గుణరహితుఁడు.

నిర్గ్రంథనము. సం. వి. అ. న. వధము, చంపుట.

నిర్గ్రంథుఁడు. సం. వి. అ. పుం. 1. దిసమొలవాఁడు; 2. బీదవాఁడు; 3. మూర్ఖుఁడు.

నిర్ఘటము. సం. వి. అ. న. బహుజనసమ్మర్దముగల అంగడి. విశే. ఘటములేనిది.

నిర్ఘాతము. సం. వి. అ. పుం. 1. పిడుగు; 2. వజ్రము.

నిర్ఘృణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కనికరములేనివాఁడు.

నిర్ఘోషము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

నిర్జనము. సం. విశే. (అ. ఆ. అ.) జనములేనిది.

నిర్జర. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ; 2. మురచెట్టు.

నిర్జరుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేలుపు. విశే. ముదిమిలేనివాఁడు.

నిర్జలము. సం. విశే. (అ. ఆ. అ.) జలములేనిది.

నిర్జించు. సం. స. క్రి. జయించు, గెలుచు.

నిర్జితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) గెలువఁబడినవాఁడు.

నిర్జీవుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) జీవములేనివాఁడు.

నిర్ఝరము. సం. వి. అ. పుం. సెలయేఱు, ఝరము.

నిర్ఝరిణి. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు, నది, సరిత్తు.

నిర్ణయము. సం. వి. అ. పుం. ఏర్పాటు.

నిర్ణయించు. సం. స. క్రి. ఏర్పాటుచేయు.

నిర్ణాయకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ణయముచేయువాఁడు.

నిర్ణిక్తము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగుటలోనగువానిచేత గరగరికైనది, మృష్టము.

నిర్ణీతము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ణయింపఁబడినది.

నిర్ణేజకుఁడు. సం. వి. అ. పుం. చాకలవాఁడు, రజకుఁడు.

నిర్ణేత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) నిర్ణయముచేయువాఁడు.

నిర్ణేయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ణయముచేయఁదగినది.

నిర్దగ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా కాలినది.

నిర్దయుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దయలేనివాఁడు.

నిర్దళనము. సం. వి. అ. న. చక్కఁగా భేదించుట.

నిర్దళితము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా భేదింపఁబడినది.

నిర్దహనము. సం. వి. అ. న. చక్కఁగా కాలుట.

నిర్దహించు. సం. స. క్రి. చక్కఁగా కాలుచు.

నిర్దారణము. సం. వి. అ. న. చక్కఁగా చీల్చుట.

నిర్దారితము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా చీల్పఁబడినది.

నిర్దిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్దేశింపఁబడినది.

నిర్దేశము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. చెప్పుట; 3. సమీపము.

నిర్దేశించు. సం. అ. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.

నిర్దేశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్దేశింపఁదగినది.

నిర్దేష్ట. సం. విశే. (ఋ. ఈ. ఋ.) నిర్దేశించువాఁడు.

నిర్దోషము. సం. విశే. (అ. ఆ. అ.) దోషములేనిది.

నిర్ధనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ధనములేనివాఁడు.

నిర్ధరించు. సం. స. క్రి. నిర్ధారణచేయు. కాశీ. ౫, ఆ.

నిర్ధారణ. సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. నిశ్చయము.

నిర్ధారణీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ధరింపఁదగినది.

నిర్ధారితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ధరింపఁబడినది.

నిర్ధార్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ధారణీయము.

నిర్ధార్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దుఃఖాదులు కలిగినఁ మనోవికారమునుచెందక పూనినపని విడువకచేయువాఁడు.

నిర్ధూతము. సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది.

నిర్నిద్రము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిద్రలేనిది; 2. జాగరూకతకలది.

నిర్బంధము. సం. వి. అ. పుం. 1. బలాత్కారము; 2. కదలమెదలఁగూడనికట్టు.

నిర్బంధించు. సం. స. క్రి. నిర్బంధముచేయు

నిర్భయము. సం. విశే. (అ. ఆ. అ.) భయములేనిది.

నిర్భరము. సం. క్రి. విశే. అ. న. పెల్లు. విశే. అధికము.

నిర్భర్త్సనము. సం. వి. అ. న. 1. అదలుపు; 2. లత్తుక.

నిర్భర్త్సించు. సం. స. క్రి. అదలించు.

నిర్భర్త్సితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్భర్త్సింపఁబడినది.

నిర్భాగ్యుఁడు. సం. విశే (అ. ఆ. అ.) భాగ్యములేనివాఁడు.

నిర్భిన్నము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా భేదింపఁబడినది.

నిర్మదము. సం. వి. అ. పుం. మదము ఉడిగిన యేనుఁగు. విశే. మదములేనిది.

నిర్మలము. సం. వి. అ. న. 1. నిర్మాల్యము; 2. అభ్రకము. విశే. మయిలకానిది.

నిర్మాణము. సం. వి. అ. న. 1. నిర్మితి; 2. యోగ్యత 3. సారము.

**నిర్మాత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) నిర్మించువాఁడు.

**నిర్మాయి.** సం. విశే. (న్. ఈ. న్.)———సై.———

**నిర్మాల్యము.** సం. వి. అ. న. ధరించి తీసివేసినది.

**నిర్మించు.** సం. స. క్రి. నిర్మాణముచేయు, కలుగఁజేయు.

**నిర్మితము.** సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింపఁబడినది.

**నిర్మితి.** సం. వి. ఇ. స్త్రీ. నిర్మించుట, నిర్మాణము.

**నిర్మిమీష.** సం. వి. ఆ. స్త్రీ. నిర్మింపనిచ్ఛ.

**నిర్ముక్తము.** సం. వి. అ. పుం. కుబుసమువిడిచినపాము.

**నిర్ముక్తుఁడు.** సం. వి. అ. పుం. సంగమువిడిచినసన్యాసి. విశే. సంగమువిడిచినవాఁడు.

**నిర్మూలము.** సం. విశే. (అ. ఆ. అ.) వేరులేనిది.

**నిర్మూలించు.** సం. స. క్రి. 1. వేరులేనిదిగాఁజేయు; 2. నాశము చేయు.

**నిర్మృష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) తుడువఁబడినది.

**నిర్మోకము.** సం. వి. అ. పుం. 1. పాఁపకుబుసము; 2. కుబుసము; 3. విడుపు; 4. ఆకాశము.

**నిర్యంత్రణము.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డములేనిది.

**నిర్యంత్రితము.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డములేనిదిగా చేయఁబడినది.

**నిర్యాణము.** సం. వి. అ. న. 1. ఏనుఁగుకడకన్ను; 2. చావు; 3. ముక్తి; 4. వెడలఁబాటు.

**నిర్యాతనము.** సం. వి. అ. న. 1. పగతీర్చుట; 2. చంపుట; 3. అప్పులోనగువానిఁదీర్చుట; 4. దాఁచఁబెట్టినసొమ్ము మరల నప్పగించుట; 5. ఈవి.

**నిర్యాతము.** సం. విశే. (అ. ఆ. అ.) వెడలఁబడినది.

**నిర్యాసము.** సం. వి. అ. పుం. మ్రానిబంక.

**నిర్యూహము.** సం. వి. అ. పుం. 1. సిగబంతి; 2. నాగవాసము, గృహదారువిశేషము; (అనికొందఱు.) 3. మ్రానిబంక; 4. వాకిలి.

**నిర్లజ్జము.** సం. విశే. (అ. ఆ. అ.) లజ్జలేనిది.

**నిర్వచనము.** సం. వి. అ. న. అర్థవివరణముచేసిచెప్పుట. విశే. మాటలేనిది.

**నిర్వచనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) నిర్వచింపఁదగినది.

**నిర్వచించు.** సం. స. క్రి. నిర్వచనముచేసి చెప్పు.

**నిర్వపణము.** సం. వి. అ. న. దానము, ఈవి.

**నిర్వర్ణనము.** సం. వి. అ. న. చూపు, ఆలోకనము.

**నిర్వర్తించు.** సం. ప్రే. నిర్వర్తిల్లఁజేయు.

**నిర్వర్తిల్లు.** సం. అ. క్రి. నెఱవేఱు.

**నిర్వహణము.** సం. వి. అ. న. 1. ప్రస్తుతకథాసంహారరూపమైన యొక నాటకసంధి; (చూ. సంధి.) 2. నిష్ఠ.

**నిర్వహించు.** సం. ప్రే. నిర్వహిల్లఁజేయు.

**నిర్వహిల్లు.** సం. స. క్రి. 1. జరగు; 2. నెఱవేఱు.

**నిర్వాణము.** సం. వి. అ. న. 1. ముక్తి; 2. నాశము; 3. సుఖము; 4. ఏనుఁగు నీళ్లలోమునుఁగుట. విశే. 1. చల్లారినది; (దీపము నిప్పులోనగునది.) 2. నీళ్లమునిఁగినది. (ఏనుఁగు.)

**నిర్వాణుఁడు.** సం. వి. అ. పుం. 1. మునివాఁడు; 2. బరువు మోసిడివాఁడు. విశే. 1. ముక్తినొందినవాఁడు; (ముని మొ.) 2. శాంతిఁబొందినది. (వహ్ని మొ.)

**నిర్వాతము.** సం. వి. అ. పుం. చలింపనిగాలి. విశే. గాలిలేనిది. (చోటు మొ.)

**నిర్వాదము.** సం. వి. అ. పుం. 1. అపవాదము; 2. వాదము లేమి; 3. నిశ్చితవాదము.

**నిర్వాపణము.** సం. వి. అ. న. 1. కొల; 2. ఈవి.

**నిర్వాసనము.** సం. వి. అ. న. 1. చంపుట; 2. వెళ్లఁగొట్టుట.

**నిర్వాసితము.** సం. విశే. (అ. ఆ. అ.) వెళ్లఁగొట్టఁబడినది.

**నిర్వాస్యము.** సం. విశే. (అ. ఆ. అ.) వెళ్లగొట్టఁదగినది.

**నిర్వాహకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిర్వహించువాఁడు.

**నిర్వాహము.** సం. వి. అ. పుం. 1. శక్తి; 2. జరగుఁబాటు.

**నిర్వికారుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వికారములేనివాఁడు.

**నిర్విఘ్నము.** సం. విశే (అ. ఆ. అ.) విఘ్నములేనిది.

**నిర్విణ్ణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిర్వేదమునొందినవాఁడు.

**నిర్విశేషము.** సం. విశే. (అ. ఆ. అ.) విశేషములేనిది.

**నిర్విష.** సం. వి. ఆ. స్త్రీ. అతివసతి. విశే. విషములేనిది.

**నిర్విష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చొరఁబడినది; 2. పొందఁబడినది; 3. నిలిచినది.

**నిర్వీర్యము.** సం. విశే. (అ. ఆ. అ.) వీర్యములేనిది.

**నిర్వృతము.** సం. వి. అ. న. ఇల్లు. విశే. 1. సుఖించినది; 2. సళించినది.

**నిర్వృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సుఖము; 2. ఊటుట; 3. నాశము.

**నిర్వృత్తము.** సం. విశే. (అ. ఆ. అ.) నెఱవేఱినది.

**నిర్వృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము; 2. మోక్షము; 3. నెఱవేఱుట. విశే. వృత్తిలేనిది.

**నిర్వేదము.** సం. వి. అ. పుం. తత్వజ్ఞానదుఃఖేర్ష్యాదులచేతఁ గలుగు హేయత్వబుద్ధి.

**నిర్వేదించు.** సం. అ. క్రి. నిర్వేదపడు.

**నిర్వేశము.** సం. వి. అ. పుం. 1. కూలి; 2. జీతము; 3. భోగము; 4. మూర్ఛపోవుట.

**నిర్వైరము.** సం. విశే. (అ. ఆ. అ.) వైరములేనిది.

**నిర్వ్యధనము.** సం. వి. అ. న. రంధ్రము, బెజ్జము.

**నిర్వ్యాజము.** సం. విశే. (అ. ఆ. అ.) నెపములేనిది.

**నిర్హరణము.** సం. వి. అ. న. 1. నిశ్శేషముగా హరించుట; 2. పీనుఁగును కాల్చుట.

**నిర్హ్రాదము.** సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

**నిర్హారము.** సం. వి. అ. పుం. నాటినములికిలోనగువాని నూడఁబెఱుకుట. పైరునకు విఘాతమైనగాదము మొదలైనవానిఁబెఱుకుట. (అనికొందఱు.)

కురుకురుకొనిపోవునూఁగుడు, పాడెఁగినకాగ్ని విజమునకుఁ బ్రతి యై." కవి. ౫, ఆ.

**నూఁగుదోస.** దే. వి. (చూ.) కూఁతురుబుడమకీ.

**నూక.** దే. వి. తండులకణము, తంబూకము.

**నూకు.** దే. స. క్రి. 1. త్రోచు; 2. త్రోలు. "పంటలవికిఁ వాహంబునడ్డంబునూకిరపావల్లభుఁడెని." సా. ౪, ౮.

**నూకుడు.** దే. వి. త్రోపుడు.

**నూగు.** దే. వి. నూవునకు మొదటిరూపము.

**నూచే.** దే. వి. పాడి. "ఉ. కొన్నిటిహస్తములు చదియఁగొన్నిటిఁ గొమ్ములుదుమ్ముఖాళిగాఁ, గొన్నిటిఁగుంభములు వగులఁ గొన్నిటిఁగా ళ్లు నుగ్గునూచగాఁ, గొన్నిటిఁబార్శ్వమ్ములు నలియఁగొన్నిటిపేఁపులు పిండిపిండిగా, నన్నిటిభీముఁడుద్భటగదాహతినేసఁగువేఁటలాడఁ గడ." భార. భీష్మ. ౨, ఆ. (రూ. నూచము. "క. అరదంబులుపాడిపాడియై, హరులగములునుగ్గునూచమై మొత్తువుఁగా, ఖ్యరుచిదురుపలైపడని, మ్మరగతివిహరించెవాయుసూనుఁడుగద తోడ." భార. భీష్మ. ౨, ఆ.) నుగ్గునూచ అని యొకానొకనిఘంటువునందు ఏకపదముగా వ్రాయఁబడియున్నది. అట్లు చెప్పినచో నూచశబ్దము నిరర్థకమగును. నుగ్గుశబ్దము ప్రత్యేకముగాను ప్రయోగింపఁబడుచున్నది. కనుక నుగ్గునూచశబ్దములు రెండుచేరినప్పుడు మిక్కిలి పొడియనియర్థముచెప్పవచ్చును. దీనికి పైయుదాహరణమునందు దుమ్ముధూళిగా అని చెప్పియుండుటయే ప్రమాణముగా గ్రహింపవలెను.

**నూతనము.** సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్త, నవీనము.

**నూత్నము.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

**నూదోస.** దే. వి. నూఁగుదోసయొక్కరూపాంతరము.

**నూనియ.** దన్య. వి. నూనెయొక్కరూపాంతరము. "సీ. కమనీయ గతిఁదిలోత్తమనేర్చుఁగాక నూనియయంటనెవ్వారునేర్తురనుచు." వసు. ౫, ఆ.

**నూనె.** దన్య. వి. (నూవు+నేయి.) తైలము. (ఇది చమురుకలుగఁ జేయుడుబీత్తులుగలచెట్టునకువెనుకవచ్చినప్పుడు ఆయాయిచమురున కర్థమగును. ఉదా. ఇప్పనూనె, వేఁపనూనె మొ.)

**నూనెముంత.** దన్య. వి. గుర్చ్బలకీ.

**నూనెముడి.** దన్య. వి. కీలుగంటు. "సీ. నిడుదవేనలి నూనెముడి జాఱఁ జిగురాకుపాదఁదూఱుగార్చిచ్చుఁగదియుకరణి." సా. 3, ఆ.

**నూనెయగిసె.** దన్య. వి. నల్లగిసె, ఆఁతసికీ.

**నూపురము.** సం. వి. అ. పుం, న. అందె, మంజీరము.

**నూయి.** దే. వి. చేఁదబావి, కూపము. (నుయ్యికి మొదటిరూపము.)

**నూర్చు.** దే. స. క్రి. నూఱుచుయొక్కరూపాంతరము. "క. కంటకంబులఁగాళ్లఁ, విపరీతతనూర్చుచునే, రుపునంబల్లేరులూడ్చి త్రోయుచుఁజనుచుఁ." ఆము. ౬, ఆ.

**నూర్పిడి.** దే. వి. నూఱిపిడియొక్కరూపాంతరము.

**నూర్పు.** దే. వి. నూఱుపుయొక్కరూపాంతరము.

**నూఱంచులకైదువు.** దే. వి. వజ్రాయుధము, శతకోటి. "ఉ. మించినపేర్మినేయెడలమిన్నులుముట్టి వెలుంగునట్టినూ, ఱంచుల కైదువుల్." లక్ష్మీ. ౨, ఆ.

**నూఱిపిడి.** దే. వి. నుఱిపిడియొక్కరూపాంతరము.

**నూఱు.** దే. స. క్రి. 1. ఆయుధమునువాఁడిచేయు; 2. వన్నెకంట మర్దించు. స. శతము. "బాహుపర్వల్ నూఱునఁజూఁచి." హరి. పూ. ౪, ఆ.

**నూఱుచు.** దే. స. క్రి. నుఱుచుయొక్కరూపాంతరము.

**నూఱుపు.** దే. వి. నుఱిపిడి.

**నూలిగరసు.** దే. వి. ఇట్టెకల.

**నూలు.** దే. వి. ప్రత్తిపడికినపోఁగు, పంతువు. "కొనవదేఁగలెనూలు ను." సా. ౨, ఆ.

**నూలుకొను.** దే. అ. క్రి. 1. ఒప్పుకొను; 2. కుదురుకొను; 3. చిక్కఁబడు; 4. పురికొను. (చూ. నూలొక్కొను.) (ప్రే. నూలుకొలుపు, నూలుకొల్పు. ఒప్పుకొనఁజేయుటకు. — "ఉ. మిక్కిలి మిక్కుటంబునకుమికారతికారతినూలుకొల్పుచుకా." కళా. ౭, ఆ. — కుదురువఱుచుటకు. — "మనములునూలుకొల్పి." భార. విరా. ౪, ఆ.—చిక్కఁబఱచుటకు.—"వ. అనేకదేశంబునం గలయఁబడినయనేకజంబులునూలుకొల్పి." ఉ. హరి. ౫, ఆ.)

**నూలుకోలు.** దే. వి. నూలుకొనుట.

**నూలొక్కొను.** దే. అ. క్రి. నూలుకొనుయొక్కరూపాంతరము. (ఒప్పుకొనుటకు. — "కన్నతెంపుభ్రాగ్యబంధురసహజారుణత్వముని నూలొక్కనవాడితివి." కా. ౨, ఆ.—కుదురుకొనుటకు.—"పెద్దవడి కక్కటనీమదికార్యవృత్తినూలొక్కనియె." భార. ఉద్యో. ౨, ఆ.—చిక్కఁబడుటకు.—"తత్తనువులు నూలొక్కనఁ నివిరి." భార. విరా. ౪, ఆ.—పురికొనుటకు. — "క. అప్పులుపులకలుకలుమది, నుప్పరమెగయంగనెనఁగెనుల్లానముమై, నొప్పారఁగబరిగోలల, నొప్పించినభద్రగజము నూలొక్కన్నగతిఁ." ఉ, హరి. ౫, ఆ.) (ప్రే. నూలొక్కలుపు, నూలొక్కల్పు.—పురికొల్పుటకు.—"తాని లుఁగిచ్చివీటికైనూలొక్కలిపెఁ." భార. విరా. ౪, ఆ.)

**నూవు.** దే. వి. నువ్వునకు మొదటిరూపము. "క. నూవుంబువ్వును సంపెఁగ, పూవు గెలిచి బిరుదుమత్తెపుంజల్లితగఁ, దావైచెనసఁగ ముంగర, తోవనరుహనేత్రనాన తులలేకొప్పఁ." శశిబిందు చరిత్రము.

## నృ.

**నృత్తము.** సం. వి. అ. న. నర్తనము. (చూ.) నృత్యము.

**నృత్యము.** సం. వి. అ. న. శరీరహస్తనేత్రాభినయములచేత భావమునుతెలుపుచు ఆడెడు ఆట.

**నృపతి.** సం. వి. ఇ. పుం. 1. రాజు; 2. కుబేరుఁడు.

**నృపలక్ష్మము.** సం. వి. న్. న. రాజునకుఁబట్టెడుతెల్లగొడుగు.

**నృపాలుఁడు.** సం వి. అ. పుం. రాజు, ఱేఁడు.

**నృపుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**నృశంసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) క్రూరుఁడు.

**నృసింహుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. నరశ్రేష్ఠుఁడు.

**నృహరి.** సం. వి. ఇ. పుం.——పై.——

## నె.

**నె.** దే. విణ. నెఱనెరిశబ్దములకు వృత్తియందు అంత్యవర్ణములోపింపఁగామిగిలినరూపము. (వృత్తియందు దీనిమీఁదిహల్లునకు ద్విత్వము వచ్చెడి. ఉదా. నెఱశబ్దమునకు.—నెచ్చెలి, నెత్తమ్మి, నెత్తళి, నెత్తా

మర, నెత్తావి, నెమ్మది, నెవ్వగ, నెవ్వడి మొ. నెఱిశబ్దమునకు.- నెన్నడ, నెన్నడుము, నెన్నుదురు, నెన్నొసలు, నెమ్మోయి, నెమ్మేన, నెమ్మొగము, నెమ్మోము మొ. నెన్నడ, నెన్నడుము, నెమ్మేన ఇత్యాది స్థలములయందు నెఱిశబ్దపూర్వకమై అర్థము పొసఁగియుండునట్లు నెఱిశబ్దపూర్వకమైపొసఁగియుండదనియెఱుంగవలయును. కొన్ని యెడల తత్సమపదము పరమగుచపుడును ద్విత్వముకానఁబడుచున్నది. "నీవునెమ్మనమునసంతసిల్లుడు సమస్తజగంబులుశాంతిఁ బొందు." భార. ఆర. ౪, ఆ.)

**నెంజిలి.** దే. వి. మనోవ్యధ, ఆధి. "క. అసిదొంగిలిచెఱగాఁది, చ్చెనితండనునెంజిలింగృశించుచుఁజత్తం, బునఁబట్టలేకగోల్గో, లునసేడ్చెఁ బాష్పకణములుఁగడువెడలన్." పర. ౪, ఆ.

**నెక్కర.** దే. వి. ఒకానొకచెట్టు.

**నెక్కొను.** దే. అ. క్రి. పాదుకొను. "ఆత్మలన్ నెక్కొనిమోములంబొడమునెవ్వగతోడ." భార. ఉద్యో. ౧, ఆ. (ప్రే. నెక్కొలుపు, నెక్కొల్పు. "క. అక్కటదైవమురాజ్యముఁ, డ్రెక్కొనియాలిందనూఁజాఁదెగనమ్మంగా, నెక్కొలిపిహరిశ్చంద్రుని, నిక్కడఁగా ద్రుఱిచెనింక నేగతిఁబోదున్." మార్క. ౧, ఆ. "ఇంతులుం దగిలినీపైఁ జూడ్కినెక్కొల్పినెమ్మనముల్ విస్మయమందఁజూచెదరు." భార. విరా. ౧, ఆ.) (నెలకొనుయొక్కరూపాంతరము.)

**నెక్కోలు.** దే. వి. నెక్కొనుట.

**నెగడి.** దే. వి. దుష్టమృగములుబెదరుటకును, చలికాఁచుకొనుటకును వేసెడుమంట. "గీ. నెగడికిఁబాచనమున, కింధనములిచ్చిధనముల నెసకమెసఁగు." భార. అను. ౨, ఆ.

**నెగడు.** దే. అ. క్రి. 1. బయలుమెఱయు; "గీ. ఆపద, నిస్తరించిసిదపనెగడవలయు." భార. విరా. ౧, ఆ. - 2. వర్ధిల్లు. వి. (చూ.) తంతునాగము. "ద్వి. ఒడ్డనములునెగడ్లు." రా. యు, కాం. (కొందఱుజలగ్రహమని యర్థము వ్రాసియున్నారు.)

**నెగపు.** దే. వి. ఎగపునకు మొదటిరూపము.

**నెగయు.** దే. అ. క్రి. ఎగయునకు మొదటిరూపము. (ఎగురుటకు.-"క. నెఱినక్కఁగఁద్రోచియెత్తినెగయంగన్నృపా." భార. ఉద్యో. 3, ఆ.-పయికిలేచుటకు.-"సీ. నెగసినకొసలేచినింగియంతంతకు నవులఁద్రోవఁగఁదనరారుదాని." భార. విరా. ౧, ఆ.)

**నెగయుదెంచు.** దే. అ. క్రి. (నెగయు+తెంచు.) పైకిలేచు, నెగయు. "గీ. బంధనంబులెల్లఁబాయుచుభీముండు, నీరిలోన నుండి నెగయుదెంచె." భార. ఆది. ౫, ఆ. (స్వార్థమున తెంచు.)

**నెగవు.** దే. వి. ఎగవునకుమొదటిరూపము. "సీ. నిఖిలాండములనొక్కనెగవునఁదాఁటంగఁ గలయద్భుతోగ్రవేగంబువాని." హరి. పూ. ౪, ఆ. (ఇది కెడవువంటిది.)

**నెగులు.** దే. వి. 1. బాధ; "గీ. నిజముచెప్పినదీకుసేనెగులు లేదు." కాశీ. ౪, ఆ.-2. దుఃఖరూపమైనవిచారము. "ఎ, గీ. అనఁగుఁజెలినిబోరెనలరుఁదీవియనూఁది, నిగిడిమనములోనినెగులు చేతఁ, జవ్వడేమిద్రైనసవగనాలించుచు, నున్నదానినొక్కయువిదఁ గాంచి." య. 3, ఆ.

**నెగ్గడము.** వై. వి. త్రొక్కిడి, సమ్మర్దము.

**నెగ్గు.** దే. అ. క్రి. నిర్వహిల్లు. (నిగ్గుయొక్కరూపాంతరము.)

**నెగ్గురు.** దే. వి. గుండెయదరుటయందగునసుకరణము. "ఉ. అన్నీరజగంధిఁజూచియెదనెగ్గురనన్ గడుఖిన్నచిత్తుఁడై." శుక. ౧, ఆ.

**నెచ్చె.** దే. వి. మిక్కిలిచిన్నమైననూకలసమూహము.

**నెటిక.** దే. వి. వ్రేళ్లుమొదలగువాని కీళ్లకదలికచప్పుడు.

**నెటుకురు.** దే. వి. నెటికపెలుగుటయందగు ననుకరణము. "స్త్రీ. అష్టోత్తరశతవ్రణాధ్యక్షుఁడగురాజశిటకునకునవీఁపునెటుకురని యె." జై. ౭, ఆ.

**నెట్టన.** దే. అవ్య. క్రి. విశే. అనివార్యముగ. "క. ఎట్టివిశిష్టకులంబునఁ, బుట్టిన సదసద్వివేకములుగల్గియునుస్, గట్టినకర్మఫలంబులు, నెట్టనభోగింపకుండనేర్తురెమనుజుల్." భార. ఆది. ౫, ఆ. (రూ. నెట్టనను. "ఎ, గీ. పాత్రమెఱుఁగనిచెనఁటిభూపతుల యిండ్ల, కెట్టినియతాత్మకులనైననేగఁజేయు, ద్వారనిలయులువారింప వారినచట, నిలువఁబెట్టునగామంబునెట్టనముగ." శివ. ఉ. ౨, ఆ.) (దీనిని ద్రుతప్రకృతికముగా వాడుచున్నారుగాని దానికి సరియైనప్రయోగములేదు. అదిగాక యది ద్రుతాంతమైనయెడఁబకారాంతరమున మువర్ణాంతముగాదు.)

**నెట్టపంట.** దే. అవ్య. క్రి. విశే. నిష్కారణముగ.

**నెట్టిక.** దే. వి. నెటికయొక్కరూపాంతరము.

**నెట్టికసీల.** వై. విశే. సదాచారసంపన్నమగుస్వభావముగలవాఁడు, సదాచారసంపన్నమగు స్వభావముగలది. "పట్టినచలమునసీగతి, మట్టముగానేనఁబిలుకుమార్చికదలిరా, నెట్టికసీలతుమదిలోఁ, బుట్టిన హార్దమునఁ దమతపోవనమునకున్." జై. ౬, ఆ. "ఉ. నెట్టనయల్లలచ్చియలసీశలభూసలియుండనీవునీ, నెట్టికసీలపై మనసు నిల్పుటకేమనవచ్చు." ఆము. ౬, ఆ.

**నెట్టియము.** దే. వి. 1. చుట్టకుదురు; 2. గుండుపాగ. "వ.- కెంజడముడి బిగియించినెట్టియంబుచుట్టినజగజెట్టి." భీ. ౫, ఆ.

**నెట్టు.** దే. స. క్రి. పూనిత్రోయు. "క. నెట్టిరివిషాన్నమంటం, గట్టియుఘనపాశములనుగంగానదిలో, నెట్టియురాజ్యము వెడలం, గొట్టిరిధర్మంబువిడిచికుటిలాత్మకులై." భాగ. 3, స్కం. ["ద్వి. పూతిగంధంబులఁబొరలింతురగ్ర, వైతరణీనదివడినెట్టిత్రోతురు." (ఇక్కడనెట్టియనఁగా పూనియనిమాత్రమర్థము.) నల. ౪, భా.]- వి. 1. పూనిక; "ఎ, గీ. అంజకయశేషసుమనోవనాగ్రదేశ, ముఖరభూరిద్విజావళి మ్రోలనెట్టు, గానిలువనేర్తునాత్మయోగంబుఁ దొఱఁగి, సనుదుఃగాకనితాల్చెరూక్షప్రతిజ్ఞ." హంస. ౧, ఆ.-2. బ. బాలక్రీడావిశేషము. (రూ. నెట్లు.) (చూ. చిమ్ముబిల్లలు.)

**నెట్టుకొను.** దే. అ. క్రి. 1. పూనుకొను; "వ. నేనును నాథోత్తరీయంబు నడుమం జుట్టుకొనినెట్టుకొనియుండితి." భో. ౭, ఆ.-2. నెలకొను; "ద్వి. నెట్టుకొనినతొలుకరిమించొ." విష్ణు. ఉ. ౪, ఆ.-3. అతిశయించు. "గీ. పట్టఁగూడనితిమకంబునెట్టుకొనఁగ." శశాం. 3, ఆ.-స. క్రి. బలాత్కరించు. "గీ. కృపకులాబ్ధిచంద్రనీవింతనెట్టుకొ, నంగఁ ద్రోచిపోవ నాకుఁదగదు." భో. ౭, ఆ.

**నెట్టె.** దే. వి. ఉద్ది. "ద్వి. నిండారుప్రేమతోనెట్టెలుగట్టి, చెండునుదండంబుఁ జెలువొప్పఁబట్టి." రా. బాల, కాం.

**నెట్టెము.** దే. వి. నెట్టియముయొక్కరూపాంతరము. (గుండుపాగకు. "సీ. తనయడుగుంతమ్ములనురాచనెట్టెంపుఁబులుదిండిరాతుమ్మెదలుమెలంగ." య. ౧, ఆ.)

**నెడిమె.** దే. వి. దీపము. (అప్ర.)

**నెత్తకమ్మ.** దే. వి. (నెత్తము+కమ్మ.) పాచికలపంటెము. "సీ. నిలువుమహాబొంకకునెత్తకమ్మయటంచుఁబత్తులులెక్కడునొయ్యఁబలుక మనుచు." కళా. ౬, ఆ.

**నెత్తపలక.** ద్వి. వి. (నెత్తము+పలక.) నెత్తమాడెడుపలక, అష్టాపదము. (చూ. తమకు.)

**నెత్తము.** దే. వి. 1. పాచికలాట; "శా. ప్రౌఢాపొప్పియునెత్తమున్ మొదలుగా జూదంబునీవాడుస, వ్వేళన్." జై. 3, ఆ.—2. పందెము; "సీ. తనకులాగైననెత్తంబుగైకొనిపన్ని పాసికల్ తాల్చించి పాటెజేంగి." ఉ, హరి. 3, ఆ.—3. కొండమీఁది విశాలసమ ప్రదేశము. "శీ. నెత్తమ్ములేకొండనెత్తమ్ములందాడువిద్యాధరీకోటి విటులతోడ." స్వా. ౮, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. నెత్తపలక మొ.)

**నెత్తలులు.** దే. వి. బ. (నెఱ+తలులు.) పెద్దయలలు, కల్లోలము. "చదలేటిసేటినెత్తలులజఱించు క్రొన్నురువుదండములై." లక్ష్మీ. ౨, ఆ.

**నెత్తి.** దే. వి. తల, శిరము. "ఎ, గీ. కాకియైనగ్రద్దయిననులూకమైన, నెత్తిపోఁకినవాఁడాఱునెలలఁగెడయు." జై. ౮, ఆ. (రూ. నెత్తి కాయ.)

**నెత్తురు.** దే. వి. రక్తము. (రూ. నెత్రు.)

**నెత్తురుఁబ్రొద్దు.** ద్వ. వి. (నెత్తురు+ప్రొద్దు.) సంధ్యాకాలము. "వ. ఉత్తిరిఁగడిందినెత్తురుంబ్రొద్దగుట." స్వా. ౮, ఆ.

**నెత్తురుకందు.** ద్వ. వి. (చూ.) జొత్తుపాప. (రూ. నెత్రుకందు. "ఎ, గీ. నేత్రములువిప్పనట్టియానెత్రుకందు." పాండు. 3, ఆ.)

**నెత్తురుద్రావుఁడు.** దే. వి. (నెత్తురు+త్రావుడు.) రాక్షసుఁడు, అస్రపుఁడు. "క. కావునమీరానెత్తురు, ద్రావుడువంగడపుఁగడలి తామరదాయన్, వేవేగఁదెండుసేడ, ద్దీవికిదొరఁజేసియునుతుఁదిరమొప్పారన్." అచ్చ. యు, కాం.

**నెత్తురుపాప.** దే. వి. (చూ.) ముట్టుఁబాము.

**నెత్తురుబంక.** దే. వి. మలముతో నెత్తురునుబంకయునుపడు వ్యాధి విశేషము.

**నెత్తురువాఱు.** దే. అ. క్రి. (నెత్తురు+పాఱు.) ఎఱ్ఱసగు, జొత్తిల్లు. "క. కడలునునెత్తురువాఱఁగఁ, దొడఁగెన్." హరి. పూ. ౬, ఆ.

**నెత్రు.** దే. వి. నెత్తురుయొక్కరూపాంతరము. "నెత్రుటేర్లు." కా. 3, ఆ.

**నెనడు.** దే. వి. ఎముకలలోనిక్రొవ్వు, మజ్జ. "చ. నెత్తురున్నెనడునుగ్రోలిభూతములునిక్కుచునీల్గుచుఁజొక్కుచుండఁగన్." భార. ద్రో. ౨, ఆ. "గీ. నెనడుమెదడుమలమునెత్తురుశుక్లంబు, మూత్రమనెడునివియుమొదలుగాఁగ, గుబిలిచెమటపుసులుగోరు శ్లేష్మంబ్రవు, జలములివిశరీరమలములయ్యె." విజ్ఞా. ఆచా, కాం.

**నెనరు.** దే. వి. 1. కృతజ్ఞత; 2. ప్రేమము. "గీ. జనితనాకన్న నెనరైనవారునీకుఁ, గలుగనేర్తురె." భాగ. ౧౦, స్కం. ఉ.

**నెపము.** వై. వి. 1. వ్యాజము; "వ. అక్షవతినెపంబున." భార. అర. ౧, ఆ.—2. కారణము*; "క. విపరీతగతినిసుందుం, డుపసుందుఁడుఁదాఁకిపొడిచిరొండొరులుమహా, కుపితాత్ములయితిలోత్తమ, నెపమున దృఢముష్టిఘాతనిర్ఘాతములన్." భార. ఆది. ౮, ఆ.—3. తప్పు*. "చ. తివిరిమురారినీకుఁగడుఁదీపుగఁజెప్పినపల్కుగల్గినన్, గువలయనేత్ర నీమనసుగూడినవారికినైనఁజెప్పఁగా, వ వలదు దాననొండొకనెపంబుఘటింతురెటెంగిరేనినీ, నవతులు కృష్ణుబుద్ధినిరసంబగునీదెసఁదప్పయుక్తిచేన్." భార. అర. ౪, ఆ.

**నెప్పరము.** దే. వి. వేగము. "వ. అత్తఱిఁదత్తఱంబునఁదత్తడులం బల్లింపకయనెప్పరంబుననెక్కుఁబోవువారును." పా. ౮, ఆ. (రూ. నెప్పళము.)

**నెప్పరి.** దే. వి. (నెప్పు+అరి.) ఉపాయమెఱిఁగినవాఁడు, ఉపాయమెఱిఁగినది. "క. అప్పరిఁగలయుప్పరిగల, నెప్పరులగుమగువ లెక్కినిక్కితమనెఱం, గొప్పుల కలకల్పకముల, గొప్పనుమములేరి కోరికోయుదురదనన్." భద్రా. ౧, ఆ.

**నెప్పరించు.** దే. స. క్రి. మూందలించు. (వానినాకు నెప్పరించి పొమ్ము.)

**నెప్పు.** దే. వి. 1. స్థానము; 2. స్థైర్యము;*(చూ. జీను.) 3. ఉపాయము. రస. 3, గుచ్ఛము.

**నెప్పుకొను.** దే. అ. క్రి. పాదుకొను. "సీ. నెలనెప్పుకొనిగొప్పపులినైనఁబీడించిపటుపైతుఁజొచ్చినపాదమాన." స్వా. ౮, ఆ.

**నెమకు.** దే. స. క్రి. వెదకు, అన్వేషించు. "సీ. నానమణిపడిపోవ ధరణీతలంబుననెనుకంగవచ్చినసింగియనఁగ." పా. ౨, ఆ.

**నెమకుడు.** దే. వి. నెమకుట, అన్వేషణము.

**నెమరు.** దే. వి. పశువులు కొంచెమునమలితిన్నదాని నోటికితెచ్చుకొని మరల చక్కఁగానమలుట, రోమంథము.

**నెమరుచు.** దే. స. క్రి. నెమరువేయు. (రూ. నమర్చు. "చ. ప్రమదములుల్లసిల్లఁదనుపొంగిగనిద్రలునోయిపల్లవుల్, గమియనెమర్చిమేపఱుగఁగాఁబొరిఁబెండలువెట్టిలేదివ, గ్గనముగఁదలంచి పంచితిలిచన్నులఁజేఁపొదవంగఁబెంపుతోఁ, గొనురుగ జారుహుంకృతులగోవులుచెన్నువహించుచుండలన్." హరి. పూ. ౮, ఆ.)

**నెమిలి.** దే. వి. 1. మయూరము; "ఎ, గీ. పక్షములుగప్పిపెనఁబాఁపపాపలకును, మేపులొసఁగిరక్షించునెమిళ్లు." జై. ౮, ఆ.—2. నెమలియడుగుచెట్టు. (నెమలియనివాడుచున్నారుగాని దానికిఁ దగినప్రయోగము కనఁబడలేదు.)

**నెమిలియడుగు.** దే. వి. 1. పూతికరజము*; 2. బ. కుచనఖక్షతములు.

**నెమిలివడ్లు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము. "సీ. క్రొత్తగోనియలబియ్యమువట్లునెమిలివడ్లు, నొదినిరిప్రాలున నొనరంగఁబోసి చాఁపలునుంచములుమీఁదబలియఁగట్టు." హరి. పూ. ౬, ఆ.

**నెమ్మి.** యు. దే. వి. 1. ప్రేమము; "క. నెమ్మిగలవానినాది, త్తనెమ్మిశుతువానిసకలధర్మప్రియునా, సమ్మునినిదురుందోడ్కొని, రమ్మురుగుముకామ్యకాఖ్యరమ్యాటవికిన్." సం. "భ్రాతామమసుహృచ్చైవసాక్షాద్ధర్మఇవాపరః, తస్యస్మృతౌపద్యసుభృశం హృదయం దీర్యతీవమే, తథాసయసద్ధర్మజ్ఞః మమభ్రాతరమానయై." భాగ. అర. ౧, ఆ.—2. సమ్మది; "క. ఇమ్మణిమఱిపురమ్మునఁ, దమ్ముండునుదానునతిముదమ్మునసుండున్, నెమ్మినినిల్వఁలుఁడనవాఁ, డిమ్మహిధనవంతుఁడతఁడయెవ్వరికంటెన్." భార. అర. ౨, ఆ.—3. సంతోషము; "క. త్రిణయనుఁడువరమువేఁడుమా, దనుజాధిపయనుడునతఁడుదద్దయునెమ్మిన్." ఉ, హరి. ౬, ఆ.—4. క్షేమము; "గీ. అన్నగాడిలిచుట్టమవగుచుతేని, నెమ్మియుఱిఁగించియుసుఱులునిలిపినట్టి, నిన్నొకంతయుసగ్గపసేరనింకఁ, బుడమినెదురెందులనులేక తడవుమనుము." అచ్చ. సుం, కాం.—5. నెమిలి. "సీ. నెఱివేణిమెఱయించినెమ్మిబోదనరేఁచి వడిఁగేకవేయించెవనితయొకతె." చంద్రా. 3, ఆ.—వై. వంబాళము*. "రగడ. నెమ్మినుండియీనెమ్మికివదరెదు, కొమ్మపొన్నలుకొమ్మపదరెదు." యా. ౮, ఆ.

**నెమ్మిక.** దే. వి. నెమ్మి, ప్రేమము. "ఉ. నేరుగములజ్జయుంగరుణనెమ్మికకోపభయైకలేశమే, నేయుడఁజూచినన్ మతికినింపుకయుందక." రస. 3, గుచ్ఛము. (సార్థమున కప్రత్యయము.)

**నెమ్మిజొట్టు.** ద్వి. వి. బర్హిచూడము*.

**నెమ్మిగవుతు.** ద్వి. వి. కుమారస్వామి, శిఖివాహనుఁడు.

**నెమ్మిఱేఁడు.** దే. వి. _____ నై. _____

**నెమ్మిలి.** దే. వి. నెమిలియొక్క రూపాంతరము.

**నెమ్మిలిపరుఁజో.** దే. వి. కత్తిపరుఁజు.

**నెమ్ము.** దే. వి. 1. తేడి; 2. బ. పలకలులోనగునవి యంటవేయ లోపలఁజొప్పించెడుమేకులు. బండిచక్రముల రంధ్రముల యందు చొప్పించెడు ఇనుపగొట్టములు. (అనికొందఱు.)

**నెమ్ముకొను.** దే. అ. క్రి. చెమ్మగిల్లు. (వానచేతనేలనెమ్ముకొన్నది.)

**నెయి.** వై. వి. నెయ్యియొక్క రూపాంతరము.

**నెయ్యపుటలుక.** ద్వి. వి. (నెయ్యము+అలుక.) ప్రణయ కోపము.

**నెయ్యపుఱేఁడు.** ద్వి. వి. (నెయ్యము+ఱేఁడు.) మన్మథుఁడు, రతిపతి.

**నెయ్యమాడు.** ద్వి. అ. క్రి. (నెయ్యము+ఆడు.) స్నేహించు.

**నెయ్యమి.** వై. వి. నెయ్యముయొక్క రూపాంతరము. (ఇంపు నకు.—"క. అయ్యాకలదోకవిన్నవ, మియ్యవవనసీమ నివ్వడే నేర్పుగలిగె, నెయ్యమిగొనకపూఁజప్పర, మొయ్యనరచియించితిని సముజ్జ్వలభంగిన్." చమ. ౨, ఆ.)

**నెయ్యము.** వై. వి. 1. స్నేహము; "క. రమణినిజభ్రాతృనియో, గముఁదలఁతకయపుడు భీముఁగలసెఁబతిన్నే, హముకామినునఱ బలవం, తముపెఱనెయ్యములువేయుఁదట్లదృశేములే." భార. ఆది. ౬, ఆ.—2. ఇంపు. "అమ్మసాహాశ్రవమునెయ్యమునఁజూడంగఁ దిశిరి." భార, ఆది. 2, ఆ.

**నెయ్యరి.** ద్వి. విశే. (నెయ్యము+అరి.) స్నేహితుఁడు, స్నేహితు రాలు. "సీ. నేర్పులేకచెడంగనిండవేసురునండియతనోడువారు నెయ్యరులుగారు." రామా. 2, ఆ.

**నెయ్యి.** వై. వి. 1. తైలము; (చూ. నేయి.) 2. ఘృతము*. (నేయియొక్క రూపాంతరము.)

**నెయ్యుఁడు.** వై. విశే. స్నేహితుఁడు. "వానికినెయ్యుఁడై." భార. సభా. ౧, ఆ.

**నెయ్యురాలు.** ద్వి. విశే. (నెయ్యము+ఆలు.) స్నేహితురాలు.

**నెర.** దే. విశే. వృత్తియందు నెరవుశబ్దమునకుమీఁదివర్ణములోపిం పఁగా మిగిలినరూపము. "నెరవిల్కాఁడవుసీవెరామ." రామా. 2, ఆ.

**నెరడు.** దే. విశే. గొగ్గి, విషమము. (ఆచోటునెరడుగానున్నది.)

**నెరపు.** దే. ప్రే. (నెరయఁజేయు.) 1. నించు; 2. నెఱవేర్చు; "వ. అట్టివసంతసమయంబునం బురందరాదేశంబునెరపంబూని చనుదెంచినవనజలోచనలు." లక్ష్మీ. ౨, ఆ. — 3. పఱపు; "విక్రయార్థమైనెరపినవస్తుకంబులన." భల్లా. ౫, ఆ. — 4. వ్యాపింపఁజేయు. (చూ. నెఱపు.)—వి. వ్యాపనము. "క. కొరవునెరపుల్, దుల కించునాటతమిచే." య. ౪, ఆ.—విశే. అధికము. "ఆలాపములనెరపయ్యెన్." ఉ, హరి. ౫, ఆ.

**నెరయిక.** దే. వి. నెరయుట. (చూ. నెరయు.)

**నెరయు.** దే. అ. క్రి. 1. నిండు; "క. తరళనయనాబ్జదళ ములు, నెరయఁగఁదై మున్ను చల్లినృపసుతుఁబూఁజించిరి." భార. ఆది. 3, ఆ.—2. నెఱవేఱు; (చూ. నెఱవు.)—3. వ్యాపించే.

"మ. ఫణిసీమండలిసందునఁ జొరఁగి పాతాళంబునంబరిప్లవి, స్థిర నాథప్రముఖానురాఖిలనివాసశ్రేణులందోలిమై, నెరసెన్." లక్ష్మీ. 3, ఆ.

**నెరనంజి.** దే. వి. ఒకానొకచెట్టు. (దీనిని వైద్యసిఘంటువులయందు నెరవెందయని వాడుచున్నారు.)

**నెరవు.** దే. వి. 1. పూర్తి; 2. వ్యాపనము; "క. తిరుపాకటి పెటికలాంగల, ధరుఁ డుద్ధతిఁ బూఁచి హయరథద్విపసుభటా, తికరములమ్రగ్గింపఁగన, న్నెరవులు విచ్చుటయు మేదినీదరుఁ డలరెన్." హరి. ఉ. 3, ఆ.—3. మార్గము; "ద్వి. ఆ నెరవును మీఱహంనములరుగు, నాపైనిగారుడంబైనమార్గంబు." రా. కిష్కిం, కాం.—4. ఒకానొకచెట్టు. విశే. 1. పూర్ణము; 2. అధికము; 3. యుక్తము; 4. విశాలము; 5. వ్యాపకము; "నెరవతఁడుం డనుకావలయునిండుక." ఆము. ౪, ఆ.—6. వ్యాప్తము. "మహా స్రగ్ధర. తరుణీదామోదరీయోదరకుహర దరీస్థానమీనిక్వధాత్రీ, శ్వరుకీర్తుల్ ముంచిపాఱంజటులగతిజగజ్జాలముల్ దేలియాడన్, మురజిన్నాభిప్రణాళీముఖమున ధవళాంభోజమున్ పేరుగాఁదా, నెరవైతత్పూరమంతర్నిబిడమయి బహిర్నిర్గమంబున్ భజించెన్." సై. ౫, ఆ. (చూ. నెఱవు.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. నెర.)

**నెరవెంద.** దే. వి. తీక్ష్ణగంధము*.

**నెరసు.** దే. వి. 1. తప్పు; "చ. సుకవులసూక్తులందునరసుల్ నెరసుల్ వెదకంగఁబోరు." అని. ౧, ఆ.—2. కళంకము; "సీ. నిండారుచందురునెరసుతక్కువపడఁ దిలకించుముద్దుమోములబెడం గు." హరి. 2, ఆ.—3. దోషము; "మ. అతనిన్ వీక్షించియా చూడ్కియే, నెరసుంబొందకయుండవచ్చుమముఁదానెమ్మిన్ మహా భాగ్యసుం, దరుఁడక్రూరుఁడుదూచుఁగాత." హరి. పూ. ౮, ఆ.—4. నలుసు; "గీ. అనిమిషులగుండెలోగాలమఖిలలోక, నేత్రములనాటివేధించునెరసుగాలి, కాలిముల్లు కుభృత్పాళిపాలి పిడుగు, రావణుఁడుడిందెభువనముల్ రక్షఁజెందె." ఉ, రా. ౧, ఆ.—5. గవ్వుండ్లవాఁడుకత్తులునూఱెడుపొడి.

**నెరి.** దే. వి. వక్రత. "సీ. మొలకచీఁకటిజలజలరాల్పఁగారాదె నెరులుమించినవిరికురులయందు." పాండు. ౧, ఆ.

**నెరుము.** దే. స. క్రి. రాచే. "ద్వి. నెరిమిడాకాలఁజెండేరంబుఁ బెట్టి." సా. ౨, భా.

**నెఱ.** దే. విశే. వృత్తియందు నెఱవుశబ్దమునకు మీఁదివర్ణములోపిం పఁగా మిగిలినరూపము. (నెఱగాణ, నెఱజాణ, నెఱజోదు, నెఱ తనము, నెఱవడి మొ.) ["క. కరువలికొమరుఁడుమదిన, బ్బుర మందుచుఁగల్లతపనిపజ్జకుఁజనినన్, గరమరుదందుచువాఁడున్, వెరవొప్పఁగఁ గొమ్మమెకపునెఱకట్లనియెన్." (అని యాగ్రంథకర్త ప్రయోగించినాఁడు. ఇతఁడుతప్ప దీని నిట్లు భిన్నముగాఁబ్రయో గించినవారులేరు.) అచ్చ. యు, కాం.] (రూ. నెఱా, నేఱా.)

**నెఱఁకు.** దే. వి. నెఱసుయొక్క రూపాంతరము. (ఇది తఱచుగా బహువచనాంతమయినప్పుడేకుఁజంతముగా కానఁబడుచున్నది.)

**నెఱక.** దే. వి. వెండ్రుక, కేశము.

**నెఱకాఁడు.** దే. విశే. (నెఱవు+కాఁడు.) పూర్ణుఁడు.

**నెఱను.** దే. వి. 1. మర్మము; "క. మఱచితిగాకలతాంగీ, కఱకం ఠునితోడనాడు కాత్యాయనినీ, నెఱనెఱిఁగినాడచెప్పిన, తెఱఁగిదెన మకూఱెనింకదిగులేమిటికిన్." ఉ, హరి. ౫, ఆ.—2 జీవస్థానము. (చూ. దట్టము.)

**నెఱపు.** దే. ప్రే. (నెఱయఁజేయు.) 1. నించు; "నిండుకుసం బుతోనెఱపుముచెలిమి." అభిమన్యుద్విపద.—2. నెఱవేర్చు; "గీ.

ప్రతినెఱపుమవశ్యంబుపొ(ను)నొనఁగి." మార్క. ౮, ఆ.—3. పఱపు; 4. వ్యాపింపఁజేయు. "కమ్మజవ్వాదివలపునెఱపెడి సురఁటీలగఱులగాడ్పులుసోఁకి." శకాం. 3, ఆ.—వి. వ్యాపనము. —విణ. అధికము. (చూ. నెరపు.)

**నెఱయు.** దే. అ. క్రి. 1. నిండు; 2. నెఱవేఱు; (చూ. నెఱపు.) 3. వ్యాపించు. "ద్వి. పొండన్న నగరులుభుజశక్తిమెఱసి, నెఱసి బ్రహ్మాండంబునిండగర్జించి." రా. బాల, కాం.

**నెఱవాది.** దే. విణ. (నెఱపు+ఆడి.) నేర్పరి. "క. అఱువదినాలు గువిద్యలు, నఱువదినాలుగుదినంబులంతనవారల్, నెఱవాదులైన కతమున, నెఱినొక్కొ-కనాటివినికినేర్చిరిలేకా." భాగ. ౧౦, స్క-ం. పూ.

**నెఱవిద్దె.** దస్. వి. (నెఱపు+విద్దె.) హస్తలాఘవముగల జాలవిద్య.

**నెఱపు.** దే. వి. 1. పూర్తి; "ద్వి. నెఱవారనందఱనిర్జించె." రా. యు, కాం.—2. వ్యాపనము; 3. మార్గము. విణ. 1. పూర్ణము; "ద్వి. కఱకైనయాకుంభకర్ణునియందు, నెఱపైనకడిమికినిలువక కపులు." రా. యు, కాం.—2. అధికము; "గీ. పుడమితేనితోడఁ దొడరనీలావేమి, భరునికం బె నల్లగల్లనూడు, కొడుకుకం బెగండ్ర గొడ్డలితొలుపు, నేలవేల్పుకం బెనెఱవెచెపుమ." అచ్చ. యు, కాం.—3. యుక్తము; "వ. అందునందును వేఁటకునెఱపైనవాని నేర్పరించితెచ్చుటకునను చరులనీవునీవనినియమించి." స్వా. ౪, ఆ.—4. విశాలము; "క. ముఱిముఱిచీఁకటిలోనం, దఱురాజులు నమరముడిగితగనెల్లిటికిఁ, గొఱగలకలనగునదుపుడు, నెఱవగు గోవర్ధనాద్రినేలకుననుచున్." ఉ, హరి. ౪, ఆ.—5. వ్యాపకము; 6. వ్యాప్తము. (చూ. నెరపు.)

**నెఱవేఱు.** దే. అ. క్రి. ముగియు, సిద్ధించు.

**నెఱసరి.** దస్. విణ. శూరుఁడు. "క. చలినుండితొలఁగనుటికెడు, నెఱసరిసింగంబుఁజోలెనిబ్బరముగఁగ్రే, ళ్లుటికెందొలఁగఁబగతుని, యఱకటనుండిభువిమీఁదికబ్బలియుండున్." హరి. పూ. ౭, ఆ.

**నెఱా.** దే. విణ. నెఱయొక్క-రూపాంతరము. "నెఱాతెలి." అల్లసానిపెద్దనగారివృత్తమాలిక.

**నెఱి.** దే. వి. 1. అందము; "క. వసివాళ్లువాడియప్పుడు, వసంతసమయంపుబెండ వలనఁ నెఱిపోఁ, గనుగందులుకందినవవ, కుసుమలతికవోలెమిగులఁగోమలితోమప్పెన్." కళా. ౪, ఆ.—2. ఆచారము; "క. ఈనెఱిఁగైకొనిశూద్రుం, డైనను గ్రమవృత్తినవ్వయం బగుపదమున్, గానఁగఁబడయుటకల్లును, వానికినియమములత్రోవ వలవకయునికిన్." భార. అను. 3, ఆ.—3. వస్త్రపుకుచ్చె; "సీ. నెఱిపెట్టికట్టినవిండుచెంగావిపైఁగాంచికాఘంటికల్ కళవళింప." పాంచా. ౨, ఆ.—4. క్రమము; "క. నెఱిదప్పంబడిపెల్లుగ, నొఱలెడినరవాజికరులయులివధిమస్యం, డఱిముఱిఁబడుటకువగ మదిఁ, బఱిగొననిలపెలుచనఱుచుభంగిఁజెలంగెన్." భార. ద్రో. ౨, ఆ.—5. పక్షియీఁకలచిక్కు; "సీ. అలఁతఁజీఁకినయెఱకల నెఱిఁదీర్చుజక్క-వలుచెందొవలకేఁకటయొనర్ప." భార. ఉద్యో. ౨, ఆ.—6. న్యాయము; "గీ. నీకువిరలఁదేర్చుటనెఱియకాదె." భార. ఉద్యో. 3, ఆ.—7. పరాక్రమము; "క. నెఱినుఱకపైరి వీరుల, నెఱుకులుతూలంగనేయునృపపుంగవునం, పఱకోర్వక పిఱుఁదఁజనిరి, వెఱచివిపక్షులయిసకలవిషయాధిపతుల్." భార. ఆది. ౪, ఆ. — 8. పూర్తి; "మీఁదఁబురోచనుకృతినెఱి నేర్పడు నంతకును." భార. ఆది. ౬, ఆ.—9. తెక్కు; "ఎ, గీ. కటికి నెఱినెఱిఁగోలెమ్ముకయునువిఱుగ, విఱిచె." స్వా. ౪, ఆ. — 10. వక్రత; "ఎ, గీ. ఇంతికచములునెఱిగలయింవ్రశిలలు." చంద్ర. — 11. విధము; "మీరినెఱికిఁ నహాయపడుటీప్సితమేని గడింగుఁడు." హరి. ఉ. 3, ఆ.—12. ప్రజ్ఞ; "వ. ఆసక్కలు నరంబులుద్రివ్వంగఱచినెఱిదప్పియయ్యుష్ట్రంబు నిర్గతప్రాణంబయ్యె." భార. శాం. 3, ఆ.—13. బ. వెంద్రుకలు; "ఎ, గీ. నెఱులునేర్పునఁదడియార్చనెలఁతయోర్తు." య. ౪, ఆ. —14. చుట్టవెంద్రుకలు. "సీ. నెఱులనున్నదికప్పు తుఱుఁగలిగొనఁ గూడి పొదలువెంద్రుకలు కొప్పునకునెయిద." హరి. పూ. ౬, ఆ.—విణ. వక్రము. "నెఱులైయొప్పువినీలకేశములు." హరి. పూ. ౫, ఆ.

**నెఱిక.** దే. వి. 1. వస్త్రపుకుచ్చె; "సీ. బంగారునరిగలపట్టంచువలిపంపు నెఱికమీఁగాళ్లపైనొఱసియాడ." సురా.—2. పైటపావడ. "సీ. అచ్చవెన్నెలచాయనవఘళింపఁగఁజాలునిద్దంపువెలిపట్టునెఱికగట్టి." నై. ౬, ఆ.

**నెఱిపడు.** దస్. అ. క్రి. అగు, సిద్ధించు. "క. కానియటులుండి నెఱిపడు, నైనతెఱఁగుదోఁచిమాయమగు." భార. శాం. 3, ఆ.

**నెఱియ.** దే. వి. 1. చీలిక; 2. నేలపగులు.

**నెఱె.** దే. వి. నెఱియయొక్క-రూపాంతరము.

**నెఱ్ఱియ.** దే. ని.——పై.——

**నెఱ్ఱె.** దే. వి. నెఱ్ఱియయొక్క-రూపాంతరము.

**నెల.** దే. వి. 1. మాసము; (బహువచనమునందునెల్లు అని యొకానొకకవిప్రయోగించినాఁడు. "నాతికిఁదొమ్మిదినెల్లునిండఁగన్." య. ౫, ఆ.)—2. చంద్రుఁడు; "క. నెలలన్నియునిండఁగన, న్నెలఁతకుజనియించెనిండునెలపున్నమకున్, నలకొనియుదయించు పగిది, నెలమిఁగొడుకునకలకువలయేచ్చాకరుఁడై." హరి. పూ. ౫, ఆ.—3. పున్నమ; "సీ. నెలచందురునికాంతినెమ్మోమునృజియించియకలంకవిలసనంబలవరించి." షట్. ౬, ఆ.—4. స్థానము; "క. అనివలుకుకులశేభవముఖ, మునిజనములప్రశ్నవాక్యములువిని పురభి, త్తనయుఁడుతత్త్రిభమునా, క్క-నెలనుగుమిగూడియునికి గనఁజాలమికిన్." (చూ. ముందుపద్యము.) పాండు. ౧, ఆ.—5. కర్పూరము; (చూ. నెలవత్తి.) 6. తేఁడుదానిశిరోభూషావిశేషము.

**నెలఁత.** దే. వి. ఆఁడుది, నెలఁది, వనిత.

**నెలఁతుక.** దే. వి. (నెలఁత+ఉక.)——పై.——(సొప్వార్థమున ఉక.)

**నెలకట్టు.** దే. ని. జాతికట్టడపునేల, కుట్టిమము. "సీ. అడుగులనసుఁగాంతినయ్యెడపద్మరాగంబులనెలకట్టుకరణనొప్ప." భార. శాం. ౪, ఆ.

**నెలకువ.** దే. వి. స్థానము. "క. వినసుగావణుఁడటరిపుఁ, డానెలకువఁజొచ్చిపొదివిఁటకయ్యమునన్, జీనత్తురుగాళుఁడఁగ, వానిం జంపితఁటతగదవర్తనసేయన్." నిర్వ. ౨, ఆ. (ఇది పొలఁకువ వంటిదనితోఁచెడి.)

**నెలకూన.** దస్. వి. 1. బాలచంద్రుఁడు; 2. నఖక్షతము. వసు. ౬, ఆ.

**నెలకొను.** దే. అ. క్రి. నెలవుకొనుయొక్క-రూపాంతరము. (నిలుకడయగుటకు. — "క. మర్త్యుల్లలోకాంతికవృత్తిని, నెలకొనఁగానట్లు వచ్చు." భార, శాం. ౬, ఆ.—నిలుచుండుటకు.—"గీ. నేరుపున నిట్టులుద్దుల నేఱుపటిచి, రామకృష్ణాదులొకట శ్రీదామముఖ్యు, లొకటనెలకొని." దశావతారచరిత్రము. ౯, ఆ.)

**నెలగ.** దే. వి. ధనము. "క. కలిమికినిదగినకొలఁదిని, నెలగలవెలి విడువకున్న నిలుపెక్క-డిదా, కలయఁగనిండినచెఱువున, కలుఁగించుకవిడువకున్నవాఁగనిభంగిన్." ద్వా. ౨, ౬.

**నెలచూలి.** దే. వి. బుధుఁడు, సౌమ్యుఁడు.

నెలతాలుపు. దే. వి. చంద్రుడు, చంద్రశేఖరుడు. (చూ. నెలతాల్పు. "శా. నెలతాల్పుదేవరయాలిగిరిజనిగాదు వెండిగుబ్బలిచేతకయుండదనంచు." య. 3, ఆ.) (ఇట్లు జాబిలితాలుపు మొ.)

నెలత్రావపము. దే. వి. చకోరపక్షి. "గరుడిమాపులునెలత్రావడంబులంబ్రోచు." హంస. 4, ఆ.

నెలపట్టి. దే. వి. బుధుడు, సౌమ్యుడు.

నెలపాలు. దే. వి. చంద్రకళ, నెలవీసము.

నెలపులుగు. దే. వి. చకోరపక్షి. (చూ. నెలపుల్గు. "వాకట్టు నెలపుల్గుమూకకు." చంద్ర.)

నెలమేపరి. దే. వి. రాహువు, విధుంతుదుడు.

నెలఱాయి. దే. వి. చంద్రకాంతపుశిల. "సీ. నెలఱాతిచాలు నిగ్గులలోనిమిన్నేటి రాయంచగములయారభటివలన." రామా. ౧, ఆ. (రూ. నెలఱా. "నెలఱాచొక్కపుమేడలన్." చంద్రా. ౨, ఆ.) (ఇట్లు నెలచేట్టు, నెలచేలువ మొ.)

నెలవంక. ద్వ. వి. 1. బాలచంద్రుడు; 2. నఖక్షతము. "సీ. బింకంపుపానులవంకరాపడినెలవంకపైబూనినవానిమాని." వసు. ౧, ఆ.

నెలవంకకోల. ద్వ. వి. అర్ధచంద్రబాణము. "నెలవంకకోలలం ద్రుంచివైచి." రా. యు, కాం.

నెలవత్తి. ద్వ. వి. పచ్చకప్పురపుపలుకు. "సీ. మంచివాసనల వాసించినసెలవత్తి బాగాలురాసులు వడగగబోసి." కళా. ౭, ఆ.

నెలవరి. దే. విశే. నెళవరియొక్కరూపాంతరము. "క. తలవరులు నెలవరులున్, బొలపరులున్ వచ్చి." సా. 3, ఆ.

నెలవీసము. దే. వి. చంద్రకళ, నెలపాలు.

నెలవు. దే. వి. 1. వాసస్థానము; "వానినెలవుగంటి." భో. ౫, ఆ.—2. స్థానము; "ఈనెలవును బృందారకాధీనము." భార. స్వ. ౧, ఆ.—3. పరిచయము.

నెలవుకొను. దే. అ. క్రి. 1. నిలుకడయగు; 2. నిలుచుండు. (చూ. నెలకొను.)

నెలవెలుగు. దే. వి. వెన్నెల, చంద్రిక.

నెల్లి. దే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు, అగ్నిమంథము.

నెవడు. దే. అ. క్రి. వి. నెగడుయొక్కరూపాంతరము. (బయలు మెఱయుటకు. — "గీ. కువలయశ్రీతిరామంబైనెవడురాజు, గాఢరూఢప్రసన్నతంగానితిరుగ, సాధుబుద్ధివికాసైతిశంబరారి, వేమునకుం బోయుపాలయ్యె వృద్ధసేవ." పంచ. వేం. ౪, ఆ.)

నెవము. వై. వి. నెపముయొక్కరూపాంతరము. (కారణమునకు.—"గీ. చిత్రరుచింగెమ్మోవి చిఱుగాటునెవముగాంగ, దామరసనేత్రకోపింపందగదుమమ్ము." నై. ౮, ఆ.)

నెవయు. దే. అ. క్రి. నెగయుయొక్కరూపాంతరము. (ఎగురుటకు.—"క. అతమానదుఃఖితుండయి, పొవయుచుంగోపానలంబు పొడమిపెలుంగన్, బవనసఖుడగ్నికణములు, నెవయంగందనపొడవునూపెనిషధునిమ్రోలన్." భార. సభా. ౧, ఆ.)

నెవిలి. దే. వి. నెమిలియొక్కరూపాంతరము. (అప్ర.)

నెవులు. దే. వి. నెగులుయొక్కరూపాంతరము.

నెవ్వ. దే. వి. 1. దారిద్ర్యము; "వర్గంపునెవ్వన్." ఆము. ౪, ఆ.—2. ఆపద; "శా. నిన్నుంబొమ్మనుపేళనేమనిరిమానెవ్వల్ విచారింతురే." భాగ. ౧౦, స్కం. పూ.—3 వఱపు, వగ్రహము. "శీ. వానలులేక నెవ్వనుచైరులన్నియువాడందొడంగెన నోషిపజలు." అచ్చ. బాల, కాం.

నెళవరి. దే. విశే. 1. పరిచయముగలవాడు; 2. మర్మము నెఱింగినవాడు.

నెళవు. దే. వి. 1. పరిచయము; 2. మర్మము.

నెళి నెళి. దే. వి. విఱుగుటయందగుధ్వన్యనుకరణము. "ద్వి. నిజరథంబంతయు నెళినెళివిఱుగ." రా. యు, కాం.

## నే.

నే. దే. స. నాశబ్దప్రథమైకవచనమునకు పరళస్థిరవర్ణములుపరము లగుచోద్రుతములోపించినరూపము. (నేగెలిచితిని, నేపింటిని, మొ.) — వై. వి. నేయియొక్కరూపాంతరము. "ప్రజ్వలితాత్యుగ్రదవాగ్ని నేమిడిచినంజల్లారునే." ఉ, రా. ౨, ఆ.

నేచెల్ల. దే. అవ్య. (నేను+చెల్లె.) సంతాపమును దెలుపును. "గీ. అకటనేచెల్ల నేచెల్లహాకుమార, హాతనూభవహావత్స యనుచు నార్తిం, దల్లియును దండ్రియునువచ్చితనుజుంబొదివిరి." హరి. పూ. ౫, ఆ.

నేడు. దే. వి. ఈదినము.

నేత. దే. వి. 1. నేయుట, వయనము; 2. బ. సన్నబారచాంపులు. కవిక. 3, ఆ.

నేతకాడు. దే. వి. నేతనేయువాడు, తంతువాయుడు.

నేతపలక. దే. వి. నేతకాడునేయునపుడు పడుగుపేకలను ఉగ్గించునట్టిపలక.

నేతపురుగు. ద్వ. వి. సాలెపురుగు, తంతువాయము.

నేతరి. దే. వి. (నేత+అరి.) నేతకాడు.

నేజె. దే. వి. చిల్లకోల. "సీ. అనుగుంజుట్టంబైనయలవసంతునిరాకచిరవాజిబలునేజవిఱుగంజూచి." చంద్రా. 3, ఆ. (రూ. నేజేము. "క. నేజముగొనియిప్పోటున, నేజమునింజేర్తుననుచునిశిచరవీరుల్, జేజేలిడసాహసమున, జేజేలగజంబుకుంభసీమంగ్రుమ్మెన్." కళాం. ౫, ఆ.)

నేజా. దే. వి. నేజెయొక్కరూపాంతరము. "కత్వమొగ్గనేజానటు చిమ్మి." భాను. 3, ఆ.

నేటించు. దే. అ. క్రి. దృఢపడు. "ఆ. నిన్నునన్నుతించినేటించిమ్రొక్కుడు, హరిమురారిశౌరియవధరింపు." భద్రరాజపుత్రచరిత్రము. 3, ఆ.

నేటు. దే. వి. నిశ్చయము. "ద్వి. నేటుగానీకల్లనిజములురెండుం, దేటగానిప్పుడుతెలుపకయున్న." సా. ౭, భా.—విశే. దృఢము. "ఎ, గీ. మహోదరుతోడనేటుగనుపేణుం, దునువిరూపాక్షుతోడ రాముని యనుంగుం, దోడంబుట్టువునేడైత్తెఱదొడరి." అచ్చ. యు, కాం.

నేటుకొను. దే. అ. క్రి. నేటించు. (చూ. గోటాపన.)

నేటు సేయు. ద్వ. స. క్రి. (నేటు+చేయు.) నిశ్చయపఱచు. "ద్వి. పాటిలప్పితివయోపాపపుణ్యముల, నేటుసేయంగలేక." సా. ౭, భా. (చూ. ఓటుసేయు.)

నేత. సం. విశే. (బు. ఈ. బు.) ప్రభువు, ఏలిక.

నేతిబీఱ. ద్వ. వి. (నేయి+బీఱ.) ఒకదినుసుబీఱ, ఘృతకోశాతకి.

**నేత్రము.** సం. వి. అ. న. 1. కన్ను; 2. తరిత్రాడు; 3. ఏఱు; 4. వలిపము; 5. కేరు; 6. వేరు. విణ. డు. ఒడయఁడు.

**నేదిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి సమీపము.

**నేను.** దే. స. నాశబ్దమునకు ప్రథమైకవచనము.

**నేపథ్యము.** సం. వి. అ. న. 1. వస్త్రాద్యలంకారము; 2. నాట్యస్థానము. (కొన్ని నిఘంటువులయందీపాఠము.)

**నేపాళము.** ఉభ. వై. వి. వృక్షవిశేషము. సం. వి. అ. పుం. 1. దేశవిశేషము; 2. ఇక్షువిశేషము.

**నేపాళిక.** సం. వి. ఆ. స్త్రీ. నేపాళపుచెట్టు.

**నేబు.** దే. వి. పంద్రెండుకాసులనాణెము.

**నేమకము.** వై. వి. నేమము, నియమము.

**నేమము.** ఉభ. వై. వి. నియమము. "ఉ. గట్టిగనిశ్చయించెనా, భామలజట్టియిచ్చి తనపట్టినయట్టికడిందినేమముఙ్, దామదిఁగొన్ని నా శ్లపహతంబుగనిల్పికొనఙ్ మనంబులోఙ్." కళా. ౬, ఆ.—సం. అ. పుం. 1. కాలము; 2. మేర; 3. ఖండము; 4. ప్రాకారము; 5. కపటము.

**నేమి.** సం. వి. ఇ. స్త్రీ. 1. బండికంటికడకమ్మి; 2. గిఱక. పుం. తినాసము.

**నేమించే.** వై. స. క్రి. నియమించు "ఎ, గీ. మఱియుఁగడుఁ జేరుగలిగినమలలునరసి, యున్నతావులఁగదలింపకునిచిరండు, మీరలంచును బిలిచినేమించిపనుప." య. 3, ఆ.

**నేము.** దే. స. క్రి. ధాన్యము చేటలోఁ బోసికొని యిటునటుఁ ద్రిప్పు. స. నాశబ్దప్రథమాబహువచనమునకు రూపాంతరము.

**నేయము.** వై. వి. 1. స్నేహము; (నెయ్యమునకు మొదటిరూపము. చూ. నెమ్మిక.)—2. న్యాయము. "నేయముగాదువద్దంటే నిలిచేది మేరగాదు." క్షేత్రయ.

**నేయి.** వై. వి. నెయ్యికి మొదటిరూపము. (తైలమునకు.—"క. నేయి పాలుపడినదీవియ, మాయుకరణిఁగర్మసిద్ధిమలిగినహీన, త్వాయత్తం బైతానును, మాయునుదైవానుకూల్యమహ్మీమమహీశా." భార. అను. ౧, ఆ.)

**నేయు.** దే. స. క్రి. 1. నేఁతచేయు; 2. చాఁపలులోనగువానిని అల్లు.

**నేరఁబోతు.** దే. విణ. (నేరమి+పోతు.) తెలియనివాఁడు, అనభిజ్ఞుఁడు.

**నేరమి.** దే. వి. 1. అజ్ఞానము; "క. ఏనెఱుఁగమినిట్లడిగితి, నానేరమిసైఁపవలయు." భార. అర. ౫, ఆ.—2. దోషము. "సీ. పసులచేవిడువంగఁబడివిభుండు, కడఁగక విముఖుండుకాఁజనదని షుభషాత్రధర్మంబులోకంబులందు, నిలిపెఁదానిదిపతినేరమియే." భార. సభా. ౨, ఆ.

**నేరము.** దే. వి. తప్పు, అపరాధము. "చ. మిముమునువేఁటలాడి కడిమిఙ్ నొగిలించు మహాపరాధముఙ్, రమణినిశాతదీర్ఘతర రంగదపాంగములంజరించునే, రమునుసహించిచూపుఁడుకురంగములార లతాంగిచన్నమూ, ర్గముశశిమాళిమస్తకకరంబులుమీకువిహారధామముల్." రామా. ౫, ఆ.

**నేరాజా.** దే. విణ. సరిగతోనేసినది, జేరబాజా. (వస్త్రము.)

**నేరిమి.** దే. వి. నేరుపు, సామర్థ్యము.

**నేర్చుచే.** దే. అ. క్రి. ఓపు. స. క్రి. అభ్యసించు. (రూ. నేర్చు.) -ఓపుటకు.—"పలుకఁగ నేర్తుగదా." (చూ. తిలకించే.)

**నేరుపరి.** దే. విణ. (నేరుపు+అరి.) సామర్థ్యముకలవాఁడు, సమర్థుఁడు. (రూ. నేర్పరి.)

**నేరుపు.** దే. ప్రే. నేరువఁజేయు. వి. సామర్థ్యము. (రూ. నేర్పు.)

**నేరుపుకాఁడు.** దే. విణ. నేర్పరి. (రూ. నేర్పుకాఁడు.)

**నేరుపులాఁడు.** దే. విణ. (నేరుపులు+ఆఁడు.) నేరుపుకాఁడు. "పెనుబొజ్జనిడ్డనల్ నినుచునేరుపులాఁడు." అచ్చ. బాల, కాం.

**నేరెడు.** దే. వి. నేరేడుయొక్క రూపాంతరము. "ఉ. ఆరమణీయజంబువునయందనిశంబును భూరిసింధుర, స్ఫారఫలంబులన్నగముపైఁబడి వ్రయ్యఁగఁదద్రసంబులాం, పారమహాప్రవాహానదియై దివిజాద్రిఁ బ్రదక్షిణించియు, న్నేరెడుమ్రానిమూలమున నెక్కొనియుండు జగత్ప్రశస్తమై." మార్క. 3, ఆ.

**నేరేడు.** దే. వి. జంబువు.

**నేజా.** దే. విణ. నెజాయొక్క రూపాంతరము. "ను. రవిఁదీవ్రద్యుతియంద్రుడు పావకుని నేజామంటమారంద్రువా, రివిధంబుల్ పెనుపంజు క్రిందిదినియల్ రేరాజనిన్నెన్నచో, నవ్వనోఁదావకతేజమోర్వకచుమీయఙ్జాష్ఠుఁడబ్ధిఙ్ బడుఙ్, భవనంబుల్ వడిఁజోచ్చు నిచ్చశిఖి దీపశ్రేణిదంభంబునఙ్." చంద్ర.

**నేల.** దే. వి. 1. భూమి; "సీ. నేలనీరనలంబుగాలినభంబనునేనిటఁ బొడమైనయీశరీరము." మార్క. 3, ఆ.—2. ప్రదేశము; "క. భక్తకోటులలోనే, లంద్రిమ్మరునాత్మపురని, చంద్రవిలోచనునివేకమైత న్యనిధి." ఉ, హరి. ౨, ఆ. (ఈ యుదాహరణమునకు ముందు భాగము త్రోవకడవ్రాయఁబడియున్నది.)—3. దేశము. "ఆ. నేల ప్రొద్దైటెంగిచాలుమానిసిరణో, ద్యమమొనర్పుఁగాక." సం. "దేశకాలౌతుసం ప్రేక్ష్యయోద్ధవ్య మితిమేమతిః." భార. విరా. ర, ఆ.

**నేలఁగలుపు.** దే. అ. క్రి. (నేలఙ్+కలుపు.) చంపు.

**నేలకడిమి.** ద్వ. వి. భూకదంబము.

**నేలకలిగొట్టు.** దే. వి. భూస్ఫోటలి.

**నేలకుఁగోలకుఁ దెచ్చు.** దే. స. క్రి. క్రిందుమీఁదుచేయు.

**నేలగుమ్మడి.** దే. వి. భూమికగ్గారువు.

**నేలగుమ్ముడు.** ద్వ. వి. విదారి. (ఇది ద్వివిధము.— తెల్లనేలగుమ్ముడు, నల్లనేలగుమ్ముడు అని. ఇదియు తెల్లనేలగుమ్ముడు.)

**నేలగొలినిడి.** దే. వి. గోలోని.

**నేలమోలి.** దే. వి. సీత, భూమిజ. "ఆ. నెలమూలివెదకగాలిబిడ్డఁడులోను, గాను గలిగినట్టికడిదికొమ్మ, మెకపుగముల ననుప మించియందటిలోన, ననుమఁడుప్పుఁగడలియవలికరిగి." య. 3, ఆ.

**నేలజెమ్మి.** ద్వ. వి. పిన్నజెమ్మి, శమీరము.

**నేలతంగెడు.** దే. వి. చిన్నతంగెడు, అకులన్యము.

**నేలతాడు.** ద్వ. వి. తాళమూలిక.

**నేలతామర.** ద్వ. వి. మెట్టదామర, స్థలపద్మిని.

**నేలతాలుపు.** దే. వి. 1. పర్వతము, భూధరము; "నేలతాలుపు రాచచూలిగాదిలికందు." అచ్చ. బాల, కాం.—2. రాజు, భూధరుఁడు. "క. నలికపుమానిసియనినీ, తలఁపునవిపుడల్లనేలతాలుపు మిన్నఙ్, జులుకగఁజూచెదవకనిఙ్, గెలువఁగనీవంటివారికినిదర మగునే." అచ్చ. యు, కాం. (ఇట్లు పుడమితాలుపు, మన్నుతాలుపు మొ.)

**నేలతోళసి.** ద్వ. వి. భూతులసి.

**నేలనమిలి.** దే. వి. పక్షివిశేషము. "సీ. నేలనమిల్లి పైనేలాఁపు చేగలవిడిచి యేపునఁబోఁచమడఁచఁజేసి." రసి. ౧, ఆ.

**నేలనేరెడు.** దే. వి. కాకినేరెడు, భూమిజంబుకవృ.

**నేలపట్టి.** దే. వి. 1. అంగారకుఁడు, భౌముఁడు; 2. నరకాసురుఁడు; 3. సీత, భూపుత్రి.

**నేలపల్లటి.** దే. వి. పారావతవిశేషము.

**నేలపొన్న.** దే. వి. కోలపొన్న, అంఘ్రిపర్ణికవృ.

**నేలమాలె.** దే. వి. భూమిలోపలియిల్లు. "వ. బహుప్రకారంబులు నేలమాలెనున్నట్టికోలవేది పాలికింజనుదెంచి." వి. క్రీ. 3, ఆ. (మొదటిరూపము నేలమాలియ.)

**నేలములక.** దే వి. వాఁకుడు, వార్తాకివృ.

**నేలయుసిరిక.** దే. వి. (నేల+ఉసిరిక.) భూమ్యామలకివృ.

**నేలరేను.** దే. వి. భూబదరివృ.

**నేలఱేఁడు.** దే. వి. రాజు, భూపతి. "తే. మీసలోఁచనయను మాటమిథ్యగాక, యుండుమనట్లుగనొక్కవేదండయాన, దండదీయక నిలిచియుద్దండలీల, తెప్పవేయకయన్నెలతేనిఁజూచె." రసి. ౧, ఆ.

**నేలవేము.** దే. వి. భూనింబమువృ.

**నేలవేలుఁపు.** దే. వి. బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు. "ఎ, గీ. నేలవేలుపుమేలిటినేమములకు, నెలవు." య. 3, ఆ.

**నేలసంపెఁగ.** దే. వి. భూమిచంపకమువృ.

**నేలాఁవు.** దే. వి. (నేల+ఆఁవు.) శ్యేనవిశేషము. (చూ. నేలనమిలి.)

**నేవడము.** దే. వి. నేవళమునకు మొదటిరూపము.

**నేవము.** వై. వి. నెవముయొక్కరూపాంతరము.

**నేవళము.** దే. వి. మణులుగ్రుచ్చినహారము. "సీ. మొలనూలు నొడ్డాణమునునేవళంబుఁ బుంజాలదండయుబన్న నరముమొగపు, తీఁగయు." కళా. 2, ఆ.

**నేస్తకత్తె.** వై. విశ. (నేస్తము+కత్తె.) స్నేహితురాలు. (మొదటిరూపము నేస్తకత్తియ.)

**నేస్తకాఁడు.** వై. విశ. (నేస్తము+కాఁడు.) స్నేహితుఁడు. "తే. కటికిచీఁకటినెఱనేస్తకాఁడుబోలె, ధృతియొసంగఁగదానిమందిరముఁ జేరి." శుక. ౨, ఆ.

**నేస్తము.** వై. వి. మైత్రి, చెలిమి, స్నేహము.

**నేస్తురాలు.** దే. విశ. (నేస్తము+ఆలు.) స్నేహితురాలు.

**నేహారము.** దే. వి. నేవళముయొక్కరూపాంతరము. "ద్వి. లోహజితంబులైలోలతమించు,నేహారంబులుగొన్నినీలాలనమర."హరిశ్చ. ౨, భా. (దీనికి గ్రంథాంతరమందు ప్రయోగము కనఁబడలేదు.)

## నై.

**నైకభేదము.** సం. విశ. (అ. ఆ. అ.) అనేకభేదములుకలది.

**నైగనిగ్యము.** సం. వి. అ. న. నిగనిగలాడుట.

**నైగమము.** సం. వి. అ. న. వేదాంతము. విశ. పట్టణముది.

**నైగముఁడు.** సం. వి. అ. పుం. 1. నాగరుఁడు; 2. వణిజుఁడు.

**నైచికము.** సం. వి. అ. న. ఆవుయొక్క శిరఃప్రదేశము.

**నైచికి.** సం. వి. ఈ. స్త్రీ. చక్కనిరూపమును, మంచిప్రాయమును గలిగి సమృద్ధిగ పాలిచ్చెడియావు.

**నైచ్యము.** సం. వి. అ. న. (భక్త్యాదులచేఁగలుగు) అధమభావము.

**నైజము.** సం. విశ. (అ. ఈ. అ.) 1. తనది; 2. స్వాభావికము.

**నైపథ్యము.** సం. వి. అ. న. 1. వస్త్రాద్యలంకారము; 2. నాట్యస్థానము.

**నైపుణము.** సం. వి. అ. న. నేర్పరితనము, నిపుణత్వము.

**నైపుణి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**నైపుణ్యము.** సం. వి. అ. న.——పై.——

**నైమిత్తికము.** సం. విశ. (అ. ఈ. అ.) నిమిత్తమువలనఁగలిగినది.

**నైమేయము.** సం. వి. అ. పుం. వరకులమాఱుపు, వినమయము.

**నైయగ్రోధము.** సం. వి. అ. న. మఱ్ఱిపండు.

**నైయాయికుఁడు.** సం. వి. అ. పుం. న్యాయశాస్త్రముతెలిసినవాఁడు.

**నైరాశ్యము.** సం. వి. అ. న. ఆశలేనితనము.

**నైరృతి.** సం. వి. ఇ. స్త్రీ. పెద్దమ్మ. పుం. నైరృతుఁడు.

**నైరృతుఁడు.** సం. వి. అ. పుం. చతుర్థదిక్పాలకుఁడు, మూలఱేఁడు.

**నైర్ఘృణ్యము.** సం. వి. అ. న. దయలేనితనము, నిర్ఘృణత్వము.

**నైర్మల్యము.** సం. వి. అ. న. నిర్మలత, నిర్మలత్వము.

**నైల్యము.** సం. వి. అ. న. నల్లఁదనము, నీలత్వము.

**నైవేద్యము.** సం. వి. అ. న. నివేదింపఁదగినవస్తువు.

**నైష్కికుఁడు.** సం. వి. అ. పుం. టంకసాలకధికారి.

**నైష్ఠికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) నిష్ఠగలవాఁడు.

**నైష్ఠుర్యము.** సం. వి. అ. న. నిష్ఠురత, నిష్ఠురత్వము.

**నైసర్గికము.** సం. విశ. (అ. ఈ. అ.) స్వాభావికము.

**నైస్త్రింశికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) కత్తియాయుధముగాఁ గలవాఁడు.

**నైస్పృహ్యము.** సం. వి. అ. న. ఇచ్ఛలేనితనము, నిస్పృహత, నిస్పృహాత్వము.

## నొ.

**నొంచు.** దే. ప్రే. నొవ్వఁజేయు. "ఎ, గీ. ధర్మనందనుండు, నొంచెనిశితవిశిఖపంచకమ్మునసమ్మ, హీనునరముదర్పమెసకమెసఁగ." భార. కర్ణ. ౧, ఆ.

**నొక్కము.** దే. వి. పెద్దనదాప, శతావ్హాయవృ.

**నొక్కు.** దే. స. క్రి. అదుము. వి. 1. అదుముటవలనఁగలిగిన పల్లము; 2. ముడుత. "ప్రిదిలికైరవదళశ్రేణినొక్కులుదీఱె." స్వా. 3, ఆ.

**నొక్కుడు.** దే. వి. నొక్కు. "సీ. తలిరుపైఁగెంపులుదాఁచిన చందాన మునిపండ్లనొక్కుల్ల మోములలర." య. ౫, ఆ.

**నొగ.** దే. వి. కాఁడిమానికి ఆధారమై బండిలోనగువాని మొదట నుండెడు నిడుపాటిమ్రాను, కూబరము.

**నొగులు.** దే. అ. క్రి. 1. ఎడలు, వికలమగు; "వ. వీఁపులు వగిలియుమూఁపులునొగిలియు." ఉ, హరి. 3, ఆ.—2. నొవ్వు.

వి. 1. శకలమగుట; 2. నొప్పి. "క. తనువునొగిలించుకంటెను, మనమునొగుల్చుటయెహింసమదిఁబరికింపన్, దనువునొగులపుడ తీఱును, మనమునొగులుమనినదనుకమానదుసఖ్మి."

**నొగులుచు.** దే. ప్రే. (నొగులఁజేయు.) 1. ఎడలించు; 2. నొప్పించు. (రూ. నొగుల్చు. ఎడలించుటకు.—"తేరుపది బాణములనొగిల్చె." ఉ, హరి. 3, ఆ.—నొప్పించుటకు.—"భోజ వరురెంటనొగిల్చిన." జై. 2, ఆ.)

**నొచ్చిళ్లు.** దే. వి. బ. చొంగ.

**నొచ్చు.** దే. అ. క్రి. 1. నొప్పిఁజెందు; (నాకుకాలునొచ్చు చున్నది.)—2. దారిద్ర్యాదులచేపీడనొందు. (వాఁడిప్పుడు మిక్కిలి నొచ్చియున్నాఁడు.)

**నొచ్చుకొను.** దే. అ. క్రి. పశ్చాత్తాపపడు. (వాఁడు మాటమీఱి చెప్పినాఁడుగాని అవలచాలనొచ్చుకొన్నాఁడు.)

**నొచ్చుకోలు.** దే. వి. నొచ్చుకొనుట, పశ్చాత్తాపపడుట.

**నొడలదొంతి.** దే. వి. సంశయము. (అప్ర.)

**నొడి.** దే. వి. నుడియొక్కరూపాంతరము.

**నొడికాఁడు.** దే. విశే. మాటలమారి. "ఇంకంచనుఁగన్న దెవ్వ నొడికాఁడనికొంకితిఁగాని." భార. అశ్వ. 3, ఆ.

**నొడికారము.** దే. వి. నుడికారముయొక్కరూపాంతరము. "వ. కళావతీనీవునొడికారపుమాటలంబ్రోడవనివిందు." నై. ౫, ఆ.

**నొడికారి.** దే. విశే. (నొడికారము+ఇ.) మాటచమత్కారముగల వాఁడు. "ఉ. కప్పముపేరనేఁడునొడికారితనంబునమోసపుచ్చఁగా, నుప్పలుదెత్తురే." ఉ, హరి. ర, ఆ.

**నొడుగు.** దే. స. క్రి. వి. నుడుగుయొక్కరూపాంతరము.

**నొడుచు.** దే. స. క్రి. తప్పులుపట్టు.

**నొడుపు.** దే. వి. తప్పులుపట్టుట.

**నొడువు.** దే. స. క్రి. వి. నుడువుయొక్కరూపాంతరము.

**నొప్పి.** దే. వి. 1. బాధ; 2. ఒప్పమి, ఆపద, "క. అప్పాండవ మధ్యమునకు, నొప్పమిపుట్టంగవలయునుల్లముగలఁగెన్, దప్పదు నాకలనీసఖు, నొప్పిపరిహరించిదయఁగనుంగొనుమనినన్." జై. 2, ఆ.

**నొప్పిగుంటి.** దే. విశే. (నొప్పి+కుంటి.) వ్యాధిగ్రస్తుఁడు.

**నొల్లు.** దే. స. క్రి. బిడ్డలునోటవ్రేళ్లిడుకొనిచప్పరించు. "సీ. వ్రేళులుకఱవంగవెరవల్వరించిరోనోరఁజేతులుగ్రుక్కినొల్లు నాఁడ." నిర్వ. ౧, ఆ.

**నొవ్వి.** దే. వి. 1. వేదన; "క. ఎవ్వరులేనెడనొక్కఁడు, నొవ్వంగానడిచెనేనినొప్పికొలఁదియున్, జివ్వకతమునరయందగు, నొవ్విన్వాఁడెగ్గులాడునుత్తమునయినన్." విజ్ఞా. ప్రా, కాం.—2. వ్యాధి. "క. ఎవ్వరునేటికినామెయిఁ, గ్రొవ్వినమాంసంబుగలదు కొనుమాఁకలియున్, నొవ్వియునుదీఱునంతట, నవ్వల నారోగ్యమగుమృగాధిపనీకున్." పంచ. నా. ౧, ఆ. (నొవ్వు యొక్కరూపాంతరము.)

**నొవ్వు.** దే. వి. 1. వేదన; "తే. వాయువంగంబులందు దురాప్తి గదిరి, నొవ్వుఁదెవ్వులునుబుట్టించుఁగ్రొవ్వుచెఱుచు, నందు లెడలించుఁగ్రమమునసెందుఁబరఁగి, తనువుమ్రానుగఁజేసిజీవుని వెలార్చు." భార. అశ్వ. ౧, ఆ.—2. వ్యాధి. (చూ. నొవ్వి.)

**నొసలు.** దే. వి. నుదురు, ఫాలము.

**నొష్ట.** గ్రా. వి. (నొసటకు గ్రామ్యము.)

## నో.

**నోఁచు.** దే. స. క్రి. వ్రతమాచరించు. "మహోగ్రపు నోములు నోఁచుచున్నయయ్యోగివరేణ్యునేమమున నల్లము వెన్నవలెం గరంగ." పాండు. ౨, ఆ.

**నోఁత.** దే. వి. నోఁచుట. "చ. వెలిదళిఁగోరుదుండగపువేడుక కత్తెలనోముసోఁత." కవిక. ర, ఆ.

**నోటిబీగము.** దే. వి. దేవతాప్రార్థనకై దౌడలయందుకుట్టుకొనెడు చౌకపు లోహపుకమ్మి.

**నోటు.** ఆం. వి. చిన్నచీటి, విలువగలకాగితము. (బ్యాంకునోటు, ప్రామిసరీనోటు.)

**నోము.** దే. స. క్రి. 1. వ్రతముచేయు; "ఉ. మున్నెన్నిటనోము కొంచిరొసమిద్ధతపఃఫలసారమైనయు, ద్యన్నయశీలునిన్నఁదలిదం డ్రులు." రామా. ౨, ఆ.—2. పోఁగొట్టు. వి. వ్రతము.

**నోయు.** దే. అ. క్రి. నొచ్చు. "క. నోసినదెందముపగులఁగ." రా. సుం, కాం.

**నోరు.** దే. వి. ముఖద్వారము, వక్త్రము.

**నోరుమెంగ.** దే. విశే. మూఁగ. "క. నిన్నట్టిపలికద్రొబ్బఁగ, నిన్నకవనసంపన్నోరుమెంగయొయదియా, నున్నాడినసూటలబిసు, సన్నఁగనిదికసియెయతఁడుపేక్షయొనర్చెన్." కళా. 3, ఆ.

**నోరూరు.** దే. అ. క్రి. (నోరు+ఊరు.) 1. రుచిగలవస్తువులు తినుకోరికచేనోటనీళ్లూరు; 2. అపేక్షించు. "సీ. సంపెంగపొద రింటిచక్కిగోరఁటఁగాంచియుసురంచు మగుడ నోరూరునయ్యు." పా. 3, ఆ.

**నోరెత్తు.** దే. అ. క్రి. (నోరు+ఎత్తు.) మాటాడయత్నించు.

**నోవరి.** దే. విశే. (నోవు+అరి.) వ్యాధిగలవాఁడు.

**నోవి.** దే. వి. నోవుయొక్కరూపాంతరము.

**నోవు.** దే. వి. నొవ్వుయొక్కరూపాంతరము. "క. కౌరవపాండవు లందె, వ్వారలకుంజావునోవువచ్చినమేలు, రీవ్వరమణచిత్తమునని, య్యారయుమానీకుదుఃఖమగునట్లైనన్." భార. ఉద్యో. 3, ఆ.

## నౌ.

**నౌ.** దే. వి. నవ్వు. (మొదటిరూపము నవు.)

**నౌక.** సం. వి. ఆ. స్త్రీ. నావ, ఓడ.

**నౌకాదండము.** సం. వి. అ. పుం. ఓడనడపుగడ.

**నౌకు.** దే. వి. మొఱ్ఱి. "ద్వి. నల్లమబ్బుకుఁగ్రిందనౌకుదాపునను, దెల్లనివాల్చుక్కతెగిపడ్డరీతిఁ, గనిపించె." పా. ౨, భా. (మొదటి రూపము నవుకు.)

**నౌదుకొట్టు.** దే. అ. క్రి. మిణకరించు. (మొదటిరూపము నవు దుకొట్టు. "ద్వి. అనియిట్లుదేవేంద్రుఁడాడినమాట, వినియును విననట్లు విస్మయంబంది, చ్యవనుఁడూరకయుండె శార్ఙ్గరవుఁడు, నవుదుకొట్టెనునీళ్లు నమలెఁగశ్యపుఁడు." పారిజా. ౧, భా.)

**నౌబతు.** హిం. వి. చర్మవాద్యవిశేషము.

**నౌరు.** దే. విశే. మృదువు. (మొదటిరూపము నవురు.)

## న్య.

**న్యంకువు.** సం. వి. ఉ. పుం. 1. జింక; 2. ముని.

న్యక్కారము. సం. వి. అ. పుం. తిరస్కారము.
న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ. న్యక్కారము.
న్యక్షము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అధమము; 2. సమస్తము.
న్యగ్రోధము. సం. వి. అ. పుం. 1. మఱ్ఱిచెట్టు; 2. జమ్మిచెట్టు; 3. బార.
న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజెవి.
న్యర్బుదము. సం. వి. అ. న. పదియర్బుదముల సంఖ్య. విశే. పది యర్బుదముల సంఖ్యగలది.
న్యస్తము. సం. విశే. (అ. ఆ. అ.) ఉంచఁబడినది.

## న్యా.

న్యాదము. సం. వి. అ. పుం. భోజనము, కుడుపు.
న్యాయము. సం. వి. అ. పుం. 1. తగవు; 2. సృష్టిక్రమమువలన చలింపకుండుట; 3. తర్కశాస్త్రము.
న్యాయ్యము. సం. విశే. (అ. ఆ. అ.) న్యాయముతోఁగూడినది.
న్యాసము. సం. వి. అ. పుం. 1. ఉనుచుట; 2. ఇల్లడ; 3. వాడిక.

## న్యు.

న్యుబ్జము. సం. వి. అ. న. కర్మరంగమను మ్రానిపండు. పుం. దర్భతోఁజేసిన స్రుక్కు.
న్యుబ్జుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందుచూచువాఁడు; 2. తెవులుచే వంకరైనవాఁడు.

## న్యూ.

న్యూనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తక్కువైనది; 2. నిందింపఁదగినది.

## ప.

ప. ఒక యక్షరము.
పంకజము. సం. వి. అ. న. తామర, అనలుఁబుట్టువు.
పంకము. ఉభ. దే. వి. పాలు. "సీ. లేడిపిల్లలకుబాలెంతచివ్వంగులుపంకంబులిచ్చుచుఁబంచితిల్లు." జై. ౪, ఆ.—సం. అ. పుం, న. 1. బురద; 2. పాపము.
పంకరుహము. సం. వి. అ. న. తామర, అనలుఁబుట్టువు.
పంకా. హిం. వి. పెద్ద విసరుఁగఱ్ఱ.
పంకి. జై. వి. బురద. "చ. పొగడలసాదరాచిలుకపుత్తడిపావలు తావిదూపపుం, బొగలుజవాదిపంకితెలిముత్యపుఁజిప్పవనిండిగిండియుక్, బగడపుఁగోళ్లమంచము జమల్పటుపుం గపురంపుఁజిన్నికెం, పుగములజాలవల్లికయుఁ బువ్వులమించులనిల్వుటద్దముక్." య. ౫, ఆ.
పంకించు. యు. దే. స. క్రి. పట్టించు. "సీ. కలదులేదనుపాటి గారనూవెయొకింత పంకించితలచిక్కువాపిముడిచి." జై. ౬, ఆ. "క. బింకపువ్రేతలవాతెఱ, మంకెనపూఁదేనెతేటమానకత్రైచైత్రై, నింకఁగనింకఁగ బలుమఱుఁ, బంకించుటఁబోలెమోవిఁ బచ్చనచొచ్చుక్." పాండు. ౩, ఆ.—జై. అ. క్రి. చలించు. "సీ. బాంధవపితృమాతృభక్తిఁజెందినవాఁడు కిల్బిషంబులకుఁబంకించువాఁడు." జై. 3, ఆ.

పంకిలము. సం. విశే. (అ. ఆ. అ.) బురదగలది. (దేశము.)
పంకెన. దే. వి. తెడి, పదను. "సీ. పాపటయిడినూనె పంకెనతో నున్నగా దువ్వెనెఱులుకీలింటువైచి." హంస. ౩, ఆ.
పంకేజము. సం. వి. అ. న. పంకజముయొక్కరూపాంతరము.
పంకేరుహము. సం. వి. అ. న. పంకరుహముయొక్కరూపాంతరము.
పంగ. జై. వి. ఎడముగాచాఁగినశాఖ*. "క. పొడచెదరిబూదిచఱచిన, యొడళ్లతోనాల్గురెండునొకటియుఁబంగల్, విడటెకొమ్ముల బరువున, నడుగిడఁగాలేవ్వబలిసియందులదుప్పుల్." సాన్వ. ౪, ఆ.
పంగటి. జై. విశే. ఎడముగలది. (పంగటికాళ్లు.)
పంగటించు. జై. స. క్రి. ఎడముగాచాఁచు.
పంగటికాళ్లవాఁడు. దన్వ. వి. దొడ్డికాళ్లవాఁడు, ప్రగతజానుకుఁడు.
పంగనామము. దన్వ. వి. నడుమ ఎడముగలుగపంగవలెతీర్చిన తిరుమణి. (ఎడములేకతీర్చిన తిరుమణి బుంగనామము.)
పంగము. జై. వి. దేవబ్రాహ్మణవృత్తులమీఁద దొరతనమువారు తీసెడు చతుర్థాంశమైన కప్పము.
పంగిడి. దే. వి. ఓదము. (చూ.) అవపాతము.
పంగు. దే. వి. భయము.
పంగువు. సం. వి. ఉ. పుం. కెని. విశే. ఈచఁబోయిన కాలుగల వాఁడు.
పంగెన. దే. వి. (చూ.) పంగిడి.
పంచకము. సం. వి. అ. న. యుద్ధభూమి. న. అయిదు.
పంచగవ్యము. సం. వి. అ. న. అయిదువిధములైనగోసంబంధి వస్తువులు. (అవి ఆవుపేఁడ, పంచితము, పాలు, పెరుఁగు, నెయ్యి.)
పంచగూఢము. సం. వి. అ. పుం. తాఁబేలు. (ఇట్లు పంచ గుప్తము.)
పంచజనుఁడు. సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి.
పంచత్వము. సం. వి. అ. న. 1. చావు; 2. పంచభావము.
పంచదశి. సం. వి. ఈ. స్త్రీ. 1. అమావాస్య; 2. పున్నమ.
పంచనఖము. సం. వి. అ. పుం. పులి, వ్యాఘ్రము.
పంచనఖి. సం. వి. ఈ. స్త్రీ. ఉడుము.
పంచపాత్రము. సం. వి. అ. న. పంచపాత్రముల సమాహారము. (వాడుకయందు లోహపాత్రవిశేషము.)
పంచభద్రము. సం. వి. అ. పుం. అయిదుచోటమంచిసుళ్లుగల గుఱ్ఱము.
పంచమంగళము. సం. వి. అ. పుం. స్తనశిరఃస్కంధపూలికా వక్షోమధ్యములయందుమంచిసుళ్లుగల గజము.
పంచమము. సం. వి. అ. పుం. 1. కోయిలు; 2. రాగవిశేషము; 3. ఒక స్వరము. (చూ. స్వరము.) విశే. 1. అయిదవది; 2. ఇంపైనది.
పంచమి. సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు అయిదవతిథి; 2. ద్రౌపది.
పంచముఁడు. సం. వి. అ. పుం. మాలవాఁడు. విశే. నేర్పరి.

**పంచలక్షణము.** సం. వి. అ. న. పురాణము. (పంచలక్షణములు.—సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము.)

**పంచవన్నె.** వై. గ్రా. వి. అయిదువన్నెలు. "సీ. కన్నప్పవిభుని వక్త్రమున్మజ్జనపుబింబెపంచసాయకుమేనుపంచవన్నె." రుక్మి. ౪, ఆ.

**పంచవన్నియ.** వై. గ్రా. వి. పంచవన్నె. "సీ. పంచవన్నియతోడఁబ్రసవనారాచునిసెజ్జచిచ్చఱకంటజుట్టినాఁడు." భీ. ౧, ఆ.

**పంచవన్నె.** వై. గ్రా. వి. అయిదువర్ణములు.

**పంచశరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**పంచశాఖము.** సం. వి. అ. పుం. చెయ్యి, కరము.

**పంచసారము.** సం. వి. అ. పుం. పంచేదార.

**పంచాంగము.** సం. వి. అ. న. తిథివారనక్షత్రయోగకరణములను తెలియఁజేసెడు జ్యోతిషగ్రంథభాగము. పుం. 1. కూర్మము; 2. అశ్వవిశేషము; 3. ప్రణామవిశేషము.

**పంచాంగులము.** సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

**పంచాణుఁడు.** సం. వి. అ. పుం. శిల్పి.

**పంచాననుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, అయిదుమోముల వేలుపు. (ఇట్లు పంచాస్యుఁడు, పంచముఖుఁడు మొ.)

**పంచాయతి.** సం. వి ఇ. స్త్రీ. న్యాయముతీర్చుటకై మధ్యస్థముగా నేర్పడిన అయిదుగురికూటమి.

**పంచాలి.** సం. వి. ఈ. స్త్రీ. గీతవిశేషము, పంజేశము.

**పంచాస్యము.** సం. వి. అ. పుం. సింహము, తెఱనోటిమెకము. (ఇట్లు పంచాననము, పంచముఖము మొ.)

**పంచితము.** దే. వి. గోమూత్రము.

**పంచితిల్లు.** దే. అ. క్రి. గోవుమూత్రము విడుచు. (చూ. పంచితలు.) (చూ. పెమర్చు.)

**పంచివేఁత.** దే. వి. ఒక్కొక్కఁడింతింతయియ్యవలసినదని భాగములువేసికొనుట, చందా.

**పంచె.** దే. వి. 1. పడుచువాఁడును, పడుచుదియును కట్టుకొనెడు చిన్నవస్త్రము; 2. అంగవస్త్రము. (మొదటిరూపము పంచియ.)

**పంచే.** వై. వి. 1. గృహాదిపార్శ్వప్రదేశము; "క. నిశలగతినన్న రాక్షసు, లాకనాకనిమొగంబుఁగానకురకచవిరం, తకునరుణకిరణకిరణము, లకుఁబడమటికొండపంచలంబడవలసెఁ." ఉ, హరి. ౪, ఆ.— 2. పంచేపాక*. విణ. అధికము*. (చూ. పంచేకరపాటులు.)

**పంచేకము.** యు. దే. వి. అశ్వముయొక్క పశ్చాత్ప్రదేశము. "ఎ, గీ. పంచకముఱొమ్ముభిరివియైపరిఢవిల్ల." సా. ౧, ఆ.—వై. అయిదుతూములు*.

**పంచేకరపాటులు.** దృ. వి. బ. (పంచే కరము + పాటులు.) అత్యధికదుఃఖములు. "వ. అప్పుడుహరివిరించులు నక్తంచరులచేతఁ బంచకరపాట్లువడియంతఃకరణంబులంతలంచి." భీ. ౪, ఆ. "పంచకరపాట్లువడితన్నుఁజెంచి." కాశీ. ౪, ఆ.

**పంచేదార.** వై. వి. శర్కర.

**పంచేపాక.** దృ. వి. ఇంటిప్రక్కవంచికట్టినకట్టడము.

**పంచేబంగాళము.** వై. విణ. దూరము. "సీ. ప్రబలాంధకారధారాచ్ఛటాపటలంబుపంచబంగాళ మైపాఱిపోవ." కాశీ. ౧, ఆ.

**పంచోణము.** వై. వి. శిల్పము*. (చూ. పంచోణంబువాఁడు.)

**పంచోణంబువాఁడు.** దృ. వి. శిల్పి. "వ. అచ్చటిపంచాణంబువారునివసట్టుగా నప్పటప్పటికినాగపట్టణప్రసిద్ధబుద్ధాయతనంబు కన్నపోయునరిపలుకుచుండ." పం. ౪, ఆ. (చూ. పంచోణము వాఁడు, పంచోణపువాఁడు, పంచోణంపువాఁడు.)

**పంచోది.** దృ. వి. (పంచే + ఆది.) 1. పంచే; 2. పంచేపాక. "సీ. పంచాదియరుఁగుమైఁబంచాస్త్రబాణసమాకులమానసుండగుచునుండె." పర. 3, ఆ. (చూ. వీఁడాది.)

**పంచోరము.** వై. వి. 1. వ్యాపనము; 2. అతిశయము*. (చూ. పంచోరించే.)

**పంచోరించే.** వై. అ. క్రి. 1. వ్యాపించు; "వ. కమలకోశకనకకలశ కరికుంభప్రముఖంబులగునుపమాన్యంబులక్రొవ్వడంచి పంచారించిపిక్కటిల్లి." ఎం. మ. 3, ఆ.— 2. అతిశయించు*. "రగడ. పంచారించినకైవల్యసుఖప్రచయంబులకును ఘనిమణికర్ణిక." కాశీ. ౬, ఆ.

**పంచే.** దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు; "వ. తనశిష్యులనగ్గరునై తెంపాయన సుమంతుజైమినులం బంచి క్రమంబునఁజతుర్వేదసూత్రంబులఁజేయించివేదవ్యాసుండై." భార. ఆది. ౧, ఆ.— 2. పుచ్చు; "ఈతనింబంచితిసన్న్యయుక్తముగ." ద్విర. ౧, ఆ. (పనిచియొక్కరూపాంతరము. చూ. పనుచు.)— 3. భాగించు.

**పంజరము.** సం. వి. అ. న. 1. పంజేరము; 2. గవుసెన. పుం. 1. శరీరము; 2. శరీరముయొక్క యెముకలగూడు.

**పంజి.** దే. వి. కప్పము, కరము.

**పంజె.** వై. వి. బారంగి*. (మొదటిరూపము పంజియ.)

**పంజె.** వై. వి. అవిక*. "గీ. కొండలకునస్నసిమనుంగిగోనుభాంగి, పయ్యెదమొఱంగిచనుదోయిఁబంజఁ దేర్చె." గామా. ౪, ఆ. (ఇది విచార్యము.)

**పంజేన.** దే. వి. నిగరమైనది. (అప్ర.)

**పంజేరము.** వై. వి. పక్షినిపట్టి పెంచెడుగూఁడు. "పంజరంపు చిలుకాయన." అచ్చ. అ, ౩౦.

**పంజేశము.** వై. వి. (చూ.) పంచాలి. "తే. పాడెనుచ్చైఁచనొకయింతిపంజశములు." కాశీ. ౬, ఆ.

**పంజాయీ.** దే. వి. ఒకదినమునుదివటే. "జగతీశుర్యసులుసగడలు బలుపంజాయీలు." హంస. 3, ఆ.

**పంజో.** దే. వి. 1. దివటే; (చూ. సెజా.) 2. ఒకదినమునుదివటే; "దివటీలుఁదిరస్వికలుం బంజాల్ మహాజ్యోతులుఁ." హంస. 3, ఆ.—3. విడవలిలోనగువానికట్టు; (చూ. జేల్లి.)— 4. విడవలిలో నగువానిగంట. "సీ. పంజాజాడలనేగుపదనిరోసినఁగర్లఁబంజాజాడల నేగుపదవియిచట." రామా. ౪, ఆ.

**పంజోలకమ్మలు.** దే. వి. బ. రత్నములుచెక్కినకమ్మలు. "ఉ. బంగరుతళ్కుచెక్కులనుబంజాలకమ్ములడాలుచిందుద్రొక్కంగ." ఉ, రా. 3, ఆ.

**పంట.** దే. వి. 1. పండుట; 2. కృషి; 3. ఫలము. (చూ. పెడఁగు మొదటియర్థము నుదాహరణము.)

**పంటకాఁపు.** దే. వి. 1. పంటచేజీవించువాఁడు, కృషీవలుఁడు; 2. రెడ్లలో ఒకతెగవాఁడు.

**పంటరెడ్లు.** దే. వి. బ. రెడ్లలో ఒకతెగవారు.

**పంటపఱ్ఱఁతి.** దే. వి. భూమి. "సీ. బాహుసౌఖక్రీడఁ బరఁగు పంటవలంతిలోయ్యలినిమిసి కస్తూరిబొట్టు." వా. ౧, ఆ. (ఇట్లు పంటచెలి, పంటపాలఁతి మొ.)

**పంటసాల.** ద్వి. వి. 1. ఉగ్రాణము; 2. కణఁజేము.

**పంటి.** దే. వి. పనఁటియొక్క-రూపాంతరము. "సీ. పటిసీటికటం చుఁబాటిపం బెట్టుక పలుమాఱుఁదిరుగుసిబ్బరముతోఁడ." హంస. ౧, ఆ.

**పంటించు.** దే. అ. క్రి. 1. జోగుచేయు; "శా. మింటన్ మ్రోసిన మ్రోఁతతాలిమినిలో మేంద్రింపముస్నీరనా, యింటంబుట్టెదవం చుఁగంసుఁడుదొడిన్ హింసించెనీయన్నలన్, గంటంగూరుకుదేఁడు సీయుదయ మీకారాజునల్ సెప్పఁగాఁ, బంటింపం జెదురేగుదెంచు వడిసీస్పైనేఁడునన్నద్ధుఁడై." భాగ. ౧౦, స్కం. పూ.—2. తడఁబడు. "అలంతనూర్పువలపుల్ సాలఁగఁబంటింపఁగా." భాన. ౪, ఆ.

**పంటె.** దే. వి. సాలెవాఁడు నూలుచుట్టెడు సాధనవిశేషము. (మొదటిరూపము పంటియ. దీనినే పంటెకఱ్ఱ, పంటెకోల అందురు.)

**పంట్ర.** దే. వి. చిల్లులుగల అలుఁగులు మూఁడునాలుగుగలకఱ్ఱ. (దీనినేపంట్రకోల అందురు. "తే. కంపతొడుగీడ్చినట్లేదుకానఁజన్న, తెరువెఱుంగుచునోఁచేగిపరువుతోన, పడియడఁగియుండఁగాఁబటపటనముంట్లు, గాలిఁగదలుటగనిపంట్రకోలఁబొడిచె." సావి. ౪, ఆ.)

**పంట్రించు.** దే. స. క్రి. పంట్రతోఁబొడుచు.

**పండ.** సం. వి. ఆ. స్త్రీ. యథార్థమునెఱిఁగెడుబుద్ధి.

**పండావారు.** దే. వి. బ. జగన్నాథాదిదేశములందుండుజనులు.

**పండితుఁడు.** సం. వి. అ. పుం. చదువరి.

**పండు.** దే. అ. క్రి. 1. ఫలించు; 2. శయనించు. "తే. స్నానమొనరించునప్పుడుజపముసేయు, నపుడుఁగరపాత్రమునభిక్షయడుగునపుడుఁ, బండునప్పుడు బొంతపైనుండుమనసు, బీదగఱచినబూరెయభ్భిక్షునకును." పంచ. వేం. ౧, ఆ.—వి. ఫలము. విణ. పండినది. (పండుటాకు మొ.)

**పండుఁడు.** సం. వి. అ. పుం. నపుంసకుఁడు, పేడి.

**పండుకొను.** దే. అ. క్రి. శయనించు. (స్వార్థమునకొను.)

**పండుగ.** దే. వి. 1. ఉత్సవము; "ద్వి. పొలివోనిజవ్వనంబునఁ గన్నుపండు, గలుసేయుదానిచక్కఁదనంబు లెక్క." విష్ణు. పూ. ౩, ఆ.—2. సంక్రాంతిలోనగునది.

**పండుగు.** దే. వి. పండుగయొక్క-రూపాంతరము. (ఇది దండుగు వంటిది.)

**పండుచేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**పండువ.** దే. వి. పండుగయొక్క-రూపాంతరము.

**పండువు.** దే. వి. పండుగుయొక్క-రూపాంతరము. (చూ. పండుగు.)

**పండువెన్నెల.** ద్వి. వి. పూర్ణచంద్రిక.

**పండేరము.** వై. వి. భక్ష్యము. "ఉ. చేరినృపాలుఁడర్పణముచేసినఁజక్కెరలుప్పతిల్లువం, డేరములారగించుచునటింపఁదొడంగెనుహాసుఁడింపునన్." సా. ౧, ఆ.

**పండ్రెండు.** ద్వి. స. (పది+రెండు.) ద్వాదశసంఖ్య. (చూ. మండ్రాటము.)

**పంద్గమాను.** దే. వి. చేలలో సైరులోనిగాదముపోవునట్లు దున్నెడు సాధనవిశేషము.

**పంతకాఁడు.** ద్వి. విణ. (పంతము+కాఁడు) 1. పోటిచేయువాఁడు; 2. ప్రతిజ్ఞకలవాఁడు; 3. పౌరుషముకలవాఁడు.

**పంతగించు.** వై. అ. క్రి. 1. పోటిచేయు; 2. ప్రతిజ్ఞచేయు; "ద్వి. శూలాయుధుఁడనీవుచూచితివేని, బాళిఁజిక్కుదువనిపంతగించితిని." విష్ణు. ఉ. ౪, ఆ.—3. విధించు*. "క. అనికలు ద్రావుటయెవ్వరి, కనిగాదనిపలికిపంతగించుచునంజీ, వనిచేతఁ గడుపులోఁగచు, సనువుగఁబ్రతికింపఁదెలిసియతఁడిట్లనియెన్." య. ౩, ఆ.

**పంతము.** వై. వి. 1. పోటి; "మ. తమిఁబూఁదీఁగెలతూఁగుటుయ్యెలలఁబంతాలాడుచుందూఁగునా, కొమరుంబాయపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁజాఁగిమిం, టిమొగంబైచనఁదెంచు తీవిఁగనుఁగొంటేదివ్యపాసంద్రనా, కమ్రగినేత్రలమీఁదఁ గయ్యముసకున్ గాల్ సాఁచులాగొప్పెడున్." కళా. ౧, ఆ.—2. ప్రతిజ్ఞ*; "మ. పరితాపంబునఁబొందునప్పొలఁతికిన్ బంతంబునేనిచ్చితిన్, దరుణీతెచ్చెదనీమనోరమణుఁజింతాభారమింతేలయంచు." ఉ, హరి. ౫, ఆ.—3. పౌరుషము*; "పడుచులతోడఁ బోరుటదిపంతమె." ఉ, హరి. ౩, ఆ.—4. విధము*. "ద్వి. తటుకుసఁదుమ్మపంతముఁజెప్పుమనిన." హరిశ్చ. ౨, భా.

**పంతు.** దే. వి. మేలిమి. "ద్వి. అంతకంతకులతొంతొయుధకేళి, పంతువహించి యప్పద్మజుండు." విష్ణు. పూ. ౩, ఆ.—విణ. మేలు. "పరిజనకోపదంభమునఁబంతుగఁజూడవు." రస. ౧, గుచ్ఛము.

**పంతులు.** దే. వి. బ. 1. చదువులయ్యవారు; 2. కొందఱు బ్రాహ్మణులలో గొప్పయుద్యోగస్థులకు పూజ్యవాచకము.

**పంద.** వై. విణ. పిఱికి. "ఆ. ఓరోరియిం, కెందుఁబోవవచ్చుఁ బందనిలువుము." భార. ఆర. ౬, ఆ.

**పంది.** దే. వి. సూకరము. (దీని భేదములు. ఊరఁబంది, అడవిపంది, ముండ్లపంది.)

**పందికొక్కు.** దే. వి. మూషిక.

**పందిగడ్డ.** ద్వి. వి. పరికెగడ్డ, శృంగాటకము*.

**పందిగోరు.** ద్వి. వి. వేఁటకానిసాధనవిశేషము. "క. వడదోళ్లను ముప్పిళ్లను, నడిదంబులువెడఁదవాతియలుఁగులపాదులున్, దడవిండ్లుఁబందిగోళ్లును, గెడలున్ ధరియించి భటులుకెలఁకులఁగొల్వన్." భల్లా. ౩, ఆ.

**పందిపీఁట.** ద్వి. వి. గాఁడీమొదలగు ఎక్కుడుబండ్లచివరనుపంది మూతివలెమ్రానులోనగువానితోఁజేసియమర్చిన పరికరవిశేషము.

**పందిపోటు.** దే. వి. పందీఁటె. (చూ. తీడు.)

**పందిముక్కు.** దే. వి. పందిపీఁట.

**పందిమూతి.** దే. వి.——పై.——

**పందిరి.** దే. వి. గుంజెలునాటి మీఁదకొయ్యలుకట్టి టెంకాయాకులు లోనగువానికప్పినది, పందిలి. "సీ. శైత్యపాండిమలుతుషారాంతమునఁజేరెనిరులుకాన్ ద్రాక్షపందిరులవిరుల." ఆము. ౫, ఆ.

**పందిలి.** దే. వి. పందిరియొక్క-రూపాంతరము, కాయమానము.

**పందీఁటె.** దే. వి. (పంది+ఈఁటె.) పందినిపొడుచునట్టియీఁటె, పందిపోటు. (చూ. చేకత్తి.)

**పందుము.** వై. వి. (పది+తూము.) పదితూములు.

**పందెకాఁడు.** ద్వ. వి. (పందెము+కాఁడు.) పందెముపెట్టి కోడి మొదలగువాని జేగడమునకువిడుచువాఁడు. "సీ. పందెకాండ్రకు నిచ్చిపరిహాసకులకిచ్చికూడియాడెడుధూర్తకోటికిచ్చి." వి,క్ర. ౭, ఆ.

**పందెము.** వై. వి. 1. జూదములోనగువానియందు ఓడెడువాఁడు గెలిచెడువానికిచ్చునట్లు పంతమాడిపెట్టెడు ధనాదికము; 2. దాయము. (మొదటిరూపము పందియము.)

**పందేరము.** దే. వి. ధనాదికము పంచిపెట్టుట.

**పందొమ్మందుము.** ద్వ. వి. (పందొమ్మిది+తూము.) పందొమ్మిది తూములు.

**పందొమ్మిది.** ద్వ. స. (పది+తొమ్మిది.) ఏకోనవింశతి.

**పంపకము.** దే. వి. 1. పంచుట; 2. పంపుట.

**పంపర.** సం. వి ఆ. స్త్రీ. పంపరపనసకాయ.

**పంపరపనస.** ని. వి. పంపరయను ఫలవృక్షము.

**పంపించు.** దే. స. క్రి. పంచు, పుచ్చు. (స్వార్థమున ఇంచు.)

**పంపిణి.** దే. వి. పంచిపెట్టుట.

**పంపు.** దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు; "క. చంపునొకోయక్కటకా, రింపఁదలంచునొకొ లఘుచరిత్రంబులకున్, బంపఁగడం గునొకోశం, కింపండీకఱకుటసురకీడొనరింపన్." నిర్వ. ౫, ఆ.—2. పంపించు. వి. 1. ఆజ్ఞ; "మీరలెల్లనాపంపునఁబోరికిం జనుఁడు." జై. ౭, ఆ. (చూ. అంచు.) — 2. ఆజ్ఞాపింపఁబడిన పని; "ఉ. అత్తలకెల్లభూరివినయంబునఁబంపుదగంగఁజేయుచున్, జిత్తమెలర్పనాథుపనిసేయుచు." నిర్వ. ౮, ఆ.—3. పంపకము; "పాలుపంపనియూకయేలిమాటలనమ్మలుకఁదీర్చెదరు." భార. ఉద్యో. 3, ఆ. — 4. వరిమళ్లవరుస; "తత్కలమాంకూరపు పంపుమేయునెలజింకన్ సారెవారించు." వసు. ౧, ఆ. — 5. మారణకర్మము; "చ. బాలలపయిఁబంపువెట్టివెతలంబఱపం దగునాసమీరణా." చంద్ర.—6. తులామానవిశేషము.

**పంపుపడు.** ద్వ. అ. క్రి. (పంపు+పడు.) ఆజ్ఞాపింపఁబడు. "వ. మహాప్రసాదంబనిపంపువడిచంపకాపురంబునకరుదెంచువారు." జై. ౪, ఆ.

**పంపువెట్టు.** దే. స. క్రి. (పంపు+పెట్టు.) ఆజ్ఞాపించు. "ఉ. మీరిక నేఁటనుండియునుమేదినిలోఁగలపిన్నబిడ్డలన్, వారకచంపుఁ డంచుబలవంతులఁదెంపునఁబంపువెట్టినన్." వి, పు. ౭, ఆ.

**పంబ.** వై. వి. చర్మవాద్యవిశేషము.

**పంబు.** దే. అ. క్రి. అతిశయించు. "పంబినవేడ్కలుల్లమునఁబైకొన." రా. బాల, కాం.—వి. ఎద్దుమీఁదవేసెడు పెద్దసిద్దె. హంస. ౫, ఆ. (చూ. పమ్ము.)

**పంబుదాళ్లు.** దే. వి. (పంబు+తాళ్లు.) దేనినేని ఈడ్చికట్టెడు త్రాళ్లు. "జగాడంబారుసూంబట్టుపఁబుదాళ్లు." రసి. 3, ఆ.

**పకపక.** దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. "క. పకపక నవ్వుచునొకవి, ప్రకళేబరమాంసమల్లపుచ్చిపునుకపా, త్రికలోనఁగడిగిపెట్టుచునకుటిలమతిఁ గృష్ణనీకు నర్పితమనుచున్." ఉ, హరి. ౨, ఆ.

**పకాపక.** దే. వి. పకపకయొక్కరూపాంతరము. "నిండుచందురుఁబకాపకనవ్వుమొగంబు." శేష. ౧, ఆ.

**పకీరు.** హిం. వి. (చూ. ఫకీరు.)

**పకీలు** దే. వి. ఏయుటయందగు ధ్వన్యనుకరణము. "ఉ. కీరమ నీవుకొంతచెలికిన్ సకిగాళ్ళసనీదుమాటలన్,. గీరమస్నేఁచిలికన్ మధుప కీటములేఁగయికొన్న యీవెడం, గీరముచేరిచేయురుతు లేవినఁజూరతిపుష్పకోమలాఁ, గీరమణుండు తాళకపకీలనకాదలద్రివ్వనేసినన్." చంద్ర.

**పకోడి.** హిం. వి. భక్ష్యవిశేషము. (రూ. పగోడా.)

**పక్క.** యు. దే. వి. పడుకయొక్కరూపాంతరము. వై. 1. పార్శ్వము; 2. పక్షము.

**పక్కణము.** సం. వి. అ. పుం. బోయపల్లె.

**పక్కణి.** దే. వి. బరణి. "జవ్వాదిపక్కణి." నీలా. 3, ఆ.

**పక్కము.** వై. వి. మాసార్ధము. విణ. తోడు. "తే. నీవచుట్టంబుఁ బక్కంబు నీవచెలియు." భార. శాం. ౧, ఆ.

**పక్కా.** హిం. విణ. పక్వమైన, సిద్ధమైన, నిండు.

**పక్కాలి.** దే. వి. (చూ.) తఁగము, నీళ్లుతెచ్చెడి తోలుసంచి. (రూ. పకాలి.)

**పక్కి.** వై. వి. పులుఁగు, పక్షి.

**పక్కిడాల్వేలుపు.** ద్వ. వి. విష్ణువు, గరుడధ్వజుఁడు.

**పక్కియ.** యు. దే. వి. పక్కచెట్టు. వై. పార్శ్వము. "క. హరు శరమునుసరుశరమును, సరినిరుపక్కియలఁదాఁకి జవమఱిశరసం, భరమునఁదిరిగెవరాహము. శరనిధిమథనమునఁదిగుగు శైలముపోలెన్." భార. అర. ౧; ఆ.

**పక్కిరొయొడలివాఁడు.** ద్వ. వి. కిన్నరుఁడు.

**పక్కిరాయఁడు.** వై. వి. గరుత్మంతుఁడు, ఖగేశ్వరుఁడు.

**పక్కు.** దే. వి. 1. ఎండినపట్టు; "చిట్లుగందపుం బక్కులతోడి దేహములు." వి, పు. ౬, ఆ.—2. నవ్వుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (పక్కుననవ్వు, పక్కునఁదిట్టు, పక్కునఁబిగులు, పక్కునఁబొడుచు మొ.) (ఆమ్రేడితమునందు పక్కుపక్కు. "పక్కుపక్కున సంఘ్రిపాశముల్ వెనఁద్రెంచి." స్వా. ౪, ఆ. మొ.)

**పక్కున.** దే. ద్ర. క్రి. విశే. తటాలున. "పక్కునవేసరంజనదు." స్వా. 3, ఆ.

**పక్కె.** దే. వి. 1. పిచులముకాయ; (పక్కియయొక్కరూపాంతరము.) 2. మత్స్యవిశేషము. (దీని భేదములు. చేందమామపక్కె, బుడ్డపక్కె, బొందపక్కె, మంగలపక్కె, మూచెనపక్కె, మోరపక్కె.)

**పక్కెర.** వై. వి. గుఱ్ఱములోనగువాని అంగీ. (చూ. కడపటియుదాహరణము.) "సీ. పన్నగాళికినెదుర్పడవెండిఱెక్కలుధరియించెననఁగఁబక్కెరసెలంగ." పా. ౪, ఆ. "సీ. అర్జునునకుఁ, బ్రబలసింహమునకుఁ బక్కెరపెట్టినయట్లు దేవతలునెయ్యంబుతోడఁ, బరముఁదొట్టిపాశుపతమాదిగాదివ్య, శరములిచ్చిరి." భార. అర. ౧, ఆ. "క్రీడియేమంగుపక్కెరచిఱునుగ్గునేయ." భార. ద్రో. ౧, ఆ. "క. ఘూఁబక్కెరగలశుకతురగము, నెక్కినవెడవింటిగొతు కెఱఁగిలిమూర్తిన్." భో. 3, ఆ. "వ. సుశర్మయునేలినవానిపనిఁ బూనిజోడుపక్కెర కైదువులిరుదురవణంబు మొదలైనసవరణంబులంజూడ నక్కజంబుగాఁగూడి." భార. విరా. 3, ఆ.

**పక్కెరాలు.** ద్వ. వి. (పక్కెర+ఆలు.) అంతఃపురపుకావలికత్తె. "క. అవియచ్చటిసైకావలి, పెనురక్కసి పక్కెరాండ్రఁ బిలిచితినుండీ, వనితనిఁక రెండునెలలగు, దనుకంజూచియనిచెప్పిదైత్యుఁడుపోయెన్." రామా. ౬, ఆ.

**పక్త్రిమము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పండినది; 2. వండఁబడినది.

**పక్వము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పరిపాకముఁబొందినది; 2. చేటుమూఁడినది. "పక్వోష్ఠాఽజప్వత స్త్రీణామ్."

**పక్షకము.** సం. వి. అ. పుం. 1. దిడ్డివాకిలి; 2. పక్క.

**పక్షచరము.** సం. వి. అ. పుం. గుంపునుబాసి యొంటిఁజరించెడియేనుఁగు.

**పక్షచరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**పక్షతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పాడ్యమి; 2. ఱెక్కమొదలు.

**పక్షపాతము.** సం. వి. అ. పుం. ఒకపక్కకొఱగుట.

**పక్షపాతి.** సం. వి. న్. పుం. పక్షపాతముకలవాఁడు.

**పక్షభాగము.** సం. వి. అ. పుం. ఏనుఁగుయొక్క పార్శ్వభాగము.

**పక్షము.** సం. వి. అ. పుం. 1. నెలయందు పదియేనుదినములు; 2. ఱెక్క; 3. ప్రక్క; 4. ప్రక్కయిల్లు; 5. పగ; 6. బలము; 7. ఱాజెక్కడియేనుఁగు; 8. ప్రొయ్యినోరు; 9. చెలికాఁడు; 10. సహాయుఁడు; 11. తర్కవిషయసాధ్యము; 12. కేశతత్పర్యాయములకు పరమైనచో సమూహము. (కేశపక్షము మొ.)

**పక్షాంతము.** సం. వి. అ. పుం. 1. పున్నమ; 2. అమావాస్య.

**పక్షి.** సం. వి. న్. పుం. చిలుకమొదలైనది, పులుఁగు.

**పక్షిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రెండుపగళ్లతోఁగూడినరాత్రి; 2. రాత్రి; 3. పున్నమ; 4. ఆఁడుపక్షి.

**పక్షీకరించు.** సం. అ. క్రి. పక్షముంచు.

**పక్ష్మము.** సం. వి. న్. న. 1. ఱెప్పవెండ్రుక; 2. పక్షిత్రుప్పుడు; 3. నూలుతోనగుదాని సన్నపుతునుక; 4. అకరువు.

**పక్ష్మలము.** సం. విశే. (అ. ఆ. అ.) పక్ష్మములుగలది.

**పక్ష్మలించు.** సం. అ. క్రి. ఱెప్పవేయు. "వ. సరసీతీరంబున సారసంబుసారస్యంబుపక్ష్మలింప." కాశీ. ౨, ఆ.

**పగ.** వై. వి. 1. విరోధము; 2. విరోధి. "క. మసకుఁ, బగ యింద్రుఁడకాఁడెయెల్లభంగులఁదలఁపఁ." నిర్వ. ౫, ఆ.

**పగఁబట్టు.** ద్వ. అ. క్రి. (పగన్+పట్టు.) పగగొను. "ద్వి. ఆతరుణినామీఁదఁ, బగఁబట్టియేల భూపతికెఱఁగించు." సా. ౨, భా.

**పగగొను.** ద్వ. అ. క్రి. (పగ+కొను.) విరోధపడు. "క. శకుని వినుసమరధుఁడుపాం, డుకుమారులతోడనెప్పుడుంబగగొనివా, రికిఁగీడురోయు." భార. ఉద్యో. ర, ఆ.

**పగచాటు.** ద్వ. వి. దూపించుట. "క. కసరెత్తిమ్ముక్కుఁడుస్సిన, పసరమువలెరేఁగి పరుషభాషలనన్నున్, విసువకపగచాటునఁబో, ఱుసమునననదండపాలుఁడట్లొనరించెన్." పంచ. వేం. ౧, ఆ. "హస్తపంజరమునఁబూనిపెంచు శుకశాబకముంబగఁజాటుదయ్యె." కవిక. 3, ఆ.

**పగటివేలుపు.** దే. వి. (పగలు+వేలుపు.) సూర్యుఁడు, అహస్కరుఁడు. (రూ. పగటివేల్పు. "ఆ. చాలఁదపముఁబూని నంయముల్ వనముల, నిన్నుఁగాంచువేడ్కనున్నవారు, దర్శనంబొసంగఁదగురామయనిమేలు, కొల్పననఁగఁబగటివేల్పువొడిచె." అధ్యా. అ, కాం.)

**పగటు.** వై. స. క్రి. ప్రకటించు*. "క. ధరనెవ్వారలుచేసిన, దురితంబులునుచ్చరింపదోసముఁటమహా, పురుషులకొకకొదయొకచోఁ, బొరసిననదిపగటుపాపముల్ వృథననునే." కళా. ౮, ఆ. "సీ. తామరసంబులఁదన్మృణాళంబులఁ బగటుమొగంబులు బాహువులను." హరిశ్చ. ౧, ఆ.—వి. 1. ప్రకాశము*; "సీ. అవయవసరససౌష్ఠవములఁ బెంపొందుమృగవిశాలేక్షణల్ పగటుసూప." హంస. ౫, ఆ.—2. లావణ్యము*. "ఆ. వచ్చిమదికిమెచ్చువచ్చునచ్చెలితింత, పగటుఁజూచి." శుక. ౧, ఆ.

**పగడ.** దే. వి. పాచికలమీఁది ఒంటిచుక్క. న. ఒకటి.

**పగడపుజిట్ట.** ద్వ. వి. (పగడము+జిట్ట.) పక్షివిశేషము.

**పగడపురిక్క.** వై. వి. (పగడము+రిక్క.) ఆర్ద్రానక్షత్రము.

**పగడము.** వై. వి. మణివిశేషము, ప్రవాళము.

**పగడసాల.** ద్వ. వి. (పగడ+సారె.) 1. పాచికలుసారెలుగల జొగటాలపలక; "ద్వి. పగడంబుపలకపైభవ్యరత్నముల, జగడంబుగులికెడుసారెలువన్ని, కనకకీలితపాశకములతోఁదెచ్చి, యునిచెవారలచెంతనొకదివ్యకాంత, జగదీశుఁడపుడు శ్రీసతిమోముఁజూచి, పగడసాలిదెతెచ్చెఁబడఁతినీచెలియ, యాడెదవేయొకయాటనాతోడ." విష్ణు. పూ. ౨, ఆ.—2. జొగటాల ఆట. "ద్వి. పగడసాలాడంగఁ బ్రమదంబునొంది, జగతీశయిచటికేఁజనుదెంచినపుడు, నినుఁజిన్నపుచ్చుటనీతికాదింక." నళ. 3, భా. (సంధిని వర్ణవికారము.)

**పగతుఁడు.** ద్వ. వి. (పగ+అతఁడు.) శత్రువు.

**పగతురాలు.** ద్వ. వి. (పగతుఁడు+ఆలు.) శత్రురాలు.

**పగదారి.** వై. విశే. విరోధమువహించినవాఁడు.

**పగఱు.** ద్వ. వి. బ. (పగ+వారు.) శత్రువులు. "క. కఱకంఠవరమునాకుఁబ, గఱఁబరిమార్పంగశక్తిగలుగఁగనిమ్మీ." భార. సౌ. ౧, ఆ. "పగఱుపోయిరిపోయిరి." (చూ. తొఁడదల.)

**పగలింటిదొర.** దే. వి. (పగలు+దొర.) సూర్యుఁడు, అహర్పతి.

**పగలు.** దే. వి. దినము. (హలవసానంబులుపరమగుచో దీనియుత్వమునకు వికల్పముగాలోపంబగు. "పగల్ సనెఁజనెఁబగల్.")

**పగలువత్తి.** ద్వ. వి. ఒకదినముబాణపుసంచు, మత్తాబు.

**పగవాఁడు.** ద్వ. వి. పగతుఁడు, శత్రువు.

**పగిడి.** దే. వి. కరబుజేము*.

**పగిది.** వై. వి. 1. విధము*; 2. కప్పము*. "ఆ. నందుఁడాదిగాఁగఁగొందఱుగొల్లలు, పగిదిధనముఁదీర్పఁబాలుఁజమురు, నులుపగొంచుఁగంసుఁడున్నచోటికిఁబోవు, వారిఁగాంచెననతిబూరమునను." వి, పు. 2, ఆ.

**పగులఁగొట్టు.** దే. స. క్రి. (పగులన్+కొట్టు.) పగుల్చు.

**పగులఁబాఱు.** దే. అ. క్రి. (పగులన్+పాఱు.) పగులు. (చూ. పాఱు.)

**పగులు.** దే. అ. క్రి. భిన్నమగు. వి. చీలిక.

**పగులుచు.** దే. ప్రే. పగులఁజేయు. (రూ. పగుల్చు.)

**పగుల్లువాఱు.** దే. అ. క్రి. (పగుల్లు+పాఱు.) చీలు.

**పగ్గము.** వై. వి. 1. గుఱ్ఱములోనగువానికళ్లెములోనగువానియందు తగిల్చి యీడ్చిపట్టెడుత్రాడు; "క. అగ్గలికననఁడుహయముల, పగ్గంబులుసడలవిడిచిపటురయమునవా, మొగ్గరముఁదజేయఁబలపిన, ప్రగ్గెడరథపంచశతము మత్స్యాధిపుచేఁ." భార. విరా. 3, ఆ. "ఉ. మేఁడియుసీరముల్ భుజముమీఁదభరించుచుఁ బోతునెద్దుతోఁ, గూడఁగఁగాఁడిఁబూన్చిమునికోలకరంబునఁబట్టిపగ్గముం, ద్రాకునుమోకువాతెనయుఁదాలిచిముందటవెన్కఁజుంగుర్రే, లాడఁ

గఁగాసెఁగట్టుకొనియక్కు-టిలాత్తథుఁడే గెఁ జేనికిఁ." శేష. ౪, ఆ.—2. పాలెవాఁడు పడుగుసేడ్చికట్టెడుత్రాడు*; (చూ. కుంచె.) 3. తరిత్రాడు*; "ఉ. ఆదిమవ్యాళము దీనిపగ్గమయినట్టియవష్టం దలంతుసెప్పదుకఁ." స్కా. ౫, ఆ.—4. త్రాడు*. "సీ. వల పగ్గములు త్రెంచికలఁబడఁగొందఱే బొజ్జలు వ్రయ్యంగఁ బొడిచి పొడిచి." నీలా. ౨, ఆ.

పగ్గించు. వై. అ. క్రి. ప్రశ్నలుపలుకు. "వ. చూపఱగ్గింపఁబగ్గించియు నెగ్గించియు." ఉ, హరి. ౫, ఆ.

పగ్గె. వై. వి. 1. సామర్థ్యమునుదెలుపుమాట; "ఎ, గీ. చెంతఁ జేరిననీవేమిచేయుదాన, వాయెనీవట్టిపగ్గెలేలమ్మయనుచు." ఉ, రా. ౬, ఆ.—2. సామర్థ్యము*. "ఎ, గీ. కోఁతులెచ్చటజగడంపుఁ జేతలెచటఁ, బగ్గెలుపెట్టిదిగ్గనఁ బాఱెచనుఁడు." అచ్చ. యు, కాం. (మొదటిరూపము పగ్గియ.)

పంక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. వరుస; 2. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 3. పది.

పచ. సం. వి. ఆ. స్త్రీ. పాకము, వంట.

పచంపచ. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపుచెట్టు.

పచనము. సం. వి. అ. న. పాకము, వండుట.

పచారి. హిం. వి. చిల్లరదినుసులమ్మువాఁడు. (పచారిదినుసులు.)

పచేరము. వై. వి. విహారము. (ఇది నైఘంటికము.) (పచారు, వాడుకరూపము.)

పచేలిమము. సం. విశే. (అ. ఆ. అ.) తనంతట పక్వమైనది.

పచ్చి. దే. విశే. 1. ఉడిగనిది; (పచ్చిపిడుక మొ.) 2. ఉడుకనిది; (పచ్చిపులుసు మొ.) 3. ఎండనిది; (పచ్చికసవు మొ.) 4. కాలనిది; (పచ్చికుండ మొ.) 5. తేఱనిది; (పచ్చియొడలు మొ.) 6. మఱుఁగులేనిది; (పచ్చిమాట మొ.) 7. ముదురనిది. (పచ్చికాయ మొ.)

పచ్చిక. దే. వి. (పచ్చి+కలది.) పచ్చికసవు, శాదము.

పచ్చిదేఱు. దే. అ. క్రి. (పచ్చి+తేఱు.) పచ్చియగు.

పచ్చిబియ్యపుమామిడి. దే. వి. (పచ్చిబియ్యము+మామిడి.) నారలేక కండగలమామిడిచెట్టు.

పచ్చిబియ్యము. దే. వి. 1. నానఁబ్రాలు; 2. ఉప్పుడుచేయని బియ్యము.

పచ్చెకాఁడు. ద్వి. విశే. (పచ్చెము+కాఁడు.) చూచుచుండఁగా దొంగిలించువాఁడు.

పచ్చెము. వై. వి. చూచుచుండఁగా దొంగిలించుట. (మొదటి రూపము పచ్చియము.)

పచేరణ. వై. వి. నటన*. "ద్వి. పచరణకాడుమీపాదంబులాన." హరిశ్చ. ౧, భా.

పచరించు. వై. అ. క్రి. ప్రవర్తించు. "ఎ, గీ. నేలపైనిల్చితమ యేపునిల్వలేక, బెడిదముసఁబరుప్పపిడుగులకడిమియెంత, యనుచు గేలిగ రచ్చలనాడుకొనుచు, నేచిపచరింతురచ్చటిరాచవారు." య. ౧, ఆ.—స. క్రి. 1. ప్రసరింపఁజేయు*; "శే. తన్నుఁ గానంగరానీకతనుభ్రదాఁచి, యాకసంబుననుండివిహంగరాజు, భక్తి నెఱకలనీడనప్పుడ్దనాథు, మీఁదఁబచరించెబీఱెండమెఱయకుఁడ." హరి. పూ. 2, ఆ.—2. (అంగడియందమ్ముటకు) సరకులసమర్చు*; "చ. వననిధిలోనిరత్నములువానుకిమూర్ధజరత్నసంఘముల్, గొనఁ గనవత్న్యముక్జనులకుక్ నమకూఱదుగానసెప్పదుకఁ, గొనఁగఁ బరార్థ్యవస్తువులఁగోరినవానినయిచ్చునత్తెఱం, గునఁబచరింతురంగ ళులఁగోమటులప్పురిసిద్ధరత్నముల్." భార. ఆది. ౮, ఆ.—3. వలపఱచు*; "సీ. సాయంతనంబనుజాలరిజలధిలోఁబచరింప వలడిగ్గఁబాఱెనట్లు." ఉ, హరి. ౪, ఆ.—4. ప్రయోగించు*; "సీ. అఖిలెరెండవయుపాయంబైనభేదముఁ బచరించుఁబుణ్యపాప ములయందు." భో. ౭, ఆ.—5. బాణముప్రయోగించు*; "అంబ కపంచకంబుగలయంబచరించుచు." వసు. ౫, ఆ.—6. చేఁయు*; "చ. చేతులుపచరించుచుక్ దనువుధూళి మెయిందొరయంగనేలన, న్నెలమిని గొఁగిలించుకొనవు." మార్క. ౧, ఆ.—7. నడపు*; "సీ. శుచివృత్తినెన్నాళ్లుపచరించెనోతీర్థసంవాసమిచటిహంసవ్రజంబు." వసు. 3, ఆ.—8. సవరించు*; "క. కనికనకనిదమ కైదువు, లనఁబ్రగఁబచరించికొనుచునభిముఖులైయం, తనతిత్తెజోహత దశి, ఘనులగుటఁదల్లడిల్లిక్రమ్మఱిరివెనకఁ." హరి. ఉ. ౬, ఆ.—9. ప్రకటించు*. "ద్వి. హరివద్దనడచినయవ్వార్తలెల్లఁ, బచరించి." విష్ణు. ఉ. ౫, ఆ.

పచరింపు. వై. వి. ప్రసరణము. "గొనబుంబచరింపులసిద్ధుఁ శ్రేమ యుంచెనఁగొని." పు. ౨, ఆ. (చూ. ఆరగింపు.)

పచారము. వై. వి. అంగడి*. "ద్వి. మెఱుఁగుముత్తెపుఱాలమిం చుపచారము." విష్ణు ఉ ౪, ఆ.

పచారించు. వై. స. క్రి. 1. నడపు*; "ఈగతినిజక్రీడల్ పచారించుచో." రామా. ౬, ఆ.—2. ప్రసరింపఁజేయు*. "వ. నునుఁజొగవెన్నెలలంగలనిసిపాలించుదంచలదృగంచలప్రభలంబచారించి." స్కా. ౫, ఆ.

పచ్చ. వై. వి. 1. పసరువన్నె; 2. పసుపువన్నె*; 3. మరకతమణి*; 4. పచ్చనిచెట్టుమొదలైనది*; "పసినేదుదర్శించుఁజైరుఁ బచ్చ." పాండు. 3, ఆ. "ఉ. కోరికలెల్లఁజాలనొడఁగూర్చు ప్రియుంబెడఁబాసినట్టివం, కేరుహపత్రలోచనకుఁగీరమువైరము హారమెంతయుక్, భారముమంచికప్పురపుఁబలుక్కులుముల్కులు పచ్చవెచ్చకృం, గారవనాంతరాళశశికాంతపువేదులు నూదులార యక్." హరిశ్చ. 3, ఆ.—5. కరచరణాదులయందు పొడుచు కొనుటచేతనేర్పడెడు పసరువన్నెరేఖ*. విశే. 1. పసరువన్నెగలది; 2. పసుపువన్నెగలది*. [పచ్చ అను విశేషణము ముందుగలసంజ్ఞావాచక శబ్దములు.—పచ్చగన్నేరు (పచ్చపూవులగన్నేరుచెట్టు.), పచ్చగోరంట (కురంటకముచెట్టు.), పచ్చచేమంతి (కురంటకముచెట్టు.), పచ్చజెనము (శణపుష్పిచెట్టు.), పచ్చజొన్న (కలుజొన్న, కబీతనముచెట్టు.), పచ్చనీరుల్లి (దుర్గుమముచెట్టు.), పచ్చపెసలు (ఖండీరము.), పచ్చయరఁటి (మహారంభచెట్టు.), పచ్చయిరుగుడు (పాఠిణిచెట్టు.). ఇత్యాదులు.]

పచ్చఁబ్రాలు. ద్వి. వి. బ. (పచ్చ+ప్రాలు.) శోభనాక్షతలు. "ఉ. అల్లసవెండిపళ్లెరములందును గంధముఁబూలుఁబచ్చఁబ్రాల్, పెల్లుగనించి." య. ౪, ఆ.

పచ్చకన్నులమెకము. ద్వి. వి. సింహము, హర్యక్షము. "రాద పచ్చకన్నులమెకము." అచ్చ. యు, కాం.

పచ్చకన్నులవేల్పునూఁడు. ద్వి. ఎ. ఒకానొకరాక్షసుఁడు, సింగళాక్షుఁడు. "ఎ, గీ. త్రెలిమిడిఁబచ్చకన్నులవేల్పునూడుఁ, ఆదిమిష్వైచిన." అచ్చ. సుం, కాం.

పచ్చకప్పురము. వై. వి. చల్లదనమును, మంచి పరిమళమునుగల యొకవిధమయిన కర్పూరము.

పచ్చగన్నేరు. ద్వి. వి. 1. పచ్చపూవులగన్నేరుచెట్టు; 2. ధాన్యవిశేషము. "పచ్చగన్నేరు పూఁబాళలు." అను. ౧, ఆ. (చూ. కస్తురిపట్టియ.)

**పచ్చేవడము.** వై. వి. 1. పఱపుమీఁదపఱచెడుదుప్పటి; "వెన్నెల వెల్లపచ్చడమునిచ్చిన యంబరంకయన్గ మీఁద." లక్ష్మీ. 3, ఆ.– 2. వస్త్రము*; "క. కడకడలిసేఁడివెలుఁగను, జడదారివడిగాముసుఁ గఁజానిజేసుకుంఁబు, చ్చడమాఱఁగ జెఁదరిసఁ, బడమట నెఱసఁజ నింజెబలుఫ్రగమువేయుక." య. ౨, ఆ.–3. కట్టువస్త్రము*; "తే. అమరవందితశూలాయుధమున్ఁజీరి, యొడలుతిత్తొల్చితోలు పచ్చడముచేసి, యుత్తరాసంగముగఁజేసి యుండవలయు, నోడిగిలి రక్తబిందువులుట్టిపడఁగ." కాశీ. ౬, ఆ.–4. అఁగవస్త్రము*. "సీ. కటిమండలమునసిరాపాడిదోవతి మీఁదవెలిపట్టుపచ్చడంబలవ మిగుల." రుక్మి. ౧, ఆ.

**పచ్చేడి.** దే. వి. 1. కూరగాయదినుసులు మొదలైనవాని నేచేనిఖండ ములుచేసివేసి పలుచగాచేసిన వ్యంజనవిశేషము; "ఎ, గీ. ఊరుఁ బిండులుకొకకొన్ని యొక్కకొన్ని, యూరుఁగాయలుఁబచ్చళ్లు నొక్కకొన్ని." పాండు. ౪, ఆ.–2. ఖండము; "వెడఁదగొడ్డఁ డ్లఁబచ్చడిసేయఁబనువారు" కవిక ౫, ఆ.–3. ఊరుఁబిండి.

**పచ్చేతలపిచ్చుక.** ద్వ. వి. పక్షివిశేషము, శీతముండకు.

**పచ్చేన.** వై. వి. 1. పసరువన్నె; 2. పసుపువన్నె*. (విశేషణ మైనచో. "పచ్చనిపూఁబరువునఁజలపనివాగొపక్కెర." స్వా. ౪, ఆ. ము.) (రూ. అలకన.)

**పచ్చేపచన.** వై. వి. (పచ్చేన+పచ్చేన.) మిక్కిలి పచ్చేన. "పచ్చేపచనయినదళంబులు." చసు. ౧, ఆ.

**పచ్చేపిట్ట.** వై. వి. పక్షివిశేషము, హారితము.

**పచ్చేపులుఁగు.** ద్వ. వి.____వై.____

**పచ్చేముపాడు.** దే. విణ. (పాడు+పాడు.) మిక్కిలి శూన్యము. "నేనలన్నియుంబచ్చముపాడుగావిడిగిపాటె." జై. ౪, ఆ.

**పచ్చేవలుపదారి.** ద్వ. వి. విష్ణువు, పీతాంబరుఁడు.

**పచ్చేవారువపుజోదు.** ద్వ. వి. (పచ్చేవారువము+జోదు.) 1. సూర్యుఁడు, హరిదశ్వుఁడు; 2. మన్మథుఁడు, శుకవాహుఁడు. (రూ. పచ్చవారవ్పుజోదు. "సీ. పచ్చవార్వపుజోదుపచ్చవార్వపుజోదువలకన్నుఁగొడుకునైవలపులుక." అచ్చ. బాల, కాం.)

**పచ్చేవిలుతుఁడు.** ద్వ. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. "క. నెచ్చెలులుతన్నుఁగొలువఁగఁ, బచ్చవిలుతుకలిమియెల్లఁబద్ధానమ్మై, యచ్చుపడినట్లుమెఱయుచు, నచ్చటికేతెంచె భూవరాత్మజనెమ్మిక." భార. ఆర. 2, ఆ. (రూ. పచ్చేవిల్తుఁడు. ఇట్లు పచ్చేవిలుకాఁడు ము.)

**పచ్చాకు.** ద్వ. వి. (పచ్చే+ఆకు.) హరితపత్రి,కాపత్రము.

**పజ.** వై. వి. జనము. "క. దేవరనీపీపజలను, బ్రోవఁగ." నీలా. ౨, ఆ.

**పజ్జ.** వై. వి. 1. వెనుక; "గీ. నాదురోదనంబునన్ను నెఱుంగఁగ, వలతువేనినమరవల్లభుండ, నాపిఱుందరమ్మునావుడునప్పుడు, వనిత పజ్జనరిగెవానవుండు." భార. ఆది. 2, ఆ.–2. సమీపము*. "క. పలలాదబలంబులలకపజ్జకుఁజనియెక." ఉ, రా. 3, ఆ.

**పటకా.** హిం. వి. నడుముబిగించుపట్టె, నడికట్టు.

**పటకారుఁడు.** సం. వి. అ. పుం. సాలెవాఁడు.

**పటచ్చరము.** సం. వి. అ. న. ప్రాఁతగుడ్డ.

**పటపట.** దే. వి. కదలుటయందును, కొట్టుకొనుటయందును, వగులుట యందును నగు ధ్వన్యనుకరణము. (చూ. వంటకోల.) "గీ. పట పటఁగపాలపంక్తులువగులఁగొట్టికి." స్వా. ౪, ఆ. "చ. పటపట పండ్లుగీటుకొని పంక్తిముఖాసురభర్తృపుష్పకం, బటుడిగి." ఉ, రా. 3, ఆ. "పటపటజాతికంబమిరుపాయలుగా." పా. 3, ఆ.

**పటము.** ఉభ. వై. వి. పాఁపపడగ. సం. అ. పుం, న. 1. వస్త్రము; 2. చిత్రరువ్రాయువస్త్రాదికము. పుం. మోరటికి.

**పటలము.** సం. వి. అ. న. 1. ఇంటికప్పు; 2. సమూహము; 3. పరివారము; 4. గ్రంథభాగము; 5. నేత్రరోగవిశేషము; 6. నొసటిబొట్టు. పుం. రత్నదోషము.

**పటలి.** సం. వి. ఈ. స్త్రీ. సమూహము.

**పటవణి.** దే. వి. వ్యాపనము. "అరిగలపటవణినలరుచోట్లు." కళా. ౮, ఆ.

**పటవణించు.** దే. అ. క్రి. వ్యాపించు. "పటవణించినయరిగల పొఁజు." కవిక. ౨, ఆ.

**పటవాసకము.** సం. వి. అ. పుం. వస్త్రములకు వాసనకట్టెడు బుక్కాము.

**పటహము.** సం. వి. అ. పుం, న. తప్పెట. పుం. యుద్ధవాద్యపు మ్రోఁత.

**పటా.** వై. వి. గోనెపట్టలోనగునది*. "ఎ, గీ. పసిఁడికమరుపటా యొక్కకినలయొప్పి, మొలనుధరియించె." రసి. ౧, ఆ. (పట్టా యొక్కరూపాంతరము.)

**పటాకి.** హిం. వి. మందుసామానుజాతి. (టపాసు అని కొంద అందురు.)

**పటాణి.** దే. వి. గుజ్జము. "చిలుకపటాణిరౌతు." ఉ, రా. ౪, ఆ.

**పటాపంచే.** దే. విణ. అగోచరము. "పాపపూరుషుఁబటాపంచ చేసి." పాండు. ౨, ఆ. (రూ. పటాపంచేము. "మిముం జేర్కొన్నమాత్రంబటాపంచంబైదురితంబులెల్లజనఁగా." విజ. ౨, ఆ.)

**పటాలము.** వై. వి. దండు*.

**పటికి.** వై. వి. పటికారము. "పటికనార్చిన పైఁడిప్రతిమపగిది." పర. ౨, ఆ.

**పటిక బెల్లము.** ద్వ. వి. (పటికము+బెల్లము.) కండచెక్కెర.

**పటికము.** వై. వి. ఒకదినుసు తెల్లకాయి.

**పటికారము.** వై. వి. (పటిక+కారము.) వెలిగారము.

**పటికిరింత.** దే. వి. చేలము. "ద్వి. పటికిరింతలపిల్లిపట్టినదొబ్బ." హరిశ్చ. ౨, భా.

**పటితలించు.** దే. స. క్రి. చేఱచు. "గీ. బాహువెత్తిచట్లిల్లనఁ బటితళించి." ఉ, హరి. ౬, ఆ.

**పటిమ.** సం. వి. న్. పుం. 1. నేర్పు; 2. ఓపిక.

**పటిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి పటువైనది.

**పటీరము.** సం. వి. అ. న. చందనము. పుం. చందనవృక్షము.

**పటుకాఱు.** దే. వి. పట్టుకాఱుయొక్కరూపాంతరము.

**పటుకు.** దే. వి. పడకైచుటయందగు ధ్వన్యనుకరణము. "పటుకునఁ బడకైచి." భీ. ౨, ఆ.

**పటుక్కు.** దే. వి. తెగుటయందగు ధ్వన్యనుకరణము. "కుట్టుపటు క్కునందునిసి." ఆము. ౪, ఆ.

**పటుపర్ణి.** సం. వి. [illegible] రెడ్డివారినానఁబ్రాలు.

**పటువు.** సం. వి. ఉ. న. ఇందుప్పు. పుం. చేఁతిపొట్లకాయ. విణ. 1. చౌరవకాఁడు; 2. తెవులులేనివాఁడు; 3. నేర్పరి.

**పటుసాలె.** వై. వి. పట్టుసాలెయొక్కరూపాంతరము.

**పటేలు.** మహా. వి. గ్రామాధికారి.

**పటోలము.** సం. వి. అ. పుం. 1. చేఁతిపొట్లకాయ; 2. పొట్లకాయ.

**పటోలి.** సం. వి. ఈ. స్త్రీ. పొట్ల, పటోలికకాయ.

**పట్ట.** వై. వి. 1. చెట్టుమీఁదితోలు; (చూ. నార.) 2. గోనపట్టలో నగునది. (కమ్మరపట్ట మొ.)

**పట్టకము.** సం. వి. అ. పుం. తమ్మపడిగము. "శ్లో. అధమాతును శీరవాసితమ్, నిజతాంబూలరసేనరంజితమ్, తపనీయమయేహిపట్టకే, ముఖగండూషజలంవిధీయతామ్." దేవీమానసికపూజ.

**పట్టడ.** దే. వి. కుమ్మరివడ్లంగిలోనగువారు పనులుచేయుచోటు, ఆవేశనము.

**పట్టణము.** సం. వి. అ. న. కోటచేతను, అగడ్తచేతను దుర్గమమైన ప్రధాననగరము.

**పట్టపగలు.** దే. వి. (పగలు+పగలు.) మట్టమధ్యాహ్నము, కుతపము.

**పట్టపుటేనుఁగు.** వై. వి. రాజెక్కెడియేనుఁగు, భద్రగజము.

**పట్టపువాఁడు.** దే. వి. (పట్టము+వాఁడు.) తూలివాఁడు. (ఇక్కడ పట్టమునకుపట్టుట అర్థము. అప్పుడిది అడ్డముమట్టములో నగువానివంటిది.)

**పట్టభంగము.** సం. వి. అ. పుం. మెట్టు, సోపానము. "లోనికి మణిపట్టభంగనరణిఁ ధరణీసుతుఁడేగె." స్వా. ౨, ఆ.

**పట్టము.** ఉభ. దే. వి. 1. బిరుదు; (పట్టపుపేరు.) వై. రాజ్యము. "రాకాసిపెఁ బట్టంబేలెనతండు." య. ౨, ఆ.–సం. అ. పుం. రాజ్యాభిషేకకాలమున నొసటఁగట్టెడుపట్టె; 2. పట్టునారలు; 3. చెట్టుమీఁదిపట్ట; 4. (రాజోరైతులకిచ్చెడు) పట్టా; 5. చదుకము; 6. (వ్రణముమొదలైనవానికి కట్టెడు) కట్టు; 7. సన్నెకల్లు; 8. పీట.

**పట్టసారాయి.** వై. వి. మద్యవిశేషము.

**పట్టా.** వై. వి. 1. గాజోరైతులకిచ్చెడు కవులు; 2. రెండువైపుల వాదరగలపెద్దకత్తి; 3. గోనెపట్టలోనగునది*. (చూ. పటా.)

**పట్టి.** ఉభ. దే. అప. పంచమీవిభక్తియందువచ్చెడి యొకానొకప్రత్యయము. .వి. అపత్యము. (కొడుకు, కూఁతురు.) -సం. ఈ. స్త్రీ. 1. పలక; "లలాటపట్టి."–2. రాజ్యాభిషేకకాలమునందునొసటఁగట్టెడుపట్టము. ఈ. స్త్రీ. న్. పుం. ఎఱ్ఱలొద్దుగుకాయ.

**పట్టించు.** దే. ప్రే. 1. (విద్యార్థులకు నూతనపుస్తకపఠనమును) ప్రారంభముచేయించు; 2. ప్రారంభముచేయించు. (రేపు నీపని పట్టించెదను.)

**పట్టింపు.** దే. వి. 1. (విద్యార్థులకు నూతనపుస్తకపఠనమును) ప్రారంభముచేయించుట; 2. అక్కఱ. (వానికి చదువునందు పట్టింపు లేదు.) (చూ. ఆరగింపు.)

**పట్టిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పలక; "ఫాలపట్టిక."–2. మంచములోనగువానిచట్టము; 3. కమ్మరవానిదాఁగలి.

**పట్టికాఖ్యము.** సం. వి. అ. పుం. ఎఱ్ఱలొద్దుగుకాయ.

**పట్టికామంచము.** సం. వి. అ. పుం. పట్టెమంచేము.

**పట్టిపట్టి.** దే. వి. మనుమఁడు, మన– లు.

**పట్టియ.** వై. వి. 1. పలక; (చూ. తగడు.) 2. రాజ్యాభిషేక కాలమునందు నొసటఁగట్టెడు పట్టము*; 3. మంచములోనగు వానిపట్టె*; "వ. కోళ్లయందమరించినహరినీలంపుఁబట్టియలును." అని. ౧, ఆ. "సీ. పెద్దతామరకెంపుబిగిపట్టియలచేతసొబగైనముత్యాలసారణముల." య. ౧, ఆ. – 4. మిద్దెటెండ్లకుమీఁద నడ్డముగాపఱచెడు మ్రానులోనగునది*; 5. పక్క*; 6. పట్టె వలెతీర్చినద్రవద్రవ్యపురేఖ*; 7. బ. పట్టెలుతీర్చినసున్నపుపూఁతలోనగునది*. (చూ. పట్టె.)

**పట్టియము.** వై. వి. 1. పెద్దకత్తి; (చూ. చేకత్తి.) 2. కత్తి*. (చూ. పట్టెము.)

**పట్టిలి.** దే. వి. ఎడముగాపంపఁబడిన వ్రేళ్లుగలచేర.

**పట్టిసము.** సం. వి. అ. పుం. ఆయుధవిశేషము, అడ్డకత్తి "చ. మునలగదాధనుర్విశిఖముద్గరతోమరభిండివాలక, ట్టిసపరిఘాదులొక్కరవడిఁగొనిచుట్టునుముట్టినొంప." గా. యు, కాం.

**పట్టీ.** దే. వి. 1. వస్తువులనామములనువరుసగావ్రాసినకాకితములో నగునది; 2. లోహలవక్కపెట్టిచుట్టినతములపాకుచుట్ట; 3. ఇనుములోనగువానితేకు.

**పట్టు.** యు. దే. అ. క్రి. 1. చెల్లు; "కి. అదియతిపిన్నారముపెక్కుదినంబులుపట్టుఁజెప్ప." భార. అశ్వ. 3, ఆ. – 2. బహుకాలముచెల్లు; "చ. చుఱ్ఱనుచుమొగంబువ్రేసినటులొత్తినయూర్పుల నింకెయింకెపో, యినపలుపెంట్లుగోరఁగొనియుత్తనపట్టెనుమంటిమాటికిఁ." ఆము. ౫, ఆ.–3. పద్దుపట్టు; "ఉ. పట్టినకార్యమీశ్వరుఁడుపట్టిపెనంగినఁజేరనీకచే, పట్టుటరాజధర్మము." జై. ర, ఆ.– 4. ఇంచు; "నాకెట్టుమనంబుపట్టు." భార. విరా. ౨, ఆ.– 5. ప్రారంభించు; "పట్టుపెఁముసురందు." ఆము. ర, ఆ.– 6. అంటు; (వీనికి అక్షరమునోటపట్టదు, గుడ్డకుచాయపట్టలేదు.) 7. అక్కఱకలుగు; (కావలసియుండినసీవుపోనాకేమిపట్టినది.) 8. పట్టుదలచేయు; "వ. అనినధర్మాచరణంబునకింతపట్టిపెనంగం దగునె." భార. ఉద్యో. ర, ఆ. – 9. కలుగు. (జొన్న వెన్ను తీసినది ఇంకగింజపట్టలేదు, వీనికిక్రొవ్వుపట్టినది.) – స. క్రి. 1. గ్రహించు; "పడఁతినీకరములుపట్టంగఁదివిరి." భార. విరా. ౨, ఆ. (ఈయుంగరమునావ్రేలుపట్టదు, ఈగోనెయెంతబియ్యము పట్టును. ఇత్యాదిస్థలములయందుపట్టు అనుక్రియగ్రహణార్థకమునియేయెఱుంగునది.) – 2. నిర్బంధనుచేసిగ్రహించు; (గుఱ్ఱమునుపట్టికట్టుము.)–3. అవలంబించు; "వ. మాపట్టినయవ్వురు గంటవ్రేళ్లల్లంగాలుండు మూషకవ్యాజంబునంగొఱికెన." భార. ఆది. ౨, ఆ.–4. ఊఁదు; "పట్టెశంఖము." భార. విరా. ర, ఆ.–5. మూర్కొను; (వాసనపట్టు.)–6. పిసుకు; (నాకునడుము పట్టుము.)–7. జెట్టికీలెజెఁగికరచరణాద్యవయవములను ఇటునటు కదలకయదుము. – వి. 1. గ్రహణము; (చంద్రగ్రహణము నెల పట్టు, సూర్యగ్రహణముప్రొద్దుపట్టు.) 2. పద్దు; "చ. కార్యపుమాటలిట్టివే, పతిదెనఁగూర్తివా పుటకుఁబట్టుగనెక్కువతక్కువం చును, న్నతులగుమేదినీశులకునానగఁబల్కుటగాక." భార. ఉద్యో. ర, ఆ. – 3. పూఁత; "నిడువాలికకస్తురిపట్టువెట్టి." పా. ౧, ఆ. "సీ. గరితలజొమ్ములగడితంపుగోడలఁబట్లునుబట్లునుబనపానంగ." అచ్చ. బాల, కాం. – 4. వాసస్థానము; "క. వినునంసృతిమృత్యువుప, ట్టనఘానిస్సంగవృత్తియమరగృహము." భార. శాం. ర, ఆ.–5. స్థానము; "సీ. అరుగునియుదయంబునస్తమయము, నగుపట్లుపొలిమేరలైన మహాక్షేత్రమంతయునొక్కండ యనుభవించె." భార. ద్రో. ౨, ఆ.–6. అవకాశము; "వ. కాలక్రమంబుననచ్చోటఁదిరుగంబట్టుగానక." భార. ఆర. ర, ఆ. – 7. విడలువు; "వ. పట్టుగలపటికంపుఁజాచట్టునేలతనట్టుకొని." స్వా. 3, ఆ.–8. ధైర్యము; "క. పుట్టఁబడిధీరత్వాత్రుం,

శెట్టపుగుగ్గనసాయమేదియొకనిచేఁ, పట్టువడెఁదసడుదెంద ము. పట్టువదలిచకిని వికలభావేంద్రియుఁడై.'' భార. శాం. 3, ఆ.–9. విపయను, ''క. చుట్టతనంబునఁగడుమా, పట్టునఁగని కరముశ్వాస్త్రియలుపడంగా, నెట్టుకొనివేల్పుటాజ్ఞల, పట్టికముంగారి నతోడఁబనుపఁగరింపఁ.'' య. 3, ఆ.–10. కారణము; ''ప్రష్కంబు ప్రస్థకు నాదినాఁ పట్టయ్యెన్న్లోకొ.'' భార. శాం. ర, ఆ.–11. అవలంబము; (వానికిపట్టుదొరకలేదు.) – 12. అక్కఱ; (నీకాకార్యమందుపట్టున్నదా?) – 13. పట్టుదల; (అంచేసియుపట్టుకొనను.) – 14. మట్టము; (ఇది మంచిపట్టు ఇక్కడవదలకుము.)–15. జెట్టికీలెడఁగికరించుటకాద్యవయవములను ఇటునటుకదలకయదుములు; 16. సంఘర్షము. (కొన్నినిఘంటువులయందు ఈయర్థము వ్రాయఁబడియున్నది.) – వై. ఒకజాతి పురుగులవల్లకలిగెడు ఒకదినుసుమేలురకపునూలు. (పట్టుచీర, పట్టుఅవిక మొ.)

పట్టుఁగొమ్మ. దే. వి. (పట్టు+కొమ్మ.) ఊఁతకోల, ఆధారము. ''కౌరవకోటికెఁబట్టుఁగొమ్మ.'' భార. శాం. ౧, ఆ.

పట్టుకాలు దే. వి. నిప్పునకాఁచినలోహములను ఎత్తెకు ఒక యినుప కొఱముట్టు, సందంశము.

పట్టుకొను. దే. అ. క్రి. 1. నెలకొను, నిలుచు; ''చ. అనిమిని చెప్పవేడ్కహృదయంబునఁబట్టుకొనంగమైథిలీ, తనయులుదాని కియ్యకొని.'' నిర్వ. ౧౦, ఆ.–2. (వాయురోగముమొదలగువాని చేత) బిగిసికొను. (మెడపట్టుకొన్నది.) (ప్రే. పట్టుకొలుపు.)

పట్టుకోలు. దే. వి. నిలుపు. ''ఎ, గీ. వెగడుపడిన యుల్లంబు పట్టుకోల్పఱుపఁదనకు, వశముగాకున్న.'' భార. విరా. ౨, ఆ.

పట్టుజీనువు. ద్వ. వి. పక్షివిశేషము. ''చ. పగడపుజిట్టలన్ మనికిపట్టుగఁగట్టినపట్టుజీనువుల్.'' వసు. ౧, ఆ. (కొందఱు దీనికర్థము 'పిగిలిపిట్ట' అని వ్రాసియున్నారు.)

పట్టుడు. దే. వి. పట్టుదల. (చూ. నగ్గినముగ్గినలు.)

పట్టుదల. దే. వి. వదలనిపట్టు, అభినివేశము.

పట్టుపురుగు. వై. వి. పట్టువంటివర్ణముగల ఒకదినుసుపురుగు, ఇంద్రగోపము.

పట్టుబడి. దే. వి. ఏదేనొకదాని క్రింద వ్యయమైనధనము.

పట్టుపడు. ద్వ. అ. క్రి. (పట్టు + పడు.) 1. చిక్కు; ''క. పట్టువడినసుగ్రీవునిఁ, గట్టెదురంగాంచి.'' భార. అర. ౭, ఆ.–2. విదితమగు. ''సీ. నెటినిట్టిదనియింతినీనెమ్మనంబెన్ని భంగులనరసినఁబట్టువడదు.'' భార. విరా. ౨, ఆ. (ప్రే. పట్టువఱుచు. విదితముకావించుటకు. ''వ. అనియాశిశుపాలుంబట్టువఱుచుచున్న.'' భార. సభా. ౨, ఆ.)

పట్టుసారువ. దే. వి. మీటఁద్రొక్కువాఁడుపట్టుకొనుటకు గుంజతో చేర్చికట్టిన పంగలకొయ్య.

పట్టుసాలె. వై. వి. పట్నూలవాఁడు. (మొదటిరూపము పట్టుసాలియ.

పట్టె. వై. వి. 1. పలక; 2. మంచేములోనగువానిచట్టము*; 3. రాజ్యాభిషేకకాలమునందునొసటఁ గట్టెడుపట్టము*; ''నొసటహొన్నపట్టెఁగట్టి.'' అచ్చ. యు, కాం.– 4. మిద్దెటింగ్లమీఁదఁ బఱచెడుద్రూనులోనగునది*; 5. పక్క*; (అరవపట్టెలుతీర్చినదా?) 6. పట్టెవలెఁదీర్చిన ద్రవద్రవ్యపురేఖ*; (పట్టెనామము.) 7. కుంచె*; 8. బ. పట్టెవలెఁదీర్చిన సున్నపుపూఁతలోనగునది*. (మాణిక్యపట్టెలు, సున్నపుపట్టెలు మొ.) (పట్టియయొక్కరూపాంతరము.)

పట్టెడ. దే. వి. 1. మంచేములోనగువానికినల్లెడునవారు; ''వ. పట్టియలనలవరించియల్లిన పట్టుపట్టెడయును.'' అని. ౨, ఆ.– 2. ఎద్దుమొదలైనవానిమెడకుకట్టుటకు ఉపయోగముగా నూలితోనేసిన పట్టె; 3. పట్టెవలెకోసినతోలు; ''బిగిపట్టెల్గమరించి.'' రామా. ౨, ఆ.–4. పట్టెవలెచాఁగఁగొట్టినతగడు; 5. పట్టెవలెనుండెడు స్త్రీకంఠాభరణవిశేషము; ''ద్వి. బంగారుపట్టెడబన్నసరంబు.'' సా. ౨, భా.–6. కమసాలెవానిదాఁగలి; (చూ. కమటము.)–7. వృక్షవిశేషము.

పట్టెడమ్రాను. దే. వి. సానదించుప్రక్కకొయ్యల క్రింది చట్టము.

పట్టెమంచేము. వై. వి. నవారుపట్టెడ, అల్లినమంచేము.

పట్టెమాఱుపు. ద్వ. వి. వస్త్రమునందలి చిత్రవర్ణవిశేషము.

పట్టెము. వై. వి. పట్టియముయొక్కరూపాంతరము. (కత్తికి. ''వ. విచిత్రవేగంబునఁగల భాషిణికొప్పుపట్టెపట్టెంబుజళిపించి.'' దీనికి క్రింద ''సత్తికిఁగత్తిచెయ్యెత్తిమ్రొక్కి.'' అనియున్నది. కళా. 3, ఆ.)

పట్టెవర్ధనము. మి. వి. మగవారు మిక్కిలివెడల్పుగాను, దళముగాను పట్టెవలెతీర్చిననొసటిబొట్టు. ''ఎ, గీ. పెనఁగియొక్కఁడు పట్టెవర్ధనమునాకె.'' హరిశ్చ. ర, ఆ.

పట్నము. వై. వి. పట్టణము. హంస. ౧, ఆ.

పట్ర. దే. వి. కిరాతభేదము. (పట్రవాఁడు, పట్రది.)

పఠనము. సం. వి. అ. న. పఠించుట, చదువు.

పఠించు. సం. స. క్రి. చేదువు.

పఠిత. సం. విశ. (ఋ. ఈ. ఋ.) పఠించువాఁడు.

పఠితము. సం. విశ. (అ. ఆ. అ.) పఠింపఁబడినది.

పఠితవ్యము. సం. విశ. (అ. ఆ. అ.) పఠింపఁదగినది.

పడఁకు. దే. వి. 1. సందు; ''చ. జడధిపథింపఁజిక్కి సుధసౌరభమానుటఁజూపుదక్కిజా, పడఁకులనుండిదుగ్ధభవపాండిమబొందులనందమొందనిం, దడవిమెకాలతోఁగదుపులైచరియించునుమేఁతకైబయల్, వెడలి డులీకుళీరశకులీమకరీముఖవారిజంతువుల్.'' స్వా. ౫, ఆ.–2. గుహ. ''ఆ. అపుడుపడఁకునుండియరుదెంచుసింగంపుఁ, గొదమవోలె.'' అచ్చ. యు, కాం.

పడఁత. దే. వి. హనువు. ''సీ. భంగించినట్లుండుపడఁతమాటికి మాటికూర్ధ్వకంపంబుసేయుటకతమున.'' కాశీ. ౬, ఆ.

పడఁతి. దే. వి. ఆఁడుది, ఇంతి, తొయ్యలి, వనిత.

పడఁతుక. దే. వి. (పడఁతి+ఉక.)——వై.——(స్వార్థమున ఉక.)

పడగ. వై. వి. 1. టెక్కెము; ''తే. పడగలంతంతఁగ్రాలంగనీడము లొప్ప.'' నిర్వ. ౬, ఆ.–2. సర్పఫణము; ''క. నీపడగమీఁద నుండెడు, నాపదచిహ్నములుచూచినసుగరుడుఁడుని, న్నేపున భక్షింపఁడు.'' వి, పు. ౭, ఆ.–3. స్త్రీకర్ణభూషావిశేషము*. ''ఎ, గీ. పాగడముపూసనాఁమెట్టెబవిరపడగ, చుక్కబొట్టనఁ జిటిపాటి సొమ్ముగలిగి.'' పంచ. వేం. ర, ఆ.

పడగదారి. వై. వి. పాము, ఫణి. అచ్చ. అ, కాం. (ఇట్లు పడగతాలుపు.)

పడచు. దే. స. క్రి. పడయుయొక్కరూపాంతరము. (పొందుటకు.)— ''క. ఎడపడకుండంగుడిచిన, కుడుపుప్రమాణంబుగాదు కొన్నతెలుంగుల్, బడచినతెలుఁగునుదెలుపని, యడికుడుపునఁ బాడి

గెలువదభినవదండి." విజ్ఞా. వ్య, కాం.—సంపాదించుటకు. (చూ. పడపు.)

**పడేత.** దే. వి. పణతకు మొదటిరూపము.

**పడపు.** దే. వి. 1. అర్జనము; (చూ. పడపుఁగొమ్మ.) 2. ఆర్జిత విత్తము. "క. తనపడచినసొమ్మయినను, దనవలసినయట్లుపంపఁ దగుఁబుత్రులకున్, దనతండ్రిపడపుసుతులకు, జనకుఁడుపంచంగ వలయు సరిపాలుగన్." విజ్ఞా. వ్య, కాం.

**పడమటికొండ.** వ్య. వి. (పడమర+కొండ.) పశ్చిమశైలము, అస్తపర్వతము.

**పడమటిదొర.** దే. వి. (పడమర+దొర.) వరుణుఁడు.

**పడమర.** దే. వి. పశ్చిమదిక్కు. "సీ. నిడుపునఁదూర్పున బడమరనై రెండుకడలునంభోనిధిఁగదిసియుండు." భార. భీష్మ. ౧, ఆ.—విశే. పశ్చిమము. "పడమటిదిశ." కళా. ౨, ఆ.

**పడపుఁగొమ్మ.** దే. వి. (పడపు+కొమ్మ.) వెలయాలు, వేశ్య. చంద్రా. 3, ఆ. (ఇట్లు పడపుఁజెలి, పడపుఁజేడియ మొ.)

**పడము.** వై. వి. అందలముసక్రింద పఱచెడు రత్నకంబళము*. "జిగిగుల్కులేమావి చిగురుటాకుపడమ్ము." చంద్రా. 3, ఆ. "నయముమించినమునసనాబుపడము." రా, వి. ౨, ఆ. (చూ. గొడియ, గొడె.)

**పడయు.** దే. స. క్రి. 1. పొందు; "ఆ. పరమమంత్రవిధులఁ బశువులుయూపంబు, లందుఁగట్టఁబడిమహోశుచిత్వ, విభవమొందు విహితవిశసనక్రియమేను, విడిచిదివ్యసుఖమువడయుఁబోలఁతి." భార. అను. ౫, ఆ.—2. సంపాదించు; "సీ. పెండ్లి, యగువేడ్క భార్గవుఁడప్పుడవరుణేంద్రుపాలికిఁ జనివానిఁబడసితెచ్చె." భార. అర. 3, ఆ.—3. (బిడ్డను) కను. "సీ. ఇట్టిసంతతిగన్నయిమ్మహా పాతకంబునకుఁబ్రాయశ్చిత్తమనఁగఁబ్రీతిఁ, బడసె." నిర్వ. 3, ఆ.

**పడలు.** దే. వి. బ. రాసులు. (చూ. తొడరుశబ్దము నాలుగవ అర్థము.)

**పడవ.** యు. దే. వి. 1. యుద్ధము; "క. పడవకయివచ్చియిడుమలఁ, బడవశమా." సత్య. 3, ఆ.—2. ప్రళయము. వై. చిన్న దోనె*.

**పడవలము.** దే. వి. (పడలు+వలము.) సేనాముఖము, నాసీరము.

**పడవాలు.** వై. వి. 1. సేనాధిపతి; ద్వి. రా. కిష్కిం, కాం.—2. స్వల్పసేనాధిపతి*. "వ. వారునుందండనాయకులనుబడవాళ్లనుఁబిలిపించి." అని. ౪, ఆ.

**పడసాల.** ద్వ. వి. (పడము+సాల.) కూటము. "సీ. ప్రహరి గోడలుగొప్ప పడసాలమేల్మచ్చు గారముంగిలివింతగానిపొరుగు." శుక. ౨, ఆ.

**పడాల.** వై. వి. అందలముమీఁదివన్నాగము. "సీ. అరిదిపట్టుపడాల యంచులఁగతిఁగ్రిందిపక్ష్మమాలికలుచూపట్టుచుండ." కళా. ౭, ఆ.

**పడాలు.** వై. వి. పడవాలుయొక్కరూపాంతరము. (స్వల్పసేనాధిపతికి. "ద్వి. ఉచితాసనంబులనుండిపడాలు, లుచితంబులెటిఁగింప." రా. యు, కాం.)

**పడి.** దే. వి. రెండుపోలలకొలఁది.

**పడికట్టు.** దే. వి. 1. తూనికకల్లు; 2. మర్యాద; 3. సోపానము.

**పడిగ.** వై. వి. తమ్మయుమిసెడిపాత్రము. (రూ. పడిగము.)

**పడిగల్లు.** దే. వి. (పడి+కల్లు.) తుపాకిగుండు. "ద్వి. కొక్కులు పడిగంటఁగూలుచందమున." రా. సుం, కాం.

**పడిగాపు.** దే. వి. (పడి+కాపు.) పంచేనకాచియుండుసేవకుఁడు. "క. పుడమివిభులెందఱెందఱొ, పొడగాన్నలుబలేకద్వారభూముల యందుఱ్, బడిగాపులువడియుండఁగ, బసుగులకేలబ్బుఁగఁగఁస భంజనుసేవల్." కు. ౧, ఆ.

**పడితెరము.** దే. వి. పేర్పాటు. పఁటేఁటవచ్చుమొత్తము.

**పడిదియ.** దే. వి. చేకలవాఁడు చేలువలు ఆర్ద్రకెచ్చేట. "క. మెడ వాలొడయనివస్త్రము, తడఁబఱచిన నమ్మికొనిన దారోయిడిసన్, బడిదియవెట్టినఁగట్టెన, సడయఁబణత్రయముదండు పరువఁగవల యున్." విజ్ఞా. ప్రా, కాం. (రూపాంతరముపడిదె.)

**పడిదెము.** దే. వి. ద్రవరూపమగు వ్యంజనవిశేషము, ఊర్పు. "సీ. అప్పడంబులువడియముఁదాలింపులుఁబలుచనిన లివెచ్చ పడిదెములన." జై. 3, ఆ. (మొదటిరూపము పడిదియము.)

**పడియ.** దే. వి. నీళ్లునిలిచిన చిన్నపల్లము. "తే. అబ్ధిలంఘింప నోపినయులఘుబాహు, బలునికతిదుష్కరముచౌటిపడియదాఁట." హరిశ్చ. ౨, ఆ.

**పడియచ్చు.** ద్వ. వి. ఒత్తిరూపమేర్పడుచోటకైలొలిచినయచ్చు. "హరుఁబగగొన్న వేల్పుఁబడియచ్చునన్ త్రిసలీల." చంద్రా. ౨, ఆ.

**పడివాగె.** ద్వ. వి. ఎక్కుటకాయిత్త పఱచేసపుడు నవరించెడు గుఱ్ఱపునవరణ. "సీ. తగవేలచూడఁగ్రొత్తగవేలసంఖ్యలైపడివాగెఁ బఱతెంచుఁబ్రౌఢహరులు." హంస. ౫, ఆ.

**పడిసెము.** వై. వి. శైత్యరోగవిశేషము*.

**పడిహారి.** వై. వి. పణిహారి. "ద్వి. పడిహారులనుబిల్వఁబంచియా క్షణమె, కడఁకతోఁగల్యాణకటకంబునందు." పండి. ౧, ప్ర.

**పడు.** వై. అ. క్రి. 1. పతనమగు; 2. శ్రమమునొందు*; "ఉత్సాహ. అతఁడుకురుకులంబుతోడిపొం, దునకుఁబడఁడెజగము మెచ్చఁదొడఁగిపెక్కుభంగులన్." భార. స్త్రీ. ౧, ఆ.—3. రాలు*; 4. తెయనించే*; (చూ. ఊడనిఁబాడు రెండవయర్థము.) 5. దెబ్బె*; "అ. చంపెదేనిమమ్ముజలములులేనిదే, తెనునఁజంప వలయుఁగమలనాభ, నిక్కమింతవట్టునీచేతఁబడుటకుఁ, దగుదు మనిననగుచు నగధరుండు." భార. అర. ౪, ఆ.—6. పూఁడు*; "క. జగతీశుఁడుపడినధనం, బగపడినను బ్రాహ్మణునకునర్థమువెట్టం, దగునటవిప్రోత్తముచే, నగపడిననతండుకుడువ నర్హుండంతన్." సం. "రాజాలబ్ధాన్నిధిందద్యాద్ద్విజేభ్యోర్ధంద్విజఃపునః, విద్వాన శేషమాదద్యాత్సనర్వస్యప్రభుర్యతః." విజ్ఞా. వ్య, కాం.—7. అస్తమించు*. "క. అవనీశయీహయంబులు, పవనగతింబఱ చుఁబ్రొద్దువడకుండఁగనే, డవిదర్భకు." భార. అర. ౨, ఆ.—స. క్రి. 1. అనుభవించు; "ఇంతపడుదునె." భార. అర. ౨, ఆ.—2. పొందు. "క. ఇమ్మెయినధికపుఁబరితా, పమ్మునుబడుసూతు హృదయపద్మంబలరన్, దమ్మికొలంకులుమొగుడవ, నమ్ములుపోలం గదివసనాథుఁడుగ్రుంకెన్." భార. విరా. ౨, ఆ.

**పడుక.** వై. వి. పఱుపు. (చూ. పడు నాలుగవయర్థము.)

**పడుకటిల్లు.** ద్వ. వి. (పడుక+ఇల్లు.) శయనగృహము.

**పడుకు.** దే. వి. జాయి, శిల. (చూ. తొడుకు.)

**పడుగాయ.** ద్వ. వి. (పడు+కాయ.) రాలినకాయ.

**పడుగు.** దే. వి. 1. వస్త్రమునేఁతయందలి నిడుపునూలు; 2. [illegible] తీసినజొన్నకుచ్చెలవరికుప్పలోనగునది.

పడుగొమ్మ. దృ. వి. (పడు+కొమ్మ.) క్రిందికిపడుచున్నకొమ్మ, శిఖ.

పడుచు. దే. వి. 1. కన్యక; 2. కన్నెఱికముకానివేశ్య; 3. బాలిక; "క. అంబయనుకటపాసృనికడ, కుంబోయినసతఁడుభీష్మకొనిపోయి నదా, నింబడుచుంగైకొనక, శ్రంబెకన్యాత్వమెడలెమగువాసీతుక." భార. ఉద్యో. ౪, ఆ. — 4. బాలుఁడు. "క. కడవంగఁబడిన వాఁడీ, పడుచనుచుఁబురిటియిల్లుపడఁతుకవెడలె." మార్క. ౫, ఆ.

పడుచుఁజేఁత. దృ. వి. జారత్వము. "ద్వి. పడుచుఁజేఁతలుమాని పార్వతీశ్వరుఁడు." భల్లా.

పడుచుది. దే. విణ. (పడుచు+అది.) యౌవనముగలది.

పడుచురాశి. దృ. వి. కన్యారాశి.

పడుచులతిండి. దే. విణ. ఈసుఘాతిని. "శే. కటకటాచిన్నినెత్తు రుఁగందురాద, పట్టిఁజక్కనిపాపనిఁబట్టిచంప, నేచిమృత్యువ్వస్వరూ పమైయెచటనుండి, వచ్చెనీపడుచులతిండియిచ్చటికిని." హరిశ్చ. ౫, ఆ.

పడుచువాఁడు. దే. విణ. యౌవనముగలవాఁడు.

పడుదల. దే. వి. పక్షివిశేషము, డాబ.

పడువ. దే. విణ. మిక్కిలి పల్లమైనది. (నేల.)

పడువరి. దృ. వి. కోఁతకోయునప్పుడు గింజలురాలి మొలచిన వరిపైరు.

పడె. దే. వి. పడియయొక్కరూపాంతరము. "సీ. నీరదాగమమేఘ నిర్యత్పయఃపానచాతకం బేగునేచాటిపడెకు." భాగ. ౧౦, స్కం. ఉ.

పడ్డ. వై. వి. తొలిచూలియావు (లేక) గేదె.

పణఁకు. దే. వి. వడఁకుయొక్కరూపాంతరము.

పణత. దే. వి. నాఁగేటిగొడగ.

పణము. ఉభ. దే. వి. మల్లబంధవిశేషము. సం. అ. పుం. 1. పందెము; 2. వెల; 3. కూలి; 4. ధనము; 5. జూదము; 6. కొనుట; 7. వ్యవహారము; 8. కర్షమెత్తురాగిటంకము; 9. గవ్వ యెత్తు; 10. అమ్మఁదగినకూరలోనగువానిపిడికిలి.

పణవము. సం. వి. అ. పుం. ఉడుక.

పణస సం. వి. అ. పుం. పనస.

పణాయితము. సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

పణితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొగడఁబడినది; 2. పం దెముగాఁజేయఁబడినది.

పణితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొగడఁదగినది; 2. అమ్మఁదగినది.

పణిదియ. దే. వి. పడిదియయొక్కరూపాంతరము.

పణిహారి. వై. వి. ద్వారపాలకుఁడు. "వ. పణిహారులవలనఁదన రాకయెఱింగించి." భాగ. ౧౦, స్కం. పూ.

పణ్య. సం. వి. ఆ. స్త్రీ. మానేరుతీఁగ. విణ. 1. పొగడఁదగినది; 2. అమ్మఁదగినది.

పణ్యవీధి. సం. వి. ఈ. స్త్రీ. అంగడివీధి.

పణ్యాంగన. సం. వి. ఆ. స్త్రీ. వెలయాలు, వేశ్య.

పణ్యాజీవుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు, బేహారి.

పణ్యారము. వై. వి. 1. నానఁబప్పు*; "మ. శివివారోత్సవమాచ రించెమునిశివ్యవ్రాతముందానుగ, మ్మనిపణ్యారముతోడబూరెగ్గని తోమండెంగతండంబుతో, ననుకుంబానెముతోడఁబాండుకలమాహా రంబుతోనేతితో, ఘనరంభాఫలఖండశర్కరలతోఁగారుణ్యపాథో ధికిన్." భీ. ౨, ఆ.—2. భక్ష్యము*. "పణ్యారంపుఁ బుణ్యం పుకంపుల." ఆము. ౧, ఆ.

పతంగము. సం. వి. అ. న. పాదరసము. పుం. 1. పక్షి; 2. మిడుత; 3. బాణము; 4. పిల్లి; 5. శాలిధాన్యవిశేషము.

పతంగిక. సం. వి. ఆ. స్త్రీ. తేనెటీఁగ, పుత్తిక.

పతంగుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు, వేఁడివేలుపు.

పతకము. వై. వి. హారమునడుమనుండెడు రత్నపుబిల్ల.

పతగము. సం. వి. అ. పుం. పక్షి, పతంగము.

పతత్తు. సం. వి. త్. పుం.——వై.——

పతత్రము. సం. వి. అ. న. ఱెక్క, పత్త్రము.

పతత్రి. సం. వి. ఇ. న్. పుం. పక్షి, గరుత్మంతము.

పతద్గ్రహము. సం. వి. అ. పుం. తమ్మపడిగము.

పతనము. సం. వి. అ. న. పడుట, పాటు.

పతయాళువు. సం. విణ. (ఉ.) పడెడుస్వభావముకలవాఁడు.

పతాక. సం. వి. ఆ. స్త్రీ. 1. టెక్కెము; 2. టెక్కెపుఁగంబము; 3. సౌభాగ్యము. అ. పుం. ము. అభినయహస్తవిశేషము. (బొటన వ్రేలినివంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి వ్రేళ్లన్ని చక్కఁగాఁ జాఁచిపట్టినది.)

పతాకి. సం. విణ. (న్. ఈ. న్.) టెక్కెముగలవాఁడు.

పతాకిని. సం. వి. ఈ. స్త్రీ. సేన, ధ్వజిని.

పతి సం. వి. ఇ. పుం. మగఁడు. విణ. ఏలిక.

పతింవర. సం. వి. ఆ. స్త్రీ. తనంతట మగని వరించునట్టి ఆఁడుది, వర్య.

పతితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పడినవాఁడు; 2. పదవి చెడినవాఁడు.

పతిమ. వై. వి. ప్రతిమ. "క. మనమునఁగల్గినతీరున, నినుమగనిన్ వ్రాసికొన్న నిలువుఁబతిమలన్, గనుఁగొనియెఱుఁగక పలికిన, ననఁ బోఁడిం గినియఁదగునెనవలానీకున్." య. ౫, ఆ.

పతివత్ని. సం. వి. ఈ. స్త్రీ. మగనాలు. (రూ. పతిపత్ని.)

పతివ్రత. సం. వి. ఆ. స్త్రీ. పతిభక్తిగల యిల్లాలు, క్రొత్తడి.

పత్తనము. సం. వి. అ. న. పట్టణము, ప్రోలు.

పత్తి. ఉభ. దే. వి. ప్రత్తి. సం. ఇ. స్త్రీ. 1. గమనము; 2. సేనా విశేషము. (ఒకరథము, ఒకయేనుఁగు, మూఁడు గుఱ్ఱములు, ఏవురు కాల్బ్వరునుగలది.) పుం. కాలిబంటు.

పత్తిరి. వై. వి. పూజకుపయోగించెడు బిల్వదళములోనగునది. "ఉ. తత్తఱపాటులేక నదిఁ దానమొనర్చిపినాకపాణిదే, వోత్తము విశ్వనాథుఁగరుణోదధిఁ గమ్మనిపూవుగుత్తులన్, బత్తిరిఁబూజచేసి నుతిపాఠములన్ దవణించువారికిన్, దొత్తులుపోలెదక్కుదురు తొప్పలుదోరలు ముక్తిభామినుల్." కాశీ. ౨, ఆ.

పత్తిరిబొట్టు. వై. వి. తిలకవిశేషము.

**పత్తిరేకు.** దే. వి. లోహములనదికించునపుడు పత్తివలెఁగొట్టిపెట్టెడు నజాతీయమైనపొడిరేకు. "క. తనుమధ్యవలిభంగము, లనుగూర్పఁ గనవియుఁదక్కు-లములెయగుటఁగం, తునియిడినపత్తిరేకనఁ, జను నొడ్డాణమునసడుసుచామకునమరుక్." ఆము. ౫, ఆ.

**పత్నీ.** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగాఁబెండ్లాడిన పెండ్లాము, భార్య.

**పత్రపరశువు.** సం. వి. ఉ. పుం. ఆకుఱాయి.

**పత్రపాశ్య.** సం. వి. ఆ. స్త్రీ. పాపటబొట్టు.

**పత్రభంగము.** సం. వి. అ. పుం. స్త్రీలయొక్క చెక్కిలిలోఁగు వానియందు వ్రాయఁబడు మకరికాపత్రము.

**పత్రము.** సం. వి. అ. న. 1. ఆకు; 2. వ్యవహారముయొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడు ఆకు; 3. ఱెక్క; 4. వాహనము; 5. బాణము; 6. చేరతిత్తి; 7. ...

**పత్రరథము.** సం. వి. అ. పుం. పక్షి, పులుఁగు.

**పత్రరేఖ.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పత్రభంగము.

**పత్రల.** సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దయేలకి*; 2. శ్రీతాళము*.

**పత్రలత.** సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలి నిడుపుచేరియ.

**పత్రలేఖ.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పత్రభంగము.

**పత్రస్నుహి.** సం. వి. ఈ. స్త్రీ. ఆకుజెముడు*.

**పత్రాంగము.** సం. వి. అ. న. 1. రక్తచందనము; 2. భూర్జము*; 3. పద్మకాష్ఠము*.

**పత్రాంగుళి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) పత్రభంగము.

**పత్రి.** ఉభ. వై. వి. పత్తిరియొక్క రూపాంతరము. భల్లా. 3, ఆ.—సం. న్. పుం. 1. డేగ; 2. పక్షి; 3. బాణము; 4. కొండ; 5. మ్రాను; 6. రథికుఁడు.

**పత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కాగితము; 2. వ్యవహారముయొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడుపత్రము.

**పత్త్రోర్ణము.** సం. వి. అ. న. ముఱికియొత్తినపట్టుచీర. పుం. దుండిగము*.

**పథము.** సం. వి. అ. పుం. మార్గము, త్రోవ.

**పథి.** సం. వి. న్. పుం.——పై.——(దీనికి ఈ రూపమున తెనుఁగునందు ప్రయోగములేదు.)

**పథికుఁడు** సం. వి. అ. పుం. దారినడచేవాఁడు.

**పథ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) హితము.

**పదంపడి.** దే. అవ్య. 1. వెనుక; "చ. మున్నుమా, తరపిత్ృవంద నంబును బదంపడిమిత్రసహాభివాదనా, దరము." ఉ, హరి. ౪, ఆ.—2. మఱియు; "వ. మఱియుఁగొందఱుయజ్ఞపాత్రంబుల నన్నులంజఱచిరి, వెండియుఁగొందఱుహోమాగ్నులార్చిరి, పదం పడికొందఱుహోమకుండంబులయందుమూత్రంబులువిడిచిరి." భాగ. ౪, స్కం.

**పదకము.** ఉభ. వై. వి. క్రమము*. "క. ఇదినాకానతియిచ్చిన, పదకము కలహాపువి న్నపముచేసితిని, హృదయంబునఁగైకొనుమొం, డుదలంపులుదక్కుమనవుసుంగుపితుండై." నిర్వ. ౪, ఆ.—సం. అ. పుం. పతకము.

**పదగుఁడు.** సం. వి. అ. పుం. కాలిబంటు.

**పదచాళి.** వై. వి. నాట్యభేదము, పెక్కణము. (చూ. తిరుపు.)

**పదటము.** దే. వి. ఆత్రము, తత్తఱము. "ద్వి. పట్టనుంకించినపద టము." విష్ణు. ఉ. ౪, ఆ.

**పదటు.** దే. వి. పదటముయొక్క రూపాంతరము. "ద్వి. పదటున లేచి." విష్ణు. పూ. ౧, ఆ.

**పదడు.** దే. వి. బూడిద, భస్మము. "ఆ. పడయరానియాయువొడ లికిఁగలిగినఁ, బాపకృతులదానిఁబదటఁగలుప, నగునెపుణ్యవిధినమా చరణములఁగై, సేయవలయుఁగాక చెలువుమిగుల." భార. శాం. ౫, ఆ. "ద్వి. పదడుచేపట్టుడుఁబనిఁడియ్యెచనదె." పండి. ౨, ప్ర.

**పదను.** దే. వి. 1. సమయము; "క. మనగతియీ, పదనునఁగడుఁ జులుకఁదనముపట్టయితోఁచెక్." పంచ. నా. ౨, ఆ.—2. తడి; "ఉ. పంటవలంతికింబొడమిథాసిలుసీకర్రగానసేలలో, నంటినఘర్మ వారిఁబదనైపులకోదయసస్యసంపదక్, గెంటక యుంటనీకెఱిగునేఁ డిట నావ్యవసాయ చేర్పడెక్, గంటినిరంతరాగ వవగౌరవసౌఖ్య ముసంగెఁగోరికల్." రామా. ౪, ఆ.—3. వాఁడి; "శే. నరగ మిన్నునుకమ్మరినంజకొలిమి, దెట్టుగాఁగాఁచిబంగారుచుట్టువాలు, పదనుపెట్టఁగఁగొనిపోయిపట్టలేక, విడిచెననఁబ్రొద్దుపడమటికడలి మునిఁగె." య. ౨, ఆ.—4. పరిపాకము. "క. ఇదెపోయెదఁ గౌరవ్యులఁ, బదనికిరాఁబలికిసంధిపాటించెద." భార. ఉద్యో. 3, ఆ.

**పదనుకొను.** దే. అ. క్రి. తడియు "సీ. అరచంద్రులోని చిహ్నంబునుంబో లెనుదుటఁగస్తురిబొట్టుపదనుకొనఁగ." పాండు. ౪, ఆ.

**పదపడి.** దే. అవ్య. పదంపడియొక్క రూపాంతరము. (వెనుకనను టకు.—"సీ. పనియేమిపంచినఁబదపడిచేసెదననకతక్ బంచినయా క్షణంబ, చేయుచు." భార. ఆది. 3, ఆ.—మఱియుననుటకు.— "క. పదిదినములైదు ప్రొద్దులుఁ, బదపడిరెన్నాళ్లునొక్కవగలుక్ రేయుక్, మదమునరణమొనరించిరి." భార. ఆది. ౧, ఆ.) ["క. ముదమునహరియునుసజాఁడును, జదువులుమునులాదిగాఁగ సకలజనంబుల్, మదనారిఁగొల్వవచ్చిరి, పదపడిసంభ్రమము భయముభక్తియుఁగదురక్." (ఇక్కడ పదపడి అనఁగా అత్యంతము అని యర్థమగుచున్నది.) వీర. ౧, ఆ.]

**పదము.** సం. వి. అ. న. 1. పాదము; 2. పద్యపాదము; 3. ఇసుకలోనగుచోట్లఁగనఁబడెడు పాదచిహ్నము; 4. చిహ్నము; 5. శబ్దము; 6. వాక్యము; 7. ప్రయత్నము; 8. స్థానము; 9. కపటము; 10. వస్తువు. పుం. కిరణము.

**పదరము.** వై. వి. తములపాకులు పదిలముగానుంచెడియడపము*.

**పదరు.** దే. అ. క్రి. 1. త్వరపడు; "వ. కెంజిగుళ్లకుఁబదరుచుఁగెరలు తేంట్లకుబెదరుచు." కళా. ౬, ఆ.—2. కోపించు; "క. నీమా టకుమాయత్వ, త్థామవచనములకునేఁబదరుదునె." భార. ద్రో. 3, ఆ.—3. చలించు. "సీ. పైమిన్నువ్రాలినఁ బదరనిధైర్యంబుఁ గటకటాకలఁచిచీకాకుచేసె." చంద్ర.—స. క్రి. ఆక్షేపించు; "వ. అని గాంధారింబదరి." భార. ఆది. ౫, ఆ.—వి, బ. త్వరి తపుమాట. "ఎ, గీ. జిహ్వికలకు, ననుపునెఱవాదిబంటుపంతపుఁ బదరులు." సాన్వ. ౬, ఆ.

**పదవి.** ఉభ. వై. వి. ఉన్నతస్థితి*. సం. ఈ. స్త్రీ. మార్గము.

**పదాజి.** సం. వి. ఇ. పుం. పదాతి.

**పదాతి.** సం. వి. ఇ. పుం. కాలిబంటు.

**పదార్థము.** సం. వి. అ. పుం. 1. వస్తువు; 2. శబ్దములయొక్క అభిధేయము. (సప్తపదార్థములు.—ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము.)

**పదాఱు.** ద్వి. స. (పది+ఆఱు.) పదునాఱు.

**పది.** ఉభ. వై. స. తొమ్మిదియునొకటి, దశకము. (తెలుచుగా ఒకఁడుమొదలగుసంఖ్యాపరమగుచో ఉదంతంబగు. ఉదా. పదునొకండు, పదుమూఁడు, పదునాలుగు, పదునేను, పదునాఱు, పదునేడు, పదునెనిమిది. పదుగురు మొ.)—సం. వి. ద్. పుం. పాదము. "సీ. తూలింపవాయెద్దుత్రొచ్చిసపిచ్చుకుం టనుపల్కు—పదులు పంగు నపుఁగూర్చి." రా, వి. ౧, ఆ.

**పదింబదిగ.** ద్వి. క్రి. విశ. (పదియుఁన్+పది+గాన్.) గట్టిగా, చక్కఁగా. "కవిరాజవిరాజితము. నీకరుణకుఁ బాత్రుఁడుగాఁడు పదింబదిగాఁగనివచ్చినవాఁడఁదుదన్." రాఘ. ౪, ఆ.

**పదికుఁడు.** సం. వి. అ. పుం. పదాతి, కాలిబంటు.

**పదియార్ధము.** ద్వి. వి. (పది+అర్ధము.) పదునాఱుతూములు.

**పదిలపడు.** వై. అ. క్రి. 1. దృఢపడు*; "ఎ, గీ. పాశుపతమటమీఁదనుబదిలపడును." భీ. ౫, ఆ.—2. స్థిరపడు*. (చూ. పదిలించు.) (ప్రే. పదిలపఱుచు.)

**పదిలము.** వై. వి. స్థైర్యము*. "మ. యత్నశ్రేష్ఠుఁడొండొక్కచోఁ, బదిలంబారఁగసల్పిపిల్చెననికిన్ బ్రత్యర్థినత్యర్థియై." హరి. ఉ. ౧౦, ఆ.—విశ. 1. జాగరూకము*; "నీవుపదిలంబుగఁగోడెలఁబట్టకున్న." నిలా. ౨, ఆ.—2. దృఢము*. "అల్లనసతఁడొంటియున్కిఁబదిలంబుగఁజూచి." భో. ౪, ఆ.

**పదిలించు.** వై. స. క్రి. పదిలపఱచు. (దృఢపఱచుటకు.—"క. ఇది యొకరాక్షసకృత్యము, మదివెఱవకుమనుచునెన్నిమాటలుధైర్యం, బొదవఁగఁదనుబోధించిన, హృదయము పదిలింపలేక యెడయని చింతన్." రా. అర, కాం.—స్థిరపఱచుటకు. "ముకుందులోకత్రయవందితున్హృదయకంజమునన్బదిలించి." జై. ౭, ఆ.)

**పదిలుఁడు.** వై. విశ. 1. జాగరూకుఁడు*; "క. ఇదియేటిచందమేటికి, మదియిట్టిదియయ్యెననుచుమఱియుయ్యననేఁ, బదిలుఁడనై." హరి. ఉ. ౬, ఆ.—2. స్థిరుఁడు*. "క. ఇదెయేనగూడ వచ్చితిఁ, బదిలుఁడవైపోరుమికఁబకమర్దన." భార. భీష్మ. ౨, ఆ.

**పదుంద్రు.** ద్వి. స. పదుగుంద్రుయొక్క రూపాంతరము. "చ. తొడరిభవత్తనూజులుపదుంద్రుసముద్భటసింహనాదులై." భార. కర్ణ. 3, ఆ.

**పదుగు.** దే. వి. పదువునకు మొదటిరూపము.

**పదుగుంద్రు.** ద్వి. స. పదుగురునకు మాఱురూపము.

**పదుగురు.** ద్వి. స. పదిమంది. (పదికి మహన్మహత్యర్థకబహువచనాంతాదేశము.)

**పదునల్తుము.** ద్వి. వి. (పది+నల్తుము.) పదునాలుగుతూములు.

**పదును.** దే. వి. (పది+ఊను.) పదియంగుళములవఱకు నేలయందు తడిచొచ్చునంతటి వర్ష ప్రమాణము.

**పదునెనమందుము.** ద్వి. వి. (పది+ఎనమందుము.) పదునెనిమిదితూములు.

**పదునేడ్తుము.** ద్వి. వి. (పది+ఏడ్తుము.) పదునేడుతూములు.

**పదునొకొల్తుము.** ద్వి. వి. (పది+ఒకొండు+తూము.) పదునొకండు తూములు.

**పదువు.** దే. వి. పదువు. "పాఁపపదువు." మార్క. ౮, ఆ. "క. అవుడగ్గి వన్నెతొలువే, లువుతననెమ్మేనిమంటలుగడిందిగగా, దువుతంద్రిఁ బొదువఁగ్రోఁలిప, దువుపైనతఁడమ్ములెమ్మెతోఁబఱపుటయున్." అచ్చ. యు, కాం.

**పదుముత్తుము.** ద్వి. వి. (పది+ముత్తుము.) పదుమూఁడు తూములు.

**పదురు.** యు. దే. అ. క్రి. త్వరపడు. వి. 1. విధము; "క. తుద మొదలెఱుఁగక చదువుల, పదు రెఱుఁగక తమ్మునెందుఁ బదు రెఱుఁగని దు, ర్మదకవులఁగుదియఁబద్యపు, గుదియలఁజదుపంగవలదెగులగుటలడఁగన్." కవిస. ౧, అధికారము.—2. బ. త్వరితపుమాట. "ద్వి. చదురులుఁబదురులు." భాగ. ౮, స్కం.—వై. స. పదుగురునకుమాఱురూపము. "చ. పదురునిజాప్తకింకరులు పార్శ్వయుగంబునభక్తిఁగొల్చిరా." కాశీ. 3, ఆ.

**పదురుచు.** దే. ప్రే. పదురఁజేయు. (చూ. ప్రదురుచు.)

**పదువు.** దే. వి. సజాతీయప్రాణిసమూహము. "చుట్టపుంబదువు." హరి. ఉ. 3, ఆ. (పదుగుయొక్క రూపాంతరము.)

**పదువురు.** ద్వి. స. పదుగురుయొక్క రూపాంతరము.

**పగ్గుఁడు** సం. వి. అ. పుం. పదాతి, కాలిబంటు.

**పద్దియము.** వై. వి. పద్దెము. "సీ. చిలుకబోదలమచ్చికలుచేసి ముద్దులుచిలుకఁబద్దియములు చెప్పరాదె." నీలా. ౨, ఆ.

**పద్దు.** వై. వి. 1. పంతము*; 2. ప్రతిజ్ఞ*; 3. అంకెలకత్తెము*.

**పద్దెము.** వై. వి. పద్యము. "ఉ. అచ్చతెనుంగుఁబద్దెమొకటైనను గబ్బములోననుండినన్, హెచ్చనియాడుచుందురు." య. ౧, ఆ.

**పద్ధతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ; 2. వరుస; 3. అడుసు.

**పద్నాల్గు.** ద్వి. స. పదునాలుగుయొక్క రూపాంతరము. "పద్నాల్గవయేఁట." చంద్రా. 3, ఆ.

**పద్మ.** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. బారంగి; 3. మెట్టదామర. అ. పుం, న. ము. 1. తామర; 2. ఒకనిధి; (చూ. నిధి.) 3. వ్యూహవిశేషము; 4. సంఖ్యావిశేషము; 5. ఏనుఁగుమొగమునందలిబొట్లసమూహము. పుం. పాము.

**పద్మకము.** సం. వి. అ. న 1. ఏనుఁగుమొగమునందలి బొట్లసమూహము; 2. పద్మకాష్ఠము.

**పద్మకాష్ఠము.** సం. వి. అ. న. ఓషధివిశేషము.

**పద్మకోశము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (అయిదు వ్రేళ్లను కొనలుకూడకుండునట్లు విల్లువలెవంచి యెడముగలవానిఁగాఁబట్టినది.)

**పద్మచారిణి.** సం. వి. ఈ. స్త్రీ. మెట్టదామర.

**పద్మనాభుఁడు.** సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.

**పద్మనాయకులు.** సం. వి. అ. పుం. బ. నాలవజాతిలో నొక తెగవారు.

**పద్మపత్రము.** సం. వి. అ. న. మెట్టదామరదుంప.

**పద్మపుఁదీఁగ.** మి. వి. (పద్మము+తీఁగ.) చోరపుష్పి.

**పద్మబాంధవుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు, తామరచెలి.

**పద్మరాగము.** సం. వి. అ. పుం. మాణిక్యవిశేషము, తామరకెంపు. (ఇది సింహళమునపుట్టినది, రక్తవర్ణముకలది, ఉత్తమజాతిరత్నము. చూ. మాణిక్యము.)

**పద్మవెలమలు.** మి వి. గ్రా. బ. (చూ.) పద్మనాయకులు.

**పద్మాకరము.** సం. వి. అ. పుం. 1. కొలను; 2. చెఱువు.

**పద్మాటము.** సం. వి. అ. పుం. తగిరిస.

**పద్మాలయ.** సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి, గన్నేరుచెట్టు.

**పద్మి.** సం. వి. న్. పుం. ఏనుఁగు, గజము, ద్విపము.

**పద్మిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీఁగ; 2. తామరకొలను; 3. తామరతంపర; 4. స్త్రీజాతివిశేషము; 5. ఆఁడేనుఁగు; 6. లక్ష్మి.

**పద్య.** సం. వి. ఆ. స్త్రీ. త్రోవ. అ. న. ను. ఛందోబద్ధమైన కావ్యము. పుం. డు. శూద్రుఁడు.

**పద్రుచు.** దే. ప్రే. పదురుచేయొక్క రూపాంతరము. (చూ. పద్రుచు.)

**పన.** దే. వి. చేలలో కోసివేసిన ఓదెలప్రోగు.

**పనఁటి.** దే. వి. 1. వంటకుండ; "చ. అడరుగళాస్రధారలు మహాముఖవాంతసుధాంబుధారలన్ బొడమువగుప్పకేలనులు పొంగుసుగాఁ దెఅదైత్యకోటికిన్, బెడిదపుఁగిన్నెకోనెసరుపెట్టి పెద్దపనంటిబోలెనె, క్కుడువెనగాహపుమస్తకముగొన్న సుదర్శననేత గొల్చెరన్." అను. ౧, ఆ.—2. కుండ.

**పనవు.** వై. స. క్రి. ప్రలాపించు. "క. అనిపలికిమనయుఁ గొడుకుం, బనవుచు." భార. ద్రో. ౨, ఆ.

**పనస.** వై. వి. 1. వేదభాగము; 2. వృక్షవిశేషము. (దీనిఁగొందఱు కవులు వైకృతముగా వాడియున్నారు కనుక సంస్కృతమున పణస అని యేపారము ఉండునని తోఁచెడి.)

**పనసవాండ్రు.** దృ. వి. బ. కనుసాలెవారిని యాచించి బ్రతుకువారు.

**పనాయితము.** సం. విశే. (అ. ఆ. అ.) పణాయితము.

**పని.** దే. వి. 1. వ్యాపారము; "ఇంద్రియంబులపనులనణఁచి." వా. ౪, ఆ.—2. కర్మము; "క. వినుకర్తవ్యతమంబగు, పని బ్రాహ్మణపూజనంబు." భార. అను. ౨, ఆ.— 3. ప్రయోజనము; "ద్వి. వినుముకౌశికయింకవిపరీతపనులు, పనిలేదు." రా. బాల, కాం.— 4. శిల్పము; (ఇందు మంచిపనిచేసియున్నారు.)—5. నియోగము. "ఉ. ఆయతవక్షుఁడంతహాతి నక్కెలకైలము లెల్ల నగ్గురాఁ, జేయు మహాబలంబును బ్రసిద్ధియునుంగలవాకునీపనిన్, బాయకయొమ్ము నందవడుఁబాములమోవనువారికిన్ బనుల్, సేయను నేమికారణము సెప్పుమునాకుఁబయోరుహాననా." భార. ఆది. ౨, ఆ.

**పనిగొను.** దే. స. క్రి. (పని+కొను.) నియోగించు. "క. నన్నం, బనిగొనఁదలఁచినవిలిచెద, ననుమానముగలిగెనేనియరిగెదనధిపా." భార. విరా. ౧, ఆ.

**పనితము.** సం. విశే. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

**పనిముట్టు.** దే. వి. కొఱముట్టు, ఉపకరణము.

**పనివంచు.** దే. స. క్రి. (పని+పంచు.) పనిగొను, నియోగించు. "సీ. అన్యులఁబనివంచునప్పుడాముద్దియపలుకులతీపు కోర్కులఁ గెరల్చు." భార. అను. ౧, ఆ.

**పనివడు.** దృ. అ. క్రి. (పని+పడు.) అక్కఱపడు. "క. పనివడియహింసవ్రతముగఁ, గొనివనమునననున్న మునులకున్ దొడరదె హింసనము." భార. అర. ౫, ఆ.

**పనివాఁడు.** దే. వి. భృత్యుఁడు, కింకరుఁడు.

**పనివిను.** దే. అ. క్రి. ఆజ్ఞావశవర్తియగు. "క. వచ్చినపుడర్ఘ్యపాద్యము, లిచ్చినువర్ణెకపీఠమిడిమునివరమీ, రిచ్చోటికింబదలికమై, విచ్చేయుటయేమితెలుపవేపనివిందున్." రామా. ౪, ఆ. (మజీయు నిది కొన్నివారు గొప్పవారితోవచ్చెదను పోయెదను అనుటయందును ఉపయోగింపఁబడును. వచ్చెదననుటకు.—"క. క్రమ్మఱఁబనివినియెదఁజా, మ్మమ్మభవత్సేవకు." భో. ౬, ఆ.—పోయెదననుటకు.— "ఏనుబనివినియెదనన్న లఘుకృపఁజూడుము." భార. అను. ౧, ఆ.)

**పనుచు.** దే. అ. క్రి. ఆగ్రహించు. "క. అనుచుఁగడలిపోవచ్చిన, ననుమానముమానిహంసుఁడమ్మునిఁజేపు, ట్టినచందమేమిసెప్పుదుఁ, బనికినకాలోరగంబుపట్టుటదోఁచెన్." ఉ, హరి. ౪, ఆ.

**పనుగొను.** దే. అ. క్రి. (పన్ను+కొను.) 1. గట్టిపడు, దృఢపడు; "గాంగేయకతభూములన్, బనుగొనన్ ధనువభ్యసించుచు." భార. ఆది. ౪, ఆ.—2. కలుగు. "క. ధనమునకైధర్మముదెస, ననాదరముచేసెనేనినాన్నపతికిన, ప్లైనమునుజెడుదుర్యశముగన్, బనుగొనుదుర్గతియును బాటిలునన్నూ." భార. శాం. ౨, ఆ.

**పనుచు.** దే. స. క్రి. 1. నియోగించు; "తే. అయ్యపనియేమియనిదండకరిగియరిగి, యతఁడు పనిచినవను పుళోయ్యలియొనర్చి." పం. ౧, ఆ.—2. పుచ్చు. "నేఁబనిచెదవ జ్రముల్." భార. అశ్వ. ౧, ఆ. (చూ. అనుచు.)

**పనుపడు.** దృ. అ. క్రి. పన్నుపడుయొక్క రూపాంతరము. (కలుగుటకు.— క. సుఖపొమ్మనదియాగన, మునుమాతసన్నిట్టిసకృఁ బొలఁతియోగఁ, బునసంతచౌరవయమ్మయుఁ, బనపడియన్ జెప్పుమ దాఁటఁబనిఁదిఁగెన్." భార. అను. ౬, ఆ.—సాటుటకు.— "క. అనపునమేసురుఁడనా, మనఁబు శిష్యుఁడు నిమలమానసనీస్సెఁ, బనుపడినశ్రీతిఁజెప్పితి, సనిశ్చయములభాతిగుహ్యమగునిఖ్యాతమున్." భార. అశ్వ. ౨, ఆ.) (ప్రే. పనుపఱుచు.)

**పనుపరి.** దే. విశే. (పనుపు+అరి.) ఆజ్ఞకులోఁబడినవాఁడు.

**పనుపు.** దే. వి. నియోగము. (చూ. పనుచు.)

**పన్న.** దే. విశే. 1. అనామధేయుఁడు; "ఉ. పెన్నిధిఁగన్నవాఁడు మజిపెంపునఁబ్రాణసమానమిత్రుఁడై, యున్న మహాత్మునింగదిసి యొయ్యనఁజెప్పినఁజెప్పఁగాకయే, పన్నలకైనఁజెప్పినవిపద్దశనొందఁ డెయట్లుగానని, దోష్యన్నతుఁడైనపాత్రునకు నత్తిమయోగముఁజెప్పుటొప్పగున్." శివ. ఉ. ౧, ఆ.—2. వృద్ధుఁడు.

**పన్నకము.** దే. వి. పన్నగడ, పన్నిక, రచన.

**పన్నగము.** సం. వి. అ. పుం. 1. పాము; 2. పద్మకాష్ఠము.

**పన్నగాశనుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, పాపమేపరి.

**పన్నము.** ఉభ. వై. వి. వేదమునందలి అట్లమునకు' అవయవము. సం. విశే. (అ. ఆ. అ.) జాఱినది.

**పన్నా.** గ్రా. వి. కాకితము, వస్త్రముమొదలగువానివెడల్పు.

**పన్నాగము.** దే. వి. అందలముమీఁదికప్పు. "పొన్నాకుమేల్పర్చ పన్నియపన్నాగము." చంద్రా. 3, ఆ.

**పన్నారు.** దే. వి. శాలికలాదుకొనగురిగి. "సీ. పాఁపమేఁపరి పచ్చపన్నారులోపులఁ గులుకుగుజ్జెనగూళ్లకుఁడుచుటుడిగి." యయా. 3, ఆ.

**పన్నిక.** దే. వి. పన్నగడ, పన్నకము, రచన.

**పన్నిదము.** వై. వి. 1. జూదమునందు ఒడ్డెడుధనాదికము; (చూ. పందెము.) 2. పాచికలు గవ్వలు మొదలగువానిపొర్లిక. "ద్వి. ప్రాణవిభుని, యాటకొపన్నిదంబయితనయాడు, నాటపుఁగూడని యట్టులైయున్న, యాలెక్కలీక్షించియద్భుతంబంద." విష్ణు. పూ. ౨, ఆ.

**పన్నిద్దఱు.** దృ. స. (పది+ఇద్దఱు.) పండ్రెండుమంది. (పండ్రెంటికి మహన్మహత్త్వర్థకబహువచనాంతాదేశము.)

పన్నిద్దము. దృ. వి. (పది+ఇద్దము.) పం[డ్రెం]డుతూములు.

పన్నిరుగురు. దృ. స. (పది+ఇరుగురు.) పన్నిద్దఱు.

పన్నిరువురు. దృ. స. పన్నిరుగురుయొక్క-రూపాంతరము.

పన్నిల్లము. మి. వి. (పది+ఇల్లము.) పం[డ్రెం]డుపలములు.

పన్నీరము. సం. వి. అ. న. పన్నీరు. "శ్లో. కర్పూరరేణుసికతా కమనీయగర్భే, పన్నీరశీతలశిలాతలపుష్పతల్పే, కేళీమణీరదళకల్పితకాయమానే, ధారాగృహేరఘుపతిర్విదధేనిదాఘే." సాహిత్య రత్నాకరమున రసతరంగము.

పన్నీరు. వై. వి. హిమాంబువు.

పన్ను. దే. అ. క్రి. 1. యుద్ధమునకుసిద్ధపడు; "ఉ. పన్నినవాఁడ రింకఁ జెడిపాఱకుమీయని మూఁదలించి." ఉ, హరి. 3, ఆ.– 2. కలుగు. "క. అన్నలినాక్షులవాలుం, గన్నులకెదిరింపవేనికత మునఁగాదే, పన్నినభయమునఁబేడిన, లెన్నఁడుమజలదుర్గములనునెడ లఁగవెఱచుట." హరిశ్చ. ౨, ఆ.–అం, [ప్రే]. 1. సిద్ధపఱచు; "మ. కడఁకం బన్నఁగనానతిచ్చెఁజతురంగంబుల్‌ రణక్రీడకుఁ, వెడలన్‌." ఉ, హరి. ౪, ఆ.– 2. కలుగఁజేయు. "సీ. బలభిదారామనంభవలతాంత శ్రేణిఁబన్నుమునాఁకొకచిన్నితేరు." పాండు. ౫, ఆ.–స. క్రి. 1. పర్వఱచు; "క. ధనురాచార్యుఁడుతగఁబన్నినపద్మవ్యూహమొరులునేరరుచొర." భార. ద్రో. ౨, ఆ.– 2. చేయు. "ద్వి. మీరునానఖలుగామీయొద్దిదివ్య, నారులూడిగ ముఁబన్నఁగనుండవలయు." విష్ణు. పూ. ౨, ఆ.–వి. కప్పము. విశే. ఒప్పు. "ఉ. మహీ దేవకుబావతంసరవితేజవివాహమునీకు నాకుమున్‌, భావజశక్తినైనయదివన్నుగనన్నుఁబరిగ్రహింపు." భార. ఆది. 3, ఆ.

పన్నుండు. దే. అ. క్రి. శయనించే, పరుండు.

పన్నుగడ. దే. వి. 1. రచన; 2. పీతపుకడవపైదండెనుంచి త్రాళ్లతో బిగించుట.

పన్నుపడు. దృ. అ. క్రి. 1. వాడుకపడు; 2. కలుగు; 3. నాటు. (చూ. పనుపడు.) (ప్రే. పన్నుపఱచు. "వ. అన్నులనిద్రం గ్రొన్ననవిలుకాని దిన్నెలంబన్నుపఱచియు." కృష్ణా. 3, ఆ.)

పన్నె. దే. వి. 1. మగ్గమునందు పడుగునూలు వేఱువేఱు చొప్పించుటకై నడుమ చువ్వెనపండ్లవలె నిలువుగానేర్పడియుండునట్లు వెదురుబద్దలతో అడ్డముగాఁగట్టఁబడిన సాలెవాని సాధనవిశేషము; 2. అంకపన్నె వెరుకటియినుపములు. (మొదటిరూపము పన్నియ.)

పన్ను. దే. వి. పనుపుయొక్క-రూపాంతరము. "పార్థివప్రాగ్రసరుంసుధర్మసుతుపన్పిది." భార. ఆర. ౫, ఆ.

పప్ప. దే. వి. భక్ష్యము.

పప్పాణము. సం. వి. అ. పుం. పాపటి.

పప్పర. దే. వి. కింశుకము. (దీనిభేదము నీరుపప్పర.)

పప్పళి. దే. వి. 1. వస్త్రమునందలి చిత్రవర్ణవిశేషము; "పులితోలు చిఱుతపప్పళివచ్చడముతోడ." పాంచా. 3, ఆ.–2. చిత్రవర్ణవస్త్రవిశేషము. "సీ. చిఱుతపప్పళిరోని సరిగంచుపనరుపప్పళికుచ్చెల చెఱంగువాఱఁగట్టి." శుక. ౧, ఆ.

పప్పు. దే. వి. 1. పొట్టుపోయి బద్దలైనకాయధాన్యము; 2. సూపము.

పప్పుచేయు. దృ. స. క్రి. నుఱుముచేయు. "ఎ, గీ. పరభుభుజుఁద్రుంచిగదలచేఁబప్పుచేసి." కవిక. ౨, ఆ.

పబువు. వై. విశే. ప్రభువు.

పబ్బము. వై. వి. 1. సంక్రాంతిలోనగునది; (చూ. కాళుఁడు.) 2. ఉత్సవము*; "కన్నులపబ్బము." రా, వి. ౪, ఆ.–3. అతిధ్యము*. "అ. నీవ్రుగాకయింకనెఅయంగనిరువురఁ, దొడుకవచ్చితేనినాడికమైన, భంగిమువ్వురకును బబ్బంబువెట్టెదఁ, గూర్చి తెమ్ముమొక్కుదీర్చికొనఁగ." పంచ. నా. ౫, ఆ.

పబ్లీకు. ఆం. విశే. అందఱికిచెందిన, బహిరంగమైన.

పముజో. దే. వి. పంజోనకు మొదటిరూపము.

పమ్మకము. దే. వి. అంచులుమడిచికుట్టెడుకుట్టు.

పమ్ము. దే అ. క్రి. అతిశయించే. "పన్మినతేజమ్ముదెసలఁబరఁగఁగ." మార్క. ౫. ఆ. (పంబుయొక్క-రూపాంతరము.) స. క్రి. అంచులుమడిచికుట్టు.

పయఁట. వై. వి. స్త్రీలఱొమ్ముమీఁదివస్త్రము. "పయంటయంటగపకించు." విజ. ౨, ఆ. (పయ్యఁటయొక్క-రూపాంతరము.)

పయనము. వై. వి. ప్రయాణము.

పయనించు. వై. అ. క్రి. ప్రయాణమగు.

పయర. దే. వి. 1. దక్షిణపుగాలి; 2. గాలి; 3. దక్షిణపుగాలిచేఁ బండెడు పెసలులోనగు కాయధాన్యము. (పయ్యరయొక్క-రూపాంతరము.)

పయస్య. సం. వి. అ. స్త్రీ. 1. పాలతీగ; 2. పిన్నపాలతీగ; 3. రెడ్డివారినానఁబ్రాలు. విశే. 1. పాలకుహితమైనది; 2. పాలయందుఁబుట్టినది. (నేయిలోనగునది.)

పయస్విని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు; 2. మేఁక; 3. పాలగొలిమిడి.

పయస్సు. సం. వి. స. న. 1. పాలు; 2. నీరు.

పయోజము. సం. వి. అ. న. తామర, నీటిపుట్టుగు.

పయోధరము. సం. వి. అ. పుం. 1. పాలిండ్లు; 2. మబ్బు; 3. టెంకాయ; 4. కోశకారమనుచెఱకు.

పయోధి. సం. వి. ఇ. పుం. సముద్రము.

పయోరాశి. సం. వి. ఇ. పుం. సముద్రము, నీటికుప్ప.

పయ్య. వై. వి. పల్లవన్నె. విశే. పల్లవన్నెగలది. "పయ్యకెంపు." య. 3, ఆ.

పయ్యఁట. వై. వి. పయఁట. "పయ్యంటచలింపఁగా సురఁటినల్లన వీచుచు." శశాం. ౪, ఆ.

పయ్యద. దృ. వి. పయ్యెదయొక్క-రూపాంతరము. "యానవేగమునఁబయ్యదకొంగునడలిన." హం. ౮, ఆ. (సంధిని వర్ణవికారము.)

పయ్యర. దే. వి. 1. దక్షిణపుగాలి; "రగడ. కురువిందనదెగిలు బుకొనియెఁబయ్యరదొంగ, విరులఁగరికుంభకుచవెరఁజామయ్యర గ్రుంగ." స్వా. 3, ఆ.–2. గాలి. "సీ. కాళతొల్వేలుపుఁగాటువగాటంపుటడవులమేటిపయ్యరయనుంగ." ఆచ్చ. బాల, కాం.

పయ్యెద. దృ. వి. (పయి+ఎద.) పైట. "జిలుఁగుపయ్యెద." య. 3, ఆ.

పర. ఉభ. దే. వి. 1. కంటిపొర; "చ. జరదలకొన్నమేనిజిగి జూతెవినంబడయ్యెమాటని, తస్నరుచిరభోజనంబువడిదప్పెఁగనుం గవనెంతయేనియుం, బరలుదయించెదంతములబల్మి పకావకలయ్యెఁ దిల్లగా, నరసెశిరోజముల్‌ జనపనారతెఱంగునవిమ్రతాళికిన్‌." శే. ౧, ఆ.– 2. అరఁటిలోనగుపూనిపొర, "సీ. అభరులేఁతగురు

కొమ్మలనండగొనియుండెఁబరలెత్తెనరఁటికంబములచాలు." భాస. ౪, ఆ.—వై. విణ. వృత్తియందు పరముశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (చూ. పరగడుపు.)—సం. వి. ఆ. స్త్రీ. వాగ్భేదము.

**పరంగి.** వై. వి. 1. శ్వేతముఖుఁడు; హంస. ౧, ఆ.—2. మూలికావిశేషము*.

**పరంగీలాగి.** ద్వ. వి. కెంపుజాతిదినుసు. "వ. దుష్టజనశిక్షణశిష్టజనరక్షణంబులునెఱపుటకువిన్నపంబులకుడగ్గఱు రౌద్రకరుణారసంబులతెఱంగునమెఱుంగుపరంగీలాగికెంపులపోఁగులుబెడంగుసూప." చంద్ర.

**పరంజ.** వై. వి. ఇల్లుకట్టునపుడు పనివారలకొఱకు కొయ్యలతోఁగట్టిన కట్టడము; సారువ.

**పరంజము.** సం. వి. అ. పుం. 1. గానుఁగ; 2. చురకత్తియలుఁగు; 3. నురుఁగు.

**పరంపర.** సం. వి. ఆ. స్త్రీ. 1. వరుస; 2. సంతానము; 3. హింస.

**పరంపరాకము.** సం. వి. అ. న. యజ్ఞమునందలి పశువధ.

**పరంపరావాహనము.** సం. వి. అ. న. తేరుమోకు. అనేకులు మోయునట్టి యందలములోనగునది. (అనికొందఱు.)

**పరంపరుఁడు.** సం. వి. అ. పుం. ముమ్మనుమఁడు.

**పరఁగు.** వై. అ. క్రి. 1. ప్రయుక్తమగు; "వ. అనూతనందనుండు మొదలగునష్టేటిమగలమ్మార్గణమ్ములమ్మనుజపతిపైఁబరఁగుటయు." భార. కర్ణ. ౩, ఆ.-2. ప్రవర్తిల్లు; "క. ఎక్కడనడచునుసత్యం, బెక్కడధర్మంబుపరఁగునెక్కడగలుగుం, జక్కటినిలుచుంగృష్ణుం, డక్కడనతఁడున్నకతననగుజయమధిపా." సం. "యతస్సత్యం యతోధర్మో యతోహ్రీరార్జవంయతః, తతోభవతిగోవిందోయతఃకృష్ణస్తతోజయః." భార. ఉద్యో. ౩, ఆ.—3. ప్రసరించు*; "క. తిరిగితిమిగాలిక్షైనం, జొరఁగూడనిచోటులెల్లసూర్యమరీచుల్, పరఁగనినెలవులుసూచుట, యరుదే యనిరుద్ధుఁజూడనలవడదయ్యెన్." ఉ, హరి. ౪, ఆ.—4. ప్రసిద్ధమగు*; "క. ఉత్తమమగువంశంబున, నుత్తమకులమునవితండనుత్తమయశుఁడై, యుత్తమనృపతికిఁబుట్టుట, నుత్తముఁడనఁగంబరంగునురిర్వి ననిమునుల్. చనిరి." మార్క. ౪, ఆ.—5. ప్రయాణమగు*; "క. ఆదివ్యావసథమునదన, పాదంబులయందుఁదాల్చిపరఁగిరయమునన్, భూదేవుఁడుదర్పుఖుఁడై, మోదంబునహిమనగేంద్రమునకుంజనియెన్." మార్క. ౪, ఆ.—6. ప్రవహించు*; "అస్తోకప్రవాహంబులైపరఁగెన్ రక్తనదుల్." భార. ద్రో. ౧, ఆ.—7. విహరించు*. "వ. యథేష్టవిహారణంబులనహరహంబునుంబ్రవర్తిల్లుచున్న యేనునిన్నుంగన్యకాంతఃపురంబుననొక్కసరోవరంబునంబరఁగుతఱి." ప్రభా. ౧, ఆ.

**పరఁట.** దే. వి. ఏఱుఁబిడక, కరీషము.

**పరఁటి.** దే. వి. పనఁటియొక్కరూపాంతరము. (వంటకుండకు. "ఐదాఱుపరంట్లవంటకము." భో. ౬, ఆ.)

**పరఁటిపుట్టువు.** దే. వి. అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు. "సీ. ఎఱుఁగఁడుమత్తిల్లిపరఁటిపుట్టువుగ్రుక్కగొనినయప్పుడుగలకుతిలపాటు." య. ౧, ఆ.

**పరఁటె.** దే. వి. పంటెకుమొదటిరూపము. (చూ. కుంచె.)

**పరక.** దే. వి. 1. రెండువీసములు; 2. గడ్డిమొదలగువానిపోఁచ. "శే. ఒక్కఁడడుగెత్తిపరకవేయుచునుదాఁచి, నట్టరిగిబెంకిగనిడీఁకఁబట్టుకొయ్యును." పాన్స. ౪, ఆ.

**పరకాళాబట్ట.** వై. వి. తెల్లని నాజూకుబట్ట.

**పరకీయ.** సం. వి. ఆ. స్త్రీ. త్రివిధనాయికలలో నొకతె. (చూ. నాయిక.) విణ. ఇతరునిది.

**పరగడుపు.** ద్వ. వి. (పరము + కడుపు.) ఆహారము వేయనికడుపు.

**పరగణా.** హిం. వి. జమీలోభాగము.

**పరచి.** దే. వి. (చూ.) ఎరవు, యాచితకము.

**పరజాతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బానిసవాఁడు.

**పరజె.** దే. వి. పక్షివిశేషము. "పాలలుపరజలుపావురాలు." రసి. ౧, ఆ.

**పరతంత్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరాధీనుఁడు.

**పరదా.** హిం. వి. తెర.

**పరదేశి.** సం. వి. న్. పుం. అన్యదేశమునందుండివచ్చినవాఁడు, అతిథి

**పరపత్తెము.** వై. వి. ఇతరునియొద్దచేబదులుగాద్రవ్యముపుచ్చుకొనుట. (వానికి ఎక్కడను పరపత్తెముపుట్టలేదు. నేను పరపత్తెము చేసి ఆ వ్యాపారముచేసితిని.) (దీనిని పరపతి అనియు వాడెదరు.)

**పరపిండాదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఒకరింటికూడుతినువాఁడు.

**పరపు.** వై. స. క్రి. 1. బాణముప్రయోగించు; "క. హరులఁబరిమార్చిసారథిఁ, బొరిగొని కేతనమునఱకిభూరిశరంబుల్, పరిపిపరిపంథిదేహం, బరవ్రేలెడుఁదెఱపిలేనియట్లుగఁజేసెన్." హరి. ఉ. ౧౦, ఆ.—2. ప్రవహింపఁజేయు*. "దేవతరంగిణిఁదెచ్చియురిపి పైఁబరపి." హరి. పూ. ౩, ఆ.—వి. విరివి*. "క. సురనదితీరంబునఁగడుఁ, బరపగుతనదండువిడియఁబనుచుచు." నిరో. ౯, ఆ.—విణ. విరివిగలది*.

**పరభాగము.** సం. వి. అ. పుం. గుణోత్కర్షము.

**పరభృతము.** సం. వి. అ. పుం. కోయిల, పికము.

**పరభృత్తు.** సం. వి. త్. పుం. కాకి, వాయసము.

**పరమపదము.** సం. వి. అ. న. వైకుంఠము.

**పరమము.** సం. వి. అ. పుం. పరమాత్మ. విణ. 1. ఆద్యము; 2. ఉత్కృష్టము; 3. ప్రధానము.

**పరమహంస.** సం. వి. అ. పుం. ఉత్తమపదమునొందిన సన్న్యాసి.

**పరమాణువు.** సం. వి. ఉ. పుం. సూక్ష్మములకంటె సూక్ష్మమైన అణువు.

**పరమాత్మ.** సం. వి. న్. పుం. పరబ్రహ్మము. (చూ. పరమాత్ముఁడు.)

**పరమానా.** హిం. వి. రాజాజ్ఞ, రాజసన్నదు.

**పరమాన్నము.** సం. వి. అ. న. పాలుపోసి అన్నముగావండిన యన్నము, పాయసము.

**పరము.** ఉభ. దే. వి. 1. కట్టెబండిమీఁదిపలువు మ్రాను; "సీ. కస్తూరినించిసింగములఁగట్టినకప్పురంపుటనంటిపరంపుబండ్లు." చంద్రా. ౩, ఆ.—2. చదును. "సీ. చిటికెనవ్రేలియంతటిపరిణాహంబుఁబది వ్రేళ్లనిడుపునుబరముఁగలిగి." సం. "కనిష్ఠాగ్రపరీణాహంనత్వచంనిర్వ్రణంబుజా." కాశీ. ౪, ఆ.—వై. అనశనవ్రతము, ప్రాణాచారము. (చూ. పరమువడు.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. పర.)—సం. అ. న. 1. కేవలము; 2. మోక్షము. విణ. 1. అన్యము; 2. దూరము; 3. ఘోఁడిద్ది; 4. శ్రేష్ఠము.

**పరముపడు.** వై. అ. క్రి. (పరము+పడు.) ప్రాణాచారము పడు. "వ. ఇందిరకుం బరమువడియున్నరాహులవన." ఆము. ౬, ఆ.

**పరమేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. విష్ణువు.

**పరమేష్ఠి.** సం. వి. న్. పుం. బ్రహ్మ, నలువ.

**పరవంజే.** దే. స. క్రి. కమ్ముకొను, ఆవరించు.

**పరవంతుఁడు.** సం. విశే. (త్. ఈ. త్.) పరాధీనుఁడు.

**పరవశము.** సం. విశే. (అ. ఆ. అ.) పరాధీనము.

**పరవాఁడి.** దే. విశే. అత్రగొట్టు. "రగడ. మితిలేనితేనెసామెుఁజేసె పరవాడి, యలిరలతికలమరగియేగునదిపరవాడి." సా. 3, ఆ.

**పరవు.** దే. అ. క్రి. వ్యాపించు. "సీ. పరవిలంబించిసప్తమహార్ణవంబులు విన్నఁబడెనువెల్లి విరియకుండ." భీ. 3, ఆ.—2. వ్యాపనము. "వ. నేలపరవుగానాడు గరుడుఁడనం బాయుచు డాయుచు." సా. ౪, ఆ. (పరఁగుయొక్కరూపాంతరము.)

**పరశువు.** సం. వి. ఉ. పుం. గండగొడ్డలి.

**పరశ్వథము.** సం. వి. అ. పుం.____వై.____

**పరశ్శతము.** సం. విశే. (అ. ఆ. అ.) నూటికంటె నధికసంఖ్య గలది. (ఇట్లు పరస్సహస్రము మొ.)

**పరస.** దే. వి. ఉత్సవమునకు వచ్చుజనము.

**పరస్పరము.** సం. విశే. (అ. ఆ. అ.) అన్యోన్యము.

**పరస్మైపదము.** సం. వి. అ న. క్రియాపదముయొక్క భేదము.

**పరాకు.** దే. వి. 1. తత్పరత; "తే. రమణియొయ్యారములపైఁ బరాకుచేసఁ, జవియెఱుంగఁడువడ్డించునవియెఱుఁగఁడు." విజ. ౨, ఆ.—2. ప్రమాదము. "క. వనితనృసింహేంద్రుఁబరా, కునఁ జేకొన్నెనిశరమువంచుకొను." కా. 3, ఆ.

**పరాకుఁడు.** సం. వి అ. పుం. కుత్సితుఁడు.

**పరాకుపడు.** దన్. అ. క్రి. ప్రమాదపడు.

**పరాక్రమము.** సం. వి. అ. పుం. 1. వీర్యము; 2. శౌర్యము; 3. సామర్థ్యము; 4. ప్రారంభము.

**పరాక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. పరాక్రమము.

**పరాగము.** సం. వి. అ. పుం. 1. పుప్పొడి; 2. దుమ్ము; 3. నలుఁగుపిండి; 4. రాహువు సూర్యచంద్రులనుబట్టుట; 5. చందనము; 6. విఖ్యాతి; 7. పర్వతవిశేషము.

**పరాఙ్ముఖుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పెడమొగము పెట్టిన వాఁడు.

**పరాచకము.** గ్రా. వి. పరిహాసము, ఎకసక్కెము.

**పరాచితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) భానినవాఁడు.

**పరాచీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పెడమొగము పెట్టిన వాఁడు, పరాఙ్ముఖుఁడు.

**పరాజయము.** సం. వి. అ. పుం. అపజయము, ఓటు.

**పరాజితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఓడినవాఁడు.

**పరాత్పరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) శ్రేష్ఠులకంటెకు శ్రేష్ఠుఁడు.

**పరాధీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఒకరికిలోఁబడినవాఁడు.

**పరాన్నుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఒకరింటికూడు తిను వాఁడు.

**పరాభవ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. అవమానము; 2. నాశము.

**పరాభవించు.** సం. స. క్రి. అవమానించు.

**పరాభూతి.** సం. వి. ఇ. స్త్రీ. పరాభవము.

**పరాభూతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పరాభవింపఁబడిన వాఁడు.

**పరామరికె.** వై. వి. పరామర్శము. "శీ. పయిఁబరామరికచొప్పడ మిఁబాకముతెప్పపండఁబాఱిన పొలమెండఁబాఱె." సా. 3, ఆ.

**పరామరిస.** వై. వి.____వై.____వి, పుం. 2, ఆ.

**పరామరిసించు.** వై. స. క్రి. పరామర్శచేయు. "చ. నెడకె భిక్షుకుండునట, గుపితమతిశిరఁబనియఁగొట్టెఁబరామరిసింప వేయనట." ఉ. రా. ౬, ఆ.

**పరామర్శము.** సం. వి. అ. పుం. చక్కగా విచారించుట.

**పరామర్శించు.** సం. స. క్రి. చక్కగా విచారించు.

**పరాయణము.** సం. వి. అ. న. ఆశ్రయము, ప్రా. పు. విశే. అభీష్టము.

**పరాయణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఒకట ఆసక్తిగల వాఁడు.

**పరాయి.** వై. విశే. ఇతరము. (ఉదా: పరాయివాఁడు.) (ఇది వాడుకలోనిది.)

**పరారి.** దే. విశే. ఎత్తుపడి ఊరువిడిచిపాఱిపోయినవాఁడు.

**పరాసుఁడు.** అన్య. వి. ఫ్రెంచివాఁడు.

**పరార్థవాది.** సం. వి. న్. పుం. వకీలు.

**పరార్థ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ముఖ్యము.

**పరావృతము.** సం. విశే. (అ. ఆ. అ.) పొర్లాడినది.

**పరాసనము.** సం. వి. అ. న. చేంపుట, మారణము.

**పరాసువు.** సం. విశే. (ఉ.) చచ్చినవాఁడు.

**పరాస్కంది.** సం. వి. న్. పుం. దొంగ, చోరుఁడు.

**పరాస్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అపజయమొందినది; 2. నిరాకరింపఁబడినది.

**పరి.** దే. వి. 1. సేన; "చ. పరిచనుదెంచిగోగణముఁబట్టెననట వినిపిన్న గానమీఁ, దరయకరాజనందనుఁడహంకృతిమైఁజనుదెంచి సైన్యవి, స్ఫురణముఁజూచిభీతిఁదనబుద్ధిగలంగినఁబాఱఁజొచ్చె." భార. విరా. ౪, ఆ. — 2. సమూహము; "క. మిడుతపరివోలె దిక్కుల, యెడములుదమమయ ముగాఁగనేకాశృతితోఁ, గడిఁదిగఁ బొదివిరి." హరి. ఉ. ౬, ఆ. — 3. పక్తి; "వ. ఒక్కపరి యచీమపరియనంగవిని." సా. ౪, ఆ.—4. వేష్టనము; "చ. పరిమెయిఁబాఱెవానిఁగనిపట్టివెనక బెడకేలుఁగట్టితెచ్చిరి." భార. శాం. 3, ఆ.—5. ఆవృత్తి. (పారియొక్కరూపాంతరము.) (ఈ యర్థమందిదియేకార్థకశబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడును. ఉదా. ఒకపరి, ఒక్కపరి మొ.)

**పరిఁజించు.** వై. స. క్రి. పరుఁజుతోఁబట్టు. "క. అనికైదువుఁ బరిఁజించుచు." భో. ౫, ఆ.

**పరికె.** దే. వి. ముగ్గు. "చ. తిరుమలకంచిపుష్పగిరితీర్థములం జనికొంగుముళ్లతో, వరములు దంపతుల్ వడయువారకానక్కలువైచి

యంశటకా, బరికలు దృష్టిదీపములుపన్నినగద్దెలఁజెట్టియేమిటకా, గరమగుపుత్రవాంఛకడగానఁగలేకవిచారభిన్నులై." హంస. ౨, ఆ.

**పరికరము.** సం. వి. అ. పుం. 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. ఉపకరణము; 3. సమూహము; 4. పరివారము; 5. నడికట్టు; 6. యోగపట్టె; 7. ప్రారంభము; 8. మంచేము; 9. వివేకము.

**పరికరించు.** వై. స. క్రి. పరీక్షించు. "తే. పంకనిర్మగ్న మగుగోవు పరికరించి." జై. ౧, ఆ. (ఈ రూపమున నిప్రయోగమొక్కటే కానఁబడుచున్నది.)

**పరికర్మము.** సం. వి. న్. న. దేహమునందలి మురికిపోఁగొట్టుట.

**పరికాఁడు.** దే. వి. తెగకుముఖ్యమైనయేనుఁగు, యూథపము. "చ. వంతిముట్టినఁబరికాఁడుమొత్తిమువడిఁబజతెంచినమాడ్కి నాసుగా, తనయుఁడులోనుగారథికదంబములిట్టడరెకా నమద్ధతికా." భార. భీష్మ. ౧, ఆ.

**పరికి.** దే. వి. కిరాతభేదము.

**పరికించు.** వై. స. క్రి. 1. పరీక్షించు; "కనదివ్యమతిం బరికించి కాంచి." భార. శాం. ౧, ఆ.—2. విచారించు "క. గురులకు శిష్యులుపుత్రులు, పరమార్థములోకధర్మపథ మిదిదీని . . పరికింపక యూపలుకులు, తరుణీగురు పుత్రిసేఁకుఁదగుసేవలుకకా." భార. ఆది. 3, ఆ.

**పరికిణీ.** దే. వి. పావడ, గాగర.

**పరికూటము.** సం. వి. అ. పుం. గవనివాకిటనుండెడు మట్టిదిబ్బ.

**పరికె.** దే. వి. ఒకదినుసుగడ్డ, త్రిశృంగము.

**పరిక్రమము.** సం. వి. అ. పుం. విహారము.

**పరిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. చుట్టుకొనివచ్చుట.

**పరిక్షిప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) నలుప్రక్కలఁ జుట్టఁబడినది.

**పరిక్షేపము.** సం. వి. అ. పుం. 1. చుట్టుకొనియుండుట; 2. విత్తుట.

**పరిఖ.** సం. వి. ఆ. స్త్రీ. అగడ్త, ఖేయము.

**పరిగణనము.** సం. వి. అ. న. ఎన్నిక.

**పరిగణించు.** సం. స. క్రి. ఎంచు, ఎన్ను.

**పరిగణితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఎన్నఁబడినది.

**పరిగతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలిపోయినది; 2. చుట్టఁబడినది; 3. తెలియఁబడినది; 4. పొందఁబడినది; 5. మఱవఁబడినది.

**పరిగృహీతము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రియముతో పుచ్చుకొనఁబడినది.

**పరిగె.** దే. వి. 1. వృక్షవిశేషము; 2. మత్స్యవిశేషము. (మొదటి రూపము పరిగియ.) క్రి. విశే. శీఘ్రము.

**పరిగొను.** దే. అ. క్రి. బారుతీరు. "పైపయింబరిగొనివచ్చురాజశుక పఙ్క్తులచొప్పననొప్పె." వసు. ౫, ఆ.—స. క్రి. చుట్టుకొను. "సీ. తిరిగినఁబోనీకపరిగొని యన్నింటి నదరంటఁ బొరిగొని యాఁగియాఁగి." హరి. పూ. ౬, ఆ.

**పరిగ్రహణము.** సం. వి. అ. న. ప్రియముతో పుచ్చుకొనుట.

**పరిగ్రహము.** సం. వి. అ. పుం. 1. ప్రియముతో పుచ్చుకొనుట; 2. భార్య; 3. పరివారము; 4. నందిమొదలు; 5. శాపము; 6. ఉపకరణము.

**పరిగ్రహించు.** సం. స. క్రి. ప్రియముతో పుచ్చుకొను.

**పరిఘము.** సం. వి. అ. పుం. 1. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 2. ఇనుపకట్లగుదియ; 3. బాణము; 4. గడియమ్రాను; 5. కోటగవను; 6. గాజుకుండ; 7. [illegible]; 8. దెబ్బ.

**పరిఘూర్ణించు.** దే. అ. క్రి. ఎదుగాడు. "ద్వి. గగనంబుతోఁ బరిఘూర్ణించుచునదుము." హరిశ్చ. ౨, భా. (దీనికి ఇతర ప్రయోగము కనఁబడలేదు.)

**పరిఘాతనము.** సం. వి. అ. పుం. ఇనుపకట్లగుదియ, ఆయుధము.

**పరిఘోషము.** సం. వి. అ. పుం. 1. ఉఱుము, 2. [illegible] చెడ్డ పలుకులు; 3. మ్రోఁత.

**పరిచయము.** సం. వి. అ. పుం. 1. ఎఱుక; 2. [illegible].

**పరిచయించు.** సం. అ. క్రి. [illegible], మరగు. "పరిచయించుచునుదిగంబరులతోడ." నై. 2, ఆ.

**పరిచరించు.** సం. అ. క్రి. పరిచర్యచేయు.

**పరిచరుఁడు.** సం. వి. అ. పుం. రథముందుండువాఁడు, నవ [illegible] (అనిఘంటుకము.)

**పరిచర్య.** సం. వి. ఆ. స్త్రీ. సేవ, కొలువు.

**పరిచాయ్యము.** సం. వి. అ. పుం. యాగాగ్నియందుపయోగింపఁదగినపేరు, సమూహ్యము.

**పరిచారకుఁడు.** సం. వి. అ. పుం. ఊడిగపువాఁడు.

**పరిచారము.** సం. వి. అ. పుం. పరిచర్య.

**పరిచారిక.** సం. వి. ఆ. స్త్రీ. ఊడిగపుది.

**పరిచార్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పరిచర్య చేయఁదగినవాఁడు.

**పరిచితము.** సం. విశే. (అ. ఆ. అ.) పరిచయముగలది.

**పరిచితి.** సం. వి. ఇ. స్త్రీ. పరిచయము.

**పరిచ్యుతము.** సం. విశే. (అ. ఆ. అ.) దిక్కుగా [illegible]బడినది.

**పరిచోళిక.** దే. వి. మల్లబంధవిశేషము. ఉ, హరి. 3, ఆ.

**పరిచ్ఛదము.** సం. వి. అ. పుం. 1. కప్పెడువస్త్రము; 2. పరిజనము.

**పరిచ్ఛిత్తి.** సం. వి. ఇ. స్త్రీ. నిశ్చయము.

**పరిచ్ఛిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) పరిచ్ఛేదమునొందినది.

**పరిచ్ఛేదము.** సం. వి. అ. పుం. 1. గ్రంథభాగము; 2. మేర.

**పరిజనము.** సం. వి. అ. పుం. పరివారము, బలఁగము.

**పరిఢవము.** దే. వి. అతిశయము, విశేషము.

**పరిఢవించు.** దే. ప్రే. 1. పరిఢవిల్లఁజేయు, కడుపు; "చేదవిభాగముంబరిఢవించినపుణ్యుఁడు." భీ. ౨, ఆ.—2. అతిక్రమించు; "సీ. తవణించుసింజినీటఙ్కారరవములు ఘటసింగనాదంబుఁబరిఢవింప." భాగ. ౬, స్కం.—3. ధరించు. "ఎ, గీ. పసిఁడిగిలు కులచేర్చుఁబరిఢవించి." కాశీ. 3, ఆ.

**పరిఢవిల్లు.** దే. అ. క్రి. 1. ప్రవర్తిల్లు, నడచు; "సీ. పరవుహంసస్ఫూర్తిఁబరిఢవిల్లినమీరు ఘనవిరోధంబుఁగైకొనకయున్న."

చంద్ర.—2. అతిశయిల్లు. "ఎ, గీ. భావజవికారములుకడుఁబరిఢ విల్లి." భాగ. ౬. స్క.

**పరిణతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పరిపాకముఁబొంది నది; 2. కొమ్ముతో నడ్డముగాఁబొడిచినది. (ఏనుఁగు.)

**పరిణతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పరిపాకము; 2. త్రివిధమైన యేనుఁగు క్రియలలో నొకటి.

**పరిణద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) కట్టఁబడినది.

**పరిణమించు.** సం. అ. క్రి. సంతోషించు. "సీ. పరిణమించిరి ధరామరపురంధ్రీహస్తఘటితచేలాంచలగ్రంథికలన." స్కా. ౫, ౬. ["ఆ. కపటమునులకెంతకాలంబునకునైన, నంతసింపనేనుజలజ గర్భ, చిరతపస్సమాధిఁజెందివిసర్గేచ్ఛ, మెలఁగునిన్నుఁబరిణమిం తుఁగాని." (ఇక్కడ సకర్మకముగాఁ గనఁబడుచున్నది.) భాగ. ౨, స్కం.]

**పరిణయము.** సం. వి. అ. పుం. వివాహము, పెండ్లి.

**పరిణామము.** సం. వి. అ. పుం. 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. క్షేమము; 3. అడ్డముగా విసరఁబడిన యేనుఁగుకొమ్ముదెబ్బ; 4. మాఱురూపు.

**పరిణాయము.** సం. వి. అ. పుం. పారెలయొక్క సవ్యాపసవ్య ప్రసారణము.

**పరిణాహము.** సం. వి. అ. పుం. వెడలుపు, వైశాల్యము.

**పరిణేత.** సం. వి. ఋ. పుం. మగఁడు, భర్త.

**పరితపించు.** సం. అ. క్రి. సంతాపమునొందు.

**పరితము.** వై. వి. కోయిల, పికము. "సీ. వినఁగూడుమరునిదేవేరి పైఁబాటలుపాడులేఁబాయంపుఁబరితములును." య. ౫, ఆ.

**పరితాపము.** సం. వి. అ. పుం. 1. సంతాపము; 2. నరక విశేషము.

**పరితుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి సంతోషము.

**పరితోషము.** సం. వి. అ. పుం.——పై.——

**పరితోషించు.** సం. అ. క్రి. మిక్కిలి సంతోషించు.

**పరిత్యక్తము** సం. విశే. (అ. ఆ. అ.) బొత్తిగా విడువఁబడినది.

**పరిత్యజించు.** సం. స. క్రి. బొత్తిగావిడుచు.

**పరిత్యాగము.** సం. వి. అ. పుం. బొత్తిగావిడుచుట.

**పరిత్యాజ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) బొత్తిగా విడువఁ దగినది.

**పరిత్రాణము.** సం. వి. అ. న. 1. రక్షణము; 2. చేలునెడి తలఁపు. చంపవచ్చినవాని నడ్డగించుట. (అనికొందఱు.)

**పరిదానము.** సం. వి. అ. న. వస్తువులమాఱుపు.

**పరిది.** వై. వి. సూర్యాదిపరివేషము.

**పరిదేవనము.** సం. వి. అ. న. దుఃఖముతోడిమాట.

**పరిద్రోణి.** సం. వి. ఈ. స్త్రీ. నారికడపుపొత్తి.

**పరిధానము.** సం. వి. అ. న. దోవతి, అంతరీయము.

**పరిధి.** సం. వి. ఇ. పుం. 1. సూర్యాదిపరివేషము; 2. యజ్ఞము నందు పశుబంధనార్థమునాటినపైపట్టగలకొయ్య.

**పరిధిస్థుఁడు.** సం. వి. అ. పుం. చుట్టుకొనికాచియుండుభటుఁడు, సేనచుట్టును కాచువాఁడు. (అనికొందఱు.)

**పరిపంథి.** సం. వి. న్. పుం. 1. శత్రువు; 2. తెరువాటుదొంగ.

**పరిపక్వము.** సం. విశే. (అ. ఆ. అ.) పరిపాకమునొందినది.

**పరిపణము.** సం. వి. అ. న. మూలధనము, సంచిమొదలు.

**పరిపరి.** దే. విశే. బహుప్రకారము. "వాహకుల్ పరిపరిలాగులంగు దియఁబట్టుచురా." జై. ౨, ఆ.

**పరిపాకము.** సం. వి. అ. పుం. పరువము.

**పరిపాటి.** సం. వి. ఇ. స్త్రీ. అనుక్రమము, బారిది.

**పరిపాలకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) చేక్కగా కాపాడు వాఁడు.

**పరిపాలనము.** సం. వి. అ. న. చేక్కగా కాపాడుట.

**పరిపాలించు.** సం. స. క్రి. చేక్కగా కాపాడు.

**పరిపాలితము.** సం. విశే. (అ. ఆ. అ.) చేక్కగా కాపాడఁబడి నది.

**పరిపూతము.** సం. విశే. (అ. ఆ. అ.) చేక్కగా పవిత్రమైనది.

**పరిపూర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) చేక్కగా నిండినది.

**పరిపూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. చేక్కగా నిండుట.

**పరిపేలవము.** సం. వి. అ. న. కయివడిముస్తె.

**పరిపోషకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) చక్కగా పోషించు వాఁడు.

**పరిపోషణము.** సం. వి. అ. న. చక్కగా పోషించుట.

**పరిపోషించు.** సం. స. క్రి. చక్కగా పోషించు.

**పరిపోషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చక్కగా పోషింపఁ బడినవాఁడు.

**పరిప్లవము.** సం. వి. అ. పుం. నీరుకోడి. విశే. కదలునది.

**పరిబర్హము.** సం. వి. అ. పుం. 1. శ్వేతచ్ఛత్రాదిరాజార్హవస్తువు; 2. పరివారము.

**పరిభవము.** సం. వి. అ. పుం. అవమానము.

**పరిభవించు.** సం. స. క్రి. అవమానించు.

**పరిభావము.** సం. వి. అ. పుం. పరిభవముయొక్కరూపాంతరము.

**పరిభాష.** సం. వి. ఆ. స్త్రీ. 1. పదార్థవివేచకాచార్యులయొక్క యుక్తియుక్తవాక్కు; 2. గ్రంథసంక్షేపనిర్వాహముకొఱకు చేయు నట్టి సంకేతవిశేషము.

**పరిభాషణము.** సం. వి. అ. న. 1. నిందాసహితమైన యుపా లంభము; 2. ఆలాపము; 3. నియమము.

**పరిభూతము.** సం. విశే. (అ. ఆ. అ.) అవమానింపఁబడినది.

**పరిభ్రమము.** సం. వి. అ. పుం. అంతట తిరుగుట.

**పరిభ్రమించు.** సం. అ. క్రి. అంతట తిరుగు.

**పరిమండలము.** సం. విశే. (అ. ఆ. అ.) అంతట గుండ్రమైనది.

**పరిమళము.** సం. వి. అ. పుం. 1. మెదుపుటవలనను, రాయిడి వలనను బుట్టిన యొప్పిదపుతావి; 2. సురతమునసలఁగిన మేనిపూఁత లోనగువాని వలనఁబుట్టినతావి; 3. మెదుపుట; 4. రాయిడి.

**పరిమళించు.** సం. అ. క్రి. తావివీచు.

**పరిమాణము.** సం. వి. అ. న. తూముతోనగువానికొలత, ప్రస్థ మానము.

**పరిమార్జనము.** సం. వి. అ. న. అంతటతుడుచుట.

**పరిమాఱుచు.** దే. స. క్రి. (పరియ+మాఱుచు.) 1. ఖండించు; 2. చంపు. (రూ. పరిమార్చు. ఖండించుటకు.—"కరములునాలుగుచిక్కం, బరిమార్చితి." భాగ. ౧౦, స్కం. ఉ.—చంపుటకు.—"క. పరిభవకరుఁడగుకీచకుఁ, బరిమార్చుటకిపుడు కడవఁబడియెనె." భార. విరా. ౨, ఆ.)

**పరిమితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొలఁదియిడఁబడినది; 2. చేర్పఁబడినది.

**పరిమితి.** సం. వి. ఇ. స్త్రీ. కొలఁది, పరిమాణము.

**పరియ.** దే. వి. పఱియయొక్కరూపాంతరము. (చూ. పరిమాఱుచు.)

**పరియంకము.** వై. వి. శయ్య. "సీ. అతని మజ్జనభోజనాదిబి నలరించి మృదులపుఁబరియంకమునను నిచి." వి క్ర. ౬, ఆ.

**పరియాచకము.** వై. వి. పరిహాసము. "ద్వి. పరియాచకములాడఁబద్మనాభుండు." విష్ణు. పూ. ౨, ఆ. విశే. పరిహాసయుక్తము*. (అది సరిజేముకాదు పరియాచకము.)

**పరియాచకము సేయు.** వై. స. క్రి. (పరియాచకము+చేయు.) పరిహసించు. "సీ. బ్రాహ్మణాచారంబుపరియాచకముసేయునగ్నిహోత్రవిధానమన్నఁగనలు." కాశీ. ౪, ఆ.

**పరియు.** దే. అ. క్రి. 1. తప్పు; "తే. అన్నదానంబుచేసినయట్టి పాత్ను, నకునుబలమునారోగ్యంబుఁ బ్రకటశుభము, నైయరిష్టాత్తకములైనయురులవలని, భయమునభిచారకృత్యముల్ పరిసిపోవు." వి, పు. ౪, ఆ.—2. చెడు; "ఉ. నీవిరసమెత్తియీపనికినేటికివచ్చితి వింద్రనాకునీ, ఘోరుహమిచ్చినట్ల బరిసిపోయెడునేభవదీయసంపదల్." వి, పు. ౮, ఆ.—3. మీఁదిభాగము సారహీనమై చెక్కలువాసిరాలు. "వ. పరిసినవృక్షమూలములఁబట్టినమవ్వపుఁబువ్వుఁదీఁగెలట్." భాను. ౨, ఆ. "ద్వి. మురిసినశత్రులుమద్దరంబులును, బరిసినపరిఘలుఁబటిసంబులును." రా. యు, ౕ౦.

**పరిరంభము.** సం. వి. అ. పుం. ఆలింగనము, కౌఁగిలింత.

**పరివట్టము.** వై. వి. విష్ణుప్రసాదముగా గ్రహించి తలఁజుట్టుకొను పట్టు.

**పరివర్జనము.** సం. వి అ. న. 1. బొత్తిగావిడుచుట, 2. చంపుట

**పరివర్జితము.** సం. విశే. (అ. ఆ. అ.) బొత్తిగా విడువఁబడినది.

**పరివర్తనము.** సం. వి. అ. న. 1. వస్తువులమాఱుపు; 2. చుట్టివచ్చుట; 3. వెనుకకు తిరుగుట. (రూ. పరివర్తము.)

**పరివర్తించు.** సం. అ. క్రి. చుట్టివచ్చు, తిరుగు.

**పరివసథము.** సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

**పరివాదము.** సం. వి. అ. పుం. 1. దూఱు; 2. వీణవాయించెడి కోడుపు.

**పరివాదిని.** సం. వి. ఈ. స్త్రీ. ఏడుతంత్రులుగలవీణ.

**పరివాపనము.** సం. వి. అ. న. గొఱుగుట, ముండనము.

**పరివాపము.** సం. వి. అ. పుం. 1. వెదపెట్టుట; 2. కొలఁది; 3. పాదు; 4. తవిటి.

**పరివాపితము.** సం. విశే. (అ. ఆ. అ.) గొఱుగఁబడినది. చక్కగా ఛేదింపఁబడినది. (అనికొందఱు.)

**పరివారము.** సం. వి. అ. పుం. 1. పరిజనము; 2. సేన; 3. కత్తియొఱ.

**పరివాహము.** సం. వి. అ. పుం. పరీవాహమునకు మొదటిరూపము.

**పరివిగ్నము.** సం. విశే. (అ. ఆ. అ.) (చూ.) ఉద్విగ్నము.

**పరివిత్తి.** సం. వి. ఇ. పుం. తమ్మునికిపెండ్లియయి తనకులేకుండెడియన్న. (రూ. పరివిష్టుఁడు. అ. పుం.)

**పరివృఢుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రభువు, ఏలిక. (రూ. పరీవృఢుఁడు.)

**పరివృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చుట్టఁబడినది; 2. పొందఁబడినది; 3. తెలియఁబడినది.

**పరివృత్తి.** సం. వి ఇ. పుం. ఒకయర్థాలంకారము. (చూ. అలంకారము.)

**పరివేత్త.** సం. వి. ఋ. పుం. అన్నకన్నముందుపెండ్లాడినతమ్ముఁడు.

**పరివేషము.** సం. వి. అ. పుం. 1. గాలిగుడి; 2. పరివేష్టనము. (రూ. పరివేశము.)

**పరివేష్టనము.** సం. వి. అ. న. 1. చుట్టివచ్చుట; 2. పరివట్టము. "వ. పూజకులచేతఁబాదతీర్థప్రసాదపరివేష్టనంబులిప్పించి." ఆము. ౬, ఆ.

**పరివేష్టించు.** సం. స. క్రి. చుట్టివచ్చు.

**పరివ్యాధము.** సం. వి. అ. పుం. 1. కొండగోఁగు; 2. నీరుప్రబ్బలి.

**పరివ్రాజకుఁడు.** సం. వి. అ. పుం. సన్యాసి.

**పరివ్రాట్టు.** సం. వి. జ్. పుం.——పై.——

**పరిశిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) కడపట శేషించినది.

**పరిశీలనము.** సం. వి. అ. న. శోధనము.

**పరిశీలించు.** సం. స. క్రి. శోధించు.

**పరిశుద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి శుద్ధిపొందినది.

**పరిశుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి నిర్మలత.

**పరిశోధనము.** సం. వి. అ. న. మిక్కిలి శోధించుట.

**పరిశోధించు.** సం. స. క్రి. మిక్కిలి శోధనముచేయు.

**పరిశ్రమము.** సం. వి. అ. పుం. 1. అలవాటు; 2. మిక్కిలి అలపు.

**పరిశ్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి యాఱటఁజెందినది.

**పరిశ్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి యాఱట.

**పరిషత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. సభ; 2. సమూహము.

**పరిషేచనము** సం. వి అ. న. భుజించుటనీళ్లుపోసికొని భోజనపాత్రాదులచుట్టువిడుచుట.

**పరిష్కరించు.** సం. స. క్రి. చక్కఁబెట్టు.

**పరిష్కారము.** సం. వి. అ. పుం. 1. చక్కఁబెట్టుట; 2. తొడవు.

**పరిష్కృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁబెట్టఁబడినది; 2. అలంకరింపఁబడినది.

**పరిష్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. పరిష్కారము.

**పరిష్వంగము.** సం. వి. అ. పుం. కౌఁగిలింత.

**పరిసంఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. ఒక విధి. (చూ. విధి.)

**పరిసరము.** సం. వి. అ. పుం. 1. సమీపము; 2. చేవు.

**పరిసర్పము.** సం. వి. అ. పుం. చుట్టివచ్చుట.

**పరిసర్య.** సం. వి. ఆ. స్త్రీ. కొండలోనగువాని సమీపమార్గమునను సరించిపోవుట. అంటెట తిరుగుట. (అనికొందఱు.)

**పరిసారము.** సం. వి. అ. పుం. (చూ.) పరిసర్య.

**పరిసెనము.** దే. వి. గంతు. "వ. వడిదప్పునట్లు త్రొక్కింగట్టువడి పొట్టలదరంగనిక్కి పరిసెనంబులువేయునవియును." స్వా. ౪, ఆ. (దేగలకు ఆంకలెత్తివేంటయందుచొరవకలుగుటకైమందిచ్చియెత్తిం చెడువాంతి అనికొందఱు దీనికర్థముచెప్పెదరు. అపక్షమునపరిసె నంబులువేయునవియని పాఠము.)

**పరిస్కందుఁడు.** సం. వి. అ. పుం. బానిసవాఁడు.

**పరిస్తరణము.** సం. వి. అ. న. అగ్నిచుట్టుపఱచినదర్భ.

**పరిస్తోమము.** సం. వి. అ. పుం. ఏనుఁగుమీఁదపఱచెడి యెఱ్ఱ కంబళి, కుథము.

**పరిస్పందము.** సం. వి. అ. పుం. 1. మాల్యాదినిర్మాణము; 2. దర్పణాద్యుపకరణము.

**పరిస్ఫోటనము.** సం. వి. అ. న. 1. చీల్చుట; 2. ప్రకాశింపఁ జేయుట.

**పరిస్ఫోటించు.** సం. స. క్రి. 1. చీల్చు; 2. ప్రకాశింపఁ జేయు.

**పరిస్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. కల్లు. విణ. కాఱినది.

**పరిహరించు.** సం. స. క్రి. విడుచు, విసర్జించు.

**పరిహసనము.** సం. వి. అ. న. పరిహాసము, నగవు.

**పరిహసించు.** సం. స. క్రి. పరిహాసముచేయు, నవ్వు.

**పరిహారము.** సం. వి. అ. పుం. 1. విడుపు; 2. చేయి.

**పరిహారి.** సం. విణ. (న్. ఈ. న్.) పరిహరించువాఁడు

**పరిహార్యము.** సం. వి. అ. పుం. హస్తవలయము. విణ. విడువఁ దగినది.

**పరిహాసము.** సం. వి. అ. పుం. పరియాచేకము.

**పరిహృతము.** సం. విణ. (అ. ఆ. అ.) పరిహరింపఁబడినది

**పరిహృతి.** సం. వి. ఇ. స్త్రీ. విడుపు. పరిహారము.

**పరీక్ష.** సం. వి. ఆ. స్త్రీ. పరిశీలనము.

**పరీక్షకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరీక్షించువాఁడు.

**పరీక్షించు.** సం. స. క్రి. పరిశీలించు, పరికించు.

**పరీతము.** సం. విణ. (అ. ఆ. అ.) చుట్టుకోఁబడినది.

**పరీతాపము.** సం. వి. అ. పుం. సంతాపము. (పరితాపముయొక్క రూపాంతరము.)

**పరీధావి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**పరీభావము.** సం. వి. అ. పుం. పరిభావముయొక్క రూపాంతరము.

**పరీరంభము.** సం. వి. అ. పుం. పరిరంభముయొక్క రూపాంతరము.

**పరీవర్తము.** సం. వి. అ. పుం. వస్తువులమాఱుపు. (పరివర్తము యొక్క రూపాంతరము.)

**పరీవాదము.** సం. వి. అ. పుం. దూఱు. (పరివాదముయొక్క రూపాంతరము.)

**పరీవాపము.** సం. వి. అ. పుం. పరివాపముయొక్క రూపాంతరము.

**పరీవారము.** సం. వి. అ. పుం. 1. పరిజనము; (పరివారము యొక్క రూపాంతరము.) 2. కత్తియొఱ; 3. తిరిగెడుప్రాణి.

**పరీవాహము.** సం. వి. అ. పుం. 1. కలుఁజు; 2. శ్వేతచ్ఛత్రాదిరాజార్హవస్తువు.

**పరీవృతము.** సం. విణ. (అ. ఆ. అ.) పరివృతముయొక్క రూపాంతరము.

**పరీష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అమంత్రణార్థమువెదకుట; 2. పరిచర్య; 3. ప్రాకామ్యమను ఒక ఐశ్వర్యము.

**పరీసారము.** సం. వి. అ. పుం. పరిసారముయొక్క రూపాంతరము.

**పరీహాసము.** సం. వి. అ. పుం. పరిహాసముయొక్క రూపాంతరము.

**పరుండు.** దే. అ. క్రి. (పడి+ఉండు.) శయనించు. (శేషా దేశము.)

**పరుఁజో.** వై. వి. కత్తిపిడి, గ్సరువు. "మిహాపసిండిపరుంజామొ హాదా." స్వా. ౪, ఆ.

**పరుఁడు.** సం. వి. అ. పుం. 1. శత్రువు; 2. పరమాత్ముఁడు. విణ. అన్యుఁడు.

**పరుగు.** దే. వి. 1. ప్రధావనము; 2. కోసుదూరము.

**పరుగెత్తు.** దే. అ. క్రి. (పరుగు+ఎత్తు.) ప్రధావించు. (రూ. పరువెత్తు.)

**పరువడి.** దే. వి. ఇ. (పరువు+వడి.) 1. పర్యాయము; "పరు వడిమైంబొరయుఁగాక." భార. శాం. 3, ఆ. (చూ. తత్తబడ.)– 2. క్రమము. "శేరిం గంసుఁ జాణూరునిం శిశుపాలుం నర కాదులంబరువడింజెండాడి." ఉ, హరి. ౨, ఆ. "చ. పరు వడినాపణంబులఁబ్రభామయభూముల మండపంబులన్." సం. "క్రమమాణః క్రమేణైవ హనుమాన్మారుతాత్మజః." రా. సుం, కాం.

**పరువము.** వై. వి. 1. ప్రాయము*; "ఎ, గీ. ఇతఁడు పూతనా ప్రాణపాయితఁడలిర్చెఁ, బురిటిపాపఁడైయొప్పారుపరువము నను." హరి. ఉ. ౫, ఆ.–యౌవనము. (అనికొందఱు.)– 2. పరిపాకము*. "వ. కార్యంబుపరువంబుదప్పెనంగరంబు పరి పక్వంబైయున్నయది." ఉ, హరి. ౪, ఆ.

**పరువిడు.** దే. అ. క్రి. (పరువు+ఇడు.) పరుగెత్తు. (మొదటి రూపము పరుగిడు.)

**పరువు.** ఉభ. దే. వి. 1. ధావనము; 2. కోసుదూరము. (పరుగు యొక్క రూపాంతరము.) వై. 1. పరిపాకము*; "వ. అమని క్రొన్ననలుంబోలెఁబరువుమిగిలి." కవిక. ౨, ఆ.– 2. గౌర వము*.–సం. ఉ. పుం. న్. న. వెదురుగనుపు.

**పరువుగొను.** దే. అ. క్రి. (పరువు+కొను.) పరుగెత్తు. "సీ. ఒండొరుఁగడచుచునుఱవులు నూపుచుఁబాతరలాడుచుఁబరువు గొనుచు." అచ్చ. యు, కాం. (మొదటిరూపము పరుగుగొను.)

**పరువువాఱు.** దే. అ. క్రి. (పరువు+పాఱు.) పరుగెత్తు. (మొదటిరూపము పరుగువాఱు.)

**పరువువెట్టు.** దే. అ. క్రి. (పరువు+పెట్టు.)——పై.—— (మొదటిరూపము పరుగువెట్టు.)

**పరుషము.** సం. విణ (అ. ఆ. అ.) 1. నిష్ఠురము; 2. నిష్ఠుర వాక్యము; 3. చిత్రవర్ణము.

**పరుస.** వై. వి. బాటసారులసమూహము*. "సీ. పరుసదోఁపఁగ నడ్డపడి దురాత్ములబిట్టు తెరలించివారిచేఁదెగినవారు." రుక్మాం. ౨, ఆ.—విణ. కఠినుఁడు. "ఉ. నీవొండననేలయాపరుసనోపిన యంతయుఁదీర్పునేర్పునన్." భార. ఉద్యో. 3, ఆ.

**పరుసన.** వై. వి. పారుష్యము. "పరుసనన భ్రవీధివెసఁబర్వె." రా. యు, కాం. (విశేషణమగుచో.) "పరుసనిపలుకుల" భార. భీష్మ. ౧, ఆ. (చూ. అలకన.)

**పరుసము.** వై. వి. స్పర్శవేధి*. "ఎ, గీ. పరుసమునుసోఁకిలోహం బుపసిఁడియైనపగిది." రుక్మాం. ౨, ఆ.—విణ. పరుషము.

**పరుసవేది.** వై. వి. స్పర్శవేధి*. "తే. పరుసవేదిసోఁకుటయున బరుషలోహ, మధికశుద్ధసువర్ణమయైనపోల్కి." హరి. ఉ. ౫, ఆ.

**పరుసు.** దే. వి. విధము. "క. ధైర్యధనఘనుఁడవునీ, విప్పరుసున నడలుటగదు, నొప్పదు." భార. ద్రో. ౨, ఆ. (ఇది ఆ, ఈ, ఏ శబ్దపూర్వకముగానే ప్రయోగములయందుఁ గానఁబడుచున్నది.)

**పరూషము.** సం. వి. అ. పుం. పేరీఁదు¶.

**పరూషి.** సం. వి. ఈ. స్త్రీ. చిట్టీఁదు¶.

**పరేతరాట్టు.** సం. వి. జ్. పుం. యముఁడు.

**పరేతుఁడు.** సం. వి. అ. పుం. భూతవిశేషము. విణ. చేచ్చిన వాఁడు.

**పరేష్టుక.** సం. వి. ఆ. స్త్రీ. పెక్కీఁతలీనినయావు.

**పరైధితుఁడు.** సం. వి. అ. పుం. బానిసవాఁడు.

**పరోక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) ఇంద్రియగోచరముకానిది.

**పరోఢ.** సం. వి. ఆ. స్త్రీ. పరకీయాభేదము. (ఒకనిఁ బెండ్లాడినది.)

**పరోష్ణి.** సం. వి. ఈ. స్త్రీ. గబ్బిలము, తైలపాయిక.

**పర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. న్. పుం. 1. జువ్వి¶; 2. పోఁక మ్రానులోనగువాని క్రొత్తపండు.

**పర్జని.** సం. వి. ఈ. స్త్రీ. మ్రానిపసుపు, పచంపచ.

**పర్జన్యము.** సం. వి. అ. పుం. 1. ఉఱుము; 2. ఉఱిమెడు మేఘము.

**పర్జన్యుఁడు.** సం. వి. అ. పుం. వర్షాధిదేవత, ఇంద్రుఁడు.

**పర్ణము.** సం. వి. అ. న. ఆకు. పుం. మోదుగు¶.

**పర్ణశాల.** సం. వి. ఆ. స్త్రీ. ఆకుటిల్లు, ఉటజము.

**పర్ణాసము.** సం. వి. అ. పుం. నల్లగగ్గెర¶.

**పర్పటము.** సం. వి. అ. పుం. పావటచెట్టు.

**పర్పాటకము.** వై. వి. తృణవిశేషము.

**పర్యంకము.** సం. వి. అ. పుం. 1. మంచేము; 2. (చూ.) పర్యస్తిక.

**పర్యంతము.** సం. వి. అ. పుం. వఱదాఁక, దనుక.

**పర్యటనము.** సం. వి. అ. న. భిక్షలోనగువానికొఱకు తిరుగుట.

**పర్యటించు.** సం. అ. క్రి. భిక్షలోనగువానికొఱకు తిరుగు.

**పర్యయము.** సం. వి. అ. పుం. క్రమముతప్పుట.

**పర్యవసానము.** సం. వి. అ. న. ముగియుక.

**పర్యవసితము.** సం. విణ. (అ. ఆ. అ.) ముగిసినది.

**పర్యవస్థ.** సం. వి. ఆ. స్త్రీ. విరోధించుట.

**పర్యస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పడినది; 2. కొట్టఁ బడినది.

**పర్యస్తిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) యోగపట్టె.

**పర్యాప్తము.** సం. వి. అ. న. 1. యథేష్టము; 2. తృప్తి; 3. శక్తి; 4. నివారణము.

**పర్యాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. చేలుసనెడుబుద్ధి. దేంపవచ్చినవాని నడ్డగించుట. (అనికొందఱు.)

**పర్యాయము.** సం. వి. అ. పుం. 1. ఒకయర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. అవసరము; 3. క్రమము; 4. ప్రకారము.

**పర్యాయోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒకయర్థాలంకారము. (చూ. అలంకారము.)

**పర్యాలోచనము.** సం. వి. అ. న. చక్కఁగా ఆలోచించుట.

**పర్యాలోచించు.** సం. స. క్రి. చక్కఁగా ఆలోచించు.

**పర్యుదంచనము.** సం. వి. అ. న. ఋణము, అప్పు.

**పర్యుదస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) త్రోయఁబడినది.

**పర్యుదాసము.** సం. వి. అ. పుం. త్రోయుట.

**పర్యుదాసించు.** సం. స. క్రి. త్రోయు.

**పర్యుషితము.** సం. వి. అ. న. చేలిది. విణ. బహుకాలము ఉంచేఁ బడినది.

**పర్యేషణ.** సం. వి. ఆ. స్త్రీ. అమంత్రణార్థమువెదకుట.

**పర్వతము.** సం. వి. అ. పుం. కొండ. డు. ఒకానొకదేవఋషి.

**పర్వము.** సం. వి. న్. న. 1. గనుపు; 2. దర్శప్రతిపత్సంధి; 3. పండుగ; 4. విషువదాది; 5. సమూహము; 6. ప్రస్తావము; 7. లక్షణాంతరము. (పంచపర్వములు. — అష్టమి, చతుర్దశి, కుహువు, పూర్ణిమ, రవిసంక్రాంతి.)

**పర్వారీణము.** సం. వి. అ. న. 1. ఆకులయీనె; 2. జోదమాడు కంబళి; 3. గనుపు; 4. ఆకునలిపినపసరు.

**పర్వసంధి.** సం. వి. ఇ. పుం. పున్నమకునుపాడ్యమికిని, అమా వాస్యకునుపాడ్యమికినిమధ్యకాలము.

**పర్వు.** దే. అ. క్రి. వ్యాపించు. (పరవుయొక్కరూపాంతరము.) వి. ప్రధావనము. "సీ. మొక్కలంబుననున్న ముట్టిపర్వునడయ్యఁ బాటి పట్టైదననిపాటిపాటి." రా. అర, కాం. (పరువుయొక్క రూపాంతరము.)

**పర్శుక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రక్కయెముక.

**పఱి.** యు. దే. వి. 1. ఉప్పుపండెడుబయలు; (ఉప్పుపఱి.) 2. బయలు; (ఇసుకపఱి.) 3. సున్నములోనగువానిఁగొలిచెడు మానవిశేషము; (పట్టియొక్కరూపాంతరము.) 4. సమూహము. (అడవపఱి, (చూ.) అంపఱి.)—వై. విణ. 1. ఇతరము; (చూ. పఱి గడ.) 2. మిక్కిలి; "క. ఘనసమరవిజయపటుగ, ర్వనిరూఢునిఁ గాఁగమున్నువ్రాసినచోనె, ట్టననిసుఁబఱిమొండెముఁగ, మ్మనివ్రాయఁ గఁజేతులెట్టులాడెనోవిధికిన్." భో. ౫, ఆ.—3. గొప్ప*. "క. మానెనభోమణినక్కలు, గూసెంగలయంగ దెసలకుంబలుసాయల్, నేసెంబఱిమొయిళులడరి, మ్రోసెందమయంతఁధూర్యములపర్వ నుల్లై." భార. విరా. ౪, ఆ. "క. ఎఱుఁగకవ్రతమునమోక్షము,

నెఱిగాంచెదనంచుఁబుత్రునిందునుముదురే, పఱమబ్బునమ్మినిండిన, చెఱువుజలమువెళ్లఁజేల్లుచెనఁటియుఁగలఁడే." రుక్మాం. ౯, ఆ.

**పఱుఁగు.** వై. అ. క్రి. ప్రసరించు. "సీ. దీప్తసుదర్శనతీవ్రభానునివేఁడి పఱుఁగినఁగ్రొవ్వఱునుఱికియుఱికి." హరి. ఉ. ౨, ఆ. (పరఁగుధాతువునకుఁగల మఱికొన్నియర్థములును దీనికిఁగలుగవచ్చును.)

**పఱుగడ.** వై. వి. 1. ఇతరస్థలము; "చ. ఎఱుఁగరుగాకలోకమున నెవ్వరికైననుమేలుసేయఁగా, నోఱపగునాశ్రమంబున సమున్నతమైనగృహస్థధర్మముఁ, బఱగడవైచివెట్టిగొని పాఱెడుపొల్లకుముక్తిగల్గునే, పఱిగరియేఱిసంగొలుచు పాఁతటికింగలదేతలంపఁగ." ఉ, హరి. ౪, ఆ. (చూ. పఱుగడము. "సీ. పారికాఁపులతోడఁ బఱుగడంబులువచ్చియున్నవారలనెల్లనోసరించి." వి, పు. ౨, ఆ.) — 2. పార్శ్వము. "అ. పగఱుమెట్టిపట్టిపఱుగడనుండంగ, నెవ్వఁడుండుమూలనేనుదక్క." రామా. ౨, ఆ.

**పఱుచు.** యు. దే. అ. క్రి. పాఱు. "క. గగనవీథిం, బఱచెవియచ్చరవిమానపఙ్క్తులుతూలక." భార. ఆది. ౩, ఆ.—వై. ప్రే. 1. పడఁజేయు; "కడుదుర్భవంబునఁబఱపకుమయ్య." భార. ఆర. ౯, ఆ. "క. భంగించియితరకాంతఁడో, అంగుటతప్పౌతడంబఱచిపురుషులకుఁ." కళా. ౨, ఆ.—2. దుష్పటిలోనగువానిపఱచు; 3. పాటుపడఁజేయు. "అకల్మషులంబఱపంగఁ బాడియే " భార. ఉద్యో. ౧, ఆ. (ప్రేరణార్థకమైనపఱచు ఒక న్యాయమునుబట్టి ఉకారమధ్యముగా నుండవలసియున్నను వ్రాఁతప్రతులయందంతట తఱచుగా అకారమధ్యముగానుండుటవల్లను ఒక ప్రామాణికకవి ప్రయోగమునయతియందుకానఁబడుటవల్లను ఇట్లకారమధ్యముగానును వ్రాయఁబడియెను.)

**పఱత.** దే. వి. ప్రవాహము, వఱ్ఱు, వఱద.

**పఱతి.** దే. వి.———వై.———

**పఱతెంచు.** దే. అ. క్రి. (పఱచు+తెంచు.) పాఱివచ్చు. "క. పఱతెంచికుంభసంభవు, చిఱుదొడవడిఁబట్టుకొనియె." భార. ఆది. ౬, ఆ.

**పఱద.** దే. వి. పఱతయొక్కరూపాంతరము.

**పఱపఱ.** దే. వి. చించుటయందగు ధ్వన్యనుకరణము.

**పఱపు.** యు. దే. ప్రే. (పఱవఁజేయు.) 1. పోఁగొట్టు; "పఱపెదఁదత్పిశాచముల." భార. విరా. ౪, ఆ.—2. త్రోలు; "క. అచ్చేటరథములు, పఱపఁగరాదయ్యెనుభయబలయోధులకుఁ." భార. భీష్మ. ౩, ఆ.—3. ప్రయోగించు; "దివ్యశరంబులుద్రోణుతేరిపైఁబఱపుకిరీటి." భార. ద్రో. ౧, ఆ.—4. పూయు. "శా. శాంపారంగఁబసిండిపైఁబఱపినఁజొబ్బిల్లువిల్లందమై, శంపావల్లికనిల్పిపొల్పుగతి భాస్వత్కాంతిఁజెల్వొంద." నిర్వ. ౬, ఆ.—వి. 1. పడక; 2. వేగము; "క. భగదత్తునేనుఁగడరిన, వెగడునఁబాండవులమొనలువిఱుగుటయుమహా, నగనేటివేగమాఁగిన, పగిదిఘటోత్కచుఁడుదానిపఱపుడిగించెఁ." భార. భీష్మ. ౩, ఆ.—8. విరివి. "పఱపగునారికేళవనపఙ్క్తులు." కళా. ౩, ఆ.—విశ. విరివిగలది.

**పఱవ.** దే. వి. ప్రవాహము, పఱత, వఱద.

**పఱి.** దే. వి. 1. విధము; "అ. పనసపండుదిగినపఱిగన్వన్నముగన్న, నెఱిగ." ఆము. ౪, ఆ.—2. కాఁడిబరువు. (పఱి వలపలితట్టువేయుము.)

**పఱిక.** దే. వి. ఒకదినుసుజాయి.

**పఱిగ.** దే. వి. కోయునప్పుడు చేనియందురాలినయెన్ను. (చూ. పఱ్ఱిగర్ర.)

**పఱిగపిట్ట.** ద్వ. వి. పఱిగయేఱితినుపక్షివిశేషము.

**పఱిగబ్రతుకు.** ద్వ. వి. గింజలేఱుకొనితినిబ్రదికెడుబ్రదుకు, ఉంఛవృత్తి.

**పఱిగరి.** దే. విశ. (పఱిగ+అరి.) పఱిగయేఱువాఁడు. (చూ. పఱుగడ.)

**పఱిగవాఁడు.** దే. విశ. పఱిగరి.

**పఱిగొను.** దే. స. క్రి. (పఱి+కొను.) అపహరించు. "క. నెఱిదప్పంబడిపెల్లుగ, నోఱలెడినరవాజికరులయులివభిమన్యుం, డఱిముఱిఁబడుటకువగమదిఁ, బఱిగొననిలపెలుచనఱచుభంగిఁజెలంగెఁ." భార. ద్రో. ౩, ఆ. (చూ. కొఱు.) (వృత్తియందే పఱిశబ్దమునకు కొల్లయనియర్థము.)

**పఱిపఱి.** దే. విశ. ఖండితము. "ఉదగ్రయోఘులంబఱిపఱిచేసి." "ఇంద్రుఁడుంబఱిపఱిగాకపోఁగలఁడె." హరి. ఉ. ౫, ఆ.

**పఱియ.** దే. వి. బ్రద్ద. "వ. గదాప్రహతులందునియలుపఱియలుతుమ్రుళ్లునైసీసకంబులు కత్తళంబులుధరాతలంబునందొరంగె." శల్య. ౩, ఆ. "దిక్కులార్పులంబఱియలుసేయుచుఁ." రా. యు, కాం. (చూ. పఱియవాయు.) (ఒకానొకచోట లఘురేఫకముగాఁ గానఁబడుచున్నది. చూ. పరిమాఱుచు.)

**పఱియవాయు.** దే. అ. క్రి. (పఱియ+పాయు.) చీలు. (ప్రే. పఱియవాపు. "పఱియవాపంగఁదునియగావిఱువ." భార. విరా. ౧, ఆ.)

**పఱివోవు.** దే. అ. క్రి. (పఱి+పోవు.) 1. కొల్లపోవు; "ఎ, గీ. దొద్దకార్లచేఁబఱివోయెఁదూర్పుదిక్కు." ఉ, హరి. 3, ఆ.—(చూ. పఱిగొను.) 2. నశించు. "క. మఱికొంతసేపునకుఁదె, ప్పిఱిలేచిముకుందుమేనుపెద్దయునుంబ్రో, ద్దిఱియంగొఁగిటఁజేర్చెఁ, బఱివోయినతాల్మినూష్మబాష్పములురులఁ." భార. మా. ౧, ఆ.

**పఱుచు.** దే. ప్రే. 1. పడఁజేయు; "వ. పదంబులుఁబఱిచియుఁబార్శ్వంబులగలఁజెఱిచియు, గజంబులఁబఱిచియుగాత్రంబులనుఱిచియు." భాగ. ౬, స్కం.—2. దుష్పటిలోనగువానిపఱచు; 3. పాటుపడఁజేయు. (అనుప్రయుక్తమైనపడుధాతువునకును రూపమిట్లెఱుంగునది.)

**పఱుపు.** దే. ప్రే. 1. పడఁజేయు; 2. పాటుపడఁజేయు. వి. పడక.

**పఱ్ఱ.** దే. వి. 1. ఉప్పుపండెడుబయలు; 2. బయలు; 3. సున్నములోనగువానిఁ గొలిచెడుమానవిశేషము. (చూ. పఱ.)

**పఱ్ఱియ.** దే. వి. పఱియకు మొదటిరూపము.

**పఱ్ఱు.** దే. వి. చినుఁగుటయందగు ధ్వన్యనుకరణము. (పఱ్ఱునిచినిఁగెను, పఱ్ఱునచించెను.)

**పఱ్ఱె.** దే. వి. పఱ్ఱియయొక్కరూపాంతరము.

**పలంకష.** సం. వి. ఆ. స్త్రీ. 1. పల్లేరు ¶; 2. గుగ్గిలపుచెట్టు; 3. మోదుగు ¶; 4. రాస్న ¶; 5. ముండీరవృక్షము. అ. పుం. డు. నైరృతి.

**పలఁకు.** దే. అ. క్రి. పండు, ఫలించు. (అప్ర.)

**పలక.** వై. వి. 1. వ్రాయఁదగినసాధనము; 2. కేడెము; "పలకయువాలునుగొని." భార. భీష్మ. ౩, ఆ.—3. తలుపులోనగువానికుపయోగించుటకై కోయఁబడిన మ్రానిచెక్క; 4. బల్ల*; 5. జోదఘాడుబల్ల*; (చూ. జోగిణి.) ["వ. కంకునాలోకించి నెత్తంబొకపలకయాడుదమేయని." (ఇక్కడ పలకయనఁగా ఆటయనియర్థము.) భార. విరా. ౯, ఆ.]—6. సాలెవాఁడు నేఁతకరితట్టెడుసాధనవిశేషము*. (చూ. కుంచె.)

**పలకము.** వై. వి. చిన్నమంచేము*.

**పలకసరి.** వై. వి. పురుషకంఠాభరణవిశేషము.

**పలగండుఁడు.** సం. వి. అ. పుం. సున్నపుపూఁతపూయువాఁడు, లేపకుఁడు.

**పలచేము.** దే. వి. కప్పము. "సీ. చేదిమండలముగాసిగఁజేసికాళవ పతినియ్య కొలుపఁజేపలచమునకు." నిర్వ. ౧, ఆ.

**పలనాడు.** దే. వి. దేశవిశేషము. ప్రభా. ౧, ఆ.

**పలపల.** దే. వి. 1. తొరఁగుటయందగు ననుకరణము; "పలపల కన్నులందొరఁగుబాష్పకణంబులతో." ఉ, రా. ౫, ఆ.—2. వేగుటయందగు ననుకరణము; "పలపలవేగరేపకడఁబంకజదీర్ఘికఁదీర్థమాడి." కాశీ. ౫, ఆ.—విణ. 1. విరళము; "క. బలభిదుపలాద్రి మాళిక, బలపలగాఁబొదువుముదిరపటలముపగిదిన్, లలితోత్తమాంగతలమున, జలుఁగుందెల్లి క్రొత్తచలిదిచిక్కుముదనరన్." పాండు. ౨, ఆ.—2. కృశము. (చూ. పలపలన.)

**పలపలన.** దే. వి. 1. వైరళ్యము; 2. కార్శ్యము. (విశేషణమగుచో. "క. పలపలనిమూఁకలోఁగాల్, నిలువకగుజ్జంబుడిగ్గినీ కొడుకుగదా, కలితభుజాఁడగుచునొక్కఁడుఁ, దొలఁగిచనియె." భార. శల్య. ౧, ఆ. "క. పలపలననడుమురనగఁ." వా. ౨, ఆ.) (చూ. అలకన.) విణ. 1. విరళము; "తారకచక్రవాకముల్పలపలనయ్యె." భీ. ౨, ఆ.—2. కృశము.

**పలము.** సం. వి. అ. న. 1. నాలుగుకర్షములయెత్తు; (వెండి పలము=ఇందువు. బంగారుపలము=కురుబిస్తము.) 2. మాంసము.

**పలలము.** సం. వి. అ. న. 1. మాంసము; 2. బురద; 3. నూవుపిండి. పుం. డు. రాక్షసుఁడు.

**పలవ.** దే. వి. రెండుకొమ్మలమొదలు.

**పలవరము.** వై. వి. పలవరింత, ప్రలాపము.

**పలవరించు.** వై. అ. క్రి. ప్రలాపించు. "సీ. మురవైరినీడన మూడులోకంబులు బ్రదుకంగ మనకేలపలవరింప." ఉ, హరి. ౫, ఆ.

**పలవరింత.** వై. వి. పలవరించుట, ప్రలాపము.

**పలవించు.** వై. అ. క్రి. పలవరించుయొక్క రూపాంతరము. "సీ. ఒక్క, బాలుండునుమృతుఁడైనబంధులుప్రేతభూమికిఁగొనిపోయియమేయశోక, వివశాత్ములైపలవింపఁగా." భార. శాం. 3, ఆ.

**పలవు.** వై. అ. క్రి. పలవించుయొక్క రూపాంతరము. "మహీజలక్ష్మణుంబలవుచుఁజూచుచుండె." జై. ౬, ఆ.

**పలాండువు.** సం. వి. ఉ. పుం. నీరుల్లి. (రూ. పలండువు†).

**పలాములుచేయుట.** దే. స. క్రి. పాడుచేయుట, దోపిడిచేయుట.

**పలాయనము.** సం. వి. అ. న. పాఱిపోవుట.

**పలాయితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పాఱిపోయినవాఁడు.

**పలాలము.** సం. వి. అ. పుం, న. గింజలేనివరిపోఁచేలోనగునది, సొడు.

**పలాశము.** సం. వి. అ. న. ఆకు. పుం. 1. ఆకుపచ్చ; 2. గంట్లకచోరము†; 3. మోదుగు†. విణ. ఆకుపచ్చనిది.

**పలాశి.** సం. వి. న్. పుం. 1. చెట్టు; 2. కోరింద†; 3. ఱేవ్వ†; 4. రాక్షసుఁడు.

**పలాశుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు, పాలదిండి.

**పలాస్త్రి.** ఆం. వి. వ్రణములకంటించు మలాముపట్టి.

**పలిక్ని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ముదిసినయాఁడుది; 2. తొలిచూలియావు.

**పలితము.** సం. వి. అ. న. 1. నర; 2. నరవెండ్రుక; 3. బురద; 4. జాతిపూవు.

**పలు.** దే. వి. పల్లుయొక్క రూపాంతరము. "సీ. పలురాకమును వచ్చిబాలువేలుపుమన్నఁబండ్లులేకున్న నభాగ్యుఁడనియె." భాగ. ౯, స్క-౦.—విణ. అనేకము. (వృత్తియందు పల్లుపరమగుచో ఉత్వలోపమువికల్పముగానగును. "పల్తునియలు." భార. ద్రో. ౪, ఆ. దీనికీయర్థమునందు ఏకవచనమునవ్వ స్తముగా ప్రయోగము లేదు.)

**పలుఁగు.** వై. వి. స్ఫటికము. "పలుఁగుజాలకుడ్యములరుచుల్." భార. సభా. ౧, ఆ. "పలుంగునెల్లైమున్." ఉ, హరి. ౨, ఆ.

**పలుక.** వై. వి. వైవర్ణ్యము, తెల్లన*. "సీ. పలుకనెంతయుఁగ్రుయ్యఁబాఱెననుఁజెక్కులందందదడిపెడునశ్రువారి." హరి. ఉ. 3, ఆ. (ఇది నల్లవంటిది.)

**పలుకఁబాఱు.** దన్. అ. క్రి. వివర్ణమగు, తెల్లనగు. "మ. తొటంకరత్నప్రభల్, పలుకంబాఱెనచెక్కుటద్దములపైఁదైపైవిలంఘింపఁగాన్." కాశీ. ౫, ఆ. "పలుకఁబాఱెనిశాంతనిశాంతదీపముల్." పా. ౨, ఆ.

**పలుకన.** వై. వి. పలుకయొక్క రూపాంతరము. (విశేషణమగుచో. "పలుకనిమోము." విక్ర. ౨, ఆ. చూ. అలకన.)

**పలుకప్పు.** దే. వి. పెదవి, పలుతెర, రదనచ్ఛదము.

**పలుకరించు.** దే. అ. క్రి. మాటాడు. "మ. పొలయుబ్జూచు నగుబయల్ పలుకరించుం బల్కునూఁకొట్టు." చంద్రా. 3, ఆ.--అం, ప్రే. మాటాడించు. (చూ. పల్కరించు.) — స. క్రి. హెచ్చరించు.

**పలుకరింత.** దే. వి. 1. మాటాడుట; 2. హెచ్చరించుట.

**పలుకరింపు.** దే. వి. పలుకరింత. అని. 3, ఆ. (చూ. ఆరగింపు.)

**పలుకు.** దే. అ. క్రి. మాటాడు. (నీవేలనాతోపలుకవు.)—స. క్రి. 1. అను; "కమలబాంధవుఁడు కర్ణుఁబలికె." భార. ఆర. ౭, ఆ.—2. నిందించు. "తే. రూపవిహీనులుదారురూపు, గలిగితొలుమేనఁ గొనటులఁ బలికినారు." భార. ఆను. ౫, ఆ. — వి. 1. మాట; 2. నింద; "వచ్చిశుద్ధుఁడై పలుకులుమాన్పుభృత్యుఁ డనుపాడిదలంచెదవు." భార. ఉద్యో. ౨, ఆ.—3. పక్షిధ్వని; 4. వీణాదిస్వరము; 5. విద్య; 6. ఖండము; "సీ. పోఁకమేపరిపచ్చే వలుకులఁజెంగల్వదొరజాలఁదీరినదూలములను." య. ౧, ఆ.—7. విత్తులోపలిభాగము. (రూ. పల్కు.—ఖండమునకు.— "ద్వి. పలుకుపలుకననుగవ్రపుఁబల్కులొలుక." విష్ణు. పూ. 3, ఆ.)

**పలుకుఁజెలి.** దే. వి. (పలుకు+చెలి.) సరస్వతి. (రూ. పల్కుఁజెలి. "మ. సకలామోదకతోళవృత్తగతులన్ సంగీతసాహిత్యనామకవిద్యాయుగళంబుపల్కుఁజెలికిన్ బాలిండ్లపోల్కెసిరుల్, ప్రకటింపన్." వసు. ౧, ఆ.)

**పలుకుఁదత్తడి.** దే. వి. (పలుకు+తత్తడి.) చిలుక. "చొక్కఁటపుంబలుకుందత్తడినెక్కి." చంద్రా. 3, ఆ.

**పలుకుఁదోడు.** దే. విణ. (పలుకు+తోడు.) పలుకరించుతోడు, మాటతోడు.

**పలుకుబడి.** దే. వి. 1. ఉచ్చారణము; 2. వచోనిబంధనము, ఒడంబడిక. "అప్పనంబుఁబలుకుబడితప్పికొనియెనుపలియు." భార. అను. ౨, ఆ. (రూ. పల్కుబడి. — ఉచ్చారణమునకు. — "సొగసులుగుల్కుపల్కుబడి." శశాం. 3, ఆ.)

**పలుకుఱాయి.** దే. వి. ప్రతిధ్వనియిచ్చెడు శిలావిశేషము.

**పలుకెంపు.** దే. వి. దంతక్షతము.

**పలుగఱ.** ద్వి. వి. (పలు+కఱ.) పండ్లపాడి. "సీ. పలుగఱసేయక పసుపునలిపించుకొనక మొగంబుమజ్జనములేక." ప్ర.భా. ౫, ఆ.

**పలుగాఁడి.** దే. వి. 1. పసులదొడ్డిలోనగువానికిపెట్టెడుతలుపు; "ప్రాఁకిలోపలఁజొచ్చిపలుగాఁడిఁదెఱచిన." ఉ, హరి. 3, ఆ.— 2. బండిపరము. "పలుగాఁడిలోనైనయంగములనొకటినెడలించి మీఁదటనెసఁగెడిపఱపెల్లఁబడఁద్రోచియడఁతుచో." హరి. పూ. ౫, ఆ. — విశే. పెక్కుగాఁడులుగలది. "పలుగాఁడితలుపులు." ఉ, హరి. ౨, ఆ. "పలుగాఁడితూపులు." లక్ష్మీ. ౨, ఆ.

**పలుగాకి.** దే. విశే. దుష్టుఁడు. "చ. అలరులురాల్చుచుందలిరుటాకులుద్రుంచుచుఁబక్వమైనసత్ఫలములుకోయుచున్ వివిధపాదపశాఖలు పట్టియూఁచిప, ఝులఁబెదరంగఁదోలుచు విశుద్ధసరోవరవారిపూరముల్, గలఁచుచుగాసిసేయుపలుగాకులమాన్పవునీదుభృత్యులన్." హరిశ్చ. ౨, ఆ.

**పలుగు.** దే. వి. గుంటకగుజ్జెలకును, పాపటపుగుజ్జెలకును తగిలించెడు దళమైనయినుపతగడు. విశే. దుర్జనుఁడు.

**పలుగుంద్రు.** దే. స. బ. పలుగురుయొక్కరూపాంతరము.

**పలుగుగుంటక.** దే. వి. పలుగు అమర్చినగుంటక. (చూ. గుంటక.)

**పలుగుడుఁబాము.** దే. వి. (పలుగుడు+పాము.) సర్పవిశేషము.

**పలుగుపిట్ట.** ద్వి. వి. గుడ్లగూబ, ఘూకము.

**పలుగురు.** దే. స. బ. అనేకులు (పలుశబ్దమునకు మహన్మహత్యర్థకబహువచనాంతాదేశము.)

**పలుగొమ్ములమెకము.** ద్వి. వి. (పలు + కొమ్ములమెకము.) ఏనుఁగు.

**పలుగొఱ్ఱు.** దే. వి. పైరులోనిగాదము పెల్లగించుటకై పండ్లవలె మేకులమర్చినపలక.

**పలుచే.** దే. విశే. 1. దళసరికానిది; "సీ. ఇలధూళియెగసినఁబలుచగాకుండంగరాసినలోడవుల్ధరజముదొరఁగు." భార. భీష్మ. ౧, ఆ. — 2. వెలితియైనది; (పైరుపలుచగానున్నది.) — 3. చిక్కనకానిది; (జావపలుచగాఁజేము.) — 4. చులుక. "ద్వి. పలికినపంతంబుపలుచగాకుండ." భల్లా. ౧, భా.

**పలుచన.** దే. వి. 1. సన్నఁదనము; 2. వెలితితనము; 3. అనుకుఁదనము; 4. చులుకఁదనము. "తే. ఆకులాహార్యనందనయలసవవన, జాలములఁదూలగతిఁజాలఁదూలఁదొడఁగె, గరిమఁదానెంతయచలేంద్రకన్యయైనఁ, బలుచనగుఁగాదెఘనవపుప్రార్థనమున." వసు. 3, ఆ. (విశేషణముగుచో) "పలుచనివాతెఱ." స్వా. ౪, ఆ. "పలుచనితావులు." ఉ, హరి. ౫, ఆ. "పలుచనియంబఁకుల్." ఆము. ౧, ఆ.

**పలుచేపడు.** ద్వి. అ. క్రి. పలుచేనగు. (మజ్జిగపలుచపడినది.)

**పలుదెర.** ద్వి. వి. (పలు+తెర.) (చూ.) పలుకప్పు. "క. పలుకులునేర్పఁగఁగీరము, పలుదెరపండనుచునాడిసిపట్టఁగనెగయన్, వలకేలఁదోలనకులున్, జలజఁబేనిమొరయనవ్వెసఖినివ్వెఱఁగై." శృం. ౧, ఆ.

**పలుపట్టడ.** దే. వి. సంకరజాతిజనము.

**పలుపు.** దే. వి. 1. పసులమెడఁగట్టెడుతలుగు, ఆబంధము; 2. గుఱ్ఱముమెడఁగట్టెడుత్రాడు. "క. పలుపులఁగాఁడులఁబగ్గంబులఁదనయస్త్రంబులడరిపొడిసేసినవి, చ్ఛలవిడిఁబాఱెడురథ్యంబులసేయఁడు దివిజరాజపుత్రుఁడుకృపతోన్." భార. విరా. ౫, ఆ.

**పలుమరు.** దే. ద్ర. క్రి. విశే. పలుమఱుయొక్కరూపాంతరము. "క. పలుమరులశోభగుచందముఁ, బలుమరునగునంగపటిమఁ బాటిల్లుదురా, నలుగురురాసుతులుగ్రా, నలుగురులతులప్రతాపనైపుణికతనన్." రామా. 3, ఆ. (చూ. పల్మరు.)

**పలుమఱు.** దే. ద్ర. క్రి. విశే. (పలు+మాఱు.) మాటిమాటికి. "క. విఱుగుటనొచ్చుటమనదెనఁ, దఱచుగఁజెప్పెదవుపాండుతనయులబలమే, తైఱతఱఁగకపెనఁగుటపలు, మఱునాడెదవకటయేమిమాయయొతలఁపన్." భార. భీష్మ. 3, ఆ.

**పలుమాఱు.** దే. ద్ర. క్రి. విశే.——పై.——"మ. గదతోడన్గదచుట్టిరాఁదిగుచుచున్ గండొప్పలంఘించిమా, ఱుదెసన్గైకొనుచున్గడంగిపలుమాఱున్ దాఁకుచున్." భార. శల్య. ౨, ఆ.

**పలుము.** వై. అ. క్రి. ప్రలాపించే. వి. ప్రలాపము.

**పలుమేరు.** దే. వి. వృక్షవిశేషము. స్వా. ౪, ఆ.

**పలువ.** ద్వి. విశే. (పలు + వా.) దుర్జనుఁడు.

**పలువలువ.** దే. వి. పెదవి, దళనవాసస్సు. (చూ. పల్వల్వ.)

**పలువిత్తు.** దే. విశే. పలువురకుఁబుట్టినవాఁడు. "పలువిత్తుబాఁపనయ్య." భల్లా. 3, ఆ.

**పలువుంద్రు.** దే. స. బ. పలుగుంద్రుయొక్కరూపాంతరము.

**పలువురు.** దే. స. బ. పలుగురుయొక్కరూపాంతరము. (రూ. పల్వురు.)

**పలుసము.** వై. విశే. పరుసముయొక్కరూపాంతరము. "క. మొలనీలికాసెయునుబద, ములసోరచ్చులుధరించిముదముదలిర్పన్, సెలగోలయుములుబంతియుఁ, బలుసపుఁగత్తియునుబూనిపటుసాహసియై." హరిశ్చ. ౫, ఆ.

**పల్కన.** వై. వి. పలుకనయొక్కరూపాంతరము. (ఆమ్రేడితమునందు పలుపల్కన. "సీ. పలుపల్కనైమ్రానుపడిపండ్లుచూపెడుపుడుకుఁజెట్లనువేడఁబోవనేల." యా. ౧, ఆ.)

**పల్కరించే.** దే. అ. క్రి. మాటాడు. "కలయఁగఁబల్కరించిరి." భార. ఆది. ౪, ఆ. — అం. ప్రే. మాటాడించే. (చూ. ఎకసెక్కెము.) "ఉ. ఏకాంతమునందునున్నజవరాంద్రనెపంబిడిపల్కరించులా, గింతియకాక." (నెపంబిడిజవరాంద్రనుపల్కరించులాగనియన్వయము.) స్వా. ౪, ఆ. — స. క్రి. హెచ్చరించే.

**పల్కరింత.** దే. వి. పలుకరింతయొక్కరూపాంతరము.

**పల్గాకి.** దే. విశే. పలుగాకియొక్కరూపాంతరము. "తే. అతసుదర్పాంధకారమంతంతఁగమియఁ, గన్నుగానక సాధ్విరాఘవునిదేవి, జనకకన్యజగన్మాన్యఁజెనకవచ్చి, కన్నుగానకచనియెఁబల్గాకికాకి." రామా. ౫, ఆ.

**పల్నాడు.** దే. వి. పలనాడుయొక్కరూపాంతరము.

**పల్పల.** దే. వి. పలపలయొక్కరూపాంతరము.

**పల్వలన.** దే. వి. విశే. పలపలనయొక్కరూపాంతరము. (విరళము నకు.—"శీ. నాతికల్లనభూషణములు పల్వలనగాఁ బరసతిభూషణ పస్కలెడలె." భాగ. ౧౦, స్క౦. పూ.)

**పల్మరు.** దే. ద్ర. క్రి. విశే. పలుమరుయొక్కరూపాంతరము. "చ. పిరిగొనితాల్పునెట్టెముగఁ బ్రేవులుచుట్టికపాలపాత్రలో, విరియఁగలంచుఁ గ్రొమ్మెదడువెండ్రుకలేజితోలంగవైచుఁబ, ల్మరుఁబుకిలించునెత్తురు." ఉ, హరి. ౨, ఆ.

**పల్మఱు.** దే. ద్ర. క్రి. విశే. పలుమఱుయొక్కరూపాంతరము. "పల్మఱుఁబొరుగిండ్లకేఁగు." జై. 3, ఆ.

**పల్మాఱు.** దే. ద్ర. క్రి. విశే. పలుమాఱుయొక్కరూపాంతరము. (చూ. పలుమాఱు.)

**పల్యంకము.** సం. వి. అ. పుం. 1. మంచేను; 2. మంచె, 3. యతులులోనగువారియాసనము; 4. యోగపట్టె.

**పల్యంకిక.** సం. వి. ఆ. స్త్రీ. పల్లకి. "శృంగారపల్యంకికావహనంబో." ఆము. ౨, ఆ.

**పల్యయనము.** సం. వి. అ. న. గుఱ్ఱపుపల్లము.

**పల్యాణము.** సం. వి. అ. న.——సై.——(ఇది కొన్నిచోట్ల ఏనుఁగుమీఁది అంబారికిపర్యాయముగా ప్రయోగింపఁబడియున్నది.) (చూ. పల్లన.)

**పల్ల.** వై. విశే. 1. పాటలవర్ణముకలది; 2. కపిలవర్ణముకలది*; "సీ. కుశికన్నుతౌరకాగోళంబుపల్లయైయొందులోచనముతోనారయుఁగాక." కాశీ. ౪, ఆ.—3. అరుణవర్ణముకలది*. "సీ. పల్లచీమలవక్రభల్లాతకియుఁబోలె నెత్తుత్రుప్పటనొప్పుకత్తివాని." ఆము. ౬, ఆ.

**పల్లకట్టు.** ద్వ. విశే. పల్లవన్నెచూపట్టునది.

**పల్లకి.** వై. వి. మనుష్యులు మోసికొనిపోయెడు వాహనము. "ఉ. పల్లకులన్ మహోష్ట్రముల భద్రగజంబుల నందలంబులన్, గొల్లన బంధువుల్ నడవ." జై. ౨, ఆ.

**పల్లకీ.** వై. వి. పల్లకియొక్కరూపాంతరము. "చ. పల్లకీలుసం, దలములు వారువంబులునుదంతులునాదిగఁగల్గువాహనం, బులు డిగివచ్చి." కళా. ౨, ఆ.

**పల్లగింజో.** వై. స. క్రి. (చూ.) పల్లించే.

**పల్లట** దే. వి. 1. చలనము; 2. వ్యత్యాసము. (రూ. పల్లటము.)

**పల్లటి.** దే. వి. తెక్కిణిసాధనవిశేషము. (చూ. కత్రి.)

**పల్లటిల్లు.** యు. దే. అ. క్రి. 1. చలించే; "పల్లటిల్లినధృతితో." భార. విరా. ౨, ఆ.—2. వ్యత్యస్తమగు.—వై. 1. తెల్లఁబోవు*; "ఎ, గీ. ఆననముపల్లటిల్లంగనజుఁడుగలఁగె." భార. శాం. ౬, ఆ. — 2. ఎఱ్ఱవాఱు*. "వ. ఆననంబుపల్లటిల్లధర్మతనయుంగనుంగొనిన." (ఇక్కడ కోపనమయము.) భార. విరా. ౨, ఆ. — (రూ. పల్లటిలు.—చలించేటకు. — "క. ధృతి, ఖండితముగఁ బల్లటిలిరిగంధరుద్వలనిన్." భార. ఆర. ౫, ఆ. — వ్యత్యస్తమగుటకు.—"వారలసుస్థితుల్ పల్లటిల కయుండ." భార. అను. ౧, ఆ.)

**పల్లటీ.** దే. వి. 1. ఎగవు; 2. పారావతవిశేషము. "క. మేలైనల కోరిలా, డ్డీలుం బదతీలు పల్లటీల్ పక్కవలున్, జీలున్ బక దార్లునుగూ, కీలుననెడుపేరులందగినపారువముల్." సా. ౧, ఆ.

**పల్లటీల్గొను.** దే. అ. క్రి. (పల్లటీలు+కొను.) ఎగురు. "ఎ, గీ. పల్లటీల్గొనికవగూడిపావురంబు, లూరజంబులుపల్కురాయంచపనుల, పసిఁడిచిటికొమ్మవరుసక్రొంబసిమితేట, మిసిమిగుల్కెడుముత్యాలమేడలోన." భాను. ౪, ఆ. "ఉ. అవీర్వరవరుల్ మిథోవితతవీరరసోగ్రకటాక్షభావగం, భీరతఁబల్లటీల్గొనుచు." కళా. ౮, ఆ.

**పల్లటీల్దాఁటు.** దే. అ. క్రి. (పల్లటీలు+దాఁటు.) పల్లటీల్గొను. "సీ. లెగనిండఁదిగిచినల్దెసలకుబొల్టెకోలలుచూపి పల్లటీల్దాఁటువారు." కళా. ౮, ఆ.

**పల్లటీల్వైచే.** దే. అ. క్రి. (పల్లటీలు+వైచే.)——పై.—— "ద్వి. తెల్లపావురమిదితెలివిగల్గినది, పల్లటీల్ వైచు." సా. ౨, భా.

**పల్లన.** వై. వి. (చూ.) 1. గుఱ్ఱపుపల్లము; "తే. హయముఁబల్లనకట్టితెండతిరయమున." పర. 3, ఆ.—2. అంబారి. "కుముదస్తంబేరమంబగ్రతోభూమింబల్లనగట్టిరా." పా. ౪, ఆ. (రూ. పల్లవము — అంబారికి. — "ఏనికపల్లనంబిడినసేడికకున్ వశిమేమహీశ్వరా." విక్ర. ౫, ఆ.)

**పల్లపుఁబంట.** ద్వ. వి. (పల్లము+పంట.) సీరాసరాసుపండెడుపంట.

**పల్లము.** ఉభ. వై. వి. 1. పల్లపునేల*; 2. గుఱ్ఱములోనగువానినెక్కునపుడుక్రిందమెత్తగానుండుటకై కుట్టి మీఁదవేసికట్టెడుగంత. "పారసిపల్లంబు." సా. ౪, ఆ. "క. తరుణీవెఱవకుపల్లపు, మరగొమ్మేమఱకునాకుమర్యాదావి, స్మరణంబైనదిమాటల, పరాకుచేననుచుఁ దనదు పారీంద్రంబున్." కళా. 3, ఆ. "ఎ, గీ. తారశిఖరిఁగీలించినమేరుశకల, మనఁగధవళాంగకల్పితమైనపసిఁడి, పల్లమునుగత్నకింకిణీపరికరంబు, నమరవృషభేంద్రుఁడాయితంబైతనర్చె." హరి. ఉ. ౭, ఆ. — విశే. పల్లు. (నేల.) — సం. వి. అ. పుం. ధాన్యముపోసెడుపెద్దగరిసె.

**పల్లఱపులు.** ద్వ. వి. బ. (పలు+అఱపులు.) 1. వ్యర్థములైనపెక్కుమాటలు; 2. (పలువ+అఱపులు.) ఆడరానిపెక్కుమాటలు. "క. అనియీగతిఁబల్లఱపులు, గొనకొనియఱవంగవిప్రకులజునితోన, మ్మనుజేంద్రుఁడధికధైర్యం, బుననిట్లనిపల్కెశంకపొందక తెలివిన్." హరిశ్చ. ౪, ఆ.

**పల్లవము.** సం. వి. అ. పుం, న. 1. చిగురు; 2. చిగిరించినకొమ్మ; 3. కోకచెఱఁగు; 4. లత్తుకరంగు; 5. శృంగారము; 6. విరివి. పుం. వెనుకటిచరణములయందలియర్థముననుసరించిసంగీతముమొదటచెప్పెడువాక్యము.

**పల్లవించు.** సం. అ. క్రి. చిగిరించే, చిగురుచు.

**పల్లవితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చిగిరించినది; 2. లత్తుకచేనెఱ్ఱనైనది; 3. విరివియైనది.

**పల్లవుఁడు.** సం. వి. అ. పుం. విటుఁడు, షిద్గుఁడు.

**పల్లా.** హిం. వి. నూఁటయిఱువదిపక్కాసేరులమానము; పందుము.

**పల్లాయనంబువాఁడు.** ద్వ. విశే. ఆప్తుఁడు. "వ. అటమున్న వారిలోపలంగలసిపలుదెఱంగులపనులుసేయుచున్న తనపల్లాయనంబువారిలో మఱువడియున్నకౌరవేశ్వరుండమ్మాటలువిని." భార. ఉద్యో. ౧, ఆ. (రూ. పల్లాయనమువాఁడు మొ.)

**పల్లాయనము.** వై. వి. ఆప్తత*. (చూ. పల్లాయనంబువాఁడు.)

**పల్లి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పల్లె; 2. గుడిసె; 3. బల్లి.

**పల్లించు.** వై. స. క్రి. పల్లముకట్టు. "వ. అత్తఱిందత్తఱంబునందత్తడులంబల్లింపకయనెప్పరంబుననెక్కింబోవువారును." పా. ౪, ఆ.

**పల్లిక.** వై. వి. వెదురుబ్రద్దలులోనగువానితోనల్లినతట్ట.

పల్లియ. వై. వి. పల్లె. (గొల్లపల్లియ, బోయపల్లియ మొ.)

పల్లు. యు. దే. వి. దంతము. వై. విణ. పల్లము.

పల్లుడు. వై. విణ. పల్లము.

పల్లె. యు. దే. వి. 1. జాతివిశేషము; (పల్లెవాఁడు, పల్లెది.) 2. బడి. వై. చిన్నఊరు. (పల్లియయొక్క రూపాంతరము.)

పల్లెకూటము. దే. వి. బాలురుచేదువుబడి, పాఠశాల.

పల్లెత. దే. వి. పల్లెజాతిది, పల్లెది.

పల్లెమాట. దే. వి. గ్రామ్యవచనము.

పల్లెరు. దే. వి. పల్లేరుయొక్క రూపాంతరము.

పల్లేరు. దే. వి. పలంకషకాయ.

పల్లేరుఁగాయ. దే. వి. (పల్లేరు+కాయ.) భూషావిశేషము.

పల్లేరుఁబూవు. దవ్య. వి. (పల్లేరు+పూవు.) స్త్రీభూషావిశేషము.

పల్లొత్తు. దే. వి. (పల్లు+ఒత్తు.) దంతక్షతము. "సీ. కడలేని పీడ్యంబుకప్పుచందురకావి మోవిపల్లొత్తులమునుఁగుఁదన్న." పాం రు. 3, ఆ.

పల్వరించు. వై. అ. క్రి. పలవరించుయొక్క రూపాంతరము. "సీ. చుక్కలన్నియుఁజేరిపురముస్తుకొనిపోయెనంచునూరకపల్వరించెనా కత్తె." రుక్మి. 3, ఆ.

పల్వలము. సం. వి. అ. న. నీళ్లుగలచిన్నపల్లము, పడియ.

పల్వల్వ. దే. వి. పలువలువయొక్క రూపాంతరము. "చిత్రరే ఖోరపల్వల్వకోఁడ." అచ్చ. బాల, కాం.

పవడము. వై. వి. పగడముయొక్క రూపాంతరము.

పవడించు. దే. అ. క్రి. పవళించు. లక్ష్మీ. ౪, ఆ. (పవ్వడించు యొక్క రూపాంతరము.)

పవతుఁడు. దవ్య. వి. పగతుఁడుయొక్క రూపాంతరము. "క. యువతికిఁబ్రాణంబయ్యుం, బవతుగతింబ్రోదిచేసె మలయక్షితిభృ, త్పవమానుఁడు దూరితరై, పవమానుఁడుమోహాదావపావక శిఖలన్." పంచ. వేం. ౪, ఆ.

పవనతనయుఁడు. సం. వి. అ. పుం. 1. భీముఁడు; 2. హను మంతుఁడు; 3. అగ్ని.

పవనము. సం. వి. అ. న. (చూ.) ఆవము. పుం. 1. గాలి; 2. తూర్పెత్తుట.

పవనాశనము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

పవమానుఁడు. సం. వి. అ. పుం. వాయువు, గాలి.

పవము. సం. వి. అ. పుం. తూర్పెత్తుట, పవనము.

పవలు. దే. వి. పగలుయొక్క రూపాంతరము. కళా. ౬, ఆ.

పవళించు. దే. అ. క్రి. శయనించు. (పవ్వళించుయొక్క రూపాం తరము.)

పవళింత. దే. వి. పవళించుట, శయనము. "సీ. పాంపపూఁబాన్పు పైఁబవళింతగన్నవాఁడడియనిప్రోల్లోగంబైనవాఁడు." పాంచా. ౧, ఆ.

పవాడము. వై. వి. ఒకకార్యమునెఱవేఱవలెనని దేవునిప్రార్థించు కొని యాప్రార్థన నెఱవేఱినయెడ దేవునియెదుటచేయు జిహ్వాచ్ఛేద నాదిసాహసకృత్యము*. (పావాడముయొక్క రూపాంతరము.)

పవి. సం. వి. ఇ. పుం. వజ్రాయుధము, కులిశము.

పవిత్రకము. సం. వి. అ. న. జనపనారతోనల్లిన వలత్రాడు. పుం. 1. మేడిచెట్టు; 2. రావిచెట్టు.

పవిత్రము. సం. వి. అ. న. 1. జందెము; 2. దర్భచెట్టు; 3. జలము; 4. గోమయము; 5. తామ్రము. విణ. పరిశుద్ధము.

పవిది. వై. వి. పగిదియొక్క రూపాంతరము. (విధమునకు. — "ద్వి. భవుఁజూడనానందబాష్పంబులొలుకు, పవిది." బస. ౧, ఆ.)

పవ్వడించు. దే. అ. క్రి. పవ్వళించు, శయనించు.

పవ్వళించు. దే. అ. క్రి. పవ్వడించుయొక్క రూపాంతరము.

పశుపతి. సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి.

పశుమక్షిక. సం. వి. ఆ. స్త్రీ. జోరీఁగ.

పశువు. సం. వి. ఉ. పుం. 1. నాలుగుకాళ్లజంతువు; 2. గొఱ్ఱె.

పశ్చాత్తాపము. సం. వి. అ. పుం. అనుతాపము, వగపు.

పశ్చిమము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పడమటిది; 2. వెనుకటిది.

పశ్యతోహరుఁడు. సం. వి. అ. పుం. 1. కమసాలెవాఁడు; 2. (చూ.) పచ్చెకాఁడు.

పశ్యత్పాలుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

పస. దే. వి. 1. సారము; 2. సమృద్ధి; "చ. ఎవ్వరుసాటివిచిత్ర శౌర్యసం, పదపస నారసింహవిభుపట్టికినారసృపాలవాళికిన్." కళా. ౧, ఆ. — 3. చాతుర్యము. "సీ. తననీతిపసయుగంధరభట్టి చాణక్యఘనచాతురికినిదర్శనముగాఁగ." ———పై.———

పసఁగు. దే. అ. క్రి. విశదమగు. "క. తలపోయఁదల్లికడుపున, నాలసినవరుకొంతకాలమునికియులోకం, బులకెల్లదృష్టమత్తటేఁ, గలుగునిరోధంబుకాంతఁగనుఁగొనఁబసఁగున్." లక్ష్మీ. ౪, ఆ.

పసందు. హిం. వి. సొగసుదనము, అందము. (పసందుచేయు, మెచ్చుకొను.)

పసగరగొను. దే. స. క్రి. (పసగర+కొను.) పీడించు. "క. పసులపసొడ్డినవలయై, మసఁగినయవ్వానపశుసమాజమునెల్లన్, బసగరగొనియంతటఁబో, కసమస్తప్రాణిబాధకంబైపర్వెన్." హరి. పూ. 2, ఆ.

పసదనము. వై. వి. తానుకోరినపనినెఱవేఱినప్పుడు నెఱవేర్పుకొన్న వాఁడు సంతోషించి నెఱవేర్చినవానికి సంతోషముగా నిచ్చెడువస్త్రా భరణాదిద్రవ్యము, పారితోషికము. "సీ. వలనుశోభిల్లనెవ్వాఁడైన నీఁడెయర్జునుఁడెనినాకిపుసూపెనేని, పసదనంబేనిచ్చుభంగియందఱు నును వివరించిచెప్పెదవినుఁడుమీరు." భార. కర్ణ. ౨, ఆ.

పసను. దే. వి. ఎఱుపుమించినపసుపువన్నె. (చూ. కుసుమము.) విణ. 1. ఎఱుపుమించినపసుపువన్నెగలది; 2. బాగు. "ద్వి. పసుపునిమ్ములగిరివ్రజమనుపేరఁ, బసనుగానిర్మించెబట్టణంబొకటి." రా. బాల, కాం. "ద్వి. వాఁడీల్లకమున్నె, మనలకతెప్పించిమందుఁ బోయించి, పసనుగానొనరింపుప్రాణదానంబు." హరిశ్చ. ౨, ఆ. (విశేషణముగుచో కడపటి యుత్వమునకు ఇత్వమువచ్చెడి.— ఎఱుపుమించినపసుపువన్నెకలదియనుటకు. "పసనిపుష్పాడి." కళా. 3, ఆ.—బాగైనదనుటకు.—"పసనిలేనవ్వు." భాగ. 3, స్కం.)

పసపస. దే. వి. వానయొక్క ముసరు.

పసాము. వై. వి. గోమహిష్యజాతి*.

పసరించు. వై. అ. క్రి. వ్యాపించు. "క. అసమవిరక్తులమంచుం, బసరింపుదురేలొకోకథలఁగొందఱుబా, రసమాత్మఁడొకఁడు దక్కఁగఁ, గుసుమాస్త్రునకివ్వరేదురగుదురూహింపఁగన్." శివ. ఓ. ౨, ఆ.

**పసరు.** యు. దే. వి. 1. ఆకురసము; ‘‘తే. తరుణశైవాలజలజపత్రములువాోదిని, మరకతచ్ఛాయఁబోల్పఁదత్పరిఘుజలము, కోటబంగారుగాఁజేయుకొాఆకుమున్న, బ్రహ్మపిడిచినమందాకుపసరనంగ.’’ ఆము. ౨, ఆ.—2. ఆకుపచ్చన. ‘‘మ. పసరొందెన్ దలిరాకులన్ మరకతప్రత్యగ్రజాగ్రద్ద్యుతిన్.’’ ఉ, రా. ౬, ఆ.—విశ. ఆకుపచ్చనిది. —వై. వి. వ్యాపనము. ‘‘ఒకింతబుద్ధిలోఁబసరిడిచూడుమా.’’ (ఇక్కడ పసరిడి అనఁగా ఆలోచించియనుట.) హరి. ఉ. ౮, ఆ.

**పసరుగాయ.** దే. వి. (పసరు+కాయ.) ముదిరినపిందె. (చూ. కమియు.)

**పసరుమొగ్గ.** ద్వ. వి. లేఁతమొగ్గ, క్షారకము.

**పసలము.** వై వి. పసరముయొక్కరూపాంతరము.

**పసాదము.** వై. వి. వంటకము, అన్నము. ‘‘క. నాకుఁబ్రియమయ్యెడుమీ, బంతిఁబసాదముఁగొనఁగా.’’ భో. 3, ఆ.

**పసాపడు.** వై. స. క్రి. (పసాదము+సాపడు.) భుజించు. ‘‘క. తడయకతేఁడదిగొనితన, పడఁతుకలకుఁబంచియిడినఁ బాళొప్పఁబసా, పడియమ్మెయుంగుఁబోఁడులు, కడుపులతోనుండిరెలమిగడలుకొనంగన్.’’ అచ్చ. బాల, కాం.

**పసారము.** వై. వి. అంగడి*. ‘‘క. అప్పురవీధినిజనుచోఁ, గప్పురముజవాదియగరుఁగస్తురియునుబెన్, గుప్పలుగనించియమ్మెడు, గొప్పపసారములుగాంచెగురుఁడొకచోటన్.’’ రాజ. ౨, ఆ.

**పసారు.** వై. వి. పసారముయొక్కరూపాంతరము. ‘‘ఎ. గీ. తేరులాకొమ్ముటేనుఁగుబారులాప, సారులాచొక్కటపురాచదారులాకొ, టారులాతీరులాగొనబారునౌర, ప్రోలియొయ్యారమేరికిఁ బొగడనరిది.’’ అచ్చ. బాల, కాం.

**పసి.** యు. దే. వి. పశ్వాదులమీఁదిగాలి. ‘‘వ. కొనసాఁగిసోగలైమంగినమోరలంబోనిమోరలుసారెసారెకునెత్తిబయలుపసివట్టుచున్’’ (దీనికివెనుకటిపద్యములు. ‘‘క. జాగిలములుమొలసడములు, సాగెఁగలసిచాపముక్తశరగతినందా, జాగిలములెదిరేఁబందుల, కైగోధాదికముగాలికడరెని తరముల్.’’ ‘‘తే. మున్నుజాగిలములఁగూడిచన్నయట్టి, యుడుపకుక్కలుకుందేళ్లనుందురువుల, నుసుముల గ్రహింపఁబుట్టలకడలఁబొదల, గిరులనరియలఁబసివట్టితిరుగుచోట.’’) సాన్వ. ౪, ఆ. (ఆదిపదముచేతపుష్పముమీఁదిగాలియుశర్థము. ‘‘చ. కుసుమపుగుత్తిచూచి యొకకోమలిడగ్గఱి కోయఁబోయినన్, బసిబడినందునున్న మధుపంబులువచ్చిముఖంబుతావికిన్, మునరఁగఁజోపిచోపిపెను మ్రోఁతలతోనవిదట్టమైనవె, క్కనవడిపాఱుతెంచెఁజెలికత్తియలిద్దఱుసూచినవ్వఁగన్.’’ భో. 3, ఆ.)—విశ. లేఁత. (పసిబిడ్డ మొ.)—వై. వి. 1. గోగణము; ‘‘క. వాణీవిభవమునసతి, శ్రీణనమొనరించియిట్లుప్రిదులఁదలఁచెదా, బాణుపసినొసఁగకూరక, ప్రాణత్రాణంబునీకుఁబడయఁగవశమే.’’ హరి. ఉ. ౮, ఆ.—2. బ. గోవులు. ‘‘వరుణుపాలనున్నవిబాణునిపసులు.’’ హరి. ఉ. ౮, ఆ.

**పసిఁడి.** దే. వి. 1. బంగారు; ‘‘క. మండూకమకరకచ్ఛప, గండూపదములకుశీరకలహంసకకా, రండవబకములవెండిఁబ, సిండినిగావించిగంగఁజిదుముదురువ్రతుల్.’’ కాశీ. ౫, ఆ.—2. ధనము. ‘‘ఎ. గీ. ఛతురవచనవిలాసాంగసౌష్ఠవములఁ, బసిఁడిదానిచ్చినట్టియప్పుడఁతిమఱవఁ, బతికిఁగైదువులందిచ్చురతివిధమున, విటునకిత్తురుఘటీఖారువిరుల్లుపుర్ణిని.’’ ఆము. ౨, ఆ.

**పసిఁడికంటి.** దే. వి. పైఁడికంటియొక్కరూపాంతరము.

**పసిఁడికాయ.** దే. వి. పొత్తినూలికాయ. ‘‘ఆ. కైటభారిభజనగలిగియుండనివాఁడు, గాలిలోనన్నుండికదలుశవము, కమలనాభుపదముఁగననివానిబ్రదుకు, పసిఁడికాయలోనిప్రాణిబ్రతుకు.’’ భాగ. ౨, స్కం.

**పసిఁడిపురుగు.** ద్వ. వి. పొత్తినూలికాయపురుగు. ‘‘వ. పొత్తిచీరగొనిపసిఁడిపురుగగు.’’ మార్క. ౨, ఆ.

**పసిఁడితేఁడు.** దే. వి. పైఁడితేఁడుయొక్కరూపాంతరము.

**పసిక.** దే. వి. పస. ‘‘సీ. వెగ్గలంబైపేర్పు వీరంబునకుఁగల పసికయెల్లనుమేను వడసెననఁగ.’’ లక్ష్మీ. ౨, ఆ. (స్వార్థమున ఇక. అరమరికవంటిది.)

**పసిగాపు.** ద్వ. వి. (పసి+కాపు.) గోపకుఁడు. ‘‘ఆపసిగాపుపూపవయసాకె.’’ పాండు. ౨, ఆ.

**పసిగొను.** దే. అ. క్రి. (పసి+కొను.) గాలిపట్టు. (చూ. అఱచే.)

**పసితిండి.** ద్వ. వి. పులి, వ్యాఘ్రము. ‘‘సీ. పసితిండిమెకపులేబాలెంత లాఁకొన్నజింకకూనలకుఁ బాల్సేఁపియొసఁగు.’’ అచ్చ. బాల, కాం.

**పసిపాప.** దే. వి. లేఁతబిడ్డ. విశ. మిక్కిలి లేఁతయైనది. ‘‘క. పసిపాపయొండకొనలును, మసమసకనియిరులుఁగలసిమసమలరించెన్, దెసలునలుగడలగుంజా, విసరంబులసరులువ్రేలవిడిచినభంగిన్.’’ నై. ౮, ఆ.

**పసిమి.** దే. వి. 1. ఆకుపచ్చన; ‘‘సీ. పసిమివానెండినకసవుకట్టయుఁబోలె నరవెండ్రుకలుపరువ్వశిరమువలన.’’ కళా. 3, ఆ.—2. ఎఱుపుమించినపసుపువన్నె; ‘‘సీ. బంగారుపసిమించుపసనిపుప్పొడిరేఖఁ జూపట్టుపాపటసోగనుతోడ.’’ కళా. 3, ఆ.—3. గోరోజనపువన్నె. ‘‘సీ. బాలారుణప్రభ పసిమినూడ్చినభంగి నిండుకొంజడతలద్రిండుకట్టి.’’ హరి. ఉ. ౭, ఆ. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణమునకువికల్పంబుగ లోపంబగు. (పసిమిడి మొ.) ‘‘మ. సరిగంచుంబసిపట్టు సుగ్గడితపున్నయ్యాటపున్ గప్పులన్, దరుణుల్గాంచిరిసౌఖ్యసంపద.’’ చంద్ర.)

**పసిమిడి.** దే. విశ. (పసిమి+మిడి.) పసిమిగలది. (చూ. గింజెము.) (ఇది చలిమిడిలోనగువానివంటిది.)

**పసిరిక** దే. వి. (పసరు+ఇక.) పసరువన్నె. విశ. పసరువన్నెకలది. (స్వార్థమున ఇక. సంధినివర్ణవికారము.)

**పసిరికపాము.** దే. వి. పచ్చపాము.

**పసిరికపిట్ట.** ద్వ. వి. పచ్చపిట్ట, హారితము.

**పసిరికమొగ్గ.** ద్వ. వి. పసరుమొగ్గ.

**పసుపాడు.** ద్వ. అ. క్రి. (పసుపు+ఆడు.) పసుపుపూసికొని జలకమాడు. ‘‘అనవలాయలంతిపసుపాడిదుకూలముదాల్చి.’’ ఆము. ౫, ఆ.

**పసుపు.** వై. వి. 1. హరిద్ర; (దీనిభేదములు.—కస్తురిపసుపు, కూరపసుపు, మ్రానిపసుపు.) 2. హరిద్రావర్ణము. విశ. హరిద్రావర్ణముకలది.

**పసుపుఁబిట్ట.** వై. వి. (పసుపు+పిట్ట.) పసిరికపిట్ట.

**పసుపుముద్ద.** ద్వ. వి.——వై.——(చూ. గోర.)

**పసుపుమొల్ల.** వై. వి. పచ్చపూమొల్ల, హేమపుష్పిక.

**పసులపోలిగాఁడు.** ద్వ. వి. (చూ.) పిత్రింత.

**పసులవాఁడు.** ద్వ. వి. (పసులు+వాఁడు.) గొల్లవాఁడు. ‘‘క. నలిభగదత్తుఁడుకదుపుల, వెలుచుపసులవానియట్ల విలసద్గతిన, బ్బలముసెగువ.’’ భార. ద్రో. ౧, ఆ.

**పస్తాయించు.** దే. అ. క్రి. పశ్చాత్తాపపడు.

**పస్తు.** వై. వి. ఉపవాసము, ఉపాసము, నిట్ర.

**పస్సె.** దే. వి. పాటలవర్ణము. విణ. పాటలవర్ణముకలది.

**పళపళ.** దే. వి. ప్రకాశించుటయందగు ననుకరణము.

**పళ్యెము.** వై. వి. పళ్లెముయొక్క రూపాంతరము. (భోజనపాత్రము నకు. – "ఉ. అంబుజబాంధవాన్వయనృపాగ్రణిబోనమునేఁడు సూర్యపా, కంబుననాయితంబయినకజ్జెముభోజనశాలలోనఁబ, ళ్యెంబిడినారుపంకజదళాక్షులు." కాశీ. ౫, ఆ.)

**పళ్లెము.** వై. వి. 1. భోజనపాత్రము; (చూ. ఎడ్డెన.) 2. తాంబాళము. "చ. ఘనతరరత్నదీపకళికాళతమానమనోహరంబులై, తన రునివాళిపళ్లెములుతామరసాక్షులొసంగ." భాను. ౪, ఆ.

**పళ్లెరము.** వై. వి. 1. భోజనపాత్రము; "సీ. లేమనీభర్తపళ్లెరమునఁ గుడువఁడు విధికపాలంబుమా వీటలేదు." వీర. 3, ఆ.—2. తాంబాళము. "దండకము. భయంబేదిచేదిక్షమావల్లభుం డెంతయుం ద్రుళ్లినంబ్రల్లదంబాడినన్ బళ్లెరం బెత్తిచిత్రంబుగాఁదచ్ఛిరశ్కర్తన ప్రౌఢివర్తించి." పా. 3, ఆ.

## పా.

**పాంచజన్యము.** సం. వి. అ. పుం. విష్ణువుయొక్క శంఖము. డు. అగ్ని.

**పాంచాలము.** సం. వి. అ. పుం. దేశవిశేషము.

**పాంచాలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ద్రౌపది; 2. బొమ్మ.

**పాంచాలిక.** సం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదులచేతఁజేయఁబడిన నరమృగాదిరూపము, బొమ్మ.

**పాంచాలుఁడు.** సం. వి. అ. పుం. ఒకజాతిపురుషుఁడు. (చూ. పురుషుఁడు.) విణ. పాంచాలదేశమునందు పుట్టినవాఁడు.

**పాంజేబులు.** వై. వి. బ. కాలికిధరించు గొలుసులు.

**పాండరము.** సం. వి. అ. పుం. తెలుపు. విణ. తెల్లనిది.

**పాండవబీడు.** మి. గ్రా. వి. బహుకాలమునుండి దున్ననిబీటినేల.

**పాండితి.** సం. వి. ఈ. స్త్రీ. పాండిత్యము.

**పాండిత్యము.** సం. వి. అ. న. పండితభావము.

**పాండిమ.** సం. వి. న్. పుం. తెలుపు. (రూ. పాండిమము.)

**పాఁడీఁడు.** వై. వి. పాండ్యదేశపురాజు.

**పాండుకంబళి.** సం. వి. న్. పుం. తెల్లకంబళిచేత కప్పఁబడిన రథము. విణ. తెల్లకంబళిగలది.

**పాండురము.** సం. వి. అ. న. తెల్లపులుము. పుం. 1. తెలుపు; 2. తెలుపుమించినపచ్చన. విణ. 1. తెల్లనిది; 2. తెలుపుమించిన పచ్చనిది.

**పాండువు.** సం. వి. ఉ. పుం. 1. ఒకరోగము; 2. పేరీఁదు; 3. తెలుపు; 4. తెలుపుమించినపచ్చన. డు. ఒకరాజు. విణ. 1. తెల్లనిది; 2. తెలుపుమించిన పచ్చనిది.

**పాండ్యము.** సం. వి. అ. పుం. ఒకదేశము.

**పాంథుఁడు.** సం. వి. అ. పుం. పథికుఁడు, తెరువరి.

**పాంశువు.** సం. వి. ఉ. పుం. 1. దుమ్ము; 2. ఎరువు.

**పాంసనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దూషకుఁడు.

**పాంసుల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఱంకుటాలు; 2. భూమి.

**పాంసువు.** సం. వి. ఉ. పుం. ధూళి, దుమ్ము.

**పాఁకుడు.** దే. వి. పండ్లపాఁచిలోనగునది. (ప్రాఁకుడుయొక్క రూపాంతరము.)

**పాఁగెము.** వై. వి. సంబంధము*. "కొలముపాఁగెముననప్పలిసు దిండినినిల్పి." య. ౨, ఆ.

**పాఁచి.** వై. వి. 1. పండ్లముఱికి*; (చూ. తెత్తు.) 2. నీటియందు కలిగెడు పచ్చనిముఱికి*; 3. నీటియందుకలిగెడుపచ్చనితీఁగ, శైవాలము*. విణ. ప్రాఁతది. (పాఁచిపని.) (చూ. ప్రాఁచి.)

**పాఁచితీఁగ.** వై. వి. మజ్జిగచిక్కఁనఁజేయు నొకానొకతీఁగ, బదర.

**పాఁజేబులు.** దే. వి. బ. గజ్జెగొలుసు.

**పాఁడి.** దే. వి. క్షీరము. "ఎ, గీ. పాఁడిసేఁపెఁబుష్పఫలభరితం, బులై, తరువనంబులొప్పె." భార. ఆది. ౫, ఆ. "ఎ, గీ. ప్రణవమనుక్రేపుతోఁగూడిపాఁడిఁబిదుకు, నవనిసురులకుగాయత్రియ నెడుసురభి." కాశీ. 3, ఆ.

**పాఁత.** వై. వి. 1. వస్త్రము; "మాసినపాఁతగట్టి." వి, పు. 3, ఆ.– 2. జీర్ణవస్త్రము*. (చూ. ప్రాఁత.) విణ. బహుదినములనాఁటిది. (పాఁతచీర.) (ప్రాఁతయొక్క రూపాంతరము.)

**పాఁతగిల్లు.** వై. అ. క్రి. పాఁతదియగు. (రూ. పాఁతగిలు.) (ప్రాఁతగిల్లుయొక్క రూపాంతరము.)

**పాఁతఱ.** దే. వి. (పాఁతు+అఱ.) 1. ధాన్యముంచుటకైనేలత్రవ్వినపల్లము; 2. నిధి. "తే. తనకుఁదొమ్మిదిపాఁతఱల్ ధనముగలద, టంచుజక్కులత్రేఁడుగర్వించుఁగాని." రసి. ౧, ఆ.

**పాఁతు.** దే. స. క్రి. పూడుచు. వి. భూమిలోనగువానిలోపలదిగినట్టిపర్వతములోనగువాని యధోభాగము. "సీ. మఱియునుదస్మేరుగిరిలక్షయోజనోన్నతముగుచుండి యానడిమిదళము, విదితమైపది యాఱువేలయోజనములు నంతియపాఁతునైయతిశయిల్లు." సం. "మూలేషోడశసహస్రయోజనవితతస్తావతాంతర్భూమ్యాం ప్రవిష్టః." భాగ. ౫, స్కం. ౨, ఆ. "ధృతిపాఁతగల." భార. విరా. ౨, ఆ. "తాలిమిపాఁతెడలి." నిర్వ. ౮, ఆ.

**పాఁపజెగము.** ద్వ. వి. (పాము+జెగము.) నాగలోకము.

**పాఁపజెన్నిగట్టు.** ద్వ. వి. (పాము+జెన్నిగట్టు.) వినాయకుఁడు.

**పాఁపతూపు.** దే. వి. (పాము+తూపు.) నాగాస్త్రము. "అప్పాఁపతూపురయంబుగ్రముగాఁగబిట్టడరి." భార. కర్ణ. 3, ఆ.

**పాఁపమీను.** ద్వ. వి. (పాము+మీను.) ఒకజాతి ఆఁడుచేఁప, శృంగి.

**పాఁపమేపరి.** దే. వి. (పాము+మేపరి.) 1. గరుత్మంతుఁడు; (చూ. పన్నారు.) 2. నెమిలి.

**పాఁపమేపుడు.** దే. వి.——పై.—— "సీ. కనిపైఁడికంటిరా, కాసిత్రేఁడిచ్చిన పాఁపమేపుడుపచ్చపతకములును." య. ౪, ఆ.

**పాఁపర.** దే. వి. గోతుంబి.

**పాఁపరమ్ము.** ద్వ. వి. (పాము+అమ్ము.) నాగాస్త్రము. "చ. పాఁపరమ్మువా, తనెగయుఘోరరూపభయదప్రథమానవిషాగ్నిజిహ్వికల్, దనికినఁబెల్చమండుచునిలాస్థలిడొల్లెనినుండుపల్చిమాం, బునిధిని తాంతదృశ్యరుచిపాల్పెనఁగంబడుభంగిఁదోఁపఁగన్." భార. కర్ణ. 3, ఆ. (ఇందు వర్ణాగమము.)

**పాఁపఱేఁడు.** దే. వి. (పాము+ఱేఁడు.) నాగరాజు.

**పాక.** దే. వి. ధూళిముఖుఁచకట్టినయిల్లు, శాల.

**పాకనాడు.** దే. వి. దేశవిశేషము.

**పాకము.** సం. వి. అ. పుం. 1. పరిపాకము; 2. పంట; 3. నర; 4. పిల్ల. (కావ్యమునందు పాకములు 3.—ద్రాక్షాపాకము, నారికేళపాకము, కదళీపాకము.)

**పాకలము.** సం. వి. అ. న. చెంగల్వకోష్టు*. పుం. 1. గుబ్బము; 2. గజమునకుఁగలుగు పిత్తజ్వరము.

**పాకశాసని.** సం. వి. ఇ. పుం. ఇంద్రునికొడుకు, జయంతుఁడు.

**పాకశాసనుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**పాకాన్నము.** సం. వి. అ. న. పాకెన. "ఘనపాకాన్నముకన్న వారలకిడఁగన్నారె." పాంచా. ౪, ఆ. (చూ. ప్రాకెన్న.)

**పాకారి.** సం. వి. ఇ. పుం. పాకాసురారి, ఇంద్రుఁడు.

**పాకి.** దే. వి. మఱుఁగుపెరటికుప్పయెత్తెడువాఁడు, పాకివాఁడు.

**పాకీ.** దే. వి. పాకియొక్క రూపాంతరము.

**పాకెన.** వై. వి. పాకెన్నయొక్క రూపాంతరము.

**పాకెన్న.** వై. వి. పెండ్లియందు మూఁడవనాటిబువ్వము.

**పాక్యము.** సం. వి. అ. న. అట్టుప్పు. పుం. యవక్షారము.

**పాక్షికము.** సం. విణ. (అ. ఈ. అ.) పక్షమునఁగలిగినది.

**పాగ.** యు. దే. వి తలకట్టు. వై. బ. పావకోళ్లు. "క. పాగలు దొడికొనియొకయెల, నాఁగయుఁదానునుసభంబునంజనిచనిభూ, భాగంబునవమగుడంగని, వేగంబుననవతరించివినతుండయినన్." షో. ౨, ఆ.

**పాగడము.** వై. వి. పాడగమునకు మాఱురూపము.

**పాగా.** యు. దే. వి. 1. తలపాగయొక్క రూపాంతరము; 2. అశ్వశాల; "సీ. యవనాధిపతియుపాయనముగానొసఁగినపాగాహయంబులు వాగెవచ్చు." కాశీ. ౧, ఆ.—3. అశ్వసమూహము. (చూ. దూపించు.)—వై. బ. పావకోళ్లు "సీ. ప్రక్షాళితములైన పదియాఱువన్నియకనకంపుఁగోడుఁబాగాలుదొడిగి." నై. ౮, ఆ.

**పాగు.** వై. వి. చేక్కరలోనగునవికాఁచేఁగానగుద్రవత్వము*.

**పాచకుఁడు.** సం. వి. అ. పుం. 1. వంటవాఁడు; 2. అగ్ని.

**పాచనము.** సం. వి. అ. పుం. 1. ప్రాయశ్చిత్తము; 2. పులుసు

**పాచని.** సం. వి. ఈ. స్త్రీ. కరక, హరీతకి*.

**పాచిక.** వై. వి. జూదమాడెడి అడ్డసాళ్లు.

**పాచితము.** వై. వి. ప్రాచితముయొక్క రూపాంతరము. "తే. ధారణీవల్లభులకంటెఁదక్కుచోట, నశ్వమేధంబునిష్ఫలంబగువిధమున, నర్థవంతంబుగాదుసత్పాత్రకళత్ర, సేవకులఁబూనిచేయుపాచితముశతము." పాండు. ౯, ఆ.

**పాచేనము.** వై. వి. పాచనము*.

**పాచు.** దే. ప్రే. (పాయఁజేయు.) 1. తొలఁగించు; "ఆ. వజ్రబాణమేసివానినన్నింటిని, బాచియున్ననన్నుఁజూచియపుడు." భార. అర. ౧, ఆ.—2. చిక్కుడలించు. "వెంద్రుకలలవడఁగాఁబాచిముడిచె." భార. విరా. ౪, ఆ.

**పాట.** యు. దే. వి. 1. సంగీతము; 2. విధము. "ఉ. భూభుజలక్ష్ జయింపుము విభూతి నొనర్పుము రాజసూయముల్, సాభుజవీర్యవిక్రమగుణంబులకున్ దగుచున్నయాధన, శ్లాఘము దివ్యబాణరథలాభముశోభితమైనయానభా, లాభమునొందుపాటనఫలత్వము నొందునెకౌరవేశ్వరా." భార. సభా. ౧, ఆ. (ఇది ఈయర్థమునందు ఆ, ఈ, ఏ శబ్దాదిపూర్వకముగానే ప్రయోగింపఁబడుచున్నది.)—వై. అగలుపొంటి.

**పాటకము.** ఉభ. వై. వి. (చూ.) పోటకము.—సం. వి. అ. పుం. 1. పాడగము; 2. పట్టాకత్తి; 3. వాద్యము; 4. నద్యాదితీరము; 5. అక్షాదిచాలనము; 6. సేనానివేశము.

**పాటచ్చరుఁడు.** సం. వి. అ. పుం. తస్కరుఁడు, దొంగ.

**పాటన.** దే. వి. 1. అలంకారము; 2. సంస్కారము; "ఉ. పాటనసేయమింగురులు పైఁబడిశీర్ణపటీరపంకలా, లాటికమైదరస్మితవిలాసపుఁ జంద్రికడొంకివాడుటం, దేటదొఱంగివిన్నసగునీ మొగమోయనమాసిచంద్రుఁడో, పాటలగంధివ్రాలెనిదెభానురుచిన్దనకందుమీఱఁగన్." స్వా. 3, ఆ.—3. ఆదరణము. (చూ. పాటించు.)

**పాటనము.** సం. వి. అ. న. చీల్చుట, వ్రచ్చుట.

**పాటపాట.** దే. విణ. కొంచెముకొంచెము. "క. అటనున్నమొగులుబలియుచుఁ, జిటపొటమనిపాటపాటచినుకులు వడఁజొ, చ్చుటయాదిగాఁగఁదనపెని, మిటితడియునొయనినుగాత్రిమిగులవగపుతోన్." కళా. ౪, ఆ.

**పాటపొలము.** దే. వి. చిఱువేరుపైరయ్యెడునేల.

**పాటబంజీ.** దే. వి. రథవిశేషము, గాడీ. (చూ. గుజ్జీ.)

**పాటము.** వై. వి. కెంపులు నాణెముచూచుటకు తగినయెండ*.

**పాటల.** సం. వి. అ. స్త్రీ. కలిగొట్టు*. అ. స్త్రీ. అ. న. ము. కలిగొట్టుపువ్వు. అ. పుం. 1. ఎఱ్ఱవడ్లు; 2. తెలుపుమించిన యెఱుపు. విణ. తెలుపుమించినయెఱుపుగలది.

**పాటలి.** సం. వి. ఇ. స్త్రీ. మొక్కపుఁజెట్టు. పుం, స్త్రీ. కలిగొట్టు చెట్టు.

**పాటవము.** సం. వి. అ. న. 1. ఆరోగ్యము; 2. నైపుణ్యము; 3. శక్తత; 4. తైక్ష్ణ్యము.

**పాటి.** దే. వి. ఏ. 1. సామ్యము; "క. కోటయుమిన్నునదమలోఁ, బాటికి జగడింపనడ్డపడినిల్చినవా, చాటులరుచిఁదారకములు, దూటువలైకోటతుదలఁగొమరారుఁబురిన్." భాగ. ౧౦, స్కం. పూ.—2. ప్రమాణము. "సీ. మిన్నేటిపాటియుఁజెన్నయున్నతియువిపాశవాసియుఁజంద్రభాగచేగయును." పాండు. ౧, ఆ.—విణ. 1. సమము; "సీ. బ్రహ్మదండంబుల పాటియై మర్మంబులిట్టునొనాటునేయుతనిచేత." భార. భీష్మ. 3, ఆ.. 2. సామాన్యము; "ఉ. నావుడునేమియుంబలుక నాలుకలాడక పాటియైనథా, శ్రీవరకోటియుండెనొకదిక్కున." ఉ, హరి. 3, అ.—3. న్యాయ్యము; "వ. అనినవిని యమ్మాటలు పాటిగాఁబట్టివిరాటుండు భయభక్తియుక్తంబుగా వేఁడికొనిన." భార. విరా. ౯, ఆ.—4. కొలఁదిది. "తే. బాదరాయణుభక్తియేపాటియదియొ." కాశీ. ౭, ఆ. (ఇది యీయర్థమందు ఆ, ఈ, ఏ శబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడుచున్నది.)

**పాటించు.** దే. స. క్రి. 1. ఆదరించు; "వ. మార్జాలంబులఁ బాటించి సింహంబులననాదరంబుసేయువిధంబున." భార. ఉద్యో. ౨, ఆ.—2. విచారించు; (చూ. కోట.) 3. ప్రతీక్షించు; (చూ. అజ్జే.) 4. ధరించు; "వ. చల్లడముదట్టిమొదలైన పరికరంబులుపాటించి." భార. సౌ. ౧, ఆ.—౫. పొందు. "నృపాలకుండుమదిఁబాటించెన్ మహోత్సుకత్వము౯." నై. ౧, ఆ.

**పాటిగొను.** దే. స. క్రి. (పాటి + కొను.) సరిచేయు. "ఎ. గీ. జితశరులఁబాటిగొనవన్నుతొడలుమనువు." హన. ౪, ఆ.

పాటితము. సం. విశ. (అ. ఆ. అ.) చీల్చఁబడినది.

పాటునేల. దే. వి. (పాడు+నేల.) ఊరెత్తువడిపోయి పాడు పడినదేల.

పాటిరేవు. దే. వి. దిగినడచి దాటిపోఁదగినరేవు.

పాటిల్లు. వై. అ. క్రి. కలుగు. "తే. పాండుసుతులకన్ని పాటులు పాటిల్లె." భార. భీష్మ. ౧, ఆ. [రూ. పాటిలు. "ఉ. ఎక్కడఁ బోవవచ్చుగిరులేనియుఁగానభూములేనిఁదా, రెక్కియుఁజొచ్చి యుక్కబగతు రేడ్తెఱఁగిట్టిచలంబునక్కదలల్, ద్రొక్కకతక్కరట్లయిన దుర్గతివాటిలుఁబోకనిల్చినే, రుక్కునఁబోరినక్." (మిగులు పద్యము. చూ. చొప్పడు.) భార. శల్య. ౧, ఆ.]

పాటీరము. సం. వి. అ. పుం. 1. చందనము; 2. వెదురుచేవ; 3. జల్లెడ; 4. వరిమడి; 5. మబ్బు; 6. ముల్లంగి*.

పాటీలు. దే. వి. బ. స్త్రీహస్తభూషావిశేషము.

పాటు. వై. వి. 1. పడుట; "చ. వార్ధిలో, పలఁబడియందుఁబట్టదియె పాటుగఁదీఱ మునింగిపోయిరే." కళా. ౬, ఆ.–2. శ్రమము*; "శా. పాపాత్ముండగుదైత్యుచేఁబడినమీపాటంతయుంజెప్పఁగాఁ, గోపంబుత్కటమై మనంబునకు సంక్షోభంబు ప్రాపించె." హరి. ఉ. ౪, ఆ.–3. ఆపద*; (చూ. పాటిల్లు.) 4. సముద్రజలోల్బణశమనము*.

పాటునఁబడు. వై. అ. క్రి. యథాస్థితికివచ్చు.

పాటుపడు. వై. అ. క్రి. శ్రమపడు.

పాటుమానిసి. వై. వి. పాటుపడు మనుష్యుఁడు.

పాట్లమారి. ద్వ. విశ. (పాటులు+మారి.) మిక్కిలి శ్రమపడు స్వభావము గలవాఁడు.

పాఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. చిఱుబొద్ది; 2. విసబొద్ది*. అ. పుం. ము. 1. పఠనము; 2. వేదపఠనము; 3. బ్రహ్మయజ్ఞము.

పాఠకుఁడు. సం. వి. అ. పుం. వేదపాఠము చదువువాఁడు. (తద్విశేషములు.–అజపుఁడు, శాఖాదండుఁడు.)

పాఠశాల. సం. వి. ఆ. స్త్రీ. బాలురుచదువుచోటు, బడి.

పాఠి. సం. వి. న్. పుం. 1. చిత్రమూలము*; 2. పాఠకుఁడు.

పాఠీనము. సం. వి. అ. పుం. షేయికోఱలచేప, కొఱ్ఱ.

పాఠ్యము. సం. విశ. (అ. ఆ. అ.) పఠింపఁదగినది.

పాడెగము. వై. వి. స్త్రీపాదభూషావిశేషము.

పాడఱు. దే. అ. క్రి. (పాడు+అఱు.) పాడుపడు. (చూ. కరడు.)

పాడి. దే. వి. 1. ధర్మము; "గదానంగరమునఁ బాడిఁదొఱంగి యుపాప్లవకర్ముఁడవైతెఁగాక." సం. "అధర్మేణగదాయుద్ధేయదహంవినిపాతితః." భార. శల్య. ౨, ఆ. – 2. వ్యవహారము; "ఎ, గీ. పాడికరిగిగురునితోఁడశిష్యుఁడుతండ్రి, తోడఁగొడుకు మగనితోడనాలు, స్వామితోడఁ బంటునభఁజెప్పఁజనదైన, నందుని హావరములనిందవచ్చు." సం. "గురోశ్శిష్యేపితుఃపుత్రే దంపత్యోస్స్వామిభృత్యయోః, విరోధేతుమిథస్తేషాంవ్యవహారోనసిద్ధ్యతి." విజ్ఞా. వ్య, కాం.–3. న్యాయము; "క. నడవంజాలనివారలఁ, దడయకమోపించితెచ్చిధరణీశుఁడుదాఁ, దడవోర్వనికార్యములకు, నెడనేయకపాడినిర్ణయింపఁగవలయున్." విజ్ఞా. వ్య, కాం. – 4. స్వభావము. "చ. అతివయపాయముంబొరయునప్పుడు కావకతక్కనేనియా, పతిపతియేతలంప మగపాడియు లోకముపాడి యే." భార. విరా. ౩, ఆ.

పాడు. దే. అ. క్రి. పాటపాడు. వి. 1. పాటినేల; 2. పల్లె. (ఆముదాలపాడు, ముత్తపాడు మొ.) విశ. శూన్యము.

పాడునుయ్యి. దే. వి. కసవులోనగువానిచేఁగప్పఁబడినముఖభాగముగలకూపము, అంధకూపము.

పాడుపడు. ద్వ. అ. క్రి. (పాడు+పడు.) పాడఱు, శూన్యమగు.

పాడువాఱు దే. అ. క్రి. (పాడు+వాఱు.) పాడుపడు. "తే. పసులవోలె యుటవిన్నపైపాడువాఱె, యున్నదాన." హరి. పూ. ౫, ఆ. (చూ. పాఱు.)

పాడె. దే. వి. శవవాహనము, ఖట్వికి.

పాడ్యమి. వై. వి. పక్షమందుమొదటితిథి, ప్రథమ. (దీనినొక నిఘంటుకారుఁడు సంస్కృతపదముగా వ్రాసియున్నాఁడు.)

పాణసి. దే. వి. మాల. "పాణసిపువ్వుఁబోఁడులను." హరిశ్చ. ౨, ఆ.

పాణి. ఉభ. వై. వి. ముత్తెపునీరు*. సం. ఇ. పుం. మణికట్టు మొదలుకొని వ్రేళ్లతోఁగూడినచేయి.

పాణింధమము. సం. వి. అ. పుం. 1. కొలిమితిత్తి; 2. చీఁకటి; 3. వాద్యవిశేషము.

పాణిగృహీతి. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము.

పాణిగ్రహణము. సం. వి. అ. న. వివాహము, పెండ్లి.

పాణిఘుఁడు. సం. వి. అ. పుం. చేతులతో తాళమువేయువాఁడు.

పాణిపీడనము. సం. వి. అ. న. వివాహము, పెండ్లి.

పాణివడము. దే. వి. అమ్ములపాది, తూణీరము.

పాణివాదుఁడు. సం. వి. అ. పుం. (చూ.) పాణిఘుఁడు.

పాణౌకృతి. సం. వి. ఇ. స్త్రీ. పాణౌకరణము, పెండ్లి.

పాత. సం. విశ. (ఋ. ఈ. ఋ.) కాచేవాఁడు.

పాతకము. సం. వి. అ. పుం. మహాపాపము. (ఇవి అయిదు.– స్వర్ణస్తేయము, సురాపానము, బ్రహ్మహత్య, గురుపత్నిగమనము, ఇవి చేయువారితోడి సహవాసము.)

పాతము. సం. వి. అ. పుం. 1. పతనము, పాటు; 2. రాహువు. విశ. కావఁబడినది.

పాతరలాడు. ద్వ. అ. క్రి. (పాతరలు+ఆడు.) నర్తించే. "క. ప్రీతిగోపకులందఱు, గీతంబులువాడఁదరుల క్రిందనునగు చుక్., జేతులుత్రిప్పుచు వెడవెడ, పాతరలాడెనుయశోదపాపండడవిక్." భాగ. ౧౦, స్కం. పూ.

పాతాళము. సం. వి. అ. న. 1. క్రిందిలోకము; 2. బడబాగ్ని.

పాతిక. వై. వి. ఒకటిలో నాలుగవభాగము*.

పాతివ్రత్యము. సం. వి. అ. న. పతివ్రతాత్వము.

పాతుకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) పడునట్టిస్వభావముగలవాఁడు.

పాత్రము. సం. వి. అ. న. 1. రెండుదరులనడుము; 2. భృకుంపాది; 3. మంత్రి; 4. యోగ్యము; 5. స్రువాది; 6. త్రి. భాజనము. (ఇది తెనుఁగున భాజనార్థమునందు కొందఱు మహాకవులచేపాత్రయని ప్రయోగింపఁబడియున్నది. ఒకచోనర్తకియనునర్థ

మునందు వైకృతముగా ప్రయోగింపఁబడియున్నది. "శివపాత్రి లకు." య. ర, ఆ.)

**పాత్రలాడు.** ద్వ. అ. క్రి. పాతరలాడుయొక్క రూపాంతరము. "సీ. రాజానతో సాటిరాదురంభయటంచువేశుకతోఁ బాత్రలాడె నొకతె." రుక్మి. 3, ఆ.

**పాథస్సు.** సం. వి. స్. న. 1. జలము; 2. అన్నము.

**పాథేయము.** సం. వి. అ. న. అన్నముబియ్యములోనగుదారి బత్తెము.

**పాథోధి.** సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.

**పాథోనిధి.** సం. వి. ఇ. పుం.——పై.——

**పాదకటకము.** సం. వి. అ. పుం. అందియ.

**పాదగ్రహణము.** సం. వి. అ. న. (చూ.) అభివాదనము.

**పాదచారి.** సం. వి. న్. పుం. కాలిబంటు. విణ. నడచిపోవు వాఁడు.

**పాదజుఁడు.** సం. వి. అ. పుం. శూద్రుఁడు, అడుగుఁబుట్టువు.

**పాదట్టు.** దే. వి. (పాదు+అట్టు.) ఇండ్లలోపలివాసములకు పట్టె లకు వట్టెవుబూది.

**పాదప.** సం. వి. ఆ. స్త్రీ. పావకోళ్లు. అ. పుం. ము. 1. చెట్టు; 2. కాళ్లుంచుకొనెడుపీట.

**పాదపట్టము.** సం. వి. అ. పుం. (చూ.) పాయవట్టము.

**పాదబంధనము.** సం. వి. అ. న. ఆవులగేదెలోనగునది.

**పాదము.** సం. వి. అ. పుం. 1. అడుగు; 2. కిరణము; 3. వేరు; 4. పద్యమునందలి యొకచరణము; 5. పాతిక; 6. కొండ తఁటితిప్ప.

**పాదరసము.** వై. వి. రసము, పారదము.

**పాదలి.** వై. వి. (చూ.) ఓరపాక*. విణ. అధముఁడు*. "ద్వి. పాపపువిప్రునివనికిఁగ్రాముస్న, తొలికాఁడైనపాదలిమందఁడేఁడు." నవ. 3, ఆ.

**పాదసరము.** సం. వి. అ. పుం. గజ్జెగొలుసు.

**పాదస్ఫోటము.** సం. వి. అ. పుం. కాళ్లుపగుల్లపాఱెడు కుష్ఠ విశేషము.

**పాదాంగదము.** సం. వి. అ. న. అందియ.

**పాదాగ్రము.** సం. వి. అ. న. మీఁగాలు, ప్రపదము.

**పాదాతము.** సం. వి. అ. న. పదాతులసమూహము.

**పాదాతికుఁడు.** సం. వి. అ. పుం. పదాతి, కాలిబంటు.

**పాది.** యు. దే. వి. 1. ఏఱుదాఁటెడి యొకానొకసాధనము; 2. పాదివేఁట. వై. పాదుయొక్క రూపాంతరము.

**పాదిక.** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకంబము. విణ. నాలుగవది.

**పాదిగువ్వ.** దే. వి. పాదివేఁటకుపయుక్తమైనపెంపుడుపిట్ట. "సీ. పాదిగువ్వలుమోటువలకలుపోటుగింజలు చిక్కములు నురుల్లాగిల ములు." శుక. ౧, ఆ.

**పాదిరి.** వై. వి. కలిగొట్టు, పాటలి*.

**పాదిలి.** వై. వి.——పై.——

**పాదివేఁట.** దే. వి. కక్కెరకొఁతో కారుకోడిపూరేడులోనగు పెం పుడుపిట్టలనుపైవిడిచి పిట్టలనుపట్టెడు ఒకానొకవేఁట. "పాది వేఁటచూడఁబదరెదురాతేని, మదినెంచెంగి." య. ౨, ఆ. (చూ. వేఁట.)

**పాదు.** వై. వి. 1. చెట్టులోనగువానికి నీళ్లుపోయుటకై క్రింద కుదురుగాఁజేసినపల్లము, ఆలవాలము*; "సీ. నీరెత్తువేళలనీరెత్తుఁ బాదుపాదునకుఁగాలువలుపొందుగనమర్చి." కళా. ర, ఆ.— 2. క్రిందు*; "సీ. పాతాళలోకంబుపాదునశేషుండువెలయంగ ముప్పదివేలయోజ, నంబులవెడలుపుననుదోఁకచుట్టుగాఁజుట్టుకయుం డు." భాగ. ౫, స్కం. ౨, ఆ.—3. నిలుకడ*. (చూ. కలపన కంప.)

**పాదుక.** సం. వి. ఆ. స్త్రీ. పావకోళ్లు. అ. న. ము. ముచ్చె.

**పాదుకొను.** ద్వ. అ. క్రి. 1. నెలకొను; "పడకతఁడుపాదు కొని." రా. యు, కాం.—2. నిలుచు. "ఎ, గీ. భావమునధైర్య మింతైనఁబాదుకొనదు." అని. ౨, ఆ. (ప్రే. పాదుకొలుపు. చూ. కవలు.)

**పాదునిలుచు.** ద్వ. అ. క్రి. పాదుకొను, నిలుకడయగు. "వ. నిలువక పాదునిలిచి యేలికకుం బ్రియంబుగావించుటయు నిది ధర్మం బకాయనిన." హరి. ఉ. ౬, ఆ.

**పాదువు.** సం. వి. ఉ. ఊ. స్త్రీ. 1. పావకోళ్లు; 2. చెప్పులు.

**పాదుసా.** వై. వి. రాజు. "తే. అంబుజభవాండమనుహజారంబు లోన, నలరుఁగైదువపాదుసాయధివసింప, నమయభృత్యుఁడు వెట్టుకెం జాయపట్టు, బటువుబిల్లనఁజంద్రబింబంబుదోఁచె." కవి. 3, ఆ. (పాదుషారూపాంతరము.)

**పాదుసాహి.** వై. వి.——పై.—— "మ. చలమొప్పన్ సురు పాదుసాహిజగముల్ సాధింపఁదండెత్తి." భాను. ర, ఆ. (పాదుసా, పాదుసాహిశబ్దములకు మ్లేచ్ఛభాషయందు తఱచువాడుకగలదు.)

**పాదూకృత్తు.** సం. వి. త్. పుం. మాదిగవాఁడు. (రూ. పాదు కృత్తు.)

**పాదూవాహుఁడు.** సం. వి. అ. పుం. పావకోళ్లను, చెప్పు లను తెచ్చువాఁడు.

**పాదొట్టు.** దే. వి. (పాదు+ఒట్టు.) (చూ.) పాదట్టు. "సీ. భావజువిడిచినపాడింటిపై బొల్లిపాదొట్టుగతిమేనఁబలితమొదవ." కవిక. ర, ఆ.

**పాదొట్టుపురుగు.** ద్వ. వి. పాలెపురుగు.

**పాద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పాదముకొఱకైనది. (జలాది కము.)

**పానకము.** ఉభ. దే. వి. ఫలరసము. "బహుఫలంబులఁగలపాన కంబులతోడ." పంచ. నా. ౧, ఆ. "నలిమావిపండుపానక ములదగమాన్చి." అచ్చ. అ, కాం.—సం. అ. పుం. బెల్లములో నగువానిఁగలిపి యేలకులుమొదలైన సంబారువులుచేర్చిచేసెడు పానీయము.

**పానగోష్ఠిక.** సం. వి. ఆ. స్త్రీ. అనేకులుచేరి మద్యపానము చేసెడిచోటు.

**పానము.** సం. వి. అ. న. 1. త్రాగుడు; 2. త్రాగుడుగిన్నె; 3. కాపు. వై. వి. లింగపీఠము, పానవట్టము*. (చూ. గిరిగిటలు.)

**పానలు.** దే. వి. బ. సందేహము. "ద్వి. బనవాయనఁగవిన్నఁ బానలొందెల, పనిబాలలకుసైనఁబ్రబలదేభక్తి." భల్లా. ౨, భా.

**పానవట్టము.** దే. వి. లింగపీఠము. (పానము+వట్టము.)

**పానారము.** దే. వి. పండుపోఁక, పోఁతము.

**పానీయము.** సం. వి. అ. న. జలము. విశ. 1. త్రాగఁదగినది; 2. కాచఁదగినది.

**పానీయశాలిక.** సం. వి. ఆ. స్త్రీ. చలిపందిలి, ప్రప.

**పానుపు.** దే. వి. 1. మంచేము; 2. పఱపు. "సీ. వరునిరాకకునిశావాసకసజ్జికపఱచినవెన్నెలపానుపనఁగ." అని. 3, ఆ. (రూ. పాన్పు. మంచేమునకు. "సీ. పట్టెలఁగేలూనిపాన్పుమెల్లనడిగిగిలుకపసిండిపావలుదొడుగక." రసి. ౪, ఆ.)

**పాప.** దే. వి. 1. శిశువు; "క. ఈపిన్నదినాకూఁతురు, తాపసజనముఖ్యమిమ్ముఁ దాఁగొలువంగా, నోపుదునని పూనెంబసి, పాపనుఁడీకెనుకలేక పనిగొనవలయున్." భార. ఆర. ౭, ఆ.—2. కంటినల్లగ్రుడ్డులోని ప్రతిఫలనము. "కంటిపాప." చంద్ర.

**పాపఁడు.** దే. వి. 1. బాలుఁడు; "చ. అనమునమీఁదెఱుఁగకమహోగ్రహావృత్తిఁ గడంగిచెచ్చెరన్, బసులకుఁగూయిగాఁజనియెఁబాపఁడు." భార. విరా. ౫, ఆ. — 2. పురుషశిశువు. "క. ఈపాపఁడునలుమొగముల, యా పావనిఁగన్న మేటియగుననిభక్తిన్." భాగ. ౧౦, స్కం. పూ.

**పాపచేలి.** సం. వి. ఈ. స్త్రీ. అగలుసొంటితీ.

**పాపట.** యు. దే. వి. కేశవీధి. (ఇది పాయుధాతుకృదంతము.) వై. వృకధూమకముతీ. "ఎ, గీ. పాపటఁబోనంగియామోదభరము నించె." (దీనికి కర్తవనలక్ష్మి.) కవి. ౨, ఆ.. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**పాపటచేఱు.** ద్వ. వి. పాపటబొట్టు.

**పాపటబొట్టు.** ద్వ. వి. పాపటకు సరిగా నుదుటవ్రేలెడు చేఱుచుక్క, లాలాటిక.

**పాపటము.** దే. వి. గొర్తిపైరుమీఁదగాదము పోవదున్నెడుసాధనము. (ఇది పాయుధాతుకృదంతము.)

**పాపటవుచ్చు.** దే. ప్రే. (పాపటవోవఁజేయు.) దారివిడిచితొలఁగించు. "ఎ, గీ. తచ్చమూమధ్యమునకురథంబుఁదూఱి, నూకిపావటవుచ్చి." రామా. ౮, ఆ.

**పాపటవోవు.** దే.అ.క్రి. (పాపట+పోవు.) దారివిడిచితొలఁగు. (చూ. పాపటవుచ్చు.)

**పాపనము.** దే. వి. పాపటముయొక్కరూపాంతరము.

**పాపము.** సం. వి. అ. న. దుష్కృతము. విశ. దుష్కృతముగలది.

**పాపాత్ముఁడు.** సం. వి. న్. పుం. పాపచిత్తుఁడు.

**పాపి.** సం. విశ. (న్. ఈ. న్.) పాపముగలవాఁడు.

**పాపిష్ఠుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలిపాపి.

**పాపు.** దే. ప్రే. 1. పాయఁజేయు; (అనుప్రయుక్తమైనపాయుధాతువునకును రూపమిట్లెఱుంగునది. ఎడఁబాపు, పఱియవాపుము.)—2. దున్ను. "ఉ. ద్రౌపదియోమధుస్ఖానుచురాననయాయిమురారిముఖ్యనా, నాపృథివీశ్వరుండుయమసందనుఁడద్వరభూమిశుద్ధిగాఁ, బాపఁదొడంగెనాఱువృషభంబులఁబూనినమేటినాఁగటన్, దాపసకోటిమంత్రపఠనంబులతోఁజనుదేరనత్తఱిన్." జై. ౮, ఆ.

**పాపుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పాపి; 2. హింసకుఁడు; 3. అధముఁడు.

**పాపోసు.** వై. వి. ముచ్చె. (పాయపోసుయొక్కరూపాంతరము. చూ. జోడు.)

**పాప్మము.** సం. వి. న్. పుం. పాతకము, కలుషే.

**పామ.** సం. వి. ఆ. స్త్రీ. న్. పుం, న. ము. గజ్జి.

**పామనుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) గజ్జికలవాఁడు.

**పామరుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) 1. అజ్ఞుఁడు; 2. నీచుఁడు.

**పాము.** దే. స. క్రి. రుద్దు, రాచు. "ద్వి. పాములపుట్టలబాహువుల్సాఁచి, పామినఁగఱవకఫణులుదొలంగె." నళ. ౪, భా. (ప్రాముయొక్కరూపాంతరము.)—వి. సర్పము.

**పాముదొండ.** ద్వ. వి. ఒకదినుసుదొండతీ.

**పాములనారిగాఁడు.** దే. వి. పక్షివిశేషము.

**పాములవాఁడు.** దే. వి. పామునుపట్టి ఆడించిజీవించువాఁడు, అహితుండికుఁడు. "తే. పుట్టలోపలిపామునభ్యుద్ధరించు, వశ్యమంత్రుండుపాములవాఁడుఁబోలె, భర్తనభ్యుద్ధరించుఁబాపంబువలన, నగ్నినుఱికినయట్టిపద్మాయతాక్షి." సం. "వ్యాళగ్రాహీ యథావ్యాళం బిలాదుద్ధరతే బలాత్." కాశీ. ౨, ఆ.

**పాయ.** దే. వి. 1. చీలిక; "దండకము. తత్కాయమున్ రెండుపాయల్ వడంజించి." పా. 3, ఆ.—2. ఒక నదిలోనుండి చీలిపాటినది; 3. ఖండము; "వ. జన్నిదంబువ్రేట్లన్ బంచివేసిన గతిన్ బాయలైపడినయెడలును." కవిక. ౨, ఆ.—4. చర్మములోనగువానిఖండము; "సీ. పైఁద్రిప్పికట్టినప్రాఁదోలుపాయయుఁ జేసున్ననీలయష్టియునుగలిగి." హరిశ్చ. ౪, ఆ.—5. మునుము. "చ. ఎరగలిచిచ్చుకాఱడవియెల్లనుబెల్లుగనొక్కపాయగా, దరికొనిరూపడంచినవిధంబున." భార. భీష్మ. ౨, ఆ.

**పాయఁబాఱు.** దే. అ. క్రి. (పాయన్+పాఱు.) (అన్నము మొదలైనది.) పాయు. "తే. పదనుదివిసినకస్తూరిప్రాఁచియలరు, పాయఁబాఱినకూడునీరవ్వట్టుమడుఁగు, గళితమణియగుశొమ్మునైకానఁబడియె, దుర్విదగ్ధుండుగౌరవదూరుఁడగుచు." పాండు. 3, ఆ. (చూ. పాఱు.)

**పాయకట్టు.** దే. వి. ఒక ముఖ్యగ్రామముతోఁజేరిన యుపగ్రామములసమూహము, జనపదము.

**పాయకారి.** దే. వి. భాగప్రకారము భూస్వాతంత్ర్యములేనిరైతు.

**పాయఖానా.** హిం. వి. మరుగుపెరఁడు.

**పాయగిల్లు.** దే. అ. క్రి. తొలఁగు. (రూ. పాయగిలు. "ఉ. శోరణగండ్లమార్గమునఁజొచ్చినసన్ననిగాలియొక్కయం, భోరుహపత్రనేత్రనును పొంకపుఁజన్నులమీఁదినన్నపుం, జీరచెఱంగు వాయగిలఁజేసినవిశ్వధరాతలేశ్వరుం, డోరయునర్చెఁబావభయమొంది నిజాననచంద్రబింబమున్." జై. 3, ఆ.)

**పాయగొమ్మ.** దే. వి. (పాయ+కొమ్మ.) పంగలకొమ్మ. "సీ. నుడిగొన్నచిగురాకుజొంపంబు కెంపారఁదలమీఁద మల్లికాదామమడఁచి, నిడుదతామరతూఁడు నెట్టెంబుఁజుట్టిపైఁ బటికంపుఁగడియంపుభాగమదిమి, తోనయాక్రేవఁ గెందొవతేకుహత్తించిమెడచక్కిఁ గస్తూరిమెదిచిపూసి, పాయగొమ్మల నల్లపట్టు దగిల్చియక్కొనయాకుపైవెండికోరవెట్టి, ధవళకేతకధూళి గాత్రమునఁ జఱచి, మోళమామిడికొకకొంతమొక్కినిలిచి, యొడలిలోఁజక్కనగమునాకొసఁగుమనుడు, నద్రికన్యకతలవాంచెహరుఁడునవ్వె." ఉ, హరి. ౫, ఆ.

**పాయపోసు.** వై. వి. (చూ.) పాపోసు.

**పాయము.** వై. వి. వయసు. "ఉ. ఒకయోగివరుండువరంబొసంగనీ, భావమునన్ మదీయమగుపాయముపాయములేకశోభిలన్." పర. ౨, ఆ.

**పాయవట్టము.** వై. వి. కాలియందె. (చూ. నయ.)

**పాయపడు.** వ్య. అ. క్రి. (పాయ+పడు.) 1. చీలు; "క. మిటమిటనిఁకటికియెండఁగా, బటపటపటఁబగిలిపాయవడినవెదురులఁగా, బుటమెగయుచుమత్తియముల్, చిటిలినగతినాఁడె శాల్మలీతూలంబుల్." చంద్ర. ౧, ఆ.—2. తొలఁగు; "క. సేనాగ్రసరుల్, పాయవడి విభునివిడిచిప, లాయనపరులైరి." హరి. ఉ. 3, ఆ.—3. దారివిడిచితొలఁగు; "క. పాయపడఁజొచ్చిగుంపులు, సేయును." భార. భీష్మ. ౧, ఆ.—4. వెలివడు. "తే. ఇంకఁ జుట్టలునన్నేమి యెన్నువారొ, కులమునకుఁబాయవడియేనుగులటనైతి." హరి. పూ. ౯, ఆ.

**పాయవాఱు.** దే. అ. క్రి. (పాయ+వాఱు.) తొలఁగు. "ఎడతెంపిగఁగొందఱుపాయవాఱఁగఁగా." భార. విరా. ౫, ఆ.

**పాయసము.** సం. వి. అ. న. పరమాన్నము. పుం. దేవదారుబంకతోఁజేసినధూపము.

**పాయి.** ఉభ. వై. వి. పాలు. "ద్వి. కొడుకుఁ, బాయనియక్కఁసఁబట్టిపాలిండ్ల, నొత్తి." పారిజ్ఞ. ౨, ఖా. (ఇది తఱచుగా బహువచనాంతమైనను ఈకవిచే నేకవచనాంతముగాఁ జెప్పఁబడియున్నది. ఇట్లు వ్యవహారమందును కొన్నిచోట్లఁ గానఁబడుచున్నది.)—సం. విశ. (న్. ఈ. న్.) తాగుఁబోతు.

**పాయు.** దే. అ. క్రి. 1. తొలఁగు; "క. నీయవినయంబుపెంపున, నీయాపదసంభవించెనింకవగచినఁగా, బాయునె." భార. ద్రో. ౪, ఆ.—2. చిక్కెడలు; (చూ. పాచు.)—3. పక్వపదార్థముకాలాతిక్రమణముచేమెత్తఁబడిచెడు. "పాసినవంటకంబు." —స. క్రి. విడుచు. "సతింబతివాయనోపఁడు." భార. ఆర. ౨, ఆ.

**పాయువు.** సం. వి. ఉ. పుం. గుదము, మూఁడి.

**పాయ్యము.** సం. వి. అ. న. 1. త్రాసు, మూర, తూముళోనగుమానము; 2. జలము. విశ. నిందింపఁదగినది.

**పారంగతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దరిఁజేరినవాఁడు.

**పారంపరి.** సం. వి. ఈ. స్త్రీ. పారంపర్యము. "ఎ, గీ. వంశపారంపరీలబ్ధవైష్ణవాంక, వంచ సంస్కారవిభవవిభ్రాజమానుఁడు." వై. ౧, ఆ.

**పారంపర్యము.** సం. వి. అ. న. 1. కులక్రమము; (పుం. గురుక్రమము. అనికొందఱు.) 2. పరంపరాభావము.

**పారగుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పారంగతుఁడు.

**పారడ.** వ్య. వి. పాలడయొక్కరూపాంతరము.

**పారణ.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. ఉపవాసముండి మఱునాడుచేయుభోజనము. పుం. మేఘము.

**పారతంత్ర్యము.** సం. వి. అ. న. పరాధీనత.

**పారత్రికము.** సం. విశ. (అ. ఈ. అ.) పరలోకసంబంధమైనది.

**పారదము.** సం. వి. అ. పుం. పాదరసము. (రూ. పారతము.)

**పారదారికుఁడు.** సం. వి. అ. పుం. పరదారరతుఁడు.

**పారదేశికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) 1. అన్యదేశస్థుఁడు; 2. దారినడచువాఁడు.

**పారమార్థికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) 1. పరమార్థబుద్ధిగలవాఁడు; 2. ముఖ్యుఁడు.

**పారము.** సం. వి. అ. న. 1. అవలిదరి; 2. సమీపము.

**పారలౌకికము.** సం. వి. అ. న. పరమాన్నము. విశ. పరలోకసంబంధమయినది.

**పారవశ్యము.** సం. వి. అ. న. పరవశత్వము.

**పారశీకము.** సం. వి. అ. పుం. 1. ఒకానొకదేశము; 2. ఆదేశమునందుఁబుట్టినగుఱ్ఱము. (రూ. పారసికము, పారసీకము.)

**పారశ్వధికుఁడు.** సం. వి. అ. పుం. గండగొడ్డలియాయుధముగాఁగలవాఁడు. (రూ. పారశ్వధుఁడు.)

**పారసి.** వై. వి. పారసీకదేశపుభాష*. (చూ. ఆరెము.) విశ. పారసీకదేశమునందుఁ గలిగినది. "పారసిపల్లంబు." సా్వ. ౪, ఆ.

**పారస్త్రైణేయుఁడు.** సం. వి. అ. పుం. పరస్త్రీవలనఁబుట్టిన కొడుకు.

**పారా.** హిం. వి. కావలి. (రూ. పహరా.)

**పారాణి.** దే. వి. కుంకుమనుములోనగువానితో పాదములకుచేయు నలంకారము.

**పారాణించు.** దే. స. క్రి. కుంకుమనుములోనగువానితో పాదముల నలంకరించు.

**పారాయణము.** సం. వి. అ. న. 1. అంతయు; 2. అంతయు చదువుట; 3. పారమునుపొందుట.

**పారావతము.** సం. వి. అ. పుం. 1. పావురము; 2. కోతి తుమికి*.

**పారావతాంఘ్రి.** సం. వి. ఇ. స్త్రీ. మానేరు*

**పారావారము.** సం. వి. అ. న. ఈవలావలిదరులు. పుం. సముద్రము.

**పారాశరి.** సం. వి. ఇ. పుం. వ్యాసముని. న్. సన్యాసి.

**పారి.** ఉభ. దే. వి. 1. తడవ. "ఎ, గీ. ఒక్కపరివ్రాఘ్రమ్మై వచ్చునొక్కపారి, దంష్ట్రియై తోఁచు." ఉ, రా. 3, ఆ. (చూ. పరి.) — 2. మన్ను. "సీ. చుట్టుకంపయికాని పెట్టఁగావెఱతురు వట్టైనకోటలుపారిమగులు." చంద్రా. ౧, ఆ.—సం. ఈ. స్త్రీ. 1. గిండి; 2. ఈడుముంత; 3. ఏనుఁగుకాలిగొలుసు; 4. మల్లె చిప్ప; 5. నీరుప్రబ్బ*.

**పారిక.** దే. వి. దానురాలు, దానిని. ఆం, ఖా.

**పారికాంక్షి.** సం. వి. న్. పుం. 1. ముని; 2. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతశీలుఁడు.

**పారికాఁపు.** దే. వి. పరిచరుఁడు. (చూ. పఱిగడ, పారివాఁడు.)

**పారిజాతము.** సం. వి. అ. పుం. 1. పారిభద్రము*; 2. కల్పవృక్షము; 3. బ. ధాన్యవిశేషము.

**పారిణి.** సం. వి. ఈ. స్త్రీ. పచ్చేయిరుగుడు*.

**పారితథ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. జడబిళ్ల; 2. సిగపువ్వు.

**పారితోషికము.** సం. వి. అ. న. (చూ.) పసదనము.

**పారిప్లవము.** సం. విశ. (అ. ఆ. అ.) చలించునది.

**పారిభద్రము.** సం. వి. అ. పుం. 1. దేవదారువృ*; 2. వావిలి*; 3. వేము*.

**పారిభాద్యము.** సం. వి. అ. న. చెంగల్వకోష్టు*.

**పారియాత్రకము.** సం. వి. అ. పుం. ఒకానొకకొండ. (చూ. పారియాత్రము.)

**పారివాఁడు.** దే. వి. పారికాఁపు, పరిచరుఁడు. ఆం, భా.

**పారిషదుఁడు.** సం. వి. అ. పుం. ప్రమథగణమునందలిచండి కేశ్వరాది.

**పారిహారికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) పరిహారముచేయు వాఁడు.

**పారిహార్యము.** సం. వి. అ. పుం. సూడిగము. (చూ.) ఆవాప కము. విశే. పరిహారముచేయఁదగినది.

**పారీంద్రము.** సం. వి. అ. పుం. సింహము, కంఠీరవము.

**పారీఖత్తు** హిం. వి. విభాగపత్రము.

**పారీణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పారముముట్టినవాఁడు

**పారు.** దే. అ. క్రి. 1. పరుగెత్తు; "శా. శ్రేణుల్ గట్టినభోంత రాళమునఁ బారెంబత్తులు." స్వా. 3, ఆ. (ఇది లఘురేఫకమగుట కావి కవుల ప్రయోగము కనఁబడలేదు.) 2. పానముచేయు.

**పారుకాడు.** దే. అ. క్రి. (పారుక+ఆడు.) పరుగెత్తు. "ద్వి. పారావతమువెంటఁబడివీథులందుఁ, బారుకాడెడు మృదుపదముల వలన." సా. 2, భా.

**పారుడు.** దే. వి. పానము.

**పారుపత్తెకాఁడు.** దే. విణ. 1. దొరతనమువారికియ్యవలసిన ధనమును జనులవలనరాఁబట్టెడి అధికారి; హంస. 3, ఆ. — 2. అధికారి.

**పారుపత్తెము.** దే. వి. 1. దొరతనమువారికియ్యవలసినధనమును ప్రజలవలనరాఁబట్టెడి అధికారము; 2. అధికారము. (చూ. తలతల.)

**పారువ.** దే. వి. జోడ. "సీ. కలికిజక్కవలునీవలిగుబ్బలకునుబ్బి వఱతెంచెఁబారువపట్టెనేమొ." ఉ, రా. ౬, ఆ.

**పారువము.** వై. వి. పారావతము. "పారువమునోనంగుపోయెద సరోరుహలోచన." సా. ౨, ఆ.

**పారుష్యము.** సం. వి. అ. న. 1. పరుసఁదనము; 2. పరుసపు మాట.

**పారేవతము.** సం. వి. అ. న. ఒకదినుసు ఎఱ్ఱకిత్తలి, ఈడకీ.

**పార్తెంచు.** దే. అ. క్రి. పాఱుతెంచుయొక్క రూపాంతరము. (పరు గెత్తివచ్చుటకు. "సీ. సింహంబుదెసభీతిఁజెందిపార్తెంచిన ఘనసిం హముగఁజేసిగర్వమిచ్చె." భార. శాం. 3, ఆ.)

**పార్థక్యము.** సం. వి. అ. న. పృథగ్భావము, వేర్పాటు.

**పార్థివ.** సం. వి. అ. పుం. 1. ఒక సంవత్సరము; (చూ. సంవత్స రము.) ను. 2. గుజ్జము. విణ. పృథివీసంబంధమైనది.

**పార్థివుఁడు.** సం. వి. అ. పుం. రాజు, ఱేఁడు.

**పార్థుఁడు.** సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. రాజు.

**పార్పత్తెము.** దే. వి. పారుపత్తెముయొక్క రూపాంతరము.

**పార్వణము.** సం. వి. అ. పుం. మృగవిశేషము. పుం, స 1. పిండప్రదానము; 2. పర్వసంబంధమయినది.

**పార్వతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గౌరి; 2. ద్రౌపది; 3. ఒక గోపిక; 4. అందుగు; 5. పాలకూర.

**పార్వతీనందనుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి.

**పార్వతేయము.** సం. వి. అ. పుం. ప్రొద్దుతిరుగుడుచెట్టు. విణ. పర్వతమునందుపుట్టినది.

**పార్వము.** వై. వి. పారువముయొక్క రూపాంతరము. "చ. తారకా, గ్రహములఁజంచులంగమిచి క్రొయ్యఁబురింజిఱప్రోదిపార్వము ల్." కవిక. ౧, ఆ.

**పార్శ్వము.** సం. వి. అ. న. పర్శువులసమూహము. పుం. ప్రక్క. త్రి. సమీపము.

**పార్ష్ణి.** సం. వి. ఇ. స్త్రీ. వేఁదుఱెత్తినయాఁడుది. పుం, న. 1. కాలి మడమ; 2. దండువెనుక; 3. వెనుక.

**పార్ష్ణిగ్రాహుఁడు.** సం. వి. అ. పుం. దండెత్తిపోవురాజునకు వెనుకదిక్కుననుండుశత్రువు.

**పార్ష్ణిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. అఱకాలుమీఁగాలుమడమలను మూసి కొనియుండుముచ్చె. అ. న. ము. ముందటనుండి రక్షించెడుసేన.

**పాఱ.** దే. వి. త్రవ్వునట్టియొకానొకసాధనము, ఖనిత్రి.

**పాఱఁదోలు.** దే. స. క్రి. (పాఱన్+తోలు.) తఱుము.

**పాఱఁజూచు.** ద్వ. స. క్రి. దృష్టించిచూచు. "తే. పాఱఁ జూచినఁ బరసేన పాఱఁజూచు, వింటికొఱగినరిపురాజివింటికొఱ గు." విజ. ౧, ఆ.

**పాఱఁబోఁత.** దే. వి. పాఱఁబోయుట.

**పాఱఁబోయు.** దే. స. క్రి. (పాఱన్+పోయు.) ఉమ్మరించు.

**పాఱమ్ము.** ద్వ. వి. (పాఱ+అమ్ము.) పాఱవాతియమ్ము.

**పాఱవాతియమ్ము.** ద్వ. వి. (పాఱవాయి+అమ్ము.) పాఱయొక్క వాదరవంటివాదరగలబాణము. "అచ్చెట్టుబిడారుబొబ్బ మెకంబు పైనగ్గలంబుగఁబాఱవాతియమ్ములునినుప." అచ్చ. సుం, కాం.

**పాఱవేయు.** దే. స. క్రి. (పాఱన్+వేయు.) 1. విసరివేయు; 2. వదలవిడుచు. (సొమ్ముపాఱవేసినవాఁడు.)

**పాఱవైచు.** దే. స. క్రి. (పాఱన్+వైచు.) విసరివేయు. "ఎ, గీ. నిత్యంబులైన, కృత్యములఁబాపిదైవంబుకినుకనిట్లు, పాఱవైచునె మిన్నులువడ్డచోట." స్వా. ౨, ఆ.

**పాఱాడు.** దే. అ. క్రి. (పాఱి+ఆడు.) పాఱు. (మొదటిరూ పముపాఱియాడు. "చ. నసుచుచుఁగూరుచుండుచును నవ్వుచు నిల్చుచుఁ బాఱియాడుచున్." కాశీ. ౫, ఆ.) (చూ. ఈఁగాడు.)

**పాఱు.** దే. అ. క్రి. 1. పరుగెత్తు; "ఉ. పాఱఁడులేచిదిక్కు లకు బాహువులొడ్డఁడుబంధురాజిలోఁ, దూఱఁడు ఘోరకృత్య మనిదూఱఁడుతండ్రినిమిత్రవర్గమున్, జీఱఁడుమాతృసంఘము వసించుసువర్ణగృహంబులోనికిన్, దాఱఁడుకావరేయనఁడుతాపము నొందఁడుకంటగింపఁడున్." భాగ. 2, స్కం. — 2. ప్రవ హించు; (చూ. ఓటాఱు.) 3. ప్రసరించు. "ఉ. వేల్పోకచాప మెత్తిసినివీరుఁడుఁడబ్బదిరెండుబాణముల్, మీఱినపాంద్రభూవిభుని మేనికలంతటనాటినల్లడం, బాఱఁగనేసిరేనిశలభప్రకరంబు మహీ రుహంబుపైఁ, దాఱుతెఱంగుసేసె." ఉ, హరి. 3, ఆ. (ఇది కొన్నిక్రియలకు స్వార్థమందును, కొన్నిటికి ఇంచుక్ర్థానమందును, మఱికొన్నిటికి అరంభార్థమునందును అనుప్రయుక్తమగుచున్నది. విరియఁబాఱు, తెల్లవాఱు, పండఁబాఱు మొ.)

**పాఱుఁడు.** దే. వి. (పాఱు+వాఁడు.) బ్రాహ్మణుఁడు.

**పాఱుఁబోతు.** దే. విణ. (పాఱు+పోతు.) పిఱికి.

**పాఱుటక్క.** ద్వ. వి. (పాఱుఁడు+అక్క.) బ్రాహ్మణస్త్రీ. "సీ. బారసిపోనీదుపైనిద్రఁ బాఱుటక్కలువాడుమత్పుణ్యకథలఁ ద్రోయు." ఆము. ౪, ఆ.

**పాఱుటసుర.** మి. వి. (పాఱుఁడు+అసుర.) బ్రహ్మరాక్షసుఁడు. ‘‘తే. అనిశదత్తసత్యమునకునే త్రాంబులురులఁ, బ్రమదపులకితగా త్రుఁడై పాఱుటసుర.’’ ఆము. ౬, ఆ.

**పాఱుటాకులు.** దే. వి. బ. (పాఱుఁడు+ఆకులు.) మనసులు లోనగువారువస్త్రమునకుమాఱుగా కట్టుకొనెడియొకదినుసు ఆకులు. ‘‘పాఱుటాకులదికుప్పసమిదప్ప.’’ య. ౧, ఆ. (వృత్తియందేక వచనాంతము. ‘‘పాఱుటాకుగుంపు.’’ చంద్రా. ౨, ఆ.)

**పాఱుడు.** దే. వి. పాఱుట, ప్రవాహము.

**పాఱుత.** వై. వి. బ్రాహ్మణభార్య, బ్రాహ్మణి.

**పాఱుతెంచు.** దే. అ. క్రి. 1. పరుగెత్తివచ్చు; ‘‘క. వారించు చుఁబాఱుతెంచివడిగంధర్వుల్.’’ భార. అర. ౫, ఆ.—2. ప్రవహించు. (చూ. ఎనకము రెండవయర్థము.) (ఇందు స్వార్థమున తెంచు.)

**పాఱుపోఁగు.** దే. వి. దూరదూరముగాపోయి నూలిపోఁగు.

**పాఱుపోఁగుపోయు.** దే. స. క్రి. దూరదూరముగా నూలు పోఁగుపోయు.

**పాఱువాఁడు.** దే. వి. బ్రాహ్మణుఁడు. ‘‘మత్తకోకిల. రాజయోగ్యములైన యీహయరత్నముల్ జవసత్వవి, భ్రాజితంబులువాని కేటికిఁబాఱువానికినంచు.’’ భార. అర. ౪, ఆ.

**పాఱువేఁట.** దే. వి. దేవోత్సవవిశేషము.

**పాల.** యు. దే. వి. 1. ఒకానొకపిట్ట, చాషము; 2. క్షీరికవృక్షము. (దీనిభేదము.—చిఱుపాల.) విణ. శ్వేతము. (చూ. పాలకొడిస.) (ఇది పాలుధాతుకృదంతము.)—వై. పాటలము.

**పాలంక్య.** సం. వి. ఆ. స్త్రీ. కుందురుష్కమనెడు గంధద్రవ్యము. (రూ. పాలుక్య.)

**పాలకడలి.** ద్వ. వి. (పాలు+కడలి.) క్షీరాబ్ధి.

**పాలకడలివెన్న.** ద్వ. వి. చంద్రుఁడు, సముద్రనవనీతము.

**పాలకన్ను.** దే. వి. ధాన్యవిశేషము.

**పాలకాయ.** దే. వి. భక్ష్యవిశేషము.

**పాలకి.** వై. వి. పల్లకియొక్కరూపాంతరము. ‘‘ఉ. పాయుతోలంగుమంచుభయపార్శ్వములన్ బగళంబుసేయుచున్, దోయజలోచనల్ గొలిచితోఁజనుదేరఁగఁబెండ్లికూఁతు, రత్యాయతవైభవస్ఫురణ నంతిపురంబునకేగుదెంచెఁబై, డాయఁగదిద్దివైచినకడానిముసుంగు పసిండిపాలకిన్.’’ నై. ౭, ఆ.

**పాలకీ.** వై. వి. పాలకియొక్కరూపాంతరము.

**పాలకీబొంగుచుక్క.** ద్వ. వి. మఘానక్షత్రము.

**పాలకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) రక్షకుఁడు.

**పాలకుప్ప.** ద్వ. వి. (పాలు+కుప్ప.) పయోరాశి. ‘‘ఆ. గొల్లరీతిఁబాలకుప్పఁద్రచ్చి.’’ భాగ. ౮, స్కం.

**పాలకూర.** వై. వి. (పాలు+కూర.) మధుస్రవ.

**పాలకొడిస.** ద్వ. వి. శ్వేతకుటజము.

**పాలకొయ్య.** దే. వి. (చూ.) యూపము.

**పాలగచ్చ.** దే. వి. నన్ననున్న పుష్పలత.

**పాలగరువు.** ద్వ. వి. మీఁద ఇసుకగలజాలిపాఱునేల.

**పాలగార.** దే. వి. (చూ.) పాలగచ్చ.

**పాలగుంజె.** ద్వ. వి. (చూ.) యూపము.

**పాలగుమ్మ.** దే. వి. పాలపిట్ట, చాషము. అ, పా.

**పాలగుమ్ముడు.** వై. వి. (పాలు+గుమ్ముడు.) నల్లనేలగుమ్ముడు, క్షీరవిదారి. (ఇక్కడ వ్యతిరేకలక్షణ.)

**పాలగొలిమిడి.** ద్వ. వి. (పాలు+గొలిమిడి.) పయస్విని.

**పాలగోఁకుడు.** ద్వ. వి. (పాలు+గోఁకుడు.) గోఁకియెత్తినపాల కుండలోనియడుగంటు.

**పాలఘ్నము.** సం. వి. అ. పుం. గుడ్డికామంచి.

**పాలచేఁప.** దే. వి. ఒకదినుసుతెల్లచేఁప.

**పాలచేరులు.** ద్వ. వి. బ. గజ్జెనరము. ‘‘సీ. పాలచేరులుపట్టి తూలింపబలిమినీవ్చుకొనిడొంకలఁదూఱిచుట్లఁబెట్టు.’’ స్వా. ౪, ఆ. (రూ. పాలచేర్లు. ‘‘ఉ. సారెకుఁబాలచేర్లుబలుజాగిలముల్ కబళించియీడ్వఁగా.’’ ఉ, రా. ౭, ఆ.)

**పాలచొఱ.** దే. వి. సముద్రమునుండి మనుష్యులను భక్షించెడు తెల్లనిచొఱమీను.

**పాలడ.** ద్వ. వి. (పాలు+అడఁగు.) బిడ్డలకుపాలుపోసెడు చిన్న శంఖము.

**పాలతుత్తము.** ద్వ. వి. అంగడిమందుదినుసు, ఖర్పరి.

**పాలతేఁకు.** దే. వి. తేఁకుదినుసు, గృహద్రుమము.

**పాలనము.** సం. వి. అ. న. రక్షణము. (ఇది ఆకారాంతస్త్రీలింగము నగును.)

**పాలపండ్లు.** ద్వ. వి. బ. (పాలు+పండ్లు.) పుట్టుదంతములు. ‘‘తే. కృతపయఃపానవమేఘుపృథుకములకు, రాలెనొయ్యనవడ గండ్లపాలపండ్లు.’’ ఆము. ౪, ఆ.

**పాలపాపఁడు.** ద్వ. వి. (పాలు+పాపఁడు.) పాలుత్రాగెడు బిడ్డఁడు.

**పాలపూస.** దే. వి. తెల్లనిగాజుపూస, చంద్ర.

**పాలబుగ్గలు.** ద్వ. వి. బ. (పాలు + బుగ్గలు.) పాలంటినబుగ్గలు. (చూ. కదలాడు.)

**పాలమన్ను.** ద్వ. వి. ధవళమృత్తిక, సుద్ద.

**పాలము.** సం. వి. అ. పుం. 1. కొయ్యపడిగము; 2. (చూ.) మడ్డు.

**పాలమున్నీటికూఁతురు.** ద్వ. వి. (పాలమున్నీరు+కూఁతురు.) లక్ష్మీదేవి, క్షీరసాగరకన్యక.

**పాలమున్నీటియల్లుఁడు.** ద్వ. వి. (పాలమున్నీరు+అల్లుఁడు.) విష్ణువు. ‘‘ఎ, గీ. గంధవాహంబులేదునుగఱులుగాఁగ, విలయ కాలానలజ్వాలములికిగాఁగ, లచ్చిచనుదోయికుంకుమ బచ్చెనయుగఁ, బాలమున్నీటియల్లుండుబాణమయ్యె.’’ భీ. ౪, ఆ.

**పాలమున్నీరు.** ద్వ. వి. (పాలు+మున్నీరు.) క్షీరసాగరము.

**పాలవాఁగు.** వై. వి. (పాలు+వాఁగు.) క్షీరాబ్ధి. ‘‘క. ఇరుచక్కమేనులూఁకబలు, దొరకొలపుంబాలవాఁగుతోఁగలయనుంగై.’’ అచ్చ. బాల, కాం.

**పాలవిఱుగుడు.** ద్వ. వి. (పాలు+విఱుగుడు.) కాఁగినపాలు ఏదేనియొకదోషముచేత విఱిగిపోయి నీళ్లుగా నేర్పడినభాగముపోఁగా మిగిలిన చినచిన్న తెల్లముద్దలు, ఆమిక్ష.

**పాలవెల్లి.** ద్వ. వి. (పాలు+వెల్లి.) క్షీరాబ్ధి. ‘‘క. వెల్లుగనర్థుల కోర్కులు, వెల్లిగొలుపుమొదవుపాలవెల్లినిబుట్టెన్.’’ భాగ. ౮, స్కం.

**పాలసుఁడు.** వై. విణ. 1. మూర్ఖుఁడు; "మ. వసుధాధీశ్వర సభటుల్ పటుశిలావర్షంబుచేఁ గొందఱు, గ్రసమీరోద్ధతిఁగొంద ఱుగ్రామడిసిరింకన్ వారికైకుండిపా, లసునింబోలకు." ఉ, రా. ౭, ఆ.—2. దుర్జనుఁడు*. "తే. పాలసుమేపరిక్రొన్ననఁబోఁడి తెగల, యీలువులుమొక్కపటిచియుమేలికత్త, లానిపైనెక్కిమోఁసి పాలసులనెల్లఁ, జిదుమఁగలబల్లిదుఁడవివెగడవితంత్రి." అచ్చ. బాల, కాం.

**పాలసున్నము.** ద్వ. వి. పాలగచ్చు. "సీ. పటుహీరములె చాలుఁ బాలసున్నమొనర్పశక్రాశ్మములెచాలుఁ జాఁదుపూయ." వసు. ౪, ఆ.

**పాలాడు.** దే. స. క్రి. (పాలు+ఆడు.) ఖండించు. "క. వలఁ బాటినవానినిభటు, లటుఁగులఁబాలాడిరి." స్వా. ౪, ఆ.

**పాలానుగు.** ద్వ. వి. (పాలు+ఆనుగు.) దుగ్ధతుంబి**౹**.

**పాలారుచు.** దే. స. క్రి. (పాలు+ఆరుచు.) ఉపేక్షించు. (చూ. పాలార్చు. "క. బాలుఁడుకరమునను గ్ర, వ్యాళముఖరి యుంచియాడువడువునరక్షః, పాలునిఁద్రుంపకయూరక, పాలా ర్చుటనీతియేశుభప్రదయింకన్." (చూ. ముందుపద్యము.) భాగ. 3, స్కం.) (దీనిని కవిత్రయమువారును ఇతరులున పట్టి చేపట్టి అనుపూర్వకాలికాసమాపకక్రియలకు వెనుకచేర్చి ప్రయో గించియున్నారు.)

**పాలావు.** ద్వ. వి. (పాలు+ఆవు.) మిగులపాలిచ్చెడియావు, పయస్విని.

**పాలాశము.** సం. వి. అ. పుం. ఆకుపచ్చేన. విణ. ఆకుపచ్చనిది.

**పాలాసత్రాళ్లు.** ద్వ. వి. బ. గుఱ్ఱముకాళ్లుగట్టుత్రాళ్లు.

**పాలించు.** సం. స. క్రి. రక్షించు, కాపాడు.

**పాలిండ్లు.** ద్వ. వి. బ. (పాలు+ఇండ్లు.) స్త్రీస్తనములు.

**పాలిక.** సం. వి. ఆ. స్త్రీ. వివాహకాలమునందు నవధాన్యములు నాటుపోసెడుశరావవిశేషము. (చూ. జోజోము.) (ఇది సంస్కృత పదముగా అనేకగ్రంథములయందు ప్రయోగములు కనఁబడుచు న్నవి. ఒకానొకనిఘంటుకారుఁడు దీనిని తెనుఁగుగా వ్రాసియు న్నాఁడు.)

**పాలికాఁపు.** దే. విణ. (పాలు+కాఁపు.) భాగస్థుఁడు.

**పాలిచేట్టము.** దే. వి. (పాలు+చేట్టము.) పాలివాఁడు.

**పాలితము.** సం. వి. అ. పుం. పెద్దబేఁకు**౹**. విణ. 1. రక్షింపఁ బడినది; 2. పెంచుకొనఁబడినది.

**పాలిని.** సం. వి. ఈ. స్త్రీ. నల్లతెగడ**౹**. విణ. పాలించేనది.

**పాలివాఁడు.** దే. వి. (పాలు+వాఁడు.) 1. జ్ఞాతి; 2. పాలేరు వాఁడు. విణ. భాగస్థుఁడు.

**పాలు.** యు. దే. అ. క్రి. తెల్లనగు. (వానిముఖము పాలిపోయి నది.) — వి. 1. భాగము; (ఈసొమ్మువానిపాలికివచ్చినది.) 2. వంతు; (ఈపనిచేయుటనాపాలు.) 3. వశము; "క. నృప ధర్మవైశ్యధర్మము, లపాపకర్మములుజీవనాభావముపా, లుపడినబ్రాహ్మ ణునకునర, శపాతమగుశూద్రకర్మకర్తృత్వమునన్." భార. శాం. ౫, ఆ. — 4. సమీపము; (వానిపాలికిపొమ్ము.) 5. బ. ప్రాలు యొక్కరూపాంతరము. (చూ. పాలుమాలు.)—వై. 1. క్షీరము; 2. మఱ్ఱిమొదలగుచెట్లయందుకలిగెడు తెల్లనిరసము*.

**పాలుగొను.** దే. స. క్రి. (పాలు+కొను.) పంచుకొను. (చూ. పాల్గొను.)

**పాలుపడు:** ద్వ. అ. క్రి. 1. పూనుకొను; "తే. పరులలేములు వాపంగఁబాలుపడిన, యమరతరువులకొదవెఁబుష్పములలేమి." నై. ౪, ఆ. — 2. స్వాధీనమగు. "ఆ. ఎచటనున్న నెవటికేగిన నీపాద, పద్మభక్తిమాకుఁబాలుపడును, గాతమచలయగుచు." అహ్యా. బాల, కాం.

**పాలుపుచ్చు.** దే. ప్రే. (పాలుపోఁజేయు.) 1. విభాగించు; 2. నిర్ణయించు. "ద్వి. పాలునునీళ్లు నేర్పఱిచియారెంటిఁ, బాలు పుచ్చిసమీఁదబాధింపుమనుఁడి." సా. ౪, భా.

**పాలుపోవు.** దే. అ. క్రి. 1. విభక్తమగు; 2. నిర్ణీతమగు. (నాకు అది యెటుచేయనుపాలుపోలేదు.)

**పాలుబోన.** దే. వి. ఉభయరాశియైన అంబారములో కాఁపువానికి చేరవలసిన వర్తనధాన్యము.

**పాలుమాలిక.** దే. వి. ప్రాలుమాలికయొక్కరూపాంతరము. (చూ. పాలుమాలు.)

**పాలుమాలు.** దే. అ. క్రి. ప్రాలుమాలుయొక్కరూపాంతరము. "రగడ. పాలుమాలిన్నపాలునుతవనపాలురిడునులుసాలుడాఁ చెను." చంద్ర.

**పాలువెట్టు.** దే. స. క్రి. (పాలు+పెట్టు.) 1. భాగించు; పంచ. నా. ౧, ఆ.—2. నిర్ణయించు.

**పాలెలు.** దే. వి. బ. బిల్లలమొలత్రాటియందలి వెండిబంగారముల బిల్లలు. ["క. కక్కులకొడవలిపాలెం, జక్కఁగఁదెగియున్నక్రూర సర్పమువదనం, బొక్కటియుండఁగఁగనుఁగొని, యక్కజముగఁ బతికిఁజూపియతఁడిట్లనియెన్." (ఇందుపాలె అనునదివేఱుపదము గాక అదిగానేయున్నపక్షమందు దానికి వాదర అర్థమగుచున్నది.) భో. ౪, ఆ.]

**పాలేరు.** దే. వి. (పాలు+ఏరు.) మేఁడిపాలికిదున్నెడుమడఁక.

**పాలేరువాఁడు.** దే. విణ. మేఁడిపాలికిదున్నెడుమడఁకవాఁడు.

**పాలేఱు.** ద్వ. వి. (పాలు+ఏఱు.) 1. క్షీరనది; "క. ఎండ వడచేతవాతెఱ, లెండ వడిన్ నడచిమారుతేరితలహరీ, మండల తాండవహిండన, పాండిత్యమ్మునఁదనర్చుపాలేటిదరిన్." పర. ౪, ఆ.—2. క్షీరాబ్ధి. "దండకము. పెంపురాణింపఁదోల్వేల్పులున్ వేల్పులున్ గూడిపాలేఱుచ్చేత్రచ్చుచోమేటితామేటిమైయెత్తిమవ్వం పుఁగవ్వంపుగట్టేపునన్ వీఁపునన్ దాల్పవా." నీలా. ౨, ఆ.

**పాల్కడలి.** ద్వ. వి. పాలకడలియొక్కరూపాంతరము.

**పాల్గొను.** దే. స. క్రి. పాలుగొనుయొక్కరూపాంతరము. "క. మనుమలుతాతధనముపా, ల్గొనయోగ్యతగల్గిపంచుకొనఁజోఁదమ కున్, జనకులుపెక్కండ్రైనను, జనకులయంశములుగొనఁటనర్థశ్రుమి లన్." విజ్ఞా. వ్య, కాం.

**పాల్పడు.** ద్వ. అ. క్రి. పాలుపడుయొక్కరూపాంతరము. (పూనుకొనుటకు. "ఉ. భల్లతరక్షుసింహమృగపఙ్క్తులఁద్రుంపఁ గఁగొందఱాత్మఁబెం, పుల్లసిలంగఁబాల్పడిరి." రామా. ౨, ఆ.)

**పాల్మాలిక.** దే. వి. పాలుమాలికయొక్కరూపాంతరము.

**పాల్మాలు.** దే. అ. క్రి. పాలుమాలుయొక్కరూపాంతరము.

**పావంచె.** ద్వ. వి. మెట్టు, సోపానము.

**పావకము.** సం. వి. అ. పుం. 1. చిత్రమూలము; 2. ఛేడి**౹**; 3. నెల్లి**౹**.

**పావకుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు; 3. మంచినడవడికలవాఁడు.

**పావకోళ్లు.** ద్వ. వి. బ. కొయ్యతోచేసిన పాదరక్షలు, పాదుకలు.

**పావటీలు.** దే. వి. బ. మెట్లు, సోపానములు.

**పావడ.** దే. వి. 1. స్త్రీలుమొలఁగట్టుకొనెడువస్త్రవిశేషము; "క్రొమ్మె ఱుఁగుదువ్వలువల్ కడవేసిజిల్గుపావడఁగొంగఁగట్టి." చంద్ర.— 2. ధౌతవస్త్రము; "సీ. తలవెంట్రుకలుపావడలనద్దియద్దిశిప్రమ లడియార్చిపువ్వులుముడిచి." కళా. ౭, ఆ. "మ. అవనీ కన్యకఁగూడియిట్లుచతురాహారంబులందృప్తుఁడై, యవనీశాగ్రణి కామినీకర మణివ్యానంగభృంగారకాం, బువులఁ ధౌతకరాననారుణ పదాబ్జుం డైనచోభూమిపు, త్రివెసంబావడయిచ్చిపైఁటఁదడి యొత్తెఁ భర్తపాదాబ్జముల్." ఉ, రా. ౬, ఆ. — 3. వస్త్రము. "వ. ఆక్షణంబతెచ్చినెచ్చెలియుందానునప్పలకకప్పఁ బావడయెడలిం చి." ప్రభా. ౧, ఆ.

**పావడము,** దే. వి. కానుక. "ఎ, గీ. అనచునీనాల్గుమణులును నంబురాశి, పావడంబుగనాచేతఁబనిచెనీకు." విక్ర. ౫, ఆ.

**పావనము.** సం. వి. అ. న. 1. సాంతపనాదివ్రతము; 2. జలము; 3. గోమయము; 4. రుద్రాక్షము. పుం. 1. అందుగుబంకతోఁ జేసినధూపద్రవ్యము; 2. పచ్చేగుంటగలిజేరుⁱ. విణ పవిత్రము.

**పావని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు; 2. గంగ; 3. తులసిⁱ. ఇ. పుం. 1. భీముఁడు; 2. హనుమంతుఁడు. విణ. పవిత్రపు రాలు.

**పావలి.** దే. వి. చిన్నజాతిగోళికూరాకు, విచిల్లిక.

**పావలు.** వై. వి. బ. పావకోళ్లు. (పాగలుయొక్క-రూపాంతరము. చూ. దలిమము.)

**పావాడము.** దే. వి. (చూ.) పవాడము.

**పావాలు.** వై. వి. బ. పాగాలుయొక్క-రూపాంతరము.

**పావి.** వై. వి. పాపి. "ఉ. ఇష్టుమూఁగయక, పావులనోరు నీయెడమపాదతలంబునఁ దన్నినట్లుగా, నీవొకయింతయావురని యేడ్వఁ గదన్న కుమారరత్నమా." (ఈపద్యము ముందుభాగమును చూ. తలపోఁతకడ.) పర. ౨, ఆ.

**పావు.** వై. వి. నాలవభాగము, వరాలో నాలవభాగము*.

**పావురపుఁబలుకు.** ద్వ. వి. (పావురము+పలుకు.) మణితము.

**పావురము.** వై. వి. పావురాయి, పారావతము.

**పావురాయి.** వై. వి.——పై.——

**పావులా.** వై. వి. రూపాయలో నాలవభాగము*.

**పాశకము.** సం. వి. అ. పుం. పాచిక, అక్షము.

**పాశము.** సం. వి. అ. పుం. 1. త్రాడు; 2. కేశపర్యాయము లకుపరమైనచోవానిసమూహము; (కేశపాశము మొ.) 3. కర్ణశబ్ద పూర్వకమైనప్పుడు సుకర్ణము; 4. ఛత్రపూర్వకమైనప్పుడు కుత్సి తచ్ఛత్రము.

**పాశి.** సం. వి. న్. పుం. 1. వరుణుఁడు; 2 యముఁడు; 3. వ్యాధుఁడు. విణ. పాశధరుఁడు.

**పాశుపతము.** సం. వి. అ. పుం. 1. పశుపతియధిదైవతముగాఁ గలయొకయస్త్రము; 2. పశుపతిమతము; 3. బకపుష్పముⁱ. విణ. పశుపతియందానగలది.

**పాశుపాల్యము.** సం. వి. అ. న. గోమహిష్యాదిపోషణవృత్తి.

**పాశ్చాత్త్యుఁడు.** సం. వి. అ. పుం. వరుణుఁడు. విణ. 1. పడ మటివాఁడు; 2. వెనుకటివాఁడు.

**పాశ్య.** సం. వి. ఆ. స్త్రీ. పాశములసమూహము.

**పాషండము.** సం. వి. అ. పుం. ఒకమతము.

**పాషండుఁడు.** సం. వి. అ. పుం. వేదబాహ్యుఁడు. (రూ. పాషండి. న్. పుం.)

**పాషాణదారకుఁడు.** సం. వి. అ. పుం. ఱాయితొలుచేసని వాఁడు, కాసీఁడు.

**పాషాణదారణము.** సం. వి. అ. పుం. (చూ.) కాసెయులి, టంకము.

**పాషాణము.** సం. వి. అ. పుం. ఱాయి, శిల, గ్రావము.

**పాసఁగు.** దే. వి. శాలిధాన్యవిశేషము. "సీ. ఏఁటేఁటవిరిసిట నిరుగారునుంబండుఁబాసఁగువరిచేలుపసిఁడిచాయ." భీ. ౨, ఆ. (మొదటిరూపము ప్రాసఁగు.)

**పాసనము.** వై. వి. కడుపువెళ్లుట, విరేచనము.

**పాసిక.** వై. వి. పాచికకు మొదటిరూపము.

**పాసెము.** వై. వి. పాయసము. (చూ. పణ్యారము.)

**పాళి.** దే. వి. పోఁకలొనగువానికప్పడుతోడిపూఁగుత్తి, కుహళి. "రగడ. పాళకల్లదిపోఁకఁబ్రాఁకబందముదెగియె." స్వా. 3, ఆ.

**పాళెము.** యు. దే. వి. 1. విధము; 2. సమయము. "రగడ. భామకోయకువేగపడి పూఁబాళఁబాళముగాదునేటికి." పా. ౪, ఆ.—వై. 1. బంగారులోనగువానికడ్డి*; 2. కొలఁది*. "ఉ. పాళముమీఱఁబెద్దపెదపాళముల్లై బలితంపుఁగాఁగులఁ, మూలుగు చున్న ప్రాఁబసిఁడిముంచి ధనార్థులకిచ్చు." (ఇది యీ రెండర్థ ములకునుదాహరణము.) పాండు. ౪, ఆ.

**పాళా.** వై. వి. బంగారులోనగువానికడ్డి*. (పాళముయొక్క-రూపాంతరము.)

**పాళి.** ఉభ. వై. వి. 1. జోదమాడెడుఫలక*; 2. సారెలపోఁత*. "గుప్తమనుజపాళులో." హన. 3, ఆ. — సం. ఇ. ఈ. స్త్రీ. 1. అంచు; 2. గుఱుతు; 3. చోటు; 4. వరుస; 5. చెవి తమ్మె; 6. కొండనెత్తము; 7. మీసములుగల ఆఁడుది; 8. పేను.

**పాళియ.** వై. వి. పాళె*.

**పాళియము.** వై. వి. పాళెమునకు మొదటిరూపము. (దండునకు— "ఉ. ఆవనవీథిలోఁగలమృగావలిఁబత్తుల సంహరించిపూ, ర్వావని భృత్తటాటవులనాటవికుల్ మృగయావిహారముల్, చేవదలిర్పఁజేయు టకుశీఘ్రమపాళియమెత్తి." కాళ. 3, ఆ.)

**పాళీ.** యు. దే. వి. వ్రాసెడియినుపకలముయొక్క-మొన. వై. 1. జోదమాడెడుపలక*; 2. బ. జోదము. "పాళీలభీష్టంబులే." భాగ. ౧౦, స్కం. పూ. (పాళియొక్క-రూపాంతరము.)

**పాళె.** వై. వి. జోదమాడెడుపలక*. (పాళియయొక్క-రూపాంతరము.)

**పాళెంబుదిగు.** ద్వ. అ. క్రి. (దండు) విడియు. (చూ. పాళెము.) (ప్రే. పాళెంబుదించే. "సీ. పాళెంబుదించుచోఁబయ నంబునేయుచోనెందుఁగ్రందుకానీనినేర్పు." ఉ, రా. ౪, ఆ.)

**పాళెగాఁడు.** ద్వ. వి. (పాళెము+కాఁడు.) పాళెముపట్టుదొర. "చ. భువనబంధుఁడులేనియరాజకంబుచే, దనరపమ్మెచరించె వసుధాస్థలిఁజీఁకటిపాళెగాఁడొగిఁ." అని. 3, ఆ.

**పాళెము.** వై. వి. 1. కావలి; "ఉ. నందివినాయకాదిగణనాథులు గూడిధృతాస్త్రశస్త్రులై, యెందఱుపాళెముందురుమహీధరశస్యకుపావ

భాచుత్రై, సందదివినాయకాదిగణనాథులు హడిధృతాస్త్రశస్త్రులై. యంచ యుఁబాళెముందురుమహాప్రభుపీఠికిదక్షవాటికిన్." భీ. 3, ఆ.— 2. పాళెగానిపట్టణము*; 3. చిన్నపట్టణము*; "సీ. మూడుపాళెములుతెంపునగెల్చిపొదలుజాబిల్లితొలుపువేల్పుబీరమెంత." య. ౧, ఆ.—4. దండు*; "ఉ. దర్పవలం, బాళెముడించియొక్కఁడవుబాణకృపాణధనుర్ధరుండవై, యాలవణుండుప్రోల్వెడలినప్పుడెకప్పము గొప్పతూపులన్." ఉ, రా. 2, ఆ.—5. దండువిడియు చోటు*. "వ. రాజన్యులుకొండదిగి దండునకుఁబాళెంబులుదిగం బాళెంబులెత్తింగి." రామా. 2, ఆ.

**పాళెముపట్టు.** ద్వ. వి. పాళెగానిరాజ్యము. "సీ. కమలాకరములుపాళెముపట్టుకొనఁగెదనెంచుఁడీనాదెసయంచలార." చంద్ర.

## పి.

**పింగ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోజనము; 2. పార్వతి; 3. ఇంగువ; 4. కాఁడ. అ. న. ము. కురువేరు. పుం. గోరోజనపు వర్ణము. విణ. గోరోజనపువర్ణముగలది.

**పింగలి.** దే. విణ. వెనుకటిది, వెనుకటివాఁడు. "ఉ. మోదమునందనూభవుని ముంగలిగానడపించితానుదు, ర్భేదబలాన్వితుండగుచుఁ బింగలియైచనదేవకోటిశౌ, ర్యోదయలీలఁగూడుకొనియుండొరుఁ బల్కుచుశక్రమోక్షణా, హ్లాదముగోరిపెంపున రయంబెసఁగన్ బఱతెంచితాఁకినన్." నిర్వ. ౬, ఆ.

**పింగటించు.** గ్రా. వి. అతిశయపు మాటలాడు. (రూ. సింగ కించుట.)

**పింగళ.** సం. వి. ఆ. స్త్రీ. 1. దక్షిణపుదిక్కునందలి ఆఁడేనుఁగు; 2. ఒకనాడి; 3. సైఁడికంటి; 4. ఒకానొకవేశ్య. అ. పుం. సంవత్సరవిశేషము. (చూ. సంవత్సరము.) ము. 1. గోరోజనము వంటివర్ణము; 2. కోఁతి; 3. ఒకపాము; 4. ముంగిస; 5. నిధి విశేషము. విణ. గోరోజనమువంటివర్ణముకలది.

**పింగళుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యునిప్రక్కనుండు వారిలోనొకఁడు; (చూ. దండుఁడు.) 2. అగ్ని; 3. శివుఁడు.

**పింగాణి.** దే. వి. ఒకదినుసు తెల్లమట్టిపాత్రము. "గాజుపింగాణి." రుక్మాం. ర, ఆ.

**పించియము.** వై. వి. పించెము. "సీ. చిప్పకూఁకటివానిచిన్నినవ్వులవానిఁ జెరివిననెమ్మిపించియమువాని." పాండు. ౧, ఆ.

**పించెము.** వై. వి. నెమిలిపురి. (పించియముయొక్కరూపాంతరము)

**పించేము.** వై. వి. మదము*.

**పించను.** ఆం. వి. చిరకాలము పనిచేసినందుకై యిచ్చుమనోవృత్తి.

**పించము.** సం. వి. అ. న. 1. నెమిలిపురి; 2. కృష్ణునిశిరోభూషణము.

**పింజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. దూది; 2. పసుపు. అ. న. ము. 1. బలము; 2. హింస. విణ. కలఁతపాటినది.

**పింజనము.** సం. వి. అ. న. దూదేకువిల్లు.

**పింజరము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. హరిదళము. పుం. 1. ఎఱుపుమిళితమైన పసుపువర్ణము; 2. తామ్రము. విణ. 1. ఎఱుపుమిళితమైన పసుపువర్ణముగలది; 2. కలఁతపాటినది.

**పింజలము.** సం. వి. అ. పుం. మిక్కిలి కలఁతపాటిన సేనభాగపు శక్తి.

**పింజించు.** దే. స. క్రి. 1. పింజెపోయు; "సీ. పింజించికట్టినబిగువుపచ్చనిపట్టుతోలుకారుమెఱుఁగులఁదుఱఁగలింప." కవిక. ౬, ఆ. — 2. నీళ్లుచిలుకరిలఁజిమ్ము. "మ. ఇభలోకేంద్రుఁడుహస్తరంధ్రములనీరెక్కించిపూరించిచం, డభమార్గంబున కెత్తినిక్కవడినుద్దాడించిపింజింప." భాగ. ౮, స్కం.

**పింజిక.** సం. వి. ఆ. స్త్రీ. నూలిచుట్ట, తూలనాళిక.

**పింజూషము.** సం. వి. అ. పుం. కర్ణమలము, గులిమి.

**పింజె.** దే. వి. 1. ముందుచెక్కుకొనెడివస్త్రపుకుచ్చె; "సీ. సరిలేనిరాకట్టుజాళువామొలకట్టుబెడఁగారునీర్కావిపింజెకోడ." స్వా. 3, ఆ. — 2. వెనుకఁజెక్కుకొనుదోవతికొంగు. "మ. సిగవీడన్ వెనుచక్కిపింజెవదలన్ జేపట్లకున్ వచ్చినన్." ఉ, రా. ౬, ఆ.

**పింజే.** వై. వి. 1. దూదేకువిల్లు, పింజనము; (చూ. పింజారి.) 2. బాణముక్రిందిచివర, పుంఖము*. "తే. వారలతిచిత్రకరలాఘవంబుపేర్మిఁ, జేర్చియొండొరుపయినేయఁబింజపింజఁ, గఱచుకొనిపాఱుతూపులొక్కటియుఁబోలెఁ, గానుపించుచుఁదలఁపించెగడలపోరు." కళా. ౮, ఆ.

**పింజెనగ్రోవి.** దే. వి. (పింజెన+క్రోవి.) చిమ్మనగ్రోవి. "చ. నరపతియొండువిల్గొనిగుణధ్వనిచేసికుమారుమీఁదని, ర్భరగతినేసెనర్వదిశరంబులురంబునఁగాఁడనెత్తురా, విరునగుగంటులందొరఁగి పింజనగ్రోవులరీతిఁబాఱఁగా, నరుణమరీచిమాలిక్రియనక్కజపట్టివెలింగెనాజిలోన్." జై. ౨, ఆ.

**పింజారి.** ద్వ. వి. (పింజె+అరి.) దూదేకువాఁడు. (సంధిని వర్ణవికారము.)

**పింత.** సం. వి. ఆ. స్త్రీ. విటజనసమాశ్రయము. (చూ. వేశము.)

**పిండపుష్పము.** సం. వి. అ. న. 1. మెట్టనూఁబు; 2. అశోకపుఁబువ్వు; 3. దాసనపుఁబువ్వు.

**పిండము.** సం. వి. అ. న. 1. బ్రదుకుఁదెరువు; 2. ఇనుము. పుం. 1. అన్నపుపిడుచే; 2. పితృదేవతలకిచ్చెడు అన్నపుముద్ద; 3. గర్భము; 4. శరీరము; 5. శరీరమునందు ఏకదేశము; 6. గృహమునందు ఏకదేశము; 7. చెండు; 8. గజకుంభము; 9. బోళము; 10. బలము; 11. సమూహము; 12. ధట్టము; 13. చిల్లమడ్డి; (రూ. పిండకము.) 14. దాసనము†.

**పిండలి.** వై. వి. ముద్ద. "వ. కసిమసంగినమారిపిసికిపిండలిచేసినచందంబునంగొండలైనకండలరాశిఁగలసి." ఉ, హరి. ర, ఆ.

**పిండాభ్రము.** సం. వి. అ. న. వానతూర.

**పిండాలువు.** సం. వి. ఉ. పుం. చేఱకంద†.

**పిండి.** ఉభ. వై. వి. బియ్యములోనగువాని పొడి, పిష్టము. సం. ఈ. స్త్రీ. 1. సమూహము; 2. ఒకదినుసు ఈఁదు†; 3. మంగ†; 4. శారి†.

**పిండిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. బండికంటినడిమితూము; 2. తురుష్కదేశమునందు అందుగుబంకతోఁజేసెడు ధూపద్రవ్యము; 3. పిక్కయందలిమాంసము.

**పిండికూడు.** ద్వ. వి. సంకటి.

**పిండికూర.** వై. వి. ఒకదినుసుకూరాకు. "ఆ. ఉల్లిపుర్చుకాయముల్లంగిశారకాయ, పిండికూరనేతిబీఱకాయ, చిట్టిమేడికాయ చెంచలివంకాయ, కానిమంచికూరగాయఁదేను." జై. ४, ఆ. (దీనిని పిండిబొద్దికూర అందురు.)

**పిండికొండ.** వై. వి. వృక్షవిశేషము, కొండపిండి.

**పిండితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దట్టము; 2. గుణింపఁబడినది; 3. ఎంచేఁబడినది; 4. చేర్పఁబడినది.

**పిండిదొండ.** వై. వి. తుర్యతుఁడిశీ.

**పిండిపోకలు.** వై. వి. బ. గుడపిండములు.

**పిండిమిరియము.** వై. వి. పులుపుతేక పలుచేగావండిన వ్యంజన విశేషము.

**పిండిలము.** సం. వి. అ. పుం. (రూ.) వంతెన.

**పిండివంటు.** దవ్. వి. 1. అప్పములోనగు అపూపము; 2. చెక్కలములోనగుభక్ష్యము.

**పిండివడియము.** వై. వి. పిండితోచేసినవడియము. "గుడిమ్రింగువానికినందిపిండివడియము." వి క్ర. ౨, ఆ.

**పిండీకృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ముద్దగాఁజేయఁబడినది.

**పిండీతకము.** సం. వి. అ. పుం. 1. మంగశీ; 2. మరువముశీ.

**పిండు.** ఉభ. దే. స. క్రి. 1. పాలుపితుకు; 2 రసముపిడుచే. వై. వి. సమూహము, గుంపు. "అచ్చంరిలేమపిండు." భార శాం. ౩, ఆ.-సం. అ. పుం. చెండు. "నూతిలోఁబడినకాంచన పిండుఁగొనంగలేక." (తెనుఁగునందు ఉత్వమువచ్చినది.) భార ఆది. ౫, ఆ.

**పిండుగట్టు.** దవ్. అ. క్రి. (పిండు+కట్టు.) గుంపుగూడు. "హంసతెల్లఁబిండుగట్టితిరుగుచుండె." భార. అర. ౨, ఆ.

**పిందియ.** దే. వి. పిందె. "తే. నాథచివురులురంజిల్లెనలుమొలచె, నలరెవిరులెల్లఁబూపలుతలలునూపెఁ, బసిమినిరవొందెఁ బిందియల్ బలిసెనవళ, లాటుపులుసాంద్రరుచులఫలంబులెసఁగ." వసు ౧, ఆ.

**పిందె.** దే. వి. 1. కాయయగుటకుముందటిది; (దీనికి ముందటిది పూఁబిందె.) 2. రత్నాలపోఁగులులోనగువానియందు శేవపెట్టు నేర్పఱచెడుతదవయవవిశేషము. (పిందియయొక్క రూపాంతరము.)

**పింపిణీ.** దే. వి. స్త్రీవేణీవిశేషము. "మ. జడిగొల్కోర్కులనింతితాను మగవేషంబూనినున్పింపిణీ, జడలన్ బాపటరావిరేక జగి పెచ్చన్ గొప్పపొంకించి." సత్య. 3, ఆ.

**పింపిసలాడు.** దే. అ. క్రి. (పింపిసలు+ఆడు.) 1. బాలికలు పెదవిమీఁదుగానొకవిధమైనధ్వనికలిగించుచునర్తించే; "తే. వేడుకలు మీఱఁబింపిసలాడుమఱియు." రుక్మి. ౧, ఆ. — 2. నర్తించే. "తురులుబొమ్మలమీఁదఁగులికిపింపిసలాడ." రసి. ౬, ఆ.

**పింపిసలు.** దే. వి. బ. పింపిళ్లునకు మొదటిరూపము.

**పింపిళ్లాడు.** దే. అ. క్రి. (పింపిళ్లు+ఆడు.) నర్తించే. "రగడ. మణికూటస్థలిమలయుమణిప్రభు, పెరుమాళ్లకుఁగడుఁబింపిళ్లాడుచు." హంస. ర, ఆ.

**పింపిళ్లు.** దే. వి. బ. (పింపిస+లు.) పెదవిమీఁదుగా నొకవిధమైన ధ్వనిగలిగించుచునర్తించెడు బాలికాక్రీడావిశేషము. (రూ.) పింపిసలు. (చూ. అచ్చనగండ్లు.)

**పింపిళ్లుగూయు.** దే. అ. క్రి. (పింపిళ్లు+గునియు.) 1. బాలకులుబాలికలును పెదవిమీఁదుగా నొకవిధమైన ధ్వనిగలిగించుచే నర్తించే; "ఎ, గీ. చిన్నబిడ్డలెయ్యెడలఁబింపిళ్లుగూసిరి." పారి. ఘ. 2, ఆ.—2. నర్తించు. "సీ. మాటికినెత్తమ్మి మఱువునఁబింపిళ్లగూయుచుగ్గురు రాచకొమ్మగములు." య. 3, ఆ. "మ. బిగిచన్ గుబ్బలుగుత్తుపుం బయఁటలోఁబింపిళ్లుగూయంగళీ, భ్రుగలీన్ భామయొకర్తువచ్చియిదియోగంధర్వనీవొందెదీ, భృగుపాతంబు ఫలంబుసేపరుసవారింగావ్రమంచున్ ధగ, ద్ధగితాశాంతరమైన ఖడ్గమొకటిన్ దత్పాణికిచ్చెన్ వెసన్." కళా. ౬, ఆ.—(ఒకానొకచో "పింపిళ్లొగిగూయఁజొచ్చె" అని భిన్నముగా ప్రయోగము కానఁబడుచున్నది. చూ. నీడు. వి. మూడవయర్థము నుదాహరణము.)

**పికపికలు.** దే. విణ. బ. చెల్లాచెదరు. "క. ఒకమరివిఱిగినయమకులు, పికపికలైపోవలావ్రఁజెంపేర్పడనే, నకువెనుకైచనియెనులం, కకుదానవవిభుఁడుబాహుగర్వోద్ధతుఁడై." నిర్వ. ౬, ఆ.

**పికము.** సం. వి. అ. పుం. కోకిలము, కోయిల.

**పికవర్ధనము.** సం. వి. అ. పుం. కాకము, కాకి.

**పికిలి.** దే. వి. పక్షివిశేషము. (చూ. పిక్కిలి.)

**పికిలిపువ్వు.** దవ్. వి. పికిలిపిట్టతోఁకక్రిందిఈక. (చూ. కైకానుక.)

**పిక్క.** వై. వి. 1. జంఘ; 2. ఒకానొకచెట్టు.

**పిక్కటిల్లు.** దే. అ. క్రి. 1. నిండు; 2. అతిశయించే; "వ. పిక్కటిల్లినసంతోషంబుచేత." భాగ. ౬, స్కం.—3. వ్యాపించే; "చ. విమలదరస్మితామృతమువెల్లువచెక్కులఁబిక్కటిల్లినన్." ప్రభా. ౧, ఆ.—4. పిగులు; 5. వర్ధిల్లు. (రూ. పిక్కటిలు.—నిండుటకు. —"ఉ. ఎక్కడికేనియుంజనియనేకవిధంబులజీవరాసులన్, జెక్కటిఁగానలోఁగడుపుపిక్కటిలన్ దినిమాపువేటికిన్, జక్కఁగనేగు చోఁ దెరువునయ్యనవీవరికట్టుకొన్నవాఁ, డుక్కఱుకూలమింటికడనున్కినిరాయుధవృత్తినత్తఱిన్." నిర్వ. ౧౦, ఆ.—పిగులుటకు.—"తే. ఇట్టలపుఁబువ్వుగుత్తులనట్టనడుమఁ, గలికిదులకించెదాడిమీఫలయుగంబు, కంటెకెంబట్టుఱవికపిక్కటిలియుబ్బ, నీబటువుగబ్బిగుబ్బలనీటుపూని." ఉ, రా. ౬, ఆ.—వర్ధిల్లుటకు. ఆము. ౫, ఆ.)

**పిక్కారు.** దవ్. వి. (పిదప+కారు.) (చూ.) దాళువా.

**పిక్కిలి.** దే. వి. పికిలియొక్కరూపాంతరము. "సీ. పెనుగొండకాడ వ్రాలిపిక్కిళ్లుమొదలైన ప్రతిపక్షులను హతాహతముచేసి." శై. ౧, ఆ.

**పిక్కు.** దే. అ. క్రి. వెనుదీయు. స. క్రి. వంచించే. వి. 1. మర్మము; 2. వంచన.

**పిగులు.** దే. అ. క్రి. వస్త్రములోనగునది బిగువుచేచినుఁగు.

**పిచండము.** సం. వి. అ. పుం. 1. కడుపు; 2. పఱప్పు.

**పిచండిలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పెద్దకడుపువాఁడు.

**పిచిండము.** సం. వి. అ. పుం. 1. కడుపు; 2. మృగముల వీఁపు.

**పిచుమందము.** సం. వి. అ. పుం. వేము, నింబముశీ.

**పిచుమర్దము.** సం. వి. అ. పుం.———పై.———

**పిచులము.** సం. వి. అ. పుం. 1. నీరుకాకి; 2. గన్నేరుశీ; 3. పక్కిశీ.

**పిచువు.** సం. వి. ఉ. పుం. 1. దూది; 2. కుష్ఠభేదము; 3. మాడ; 4. ఒకానొకరాక్షసుఁడు.

**పిచ్చటము.** సం. వి. అ. న. 1. తగరము; 2. సత్తు. పుం. కంటి తెవులు

**పిచ్చి.** వై. వి. పిత్తవ్యాధి, ఉన్మాదము.

**పిచ్చిక.** దే. వి. ఊరఁబిచ్చిక, చటకము.

**పిచ్చికకుంటు.** దే. వి. అనూరుఁడు. విణ. కాళ్లులేనివాఁడు. (చూ. పిచ్చేకకుంటు.)

**పిచ్చికుంటు.** దే. వి. (పిచ్చిక+కుంటు.) అనూరుఁడు "సీ. ప్రీతినింతకునేఁగుఁబిచ్చికుంటుకు, మ్రొక్కవిన పసాభ్రాత్రుఁడు వినతిపట్టె." నై. ౫, ఆ.—విణ. కాళ్లులేనివాఁడు. (చూ. పిచ్చే కుంటు.)

**పిచ్చిల్లు.** దే. అ. క్రి. చిప్పిల్లునకుమాఱురూపము. (రూ. పిచ్చిలు. "బాష్పధారలుపిచ్చిల." వి, పు. ౭, ఆ.)

**పిచ్చివాఁడు.** ద్వ. విణ. పిచ్చిపట్టినవాఁడు, ఉన్మత్తుఁడు.

**పిచ్చె.** యు. దే. విణ. హీనము. "తే. బ్రహ్మనంతతివాఁడవైపట్ట ణంబు, లంకగానుండికేలఁగైలాసమెత్తి, ప్రబలితివినీకులస్థానభాగ వముల, కొచ్చెముగనేలచొచ్చితిపిచ్చపనికి." రామా. ౭, ఆ.—నై వి. పిచ్చి.

**పిచ్చెపట్టు.** దే. వి. లుబ్ధత్వము.

**పిచ్చెపెసలు.** దే. వి. బ. ఒకదినుసుపెసలు.

**పిచ్చెలించు.** దే. అ. క్రి. 1. అతిశయించు. "ఆ. పొరిఁబొరిఁ గదిరెడు, భీతిమానసమునఁబిచ్చలింప." ఉ, హరి. ౬, ఆ.—2. భయపడు. "క. ఒనరింపఁబిచ్చలింపక, మునుకొనియయ్యెద నిమన్కిమొనకాంద్రతనిక, జెనసిపెనఁజెట్లుగట్లును, బెనుపాదవఁ గఁబలపుటయునుబెగడకవాఁడుగ." అచ్చ. యు, కాం. (ఈయ ర్థమునకు ప్రాచీనప్రయోగము కనఁబడలేదు.)—స. క్రి. ప్రకం పించు. "ఉ. ఎట్టిలా, వెట్టిపరాక్రమస్ఫురణమెట్టిరయంబనిపిచ్చ లింపఁగ." భార. భీష్మ. ౧, ఆ. "చ. అవ్విరాటునివిడిపించె దగ రణపటుత్వమువైరులుపిచ్చలింపఁగ." భార. విరా. 3, ఆ.

**పిచ్చె.** యు. దే. వి. చింతవిత్తు. వై. జంతువులకడుపులోనిపిత్త కోశము.

**పిచ్చెక.** దే. వి. పిచ్చికయొక్కరూపాంతరము.

**పిచ్చెకకాలు.** దే. వి. తృణవిశేషము, పర్పటము.

**పిచ్చెకకుంటు.** దే. వి. అనూరుఁడు. "సీ. ఉత్తానుఁడైవెన్కకొఱగి పిచ్చెకకుంటువిప్రతీపంబుగావినుతిసేయ." కాశీ. ౧, ఆ.—విణ. కాళ్లులేనివాఁడు. (చూ. కుజ్జ.)

**పిచ్చెకుంటు.** దే. వి. (పిచ్చెక+కుంటు.) అనూరుఁడు. "సీ. చుట్టుపరువ్వలకునించుకయునీడొందలేకినుహరుల్ పిచ్చెకుంటునకగ పడె." ఉ, రా. ౧, ఆ.—విణ. కాళ్లులేనివాఁడు. "ఎ, గీ. అవలఁ గొఱగాకపిచ్చెకుంటయియనంగుఁ, డనుపుగొనఁజొచ్చె." అను. ౨, ఆ.

**పిచ్చెగుంటెవాండ్రు.** దే. వి. బ. కమ్మవారిని అడిగికొని జీవించు వారు. బిచ్చెమెత్తువారు. (అనికొందఱు.)

**పిచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అరఁటికీ; 2. ఒఱ; 3. గుఱ్ఱపుకాలి పుండు; 4. పోఁక; 5. సమూహము; 6. పాముయొక్కజోల్లు; 7. బూరుగుబంక; 8. వరుస; 9. గంజిమీఁదిమీఁగడ. అ. న. ము. 1. నెమిలిపురి; 2. సిగ. పుం. తోఁక.

**పిచ్ఛందకము.** సం. వి. అ. పుం. రాజగృహరచన.

**పిచ్ఛిల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇరుగుడుచెట్టు; 2. బూరుగుచెట్టు. విణ. 1. పేరినది; 2. మీఁగడకట్టినది.

**పిటకము.** సం. వి. అ. పుం, న. పుండు. పుం. 1. చిన్నపెట్టె; 2. చిన్నగంప.

**పిటము.** సం. వి. అ. పుం. గంప, కండోలము.

**పిట్ట.** వై. వి. పులుఁగు, పక్షి, ఖగము, విహంగము.

**పిట్టపిడుగు.** దే. క్రి. విణ. అనివార్యము. "తే. పిడుగుమొత్తిన గతిఁగూలుఁబిట్టపిడుగు." కవిస. ౧, అధికారము. "ఆ. పిడుగు వైచిచంపుఁబిట్టపిడుగు." చంద్ర. (పిట్టపిడుగు—పిట్టపిడుగుగా నని యర్థము.)

**పిట్టు.** వై. వి. వాసెనమీఁదపక్వముచేసినపిండి*.

**పిఠరము.** సం. వి. అ. న. 1. కవ్వపుకోల; 2. ముస్తె. పుం, న. వంటకుండ.

**పిడి.** దే. వి. 1. కత్తిపరుఁజోలోనగునది, త్సరువు; "సీ. కఱకుదుండ గపురక్కసులఁద్రెంపఁగఁ జాలుజాలువాపిడివాలువాలువాని." చంద్రా. ౧, ఆ.—2. పిడికిలి; "ద్వి. వడిరక్కసులపట్లువదలె నన్నట్లు, పిడిపట్లువదలినఁబెటిలిపేడెత్తి." రా. బాల, కాం.—3. ఆఁడుమృగము. "వ. తొడిగినయమ్ములన పడిపొరలుపిడుల విడువక చిడిముడిపడుకడఁతులును." ఉ, హరి. ౪, ఆ. "తే. చుట్టునతివలుగ్రాలనడుమ, నమరుపిడిపిండులోనిమహాగజెం ద్రు, కాంతినలరుకుమారుసంతగతఁగనియె." హరి. ఉ. ౭, ఆ. "పిడియేనిక" "మనుఁబిడి."

**పిడికట్టు.** దే. వి. వింటినడుము, లస్తకము.

**పిడికిలి.** దే. వి. ముడువఁబడినవ్రేళ్లుగల అఱచేయి, ముష్టి.

**పిడికిలించు.** దే. స. క్రి. పిడికిటఁబట్టు. "వ. తూర్పునసుత్తరం బునంగలుగు నరనాయకులునానాసేనానమన్వితులైవచ్చిచిచ్చయిన నుం బిడికిలింతుమనుచున్నవారు." భార. ఉద్యో. ౨, ఆ.

**పిడికోల.** దే. వి. నాఁగేలులోనగువానిమేఁడి.

**పిడిగంట.** ద్వ. వి. నిడుపుపిడిగలగంట. "సీ. పిడిగంటలును గేకిపింఛంపుఁగుంచెలుఛత్రముల్ పులిగోళ్లుచామరములు." రాజ. ౧, ఆ.

**పిడిగుద్దులు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. కుప్పిగం తులు.)

**పిడిగొట్టు.** దే. స. క్రి. (పిడి+కొట్టు.) ఎద్దుపట్టు.

**పిడిమూరి.** దే. వి. ముడువఁబడినవ్రేళ్లుగలమూర, రత్ని.

**పిడియము.** దే. వి. పిడెము. "చ. చల్లడములుపూనిమీఁదఁబదిలం బుగఁగట్టినమట్టికాసులగ, బిడియములంటదోఁపి." స్వా. ౪, ఆ.

**పిడివాటు.** దే. వి. 1. పనకట్టలను చేతికొలదినెత్తి గింజెలురాలఁ గొట్టుట; 2. ఒడంబడిక. (పిడివాటుచీటి.)

**పిడివాదము.** అర. వి. మూర్ఖవాదము.

**పిడివేయు.** దే. అ. క్రి. పసులకటిలోచేయిడిత్రిప్పు.

**పిడిసాన.** ద్వ. వి. వడ్లవాఁడును, జాళ్లపనివాఁడును కొయ్యలకును, రత్నములకును బెజ్జముచేసెడు సాధనము, ఆశ్ఫోటని.

**పిడుఁజు.** దే. వి. పశువులదేహమందుచేరి రక్తముపీల్చెడు జంతు విశేషము.

**పిడుఁదు** దే. వి. పిడుఁజుయొక్కరూపాంతరము.

**పిడుక.** దే. వి. పిసికిపిడుచగాచేసితట్టియెండఁబెట్టినపేఁడ, కరీ షము. (వాడుక పిడకయని.)

**పిడుకమొసలి.** దే. వి. శింశుమారభేదము. హంస. ౪, ఆ.

**పిడుగు.** దే. వి. అశని, నిర్ఘాతము.

**పిడుగుకైదువు.** దే. వి. వజ్రాయుధము. "సీ. పిడుగుకైదువు పెట్టుతడకట్టుగాఁబయోధి మహౌషధిరసంబుచమిరెననఁగ." వసు. ౫, ఆ.

**పిడుచే.** దే. వి. అన్నములోనగువానిముద్ద. (వాడుకపిడచేయని.)

**పిడుచేపాఁత.** ద్వ. వి. అలుకుచుట్ట.

**పిడుచే.** దే. స. క్రి. రసములోనగువానిపిండుట.

**పిడుచే.** దే. వి. మిక్కిలి చిన్నకుండ. (వాడుక పిడచయని.)

**పిడెము.** దే. వి. బాఁకు. "పులితోల్ కాసెలనంటదోఁపినపిడెం బుల్." సా. ౧, ఆ. (పిడియముయొక్క రూపాంతరము.)

**పిడ్డు.** దే. వి. పిడుగుయొక్క రూపాంతరము. "ఉ. రాజీవవిరోధి మండలము చిచ్చుఆపిడ్డునుబోలెనేచినఁ, వీడఁదోడంగెఁదెమ్మెఁలు వెన్నెలమంటలుమీఁదఁజల్లుచుఁ." షో. ౨, ఆ.

**పిణ్యాకము.** సం. వి. అ. పుం, న. 1. తెలికపిండి; 2. ఇంగువ; 3. చిల్లమడ్డి; 4. కుంకుమపువ్వు.

**పిత.** సం. వి. ఋ. పుం. తండ్రి. (తండ్రులు అయిదుగురు.— కన్నవాఁడు, వడుగుచేసినవాఁడు, చదువుచెప్పినవాఁడు, అన్నము పెట్టినవాఁడు, వెఱపుదీర్చి కాపాడినవాఁడు.) ద్వ. తల్లిదండ్రులు.

**పితర.** వై. వి. తండ్రి. "వ. పితరయుఁబితామహుండును బ్రపితామహుండునునఁగఁ బిండసంబంధులుముగ్గురు." మార్క. 3, ఆ.

**పితరదొర.** ద్వ. వి. యముఁడు, పితృపతి. (చూ. కేటత్రాడు.) (ఇట్లుపితరులఱేఁడు మొ.)

**పితరుఁడు.** వై. వి. 1. తండ్రి; "క. సతియుంబతియునుసుతుఁడును, బితరుఁడునొండొరులతోడఁజెనఁగెడుచోసా, క్షితఁగైకొని మాన్పకయు, న్నతఁడు పణత్రయము దండువరువఁగవలయుఁ." విజ్ఞా. ప్రా, కాం.—2. బ. మృతిపొందినపితృవర్గమువారు, పితృదేవతలు. "క. కృతమతియైయేఁడులు, హుతవహుఘృతమునను బ్రీతినొందించినను, వ్రతుఁడీరేడుతరంబుల, పితరులఁగొనిదివికి నేగుఁజెంపెనలారఁ." భార. అర. ౭, ఆ.

**పితరులచుక్క.** వై. వి. మఘానక్షత్రము.

**పితలాటము.** దే. వి. మోసము. (రూ. పితలాటకము.)

**పితామహి.** సం. వి. ఈ. స్త్రీ. తండ్రితల్లి.

**పితామహుఁడు.** సం. వి. అ. పుం. 1. తండ్రితండ్రి; 2. తండ్రి; 3. బ్రహ్మ.

**పితాళ్లు.** వై. వి. బ. పితరులుయొక్క రూపాంతరము. "ద్వి. తగఁ బితాళ్లకుఁదిలోదకములునడపి, జగములనిటనత్యసంధుండవగుము." రా. బాల, కాం.

**పితుకు.** దే. స. క్రి. పాలుపిండు. "ఎ, గీ. ఇద్ధరాదోగ్ధ్రిగ్రేపుల నెలమిఁజేర్చి, పితికికొనుఁడనిపనిచెనమ్మతముమిగుల." హరి. పూ. ౧, ఆ.

**పితూరి.** హిం. వి. రాజద్రోహము, కలహము, కుట్ర.

**పితృపతి.** సం. వి. ఇ. పుం. యముఁడు, పితరులఱేఁడు.

**పితృప్రసువు.** సం. వి. ఈ. స్త్రీ. ప్రొద్దుపొడుచుటకు ముందైదుగడియలవఱకును, ప్రొద్దుగ్రుంకినవెనుక మూడుగడియలవఱకును గలకాలము.

**పితృయజ్ఞము.** సం. వి. అ. పుం. పితృతర్పణము.

**పితృవనము.** సం. వి. అ. న. శ్మశానము, ఒలికిమిట్ట.

**పితృవ్యుఁడు.** సం. వి. అ. పుం. తండ్రితోడఁబుట్టినవాఁడు.

**పిత్తము.** సం. ౧. అ. న. ధాతువిశేషము. (చూ. ధాతువు)

**పిత్తలి.** సం. వి. అ. స్త్రీ. నిరుపిప్పలి[?]. అ. న. ము. ఇత్తడి. విణ. పిచ్చిగలది. (రూ. పిత్తడి.)

**పిత్తు** దే. అ. క్రి. అపానవాయువువిడుచు. వి. అపానవాయువు.

**పిత్ర్యము.** సం. విణ. (అ. ఆ. అ.) తండ్రిది.

**పిత్సంతము.** సం. వి. త్. పుం. పక్షి. విణ. పడనిచ్ఛగలది

**పిదప.** దే. వి. వెనుక. "ఇచ్చినపిదప." ఉ, హరి. ౨, ఆ.—విణ. 1. వెనుకటిది; "పిదపటికథ." భార. ఉద్యో. 3, ఆ. "పిదపటి పట్టి." భార. కర్ణ. ౨, ఆ. "పిదపటిపత్రము." విజ్ఞా. వ్య, కాం.—2. తక్కువ, నీచము. (పిదపచేను, పిదపపని మొ.)

**పిదపిద.** దే. విణ. 1. అనుకు; (చూ. పిదపిదన.) 2. మృదువు. "ద్వి. చెదరకయదరకచిడిముడిగొనక, బెదరకపదరకపిదపిదగాక, క్రొవ్వాఁడినూపకత్రుళ్లతలేక." పండి. ౧, భా.

**పిదపిదన.** దే. వి. 1. అనుకుఁదనము; 2. మృదుత్వము. విణ. 1. అనుకు; "వ. శికరపరంపరలచొదుగులుపదుగులుగొనినఁ బిదపిదనగుచుఁ జిదుకుచిదుకుమనురొంపులును." భాగ. ౧౦, స్కం. పూ.—2. మృదువు. (చూ. పిదపిద.)

**పిదుకు.** దే. స. క్రి. పితుకుయొక్క రూపాంతరము.

**పిధానము.** సం. వి. అ. న. మఱుఁగు, తిరోధానము.

**పిన.** దే. విణ. పిన్నయొక్క రూపాంతరము. (పినతల్లి, పినతండ్రి మొ.)

**పినగుమ్ముడు.** ద్వ. వి. పేఁకు[?].

**పినద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; (వస్త్రము.) 2. తొడుగఁబడినది. (కవచము.)

**పినాకము.** సం. వి. అ. పుం, న. 1. శివుని విల్లు; 2. త్రిశూలము; 3. మట్టివాన.

**పినాకి.** సం. వి. న్. పుం. శివుఁడు, ముక్కంటి.

**పినాకిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. నదీవిశేషము; 2. వీణావిశేషము.

**పినుఁగు.** దే. వి. లుబ్ధకుఁడు. "ఆ. అవురుఁగండెలుగాలపుఁజివ్వవెదురు, లాదియగుసాధనంబులనలవరించు, కొని హుటాహుటినడలతోఁబినుఁగులెల్లఁ, గదిసినడచిరి యప్పుడీ కాంతునఱత." సా. ౧, ఆ.—విణ. లుబ్ధుఁడు. (చూ. పిలుఁగు.)

**పిన్న.** దే. విణ. చిన్న. (పిన్నవాఁడు, పిన్నది.) "పిన్నటినవ్వు." భార. ద్రో. ౭, ఆ.

**పిన్నకక్కెర.** ద్వ. వి. పక్షివిశేషము, కక్కెర.

**పిన్నగోరంట.** ద్వ. వి. సహా[?].

**పిన్నగ్రద్ద.** ద్వ. వి. పక్షివిశేషము, చిందు.

**పిన్నజెమ్మి.** ద్వ. వి. నేలజెమ్మి, శమీరము[?].

**పిన్నటనాడు.** దే. వి. పిన్ననాడుయొక్క రూపాంతరము. "ఉ. పిన్నటనాటనుండిననుఁబెద్దగఁజూచినవంశ వృద్ధులఁ, మిన్నకచంపి చేకొనిన మేదినినాకిదియేల." జై. ౧, ఆ.

**పిన్నతుమికి.** దే. వి. కాకితుమికి[?].

**పిన్నదూలగోవెల.** దే. వి. దూలగోవెల, కండూర[?].

**పిన్ననాడు.** దే. వి. బాల్యదశ, చిన్ననాడు.

**పిన్ననుదురు.** దే. వి. పీనుఁగునొసటిబుడిపి, వాతకుంభము.

**పిన్న నేరెడు.** దే. వి. కాకినేరెడు, కాకజంబువృక్షము.

**పిన్న పాఁపర.** దే. వి. పాఁపర, గోతుంబవృక్షము.

**పిన్న పాప.** దే. వి. కన్యక. "సీ. పిన్నపాపవునీవుపిన్నపవాగీనవు కార్యనిర్ణయశక్తి కలదెసీకు." నై. ౨, ఆ.

**పిన్న పాల.** దే. వి. చిఱుపాల, క్షీరావివృక్షము.

**పిన్న ములక.** దే. వి. నేలములక, కంటకారికవృక్షము.

**పిన్న ముల్లంగి.** ద్వ. వి. క్షుద్ర మూలకము వృక్షము.

**పిన్న యిప్ప.** దే. వి. మధూళిక వృక్షము.

**పిన్న ఱికము.** దే. వి. పిన్నతనము.

**పిన్న ఎరగోఁగు.** దే. వి. కమలవల్లభ వృక్షము.

**పిపాస.** సం. వి. ఆ. స్త్రీ. నీరుత్రావనిచ్ఛ, నీరువట్టు.

**పిపాసితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నీరుత్రావనిచ్ఛకొన్న వాఁడు.

**పిపాసువు.** సం. విణ. (ఉ.) నీరుత్రావనిచ్ఛించువాఁడు.

**పిపీలిక.** సం. వి. ఆ. స్త్రీ. చీమ. (రూ. పిపీలి. ఈ. స్త్రీ.)

**పిప్పల.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలివృక్షము.. అ. న. ము. జలము. పుం. 1. రావివృక్షము; 2. బాతు.

**పిప్పలాశనము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

**పిప్పలి.** సం. వి. ఈ. స్త్రీ. ఊడుగవృక్షము. ఇ. పుం. రావివృక్షము.

**పిప్పి.** దే. వి. నలిచిరసముపిండిన ఆకులోనగునది.

**పిప్పిక.** సం. వి. ఆ. స్త్రీ. పండ్లపాఁచి, దంతమలము.

**పిప్పిరి.** దే. వి. పిప్పి. "విరోధిసేనలఁ బిప్పిరిచేసెదన్." జై. ౬, ఆ.

**పిప్లువు.** సం. వి. ఉ. పుం. పుట్టుమచ్చ, తిలకాలకము.

**పిమ్మట.** దే. వి. మనోవ్యథ. "క. ఆరీతినంతిపురమున, నారీతిల కంబునఖిజనంబులుగొలువం, జేరినపిమ్మటమదిలోఁ, గూరినపిమ్మట విరాళిగొనినరుఁడుండెన్." విజ. ౨, ఆ.—ద్ర. 1. అనంతరము; 2. పరోక్షమందు. "సీ. తులువపిమ్మటనిన్నుదూషించుపలుకులు కులజులునిజముగాఁగొనుట." భార. అను. ౪, ఆ.

**పియ్యి.** దే. వి. పీయియొక్క-రూపాంతరము.

**పిర.** దే. వి. కానిలో నాలవభాగము.

**పిరంగి.** దే. వి. సిపాయులు యుద్ధమప్పుడు మందుగుండువేసి గట్టించికాల్చెడియినుపక్రోవి. (చూ. అగాదు.)

**పిరంగీ.** దే. వి. పిరంగియొక్క-రూపాంతరము.

**పిరి.** దే. వి. 1. మెలి; 2. వెంటి; "పిరిచుట్టుగఁజుట్టి." కళా. ౬, ఆ. (చూ. పిరిగొను.) 3. గోనెలులోనగునవి కట్టెడుత్రాడు.

**పిరిగొను.** దే. అ. క్రి. (పిరి+కొను.) పెనఁగొను. "క. సురలచ్చె రువ్వునుమెచ్చున, బిరిగొనుచిత్తములతోడ." భార. శల్య. ౨, ఆ.—స. క్రి. మెలిపెట్టు. (చూ. వల్లరు.)

**పిరువీఁకు.** దే. వి. (వీఁకు+వీఁకు.) 1. వీఁకులాట; "క. తరుణీ యేరికిఁజెల్లునె, యరయఁగనేమింతవారమనుకొననిదిగోఁ, బిరువీఁకుగ నున్నదితాఁ, గరమద్భుతమైనతవతికయ్యముచేకన్." కళా. ౧, ఆ.—2. బాధ. "క. ఈరాత్రియకారణముం, బేరలుకఁదదాత్మకడసి పిరువీఁకగుచో, బ్రారయభాగ్యవిహీనలు, లేరెవ్వరునవనిమండలిఁ గానుఁబోలన్." ప్రభా. ౫, ఆ.

**పిరువీఁకులాడు.** దే. అ. క్రి. (పిరువీఁకులు+ఆడు.) పెనఁగులాడు. "ఒండొంటితోఁబిరువీఁకులాడు." ఆము. ౬, ఆ.

**పిరువీఁకుసేయు.** ద్వ. స. క్రి. (పిరువీఁకు+చేయు.) 1. వీఁకులాడు; "క. కనిచుట్టువాఱుకొనియి, ట్టునటుంబిరువీఁకుసేయుదు." పర. ౫, ఆ.—2. బాధించు. "వ. ఇట్లుబహువిధంబులంబొదివి కాలకౌశికునిం బిరువీఁకుసేయు బ్రహ్మచారులకుఁ బ్రియంబునవందనంబొనర్చి." హరిశ్చ. ౪, ఆ. (చూ. వెనుకటి పద్యము.) (రూ. పిరువీఁకులుసేయు.)

**పిర్వీఁకు.** దే. వి. పిరువీఁకుయొక్క-రూపాంతరము. (బాధకు.—"అసహ్యవర్తనములన్ బిర్వీఁకులంబెట్టుదుర్జాతున్." పాండు. ౪, ఆ.)

**పిఱికి.** వై. విణ. భయశీలుఁడు, భీరువు. "క. వెఱపెట్టిదియెూయెన్నఁడు, నెఱుఁగనినీయట్టివానికెవ్వరొకోయీ, పిఱికితనమింతయులవడఁ, గఱపినవారనుచుశౌరికలకలనవ్వెన్." భార. ఉద్యో..3, ఆ.

**పిఱికికండ.** వై. వి. అధైర్యము. "ఎ, గీ. పిఱికికండయెుకింతలే కఱిమివేడ్కఁ, జచ్చుఱుకఁబోవువికచరాజీవనేత్ర, కళ్వమేధంబు ఫలముతథ్యంబుగలుగు." కాశీ. ౨, ఆ.

**పిఱికిమెకము.** వై. వి. జింక, హరిణము.

**పిఱు.** దే. వి. వృత్తియందు పిఱుఁదుశబ్దమునకు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (పిఱుతివియు మొ.)

**పిఱుఁదు.** దే. వి. 1. మొలకువెనుకటిభాగము, నితంబము; 2. వెనుక. "శా. ద్రోణాచార్యుపిఱుఁదనొప్పిదృఢ హస్తుల్ బద్ధగోధాంగుళి, త్రాణుల్ మార్గణపూర్ణతూణులుమహా ధనుష్కుల్ కుమారుల్ తను, త్రాణోపేతులురంగమధ్యమున నంతన్ సిల్చిరి." భార. ఆది. ౬, ఆ. "క. పిఱిఁదికిఁబోనిచ్చినవి, ల్లఱితికినైయల్లచాఁప." రా. అర, కాం. ౨, ఆ.

**పిఱుఁదుకొను.** దే. స. క్రి. వెంబడించు. "సీ. రథ్యాప్రదీపోత్థరవముచేగిరికోటి పిడుగులనెఱవిడిఁబిఱుఁదుకొనఁగ." ఉ, హరి. 3, ఆ.

**పిఱుతివియు.** దే. అ. క్రి. (పిఱుఁదు+తివియు.) వెనుదీయు, పరాఙ్ముఖమగు. "వ. ఇట్లుభయసైన్యంబులుఁబిఱుతివియక పూర్వపశ్చిమసముద్రంబులతెఱంగునంగవిసి." శేష. ౫, ఆ.

**పిఱుతివుచు.** దే. అ. క్రి. (పిఱుఁదు+తివుచు.)——పై.—— "క. మసవాఁడైనంద్రుఁడుచె, ప్పినమాటలువింటిరింకఁబిఱుతివకములల్, కొనివచ్చికట్టఁగట్టుఁడు, చనవలయుంగడలిదాఁటినరగునమనకున్." య. 3, ఆ.

**పిఱుదీయు** దే. అ. క్రి. (పిఱుఁదు+తీయు.)——పై.—— "సీ. మొలనూలుబిగియించివెలఁదివెన్నెలఁజొచ్చుఁబిఱుదీయకేటిలోనుఱుకుకరణి." స్వా. 3, ఆ.

**పిఱుము.** దే. వి. పరుషభావము. "చ. కడుం, బిఱుములచూపులందఱుచుబీఱనరంబులుఁగల్గురూపమై." ఉ, హరి. ౨, ఆ.—విణ. పరుషము. "సీ. ద్వాదశరూపముల్ దాల్చియుగ్రమయూఖుఁ డేవేళఁబచరించునెండఁబిఱుము." హరిశ్చ. ౪, ఆ.

**పిఱువడు.** ద్వ. అ. క్రి. (పిఱుఁదు+పడు.) 1. వెనుదీయు; 2. భయపడు. "క. చారులచేగాండీవిమ, హారథికులతోడవచ్చెననివిని గుండెల్, నీర్గైసైంధవతనయుఁడు, పేరోలగముండిబిట్టుపిఱువడిచచ్చెన్." జై. ౮, ఆ.

**పిఱువెట్టు.** దే. స. క్రి. (పిఱుఁదు+పెట్టు.) అనాదరించు. "ఆ. చలనమేదిపుట్టుఁజావునుఁబిఱువెట్టి, యామిపార్థివులనవహసించు, నెలమితోడలేమిఁకలిమివాటింపని, రమణనునికియజగరవ్రతంబు." భార. శాం. ౪, ఆ.

**పిఱువోవు.** దే. అ. క్రి. (పిఱుఁదు + పోవు.) వెనుదీయు. "సీ. పిఱువోవనందందతతిమికొమ్ములవట్టితోడర నొంజొంటిపైఁ ద్రోచి త్రోచి." హరి. పూ. ౬, ఆ.

**పిఱుసను.** దే. అ. క్రి. (పిఱుఁదు + చేను.)——పై.——"క. మఱుఁతురెయాడినమాటలు, పిఱుసనిపోఁదగునెమీకు బెదరకయి దుర్రై, తఱుముఁడుభీష్మునిగిష్మని, నెఱుఁగరె ము న్నెనుగలుగ నేలా వెఱవక." భార. భీష్మ. ౨, ఆ.

**పిఱ్ఱ.** దే. వి. పిఱుఁదు, నితంబము.

**పిలపిల.** దే. వి. మూఁగుటయందును, వచ్చుటయందును, పోవుట యందును, బిక్కిరించుటయందును నగుననుకరణము. "పిలపిల మూఁగ." సా. 3, ఆ. "పిలపిలనేతేర." విజ. ౨, ఆ. "పిల పిలనేగ." రసి. ౫, ఆ. "ద్వి. పిలపిలఁజెవులల్ల బిక్కిరించు కొని." నళ. 3, భా.

**పిలు గు.** దే. వి. విణ. పినుఁగుయొక్క రూపాంతరము. (లుబ్ధునకు.— "క. కలదానన్యాసికిబహు, కలధౌతసువర్ణపూర్ణకంథ సదా యు, ప్పిలుఁగుయతిపఱపుమోసము, కలనేనియులేక దానిఁగని రక్షిం చుక." పంచ. వేం. ౧, ఆ.)

**పిలుక.** పై. వి. పక్షిలోనగువానిపిల్ల. ("అంచేపిలుక." "సింగ పుఁబిలుక." "తేఁటిపిలుక." "తెమ్మెరపిలుక" మొ.)

**పిలుకు.** దే. వి. గర్వము. (చూ. పిలుకుమాలు.)

**పిలుకుమారు.** దే. అ. క్రి. 1. చేష్చు; "ఉ. ఇంచుకయేనియుక్ వనట నెన్నఁడుఁ బొందనితల్లినేడునా, మంచితనంబునక్ బిలుకు మారిననాథుని నుగ్రశత్రులక్, మంచునినుండుఁబోలేఁబరిమార్చు మహాబలుఁ జూచియిట్లుడుఃఖ, ఇంచుచునుండఁజూచితి నకిల్బిష చిత్తున కింతపెద్దయే." భార. అశ్వ. ౪, ఆ. — 2. నాశమొందు. (చూ. పిలుకుమాలు.) (రూ. పిల్కుమాఱు, పిలుకుమాలుయొక్క రూపాంతరము.)

**పిలుకుమార్చు.** దే. ప్రే. (పిలుకుమారఁజేయు.) 1. చెంపు; "క. పట్టినచలమునసీగతి, మట్టముగానేఁ బిలుకుమార్చికదలిరా, నెట్టికసీల ఉ మ దిలోఁ, బుట్టినహర్షమునఁదమతపోవనమునకుక్." పై. ౬, ఆ.—2. నాశముచేయు. "సీ. నముచితంబైనలజ్జాభరంబు నఁబోలేఁబ్రియసఖీసఖ్యంబుఁబిలుకుమార్చి." కవి. 3, ఆ. (మొదటిరూపము పిలుకుమారుచే.)

**పిలుకుమాలు.** దే. అ. క్రి. 1. చేష్చు; (చూ. పిలుకుమారు.) 2. నాశమొందు. "చ. నరకుగొనందుపాండుసుత సైన్యనికాయ మునించుకేనియుక్, గరులురథంబులుక్ హరులుఁ గాల్బలముల్ దనవీఁకవిచ్చియుక్, మరలియుఁ దూలియుంబిలుకుమాలియునల్ల డఁబాటుయుక్ వియ, చ్చరులకువేడ్కసేయ భుజసారము శౌర్య ముఁజూపెనేపునక్." భార. కర్ణ. ౧, ఆ. (రూ. పిల్కుమాలు.)

**పిలుకుమాల్చు.** దే. ప్రే. పిలుకుమాలఁజేయు. (మొదటిరూపము పిలుకుమాలుచే.)

**పిలుచు.** దే. స. క్రి. ఆహ్వానించే. (రూ. పిల్చు.)

**పిలుపు** దే. వి. పిలుచుట, ఆహ్వానము.

**పిలువుడు.** దే. వి.——పై.——

**పిల్కు.** పై. వి. పిలుకయొక్క రూపాంతరము. "తెమ్మెరపిల్కు." చంద్రా. ౨, ఆ.

**పిల్ల.** పై. వి. 1. పక్షిలోనగువానిసంతతి; (కోడిపిల్ల, మేఁకపిల్ల, ఎలుకపిల్ల, అరఁటిపిల్ల మొ.) 2. ఆఁడుపడుచు*; 3. బ. బిడ్డలు*. విణ. చిన్న*. (పిల్లకాలువ మొ.)

**పిల్లఁగ్రోలు.** దస. వి. (పిల్ల + క్రోలు.) పిల్లనగ్రోవి, మురళి. "సీ. బంగారుతగటుదుప్పటిబిగ్గమొలఁజుట్టి కేలఁజొక్కపుఁబిల్లఁ గ్రోలువట్టి." నీలా. ౧, ఆ. "దానవులు పిల్లంగ్రోల్లుపట్టంగ." భీ. ४, ఆ. (సంధియందు వర్ణాధిక్యము. ఇట్లు పిల్లఁగ్రోవియం దును.)

**పిల్లఁగ్రోవి.** దస. వి.——పై.——

**పిల్లకాయ.** దస. వి. బాలుఁడు.

**పిల్లగడ్డము.** దస. వి. నడుమమాత్రము కొంచెమువెండ్రుకలుగల గడ్డము. "సీ. పిల్లగడ్డమునింపుచఁజెఱఁగిమీసలుకుక్షి గోళంబుమీఁద నుయ్యాలలూఁగ." ఆము. ౬, ఆ.

**పిల్లగాఁడు.** దస. వి. (పిల్ల + కాఁడు.) బాలుఁడు.

**పిల్లగిఱులు.** దస. వి. బ. బాలక్రీడావిశేషము.

**పిల్లజుట్టు.** దస. వి. బాలురముందటిసిగ.

**పిల్లదీపు.** దస. వి. (పిల్ల + తీపు.) బాలక్రీడావిశేషము. (చూ. తూరనతుంకములు.)

**పిల్లదీవి.** పై. వి. బాలక్రీడావిశేషము. "సీ. తూరనతుంకాలుగిరన గింజలు పిల్లదీవాలంకె బిల్లగోడు." కాశీ. 3, ఆ.—బ. పిల్లదీవులు. (చూ. గుళ్ళు.)

**పిల్లనగ్రోలు.** దస. వి. (పిల్ల + క్రోలు.) పిల్లనగ్రోవి.

**పిల్లనగ్రోవి.** దస. వి. (పిల్ల + క్రోవి.) ఊఁదుటకనువుగాబెజ్జములు వేసినవెదురుగొట్టము, మురళి. (సంధియందువర్ణాధిక్యము. ఇట్లు పిల్లనగ్రోలునందును.)

**పిల్లనూయి.** దస. వి. నూతిలోపలి చిన్ననూయి, కూపకము. (పిల్ల బావియనుచోబావిలోపలిచిన్నబావి అని యర్థమెఱుంగునది.)

**పిల్లపీఁచర.** దస. వి. పీఁచర, శతావరి*.

**పిల్లపెసర.** దస. వి. కాకిపెసర, ముద్గపర్ణి*. (ధాన్యవాచకమైనచో పిల్లపెసలు.)

**పిల్లము.** సం. వి. అ. పుం. తడికన్ను. విణ. తడికన్నుగలది.

**పిల్లమెఱము.** దస. వి. 1. తలక్రిందుగావేసెడు లాఁగు; 2. లాఁగు. "తే. పిల్లమెఱములఁబోదుకప్పించరాదు, దీనినేలాగు నఁదరింపఁదిరుమనకు." రామా. ౬, ఆ.

**పిల్లవ్రేలు.** దస. వి. చిటికెనవ్రేలు. "వలకాలిపిల్లవ్రేల్." పై. ౭, ఆ.

**పిల్లాఁడి.** దే. వి. పిల్లాణికిమొదటిరూపము. "ఉ. ఆకెపిల్లాఁడికరం బువ్రేలఁ బదిలంబుగఁదాల్చినవాఁడుచూడవే." కళా. ౭, ఆ.

**పిల్లాకము.** సం. వి. అ. పుం, పక్షిపిల్ల.

**పిల్లాణి.** దే. వి. ఆఁడుదాని కాలినాలుగవవ్రేలియందలి ఆభరణము.

**పిల్లి.** పై. వి. మార్జాలము. (దీని భేదములు.—జేంగుపిల్లి, నీరుపిల్లి, జేవాదిపిల్లి, పునుఁగుపిల్లి, బూతపిల్లి మొ.)

**పిల్లికన్రతనము.** దస. వి. (పిల్లికను + రతనము.) వైడూర్యము. "పిల్లికన్రతనంపుఁ బెద్దమంచనములు." అచ్చ. సుం, కాం.

**పిల్లిగడ్డ.** పై. వి. పునుఁగుచెట్టము. "సీ. పిల్లిగడ్డకుఁదావిపెట్టిగా నొనఁగూర్చి ఇందనంబునకేల కూర్పఁడయ్యె." నీలా. ౧, ఆ.

**పిల్లు.** దే. వి. పుల్లుయొక్క రూపాంతరము. "ఆ. పిల్లుగట్టునఱుకులే రుండుదానైన, నాయమునకువెర్చ మధికమైన." విక్ర. ౨, ఆ.

**పిల్లేపుగంతు.** దవ్. వి. (పిల్ల + పరుగంతు.) తలక్రిందుగావేసెడు ల్లాఁగు.

**పిశంగము.** సం. వి. అ. పుం. కపిలవర్ణము. విణ. కపిలవర్ణము గలది.

**పిశాచము.** సం. వి. అ. పుం. 1. దేవయోనివిశేషము; 2. పిల్లి.

**పిశాచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీపిశాచము; 2. జటామాంసి.

**పిశిత.** సం. వి. ఆ. స్త్రీ. జటామాంసి. అ. న. ము. మాంసము.

**పిశున.** సం. వి. ఆ. స్త్రీ. 1. స్పృక్కాకీ; 2. కొండబెండకీ. అ. న. ము. కుంకుమపువ్వు. పుం. కాకి.

**పిశునుఁడు.** సం. వి. అ పుం. నారదుఁడు. విణ. 1. కొండె కాఁడు; 2. దుష్టుఁడు.

**పిష్టకము.** సం. వి అ. న. నూఁబోడి. పుం. 1. పిండివంట; 2. నేత్రరోగవిశేషము; 3. కించిజ్జఘనాధిక్యమునుస్తనాంతవిస్తృతి యుఁగలగజవిశేషము.

**పిష్టపచనము.** సం. వి. అ. న. పిండివంటచేసెడుపాత్రము. బూరెలమూకుడు. (అనికొందఱు.)

**పిష్టము.** సం. వి. అ. న. 1. పిండి; 2. సీసము విణ. పొడి చేయఁబడినది.

**పిష్టాతకము.** సం. వి. అ. పుం. వస్త్రములకువాసనకట్టెడుబుక్కాము, పటవాసకము.

**పిస.** దే. వి. అవివేకము. "చ. రసికుఁడుగానియర్థమధురంబగుకావ్య గభీరభూరివా, గ్విసరమెఱుంగనేరఁడవివేకియొకానొకకారణంబు నన్, వెసఁజనిరాజగేహమునవిద్రుమపంజరకీరిఁజూచితాఁ, బిస నెలతగ్గుదూడయని పిల్చును గొల్లఁడు జాతిభావలన్." చమ. ౧, ఆ.

**పిసక.** దే. వి. తలవెండ్రుకలయందు చెమటచే బందనగొను ముఱికి.

**పిసరు.** దే. వి. 1. కడిగినధాన్యములో త్రోపుడుపడినది; "ద్వి. పిసరుగాఁచినకుండపేర్పుచందమున, నెసఁగినబాఁకినోరెంతయుఁ దెఱచి." వారిశ్చ. ౨, భా. – 2. లేశము; (పిసరంతపొడి.) 3. విష. (పిసరువెళ్లగ్రుద్దినాఁడు.)

**పిసాసి.** వై. వి. పిశాచి, పిశాచము*.

**పిసాళము.** దే. వి. 1. వికాసము; "క. అంతవసంతముజితహే, మంతముదీపించెమత్తమధుకరకలభా, క్రాంతమురుపుష్పరసవే, శంతముసకలద్రుమలఁబిసాళముచెలఁగన్." పాండు. ౪, ఆ.– 2. పరిహాసము; "తే. విప్రనారాయణునిఁజూచివెలఁదులపుడు, కసుఁబిసాళంపుఁబలుకులునడపుచుండఁ, జిలుకపలుకులతోడిభ్రమ్రాఁ కులనుబోలె, వికృతిలేకతఁడీక్షింపవెఱఁగుపడిరి." పర. 3, ఆ.– 3. ప్రకాశము; 4. వ్యాపనము; 5. దొంగయెత్తు. (చూ. పిసాళించు.)

**పిసాళి.** దే. విణ. 1. ప్రకాశముకలది; "అలఁతిపిసాళినవ్వు." పాండు. ౪, ఆ.—2. వ్యాపనముగలది; "ఉ. చందురకావిపావడపిసాళిరుచుల్ నరిగంచుచీరపైఁ, జిందులుద్రొక్క." విజ. ౨, ఆ. (చూ. ఊఁక.)—3. దొంగయెత్తుగలది. "చాలుంజాలుఁబిసాళిసేఁతలు." కా. ౨, ఆ.

**పిసాళించు.** దే. అ. క్రి. 1. ప్రకాశించు; (చూ. పచారించు.) 2. పరిమళించు; "సీ. సద్యోవినిర్భిన్నసారంగనాభికాహ్మృతమైపిసాళించుమృగమదంబు." స్వా. ౨, ఆ.–3. వ్యాపించు; "క. పరిమళధూపముజాలక, సరణిఁబిసాళింప." జై. ౭, ఆ.—4. పరిహాసములాడు; "వ. అనియాప్రకారంబునమఱియునొండొరులతోననేకవిధసరసనల్లాపంబులంబిసాళించుచు." కళా. ౧, ఆ.– 5. దొంగయెత్తువేయు. "ద్వి. కొడుకుకువిలపించుకొనుచుసీవున్న, నెడపకెవ్వరొనర్తురీపనులెల్లఁ, జాలులేలెమ్ముపిసాళింపకనుచు." హరిశ్చ. ౨, భా.—స. క్రి. పరిహసించు. "ద్వి. లేఁతచందురుఁబిసాళించునెన్నుదురు." హరిశ్చ. ౨, భా.

**పిసి.** దే. వి. తొలియందుబిగఁగొట్టుటకై చెక్కినస్తంభము పట్టెలో నగువానిచివర.

**పిసికెళ్లు.** దే. వి. బ. 1. జొన్నలులోనగువానియూఁచెబియ్యము; 2. పిసుకుటలు. (చూ.) ఆము. ౪, ఆ.

**పిసిడి.** దే. విణ. పిసిని. "సీ. పిసిడియర్థముఁగూడఁబెట్టినట్లావంకఁ బోతుటీఁగకునైనఁబోలయరాదు." జై. ౧, ఆ.

**పిసినారి.** దే. విణ. (పిసిని + అరి.) పిసినిగొట్టు, లోభి. (స్వార్థమున అరి. సంధియందు వర్ణవికారము.)

**పిసిని.** దే. విణ. పిసినివాఁడు. (పిసిడియొక్కరూపాంతరము.)

**పిసినిగొట్టు.** దే. విణ. పిసినారి. (స్వార్థమున కొట్టు.)

**పిసుకు.** దే. స. క్రి. 1. పిండిలోనగువానిచేతమర్దించు; 2. పాదములులోనగువానినొత్తు.

**పిహితము.** సం. వి. అ. న. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. కనుఱెప్పమూఁత. విణ. కప్పఁబడినది.

**పిళ్లె.** అర. వి. కొన్ని జాతులపేరునకుఁజేర్చెడుపదము.

**పిళ్లారి.** దే. వి. వినాయకుఁడు. అచ్చ. కిష్కిం, కాం.

**పిళ్లు.** దే. వి. బ. దూడలనుకుడువనీనియావులనుదూడలుచచ్చినయావులనుమరులుకొలుపుటకైతద్యోనిద్వారమునఁ జొప్పించిలాగెడుతోరపుకుఱుచకసవువెంటి. "వ. క్రేపులంగొననియావులందొలంగంగట్టిపిళ్లువెట్టియు మందులుసల్లియుం జాలదుఃఖపఱిచిచేఁపెఱంగించువారును." హరి. పూ. ౫, ఆ.

## పీ.

**పీఁకు.** దే. స. క్రి. 1. పెఱుకు; 2. తీసివేయు.

**పీఁకులాట.** దే. వి. పీఁకులాడుట, పిరుపీఁకు.

**పీఁకులాడు.** దే. అ. క్రి. (పీఁకులు + ఆడు.) పెనఁగులాడు. (పలనాతో పీఁకులాడెదవు.)

**పీఁకుపీఁకాడు.** దే. స. క్రి. (పీఁకు + పీఁకు + ఆడు.) మిక్కిలి పెఱుకులాడు. "సీ. దీనిఁగంకశివాగృధ్రకాకకులము, లాదిగాఁగలుగుక్రవ్యాదముల్ పీఁకుపీఁకాడుటనెంగిలియయ్యెనకట." భార. స్త్రీ. ౨, ఆ.

**పీఁకె.** దే. వి. 1. నాగసరములోనగువాద్యముఖమునఁజొప్పించెడు క్రోవిపుల్ల; 2. కాళెవలెఁజుట్టినచిన్నఆకుచుట్ట; "సీ. నిడుపుననాకులుమడిచిపీఁకెలుచుట్టి యూఁదుచునటియింతురొక్కవేళ." వి. పు. ౭, ఆ.—3. తాగిమిగిలినపొగచుట్ట.

**పీఁకెవాఱు.** దే. అ. క్రి. 1. చేప్పటయగు; 2. కృశించు. "సీ. బలురాజనంపుఁబొట్టలుపీఁకెవాఱెఁబో ముద్దియపిక్కలకుద్దిగాక." అచ్చ. ఆర, కాం.

**పీఁచేము.** వై. వి. పించేముయొక్కరూపాంతరము.

**పీఁచేర.** దే. వి. శతావరికీ. (ఇది ద్వివిధము.–పిల్లపీఁచేర, పెద్దపీఁచేర, ఇదే పిల్లపీఁచేర.)

**పీఁచే.** దే. వి. గూఁడుపలెఁబెనఁచేకొనియుండునార. (టెంకాయ పీఁచే, బీఅకాయపీఁచే మొ.)

**పీఁట.** వై. వి. కూర్చుండెడుపలక, ఆసనము.

**పీఁటవెట్టు.** ద్వ. అ. క్రి. (పీఁట+పెట్టు.) లేవకయొకచోటనే పాదుకొనియుండు. "ఎ, గీ. ఈఁటెపోటులబడిఁ బ్రేవులీఁదులాడఁ, బోయిపోలేకదగదొట్టిపాదలుశొచ్చి, బెండువడియును జొరనీదుపీఁటవెట్టి, చూపులనెయేర్పుఁ బ్రజనొక్కసూకరంబు." స్వా. ర, ఆ.

**పీఁగ్రద్ద.** ద్వ. వి. పీతిరిగద్ద, ఆతాయి.

**పీఠమర్దుఁడు.** సం. వి. అ. పుం. శృంగారనాయకసచివులలో నొకఁడు. (చూ. సచివుఁడు.) విణ. ధృష్టుఁడు.

**పీఠము.** సం. వి. అ. పుం. ఆసనము, పీఁట.

**పీఠి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**పీఠిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. గ్రంథము మొదటవ్రాసెడుదాని పుట్టుపూర్వోత్తరము; 2. ఉత్కృష్టపీఠము.

**పీడ.** సం. వి. ఆ. స్త్రీ. 1. బాధ; 2. కరుణ; 3. సిగదండ; 4. సరళవృక్షము.

**పీడనము.** సం. వి. అ. న. పరులచేఁగలుగురాయిడి.

**పీడించే.** సం. స. క్రి. బాధించే, నొగులుచే.

**పీడితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పీడింపఁబడినది; 2. పిసుకఁబడినది.

**పీడ్యమానము.** సం. విణ. (అ. ఆ. అ.) పీడింపఁబడుచున్నది.

**పీత.** ఉభ. వై. వి. ఎండ్రకాయ. సం. ఆ. స్త్రీ. పసుపు. అ. పుం. ము. 1. ఎండ్రకాయ; 2. పసుపువర్ణము. విణ. 1. పసుపువర్ణము గలది; 2. త్రాగఁబడినది.

**పీతదారువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. దేవదారువుచెట్టు.

**పీతద్రువు.** సం వి. ఉ. పుం. 1. మ్రానిపసుపుచెట్టు; 2. సరళవృక్షము.

**పీతనము.** సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు; 2. హరిదళము; 3. దేవదారువుచెట్టు. పుం. అంబాళముచెట్టు.

**పీతముండము.** సం. వి. అ. పుం. పచ్చతలపిచ్చుక.

**పీతసాలకము.** సం. వి. అ. పుం. వేఁగిసచెట్టు.

**పీతాంబరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, పచ్చేవలువదారి. విణ. పీతవస్త్రముగలవాఁడు.

**పీతి.** సం. వి. ఇ. స్త్రీ. పానము. పుం. గుఱ్ఱము.

**పీతిగోరువంక.** ద్వ. వి. పక్షివిశేషము, విట్చారిక.

**పీతిరిగద్ద.** ద్వ. వి. (పీతి+గద్ద.) పీఁగ్రద్ద. (సంధియందు వర్ణాధిక్యము.)

**పీతిరిగుంట.** ద్వ. వి. (పీతి+గుంట.) ముఱికిగుంట. (సంధియందు వర్ణాధిక్యము.)

**పీత్తోలు.** గ్రా. వి. పైనుండు సన్ననిచర్మము.

**పీనము.** సం. వి. అ. న. సంతోషము. పుం. చెమట. విణ బలిసినది.

**పీనసము.** సం. వి. అ. పుం. రోగవిశేషము, పడిసెము.

**పీనాహము.** సం. వి. అ. పుం. 1. ఘటికలోనగువానిచేత కట్టఁబడిన నూతివాతికట్టు, తొగాఁడి.

**పీనుఁగు.** దే. వి. ప్రాణమువాసినబొంది, శవము. "క. ప్రోవులు గట్టినగుజ్జుపుఁ, బ్రేవులునేనుంగుతఱచుపీనుంగులుర, క్తావిలతవెల్ల చీరలుఁ, గావులునైభటనికాయకాయంబులునై." భార. భీష్మ. ౨, ఆ.

**పీనుఁగుఁదిండి.** దే. వి. (పీనుఁగు+తిండి.) పిశాచము.

**పీనోధ్ని.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దపొదుఁగుగలయావు.

**పీన్గు.** దే. వి. పీనుఁగుయొక్కరూపాంతరము.

**పీయి** దే. వి. మలము, విష్ఠ, పురీషము.

**పీయూషము.** సం. వి. అ. న. 1. అమృతము; 2. జున్నుపాలు.

**పీరు.** దే. అ. క్రి. పీలుయొక్కరూపాంతరము. వి. క్షీరధార, గుమ్మ.

**పీరుచే.** దే. స. క్రి. పీలుచేయొక్కరూపాంతరము. (రూ. పీర్చే.)

**పీర్లు.** హిం. వి. మహమ్మదీయుల భక్తుల జ్ఞాపకార్థమైన చిహ్నాలు.

**పీల.** దే. విణ. బక్క, కృశము.

**పీలి.** దే. వి. 1. పక్షివిశేషము; "పీలిగఱులయంపకోలలు." స్వా. ర, ఆ. (పికిలియొక్కరూపాంతరము.)—2. ఓడకుదారిచూపెడు చుక్కాని.

**పీలిక.** దే. వి. వస్త్రములోనగువానిఖండము.

**పీలికాఁడు.** దే. వి. ఓడచుక్కానుత్రిప్పెడువాఁడు, కర్ణధారుఁడు.

**పీలు.** దే. అ. క్రి. పిగులుయొక్కరూపాంతరము.

**పీలుకము.** సం. వి. అ. పుం. పక్షిపిల్ల.

**పీలుచే.** దే. స. క్రి. 1. జొట్టు; 2. ఊపిరిపట్టి పాడి ముక్కులోపలికీడ్చుకొను. (రూ. పీల్చు.)

**పీలుపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చాఁగచెట్టు; 2. దొండచెట్టు.

**పీలువాది.** సం. వి. న్. పుం. ఒక మతమువాఁడు.

**పీలువు.** సం. వి. ఉ. పుం. 1. గోలుగుచెట్టు; 2. ఏనుఁగు; 3. పరమాణువు; 4. తాటిచెక్క; 5. పుష్పము; 6. బాణము.

**పీవము.** సం. విణ. (న్. ఈ. న్.) పీనము, బలిసినది.

**పీవరము.** సం. వి. అ. పుం. తాఁబేలు. విణ. 1. బలిసినది; 2. క్రొవ్విననది.

**పీవరి.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దపీఁచరచెట్టు.

## పు.

**పుంఖము.** సం. వి. అ. పుం. బాణముక్రిందిచివర, పింజె.

**పుంఖితము.** సం. విణ. (అ. ఆ. అ.) పుంఖానుపుంఖముగాఁ జేయఁబడినది.

**పుంగవము.** సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. ఓషధివిశేషము.

**పుంగవుఁడు.** సం. వి. అ. పుం. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠుఁడు.

**పుంగుడు.** దే. వి. తెల్లపాడలకుష్ఠము. పులిపులి. (అనికొందఱు.)

**పుంజము.** సం. వి. అ. పుం. రాశి, ప్రోగు.

**పుంజి.** వై. వి. సమృద్ధి*. "ఖంజరీటంబులపుంజిఁదెలుప." దశా. ౯, ఆ. — విణ. సమృద్ధము*. (అగ్రామమిప్పుడు పుంజిగా నున్నది.)

**పుంజికొను.** ద్వ. అ. క్రి. గుబురుకొను. "వ. పుంజికొనివెడలి నిమురలైయుండుకఅకుగిలునాసాకేశంబులున." కవిక. ౪, ఆ.

**పుంజీ.** దే. వి. నాలుఁగు.

**పుంజీభవించు.** సం. అ. క్రి. రాశివడు, ప్రోగువడు.

**పుంజెము** వై. వి. కుప్పడియెనికలనూలు*.

**పుంజొాలదండ.** వై. వి. ఆఁడుదానికంఠాభరణవిశేషము. "తే. దండనకె మెడఁబుంజాలదండవెట్టు." పాండు. 3, ఆ. (చూ. ఒడ్డాణము)

**పుంజో.** దే. వి. మగకోడి, కుక్కుటము.

**పుంజోదాలుపు.** దే. వి. (పుంజో+తాలుపు.) కుమారస్వామి.

**పుంట.** దే. వి. సంధ్య. (పూఁటయొక్కరూపాంతరము.)

**పుండరీకము.** సం. వి. అ. న. 1. తెల్లదామర; 2. తెల్లగొడుగు; 3. తీర్థవిశేషము; 4. గంధద్రవ్యవిశేషము. పుం. 1. ఆగ్నేయపుదిక్కునందలియేనుఁగు; 2. బెబ్బులి; 3. కప్ప; 4. తియ్యమామిడి*; 5. తెల్లపొడలకుష్ఠము. డు. 1. ఒకానొకముని; 2. నిఘంటువులుచేసినవారలలో నొకఁడు.

**పుండరీకాక్షుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, తెలిదమ్మికంటి.

**పుండలించు.** దే. అ. క్రి. అభూతకల్పనముచేయు.

**పుంసు.** దే. వి. వ్రణము, పిటకము.

**పుండ్రము.** సం. వి. అ. పుం. 1. నలుపుగలసినయెఱ్ఱచెఱకు*; 2. తెల్లదామర; 3. నుదుటినామము; 4. పురుగు; 5. పువ్వులగురివెంద, పుండ్రకము*; 6. వంగదేశము. డు. ఒక రాక్షసుఁడు.

**పుంత.** దే. వి. (చూ.) ఉపరథ్య.

**పుంభావము.** సం. వి. అ. పుం. ప్రౌఢిమము.

**పుంశ్చలి.** సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, కులట.

**పుంసవనము.** సం. వి. అ. న. 1. గర్భచిహ్నముతెలిసినతోడనే పురుషప్రజగాపుట్టవలెననిచేసెడియొకానొకశుభకర్మము; (చూ. కర్మము.) 2. క్షీరము.

**పుకారు.** హిం. వి. కేకలు, అల్లరి, వదంతి.

**పుకిలించు.** దే. స. క్రి. పుక్కిలించుయొక్కరూపాంతరము. (చూ. పల్మరు.)

**పుకిలింత.** దే. వి. పుక్కిలింతయొక్కరూపాంతరము.

**పుక్క.** దే. వి. బుగ్గయొక్కరూపాంతరము.

**పుక్కిలి.** దే. వి. బుగ్గలోపలిభాగము.

**పుక్కిలించు.** దే. స. క్రి. నీళ్లులోనగువానిగండూషించు.

**పుక్కిలింత.** దే. వి. పుక్కిలించుట, గండూషము.

**పుచ్చ.** దే. వి. 1. తలపుత్తె; 2. టెంకాయబొండ్లములోనగునది.

**పుచ్చ.** దే. వి. కాళింగి*. (దీనిభేదముచేఁతిపుచ్చ.)

**పుచ్చడీక.** దే. వి. సిగ్గరి. "సీ. పుచ్చడీకతనంబుపోఁబెట్టిగిరికన్యపతిఁగొల్వనాయాసపడినచోటు." స్వా. ౨, ఆ.

**పుచ్చు.** దే. అ. క్రి. పుచ్చిపట్టు. ప్రే. పోఁజేయు. "ఆ. భూరిభుజుఁడుతానెపోయెనోసివెట, కేనిపుచ్చితోనిజేచ్చ." భార. అర. 3, ఆ.–స. క్రి. 1. గ్రహించు; "ఉ. తనమెడహేమసూత్రమొకదారుపునందగిలించిగ్రక్కునన్, జనిననెటెంగివాయసము చంచుపుటంబునదానిఁబుచ్చి." పంచ. నా. ౧, ఆ.–2. పెటుకు. "శా. విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్ వెల్గొందుచంచజ్జటన్, సద్యఃక్రోధముతోడఁబుచ్చివయిచెన్ క్ష్మాచక్రమధ్యంబునన్. వ. ఇట్లుపెటికివైచినరుద్రునిజటయందు." భాగ. ౪, స్కం. – వి. అముదపుమడ్డి.

**పుచ్చుకొను.** దే. స. క్రి. గ్రహించు. "వ. దానింబుచ్చుకొనియభిమంత్రించిచండకౌశికుండు బృహద్రథునకిచ్చి." భార. సభా. ౧, ఆ. (స్వార్థమునకొను.)

**పుచ్చుకోలు.** దే. వి. పుచ్చుకొనుట, గ్రహణము.

**పుచ్ఛటి.** సం. వి. ఈ. స్త్రీ. నెటికవిఱుచుట. (దీనిఁగొందఱుపున్నపుంసకలింగములుగా వ్రాసియున్నారు.)

**పుచ్ఛము.** సం. వి. అ. పుం, న. 1. తోఁక; 2. వెనుకప్రక్క.

**పుటపుట.** దే. వి. అదురుటయందగు ననుకరణము. "ద్వి. నాసికయుఁ, బుటపుటఁగటములుఁ బొరిఁబొరినదుర." హరిశ్చ. ౧, ఆ.

**పుటపుటన.** దే. విశ. 1. అధికము; "వ. కొంతెఱుకనగుమదము పుటపుటన." అము. ౧, ఆ.–2. ప్రవృద్ధము. "క. ఇటనభమిటభూవలయం, బిటబలిసద్మంబునుండునిరవులివియనన్ బటుఫలగువలులచెలువునఁ, బుటపుటనైనున్న చిన్ని బొజ్జెగదలఁగన్." పాండు. ౨, ఆ.

**పుటపుటనగు.** దే. అ. క్రి. (పుటపుటన+అగు.) ప్రవృద్ధమగు. "వ. చేమంతిపూబంతులఁబుటపుటనై." స్వా. 3, ఆ.

**పుటభేదము.** సం. వి. అ. పుం. 1. పట్టణము; (రూ. పుటభేదనము. న.) 2. చతుర్విధవాద్యము; 3. ఏటివంపు.

**పుటము.** ఉభ. వై. వి. అశ్వగతివిశేషము. (చూ.) ప్లుతము. (పుటముల్ దుమికించు అనుచో పుటములుగాదుమికించుననుట. దీనికి ఏకవచనాంతముగా ప్రయోగము కనఁబడలేదు.) (చూ. తీరు.) – సం. అ. పుం, న. 1. పూలబుట్ట; 2. దొప్ప; 3. గుజ్జపుకాలిగొరిజె.

**పుటముబ్బు.** ద్వ. అ. క్రి. (పుటము+ఉబ్బు.) మీఁదికుబ్బు. "చ. అలికులవేణియారునవయావనమన్ వలరాచతోఁటలోఁ, బొలుచునితంబవేదికడఁబొక్కిలిడిగ్గియచెంతనీలనం, కలితనవాంబుయంత్రమగుఁగానియెడన్ రసగుంభనంబునం, ధిలఁబుటముబ్బునేనడుమనిల్చిఘనస్తనసూనగుచ్ఛముల్." వసు. ౨, ఆ.

**పుటమెగయు.** ద్వ. అ. క్రి. (పుటము+ఎగయు.) 1. మీఁదికెగయు; "క. పుటమెగసితాళవృక్షముఁ, జటులోద్ధతిఁబూనిపెటికిసారథినవనిన్, విటతటముగఁబడవైచెను, బటుభుజసత్వంబుమెఱయఁబవనజుఁడల్కన్." మై. 3, ఆ. – 2. దాఁటు. "క. ఇటునిశ్చయించియపుడటు, నిటుచూచిమహేంద్రశైలమెక్కినలంకా, పుటభేదనంబుమీఁదికిఁ, బుటమెగయునువాయుసూతిపొమ్మనికదలెన్." రామా. ౬, ఆ.

**పుటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పూలబుట్ట; 2. దొప్ప.

**పుటిక.** వై. వి. చిన్నగంప. (రూ. పుట్టిక.)

**పుటితము.** సం. వి. అ. న. దొప్పవలెకూర్పఁబడినరెండుచేతులు, దోసిలి. విశ. 1. కుట్టఁబడినది; 2. దొప్పగాఁజేయఁబడినది.

**పుటుక్కు.** దే. వి. తెగుటయందగు ధ్వన్యనుకరణము. (పుటుక్కునతెగెను.)

**పుట్ట.** దే. వి. 1. వల్మీకము; 2. చిన్నపొద; 3. జన్మస్థానము. (రోగములపుట్ట మొ.)

**పుట్టకాఁపు.** దే. వి. ఎలుఁగు, భల్లూకము.

పుట్టకాలివాఁడు. దే. విణ. (పుట్టకాలు+వాఁడు.) పుట్టకాలు గలవాఁడు, వల్మీకపాదుఁడు.

పుట్టకాలు. దే. వి. పుట్టవలెదుర్గంధముపెరిఁగినకాలు.

పుట్టకూడు. దే. వి. చీమ గుడ్లతోఁగలసినపుట్టమట్టిముద్ద. "క. పుట్టకూటికంటెఁ జీమలకు నెలంగులుగులఁగులంబుట్టలునశితనిజనఖరి... లికకోటులం గోరాడ." సాన. ౪, ఆ.

పుట్టకూడుదిండి. దే. వి. (పుట్టకూడు+తిండి.) ఎలుఁగు, భల్లూకము. (ఇట్లు పుట్టకూడుమేపుడు.)

పుట్టకొక్కు. దే. వి. పుట్టయందు తెల్లగా మొగ్గవలెమొలచునది, భూస్ఫోటము. (ఇది మిక్కిలి మెత్తగానుండును.)

పుట్టకోట. దస. వి. కోటకు బలముకొఱకు కోటబయటవేసిన మట్టి తిన్నె.

పుట్టగొడుగు. దే. వి. పుట్టయందు తెల్లగా గొడుగువలె మొలచునది, ఛత్రాకము. (దీని పుట్టంగొడుగని యొకానొకఁడు ప్రయోగించియున్నాఁడు.)

పుట్టగోఁచి. దే. వి. పెద్దకౌపీనము.

పుట్టచెండు. దస. వి. (పుట్టము+చెండు.) 1. ఎగురఁగొట్టియాడెడువస్త్రాదికృతమైనబంతి; "వ. పుట్టచెండుకరణినెగసి." నాచు. ౫, ఆ.—2. బ. బాలక్రీడావిశేషము. (చూ. అలంతులు.)

పుట్టచేర్పు. దే. వి. (చూ.) పుట్టకొక్కు. "చెలికొమలశపుట్టచేర్పులమన్నించు." వస. ౪, ఆ.

పుట్టతెమ్మె. దే. వి. ఒకదినుసుతమ్మెట.

పుట్టతేనె. దే. వి. పుట్టలోపెట్టిన పెరతేనె.

పుట్టతేలు. దే. వి. మండ్రగబ్బ.

పుట్టపుట్టువు. దే. వి. వాల్మీకిముని. "ఆ ప్రముఖకవిత్వతత్వనిజభక్తిఁదలంచెదఁబుట్టపుట్టువున్." వి క్రి. ౧, ఆ.

పుట్టము. వై. వి. వస్త్రము.

పుట్టి. దే. వి. 1. మానవిశేషము; (నాలుగు పందుములకొలఁది.) 2. వేములతో పెద్దగంపవలె అల్లి మీఁదతోలుకప్పి కుట్టఁబడినయేఱు దాఁటెడు సాధనవిశేషము. (వానిపుట్టిమునిఁగెను, వానిపుట్టిముంచెను ఇత్యాదిస్థలములయందు వాఁడెక్కిన పుట్టిమునిఁగెను, వాఁడెక్కినపుట్టిముంచెను అని శబ్దార్థము. వాఁడు మునిఁగెను, వాని ముంచెను అని తాత్పర్యార్థము. అప్పుడు మునుఁగుటకును, ముంచుటకును చెడుటయు, చెఱుచుటయు నర్థము.)

పుట్టిక. వై. వి. పుటికయొక్కరూపాంతరము. "పండ్లపుట్టికల్." కళా. ౬, ఆ.

పుట్టినిల్లు. దే. వి. (పుట్టిన+ఇల్లు.) మాతృగృహము, జన్మస్థానము.

పుట్టు. దే. అ. క్రి. జన్మించే. వి జన్మము.

పుట్టుక. దే. వి. జన్మము. (స్వార్థమునక ప్రత్యయము.)

పుట్టుకల్లరి. దే. విణ. పుట్టుకమొదలు కల్లలాడువాఁడు. "సీ. పుట్టుకల్లరియైనపాపములకునెల్లఁ, దిట్టయైలోకములచేతఁదిట్టువడిన, కట్టిఁడికినిట్టికష్టంబుగానోర్చి, తగవిధాతృఁడుచతురుఁడైనెగనె నేడు." భార. అర. ౫, ఆ.

పుట్టుగట్టు. దస. వి. ఉదయాద్రి. "ఆ. బ్రతుకుఁద్రోవయిట్లు పరఁగనేఁజెప్పినఁ, గమఁడువెడలెనిండుకడుపువచ్చి, పుట్టుగట్టు దటినిబొడముతమ్ములవిందు, కరణిమేనితెల్వి గడలుకొనఁగ." య. ౩, ఆ.

పుట్టుగు. దే. వి. పుట్టుక, జన్మము. (చూ. పుట్టువు.)

పుట్టుగొడ్డు. దే. విణ. పుట్టుకమొదలుగొడ్డుతనముగలది.

పుట్టుగ్రుడ్డి. దే. విణ. పుట్టుకమొదలుగుడ్డివాఁడైనవాఁడు, జన్మాంధుఁడు. (ఇట్లు పుట్టుచీకు. "ఆ. పుట్టుచీకువృద్ధుఁబూతిగంధానను, వేదజడునిఁబొందవెలఁదిరోసి." భార. ఆది. ౪, ఆ.)

పుట్టుచెయువు. దస. వి. జాతకర్మము.

పుట్టుపాప. దే. విణ. వ్యాధిచే తెల్లఁబాఱినదేహముగలవాఁడు.

పుట్టుబడి. దే. వి. పుట్టుక, ఉత్పత్తి.

పుట్టుమచ్చ. దే. వి. పుట్టుకమొదలు దేహమునందు కలిగినసల్లబొట్టు, తిలకాలకము.

పుట్టుమూఁగ. దస. వి. పుట్టుకమొదలు మూఁగయైనవాఁడు. (చూ. తమ్మిపుట్టు.)

పుట్టువడుగు. దస. వి. పుట్టుకమొదలు బ్రహ్మచారియైనవాఁడు.

పుట్టువు. దే. వి. పుట్టుక. (చూ. కూటువు.) (పుట్టుగుయొక్క రూపాంతరము.)

పుట్టువెట్టి. దే. విణ. పుట్టుకమొదలు వెట్టివాఁడైనవాఁడు.

పుట్నిల్లు. దే. వి. పుట్టినిల్లుయొక్కరూపాంతరము. "ఎ. గీ. మూడుమూర్తులపుట్నిల్లుమొదలిసెలవు." భాగ. ౮, స్క.

పుడమి. వై. వి. నేల, భూమి.

పుడమితాలుపు. దస. వి. 1. శేషుఁడు; 2. రాజు; 3. పర్వతము. "తే. అంటి, పుడమితాలుపుగమిపెచ్చుపెరిగడనరిది." అచ్చ. బాల, కాం.

పుడమిపట్టి. దస. వి. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు; 3. సీత, భూమిజ. "తే. తపనిజాలిల్లిజవరాం డ్రదండనుండఁ, బుడమిపట్టికిమదిఁగోర్కిపుట్టుటయును." రామా. ౫, ఆ.

పుడమిపుట్టు. దస. వి. 1. చెట్టు, భూజము; 2. సీత, భూమిజ. "తే. పుడమిపుట్టగులతకూనపూవుఁబోఁడి, కొమ్మపొదోడుమీకుభూజమ్ములార, తోడునీడయునగుచుఁగాపాడుఁడగనీ, యభిమతైకఫలావాప్తియగునిజంబు." రామా. ౫, ఆ.

పుడమిఱేఁడు. దస. వి. రాజు, భూపతి.

పుడమివేలుపు. దస. వి. బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు. "తే. ఇప్పుడమితాగ్రహంబునసేనరేఁగి, యిప్పుడమివేల్పుఁగొలమువారిం దిరేశ, వెలియుగిలియంచునున్నారు." పర. ౨, ఆ.

పుడమీశుఁడు. వై. వి. గ్రా. రాజు. "క. పుడమీశసత్యవాక్యము, నడపుము." సకల. ౨, ఆ. (ఇట్లు పుడమీశ్వరుఁడు.)

పుడికిరించే. దే. స. క్రి. (చూ.) పుణికిరించే.

పుడికిరింత. దే. వి. పుడికిరించుట, పుణికిరింత.

పుడికిళ్లు. దే. వి. బ. (చూ.) పుణికిళ్లు.

పుడిసిలి. దే. వి. కుదియఁబట్టినచేరలోనగునము, ప్రసృతి.

పుడిసిలించే. దే. స. క్రి. (జలముతోనగునాని) పుడిసిటఁబట్టు. "వారిధుల్ పుడిసిలింతుమె." రా. యు, కాం.

పుడిసిలింత. దే. వి. పుడిసిటఁబట్టుట, పుడిసిలించుట.

పుడుఁకులు. దే. వి. బ. భక్ష్యవిశేషము. "వ. పుడుఁకులునడుకులు." కాశీ. ౭, ఆ.

పుడుక. దే. వి. 1. పుల్ల; 2. కట్టెపుల్ల. (వాడుక పుడకయని.)

**పుడుకబావిలి.** దే. వి. స్త్రీకర్ణభూషావిశేషము.

**పుడుకు.** దే. స. క్రి. 1. కొంచెముగా ఇచ్చు; "తే. పుట్టలెసు మంతయిడనీడఁబోదలు పెట్టఁగి, పుడుకఁబుడుకంగఁగాటుకపోక చూచి, విత్తనముపార్జనవ్యయవృత్తులందుఁ, జిత్తమిడినవర్తకులకుఁ జేటులేదు." విక్ర. ౨, ఆ.–2. ఇచ్చు; "క. అడిగెడువారలు మునుమయి, పుడికెడువాఁడొకఁడులేక పురుషాల్పతయై, పడఁ తులుతఅచైకులములు, సెడియన్యులుప్రబలిజగముశిథిలతనొం దుఁగా." హరి. ఉ. ౯, ఆ.–3. (అయిదువ్రేళ్లతో) గ్రహించు. "మోమువ్రేళులంబుడుకుచు." ఉ, హరి. ౫, ఆ. – వి. ఈవి. "పుడుకులకొఱకు." అచ్చ. అ, కాం.

**పుడుకుఁగల్లు.** దే. వి. (పుడుకు+కల్లు.) చింతామణి. "ఎ, గీ. పుడుకుఁగల్లలజెట్టికైపాడమినట్టి, మెట్టవాల్పిట్టరామేనిదిట్టవేల్పు" అచ్చ. బాల, కాం.

**పుడుకుఁదొడుకు.** దే. వి. (పుడుకు+తొడుకు.) కామధేనవు. (చూ. తొడుకు. ఇట్లు పుడుకుఁబసి.)

**పుడుకుమ్రాను.** దే. వి. కల్పవృక్షము. "తే. కొండవీడేలు వేలుపుఁగూడిపాల, కడలినడుచక్కి–బలుమానికములదీవిఁ, బుడుకు మ్రాఁకులుమారేల్లుఁబొదలిపొదలు, కడిమిపూఁదోఁటలోనాడుగరి తఁదలఁతు." అచ్చ. బాల, కాం.

**పుడికిరించు.** దే. స. క్రి. 1. కొంచెముగా ఇచ్చు; 2. (సన్ని పాతదోషముచేత వ్రేళ్లతో) గ్రహించు. (పుడికిరించుయొక్క–రూపాంతరము.)

**పుడికిరింత.** దే. వి. పుడికిరింతయొక్క–రూపాంతరము.

**పుడికిల్లు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (పుడికిల్లుయొక్క–రూపాంతరము.)

**పుణుఁకులు.** దే. వి. బ. పుడుఁకులుయొక్క–రూపాంతరము.

**పుణుకు.** దే. స. క్రి. వి. పుడుకుయొక్క–రూపాంతరము.

**పుణ్యకము.** సం. వి. అ. న. ఉపవాసాదిరూపవ్రతము.

**పుణ్యజనుఁడు.** సం. వి. అ. పుం. 1. నైరృతి; 2. రాక్షసుఁడు; 3. యక్షుఁడు; 4. పుణ్యాత్ముఁడగుమనుష్యుఁడు.

**పుణ్యజనేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**పుణ్యభూమి.** సం. వి. ఇ. స్త్రీ. వింధ్యమునకును, హిమవంత మునకును మధ్యదేశము.

**పుణ్యము.** సం. వి. అ. న. 1. ధర్మము; 2. సుకృతము. విశ. 1. పవిత్రము; 2. మనోజ్ఞము.

**పుణ్యవంతుఁడు.** సం. విశ. (త్. ఈ. త్.) 1. ధార్మికుఁడు; 2. సుకృతి.

**పుణ్యాత్ముఁడు.** సం. విశ. (న్.) పుణ్యస్వరూపుఁడు.

**పుణ్యాహము.** సం. వి. అ. న. పుణ్యదినము.

**పుణ్యాహవాచనము.** సం. వి. అ. న. దైవాదికర్మప్రారంభము నందు మంగళార్థము పుణ్యాహమనుశబ్దమును మూడుమాఱులు చెప్పెడు శుభకర్మము.

**పుతపుత.** దే. వి. చలనమునందగు ననుకరణము. (ఆమాట విన్నది మొదలు నామనసు పుతపుతయనుచున్నది.)

**పుతపుతపోవు.** దే. అ. క్రి. వివశమగు. "తే. భుజములుద్ధతిఁ బుతపుతపోవఁగఁజొచె." ఉ, హరి. ౬, ఆ.

**పుత్త.** వై. వి. స్వర్ణము.

**పుత్తడి.** యు. దే. వి. అపరంజి. "సీ. తరతరంబులనుండి తన యింటనలరుపుత్తడిసైఁడిబుట్టమస్తమునవెలయు." శుక. ౧, ఆ.– వై. (చూ.) పుత్తళిక. "మ. పురుషాకారముతోడనున్న శిఖియో పుంస్త్వంబులేదోయదే, తరువో పుత్తడిరూపొచిత్తమును జైతన్యంబు శూన్యంబొకో, విరసత్వంబులప్రోవొనిర్భరకళా విజ్ఞానసర్వస్వమో, యరుదీచందమనంగనిల్చెధృతినిందస్పందమందస్థితిఁ." లక్ష్మీ. ౨, ఆ.

**పుత్తళి.** ఉభ. దే. వి. పుత్తడియొక్క–రూపాంతరము. సం. ఈ. స్త్రీ. పుత్తళిక.

**పుత్తళిక.** సం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదులచేత చేయఁబడిన బొమ్మ.

**పుత్తిక** సం. వి. ఆ. స్త్రీ. పెరయీఁగ, పతంగిక.

**పుత్తెంచు.** దే. ప్రే. (పుచ్చు+తెంచు.) పుచ్చు. (స్వార్థమున తెంచు.)

**పుత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. పుత్తళిక; 3. అక్క–దూడి.

**పుత్రుఁడు.** సం. వి. అ పుం. కొడుకు. (పుత్రులుపన్నిద్దఱు. 1. ఔరసుఁడు, (భార్యయందు తనకుఁబుట్టినకొడుకు.) 2. క్షేత్రజుఁడు, (ఏదేనియొకకారణమున సంతానవిచ్ఛిత్తికలుగఁగా పెద్దలయనుజ్ఞచేత తనభార్యయందుదేవరుఁడులోనగువారికిఁబుట్టినకొడుకు.) 3. దత్తుఁడు, (దత్తుతీసికొన్నకొడుకు.) 4 కృత్రిముఁడు, (గుణజ్ఞుఁడనియభిమానించిపెంచుకొన్నకొడుకు.) 5. గూఢోత్పన్నుఁడు, (భార్యయందు తనకుతెలియకుండఅంకుమగనికిఁబుట్టినకొడుకు.) 6. అపవిద్ధుఁడు, (తల్లిచేతఁగాని, తండ్రిచేతఁగాని, యుభయుల చేతనుగాని విడువఁబడఁగా తెచ్చి పెంచుకొన్నకొడుకు.) 7. కానీనుఁడు, (తనభార్యయందు కన్యాత్వమున రహస్యముగా నితరునికిఁ బుట్టినకొడుకు.) 8. సహోఢజుఁడు, (గర్భిణిగానుండ తెలిసికాని, తెలియకకాని వివాహముచేసికొన్న భార్యయందుఁబుట్టిన యా కొడుకు.) 9. క్రీతుఁడు, (తల్లిదండ్రులవద్దవెలయిచ్చికొనుకొన్న కొడుకు.) 10. పౌనర్భవుఁడు, (పునర్భువునందుఁబుట్టినకొడుకు.) 11. స్వయందత్తుఁడు, (తల్లిదండ్రులులేకకానితల్లిదండ్రులచేత నకారణముగవిడువఁబడికానితనంతట నేనునీకుఁబుత్రుఁడనయ్యెదనని వచ్చినకొడుకు.) 12. జ్ఞాతిరేతుఁడు. (జ్ఞాతికొడుకు.) వీరిలో మొదటియార్గురు బంధువులుదాయాదులునగుదురు. వెనుకటియార్గురుబంధువులగుదురుగాని దాయాదులుకారు. ఇదిభారతమునందు వ్రాయఁబడియున్నవిధమునను సరించినది. జ్ఞాతిరేతుఁడనుదానికి మాఱుగా మనుస్మృతియందుపారశవుఁడు (లేక) శౌద్రుఁడనియు, విజ్ఞానేశ్వరీయమునందుపుత్రికాపుత్రుఁడనియు వ్రాయఁబడియున్నది.)

**పుదియబొట్టు.** దృ. వి. ఊర్ధ్వపుండ్రము. "సీ. తుదివ్రేళ నెగ సద్రోచినపుదియబొట్టురుఫాలపట్టికనుల్లసిల్ల." రా. అర. ౨, ఆ.

**పుదీనా.** హిం. వి. సువాసనగల ఒక మొక్క.

**పునర్నవ.** సం. వి. ఆ. స్త్రీ. గలిజేరు. అ. పుం. ము. గోరు.

**పునర్భవ.** సం. వి. ఆ. స్త్రీ. చంద్రకళ. అ. పుం. ము. 1. గోరు; 2. సంసారము. విశ. మరలఁబుట్టినది.

**పునర్భువు.** సం. వి. ఊ. స్త్రీ. మాఱుమనువుది, దిధిషువు.

**పునర్వసు.** సం. వి. ఉ. పుం. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.) వు. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. కాత్యాయనముని.

**పునశ్చరణము.** సం. వి. అ. న. మంత్రములయొక్క పునఃపునః పఠనము.

**పునస్సంధానము.** సం. వి. అ. న. విచ్ఛిన్నమైపోయిన యగ్నిని మరల హోమముగుండమునందుఁగూర్చుట.

**పునస్సంస్కారము.** సం. వి. అ. పుం. ద్వితీయవారోపనయనాదిసంస్కారము.

**పునాది.** దే. వి. బలముసకైగోడకడుగుసభూమిలో లోఁతుగాత్రవ్వి పెట్టెడుగోడ, మూలబంధము.

**పునాసలు.** వై. వి. బ. సూర్యుఁడు పునర్వసునక్షత్రమందుండఁగా విత్తినసజ్జలులోనగుధాన్యములు*. ఆము. ౪, ఆ.

**పునీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పవిత్రుఁడు.

**పునుఁగు.** దే. వి. మార్జారికవలనఁగలుగు గంధద్రవ్యము.

**పునుఁగుచేట్టము.** దే. వి. పునుఁగుండునట్టికోశము, బిడాలకము.

**పునుఁగుపిల్లి.** ద్వి. వి. పునుఁగుతీసెడుపిల్లి, మార్జారిక.

**పునుఁగురాజెనాలు.** దే. వి. బ. మిక్కిలి వాసనగల శాలిధాన్యవిశేషము.

**పునుక.** దే. వి. తలచిప్పయెముక, కపాలము.

**పునుకతాలుపు.** దే. వి. శివుఁడు, కపాలభృత్తు. "సీ. ప్రోల్లగూల్చఁగఁడంగుపునుకతాలుపుమాడ్కి జగమడంపఁగఁబూనఁజము కరణి." అచ్చే. యు, కాం.

**పునెము.** వై. వి. విణ. పున్నెముయొక్కరూపాంతరము. (సుకృతమునకు. — "క. వినవమ్మభామినీమణి, మనమునసీకితరసంగమము ప్రియమైనన్, మునుగొంతికమలబాంధవు, నెనసియుఁబునెముఁగ నట్టులేవర్తిలుమీ." శుక. ౧, ఆ.)

**పున్న.** దే. విణ. పిన్న. (పున్నతేలు మొ.)

**పున్నమ.** వై. వి. శుక్లపక్షమునందు పదునేనవతిథి.

**పున్నాగము.** సం. వి. అ. పుం. 1. సురపొన్న; 2. ఇంద్రుని యేనుఁగు; 3. పురుషశ్రేష్ఠుఁడు; 4. తెల్లగలువ; 5. జాజికాయ.

**పున్నియము.** వై. వి. సుకృతము "తే. ఎన్నఁడునుసేగిలేనట్టియిష్టపోర్త, శానమునయందుఁగాపున్నజంతువులకు, నేటిసాకంబుపున్నియంబెడలినప్పు, డొఱకమునఁగూలవలయుఁగీలూడినట్లు." కాశీ. ౨, ఆ.—విణ. సుకృతముకలది*.

**పున్నెము.** వై. వి. విణ. పున్నియముయొక్కరూపాంతరము. (సుకృతమునకు. — "అన్నెముపున్నెమెఱుఁగనమ్మ." శుక. ౨, ఆ.)

**పుప్పము.** వై. వి. పువ్వు, పుష్పము. ఆం, సం.

**పుప్పి.** దే. వి. వ్యాధిచేతపురుగుపడిగోరులోనగునది పుచ్చుట.

**పుప్పించు.** దే. ప్రే. పుచ్చు. "తే. నాడుగుడిపొంతఁజాలనన్ని తీఁదసర్పు, తోరణస్తంభమెక్కియెవ్వారునెఱుఁగ, కుండనిచ్చెనఁ బుప్పించియుండుమువిద, యట్టులైననునేగెదవమరపురికి." హా. 3, ఆ. (ఇచ్చట ప్రేరణార్థకమైనపుచ్చునకుమీఁద ఇంచుక్రానియెఱుంగునది.)

**పుప్పిపురుగు.** ద్వి. వి. (చూ.) నుసిపురుగు.

**పుప్పు.** దే. వి. పశువులగోరిశేలువ్రస్సిపురుగులుపడెడువ్యాధి. (చూ. అదురుద్రిక్క.)

**పుప్పొడి.** ద్వి. వి. (పూ+పొడి.) పువ్వులయందలిధూళి, పరాగము.

**పుబ్బ.** వై. వి. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.) (పాడ్యమిని సంస్కృతపదముగావ్రాసిననిఘంటుకారుఁడు దీనిని సంస్కృతపదముగా వ్రాసియున్నాఁడు.)

**పుమాంసుఁడు.** సం. వి. స్. పుం. మనుష్యుఁడు, మానిసి.

**పుయిలోటు.** దే. వి. (పుయిలోడుట.) వెనుదీయుట, సంకోచము. "తే. నీవుఁదమ్ములునొక్కడనిలిచిచూచు, చుండుఁడనివల్కుట యుఁబుయిలోటతోడఁ, గీచకారాతిఁదప్పకచూచినగుచు, నతనికిట్లని చెప్పె ధర్మాత్మజుండు." భార. విరా. 3, ఆ. (రూ. పుయిలోటము. "సె. జనులుగాంచినమానుషముదూలుఁదనకనుపుయిలోటమున మోముపుల్లసిలఁగ." భార. విరా. ౨, ఆ.) (చూ. పుయిలోడు.)

**పుయిలోడు.** దే. అ. క్రి. (పుయిలు+ఓడు.) వెనుదీయు, సంకోచించు. "వ. ధర్మనందనుండతనియుద్ధతికింబుయిలోడి." భార. ఉద్యో. ౧, ఆ. (ఇందు పూర్వావయవము అన్యదేశ్యము. ఇది ఈడేలు, సెలవేలుశబ్దములవంటిది.)

**పురందరుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**పురంధ్రి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కుటుంబముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**పురఁటి.** దే. వి. సంధ్య. (పూఁటకు మొదటిభాగము.) ఆం, భా.

**పురడించు.** వై. అ. క్రి. పురిణించుయొక్కరూపాంతరము.

**పురణించు.** వై. అ. క్రి. 1. వర్ధిల్లు; "వ. కృష్ణుండు జన్మించినది యాదిగా గోపులుప్రతివత్సరంబును బ్రసూతలైక్రేపులుపురణించిచవచ్చు." హరి. పూ. ౬, ఆ. — 2. విజృంభించు*. "క. కురుబలమదెపురణించెబడలుపఱుతమురమ్మా." భార. ద్రో. ౫, ఆ.

**పురపుర.** దే. వి. పొక్కుటయందగు ననుకరణము. "దానిఁజూచి యేఁబురపురబొక్కుదుక." భార. విరా. ౨, ఆ.

**పురపురలాడు.** దే. అ. క్రి. (పురపురలు+ఆడు.) మిక్కిలి యపేక్షపడు.

**పురము.** సం. వి. అ. న. 1. పట్టణము; 2. పాటలీపుత్రమను పట్టణము; 3. శరీరము; 4. ఇల్లు; 5. మేడ; 6. మూడు. పుం. గుగ్గిలపుఁజెట్టు.

**పురస్కరించు.** సం. స. క్రి. 1. ముందిడుకొను; 2. పూజించు.

**పురస్కారము.** సం. వి. అ. పుం. 1. ముందిడుట; 2. పూజనము; 3. సన్మానము; 4. పరిగ్రహించుట; 5. తడుపుట; 6. శత్రువాక్రమించుట; 7. అపదూఱుపడుట.

**పురస్కార్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పురస్కరింపఁదగినది.

**పురస్కృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందిడఁబడినది; 2. పూజింపఁబడినది; 3. సన్మానింపఁబడినది; 4. పరిగ్రహింపఁబడినది; 5. తడుపఁబడినది; 6. శత్రువుచేనాక్రమింపఁబడినది; 7. అపదూఱుపడినది.

**పురస్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. (చూ.) పురస్కారము.

**పురస్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ.———పై.———

**పురస్సరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ముందునడచువాఁడు, పురోగముఁడు.

**పురహరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**పురాకృతము.** సం. విణ. (అ. ఆ. అ.) పూర్వజన్మమందుచేయఁబడినది. (శుభాశుభకర్మము.)

**పురాణము.** సం. వి. అ. న. 1. సర్గప్రతిసర్గాదిపంచలక్షణములతోఁగూడినబ్రాహ్మాది; (అవి పదునెనిమిది.—బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము,

స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము ) — 2. పదునెనిమిది. పుం. కర్ణమెత్తుటంకసాలవాటు. విశ. పురాతనము.

**పురాణించు.** ఉభ. వై. అ. క్రి. 1. వర్ధిల్లు; "వ. నాచేఁ గ్రేపులుపురాణించుటంజేసికొంచౌకకాలంబునీకదుపులంబెనుతు." భార. విరా. ౧, ఆ. "దండకము. ఉల్లోకసౌందర్యధుర్యస్థిలీవిస్తృతంబౌ నురస్సీమజీమూతమైహారవర్ణోపలశ్రేణిరాణించుమించుచున్బురాణింపఁగాఁజేయ." పాండు. ౪, ఆ. — 2. విజృంభించు*. (చూ. పురణించు.) — సం. స. క్రి. పురాణముచెప్పు. (చూ. దొరఁకొను.)

**పురాతనము.** సం. విశ. (అ. ఈ. అ.) బహుదినములనాటిది.

**పురాయించు.** వై. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. విజృంభించు*. "దండకము. శాకస్వరన్కంధబంధుత్వగంధంబురూపించుమూఁపుల్ పురాయింప." పాండు. ౪, ఆ.

**పురారి.** సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి.

**పురావృత్తము.** సం. వి. అ. న. తొల్లిటికథ.

**పురి.** ఉభ. దే. వి. 1. మెలి; 2. నెమిలిపింఛము; "తే. మేఘరాజులు సరసతమీఁదఁదమ్ముఁ, దరళవిద్యుల్లతాదీర్ఘతరకటాక్ష, వీక్షణకలాపములగారవింపనలరి, నెమ్మివర్తించుఁబురివిచ్చినెమ్మిగములు." రామా. ౬, ఆ.—3. కవియుట, ఆక్రమణము; "ఆపురికెదురాపరోద్యమునుండైన యాహారియుందోడలె." భార. ఉద్యో. ౪, ఆ.— 4. ధాన్యముపోసియుంచుటకు గడ్డితోకట్టినకూటు.—సం. ఈ. స్త్రీ. పట్టణము, ప్రోలు.

**పురికొను.** దే. అ. క్రి. కవియు, క్రమ్ము. "పురికొనుచుందెరలుచు." భార. భీష్మ. ౨, ఆ. (చూ. ప్రే.) "ఔందంబునఁ బురికొనుకౌతుకముతోడ." స్కా. ౨, ఆ. (ప్రే. పురికొలుపు. "క. సైరింపకయేడ్తెఱఁగురు, వీరాగ్రణియిరువదేనువేలరథంబుల్, పోరికిఁబురికొలిపినవి, స్ఫారగతింగూడికవిసెఁబార్థునిమీఁదన్." భార. భీష్మ. ౨, ఆ.)

**పురిడిపిట్ట.** ద్వ. వి. పక్షివిశేషము, పూరేడు.

**పురిపులుఁగు.** దే. వి. నెమిలి, బర్హిణము (చూ. గొరగొర.) (ఇట్లు పురిపిట్ట.)

**పురివిచ్చు.** దే. అ. క్రి. వేఱుపడు, పాయు.

**పురీతత్తు.** సం. వి. త్. న. ప్రేగు, ఆంత్రము.

**పురీషము.** సం. వి. అ. న. మలము, విష్ఠ.

**పురుగు.** వై. వి. క్రిమి, కీటకము.

**పురుటియాలు.** దే. వి. (పురుడు+ఆలు.) బాలెంతరాలు. "సీ. పాదివితేఁగానకపొత్తులలోఁబట్టఁ బోనాడుకొనినలేఁబురుటియాండ్రు." రామా. ౬, ఆ. (రూ. పురుటాలు. "క. పురుడీబోటికినిందిర, పురుడంబికగాక యొరులుపురుడేయనుచున్, బురుటాలికిఁబదిదినములు, పురుడుప్రవర్తించిరెలమిఁబుణ్యపుగరితల్." భాగ. ౮, స్కం.)

**పురుటిల్లు.** దే. వి. (పురుడు+ఇల్లు.) ప్రసవగృహము, అరిష్టము.

**పురుడించు.** దే. అ. క్రి. పోలికయగు. "క. బద్దులఁదొలివుట్టుగువెడ, బుద్ధులనొండొంటితోడఁబురుడించినసె, న్నుద్దులమగ్గులముద్దుల, సుద్దులబాలకుఁడు ప్రోచెక్షోణింబడఁగన్." వి, పు. 2, ఆ.—స. క్రి. పోలు. "శా. సింగంబున్నగుహానికేతమునకున్ శృంగంబునన్వచ్చుమా, తంగంబుం బురుడించుచున్." భార. విరా. ౨, ఆ.

**పురుడు.** దే. వి. 1. జాతాశౌచము; "తే. పదిదినంబులునుఁ భూపాలునతికిఁ, బురుడువెడలెఁద్రయీగణ్యఁబుణ్యరాశి, యతిమనఃపద్మమదమధువ్రతముఁగన్న, పుత్త్రుఁబోఁడికిఁజగముఁ బురుడుగలదె." రామా. 3, ఆ.—2. జాతాశౌచసమయము. "ధరణిఁగడుఁబేదవారును, బురుటికిఘృతతైలధాన్యములఁజెచ్చి, ముం, దరసంగ్రహింతురవిమన, కరుదుగ నతిదుర్లభంబులర్థము మిన్." భార. ఆర. 3, ఆ.—విశ. ఏ. సమానము, సమానుఁడు. "క. పురుషోత్తముతోనెవ్వఁడుఁ, బురుడీతండంద్రు." హరి. ౬ ౫, ఆ.

**పురుభువు.** సం. విశ. (ఉ. ఊ. ఉ.) మిక్కుటము. (రూ. పురుహువు.)

**పురులోము.** దే. అ. క్రి. (పురులు+ఓము.) శ్రోత్రముమెఁయించు.

**పురువు.** ఉభ. వై. వి. పురుగుయొక్కరూపాంతరము. (చూ. పుర్వు.)—సం. అ. పుం. 1. తల; 2. ఒకరాజు. విశ. మిక్కుటము.

**పురుషకారము.** సం. వి. అ. పుం. పురుషప్రయత్నము

**పురుషము.** సం. వి. అ. పుం. 1. క్రియలమీఁదివిభక్తులసంజ్ఞ; (ఇవి మూడు.—ప్రథమపురుషము, మధ్యమపురుషము ఉత్తమపురుషము.) 2. శాస్త్రము; 3. సురపొన్న.

**పురుషాయితము.** సం. వి. అ. న. ఉపరతి.

**పురుషార్థము.** సం. వి. అ. పుం. పురుషప్రయోజనము. (పురుషార్థములు నాలుగు.—ధర్మము, అర్థము, కామము, మోక్షము.)

**పురుషుఁడు.** సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. సాంఖ్యజీవుఁడు; 3. పరమాత్మ.

**పురుషోత్తముఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.

**పురుహూతుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**పురె.** దే. అవ్య. ప్రశంసార్థకము. (చూ. బాపురె.)

**పురే.** దే. అవ్య. పురెయొక్కరూపాంతరము. "చాలుఁబురే సరోజభవ." భాగ. 3, స్కం.

**పురోగముఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ముందునడచువాఁడు.

**పురోగామి.** సం. విశ. (న్. ఈ. న్.) ——పై.——

**పురోగుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ——పై.——

**పురోడాశము.** సం. వి. అ. పుం. 1. యజ్ఞార్థమైన అపూపము; 2. సోమలతరసము; 3. హుతశేషము.

**పురోణి.** వై. వి. చిన్నయుత్తరము, చీటి.

**పురోధసుఁడు.** సం. వి. న్. పుం. పురోహితుఁడు. (రూ. పురోధ.)

**పురోభాగి.** సం. విశ. (న్. ఈ. న్.) ఎప్పుడును తప్పులువెదకువాఁడు.

**పురోహితుఁడు.** సం. వి. అ. పుం. శుభాశుభవైదికకర్మములను చేయించుచు మేలుకీడులను తెలుపుచుండెడి యాచార్యుఁడు, ఒజ్జ.

**పుర్వు.** వై. వి. పురువుయొక్కరూపాంతరము. "చ. పొత్తినూలిపుర్వునకెనగాకుబంధకుఁడవుదున్ దనకజ్జుఁడు దానయమ్మెయిన్." భార. శాం. ౬, ఆ.

**పుత్రియ.** వై. వి. పుత్రె. "చ. కలచినవీనఁగుక్ వెడఁదకప్పెర యుక్ మొలఁబచ్చితోఁల్లనుం, బుటియల పేరులుక్." ఉ, హరి. ౨, ఆ.

**పుజ్జి.** దే. విశే. ఎడమ, వామము. (పుజ్జిచేయి మొ.)

**పుత్రియ.** వై. వి. పుటియకు మొదటిరూపము.

**పుజ్జు.** దే. వి. పలుచేనిమలము.

**పుట్టె.** వై. వి. (చూ.) పునుక.

**పుల.** దే విశే. పసుపుమించిన తెలుపువన్నెకలది. (పులకండము.) (పుల్లయొక్క రూపాంతరము.)

**పులకండము.** ద్వ. వి. కండచక్కెర. "సీ. పలుకుచిల్కకుఁబెట్టు పులకండమోయనముంగరముత్తెంబు మురువుసూప." చంద్రా. 3, ఆ.

**పులకము.** సం. వి. అ. పుం. 1. పులగము; 2. పీనుఁగునకిచ్చెడి యన్నపుకబళము; 3. పురుగు; 4. చెట్టుమీఁదినల్లపురుగు; 5. నులిపురుగు; 6. మణిదోషవిశేషము; (అనఁగా మణులయందలిచీలిక.) 7. వజ్రమణి; 8. హరిదళము; 9. కడపకీ.

**పులకరము.** వై. వి. 1. గగుర్పాటు; 2. జ్వరము*.

**పులకరించు.** వై. అ. క్రి. గగుర్పొడుచు.

**పులకలు.** సం. వి. అ. పుం. గగుర్పాటు. "వ. అస్తంబునంగల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁజెంతించినమేనంబులకలిప్పుడుం బొడమెడు." స్వా. ౧, ఆ. (తెనుఁగుననిది స్త్రీసమముగాను బహువచనాంతముగాను బ్రయోగములంజూపట్టెడు.)

**పులకించు.** సం. అ. క్రి. గగుర్పాటుగలదియగు.

**పులగము.** వై. వి. పెసరపప్పుచేర్చివండినయన్నము.

**పులపొడుచు.** దే. అ. క్రి. తెప్పవేయకచూచు. "క. చప్పుడు సేయకసంజ్ఞకుఁ, జప్పట్లిడుకొంచుఁగొండనరియలవెంటక్, జప్పళ్లకుఁబులపొడుచుచుఁ, జొప్పరయుచునీలవెట్టుచునుశబరభటుల్." భల్లా. 3, ఆ.

**పులము.** సం. వి. అ. పుం. గగుర్పాటు. విశే. విపులము.

**పులసరము** దే. వి. పాకము చెడుటవలనఁ గలిగిన పులుసు.

**పులసరి.** దే. విశే. గరిష్ఠుఁడు. "ద్వి. కలవానియట్లునిక్కంబు సీవొక్క, పులసరితనమునఁబుచ్చితికొలుచు." భల్లా. ౪, ఆ.

**పులాకము.** సం. వి. అ. పుం 1. పొల్లు; 2. మెతుకు; 3. సంక్షేపము.

**పులావు.** హిం. వి. ఒకవిధమైన వంటకము.

**పులి.** దే. వి. వ్యాఘ్రము. విశే. పులిసినది. (పులికడుగు మొ.)

**పులికడుగు.** దే. వి. పులిసినకడుగునీరు, ధాన్యామ్లము.

**పులికూడు.** దే. వి. 1. పులిసిన యన్నము; 2. భిక్షాన్నము. "చెలిపులికూడుమానుపనిశ్రీదునిఁగాదని." వసు. ౧, ఆ.

**పులికోచె.** దే. వి. పులిముఖమువంటి ముఖముగలిగిన సాలెపురుగు వంటి యొక పెద్దపురుగు.

**పులిగంజి.** ద్వ. వి. పుల్లనీళ్లు, ఆరనాళము.

**పులిగాయము.** దే. వి. ఆణినగంటిమచ్చె. "క. తిలకించితివేన్నపమొ, కృ లమగునీచెంచుమేనఁగలపలుగంటుల్, బలుసింగపుపలుగంట్లా, పులిగాయములెల్లఁబెద్దపులిగాయంబుల్." చంద్రా. ౨, ఆ.

**పులిగోరు.** దే. వి. 1. నడుమ వ్యాఘ్రనఖమును పతకమునకు మాఱుగాఁ గూర్చినహారము; (చూ. మొలకట్టు.) 2. వ్యాఘ్రనఖముకీ.

**పులిచించెలము.** ద్వ. వి. పులిచింతకీ.

**పులిచింత.** ద్వ. వి. చుక్రికకీ.

**పులిచెంచలి.** దే. వి.——వై.——

**పులిచెవులాకు.** ద్వ. వి. (పులిచెవులు+ఆకు.) ఒకానొక మందు చెట్టు.

**పులిజూదము.** ద్వ. వి. ఒకానొక ఆట.

**పులితేఁపు.** దే. వి. అజీర్ణపుతేఁపు.

**పులినము.** సం. వి. అ. స. ఇసుకదిన్నె, సైకతము.

**పులినీరు.** ద్వ. వి. రక్తమువిఱిగిగాయములోనగువానియందుండి కాఱెడునీరు. "క. హారునఱకాలంజొరఁబడి, శిరమునకుక్ వెడలెనిదుశితఖండముచం, దురయదిసెలవడినేఁడుక్, దొరఁగెడుపులినీరుగాంగతోయము పేరక్." చంద్ర.

**పులిపిరి.** దే. వి. దేహమునందు మిరియమువలెపెరిఁగెడు దుర్మాంసవిశేషము, కేమము.

**పులిపిరికాయ.** దే. వి.——వై.——

**పులిపులి.** దే. వి. పులిపిరికాయ. విశే పీడితము, అవమర్దితము. "సీ. పులిసేరుచోఁబులిపులిసేయలావేలవ్రేలికీమూలికవెలసెనేని." చంద్రా. ౨, ఆ. "సీ. పులిఁగ్రమ్ముకొని పులిపులిగనీఁటెలఁగ్రుమ్మియేపుతోమగఁటిమిచూపువారు." రసి. ౧, ఆ.

**పులిపులికాయ.** దే. వి. పులిపిరికాయ, కేమము.

**పులిపెంజెర.** దే. వి. కాటుకరేకుపాము.

**పులిమిపుచ్చు.** దే. స. క్రి. (విషయమును) తేలికగాపోనిచ్చు. "క. తెలుఁగుకవిత్వముచెప్పక్, దలఁచినకవియర్థమునకుఁదగియుండెడుమా, టలుగొనివళులుంబ్రాసం, బులునిలుపకయొగినిబులిమిపుచ్చుటచదురే." నిరవ. ౧, ఆ.

**పులిమెకము.** ద్వ. వి. మత్స్యవిశేషము.

**పులిమెట్టు.** దే. వి. తేర్చినకడుగుయొక్క యడుగుది.

**పులియ.** దే. వి. విస్తరాకు. "క. నెలనాళ్లుసునియతుండై, పలాశపత్రములపులియఁబాయకద్విజుఁడి, మ్ములభోజనంబుచేసిన, ఫలమిలఁజాంద్రాయణంబుఫలముంగలుగుక్." విజ్ఞా. ఆచా, కాం.

**పులియఁడు.** దే. వి. పులివలెనుండుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**పులియఁబాఱు.** దే. అ. క్రి. (పులియక్+పాఱు.) పులియు. "సీ. బూఁబోఁడికెమ్మోవిపులియఁబాఱనితేనెనతిమోముకందనిచందమామ." చంద్ర. (చూ. పాఱు.)

**పులియు.** దే. అ. క్రి. పుల్లనగు.

**పులియోర.** అర. వి. పులుసుకలిపిన యన్నము. (గూ. పులిహోర.)

**పులిరుసు.** దే. వి. పుల్లిరుసుయొక్క రూపాంతరము.

**పులివరుగు.** దే. వి. పులియఁబెట్టినవరుగు. కాశీ. ౭, ఆ.

**పులిసరి.** దే. వి. పులుగుడు, వాతఘ్నికీ.

**పులు.** దే. వి. 1. రత్నమాలిన్యము; "పులుకడిగినరత్నశలాకలీల." పర. ౨, ఆ.—2. కసవు. "పులుమఖశాలికానికట భూముల

సేయుచు." ఆము. 3, ఆ.—విణ. అల్పము. (పులుమానిసి మొ.) (వెనుకటి రెండర్థములయందిది పుల్లుయొక్క—రూపాంతరము.)

పులుఁగు. దే. వి. పక్షి, విహగము, పిట్ట.

పులుఁగుపిట్ట. దృ. వి. గుడ్లగూబ, ఘూకము.

పులుఁగుబొల్లఁడు. దే. వి. గరుత్మంతుఁడు.

పులుఁగుపత్రాయి. దే. వి. పచ్చ, గారుత్మతము.

పులుఁగురేఁడు. దే. వి. గరుత్మంతుఁడు, ఖగేశ్వరుఁడు.

పులుకానిపురువు. దృ. వి. పచ్చతెక్కపురుగు. ("ద్వి. రాజులు వాటించు మరాళివాసముల, నోజతో నూఁడి గంబో నరించు చదమకు, వరప్రసుగాఁ జేసివరుసవర్తింపఁ, బురిలోనఁబులుకానిపురువులతర మె." (ఇక్కడ పులుకానిపురువులనఁగా అల్పులనియర్థము.) హరిశ్చ. ౨, భా.)

పులుకానిపులుఁగు. దే. వి. చిలుక. "తే. ఇన్ని దేవళ్లఁగొలిచి నేనేసుగంటిఁ, బోయిపచ్చనిపులుకానిపులుఁగుచేత, మోసపోయితి నని కుందుమొనయఖేద, మూరటమొనర్పవినివియయ్యారిబనివి." శుక. 3, ఆ.

పులుకుపులుకు. దే. వి. ఱెప్పలుమూసిమూసితెఱచిచూచుచూచుట యందగుననుకరణము. "శే. పులుకుపులుకునఁజూచియక్కలికి తోడఁ, బలుకువలుకునదైన్యంబుదొలుకఁబలికె." సా. ౨, ఆ. (చూ. పులుక్కు—పులుక్కు. "సీ. భోగించువారలఁబులుక్కు—పులుక్కునఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లు మ్రింగువారు." నై. 2, ఆ.)

పులుఁగరి. దే. విణ. (పులుగు+అరి.) జోడమెట్టిగినవాఁడు. "క. వినివారిగడగిగడ, యననేమియునేమెఱుంగమాశొమ్మఖలం, బునువచ్చునేనిసీచె, ప్పినపులుగరివెచ్చ మెల్లఁ బెట్టెదమనిరా." పర. ౫, ఆ.

పులుఁగాకు. దే. వి. (పులు+కాకు.) ఉపద్రవము. "ద్వి. పలు గాకులైబహుభంగులనిట్లు, పులుగాకులో నరింపఁబోలదేమాన్స." హరిశ్చ. ౧, భా.

పులుఁగు. దే. వి. 1. గుఱుతు; "ఎ, గీ. పాలఁతిరేలుసీయునికియ పులుగుగాదె." ఆము. ౫, ఆ.—2. జోడ. (చూ. పులుగరి.)

పుఁగుసు. దే. వి. పులిసరి, వాతఘ్నీ. (ఇది ద్వివిధము. నల్ల పులుగుడు, తెల్లపులుగుడు.)

పులుదిండితాయి. దే. వి. (పులు+తిండితాయి.) ఇంద్రనీల మణి. (చూ. నెట్టెము.) (ఇట్లు పులుదిండిచలువ.)

పులుప. దే. వి. పలుచేగానూఁబినపుల్లయూరుఁబిండి. కాశీ. 2, ఆ.

పులుఁమానిసి. దృ. వి. అల్పమనుష్యుఁడు. (చూ. దెస.)

పులుఁము. దే. స. క్రి. 1. రుద్దు; 2. నలుపు; 3. ఉనుము; 4. కొట్టు. వి. కుష్ఠరోగము.

పులుఁముడు. దే. వి. రుద్దుడు, మార్జనము.

పులుమ్రాను. దే. వి. తాళనారికేళాదితృణద్రుమము.

పులుఁసు. దే. వి. 1. ఒక రసము, ఆమ్లము; (చూ. రసము.) 2. వ్యంజనవిశేషము.

పులుసుఁగూర. దృ. వి. (పులుసు+కూర.) పులుసుపోసివండిన కూర.

పులోమజ. సం. వి. ఆ. స్త్రీ. ఇంద్రునిభార్య, శచి.

పులోమజిత్తు. సం. వి. త. పుం. ఇంద్రుఁడు.

పుల్కసుఁడు. సం. వి. అ. పుం. 1. బోయవాఁడు; 2. స్తోత్రవాఁడు; 3. అధముఁడు. (రూ. పుల్కసుఁడు.)

పుల్గము. వై. వి. పులగముయొక్క—రూపాంతరము. "మాయక్కసేకురుబుల్గంబిదెవంచెఁగొనుము." భల్లా. ౫, ఆ.

పుల్గరి. దే. విణ. పులుగరియొక్క—రూపాంతరము. "ఏమిమూపుమున కేగితెచ్చెదము పుల్గరిధనంబనిరి." పర. ౫, ఆ.

పుల్పిరి. దే. వి. పులిపిరియొక్క—రూపాంతరము.

పుల్పొడుచు. దే. అ. క్రి. పులపొడుచుయొక్క—రూపాంతరము "జడతలదుదవెప్పలఁగన్నువిప్పిపుల్పొడుచుచు." ఆము ౪, ౬

పుల్ల దే. వి. 1. పుడక; 2. సమిధ; 3. పాయినీడుకట్టె. విణ. 1 పుల్లనిది; (పుల్లదానిమ్మ మొ.) 2. పసుపుమించిన తెలుపు వన్నెగలది. (పుల్లావు మొ.)

పుల్లంటుతాయి. దే. వి. (పుల్లు+అంటుతాయి.) ఇంద్రనీల మణి.

పుల్లకంద. దృ. వి. ఒకదినుసుకందౌ.

పుల్లగిల్లు. దే. అ. క్రి. భయపడు. (రూ. పుల్లగిలు. "క. తన చేతన్వతిసుతుఁడాటెఁ, గినఁడైవచ్చునని పుల్లగిలిపోఁజూచుఁ, వన సత్వములత్యుగ్రం, బునమెదలఁగఁజూచి పాఱిపోవనువెఱచున్." భో. ౫, ఆ.)

పుల్లగూర. దృ. వి. (పుల్ల+కూర.) (చూ.) పులుసుఁగూర.

పుల్లగోరక. దే. వి. నీరుకోడి, పరిప్లవము.

పుల్లతి. దే. వి. పాదనకాండ్రుగుటికినా లెడుకోల.

పుల్లతీఁగె. దృ. వి. సోమలత. "సీ. కమలారినామంబుగొన్నవివి యనిపుల్లతీఁగలుచూచిపుల్లసిల్లి." పాండు. ౫, ఆ.

పుల్లదానిమ్మ. దృ. వి. ఆమ్లదాడిమము.

పుల్లన. దే. వి. పులుసు. విణ. పులుసుగలది. (వృత్తియందు విశేషణముగుచో పుల్లని. చూ. అలకన.)

పుల్లనీళ్లు. దృ. వి. బ. కూటినీళ్లు, ఆరనాళము.

పుల్లప్రత్తి. దే. వి. ఒకదినుసుప్రత్తి.

పుల్లప్రబ్బ. దే. వి. ఆమ్లవేతసము.

పుల్లబచ్చలి. దే. వి. వల్లిసూరణము.

పుల్లమామిడి. దే. వి. కొండమామిడి.

పుల్లయుసిరిక. దే. వి. (పుల్ల+ఉసిరిక.) కొండయుసిరిక. (దీని కాయలు పెద్దవి.)

పుల్లరి. దే వి. (పుల్లు+అర్రి.) పసులు కసవుమేయుటకైయిచ్చెడు పన్ను, తృణభాగధేయము.

పుల్లరుజా. దే. వి. (పుల్లు+అరుజా.) మత్స్యవిశేషము. హంస. ౪, ఆ.

పుల్లవడు. దృ. అ. క్రి. (పుల్ల+పడు.) స్తంభించు. "క. పుల్ల వడిచలము కోపము, పొల్లవడిచనంగఁగొంత ప్రొద్దుమొగముగన్, వెల్లఁదనముగదురనిలిచి, యెల్లజనులువినఁగమఱియునిట్లనిపలికెన్." భార. ఆర. ౪, ఆ. "క. తల్లియుఁదండ్రియువెఱఁగునఁ, బొల్ల వడఁగవారికడకుఁబోయితడయఁగా, నొల్లకపయనముపీడ్కో, లెల్లను దనయిచ్చఁదెల్పి యిట్లనియెదగన్." భార. ఉద్యో. ౪, ఆ.

పుల్లవావిలి. దే. వి. తెల్లవావిలి, శ్వేతసురస.

పుల్లవెలఁగ. దే. వి. ఒకదినుసువెలఁగ.

**పుల్లసిల్లు.** దే. అ. క్రి. 1. వివర్ణమగు; (చూ. పుల్లతీఁగ.) 2. కలఁగు. (రూ. పుల్లసిలు.—కలఁగుటకు.—"ఉ. మల్లసుగంధినామనసు మోహమునా అడిపెట్టిసీవున, న్నొల్లకవీడనాడెదవయోతగవామగవారిచిత్తముల్, పుల్లసిలంగఁజేయఁబోరపాచ్చెములాడఁగనాఁడు వారికే, చెల్లునుజెల్లఁబోవ్రతముచెడ్డసుఖంబునుదక్కదయ్యెఁగా." వి, పు. ౨, ఆ.)

**పుల్లావు.** దే. వి. (పుల్ల+ఆవు.) కపిలధేనువు. "శార్దూలమంచో పుల్లావుశిరంబుఁద్రుంచె." భాగ. ౯, స్కం.

**పుల్లియ.** దే. వి. పుల్లె. "తే. ఇచటికెంగిలిపుల్లియలేలవచ్చె." కాశీ. 3, ఆ.

**పుల్లిరుసు.** దే. వి. (పుల్లు+ఇరుసు.) తొండాపుత్రాటికి అనుదలగానమర్చిన చిన్నయిరుసు.

**పుల్లు.** దే. వి. కసవు, తృణము. (చూ. పులు.) విశ. అల్పము. (పుల్లిరుసు మొ.)

**పుల్లుడి.** దే. వి. (పుల్లు+ఉడి.) ఒకానొకప్పుడు సాగుబడికుపయోగించెడుపొలము. (ఇట్టివి ఏఁడుడి, నీరుడి.)

**పుల్లుఉుకుపాము.** దే. వి. (పుల్లు+ఉఉకుపాము.) సర్పవిశేషము.

**పుల్లె.** దే. వి విస్తరాకు. (పుల్లియయొక్కరూపాంతరము.)

**పుల్లెన.** దే. వి. ఒకానొకమందుచెట్టు.

**పువు.** వై. వి. పువ్వుయొక్కరూపాంతరము. "చ. ఇన్నదిఁగ్రుంకియందఱుం, బువులిఁకఁగోసితెండు శివపూజకటంచుదశాస్యుఁడంచినన్." ఉ, రా. 3, ఆ.

**పువుఁబోఁడి.** ద్వి. వి. పువ్వుఁబోఁడియొక్కరూపాంతరము. "వేల్పుంబువుంబోంట్లు." య. ౧, ఆ.

**పువ్వాటు.** ద్వి. వి. (పువు+వాటు.) ముందువెనుకలకు సూఁగాడుట.

**పువ్వార.** ద్వి. వి. (పువు+వార.) ఈఁదుతాడులోనగువానివంటి చెట్లయొక్కపూఁత.

**పువ్వారుఁబోఁడి.** (పువు+ఆరు+పోఁడి.) 1. పువ్వమువలె మిక్కిలి మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. "క. నెవ్వడిసీ తెఱఁగంతయుఁ, బువ్వారుంబోఁడినాకుబొంకకచెపుమా." రసి. 3, ఆ.

**పువ్విలుకాఁడు.** ద్వి. వి. (పువు+విలుకాఁడు.) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు. "ఉ. పువ్విలుకాఁడునాహృదయముక్ నొగిలించుచున్నవాఁడు." ఉ, రా. 2, ఆ.

**పువ్విలుతుఁడు.** ద్వి. వి. (పువు+విలుతుఁడు.)——పై.—— "క. పువ్విలుతుతంద్రియచ్చట, మువ్వంకమురువునమురళిమొరయించెమనం, బువ్విళ్లూరఁగత్రుతులకు, నవ్విధముఁదదీయపదయుగాంకము తెల్పన్." పాండు. ౫, ఆ.

**పువ్వు.** వై. వి. పువు, పూవు, విరి, పుష్పము.

**పుషితము.** సం. విశ. (అ. ఆ. అ.) పోషింపఁబడినది.

**పుష్కర.** సం. వి. ఆ. స్త్రీ. మెట్టతామర. అ. న. ము. 1. ఆకాశము; 2. ఉదకము; 3. తామర; 4. మెట్టతామరదుంప; 5. తొండముచివర; 6. వాద్యముఖము; 7. కత్తివాదర; 8. బాణము; 9. కుష్ఠమనెడు ఓషధి; 10. ఒక ద్వీపము; (చూ. ద్వీపము.) 11. తీర్థవిశేషము. పుం. 1. బెగ్గురుపక్షి; 2. రోగవిశేషము; 3. సర్పవిశేషము. డు. 1. ఒకరాజు; 2. వరుణునికొడుకు.

**పుష్కరాహ్వము.** సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి.

**పుష్కరిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కోనేఱు; 2. తామరకొలను; 3. ఆఁడేనుఁగు. (మగయేనుఁగు—పుష్కరి. న్. పుం.)

**పుష్కలము** సం. విశ. (అ ఆ. అ.) 1. శ్రేష్ఠము; 2. అధికము, సమృద్ధము.

**పుష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పోషింపఁబడినది; 2. బలిసినది.

**పుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పోషణము; 2. బలుపు; 3. సమృద్ధి.

**పుష్పంధయము.** సం. వి. అ. పుం. తుమ్మెద.

**పుష్పకము.** సం. వి. అ. న. 1. కుబేరునివిమానము; 2. కుసుమాంజనము; 3. రత్నకంకణము; 4. కుంపటి. పుం. కృష్ణునితేరిగుఱ్ఱములలో నొకటి.

**పుష్పకేతువు.** సం. వి. అ. న కుసుమాంజనము. పుం. మన్మథుఁడు.

**పుష్పదంతము** సం. వి. అ. పుం. వాయువుదిక్కునందలి యేనుఁగు. డు. ఒక విద్యాధరుఁడు.

**పుష్పధన్వుఁడు.** సం. వి. న్. పుం. మన్మథుఁడు, పూవిలుతుఁడు.

**పుష్పపుటము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

**పుష్పఫలము.** సం. వి. అ. పుం. కపిత్థము, వెలఁగ.

**పుష్పమంజరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పూగుత్తి; 2. బ. ధాన్యవిశేషము.

**పుష్పము.** సం. వి. అ. న. 1. పూవు; 2. స్త్రీరజస్సు; 3. గండివనము; 4. మాచిపత్రి.

**పుష్పరథము.** సం. వి. అ. పుం. క్రీడాయోగ్యమగురథము. (రూ. పుష్యరథము.)

**పుష్పరసము.** సం. వి. అ. పుం. పూఁదేనె.

**పుష్పలావిక.** సం. వి. ఆ. స్త్రీ. పూలబంతులు సరములులోనగునవి గ్రుచ్చియమ్మెడు ఆఁడుది.

**పుష్పలిహము.** సం. వి. హ్. పుం. షట్పదము, తుమ్మెద.

**పుష్పవంతులు.** సం. వి. త్. పుం. ద్వి. సూర్యచంద్రులు.

**పుష్పవతి.** సం. వి. ఈ. స్త్రీ. రజస్వల, ముట్టుది.

**పుష్పశరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**పుష్పసమయము.** సం. వి. అ. పుం. వసంతఋతువు, పూఁదఱి.

**పుష్పించే.** సం. అ. క్రి. వికసించే, పూచే.

**పుష్పిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. దంతమలము; 2. లింగమలము.

**పుష్పిణి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) పుష్పవతి.

**పుష్పితము.** సం. విశ. (అ. ఆ. అ.) పూచినది.

**పుష్యమి.** సం. వి. ఈ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**పుష్యము.** సం. వి. అ. పుం. 1. పుష్యమీనక్షత్రము; 2. పౌషమాసము; 3. పుష్యరాగము; 4. కలియుగము.

**పుష్యరాగము.** సం. వి. అ. పుం. శ్వేతమణివిశేషము.

**పుసలాయించు.** వై. స. క్రి. బుజ్జగించు.

**పుసి.** దే. వి. నేత్రమలము, దూషిక.

పుసుకు. దే. వి. తుమ్ముటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (పుసుకనితుమ్మెను, పుసుకునచెప్పెను.)

పుస్తకము. సం. వి. అ. న. లేఖనపత్ర సంపుటము.

పుస్తము. సం. వి. అ. న. 1. లప్పముచేయుటలోనగు శిల్పుల పని; 2. పుస్తకము; 3. మాంసపుచెక్కడము.

పుస్తు. దే. వి. దుర్గంధము. "ద్వి. అదెవచ్చెనడబీనుఁగనుచునం తంతఁ, గదియుచుమైపుస్తుకంపునకెడసి, తొలఁగుచుఁబురజనుల్ తుప్పననుమియు." హరిశ్చ. ౨, భా.

పుస్తె. దే. వి. మంగళసూత్రము. "తే. పుస్తెగట్టినయదిమొదల్ పొంతరాపు." రుక్మాం. ౪, ఆ.

పుస్తెముడుపు. దే. వి. కంటెబొట్టు.

పుళిందము. సం. వి. అ. పుం. ఒకదేశము. (చూ. దేశము.)

పుళిందుఁడు. సం. వి. అ. పుం. ఇతరభాషతెలియక అడవియందు వాసముచేయుచు మిక్కిలి జీవహింసాపరుఁడై తిరిగెడు ఒకజాతి బోయవాఁడు.

## పూ.

పూ. వై. వి. పువ్వు. "ఎ, గీ. కాలకంఠునిశిరముపూగగనగంగ." కాశీ. ౧, ఆ. (దీనికి వృత్తియందు ఉకారమునకువలెనుమాగమాది కార్యమునెఱుంగవలెను. ఉదా. పూఁగొమ్మ, పూటడిదము.)

పూంచే. దే. ప్రే. పూనుచేయొక్కరూపాంతరము. "క. కాంచన మాలాలంకృత, చంచత్తనులీలమెఱయుజవనాశ్వములన్, బూంచి రథంబునమణిమయ, పంచాననకేతువెత్తెబంధురభంగిన్." భార. విరా. ౪, ఆ.

పూఁచే. దే. అ. క్రి. పూను, ఉద్యమించే. "క. పూఁచివిభుని మీఁదసైన్యములతోవెడలెన్." శశాం. ౪, ఆ.

పూఁజేఁప. ద్వ. వి. (పూ+చేఁప.) మత్స్యవిశేషము. (దీనిని అఱవమున వగాలందురు.)

పూఁట. దే. వి. 1. సంధ్య; "ఉ. రేపటిపూఁటనెన్నికొనివ్రేఁడు పసింగొనిపోయి మేపితా, మాపటిపూఁటనెన్నినక్రమంబునవీఁ దగు." విజ్ఞా. ప్రా, కాం.—2. దినము; "సీ. ఈపూఁటదప్పించి యెల్లిచూచెదనన్నఁబతివేడ్కఁజెఱచుటపాడిగాదు." భో. ౪, ఆ.— 3. కాలము; (పగటిపూఁట, రాత్రిపూఁట.) (పురఁటయొక్క రూపాంతరము.)—4. ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెదనని మఱియొకఁడు పూనుట, ప్రతిభూత్వము. విణ. (చూ. పూఁట కాఁపు.) "క. మీకునుధర్మవిరోధము, గాకుండుటకేనపూఁట." భార. శాం. ౬, ఆ.

పూఁటకాఁపు. దే. విణ. ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెద నని పూనుకొనిన మఱియొకఁడు, ప్రతిభువు. "సీ. వినుమింతి యాయర్థమును ఘటింపఁగఁజేయఁబువ్వునారాచుండుపూఁటకాఁ పు." నై. ౨, ఆ.

పూఁటకూళ్లమ్మ. ద్వ. వి. (పూఁటకూళ్లు+అమ్మ.) వెలతీసికొని వేళవేళకు అన్నమువండిపెట్టెడు వంటలక్క.

పూఁటకూళ్లయిల్లు. దే. వి. (పూఁటకూళ్లు+ఇల్లు.) పూఁటకూళ్లు వండిపెట్టెడు గృహము.

పూఁటకూళ్లు. దే. వి. బ. వెలతీసికొని వేళవేళకుపెట్టెడు అన్నము.

పూఁటపడు. ద్వ. అ. క్రి. (పూఁట+పడు.) ఒకఁడుచేయవల సినపనిని నేను చేసెదనని మఱియొకఁడుపూనికగొను. "ఉ. అనఘ యిచ్చినట్లసరియాఁకలనున్నప్రపన్నుపాలికిం, పూనఁగనేరకూఁట వడియొప్పఁగ నాతనియప్పుఁదీఱిచెన్, దానతిచిత్రవైభవమునన్ ధనధాన్యపు రాసులెన్నియేఁ, గానఁబడంగఁజేసి సిరికాంతునికిపు విచిత్రమింతయున్." పర. ౪, ఆ.

పూఁటవాటు. ద్వ. వి. పూఁటవడుట. "ఆ. అన్నదమ్ములైన నాలుమగండైనఁ, గొడుకుఁదండ్రియైనఁగూడియుండి, పొత్తుధనము నందుఁబూఁటవాటునునప్పు, సాక్ష్యమునువహింపఁజనదుజగతి." విజ్ఞా. వ్య, కాం.

పూఁటవెట్టు. దే. స. క్రి. (పూఁట+పెట్టు.) ఒకఁడు తానుచేయ వలసినపనిని మఱియొకనిని నీవు చేయుమని పూనికగొలుపు. "ఎ, గీ. ఒయ్యఁజేరికచేసిసొమ్ముప్పఁజెప్పఁ, బూఁటవెట్టుమునను." పర. ౪, ఆ.

పూఁడులు. దే. విణ. బ. అనేకములు. (సంవత్సరములు.) "ఇట్టివి యెల్లఁజూచిరానెఱకలుగట్టుకొన్నమఱియేఁడులుపూఁడులుపట్టు." సావి. ౧, ఆ. (రూ. పూండ్లు. "క. నావుడుముట్టినజగడం, బీవేళనెతీర్పవేనియేండ్లన్బూండ్లన్, నీవేమితీర్చెదనుటయు." శై. ౪, ఆ. "క. ఆగుణమణియొక్కనికిదు, బాగాలేచాలుబహుళపరి ణయములకున్, బాగైనవలువలోకనివి, భోగింపఁగనీమకేండ్లపూం డ్లకుఁజాలున్." పాంచా. ౪, ఆ.)

పూఁత. దే. వి. 1. చర్చ; 2. చందనము; "పువ్వులుపూఁత తమ్ములమర్థిఁబుచ్చుట." విజ్ఞా. ప్రా, కాం.— 3. సున్నపుగచ్చు.

పూఁదఱి. ద్వ. వి. (పూ+తఱి.) వసంతఋతువు, పువ్వునవ యము.

పూఁదేనియ ద్వ. వి. (పూ+తేనియ.) పుష్పరసము, మకరం దము. "సీ. పూఁదేనియలఁజాలఁబొదలుతేఁటులమ్రోఁతరహిమిం చునుబుములరవలిగాఁగ." య. ౪, ఆ. (రూ. పూఁదేనె.)

పూఁపు. దే. వి. పూనిక, ఉద్యమము. "ఒక్కపూఁపునయా ఘటించినాకున్ మహోదారంబైన శుభంబొనర్పుఁడు." హరి. పూ. ౯, ఆ.

పూఁబాళ. ద్వ. వి. (పూ+పాళ.) 1. పువ్వులుగలపాళ; 2. బ. ధాన్యవిశేషము. (చూ. కుసుమ.)

పూఁబిందె. ద్వ. వి. (పూ+పిందె.) మిక్కిలి లేఁతపిందె, పూప. (మొదటిరూపము పూఁబిందియ.)

పూఁబోఁడి. ద్వ. వి. (పూ+పోఁడి.) (చూ. పువ్వుఁబోఁడి.) "క. పూఁబోఁడులకునువిటులకు, వేఁబోకలఁదలరుసొంపునీడ్కో లుపుఁబురిన్, లేఁబోకఁబోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁబొద లినగాడ్పుల్." భీ. ౧, ఆ.

పూగము. సం. వి. అ. న. పోఁక. పుం. 1. ప్రోగు; 2. పోఁ మ్రాను; 3. గంగరావి*.

పూచి. దే. వి. 1. తృణవిశేషము; 2. బాధ్యత, కార్యము.

పూచిక. దే. వి.——వై.——

పూచే. వై. అ. క్రి. 1. పుష్పించే; 2. తప్పుమల్లుపొడము*; "ఉ. పూచినమావులన్దవిలిపువ్వులుతోదునకమ్మెమాధవుంజేసిన శంక." ఆము. ౫, ఆ. —3. నిస్సారమగు*. "తీఁకతోఁడుఁ బూచుమ్రాఁకులవిఱుపుసు." భార. సభా. ౨, ఆ.

పూజ. సం. వి. ఆ. స్త్రీ. అర్చన, సపర్య, నమస్య.

పూజకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అర్చకుఁడు.

పూజనము. సం. వి. అ. న. పూజించుట, అర్చన.

**పూజనీయుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) పూజింపఁదగిన వాఁడు.

**పూజించు.** ఉభ. వై. సం. స. క్రి. పూజచేయు, అర్చించు. "సీ. నీతండ్రిగంగననిచ్చనిచ్చలుమమ్ముఁ బూజించెనపరంజిపూల చేత." అచ్చ. బాల, కాం.

**పూజితవ్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పూజనీయుఁడు.

**పూజితుఁడు.** సం. వి. అ. పుం. వేలుపు. విశ. పూజింపఁబడిన వాఁడు.

**పూజె.** దే. వి. ఘటాదులమీఁదిచిత్రము. (కుండకుపూజెలు పెట్టిరి.)

**పూజెకుండలు.** ద్వ. వి. ఐరేనికుండలు. "నాల్గువంకలనుప్పొం గుచుఁ బూజెకుండలలరెఙ గన్గొంటె." య. ౪, ఆ.

**పూజెగులు.** దే. వి. బ. (పూజె+కాఁగులు.)———పై.——— ఆం, భా.

**పూజెసేయు.** ద్వ. స. క్రి. (పూజె+చేయు.) ఘటాదులను చిత్రించు. "సీ. తురగఖురోద్ధూతధూళిదిక్కులఁ బ్రాఁకిభుజగారి తెక్కలఁబూజెసేయ." ఉ, హరి. ౬, ఆ.

**పూజ్యుఁడు.** సం. వి. అ. పుం. మామ. విశ. పూజింపఁదగిన వాఁడు.

**పూజె.** వై. వి. అర్చన. "ఎ, గీ. తమ్మిపూమిద్దెగద్దెపైఁగమ్మవిల్తు, నిమ్ముగానిల్పియెమ్మెనుగొమ్మలెల్లఁ, గ్రమ్ముకొనిపెక్కులాగులదొమ్మిగూడి, పూజలొనరించియిట్లనిపాగడిరపుడు." నీలా. 3, ఆ.

**పూజెరి.** ద్వ. వి. (పూజె+అరి.) అర్చకుఁడు. "సీ. పూజరి బ్రాహ్మణపుత్రియొకర్తుకు గాత్రినాఁబరఁగెడుకాంతగలదు." కళా. ౪, ఆ.

**పూజారి.** ద్వ. వి. పూజెరియొక్కరూపాంతరము. "ఉ. పూజారి వధూటివచ్చిజలజాతవిలోచనఁజూచియిట్లనుఙ." వి,క్ర. ౬, ఆ.

**పూటము.** దే. వి. బరువు, భారము.

**పూడ.** దే. వి. మూడి, గుదము.

**పూడిక.** దే. వి. నూయిమొదలగువానియందు అడుగునపూడిన మన్ను.

**పూడు.** దే. అ. క్రి. 1. పల్లముమట్టిలోనగువానిచేనిండు; 2. నిండు. వి. పూడిక.

**పూడుఁబాము.** దే. వి. (పూడు+పాము.) మట్టిలోపూడియుండు ఇరుదలలపాము. "ఉ. శేషానిలభుగ్విభుం డురుసహస్ర శిరంబులఁ దాల్చులోకముఙ, హీనపుఁబూడుఁ బాముధరియిం చెదనంచుఁదలంచుచాడ్పునఙ." వి, పు. ౧, ఆ.

**పూడుచు.** దే. ప్రే. 1. పూడఁజేయు; 2. పాఁతు. (రూ. పూడ్చు.)

**పూడుపు.** దే. వి. 1. పూడ్చుట; 2. నిక్షేపము.

**పూత.** దే. వి. పూచుట, వికసనము.

**పూతన.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకరాక్షసి; 2. కరక్కాయ. అ. పుం. ము. గజవిశేషము. (విషాణకర్ణనయనచరణములలో పదేని నొక్కటినొకప్రక్కకలుగక మఱియొకప్రక్కనన్నియుఁ జక్కగాఁ గలిగి మేఘమువలె నల్లనై మంజిడివన్నెగలనఖరోమములుగలిగినది. ఇది యోధనార్హము. వంద్రము.)

**పూతము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. తూర్పెత్తినది; 2. పరిశుద్ధమయినది; 3. పవిత్రపఱచఁబడినది.

**పూతిక.** సం. వి. ఆ. స్త్రీ. కొమ్మనగొత్తెపిండిచెట్టు. అ. పుం. ము. 1. నెమిలడుగుచెట్టు; 2. పూతిమార్జాలము.

**పూతికరజము.** సం. వి. అ. పుం. నెమిలడుగుచెట్టు.

**పూతికాష్ఠము.** సం. వి. అ. న. 1. దేవదారువృక్షము; 2. సరళవృక్షము.

**పూతిగంధి.** సం. వి. ఇ. పుం. దుర్గంధము, గదురు.

**పూతిదారువు.** సం. వి. ఉ. పుం. దేవదారువృక్షము.

**పూతిఫలి.** సం. వి. ఈ. స్త్రీ కారుగచ్చెక్కాయ.

**పూత్యండము.** సం. వి. అ. పుం. 1. కస్తురిమెకము; 2. గదురు కంపుగల ఒకదినుసు పురుగు.

**పూదియ.** దే. వి. పూదె. (చూ. గవ్వచేకము.)

**పూదె.** దే. వి. బంగారుపూస. "ఉ. కాలకళాదుఁడెండయను కాంచనరేణువుఁ బ్రత్యగాశనాఁ, గ్రాలెడు క్రోవిఁగూర్చికరఁగంగఁ బ్రవర్ధనమొందుజాళువా, మేలిమిపూదెనాఁబోలుపుమీఁటెనినుం డదికాఁక యార్పఁగీ, లాలనిమజ్జితంబయినలాగునఁగ్రుంకెనుబశ్చిమాంబుధిఙ." కళా. ౮, ఆ.

**పూదెగట్టు.** దే. అ. క్రి. (పూదె+కట్టు.) బంగారుపూసగా నేర్పడు. "పూదెగట్టినతత్త్వబోధమనఁగ." కళా. 3, ఆ.

**పూనిక.** దే వి. కడఁక, ఉద్యమము. "ఎ, గీ. నీయశోలక్ష్మిఁ బోలుపూనికలఁదపము, సేఁడునొనరించుచున్నాఁడునీలగళుఁడు." కా. ౨, ఆ.

**పూనికె.** దే. వి.———పై.———(చూ. పూన్కి.)

**పూనిగొల్లలు.** ద్వ. వి. బ. గొల్లలలో నొకతెగవారు.

**పూనీరు.** వై. వి. పన్నీరు.

**పూను.** దే. అ. క్రి. కడఁగు, ఉద్యమించు. "ఉ. వైనితసూఁజాఁ డొక్కరుఁడు వీర్యసమగ్రుఁడపోలెవచ్చినా, పూనినపూన్కియంతయును బొంకగునట్లుగఁజేసె." హరి. ఉ. 3, ఆ. — స. క్రి. 1. ధరించు; "జడల్ పూనుఙ." భార. శాం. ౨, ఆ. (ఈ యర్థమునందు దీనికి ఆదికాల్లువికల్పముగాలోపించును. చూ. ఊను.) అప్పకవి. "ఆ. పూనెనెగసెఁబోదవెఁబొసరెఁబొందెనటన్న, పలుకులందుమొదలఁగలుగునట్టి, వ్యంజనంబులడఁగివానిపైనచ్చరములు, నిలుచువలసినపుడు నీరజాక్ష" అని సామాన్యముగావిధించిన విధికి చిన్నయసూరిగారు వ్యవస్థయేర్పఱుపక. "పూనుపొదవులకాది లోపంబొకానొకండువచియించెనదియ విచారమూలకంబు" అని వ్రాయుటకుకారణమేమో తెలిసినదికాదు.—2. వహించు. "ఎ, గీ. రాజులేకున్న రాజ్యమరాజకమగు, ననినఁబతియాజ్ఞశిరమునసతఁడు పూని." ఉ, రా. 2, ఆ.

**పూనుచు.** దే. ప్రే. పూనఁజేయు. (రూ. పూన్చు.) — వహింపఁ జేయుటకు. — "మ. భువనేశత్వభరంబుఁ బూన్పఁదగునేర్పూరుఙ జఘన్యాత్మజుఙ." భార. ఆది. 3, ఆ. "క. అనిలజవాశ్వంబులఁబూ, న్చినరథములనెక్కి." భార. సభా. ౧, ఆ.

**పూనూక.** ద్వ. వి. మిక్కిలి సన్ననూక.

**పూనూనె.** ద్వ. వి. సంపెంగనూనె.

**పూనె.** దే. వి. బరణి. "రగడ. మిక్కుటపుఁగస్తూరివలపులుమించు పునుఁగిడఁదగినపూనెలు." షక. ౧, ఆ.

**పూన్కి.** దే. వి. పూనికయొక్కరూపాంతరము. "తే. ధ్వలడితౌరాతి నీదేవికుండలమ్ము, లిమ్మునాపూన్కియదిసఫలమ్ముగాఁగ." భార. ఆది. ౧, ఆ.

పూప. దే. వి. 1. పూఁబిందె; "చ. కొలఁదికిమించుకెంజిగురు గుత్తులమొగ్గలఁబువ్వగుచ్ఛకం, బులఁబువుఁదేనెఁబుప్పొడులఁబూ పలఁబిందెలఁగాయలఁ ఫలం,బులనెపుడున్ నమగ్రపరిపూర్తివహించుచుఁదద్వనవ్రజం, బెలమివహించునందనసమృద్ధికిఁగోటిగుణాధికంబుగన్." కళా. ౧, ఆ. (చూ. పిందియ.) – 2. శిశువు; "పూపయితండు." కృష్ణా. 3, ఆ.–3. కంటిపాప. "బానవాల్ కనుపూప." య. ౧, ఆ.—విణ. లేఁత. "కసుగాఁపుపూపవయసు మిటారి." పాండు. 3, ఆ.

పూపము. సం. వి. అ. పుం. 1. భక్ష్యము; 2. పిండివంట.

పూపలిక. సం. వి. ఆ. స్త్రీ. అపూపము, పిండివంట.

పూయము. సం. వి. అ. న. 1. చీము; 2. జోదము; 3. పీనుఁగు.

పూయు. దే. స. క్రి. 1. చందనములోనగుదానిని అలఁదు; 2. మన్నులోనగువానినిమెత్తు.

పూరకము. సం. వి. అ. పుం. 1. ఊపిరిఁబూరించుట; 2. మాది ఫలము†.

పూరకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నించేవాఁడు.

పూరగించు. వై. స. క్రి. 1. నెఱవేర్చు; "క. తను, మిగిలిప్రతిన పూరగింపమేకొనిచనునా, మగఁటిమియులావుష్మాన్పుట, తగవాగురునకు." భార. ద్రో. ౨, ఆ –2. కడపు*. "రజనిఁబూరగింప." రా. యు, కాం.

పూరణము. సం. వి. అ. న. 1. నించుట; 2. గుణించుట; 3. కుడుముమొదలగు పిండివంటలలోపలపెట్టెడు బెల్లమువేసినూఱిన పప్పుముద్దలోనగునది; 4. గలిజేరు†. విణ. నించునది.

పూరణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పేక; 2. బూరుగు†.

పూరము. సం. వి. అ. పుం. 1. జలప్రవాహము; 2. భక్ష్యము; 3. వ్రణసంశుద్ధి; 4. గలిజేరు†.

పూరా. హిం. విణ. సంపూర్ణమయిన.

పూరి. దే. వి. 1. గడ్డి, తృణము; 2. మృగములచనుపాలు. "సీ. భేరుండములు ప్రక్కఁబెట్టిచన్నులపూరిపాటించిశరభడింభములకిచ్చు." జై. ౪, ఆ.

పూరించు. సం. స. క్రి. 1. పూరగించు; 2. నించు.

పూరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బూరె; 2 పూరీ*.

పూరితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నింపఁబడినది; 2. గుణింపఁబడినది.

పూరీ. వై. వి. భక్ష్యవిశేషము*. (ఒకానొక ఆధునికనిఘంటుకారుఁడు పూరీపోళీశబ్దములను సంస్కృతములుగా వ్రాసియున్నాఁడు. అది విచార్యము.)

పూరుద్రోణ్ణి. ద్వ. వి. ఒకానొకచెట్టు.

పూరుషుఁడు. సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి.

పూరెడు. దే. వి. పూరేడుయొక్క రూపాంతరము.

పూరేకు. ద్వ. వి. 1. పువ్వుదళము; 2. బ. ధాన్యవిశేషము.

పూరేడు. దే. వి. పక్షివిశేషము.

పూర్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. తిథివిశేషము; (చూ. తిథి.) 2. పున్నమ.

పూర్ణపాత్రము. సం. వి. అ. న. 1. (చూ. పూర్ణానకముమొదటి యర్థము.); 2. వస్తుసంపూర్ణపాత్రము.

పూర్ణమాసము. సం. వి. అ. పుం. పున్నమనాటియాగము. (చూ. పౌర్ణమాసము.)

పూర్ణము. సం. వి. అ. న. వింటినారినిచెవిదాఁకతిగుచుట. విణ. 1. నిండినది; 2. శక్తికలది; 3. సమస్తము.

పూర్ణానకము. సం. వి. అ. న. 1. ఉత్సవకాలమునందు సంతోషముచే వస్త్రాభరణాదికము దోఁచుకొనుట, దోఁపు; 2. తప్పెట.

పూర్ణిమ. సం. వి. ఆ. స్త్రీ. పౌర్ణమాసి, పున్నమ.

పూర్ణీభవించు. సం. అ. క్రి. పూర్ణమగు, నిండు.

పూర్తము. సం. వి. అ. న. 1. నూతినిబావినిచెఱువును త్రవ్వించుట, గుడికట్టించుట, తోఁటపెట్టించుట, అన్నముపెట్టుట; 2. పాలనము. విణ. 1. నింపఁబడినది; 2. కప్పఁబడినది.

పూర్తి. సం. వి. ఇ. స్త్రీ. పూరణము, నింపు.

పూర్ణము. వై. వి. కుడుములుమొదలగు పిండివంటలలోపలఁబెట్టెడు బెల్లమువేసినూఱిన పప్పుముద్దలోనగునది.

పూర్వ. సం. వి. ఆ. స్త్రీ. తూర్పు, తొలిదిక్కు.

పూర్వగంగ. సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

పూర్వజ. సం. వి. ఆ. స్త్రీ. అక్క. విణ. మొదటపుట్టినది.

పూర్వజుఁడు. సం. వి. అ. పుం. అన్న. విణ. మొదటపుట్టినవాఁడు.

పూర్వదేవుఁడు. సం. వి. అ. పుం. తొలివేల్పు.

పూర్వపక్షము. సం. వి. అ. పుం. 1. వాదము; 2. శుక్లపక్షము.

పూర్వపర్వతము. సం. వి. అ. పుం. తూర్పుకొండ. (ఇట్లు పూర్వాద్రి మొ.)

పూర్వఫల్గుని. సం. వి. ఈ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

పూర్వభద్రపదము. సం. వి. అ. పుం. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

పూర్వము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మొదటిది; 2. మొదటి దిక్కుది; 3. మొదటిచోటిది; 4. ముందటికాలముది.

పూర్వరాగము. సం. వి. అ. పుం. శ్రవణమువలనఁగాని, దర్శనమువలనఁగాని పరస్పరము వృద్ధిఁబొందిన యనురాగముగల నాయికానాయకులకు అయోగమునందుఁగలిగెడి దశావిశేషము. (ఇది త్రివిధము. నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగము.)

పూర్వరాత్రము. సం. వి. అ. పుం. ముందటిదినమురాత్రి.

పూర్వాషాఢ. సం. వి. ఆ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

పూర్వాహ్ణము. సం. వి. అ. పుం. దినపూర్వభాగము, తేఁబగలు.

పూర్వులు. సం. వి. అ. పుం. బ. ముందటివారు.

పూర్వోత్తర. సం. వి. ఆ. స్త్రీ. ఈశాన్యదిగ్భాగము.

పూలగురివెంద. ద్వ. వి. వానంతి†.

పూలమట్ట. ద్వ. వి. మత్స్యవిశేషము.

పూలము. సం. వి. అ. పుం, న. గడ్డికట్ట.

పూలముడుపు. ద్వ. వి. (పూలు+ముడుపు.) సిగ్గులకెక్కించెడు పుష్పధారణము.

పూలి. దే. వి. ఒకానొకచెట్టు.

**పూపత్త్రి.** వై. వి. బాణసంచువిశేషము.

**పూవింటి.** ద్వ. వి. (పూ+విల్లు.) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు. "ఎంతయువింతబెడంగుఁగన్న పూవింటిమెఱుంగుఁదూపుక్రియ." పర. ౨, ఆ.

**పూవింటివాఁడు.** ద్వ. వి.——పై.——

**పూవిలుకాఁడు.** ద్వ. వి. మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.

**పూవిలుతుఁడు.** ద్వ. వి.——పై.——

**పూవు.** వై. వి. 1. పుష్పము; 2. కాఁకరవత్తిలోనగువానియందలి పువ్వు*; 3. కంటియందుపడెడు పువ్వు*.

**పూవుఁబోఁడి.** ద్వ. వి. (చూ. పువ్వుఁబోఁడి.) "అప్పూవుం బోఁడులుమువ్వురతో." స్వా. ౬, ఆ.

**పూవుగట్టు.** ద్వ. అ. క్రి. (పూవు+కట్టు.) పూవుగలదియగు. "పూవుగట్టినగందవొడివోలెఁబరిమళభరితమైనెఱయ." రామా. ౮, ఆ.

**పూషుఁడు.** సం. వి. న్. పుం. ద్వాదశాదిత్యులలో నొకఁడు. (చూ. ఆదిత్యుఁడు.)

**పూస.** దే. వి. 1. పూదె; 2. మణి; 3. వ్రేలులోనగువానికీలు.

**పూసకజ్జెము.** ద్వ. వి. భక్ష్యవిశేషము, మనోహరము.

**పూసకామంచి.** ద్వ. వి. తృణవిశేషము.

**పూసరొయిముక.** దే. వి. వెన్నుపూస, కశేరుక.

**పూసలగురివెంద.** ద్వ. వి. గుంజ**.

**పూసలవాఁడు.** దే. వి. రత్నములుసానపెట్టువాఁడు, మణికారకుఁడు.

## పృ.

**పృక్క.** సం. వి. ఆ. స్త్రీ. పిక్క**. శాకవిశేషము. (అనికొందఱు.)

**పృక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

**పృక్తి.** సం. వి. ఇ. స్త్రీ. స్పర్శము, తాఁకుడు.

**పృచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రశ్నము, అడుగుట

**పృచ్ఛించు.** సం. స. క్రి. ప్రశ్నముచేయు, అడుగు.

**పృతన.** సం. వి. ఆ. స్త్రీ. 1. సేన; 2. సేనావిశేషము. (ఇన్నూటనలువదిమూఁడురథములు, అన్నియేనుఁగులు, ఏడ్నూటయిరువదితొమ్మిది గుఱ్ఱములు, వేయినిన్నూటపదునేవురుకాల్వురునుగలది.)

**పృతనాషాట్టు.** సం. వి. హ్. పుం. ఇంద్రుఁడు.

**పృథక్పర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న**.

**పృథగ్జనుఁడు.** సం. వి. అ. పుం. 1. నీచుఁడు; 2. మూర్ఖుఁడు; 3. పాపి.

**పృథగ్విధము.** సం. విణ. (అ. ఆ. అ.) పెక్కువిధములుగలది.

**పృథివి.** సం. వి. ఈ. స్త్రీ. భూమి. (రూ. పృథవి.)

**పృథివీపతి.** సం. వి. ఇ. పుం. 1. రాజు; 2. యముఁడు; 3. వృషభమనెడు ఓషధీవిశేషము.

**పృథుకము.** సం. వి. అ. పుం. 1. పిల్ల; 2. అడుకులు.

**పృథురోమము.** సం. వి. న్. పుం. చేఁప. విణ. పెద్దవెండ్రుకలుగలది.

**పృథులము.** సం. విణ. (అ. ఆ. అ.) విరివియైనది.

**పృథువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. నల్లజీలకఱ్ఱ; 2. ఇంగువత్రాను. పుం. 1. అగ్ని; 2. ఒకరాజు. విణ. 1. గొప్పది; 2. విరివియైనది.

**పృథ్వి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పుడమి; 2. ఇంగువత్రాను; 3. నల్లజీలకఱ్ఱ. విణ. విరివియైనది.

**పృథ్వీక.** సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకులు.

**పృదాకువు.** సం. వి. ఉ. పుం. 1. పాము; 2. తేలు; 3. పులి; 4. చిఱుతపులి.

**పృశ్ని.** సం. వి. ఇ. పుం. 1. కిరణము; 2. బోయవాఁడు. విణ (చూ. అలిపిరి.)

**పృశ్నిపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న**.

**పృషతము.** సం. వి. అ. పుం. 1. దుప్పి; 2. నీటిబొట్టు. విణ. బ్రహ్మబిందువుతోఁగూడినది.

**పృషత్కము.** సం. వి. అ. పుం. బాణము, శరము, అమ్ము.

**పృషత్తు** సం. వి. త్. న. నీటిబొట్టు. పుం. దుప్పి. విణ. బ్రహ్మబిందువుతోఁగూడినది.

**పృషదంశకము.** సం. వి. అ. పుం. పిల్లి. (రూ. వృషదంశకము.)

**పృషదశ్వుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, గాలి.

**పృషదాజ్యము.** సం. వి. అ. న. పెరుఁగుతోఁగలపఁబడిననేయి.

**పృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) అడుగఁబడినది.

**పృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తాఁకుడు; 2. కిరణము.

**పృష్ఠమాంసాదనము.** సం. వి. అ. న. కడచినపనికిచింతించుట.

**పృష్ఠము.** సం. వి. అ. న. 1. మూపు; 2. వీఁపు; 3. వెనుకప్రక్క; 4. యజ్ఞసంబంధిస్తోత్రవిశేషము.

**పృష్ఠ్యము.** సం. వి. అ. న. పృష్ఠములనెడియజ్ఞసంబంధిస్తోత్రవిశేషములసమూహము. పుం. మోపుమోసెడుగుఱ్ఱము.

## పె.

**పె.** దే. విణ. వృత్తియందు పెనుశబ్దమునకుమీఁది వర్ణములులోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరములగునప్పుడునుమాగమంబగును. పెన్గురుఁజు, పెన్జిలువ, పెన్జీఁకటి, పెన్జెమట, పెన్తోఁట, పెన్దడి, పెన్దత్తఱము, పెన్దపసి, పెన్దరఁగ, పెన్దీఁగ, పెన్దుఱుము, పెన్దెర, పెన్దెవులు, పెన్బులుఁగు, పెన్బోఁగ, పెన్బ్రోడ, పెన్బ్రోవు, పెన్గుబ్బ, పెన్జగతి, పెన్జేడ, పెన్దరి మొ. ఇందలి ద్రుతంబునకు బిందువునగు. పెంజీఁకటి మొ.) (ఒకానొకచో స్థిరముపరమగునప్పుడును బిందువుకానంబడియెడి. "సీ. పెంధూళియెసఁగ నందంతకాల్ద్రవునదగ్రతమహీతలముగ్రక్కదలుచుండ." మార్క. ౬, ఆ.)

**పెంకి.** దే. వి. ఒకానొక తీఁగ.

**పెంకు.** దే. వి. 1. ఇంటికికప్పెడు ఓడుబిల్ల; 2. కుండలోనగువానిపెంచిక. (కుండపెంకు, అద్దపుపెంకు, పుఱ్ఱెపెంకు మొ.)

**పెంకె.** దే. విణ. 1. మొండికట్టె; 2. మూర్ఖుఁడు.

— **కెపురుగు.** ద్వ. వి. ధాన్యమునకుఁబట్టెడు ఒకతిరుఁగుపురుగు.

**పెంచిక.** దే. వి. కుండలోనగువానిపెంకు. "సీ. రయమునసనాళికేర ఫలమొక్క-టివేయఁబెటిలిపెంచికలునొప్పించెఁబ్రజల." జై. ౪, ఆ. (పుత్తెపెంచిక.)

**పెంచు.** దే. ప్రే. పెనుచుయొక్క-రూపాంతరము. వి. పెంచిక. "క. భవదురుశరపురదాహ, శ్రవణంబుననంటివచ్చి బ్రహ్మాండఘటం, బవియించినపెంచునసీ, భువనముతోనుడుకఁబెట్టిపొరఁబెఁదఁగపులక." రామా. ౭, ఆ.

**పెంచుకొను.** దే. స. క్రి. దత్తుతీసికొను

**పెంజెర.** దే. వి. ఒకదినుసుకొండచిలువ. (దీని భేదములు—తుస్సు పెంజెర, పొట్టపెంజెర, రక్తపెంజెర.)

**పెంట.** యు. దే. వి. 1. చీఁపురుకట్టచేత ఊడ్చియెత్తినచెత్తలోనగునది; 2. ఎరువుకుప్ప; "క. కోపించిచెండియింటిస, మీపంబున నున్న పెంటమీఁదఁగ్రైచెక." జై. ౪, ఆ.—3. ఆవులమందముం దున్నచోటు. వై. పేఁటయొక్క-రూపాంతరము. (మంగలపెంట యు.)

**పెంటగట్టు** దే. అ. క్రి. (పెంట+కట్టు.) పెంటకై మందగట్టు.

**పెంటపట్టు.** దే. వి. పసులులోనగువానిదొడ్డి. "వ. మేఁతవెం బడిం బొలములపల్లంబులందిరిగిరిగి పెంట్రికలువెట్టుపెంటపట్టు నకువచ్చి." "వ. ఉపరిప్రదేశంబులఁగారెనుపపెంటపట్లనీరాలు నేలుంబిడకలదాళ్లిడి." హ్యా. ౪, ఆ.

**పెంటి.** దే. వి. పశుపక్ష్యాదిస్త్రీజాతి. "శే. పజువనోపకయున్న మైమఱచిపెంటిఁ, బెనఁగియున్నను బ్రసవింపమోననియున్నఁ, దెవ్వ లుకొనియున్నమృగములఁదివిరియేయ, రెఱచియాహారముగమను నెఱుఁగులయిన," భార. ఆది. ౫, ఆ. "శే. అంతఁబడమటనెఱ శంఖయామునకవిసె, నలినికనుమూసెఁదుమ్మెదకలువకరిగెఁ, బులుఁ గిరవులఁజేరెమెఱుఁగుడుఁబురువులిఁగెఁ, బెంటినెడఁబాసిజక్కువ యుంటిఁదిరిగె." రామా. ౬, ఆ. (పెంటిశాడు.)

**పెంటిక.** దే. వి. ఉండ ఉండగావేసెడు మేఁకలోనగువానిపేఁడ.

**పెంటికరడు.** దే. వి. చిన్న అల.

**పెంటిపడు.** దృ. అ. క్రి. కవగూడు. "ద్వి. మృగపక్షిపశువులు మేఁతలువదలి, పగలురేయునుబెంటిపడిపాయవయ్యె." ప్రభు. ౩, ఆ.

**పెంట్రిక.** దే. వి. పెంటికకు మొదటిరూపము. (చూ. పెంటపట్టు.)

**పెండ.** దే. వి. పేఁడయొక్క-రూపాంతరము.

**పెండరము.** దే. వి. పెంఢారముయొక్క-రూపాంతరము.

**పెండలము.** దే. వి. ఒకదినుసుదుంప.

**పెంఢారము.** దే. వి. (చూ.) గండపెంఢారము.

**పెండియము.** దే. వి. 1. కాలధరించెడుపెండెము; "చ. హారి మొదలైనదిక్పతులయాశ్వతులకాదనరారియున్నయా, బిరుదులఁ గ్రాలుపెండియముఁబెంపగురత్న మయాఖచారునూ, పురమును వామపాదమునఁబొల్పువహింపఁగ." రా. యు, కాం.—2. దొడ్డి మొదలైనవానివాకిటికిఁ బెట్టెడుపెండెము.

**పెండిలి.** దే. వి. వివాహము. (చూ. పెండిలిసేయు.)

**పెండిలియగు.** దే. స. క్రి. (పెండిలి+అగు.) వివాహమగు. "పెండిలియగుమయియ్యెంతి." భార. ఆది. ౪, ఆ. (రూ. పెండ్లియగు. "క్రమంబుననేవురుఁబెండ్లియగుఁదుఁకృష్ణ." భార. ఆది. ౭, ఆ.)

**పెండిలియాడు.** దే. స. క్రి. (పెండిలి+ఆడు.) వివాహమగు. "దానిఁద్రుణబిందుఁడు పెండిలియాడి." వి, పు. ౪, ఆ. (రూ. పెండ్లియాడు. "సాగరవల్లభుఁబెండ్లియాడదో." నై. ౪, ఆ.)

**పెండిలిసేయు.** దృ. స. క్రి. (పెండిలి+చేయు.) పెండ్లాడు. (రూ. పెండ్లిసేయు. "ఆ. మమ్ముఁ బెండ్లిసేయుమా ప్రాణవల్లభ, ప్రాణమిచ్చికావుభక్తవరద, నీవుసేయుపెండ్లినిత్యంబుభద్రంబు, పిన్ననాటిపెండ్లిపెండ్లికాదు." భాగ. ౧౦. స్కం. పూ.) అం. ప్రే. పెండ్లాడఁజేయు. "క. పొలఁతులరూపవతులఁబెం, డిలిసేసి దొరలుహంసడిభకులకు." ఉ, హరి. ౪, ఆ.

**పెండె.** దే. వి. 1. ఇంటివాసములమీఁద అడ్డముగావేసికట్టెడు కొయ్య; "సీ. పెండెఁగట్టెడుచోటఁబెనుఁబగడపుఁదీఁగలీఁతమెల్లెతుల్య మెపుడున్నపతి." రా, వి. ౩, ఆ.—2. పొగాకుమొదలైన వానినగయందునగము.

**పెండెకట్లు.** దే. వి. బ. పెండెలవలెపట్టెలుగాఁదీర్చినవిభూతిరేఖలు. "విబూదిపెండెకట్లు." హం స. ౧, ఆ.

**పెండెము.** దే. వి. 1. గండపెండారము. "పెండెంబుడాకాలఁబెట్టి." ఉ, హరి. ౪, ఆ.—2. పలుగాఁడితలుపు. (పెండియము యొక్క-రూపాంతరము.)

**పెండేరము.** దే. వి. పెంఢేరముయొక్క-రూపాంతరము.

**పెండేరము.** దే. వి. పెంఢారముయొక్క-రూపాంతరము. (చూ. నెరుము.)

**పెండ్లము.** దే. వి. (పెండ్లి+అము.) వివాహమైనభార్య. "క. అడ్డము చెప్పకకడపటి, బిడ్డఁడు రాముండు సుతులఁబెండ్లమునచటన్, గొడ్డంటం దిగనడిచిన, ఒడ్డనఁదలయూఁచిమెచ్చెజమదగ్నిమదిన్." భాగ. ౯, స్కం.

**పెండ్లాడు.** దే. స. క్రి. (పెండ్లి+ఆడు.) వివాహమగు. (మొదటి రూపము పెండ్లియాడు.)

**పెండ్లాము.** దే. వి. పెండ్లముయొక్క-రూపాంతరము.

**పెండ్లి.** దే. వి. పెండిలియొక్క-రూపాంతరము. (బ. పెండ్లిండ్లు.) "క. పెనుమినుకుఁద్రోవఁబెండ్లిం, డ్లొనరించి." అచ్చ. బాల, కాం.

**పెండ్లికుండలు.** దృ. వి. బ. పూజలుపెట్టిపెండ్లియందుపయోగించెడుకుండలు, ఐరేని.

**పెండ్లికూఁతురు.** దే. వి. 1. వివాహదీక్షితురాలు, వధువు; (చూ. నలఁగు.) 2. కోడలు. (చూ. పెండ్లికొడుకు.)

**పెండ్లికొడుకు.** దృ. వి. 1. వివాహదీక్షితుఁడు, వరుఁడు; "వ. అయ్యాదిమవరుండుదివ్యాభ్యరణలుహరిబ్రాదికస్నానీయ ద్రవ్యమండనంబొనర్పఁబెండ్లికొడుకై." ఆము. ౬, ఆ.—2. అల్లుఁడు. "శే. అర్థితోనోషధీశ్వరుఁడాదియైన, పెండ్లికొడుకులనెల్లనుబిలువఁబంచె." భీ. ౨, ఆ.

**పెండ్లిగుమ్మడి.** దే. వి. వివాహాదిశుభదినములయందు ఉపయోగించెడుగుమ్మడి, బూడిదగుమ్మడికాయ.

**పెండ్లినడక.** దే. వి. పెండ్లియందువలెతిన్నగానడచునడక. "పెండ్లినడకల్ నడచెక." భాను. ౧, ఆ.

**పెండ్లియరుఁగు.** దే. వి. (పెండ్లి+అరుఁగు.) పెండ్లియందు వధూవరులు కూర్చుండుటకై త్రేలెడు ఎత్తున చౌకముతీర్చివేసెడు తిన్నె.

**పెందలకడ.** దే. ద్ర. క్రి. విశే. (పెఱ+తలకడ.) ప్రొద్దుపోక మునుపు.

**పెందలాడె.** దే. ద్ర. క్రి. విణ. పెందలకడయొక్కరూపాంతరము.

**పెందిరువడి.** దే. వి. (పెన్+తిరువడి.) (వైష్ణవపరిభాషయందు) గరుత్మంతుఁడు. "పెందిరువడింగని." ఆము. ౪, ఆ.

**పెందెరువు.** దే. వి. (పెన్+తెరువు.) రాజమార్గము. "వ. కరి కరంబుపెందెరువుగైకొని." భార. ఉద్యో. 3, ఆ.

**పెందొడ.** దే. వి. (పెన్+తొడ.) ఊరుమూలము.

**పెంద్రోవ.** దే. వి. (పెన్+త్రోవ.) ముక్తి. "ఉ. ఏవిభుపాద పద్మరతులెన్నఁడునెవ్వరుఁ బొందలేనిపెం, ద్రోవఁజరింతురు." భాగ. ౧౦, స్కం. పూ.

**పెంపగు.** దే. అ. క్రి. (పెంపు+అగు.) వర్ధిల్లు. "క. నీపేరనీ సరోవర, మేపారన్ ఖ్యాతిగాంచునిందుమునుంగన్, బాపములు వాయుపుణ్యు, శ్రీపెంపగుమోక్షలక్ష్మిచేకూఱుఁదుదన్." శేష. ౫, ఆ.

**పెంపారు.** దే. అ. క్రి. (పెంపు+ఆరు.) గొప్పయగు. "ఉ. వీరలుధర్మమార్గమునవిస్తరతన్ దగనాడిరేనియున్, వారలుదీనికియ్య కొనినన్ వినుమచ్యుతయట్టిసంధిపెం, పారఁగనేర్చునే." భార. ఉద్యో. 3, ఆ.

**పెంపు.** దే. ప్రే. నాశముచేయు. "ఉ. తెంపరివైపొరింబొరినిదేవకి బిడ్డలఁజిన్నికుఱ్ఱలన్, జంపితివంతనైన నుపశాంతివహింపకఱాల మీఁదనన్, దెంపితివిప్పిరోయిదియు బీరమె నాసరసన్ జనించినిన్, జంపెడి వీరుఁడొక్కడెనసత్కృతినొందెడువాఁడుదుర్మతీ." భాగ. ౧౦, స్కం. పూ. "సీ. తనమహాహావదీక్షతనమహాహావదీక్షపగిది నానావనీపకులఁబెంప." వసు. ౧, ఆ.—వి. 1. సమృద్ధి; 2. నాశము; "సీ. అనురక్తిరేఁచునూతనసారసాటోపమొంటిగాం డ్రకుఁబెంపులొసఁగునెచట." హంస. ౨, ఆ. (ఇది పైరెండర్థములకు నుదాహరణము.)—3. అతిశయము; "సీ. మోహాంబువల నఁబై ముసురుశోభంబుశోభావేశమునఁగామమగ్గలించుఁ, గామంబు పెంపునఁగడఁగుఁ గ్రోధంబుగ్రోధంబునవైరమెంతయునుబెరుఁ గు." భార. ఆర. ౪, ఆ.—4. గౌరవము; "క. సంపదలేమికి మదిశో, కింపవు శత్రువులచేతికిని లోనగుటూ, హింపవునీవూర కునికి, పెంపనిపాటించెదిట్టిబేలయుఁగలఁడే." భార. శాం. ౪, ఆ.—5. మహత్వము. "వ. సర్వలోకాభిగమ్యుండగు నమ్మహాను భావునకుమనమభిగమ్యులమైతిమి, మనకింతకంటెనుబెంపెయ్యది." భార. ఉద్యో. 3, ఆ.

**పెంపుడు.** దే. విణ. పెంపఁబడినది. (పెంపుడుచిలుక.)

**పెంపుమీఱు.** దే. అ. క్రి. అతిశయించు. "సీ. ప్రతిదేశమును భోగభాగ్యసంపత్ప్రజాసంపూర్ణవిభవమైపెంపుమీఱుఁ, బ్రతిదేవతా వాసమతులితనిత్యోత్సవాడంబరంబులనతిశయిల్లు." పు. ౧, ఆ.

**పెకలు.** దే. అ. క్రి. 1. పెల్లగిల్లు; "పెకలియజాండకర్పరము బీటలువాఱఁగమేనువెంచి." పా. 3, ఆ.—2. ప్రయాణమగు. "తే. నృపతికితనికహౌహిణీదళకము, కలిగిననునందునొకకొంతగాని పెకలి, యంతయునురాదుచనుదెంచహాయముబడిని." జై. ౨, ఆ.

**పెకలుచు.** దే. ప్రే. (పెకలఁజేయు.) పెకలించు. "క. ఒకపాద పంబుఁగేలం, బెకలిచికొనియెదుర." రామా. ౮, ఆ. (రూ. పెకల్చు. "చ. జలరుహనాభుఁడిట్లురభసంబుననందనపారిజా తమున్, బలిమిఁబెకల్చియెత్త." పా. ౪, ఆ.)

**పెక్కండ్రు.** వై. స. బ. అనేకులు. (పెక్కు-శబ్దమునకు మహన్మహత్వార్థకరూపము.)

**పెక్కణము.** వై. వి. 1. అభినయముతోడినృత్యము; "సీ. మొకషులభాయవేళ్లొకచందముగనిల్పి కమలసంభవుఁడుపెక్కణ మొనర్ప." ఉ, హరి. ౪, ఆ.—2. మల్లరంగము*. (చూ. ప్రెక్కణము.)

**పెక్కలి.** దే. వి. ఒకానొకచెట్టు.

**పెక్కు.** వై. స. అనేకము.

**పెక్కురు.** వై. స. బ. పెక్కండ్రుయొక్కరూపాంతరము. నీలా. ౨, ఆ.

**పెక్కువ.** దే. వి. 1. వర్ధనము; "వ. ఇట్లుపెరిఁగినవింధ్యంబు నొద్దకువచ్చి వేల్పులెల్లదానివర్ధనంబువారింపనోపకయగస్త్యుపాలి కింజని వింధ్యంబుపెక్కువయెఱింగించియిట్లనిరి." భార. ఆర. 3, ఆ.—2. ఆధిక్యము. "ఉ. పెనంగిరిబాహుశౌర్యముల్, త్రాసు నఁదూన్పవచ్చునసఁదక్కువ పెక్కువలేకయుద్ధమున్." జై. ౫, ఆ.

**పెగడ.** దే. వి. ప్రెగడయొక్కరూపాంతరము.

**పెగలు.** దే. అ. క్రి. పెకలుయొక్కరూపాంతరము. (పెల్లగిల్లుటకు. "ఆ. వగరుపుట్టెనంతఁబెగలెదంతంబులు." భాగ. ౬, స్కం.)

**పెగలుచు.** దే. ప్రే. పెకలుచుయొక్కరూపాంతరము.

**పెగ్గుమ్ముడు.** వై. వి. (పెద్ద+గుమ్ముడు.) శ్రీపర్ణి‡.

**పెగ్గురు.** వై. వి. బెగ్గురుపక్షి, సారసము. (ఇది యిట్లు పరుషాది గానును కానఁబడుచున్నది.)

**పెచ్చారి.** దే. విణ. మూర్ఖుఁడు. "క. మచ్చరపువాసుదేవుఁడు, పెచ్చారితనంబుమ్రానుపిల నిట్లనియెన్." ఉ, హరి. 3, ఆ.

**పెచ్చు.** దే. వి. 1. అక్కఅనుబట్టినాణెములమార్పులోనగువాని యందు అధికముగానిచ్చెడుధనము; 2. పందెములోనగువానిమీఁది తోలు. విణ. అధికము.

**పెటపెట.** దే. వి. పండ్లుకొఱుకుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (కొఱుకుటయందు.) "ఆ. పెదవులదరఁబండ్లుపెటపెట్ల గొఱుకుచు." భాగ. ౬, స్కం.—ఉఱుముటయందు. (చూ. తొటతొట.)—పగులుటయందు. "దిక్కులుపెటపెటఁబగులంగ నార్చి." మై. 3, ఆ.—పెటులుటయందు. "ద్వి. పెటపెటఁబెటిలి పెన్బిడుగులుపడియె." హరిశ్చ. ౧, భా.—ప్రేలుటయందు. "ద్వి. పటుతరంబైననాబాణాగ్నిశిఖలఁ, బెటపెటఁ బ్రేలక ప్రిదిలి పోఁగలరె." రా. యు, కాం.—విఱుగుటయందు. "ద్వి. పెళపెళ ధ్వనులనుబెటపెటధ్వనులఁ, గలయదిక్కులద్రువఁగావిల్లువిఱిగె." రా. బాల, కాం.

**పెటపెటమను.** దే. అ. క్రి. (పెటపెట+అను.) పెటపెట అను ధ్వనికలదియగు. "ద్వి. పెటపెటమనివేగఁబ్రిదిలికంబంబు, పటు పటవ్రయ్యలైపగులనానడుమ." భాగ. 2, స్కం.

**పెటపెటలాడు.** దే. అ. క్రి. (పెటపెటలు+ఆడు.) పెటపెట మను. "పెటపెటలాడుచున్ విఱిగె." రా. బాల, కాం.

**పెటిలు.** దే. అ. క్రి. పెట్లు. "క. అలరెండారలుసంధ్యో, జ్జ్వల నశిఖాదహ్యమానచరమాద్రివనా, వళిఁబెటిలువంశపటలం, బుల నెగసినగొప్పవెలఁదిముత్తెములనఁగన్." పర. 3, ఆ. (ఇది యిట్లు ఇకారమధ్యముగా ప్రతులయందుఁ గానఁబడుచున్నది.)

**పెటుకు.** దే. విణ. విరసము. (ఏలపెటుకుమాటలాడెదవు.)

**పెటులు.** దే. అ. క్రి. పెట్లు. "సీ బడబానలాహతిజడనిధిలో నున్నపటుశైలతతి ప్రేలిపెటిలెనొక్కొ." లక్ష్మీ. ౫, ఆ.—వి. పెట్లుఁ గ్రోవి. "సీ. పెటులు చప్పుడులాత్మభీరున్వయం ప్రాప్తారి రంభసుఖముఖీచరులకొసఁగ." సాన్వ. ౫, ఆ.

**పెట్ట.** దే. వి. 1. పశుపక్షిస్త్రీజాతి; "క. ఆలేమయిల్లువెడలెను, గోలయుబలె నొక్క పెట్టకుక్కంగొనుచున్." శుక. ౨, ఆ. "వ. సంచారార్థంబుదిక్కులకువెడలునక్కలరవంబుల నుక్కుం దండనంబువోనిముక్కున నంకుశంబులంబోలుచరణనఖాంకురంబులం బెట్టనుంబోతునుంగఱచియునిటికియుంబట్టియేకాంత ప్రదేశంబున భక్షించునదియై." కాశీ. ౬, ఆ.—2. ఆఁడుకోడి.

**పెట్టమారి.** దే. వి. ఆఁడుకోడివలెనుండుపుంజు.

**పెట్టు.** దే. అ. క్రి. కలుగు. "క. గడగడవడఁకెడుమేనన్, నిడువెంద్రుకవెట్ట." ఉ, హరి. ౫, ఆ.—స. క్రి. 1. ఉంచు; 2. (పక్షులలోనగునవి) గర్భమునుండి గ్రుడ్లనువెలిపుచ్చు; (కోడి గ్రుడ్లుపెట్టెను.)—3. గ్రుడ్లుపొదిఁగిపిల్లనుచేయు; "సీ. చతురభాషిణియొక్కశారికవర్తించునదిపిల్లఁబెట్టియింపారఁబండ్లు, తెచ్చి యర్థిలిదానికిచ్చుచో." భార. శాం. 3, ఆ.—4. ధరించు; "ఎ, గీ. రాజ్యమింతయునీసొమ్ము రాజవీవు, కుడువఁగట్టను బెట్టనుగొఱఁతలేక, యేనుఁగులగుఱ్ఱములనెక్కియెల్లవారుఁ, గొల్వసాధురక్షకుఁడవై కొఱలుమింక." హరి. పూ. ౯, ఆ.—5. ఇచ్చు; "క. కుడువక పెట్టకయూర్ద్రుఁడు, కడునెక్కుడుగూర్చినట్టికనకముఁగొలుచున్, బుడమిపతిధర్మకృతులకు, నిడఁదగునగముగొనిమేదినీశ్వరవర్యా." భార. శాం. 3, ఆ.—6. మోపు; (వాఁడుతొనుచేని అదినామీఁద పెట్టినాఁడు.) 7. గోడమొదలగువానిలేపు; "పెట్టనికోటనీకుహరి." భార. ఉద్యో. ౧, ఆ.—8. నాటు; "క. సుగ్రీవుఁడయో, మీ పెట్టుచెట్టుకాఁడా." రామా. ౬, ఆ.—(చెట్టుపెట్టినవాఁడునీళ్లుపోయును.)—9. కొట్టు. (చెంపను రెండుపెట్లుపెట్టినాఁడు.) (ఇది విడుచులోనగు ధాతువులకు అనుప్రయుక్తమయినపుడు బొత్తిగా నను అర్థమునుదెలిపెడిని. ఉదా. వాఁడు పాఠశాలవిడిచిపెట్టెను.)—వి. 1. దెబ్బ; "తే. ఎందునీతివిహీనునిఁ జెందునట్టి, సిరినిదిట్టుదురెట్లుదాఁ జేరెనితని, ననుచు భూజనులందఱు నినుముఁగూడి, యున్నయగ్నికిఁబెట్లు రాకుందుసెట్లు." కళా. ౭, ఆ.—"వింటిపెట్టు." ద్వి. రా. సుం, కాం.—2. ఈవి; (పెట్టుపోఁతలు.)—3. మాఱు; "తమ్ములునవ్విభుఁడున్, వేవురపెట్టుగనంతతికల్మియు నీమదినిల్పుము." భార. స్త్రీ. ౧, ఆ.—4. అవృత్తి. "క. ఆమహిమ యెఱుఁగనేరని, పామరులాకారపూజఁబరఁగుదురొకపె, ట్టామడచననోపకయర, యామడచనినిల్చినట్టయాత్మవివేకి." వా. ౫, ఆ. "చ. ఏచియు, గ్రుపుగతిమాత్స్యకేకయముఖంబగుపాండవసైన్యమొక్కపెట్టపరఁగినీబలంబులకడంక యడంచిమదించిపేర్చినన్." భార. ద్రో. ౫, ఆ. (ఇది యీయర్థమునందు ఏకార్థకశబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడును.)

**పెట్టుఁజెట్టు.** దే. వి. (పెట్టు+చెట్టు.) కల్పవృక్షము.

**పెట్టుకొను.** దే. స. క్రి. ఉంచుకొను. (సొమ్ములుపెట్టుకొను, పేరుపెట్టుకొను మొ.)

**పెట్టుకోలు.** దే. వి. పెట్టుకొనుట. "వైరముందామదిఁబెట్టుకోలు సుఖతంత్రముగాదు." భార. శాం. 3, ఆ.

**పెట్టుడు.** దే. వి. ఈవి, త్యాగము, దానము.

**పెట్టుబడి.** దే. వి. దేనికేని వెచ్చేమునకై మొదటపెట్టినధనము.

**పెట్టుమందు.** దే. వి. స్వవశమగుటకుగాను పెట్టెడుమందు, వశ్యౌషధము. "పెట్టుమందు నీపతికిదెపాలతోనిడుముభర్తవశుండగు." రుక్మాం. 3, ఆ.

**పెట్టువడు.** ద్వ. అ. క్రి. (పెట్టు+పడు.) దెబ్బతిను.

**పెట్టె.** వై. వి. 1. సొమ్ములులోనగునవియుంచెడుపేటిక; 2. పల్లకి నడిమిపెట్టె*; "పల్లకులుగదల్చి పెట్టెలకెలంకుల సాళ్వకిఁబోవం బంచి." జై. 3, ఆ.—3. బండిపరముమీఁదిపెట్టె*; 4. పాము చుట్టుకొనుచుట్ట*. (మొదటిరూపము పెట్టియ.)

**పెట్టెబండి.** ద్వ. వి. పరముమీఁద పెట్టెవలె నమర్చినబండి.

**పెట్టెవెట్టు.** ద్వ. అ. క్రి. (పెట్టె+పెట్టు.) (పాము) చుట్టుకొను. "సీ. పీతరూపంబునఁబెట్టెవెట్టినశేషుఫణరత్నఘృణులకుఁ బ్రాఁకువెట్టు." పాండు. ౪, ఆ.

**పెట్రకోలికికట్టు.** దే. స. క్రి. పెడరెక్కలువిఱిచికట్టు.

**పెట్లకంబము.** ద్వ. వి. (పెట్లు+కంబము.) అదురువేటుగొట్టము.

**పెట్లదిమ్మె.** దే. వి. (పెట్లు+దిమ్మె.) 1. అదురువేటుగొట్టము; 2. చేలయందు పక్షులనుదోలుటకై సర్పాకారముగాపేనిపెట్టుకొని యుండెడుచేరు.

**పెట్లమారి.** దే. విశే. (పెట్లు+మారి.) దెబ్బలుతినుస్వభావముకలవాఁడు, దెబ్బలుతినుస్వభావముకలది. "సీ. కోరిబంతులఁజాలగుణవంతములటంచుఁబెట్లమారులనీడుపెట్టఁదగునె." చంద్ర.

**పెట్లాఁగు.** దే. వి. (పెట్లు+లాఁగు.) మల్లబంధవిశేషము.

**పెట్లు.** దే. అ. క్రి. కాలిధ్వనిపూర్వకముగ బ్రద్దలగు. "పొగిసిదిక్కులు మెకంబులయంగములు పెట్లె." చంద్రా. ౨, ఆ. (పెటులుయొక్కరూపాంతరము.)

**పెట్లుఁగ్రోవి.** దే. వి. (పెట్లు+క్రోవి.) అదురువేటుగొట్టము. "సీ. వలలునుబెట్లుఁగ్రోవులుఁబెద్దయురులునుదెరలునుబోనులు దీమములును." హరిశ్చ. ౨, ఆ.

**పెట్లుప్పు.** దే. వి. (పెట్లు+ఉప్పు.) ఒకదినుసు ఉప్పు.

**పెఠిల్లు.** దే. వి. 1. హఠియందగు ధ్వన్యనుకరణము; (చూ. కరిల్లు.) 2. పిడుగుపడుటయందగు ధ్వన్యనుకరణము. (ఆమ్రేడితమునందు పెఠిల్లుపెఠిల్లు, పెఠిల్లుపెఠిలు. "క. ధళధళ మెఱపులుమెఱవఁగఁ, బెళపెళనుఱుముచుఁ బెఠిల్లుపెఠిలునఁబిడుగుల్, నలుగడఁబడబెడిదపుధా, రలుగలబలువానజలధరంబులుగురిసెన్." కళా. ౪, ఆ.)

**పెడ.** వై. విశే. 1. పెద్ద; "సీ. నడయభ్యసించినపెడగొండలును బోనియాభీలసత్వ మత్తేభములును." పర ౪, ఆ.—2. వెనుకటిది; "పెడకచ్చవిడ." నవ. 3, భా. "పెడముట్టు." భార. శల్య. ౧, ఆ.—3. విపరీతము*. "ఉ. ఈపెడబుద్ధినీకెజనియించెనొయేజడుఁడైనఁదెల్పెనో." ఉ, రా. ౭, ఆ.

**పెడఁబాయు.** దే. స. క్రి. ఎడఁబాయునకు మొదటిరూపము. "మ. సురసేవించినవాతవాఁడియయినన్ సొమ్మెల్లఁబోనాడినన్, బురుషద్వేషిణియైనగొడ్డయిన నెప్డుంగూఁతులంగన్నపైఁ, బరపారోగముగల్గెనేనియునుసబ్భార్యంబెడంబాసియ, ప్పురుషుండొండొకపెండ్లియాడినను నొప్పున్ దప్పులేదేమియున్." నం. "సురాపీవ్యాధితాధూర్తా వంధ్యార్థఘ్న్యప్రియంవదా, స్త్రీప్రసూశ్చాధివేత్తవ్యా పురుషద్వేషిణీతథా." విజ్ఞా. ఆచా, కాం.

**పెడక.** వై. వి. 1. కత్తియొక్కపృష్ఠభాగము*; 2. ఆకుయొక్కపృష్ఠభాగము*. (చూ. పెణక.)

**పెడకంటి.** దే. వి. కాఁపువారిజాతివిశేషము. హంస. ౪, ఆ.

**పెడకట్టె.** వై. విశే. సెడసరకట్టెకు రూపాంతరము.

**పెడకట్లు.** ద్వ. వి. బ. చేతులనువెనుకకువిఱిచికట్టుట. "ద్వి. కలకుఁద్రాడులఁబెడకట్లుకట్టించె." పా. ౫, భా.

**పెడకేలు.** వై. వి. వెనుకకు త్రిప్పినభుజము.

**పెడగాలు.** ద్వ. వి. (పెడ+కాలు.) వెనుకకుమడిచినకాలు.

**పెడచెవి.** వై. వి. చెవివెనుకటిభాగము. ''తే. బహువిధంబులఁ బలుకునావలుకులెల్లఁ, జెవిటికైవడిఁదనపెడచెవులఁబెట్టి, యీఅ తాఅలుమఱుమాటలిచ్చియపహా, సించెదురోధనుఁడువేయుఁజెప్ప నేల.'' భార. ఉద్యో. ర, ఆ.

**పెడచేయి.** వై. వి. చేతికివెనుకటిభాగము, మీఁజేయి.

**పెడతల.** ద్వ. వి. తలవెనుకటిభాగము, అవటువు. ''సీ. పెడతలఁ జెంపలనడునెత్తిముందటనైదుకూఁకటులుండునట్లుగాఁగఁ, దలబోడి గావించి.'' షో. 3, ఆ.

**పెడదారి.** వై. వి. తప్పుత్రోవ, అపథము.

**పెడనెల.** ద్వ. వి. తీర్పరి. (అప్ర.)

**పెడమరలు.** ద్వ. అ. క్రి. వెనుకకుతిరుగు. ''తే. పెడమరలియేసె వానినప్పుడమరుండు.'' నై. ౬, ఆ. – వి. వెనుకకుతిరుగుట. (చూ. పెడమర్లు.)

**పెడమర్లు.** ద్వ. అ. క్రి. వెనుకకుతిరుగు. ''ఉ. పందీఁటెను గ్రుచ్చియెత్తెఁగడుహెచ్చరికన్ బెడమర్లిగ్రక్కునన్.'' చంద్రా. ౨, ఆ.—వి. వెనుకకుతిరుగుట. ''సీ. ఇలమీఁదఁదలతాఁకనీప్రక్క నాప్రక్కఁబెడమర్లుగాఁబొడపెట్టిపెట్టి.'' కాశి. ౨, ఆ. (పెడ మరలుయొక్కరూపాంతరము.)

**పెడమఱు.** దే. అ. క్రి. వెనుకకుమరలు. ''క. పఱతెంచికదియఁ బడియే, డ్తెఅవ్రేసినమోముదాఁకతిరిగెగరుడియ, త్తఱిఁజక్రంబున హరిపెడ, మఱివైచెనుదనుజానుజామస్తకముదెగన్.'' నిర్వ. 3, ఆ. (ప్రే. పెడమరించు.)

**పెడమల్లె.** వై. వి. ఒకజాతిపెద్దమల్లె.

**పెడము.** వై. వి. పెడమోముయొక్కరూపాంతరము. ''తే. పచ్చ ఱామానికంబులపల్లెరములఁ, బచ్చగందనికూరలేర్పడమిఁజూచి, పెట్ట రనిపెండ్లిపెద్దలుపెడముపెట్టఁ, బెట్టుటకునంగనలకునుబట్టెఁదడవు.'' నై. ౬, ఆ. ''సీ. యానంబుమురిపంబునందెలమొరపంబునడుగుఁ దామరలకుఁబెడముసేయ.'' షో. ౮, ఆ.

**పెడమోము.** వై. వి. వెనుకకుతిరిగినమొగము.

**పెడమోమువడు.** వై. అ. క్రి. (పెడమోము+పడు.) వెనుకకు తిరిగినమొగమగు. ''సీ. ప్రేల్చుచుఁబఱతెంచుభిదురంబునని మొ నఁబెడచేతఁబెడమోమువడఁగనడిచి.'' లక్ష్మీ. ౨, ఆ.

**పెడరేఁచు.** వై. ప్రే. పురికొలుపు. ''వ. ఇట్లాక్రమించినయాకలి తత్త్వవిముఖవిచారుండై యసూయోచ్ఛ్రయంబువడింబెడరేఁప.'' హన. 3, ఆ.

**పెడలు.** దే. వి. పెరడు. ''ఆ. తమకసాధ్యమైనఁదమితోడఁగాం క్షింతు, రారనాళమునుధరాధినాథ, తమకుసులభమైనయమృతంబుఁ గైకొన, రెండుఁబెడలిచెట్టుమందుగాదు.'' కళా. ౮, ఆ. (ఇక్కడ పెరటియనియున్ననుబాధలేదు. అయినను పాఠమిట్లుకనఁబడు చున్నది.)

**పెడసరకట్టె.** ద్వ. విణ. (పెడసరము+కట్టె.) మూర్ఖుఁడు, మూ ర్ఖురాలు.

**పెడసరము.** దే. వి. మౌర్ఖ్యము.

**పెడిసె.** దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

**పెడులు.** దే. అ. క్రి. పెట్లు. ''చ. పెడిలిసువర్ణపర్వతముపెక్కు తెఱంగులవ్రయ్యునట్టులు.'' భార. ఆది. ౮, ఆ. (పెటులు యొక్కరూపాంతరము.)

**పెడ్డ.** దే. వి. మట్టిపెల్ల. (అమడిగడ్డపెడ్డలుగానున్నది.)

**పెణక.** యు. దే. వి. ఇంటియొక్క ఒకభాగపుకప్పు. వై. పెడక యొక్కరూపాంతరము. (ఆకుయొక్కపృష్ఠభాగమునకు. – చూ. తెలె.)

**పెత్తనగాఁడు.** ద్వ. విణ. (పెత్తనము+కాఁడు.) అధికారి.

**పెత్తనము.** వై. వి. (పెద్ద+తనము.) 1. అధికారము; 2. వార్ధకము.

**పెద.** వై. విణ. పెద్దయొక్కరూపాంతరము. (పెదతండ్రి మొ.)

**పెదవి.** దే. వి. మోవి, వాతెర, అధరము.

**పెద్ద.** వై. విణ. 1. వృద్ధుఁడు; 2. పెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు*; 3. గొప్పవాఁడు*; ''ఆ. హరిసహస్రశీర్షుఁబరమసహస్రాక్షు, వేదమయుసహస్రపాదునలఁతు, లైనవారికంటెనలఁతిపెద్దలకును, జాలఁబెద్దయగుదయాళుఁగొలుతు.'' భార. శాం. ౨, ఆ.—4. అధి కము*; ''పావనిమెయిలావుపెద్ద.'' భార. శల్య. ౨, ఆ. — 5. శ్రేష్ఠము*; ''యజ్ఞవిధానములఫలంబుపెద్ద.'' భార. అశ్వ. ౨, ఆ.—6. దీర్ఘము*. ''ఆ. ఎట్టిసాధ్వులకునుబుట్టినయిండ్లను, బెద్దకాలమునికితగ్గదగదు, పతులకడనయునికిసతులకుధర్మువు, సతుల కేడుగడయుఁబతులచూవె.'' భార. ఆది. ర, ఆ. – క్రి. విణ. అత్యంతము*. ''పెద్దమెచ్చి.'' భార. ఆది. ౫, ఆ. (కడపటి రెండర్థములయందునిదియువర్ణాంతమునయ్యెడి. ''పెద్దయుంబ్రొద్దు చింతించి.'' భార. ఆర. ౨, ఆ. ''పెద్దయువిచారించి.'' మొ.)—[పెద్ద అను విశేషణముముందుగలసంజ్ఞావాచకశబ్దములు.— పెద్దకక్కెర (కర్కరేటువు.) పెద్దకాఁకర (మహాకారవేల్లము†.), పెద్దకాఁచి (కాకాదని†.), పెద్దకూఁకటిమూగ (మాందిలవము.), పెద్దకొంగ (బలాకము.), పెద్దగజిక (గండాలి†.), పెద్దగుమ్మడి (పెండ్లిగుమ్మడి†.), పెద్దగుమ్ముడు (శ్రీపర్ణి†.), పెద్దగోరఁట (ఖురం టకము†.), పెద్దచేఁతరాసి (మహాఝురసి†.), పెద్దచేమంతి (మహా సహ†.), పెద్దజెల్లిమెకము (సృమరము.), పెద్దతుమ్మి (మహాద్రో ణము†.), పెద్దదవనము (మహాదమనము†.), పెద్దదుప్పి (రామ ము.), పెద్దదూలగోవెల (మహాత్మగుప్త†.), పెద్దదోస (రాజకర్క టి†.), పెద్దనువ్వు (మహాతిలము†.), పెద్దనేరెడు (మహాజంబు వు†.), పెద్దపల్లేరు (మహాపలంకష†.), పెద్దపాఁపర (ఇంద్రవా రుణి†.), పెద్దపీఁచేర (పీవరి†.), పెద్దపెన్నేరు (మహాశ్వగంధ†.), పెద్దబీఱ (రాజకోశాతకి†.), పెద్దబోడతరము (మహాముండిని†.), పెద్దమానేరు (మహాజ్యోతిష్మతి†.), పెద్దముత్తవపులగము (అతి బల†.), పెద్దములక (మహావార్తాకి†.), పెద్దముల్లంగి (మహామూల కము†.), పెద్దమ్రాను (డుండుకము†.), పెద్దయీడ (స్వర్ణపారే వతము†.), పెద్దయేలకి (బృహదేల†.), పెద్దవరగోఁగు (బృహత్ప్ల లువు†.), పెద్దవిరి (మహానీలి†.), పెద్దవేము (మహానింబము†.), పెద్దారుగ (వరకము.) మొ.]

**పెద్దకాఁపు.** ద్వ. విణ. గ్రామాధికారి.

**పెద్దతల.** ద్వ. విణ. పెద్దగానుండి కార్యములనునడపించువాఁడు. ''క. పెద్దతలలేకమీరి, నిద్దపురూపములనిచటనిలిచినమనకున్, బెద్ద ఱికముచాలదుపెఱ, సుద్దులుగల్పింతురెందునుజనులుగలరే.'' కళా. ౬, ఆ.

**పెద్దనిదుర.** వై. వి. పెద్దనిద్దురయొక్కరూపాంతరము. ''శే. పెద్ద నిదురకుమ్రాఁగన్నుపెట్టుచున్న, మానవునిఁదెచ్చిదక్షిణమస్తకంబు, గామహీశయ్యనునిచియుత్తాంతిదాన, మవనిదేవోత్తమునకొక్కయా వునిచ్చి.'' వి, పు. ర, ఆ.

**పెద్దనిదురవోవు.** ద్వ. అ. క్రి. (పెద్దనిదుర+పోవు.) చచ్చు.

**పెద్దనిద్దుర.** వై. వి. చావు, దీర్ఘనిద్ర. ''ఉ. కందఁడుభీతిఁగుం దఁడుప్రకంపితమొందఁడుపెద్దనిద్దురం, జెందఁడు.'' భాగ. ౬, స్కం.

**పెద్దనెల.** ద్వ. వి. జ్యేష్ఠమాసము.

**పెద్దపులి.** ద్వ. వి. బెబ్బులికి మొదటిరూపము.

**పెద్దపులుఁగు.** ద్వ. వి. గుడ్లగూబ, మహాపక్షి.

**పెద్దపొల.** వై. వి. గోమాంసము.

**పెద్దమ్మ.** వై. వి. (పెద్ద+అమ్మ.) 1. జ్యేష్ఠాదేవి; 2. పెదతల్లి.

**పెద్దరోగము.** మి. వి. దేహముతెగదినెడు వ్యాధివిశేషము.

**పెద్దఱికము.** ద్వ. వి. పెద్దతనము.

**పెద్దలు.** వై. వి. బ. తెలిసినవారు*.

**పెద్దవాకిలి.** ద్వ. వి. గోపురద్వారము.

**పెద్దవారము.** మి. వి. బుధవారము.

**పెద్దవిన్నపము.** వై. వి. చెవుడు, బధిరత్వము.

**పెద్దవిన్నపమువాఁడు.** ద్వ. విశ. చెవిటివాఁడు.

**పెద్దవీది.** వై. వి. రాజమార్గము.

**పెద్దవేలుపు.** ద్వ. వి. బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.

**పెద్దవ్రేలు.** ద్వ. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము.

**పెద్దాకుచెట్టు.** ద్వ. వి. (పెద్ద+ఆకుచెట్టు.) ఒకానొక అడవి చెట్టు.

**పెద్దాపురి** దే. వి. పెద్దాపురమునందు చేయఁబడు శర్కర.

**పెద్దింటమ్మ.** ద్వ. వి. (పెద్ద+ఇల్లు+అమ్మ.) ఒక గ్రామదేవత. (గ్రామదేవతాభేదము లిట్టులనేకములుగలవు.)

**పెన.** దే. వి. 1. మెలిక; "సీ. ఉడుపథంబునజాఱునుడుపప్రతతి భాతి మెడహారములపెన పుడమిఁదాఁక." పాండు. ౫, ఆ.— 2. బంధము; "క. అప్పుడుగరుడునితెక్కల, చప్పుడుదూరమున నెఱిఁగిసైరింపఁగలే, కప్పెనలువిడిచిరాఘవు, లొప్పఁగభుజగంబు లొక్కయురవడిఁబఱచెన్. వ. ఇట్లు బంధమోచనంబు సేయుచు." రా. యు, కాం. — 3. రెండుపశువులనుజేర్చి బంధించెడు బంధము.

**పెనఁకువ.** దే. వి. 1. పెనఁగులాట; 2. చుట్టుకొనుట; (చూ. పెనఁగు.) 3. మేళనము; "క. వినుసత్త్వరజస్తమముల, పెనఁకువకవులవెలుఁగొందుపెంపుగలుగుతు, ర్యనిరంజనతత్త్వముపర, మన ఘాయదిభావనీయమనువేదంబుల్." భార. శాం. ౪, ఆ. — 4. యుద్ధము; "పెనఁకువకర్ణుఁడేలుడుగు." భార. కర్ణ. 3, ఆ.— 5. వివాదము; "క. ఒక్కఁడుమానుషమూఁదఁగ, నొక్కఁడు దైవంబునూఁదియుడఁబడకున్నన్, నిక్కపుమానుషముఙ్గాని, తక్కకపెనఁకువలుదీర్పఁ దగునభ్యులకున్." విజ్ఞా. వ్య, కాం.— 6. కలయిక. "బెడిదంపుఁబెనంకువగోళ్లనొక్కుచున్." చంద్ర.

**పెన్నఁకువలుగొను.** దే. అ. క్రి. (పెనఁకువలు+కొను.) మెలివడు. "వ. అఱుతినరులుకలయంబడుచుఁదిరుగుచుఁబెనఁకువలుగొన." భాగ. ౭, స్కం.

**పెనఁగఁబడు.** ద్వ. అ. క్రి. (పెనఁగన్+పడు.) పెనవేసికొను. "పెనఁగంబడురథ్యములన్ మరల్పఁగానొండువిధంబుగానక." జై. ౫, ఆ.

**పెనఁగాడు.** దే. అ. క్రి. (పెనఁగి+ఆడు.) పెనఁగొను. "చ. పవనజుచాపమున్ వారులపగ్గములున్ దునుమాడికాఁడితో, నవిపెనఁగాడఁగావెడఁదయమ్మునఁగేతువుఁగూల్చి." భార. ద్రో. ౪, ఆ. (మొదటిరూపము పెనఁగియాడు. చూ. ఊఁగాడు.)

**పెనఁగు.** దే. అ. క్రి. 1. పెనఁగొను; 2. చుట్టుకొను; "తోయముఁగసఁగ్లంబెనఁగెఁగదాయనుచు." భార. ఆది. ౫, ఆ. — 3. కలయు; "క. మనసిజరాగంబునఁబెనఁ, గినయిట్టినిలేడిఁజూచి." భార. ఆది. ౫, ఆ. — 4. యుద్ధముచేయు; "నకులుఁడుసూతపుత్రుఁసుఁబెనంగునెడన్." భార. కర్ణ. ౧, ఆ.—5. మాఱాడు, "ఉ. నావుడుభామతోడనరనాధవరేణ్యుఁడుపల్కెనింకరా, జీవదళాక్షియీహితవుసెప్పకుమిప్పనిఁబూనిబ్రహ్మయున్, దేవనిభుండునేఁడరుగుదెంచివ్రతప్రతి కూలురైననే, నావిధమేలమానుదుఁబెనంగకతక్కుమటంచుఁద్రోయుచున్." రుక్మాం. ౫, ఆ.—వి. పెనఁకువ. "పెనఁగీకపెనఁగిన." ఆము. ౬, ఆ.

**పెనఁగులాట.** దే. వి. (పెనఁగులాడుట.) పెనఁగొనుట. (రూ. పెనఁగులాటము. "తరులతలపెనఁగులాటములు." రాఘ. ౨, ఆ.)

**పెనఁగులాడు.** దే. అ. క్రి. (పెనఁగులు+ఆడు.) మల్లాడు. "సీ. హేలారచితపుష్పమాలానిచితకేశభృంగమల్లములతోఁబెనఁగులాడు." పు. ౧, ఆ.

**పెనఁగువడు.** దే. అ. క్రి. (పెనఁగు+పడు.) చేరు. "క. కరుణాతిశయంబుఁబ్రజా, పరిపాలనరతియుఁబెనఁగువడియుల్లములోఁ, బిరిగొన." నిర్వ. ౧, ఆ.

**పెనఁగొను.** దే. అ. క్రి. (పెన+కొను.) 1. మెలిగొను; "చ. అనుడుముదంబునెమ్మియునవాత్మఁబెనంగొననన్నతోడని, ట్లనువిదురుండు." భార. ఉద్యో. ౨, ఆ.—2. చేరు. "భూషణోత్కరముతోఁ బదహస్తతలంబులుర్విపైఁబెనఁగొనిచారుభంగియనుభీషణరేఖయుఁదాల్ప." భార. ద్రో. ౨, ఆ.

**పెనఁచు.** దే. ప్రే. పెనఁగఁజేయు. "బలితపుశాఖయందుఁబదపద్మయుగంబుఁబెనంచి." భో. ౨, ఆ.

**పెనపరి.** దే. విశ. (పెనపు+అరి.) 1. వివాదశీలుఁడు; "క. అప్పుగొనిపెట్టనొల్లక, త్రిప్పియకారణమవసుమతీపతిసభకున్, జెప్పఁగవచ్చినపెనపరి, నప్పుడదండించి ధనమునరువఁగవలయున్." (ఇందు అరువఁగన్ అనునది అంతర్భావితప్రేరణముగానుండునని తోఁచెడి.) విజ్ఞా. వ్య, కాం.—2. భేదశీలుఁడు. "క. హరిపలికినవిధమెంతయు, నెరవైయున్నయదివింటెయిమ్మాటతెఱం, గరయుదముతోలుతనీపెన, పరిచందంబెల్ల నెఱుకపడియెడుఁబిదపన్." భార. ఉద్యో. 3, ఆ.

**పెనపు.** దే. ప్రే. (పెనయఁజేయు.) 1. కలపు; 2. పెనఁచు. వి. 1. వివాదము; 2. భేదము.

**పెనము.** దే. వి. దోసెలులోనగునవికాల్చెడుగుండ్రనియినుపతగడు, స్వేదని.

**పెనయు.** దే. అ. క్రి. 1. కలయు; 2. పెనఁగు. "ఆ. రూఢిపేరు రెండురూఢితోఁగలిగినఁ, బేరురూపుక్రియనుబెనసియుండు, నామరూపములును నాశమొందుటనేలు."

**పెనవెట్టు.** దే. స. క్రి. (పెన+పెట్టు.) మెలివెట్టు. "సీ. విషమానములుగాఁగవసతోడఁబెనవెట్టినెట్టెంబుగాఁద్రెవ్వఁబట్టినాఁడు." సాన్వ. ౪, ఆ.

**పెనవేయు.** దే. స. క్రి. 1. మెలిపెట్టు; 2. పశువులను ఒకటితో నొకటిఁజేర్చి ముడివేయు.

**పెనిమిటి.** దే. వి. (పెనుపు+మేటి.) మగఁడు, భర్త. (చూ. పాటపాట.) (ఇందు సంధినివర్ణవికారము.)

**పెను.** దే. విశ. వృత్తియందు పెనుపుశబ్దమునకుమీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (పెన్నుద్ది, పెన్నూఁత; పెనుఁగొమ్మ, పెనుమేటి మొ. దీనికి అచ్చుపరమగునపుడు ద్విత్వమనియుఱుంగునది

దీనికి స్థిరవర్ణములు పరములగునపుడు ఉత్వలోపంబు బహుళంబుగా నగు. పెన్నాటకము, పెన్నింట, పెన్నీరు, పెన్నెత్తురు, పెన్నెనరు, పెన్నెజి, పెన్నద్ద, పెన్నసరు, పెన్నెక మొ.)

పెనుఁగొమ్మ. దే. వి. (పెనుపు+కొమ్మ.) చెట్టుమొదటికొమ్మ, కవట, స్కంధశాఖ.

పెనుఁబాము. దే. వి. (పెనుపు+పాము.) కొండచిలువ, అజగరము. "వ. తనపట్టినసురియనప్పెనుఁబామువదనంబు వ్యస్యం దఱిగిన." భార. అర. ౨, ఆ.

పెనుచే. దే. ప్రే. పెరుఁగఁజేయు, వర్ధిల్లఁజేయు, పెంచే.

పెనుపడు. దే. అ. క్రి. (పెనుపు+పడు.) 1. అతిశయిల్లు; "సీ. బిరుదుకాహళములుపెనుపడఁ దై మ్రోయ ఘనశస్త్రరోచులాక సముఁద్రాఁక." జై. ౨, ఆ. — 2. వర్ధిల్లు. "క. ఘనమైనకోప వహ్నియుఁ, బెనుపడ." రా. అర, కాం. ౨, ఆ.

పెనుపరి. దే. విశే. (పెనుపు+అరి.) వృద్ధిఁబొందించువాఁడు.

పెనుపారు. దే. అ. క్రి. (పెనుపు+ఆరు.) పెంపారు.

పెనుపు. దే. వి. 1. పెంచేట; "ఆ. పరిజనములఁబెనుపుపలికి హితము." భార. శాం. ౨, ఆ. — 2. వృద్ధి; 3. ఆధిక్యము; "పెనుపుననాకనంబవియుబృంహితముల్." భార. శల్య. ౧, ఆ.— 4. మహాత్మ్యము. "క. వినుమునరేశ్వరకర్ణుని, పెనుపుమహేంద్రుం డువచ్చిప్రియమునకెక్కె, తనునర్థింపఁగనిచ్చెను, గొనుమనిలోకం బులెఱుఁగఁగుండలయుగముల్." భార. ఉద్యో. ౨, ఆ.

పెనుమసనము. దృ. వి. (పెనుపు+మసనము.) కాశీ. "పెను మసనంబునంగలవు పెక్కులుతీర్థములు." కాశీ. ౬, ఆ.

పెనుమినుకులు. దే. వి. బ. (పెనుపు+మినుకులు.) వేదము. (చూ. పేరిమికాఁడు.)

పెనుమ్రాను. దే. వి. (పెనుపు+మ్రాను.) దుండిగము.

పెనువెల్లి. దే. వి. (పెనుపు+వెల్లి.) ప్రళయకాలమునందలియేకార్ణవము. "వ. అప్పెనువెల్లియెల్లనడంగిపోవందొడంగునెడ." భార. అర. ౪, ఆ.

పెనువ్రేలు. దే. వి. (పెనుపు+వ్రేలు.) బొటనవ్రేలు, అంగుష్ఠము.

పెన్న. వై. వి. పినాకినీనది.

పెన్నడవులుఁగు. దే. వి. (పెన్+నడవులుఁగు.) ఖరరము.

పెన్నెరు. దే. వి. పెన్నేరుయొక్కరూపాంతరము.

పెన్నేరు. దే. వి. అశ్వగంధి.

పెన్నిటి. దే. వి. పెనిమిటియొక్కరూపాంతరము. "పెన్నిటివస్త్రము." కళా. ౭, ఆ.

పెమ్మె. దే. వి. పెరిమెయొక్కరూపాంతరము. "ద్వి. జనవరాధమ ఘూరజనుఁడిట్టియెడలఁ, బెమ్మెలుపలుకునేపేర్చినశక్తి, నమ్మదంబుగఁ బోపిజయమొందుఁగాక." భాగ. ౧౦, స్కం.

పెయ్య. దే. వి. 1. పాలువిడిచిన ఆఁడుదూడ; (చూ. తలుగు.) 2. దూడ; "క. వసురుచిపిదుకఁగఁబాత్రము, బిసరుహముగఁ జిత్రరథుఁడు పెయ్యగఁగొనిరిం, పెసఁగఁగోగానక్షీరం, బసమునగం ధర్వవరులునమరాంగనలున్." హరి. పూ. ౧, ఆ. — 3. ఆవు. "సీ. వలయుకోరికలియ్యఁగలపెయ్యగలిగిముష్టింపచుల్ పరితుష్టిఁ జెందుటెల్ల." ఉ, రా. ౫, ఆ.

పెర. యు. దే. వి. కేసెతెక్కె. "సీ. గురిబెందపూఁదేనపెరలక్కెతమ లోనఁబొత్తుపోపకసారె పోరుఁగొన్ని." పాండు. ౧, ఆ.—వై.

న. అన్యము. "క. పెరజనులయందువిభునకు, నరయంగవినోద మాత్రమనురాగమెదం, బొరసినయప్పుడుపలువురు, తరుణుల యెడరాగమొకఁడుతొల్పుటతరుణీ." మార్క. ౫, ఆ.

పెరక. దే. వి. పెంకు, పెంచే.

పెరజో. దే. వి. సర్పవిశేషము. (అప్ర.)

పెరడు. దే. వి. ఇంటివెనకటిదొడ్డి, నిష్కుటము.

పెరయాఁగ. దే. వి. ఒకనినుసులేనెటిఁగ, ఫుత్తిక. "క. పెరయాఁ గలగతిఁగవియుచు." భాం. ద్రో. ౧, ఆ.

పెరరేచు. వై. స. క్రి. ప్రేరేపణచేయు. "క. భరతునిఁగనఁగొని నిజసా, దరులుపడినచోటికిపుడుదైవమునిన్నున్, బెరరేచితెచ్చె నిపుడెం, దరిగెదుకుశునెదురననుచునాటోపమునన్." జై. ౬, ఆ.

పెరరేపు. వై. స. క్రి. పెరరేచేయొక్కరూపాంతరము.

పెరవణి. వై. వి. పేరణియాట. "ద్వి. అంగజారాతికినానంద మొదవ, భృంగిముఁదటివంకఁబెరవణిచూప." ప్రభు. ౨, ఆ. (ఈ రూపము ఈయొకచోటనే కనఁబడుచున్నది.)

పెరసు. దే. వి. పాల, మాంసము.

పెరిమ. వై. వి. ప్రేమ. "చ. రంగనాథునె, మ్మనమునసిల్పఁజొచ్చెఁ బెరిమంబులకించుకపోలపాళితోన్." పర. 3, ఆ.

పెరిమె. దే. వి. పెద్దటికము. "రగడ. నేర్పుమైనల్లయదినెఱులఁ దొలుపూఁదుటిమె, దర్పకునకర్పింపఁదలఁపడెంకటిపెరిమె." సా. 3, ఆ.

పెరుఁగాకు. దే. వి. (పెరుఁగు+ఆకు.) పెరుఁగుతోటకూర, శాకిని.

పెరుఁగు. దే. అ. క్రి. 1. వర్ధిల్లు; "క. అనఘమదాలసకడుపున, జనియించియుయోగిమాతచనుగుడిచిపెరిం, గినతనయులితరవనితల, తనయులువనత్రోవఁజనఁగఁదగియెడువారే." మార్క. 3, ఆ.— 2. ఎదుగు. "తే. వింధ్యసమమరాద్రిమాద్రికివివిధతౌర, కములు మొలపూసలుగఁబెరుంగమదిఁదలఁచె." పాండు. ౫, ఆ.—వి.దధి. "ఉ. కమ్మనిజున్ను మంచినెయి గట్టిదిమీఁగడతోఁ బెరుంగు." హంస. ౨, ఆ.—విశే. 1. పండ్లుచెల్లినవాఁడు, పండ్లుచెల్లినది; 2. వృద్ధి పొందినది. (చూ. పెరువు.)

పెరుఁగుడు. దే. వి. 1. వర్ధనము; 2. వృద్ధి.

పెరుఁగుతోటకూర. దే. వి. పెరుఁగాకు, శాకిని. పెరుఁగు సంద్రము. దృ. వి. పెరుఁగుసముద్రము, దధ్యుదము.

పెరుగు. దే. అ. క్రి. తెగు. "పెరిగినహారరత్నములపెల్లుననొక్కెడఁ దామ్రపర్ణియై." పా. ౪, ఆ.

పెరుమాళ్ళకోయిల. దే. వి. (పెరుమాళ్లు + కోయిల.) కాంచీపురము. (చూ. కోయిల.)

పెరుమాళ్లు. దే. వి. బ. విష్ణువు. "మనసుకృతంబుపెంపుపెరు మాళ్లియెఱుంగు." పర. ౨, ఆ.

పెరువు. దే. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. ఎదుగు. (చూ. పెర్గు.) వి. దధి. "క. తరువంబెట్టినబానల, పెరువులుమునుగిలుకరించి పేర్చిన వెన్నల్, సురువులెనఁగఁగ్రోలిపిదప, సురలంద్రోచుచునుబోవు నుక్కివపుగతిన్." హరి. పూ. ౫, ఆ.—విశే. 1. పండ్లుచెల్లినది, పండ్లుచెల్లినవాఁడు; "పెద్దకాలమునాఁటిపెరువ." కాశీ. ౨, ఆ.—2. వృద్ధిపొందినది. "వ. తెరువులంబెరువులయివిరువులుగఁ బూచిమరువులలరు కదంబతరువులును." రాజ. ౨, ఆ. (పెరుఁగుయొక్కరూపాంతరము.)

**పెర్కు.** దే. అ. క్రి. పెఱుకుయొక్కరూపాంతరము. (పీఁకుటకు. "ద్వి. విజయలోలుఁడైవానినాలుకపెర్కి-చంపె." రా. సుం, కాం.)

**పెర్గు.** దే. అ. క్రి. వి. పెరుఁగుయొక్కరూపాంతరము. (వర్ధిల్లు టకు. "పలుకుందొయ్యలి చేతిరాచిలుకఁబెంపంబెర్గి." విక్ర. ౨, ఆ.)

**పెర్వు.** దే. అ. క్రి. వి. పెరువుయొక్కరూపాంతరము. (దధికి.— "అంగనలకావెన్నలు వేఁడుఁబెర్వుదరువంగా." హరి. పూ. ౫, ఆ.)

**పెఱ.** వై. స. అన్యము. "క. చఱచియొకచేతఁగూర్మముఁ, బెఱచేత గజంబుఁబట్టిపెనఁచిఖగేంద్రుం, డిఱికికొనిగగనవీథిక్, బఱచెవి యచ్చరవిమానపఙ్క్తులదూలక్." భార. ఆది. ౨, ఆ. (ఇట్లు పెఱ, చెఱ ఇత్యాద్యనేకశబ్దములయందు శకటరేఫము కనఁబడుచుం డఁగా చిన్నయసూరిగారు "శకటరేఫము తత్సమతద్భవములందు లేదు" అని చెప్పుటకు అభిప్రాయమేమో తెలిసినదికాదు.)

**పెఱగాయ.** ద్వ. విశే. (పెఱ+కాయ.) కుత్సితుఁడు. "క. కట కటగురువులతోనే, గుటగుటలానేనగోరుకోరికవితగా, నటునిటుఁ బ్రొద్దులుపుచ్చుచు, నటమటఁబెఱగాయనుద్దు లాడెదవౌరా." శశాం. ౩, ఆ.

**పెఱమగఁడు.** ద్వ. వి. జారుఁడు. "వ. పెఱమగలచేనంపించు కొనివారలునప్పుడు." చంద్ర.

**పెఱిక.** దే. వి. ఎద్దులోనగువానిమీఁదవేసిమోయించెడుగోనెమూట. "చ. మఱియుననన్నిధింగలనమంచితకాంచనరాశిబండులం, బెఱికలమోపులంగొలఁదివెట్టఁగఁబెక్కుసుబారువుల్ జనల్, వెఱఁగు పడంగభీచరులువెక్కసమందఁగశత్రుకోటికిన్, వెఱపానరించు వార్తపృథివిన్బరఁగన్నడపించెభూవరా." భార. అశ్వ. ౩, ఆ.

**పెఱికాటము.** దే. వి. ఎద్దులోనగువానిచే ధాన్యాదులుమోయిం చుట.

**పెఱుకు.** దే. స. క్రి. 1. పీఁకు; 2. పెల్లగించు. "చ. గుఱుకొని నేలవ్రక్కలుగఁగ్రొచ్చియుమున్నులు మ్రింగియుక్కళల్, వెఱి కియు." రా. బాల, కాం.—3. మోయు. "ఎ, గీ. బలిమిఁగొనిన ధనముపదివేలయెంబెలు, పెఱికిరాఁగ వైరిభీకరుండు, వచ్చెనకు లుఁడు." భార. సభా. ౧, ఆ. (అం, ప్రే. మోయించు. "సీ. వలుదయేనుఁగుమ త్తెములుపట్టిపులులపైఁ బెఱికినయిట్టితోల్పెఱిక గములు." చంద్రా. ౨, ఆ.)

**పెఱుగు.** దే. అ. క్రి. 1. కడఁగు, ఉద్యమించు; "క. చక్క నగుమనినరక్కసుఁ, డక్కజముగఁబెఱిగివచ్చియయ్యనిలజు నీ, యుక్కునుభీరముఁజూచెదఁ, జిక్కఁగనిలువ్వుమనికడువిజృంభించి వడిన్." భార. ఆది. ౬, ఆ. "ఉత్సాహ. వీఁడిదీనిసెడయుఁజేయ నీక్షణంబయేగిపాం, చాలుఁబట్టితెత్తమధికశౌర్యలీలమెఱయఁగాఁ, బోలుననుచుఁబెఱిగిరాజపుత్రులెల్లనరిగిపాం, చాలుపురముముట్టి కొనిరసంఖ్యబలసమేతులై." "సీ. వారణావతముననవారెల్లఁబాండ వాగమనంబువిని సంతసమునఁబెఱిగి, కరమొప్పఁగరిరథ తురగబలా ఢ్యులై యెదురువచ్చిరికడుముదముతోడ." భార. ఆది. ౬, ఆ.— 2. విజృంభించు. "తఱుచుటమ్ములనేదుపెఱిగినచందంబుచేసె." భార. కర్ణ. ౧, ఆ.

**పెలుకుఱు.** దే. అ. క్రి. భయాదులచేత అంగములు విలవిలపోవు, విహ్వలించు. "చ. ఖలుఁడుబృహద్రథాత్మజుఁడు గర్వితుఁడైమహీ లోనిరాజులన్, బెలుకుఱఁబట్టితెచ్చి." భార. సభా. ౧, ఆ.

**పెలుచే.** దే. వి. 1. అతిశయము; "కుడిచెవిపొన్నమునాఁకటి పెలుచను." భార. ఆది. ౫, ఆ.—2. ఆగ్రహము; "క. అనుపలు ఖలతయ్యంగన, ఘనకోపముగదిరినీచూగావునజంకిం, చినఁగాని మెత్తఁ బడిపోఁ, డనిమనమునఁదలఁచి యిట్టులనియెన్బెలుచన్." భార. విరా. ౨, ఆ. "క. కొట్టువడియటకుమునుపే, తిట్టంబడియెద్ది నాదుదెసగనిమదిలోఁ, గట్టలుకవోడమినాసఖు, లిట్టనిరిమనీంద్రు తోడనెత్తినపెలుచన్." స్వా. ౮, ఆ.—3. అధిక్యము; 4. కాఠి న్యము. (చూ. పెలుచన.)—విణ. అధికము. "పెలుచగుభూఁపుభో." యు. 3, ఆ.—ద్ర. ఉచ్చైరర్థకము, గట్టిగా. "పెలుచనోకర్ణయో కృపయోనుయోధన...అనిపలికి." భార. ద్రో. ౫, ఆ. "పాంచ జన్యంబుఁబెలుచఁబూరించి." నిర్వ. 3, ఆ. (ఇది నల్లతోనగు వానివంటిది.)

**పెలుచన.** దే. వి. 1. అతిశయము; (చూ. పెలుచే.) 2. ఆటో పము; (చూ. పెల్చన.) 3. ఆగ్రహము; "క. జననియనకయిట్లిం తయు, ననలంకించితటుగావునన్ బదమువపిన్, దునిసిపడుఁగాక యనిపెలు, చనశపియించుటయువెఱచి జముఁడాతురుఁడై. వ. తండ్రిపాలికరిగి ప్రణతియొనర్చి తనయపచారంబునుదల్లి కోపించి యిచ్చిన శాపంబునునెఱింగించి." హరి. పూ. ౧, ఆ.— 4. అధిక్యము; (చూ. పెల్చన.) 5. కాఠిన్యము; (విశేషణమగుచో "బలితంపుజంఘలపెలుచనితొఁడున." హరి. ఉ. ౫, ఆ.)— 6. ఉచ్చైర్నాదము. (విశేషణమగుచో. "పెలుచనియెలుఁగున." భార. శాం. 3, ఆ.) చూ. అలకన.

**పెల్కుఱు.** దే. అ. క్రి. పెలుకుఱుయొక్కరూపాంతరము. "పెల్కుఱిదిశాదంతావళశ్రేణిమ్రొగ్గె." మార్క. ౬, ఆ.

**పెల్చ.** దే. వి. విణ. పెలుచయొక్కరూపాంతరము.

**పెల్చన.** దే. వి. పెలుచనయొక్కరూపాంతరము. (ఆటోపమునకు.— "క. కృతహస్తుఁడుపెం, ల్చననేమ్ములనారెం, టినిద్రెళ్లఁగనేసెఁగడుఁ గఠినహృదయుండై." భార. ఆది. ౫, ఆ. (ఈపద్యము ముందు భాగమును. చూ. పెనఁగుకడ.)— అధిక్యమునకు.— "ఇంత పెల్చన నీవాడెదవంతతక్కువనెబేలా." భార. శాం. 3, ఆ.)

**పెల్ల.** దే. వి. ఎండిపెల్లగిలినపలుచనిమంటిగడ్డ.

**పెల్లగించు.** దే. ప్రే. పెల్లగిలఁజేయు, ఉన్మూలించు.

**పెల్లగిల్లు.** దే. అ. క్రి. 1. పాదు ఊడిలేచు, ఉన్మూలితమగు; "సీ. పృథివితలంబెల్లఁబెల్లగిల్లఁగడంగెనతిమలినంబయ్యెనంబ రంబు." రామా. ౫, ఆ.—2. పాఱు. (రూ. పెల్లగిలు. పాఱు టకు. "రారాజుసైన్యంబులోక్కమొగింబెల్లగిలంగ." భార. కర్ణ. ౨, ఆ.)

**పెల్లిదము.** ద్వ. వి. (పెల్లు+ఇదము.) పెల్లు, అతిశయము. "క. ఒదవెడుతృషపెల్లిదమున, వదనమువఱువట్లువట్టె." భార. విరా. ౨, ఆ.

**పెల్లు.** వై. వి. 1. అతిశయము*; "హావ్యవహశిఖలపెల్లిధి." భార. ఆది. ౨, ఆ. "భీకరబాణవర్షములపెల్లున." భార. విరా. 3, ఆ.—2. అధిక్యము*. "ఉ. పెల్లునఁబెద్దనేపురరణభీషణలీలఁ జెమర్చిడస్సియున్." రా. యు, కాం.—క్రి. విణ. అత్యంతము*. "క. డొల్లెడుతలయునుఁదునిసెడు, విల్లునుధరనొఱగుమేనువిఱిగెడు పిడముల్, బెల్లుదొరఁగునెత్తురునై, వల్లటిలందొడఁగెనపుడు పాండవబలముల్." భార. భీష్మ. ౧, ఆ. "క. కరిహయరథతతి, ల్లుగనత్రులురులఁజొచ్చెను." భార. భీష్మ. ౧, ఆ.—విణ. అధి కము*.

**పెల్లుకోను.** ద్వ. అ. క్రి. అతిశయిల్లు. (చూ. దల్లు.)

**పెసర.** దే. వి. సస్యవిశేషము.

**పెసలు.** దే. వి. బ. పెసరధాన్యము. (దీని భేదములు నల్లపెసలు, పచ్చపెసలు, పిచ్చపెసలు.)

**పెళపెళ.** దే. వి. 1. ధ్వనివిశేషము; "పెళపెళనిచీర." సావి. ౫, ఆ.—2. విఱుగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (విఱుగుటయందు; "ద్వి. పృథులశాఖలు గాలిఁ బెళపెళవిఱిగి, పృథివిపై మ్రాఁకులుపెల్లుగాఁగూల." హరిశ్చ. ౧, భా.—విఱుచుట యందు; "పెళపెళబల్లెముల్ విఱిచి." ఉ, రా. ౭, ఆ.—ఉఱుముట యందు; "పెళపెళమబ్బుచిట్టుఱుమ." ఆము. ౪, ఆ.—ఆర్చుట యందు. "సీ. నిగిడితెరవ్వరులగుండెలుజల్లురనఁజేర్చిపెళపెళనార్చు కోవెలకుఁదోడు." య. ౫, ఆ.)

**పెళపెళయను.** దే. అ. క్రి. (పెళపెళ+అను) తోలులోనగునవి పెళపెళయనిధ్వనించు. "మృగకృత్తిపెళపెళయనఁగ." ఆము. ౪, ఆ. "సీ. కలమాన్నరుచితోడఁగలపించుజాడ దువ్వలువపింజెలు పెళపెళయనంగ." పా. ౩, ఆ.

**పెళుచు.** దే. విశ. 1. మూర్ఖుఁడు; "ఎ, గీ. చాలకుండిననగుఁ జెట్టబాలుఁడితఁడు, కొనరిగొంతెమకోరికల్ గోరెనేని, యిడకపోఁ బోలదిడఁబోలదీరుదివియఁ, జేసురాకున్నెతైర్థికుల్ పెళుచులం డ్రు." పాండు. ౪, ఆ.—2. నిరసము. "పెళుచుమాటలుకొన్ని పిమ్మటాడిననేమి."

**పెల్లమ్రాను.** దే. వి. దున్నినపిమ్మట మిట్టపల్లములు సరిపడమీఁద నీడ్చెడుపలక.

**పెల్లు.** దే. వి. విఱుగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (విఱుగుటయందు; "సీ. నిక్కిపెల్లనికొమ్మలుక్కనవిఱుగంగఁ దిగిచిధారణిఁద్రోచిపగులఁద్రొక్కి." హరి. పూ. ౬, ఆ.—విఱుచుటయందు; "ద్వి. అసురులచేతిశస్త్రాస్త్రంబులాడిసి, వెసఁ బుచ్చిపెల్లునవిఱుతురుకపులు." రా. యు, కాం.—దాఁటుట యందు. "ఉ. బెబ్బులిగొంతుక్రోల్ గఱచిపెల్లునమార్లెడద్రెళ్ల దాఁటుచుఁ." ఆము. 3, ఆ.)

**పెల్లెము.** దే. వి. మద్యముచేయుటకు అనేకవస్తువులు చేర్చిచేసిన పిండి, మేదకము.

## పే.

**పేఁట.** వై. వి. 1. నగరము*; "క. ఎక్కడఁజూచినఁగాల్బల, మెక్కడఁజూచినరథంబు లిభతురగచయం, బెక్కడఁజూచినఁ దాపై, క్రిక్కిఱిసెఁ బేఁటనాల్గుకెలఁకులసేనల్." కవి. 3, ఆ.—2. శాఖానగరము*. "పురములుకాల్చికూపములుపూడిచిపేఁటలు దోఁచి." బ్ర. ౫, ఆ.

**పేఁటు.** దే. వి. ఛీఁటిక. (చూ. పట్టు. దే. అ. క్రి. రెండవ యర్థము నుదాహరణము.)

**పేఁడ.** దే. వి. గోమయము. (రూ. పెండ.)

**పేఁడగువ్వ.** దే. వి. పారావతవిశేషము.

**పేఁడపురుగు.** ద్వి. వి. పేఁడయందుండు ఒకదినుసు తెక్కపురుగు.

**పేఁడు.** దే. స. క్రి. దారముపేను.

**పేక.** దే. వి. వస్త్రములనేఁతయందలి యడ్డనూలు.

**పేగు.** దే. వి. ప్రేగుయొక్కరూపాంతరము.

**పేచకము.** సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ; 2. ఏనుఁగుతోఁక మొదలు; 3. దానిసమీపము.

**పేచి.** కన్న. వి. భారము, తంటా.

**పేచిక.** దే. వి. ఒకానొకచెట్టు.

**పేచీఖోరు.** తంటాలమారి.

**పేజి.** ఆం. వి. పుట.

**పేట.** ఉభ. దే. వి. హారములోనొకసరము, యష్టి. సం. ఆ. స్త్రీ. పెట్టె. (రూ. పేటము, పేటకము. అ. పుం, న.)

**పేటనఁబెట్టు.** ద్వి. అ. క్రి. (పేటన్+పెట్టు.) యత్నించు. "చ. పయిఁబయిఁబండుకొల్చువిరిపైఁడియుగట్టిదినుస్సుజాయిలి, ప్పయుమణిబంటుబాసినలుఁబైరముఁబెయ్యియుఁ జేనఁజెట్టులో, నయిన సమస్తసంపదలునన్నవితీర్ణికివెచ్చపెట్టికాఁ, బ్రియలుధరించు సొమ్ములకుఁబేటనఁబెట్టెఁజలింపకంతటన్." కళా. ౬, ఆ.

**పేటాడు.** దే. అ. క్రి. (పేటు+ఆడు.) భేదించు.

**పేటి.** ఉభ. దే. వి. నడికట్టు.—సం. ఈ. స్త్రీ. పెట్టె.

**పేటిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పెట్టె; 2. సమూహము.

**పేటీ.** దే. వి. పేటియొక్కరూపాంతరము.

**పేటు.** దే. వి. 1. సరిగలోనగువానితోనేసినపట్టె; 2. పర్వత శిఖరము.

**పేడి.** వై. వి. నపుంసకుఁడు. "క. చనఁబేడికెదారక్రియ, యును జెవిటికిమధురగీతియునుజీకునక, ల్యనుపమసురూపదర్శన, మును జేయుటఁబోలుఁగృష్ణుఁబూజించుటెలన్." భార. సభా. ౩, ఆ.

**పేడు.** దే. వి. సన్నచెక్క.

**పేడె.** వై. విశ. గడ్డముమీసములేనివాఁడు*. (గడ్డముమీసములేనిది. పేడెమూతి.)

**పేడెత్తు.** దే. అ. క్రి. (పేడు+ఎత్తు.) విచ్చు, తొలఁగు. "మ. దీపించుపెక్దత్తఱం, బునఁబేడెత్తినలజ్జనంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబుని, ల్చినయయ్యచ్చరఁజూచి." సావి. ౩, ఆ.

**పేణీ.** వై. వి. భక్ష్యవిశేషము.

**పేద.** వై. వి. భటుఁడు. "క. చనుచోవాకిటిపేదలు, కనిదిగ్గనలేచి." సా. ౩, ఆ.—విశ. 1. పిఱికి; "ఉ. ఈదనుజుండుచిక్కభయ మేటికిలుబ్ధకులారయాత్మకున్, బేదతనంబుమేలె." సావి. ౪, ఆ.—2. దరిద్రుఁడు*; "ఆ. పేదయైనధనదుపెన్నుద్ధియైతగు, నాయమునకువెచ్చమల్పమైన." విక్ర. ౩, ఆ.—3. అనుద్ధతుఁడు*; "తే. ఉద్ధతులమధ్యమునఁబేదకుండఁదగునె." కవిక. ౩, ఆ.—4. అశక్తుఁడు*. "పేదతాపసులు." భార. ఆర. ౭, ఆ. "వ. ఇప్పేద గుఱ్ఱంబు లతిదూరంబెట్లు పోవనోపు." భార. ఆర. ౩, ఆ.

**పేదర్కి.** ద్వి. వి. పేదఱిమియొక్కరూపాంతరము. (దారిద్ర్యము నకు. "సీ. కష్టఁబువ్వులుఁబూఁతకలలోపలనులేకపేదర్కితమునఁ బెండ్లిలేక." పంచ. నా. ౫, ఆ.)

**పేదఱికము.** ద్వి. వి. దారిద్ర్యము. "క. కడుఁబేదఱికంబు కంటెఁగష్టముగలదె." విక్ర. ౩, ఆ.

**పేదఱిమి.** ద్వి. వి. 1. దారిద్ర్యము; (చూ. పేదర్కి.)—2. పిఱికి తనము. "తే. దండిపైలెమ్మమనసుపేదఱిమివిడిచి." భార. భీష్మ. ౧, ఆ.

**పేదవడు.** వై. అ. క్రి. (పేద+పడు.) 1. దారిద్ర్యమునుపొందు; "తే. చెల్లియుండియుసైరణసేయునతఁడుఁ, బేదవడియునునర్థికిఁ బ్రియముతోడఁ, దనకుఁగలభంగినిచ్చునతండుఁబుణ్య, పురుషులని చెప్పిరార్యులుబుధవరేణ్య." భార. ఉద్యో. ౩, ఆ.—2. దైన్యము నుపొందు. "సీ. పేదవడ్డాఁడవుప్రియజనంబునుబరివారంబు లేదియవ్యవస్థకింత, వగచెదవోదానవశ్రేష్ఠ." భార. శాం. ౪, ఆ.

**పేనా.** ఆం. వి. కలము.

**పేను.** దే. స. క్రి. దారము పేఁడు. వి. తలయందుపట్టెడుజంతు విశేషము, యూకము.

**పేన్నీళ్లు.** ద్వ. వి. బ. (పేఁడ+నీళ్లు.) కలయంపిచల్లెడు పేఁడ కలిపిననీళ్లు. "నిల్చినచోటఁబేన్నీళ్లుచల్లి."

**పేపర.** దే. వి. పక్షివిశేషము. (అప్ర)

**పేము.** దే. వి. ప్రేముయొక్కరూపాంతరము.

**పేముబొద్దు.** దే. వి. గోడయంచులయందు పేమువలె ఏర్పఱచెడు బొద్దు.

**పేయ.** దే. వి. పెయ్యకుమొదటిరూపము.

**పేయము.** సం. వి. అ. న. 1. నీళ్లు; 2. పాలు. పుం. 1. అచ్చు పుఁదేట; 2. వెలవ. విణ. త్రావఁదగినది.

**పేరంట్రము.** దే. వి. పేరఁటముయొక్కరూపాంతరము. (మొదటి యర్థమునకు. "తే. ఇతఁడు సిల్వని పేరంట్రమేగువెంచి, పాటి చెప్పెదననుచదబ్బఱలుపలికె." హరిశ్చ. ౪, ఆ. పేరంట్రము పేరంట్రముగాననియర్థము.)

**పేరఁటము.** దే. వి. 1. వివాహాదిశుభకార్యములు నడపుటకు ముత్తయిదువలు ఇరుగుపొరుగు ముత్తయిదువలను రమ్మని పిలుచుట; "పెండ్లినృపాలునింటనని పేరఁటముల్ స్త్రియమొప్పఁజెప్ప." కళా. ౭, ఆ.–2. వివాహాదిశుభకార్యములయందు ఇరుగుపొరుగు ముత్తయిదువలు వచ్చిచేయు తత్సంబంధమైనకార్యము. "సీ. కైసేసికొనుచు రోనుగాఁగలదేవ పురంధ్రివర్గములు పేరఁటమునేయ." హరి. ఉ. ౮, ఆ.

**పేరఁటాలికూర.** ద్వ. వి. ఒకదినుసుకూరాకు.

**పేరఁటాలు.** దే. వి. 1. పేరఁటమునకువచ్చినముత్తయిదువ; "క. చెలరేఁగిరెండుదోయం, బులపేరంటాండ్రుఁజిత్తములనెంతయువే, డ్కలుమీఱఁజల్లులాడిరి, తలఁకకయభినవశుభాక్షతవ్రాతము లన్." కళా. ౭, ఆ.–2. మృతసువాసిని.

**పేరడవి.** ద్వ. వి. (పేరు+అడవి.) మహారణ్యము.

**పేరణము.** వై. వి. పేరణియొక్కరూపాంతరము. "సీ. వడఁకు పన్నగరాజుపడగలమీఁద నర్వంసహాకాంత పేరణముసూప." ఉ, హరి. ౪, ఆ.

**పేరణి.** యు. దే. వి. అంగీ. "తలనిద్దాతగటీలు పేరణులుపైద ట్లుగన్." రా. వి. ౩, ఆ.–వై. భాండోపరినృత్యము. "మేళా య్యార్యములనచ్చరలు పేరణినటింప." ఉ, రా. ౩, ఆ.

**పేరము.** దే. వి. పేరెముయొక్కరూపాంతరము. "సీ. కలరవంబుల రకంబులు పికంబులు గేరెరమణఁగీరములు పేరములువాఱె." భద్రా. ౧, ఆ.

**పేరాముదపుఁజెట్టు.** ద్వ. వి. (పేరాముదము+చెట్టు.) రక్తైరండము.

**పేరాముదము.** ద్వ. వి. (పేరు+ఆముదము.) రక్తైరండతైలము.

**పేరాముదాలు.** ద్వ. వి. బ. పేరాముదపువిత్తులు.

**పేరి.** ఆం. వి. ఒకవిధమైన ఫలవృక్షము.

**పేరిమి.** దే. వి. (పేరు+ఇమి.) 1. గౌరవము; 2. అతిశయము. (చూ. పేర్మి.)

**పేరిమికాఁడు.** దే. విణ. గొప్పవాఁడు, ఘనుఁడు. "పెనుమినుకుందెగలు పొగడుపేరిమికాఁడా." అచ్చ. సుం, కాం.

**పేరీఁదు.** దే. వి. (పేరు+ఈఁదు.) ఖర్జూరము.

**పేరు.** దే. అ. క్రి. 1. ఘనీభవించు; 2. సాంద్రమగు; "చీఁకటుల్ పేరినయొక్కచోటుగని." హరి. ఉ. ౧౦, ఆ.–3. అతిశయించు; "పేరినవేదన." చంద్రా. ౩, ఆ.–వి. 1 నామము; 2. కీర్తి; "క. పెనఁకువమమునోర్చికొనుము పేరును బెంపున్." హరి. ఉ. ౯, ఆ.–3. దండ. "సీ. అత్తగారిచ్చినహారిసుదర్శన పుఁబేరునకుముత్తయిదువవనటఁబొంద." పాండు. 3, ఆ.–విణ. 1 పెద్ద; "పేరోలగము." "పేరుబలఁగము." మొ.–2. అధికము. "ఎ, గీ. భీతిపగఱకునాత్మలోఁబేరుపెరిఁగె." రామా. 3, ఆ. (హల్లుపరమగుచో దీని యుకారమునకు వికల్పముగా లోపంబగు. "ధరణియందుఁబేర్కలవాఁడు." హరి. ఉ. ౬, ఆ.)

**పేరుంగరము.** దే. వి. (పేరు+ఉంగరము.) పేరుచెక్కిన ఉంగరము, ముద్రిక.

**పేరుకొను.** దే. స. క్రి. 1. పేరుపెట్టిపిలుచు; 2. పిలుచు; (చూ. పేర్కొను.) 3. ఉచ్చరించు, వచించు; "వ. అద్దేవుని సహస్రనామంబులుఁబేరుకొని." ఉ, హరి. ౩, ఆ. "క. పేరు ప్రమాదవశంబునఁ, బేరుకొనుటకల్లయయ్యె." నై. ౪, ఆ.–4. స్తుతించు. (చూ. పేర్కొను.)

**పేరుకోలు.** దే. వి. పేరుకొనుట.

**పేరుగ్రుచ్చు.** దే. స. క్రి. (పేరు+గ్రుచ్చు.) 1. పేరుపెట్టి పిలుచు; "ఆ. అడరిపెలుచనేడ్చునాఱడిపోయిన, ప్రజలపేరుగ్రుచ్చిపనవిపనవి." భార. మా. ౧, ఆ.–2. చెప్పు. "సీత్రపేరుగ్రుచ్చినయవియెల్లమేలు." భార. శాం. ౫, ఆ. (గ్రుచ్చు అనునది కూర్చుయొక్కమాఱురూపమనియెఱుంగునది. చూ. వాగ్రుచ్చు.)

**పేరుచు.** దే. అ. క్రి. 1. అతిశయించు; 2. విజృంభించు. స. క్రి. 1. ఒకటిమీఁదనొకటిపెట్టు; (జాళ్లుపేర్చిపెట్టుము.) 2. ఒకటిమీఁద నొకటిగాపెట్టియేర్పఱచు. (రూ. పేర్చు.–అతిశయించుటకు.–"క. ఆతతసామ్రాజ్యమంతకంతకుఁబేర్చెన్." లక్ష్మీ. ౩, ఆ.–విజృంభించుటకు.–"క. కార్చిచ్చుకవిసిమృగముల, నేర్చుగరణినేడుభీష్ముఁడేచినకడిమిన్, బేర్చి మననేనఁబొదివెళ, రార్చుల నవ్వీరుఁగన్నులారంగంటిన్." భార. భీష్మ. 3, ఆ.–ఒకటిమీఁద నొకటిగాఁబెట్టియేర్పఱచుటకు.–"వ. సరయూతటంబునసౌధ పేర్చి." రా. అ, కాం.)

**పేరుడు.** దే. వి. పేరుట, ఘనీభవించుట.

**పేరుపు.** దే. వి. 1. ఒకటిమీఁదనొకటిపెట్టుట; 2. కుండపెంకు. (చూ. పేర్పు.)

**పేరెము.** దే. వి. 1. గుఱ్ఱపుపరుగు; 2. పరుగు.

**పేరోజెము.** వై. వి. మరకతమణివిశేషము. "పేరోజంబుమణుల మొగముట్టు." సా. ౪, ఆ.

**పేరోజము.** సం. వి. అ. న. క్షుద్రమణివిశేషము.

**పేరోదనము.** వై. వి. పేరోజెముయొక్కరూపాంతరము.

**పేర్కొను.** దే. స. క్రి. పేరుకొనుయొక్కరూపాంతరము. (పేరు పెట్టిపిలుచుటకు.–"చ. అమితసహస్రవర్షవిశదాయువు నన్నిటులెవ్వఁడొక్కొనా, విమలతపంబుఁగైకొనకవృద్ధతనూడకబాలుగానవ, జ్ఞమిగులనిట్లుపేర్కొనియె." హరి. ఉ. ౯, ఆ.–పిలుచుటకు.–"వ. అక్కుమరంబుఁబేర్కొని." భార. అర. ౪, ఆ.–స్తుతించుటకు.–"సీ. శ్రీకాంతుకమనీయశృంగారలావణ్యకథలుపేర్కొనుశారికాగణంబు." లక్ష్మీ. ౧, ఆ.)

**పేర్కోలు.** దే. వి. పేరుకోలుయొక్కరూపాంతరము.

**పేర్పు.** దే. వి. పేరుపుయొక్క-రూపాంతరము (ఒకటిమీఁదనొకటి పెట్టుటకు.—"పేర్పుగఘుజించి." జై. ౬, ఆ.—కుండపెంకునకు. చూ. పిసరు.)

**పేర్మి.** దే. వి. పేరిమియొక్క-రూపాంతరము. (గౌరవమునకు.—"ఉ. ఇమ్మనుజేంద్రుఁడింద్రదనుజేంద్రులకంటె మహావిలాసపో, ఖ్య స్థులఁ బెద్దయిద్ధరణిఁగావుఁ సితని పేర్మికిఁ దగన్, నెమ్మి నొనర్చెదన్ సవ." భార. సభా. ౧, ఆ.—అతిశయమునకు. — "ఆ. ఇమ్మహి, మంతుఁడిపుసుతసదుమదముపేర్మి, నన్నునరయకుసిుసెనామీఁద." భార. ఆర. ౪, ఆ.)

**పేలపిండి.** ద్వ. వి. పేలాలువిసరిచేసినపిండి, సక్తువు.

**పేలలు.** దే. వి. బ. లాజలు. (దీనిని ఆవాలవలెనే పేలాలనివాడె దరు. వృత్తియందేకవచనాంతము. పేలగింజలు మొ.) (ప్రేలల యొక్క-రూపాంతరము.)

**పేలవము.** సం. విశ. (అ. ఆ. అ.) పలుచనిది, విరళము.

**పేలా.** దే. వి. సిల్లుత్రాగెడు ఒకదినుసుగిన్నె.

**పేలిక.** దే. వి. చింపిగుడ్డ. (చూ. నాలిక.)

**పేలు.** దే. అ. క్రి. సెగచేతవేఁగియుబుకు. (ప్రేలుయొక్క-రూపాంతరము.)

**పేలుచు.** దే. ప్రే. పేలఁజేయు. (చూ. పేల్చు.)

**పేవు.** దే. వి. పేగుయొక్క-రూపాంతరము.

**పేశలము.** సం. వి. అ. పుం. 1. కోయిల; 2. రోఁకలి. విశ. 1. నేర్పుగలది; 2. చక్కనిది.

**పేశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గ్రుడ్డు; (ఇకారాంతమునకు.) 2. కత్తి యొఱ; 3. మాంసపుముద్ద.

**పేశీకోశము.** సం వి. అ. పుం. అండము, గ్రుడ్డు.

**పేషణము.** సం. వి. అ. న. నూఱుట.

**పేషణి.** సం. వి. ఈ. స్త్రీ. నూఱెడుఱాయి, సన్నెకల్లు.

**పేష్కషు.** హిం. వి. జమీఁదారులు ప్రభుత్వమువారికికట్టుపన్ను.

**పేష్కారు.** హిం. వి. అమల్దారుక్రిందియుద్యోగస్థుఁడు.

**పేసెము.** వై. వి. (చూ.) బేసము.

## పై.

**పై.** దే. వి. మీఁదు, ఉపరిభాగము. (పైక్రిందులు, పైమాట మొ.) (మొదటిరూపము. పయి.)

**పైఁట.** వై. వి. పయఁటయొక్క-రూపాంతరము. "పైఁటకులాగు లాడి." పాంచా. ౫, ఆ. (మొదటిరూపము. పయిఁట. "జిలుఁగుపయింటదూల." క్రవి. 3, ఆ.)

**పైఁడి.** దే. వి. 1. బంగారు; 2. ధనము. "క. ఆపిమ్మటనేవచ్చెద, నాపైఁడి మహత్త్వమచటనడిపించెద." భల్లా. ౫, ఆ.—3. (చూ.) ఉంకువ. (మొదటిరూపము. పయిఁడి.)

**పైఁడికంటి.** దే. వి. (పైఁడి+కన్ను.) పక్షివిశేషము, కనకాక్షి. విశ. బంగారు చాయకన్నులుగలది. (మొదటిరూపము. పయిఁడికంటి.)

**పైఁడిచూలాలు.** దే. వి భూమి, వసుగర్భ. "తే. అమరిపుష్పా డికుప్పలైయంతకంత, మెట్టదామరపాకులమీఁదజాఱెఁ, బైఁడిచూలాలివేవిల్లుపాయఁదోఁట్ల, కలిమిచెలివెట్టుకల వంటకంబులనఁగ." య. ౪, ఆ,

**పైఁడితామర.** ద్వ. వి. మెట్టతామర, స్థలపద్మిని. (మొదటిరూపము పయిఁడితామర.)

**పైఁడినెలఁత.** దే. వి. లక్ష్మి, ఇందిర. "మ. గెలుపుంబైఁడినెలంతఁగైకొనియెనగ్గింపంజగంబంతయున్." య. ౬, ఆ. (మొదటిరూపము పయిఁడినెలఁత.)

**పైఁడిప్రత్తి.** ద్వ. వి. కార్పాసభేదము. (మొదటిరూపము పయిఁడి ప్రత్తి.)

**పైఁడిముడుచు.** దే. అ. క్రి. నిశ్చితార్థముచేయు. (మొదటిరూపము పయిఁడిముడుచు.)

**పైఁడిముడుపు.** దే. వి. నిశ్చితార్థము. (మొదటిరూపము పయిఁడి ముడుపు.)

**పైఁడిఱేఁడు.** దే. వి. కుబేరుఁడు, ధనాధిపుఁడు. (ఇట్లు పైఁడి దొర, పైఁడిరాయఁడు మొ.) (మొదటిరూపము పయిఁడిఱేఁడు.)

**పైకము.** ఉభ. దే. వి. 1. రెండుకాసులనాణెము; "క. అరపైకంబునుజేయని, హరివాసరమునకుసైనిజాత్మజుఁడునమన్, గరవాలు చేతఁబూనిన, కరశియినుపమొలకుమేడగాల్చుటసుమ్మీ." రుక్మా. ౫, ఆ.—2. ధనము; "సీ. పరవర్తకులకెల్లసరకులిచ్చెదననితివిరిపైకముఁగొనిత్రిప్పుచుండు." భల్లా. 3, ఆ. — 3. సమూహము. (మొదటిరూపము పయికము)—సం. అ. న. పికములసమూహము.

**పైకూటమి.** దే.వి. ఉపరిసురతము. (మొదటిరూపము పయికూటమి.)

**పైకొను.** దే. అ. క్రి. 1. మీఱు; 2. కవియు; "క. దానఁగడు డస్సెనాతని, సేనయరాతులదియెఱిఁగిచెచ్చెరబలసం, తానము తోడంబైకొని, యానరపతిఁజెఱిచిరి." భార. అశ్వ. ౧, ఆ. — 3. యత్నించు; "క. ప్రాణములకెక్కుడగునా, ప్రాణేశ్వరి దోఁచుకొనియెఁబట్టిమదాప్త, ప్రాణులబంధించెనుమ, త్ప్రాణంబులు గొనఁగనెపుడుఁ బైకొనియుండున్." రా. కిష్కిం, కాం.— 4. కలుగు. "క. వినుసత్క్షత్రగ్రహావళి, మునదేశంబులకును శుభమునశుభమునబై, కొనఁదత్పీడలువిబుధులు, గనిశాంతియొనర్ప వలయు గ్రక్కునసఘా." మార్క. ౪, ఆ. (ప్రే. పైకొలుపు. "సీ అడరియింద్రుండుబ్రహ్మాస్త్రంబుఁ బైకొల్పనదిమఁరాంతకు నాభియందుడించె." పా. ౫, ఆ.) (మొదటిరూపము పయికొను. "చ. పయికొనినన్నునిట్లుమరుబారికిలోనుగఁజేయఁబూనియే, నియతియొవట్టిసందియమునీకొనరింపఁగఁబోలుఁగాని." కళా. ౭, ఆ.)

**పైజోఱు.** దే. వి. ముచ్చె. (మొదటిరూపము పయిజోఱు.)

**పైజోఱుమట్టు.** దే. వి. మత్స్యవిశేషము. (మొదటిరూపము పయిజోఱుమట్టు.)

**పైఠ.** సం. వి. అ. స్త్రీ. ఆఁడువారిపైఁట. "శా. లంకాపురీ, పాప గ్రంథికులాంగనాకుచతటీ పైఠాపటగ్రాహబా, హాపాటచ్చర." మరున్నందనశతకము.

**పైఠరము.** సం. విశ. (అ. ఈ. అ.) పిఠరమునందు వండఁబడినది. (పిండివంట.) (చూ. పిఠరము.)

**పైతామహము.** సం. విశ, (అ. ఈ. అ.) పితామహసంబంధమైనది.

**పైతృకము.** సం. విశ. (అ. ఈ. అ.) పితృసంబంధమైనది.

**పైతృష్వసేయుఁడు.** సం. వి. అ. పుం. మేనత్తకొడుకు.

**పైతృష్వస్రీయుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**పైత్తము.** సం. విశ. (అ. ఈ. అ.) పిత్తమువలనఁగలిగినది, (వ్యాధి.)

**పైత్రము.** సం. విశే. (అ. ఆ. అ.) పితృసంబంధమైనది.

**పైద.** దే. వి. పిల్లకాయ. "ఎ, గీ. పసుచుఁబైదవెంటఁబడినొవ్వ నసుచునో." భో. ౪, ఆ. "ఉ. హాళిమనంబునందెరుఁగ నాల యిబిడ్డయిబంటుఁబైదయై, మూలధనార్జనంబు నిలుముంగిలియైగళ దప్పుదర్పతన్, వాలెదువారికెట్టులపవర్గముభర్గముక్తుందుఁడిచ్చెనిం, కేలకళాసమేలజడ లేలకమండలువేలదండముల్." పాండు. ౫, ఆ. (మొదటిరూపము పయిద.)

**పైదలి.** దే. వి. ఆఁడుది. (మొదటిరూపము పయిదలి.)

**పైనము.** వై. వి. పయనముయొక్క రూపాంతరము. "పడమరవెట్ట గాడ్పెదురఁ బైనముసాగని వెల్గుఱేఁడు." చంద్రా. ౨, ఆ. (మొదటిరూపము పయినము.)

**పైపడు.** ద్వి. అ. క్రి. 1. మీఱు; 2. పైకొను, కవియు. "క. ఆపదనమస్తలోకులఁ, బ్రాపించుఁదోలంగునపుడపవనముభంగిన్, బైపడునాపద సైఁచిన, భూపాలాక్షణములోనఁ బొందు శుభంబుల్." రా. ఆర, కాం. ౨, ఆ. (మొదటిరూపము పయిపడు. మీఱుటకు. "ద్వి.. భయమును బ్రియమునుబైపాటుసిగ్గుఁ, బయిపడుచుండనప్పడఁతుకయుండె" రా. యు, కాం.) (చూ. ప్రేపు.)

**పైపాటు.** ద్వి. వి. (పైపడుట.) కవియుట. (మొదటిరూపము పయిపాటు. "బాలసమీరణంబుపయిపాటుననించుకసోఁకినన్." విజ. 3, ఆ.)

**పైపైగ.** దే. ద్రు. క్రి. విశే. (పైపై+కాన్.) సులభముగా. (ఆ తప్పు పైపైగ తేలిపోయినది.) (మొదటిరూపము పయిపయిగ.)

**పైర.** దే. వి. పయరయొక్క రూపాంతరము. (మొదటిరూపము పయిర.)

**పైరము.** దే. వి. ఆవు. (చూ. పేటనఁబెట్టు.) (మొదటిరూపము పయిరము )

**పైరు.** దే. వి. సస్యము. (మొదటిరూపము పయిరు.)

**పైరులయొకిమీఁడు.** దే. వి. చంద్రుఁడు, ఓషధీశుఁడు. (మొదటిరూపము పయిరులయొకిమీఁడు. "వారలాకోఁతిపయిరులయొకిమీనీ బొదివిపల్దెఱఁగులఁబోర." అచ్చ. యు, కాం.)

**పైలుమాను.** హిం. వి. జెట్టివాఁడు.

**పైశాచము.** సం. వి. అ. పుం. నిద్రించియు తాగిమైమఱచియు శీలము సంరక్షింపఁ బరాకుపడియున్నదానిని సంభోగేచ్ఛచే రహస్యముగాఁ జేసికొనువివాహము. (చూ. వివాహము.) (ఇది యధమము.) విశే. పిశాచసంబంధమైనది.

**పైశున్యము.** సం. వి. అ. న. కొండెకానితనము.

**పైసరము.** దే. వి. రతి. (మొదటిరూపము పయిసరము.)

**పైసలా.** హిం. వి. తీర్పు, పరిష్కారము.

## పొ.

**పొ.** దే. విశే. వృత్తియందు పొన్నుశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరములగునపుడును మాగమంబగు. పొంబట్టు, పొంబనఁటి, పొంగట్టు మొ.)—అవ్య. నిశ్చయమునుదెలుపును. "ఆ. తొల్లిసప్తమునులు దుర్భిక్షవేళన, నన్యగతికులగుచుఁబ్రాణధృతికి, శవముఁదినఁగనైన నమ్మతించిరి గాని, యొల్లరైరిపొన్నృపుఁడొసఁగుధనము." పర. ౪, ఆ.

**పొంకపడు.** ద్వి. అ. క్రి. (పొంకము+పడు.) పొందికపడు. (ప్రే. పొంకపఱుచు. "ఇంకఁగావ్యవిశేషముల్పొంకపఱుచు." కా. ౨, ఆ.)

**పొంకము.** దే. వి. పొందిక. "పంకజాతమ్ములపొంకమెడలె." పు. ౧, ఆ.

**పొంకించు.** దే. స. క్రి. పొంకపఱుచు.

**పొంగటినెల.** దే. వి. (పొంగలి+నెల.) మార్గశీర్షమాసము.

**పొంగటిపండుగ.** ద్వి. వి. (పొంగలి + పండుగ.) మకర సంక్రాంతి.

**పొంగట్టు.** ద్వి. వి. (పొన్ను+గట్టు.) హేమాద్రి.

**పొంగరము.** దే. వి. ఒకదినుసుపిండివంట.

**పొంగలి.** దే. వి. పాలుచేర్చిపొంగించునట్టి అన్నము. (దీని భేదములు పప్పుపొంగలి, చక్కెరపొంగలి.)

**పొంగలించు.** దే. అ. క్రి. నిక్కు. "ఆ. పులకలంగమునను బొంగలింప." మై. ౨, ఆ.

**పొంగారు.** దే. అ. క్రి. (పొంగు+ఆరు.) 1. ఉబుకు; "శ్రీ. ఉరవడివర్ధిల్లుచున్నజలంబు చేఁబొంగారిదెసలెల్లమ్రింగికొనుచు." భార. ఆర. ౪, ఆ.—2. సంతోషించు; "క. అనినదమునిని యాదవ, సేనలుపొంగారెనెదురుసేనలుసల్లెన్, మానవతీతతివందిజ, నానూనస్తుతులుసెలఁగెనచ్యుతుమ్రోలన్." ఉ, హరి. 3, ఆ.—3. అతిశయించు; "క. రంగగుతోడవులఁబూఁతల, నంగుఁగసైసి యందునాడెడుతమిచేఁ, బొంగారెడువేడుకతో, సింగారపుఁదోఁట కరిగిచెలువలుఁదానున్." య. 3, ఆ.—4. విజృంభించు; "మత్తకోకిల. ఆ, వీరుఁడున్గదఁజూర్ణితంబుగ వ్రేసెనాసురభంగిఁ బొం, గారిదారుణవజ్రపాతరయంబునన్బటుహస్తుఁడై." భార. ఆర. ౫, ఆ.—5. నిక్కు. "పాలిండ్లుపొంగార." స్వా. ౨, ఆ.

**పొంగిలి.** దే. వి. పక్షులయాహారము. "చ. పులుఁగులఁజూడ మాయెడలబోధముగల్గియుమోహమెట్టిదో, శాలయకయాఁకటన్నలియుచుం జనిపొంగిలి తెచ్చితెచ్చిచం, చులవెడలించుపిల్లలకుఁ జొన్పెడుమక్కువనింతశంకెనే, తలఁపఁగబంధులందువసుధావర మోహము మర్త్యకోటికిన్." మార్క. ౬, ఆ.

**పొంగు.** దే. అ. క్రి. 1. ఉల్బణమగు; 2. సంతోషించు, 3. గర్వించు. వి 1. ఉల్బణము; "చ. అడరుగళాస్రధారలు మహోముఖవాంతసుధాంబుధారలున్, బొడవగువహ్నికీలములుఁ బొంగునుగా." అను. ౧, ఆ.—2. సంతోషము; "ఆ. వానిపొంగుగ్రుంగవాఁడేలవచ్చెను." — 3. గర్వము. (నీపొంగుగ్రుంగ.) "మ. మునువేచేతులుగల్గిక్రొవ్వుదు మహామోహాంధతన్హైహయార్జునుఁడన్రాజునుదీర్ణుఁడైభృగుతనూజుండాజిలోనెవ్విధం, బునఖున్ దెచ్చెనెఱుంగవేయటుల నీపొంగేనడంగింతు." హరి. ఉ. ౮, ఆ.

**పొంగునీళ్లు.** ద్వి. వి. బ. చిట్టుడుకునీళ్లు.

**పొంగుప్రాలు.** దే. వి. బ. ధాన్యవిశేషము.

**పొంచిక.** దే. వి. పొంచు. "మ సప్పంబేపుమైనింకఁబొం, చికనేతెంచుఁబ్రసూతికాలమునువచ్చెన్ గార్యమెట్లుండునో." వంచ. నా. ౧, ఆ. (ఇది పెంచికవంటిది.)

**పొంచు.** దే. అ. క్రి. ఏదేనినుద్దేశించి మఱుఁగుపడి కనిపెట్టియుండు. వి. ఏదేనినుద్దేశించి మఱుఁగుపడి కనుపెట్టియుండుట.

**పొంజు.** దే. స. క్రి. పోఁజోయొక్క రూపాంతరము. "ద్వి. దర్భ, కసవులునన్నంబుగాఁబొంజిపొంజి, ఖినువశయందిచ్చువిశ్వాసమునను." ప్రభు. ౨, ఆ.

**పొంటె.** దే. ద్ర. కొఱకు అను ప్రత్యయార్థమునందువచ్చునది. "మధ్యాక్కర. పయోరుహగర్భుఁ, డురగవిషాసేత జీవసంజీవ నోపదేశంబు, కరుణఁగశ్యపునకునిచ్చె సకలలోకహితంబు పొంటె." భార. ఆది. ౩, ఆ.

**పొంత.** వై. వి. 1. సమీపము; "తే. పురుషుమనసెంతదృఢమైనఁ బువ్వుఁబోఁడి, వికృతిపైకొన్నసెగపొంతవెన్నగాదె." పు ౩, ఆ.—2. తీరము*. "వ. హిరణ్వతియనునదిపొంతవిడిదలగా నియ పించి." భార. ఉద్యో. ౪, ఆ.

**పొంతకడవ.** వై. వి. ప్రొయ్యిదగ్గఱినీళ్లకుండ.

**పొంతకత్తె.** దవ్. వి. (పొంతము+కత్తె.) కుంటెనకత్తె.

**పొంతనము.** దవ్. వి. (పొందు+తనము.) గ్రహమైత్రి. "తే. ఆతఁడునుబొంతనములెల్లనరసిలెస్స, యున్నదనిపల్కియారేయి యొక్కలగ్న, మేర్పఱిచియిరుగుపొరుగునెఱుఁగఁ జుడఁ, దనతనూ భవనతనికిదారవోసె." శుక. ౩, ఆ. (స్వార్థమున తనము.)

**పొంతము.** దే. వి. పొందు, స్నేహము. "ధర్మసూతితోఁబొంతము మేలు." సం. "సాధుమన్యేపాండవైస్సహసంగతమ్." భార. ఉద్యో. ౩, ఆ.

**పొందిక.** దే. వి. 1. పొంకము; (మాట పొందికగాలేదు.) 2. చేరిక; "శ్రీతాకాంతమునిస్త్రీలపొందికలమరగి." రామా. ౫, ఆ.—3. కల యిక. "క. పొందికకుఁదగినయువతిని." రామా. ౫, ఆ.

**పొందు.** దే. అ. క్రి. (కన్ను) వాలు. "ఆ. కడుపునిండఁగుడువఁగానమిరేయెల్లఁ, గన్నుపొందకున్నఁగరముడస్సి, యున్నవాఁడ." భార. ఆది. ౬, ఆ.—స. క్రి. 1. ప్రాపించు; (చూ. తలపెట్టు.) 2. కలయు. వి. 1. పొందిక; "మాటపొందెఱింగి." భార. ఉద్యో. ౧, ఆ.—2. స్నేహము; "తే. ఎట్లు, పుడమితేనికినీకును బొందుబెరసె." అచ్చ. సుం, కాం.—3. సంధి; (చూ. పడు.) 4. ప్రాప్తి; "మ. జలచారస్తబ్ధరోమత్వకే, నరితల్పొందవతార దంభముననాచ్ఛాదించుఁదాఁబ్రొధిమన్." ఆము. ౫, ఆ.—5. అభేదము; "అహోకొందఱిపొందెఱుంగరు." ఉ, హరి. ౩, ఆ.—6. అనుకూల్యము. "సీ. రాజునాజ్ఞలమంత్రరక్షోబలంబున రాఁబొందుగాదయ్యె రాక్షసునకు." నై. ౪, ఆ.—విణ. స్నేహితుఁడు. "చ. కళలకునిమ్మయొమ్మెసెకకంటికిమింటికిఁజెన్నువెన్నతో, య్యలిసయిదోడుకూడుదివిజాళికిహేళికి జంటతుంటవిల్, గలదొర పొందువిందువిరిగల్వకుఁజల్వకునిక్కరిక్కలే, వెలఁదులనీవిబాని రుచి వీచికిఁబ్రాచికివచ్చెఁజెచ్చెరన్." హంస. ౧, ఆ.

**పొందుకాఁడు.** దే. విణ. స్నేహితుఁడు. "ఆ. ఎల్లతనువులందు నిరవొందుతనతోడఁ, బొందుసేసినట్టిపొందుకాని, పొందువొంద లేఁడుపురుషుండుగుణముదా, గుణినిబోలునట్టిగుణిభజింతు." భాగ. ౬, స్కం.

**పొందుకొను.** దే. అ. క్రి. నెలకొను. "క. మందవినర్పిఃశియ ననా, నందముతోఁజీరపేను నరపతిశయ్యన్, బొందుకొనిపెద్దగాలం, బెందునుబోకచొటనుండునిష్టమెలర్పన్." పంచ నా. ౧, ఆ.

**పొందుపడు.** దవ్. అ. క్రి. సరిపడు, అనుకూలించు. "సఖ్యం బైననాతోనపొందుపడున్." రా. యు, కాం.

**పొందుపాటు.** దవ్. వి. సరిపడుట, అనుకూలించుట.

**పొంపిరి.** దే. వి. సాంద్రత. "చ. ఉరుతరమైనవేదనకుహోర్వక భీకరమైనవక్త్రగ, హ్వరమురయంబునందెఱవవారిభీకరనక్రకూర్మద, ర్దురనముపేశమైజలముదొట్టుచువచ్చినవాతనిం చెఁబొం, పిరిదగ వాయునందనుఁడు ప్రేవులప్రోవులముద్దఁజెచ్చెరన్." రా. యు, కాం.—విణ. సాంద్రము. "చ. జలజభవాండమొప్పెఁగలశంబు విధంబుననందులోనను, జ్వలమగుచంద్రికాపటలినన్నుతికెక్కెఁ బయఃప్రపూర్ణమై, లలితకలాకలాపసదలంకృతచారుసుధామరీచి యిం, పులగనియైతనర్చెఁబయిఁబొంపిరిగట్టనమీఁగడోయనన్." (పొంపిరి - పొంపిరిగానని యర్థము.) భో. ౪, ఆ.

**పొంపిరివోవు.** దే. అ. క్రి. (పొంపిరి + పోవు.) 1. అతి శయించు; "గాడ్పునకును నెక్కుడైజవముపొంపిరివోయెడు దాని." భార. ఆర. 2, ఆ.—2. వర్ధిల్లు; (చూ. దట్టుఁడు.)— 3. వ్యాపించు; "త్రిజగంబులంబొగడుపొంపిరివోవ." నిర్వ. 3, ఆ.—4 పుట్టు; "క. పొంపిరివోయెడుతనయను, కంపాతి శయమునఁబజ్జికంధరునెట్లుం, జంపఁగఁజాలకరోషము, పెంపునఁ గారాగృహమునఁ బెట్టఁగఁబనిచెన్." నిర్వ. ౨, ఆ.—5. సంతో షించు; "క. మరలవిడిసిగెలుపునఁబొం, పిరివోవుచులంకఁదలఁచి పెనుపొసరఁజమూ, వరులఁబిలిపించిపోదమె, పురమునకనిచెప్పె దనుజపుంగవుఁడెలమిన్." నిర్వ. ౫, ఆ.—6. విజృంభించు; "వ. వివిధదేశాధీశులునాతోడిసుఖదుఃఖంబులకియ్యకొనియగ్గలిక మైసగ్గినైననుఱుకనుసముద్రంబైనసీఁదనుదెంపుసేసి పొంపిరి వోవు చున్నవారు." భార. ఉద్యో. ౩, ఆ.—7. ప్రసిద్ధికెక్కు. "ఉ. భూరినియుద్ధకౌశలతఁ బొంపిరివోయివెలుంగుచున్నచా, ణూరుని ముష్టికుంభినిచి." వి, పు. ౨, ఆ.

**పొంపు.** దే. వి. 1. మెడవెనుకటిభాగము; (మెడపొంపు.) 2 ఒప్పు. "ఆ. పొదలఁదూఱువారుఁబుట్టలమాటున, నీఁగువారుఁబరువులెత్తువారుఁ, ద్రెళ్లువారుబొబ్బరించువారునునేలఁ, బొరలువారునైరిపొంపుదఱిఁగి." అచ్చ. యు, కాం. (దీని కీయర్థ మునం దీగ్రంథకర్తప్రయోగములే కనఁబడుచున్నవి.)

**పొంపెసలారు.** దే. అ. క్రి. (పొంపు+ఎసలారు.) ఒప్పగు. "క. కాటుక, పొక్కుడుచందముననింగిపొంపెసలారెన్." షో. ౫, ఆ. (దీనికీ ప్రయోగమొక్కటే కానఁబడుచున్నది.)

**పొకారు.** దే. అ. క్రి. నాశమగు. (పోకారుయొక్కరూపాం తరము.)

**పొకారుచు.** దే. ప్రే. పొకారఁజేయు, నాశముచేయు. "ఉ. కానకకన్నమాసుతుఁబొకారిచియిన్నియుమిథ్యచేసితే." రామా. ౩, ఆ. (పోకారుచుయొక్కరూపాంతరము.)

**పొకాలు.** దే. అ. క్రి. 1. వెడలు; "శా. బ్రాహ్మణ్యమింకో హోచాలుఁబొకాలిపోయెదరొపోరోనోటిక్రొవ్వేటికిన్." (మీఁద "క. వారుసురుమనివెడలిపోయిరి.") స్వా. ౬, ఆ.—2. పోవు. "చ. కరినిభయానతోనిదెపొకాలెదమిన్నులువడ్డచోటికిన్." కాశీ. ౩, ఆ. "అనపత్యతవంకనూర్ధ్వలోకమ్ములులేకపోయినఁ బొకాలఁగ నిమ్ము." జై. ౨, ఆ. (పోకాలుయొక్కరూపాంతరము.) (ఇది కోప దుఃఖకాలములయందుపయోగపడెడు మాట.)

**పొక్కలి.** దే. వి. 1. ఎత్తుడుప్రొయ్యి; 2. మూడురాళ్లుపెట్టిన ప్రొయ్యి.

**పొక్కి.** దే. వి. 1. గుఱుతు; "సీ. ఏతెంతుననిపొక్కియిడిపోయి మత్తాళి చూడనాకడఁదొంగి చూడవైతి." పంచ. వేం. 3, ఆ.— 2. ఉపాయము.

**పొక్కిలి.** దే. వి. 1. బొడ్డు; 2. గుంట. "చ. వనితకుచాద్రు లంబొడమివాటపుఁబొక్కిలినిండి యుబ్బిజాల్, గొనికటిచక్ర మూని మెఱుఁగుందొడలైబిరివాసివచ్చునూ, తనకిరణామృతౌఘముల దండహలాంకపదోత్థితంబులై, మనునుడివోనిగర్భకలమంబులుగా వెలతొంగిజంఘికల్." వసు. ౩, ఆ. (ఇది రెండర్థములకు నుదా హరణము.)

**పొక్కిలిచూలి.** దే. వి. బ్రహ్మ, నాభిజన్ముఁడు.

పొక్కు. దే. అ. క్రి. 1. దుఃఖించు; "ఉ. తెక్కలురావుపిల్లలకు తేపటనుండియుమేఁతగాననుక్, బొక్కెడుఁ గూఁటిలో." భాగ. ౭, స్కం. — 2. బొబ్బలేచు; "వ్రేళులపుటంబులు పొక్కఁ దొడంగె." భార. విరా. ౧, ఆ.—3. ఉలుకు. "క. కక్కుటితి కాఁడుకార్యము, చక్కటియెఱుఁగండుసందెజామునఁ దడుక్; బొక్కిపడనీవుకోఅల, నొక్కినలమీఁదనుండనొప్పగుఁ జుమ్మీ." పంచ. నా. ౧, ఆ.—వి. 1. దుఃఖము; "ఆ. కడుపుపొక్కు మాన్పికావవయ్య." భాగ. ౮, స్కం.—2. బొబ్బ; 3. ఎండి లేచినపెల్ల; "పలకపొక్కు."— 4. జనక్షుత్రివిశేషము.

పొక్కుడు. దే. వి. ఎండిలేచినపెల్ల, పొక్కు. (చూ. పొంపె నలూరు.)

పొగ. దే. వి. ధూమము.

పొగకన్ను. దే. వి. అగ్నిజనించినశివునిఫాలనేత్రము. "సీ. పులి తోలుచిత్రంపువలిపదుప్పటిఁ జేసిపొగకన్నుకస్తూరిబొట్టుఁజేసి." భల్లా. ౪, ఆ.

పొగకట్టు. దే. వి. ఇంటిపైకప్పునందులయందు పొగచేతచుట్టఁబడి కట్టువలెఁగనఁబడు సూర్యకిరణము.

పొగగూఁడు. దే. వి. ఇంటికప్పునందు పొగపోవుటకేర్పఱచిన సందు.

పొగచు. దే. ప్రే. (పొగయఁజేయు.) 1. పొగయించు; "సీ. అగరుధూపము వెట్టియాభ్యంతరంబైనగగనావకాశంబుఁబొగచువారు." నై. ౬, ఆ.—2. సాతాళించు. "చ. వలపులుగ్రమ్మఁగాఁ బొగచివండినకూరపుఁగాయగూరలు." ఉ. రా. ౫, ఆ.

పొగచుట్ట. దే. వి. పొగాకుచుట్ట.

పొగచూరు. దే. అ. క్రి. పొగపట్టు. "సీ. కనకవర్ణుండైనకైటభాసురవైరిపొగచూరినల్లనై బొగ్గువడియె." భీ. ౪, ఆ.

పొగచెట్టు. దే. వి. పొగాకుచెట్టు, ధూమ్రపత్రిక.

పొగడ. వై. వి. (చూ. వకుళము.) (చూ. పొగడు.)

పొగడిక. దే. వి. పొగడు, స్తుతి, స్తోత్రము.

పొగడికోలు. దే. వి. పొగడికొనుట. "తే. అన్యకీర్తనంబునన్య నిందయుఁదన్నుఁ, బరఁగఁబొగడికోలుఁ బ్రబ్బికోలు, నాపగాత నూజయార్యవృత్తములుగా, వనరిబీనినారుల్గలైనమునులు." సం. "ఆత్మనిందాత్మపూజాచపరనిందాపరస్తవః." భార. సభా. ౨, ఆ.

పొగడిత. దే. వి. 1. స్తుతి; 2. కీర్తి. "క. జగములనెల్లనునిండిన, పొగడితఁగడువెలితిచేసిపొల్లయొడలికిక్, దగునేజన్నవ్రతములు దగవిడువఁగనేడునాకుఁద్రిభువనదీపా." సం. "నమేకీర్తిః ప్రణశ్యేతత్రిషులోకేషువిశ్రుతా." భార. అర. ౭, ఆ.

పొగడు. దే. స. క్రి. స్తుతించు. "తే. పొగడఁదగువానిఁగానరే పొగడలూర." భాగ. ౧౦, స్కం. పూ. — వి. స్తుతి. (చూ. తెగడు.)

పొగడ్త. దే. వి. 1. స్తుతించుట; "చ. దోర్బలవిదితుండు కుంభజుఁడుబాలునినొక్కరుఁ జంచలాత్మువెం, గలిఁగడుఁబెద్దఁ జేయుచుఁ బొగడ్తకుఁజొచ్చె." భార. ద్రో. ౨, ఆ.—2. స్తుతి; "గరుడునికాంతికిక్ హరిపొగడ్తయొనర్చు." ఉ. హరి. ౬, ఆ. — 3. కీర్తి "తే. ధరణిఁబరఁగుఁబొగడ్తయెంతదాఁకనంత, కాల మునుబుణ్యలోకంబుగల్గునంద్రు." సం. "యావత్కీర్తిర్మనుష్యస్య పుణ్యలోకేషుగీయతే." భార. ఉద్యో. ౨, ఆ. (పొగడితయొక్కరూపాంతరము.)

పొగడ్తపడు. దే. అ. క్రి. (పొగడ్త+పడు.) స్తుతింపఁబడు. "అఖండితశౌర్యమునస్తప్రైర్యముక్ ఘుజబలముక్ బొగడ్తపడ." భార. భీష్మ. ౨, ఆ.

పొగపు. దే. ప్రే. సాతాళించు. "వండినచొప్పనుంబొగపువాసనయుక్." భీ. ౨, ఆ. ["తేనియక్ బొగపినపప్పులుక్ బొగడి." (ఇక్కడ పొగపిన అనఁగా పక్వముచేసిన అని యర్థము.) పాండు. ౧, ఆ.]

పొగబాణము. మి. వి. ఒకదినుసుబాణపుసంచు.

పొగయు. దే. అ. క్రి. 1. పొగగలదియగు; 2. కుములు. "క. జ్ఞాతులుతమలోఁబొందినఁ; జేతో మోదమునఁ జెలఁగిచెలువొందు దుర, న్నీతింబాసినవిగతని, భూతింగడకొలఁపులట్లపొగయుదురధిపా." భార. ఉద్యో. ౨, ఆ.

పొగరు. దే. వి. 1. గర్వము; 2. దైర్ఘ్యము; "అగరుధూపపుఁ బొగల్ పొగరారుకురులుగా." రామా. ౬, ఆ. — 3. తీక్ష్ణగంధము.

పొగరుఁబోతు. దే. విఀ. (పొగరు+పోతు.) గర్వశీలుఁడు.

పొగాకు. దే. వి. (పొగ+ఆకు.) ధూమ్రపత్రము.

పొగులు. దే. అ. క్రి. 1. పరితపించు; "తే. పొరలుఁగెరలు వియోగాగ్నిఁబొగులునొగులు." రామా. ౫, ఆ.—2. కుములు, "ఆ. పొగిలిపొగిలికాలుమగువదేహంబున, నగరుపరిమళము పొగలువెడలె." భాగ. ౧౦, స్కం. పూ.

పొచ్చెము. దే. వి. 1. న్యూనత; "దీననేపొచ్చెమునొచ్చెముం జొరదు." పాండు. ౨, ఆ. — 2. కపటము. "ఉ. పొచ్చెము లేనినెయ్యమునఁ బూనివిపద్దశనొందకుండఁగా, నెచ్చెలిఁగావఁజూచు మహనీయునికిట్టిదకాలము." భార. శల్య. ౧, ఆ. "చ. పురుష వరేణ్య యేలయిటుపొచ్చెపుమాటలనన్నొఅంగెదు." హరి. పూ. ౨, ఆ. "చ. ఉదరమునందు విశ్వమునున్నది వెల్పలకూన్య మిమ్మెయిక్, బొదలినమట్లెయాకుపయిఁబొచ్చెపు బాలుఁడవైనినో దనం, పదవిలజిల్లెదు." హరి. ఉ. ౯, ఆ. — విశ. న్యూనము. "క. ఇచ్చటిబంధులునీవును, నచ్చెరుపడివినుచునుండనయిదూళ్లు నుమా, కిచ్చినచాలునంటిని, బొచ్చెముకాదింతవట్టుఁబూర్ణము సుమ్మీ." భార. ఉద్యో. 3, ఆ.

పోట. వై. వి. దొప్ప. (ఆకుపోట.)

పోటకరించు. దే. అ. క్రి. 1. అతిశయించు; "ఆ. గంధకరటి నూత్నకమలంబుఁబోలెన, ప్పురుషుఁడలనలీలపోటకరింపఁ, ద్రుంచెనః స్వరించిపంచమవదనంబుఁ, బ్రఖరదీర్ఘహస్తనఖరధార." కాశీ. ౫, ఆ. — 2. వర్ధిల్లు. "తే. విశ్వగర్భుఁడుతనగర్భవివరమందుఁ, బూఁటపూఁటకుఁబూర్ణుఁడై పోటకరింప, వ్రేఁకఁజూలాలితనమున వేల్పుఁబెద్ద, పొలఁతికంతటనీల్గాడుప్రొద్దులయ్యె." భాగ. ౮, స్కం.

పోటకఱ. దే. వి. పోట్లకఱ్ఱయొక్కరూపాంతరము. "క. వనజదళో యతనవలో, చనచరణములాత్మజాతశాలేయములో, టనోకోయప్ప ట్టులరా, జనపుఁబోటకఱలునెగడెజంఘలపేరక్." చంద్ర.

పోటకత్తి. దే. వి.________పై.________"చ. కఱకరిరాజనంపుఁబోట కత్తులనెల్లఁదృణీకరించుచుక్." భాను. ౨, ఆ.

పోటపోట. దే. వి. రాలుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (రాలుటయందు. — "కనుఁగ్రేవనిప్పుకల్ పోటపోటరాల." భాగ. ౯, స్కం.—పడుటయందు.—"సీ. కణఁతలెల్లనుగాతుకఁఅఁగిడిక్కరు లకుఁబోటపోటఁగన్నీరు బొట్లుపడియె." రామా. ౮, ఆ.—ఖరి

యుటయందు. — (చూ. లొటలొట.) పొడముటయందు. "ద్వి. పొటపొటఁజెమటమైఁబొడమ." హరిశ్చ. ౧, భా.)

**పొటమరించు** దే. అ. క్రి. 1. బొబ్బలొనగునదిలేచు; 2. చిగురులొనగునదిపుట్టు (రూ. పొటమరిల్లు, పొటమరిలు )

**పొటము.** యు. దే. అ. క్రి. పుట్టు. "క. నటనాహంకృతిఁదనులోఁ, జిటపొటజగడంబులూర్వశీరంభలకున్, బొటమిన మేలేర్ప ఱుపఁగ, నిటమిమురక్షించెనిర్జరేశ్వరుఁడధిపా." విక్ర. ౨, ఆ. (పొడముయొక్క రూపాంతరము.) వై. నాసాపుటము. "ద్వి. పొటములతోముక్కు బోసిపోఁగఱచి." రా. యు, కాం.

**పొటి.** వై. విశ. పొట్టియొక్క రూపాంతరము.

**పొటిపొటి.** వై. విశ. అల్పము. "క. అటులేనియుఁజెప్పెదనీ, పొటిపొటితలపోఁతలెల్లఁబోవనడువుమా, రటముడుగునెమ్మనమునొ, క్కటిగానొసరించిగట్టిగావినుమధిపా." పాండు. ౫, ఆ.

**పొటుకు.** దే. వి. 1. చెట్టుమీఁదనుండి వానచినుకులు పడుటయందగు ధ్వన్యనుకరణము; 2. ప్రొద్దుపొడుచుటయందున, క్రుఁకుటయందునగు అనుకరణము. (ప్రొద్దుపొడుచుటయందు.—(చూ. పొటుక్కు.) క్రుంకుటయందు. "అంతఁబ్రొద్దుపొటుకునఁగ్రుంకెన్." సా. 3, ఆ.)

**పొటుక్కు.** దే. వి. పొటుకుయొక్క రూపాంతరము. (ప్రొద్దు పొడుచుటయందు. "ఉ. ప్రొద్దుపొటుక్కునంబొడుపుభూధర కూటములెక్కి డిగ్గుచున్." కాళ. ౪, ఆ.)

**పొటేలు.** దే. వి. పొట్టేలుయొక్క రూపాంతరము. "చ. గొటియలమేఁకపోతులనగొమ్ముపొటేళ్లనుగోడిపుంజులన్." చాటుపద్యము.

**పొట్ట.** దే. వి. 1. కడుపు; 2. వరిపొట్ట.

**పొట్టకఱ.** దే. వి. పొట్టకఱ్ఱయొక్క రూపాంతరము.

**పొట్టకఱుకు.** దే. వి. ఎన్నుపొట్టపట్టుపరువము.

**పొట్టకఱ్ఱ.** దే. వి. బయటికిరాక లోపలబలిసియుండు ఎన్ను, కలమగర్భము.

**పొట్టపట్టెడ.** దే. వి. టంగువాఱు.

**పొట్టపెంజెర.** దే. వి. ఒకదినుసుపెంజెర.

**పొట్టము.** దే. వి. గోఁచి, కౌపీనము.

**పొట్టకూటివాఁడు.** దే. విశ. (పొట్టకూడు+వాఁడు.) కడుపుకూటికిపనిచేయువాఁడు.

**పొట్టకూడు.** దే. వి. జీతముమాఱుగా పొట్టకుపెట్టెడు అన్నము, కడుపుకూడు.

**పొట్టక్రొవ్వు.** దే. వి. ఆహారమువలనఁగలిగినమదము.

**పొట్టపోసికొను.** దే. అ. క్రి. మానావమానములెంచక కడుపు నించుకొను.

**పొట్టవాఁడు.** దే. విశ. బొజ్జకడుపువాఁడు.

**పొట్టి.** వై. విశ. వామనుఁడు, వామనము.

**పొట్టింపుచీరణము.** దే. వి. ఒకదినుసుచిన్నచీరణము.

**పొట్టికాఁకర.** వై. వి. పొట్టికాయలుగలకాఁకర, కర్కోటము.

**పొట్టిపిట్ట.** వై. వి. పక్షివిశేషము.

**పొట్టియ.** దే. వి. తేలు, వృశ్చికము. "తే. అగ్గిఁబడఁబోవుపొట్టియనమరఁబట్టి, మనువఁబూనావునీఁగుట్టకమానఁగలదె." అచ్చ. యు, కాం.

**పొట్టు.** దే. వి. 1. ఊక; 2. కాయధాన్యముమీఁదితోలు.

**పొట్టుపొరలగు.** దే. అ. క్రి. పీడితమగు. "వ. పునర్జన్మంబు కలదులేదనుసంశయంబుతోఁబొట్టుపొరలగుదురునరులు." భార. అను. ౫, ఆ.

**పొట్టెలు.** దే. వి. పొట్టేలుయొక్క రూపాంతరము.

**పొట్టేలు.** దే. వి. గొఱ్ఱెపోతు, మేషము.

**పొట్రేను.** ద్వి. వి. (పొట్టి+రేను.) ఒకదినుసుచెట్టు.

**పొట్లు.** వై. వి. ఒకానొకతీఁగ, పటోలిక. (దీనిభేదములు.—గుజ్జుపొట్ల, చేఁతిపొట్ల.)

**పొట్లపూరిక్క.** వై. వి. పుష్యమీనక్షత్రము.

**పొట్లపూరిక్కనెల.** ద్వి. వి. పుష్యమాసము.

**పొట్లము.** వై. వి. 1. పువ్వులుమొదలగువానిని ఆకులులోనగు వానియందుంచి మడిచినమూట; 2. కుంపు*. "ఆ. అట్లు పఱచువారిఁబొట్లముగామర, లించి." అచ్చ. యు, కాం.— 3. సేన*. "క. అఱిమురిసెపొట్లముతను, గిఱికొనికొలువంగ సరిగ." అచ్చ. కిష్కి, కాం.

**పొట్లు.** దే. అ. క్రి. పాఁచిపట్టు. (అప్ర.)

**పొడ.** దే. వి. 1. రూపు; "క. ఇవ్విధమునసేధర్మము, నెవ్వలఁబొడలేకపోవనేమనిచెప్పన్, బువ్వులుపాములుమొదలుగఁ, గ్రొవ్వునఁగఁగ నెందుఁబరఁగికొనికాఁచించున్." హరి. ఉ. ౯, ఆ. — 2. చూపు; "పొడలేకభూతములుపొలెన్." రా. యు, కాం.—3. దేహమునందుపెద్దబొట్టుగాఁగనఁబడురేఖ. "చ. అడవికివేఁటమైనరిగియాతఁడొకానొకనాఁడొకింతయున్, మెడమలఁగింపలేకతనమేపొడలొండునురెండునేకమై, పొడమఁగబీదకన్నువడిబూడిదపండునుబోలెబూదుపా, రెడునొకదుప్పికింగవియఁ బ్రేలిభయజ్వరతప్తచిత్తమై." పాండు. ౫, ఆ.

**పొడక.** దే. వి. పొడకకుమొదటిరూపము.

**పొడకట్టు.** దే. అ. క్రి. 1. కనఁబడు; "పెన్నిధిగతిన్ బ్రతికన్ బొడకట్టేనేల్పుఁదొయ్యలి." సా. ౬, ఆ.—2. ప్రత్యక్షమగు. "ద్వి. ప్రాణినాశముసకుభయపడినిమ్ముఁ, బూనియుంచితినీకు పొడకట్టినంత, నెప్పటియట్లరహించెలోకంబులు." విష్ణు. పూ. 3, ఆ.

**పొడగను.** దే. స. క్రి. (పొడ+కను.) చూచు. "క. కడకంటిచూడ్కిదళముఖుఁ, బొడగని." నిర్వ. ౭, ఆ. (ప్రే. పొడగనిపించు. "క. నుడువులపడఁతుకనుగనికిఁ, బొడచూపనితనదురూపుఁ బొడగనిపించెన్, జడనిధిశయనుఁడుకొంగున, ముడిచినమణిగాదె భక్తముఖ్యులకెల్లన్." పాండు. ౨, ఆ.)

**పొడగాంచు.** దే. స. క్రి. (పొడ+కాంచు.)———ప్రై.——— "వ. యశోదానందనులంబొడగాంచి." వి, పు. ౭, ఆ.

**పొడగానుపు.** దే. వి. పొడగనుట, దర్శనము. (రూ. పొడగాన్పు. "తే. కౌరవోత్తమయనఘునీకుతనమాకు, జలజలోచనుపొడగాన్పుసంభవించె, నట్లుగాకున్నమముబోంట్లకమ్మహాత్ము, దర్శనముకల్గునేధరాస్థలిఁదలంప." శేష. 3, ఆ.)

**పొడచూచు.** ద్వి. స. క్రి. పొడగాంచు. "క. నాతోడిప్రేముడింగడు, నాతురయైయెదుగుసూచనంబకుఁజేతః, ప్రీతిగఁజనియా యమఁబొడ, చూతుంబోనీఁగదేవివిశుద్ధచరిత్రా." భార. విరా. ౪, ఆ.

**పొడచూపు.** ద్వి. అ. క్రి. 1. కనఁబడు; "తే. పన్నగాధీశభోగతల్పంబుమీఁదఁ, దక్షణారత్నదీప్తిమైతళుకుఁజూపఁ బాల్కమున్నీ

టిలోఁ ద్రమేలుకొన్న, హరికిఁబొడచూపనెత్తె చెహరిహయుండు." షే. ౪, ఆ. — 2. ప్రత్యక్షమగు. "నాకస్మైఁబొడచూపెఁదాను గృపతోనాడంథు." భార. అర. ౪, ఆ

**పొడతెంచు.** దే. అ. క్రి. 1. ఉదయించు; "తే. లలితకాశ్మీర భవసమాలపనకర్మ, పాటలంబైననీముఖాబ్జంబుతోడ, నోరయుఁగాక భవత్కేళి యోగ్యమైన, పొడుపుగుబ్బలిఁ, బొడతెంచుపూర్ణ విధుఁడు." నై. ౫, ఆ. — 2. పుట్టు. "పులకంబులతోఁబొడ తెంచెఁగంపముల్." ఉ, హరి. ౫, ఆ.

**పొడదామర.** దే. వి. 1. మండలాకారకుష్ఠము; 2. ఒకదినుసు పచ్చాకు.

**పొడనీడ.** దే. వి. సందులగుండతోఁచి పొడపొడగానేర్పడునీడ "క. మిసుతగమికవియుతఱచునఁ, బొడనీడలునెండలునియప్రో వులుగలయం, బుడమిందిలతండులగతిఁ, బడఁగానుడుపీథిసండి పఱచిరిపెలుచన్." రా. యు, కాం.

**పొడపత్రి.** ద్వ. వి. ఒకానొకచెట్టు.

**పొడము.** దే. అ. క్రి. పుట్టు, జనించు. (చూ. పొడమూడవ యర్థము.)

**పొడయెండ.** దే. వి. (పొడ+ఎండ.) సందులగుండతోఁచి పొడ పొడగానేర్పడు ఎండ. "వ. పొడయెండయుఁ బొలయనీక కేత నంబులుగట్టించి." రా. యు, కాం.

**పొడలమెకము.** ద్వ. వి. దుప్పి, చమూరువు.

**పొడవడఁగు.** దే. అ. క్రి. (పొడవు+అడఁగు.) 1. చెడు; "వ. పొడవడంగినపల్లంబులును." కళా. ౭, ఆ.—2. చేచ్చు. "వ. అట్లుయమునమడుపునంబడినహంసుండుపొడవడంగుటసకల గంధర్వులుహరినామకీర్తనంబునగీతంబులొనర్చిరి." ఉ, హరి. ౪, ఆ.

**పొడవడఁచు.** దే. ప్రే. (పొడవడఁగఁజేయు.) 1. చెఱుచు; "క. అవమానితులగుధరణీ, దివిజులు కోపాగ్నిశిఖలదీపించిమహా, ద్రివనద్వీపంబులతో, నవనినయినఁబొడవడంతురప్రతికారుల్." భార. అర. ౫, ఆ.—2. చేంపు.

**పొడవడు.** ద్వ. అ. క్రి. (పొడ+పడు.) కనఁబడు. "సీ. అహూ తులైనమహామునీశ్వరులచేఁ బొడవడదయ్యెభూభువనతలము."పా. ౫, ఆ.

**పొడవు.** దే. వి. రూపు. "క. పదునాలుగు లోకంబులుఁ, బొద లింపం ద్రుంపవలసి పొడవులు రెండై, తుదిఁదారొక్కటియగు దురు, వదరలఁజేయుదురుభేదవాదులనెల్లన్." ఉ. హరి. ౨, ఆ.

**పొడవుసూపు.** ద్వ. అ. క్రి. (పొడవు+చూపు.) 1. ప్రత్యక్ష మగు; (చూ. పొడుపు.) 2. కనఁబడు.

**పొడసుత్తె.** దే. వి. చిన్నసుత్తె.

**పొడి.** దే. వి. చూర్ణము. విణ. ఎండినది. (పొడిగుడ్డ.)

**పొడిగొట్టు.** దే. స. క్రి. (పొడి+కొట్టు.) చేనియందలి చెట్లు కొట్టు.

**పొడిచీఁకటి.** దే. వి. మసమసకనిచీఁకటి, అవతమసము. "క. అట్లుపొడిచీఁకటిన, పోఁరఁబడ సైంధవునినరు, చారిఁబటిచితి." భార. శల్య. ౨, ఆ.

**పొడిసేయు.** ద్వ. స. క్రి. (పొడి+చేయు.) చూర్ణముచేయు. "భీముండు కౌరవవ్యూహంబున్ బొడిసేయుచుఁజేర్చెన్." భా. భీష్మ. ౨, ఆ.

**పొడుగు.** దే. అ. క్రి. 1. ఉన్నతమగు; 2. వర్ధిల్లు. వి. 1. మీఁదు, (చూ. పొడుగుమడుగు.) 2. ఉన్నతి; 3. ఎత్తు. విణ. 1. ఉన్నతము; 2. ఉత్కృష్టము. (చూ. పొడువు.)

**పొడుగుమడుఁగు.** దే వి. ఆకాశగంగ. (చూ. తొడుగు.)

**పొడుచు.** దే. అ. క్రి. 1. పోట్లాడు; "సీ. సమకట్టిసైన్యంబు సైన్యంబుతోనొంటెఁదొడరిమీముప్పరతోడనొండె, నిద్దఱతోనొండె నెక్కటియొక్కనితోనొండెఁబొడిచెదదోర్బలమున." సం. "సై న్యససైన్యంవ్యూఢేన ఏక ఏకేనవాపునః, ద్వాభ్యాంత్రిభిర్వాయో త్స్యేహంయుగపత్పృథగేవవా." భార. సభా. ౧, ఆ. (ఇది కయ్యము. మేడము అను శబ్దములతోఁజేరివచ్చునపుడు చేయు అను నర్థమునిచ్చుచున్నది. "తే. అధిపసీతనయుండుగయ్యంబువొడు చుఁ, దెంపువదలకవిభవంబుపెంపుమెఱయ." భార. భీష్మ. ౧, ఆ. "పొడుతునెట్లుఁబాండుపుత్రులతోఁగయ్యమేను." భార. శల్య. ౧, ఆ.) — 2. ఉదయించు. "క. తరణివొడిచితమము చెఱుచు, కరణిని." సం. "ఉదయన్వాయథాసూర్యోనాశ యంత్యశుభంతమః." భార. శాం. ౨, ఆ. "సీ. పడియుండి వాఁడిలఁబొడిచినచఁదురుక్రియఁదత్తలములెలింగింపకున్నె."భార. ద్రో. ౨, ఆ.—స. క్రి. 1. పిడికిలిలోనగువానితోగ్రుమ్ము; "సీ. తెగిగతిలేనిపోటుగనొడ్లనద్దలగిద్దలఁబొడుచువేగినబిగాది." పంచ. వేం. ౧, ఆ. — 2. బల్లెములోనగువానితోగ్రుచ్చు; 3. వ్రేయు; "ఆ. వానిమస్తకంబువ్రయ్యఁగవడిగదఁ, బొడిచెరుధిరవారిపూర మొలుక." భార. అర. ౧, ఆ.—4. కుట్టు; "ఆ. మేలుకొలుపు చున్నమెల్లననించుక, పొరలిచిన్ననల్లిపొడిచెనంచు." అచ్చ. యు, కాం. — 5. (ఆన) పెట్టు. "క. వెడదెరువులిచటఁజెల్లవు, పుడమినహహదొంగలానవొడిచినఁగోకల్, విడుతురె." కళా. 3, ఆ.

**పొడుపు.** దే. వి. 1. పొడుచేట; (పొడుపుమాట.) 2. ఉద యము; "తే. ప్రొద్దు, పొడుపునకుమున్న వెడలించెఁబురము సకల, జనములనుజీవధనములసరకునతఁడు." భార. మా. ౧, ఆ. "ఎ, గీ. వినుమునీకీర్తినీభుజానివ్రతకృపాణి, నీకరమునీరుచియ కానినెఱయఁగాదు, విధుపొడుపుగాదుపవిగాదువేల్పుమ్రాను, కాదు రవిబింబమోబభూకాంతునరస." కా. ౫, ఆ.—3. పోటు.

**పొడుపుఁగొండ.** ద్వ. వి. (పొడుపు+కొండ.) ఉదయాద్రి. "ఉ. కోమలధాముఁడైపొడుపుఁగొండకినుండుకిరీటమయ్యె." రామా. ౭, ఆ.

**పొడుము.** దే. వి. పొడి, చూర్ణము.

**పొడువ.** దే. విణ. (పొడుచువాఁడు.) దుర్జనుఁడు. "ఆ. పొడువ యిల్లుపొరఁగఁబోలుఁబొమ్మనియిట్టు, నట్టుఁ జూచి మనసుపట్టలేక, ధరివ్యయరసిమున్నధాఁచిపోయినచోట, నున్న నూరకుండెనుదుకు మాలి." భో. 3, ఆ.

**పొడువఁడు.** దే. విణ. (పొడువ+అఁడు.)——పై.——"క. వెడవెడనార్చుచుఁబెజికిన, పిడియమువలకేలఁగ్రాలబిఱబిఱవెం టం, బడియీపొడువఁడుముద్దుం, గొడుకుందెగఁజూచెనెంతుకొనే నెఱుఁగక." పంచ. వేం. ౧, ఆ. (స్వార్థమున అఁడు.)

**పొడువు.** దే. వి. 1. ఉన్నతి; "క. పొడువునఁబ్రాయంబునఁ గడుఁ, గడిఁదిబలంబుననుజూడఁగాననదృశునీ, కొడుకనియాతని నెంతయు, నెడమడుగుగఁజూపెదేలయిందఱునగఁగాన్." భార. ఆది. ౪, ఆ.—2. ఎత్తు; "క. పుడమికివితస్తిమాత్రపుఁ, బొడువున నాక్షేత్రరాజమువిరాజిల్లున్." పాండు. ౨, ఆ. — 3. మీఁదు. "పొడువునందుండివెనఁదలక్రిందుగాఁగెడయించి." పాండు. ౪, ఆ. — విణ. ·1. ఉన్నతము; "ఆకసంబుకంటెఁబొడువుజన కుఁడు." భార. అర. ౭, ఆ. — 2. ఉత్కృష్టము. "ఎ, గీ.

పొడమి ప్రత్రేనియుందఱఁ బొడవుసూపెఁ, బొమునృలందెల్లఁ బొను వైనబోటుసేల్పు." ఉ, హరి. ౨, ఆ. (పొడుగుయొక్క రూపాంతరము.)

**పొడ్తు.** దే. అ. క్రి. *పొడముయొక్క రూపాంతరము. "భోరన విస్ఫులింగములుపొడ్తఁగ." భార. ఆర. ౬, ఆ.

**పొణక.** దే. వి. ఈఁతబ్రద్దలులోనగువానితోనల్లినబొట్ట, కుసూల విశేషము.

**పొణకుకట్టి.** దే. వి. తేలికైన యొకదినుసుకట్టి.

**పొతక.** దే. వి. పొత్తర.

**పొతము.** వై. వి. 1. పొట్లము; "చ. ఇతఁడశోకనాఁటిరాతిరిరహిందనవేశ్యకుఁబూవు జొంపముల్, పొతముగఁగొంచుఁబోవుతఱిబోరననందొకపూవుజాఱియ, ప్రతిహతమైతసర్పినయపాయపుదిక్కునఁబట్టఁజూచియా, యతమగునట్టిభీతినిశివార్పితమంచునుబల్కెనెమ్మదిన్." భల్లా. 3, ఆ. — 2. గుంపు*. "చ. అశోకనాఁడు వేఁటకొఱకైతనునేలినవారువేడ్కతోఁ, బొతముగఁబైనమాటఁగని." భల్లా. 3, ఆ.

**పొతుకు.** దే. వి ధాన్యపురాశిచుట్టుగీఁచెడుగిఱి.

**పొత్తము.** వై. వి. 1. పుస్తకము; 2. కావ్యము*; "ఉ. అచ్చ తెనుంగుఁబద్దెమొకటైనను గబ్బము లోననుండినన్, హెచ్చని యాడుచుందురదియెన్నచునేర్పునఁబొత్తమెల్లని, ట్లచ్చతెనుంగునన్ నొడువనందులచందమెఱుంగువారెదన్, మెచ్చరొ యబ్బురంబ నరొమేలనరోకొని యాడరోనినున్." య. ౧, ఆ.—3. గ్రంథము*. "ద్వి. అద్యులపొత్తములందెల్లవెదకి." బస. ౧, ఆ.

**పొత్తర.** దే. వి. ఆకులులోనగువానికట్ట.

**పొత్తరము.** వై. వి. నూఱెడుగుండ్రాయి, ఉపల*.

**పొత్తరముల్లు.** దే. వి. ఒకదినుసుపచ్చిక.

**పొత్తి.** వై. వి. 1. మెత్తనిసన్ననిపాఁతవస్త్రము; (పొత్తిగుడ్డ) "క. అత్తఱినరవీక్షలనా, పొత్తులలోశిశువుచిబుకముగళంబుపయిన్, హత్తనదిచూచితెలిఁదళు, కొత్తుచుశేఁజెక్కులదరనొయ్యన నగియెన్." కళా. ౫, ఆ.—2. చెట్టుమీఁదినార*; (పొత్తిచీర.) 3. పోఁక పూగుత్తిమీఁదిపట్ట, కుహళి*; "సీ. నునుఁబోఁకపొత్తిఁగుట్టినదొప్ప గమితోడరంభావిశాలపర్ణములు పఱచి." అము. ౧, ఆ.— 4. విశల్యకి*.

**పొత్తిక.** వై. వి. మెత్తనిసన్ననిచిన్న వస్త్రము*. "క. కురువీరుల గెలిచితదం, బరములఁజిత్రవర్ణభాసురములుగాఁ, దరమెఱిఁగి లోచనోత్సవ, కరములుగాబొమ్మపొత్తికలకుంచెండీ." భార. విరా. ౪, ఆ. (స్వార్థమున క ప్రత్యయము.)

**పొత్తికడుపు.** వై. వి. క్రిఁగడుపు, వస్తి.

**పొత్తిగడ్డ.** వై. వి. పొత్తి, విశల్యకి.

**పొత్తిచీర.** వై. వి. నారచీరకి. (చూ. పసిఁడిపురుగు.)

**పొత్తిదామర.** వై. వి. (పొత్తి+తామర.) ముడుఁగుఁదామర, నచుస్కారికి.

**పొత్తినూలికాయ.** ద్వ. వి. (పొత్తినూలు+కాయ.) పొత్తినూలి గూఁడు. "అ. తనకుఁదానబంధమొనరించుకొనియెడు, పొత్తినూలి కాయపురువుభంగి, నగుణమయ్యునగుణతావాప్తిఁబొందున, క్షరము ప్రకృతిగుణముసంక్రమించి." భార. శాం. ౬, ఆ.

**పొత్తినూలు.** ద్వ. వి. పట్టుపురుగునేసెడు పట్టునూలు. (చూ. పురువు.)

**పొత్తు.** దే. వి. 1. స్నేహము; "లోనిపొత్తువెలివృత్తంబున్ జనస్తుత్యముల్ కానింపందగునికు." భార. ఉద్యో. 3, ఆ.—2. సంగతి; "క. జనకునిఁదెగటార్చినపా, పునకుంబ్రాణంబుతోడిపొత్తున మనఁగా, మనమునఁదాలిమిగలుగున, దనుఁగాకయతండుచనిన సద్గతికతగన్." భార. అశ్వ. ౪, ఆ. "అ. అనపసితుతోడనాలితోఁబొత్తునఁ, గుడుసఁజెల్లు." విజ్ఞా. ఆచా, కాం.-3. అవిభక్తత; "క. పొత్తునఁగుటుంబరక్షకుఁ, బొత్తులవారిం దఱవ్వవృచ్ఛిన చోటన్, బొత్తులవారందఱుబుధ, విత్తంబరువంగవలయువిధివంతముగన్." సం. "అవిభక్తైఃకుటుంబార్థే యదృణంతుకృతంభవేత్, దద్యుస్తద్రిక్థినః ప్రేతే ప్రోషితేవాకుటుంబిని." విజ్ఞా. వ్య, కాం.—4. ఉమ్మడి. "క. ఉత్తమమగుద్రవ్యంబున, విత్తంబునునగ్రజానికిపింశాఁశంబున్, బొత్తుననిచ్చినహెూదరు, లత్తిన మాంశంబుగొనుటయర్హమెందున్." విజ్ఞా. వ్య, కాం. — విణ. 1. స్నేహితము; "కోపముపాపమునకుఁబొత్తు." కళా 3, ఆ.— 2. సంగతము. "ఉ. ఎత్తిలికావుకావురని యేడ్చుత దీయపయోధగాత్రముల్, కుత్తుకదాఁకఁబిల్చికొని క్రొత్తెఁగ్రమంబునఁజన్నుపాలతో, నెత్తురుమున్నగాఁగగణనీయములైచను సప్తధాతువుల్, పొత్తుగఁబ్రాణముల్ చెనఁటిబొందియత్రిక్కఁగనొక్క వ్రేల్మిడిన్." హరి. పూ. ౫, ఆ.

**పొత్తుకత్తె.** ద్వ. విణ. స్నేహితురాలు. "వ. తమతమపొత్తుకత్తెలుందారును." భాగ. ౧౦, స్కం. పూ.

**పొత్తుకాఁడు.** దే. విణ. స్నేహితుఁడు.

**పొత్తుగుడుపు.** దే. వి. (పొత్తు+కుడుపు.) సహభోజనము, సజగ్ధి.

**పొత్తువు.** వై. వి. సరస్వతి*.

**పొత్తుసేయు.** ద్వ. అ. క్రి. (పొత్తు+చేయు.) స్నేహించు. "ఉ. గ్రుచ్చికవుంగిలించుకొనెఁగూర్మియుభక్తియుఁబొత్తుసేయఁగా." జై. ౧, ఆ.

**పొత్తెము.** దే. వి. గరిడీసాలయందు క్రిందపఱచెడి యొఱ్ఱమన్ను. "మ. గరిడిన్ బొత్తెపు మట్టిచల్లడముచెంగావిన్ గళల్ దేఱుకా, సెరహిన్ మీఱఁగఁజొచ్చి." కనకరంజని. ౫, ఆ.

**పొత్రము.** వై. వి. పొత్తరముయొక్క రూపాంతరము.

**పొద.** దే. వి. ఒకటితోనొకటి పెనఁగొన్నబోదెలేని చిన్న చెట్లగుంపు, గుల్మిని.

**పొదక.** దే. వి. పెద్దయెలుఁగు, పెద్దగొంతు.

**పొదడు.** దే. విణ. పొట్టివాఁడు, వామనుఁడు.

**పొదరిండ్లచేక్క.** ద్వ. వి. పునర్వసునక్షత్రము.

**పొదరిల్లు.** దే. వి. (పొదరు + ఇల్లు.) ఇంటివలెనుండుపొద, నికుంజము. (రూ. పొదరుటిల్లు.)

**పొదరు.** దే. వి. పొద. "తే. ఇట్లు ప్రార్థించి పాంచాలియొట్టకేని, సింహబలుమందిరంబల్లచేరనరిగి, యుల్లఁబోవుచుబెబ్బులి యున్నపొదరు, చొచ్చులేడిచందంబునఁజొచ్చుటయును." భార. విరా. ౨, ఆ.

**పొదలాడు.** దే. అ. క్రి. (పొదలి+ఆడు.) పొదలు, వర్ధిల్లు. "ఎ, గీ. అద్భుతంబులుభయములునాదరములుఁ, గౌతుకంబులుఁ బొదలాడఁగా." హరి. ఉ. ౭, ఆ. (మొదటిరూపము పొదలియాడు. చూ. ఊఁగాఁడు.)

**పొదలిక.** దే. వి. పెంపు, వర్ధనము. "ద్వి. అదిగాకనీలోననత్యంత దుష్ట, మదకారణములు తామసరాజసములు, పొదలుచున్నవి వాని

పొదలికవలన, సదసద్వివేకంబు జనియింపఁబోదు." విష్ణు. పూ. ౨, ఆ.

**పొదలు.** దే. అ. క్రి. పెరుఁగు, వర్ధిల్లు. "ఆ. అనఘునీప్రయత్నమున నాశరీరంబు, పొదలెనిందునాకు మెదలసెడము, చాలదు." భార. ఆర. ౪, ఆ.

**పొదలుకొను.** దే. అ. క్రి. 1. పెరుఁగు; 2. బలియు "సీ. పెన్నిధిఁగాంచినపేదచందంబునఁ బొలఁతుకసీకొనఁ బొదలుకొనియె." నిర్వ. ౮, ఆ. (స్వార్థమున కొను.)

**పొదవెట్టు.** దే. స. క్రి. 1. సూచించు; "క. పరబలముమీఁద నేనలఁ, బురికొల్పెడువాఁడపోలెఁ బొదవెట్టుచున, మ్మరవైరితఱుము కొనిచనె, నరదము పుడుమియోజనత్రయంబెడగలుగన్." జై. ౫, ఆ. — 2. ఆరోపించు. "క. అదికారణముగనతనికి, సదృశంబగుగుణమునీకుఁ జాలదుభువిలోఁ, బొదలనిపెద్దపేకంబులు, పొదవెట్టకలేచిపొమ్ము భోజనృపాలా." ద్వా. ౨, ఆ.

**పొది.** దే. వి. 1. పొదుఁగు; "సీ. పొట్టపొంగునఁదల్లిపొదిఁ గాసి పిఢికిఁ బాపెక్రమ్మఱుఁబెద్దపసువుతోడ." భో. ౬, ఆ.— 2. భారము; "తలుగులపొది." భార. విరా. ౧, ఆ.—3. అమ్ములపొది, తూణము; "సీ. కలికిచూపులకు భితిలిడాఁగినిలిచినకైవడిఁ బొదులమార్గణములలర." జై. ౫, ఆ.—4. సమూహము; "చ. కలయఁజరించుతేఁటిపొదిఁగైకొనఁడాధవళాయతాక్షి వే, నలిపయిఁ జూడ్కినిల్పు." నిర్వ. ౮, ఆ.—5. మంగలవాని అడపము.

**పొదికట్టు.** దే. వి. వాకిటిముందఱపంచేపాక. "సీ. ఒకవైష్ణవగృహంబునకు నెఱుంగకయేగి పొదికట్టుమఱుఁగునఁ బొంచియుండ." పర. ౪, ఆ.

**పొదిగిలి.** దే. వి. ప్రక్కకుసందిటికినిసడిమిభాగము. "క. పొదిగిళ్లలోనబిడ్డల, ముదముననిడియాదమఱచిముందటిరీతిన్, గొదకొనినిద్రింపఁగరా, దిదిమిగులఁబ్రమాదమయ్యె నీకనిప్పిటన్." హరిశ్చ. ౫, ఆ.

**పొదిగొను.** దే. అ. క్రి. (పొది+కొను.) గుంపుగూడు. "ద్వి. పదివేలకోటులభాను తేజములు, పొదిగొనిలోకముల్ పొదివినయట్లు." రా. ఆర, కాం.—స. క్రి. (పొదిగి+కొను.) పరివేష్టించు. "అనేకరాక్షసుల్ పొదిగొనికావ." భార. అను. ౧, ఆ. "సీ. దనుజారి పారిజాతముఁజేరి పొదిగొన్నరాజన్య రాజకీరములలోన." ఉ, హరి. ౪, ఆ.

**పొదిటి.** దే. విశే. పొదవు, పొట్టి.

**పొదుఁగు.** దే. వి. ఆవులోనగువానికి పాలుండెడుచోటు, ఊధము. "చతుస్స్తనంబులుంబలిసిపొదుంగు వ్రేఁగుపఱపంగ." భో. ౬, ఆ.

**పొదుఁగుచేయు.** ద్వ. అ. క్రి. (ఆవులోనగునది యీనఁబోవు సమయమున) పెద్దపొదుఁగుగలదియగు. (ఆవు పొదుఁగు చేసినది.)

**పొదుక.** దే. వి. పొది, భారము. "తే. ఊడ్చిబొందువుచ్చి మేనురివినంజా, డంతయునుబుచ్చిపొదుకగానమరఁగట్టి, కొనుచువేగఁబోకగుటయుఁజనియెనట్టి, సమయమున మేలుకొని దనుజప్రభుండు." భార. శాం. 3, ఆ. (స్వార్థమున ఉక.)

**పొదుగు.** దే. స. క్రి. 1. క్రమ్ము; "తే. పొదుగులజ్జాభయంబులనొదుఁగుమనము, ధైర్యశౌర్యనిరంకుశత్వమువహించె." పు. ౨, ఆ.—2. (రత్నములులోనగువాని) చెక్కు; 3. కప్పు; (చూ. నూఁగుడు.) 4. పక్షులు గ్రుడ్లను ఱెక్కలతో కప్పు. వి. పొత్తిగుడ్డ. (అని ఒకచోవ్రాయఁబడియున్నది.)

**పొనుగుడు.** దే. వి. కప్పుడు. "క. ఉత్తానశయతఁబొదుగుడు, బొత్తులలోనునిచి దివ్యపురుషుఁడనితమో, మత్తులునిమఁగానక, సను, నత్తెఱఁగుసఁజూడకుముదయఁబ్రోవఁదగున్." పర. ౧, ఆ.

**పొదుపు.** దే. వి. వృద్ధి. "క. కరువుసఁబోసినవిధమున, నరుడుగదసరూపమెట్టి దట్టిదకాఁద, త్పురభులుక్రేపులసెనఁగఁ, బొరిఁబొరినేఁటేఁటఁగదుపు పొదుపగుచెంచెన్." భో. ౬, ఆ.

**పొదురు.** దే. అ. క్రి. పూను. (ప్రే. పొదిరించు. "సీ. బొట్టుగులేమావిఁబొదిరించెనొక్కర్తు చూచియుఁజేనంటిశాబగుమీఱ." య. ౪, ఆ.)

**పొదువు.** దే. అ. క్రి. కవియు. "వ. ఓహరిసాహరించెనంగివిచ్చుచుంబొదువుచుండిరి." వా. 3, ఆ.—స. క్రి. 1. క్రమ్ము; "క. అదియట్లకాదెనిప్పునఁ, జెదలంటునెదేవదేవు శ్రీరమణీశున్, మదినునిచినయుత్తమమునిఁ, బొదువునెయాపదలునూర్యుఁబొదువనెతమముల్." లక్ష్మీ. ౪, ఆ.— 2. (రత్నములులోనగువాని) చెక్కు; 3. కప్పు; "వ. పారిజాతంపుఁగ్రొన్ననమిన్నేటిపసిండినెత్తమ్మిచిగురుటాకు సంబొదివియిచ్చిన." పా. ౧, ఆ.—4. (పక్షులుగ్రుడ్లనుఱెక్కలతో) కప్పు. వి. 1. కప్పుడు; "వ. పొదువువిరియందట్టికనంగొని." భార. విరా. ౪, ఆ. (పొదుగుయొక్కరూపాంతరము.) 2. ఊధము. (పొదుఁగుయొక్కరూపాంతరము.)

**పొద్దు.** వై. వి. ప్రొద్దుయొక్కరూపాంతరము. (కాలమునకు.—"క. ఏపొద్దుఖేదమునసం, తాపించుచునుండె." పు. ౨, ఆ.)

**పొన.** దే. విశే. దృగ్గోచరమైనది. "రగడ. పొలఁతియదిచనసాగెఁ బొనపొన్ననీడలకు." ఉ, రా. ౬, ఆ. (ఆమ్రేడితమునందు పొనపొన. "క. అల్లదెకంటివెపొనపొన, తెల్లనిగట్టుతమబ్బుదేజెడుపాలమం, దెల్లెడఁజూచినధరణీ, వల్లభసీరామునేనవాలుమెకంబుల్." స్వా. ౪, ఆ.)

**పొనరారు.** దే. అ. క్రి. (పొనరు+ఆరు.) ఒప్పు. "పునాదవృత్తము. జేజేరాయఁడుసిరిగేస్తుండున్, దేజుల్ మీఱఁగదిటమూబత్తిన్, వేజోహారులునెఱిగావింపన్, బూజంజెందుచుఁ బొనరార్తేటి." అచ్చ. యు, కాం.

**పొనరు.** దే. అ. క్రి. 1. అగు; 2. పొనఁగు. "చ. అనఘయపూర్వమైనభవదాగమనంబుతలంపనొక్కచోఁ, బొనరినకయ్యమిప్పుడెగఁబోయఁగవచ్చినయట్లుతోఁచె." శశాం. ౪, ఆ.—వి. 1. పొందిక; 2. ఇంపు. (ఒనరునకు మొదటిరూపము. చూ. ఒనరు.)

**పొనరుచు.** దే. ప్రే. (పొనరఁజేయు.) 1. కావించు; (చూ. కైకొను.) 2. పొనఁగించు. "క. పొనరిచియాడెడుమాటలఁ, గొనఁదలఁపకదుర్వినీతకోటిధనంబుల్, తనకెక్కనట్టితప్పులఁ, గొనిమెఱసులకీగినృపతిగుణమంద్రుబుధుల్." భార. శాం. ౨, ఆ. (భూ. పొనర్చు.—కావించుటకు. — "చ. మనుజులుతన్నుఁజూచియవమానపరాభవముల్ పొనర్చువ, ర్తనమునునట్టివేషమునుదాల్చి." మార్క. 3, ఆ.)

**పొనరుపడు.** ద్వ. అ. క్రి. (పొనరు+పడు.) పొందుపడు.

**పొనలు.** దే. అ. క్రి. దగదగమండు. "ద్వి. వహ్ని, కనలుచుఁ బొనలుచుగనగనయనుచు." పండితారాధ్యచరిత్రము.

**పొనిక.** దే. వి. ముంజిగడ్డి.

**పొనుఁగు.** దే. వి. తృణవిశేషము. విశే. 1. నిస్తేజము; "తే. శీతలజ్జుఁడైపఱచెసావీరవిభుఁడు, పొనుఁగుప్రజనేలయాఱడిదునిమిలైవ." భార. ఆర. ౬, ఆ.—2. పొట్టి.

**పొనుఁగుచేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**పొనుఁగుపడు** దే. అ. క్రి. (పొనుఁగు+పడు.) 1. నిస్తేజమగు; "తే. అమరపతినందనుఁడుపొడవడఁగిచనిన, నసురమాయయు నుడిగెనునట్లకాదె, యడరిదరికొనిమండుతీవ్రానలంబు, పుడుక లెడిగల్లవైచినఁబొనుఁగువడదె." సిరవ్. ౬, ఆ. "చ. తటనుహ చిద్రుమద్రుమవితానమునుపొప్పుఁబమోధికింకను, త్కటచటులోర్మి హస్తములగర్వమునన్ వెడలంగఁద్రోచినన్, బటుతరభావమేది బహువంగిచికీర్తితనొందిక్రిందన,చ్చటనచటన్ బొనుంగువడిస్రగ్గిన జాడబకీలలోయనన్." లక్ష్మి. ౧, ఆ.-2. నశించు; "క. విను నాకీర్తిజగంబులఁ, బొనుఁగువడియెనీవృభువనపూజితవృత్తిన్, బను పడితిగానఁదగున్, కనలపదవినుండనాకునలవడదింకన్." సం "నష్టకీర్తిరహంలోకేభవాన్ జాతోహుతాశనః." భార. ఆర. ౫, ఆ.- 3. శూన్యమగు. "క. పసులకుమేపెద్దడిపై, పసచెడిపాల మెల్లఁబొవఁగుపడియుండఁగగో, పసమేళంబుగవసుచే, వసుతుఁడు చింతించుఁబ్రొథవల్లవులుదగన్." హరి. పూ. 2, ఆ. (క్రే పొనుఁగువడుచే. "సీ. అబలనీవార్తవిన్నప్పుడనిజదేహజనితలియో గాగ్నిఁ బొనుఁగుపడిచె." భో. 3, ఆ.)

**పొనుపడు.** ద్వ. అ. క్రి. 1. నిస్తేజమగు; "క క్షేత్రజుఁడా దిగఁగలిగిన, పుత్రులు గ్రహములునుబోలెఁబొనుపడుదురున్న, క్షేత్రమునసౌరసుండను, పుత్రుఁడు గ్రహరాజుఁబోలెఁబొడచూపు టయున్." విజ్ఞా. ఆచా, కాం.-2. వ్యర్థమగు; "తే. అసుర వర్యులమాయలనగ్నిదేవు, కడఁకపొనుపడఁదొడఁగుటగని." హరి. ఉ. ౧౦, ఆ.—3. ఉడుగు. "నీమనసులో రణవాంఛనరేంద్ర యిప్పుడుంబొనుపడదేని." హరి. ఉ. ౧, ఆ. (పొనుఁగువడు యొక్కరూపాంతరము.)

**పొనుపు.** దే. విశ. పరాక్రమము. "చ. అనవుడుధారణీరమణుఁడౌ రనిశాటకడిందిబంటవై, పొనుపుననిల్చియాగడపుఁబోకలఁబో యెదు." రసి. ౬, ఆ. (రూ. పొంపు.)

**పొన్న.** యు. దే. విశ. దృగ్గోచరమైనది. "రసాలసాలపుంగమ్మని పుష్పఁదేనియలకాలువపొన్నది." రా. వి. 3, ఆ. (పొనయొక్క రూపాంతరము.)—వై. వి. పున్నాగముᵀ.

**పొన్నంగి.** దే. వి. పక్షివిశేషము. "సీ. కొక్కెర పూరేడు గోరువంక లావుక పొన్నంగి కోవెల కన్నెలేడి." య. ౨, ఆ.

**పొన్నగంటి.** దే. వి. ఒకదినుసుకూరాకు, మత్స్యాక్షి.

**పొన్నట్టు.** దే. వి. అటక, చట్టువము. "సీ. పొన్నట్టుఁదట్టుఁజేఁ బూని యన్నమువంచె వలకేలలతలిరుల్ వంచెననఁగ." బహు. ౮, ఆ.

**పొన్నరి.** దే. విశ. పొన్నారియొక్కరూపాంతరము. "పొన్నరి వేణియు." విక్ర. ౫, ఆ.

**పొన్నాడ.** దే. వి. ఒకదినుసు చిఱుతపులి.

**పొన్నారి.** దే. విశ. మనోజ్ఞము. "సీ. చిన్నారిపొన్నారిచిఱుత కూఁకటినాఁడు రచియించితిమరుత్తరాట్చరిత్ర." కాశీ. ౧, ఆ. (చిన్నారి, పొన్నరి అనుపదములు వేఱువేఱుగా ప్రయోగింపఁ బడియుండుటవలన ఇదియును వేఱుగా వ్రాయఁబడినది.)

**పొన్ను.** దే. వి. 1. బంగారు; 2. రోఁకలిమొదలగువానిమొనను వేసెడులోహవలయము, శంబరము.

**పొన్పడు.** ద్వ. అ. క్రి. పొనుపడుయొక్కరూపాంతరము. (నిస్తేజ మగుటకు. "వనరుహబంధుమండలమువాఁడిమిపొన్పడఁజొచ్చె." రా. సుం, కాం.)

**పొమ్ము.** దే. క్రి. నిశ్చయమును దెలుపునది. (చూ. పొడువ.)

**పొయి.** దే. వి. పొయ్యియొక్కరూపాంతరము.

**పొయ్యి.** దే. వి. ప్రొయ్యియొక్కరూపాంతరము.

**పొర.** దే. వి. 1. అరఁటిలోనగువానియావరణవిశేషము; "క. అరఁటియుఁబత్రంబులచేఁ, బొరలైనట్లు." వా. ౫, ఆ. "చ. పరమవినీలినాతివెలిపావడచేఁదడియొత్తియొత్తిపై, పొరనడిమీన యున్దిగిచిపొంకముగాఁ గొనగోరఁద్రుంచివే, మరుబొటవ్రేలఁ దీసితగుమాత్రమునున్నము వెట్టియంతన, య్యెరుగడనొక్కియాకు మడుపిచ్చిననఁడివిడెంబుసేయుచున్." పా. 3, ఆ.-2. నేత్ర రోగవిశేషము; 3. పాముయొక్కకుబుసము; 4. కపటము; "సీ. పొరలూనిమేతాలుపులజిట్టుమని వెఱకొలుపుచురెండునాల్కలు దలిర్ప." అచ్చ. బాల, కాం. (ఇది సైరెంధ్రములకు నుదాహరణము.)-5. మడత, 6. ప్రమాదము. "తే. అతనిహతుఁడైనశూల సిద్ధాంగుఁడైనఁ, బడకయొకచోటఁబొరదప్పిబ్రదుకుఁగాక, విప్రశా పాగ్నిదొడరినసకృతిఁబొంద, కుంభజంతువ్రలెండుటెవ్వరిద్వఁనుఁడ." పంచ. నా. 3. ఆ.

**పొరఁటు.** దే. స. క్రి. నూరాకుసిల్లిగురపొర్లించివండు. "చ. గురుగుంజెంచలితుమ్మిలేఁదగిరిసాకుందింత్రిసిపల్లవా, క్కూరముం గూడఁబొరంటి." ఆము. ౪, ఆ.

**పొరక.** దే. వి. 1. (గడ్డి) పోఁచ; "సీ. పొరకలుమెయినిండఁ బూరించుకొనిపచ్చచెట్టు చందంబునఁజేరిచేరి." రా. ఆర, కాం. ౨, ఆ.—2. ఈనపుడక; 3. చీఁపురుకట్ట.

**పొరకచేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**పొరకటి.** దే. వి. వాకిటిచేరువగోడ.

**పొరకసుడి.** దే. వి. ఎద్దులలోనగువానిమీఁది యొకదినుసుతప్పు సుడి.

**పొరచి.** దే. వి. చేబదులుగా అడిగితెచ్చుకొన్న ధనాదికము.

**పొరట.** వై. వి. పుస్తకపుపత్రముయొక్క ఒక ప్రక్క.

**పొరపడు.** ద్వ. అ. క్రి. ప్రమాదపడు.

**పొరపాటు.** ద్వ. వి. పొరపడుట, ప్రమాదము.

**పొరపు.** దే. వి. భేదము. "సీ. పొరపుదట్టినరథంబులుసమీపం బునఁజక్కనరథరథ్యసారథులును." జై. ౫, ఆ.—విశ. భిన్నము. "పొరపయ్యంబలుతాల్మి." ఉ, హరి. ౫, ఆ.

**పొరపోవు.** దే. అ. క్రి. పొందారిసెక్కు. (నీళ్లుత్రాగితిని, పొర పోయినది.)

**పొరయు.** దే. అ. క్రి. 1. కలుగు; "పొరసెన్నమ్మదమెల్లలోక ములకున్." భీ. ౬, ఆ. — 2. పొందు. "వ. మూషకంబునకు మార్జాలంబుపొరసియుండెడుభంగినాత్మకుఁగామక్రోధాదులుపరి పంథులైసమయంబు నిరీక్షించుచుండు." అధ్యా. యు, కాం.— స. క్రి. పొందు. "ఆపదంబొరయకయుండఁజేయుము." భార. శాం. 3, ఆ

**పొరలఁబడు.** ద్వ. అ. క్రి. (పొరలన్+పడు.) పొరలు. "ఆ. అగ్నిచల్లనైనన్జమిత్రుఁడుమైల, వడ్డనుర్వి పొరలఁబడినమేరు, నగము నంచలించినను బొంకుపొరయునే, నాదుపలుకు నెమ్మనమున నమ్ము." భార. అశ్వ. ౧, ఆ. (సార్వర్థమున పడు.)

**పొరలాట.** దే. వి. పొరలాడుట. "ఎ, గీ. అలఁతఁబానుపు పైఁబొరలాటదెలుప." ఆము. ౫, ఆ.

**పొరలాడు.** దే. అ. క్రి. (పొరలి+ఆడు.) పొరలు. "చ. బెడిదపుటాఁకటంబడలిబిడ్డలువచ్చివసుంధరాస్థలిన్, బడిపొరలా డుచున్బడెడుపాటులుచూడవుబాష్పపూరముల్, ఱడిగొననేడ్చు

పోరుసుపశక్యముగాదిఁకనేమికార్యమీ, పడుచులఁ బ్రోదిసేయుట కుపాయమునాకెఱుఁగంగఁజెప్పుమా.'' శేవ. ౧, ఆ. (మొదటి రూపము పొరలియాడు.) (చూ. తేరగు. ఊఁగాడు)

**పొరలిక.** దే. వి. పొరలుట, ఉరకనము. ''ఎ, గీ. పొరలికఁబయో ధిఁజెందినబురదయెండి, యొడలుజాడింపఁగడరాలి పడినయొడ్డు, పెల్లలఖ్యానవాండమువ్పెంపుగాంచుఁ, దావక మహత్వమునసుమా యావరాహ.'' చంద్రా. ౧, ఆ.

**పొరలు.** దే. అ. క్రి. 1. పొర్లు; ''వ. పోటువడిపొరలియుం గెరలియు.'' ఉ, హరి. ౬, ఆ. — 2. ప్రవర్తిల్లు. ''చ. ఆతఁడే ప్రతినదప్పకయుండఁగఁదీర్పునట్లుగాఁ, బొరలకయున్నదుర్దశలఁ బొందనెపాయనినిందఁగుందనే.'' భార. ద్రో. ౨, ఆ.—వి. పొర లిక. ''ఎ, గీ. సారెమోపునుబొరలునుసదరమైన.'' ఉ, హరి. 3, ఆ.

**పొరలుచే.** దే. ప్రే. (పొరలఁజేయు.) పొరలించే. (రూ. పొరల్చు. ''చ. రజనీసమయంబునఁబొంచియెవ్వఁడో, మకుట ముఁదన్ని నాశిరముమానికముంగొనిపోయెనంచుని, ప్వకలఁబొరల్చి నట్లుమదిపొక్కెడు.'' ఉ, హరి. ౫, ఆ.)

**పొరలుదండము.** దే. వి. పొరలుచుపెట్టెసుదండము.

**పొరలువెట్టు.** దే. అ. క్రి. (పొరలు+పెట్టు.) పొరలు. ''సీ. నిద్రితద్రుచ్ఛాయనిలువకజరగవెంబడినెయధ్వగపత్క్తిపొరలు వెట్టె.'' ఆము. ౨, ఆ.

**పొరి.** వై. వి. పొలియొక్కరూపాంతరము. (చూ. పొరిగొను మొ.)—క్రి. క్రి. విశ. 1. అత్యంతము; ''సీ. గొడుగులనీడపైనడరఁ జెన్నగుమోముపొరిఁబరువ్వెంధూళిఁబ్రుంగెనేడు.'' భార. ద్రో. ౨, ఆ. — 2. దృఢముగా*; ''భుజంగప్రయాతము. మానుల్, పొరింబల్కిరిట్లంచు భూపాలుతోడన్.'' రుక్మాం. ౧, ఆ. — 3. క్రమముగా*; ''తరల. పొరినివారలచేతియున్నత భూరుహా యుధముల్ పర, స్వరకరోరశిరష్టలంబులపైవడింబడి.'' భార. అర. ౧, ఆ.—4. మాటికి*. (అప్పేడితమునందుపొరిఁబొరి.— మాటికనుటకు.—''ఎల్లెత్తిపొరింబొరింబిలుచు.'' భో. 2, ఆ.)

**పొరిగొను.** దు. స. క్రి. (పొరి+కొను.) 1. చేంపు; ''ఇంత చెప్పనేలాపొరిగొందునీతని.'' భార. ద్రో. 3, ఆ.—2. నాశము చేయు. ''క. ఇరువేయుద్భటరథములఁ, బొరిగొనుటయు.'' భార. ద్రో. ౧, ఆ.

**పొరిచూపు.** దే. వి. 1. ఉగ్రదృష్టి; ''మ. ఘనగర్వాంధమన స్కులైయిటులు దీక్షాభంగదోషంబులన్, జనకుండుండునఖో గతిందలఁపకాచారంబుధర్మక్రమం, బునునూహింపకకన్ఫపంబు పొరిచూపుల్చూచివేసంటకే, చినగర్వంబుననేగిరుద్ధతులకున్సిద్ధిం చునేధర్మముల్.'' షా. ౫, ఆ.—2. భేదదృష్టి. ''క. మనలోమన మిటుపొరిచూ, పునసుండినటువేమేకముగనుండినఁగుం, భినియేల మెయనిభ్యగురా, మునిఁదిట్టిరిశ్రోత్రియోత్తములుముంగోపుల్.'' పాంచా. ౨, ఆ.

**పొరిమారుచే.** దే. ప్రే. చేంపు. ''క. మారునియాకారముఁ బలు, మారునునిరసించురాకుమారులువీటన్, మారుర్వివేకవడిఁ బొరి, మారుతురరివరులఁదృణముమారుగనెపుడున్.'' రాజ. ౧, ఆ. (రూ. పొరిమార్చు. ''క. హరిసేనకడఁగిదైత్యులఁ, బొరి మార్పఁగఁజొచ్చెముష్టిభూరుహగిరులన్.'' రా. యు, కాం.) (పొరిమాలుచుయొక్కరూపాంతరము.)

**పొరిమాలు.** దే. అ. క్రి. చేచ్చు. ''క. అరిమిగులఁగొనటఁ క్రేపులు, పొరిమాలఁగఁబిదికినట్లభూవరకరుపుల్, పెరభుసఁబెని చినయట్లగు, సరపతిప్రజచేశనప్పునమఁదగఁగొనినన్.'' భార. శాం. ౨, ఆ.

**పొరిమాలుచే.** దే. ప్రే. పొరిమాలఁజేయు. (రూ. పొరిమార్చు. ''క. కూల్చుచురథములనెత్తుటఁ, దేల్చుచుఁదురగములవీఁకఁదేర్చు చుమరలన్, పేల్చుచుఁగాల్బలములఁబొరి, మాల్చుచుగౌరవుని మారిమసఁగినభంగిన్.'' భార. ద్రో. ౧, ఆ.)

**పొరివుచ్చు.** దే. ప్రే. (పొరిపోఁజేయు.) చేంపు. ''మ. ధరణీ చక్రమునందునీవునమరోత్సాహంబునన్రాజులన్, బొరివుచ్చఁ నుఁగొంచుకొంచు మదినేప్రొద్దున్ముదంబందుదున్.'' నిర్వ. ౫, ఆ.

**పొరిపోవు.** దే. అ. క్రి. (పొరి+పోవు.) చేచ్చు. ''క. ఉరగాఁ గసనలిఁబట్టెసు, గరుడునిక్రియశక్తివట్టిక్రమ్మఱవైచెన్, నరసు తుఁడుశల్యుసూతుని, బొరిపోఁగనార్చెఁబాండుపుత్రబలంబు ల్.'' భార. ద్రో. ౧, ఆ.

**పొరుగు.** దే. వి. 1. ప్రక్క; (వీఁడునాపొరుగున ఉన్నాఁడు.) 2. ఇరుగునకుప్రక్క; ''క. మెండియపువ్రేలవెండియు, మెండీ నికిఁబొరుగుప్రేలమేలిమిపసిఁడిం, గొండొకవ్రేలజలంబును, నం డంగావలయుబ్రాహ్మణోత్తముచేతన్.'' విజ్ఞా. ఆచా, కాం.— 3. సమీపము. ''తే. ప్రియమునాకొండుగలుగదీత్రిభువనముల, గలదుప్రియమొక్కటియచూడఁగాలకరం, వినుముకాశికాపురిని నీ శసఁబు, కరుణఁసాంపారనిమ్ము నీపొరుగునందు. వ. అనిశంభుం డొంగాక విశ్వంభరనాచేసువసేయుండుము...అనిశంభుండువిశ్వం భరునకునావృత్తాంతంబానతిచ్చివిశ్వేశ్వరలింగంబుతో సాంగ త్యంబువహించెననిచెప్పుటయు.'' కాశీ. 2, ఆ.

**పొరువు.** దే. వి. పొరుగుయొక్కరూపాంతరము. (సమీపమునకు. ''వ. ఇట్లుపన్నగారినగారిపొరువుతెరువునంజనునవ్వసు.'' ఉ, హరి. ౬, ఆ.)

**పొర్గు.** దే. వి.——పై.——''ఏయింటివారలుఁబొర్గింటికేసీగ కుండఁగ.'' విక్ర. ౪, ఆ.

**పొర్లాడు.** దే. అ. క్రి. పొరలాడుయొక్కరూపాంతరము.

**పొర్లిక.** దే. వి. పొరలికయొక్కరూపాంతరము.

**పొర్లు.** దే. అ. క్రి. 1. పొర్లాడు; 2. పశుమిథునముకూడు. (పొరలుయొక్కరూపాంతరము.)

**పొర్లుకట్ట.** దే. వి. వెల్లువపొరలిరాక అడ్డముగావేసెడుకట్ట.

**పొర్లుగాడి.** దే. వి. క్రోష్టుపుచ్ఛిక?.

**పొఱడు.** దే. వి. గూను. ''ద్వి. నెఱిగూనిపాండ్యుఁడన్నిఖిలావ నీశు, పొఱడువోయినవీఁపుపొఱడుపోఁజేసి.'' పండి. ౫, ప్రకరణము.

**పొఱడువోవు.** దే. అ. క్రి. (పొఱడు+పోవు.) గూనుపడు. (చూ. పొఱడు.)

**పొఱయు.** దే. స. క్రి. పొరయు, పొందు. ''క. తన్నుఁగొన కుండెడువా, రెఱుకలకుఁ జేరువయ్యును, బొఱయఁగదవ్వేడు నిఖిల భువనములందున్.'' లక్ష్మీ. ౫, ఆ.

**పొటివుచ్చు.** దే. ప్రే. (పొటిపోఁజేయు.) కలఁచే. ''చ. వన గజమంబుజాకరమవారణఁజొచ్చికలంచియాడఁగా, మనమునఁ గొంకులేక కృపమాలినబోయలుముట్టిచంపుచా, డ్పునభవదీయ సేనఁబొటిపుచ్చఁగఁజొట్టునుముట్టిపార్థనం, దనునలయించినిర్దయ విధంబునఁజంపెదనేకసైనికుల్.'' భార. ద్రో. ౨, ఆ. (రూ. పొటిపోవు.)

**పొటివోవు.** దే. అ. క్రి. (పొటి+పోవు.) కలఁగు. ''క. మిత్తి యుమునుఁగుపడవేడ్కలు, తెఱపులుగొనినీఁగురెండు దిక్కుల

చేతన్, బొజేవోవునెమ్మనమ్ముల, నెఱేనిరువురునలవరింపనేరరు రతులన్." నిర్వ. ౮, ఆ.

**పొల.** యు. దే. విశ. అల్ల. (చూ. డబడబ.)—వై. వి. 1. మాంసము; "సీ. పొలయీడ్చి తినుటకుఁ బొలయుపుల్గులఁ బోవన దలించు పుంకృతిఁజెదరెమంత్రము." పాండు. ౫, ఆ.—2. మాంసపుదుర్గంధము*; "చ. వెనుబొలవల్చుచున్నయది వీనుఁగుఁజూచినయట్టులయ్యెడున్, నినుఁగనుఁగొన్న." భార. శాం. 3, ఆ.—3. చేఁపమీఁదిపొట్టు, శల్కము*. "లేమకన్నులు పొలలేనిమీలు." చంద్ర.

**పొలఁకు.** దే. వి. తృణశ్రేణి.

**పొలఁతి.** దే. వి. ఆఁడుది, ఇంతి.

**పొలఁతుక.** దే. వి.———వై.———(స్వార్థమున ఉక.)

**పొలకు.** దే. వి. కటస్థంగళలము. (అప్ర.)

**పొలకువ.** దే. వి. జోడ, పోబడి. "సీ. పొలకువగనుఁగొన్నఁబోవ దయ్యెంబులు విశరములభీతిచేవిప్తరిల్లి." హంస. 3, ఆ.

**పొలదిండి.** ద్వి. వి. (పొల+తిండి.) రాక్షసుఁడు, క్రవ్యాదుఁడు. "చ. ముదిపొలదిండిచేటు తనమూఁకలకొందలపాటు వేల్పుమ, న్నెదొరలగెల్పునీటు." ఉ, రా. ౪, ఆ. (ఇట్లు పొలమేఁతరి, పొలమేపరి.)

**పొలపము.** దే. వి. 1. వ్యాపనము; "క. తలిరులతుదఁజినుకులు జల, జలవడియఁగఁదడిసిమెలఁగుచలికరువలిసన్, పొలపమున విరియుపరువపుఁ,దొలుమొగడలవలపుఁదెలుపు తోఁటలతోనన్." పా. ౫, ఆ.—2. వాసన; "ద్వి. బాపురేమాయింటిపారిజాత మున, కీపొలపములేదిదెన్నఁడుదెచ్చి, యిచ్చెనోమాసత్యయెఱుఁగక యుండ." విష్ణు. పూ. ౧, ఆ.—3. ప్రకాశము. "సీ. మెఱవకుం డినవేమిమెఱుఁగులపొలపమేతన్మాత్రములెకా విధళధళములు." పాండు. ౪, ఆ.—విశ. వ్యాప్తము. "సీ. పొలపంబుమెఱసి దిక్కులఁగాంతిపూరించుక్రొక్కారుమెఱుఁగులనుక్క డంచి." (పొలపంబు—పొలపముగాననియర్థము.) భార. విరా. ౨, ఆ. (వృత్తియందంత్యవర్ణలోపమువికల్పముగానగును. "పొలపవెల్లి." కళా. ౪, ఆ. మొ.)

**పొలపరి.** దే. విశ. (పొలము + అరి.) జోడతెలిసినవాఁడు. "ద్వి. గురుమెకంబులతోఁడఁగూడంగఁబాఱి, శరములఁబడనేయనరినడు గెత్త, నాయంతపొలపరినలినాయతాక్షి, బోయరాజులలోనఁబోడ గానమెందు." నళ. ౪, భా. (సంధియందు వర్ణాగమవిశేషమని యెఱుఁగునది.)

**పొలపొల.** దే. వి. పొక్కుటయందగు ననుకరణము. "ద్వి. విడిచి, పోయితేనన్నవిపొలపొలఁబొక్కు." ప్రభు. ౫, ఆ.

**పొలమరి.** దే. వి. (పొలము+అరి.) పొలముకాఁపు. "పొలమరు లందుఁగూఁతలిడ." ఆము. ౨, ఆ.—విశ. జోడతెలిసినవాఁడు.

**పొలమారు.** దే. అ. క్రి. ప్రమాదపడు. (చూ. పొలమార్చు.)

**పొలమార్చు.** దే. ప్రే. పొలమారఁజేయు. "ద్వి. కౌరవులఁ, బొలమార్చియంబరంబులుదోఁచుకొనిన, బలిమియాదేవుని ప్రాపు నఁగాదె." భాగ. ౧, స్కం.

**పొలము.** దే. వి. 1. పైరుపెట్టునేల; (చూ. దొరలు.) 2. వరి పైరుపెట్టునేల; (చూ. కలను.) 3. పసులుమేయుకంచె; "వానలు లేకయుండినన్బొలమునవెమ్మెయింబసరముల్ చెడవెన్నఁడు." వి, పు. 2, ఆ.—4. అడవి; "క. కంటిమెనింగం, బులనెత్తటినెనసనే, పొలమునవేనియునునక్కపోతుగెలువఁగన్." భార. కర్ణ. ౨, ఆ.—5. ప్రదేశము; "సీ. కలుషవర్తనులున్నపొలముపొంతఁజనండు కలిమికుబ్బఁడులేమికలఁగఁడాత్మ." పాండు. ౨, ఆ.—6. ఊరు; "క. ఏపొలములుఁబాడయ్యెనె, యీపల్లెనుజిచ్చువెట్టియేగెదము." హరి. పూ. ౫, ఆ.—7. జాడ; "సీ. బనివారికడకునుదన జాలె వ్వరునాడుపొలమెఱుంగకయుండఁబోదునొక్కొ." మై. ౨, ఆ.—8. విధము. "ఎ, గీ. ఈ పొలములగుమ, హాధిక వ్రతములుదేహబాధకములు." భార. శాం. ౪, ఆ.

**పొలముపాటు.** ద్వి. వి. పైరుపెట్టుట, కృషి.

**పొలయలుక.** దే. వి. (పొల్ల+అలుక.) (చూ. ప్రణయకోపము.)

**పొలయిక.** దే. వి. 1. సంచారము; 2. వ్యాపనము.

**పొలయు.** దే. అ. క్రి. 1. సంచరించు; "క. కనకమృగరూపమునఁజని, యినవంశుఁడునతియునున్న యెడఁబొలయుటయున్." భార. అర. ౬, ఆ.—2. వ్యాపించు; "సీ. మదిరాక్షివలిగాడ్పుఁ గొదమనెత్తావినేఁ బొలయఁ మన్నను గాసిపొలయవెఱచు." రామా. ౫, ఆ.—3. సమీపించు; "ఎ, గీ. పొలసినవె యొట్టినరున్నైనఁ గులముఁదెలియ." ఆము. ౧, ఆ.—4. ప్రవేశించు. "ఆ. అంతిపురములోనికసర్థులవెరిటి, పోతుటీఁగనైనఁబొలయకుండ, నాజ్ఞ వెట్టిశారదానందగురునాజ్ఞ, సెట్టనేరనైతిబేలనైతి." విక్ర. 3, ఆ.

**పొలసు.** దే. వి. మత్స్యవిశేషము. (అప్ర.)

**పొలసాడు.** దే. అ. క్రి. (పొలసి+ఆడు.) సంచరించు. "సీ. బొండుమల్లియలపైఁ బొలసాడుబొలసాడి పుష్పంధయంబులఁ బోవఁజోవు." విక్ర. ౧, ఆ. (మొదటిరూపము పొలసియాడు. "సీ. తలయెత్తిచూచుచుఁబలుమాఱుఁదనతల్లిపిలువ ంగన టనిటఁ బొలసియాడు." భో. ౬, ఆ. చూ. ఊఁగాడు.)

**పొలసు.** వై. వి. 1. మాంసము; 2. మాంసపుదుర్గంధము*; 3. చేఁపమీఁదిపొట్టు, శల్కము*. "సీ. పొలసుదోర్గఁ జూచు కలికిచూపులమీలుతెలిగన్నులగుట సందియముగలదె." ఆము. ౨, ఆ.

**పొలసుదిండి.** ద్వి. వి. (పొలసు + తిండి.) పొలదిండి, క్రవ్యాదుఁడు. "క. ఎదురైనపోరుదిండికిఁ, బదిశిరములపొలసుదిండి ప్రణతుండై." ఉ, రా. ౫, ఆ. (ఇట్లు పొలసుమేపరి మొ.)

**పొలి.** యు. దే. వి. 1. లాభము; (పొలిగలుగు.) 2. నష్టి. (పొలివోవు.)—వై. బలి. (పొలిమేర.)

**పొలికలను.** ద్వి. వి. యుద్ధభూమి. "క. పలుకయుఁగరవాలముఁ గొని, పొలికలనంగెలనఁజదలఁబొదలమెఱుంగుల్, వలనొప్పారఁ బ్రచారం, బులుమున్నడిరెండునిండుమొనలకుఁజూపెన్." ఉ, హరి. ౫, ఆ.

**పొలిమేర.** వై. వి. గ్రామద్వయమధ్యసీమ, ఎల్ల.

**పొలియిక.** దే. వి. 1. నాశము; 2. మరణము.

**పొలియు.** దే. అ. క్రి. 1. చెడు; "క. పలుతలలుముఖవికాసము, పొలియకపడియున్న సమరభూభాగముపై, ల్లలరినతామరకొలనిం, దలఁపించెన్గగనచరవితతిపులకింపన్." భార. ద్రో. 3, ఆ.—2. చచ్చు. "సీ. వినుమురక్కసులును వేలుపులునుదొల్లి కలనిలోఁబోరాడిపొలియుచుండ." య. 3, ఆ.

**పొలివుచ్చు.** దే. ప్రే. పొలివోవఁజేయు. (చంపుట.—"ద్వి. మృగమేనిగొనివత్తుమేటిరక్కసుల, తెగయేసిపొలివుత్తు." రా. అర, కాం.)

**పొలివెట్టు.** దే. వి. (పొలి+పెట్టు.) నుడికేర్పఱిచినస్థితి.

**పొలివోవు.** దే. అ. క్రి. (పొలి+పోవు.) 1. చచ్చు; 2. చెడు; "క. పొలివోనిశౌర్యరేఖం, జెలఁగుచు." భార. భీష్మ. ౨, ఆ.—

3. వ్యర్థమగు; "క. తపమంతయుఁబొలివోవఁగ." సాం. ౬, ఆ.—4. భంగపడు; "జేజేలుపొలివోయిచేయునట్టిదిలేకకిన్కలో బ్రుంగి." య. 3, ఆ. — 5. ఉడుగు. "క. అరిగితురగముల సూతుం, బొరిగొనవిరథుఁడయిన్నృపతిపొలివోవకయు, ధ్ధురగతిగద గొనిచనిత, త్తురగంబులసారథినిఁజదుర్చ్వలుసేసెన్." భార. ద్రో. ౪, ఆ.

**పొలుచు.** దే. అ. క్రి. 1. ప్రత్యక్షమగు; "వ, గీ. శివుఁడు గిరిరాజకన్యకాధవుఁడుపొలిచె. వ. ఇవ్విధంబునఁ జంద్రశేఖరుండు ప్రత్యక్షంబగుటయు." హరిశ్చ. ౫, ఆ. — 2. కనఁబడు; "తే. అంబుధరజాలముక్తంబులైనజలక, ణములుసాత్రాజితీకైశికమునఁబొలిచె, గగనతలలక్ష్మి పొరచిగాఁగనిడినఁ, జాలనొప్పారుమత్తాక్తికస్తబకమనఁగ." పా. ౨, ఆ. (పొడుచుయొక్క రూపాంతరము.) 3. ఒప్పు; 4. స్థిరమగు. (రూ. పొల్చు.)

**పొలునోరు.** దే. వి. (పొర్లు+నోరు.) వంకరనోరు.

**పొలుపారు.** దే. అ. క్రి. (పొలుపు+ఆరు.) ఒప్పారు. (రూ. పొల్పారు.) (ఇట్లు పొలుపొందు మొ.)

**పొలుపు.** దే. వి. 1. ఒప్పు; "తే. పొలుపుమీఱిననెలవంకబొమలు చూచి." రుక్మాం. ౨, ఆ. — 2. విధము; "క. వెలివిరిసివచ్చు జలనిధి, పొలుపున." భార. భీష్మ. 3, ఆ.—3. స్థైర్యము. "క. రేపడకరభసమునగం, గాపుత్రుఁడుసేనఁగూర్చిగరుడవ్యూహం, జేపారఁదీర్చిముంగలి, యైపొలుపునబలుపుమెఱయునట్లుగనిలిచెన్." భార. భీష్మ. ౨, ఆ. — విణ. స్థిరము. "చ. శౌలయకయెల్లదేశములుసూచితినందుఁ బ్రసిద్ధులైనరా, జులసుచరిత్రసంపదలఁ జూచితినాద్రుపదేశుదేశమున్, బొలుపుగనొందుదేశములుపోల్పఁగనెవ్వియులేవు." భార. ఆది. ౬, ఆ. (రూ. పొల్పు.)

**పొలువ.** దే. విణ. పొడువయొక్క రూపాంతరము. "సభకుద్రుపదపుత్రినీడిచితెచ్చి పొలువతనమ్మున." భార. స్త్రీ. ౨, ఆ. "క. ఏపాపమేనిలేనిది, కాపురుషతనొకనిమీఁదఁగలిగించినన, ప్పాపముచేసినవాఁడగు, నాపొలువయసంగవిందుమార్యులచేతన్." భార. శాం. 3, ఆ.

**పొలువడు.** ద్వి. అ. క్రి. తఱఁగు, క్షయించు. (చూ. నేయి.) (పొల్లువడుయొక్క రూపాంతరము.)

**పొల్తి.** దే. వి. పొలఁతియొక్క రూపాంతరము. "వికృతరూపంబుతో నున్న యాపొల్తిఁగని." మార్క. ౫, ఆ.

**పొల్తుక.** దే. వి. పొలఁతుకయొక్క రూపాంతరము. "క. సకలలోకోత్కృష్టోన్నతిఁబా, యకయెయ్యదికీర్తివడయు నర్థముపొ, ల్తుకయర్ధభాగంబై, యకుటిలగతిఁ దీర్ఘమూర్తి యందువెలుంగున్." పాండు. ౨, ఆ.

**పొల్ల.** వై. వి. బొత్తిగాగింజపట్టనిధాన్యము*. విణ. 1. వ్యర్థము, వ్యర్థుఁడు*; (చూ. పొగడిత, పఱగడ.) 2. త్రోపుడైనది*. "సీ. హరియురోరత్నమీయచలంబుమణులపెంబ్రోవులకడపటిపొల్లయొక్కొ." మార్క. ౧, ఆ.

**పొల్లవడు.** వై. అ. క్రి. (పొల్ల+పడు.) 1. వ్యర్థమగు; "క. పుల్లవడిచలముకోపము, పొల్లవడిచనంగఁగొంతప్రొద్దుమొగమునన్, వెల్లఁదనముగదురనిలిచి, యెల్లజనులువినఁగమఱియునిట్లనిపలికెన్." భార. అర. ౪, ఆ.—2. క్షయించు.

**పొల్లవుచ్చు.** ద్వి. ప్రే. పొల్లవోవఁజేయు.

**పొల్లవోవు.** ద్వి. అ. క్రి. (పొల్ల+పోవు.) పొల్లవడు. "సీ. అఖిలధర్మవిధిజ్ఞుఁడాత్మభార్యాద్వయంబునకు బిడ్డలులేమిఁబొల్లవోయె, సంసారమనుచు." ఉ, హరి. ౪, ఆ.

**పొల్లు.** వై. వి. 1. బొత్తిగాగింజపట్టనిధాన్యము*; 2. నిరర్థకశబ్దము*. భల్లా. ౧, ఆ.—విణ. వ్యర్థము*.

**పొల్లుఁదనము.** వై. వి. (పొల్లు+తనము.) అపౌరుషము. "ఉ. నీవునుదమ్ములున్సుతులునెయ్యురువైరులచే గృహీతులై, పోవఁగఁజాటిపోయెఁగడుఁబొల్లుఁదనంబునసూతపుత్రుఁడు." భార. అర. ౬, ఆ.

**పొల్లువడు.** వై. అ. క్రి. 1. క్షయించు; (చూ. పొలువడు.) 2. వ్యర్థమగు.

**పొస.** దే. వి. పొగయొక్క రూపాంతరము.

**పొసడ.** వై. వి. పొగడయొక్క రూపాంతరము.

**పొసడు.** దే. స. క్రి. వి. పొగడుయొక్క రూపాంతరము.

**పొసయు.** దే. అ. క్రి. పొగయుయొక్క రూపాంతరము. (చూ. నెవయు.)

**పొసరు.** దే. వి. పొగరుయొక్క రూపాంతరము.

**పొసలు.** దే. అ. క్రి. పొగలుయొక్క రూపాంతరము. (పరితపించుటకు. "క. కవవాసినకతమునజ, క్కవలంతినువిరహదాహకలితమనములన్, బవలింటికూర్మిఁదలఁచుచు, బొసలుచుఁగాసారకూలభూములనుండెన్." రా. యు, కాం.)

**పొసఁగు.** దే. అ. క్రి. 1. అనుకూలించు; "సంధికినేగికార్యము పొసంగకకృష్ణునిరాకయున్." భార. ఉద్యో. ౪, ఆ.—2. లభించు; "ఏరొకటదెబ్బరామునకునెడ్లుపొసంగవు." శకాం. ౨, ఆ.—3. చేకూఁబడు; "క. ఎదిరిందమయట్టులకా, మదిఁదలఁచినఁబొసఁగుఁగాకమాకుంగుడుమిం, డిదెమీరువ్రక్కఁగొనుఁడని, చదురడిచినమనసుపొందుచక్కంబడునే." భార. ఉద్యో. ౧, ఆ.—4. పొందుపడు; "చ. చపలతమాన్చియిట్లనఁబొసంగఁబతంగకులప్రధానము." హస. ౨, ఆ. — 5. ఒప్పు. "చాటినవార్తదిక్కులఁ బొసంగవినంబడినన్." పాంచా. ౧, ఆ.

**పొసఁగుడు.** దే. వి. 1. అనుకూల్యము; 2. ప్రాప్తి.

**పొసపొస.** దే. క్రి. విణ. త్వరితముగా. (అప్ర.)

**పొసరాకు.** దే. వి. (పొసరు+ఆకు.) దగ్గుకైమూచాచు ఒకానొక ఆకు.

## పో.

**పో.** దే. క్రి. 1. నిశ్చయమును తెలుపునది; "సీ. జలజాక్షియిఁతఁడువోసకలయోగీంద్రులు భావవీథులఁగాంచుపరమతత్వము." కాశీ. ౫, ఆ. "తెచ్చెదంబోవసుదేవసూను." ఉ, హరి. ౫, ఆ.—2. అనాదరమును దెలుపునది. "సీ. పట్టెఁబోదొంగఁదేగ్లుట్టి నట్టువిడాఁచి కొంచుఁబోవకమెఱయించుఁటెట్లు." కళా. ౨, ఆ. (పొమ్ముయొక్క రూపాంతరము.)

**పోఁక.** వై. వి. 1. క్రముకఫలము; (దీని భేదములు కారుపోఁక, తోఁటపోఁక మొ.) 2. క్రముకవృక్షము. (చూ. పాళ.)

**పోఁకగంజి.** వై. వి. (చూ.) కాఁచు.

**పోఁకపేరు.** ద్వి. వి. భక్ష్యవిశేషము. "సీ. పోఁకపేరులొసంగఁ బొంకంబుజపసూత్రవలయంబులనిమెడవైచువారు." చమ. 3, ఆ.

**పోఁకబంతిపువ్వు.** వై. వి. ఒకానొకపుష్పము.

**పోఁకముడి.** ద్వి. వి. కామినీకటివసనబంధనగ్రంథి, నీవి. "రగడ. పోఁకముడివీడఁజెలిపొగడకేటికినిక్కఁ, బోఁకత్రూఁకుల యొద్దిపొదచీఁకటికినిక్క." ఉ, రా. ౬, ఆ.

**పోఁకు.** దే. వి. మంచేకవిసినగడ్డి. "సీ. వేకువకడఁబోయి పోఁకు మేయఁగఁ బాఁడియావులఁబొదివిచెండాడెనేఁడు." హరి. పూ. ౬, ఆ.

**పోఁకొత్తు.** ద్వి. వి. (పోఁక+ఒత్తు.) (చూ.) అడకొత్తు.

**పోఁగు.** దే. వి. 1. తంతువు; 2. పోఁగుఁద్రాడు; "ఎ, గీ. అనుచునడుగెత్తి మూఁగువారరసిపోఁగు, వాఱు వారునఁదెరలెత్తు వారుఁజోపు, వారు వడి నోదములు ద్రవ్వువారునగుచు, నాటవికసంఘమప్పుడయ్యెడఁబలసె." చంద్రా. ౨, ఆ. (పోఁగువాఱు అని అనేకగ్రంథములయందు ప్రయోగములు కనఁబడుచున్నవి. అక్కడ పాఱు=పాఱించు. అని యర్థము. అప్పుడు పాఱుధాతువును అంతఃప్రేరణార్థకముగా నెఱుంగవలయును. కొన్ని గ్రంథములయందు పాఱించు అనియు ప్రయోగములు కనఁబడుచున్నవి. ఇది కరఁగుధాతువువంటిది.) 3. బ. పురుషకర్ణాభరణము.

**పోఁగుఁద్రాడు.** దే. వి. (పోఁగు+త్రాడు.) వేఁటాడుచోట చుట్టిరానేర్పఱచెడుత్రాడు. "క. ఉద్దవిడిఁగవియుకుక్కలు, గద్దఱిసివ్వంగులిర్లుగడునేచినమే, లెద్దులుమొదలుగవేఁటకు, దిద్దినయవిపోఁగుఁద్రాళ్లఁదెరచీరగముల్." య. ౧, ఆ.

**పోఁగుపోఁత.** దే. వి. పోఁగుపోయుట. (చూ. పోఁగుపోయు.)

**పోఁగుపోయు.** దే. స. క్రి. సంతనకై తిన్నగా పోఁగుపాఱించుకుట్టు.

**పోఁగువాఱు.** దే. స. క్రి. (పోఁగు+పాఱు.) 1. ఆవరించుకొను; "సీ. గొరగొరఁబరుగిడిమరలిమోరలుచాఁచి పొదలఁదూఱుచుఁజుట్టి పోఁగువాఱి." రసి. ౧, ఆ. – 2. పోఁగువాఱించు. (చూ. పోఁగు.)

**పోఁగొట్టు.** దే. స. క్రి. (పోక్+కొట్టు.) పోకడపెట్టు.

**పోఁచి.** దే. వి. మనికట్టుమీఁదిచోటు.

**పోఁచీ.** దే. వి. 1. పోఁచియొక్కరూపాంతరము; 2. బ. ఆఁడువారి హస్తాభరణవిశేషము.

**పోఁచే.** దే. వి. గడ్డిలోనగువానిపరక. "తే. ఒంటికుఱువేరుపోఁచకుఁగంటగింపరైరి." ఆము. ౫, ఆ.

**పోఁజో.** దే. స. క్రి. నారలోనగువాని నలుసులువాయసన్నముగాఁ దీయు. (ప్రోఁజోయొక్కరూపాంతరము.) .

**పోఁడి.** దే. వి. ఒప్పు. "చచ్చియుంబోఁడిదోఁతఁగకున్నవాఁడు." భార. స్త్రీ. ౨, ఆ. – విశే. ఒప్పిదము. "నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్ పోఁడిగవేల్వఁగాఁబడియె." భార. ఆది. 3, ఆ.

**పోఁడిమి.** దే. వి. 1. ఒప్పు; "నొచ్చియుఁబోఁడిమి చెడక." భార. కర్ణ. ౨, ఆ. – 2. సంపద; "క. వేఁడికొనికృపణులైకను, పోఁడిమియదియేల." భార. ఉద్యో. 3, ఆ. – 3. సౌఖ్యము; "ఉ. మాపనియేమియున్నయది మానకయొక్కపు డీతెఱంగునన్, మీపొడగాన్పుగల్గుటయు మిక్కిలినబ్బురమింతనుండిమీ, కీపరిపాటి సేవరచియించుటకేఁదగినట్టిదాననో, భూపవరేణ్యయేనుదెఱపోఁడుములెంతటిదవ్వుమాకిఁకన్." కళా. 2, ఆ. – 4. విధము. "క. మీఁడాయట్లన్యాయపుఁ, బోఁడుములకుఁబూనినట్టిపుణ్యుఁడుపూవి, ల్కాఁడో వల్లభయెంతటి, వాఁడైననగున్ విశంకవర్తనుఁడెందున్." కళా. 3, ఆ. "చ. కటకటకాశికాపురినొకానొకనిద్దురఁగన్నుమోడ్చియు, న్పటఁగనువిచ్చునప్పుకుడిభాగముగన్గొని చోద్యమందుదా, పటిదెసఁజూచియచ్చెరువుపాటువహించుమనన్నరోజనం, పుటమునవాఁడులాఁగుమగ పోఁడిమియుంగల జంతుసంతతుల్." కాశీ. 3, ఆ.

**పోఁత.** దే. వి. పోయుట. "సీ. కన్నీరుబోరనఁ గ్రమ్మించుటలు పొరిఁబొరి నాజ్యధారలపోఁతగాఁగ." నిరవ. ౫, ఆ. (అనుప్రయుక్తమయిన పోయుధాతువునకును రూపమిట్లెఱుంగునది. ఉదా. పాఱఁబోఁత, పోఁగుపోఁత మొ.)

**పోఁపు.** దే. వి. పోఁకుగడ్డి. "సీ. అంతటఁదద్ధేనువటవీస్థలంబునఁ బోఁపుమేయుచుఁజాలఁజేఁపువచ్చె." చెన్న. ౪, ఆ.

**పోక.** దే. వి. 1. గమనము; 2. బ. నడత, ప్రవర్తనము; 3. కపటప్రవర్తనము. "తిరస్కరించినన్ బోకలఁబోకనె మగిడిపోయెద." వి. పు. ౫, ఆ.

**పోకడ.** దే. వి. 1. గమనము; "ఎ, గీ. రాకడయుఁబోకడయుఁ గానరానియట్టి, పాదరక్షలు." భల్లా. ౧, ఆ.–2. గతి; "పోకడమాలినవారమయ్యయుద్ధురిపశరీరముందినఁగ." భార. శాం. 3, ఆ.–3. నడత, ప్రవర్తనము; "ఉ. ఈనలినాక్షి చింతపారియింతమొకెంతపరాకుచేసియు, న్నాపనికతోడవచ్చి మనపోకడలేమనిచెప్పనాలలే, కనిన్నుపాత్మజందలఁపఁగానము." కళా. ౬, ఆ. – 4. నాశము. "ఉ. ఏకడఁజొచ్చునో సుకృత మెచ్చటఁగ్రాఁగునో తృప్తియెప్పుడో, పోకడశాంతికెందడఁగిపోవునో సౌఖ్యముమానమేమియో, నోకృపయట్లు మాయమగునో యశమే గహనంబుఁ దూఱునో, లోకమునందెఱుంగ మొకలోభమెదిర్చినమాత్రఁ జిత్రమై." కవిక. ౫, ఆ.

**పోకడపెట్టు.** దే. స. క్రి. 1. పోఁగొట్టు; "చ. తెరలకకాశికానగరిదేవతరంగిణిఁదీర్థమాటకై, యరుగుచు నెవ్వఁడేనిమృతుఁడౌ భవితవ్యతకారణంబుగాఁ, దెరువునవామనుష్యుఁడును దీర్ఘఫలంబఫలంబుగాంచియుం, బురుహదళాక్షి పాపములఁబోకడపెట్టుఁబురార్జితంబులన్." కాశీ. ౫, ఆ.–2. విక్రయించు. "ఉ. మదీయభార్యసత్పుత్రవతిన్ ధనార్థినయిపోకడపెట్టె దరందువిల్వఁగన్." హరిశ్చ. ౪, ఆ.

**పోకమాను.** దే. వి. రొంపిమాను.

**పోకలాఁడి** దే. విశే. (పోకలు+ఆఁడి.) కపటప్రవర్తనముకలది. "క. చూపట్టగోమయంబునఁ, జేపట్టొసరించిజడలఁ జెక్కినలింగం, బాపోకలాఁడికైకొని, వేపికడన్ నిలిపిభక్తివివశయుఁబోలెన్." శుక. ౨, ఆ.

**పోకలాఁడు.** దే. విశే. (పోకలు+ఆఁడు.) కపటప్రవర్తనముకలవాఁడు. "తే. త్రిపురకాంతలశీలంబులపహరింప, బుద్ధవేసంబుఁ గైకొన్నపోకలాఁడు, జలజనాభుఁడు సుగతవేషముధరించెఁ, గాశికాప్రజకులధర్మగతిహరింప." కాశీ. ౬, ఆ.

**పోకాడు.** దే. అ. క్రి. (పోక+ఆడు.) పోవు, చలించు. "ఎ, గీ. సుమహితజ్యోత్స్నికాలతాసుమగుచ్ఛ, మనఁగనతిభాసరచ్ఛాయసజ్జవైరి, చెలువుపోకాడిబింబావశిష్టుఁడగుచు, నల్లనల్లన వ్రాలెడునంబుజాక్ష." పా. ౨, ఆ.

**పోకారుచు.** దే. ప్రే. (పోకాడఁజేయు.) పోఁగొట్టు, పోఁగొట్టుకొను. (రూ. పోకార్చు.–పోఁగొట్టుటకు.–"క. శోకముసుఖముం జెఱుచును, శోకముతేజంబునడఁచు శోకముబుద్ధిం, బోకార్చుఁ గానఁదాలిమిఁ, గైకొనిశోకంబువిడువఁగావలయున్నృపా." రా. కిష్కిం, కాం.–పోఁగొట్టుకొనుటకు.–"క. నాకీడుదలఁపనేరక, శ్రీకైతగుపాడియింతసేయకపుత్రా, నీకసువ్యాద్యాంధవులన్, బోకార్చితిబ్రతుకుటెంకఁబోసఁగునెచెపుమా." భార. స్త్రీ. ౧, ఆ.)

**పోక్కాలు.** దే. అ. క్రి. పోవు. (చూ. గంద్ర.) (ఇది కోపదుఃఖకాలములయం దుపయోగపఱచెడు మాట.)

**పోకిరి.** దే. విశే. దుర్మార్గప్రవర్తనముకలవాఁడు.

**పోకిళ్లు.** దే. వి. బ. దుర్మార్గప్రవర్తనము.

**పోకు.** దే. వి. 1. నడవడి; "తే. అసఘుసీవశక్తియు స్త్రీపోద్యంబు గలదె, యభవునర్చించుచువేళ నమాధినుండి, కొడుకుచెనసైనయన్ని పోకులున జూడఁ, గడచెనాఁటినుండియేదేండ్లుకర్తమునకు." కాశీ. ౪, ఆ.—2. నష్టి.

**పోగండుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వికలమైనశరీరముగలవాఁడు.

**పోగర.** దే. వి. కముసాలవాఁడు చిత్రించెడుపనిముట్టు.

**పోగు.** వై. వి. ప్రోగు యొక్క రూపాంతరము.

**పోచిళ్లు.** వై. వి. బ. శకునముచూచుటకై యిరుగుపొరుగిండ్లమీఁద అక్షతలుచల్లుట. "సీ. చెలువుండుసనునిరీక్షించునా ప్రియముతోననుచుఁబోచిళ్లునిత్యమున జల్లె." రుక్మాం. 3, ఆ. (ఇరుగు పొరుగిండ్లమీఁద అక్షతలునీళ్లుచల్లి ఆ యిండ్లవారాడుకొను శుభాశుభవాక్యములను పొంచుండివిని శుభాశుభశకునములు నిర్ణయింతురు.)

**పోట.** ఉభ. దే. విణ. పెద్ద. (చూ. పోటకత్తి, పోటముంజి.) సం. వి. ఆ. స్త్రీ. 1. మీసముగల ఆఁడుది; 2. దాసి.

**పోటకందులు.** దే. వి. బ. తెల్లకందులు.

**పోటకత్తి.** దృ. వి. అడవినఱకెడుకత్తి.

**పోటకము.** వై. వి. దేహమంతయు బొబ్బలుబొబ్బలుగాలేచెడు వ్యాధివిశేషము, స్ఫోటకము.

**పోటగళము.** సం. వి. అ. పుం. 1. కిక్కిసకసవు; 2. తెల్లుకు; 3. చేఁప.

**పోటనబంతి.** దృ. వి. (పోటు+బంతి.) పుట్టచెండు. "పోటన బంతిమీటుగతి." వసు. ౨, ఆ. (సంధిని వర్ణాగమవిశేషమని యెఱుంగునది.)

**పోటముంజి.** దృ. వి. పుట్టగోఁచి.

**పోటరి.** దే. విణ. (పోటు+అరి.) శూరుఁడు. "పోటరులైనధర్త లేవురుగలరంటి." భార. విరా. ౨, ఆ.

**పోటి.** దే. వి. 1. స్పర్ధ; "సీ. అలార్కునకునీకులానసేమేనిఁ బోటిపుట్టుదుగదామాటమాట." భీ. ౨, ఆ.—2. పోటుఁగంబము. విణ. మాఱు. "సీ. ప్రవహించెనెందుశ్రీభాగీరథికిఁ బోటి యమృతప్రదాహ్వయమైనతటిని." కాశీ. ౬, ఆ.

**పోటిగాఁడు.** దే. విణ. (పోటి+కాఁడు.) పోటిగలవాఁడు.

**పోటు.** దే. వి. 1. పొడుపు; "అటుపోటుదాఁకనిఘనయోధకోటి." భార. విరా. ౫, ఆ.—2. యుద్ధము; "చ. వెఱవకుమన్న పోటుకురుబీరులతోడనశక్యమేనియు, తైఱఁగదియేలనీవుడుగుతేరికి సారథిగమ్మునాకుఁజ, చ్చుఅపిడుగెట్టులట్టడరిశూరులమొత్తమునుగ్గు సేసెదఁ." సం. "యదినోత్సహసేయోద్ధుంశత్రుభిశ్శత్రుకర్శన, శిహిమేత్వంహరాశ్వాన్యచ్ఛయుధ్యమానస్యశత్రుభిః." భార. విరా. ౪, ఆ.—3. సముద్రోల్బణము; "సీ. పుష్పాస్త్రునకుకాదుపోటు సంధిల్లుట కలశసాగరతరంగములకెల్ల." హంస. ౪, ఆ.—4. శౌర్యము. "పందకుఁబోటులోభగ్రస్తునకునీగి." పాండు. ౫, ఆ.

**పోటుఁగంబము.** దృ. వి. (పోటు+కంబము.) ఊఁతగానిలిపిన స్తంభాదికము. "మ. రసమాణామరయోధసాధకట నిర్వర్ణానగం ధానుబంధ, ధమరుత్పట్టణసాలమెంతయును గన్నందత్పురీమత్తనా, గముబొక్కుమ్మడి గ్రుమ్మఁగసెడనాఁ గంబూన్నుబల్పోటుఁగం, బములోనావిలసిల్లుసౌధములవాప్తస్వర్ణసంసర్గతన్." చంద్రా. ౧, ఆ. (ఇట్లు పోటుఁగోల.)

**పోటుఁగలుపు.** దే. వి. (పోటు+కలుపు.) రెండవసారితీయు కలుపు.

**పోటుకాఁడు.** దే. విణ. శూరుఁడు. "ఆ. పాలదిండిరాయఁడ, పోప్పోటుకానిఁగయ్యముసకుఁబనిచె." అచ్చ. యు, కాం.

**పోటుబంటు.** దృ. విణ.——పై.—— "ఉ. నీవొకపోటు బంటవై, మిన్నకవచ్చితేల పులిమీసలనయ్యలలూఁగవచ్చునే." విక్ర. ౪, ఆ.

**పోటుమగఁడు.** దే. విణ.——పై.—— "క. మాటలుపెక్కాడితివి, పోటుమగలువినఁగనింకఁబోవ్రటతగదె, ప్పాటనదిగాశత్తమ్మని, పాటునుగన్నారఁగంటివాఱకుమింకన్." భార. విరా. ౫, ఆ.

**పోటుమానిసి.** దృ. విణ.——పై.—— (చూ. చిక్కన.)

**పోటుముట్టు.** దే. వి. యుద్ధసాధనము, ఆయుధము. "సీ. రూపు మొక్కటిరెండురూపులైచెలువొందుమున్నె గములపోటుముట్టు వట్టు." విక్ర. ౨, ఆ.

**పోటులాడు.** దే. అ. క్రి. (పోటులు+ఆడు.) యుద్ధముచేయు, పోరు. "ఆ. వెరవులాపుగలుగునరనాథులింతదే, శంబుగలుగు మనకుఁ జాలునరు, తంత్రిబిడ్డయన్న దమ్ముఁడునసకెత్తి, పోయి పోటులాడిపుడమిఁగొంద్రు." భార. భీష్మ. ౧, ఆ.

**పోటొగ్గు.** దే. అ. క్రి. (పోటు+ఒగ్గు.) యుద్ధప్రయత్నము చేయు.

**పోటొడ్డు.** దే. అ. క్రి. (పోటు+ఒడ్డు.)——పై.——

**పోట్టలి.** సం. వి. ఈ. స్త్రీ. పొట్లము.

**పోట్లాట.** దే. వి. పోట్లాడుట, యుద్ధము.

**పోట్లాడు.** దే. అ. క్రి. పోటులాడుయొక్క రూపాంతరము.

**పోట్లావు.** దే. వి. (పోట్లు+ఆవు.) పొడిచెడిస్వభావముగల ఆవు, ఒట్టియ, సుకత.

**పోడు.** దే. వి. చిఱువేరుపైరగునేల. "తే. చేలుఁబోట్లుఁ బీళ్లుసుజేరి చొచ్చి, పైరుపచ్చలుమేసియాపాటఁబోక, పల్లియలుచొచ్చి తోఁటలుపాడుచేసి, కావరంబునఁగడుపులైగానిచేయు." యు. ౧, ఆ.

**పోఢము.** సం. వి. అ. న. పండుపోఁక.

**పోణి.** దే. వి. విణ. పోఁడియొక్క రూపాంతరము. "ఎ, గీ. మేటి రతులకుసురతాణిమించుఁబోణి." శశాం. ౪, ఆ.

**పోణిమి.** దే. వి. పోఁడిమియొక్క రూపాంతరము. (సౌందర్యము నకు. — "సీ. పికవాణియగువాణిపృథువేణిఁగలపోణిమినిజాణతన మునమించనాడి." రాజ. ౧, ఆ.—ఒప్పునకు.—"ఉ. ప్రాణము తోడనుండిబహుభంగులఁబుణ్యములాచరించియుం, బోణిమిగాఁగ మోక్షమునుబొందుటదుర్లభము." రుక్మాం. ౫, ఆ.—విధమునకు.—"క. ప్రాణేశ్వరుండుకడుని, ద్రాణతనున్నాఁడిదేమితనకన్ను లకున్, రాణింపనొయితనికిమగ, పోణిమియేలేదొ యనుచుఁ బొక్కుచుమదిలోన్." శుక. ౧, ఆ.)

**పోతము.** సం. వి. అ. పుం. 1. పిల్ల; 2. పదేండ్లయేనుఁగు; 3. మనుజులెక్కిపోయెడు ఓడ; 4. ఇంటిచోటు; 5. వస్త్రము.

**పోతరము.** దే. వి. క్రొవ్వు, మదము. "శా. ఓరియొవ్వఁడవీవు పోతరముతోసున్నాదివైయిప్పుడే, నారింబట్టితిరెట్టుంగామొఱయిడన్." శశా. 3, ఆ. (చూ. పోతరించే.)

**పోతరి.** దే. వి. ఒకానొకచెట్టు.

**పోతరించు.** దే. అ. క్రి. క్రొవ్వు, మదించు. "తే. ఎండకాలంబు బోరలాడునేకలముల, చమురు దేఱెడుదొరువులజలముఁగ్రోలి, పోతరించినకారెనుఁబోతులచట, వచ్చి మదహస్తితోడఁగొమ్మిచ్చు నధిప." చంద్రా. ౨, ఆ.

**పోతవణిజుఁడు.** సం. వి. జ. పుం. ఓడబేరఁగాఁడు.

**పోతవాహుఁడు.** సం. వి. అ. పుం. ఓడగడపువాఁడు, తండేలు.

**పోతాధానము.** సం. వి. అ. న. చేఁపపిల్లలగుంపు.

**పోతు.** దే. అప. తాచ్ఛీల్యమునందువచ్చెడు ఒకానొక ప్రత్యయము. (తాగుఁబోతు, తిండిపోతు మొ.) వి. 1. పశుపక్ష్యాదులలో పురుషజాతి; ("ఆఁబోతు." "ఎనుఁబోతు." "మేఁకపోతు." "నక్కపోతు." "పోతుటేనుఁగు." "పోతుపిల్లి." "పోతుటీఁగ." "పోతుతాడు" మొ.)—2. మహిషము; "క. అచ్చపుఁజీఁకటి ప్రొద్దున, నొచ్చెములేనట్టిపోతునొక్కటచెయిద్దుఁడ, మ్రుచ్చిలి చేకొని క్రమ్మఱ, వచ్చెందనదేశమునకువాఁడభయుండై." శేష. ౪, ఆ.—3. వృషభము. "ఒక్కపోతునుదటుకునఁబిడికిటనుబొడిచె." నీలా. 3, ఆ.

**పోతుకరడు.** దే. వి. పెద్ద అల, కల్లోలము.

**పోతురాజు.** మి. వి. ఒకానొక క్షుద్రపురుషదేవత.

**పోతురౌతు.** దన్య. వి. యముఁడు, మహిషవాహనుఁడు.

**పోతులరాజు.** మి. వి. పోతురాజువలెనుండుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**పోత్రము.** సం. వి. అ. న. 1. పందిమూతి; 2. నాఁగటిదుంపమొన; 3. వస్త్రము.

**పోత్రి.** సం. వి. న్. పుం. వరాహము, పంది.

**పోనాడు.** దే. స. క్రి. (పోన్+ఆడు.) 1. పోఁగొట్టు; (చూ. పెడఁబాయు.) 2. నిందించు. "క. కడునెందునుబోనాడుచుఁ, బుడమిపయింగన్నవారుపుసుకలఁజిమ్మన్, బడిపడిపేసారితిని, ప్పుడునాకీముదిమిమాను పుటవరమనఘా." పర. ౨, ఆ.

**పోని.** దే. విశ. పోలిన. "వ. అనన్యసాధారణరూపవిభవంబుల రెండవమన్మథుండునుంబోనివానినలుంగని." భార. ఆర. ౨, ఆ.

**పోపడు.** దన్య. అ. క్రి. (పోకు+పడు.) పోవు. "క. ఈపగదీర్చెదనంచున్, గోపంబునరాజుకొడుకు గ్రుడ్డులురెండున్, బోపడునట్లుగగోళ్లన్, వేపెఱికిరయమునగగనవీధికినెగసెన్." భార. శాం. 3, ఆ. (ఈ పాఠము వ్రాఁతప్రతుల ననుసరించినది. త్రోపడువంటిది.)

**పోపిట్ట.** దన్య. వి. (పోట+పిట్ట.) పక్షివిశేషము.

**పోబడి.** దే. వి. (పోవు+బడి.) జాడ. "సీ. పోయెఁబోపోయిన ప్రోయాలిపోబడి వెదకిపట్టుటయేల విహితమయ్యె." రామా. ౬, ఆ.

**పోబెట్టు.** దే. వి. (పోట+బెట్టు.) అనురాగమువలనఁ బుట్టినధ్వని, ప్రణాదము.

**పోయు.** దే. అ. క్రి. పుట్టు. (చీముపోయు, చెమటపోయు మొ.) స. క్రి. 1. (జలాదికము) విడుచు; 2. (నాఱు) విడుచు; 3. తగులుచు; (ఉరిఁబోయు.) 4. (బాణము) సంధించు. "ఉగ్రుఁడైయమ్మరిఁబోసినంగని." భాగ. ౪, స్కం.

**పోరంబోకు.** హిం. వి. సాగుఁబడికిరానినేల.

**పోరచి.** దే. వి. కానుక. (చూ. పొలుచు.) విశ. 1. వ్యర్థము; 2. నిస్సారము. "ఉ. కోరినకోర్కికిందగఁగఁ గుంతిసుతత్రితయంబుఁగాంచెగాం, ధారియునక్కడన్ సుతశతంబు ముదం బొనరంగఁగాంచెనే, బోరచియాఁడుపుట్టువ్వనఁ బుట్టెనిరర్థకజీవనైతినం, సారసుఖావహంబయిన సత్సుతజన్మముఁగానఁబోలమిన్." భార. ఆది. ౫, ఆ.

**పోరాట.** దే. వి. (పోరాడుట.) 1. కలహము; 2. యుద్ధము; "తే. అవిపేకుఁడైన, యాసుయోధనతోడిపోరాటదక్కి." భార. ఉద్యో. 3, ఆ.—3. మల్లాడుట. (చూ. పోరాడు.) (రూ. పోరాటము. — యుద్ధిమునకు. — "క. నీరాటవనాటములకుఁ, బోరాటం బెట్టుగలిగెఁబురుషోత్తముచే, నారాటమెట్లుమానెను, ఘోరాటవిలోని భద్రకుంజరమునకున్." భాగ. ౮, స్కం.—కలహమునకు. చూ. ఈండ్రించు.) (చూ. అఱకడ.)

**పోరాడు.** దే. అ. క్రి. (పోరు+ఆడు.) 1. కలహించు; 2. యుద్ధముచేయు; (చూ. పొలియు.) 3. మల్లాడు. "తే. చుట్టములలోననొప్పమిపుట్టునప్పు, డడ్డపడివారితోడఁబోరాడియైనఁ, బూనియుడుపంగఁజొరకున్న వానిఁగ్రూర, కర్ముఁడనిచెప్పుదురుకర్మకాండవిదులు." భార. ఉద్యో. 3, ఆ.

**పోరాని.** దే. విశ. అప్తమైన. "ఆ. ఈవుపో, గానిమట్టమవ్రమహాను భావు, డవు." భార. ఉద్యో. 3, ఆ. (ఇది పోవచ్చు అనుక్రియనుండికలిగినవ్యతిరేకార్థకవిశేషణము. వ్యతిరేకార్థకమైనప్పుడే దీనికీయర్థము కలుగుచున్నది.)

**పోరామి.** దే. వి. 1. ఆప్తత; "పోరామిచెలి." విక్ర. ౭, ఆ.—2. స్నేహము; (చూ. చెడిప.) 3. సంకటము. "వ. నీవీయలభ్యరత్నంబుడాఁపవలయు. ప్రాణంబుపయివచ్చుసంతటిపోరామియందునునెవ్వరికినెఱింగింపకుండునది." హరి. పూ. 3, ఆ. "క. ఆరామకారువలనం, బోరాములుపడుచు." విక్ర. ౭, ఆ. (ఇదియు పోవచ్చు అనుక్రియనుండికలిగిన వ్యతిరేకభావార్థకరూపము. చూ. పోరాని.)

**పోరితమాడు.** దే. అ. క్రి. (పోరితము+ఆడు.) పోరాడు, మల్లాడు. "ఉ. వీరునుపాండుపుత్రులును వేరమదక్కిపానంగిమన్కికై, పోరితమాడియేనటులుబుద్ధులుసెప్పినభంగియున్." భార. ఉద్యో. 3, ఆ.

**పోరితము.** దే. వి. (పోరు+ఇతము.) 1. కలహము; "సీ. తనయులింకేభంగిధనవిభాగములకైపోరితంబులులేకపొసఁగియుందురు." కాశీ. 3, ఆ.—2. యుద్ధము; "ఉ. కయ్యముదక్కిమన్కితగుకార్యముకాదొకొపోరితంబులే, కయ్యెడుకార్యసిద్ధివెడఁగైనను నొల్లకయొండుసేయునే." సం. "అయుద్ధంవైతౌతయుద్ధాద్గరీయః." భార. ఉద్యో. ౧, ఆ.—3. స్పర్ధ. "ఈనుకలంకపోరితంబనునివిమత్సరంబుగలయట్టిమనంబునఁబుట్టు." భార. శాం. ౫, ఆ. (స్వార్థమున ఇతము.)

**పోరు.** దే. అ. క్రి. 1. కలహించు; 2. యుద్ధముచేయు. వి. 1. కలహము; 2. యుద్ధము.

**పోరుదిండి.** దే. వి. (పోరు+తిండి.) నారదుఁడు, కలహాశనుఁడు. (చూ. పొలసుదిండి.)

**పోరుపెట్టు.** దే. అ. క్రి. బిడ్డ ఉడుగక గట్టిగాఏడ్చు. "క. భిక్షార్థమరుగుచోనొక, వృక్షసమీపమునఁబోరు పెట్టుచునుండెన్, వీక్షించిసంశయింపక, భిక్షునియోగమునఁ దెచ్చి పెనిచితిఁ గరుణన్." బ్ర. ౨, ఆ.

**పోరువ.** దే. వి. 1. సెల్లా; "సీ. పసమించుమాదరపాకపోరువలచేఁదడియాఱనొత్తికుంతలములార్చి." శశాం. 3, ఆ. —

2. పొర. ''ఉ. వ్యాళవిఘుఁ డెకా బులుఁగీడ్చిన మాడ్కి నీడ్చిన, బ్బాలిశుఁ గాలభైరవుఁడు పైకుబు సంబొకపోరు వెత్తఁగన్.'' పాండు. ౪, ఆ.

**పోఱఁడు.** దే. విణ. పడుచువాఁడు, బాలుఁడు.

**పోఱఁతి.** దే. విణ. పడుచుది, బాలిక.

**పోఱఁతిగాఁడు.** దే. విణ. పోఱఁడు, బాలుఁడు.

**పోలఁడు.** దే. వి. పక్షివిశేషము, పోలిగాఁడు.

**పోలక.** ద్వ. వి. (పోలు + అక.) ఒకానొక గ్రామదేవత, పోలకమ్మ.

**పోలానిగంటలు.** ద్వ. వి. బ. ఏనుఁగు మెడను గట్టెడుగంటలు ''సీ. వ్రేలుఁగొప్పులు సల్లఖిడిపట్టుగద్దియల్ హారమ్ములలఁతిపోలాని గంటలు.'' చంద్రా. ౧, ఆ.

**పోలిక.** ఉభ. దే. వి. సామ్యము. సం. వి. ఆ. స్త్రీ. పోళీ. (రూ. పోలీ. ఈ. స్త్రీ.)

**పోలికి.** దే. వి. పోలిక. ''క. సినుఱొంపిలోపలను బ్రుం, గిన ధేనువు సత్తుపోలికినిశల్యుండు, మ్మొనఁదనభుజబలమునఁగలఁ, గని యట్లుగ నిలిపెశౌర్యగర్వము మెఱయన్.'' భార. శల్య. ౧, ఆ.

**పోలిగాఁడు.** దే. వి. పక్షివిశేషము, పోలఁడు.

**పోలీసు.** ఆం. వి. పురజనసంరక్షకభటులు.

**పోలు.** దే. అ. క్రి. 1. ఒప్పు; ''శా. శీలంబున్ గులమున్ శమం బుఁదమమున్ జెల్వంబులేఁ బ్రాయమున్, బోలంజూచి.'' స్వా. ౧, ఆ. – 2. యుక్తమగు; ''మ. భవదీయంబైనరూపంబుచూ, చుతలం పెత్తెడుఁబోలునే నిదయఁజక్షుః ప్రీతిఁగావింపవే.'' భార. భీష్మ. ౧, ఆ.–3. శక్యమగు. ''చ. దుర్మతులారసమీరు మీకుఁజే, సలవడఁబట్టవచ్చునె మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా, సలుఁజమరంగశక్యమె.'' భార. ఉద్యో. 3, ఆ.–స. క్రి. సరిపోలు. ''వ. సర్వగుణసౌందర్యంబుల నెవ్వరునలుంబోలరు.'' భార. ఆర. ౨, ఆ.–వి. ఒప్పు. ''క. కాళియమర్దనమునకున్, గాలాకృతిఁ గృష్ణుఁడుఱికఁగన్గొఱఁగిమహా, వ్యాళములు వెడలఁబాఱెడు, పోలిక పోలయ్యెఁదరులఁ బొందుతఱఁగలన్.'' హరి. పూ. ౭, ఆ. (ఇతరప్రయోగము కనఁబడమిచే ఈ పదము సరియైనదని చెప్పుటకు ధైర్యము చాలదు.)

**పోలుగ.** దే. వి. పక్షివిశేషము, ''సీ. పట్టుజీనువకొంగపాలేరు పిచ్చికపోలుగపిక్కిలిమీలముఱ్ఱుచ్చు.'' హంస. 3, ఆ.

**పోలుగఱ్ఱ.** దే. వి. బండినొగమీఁది తొట్టికి ఈవలావల అమర్చిన కొయ్య.

**పోలుచు.** దే. ప్రే. పోలఁజేయు. (రూ. పోల్చు.)

**పోలుపొందు.** దే. వి. సంగతి, వృత్తాంతము. (ఆ పోలుపొందు నాకేమితెలియదు.)

**పోలువ.** దే. వి. పోలుగయొక్క రూపాంతరము.

**పోలె.** దే. ద్ర. వలె. ''చంద్రరేఖయుంబోలె.''

**పోలేఱు.** దే. వి. (ప్రోలు + ఏఱు.) పోలేఱమ్మ, ఒక గ్రామదేవత. (సంధినివర్ణలోపాదికము.)

**పోల్కి.** దే. వి. పోలికియొక్క రూపాంతరము.

**పోవడి.** దే. వి. పోబడియొక్క రూపాంతరము.

**పోవు.** దే. అ. క్రి. 1. సమీపమునుండి దూరమునకరుగు; 2. చేష్ప; ''క. వాఁడుదివిజులచేతన్, బోవనిదైత్యులఁజంపఁడె.'' భార. ఉద్యో. ౨, ఆ. – 3. ఆరంభించు; ''వ. అన్నలుండు వివిధ వస్తువాహననివహంబు లొడ్డిపుష్కరునఁ గోటువడంబోయిన.'' భార. అర. ౨, ఆ. – 4. కడచు; (పోయినపనికి చింత యేల.) 5. చెడు; (వానికి కన్నులుపోయినవి.) 6. కలయు; (మిత్రద్రోహము చేసినవాఁడు మహాపాపమునఁ బోవును.) 7. అగు. (వానికి ముక్కుచొట్టపోయినది.)

**పోవుదెంచు.** దే. అ. క్రి. (పోవు+తెంచు.) పోవు, కడచు. ''మునిశాపదినంబులుపోవుదెంచె.'' భార. ఆది. ౨, ఆ. (స్వార్థమున తెంచు.)

**పోషకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) పోషించువాఁడు.

**పోషణము.** సం. వి. అ. న. పోషించుట. (చూ. ప్రోచు.)

**పోషించు.** సం. స. క్రి. పోషణముచేయు. (చూ.) ప్రోచు.

**పోష్ట.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) పోషించువాఁడు.

**పోష్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పోషింపఁదగినది.

**పోసనము.** దే. వి. 1. పాలు, క్షీరము; ''భూప్రవరుంబోసన మిమ్మసంగవలెనే.'' భాగ. ౧౦, స్కం. పూ.–2. సైపూఁత; ''ఎ, గీ. బాసపోసనములు నిడంబములు భ్రమలు.'' పాండు. 3, ఆ.–3. కాంతి. ''వ. కెంపుపోసనంబులగు దానసంబులును.'' య. ౪, ఆ.

**పోసరము.** దే. వి. పోతరముయొక్క రూపాంతరము. (చూ. పోసరించు.)

**పోసరించు.** దే. అ. క్రి. పోతరించుయొక్క రూపాంతరము. ''వ. తెరువరులుతాలవృంతానిలంబులఁ బాలుపుకొలిపిమున్న పరిక్షీణంబులగు ప్రాణపవనంబులఁబోసరింపంజేసిరి.'' పాండు. ౪, ఆ.

**పోసబెక్క.** దే. వి. మత్స్యవిశేషము.

**పోసూడు.** దే. వి. పాపోసు. (ఇది పాపోసుయొక్క వికారముగా నుండునని తోఁచుచున్నది.)

**పోస్తకాయ.** హిం. వి. గసగసకాయ సైబెరడు.

**పోస్టు.** ఆం. వి. టప్పా, అంచె.

**పోహణ.** వై. వి. 1. కూర్పు; 2. నేర్పు. ఇలా. 3, ఆ.

**పోహణించు.** వై. స. క్రి. కూర్చు. ''సీ. పొసఁగముత్తెపుసరుల్ పోహణించినలీలఁదమలోనదొరయుశబ్దములుగూర్చి.'' కళా. ౧, ఆ.

**పోళీ.** వై. వి. ఒబ్బట్టు.

## పౌ.

**పౌండర్యము.** సం. వి. అ. న. పుండరీకమను గంధద్రవ్యవిశేషము. (రూ. పుండర్యము.)

**పౌఁజు.** వై. వి. 1. బారు, వరుస*; 2. దండు. (మొదటి రూపము పవుఁజు.)

**పౌఁజులుతీరు.** ద్వ. అ. క్రి. బారుతీరు. ''ఉ. మందిగుఱ్ఱాలు నేనుఁగులు మావుతులుం దొరలెన్నఁ బెక్కులై, క్రందుగఁగూర్మితో నెదురుగాఁజనిపౌఁజులుదీర.'' య. ౪, ఆ. (రూ. పౌఁజుదీరు. చూ. పౌజులుతీరుచు.) (మొదటిరూపము పవుఁజులుతీరు.)

**పౌఁజులుతీరుచు.** ద్వ. ప్రే. పౌఁజులుతీరఁజేయు. (రూ. పౌఁజులుతీర్చు, పౌఁజుతీర్చు. ''కపిరాజులఁబౌఁజులుతీర్చిచూపినన్.'' రామా. ౬, ఆ. ''ఎనసిబలయవెడలి యింద్రజిత్ప్రముఖులు, పౌఁజుతీర్చిరొక్కబయలనపుడు.'' రామా. ౭, ఆ.) (మొదటిరూపము పవుఁజులుతీరుచు, పవుఁజుతీర్చు.)

పౌఁజోలుసేయు. వై. స. క్రి. (పౌఁజోలు+చేయు.) పౌఁజోలు తీర్చు. "ఉ. పాలెము చుట్టుఁగా మలకుఁబార్థునిఁబౌఁజులునేయఁ బంచి." (కావలివారిసనిక్షత్ర అద్యాహార్యము.) జై. 3, ఆ. (మొదటిరూపము పవుఁజులుసేయు.)

పౌగండుఁడు. సం. వి. అ. పుం. బాలుఁడు.

పౌతవము. సం. వి. అ. న. త్రాసు, మూర, తూములోనగు మానము.

పౌత్తికము. సం. వి. అ. న. నేతిచేయగలతేనె.

పౌత్రి. సం. వి. ఈ. స్త్రీ. (కొడుకుకూఁతురు, కూఁతుకూఁతురు.) మనుమరాలు.

పౌత్రుఁడు. సం. వి. అ. పుం. కొడుకుకొడుకు, మనుమఁడు.

పౌనఃపున్యము. సం. వి. అ. న. మరలమరల చెప్పుట.

పౌరము. సం. వి. అ. న. కామంచిగీ. విశే. పురమునందుపుట్టినది.

పౌరస్త్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మొదటిది; 2. మొదటిదిక్కుది.

పౌరాణికుఁడు. సం. వి. అ. పుం. పురాణము తెలిసినవాఁడు.

పౌరుషము. సం. వి. అ. న. 1. పురుషభావము; 2. పురుషప్రయత్నము; 3. పురుషవ్యాపారము; 4. పరాక్రమము. విశే. పురుషునిచేయెత్తుపొడుగు.

పౌరుషేయము. సం. వి. అ. న. పురుషుఁడుచేసినపని. విశే. పురుషుఁడుచేసినది.

పౌరోగవుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) వంటయింటి అధికారి.

పౌరోహిత్యము. సం. వి. అ. న. పురోహితునికర్మము.

పౌర్ణమాసి. సం. వి. ఈ. స్త్రీ. పూర్ణిమ, పున్నమ.

పౌర్ణిమ. సం. వి. ఆ. స్త్రీ.——వై.——

పౌలస్త్యుఁడు. సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు; 2. రావణుఁడు.

పౌలు. దే. అ. క్రి. పగులుయొక్కరూపాంతరము. (మొదటిరూపము పవులు. "కుంభముల్ పవులఁగ." భార. భీష్మ. ౨, ఆ.)

పౌలోమి. సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రునిపెండ్లాము, శచి.

పౌషము. సం. వి. అ. పుం. పుష్యనక్షత్రముతోఁగూడిన పున్నమగలనెల, పుష్యమాసము.

పౌషి. సం. వి. ఈ. స్త్రీ. పుష్యమాసమందలిపున్నమ.

పౌష్కరము. సం. వి. అ. న. మెట్టదామరదుంప.

పౌష్పకము. సం. వి. అ. న. కుసుమాంజనము.

పౌష్పము. సం. విశే. (అ. ఈ. అ.) 1. పుష్పముచే చేయఁబడినది; 2. పుష్పసంబంధమైనది.

పౌళి. సం. వి. ఇ. పుం. గుగ్గిళ్లు, అభ్యూషము.

## ప్ర.

ప్ర. సం. ఉప. ప్రకర్షార్థకము. (ఇది సంస్కృతపదములకుముందు నిలిచి మిక్కిలి యనునర్థమునిచ్చుచున్నది. ఉదా. ప్రోక్తము, ప్రోక్షితము, ప్రోత్తుంగము, ప్రోత్థితము, ప్రోత్సాహము, ప్రోద్దామము, ప్రోద్ధతము మొ. ఇట్టివి తఱచుగా ప్రత్యేకముగా వ్రాయఁబడవు.)

ప్రంగ. వై. వి. ఎడమగాచాఁగినశాఖ*. (పంగకు మొదటిరూపము.)

ప్రకంపనుఁడు. సం. వి. అ. పుం. మిక్కిలి బలముగల వాయువు.

ప్రకటనము. సం. వి. అ. న. ప్రకటించుట.

ప్రకటము. సం. విశే. (అ. ఈ. అ.) ప్రసిద్ధము, వెల్లడి.

ప్రకటించు. సం. స. క్రి. ప్రకాశపఱచు, వెల్లడిచేయు.

ప్రకటితము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రకటింపఁబడినది.

ప్రకరణము. సం. వి. అ. న. 1. ప్రస్తావము; 2. గ్రంథభాగము; 3. నాటకభేదము. (చూ. నాటకము.)

ప్రకరము. సం. వి. అ. న. అగరు. పుం. 1. సమూహము; 2. చెదరినపుష్పములోనగునది.

ప్రకర్షము. సం. వి. అ. పుం. అతిశయము, మేలు.

ప్రకాండము. సం. వి. అ. పుం. న. 1. చెట్టునడిమిమొదలు గొమ్మ; 2. చెట్టుబోదె. విశే. ప్రశస్తవాచకము. (ఇది వృత్తియందు ఉత్తరపదమై శ్రేష్ఠమను తెలుపును. ఉదా. గోప్రకాండము మొ.)

ప్రకామము. సం. క్రి. విశే. అ. న. ఇచ్చవచ్చినట్లు.

ప్రకారము. సం. వి. అ. పుం. 1. పోలిక; 2. భేదము.

ప్రకాశము. సం. వి. అ. పుం. 1. ఎండ; 2. వెలుఁగు; 3. తళయాడించుచునవ్వుసునవ్వు. విశే. 1. మిక్కిలి ప్రసిద్ధము; 2. బయలుపడినది; 3. సమానము; 4. కాశరోగముగలది.

ప్రకాశించు. సం. అ. క్రి. 1. వెలుఁగు; 2. మెఱయు.

ప్రకీర్ణకము. సం. వి. అ. న. 1. వింజామరము; 2. విరివి. పుం. గుఱ్ఱము.

ప్రకీర్యము. సం. వి. అ. పుం. నెమలియడుగుచెట్టు. (పా. ప్రకిరము.) విశే. చేల్లఁదగినది.

ప్రకృతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కఁగా చేయఁబడినది; 2. ప్రకరణమువలన పొందఁబడినది.

ప్రకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రత్యయమురాకముందున్న శబ్దస్వరూపము; 2. ఉపాదానకారణము; 3. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 4. పౌరవర్గము; 5. సత్త్వాదిగుణసామ్యావస్థ; 6. స్వభావము; 7. స్వామ్యాది. (సప్తప్రకృతులు. — స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము.) 8. అవ్యక్తము. (అష్టప్రకృతులు. అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు.)

ప్రకృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రకర్షముగలది.

ప్రకోపము. సం. వి. అ. పుం. ముష్కరము.

ప్రకోపించు. సం. అ. క్రి. ముష్కరించు.

ప్రకోష్ఠము. సం. వి. అ. పుం. 1. తొట్టికట్టు; 2. ముంజేయి.

ప్రక్క. వై. వి. 1. పార్శ్వము; "సీ. నిఖిలప్రపంచంబునిక్కమీతనిడొక్కప్రక్కకుమెతుకుమాత్రంబునుమ్ము." పాంచా. ౨, ఆ.—2. పక్షము. (పక్కయొక్కరూపాంతరము.)

ప్రక్కి. దే. వి. ప్రక్కయొక్కరూపాంతరము.

ప్రక్కె. దే. వి. పిచులము1. (పక్కెకు మొదటిరూపము.)

ప్రక్రమము. సం. వి. అ. పుం. 1. క్రమము; 2. ఉపక్రమము; 3. అవసరము, తరవాయి.

**ప్రక్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆరంభింపఁబడినది; 2. అతిక్రమింపఁబడినది; 3. కడవఁబడినది.

**ప్రక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అధికారము; 2. ప్రకరణము; 3. మేలైనకార్యము; 4. శబ్దరూపముకలిగినవిధము.

**ప్రక్వణము.** సం. వి. అ. పుం. వీణాధ్వని.

**ప్రక్వాణము.** సం. వి. అ. పుం.——పై.——

**ప్రక్షాళకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) చేక్కగా కడుగువాఁడు.

**ప్రక్షాళనము.** సం. వి. అ. న. చేక్కగాకడుగుట.

**ప్రక్షాళించు.** సం. స. క్రి. చేక్కగాకడుగు.

**ప్రక్షాళితము.** సం. విణ. (అ. ఆ. అ.) చేక్కగాకడుగఁబడినది.

**ప్రక్షిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చేక్కగావిసరివేయఁబడ్డది; 2. చేర్పఁబడ్డది.

**ప్రక్షీణము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి క్షయించినది.

**ప్రక్షేపము.** సం. వి. అ. పుం. చేక్కగా విసరివేయుట. (రూ. ప్రక్షేపణము.)

**ప్రక్షోభించు.** సం. అ. క్రి. మిక్కిలి కలఁతపడు.

**ప్రక్ష్వేడనము.** సం. వి. అ. పుం. ఇనుపబాణము.

**ప్రఖరము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుపక్కెర; 2. కంచేరగాడిద; 3. కుక్క. విణ. మిక్కిలి కఱకైనది.

**ప్రఖ్యాతము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రసిద్ధికెక్కినది.

**ప్రఖ్యాతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి ప్రసిద్ధి.

**ప్రఖ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (ఉత్తరపదమైనచో) తుల్యుఁడు.

**ప్రగండము.** సం. వి. అ. పుం. మోఁచేతికిమీఁదిభాగము, సందిలి.

**ప్రగతజానుకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) దొడ్డికాళ్లవాఁడు, ప్రజ్ఞాడు.

**ప్రగతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. భొత్తిగాపోయినది; 2. ఎడముగలది.

**ప్రగల్భ.** సం. వి. ఆ. స్త్రీ. స్వీయాంతర్భేదవిశిష్టనాయికావిశేషము.

**ప్రగల్భుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిభగలవాఁడు.

**ప్రగాఢము.** సం. క్రి. విణ. అ. న. పెల్లి. విణ. 1. అధికము; 2. దృఢము.

**ప్రగుణము.** సం. విణ. (అ. ఆ. అ.) ఋజువు, సరియైనది.

**ప్రగ్గ.** వై. వి. ప్రంగయొక్కరూపాంతరము.

**ప్రగ్గము.** వై. వి. పగ్గమునకు మొదటిరూపము. (త్రాటికి.) "ఉ. ఎక్కునూలినుతా, ప్రగ్గమునందఁగాఁదరుమరందనరస్వరవింద గోష్ఠికిఁజా, వెగ్గలమాడుదేంట్లుమరువింటికిఁబూనెగుణద్వయత్వముతా." అము. ౫, ఆ. (ఈపద్యము ముందుభాగము గెడకడనున్నది.)

**ప్రగ్రహము.** సం. వి. అ. పుం. 1. చెఱ; 2. చెఱఁబడ్డది; 3. త్రాసుతూనికకోలమొదలైనవానిత్రాడు; 4. పగ్గము; 5. గుఱ్ఱములోనగువానిఁగట్టెడుపగ్గము; 6. బంగారు; 7. నియమనము; 8. భుజము; 9. హరిద్రుమము.

**ప్రగ్రాహము.** సం. వి. అ. పుం. 1. త్రాసుతూనికకోలమొదలైనవానిత్రాడు; 2. గుఱ్ఱములోనగువానిఁగట్టెడుపగ్గము.

**ప్రగ్రీవము.** సం. వి. అ. పుం, న. 1. కలశము; 2. ఒఱగుదిండు; 3. మెడ; 4. ప్రాసాదమునందలికిటికీ.

**ప్రఘణము.** సం. వి. అ. పుం. 1. తలవాకిటికి ప్రక్కనుండెడుచిన్నగది; 2. ఇనుపగుదియ; 3. రాగిబిందె.

**ప్రఘాణము.** సం. వి. అ. పుం. తలవాకిటికి ప్రక్కనుండెడుచిన్నగది.

**ప్రఘారము.** సం. వి. అ. పుం. జలాదిధార.

**ప్రఘూర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తిరుగుడుగలది.

**ప్రచండము.** సం. వి. అ. పుం. తెల్లగన్నేరు. విణ. 1. చేరరానిది; 2. వాఁడిమిగలది; 3. సాధ్యముకానిది.

**ప్రచక్రము.** సం. వి. అ. న. ప్రయాణమైనసేన.

**ప్రచయము.** సం. వి. అ. పుం. 1. సమూహము; 2. అనుదాత్తస్వరవిశేషము.

**ప్రచలాయితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కునికిపాటుగలవాఁడు, ఘూర్ణితుఁడు.

**ప్రచారము.** సం. వి. అ. పుం. 1. సంచారము; 2. కులాచారము; 3. వ్యవహారము; 4. ప్రవేశనిర్గమమార్గము.

**ప్రచురము.** సం. విణ. (అ. ఆ. అ.) అధికము, మిక్కుటము.

**ప్రచేతసుఁడు.** సం. వి. స్. పుం. 1. వరుణుఁడు; 2. ఒకముని. విణ. గొప్పమనస్సుగలవాఁడు. (రూ. ప్రచేతుఁడు.)

**ప్రచోదనము.** సం. వి. అ. న. ప్రేరేపించుట.

**ప్రచోదని.** సం. వి. ఈ. స్త్రీ. 1. వాఁకుడుచీ; 2. సంగడితెడ్డు.

**ప్రచోదితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రేరేపింపఁబడినది.

**ప్రచ్ఛర్దిక.** సం. వి. ఆ. స్త్రీ. వమనము, వాంతి.

**ప్రచ్ఛదపటము.** సం. వి. అ. పుం. 1. గవుసెన; 2. పఱచెడువస్త్రము.

**ప్రచ్ఛదము.** సం. వి. అ. పుం. కప్పుడు, ఆచ్ఛాదనము.

**ప్రచ్ఛన్నము.** సం. వి. అ. న. లోవాకిలి. విణ. కప్పఁబడినది.

**ప్రచ్ఛాదనము.** సం. వి. అ. న. 1. ఉత్తరీయము; 2. ఆచ్ఛాదనము.

**ప్రచ్ఛాదించు.** సం. స. క్రి. కప్పు, ఆచ్ఛాదించు.

**ప్రచ్ఛాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) కప్పఁబడినది.

**ప్రజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. సంతతి; 2. జనము.

**ప్రజనము.** సం. వి. అ. పుం. 1. ఆవు ఎనుములోనగువాని తొలిచూలు; 2. చూలు.

**ప్రజవి.** సం. విణ. (న్. ఈ. న్.) వడిగలవాఁడు, తరస్వి.

**ప్రజాత.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు, ప్రసూత.

**ప్రజాపతి.** సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. ఒక బ్రహ్మ. (చూ. బ్రహ్మ.)

**ప్రజావతి.** సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినవానిపెండ్లాము. అన్నపెండ్లాము. (అనికొందఱు.)

**ప్రజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. 1. బుద్ధి; 2. బ. సామర్థ్యమును దెలిపెడుమాటలు. (ఊరక ప్రజ్ఞలేలపల్కెదు.)

**ప్రజ్ఞానము.** సం. వి. అ. న. 1. బుద్ధి; 2. గుఱుతు.

**ప్రజ్ఞాపత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. పుస్తకమునందు గుఱుతుకువేసిన కాగితము.

**ప్రజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. పండితుఁడు. విశ. దొడ్డికాళ్ల వాఁడు.

**ప్రజ్ఞువు.** సం. విశ. (ఉ.) దొడ్డికాళ్లవాఁడు.

**ప్రజ్వలనము.** సం. వి. అ. న. 1. మండుట; 2. ప్రకాశించుట.

**ప్రజ్వలించు.** సం. అ. క్రి. 1. మండు; 2. ప్రకాశించు.

**ప్రజ్వలితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మండినది; 2. ప్రకాశించినది.

**ప్రడీనము.** సం. వి. అ. న. మొదటియెగురు.

**ప్రణతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నమ్రత; 2. నమస్కారము.

**ప్రణతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి వంగినవాఁడు; 2. నమస్కరించినవాఁడు; 3. శిక్షింపఁబడినవాఁడు.

**ప్రణమిల్లు.** సం. అ. క్రి. ప్రణామముచేయు, నమస్కరించు.

**ప్రణయకోపము.** సం. వి. అ. పుం. ప్రేమముయొక్క కుటిల ప్రచారమువలన కారణములేకయే నాయికానాయకులకుఁ గలిగెడు కోపము, పొలయలుక.

**ప్రణయము.** సం. వి. అ. పుం. 1. ప్రేమము; 2. ప్రార్థన; 3. వినయము; 4. విశ్వాసము; 5. పరిచయము.

**ప్రణయించు.** సం. స. క్రి. జ్వలింపఁజేయు. "చ. హిమకరుఁడప్పుడొప్పెఁ బ్రణయించితుషావృతివర్ధగార్హపత్యముక్రియ." కళా. ౮, ఆ.

**ప్రణయిని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రియురాలు. విశ. ప్రేమగల ఆఁడుది.

**ప్రణవము.** సం. వి. అ. పుం. ఓంకారము.

**ప్రణాదము.** సం. వి. అ. పుం. 1. అనురాగమువలనఁ బుట్టిన ధ్వని; 2. గట్టిమ్రోఁత; 3. చెవుడు.

**ప్రణామము.** సం. వి. అ. పుం. నమస్కారము, ప్రణతి.

**ప్రణాళి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నీళ్లుపోవుదారి; 2. నీళ్లుపోవుటకు భూమిలోఁ దీసిన త్రోవ. (రూ. ప్రణాళిక, ఆ. స్త్రీ. ప్రణాళము. అ. పుం.)

**ప్రణిధి.** సం. వి. ఇ. పుం. 1. వేగులవాఁడు; 2. ప్రార్థన.

**ప్రణిపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రణిపాతము.

**ప్రణిపాతము.** సం. వి. అ. పుం. (చూ.) అభివాదనము, ఏటికోళ్లు.

**ప్రణిహితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఒప్పుకొనఁబడినది; 2. ఉంచేఁబడినది; 3. పొందఁబడినది.

**ప్రణీత.** సం. వి. ఆ. స్త్రీ. యజ్ఞపాత్రవిశేషము. అ. పుం. ము. మంత్రముచేత సంస్కరింపఁబడిన అగ్ని. విశ. 1. చేయఁబడినది; 2. చొప్పింపఁబడినది; 3. త్రోయఁబడినది; 4. నీళ్లుపోసి వండఁబడినది.

**ప్రణుతము.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి పొగడఁబడినది.

**ప్రణుతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి పొగడిక.

**ప్రణుతించు.** సం. స. క్రి. మిక్కిలి పొగడు.

**ప్రణేయము.** సం. విశ. (అ. ఆ. అ.) మందుమాఁకులచేత లోఁబడినది, వశ్యము.

**ప్రతతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తీఁగ; 2. విరివి.

**ప్రతనము.** సం. విశ. (అ. ఆ. అ.) పురాతనము, ప్రాఁత.

**ప్రతలము.** సం. వి. అ. న. పాతాళవిశేషము. పుం. (చూ.) చేప్పట.

**ప్రతాపము.** సం. వి. అ. పుం. 1. కోశబలములవలనఁగలిగిన తేజము; 2. వేఁడిమి.

**ప్రతాపసము.** సం. వి. అ. పుం. తెల్లజిల్లేడుచెట్టు.

**ప్రతాపించు.** సం. అ. క్రి. ప్రతాపముచూపు. "శివుతోనెక్కటికయ్యముఁదొడరిమెచ్చించెం బ్రతాపించి." జై. ౫, ఆ.

**ప్రతారకుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) మోసపుచ్చువాఁడు.

**ప్రతారణము.** సం. వి. అ. న. మోసపుచ్చుట.

**ప్రతారించు.** సం. స. క్రి. మోసపుచ్చు.

**ప్రతారితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మోసపుచ్చఁబడినవాఁడు.

**ప్రతి.** సం. అవ్య. 1. సమానము; "ఎవ్వారునీప్రతిలేరీభువనత్రయంబున." హరి. ఉ. ౧౦, ఆ.–2. మాఱు. "ఏనునీప్రతిగనర్చనచేసెదఁగానిశాంభవిక." జై. ౮, ఆ. (సదాద్యవ్యయములవలె దీనికి ప్రయోగమని యెఱుంగునది.)

**ప్రతికర్మము.** సం. వి. న్. న. వస్త్రాద్యలంకరణము, కైసేఁత.

**ప్రతికారము.** సం. వి. అ. పుం. మాఱుచేఁత.

**ప్రతికూలము.** సం. విశ. (అ. ఆ. అ.) అనుకూలముకానిది.

**ప్రతికృతము.** సం. విశ. (అ. ఆ. అ.) మాఱుచేయఁబడినది.

**ప్రతికృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రతిమ; 2. మాఱురూపు; 3. మాఱుచేఁత.

**ప్రతికృష్టుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఆచారాదిహీనత్వముచేత నిందింపఁబడినవాఁడు.

**ప్రతిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రతికారము; 2. మందు.

**ప్రతిక్షిప్తుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆక్షేపింపఁబడినవాఁడు; 2. అడ్డగింపఁబడినవాఁడు; 3. పంపఁబడినవాఁడు.

**ప్రతిగృహీత.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) దానము పుచ్చుకొనువాఁడు.

**ప్రతిగృహీతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దానము పుచ్చుకొన్నవాఁడు.

**ప్రతిగ్రహము.** సం. వి. అ. పుం. 1. పుచ్చుకొనుట; 2. దానము పుచ్చుకొనుట; 3. దానద్రవ్యము; 4. సేనకువెనుకటిబలము; 5. తమ్మపడిగము; 6. గ్రహభేదము.

**ప్రతిగ్రహించు.** సం. స. క్రి. దానముపుచ్చుకొను.

**ప్రతిగ్రాహము.** సం. వి. అ. పుం. పతద్గ్రహము, తమ్మపడిగము.

**ప్రతిగ్రాహ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) పుచ్చుకొనఁదగినది.

**ప్రతిఘటనము.** సం. వి. అ. న. మాఱొడ్డుట.

**ప్రతిఘటించు.** సం. అ. క్రి. మాఱొడ్డు.

**ప్రతిఘము.** సం. వి. అ. పుం. 1. కోపము; 2. మాఱుదెబ్బ; 3. పగతీర్చుకొనుట; 4. మూర్ఛ.

**ప్రతిఘాతము.** సం. వి. అ. పుం. 1. మాఱుదెబ్బ; 2. పగతీర్చుకొనుట.

**ప్రతిఘాతనము.** సం. వి. అ. న. చంపుట, వధము.

**ప్రతిఘాతి.** సం. విశే. (న్. ఈ. న్.) పగతీర్చుకొనువాఁడు.

**ప్రతిచ్ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రతిమానము, ప్రతిమ.

**ప్రతిజాగరము.** సం. వి. అ. పుం. ఎచ్చరిక. కాచుట. (అనికొందఱు.)

**ప్రతిజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పదేనొకపనిని తప్పకచేసెదనని దృఢముగా చెప్పుట; 2. అంగీకారము.

**ప్రతిజ్ఞాతము.** సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది, ఇయ్యకొనఁబడినది.

**ప్రతిజ్ఞాతవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రతిజ్ఞచేయఁదగినది; 2. అంగీకరింపఁదగినది.

**ప్రతిజ్ఞానము.** సం. వి. అ. న. అంగీకారము.

**ప్రతిజ్ఞేయము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రతిజ్ఞచేయఁదగినది; 2. అంగీకరింపఁదగినది.

**ప్రతిదానము.** సం. వి. అ. న. 1. వస్తువులమాఱుపు; 2. దాఁచ నిచ్చినదానిని మరలనిచ్చుట.

**ప్రతిదారణము.** సం. వి. అ. న. యుద్ధము, పోరు.

**ప్రతిదినము.** సం. వి. అ. న. దినదినము, ప్రత్యహము.

**ప్రతిధ్వానము.** సం. వి. అ. పుం. మాఱుమ్రోఁత.

**ప్రతిన.** వై. వి. పంతము, ప్రతిజ్ఞ. "క. ఈ ప్రతినయొట్టితెలఁగున, న ప్రతిహతవృత్తినెగడునట్టితెఱఁగులో, క ప్రభువనీవచేయుము, తి ప్రకటపరాక్రమ ప్రదీప్తుఁడనగుదుర్." భార. ద్రో. ౨, ఆ.

**ప్రతినిధి.** సం. వి. ఇ. పుం. 1. ప్రతిమ; 2. మాఱు.

**ప్రతినివిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) పట్టుపట్టఁబడినది.

**ప్రతినివేశము.** సం. వి. అ. పుం. అక్కఱ, పట్టు.

**ప్రతిపక్షుఁడు.** సం. వి. అ. పుం. 1. శత్రువు; 2. ప్రతివాది.

**ప్రతిపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. గౌరవము; 2. తెలివి; 3. నేర్పు; 4. ప్రవేశము; 5. ప్రాప్తి; 6. పదప్రాప్తి.

**ప్రతిపత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. పాడ్యమి; 2. బుద్ధి.

**ప్రతిపన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినది; 2. తెలియఁబడినది.

**ప్రతిపాదకము.** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఇచ్చునది; 2. కలిగించునది; 3. తెలుపునది; 4. నిరూపించునది.

**ప్రతిపాదనము.** సం. వి. అ. న. 1. ఇచ్చుట; 2. కలిగించుట; 3. తెలుపుట; 4. నిరూపించుట.

**ప్రతిపాదించు.** సం. స. క్రి. 1. కలిగించు; 2. తెలుపు; 3. నిరూపించు.

**ప్రతిపాదితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రతిపాదింపఁబడినది.

**ప్రతిపాద్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రతిపాదింపఁదగినది.

**ప్రతిపాలకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) రక్షకుఁడు.

**ప్రతిపాలనము.** సం. వి. అ. న. రక్షణము.

**ప్రతిపాలించు.** సం. స. క్రి. రక్షించు.

**ప్రతిఫలనము.** సం. వి. అ. న. మాఱురూపముతోఁచుట.

**ప్రతిఫలించు.** సం. అ. క్రి. మాఱురూపముతోఁచు.

**ప్రతిఫలితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రతిఫలించినది.

**ప్రతిబంధకము.** సం. విశే. (అ. ఈ. అ.) అడ్డగించునది, ప్రతిరోధకము.

**ప్రతిబంధము.** సం. వి. అ. పుం. అడ్డగింత.

**ప్రతిబంధించు.** సం. స. క్రి. అడ్డగించు.

**ప్రతిబద్ధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినవాఁడు; 2. మనసుచెడినవాఁడు.

**ప్రతిబింబము.** సం. వి. అ. న. 1. ప్రతిఫలనము; 2. ప్రతిమ.

**ప్రతిబింబించు.** సం. అ. క్రి. ప్రతిఫలించు.

**ప్రతిబింబితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రతిఫలితము.

**ప్రతిభ.** సం. వి. ఆ. స్త్రీ. అప్పటప్పటికి వికసించెడుబుద్ధి.

**ప్రతిభటుఁడు.** సం. వి. అ. పుం. పగవాఁడు, శత్రువు.

**ప్రతిభయము.** సం. వి. అ. న. భయానకరసము. విశే. భయానకరసముగలది.

**ప్రతిభువు.** సం. వి. ఊ. పుం. పూఁటకాఁపు.

**ప్రతిమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. శిలాదినిర్మితవిష్ణ్వాదిమూర్తి; 2. ఏనుఁగువాహిత్థము క్రిందికొమ్ములనడిమిచోటు; 3. పోలిక.

**ప్రతిమానము.** సం. వి. అ. న. 1. శిలాదినిర్మితవిష్ణ్వాదిమూర్తి; 2. ఏనుఁగువాహిత్థము క్రిందికొమ్ములనడిమిచోటు; 3. తడగట్టెడి ఒడ్డిక. (చూ. ఒడ్డిక.)

**ప్రతిమాల.** సం. వి. ఆ. స్త్రీ. అంతాదిగ్రంథము.

**ప్రతిముక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; (వస్త్రము.) 2. తొడుగఁబడినది. (కవచము.)

**ప్రతిముఖము.** సం. వి. అ. న. ఒకనాటకసంధి. (చూ. సంధి.)

**ప్రతియత్నము.** సం. వి. అ. పుం. 1. ఇచ్ఛ; 2. అనుకూల్యము; 3. ప్రతీకారము; 4. సంస్కారము.

**ప్రతియాతన.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రతిమ; 2. తుల్యయాతన.

**ప్రతియోగము.** సం. వి. అ. పుం. విరోధము, పగ.

**ప్రతియోగి.** సం. విశే. (న్. ఈ. న్.) పగవాఁడు.

**ప్రతిరోధము.** సం. వి. అ. పుం. 1. ఎదిరించుట; 2. దొంగతనము.

**ప్రతిరోధి.** సం. వి. న్. పుం. 1. ఎదిరించువాఁడు; 2. దొంగ.

**ప్రతిలోమము.** సం. విశే. (అ. ఆ. అ.) అవరోహణక్రమము గలది.

**ప్రతివసథము.** సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.

**ప్రతివసించు.** సం. అ. క్రి. వసించు, ఉండు.

**ప్రతివాక్యము.** సం. వి. అ. న. మాఱుమాట.

**ప్రతివాది.** సం. విశే. (న్. ఈ. న్.) వాదికి ప్రతిపక్షమువాఁడు.

**ప్రతివాదించు.** సం. అ. క్రి. వాదికి ప్రతిపక్షముగామాటాడు.

**ప్రతివాసి.** సం. విశే. (న్. ఈ. న్.) ఇరుగుపొరుగులనుండు వాఁడు.

**ప్రతివిధానము.** సం. వి. అ. న. మాఱుసేఁత.

**ప్రతివిష.** సం. వి. ఆ. స్త్రీ. అతివసఁ.

**ప్రతివేశము.** సం. వి. అ. పుం. ఇరుగుపొరుగు ఇల్లు.

**ప్రతిశాసనము.** సం. వి. అ. న. పిలిచి పనిపంచుట.

**ప్రతిశీర్షకము.** సం. వి. అ. న. కుదువ, ఆధి.

**ప్రతిశ్యాయము.** సం. వి. అ. పుం. పడిసెము.

**ప్రతిశ్రయము.** సం. వి. అ. పుం. 1. గృహము; 2. ప్రాపు; 3. సభ; 4. సత్తరువు.

**ప్రతిశ్రవము.** సం. వి. అ. పుం. అంగీకారము.

**ప్రతిషిద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) నిషేధింపఁబడ్డది.

**ప్రతిషేధకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిషేధించువాఁడు.

**ప్రతిషేధము.** సం. వి. అ. పుం. అడ్డగింత, నిషేధము.

**ప్రతిషేధించు.** సం. స. క్రి. అడ్డగించు, నిషేధించు.

**ప్రతిష్టంభము.** సం. వి. అ. పుం. అడ్డగింత.

**ప్రతిష్టబ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

**ప్రతిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గౌరవము; 2. చోటు; 3. శాశ్వతముగ నిలుపుట; 4. నేల; 5. నాలుగవ ఛందస్సు. (చూ. ఛందస్సు.)

**ప్రతిష్ఠించు.** సం. స. క్రి. శాశ్వతముగ నిలుపు.

**ప్రతిష్ఠితము.** సం. విశే. (అ. ఆ. అ.) శాశ్వతముగ నిలుపఁబడినది.

**ప్రతిసరము.** సం. వి. అ. పుం, న. 1. ఏనుఁగుకుంభముల క్రింది చోటు; 2. చేతఁగట్టుకొనుతోరము; 3. భూషణము. పుం. 1. కడియము; 2. పూదండ; 3. మంత్రవిశేషము; 4. సేన వెనుకటిదిక్కు; 5. వ్రణశుద్ధి. విశే. నియోగింపఁదగినది.

**ప్రతిసర్గము.** సం. వి. అ. పుం. మన్వాదిసృష్టి. (పురాణలక్షణములలో నొకటి. చూ. లక్షణము.)

**ప్రతిసీర.** సం. వి. ఆ. స్త్రీ. తెరచీర, యవనిక.

**ప్రతిస్పర్ధ.** సం. వి. ఆ. స్త్రీ. స్పర్ధ, పోటి.

**ప్రతిస్పర్ధించు.** సం. అ. క్రి. స్పర్ధచేయు, పోటిచేయు. "వ. వింధ్యంబనుమహీధరంబువిబుధశైలంబుతోఁ బ్రతిస్పర్ధించి." కాశీ. ౩, ఆ.

**ప్రతిహతి.** సం. వి. ఇ. స్త్రీ. విఘాతము, అడ్డగింత.

**ప్రతిహతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినవాఁడు; 2. మనసుచెడినవాఁడు.

**ప్రతిహారకుఁడు.** సం. వి. అ. పుం. గారడివిద్యయందు నేర్పరియైనవాఁడు.

**ప్రతిహారి.** సం. వి. న్. పుం. వాకిటికావలివాఁడు.

**ప్రతిహారుఁడు.** సం. వి. అ. పుం.______పై.______

**ప్రతిహాసము.** సం. వి. అ. పుం. గన్నేరుఁ.

**ప్రతీకము.** సం. వి. అ. పుం. అవయవము. విశే. 1. ప్రతికూలము; 2. అనుకూలము.

**ప్రతీకారము.** సం. వి. అ. పుం. 1. ప్రత్యపకారము; 2. చికిత్స.

**ప్రతీకాశము.** సం. విశే. (అ. ఆ. అ.) (ఉత్తరపదము) తుల్యము.

**ప్రతీక్షణము.** సం. వి. అ. న. (ప్రత్యాశతో) ఎదురుచూచుట.

**ప్రతీక్షించు.** సం. అ. క్రి. (ప్రత్యాశతో) ఎదురుచూచు.

**ప్రతీక్ష్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పూజ్యుఁడు.

**ప్రతీచి.** సం. వి. ఈ. స్త్రీ. పశ్చిమదిక్కు, పడమర.

**ప్రతీచీనము.** సం. విశే. (అ. ఆ. అ.) పశ్చిమదిక్కునందు పుట్టినది.

**ప్రతీతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధికెక్కినది; 2. ఎఱుఁగఁబడినది; 3. ఆదరింపఁబడినది; 4. సంతోషమునొందినది.

**ప్రతీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రసిద్ధి; 2. ఎఱుక; 3. ఆదరము; 4. సంతోషము.

**ప్రతీపదర్శిని.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది, అంగన.

**ప్రతీపము.** సం. వి. అ. న. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.) విశే. ప్రతికూలము.

**ప్రతీపుఁడు.** సం. వి. అ. పుం. 1. పగవాఁడు; 2. చంద్రవంశజుఁడైన ఒకానొకరాజు.

**ప్రతీరము.** సం. వి. అ. న. (నద్యాది) తీరము, గట్టు.

**ప్రతీవాపము.** సం. వి. అ. పుం. 1. జనోపద్రవము; 2. నిక్షేపించుట; 3. రాలినలోహపుపొడినికాఁచి దాఁగఁగొట్టుట.

**ప్రతీహారము.** సం. వి. అ. పుం 1. ద్వారము; 2. పూర్వము నేను వీనికి మేలుచేసితినిగాన నిప్పుడు వీఁడు నాకు మేలుచేయునని యెంచి చేయునట్టిసంధి.

**ప్రతీహారి.** సం. వి. ఈ. స్త్రీ. ద్వారపాలకురాలు. న్. పుం. ద్వారపాలకుఁడు.

**ప్రతీహారుఁడు.** సం. వి. అ. పుం. ప్రతిహారుఁడు.

**ప్రతున్నము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి వ్యథపెట్టఁబడినది.

**ప్రతోదము.** సం. వి. అ. పుం. గుఱ్ఱములోనగువానికొట్టెడు ముసికోల.

**ప్రతోళి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. పెద్దవీథి, రథ్య.

**ప్రత్తి.** దే. వి. విత్తులతోనుండుదూది, కార్పాసము. (పత్తికి మొదటి రూపము. దీని భేదములు. ఎఱ్ఱప్రత్తి, జడప్రత్తి, పుల్లప్రత్తి, పైఁడి ప్రత్తి.)

**ప్రత్నము.** సం. విశే. (అ. ఆ. అ.) పురాతనము.

**ప్రత్యంతపర్వతము.** సం. వి. అ. పుం. పెద్దకొండచేరువనుండు చిన్నకొండ, గుట్ట.

**ప్రత్యక్శ్రేణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఎలుకచెవిచెట్టు; 2. దంతిచెట్టు.

**ప్రత్యక్పర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేనుఁ.

**ప్రత్యక్పుష్పి.** సం. వి. ఈ. స్త్రీ.______పై.______

**ప్రత్యక్షము.** సం. విశే. (అ. ఆ. అ.) చక్షురాదీంద్రియగోచర మైనది, ఐంద్రియకము.

**ప్రత్యక్షవాది.** సం. వి. న్. పుం. జైనుఁడు, బౌద్ధుఁడు.

**ప్రత్యగ్రము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నూతనము; 2. పరిశుద్ధము.

**ప్రత్యనీకము.** సం. వి. అ. న. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**ప్రత్యనీకుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు, పగవాఁడు.

**ప్రత్యయము.** సం. వి. అ. పుం. 1. సుప్తిఙాది; 2. విశ్వాసము; 3. ప్రసిద్ధి; 4. జ్ఞానము; 5. ఆచారము; 6. శపథము; 7. అవకాశము; 8. వశము; 9. హేతువు.

**ప్రత్యయితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నమ్మఁబడినవాఁడు, ఆప్తుఁడు.

**ప్రత్యర్థి.** సం. వి. న్. పుం. 1. శత్రువు; 2. ప్రతివాది.

**ప్రత్యవసానము.** సం. వి. అ. న. భోజనము, కుడుపు.

**ప్రత్యవసితము.** సం. విశే. (అ. ఆ. అ.) భుజింపఁబడినది, కుడువఁబడినది.

**ప్రత్యవాయము.** సం. వి. అ. పుం. 1. పాపము; 2. దురదృష్టము.

**ప్రత్యహము.** సం. అవ్య. దినదినము, ప్రతిదినము.

**ప్రత్యాకారము.** సం. వి. అ. పుం. ఖడ్గాదులయొఱ.

**ప్రత్యాఖ్యాతము.** సం. విశే. (అ. ఆ. అ.) కూడదని నిరాకరింపఁబడినది.

**ప్రత్యాఖ్యానము.** సం. వి. అ. న. కూడదని నిరాకరించుట.

**ప్రత్యాదిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) (చూ.) ప్రత్యాఖ్యాతము.

**ప్రత్యాదేశము.** సం. వి. అ. పుం. ప్రత్యాఖ్యానము.

**ప్రత్యాబ్దికము.** సం. వి. అ. న. ప్రతి సంవత్సరముచేసెడు శ్రాద్ధము.

**ప్రత్యాలీఢము.** సం. వి. అ. న. విలుకాఁడు ఎడమకాలు ముందటికిచాఁచినిలుచుట. (చూ. స్థానము.)

**ప్రత్యాశ.** సం. వి. ఆ. స్త్రీ. కలుగునని ఆశ, అడియాస.

**ప్రత్యాసత్తి.** సం. వి. ఇ. స్త్రీ. సంగతి, చేరిక.

**ప్రత్యాసన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) సంగతము, చేరికయైనది.

**ప్రత్యాసారము.** సం. వి. అ. పుం. వ్యూహము వెనుకనుండు ఘటియొక వ్యూహము.

**ప్రత్యాహారము.** సం. వి. అ. పుం. 1. విషయములవలన నింద్రియముల మరలించుట; (ఇది యోగాంగములలోనొకటి.) 2. (వ్యాకరణమున) వర్ణసంగ్రహము.

**ప్రత్యుత్క్రమము.** సం. వి. అ. పుం. ప్రయోగము. యుద్ధముకొఱకైన భటులయుద్యమము. (అనికొందఱు.)

**ప్రత్యుత్తరము.** సం. వి. అ. న. మాఱుత్తరము.

**ప్రత్యుత్థానము.** సం. వి. అ. న. (చూ.) అభ్యుత్థానము.

**ప్రత్యుద్గతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఎదురుకొని తేచిన వాఁడు.

**ప్రత్యుద్గమము.** సం. వి. అ. పుం. ప్రత్యుత్థానము.

**ప్రత్యుద్గమించు.** సం. అ. క్రి. ఎదుర్కొనిపోవు. "వ. అజ్జగతీధరంబు కొన్నిపజ్జలు ప్రత్యుద్గమించి." కాశీ. ౨, ఆ.

**ప్రత్యుషము.** సం. వి. స్. న. అ. పుం. ప్రత్యూషము.

**ప్రత్యూషము.** సం. వి. అ. పుం, న. (చూ.) ప్రభాతము. పుం. డు. ఒకవసువు.

**ప్రత్యూహము.** సం. వి. అ. పుం. విఘ్నము, చెఱుపు.

**ప్రత్యేకము.** సం. వి. అ. న. వేఱువేఱు.

**ప్రత్యేకించు.** సం. అ. క్రి. ప్రత్యేకముగు, వేఱువేఱగు.

**ప్రథ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రఖ్యాతి, పేరు.

**ప్రథమము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. మొదటిది; 2. ముఖ్యము.

**ప్రథితి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రఖ్యాతి, ప్రథ.

**ప్రథితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రఖ్యాతినొందినవాఁడు, ప్రతీతుఁడు.

**ప్రథిమ.** సం. వి. న్. పుం. విరివి. (రూ.) ప్రథిమము.

**ప్రదక్షిణము.** సం. వి. అ. న. ప్రదక్షిణించుట.

**ప్రదక్షిణించు.** సం. స. క్రి. దేవతాదులనుద్దేశించి కుడికితిరిగి వచ్చు, వలగొను.

**ప్రదరము.** సం. వి. అ. పుం. 1. బాణము; 2. చీలుట; 3. విఱుచుట; 4. ఆఁడుదానికికలుగు రక్తస్రావరోగము.

**ప్రదర్శకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) విశదపఱచి చూపువాఁడు.

**ప్రదర్శనము.** సం. వి. అ. న. విశదపఱచి చూపుట.

**ప్రదర్శితము.** సం. విశే. (అ. ఆ. అ.) విశదపఱచిచూపఁబడినది.

**ప్రదానము.** సం. వి. అ. న. ప్రకృష్టదానము, గొప్పయీవి.

**ప్రదీపనము.** సం. వి. అ. పుం. అంజనాద్రియందుఁబుట్టిన రక్తవర్ణముగల విషభేదము.

**ప్రదీపము.** సం. వి. అ. పుం. దీపము, దివ్వె.

**ప్రదేశనము.** సం. వి. అ. న. కానుక, ఉపాయనము.

**ప్రదేశము.** సం. వి. అ. పుం. 1. చోటు; 2. దేశము; 3. (చూ.) జోట్టిలి; 4. జెత్తిలి.

**ప్రదేశిని.** సం. వి. ఈ. స్త్రీ. జోట్టనవ్రేలు, తర్జని.

**ప్రదోషము.** సం. వి. అ. పుం. 1. మునిమాపు; 2. మిక్కిలి దోషము.

**ప్రద్యుమ్నుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**ప్రద్యోతనుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**ప్రద్రావము.** సం. వి. అ. పుం. యుద్ధమువలనఁబాఱుట, ఓడుట. (రూ.) ప్రద్రవము.

**ప్రధనము.** సం. వి. అ. న. 1. యుద్ధము; 2. చీల్చుట.

**ప్రధానము.** సం. వి. అ. న. 1. పరమాత్మ; 2. ప్రకృతి; 3. బుద్ధి; 4. వి. ముఖ్యము.

**ప్రధానుఁడు.** సం. వి. అ. న. 1. కార్యసహాయుఁడు; 2. మధ్యమాధికారి; 3. వి. ముఖ్యుఁడు.

**ప్రధారణము.** సం. వి. అ. న. ఫలమపేక్షించియిచ్చుట.

**ప్రధావించు.** సం. అ. క్రి. పరుగెత్తు, పాఱు.

**ప్రధి.** సం. వి. ఇ. పుం. బండికంటికడకమ్మి, నేమి.

**ప్రధ్వంసము.** సం. వి. అ. పుం. నాశము, చేటు.

**ప్రన్న.** దే. విశ. మనోజ్ఞము.

**ప్రన్నన.** దే. వి. మనోజ్ఞత. (విశేషణమగుచో. "క. మున్నేనుమేనలందిన, ప్రన్ననిభసితంబునడఁచిశ్రమవారికడుఁగా, జెన్నెసఁగె మంచుమలమం, చున్నాఁచికొనిప్రవహించుసురనదిపగిదిఁగా." పాండు. ౫, ఆ. చూ. అలకన.)

**ప్రప.** సం. వి. ఆ. స్త్రీ. చేలిపందిరి, పానీయశాలిక.

**ప్రపంచము.** సం. వి. అ. పుం. 1. భూలోకము; 2. సంసారము; 3. శబ్దవిస్తరము; 4. విరివి; 5. రచన; 6. వ్యత్యాసము; 7. మోసపుచ్చుట.

**ప్రపంచించు.** సం. స. క్రి. విరివిచేయు, విస్తరించు.

**ప్రపంచితము.** సం. విశ. (అ. ఆ. అ.) విరివిచేయఁబడినది, విస్తరింపఁబడినది.

**ప్రపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. భక్తిపరులుచేయు శరణాగతి.

**ప్రపదము.** సం. వి. అ. న. 1. మునుగాలు; 2. మీఁగాలు. "ప్రపదములుదులులు." కవి. ౧, ఆ.

**ప్రపన్నుడు.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రపత్తిచేసినవాఁడు.

**ప్రపాతము.** సం. వి. అ. పుం. 1. కొండచఱియ; 2. కునికిపాటు.

**ప్రపితామహి.** సం. వి ఈ. స్త్రీ. ప్రపితామహునిభార్య.

**ప్రపితామహుఁడు.** సం. వి. అ. పుం. 1. ముత్తాత; 2. బ్రహ్మ.

**ప్రపున్నాటము.** సం. వి. అ. పుం. తగిరిసె. (చూ. ప్రపున్నటము.)

**ప్రపౌండరీకము.** సం. వి. అ. న. పుండరీకమను గంధద్రవ్యము.

**ప్రపౌత్రి.** సం. వి. ఈ. స్త్రీ. పౌత్రునికూఁతురు, ముమ్మనుమరాలు.

**ప్రపౌత్రుఁడు.** సం. వి. అ. పుం. పౌత్రునికొడుకు, ముమ్మనుమఁడు.

**ప్రప్రపితామహుఁడు.** సం. వి. అ. పుం. ప్రపితామహుని తండ్రి.

**ప్రఫుల్లము.** సం. విశ. (అ. ఆ. అ.) వికసించినది.

**ప్రబంధము.** సం. వి. అ. పుం. కావ్యము.

**ప్రబర్హము.** సం. విశ. (అ. ఆ. అ.) ముఖ్యము, మొదటిది.

**ప్రబలము.** సం. వి. అ. పుం. చిగురు. విశ. మిక్కిలి బలము గలది.

**ప్రబలు.** వై. అ. క్రి. 1. అతిశయిల్లు; "తే. కర్ణజానికీర్తితాళికవిఖ్యాతమగుచుఁ, బ్రబలుఁగాకనిదీవించి." జై. ౨, ఆ.— 2. వర్ధిల్లు. "సీ. కాలకూటానలగర్వంబుసర్వంబు ప్రచ్ఛన్నతను లీలఁబ్రబలెనసఁగ." హరి. పూ. ౬, ఆ.

**ప్రబుద్ధము.** సం. విశ. (అ. ఆ. అ.) (చూ.) ప్రఫుల్లము.

**ప్రబుద్ధుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మేలుకొన్నవాఁడు.

**ప్రబోధనము.** సం. వి. అ. న. అత్తరు, అనుబోధము.

**ప్రబోధము.** సం. వి. అ. పుం. 1. మిక్కిలి తెలివి; 2. మేలుకోలు.

**ప్రబోధించు.** సం. స. క్రి. 1. చక్కగా తెలుపు; 2. మేలుకొలుపు.

**ప్రబ్బ.** దే. వి. ప్రబ్బలియొక్కరూపాంతరము.

**ప్రబ్బలి.** దే. వి. ప్రబ్బతీఁగ, వేతసము. "సీ. భాగసుల దంతి నిందగపడఁజేయరే ప్రబ్బలారసురుంగుదబ్బలార." రసి. ౬, ఆ.

**ప్రబ్బికోలు.** దే. వి. ప్రబ్బికొనుట. (చూ. ప్రబ్బు, పొగడికోలు.)

**ప్రబ్బు.** దే. అ. క్రి. 1. వ్యాపించు; "క. దంపతులరాగరసముల, పెంపొమన్మథతమంబుపెంపొయసఁగా, సొంపగుసంధ్యారాగపు, సంపదయునుజీకువాలుఁబ్రబ్బెఁబయిపయిన్." భో. ౪, ఆ. (చూ. కవట.) 2. వర్తిల్లు; "సీవల్లజగములునెఱిజనించుఁ బ్రబ్బులేదగుసంచుఁబలుకుటతప్పుగాదు." భాగ. ౧౦, స్కం. పూ.—3. అతిశయించు; "క. ప్రబ్బినభక్తినిహరిపైఁ, గబ్బంబులుసెప్పికవులుకైవల్యశ్రీ, కబ్బుదురఁట." భాగ. ౧౦, స్కం. పూ.—4. వర్ధిల్లు. "అధర్మంబంతకంతకుఁబ్రబ్బ." భార. శాం. 3, ఆ.—స. క్రి. 1. నిందించు; (చూ. పొగడికోలు.) 2. కలయు. "సీ. మెడఁగెంపుజాతాళినిడుకొనివనమాలి లిబ్బిగుబ్బెతఁబ్రబ్బియుబ్బుచెల్ల." ఉ, రా. ౫, ఆ.—వి. నింద. "ఉ. అతినృశంసతనింతులఁజేసినట్టియా, పంకజసూతిపైనెఱయఁబ్రబ్బిడివేగమయగ్నిఁజొచ్చెదన్." కాశీ. ౫, ఆ.

**ప్రభ.** సం. వి. ఆ. స్త్రీ. 1. వెలుఁగు; 2. కుబేరునిపట్టణము; 3. సూర్యునిభార్య; 4. దుర్గ.

**ప్రభంజనుఁడు.** సం. వి. అ. పుం. వాయువు. విశ. చక్కగా విఱుచువాఁడు.

**ప్రభవ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. పుట్టుక; 2. పుట్టుకకు కారణము; 3. తెలివికి మొదటి చోటు; 4. పరాక్రమము.

**ప్రభవించు.** సం. అ. క్రి. పుట్టు, కలుగు, జనించు.

**ప్రభాకరుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**ప్రభాతము.** సం. వి. అ. న. తెల్లవాఱుటకుముందు నాలుగుగడియలుగల కాలము, వేకువ. (ప్రభాతసంబంధమైనది ప్రాభాతికము.)

**ప్రభావము.** సం. వి. అ. పుం. 1. కోశబలములవలనఁ గలిగిన తేజము; 2. శక్తి.

**ప్రభిన్నము.** సం. వి. అ. పుం. మదముపట్టినయేనుఁగు. విశ. మిక్కిలి భేదపడినది.

**ప్రభువు.** సం. వి. ఉ. పుం. విష్ణువు. విశ. 1. అధిపుఁడు; 2. సమర్థుఁడు.

**ప్రభూతము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. అధికము; 2. ఉన్నతము; 3. సంభూతము.

**ప్రభృతి.** సం. వి. ఇ. స్త్రీ. మొదలు. (మునిప్రభృతిజనంబులు.)

**ప్రభ్రష్టకము.** సం. వి. అ. న. సిగనువ్రేలెడుదండ.

**ప్రమ.** సం. వి. ఆ. స్త్రీ. యథార్థజ్ఞానము, ప్రమితి.

**ప్రమత్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రమాదపడిన వాఁడు; 2. మిక్కిలి మత్తుకొన్నవాఁడు.

**ప్రమథనము.** సం. వి. అ. న. చంపుట, వధము.

**ప్రమథాధిపతి.** సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి.

**ప్రమథితము.** సం. వి. అ. న. నీళ్లుపోయక చిలికిన మజ్జిగ.

**ప్రమథుఁడు.** సం. వి. అ. పుం. శివభటుఁడు.

**ప్రమద.** సం. వి. ఆ. స్త్రీ. 1. యౌవనాదిమదముగల ఆఁడుది; 2. ఆఁడుది. అ. పుం. ము. సంతోషము. విణ. మిక్కిలి మదము గలది.

**ప్రమదావనము.** సం. వి. అ. న. అంతఃపురస్త్రీలు విహరింపఁదగిన యుద్యానవనము. (రూ. ప్రమదవనము.)

**ప్రమనుఁడు.** సం. విణ. (స్.) సంతోషమునొందిన మనస్సుగల వాఁడు.

**ప్రమాణము.** సం. వి. అ. న. 1. ప్రత్యక్షాదిజ్ఞానకారణము; 2. అంగుళిమానాదిమానము; 3. అంగుళిమానము; 4. సత్యము; 5. మేర; 6. శాస్త్రము; 7. వి. ఎఱుఁగునది. (ప్రత్యక్షాదిప్రమాణములు. ౮. – ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శాబ్దము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము. ఇందు మొదటనుండి నాలుగు తార్కికులమతమునందు ఆఱువేదాంతుల మతమునందు ఎనిమిది పౌరాణికులమతమునందు నని క్రమముగా నెఱుంగునది.)

**ప్రమాణీకరించు.** సం. స. క్రి. సత్యముగానెంచు. "వ. తద్వాక్యంబులు ప్రమాణీకరించునది." కాశీ. ౬, అ.

**ప్రమాత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఎఱిఁగెడువాఁడు.

**ప్రమాతామహి.** సం. వి. ఈ. స్త్రీ. మాతామహునితండ్రిభార్య.

**ప్రమాతామహుఁడు.** సం. వి. అ. పుం. మాతామహునితండ్రి.

**ప్రమాదము.** సం. వి. అ. పుం. ఏమఱుపాటు.

**ప్రమాది.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. ప్రమాదముగలవాఁడు.

**ప్రమాదీచ.** సం. వి. అ పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**ప్రమాపణము.** సం. వి. అ. న. చంపుట, వధము.

**ప్రమితి.** సం. వి. ఈ. స్త్రీ. యథార్థజ్ఞానము, ప్రమ.

**ప్రమిద.** దే. వి. దీపమువెలిఁగించెడు పాత్రము, మల్లకము.

**ప్రమీతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. యజ్ఞమునందు చంపఁబడినది; 2. చచ్చినది.

**ప్రమీల.** సం. వి. ఆ. స్త్రీ. కునికిపాటు, తంద్రి.

**ప్రముఖము.** సం. వి. అ. న. జరగుచున్నకాలము. పుం. పున్నాగము. విణ. ముఖ్యము.

**ప్రముదితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) సంతోషించినవాఁడు, హృష్టుఁడు.

**ప్రమేయము.** సం. విణ. (అ. ఆ. అ.) యథార్థముగా ఎఱుఁగఁదగినది.

**ప్రమోదము.** సం. వి. అ. పుం. సంతోషము, సంతసము.

**ప్రమోదించు.** సం. అ. క్రి. సంతోషించు, సంతసించు.

**ప్రమోదూత.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**ప్రమ్మిద.** దే. వి. ప్రమిదకుమొదటిరూపము. "ఉ. రెండవయోగిపుంగవుఁడు శ్రీమనమాహ్వయమైన ప్రమ్మిదకా, నిండఁగభక్తియన్ చమురునించిహృదబ్జమువత్తిగాఁగను, దండితర ప్రబోధనముదంచిత దీపమునర్థలోకనా, ఘుండగు చక్రికిం బ్రియముతోడ సమర్పణ చేసె నయ్యెడన్." పర. ౧, అ.

**ప్రమ్ము.** దే. స. క్రి. పరివేష్టించు.

**ప్రయతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరిశుద్ధుఁడు.

**ప్రయత్నము.** సం. వి. అ. పుం. మిక్కిలి యత్నము.

**ప్రయత్నించు.** సం. అ. క్రి. మిక్కిలి యత్నించు.

**ప్రయస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) నేయినూనెలోనగువాని చేత సాతాళింపఁబడినది.

**ప్రయాగము.** సం. వి. అ. పుం. 1. తీర్థవిశేషము; 2. ధాన్యవిశేషము; "సీ. అర్థిఁ బ్రయాగంబులార్జింపనార్జింపఁగానోపమెట్లు గంగాజలంబులు." కవి. ౧, ఆ. – 3. యజ్ఞము; 4. గుఱ్ఱము. డు. ఇంద్రుఁడు.

**ప్రయాణము.** సం. వి. అ. న. బయలుదేఱుట.

**ప్రయాణించు.** సం. అ. క్రి. ప్రయాణమగు. "బంగారుపల్లకీ యెక్కి ప్రయాణించునెడ." జై. ౮, ఆ.

**ప్రయాతము.** సం. విణ. (అ. ఆ. అ.) .ప్రయాణమైపోయినది, ప్రస్థితము.

**ప్రయామము.** సం. వి. అ. పుం. జయఘంటలోనగువానిగుండ ధాన్యాదులవెలను ప్రసిద్ధపఱచుట. వ్యవహారాదులయందు న్యూనాధిక్యములులేక కలిగినది కలిగినట్టు చెప్పుట. (అనికొందఱు.) మహార్ఘములైన ధాన్యాదులయందలి జనులయాదరాతిశయము. (అనికొందఱు.)

**ప్రయాసపడు.** మి. అ. క్రి. (ప్రయాసము+పడు.) శ్రమపడు, పాటుపడు.

**ప్రయాసము.** సం. వి. అ. పుం. శ్రమము, పాటు.

**ప్రయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రయోగింపఁబడినది; 2. మిక్కిలి కూడుకొన్నది.

**ప్రయుతము.**, సం. వి. అ. న. 1. దశలక్షసంఖ్య; 2. దశలక్షసంఖ్యగలది.

**ప్రయోక్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ప్రయోగించువాఁడు.

**ప్రయోగము.** సం. వి. అ. పుం. 1. నడపుట; 2. మంత్రతంత్రాదులను నడపుట; 3. ప్రయత్నము; 4. తారకాణము; 5. కర్తృకర్మక్రియలకూడిక.

**ప్రయోగించు.** సం. అ. క్రి. 1. నడపు; 2. మంత్రతంత్రాదులను నడపు; 3. గ్రంథమునందు వాక్యము నుపయోగించు.

**ప్రయోజకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) 1. ప్రయోగించువాఁడు; 2. కార్యము నెఱవేర్చువాఁడు.

**ప్రయోజనము.** సం. వి. అ. న. 1. కార్యము; 2. హేతువు.

**ప్రరోహము.** సం. వి. అ. పుం. మొలక, అంకురము.

**ప్రలంబఘ్నుఁడు.** సం. వి. అ. పుం. బలరాముఁడు.

**ప్రలంబము.** సం. వి. అ. పుం. 1. మిక్కిలి లంబనము; 2. హార విశేషము; 3. స్తనము; 4. కొమ్మ; 5. గిఱకతోడు; 6. తగరము. డు. ఒక రక్కసుఁడు.

**ప్రలంభము.** సం. వి. అ. పుం. వంచనము.

**ప్రలాపము.** సం. వి. అ. పుం. (వెఱ్ఱివాఁడులోనగువారి) అర్థశూన్యమయినమాట, పలవరము.

**ప్రలాపించు.** సం. అ. క్రి. అర్థశూన్యములైనమాటలాడు, పలవరించు.

**ప్రలోభనము.** సం. వి. అ. న. మృగములను పట్టుటకు పెట్టు మచ్చు.

**ప్రలోభము.** సం. వి. అ. పుం. మిక్కిలి లోభము.

**ప్రలోభించు.** సం. స. క్రి. ఆసగొనఁజేయు. "వ. నీవురత్నమయతనూరుహంబులుగల కనకమృగంబవై చని జానకిం బ్రలోభింపవలయు." భార. అర. ౬, అ.

**ప్రల్లఁదనము.** దేశ్య. వి. (ప్రల్లద+తనము.) ప్రల్లదము.

**ప్రల్లదకాఁడు.** దే. విణ. (ప్రల్లదము+కాఁడు.) ప్రల్లదుఁడు. భల్లా. 3, అ.

**ప్రల్లదము.** దే. వి. 1. పౌరుష్యము; "తే. వెలఁదిజూదంబు పానంబువేఁటపలుకుఁ, బ్రల్లదంబునుదండంబు పరుసఁదనము, సొమ్మునిష్ప్రయోజనముగవమ్మునేఁత, యనెడుసప్తవ్యసనములఁజనదు తగుల." సం. "స్త్రియో క్షో మృగయా పానం వాక్పారుష్యంచ పంచమమ్, మహచ్చదండపారుష్య మర్థదూషణమేవచ." భార. ఉద్యో. ౨, అ. — 2. దుర్భాషణము; "ఉ. ప్రల్లదమేదియిట్లు శిశుపాలుఁడువజ్రహతాద్రితుల్యుఁడై, త్రెళ్లిన." భార. సభా. ౨, అ. "క. గురుఁడల్లినదంద్రనిష్టో, దరునినకారణమ ప్రల్లదము పల్కినము, మ్మరుచేతనూఱుపణములు, ధరణీశుఁడుగొనుటనీతి దండువుపేరన్." విజ్ఞా. ప్రా, కాం. "ఉ. ప్రల్లదమాడిపెద్దలకుబాధయొనర్చునతండుఁదంద్రికిన్, దల్లికిమాఱుపల్కెడునతండునునాఁకొని వచ్చియొడ్డచే, నుల్లమెలర్పమేయఁ జనుచున్న వృషంబు నదల్చునాతఁడున్, ద్రెళ్లెడునట్టిదుర్గతులఁ ద్రెళ్లుడునే నిటురాకతక్కినన్." భోజ. ౬, అ.—3. దుష్కృత్యము. "ఆ. ఓరోరియిం, కెందుఁబోవవచ్చుఁబందనిలువు, మిట్టికడిమినమ్మియే ప్రల్లదంబులు, నేయఁదొడఁగితనుచుదాయుటయును." భార. అర. ౬, అ. "మత్తకోకిల. ప్రల్లదంబునవేల్పులుద్ధతిఁబాటిరాజనివాసముం, గొల్లపెట్టినమస్తవిత్తముఁగ్రూరతంగొనిపోవఁగా." భాగ. ౭, స్కం.

**ప్రల్లదీఁడు.** దే. విణ. (ప్రల్లదము+ఈఁడు.) ప్రల్లదుఁడు. "సీ. చిక్కనిమానంబుచిక్కఁబట్టైదనన్న పంచబాణుఁడుకడుఁబ్రల్లదీఁడు." విక్ర. ౧, అ.

**ప్రల్లదుఁడు.** దే. విణ. దుష్టుఁడు. "ఉ. ప్రల్లదుఁడైనయొక్క కులపాంసనుచేసినదానఁదక్కలం, బెల్లనుదూషితంబగుటయేమియపూర్వము." భార. ఆది. ౧, అ. "తే. అతినచందనశిశిరాపహారకులను, సాధుహృదయప్రమోదనిషేధకులను, బరుఁకుపతావమొనరించుప్రల్లదులను, కెండితప్తవ్యాలుకలఁ జేర్చెదరుచూడు." మార్క. ౨, అ.

**ప్రల్లదురాలు.** దే. విణ. (ప్రల్లద+ఆలు.) దుష్టురాలు. "క. కో, పమునసురక్కసియుఁగరము ప్రల్లదురాలై." నిర్వ. ౫, అ. (ఇక్కడ దుష్టురాలనఁగా దుర్భాషణములాడునదియని యర్థము.)

**ప్రవక్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) చేక్కగా మాటలాడువాఁడు.

**ప్రవచనము.** సం. వి. అ. న. 1. వేదము; 2. గొప్పమాట.

**ప్రవచనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) చేక్కగా మాటాడఁదగినది.

**ప్రవణము.** సం. వి. అ. పుం. చతుష్పథము. విణ. వాటపు పల్లము.

**ప్రవణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆసక్తుఁడు; 2. నమ్రుఁడు; 3. నమర్థుఁడు.

**ప్రవయుఁడు.** సం. విణ. (స్.) వృద్ధుఁడు, ముసలి.

**ప్రవరము.** సం. వి. అ. న. 1. పేరు; 2. కులము.

**ప్రవరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) శ్రేష్ఠుఁడు, మేటి.

**ప్రవర్గ్యము.** సం. వి. అ. పుం. అగ్నిష్టోమాదియాగములకు అంగభూతమైన యాగవిశేషము.

**ప్రవర్తకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ప్రవర్తింపఁజేయువాఁడు, నడపువాఁడు.

**ప్రవర్తనము.** సం. వి. అ. న. ప్రవర్తిల్లుట, నడపు.

**ప్రవర్తించు.** సం. అ. క్రి. నడచు. (రూ. ప్రవర్తిల్లు.)

**ప్రవర్ధిల్లు.** సం. అ. క్రి. మిక్కిలి వృద్ధిఁబొందు. (ప్రే. ప్రవర్ధించు.)

**ప్రవల్హిక.** సం. వి. ఆ. స్త్రీ. గూఢముగానుంచఁబడిన యర్థముగల కావ్యవిశేషము. "శ్లో. కశ్చనుప్తోనిమిషతి, కాచవేగేనవర్తతే, మత్స్యస్సుప్తోనిమిషతి, నదీవేగేనవర్తతే." ఇత్యాది.

**ప్రవహణము.** సం. వి. అ. న. 1. బాలకాదుల క్రీడాశకటము; మనుష్యులుమోసెడువిమానము. (అనికొందఱు.) 2. యానపాత్రము.

**ప్రవహము.** సం. వి. అ. పుం. 1. బహిర్గమనము; 2. మహావాయువు; 3. వాయువు.

**ప్రవహించు.** సం. అ. క్రి. ప్రవాహము పాఱు.

**ప్రవాణి.** సం. వి. ఇ. స్త్రీ. సాలెవానిసాధనవిశేషము, లాక.

**ప్రవాదము.** సం. వి. అ. పుం. కారణములేకయే కలిగి లోకము నందంతట వ్యాపించినమాట.

**ప్రవారణము.** సం. వి. అ. న. 1. ఫలమునుగోరి చేయుదానము; 2. నిషేధము.

**ప్రవాసనము.** సం. వి. అ. న. చంపుట, వధము.

**ప్రవాసము.** సం. వి. అ. పుం. 1. పరదేశవాసము; 2. పరదేశగమనము.

**ప్రవాహము.** సం. వి. అ. పుం. 1. వెల్లువ; 2. ప్రవృత్తి; 3. పరంపర.

**ప్రవాహిక.** సం. వి. ఆ. స్త్రీ. అతిసారరోగము.

**ప్రవాళము.** సం. వి. అ. పుం. 1. పగడము; 2. వీణాదండము, ఒళగు; 3. చిగురు.

**ప్రవిదారణము.** సం. వి. అ. న. యుద్ధము, పోరు.

**ప్రవిష.** సం. వి. ఆ. స్త్రీ. అతివస.

**ప్రవిష్టుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రవేశించినవాఁడు.

**ప్రవీణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నిపుణుఁడు, తీర్పరి.

**ప్రవృత్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రవర్తించినవాఁడు.

**ప్రవృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నడక; 2. ప్రవేశము; 3. బ్రతుకు తెరువు; 4. వృత్తాంతము.

**ప్రవృద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెరిఁగినది; 2. కొన సాఁగిపెరిఁగినది.

**ప్రవేకము.** సం. విణ. (అ. ఆ. అ.) ముఖ్యము, గామిడి.

**ప్రవేణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఏనుఁగుమీఁదఁబఱచెడియెఱ్ఱ కంబళి; 2. సర్పాకారముగా అల్లినజెడ.

**ప్రవేశము.** సం. వి. అ. పుం. చొచ్చుట, చొరవ. (గృహప్రవేశము. వానికి శాస్త్రములయందు ప్రవేశము చాలదు మొ.)

**ప్రవేశించు.** సం. అ. క్రి. చొచ్చు.

**ప్రవేష్టము.** సం. వి. అ. పుం. బాహువు, చేయి.

**ప్రవ్యక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) స్పష్టము. వెల్లడి.

**ప్రవ్రజితుఁడు.** సం. వి. అ. పుం. సన్యాసి.

**ప్రవ్రజ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. సన్యాసాశ్రమము; 2. పర్యటనము, త్రిప్పుట.

**ప్రవ్వ.** దే. వి. కుండ, ఘటము. "క. ఎవ్వనినంతొానంబులు, నివ్వటిలెఁ గావసుధనెల్లనెఱేనాదత్తుం, డివ్వలనజగములన్నిటఁ, బ్రవ్వజలమునిలిపినట్లు ప్రజఁబుట్టించెన్." భాగ. ౬, స్కం.

**ప్రశంస.** సం. వి. ఆ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

**ప్రశంసించు.** సం. స. క్రి. స్తోత్రముచేయు, పొగడు.

**ప్రశస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధికెక్కినది; 2. నేయినూనెలోనగువానిచే పొగడఁబడినది.

**ప్రశస్తి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి.

**ప్రశస్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రసిద్ధికెక్కఁదగినది.

**ప్రశాంతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలిశాంతి.

**ప్రశాంతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి శాంతినొందినవాఁడు.

**ప్రశ్నము.** సం. వి. అ. పుం. అడుగుట. (రూ. ప్రశ్న.)

**ప్రశ్రయము.** సం. వి. అ. పుం. (చూ.) అనునయము.

**ప్రశ్రితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) వినీతుఁడు.

**ప్రష్ట.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) అడుగువాఁడు.

**ప్రష్ఠవాహము.** సం. వి. హ. పుం. పనుపఱచుటకు కాఁడిమోపెడియెద్దులదాపునఁగట్టెడికోడె.

**ప్రష్ఠుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) అగ్రేసరుఁడు.

**ప్రష్ఠౌహి.** సం. వి. ఈ. స్త్రీ. తొలుచూలిపడ్డ. (రూ. పష్ఠౌహి.)

**ప్రసంగము.** సం. వి. అ. పుం. 1. విషయవిస్తరము; 2. ప్రస్తావము.

**ప్రసంగించు.** సం. స. క్రి. 1. ఏదేనియొకవిషయమును విస్తరించి చెప్పు; 2. ప్రస్తావించు. "వ. అనిపలికితమతోడికోడలింబ్రసంగించి." భో. ౬, ఆ.

**ప్రసక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రస్తావము, ప్రసంగము.

**ప్రసక్తించు.** సం. అ. క్రి. ప్రస్తావమునకువచ్చు.

**ప్రసన్న.** సం. వి. ఆ. స్త్రీ. కల్లు. విణ. 1. నిర్మలము; 2. సంతుష్టము.

**ప్రసభము.** సం. వి. అ. పుం, న. బలాత్కారము.

**ప్రసరణము.** సం. వి. అ. న. అంతటనేనవ్యాపించుట. (రూ. ప్రసరణి. ఇ. ఈ. స్త్రీ.)

**ప్రసరము.** సం. వి. అ. పుం. 1. వ్యాపనము; 2. వినయము; 3. వేగము.

**ప్రసరించు.** సం. అ. క్రి. వ్యాపించు. (రూ. ప్రసరిల్లు.)

**ప్రసర్పణము.** సం. వి. అ. న. వ్యాపనము, ప్రసరము.

**ప్రసవబంధనము.** సం. వి. అ. న. ఆకులోనగువాని తొడిమ, వృంతము.

**ప్రసవము.** సం. వి. అ. పుం. 1. కానుపు; 2. పువ్వు; 3. పండు; 4. పుట్టుక; 5. బిడ్డ.

**ప్రసవించు.** సం. స. క్రి. (బిడ్డఁ) గను.

**ప్రసవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కుడి; 2. ఎడమ; 3. అనుకూలము; 4. ప్రతికూలము.

**ప్రసాదనము.** సం. వి. అ. న. 1. తేర్చుట; 2. బహుమానము; 3. అన్నము.

**ప్రసాదని.** సం. వి. ఈ. స్త్రీ. మూలుగుకీ.

**ప్రసాదము.** సం. వి. అ. పుం. 1. ప్రసన్నత; (రూ. ప్రసత్తి. ఇ. స్త్రీ.) 2. కావ్యగుణములలోనొకటి; (చూ. గుణము.) 3. అనుగ్రహము; 4. స్వాస్థ్యము; 5. భగవంతుఁడుతోనగువారిచే భుక్తపరిశిష్టమైన అన్నము మొదలగునది.

**ప్రసాదించు.** సం. స. క్రి. అనుగ్రహించి యిచ్చు.

**ప్రసాధనము.** సం. వి. అ. న. 1. వస్త్రాద్యలంకరణము; 2. సిద్ధి.

**ప్రసాధని.** సం. వి. ఈ. స్త్రీ. దువ్వెన, కంకతిక.

**ప్రసాధితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వస్త్రాదులచేత అలంకరింపఁబడినవాఁడు, కైసేయఁబడినవాఁడు.

**ప్రసారణము.** సం. వి. అ. న. 1. చాఁచుట; 2. తిగుచుట.

**ప్రసారణి.** సం. వి. ఈ. స్త్రీ. గొంతెమగోరుకీ.

**ప్రసారము.** సం. వి. అ. పుం. వ్యాపనము.

**ప్రసారి.** సం. విణ. (న్. ఈ. న్.) ప్రసరించునది.

**ప్రసారితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చాఁపఁబడినది; 2. తిగువఁబడినది.

**ప్రసితి.** సం. వి. ఇ. స్త్రీ. నిర్బంధము, కట్టెడుసాధనము. (అనికొందఱు.)

**ప్రసితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) తత్పరుఁడు.

**ప్రసిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధికెక్కినది; 2. అలంకరింపఁబడినది.

**ప్రసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఖ్యాతి; 2. అలంకారము.

**ప్రసువు.** సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి; 2. అఁడుగుఱ్ఱము; 3. అరఁటికీ; 4. ఒకటితోనొకటి పెనఁగొన్న ద్రాక్షతీఁగలోనగునది.

**ప్రసూత.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు. అ. న. ము. పువ్వు. విణ. పుట్టినది.

**ప్రసూతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కానుపు; 2. పుట్టుక; 3. బిడ్డ.

**ప్రసూతిక.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు, ప్రసూత.

**ప్రసూతిజము.** సం. వి. అ. న. బాధ, దుఃఖము.

**ప్రసూనము.** సం. వి. అ. న. 1. పుష్పము; 2. ఫలము. విశే. పుట్టినది.

**ప్రసృత.** సం. వి. ఆ. స్త్రీ. కాలిపిక్క.- అ. పుం. ము. చేర. విశే. 1. కొనసాఁగిపెరిఁగినది; 2. తీర్పఁబడినది.

**ప్రసృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చేర; 2. పుడిసిలి.

**ప్రసేకము.** సం. వి. అ. పుం. 1. చెల్లుట; 2. జాఱుట.

**ప్రసేవకము.** సం. వి. అ. పుం. వీణకరివె. (చూ. కరివె.)

**ప్రసేవము.** సం. వి. అ. పుం. 1. ఎండుపుట్ట; 2. వీణకరివె.

**ప్రస్తరము.** సం. వి. అ. పుం. 1. ఱాయి; 2. రత్నము; 3. ఋషభము; 4. చిగుళ్లులోనగువానిచే పేర్పఱచినసెజ్జ.

**ప్రస్తరించు.** సం. స. క్రి. 1. విస్తరించు; "సీ. యజ్ఞవాటమునఁ బునందుఁ గుశంబులువెట్టి ప్రస్తారికృత్పృష్టిఁ బ్రస్తరించి." భీ. 3, ఆ.-2. ఛందఃప్రస్తారముచేయు.

**ప్రస్తవము.** సం. వి. అ. పుం. విషయము. "క. అనఘాస్త్రప్రస్తవమున, ననిలీలనిలీనవీరభటులయనుపోష్యులనె, ల్లను ద్రోణభోజనాచార్యు, దనములవారలకునెమ్మితముఁగాక యుండక." భార. సభా. ౧, ఆ.

**ప్రస్తారము.** సం. వి. అ. పుం. 1. ఛందశ్శాస్త్రమునందలి ప్రత్యయవిశేషము; 2. వృక్షవిస్తారము.

**ప్రస్తావము.** సం. వి. అ. పుం. 1. అవసరము; 2. చెప్పుట.

**ప్రస్తావించు.** సం. స. క్రి. ప్రస్తావమునకు తెచ్చు.

**ప్రస్తుత.** సం. వి. ఆ. స్త్రీ. (ఈనఁబోవుసమయమున) పొదుఁగు చేసిన ఆవు. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి స్తుతింపఁబడినది; 2. చెప్పఁబడినది; 3. ప్రయత్నముచేయఁబడినది; 4. సిద్ధము చేయఁబడినది.

**ప్రస్తుతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి స్తోత్రము.

**ప్రస్తుతించు.** సం. స. క్రి. మిక్కిలి స్తుతించు.

**ప్రస్థపుష్పము.** సం. వి. అ. పుం. మరువము.

**ప్రస్థమానము.** సం. వి. అ. న. ధాన్యములోనగువానికొలత. (చూ. మానము.)

**ప్రస్థము.** సం. వి. అ. పుం. 1. ప్రస్థమానము; 2. నాలుగు మానికలకొలఁది; 3. కొండనెత్తము.

**ప్రస్థానము.** సం. వి. అ. న. 1. ప్రయాణము; 2. శాస్త్రము.

**ప్రస్థాపించు.** సం. స. క్రి. చెక్కగా స్థాపనముచేయు.

**ప్రస్థాపితము.** సం. విశే. (అ. ఆ. అ.) చెక్కగా స్థాపింపఁబడినది.

**ప్రస్థితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రయాణమైపోయినది, ప్రయాతము.

**ప్రస్ఫోటనము.** సం. వి. అ. న. 1. చేట; 2. ప్రకాశనము; 3. దెబ్బ.

**ప్రస్రవణము.** సం. వి. అ. న. 1. సెలయేటు; 2. చెమట.

**ప్రస్రావము.** సం. వి. అ. పుం. మూత్రము, ఉచ్చ.

**ప్రహతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినది; 2. పొడి చేయఁబడినది; 3. విస్తరింపఁబడినది.

**ప్రహరణము.** సం. వి. అ. న. ఆయుధము.

**ప్రహరము.** సం. వి. అ. పుం. 1. జాము; 2. దెబ్బ.

**ప్రహరి.** దేశ్య. వి. ప్రాకారము. "సీ. అలదేవమణికిఁగావలియుండ్డ ప్రహరినాగళముల ఘంటికావలులుమొరయ." పా. ౪, ఆ.

**ప్రహరించు.** సం. స. క్రి. దెబ్బతీయు, కొట్టు.

**ప్రహరిచరించు.** మి. అ. క్రి. ప్రహరిదిరుగు. "చ. ప్రహరిచరించుతరెప్పుడును భైరవులర్ధనిశాగమంబులన్." భీ. ౧, ఆ.

**ప్రహరిచుట్టు.** దేశ్య. అ. క్రి.———పై.———"మ. అని చింతించుచు నొక్క-ధామమునకున్ యశోంగనల్ పుష్కర, ధ్వనితోఁ జారణకన్యకల్ చటులవాగ్వైచిత్రితోఁబన్నగాం, గనలుర్వ స్వణితీపమాలికలతోఁగంధర్వకాంతల్ సుకం, ఠనినాదాతిశయంబుతోఁ బ్రహరిచుట్టంగఁటిఁ బత్రంబుగాన్." వసు. ౪, ఆ.

**ప్రహరిదిరుగు.** దేశ్య. అ. క్రి. (ప్రహరి + తిరుగు.) ప్రదక్షిణించు, చుట్టివచ్చు. "తే. అద్దిపెట్టెదఁగాకతీర్థాంబువిధముఁ, బ్రహరిదిరుగకయుండంగఁబుర్రగిరికి." కాశీ. ౧, ఆ.

**ప్రహసనము.** సం. వి. అ. న. 1. నాటకభేదము; (చూ. నాటకము.) 2. పెద్దనవ్వు; 3. పరిహాసము.

**ప్రహసించు.** సం. అ. క్రి. పెద్దనవ్వునవ్వు.

**ప్రహసితము.** సం. వి. అ. న. శిరఃకంపనముతోఁగూడిననవ్వు. (ఇది మధ్యమము. చూ. హాసము.)

**ప్రహస్తము.** సం. వి. అ. పుం. చేప్పుట, చపేటము. డు. ఒక రాక్షసుఁడు.

**ప్రహారకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) ప్రహరించువాఁడు.

**ప్రహారము.** సం. వి. అ. పుం. ప్రహరము, దెబ్బ.

**ప్రహారి.** సం. విశే. (న్. ఈ. న్.) ప్రహారకుఁడు.

**ప్రహి.** సం. వి. ఇ. పుం, న. నూయి, కూపము.

**ప్రహితము.** సం. విశే. (అ. ఆ. అ.) వింటనుండి విడువఁబడినది. (బాణము.)

**ప్రహితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యుత్పన్నుఁడు.

**ప్రహేళిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) ప్రవల్హిక.

**ప్రహ్లన్నుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సంతోషించినవాఁడు, ప్రముదితుఁడు.

**ప్రహ్లాదము.** సం. వి. అ. పుం. సంతోషము. (రూ. ప్రహ్లత్తి. ఇ. స్త్రీ.)

**ప్రహ్వము.** సం. విశే. (అ. ఆ అ.) 1. నమ్రము; 2. ఆసక్తము.

**ప్రళయము.** సం. వి. అ. పుం. 1. కల్పాంతము; 2. అపాయము; 3. మృత్యువు; 4. మూర్ఛ.

## ప్రా.

**ప్రా.** వై. విశే. వృత్తియందు ప్రాఁతశబ్దమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. ప్రామజ్జి, ప్రావేలుపు ము.) (దీనికి వృత్తియందు అచ్చుపరమగునపుడు యడాగమంబును, పరుషములు పరంబులగునపుడు నగాగమంబునను. ఉదా. ప్రాయిల్లు, ప్రాయేఱు, ప్రాఁగెంపు, ప్రాఁజోఁతు, ప్రాఁబచ్చ, ప్రాఁబసిఁడి ము.)

**ప్రాంగణము.** సం. వి. అ. న. 1. ముంగిలి; 2. పణవవాద్యము.

**ప్రాంతము.** సం. వి. అ. పుం. 1. తీరము; 2. సమీపము.

**ప్రాంతరము.** సం. వి. అ. న. 1. అడవి; 2. తొఱ్ఱ; 3. దవ్వయిన యెడారిత్రోవ; 4. పొలిమేర.

**ప్రాంశువు.** సం. విణ. (ఉ.) పొడుగైనది, ఉన్నతము.

**ప్రాఁకు.** దే. అ. క్రి. 1. ఎక్కు; "ఉ. ప్రాఁకుదుమా త్రికూటశిఖరంబులమీఁదికినెల్లవారు." రా. యు, కాం.—2. ఱొమ్ముతో జేరగు. "క. అండజగామినియూరువుఁ, బింసువలపులానసనాభిబిలము వెడలిచక్, గొండలసడుమసఁ బ్రాఁకెను, కుండలియో యనఁగనారుకోమగోప్పారెక్." అను. ౫, ఆ.—వి. 1. తీఁగె యల్లుటకు సమీపమున నిడుకొయ్యలోనగునవి, ఉపఘ్నము; "క. ఇంతకుమూలముత్పష్ణా, తంతులతయవశ్యవినుము దానికిసడరం, గాంతొజనంబుతోలు ప్రాఁ, కెంతయెటేఁగితృష్ణఁదో అఁగుటిచ్చు విముక్తిక్." భార. శాం. ౪, ఆ.—2. మాలిన్యము, పాఁచి. "సీ. కన్నీరుజడిగొని క్రమ్మఁ బ్రాఁకెక్కిన కమ్రకపోలభాగము లుగలిగి." భార. అర. ౭, ఆ. "ద్వి. నాదులఁ బ్రాఁకువట్టిబలువుకప్పినగొగ్గి పంఙ్ణను." నవ. 3, భా.

**ప్రాఁకుడు.** దే. వి. 1. ప్రాఁకుట; 2. పాఁచి.

**ప్రాఁకుదెంచు.** దే. అ. క్రి. (ప్రాఁకు+తెంచు.) ప్రాఁకు. "ఎ, గీ. క్రమముతోశీతకరమయూఖములుగగన, భాగమునఁగొన్ని యల్లనఁ బ్రాఁకుదెంచె." పా. ౨, ఆ. (స్వార్థమున తెంచు.)

**ప్రాఁకులాడు.** దే. అ. క్రి. (ప్రాఁకులు+ఆడు.) ప్రాఁకి యెక్కు. (నన్నుఁబట్టుకొని యేమి ప్రాఁకులాడెదవు.)

**ప్రాఁకొను.** దే. అ. క్రి. (ప్రాఁకు+కొను.) పాఁచిపట్టు. "క. ప్రాఁకొన్న నూతియుదకము, మేఁకలపాఁడియునురోఁత."

**ప్రాఁగబ్బము.** వై. వి. (ప్రాఁత+కబ్బము.) వేదము. "సీ. ప్రాఁగబ్బవుంబల్కుబడి చిక్కుదీర్పరిగారుడాదిపురాణకథనకర్త." పాంచా. 3, ఆ.

**ప్రాఁచి.** వై. వి. విణ. పాఁచికి మొదటిరూపము. (ప్రాఁతదనుటకు. "సీ. పెరుఁగంతయును గ్రోలి పిదపబానలయందు సంపూర్ణముగఁ బ్రాఁచిచల్లునుచు." హరి. పూ. ౫, ఆ.)

**ప్రాఁజెదువులు.** ద్వ. వి. బ. (ప్రాఁత+చేదువులు.) వేదము. "శా. ఆనందో బ్రహ్మ మటన్న ప్రాఁజెదువులంతర్బుద్ధినూహింపుమా." స్వా. ౨, ఆ. (వృత్తియందేకవచనాంతము. చూ. ప్రాఁబలుకులు.)

**ప్రాఁత.** వై. వి. 1. భృత్యుఁడు; "కౌరవుల ప్రాఁతలమునేము." భార. విరా. ౧, ఆ. "ప్రాఁతలమేమునీకు." ఉ, హరి. ౪, ఆ.—2. వస్త్రము; (చూ. పాఁత.) 3. జీర్ణవస్త్రము*. "సీ. పెను పైలయగునీలివేలిక మొలఁగట్టిపైనొకయెఱ్ఱని ప్రాఁతదాల్చి." రా. బాల, కాం.—విణ. 1. పురాతనము; "ప్రాఁతందలము." అను. ౨, ఆ.—2. పూర్వము*; "ప్రాఁతవేలుపు." అచ్చ. అర, కాం.—3. జీర్ణము*. (ప్రాఁతచీర.)

**ప్రాఁతగిల్లు.** వై. అ. క్రి. ప్రాఁతవడు. (రూ. ప్రాఁతగిలు.)

**ప్రాఁతవడు.** వై. అ. క్రి. (ప్రాఁత+పడు.) ప్రాఁతదియగు. "ప్రాఁతవడ్డమాటలఁ దమనేర్పుచూపి." నిర్వ. ౧, ఆ.

**ప్రాఁబడు.** వై. అ. క్రి. (ప్రాఁత+పడు.) 1. ప్రాఁతగిల్లు; 2. అలవడు. "చ. తొడవులుదీసి క్రొమ్మెఱుఁగుదువ్వలువల్కడ వేసిజిల్లుపా, వడలొగిఁగట్టిమేలినిడువాలికకొమ్ములువట్టియుద్దులే, ర్పడఁగవగూడియల్లవలరాయని క్రొవ్విరిఁ బోఁడికేని ప్రాఁ, బడ నియొయ్యారిదారికనుపట్టఁగొలంకునఁజేరిరెంతయుక్." చంద్ర.

**ప్రాఁబలుకులు.** ద్వ. వి. బ. (ప్రాఁత+పలుకులు.) వేదము. (రూ. ప్రాఁబల్కులు.) (వృత్తియందేకవచనాంతము. "సీ. ప్రాఁబల్కు తుదలతోఁ బ్రణుతించుసంయమి ప్రవరులనుతిఁబెడచెవులఁబెట్టి." ఉ, రా. ౨, ఆ.)

**ప్రాక్.** దే. వి. పాకకుమొదటిరూపము.

**ప్రాకటము.** సం. విణ. (అ. ఈ. అ.) ప్రసిద్ధము. (ప్రకటము యొక్క రూపాంతరము.)

**ప్రాకామ్యము.** సం. వి. అ. న. ఒక ఐశ్వర్యము. (చూ. ఐశ్వర్యము.)

**ప్రాకారము.** సం. వి. అ. పుం. గుడి మొదలగువాని చుట్టుగోడ, ప్రహరి, వరణము.

**ప్రాకృతము.** సం. వి. అ. న. ఒకానొకభాష. (ఇది స్త్రీలు లోనగువారు భాషించుటకు నుపయుక్తముగానుండినది. ఇది షడ్విధను. ప్రాకృతము, శౌరసేని, మాగధి, పైశాచి, చూళికాపైశాచి, అపభ్రంశము.)

**ప్రాకృతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పామరుఁడు.

**ప్రాకెన.** వై. వి. పాకెనయొక్క రూపాంతరము. "క. తగఁ బ్రాకెనయునుదీర్చిచి, నగవులపసలైనవెనకనాలవనాఁడొ, పన్నగనాగవల్లి సేయఁగఁ, బగడపుటుప్పరిగలోనఁబడఁతుకలెల్లక్." య. ౪, ఆ.

**ప్రాకెన్న.** వై. వి. పాకెన్నయొక్క రూపాంతరము. "మ. ఘనపాకాన్నముగన్నవారలకిడక్ గన్నారెరూకన్ననా, కునుబోఁకన్నొకన్నమున్నిటులుగోకొమ్మన్నచోటున్నదా, మన ప్రాకెన్న చెలంగెఁగీర్తిలతికల్ పాకారిలోకంబువెం, టనె ప్రాఁకెన్నయమొప్పనంచు నరులాడం జొచ్చిరిచ్ఛారతిక్." పాంచా. ౪, ఆ.

**ప్రాక్తనము.** సం. విణ. (అ. ఆ. అ.) పురాతనము.

**ప్రాగల్భ్యము.** సం. వి. అ. న. 1. ప్రగల్భత్వము; 2. స్త్రీల యొక్క అయత్నజమైన శృంగారచేష్టావిశేషము.

**ప్రాగ్భారము.** సం. వి. అ. పుం. 1. అతిశయము; 2. పర్వతములోనగువాని శిఖరము.

**ప్రాగ్రసరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందునడచువాఁడు; 2. మొదటివాఁడు.

**ప్రాగ్రహరము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందు నడచునది; 2. మొదటిది.

**ప్రాగ్ర్యము.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——:

**ప్రాగ్వంశము.** సం. వి. అ. పుం. హవిర్గృహమునకుముందున్న సభాగృహము.

**ప్రాఘారము.** సం. వి. అ. పుం. జలాదిధార. కాఱుట. (అని కొందఱు.)

**ప్రాచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తూర్పు; 2. పచ్చోకుచెట్టు.

**ప్రాచితము.** వై. వి. ప్రాయశ్చిత్తము. "సీ. అత్త, జనకునిమారొకన్న పెనుఁబాతకము హాయఁ బ్రాచితంబుగఁదుపారాచలంబు, దండఁదనమేనువిడువంగఁదమకపడెడు." జై. ౭, ఆ.

**ప్రాచీన.** సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది.

**ప్రాచీనబర్హి.** సం. వి. స్. పుం. 1. ఇంద్రుఁడు; 2. ఒకానొక రాజు.

**ప్రాచీనము.** సం. వి. అ. న. (చూ.) కంపకోట. (రూ. ప్రాచీరము.) విణ. 1. పూర్వదిశయందుఁగలిగినది; 2. పూర్వకాలమునందుఁగలిగినది.

**ప్రాచీనావీతము.** సం. వి. అ. న. కుడిభుజముమీఁదుగా ఎడమ ప్రక్కనువ్రేలెడుజంధెము.

**ప్రాచుర్యము.** సం. వి. అ. న. ప్రచురత్వము.

**ప్రాచేతసుఁడు.** సం. వి. అ. పుం. వాల్మీకిమహాముని.

**ప్రాచ్యము.** సం. వి. అ. పుం. శరావతియనునది యెల్లగాఁగల ప్రాగ్దక్షిణముల మధ్యదేశము. విణ. తూర్పుదిక్కునందలిది.

**ప్రాజనము.** సం. వి. అ. న. మునికోల, తోత్త్రము.

**ప్రాజాపత్యము.** సం. వి. అ. న. 1. అధికారము; 2. ఇష్టివిశేషము; 3. పంద్రెండుదినములలో ముగింపఁదగిన వ్రతవిశేషము. పుం. మీరిరువురుగూడి ధర్మముచేయుఁడని వరునితో పరిభాషించి కన్నెనిచ్చిచేయువివాహము. (చూ. వివాహము.)

**ప్రాజిత.** సం. వి. ఋ. పుం. సారథి, తేరుపూన్పరి.

**ప్రాజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిబుద్ధిగల ఆఁడుది; 2. బుద్ధి.

**ప్రాజ్ఞి.** సం. వి. ఈ. స్త్రీ. 1. లౌకికవ్యవహారమునందు మిక్కిలి తెలివిగల ఆఁడుది; 2. పండితునిభార్య.

**ప్రాజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పండితుఁడు; 2. నమర్థుఁడు.

**ప్రాజ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అధికము.

**ప్రాడ్వివాకుఁడు.** సం. వి. అ. పుం. తగవరి. (వ్యా.) అక్షదర్శకుఁడు.

**ప్రాణగొడ్డము.** వై. విణ. ప్రాణహింసకము. "చ. లోభసిరతిఁ బెద్దకాసపడిపాడి దొలంగినఁబ్రాణగొడ్డపుంబనులగు." భార. అను. ౪, ఆ.

**ప్రాణనాథుఁడు.** సం. వి. అ. పుం. 1. ప్రియుఁడు; 2. యముఁడు. (ఇట్లు ప్రాణేశుఁడు మొ.)

**ప్రాణము.** సం. వి. అ. పుం. 1. గాలి; 2. హృదయమందలి గాలి; 3. కావ్యజీవము; 4. బలిమి; 5. బోళము; 6. బ. ఉసురు. విణ. నిండింపఁబడినది. (పంచప్రాణములు.—ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము.)

**ప్రాణాచారము.** సం. వి. అ. పుం. ప్రాయోపవేశము.

**ప్రాణాచారముపడు.** మి. అ. క్రి. ప్రాయోపవేశముచేయు.

**ప్రాణాయామము.** సం. వి. అ. పుం. నాశికాముఖములయందు సంచరించెడువాయువును మంత్రపూర్వకముగా నిరోధించుట. (ఇది యోగాంగములలో నొకటి. చూ. అంగము.)

**ప్రాణి.** సం. వి. న్. పుం. మనుష్యాదిజంతువు. విణ. ప్రాణముగలది.

**ప్రాణిద్యూతము.** సం. వి. అ. న. కోడిపందెములోనగునది, సమాహ్వయము.

**ప్రాతికూల్యము.** సం. వి. అ. న. ప్రతికూలత్వము. (ఆనుకూల్యమునకు మారు.)

**ప్రాతిపదికము.** సం. వి. అ. న. ధాతుభిన్నంబును ప్రత్యయభిన్నంబును ప్రత్యయాంతభిన్నంబునగు అర్థవచ్ఛబ్దరూపము.

**ప్రాతిభావ్యము.** సం. వి. అ. న. ప్రతిభూత్వము.

**ప్రాతివేశిని.** సం. వి. ఈ. స్త్రీ. దూతికావిశేషము.

**ప్రాతిహారకుఁడు:** సం. వి. అ. పుం. గారడివిద్యయందు నేర్పరియైనవాఁడు.

**ప్రాథమకల్పికుఁడు.** సం. వి. అ. పుం. క్రొత్తగాచదువనారంభించిన శిష్యుఁడు, శైక్షుఁడు.

**ప్రాథమికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ప్రథముఁడు.

**ప్రాథమ్యము.** సం. వి. అ. న. ప్రథమత్వము.

**ప్రాధేయపడుట.** సం. అ. క్రి. వేఁడుకొనుట.

**ప్రాదుర్భవించు.** సం. అ. క్రి. ఆవిర్భవించు, పుట్టు.

**ప్రాదుర్భావము.** సం. వి. అ. పుం. పుట్టుక.

**ప్రాదుర్భూతము.** సం. విణ. (అ. ఆ. అ.) పుట్టినది.

**ప్రాదేశనము.** సం. వి. అ. న. త్యాగము, దానము.

**ప్రాదేశము.** సం. వి. అ. పుం. చూపుడువ్రేలిని బొటనవ్రేలినిచాఁచిపట్టినకొలత, జేత్తెడు.

**ప్రాధాన్యము.** సం. వి. అ. న. ప్రధానత్వము.

**ప్రాపకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాపించువాఁడు.

**ప్రాపణము.** సం. వి. అ. న. ప్రాపించుట.

**ప్రాపణీయము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాపింపఁదగినది, పొందఁదగినది.

**ప్రాపించు.** సం. స. క్రి. పొందు. "క. గోమతినమ్మృతరసాపమ, గోమతిఁదనుపుంజమంజుకుంజోరుతటీ, గోమతినుతికలితవ్రతి, గోమతిఁబ్రాపించిప్రాడ్గురుంకినయంతన్." ఉ, రా. ౬, ఆ.

**ప్రాపు.** వై. వి. ఆశ్రయము. "సీ. సింహనాదమునకుఁ, బ్రాపులై దేవదత్తంబురవముగుణము, రావమునుదిక్తటంబులవ్రయ్యఁజేయ." భార. ద్రో. ౧, ఆ.

**ప్రాప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. కూడుకొన్నది.

**ప్రాప్తరూపుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కనివాఁడు; 2. తెలిసినవాఁడు.

**ప్రాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. లాభము, పొందు; 2. శుభోదయము; 3. ఒక ఐశ్వర్యము. (చూ. ఐశ్వర్యము.)

**ప్రాప్తించు.** సం. అ. క్రి. లభించు, కలుగు.

**ప్రాప్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పొందఁదగినది.

**ప్రాబల్యము.** సం. వి. అ. న. ప్రబలత్వము, బలిష్ఠత.

**ప్రాభవము.** సం. వి. అ. న. ప్రభుత్వము, దొరతనము.

**ప్రాభృతము.** సం. వి. అ. న. కానుక, ఉపహారము.

**ప్రామాణికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) 1. మేరమీఱనివాఁడు; 2. సత్యముతప్పనివాఁడు; 3. శాస్త్రమునెఱిఁగినవాఁడు.

**ప్రామాణ్యము.** సం. వి. అ. న. 1. దృష్టాంతము; 2. సాక్ష్యము.

**ప్రామిడి.** దే. వి. క్రౌర్యము. "ఉ. ఏమనిచెప్పవచ్చుఁబరమేశ్వర! వీఁడుధరాతలంబునన్, బ్రామిడిఁజేసినట్టిఘనపాతకకోట్లకులెక్కలేదు." భల్లా. 3, ఆ.—విణ. క్రూరము, క్రూరుఁడు, క్రూరురాలు. "ఉ. రాయిడికత్తెలైనపెనుఁబ్రామిడియత్తలయిండ్లకోత్రముల్, సేయువిలాసినుల్మొనపుఁజెందఁగ." విక్ర. ౬, ఆ.

**ప్రామినుకులు.** దే. వి. బ. వేదము. (రూ. ప్రామిన్కులు. "సీ. బానవాల్గములెన్నప్రామిన్కులే వేల్పుచెలువంపుఁబావాలగిలుకురవలు." య. ౧, ఆ.) (వృత్తియందేకవచనాంతము, చూ. ప్రాఁబలుకులు.)

**ప్రాము.** దే. స. క్రి. 1. ఱాచు; "ద్వి. మునిమాయ, నావెంటఁ దతిగొనినలిచిపోనీక, పట్టియాగతినేలపైనిడికాలఁ, బెట్టిప్రాముచు బునవెట్టుచుండఁగను." హరిశ్చ. ౨, భా.—2. తూయు; "తే. మాటిమాటికిఁగోపసంభ్రమము పేర్మిఁ, గక్షపాత్రంబులందున్న కమ్మభూతి, వదనములఁబ్రామికొనుచునిర్వక్రలీల, హరహరాయని పల్కరియబ్రమదర." కాశీ. ౬, ఆ.—3. మూయు; "ఆ. నీడఁ గడవఁబాఱునేలకు వెలిగాఁగ, నడుగువెట్టితిరుగనాత్తమొఱఁగి, యొక టేఁదలఁపనరులకొదవిననొదవదే, కరణిమృత్యుదేవికన్నుప్రామ." స్వా. ర్వ, ఆ.—4. తుడుచు; "ఉ. కోపముతోడనీవుదధికుంభము భిన్నముసేయుచున్నచో, గోపికత్రాటఁగట్టిననకుంచితసాంజన బాష్పతోయధా, రాపరిపూర్ణపక్ష్మముఁగరంబులఁబ్రాముచు వెచ్చ నూర్చుచుక, శాపఁడవైనటించుటగృపాపరనామదిఁజోద్యమయ్యె డిన్." భాగ. ౧, స్కం.—5. పులుము; "క. ఒకతెవడిన్, దలఁబ్రామిపసిఁడికొప్పెర, జలములుచెలువందియొనఁగ జలకం బార్చెన్." విజ. 3, ఆ.—6. పీడించు; "తే. ప్రాముజరరాగ్నిచేఁ గింకరోమి యనుచు, నడకువేదనచేఁగ్వయాస్వామియనుచు, క్రిస్త యపుమూర్ఛచేహాహతోస్మియనుచుఁ, బలవరింపఁగసాగ నబ్బక్కనక్క." హంస. ౧, ఆ.—7. ఖండించు. "క. రయమునఁగాళ్లుం జేతులుఁ, బొడిపొడిగాఁబ్రామిచెలఁగిభూరిబలంబే, ర్పడనక్కద్రొక్కిరక్కసు, బెడిదంబుగనవయవములుపెటికివధించెన్." మార్క. ౧, ఆ.

**ప్రాముడు.** దే. వి. పులుముడు, మార్జనము.

**ప్రాయము.** సం. వి. అ. పుం. 1. వయస్సు; 2. మరణార్థము సర్వకర్మపరిత్యాగపూర్వకమైన ఉపవాసము; 3. చొప్పు; 4. బాహుళ్యము; 5. వృత్తియందుత్తరపదమైనచో సమాసము. (పశుప్రాయము మొ.)

**ప్రాయశ్చిత్తము.** సం. వి. అ. న. పాపపరిహారార్థముచేసెడు కర్మము.

**ప్రాయి.** దే. వి. 1. పౌరుషము; "క. రేయిసురమానిచెప్పెన్, బ్రాయఁపౌరుషులులేరుపాండవసేనన్, బ్రాయిగలమగలునరరా, ధేయసుతులుదక్కననుచుఁదెలియఁగనాకున్." జై. ౭, ఆ.—2. భాగ్యము; "తే. పూనద్రాడుదుయ్యనురేదుపాలఁతిమెడకుఁ, బెరుఁగఁబాలింటనేడ్చిన బిడ్డకైన, మిడువలేదెల్లదాసను జెడితిమొల్లఁ, బోయితిమిప్రాయిగలపట్టి పుట్టఁబట్టి." (ప్రాఁతప్రతులయందీ పాఠము.) హరి. పూ. ౫, ఆ.—3. సౌమంగల్యము. "సీ. ప్రాల్గలరతిదేవిభాగ్యసంపదఁగదా ప్రసవసాయక చచ్చిబ్రతికితివు." నై. 3, ఆ.

**ప్రాయిఁడి.** దే. విశే. (ప్రాయి+ఇఁడి.) 1. పౌరుషహీనుఁడు, దీనుఁడు; "క. రోయిగొనిపెట్టఁజాలక, ప్రాయిఁడియైయరుగు నతఁడుఁ బరదేశముదాఁ, బోయినతఁడుమూఁడునెలల్, పోయినఁ దుదివడ్డినహితముగఁ బెట్టఁదగున్." విజ్ఞా. వ్య, కాం.—2. భాగ్యహీనము, దీనము. "ద్వి. ప్రాయిఁడిమోము." రా. యు, కాం.

**ప్రాయికము.** సం. విశే. (అ. ఈ. అ.) సామాన్యము.

**ప్రాయేఱు.** ద్వ. వి. (ప్రాఁత+ఏఱు.) మున్నీరు, సముద్రము. (చూ. ఎవుచే.)

**ప్రారంభము.** సం. వి. అ. పుం. ప్రయత్నము, కడఁక.

**ప్రారంభించు.** సం. అ. క్రి. ప్రయత్నించు, కడఁగు.

**ప్రారబ్ధము.** సం. వి. అ. పుం. శరీరమునెత్తించెడు కర్మవిశేషము. విశే. ప్రారంభింపఁబడినది.

**ప్రార్థకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడుగువాఁడు; 2. వేడువాఁడు.

**ప్రార్థన.** సం. వి. ఆ. స్త్రీ. 1. అడుగుట; 2. వేఁడుట. (రూ. ప్రార్థనము. అ. న. ము.)

**ప్రార్థనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడుగఁదగినది; 2. వేఁడఁదగినది.

**ప్రార్థించు.** సం. స. క్రి. 1. అడుగు; 2. వేఁడు.

**ప్రార్థితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడుగఁబడినది; 2. వేఁడఁబడినది; 3. శత్రువుచే అడ్డగింపఁబడినది.

**ప్రాలంబము.** సం. వి. అ. న. మెడనుండి సరిగా నురమున వ్రేలెడు పూలదండలోనగునది.

**ప్రాలంబిక.** సం. వి. ఆ. స్త్రీ. మెడనుండి సరిగా నురమున వ్రేలెడు బంగారుబొట్లదండలోనగునది.

**ప్రాలు.** దే. వి. బ. 1. బియ్యము; "ఆ. పూరిపంటప్రాలు నాయకబియ్యంబు, జంబువునఫలంబు శ్రాద్ధకృతికిఁ, గావు." భార. అను. 3, ఆ.—2. తలఁబ్రాలు. "శా. లీలంబార్వతిసేసఁబ్రాలు శివుమౌళింబోసెఁదాఁగోరికల్, కేలిందోయిటఁబట్టిశంకరునిపైఁగీలించెనోనాఁగన, వ్వేళన్సత్కృపదోయిలించినతిపైవిశ్వేశ్వరుండుం చెనాఁ, బోలన్శంభుఁడుప్రాలువోసెఁదలపైఁబూర్ణేందుబింబాన్యకున్." సీర. 3, ఆ. (ఏకవచనముప్రాయి. చూ. నసుఁబ్రాయి.)

**ప్రాలుమాలిక.** దే. వి. సోమరితనము.

**ప్రాలుమాలు.** దే. అ. క్రి. సోమరితనముపొందు.

**ప్రాలేయము.** సం. వి. అ. న. మంచు, హిమము, నీహారము.

**ప్రాల్మాలిక.** దే. వి. ప్రాలుమాలికయొక్క రూపాంతరము.

**ప్రాల్మాలు.** దే. అ. క్రి. ప్రాలుమాలుయొక్క రూపాంతరము. "భరమైతోఁచుకుటురీబరతిక్షణకుఁగాఁబ్రాల్మాలి." స్వా. ౧, ఆ.

**ప్రావ.** యు. దే. వి. పద్ధతి. "సీ. త్రిజగజ్జనులకునతిపతి న్యాయమై సాగినప్రావయాచార్యసేవ." వై. ౨, ఆ. — విశే. 1. అనుకూలము; "క. మగఁడాపట్టెంబునఁదలఁ, దెగఁగొట్టినఁగొట్టుఁగాక తెకచేరగనే, కెగవిడిచిపోయెదనెప్రా, వగనాకాణాచియైన వలపుల పంటన్." కళా. 3, ఆ.—2. యుక్తము. "క. ఆవేళమహీసారపు, రీవానుండైనమేదరియొకండుకడున్, బ్రావగహరిదాసుఁడనఁ, గావెలసినవాఁడు బంధుగణముందానున్." పర. ౧, ఆ.—వై. వి. దోషము. (నీకు వాని ప్రావకొట్టినది.)

**ప్రావరణము.** సం. వి. అ. న. 1. ఉత్తరీయము; 2. ముసుఁగు.

**ప్రావారము.** సం. వి. అ. పుం. 1. ఉత్తరీయము; 2. కంబళి.

**ప్రావీణ్యము.** సం. వి. అ. న. ప్రవీణత్వము, నేర్పు.

**ప్రావు.** వై. అ. క్రి. పరవుయొక్క రూపాంతరము.

**ప్రావృట్టు.** సం. వి. ష. స్త్రీ. వర్షర్తువు. (రూ. ప్రావృష. ఆ. స్త్రీ.)

**ప్రావృతము.** సం. విశే. (అ. ఆ. అ.) కప్పుకొనఁబడినది. (దుప్పటి.)

**ప్రావృషాయణి.** సం. వి. ఈ. స్త్రీ. దూలగొండి.

**ప్రావృషేణ్యము.** సం. వి. అ. పుం. 1. కడపి; 2. కొడిసె. విశే. ప్రావృట్కాలమునఁబుట్టినది.

**ప్రావేలుపు.** ద్వ. వి. (ప్రాఁత+వేలుపు.) అసురుఁడు, పూర్వదేవుఁడు. (రూ. ప్రావేల్పు. "వ. వేల్పులుంబ్రావేల్పులుననల్పభావనావిశేషంబులనశేషవిధంబుల మహాశివాహానునకుఁబ్రదక్షిణంబులుఁబ్రణామంబులుంజేసి." భీ. ర, ఆ.)

**ప్రాశనము.** సం. వి. అ. న. భోజనము, కుడుపు.

**ప్రాశస్త్యము.** సం. వి. అ. న. ప్రశస్తత్వము.

**ప్రాశించు.** సం. స. క్రి. 1. భుజించు; 2. పానముచేయు.

**ప్రాశితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. భుజింపఁబడినది; 2. పానముచేయఁబడినది.

**ప్రాశ్నికుఁడు.** సం. వి. అ. పుం. సభ్యుఁడు. విణ. ప్రశ్నచేయువాఁడు.

**ప్రాసంగము.** సం. వి. అ. పుం. కాఁడికిముందటికాఁడి, కాఁడికి వెనుకటికాఁడి. (అనికొందఱు.)

**ప్రాసంగ్యము.** సం. వి. అ. పుం. కాఁడిమోసెడు ఎద్దు.

**ప్రాసఁగు.** దే. వి. సన్యవిశేషము. "ఉ. ప్రాసఁగువిత్తువంటి నెఱపాఱుకులంబునఁబుట్టి వేదముల్, పోసినగాదె శాస్త్రములు పుట్టిన యిల్లు కలాకలాపముల్, డాసినరచ్చ యంచునకలంబుఁదనుఁగొని యాడనొప్పును, ద్భాసితభాసితద్యుతినభాపతినానొకఁడాహితాగ్ని యై." పాండు. 3, ఆ. "సి. పొదలెల్లఁగార్కొనిపారిఁబొరిఁ బసరించెఁబ్రాసంగువరిచేలఁబసలుమించె." అచ్చ. కిష్కిం, కాం.

**ప్రాసము.** సం. వి. అ. పుం. 1. పద్యపాదమున రెండవ అక్షరము; 2. ఈఁటె.

**ప్రాసవము.** సం. విణ. (అ. ఈ. అ.) ప్రసవసంబంధమైనది. (ప్రసవము=పుష్పము.)

**ప్రాసాదము.** సం. వి. అ. పుం. 1. దేవళము; 2. నగరు.

**ప్రాసికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) ఈఁటెకాఁడు.

**ప్రాహ్ణము.** సం. వి. అ. పుం. ఉదయముమొదలు పదిగడియల వఱకుఁగలకాలము, లేఁబగలు.

## ప్రి.

**ప్రిదులు.** వై. అ. క్రి. 1. విరియు; "సీ. ప్రదిలికైరవదళశ్రేణి నొక్కలుదీఱ శశికాంతిపస్త్కలజలములూరె." సాంబ. 3, ఆ.— 2. నడలు; "క. తెల్లముగనుతుపడుటవిని, జల్లనడెందంబుసెదర సంఘలుప్రిదులన్." భార. ద్రో. ౨, ఆ. (చూ. గనయము.) —3. తగ్గు*; "ప్రిదులనిశౌర్యసంపదల." కళా. ౮, ఆ.— 4. ఊడు*; "ఉ. శ్యేనముఖంబునంబ్రిదిలి చెచ్చెరమేదినిఁ బడ్డశారికన్." మార్క. ౭, ఆ.—5. జాఱు*; "ద్వి. ప్రిదిలిన పయ్యెదబిగియఁజేర్చుచును." రా. ఆర, కాం. — 6. తొలఁగు*. "తే. పగతుఁడిట్టులులెన్నలోఁబడియెవీనిఁ, బ్రిదిలి పోనీక యింకఁ జంపెదరయమున." హరి. పూ. ౭, ఆ.

**ప్రియ.** ఉభ. దే. వి. పిరయొక్కరూపాంతరము. సం. ఆ. స్త్రీ. ప్రియురాలు.

**ప్రియంగువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. కొఱ్ఱలు; 2. నల్లావలు; 3. పిప్పలి†; 4. ప్రేంకణము†. న. కుంకుమము.

**ప్రియంవదుఁడు.** సం. వి. అ. పుం. ఒకఖేచరుఁడు. విణ. ఇచ్చకమాడువాఁడు.

**ప్రియకము.** సం. వి. అ. పుం. 1. కుంకుమము; 2. చిత్ర వర్ణముగలజింక; 3. తుమ్మెద; 4. కడప†; 5. ప్రేంకణము†; 6. వేఁగిస†.

**ప్రియత.** సం. వి. ఆ. స్త్రీ. స్నేహము, చెలిమి.

**ప్రియపడు.** మి. అ. క్రి. ప్రియంపడు, ఇష్టపడు.

**ప్రియము.** సం. వి. అ. పుం. 1. వృద్ధియనెడు ఓషధి; 2. స్నేహము; 3. సంతోషము. (వెనుకటి రెండర్థములకును తెనుఁగున భారతాదిగ్రంథములయందు ప్రయోగము.) విణ. 1. ఇష్టము; 2. హెచ్చువెలగలది. (కఱవులో బియ్యము చాల ప్రియముగా నుండెను.)

**ప్రియవాది.** సం. విణ. (న్. ఈ. న్.) ఇచ్చకమాడువాఁడు, ప్రియంవదుఁడు.

**ప్రియవాదిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. వివాహాదిప్రయుక్తమంగళవాద్యము; 2. వివాహాదిప్రయుక్తమంగళవాద్యధ్వని.

**ప్రియాలు.** సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష†. అ. పుం. ము. మోరటి†.

**ప్రియాళువు.** సం. వి. ఉ. పుం. ప్రియాలము, మోరటి†. (దీనికి దోహదక్రియ గీతి.)

**ప్రియుఁడు.** సం. వి. అ. పుం. ప్రాణనాథుఁడు.

## ప్రీ.

**ప్రీణనము.** సం. వి. అ. న. తృప్తిఁబుట్టించుట.

**ప్రీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము; 2. స్నేహము; 3. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 4. మన్మథునిభార్య.

**ప్రీతిదత్తము.** సం. వి. అ. న. అత్తగారిచేతఁగాని మామగారిచేతఁగాని ప్రేమచేనియ్యఁబడినదియు పాదవందనకాలమునఁ దియ్యఁబడినదియునైన స్త్రీధనము.

**ప్రీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రీతిఁబొందినవాఁడు, ముదితుఁడు.

## ప్రు.

**ప్రుంగుడు.** దే. వి. తెల్లకుష్ఠము, శ్విత్రము.

**ప్రుచ్చు.** దే. అ. క్రి. పుచ్చిపట్టు. "ను. హరిసాధింతుహరిన్ వధింతుహరిఁబ్రాణాంతంబు నొందింతుఁదా, హరికిన్ వైరినటంచు వీఁడుపట్టురోషాయత్తుఁడైయెప్పుడున్, దిరుగుంబ్రువ్వదునోరు ప్రిలిపడదున్ దేహంబుదాహంబుతో, సరకప్రాప్తియు నొందఁడే క్రియ జగన్నాథుంబ్రవేశించెనో." భాగ. ౭, స్కం. (పుచ్చునకు మొదటిరూపము.)

**ప్రుప్పి.** దే. వి. 1. ప్రుచ్చుట; 2. మఁగిదొపవిశేషము. (పుప్పికి మొదటిరూపము.)

**ప్రువ్వు.** వై. వి. పురువుయొక్కరూపాంతరము. (చూ. పాడ.)

**ప్రుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁబడినది, దగ్ధము.

## ప్రె.

**ప్రెక్కణము.** వై. వి. 1. అభినయముతోడినృత్యము. (చూ.) పెక్కణము; 2. మల్లరంగము*. "వ. అని పెత్తనయియ్యకొనిగజాలన్యంబునంబ్రెక్కణంబుచొచ్చిభూపాలునిముందటభుజాస్ఫాలనంబుచేసిమ్రొక్కిమరలునెడ," సం. "ప్రవివేశమహారంగమ్." భార. విరా. ౨, ఆ.

**ప్రెగడ.** ద్వి. వి. ప్రెగ్గడయొక్కరూపాంతరము. (మంత్రికి.— "క. ప్రెగడలమనములు విరసము, లగుగతినడచురిపురాజ్యమరసి విభిన్నం, బుగఁజేసికలఁచిపైకొని, జగతీవరకొనఁగవలయుసౌశర్యస్ముగన్." భార. ఆశ్ర. ౧, ఆ. – ప్రధానపురుషునకు.—

"క. నాగనిలోనూహుం పుఘు, దిగవిడువకున్నలినయుద్ధమతివైపొం, పగుచెందముకొమకులకున్, బ్రెగ్గడలకుంజెప్పతీర్పుపెంపేర్పడఁగన్." భార. ఉద్యో. ౨, ఆ.—యువరాజునకు. చూ. ప్రెగ్గడ.)

**ప్రెగ్గడ.** దన్వ. వి. (పేరు+కడ.) 1. మంత్రి; "సుమంత్రుఁడనఁగఁబరఁగుప్రెగ్గడయును." అచ్చ. అ, కాం.—2. ప్రధానపురుషుఁడు; (చూ. ప్రెగడ.) 3. యువరాజు. "ఉ. నాదునెయ్యపుం, దమ్ముఁడుకైటభాంతకుఁడు దక్షతఁబ్రెగ్గడయైనమస్తభా, రమ్మువహింపఁగాఁ ద్రిదశరాజ్యమునెమ్మదిఁజేయుచుండుదున్." నై. ౩, ఆ.

**ప్రెబ్బొత్తి.** దన్వ. క్రి. విశే. (పెరు+బొత్తి.) నిశ్చయముగా. "ద్వి. ప్రెబ్బొత్తిపెయ్యల పెద్దయొకండు." బల్లా. ౫, భా.

**ప్రెవడ.** దన్వ. వి. ప్రెగడయొక్క రూపాంతరము.

## ప్రేం.

**ప్రేంకడము.** వై. వి. (చూ.) క్రీయాశువృత్తి. "తే. అంబుజాసనయొకలెగాసంబుసేయఁ, గడువికాసంబునొంది ప్రేంకడపుఁదరువు, సుతియొనంగెనపీన ప్రసూనవిసర, లీనవదలీనసంతానతానములన." రుక్మి. ౩, ఆ.

**ప్రేంకణము.** వై. వి. (చూ.)——పై.——"రగడ. పుడుకుమల్లనగందపాడికినీప్రేంకణము, దడయకిటసీకిత్తుఁదగరత్నకంకణము." సావి. ౩, ఆ.

**ప్రేంకనము.** వై. వి. (చూ.)——పై.——(చూ. నన.)

**ప్రేంఖ.** సం. వి. ఆ. స్త్రీ. 1. డోల; 2. పర్యటనము; 3. నృత్యము; 4. అశ్వగతి.

**ప్రేంఖణము.** సం. వి. అ. న. 1. నృత్యవిశేషము; "తే. ఒండుపనులకు సెలవులేకునికిఁజేసి, యభ్యసించితిశైశవమాదిగాఁగ, దండలాసకవిధమునుగుండలియును, బ్రేంఖణంబుతెఱంగును బ్రేరణియును." భార. విరా. ౧, ఆ. (చూ. పెక్కణము.) — 2. పర్యటనము; 3. ప్రవేశము; 4. నాటకము.

**ప్రేంఖితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఊఁచఁబడినది; 2. కదలింపఁబడినది.

**ప్రేఁపుడు.** దే. విశే. అధికుఁడు. "క. సన్నపువారలనధిపతి, మన్నించినఁబ్రేఁపుడైనమంత్రికిబ్రతుకే, మున్నదిమునుమున్నయతఁడు, సన్నకుసన్నచటువాసిచనకున్నఁజెడున్." పంచ. నా. ౧, ఆ.

**ప్రేఁబ్రాలు.** దే. వి. బ. (ప్రేల+ప్రాలు.) ప్రేలగింజలు. "ఎ, గీ. కుప్పఁజిచ్చిడిప్రేఁబ్రాలుగొఱుకఁదివురు." పాండు. ౪, ఆ.

**ప్రేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. బుద్ధి; 2. ఈక్షణము; 3. నృత్యేక్షణము.

**ప్రేక్షణము.** సం. వి. అ. న. 1. నేత్రము; 2. ఈక్షణము; 3. నృత్యేక్షణము.

**ప్రేక్షణీకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) చూచేవాఁడు, దర్శకుఁడు.

**ప్రేక్షణీయము.** సం. విశే. (అ. ఆ. అ.) చూడఁదగినది, దర్శనీయము.

**ప్రేక్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) చూడఁబడినది, దర్శితము.

**ప్రేగు.** దే. వి. కడుపులోనిపేగు, అంత్రము.

**ప్రేచు.** వై. స. క్రి. ప్రేరేచుయొక్క రూపాంతరము.

**ప్రేతపురము.** సం. వి. అ. న. యమపట్టణము.

**ప్రేతము.** సం. వి. అ. పుం. 1. నరకమందుండు జంతువు; 2. భూతవిశేషము. విశే. పీనుఁగు.

**ప్రేతవనము.** సం. వి. అ. న. ఒలికిమిట్ట, శ్మశానము.

**ప్రేపు.** వై. వి. ఉషఃకాలము, వేకువ. "ఉ. ప్రేపుబరేలుఁబెద్దయును బెర్చిసమీపసగేంద్రచంద్రకాం, తోపలతోయదంబు నదుఅక్కమొగింజనుదెంచియాదటన్, బైపడఁదానసుల్లసితభాతిఁదదీయనదాభిసారమున్, దీపెనలారఁగైకొనివమదించునదీపతికోర్కివింతగన్." లక్ష్మీ. ౧, ఆ.

**ప్రేమ.** సం. వి. న్. పుం, న. 1. హార్దము; 2. స్నేహము. (చూ. ప్రేమము.)

**ప్రేము.** దే. వి. బెత్తము, వేత్రము. (పేమునకు మొదటిరూపము.)

**ప్రేముడి.** వై. వి. స్నేహము. (చూ. పొడచూచు.)

**ప్రేముడించు.** వై. అ. క్రి. 1. ప్రియపడు; "చవులకుఁబ్రేముడించుననిశంబుసునాలుక." భార. ఆది. ౬, ఆ.—2. శోకించు*; "అ. భీమనందనుచావునఁబ్రేముడించి, ధర్మతనయుండుబాష్పంబు ధారలడర, మేనుడిల్లంబుగాఁదేరిమీఁదవివశుఁ, డగుచుఁజతికిలఁబడుటయునచ్యుతుండు." సం. "అశ్రుపూర్ణముఖోరాజానిశ్వసంశ్చ పునఃపునః, కశ్మలం ప్రావిశద్ఘోరం దృష్ట్వాకర్ణస్యవిక్రమమ్, తంతథావ్యథితం దృష్ట్వా కృష్ణోవచనమబ్రవీత్." భార. ద్రో. ౫, ఆ.—3. బాధపడు*. "తే. చావుతథ్యముమనకువిచారమేల, పెక్కుదినములయాఁకటఁబ్రేముడించు, హరికినెచ్చోటనేమియుదొరకదయ్యె, సరయసంతయుదైవికంబట్లకాదె." పంచ. నా. ౧, ఆ.

**ప్రేయసి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రియురాలు.

**ప్రేయసుఁడు.** సం. వి. స్. పుం. ప్రియుఁడు.

**ప్రేరకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) ప్రెరేపణచేయువాఁడు.

**ప్రేరణము.** సం. వి. అ. న. ప్రేరేపణ. (ఇది ఆకారాంతస్త్రీలింగముగాను కనఁబడుచున్నది.)

**ప్రేరణి.** సం. వి. ఈ. స్త్రీ. నృత్యవిశేషము. "సీ. కుండలీప్రేంణీదండలాసకముఖ్యనృత్యంబులచ్చరల్నెఱపుచుండ." పు. ౧, ఆ. (చూ. పేరణి.)

**ప్రేరణీయము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రేరణచేయఁదగినది.

**ప్రేరించు.** సం. స. క్రి. ప్రేరేపణచేయు, ప్రేరేచు.

**ప్రేరితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రేరేపఁబడినది.

**ప్రేరేచు.** వై. స. క్రి. ప్రేరించు. "ఎవ్వరైనఁబ్రేరేచిరొసివెవేడ్కకుఁజరించెదో." ఉ, రా. ౨, ఆ.

**ప్రేరేపణ.** వై. వి. ప్రేరణము. (ఇది వాడుకలోనిది.)

**ప్రేరేపించు.** వై. స. క్రి. ప్రేరేపుయొక్క రూపాంతరము. (ఇది వాడుకలోనిది.)

**ప్రేరేపు.** వై. స. క్రి. ప్రేరేచుయొక్క రూపాంతరము. "క. ఈరీతిమనకువిరహము, ప్రేరేపయశోదపట్టిఁబెడఁబాపినయా, క్రూరునినక్రూరుండని, యేరీతింబిలువవచ్చునింతులువినరే." వి. పు. ౭, ఆ.

**ప్రేలడము.** దే. వి. ప్రేలుట. "ఆ. మనసురాదునాకుమానినీమణులార, ప్రేలడములుగట్టి పెట్టిరండు, కాకయున్ననన్నుఁగనలింపకూరక, యుండుఁడనినవారలులుకుపుట్టి." చంద్రా. ౨, ఆ. (దీనికి పురాతనగ్రంథములయందు ప్రయోగముకానఁబడదు.)

**ప్రేలరి.** దే. విశే. వదరుఁబోతు, జల్పకుఁడు. "క. ప్రేలరులై వెడయఱపుల, నాలిగొనకపాండుతోలఁగియసవుడు." హరి. పూ. ౭, ఆ.

**ప్రేలలు.** దే. వి. పేలలకుమొదటిరూపము. (వృత్తియందేకవచనాంతము. ప్రేలగింజలు.)

**ప్రేలిక.** దే. వి. పేలికకు మొదటిరూపము.

**ప్రేలు.** దే. అ. క్రి. 1. వదరు; "క. కాలుఁడు ప్రేరేపఁగనిటు, ప్రేలినయంతటనేనిన్నుఁబెద్దగఁదలఁపం, బోలునెమాకును." భార. ఉద్యో. ౨, ఆ.– 2. వేఁగు; (చూ. పాడ.) 3. వేఁగియుబుకు. "శి. పగిలిభద్రేభకుంభములమౌక్తికములు పెటిలినట్టిక్కులఁ ప్రేలి పడఁగ." జై. ౪, ఆ.

**ప్రేలుచు.** దే. ప్రే. (ప్రేలఁజేయు.) వేఁచు. (చూ. ప్రేల్చు. "ఆ. సప్తహాయుఁడుమూర్తిసప్తకంబుధరించి, కరమువేఁడిమిగులు కనుముపొప్ప, నదనదీజలములునుదధిజలంబులుఁ, బీల్చిజగములెల్లఁ బ్రేల్చుఁగడఁగి." భార, అర. ౪, ఆ.)

**ప్రేలుడు.** దే. వి. ప్రేలుట.

**ప్రేవు.** దే. వి. ప్రేగుయొక్కరూపాంతరము. "క. ప్రోవులుగట్టిన గుజ్జువుఁ, బ్రేవులు." భార. భీష్మ. ౨, ఆ.

**ప్రేషకుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) పంపువాఁడు.

**ప్రేషణము.** సం. వి. అ. న. పంపుట.

**ప్రేషణీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పంపఁదగినవాఁడు.

**ప్రేషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పంపఁబడినవాఁడు.

**ప్రేష్ఠము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రియమైనది.

**ప్రేష్యుఁడు.** సం. వి. అ. పుం. భృత్యుఁడు. విశే. పంపఁదగిన వాఁడు.

## ప్రై.

**ప్రైషము.** సం. వి. అ. పుం. 1. ప్రేషణము; 2. మర్దనము; 3. క్లేశము; 4. ఉన్మాదము.

## ప్రొ.

**ప్రొద్దు.** వై. వి. 1. సూర్యుఁడు; "వ. కందమూలఫలంబుల యాహారంబుగాఁ బ్రొద్దువడినచోటనివాసంబుగామృగంబులసహాయంబుగావనంబునంబరిభ్రమించితి." భార. అర. ౨, ఆ.– 2. కాలము*; "క. ఏప్రొద్దుశూద్రమునివిగ, తప్రాణునిఁజేసి తీవ్రధర్మనిరతినా, విప్రశిశువుచైతన్యం, బాప్రొద్దయనూనముగసమాహితమయ్యెన్." నిర్వ. ౧౦, ఆ. (చూ. నేల.)–3. దినము*; (చూ. పదపడి.) 4. పూఁట*; "సీ. అధ్యయనంబునుయజనంబు దానంబు నధ్యాపనంబునుయాజనముఁబ్ర, తిగ్రహంబును బ్రశాంతియుఁదపస్సత్యశౌచంబులువిప్రధర్మంబులాప, దలఁదక్కనతనికిపలవదువాణిజ్యమగ్నికార్యంబు శూద్రాన్నవర్జ, నమునిజదారసంగమనియమంబును నిరుప్రొద్దుగుడుపునుహింసలేమి, యునునివాసశుద్ధియును నతిథిప్రియ, త్వంబుబ్రాహ్మణులకువలయుఁదపము, పేర్మిసాధనముగధర్మమూలముగవా, రలన్సృజించెఁగాదె నలినభవుఁడు." భార. అను. ౫, ఆ.—5. ఉషఃకాలము*; "రమణుల్ ప్రొద్దునమేలుకాంచి." భాగ. ౧౦, స్కం. పూ.—6. బ. ప్రసవదినములు. "క. ముద్దియమునిహృత్కమలము, లుద్దామశ్రీసమృద్ధినొందఁగఁగనియెన్, బ్రొద్దులునిండుటఁజేసిల, సద్దీప్తసహస్రభానుశతకోటినిభున్." రామా. 3, ఆ.—(చూ. ఉద్దియసేయు.) (ఉషఃకాలము అను నర్థమునందు కొందఱు అవ్యయముగా వ్రాసియున్నారు. ఆపక్షమున ప్రొద్దిటిపూఁట, ప్రొద్దుటెండ ఇత్యాదిరూపములు సిద్ధింపవు.)

**ప్రొద్దుఁగల్లు.** దృ. వి. (ప్రొద్దు + కల్లు.) సూర్యకాంతశిల. "ప్రొద్దుఁగల్నాటెంపుమిద్దియులును." అచ్చ. సుం, కాం. (ఇట్లు ప్రొద్దుఱాయి.)

**ప్రొద్దుఁగొడుకు.** వై. వి. (ప్రొద్దు+కొడుకు.) 1. యముఁడు; 2. శనైశ్చరుఁడు; 3. కర్ణుఁడు; 4. సుగ్రీవుఁడు. (ఇట్లు ప్రొద్దుఁబట్టి మొ.)

**ప్రొద్దుచూలి.** దృ. వి.——వై.——

**ప్రొద్దుదిరుగుడు.** దృ. వి. (ప్రొద్దు+తిరుగుడు.) సూర్యానువర్తిని*.

**ప్రొద్దురిక్క.** వై. వి. ఉత్తరఫల్గునీనక్షత్రము.

**ప్రొద్దురిక్కనెల.** దృ వి. ఫాల్గునమాసము.

**ప్రొద్దులనెల.** దృ. వి. (ప్రొద్దులు + నెల.) ప్రసవమాసము, వైజననము. "తే. సతికిఁబ్రొద్దులనెలచొచ్చె జడత హెచ్చె." కళా. ౫, ఆ.

**ప్రొయి.** దే. వి. ప్రొయ్యియొక్కరూపాంతరము.

**ప్రొయ్యి.** దే. వి. వంటకు అగ్నిని ప్రజ్వలింపఁజేసెడు యంత్రవిశేషము, అధిశ్రయణి. (ఇది త్రివిధము.—గడ్డప్రొయ్యి, గాఁడిప్రొయ్యి, గుంటప్రొయ్యి.)

## ప్రో.

**ప్రోఁగు.** దే. వి. పోఁగునకు మొదటిరూపము.

**ప్రోఁచు.** దే. స. క్రి. (చూ.) పోఁచు. "ఉ. ప్రత్తినిఁబ్రోఁచుచున్ వడికిబ్రాహ్మణుఁడిచ్చుపవిత్రతంతువుల్, క్రొత్తగనేకవింశతియుఁగూర్చి." ఉ, హరిశ్చ. ౪, ఆ.

**ప్రోక.** వై. వి. ప్రోగు, రాశి*. "క. ఆఁకరముతోడనప్పెను, మూఁకలపైకుటికికతినముష్టినిహతులన్, ప్రాఁకులశిలలనుబీనుఁగు, ప్రోకలుగావించిరపుడుపాడవడఁగవడిన్." రా. యు, కాం.

**ప్రోక్షణము.** సం. వి. అ. న. 1. (నీళ్లు) చిలుకరించుట; 2. (యజ్ఞమునందు) పశువునువధించుట.

**ప్రోక్షించు.** సం. స. క్రి. 1. (నీళ్లు) చిలుకరించు; 2. (యజ్ఞమునందు) పశువునువధించు.

**ప్రోక్షితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చిలుకరింపఁబడినది; 2. (యజ్ఞమునందు) వధింపఁబడినది.

**ప్రోగు.** వై. వి. ప్రోక, రాశి*. (చూ. ప్రోవు.)

**ప్రోచికోలు.** దే. వి. (బలహీనత్వముపొందినగవాదికమును) కాపాడియనుభవించుకొనుట. (వానికి ఆయావును ప్రోచికోలుగా ఇచ్చినాఁడు.) విశే. వ్యర్థము. (గడ్డిపోఁచయు ప్రోచికోలు కాద నఁగా మనుష్యుని చెప్పనేల.) (దీనిని వాడుకయందు పోచికోలందురు.)

**ప్రోచిల్లు.** వై. వి. బ. పోచిళ్లకు మొదటిరూపము.

**ప్రోచు.** వై. స. క్రి. అన్నపానాదులిడిపోషించు. "క. పేదమనసగుటధర్మువు, గాదునరేంద్రుసకుజగముగావన్ బ్రోవన్, గాదె నృపులోకపాలాం, శోదితుఁడుగఁజేసెఁబద్మయోనిచతురతన్." భార. శాం. ౧, ఆ.

**ప్రోఢ.** వై. విశే. 1. ప్రగల్భుఁడు; 2. నిపుణుఁడు; "క. మీకలు దుష్ప్రచుసుడుగని, రోసంబునఁదేరులెక్కి-ప్రోఢలయినరా, కాసివ జీరులఁగొందఱ, భాసటగొనినల్దెఱఁగులభాఁజులుగొలువఁగా." అచ్చ. యు, కాం.—3. వివేకి*. "వ, గీ. బుద్ధిసెప్పినవిని యెడు ప్రోఢగాఁడు." భార. స్త్రీ. ౧, ఆ.

**ప్రోఢఁడు.** వై. విశే. ప్రోఢయొక్క-రూపాంతరము. (నిపుణుఁడు.—"క. ఏడెనిమిదిదినములనీ, రేడుజగంబులనుబ్రాసియిచ్చెద సికుక్, జూడుముచిత్రపటములోఁ, బ్రోఢండైనిన్నుఁ బొంది పోయినవానిక్." వి, పు. ౮, ఆ.) (ఇది జోణఁడువంటిది.)

**ప్రోతము.** సం. వి. అ. న. వస్త్రము. విశే. కుట్టఁబడినది.

**ప్రోథము.** సం. వి. అ. పుం, న. గుఱ్ఱపుముక్కు-. పుం. 1. గర్భ పిండము; 2. పిఱుఁదు; 3. జీర్ణవస్త్రము. విశే. 1. తెరువరి; 2. ప్రసిద్ధికెక్కినది; 3. స్థాపింపఁబడినది.

**ప్రోది.** వై. వి. 1. పోషణము; "వసుమతీసురవంశవతంసమెల్ల వారు నిన్నసుతింపఁజెంపొనఁగఁబ్రోదియొనర్పుచుఁదల్లిఁదండ్రి." వాఁడు. ౨, ఆ.—2. వైభవము*. "క. ఆడలనేనుఁగుడిగితన, పైదలియుంరాచుబైడిపల్లెరములము, త్రెదువలారసులీఁగాఁ, బ్రోదింద ననగరుబాచ్చెఁబూనికతోడక్." య. ౪, ఆ.

**ప్రోదిగొను.** దృ. న. క్రి. (ప్రోది+కొను.) పోషించే. "మ అనిఁజెండాడివిపక్షవృక్షములకౌరార్యగ్ని చ్ఛటం బ్రేర్చిశ, స్త్రరచ్ఛేదములకారణోర్విత్తలముక్ నంక్షుణ్ణముంజేసినై, ర్యసృగార్ద్రంబొన రించిప్రోదిగొనకుద్యత్కీ-ర్తినస్యౌఘముల్, వెనసిద్ధించునెయంచుఁ బల్కు-నరసోరీనాథుయోధావళుల్." కా. 3, ఆ.

**ప్రోదిసేయు.** వై. స. క్రి. (ప్రోది+చేయు.) పోషించే. "సీ. ఆదిమనృపగతిమేదినీజనములఁబ్రోదిసేయుచు నొప్పుమాదవిభుని." కళా. ౧, ఆ.

**ప్రోపడు.** వై. అ. క్రి. (ప్రోపు+పడు.) పోషింపఁబడు. (ఇది త్రోపడువంటిది.)

**ప్రోపరి.** దృ. విశే. (ప్రోపు+అరి.) 1. పోషకుఁడు; 2. రక్షకుఁడు. "ఉ. కల్లలకెల్లనిల్కు-డలుగాకెకనుంగొనసేలప్రోపరుల్." అచ్చ. అ, కాం.

**ప్రోపు.** వై. వి. పోషణము. "ఆ. కొడుకనిన్నుఁగాంచుకొఱఁత నోములెకాని, పెంచిగారవించి పెన్చినీదు, ప్రోపుగుడువఁగాంచు పుణ్యంబుతుదిముట్ట, నేలచేయనైతినేనుకుత్త." భార. అర. ౨, ఆ.

**ప్రోయాలు.** దృ. వి. (ప్రోలు+ఆలు.) ఇల్లాలు, పురంధ్రి. "ఉ. పాలును నీరునేఱుపఱుపంగలమావులవేదవీధిపా, హ్యాళి యొనర్పునేయశిఖలాలకదానికవర్ణయయ్యనే, బాలమవర్ణరూప నుఁనభాసిలునానలుమోముచేర్పుప్రో, యాలుప్రవీరామాకమహాకృతినాథుఁగృతార్థుఁజేయుతక్." రామా. ౧, ఆ. (ఇక్కడ ప్రోలుశబ్దమునకు ఇల్లు అర్థమని గ్రహింపవలెను.)

**ప్రోలు.** వై. వి. పట్టణము. "అప్రోలు." ఉ, రా. 3, ఆ.

**ప్రోల్గడుపు.** దే. న. క్రి. ప్రేరేచే. (అప్ర.)

**ప్రోవు.** వై. వి. ప్రోగుయొక్క-రూపాంతరము. "సీ. కోమాంచ లీల్లలప్రోవులైయొండొరులు మూర్తులాశ్లేషశలనసొగియ." ఉ, హరి. 3, ఆ. "ఉ. వేవురుచంద్రులోలిఁబది వేవురుసూర్యులు లక్షపావకుల్, ప్రోవయియున్నయట్టిదగుభూరితరంబగుతేజము." హరి. ఉ. ౯, ఆ.

**ప్రోవుకొను.** దృ. అ. క్రి. రాశిపడు. (ప్రే. ప్రోవుకొలుపు. "ప్రోవుకొల్పెడుమహామలకోపమవర్తికావళిక్." కవిక. ౬, ఆ.)

**ప్రోషము.** సం. వి. అ. పుం. కాల్చుట, ప్లోషము.

**ప్రోషితభర్తృక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు దేశాంతరగతుఁడై యుండ ఖేదమునొందియుండు నాయిక. (చూ. నాయిక.)

**ప్రోషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దేశాంతరగతుఁడు.

**ప్రోష్ఠి.** సం. వి. ఈ. స్త్రీ. ఎగిరియెగిరిపడెడు మత్స్యవిశేషము.

**ప్రోహము.** సం. వి. అ. పుం. 1. ఏనుఁగుకాలు; 2. ఏనుఁగు మోఁకాలు; 3. కూర్పు; 4. నేర్పు. విశే. 1. నేర్పరి; 2. రు. తార్కికుఁడు.

## ప్రౌ.

**ప్రౌఢ.** సం. వి. ఆ. స్త్రీ. స్వీయాంతర్భేదవిశిష్టనాయికావిశేషము. (పదునెనిమిదియేండ్లకు పైపడిన వయస్సుగలిగి సంపూర్ణ యౌవనముగలది.)

**ప్రౌఢి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రౌఢిమ, నేర్పు.

**ప్రౌఢిమ.** సం. వి. న్. పుం. నేర్పు. (రూ. ప్రౌఢిమము.)

**ప్రౌఢుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రగల్భుఁడు; 2. నిపుణుఁడు; 3. ప్రవృద్ధుఁడు.

**ప్రౌష్ఠపద.** సం. వి. ఆ. స్త్రీ. పూర్వాభాద్రానక్షత్రము. అ. పుం. ము. భాద్రపదమాసము. (రూ. ప్రోష్ఠపద, ప్రోష్ఠపదము.)

## ప్ల.

**ప్లక్షము.** సం. వి. అ. పుం. 1. జువ్వి; 2. కలుజువ్వి; 3. రావి; 4. ఒక ద్వీపము. (చూ. ద్వీపము.)

**ప్లవ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) న. ము. 1. కయివడిముస్తె; 2. గంధతృణము. పుం. 1. తెప్ప; 2. కప్ప; 3. కోఁతి; 4. గొఱ్ఱె; 5. నీరుకాకి; 6. నీరుకోడి; (కొందఱు కన్నెలేడియందురు.) 7. వాటపుఁబల్లునేల; 8. ప్లుతస్వరము; 9. దాఁటు; 10. కాకియుమ్మెత్త; 11. జువ్వి. రు. మాలవాఁడు.

**ప్లవంగ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. కోఁతి; 2. కప్ప.

**ప్లవంగమము.** సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. కప్ప.

**ప్లవగము.** సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. కప్ప. రు. అనూరుఁడు.

## ప్లా.

**ప్లాక్షము.** సం. వి. అ. న. ప్లక్షఫలము.

## ప్లీ.

**ప్లీహము.** సం. వి. న్. పుం. హృదయమున ఎడమప్రక్క-నుండెడు మాంసగోళము.

**ప్లీహశత్రువు.** సం. వి. ఉ. పుం. ములుమోదుగు.

## ప్లు.

**ప్లుతము.** సం. వి. అ. న. వేగమున అంతమేరయు నడముగా బోయెడు అశ్వధారావిశేషము, నిబ్బరము. (చూ. ధార.) పుం. మూడుమాత్రలకాలముగలస్వరము.

**ప్లుష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) కాల్చఁబడినది.

ప్లో.

**ప్లోషము.** సం. వి. అ. పుం. కాల్చుట, ప్రోషము.

ఫ.

**ఫ.** ఒక అక్షరము.

**ఫకీరు.** హిం. వి. భిక్షుకుఁడు, మహమ్మదీయులలో బైరాగి.

**ఫక్కి.** సం. వి. ఈ. స్త్రీ. రీతి, ప్రకారము.

**ఫక్కిక.** సం. వి. ఆ. స్త్రీ. ఏక గ్రంథము.

**ఫక్తు.** హిం. క్రి. విణ. మాత్రము, ఊరక, ఉత్త.

**ఫణ.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. పాముయొక్క పడగ.

**ఫణి.** సం. వి. న్. పుం. పాము, సర్పము, భోగి.

**ఫణిజ్ఝకము.** సం. వి. అ. పుం. మరువము. (రూ. ఫణిర్జకము.)

**ఫణితము.** సం. వి. అ. న. వాక్కు. విణ. చెప్పఁబడినది.

**ఫణితి.** సం. వి. ఇ. స్త్రీ. వాక్కు.

**ఫర్మానా.** హిం. వి. రాజాజ్ఞ, శాసనము. (రూ. ఫర్మానా.)

**ఫర్మాయించు.** హిం. వి. ఆజ్ఞాపించు.

**ఫర్యాద్.** హిం. వి. లక్ష్యము.

**ఫర్మాయిషి.** హిం. వి. ఏదైన నొకపనిచేయ నాజ్ఞయిచ్చుట.

**ఫలకము.** సం. వి. అ. పుం. పలక. పుం, న. కేడెము.

**ఫలపూరము.** సం. వి. అ. పుం. మాదీఫలము.

**ఫలము.** సం. వి. అ. న. 1. పండు; 2. పంట; 3. ప్రయోజనము; 4. లాభము; 5. జాజికాయ; 6. ప్రత్తికాయ; 7. కేడెము; 8. బాణముములికి; 9. నాఁగటికఱ్ఱు; 10. పందికోఱచివర.

**ఫలముపాటు.** గ్రా. వి. లాభము, ప్రయోజనము.

**ఫలవంతము.** సం. విణ. (త్. ఈ. త్.) పండ్లుగలది. (వృక్షము)

**ఫలసాయము.** గ్రా. వి. పంట.

**ఫలాధ్యక్షము.** సం. వి. అ. న. క్షీరిక, పాలరి.

**ఫలానా.** హిం. విణ. అట్టి, ఒకానొక. (రూ. ఫలాని.)

**ఫలి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రేంకణముచేప. విణ. (న్.) పండ్లుగలది. (వృక్షము.)

**ఫలించు.** సం. అ. క్రి. 1. పండు; 2. నెఱవేరు.

**ఫలితము.** సం. వి. అ. పుం. వృక్షము. విణ. ఫలించినది.

**ఫలినము.** సం. విణ. (అ. ఆ. అ.) పండ్లుగలది. (వృక్షము.)

**ఫలిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తరిగొఱ్ఱచెట్టు; 2. ప్రేంకణముచేప. విణ. పండ్లుగలది. (వృక్షము.)

**ఫలేగ్రహి.** సం. విణ. (ఇ.) ఫలించునది. (వృక్షము.)

**ఫలేరుహ.** సం. వి. ఆ. స్త్రీ. కలిగొట్టుచెట్టు.

**ఫల్గునుఁడు.** సం. వి. అ. పుం. అర్జునుఁడు.

**ఫల్గువు.** సం. వి. ఉ. స్త్రీ. కుక్కమేడిచెట్టు. విణ. సారములేనిది.

**ఫసలీ.** హిం. వి. పంట, సంవత్సరము.

ఫా.

**ఫాంటము.** సం. వి. అ. పుం. ఆయాసములేక చేసిన కషాయను లోనగునది.

**ఫాణితము.** సం. వి. అ. న. కండచక్కెర.

**ఫామేదా.** హిం. విణ. అలవరిన, చేయితిరిగిన.

**ఫాయిదా.** హిం. వి. లాభము.

**ఫారం.** ఆం. వి. లెక్కలచిట్టా.

**ఫారసి.** హిం. వి. ఒకభాష. (రూ. పారసి.)

**ఫాలనేత్రుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**ఫాలము.** సం. వి. అ. న. నెత్తి. పుం. నాఁగటికఱ్ఱు. డు. 1. బలరాముఁడు; 2 శివుఁడు. విణ. ము. నూలిచేసేయఁబడినది. (వస్త్రము.)

**ఫాల్గునము.** సం. వి. అ. పుం. 1. ఒక మాసము; (చూ. మాసము.) 2. ఏఱుమద్దిచెట్టు. డు. అర్జునుఁడు.

**ఫాల్గునికము.** సం. వి. అ. పుం. ఫాల్గునమాసము.

ఫి.

**ఫిరాయించు.** హిం. స. క్రి. మార్చు.

**ఫిర్కా.** హిం. వి. ఒకభాగము.

**ఫిర్యాది.** హిం. వి. వాది.

**ఫిర్యాదు.** హిం. వి. విన్నపము, మొఱ.

ఫీ.

**ఫీజు.** ఆం. వి. బ. ఇంత యిత్తుమని ఒడఁబడిన ద్రవ్యము, జీతము.

ఫు.

**ఫురుసత్తు.** హిం. వి. అవకాశము.

**ఫుల్లము.** సం. విణ. (అ. ఆ. అ.) వికసించినది, విరిసినది.

**ఫుల్లరీకము.** సం. వి. అ. పుం. పాము, సర్పము.

ఫే.

**ఫేనము.** సం. వి. అ. పుం. సముద్రపునురుఁగు.

**ఫేనిక.** సం. వి. ఆ. స్త్రీ. భక్ష్యవిశేషము, పేణీ.

**ఫేనిలము.** సం. వి. అ. న. రేఁగుఁబండు. పుం. కుంకుడుచెట్టు. విణ. నురుఁగుగలది.

**ఫేరవము.** సం. వి. అ. పుం. నక్క. డు. రాక్షసుఁడు.

**ఫేరువు.** సం. వి. ఉ. పుం. నక్క, జంబుకము.

**ఫేల.** సం. వి. ఆ. స్త్రీ. ఎంగిలి, ఉచ్ఛిష్టము.

ఫ్లా.

**ఫ్లానెలు.** ఆం. వి. ఉన్నివస్త్రము.

ఫ్సా.

**ఫ్సాతము.** సం. విణ. (అ. ఆ. అ.) భక్షింపఁదగినది.

బ.

**బ.** ఒక అక్షరము.

**బంక.** దే. వి. 1. చెట్లయందుఁగలిగెడు జిగటగలవస్తువు, నిర్యాసము; 2. వ్యాధివిశేషము.

**బంకమన్ను.** ద్వ. వి. జిగటగల ఒకదినుసుమట్టి.

**బంకముచ్చు.** దే. విశ. పిసినారి, లోభి.

**బంకు.** దే. వి. సందువీధి. విశ. 1. శూరునివలెనటించువాఁడు; "చ. అనుటయుహుంసుఁడిట్లనుజనార్దనుతోముదిజోదుభీష్మునోం, డనఁబని లేదుబాహ్లికుఁడునాతనికంటెనుబంకు." ఉ, హరి. ౪, ఆ.—2. కావలివాఁడు.

**బంకెత.** దే. విశ. (బంక+ఎత.) లుబ్ధురాలు. "ద్వి. బంకెతల్ అంకెతల్పచ్చిరక్కసులు." పండి. ౫, ప్ర.

**బంకోలు.** వై. వి. జన్మఖయిదు వేయఁబడినవారినిపంపు ద్వీపాంతరము.

**బంగనబయలు.** వై. వి. (బయలు+బయలు.) బట్టబయలు.

**బంగరిము.** వై. వి. బఁగారముయొక్కరూపాంతరము. (చూ. గవ్వ చౌకము.)

**బంగరు.** వై. వి. బంగారుయొక్కరూపాంతరము. "క. కరులేటికి గడితపుబం, గరులేటికిమఱియుమేల్మగరులేటికిరా, సిరులేటికిబల్ రతనపు, సరులేటికినిన్నువిడిచి చనునెడఁదరుణీ." రసి. ౬, ఆ.

**బంగరుకొండ.** వై. వి. హేమాద్రి. "బంగరుకొండధైర్యమున." బ్ర. ౨, ఆ.—విశ. మంచివాఁడు. (చూ. బంగారుకొండ.)

**బంగరుపిచ్చుక.** ద్వ. వి. పక్షివిశేషము. (చూ. గడ్డిపిట్ట.)

**బంగరువు.** వై. వి. బంగరుయొక్కరూపాంతరము. "పదాఱువన్నె బంగరువున." పాండు. ౧, ఆ.

**బంగల.** దే. వి. కుంపటి, అంగారధానిక.

**బంగారము.** వై. వి. స్వర్ణము. విశ. దుర్లభము*. "సీ. కప్పు కొనేల బంగారమా పువుబంతులవిసువర్ణలకోదయములునుమ్ము." పు. ౧, ఆ.

**బంగారు.** వై. వి. విశ. బంగారముయొక్కరూపాంతరము.

**బంగారుకుండ.** వై. వి. స్వర్ణఘటము. విశ. మనోజ్ఞ. (చూ. తేరకుఁదేర.)

**బంగారుకొండ.** వై. వి. హేమాద్రి. విశ. మంచివాఁడు*. (వీఁడు మాబంగారుకొండ.)

**బంగారుతీఁగలు.** వై. వి. బ. శాలిధాన్యవిశేషము. "సీ. కణఁజములనిండ బంగారుతీఁగలుగూర్పఁజాలమేమఱిముత్తెసరులు గూర్ప." కవి. ౧, ఆ.

**బంగాళము.** ఉభ. వై. వి. వంగదేశము. (ఇది వాడుకలోనిది.) సం. అ. పుం. ఇక్షువిశేషము†.

**బంగాళా.** హిం. వి. పెద్ద యిల్లు.

**బంగాళి.** సం. వి. ఈ. స్త్రీ. కొమ్మరఁటి†.

**బంగి.** వై. వి. గంజాయి, మదమత్తము.

**బంగి.** హిం. వి. టప్పామీఁదవచ్చు వస్తువులకట్ట.

**బంగిముచ్చు.** ద్వ. విశ. బంగితాగువాఁడు.

**బంజరు.** హిం. వి. బీడునేల.

**బంజారి.** హిం. వి. ఒకజాతిజనులు, లంబాడివాండ్రు.

**బంటి.** దే. అవ. నీళ్లలోఁదినిదెలిపెడు ప్రత్యయము. (మోఁకాలిబంటి, మొలబంటి, పుక్కిటిబంటి, ఈఁతబంటి మొ.)

**బంటు.** వై. వి. 1. సేవకుఁడు*; 2. భృత్యుఁడు*; "సీ. ముని మాపు బలుగంబమునఁబుట్టి బంటునకు—ఁదానిపట్టిసింగంబతీవ." పా. ౧, ఆ.—3. శిష్యుఁడు*. "చ. గొనములప్రోకయంగిరసు కూరిమిమన్నఁడువేల్పుటొజ్జ పే, ర్గినిగనుఁగొన్నబిడ్డమఱిమీకును బంటు." య. 3, ఆ.—విశ. శూరుఁడు. "క. ఇంటందివ్యులుసఁ జచ్చుట, కంటెనబాపంబులొండుగలవెన్నవులకుఁ, బంటైరణ నంబోలియుఁటఁ, గంటనిధానంబుఁగంటకాదేమనకుఁ." భార. భీష్మ. ౧; ఆ.

**బండ.** యు. దే. వి. 1. వెడలుపుఱాయి; 2. పొట్టిరోఁకలి. విశ. అఱిగినది. వై. వి. ఘోరకృత్యములచే బిచ్చమెత్తెడు ఒక నీచజాతి. (బండవాఁడు, బండది.) విశ. ఆకతాయి*.

**బండఁడు.** వై. విశ. ఆకతాయి*. (బండయొక్కరూపాంతరము. బిడ్డఁడులోనగువానివంటిది.)

**బండగు.** వై. వి. బోను*. (చూ. దీము.)

**బండగుఁడు.** వై. విశ. బండ, ఆకతాయి*. "ఎ, గీ. జాలికాదుల చేత దూషకులచేతఁ, బ్రల్లదులచేత వంశనాపకులచేత, డాంబికుల చేతఁబచ్చిబండగులచేతఁ, గల్లరులచేత దర్పించుఁగలియుగంబు." జై. ౮, ఆ.

**బండము.** వై. వి. వస్తువు. "క. కొలుచాదిగఁగలబండము, గొలుచు నెడఁదూఁచుచోటఁ గుటిలతఁదఱుఁగఁ, గొలిచినఁదూఁచినబండము, దళమునబేహారిమీఁదదండువుదగులుఁ." విజ్ఞా. ప్రా, కాం.

**బండరువు.** వై. వి. బండారము. "సీ. ఆయాధికవ్యయానధికంబును బ్రజాళివిరుజంబుఁగాఁగబండరువుగూర్చి." ఆము. ౪, ఆ.

**బండవలము.** వై. వి. 1. సంచిమొదలు*; 2. సామర్థ్యము*.

**బండాట.** ద్వ. వి. (బండ+ఆట.) ఆకతాయితనము. (రూ. బండాటము. "ఎ, గీ. తోడబండాటమునఁగోకదోఁచుకొనుచు." కవిక. ౪, ఆ.) (చూ. అఱకడ.)

**బండారము.** వై. వి. బొక్కసము. "సీ. బండారములయందుఁ బరమవిశ్వాసులభక్తులదక్షులఁబంచితయ్య." భార. సభా. ౧, ఆ.

**బండారి.** ద్వ. వి. (బండారము+ఇ.) బొక్కసమున కధికారి. "ఎ, గీ. తనరుచలమర్తిగండప్రతాపరుద్ర, మనుజవరునకుబండారి యునుమహోధి, కారియునునాప్తుఁడునునయిగణనకెక్క, మేరు ధీరుండునాగయమేచశౌరి." మార్క. ౧, ఆ.

**బండారు.** యు. దే. వి. (బండ+ఆరు.) జాతిమీఁద జాచిపూసికొనెడుపసుపు. "ద్వి. బండారుకొమ్మినిపట్టపుసెట్టి, యిలుఘూలనిచ్చునే." భల్లా. ౧, భా.—వై. వి. బండారము. "బండారిలు." ఆము. ౪, ఆ.

**బండారుఁడు.** సం. వి. అ. పుం. బత్తెలనుకాచువాఁడు.

**బండారుపిచ్చుక.** దే. వి. (చూ.) పీతముండము.

**బండాలము.** వై. వి. సామగ్రి, సామర్థ్యము. (బండవలము యొక్కరూపాంతరము.)

**బండి.** దే. వి. 1. శకటము; 2. రథము. "సీ. ఎలుఁగులుఁబులులుఁగారెనుఁబోతులునుబూను బండ్లపైదేవాంతకుండువచ్చె." రామా. ౮, ఆ.

**బండిగిల్లు.** దే. అ. క్రి. కడగండ్లుపడు.

**బండిగురిగింజె.** ద్వ. వి. బండిగురివెందగింజె.

**బండిగురివెంద.** ద్వ. వి. కాంభోజి†.

**బండ్లిఘెుగ్గరము.** దే. వి. శకటవ్యూహము.

**బండిరిక్క.** ద్వ. వి. రోహిణీనక్షత్రము.

**బండు.** వై. వి. 1. ఆకతాయితనము*; "ఎ, గీ. సిఫువచ్చితిమేల య్యానిదియేచాలు, నతఁడురాకున్నఁగొదలేశమైనలేదు, తానుభిషేక పాలంబుదాల్చివచ్చి, బండుసేయుటకంటెరాకుండుటుఅవు." కాశీ. ౭, ఆ. — 2. ఆకతాయిమాట*. (నన్ను వాఁడు బండు బూతులు తిట్టినాఁడు.)

**బంతి.** యు. దే. వి. చెండు. వై. 1. పఙ్క్తి; (చూ. పసాదము.) 2. పది. (చూ. నట్టు.)

**బంతికట్టు.** ద్వి. వి. కుప్పనుఅుచునప్పుడు ఎడ్లవరుసకుఁగట్టెడు తలుపు.

**బంతికుడుపు.** ద్వి. వి. అనేకులుచేరి భుజించుట, సజ్గ్ధి.

**బంతిచెట్టు.** దే. వి. ఒకదినుసు చేమంతిచెట్టు.

**బందడము.** దే. వి. దొంతికుండ.

**బందన.** వై. వి. 1. జగట*; 2. బంక*.

**బందనగొను.** ద్వి. అ. క్రి. (బందన+కొను.) జిగటగలదియగు. "వ. ఇందూపలస్యందంబులకువిందులగునిందీవరమరందంబుల పెందడింబడిబందనగొను వలిమించు క్రొమ్మించుటొ దులీఁది యాఁది." స్వా. 3, ఆ.

**బందము.** వై. వి. 1. దూలముపైగుజ్జీలకుబిగువునిమిత్తములంకెగా నమర్చినపట్టె*; 2. చెట్టెక్కువాఁడు కాలికితగిలించుకొనెడు త్రాడు*; 3. పశువులకు రెండుకాళ్లుచేర్చికట్టెడుత్రాడు*.

**బందలము.** దే. వి. బందడముయొక్క రూపాంతరము.

**బందా.** వై. విశ. చెఱఁబడ్డవాఁడు*. "ఎ, గీ. పవనపన్నాంబు భక్షులైనవసి యినుప, కచ్చడాల్కట్టుకొనుమునిముచ్చులెల్లఁ, దామ రసనేత్రలిండ్లబందాలుగారె." స్వా. ౨, ఆ.

**బందాము.** వై. వి. బరెదముయొక్క రూపాంతరము.

**బందారు.** దే. వి. ఒకానొకచెట్టు.

**బంది.** ఉభ. వై. వి. నిర్బంధము*. (చూ. తెక్కలి.) సం. ఈ. స్త్రీ. 1. చెఱ; 2. చెఱఁబడ్డది.

**బందికాఁడు.** ద్వి. వి. బందిపోటుదొంగ. "చ. జలరుహమిత్రుఁ డాత్త రుచిసంపదఁజీఁకటి బందికానికిన్, గలఁగుచువీనిలోననిడికై కొనసమ్మికకాఁపులంచుఁజ, క్కలదొరయొండదాడివినిగ్రక్కునఁదా నునుగాంతివీనిలో, పలనెలకొల్పెనాఁబలుకఁబొలెనిశాంతనిశాంతదీప ములే." పా. ౨, ఆ.

**బందిఖానా.** హిం. వి. చెఱసాల. (రూ. బందేఖానా.)

**బందిగము.** వై. వి. చెఱసాల. "ఎ, గీ. ధర్మమార్గంబు దప్పని తండ్రినుగ్ర, సేనుశృంఖలాబద్ధునిఁజేసిబంది, గమునసిడి మెట్టిదైత్యు లఁగాపువెట్టెఁ, గంసుఁడత్యంతభీకరాకారుఁడగుచు." వి, పు. ౭, ఆ.

**బందిపోటు.** ద్వి. వి. నిర్బంధపఱిచికొట్టెడిదోఁచుట.

**బందు.** యు. దే. వి. బోరువపత్తి. వై. 1. ఆవరణము*; "ద్వి. గొనలైనయులదీఁగగుమిగవ్వకొన్న, నునుపొన్నచెట్టుబందు ననంద మైన, చందుతాతిన్నెపై." విష్ణు. ఉ. ౪, ఆ. — 2. గోపనము*; 3. పెట్టెతొఱలగుతాని ముూలలబిగించెడియినుముఠొనగువానితగ డు*; 4. నిరోధము*, కట్టివేత.

**బంధుకట్టు.** ద్వి. వి. జాతికట్టుపాటు.

**బందుగుఁడు.** వై. వి. చుట్టము. "శ. వగతురఅడఁచుటయుంబం, [illegible]శంబరయున్, విగశంటికైననిదికడుఁ, [illegible]." నీలా. 3, ఆ.

**బందువుఁడు.** వై. వి. బందుగుఁడుయొక్క రూపాంతరము.

**బందె.** వై. వి. 1. పశువులచెఱ*; "సీ. కట్టఁగాపింపదక్షతలేమి నూరూరబందెలఁబడిపోయెఁబశుగణంబు." స్వా. 3, ఆ. — 2. పశువులదండుగ*; "క. ఎనుమునకుబందెపాలిక, గొనవగు మొదవునకుఁబరకగొఱియకుపిసం, బొనరనారుచేనుమేసిన, నిను మడిగొనవలయునొడయఁడెజేఁగివిడిచినన్." విజ్ఞా. ప్రా, కాం. — 3. నిర్బంధము*. "సీ. ఆదికాలమునాటియగ్రహారంబులు బందెలుకల్పించిపాడుసేయు." వి, పు. ౨, ఆ.

**బందెకత్తె.** వై. విశ. చెఱలోవేయునది. "సీ. మదనసమ్మోహన మంత్రాధిదేవతల్ పంచశిలీముఖుబందెకత్తెలు." శాఁగ. ౬, స్కం.

**బందెకాఁడు.** ద్వి. విశ. చెఱలోవేయువాఁడు.

**బందెగొను.** ద్వి. స. క్రి. (బందె+కొను.) చెఱఁబెట్టు. "తే. అస్కవెన్నాడిరాజశుద్ధాంతగణము, తారకలబందెగొని." కవిక. ౪, ఆ.

**బందెడ.** దే. వి. తెల్లవావిలి, శ్వేతసురస.

**బందెలపోతు.** ద్వి. విశ. చెఱవేయుస్వభావముగలవాఁడు. "ద్వి. అచ్చినాయెదుర బ్రస్తుకుఁబోవరాదు, పురిలోనబందెలపోతుఁ డనఁగ." హరిశ్చ. ౨, భా.

**బందోబస్తు.** హిం. వి. ఏర్పాటు, భద్రము, పరిష్కారము.

**బంధకము.** సం. వి. అ. న. 1. చెఱసాల; 2. మాఱుపు. పుం. కుదువ.

**బంధకి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అంకుటాలు; 2. ఆటకత్తె; 3. ఆఁడేనుఁగు.

**బంధనము.** సం. వి. అ. న. 1. కట్టు; 2. కట్టుటకుఁదగినసాధనము; 3. కుదువ; 4. కొల; 5. చెఱ; 6. చెఱసాల; 7. తొడిమ.

**బంధనాలయము.** సం. వి. అ. పుం. చెఱసాల.

**బంధము.** సం. వి. అ. పుం. 1. కట్టు; 2. చెఱ; 3. కుదువ; 4. కావ్యరచనావిశేషము; 5. సంయోగవిశేషము.

**బంధస్తంభము.** సం. వి. అ. పుం. (ఏనుఁగునుకట్టెడు) కట్టుఁగంబము.

**బంధించు.** సం. స. క్రి. బంధనముచేయు, కట్టు.

**బంధుజీవకము.** సం. వి. అ. పుం. మంకెన.

**బంధుత.** సం. వి. ఆ. స్త్రీ. బంధుసమూహము.

**బంధుర.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. అ. న. ము. మకుటము. పుం. 1. కలహంస; 2. పక్షి; 3. నూనెమడ్డి; 4. ఆఁడుగుబి; 5. మంకెన. విశ. 1. ఒప్పిదమైనది; 2. వంగినది; 3. మధ్యోన్నతమును పార్శ్వావనతమునైనది. (రూ. బంధూరము.)

**బంధులుఁడు.** సం. వి. అ. పుం. అంకుటాలికొడుకు, కొలచేరుఁడు.

**బంధువు.** సం. వి. ఉ. పుం. 1. చుట్టము; 2. జ్ఞాతి; 3. మిత్రుఁడు; 4. మంకెన.

**బంధూకము.** సం. వి. అ. పుం. 1. మంకెన; 2. వేఁగిస.

**బంపు.** దే. వి. వండ్లపోఁచి, పోఁకుడు. "సీ. నన్నుతించుచుఁ జేరుజటివరేణ్యులనోటి బంపుకంపునసెగఁద్రాఁకుపెగటు." చంద్రా. ౧, ఆ.

బంబ. దే. విశే. స్థూలము. "ద్వి. ధవళహస్తముల, బంబలింగం బులఁబొసవివారు." ప్రభు. 3, ఆ.

బంబోతు. దే. విశే. (బంబ+పోతు.) మిక్కిలి బలిసినవాఁడు. "బంబోతద్దానరి." ఆము. ౬, ఆ.

బంభరము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద.

బంహిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి బహువు. (బహువు=తఱచు.)

బకదారి. దే. వి. పారావతవిశేషము.

బకము. సం. వి. అ. పుం. 1. వక్కు-కొంగ; 2. బకపుష్పము†. ను. 1. ఒకగాక్షసుఁడు; 2. కుబేరుఁడు.

బకవైరి. సం. వి. ఇ. పుం. 1. కృష్ణుఁడు; 2. భీమసేనుఁడు.

బకాను. దే. వి. చిఱువేరు†.

బకాయ. హిం. వి. వెనుకటిబాకి, నిలువబాకు.

బకాల్. హిం. వి. మైనపువత్తులమ్మువాఁడు, కోమటి.

బకోటము. సం. వి. అ. పుం. వక్కు-కొంగ, బకము.

బక్క. దే. విశే. బక్కటిల్లినవాఁడు, బక్కటిల్లినది. బ. వి. గని త్రవ్వవారు.

బక్కటిల్లు. దే. అ. క్రి. 1. శుష్కించు; 2. కృశించు.

బక్కమజ్జిగ. దృ. వి. నీళ్లు అధికముగాఁజేర్చినమజ్జిగ.

బగబగ. దే. వి. మండుటయందగు ధ్వన్యనుకరణము. "చ. శోద రుంబగగొనిరాజ్యలోభమునఁబట్టివధించినదుష్టకర్ముని్, బగబగ మండుమంటలనుబట్టియునెట్టఁగలేదు." రుక్మాం. ౨, ఆ.

బగళంబుసేయు. దృ. స. క్రి. (బగళంబు+చేయు.) తొలఁ గించు. (చూ. పాలకి.) (రూ. బగళముసేయు, బగళమ్ముసేయు.)

బగళము. దే. వి. తొలఁగుడు, అపసరణము. "సీ. అవసరంబిప్పుడ యగుననంతదాఁకనుబగళమైనిలుఁడుదిక్పాలవరులు." లక్ష్మీ. ౧, ఆ. "తే. వీరభద్రమహాకాళిభృంగిరిటులు, పాయుబగళంబుతొలఁగు విచ్చేయుఁడనుచుఁ, బార్శ్వములయందుమిగులనార్భటముసేయ." భీ. ౫, ఆ.

బగి. వై. వి. ప్రక్క, పార్శ్వము*.

బగిస. దే. వి. తృణవిశేషము.

బగిసి. వై. వి. బవిసియొక్క-రూపాంతరము.

బగీలు. దే. వి. సంతాపమునందగు ధ్వన్యనుకరణము. (ఆమాటవినఁ గానే నాకడుపులో బగీలుమన్నది.)

బగ్గముపాడు. దే. విశే. (పాడు+పాడు.) మిక్కిలిపాడు. (చూ. క్రోవిముడవయర్థము.)

బగ్గరి. దే. విశే. (బగ్గు+అరి.) బగ్గనిమండిపడువాఁడు.

బగ్గి. దే. వి. బూడిద.

బగ్గు. దే. వి. మండుటయందగు ధ్వన్యనుకరణము.

బగ్గుండి. దే. వి. రక్తవర్ణచూర్ణము; "ఎ, గీ. త్రాసుఁదాలుపుఁజెలి పైడిమేడమీఁద, గొండ్లినలుపుచునుఁగులఁగూడిచల్లు, లాడు బగ్గుండిపొడులనవలరియపుడు; చదలఁగొదలేక. సంజకెంజాయ అమరె." (ఇక్కడ బగ్గుండికి రక్తవర్ణమూత్రమర్థము.) అచ్చ. ౫, కాం.

బగ్గుమను. దే. అ. క్రి. (బగ్గు+అను.) బగ్గునమండు.

బచ్చెన. వై. వి. 1. పూఁత*; "ఎ, గీ. గంధవాహాంబులేదున గఱులుగాఁగ, విలయకాలానలజ్వాలములికిగాఁగ, లచ్చిచనుదోయి కుంకుమ బచ్చెనయుగఁ, బాలమున్నీటియల్లుఁడు బాణమయ్యె." భీ. ౪, ఆ.—2. వర్ణము*. "తే. అమలశశికాంతకాంతకుద్దాంత శ్రేణి, కానిశాంతాంతరంబునగమ్మురనెడు, పచ్చబచ్చెనచిత్తరు పనుల మించు, ప్రతిమసంఘటనలమండపంబులోన." హంస. ౧, ఆ.

బచ్చలి. దే. వి. కలంబి†. (దీని భేదములు తీఁగబచ్చలి, దుంప బచ్చలి. ఇదే తీఁగబచ్చలి.)

బచ్చు. వై. వి. 1. వైశ్యుఁడు; "తే. బలయురత్నాకరములునంచు లుగఁజేసి, పొదివినిధులెల్లఁగొనినంచిమొదలుచేసి, బేరమాడెడు పాటియుదారలక్ష్మి, బచ్చులున్నారలప్పురిఁబెచ్చువెరిఁగి." పాండు. ౧, ఆ.—2. బొక్కసమునకధికారి*; "ఉ. లాలనఁగొత్తబెబ్బులి కళాసమువెట్టిరి యానసంబుగా, గోలయుసాధువైనయొకకోమటికిక్ నిపధేంద్రుబచ్చుకుక్." నై. ౬, ఆ.—3. వెండిబంగారముల నాణెము చూచువాఁడు*. "చ. పరునకుఁజైత్రమంత్రివనమండల రాజ్యఫలైకకాంచనో, త్కరముకరంబొసంగుటయుఁ దావులబచ్చు లుచేరితచ్చడా, వరణముఁబాయవిప్పిపరువంబుగనెన్నికకెక్కఁ జేయుచుక్, దొరయఁగనీరుకంటెచెలిధూర్తవతంసమలీమసా శులక్." వసు. 3, ఆ.

బజంత్రి. హిం. వి. మేళము, మేళగాఁడు. (బాజాబజంత్రీలు.)

బజీతు. వై. విశే. భంగమునొందినది. "తే. అఁటదానిబజీతుసేయంగ వలెనె." ఆము. ౫, ఆ.

బజ్జి. దే. వి. ఎనిచిపలుచనగాఁజేసెడు వ్యంజనవిశేషము. (చూ. తియ్యఁగూర.)

బజారము. వై. వి. వ్యభిచారము*.

బజారి. వై. విశే. (బజారము+ఇ.) వ్యభిచారిణి. "అగడాడెడు చిల్కయనంబజారి." చంద్ర. "బీలబజారిరంతులెవియెవ్వరు మెత్తురు." సా. 3, ఆ.

బజారించు. వై. అ. క్రి. వ్యభిచరించు*.

బజారు. వై. వి. అంగడివీధి*.

బజారుమాట. వై. వి వీధులయందుఁజెప్పుకొనుమాట, కోలాహలము.

బజ్జెడి. దే. వి. పాదవిన్యాసవిశేషము. "ద్వి. బహుచిత్రగతు లతోబజ్జెల్లద్రొక్కు." పల్నాటిచరిత్రము. ౨, భా.

బటాకబయలు. వై. వి. విశే. బటాబయలుయొక్క-రూపాంతరము. "క. పయ్యెదగొబ్బునబటాకబయలుగఁజేసెక్." సా. 3, ఆ. (స్వార్థమున కకారాగమము. చూ. బట్టబయలు.)

బటాని. అన్య. వి. ఒకవిధమైన కాయధాన్యము.

బటాబయలు. వై. వి. విశే. బట్టబయలుయొక్క-రూపాంతరము. "చ. అనవుడునవిశాలరలాక్షీకటాక్షములందునంకురించి, చిన యలుకంబటాబయలునేయక." సా. ౨, ఆ. (చూ. బట్టబయలు.)

బటాబూరము. వై. వి. (బటారము+బూరము.) పెద్దబీకము*. "తే. కలనిదయ్య, ములబటాబూరమింతేమిముట్టఁగలదు." ఉ, హరి. 3, ఆ.

బటారము. వై. విశే. గొప్ప*. (లొటలొటారము బయలుబటారము.)

బటువు. యు. దే. వి. 1. గుండ్రన; చంద్ర.—2. గుండ్రని యుంగరము; "ఎ, గీ. తళుకుజిగికెంపుబటువుప్రత్యర్థిభిన్న, మధ్య రుచిచండమార్తాండమండలంబు, తనవిమలకీర్తికాంతకు." చంద్ర. ౧, ఆ.—3. బటువుబిల్ల. "ఆ. పసిఁడికుండకరణిఁబచ్చనికోడెంబు, భాతినెట్టపట్టుబటువురీతి, గాఢరక్తరుచులు గ్రమ్మనిమ్మగుప్రభల్,

తచేఁగియస్తమించెఁదరణియంత." సురా.—విశే. గుండ్రనిది. వై. దృఢము.

బటువ్రుఁగైదువు. దే. వి. (బటువు+కైదువు.) చక్రాయుధము. (ఇట్లు బటువువాలు.)

బటువుబిల్ల. దే. వి. బిల్లతలగడ. ఆము. ౧, ఆ.

బట్ట. యు. దే. వి. పసులదేహముమీఁది తెలుపులోనగువానిచోఁటు. (బట్టావు మొ.) విశే. వెండ్రుకలూడినది. (తల.) వై. వి. వస్త్రము. "ద్వి. తుదనుఁగట్టినబట్టదోఁచుకపోయె." నళ. 3, భా.

బట్టకడిమి. ద్వ. వి. ధూళికదంబము.

బట్టగుత్తు. వై. విశే. సిగ్గుమాలినవాఁడు, నిర్లజ్జుఁడు. "ద్వి. బట్ట గుత్తనినిన్నుఁబ్రజలువీక్షింపఁ, జట్టుమోయించెదనర్వదామాడు." హరిశ్చ. ౨, భా.

బట్టతల. దే. వి. వెండ్రుకలూడినతల, ఇంద్రలుప్తకము.

బట్టతలవాఁడు. దే. విశే. బట్టతలగలవాఁడు, ఇంద్రలుప్తకుఁడు.

బట్టబయలు. వై. వి. (బయలు+బయలు.) మిక్కిలి బయలు "ఎ, గీ. మండువేసవిఁబంచాగ్నిమధ్యమమున, భయదజలదాగమంబునబట్టబయట, గాటమగుచలివేళలనీటిలోన, భార్గవుఁడు ఘోరమైనతపంబొనర్చె." పర. ౧, ఆ.—విశే. మిక్కిలి బయలైనది. (చూ. బటాబయలు, బటాకబయలు )

బట్టమేఁక. ద్వ. వి. పక్షివిశేషము.

బట్టి. దే. వి. 1. వాగ్ధోరణి; (చూ. బట్టికాఁడు.) 2. ఆవము.

బట్టికాఁడు. దే వి. 1. చిలుక; 2. గోరువంక.

బట్టినగోల. దే. వి. ఎడ్లమీఁద గోనెలెత్తివేసెడుకఱ్ఱ, ఎత్తనగోల.

బట్టు. వై. వి. బట్టువాఁడు, వంది.

బట్టె. దే. వి. కాలువ, కుల్య.

బట్లె. దే. వి. ఒకదినుసుమూకుడు.

బటా్వడా. హిం. వి. కూలిపంచియిచ్చుట.

బడ. దే. విశే. 1. పెద్ద; (చూ. బడగొండ.) 2. మిక్కిలి. "బడ బాకినోరు." భల్లా. ౨, ఆ.

బడగులు. అన్య. వి. నీలగిరులలోనుండు నొకజాతిజనులు. (వడగరులు.)

బడగొండ. ద్వ. వి. (బడ+కొండ.) కొండవలె పెద్ద ఆకారము కలిగి నీళ్లుగలిగిన మేఘము.

బడప. దే. వి. ఇడుమ, ఆపద.

బడబ సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. బ్రాహ్మణస్త్రీ; 3. తార్చునట్టియాఁడుది.

బడబడ. దే. వి. పాఱుటయందగు ధ్వన్యనుకరణము. "క. బడబడఁ బాఱుచుగడగడ, వడఁకుచు." పాండు. ౫, ఆ.

బడబానలము. సం. వి. అ. పుం. బడబాగ్ని, వార్వపుటగ్గి.

బడలిక. దే. వి. అలయిక, అలపు, శ్రమము.

బడలు. దే. అ. క్రి. శ్రమపడు. వి. శ్రమము. (చూ. బడలు పడు.)

బడలుపడు. ద్వ. అ. క్రి. బడలు, శ్రమపడు. (రూ. బడల్పడు. "చ. తనగదచేతరాక్షసులదారుణశస్త్రచయంబునశ్రమం, బుననతివీరుఁడైనిలిపిపోరనిశాచరులంబడల్పడన్, ఘనభుజదండ చండహతిఁగ్రాఁచిన." భార. అర. 3, ఆ.)

బషేవా. వై. వి. 1. తార్చునది; 2. తార్చువాఁడు*. (ఒక తిట్టుగా వాడఁబడును.)

బడాయి. హిం. వి. గర్వము, అతిశయము.

బడాయించు. హిం. అ. క్రి. అభివృద్ధియగు. స. క్రి. అభివృద్ధిచేయు.

బడాయిఖోరు. హిం. వి. అతిశయముగా మాటలాడువాఁడు.

బడి. దే. అవ. భావార్థమునందువచ్చెడి యొకానొక ప్రత్యయము. (ఏలుబడి, వచ్చుబడి మొ.) — వి. 1. పాఠశాల; 2. దిట్టము; "చ. ఎల్లిదండనిపురిఁజాటఁబంచిదొరలందఱకున్ బడిసేయఁ జేర్తుఁగాన్." భార. ఉద్యో. ౪, ఆ.—3. క్రమము. "క. తొడిఁ బడవిషయాతురునవి, విడుమనియెడికంటెఁగలదెవేతేపగనే, ర్వడరఁగధాదులనొకటన్, బడిదోఁపఁగఁబలికిమైత్రివాపులయొప్పన్." ఆము. ౪, ఆ. — ద్ర. వెంబడి. "సీ. భువిఁగవిలోకన్యఁబుట్టించె నెవ్వాఁడు బడినాగమములెల్లనడపెనెవ్వఁడు." వసు. ౧, ఆ.

బడికోడి. దే. వి. కోడిబడియొక్క మాఱుపాటు. (మేక్కచేరు వంటిది.)

బడికోలు. దే. వి. పోలిక. ఆము. ౫, ఆ.

బడితె. దే. వి. ఇనుపకట్లగుదియ, పరిఘము.

బడితపాఠము. వై. గ్రా. వి. చేదివినపాఠము. "ద్వి ఒజ్జలకు, బడితపాఠముదొంగపదరులన్నియును." హరిశ్చ. ౨, భా.

బడిద్రిప్పు. దే. స. క్రి. (బడిమి+త్రిప్పు.) బడియు. "ఎ, గీ. డాసినెలితేకుమూఁకుటఁగేసరాన్న, పుంజమప్పుడుబడిద్రిప్పిపోసె నొకతె." చమ. ౨, ఆ.

బడిపెద్ద. ద్వ. వి. ఉపాధ్యాయులకు సహాయత్వమును వహింపఁగల ముఖ్యవిద్యార్థి.

బడిమి. దే. వి. 1. బడియుట; 2. చక్రాకారభ్రమణము; "ద్వి. పురిచుట్టుబడిమిగాఁద్రిప్పి." సా. 2, భా.—3. భూతబలి.

బడియ. దే. వి. చిన్నదుడ్డుఁగఱ్ఱ. "సీ. ఆర్చుచుగోపాలురందఱు నందందబడియలఱాలనుబడఁగవైచి." హరి. పూ. ౬, ఆ.

బడియు. దే. స. క్రి. (దృష్టిదోషపరిహారార్థము.) దిగఁదీయు. నై. 3, ఆ.

బడిలి. దే. వి. తూఁటు, బెజ్జము, రంధ్రము.

బడివారడి. దే. వి. ప్రతిమనుష్యునకువేసెడుపన్ను.

బడిశము. సం. వి. అ. న. (చేఁపలనుపట్టెడు) గాలము.

బడిసివాటు. దే. వి. దిగఁదీసివేయుట. విశే. దిగఁదీసివేసినది. "తే. బ్రహ్మలోకంబుకాశికిబడిసివాటు." కాశీ. 2, ఆ.

బడుగు. దే. వి. శవము. విశే. 1. కృశము; "సీ. కడుఁగృశత్వంబునఁ బిడికిటిలోపలనడఁగెడుబడుగునెన్నడుముతోడ." కళా. ౮, ఆ. (ఆమ్రేడితమునందు బడుగుబడుగు. "వ. బడుగు బడుగగునడుముపసంగడునొడికమగువాని." ఆము. ౬, ఆ.)— 2. అశక్తుఁడు. "మ. అడుగన్నిన్ను వరంబువేగమయవాల్యాజారవిచ్చేయునా, కుడురాజార్ధవిభూషణుండువరమీనున్నాఁడు యుష్మాదృశుల్, బడుగుల్ వాంఛితమీసమర్థులెవ్వధాలాపప్రబంధంబులన్, జడివెట్టం బనిలేదుమిన్నకతపళ్ళర్యావిరోధంబుగాన్." కాశీ. ౪, ఆ.

బడువ. దే. విశే. బాడువయొక్కరూపాంతరము.

బడువు. దే. విశే. బడుగుయొక్కరూపాంతరము.

**బడె.** దే వి. బడియయొక్కరూపాంతరము. "ఎ, గీ. ఉడుము నడిఁకియున్నసమఁకుసెబడెసెట్టు." భో. ౪, ఆ.

**బడ్డు.** దే. వి. మగగుజె.

**బణ్ణము.** వై. వి. క్రొత్తయిత్తడిపాత్రముల సమూహము*.

**బతము.** వై. వి. వ్రతము. కళా. 3, ఆ.

**బతినీ.** దే. వి. ఒకదినుసుపట్టువస్త్రము. "వ. వలిపంబులుఁబప్ప ళులుమాదావళులుజిలుగులుజీబులునేఁతలుగింటెంబులుబతి నీలు." కవిక. 3, ఆ.

**బతిమాలిక.** దే. వి. బతిమాలుట.

**బతిమాలు.** దే. స. క్రి. దైన్యముతో వేఁడుకొను.

**బతిమాలుచు.** దే. ప్రే. బతిమాలఁజేయు. "క. గతజీవ్రుఁడుప్రేఁ గనియెడి, కతయదిముసి యయ్యెఁబక్షికంఠునియెడఁదా, నలఁడు మును బ్రతికిప్రేఁగై, బతిమాలిచెజగముఁజచ్చిభారమువాపెఁ." రామా. ౮, ఆ.

**బత్తడిక.** దే. వి. బత్తళికకు మొదటిరూపము. లక్ష్మీ. ౨, ఆ.

**బత్తళి.** దే. వి. (చూ.) బత్తళిక. (ఒక నిఘంటుకారుఁడు బత్తళి అని పదమెత్తియున్నాఁడు.)

**బత్తళిక.** దే. వి. అమ్ములపొది. "తే. అరుణరుచిఁబొల్చునెలనాఁగ యంఘ్రియుగము, లీలఁబంకరుహశ్రీలనేలలేదె, పద్మలోచనజం ఘలుబత్తళికలఁ, జెలఁగి ప్రదరాన్వితములుగాఁజేయలేవె." కవి. ౧, ఆ.

**బత్తాయి.** అన్య. వి. బతావియయను ద్వీపమునుండివచ్చిన (నారిం జపండు.)

**బత్తి.** వై. వి. భక్తి. "అంగనయెంతటిపుణ్యమూర్తివో బత్తిజనింపనాదు చెలఁబాపితి." శుక. 3, ఆ.

**బత్తుఁడు.** యు. దే. వి. కమసాలెవారిపట్టపుఁబేరు. వై. భక్తుఁడు. "క. బత్తులునునువాకత్తుల, మొత్తిరిపశుసమజముండములుచండ ములౌ, నెత్తురుదారలుదారవి, పత్తిమిరనవారుణప్రభలఁబ్రబలం గఁ." పాండు. 3, ఆ.

**బత్తెము.** వై. వి. భోజనమునకైయిచ్చెడు ద్రవ్యము*.

**బదనామి.** హిం. వి. అవమానము, చెడుపేరు. (బదలాము అని వాడుకమాట.)

**బదనిక.** వై. వి. చెట్టుమీఁదమొలచునట్టి ఓషధివిశేషము.

**బదర.** ఉభ. దే. వి. పగులు. (ఆకుండబదరపోయినది.) సం. ఆ. స్త్రీ. 1. కారేలకి; 2. పాఁచితీఁగ; 3. ప్రత్తిచెట్టు. అ. న. ము. 1. రేఁగుపండు; 2. ప్రత్తికాయ. పుం. 1. ప్రత్తిచెట్టు; 2. ప్రత్తిజెడ.

**బదరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రేఁగుకి; 2. గంగరేఁగుకి; 3. ప్రత్తి చెట్టు.

**బదరికము.** దే. వి. పెట్టె. "ఆ. మూడువగలపగిదిముడుపులు దెప్పించి, కలయనొక్కబదరికముననుంచి, కొంతలేశ్వరునినగరి పురోహితుఁడైన, గాలవునకుఁగౌతుకమునఁబనిచె." జై. ౮, ఆ.

**బదలాయించు.** హిం. స. క్రి. మార్చు.

**బదులు.** దే. వి. 1. మాఱు; కవి. 3, ఆ.—2. అప్పు; (చేబదులు.) 3. ప్రతి.

**బద్ద.** వై. వి. 1. కాయయొక్కఖండము*; 2. వెదురులోనగువాని ఖండము*; 3. చీలిక*. (అటకాలు బద్దలుబద్దలుగాచీలినది.) విశే. పలుచనిది*. "ద్వి. బద్దపిక్కలునంటబలిసినతొడలు." హరిశ్చ. ౨, భా. (బ్రద్దయొక్కరూపాంతరము.)

**బద్దకము.** వై. వి. పాలుమాలిక, ఆలస్యము*.

**బద్దకించు.** వై. అ. క్రి. పాలుమాలు.

**బద్దపరి.** ద్వి. వి. బ్రద్దపరియొక్కరూపాంతరము.

**బద్దించు.** దే. స. క్రి. (సరిగా ఉన్నదా లేదా అని) కొలిచినది తిరుగకొలుచు.

**బద్దు.** దే. వి. అసత్యవచనము, బొంకు. "క. ఇద్దఱునుంజనియేటి కిఁ, బొద్దునఁదీర్థంబులాడిపోరునఁదిరుగఁ, గద్దెత్తుకొనియెనీ సుతు, బద్దులవలెనుండుననుచుఁబలుకఁగవెఱతుఁ." పంచ. నా. ౧, ఆ.

**బద్దుర.** దే. వి.———పై.———

**బద్దె.** వై. వి. 1. వస్త్రముమొదలు; 2. అపరకర్మముచేయునపుడు జందెమువలెవేసికొనెడు వస్త్రఖండము.

**బద్ర.** వై. వి. పంద్రెండు. "క. అత్తీవంచిత్తిగదుగ, నత్తాదచ్చౌక వంచచౌవంచీరై, దత్తిగయద్దుగబద్రలు, చిత్తంబునఁదలఁచినట్లు చేతికిఁదెచ్చుఁ." ఉ, హరి. 3, ఆ. (సొగటాలాటయందుపాచి కలురెండు. ఆపాచిక లొక్కొక్కటికి నాలుగుప్రక్కలు. ఒక్కొక్క ప్రక్కకు ఆఱునాఱును నాల్గునాల్గును మూడుమూడును ఒక టొకటియునుగా జతలు ఎనిమిదింటికి బొట్లు ఇరువదియెనిమిదియై యుండును. ఆపాచికలురెంటినితాళించివేయునపుడు వానిపార్శ్వ భేదముచేతపంద్రెండు, పది, తొమ్మిది, ఎనిమిది, ఏడు, ఆఱు, అయిదు, నాలుగు, రెండునుగాపందెములుతొమ్మిదిపడును. కాన ఆపందెములు తొమ్మిదియునీపద్యమునందు చెప్పఁబడియున్నవి.)

**బద్రము.** వై. విశే. పదిలముయొక్కరూపాంతరము.

**బధిరితము.** సం. విశే. (అ. ఆ. అ.) బధిరముగాఁజేయఁబడినది. "బధిరితదిఙ్ముఖుండు." భార. భీష్మ. ౧, ఆ.

**బధిరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చెవిటివాఁడు.

**బద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) కట్టఁబడినది.

**బధ్యము.** సం. వి. అ. పుం. నీళ్లురాకుండకట్టినకట్ట. (చూ. ఖేయము.)

**బధ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) చావఁదగినవాఁడు.

**బనాతు.** హిం. వి. ఒకవిధమైన ఉన్నిబట్ట.

**బనాయించు.** హిం. స. క్రి. కల్పించు.

**బనారసు.** హిం. వి. కాశిపట్టణము. (బనారసుచీరె మొ.)

**బన్నపడు.** వై. అ. క్రి. (బన్నము+పడు.) భంగమునొందు*. "ఎ, గీ. తక్కగలయింతిగములనాదస్యులడరి, పట్టికొనియేచి వీడ్ఱల్లబన్నపడఁగ, దొడ్డగొనిరథకుంజరతురగతతులు, తమకువలవ కునికిదిగఁద్రావిచనిరి." భార. మా. ౧, ఆ.

**బన్నము.** వై. వి. 1. అవమానము*; "ఉ. నన్నిటులాదురాత్ము సదనంబునకుఁజనుమన్నజింతకీ, బన్నములన్నియుం దెలియఁబ ల్కెదఁగాకని పోయె." భార. విరా. ౨, ఆ.—2. ఆపద*. "ఉ. క్రొన్నెలవెన్నెలఁసమదకోకిలకాకలికారవంబులఁ, జెన్నటియెన్ని బన్నములుచెందఁగఁగూడునో." రవి. 3, ఆ.

**బన్నసరము.** వై. వి. నానావిధములయినమణులగ్రుచ్చినహారము. "సీ. జనియించె నొక్కావచ్చనిమొల్కయను బుద్ధిగ్రుచ్చినకచ్చుల కొమరువలన, సమకూడెనొక్కాదాడీ మఘలోద్భవబీజమతిమ్మ రాగసామగ్రివలనఁ, బొడకట్టె నొక్కజంబూఫలంబులను మనో

భ్రమమింద్రనీల విభ్రమమువలనఁ, దోఁతెంచెనొక్కొ మధూక పుష్పములనునాసపూర్ణంజిముత్యములవలన, దాసియటులెత్తిపసు పాడఁదలఁచిచనుడు, బరణిమూఁకుటనెలకొన్న బన్నసరముఁ, గఱచి కొనిపోయెఁజల్క ప్రగల్భవిటుఁడు, బాలికామాననముఁగొనుపగిది నవుడు." పాండు. ౪, ఆ. ("పగడంపుబన్నసరము." చంద్ర. ఇత్యాదిస్థలములయందు బన్నసరమునకు హారముమాత్రమర్థము.)

**బన్నసరి.** వై. వి. బన్నసరముయొక్క రూపాంతరము. "ఎ, గీ. పరఁగవెలలేనిచౌకట్లుబన్నసరులుఁ, బసిమినొప్పారుపచ్చలపతకము లును, గండపెండారములులోనుగాఁగఁగలుగు, సొమ్ములొకయింతి కైసేసిసొంపుమెఱయ." య. ౪, ఆ.

**బభ్రువు.** సం. వి. ఉ. స్త్రీ. కపిలగోవు. పుం. 1. (చూ.) వెంట్రువ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. అగ్ని. విశే. 1. పచ్చనిది; 2. బట్టతలవాఁడు.

**బమ్మ.** వై. వి. బ్రహ్మ, నలువ. "క. తమ్ములకన్నునుగన్నులు, తొమ్మిది గుణములను హెచ్చు తొయ్యలికంచుఁ, బమ్మతదఁషీయుగోపాం, తమ్మునవ్రాసిననవాంకతందెలిపెఁజెవుల్." కవి. ౧, ఆ.

**బమ్మరించు.** వై. అ. క్రి. భ్రమించు. "శయానుండయ్యునాసీనుఁ డయ్యుఁబిత్భశ్రేశిఁగని బమ్మరించెనేనియదిపితృగ్రహము." భార. అర. ౫, ఆ. (రూ. బమ్మరిల్లు. "సీ. పన్నగఁబులకెల్లభయము మిక్కుటముగాఁ బాతాళలోకంబు బమ్మరిల్లె." విక్ర. ౪, ఆ.)

**బమ్మెర.** వై. వి. భ్రమము, భ్రాంతి.

**బమ్మెరపోక.** ద్వ. వి. బమ్మెరపోవుట, భ్రమపడుట. "బమ్మెర పోకతో." పంచ. వేం. ౨, ఆ.

**బమ్మెరపోవు.** ద్వ. అ. క్రి. భ్రమపడు. "క. ఆబెడిదపుమ్రోఁ తకుఁగా, దేబమ్మెరపోయిదేవదేవరనగరఁ, వేబెండుపడిరిమొగముల, పైబెగ్గలికంబుదేఱఁబరిజనులెల్లఁ." హరి. పూ. ౯, ఆ.

**బయకాఁడు.** ద్వ. వి. (బయలు+కాఁడు.) రాగమును బయలు పఱచువాఁడు, గాయకుఁడు. "చ. అనఘయపూర్వమైనభవదా గమనంబుతలంపనొక్కచోఁ, బొనరినకయ్యమిప్పుడెగఁ బోయఁగ వచ్చినయట్లుతోఁచెనీ, వనుపమదేవదానవమహాహవనాటకసూత్ర ధారివై, ఘనముగవీణెమీటుబయకాఁడవునీయొళవేనెఱుంగనే." శశాం. ౪, ఆ. "సీ. ఇంపుసొంపులఁబాడునెలతేఁటిబయకాఱు లకువన్నెమీఱునీలములొసంగి" అని. ౨, ఆ. ("అలరాజనిభాస్య యెలుంగుగట్టివాకోయిలకంచుకుత్తికలకుఁ బయకాఁడనవచ్చు." (ఇక్కడ బయకాఁడనఁగా గానవిద్యోపాధ్యాయుఁడు అని యర్థము.) విజ. ౧, ఆ.)

**బయకారము.** ద్వ. వి. (బయలు+కారము.) యౌవనమునందు బయలుపడుశృంగారచేష్ట. (దీనికిఅల్లసానిపెద్దనగారుచెప్పిన ఉత్పల మాలికావృత్తమునందు ప్రయోగము.)

**బయకారి.** ద్వ. విశే. (బయకారము+ఇ.) విలాసవతి. "తే. మం తుఁడననొప్పునెఱవింతహొంతకారి, సొగసుబయకారిచానసుజూడ దగ్గి, శీకరించిననాతఁడుకెరలికాంచి, యిదియువగలాఁడిరాయని కదియఁజనఁగ." హంస. ౫, ఆ.

**బయలు.** వై. వి. 1. బహిఃప్రదేశము; 2. చెట్టుచేమలేనిచోటు; "చ. అమరినలేఁతపచ్చికబయళ్లనుదట్టములైనయింద్రగో, పములు నటింపఁగా." వి. పు. 2, ఆ.—3. ఆకాశము*. "ఇప్పుడీబయలు చెప్పినమాటలునమ్మవచ్చునే." వీర. ౨, ఆ.—విశే. శూన్యము*. "వ. అక్కురురాజితనచుట్టునుంబయలుగుటచూచి." భార. శల్య. ౨, ఆ.

**బయలుదామర.** వై. వి. (బయలు+తామర.) మెట్టదామర, స్థల పద్మము. "ద్వి. బయలుదామరలఁగేడ్పఁజాలుచుపాదములు." హరిశ్చ. ౧, భా.

**బయలుదేఱు.** ద్వ. అ. క్రి. (బయలు+తేఱు.) బయలువెడలు, నిర్గమించు.

**బయలుపడు.** వై. అ. క్రి. ప్రకాశితమగు. (రూ. బయల్పడు. "సంగరోత్సవోద్యమరభసాతిరేకముబయల్పడుటించుకలేక." భార. విరా. ౨, ఆ.)

**బయలుమెఱయు.** ద్వ. అ. క్రి. బయలుపడు. "వ. తారం దఱువిరాటుకొలువుకూటంబునకుంబోయి బయలుమెఱసియుండుఁ వారుగా నిశ్చయించి." భార. విరా. ౫, ఆ.

**బయలువెడలు.** ద్వ. అ. క్రి. బయలుదేఱు, నిర్గమించు.

**బయలువోవు.** ద్వ. అ. క్రి. (బయలు+పోవు.) బయలుపడు. "ద్వి. నిన్నొక్క, పనిఁబంపవేఁడెదబయలుపోకుండఁ, జేసదవేని యుఁజెప్పెద." నవ 3, భా.

**బయానా.** హిం. వి. సంచేకరువు.

**బయావారి.** హిం. విశే. వివరమైన.

**బయ్యంకలు.** దే. వి. బ. వేవిళ్లు, దౌహృదము.

**బయ్యఁడు.** దే. విశే. మందుఁడు.

**బరక.** దే. విశే. కఱకైనది. (పిండిబరకగానున్నది.)

**బరకము.** దే. వి. దూదిబరువు.

**బరగడ.** దే. వి. ధాన్యపురాశిలోనగువానిమీఁదవేసెడు మట్టిముద్ర.

**బరగడము.** దే. వి. వృక్షవిశేషము.

**బరడు.** వై. వి. గఱుకైనపట్టలోనగునది.

**బరణి.** వై. వి. కాటుకమొదలగునవియుంచుకొనెడు పాత్రము, కరాటము. "ఎ, గీ. మించుబీఱెండనగ్నిఁబుట్టించునరణి, కలుష ఘోరపయోరాశిఁగడపుతరణి, తోఁచెఁబ్రాచీమహీధరోత్తుంగసరణి, ప్రాఁజదువుమానికంబులబరణితరణి." పా. ౪, ఆ.

**బరణిచుక్క.** వై. వి. భరణీనక్షత్రము.

**బరతరఫు.** హిం. వి. ఉద్యోగమునుండితొసివేయుట.

**బరతుపిట్ట.** ద్వ. వి. పక్షివిశేషము.

**బరపటు.** దే. వి. 1. తృణవిశేషము; 2. బ. తృణధాన్యవిశేషము. (చూ. ఈఁదేటి.)

**బరమా.** దే. వి. (చూ.) పిడిసాన.

**బరవసము.** దే. వి. ధైర్యము. "క. శరగురుఁడెదటికిఁదటిమిన, వెరవునవచ్చుటికినెల్లవిక్రాంతిధురం, ధరుఁడగుధృష్టద్యుమ్నుఁడు, బరవసముదలిర్పనడ్డపడిపోరాడెఁ." భార. ద్రో. ౧, ఆ.

**బరాతము.** హిం. వి. లిఖితపూర్వకమైన ఆజ్ఞ.

**బరాబరి** దే. వి. హెచ్చరిక. "సీ. సద్దీకహస్తులైనమ్ముఖమ్మున బరాబరిగాఁగసర్వమపర్వులుండ." కాశ. ౨, ఆ.—విశే. సరియైన.

**బరాబరిక.** దే. వి. బరాబరియొక్క రూపాంతరము. "సీ. తనదు దండపుఁగట్టియనుబెత్తముగఁ బట్టిప్రతిహారులనుబరాబరికచేసి." చంద్రా. 3, ఆ. (స్వార్థమున కప్రత్యయము.)

**బరావర్దు.** హిం. వి. ఉజ్జాయింపు, మదింపు.

**బరి.** దే. వి. 1. పార్శ్వము; "వ. బరితోడబరియగునరిబెరయ నొరయుచు." జై. ౨, ఆ.—2. (చూ.) కిటి; "ద్వి. వక్షశాల

ఖుఁజాట్టుబరుతేమ్రవ్రాసి." రా. ఆర, కాం. — 3. (చూ.) బరిగోల; 4. దొంగ; "మ. అవనీశ త్రిదశేంద్రుఁజూపుబరికన్యాగండసాళిద్వయీ, నవలావణ్యరసంబుఁగొల్లగొనియంతంజెంతఘాలంపురా, జువిలోకెంచిచలించికైకొనినయాశామ్మెల్లఘర్మాంబుకై, తవమొప్పఁ వెసడించితూ తెఁగబరీతాపింఛకుంజాంతముఁ." స్వా. ౫, ఆ.—5. శత్రువు. "ఎ, గీ. చిచ్చవాతనుబరివాతఁ జిక్కుపడక, తప్పిపోయినవారలేతజ్జాలంద్రు." కాశీ. ౬, ఆ.—విణ. వృత్తియందు బరిగిశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగామిగిలిన రూపము. "బరిమేను." భార. కర్ణ. 3, ఆ. మొ.

**బరికట్టె.** ద్వి. వి. (బరిగి+కట్టె.) అలుగులేనియీఁటె.

**బరికాఁడు.** దే. వి. మావటివాఁడు. "మ. మతిశంకింపఁగనుట్టివిక్రమరసోన్మాదంబునఁ భూవిభుఁ, గదవ్రేయంగనతంమపైఁ బడిభుజాగర్వంబునంబట్టినా, రదుఁడార్వఁబరికాఁడునిర్భయతఁ జేరంజూచినంబట్టును, న్మదశుండాలములీలదిక్కలితనామశ్రావణుఁ రావణుఁ." నిర్వ. ౭, ఆ.

**బరికె.** దే. వి. గణుపులుగలయెండినతొటిమట్ట. విణ. చింపిజే. "తే. నిడుదపాడవ్రుసుమిడిగ్రుడ్లుబడుపుటొడలు, గుంతమోమునుగుబుకేలుఁగుండకమవు, మిట్టపండ్లునునెంతయుబెట్టిదంపుఁ, బలుకులునుదురాచారంబుబరికెతలయు." మార్క. ౫, ఆ.

**బరిగమ్మి.** ద్వి. వి. (బరిగి+కమ్మి.) బరికట్టె. "ద్వి. గొడ్డలిబరిగమ్మి కూటికుండయును." భల్లా. 3, భా.

**బరిగి.** దే. విణ. ఏమియులేనిది, శూన్యము.

**బరిగిరౌతు.** ద్వి. వి. పల్లమువేయనిగుఱ్ఱముమీఁదనెక్కెడుసారథి.

**బరిగోల.** దే. వి. (బరి+కోల.) 1. ఏనుఁగుప్రక్కలుపొడిచిబెదరించుటకై అర్ధచంద్రాకారముగా ఉక్కుతోచేసిన అలుఁగుగలవేణుదండము; "క. బరిగోలచేతమదసిం, ధురముంగనలించినట్లుతూపులనాభూ, వరుఁగనలించుచుఁగవచము, మురియలుగానేసివిల్లు ముష్టికిఁద్రుంచెఁ." రా. ఆర, కాం. ౧, ఆ.—2. బాణము. "రగడ. క్రొవ్విక్రొవ్విరి మొగ్గమరుబరిగోలగోలయిదేల దాఁటితి." వసు. 3, ఆ.

**బరిచి.** దే. వి. ఈఁటె, కుంతము. (రూ. బరిచీ. "ద్వి. పరశుపట్టిసములబాఁకులవాఁడి, బరిచీలనురుగదాప్రముఖాయుధముల." సా. ౨, భా.)

**బరిజోగి.** ద్వి. వి. (బరిగి+జోగి.) పాములవాఁడు. "క. పారిఁబోరినాడింతురుదరపోషణములకుఁ, బరిజోగులుపెట్టెలనిడి." జై. ౭, ఆ.

**బరిడెగవ్వ.** ద్వి. వి. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

**బరిడెపురుగు.** ద్వి. వి. బరిడెపురుగు.

**బరిడెపురుగు.** ద్వి. వి. బొద్దిఁక.

**బరివెంక.** దే. వి. పక్కెచెట్టు.

**బరిస.** దే. వి. ఇనుపకట్లగుదియ, పరిఘము.

**బరుకు.** దే. స. క్రి. 1. తోలులేచునట్లుగీఱు; 2. గీఱు. "క. మరిగినవిధమునఁజేరుచఁ, దిరుగుంబసిగొనుచుఁగలయఁద్రృణములువెదకుఁ, ఖురపుటమునఁగడుపాయ్యన, బరికికొనుచుఁజక్కనిలుచుఁబలుమఱునెదురఁ." రా. ఆర, కాం. ౨, ఆ.

**బరుజు.** దే. వి. గజ్జె, కింకిణి.

**బరువడి.** దే. ద్ర. మరల. "క. ఒండొరులఁజూచియానన, మండలములఁ దెలివియొలయమూఁకన్నియకా, తండువరుండగుబరువడి, రండనిక్కారోక్తిమైమరల్చిరివానిఁ." భో. 3, ఆ.

**బరువు.** వై. వి. 1. భారము; 2. సరకులునింపినకంట్లములోనగునది*.

**బరుసడ్డసరము.** వై. వి. (బరుసు+అడ్డసరము.) అంబష్ఠ⁑.

**బరుసు.** వై. విణ. 1. కఱకైనది; "ద్వి. బరుసుమీసముచెక్కుపైఁబులిపిరియు." నవ. 3, భా.—2. గఱుకు*. (చూ. తీడు.)

**బర్కరము.** సం. వి. అ. పుం. 1. ప్రాయపుపశువు; 2. మేఁక; 3. పరిహాసము.

**బర్బర.** సం. వి. ఆ. స్త్రీ. వాయింట⁑. పుం. ము. 1. బారంగి⁑; 2. బొబ్బరలు; 3. ఒకదేశము. విణ. గఱుకులుగలది. "సీ. తన భుజాపరిఘచేధరణీవరారోహభరియించిబర్బరబాహుఁడయ్యె." జై. ౧, ఆ.

**బర్బురము.** సం. వి. అ. పుం. బొబ్బలి⁑.

**బర్హపుష్పము.** సం. వి. అ. న. 1. గండివనము⁑; 2. పచ్చెకు; 3. మాచిపత్రి. (రూ. బర్హిపుష్పము.)

**బర్హము.** సం. వి. అ. పుం, న. 1. నెమిలిపురి; 2. ఆకు; 3. గండివనము⁑; 4. పచ్చెకు; 5. మాచిపత్రి.

**బర్హి.** సం. వి. న్. పుం. 1. నెమిలి; 2. దర్భ⁑.

**బర్హిమాడము.** సం. వి. అ. న. నెమిలిజొట్టుచెట్టు.

**బర్హిణము.** సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. దర్భ⁑.

**బర్హిర్ముఖుఁడు.** సం. వి. అ. పుం. నిర్జరుఁడు, వేల్పు.

**బర్హిశ్శుష్మ.** సం. వి. న్. పుం. అగ్ని, అనలుఁడు.

**బర్హిష్ఠము.** సం. వి. అ. న. కురువేరు, హ్రీబేరము.

**బర్హిస్సు.** సం. వి. స్. పుం. అగ్ని, హుతాశనుఁడు. పుం, న. దర్భ⁑.

**బఱటు.** దే. స. క్రి. 1. గోఁకు; "ఆ. మూఁగవానియెదుటముక్కుబఱట, రానిచందమయ్యె." భో. ౬, ఆ.—2. సైఁగగాగోఁకు. "తే. బఱటికొనిపోయికృతవర్మఁబన్నఁబనిచె." భార. ఉద్యో. 3, ఆ.

**బఱబఱ** దే. వి. ఈడ్పులయందగు ధ్వన్యనుకరణము. (వానికాలుపట్టి బఱబఱయీడ్చెను.)

**బఱ్ఱె.** దే. వి. ఎనుము, గేదె, మహిషి.

**బల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తవపులగము⁑; 2. విద్యావిశేషము.

**బలఁగము.** వై. వి. పరిజనము. "ఎ, గీ. పాండ్యుఁడతిరథుండు బలఁగంబుగలవాఁడు." భార. ఉద్యో. ౪, ఆ. "చ. అనుటయు లజ్జనజ్జలరుహాననయించుకయోరగాఁగవం, చినమొగమెుప్పనేమనుచుఁజెప్పెదదాననచేసికాదెయో, యనఘచరిత్రనాకుఁగలయట్టి బలంగములెల్లఁబాసియీ, ఘనగహనప్రవేశములఁగష్టపుఁబాటులఁ గుందితింగడుఁ." కళా. 3, ఆ.

**బలకరము.** దే. వి. కావలి. "తే. గాలితేఁజీమెకంబులుకోలుపులులు, కొదమసింగముల్ రెంటఁద్రాగుడుమెకంబు, లలభరద్వాజమునిరాజనిలయమునకు, బలకరంబున్నజోదులపగిదిఁబొలిచె." రామా. ౫, ఆ.

**బలకరించు.** వై. అ. క్రి. వ్యాపించు*. (చూ. గిలకరించు.)

**బలకాయించు.** దే. అ. క్రి. (బలము+ఇంచు.) అతిశయించు. (సంధియందు వర్ణవికారము.)

**బలకొట్టు.** దే. అ. క్రి. ఆఁ అని శ్రుతిపట్టు.

బలకొను. దే. అ. క్రి. (బలము+కొను.) అతిశయించే. "క. తలఁపఁజతుష్పదులధికులు, బలకొనిమతివారికంటెఁబాదద్వయ ముల్, గలమనుజాలలఘుతములి, మ్మలవారలయందు వర్ణను లు న్నాల్గరయన్." భాగ. 3, స్కం.

బలదేవుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. వాయువు.

బలపడు. దృ. అ. క్రి. (బలము+పడు.) అధికమగు.

బలపము. దే. వి. 1. పలక వ్రాసెడుసాధనము, కణిని; 2. చోర సాధనవిశేషము. (చూ. గడ్డగోరు.)

బలభద్రిక. సం. వి. ఆ. స్త్రీ. కలుక్రాంతకి.

బలభద్రుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

బలము. ఉభ. దే. విశ. అధికము. (వానివద్ద దుడ్డుబలముగానున్నది.) సం. వి. అ. న. 1. గంధము; 2. రసము; 3. రూపము; 4. సత్త్వ; 5. బలుపు; 6. సైన్యము. పుం. కాకి.

బలయు. వై. స. క్రి. పరివేష్టించే. "క. అద్రిచరసేనఁగొంచున, ముద్రముఁబంధించికడచిమవ్వరునద్రికా, టాద్రిబలసియున్నా రదె, ముద్రితలం కాకవాటముగదాశరథుల్." రా. యు, కాం.

బలవంతము. ఉభ. వై. వి. బలాత్కారము*. "క. బలవంతము జూదమునకు, బిలువంబడిమగుడనగునెపెద్దలకనితా, నలఘుఁడు ధృతరాష్ట్రుతో, నలయకధర్మజుఁడుజూదమాడఁగడంగెన్." (బల వంతము-బలవంతముగాననియర్థము.) భార. సభా. ౨, ఆ.—సం. విశ. (త్. ఈ. త్.) బలముగలది.

బలవిన్యాసము. సం. వి. అ. పుం. వ్యూహముసొడ్డుట.

బలసూదనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

బలా. దే. అవ్య. బళాయొక్కరూపాంతరము. "పంచచామరము. బలాబలాలితోడఁజాలఁబట్టిబిట్టుచుట్టినే, హలాహలీకహలాహలా భయాబుభుక్షుఁదీర్చెదన్." సాన్వ. ౪, ఆ.

బలాక. సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దపెంటికొక్కెర; 2. పెంటి కొక్కెర. అ. పుం. ము. 1. పెద్దకొక్కెర; 2. కొక్కెర.

బలాత్కరించే. సం. స. క్రి. బలాత్కారముచేయు.

బలాత్కారము. సం. వి. అ. పుం. మిక్కిలి నిర్బంధించుట, బలవంతము.

బలాదూరు. హిం. వి. దిగఁదుడుపు. (చేటును దూరపఱచుటకు నిచ్చుబలి.)

బలారా. దే. అవ్య. బలాయొక్కరూపాంతరము. "బలారాబలా రాతిప్రోద్భవుఁడెంతనేస." విజ. 3, ఆ. (ఇది ఔరావంటిది.)

బలారాతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

బలాహకము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. విష్ణువుతేరి గుఱ్ఱములలో నొకటి; 3. సర్పవిశేషము.

బలి. సం. వి. ఇ. పుం. 1. కప్పము; 2. (పూజార్థమైన) కానుక; 3. చామరదండము; 4. ఒక అసురరాజు. విశ. (న్. ఈ. న్.) బలముగలవాఁడు.

బలిజె. దే. వి. శూద్రజాతివిశేషము. (బలిజెవాఁడు, బలిజెది.)

బలితము. వై. విశ. 1. బలిష్ఠము; "క. బలితపుటురిగామంబున, నిలుచుటయారజ్జుద్రవ్యనీలిగినమతుల్, వెలలిచనీసుఖులగుదుర, వ్వలనెఱుఁగరుపఁడుదురందువత్పుదురాత్ముల్." భార. శాం. ౬, ఆ.—2. స్థూలము*. "సీ. కృశదైత్యజాతివర్ధిలునిటులనురీతిఁగల కంతిలేఁగొనుబలితమయ్యె." ఉ, రా. ౨, ఆ.

బలిధ్వంసి. సం. వి. న్. పుం. విష్ణువు, హరి, వెన్నుఁడు.

బలిపుష్టము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. వక్కకొంగ.

బలిపెట్టు. మి. స. క్రి. చంపు.

బలిభుక్కు. సం. వి. జ్. పుం. 1. కాకి; 2. ఊరఁబిచ్చుక.

బలిమి. వై. వి. 1. దేహబలము; "లేలెమ్మురణంబులోబలిమి చూపుము." హరి. ఉ. ౬, ఆ.—2. బలాత్కారము*. "తే. స్నాతకులరేనిపూవులుఁజందనంబుఁ, జనునెబలిమినిగొనితాల్ప." భార. సభా. ౧, ఆ.

బలిమికాఁడు. దృ. విశ. బలవంతుఁడు. "సీ. అక్షౌహిణీత్రిత యంబుబలంబునఁ బరులనోడించినబలిమికాఁడు." భార. సభా. ౧, ఆ.

బలియు. వై. అ. క్రి. 1. స్థూలించే; 2. అధికమగు*. "క. పవనునివలనన్, గొమరుమిగులబలియునుగం, ధము." రాఘ. ౧, ఆ.

బలియుఁడు. వై. విశ. బలవంతుఁడు. "ఉఱఁడునురేంద్రునైన బలియుండుమహీడింబుఁడు." భార. ఆది. ౬, ఆ.

బలివారు. మి. స. క్రి. చంపు. "క. దండింపఁదలఁచియప్పుడు, చండాలబటాలిఁబిలిచి నచివుఁడుమీరీ, కొండికపాపనిబలివా, రుండనిసెలవొసఁగఁగింకరులురభసమునన్." జై. ౫, ఆ.

బలిష్ఠము. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి బలముగలది.

బలిసద్మము. సం. వి. న్. న. పాతాళలోకము.

బలీయము. సం. విశ. (న్. ఈ. న్.) మిక్కిలి బలముకలది, బలిష్ఠము.

బలీవర్దము. సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

బలు. వై. విశ. వృత్తియందు బలువుశబ్దమునకు మీఁదివర్ణములోపిం పఁగా మిగిలినరూపము. (ఉదా. బలువడి, బలువిడి మొ. (చూ. విడి.) హల్లుపరమగుచో ఉత్వమునకు వికల్పముగాలోపంబగు, ఉదా. బల్వంట మొ.)

బలుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; (ఇతని నాఁగలి సంవర్తకము, రోఁకలిసౌనందము.) 2. ఒక రాక్షసుఁడు. విశ. బలముగలవాఁడు.

బలుగత్తి. వై. వి. (బలువు+గత్తి.) 1. సస్యవిశేషము; "ద్వి. పొలుపుగైకొనకకప్పురబోగివ్రేఁగె, బలుగత్తికడుమెత్తఁబడి మొత్త ముడిగె." విష్ణు. పూ. 3, ఆ.—2. బ. ధాన్యవిశేషము.

బలుపు. వై. వి. 1. పుష్టి; "వ. వర్ణంబువలనఁదృణవర్ధనంబు గావించిదుర్బలబలీవర్దంబులకుబలుపుగావించె." భార. ఆర. ౧, ఆ.—2. బలము. "ఆ. ఇంకనురలకైనశంకింతునేభవ, ద్బాహువప్ర గుప్తిబలుపులేక." భార. విరా. ౪, ఆ.

బలుపుకొను. దృ. అ. క్రి. అతిశయించే. (రూ. బల్పుకొను. "పరిభవచింతచిత్తమునబల్పుకొనన్." రా. యు, కాం.)

బలురక్కసి. వై. వి. (బలువు+రక్కసి.) బృహచ్ఛదముకి.

బలువిడి. దే. వి. విధము. "ఎ, గీ. కసిమసంగినమృత్యువుపుకరణి యంత, కాలరుద్రునికైవడికాలదండ, ధరునిబలువిడియలవడు దురములోన." నిర్వ. ౧, ఆ. (రూ. బల్విడి.)

బలువు. వై. వి. బలము. విశ. 1. అధికము, మిక్కుటము*; "పాండవకోటికప్పుడుం జేటుదలంచియేబలువునేనిల్తిసైరము." భార. భీష్మ. 3, ఆ. "అందునొక్కమహాగ్రాహముఘాతనిపాదకము

లంబు బలువుగాఁగఁఅచిలిగువ." జై. ౫, ఆ.—2. పెద్ద*. (చూ. బలు.)

**బలువ్రుఁడు.** వై. విణ. బలియుఁడు, బలవంతుఁడు. (ఒకనిఘంటుకారుఁడు ఇట్లు పదమెత్తినాఁడు.)

**బలుసు.** దే. వి. గాంగేరుకము.

**బలుహజ్జెమెకము.** ద్వి. వి. (బలువు+హజ్జెమెకము.) ఏనుఁగు, గజము.

**బలె.** దే. క్రి. ఇవార్థకము, వలె.

**బలే.** దే. అవ్య. 1. బళా; 2. చేమా. "చ. అతండువ్రాలిన దెసవ్రాలకుండినబలేమముబోఁటులకుంబ్రియంబగుఁ." భార. ఉద్యో. ౩, ఆ.

**బల్గము.** వై. వి. బలఁగముయొక్కరూపాంతరము. "సీ. నిజకుమారులనైననిండుబల్గమునైనవిడుతురులోభంబువిడువలేక." శివ. ఉ. ౩, ఆ.

**బల్పు.** వై. వి. బలుపుయొక్కరూపాంతరము.

**బల్బజము.** సం. వి. అ. పుం. తృణవిశేషము, మొదవ.

**బల్మి.** వై. వి. బలిమియొక్కరూపాంతరము.

**బల్ల.** దే. వి. 1. కూర్చుండుటకైకాళ్లమర్చినయెత్తుపలక; 2. కడుపులోనిదుర్మాంసపుబిల్ల; (చూ. గిల్లచూపు.) 3. కుంచేము.

**బల్లకట్టు.** దే. వి. వెడలుపైన అడుగుగలపడవ.

**బల్లాడదట్టీ.** ద్వి. వి. ఒకదినుసుకాసె. కళా. ౬, ఆ.

**బల్లి.** వై. వి. గౌళి, గృహగోధిక.

**బల్లిదము.** వై. విణ. మిక్కిలిబలముగలది. "బల్లిదమైనసాధనము." కవిక. 3, ఆ. (ఒకఁడు దీనిని విశేష్యముగా ప్రయోగించినాఁడు. అదిచింత్యము.)

**బల్లిదుఁడు.** వై. విణ. మిక్కిలిబలముగలవాఁడు. "బల్లిదుఁడా యింద్రుని పారిజాతమిలకుఁ లీలాగతిఁదెచ్చి." భార. ద్రో. ౧, ఆ.

**బల్లు.** దే. వి. 1. తెల్లవాఱుటయందగు ధ్వన్యనుకరణము; "బల్లునఁ దెల్లవాఱిన." సా. ౧, ఆ.—2. విఱుగుటయందగు ధ్వన్యనుకరణము. "క. పాదంబులువెట్టుడుఁద, త్పాదపఘనశాఖవిఱిగిబల్లన నుచ్చై, ర్నాదమునదిక్కులద్రువఁగ, భేదిల్లెవిహంగతతులుభీతింబఱవఁ." భార. ఆది. ౩, ఆ.

**బల్లెకోల.** ద్వి. వి. (బల్లెము+కోల.) పొడిచెడియాయుధవిశేషము, బల్లెము. "సీ. వరుణుండువైచువవ్వపుబల్లెకోలనాఁదరఁగ తూరుపుగట్టుదాఁకనిగుడ." శుక. 3, ఆ.

**బల్లెము.** వై. వి. 1. జెముడాకువంటి అలుఁగుగలబాణము; "వ. పదేనుతూపులనంగదునెనిమిదిబల్లెంబులహనుమంతునిరువదికట్టియలగవాక్షు." అచ్చ. యు, కాం.—2. పొడుచునట్టి ఒకానొక ఆయుధము, కుంతము*.

**బవ.** సం. వి. అ. పుం. ఒకకరణము. (చూ. కరణము.)

**బవంతము.** దే. వి. మోసము, కపటము.

**బవంతి.** దే. వి. 1. నాలుగుప్రక్కలకలిపికట్టినకట్టడముగలతొట్టికట్టు; 2. చిత్రవర్ణము; 3. చిత్రవర్ణముగలచీర. ప్రభా. ౪, ఆ.

**బవనిక.** వై. వి. బవనికయొక్కరూపాంతరము.

**బవరము.** వై. వి. యుద్ధము*. "క. ఆబీభత్సునిభూరిభుజాబలమునుదుర్నివారశౌర్యముశరవి, ద్యాబహులతయునుబందికి, సైబవరముచేసినట్టిహరుఁడయెఱుంగుఁ." భార. ఉద్యో. ౧, ఆ.

**బవిని.** దే. వి. జాతరయందలి బవినీలనృత్యము.

**బవినీఁడు.** దే. వి. (బవిని+ఈఁడు.) జాతరయందు సుద్దులు చెప్పుచుబవినియాడువాఁడు. "సీ. ప్రణుతించునొక్కవీరాదేవినొకవేళబవినీఁడయినసమగ్రభక్తిగరిమ." కాశీ. ౭, ఆ.

**బవిర.** దే. వి. వర్తులాకారమైనకర్ణాభరణవిశేషము. "ఎ, గీ. రత్నతాటంకములుబవిరలునుబావి, లీలుముత్యాలసరములుకీలుకడెము, లాదియగుసొమ్ములంగంబులానియలరె, ననివిభుఁడుసీతసింగారమభినుతించె." ఉ, రా. ౬, ఆ.

**బవిరి.** దే. విణ. గుండ్రము. "బవిరిగడ్డము." విజ. ౩, ఆ. "బవిరిటాకు." భాను. ౪, ఆ. "ముత్యాలబవిరికెంపులచట్టము." వసు. ౧, ఆ. "బవిరికమ్మలు." హంస. ౩, ఆ. మొ. "ద్వి. తీరుపడఁజెక్కడంపు, గోమేధికంబులకొణిగెలుబవిరి, గామల్చి." రా. బాల, కాం. "సురగిరిచుట్టునుంబవిరిచుట్టెదవేలదినేశ." (బవిరి—బవిరిగా.) కా. ౩, ఆ. "తే. బవిరిదిద్దినచెంపలబాగుఁజూచి." (బవిరి—బవిరిగా.) విజ. 3, ఆ. (బవరియని అకారమధ్యముగా కొన్ని గ్రంథములయందు రూపము కానఁబడుచుండినను రూపాంతరము బవ్రియని కనఁబడుటచే బవిరియనురూపమే సాధువనితోఁచెడి.)

**బవిసనము.** దే. వి. (చూ.) బైసన.

**బవిసి.** వై. వి. 1. భాగ్యము; 2. గౌరవము*. (చూ. బైసి.)

**బవ్రి.** దే. విణ. బవిరియొక్కరూపాంతరము. (చూ. టాకు.)

**బష్కయణి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) తఱపియావు.

**బష్కయము.** సం. వి. అ. పుం. తఱపిదూడ.

**బస.** వై. వి. వాసస్థానము, ఉనికిపట్టు.

**బసవఁడు.** వై. వి. వృషభము. "ఇంతియుఁదానునువచ్చెశూలిదా బసవనినెక్కి." వీర. 3, ఆ.

**బసవన.** ద్వి. వి. (బసవఁడు+అన.)———వై.———"క. బసవననుగుకవులనియెడి, పసికోడెలఁజఱపిపఱపుబసవనను." కవిస. ౧, అధికారము. (రూ. బసవన్న.)

**బసివి.** వై. వి. స్వైరిణి. "క. మాచాలుఁడుచన్నొల్లఁడు, నేచాసుబళానినుఁబసివిఁబిలిచితిమా, యీబేరజేములుమానుము, నీబోఁటులకెల్లఁజెల్లునేయెల్లిదముల్." కృష్ణా. 3, ఆ.

**బసుమము.** వై. వి. భస్మము. (చూ. తిరి.)

**బస్తకము.** సం. వి. అ. న. (చూ.) రౌమకము.

**బస్తము.** సం. వి. అ. పుం. ఛాగము, మేఁకపోతు.

**బస్తా.** హిం. వి. కట్ట, మూట.

**బస్తీ.** హిం. వి. పట్టణము.

**బహాదరు.** హిం. వి. ఘనసూచకమైన బిరుదు.

**బహిత్రము.** సం. వి. అ. న. యానపాత్రవిశేషము. (చూ.) ఓఁగు.

**బహిరంగము.** సం. వి. అ. న. వెలుపటి అవయవము. విణ. బయలుపడినది.

**బహిర్ద్వారము.** సం. వి. అ. న. తలవాకిలి.

**బహిర్లాపి.** సం. వి. న్. పుం. ఉత్తరము వేఱుమాటలయందణఁగి యుండునట్లు అడుగునట్టివిషమసమస్య. "సీ. రాజులకెటువంటి రత్నముల్ ప్రియమగుఁగాయలేచెట్లవికరులు బ్రిం[గు]." ఇత్యాది.

**బహీపడు.** మి. అ. క్రి. (బహి+పడు.) వెలివేయఁబడు. "సీ. బహివడ్డదిక్ జానకల్వ పుఁబాచితంబిడి పసిఁడి కైతావానిబంతిఁ గుడిచి." ఆము. ౬, ఆ.

**బహీవెట్టు.** మి. స. క్రి. (బహి+పెట్టు.) వెలివేయు. "బహివెట్టినతని యన్నమును...అభోజ్యమంద్రు." భార. శాం. ౧, ఆ.

**బహిష్కరించు.** సం. స. క్రి. వెలివేయు, బహీవెట్టు.

**బహిష్కారము.** సం. వి. అ. పుం. వెలివేయుట. (రూ. బహిష్కరణము.)

**బహిష్కృతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బహిష్కరింపఁబడినవాఁడు.

**బహుకరుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) (చూ.) ఖలపువు.

**బహుధా.** సం. అవ్య. అనేకవిధములచేత. (చూ. గుట్టుఁబేడు.) (దీనికి ఇతరగ్రంథములయందు ప్రయోగము మృగ్యము.)

**బహుధాన్య.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**బహుపాదము.** సం. వి. అ. పుం. మఱ్ఱిచెట్టు. (దకారాంతమునగు.)

**బహుప్రదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి యీవికాఁడు, దానశౌండుఁడు.

**బహుమతి.** సం. వి. ఇ. స్త్రీ. బహుమానము.

**బహుమానము.** సం. వి. అ. న. సమ్మానము.

**బహురూపము.** సం. వి. అ. పుం. 1. ఊసరవెల్లి; 2. సర్జరసము. డు. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. మన్మథుఁడు. విణ. పెక్కురూపములుగలవాఁడు.

**బహువారకము.** సం. వి. అ. పుం. విరిగిచెట్టు.

**బహువిధము.** సం. విణ. (అ. ఆ. అ.) పెక్కుతెఱఁగులుగలది, వివిధము.

**బహువు.** సం. విణ. (ఉ. ఉ, ఈ. ఉ.) 1. అధికము; 2. పెక్కు.

**బహుసుత.** సం. వి. ఆ. స్త్రీ. పిల్లపీఁచరచెట్టు. విణ. పెక్కండ్రు కొడుకులుగాని, కూఁతులుగాని కల ఆఁడుది.

**బహుళ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆవు; 2. పెద్దయేలకిచెట్టు; 3. చిట్టేలకిచెట్టు; 4. నీలిచెట్టు; 5. బ. కృత్తికానక్షత్రము. అ. న. ము. ఆకాశము. పుం. కృష్ణపక్షము. డు. అగ్ని. విణ. అధికము, తఱచు.

**బహుళీకృతము.** సం. విణ. (అ. ఆ. అ.) తూర్పెత్తినది. (ధాన్యము.)

**బహూకరించు.** సం. స. క్రి. సమ్మానించు, గౌరవించు.

**బహూకృతి.** సం. వి. ఇ. స్త్రీ. బహూకరించుట. (రూ. బహూకరణము.)

**బళకరము.** దే. వి. బలకరముయొక్క రూపాంతరము.

**బళా.** దే. అవ్య. మెచ్చునుతెలుపునది. "ఎ, గీ. ఔబళాయనితను రాజులభినుతింప, సౌబళాధిపుఁడలరెవిఖ్యాతమహిమ." రామా. ౧, ఆ.

**బళాయి.** వై. విణ. బలవంతుఁడు. "తే. ధనముహేరాళమబ్బినీతఁడుబళాయి, వీఁడుప్రాణానసరిగినవెదకివెదకి, మనలనెపమార్చుఁగాకేలమనఁగనిచ్చు, నితనివధియింతమనినిశ్చయింతురపుడు." కాశీ. ౭, ఆ.

**బళారె.** దే. అవ్య. బళాయొక్క రూపాంతరము. "సుగ్రీవబళారె యెంతపనికైన హనుమంతుఁడు దక్షుఁడు." రామా. ౬, ఆ. (రూ. బళారే.)

**బళి.** దే. అవ్య. బళాయొక్క రూపాంతరము.

**బళిర.** దే. అవ్య. బళియొక్క రూపాంతరము. "తే. అహహాయియ్యిందువదనయయ్యసమశరుని, భూరిసామ్రాజ్యలక్ష్మికాఁబోలు బళిర." రసి. ౨, ఆ. (రూ. బళిరా. "క. బళిరాఘనధమ్మిల్లం, బళిరాచెలిరదనపఙ్క్తియభినవముక్తా, వళిరాయివ్వ్చీనిభ, వళిరాఁ(?)గఁగన్గలుమహిమవశమాపాగడన్." రుక్మి. ౫, ఆ.)

**బళిరయ్య.** ద్వ. అవ్య. (బళిర+అయ్య.) బళిరా. "బళిరయ్య డాల్." ఉ, రా. ౬, ఆ.

**బళిరె.** దే. అవ్య. బళిరయొక్క రూపాంతరము. "అఖిలదుష్కృతులనాక్రమించెబళిరె." రామా. ౧, ఆ. (రూ. బళిరే. చూ. అరె.)

**బళీ.** దే. అవ్య. బళియొక్క రూపాంతరము. "బళీయిదికల్లయె." పర. 3, ఆ.

**బళీరె.** దే. అవ్య. బళిరెయొక్క రూపాంతరము. (చూ. బాపురె.) (రూ. బళీరే.)

## బా.

**బాంకి.** ఆం. వి. కొఠీ, ధననిధి. (రూ. బ్యాంకు.)

**బాండువ.** వై. వి. కుండ, ఘటము.

**బాండ్లి.** గ్రా. వి. వంటచేయుటయందు వాడుకొను లోహపాత్ర.

**బాంది.** హిం. వి. పనికత్తె.

**బాంధకినేయుఁడు.** సం. వి. అ. పుం. ఱంకుటాలికొడుకు, బంధులుఁడు.

**బాంధవము.** సం. వి. అ. న. చుట్టఱికము.

**బాంధవుఁడు.** సం. వి. అ. పుం. 1. చుట్టము; 2. జ్ఞాతి; 3. మిత్రుఁడు.

**బాఁకు.** దే. వి. కటారి. "కుందనపుఁజాయలగేదఁగిఱేకుబాఁకు నకామానినిఁజేరిచీటి." భాను. 3, ఆ.

**బాఁజె.** దే. వి. శ్యేనవిశేషము. (చూ. అణుకో.)

**బాఁతి.** దే. వి. విణ. భ్రాంతియొక్క రూపాంతరము. (ఇట్లు వ్రాఁతలేకయుఁ బ్రయోగములయందుఁ గనఁబడుచున్నదిగాని దానికిఁ సరియైన ప్రమాణము చిక్కినదికాదు.)

**బాఁదు.** వై. స. క్రి. కొట్టు, ప్రహరించు*.

**బాఁదుకొను.** ద్వ. స. క్రి. బాఁదు, కొట్టు. "క. ఎద్దొక్కకడ కుదీసిన, గ్రద్దటియెనుఁబోతునొక్కకడకీడ్చుటయున్, బెద్దముని కోలచేఁజే, కొద్దిక్కావడియడరబాఁదుకొనుచున్ దున్నెన్." శేష. ౪, ఆ. (స్వార్థమున కొను.)

**బాఁపఁడు.** వై. వి. బ్రాహ్మణుఁడు, పాఱుఁడు.

**బాఁపత.** ద్వ. వి. (బాఁపన+త.) బ్రాహ్మణస్త్రీ.

**బాఁపన.** వై. వి. బ్రహ్మకులము*. (బాఁపనవాఁడు, బాఁపనది.)

**బాఁపనక్క.** వై. వి. (బాఁపన+అక్క.) బ్రాహ్మణస్త్రీ.

**బాఁపనచీమ.** దష్ట. వి. వృక్షములయందుండు గోరోజనవర్ణముగల ఒకదినుసుపెద్దచీమ, బ్రాహ్మి.

**బాఁపనయ్య.** వై. వి. (బాఁపన+అయ్య.) బ్రాహ్మణుఁడు. "అనుటయుబాఁపనయ్యకతఁడర్థిలిసిట్లనిపల్కె." నీలా. ౧, ఆ.

**బాఁపనుఁడు.** వై. వి. బాఁపనవాఁడు, బ్రాహ్మణుఁడు.

**బాఁపతికము.** దష్ట. వి. (బాఁపన+తికము.) బ్రాహ్మణత్వము.

**బాకా.** హిం. వి. కాహళము, ఊదువాద్యవిశేషము.

**బాకి.** దే. విణ. విస్తృతము. "ద్వి. బాకినోరు." భల్లా. ౨, భా. వి. అప్పు.

**బాకినోటిమెకము.** దష్ట. వి. (బాకినోరు+మెకము.) సింహము, పంచాస్యము.

**బాగములు.** వై. వి. బ. వక్కపొడి*. "తే. పండుటాకులుఁగపురంపుబాగములును, బరఁగఁజేపట్టి." రాజ. ౧, ఆ. (రూ. బాగలు, బాగాలు. "ఉ. కట్టెఁడుతెల్లనాకులునుగప్పురబాగలు నిచ్చునిచ్చలుఙా." శశాం. ౨, ఆ. "క. క, ర్పూరంబుతోడి బాగా, లీరాదోయాకుమడిచియీరాదొచెలీ." కళా. ౮, ఆ.)

**బాగరి.** దష్ట. విణ. (బాగు+అరి.) అందగాఁడు, అందగత్తె. "తే. నాగరికముద్రగలమంచిబాగరియఁట." విజ. ౧, ఆ.

**బాగు.** వై. వి. 1. క్షేమము; 2. అందము*; "సీ. చందురునునుఁగాంతికందేర్చికూర్చి బాగునకుఁదెచ్చినయట్లుకోమరుమిగిలి." భార. విరా. ౨, ఆ.--3. విధము*. "తే. మెల్లనేకళావతీసతి మేలుకాంచి, ప్రక్కవేఱొక్కమగఁడున్నబాగుదెలిసి." శుక. ౧, ఆ.—విణ. 1. క్షేమముగలది; (అక్కడ అందఱుబాగా?) 2. అందముగలది*. (చూ. దట్టము.)

**బాగుచేయు.** వై. స. క్రి. చక్కపఱచు.

**బాగుదార.** వై. వి. చిన్నకత్తి.

**బాగులాఁడి.** దష్ట. విణ. (బాగులు+ఆఁడి.) అందగత్తె. (చూ. ఒనపరి. సా. ౧, ఆ.)

**బాగేము.** వై. వి. సుకృతము. "ఎ, గీ. ఇతని, నూసినామేలు బాగేమునేసినారము." య. ౧, ఆ.

**బాజా.** హిం. వి. డోలు తప్పెట మొదలగు వాద్యవిశేషములు.

**బాజాలు.** వై. వి. బజాలుయొక్క రూపాంతరము. "సీ. కూరగాయలకంచుఁగోరితాబాజాలుకునుమ ఱిమఱినేగుఁగొమరుతోడ." హంస. ౧, ఆ.

**బాజే.** వై. వి. 1. కాంతి*; "క. జేజేరాజాబాజేజే, గాజిగినాగిఁ దెగడినెగడఁగాఁజాలెదుమేల్, తేజూనెదుకుత్తుకగల, జేజేకుఙా మొగులుదారిసికజేజేకుఙా." అచ్చ. బాల, కాం.—2. ప్రక్క.

**బాజోబందు.** వై. వి. నందిటఁగట్టుకొనెడుభూషణవిశేషము. "సీ. కంకణంబులుసూడిగాల్ బాజోబందులుకేయూరహారముల్ కేలిసరులు." కృష్ణా. 3, ఆ.

**బాట.** వై. వి. రాజమార్గము*.

**బాటసారి.** వై. విణ. దారినడచేవాఁడు.

**బాడబము.** సం. వి. అ. న. బడబానసమూహము. పుం. బడబానలము.

**బాడబుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

**బాడబ్యము.** సం. వి. అ. న. బాడబుల సమూహము. (రూ. బాడవ్యము.)

**బాడాసువు.** సం. వి. ఉ. స్త్రీ. బాడిస.

**బాడిగ.** వై. వి. ఒకఁడొకనిసొత్తునుపయోగించుకొనుటకై ఆసొత్తు గలవానికిచ్చెడుధనము, అద్దె.

**బాడిత.** వై. వి. బాడిసయొక్క రూపాంతరము.

**బాడిదము.** వై. వి. పారిభద్రము†.

**బాడిస.** వై. వి. వడ్లవాఁడు కొయ్యచెక్కెడు కొఱముట్టు.

**బాడు.** దే. వి. ముసుఁగు, ప్రావరణము.

**బాడుగోలు.** దే. విణ. (బాడు+కోలు.) మానహీనుఁడు. "పెంజెముబాడుగోలునకు." హంస. ౫, ఆ.

**బాడుదల.** దే. వి. (బాడు+తలఁగించుట.) అవమానించుట. "సీ. భీతిఁబాఱెడుపురుహూతువెన్కనిబాడుదలఁబట్టి." లక్ష్మీ. ౨, ఆ. "క. బాడుదలఁబట్టికొలమునఁ, గూడనిచెడుగంచుఁబెట్టు కొనఁజూచియుఁజే, యాడకవిడిచిననూడనిఁ, బాడెంగోణపుఁడు దైత్యపతిపతివెనుకఙా." కవిక. ౨, ఆ. "తే. బాడుదలనొండెఁ బట్టుముపాండుతనయ, ముఖ్య." భార. కర్ణ. ౨, ఆ.

**బాడువ.** దే. వి. పల్లపునేల.

**బాడె.** దే. వి. బురద, అడుసు, పంకము.

**బాఢము.** సం. వి. అ. న. ప్రతిజ్ఞ. క్రి. విణ. పెల్లు. విణ. అధికము.

**బాణ.** సం. వి. ఆ. స్త్రీ. బాణమూలము. ఆ. స్త్రీ. అ. పుం. నల్లగోరంట†. అ. పుం. ము. 1. అమ్ము; (మన్మథునిపంచబాణములు– మోహనము, ఉన్మాదనము, సంతాపనము, శోషణము, నిశ్చేష్టాకరణము.) 2. అవుపాదుఁగు. డు. ఒకరాక్షసుఁడు.

**బాణపుంఖి.** సం. వి. ఈ. స్త్రీ. వెంపలి†.

**బాణలి.** దే. వి. వేఁచుటలోనగువానికి ఉపయుక్తమగు లోహపాత్రవిశేషము.

**బాణవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. బాణసంచులను కాల్చుట.

**బాణసంచు.** మి. గ్రా. వి. (బాణము+సంచు.) తుపాకిమందుతోచేసి వేడుకకుకాల్చెడు పగలువత్తులు పూలవత్తులు భిరుసులు లోనగునవి.

**బాణా.** దే. వి. దండాయుధము. (చూ. గుమితి.)

**బాణాసనము.** సం. వి. అ. న. ధనుస్సు, విల్లు.

**బాతళించు.** దే. అ. క్రి. తత్తఱపడు. "ద్వి. గుండెబలువిడిన డిచి, పడఁగనెలుంగనిబాతళింపఁగను." నవ. 3, భా.

**బాతాఖాని.** హిం. వి. వదురుఁబోతు.

**బాతిని.** హిం. వి. రహస్యముగా పంచఁబడుదూత, వేఁగువాఁడు.

**బాతు.** దే. వి. జలపక్షివిశేషము. (చూ.) ఆడేలు.

**బాతువు.** దే. వి. బాతుయొక్క రూపాంతరము. "మ. తల పక్షచ్ఛటగ్రుచ్చిబాతువులు కేదారంపుఁగుల్యాంతర, స్థలి నిద్రింపఁగఁజూచియారెకులువస్నాతప్రయాతద్విజా, వలిపిండీకృతకాటకల్ సవితదావానంబుఁజేర్పంగరే, ఫులడిగ్గఙావెనఁబాఱువానిఁగని నవ్వఙా శాలిగోపోద్ఘముల్." ఆము. ౧, ఆ.

**బాద.** వై. వి. బాధ. (వీఁడు అదబాదపరుగెత్తివచ్చినాఁడు.)

**బాదము.** వై. వి. ఫలవృక్షవిశేషము†. (దీని గింజలలోనిపప్పును భక్షింతురు.)

**బాదరము.** ఉభ. దే. వి. బాదరుకుమొదటిరూపము. సం. విశే. (అ. ఆ. అ.) నూలిచేనేయఁబడినది. (చీర.) ఫాలము.

**బాదరాయణుఁడు.** సం. వి. అ. పుం. 1. వ్యాసముని; (రూ. బాదరాయణి. ఇ. పుం.) 2. వెఱ్ఱివాఁడు; 3. నిష్ప్రయోజకుఁడైన పురుషుఁడు.

**బాదరించు.** దే. అ. క్రి. సమానమగు. "సీ. మొలకకూఁకటిఁ గ్రాలు ముత్యాలరావ్రేక భసితంపుబొట్టుతోబాదరింప." (చూ. ముందు వెనుకటిచరణములు.) కాశీ. 3, ఆ.

**బాదరు.** దే. వి. జోనకిత్రాడుంచెడుకర్ణాటకపుతుపాకిచెవి.

**బాదాము.** సం. వి. అ. న. బాదముకాయ.

**బాదాము.** వై. వి. బాదముయొక్కరూపాంతరము.

**బాధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. దుఃఖము; 2. నిషేధము.

**బాధకము.** సం. విశే. (అ. ఆ. అ.) బాధించునది.

**బాధించు.** సం. స. క్రి. బాధపెట్టు, నొగుల్చు.

**బాధితము.** సం. విశే. (అ. ఆ. అ.) బాధింపఁబడినది.

**బాధిర్యము.** సం. వి. అ. న. బధిరత్వము, చెవుడు.

**బాధ్యత.** సం. వి. బాధ్యత్వము.

**బాధ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) బాధింపఁదగినది.

**బాన.** వై. వి. 1. కడవ*; 2. పీతపుకడవ*.

**బానగిల్లు.** దే. అ. క్రి. బలాత్కృతమగు. (రూ. బానగిలు. "ఉ. పూనినరీతిరానితలఁపుల్ వడిప్రాణములుఙ్ జలంబునఙ్, బానగిలంగనీడ్చియొకపద్యముఁగూర్పఁగవచ్చుఁగాకయా, ఖ్యానకథానుకూలముగఁగావ్యముఁజెప్పవశంబె." ద్వా. ౧, ఆ.)

**బానసము.** వై. వి. 1. వంట; "శా. దేవానాలవజాతివాఁడ నిను నర్థింగొల్వఁగావచ్చితిఙ్, సేవాదక్షతయొండుమైనెఱుఁగనీచిత్తంబునఙ్ మెచ్చున, ట్లేవండఙ్ గడునేర్తుబానసమునందిచ్చోటనేకాదున, న్నేవీటఙ్ మిగులంగనెవ్వఁడునులేఁడే భంగులంజూచినఙ్." భార. విరా. ౧, ఆ.—2. వంటసాల*. "ఉ. తెచ్చెదమెల్లినేడుమముఁ దిమ్మనిపంచినయుప్పడాకినుల్, మచ్చరికంబునంజివులమర్చుటకైడిభకుండునీవునుం, జొచ్చినచోటఁజొచ్చిరణశూరుఁడు శౌరి కరాసిధారచేఁ, బచ్చడిసేయఁగాజమునిబానసనుం బురుడించు చోటికిఙ్." ఉ, హరి. ౪, ఆ.

**బానసీఁడు.** ద్వ. విశే. (బానసము+ఈఁడు.) వంటవాఁడు. "ఉ. వేఱొకభంగిఁబాకములు విన్ననువొప్పఁగసంఘటించి న, న్నీటఁగబానసీనినొకనిఙ్ బురిఁగాననియట్లుగాఁగమేఁ, గాటియవెట్టి యైననొడికంబుగ వండుదు నెల్లకూరలుఙ్." భార. విరా. ౧, ఆ.

**బానిస.** దే. వి. దాసి. "క. సానితనంబేలబానిసగనమ్ముమనఙ్." భల్లా. ౫, ఆ.

**బానిసము.** దే. వి. బానిసతనము, దాస్యము.

**బానిసీఁడు.** దే. వి. (బానిసము+ఈఁడు.) దాసుఁడు. (ఒకానొకరు దీనిని సేవకపర్యాయముగా ప్రయోగించియున్నాఁడు. "పూఁదోఁటకావలిబానిసీలుపాలఁజిచ్చిరి." అచ్చ. యు, కాం.)

**బాపు.** దే. అవ్య. బళీ. "ఆ. లేమనగవుచూపులేమననగుబాపు." విజ. ౧, ఆ.

**బాపురే.** దే. అవ్య. బాపుయొక్కరూపాంతరము. (చూ. అరె.) (రూ. బాపురే. "మ. అరరేదాంతి బళిరెశాంతి గుణమయ్యారే ప్రశాదంబుమా, యురె దాక్షిణ్యముబాపురే తెలివిమే లౌహా తపం బౌరయా, దర మాహామహిమం బహొహాకలితమేధాశక్తి మజ్జారెన, త్కరుణాలోకన మంచునాత్మమునిరా ట్కంఠీరవుఙ్ మెచ్చుచుఙ్." చంద్రా. 3, ఆ.)

**బాబతు.** హిం. వి. విషయము, రీతి, పద్దు.

**బాబా.** వై. వి. గుజ్జము. "సీ. పచ్చలడాలులొపలిప్రొద్దుబాబాల రత్నకింకిణులయారవమువలన." రామా. ౧, ఆ.

**బాబారౌతు.** వై. వి. కుబేరుఁడు.

**బాబు.** వై. వి. పూజ్యుఁడు*.

**బాము.** వై. వి. 1. జన్మము; "సీ. ఏబాములెఱుఁగకయేపారుమేటికిఁ బసులకాపరియింటబాముగలిగె." భాగ. ౧౦, స్కం. పూ.—2. దుఃఖము*. "క. నాయున్నబాముఁదలఁపవ." భార. విరా. ౨, ఆ.

**బార.** యు. దే. వి. అడ్డముగాచాఁపఁబడిన రెండుచేతులతోడి యొమ్ముకొలత, వ్యామము. వై. పంద్రెండు. (చూ. సెటికాను పు.)

**బారంగి.** వై. వి. ఒకానొకమందుచెట్టు.

**బారకము.** వై. వి. బరువు.

**బారకాఁడి.** దే. వి. కోడెలను ఎద్దులతోచేర్చి మరపుటకు కట్టెడు కాఁడి.

**బారకాసు.** ఆం. వి. సైనికులుండు నివాసములు.

**బారకించు.** వై. అ. క్రి. భారమగు. (నాకు కొంచెము ఒళ్లు బారకించియున్నది.)

**బారపట్టె.** ద్వ. వి. స్తంభములమీఁద అడ్డముగా అమర్చెడు నిడుపాటిపట్టె.

**బారపోయు.** దే. స. క్రి. చేయిచాఁగునంతకొలఁది నూలువడుకు.

**బారబలావతీలు.** హిం. వి. పన్నిద్దరు గ్రామసేవకులు:—నంబి, రెడ్డి, కరణము, పురోహితుఁడు, తలారి, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, చాఁకలి, మంగలి, మాల, మాదిగ.

**బారసాల.** వై. వి. (చూ.) నామకరణము.

**బారసి.** వై. వి. ద్వాదశి. "ద్వి. బారసిదాఁటెడుభయమునసలిల, పారణగావించెఁబార్థివుండంత." భాగ. ౮, స్కం.

**బారా.** వై. వి. బారయొక్కరూపాంతరము. (చూ. దచ్చెక.)

**బారాది.** దే. విశే. (బార+ఆది.) 1. అధికము; "వ. ఎగువపాలిమేరబారాదియగు దూరంబేగఁబోఁగువాజెంచి." సాన్వ. ౪, ఆ.—2. అనేకము. "క. బారాదిసొమ్ములుండగ, హారముఁగైకొనుచుఁ జనియెనండజముప్రియం, బారఁగఫలకాముకులగు, వారలుగుణవత్ప్రసక్తివదలవిడుతురే." పాండు. ౪, ఆ.

**బారి.** వై. వి. 1. ఏనుఁగుకాలుగట్టెడుగొలుసు; "ఉ. ఆయెడహాత్తియొక్క మదహస్తికరంబునఁగొట్టిలేదుబం, తీయనిదాఁటిదూఁటి కడు దిట్టతనంబునఁజొచ్చికచ్చిమేల్, రాయసదానిబారినిగళంబునఁజెట్టునకంటఁగట్టెలేఁ, బ్రాయపుఁజెంచొకందుతనుఁబల్లఱుబోయలు చూడవేడుకఙ్." చంద్రా. ౨, ఆ.—2. నిర్బంధము*; "తే. కాముఁడను బల్లిదవువేఁటకానిబారిఁ, బడుటకెంతయునాసింపబలుఁడుదలరి." భార. విరా. ౨, ఆ.—3. హింస*; "క. నీరమునఁబట్టితిగుచుచు, దారుణముసలమునఁబటుగదాయష్టినిదు, ర్వారతబారిసమరుబలు, బారిగడవలేకమడిసెఁబ్రతిభటబలముల్." హరి. ఉ. ౭, ఆ.—4. కపిలెయెద్దులకు నిర్బంధముగా నేర్పఱచిన దారి*.

**బారిజేము.** వై. వి. పారిభద్రము‌ꜝ.

**బారిదము.** వై. వి. బారిజేముయొక్క రూపాంతరము.

**బారిముద్ర.** మి. వి. దీనారభేదము.

**బారిసమరు.** ద్వి. స. క్రి. (బారి+చమరు.) హింసించు. "తే. కాలపక్వంబులైన లోకములజముఁడు, బారిసమరెడుచాడ్పున." భార. విరా. ౫, ఆ.

**బారిసము.** దే. వి. వేషము, వాలకము.

**బారిస్టరు.** ఆం. వి. న్యాయవాదులలో ముఖ్యుఁడు.

**బారీ** వై. వి. ఏనుఁగుకాలుగట్టెడుగొలుసు. "సీ. అలరునంఘ్రుల పైఁడి గొలుసులుబారీలునెమ్మేనిక్రొమ్మించునిండుజాజు." చంద్రా. ౧, ఆ. (చూ. జోగా.) (బారియొక్క రూపాంతరము.)

**బారు.** వై. వి. 1. సమూహము; "తే. మోటుఁబలకనిజాంగంబు మాటుగాఁగ, వెలయుమావంతుఁడెనకొల్పమలయుమత్త, వారణేంద్రంబుద్వారంబుచేరిపెద్ద, బారిచేవైరిబారులబారిసమరె." రా, వి. ౫, ఆ.—2. వరుస*. "ఎ, గీ. సురపొన్నబారుచలువ, లీనునీడలజాడలనేగియేగి." పు. ౨, ఆ.

**బారుచేపు.** దే. వి. పెక్కుమూరలుగలతేకు. (చూ. తేకువస్త్ర పర్యాయము.)

**బారుచేయు.** గ్రా. స. క్రి. తుపాకిలో మందుగుండువేసి కూరుట.

**బారుదూలము.** వై. వి. నిడుపాటిదూలము. "చ. పగడపుబోదె కంబములపైహరినీలపు బారుదూలముల్." భాను. 3, ఆ.

**బారువ.** వై. వి. ఇరువదిమణుఁగులకొలఁది.

**బార్హతము.** సం. వి. అ. న. బృహతీఫలము. (బృహతి=ములక.)

**బాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుది; 2. నారికేళముꜝ; 3. పసుపుꜝ; 4. మల్లికావిశేషముꜝ. అ. పుం. ము. అయిదేండ్లయేనుఁగుపిల్ల. పుం, న. కురువేరు. విశ. 1. పదునాఱేండ్లకు లోఁబడినపిల్ల; 2. మూర్ఖురాలు.

**బాలకుఁడు.** సం. వి. అ. పుం. పదునాఱేండ్లకులోఁబడినపిల్లవాఁడు.

**బాలతనయము.** సం. వి. అ. పుం. చేండ్ర, ఖదిరముꜝ.

**బాలతృణము.** సం. వి. అ. న. లేఁతకసవు, పచ్చిక.

**బాలబందు.** హిం. వి. దేవనాగరిలిపినిబోలు లిపివిశేషము.

**బాలమూషిక.** సం. వి. ఆ. స్త్రీ. చిట్టెలుక, గిరిక.

**బాలవ.** సం. వి. అ. పుం. ఒకకరణము. (చూ. కరణము.)

**బాలాజి.** వై. వి. తిరుపతివేంకటేశ్వరులకు బైరాగులువాడుపేరు.

**బాలసంగడము.** మి. గ్రా. వి. మల్లసాధనవిశేషము.

**బాలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పదునాఱేండ్లకులోఁబడినపిల్ల; 2. కన్యక; 3. ఆఁడుది; 4. తీఁకె; 5. చెవిబొగడ.

**బాలిశము.** సం. వి. అ. న. తలగడ, ఉపధానము.

**బాలిశుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు; 2. బాలుఁడు.

**బాలీసు.** వై. వి. ఒఱగుదిండు*. "సీ. సురమాలిబాలీసుసూతి నిగళుసెన జరబాశేచందువా సాసకీఁట." నీలా. 3, ఆ.

**బాలెంత.** దే. వి. బాలెంతరాలు, ప్రసూత. "రగడ. తీటవాసైయదియీాయరఁటిబాలెంత, చేటునకెయగుచూలుచేఁగలుగునే లెంత." (ఎంతక—ఎంతయు.) స్వా. 3, ఆ.

**బాలెంతబోళము.** ద్వి. వి. బాలెంతకిచ్చెడు ఔషధవిశేషము.

**బాలేయము.** సం. వి. అ. న. పిన్నముల్లంగిꜝ. పుం. గాడిద. విశ. 1. బాలునికిహితమైనది; 2. మెత్తనిది.

**బాలేయశాకము.** సం. వి. అ. పుం. బారంగిꜝ.

**బాల్యము.** సం. వి. అ. న. చిన్నతనము. (మొదటివయోవస్థ. చూ. అవస్థ.)

**బావ.** వై. వి. 1. అక్కమగఁడు; 2. మగని అన్న*; 3. తనకంటె పెద్దవాఁడైన మేనత్తమేనమామలకొడుకు*.

**బావంజీ.** వై. వి. ఒకానొకచెట్టు, వాగుజి.

**బావి.** వై. వి. 1. దొరువు; "వ. విమలమణిశిలాతలబుద్ధిసుధాపరిపూర్ణంబైన బావిచొచ్చి కట్టినపుట్టంబుదడియంద్రెళ్లిన." సం "వాపీంమత్వాస్థలమితినవాసాఃప్రాపతిజ్జలే." భార. సభా. ౨ ఆ. — (డిగ్గియవేఱు. "బావులు దీర్ఘికావలులువెలయ." భార సభా. ౧, ఆ.)—2. చెఱువు*; "తే. కాంచియీాబావియగుఁదరంగములునీరు, ద్రావునది." (చూ. దీనికిముందు.) వై. ౨ ఆ.—3. పల్లము*. "క. నీవారాజ్యమువిడిచినఁ, దావిడువఁ వెంటఁదగిలితపెదప్పినినుఁ, బావిఁబడద్రోచెలోఁబడఁ, దావఁ నినుఁగట్టిమోహతమమచలాత్మా." (చూ. ముందు.) వాసి. ౫, ఆ

**బావిడీ.** హిం. వి. బావి.

**బావిలీ.** దే. వి. ఆఁడుది కొనచెవినిధరించెడు భూషావిశేషము.

**బావిలీగొలుసు.** దే. వి. మగవాఁడు కొనచెవినిధరించెడు భూషావిశేషము.

**బావుకొను.** దే. స. క్రి. 1. అన్నములోనగునది చేయినిండ ఎత్తినోటనిడుకొను; "తే. పెద్ద, బానలందున్నవెన్నలుబావుకొనుచు." హరి. పూ. ౫, ఆ. — 2. అనుభవించు. (ఎగతాళిగ చెప్పుమాట.)

**బావుటా.** హిం. వి. ధ్వజపటము.

**బావురుఁబిల్లి.** దే. వి. (బావురు+పిల్లి.) బావురనికూసెడుపెద్ద గండుపిల్లి. "క. కలభాషిణిఁజేరఁగవ, చ్చిలతాంగీయిచటనుండి చేరితివకటా, కలుషపుబావురుఁబిల్లిని, జిలుకయుబలెనిద్దురాత్మ సిద్ధుండనుచుఁ." కళా. 3, ఆ. ("ఉ. పెంచినవారికిముద్దుగాక పెఁ, బావురుఁబిల్లికింగలుగునామొగమోటయొకింతచిల్కపైఁ." ఇత్యాదిస్థలములయందు బావురుఁబిల్లికిగండుపిల్లియనిమాత్రమర్థము. కళా. ౬, ఆ.)

**బావురుగడ్డము.** దే. వి. పిల్లిగడ్డము, మేకగడ్డము.

**బావురుగాఁడు.** దే. వి. (బావురు+కాఁడు.) బావురుఁబిల్లి. "ఉ. బావురుగానిఁజూచివెఱపైకొనఁదల్లడమందుమారుతే, జీవలె." ఉ; రా. ర, ఆ.

**బావురుమను.** దే. అ. క్రి. (బావురు+అను.) (జనశూన్యమగుటచే) బావురుమని మాఱుమ్రోఁతకలదియగు.

**బాష్పము.** సం. వి. అ. న. 1. కన్నీరు; 2. కొయ్యగూర. పుం. 1. ఆవిరి; 2. ఇనుము.

**బాష్పిక.** సం. వి. ఆ. స్త్రీ. ఇంగువమ్రాను. ఇంగువమ్రాని ఆకు. (అనికొందఱు.)

బాస. వై. వి. 1. సంస్కృతాదిభాష; 2. ప్రతిజ్ఞ*; ''ఉ. నెట్టన నన్నుసత్కరుణనేరధివేష్టితయైనధాత్రికే, బట్టముగట్టెదేనియొక బాసపితామహాయాత్తనెగ్గుగాఁ, బట్టకవిన్న.'' (చూ. వెనుక.) కాశీ. ౫, ఆ.—3. ప్రమాణము*; ''ఎ, గీ. పిలిచిరాకాసిప్రోలువిభీషణునకుఁ, దిరముగానిచ్చి సెగబాసఁదేఁజేసట్టి, చాలుపేరింటిపూఁబోఁడినోలిఁగూడి, తౌనుఁదమ్ముఁడుఁదగనయోధ్యకునువచ్చె.'' య. 3, ఆ.—4. వ్రతము*; ''ఉ. భూసురకోటివేఁడుటయుఁబోఁడిగఁబ్రాణములైన నిత్తునా, బాసదినేశలోకమునఁబ్రస్ఫుటమెంతయు.'' సం. ''వ్రతంవైమమలోకోయం వేత్తికృత్స్నోవిభావసో.'' భార. అర. 2, ఆ. — 5. సంకేతము*. ''ఆ. పాండురాజసుతులుబాసమైనడవడి, గడచికయ్యమునకుఁగాలుద్రవ్వ, నున్నయట్టులైననిన్నరవాఖతో, సందిసేయుటొప్పసముచితముగ.'' భార. విరా. 3, ఆ.

బాసట. దే. విణ. ఏ. సహాయము. ''ఎ, గీ. బాసటైపీరరథికులు బలసికొలువ.'' భార. భీష్మ. ౧, ఆ.

బాసనము. వై. వి. వంటపాత్రము*.

బాసము. వై. వి. జాలె*. (చూ. ఒలె.)

బాసవాలు. వై. వి. 1. దేవత; 2. ఋషి. (హల్లువరమగుచో ఉకారమునకు వికల్పముగాలోపము. ''సీ. ముంగిళ్లబాసవాల్ ముద్దియలిడినమ్రుగ్గులుపువ్వులకునిండుతెలివినింప.'' య. ౨, ఆ.) (దీనికి సరియైన సంస్కృతపదము గీర్వాణుఁడు.)

బాసవాల్దొర. ద్వ. వి. 1. ఇంద్రుఁడు; 2. ఋషీశ్వరుఁడు.

బాసాడు. ద్వ. అ. క్రి. (బాస+ఆడు.) మాటాడు, భాషించు. ''ఎ, గీ. ఎల్లనృపులుగొలువనెఱుఁగవెబాసాడి.'' ఆము. ౧, ఆ.

బాసికదండ. ద్వ. వి. (బాసికము+దండ.) తలముందు ప్రక్కనుంచఁబడిన పుష్పహారము.

బాసికపట్టు. దే. వి. (బాసికము+పట్టు.) పద్మాసనము.

బాసికము. దే. వి. వివాహకాలమునందువధూవరులకునొసటఁగట్టెడుమూఁడుప్రక్కలేర్పడినముక్తికాదిహారవిశేషము, లలామకము. ''మ. వసురాజన్యకిరీటవీధిననఘస్వర్లోకవాస్తవ్యభ, వ్యసతీకల్పితకల్పదామఘటితంబైముత్తెపుంబాసికం, బెసఁగెంగాంచనశైలరోహణమహాశృంగంబుపైనుద్భవిం, చుసురద్వీపవతీత్రిరూపవిపులస్రోతోవిశేషంబనఁ.'' వసు. ౫, ఆ. (మునుపటివారర్థమిట్లువ్రాసియున్నారు. ఇప్పటివాడుకయందిది యర్ధచంద్రాకారముగాఁ గనఁబడుచున్నది.)

బాహ. సం. వి. ఆ. స్త్రీ. బాహువు, భుజము, చేయి.

బాహాటము. వై. విణ. బయలుపడినది, బహిరంగము.

బాహిరపోవు. ద్వ. అ. క్రి. (బాహిరము+పోవు.) 1. బయలుపడు; ''క. కావునవంచనబాహిర, పోవకయుండంగరిపునిఁబోరిఁబరిమార్పం, గావచ్చునేనియట్టిద, నావలపటుగాకతక్కనునువలదు సుమీ.'' భార. విరా. ౨, ఆ.—2. మూర్ఛిల్లు. ''అతండుశోలియునుబాహిరపోవకదేచి.'' (దీని ముందటిభాగము. చూ. కట్టియకడ.) భార. శల్య. ౧, ఆ.

బాహిరము. వై. విణ. 1. బయలుపడినది; ''ఆ. ఆవులింతతుమ్ముహాసంబునిష్ఠీవ, నంబుగుప్తవర్తనములుగాఁగ, నలుపవలయునృపతికొలువున్నయెడలబా, హిరములైనఁగెలనికెగ్గులగుట.'' భార. విరా. ౧, ఆ.—2. వెలియైనది. ''తే. వలయునన్నపానంబులుపలుదెఱఁగుల, నేర్చువిధముననేమొడఁగూర్చివేడ్క, నున్ననీవుపయోగింపనొల్లకునికి, బాంధవమునకునీతికిబాహిరంబు.'' భార. ఉద్యో. 3, ఆ.

బాహుజుఁడు. సం. వి. అ. పుం. రాచవాఁడు, బుజేము పుట్టువు. విణ. భుజమునందుపుట్టినవాఁడు.

బాహుద. సం. వి. ఆ. స్త్రీ. ఒకయేఱు. అ. న. ము. బాహుపురి.

బాహుపురి. మి. వి. సందికడియము, కేయూరము.

బాహుమూలము. సం. వి. అ. న. చేంక, కక్షము.

బాహులము. సం. వి. అ. న. బాహుత్రాణము. (చూ. తనుత్రాణము.) పుం. కార్తికమాసము.

బాహులేయుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి.

బాహుళ్యము. సం. వి. అ. న. బహుళభావము.

బాహువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. భుజము. (రూ. బాహు.)

బాహ్యము. సం. విణ. (అ. ఆ. అ.) వెలుపలిది, వెలియైనది.

బాహ్లీకము. సం. వి. అ. న. 1. ఇంగువ; 2. కుంకుమపువ్వు. పుం. 1. ఒకదేశము; 2. ఆదేశమునందుపుట్టినగుఱ్ఱము. డు. ఒకరాజు. (రూ. బాహ్లీకము.)

బాళి. దే. వి. కాంక్ష. ''సీ. శ్రీసూర్యకులసుధాసింధువాకాంక్షించి పాలమున్నీటిపైబాళిమాని.'' ఉ, రా. ౧, ఆ.

## బి.

బింకము. దే. వి. 1. బిగువు; ''నావుడుఁజిత్రరేఖవదనంబున బింకముమీఱఁబల్క.'' ఉ, హరి. ౫, ఆ.—2. గర్వము; ''తే. కాలమనుమావటీఁడుబింకంబుతోడ, సరకుసేయకభీకరతరతమిస్ర, వారణముఁగూల్పఁజూచుకటారికోల, వెండిబొట్టియబలెఁదోఁచెవేగుఁజుక్క.'' పర. 3, ఆ.—3. నిక్కు. (చూ. నయము రెండవయర్థమునుదాహరణము.)

బిందము. వై. వి. సమూహము. ''కోనమనికిబిందంబులు.'' అచ్చ. యు, కాం.

బిందియ. దే. వి. బిందె. భాను. ౪, ఆ.

బిందీ. వై. వి. చేఱుచేక్క*. కృష్ణా. 3, ఆ.

బిందుతంత్రము. సం. వి. అ. న. 1. చదరంగము; 2. నెత్తపలక.

బిందువు. సం. వి. ఉ. పుం. 1. నీటిబొట్టు; 2. చుక్క; 3. సున్న; 4. శుక్రము; 5. భ్రూమధ్యము; 6. దంతక్షతవిశేషము.

బిందె. దే. వి. గొంతుసన్నముగానుండెడు లోహపాత్రవిశేషము. (పసిఁడిబిందె, మట్టిబిందె. ఇత్యాదిస్థలములయందు పాత్రముమాత్రమర్థము.)

బింబము. సం. వి. అ. న. 1. ప్రతిబింబము; 2. దొండపండు; 3. ప్రతిమ; 4. సమానము. పుం. ఊసరవెల్లి. పుం, న. (చంద్రసూర్య) మండలము.

బింబిక. సం. వి. ఆ. స్త్రీ. దొండ, తుండికేరి*.

బింబితము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిబింబించినది.

బింబోష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. 1. దొండపండువంటిపెదవిగల ఆఁడుది; 2. ఆఁడుది.

బికారి. వై. విణ. 1. భిక్షకాఁడు; 2. అప్రయోజకుఁడు*. ''ఎ, గీ. ప్రయోగమునకు, శుద్ధిగాఁగూర్పకుఱకవిజ్ఞోఁపుపడఁగ, గణములూహించికూర్చుబికారికుకవి.'' కవిస. ౧, అధికారము.

బికాసి. వై. విణ. భిక్షకాఁడు.

బిక్క. వై. విణ. ఖిన్నము, నిరుపేద,

**బికిరము.** వై. వి. భిక్షము. "సీ. తొనన్న ఫూర్ణాభిధానయయ్యనుమాన్చ దొకనాడుఁదనజేఁడుబికిరమెత్త." వసు. ౧, ఆ.

**బికిరాలమారి.** దన్య. విశ. భిక్షమెత్తుస్వభావముగలవాఁడు.

**బిక్కి.** దే. వి. అక్షోటము.

**బిక్కిరించు.** దే. స. క్రి. బెక్కించు. (చూ. పిలపిల.)

**బిగ.** దే. ద్ర. క్రి. విశ. బిగియ. (బిగఁగొట్టు, బిగఁబట్టు మొ.)

**బిగాది.** దే. విశ. ధూర్తుఁడు. "సీ. ఆకతాయబిగాదియడిబండగుండఁడుమొండికట్టెగులాముమొప్పెగోవు." హంస. ౫, ఆ.

**బిగి.** దే. వి. బిగువు. (బిగివదలకున్నది.)

**బిగించు.** దే. ప్రే. బిగియించుయొక్కరూపాంతరము. "అంతవిలంబికల్పచేలమునడుమునఁబిగించుచు." పా. 3, ఆ.

**బిగితము.** దే. విశ. (బిగి+ఇతము.) దృఢము. "సీ. బిగితంపుముష్టిఁగంపితమైనయసిధారవిమతకరాగ్రములువిటేచివిటేచి." హరి. ఉ. 3, ఆ.

**బిగిబద్ద.** దన్య. వి. రెండుగాఁడికమ్ములకునడుమవేయుబిగువుబద్ద.

**బిగియు.** దే. అ. క్రి. 1. బిగువగు; (బిగియఁగట్టుము.) 2. బిగువుచేయు. "క. పితృపైతామహామగునీ, క్షితియంతయుఁజక్కనగముచెచ్చెరనాకి, మిత్రరునిఁగాననుఁజూడకు, ధృతిసీనవిబిగిసితేనితెగిరమ్మనిక." మార్క. ౬, ఆ.

**బిగుచు.** దే. ప్రే. బిగియఁజేయు, బిగించు. "క. పదపడిచేతులుబిగిచిన." వి, పు. ౬, ఆ.

**బిగుతు.** దే. విశ. వదులుకానిది. (ఈకడియము చేతికి బిగుతుగానున్నది.)

**బిగువు.** దే. వి. 1. బింకము; 2. బిగిబద్ద; 3. త్రాటితోకొలిచెడుఒకదినుసుకొలత.

**బిగువుకొను.** దే. అ. క్రి. బిగువగు.

**బిగ్గ.** దే. ద్ర. క్రి. విశ. బిగయొక్కరూపాంతరము. (చూ. పిల్లఁగ్రోలు.)

**బిగ్గర.** దే. ద్ర. క్రి. విశ. 1. గట్టిగా; (బిగ్గరమాటాడకుము.) 2. దృఢముగా. "సీ. మొలపట్టుకాసెతోమురళికానాళంబుపేర్చిబిగ్గరదిండుసెనఁజెక్కిట్టి." రుక్మాం. ౧, ఆ.

**బిచానా.** హిం. వి. పడక.

**బిచ్చగాఁడు.** దన్య. విశ. (బిచ్చేము+కాడు.) భిక్షమెత్తువాఁడు, భిక్షుకుఁడు.

**బిచ్చెము.** వై. వి. భిక్షము, తిరిపము.

**బిజెగు.** దే. స. క్రి. బొంకు. "క. బిజిగెడిమాటలుచెవినిడి, నిజమనిగురుభక్తినిరతు నిర్మలచరితుఁ, సుజనుఁగుమారునిలీలాం, గజునింబోనాడుకొంటిఁగదనేడనుచుఁ." సా. 3, ఆ.

**బిటారము.** దే. వి. విలాసవిశేషము. "ద్వి. రాజిత్వైవాలరమణీయరోమ, రాజీలతల్ బిటారములువాటింప." విష్ణు. పూ. ౨, ఆ.

**బిటారి.** దే. విశ. (బిటారము+ఇ.) బిటారముకలది.

**బిట్టబిజ్జి.** దే. వి. (బిజ్జ+బిజ్జ.) మిక్కిలిబిగువు. "చ. అనవుడునట్లకాకయని యాసతివిప్రునియింటికేగియ, ల్లననఁడొంటియుక్కిపదిలంబుగఁజూచినమీపమందుని, ల్చినఁగని బిట్టబిజ్జఁదనచిత్తముజల్లనమోముఁదేరకోఁ, గనుఁగొని యింతప్రొద్దిటకుఁ గామినిరాఁగతమేమి నాళ్వుఁడుఁ." భో. ౪, ఆ.

**బిట్టు.** దే. అవ్య. 1. శీఘ్రము; "మ. విరథుండై పొలివోనిబంటుతనముఁ వేగంబునొప్పంగవి, ట్టరదంబుఁడిగునప్పు." భా. భీష్మ. ౨, ఆ. (చూ. బెట్టు.) 2. శీఘ్రముగా. (చూ. వటు. మొదటియర్థము సుదాహరణము.)

**బిట్టుబిట్టు.** దే. అవ్య. (బిట్టు+బిట్టు.) తటాలున. "మ. అతనిపైతెంచుటబిట్టుబిట్టుగనికాంతల్ విస్మయాక్రాంతలై." భో. ౫, ఆ.

**బిడ.** దే. వి. బిడ్డయొక్కరూపాంతరము. (ఇది అ, ఈ, ఏ శబ్దములకు అనుప్రయుక్తమై స్త్రీవాచకమగును. ఉదా. అబిడ, ఈబిడ, ఏబిడ. చూ. బిడారు.)

**బిడము.** సం. వి. అ. న. అట్టుప్పు.

**బిడాయించు.** హిం. వి. ఒకదానిలో మఱొకదానినుంచుట.

**బిడారము.** దే. వి. 1. వాసస్థానము; "అప్పతికిఁ బిడారఫుఁ గడలి." చంద్రా. ౨, ఆ.—2. విడిది. "వ. మున్నాయితంబుచేయించిన బిడారంబులనకలయాదవులవిడియించి." వై. 3, ఆ.

**బిడారు.** దే. వి. 1. వాసస్థానము; "తే. ఈవెలందియొడల్ పైడితోవెలంది, యూనెలంత లలాటంబులేనెలంత, యూసుపాణిరదశ్రేణియేసుపాణి, యూబిడారుమృగీమదశ్రీబిడారు." విజ. ౧, ఆ.—2. చనుప, లంబాడితండ.

**బిడాలకము.** సం. వి. అ. న. హరిదళము. పుం. 1. వునుఁగుచట్టము; 2. నేత్రౌషధవిశేషము.

**బిడాలము.** సం. వి. అ. పుం. 1. పిల్లి; 2. కనుగ్రుడ్డు, కంటితెప్పలు. (అనికొందఱు.)

**బిడాలవణము.** అన్య. వి. ఒక యుప్పు.

**బిడియము.** దే. వి. సిగ్గు. "ద్వి. మదిబిడియంబువదలి." సా. ౫, భా.

**బిడువు.** దే. వి. అవకాశము. విశ. అవకాశముకలది.

**బిడెము.** దే. వి. బిడియముయొక్కరూపాంతరము. "చ. మొగముబిడెంబునెన్నుదుటిముంగురులుఁగఁగుకొందుచూపులుఁ." ఉ, రా. ౬, ఆ.

**బిడౌజుఁడు.** సం. వి. స్. పుం. ఇంద్రుఁడు.

**బిడ్డ.** దే. వి. 1. శిశువు; "చ. తల్లిదం, డ్రులకునిజాగ్రసూనలపటుప్రచురోక్తులకంటెఁబిన్నబి, డ్డలనెడుతొక్కుఁబల్కులు దృఢంబగుముద్దులనీనకుండునే." భో. ౧, ఆ.—2. కొడుకు; 3. కూఁతురు.

**బిడ్డఁడు.** దే. వి. 1. మగశిశువు; 2. కొడుకు. "సీ. అంతఁజూడాకర్మమాచరించిరి బిడ్డనికిగృహ్యాసంప్రోక్తనియమపరత." కాశీ. ౫, ఆ.

**బిడ్డకుట్టు.** దే. వి. ప్రసవవేదన, ఆమనస్యము.

**బిడ్డతల్లి.** దే. వి. బాలెంతరాలు, ప్రసూత.

**బిడ్డె.** దే. వి. బిడ్డయొక్కరూపాంతరము. (చూ. కైనుక.)

**బిత్తరపోవు.** దే. అ. క్రి. (బిత్తరము+పోవు.) చలించు.

**బిత్తరము.** దే. వి. 1. శృంగారచేష్ట; "వ. వెన్నెలపులుఁగులమొత్తంబులబిత్తరంపుంబసులకుమెత్తవడి." నీలా. 3, ఆ.—2. ప్రాశము. "ద్వి. మేలైన, బిత్తరంబులునిమ్మలెడిదపువాలుఁ, గత్తులు." హరిశ్చ. ౨, భా.—విశ. 1. చంచలము; "అనిమేషశ్వముమాప్పెబిత్తరపుఁజూపు." పాన్. ౨, ఆ.—2. సరసము. "మలయజగంధిబిత్తరపుమాటలు" అని. ౨, ఆ. (చూ. బిత్తరి, బిత్తరించు.)

**బిత్తరములాడు.** దే. అ. క్రి. (బిత్తరములు+ఆడు.) ప్రకాశించు. "సీ. శరదభ్రశుభ్రనిశ్చలదేహవిస్ఫురద్ధాళిధళ్యములుబిత్తరములాడ." వి, పు. 3, ఆ.

**బిత్తరి.** దే. వి. (బిత్తరము+ఇ.) 1. శృంగారచేష్టగల ఆఁడుది; 2. ఆఁడుది. "క. మరుఁజిత్రలిఖితుఁగనిబి, త్తరివెఱవఁబరాగభూతిఁదగనిడిచిగురా, కరయఁదిగఁదుడిచియులులకు, వెరిబోనమువోయఁదెలిసె వెఱపున్నసింహా." కా. 3, ఆ.—విశ. శృంగారచేష్టగలది. "బిత్తరివాలుఁజూపులన్." రాజ. 3, ఆ.

**బిత్తరించు.** దే. అ. క్రి. 1. సరసమాడు; "వ. గామదామోదంబుతో మంతనంబాడుమెంతులనెత్తావులును, మెంతులనెత్తావులతో బిత్తరించుజీరకంబులసౌరభంబును." కాశీ. 2, ఆ.—2. ప్రకాశించు; "సీ. వేణీభరంబుపైవిహరించువిహరించిబింబాధరంబుపై బిత్తరించు." భీ. 4, ఆ.—3. చలించు; "కన్నులుబిత్తరింప." మై. 1, ఆ.—4. ఊఁగాడు. "సీ. కడుమనోజ్ఞములైనకర్ణపార్శ్వంబులఁబెనుపాఁపపోఁగులుబిత్తరింప." భీ. 3, ఆ.

**బిత్తల.** దే. వి. (చూ.) దిసమొల.

**బిత్తలి.** దే. విశ. (బిత్తల+ఇ.) దిసమొలవాఁడు, దిసమొలది. "అత్తబిబిత్తలై." హంస. 5, ఆ.

**బిత్తెడ.** దే. వి. చక్కిలములులోనగువాని పేల్చియెత్తెడు లోహసాధనవిశేషము.

**బిద్దము.** వై. విశ. భిన్నము. "ఉ. గద్దియడిగ్గికౌశికుఁడుగాదిలిసూనుఁడుకొండవట్టినన్, ముద్దియదక్షుకూఁతురువిమూఢత రెండవపుత్రునైననుం, దద్దయువేడ్కఁజూతునని తాలిమి లేకనఖాంకురంబునన్, బిద్దము సేసెమైసగమునిండనిగర్భముతోడియండమున్." కాశీ. 6, ఆ.

**బిద్దు.** దే. అ. క్రి. చేచ్చే. (చూ. దోరు.)

**బిద్దె.** దే. వి. దుర్గతి, నరకము, బిస్త.

**బిబ్బరించు.** దే. అ. క్రి. (పులి) కూయు. (చూ. బిబ్బరింత.)

**బిబ్బరింత.** దే. వి. పులికూఁత. "ఉ. గబ్బుసమక్షికంబయిమొగంబడువన్దరువర్ణముల్ పడం, ద్రొబ్బుచుఁగార్శ్యొగిళ్లరొదతోఁజేరలాడెడు బిబ్బరింతగా, దుప్పబ్బివిసంజ్ఞాఁగఁజెవులూఁదినవల్లవుఁడురివ్వ్రాలఁగా, బెబ్బులిగొంతుక్రోల్ గఱచిపెల్లునమార్వెడద్రెళ్లదాఁటుచున్." ఆము. 3, ఆ. (వ్రాఁతప్రతులయందు పదమిట్లు కనఁబడుచున్నది.)

**బిబ్బిలికాయ.** దే. వి. ఆఁడుదానికాలిమూఁడవ వ్రేలియాభరణము. "సీ. తళుకుబిల్లాండ్లు బిబ్బిలికాయలును మట్టియలు వీరసుద్దెలు నందియలును." కళా. 2, ఆ.

**బిబ్బి.** దే. వి. 1. తోరణము; "మ. జతనన్దత్పురిజంభభిన్నగరమున్ సాధింపఁగాఁగోరియో, ప్సితముల్ సేకుఱనెత్తుబల్లకర బిబ్బిలో యనన్ మించునం, చితశక్రోపలసౌధజాలములపై జీమూతసంఘాతము, ధ్వతిపైనెత్తినయత్తురాలగమిచందంబందిపెంపొందఁగన్." (మకరబిబ్బియనునది జీవగఱ్ఱలోనగువానివంటిదని యొఱుంగవలయు.) చంద్రా. 1, ఆ.—2. తురుష్కుల యంతఃపురస్త్రీ. "సీ. ఎదలపైఁబొదలుపయ్యెదలుజాఱఁగఁబాఱుబిబ్బిలకుముసుంగులబ్బఁజేసె." వసు. 1, ఆ.

**బిబ్బోకము.** సం. వి. అ. పుం. నాయికకు గర్వాతిశయముచేత ఇష్టవస్తువునందేనియుకలిగెడు అనాదరము. (మొదటిరూపము బిబోక్షకము.)

**బిమ్మిటి.** దే. వి. 1. వివశత; "చ. నెలఁతయొకర్తుచేతిహరినీలశిలామయపాత్రిఁబూర్ణసం, వలితతరంగయైపొదలువారుణిఁదోఁచుసుధాంశుమండలం, బలము కరాళరాహువదనాహతి స్రుక్కికరంబుబిమ్మిటిన్, గలఁగిపొరింబొరిన్ వణఁకుకైవడిఁగానఁగనయ్యెనయ్యెడన్." లక్ష్మి. 3, ఆ.—2. సంకోచము. "ఉ. కాంచివిరించినందనుఁడుకన్నులుబిమ్మిటినొందడిందియొ, క్కించుకకొంకుదేఱికనియెన్దదుదగ్రమహోగ్రదీప్తిలోఁ, బంచముఖున్ శిఖీక్షణవిభాసిలలాటుమరుజ్ఝరీధరున్, సంచితనత్కృపారసవశంవదు నాదికపిన్ వృషాకపిన్." పాండు. 5, ఆ.—విశ. వివశము. "క. కరికోటికిబిమ్మిటియై, హరిసమితికిగ్రుడ్లకొలఁదియైరథతతికిన్, సరిదన్నితౌపలయిత, త్కరవాలకరాళఘాతకఠినతఁబేర్చెన్." హరి. ఉ. 2, ఆ.

**బిమ్మిటిగొను.** దే. అ. క్రి. (బిమ్మిటి+కొను.) వివశత్వమునొందు. "ఎ, గీ. పేర్చుతల్లడమునబిమ్మిటిగొనియెడు, చిత్తము." భార. ద్రో. 5, ఆ.

**బిమ్మిటివోవు.** దే. అ. క్రి. (బిమ్మిటి+పోవు.) 1. వివశత్వమునొందు; 2. మూర్ఛిల్లు. "అంగదునాప్రజంఘుఁడున్ బిడికిటబెట్టుగాఁబొడువ బిమ్మిటివోవుచుఁదేటి." రా. యు, కాం.

**బియ్యము.** దే. వి. పొట్టూడదంచినధాన్యము, తండులము.

**బిరడ.** దే. వి. 1. తంబుఱలోనగువానితంతిచుట్టెడుతఱిమెనకొయ్య; 2. టెంకాయబుఱ్ఱలోనగువాని మూతికివేసెడుతఱిమెనకొయ్యతునకలోనైనది.

**బిరబిర.** దే. ద్ర. క్రి. విశ. అతిత్వరితముగా. "చ. బిరబిరఁద్రిప్పివైచుటయు బెట్టుగనెత్తురునోరఁగ్రక్కుచున్, ధరణితలంబునం బడియె." వి, పు. 2, ఆ.

**బిరికీ.** దే. వి. మెడనుధరించెడు భూషావిశేషము.

**బిరుదము.** సం. వి. అ. పుం. సామర్థ్యచిహ్నము.

**బిరుదాయత్తు.** వై. విశ. బిరుదుగలవాఁడు.

**బిరుదు.** వై. వి. 1. సామర్థ్యచిహ్నము; (వానికి విద్వత్సార్వభౌముఁడని బిరుదుపేరు.)—2. శౌర్యచిహ్నము*; "సీ. నవ్వెడుతలలనుగ్రొవ్వారుచేతుల బిరుదులువెట్టినచరణములను." భార. కర్ణ. 3, ఆ.—3. ప్రతిజ్ఞ*. (వానికి బుద్ధిమంతులతోఁగాని యితరులతోఁజేరఁగూడదని బిరుదు.)—విశ. 1. సమర్థుఁడు, సమర్థము*; "సీ. భారంబునకుఁజాలిభూరిసత్వాఢ్యమై బిరుదైనయెద్దుభూసురునకిచ్చి, నరుఁడుధేనుదశకమిరవొందనిచ్చిన, ఫలమువడయు." భార. అర. 4, ఆ.—2. శూరుఁడు*. "బిరుదులనైనను బిటకివాండ్రనునైనఁజంపుచోఁగడపఁడుజముఁడు." భార. స్త్రీ. 1, ఆ.

**బిరుదులాఁడు.** దృ. విశ. (బిరుదులు+ఆఁడు.) ప్రతిజ్ఞావంతుఁడు. "తే. అర్థితోనోషధీశ్వరుఁడాదియైన, పెండ్లికొడుకులనెల్లనుబిలువఁబంచి, గబ్బితనమునజగదీశుఁగాలకంఠుఁ, బిలువఁబంపకమానెనబ్బిరుదులాఁడు." భీ. 5, ఆ.

**బిరుసు.** దే. వి. 1. కాఠిన్యము; "ఎ, గీ. తిరుగఁడొకమాత్రమునవచ్చుబిరుసుచూడ." కళా. 3, ఆ.—2. బ. బిరుసుఁగ్రోవి. (చూ. చంద్రజ్యోతి.) (వృత్తియందేకవచనాంతము.)—విశ. కఠినము. "బిరుసుగనేటికిన్దఱచుప్రేలెదు." జై. 2, ఆ.

**బిరుసుఁగ్రోవి.** దే. వి. (బిరుసు+క్రోవి.) ఒకదినుసు బాణసంచు. "బిరుసుఁగ్రోవిముట్టించినతెఱంగు." కళా. 7, ఆ.

**బిఱబిఱ.** దే. ద్ర. క్రి. విశ. అతిత్వరితముగా. "చ. దంపతుల్, బిఱబిఱఁజొట్టుచున్ బికిలిపిట్టలకైవడిఁబోరిరెంతయున్." చంద్ర.

**బిఱ్ఱాన.** దే. ద్ర. క్రి. విశ. త్వరితముగా.

**బిఱ్ఱీన.** దే. ద్ర. క్రి. విశ.——పై.—— "చ. కడువడిదృష్టి కింతవెలిగాఁబోదనుండిబిఱ్ఱీనఁగ్గైదువే, వెడల." చంద్రా. ౨, ఆ.

**బిఱ్ఱీలున.** దే. ద్ర. క్రి. విశ.——పై.—— "వ. అప్పలుకు లాలించిబిఱ్ఱీలునంజను దెంచుతలవరులంజూచి." చంద్ర.

**బిఱుబిఱ్ఱు.** దే. వి. ఊలులోనగునవిపడుటయందగు ధ్వన్యనుకరణము. "క. అఱచేతిర్వ్రాలుగనున, త్తఱేఁబడెనొక యంపకట్టె దానికిఁదెరలక్, బిఱుబిఱ్ఱునజాలుంబడెఁ, దెఱపియుఁగనలేమి సాతుతిరుగుచుపడియెక్." ఆము. ౬, ఆ.

**బిఱుసు.** దే. వి. 1. కాఠిన్యము; "క. ఉఱుకుచునెకరినముష్టిక్, నెఱిచెడనడిఁవఁపువాడిచినిజభుజములయే, డ్డెఱమెఱయవానిసంధులు, బిఱుసునవెనుకకుఁగుదించిపేడక్లేల్లట్టెక్." కళా. ౮, ఆ.–2. బ. బిరుసుఁగ్రో.వి. విశ. కఠినము.

**బిఱ్ఱు.** దే. వి. బిగువు. (చూ. బిట్టబిఱ్ఱు.)

**బిఱ్ఱుబిగియు.** దే. అ. క్రి. (బిగియు+బిగియు.) మిక్కిలి బిగిసికొను. "తే. పెద్దలయ్యునుగడుబిఱ్ఱుబిగిసియుంద్రు, వట్టియభిమానములను గర్వములఁబట్టి." కాశీ. 2, ఆ.

**బిఱ్ఱు.** దే. అ. క్రి. బిరుసగు. "ఉ. క్రూరపుఁజూపులక్ నిడుదకోఱలు నుగ్రపుమోమునెత్తుటక్, జేరినకోరమీసములు బిఱ్ఱినవెంద్రుకలుక్ గృశత్వముం, గూరినదేహముక్ వెడఁదకుక్షియుఘోరరవంబుఁగల్గియే, పారినబ్రహ్మరాక్షసుఁడుదగ్రబలుండొకఁడవ్వనంబునక్." భో. ౪, ఆ.–వి. 1. తడికబిగువుగానిలుచుటకై దారముగట్టియాడ్చియానించెడుకొయ్య; 2. ఉద్ధతి. విశ. ఉద్ధతము.

**బిలకము.** సం. వి. అ. పుం. (చూ.) పల్లిక.

**బిలము.** సం. వి. అ. న. 1. రంధ్రము; 2. గుహ. పుం. ఉచ్చైశ్శ్రవము.

**బిలేశయ.** సం. వి. అ. స్త్రీ. ఉడుము. అ. పుం. ము. 1. పాము; 2. ఎలుక.

**బిల్ల.** దే. వి. 1. పలుచనిగుండ్రనివస్తువు; (తోలుబిల్ల మొ.) 2. గుండ్రపుతలగడ; "కుఱుగద్దెబిల్లఁబ్రకోష్ఠమునిచి." ఆము. ౪, ఆ.–3. ఖండము; "ఎ, గీ. కల్లుబిల్లలుచేసివెగ్గలమునవ్వె." ఉ, హరి. 3, ఆ.–4. నీచజాతివారికర్ణభూషావిశేషము; "ద్వి. చెడఁగొండుచీనులబిల్లలుగట్టి." నళ. 3, భా.–5. (సూర్యచంద్రుల) బింబము; 6. కపిలెరాట్నము; 7. ఊళ్లపనివాఁడు దిండునకంటించెడుచక్రము; 8. మెడలోనగుచోట్లయందు గుండ్రముగాలేచెడు నెత్తురుగడ్డ. విశ. గుండ్రనిది.

**బిల్లకట్టు.** దే. అ. క్రి. మెడలోనగుచోట్లయందు నెత్తురుగడ్డ కట్టు.

**బిల్లకఱ్ఱలు.** దే. వి. బ. తములపాకులనుదెలకు క్రిందనుమీఁదను సంతనచేసి కట్టెడుకఱ్ఱలు.

**బిల్లగోల్లు.** దే. వి. బ. (బిల్ల+కోల్లు.) బాలక్రీడావిశేషము. (చూ. అందలము.) (ఇది బిల్లగోడని ఏకవచనాంతముగాను గానఁబడుచున్నది.)

**బిల్లచెప్పులు.** దే. వి. బ. తోలుబిల్లలకుచ్చులమర్చినచెప్పులు. "వ. జేగడలతోడిబిల్లచెప్పులుదొడిగి." వి, పు. 2, అ.

**బిల్లవాలు.** ద్వ. వి. చక్రాయుధము.

**బిల్లిక.** దే. వి. (చంద్రసూర్యుల) బింబము. (బిల్లయొక్కరూపాంతరము.)

**బిల్మక్తా.** హిం. వి. మొత్తముననిచ్చుగుత్త.

**బిల్వము.** సం. వి. అ. న. మారేడుపండు. పుం. మారేడుచెట్టు.

**బిల్లు.** దే. వి. శోత్రకము.

**బిస.** దే. వి. 1. యంత్రపుకీలు; "వ. మృగయుండుబిసయొడ్డి సంఘటించినకాలిబోనులంబడి." పా. ౪, ఆ.–2. యంత్రము. "సీ. వంకులుగుదియలువలత్రాళ్లుమోకులు బిసలుమాఱుమ్ములుపెద్దవింట్లు." శుక. ౧, ఆ.

**బిసకంఠిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దపెంటికొక్కెర; 2. పెంటికొక్కెర.

**బిసప్రసూనము.** సం. వి. అ. న. తామర, పద్మము.

**బిసబిస.** దే. వి. వేగము. "బిసబిసఁబోకయొయ్యనడపింపుఁడు." పాంచా. ౪, ఆ.

**బిసము.** సం. వి. అ. న. 1. తామరతూఁడు; 2. తామరతీఁగ.

**బిసరుహము.** సం. వి. అ న. తామర, పద్మము.

**బిసాతు.** హిం. వి. శక్తి, బలము.

**బిసి.** దే. వి. తడికబిఱ్ఱు. (చూ. బిఱ్ఱు.)

**బిసిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీఁగ; 2. తామరకొలను; 3. తామరతంపర.

**బిసిబిసి.** దే. విశ. లగువుబిగువుగలది. "సీ. విభుఁడుదండనెయిది వినుచున్నవాఁడెంతగబ్బివేయిదిలజ్జక్రమమెయనియు, నతఁడిదినరకుసేయమిగభావించిననపుడేమియగుదుపేవబలయనియు, రసికశేఖరుఁడుసర్వజ్ఞుఁడుప్రియుఁడునీకొలఁదిననడచుభీతిలకుమనియు, నతిగోప్య మీసుభావాప్తిదీనికినింత తడయుటొప్పమి యట్లుదలఁపవనియు, మఱియునెన్నేనిబిసిబిసిమాటలమరఁ, బ్రియముచెప్పియు నదరపైచియుహితాను, వృత్తిఁదెలిపియునొకకొంత మెత్తపడఁగఁ, జేసికేల్పట్టితిగిచెనాచెలువఁగదల." ప్రభా. ౫, ఆ.

**బిసిపోవు.** దే. అ. క్రి. (బిసి+పోవు.) పట్టువదలు.

**బిస్త.** దే. వి. దుర్గతి, నరకము, బిద్దె.

**బిస్తము.** సం. వి. అ. పుం. కర్షమెత్తుబంగారు, మాడ.

**బిస్తి.** హిం. వి. తోలుసంచులతో నీళ్లుమోయువాఁడు, పకాళి.

**బిస్సు.** దే. వి. వేగమునందగు ధ్వన్యనుకరణము. "బిస్సునసాళువంబు తూఱెడుక్రియ." సా. ౧, ఆ.

## బీ.

**బీఁటు.** దే. వి. బీఁటిక, పగులు. "శ. దాఁటుటయుఁగొండగొవులు, బీఁటలువాసనగడింటబీతునజేశే, దాఁటువడంకంబాఱెను, గాటపుఁబయ్యరలమొగులుగడలకుజాతెక్." అచ్చ. కిష్కిం, కాం.

**బీఁటగిల్లు.** దే. అ. క్రి. పగులువాఱు. (రూ. బీఁటగిలు.) "వ. చండీశ్వరాసీపుమేరుకోదండంబునఁబుండరీకాక్షకాండంబుదొడిగి కుండలిజ్యావల్లరీఝల్లరీ ఝుంకారంబునఁ బంకరుహభవాండంబుబీఁటగిలనికాటపుటభేదనంబులొక్కయేటునఘటచ్చుటనేనిటివి." భీ. 3, ఆ.

**బీఁటలువాఱు.** దే. అ. క్రి. (బీఁటలు+వాఱు.) బీఁటగిల్లు. "శీ. బిఱెండతాఁకునబీఁటలువాఱినపచ్చిగోడలమాడ్కిఁబగిలె దిశలు." భార. ఉద్యో. ౪, ఆ.

**బీఁటలువోవు.** దే. అ. క్రి. (బీఁటలు+పోవు.) బీఁటగిల్లు. "సీ. భేరీధ్వనులనింగిబీఁటలువోకుండఁగరికరశీకరోత్కరముదడు పు." భార. భీష్మ. ౧, ఆ.

**బీఁటిక.** దే. వి. బీఁటయొక్కరూపాంతరము. "సీ. ననసీట గుబ్బ లించెనుగళావతి యోర్తుజిగిమోవిబీఁటికలెగయకుండ." భాను. ౨, ఆ.

**బీగము.** దే. వి. తలుపులోనగువానికివేసెడుతాళము.

**బీజకోశము.** సం. వి. అ. పుం. తామరపూస.

**బీజపూరము.** సం. వి. అ. పుం. మాదీఫలము*.

**బీజము.** సం. వి. అ. న. 1. విత్తనము; 2. విత్తులు; 3. ముష్కము; 4. రేతస్సు; 5. హేతువు; 6. బలము.

**బీజాకృతము.** సం. విశ. (అ. ఆ. అ.) విత్తిదున్నినది. (పొలము)

**బీజ్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మంచికులమునందుపుట్టిన వాఁడు.

**బీడు.** దే. వి 1. దున్ననిభూమి; (బీటినేల.) 2. మట్టమైన యినుము. విశ. నికృష్టము.

**బీతు.** వై. వి. భయము. "చ. వికృతములైనమర్కటులవేషము లక్కడనీవుచూచిబీ, తుకుడిచివచ్చినోరికొలఁదుల్ ప్రకటించెదు." రా. యు, కాం.

**బీతుకొను.** ద్వి. అ. క్రి. భయపడు. (ప్రే.) బీతుకొలుపు. "ఖంతజనంబుల బీతుకొల్పు కక్కసమగురక్కసుల్." పు. ౨, ఆ.

**బీద.** వై. విశ. 1. భయమునొందినది; 2. దరిద్రుఁడు*.

**బీభత్సము.** సం. వి. అ. పుం. ఒకరసము. (చూ. రసము.)

**బీభత్సు.** సం. విశ. చెడిపోయినది, అసహ్యకరమైనది.

**బీభత్సుఁడు.** సం. వి. అ. పుం. అర్జునుఁడు. విశ. 1. వికారముగలవాఁడు; 2. క్రూరుఁడు; 3. కనికరముగలవాఁడు.

**బీమా.** హిం. వి. కొంతద్రవ్యమునిచ్చుట కొడఁబడుపద్ధతి. (ఆంగ్లేయభాషలో ఇన్స్యూరెన్సు అందురు.)

**బీరము.** వై. వి. పరాక్రమము. "క. వేరమ్ముపైమయువుదొడి, తేరెక్కుముతప్పఁగ్రుంకఁదీఁటుడునీకుఁ, సైరంధ్రిసెప్పెనీదగు, బీరమ్మునుబెంపులావువెరవునుమాకుఁ." భార. విరా. ౪, ఆ.

**బీరాఁజో.** దే. స. క్రి. తుడిచిబిఱ్ఱచేయు.

**బీరింగు.** ఆం. విశ. నటుపైడ్డు.

**బీరిజెము.** వై. వి. బీజము, అండకోశము, ముష్కము.

**బీరు.** ఆం. వి. ఒకవిధమైన సారాయము.

**బీరువ.** దే. వి. అంతస్తు అంతస్తుగా అడ్డపలకలమర్చిన నిలువుపెట్టె.

**బీఱ.** దే. వి. 1. ఒకానొకచెట్టు; 2. ఒకానొకతీఁగ. (దీనిభేదములు.—ఈరబీఱ, చేఁతిబీఱ, నేతిబీఱ.) విశ. పెద్ద. (బీఱెండ, బీఱజడలు, బీఱనరాలు.)

**బీఱు.** దే. విశ. వ్యర్థము. (బీఱువడు మొ.)

**బీఱువడు.** ద్వి. అ. క్రి. (బీఱు+పడు.) వ్యర్థమగు. "తలఁపులుసిక్కి బీఱువడి తొల్తుటపెల్లగిలంగ." పారి. ఉ. ౨, ఆ.

**బీఱువాఱు.** దే. అ. క్రి. (బీఱు+పాఱు.) బీఱువడు. "శే. ఏల, యీఱతొఱకలంపులబీఱువాఱ." భార. అశ్వ. ౧, ఆ.

**బీఱువోవు.** దే. అ. క్రి. (బీఱు+పోవు.) 1. వ్యర్థమగు; "ఎ, గీ. భవ్యతరత, పోబలంబునఁగడు బీఱువోనిగోఁచి, వాఁడు." హన. ౧, ఆ.—2. బలహీనమగు. "పాడిచినవెనబీఱువోవక యొండొరునందందపొడుచుచు." భార. విరా. 3, ఆ.

## బు.

**బుంగ.** దే. వి. చిన్నమూతిగలకుండ. "కల్లుబుంగ." హరిశ్చ. ౪, ఆ.

**బుంగనామము.** దే. వి. నడుమ ఎడములేకతీర్చినతిరుమణి. (చూ. పంగనామము.)

**బుక్క.** దే. వి. వస్త్రములకువాసనకట్టెడుగందవొడి, పటవాసకము.

**బుక్కనము.** సం. వి. అ. న. కుక్కయొక్కమొఱుగు.

**బుక్కము.** సం. వి. న్. స. అ. పుం. శ్రోతమునందు ప్రసిద్ధమైనమాంసము.

**బుక్కా.** దే. వి. బుక్కయొక్కరూపాంతరము. (చూ. గుబులు.)

**బుక్కాపకీరు.** హిం. వి. నిరుపేద, దిక్కులేనివాఁడు.

**బుక్కాము.** దే. వి. 1. పుప్పొడి; 2. బుక్క. "రగడ. నెలఁతయీగేదంగినీకబ్బెబుక్కాము, చిలుకునీపుప్పొళ్లుచెంచెతలబుక్కాము." సావి. 3, ఆ.

**బుక్కావాఁడు.** దే. వి. గందవొడిలోనగునవి యమ్మువాఁడు.

**బుక్కు.** ఆం. వి. పుస్తకము.

**బుగడ.** దే. వి. ఆఁడువారు కొనచెవినిధరించెడు భూషావిశేషము.

**బుగబుగ.** దే. వి. బుగులుకొనుటయందగు ధ్వన్యనుకరణము. "క. దగదగయనుపదకంబున, నిగనిగయనుక్రొమ్మెఱుంగునేత్రపటము నకుఁ, బుగబుగయనుమేపూఁతకుఁ, బగబగయనిపించెనతఁడు నా హృదయంబుకుఁ." కళా. ౨, ఆ.

**బుగులు.** దే. వి. గుబులునకు మాఱురూపము. (చూ. బుగులుకొను.)

**బుగులుకొను.** దే. అ. క్రి. 1. గుబులుకొనునకు మాఱురూపము; "సీ. బుగులుకొంచుఁదనర్చుభూరిసౌరభముచే నొఱపైనమేపూఁతయొప్పతోడ." పర. 3, ఆ.—2. (చూ.) చిప్పిలు; "ఉ. వీలకకాలజిత్ప్రముఖవీరులుమున్నకుశాఘగాహతిఁ, గూల్చిరోరక్తధారలు బుగుల్కొనలక్ష్మణుమ్రోలధాతుకు, తీక్కలమునాల్గువంకలనతిత్వరమాణసమీరవర్తనో, న్మాలితసంప్రఫుల్లసుమనోభరకింశుకవాటికైవడిఁ." జై. ౬, ఆ.—3. విజృంభించు; (చూ. దంటమోములదేవర.)—4. వ్యాపించు. "శా. ద్యావాపృథ్వ్యవకాశముల్ బుగులుకొనందందవింధ్యాద్రిఘం, టావీథిఁజెలఁగెఁ గరోరతరకంఠక్ష్వేళనాదంబుతో, దేవదానవకోటినిష్ఠురభుజాళిప్రౌఢనానాధను, ర్జ్యావల్లీభవభూరిభాంకృతు లురుద్రాఘిష్ఠదీర్ఘధ్వనిఁ." కాశీ. ౬, ఆ.

**బుగులుపుచ్చు.** దే. ప్రే. బయలువఱచు. "ద్వి. ఇంకొక్కభయము, పుట్టుచున్నదిమాకుభూపాలపుత్రిఁ, బట్టియొజ్జలుగాసి వఱచెనటంచు, బుగులుపుత్తురొమీరుపురిలోననుచు." నవ. 3, ఆ.

**బుగులుపోవు.** దే. అ. క్రి. బయలుపడు. (చూ. బుగులుపుచ్చు.)

**బుగులుబుగులు.** దే. వి. క్రక్కుటయందగు ధ్వన్యనుకరణము. "క. తెగనిండఫాలనయనుఁడు, నగచాపముఁదిగిచినప్పుడుసాగెం

గ్రుండ. బ్బిగుపునమొగంబులదరుటఁ, బొగలెగయఁగవిషములు బుగులుబుగులునఁగ్రక్కెన్." భీ. ౪, ఆ.

**బుగ్గ.** దే. వి. 1. చెక్కిలి; 2. నీటిబుడ్డ; 3. పర్వతాదులయందుండి సంతతధారగా పైకుబికివచ్చెడునీరు.

**బుగ్గి.** దే. వి. బూడిద, భస్మము.

**బుచ్చి.** దే. విశే. చిన్న, అల్పము.

**బుచ్చిగాఁడు.** దే. విశే. (బుచ్చి+కాఁడు.) చిన్నవాఁడు.

**బుచ్చిపాఱు.** దే. అ. క్రి. (బుచ్చి+పాఱు.) చిన్నపోవు.

**బుజ.** యు. దే. వి. కుండలీకరణము, సున్న. "క. వనజభవుఁడవయవమ్ములు, తనగారసృజించిసావధానమతిన్గ, న్గొనికొనొక్కటెదబ్బఱ, యనిబుజయిడుపగిదినాభియంగనకలరున్." చంద్ర.—వై. భుజము. "బిసవల్లిసముద్భవసౌకుమార్యకందళములకంబుజేల్ బుజేలు." చమ. ౧, ఆ.

**బుజపత్తిరి.** వై. వి. భుజపత్రము*.

**బుజెము.** వై. వి. భుజము. (చూ. బుజేముపుట్టువు.)

**బుజెముపుట్టువు.** ద్వ. వి. రాచవాఁడు, బాహుజుఁడు. "తే. అట్టితనయునిక్కపట్టునకత్తెఱఁగున, బుజముపుట్టువుకుజ్జబెబ్బులులఁదెచ్చి, తనియఁబూజేలొనంగియత్తపసిరాయఁ, డంతఁదాజన్నమొనరించునదనునందు." అచ్చ. బాల, కాం.

**బుజ్జగము.** దే. వి. ఉపలాలనము. భాగ. 3, స్కం.

**బుజ్జగించు.** దే. స. క్రి. ఉపలాలించు.

**బుజ్జగింత.** దే. వి. బుజ్జగించుట, ఉపలాలనము. "ద్వి. బుజ్జగింతలుఁబొరిబొంకుమాటలును, మజ్జాతులగువారిమాటలుగావు." హరిశ్చ. ౨, భా.

**బుజ్జివము.** దే. వి. బుజ్జగముయొక్కరూపాంతరము. విక్ర. ౬, ఆ.

**బుటా.** హిం. వి. వస్త్రములమీఁదనేయుపువ్వు. (జరిబుటాలు.)

**బుటుకు.** దే. వి. మునుఁగుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. కమలాప్తుఁడుదయింపకయుమున్న బుటుకునమునుఁగునంగమతీర్థమునకునేగి." పాండు. ౫, ఆ. (రూ. బుటుక్కు.)

**బుట్ట.** వై. వి. పుష్పాదులుంచెడుకరండము*.

**బుట్టి.** వై. వి. బుట్ట. "సీ. గణనమీఁజేనశార్ఙ్గిగుణములుహృదయసంపుటినించుక్రియవిరుల్ బుట్టిఁబెట్టి." పాండు. ౨, ఆ.

**బుట్టిక.** వై. వి. బుట్టియొక్కరూపాంతరము. "ద్వి. కలరవంబులబుట్టికలఁజేతఁబట్టి." సా. ౨, భా. (స్వార్థమున కప్రత్యయము.)

**బుడకోడి.** ద్వ. వి. నీరుకోడి, జలకుక్కుటము.

**బుడగ.** దే. వి. బుగ్గకు మొదటిరూపము.

**బుడబుడ.** దే. వి. నీళ్లనుండివెడలుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (నీళ్లనుండివెడలుటయందు; "ఎ, గీ. బుడబుడధ్వనివెడలుబుద్బుదములందు." స్వా. ౪, ఆ.—పొక్కుటయందు; "అడుగులెండబుడబుడఁబొక్కిన నిర్ఝరాంతరములనిలుచు." భార. అర. ౨, ఆ.—క్రక్కుటయందు. "క. బుడబుడనెత్తురుగ్రక్కుచు." భాగ. 3, స్కం.)

**బుడమ.** దే. వి. మృగోర్వారుకు*.

**బుడము.** దే. వి. మొదలు. (వాఁడునాలుక బుడమునకు పెఱుకుకొనివచ్చెను. నీచెవులు బుడములంటఁదెగఁగోసెదను.)

**బుడికిస్స.** దే. వి. బాలక్రీడావిశేషము.

**బుడిగ.** దే. వి. 1. ఎద్దుమీఁదియొకవైపుసిద్దె; 2. పిడత. "పాలబుడిగలు." హంస. ౨, ఆ.

**బుడిగి.** దే. విశే. బుడుగుయొక్కరూపాంతరము.

**బుడిపి.** దే. వి. 1. పోటుచేత దేహమునందు ఉబ్బగాలేచెడుబొప్పి; 2. చెఱకులోనగువానికనుపు; 3. మ్రానియందలి ముడి.

**బుడిబుడి.** దే. వి. తొట్రుపాటు. "సీ. రాకొమారులయిండ్లకేకతంబునఁదదాప్తులవెంట బుడిబుడిఁబోవువారు." వసు. ౪, ఆ. "బుడిబుడిమాటలాడుటయు." (ఇక్కడ బుడిబుడిమాటలు అనఁగా తొట్రుపాటుగలమాటలు అని యర్థము.) భార. ఉద్యో. 3, ఆ.—విశే. అల్పము. "బుడిబుడికన్నీరు." స్వా. 3, ఆ. "ద్వి. హరినణంచుటయొబ్రహ్మాదిదేవతలఁ, బొరిమార్చుటయొ బుడిబుడివేలుపులను, వంచుటచోద్యమే." భాగ. ౪, స్కం.

**బుడివడు.** ద్వ. అ. క్రి. (బుడి+పడు.) తొట్రుపడు. "క. తడఁబడుచునొడలునులుచుచు, వడిఁదూలుచునావులింతవచ్చినశాలయున్, బుడివడుకాళులునిలువక, పడఁబోవున్ బడగకామపైఁబడియొఱగన్." ఉ, హరి. ౬, ఆ.

**బుడుక.** దే. వి. మునుక, స్నానము.

**బుడుకు.** దే. వి. బ. భక్ష్యవిశేషము. "వ. బుడుకులునడుకులు." కాశీ. ౭, ఆ.

**బుడుగు.** దే. విశే. పొట్టి. "ఎ, గీ. పొడుగుమడుఁగునుగాంచినయడుగువాఁడు, పిడుగువడుగునరిపునొంచునడుగువాఁడు, చెడుగులుడుగునట్లుగనమ్ముదొడుగువాఁడు, బుడుగువడుగురూపునబలినడుగువాఁడు." చంద్రా. ౧, ఆ.

**బుడుత.** దే. వి. 1. బిడ్డ; 2. బాలుఁడు. (చూ. బుడుతఁడు.) విశే. పొట్టి.

**బుడుతఁడు.** దే. వి. బుడుతయొక్కరూపాంతరము. (బిడ్డకు.— "సీ. కుఱుమాపుపయ్యంటచెఱఁగులోనెలకొన్నముద్దుపలుకులచిన్ని బుడుతఁడమర." శుక. ౧, ఆ.—బాలునికి.— "సీ. జీరాడుదుప్పటిచెఱఁగుచేఁబూని వెంబడిగిండిగొనివచ్చు బుడుతఁడొదుఁగ." ఉ, రా. ౬, ఆ.)

**బుడుబుడుక్క.** దే. వి. డుబుడక్కకు మాఱురూపము.

**బుడుబుడుక్కలవాఁడు.** దే. వి. (చూ.) డుబుడక్కవాఁడు.

**బుడుమ.** దే. వి. సస్యవిశేషము. "బుడుమసత్తిమిత్తినిగూడె." విష్ణు. పూ. 3, ఆ.

**బుడ్డ.** దే. వి. 1. అండవృద్ధి; 2. నీరుబుగ్గ.

**బుడ్డకాఁకర.** ద్వ. వి. శక్రవల్లిక*.

**బుడ్డగించు.** దే. అ. క్రి. పంధిముట్టితోశోరాడు. "ఒకమరిబుడ్డగింప." ఆము. ౪, ఆ.

**బుడ్డగింపు.** దే. వి. బుడ్డగించుట. (చూ. ఆరగింపు.)

**బుడ్డపక్కె.** దే. వి. మత్స్యవిశేషము.

**బుడ్డపిడుఁదు.** దే. వి. పశువులకుపట్టెడు ఒకదినుసుపిడుఁజ.

**బుడ్డబుడుసర.** దే. వి. ఓషధివిశేషము.

**బుడ్డవాఁడు.** దే. విశే. అండవృద్ధిగలవాఁడు.

**బుడ్డి.** దే. వి. చిన్నమూతిగల నిడుపాటి కాచపాత్రవిశేషము.

**బుడ్డిగ.** దే. వి. బుడ్డియొక్కరూపాంతరము.

**బుడ్బి.** దే. వి. బుడిపియొక్క రూపాంతరము.

**బుత్తి.** వై. వి. భోగము. "అ. మత్తగిల్లుసత్తుగిత్తతత్తడిసెక్కి, మిత్తి మొత్తిసత్తినత్తిబత్తిఁ, బత్తిరిడిసముత్తిబుత్తులురెండును, నొత్తిగుత్తగట్టు చుండుజేఁడ." నీలా. ౧, ౬.

**బుద్ది.** వై. వి. మతి. "ఉ. అద్దిరపినిశీవియునొయారముదిట్టతనంబు చేవయుఁ, దద్దయునబ్బురంబెదకుఁదార్కొనఁజేయఁదొడంగెనిట్టి బల్, గద్దరికాఁడువాఁడిని జగంబులు గెల్చుటదేమి వింతమేల్, బుద్దియొకింతలేకచెడిపోవఁదలంపెడెఁగాకయిత్తఱిఁ." అచ్చ. సుం, కాం.

**బుద్బుదము.** సం. వి. అ. పుం. 1. నీరుబుగ్గ; 2. గర్భమునందలి అవయవవిశేషము.

**బుధవారము.** సం. వి. అ. పుం. ఒకవారము. (చూ. వారము.) (ఇట్లు సౌమ్యవారము.)

**బుధితము.** సం. విణ. (అ. ఆ. అ.) తెలియఁబడినది.

**బుధుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒకగ్రహము; (చూ. గ్రహము.) 2. విద్వాంసుఁడు; 3. వేలుపు.

**బుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. మతి. (అంతఃకరణవృత్తులు నాలుగింటిలో నొకటి. ఇది పండ, మేధ, ధారిణి, గృహీతి, శ్రౌతి, చత్వరి అని ఆఱువిధములుగలది. బుద్ధిగుణములు. ౮.-శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహము, అపోహము, అర్థవిజ్ఞానము, తత్వజ్ఞానము.)

**బుద్ధిమంతుఁడు.** సం. విణ. (శ్. ఈ. శ్.) బుద్ధిగలవాఁడు.

**బుద్ధుఁడు.** సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. విద్వాంసుఁడు. విణ. తెలియఁబడినవాఁడు.

**బుధ్నము.** సం. వి. అ. పుం. 1. వేరు; 2. ఊఁడ. డు. శివుఁడు.

**బుభుక్ష.** సం. వి. ఆ. స్త్రీ. భుజింపనిచ్ఛ, ఆఁకలి.

**బుభుక్షితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నవాఁడు, క్షుధితుఁడు.

**బుభుత్స.** సం. వి. ఆ. స్త్రీ. బోధగొననిచ్ఛ.

**బుయ్య.** దే. వి. ఆఁడుగుఱి.

**బుయ్యారము.** దే. వి. చెఱసాల, కారాగృహము.

**బురకా.** హిం. వి. గవిసెన, ముఖమునుకప్పువస్త్రము.

**బురజె.** దే. వి. చిఱుగజ్జె. (అప్ర.)

**బురద.** దే. వి. అడుసు, కర్దమము, పంకము.

**బురదకమ్మి.** దవ్. వి. కడపక్రిందికమ్మి.

**బురదపాము.** దే. వి. నీరుపాము.

**బురక.** దే. వి. బిడ్డ. విణ. పొట్టి. (దీనికి ఒక నిఘంటువునందు గుజ్జుముతలయందుండెడు తొరాయి అని ఒకయర్థము వ్రాయఁబడియున్నది.)

**బురుకఁడు.** దే. వి. 1. బిడ్డ; "సీ. బురుకఁడుచంకబంగరుబుట్టితగుజాతివిరికిఁగౌరవంబివిధమెుకర్తు." ఉ, రా. ౬, ఆ.- 2. వేఁటకుక్క. విణ. పొట్టి.

**బురుజా.** హిం. వి. కోటగోడయందుండుదిబ్బ, గడి.

**బురుడా.** దే. వి. అసత్యవచనము.

**బురుడుఁడు.** సం. వి. అ. పుం. మేదరవాఁడు.

**బురుమా.** దే. వి. బరమాయొక్క రూపాంతరము.

**బురుసా.** దే. వి. 1. ఎఱ్ఱపట్టు; (చూ. తగటి.) 2. పట్టు. (చూ. తివాసి.)

**బురుసు.** ఆం. వి. వెండ్రుకలకుంచె.

**బుఱటకొమ్ము.** దే. వి. బుఱ్ఱటకొమ్ముయొక్క రూపాంతరము. "మ. ముదితల్ కొందఱుకెంపుఁజాబుఱటకొమ్ముల్ పూనియేతేర." చంద్ర.

**బుఱ్ఱ.** దే. వి. 1. కొబ్బెరకాయమొదలైనవానిగుల్ల; 2. ఎండినసొరకాయ; "తే. ఎన్నఁడునుమున్నువారలయేపునోపుఁ, గానమెట్లు సముద్రంబులోనబుఱ్ఱ, వైచఁగొన్నంతకొనుఁగాకవారిగెల్వ, మాకు శక్యంబెచవిగానిమాటలేల." భార. భీష్మ. ౨, ఆ.- 3. వీణలో నగువానికాయ; "వ. వెఱ్ఱిసొరకాయలబుఱ్ఱలంగట్టినసరకట్లకిన్నెరలమెఱయమొరయించునేచపాటల తానమానంబులును." కాశీ. 3, ఆ.- 4. పాములవానినాగసరము; 5. తలపుఱ్ఱె. విణ. పెద్ద.

**బుఱ్ఱకత్తి.** దవ్. వి. చెట్లకొమ్మలునఱకెడుమోటకత్తి.

**బుఱ్ఱకాయ.** దవ్. వి. సొరకాయకమండలువు. "అ. కావిచీరముసుఁగుకచ్చడంబునఁజూచి, బోడతలయునీడుదబొట్టుఁజూచి, గోఁచితోడవెదురుఁగోలయుఁజక్కఁ౦బు, గట్టియున్న బుఱ్ఱకాయఁజూచి." ఉ, హరి. ౪, ఆ.

**బుఱ్ఱటకొమ్ము.** దే. వి. (చూ.) చిమ్మఁగ్రోవి. "క. అత్తటివిటనాగరికులు, చిత్తమునవసంతకేళిచిగురొత్తంగా, మొత్తములుగట్టి తెచ్చిరి, ముత్తెపుఝల్లరులతోడిబుఱ్ఱటకొమ్ముల్." వైజ.

**బుఱ్ఱజింక.** దే. వి. బుఱ్ఱముక్కుగలజింక.

**బుఱ్ఱతలము.** దే. వి. బుఱ్ఱయేతము. (చూ.) కారెము.

**బుఱ్ఱపిట్ట.** దవ్. వి. పారావతవిశేషము.

**బుఱ్ఱబాడిస.** దవ్. వి. జాళ్లుచెక్కెడుబాడిత.

**బుఱ్ఱముక్కు.** దే. వి. పెద్దరంధ్రములుగలముక్కు. "సీ. ముడిబొమ్మలునుబుఱ్ఱముక్కుతిత్తువుకళ్లులాకచేతులు వెట్టిలక్షణములు." భల్లా. ౪, ఆ.

**బుఱ్ఱముక్కువాఁడు.** దే. విణ. (చూ.) ఖురణసుఁడు.

**బుఱ్ఱి.** దే. వి. తఱుపాపు.

**బుఱ్ఱు.** దే. వి. పక్షియెగురుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. బెదరుఁజిత్తమునాఁపుఁబిట్టబుఱ్ఱనిన." పారిజా. ౧, భా.

**బులాకి.** హిం. వి. ముక్కుక్రిందనుంచుకొను అభరణము.

**బులియు.** దే. అ. క్రి. సుఖించు. "ఎ, గీ. అలరఁజేయునచ్చరలపిండుముక్తిక, నృలనుబెండ్లియాడిబులియుచున్న, క్రొత్తపెండ్లికొడుకుఁగొమరులనయ్యాట, లాడుతద్వధూవయస్యలనఁగ." కళా. ౫, ఆ.

**బులుపు.** దే. వి. సుఖము. (చూ. బులియు.)

**బుల్ల.** దే. వి. మగగుఱి.

**బువ్వ.** దే. వి. అన్నము, వంటకము.

**బువ్వకుడుపు.** దే. వి. (చూ.) అన్నప్రాశనము.

**బువ్వము.** దే. వి. వివాహమునందు బంధువులయినమగవారు ఆఁడువారు అందఱును ఒకటిగాఁగూర్చుండి వేడుకగా భుజించుట.

**బువ్వముబంతి.** దవ్. వి. (చూ.) హరిబువ్వము.

**బుస.** దే. వి. 1. పాముయొక్క-ఫూత్కారము; 2. నిట్టూర్పు. "సీ. భూరిభుజంగికాభుక్తనిర్ముక్తిఁడైవా రకబుసకొట్టువా నిఁదెగడి." వసు. ౧, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**బుసకొట్టు.** దే. అ. క్రి. 1. (పాము) బుస్సను; 2. నిట్టూర్చు; "క. ఊర్పుల్, మిన్నందఁగబుసకొట్టుచు." ఆము. ౬, ఆ.–3. (ఏనుఁగులొండముతో) ఫూత్కారముచేయు; "ఏనికమూఁకతేసి వేమఱుబుసకొట్టఁగా." య. ౧, ఆ.–4. (సింహము) ఫూత్కారముచేయు. "సీ. పాటింపనోరిబొబ్బాటమేవడిగాని ఘూరాజిలో బుసకొట్టుచుంట." కా. ౫, ఆ.

**బుసబుస.** దే. వి. నీళ్లుపొంగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము.

**బుసబుసలాడు.** దే. అ. క్రి. (బుసబుసలు+ఆడు.) బుస పెట్టు.

**బుసము.** సం. వి. అ. న. 1. పొల్లు; 2. మీఁగడతీసినపెరుఁగు; 3. పిడక. (రూ. బుషము.)

**బుసి.** ఉభ. దే. వి. (చూ.) నిగుఱు. సం. ఈ. స్త్రీ. పశ్చిమసముద్రము నడుమనుండెడు వరుణోద్యాన నది.

**బుసిపోవు.** దే. అ. క్రి. (బుసి+పోవు.) చెడు.

**బుసుకుజొన్న.** ద్వ. వి. ఒకదినుసుజొన్న*.

**బుస్సు.** దే. వి. పాముబుసకొట్టుటయందగు ధ్వన్యనుకరణము. "కాలసర్పముసమున్నతినాడఁగశేవమీఱబుస్సంచుఫణాగ్రమెత్తి." హంస. ౫, ఆ. "తోటకవృత్తము. బుస్సున మ్రోఁగుచు వాఁడిక౯, మించినపాములమేల్చిలుకేసెక౯." అచ్చ. యు, కాం.

## బూ.

**బూఁజొ.** దే. వి. ఎండసోఁకమిచే తడివస్తువులమీఁదఁగలుగు కొంచెముమాసినతెలుపు.

**బూఁజొపట్టు.** దే. అ. క్రి. బూఁజోగలదియగు.

**బూఁదు.** దే. వి. బూఁజోయొక్క-రూపాంతరము.

**బూఁదుపారు.** దే. అ. క్రి. బూఁజోపట్టు. "బూఁదుపారఁగ మేనబూదిఁబూసినవారు." పాండు. ౧, ఆ. "బూడిదపండును బోలెబూఁదుపారెడునొకదుప్పికింగవియ." పాండు. ౫, ఆ.

**బూక.** దే. విశే. బూటకము, మాయ.

**బూగర.** దే. వి. 1. తమిఁదలుమొదలగుధాన్యములమీఁదిపొట్టు; 2. ఇండ్లవానములకుఁబట్టెడుబూజి.

**బూచి.** వై. వి. భూతము. "ఆ. బూచివోలెనున్న వాచంయముని మోము, బాల్యచాపలమునఁబట్టుటయును." స్వా. ౪, ఆ.

**బూచిగాఁడు.** ద్వ. వి. (బూచి+కాఁడు.) బూచివలెనుండుటచే కుక్క-కియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**బూచివాఁడు.** ద్వ. వి. బూచి, భూతము.

**బూచేలతేఁడు.** ద్వ. వి. శివుఁడు, భూతేశుఁడు.

**బూటకము.** దే. వి. 1. మాయ; "దండకము. నీబూటకంబెవ్వరు౯నేటుగానారయ౯లేరుగా." నీలా. ౨, ఆ. – 2. వంచన. "ఉ. మాటలువేయునేలయొకమర్మముసెప్పెదమోక్షదాతలై, పాటిలు విష్ణుశంకరులభక్తిదృఢంబుగఁగల్గెనేనినా, నాటికివానికన్నిసుగుణమ్ములుఁ దామెఘటింపనుత్తుఁడో, బూటకపు౯విచారములఁబోవఁగ నేమిఫలంబుభూవరా." పు. ౨, ఆ.

**బూటకీఁడు.** దే. విశే. (బూటకము+ఈఁడు.) 1. మాయావి; 2. వంచకుఁడు. "ఆ. నన్నుశూలియితరులెఱుఁగ, కుండఁదలుపు వెడలికొనిపోవజనులెల్ల, బూటకీఁడుపాఱిపోయెనంద్రు." బస. ౧, ఆ.

**బూటకుఁడు.** దే. విశే. మాయావి, బూటకీఁడు. "ద్వి. బూటకులను మాయపొరిగొనుచుండు." ప్రభు. ౨౪, ఆ.

**బూడిద.** వై. వి. 1. గోమయభస్మము, బూధి.

**బూడిదగుమ్మడి.** వై. వి. (చూ.) పెండ్లిగుమ్మడి*.

**బూడిదపండు.** ద్వ. వి. విభూతియుండ. (చూ. బూఁదుపాఱు.)

**బూడిదపన్ను.** ద్వ. వి. శ్మశానమునందు శవమునుకాల్చుటకై యిచ్చెడుపన్ను.

**బూడ్ద.** వై. వి. బూడిదయొక్క-రూపాంతరము. "సీ. చక్రంబు పనిసేయనడిసన్ననీపంపు బూడ్దబొట్టయ్యెనేభూరికీర్తి." మార్క. ౧, ఆ.

**బూతపిల్లి.** వై. వి. (బూతము+పిల్లి.) (చూ.) పూతికము. "ఆ. మహినిబూతపిల్లిమచ్చికయునుబోలె,రాచమాటనమ్మరాకయుండు." భల్లా. ౪, ఆ.

**బూతము.** వై. వి. 1. పిశాచము; "క. ఆతఁడేవెన్నెలదగును, జ్ఞాతాజాబిల్లివెజ్జజగమునకెల్లక౯, రాతిరిసోఁకినచీఁకటి, బూతము విడిపింపఁజల్లుబూతియుఁబోలెక౯." య. ౨, ఆ.–2. ప్రాణి. (చూ. ఎకసక్కెము. విశే.)

**బూతాటము.** దే. వి. (బూతు+ఆడుట.) బూతులాడుట. "బూతాటమాడితిట్టునతని." విజ్ఞా. ప్రా, కాం. (చూ. అఱకడ.)

**బూతి.** వై. వి. 1. బూది; 2. తిండి.

**బూతు.** దే. వి. 1. కుచ్చితపుతిట్టు; 2. కుచ్చితపుతిట్టుతిట్టువాఁడు; "సీ. బండలుబూతులుపరిహాసకులునట్టువారాదిగాఁగల వీరుదక్క." విజ్ఞా. ప్రా, కాం.–3. బట్టువాఁడు. "ఆ. బూతు పొగడినట్లుపొగడెదుపొగడంగ, వలయునేనిసుగుణవంతులైన, కర్ణశల్యులాదిగాఁగలవీరులఁ, బొగడుచుండరాదెప్రాద్దుపోవ." సం. "యన్యసంస్తవవక్తాత్వం వందివత్సతతోత్థితః." భార. సభా. ౨, ఆ.

**బూద.** దే. వి. పాలకుండ. "మ. ఉదయోలూఖలమెక్కి-నిక్కి-సహజాంకోపేంద్ర సంయుక్తుఁడై, చదల౯బూదశశాంకసీరి కరవిస్తారంబులంబట్టిబె, ట్టదుమ౯ గాఱెఁ జకోరగోపతతిపాలైచంద్రికాక్షీరముల్, పొదివెఁ౯ఘూర్ణితదుగ్ధధామనిబిడప్రోద్భూతసంరంభముల్." వసు. ౪, ఆ.

**బూది.** వై. వి. గోమయభస్మము, బూడిద.

**బూదిచేలచే.** ద్వ. అ. క్రి. బూఁజోపట్టు.

**బూదె.** వై. వి. చతుర్దశితిథి*.

**బూబు.** హిం. వి. తురకస్త్రీ.

**బూమియ.** వై. వి. 1. మాఱువేషము; "ఉ. ఏనికమోముబూమి యవహించి చరించుచునుండుకామధు, గ్ధేనువు డుంఠి కాశినిది తెల్లమువేలుపు గిడ్డికానినా, డీసునెమోక్షతర్షకమునిచ్చునెకాంక్షితదుగ్ధధారదూ, ర్వానవపల్లవావలులువైచినమాత్రనభక్తకోటికి౯." కాశీ. ౬, ఆ.–2. మాయ*; 3. వంచన*. (చూ. బూమె.)

**బూమె.** వై. వి. బూమియయొక్క-రూపాంతరము. (మాఱువేషము నకు. – "ఉ. నావుడునయ్యయాతిపదినాటినప్రేముడిముజ్జిగంబుల౯, బ్రోవఁగఁ గావబీరమునఁబొల్పగు రాముఁడునట్టిబూమెచే, నేవగమోసపోయె." య. ౨, ఆ.–మాయకు. – "శే. మాఱుకోభీ

లామయిట్టిది మనుజనాథ, కోర్కి యీడేర్పఁదగుదేనిఁగొనుముభూతి, కాకయుండినఁబ్రొద్దుకల్గంగననుపు, పోయివచ్చెదమింతేసిబూామె లేల.'' భల్లా. ౪, ఆ.—వంచనకు.—''తే. నన్నుఁగొనివచ్చునప్పుడు నాథనీవు, నీకుఁగల్గు వ్రతంబులునియమములును, దెలియఁజెప్పిన నిన్నేలతేజెచూతు, భూపవల్లభుడునన్నింతబూామెసేయ.'' రుక్మాం. ౫, ఆ.)

బూామెకత్తియ. వై. విణ. బూామెలుగలది. ''సీ. పుష్పలావిక యోర్తుబూామెకత్తియయోర్తుగంధవాహినియోర్తొకర్తులంజె.'' కాశీ. ౫, ఆ. (రూ. బూామెకత్తె.)

బూామెకాఁడు. ద్వ. విణ. బూామెలుకలవాఁడు.

బూామెలాఁడి. ద్వ. విణ. (బూామెలు + ఆఁడి.) బూామెకత్తె.

బూామెలాఁడు. ద్వ. విణ. (బూామెలు + ఆఁడు.) బూామెకాఁడు.

బూార. వై. వి. వాద్యవిశేషము*. (చూ. బూారగ.) ''క. బో, రన బూారలుబేరులునుగరంబుచెలంగెఁ.'' అచ్చ. యు, కాం.—విణ. స్థూలము*.

బూారఁడు. వై. విణ. విజృంభించినవాఁడు*. ''చెప్పిననద్దుగాత్త కుఁడుసింగఁడుబూారఁడునై.'' పంచ. వేం. ౧, ఆ.

బూారకాలివాఁడు. ద్వ. విణ. ఏనుఁగుకాలివాఁడు.

బూారకాలు. ద్వ. వి. ఏనుఁగుకాలు. ''సీ. బూారకాళులునీచఁ బోయిన చేతులుఁగోలుమూఁపులుముడిగొన్నతొడలు.'' ఉ, హరి. ౩, ఆ.

బూారగ. వై. వి. 1. నాగసరమునకుసుతియిచ్చెడు వాద్యవిశేషము, బూార*. (చూ. నాగసరము.) 2. తార*. ''ద్వి. బూారగల్ కంచుకొమ్ములు కాహళములు, బోరుకొల్పుటకు నంబుధు లెల్లఁ గలఁగ.'' నళ. ౩, భా.

బూారగడ్డి. ద్వ. వి. తృణవిశేషము.

బూారగొమ్ము. ద్వ. వి. (బూార+కొమ్ము.) వంకరగానుండువాద్య విశేషము, కొమ్ము, శృంగము. ''ఉ. తారలుబూారగొమ్ములునుదప్పె టలుఁ బటహంబులుఁ బదుల్, నూఱులువేలుమ్రోయు.'' రామా. ౮, ఆ.

బూారటు. వై. వి. ఉల్బణము*.

బూారటించు. వై. ప్రే. బూారటిల్లఁజేయు.

బూారటిల్లు. వై. అ. క్రి. 1. నిండు; ''తే. అంబరముదిశలు, బూారటిల్లంగఁజెలఁగెఁదదారవంబు.'' భార. విరా. ౪, ఆ.—2. ఉబ్బు*. ''సీ. కలముపైఁగీలించిగాలికత్తినచాఁపఁబోలిమిన్నం తయుబూారటిల్లె.'' భార. ఉద్యో. ౪, ఆ. (రూ. బూారటిలు.)

బూారియ. వై. వి. బూారె. ''ఎ, గీ. బూారియలులడ్డువంబులు పారలిపాఱ.'' నై. ౬, ఆ.

బూార్నిసు. గ్రా. వి. మెత్తనికంబళి.

బూారుగు. దే. వి. శాల్మలి*.

బూారుగుదీవి. ద్వ. వి. శాల్మలద్వీపము.

బూారువు. దే. వి. బూారుగుయొక్క రూపాంతరము.

బూారె. వై. వి. భక్ష్యవిశేషము. (బూారియయొక్క రూపాంతరము.)

బూాళ. దే. వి. లేఁతతాటిమ్రానిలోనిపేడు.

బూాలి. దే. విణ. నిస్సారమైనది.

బూాసము. దే. వి. ధాన్యము. (ఇది విచారణీయము.)

బూాసి. దే. వి. ఇండ్లవాసములకుపట్టెడుసాలెపట్టు.

## బృ.

బృంద. సం. వి. ఆ. స్త్రీ. తొళసి*. అ. న. ము. సమూహము.

బృందారకుఁడు. సం. వి. అ. పుం. వేలుపు. విణ. 1. మనోజ్ఞుఁడు; 2. శ్రేష్ఠుఁడు.

బృందిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి మనోజ్ఞమయినది.

బృంహితము. సం. వి అ. న. ఏనుఁగుయొక్క గీఁక.

బృహతి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాఁకుడు*; 2. ములక*; 3. ఒకఛందస్సు; (చూ. ఛందస్సు.) 4. ఉత్తరీయము; 5. విశ్వావసునివీణ. విణ. గొప్పదైనది.

బృహతిక. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరీయము.

బృహత్కుక్షి. సం. విణ. (ఇ.) పెద్దకడుపువాఁడు.

బృహత్తు. సం. విణ. (త్. ఈ. త్.) గొప్పది.

బృహత్ఫలువు. సం. వి. ఉ. పుం. పెద్దవరగోఁగు*.

బృహదేల. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకి*.

బృహద్బీజము. సం. వి. అ. న. అండవృద్ధి. పుం. అంబాళము*.

బృహద్భానువు. సం. వి. ఉ. పుం. అగ్ని, పావకుఁడు.

బృహన్నల. సం. వి. ఆ. స్త్రీ. అర్జుననికి వేషాంతరమునందలి నామము. అ. పుం. ము. పెద్దకిక్కస*.

బృహన్మరీచము. సం. వి. అ. న. మిరెపకాయ.

బృహస్పతి. సం. వి. ఇ. పుం. సురగురువు, వేల్పుటొజ్జ.

బృహస్పతివారము. సం. వి. అ. పుం. ఒకవారము. (చూ. వారము.) (ఇట్లు గురువారము.)

## బె.

బెంగ. దే. వి. 1. విరహవ్యథ; ''అన్నవవింటిదంటచేవంతఁగలంగి బెంగగొని.'' రసి. ౫, ఆ.—2. కూఁత. ''ఉ. బెంగలిడంగగెంటి యిటుపెంటినిగానకతేలిపోయి.'' సా. ౩, ఆ.

బెండ. దే. వి. ఎద్దునాలికచెట్టు. (దీనిభేదము కప్పురపుబెండ.)

బెండగిల్లు. దే. అ. క్రి. పెల్లగిల్లు, ప్రయాణమగు.

బెండు. దే. వి. జీలుగు*. విణ. నిస్సారము. ''సీ. మందెడుపటు కాలదండంబుచేతులఁ బిసికివేఁడిమియార్చిబెండుచేసి.'' హరి. పూ. ౪, ఆ.

బెండుమానిసి. ద్వ. వి. బలహీనుఁడైన మనుష్యుఁడు. ''వ. వారల గరుడకపిధ్వజంబులుంజక్రగాండివంబులుబెండుమానుసులకుభీష ణంబులుగానినాకుఁబరితోషణంబులు.'' భార. కర్ణ. ౩, ఆ.

బెండువడు. ద్వ. అ. క్రి. (బెండు+పడు.) బలహీనతనొందు. ''ఎ, గీ. అధికశౌర్యసారులగుకపివీరుల చేతనొచ్చిదైత్యసేనభీతిఁ, బఱచెఁగొంతబెండువడియుండెఁగొంతధూ, మ్రాక్షువెనుకకొదిఁగె నంతఁగొంత.'' భార. అర. ౭, ఆ.

బెకబెకలాడు. దే. అ. క్రి. (బెకబెకలు+ఆడు.) (కప్పలు) కూయు.

బెక్కొట్టు. దే. అ. క్రి. (బెంగ+కొట్టు.) వాపోవు.

బెగడు. దే. అ. క్రి. భయపడు. వి. భయము.

బెగడువడు. ద్వ. అ. క్రి. (బెగడు+పడు.) భయపడు, (ప్రే. బెగడుపఱుచు.)

బెగ్గడిల్లు. దే. అ. క్రి. భయపడు. "ఉ. ఒక్కటిమున్నవచ్చుట యునున్నవిరానికిబెగ్గడిల్లుదుక్." మార్క. ౭, ఆ. (రూ. బెగ్గడిలు.)

బెగ్గడు. దే. అ. క్రి. బెగడుయొక్కరూపాంతరము.

బెగ్గలము. వై. వి. 1. విహ్వలత; "క. కడుభీతియుబెగ్గలమును, నడరఁగ." మార్క. ౧, ఆ.—2. భయము*. "వ. బెగ్గలంబగ్గలింపగవాధ్యక్షుండురథంబుదోలుకొనియాక్రోశించుచుంబురంబునకరుదెంచి." సం. "గోపాధ్యక్షోభయత్రస్తోరథమాస్థాయ సత్వరః." భార. విరా. ౪, ఆ.

బెగ్గలించు. వై. అ. క్రి. 1. విహ్వలించు; "చ. జలధీశనందను లు...పదాతులఁగూడికడంగిపెల్లుగన్, బఱచిరిపట్టణంబువెనఁబౌరజనంబులుబెగ్గలింపఁగన్." నిర్వ. ౫, ఆ.—2. భయపడు*. "వ. ఎరకైవచ్చియిట్లుతోఁచినయెలుక యారెంటిబారిదప్పిపోవరామిదలంచి బెగ్గలించిధైర్యంబుకలిమింగార్యంబూహించి యప్పిల్లింగొంఁడొకచేరంజనుచుదానితో నిట్లనియె." భార. శాం. 3, ఆ.

బెగ్గలికము. వై. వి. భయము*. "క. అబెడిదపుమ్రోఁతకుఁగా, దేబమ్మెరపోయిదేవదేవరనగరన్, వేబెండువడిరిమొగముల, పైబెగ్గలికంబుదేఱఁబరిజనులెల్లన్." హరి. పూ. ౯, ఆ.

బెగ్గిల్లు. వై. అ. క్రి. 1. విహ్వలించు; 2. భయపడు*; 3. చింతించు*; "శా. రక్షోనాయకులారనిర్జరవరవ్రాతంబుచేతన్ సుధా, భిక్షాపాత్రమువోయెనంచుమదిలోబెగ్గిల్లఁగానేటికిన్, రక్షార్థంబుభజింపరాదెయభవున్ త్రైలోక్య కుక్షింభరున్, దాక్షారామపురాధినాథునిసుధాధామార్ధచూడామణిన్." భీ. ౪, ఆ.—4. చలించు*; 5. బెదరు*. (రూ. బెగ్గిలు.—విహ్వలించుటకు.—"అశావారణశ్రేణిబెగ్గిలిమ్రొగ్గంబడియెన్." హరి. ఉ. ౪, ఆ.—భయపడుటకు.—"క. ఆమారీచునికృత్రిమ, భీమస్వరమువినిసీత బెగ్గిలివించే, రామునియార్తధ్వానము, నేమయ్యెనొవేగమరుగవేవిభుకడకున్." రా. అర, కాం. ౨, ఆ.—చలించుటకు.—"క. ఆతనిబాసటగాఁగొని, యాతులువలనడిచిజన్నమలరనొనర్తున్, నీతలఁపుననిపుడేమియు, బీతునుపకయనుపుమనినబెగ్గిలియతఁడున్." అచ్చ. బాల, కాం.—చెదరుటకు.—"చ. తొలఁగెఁగడంకమీఁదెధృతిదూలెవివేకమడంగెబుద్ధిబె, గ్గిలెనభిమానమేగెఁద్రవగెంబెనయంబభయంబుగుందెగా, సిలెబిగిశాతెమేనుకులశీలముగ్రుంగెముడింగెగౌరవం, బలుకువతగ్గదైవమకటాయిటఁదెచ్చెనెయేమివచ్చెనే." చంద్ర.)

బెగ్గురు. వై. వి. సారసపక్షి. (కొందఱుపెగ్గురందురు.)

బెజ్జము. దే. వి. తూఁటు, రంధ్రము.

బెట్ట. దే. విశే. వేండ్రము, తీక్ష్ణము.

బెట్టించు. దే. స. క్రి. (నిర్బంధము నుండి.) మరలించు. "సీ. అప్పాటఁబ్రబలుజటాసురుసడరిదండితుఁజేసిమనల బెట్టించుకొనియె." భార. విరా. ౧, ఆ. "తే. బవరములుగావెవిఱిగినబారసాఁప,వచ్చునేయొక్కరుండువివ్వచ్చుఁడడరి, పసుల బెట్టించునపుడునీబలమువిఱుగ, దయ్యెనేనీవుఁగర్ణుండునచటలేరె." భార. ఉద్యో. ౨, ఆ.

బెట్టిదము. దే. వి. (బెట్టు+ఇదము.) 1. ఉద్ధతి; 2. క్రౌర్యము. "క. క్షమయునుబ్రియహాదిత్వము, శమమునునార్జవముదుర్విచారులుగడుఁజా, లమిగానూహింతురులో, కమువెఱచుటబెట్టిదంబుగలుగుటఁజూమ్మీ." రా. యు, కాం.—విశే. 1. ఉద్ధతము; 2. క్రూరము; "క. భువిఁబుత్రస్నేహముమా, నవజాతికికాకలేదె నరనాయకమీఁ, దువిచారింపకచేసితి, తవిలెఁగదానీకుబెట్టిదపుఁబాపము ధాన్." భో. ౬, ఆ. "ఎ, గీ. కులములందెల్లనీరాచకులము చాల, బెట్టిదంబు." భార. భీష్మ. ౧, ఆ.—3. కఠినము; "క. అది బెట్టిదంపువెరవున, మృదుభూతోపాయమునను మేకొనదుప్రజన్, బొదువవలయునాజ్ఞానం, పదగలసాధ్యగతముతోడఁబతియవహితుఁడై." భార. శాం. 3, ఆ.—4. బ. నిష్ఠురవచనము. "వ. ఇప్పాపాత్ముండు ప్రియవచనంబులంబోవండు, బెట్టిదంబులంగాని చక్కంబడండు." భార. అర. ౬, ఆ.

బెట్టిదుఁడు. దే. విశే. (బెట్టు+ఇదుఁడు.) 1. ఉద్ధతుఁడు; "రౌద్రరసనమగ్రతఁగడుబెట్టిదుఁడై." మార్క. ౭, ఆ.—2. క్రూరుఁడు; "చ. బె, ట్టిదుఁడగుకాముతూపులఁ దొడింబడకుండఁగఁగాపుమిత్తజన్." భార. విరా. ౨, ఆ.—3. కఠినుఁడు. "క. మృదువులకుఁజాలమృదువులు, విదితయశావినుము పాండవేయులుకడుబె, ట్టిదులుబెడిదంపువారికి, మదలోభిత్వములులేవుమందునకైనన్." భార. ఆశ్ర. ౧, ఆ.

బెట్టిదురాలు. దే. విశే. (బెట్టిద+ఆలు.) బెట్టిదముగలది. (చూ. బెట్టిదుఁడు.)

బెట్టు. దే. వి. 1. గౌరవము; 2. ఉద్ధతి; "పల్లఱుబెట్టుచూపినంజాట్టములైనఁదాళుదురె." ఉ, రా. ౨, ఆ.—3. అతిశయము "చ. జనవినుతప్రభాకలితసంద్రమతీతలఁబట్టిమోహముల్, పెనఁగొనఁజేసిపాదహతిబెట్టుమెయిన్ ద్విజరాజురేసికై, కొనసఖిలక్ష్మాభరముఁ గ్రూరవిషాదపయోధిఁగ్రుంకఁగం, టినిగలయంగనామనమునెవ్వగఁజేయఁగఁజేయుమీవనన్." హంస. ౨, ఆ.—విశే. ఉద్ధతుఁడు. "చ. తనచతురంగసేనలుశతంబులువేలునుగోటులున్ ధరన్, బెనఁగొనఁగూల్చెవీఁడుకడుబెట్టు." ఉ, హరి. ౬, ఆ.—క్రి. విశే. 1. అత్యంతము; "మ. అవీర్వరుఁడువాలునుంబలుకయున్ ఘోరాకృతింబుచ్చికొం, చురయంబారఁగడంగిబెట్టడర సంక్షోభించెసీసైన్యముల్." భార. భీష్మ. ౨, ఆ.—2. గట్టిగా; (చూ. అల్లన.) "బెట్టుగవినిచెన్ శివారుతము." భార. ద్రో. ౧, ఆ.—3. దృఢముగా. "మ. కడిందివృషాధముఁడగ్గలంపుఁదెం, పుఱవుగఁదాఁకెఁగృష్ణుఁడతఁడొడ్డినకొమ్ములువట్టిబెట్టుగన్." హరి. పూ. ౭, ఆ.

బెడఁకు. దే. అ. క్రి. 1. చలించు; "సీ. గతిసంభ్రమంబున గరిమ బెడంకుచునకనకల్గుడుచునెన్నడిమిసొబగు." కళా. ౪, ఆ.—2. తొలఁగు. "చ. కబళముగొందుగాకత్రిజగంబువడంక బెడంకనిత్తువే." వసు. ౪, ఆ.—వి. 1. చలనము; 2. తొలఁగుడు.

బెడఁగారు. దే. అ. క్రి. (బెడఁగు+ఆరు.) అందగించు. "సీ. నరిలేనిరాకట్టుజాళువామొలకట్టుబెడఁగారునీరాకవిపింజెతోడ." స్వా. 3, ఆ.

బెడఁగు. దే. అ. క్రి. అందగించు. "మహీజంబుమాడ్కిఁగొమ్మలబెడంగి." భాను. ౧, ఆ.—వి. 1. అందము; "ఆ. వీరసేనసుతుఁడువీరుండుహంసల, నడబెడంగుఁజూచినగుచు." భార. అర. ౨, ఆ.—2. విలాసము. "ఉ. కరంగనివాఁడుగల్గునే, యొయ్యడెంరంభదానుమెఱయించుబెడంగులకంచునవ్వుచున్." కళా. 3, ఆ.—విశే. 1. అధికము; "మ. ప్రబలాకారముతోగిరీశశిరమున్ బ్రాపింపఁబెన్ ఱాఁగనాఁ, గబెడంగయ్యెజనాపవాదము." వసు. ౫, ఆ. (దీనికి వేఱుప్రయోగము కనఁబడలేదు.)—2. మనోజ్ఞము. "క. ఖరకిరణతాపముననురు, తరదవదాహమున శోషితములైనవనాం, తరతరుతతికాప్యాయన, కరమైవర్షాగమంబుకడుబెడఁగయ్యెన్." భార. అర. ౪, ఆ.

బెడఁద. దే. వి. 1. బాధ; "శా. చాలుంజాలుబెడందయేలచనుమాత్మాభృత్యసమీపోర్వికిన్." రసి. ౫, ఆ.—2. ఆపద. "చ. నాయెడహృదయంబులోఁగృపవహించితపోధనవర్యసారెకున్, బెడఁదలుచుట్టియప్పువయిఁబెట్టకయింతటఁ దృప్తిఁబొందుఁడీ." పారిజా. 3, ఆ.

**బెడక.** దే. వి. ఉత్తగోనె.

**బెడద.** దే. వి. భక్ష్యవిశేషము. "వ. కర్జూరాయలు బెడదలు లడ్వా లు." హంస. ౧, ఆ.

**బెడిదము.** వై. వి. 1. భయంకరత్వము*; "ద్వి. కాలదండమున నలరెడు బెడిదంబు." హరిశ్చ. ౧, భా.–2. కఠినత్వము*. విణ. 1. భయంకరము; (చూ. బెగ్గలికము.)–2. అధికము*; "సీ. వెడఁదజాచలు పలబెడిదం పుఁగరినతనరకు నేయ నియురవ్నలముతో న." పర. ౨, ఆ. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.) 3. కఠినము*; 4. బ. పరుషవచనము*. "రాజా బెడిదంబులు పల్కిన యేనిసైఁపుము." భార. ఉద్యో. 3, ఆ. (బెడిదముయొక్క రూపాంతరము.)

**బెడిదుఁడు.** వై. విణ. 1. భయంకరుఁడు*; "ద్వి. బెడిదుండు పీఁడనఁబృథివిఁ జేర్పడితి" రా. యు, కాం.–2. కఠినుఁడు. (చూ. బెట్టిదుఁడు*.)

**బెడిదురాలు.** దవ్. విణ. (బెడిదము+ఆలు.) బెడిదముగలది. (చూ. బెడిదుఁడు.)

**బెడియు.** దే. అ. క్రి. 1. తప్పు; 2. ఒకలమగు. (చూ. కూనగుంత.)

**బెఁఱుకు.** దే. అ. క్రి. వి. బెడఁకుయొక్క రూపాంతరము.

**బెత్త.** వై. వి. (చూ.) బెత్తిలి*.

**బెత్తము.** వై. వి. పేము, వేత్రము.

**బెత్తిక.** దే. వి. ఎండిలేచిన మట్టిపెళ్ల.

**బెత్తిలి.** వై. వి. తర్జనిమొదలైననాలుగువ్రేళ్ల అడ్డకొలత*. "చ. కలఁక రొలంకవేదవతి గ్రుక్కనబెత్తిలియెత్తి వ్రేయుడుఁ, మలచవుపేణి నట్టనడుమన్ దెగిచేతికిఁదున్కచిక్కె." ఉ, రా. 3, ఆ.

**బెత్తు.** యు. దే. వి. 1. (చూ.) బెత్తిక; "సర్వదిగ్వలయాంబర క్షితిభాగములు బెత్తుబెత్త." శకాం. ౪, ఆ –౨. గౌరవము. వై. బెత్తము. "క్షీ. వామనుఁకోలెమ్ము వన్నె బెత్తుఁగఁజేసి ఫణిహారములు యోగపట్టెఁజేసి." భల్లా. ౪, ఆ.

**బెదరింపు.** దే. వి. బెదరించుట. "పోపాండవ్మ్మ రో పోవుచేట్లు బెదరింపుల్ మానుఁడిచ్చోట." చంద్రా. ౨, ఆ. (చూ. అదరింపు.)

**బెదరు.** దే. అ. క్రి. భయపడు. (చూ. వదరు.) వి. భయము.

**బెదరుపడు.** దవ్. అ. క్రి. భయపడు, బెదరు. "ఎ, గీ. అనుచుఁ జెలులాడుదురు జాలకాంతరాళ, విలసితార్ధేందుసఖుఁ జిల్కపల్కు లకును, గమ్మవిరితేనెకునుగందు తుమ్మెదకును, బెదురుపడునట్టి శర దిందువదనఁజూచి." భాను. 3, ఆ.

**బెదరుపోతు.** దే. విణ. భయశీలుఁడు, భయశీలురాలు.

**బెబ్బులి.** దవ్. వి. (పెద్ద+పులి.) వ్యాఘ్రము.

**బెరయు.** దే. అ. క్రి. 1. కలుగు; "చ. నీ, వరయనియట్టియర్థ మొకఁడైనను గల్గునె యైన నామదిన్, బెరసినకోర్కి దేవవినిపింతు దయామతిఁజిత్తగింపవే." భాగ. ౨, స్కం.–2. వ్యాపించు; "క. ఖురిసెసురపుష్పవర్షము, హరిపైనప్సరసలాడిరాశోద్యంబుల్, మొరసెనుఖస్వర్ణంబై, బెరసెన్ జవనంబు దనలువెలసెన్ గల యన్." హరి. పూ. ౬, ఆ.– 3. చేరు. "సీ. వినుముబుగ్వేదాది వేదముల్ నాలుగుఁగల్పాదులైన యంగంబులాఱు, బెరసినిద్యలు పది." భార. శాం. 3, ఆ. "క. పెరుఁగుట ప్రగ్గఁగఁజవులం, బొరయుట యరుచంబుగాఁగఁ బుట్టుటసావం, బెరయుటపాయ." భార. స్త్రీ. ౧, ఆ.–స. క్రి. పొందు. "క. హరిహరసరసిజభవ, వరాంశజాలయినట్టి సుతులఁబడసె మునీంద్రుం, డరుదుగ నమ్మోదమునం, బెరసెను బెన్నిఘులఁగన్న పేదయుఁబోలెన్." శకాం. ౨, ఆ.

**బెరసు.** వై. వి. 1. క్రూరము*; "బెరసునల్లరా పుపడఁతి." నీలా. ౧, ఆ.–2. మతక*. "బెరసుపచ్చడములు." నీలా. 3, ఆ.

**బెరికి.** దే. వి. కొఱఁత, న్యూనత. (చూ. నఁుబ్రాయివడు.)

**బెరుకు.** దే. వి. 1. భేదము; "తే. నందగోపకరోహిణీనందనుఁడు, పెరుఁగుచున్నాఁడు మీయొద్ద గరిమతోడ, నీకుమారుని బెంచినట్లాకు మారు, నరసిరక్షింపు మీమదిబెరుకులేక." వి, పు. ౭, ఆ.– 2. ప్రయోజనము. "తే. చెక్కుమీటినవసగాణుశికువుభక్తి, నుగ్ర తపమొనరించుచున్న నతని, యదులతపము విఘ్నంబు నేయంగఁ బూని, పెక్కుమాయలుపన్ని నబెరుకులేదు." వి, పు. ౨, ఆ.

**బెలంచి.** దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

**బెలము.** వై. వి. బొక్క, కలుఁగు.

**బెలయు.** దే. అ. క్రి. వ్యాపించు. "నవ్వునిండారమొగంబునన్ బెలయనప్పరమేశ్వరుఁడొప్పె." లక్ష్మీ. ౪, ఆ.

**బెల్లము.** దే. వి. చెఱకుపాలుకాఁచఁగాసైనముద్ద, గుడము.

**బెల్లి.** దే. విణ. వంచకము. "బెల్లిమాటలు." అచ్చ. అ, ౨౦.– వంచకుఁడు, వంచకురాలు. "ఓసిబెల్లి." కళా. 3, ఆ.

**బెల్లించు.** దే. స. క్రి. వంచించు. "ద్వి. బెల్లించియతని." రా. బాల, కాం.

**బెల్లింపు.** దే. వి. బెల్లించుట, వంచనము. "క. అల్లందుకందుకొనిన్, బెల్లింపులఁబడినమొదలు పెనుబాములకే, యల్లైతి." ఇలా. ౪, ఆ. (చూ. అదరింపు.)

**బెసుకు.** దే. అ. క్రి. (చూ.) బెడియు.

**బెస్త.** దే. వి. చేపలను పట్టుటచేతను, పల్లకిలోనగువానిమోసికొనిపోవుటచేతను జీవించెడు ఒకజాతివాఁడు, బోయీ. "ఆ. మీరలిప్పుడిచటఁజేరిమిక్కిలి ప్రియ, త్నంబుతోడఁదగిలినడుచుచుండ, విషమమగుచుగమనవేగంబుననుబాధ, పెట్టుచున్న దనిన బెస్తలనిరి." భాగ. ౪, స్కం. ౧, ఆ. (చూ. తగటీ.)

**బెహారము.** వై. వి. బేహారముయొక్క రూపాంతరము. "క. పెక్కం డ్రొక్కటియైతొ, రొక్కబెహారంబెయాడుచుండఁగదానం, దక్షవయొకుక్కవదగిలిన, నొక్కటిగాననుభవించుటుచితంబెందున్." విజ్ఞా. ప్రా, కాం.

**బెహారి.** వై. వి. బేహారియొక్క రూపాంతరము. "అందఱకొక్క బెహారిచేరహస్యనియతిమూల్యమందుకొనియచ్చటికింగొనిపోయె." కళా. ౬, ఆ.

**బెళఁకు.** దే. అ. క్రి. 1. చలించు; 2. ఒరయు. "సీ. జిలుఁగు దువ్వలువింతబెళఁకిన గరుడాల్పుతనువెట్టులో ర్చెనోధాతువస్త్రభరణమునకు." పాండు. ౪, ఆ.–వి. చలనము. "సీ. కంఠహారంబులగంతులజతగూడిపిడికెడునడుముతో బెళఁకుఁజూప." అని. ౪, ఆ. (బెడఁకుయొక్క రూపాంతరము.)

**బెళఁగు.** దే. వి. బెడఁగుయొక్క రూపాంతరము. "చ. బెళఁగు దళిర్పఁగానధరబింబముఁజెంచెడు చోటఁ జిల్కయై." పాంచా. ౪, ఆ.

**బెళగువ్వ.** దే. వి. (బెళవ+గువ్వ.) (చూ.) బెళవ. "సీ. పెను దవ్వదగదొట్టఁజనిరెట్టవడఁ గొబ్బైనడుమీధిబెళగువ్వనొక్కయణుజు." పార్వ. ౪, ఆ.

**బెళవ.** దే. వి. పక్షివిశేషము.

**బెళుకు.** దే. అ. క్రి. తళతళమనిప్రకాశించు. య. ౫, ఆ.— "సీ. చిన్నటనాఁడుకార్చిచ్చువేజుజ్జఁగాఁబేర్చినబింకముల్ బెళుక వయ్యె." చమ. ౨, ఆ.—వి. తళతళమను ప్రకాశము. "చ. బెళు కులుచిమ్ముచుంగలికిబిత్తరి చూపునరత్నకుండలాం, చలకమణోజ్జ్వ లత్వముపసల్ నెఱపఁ." కళా. ౧, ఆ.

## బే.

**బే.** వై. వి. అంబేయొక్క మాఱురూపము. "బేయను." భో. ౬, ఆ.

**బేఁటు.** దే. వి. 1. ఎండిన యెనుసులోనగువానిపెల్ల; "చ. తన యూర్పులనింకియింకిపో, యినపలుబేంట్లుగోరఁగొనియెత్తనపట్టెను మాటిమాటికిఁ." ఆము. ౫, ఆ.—2. కొండలోనగువానియందలి చీలిక. (గ్రంథములయందిట్లు సరళాదిగాఁ గనఁబడుచున్నది. వాడుకలో పరుషాదిగాఁ గానఁబడియెడి.)

**బేగడ.** దే. వి. కాకిబంగారు, అభ్రకము. (చూ. బిల్ల.)

**బేగి.** వై. క్రి. విశ. వేగముగ.

**బేజరూరు.** హిం. విశ. అనగత్యమైన.

**బేజారు.** హిం. వి. అలయిక.

**బేడ.** దే. వి. 1. పరకరూపాయ; 2. బ. కాయధాన్యములపప్పు.

**బేడిగ.** దే. వి. పన్ను, భాగధేయము.

**బేడిజెము.** దే. వి. మాయ, టక్కు.

**బేడిదము.** వై. విశ. బెడిదమునకు మొదటిరూపము. (భయంకర మునకు.—"క. బేడిదమగునాదెబ్బకు, నోడకవిల్లెక్కుడించియు గ్రుఁడువైచెక, గ్రీడించువేడ్కనవిలోఁ, గ్రీడించుకవెగడుపడఁ బరిస్ఫుటశక్తిఁ." కాశ. ౪, ఆ.)

**బేడిస.** దే. వి. శకులము అను మత్స్యము. పాఠీనము. అను మత్స్య ము. (అనికొందఱు.) శఫరి అను మత్స్యము. (అనికొందఱు.)

**బేడౌలు.** హిం. విశ. వికారమైన.

**బేతాళము.** సం. వి. అ. పుం. 1. పిశాచము; 2. భూతావిష్ట మృతశరీరము. డు. యమకింకరుఁడు.

**బేది.** దే. వి. పాననము, విరేచనము.

**బేపరవా.** హిం. విశ. లక్ష్యములేని.

**బేమరమ్మతు.** హిం. విశ. చెడిపోయిన, శిథిలమైన.

**బేరకత్తె.** వై. విశ. (బేరము+కత్తె.) బేరమాడునది. (మొదటి రూపము బేరకత్తియ.)

**బేరకాఁడు.** ద్వి. విశ. (బేరము+కాఁడు.) బేరమాడువాఁడు.

**బేరజెము.** దే. వి. 1. కుత్సితపునడక; "రగడ. ఇంతిపావురపు రొదయేలవినెదారజము, వింతయేవిరహిణులవెతఁబెట్టుబేరజము." సావి. 3, ఆ.—2. బ. పరుషవచనము. "ఎ, గీ. కాంతుఁడపగా ధియైధైర్యకలనఁజేరఁ, గేరడములాడుదైన్యంబుగేలుకొనిన, బేరజ ములాడుధీరాదిభేదవశత, నదియ్యొతదిద్విధమెట్లన్ననువదింతు." శృం. ౨, ఆ.—విశ. కుత్సితుఁడు, కుత్సితురాలు. "అమ్మదిబేరజ మిట్లనియె." శుక. ౨, ఆ.

**బేరము.** ఉభ. వై. వి. 1. వర్తకవ్యాపారము; (చూ. బచ్చు.) 2. వెలకువస్తువునిచ్చుకొలఁదినడుగుట.—సం. అ. న. ప్రతిమ. "పంకములోనిహైమబేరము." పర. ౫, ఆ.

**బేరి.** వై. వి. 1. వాద్యవిశేషము; "సీ. బేరులుడోళ్లుతప్పెటలు కాళెలుపిల్లఁగ్రోవులు తుమ్మెలురీవిమెఱయ." అచ్చ. యు, కాం.—2. (బేరము+ఇ.) వైశ్యుఁడు.

**బేరీజు.** హిం. వి. 1. రాజుకిచ్చు పన్నుమొత్తము; 2. లెక్కవివ రము.

**బేల.** వై. విశ. మూఢుఁడు. (చూ. తలియ.)

**బేలరి.** దే. విశ. (బేలు+అరి.) మోసకాఁడు, వంచకుఁడు. "బేల రివైతి." (దీని ముందుభాగము. చూ. ఆలరి.) భాగ. 3, స్కం.

**బేలాయఖు.** హిం. విశ. తగియుండని.

**బేలు.** దే. వి. మోసము, వంచన. (చూ. బేలుపడు, బేలుపోవు ము.)

**బేలుపడు.** ద్వి. అ. క్రి. మోసపోవు. "దానిచేత ననేకులు బేలు పడిరి." సం. "తయారాజానోవిప్రలబ్ధాః." భార. అర. ౪, ఆ. (ప్రే. బేలుపఱుచు.) (రూ. బేల్పడు. "మాటపసబేల్పడిక్రమ్మ ఱఁజేరుటొప్పునే." భార. శాం. 3, ఆ.)

**బేలుపోవు.** దే. అ. క్రి.——పై.——(ఈ విషయమునందు వాఁడు బేలుపోయినాఁడు.) (ప్రే. బేలుపుచ్చు.)

**బేలువెట్టు.** దే. స. క్రి. (బేలు+పెట్టు.) మోసపుచ్చు. "క. తానఁటమాంసముఁదినదఁట, యీనక్కయుబేలువెట్టెనిన్నాళ్లును." భార. శాం. 3, ఆ.

**బేవారసు.** హిం. విశ. సాధుఁడులేని, హక్కుదారులేని.

**బేసము.** వై. వి. (చూ.) పేసెము. "వ. తీయనిపండ్లకుఁగదియం బడి కయ్యంబునేసియేనరేఁగిబేసంబులుగానంబులుగొని." భాగ. ౮, స్కం.

**బేసరి.** దే. వి. ఒకదినుసుముక్కర.

**బేసి.** దే. విశ. సరిముకానిది, విషమము.

**బేసికంటి.** దే. వి. (బేసి+కన్ను.) శివుఁడు, విరూపాక్షుఁడు. "సీ. నగఁగల్గిననుజాలుమొగసాలవాకిలిగాపించునబ్బేసికంటినైన." య. ౧, ఆ.

**బేసికైదువుజోదు.** ద్వి. వి. మన్మథుఁడు, అసమశరుఁడు.

**బేహరము.** వై. వి. బేహారముయొక్కరూపాంతరము. "సీ. బేహర మాడింపఁబెరిఁగినధనమును." పంచ. నా. ౫, ఆ.

**బేహరి.** వై. వి. బేహారియొక్కరూపాంతరము. "మ. మీరలి, ట్లతి కష్టస్థితినోడబేహరులపాలైపోవనాచెట్టవ, ట్టిటిరేయంచు." కళా. ౬, ఆ.

**బేహారము.** వై. వి. వర్తకవ్యాపారము, వాణిజ్యము. "ఎ, గీ. అధిపకృషిసేయుటయునుబేహారమాడు, టయునుగోరక్షగావించుట యునుమొదలు, గాఁగబ్రదికెడుతెరువులుగాసిగావె." భార. శాం. ౨, ఆ.

**బేహారి.** వై. వి. (బేహారము+ఇ.) వర్తకవ్యాపారముచేయువాఁడు, వణిజుఁడు. "క. నరకమ్మెడుబేహారులు, నరపతిసుంకరులలెక్క నమ్మికతోడఁ, నరకమ్మినసొమ్మునఁదా, రిరువదియగు పాలుసుంక మీఁదగుఁబ్రీతిఁ." విజ్ఞా. ప్రా, కాం.

## బై.

**బైజె.** దే. వి. అజ్ఞానము. "ఉ. కల్లలువేదముల్ స్మృతులుగల్లలు కల్లలుయజ్ఞకర్మముల్, కల్లలుపైతృకక్రియలుకల్లలుఘోరతపఃప్రభావ ముల్, కల్లలుదేవకార్యములుకావునబైజలుమానిమామతం, బెల్లవిధం

బులక౯ పడపుడిమ్ములముక్తికిఁబోవఁ గోరిన౯.'' వి, పు. ౪, ఆ. (మొదటిరూపము బయిజే.)

**బైడాలము.** దే. వి. కోపము, కినుక. (మొదటిరూపము బయిడాలము.)

**బైరవాసము.** వై. వి. ఉత్తరీయము. (మొదటిరూపము బయిరవాసము.)

**బైరాగి.** వై. వి. విరక్తుఁడైనతీర్థవాసి*. ''తే. ఆస్నపాలుండునతతమభ్యాగతులకు, యోగులకుసిద్ధులకునుబైరాగులకును, దైర్థికులకును గోరినయర్థవితతి, నిండువేడుకనొసఁగుచునుండునంత.'' బ్ర. ౨, ఆ. (మొదటిరూపము బయిరాగి.)

**బైరి.** దే. వి. శ్యేనవిశేషము. (చూ. అణుజో.) (మొదటిరూపము బయిరి.)

**బైలగు.** ద్వ. అ. క్రి. (బైలు+అగు) బయలుపడు. ''సీ. గర్భగార్భకతనూకాంతిబైలగులీలవిమలాంగినూఁగారువిపులమయ్యె.'' ఉ, రా. ౨, ఆ. (మొదటిరూపము బయిలగు.)

**బైలు.** వై. వి. బయలుయొక్కరూపాంతరము. (చూ. బైలగు.) (మొదటిరూపము బయిలు.)

**బైసణ.** దే. వి. వీణెసొరకాయయొక్క బంధనము. (మొదటిరూపము బయిసణ.)

**బైసి.** వై. వి. 1. భాగ్యము; ''ఉ. నీ, బైసిదొలంగఁదొత్తువలెఁ బాపెడఁగూటికిఁజీరకుంజెడ౯.'' పంచ. నా. ౧, ఆ. - 2. గౌరవము*. ''ఎ, గీ. చేసియిటులేకలమ్ములబైసిగొనియె.'' చంద్రా. ౨, ఆ. (బవిసియొక్కరూపాంతరము. మొదటిరూపము బయిసి.)

**బైసుక.** దే. వి. నియమనము, ప్రతిజ్ఞ. ''ఎ, గీ. పలకదఱిమకబైసుకపల్లటిలక.'' ఉ, హరి. 3, ఆ. ''ఆ. ప్రాణమిత్తునంచుబైసుకపెట్టంగ, వలదుపొమ్ముభూపవరకుమార.'' రుక్మాం. ౫, ఆ. (చూ. కొనరు.) (మొదటిరూపము బయిసుక.)

## బొ.

**బొంకణము.** వై. వి. బొక్కణముయొక్కరూపాంతరము. ''ఆ. కటితటంబునందుఁగట్టినగోఁచియు, నొలువఁబడితివిట్టులొంటిఁదిరిగి, చంకబొంకణమునుసడలినదిఁకనైనఁ, గొండలందుఁదిరుగకుండుదేవ.'' బస 3, ఆ.

**బొంకప్ప.** దే. వి. మత్స్యవిశేషము.

**బొంకరి.** దే. విశే. (బొంకు+అరి.) అసత్యవాది. (చూ. కొండియుఁడు.)

**బొంకి.** దే. వి. బోఁకియొక్కరూపాంతరము.

**బొంకించు.** దే. స. క్రి. మోసపుచ్చు. ''ద్వి. చేతిలోఁజెయివేసి చీకాకుపఱిచి, పోతివిబొంకించి భూపాలతనయ.'' సా. 3, భా.— ప్రే. బొంకఁజేయు.

**బొంకు.** దే. స. క్రి. అసత్యమాడు. వి. అసత్యవచనము. విశే. అసత్యము.

**బొంకులాఁడి.** దే. విశే. (బొంకులు+ఆఁడి.) అసత్యములాడునది.

**బొంకులాఁడు.** దే. విశే. (బొఁకులు+ఆఁడు.) అసత్యములాడువాఁడు. ''ఆ. బాలకుఁడువృద్ధుపగవాఁడుచుట్టంబు, బూతుసూనగాఁడుపాతకుండు, బొంకులాఁడుముచ్చుముండరికొండీఁడు, కల్లద్రాగువాఁడుగాఁడుసాక్షి.'' విజ్ఞా. వ్య, కాం.

**బొంగరము.** వై. వి. బాలురాడుకొను బొమ్మరము. ''ద్వి. బొంగరాలాడుచుబోడికల్దాను, సంగతిఁబాయకచరియించుచున్న.'' సా. ౧, భా.

**బొంగు.** దే. వి. ఎండిన లావుబోలువెదురు.

**బొంగువెదురు.** ద్వ. వి. 1. గాలిసోఁకున మ్రోఁగెడు బోలువెదురు; 2. బోలువెదురు.

**బొండ.** దే. వి. తప్పుచేసినవారికాలుసేతులకుతగిల్చెడు దారుయంత్రవిశేషము, ద్రుపదము. (ఇది బొండకొయ్య, బొండమ్రాను అనియు చెప్పఁబడును.)

**బొండము.** దే. వి. బొండలమునకు మాఱురూపము. ''క. ఆనాలుగుభూతంబులు, మానుగనొక్కకటియేడుమాఱులుపొదువ౯, లోనమరెనుబొండములోఁ, గానంబడునారికడపుఁ గాయయుఁబోలె౯.'' వి, పు. ౧, ఆ.

**బొండలము.** దే. వి. టెంకాయమీఁదిబొసిక. ''సీ. ఎళనీటిబొండలంబులువోలెమెదడెల్ల జుఱ్ఱివైచినడొల్లుపుత్తిగములు.'' (ఇట్టొకపాఠము. చూ. ఎడనీరు.) ఆము. ౬, ఆ.

**బొండాము.** దే. వి. బొండముయొక్కరూపాంతరము.

**బొండిగ.** దే. వి. ఈనెమొదలు, లొడిమ.

**బొండు.** దే. విశే. గుండ్రమైనది. (బొండుగంటలు.)

**బొండుగ.** దే. వి. కంఠనాళము. ''కొందఱబొండుగల్వగుల ద్రుద్దియు.'' అచ్చ. యు, కాం.

**బొండుమల్లె.** ద్వ. వి. మల్లికావిశేషము, గుండుమల్లె ꠰.

**బొండువ.** దే. వి. బొండుగయొక్కరూపాంతరము. భార. శాం. 3, ఆ.

**బొండెము.** దే. వి. ముండ్లకంపతో అల్లి తెట్టుసకమర్చెడు తడుకు.

**బొండ్లము.** దే. వి. బొండలముయొక్కరూపాంతరము. ''అరుణంపుబొండ్లముల.'' ఆము. ౧, ఆ.

**బొండ్లాము.** దే. వి. బొండ్లముయొక్కరూపాంతరము. (చూ. ఎడనీరు.)

**బొంత.** యు. దే. విశే. పెద్ద. (చూ. బొంతరఁటి మొ.) వై. వి. చలికప్పుసకును, పఱపునకును ఉపయోగముగా దూదిలోనగువానిఁ జేర్చి దట్టముగాకుట్టెడుగంత*.

**బొంతకాకి.** ద్వ. వి. మాలకాకి, కాకోలము.

**బొంతజెముడు.** ద్వ. వి. ఒకదినుసుజెముడు ꠰.

**బొంతరఁటి.** దే. వి. (బొంత+అరఁటి.) పెద్దకాయలుగల ఒకదినుసు అరఁటి, మహేంద్రి ꠰.

**బొంతరాయి.** దే. వి. శిలాభేదము.

**బొంతు.** దే. వి. జొన్నలులోనగువాని గింజలయడుగునసుండు కుదురువంటిపొట్టు.

**బొంద.** దే. వి. 1. రంధ్రము; 2. తాడులోనగు చిన్నచెట్టు. (తాటిబొంద, ఈఁతబొంద.)

**బొందకోల.** దే. వి. మల్లసాధనాయుధవిశేషము.

**బొందడము.** ద్వ. వి. (బొంత+దడము.) బొందళమునకు మొదటిరూపము. నై. ౭, ఆ.

**బొందడీఁడు.** ద్వ. విశే. (బొందడము+ఈఁడు.) బొందడము తొడిగినవాఁడు, వర్మితుఁడు.

బొందపక్కి. దే. వి. మత్స్యవిశేషము.

బొందపువ్వు. దృ. వి. తొటిమోవునఃపట్టేయుండెడు నూఁగు పూవు.

బొందళేము. దృ. వి. (బొంత+దళేము.) కవచము. "కెందమ్మి బొందళపుఁ రౌతును వ్రాసినట్టి పడకింటఁ." ఉ, రా. ౪, ఆ.

బొంది. దే. వి. మేను, శరీరము. (చూ. పిడ్వడు.)

బొందిలి. దే. వి. ఒకజాతి.

బొందు. దే. వి. 1. దారము; (చూ. శవణిల్లు.) 2. చొక్కాయ ముడివేసెడు సన్ననాడా; 3. పుష్పసరము; "శే. నియమమునఁ బుష్పములుగోసినేర్పుమీఱఁ, బలుదెఱంగులవింతవింతలుగమాలి, కలును బొందులుఁగందుకంబులురచించి." కళా. ౪, ఆ. — 4. వెన్నుదీయుటకు యోగ్యముగాని వరిలోనగునది.

బొందుపోవు. దే. అ. క్రి. వరిలోనగునది వెన్నుదీయయోగ్యము గాకపోవు.

బొందె. దే. వి. అరఁటి ఊఁచే.

బొక్క. యు. దే. వి. నోరునిండినపాడియగు తినుబండము. (వాఁడు అరుకులు రెండుబొక్కలు బొక్కిపోయినాఁడు.)— వై. 1. బిలము; 2 రంధ్రము*; 3. శవమునుపూడ్చెడు పల్లము*. "ద్వి. ఎడనెడబొక్కలనిడినబాలకుల, వెడలించి భక్షించుబేతాళతతులు." హరిశ్చ. ౨, భా.

బొక్కణము. వై. వి. విబూదినంచి*. "ద్వి. పాడలకళాసంబొబూదిబొక్కణము." హరిశ్చ. ౧, భా.

బొక్కనీయ వై. వి. గుఱ్ఱమునకు ఉలవలుపెట్టెడు బొక్కెన. "సీ. మోదంబుతోనశ్వ ముఖులలాయంబులఁగట్టిబొక్కనియలఁ గవణమెత్తు." లక్ష్మీ. ౨, ఆ. (బొక్కెనయొక్కరూపాంతరము.) (దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.)

బొక్కబెరడు. దృ. వి. సర్పవిశేషము.

బొక్కలాఁడు. దృ. వి. (బొక్కలు+ఆఁడు.) 1. సర్పము; 2. కన్నగాఁడు. "ద్వి. శ్రుతిబాహ్యుఁడిలఁబుట్టుగ్రుడ్డుతాము సుఁడు, గతిచెడ్డచెడుగుతెక్కలిబొక్కలాఁడు, పదవిహీనుఁడు జగత్ప్రాణభక్షకుఁడు, వెదకియావిసపాలవిత్తునేమందు, ననిపాము నిందించి." హరిశ్చ. ౨, భా. (ఇది రెండర్థములకును దాహారణము)

బొక్కసము. దే. వి. 1. అర్థభారము; "శే. అర్థిగర్భితతామ్ర పేటన్యస్తమగు, బొక్కసంబెత్తుకొనిపోయెబోయయనుచు." (దీనికివెనక. "ఎ, గీ. పాపకర్ముండుచెంచర్థభారమనుచు, వంచనాపాటవంబునఁగొంచుఁబోయి.") కాశీ. ౫, ఆ.—2. సప్తాంగములలోనొకటి, కోశము; 3. భాండాగారము.

బొక్కి. దే. విశ. 1. పండ్లులేనిది; (బొక్కినోరు.) 2. మాంసములేనిది. (బొక్కిఱొమ్ము.) (చూ. తెఱ్ఱ.)

బొక్కిస. దే. వి. వస్త్రములుపెట్టెడు పెట్టె, కరోటకము.

బొక్కిసా. దే. వి. చిన్నమూట, అల్పభారము.

బొక్కు. దే. స. క్రి. ఏదేని నోరునిండవేసికొనితిను. వి. నిండిన నోరు, బొక్క.

బొక్కులాడు. దే. స. క్రి. (బొక్కులు+ఆడు.) (చూ.) బొక్కు.

బొక్కెన. యు. దే. వి. నీరుపిప్పలికి. వై. 1. గుఱ్ఱమునకు ఉలవలుపెట్టెడు తోలుసంచి; 2. నీళ్లుతిపోసెడు తోలుసంచి; 3. నీళ్లు చేఁదెడి యినుపపాత్రము*.

బొగడ. దే. వి. 1. బుగడ; 2. చూచుకము; కళా. ౧, ఆ.— 3. మంచేపుఁగోడుశిఖరము; (చూ. తరువడి.) 4. గండపట్టె మీఁదిగుబ్బ; 5. చెఱువుకట్టలోనగువానియందు నీళ్లుదూఱవచ్చెడు రంధ్రము.

బొగ్గు. దే. వి. మండిచల్లారిన కట్టెతునుక, కాళిక.

బొచ్చె. దే. వి. 1. కుండలోనగువానిపెంకు; 2. తలపుఱ్ఱె; 3. మత్స్యవిశేషము.

బొచ్చు. దే. వి. కేశము, రోమము.

బొజెఁగు. వై. వి. విటుఁడు. "క. సిరులచెలిమగనియడుగునఁ, గరమరుదుగఁబొడమిముజ్జగంబులయందుఁ, గరగరికనెఱపు జక్కర, విరిఁబోఁడిబొజంగప్రాఁతవేల్పులగొంగా." అచ్చ. అర, కాం.

బొజ్జ. దే. వి. కడుపు, కుక్షి, ఉదరము.

బొజ్జవాఁడు. దే. విశ. పెద్దకడుపువాఁడు, పిచండిలుఁడు.

బొటనవ్రేలు. దే. వి. పెద్ద వ్రేలు, అంగుష్ఠము.

బొటమనవ్రేలు. దే. వి.———పై.———"క. గల్లనియందెలు మొరసినఁ, గొల్లకొల్లనఁజనిరికోమలులపుడే, యల్లనబొటమనవ్రేలిని, మెల్లనహరిపంటనంటమెఱుముచునొక్కెఁ." సత్య. ౪, ఆ.

బొటవ్రేలు. దే. వి.———పై.———"సీ. ఘనసారచూర్ణమొక్కల తొంగితెచ్చినబొటవ్రేలనేచుక్కబొట్టువెట్టి." సాన్వ. 3, ఆ. (చూ. నింగిసిగ.)

బొటిమ. దే. వి. (చూ.) మొటిమ, అవగండము.

బొట్టె. దే. వి. వెదురుబద్దలులోనగువానిచేసల్లినగాదె.

బొట్టడి. దే. వి. దొర్లించెడు నల్లకాయి.

బొట్టనగోలలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. చిమ్ముబిల్లలు.)

బొట్టనవ్రేలు. దే. వి. బొటనవ్రేలుయొక్కరూపాంతరము. పాండు. ౫, ఆ.

బొట్టము. దే. వి. గోఁచి, కౌపీనము.

బొట్టవ్రేలు. దే. వి. బొటవ్రేలుయొక్కరూపాంతరము.

బొట్టియ. యు. దే. వి. బాణములోనగువానిచివరనేర్పఱచెడు తామరమొగ్గవంటిములికి. (చూ. బింకము రెండవయర్థము. (బొట్టెకోల.)—వై. 1. కొడుకు; "వెల్పుగొంగతొలుబొట్టియ." అచ్చ. యు, కాం.—2. కూఁతురు. "పుడమిబొట్టియ." అచ్చ. యు, కాం.)

బొట్టియఁడు. వై. వి. కొడుకు. "గాడుపుబొట్టియఁడు." (ఇక్కడ బొట్టియ అనియుండినను డవచ్చును. అయినను పాఠమిట్లుండుటవల్లను బొట్టెడు అని ప్రయోగముండుటవల్లను ఈ పాఠమే గ్రహింపఁబడెను.) అచ్చ. యు, కాం.

బొట్టు. వై. వి. 1. తిలకము; 2. అనుస్వారము; 3. జలాదిబిందువు*; 4. మంగళసూత్రమునందుగ్రుచ్చెడు స్వర్ణాభరణవిశేషము*.

బొట్టుగు. వై. వి. తిలకవృక్షము*.

బొట్టుదారము. దు. వి. బొట్టును గుచ్చెడు మంగళసూత్రము.

బొట్టువు. వై. వి. బొట్టుగుయొక్క రూపాంతరము.

బొట్టె. వై. వి. 1. కొడుకు; 2. కూతురు. (బొట్టియయొక్క రూపాంతరము.)

బొట్టెఁడు. వై. వి. 1. బాలుఁడు*. "క. ఎట్టిమొనగాండ్రు లేనియు, గట్టిగనాయెదుటదిటముగనకపఱురొ, నెట్టుకొనినేఁడు మిగులక బొట్టెఁడవిట్లునిలిచిపోరెదుచెపుమా." అచ్చ. బాల, కాం. (బొట్టియఁడుయొక్క రూపాంతరము.)

బొట్టెకోల. దే. వి. తామరమొగ్గవంటి ములికిగల బాణవిశేషము. "ఎ, గీ. కామునికిబొట్టెకోలలుగావెనాళ, ములఁబ్రకాశించుతామర మొగ్గలరయ." కళా. ౭, ఆ.

బొడబొడ. దే. వి. 1. కాఱుటయందగు ధ్వన్యనుకరణము; "నోటనుంబొడబొడరక్తముందొరఁగ." అధ్యా. అర, కాం.— 2. మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. పుఱియ మూఁగలుబొడబొడమని మ్రోయ." హరిశ్చ. ౧, భా.

బొడిగ. వై. వి. బాలకుఁడు*.

బొడిప. దే. వి. చెట్లయందలి బుడిపి.

బొడిమ. దే. వి. పావకోళ్లబిరడ.

బొడియ. దే. వి. రెండుపిడ్డెలఘువేసెడు పెన.

బొడ్డ. దే. వి. అత్తి, ఉదుంబరము*.

బొడ్డనబావి. దు. వి. నడుమపిల్లనూయిగలకోనేఱు. "వ. వజ్రపురంబునంగలకొలంకులం దటాకంబులం గొళాకూళులబొడ్డనబావు లనడ్డపెట్టులేకవిహరించుటకు వజ్రనాభుముదలయడిగి." ప్రభా. ౧, ఆ.

బొడ్డసరము. దే. వి. పైరులోమొలచు ఒకదినుసు చిన్నచెట్టు.

బొడ్డు. దే. వి. 1. నాభి; 2. నూతిచుట్టు ఎత్తుగాపెట్టినగోడ.

బొడ్డుఁజేవిక. దు. వి. (బొడ్డు+చేవిక.) చుట్టుకొల్లారము నడిమిచోవడి.

బొడ్డుపుడక. దే. వి. ఒకదినుసు మ్రానికొఱముట్టు.

బొణిగ. దే. వి. 1. సరకుతోనున్న చేతిసిద్దె; 2. బ. పొట్టుపీడి బద్దలుకాని కాయధాన్యము; 3. బొంతుపీడని జొన్నలోనగునవి; 4. భక్ష్యవిశేషము; 5. కొయ్యగంట.

బొత్త. దే. వి. తామ్రాదిపాత్రములబొంద.

బొత్తాము. ఆం. వి. గుండి. (రూ. బొత్తాను.)

బొత్తిగ. వై. ద్ర. క్రి. విణ. మొదలంట, ఆమూలము.

బొద. దే. వి. తృణవిశేషము, బల్బజము.

బొది. దే. వి. ఓడలుచేసెడుచోటు.

బొద్ది. దే. వి. ఒకదినుసుకూరాకు, వృద్ధదారకము.

బొద్దీఁక. దే. వి. బరిణెపురుగు.

బొద్దు. దే. వి. 1. గోడలులోనగువాని అంచులయందేర్పఱచెడు తదవయవవిశేషము, టాకు. (దీనిభేదములు. అడఁగుబొద్దు, వేము బొద్దు.)—2. బ. హస్తాభరణవిశేషము.

బొద్దుకీటు. దే. వి. గోడమీఁద బొద్దేర్పఱచిపెట్టెడుకీటు.

బొనము. దే. వి. మెఱుఁగు. "మేడికాయబొనము."

బొప్పఁడు. దే. విణ. మూఢుఁడు. "క. వెడనవ్వ్వి బొప్పఁడప్పుడు, జడుఁడైయాకిన్నరయ్యనన్నిఫెలికిక." బస. ౫, ఆ.

బొప్పాయిపండు. వై. వి. ఒకజాతిఫలము.

బొప్పి. దే. వి. పోటుచేత దేహమునందు ఉబ్బుగాలేచెడు బుడిపి.

బొబ్బ. దే. వి. 1. పొక్కు; 2. సింహనాదము; "ఆవెనబొబ్బలు నార్పులుబహుతూర్యకోటియుఁ జెలఁగె." భార. భీష్మ. 3, ఆ.— 3. పెద్ద అఱపు. "బొబ్బలునార్పుల్ పటుసింహ నాదములు నుల్పొదింప." భీ. ర, ఆ.

బొబ్బమెకము. దు. వి. సింహము, కేసరి.

బొబ్బర. వై. వి. 1. చెట్టుమీఁదిబరదు; 2. సస్యవిశేషము; "వ. ప్రత్తినంపత్తియుబొబ్బరయుబ్బరంబున." భీ. 3, ఆ.—3. బ. ధాన్యవిశేషము. (ఇవి నల్ల అలనందెలు)

బొబ్బరించు. దే. అ. క్రి. బొబ్బవేయు.

బొబ్బరింత. దే. వి. బొబ్బరించుట.

బొబ్బిలి. వై. వి. ఒకానొకచెట్టు, బర్బురము.

బొబ్బాటము. దే. వి. బొబ్బరింత. (చూ. బుసకొట్టు.)

బొమ. దే. వి. బొమ్మయొక్క రూపాంతరము. (కను బొమలు.— "బొమలల్లక ముడివడ్డ." భార. ఉద్యో. ౨, ఆ.— ప్రతిమలు.— "వ్రాసినచిత్రపుంబొమకుఁ బ్రాణమువచ్చినభంగిలేచి." విక్ర. ౭, ఆ.)

బొమముడి. దే. వి. కోపముచేతకలిగెడు బొమలముడి, భ్రుకుటి.

బొమముడిపాటు. దు. వి. బొమముడిపడుట. "చ. బొమ ముడిపాటుజంకెనయుఁబూనిపురంధ్రులుసాపరాధులొ, రమణులు వేఁడుకొన్ననరాగముదాల్పుదురట్లుగాదుమ, త్తమమపరాధలేశ మును దాల్పని నీవిపుడెంత మ్రొక్కినన్, దెమలదుశాంతిఁబొందదు మదీయమనం బికఁజాలుఁబ్రార్థనల్." కా. ౨, ఆ.

బొమిక. దే. వి. ఎముక. "సీ. ముంగాళ్లపైఁజాఁగిముచ్చుపూ పులుపరవ్వబొమికలెత్తుకపాఱిపోవునలు." ఆము. ౬, ఆ.

బొమికము. దే. వి. బొమ్మికముయొక్క రూపాంతరము.

బొమిడిక. దే. వి. కిరీటము. "సీ. దట్టంపుమల్లెలతలబొమిడిక వెట్టిసొంపారుపుష్పలజోడుదొడిగి." వీర. ౨, ఆ. (రూ. బొమిడికము. "సీ. తిమిరాసురునిగెల్వనమయశౌరిధరించుచికిలి కెంపులబొమిడికమనంగ." భాను. 3, ఆ.)

బొమిడీకము. దే. వి. బొమిడికముయొక్క రూపాంతరము. (చూ. బొమిడిక.)

బొమ్మ. యు. దే. వి. 1. కనుబొమ, భ్రూవు; 2. ప్రతిమ; (చూ. బొమ.) 3. బిరుదచిహ్నము; "వ. పిడికిబంటునుంబోలె నిలువకబొమ్మలువదలి." కవిక. ర, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)—4. అవమానచిహ్నము. "ద్వి. కట్టిఁడిమరునకుగట్టి గాబొమ్మ, గట్టితివేని." విష్ణు. ఉ. ర, ఆ. "వ. జ, క్కిణికొర వంజివేషములఁకేళికసల్పిరిదేవతానటీ, మ ణులకు బొమ్మవెట్టు క్రియ." రామా. ౨, ఆ.—విణ. అల్పము.—వై. భ్రష్ట. (చూ. అగ సాలె.)

బొమ్మంచు. దు. వి. (బొమ్మ+అంచు.) 1. ఎఱుపు; 2. బ. ఎఱుపువన్నెవస్త్రము. విణ. ఎఱ్ఱనిది. "క. మంచిదియటువలెనోఁ బో, మ్మంచునుబొమ్మంచుమోవిహాసనాంకురముల్, మించఁగగిరి సుత పంచినఁ, జంచలలోచనలుగొల్లఁజనెనిలయమునకున్." ఉ, రా. ౭, ఆ.

**బొమ్మఁడు.** వై. వి. బ్రాహ్మణుఁడు. "క. ఎడరిగుటతెలిసిపాఱుం, బొమవఁడుకొనిచనియు మాఱుభూమికిసటనం, దడిబొమ్మఁడు పెండ్లాడెను, వడువునఁగనుగాఁ పుఁబూ పవ యసు మిటారిక." పాండు. 3, ఆ.

**బొమ్మచారి.** వై. వి. బ్రహ్మచారి, వడుగు.

**బొమ్మచుక్క.** వై. వి. అభిజిన్నక్షత్రము.

**బొమ్మజెముడు.** వై. వి. సింహుండముడు.

**బొమ్మడాయ.** దే. వి. నేలనడఁగియుండు మత్స్యము, మద్గురము.

**బొమ్మపెండ్లిండ్లు.** దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. (చూ. అచ్చనగండ్లు.)

**బొమ్మముడి.** దే. వి. బొమముడియొక్క రూపాంతరము.

**బొమ్మమేడి.** దే. వి. (చూ.) కాకిమేడిడు.

**బొమ్మరము.** వై. వి. 1. బాలురాడుకొన్న బొంగరము; "క. అమ్మాధవాఙ్ఘ్నులఁబెన, దుమ్ముపాదుఁగరథముతిరుగఁదోడఁగెఁదడవుగా, బొమ్మరముతిరుగునరవడిఁ, గుమ్మరిసారెగుడిదిరుగుకొనెడువిధమునన్." జై. ౫, ఆ.–2. బ. బాలక్రీడావిశేషము. (చూ. చిమ్ముబిల్లలు.)

**బొమ్మరవోవు.** ద్వి. అ. క్రి. (బొమ్మరము+పోవు.) భ్రమించు. "భుజంగపతిబొమ్మరవోయె." రా. బాల, కాం.

**బొమ్మరాకాసి.** వై. వి. బ్రహ్మరాక్షసి, బ్రహ్మరాక్షసుఁడు. "ద్వి. బొమ్మరాకాసుల భోజనమ్ములకు, రమ్మనిప్రార్థింపరాఁడొక్కరుండు." హరిశ్చ. ౨, భా.

**బొమ్మరిల్లు.** దే. వి. (బొమ్మ+ఇల్లు.) బాలికలు బొమ్మలనుంచి ఆడుకొనెడు చిన్నయిల్లు.

**బొమ్మఱాయి.** దే. వి. శిలావిశేషము.

**బొమ్మికము.** దే. వి. బొమ్మిడికముయొక్క మాఱురూపము.

**బొమ్మిడికము.** దే. వి. బొమిడికముయొక్క రూపాంతరము. (చూ. బొమిడిక.)

**బొమ్మిడీకము.** దే. వి. బొమ్మిడికముయొక్క రూపాంతరము.

**బొరిగ.** దే. వి. గడ్డిపెల్లగించెడు గుద్దలి.

**బొరుగులు.** దే. వి. బ. పేలగింజే.

**బొరువులు.** దే. వి. బ. బొరుగుయొక్క రూపాంతరము. కళా. ౬, ఆ.

**బొరుసు.** దే. వి. 1. కఱకుతి; "తే. బొరుసునొనలనుజెంద్రంపు బొట్టుపెట్టి." రాజ. 3, ఆ.–2. వేఁపుడుచేట్టి.

**బొఱియ.** దే. వి. 1. బిలము; "తే. నఱుజరూపూనికుత్తుకబొఱియఁజొచ్చి." అచ్చ. యు, కాం.–2. పర్వతబిలము; "సీ. పఱచివాఁడొక్కగుబ్బలిపెనుబొఱియలోఁదూఱెననతఁడునదోనెతూఱె." అచ్చ. కిష్కిం, కాం.–3. గొయ్యి; "భూదారములునేలబొఱియలలోడాఁగు." భాగ. ౮, స్కం.–4. లోపలిసీరింకిపోయియుండినసారికడపుబొండము. "భార్యకన్పాగసారకుండనారికడపుంబొఱియల్తవిలించి." ఆము. ౧, ఆ.

**బొఱియచూలి.** దే. వి. వాల్మీకి. "క. అనినెనరొదవఁగనిటుల, య్యనియోరెపుఁదిండిదాసరయ్యతెలిపినన్, వినిబొఱియచూలియెదలోఁ, దనివినసకయపలికతయుఁదమిపడుగుటయున్." అచ్చ. ఉ, కాం.

**బొల్తి.** దే. వి. బొజ్జెకడుపు. "సీ. వలపగ్గములఁద్రెంచికలనడఁగొందపెబొల్తిలువ్రయ్యంగఁ బొడిచిపాడిచి." సీలా. ౨, ఆ.

**బొల్తిజిట్ట.** దే. వి. పక్షివిశేషము.

**బొత్తె.** దే. వి. బొఱియయొక్క రూపాంతరము. (మొదటిరూపము బొట్టియ.)

**బొల్లఁడు.** దే. వి. బొల్లిగుఱ్ఱము. "ఉ. నల్లనిమేననిల్వతిరునామము పచ్చని పట్టునాభిపైఁ, దెల్లనితమ్మియుంగలుగుదేవుఁడుకుంకువన్నెపుల్గురా, బొల్లనిసెక్కినల్పుతెలుపుఁగల పువ్వులదండదెచ్చియుత్పల్లనిజాంజలిం జగురుఁబోఁడి కొసంగెవెసన్ గృపామతిన్." వైజ. ౧, ఆ. "క. ఒసరించినసీలనినడ, గనిబొల్లనిఁ గత్తలాని." ద్వా. 3, ఆ.

**బొల్లి.** దే. విణ. తెల్లనిది, తెల్లనివాఁడు. "సీ. పరికింపమీతెగపక్షపాతధురీణమరయంగనెఱబొల్లులకటమీరు." చంద్ర.

**బొల్లికోడి.** ద్వి. వి. జలకుక్కుటము.

**బొల్లిగ్రద్ద.** ద్వి. వి. గరుత్మంతుఁడు.

**బొల్లిపూస.** దే. వి. ఇంద్రవల్లిడు.

**బొల్లిమోరమెకము.** ద్వి. వి. ఎలుఁగు, భల్లూకము.

**బొల్లు.** దే. అ. క్రి. అసత్యమాడు. వి. అసత్యము.

**బొసబొస.** దే. వి. వెడలుటయందగు ధ్వన్యనుకరణము. "వ. కడుపులనుండిబొసబొసవెడలు ప్రేవుల ప్రోవులదిమి." ఉ, రా. ౪, ఆ.

**బొసిక.** దే. వి. టెంకాయమొదలగువాని పైతోలు.

**బొసుక,** దే. విణ. బలిసినది, బలిసినవాఁడు. "సీ. పనిలేనిపనిబక్కబలిసినబొసుకచిక్కినవాఁడుదెగునెలలెనిమిదింట." జై. ౮, ఆ.

**బొళుకుబొళుకు.** దే. వి. క్రక్కుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "తే. వచ్చిశ్రీరామునడుగులవ్రాలెనబ్ధి, కేలుగవపట్టినిజసతుల్వ్రాలవంప, నవనినురమానపీఁపునసమ్మలెక్క, బొళుకుబొళుకునఁగ్రొన్నెత్తురొలుకనపుడు." రామా. ౭, ఆ.

## బో.

**బోఁకి.** దే. వి. 1. కుత్సితపాత్రము; 2. జేలగడుగుదోనె.

**బోఁకె.** దే. వి. ఎమ్ము, ఎముక, అస్థి.

**బోఁటి.** దే. విణ. వంటి, వంటివాఁడు. "మత్తకోకిల. నాఁటనుండియునాసమాలిన నామనంబుననాకునిం, కేటిజీవనమంచుసీతపమిట్లువన్నితిఁగాకయే, నాఁటనేనియతవ్రతస్థుఁడనన్నెఱింగియునిట్టినా, బోఁటిభీతునినీకుఁదోడనఁబోలునేదశకంధరా." రా. అర, కాం. "బోటుఁదనాలుచన్నెమిమబోంట్లకు." కళా. ౭, ఆ.

**బోక్కాణము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱమునకు ఉలవలుపెట్టెడు బొక్కెన; 2. నీళ్లెత్తిపోసెడు బొక్కెన.

**బోగమాట.** దే. వి. (బోగము+ఆట.) బోగముదాని నృత్యము.

**బోగము.** వై. వి. 1. లంజెవెల; (బోగముది.) 2. వెల. "మేల్బోగిపురేఁటెముల్." య. ౪, ఆ.

**బోగముది.** ద్వి. వి. (బోగము+అది.) వెలయాలు.

**బోగి.** యు. దే. వి. సంక్రాంతిపండుగకు తొలిదినము. వై. విణ. భోగముగలవాఁడు, భోగముగలది. "ఇది పుట్టుబోగి." యు. ౪, ఆ.

**బోగు.** దే. వి. పూనికి. "క. కడునిడుమలఁబడివారి, పృథుమును పటినెలవ్రవదలి బోగుమిగులఁగఁ, దొడుకులనుబ్బుంఁదయనియె డు, నడవికిఁగోఁపురముఁవచ్చిరలజడిమీఁతక." నీలా. ౧, ఆ.

**బోగుబడి.** దే. విశే. (చూ.) దూఁబఱఁదిండి.

**బోటి.** దే. వి. 1. ఆఁడుది; "క. తేఁటియొకటియొరుప్రియకును, మాటికిమాటికినినాగమదజలగంధం, బేటికినితనుఁబొందెడు, బోటికినందిచ్చునిండు బోటుఁదనమునఁ." భాగ. ౮, స్క-౦.— 2. చెలికత్తె. "ఎ, గీ. అంగపతికాంతమన్నించుచునను గుబోటి, యగుచకోరికయను చకోరాక్షి వచ్చి." విక్ర. ౪, ఆ.

**బోటికత్తియ.** దన్య. వి. చెలికత్తె. "ఉ. అత్తఱిబిత్తరిక్షమణిగ్వ ళాంబునఁగానకబోటికత్తియల్, తత్తఱమంది." వసు. 3, ఆ. (రూ. బోటికత్తె.)

**బోటు.** వై. వి. కొండమొదలగువానియందు ఉబ్బుగానుండు చోటు*. విశే. 1. ప్రౌఢుఁడు; "ఎ, గీ. పొడువులందెల్లఁ బొడుమైనబోటువేల్పు." ఉ, హరి. ౨, ఆ.—2. ధూర్తుఁడు*. "ఉ. పాటలగెల్చినట్టి సతిపల్కులుపల్కులుగాకయిట్లునే, డోటమి నన్నమాపులుకులోనృపయేటికికేకువట్టియా, మాటలకేమిపోదుఁమది మక్కువవేఁ్ఁక చోటనుఁడఁగా, బోటుఁదనాలుచన్నె మిముబోంట్ల కుఁదక్కనవారికిక్షవలెఁ." కళా. 2, ఆ.

**బోటు.** ఆం. వి. పడవ.

**బోడ** దే. వి. 1. సన్న్యాసి; (చూ. నానగండ.) 2. మ్రోడు. "సన్న్యాసిబోడలపైనెక్కితపంపుటింధనముఁగొంటఁ." చంద్రా. 3, ఆ.—విశే. బోడిది, బోడివాఁడు. (చూ. బుజ్జకాయ.)

**బోడఁడు.** దే. విశే. బోడివాఁడు, ముండితుఁడు.

**బోడతరము.** దే. వి. ఒకానొకచెట్టు, ముండిని.

**బోడసరము.** దే. వి. బొడ్డసరమునకు మొదటిరూపము.

**బోడి.** దే. విశే. ముండితము, ముండితుఁడు.

**బోడించు.** దే. స. క్రి. బోడిచేయు.

**బోడింపు** దే. వి. బోడించుట. (చూ. అరగింపు.)

**బోడికి.** దే. వి. 1. సేవకుఁడు; "బోడికల్ సఖుల్ హితులును బంధువర్గములు నిష్టముతోఁడుతఁజుట్టికొల్వ." భల్లా. 3, ఆ.— 2. బాలకుఁడు. "ద్వి. రావిరేకలుగలరాచబోడికలు." సా. ౨, భా.

**బోడు.** దే. విశే. బోడియైనది, బోడ.

**బోణి.** దే. వి. మొట్టమొదట వరకు అమ్మఁగా వచ్చినసొమ్ము.

**బోద.** వై. వి. పక్షిలోనగువానిపిల్ల. (ఉదా. అంచేబోద, లేటి బోద, ఎలుకబోద,) ["మెడలుఁబోఁకబోదలు." (ఇక్కడ పోఁక బోద అనఁగా లేఁతపోఁకయని యర్థము.) ఉ, హరి. ౫, ఆ.]

**బోదన.** వై. వి. దుర్బోధనము*. "ఉ. వేదనమించునీవిరహవేదనఁ దాళఁగఁజాలఁగంతుని, సాదనరాదుగాఁదనదుసాదనచూపఁదొ డంగెగాదప్పుఁదా, నీఁదనవచ్చునేమెదలనీ దనలాకృతివేఁడిచూపు చుఁ, బోదనచెల్లువాకడకుఁబోదనయంబుశుకంబుప్రేలుచుఁ." సా. ౨, ఆ. (రూ. బోధాయనము.)

**బోదియ.** దే. వి. 1. అడుగునుండి కొమ్మలమొదళ్లపర్యంతముగల వృక్షభాగము, ప్రకాండము; "పూచినయొక్కపోఁకనునుబోదియఁ జేరి." స్వా. ౨, ఆ.—2. స్తంభముమీఁది అవయవవిశేషము. "మిద్దెలోబోదియమీఁదనున్న తులి." హంస. ౨, ఆ.

**బోదు.** దే. వి. 1. సాగరముమోసెడి యెద్దుగంత; 2. గోము. "క. పదియునేరదుప్రోదిం, బోదునఁ బెరిఁగినదిరాజమొన్నటిది సుమీ, పైదలి నేరనుఁగలిగినఁ, గాదని తెల్పుదువుగానికడునల్లకుమీ." య. ౪, ఆ.

**బోదె.** దే. వి. 1. బోదియ, ప్రకాండము; 2. స్తంభముమీఁది అవయవవిశేషము; (బోదియయొక్కరూపాంతరము.) 3. మిరెప చేనులోనగువానియందు ఈవలావల కాలువలేర్పఱచినకట్ట.

**బోదెకొయ్య.** దే. వి. కడపక్రిందికఱ్ఱ.

**బోధకరుఁడు.** సం. వి. అ. పుం. వేకువను రాజులనిద్రమేల్కొలి పెడువాఁడు, వైతాళికుఁడు.

**బోధకుఁడు.** సం. వి. అ. పుం. ఉపాధ్యాయుఁడు. విశే. బోధించువాఁడు.

**బోధచేయు.** మి. స. క్రి. బోధించు.

**బోధనము.** సం. వి. అ. న. బోధించుట, కఱపుట.

**బోధనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) బోధింపఁదగినది.

**బోధపడు.** మి. అ. క్రి. ఆకళింపఁబడువచ్చు.

**బోధము.** సం. వి. అ. పుం. తెలివి, జ్ఞానము.

**బోధి.** సం. వి. ఇ. పుం. 1. రావి; 2. సమాధివిశేషము.

**బోధించు.** సం. స. క్రి. తెలియఁజేయు, కఱపు.

**బోధితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) బోధింపఁబడినవాఁడు.

**బోధ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) బోధనీయము.

**బోనకత్తియ.** వై. వి. (బోనము+కత్తియ.) అన్నముచేసిపెట్టునది. (రూ. బోనకత్తె.)

**బోనకాఁడు.** దన్య. వి. (బోనము+కాఁడు.) అన్నముచేసిపెట్టు వాఁడు.

**బోనము.** వై. వి. 1. భోజనము; "ఎల్లవంటకములునేర్పడఁబోనాలు పెట్టింప." భార. ఉద్యో. 3, ఆ.—2. అన్నము*. "క. బోనఁబు దిచ్చియటనిజ, సూనుఁడుతెగియున్నఁజూచి శూర్పణఖవివ, ర్ణానన యైనేలంబడి, హా నందనయనుచుఁదుఃఖితాత్మకయగుచుఁ." రా. అర, కాం. (వృత్తియందంత్యవర్ణలోపము. ఉదా. బోనకావడి, బోనపుట్టిక మొ.)

**బోనముకత్తె.** వై. వి. బోనకత్తె. "ఈనిసువృబోనముకత్తెలకైనఁబట్టఁ గాముట్టఁగనీము." కృష్ణా. 3, ఆ.

**బోనముపెట్టె.** వై. వి. తోలుకప్పిన గుండ్రనిపెట్టె.

**బోను.** దే. వి. 1. మృగములులోనగువానినిపట్టెడు కపటయంత్రము; 2. పెంపుడుమృగములుండుటకై చుట్టుకమ్ములమర్చి చేసిన ఒకవిధమైన పెట్టెలోనగునది. "ఉ. బోనుననున్న మత్తవారి పోలికబ్రాహ్మణశాపయంత్రనెం, తేనియుశాంతిఁజెందనితఁడు." ఉ, రా. ౫, ఆ.

**బోనుపొయ్యి.** దే. వి. అటునిటు తీసికొనిపోఁదగిన మంటిపొయ్యి.

**బోము.** దే. వి. బలవంతము, బలాత్కారము.

**బోయ.** దే. వి. 1. కిరాతుఁడు; "తే. దీనిలేవియఁద్రావినమాన ఫులకు, జరయురుజయుసుఁడప్పియుఁజావ్రుఁగల్గ, వనఁగఁగొందఱు బోయలు వినికడంగి, యుఱక మొఱకులైచఱిఁబడనుఁజికిరపుడు." సం. "శతశకిరాతాస్తద్భష్ట్వా." భార. ఉద్యో. ౨, ఆ.—2. శైవ

ర్తుఁడు. "క. తెలవిసరిపెలదగఁగఁబో, యలకీవలదయ్యాయనిన." భార. అను. ౨, ఆ.

**బోయఁడు.** దే. వి. బోయవాఁడు. (బోయయొక్క రూపాంతరము.)

**బోయత.** దే. వి. బోయది. (కిరాతస్త్రీకి. "ద్వి. తనుపుజూమ్మన బోయతన బిట్టుగదిసి, కనుకనిఁదమకించికొఁగిటఁజేర్చె." విష్ణు. పూ. 3, ఆ.)

**బోయి.** దే. వి. బోయీయొక్క రూపాంతరము.

**బోయీ.** దే. వి. పల్లకిమోచేవాఁడు, బెస్త.

**బోయీఁడు.** దే. వి. బోయి. (స్వార్థమున ఈఁడు.)

**బోయెత.** దే. వి. బోయతయొక్క రూపాంతరము. "చ. అతినవ పల్లవోజ్జ్వలతరాంబరయాతొలుసఁజగబ్బిబో, యెతతటివేచివింటఁ గదియించినలేగురుఁజుక్కయుంటను, ద్ధతగతిఁదద్విజాధిపతిదారఁద మింగెడపక్షదదండనం, హతిక్రియఁదారకల్ సెదరనండజకోటిభ్ర మించెనల్లడన్." హన. ౪, ఆ.

**బోర.** దే. వి. ఱొమ్ము, అక్కు, ఎద, వక్షము.

**బోరగించు.** దే. ప్రే. బోరగిల్లఁజేయు.

**బోరగిల్లు.** దే. అ. క్రి. 1. ఱొమ్ము భూమినాను; 2. ఱొమ్ము భూమినానఁబరుండు. (రూ. బోరగిలు. ఱొమ్ము భూమినానుటకు.— "చ. క్షతమునముక్కునంజెవులఁ గన్నులనోల్కెడు రక్తమంగమూ, ప్లుతముగఁజేయఁగానతఁడు బోరగిలంబడియెన్ధరన్." భార. శల్య. ౧, ఆ.—ఱొమ్ముభూమినానఁబరుండుటకు.— "సీ. పొలు పారఁగాబోరగిలిపాన్పునాల్గుమూలలకును వచ్చును మెలఁగిమెలఁ గి." (ఇక్కడ భూమియనునది పఱుపులోనగునానికిని ఉపలక్షణము.) హరి. పూ. ౫, ఆ.)

**బోరన.** దే. ద్ర. క్రి. విణ శీఘ్రముగా. "క. మనుజేశ్వరులెల్ల నబో, రనదమయంతీస్వయంవరమునకునొప్పన్, జనుదెంచిరిసైన్యస్యం, దనఘట్టనసవనితలముతల్లడపడఁగన్." భార. ఆర. ౨, ఆ. "క. ఈరథికులుతననిమ్మెయిఁ, బోరికిఁదఱుమంగఁదానుబిరి కొనకిదటన్, గౌరవపతిడాఁగినగతి, బోరనఁజనిచెప్పవలయు భూనాథునకున్." భార. శల్య. ౨, ఆ.

**బోరప్రాఁకుడు.** దే. వి. పాము, ఉరగము. "ఎ, గీ. దోనవు గయాళి, బోరప్రాఁకుడుఁగొలములపుల్లుతేఁడ." అచ్చ. బాల, కాం.

**బోరు.** దే. ఓ. వానకురియుటయందగు ధ్వన్యనుకరణము; (వాన బోరున కురియుచున్నది.) విణ. పెద్ద. (ఉదా. బోరుతలుపులు మొ.)

**బోరుకలఁగు.** దే. అ. క్రి. మ్రోఁగు, ధ్వనించు. "కటకరవంబు బోరుకలఁగన్." స్వా. ౫, ఆ. "వాద్యములో బోరుకలంగ." విజ. 3, ఆ, (ఒకానొకగ్రంథమునందు బోరుకల్లు అని ప్రయోగింపఁబడియున్నది.)

**బోరుకాడించు.** దే. ప్రే. బోరుకాడఁజేయు. "తే. పాపనికి నూనెతలయంటిపసుపుఁబూసి, బోరుకాడించిహరిరక్షపొమ్మటంచు, జలములొకకొన్నిచుట్టిరాజిలెడుతొట్ల, ననిచిదీవించి పాడిరయ్యువిదలెల్ల." భాగ. ౧౦, స్కం. పూ. (చూ. బోర్కాడించు.)

**బోరుకాడు.** దే. అ. క్రి. (బోరుక+ఆడు.) (బిడ్డలు) స్నానముచేయు.

**బోరుకొను.** దే. అ. క్రి. బోరుకలఁగు, మ్రోఁగు. "తే. భేరి మొదలగువాద్యముల్ బోరుకొనఁగ." ఇలా. ౧, ఆ. (ప్రే. బోరుకొలుపు. "ద్వి. బూరగల్ కంచుకొమ్ములుకాహళములు, బోరుకొల్పుటకునంబుధులెల్లగలఁగ." నవ. ౨, ఆ.)

**బోరుతలుపులు.** దే. వి. బ. నగరులోనగువాని వాకిటిపెద్దతెక్కతలుపులు. "ఎ, గీ. బీగములువుచ్చిగడియలుపెకలఁజేసి, బోరుతలుపులుదెఱచిగొబ్బునఁబురంబు, వెడలెనానకదుందుభివిష్ణుమాయ, యఖిలమునుగప్పితనకుఁదోడైనటింప." వి, పు. ౭, ఆ.

**బోరువ.** దృ. వి. (బోరు+వా.) ఒకదినుసు పెద్దగద్ద.

**బోరెము.** దే. వి. దూదిలోనగువానిమూట. "గెంటేపుబోరెములు." హంస. ౫, ఆ.

**బోరెంపోతు.** దే. వి. తిండిపోతు, కొవ్వినవాఁడు.

**బోర్కాడించు.** దే. ప్రే బోరుకాడించుయొక్క రూపాంతరము. "శా. ఆశీనాతొలుచూలిబిడ్డనికిబోర్కాడించినేసూతికా, శాలామధ్యవిశాలతల్పగతనైచన్నిచ్చినిద్రింప." భాగ. ౧౦, స్కం. ఉ.

**బోర్కాడు.** దే. అ. క్రి. బోరుకాడుయొక్క రూపాంతరము.

**బోర్డు,** ఆం. వి. 1. కార్యనిర్వాహకసభ; 2. పెద్దకొయ్యపలక.

**బోర్తలుపులు.** దే. వి. బ. బోరుతలుపులయొక్క రూపాంతరము. "బలుకంచుగుబ్బబోర్తలుపులు." హంస. ౨, ఆ.

**బోలము.** సం. వి. అ, పుం. బాలెంతబోళము.

**బోలు.** దే. విణ. లోపల ఏమియులేనిది. "ద్వి. బోలుసొమ్ములు." హరిశ్చ. ౨, భా.

**బోలె.** దే. వి. 1. ఓటికుండ; 2. కుండబొచ్చె.

**బోలెము.** దే. వి. వేగము. (చూ. నడగఁడు.)

**బోసి.** దే. వి. పండ్లులేనిది, బొక్కి. "బోసినోరు." రాజ. 3, ఆ.

**బోసివడు.** దృ. అ. క్రి. (బోసి+పడు.) బోసివోవు. "సీ. ఎచ్చోటనులివేఁడియెండఁ బండులురాలిపూషార్కవదనంబుబోసివడియె." భీ. 3, ఆ.

**బోసివోవు.** దే. అ. క్రి. (బోసి+పోవు.) బోసేయగు. (చూ. పోటము.) (ప్రే. బోసివుచ్చు. "సీ. పటుచపేటంబునఁబండ్లుడుల్లఁగమొత్తిపూషార్కవదనంబుబోసివుచ్చె." కాశీ. ౭, ఆ.)

**బోసేయు.** వై. స. క్రి. (బోనము+చేయు.) భుజించు. "ఎ, గీ. అబిడన్నంబుసంకటియంబలియును, జేయసవరేయివేళబోసేసిపోవు." హంస. ౪, ఆ.

**బోళము.** వై. వి. గంధరసము.

**బోళా.** వై. విణ. కపటములేని, దాపరములేని.

## బ్ర.

**బ్రక్క.** దే. విణ. దీనుఁడు. "ఈబ్రక్కన్ద్విజుఁజూడరయ్యసభవారు." ఆము. ౬, ఆ. (బక్కకు మొదటిరూపము.)

**బ్రతుకు.** దే. అ. క్రి. జీవించు. "క. ఏవేళనైనఁబ్రియపడి, రావించునదానివలనబ్రతికితిఁజుమ్మీ." భో. ౫, ఆ.—వి. 1. జీవనము; "క. నీ, బ్రతుకుబయల్గానదాలిపయ్యరకుజ్జా." సీలా. 3, ఆ.—2. స్థితి. "చ. ఈ, జగములపుట్టువుం బ్రతుకుఁజావును నీవలనన్ స్వభావమై, సెగడిసరాజసాదికమనీయగుణత్రయిచేష్టితంబులు." వి, పు. ౨, ఆ. బ్రతుకుఁదెరువు. దే. వి. (బ్రతుకు+తెరువు.) జీవనోపాయము.

**బ్రదిమి.** దే. వి. జీవనము. "తే. అరయఁగారణమించుకయైనలేక, వలముగలవాఁడుబడుగ్గైనవలములేని, వాఁడునలిష్ఠైనఁదెలియంగ

వలయువాని, బ్రదిమియెనిమిదినెలలౌటభవ్యమతులు.'' శివ. ఉ. ౨, ఆ.

**బ్రదుకు.** దే. అ. క్రి. వి. బ్రతుకుయొక్కరూపాంతరము. [జీవించుటకు.--(చూ. ఎడరు. రెండవ అర్థముకడ.) జీవనమునకు.--''ఎ, గీ. అట్టిబెడిదంబునకునోర్వకమరవరులు, మునులునజుఁడుమున్నుగ మహామూర్తివిష్ణు, నుదరదేశంబుసొత్తురుబ్రదుకుఁగోరి.'' హరి. పూ. ౧, ఆ.]

**బ్రద్ద.** యు. దే. వి. 1. తునక; 2. చీలిక. వై. పేమ. (చూ. కుప్పనము రెండవ అర్థము కడ.)

**బ్రద్దపరి.** దస్వ. వి. పేములతోనల్లిన కేడెము. ''ద్వి. శతమాయుఁడశిదంబుజళిపించిపూన్చి, శతబలివిపులవక్షంబేయుటయును, సర భసుండైయప్డుశతబలిబ్రద్ద, పరిఁదప్పనొడ్డి కృపాణోగ్రధారఁ, జలమునఁ దెగవ్రేసె శతమాయుతొడలు.'' రా. యు, కాం.

**బ్రద్దర.** దస్వ. వి. (బ్రద్ద+అర.) 1. తునక; 2. చీలిక.

**బ్రద్దలవారు.** దస్వ. వి. బ. వేత్రధరులు. ''ద్వి. క్రందుగాకుండంగ బ్రద్దలవారు, సందడిజడియ.'' రా. యు, కాం.

**బ్రధ్నము.** సం. వి. అ. పుం. వేరు, బుధ్నము.

**బ్రధ్నుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. శివుఁడు.

**బ్రమయు.** వై. అ. క్రి. భ్రమించు, బమ్మెరపోవు.

**బ్రమరిదిరుగు.** దస్వ. అ. క్రి. (బ్రమరి+తిరుగు.) చుట్టివచ్చు. ''క. ఎత్తినగదలంకించియు, హత్తియునుంబ్రమరిదిరిగియడిచియుఁ బైపై, నొత్తియుఁదట్టియుఁబట్టియు, మత్తగజద్వయముఁబోలెమలసిరి రువురుఁ.'' ఉ, హరి. 3, ఆ.

**బ్రమరివాఱు.** దే. అ. క్రి. (బ్రమరి+పాఱు.) బ్రమరి దిరుగు. ''ఎ, గీ. మల్లుఁజుచుచునార్పుచుమలసిబ్రమరి, వాఱుచునుబెక్కుబిరుదులుపలికిపలికి, మెలఁగియాఁబోరులుండెడుపాలములరసి, ఱంకెపట్టుకనుంగొనిబింకమెసఁగ.'' హరి. పూ. ౬, ఆ. (ఒకానొకచోటబ్రమరులువాఱు అని ప్రయోగింపఁబడియున్నది.)

**బ్రమ్మి.** వై. వి. గోమెదచెట్టు.

**బ్రల్లు.** దే. వి. కూలుటయందగు ధ్వన్యనుకరణము. ''ఉ. ఈ, రావిఁగడిందికొమ్మొకటిబ్రల్లనఁగూల్చెరనేనుబోవుచుఁ.'' పర. ౫, ఆ. (బల్లుయొక్క మొదటిరూపము.)

**బ్రహ్మ.** సం. వి. న్. పుం. 1. నలువ; (నవబ్రహ్మలు.--భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, అంగిరసుఁడు, అత్రి, క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, మరీచి.) 2. విష్ణువు; 3. బ్రాహ్మణుఁడు; 4. ఒక ఋత్విజుఁడు. (చూ. ఋత్విజుఁడు.) న. ము. 1. పరమాత్మ; 2. వేదము; 3. తపము. పుం. ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**బ్రహ్మచర్యము.** సం. వి. అ. న. ఆశ్రమవిశేషము. (చూ. ఆశ్రమము.)

**బ్రహ్మచారి.** సం. వి. న్ పుం. ముంజిత్రాడుమొలనగువానిధరించి వేదముచదివి బ్రహ్మచర్యవ్రతమునందుండువాఁడు.

**బ్రహ్మణ్యము.** సం. వి. అ. పుం. గంగరావిచెట్టు. విణ. బ్రాహ్మణహితము.

**బ్రహ్మదర్భ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు ఓమము.

**బ్రహ్మదారువు.** సం. వి. ఉ. న. గంగరావిచెట్టు.

**బ్రహ్మపుత్త్రము.** సం. వి. అ. పుం. 1. పడమరపాటెడి యొక యేఱు; 2. విషభేదము.

**బ్రహ్మబంధువు.** సం. విణ. (ఉ.) 1. గుణింపఁబడువాఁడు; 2. దూఱఁబడువాఁడు.

**బ్రహ్మబిందువు.** సం. వి. ఉ. పుం. వేదపాఠమునందలి నోటితుంపర.

**బ్రహ్మభూయము.** సం. వి. అ. న. బ్రహ్మత్వము.

**బ్రహ్మమేఖలము.** సం. వి. అ. పుం. బ్రహ్మచారులకు మొంజిగా ఉపయోగింపఁబడు తృణవిశేషము.

**బ్రహ్మయజ్ఞము.** సం. వి. అ. పుం. వేదపాఠము.

**బ్రహ్మరంధ్రము.** సం. వి. అ. న. నడునెత్తి, మాడపట్టు.

**బ్రహ్మరథము.** సం. వి. అ. పుం. మృతిపొందిన సన్యాసులను తీసికొనిపోయెడు వాహనము.

**బ్రహ్మవర్చసము.** సం. వి. అ. న. సదాచారాధ్యయనసమృద్ధి.

**బ్రహ్మవాది.** సం. వి. న్. పుం. వేదాంతి.

**బ్రహ్మసాయుజ్యము.** సం. వి. అ. న. బ్రహ్మత్వము.

**బ్రహ్మసువు.** సం. వి. ఊ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**బ్రహ్మసూత్రము.** సం. వి. అ. న. యజ్ఞోపవీతము.

**బ్రహ్మాంజలి.** సం. వి. ఇ. పుం. వేదాధ్యయనకాలమునందలి మ్రొక్కు.

**బ్రహ్మారణ్యము.** సం. వి. అ. న. వేదపాఠభూమి.

**బ్రహ్మావర్తము.** సం. వి. అ. పుం. డిల్లికి వాయవ్యభాగమునను౦డెడు దేశవిశేషము.

**బ్రహ్మాసనము.** సం. వి. అ. న. ధ్యానోపాయభూతమైన పద్మస్వస్తికదండాద్యాసనము.

## బ్రా.

**బ్రాఁతి.** దే. వి. ప్రేమ. ''ఉ. పేశియముట్టుటల్ నిగులఖింతలు పెంపునుచిల్కబోదతో, రాణదలిర్పఁబల్కుట గరంబపురూపమపూర్వమంతయుఁ, బ్రాణసఖీరహస్యముల బ్రాఁతియుఁగ్రీడలు కానివాలియా, యేణవిలోలలోచనకు హెచ్చినమన్మథచేష్ట నయ్యెడఁ.'' కళా. ౬, ఆ. ''చ. పలువురియందునొక్కనికి బ్రాఁతియు నొక్కనియందుఁజూడన, గ్గలమగుప్రేమపల్వరకుఁగల్గుట యద్భుతము.'' స్వా. ౬, ఆ.--విణ. 1. అధికము; ''ఉ. భూసురకోటివేఁడుటయుఁబోఁడిగఁబ్రాణములైననిత్తునా, శాసదినేశలోకము నఁబ్రస్ఫుటమెంతయునట్లుగావునఁ, వానవుఁడట్టెనన్నడుగవచ్చుఁ బ్రియంపడినాకునొక్కబ్రాఁ, తేసురలోకవందితమదింగవచంబునఁగుండలంబులుఁ.'' భార. అర. ౭, ఆ. -- 2. దుర్లభము; ''ధర్మతత్పరులకుగెల్పుబ్రాఁతె.'' భార. శల్య. ౧, ఆ. ''ఆ. ఇమ్మెయిముక్తి, బ్రాఁతెబ్రాహ్మణులకురాజులకును.'' భార. అశ్వ. ౧, ఆ.--3. ప్రియము. ''తే. ఇచటమత్ప్రీతిచేసినన్నేలికొనుము, భక్తిగానినీకేమియుఁబ్రాఁతిగాదు.'' ఉ, హరి. ౨, ఆ. ''తే. పగళులెలతోఁట నీడలుబ్రాఁతియయ్యెఁ, బగుళులుసురేలుఁదనుగాలి బ్రాఁతియయ్యె, రేలువెన్నెలబయళులుప్రియములయ్యె, రేలుఁ బగళులునిద్రలుప్రియములయ్యె.'' లక్ష్మీ. 3, ఆ.

**బ్రాంది.** ఆం. వి. ఒకవిధమైన మద్యము.

**బ్రాహ్మణబ్రువుఁడు.** సం. వి. అ. పుం. జాతిమాత్రోపజీవియైన బ్రాహ్మణుఁడు.

**బ్రాహ్మణము.** సం. వి. అ. న. 1. బ్రాహ్మణసమూహము; 2. వేదభాగము.

**బ్రాహ్మణాయనుఁడు.** సం. వి. అ. పుం. విద్వాంసుఁడును, నక్కృత్యపరుఁడునైన వంశకర్తవలనఁబుట్టిన విప్రుఁడు.

**బ్రాహ్మణార్థము.** సం. వి. పితృకార్యములయందు భోజనమున కుఁబోవుట.

**బ్రాహ్మణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. బ్రాహ్మణునిభార్య; 2. నలికంగ్లపాము; 3. చిఱుతేఁకుటీ.

**బ్రాహ్మణుఁడు.** సం. వి. అ. పుం. పాఱుఁడు.

**బ్రాహ్మణ్యము.** సం. వి. అ. న. 1. బ్రాహ్మణసమూహము; 2. బ్రాహ్మణభావము; 3. బ్రాహ్మణకర్మము. పుం. డు. శని.

**బ్రాహ్మము.** సం. వి. అ. న. పెద్దవ్రేలిమొదటనుండెడు బ్రహ్మతీర్థము. పుం. విద్యయునాచారముఁగల వరునిఁదానేపిలిచి వధూసహితముగ వస్త్రాదులచేసలంకరించి పూజించి కన్యనిచ్చిచేయువివాహము. (చూ. వివాహము.) విశ. బ్రహ్మసంబంధమైనది.

**బ్రాహ్మణయష్టిక.** సం. వి. ఆ. స్త్రీ. చిఱుతేఁకు, బారంగిటీ.

**బ్రాహ్మి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక మాతృక; (చూ. మాతృక.) 2. సరస్వతి; 3. చాఁపనచీమ; 4. పొన్నగంటికూర; 5. బారంగిటీ; 6. సోమెదకూర.

## బ్రు.

**బ్రుంగు.** దే. అ. క్రి. 1. పూఁడు; "ఆ. అశ్వసుభటతతులయంగఖండఁబులు, రుధిరకర్దమమునబ్రుంగియున్న, పెల్లుచూడరౌద్రబీభత్సకరుణాభ, యానకైక హేతువయ్యెనధిప." భార. ద్రో. ౧, ఆ.–2. మఱుఁగు; 3. మునుఁగు.

**బ్రుంగుడు.** దే. విశ. 1. మఱఁగినది; "ఉ. విస్మయమొప్పఁగా దనుజవీరులమాయలచేతబ్రుంగుడై, భస్మములోపలన్ మెఱయు పావకమూర్తియుఁబోలెవానుచే, వస్మరణప్రభావమునవర్ధితుఁడైవెలుఁగొందుచుండె." వి, పు. ౨, ఆ.–2. మునిఁగినది. "ఉ. భూవరయిట్లునాసికముపోయినరక్తముచేతబ్రుంగుడై, జేవుఱుఁగొండచందమునఁజెయ్యులుదక్కనిశాచరుండువా, పోవుచులోనసిగ్గుదలపోయుచువచ్చినత్రోవనేగిమై, రావణుఁగాంచిమ్రొక్కకడుఁగ్రమ్మిన భీతినిబల్కెనెంతయున్." మై. ౨, ఆ.

**బ్రుంగుడువడు.** ద్వి. అ. క్రి. (బ్రుంగుడు + పడు.) మఱుఁగుపడు. "తండ్రిసద్గుణసముదయముబ్రుంగుడువడమెలఁగుపుత్రుఁడుహీనుఁడు." మార్క. ౨, ఆ. (ప్రే. బ్రుంగుడువఱుచు. "తే. కర్ణుఁదొలుచూలుగానేలకుంటితల్లి, నీదుమంత్రంబు పరమవిషాదకారి, యయ్యెనీమాకెల్లనట్టిబలైకగణ్యుఁ, గన్నుబ్రుంగుడువఱుచుటకారణమున." భార. స్త్రీ. ౨, ఆ.)

**బ్రుంగుడువాటు.** ద్వి. వి. బ్రుంగుడువడుట. "ఉ. పేరునుం, బుట్టునుమాలియిప్పుడిటుబ్రుంగుడువాటునఁబొందఁజూచినా, కెట్టుమనంబుపట్టు." భార. విరా. ౨, ఆ.

**బ్రుంగువడు.** ద్వి. అ. క్రి. మగ్నమగు. "తే. సుతకళత్రాదిసకలవస్తువులువగల, బ్రుంగువడనిసుఖంబుసేయంగఁజాలవు." కవిక. ౫, ఆ. (బ్రుంగుడువడుయొక్క మాఱురూపము.)

**బ్రుంచు.** దే. ప్రే. బ్రుంగఁజేయు.

**బ్రుయ్యు.** దే. అ. క్రి. నశించు. "ఆ. దానఁజేసిమీరునేనును బ్రుయ్యఁబా, పంబులేకవెడలఁబడితిమి." భార. మా. ౧, ఆ.

**బ్రుసి.** సం. వి. ఈ. స్త్రీ. వ్రతుల ఆసనము. (గూ. బ్రుషి.)

## బ్లా.

**బ్లాంకెటు.** ఆం. వి. బనాతుపచ్చడము.

## భ.

**భ.** ఒక అక్షరము.

**భంగ.** సం. వి. ఆ. స్త్రీ. జనపచిత్తులు. అ. పుం. ము. 1. చెఱుపు; 2. అల; 3. అవమానము; 4. రోగము; 5. రోగవిశేషము.

**భంగపడు.** మి. అ. క్రి. (భంగము + పడు.) అవమానపడు.

**భంగపాటు.** మి. వి. భంగపడుట. "ఎ, గీ. నీవునునాపద, కోర్చిభంగపాటుదీర్చికొనము." భార. విరా. ౧, ఆ.

**భంగపెట్టు.** మి. స. క్రి. (భంగము + పెట్టు.) భంగపఱుచు. "నధర్మద్రుపదాత్మజభంగపెట్టరే." భార. ఉద్యో. 3, ఆ.

**భంగి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. విధము. ఈ. స్త్రీ. 1. భంగము; 2. గంజాయి.

**భంగించు.** సం. స. క్రి. భంగపఱుచు.

**భంగురము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. నశించునది; 2. వంకరైనది.

**భంగ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) భంగలుపండునది. (పొలము.)

**భంజకము.** సం. విశ. (అ. ఆ. అ.) విఱుచునది.

**భంజనము.** సం. వి. అ. న. విఱుపు.

**భంజళి.** సం. వి. ఈ. స్త్రీ. పామువలె వంకరగాపోయెడి అశ్వగతి విశేషము. (రూ. భంజళిక. ఆ. స్త్రీ.) (చూ. మురళి.)

**భంజించు.** సం. స. క్రి. విఱుచు.

**భంజిక.** సం. వి. ఆ. స్త్రీ. చిఱుతేఁకుటీ.

**భంటాకి.** సం. వి. ఈ. స్త్రీ. ములకటీ.

**భండనము.** సం. వి. అ. న. 1. యుద్ధము; 2. కవచము; 3. దుశ్చేష్ట.

**భండారము.** సం. వి. అ. పుం. బొక్కసము.

**భండించు.** సం. అ. క్రి. బండాటలాడు. "క. ఖండింపుముసుతునటుగా, ఖండినవ్రతమైనమానియుండుమునీవీ, యొండైనఁజేయకూరక, భండించినఁగలదెపరమపదవిస్పృహాలా." రుక్మాం. ౫, ఆ.

**భండీరము.** సం. వి. అ. పుం. 1. దిరిసెనముటీ; 2. చిర్రికూర.

**భండీరి.** సం. వి. ఈ. స్త్రీ. మంజిటిటీ.

**భండుఁడు.** సం. వి. అ. పుం. దుశ్చేష్టుఁడు, ఆకతాయి.

**భంబు.** సం. వి. అ. న. 1. నక్షత్రము; 2. ఆకాశము. పుం. కిరణము. (చూ. కంబు.)

**భక్తము.** సం. వి. అ. న. అన్నము. విశ. భాగింపఁబడినది.

**భక్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సేవ; (ఇది అష్టవిధము.–భాగవతవాత్సల్యము, భగవత్పూజయందనుమోదము, భగవదర్చన, భగవద్విషయమునందదంభము, భగవత్కథాశ్రవణేచ్ఛ, స్వరనేత్రాంగవికారము, సదాభగవదనుస్మరణము, అమాంసభక్షణము, భక్తిలక్షణమునవవిధము.–శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము.) 2. భయముతోఁగూడిన స్నేహము; 3. భాగము.

భక్తుఁడు. సం. వి. అ. పుం. భక్తిగలవాఁడు, డింగరీఁడు.
భక్షకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తిండిపోతు.
భక్షణము. సం. వి. అ. న. భక్షించుట, తిండి.
భక్షణీయము. సం. విణ. (అ. ఆ. అ) భక్ష్యము.
భక్షించు. సం. స. క్రి. భక్షణముచేయు, తిను.
భక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) భక్షింపఁబడినది.
భక్ష్యకారుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పిండివంటవాఁడు. (రూ. భక్ష్యంకారుఁడు.)
భక్ష్యము. సం. వి. అ. న. తినుబండము. (పంచభక్ష్యములు.— భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము.) విణ. తినఁదగినది.
భగందరము. సం. వి. అ. పుం. మర్మస్థానమునందలి వ్రణము.
భగము. సం. వి. అ. పుం, న. 1. శ్రీ; 2. వీర్యము; 3. ఇచ్ఛ; 4. జ్ఞానము; 5. వైరాగ్యము; 6. కీర్తి; 7. మాహాత్మ్యము; 8. ఐశ్వర్యము; 9. యత్నము; 10. ధర్మము; 11. మోక్షము; 12. యోని. పుం. డు. ద్వాదశాదిత్యులలో నొకఁడు. (చూ. ఆదిత్యుఁడు.)
భగవంతుఁడు. సం. వి. త్. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. బుద్ధదేవుఁడు. విణ. పూజ్యుఁడు. (రూ. భగవానుఁడు.)
భగవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. సరస్వతి; 2. పార్వతి; 3. గంగ. విణ. పూజ్యురాలు.
భగిని. సం. వి. ఈ. స్త్రీ. తోఁడబుట్టినది.
భగ్నము. సం. విణ. (అ. ఆ. అ.) భంగమునొందినది.
భజనము. సం. వి. అ. న. 1. సేవించుట; 2. భాగించుట.
భజమానము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సేవించునది; 2. భాగించునది; 3. న్యాయముతోఁగూడినది.
భజించు. సం. స. క్రి. 1. సేవించు; 2. భాగించు. (సంభజించు అనియు.)
భజిష్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సేవింపఁదగినది; 2. భాగింపఁదగినది.
భటము. సం. వి. అ. పుం. దినముయొక్క పదునేనవభాగము. (చూ. దినము.)
భటిత్రము. సం. విణ. (అ. ఆ. అ.) ఇనుపశలాకకు గ్రుచ్చి కాల్చినది. (కఱకుట్లు.)
భటుఁడు. సం. వి. అ. పుం. 1. కాలిబంటు; 2. పనివాఁడు.
భట్టారకుఁడు. సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) రాజు; 2. ముని; 3. సూర్యుఁడు.
భట్టిని. సం. వి. ఈ. స్త్రీ. 1. (నాట్యపరిభాషయందు) రాజు పెండ్లాము; 2. బ్రాహ్మణునిపెండ్లాము.
భట్టుఁడు. సం. వి. అ. పుం. బట్టువాఁడు. "విద్వాంసకవయో భట్టాః." అభినయదర్పణము.
భద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. తిథివిశేషము; (చూ. తిథి.) 2. కృష్ణుని అష్టమహిషులలో నొకతె; 3. గంగానది. అ. న. ము. 1. శుభము; 2. బంగారు; 3. నాగముస్తె. స్త్రీ, న. ఒక కరణము. (చూ. కరణము.) పుం. 1. గజజాతివిశేషము; (చూ. గజము.) (ఈజాతిగజము శుభకార్యములయందు పురప్రచార యోగ్యమైనది.) 2. ఎద్దు; 3. కాటుకపిట్ట. డు. 1. వీరభద్రుఁడు; 2. పురుషజాతివిశేషము. (చూ. పురుషుఁడు.) విణ. 1. శుభకరము; 2. శ్రేష్ఠము.
భద్రకుంభము. సం. వి. అ. పుం. రాజద్వారమునందుంచిన జలపూర్ణమైన సవర్ణకలశము.
భద్రదారువు. సం. వి. ఉ. న. దేవదారువృక్షము.
భద్రపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడుచెట్టు.
భద్రబల. సం. వి. ఆ. స్త్రీ. గొంతెమగోరుచెట్టు.
భద్రముస్తకము. సం. వి. అ. పుం. నాగముస్తె.
భద్రయవము. సం. వి. అ. న. కొడిసెకాయ.
భద్రశ్రీ. సం. వి. ఈ. పుం. చందనము, గంధము.
భద్రాకరణము. సం. వి. అ. న. క్షౌరము, వపనము.
భద్రాసనము. సం. వి. అ. న. రాజుకూర్చుండుపీఠము.
భయంకరము. సం. విణ. (అ. ఆ. అ.) భయమునుపుట్టించునది.
భయము. సం. వి. అ. న. వెఱపు. విణ. వెఱపుపుట్టించునది.
భయానకము. సం. వి. అ. పుం. 1. నవరసములలో నొకటి; (చూ. రసము.) 2. పులి; 3. రాహువు. విణ. భయానకరసము గలది.
భరంతు. హిం. వి. ఇంటిమట్టము.
భరటుఁడు. సం. వి. అ. పుం. 1. కూలివాఁడు; 2. కుమ్మరవాఁడు.
భరణము. సం. వి. అ. న. 1. భరించుట; 2. కూలి; 3. జీతము; 4. ఇరువదితులముల మానము.
భరణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. భూమి.
భరణ్యము. సం. వి. అ. న. 1. కూలి; 2. జీతము.
భరద్వాజము. సం. వి. అ. పుం. భీట్రింత. డు. 1. ఒకముని; 2. ద్రోణుఁడు.
భరము. సం. వి. అ. పుం. 1. అతిశయము; 2. బరువు; 3. కావడ.
భరించు. సం. స. క్రి. 1. మోచు; 2. ప్రోచు. (సంభరించు అనియు.)
భర్గుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
భర్జనము. సం. వి. అ. న. వేఁచుట, భృష్టి.
భర్జించు. సం. స. క్రి. భర్జనముచేయు, వేఁచు.
భర్త. సం. వి. ఋ. పుం. మగఁడు. విణ. 1. మోచువాఁడు; 2. ప్రోచువాఁడు.
భర్తి. హిం. వి. సంపూర్తి.
భర్తృదారకుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) యువరాజు.
భర్తృదారిక. సం. వి. ఆ. స్త్రీ. (నాట్యపరిభాషయందు). రాజకూఁతురు.
భర్త్సనము. సం. వి. అ. న. బెదరింపుమాట.
భర్మము. సం. వి. అ. న్. న. బంగారు. న్. న. జీతము.

**భల్లము.** సం. వి. అ. న. బల్లెము. పుం. ఎలుఁగుబంటు.

**భల్లాతకి.** సం. వి. ఈ. స్త్రీ. జీడిచె.

**భల్లారే.** దే. అవ్య. ఆశ్చర్యార్థకము. (రూ. బళిరే.)

**భల్లింగము.** సం. వి. అ. పుం. గట్టివెదురుచె.

**భల్లుకము.** సం. వి. అ. పుం. 1. ఎలుఁగుబంటు; 2. కోఁతి.

**భల్లూకము.** సం. వి. అ. పుం. ఎలుఁగు, భల్లుకము.

**భవదీయము.** సం. విశే. (అ. ఆ. అ.) నీది.

**భవనము.** సం. వి. అ. న. 1. అగుట; 2. ఇల్లు.

**భవనాసి.** గ్రా. వి. అషియపాత్ర.

**భవము.** సం. వి. అ. పుం. 1. పుట్టుక; 2. సంసారము; 3. ప్రాప్తి; 4. శుభము; 5. సత్త.

**భవాదృశుఁడు.** సం. విశే. (శ్) నీవంటివాఁడు.

**భవాని.** సం. వి. ఈ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

**భవికము.** సం. వి. అ. న. శుభము, మేలు.

**భవిత.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) కాఁగల స్వభావముగలవాఁడు.

**భవితవ్యము.** సం. వి. అ. న. 1. భాగ్యము; 2. శుభము. విశే. కాఁదగినది.

**భవిష్ణువు.** సం. విశే. (ఉ.) కాఁగల స్వభావముగలవాఁడు.

**భవిష్యత్తు.** సం. విశే. (త్. ఈ. త్.) కాఁగలది.

**భవిష్యము** సం. వి. అ. న. 1. భాగ్యము; 2. శుభము. విశే. కాఁగలది.

**భవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**భవ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. గజపిప్పలిచె. అ. న. ము. 1. శుభము; 2. ఎముక. విశే. 1. శుభమైనది; 2. సత్యమైనది; 3. యోగ్యమైనది; 4. కాఁగలది.

**భషకము.** సం. వి. అ. పుం. శునకము, కుక్క.

**భషణము.** సం. వి. అ. న. కుక్కయొక్క మొఱుగు.

**భసలము** సం. వి. అ. పుం. తుమ్మెద, భృంగము.

**భస్త్ర.** సం. వి. ఆ. స్త్రీ. (కమ్మరవాని) కొలిమితిత్తి.

**భస్త్రి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——

**భస్మగంధిని.** సం. వి. ఈ. స్త్రీ. రేణుకయను గంధద్రవ్యము.

**భస్మగర్భ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కంపుటిరుగుడుచె; 2. ఇరుగుడుచె.

**భస్మము.** సం. వి. న్. న. ఏదయినను కాలి తెల్లగానైనపొడి, బూది.

**భస్మీకరించు.** సం. స. క్రి. భస్మముచేయు.

## భా.

**భా.** సం. వి. ఆ. స్. స్త్రీ. సూర్యునివెలుఁగు, కిరణము.

**భాంగీనము.** సం. విశే. (అ. ఆ. అ.) భంగలుపండినది. (పొలము.)

**భాండము.** సం. వి. అ. న. 1. తొడవు; 2. గుఱ్ఱపుఁదొడవు; 3. కుండలోనగు మట్టిపాత్రము; 4. వస్తువు; 5. మొదలిసొమ్ము; 6. సంచిమొదలు.

**భాండాగారము.** సం. వి. అ. న. ధనముండుచోటు, బొక్కసము.

**భాండి.** సం. వి. ఈ. స్త్రీ. మంజటిచె.

**భాగధేయము.** సం. వి. అ. న. భాగ్యము. పుం. కప్పము.

**భాగము.** సం. వి. అ. పుం. 1. పాలు; 2. భాగ్యము.

**భాగించు.** సం. స. క్రి. భాగముచేయు, పంచు.

**భాగినేయుఁడు.** సం. వి. అ. పుం. తోడఁబుట్టినదానికొడుకు, మేనల్లుఁడు.

**భాగీరథి.** సం. వి. ఈ. స్త్రీ. గంగ, మిన్నేఱు.

**భాగ్యము.** సం. వి. అ. న. 1. అదృష్టము; 2. సుకృతము. విశే. భాగింపఁదగినది.

**భాజనము.** సం. వి. అ. న. 1. పాత్రము; 2. యోగ్యము.

**భాటకము.** సం. వి. అ. పుం. బాడిగ, అవక్రయము.

**భాణము.** సం. వి. అ. పుం. నాటకభేదము. (చూ. నాటకము.)

**భాతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి; 2. విధము. (రెండవ అర్థమునకు తెనుఁగు గ్రంథములయందు ప్రయోగము.)

**భాద్రపద.** సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరభద్రపదానక్షత్రము. అ. పుం. ము. భాద్రపదమాసము.

**భానుమంతుఁడు.** సం. వి. త్. పుం. సూర్యుఁడు. విశే. కిరణముగలవాఁడు.

**భానువు.** సం. వి. ఉ. పుం. 1. సూర్యకిరణము; 2. సూర్యుఁడు.

**భామ.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది. అ. పుం. ము. 1. కోపము; 2. సూర్యకిరణము. డు. సూర్యుఁడు.

**భామిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. క్రీడాసమయమునందు కోపము చూపెడు ఆఁడుది; 2. ఆఁడుది.

**భారకుఁడు.** సం. వి. అ. పుం. బరువుమోసెడి కూలివాఁడు.

**భారతము.** సం. వి. అ. న. 1. వ్యాసప్రోక్తమైన అయిదవ వేదము; 2. హిమవత్పర్వతమునకును, దక్షిణసముద్రమునకును నడుమైన ఒక వర్షము. (చూ. వర్షము.) పుం. డు. నట్టువుఁడు.

**భారతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సరస్వతి; 2. వాక్కు; 3. ఒక కావ్యవృత్తి; (చూ. వృత్తి.) 4. పక్షివిశేషము.

**భారద్వాజము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము, ఏట్రింత.

**భారద్వాజి.** సం. వి. ఈ. స్త్రీ. అడవిప్రత్తిచె.

**భారము.** సం. వి. అ. పుం. 1. బరువు; 2. బారువ.

**భారయష్టి.** సం. వి. ఇ. స్త్రీ. కావడిబద్ద.

**భారవాహుఁడు.** సం. వి. అ. పుం. బరువుమోసెడువాఁడు, భారకుఁడు.

**భారి.** హిం. విశే. గొప్ప, ఘనమైన, బలిసిన.

**భార్గవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. లక్ష్మి; 2. పార్వతి; 3. గఱికచె.

**భార్గవుఁడు.** సం. వి. అ. పుం. 1. శుక్రుఁడు; 2. పరశురాముఁడు.

**భార్గి.** సం. వి. ఈ. స్త్రీ. బారంగిచె.

**భార్య.** సం. వి. ఆ. స్త్రీ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము; పత్ని.

**భార్యాటికుఁడు.** సం. వి. అ. పుం. పెండ్లాముమాట జవదాఁటని వాఁడు.

**భాలూకము.** సం. వి. అ. పుం. భల్లుకము, ఎలుఁగు.

**భావ.** సం. వి. ఆ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. సత్తు; 2. మనోవికారము; 3. అభిప్రాయము; 4. ఆత్మ; 5. పుట్టుక; 6. ధాత్వర్థరూపక్రియ; 7. స్వభావము; 8. పదార్థము; 9. విభూతి; 10. రత్యాది. డు. (నాట్యపరిభాషయందు) విద్వాంసుడు.

**భావజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

**భావన.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. 1. తలఁపు; 2. వాసనకట్టుట.

**భావి.** సం. విశే. (న్. ఈ. న్.) కాఁగలది, భవిష్యత్తు.

**భావించు.** సం. అ. క్రి. ఎంచు, తలఁచు.

**భావికము.** సం. వి. అ. న. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**భావితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. కర్పూరాదులచేత వాసనకట్టినది.

**భావిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. భావముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**భావుకము.** సం. వి. అ. న. శుభము, భవికము.

**భావుకుఁడు.** సం. వి. అ. పుం. తోఁడఁబుట్టినదానిమగఁడు, బావమఱఁది.

**భావ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అవశ్యముకాఁదగినది.

**భాష.** సం. వి. ఆ. స్త్రీ. 1. సంస్కృతాది; 2. మాట; 3. ప్రతిజ్ఞ; 4. ప్రమాణము.

**భాషణము.** సం. వి. అ. న. మాటాడుట.

**భాషించు.** సం. అ. క్రి. మాటాడు.

**భాషితము.** సం. వి. అ. న. మాట. విశే. మాటాడినది.

**భాష్యము.** సం. వి. అ. న. సూత్రవ్యాఖ్యానగ్రంథము. విశే. మాటాడఁదగినది.

**భాసంతము.** సం. వి. అ. పుం. గంపపులుఁగు. విశే. చక్కనిది.

**భాసమానము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశించుచున్నది.

**భాసిల్లు.** సం. అ. క్రి. ప్రకాశించు. (ఉద్భాసిల్లు, సముద్భాసిల్లు అనియు.)

**భాసురము.** సం. వి. అ. పుం. పటికపుఱాయి. విశే. ప్రకాశించునది.

**భాస్కరుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**భాస్వంతుఁడు.** సం. వి. త్. పుం. సూర్యుఁడు. విశే. ప్రకాశించువాఁడు.

**భాస్వరుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

## భి.

**భిండిపాలము.** సం. వి. అ. పుం. విడిచివాటుగుదియ. (శాదుకయందు భిండివాలమందురు. చూ. భిందిపాలము.)

**భిందిపాలము.** సం. వి. అ. పుం. విడిచివాటుగుదియ. రెండుమూడు చక్రములుగల మూదిగకత్తి. (అనికొందఱు.) (చూ. భిండిపాలము.)

**భిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. బిచ్చెము; 2. బిచ్చెమెత్తిన వస్తువు; 3. కడికొలఁది అన్నము; 4. కూలి; 5. సేవ. (చూ. భిక్షము.)

**భిక్షించు.** సం. స. క్రి. భిక్షమెత్తు.

**భిక్షుకుఁడు.** సం. వి. అ. పుం. భిక్షమెత్తుకొని జీవించెడు సన్యాసి.

**భిక్షువు.** సం. వి. ఉ. పుం. 1. బ్రహ్మచారి; 2. సన్యాసి.

**భిత్తము.** సం. వి. అ. న. ఖండము, తునుక.

**భిత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. భేదనము; 2. గోడ; 3. జొత్తిలి.

**భిత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పిడుగు; 2. గోడ; 3. చేల్లగడ్డ.

**భిద.** సం. వి. ఆ. స్త్రీ. 1. భేదము; 2. భేదనము; 3. భేదోపాయము.

**భిదురము.** సం. వి. అ. న. వజ్రాయుధము, జాలివాలు.

**భిన్నము.** సం. వి. అ. పుం. 1. అర్థదోషములలో నొకటి; 2. నీలరత్నదోషము. విశే. 1. పగిలినది; 2. చీలినది; 3. విరిసినది; 4. వేఱుపడినది; 5. కూడినది.

**భిల్లుఁడు.** సం. వి. అ. పుం. బోయవాఁడు.

**భిషక్కు.** సం. వి. జ్. పుం. చికిత్సకుఁడు, వైద్యుఁడు.

**భిస్స.** సం. వి. ఆ. స్త్రీ. అన్నము, వంటకము.

**భిస్సట.** సం. వి. ఆ. స్త్రీ. మాఁడన్నము.

## భీ.

**భీ.** సం. వి. ఈ. స్త్రీ. భయము, వెఱపు.

**భీకరము.** సం. విశే. (అ. ఆ. అ.) వెఱపుపుట్టించునది, భయంకరము.

**భీతము.** సం. వి. అ. న. వెఱపు. విశే. వెఱచినది.

**భీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వెఱపు; 2. వడఁకు.

**భీతిల్లు.** సం. అ. క్రి. భయపడు, వెఱచు.

**భీమము.** సం. వి. అ. పుం. భయానకరసము. విశే. భయానకరసముకలది.

**భీముఁడు.** సం. వి. అ. పుం. 1. ధర్మరాజుతమ్ముఁడు; 2. ఒక రాజు; 3. శివుఁడు. విశే. భయంకరుఁడు.

**భీరుకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వెఱపరి.

**భీరువు.** సం. వి. ఊ. స్త్రీ. 1. వెఱపరియగు ఆఁడుది; 2. ఆఁడుది ఉ. స్త్రీ. పిల్లపీఁచెరకి. విశే. వెఱపరి.

**భీలుకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) భీరుకుఁడుయొక్కరూపాంతరము.

**భీషణము.** సం. వి. అ. పుం. భయానకరసము. విశే. భయానకరసముగలది.

**భీష్మము.** సం. వి. అ. పుం. విశే.——పై.——

**భీష్మసువు.** సం. వి. ఊ. స్త్రీ. గంగానది.

**భీష్ముఁడు.** సం. వి. అ. పుం. 1. శాంతనవుఁడు; 2. శివుఁడు. విశే. భయంకరుఁడు.

## భు.

**భుక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. భుజింపఁబడినది; 2. అనుభవింపఁబడినది.

భుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. భోజనము; 2. అనుభవము.

భుగ్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వంగినది; 2. విఱిగినది; 3. వంకరైనది.

భుజ. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. చేయి.

భుజంగభుక్కు. సం. వి. క్. పుం. నెమిలి, పాఁపమేపరి.

భుజంగమము. సం. వి. అ. పుం. పాము.

భుజంగము. సం. వి. అ. పుం. పాము. డు. విటుఁడు.

భుజంగాక్షి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షిచె.

భుజకీర్తి. సం. వి. ఇ. స్త్రీ. బాహుపురి.

భుజగము. సం. వి. అ. పుం. పాము.

భుజపత్రము. సం. వి. అ. పుం. బుజపత్తిరిచె.

భుజశిరస్సు. సం. వి. స్. న. మూఁపు, అంసము.

భుజాంతరము. సం. వి. అ. న. ఱొమ్ము, క్రోడము.

భుజించు. సం. స. క్రి. 1. తిను; 2. అనుభవించు.

భుజిష్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పరిచారిక; 2. వేశ్య. అ. పుం. ము. చేకట్టుకొనెడు తోరము. డు. పరిచారకుఁడు. విణ. స్వతంత్రుఁడు.

భువనము. సం. వి. అ. న. 1. జగము; 2. ఉదకము; 3. ఆకాశము.

భువనేశ్వరము. సం. వి. అ. న. గృహవిశేషము, చేట్టుబవంతి.

భువి. సం. వి. ఈ. స్త్రీ. 1. భూమి; 2. స్థానము.

## భూ.

భూకదంబము. సం. వి. అ. పుం. నేలకడిమిచె.

భూకము. సం. వి. అ. న. 1. బొక్క; 2 కాలము.

భూగృహము. సం. వి. అ. న. నేలమాళిగ.

భూజము. సం. వి. అ. పుం. వృక్షము, పుడమిపుట్టు.

భూజాని. సం. వి. ఇ. పుం. 1. విష్ణువు; 2. రాజు.

భూతకేశము. సం. వి. అ. పుం. మరులుజెడచె.

భూతధాత్రి. సం. వి ఈ. స్త్రీ. భూమి, నేల.

భూతము. సం. వి. అ. న. 1. పృథివ్యాది; (ఇవి అయిదు.— పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము.) 2. పిశాచాది; 3. ప్రాణి. పుం. 1. దేవయోనివిశేషము; 2. కృష్ణచతుర్దశి. డు. కొడుకు. విణ. 1. తగినది; 2. కడచినది; 3. నిక్కమయినది; 4. పొందఁబడినది; 5. వెలసినది; 6. (ఉత్తరపదమైనచో) సమానమైనది.

భూతయజ్ఞము. సం. వి. అ. పుం. భూతబలి.

భూతవేశి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లవావిలిచె.

భూతాత్మము. సం. వి. న్. పుం. దేహము. డు. బ్రహ్మ.

భూతావాసము. సం. వి. అ. పుం. విభీతకము, తాండ్రచె.

భూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఐశ్వర్యము; 2. సంపద; 3. భస్మము; 4. సత్త; 5. పుట్టుక; 6. ఏనుఁగు శృంగారము.

భూతికము. సం. వి. అ. న. 1. ఓమము; 2. కర్పూరము; 3. కామంచికసవు; 4. చేఁపురుకసవు; 5. నేలవేముచె. (రూ. భూతీకము.)

భూతులసి. సం. వి. ఈ. స్త్రీ. నేలతొళసిచె.

భూతేశుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. బూచులఱేఁడు.

భూదారము. సం. వి. అ. పుం. వరాహము, కిటి, పంది.

భూదేవుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, నేలవేలుపు.

భూధరము. సం. వి. అ. పుం. పర్వతము, నేలతాలుపు.

భూనింబము. సం. వి. అ. పుం. నేలవేముచె.

భూపతి. సం. వి. ఇ. పుం. రాజు, నేలఱేఁడు.

భూపది. సం. వి. ఈ. స్త్రీ. మల్లియచె.

భూపాటలి. సం. వి. ఈ. స్త్రీ. నేలకలిగొట్టుచె.

భూపుఁడు. సం. వి. అ. పుం. రాజు, ఱేఁడు.

భూపూగము. సం. వి. అ. పుం. (చూ.) తోఁటపోఁకచె.

భూబదరి. సం. వి. ఈ. స్త్రీ. నేలరేనుచె.

భూభుజుఁడు. సం. వి. జ్. పుం. రాజు, ఱేఁడు.

భూభృత్తు. సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు. (దీనికి సరియైన తెనుఁగుమాట నేలతాలుపు.)

భూమి. సం. వి. ఇ. స్త్రీ. 1. నేల; 2. చోటు.

భూమిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మాఱువేషము; 2. రచన.

భూమికర్కారువు. సం. వి. ఉ. పుం. నేలగుమ్మడిచె.

భూమిచంపకము. సం. వి. అ. పుం. నేలసంపెఁగచె.

భూమిజ. సం. వి. ఆ. స్త్రీ. సీత. అ. పుం. డు. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.

భూమిజంబుక. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకినేరేడుచె; 2. నేలనేరేడుచె.

భూమిస్పృశుఁడు. సం. వి. శ్. పుం. 1. కోమటి; 2. మనుష్యుఁడు.

భూమ్యామలకి. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరికచె.

భూయస్సు. సం. విణ. (స్.) అధికము, మిక్కటము.

భూయిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

భూరి. సం. వి. ఇ. న. బంగారు. విణ. అధికము.

భూరిఫేన. సం. వి. ఆ. స్త్రీ. సంబరేనుచె.

భూరిమాయము. సం. వి. అ. పుం. జంబుకము, నక్క.

భూరిమాయువు. సం. వి. ఉ. పుం.——పై.——

భూరుండి. సం. వి. ఈ. స్త్రీ. గురుగుచె.

భూరుహము. సం. వి. అ. పుం. వృక్షము, పుడమిపుట్టు.

భూర్జము. సం. వి. అ. పుం. బుజపత్తిరిచె.

భూవరుఁడు. సం. వి. అ. పుం. రాజు, పుడమిఱేఁడు.

భూష. సం. వి. ఆ. స్త్రీ. భూషణము, తొడవు.

భూషణము. సం. వి. అ. న. 1. అలంకరణము; 2. తొడవు.

భూషించు. సం. స. క్రి. స్తుతించు. (సముద్భూషించు అనియు.)

**భూషితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అలంకరింపఁబడిన వాఁడు.

**భూష్ణువు.** సం. విశే. (ఉ.) కాఁగల స్వభావముగలవాఁడు.

**భూసురుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, నేలవేలుపు.

**భూస్తృణము.** సం. వి. అ. న. చిప్పకసవుగీ.

## భృ.

**భృంగము.** సం. వి. అ. న. లవంగపుఁబట్ట. పుం. 1. తుమ్మెద; 2. కాఁకటిమూఁగ; 3. గుంటగలిజేరుగీ. డు. విటుఁడు.

**భృంగరాజము.** సం. వి. అ. పుం. 1. గుంటగలిజేరుగీ; 2. గండుతుమ్మెద; 3. కాఁకటిమూఁగ.

**భృంగారము.** సం. వి. అ. పుం. 1. గుంటగలిజేరుగీ; 2. బంగారుగిండి

**భృంగారి.** సం. వి. ఈ. స్త్రీ. చిమ్మటపురుగు, ఝిల్లిక.

**భృంగి.** సం. వి. ఈ. స్త్రీ. అతివస. న్. పుం. భృంగీశ్వరుఁడు.

**భృగువు.** సం. వి. ఉ. పుం. 1. కొండచేపియ; 2. ఒకముని; 3. శుక్రుఁడు; 4. శివుఁడు.

**భృతకుఁడు.** సం. వి. అ. పుం. కూలివాఁడు.

**భృతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ధరింపఁబడినది; 2. నింపఁబడినది.

**భృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. మోచుట; 2. కూలి; 3. వెల.

**భృతిభుజుఁడు.** సం. వి. జ్. పుం. కూలివాఁడు.

**భృత్య.** సం. వి. ఆ. స్త్రీ. కూలి. అ. పుం. డు. పనివాఁడు, బంటు.

**భృశము.** సం. క్రి. విశే. అ. న. పెల్లు. విశే. అధికము.

**భృష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) వేఁచేఁబడినది.

**భృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వేఁపుడు; 2. పాడఁడవి.

## భే.

**భేకము.** సం. వి. అ. పుం. 1. కప్ప; 2. మేఘము.

**భేకి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకప్ప, వర్షాభ్వి.

**భేదకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) భేదించువాఁడు.

**భేదనము.** సం. వి. అ. న. భేదించుట. పుం. పుల్లబచ్చలిగీ.

**భేదము.** సం. వి. అ. పుం. 1. భేదనము; 2. వేఱిమి; 3. విశేషము; 4. ఒక ఉపాయము. (చూ. ఉపాయము.) (ఇది త్రివిధము.—ఒండొరులస్నేహముచెఱుచుట, ఒండొరులకు రాయిడి పుట్టించుట, బెదరుచూపుట.)

**భేదించు.** సం. ప్రే. భేదిల్లఁజేయు. (నిర్భేదించు అనియు.)

**భేదితము.** సం. విశే. (అ. ఆ. అ.) భేదింపఁబడినది.

**భేద్యము.** సం. విశే. (అ. ఆ. అ.) భేదింపఁదగినది.

**భేదిల్లు.** సం. అ. క్రి. 1. వేఱగు; 2. చీలు.

**భేరి.** సం. వి. ఈ. స్త్రీ. వాద్యవిశేషము, దుందుభి.

**భేరుండము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము. విశే. భయంకరము.

**భేలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు; 2. పిఱికి; 3. చలించువాఁడు.

**భేషజము.** సం. వి. అ. న. ఔషధము, మందు.

## భై.

**భైక్షము.** సం. వి. అ. న. భిక్షాన్నసమూహము.

**భైరవము.** సం. వి. అ. పుం. భయానకరసము.

**భైరవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. రాగవిశేషము.

**భైరవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు. విశే. భయానకరసము కలవాఁడు.

**భైషజ్యము** సం. వి. అ. న. ఔషధము, మందు.

## భో.

**భోక్త.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) 1. భుజించువాఁడు; 2. అనుభవించువాఁడు.

**భోక్తవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. భుజింపఁదగినది; 2. అనుభవింపఁదగినది.

**భోగగృహము.** సం. వి. అ. న. పడకిల్లు.

**భోగము.** సం. వి. అ. పుం. 1. సుఖము; 2. భోజనము; 3. పాముయొక్క పడగ; 4. పాముయొక్క శరీరము; 5. ధనము; 6. వేశ్యాదులకిచ్చెడువెల; 7. పాలనము. (అష్టభోగములు.—గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము.)

**భోగవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పాతాళము; 2. పాతాళము నందలియేఱు. విశే. భోగముగలది.

**భోగి.** సం. వి. న్. పుం. 1. పాము; 2. రాజు; 3. మంగలి. విశే. సుకవాసి.

**భోగించు.** సం. అ. క్రి. సుఖించు, అనుభవించు. (ఉపభోగించు అనియు.)

**భోగిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుఁబాము; 2. భోగముది; 3. పట్టాభిషిక్తురాలుకాని రాజుభార్య.

**భోగ్యము.** సం. వి. అ. న. 1. ధనము; 2. ధాన్యము. విశే. భోగింపఁదగినది.

**భోజనము.** సం. వి. అ. న. ఆహారము, కుడుపు.

**భోజ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) భుజింపఁదగినది.

**భోషాణము.** దే. వి. పెద్దపెట్టె.

## భౌ.

**భౌతికము.** సం. వి. అ. న. ముత్తెము. విశే. భూతసంబంధమైనది.

**భౌముఁడు.** సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు. విశే. భూమియందుఁబుట్టినవాఁడు.

**భౌరికుఁడు.** సం. వి. అ. పుం. బంగారునాణెపు బండారమున కధికారి.

## భ్ర.

**భ్రంశము.** సం. వి. అ. పుం. 1. చలించుట; 2. జాఱుట,

**భ్రకుంసుఁడు.** సం. వి. అ. పుం. భ్రుకుంసుఁడుయొక్క-రూపాంతరము.

**భ్రకుటి.** సం. వి. ఇ. స్త్రీ. భ్రుకుటియొక్క-రూపాంతరము.

**భ్రత్నము.** సం. వి. అ. పుం. తనతప్పును మఱుఁగుపుచ్చుట.

**భ్రమణము.** సం. వి. అ. న. తిరుగుడు. పుం. తుమ్మెద.

**భ్రమము.** సం. వి. అ. పుం. 1. భ్రాంతి; 2. తిరుగుడు; 3. బండికంటితిరుగుడు; 4. నీళ్లు వెలికిఁబోవుటకేర్పఱచిన తూములోనగునది.

**భ్రమరకము.** సం. వి. అ. పుం. 1. తుమ్మెద; 2. బొంగరము; 3. ముంగురులు.

**భ్రమరము.** సం. వి. అ. పుం. 1. తుమ్మెద; 2. ముంగురులు; 3. అభినయహస్తవిశేషము.

**భ్రమరించు.** సం. అ. క్రి. భ్రమణముచేయు, తిరుగు. "వ, ట్పదములుపుష్పగుచ్ఛములపైభ్రమరించుచు." హరిశ్చ. ౧, ఆ.

**భ్రమి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. భ్రమణము, తిరుగుడు.

**భ్రమించు.** సం. అ. క్రి. భ్రమరించు, తిరుగు.

**భ్రష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) జాఱినది.

**భ్రష్టుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) వెలివేయఁబడ్డవాఁడు. (రూ. భ్రష్టు.)

## భ్రా.

**భ్రాంతము.** సం. విశ. (అ. ఆ. అ.) భ్రాంతినొందినది.

**భ్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. మిథ్యామతి; (ఉన్నదిలేనట్టులేనిది ఉన్నట్టునుతలఁచుట.) 2. భ్రమణము; 3. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**భ్రాజితము.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రకాశమునొందినది.

**భ్రాజిష్ణువు.** సం. విశ. (ఉ.) ప్రకాశించువాఁడు.

**భ్రాత.** సం. వి. ఋ. పుం. తోడఁబుట్టినవాఁడు.

**భ్రాతృవ్యుఁడు.** సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టినవాని కొడుకు; 2. పగవాఁడు.

**భ్రాత్రీయుఁడు.** సం. వి. అ. పుం. తోడఁబుట్టినవానికొడుకు.

**భ్రామరము.** సం. వి. అ. న. భ్రమరములుగూర్చిన తెల్లనితేనె. పుం. ఒకదినుసురాయి. విశ. భ్రమరసంబంధమైనది.

**భ్రాష్ట్రము.** సం. వి. అ. పుం. వేఁపుడుచేట్టి, మంగలము.

## భ్రు.

**భ్రుకుంసుఁడు.** సం. వి. అ. పుం. స్త్రీవేషమువేసికొని ఆడెడు పురుషుఁడు.

**భ్రుకుటి.** సం. వి. ఇ. స్త్రీ. బొమముడి. (రూ.) భృకుటి.

## భ్రూ.

**భ్రూకుంసుఁడు.** సం. వి. అ. పుం. భ్రుకుంసుఁడుయొక్క-రూపాంతరము.

**భ్రూకుటి.** సం. వి. ఇ. స్త్రీ. భ్రుకుటియొక్క-రూపాంతరము.

**భ్రూణ.** సం. వి. ఆ. స్త్రీ. చూలాలు. అ. పుం. ము. 1. గర్భము; 2. బిడ్డ.

**భ్రూభంగము.** సం. వి. అ. పుం. బొమముడి.

**భ్రూవు.** సం. వి. ఊ. స్త్రీ. కనుబొమ.

## భ్రే.

**భ్రేషము.** సం. వి. అ. పుం. తనకుచితమైన ధర్మమునుండి చలించుట.

## మ.

**మ.** ఒక అక్షరము.

**మంకు.** దే. విశ. 1. మొండి; 2. మూర్ఖుఁడు.

**మంకెన.** దే. వి. 1. బంధూకముꣳ; 2. ఎద్దుమీఁద నీళ్లబిందెలు తెచ్చునపుడు ఆ బిందెలక్రింద కుదురుగా నంతనచేసియుంచఁబడు బెత్తపుబుట్టలజేత.

**మంఖుణము.** సం. వి. అ. న. పిక్కలకుఁదొడిగికొను కవచము.

**మంగ.** దే. వి. పిండీతకముꣳ.

**మంగల.** దే. వి. క్షౌరకజాతి. (మంగలవాఁడు, మంగలది.)

**మంగలకత్తి.** ద్వ. వి. మంగలవానికత్తి, క్షురము.

**మంగలకత్తిమూపు.** ద్వ. వి. కృత్తికానక్షత్రము.

**మంగలపక్కి.** దే. వి. మత్స్యవిశేషము.

**మంగలపిట్ట.** ద్వ. వి. ఏట్రింత, భారద్వాజము.

**మంగలము.** దే. వి. వేఁపుడుచేట్టి, భ్రాష్ట్రము.

**మంగలి.** దే. వి. మంగలవాఁడు, క్షౌరకుఁడు.

**మంగలికోళ్లు.** దే. వి. బ. సన్నాయి, నాగసరము. "క. మంగళ సూత్రముగట్టెఁగు, రంగాక్షికినంతరంగరాజేంద్రుఁడుపు, ణ్యాంగ నలపెండ్లిపాటలు, మంగలికోళ్లమృదుగీతిమధురిమసెనయన్." కళా. ౭, ఆ.

**మంగలిపని.** దే. వి. క్షౌరము. "తే. వలయుఁబ్రాహ్మణోదక్షుఖత్వ ములనొకటి, దారకంబులుఁదిఘులునవారములుచు, జోస్యులెచెఁగించినవిమేలుసువ్రతైక, శీలమంగలిపనికినిదైలమునకు." భార. అను. ౪, ఆ.

**మంగళ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. తెల్లగఱికꣳ. అ. న. ము. 1. శుభము; 2. క్షేమము.

**మంగళదేవత.** సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

**మంగళవారము.** సం. వి. అ. పుం. ఒక వారము. (చూ. వారము.)

**మంగళసూత్రము.** సం. వి. అ. న. బొట్టుదారము.

**మంగళహారతి.** వై. వి. మంగళారతియొక్క-మాఱురూపము.

**మంగళారతి.** వై. వి. మంగళకరమైన ఆరతి. "ద్వి. అంగనల్ వివిధపుష్పాంజలులిచ్చి, మంగళారతులెత్తిమహిమ్రొక్కువారు." బస. ౧, ఆ. (ఇది అంచేయానవంటిది.)

**మంగళాశాసనము.** సం. వి. అ. న. (వైష్ణవపరిభాషయందు) ఆశీర్వాదము.

**మంగళుఁడు.** సం. వి. అ. పుం. అంగారకుఁడు.

**మంగళ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోచనము; 2. శమ్మిꣳ; 3. తెల్లవసꣳ; 4. సదాపꣳ. అ. న. ము. 1. మల్లెపూవాసనగల

అగలు; మల్లెపూవానగల నల్ల అగలు. (అనికొండఱు.) 2. మీఁగడపెరుఁగు. పుం. 1. కలుక్రాంతి*; 2. మారేడు*; 3. రావి*; 4. చిఱుసెనగలు. విణ. శుభకరము.

**మంగి.** దే. వి. మంగలవాఁడు, క్షౌరకుఁడు.

**మంగు.** దే. వి. మాఁగుయొక్క రూపాంతరము.

**మంగుడు.** దే. వి. ముఖమునందలి నల్లనిపొడ.

**మంచము.** సం. వి. అ. పుం. 1. మంచేము; 2. మంచె.

**మంచి.** దే. వి. మేలు. (మంచిసెబ్బరలు.) విణ. యోగ్యము. "ఉ. మంచిగభూరిభూసురసమాజమునెల్లనుభక్తితోడఁబూజించి." భార. సభా. ౧, ఆ. [మఱియు దీనికి సందర్భానుసారముగా అనేకార్థములుకలవు. "సీ. మంచిమగండుదామగ్రంథియసమసంగ్రామకేళీగాఢకౌతుకుండు." (ఇక్కడ మంచికి మిక్కిలియని అర్థము.) భార. విరా. 3, ఆ.]

**మంచిగంధము.** దన్వ. వి. శ్రీచందనము.

**మంచినీళ్లు.** దన్వ. వి. బ. పానయోగ్యమగు జలము.

**మంచినూనె.** దన్వ. వి. తలంటుకొను తైలము.

**మంచిపాము.** దే. వి. నాగుఁబాము, త్రాఁచు.

**మంచిబెల్లము.** దే. వి. చెఱకురసముతో చేసినబెల్లము.

**మంచిముత్తెము.** దన్వ. వి. అకృత్రిమమైన మౌక్తికము.

**మంచియ.** వై. వి. మంచెకు మొదటిరూపము.

**మంచె.** వై. వి. జొన్నచేనుమొదలగుచోట్ల కూర్చుండుటకై యెత్తుగా వేసెడు చప్పరమువంటిపందిరి.

**మంచేము.** వై. వి. మంచము, పర్యంకము.

**మంచు.** దే. క్రి. మనుచుయొక్క రూపాంతరము. "ఉ. మంచిత నేకయాగములమానుగదక్షిణలిచ్చి విప్రులన్." భార. ఆది. ౨, ఆ.—వి. హిమము.

**మంచుఁగొండ.** దన్వ. వి. హిమవత్పర్వతము. (ఇట్లు మంచుగుబ్బలి మొ.)

**మంచుతఱి.** దే. వి. హేమంతఋతువు.

**మంజరి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. చిగిరించినలేఁతకొమ్మ; పూచిన లేఁతకొమ్మ. (అనికొండఱు.) 2. బొట్టుగు*; 3. పెద్దముత్తెము. (దీనికర్థము పూగుత్తియని తఱచుగా వాడుదురు. "స్యాద్గుచ్ఛకస్తు స్తబకః" అని పూగుత్తిపర్యాయములు మఱియొకచోఁ జెప్పఁబడియున్నవికదా.)

**మంజిటి.** వై. వి. మంజిష్ఠ*.

**మంజిడి.** వై. వి. 1. చిత్రవర్ణవస్త్రము*; "సీ. బలుమంచుఁగంబాలబలసి రాఁజుట్టినక్రొత్తమంజిడిబాగుఁగొఱఁతనేసి." (ఈ పద్యమునందు ఎత్తుగీతముచూడవలసినది.) ఉ, హరి. ౨, ఆ.— 2. నీలవస్త్రము*. "సీ. వృష్టిగాకుద్ధాంబువేణిమజ్జనమార్చిశిఖరిమేఘముగమంజిడిఘటించి." పాండు. ౨, ఆ. [‛‛సీ. మక్కళించినతావుమంజిళ్లపెందెరలుంగరంబులఁబట్టియొత్తువారు." (అనునీ యుదాహరణమునుబట్టి యీ రూపమే సరియని తోఁచుచున్నది.) వై. ౬, ఆ.]

**మంజిమ.** సం. వి. న్. పుం. మనోజ్ఞత. (రూ. మంజిమము.)

**మంజిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకచెట్టు; 2. మిక్కిలి ప్రకాశించెడి యెఱుపు.

**మంజిష్ఠారాగము.** సం. వి. అ. పుం. బయటికిని విశేషముగా కనఁబడుచు లోపలను ఎప్పటికి వీడకుండెడు గాఢానురాగము. (చూ. పూర్వరాగము.)

**మంజీరము.** సం. వి. అ. పుం. అందె, నూపురము.

**మంజులము.** సం. వి. అ. న. 1. పొంచి; 2. పొదరిల్లు. పుం. ఒకదినుసు కూకుడుగుండెంగపక్షి. విణ. ఒప్పిదమైనది.

**మంజువు.** సం. విణ. (ఉ.) మనోజ్ఞము.

**మంజూరు.** హిం. వి. అంగీకారము.

**మంజూష.** సం. వి. ఆ. స్త్రీ. పెట్టె, మందసము.

**మంజెస.** వై. వి.———పై.——— "ఆ. ఘనభుజుండురాధయను దానిపతియొక్క, సూతుఁడరుగుదెంచిచూచిరత్న, పుంజభరితమైన మంజసలోనున్న, కొడుకుదానితోనకొనుచువచ్చి." భార. ఆది. ౫, ఆ.

**మంజోడి.** దే. వి. వజ్రములతూనిక. (రూ. మంజాళి.)

**మంట.** దే. వి. 1. జ్వాల; 2. కోపము; "తే. పావకుండునుగపటంపుభూవరుండుఁ, దమ్ముఁగనుఁజేరిమఁటిమేలమ్ముతోడ, నన్న వారికిఁ గీడుచేయుదురువారి, కంచితస్నేహముసమంటలధికమగును." వి, పు. ౭, ఆ. — 3. చుఱుకుమనెడునొప్పి. (గాయము తగిలినచోట మంటయెత్తుచున్నది.)

**మంటకము.** సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము, మండెఁగ.

**మంటచేమురు.** దే. వి. ఎఱ్ఱగాఁగాలిన గరిఁటెలోపోయఁగా మండెడుచేమురు. (ఇట్లు మంటసేయి మొ.)

**మంటమారి.** దే. విణ. 1. జ్వలనశీలుఁడు; (చూ. నేఱా.) 2. కోపశీలుఁడు. "తే. మఱియునమ్మంటమారిఁ, గలయనెక్కించుకొనివచ్చు మలయనగభు, జంగవిమదిగ్గపవనుపైఁజలమువాడవు." వసు. ౪, ఆ.

**మంటినూనె.** దన్వ. వి. (మన్ను+నూనె.) (చూ.) మట్టితైలము.

**మండ.** ఉభ. దే. వి. 1. శాఖ; 2. ఉపశాఖ; "వ. మండగలకంపమండలు." స్వా. ౪, ఆ.—3. వేఁపుకుచ్చు; 4. చీలమండ. సం. ఆ. స్త్రీ. ఉసిరిక*.

**మండకంచేము.** దన్వ. వి. అంచుకట్టినకంచేము.

**మండనము.** సం. వి. అ. న. 1. భూషణము; 2. అలంకరించుట. విణ. అలంకరించునది.

**మండపము.** సం. వి. అ. పుం, న. 1. చుట్టును నడుమను మఱుఁగులేక స్తంభములునిలిపికట్టిన కట్టడము, చవిక; 2. చావడి.

**మండపి.** సం. వి. ఈ. స్త్రీ. చిన్నమండపము.

**మండము.** ఉభ. దే. వి. చేపలఁబొడుచు చిల్లకోల. సం. అ. న. మీఁగడ. పుం, న. 1. గంజి; 2. నూనెలోనగువానితేట. పుం. 1. ఆముదపుఁజెట్టు; 2. భూషణము; 3. ఒకదినుసు కూరాకు.

**మండలము.** సం. వి. అ. న. 1. పరివేషము; 2. దేశము; 3. కుక్క*; 4. విలుకాఁడురెండుకాళ్లతో మండలాకారముగా నిలుచుట; (చూ. స్థానము.) 5. పన్నిద్దఱురాజులు. పుం. 1. సమూహము; 2. వలయాకారముగాదీర్చినయొకవ్యూహము; 3. కుక్క. త్రి. సూర్యచంద్రాదులబింబము.

**మండలాగ్రము.** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**మండలి.** సం. వి. ఈ. స్త్రీ. సమూహము. న్. పుం. 1. పాము; 2. మండలేశ్వరుఁడు; 3. సూర్యుఁడు; 4. పిల్లి; 5. కుక్క.

**మండలేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిశ్వరసార్వభౌములకంటె ఇతరుఁడైనరాజో.

**మండవాయి.** దృ. వి. గుల్మవాయువు.

**మండహారకుఁడు.** సం. వి. అ. పుం. కల్లిలివాఁడు.

**మండాటము.** దే. వి. దైన్యముతో యాచించుట.

**మండాడు.** దే. స. క్రి. దైన్యముతో యాచించే. "ద్వి. ఆవేళ భయకంపితాత్ముఁడైవాఁడు, చండికి నీశ్వరేశ్వరునకునెరఁగి, మండాడఁబోయిన." పండి. ప్ర. ౧.

**మండాము.** దే. వి. మండనముయొక్క-రూపాంతరము.

**మండి.** దే. వి. ఒకకాలు నేలమోఁకరించుట.

**మండిగండ్రలు.** దే. వి. బ. ధాన్యవిశేషము.

**మండిగము.** దే. వి. వాకిటిక్రింద అడ్డముగానమర్చినకొయ్య, శిల.

**మండితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినవాఁడు.

**మండేలూటి.** దే. వి. బయటపొటమరింపక లోపలనణఁగియుండు వ్రణము.

**మండీ.** దే. వి. మండికి మొదటిరూపము.

**మండు.** దే. అ. క్రి. 1. జ్వలించు; "క. క్రోధం, బేమియు మానకమండెడు, నామునిమునియే." సా. ౪, ఆ.—2. చుఱుకుమనినొచ్చు; (గాయముమండుచున్నది.) 3. ఈర్ష్యాదులచేఁ దపించు. (ఒళ్లుమండుచున్నది మొ.)

**మండునెల.** దే. వి. వసంతఋతువు. "ఎ, గీ. వలపుఁదూపులు కరసానవాఁకినేసి, మండునెలతోడఁదనమేనమామయైన, నిండునెలతోడవలరాజునిర్గరేంద్రు, నధకునేతెంచె భుజబలోత్సాహమెసఁగ." ఉ, హరి. ౨, ఆ.

**మండువా.** వై. వి. 1. పాక; 2. ఒకతట్టు గోడలేని గుజ్జాలపాక. "మహాస్రగ్ధర. ఎకరాలన్ మండువాసాహిణములఁగల భద్రేభసందోహవాహా, ప్రకరంబుంగొంచు." సా. ౧, ఆ.

**మండూకపర్ణము.** సం. వి. అ. పుం. దుండిగము*.

**మండూకపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పొన్నగంటి*; 2. బెండ*; 3. మంజిష్ఠ*.

**మండూకము.** సం. వి. అ. పుం. 1. కప్ప; 2. దుండిగము*. (రూ. మండుకము.) డు. ఒక ఋషి.

**మండూరము.** సం. వి. అ. న. 1. ఇనుపచిట్టెము; 2. ఇనుపచిట్టెముతోచేసిన సిందూరము.

**మండె.** దే. వి. జొన్నకంకులు పిట్టలుతినకుండ వ్రుగ్గుటకై బ్రోగువేసిమీఁదకప్పిపెట్టుట. (మొదటిరూపము మండియ.)

**మండెఁగ.** వై. వి. పంచదారవేయని గోదుమపూరి. "సీ. చింపివల్క-ములేమిచే సెడిదనఁగాపునెఱవైనకండమండెఁగలుగాని." జై. ౮, ఆ. "క. మండెం, గలుచీరలుగభుజక్రియ, వలపించెం బెండ్లివారివనితయుఁబోలెన్." నై. ౭, ఆ.

**మండెము.** వై. వి. మాఁడెముయొక్క-రూపాంతరము.

**మండ్ర.** దే. వి. ఒకానొక ముండ్లచెట్టు. "ఎ, గీ. మాద్పుచిటికొక్కి-సీకాయ మండ్రతొఱ్ఱ." హంస. ౪, ఆ.

**మండ్రగబ్బ.** దే. వి. నల్లని పెద్దతేలు, పడ్డిందువు.

**మండ్రాటము.** దే. వి. సంతాపము. "శా. పండ్రెండేడులు నీగతింజనఁగ జంభద్వేషిముఖ్యామరుల్, మండ్రాటం బిదియేల చెప్పఁదను కామధ్వంసికినేమముల్, గుండ్రాయైనఁజెమర్పునింతకన్నాగో పాలచూడామణిన్, గండ్రౌకానరొ వారు చెప్పఁదగదా, కైలాసవాచంయముల్." ఉ, హరి. ౨, ఆ.

**మండ్రాడు.** దే. అ. క్రి. సంతాపించు.

**మంత.** సం. విశ. (ఋ. ఈ. ఋ) ఆలోచించువాఁడు.

**మంతనము.** వై. వి. 1. ఆలోచన; "మ. యదువంశంబునసంబుజోదరమునం దాబ్రహ్మయుంబోలెనీ, వుదయంబొంది సమస్తయాదవ భయవ్యుచ్ఛేదదక్షుండవై, త్రిదశేంద్రాదుల . మంతనంబులనుబుద్ధింగాంతు." హరి. ఉ. ౧, ఆ.—2. ఏకాంతము*; "కై. మంతనంబుననేమేమొమాటలాడి." అచ్చ. సుం, కాం.—3. రహస్యము*. "క. దంతిపురనాథవినుమొక, మంతనమెఱిఁగింతుశమదమంబులునంహెూ, వంతుశుభవంతుఁజేయవు, కంతునిగురుభక్తిముక్తిగలిగించునతిన్." భాగ. ౬, స్క-ం.

**మంతరము.** వై. వి. 1. ప్రసవోపాయము*; 2. జాలవిద్య*. (మంత్రమునకు మొదటిరూపము.)

**మంతరసాని.** వై. వి. మంత్రసానికి మొదటిరూపము.

**మంతవ్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ఆలోచింపఁదగినవాఁడు.

**మంతిరి.** వై. వి. మంత్రి. "మ. చెంతమం, తురులంబిల్చిప్రవాహకారణముఁ దోడ్తోనారయం బంచినన్." ఉ, రా. 3, ఆ.

**మంతిరించు.** వై. అ. క్రి. మంత్రముచేయు. "ఎన్నిమందులిడితివో యేమిమంతిరించితివో." క్షేత్రయ.

**మంతు.** యు. దే. వి. ప్రసిద్ధి. "ద్వి. మంతుకెక్కి-నహనుమంతుండుఁదాము." రా. కిష్కి-ం, కాం.—వై. 1. మంత్రి; "క. సంతసిలియాతఁడాహను, మంతునకానతియొసంగిమదిలోమిగులన్, వంతయెలర్పఁగనపుడే, మంతులతోఁగూడిచనియెమలయంబునకున్." అచ్చ. కిష్కి-ం, కాం. — 2. చదరంగమున మంత్రిగానుంచుకొన్నకాయ*; 3. మంత్రము. (చూ. నాగబెత్తము)

**మంతువు.** సం. వి. ఉ. స్త్రీ. తెలివి. పుం. 1. అపరాధము; 2. మనుష్యుఁడు; 3. రాజో.

**మంత్రకాఁడు.** దృ. వి. (మంత్రము+కాఁడు.) ఇంద్రజాలవిద్య నెఱిఁగినవాఁడు. "క. తెగుతలలుమొలచుతలలున్, దిగుపంబడుతలలుమొగులుతెరువునకువడిన్, నెగయుతలలప్పుడబ్బురపుగుచున్ జగమంత్రకానియాటయుఁబోలెన్." అచ్చ. యు, కాం.

**మంత్రణ.** సం. వి. ఆ. స్త్రీ. రహస్యాలోచన. (రూ. మంత్రణము. అ. న.)

**మంత్రము.** ఉభ. వై. వి. 1. ప్రసవోపాయము*; (మంత్రసాని.) 2. జాలవిద్య*. (చూ. మంత్రకాఁడు.) — సం. అ. పుం. 1. గాయత్రిలోనగునది; 2. రహస్యము; 3. అథర్వవేదము.

**మంత్రవాది.** సం. వి. న్. పుం. మాంత్రికుఁడు.

**మంత్రసాని.** వై. వి. (మంత్రము+సాని.) సుఖముగా ప్రసవింపనుపాయముచేసెడుచికిత్సకురాలు, సావిత్రి. (మంతరసానియొక్క-రూపాంతరము.)

**మంత్రాంగము.** సం. వి. మంత్రిత్వము, తంత్రము.

**మంత్రి.** సం. వి. న్. పుం. 1. బుద్ధిసహాయుఁడు; 2. సహాయుఁడు.

**మంత్రించు.** సం. అ. క్రి. మంతిరించు.

**మంథదండము.** సం. వి. అ. పుం. కవ్వము.

**మంథనము.** సం. వి. అ. న. త్రచ్చుట పుం. కవ్వము.

**మంథని.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) తరిగడవ.

**మంథము.** సం. వి. అ. పుం. 1. కవ్వము; 2. కంటినొప్పి; 3. అంబలి; 4. వధము. డు. సూర్యుఁడు.

**మంథరజ్జువు.** సం. వి. ఉ. పుం. (చూ.) తరిత్రాడు.

**మంథరము.** సం. వి. అ. పుం. 1. కవ్వము. విణ. 1. చొరవ లేనిది; 2. మెల్లగాఁబోవునది; 3. వంకరైనది; 4. విరివియైనది.

**మంథాద్రి.** సం. వి. ఇ. పుం. కవ్వపుఁగొండ. (ఇట్లు మంథాచలము, మంథశైలము మొ.)

**మంథానము.** సం. వి. అ. పుం. మంథదండము, కవ్వము.

**మంద.** దే. వి. 1. ఊరికివెలుపల పశువులుండుచోటు, గోష్ఠము; "ఆ. పుణ్యదినమునందుభూసురానుజ్ఞతో, నుపవసించిగోవులున్న మంద, కరిగిపరమనియతినయ్యహోరాత్రము, గోష్ఠమునవసించి నిష్ఠతోడ." భార. అను. ౨, ఆ.—2 పశుసమూహము; 3. గొల్లపల్లె, వ్రజము. "వ. జనపదంబులును బురంబులును గ్రామంబులును బల్లెలును మందలును." సం. "స్థితాః జనపదాస్తత్ర పురగ్రామవ్రజాకరాః." భాగ. ౧, స్కం.

**మందకట్టు.** దే. వి. గొల్లపల్లెలవారు ఏర్పఱుచుకొన్న యేర్పాటు.

**మందగామి.** సం. విణ. (న్. ఈ. న్.) మెల్లగానడచువాఁడు.

**మందగించు.** వై. అ. క్రి. మందమగు. "యానముల్ వేమఱు మందగించె." హంస. ౨, ఆ.

**మందగొను.** దే. అ. క్రి. మందగాఁగూడు. "క. ఇచ్చోఁబచ్చికమేసిన, విచ్చోఁద్రాగినవితోయమేగినవిచ్చో, నిచ్చోటమందగొన్నవి, యిచ్చోఁబొసినవి జాడయిదెయిదెయనుచున్." భాగ. ౧౦, స్కం. పూ.

**మందటు.** దే. వి. 1. సమీపము; "చ. మనములనమ్మతించితమ మందటనాసభవారుతీర్చిచె, ప్పనగలిచేసిరి." పంచ. నా. ౧, ఆ.—2. అడఁకువ. "మ. వినుకుం భాండయనేకకాలము మహావీరాహవప్రౌఢిపెం, పునఁగ్రీడింపఁగలేకనాదగుభుజంబుల్ మందటంబొందినన్." హరి. ఉ. ౭, ఆ.

**మందటిల్లు.** దే. అ. క్రి. అడఁగు. (రూ. మందటిలు. "క. క్రమ్మచీఁకటి, మందటిలెన్ మేలుకట్టుమానికములచేన్." య. ౪, ఆ.)

**మందడి.** వై. వి. గుఱ్ఱపుశాల, మందుర. "ద్వి. ఈరేయిమందడి యొల్లమైమఱచి, తొరునిద్రించునత్తఱిఁజిచ్చువెట్టు, మీవాజిశాలల నిటుచేసితేని, భావములోనవాపలుకులు మెచ్చి, తగనృపుండిచ్చు నర్థంబులోనీకు, సగమిత్తు." నవ. 3, ఆ.

**మందడీఁడు.** దే. వి. (మందడి+ఈఁడు.) గుఱ్ఱపువాఁడు, మందురకుఁడు. "ఎ, గీ. లాయమునను‌న్న, యపుడుదొనఁగించుకయు లేనియట్లుగాఁగ, మాటిమాటికిఁబదికించిమందడీల, కెల్లనూఱటయగుచువర్తిల్లనేర్తు." భార. విరా. ౧, ఆ.

**మందపిచ్చుక.** దే. వి. చటకవిశేషము, ఖంజరీటము.

**మందప్రోయాలు.** ద్వ. వి. గొల్లది, ప్రేత. "ఎ, గీ. మందప్రోయాంద్రకూరిమిప్రాపనిపండు." పాండు. ౨, ఆ.

**మందము.** ఉభ. దే. విణ. 1. దట్టము; 2. స్థూలము. "ద్వి. నడుముమందంబాయెనాభికన్పడియె." నళ. ౨, భా.—సం. వి. అ. పుం. గజజాతివిశేషము. (చూ. గజము.) (ఈ జాతిగజము యుద్ధకాలమునందు వాహనయోగ్యమైనది.) విణ. 1. చొరవలేనిది; 2. మెల్లనిది.

**మందరము.** సం. వి. అ. పుం. 1. కవ్వపుఁగొండ; 2. మందారమనుకల్పవృక్షము. విణ. 1. అలసము; 2. బహుళము.

**మందల.** దే. వి. 1. మేర; "వ. వసుదేవుండుబ్రదుకుమందలగంటిననుచు సుందరియుందానును మందిరంబునకుంబోయిచెందంబుననానందంబుఁబొందియుండె." భాగ. ౧౦, స్కం. పూ. (మేరయనఁగా నిక్కడ విధమనియర్థము.)—2. మనుదల, జీవము; "వ. ఇట్లు రాజలోకంబునెల్లనక్రమంబుననోడించి సాల్వరాజు మందలవిడిచి." సం. "జిత్వావిసర్జయామాస జీవంతంనృపసత్తమమ్." భార. ఆది. ౮, ఆ. "సహదేవుఁజులుకనమర్దించివిమందల విడువఁడే." భార. కర్ణ. ౧, ఆ. (ఇది యీయర్థమునందువిడుచు ధాతువుతోఁగూడియే ప్రయోగింపఁబడియున్నది.)—3. సమీపము.

**మందలించు.** దే. స. క్రి. 1. చెప్పు; "తే. ఇంతయలుకకుఁగారణంబిదియటంచు, మందలింపుమునాయానమందయాన." ఇళా. ౪, ఆ. — 2. ఆజ్ఞాపించు; "తే. మందకొందలమందనమందవృష్టిఁ, గ్రందుకొనుఁడంచు నింద్రుఁడు మందలింప." భాగ. ౨, స్కం. (ఇక్కడ చెప్పుననుటకంటె ఆజ్ఞాపింపుననుట యుక్తము.) -- 3. మనవిచేయు; "తే. ఇన్నియుపచారములుచేసియిందువదన, లన్నియునుజూడమునుపటికన్నమిగుల, బాధకములయ్యెదయలేని ప్రభువుతోడ,మందలించినమనవులచందమునను." అని. 3, ఆ. — 4. హెచ్చరించు; "ద్వి. నీవునదేవముని శ్రేణిఁగలసి, వేవచ్చిననుఁజేరి వేఁడుచున్నపుడు, మందలించెదఁగాక." విష్ణు. పు. 3, ఆ. — 5. తలఁచు. "సీ. ముక్తకంచుకముస్తముక్తాఫలంబులమందలింతురుగురువిందలట్ల." కాళ. ౨, ఆ.

**మందలింపు.** దే. వి. వ్యవహారము. (చూ. అరగింపు.)

**మందస.** వై. వి. పెట్టె. "ద్వి. తటుకుననరిగిమందసఁబట్టుఁడనుచు." నవ. 3, భా. (రూ. మందసము. "చందుగుపెట్టెలుమందసములు." నీలా. 3, ఆ.)

**మందహాసము.** సం. వి. అ. పుం. చిఱునవ్వు.

**మందాకిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. గంగ; 2. ఆకాశగంగ; 3. ఒకానొకవృత్తము; 4. అఱువదేండ్ల ఆఁడుది.

**మందాకు.** దే. వి. (మందు+ఆకు.) ఓషధి. (చూ. పసరు మొదటి యర్థము.)

**మందాక్షము.** సం. వి. అ. న. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప.

**మందారము.** ఉభ. దే. వి. మేఘావరణము. సం. అ. పుం. 1. ఒక కల్పవృక్షము; 2. జిల్లేడుచెట్టు; 3. బాడిదముచెట్టు.

**మంది.** దే. వి. 1. జనసమూహము; 2. పరిజనము; "ఉ. తప్పుగణించికాదొరలు దండనసేయుదురొద్దివారివా, తప్పనకల్గిమందిగలదాననటంచును మారుతూపులం, గుప్పితివీవు." ఉ, రా. ౬, ఆ.—3. కాలుబలము. "ఉ. మందిగుఱ్ఱాలునేనుఁగులుమావుతులున్ దొరలెన్నఁజెక్కులై, గ్రందుగఁగూర్మితోనెదురుగాఁజనిపోఁజాలు దీర్చ." య. ౧, ఆ.

**మందిరము.** సం. వి. అ. న. 1. ఇల్లు; 2. పట్టణము. పుం. సముద్రము.

**మందీభవించు.** సం. అ. క్రి. మందమగు.

**మందు.** దే. వి. 1. ఔషధము; 2. వశ్యౌషధము; 3. ప్రతిక్రియ; "క. వినుముపురాతనజన్మం, బునఁజేసినయట్టికర్మములఫలములుప్రా, జ్ఞానినైనఁబొందువానికి, మనుజేశ్వరమందుధైర్యమహి

మయచుమ్మీ." భార. శాం. ర, ఆ.—4. ఉపాయము. "చ. అని మొనదేవదానవులనైననుగెల్వనశక్యమిమ్మహా, స్త్రునినొకమందుసెప్పెదనుతుఁ బాతుఁడయ్యెననంగవిన్నయం, బనయితఁడాయుధంబుదిగఁద్రావియచేష్టతఁబొందునప్పుడీ, తనిఁబరిమార్పవచ్చునిదిలప్పను పాయము గల్గదెమ్మెయిన్." భార. ద్రో. ౫, ఆ. — విశ. దుర్లభము. "కూడుదానఁగల్గెనేనిఁగూరగుటమందు." ఆము. ర, ఆ.

**మందుఁడు.** సం. వి. అ. పుం. శని. విణ. 1. చేరవలేనివాఁడు; 2. అల్పుఁడు; 3. ఇచ్చేవచ్చినట్టు తిరుగువాఁడు; 4. నిర్భాగ్యుఁడు; 5. మూర్ఖుఁడు; 6. వ్యాధిగ్రస్తుఁడు.

**మందుపట్టెడ.** దే. వి. బాణసంచుచేసెడుశాల.

**మందుభాయి.** గ్రా. వి. నల్లమందుతినువాఁడు.

**మందుమల.** ద్వ. వి. మందుచెట్లుండుపర్వతము, ద్రోణము.

**మందుర.** సం. వి. ఆ. స్త్రీ. 1. లాయము; 2. పడక.

**మందురకుఁడు.** సం. వి. అ. పుం. గుఱ్ఱపువాఁడు, మందడీఁడు. "క. ఆవనితయునిచ్చెఁగూర్చుహయపాలునకున్. క. అమ్మందురకుఁడుతద్గృహ, సమ్మార్జనికిచ్చె." విక్ర. 3, ఆ.

**మందులమారి.** దే. విశ. మర్లుమందుపెట్టువాఁడు, మర్లుమందు పెట్టునది.

**మందెమేలము.** దే. వి. 1. ఉపేక్ష; "వ. సితచ్ఛత్రచామర శంఖకిరీట చిత్రశయ్యాసౌధసింహాసనంబులు కైకొనుట మనమందె మేలంబునంగాదె." సం. "కిరీటమాసనంశయ్యాం భుంజత్యస్మదుపేక్షయా." భాగ. ౧౦, స్కం. ఉ. — 2. చనవు; "క. అని చెనకుచునదితను డా, సిన మునికో పించియోసిచెడుగవెఱపుమా, లిననుంగదియఁగవచ్చెదు, మునుకొవి యీమందె మేలమునకోర్వఁ జూమీ." భో. ర, ఆ. — 3. స్నేహము. (చూ. మంట రెండవ అర్థము.)

**మందోష్ణము.** సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విశ. ఇంచుకవేఁడియైనది.

**మంద్రము.** సం. విశ. (అ. ఆ. అ.) గంభీరమైనది. (స్వరము.)

**మంపిల్లు.** దే. అ. క్రి. మత్తిల్లు. "సీ. క్రొవ్వులుల్ మంపిల్లి గొటగొటమనిరొప్పిబలుసింగములనైనఁబట్టఁజూచు." సా. ౧, ఆ. (రూ. మంపిలు. "ద్వి. పరలోకసౌఖ్యసంపదలమంపిలుము." విష్ణు. ఉ. ౫, ఆ.)

**మంపు.** దే. వి. 1. మత్తు; "ఉ. మంపెసఁగంగటాక్షలవమాత్రముచేతనెముజ్జగంబుమో, హింపఁగఁజేయుభారమిఁకనీవువహించితిగాన." విజ. ౧, ఆ.—2. మైకము. "సామినీకన్నులనిద్దురమంపు." క్షేత్రయ.

**మంపుగొను.** దే. అ. క్రి. (మంపు+కొను.) మత్తిల్లు. "తే. మంపుగొనిమేయెఱుంగకమలసిమలసి." ఉ, హరి. ర, ఆ. (ప్రే. మంపుగొలుపు.)

**మంబరము.** దే. వి. దహనము. (చూ. మంబరముసేయు.)

**మంబరముసేయు.** దే. స. క్రి. (మంబరము+చేయు.) దహించు. "ఉ. కౌఁగిటం, జేపడఁబట్టిమంబరముసేసెదిగంబరవేమఁగృత్య." ఉ, హరి. 3, ఆ.

**మకరందము.** సం. వి. అ. పుం. పూఁదేనె.

**మకరకంఠి.** సం. వి. ఈ. స్త్రీ. నడుమ మొసలిముఖమేర్పఱచిన కంఠభూషావిశేషము.

**మకరకుండలము.** సం. వి. అ. న. మొసలిముఖమేర్పడఁజేసిన పురుషునికర్ణభూషావిశేషము.

**మకరతము.** సం. వి. అ. న. మరకతముయొక్క మాఱురూపము. "చ. సకియకలంకతోయకణసంగతపద్మపలాశమధ్యహ, ల్లకరుచులొప్పెడున్గొలఁకులచ్చినినంగనిచెల్మిహెచ్చఁగా, మకరతపాత్రలోవిమలమౌక్తికముల్ జతగూర్చిరత్నదీ, పకలననిచ్చునారతులభావమునన్ గనుఁగొంటెయిచ్చటన్." ఉ, రా. ౬, ఆ.

**మకరతోరణము.** సం. వి అ. పుం, న. మొసలిరూపమేర్పడఁజేసిన తోరణము.

**మకరధ్వజుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు. (ఇట్లు మకరకేతనుఁడు మొ.)

**మకరము.** సం. వి. అ. పుం. 1. పెద్దచేఁప; మొసలి. (అనికొందఱు.) 2. ఒక నిధి; (చూ. నిధి.) 3. ఒక రాశి; (చూ. రాశి.) 4. అభినయహస్తవిశేషము.

**మకరాంకుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**మకరాలయము.** సం. వి. అ. పుం. సముద్రము, కడలి.

**మకరిక.** సం. వి. ఆ. స్త్రీ. మకరికాపత్రము. "శ్రీరుక్మిణికిమకరికలుచెక్కులవ్రాసి." ఉ, రా. ౧, ఆ.

**మకరికాపత్రము.** సం. వి. అ. స. స్త్రీలకు చెక్కిళ్లలోనగు తావులయందు లత్తుకతోవ్రాసెడు మకరరూపమగురేఖ.

**మకరివల.** దే. వి. మృగములనుబట్టెడు ఒకదినుసువల. "వ. తెరచీరకట్టలుప్రోఁగుచుట్టలు దొడ్డివలలేటివల కుందేటివల పందివల నవదండవల మకరివల యెలికవల మొదలుగా వలయువలలును." కాశ. 3, ఆ.

**మకాము.** హిం. వి. బస. ప్రయాణమునందు నిలుచుస్థలము.

**మకిల.** వై. వి. 1. ముటికి*; 2. నలుపు*.

**మకుటము.** సం. వి. అ. న. కిరీటము, బొమిడికము.

**మకురము.** సం. వి. అ. పుం. 1. అద్దము; 2. పొగడ; 3. మల్లెపుష్పవృ; 4. కుమ్మరిసారెఁద్రిప్పెడుకఱ్ఱ.

**మకురుతనము.** దే. వి. మూర్ఖత్వము, మొండితనము.

**మకుష్టకము.** సం. వి. అ. పుం. అడవిపెసలు. (రూ. మపుష్టకము.)

**మకూలకము.** సం. వి. అ. పుం. దంతిచెట్టు.

**మక్క.** వై. వి. బిడ్డలుగన్నస్త్రీకి పొత్తికడుపునఁబుట్టెడి అపాయకరమైన నెత్తురుగడ్డ.

**మక్కనగాయ.** ద్వ. వి. (మక్కన+కాయ)———పై.———

**మక్కల్లము.** సం. వి. అ. పుం.———పై.———

**మక్కళించు.** దే. అ. క్రి. 1. తిరుగుకొను; (వానికి జ్వరము మక్కళించుకొన్నది. అనఁగా జ్వరమునిలిచియుండి మరలవచ్చినదనుట.) 2. నరిపఱచు; (చూ. మంజిడి.) 3. నరిపోలు. "సీ. కరికరశీకరకణములు విక్రాంతమక్తుటముక్తారుచిమక్కళింప." ఉ, హరి. ౬, ఆ.—అం, ప్రే. 1. తిరుగుకొనఁజేయు; "సీ. ఐణేయమైనయొడ్డాణంబులవణిచేనక్కళించినపాట్టమక్కళించి." (ఇక్కడ తిరుగుకొనఁజేయుట అనఁగా లోపలికి అడఁచుకొన్నకడుపునుమరల నుబ్బించుట అని యర్థము.) స్వా. ౧, ఆ.—2. నరిపఱచు; "సీ. సేనకొప్పునఁజుట్టుశిఖిపింఛరించోళి మక్కళించినబిల్లుమడుఁగుపాగ." (ఇక్కడ నరిపఱచుట అనఁగా చెక్కుట.) కాశీ. 3, ఆ. "సీ. మారేడుబుఱ్ఱలోమక్కళించుకసందిఁగట్టినచంద్రశేఖరుఁడు వెలయు." (ఇక్కడ నరిపఱచుట అనఁగా ఇముడ్చుట.) హంస. ౧, ఆ.—3. నరిపోల్చు. "ఎ, గీ. తొడలుననఁటికంబం

బులుమెడలుఁబోఁక, బోదలునెలుంగులును బరపుష్టతరులు, మాటలును గీరభావలుమక్కళించి, చిగురుఁబోఁడులువనకేళిసేయఁ జేయ." ఉ, హరి. ౫, ఆ.

**మక్కా.** నై. వి. యవనదేశమునందలి ముఖ్యపట్టణము*.

**మక్తా.** హిం. వి. గుత్త.

**మక్కి.** దే. విశ. నిస్సారము. "తే. మందగుదిపుష్పిగొరిసెలుమక్కిరొండ్లు." హంస. ౫, ఆ. (ఇక్కడ మాంసములేనిదని యర్థము.)

**మక్కు.** దే. అ. క్రి. 1. కాంతిహీనమగు; "వెలవెలనైనభోవీథిఁదారలుమక్క." కన్యకా. ౮, ఆ.—2. నవయు; "ఉ. ఒక్కని వేఁడఁబోవుమటియొక్కనిచేటునకియ్యకోళ్ళవే, ఒక్కనిసొమ్ముకాస పడనొల్లవుమా లవిఘాతనిర్దయుం, డక్కటనీరునుండ్రుణమునాని మహోగ్రవనాంతరంబులన్, మక్కెడు నీకునిట్టియవమానము మానముదప్పఁజేసెనే." పంచ. నా. ౨, ఆ.-3. చచ్చు. "వ. ఇట్లుపెక్కువరుసలు రక్కసులయుక్కివంబునమక్కిన." య. 3, "క. దిక్కులరాజులనెల్లను, మక్కించిధనంబుగొనుటమయకృతసభము, న్నెక్కటజన్నముసేయుట, నిక్కముహరిమనకుదండనిలిచినఁగాదే." భాగ. ౧౦, స్కం. "ద్వి. ఒక్కొక్కజనుఁడుర్వినొందవుపాపముల, మక్కించువేణుగుల్మమునగ్నిపోలె." భాగ. ౬, స్కం.—స. క్రి. గీఱు. "క. ముక్కునఁజిజయఁగోళ్లన్, మక్కియునొప్పింపనడవిమన్కివజీరుం, డక్కుళీఁదద్దగ్రుద్ధియు, ఱెక్కలునఱుమాడియుక్నెటెంగుందించెన్." అచ్చ. యు, కాం.—వి మాలిన్యము. "సీ. ధూళిమక్కెక్కిమంగళులతిప్పలురేఁగు వడుపునగాలినాదెడువిటకల." ఆము. ౬, ఆ.

**మక్కువ.** దే. వి. కూరిమి, ప్రేమము.

**మక్కెలు.** దే. వి. బ. ఎముకలు, అస్థులు.

**మక్షిక.** సం. వి. ఆ. స్త్రీ. ఈఁగ.

**మఖము.** సం. వి. అ. పుం. యజ్ఞము, జన్నము.

**మగ.** దే. వి. పుంస్త్వము. (మగవాఁడు.)

**మగఁటిమి.** దే. వి. 1. మగతనము, పౌరుషము; 2. శౌర్యము. (చూ. పూరగించు.)

**మగఁడు.** దే. వి. 1. పురుషుఁడు; "సీ. చూచినమగలైనఁజొక్కెడునట్టిసౌందర్య సంపద సొంపుదాల్చెననియు." నిర్వ. ౧, ఆ.—2. భర్త; "ఆ. మగఁడులేని సుగుణమాడ్కిగాకున్నెనా, సేన భీష్ములేమిఁజేసినేడు." భార. భీష్మ. ౧, ఆ.—3. రాజు; "మ. అపుడప్పక్కిమగండు రక్కసుల జియ్యందాఁకియిబ్భంగిను, గ్రపుఁగయ్యంబొనరించిమూర్ఛిల." రామా. ౫, ఆ.—4. శూరుఁడు. "శ. పాండవులనాజినోర్చుని, తండనిమీరాజాసూతతనయునిఁబొగడుక్, గండడఁచెభీముఁడిట్టిమ, గండుగలఁడెపిదపనెట్లుంకయ్యముసెల్లెన్." భార. కర్ణ. ౨, ఆ. (వృత్తియందంత్యవర్ణలోపము. మగపాటు, మగపొందు మొ.)

**మగచెయ్వులు.** ద్వ. వి. బ. గ్రామ్యధర్మము. (ఇట్లు మగపనులు మొ.)

**మగధము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

**మగధుఁడు.** సం. వి. అ. పుం. వంశావళి చదివెడువాఁడు. (రూ. మాగధుఁడు.)

**మగనాలు.** దే. వి. (మగని+ఆలు.) మగఁడుగల ఆఁడుది, పతివత్ని.

**మగపాడి.** దే. వి. 1. శౌర్యము; "క. అయ్యెడమానమువదలక, డయ్యకమగపాడితో దృఢంబుగఁబోరన్." భాగ. ౧౦, స్కం. ఉ.—2. ఉపరతి.

**మగపోఁడుములు.** దే. వి. బ. గ్రామ్యధర్మము.

**మగమానికపువాలు.** ద్వ. వి. వజ్రాయుధము. "తే. తనరమగమానికపువాలుదాల్పుజోదు, వేడుకలుమీఱనాడుబత్తేడ." సీలా. 3, ఆ.

**మగమానికము.** ద్వ. వి. రవ, వజ్రము. "సీ. తగువేల్పుదొరరాణి మగమానికపుసొమ్ము సెగతేనిచానగొజ్జఁగలబంతి." య. ౧, ఆ.

**మగఱాతివాలు.** ద్వ. వి. వజ్రాయుధము. అచ్చ. యు, కాం.

**మగఱాయి.** దే. వి. మగమానికము. "మ. సెలఱావొక్కపుమేడలోనమగఱానిద్దంపుఁగీల్బూఁగుటుయ్యెలలో." చంద్రా. ౨, ఆ.

**మగలాగు.** దే వి. మగపాడి, ఉపరతి.

**మగవాఁడు.** దే. వి 1. పురుషుఁడు; 2. శూరుఁడు.

**మగిడి.** దే. వి. పాములవాఁడు ఊఁదెడు వాద్యవిశేషము.

**మగుడఁబడు.** ద్వ. అ. క్రి. (మగుడన్+పడు.) మగుడు. (స్వార్థమున పడు.)

**మగుడు.** దే. అ. క్రి. మరలు.

**మగుడుచు.** దే. ప్రే. మగుడఁజేయు. (రూ. మగుడ్చు. "అమ్మహితుండుమన్మథున్, గొడుకుగఁబంచివేతనుమగుడ్చఁగవచ్చె." భార. అను. ర, ఆ.)

**మగులు.** దే. వి. గోడమీఁదికప్పు. (చూ.) మదురు.

**మగులుగోడ.** ద్వ. వి. మగులుపెట్టినగోడ. "ఆ. మగులుగోడమీఁదమ్రాఁకులుచిగురుజొం, పములువానిమీఁదఁబ్రచురదోహదములధూపములునదనకుమాటుగగూఢ, గతినిగాంతఁగొనుచునతఁడుననియె." కళా. 3, ఆ.

**మగువ.** దే. వి. ఆఁడుది, ఇంతి, పొలఁతి, స్త్రీ.

**మగ్గపుగుంత.** ద్వ. వి. సాలెవాఁడు నేయుటకుఁగూర్చున్నపుడు కాలుచాఁచుకొనెడుపల్లము. (చూ. కుంచె అయిదవయర్థము.)

**మగ్గము.** దే. వి. సాలెవాఁడునేసెడు యంత్రము.

**మగ్గరి.** దే. వి. (మగ్గము+అరి.) సాలెవాఁడు.

**మగ్గు.** దే. అ. క్రి. ఉక్కచే చెమ్మగిల్లిచెడు.

**మగ్గుడు.** దే. వి. మగ్గుట.

**మగ్గుడుపాఱు.** దే. అ. క్రి. మగ్గు.

**మగ్దూరు.** హిం. వి. అధికారము, శక్తి.

**మగ్నము.** సం. విశ. (అ. ఆ. అ.) మునిఁగినది.

**మఘ.** సం. వి. ఆ. స్త్రీ. 1. మొక్కజొన్నలు; 2. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.) అ. పుం. ము. 1. యజ్ఞము; 2. ఒకానొక దీవి.

**మఘవంతుఁడు.** సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు. (మఖవంతుఁడు అనియు.)

**మఘవుఁడు.** సం. వి. న్. పుం.——— పై. ———(మఖవుఁడు అనియు.)

**మచర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రశస్తవాచకము, మతల్లిక.

**మచ్చిక.** దే. వి. 1. మోహము; "ఉ. మచ్చికవీరికెల్లబహుమాత్ర పుఁజూోద్యము దేహపుష్టుచుం, జచ్చుచునుండఁజూచెదరుచావక మానెడువారిభంగినీ, చచ్చినవారికేడ్చెదరుచావునకొల్లకడాఁగవచ్చునే, యెచ్చటఁబుట్టెనచ్చటికినేగుటనైజముప్రాణికోటికిన్." సం. "అహో అమీషాంవయసాధికానాంవిపశ్యతాంలోకగతింవిమోహః, యత్రోద్భవస్తత్రగతంమనుష్యంస్వయంధర్మాఅపిశోచంత్యపార్థమ్." భాగ. ౭, స్కం. "తే. మైత్రియునునానకూల్యంబుమచ్చికయును, గలిగియక్కొంతనిన్నెప్పుఁగడిసియుండ, మిత్రకామేష్టియొనరింతు." మార్క. ౫, ఆ.—2. ఆసక్తి. (చూ. మచ్చిగ.)

**మచ్చికపడు.** ద్వ. అ. క్రి. 1. మరులుకొను; 2. మరగు.

**మచ్చిగ.** దే. వి. మచ్చికయొక్కరూపాంతరము. (మోహమునకు.—"మ. తగునేమాధవయిట్టివాఁడిపలుకుల్ధర్మంబులేయాయెడన్, మగలున్బిడ్డలుసోదరుల్జనకులున్మమ్మున్ నివారింపము, చ్చిగనీయంఘ్రులుచేరినారమిటఁబోఁజేకొందురేవారలా, పగిదేమొల్లముకింకరీజనులుగాభావించిరక్షింపవే." భాగ. ౧౦, స్కం. పూ.—ఆసక్తికి. "చ. తగిననరేంద్ర సూనఁడనితన్నుఁబ్రియంబునఁబిల్చితెచ్చిమ, చ్చిగసుతనిచ్చిమత్ప్రతిమఁజేసిన." విక్ర. ౬, ఆ.)

**మచ్చెకంటి.** ద్వ. వి. (మచ్చెము+కన్ను.) 1. చేఁపలవంటి కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. "మత్త. మచ్చెకంటిమముంద లంతువెమానసంబున." కళా. 3, ఆ.

**మచ్చెము.** వై. వి. చేఁప. "క. మచ్చెమయినీవుసామకు, ద్రుచ్చిలివేదములుగొనుచుమున్నీరుసొరన్, జొచ్చిపరిమార్చిమగుడఁగ, నచ్చదువులుతెచ్చినాఁడవచ్యుతలీలన్." రా. యు, కాం.

**మచ్చ.** దే. వి. 1. పుట్టినప్పుడే దేహమునందుఁగలిగిన నల్లనియెఱ్ఱని చుక్క, లాంఛనము; 2. గాయముమొదలైనవి మానినపిమ్మట దేహమునందేర్పడెడు గుఱుతు.

**మచ్చమాయు.** దే. అ. క్రి. నశించు.

**మచ్చము.** దే. వి. గుఱుతు. "సీ. అంగీకృతాంగచైత్రాధిదేవతలాత్మసుమచోరుమచ్చంబు చూపుకరణి." వసు. ౬, ఆ. "ద్వి. తోడమచ్చంబుగాఁదొడవులమూట, సూడిదపెట్టితాసురిఁగెనాచోరుఁడు." హరిశ్చ. ౨, భా.

**మచ్చరము.** వై. వి. 1. చేలము; 2. ద్వేషము. (చూ. మచ్చరించు.)

**మచ్చరి.** వై. విశ. (మచ్చరము+ఇ.) 1. చలపాది; "చ. మదమునదేవదానవులుమచ్చరులైకడుఁబిచ్చలించినం, పదలనుగోరిపోరునెడ." భాగ. ౬, స్కం.—2. ద్వేషి.

**మచ్చరించు.** వై. అ. క్రి. 1. చలపట్టు; 2. ద్వేషించు. "సీ. మగలతో నిల్లాండ్రుమచ్చరించెదరంద్రునుతులుతండ్రులఁదెగఁజూతురంద్రు." సం. "పితృమాతృసుహృద్భ్రాతృ దంపతీనాంచ కల్కనమ్." (కల్కనమ్=కలహాది.) భాగ. ౧, స్కం.

**మచ్చరికము.** వై. వి. 1. చేలము; "ఉ. ఏటికినోవసిష్ఠతగదీక్రియసారెకుపట్టివాదముల్, మాటికిమాటికిన్బెనఁచిమచ్చరికంబుననాడనీకు." హరిశ్చ. ౧, ఆ.—2. ద్వేషము; 3. పోటి. "క. చీనాంబరమణిభూషణ, నానాగంధానులేపనవమాల్యములన్, మానినులునువైదర్భియు, మానుగఁగైసేసికొనిరిమచ్చరికమునన్." విక్ర. ౫, ఆ.

**మచ్చరికించు.** వై. అ. క్రి. 1. చేలపట్టు; 2. ద్వేషించు. "ధూర్తకోటితోమచ్చరికించుచున్." విక్ర. ౮, ఆ. "చ. మదగజరాజకుంభముల మచ్చరికించునరోజకుంభముల్, కదిసికలంతమేరయునుగైకొనియున్నవి." నై. ౮, ఆ.

**మచ్చరీఁడు.** వై. విశ. (మచ్చరి+ఈఁడు.) మచ్చరముకలవాఁడు. "ఆ. బిచ్చలేకచిముడుమచ్చరీఁడీసుద్ది, వజ్రనాభుఁడోర్చువాఁడెయకట." ప్రభా. ౧, ఆ. (స్వార్థమున ఈఁడు.)

**మచ్చు.** దే. వి. 1. మీఁదకట్టడములేనిమిద్దెటిల్లు; "తే. మచ్చులమేడలనెలవులెల్లఁ, గ్రొత్తసింగారములఁదళుకొత్తఁజేసి." అచ్చ. ఆ, కాం.—2. చొక్కపొడి; "ఎసయఁగమచ్చుఁజల్లిభ్రమయించి." రసి. ౪, ఆ.—3. మృగాదులు వలలోఁదగులుకొనుటకైవలకుసమీపమున నుంచఁబడునాహారము, ప్రలోభనము; "మ. ౫౫నారణ్యచరాంధకార గజమున్గాలాహ్వయవ్యాధుఁడ, చ్చుఁగఁబట్టందమకించిమచ్చిడుటకైచూతాంకురశ్రేణిచే, నొగిఁగల్పించినకందుకంబనఁగ సూర్యుండంతవీక్షింపఁగాఁ, దగెమందప్రభతోడఁబశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్." భాగ. ౧౦, స్కం. పూ.—4. వన్నెసరిగానున్నదని చూచుకొనుటకై యగసాలెవాఁడిచ్చెడు వెండిబంగారములకమ్మి; "ద్వి. అచ్చుగాసతివి యోగాగ్నికీలలకు, మచ్చిదియననొప్పుమాణిక్యమిచ్చె." (ఇక్కడ మచ్చునఁగా కేవలముమాదిరియనియర్థము.) రా. సుం, కాం.—5. బ. వన్నెయొరసి పరీక్షించుటకైయగసాలలొనగువారుంచుకొనియుండెడు వెండిబంగారపులకమ్ములు. (చూ. కమటము.)

**మచ్చుకత్తి.** ద్వ. వి. కొమ్మలునఱకెడు మోటకత్తి.

**మచ్ఛము.** సం. వి. అ. పుం. మత్స్యము, చేఁప.

**మజుకూరు.** హిం. వి. పైనచెప్పిన, ఈ.

**మజుబతు.** హిం. విశ. గట్టి.

**మజూరి.** హిం. వి. దినవుకూలి.

**మజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. న్. పుం. చెట్టుచేవ. న్. పుం. ఎముకలయందలినేయి.

**మజ్జనము.** సం. వి. అ. న. స్నానము, మునుక.

**మజ్జిగ.** వై. వి. చల్ల, తక్రము*.

**మజె.** దే. అవ్య. ప్రశంసనుతెలుపునది. "క. భుజగర్వమడఁగఁగట్టిన, భుజగాస్త్రములిట్టునట్టుఁబొరలంబడినన్, గజిబిజిలేదుమొగంబున, మజబాపురెవీనిఁబోలమగలుంగలరే." ఉ, హరి. ౫, ఆ.

**మజా.** దే. అవ్య. మజెయొక్కరూపాంతరము. "మీనలువడిసెట్టునూరకమజాయను." విక్ర. ౮, ఆ.

**మజ్జె.** దే. అవ్య.———పై.———

**మజ్జెరె.** దే. అవ్య. మజ్జె. (రూ. మజ్జెరే.)

**మజ్జా.** దే. అవ్య. మజ్జెయొక్కరూపాంతరము. (చూ. బూతము.)

**మజ్జారె.** దే. అవ్య. మజ్జెరెయొక్కరూపాంతరము. (రూ. మజ్జారే.)

**మటమట.** దే. వి. మలమలయొక్కరూపాంతరము. "క. ఆఁకట మటమటమాఁడుచు." భాగ. ౯, స్కం.

**మటమటలాడు.** దే. అ. క్రి. (మటమటలు+అడు.) మండు, జ్వలించు.

**మటికె.** దే. వి. మట్టికయొక్కరూపాంతరము.

**మటుమాయ.** దే. విశ. (మాయము + మాయము.) మిక్కిలి మాయము. "ద్వి. మటుమాయకలిపట్టిమగువనునన్ను." (మటుమాయ=మటుమాయగానని యర్థము.) నళ. 3, భా. (రూ. మటు

మాయము. "ఎన్నఁడునేర్చినాఁడవ్వరయీమటుమాయపుమాట లీవు." సా. ౨, ఆ.)

**మటుమాయలాఁడు** దే. విశ. (మటుమాయలు+ఆఁడు.) మిక్కిలి మాయలుగలవాఁడు. (చూ. చేవ్వ.)

**మట్ట.** దే. వి. 1. తాటిచెట్టులోనగువానికొమ్మ; "మట్టగీసెడుకత్తిఁ బట్టుబెబ్బులిచేత." సురా.–2. ఆవులులోనగువానితోఁక. "వ. ఒంపొండమట్టలెత్తుకొని నేలమట్టవిసియద్రువఁబసులువెనందిరిగి మున్నువివ్వచ్చుఁడువచ్చినజాడఁగైకొని దక్షిణదిశకుజిఱ్ఱలుకొను చుచుందెరలంచాఱిన." సం. "ఊర్ధ్వపుచ్ఛా న్విధున్వానా ధావమానా స్సనుంతతః." భార. విరా. ర, ఆ.

**మట్టగించు.** వై. స. క్రి. తగ్గించు. "మరుఁడేలతాలిమిమట్టగించె." చంద్ర.

**మట్టగిడుసు.** దే. వి. మత్స్యవిశేషము.

**మట్టపలక.** వై. వి. (మట్టము+పలక.) మట్టముచూచెడుపలక.

**మట్టమధ్యాహ్నము.** మి. వి. పట్టపగలు. "ఎ, గీ. మట్టమధ్యాహ్నమిది సుధామధురవాణి, యర్ఘమిచ్చోఁబథశ్రమంబపనయింప." పాండు. ౧, ఆ.

**మట్టము.** వై. వి. కొలఁది. విశ. 1. తక్కువ*; "క. హితముగల కుసుపుచుఱిను, గిన్వతులఁబొడమంగనీనివిధముననతిన, ద్వ్రతుఁడైనవాఁడున్నిరల, మతిచేనఘరాశినెల్లమట్టముసేయుఁ." భాగ. ౬, స్కం.–2. పొట్టి*; "క. కుఱుమట్టపుఁబడుచువడుగుకొంతనటించెఁ." భాగ. ౮, స్కం.–3. నమము*; "ఎ, గీ. మిట్టుఁబల్లంబుగట్టునుమెట్టునొక్క, మట్టమైయదినుపారు." భార. అను. ౧, ఆ. "భర్తమట్టమేఁడాదికిమరణమొందు." కవిస. ౧, ఆ. (వృత్తియందు హల్లుపరమగుచో ముప్పర్ణము లోపించును. మట్టపలక, మట్టపాటి మొ.)

**మట్టసము.** వై. విశ. 1. కుఱుచైనది*; 2. పరిమితము*. "పసిమినుప్పొంగుమట్టనపుభొమ్ములతోడ." య. ౨, ఆ.

**మట్టసి.** వై. విశ. పొట్టివాఁడు*.

**మట్టాడు.** దే. అ. క్రి. (మట్టి+ఆఁడు.) 1. నడచు; "సీ. ఖురములసప్తసాగరములు రొంపిగానుంకించిమట్టాడునొక్కమాటు." భాగ. 3, స్కం.–2. సంచరించు; "మ. క్ర, మ్మఱిచూచుంజెవిదార్చినిల్చుమలఁగుఁమట్టాడుఁగోరాడునే, మఱినట్టుండుఁదృణంబుమేయుమలయుఁ మాయామృగంబిమ్ములఁ." భార. ఆర. ౬, ఆ.–3. వ్యాపించు*. "ద్వి. మహనీయతిరమైనమణికుండలముల, మహిమదిక్కులనెల్లమట్టాడుచుండ." రా. యు, కాం.

**మట్టి.** వై. వి. మన్ను, మృత్తిక.

**మట్టిక.** దే. వి. గోరుచిక్కుడు. (రూ. మటిక?.)

**మట్టితైలము.** మి. వి. మట్టివలనఁదీసెడు ధృతి.

**మట్టియ.** యు. దే. వి. 1. మగవానికాలి రెండవవ్రేలిమించు; "సీ. మట్టియలొండొంటిబిట్టుతాఁకఁగనేలనందందమునికాళ్లనప్పళించు." భార. విరా. ౨, ఆ. (చూ. మట్టె.) 2. బ. ఆఁడుదానికాలి రెండవవ్రేలిమెట్టెలు. (చూ. బిబ్బిలికాయ.)–వై. మట్టి. "సీ. కల్పింపనేర్చిరిగంగమట్టియమీఁదఁగస్తూరికాపత్రకములునొసల." భీ. ౧, ఆ.

**మట్టు.** యు. దే. స. క్రి. త్రొక్కు. "చ. కొడుకులపాటుసూచి కడుఁగోపమెలర్పఁగఁదల్లులొక్కయు, మ్మడివనజాయతేక్షణుని మట్టఁదలంచి." హరి. పూ. ౬, ఆ.–వి. 1. త్రొక్కుడు; "ఎ, గీ. బలనికాయఘుకాలిమట్టులనడంచుఁ, గటకముసునింకననుచు తక్కుల మహీశుఁ, డనుదినమ్మున వెఱచుసెవ్వనికిఁ గేఁడు, గాజమాత్రుఁడె శ్రీకృష్ణరాయవిభుఁడు." వా. ౧, ఆ.–2. కుదురు; "నేలమట్టవిసి" (చూ. మట్ట.) 3. ప్రవేశము. (అనుగుమట్టు, పైమట్టు.)–వై. 1. మితి; "ఉ. మైవదలించిప్రూర్వమగు మట్టునగాడ్పులుసాఁగనిచ్చి." పాండు. ౨, ఆ.–2. పర్యంతము*. విశ. 1. తక్కువ*; 2. మితము*.

**మట్టుకాఁకర.** ద్వ. వి. ఒకదినుసు కాఁకర, కర్కోటము?.

**మట్టుకొను.** దే. అ. క్రి. కుదురుకొను. "ఎ, గీ. చిత్తజాతుండు కనుమాయచేసినాఁడొ, మనమునంబులవిభ్రాంతిమట్టుకొనెనొ." విక్ర. ౧, ఆ. (ప్రే. మట్టుకొలుపు. "సీ. సలలితసత్కీర్తిచంద్రికఁబగతురమనసులతాపంబు మట్టుకొల్పి." విక్ర. ౨, ఆ)

**మట్టుచేయు.** వై. స. క్రి. తగ్గించు.

**మట్టుపడు.** యు. ద్వ. అ. క్రి. కుదురుపడు. (ప్రే. మట్టుపఱుచు. "ఎ, గీ. గుంజెనీఱుగనవిసికాకుత్స్థవర్యుఁ, డెట్టకేలకు ధైర్యంబు మట్టుపఱిచి." జై. ౬, ఆ.)–వై. అడఁగు. "ఎ, గీ. మఱియుదనుజుండుశాంబరీమంత్రమహిమఁ, బర్వతారణ్యజీమూతపటలభయద, మృగసరీసృపవితతి నిర్మింపసరుఁడు, మట్టుపడనేసెనాయాయిమార్గణముల." జై. ౫, ఆ.

**మట్టుపెట్టు.** ద్వ. స. క్రి. అడఁచు, చంపు. "ఉ. గట్టులమట్టుపెట్టుబలుకైదువఁబట్టినయట్టిదిట్టఁడుఁ, దిట్టతనంబువాసి పొలదిండికిలోఁబడి గాసిఁజెందఁగా, నెట్టునహింపవచ్చు." ఉ, రా. ౫, ఆ. "సీ. ప్రళయాబ్ధిమోఁకాలి బంటిగాఁజరియించుమధుకైటభులఁబట్టి మట్టుపెట్టె." ఉ, రా. ౨, ఆ.

**మట్టుబచ్చలి.** ద్వ. వి. దుంపబచ్చలి, ఉపోదక?.

**మట్టుబీఱ.** ద్వ. వి. ఒకదినుసుబీఱ.

**మట్టుమిగులు.** ద్వ. అ. క్రి. అతిక్రమించు.

**మట్టుమీఱు.** ద్వ. అ. క్రి.——వై.——

**మట్టె.** దే. వి. 1. మగవానికాలి రెండవవ్రేలిమించు; "మ. జడచొల్లెంబునుబట్టుఁదట్టియునురత్నాహాటకాలంకృతుల్, మెడహారంబులుమట్టెవన్నెయగుచుఁ లీలావిలాసంబుపెం, పడరంజేయఁగ." కాశీ. ర, ఆ.–2. బ. ఆఁడుదానికాలి రెండవవ్రేలిమెట్టెలు. "ఉ. అందెలుఁ, మట్టెలుదిట్టమైచెలఁగ మందగతింజనియవ్వనంబునఁ." భో. 3, ఆ.–విశ. బట్టచాఱలుగలది. (మట్టెయావు మొ.)

**మట్ర.** ద్వ. వి. దున్ననపుడు కొండ్రతిరుగక నడుమనిలిచెడు కొంచెముతావు. "వ. తప్పిదాఱిమడిమట్రచేనుచెట్లున్నపట్లరసి తనపట్టులంగాపువెట్టుచు." పాండు. 3, ఆ.

**మఠము.** సం. వి. అ. పుం. సన్యాసులులోనగువారు ఉండెడు చోటు.

**మఠ్యము.** సం. వి. అ. పుం. తాళభేదము. (పది అక్షరముల కాలము.)

**మడ.** దే. వి. ప్రవాహమార్గము. "క. నడుకట్టలిసుకతిప్పలు, మడలుదరులు వాఁకలునుగ్రమంబుననొకఁడుఁ, గడవఁబడకుండఁ గృష్ణుఁడు, పడఁతులకునుఁయమునయాటపట్టుగఁజేసెఁ." హరి. పూ. ౮, ఆ. "ద్వి. పొదలవృక్షములనీడలను, మడలతీరంబులమడుగ్రులమేటి, పడియల." నవ. 3, భా.

**మడఁక.** దే. వి. 1. మడుపు; 2. (చూ.) అరక.

**మడఁగు.** దే. అ. క్రి. 1. వంగు; 2. మరలు. "సీ. మ్రానుపేరేటిచేమడఁగు నామడఁగదొమడఁగుఁజేరేటినీమ్రానుమడఁచె."

ఉ, హరి. ౨, ఆ. "వ. కండలు వ్రాలియుగుండెలుగూలియు, రూపులడంగియునేపులుమడంగియు." మార్క. ౬, ఆ.

**మడఁచు.** దే. ప్రే. మడఁగఁజేయు. (చూ. లంగగొను.)

**మడఁతి.** దే. వి. ఆఁడుది, పడఁతి, ఇంతి, స్త్రీ.

**మడఁతుక.** దే. వి ———పై.——— (స్వార్థమున ఉక.)

**మడకత్తి.** దే. వి. లావుకత్తి.

**మడచెట్టు.** దే. వి. వృక్షవిశేషము.

**మడత.** దే. వి. 1. (వస్త్రపు) మడుపు; 2. (కడుపుమీఁది) మడుపు; 3. భక్ష్యవిశేషము.

**మడత్రొక్కు.** దే. స. క్రి. (మడఁగన్+త్రొక్కు.) తొటాకులు దొంతిగా అడికి అణఁగఁద్రొక్కు.

**మడమ.** దే. వి. గుదికాలు. "వ. మడమలమెడమలంచియునలంచియు." ఉ, హరి. ౬, ఆ.

**మడవ.** దే. వి. (మడ+వా.) మళ్లకు పాదులకు నీళ్లుపాఱెడు కాలువముఖము. "సీ. అడుసుఁదుంపురుచెక్కటద్దంబులనుబరవ మళ్లకుమడవలుమార్చిమార్చి." కళా. ౪, ఆ.

**మడవచేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**మడవు.** దే. అ. క్రి. 1. విముఖమగు; "క. కడవనములుఁగోలలుఁగ, ప్పడములువీరలధనంబుపరికింపఁగనె, క్కడిదేశికులనివగవక, మడవకతనుమధ్యనిందు మనముననుండెన్." భార. ఆది. ౭, ఆ.–2. నిష్ఫలమగు. "క. చెడఁగఱపువారుచెడుగులుఁ, గడుకొనినీయట్టివారికర్జంబులుచె, ప్పెడువారుగాకనీకున్, మడవకమాయట్టివారిమాటలుకొఱయే." భార. సభా. ౨, ఆ.

**మడి.** దే. వి. 1. మడుఁగువస్త్రము; 2. వరిపొలము, కేదారము. విణ. 1. పరిశుద్ధము; 2. వృత్తియందు ఉత్తరపదమైన మడుఁగు శబ్దమునకు ఆదేశముగావచ్చెడిరూపము. (ఇనుమడి, ముమ్మడి, నలుమడి.)

**మడికాసు.** దే. వి. వెండి, రజతము. "ఒంటిగామడికాసుగుంటి పైఁగూర్చుండి." కా. ౨, ఆ.

**మడిచేఱు.** ద్వ. వి. (మడిచిన+చేఱు.) వైష్ణవస్త్రీలుముందుండి యెత్తివెనుకకుచెక్కుకొను కోకచేఱు.

**మడిపెసలు.** దే. వి. మడియందుపైఁగునల్లపెసలు.

**మడిమంచె.** దే. విణ. బలహీనము. "చ. చెట్లుపట్టిమనుప్రాఁతదళంబులతోడఁ దోలెనా, మనిదోరమంచురాజు మడిమంచగఁ గోయిలగంట మ్రోయఁగన్" స్వా. ౬, ఆ. (రూ. మడిమంచెము. "ద్వి. బలదేవుఁడుద్ధతిఁబరిఘంబుఁబూని, మలయుక్కిసి మడిమంచంబుచేసె." భాగ. ౧౦, స్క-ం.)

**మడియఁడు.** దే. విణ. మూఢుఁడు. "తే. త్రిమ్మరిగదానదాగతి తెలిసిచూడ, మెటియఁడుగదాయనంగఁదేతటిమటిమడి, యఁడుగదాయలజైవాతృకుఁడుతలంప, నిట్టిచెడుగులచేబాధయెట్టులోర్తు." సా. ౨, ఆ.

**మడియు.** దే. అ. క్రి. 1. చేచ్చు; 2. తునుఁగు. "క. తోమరము శక్తియుబె, టిదముగనతఁడడరించిన, మదమునవయోధవరుఁడు మడియించెనెడన్." భార. ద్రో. ౪, ఆ.

గేలిడి నిలువ్రకాచుని, స్నావసుధేశమాళికిదయారసశీతలముల్కటాక్షముల్." రామా. ౬, ఆ.

**మడుఁగు.** దే. అ. క్రి. 1. అడఁగు; "మత్ప్రకృతియందుఁజరాచరంబుదోఁచుమడుఁగు." ఉ, హరి. ౨, ఆ. "ఉడిగిమడింగి మైమఱచియున్నతటిన్." ఉ, హరి. ౫, ఆ.–2. వంగు.–వి. 1. గుణము; (దీనికది యెన్నిమడుఁగులు హెచ్చు.)–2. హ్రదము; 3. కొలను; "చ. పొలియఁగఁజేసెనమ్మడుఁగుఁబొల్పెనఁగన్‌జల పాదశేషమై." పంచ. నా. 3, ఆ.–4. పరిశుద్ధి; 5. పరిశుద్ధవస్త్రము; "మ. జలకంబాడిమడుఁగుగట్టి మణిభూషాదీప్య మానాంగియై." పా. ౨, ఆ.–6. ఎనిమిదివీసెలకొలఁది; 7. అడఁకువ, ఉపశాంతి. (చూ. మడువు.) 8. బ. అకుమడుపు. "చ. సురఁటియొకర్తువీవనొక సుందరియాకు మడుంగులియ్య." రుక్మి. ౫, ఆ.–విణ. పరిశుద్ధము. "ఉ. ఒత్తుగమాంసమున్ మడుఁగు టొగిరమున్ ఘృతశర్కరాదులున్." హరిశ్చ. ౧, ఆ.

**మడుఁచు.** దే. ప్రే. మడుఁగఁజేయు.

**మడుపు.** దే. వి. 1. మడత; 2. మడుఁగువస్త్రము; "క. తడియొత్తెనొకతెవలిపపు, మడుపులుగట్టంగనిచ్చెమఱియొక్కతె" అని. ౫, ఆ.–3. బ. అకుమేట్టలు. "క. వచ్చికపురంపుబాగా, లిచ్చిపిదపమడుపులొసఁగి." ఉ, రా. ౬, ఆ.

**మడువు.** దే. అ. క్రి. వి మడుఁగుయొక్కరూపాంతరము. (ఉపశాంతికి.–"ఆ. అవులించుతలయునడరెడునట్టయుఁ, జూచిప్రీతుఁడగుచుసురవిరోధి, యచటిడింభతతికినాఁకలిమడువుగా, నిచ్చి యాగ్రహమునసిట్టులనియె." నిర్వ. ౪, ఆ.)

**మడ్గు.** దే. అ. క్రి. మడుఁగుయొక్కరూపాంతరము. (గుణమునకు.–"సీ. ముమ్మడ్గుపుష్కరంబునకునల్మడుఁగుపంపఱ నిడియనఁదగిప్రకటమహిమ." పాండు. 3, ఆ.)

**మడ్డి.** దే. వి. నూనెలోనగువానియందు అడుగున నిలిచెడుమలిని. విణ. మూఢుఁడు.

**మడ్డు.** దే. వి. ఇనుపగుదియ. "ఉ. పేఁగలలోననాండెఱుఁగనీవె విభుండవునందియంబునా, పైఁగలదేనిచూడుమని ప్రాగ్దిశగాత మదారజారునిన్, దాఁగడునమ్మఁజేయుటకుఁ దక్కక యెత్తెనునట్టియెట్టిగాఁ, గాఁగినమడ్డుచందమెసఁగంగనుపట్టెనినుండునప్పతన్." ప్రభా. ౫, ఆ.

**మడ్డుకత్తి.** ద్వ. వి. మచ్చుకత్తి.

**మడ్డువు.** సం. వి. ఉ. పుం. గుమ్మెట, తుడుము.

**మణఁగు.** దే. అ. క్రి. మడఁగుయొక్కరూపాంతరము.

**మణి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. పచ్చలాయిలోనగునది; (ఇది అశ్మజాతి.) 2. ముత్యములోనగునది; (ఇది అనశ్మజాతి.) 3. ముంత; 4. మనికట్టు; 5. గొఱ్ఱెమెడచన్ను; 6. మగవాని కామచివర. పుం. సర్పవిశేషము.

**మణికము.** సం. వి. అ. పుం. కాఁగు, ముంత. (అనికొంద్రు.)

**మణికారుఁడు.** సం. వి. అ. పుం. రత్నములను సానఁబట్టువాఁడు.

**మణిగ.** దే. వి. మళిగ. (అప్ర.)

**మదానశేషము.** సం. వి. అ పుం. ఏనుఁగు, గజము.

**మది.** వై. వి. 1. బుద్ధి; "అక్క-ర. అదియునుంగాక పరప్రయోగ మాయలుగలవెజెఁగి, మదినుంచునది." భార. ఆర. ౧, ఆ.– 2. మనస్సు*. "క. ఇది నీకోరినఫలమని, సుదతికిసనిరుద్ధుఁజెలువ మాపియిటులనుఁ, మదిఁజొచ్చినీకుఁగూరిమి, యదికినవలరాచ చుట్టమానోకాఁడో." ఉ, హరి. ౫, ఆ.

**మదించు.** ఉభ. వై. అ. క్రి. కలఁచు. (చూ. జోటాడు.) స. క్రి. మదింపువేయు*. (ఈ యర్థమునందు కొన్నిచోట్ల మతించు అని వాడెదరు.) సం. అ. క్రి. క్రొవ్వు. (మదియించు అనియు.)

**మదింపు.** వై. వి. ఇంతయని వెలమొదలగువాని నూహించుట. (చూ. మదించు, అరగింపు.)

**మదిమది.** వై. వి. నెమ్మది, నిశ్చింత. "చ. త్రిదశపతిజాజయించి జగతీతలమంతయునేలుబాణుఁడే, మదిమదినుండిదానవసమాజము చేటుపకై త్రిలోచనుఁ, గదనమువేఁడె." ఉ, హరి. ౫, ఆ. (బాణుఁడే అనుసప్పుడు ఇక్కడి ఏకారము ఆధిక్యమును తెలుపు చున్నది. చూ. ఏ.)

**మదిర.** సం. వి. అ. స్త్రీ. సుర, మద్యము, కల్లు.

**మదిరాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మదముకప్పిన కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**మదీయము.** సం. విశే. (అ. ఆ. అ.) నాది.

**మదుగు.** దే. వి. అనుకు. "వ. శీకరపరంపరలచొదుగులుమదుగులు గొనఁబిదపిదనగుచు." భాగ. ౧౦, స్కం. పూ.

**మదుపు.** దే. వి. ఆకుపచ్చ. కవిక. 3, ఆ.

**మదువు.** దే. వి. మదుగుయొక్క-రూపాంతరము.

**మదురు.** దే. అ. క్రి. కమియు. (మదురఁబండినపండు.) వి. గోడమీఁదికప్పు. (దీనిని మదుళు అని వాడెదరు.)

**మదురుగోడ.** ద్వి. వి. మదురుపెట్టినగోడ. "ద్వి. జాలినాతోడ నొజ్జలుచెప్పియున్న, మాటనీకతెఁగించిమదురుగోడైన, దాఁటి పోయుదనింక దాఁపురమేల" హరిశ్చ. ౨, భా.

**మదురువు.** వై. వి. 1. మద్యము; "క. మదురువుగొనియెడ తెలుఁగక, మదాకులమనస్కులైనమానవులకునిం, పొదవియుఁబిడి కిళ్లంగొని, చదియఁబొడుచునేనియదియుసౌఖ్యంబగునే." లక్ష్మీ. ౪, ఆ.– 2 మత్తు*. "సీ. మదురువుగొనిమాఱుమలయుకారెనుఁ బోతు నాడిసికొమ్ములువట్టిముడ్డుఁగఁద్రోచి." లక్ష్మీ. ౨, ఆ,

**మదువు.** దే. వి. మదుగుయొక్క-రూపాంతరము.

**మదోత్కటము.** సం. వి. అ. పుం. 1. మదపుటేనుఁగు; 2. కపోతము.

**మద్దతు.** హిం. వి. సహాయము.

**మద్గురము.** సం. వి. అ. పుం. (చూ.) బొమ్మడాయ.

**మద్గువు.** సం. వి. ఉ. పుం. 1. నీరుకాకి; 2. మత్స్యవిశేషము.

**మద్ది.** దే. వి. అర్జునము*. (దీనిభేదములు ఇనుమద్ది, పటుమద్ది.)

**మద్దికాయలు.** దే. వి. బ. బాలకులచెవితమ్మెలనుంచెడుభూషణ విశేషము. "విడిగలమద్దికాయకవవీనులశొంపుఘటింప." ("మద్ది కాయకవ." ఇక్కడ వృత్తియందేకవచనము.) చంద్రా. ౨, ఆ.

**మద్దెల.** వై. వి. చర్మవాద్యవిశేషము. (చూ. దిమిదిమి.)

**మద్దెలరూపుచుక్క.** వై. వి. ధనిష్ఠానక్షత్రము.

**మద్యము.** సం. వి. అ. న. కల్లు, సుర, కాదంబరి.

**మధుక.** సం. వి. ఆ. స్త్రీ. తిప్పదీఁగ. అ. న. ము. అతిమధురము. పుం. 1. ఇప్ప*; 2. నెమిలి. డు. వంశావళిఁజదువు వాఁడు.

**మధుకరము.** సం. వి. అ. న. భిక్షాన్నము. పుం. 1. తుమ్మెద; 2. జీవకము*.

**మధుక్రమము.** సం. వి. అ. పుం. మద్యపానక్రమము.

**మధుద్రుమము.** సం. వి. అ. పుం. ఇప్ప*.

**మధుపము.** సం. వి. అ. పుం. తుమ్మెద, తేనెతిండి. విశే. మద్యపానముచేయునది.

**మధుపర్కము.** సం. వి. అ. న. 1. పెరుఁగుతోకలసినతేనె; 2. పెండ్లిలోవధూవరులకిచ్చెడువస్త్రము.

**మధుపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గుమ్ముడు*; 2. తిప్పతీఁగ; 3. నీలిచెట్టు.

**మధుమేహము.** సం. వి. అ. పుం. మూత్రరోగవిశేషము.

**మధుయష్టిక.** సం. వి. ఆ. స్త్రీ. అతిమధురము.

**మధుర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకపట్టణము; 2. సదాప*; 3. అడవిసదాప*. అ. న. ము. విషము. పుం. తియ్యన. విశే. 1. తియ్యనిది; 2. ఇంపైనది.

**మధురస.** సం. వి. ఆ. స్త్రీ. 1. చేఁగ*; 2. ద్రాక్ష*; 3. పిన్నపాల*.

**మధురిక.** సం. వి. ఆ. స్త్రీ. అడవిసదాప*.

**మధురిపుఁడు.** సం. వి. ఉ. పుం. విష్ణువు, శౌరి, వెన్నుఁడు.

**మధురిమ.** సం. వి. న్. పుం. తియ్యన. (రూ. మధురిమము.)

**మధులిహము.** సం. వి. హ్. పుం. తుమ్మెద, తేనెతిండి.

**మధువారము.** సం. వి. అ. పుం. మద్యపానక్రమము.

**మధువు.** సం. వి. ఉ. స్త్రీ. పాలకూర. న. 1. నీరు. 2. పాలు. పుం, న. 1. కల్లు; 2. తేనె; (ఇది త్రివిధము.–మాక్షికము, భ్రామరము, సారఘము. పౌత్తికమని కొందఱు.) 3. పూఁదేనె. పుం. 1. చైత్రమాసము; 2. వసంతఋతువు; 3. ఇప్ప*; 4. గోరఁట*.

**మధువ్రతము.** సం. వి. అ. పుం. తుమ్మెద, భృంగము.

**మధుశిగ్రువు.** సం. వి. ఉ. పుం. ఎఱ్ఱపువ్వులమునగ*.

**మధుశ్రవ.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురిజె*.

**మధుశ్రేణి.** సం. వి. ఈ. స్త్రీ. చేఁగ*.

**మధుష్ఠీలము.** సం. వి. అ. పుం. ఇప్ప. (రూ. మధుష్ఠీవము*.)

**మధుసూదనుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. ము. తుమ్మెద.

**మధుస్రవ.** సం. వి. ఆ. స్త్రీ. పాలకూర.

**మధూకము.** సం. వి. అ. పుం. ఇప్ప. (రూ. మధుకము*.)

**మధూలకము.** సం. వి. అ. పుం. సీరిప్ప*. కొండయిప్ప. (అనికొందఱు.)

**మధూలిక.** సం. వి ఆ. స్త్రీ. 1. పుష్పాడి; 2. చేఁగ*.

**మధూళి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కల్లు; 2. పూఁదేనె.

**మధ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 2. స్వీయాంతర్భేదవిశిష్టనాయికావిశేషము. (ఉదయించినయౌవనముగలది, పదుమూడేండ్లుమొదలు పదునెనిమిదేండ్లపర్యంతమైన

వయసుగలది.) అ. న. ము. అవకాశము. పుం, న. నడుము. పుం. మాసమున అరత్ని ప్రమాణముహీనస్థనయేనుఁగు. విశే. 1. నడి తరముది; 2. నడిమిది.

**మధ్యదేశము.** సం. వి. అ. పుం. భారతవర్షమునడిమిదేశము.

**మధ్యమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. దుద్దు; 2. వాగ్భేదము; 3. నడిమి వ్రేలు; 4. క్రొత్తగసమర్తాడినది. అ. పుం, న. ము. నడుము. పుం. 1. కురుక్షేత్ర ప్రయాగహిమాద్రివింధ్యములకు నడుమ నున్నదేశము; 2 ఒక స్వరము; (చూ. స్వరము.) విశే. నడిమిది.

**మధ్యరాత్రము.** సం. వి. అ. పుం. నడురేయి.

**మధ్యలోకము.** సం. వి. అ. పుం. భూలోకము.

**మధ్యస్థుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నడుమనుండి పక్షపాతములేక యిరుదెగలవారికి సరిగా న్యాయముచెప్పువాఁడు.

**మధ్యాహ్నము.** సం. వి. అ. పుం. పట్టపగలు.

**మధ్వాసనము.** సం. వి. అ. పుం. ఇప్పపువ్వుకల్లు.

**మన.** దే. స. మనము అనుదానికి ప్రాతిపదికము.

**మనఃప్రభవుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపు చూలి.

**మననము.** సం. వి. అ. న. చింతన, గమనము.

**మనము.** ఉభ. దే. స. నీవునునేనును. సం. వి. స్. న. 1. మనసు; 2. బుద్ధి.

**మనవి.** దే. వి. విజ్ఞాపనము. ''మనవియుక్తితెలుంగుమీకనినది.'' రాఘ. ౧, ఆ.

**మనశ్శిల.** సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

**మనసరి.** మి. విశే. (మనసు+అరి.) బుద్ధిమంతుఁడు. ''క. అన యమునిజప్రచారం, బనయము గాకుండనచటసతిశౌర్యమునన్, మనసరియేకేసరియని, మనసరిరాకొమరుమూఁకమనుమనురీతిన్.'' రామా. ౧, ఆ.

**మనసిజుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

**మనసు.** సం. వి. స్. న. మానసము. (మొదటిరూపము మనస్సు.) విశే. ఇష్టము. ''మనసయ్యెవెల్మిడియు.'' రామా. ౩, ఆ. (ఈ యర్థము సంస్కృతమునలేదు.)

**మనస్కరించు.** సం. అ. క్రి. మనసుంచు. (వాఁడు మనస్కరించి అపనిచేసినాఁడు.)

**మనస్కారము.** సం. వి. అ. పుం. మనఃప్రయత్నము. మనః పూర్తి. (అనికొందఱు.)

**మనస్వి.** సం. విశే. (న్. ఈ. న్.) మంచిమనస్సుకలవాఁడు.

**మనాయించు.** గ్రా. స. క్రి. లక్ష్యపెట్టు, విను, లోఁబడు.

**మనికట్టు.** ద్వ. వి. మణిబంధము. ''వ. మనికట్లనికట్లలవఱిచి యుంజెఱచియు.'' ఉ, హరి. ౬, ఆ.

**మనికి.** దే. వి. 1. జీవించుట; 2. వసించుట; ''క. క్షీరోదక గతిఁబాండవ, కౌరవులొండొఁగూడిమనికిగార్యంబు.'' భార. ఉద్యో. 3, ఆ.—3. జీవనము; ''సీ. ఏనతి దీనతనే కాకినైమనమనికియుఁ దానొక్కమనికియగునె, యిట్టిజీవనమదిగాల్పనే.'' మార్క. 2, ఆ.—4. వాసస్థానము; ''చ. ఎనయఁగనీ నివాసమునకేనరుదెంచె దనంచు నావయిన్, గనుఁగొననిక్కపుంబ్రియముగల్గినవాఁడునుబోలెఁబల్కియా, మనికికిరాకతక్కిననుమానెడుఁగాకమదీయదృష్టికిన్, బనుపడిమ్రోలనున్న గతిమాయలునేయఁగనేలభర్తకున్.'' కా. ౩, ఆ.—5. స్థానము. ''బ్రహ్మమనికిమహీజముల్.'' వసు ౩, ఆ.

**మనికితపడు.** ద్వ. అ. క్రి. (మనికితము+పడు.) దుఃఖపడు. ''క. తనపతిఁగానకయెంతయు, మనికతపడివచ్చికామమంజరిచేరఁగా.'' విక్ర. ౬, ఆ.

**మనికితపాటు.** ద్వ. వి. మనికతపడుట. ''ద్వి. మనికితపాటుతో మఱికుందికుంది.'' విష్ణు. పూ. ౩, ఆ.

**మనికితము.** దే. వి. దుఃఖము. ''క. తనయాగమువిఘ్నముచే, సిన కీడునవజ్రియింతచేసెనమీగో, ధనములమిమ్మునుగాచెద, మనికిత ములుమానుఁడనుచుమదిఁగృపమెఱయన్.'' వి, పు. 2, ఆ.

**మనితము.** సం. విశే. (అ. ఆ. అ.) తెలియఁబడినది.

**మనీష.** సం. వి. ఆ. స్త్రీ. బుద్ధి, ప్రజ్ఞ, మతి.

**మనీషి.** సం. వి. న్. పుం. విద్వాంసుఁడు. విశే. బుద్ధిమంతుఁడు.

**మను.** యు. దే. అ. క్రి. 1. జీవించు; (చూ. మనికి రెండవ యర్థము.) 2. వర్తించు. ''క. కలిమికినొప్పుగునీగయు, బలిమికిఁ దొడవైనయట్టిబలఁగమునైలా, కులచిత్తములకు వ్రేఁగగు, కొలఁదిమ నన్గుంతిపెద్దకొడుకునకమరున్.'' భా. విరా. ౩, ఆ.–వి. ఋశ్యవాచకమైనమన్నశబ్దమునకువృత్తియందు ద్విత్వములోపించినరూపము. (ఉదా. మనఁబిడి, మనఁబెంటి, మనఁబోతు ము.)–వై. 1. మట్టి; ''క. వినమనసములోఁ నంటెట, నను మాసము తీఱెశుద్ధియగునందాఁకన్, మనుశౌచముసేయుటదగు, సెనికయుఁ గొలఁదియును వెదకరెన్నఁడుఁబెద్దల్.'' విజ్ఞా. ఆచా, కాం. – 2. నేల*. ''సీ. అదనుతోఁజేఁపిచన్నవసియోషధులమన్నొదవు కొండలకెల్లఁబిదుకనెఱేఁగె.'' (ఇక్కడ ఉకారమునకు లోపము.) స్వా. ౩, ఆ.

**మనుఁగు.** దే. అ. క్రి. చేచ్చు. ''అతినిఘోరశరరాశినసేకరాక్షసుల్ మనిఁగిరి.'' అధ్యా. యు, కాం.

**మనుకువ.** దే. వి. వాసస్థానము. (చూ. ఒరిమ.)

**మనుగడ.** దే. వి. 1. జీవనము; 2. జీవనోపాయము. ''క. పేనల యెడమేలుగాంచిన, మనుగడయగ్గలము చేసిమన్నింపుము.'' భార. ఆశ్ర. ౧, ఆ.

**మనుగుడుపు** దే. వి. (మనువు+కుడుపు.) (చూ.) అల్లెము.

**మనుచే.** దే. ప్రే. మనఁజేయు. (రూ. మంచే.)

**మనుజాశనుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు, మానిసి దిండి.

**మనుజుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి.

**మనుజేంద్రుఁడు.** సం. వి. అ. పుం. రాజు, మానిసితేఁడు.

**మనుదిండి.** ద్వ. వి. (మను+తిండి.) ఒకదినుసుపాము, మాలు ధానము.

**మనుపరి.** దే. విశే. (మనుపు+అరి.) కాపరి, రక్షకుఁడు.

**మనుపాల.** దే. వి. పాలకూర, జీవంతి.

**మనుపీనుఁగు.** దే. వి. జీవచ్ఛవము.

**మనుపు**' దే. ప్రే. మనుచుయొక్కరూపాంతరము. వి. రక్షణము.

**మనుమఁడు.** దే. వి. పౌత్రుఁడు. ''క. కనికనికరమొదవఁగఁజక్కనికరములఁగౌఁగిలించికాంతాయుతుఁడౌ, మనుమనిసుఖాన్వితుఁడవై, మనుమనిదీవించెనబహుమానముగాఁగన్.'' అని. ౫, ఆ.

**మనుమరాలు.** దే. వి. (మనుమ+ఆలు.) పౌత్రి.

**మనువర్తి.** గ్రా. వి. జీవనమునకై యిచ్చుసొమ్ము. (రూ. మనోవర్తి.)

**మనువు.** ఉభ. దే. అ. క్రి. మనుఁగుయొక్క-రూపాంతరము. వి. 1. జీవనము; "ఎ, గీ. అలుపోరినమనవచ్చునయ్యాదుఃఖ, మునకొ సుఖమునకొసరులమనువుచెపుమ." మార్క. ౫, ఆ.—2. వర్తనము; "నీమనవుదుష్పారంబు." భాగ. ౨, స్క-౦.—3. మగనివరించుట; "ఈ మను విదియేలలక్ష్మణకుమారునినిర్జితమారుఁబొందు." రా. అర, కాం. ౧, ఆ.—4. మగఁడు. సం. ఉ. పుం. 1. వైవస్వతాది; (వీరు పదునలువురు.—స్వాయంభువుఁడు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుఁడు, భౌచ్యుఁడు.) (ఇవి కొన్నిచోట్ల వేఱువిధముగా వ్రాయఁబడియున్నవి.) 2. మంత్రము.

**మనుష్యధర్ముఁడు.** సం. వి. న్. పుం. కుబేరుఁడు.

**మనుష్యయజ్ఞము.** సం. వి. అ. పుం. అతిథిపూజ.

**మనుష్యుఁడు.** సం. వి. అ. పుం. మనుజుఁడు, మానిసి.

**మనోగుప్త.** సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

**మనోజవసుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తండ్రినిబోలినవాఁడు. (కొడుకు.) (రూ. మనోజవుఁడు.)

**మనోజుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

**మనోజ్ఞము.** సం. విశే. (అ. ఆ. అ.) సుందరము.

**మనోభవుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

**మనోరథము.** సం. వి. అ. పుం. ఇచ్ఛ, కోరిక.

**మనోరమము.** సం. విశే. (అ. ఆ. అ.) మనోజ్ఞము.

**మనోహతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మనసుచెడినవాఁడు.

**మనోహరము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. భక్ష్యవిశేషము. "ద్వి. అతిరసంబులుమనోహరములునైన, యతిరసంబులుమనోహరములుమటియు." రా. బాల, కాం.—విశే. మనోజ్ఞము, ఇంపైనది.

**మనోహ్వా.** సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

**మన్కి.** దే. వి. మనికియొక్క-రూపాంతరము.

**మన్దిండి.** ద్వి. వి. మనుదిండియొక్క-రూపాంతరము. "ఎఱ్ఱరోఁకటిబండజెట్టిమన్దిండి." ఆము. 3, ఆ.

**మన్న.** దే. వి. అడ్డగింపు, నిరోధము.

**మన్నన.** వై. వి. 1. సమ్మానము. "క. మన్ననకుబ్బకయవమతి, తన్నొందినద్రుక్కఁబడకధరణీశుకడకా, మున్నున్నయట్లమెలఁగిన, నన్నరునకుశుభములొదవుసాపదలడఁగుకా." భార. విరా. ౧, ఆ.—2. గౌరవము.

**మన్ని.** యు. దే. వి. జీవము. "ఎ. గీ. మనఁగనాబుద్ధివినకనామన్నిగొంటివి." రా. కిష్కిం, కాం. "సీ. కడిఁదిమృత్యువుపువ్వగంధియైచనుదెంచినీమన్నిగొనియెనేనృపతనూజ." భోజ. ౬, ఆ.—వై. పెడతలయందుండునరము.

**మన్నించు.** వై. స. క్రి. 1. సమ్మానించు; 2. గౌరవించు. "క. అన్నయిదిధర్మువనిమీ, యన్నను నన్నునునతిప్రియంబునెనెదలో, మన్నించియే మిపనిచినఁ, గ్రన్ననసాపను పు సేయఁగడఁగుము బుద్ధిన్." భార. ఆది. ౬, ఆ.

**మన్నింపు.** వై. వి. 1. మన్నించుట; 2. అపరాధక్షమము. (చూ. అరగింపు.)

**మన్నిక.** వై. వి. మన్నన, సమ్మానము.

**మన్నిగొను.** దే. స. క్రి. (మన్ని+కొను.) చంపు. "క. కన్నండఁగఁటిపాపం, గొన్నట్లుమొఱంగిబాలుఁగొనిపోవుటకై, యన్నిచబంధుయుతముగ, మన్నిగొనకయున్న నేటిమాటలుమనకున్." ఉ. హరి. ౫, ఆ.

**మన్నియ.** వై. వి. ప్రభువు*. "అమన్నియతేరియక్క-జపుమావులఁగూల్చి." అచ్చ. అర, కాం.

**మన్నియఁడు.** వై. వి.——వై.——"మన్నియరగండఁడు." కా. ౧, ఆ. (రూ. మన్నెఁడు.)

**మన్నీఁడు.** ద్వి. వి. (మన్ను+ఈఁడు.)——వై.——"తే. అంతఁదనపట్టియగువాలినడఁగఁజేసె, నీకొమరుఁడంచువేల్పుమన్నీఁడుప్రొద్దు, నలమిముట్టడివేయించెననఁగమబ్బు, తెగలువడిఁబర్వెఁజుక్కలతెరువునందు." అచ్చ. కిష్కిం, కాం.

**మన్ను.** యు. దే. వి. 1. ఋశ్యమృగము; "తే. పంకముగొరిజదిగఁబడిపఱవలేరు, మన్నులివ్వేళరేగటిమన్నులందు." స్వా. ౪, ఆ.—2. యుద్ధసాధనవిశేషము. "వ. కొంకిమన్నుదగరుమొదలుగాఁగలసాధనంబులచేఁజీకాకుపఱిచియు." ఉ, హరి. 3, ఆ.—వై. 1. మట్టి; 2. నేల*. (చూ. దే. మొదటియర్థము.)

**మన్నుఱేఁడు.** ద్వి. వి. రాజు, భూపతి. కాశీ. ౬, ఆ.

**మన్నెకాఁడు.** ద్వి. వి. (మన్నెము+కాఁడు.)——వై.——"రక్కసిమన్నెకాఁడు." అచ్చ. సుం, కాం.

**మన్నెము.** వై. వి. సమ్మానించియిచ్చిన కొంతభూభాగము*.

**మన్నెముల్లు.** ద్వి. వి. మేఁకలకాలిగిట్టలలోని ముల్లుతీసెడుపెద్దసూది.

**మన్మఁడు.** దే. వి. మనమఁడుయొక్క-రూపాంతరము.

**మన్మథ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. కామచింత**; 2. వెలఁగ**.

**మన్మథుఁడు.** సం. వి. అ. పుం. మరుఁడు, మారుఁడు.

**మన్మనము.** సం. వి. అ. పుం. ఆలుమగలు సురతకాలమునందు దేశభాషతోఁ జెవిలో మెల్లఁగా చెప్పుకొనుమాట.

**మన్యా.** సం. వి. ఆ. స్త్రీ. పెడతలయందుండునరము.

**మన్యువు.** సం. వి. ఉ. పుం. 1. క్రోధము; 2. శోకము; 3. దైన్యము; 4. యజ్ఞము.

**మన్వంతరము.** సం. వి. అ. న. 1. డెబ్బదియొక్క-దివ్యయుగములు; 2. మనుకాలమధ్యచరిత్రము.

**మపుష్టకము.** సం. వి. అ. పుం. (చూ.) మకుష్టకము.

**మప్పితము.** దే. విశే. మితము, పరిమితము.

**మప్పు.** దే. స. క్రి. మరపుయొక్క-రూపాంతరము.

**మబ్బు.** దే. వి. 1. మేఘము; 2. చీఁకటి; "ఉ. ఘనాఘనముల్ పొగరెక్కి-కీవలాం, ధంకరణంబులైబహువిధంబులమబ్బులుగొల్పుఁగంటివే." రామా. ౬, ఆ.—3. అజ్ఞానము. "అహాతెల్విలేదయ్యో మబ్బునకున్ లోనయినాఁడు వీఁడువదరుంబోతీవు." చంద్ర.

**మబ్బుకొను.** దే. అ. క్రి. మంపుకొను. పా. ౨, ఆ.

**మబ్బుత్రోవ.** దే. వి. ఆకాశము, మేఘద్వారము. (చూ. అరిగడ ఆఱవయర్థము.) (ఇట్లు మొగులుదారి.)

**మబ్బుమేపరి.** దే. వి. వాయువు, ప్రభంజనుఁడు. "శ్రీ. మబ్బుమేపరికూనగొబ్బునవానిసింగాణిముత్తునియలుగానడంప." ఉచ్చ. నుం, కాం.

**మబ్బురవుతు.** దవ్య. వి. ఇంద్రుఁడు, మేఘవాహనుఁడు.

**మభ్యపెట్టుట.** వై. స. క్రి. మోసముచేయుట, ఉపాయముగా దాఁటవేయుట.

**మమత.** సం. వి. ఆ. స్త్రీ. మమత్వము, అభిమానము.

**మమ్మ.** దే. అవ్య. ప్రశంసనుతెలుపునది. (చూ. మమ్మారె.)

**మమ్మరె.** దే. అవ్య.——పై.——(రూ. మమ్మరే.)

**మమ్మా.** దే. అవ్య. మమ్మయొక్క రూపాంతరము. (చూ. రోయు. స. క్రి.)

**మమ్మాయి.** దే. వి. లోహవిశేషము.

**మమ్మారె.** దే. అవ్య. మమ్మరెయొక్క రూపాంతరము. "క. అమ్మదనాంగేంద్రంబున, గుమ్మరిసారెగతిఁజుట్టుకొనివడిఁదిరుగన్, మమ్మారె యనుచుఁజూపఱు, ముమ్మాఱుంబొగడిరొక్క మొగినవ్వేళన్." శశాం. ౫, ఆ. (రూ. మమ్మారే.)

**మమ్ము.** దే. వి. సముద్రముమీఁద ఓడలకు నిపాతముగావీచెడు సుడిగాలివిశేషము.

**మయము.** సం. వి. అ. పుం. 1. ఒంటె; 2. కంచరగాడిద.

**మయుష్టకము.** సం. వి. అ. పుం. అడవిపెసలు. (రూ. మయుష్టకము.)

**మయుఁడు.** సం. వి. అ. పుం. అసురశిల్పి.

**మయువు.** సం. వి. ఉ. పుం. 1. కిన్నరుఁడు; 2. మృగవిశేషము.

**మయూఖము.** సం. వి. అ. పుం. 1. కిరణము; 2. కాంతి; 3. జ్వాల.

**మయూరకము.** సం. వి. అ. న. మయిలుతుత్తము. పుం. ఉత్తరేను.

**మయూరతుత్థము.** సం. వి. అ. న. మయిలుతుత్తము.

**మయూరము.** సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. నెమిలిజుట్టు; 3. ఓమము; 4. ఉత్తరేను.

**మయూరవిదళ.** సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ.

**మర.** దే. వి. 1. కీలు; (మరగాలు, మరచుట్టు మొ.) 2. తిరుగుడుచీల; 3. తిరుగుడునొక్కు. (చూ. మరగొమ్ము.) (ఆధునికులు కొందఱు దీనిని శకటరేఫముగాఁ బ్రయోగించియున్నారు.)

**మరందము.** సం. వి. అ. పుం. పూఁదేనె. (మకరందముయొక్క రూపాంతరము.)

**మరకము.** అర. వి. ఎనిమిదిపళ్లు, తూము.

**మరకతము.** సం. వి. అ. న. పచ్చలాయి, గారుత్మతము.

**మరకాఁడు.** దే. వి. (చూ.) నావికుఁడు. "సురరాజసభఁబాండు కరిఁజేర్పుమరకాఁడు." సావ. ౫, ఆ.

**మరగాలు.** దే. వి. కృత్రిమపాదము.

**మరగు.** దే. అ. క్రి. 1. పరిచితమగు; "క. మరగినసింహాము మృగములఁ, బొరిగొనుచునునరులఁగాచుపోలికినంతః, పరిచితపవనుఁడునఘములఁ, బొరిగొనుచును నరులదేహములురక్షించున్." మార్క. 3, ఆ. (చూ. తరపు.)—2. ఆశపడు. "క. నినుఁజూచి మరగివచ్చిన, ననుఁజేకొనకునికిచేఁకునాయమెచెపుమా." భో. ౪, ఆ.—స. క్రి. ఆశించు. "క. ఏలిదంద్రులుగడియించిన, ములుగులలో విత్తమెల్ల ముండలకొఱకై, వలపునను నరిసిపెట్టుచు, నెలమి మెయిన్ మరగెనొక్కయీడిగదానిన్." భల్లా. ౧, ఆ.

**మరగొమ్ము.** దే. వి. (మర+కొమ్ము.) గుజ్జముమీఁది పల్లమునకు ముందువెనుకలనానికకై యెత్తుగానేర్పఱచియుండుభాగము. "క. తరుణీ వెఱవకుపల్లపు, మరగొమ్మేమఱకునాకుమర్యాదావి, స్మరణంబైనదిమాటల, పరాకుచేసనుచుఁదసదుపారీంద్రంబున్." కళా. ౩, ఆ.

**మరచుట్టు.** దే. వి. తిరుగడ. ఆము. ౫, ఆ.

**మరణము.** సం. వి. అ. న. చావు, మృతి.

**మరణించు.** సం. అ. క్రి. మరణముచేయు, చచ్చు.

**మరతకము.** సం. వి. అ. న. మరకతముయొక్క వర్ణవ్యత్యయరూపము.

**మరపు.** దే. ప్రే. మరగఁజేయు. (చూ. మరపు.)

**మరమేకు.** దే. వి. తిరుగుఁడుచీల.

**మరమ్మతు.** హిం. వి. బాగుచేయుట.

**మరలఁబడు** దవ్య. అ. క్రి. (మరలన్+పడు.) మరలు. "క. ధృతరాష్ట్రుండిటమీఁదను, సుతులునుశకునియును సూతిసూనుండునునే, గతినడపించిరివారల, మతమయనుష్ఠించుఁగాక మరలంబడునే." భార. ఉద్యో. ౧, ఆ. (సాపేక్షమున పడు.)

**మరలఁబాటు.** దవ్య. వి. మరలఁబడుట.

**మరలు.** దే. అ. క్రి. 1. తిరుగు, నివర్తిలు; "అంతతోమరలుమదీయకోపశిఖి." భార. ఉద్యో. ౪, ఆ.—2. వెనుకకుతిరుగు. "సీ. రామభద్రుంశుగరంబుదూరంబుగానరిగియంతటనుదామరలుదృష్టి, కానరుగైకొని." రాఘ. 3, ఆ.

**మరలుచు.** దే. ప్రే. మరలఁజేయు. (రూ. మరల్చు. చూ. బరువడి.)

**మరవలి.** దే. వి. మనుఁగుడుపు.

**మరసాన.** దవ్య. వి. జాళ్లపనివాని సాధనవిశేషము.

**మరాటము.** దే. వి. ఒకచెట్టు, లాంగలి.

**మరాటి.** వై. వి. ఒకానొకదేశస్థుఁడు.

**మరాటిమొగ్గ.** వై. వి. ఒకానొక అంగడిదినుసు.

**మరాళము.** సం. వి. అ. పుం. హంస, అంచే.

**మరి.** దే. వి. ఏ. తడవ, వారము. "క. ధరణింగాళ్యపవైశ్యా, నరమార్కండేయులోలినజగద్ధిశవా, క్పరులైరొక్కడవారొక, మరిగోష్ఠీనిరతినుండిమనుజాధీశా." భార. అను. ౨, ఆ. (ఇది ఏకాదిశబ్దపూర్వకముగా ప్రయోగింపఁబడునుగాని ప్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడదు.) "అగ్నికినిమ్మరిపోయిచెప్పుము." భార. అశ్వ. ౧, ఆ.—అవ్య. మఱియు. "ఆ. మరియునొక్కసాలమిరుగేలఁబెఱికియు." రా. అర, కాం. ౧, ఆ. (ఇది ఈ యర్థమందు లఘురేఫముగా నీ గ్రంథమునందుమాత్రము కనఁబడుచున్నది.)

**మరించు.** సం. అ. క్రి. మరణించుయొక్క రూపాంతరము.

**మరిగొమ్ము.** దే. వి. (చూ.) కలుఁజా.

**మరిచము.** సం. వి. అ. న. మిరియము.

**మరిడిమహాలక్ష్మి.** దే. వి. ఒకదేవత.

**మరిడివ్యాధి.** దే. వి. కలరాజాడ్యము, వాంతిభ్రాంతి.

**మరియాద.** వై. వి. క్రమము, మేర. "క. నరనాథుఁగొలిచియల వడఁ, దిరిగితినాకేమియనుచుఁజేఁకువలేక, మ్మరియాదదప్పమెలఁగి నఁ, బురుషార్థంబునకుహానిపుట్టకయున్నే." భార. విరా. ౧, ఆ.

**మరీచము.** సం. వి. అ. న. మరిచముయొక్క రూపాంతరము.

**మరీచి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. కిరణము. పుం. ఒక ఋషి. (చూ. ఋషి.)

**మరీచిక.** సం. వి. ఆ. స్త్రీ. ఎండమావులు, మృగతృష్ణ.

**మరు.** దే. వి. వృత్తియందు మారుశబ్దమునకాదేశరూపము. (వేమరు.)

**మరుఁడు.** వై. వి. మన్మథుఁడు, మారుఁడు.

**మరుతేజి.** దృ. వి. చిలుక, కీరము.

**మరుత్తు.** సం. వి. త్. స్త్రీ. పిక్కచెట్టు. పుం. 1. గాలి; 2. వేలుపు.

**మరుత్వంతుఁడు.** సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

**మరునిల్లు.** దృ. వి. (మరుని+ఇల్లు.) మదనగృహము.

**మరున్మాల.** సం. వి. ఆ. స్త్రీ. పిక్కతీ.

**మరుపని.** దృ. వి. సురతము. "రగడ. పనపడ్డదిమరుపనులకు నదిమును." య. ४, ఆ.

**మరులు.** దే. వి. 1. మోహము; "ద్వి. మహనీయమగువిష్ణు మాయావిలాస, మహిమమించిరఁ బెద్దమరులునముంచె, హరిమా యచేమోహితాత్మయైలక్ష్మి, పరమవిద్యయుదివ్యభావంబుమఱచి." విష్ణు. పూ. ౨, ఆ.—2. పిశాచము. (చూ. మరులుతేఁడు.)

**మరులుఁదీఁగ.** దృ. వి. మరులుజెడ. "ఆ. మరులుఁదీఁగమట్టి యురులన్ననోయని, యెడుతమిస్రఁగాడువడి." ఆము. ౬, ఆ.

**మరులుకొను.** దే. అ. క్రి. మోహించు. (ప్రే. మరులుకొలుపు.)

**మరులు జెడ.** దృ. వి. మట్టినతోడనే మరులుపుట్టించెడియోషధి, భూతకేశము.

**మరులుమాతంగి.** దే. వి.——వై.——

**మరులు తేఁడు.** దే. వి. పిశాచవల్లభుఁడు. ఉ, హరి. ౨, ఆ.

**మరువకము** సం. వి. అ. పుం. 1. మరువముతీ; 2. మంగతీ.

**మరువము.** వై. వి. వాసనగల ఒకానొకచిన్నచెట్టు. (చూ. పట్టివేరు.)

**మరువు.** సం. వి. ఉ. పుం. 1. నిర్జలప్రదేశము; 2. పర్వతము.

**మర్కటము.** సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. సాలెపురుగు. (చూ. మర్కటకము.)

**మర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తీఁగకానుగతీ; 2. దూలగొండితీ.

**మర్కారి.** గ్రా. వి. పడవనడిపించువాఁడు.

**మర్తబు.** హిం. విశే. పరిష్కారమైన, ముగిసిన.

**మర్త్యము.** సం. వి. అ. పుం. భూలోకము.

**మర్త్యుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు.

**మర్దనము.** సం. వి. అ. న. 1. పిసుకుట, సంవాహనము; 2. నూఱుట, చూర్ణనము.

**మర్దలము.** సం. వి. అ. పుం. మద్దెల. (దీని ధ్వనిగుండిలము.)

**మర్దించే** సం. స. క్రి. మర్దనముచేయు, నూఱు.

**మర్దితము.** సం. విశే. (అ. ఆ. అ.) నూఱఁబడినది.

**మర్నాఁడు.** దే. వి. మఱునాఁడుయొక్క రూపాంతరము. "ప, గీ. తమ్ము, రంబుతీర్పరిఁదన్ధుమగ్నాటిపయన, మునకుఁదోడడిగె." పర. ४, ఆ. (మరునాఁడు అని యొకచోఁ గానఁబడుచున్నది. అది ప్రక్షిప్తమనితోఁచెడి.)

**మర్మము.** సం. వి. న్. న. 1. జీవస్థానము; 2. కిటుకు.

**మర్మరము.** సం వి. అ. పుం. చొక్కాకులయొక్కయు, వస్త్రముల యొక్కయు మ్రోఁత, పెళపెళ.

**మర్మస్పృక్కు.** సం. విశే. (శ్. ఈ. శ్.) మర్మమును దాఁకునది.

**మర్యాద.** సం. వి. ఆ. స్త్రీ. 1. పొలిమేర; 2. తీరము; 3. కట్టుపాటు; 4. సమ్మానము.

**మర్లుఁబాము.** దే. వి. (మర్లు+పాము.) (చూ.) మనుదిండి.

**మర్షము.** సం. వి. అ. పుం. ఓరుపు, క్షమ.

**మఱఁదలు.** దే. వి. (మఱఁది+ఆలు.) 1. తమ్మునిభార్య; 2. భార్య చెల్లెలు; 3. తనకంటెచిన్నదగు మేనత్తమేనమామలకూఁతురు.

**మఱఁది.** దే. వి. 1. చెల్లెలిమగఁడు; "సీ. వినవసుదేవుండు మన మునహర్షించి యనుజనమఱఁదినిఘనుఁజూడఁ, దనపురోహితుఁ గర్గ్యపుఁడనమహాత్ముఁ, బ్రీతిఁబుత్తెంచె." భార. ఆది. ४, ఆ.—2. భార్యతోఁబుట్టువు; "ఉ. కంతునిమేనమామబుధగణ్యతపస్విఁ గంటిపాపఘా, శ్వంతునియుద్దికాఁడు సురసంతతిబోనమువెండిగిన్నె యా, సంతమసంబుశత్రుపునిశానతికింప్రియవల్లభుండుశ్రీ, కాంతుమఱంది శూలికడకన్నగువేలుపుదోఁచెఁదూర్పునన్." భల్లా. ४, ఆ.—3. మేనమామకొడుకు; "సీ. శ్రీమన్మహాగుణస్తోమాభిరాముఁడైతేజరిల్లెడు ధర్మరాజసుతుని, దమమఱందిగిరింద్రధరుఁడు దండంబుగానించి సేయంగల విన్నపములు." భాను. ४, ఆ. (చూ. అన్నన్న.)—4. మగనితమ్ముఁడు. "ఈసైఁడిచాయల చేమించునతండునామఱంది." దశా. ౫, ఆ.

**మఱక** దే వి. 1. కఱ; 2. మేఁకపడ్డ. "చ. నూన్నఘటగర్భమునం గలనక్షత్రవంతయుక్, దఱుఁగకయున్మిమేఁకఁగొనదానికిఁబిల్లలురెండు గల్గున, మ్మఱకలురెంటికింబొడముమానఁగడూడలునాల్గు." పంచ. నా. ४, ఆ.

**మఱకువ.** దే వి. అజ్ఞానము. (చూ. ఎఱుకు.)

**మఱచే.** దే. స. క్రి. మఱపుఁజెందు. "రగడ. అంజదిదియెలదేటికననేమఱచెమఱచెదమే మనంబున." పా. ४, ఆ.

**మఱపు.** దే. వి. 1. విస్మృతి; 2. అజ్ఞానము, "ఉ. నీమహిమార్ణవంబుమదినిక్కముగా నెఱుఁగంగలేక నీ, ప్రేమఱవచ్చుదామనకుఁ బిచ్చతనంబుననెగ్గుచేసితిన్, నామఱపుల్ సహింపుమటనారకుఁడై నమనంబులోభవ, న్నామముచింతసేసిననంతసుఖస్థితిఁజెందకుండునే." భాగ. ౯, స్కం.—3. పారవశ్యము; "సీ. మఱపు మున్నీటిలోమాననంబులుదేలబిగియారుకొంగిటదొరయువారు." ఉ, హరి. ४, ఆ.— 4. ప్రమాదము. "క. తఱచుగమెకములఁ బొరిగొను, మఱపునవచ్చితిమిదప్పమనపాలమిటకి, త్తఱిసగునిమిత్తములున్నవి, కొఱగావిదెమనకుఁబెద్దగొడవగుననినన్." స్వా. ४, ఆ.

**మఱలు.** దే. అ. క్రి. మర్లు. "క. ఎఱిఁగియుసాహసమతివై, మఱలింపఁగఁదగునెరథము." రా. యు, కాం. (కవిత్రయమువారి ప్రయోగములందిదియలఘురేఫముగా కనఁబడలేదు.)

**మఱి.** దే. అవ్య. 1. వెండియు; "క. ఉఱుముచుమెఱుముచుఁ బిడుగులు, వఱలఁగనల్లడఁ బడనవారితవృష్టుల్, గుఱుకొనితురియఁగఁబంచెను, మఱియును నయ్యసలుమీఁద మఘవుం డలుకన్." భార. ఆది. ౫, ఆ.—2. ఇంకను; 3. అనంతరము,

"వ. ఏనువివాహంబయినపదంపడిభీమసేనుండువివాహంబయిన మఱి యస్సునుంసువివాహంబగుఁగాక." భార. ఆది. 2, ఆ.

**మఱిగ.** దే. వి. జోడ్డవెలవలె బలపపుఱాతితోఁజేయఁబడిన పాత్రము.

**మఱిమఱి.** దే. అవ్య. 1. మఱియుమఱియు; 2. అత్యంతము. "క. మానుము ప్రాణముకన్నను, మానంబధికంబటంచు మఱిమఱి సభ్యుల్, భూనాథపల్కవినవే, సానితనంబేలబానిసగనమ్ముమనన్." భల్లా. ౫, ఆ.

**మఱియొకటి.** ద్వి. స. (మఱి+ఒకటి.) అన్యము. (ఇట్లు మఱియొకఁడు.)

**మఱు.** దే. వి. వృత్తియందు మఱుగు మఱున మాఱుశబ్దములకా దేశరూపము (మఱుపడు, మఱునాఁడు, మఱుమాట మొ.)

**మఱుఁగు.** దే. అ. క్రి. 1. చాటగు; 2. సంతాపించు. "క. అఱువదివేలబ్దంబులు, నెఱయఁగమనిసుతులఁగననినెవ్వగచేతన్, మఱుఁగుచుజరమేసంగ్రి, క్కిఱియఁగఁ గఱిదప్పిసుతుల నిట్లేఁగంటిన్." రా. బాల, కాం. "వ. మలమలమఱుంగుచు." భార. ఆది. 3, ఆ.—వి. చాటు. "క. విడిసించుకొనిమఱుంగున, నిడిన తనదుభూషణంబులెల్లను బ్రేమం, దొడిగిగృహంబునకల్లన, నడచెం బతిచరిత్రభావనలమనమలరన్." కళా. ౪, ఆ. (చూ. మఱువు.)

**మఱుఁగుపొడ్డి.** దే. వి. మఱుఁగుపెరడు.

**మఱుఁగుపడు.** ద్వి. అ. క్రి. మఱుఁగు.

**మఱుఁగుపెరడు.** దే. వి. విష్ఠావిసర్జనస్థానము.

**మఱుకువ.** దే. వి. సంతాపము. "తే. అనిసధర్మజుఁడిట్లనునద్దురాత్ముఁ, బొలియఁజేయుటదగదుదుస్సలఁదలంచి, వానినొకతప్పునకుస్సైఁప వలదెయాంబి, కేయమహిషికిమఱుకువఁజేయఁజనునె." భార. ఆర. ౬, ఆ.

**మఱుగుజ్జె.** ద్వి. విశే. (మాఱు+గుజ్జె.) గూనివాఁడు, గూనిది.

**మఱునాఁడు.** దే. వి. (మఱున+నాఁడు.) మఱునటిదినము.

**మఱుపడు.** ద్వి. అ. క్రి. (మఱుఁగు+పడు.) మఱుఁగగు. "ఆ. మనుజులంటకుండమఱుపడఁజేసిన, యస్త్రశస్త్రసంచయంబు గాని, శవముగాదు." భార. విరా. ౪, ఆ.

**మఱుమాట.** దే. వి. (మాఱు+మాట.) ప్రతివచనము.

**మఱుమ్రోఁత.** దే. వి. (మాఱు+మ్రోఁత.) ప్రతిధ్వని.

**మఱువ.** ద్వి. వి. (మఱుఁగు+వా) కుండ. (చూ. మఱువకందు.) విశే. మూఁగ.

**మఱువకందు.** ద్వి. వి. అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు. "ఆ. మఱువకందుజోగితెఱవాయిమెకముస్న, చెంతకరిగి." అచ్చ. ఆర, కాం.

**మఱువు.** దే. వి. 1. కవచము; "ఆ. మఱువుఁగొందతెచ్చినఱకిర పుడు." మార్క. ౮, ఆ. — 2. చాటు. "సీ. ఆత్మరంధ్రము లించుకైననునొరులకునెఱుఁగరాకుండనుమఱువుసేయుము." భార. అశ్ర. ౧, ఆ.

**మఱుస.** దే. విశే. ఆవలిది. "మఱుసటినాటివేకువసమాత్యుఁడు మేల్కని." జై. ౮, ఆ. (వృత్తియందు అంత్యవర్ణమునకు వికల్పముగా లోపంబగు. మఱునాఁడు, మఱుపుట్టువు, మఱుమేను మొ.)

**మఱుసంజె.** ద్వి. వి. (మఱుస+సంజె.) సాయంసంధ్య.

**మఱ్ఱి.** దే. వి. వటవృక్షము.

**మల.** జై. వి. కొండ, తిప్ప, మెట్టు, పర్వతము.

**మలఁక.** దే. వి. 1. చిక్కు; "ద్వి. మటుమాయవిధిపట్టిమలఁక లఁబెట్టు." పారిజా. ౧, భా. — 2. చుట్టు; "పాఁపతరిత్రాటి మలంకల." కాశీ. ౫, ఆ. — 3. మెలిక. "క. తామరసనేత్ర పీనల, తోమొనసిజయించపలేక త్రొక్కటమునసెం, తోమలఁకలఁబడి ప్రుక్కుచు, వేమఱుశష్కులులు గ్రాఁగివేఁగుచునుండెన్." రసి. ౨, ఆ. — విశే. వంకర. "చ. మలఁకలుమాప్రచారములుమా ముఖముల్ విషవహ్నికీలముల్." భాగ. ౧౦, స్కం. పూ.

**మలఁకతూము.** ద్వి. వి. పదికుంచేములకొలఁదిగల మానవిశేషము.

**మలఁకపుట్టి.** దే. వి. ఇన్నూఱుకుంచేములకొలఁదిగల మానవిశేషము.

**మలఁకమెఱుపు.** దే. వి. ధనురాకారమగు మెఱుపు.

**మలఁగ.** దే. వి. ఎద్దుసైగంతతోడిసరకుగోనె.

**మలఁగు.** దే. అ. క్రి. 1. తిరుగు; "మలఁగున్ మెల్లనిగాలికిన్." భాగ. ౧౦, స్కం. పూ. — 2. మరలు; "సీ. తనయొప్పిదముఁ గన్నఁదగిలియెవ్వరికైనమలఁగి క్రమ్మఱఁజూడవలయువాఁడు." భార. విరా. ౨, ఆ. — 3. వంకరగు. "మలఁగిమలంగి...పాత్రె." భీ. ౪, ఆ.

**మలఁచు.** దే. ప్రే. మలఁగఁజేయు. స. క్రి. తొలుచు. "చ. కరుగునఁబోయుమార్గినొడికంబుగఱాతమలంచుకైవడిన్." చంద్రా. ౨, ఆ.

**మలఁపు.** దే. ప్రే. మలఁగఁజేయు. "క. మదిమఱపునఁబాపము దన, కొచెవుటయునుబిదపవగచియొకసగమునసే, నిదినేయనింకనని యెడు, మదిఁబెఱసగముఁగనరుండుమలఁపునఘంబుల్." భార. ఆర. ౫, ఆ.—వి. నర్తనము. (చూ. మలఁపుగొను.)

**మలఁపుగొను.** దే. అ. క్రి. (మలఁపు+కొను.) నర్తించు. "స. ఎడనెడం బడంతుకలు మలంపుగొన." ఆము. ౪, ఆ.

**మలక.** దే. వి. 1. తురక; 2. మూకుఁడు.

**మలకడము.** దే. వి. పాదరక్ష. "వెలివాడపనిక్రొత్తమలకడాలు." ఆము. ౬, ఆ.

**మలగొంగ.** ద్వి. వి. ఇంద్రుఁడు, నగవైరి. "సీ. మలగొంగ యలరుటెత్తులుగట్టియిడుచుండుదంటమోములసామివంటసేయు." అచ్చ. సుం, కాం. (ఇట్లు మలదాయ, మలసూడు.)

**మలగొను.** దే. అ. క్రి. (మలఁక+కొను.) మెలిగొను. "సీ. మలగొన్నతేరివాజులఁబగ్గములచేబిగించిసారథ్యమంగీకరింప." జై. ౫, ఆ. (చూ. నాగబెత్తము.)

**మలచేము.** దే. విశే. 1. అధికము; 2. గొప్ప. (చూ. నట్ట నడుము.)

**మలప.** దే. వి. దూడచచ్చిపాలిచ్చెడుధేన్వాదికము.

**మలపు.** దే. ప్రే. (మలయఁజేయు.) 1. త్రిప్పు; "మేపుగలుగు నెడలమెలఁగమలప." భార. విరా. ౧, ఆ.—2. మరలించు. "క. వలదనియెన్నితెఱంగుల, మలపిన." అచ్చ. ఆర, కాం. — వి. ఆధిక్యము. "సీ. కమలభవాండంబుఁగదలించినలిలంబుమన మీఁదనించినమలపులేదు." ఉ. హరి. ౬, ఆ.

**మలపువు.** సం. వి. ఈ. స్త్రీ. కుక్కమేడి.

**మలమనికి.** ద్వి. వి. కోఁతి, నగౌకసము. (రూ. మలమన్కి. "ఇత్తెఱంగునమలమన్కిమొత్తములు." అచ్చ. యు, కాం.)

**మలమల.** దే. వి. మాఁడుటమఱుఁగుటలయందగు ధ్వన్యనుకరణము. (చూ. మఱుఁగు రెండవ యర్థము, కూఁక.)

**మలమాసము.** సం. వి. అ. పుం. అధికమాసము.

**మలము.** సం. వి. అ. పుం, న. 1. విష్ఠ; (ద్వాదశమలములు.– వస, శుక్లము, రక్తము, మజ్జము, మూత్రము, విష్ఠ, పింజూషము, నఖము, శ్లేష్మము, అశ్రువు, దూషిక, స్వేదము.) (జిహ్వామలము కులుకము, దంతమలము పిప్పిక.) 2. కిట్టము; 3. దోషము.

**మలయ.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లతెగడ. అ. పుం. ము. 1. ఒక కొండ; 2. ఆరామము; 3. ఒకదేశము.

**మలయజము.** సం. వి. అ. పుం. 1. చందనవృక్షము; 2. చందనము.

**మలయమ్మ.** వై. వి. (మల+అమ్మ.) పార్వతి. "సీ. మలయమ్మ వేఁటాడమాసాలఁగ్లుమీసింగపుఁగొదమఁదెచ్చెదమునీకు." య. ౩, ఆ.

**మలయిక.** దే. వి. విహారము. (సందర్భమునుబట్టి తక్కిన యర్థముల నూహించునది.)

**మలయు.** దే. అ. క్రి. 1. తిరుగు; "వ. వీరభద్రుండుమాఱు లేకమలయుచుండె." కాశీ. 2, ఆ. – 2. పెనఁగు; "హస్తికరకాండతతుల్ మనకంపుఁబాముల్లైమలసినచోట." పా. ౧, ఆ. – 3. వ్యాపించు; "ఆ. అకటసతికినంతరంగమైయుండియు, మలయకయ్యనీవుమలయపవన." కవిక. 3, ఆ. – 4. ఉద్యమించు; "తే. మలసిఱంకెలువైచుచుమాఱుకొనిన, వృషభముఁలభంగిసక్రుసు వృషభుల్లిల్లు, సమదగతిఁజేసునెడఁజూచి రమసులర్థి, సనిమిషత్వంబుదమకప్పుడచ్చుపడఁగ." భార. విరా. ౫, ఆ.–5. ఉద్రేకించు; "తే. కన్యలావణ్యరససుధాగాహనమున, విభునినయనముల సప్పృవృత్తిఁజెంద, మనసుతదురోజహేమాద్రిమనికిమరగి, మహితసురతానుభూతికైమలయుచుండు." వసు. 3, ఆ.–6. తపించు, "తే. మనునివేఁడిమినెంతయుమలసెనప్పు." య. ౫, ఆ.

**మలయువు.** సం. ఊ. స్త్రీ. కుక్కనేడి.

**మలాక.** దే. వి. శ్రీఖండము.

**మలాము.** (చూ. మొలాము.)

**మలారము.** దే. వి. 1. మట్టిగాజులగుది; 2. నిడుపుకోయక్కొనను రెల్లలుకట్టి వీధిలోనగునది ఊడ్చుసాధనము.

**మలికితము.** దే. వి. సందేహము. "క. చదువులకునొజ్జయైకడుఁ, బొదలినమాయయ్యపాత్తపుంగూర్పరిచే, నిదితగవనిపించెదనే, మది లోపలమీకునితమలికితమున్నన్." య. ౪, ఆ.

**మలిగండ్లు.** దే. వి. బ. (మలి+కండ్లు.) మలిచితీయఁదగినజాలు. "ద్వి. మలిగండ్లుచీసినమంచిబియ్యంబు, నిలుచువిధంబుచనిస్సారదుష్ట, వాసనసెంతయువడికడకొత్త, భాసురజ్ఞానసంపదవృద్ధిఁబొందు." ప్రభు. ౩౪, ఆ.

**మలినము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మాసినది; 2. నల్లనిది; 3. దూషితమైనది.

**మలిని.** సం. వి. ఈ. స్త్రీ. ముట్టుది, ఋతుమతి.

**మలిమ్లుచము.** సం. వి. అ. పుం. 1. దోమ; 2. మలమాసము. డు. 1. దొంగ; 2. అగ్ని.

**మలీమసము.** సం. వి. అ. పుం. ఇనుము. విణ. మాసినది.

**మలు.** దే. విణ. మఱునకు ఆదేశరూపమైన ఘఱుశబ్దమునకు రూపాంతరము. (ఉదా. మలుగాగు ... బునంజ మొ.)

**మలుఁగు.** దే. వి. మత్స్యవిశేషము, పాఁపమీను.

**మలుకారు.** ద్వ. వి 1. ముక్కారుపంటలో రెండవకారు; 2. శీతకాలము.

**మలుకు.** దే. వి. దారములోనగువాని సెదురెదురుగా తగిలించి మరల పెడమర్లత్రిప్పినది. (రూ. మల్కు. "మల్కుతోడా మెలివెట్టికట్టిన కడానిజగాజిగిపాగమీఁద." శశాం. ౫, ఆ.)

**మలుకువ.** దే. వి. ముఱికి, మాలిన్యము.

**మలుగు.** దే. అ. క్రి. 1. ఆఱు; "క. అకృష్ణుఁడునిజసామ్యాలోకనమున నాశిఖని మలుగఁజేసంబూ, ర్ణాకారతసవ్వనముని, రాకులతంబొలిచెనదిమహాద్భుతమయ్యెన్." భార. అను. ౪, ఆ.–2. నశించు. (చూ. నేయి.) వి. తుంటి.

**మలుచు.** దే. స. క్రి. 1. బియ్యములోనగునవిఱాళ్లుపోవచెరుగు; 2. తటిమెసఁబెట్టు; 3. జాతినితొలుచు. (రూ. మల్చు. పటిమెనఁబెట్టుటకు.– "ఊరులుమల్చివేసినటులున్నవి." విజ. ౧, ఆ.)

**మలుపక్కము.** ద్వ. వి. కృష్ణపక్షము. (శుక్లపక్షము తొలుపక్కము.)

**మలుపు.** దే. ప్రే. (మలుగఁజేయు.) 1. ఆర్చు; 2. నశింపఁజేయు. "ఎ, గీ. కీఁడుమకరాక్షుఁడిపుడునీవాఁడియెల్ల, మలిపిపొలుపఱఁజేయువాఁల్లగఁడు సుమ్ము." అచ్చ. యు, ౯౦.

**మలుసంజె.** ద్వ. వి. సాయంసంధ్య. (చూ. తొలుసంజె.)

**మల్ల.** వై. వి. మంటికంచము, సానిక.

**మల్లకము.** సం. వి. అ. పుం. ఆ. స్త్రీ. దీపపుప్రమిద.

**మల్లకుఁడు.** దే. విణ. కఠినుఁడు, గడుసరి. "క. తల్లికిఁదండ్రికి సుతులకు, నెల్లవిధంబులను వలయుహితములుసెప్పన్, మల్లకుఁడు గాకకర్జము, సల్లాపముగాఁగఁజూపిసౌజన్యమునన్." భార. అను. ౪, ఆ.

**మల్లగుల్లము.** దే. వి. వాదులాట.

**మల్లచఱచు.** ద్వ. అ. క్రి. (మల్లట+చఱచు.) భుజాస్ఫాలనము చేయు. "మల్లచఱచుచునార్చుచు." హరి. పూ. ౬, ఆ.

**మల్లచఱపు.** ద్వ. వి. మల్లచఱచుట, భుజాస్ఫాలనము.

**మల్లట.** ద్వ. వి. మల్లాటయొక్కరూపాంతరము.

**మల్లడి.** దే. వి. 1. పరితాపము; 2. పెనఁకువ.

**మల్లడించు.** దే. అ. క్రి. 1. పెనఁగొను; "తే. మనములోదుఃఖతాపముల్ మల్లడింప." భాగ. ౪, స్కం. – 2. అతిశయించు. "మనములోపలరోషంబు మల్లడింప." భాగ. ౪, స్కం.

**మల్లడిగొను.** దే. అ. క్రి. (మల్లడి+కొను.) 1. పెనఁగొను; "క. తనపూజత్రోపువడుటకు, మనమునఁగోపమునుసిగ్గుమల్లడిగొనఁగా." హరి. పూ. 2, ఆ.–2. పరితపించు. "క. చిడిముడిపడుచునెదురుసనఁ, గడఁగుచుహారములుచక్కఁగాఁద్రోచుచుమల్లడిగొనుచు." భార. విరా. ౩, ఆ. (ప్రే. మల్లడిగొలుపు. "మానవికోపమిట్లుమదిమల్లడిగొల్పఁగ." పాండు. ౪, ఆ.)

**మల్లము.** సం. వి. అ. పుం. (చూ.) మల్ల.

**మల్లరము.** దే. విణ. మదించినది. "మల్లరంపుటాఁబోతులు." పర. 3, ఆ. "వ. మల్లరపుఁగల్లరికేఁటిదండంబులు." కళా. ౬, ఆ.

**మల్లసాల.** వై. వి. భోజనశాల. "క. ఎల్లెడఁబరదేసులకును, గుల్లంబంచలునురచ్చకొట్టంబులునం, గల్లనుగాకతలంపఁగఁ, జల్లనిమున్నం

పుమల్లసాలలుగలవే." హరిశ్చ. ౪, ఆ. (ఇది మల్లెసాలయని వక్రమధ్యముగా ప్రతులయందుఁగానంబడియెడి.)

**మల్లాట.** ద్వ. వి. మల్లాడుట.

**మల్లాడు.** ద్వ. అ. క్రి. (మల్లు+ఆడు.) పెనఁగాడు. "వ. అతండొక్క-తరువృకరయుగళినిజేయంబట్టి పెల్లగింపమల్లాడునాలోనన." స్వా. ౪, ఆ.

**మల్లామడి.** దే. విశ. పీడితము, పీడితుఁడు. "క. తొల్లియగువగల త్రొక్కు-న, నిల్లిగ్గులుగానవచ్చుహృదయములోనన్, పల్లాసుశ్రీయగు మదనుఁడు, మెల్లనఁగూర్చుండెఁదాల్తి మినుమినుకనఁగన్." ఉ, హరి. ౫, ఆ.

**మల్లారపము.** దే. వి. మలారమునకు మొదటిరూపము.

**మల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. మల్లెతీఁగ; 2. మృత్పాత్రవిశేషము. అ. పుం. ము. మాసినముక్కు-కాళ్లుగల తెల్లహంస.

**మల్లికాక్షము.** సం. వి. అ. పుం. 1. మాసినముక్కు-కాళ్లుగల తెల్లహంస; 2. తెల్లనికన్నులుగలగుఱ్ఱము.

**మల్లియ.** వై. వి. మల్లెతీఁగ. (చూ. నల్లన.)

**మల్లు.** వై. వి. 1. కోఁతి; 2. జెట్టిపెనఁకువ*.

**మల్లుఁడు.** సం. వి. అ. పుం. జెట్టి. విశ. శ్రేష్ఠుఁడు.

**మల్లుకట్టు.** ద్వ. స. క్రి. అడ్డగించు.

**మల్లుపెనఁగు.** ద్వ. అ. క్రి. జెట్టిపెనఁకువగాపెనఁగు. "ఉ. బల్లిదులైనబుఱ్ఱయదుభర్తలుదగ్రపరాక్రమంబునన్, మల్లుపెనఁగునంత." వి, పు. ౬, ఆ.

**మల్లె.** యు. వై. వి. 1. మల్లిక¹; (దీనిభేదములు బొండుమల్లె, సూదిమల్లె మొ.) 2. మల్ల. దే బ. శ్ఫోటకపు బొబ్బలయందుఁ గలుగు పురుగులు.

**మల్లెజేగులు.** ద్వ. వి. రాపులుఁగు, లోహపృష్ఠము.

**మల్లెలగుది.** ద్వ. వి. మల్లెపూగుత్తివలె మనోజ్ఞమగుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**మవ్వము.** దే. వి. కోమలత. "ఉ. మవ్వమెక్కియు, కుక్కమ్మడి నంకురించులత లొప్పదొఱంగవె సీరుగానమిన్." నిర్వ. ౫, ఆ.—విశ. కోమలము. "క. ఇవ్విధమునవొండొరుపయి, మవ్వంబుగఁబ్రబలుప్రేమమహిమంబులతో, జవ్వనపుఁబోఁడుములు గడు,నవ్విభుఁడున్నతియుఁగడపనంతటిలోనన్." కళా. ౭, ఆ.

**మశకము.** సం. వి. అ. పుం. 1. దోమ; 2. దేహమువిరియు రోగము.

**మశహారి.** సం. వి. ఈ. స్త్రీ. దోమతెర, చతుష్కి.

**మషాతు.** హిం. వి. నేల కొలుచుట.

**మషాఖితు.** హిం. వి. భూమిని భాగుచేయుట.

**మషాల్చి.** హిం. వి. దివిటీలుపట్టువాఁడు, దీపములు వెలిఁగించువాఁడు.

**మషి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. కాగితమువ్రాసెడుమసి.

**మషిమణి.** సం. వి. ఇ. స్త్రీ. మసిబుడ్డి.

**మస.** దే వి. విలాసము. "వలరాచమస." విక్ర. ౮, ఆ. "క. జిగిబిగివగచిన్నెలమస." హంస. ౨, ఆ.

**మసఁగు.** దే. అ. క్రి. రేఁగు, విజృంభించు. (చూ. పసగరగొను.)

**మసక.** వై. వి. 1. ఇంచుకసలుపు*; 2. మునిచీఁకటి*. "ప్రొద్దు మసకంబడె." శై. ౭, ఆ. (ఆమ్రేడితమునందు మసమసక. ఇంచుకసలుపునకు.—"వ. పాదరస్ఫటికపటీరపాండురుచి పుండరీకంబులపసకుమసమసకలెసకొల్పుమిసిమిగలభోగిభోగభాగంబునకు పరభాగంబుమిగుల." ఆము. ౬, ఆ.—మునిచీఁకటికి.—"వ. ఒండొంటికిం జేరెంబులువాటి కుప్పించితప్పించుకొనుదుప్పులఖురజరజర్ఝటలనెసకమెసఁగు మసమసకలమలుంగువడి." స్వా. ౪, ఆ.)

**మసకన.** వై. వి. 1. ఇంచుకసలుపు*; 2. మునిచీఁకటి*. [ఆమ్రేడితమునందు మసమసకన. "క. మసమసకనయ్యెదిక్కులు." (చూ. ఎగయు.) (మసమసకనయ్యెననఁగా మసమసకసకలవియాయెననుట.) (విశేషణమగుచో. "క. పసిపాపయెండకొనలును, మసమసకనియిరులుకలసిమసమలరించెన్." నై. ౮, ఆ.) (ఇక్కడ మసమసకనకు ఇంచుకమాత్రమర్థము.) చూ. అలకన.]

**మసకము.** దే. వి. 1. సంభోగేచ్ఛ; "వ. మసకంబునంబెనంగు పాములపగిది...కలయబెరయు." ఉ, హరి. 3, ఆ.—2. సంభోగము. "వ. మశకంబునకుఁ బెనఁగుకొదమనాగులబాగునమేనులు నుట్టవెట్టుకొని పెనంగుచు." భో. ౫, ఆ. "వ. మసకపుఁబ్రతిమలమేల్కట్లును." (ఇక్కడ శయనగృహవర్ణనము. చూ. మసకొను.) కవిక. 3, ఆ.

**మసకొను.** దే. అ. క్రి. (మసకము+కొను.) సంభోగేచ్ఛగొను. "సీ. ప్రాణనాయికతోడఁబర్యంకసీమలమసకొనిపెనఁగునంభ్రమమువిడిచి." కాశీ. ౨, ఆ. (ప్రే. మసకొల్పు. "ఉ. చల్లనిబెల్లిమాటలపసన్మసకొల్పుచునెల్లవారలన్." అచ్చ. అ, కాం.)

**మసటు.** దే. వి. మురికి, మాలిన్యము. "మ. అసిధారాదళితాత్తబంధుభుజమధ్యస్త్రైవరనిర్యద్ధ్వనిన్, మసపై పుట్టినయమ్మహాదురితమున్ మన్నెట్టియున్వాజిమే, ధసమిద్ధానలభూతిచేనుసిమియుం దప్పింపలేనైతినీ, కనబెప్పాటఁదొలంగునెట్టులగుదున్ గల్యాణకల్యాత్ముఁడన్." పాండు. ౫, ఆ.

**మసడు.** దే. వి. మసటుయొక్క-రూపాంతరము. ఆం. భా. ప్ర, కాల.

**మసనము.** వై. వి. శ్మశానము. "అగణ్యపుణ్యజనపాళికానమసనంబు." (నలకథయందు పుణ్యజనపాళికి ఆన అని ఛేదము.) హన. ౫, ఆ.

**మసర.** దే. వి. ధూసరవర్ణము. విశ. ధూసరవర్ణముగలది.

**మసరు.** దే. వి. ఆవేశము. "తే. బలోదారుఁడైన, మహిషుఁడెప్పుడు మదమునమసరుకవిసి, కలఁచుచున్నాఁడుత్రిభువనకమలవనము." మార్క. ౬, ఆ.

**మసలిక.** దే. వి. మాంద్యము. విశ. మందము. "అరుంగు మెఱుంగుమెట్టికల్ మసలికయెక్కుఁడు." (మసలిక=మసలికగా.) పాంచా. ౪, ఆ.

**మసలు.** దే. అ. క్రి. 1. తడయు; "క. ఈయున్నపౌష్యప్రోలికిఁ, బోయికడుంబెద్దదవ్వు పోయినయట్ల, త్వాయతవిమలతపోమహి, మాయిన్నిదినంబులేలమసలితిచెపుమా." భార. ఆది. ౧, ఆ.—2. నీళ్లుమలమలకాఁగు; 3. విహరించు; "క. ఏలావనరమ్యములగు, వేలావనములనుబవనవిచలద్వీచీ, లాలితనముద్రవిద్రుమ, మాలాపులినస్థలములమసలుచులీలన్." భార. ఆది. ౮, ఆ.—4. వెనుకకుతిరుగు. "క. వసుమతిమనమింతకుమును, వసుధాధిపకంటిమేనువర్ణమృగమురా, క్షసకృత్యమ్మిదివలవదు, మసలుఁడునతులతులచపలమతులుదలంపన్." రా. అర, కాం. ౨, ఆ.

**మసలుకొను.** దే. అ. క్రి. మసలు. "వ. నొసటిమృగమదపుటసలునమసలుకొనితుంపెసలాడుకురులు." భాగ. 3, స్కం. (స్వార్థమున కొను.)

**మసారము.** సం. వి. అ. పుం. ఇంద్రనీలము. "తరళమసార సారనిభతారకముల్." పాం౦డు. ౨, ఆ.

**మసాల.** హిం. వి. సంభారము, గుజ్జమునకిచ్చుమందు.

**మసి.** ఉభ. వై. వి. 1. నలుపు*; 2. బొగ్గు*; 3. మయిల*. సం. ఇ. ఈ. స్త్రీ. కాగితము వ్రాసెడుకాటుక. ఈ. పెద్దసదాపకీ.

**మసికట్టు.** దన్. వి. బంగారులోనగువానిచిలుము.

**మసికోతి.** దన్. వి. నల్లకోతి.

**మసిబుడ్డి.** మి. వి. మసిపోసెడుబుడ్డి.

**మసీదు.** దే. వి. తురకలగుడి. యు. ౧, ఆ.

**మసుర.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. పుం, స్త్రీ. చిఱుసెనగలు.

**మసూర.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. పుం, స్త్రీ. చిఱుసెనగలు. పుం. ము. బిల్లతలగడ.

**మసూరవిదళ.** సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడకీ.

**మసూరి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకదినుసుగజ్జి. (చూ. మసూరిక.) (ఆ. స్త్రీ.)

**మసృణ.** సం. వి. ఆ. స్త్రీ. నల్లగిసెకీ. విశ. 1. చిక్కనిది; 2. నున్ననిది.

**మసెల.** దే. వి. అటుక.

**మస్కరము.** సం. వి. అ. పుం. వెదురు, వేణువుకీ.

**మస్కరి.** సం. వి. న్. పుం. సన్న్యాసి, భిక్షుకుఁడు.

**మస్టు.** దే. వి. మనటుయొక్కమాఱురూపము.

**మస్తకి.** హిం. వి. ఒక మందుదినుసు.

**మస్తము.** సం. వి. అ. న. తల. (రూ. మస్తకము.) (పుం, న.)

**మస్తరించు.** దే. స. క్రి. లోపఱచు. "ఉ. ఎంతయుఘోరమైనవి పిసేధముమెల్లనమస్తరించిమా, వంతుఁడుకంరపీఠిఁగురదైచి సుఖం బుగనెక్కునట్టులు." కాశీ. ౫, ఆ.

**మస్తరు.** దే. వి. లోఁకువ, అధీనత. (చూ. మస్తరించు.)

**మస్తిష్కము.** సం. వి. అ. న. తలమెదడు.

**మస్తీ.** వై. వి. మదించినయేనుఁగు. "మ. తెలిపుగద్దియగాడుపుం గొదమమస్తీనెక్కిలేఁదేఁటిగం, టలసంధిల్లురొదాళముల్ పరవమిం టక్ వెంటఁజంద్రాదుల, గ్గలికక్ముంగలబారుదీరినదువకాలా ర్పుచుక్ నూకికెం, దలిరుంబెద్దహజారపున్నడిమిచెంతక్ డిగ్గితాన చ్చటక్." చంద్రా. 3, ఆ.

**మస్తు** యు. దే. వి. సమృద్ధి. వై. మదము.

**మస్తువు.** సం. వి. ఉ. న. పెరుఁగుమీఁదిమీఁగడ.

**మహంతు.** దే. వి. దేవస్థానములకు ధర్మకర్తృత్వముజఱిగించు బైరాగి.

**మహజర్నామా.** హిం. వి. బహుజనులవ్రాతపూర్వకమయిన విన్నపము.

**మహతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నూఱుతంతులుగల నారదునివీణ; 2. తెనుఁగువ్యాకరణమున తిర్యగితరస్త్రీవాచకశబ్దములకు సంజ్ఞ. విశ. గొప్పది.

**మహత్తు.** సం. వి. త్. న. దొరతనము. పుం. 1. బుద్ధితత్త్వము; (చూ. తత్త్వము.) 2. తెనుఁగువ్యాకరణమున పురుషవాచకశబ్దము లకు సంజ్ఞ. విశ. గొప్పది.

**మహనీయుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) గొప్పవాఁడు.

**మహము.** సం. వి. అ. పుం. 1. ఉత్సవము; 2. తేజము.

**మహలు.** హిం. వి. దేశములోనిభాగము, రాజమందిరము.

**మహస్సు.** సం. వి. స్. న. 1. తేజము; 2. ఉత్సవము.

**మహసూలు.** హిం. వి. పంట.

**మహాంగము.** సం. వి. అ. పుం. ఒంటె, క్రమేలకము.

**మహాకందము.** సం. వి. అ. పుం. 1. వెల్లుల్లికీ; 2. దురద కందకీ.

**మహాకాలుఁడు.** సం. వి. అ. పుం. 1 శివుఁడు; 2. ఒక శివభటుఁడు.

**మహాకులుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) గొప్పకులమునఁబుట్టిన వాఁడు, కులీనుఁడు.

**మహాగణులు.** సం. వి. బ. తెంగాలగురువులబిరుదు.

**మహాజాలి.** సం. వి. ఈ. స్త్రీ. పచ్చనిపువ్వులుగల ఆవడకీ.

**మహాదేవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**మహాధనము.** సం. వి. అ. న. 1. చిల్లమడ్డి; 2. బంగారు; 3. కృషి; 4. గొప్పవెలగలవస్త్రము; 5. గొప్పవెలగలవస్తువు. విశ. గొప్పవెలగలది.

**మహానటుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**మహానసము.** సం. వి. అ. న. పాకస్థానము, వంటయిల్లు.

**మహానీలము.** సం. వి. అ. పుం. 1. సింహళద్వీపమునందుఁ గలిగిన యింద్రనీలమణి; 2. గుంటగలిజేరుకీ డు. దేవయోని సర్పవిశేషము.

**మహాపథము.** సం. వి. అ. పుం. 1. ప్రాణాంతము; 2. రాజ మార్గము.

**మహాపద్మము.** సం. వి. అ. పుం. 1. ఒకనిధి; (చూ. నిధి.) 2. సంఖ్యావిశేషము; 3. దేవయోనిసర్పవిశేషము.

**మహాప్రళయము.** సం. వి. అ. పుం. లోకనాశనము, బ్రహ్మ ప్రళయము.

**మహాబల.** సం. వి. ఆ. స్త్రీ. నులితడకీ. అ. న. ము. సీసము. పుం. డు. వాయువు. విశ. మిక్కిలి బలిమిగలవాఁడు.

**మహామాత్రుఁడు.** సం. వి. అ. పుం. 1. కార్యసహాయుఁడు; 2. మావటీడొర; 3. సంపన్నుఁడు.

**మహామృగము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, ఎక్కుడుమెకము.

**మహారంభ.** సం. వి. ఆ. స్త్రీ. పచ్చయరఁటికీ.

**మహారజతము.** సం. వి. అ. న. స్వర్ణము, బంగారు.

**మహారజనము** సం. వి. అ. న. 1. కుసుమపువ్వు; 2. బంగారు.

**మహారణ్యము.** సం. వి. అ. న. గొప్పయడవి, పేరడవి.

**మహారథుఁడు.** సం. వి. అ. పుం. పదునొకండువేలమంది విలుకాండ్రతో పోరెడు యోధుఁడు. తన్నును, సారథిని, గుఱ్ఱము లను కాపాడుకొనుచు పోరెడు యోధుఁడు. (అనికొందఱు.) విశ. గొప్పరథముగలవాఁడు

**మహారాజకుఁడు.** సం. వి. అ. పుం. గణదేవతావిశేషము.

**మహారాత్రము.** సం. వి. అ. పుం. అర్ధరాత్రము.

**మహారౌరవము.** సం. వి. అ. పుం. నరకభేదము.

**మహాశంఖము.** సం. వి. అ. న. 1. సంఖ్యావిశేషము; 2. నొసలు; 3. మనుష్యునియెముక.

**మహాశయుఁడు.** సం. వి. అ. పుం. సముద్రుఁడు. విణ. గొప్ప యభిప్రాయముగలవాఁడు.

**మహాశూద్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లది; 2. గొల్లవాని పెండ్లాము.

**మహాశూద్రుఁడు.** సం. వి. అ. పుం. గొల్లవాఁడు.

**మహాశ్వేత.** సం. వి. ఆ. స్త్రీ. నల్లనేలగుమ్ముడుతీ.

**మహాసహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కారుమినుము; 2. గోరింట.

**మహాసేనుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి. విణ. గొప్ప సేనగలవాఁడు.

**మహి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. భూమి; 2. ఆవు.

**మహిక.** సం. వి. ఆ. స్త్రీ. మంచు, హిమము.

**మహితము.** సం. వి. అ. న. శివునిశూలము విణ. గొప్పది.

**మహిమ.** సం. వి. న్. పుం. 1. గొప్పతనము; 2. ఒక ఐశ్వర్యము. (చూ. ఐశ్వర్యము.) (రూ. మహిమము.)

**మహిషము.** సం. వి. అ. పుం. ఎనుఁబోతు, దున్న.

**మహిషవాహనుఁడు.** సం. వి. అ. పుం. యముఁడు, పోతురౌతు.

**మహిషి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పట్టపుదేవి; 2. ఎనుము; (దీని దూడకయాహము.) 3. ఒకానొకచెట్టు.

**మహిళ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుది; 2. ప్రేంకణముతీ.

**మహీక్షితుఁడు.** సం. వి. త్. పుం. 1. రాజు; 2. తేఁడు.

**మహీధ్రము.** సం. వి. అ. పుం. కొండ, పుడమితాలుపు.

**మహీరుహము.** సం. వి. అ. పుం. వృక్షము, పుడమిపుట్టు.

**మహీలత.** సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱ, గండూపదము.

**మహీసుత.** సం. వి. ఆ. స్త్రీ. సీత. అ. పుం.-డు. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.

**మహేంద్రము.** సం. వి. అ. పుం. ఒకకొండ. డు. ఇంద్రుఁడు.

**మహేంద్రి.** సం. వి. ఈ. స్త్రీ. బొంతరంటితీ.

**మహేచ్ఛుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గొప్ప అభిప్రాయముగలవాఁడు.

**మహేరణ.** సం. వి. ఆ. స్త్రీ. అందుగు, సల్లకితీ.

**మహేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. గొప్ప ప్రభువు.

**మహోక్షము.** సం. వి. అ. పుం. ఆఁబోతు.

**మహోత్పలము.** సం. వి. అ. న. తామర, పద్మము.

**మహోత్సాహుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అద్భుతకార్యారంభముకలవాఁడు.

**మహోదయము.** సం. వి. అ. న. కన్యాకుబ్జము. పుం. 1. ఆధిపత్యము; 2. అభివృద్ధి; 3. మోక్షము.

**మహోదరము.** సం. వి. అ. పుం. వ్యాధివిశేషము.

**మహోద్యముఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మహోత్సాహుఁడు.

**మహౌషధము.** సం. వి. అ. న. 1. అతివస; 2. వెల్లుల్లి; 3. శొంఠి.

**మళయాళము.** వై. వి. మలయపర్వతముచుట్టుపట్టుదేశము*.

**మళిగ.** వై. వి. చింతపండుమిరెపకాయలోనగు పలునరకులు విశేషముగానుంచుకొని అమ్మకముచేసెడి యిల్లు*.

**మళ్లు.** దే. అ. క్రి. మరలుయొక్క-మాఱురూపము.

## మా.

**మా.** ఉభ. యు. దే. అవ్య. బహు. "తే. వీరమాహేశ్వరాచారపారగునకు, దనకుశివాళియిచ్చినకనకరథము, కామగమనంబు నైషధక్ష్మావరునకు, మామయిచ్చెనుమాయనిమహిమనుతింప." నై. ౬, ఆ. — వై. విణ. మిక్కిలి. "మాబాగాయె." త్రే. త్రయ.— సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

**మాంగల్యము.** సం. వి. అ. న. 1. మంగళత్వము; 2. తాలిబొట్టు.

**మాంజిష్ఠము.** సం. వి. అ. న. ఎఱుపుమించినపసుపువన్నెగల చీర. "తే. చీనిచీనాంబరములుమాంజిష్ఠములును." శేష. 3, ఆ. — పుం. ఎఱుపుమించినపసుపువన్నె. విణ. ఎఱుపుమించిన పసుపువన్నెగలది.

**మాంత్రికుఁడు.** సం. వి. అ. పుం. మంత్రవిద్యతెలిసినవాఁడు.

**మాందాళి.** దే. వి. 1. కృత్రిమమరకతము; (మాందాళిపచ్చ.) 2. పచ్చపట్టుచీర. "సీ. జలుఁగుపావడమీఁదఁజిలుఁగరధిక్కృతమిళిందాళియొక్క-తివమాందాళిగట్టె." పంచ. వేం. ౪, ఆ.

**మాంద్యము.** సం. వి. అ. న. 1. ఆలస్యము; 2. జాడ్యము.

**మాంసము.** సం. వి. అ. న. నంజుడు, పలలము.

**మాంసలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. బలిసినవాఁడు; 2. బలిమిగలవాఁడు.

**మాంసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. జటామాంసితీ; 2. కారుకొల్లితీ.

**మాంసికుఁడు.** సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులమాంసము విక్రయించి జీవించువాఁడు, కొటికుఁడు.

**మాఁకు.** దే. వి. మ్రాను, వృక్షము. "రగడ. మాకులేదుసమాకులతరమ్మాకుఱుచవిరిమాఁకుఁడాయఁగ." చంద్ర. (మ్రాఁకుయొక్క-రూపాంతరము.)

**మాఁగాయ.** దే. వి. (మావి+కాయ.) మామిడికాయ. (ఇదియొక నిఘంటువునవ్రాయఁబడియున్నది.)

**మాఁగు.** దే. అ. క్రి. కమియఁబండు. వి. 1. మాలిన్యము; "సీ. తొడినకంకటములఁదొడవులవిలసిల్లమణులఘృణులదెసల్ మాఁగు విరియ." రా. యు, కాం.—2. ముఖమునందలి నల్లనిపొడ. "చ. కఱయుకా మాఁగునులేకపుట్టిన శుభాంగంబద్భుతొపాదియై, నెఱయక." హరి. పూ. ౫, ఆ.

**మాఁగుడు.** దే. వి. నలుపు, మాలిన్యము. "ద్వి. పలుచనిమొగిలులోపలఁదోఁచుచంద్రు, కళభంగి మాఁగుడుఁగవిని." హరిశ్చ. ౨, భా.

**మాఁగుడుపాఱు.** దే. అ. క్రి. (మాఁగుడు+పాఱు.) మాయు, మలినమగు. "వ. మెఱుంగడంగియుడురాజమండలంబుమాఁగుడువాఱికానుపింప." ప్రభా. ౫, ఆ.

**మాఁగుపడు.** ద్వి. అ. క్రి. (మాఁగు+పడు.)—వై.— "సీ. నురుచిరకిరణవిస్ఫురణంబుడింది యొంతయుమాఁగుపడిన మార్తాండుపగిది." మార్క. ౧, ఆ.

మాఁగువాఱు. దే. అ. క్రి. (మాఁగు+పాఱు.) మాయు, మలిన మగు. "సీ. దనుజాతేజముగనిదైన్యమొందినమాడ్కి-మార్తాండుఁ డెంతయుమాఁగువాఱె." లక్ష్మి. ౨, ఆ. "తే. తోఁచెనల్లడధూమకేతు వ్రజంబు, పడెనకాలపుఁబిడుగులుపుడమిమీఁద, మాఁగువాఱెను మార్తాండమండలంబు, పరఁగెఁజుక్కలుదినమునబయలుమెఱసి." ఉ, హరి. ౬, ఆ.

మాఁటినంగ. దే. వి. (మాఁటిన+నంగ.) కాముకి. "సీ. మాటాడ నేరనిమాఁటినంగవు నీవుసకలకాలంబునోసరసిజాక్షి." "ఎ, గీ. భోగదానవ్రతంబులుపూనియెపుడు, మకరకేతనునర్చించుమాఁటి నంగ." కాశీ. 3, ఆ.

మాఁటు. దే. అ. క్రి. తగులముగొను. (చూ. రోఁత.) వి. 1. తగు లము; (చూ. మాఁటువడు.) 2. మాఁతు.

మాఁటుమణఁగు. దే. అ. క్రి. జెంజాటముడిగినిశ్శబ్దమగు. "తే. అంతనక్కుశివుండూరియలబలంబు, మట్టుపడఁజూచి యిదెమాఁటు మడఁగెననుచు." శుక. ౨, ఆ. (రూ. మాఁటుమణుఁగు, మాఁటు మడఁగు, మాఁటుమసుఁగు.)

మాఁటుపడు. ద్వ. అ. క్రి. (మాఁటు+పడు.) తగులుపడు.

మాఁడు. దే. అ. క్రి. దగ్ధమగు. "క. నేఁడుండియెల్లిపోదిటఁ, బోఁడిగనొకచోటఁదప్పిపోనుండఁదగుక్, నేఁడైనశోకవహ్నిక్, మాఁడకయుండెదనహించిమారుతపుత్రా." రా. సుం, కాం.—వి. 1. అడుగంటిమాఁడిన అన్నములోనగునది, దగ్ధిక; 2. ఇంటి యొకభాగపుకప్పు.

మాఁడుచే. దే. ప్రే. మాడఁజేయు, మాఁడించు. "క. వీఁడావెఱ వకయుండెడు, వాఁడిక్కడరాముఁడున్నవాఁడనివినియుక్, నేఁడీ రక్కసుపోఁడిమి, మాఁడుతుననియాడుగఱచి మచ్చరమెచ్చక్." రామా. ౭, ఆ.

మాఁడెము. వై. వి. మండలాధిపతులభూమండలము*. "ఎ, గీ. మాఁడెములు వ్రేల్చెనొడ్డాది మనియొనర్చె." స్వా. ౧, ఆ.

మాఁతు. దే. వి. చేదరంగపు ఆటయందు బంటుతోఁగాక తక్కిన వానితో రాజునఁగట్టుట.

మాకందము. సం. వి. అ. పుం. మామిడిచె. (దీనికి దోహదక్రియ కరస్పర్శము.)

మాకరి. వై. వి. మాలకరియొక్కమాఱురూపము. (ఇదియొకనిఘం టువునందు వ్రాయఁబడియున్నది.)

మాకొను. దే. స. క్రి. కఱచే. "శే. తోలుతఁబుత్రునినెదటికో తోలఁగఁబెట్టి, యడవిలోఁబాముమాకొన్నదనుచుమొఱఁగి, కల్లయేడు పులేడ్చుచుఁగపటవృత్తి, వెదకినందుననుఱుకఁజూచెదవునీవు." హరిశ్చ. ౫, ఆ.

మాక్షికము. సం. వి. అ. న. తైలవర్ణముగలతేనె.

మాగధి. సం. వి. ఈ. స్త్రీ. 1. అడవిమొల్లచె; 2. పిప్పలిచె; 3. షడ్విధ ప్రాకృతభాషలలో నొకటి. (చూ. ప్రాకృతము.)

మాగధుఁడు. సం. వి. అ. పుం. వంశవీర్యాదులనుపొగడియుప జీవించువాఁడు. (రూ. మగధుఁడు.)

మాగాణి. దే. వి. వరి పంటపెట్టెడునేల.

మాగాని. దే. వి. దేశము, విలాతి.

మాగిలి. దే. వి. మాగాణి.

మాఘము. సం. వి. అ. పుం. ఒక మాసము. (చూ. మాసము.) [illegible] ఒకకవి.

మాఘ్యము. సం. వి. అ. న. మొల్ల, కుందముచె.

మాచి. ఉభ. దే. వి. ఒకచెట్టు. "ఎ, గీ. దళములందునుమారేడు తొళసిజమ్మి, మాచినేరేడువావిలిమంచివెలఁగ, దవనమునుతేల పత్రిచూతంబునారె, శస్త్రములునుమ్మపత్రికిజనవరేణ్య." భల్లా. 3, ఆ.—సం. ఈ. స్త్రీ. కాఁచిచె.

మాచిపత్రి. ద్వ. వి. స్థాణేయముచె.

మాచెనపక్కె. దే. వి. మత్స్యవిశేషము.

మాచేకమ్మ. ద్వ. వి. (మాచే+అక+అమ్మ.) మగతొమ్మయి మీస ములుగలిగిన ఆఁడుది, పోట.

మాజాం. హిం. వి. గంజాయి, బెల్లము మొదలగునవిచేర్చి సిద్ధము చేసిన మత్తువస్తువు.

మాట. దే. వి. 1. వచనము; 2. పదము; 3. నింద; 4. వృత్తాం తము; "సీ. అప్పపాలైనశుభ్రాబ్జంబురుచియెంత మాటమోచిన యంచతేటయెంత." (ఇది నిందకును నుదాహరణము.) కా. ౧, ఆ.—5. ప్రతిజ్ఞావచనము. (నేను వానికి మాటయిచ్చితిని.)

మాటకాఁడు. దే. విశ. సభయందు భయములేక మాటాడువాఁడు, వక్త.

మాటకారి. దే. విశ. యుక్తిగామాటాడువాఁడు, వాగ్మి. స్వా. ౫, ఆ.

మాటలమారి. దే. విశ. మిక్కిలి మాటలాడువాఁడు, వావ దూకుఁడు.

మాటాడు. దే. అ. క్రి. స. క్రి. వచించు. (వాఁడు నాతో మాటా డఁడు. చూడువాఁడెన్నిమాటలుమాటాడెను.)

మాటికి. దే. ద్ర. ముహురర్థకము, అడుగడుగుకు. "క. వీటిపటు ఘోటకనిరా, ఘాటత్వరకోడిపూరిగఱచు హారిణముల్, మాటికి నిదదా రోహంకుఁ, డౌటంబవమానుఁడోడుటబ్బురమగునే." కవి. ౧, ఆ. (ఆమ్రేడితమందు మాటిమాటికి.)

మాటు. దే. స. క్రి. మఱుఁగుపఱచు. "సీ. గొనబుఁగెంజిగురాకు లనిమాటిచెల్లరేతళుకుఁగ్రొవ్వాఁడికత్తులుఘటించి." చంద్ర.— వి. 1. మఱుఁగు; 2. తడవ; "సభంగడంగిపల్మాటు పరాభవిం చితి." భార. భీష్మ. 3, ఆ.—3. వేఁటకానిదాగుడువల్లము, ఉప శయము.

మాటుపడు. ద్వ. అ. క్రి. (మాటు+పడు.) మఱుఁగుపడు.

మాఠరుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యునిప్రక్కనుండువార లలో నొకఁడు; (చూ. దండుఁడు.) 2. వ్యాసుఁడు.

మాడ. దే. వి. అరవరా, సువర్ణము.

మాడపట్టు. దే. వి. బ్రహ్మరంధ్రము, శోడు.

మాడి. దే. వి. అడవియులవ, వనకులుత్థము.

మాడికి. దే. ద్ర. విధము. (ఇది దేనితోనైనఁజేరి ప్రయోగింపఁ బడునుగాని వేఱుగా ప్రయోగింపఁబడదు. అమ్మాడికి, ఇమ్మాడికి, చెప్పినమాడికి మొ.)

మాడు. దే. అ. క్రి. మెలయు. "క. ఆద్యక్షరగ్రహంబును, సాద్య గణగ్రహముకృతినిజాధిపరాశి, ప్రోద్యద్గ్రహమును మైత్రుల, హృద్యం బుగఁగూడిమాడియొనయఁగవలయుఁ." కవిజ. ౧, అధి. (ఇది కూడు క్రియతోఁజేరియేవచ్చును.)

మాడుగు. వై. వి. మాడువునకుమొదటిరూపము. "క. వెండియుశ గగనరత్నుఁ, గుండంబులుమీఁదమాడుగులునూతులువాఁ, దొం

డొండకట్టనవిచెదు, చుండఁదదాకాశమనియునోయనియేడ్చెఁ." వా. ౫, ఆ.

మాడువు. వై. వి. హర్మ్యము. "తే. కడురయంబునఁజనునొక కాంతఁగాంచి, తరుణియెటఁబోయెదెవ్వరిదానవనిన, మాఱుపలుకక యటఁజనిమాడువెక్క, టయునుగ్రక్కనసొక్కడహాయముఁగట్టి. క. మనమునశంకింపక న, య్యనదానున దానిపజ్జనాహర్మ్యం బెక్క." మార్క. ౨, ఆ.

మాడ్కి. దే. క్రి. విధము. (మాడికియొక్క మాఱురూపము.)

మాడ్పు. దే. వి. ఒకానొకచెట్టు. హంస. ౪, ఆ.

మాణవకము. సం. వి. అ. పుం. ఇరువదిపేటల మణిహారము.

మాణవకుఁడు. సం. వి. అ. పుం. బాలకుఁడు.

మాణవ్యము. సం. వి. అ. న. మాణవకులసమూహము.

మాణిక్యము. సం. వి. అ. న. కెంపు. (దీనికి సింహళము, కాలపురము, అంధ్రము, తుంబురము ఇవి నాలుగు జన్మదేశములు. సింహళమునందుపుట్టినకెంపురక్తవర్ణముకలది, దానికి పద్మరాగమని పేరు, అది యుత్తమము; కాలపురమునందుపుట్టినదిపసుపుడాళు కలది, దానికి కురువిందమనిపేరు, అది మధ్యమము; అంధ్రమునందుపుట్టినది అశోకపుచిగురుడాళుగలది, దానికి సౌగంధికమని పేరు, అదియు మధ్యమము; తుంబురమునఁబుట్టినది నీలపుడాళుగలది, దానికి నీలగంధియనిపేరు, అది అధమము.)

మాణిబంధము. సం. వి. అ. న. సైంధవలవణము. (రూ. మాణిమంథము.)

మాత. సం. వి. ఋ. స్త్రీ. 1. తల్లి; 2. బ్రాహ్మ్యాది; 3. లక్ష్మి; 4. పార్వతి; 5. నేల; 6. ఆవు. (పంచమాతలు.—రాజుభార్య, అగ్రజునిభార్య, గురుభార్య, భార్యాజనని, స్వజనని.) పుం. ధాన్యాదులుకొలిచెడువాఁడు.

మాతంగము. సం. వి. అ. పుం. ఏనుఁగు, మతంగజము.

మాతంగి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. వసిష్ఠునిభార్య.

మాతంగుఁడు. సం. వి. అ. పుం. మాదిగవాఁడు. (రూ. మతంగుఁడు.)

మాతగోరక. దే. వి. మత్స్యవిశేషము.

మాతరపితలు. సం. వి. ఋ. పుం. ద్వి. తలిదండ్రులు.

మాతరిశ్వుఁడు. సం. వి. న్. పుం. వాయువు, గాలి.

మాతలి. సం. వి. ఇ. పుం. ఇంద్రునిసారథి.

మాతాపితలు. సం. వి. ఋ. పుం. ద్వి. తలిదండ్రులు.

మాతాబి. దే. వి. జేలతారు.

మాతామహుఁడు. సం. వి. అ. పుం. 1. తల్లితండ్రి; 2. బ. తల్లివంశమువారు.

మాతుల. సం. వి. ఆ. స్త్రీ. మేనమామభార్య. అ. పుం. ము. 1. ఉమ్మెత్త; 2. ముళ్లుఁబాము; 3. కుసుమలు. డు. మేనమామ

మాతులపుత్రకము. సం. వి. అ. పుం. ఉమ్మెత్తకాయ. డు. మేనమామకొడుకు.

మాతులాని. సం. వి. ఈ. స్త్రీ. 1. జేనము, కుసుమలు; (అనికొందఱు.) 2. మేనమామభార్య; 3. లంకలు.

మాతులాహి. సం. వి. ఇ. పుం. ఉమ్మెత్తలోనిముళ్లుఁబాము.

మాతులి. సం. వి. ఈ. స్త్రీ. 1. మేనమామభార్య; 2. జేనము.

మాతులుంగము. సం. వి. అ. పుం. మాదిఫలపుచెట్టు.

మాతులేయుఁడు. సం. వి. అ. పుం. మేనమామకొడుకు.

మాతృక. సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లి; 2. దాది; 3. పార్వతి; 4. వర్ణమాల; 5. అసలుగ్రంథము. అ. పుం. ము. ఎడమప్రక్కకొమ్ముచెవిలోనగువానిచే కొఱవడినయేనుఁగు. (దీనిచే ఒడయనికి దారిద్ర్యము కలుగును.) (సప్తమాతృకలు.— బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండ.)

మాతృష్వసేయి. సం. వి. ఈ. స్త్రీ. తల్లితోడఁబుట్టినదానికూఁతురు.

మాతృష్వసేయుఁడు. సం. వి. అ. పుం. తల్లితోడఁబుట్టినదాని కొడుకు.

మాతృష్వస్త్రీయ. సం. వి. ఆ. స్త్రీ. తల్లితోడఁబుట్టినదాని కూఁతురు.

మాతృష్వస్త్రీయుఁడు. సం. వి. అ. పుం. తల్లితోడఁబుట్టిన దానికొడుకు.

మాత్ర. ఉభ. దే. వి. 1. చిన్నమందుంట; 2. అనిమినంచి. "ఎ, గీ. బ్రహ్మచారిధిఃజంబుమాత్రకుసడింపుఁ, బ్రాలు." ఆము. ౬, ఆ.—సం. ఆ. స్త్రీ. 1. అక్షరావయవము; 2. వృత్తాంశము; 3. కొంచెము; 4 కొలఁది; 5. త్రుటి; 6. పరివారము; 7. భూషణము; 8. ధనము. అ. న. 1. అవధారణము; 2. సర్వము.

మాత్సర్యము. సం. వి. అ. న. మచ్చేరము, చేలము.

మాద. దే. వి. ఒకరోగము.

మాదము. సం. వి. అ. పుం. మదముయొక్క రూపాంతరము.

మాదవళము. దే. వి. మాదావళముయొక్క రూపాంతరము.

మాదళము. దే. వి. 1. కపిలవర్ణము; "మాదళపుమేలిజిలుఁగు పావడ." ఉ, రా. ౪, ఆ.—2. కపిలవర్ణముగలచీర. "మాదళముల్ బవంతులు...తాల్చె." ప్రభా. ౪, ఆ. (మాదావళముయొక్క రూపాంతరము. చూ. మాదావళము.)

మాదావళము. దే. వి. 1. కపిలవర్ణము; "లయవిభాతి. జిలుఁగురవమాదా, వళపుఁదడీయొత్తుకచములఁబెనఁచిచుట్టుకొని కెలనికదికెంజడల మెలిపగిదిదోఁపఁ." కళా. ౮, ఆ.—2. కపిలవర్ణముగలచీర. (చూ. మాదళము.)

మాదావళి. దే. వి. మాదావళముయొక్క రూపాంతరము. కవిక. 3, ఆ.

మాదిగ. వై. వి. చెప్పులుకుట్టువాఁడు, మాదిగవాఁడు.

మాదిగకత్తి. వై. వి. భిందిపాలము.

మాదిఫలము. ద్వి. వి. మాతులుంగము. "రగడ. మావిమానుచేరిలిమిమగువమాదిఫలంబు, కావలసినేనిగొనుకాన్కమాదిఫలంబు." ఉ, హ. ౬, ఆ. "తోటకము. మావులు జిన్నలు మాదిఫలంబులు, క్రొత్రులునిమ్మలుగోఁగులుఁబొన్నల్." య. ౨, ఆ.

మాదిరి. దే. వి. ఏ. సామ్యము. (చూ. మాద్రి.) విణ. సమానము. "తే. చంపకంబుశిరీష ప్రసవమృదుత్వ, గౌరవములేమిమాదిరిగాకపోయె." కవి. ౧, ఆ.

మాదృశుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నావంటివాఁడు.

మాదెన. దే. వి. స్థూలపుష్పము.

మాద్రి. ఉభ. దే. విణ. మాదిరియొక్క మాఱురూపము. (సామ్యమునకు. చూ. పెరుఁగురెండవయర్థమునుదాహరణము.) సం. ఈ. స్త్రీ. పాండురాజుభార్య.

**మాధవకము.** సం. వి. అ. పుం. ఇప్పపువ్వకల్లు.

**మాధవము.** సం. వి. అ. పుం. 1. వైశాఖమాసము; 2. వసంతఋతువు.

**మాధవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పుష్పలగురివెందతీ; 2. మాదీఫలముతీ; * 3. సదాపతీ; 4. కల్లు; 5. తేనె; 6. చేక్కెర; 7. లక్ష్మి; 8. గోమహిష్యాదిసమృద్ధి; 9. కుంటెనకత్తె.

**మాధవుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, లచ్చిమగఁడు.

**మాధుకరము.** సం. వి. అ. న. మధుకరవృత్తి. (అనఁగాతుమ్మెదలు పువ్వులయందుపూఁదేనెను గ్రహించునట్లు భిక్షుకులు గృహస్థుల యిండ్లకుఁబోయి భిక్ష గ్రహించి జీవించుట.) "సీ. నయమునఁ బుష్పమేమియుఁగందకుండంగమధుసంగ్రహమునేయుమధుకరంబు, కరణిగృహస్థులెవ్వరునువేసరకుండననువుననపరాహ్ణమందుఁ జేయు, భిక్షమాధుకరంబను పేరఁబరఁగు." భో. 3, ఆ. (గ్రామ్యమున మాధవకరము )

**మాధురి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మాధుర్యము; 2. కల్లు.

**మాధుర్యము.** సం. వి. అ న. 1. తీఁపు; 2. కావ్యగుణములలో నొకటి; (చూ. గుణము.) 3. పక్షులులోనగునవివచ్చుటకు బోయ వేసెడు ఈల.

**మాధ్యస్థ్యము.** సం. వి. అ. న. మధ్యస్థుఁడు చేయుతీర్పు.

**మాధ్వి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మద్యము; 2. మకరందము.

**మాధ్వీకము.** సం. వి. అ. న. (చూ.) మాధవకము.

**మాన.** వై. వి. నాలుగుసోలలకొలఁది, కుడపము.

**మానన.** సం. వి. ఆ. స్త్రీ. మన్నన.

**మాననీయము.** సం. విణ. (అ. ఆ. అ.) మన్నింపఁదగినది.

**మానము.** సం. వి. అ. న. 1. త్రాసు, మూర, తూములోనగునది; (ఇది త్రివిధము.—తులామానము, అంగుళీమానము, ప్రస్థమానము.) 2. కొలఁది; 3. మానిక. పుం. 1. చిత్తౌన్నత్యము; 2. గర్వము; 3. స్త్రీలకుపురుషులయెడఁగలుగు కోపవిశేషము.

**మానవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మానముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**మానవుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి.

**మానసము.** సం. వి. అ. న. 1. మనస్సు; 2. ఒకసరస్సు. "సీ. మహనీయలీలలమానసంబలరింపనంచబోదలనంగననువుపడదె." కవి. ౧, ఆ.

**మానసించే.** సం. అ. క్రి. తలంచే. "సీ. ముద్దుగుమ్మలమొగంబులుచూడనేకాని మానసింపరుచందమామఁజూడ." ఉ, రా. ౫, ఆ.

**మానసౌకసము.** సం. వి. స్. పుం. హంస, మరాళము.

**మాని.** సం. విణ. (న్. ఈ. న్.) మానముగలవాఁడు.

**మానిక.** సం. వి. ఆ. స్త్రీ. మాన, కుడపము.

**మానికదారి.** వై. వి. (మానికము+దారి.) బోగముది. "ఎ, గీ. ధనములార్జించుమానికదారులిండ్లఁ, జేరునరులకునిడుములుచెప్పఁదరమే."

**మానికము.** వై. వి. 1. కెంపు; "సీ. బహుదివ్యఫలపరిపాకసౌభాగ్యంబునెఱపుకెమ్మోవి మానికముతోడ." వసు. ౧, ఆ.— 2. రత్నము*. "శే. కాఁకమించులవినుమానికంపుజోడు." రాఘ. ౫, ఆ.

**మానితము.** సం. విణ. (అ. ఆ. అ.) మన్నింపఁబడినది.

**మానిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. మానముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**మానిసి.** వై. వి. 1. మనుష్యుఁడు; 2. మనుష్యస్త్రీ; "క. మనయింటనివ్వోటచోచ్చె, టసకెచ్చోనైనసీబృహన్నలమెలఁగన్, జనియెడుమానిసి." భార. విరా. ౧, ఆ. -- 3. భటుఁడు. "రసావిభుఁడుంబరకాలుఁబిల్వఁదామానిసిఁబంచె." పర. ౫, ఆ.

**మానిసిదిండి.** ద్వి. వి. (మానిసి+తిండి.) రాక్షసుఁడు, మనుజాశనుఁడు. "చ. మదమజిపాజెరానృపులుమానిసిదిండికిఁగాక భీతితోన్." ఉ, హరి. ౪, ఆ.

**మానిసిరౌతు.** వై. వి. కుబేరుఁడు, నరవాహనుఁడు.

**మానిసితేఁడు.** ద్వి. వి. రాజు, మనుజేంద్రుఁడు. "అమ్మానిసితేఁడు." రసి. 3, ఆ.

**మానిసిసింగము.** వై. వి. నృసింహుఁడు. "సీ. మానిసిసింగమై పూనిబత్తునివెతల్ దలఁగఁ ద్రోచినవాఁడితండకాఁడె." అచ్చ. యు, కాం.

**మాను.** దే. స. క్రి. విడుచే. వి. 1. మ్రానుయొక్కరూపాంతరము; "మ. హరిశౌర్యుండగురామభూవిభునితీవ్రాటోపవదావ్యహినీ, శరవేగంబుననాత్మమూలబలముల్ జాలిన్ దళాడంబరం, బరుగన్ గొమ్మలువోవ లావటి నిజామాదుల్ వజీరుల్ భజిం, తురుసమ్మత్వముగాసలోమునలిమానుల్ గావితర్కింపఁగన్." వసు. ౧, ఆ. – 2. మనోజ్ఞత. "క. మామాయనవిరహులఁజల, మామాటికినేఁచఁజందమామాగఁమా, మామానినీకుమారుని, మామా మామాటసేయుమామానెనయన్." రసి. ౬, ఆ. – విణ. మనోజ్ఞము. "అర్థాంశుప్రకాశంబుతోమానై." భార. ఆది. 3, ఆ.

**మానుచే.** దే. ప్రే. మానఁజేయు, మానించే. (రూ. మాన్చు.)

**మానుపు.** దే. ప్రే. మానుచుయొక్కరూపాంతరము.

**మానుషి.** సం. వి. ఈ. స్త్రీ. మనుష్యస్త్రీ, మానిసి.

**మానుషుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి.

**మానుష్యకము.** సం. వి. అ. న. మనుష్యలసమూహము.

**మానెరు.** దే. వి. మానేరుయొక్కరూపాంతరము.

**మానేజరు.** ఆం. వి. కార్యనిర్వాహకుఁడు. (రూ. మేనేజరు.)

**మానేరు.** దే. వి. ఎక్కుడుఁదీఁగ, జ్యోతిష్మతి.

**మానోజ్ఞకము.** సం. వి. అ. న. మనోజ్ఞత, మనోజ్ఞత్వము.

**మాన్యము.** సం. వి. అ. న. పన్నుకట్టక అనుభవించునట్లు సన్మానించియియ్యఁబడినభూమి. విణ. మన్నింపఁదగినది.

**మాపు.** దే. ప్రే. మాయఁజేయు, పోఁగొట్టు. "క. మాపెదఁ గురురాజుదురభిమానముఁజలమున్." భార. కర్ణ. 3, ఆ.—వి. 1. సాయంకాలము; "సీ. అరుణోదయమునశౌచాదులన్నియుఁదీర్చి వరుసరేపటిసంధ్యవార్వవలయు, నాదిత్యుఁడరగ్రుంకునప్పుడు మాపటిసంధ్యావిధానంబు సలుపవలయు, రేపుసూర్యుండును మాపుచుక్కలుఁదోఁచునంతదాఁకనుజపమాచరించి, యటమీఁద నాత్మగృహ్యాను రూపంబుగా విధివంతముగసగ్నివేల్వవలయు." విజ్ఞా. ఆచా, కాం.—2. రాత్రి; "ఉ. మాపటివేళసీభువనమధ్యము వెల్వడివచ్చిగోష్పద, ప్రాపితధూళిధూసరితభాసితకుంతలమైసరోరుహమూ, ద్దీపితమైనసీమొగముధీరజనోత్తమమాకువేడ్కతోఁ, జూపిమనంబులన్ మరునిఁజూపుదుగాదె క్రమక్రమంబునన్." భాగ. ౧౦, స్కం. పూ. – 3. మైల. "మడతమార్పుటొప్పదుగడు మాపునైన."

**ముచ్చ్రంగి.** దే. వి. మత్స్యవిశేషము. (చూ. కొరద.)

**ముచ్చ్రట.** దే. వి. 1. సల్లాపము; (మీ ముచ్చట అయినదా.) 2. వృత్తాంతము; "మ. మునిశిష్యప్రకరంబుతోడగమనోన్ముఖ్యం బునన్ ముచ్చటల్, తనియంజెప్పుచు." భీ. ౨, ఆ.—3. కోరిక; "సీ. కీలాలనదులలోఁ గేళిసల్పఁదలంచుశాకినీసమితిముచ్చటలు దీఱె." ఉ, రా. ౮, ఆ.—4. ప్రేమము. "చ. మొగముమొగం బుఁగూర్చి బలుముచ్చటఁబక్షపుటాంతరంబులన్, బిగియఁగవుఁగి లించి." వసు. ర, ఆ.

**ముచ్చ్రటకాఁడు.** దే. విశే. కోరికకలవాఁడు. పంచ. వేం. ర, ఆ.

**ముచ్చ్రటపడు.** ద్వి. అ. క్రి. కోరు. "తే. ఇంతపాట్లన బడికన్న యూవిచిత్ర, మహిమకునుదగరాజ్యసంపదలుగనిన, నెంతయుఁ బగు లోయనియేనువినఁగ, బలుమఱునీకుముచ్చటపడుచున్నను." "క. ఆకోరికకైకలదొకొ, లోకోత్తరగానయుతయులోకోత్తరరం, మూర్తియునొకతెవారి, స్త్రీకులమున ననుచు దూరదృష్టికొవెదకున్." కళా. 3, ఆ.

**ముచ్చ్రటించు.** దే. అ. క్రి. ముచ్చటలాడు. "ఉ. ఈయెబ్బెటికంబెటింగిజనులీవలనావలముచ్చటింపఁగన్." భల్లా. ౨, ఆ.

**ముచ్చ్రట్లు.** దే. వి. బ. (మూఁడు+చోట్లు.) మూఁడుప్రదేశములు. "తే. చరణములుకెల్లగడిగిముచ్చట్లుచఱచి, పీఠముననుండికాళ్లుదాఁ బృథివిమోపి, యర్థినాపోశనమునుబ్రాణాహుతులును, గొనిగృహ స్థుండుమానియ్యైకుడువవలయు." (ఇచట చఱచుటకు తుడుచుట యర్థము.) విజ్ఞా. ఆచా, కాం.

**ముచ్చ్రముడుఁగు.** జై. అ. క్రి. (ముడుఁగు + ముడుఁగు.) ముక్కిలిముడుఁగు. "ఎ, గీ. అనుచుగంగనీటనవగాహనముచేసి, వెడలివచ్చిముచ్చముడిఁగియుండె." భో. ర, ఆ. "ఉ. ముచ్చ ముడింగివ్రాలెవెడమూర్ఛతనుంబోదువన్ రథంబుపై." జై. 3, ఆ. (ఇక్కడముడుఁగుటకు చేష్టలుడుగుట యర్థము.)

**ముచ్చ్రవలము.** దే. వి. (మూఁడు+చేవలము.) మూడుచవలములు.

**ముచ్చ్రు.** దే. వి. ముచ్చ్రుయొక్క రూపాంతరము. "ద్వి. నీముచ్చు విద్యలునెఱయంగనెపుడు, మామూఁకయెఱుఁగుఁగామలయంగ రాదు." భాగ. ౮, స్కం.

**ముజ్రా.** హిం. వి. తిరిఁగిరావలసినసొమ్ము.

**ముజుముదారు.** హిం. వి. లెక్కలను పరీక్షించు నొక యుద్యోగస్థుడు.

**ముటము.** దే. వి. ముద్దపిడుక.

**ముటాలు.** గ్రా. ని. బ. వంటచెఱకు, కట్టెలు.

**ముట్టఁబడు.** ద్వి. అ. క్రి. (ముట్టన్ + పడు.) డయ్యు. "ఎందుఁజరియింతునతివనేటిప్రయాణమున మహాతపముచేముట్టఁ బడితి." భో. ౬, ఆ. (చూ. తూఱఁబడు.)

**ముట్టడము.** దే. వి. 1. నిర్బంధము; "తే. అనిననాచార్యువచనంబులాదరించి, యింద్రుఁడనుపఁగధాత్రికినేగియగ్ని, మొదలఁ గాశీపురమునకుముట్టడముగ, సకలగృహములఁదనమూర్తినంగ్రహించె." కాశీ. ౫, ఆ.—2. ముట్టడించుట. "ఉ. ఏములేకునికి పొల్పుగఁగాంచియతండుసేనయుం, దానునుగోటముట్టడము దక్కివెసం జనుదెంచుమాబడిన్." హరి. ఉ. ౧, ఆ.

**ముట్టడి.** దే. వి. 1. నిర్బంధము; "ద్వి. అట్టిముట్టడిఁదనయత్తయు మామ, పుట్టినకూఁతురుఁబొదవడంగినను." విష్ణు. పూ. 3, ఆ.—2. ముట్టడించుట. "క. కట్టల్కనమ్మహీశులు, ముట్టడిగావింత మొక్కమొగినుజ్జయినీ, పట్టణమునకనిసేనల, దిట్టముగాఁబనిచిరపుడు నీరోద్ధతులై." బ్ర. 3, ఆ.

**ముట్టడించు.** దే. స. క్రి. కొటలోనగుదానిచుట్టుకొని నిర్బంధించు.

**ముట్టణము.** దే. వి. ముట్టడముయొక్క రూపాంతరము. (ముట్టడించుటకు. — "వ. పట్టణంబునకు ముట్టణంబుచేసి చుట్టునువిడిసిన." భాగ. ౧౦, స్కం. పూ.)

**ముట్టించు.** దే. ప్రే. 1. ముట్టఁజేయు; 2. కాల్చు; 3. రగుల్చు.

**ముట్టికాళ్లవాఁడు.** దే. విశే. ముట్టుమోఁకాళ్లుగలవాఁడు, సంజ్ఞావృ.

**ముట్టియ.** దే. వి. ముట్టె. "శాంతినుస్తకున్ ముట్టియతోడిజీవములు." కనిక. ౫, ఆ.

**ముట్టు.** దే. స. క్రి. 1. తాఁకు; 2. శత్రువునదాఁకు; "ఉ. కుంతానిచయంబుఁగంచుకవితానము బెగ్గిలబిట్టుముట్టినన్." నిర్వ. ౭, ఆ. — 3. మర్మముదాఁకు; "చ. జలజదళాక్షికీచకునిఁజంపుటకిమ్మెయిముట్టఁబల్కఁగా, వలయునె." భార. విరా. ౨, ఆ.— 4. ముట్టడించు; "క. చనిమధురాపురిముట్టిన, వినికుంభీనసభయంబువిసయంబుజనిం, పసరుగుదెంచిధరాలిం, గనమునఁగృపవుట్ట నన్నకాళ్లంబడియెన్." నిర్వ. ౬, ఆ. — 5. కడముట్టు. "మ. మునమీచేవినరావణాదులకథల్ ముట్టంబ్రశంసింపుఁడు." నిర్వ. 3, ఆ.—వి. 1. తాఁకుడు; (చూ. కోల్తలమొదటియర్థము.)— 2. (ఆఁడుదాని) రజస్సు; 3. కొఱముట్టు, పరికరము. "ఆ. వాహనములువానివానిముట్టులునొక్క, వలనగానొనర్చి." భార. మా. ౧, ఆ.—విశే. రజస్వల.

**ముట్టుకొను.** దే. స. క్రి. 1. ముట్టడించు; "త్రిదివంబుముట్టుకొన." నిర్వ. 3, ఆ.—2. ఆక్రమించు. "ఇదెగంధర్వులువచ్చి ముట్టుకొనిరింకెట్లొక్కొయంచున్." భార. విరా. 3, ఆ. (ప్రే. ముట్టుకొలుపు. రామా. ౬, ఆ.)

**ముట్టుకోలు.** దే. వి. ముట్టడి.

**ముట్టుకోలుగొను.** దే. స. క్రి. (ముట్టుకోలు+కొను.) ముట్టడించు. (రూ. ముట్టుకోల్గొను. "తద్భవనము ముట్టుకోల్గొని." సా. 3, ఆ.)

**ముట్టుకోలుపట్టు.** దే. స. క్రి.——పై.——"వ. పట్టంబులుముట్టుకోలుపట్టి." రామా. ౬, ఆ. (రూ. ముట్టుకోల్పట్టు. "తన్నిలయంబు ముట్టుకోల్పట్టిరి." సా. 3, ఆ.)

**ముట్టుకోలుపఱుచు.** ద్వి. స. క్రి.——పై.—— "సీ. రారాజునొక్కరునిఁబాండు, తనయులు తమవారుఁదారునుదెక్కం ద్రుగూడఁ జొట్టునముట్టుకోలుపఱిచిరి." భార. సౌ. ౧, ఆ.

**ముట్టుత.** దే. వి. ముట్టుది, రజస్వల.

**ముట్టునీళ్లు.** ద్వి. వి. బ. బహిష్ఠయైన యాఁడుది నాలవనాఁడు చేయుస్నానము. (ముట్టునీళ్లుమునిఁగి అనునప్పుడు మునిఁగియనుటకు చేసి యనియర్థము.)

**ముట్టుపడు.** ద్వి. అ. క్రి. సంకటమగు.

**ముట్టుపాటు.** ద్వి. వి. సంకటము. "వెన్బాటుదోఁచెముట్టుపాటుదొడరె." భార. విరా. ౨, ఆ.

**ముట్టె.** దే. వి. పందిముక్కు, పోత్రము.

**ముట్టెచేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**ముట్టెమెకము.** ద్వి. వి. పంది, పోత్రి.

**ముట్టెమోపు.** దే. వి. కార్యనిర్వాహకసమయము. (వాఁడు ఇన్ని దినములు కానిమ్మని ముట్టెమోపున నాచేత కాదన్నాఁడు.)

**ముతా.** హిం. వి. కొన్ని గ్రామములు, జనసమూహము.

**ముడి.** దే. వి. 1. దారములోనగువానిముడి, గ్రంథి; 2. వెంట్రు కలముడి; "విడినకచపఙ్క్తిఁ బల్మఱుముడిన్ వెడదోఁపుచు." పా. ౧, ఆ.—3. చెట్టులోనగువాని బుడిపి; "ద్వి. ముడుసుముడి." (చూ. ముస్నోటు.) హరిశ్చ. ౨, భా. — 4. ఎద్దుమూఁపురము; (చూ. ముడిగిబ్బ.) 5. కలహము; (చూ. ముల్లయలి.) 6. ముడి వలెవ్రాసెడి కొన్నిహల్లులరూపాంతరము; (తొముడి, నాముడి, మాముడి.) 7. సంధి; (చూ. ముడికాఁడు.) 8. ముడ్డియొక్క రూపాంతరము. "ద్వి. వెడమతులైనయావిప్రులఁజూడ, వడిముడి గాఁజొచ్చివాతవెళ్లుదురు." హరిశ్చ. ౨, భా.—విశే. 1. ఖండము కానిది; (ముడిపోఁక, ముడిబియ్యము.)—2. వికసింపనిది. (ముడి పూలు.) (ముడిజొన్నలు అనుచో పొట్టుతోడి జొన్నలనియర్థము.)

**ముడికాఁడు.** దే. విశే. సంధానముచేయువాఁడు, సంధాయ కుఁడు. "వినురోరిచెట్టునట్టుమెకపుముడికాఁడ." అచ్చ. యు, కాం.

**ముడికాళ్లవాఁడు.** దే. విశే. ముట్టికాళ్లవాఁడు, సంజ్ఞావ్య.

**ముడికొక్కు.** దే. వి. ఒకానొక పురుగు.

**ముడిగిబ్బ.** దే. వి. ఆఁబోతు. (చూ. కక్కురము.)

**ముడిగొను.** దే. స. క్రి. (ముడి+కొను.) ముడుఁచు. "క. మెడ మన్నునలఁచియలకలు, ముడిగొని నిజపాణిపద్మములుగరగరగాఁ, గడిగికొనితనకుమఱందలు,విడెమొసఁగుచుఁబసనిపసిఁడిపీవనపీవన్." పాండు. 3, ఆ. (ప్రే. ముడికొలుపు.)

**ముడిచె.** దే. వి. సాంక్రామికరోగము.

**ముడిబట్ట.** ద్వి. వి. అంచుకమ్ములులేనివస్త్రము.

**ముడిబొమ.** దే. వి. ముడివడ్డబొమ.

**ముడియ.** దే. వి. 1. మూట; "తే. వెండియునుమేఘనాదుండు బండిమోకు, మెడకుఁగాళ్లకుఁదగిలించిముడియగట్టి, ధీవిచక్షణు నవ్వీరుఁదేరిమీఁదఁ, బెట్టుకొనివచ్చితనమ్రోలఁబెట్టుటయును." రామా. ౬, ఆ.—2. పందెము. "సీ. మానముద్రయెకాని మాటా డువేడుక కడునవిముఖకాంతి ముడియవేయ." కవిక. 3, ఆ.

**ముడియవిడుపు.** దే. వి. ముడివిడుచుదొంగ. (రూ. ముడియ విడ్పు. "వెలయఁగసొమ్ముతోముడియవిడ్పులఁబట్టిన." విజ్ఞా, ప్రా, కాం.)

**ముడివడు.** ద్వి. అ. క్రి. (ముడి+పడు.) 1. ముడిగలదియగు; 2. సంధించు; "ముడివడుకంతుసేనలకుముయ్యేలగుట్ట." స్వా. 3, ఆ.—3. పెనఁగొను; "గొడుగులుఁబడగలుముడివడ." భార. అను. ౪, ఆ. — 4. అతిశయించు; "ఎ, గీ. గోపతిఁజూచు కోర్కులుముడివడఁ, గాంతలొకతెకొకతెకడవఁబాఱె." వీర. 3, ఆ. — 5. కలుగు. "వ. మొగంబులఁగోపంబుముడివడ." రా. మం; కాం.

**ముడివాటు.** ద్వి. వి. ముడివడుట. "ద్వి. ముఱుముఱుమని బొమల్ముడివాటుగదుర." (బొమల్ముడివాటు — బొమల యొక్క ముడివాటు.) హరిశ్చ. ౧, భా.

**ముడివెట్టు.** దే. స. క్రి. (ముడి+పెట్టు.) ముడివేయు. "క. కడునవ్వించుచుఁజెలఁగులు, ముడివెట్టంబేరఁటాండ్రుముదితకను బొమల్, ముడివెట్టెనాలిసిగ్గున, ముడివెట్టెన్నారిచెఱఁగుమోము నమరుఁడున్." స్వా. ౪, ఆ.

**ముడుఁగఁబాఱు.** ద్వి. అ. క్రి. (ముడుఁగన్+పాఱు.) ముడుఁగు. "సీ. చిగురుదామరపాకు జివ్వంచుఁజనుదోయిమొనల క్రొవ్వేఁడిసెముడుఁగఁబాఱె." నై. ౨, ఆ. (స్వార్థమున పాఱు. చూ. పాఱు.)

**ముడుఁగు.** వై. అ. క్రి. 1. ముకుళించు; "వనరుహముల్ముడిం గె." పా. ౨, ఆ. — 2. తగ్గు; "ముడింగెగౌరవంబు." పంచ్ర.—3. సంకోచించు; "చ. విలసితమౌక్తికంబులునవిభ్రమ రేఖలునున్కిసాటిరాఁ, దలఁచిమహోద్ధతిన్ మొఱసితన్పృదునాద గిలానకౌశలం, బలవడుమిన్ ముడింగిదరమైతనలోనివరంబెపం గియా, వలమురిదాఁప్రదక్షిణముఁవచ్చెనోయానతికంఠలక్ష్మికన్." వసు. ౨, ఆ —4. చేష్టలుడుగు. (చూ. ముచ్చుముడుఁగు.)

**ముడుఁగుఁదామర.** ద్వి. వి. (ముడుఁగు+తామర.) పొత్తి దామర, సనుస్కారిక.

**ముడుంచు.** వై. ప్రే. 1. ముడుఁగఁజేయు; "చ. హాసవిలాస చంద్రికల కబ్జిసమోముముడుంచు." వసు. ౩, ఆ. — 2. ముడి పెట్టు. "అల్కతోనతివబొమల్ముడించె." కా. 3, ఆ. (ఈ యర్థమాపచారికము.)

**ముడుచు.** దే. స. క్రి. ముడివేయు.

**ముడుత.** దే. వి. 1. వస్త్రపునెఱి; 2. కడుపుమీఁదివళి.

**ముడుపరి.** దే. వి. (ముడుపు+అరి.) ముడుపుపట్టినవాఁడు.

**ముడుపు.** దే. వి. 1. ధనముముడిచినమూట; 2. ధనము.

**ముడుము.** దే. వి. మోఁకాలు, జానువు.

**ముడుసు.** దే. వి. 1. ముడ్డిపూస; "వ. బేతాళమ్ములనందఁడెం దొడిఁబడ మామిడిపండ్లవడువునఁ దత్తడిముడుసునెముకమూల గలంబీల్చుకూశ్మాండంబులును." చంద్ర. — 2. ఎముక. "ద్వి. ముడుసులపేర్లుమెడవ్రేల." హరిశ్చ. ౧, భా.

**ముడేకము.** దే. వి. పీగాని.

**ముడ్డి.** దే. వి. మూడియొక్కరూపాంతరము, గుదము.

**ముడ్డిపూస.** దే. వి. వెన్నెముకక్రింది చివరపూస, త్రికము.

**ముణుఁగుఁదామర.** ద్వి. వి. ముడుఁగుఁదామరయొక్కరూపాం తరము.

**ముతంగి.** సం. వి. ఈ. స్త్రీ. తెల్లగిసెరి.

**ముతరాచే.** ద్వి. వి. ముత్తరాచయొక్కరూపాంతరము.

**ముతుక.** దే. విశే. ముదుకయొక్కరూపాంతరము.

**ముత్త.** దే. విశే. వృద్ధ, వృద్ధుఁడు. "సీ. శోకించువృద్ధభూసురుఁ డాత్మ పితృదత్తదర్భముద్రికకుఁజిత్తంబుగలఁగి, యత్తగారిచ్చినహరి సుదర్శనపుఁజేరునకుముత్తయిదువవనటఁబొందు." పాండు. 3, ఆ.

**ముత్తరాచే.** ద్వి. వి. ఒకశూద్రజాతి. (ముత్తరాచేవాఁడు, ముత్త రాచేది.)

**ముత్తవపులగము.** ద్వి. వి. చిట్టాముదపుఁజెట్టు, బల.

**ముత్తవ్వ.** ద్వి. వి. (ముత్త+అవ్వ.) వృద్ధపితామహి. (రూ. ముత్తవ.)

**ముత్తాత.** దే. వి. (ముత్త+తాత.) వృద్ధపితామహుఁడు.

**ముత్తి.** వై. వి. మోక్షము. (చూ. ముత్తి.)

**ముత్తిగ.** ద్వి. వి. (మూడు+తిగ.) తొమ్మిది.

**ముత్తియము.** వై. వి. ముత్తెము.

**ముత్తుము.** ద్వి. వి. (మూడు+తూము.) మూడు తూములు.

**ముత్తెపుఁజిప్ప.** ద్వి. వి. (ముత్తెము+చిప్ప.) 1. శుక్తి; 2. భత్స్య విశేషము. హంస. ౧, ఆ.

**ముత్తైపుఁబంట.** ద్వ. వి. (ముత్తైము+పంట.) చెఱకు. "వనితా ముత్తైపుఁబంటవింటి మగఁడీవ ర్ణీఁడు." సత్య. 3, ఆ.

**ముత్తైపురిక్క-నెల.** ద్వ. వి. (ముత్తైము+రిక్క-నెల.) చైత్రమాసము.

**ముత్తైపుసవతు.** వై. వి. (ముత్తైము+సవతు.) చిత్రానక్షత్రము.

**ముత్తైము.** వై. వి. మౌక్తికము. (ముత్తియముయొక్క-రూపాంతరము.)

**ముత్తైసరి.** వై. వి. ముక్తాహారము; "ఎ, గీ. తనదుసౌందర్యమిల దృష్టితాఁకకుండ, దండిమైనెత్తుసున్నంపుకుండలనఁగ, ముత్తైసరి మిన్నచన్గవమురువుఁజూప." చంద్రా. 3, ఆ.—2. సస్యవిశేషము; 3. బ. ధాన్యవిశేషము. (చూ. బంగారుతీఁగెలు.).

**ముత్తో.** దే. వి. (ముత్త+తోయలి.) ముత్తయిదువ. "పాత్తము ముత్తో."

**ముత్యము.** వై. వి. ముత్తియముయొక్క-రూపాంతరము. "ముత్యాలనఖాగ్రధారలకు నాభరణాచరణంబొనర్ప." పాండు. ౨, ఆ.

**ముత్యాలమ్మ.** వై. వి. (ముత్యాలు+అమ్మ.) ఒక గ్రామదేవత.

**ముత్రోవద్రిమ్మరి.** దే. వి. (మూడు+త్రోవ+త్రిమ్మరి.) ఆకాశగంగ, త్రిపథగ.

**ముదము.** సం. వి. ద్. స్త్రీ. సంతోషము, హర్షము.

**ముదముద.** దే. వి. కొతుకు, సంకోచము.

**ముదల.** దే. వి. 1. ఆజ్ఞ; "నాముదలయించుకలేకచొరంగరాదు వీడెవ్వరికైన." ప్రభా. ౪, ఆ.—2. లక్ష్యము; "వీఁడుముదలా మనకు." ఉ, హరి. ౮, ఆ.—3. గనిమచేరికనేల.

**ముదలకించు.** దే. స. క్రి. మార్కొను. "క. డించుంజరణాంచలములు, కించుఁదనంబెచ్చ ముదలకించుచుముంచుచు, నొంచుచు విదళనచుంచూ, దంచచ్చంచూపుటస్ఫుటాఘాతములన్." రామా. ౪, ఆ.

**ముదలవెట్టు.** దే. స. క్రి. (ముదల+పెట్టు.) ఆజ్ఞాపించు. "ఎ, గీ. కరుణనంతమాత్రపుటూడిగంబునాకు. ముదలవెట్టుఁడు." కళా. ౧, ఆ.

**ముదలించు.** దే. స. క్రి. 1. అడుగు; "వ. బొంకుబొంకని యదలించియుఁబంతంబులుముదలించియు." ఉ, హరి. 3, ఆ.—2. మార్కొను. "క. ఎదురెదురనుముదలింపఁగ, మదిఁగొంకి." నిర్వ. ౭, ఆ.

**ముది.** దే. వి. వార్ధకము. "సీ. అచటివిప్రులుమెచ్చరఖిలవిద్యాప్రౌఢిముదిమదిదప్పినమొదటివేల్పు." స్వా. ౧, ఆ.—విశ. వృద్ధ, వృద్ధుఁడు. "ముదిముద్దియతో." హంస. ౨, ఆ. "ముదిపాలదిండిచేటు." ఉ. రా. ౮, ఆ.

**ముదిగారము.** దే. వి. మార్జన్యము.

**ముదిత.** ఉభ. దే. వి. ఆఁడుది. "క. ఇదిమొదలుగాఁగబలిమిన్, ముదితలఁదాఁబట్టునేనిముదితలలువడిన్, బదివగిలిపోలియుఁగాకని, యదరుచురావణునిఁగూర్చియలుకంబలికెన్." య. ౨, ఆ. (ఇది దేశ్యముగా ఆంధ్రభాషాభూషణమందును జెప్పఁబడియున్నది.) సం. వి. ఆ. స్త్రీ. పరకీయాభేదము. విశ. సంతోషము నొందినది.

**ముదిమి.** దే. వి. వార్ధకము.

**ముదియ.** వై. వి. ముద్దియయొక్క-రూపాంతరము.

**ముదియు.** దే. అ. క్రి. ముదిమిపొందు.

**ముదిరము.** సం. వి. అ. పుం. మేఘము. డు. విటుఁడు.

**ముదుక.** దే. విశ. 1. ముదుగు; "వ. ముదుకవెన్నెలంటికొనుట మెదుకగొని మొదుకనయిపిడిచినంబొలవలచుచుంచుతలలును." హరి. పూ. ౪, ఆ.—2. వృద్ధ, వృద్ధుఁడు. "ఎట్టుగాఁగెడఁగితి మూఁడుకాళ్లముదుకన్ వరియింప." జై. ౮, ఆ.

**ముదుకఁడు.** దే. విశ. వృద్ధుఁడు. "క. ముదుకండయ్యునుగుమారమూర్తింబొలిచెన్." భార. ద్రో. ౧, ఆ.

**ముదుగు.** దే. విశ. లావు. (నూలిపోఁగు మొ.)

**ముదుటుంగరము.** ద్వ. వి. ముద్దుటుంగరముయొక్క-రూపాంతరము. "ఉ. అమ్మహీనేతతలారులంబిలిచినేడుసుతుంగొనిపోయి కాళ్లనుం, జేతులునాజ్ఞసేయుఁడనిచేముదుటుంగరమిచ్చె." సా. 3, ఆ.

**ముదురు.** దే. అ. క్రి. (కాయలోనగునది.) 1. పరిణమించు; 2. వర్ధిల్లు. "తే. మనసుఁబలుకును జేఁతయుననఁగనిట్టి, మూఁడు దెఱఁగులపాపంబుముదిరెనేని, నదియసంసారవారిధినదిమియుండు, మనుజుఁడెన్నఁడుఁదలయెత్తికొనఁగలేఁడు." లక్ష్మీ. ౮, ఆ. "సీ. అనఘమహాదరవ్యాధిసాతనువునవొదవియంతంతకుముదురఁ జొచ్చె." పంచ. నా. ౮, ఆ.—విశ. వృద్ధము. "సీ. కలదొక్క-బూరుగుకడుఁబెద్దగాలంబు ముదురుశాఖాశోభిమూలదృఢము." భార. శాం. 3, ఆ. "వ. ఇదిశాపంబునముదురుఁదనంబునొందిన బృందారకసుందరి గావలయు." భార. అను. ౨, ఆ.

**ముదుసలి.** దే. విశ. వృద్ధ, వృద్ధుఁడు.

**ముద్గపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. పిల్లపెసరతీ.

**ముద్గము.** సం. వి. అ. పుం. పెసలు.

**ముద్గరము.** సం. వి. అ. పుం. 1. ఇనుపగుదియ; (కొయ్యగుదియమునుండి.) 2. సమ్మెట.

**ముద్ద.** యు. దే. వి. 1. కబళము; 2. పిండము. వై. ముగ్ధ. (ముద్దరాలు.)

**ముద్దకమ్మర.** ద్వ. వి. ఱాయికరఁగియినుముచేసె డీకమ్మరజాతి. (ముద్దకమ్మరవాఁడు.)

**ముద్దకవ్వము.** దే. వి. మ్రానిబిల్లతగిలించినకవ్వము.

**ముద్దకొలిమి.** దే. వి. ఱాయి యినుముగాకరఁగెడు కొలిమి.

**ముద్దతు.** హిం. వి. కాలపరిమితి. (ముద్దతుకౌలు, కరారునామా, ముద్దతుక్రయము, అవధిక్రయము.)

**ముద్దయ్య.** వై. వి. (ముద్దు+అయ్య.) కుమారస్వామి.

**ముద్దరాలు.** ద్వ. విశ. (ముద్ధ+ఆలు.) ముగ్ధస్త్రీ.

**ముద్దాడు.** దే. స. క్రి. (ముద్దు+ఆడు.) 1. చుంబనాదిపూర్వకముగా లాలనముచేయు; "సముల్లసితప్రీతినుతునిముద్దాడుచు." హరిశ్చ. 3, ఆ.—2. ఆదరించు. "సీ. బలితనూజుండైనబాణాసురుఁడుతొల్లికార్తికేయునికూలిగారవించి, ముద్దాడునెడఁజూచి మోదంబుఖేదంబుఁ బొడమనెమ్మనములోఁ గొడుకునిట్లు, పాటింపఁడేఁ దండ్రిపనియేమి." ఉ, హరి. ౪, ఆ.

**ముద్దాయి.** హి. వి. ప్రతివాది, నేరముమోపఁబడినవాఁడు.

**ముద్ది.** దే. వి. ఇడుమ, ఆపద.

**ముద్దిడు.** దే. స. క్రి. (ముద్దు+ఇడు.) చుంబనముచేయు. "ముద్దిడవలదెయామోహనాంగునిమోము." విజ. ౧, ఆ.

**ముద్దియ.** వై. వి. ఆఁడుది, ఇంతి, వనిత.

**ముద్దీఁటె.** దే. వి. (ముద్ద+ఈఁటె.) (చూ.) సిల్లు.

**ముద్దు.** వై. వి. 1. ముద్ర; (ముద్దుటుంగరము.) 2. చుంబనము*; (నాకొకముద్దిమ్ము.) 3. ఆదరము*; "ఎ, గీ. అతనిదేవులిద్దఱును గర్భాభిరామ, మూర్తులయిరన్న రేంద్రుండుముద్దుసేయ." ఉ, హరి. ౪, ఆ.—4. మనోజ్ఞత*. "పలుకులముద్దు." భార. ఆది. 3, ఆ.—విణ. మనోజ్ఞము. (ఆ చిలుక కుగుల ముద్దుగా నున్నది.)

**ముద్దుఁడు.** వై. విణ. ఏమియుఁ దెలియనివాఁడు. "ఎ, గీ. ముద్దుఁడునుబోలెఁ గన్నులుమూసికొనియె." ఉ, హరి. 3, ఆ.

**ముద్దుగుమ్మ.** ద్వి. వి. 1. మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. ముద్దులగుమ్మ.)

**ముద్దుటుంగరము.** ద్వి. వి. (ముద్దు+ఉంగరము.) అక్షరములుచెక్కిన ఉంగరము, ముద్రాంగుళీయకము. "లే. హారమంజీరవలయకే యూరకుండ, లాదులవియుండఁగానేమియడవులకును, గరమనుసరించివచ్చినీకరణివిభుని, యొద్దనుండెనెయోముద్దుటుంగరంబ." రామా. ౬, ఆ.

**ముద్దుపెట్టుకొను.** ద్వి. స. క్రి. చుంబనముచేయు.

**ముద్దురాలు.** ద్వి. వి. (ముద్దు+ఆలు.) 1. మనోజ్ఞురాలగు ఆఁడుది. "ఆ. బాలముద్దురాలు జవరాలుకొమరాలు, నీకుభార్యరాలికెవ్వఁడొక్కొ, మగఁడు." భాగ. ౯, స్కం.

**ముద్దులాఁడి.** ద్వి. వి. (ముద్దులు+ఆఁడి.) మనోజ్ఞురాలగు ఆఁడుది; "ద్వి. ననుఁబాసిపోయెదెనాముద్దులాఁడి." నల. ౨, భా.—విణ. మనోజ్ఞురాలు.

**ముద్దులాఁడు.** ద్వి. విణ. (ముద్దులు+ఆఁడు.) మనోజ్ఞుఁడు. "సీ. వీఁడటేనందునివెలఁదికిజగమెల్లముఖమందుఁజూపిన ముద్దులాఁడు." భాగ. ౧౦, స్కం. పూ.

**ముద్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. సంజ్ఞాక్షరములుచెక్కిన ఉంగరములోనగునది; 2. ఉంగరములోనగువానియందుఁగల సంజ్ఞాక్షరములు.

**ముద్రణము.** సం. వి. అ. న. ముద్రించుట. "కనకాద్రిముద్రణగ్రంథకర్త." ఆము. ౨, ఆ.

**ముద్రపలక.** మి. వి. ముద్రవేసెడుపలక.

**ముద్రించు.** సం. స. క్రి. ముద్రాంకితముచేయు.

**ముద్రిక.** సం. వి. ఆ. స్త్రీ. ముద్దుటుంగరము, అంగుళిముద్ర.

**ముద్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముద్రింపఁబడినది; 2. ముకుళితమైనది.

**మునగ.** వై. వి. శిగ్రువు*.

**మునస.** దే. వి. పీతపుమ్రానిమీఁదియరభాగము. (పీతపుమ్రానిక్రిందియరభాగము మీట.)

**మునసపు.** హిం. వి. న్యాయముతీర్చునధికారి.

**ముని.** ఉభ. దే. విణ. వృత్తియందుమునుశబ్దముయొక్క అంత్యోకారమునకు ఇకారమువచ్చిన రూపము. (మునివ్రేళ్లు, మునిముచ్చుము.)—సం. వి. ఇ. పుం. 1. వసిష్ఠాది; 2. బుద్ధదేవుఁడు; 3. అగిసియ*.

**మునికోల.** దే. వి. 1. (చూ.) ప్రాజనము; "క. ఎద్దొక్కకడకుఁదీసిన, గద్దఱియొనుఁబోతునొక్కకడకీడ్చుటయుఁన్, బెద్దమునికోలచేఁజే, కొద్దిఁగవడియడరబాఁదుకొనుచుందున్నేఁన్." శుక. ౪, ఆ.—2. కశ. "సీ. వెండికట్టులతోడి వేత్రంబుమూలగాబంగారు మునికోలపట్టువాఁడు." కాశి. 3, ఆ. (ములుకోలయొక్కరూపాంతరము.)

**మునిచీఁకటి.** దే. వి. (మును+చీఁకటి.) ప్రొద్దుగ్రుంకినతోడనే పర్వెడుపలుచనిచీఁకటి. (ఒకానొకఁడు మునిమునిచీఁకటియని ప్రయోగించినాఁడు. అప్పుడు ప్రొద్దుగ్రుంకీగ్రుంకకమునుపుపర్వినట్టి పలుచనిచీఁకటియని యర్థము.)

**మునిమనుమఁడు.** దే. వి. (మును+మనుమఁడు.) ప్రపౌత్రుఁడు.

**మునిమనుమరాలు.** దే. వి. (మునిమనుమ+ఆలు.) ప్రపౌత్రి.

**మునిమాపు.** దే. వి. (మును+మాపు.) ప్రదోషము. (చూ. బంటు రెండవయర్థము.)

**మునిముంగల.** ద్వి. వి. (ముంగల+ముంగల.) మొట్టమొదట.

**మునిముచ్చు.** దే. వి. (మును+ముచ్చు.) పశ్యతోహరుఁడు, పశ్యతోహరురాలు. "క. కన్నుండెం, గనుపాపందివియనేర్చు గల మునిముచ్చీ, వనిత." కళా. 3, ఆ.

**మునియేఁడు.** దే. వి. (మును+ఏఁడు.) నిరుటికి తొలిసంవత్సరము.

**మునిషీ.** హిం. వి. చదువుచెప్పువాఁడు, లేఖకుఁడు.

**మునీంద్రుఁడు.** సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. ఋషిశ్రేష్ఠుఁడు.

**మును.** దే. వి. 1. మున్నుయొక్కరూపాంతరము; (ముందునకు.)—"క. మునుపదివేవురఁజంపుదు, ననియిచ్చినబాణవచ్చె." భార. భీష్మ. 3, ఆ.—మొదలునకు.—"చ. అస్త్రసహాచక్రవిక్రమగర్వంబునఁగాలనేమి మునుగాఁగాలాంతముం బొందిరి." హరి. పూ. ౪, ఆ. (హల్లుపరమగుచో దీనికడపటియుత్వమునకువికల్పముగాలోపంబగు. "అజుఁడుమున్ లోకహితార్థంబుగా బ్రాహ్మణులను సృజించి." భార. అను. ౫, ఆ.)—2. తుది. "సీ. వాచ్యుఁడవనియునువాస్తవంబగుబోధమునకర్తయనిమునుమట్టనెటేఁగి." హరి. పూ. ౭, ఆ. (ఇది అగ్రమువంటిది.)

**మునుఁగు.** దే. అ. క్రి. 1. మునుకవేయు; 2. అడఁగు; "క. ప్రుక్కినయంగుళములుదళ, మెక్కినదేహమును గాంతి యెడలిన మోముఁన్, మొక్కినచెవులునుమునిఁగిన, ముక్కునునైవచ్చి మహాఁడుముద్దియఁగనియెఁన్." భో. ౧, ఆ.—3. సహించు; "ద్వి. మునుశంకరునిచేత మునిఁగినమరుఁడు, జనియించె." భాగ. ౧౦, స్కం.—4. మఱుఁగుపడు. "పెరిఁగెవల్మీకంబుతనువుమునుంగనప్పట్ట వేణువునుబుట్టె." భార. అను. ౪, ఆ.

**మునుక.** దే. వి. 1. మునుఁగుట; 2. మునుకవేయుట. "క. మునుకలుగంగానదిలో, నొనరించుటకన్నభాగ్యమున్నదెయనుచుఁన్, మునుకలుగంగాదిగిపరి, జనములుకైలాగొనంగస్నానోన్ముఖుఁడై." విజ. ౧, ఆ.

**మునుకు.** దే. అ. క్రి. 1. సంతాపించు; "క. విన్ననయిధర్మజాచ్యుతు, లున్నెడకరుదెంచియదుకులోత్తంసునకుఁన్, విన్నపముచేసి మునుకుచుఁ, గన్నులఁగ్రొవ్వేఁడిబాష్పకణములురాలఁన్." జై. ౭, ఆ.—2. మాఱుపలుకు; "క. పి, ల్చినఁబదియెలుఁగులకొకమరి, మునుకుచు." భో. ౫, ఆ.—3. పలుకు. "మ. ఇతఁడేనైమఘుఁడంచునొండొరులతోనేకాంతమొయ్యొయ్యనా, శతమన్యుప్రముఖామరుల్ మునుకుచుంజర్చించిరుత్కంఠతోఁన్." నై. 3, ఆ.

**మునుకువ.** దే. వి. పూనిక. (చూ. మొండాడు.) (ఇది యిక్కడ ఒకచోటనేకనఁబడియెడి. దీనికి సందర్భానుసారముగా ఈయర్థము తోఁచుచున్నది.)

**మునుకొను.** దే. అ. క్రి. ముందుకొను, ముందుపడు. "క. ఎదు రేగిపాదపద్మములర్థిన్, మునుకొని యర్చనసేయుద, ము." భల్లా. ౪, ఆ.

**మునుకోలు.** దే. వి. మునుకొనుట.

**మునుగట్టు.** ద్వ. వి. తొలుగట్టు, పూర్వపర్వతము. "సీ. మును గట్టుసులుతాను మ్రొలఁబట్టినయింద్రగోపంపుటెల్లికెంగుచ్చుల నఁగ." హంస. ౪, ఆ.

**మునుచు.** దే. అ. క్రి. మునుకొను. "సీ. మునుపలేఁడాయెనేమో హాక గ్రాహ సంగ్రస్తసామజ పరిత్రాణమునకు." వసు. ౪, ఆ.—ప్రే. మునుఁగఁజేయు.

**మునుపడు.** ద్వ. అ. క్రి. మునుకొను. "ఆ. వచ్చుచున్నవాఁడు వనజాక్షిమారాజు, మునుపడంగనన్నుఁబనిచెనిటకు." రసి. ౩, ఆ.

**మునుపు.** దే. వి. ముందు, పూర్వము.

**మునుము.** దే. వి. 1. పైరుకోఁతకేర్పఱుచుకొన్ననుతి; 2. వరుస; "ద్వి. మూఁడులోకంబులమునుమిడిచెదకి." (మునుమిడి = వరుసయిడి—అనఁగా వరుసవెంబడిననియర్థము.) రా. బాల, కాం.—3. ఎదురు; "క. వినుఁడన్యులెవ్వరుసునా, మునుమునఁ బడిబ్రదుకరాలమున." భార. భీష్మ. ౧, ఆ.—4. ఎదుటిచోటు; "మునుముబయలైన." భార. శల్య. ౧, ఆ.—5. సేనాముఖము; 6. తఱచుఁదనము. (చూ. మున్ము.) విణ. తఱచు. "క. అడిగెడు వారలుమునుమయి, పుడికెడువాఁడొకఁడులేక." హరి. ఉ. ౯, ఆ.

**మునుముకొను.** దే. అ. క్రి. వరుసపెట్టు. "తే. హరుఁడు బెట్టుగనవ్వి పెల్లార్చుటయును, వినిసముద్ధతరయమునదనుజకోటి, మునుగఁబఱతెంచితాఁకినమునుముకొనిన, ధించియిలయెల్లనెత్తుట ముంచెనతఁడు." భార. శాం. ౩, ఆ.

**మున్కొను.** దే. అ. క్రి. మునుకొనుయొక్క రూపాంతరము. "ఈమహాగిరినిమున్కొని పాఱెడురక్తధార." భో. ౫, ఆ.

**మున్గు.** దే. అ. క్రి. మునుఁగుయొక్క రూపాంతరము. (మునుక వేయుటకు. "ఎ, గీ. గ్రహణకాలంబునందుమున్గఁడుజలముల." పాండు. ౪, ఆ.)

**మున్నడి.** దే. అవ్య. క్రి. విణ. (మున్ను+అడుగు.) ముందుగా. "ద్వి. నగరివాకిటనెమున్నడిలేరుడిగ్గి." రా. అ, కాం. (ముమ్మడి వంటిది.)

**మున్నరక.** దే. వి. (మున్ను+అరక.) ధైర్యము. "తే. నావదిన సత్యభామమున్నరకమైన, నిలిచిమున్నరకానురుగెలిచెఁజుమ్మి." విజ. ౩, ఆ.

**మున్నాడి.** దే. అవ్య. క్రి. విణ. మున్నడియొక్క రూపాంతరము. "మ. మునినాకిచ్చినపూవుచందమునునేమున్నాడియాభోజనం, దన కర్పించినజాడయున్." పా. ౧, ఆ.

**మున్నీటిచూలి.** ద్వ. వి. (మున్నీరు+చూలి.) లక్ష్మి, క్షీరసాగర కన్యక.

**మున్నీరు.** ద్వ. వి. (మును+నీరు.) సముద్రము. ("యాసృష్టి స్స్రష్టురాద్యా." అని కాళిదాసమహాకవి ప్రయోగము.)

**మున్ను.** దే. వి. 1. ముందు; 2. మొదలు.

**మున్నూఱు.** దే. స. (మూఁడు+నూఱు.) మూఁడునూఱులు.

**మున్నెరిక.** దే. వి. (మున్ను+ఎరిక.) పూర్వరాగమువలనఁగలిగిన విరహతాపము. "క. కన్నవారెల్లనఁగఁదముఁగన్నవారి, మిన్నకంత యఁబోనాడియెన్నరాని, మున్నెరికలమెలంగుటచన్నెయిందుఁ, జిన్నిపాయంపుముద్దురాకన్నియలకు." రసి. ౩, ఆ.

**మున్పు.** దే. వి. మునుపుయొక్క రూపాంతరము

**మున్ము.** దే. వి. మునుముయొక్క రూపాంతరము. (వరుసకు.—"సీ. ఎవ్వనియంఘ్రిమున్మిడిపాపములఁబాపు గంగపుట్టినపుణ్యకథ లఁబొల్చు." రా. యు, కాం.—తఱచుఁదనమునకు.—"ద్వి. మిను ముమున్మమునింగె." విష్ణు. పూ. ౩, ఆ.)

**ముప్పండ్రు.** ద్వ. వి. బ. ముప్పదికిమహత్మహత్యర్థకబహువచనాం తాదేశము, ముప్పదిమంది. "ప్రత్యేకంబుముప్పండ్రుదాసుల నొప్పనిచ్చి." భార. సభా. ౨, ఆ.

**ముప్పటిలు.** దే. అ. క్రి. చెల్లారు. "ముప్పటిలినజేలకము." ద్వా. ౩, ఆ.

**ముప్పది.** ద్వ. స. (మూఁడు+పది.) మూఁడుపదులు.

**ముప్పదిరెంటిగుంపు.** ద్వ. వి. (ముప్పదిరెండు+గుంపు.) రేవతీనక్షత్రము.

**ముప్పాతిక.** ద్వ. వి. (మూఁడు+పాతిక.) మూఁడుపాతికలు.

**ముప్పావు.** ద్వ. వి. (మూఁడు+పావు.) మూఁడుపావులు.

**ముప్పావులా.** ద్వ. వి. (మూఁడు+పావులా.) మూఁడుపావు లాలు.

**ముప్పిడి.** దే. వి. (మూఁడు+పిడి.) బాఁకు. "మొగలిరేకు ముప్పిడిమొలద్రిండునసవరించి." భల్లా. ౪, ఆ. "మొలము ప్పిడియును." కళా. ౨, ఆ.

**ముప్పిర.** దే. వి. (మూఁడు+పిర.) మూఁడుపిరలు.

**ముప్పిరి.** దే. వి. (మూఁడు+పిరి.) మూఁడుపిరులు. విణ. మూఁడు పిరులుగలది. "అద్భుతంబుతోముప్పిరియైనకౌతుకమునొదమునె క్కొన." భార. అను. ౧, ఆ.

**ముప్పిరిగొను.** దే. అ. క్రి. (ముప్పిరి+కొను.) 1. మూఁడు పిరులుగా పెనఁగొను; "వ. ఆరాజనందన తనమనంబున నద్భుత శోకహర్షంబులు ముప్పిరిగొన నిట్లనితలంచు." భో. ౫, ఆ.—2. పెనఁగొను. "క. అనవుడుజనపతినెమ్మన, మునవచ్చెరుపాటు ముదము ముప్పిరిగొనఁగా." నిర్వ. ౧౦, ఆ.

**ముప్పు.** దే. వి. 1. వార్ధకము; "ద్వి. ముప్పునలేమిచేమునుముట్ట నొచ్చి." రా. అ, కాం.—2. విపత్తు. "ఆ. తప్పుఁజూడఁదగునె ముప్పునకయ్యెద, వసుచునాదికాలమునసెనమ్మి, నిన్నునింటనిల్పి నీకునాబిడ్డను, బెండ్లిచేసినాఁడఁబెద్దవాఁడ." రామా. ౭, ఆ.

**ముప్పూఁట.** దే. వి. (మూఁడు+పూఁట.) మూఁడుపూఁటలు. "ద్వి. ముప్పూఁట లిమ్మార్గమునఁజరియింప." భాగ. ౬, స్కం.

**ముప్పొంగు.** దే. అ. క్రి. (మూఁడు+పొంగు.) మూఁడు పొం గులుపొంగు, ఉప్పొంగు. క్షేత్రయ.

**ముప్పొత్తులు.** దే. వి. బ. (మూఁడు+పొత్తులు.) అశ్రద్ధ.

**ముప్పోకలాడు.** దే. వి. (మూఁడు+పోకలు+ఆఁడు.) త్రిగు ణాత్మకుఁడు, భగవంతుఁడు.

**ముబ్బడి.** దే. విణ. ముమ్మడియొక్క రూపాంతరము.

**ముబ్బడించు.** దే. అ. క్రి. ముమ్మడించుయొక్క రూపాంతరము.

**ముబ్బె.** దే. వి. నితంబపార్శ్వము.

**ముముక్షువు.** సం. విణ. (ఉ.) విడుపునిచ్ఛగలవాఁడు.

**ముమూర్ష.** సం. వి. ఆ. స్త్రీ. చావనిచ్ఛ.

**ముమూర్షువు.** సం. విశ. (ఉ.) చావనిచ్ఛగలవాఁడు.

**ముమ్మడి.** దే. విశ. ముమ్ముడుఁగుయొక్క రూపాంతరము.

**ముమ్మడించు.** దే. అ. క్రి. ముమ్మడియగు.

**ముమ్మడుఁగు.** దే. విశ. (మూఁడు+మడుఁగు.) మూఁడుమడుఁగులుగలది, త్రిగుణము.

**ముమ్మనుమఁడు.** దే. వి. మునిమనుమఁడుయొక్క రూపాంతరము.

**ముమ్మనుమరాలు.** దే. వి. మునిమనుమరాలుయొక్క రూపాంతరము.

**ముమ్మరము.** దే. విశ. అధికము, అగ్గలము. "తే. జలముముమ్మరమశిఖ్ఖనమితియమితి, యబ్జములఁ గేతకంబులునపరిమితము, లధిపమనకుండ మంచిచోటబ్బెనేఁడు, వేగవిచ్చేయుమనినఁ దద్విరదవిభుఁడు." పంచ. నా. 3, ఆ.

**ముమ్మరించు.** దే. అ. క్రి. అతిశయించు, అగ్గలించు.

**ముమ్మూఁడు.** దే. స. (మూఁడు+మూఁడు.) మూఁడుమూళ్లు, తొమ్మిది, "ముమ్మూఁడుగన్నులు." హరి. ఉ. ౮, ఆ.

**ముమ్మొనవాలు.** ద్వి. వి. (మూఁడు+మొనవాలు.) త్రిశూలము. అచ్చ. యు, కాం.

**ముమ్మొనవాలుదాలుపు.** ద్వి. వి. (ముమ్మొనవాలు+తాలుపు.) శివుఁడు, శూలి.

**ముమ్మోటు.** దే. విశ. (ముమ+మోటు.) మూఢశిరోమణి. "ద్వి. ముదుసు, ముడిదిన్ననక్క ముమ్మోటుపిసాళి." హరిశ్చ. ౨, భా.

**ముయ్యంచు.** ద్వి. వి. (మూఁడు+అంచు.) మూఁడుమూలలు. విశ. మూఁడుమూలలుగలది.

**ముయ్యంచుతుంగ.** ద్వి. వి. మూఁడంచులతుంగ॰.

**ముయ్యడ.** ద్వి. వి. (మూఁడు+అడ్డ.) ఆఱుమానికలు.

**ముయ్యెలగుట్ట.** ద్వి. వి. (మూఁడు+ఎల్ల+గుట్ట.) 1. మూఁడు ఎల్లలుకలియుచోటు; 2. మూఁడుదారులు కలియుచోటు, త్రికము. (చూ. ముడివడు.) (ఇక్కడ యెల్లశబ్దమునకు స్థానముమాత్ర మర్థము.)

**ముయ్యాకుఁబొన్న.** ద్వి. వి. (మూఁడు+ఆకు+పొన్న.) సాలపర్ణి॰.

**ముయ్యాఱు.** దే. స. (మూఁడు+ఆఱు.) మూఁడు ఆఱులు, పదునెనిమిది. "పురాణములుముయ్యాఱయ్యె." వి, పు. ౪, ఆ.

**ముయ్యేఁడు.** దే. స. (మూఁడు+ఏడు.) మూఁడేళ్లు, ఇరువదియొకటి. "ముయ్యేడుమాఱులు." భార. ఆది. ౧, ఆ.

**ముయ్యేఱు.** దే. వి. (మూఁడు+ఏఱు.) గంగ, త్రిపథగ. "ద్వి. ముందఱనున్నది ముయ్యేటినేల." హరిశ్చ. ౨, భా.

**ముర.** సం. వి. ఆ. స్త్రీ. గంధద్రవ్యవిశేషము. అ. పుం. డు. ఒక అసురుఁడు.

**మురంగి.** సం. వి. ఈ. స్త్రీ. కారుమునగ॰.

**మురజము.** సం. వి. అ. పుం. మృదంగము. (దీని త్రోఁత మార్జన.)

**మురముర.** దే. వి. 1. మూల్గుటయందగు ధ్వన్యనుకరణము; "మునుకొని మురమురమూల్గువారు." రా. యు, కాం. — 2. అణఁగుటయందగు ధ్వన్యనుకరణము. "క. దురదురఁబరువిడిబిరుసున, హరిహరినిలునిలువుమనుచునసురయుఁగదిసెన్, మురమురదివిజాలహృదయము, మెరమెరయిదెయణఁగుననుచు మెఱసెన్ హరియున్." భాగ. ద. ఉ.

**మురళి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పిల్లనగ్రోవి; 2. అశ్వధారావిశేషము. "చ. పతగవిభుండుమింటిపయిభంజళికామురళీసుడాలవల్గితములరా." పా. ౨, ఆ.

**మురళించు.** దే. స. క్రి. తిరస్కరించు. "ద్వి. ముత్తెపుఁజిప్పల మురళించుమోము." హరిశ్చ. ౧, ఆ.

**మురారి.** సం. వి. ఇ. పుం. 1. కృష్ణుఁడు; 2. ఒకానొకకవి.

**మురాళము.** దే. వి. మురాళించుట.

**మురాళించు.** దే. స. క్రి. నిగఁదుడుచు.

**మురి.** దే. వి. 1. గర్వము; "క. వినుదేవరమునుదుందుభి, యనురక్కసుఁడొకఁడుదుంతయైవేలుపురా, యఁకకొమరునిఁదనతోదుర, మునకుంబిలిచినఁగడిందిమురితోనతఁడున్." అచ్చ కిష్కిం, కాం.—2. నడకయందలికులుకు "క. అత్తపేఁబుత్తడిగీమున, బిత్తరిఁగానక కరంబుఁబేర్మిసనంగుం, గత్తియలందఱునొకచో, మొత్తముతైతత్తఁబిలుచు మురిసడలంగన్." రసి. ౪, ఆ.

**మురించు.** దే. ప్రే. త్రిప్వ. (ఇది ఒక ఆధునిక గ్రంథమందొక్కచోఁ గనఁబడుచున్నది.)

**మురికాఁడు.** దే. విశ. గర్విష్ఠుఁడు. "ఓరిమురికాఁడప్రాఁత విల్లొకటిత్రుంచి, యుబ్బెదు." అచ్చ. బాల, కాం.

**మురికొను.** దే. స. క్రి. (మురియ+కొను.) ఖండించు. "క. గరుడునితలఁపుము పగతుని, మురికొనికీర్తియును విజయమును గొనుమనుడున్." ఉ, హరి. ౬, ఆ.

**మురిడీగొలుసు.** దే. వి. ముంజేతవేసికొనెడు బంగారుమెలికగొలుసు. "సీ. మురుగులుసపరంజిమురిడీగొలుసులొక్క విమలాంగి హస్తపద్మములనిడియె." రసి. ౧, ఆ.

**మురిపము.** దే. వి. 1. నడకయందలికులుకు; "సీ. నునుఁదీవఁజేరికిఁగొననినీమైఁదీఁగెమురిపంబుజెందంబుమరులుకొలిపె." భార. అను. ౧, ఆ. (చూ. పెడము.)—2. గర్వము.

**మురిపెము.** దే. వి. మురిపముయొక్క రూపాంతరము. (కులుకు నకు.—"ఉ. భీతిలియుంజెసిగ్గుమురిపెంబుననోహమదేఱచూపులన్." భాగ. ౧౦, స్కం. ఉ.)

**మురియ.** దే. వి. ఖండము. "ఇంతింతలుమురియలుగా." హరి. ఉ. ౪, ఆ.

**మురియఁబడు.** ద్వి. అ. క్రి. (మురియన్+పడు.) అతిశయించు. "మోహమంతంతకుమురియఁబడఁగ." పంచ. నా. ౧, ఆ. (స్వార్థమున పడు.)

**మురియు.** దే. అ. క్రి. 1. నడచునప్పుడుకులుకు; 2. గర్వించు; 3. తిరుగు; "సీ. కరముగ్రమగుమొగమిరుదెసమురియించి యామిషంబులవల నరసికొనుచు." భార. సౌ. ౧, ఆ. — 4. తెగు; "వర్మబంధముల్ మురియఁగ." హరి. ఉ. ౨, ఆ.—5. విఱుగు. "క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్." లక్ష్మీ. ౪, ఆ.

**మురుగు.** దే. వి. 1. పట్టెలుతీర కడ్డిగాకొట్టించి ముంజేతధరించెడు స్వర్ణాభరణము; (చూ. మురిడీగొలుసు.)—2. అల్లికవేసినబంగారుకమ్మి.

**మురువు.** దే. వి. 1. సౌందర్యము; "సీ. ఆభీరకామినీహస్తాబ్జములుకావు ముష్టిఘాతంబులుమురువుడించు." భాగ. ౧౦, స్కం. పూ.—2. గర్వము; "తే. అతనిమేని, శౌర్యగంబును బీరంబు చొప్పమురువు, తడవుగాఁజూచి." యు. ౨, ఆ. — 3. మురుగు

యొక్క-రూపాంతరము. విశే. సుందరము. "క. నరనాథకుటుంబినియా, తెరువునఁజనికొంతవడికిదృఢమతినానా, వరనారీశోభితమై, మురువగునొకవైశ్యపురమునుంచటఁగాంచెన్." బ్ర. ౫, ఆ.

**ముర్మురము.** సం. వి. అ. పుం. 1. ఊక్మ; 2. సూర్యునిగుఱ్ఱము. డు. మన్మథుఁడు.

**ముఱకటము.** దే. వి. ముఱకటించుట.

**ముఱకటించు.** దే. స. క్రి. త్రిప్పు. "వ. అనినవినిమొగంబు ముఱకటించుకొనుచుఁగద్రువగరుత్మంతునికిట్లనియె." భార. ఆను. ౧, ఆ.

**ముఱకము.** దే. వి. నిక్కు-, ఉద్ధతి. "వ. చెఱకుముఱకంబున." భీ. ౩, ఆ.

**ముఱముఱమను.** దే. అ. క్రి. (ముఱముఱ+అను.) ముఱముఱలాడు. "ద్వి. ముఱముఱమనిబొమల్ముడివాటుగదురఁ, జూఱచుఱనిప్పులశక్షులనుప్పతిల్ల." హరిశ్చ. ౧, భా.

**ముఱముఱలాడు.** దే. అ. క్రి. (ముఱముఱలు+ఆడు.) కోపవికారముచూపు.

**ముఱి.** దే. విశే. 1. అల్పము; (ముఱిప్రోవు.) 2. కుత్సితము. (ముఱిమొండెము.) (ఆమ్రేడితమునందుముఱిముఱి. "క. ముఱిముఱిచీఁకటియప్పుడు, నఱిముఱిభటులుడుగకఱరి." భార. విరా. ౩, ఆ.)

**ముఱికి.** దే. వి. కల్మషము, మాలిన్యము.

**ముఱికినాడు.** దే. వి. ఒకానొకదేశము. "తే. ముఱికినాటివారు మొఱకులు పెనపరు, లఱవవారుద్విజులకానపెద్ద, యనచుదేశభాషలను గులంబునుదిట్టు, నతఁడుదండువచ్చు శతపణములు." విజ్ఞా. ప్రా, కాం. (రూ. ములికినాడు.)

**ముఱియు.** దే. అ. క్రి. గర్వించు. "క. అఱిముఱినప్పాట్లముదను, గిఱికొనికొలువంగనరిగికెరలెడుబత్తిన్, ముఱియుచునడుగులకెరఁగిన, నఱకడఁబెట్టుకొనిరాముఁడాతనికనియెన్." అచ్చ. కిష్కిం, కాం. (ఈయొకచోటనే యిది యలఘురేఫముగాఁ గనఁబడుచున్నది.)

**ముఱు.** దే. వి. ముఱ్ఱుయొక్క-రూపాంతరము.

**ముఱుగు.** దే. అ. క్రి. 1. క్రుళ్లు; 2. చదియు. "అఱవంగ నొడలెల్లముఱుగమోఁది." మార్క. ౨, ఆ.

**ముఱుగుడు.** దే. విశే. ముఱిగినది. "వ. కొండగొఱియముఱుగుపుబొందులకు నందడించు కంకగృధ్రావళులమొల్లంబుల ముసుంగువడుపల్లంబులును." స్వా. ౪, ఆ.

**ముఱుత్రోవ.** దే. వి. (ముఱుగు+త్రోవ.) దుర్గంధపుమార్గము.

**ముఱ్ఱు.** దే. వి. ముఱ్ఱుఁబాలు.

**ముఱ్ఱుఁబాము.** దే. వి. (ముఱ్ఱు+పాము.) (చూ.) మాతులాహి.

**ముఱ్ఱుఁబాలు.** దృ. వి. (ముఱ్ఱు+పాలు.) ఆవులులోనగునవి యీనినతరువాతి మూడుదినములలోనిపాలు.

**ములక.** దే. వి. వార్తాకి. (ఇది త్రివిధము. కప్రములక, తెల్లములక, పెద్దములక.)

**ములికి.** దే. వి. 1. బాణము; (చూ. ముల్కి.) 2. బాణపుటలుఁగు; (చూ. పాలమున్నీటియల్లుఁడు.) 3. బొంగరము మొనను గ్రువ్వఁబడియుండు ఇనుపముల్కి.

**ములు.** దే. వి. 1. ముల్లు; 2. త్రాసుముల్లు; 3. వరిముల్లు. (వెనుకటిరెండర్థములకు. చూ. కుసుమరెండవయర్థము.) (ముల్లుయొక్క-రూపాంతరము.)

**ములుకత్తి.** దృ. వి. ముల్లుతీసెడు ఒక దినుసు చిన్నకత్తి. పంచ. వేం. ౧, ఆ.

**ములుకోల.** దే. వి. ఎడ్లనుబొడిచెడుమునికోల, ప్రాజనము.

**ములుఁగు.** యు. దే. అ. క్రి. మూలుగు "క. బలదేవుమేనుశోఁకెన, వెలిమిడిచేవేఁకిసఱచి విటతాటముగా, నిలుగుటతోములుగుటతో సలమటతోనావులింతలంతంతకుఁగాన్." ఉ. హరి. ౬, ఆ.-వి. మూలుగుట. వై. బొక్కసము*. (చూ. మరగు. స. క్రి.)

**ములుగోలిమిడి.** దే. వి. ఇక్షురము.

**ములుఁగోరఁట.** దృ. వి. ఝింటి.

**ములుచిఁత.** దే. వి. ముల్లుచిఁతయొక్క-రూపాంతరము. "ఆ. ఏమి నేచువండరాములు చిఁతకూర." పర. ౫, ఆ.

**ములుచే.** దే. విశే. 1. మూఢుఁడు; "క. చిలుకచదువనుటచదివిన, ములుచలదృష్టాంతమట్టిమూఢపుదుర్జా, తులఁజిలుకలఁదెలిచినదయ, గలదేమదిబెదరవదరుఁగాకనిజేచ్ఛన్." కళా. ౬, ఆ.- 2. తక్కువ.

**ములుజెముడు.** దృ. వి. త్రికంటకము.

**ములుతారు.** దే. వి. మృగములనుపట్టెడియొకదినుసువల. "వ. మృగంబులు మెలఁగుపట్లరసిములుతారువేయించి." హరిశ్చ. ౨, ఆ.

**ములునోస.** దే. వి. రోమశి.

**ములుబంతి.** దృ. వి. చోరసాధనవిశేషము. (చూ. గద్దగోరు.)

**ములుము.** దే. వి. బావులనీళ్లుపాఱించి పండించెడుపొలము.

**ములుమోదుగు.** దే. వి. రోహితకము.

**ములువాలుఁగ.** దే. వి. మత్స్యవిశేషము.

**ములువెంపలి.** దే. వి. కంటకపుంఖి.

**ములువెల్లఁగ.** దే. వి. చతురశ్రికము.

**ములువెలమ.** దే. వి. వికంకతము.

**ములుసూపు.** దే. అ. క్రి. (ములు+చూపు.) మీఱు, అతిశయించు. "సీ. నెలఁతలలోనెల్లములుసూపఁగాఁజాలునిలువీఁతసీపద్మినీలలామ" చంద్ర.

**ముల్కి.** దే. వి. ములికియొక్క-రూపాంతరము. (బాణమునకు.)- "సీ. ఒకముల్కి-యొడలిలోనున్ననలఁత, నేయునెమ్మెయిబహుసాయకకలితమానంగంబునందునొవ్వడుగనేల." భార. శాం. ౨, ఆ.

**ముల్చు.** దే. విశే. ములుచేయొక్క-రూపాంతరము. "చెలియాపెను ముల్చుబాఁపఁడేయక్క-ఱపాటుదానెఱుఁగు." పర. ౩, ఆ.

**ముల్లంగి.** వై. వి. ఒకదినుసుగడ్డ. (దీనిభేదము పెద్దముల్లంగి.)

**ముల్లాకుజాయి.** దే. వి. (ముల్లు+ఆకుజాయి.) పత్రపరశుభేదము.

**ముల్లు.** దే. వి. 1. కంటకము; 2. నీవారాదిశూకము; 3. త్రాసుముల్లు.

**ముల్లుచిఁత.** దే. వి. (ముల్లు+ఉచ్చిఁత.) అలర్కము. (దీనినే ముండ్లముస్తెయందురు.)

**ముల్లె.** వై. వి. 1. ధనముముడి*; "సీ. సంతలోపలఁజేరినన్న కునన్నసే వేవేగముల్లెలువిడుచుఁజెలఁగి." భల్లా. 3, ఆ.–2. ముడుపు, మూట*. "ద్వి. సొమ్ములుదీసిముల్లెగాఁగట్టి." సా. 3, ఛా. (మొదటిరూపము ముల్లియ.)

**మువురు.** దే. స. బ. ముగురుయొక్కరూపాంతరము.

**మువ్వ.** ద్వి. వి. (మూఁడు+వా.) 1. మొనలోమూఁడుసందులు గలపెద్దగజ్జె; 2. ఒక పట్టణము. "మువ్వపురి." క్షేత్రయ.

**మువ్వంచాకు.** ద్వి. వి. (మూఁడు+పంచె+ఆకు.) ముయ్యాకు పొన్న*.

**మువ్వంచే.** ద్వి. వి. (మూఁడు+పంచే.) మూఁడుపంచలు. "సీ. పాడువులైమువ్వంచ పొలుచునట్లుగనేనుఁగులకుగుజ్జులకుఁగొట్టములును." భార. ఉద్యో. ౪, ఆ. – విశ. మూఁడుపంచలుగలది. (సంధియందు వర్ణాగమవర్ణలోపవర్ణవికారములని యెఱుఁగునది.)

**మువ్వంటు.** దే. వి. (మూఁడు+అంటు.) నెలకులోపలి మూఁడు పురుడులు. "ఉ. చంటవిషంబుమెత్తుకొనిచంపుదునర్భకునంచు వచ్చిము, వ్వంటులనాఁడుపూతనయవారణనెత్తుకొనంగఁజన్నుఁ బాల్, గొంటయుఁబ్రాణముల్ దిగిచికోలునవొక్కటిగాఁగనీతఁడా, గొంటునిశాచరిన్ వసుధఁగూల్చుటవింటిమికాదెయేర్పడన్." (మువ్వంటులనాడు అనఁగా నెలపురిటిలోపలననియర్థము.) హరి. ఉ. ౪, ఆ.

**మువ్వకోడె.** దే. వి. కాఁడికిని, గంటకును క్రొత్తగా అలవటిచెడి యెద్దు. (ఇట్లు మువ్వపసరము.)

**మువ్వదోనె.** ద్వి. వి. అడుగున ఒంటిపలకగలదోనె.

**మువ్వన్నెమేకము.** ద్వి. వి. పెద్దపులి, చిత్రకాయము.

**మువ్వన్నెవిల్లు.** ద్వి. వి. ఇంద్రధనుస్సు. పాండు. ౪, ఆ.

**మువ్వీసము.** దే. వి. (మూఁడు+వీసము.) మూఁడువీసములు.

**మువ్వురు.** దే. స. బ. ముగ్గురుయొక్కరూపాంతరము.

**ముషితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. దొంగిలఁబడినది; 2. నఱకఁబడినది.

**ముష్కకము.** సం. వి. అ పుం. మొక్కపుచెట్టు.

**ముష్కము.** సం. వి. అ. పుం. 1. వృషణము; 2. మొక్కపుచెట్టు; 3. మొత్తము.

**ముష్కరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) కుటిలుఁడు.

**ముష్టి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. కత్తిపిడి; 2. పిడికిలి; 3. సమృద్ధి; 4. ముసిఁడి*. పుం. అభినయహస్తవిశేషము.

**ముష్టింపచుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దరిద్రుఁడు.

**ముసద్ది.** హిం. వి. లెక్కవాఁడు, లేఖకుఁడు.

**ముసనాబు.** దే. వి. అందలముప్రక్కతెర. (చూ. గొడియ.)

**ముసముస.** దే. వి. 1. ముసురుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము; 2. కోపమునఁగలుగుచిఱచిఱ; "సీ. ముసముసజంకించు మొకరితుమ్మెదబారువూఁబోఁడిపాలుపునేర్పువహరించె." భాను. 3, ఆ. – 3. పందిమూర్కొనుటయందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. ముసముసమూరుకొనుచు, నడరునంరక్షితక్షోణియజ్ఞఘోణి." భాగ. 3, స్కం.

**ముసముసమను.** దే. అ. క్రి. (ముసముస+అను.) 1. ముసముసయనిశబ్దించు. "సీ. ముసముసమనఁజుట్టికొనవెండ్రుకలువట్టి పుట్టునియందియలులియఁదాఁచి." కవిక. ౪, ఆ.–2. చిఱచిఱలాడు. "ద్వి. ముసలిరోషంబునముసముసమనుచు, ముసలలాంగల ములమునఁ కొనివిసరె." అభిమన్యుచరిత్ర. (రూ. ముసముసయను. భాగ. ౧౦, స్కం. ఉ.)

**ముసరు.** దే. అ. క్రి. కవియు, క్రమ్ము. "మోహంబువలనఁబైముసరులోభంబు." భార. ఆర. ౪, ఆ. (చూ. పసి. దే. కడపట.)

**ముసలము.** సం. వి. అ. పుం, న. రోఁకలి, అయోగ్రము.

**ముసలి.** ఉబ. దే. విశ. వృద్ధు. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉడుము; 2. ఎలుకజెడికే; 3. నేలతాడు*; 4. బల్లి. న్. పుం. బలరాముఁడు.

**ముసల్యుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ముసలముచేత చంపఁదగినవాఁడు.

**ముసాంబ్రము.** జే. వి. ఒక మందుదినుసు.

**ముసాఫ్రు, ముసాబు.** అర. వి. ముసురువాన.

**ముసి.** పే. విశ. బొంకు, అసత్యము. (చూ. బతిమాలుచు.)

**ముసింపు.** జే. అ. క్రి. చెడు. (నాకు ఆవేళకు బుద్ధిముసించి పోయెను.)

**ముసిఁడి.** వై. వి. ముష్టిచెట్టు. "చ. చెఱకునఁబండులుద్భవము సేయకబుద్ధివిహీనుఁడైఫలో, త్కరముముసిండిచెట్టునకుఁగల్గఁగఁజేయుచునున్నకైవడిన్." రుక్మి. ౨, ఆ.

**ముసిముసినవ్వు.** దే. వి. చిఱునగవు, దరహాసము. "చ. ముసిముసి నవ్వునవ్వనదిమోమొకయించుకయోరసేయుచున్." వై. ౬, ఆ. (రూ. ముసిముసినగవు.)

**ముసుండి.** సం. వి. ఈ. స్త్రీ. కొయ్యగుదియ. (ఇనుపగుదియ ముద్గరము.)

**ముసుఁగు.** దే. వి. ముసుఁగుడు. "క. గొంగళిముసుంగుతోనయు, సంగతినిలువెడలిపౌరజనవర్తనలె, ల్లంగనుఁగొనుచునువీథులు, నంగళ్లనుగలయఁదిరిగియంతటనొకచోన్." పర. ౪, ఆ.

**ముసుఁగుడు.** దే. వి. కప్పుడు, అవకుంఠనము.

**ముసుఁగుడుపడు.** ద్వి. అ. క్రి. (ముసుఁగుడు+పడు.) కప్పుడుపడు. "క. జిచ్చపడియుభయబలములు, నచ్చెరువుగఁజిత్రరూపులట్లుండశర, ప్రోచ్ఛలితచండదీప్తిన, ముచ్చయములుపెలుచెబరఁగెముసుఁగుడుపడఁగాన్." భార. భీష్మ. ౧, ఆ.

**ముసుఁగుబొంద.** దే. వి. మట్టలు ఊడనితాడులోనగు చిన్నచెట్టు.

**ముసుఁగుపడు.** ద్వి. అ. క్రి. (ముసుఁగు+పడు.) ముసుఁగుడుపడు. "క. కనుదోయినమ్మదాత్రుల, ముసుఁగఁగఁబులకములు మేన ముసుఁగుపడంగన్." నిర్వ. ౧౦, ఆ.

**ముసుఁగువాఱు.** దే. అ. క్రి. (ముసుఁగు+పాఱు.) ముసుఁగుపడు. "సీ. చరణాబ్జనఖకాంతిచంద్రికల్ నతభూపముకుటాగ్రములపైముసుఁగువాఱ." పు ౧, ఆ.

**ముసురు.** దే. వి. నిరంతరవర్షము.

**ముసురుకవియు.** దే. అ. క్రి. ముసురుకొను. "తే. నరుని పాశుపతాది బాణముల పెంపు, భీముగదసొంపునమ్మియుద్దామలీలఁ, జెలఁగివెఱపేదియక్కడిబలముముసురు, కవిసియెపుడుఁగయ్యము నకుఁ గాలుద్రవ్వ." భార. ఉద్యో. ౨, ఆ. (ఇక్కడ కవియు ధాతువు ఇంచుకప్పర్యాయము.)

**ముసురుకొను.** దే. అ. క్రి. కవియు, క్రమ్ము. (చూ. అసురుసురు.)

**ముసురుమూతి.** దే. వి. కోపవికారముగలముఖము. (ముసురుమూతివాఁడు, ముసురుమూతితనము.)

ముసువు. దే. వి. ముసుఁగుయొక్క రూపాంతరము.

**ముస్త.** సం. వి. అ. స్త్రీ. నిడుముస్తె.

**ముస్తకము.** సం. వి. అ. పుం, న. 1. కయివడిముస్తె; 2. నిడుముస్తె.

**ముస్తాదు.** హిం. విణ. సిద్ధమైన, తగియున్న. (రూ. ముస్తాబు.)

**ముస్తియ.** వై. వి. ముస్తె. (చూ. ఈఁజేటి.)

**ముస్తీదు.** దే. విణ. ఆయిత్తము, సిద్ధము. "సీ. తలబోమిడికముకత్తి శమకేడెముకత్తియాదిగాఁగలవిముస్తీదొనర్చి." ఉ, రా. ౪, ఆ.

**ముస్తె.** వై. వి. 1. తుంగ; 2. తుంగగడ్డ*. "సీ. సెలయేటి యిసుకలంకలవరాహంబులుమొత్తంబుల్రైత్రవ్వుముస్తెలెత్త." సా. ౨, ఆ. (ఇది త్రివిధము.—నిడుముస్తె, నాగముస్తె, వట్రువ ముస్తె ఇదే నిడుముస్తె.)

**ముహూర్తము.** సం. వి. అ. పుం, న. 1. పంద్రెండు క్షణములకాలము; 2. రెండుగడియలకాలము.

**ముళ్లయతి.** వి. వి. ఒకరొకరికి కలహముముడిపెట్టెడుముని, నారదుఁడు. "ఎ, గీ. ముళ్లయతివలమానవాఙ్ముఖరవృత్తి." కాన. ౨, ఆ.

## మూ.

**మూ.** దే. విణ. వృత్తియందు మూఁడుశబ్దమునకుమీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "మూన్నాళ్లు." సా. ౪, ఆ.

**మూఁక.** దే. వి. 1. సమూహము; "మొకరిపిసాళితుమ్మెదలమూఁకకు." రుక్మాం. 3, ఆ.—2. సేన. "సీ. మూఁకలవిరియించిపేఁక నాచార్యాదియోధులనెల్లనుసొక్కడెసకు, వెలిచి." భార. ద్రో. ౨, ఆ.

**మూఁకవిప్పు.** దే. విణ. చెదరఁగొట్టునది. "మొనయుచింతాశ్రేణి మూఁకవిప్పు." సా. ౪, ఆ.

**మూఁకుడు.** దస. వి. (మూఁత+కుడుక.) 1. కుండమీఁదమూసెడు తట్టవంటిమట్టిపాత్రము; "సీ. అధరసుధాపూరితాన్యపేమకలశిమూసిన నీలంపుమూఁకుడనఁగ." పాండు. 3, ఆ.—2. మూఁత; "ద్వి. ఉరగంబుఁ పెట్టెఁదానురిప్పైఁబెట్టి, వరుస మూఁకుడు నోరవాకిలిచేసి." ధర్మా. ౨, ఆ.—3. తట్టవంటి మట్టిపాత్రము, శరావము. (సంధిని వర్ణలోపము.)

**మూఁగ.** యు. దే. వి. 1. దోమ; (చూ. బొడబొడ.) 2. పక్షివిశేషము. హంస. 3, ఆ.—వై. విణ. మూఁగవాఁడు.

**మూఁగంబాఱు.** దే. అ. క్రి. (మూఁగక+పాఱు.) మూఁగు. "దిక్పాలకులమూఁగంబాఱి." ఞ. హరి. ౪, ఆ. (చూ. పాఱు.)

**మూఁగతీఁట.** దస. వి. దట్టముగా పేలినతీఁట.

**మూఁగు.** దే. అ. క్రి. కవియు, "ఒక్కతెకోయుగుత్తికిఁ మూఁగుచు." కళా. 3, ఆ.

**మూఁడు.** దే. అ. క్రి. 1. కలుగు; "క. కాలవశంబునఁగీడుఁ, మేలునుజనులకుసుమూఁడు." భార. శాం. 3, ఆ.—2. ముగియు. "ఉ. సంతతకాలకూటనిభచండవిషోల్బణపూత్కృతుల్ జగం, బంతయుమూఁడఁజేయఁగ." వి, పు. 2, ఆ.—స. రెండునొకటి. "ఉ. మూఁడుగుణంబులుఁ వరుసమూర్తులుమూఁడుధరించిలోకములఁ మూఁడురచింపఁబెంపలయమంబొరయింపఁగఁజాలుదేవుఁడక్కఁ వాఁడవ్రనీవనీవసురవర్గముఁదో వఁబురందరుండవై, నాఁడ పునీవధర్మురవనఁబిత్రువర్గమునీలువాఁడవ్రుఁ." రా. యు. కాం.

(ఈ యర్థమునందిది యీ గ్రంథమునందుమాత్రము సార్థబిందుకముగాఁ గానఁబడుచున్నది.)

**మూఁడుచు.** దే. ప్రే. మూఁడఁజేయు, కలిగించు. (రూ. మూడ్చు. "మోహముదాహముఁ మదికిమూడ్చుచునున్నది." నై. ౨, ఆ.)

**మూఁత.** దే. వి. 1. మూయుట; 2. మూయుటకుఁదగిన మూఁకుడులోనగునది.

**మూఁతబల్ల.** దే. వి. వాచోరువపట్టె.

**మూఁపు.** దే. వి. భుజశిరము, అంసము.

**మూఁపురము.** దే. వి. ఎద్దుయొక్క భుజశిరము, కకుదము.

**మూకుఁడు.** సం. వి. అ. పుం. ఒక అసురుఁడు.—విణ. మూఁగవాఁడు. (రూ. మూకు.)

**మూగురు.** దే. స. ముగ్గురునకు మొదటిరూపము.

**మూగేలు.** దే. వి. గండమాలిక, చేంచే.

**మూచూచు.** దే. స. క్రి. (మూతి+చూచు.) మూర్కొను, ఆఘ్రాణించు. "క. వినుమొరుచూచినమూచూ, చినభోజ్యము నింద్యము." భార. అను. ౪, ఆ.

**మూటి.** వై. వి. బట్టలులోనగువానిముడియ*.

**మూటము.** దే. వి. ముటముయొక్క రూపాంతరము.

**మూడమంచు.** దే. వి. దట్టమైనమంచు, హిమాని. "శే. అద్రినుఁడుగవియించినయంపమూడ, మంచుదళముగఁగప్పిన మార్గణాంశు, జాలములవెనవిరియించె శాంతనవపు, తంగుఁడుద్యోత మానవ్రతాపలీల." భార. విరా. ౫, ఆ.

**మూడి.** దే. వి. ముడ్డికి మొదటిరూపము. "ఎ, గీ. లేఁడుతగవరియొండునమూడిఁజొచ్చి, వాతవెళ్లెడువాఁడెయెవ్వఁడునసుచు." కళా. ౨, ఆ.

**మూఁడు.** దే. స. రెండునొకటి. (ఇది సార్థబిందుకమనుటకుఁ గవిత్రయము వారి ప్రయోగములయందుఁదగిన యుదాహరణములు దొరకమిగాక యిది బహువచనమున మూళ్లని వాడఁబడుచున్నది.)

**మూఢుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలివిలేనివాఁడు; 2. బాలుఁడు.

**మూతము.** సం వి. అ. న. రాజోలుచేతి క్రిందనుంచుకొను తలగడ. విణ. కట్టఁబడినది.

**మూతి.** దే. వి. 1. నోటిపైభాగము; 2. ముఖము.

**మూత్రకృచ్ఛ్రము.** సం. వి. అ. న. నీరుడిరోగము.

**మూత్రము.** సం. వి. అ. న. నీరు, కాలుమడి.

**మూత్రించు.** సం. అ. క్రి. నీరువిడుచు, కాలుమడుచు.

**మూత్రితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నీరువిడిచినవాఁడు.

**మూదల.** దే. వి. (మూల+తల.) నిరూపణము, తార్కాణ. "క. వేదములకునఖలస్మృతి, వాదములకుబహుపురాణవర్గంబులకుఁ, వాదైనచోటులనుదా, మూదలధర్మార్థకామమోక్షస్థితికిఁ." భార. విరా. ౧, ఆ.

**మూదలించు.** దే. స. క్రి. 1. నిరూపించు, తార్కాణించు; "శే. ఏమిరావానుదేవుఁడనేనయనుచుఁ, జెప్పికొనవచ్చునేయింకఁ జెపుమనాకు, నిన్నుఁగన్నపుచక్రాగ్నినీటునేయు, వచ్చుమూదలించుటకింతవలసెఁజేయ." హరి. ఉ. ౬, ఆ. "సీ. మ్రుచ్చిలఁదలఁచెవీఁడిచ్చలోనని మూదలించి దండించుమలిమ్లుచులను." కళా. ౮, ఆ.—2. ఎచ్చరించు. "ఉ. పాండునృపాగ్రనందన

సుఁడుఁ బావనియుంగవలుంజలంబుమై, నొంకొరుమూదలించు కొని యొక్కటఁదాఁకిన.'' భార. కర్ణ. ౨, ఆ.

**మూఁదలిక.** దే. వి. మూదల, తొర్పాటు.

**మూఁన.** దే. వి. 1. వస్త్రాలితముచేయఁగాఁకాలకనిలిచినది; 2. రాగులు, అనుదాలు, మేలురాసికాఁగా మిగిలినపొల్లు.

**మూఁను.** దే. స. క్రి. వస్త్రాలితముచేయు.

**మూఁయు.** దే. స. క్రి. 1. మూఁతపెట్టు; (కన్నుమూసెను, పెట్టె మూయుము, తలుపుమూసితిని మొ.) 2. కప్పు. (చేసినతప్పు మూసిపెట్టినదాఁగునా?)

**మూఁర.** దే. వి. రెండుజేనలకొలఁది, హస్తము. ఏగా. నిడుపునది. (చూ. మూరకోల.)

**మూఁరకోల.** దే. వి. బారచోఁపు.

**మూఁరకోల.** దే. వి. గజపుకోల.

**మూఁరిఁబోవు.** దే. అ. క్రి. (మూరి+పోవు.) 1. అతిశయించు; "శా. శ్రీకంఠుండునదాశివుండునియతిశాశ్వంగాంబోలుండుగా, శ్రీకాంతాసహితంబునమ్మదముమూరింబోవవేంచేసె." పీఠ. 3, ఆ.—2. వర్ధిల్లు; "ఎ, గీ. అట్లుగానఁబ్రావృట్పురదాగమనుల, నధిక భక్తిమహోపూజయాచరించి, నన్నునేవించిమనుజుఁడునాప్రసాద, మునధనముధాన్యమునుగల్గిమూరిఁబోవు." మార్క. ౬, ఆ.—3. విజృంభించు; "సీ. వేఁటయొకత, విశ్వేశర్మునికాఁకువిశదలావణ్యసముజ్జ్వలఁ జేకొనిమూరిఁబోయి." హరి. ఉ. ౪, ఆ.—4. సఫలమగు; "మ. ఈ, పడఁతింబుత్రునిఁజేసిమీదగుకృపాప్రావీణ్యముంజెంపునే, ర్పడనాకోరిక మూరిఁబోఁదగఁగృతార్థత్వంబునొందింపరే." మార్క. ౭, ఆ.—5. నశించు. "ఎ, గీ. చదువుచట్టువడియెశాస్త్రంబుమన్నయ్యె, బుద్ధిపురువుమేసెబుణ్య మడఁగె, నీతిమట్టువడియెనిర్మలజ్ఞానంబు, మొదలికుడిగెబోధ మూరిఁబోయె." భాగ. ౬, స్కం.

**మూఁరు.** దే. అ. క్రి. అతిశయించు. (చూ. పంత రెండవయర్థము.)

**మూఁరుకొండ.** ద్వ. వి. రూపగంధకి.

**మూఁరుకొను.** దే. స. క్రి. ఆఘ్రాణించు. "క. కనుఁగన్నైనసనుఁ జెవియై, కొనుఁజవిజిహ్వయయిమూరుకొనునాసికయై, తనువైన్పర్శనుఁగనుఁగొను, ననవద్యాబుద్ధియాత్మయందునిలుచుచుకా." భార. శాం. ౫, ఆ.

**మూఁరుతము.** వై. వి. 1. పంద్రెండుక్షణములకాలము; 2. రెండు గడియలకాలము. "మూరుతమడాసె." అచ్చ. అ, కాం.

**మూఁర్కొను.** దే. స. క్రి. మూరుకొనుయొక్కరూపాంతరము. "సీ. అంటిచూడనిమింయంచుటర్ధంపుపలశలు కొదమరాయంచమూర్కొనితూండ్లు." రామా. ౪, ఆ.

**మూర్ఖుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తెలిసితెలియనివాఁడు. (చూ. మూర్ఖు.)

**మూర్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. రోగాదులచేత స్మృతితప్పుట, సొమ్మ.

**మూర్ఛన.** సం. వి. ఆ. స్త్రీ. సంగీతమునందు క్రమముగాసప్తస్వరములయొక్క ఆరోహణావరోహణములు.

**మూర్ఛాలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మూర్ఛరోగముగలవాఁడు.

**మూర్ఛితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మూర్ఛిల్లినవాఁడు; 2. మూర్ఛారోగముగలవాఁడు; 3. మూఢుఁడు; 4. పొడుమైనవాఁడు.

**మూర్ఛిల్లు.** సం. అ. క్రి. మూర్ఛపోవు, సొమ్మసిల్లు.

**మూర్తము.** ఉభ. వై. వి. మూరుతముయొక్కరూపాంతరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కఠినమైనది; 2. మూర్ఛరోగముగలది; 3. స్వరూపముగలది.

**మూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. శరీరము; 2. కాఠిన్యము; 3. ప్రతిమ. (త్రిమూర్తులు.– బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు.)

**మూర్ధము.** సం. వి. న. పుం. శిరము, తల.

**మూర్ధాభిషిక్తుఁడు.** సం. వి. అ. పుం. 1. క్షత్రియుఁడు; 2. రాజు; 3. మంత్రి.

**మూర్వ.** సం. వి. ఆ. స్త్రీ. చాఁగకి.

**మూల.** ఉభ. దే. వి. 1. విదిక్కు, కోణము; 2. గొంది; 3. కొప్పు. "కే. మురువంగనేర్తురునమూలఁగమ్మనితావిగలుగుక్రొవ్విరులులోఁగండ్రుఁడ." శ్రీ. ౧, ఆ.—సం. ఆ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

**మూలకము.** సం. వి. అ. పుం. న. ముల్లంగి.

**మూలగ.** దే. వి. (చూ.) నెనడు, మజ్జ.

**మూలదుంప.** గ్రా. వి. (మూలము+దుంప.) మొదటిగడ్డ, మూలకారణము.

**మూలఫల.** సం. వి. ఆ. స్త్రీ. కొమ్మనగొలిమిడికి.

**మూలబంధము.** సం. వి. అ. పుం. (చూ.) పునాది.

**మూలము.** సం. వి. అ. న. 1. వేరు; 2. మెట్టదామరదుంప; 3. ఊఁడ; 4. మొదలు; 5. సంచిమొదలు; 6. సమీపము; 7. ఒక నక్షత్రము.

**మూలమట్టము.** దే. వి. గోడలమూలలను సరిచూచెడు మూడు మూలల మట్టపలక.

**మూలముట్టు.** మి. గ్రా. అవ్య. క్రి. విణ. ఆ మూలము. "శ్లే. మూలముట్టుగఁదెలిపెనమ్మునివరుండు, ప్రార్థితుండయినాకునప్పరను నిద్య." సావ. 3, ఆ.

**మూలతాయి.** దే. వి. వజ్రమణి. (రూ. మూలతా. "సీ. అమూలనునమూలతామొత్తముల చటులామూలముగఁదీవలంటవలయు." వసు. ౨, ఆ.)

**మూలతోఁడు.** దే. వి. నిరృతి, కోణపుఁడు. "వాలుమోపుక యుండుమూలతోఁడు." అచ్చ. సుం, కాం.

**మూలాధారము.** సం. వి. అ. న. గుదస్థానమునందుండెడు నాడులకాధారమైనచక్రము.

**మూలిక.** సం. వి. ఆ. స్త్రీ. పందారుకి. అ. పుం. డు. వృక్ష మూలమునఁగూర్చుండి తపముచేయుటయే వ్రతముగాఁగలవాఁడు. (చూ. వ్రతి.)

**మూలుఁగు.** దే. అ. క్రి. 1. నొప్పివలనిబాధచే ఒక విధముగా ధ్వనించు; 2. కూయు. (చూ. పాళము.) (ధనమొక్కచోట నుంచి పెక్కుదినములైనయెడ అచ్చోట ధనపిశాచముచేరి మూలుగు నని చెప్పుదురు.)—వి. 1. మూలుగుట, కుంథనము; 2. ప్రసాధనికి. (రూ. మూల్గు.)

**మూల్యము.** సం. వి. అ. న. 1. వెల; 2. జీతము.

**మూవ.** యు. దే. వి. సువర్ణకమొదటిరూపము. "మూవగో పాల." క్షేత్రయ.—వై. విణ. మూఁగయొక్కరూపాంతరము.

"తే. మూవలమువోలేదీనిచేఁజావనేల, యీాడుగనుజెప్పదనుమన మెఱిఁగినంత." నా. ౨, ఆ.

మూావురు. దే. స. మూగురుయొక్క రూపాంతరము.

మూాష. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) మూస.

మూాషకపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజీడిశీ.

మూాషికము. సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు.

మూాషితము. సం. విశ. (అ. ఆ. అ.) దొంగిలింపఁబడినది. (ముషితముయొక్క రూపాంతరము.)

మూాస. వై. వి. బంగారులోనగువానిఁగరఁగెడుకరువు.

మూానిక. దే. వి. మంగళసూత్రమునందుతాలిబొట్టుకు ఈవలావల గ్రుచ్చికట్టుకొనెడు నానుగ్రోవి. "ఎ, గీ. తాలి, బొట్టుమూసిక తోఁగూర్చిపొసఁగఁగఁజుఁగఁ, ద్రాడుగట్టఁ." సిలా. ౧, ఆ.

## మృ.

మృగణ. సం. వి. ఆ. స్త్రీ. వెదకుట, అన్వేషణము.

మృగతృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. ఎండమావులు, మరీచిక.

మృగదంశకము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. ఎలుఁగు.

మృగధూర్తకము. సం. వి. అ. పుం. నక్క, జంబుకము.

మృగనాభి. సం. వి. ఇ. పుం. జింకపొక్కిలి, కస్తూరి.

మృగమదము. సం. వి. అ. పుం. కస్తూరి, మెకపుటాను.

మృగము. సం. వి. అ. పుం. 1. పశువు; 2. జింక; 3. అడవి యందుతిరిగెడి యేనుఁగు; 4. మృగశీర్షము; 5. అన్వేషణము; 6. వేఁట; 7. వేఁడుట.

మృగయ. సం. వి. ఆ. స్త్రీ. 1. వేఁట; 2. వెదకుట.

మృగయుఁడు. సం. వి. ఉ. పుం. 1. బోయ; 2. బ్రహ్మ.

మృగరిపువు. సం. వి. ఉ. పుం. సింహము, హర్యక్షము.

మృగవాహనుఁడు. సం. వి. అ. పుం. వాయువు, జింకరౌతు.

మృగవ్యము సం. వి. అ. న. వేఁట, ఆఖేటము.

మృగశిర. సం. వి. ఆ. స్త్రీ. స్. న. ము. మృగశీర్షము.

మృగశీర్షకము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

మృగశీర్షము. సం. వి. అ. న. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

మృగాంకుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, జింకతాలుపరి.

మృగాజీవము. సం. వి. అ. పుం. సివంగి, తరక్షువు. డు. బోయవాఁడు.

మృగాదనము. సం. వి. అ. పుం. సివంగి, మెకములతిండి. డు. బోయవాఁడు.

మృగితము. సం. విశ. (అ. ఆ. అ.) వెదకఁబడినది.

మృగేంద్రుఁడు. సం. వి. అ. పుం. సింహము, మెకముల ఱేఁడు.

మృగోర్వారువు. సం. వి. ఉ. పుం. బుడమశీ.

మృగ్యము. సం. విశ. (అ. ఆ. అ.) వెదకఁదగినది.

మృజ. సం. వి. ఆ. స్త్రీ. నూనెమొదలైనవానిపూఁత.

మృడాని. సం. వి. ఈ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

మృడుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

మృణాళము. సం. వి. అ. న. వట్టివేరు. పుం, న. బిసము, తూఁడు.

మృతము. సం. వి. అ. న. 1. మృతి; 2. యాచితవృత్తి. విశ. మృతిఁబొందినది.

మృతాలకము. సం. వి. అ. న. తొగరిమన్ను.

మృతి. సం. వి. ఇ. స్త్రీ. మరణము, చావు.

మృత్తాలకము. సం. వి. అ. పుం. 1. తొగరిశీ; 2. తొగరిమన్ను; 3. అడవితొగరిశీఁగ.

మృత్తిక. సం. వి. ఆ స్త్రీ. 1. మన్ను; 2. తొగరిమన్ను.

మృత్తు. సం. వి. ద్. స్త్రీ. 1. మన్ను; 2. తొగరిమన్ను.

మృత్యుంజయుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, మిత్తిగొంగ.

మృత్యువు. సం. వి. ఉ. పుం, న. మరణము. పుం. మరణాధిదేవత.

మృత్స. సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిమన్ను; 2. తొగరిమన్ను.

మృత్స్న. సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిమన్ను; 2. తొగరిమన్ను; 3. అడవితొగరిశీఁగ.

మృధము. సం. వి. అ. న. యుద్ధము, ప్రధనము, పోరు.

మృదంగము. సం. వి. అ. పుం. 1. మద్దెళ; 2. తప్పెట; 3. సద్దు; 4. వెదురుశీ.

మృదుత్వక్కు. సం. వి. చ్. పుం. బుజపత్రిశీ.

మృదులము. సం. విశ. (అ. ఆ. అ.) మెత్తనిది.

మృదువు. సం. విశ. (ఉ. ఈ. ఉ.) 1. మెత్తనిది; 2. సోమరి.

మృద్వీక. సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్షశీ. (రూ. మృద్విక.)

మృధము. సం. వి. అ. న. మృథముయొక్క రూపాంతరము.

మృష. సం. అవ్య. అసత్యము.

మృష్టము. సం. విశ. (అ. ఆ. అ.) కడుగుటలోనగువానిచేత గరగరికైనది.

## మె.

మెంచే. వై. వి. తురక, మ్లేచ్ఛుఁడు.

మెండియము. దే. వి. మెండెము. (చూ. పొరుగు రెండవ యర్థము.)

మెండీఁడు. దే. వి. (మెండెము+ఈఁడు.) చూపుడువ్రేలు. (చూ. పొరుగు రెండవయర్థము.)

మెండు. దే. వి. 1. ఆధిక్యము; "తమమెండుగనువేల్పులందంద ములకన్న లకుఁ బండువులుగా." వై. ౨, ఆ.—2. అతిశయము; "వ. మిటమిటంగాయుదట్టంపుఁ బండువెన్నెల మెండునంబెండు వడి." స్వా. 3, ఆ.—3. మిక్కు. విశ. అధికము.

మెండుకొను. దే. అ. క్రి. 1. అతిశయించు; "క. తన, దండనువేదండయానతరిశీపువగల్, మెండుకొననుండ." శకా. ౨, ఆ.—2. విజృంభించు; "ఎ, గీ. నికుంభుఁడంతఁ, జండమైనకాలదండంబుఁదాల్చిన, దండధరుఁడపోలె మెండుకొనుచు." భా. యు, కాం.—3. నిండుకొను. (చూ. నిండుకొను.) (ప్రే. మెండుకొలుపు.)

**మెండెము.** దే. వి. చూపుడు వ్రేలవేసికొనెడియుంగరము. (మెండియముయొక్క-రూపాంతరము.)

**మెండొడ్డు.** దే. అ. క్రి. (మెండు+ఒడ్డు.) ఎదిరించే. "సీ. మాటికిమాటికిమగనితో మెండొడ్డిచలపాదితనమునసలిగియుండు." శకాం. ౪, ఆ.

**మెంతులు.** వై. వి. బ. సంబారువు దినుసు. (వృత్తియందేకవచనాంతము. మెంతికూర, మెంతిమజ్జిగ మొ.)

**మెంబరు.** ఆం. వి. సభికుఁడు.

**మెకపుటాము.** వై. వి. (మెకము+ఆము.) కస్తూరి, మృగమదము. "ఎ, గీ. మేలిగొజ్జంగిపూనీటమెకపుటాము, కలిపి." అచ్చ. అ, కాం.

**మెకము.** వై. వి. 1. నాలుగుకాళ్లజంతువు; (చూ. ఉగము.) 2. జింక. "కావుననీవుబంగరుమెకంబుతెఱంగునవేగనేగి." అచ్చ. అర, కాం.

**మెకములతిండి.** దవ్వ. వి. సివంగి, మృగాదనము.

**మెకములఱేఁడు.** దవ్వ. వి. సింహము, మృగేంద్రుఁడు.

**మెకమెకపడు.** దవ్వ. అ. క్రి. ఉద్ధతినొందు. "క. ఒకనాడ జొందునీసీ, డకుడబ్బాటరుగుదెంచుటయునమ్మేలా, త్తకువ్రేగై మన్నించిన, మెకమెకపడితిట్లపలుకుమీఁతగరేపుఁ." భార. శాం. 3, ఆ.

**మెకమెకపాటు.** దవ్వ. వి. మెకమెకపడుట, ఉద్ధతి. "చ. ఒక పెనుఁబాఁపతేఁడు చలమొప్పరసాతల సినుకుంజకో, రకములు భూతధాత్రికిసురల్ దివికిఁ బగదీఱునట్లుగా, మెకమెకపాటుతోడ నినుమ్రింగకపోరెపుఁడుంద్రిలోకకం, టకుఁడవుగాననీయొడలు నజ్జుగఁజేసికురంగలాంఛనా." సావ్వ. 3, ఆ.

**మెక్కు.** దే. స. క్రి. తిను, భక్షించు.

**మెగము.** వై. వి. మెకమునకు మొదటిరూపము.

**మెచ్చు.** దే. స. క్రి. 1. శ్లాఘించు; 2. లక్ష్యపెట్టు. "సీ. వాఁడునాయువ్యగర్వమున మునీంద్రులనెవ్వరిమెచ్చకయేగి యొక్క-, ధవళాక్షుఁడనుతపోధనునొద్దగర్వించిపలికిన." భార. అర. 3, ఆ. (ప్రే. మెచ్చించు, మెప్పించు.)—వి. 1. శ్లాఘన; (చూ. అచ్చు. వి. రెండవయర్థము.) 2. బహుమానము; "నా తలఁపువేగమెచెప్పినమెచ్చువెట్టెదఁ." వీర. ౨, ఆ.—3. ప్రీతి. "నీకుమెచ్చగనిదెప్రాణమిచ్చెదము." భార. అర. ౪, అ.—విశ. శ్లాఘ్యము. "లాఁతిరాజులకుమెచ్చేయివ్విధంబు." భార. ఉద్యో. 3, ఆ.

**మెచ్చులచెట్టు.** దే. వి. కల్పవృక్షము. "ఇచ్చనెచ్చినకోర్కు-లిచ్చుమెచ్చులచెట్టు." సమీ. ౬, ఆ.

**మెచ్చులాఁడి.** దే. వి. (మెచ్చులు+ఆఁడి.) మెచ్చుకొనఁదగిన ఆఁడుది. "వ. నిలింపపతికొలువువెలచెలువలచెలువంబులు మెచ్చనిమెచ్చులాఁడులు." ఉ, రా. ౫, ఆ.—విశ. మెచ్చుకొనఁదగినది.

**మెచ్చులాఁడు.** దే. విశ. (మెచ్చులు+ఆఁడు.) మెచ్చుకొనఁదగినవాఁడు.

**మెటిక.** దే. వి. మెట్టికయొక్క-రూపాంతరము.

**మెట్ట.** దే. వి. 1. నీరానరాలేకపండెడుచేను; 2. మెరకనేల; 3. పాదము. "గీ. చుట్టువాలునునెవ్వఁబోఁగొట్టునాలు, చిట్టుప్రాలుపసిండిక్రొంబట్టుసాలు, మెట్టజాలుమొగుల్పనమెట్టఁజాలు, నట్టిడాలునుగళలఁగతెట్టిఁదలఁతు." అచ్చ. బాల, కాం.

**మెట్టజేలుగు.** దే. వి. సస్యవిశేషము. "ద్వి. మెట్టజీలుగుమేలు మెట్టపాలయ్యె." పిష్ణు. పూ. 3, ఆ.

**మెట్టతెమ్మి.** దవ్వ. వి. స్థలపద్మినీ.

**మెట్టపంట.** దే. వి. మెట్టచేనిపంట.

**మెట్టవాలుపిట్ట.** దవ్వ. వి. కోడి, చరణాయుధము. (రూ. మెట్టవాల్పిట్ట. "ఎ, గీ. మెట్టవాల్పిట్టరామేనిపిట్టవేల్పు." అచ్చ. బాల, కాం.)

**మెట్టిక.** దే. వి. మెట్టు, సోపానము. (చూ. చేఁబగట్టు.)

**మెట్టినిల్లు.** దే. వి. (మెట్టిన+ఇల్లు.) (ఆఁడుదాని) అత్తగారిల్లు.

**మెట్టు.** దే. స. క్రి. త్రొక్కు-. "మెట్టినకొండక్రుంగఁబడిమేదినిబీఁటలువాఱ." రా. యు, కాం.—వి. 1. త్రొక్కు-డు; "క. చక్కు-సులవేడబంబులు, మిక్కి-లినాముకొనికొట్టుమెట్టాడంగా." య. ౨, ఆ.—2. సోపానము; 3. తిప్ప; (చూ. మట్టముమూడవయర్థము.)—4. కొండ; "ఏమెట్టియ్యదిమెట్టుగాదిదివనంబు." రా. అం, కాం.—5. సుఁకముపుచ్చుకొనెడుమట్టము; 6. పులిమజ్జిగ; 7. బ. చెప్పులు; "సీ. నడునెత్తిసిగలుగీర్నామంబులెగువాఱుమెట్టులుక్రొవ్వఁడిమెఱుఁగుసురెలు." రసి. ౧, ఆ.—8. పావకోళ్లు; "చే. సింహగతిమీఱువసురాజుచెంతనొక్క-, తోయధరవేణిపాదముల్ తుడిచిమెట్లు, వెట్టె." వసు. ౫, ఆ.—9. ఏతె నరకట్లు. "దంతపుమెట్లవెంబడింజేవడిపీణెమీటుటయు." ఆము. ౧, ఆ.

**మెట్టుఁబ్రాలు.** దే. వి. బ. (మెట్టు+ప్రాలు.) తలఁబ్రాలు. "క. తదనంతరంబహర్షము, పాదలుమదిఁ మెట్టుఁబ్రాలపుట్టికల యెడఁ, గదియంబట్టినపెందెర, గదియించిరిబంధుజనులుకన్యావరులఁ." సావ్వ. ౫, ఆ.

**మెట్టుకు.** దే. ద్ర. 1. తుదకు; 2. మొత్తమునకు. (మెట్టుకువాఁడిచ్చువాఁడుకాఁడు.)

**మెట్టె.** దే. వి. మట్టెయొక్క-రూపాంతరము. (మొదటిరూపము మెట్టియ.)

**మెట్లగుంటక.** దే. వి. గుంటకభేదము.

**మెడ.** దే. వి. కంఠము, గళము.

**మెడకాయ.** దే. వి.———పై.———

**మెడనూలు.** దే. వి. బంగారుతీఁగెలహారము.

**మెడవాలు.** దే. వి. చేకలవాఁడు, చేకలది. "ద్వి. వరజంగమములమెడవాలుమాచయ్య, హరగణంబులకెల్లనడిగట్టనవిన." ప్రభు. ౧౫, ఆ.

**మెడ్డిదము.** దే. వి. ధ్వని. "ఎ, గీ. గొరగొరంజనుపందులఘుర్ఘురంపు, మెడిదములఁబుడమియుగడగడవడంక, నెపుడునెడయాని చీఁకట్లనివముకొనుచు,నొంటిఁజొరరాని యట్లుగానుండెమటీయు." య. ౧, ఆ.

**మెడుద.** దే. వి. పులిమజ్జిగ.

**మెణకరి.** దే. వి. బ్రహ్మచారి. "సీ. మీతండ్రిచేగుజ్జమెణకరిగొన్న భూగగనంబులేలంగఁగలిగెనొక్క-." ఉ, హరి. ౫, ఆ.

**మెణత.** దే. వి. మెట్టె. "ద్వి. మెండుగావసులకుమెణతలల్లించి." పలనాటిచరిత్రము.

**మెతుక.** వై. విశ. 1. మృదువైనది; (మెతుకనేల.) 2. మందము*. (మెతుకయెద్దు.)

**మెతుకు.** దే. వి. అన్నముయొక్క-కణము.

**మెత్త.** వై. వి. 1. పఱుపు*; 2. సాగరముమోసెడిమెద్దుగంటమీఁది పఱుపు*; 3. గుజ్జుపుపల్లము*. "పసిఁడిపక్కెరజరబాజుమెత్త యు." రసి. ౧, ఆ.–విణ. మృదువైనది.

**మెత్తఁబడు.** వై. అ. క్రి. (మెత్తన+పడు.) 1. మృదువగు; "వ. అనిమెత్తంబడనిచిత్తంబున." భాగ. ౭, స్కం.–2. అణఁగు*. (చూ. పెలుచ రెండవయర్థము, గుసగుసలుబోవు.)

**మెత్తఁబాటు.** వై. వి. 1. మృదుత్వము; "ఉ. యాగమునుత్తమై చను హాయంబునకడ్డము వచ్చిపట్టికా, కీగతిమెత్తఁబాటుతగునే." భార. అశ్వ. ౪, ఆ.–2. ఆలస్యము. "తే. పిఱికితనమునేమఱు టయుఁదొఱవతనము, మెత్తఁబాటునఁగార్యంబు సత్తెఱఁగు, నేర మియు విషయంబులఁగూరుటయును, గలుగుపతికినొందదుసిరి తొలఁగిపోవు." సం. "అతిభీరు మతిక్లీబం దీర్ఘసూత్రం ప్రమాదినమ్, వ్యసనాద్విషయాక్రాంతం సభజంతి నృపం ప్రజాః." భార. ఆర. ౬, ఆ.

**మెత్తఁబోటు.** ద్వి. అ. క్రి. (మెత్తన+పాటు.) మెత్తఁబడు. చంద్రా. ౧, ఆ. (చూ. పాటు.)

**మెత్తగిల్లు.** వై. అ. క్రి. మెత్తనగు.

**మెత్తడము.** దే. వి. మెత్తాట. "మంటిమెత్తడము." వి, పు. ౭, ఆ.

**మెత్తడి.** దే. వి. మత్స్యవిశేషము.

**మెత్తన.** వై. వి. 1. మృదుత్వము; 2. శాంతి*. "క. ఆమూర్తియట్టి తేజం, బామహిమనిజాంతరంగమద్భుతభీతి, వ్యామోహితంబు సేయం, గామెత్తనఁగొంతసేపుకనుఁగొనియలుకన్." హరి. పూ. ౫, ఆ.–విణ. మృదువు. "తనయుల్లముమెత్తన." భార. విరా. ౧, ఆ.–క్రి. విణ. తిన్నగా*. "క. అమ్మునికడకున్, మెత్తన చనినారదముని, యత్తెఱఁగెఱిఁగింప." భార. అను. ౫, ఆ.

**మెత్తినగోడ.** ద్వి. వి. లోపల ఎముకలుంచిపెట్టినగోడ, ఏడూకము.

**మెత్తు.** దే. స. క్రి. మన్నులోనగువాని దళముగాపూయు. వి. మన్నులోనగువాని దళముగా పూసినపూఁత. "సీ. మూసి ముల్లడిచి గుమ్మలకొల్చుపైమెత్తు లూడ్వఁడుపస్తైననుండుఁగాని." పాండు. ౪, ఆ.

**మెదడు.** వై. వి. తలయందుండు క్రొవ్వు, మస్తిష్కము*.

**మెదలిక.** దే. వి. మెదలుట.

**మెదలు.** దే. అ. క్రి. 1. కొంచెము చలించు; (వాఁడుకదల మెదలలేకయున్నాఁడు.) 2. సంచరించు. "మ. అదెనక్తంచరు లిందునందును మహోగ్రాకారులై క్రందుగా, మెదలంజొచ్చిరి." సం. "నక్తంచరాశ్చరంత్యేతే." భార. ఆర. ౭, ఆ.

**మెదలుచు.** దే. ప్రే. మెదలఁజేయు. "కాలుచెయ్యిమెదలుప కున్నన్." జై. ౮, ఆ. (రూ. మెదల్చు.)

**మెదించు.** వై. స. క్రి. మెదుచుయొక్క రూపాంతరము. "మృగిమదంబుఁగపురంబునుసాంకవముఁ మెదించి." రుక్మి. ౩, ఆ. (ఇది నులించువంటిది.)

**మెదుక.** వై. వి. పినక*. "ద్వి. మెదుకపట్టినతల." హరిశ్చ. ౩, భా.–విణ. మందము, మందుఁడు*. "క. అదియమహాఫల మనితన, హృదయంబునఁబౌండరీక మెప్పుడెఱుఁగఁడా, మెదుక చనునిదియముక్తి, ప్రదమనిపెఱతీర్థమునకు బహునిగమనిధీ." పాండు. ౫, ఆ.

**మెదుకగొను.** ద్వి. అ. క్రి. (మెదుక+కొను.) పినకపట్టు. (చూ. మందుక.)

**మెదుకు.** దే. వి. మెతుకుయొక్క రూపాంతరము.

**మెదుగు.** దే. అ. క్రి. 1. ధాన్యము పొట్టుపోవనలఁగు; 2. నలఁగు. "క. కన్నలు, నొప్పరువార్ధకముచేతమెదిగినవానిన్." వి, పు. ౪, ఆ.

**మెదుగుడు.** దే. వి. నూతవస్త్రము. "సీ. జలకమార్చునఖంబుచ స్వచ్ఛజలములఁదడియొత్తుఁగడు మెదుగుడులఁబొదివి." పాండు. ౩, ఆ.

**మెదుచు.** వై. స. క్రి. మేదించు. "సీ. ఫాలభాగమ్మునఁబన్నిట మెదిచినకమ్మకస్తురితిలకమ్ముదిర్చి." కాశి. ౭, ఆ (చూ. పాయగొమ్ము)

**మెదుపు.** దే. ప్రే. మెదుగఁజేయు. "మ. దేవకీ, తనయుంహా రెలగ్రొచ్చివైచిమదిపెన్ వద్దైత్యుఁజూర్ణంబుగన్." పాండు. ౫, ఆ.

**మెదువు.** వై. విణ. 1. మృదువు; సాండు. ౪, ఆ. 2. మందము*.

**మెనుపు.** దే స. క్రి. (కవ్వముతో) ఎనుచు.

**మెనుసురేషన్.** ఆం. వి. భూమికొలఁతసంబంధమైన శాస్త్రము.

**మెప్పు.** దే. వి. 1. శ్లాఘన; 2. ప్రీతి; (చూ. మెచ్చు.) 3. వరము. "సి. నాకునుందెలమితోడ, నీవొసంగెదనన్నవెఱ మెప్పులిప్పుడు మఱచినాఁడవు లోకసెటుకమాలి." అచ్చ. అ, కాం.

**మెయి.** దే. అవ. కొన్నియెడల తృతీయావిభక్తియందువచ్చెడు ప్రత్యయము. (ఉదా. అలుకమెయి, చలమమెయి మొ.)–వి. 1. దేహము; "క. మయునమ్ములు సురవర్ధకి, మెయిఁగాఁడి." హరి. ఉ. ౧౦, ఆ.–2. విధము; "క. మిగిలిపవమానసుతుపై, భగదత్తుఁడుమత్తగజముఁబఱపియతనినా, శుగములఁబొదివినమ్మెయి, మొగులురవింబొదువుదర్పముందలఁపించెన్." భార. భీష్మ. ౩, ఆ.–3. పార్శ్వము; "ఉ. ఏవరా, రోహలుమమ్ముఁబోలమికి రూఢిగ నమ్మెయి నున్నయాజగ, న్మోహనమూర్తియర్థపతిముద్దుకుమారుఁడెసాక్షి." కళా. ౧, ఆ. "ఇరుమెయి." భార. విరా. 3, ఆ. "రెండుమెయిల." భార. ద్రో. ౫, ఆ.–4. వెంబడి. "క. ఏకరసమయత్వేత్రిమ, నేకోపధిరసమయంబయినయట్లునుమీ, యేకవిధమైనబుద్ధియు, నేకములగుకర్మములమెయింబోకనృపా." భార. శాం. ౪, ఆ. (మయియొక్క రూపాంతరము.) (చూ. మేను.)

**మెయికొను.** దే అ. క్రి. 1. సమ్మతించు; "క. ఓడకుమున్నత పదమునిచ్చుటకు మెయికొంటిన్." భార. అను. ౪, ఆ.–2. కలుగు; "క. ఉత్తములాశ్రితులఁగృపా, యత్తతఁజేపట్టిప్రోతు రటుగానున్నన్, రిత్తచనఁజేయ గొందుని, మిత్తంబుననైనబ్రతుకు మెయికొనఁజూతుర్." భో. ౧, ఆ.–3. అనుకూలించు. (చూ. మెరమెర మూడవయర్థము.) స. క్రి. అంగీకరించు. (చూ. కాలు. వి. మొదటియర్థము.) (మయికొనుయొక్క రూపాంతరము.)

**మెయికోలు.** దే. వి. మయికోలుయొక్క రూపాంతరము.

**మెయితాలుపు.** దే. వి. ప్రాణి, శరీరి. "మెయితాలుపుబిందువులను." అచ్చ. యు, కాం.

**మెయిపాలు.** దే. వి. సమభాగము. "క. పెక్కెండ్రుపూఁట వారలు, తక్కినిమెయిపాళ్లనరువఁదగునొకచాయన్, బెక్కెండ్రుపూఁటయగుచో, నొక్కనిచేనైనయర్థమొడయండుగొనున్." సం. "బహూనామ్నుద్ధర్యదిసాధ్యం కైర్ధద్యుః ప్రతిభువోధనమ్, ఏకచ్ఛాయాశ్రితేష్వేషు ధనికస్యయథారుచి." విజ్ఞా. వ్య, కాం.

**మెయిమఱపు.** దే. వి. మయిమఱపుయొక్కరూపాంతరము.

**మెయిమెయి.** దే. వి. విణ. మయిమయియొక్కరూపాంతరము.

**మెయివడి.** దే. వి. విణ. మయివడియొక్కరూపాంతరము.

**మెయిమఱువు.** దే. వి. మయిమఱువుయొక్కరూపాంతరము.

**మెరక.** వై. వి. మిట్టనేల.

**మెరమెర.** దే. వి. 1. మనోవ్యథ; (చూ. మురమురరెండవ యర్థము.) 2. సంశయము; "క. అరివధము పాపమనిమది, మెరమెరగలదేనిఁదగినమెయిఁజేయుముభూ, వర ప్రాయశ్చిత్తము." భార. శాం. ౧, ఆ. 3. భేదము. "క. పురుషుఁడనవేఱొకండే, పురుషోత్తముఁడైనయేన పురుషోత్తమతా, స్ఫురణకుఁబునుపత్వం బను, మెరమెరగల దదియకాదెనొయికొనఁ గ్రియకున్." భార. భీష్మ. ౧, ఆ.

**మెరమెరపడు.** ద్వి. అ. క్రి. సంశయపడు. "వ అనిమిత్త మోహంబుఁదిరిస్కరించుచునిజాశ్రమంబునకువచ్చి మనమునఁ బున మెరమెరపడుచుండె." వా. ౪, ఆ.

**మెరమెరపాటు.** ద్వి. వి. మెరమెరపడుట. "ద్వి. సరకుసేయు దునె యీసామ్రాజ్యపదవి, మెరమెరపాటేలమీకుఁజిత్తముల." హరిశ్చ. ౧, భా.

**మెరమెరలాడు.** దే. అ. క్రి. (మెరమెరలు+ఆడు.) బాధ పడు. (కన్ను మెరమెరలాడుచున్నది, మనసు మెరమెరలాడు చున్నది.)

**మెఱచు.** దే. అ. క్రి. తళుక్కనిప్రకాశించు. "వ. నీలకంఠనిటల తటనయనశిఖిశిఖాసహాయంబైనతెఱంగున మెఱచిచఱచినంబురంబు శారకకృత్యకృత్యంబులేకమరలిపఱవంజొచ్చిన." ఉ, హరి. 3, ఆ.

**మెఱపు.** దే. వి. 1. తటిత్తు; (చూ. ఒఱపు. వి. ఆఱవయర్థము, తఱపి. వి. రెండవయర్థము.) 2. ప్రకాశము. "ఎ, గీ. మదురు గోడలమెఱపువాల్మగలయొఱపు." రసి. ౧, ఆ.

**మెఱపుఁదీఁగె.** ద్వి. వి. (మెఱపు+తీఁగె.) 1. జ్యోతిష్మతీలత; 2. తీఁగవంటిమెఱపు.

**మెఱము.** దే. స. క్రి. నాటినశల్యాదికము ఇటునటు మెదల్చు. "వ. నెఱఁకులమెఱుంగుటమ్ములు మెఱమినతెఱంగుననతనిచరిత్రస్మ రణంబులు చిత్తోత్కంపంబునొనరింప." లక్ష్మీ. ౪, ఆ.—వి. పిల్ల మెఱము. "చ. మెఱములువైచుచున్ నెగసిమేఘములంటుచు." రా. యు, కాం. "క. చుట్టుకపడెనతఁడ, వ్వనజాక్షునియెదుర మెఱమువైచినభంగిన్." జై. 3, ఆ.

**మెఱమెచ్చు.** దే. వి. (మెచ్చు+మెచ్చు.) మిక్కిలిమెచ్చు. "చ. మనములమాటలం గ్రియలమన్ననలీనొకనాఁడునెట్టికా, మిను లకు గారవంబు మెఱమెచ్చులకైపచరింతుఁగాని." పా. ౧, ఆ.

**మెఱయు.** దే. అ. క్రి. 1. ప్రకాశించు; 2. బయలుపడు. "మెఱసియేనుపచారమువేడ్కనేయఁగానెన్నఁడుమెచ్చునో." భాను. 3, ఆ.—అం, ప్రే, బయలుపఱచు. "క. కఱచునెడనేయునెడవడిఁ, బఱచునెడం బెనఁగునెడనపారబలంబుల్, మెఱయునెడభీమున కునం, దొఱుఁగీడ్వడఁదొడఁగిరుద్ధతులురాజసుతుల్." భార. ఆది. ౯, ఆ.

**మెఱవడి.** దే. వి. 1. అతిశయము; (చూ. చేగ.) 2. ఉద్రే కము; "వ. అనిమిషియుఁజెఱకువిలుతునిమెఱవడినెఱసినసెఱబిసు దువెఱఁగుపడి." భాగ. ౯, స్కం.—3. ఊరేగింపు; (వాడుక యందుమెఱవణి.) 4. ధైర్యము; "ద్వి. మెఱవడిమైసురెమెఱికి." భాగ. ౯, స్కం.—5. నేర్పు; "వ. వివిధాయుధంబులసాధ నంపు మెఱవళ్లైఁజెంగించుసత్తంచరుబున." ఉ, రా. ౪, ఆ.— 6. గౌరవము. "క వెఱవకుసీవుసురేశ్వర, యెఱుఁగుదునే నా దురాత్ము నిప్పుడవానిన్, మెఱవడియొనర్చి బుద్ధులు, గఱపివరం బిచ్చిశాంతుఁగావింతురహిన్." (మెఱవడియొనర్చి—గౌరవించి యనుట.) శైవ. ౪, ఆ.—విణ. ప్రకాశితము. "క. నెఱవగ్గలిం పఁజుక్కలు, తఱచైపొడముటయుగగనతలమొప్పారెన్, మెఱుఁ గారుముత్యములచే, మెఱవడియగునల్లపట్టుమేల్కట్టుగతిన్." విక్ర. ౬, ఆ.

**మెఱికలు.** దే. వి. బ. పొట్టువీడిపీడనిబియ్యము.

**మెఱియ.** దే. వి. గుండ్రాయి.

**మెఱియఁడు.** దే. విణ. చలింపనివాఁడు. (చూ. మడియఁడు.)

**మెఱియత.** దే. విణ. చలింపనిది. "క. నీరిచ్చి మెఱియతవయః, కావరమునవలసిసట్లుగయ్యాళింపఁ, గావెఱచిపెద్దమొఱగా, నేరిరిని వారిఁదగిలియేలవచింపున్." కళా. 3, ఆ.

**మెఱుఁగు.** దే. వి. 1. తళతళయనెడుకాంతి; (చూ. మిడుఁగుఱు రెండవయర్థము.) 2. మెఱపు; "చ. ఎద్దులాఱునూ, ఱునురథ ముల్ శతంబునుమెఱుంగులమొత్తమువోసియంగనా, జనశతకంబు." భార. కర్ణ. ౨, ఆ.—3. నెయ్యిమొదలైనవానిజిడ్డు.

**మెఱుఁగుఁబోఁడి.** దే. వి. (మెఱుఁగు+పోఁడి.) 1. మెఱపు వలెమనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. "క. మెఱుఁగుంబోఁ డికిమరాళి మృదుమధురోక్తిన్. వ. ఇట్లనియె." ప్రభా. 3, ఆ.

**మెఱుఁగుడుఁబురువు.** ద్వి. వి. (మెఱుఁగుడు+పురువు.) మిడుఁగుఱుఁబురుగు. (చూ. పెంటి.) [రూ. మెఱుఁగుడుఁ బుర్వు. "చ సురవరవర్ణినీమణులుశోభిలుమింటనటించువేళఁద, త్పరహరినీలహర్మ్యరుచిఁబొల్చినచోటులఁద్రోవగానమిన్, గర మరుదందితత్తఱిలిగాఢతమఃపటలప్రచారులై, యురుతరదీప్తులన్ మెలఁగుచుంద్రు మెఱుంగుడుఁబుర్వులోయనన్." (ఇచ్చట మిడుఁగుఱుఁబుర్వు అనియున్నను బాధలేదు. అయినను ప్రతుల యందిట్లుపాఠము కనఁబడుచున్నది.) భల్లా. ౧, ఆ.]

**మెఱుఁగుజెట్టి.** దే. వి. ఒకదినుసుజెట్టి, కుటరాజము.

**మెఱుఁగుసూనె.** ద్వి. వి. మెఱుఁగునకై పెట్టెలులోనగువాని మీఁదపూసెడు పూఁతనూనె.

**మెఱుఁగునల్లలు.** ద్వి. వి. బ. (చూ.) కల్లదండ.

**మెఱుఁగురిక్క.** ద్వి. వి. 1. పగడము; 2. కాంతిగలనక్షత్రము.

**మెఱుకు.** దే. స. క్రి. పెఱుకు, ఉత్పాటించు. "సీ. మెడపట్టి గోగ్గొండిమెఱికిపుచ్చుఁడుపీనిగ్రుడ్లుచెక్కలనెత్తురులుస్రవింప." సం. "ఉత్పాటయాస్యనేత్రేత్వంనిధాయచరణౌగళే." కాశీ. 3, ఆ.

**మెఱుము.** దే. అ. క్రి. మెఱచు. "క. ఉఱుముచుమెఱుముచుఁ బిడుగులు, పఱలఁగనల్లడలఁబడఁగవారితవృష్టుల్, గుఱుకొనికురి యఁగఁబంచెను, మఱియునునయ్యనలుమీఁదమఘుఁడలుకన్." భార. ఆది. ౮, ఆ. — స. క్రి. పొడుచు. "వ. లూనియుద్రేని యుఁదఱిమియుమెఱిమియు." ఉ, హరి. 3, ఆ.—వి. మెఱపు.

**మెలఁకువ.** దే. వి. 1. మేలుకొనుట; (ఎంతలేపినను వానికి శీఘ్ర ముగ మెలఁకువరాదు.) 2. వర్తనము; "వ. వీరెల్లనిట్టిట్టిమెలఁకువల మెలంగుదురనితత్కృతాకృతంబులునేనయెఱుంగుదు." భార. ఆర. ౯, ఆ. — 3. జాగరూకవర్తనము. "క. జలతైలబిందువయినా, మెలఁకువవెల్లివిరియైనమేలగునే." ఉ, హరి. ౯, ఆ. — 4. జీవ నము; "ఆ. తలముదప్పినమెలం, కువలకల్పులియ్యకొనుటదగు నె." భార. విరా. ౧, ఆ.—౫. సంచారము. "క. మెలఁకువలు చాలితమతమ, నిలయంబులకేగసివచ్చునెమునులు." కవిక. ౪, ఆ.

**మెలఁకువకాఁడు.** దే. విణ. జాగరూకతగలవాఁడు, జాగరూకుఁడు.

**మెలఁగు.** దే. అ. క్రి. 1. వర్తించు; (చూ. కలపఁబిండి.) 2. జాగరూకతతో వర్తించు; 3. సంచరించు; "ఆ. కుడిచినపుడు నిద్ర గూరినయప్పుడు, మేలుకొనినయపుడు మెలఁగినపుడు, విష్ణుకీర్తనంబు విష్ణుచింతయుఁగాని, పలుకఁడొండుబుద్ధిఁదలఁపఁడొండు." లక్ష్మి. 3, ఆ. — 4. జరగు. "సీ. పాలుపారఁగాబోరగిలి పాన్పునాల్గుమూలలకునువచ్చునుమెలఁగిమెలఁగి." హరి, పూ. ౫, ఆ.

**మెలఁచు.** దే. ప్రే. మెలఁగఁజేయు. "వ. దర్పచేరువలనిర్గార్యంబులుగా మెలంగఁదేజికాళ్వంబుమెలంచుచు." స్వా. ౪, ఆ.

**మెలఁత.** దే. వి. నెలఁత, ఆఁడుది. "ఉ. అపురిమించుటోవరుల నాడుమెలంతలగాన మాధురిన్." వాసు. ౧, ఆ.

**మెలఁతుక.** దే. వి. (మెలఁత+ఉక.)———పై.———(స్వార్థమున ఉక.)

**మెలకు.** దే. అ. క్రి. జ్వలించు. (చూ. మిడుకు మొదటియర్థము.)

**మెలపు.** దే. ప్రే. మెలయఁజేయు. "క. పగవానిపక్షమునవాఁడగపడినంగాచెనేనినాసన్నునిఁగాఁ, దగమెలపఁదగదు మెలపినఁ, దెగునుపమర్దనుఁడుఁబోలెధీరహితుండై." పంచ. నా. 3, ఆ.—వి. 1. జాగరూకత; "ఆ. అతఁడుసజ్జఁజేరియధిపుతోనియ్యెడ, నిద్రవోదునేను నృపవరేణ్య, మీరునిదురదక్కి మెలపుననాచర, ణంబులొత్తుచునికినాకుఁబ్రియము." భార. అను. ౨, ఆ. — 2. మెత్తఁబాటు; (చూ. రూ. మెల్పు.) 3. భ్రమణము; "సీ. మృగమదంబును మదమృగమునుహసియించుఁగాయంపువలపుకన్దోయిమెలపు." అని. ౨, ఆ.—4. చలింపమి. "సీ. పూఁదీగెఁబోఁడి చూపులుచంచలములని మెలపునెన్నడుపునమేళవించె." (ఇక్కడ చలింపమియనఁగామాంద్యము. చూ. ముందువెనుకటిచరణములు.) విక్ర. ౪, ఆ.—(రూ. మెల్పు. మెత్తఁబాటునకు.—"చ. విదురాదిసజ్జనుల బుద్ధికిరానుచితంబుతోడిమె, ల్పునఁబరుసందనంబునను భూపతులెల్లవినంగనాడుమి." సం. "తత్తత్కేశవభాషితాఃసాంత్వంవాయదివేతరత్." భార. ఉద్యో. 3, ఆ.)

**మెలయు.** యు. దే. అ. క్రి. 1. వర్తించు; 2. జాగరూకతతో వర్తించు. వై. పెనఁగు. (కలసిమెలసి.) (చూ. మెలుసు.)

**మెలి.** వై. వి. మెలిక, మెలుసు, పెన.

**మెలిక.** వై. వి. మెలి, మెలుసు, పెన.

**మెలిగొను.** దృ. అ. క్రి. (మెలి+కొను.) పెనఁగొను. "హారముల్ మెలిగొన." కవి. 3, ఆ.

**మెలిదారము.** దృ. వి. జాళ్లపనివారు దిండుప్రక్కకొయ్యలకుఁ గట్టెడు బిగిదారము.

**మెలియు.** వై. అ. క్రి. పెనఁగు. (చూ. మెలుచు, మెలుసు.) (మెలయుయొక్కరూపాంతరము.)

**మెలివడు.** వై. అ. క్రి. (మెలి+పడు.) మెలిగొను.

**మెలివెట్టు.** దృ. స. క్రి. మెలివేయు.

**మెలుచు.** వై. ప్రే. మెలియఁజేయు, పెనఁచు. "చ. కేలఁగేల్, మెలిచినబెళ్కుఁజేడిసలమిన్నలచిన్నెలవెన్నుదన్నుబల్, శాలవులచూపులత్తుకలజొత్తిలఁజూచెలతాంగినాథునిన్." రస. 3, గుచ్ఛము.

**మెలుసు.** వై. వి. మెలిక. "వ. ఇనుపగొలుసులమెలుసులువీడిన." భాగ. ౧౦, స్కం. పూ.

**మెల్త.** దే. వి. మెలఁతయొక్కరూపాంతరము. నై. ౮, ఆ.

**మెల్తుక.** దే. వి. మెలఁతుకయొక్కరూపాంతరము. మార్క. ౫, ఆ

**మెల్ల.** దే. విణ. 1. కంటికడకొఱగినది; (చూపు.) (మెల్లకన్ను.) 2. మెల్లనైనది. (వానిపనియిప్పుడుమెల్ల.) — క్రి. విణ. తిన్నగా. (మెల్లగా మాటాడుము, మెల్లగా రమ్ము.)

**మెల్లకంటి.** దే. విణ. (మెల్ల+కన్ను.) కేకరాక్షుఁడు, కేకరాక్షి.

**మెల్లన.** దే. వి. 1. తిన్నన; 2. అల్లన. (విశేషణమైనచో మెల్లనినగవు, మెల్లనిమాట మొ.) (చూ. అలకన.)

**మెల్లా.** దే. వి. చేవిక. (ఇది వాడుకలోనిది.)

**మెల్లె.** దే. వి. (చూ.) చివక. "ఈఁతమెల్లె" మొ.

**మెసఁగు.** దే. స. క్రి. తిను, భుజించు. "చ. తనకెనయైనబాలకులఁ దార్చుకమెల్లన గొల్లయిండ్లకున్, జనిపెరుఁవెన్నముద్దలుమెసంగుచు." శుక్ర. ౨, ఆ.

**మెసవు.** దే. స. క్రి. మెసఁగుయొక్కరూపాంతరము.

**మెహనతు.** హిం. వి. పాటు, కష్టము, బహుమతి.

## మే.

**మే.** దే. వి. 1. శరీరము; "విధినామేఁబ్రాణముల్ నిల్పె." భార. శల్య. ౨, ఆ. — 2. విధము; "నితంపుమేగెలువకావశమే." భార. ద్రో. ౫, ఆ.—3. పార్శ్వము. "ద్వి. ఇరుమేల." భాగ. ౮, స్కం. (మెయియొక్కరూపాంతరము. చూ. మేను.)

**మేండము.** సం. వి. అ. పుం. మేషము, పొట్టేలు.

**మేండ్రించు.** దే. స. క్రి. భేదించు. (చూ. పంటించు.)

**మేంథి.** సం. వి. ఈ. స్త్రీ. మెంతికూర.

**మేఁక.** వై. వి. 1. భాగి; 2. భాగము.

**మేఁకతిండి.** దృ. వి. తోఁడేలు, వృకము.

**మేఁకపోతు.** దృ. వి. భాగము.

**మేఁకరాసి.** వై. వి. మేషరాశి.

**మేఁకసోరము.** వై. వి. స్వరవిశేషము, గాంధారము.

**మేఁగు.** దే. స. క్రి. 1. పూయు; "సీ. లోకపాలోన్నతప్రాకారములయందుమృగమదపంకంబుమేఁగిరొక్క." భో. ౨, ఆ.— 2. ఆవరించు. (చూ. మ్రేఁగు.) (మ్రేఁగుయొక్కరూపాంతరము.)

**మేఁడి.** వై. వి. నాఁగటిదుంపవెనుకనిలిపినకొయ్య*. (చూ. పగ్గము.) (దీనిని మేఁడికఱ్ఱయనియువాడుదురు.)

**మేఁడికోరు.** వై. వి. మేఁడిపాలు.

**మేఁడిచీల.** దృ. వి. మేఁడిజాఱిరాకుండవేసినచీల.

**మేఁడితోఁక.** దృ. వి. దున్నెడువాఁడు పట్టుకొనుటకు మేఁడిచివరను అడ్డముగాచెక్కిన చిన్నకొయ్య.

**మేఁడిపాలు.** దృ. వి. సేద్యకాఁపునకువచ్చు ధాన్యభాగము. (నేలయొడయనికివచ్చు ధాన్యభాగముకోరు.)

**మేఁడిసోగ.** దృ. వి. మేఁడితోఁక.

**మేఁత.** దే. వి. పశ్వాద్యాహారము.

**మేఁతరి.** దే. వి. (మేఁత+అరి.) కొందఱు శిల్పులలో ముఖ్యుఁడు. విణ. తిండిపోతు.

**మేఁతాడు.** దే. అ. క్రి. (మేఁత + ఆడు.) మేఁతమేయు. "పాల మునమేఁతాడి." పంచ. వేం. 3, ఆ. (రూ. మేఁతలాడు. "సీ. మిన్నేటిదరులందుమేఁతలాడుచునున్న యుదుటురాయంచలేఁ గొద మయనఁగ." పా. ౧, ఆ.)

**మేకము.** సం. వి. అ. పుం. మేఁక, ఛాగము.

**మేకు.** దే. వి. గూటము.

**మేకొను.** దే. అ. క్రి. 1. సమ్మతించు; "ఇందొక్కరుఁడైనఁ గేశవుహితోక్తికిమేకొనఁడయ్యె." భార. ఉద్యో. ర, ఆ.—2. కలుగు; (చూ. చెందు, బెట్టిదము.) 3. పూను. "ఉ. మేలునడత సిల్లునెడమేకొనియాపద పొందునాపదం, బూలఁగఁబూనిసౌఖ్యములుదోఁచు." భార. అర. ౫, ఆ.—స. క్రి. పొందు. "వృ. గు నిఁజంపినప్పుడెసురేంద్రునిమేకొనెబ్రహ్మహత్య." ఉ, రా. 2, ఆ. (ప్రే మేకొలుపు) (మెయుకొనుయొక్క రూపాంతరము.)

**మేకోలు.** దే. వి. మేకొనుట. (పూనికకు.—"క. ఆమతమచేశఁ బలశై, మిముఁగొనిపాండవులగెలుచుమేకోలునభూ, ఎమణులుకొం దఱువచ్చిరి." భార. భీష్మ. ౧, ఆ.)

**మేఖల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుదానియొక్క యనిమిదిపేటల మొలనూలు; 2. కొండనడుము; 3. చిలుకడత్రాడు.

**మేఖలకన్యక.** సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

**మేగలి.** దే. వి. పూనిక. "క. ఆటోపమడఁగియచ్చటి, మేటిమగలు జిచ్చవడిరిమేగలిఁగర్ణుని, దేటలవికిఁగవిసెదను, ద్యాటంకృతిసెలఁగఁబాండవాగ్రజుఁడెలుచన్." భార. కర్ణ. ౨, ఆ. (ఈ పదము ఇక్కడ నొకచోటనే కానఁబడుచున్నదిగాన ఇట్లొకపదము కలదని దృఢముగా చెప్పుటకు ధైర్యము చాలదు. పదమిట్లుండునేని సందర్భమునుబట్టి దీనికీయర్థము ఉండవచ్చునని నిర్ణయించి వ్రాయఁబడినది.)

**మేఘద్వారము.** సం. వి. అ. న. ఆకాశము, మొగులుదారి.

**మేఘనాదము.** సం. వి. అ. పుం. 1. ఉఱుము; 2. చిత్రేశూర. డు. 1. రావణునికొడుకు; 2. వరుణుఁడు.

**మేఘనాదానులాసి.** సం. వి. న్. పుం. నెమిలి.

**మేఘనామము.** సం. వి. న్. పుం. నిడుముస్తె.

**మేఘపుష్పము.** సం. వి. అ. న. 1. ఉదకము; 2. తూర. పుం. కృష్ణునితేరిగుఱ్ఱములలో నొకటి. (చూ. రథ్యము.)

**మేఘము.** సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. పిన్నఁగుకాలియందలి మదము; 3. ముస్తె.

**మేఘవాహనుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, మబ్బురౌతు.

**మేచకము.** సం. వి. అ. న. చీఁకటి. పుం. 1. నెమిలిపురికన్ను; 2. నలుపు. విశ. నల్లనిది.

**మేజా.** హిం. వి. బల్ల.

**మేజువాని.** హిం. వి. విందు.

**మేజోడు.** గ్రా. వి. పాదరక్షలకులోపలఁ గాలికివేయు జోడు.

**మేటు.** దే. వి. (చూ.) ఎక్కలి.

**మేటరి.** దే. విశ. (మేటి + అరి.) మేటి, శ్రేష్ఠుఁడు. "జ్యోతిశ్శాస్త్రులకెల్లమేటరివి." భాగ. ౧౦, స్కం. పూ. (స్వార్థమున అరి.)

**మేటి.** దే. వి. 1. అధిపుఁడు. "శే. అంబురాశినదంబులకచలములకు, నాహిమాద్రిపక్షులకుఁగళ్యపసుతుండు, మేటియైయొప్ప క్రియ సురకోటికెల్ల, బ్రభుఁడవీవొక్కరుఁడవావె పద్మనాభ." హరి. పూ. 2, ఆ.—2. కసవువామి. విశ. శ్రేష్ఠము. "పశువులకు మేటియజము." భార. అశ్వ. ౨, ఆ.

**మేటి.** అం. వి. చిల్లఱపనులుచేయు సేవకుఁడు.

**మేటిల్లు.** దే. అ. క్రి. అతిశయించు. "క. సభా, భూమికిఁజని యెదువారికి, శ్రీమేటిల్లంగమంచిచీరలువలయున్." హరి. పూ. ౯, ఆ.

**మేడ.** దే. వి (చూ.) సౌధము. "క. ఆమగువయట్లుపలుకుచు, నామేడకువారికిఁ లిపియరుగుతెఱఁగున, త్వాన్వమునియగుగణికామణి, తామఱుఁగుననుఁడిచూచిరలఁకెడుమదిలోన్. "క. ఎవ్వారోదివ్యస్త్రీ, లివ్వరసౌధంబునా శ్రయించిరి." కళా. ౬, ఆ.

**మేడము.** వై. ౧. 1. కూడిక; "పి. రథకబాస్తిపకసౌరఁగికుల్‌వల గొని మేడమైకనుచూపునేరనడువ" ఉ, రా. 3, ఆ.—2. యుద్ధము*. (కోడిమేడను.) (చూ. మేడముపొడుచు.)

**మేడముపొడుచు.** దన్. అ. క్రి. యుద్ధముచేయు. "క. ఓడితి నన్నన్, వారకమేడముపొడుతురె" ఋత. ౬, ఆ. (చూ. పొడుచు.)

**మేడి.** దే. వి. ఆత్తి, ఉదుంబరము.

**మేడుపడు.** దన్. అ. క్రి. (చూ.) మేల్పడు.

**మేడెము.** దే. వి. చెక్కడపుజోడుకీయంచుపనితరము. (మొదటి రూపము మేడియను.)

**మేద్పడు.** దన్. అ. క్రి. అజ్ఞతఁబొందు. (చూ. మిడుఁగుడు.) (మేడుపడుయొక్క రూపాంతరము.)

**మేధ్రము.** సం. వి. అ. పుం. మేహనము.

**మేతాలుపు.** దే. వి. మెయితాలుపుయొక్క రూపాంతరము.

**మేదకము.** సం. వి. అ. పుం. (చూ.) పెల్లము.

**మేదకుఁడు.** దే. విశ. కపటములేనివాఁడు. "ద్వి. సుకవానిపని వందమాపుగుజ్జంబు,మామిడిక్రిందిసోమరిమేదకుండు." హరిశ్చ. ౨, ఆ.

**మేదర.** దే. వి. వెదురుచేఁపలులోనగునవియల్లిజీవించెడి యొకానొకజాతి. (మేదరవాఁడు, మేదరది.)

**మేదరసాని.** దన్. వి. మేదరవానిభార్య.

**మేదరి.** దే. వి. (మేదర + ఇ.) మేదరవాఁడు, కటకారుఁడు. (చూ. ప్రాక.)

**మేదస్సు.** సం. వి. స్. న. మెదడు.

**మేదావి.** దే. వి. కొపానసాగ్నిమసి. "సీ. తళుకుజన్ని దమమేదావి బొట్టునుతిన్నిపట్టెవర్ధనమునుజట్టితడుపు." కళా. ర, ఆ.

**మేదించు.** వై. స. క్రి. మర్దించు. (చూ. కులుకు. క్రి. రెండవ యర్థము.) (మెదించుయొక్క రూపాంతరము.)

**మేదిని.** సం. వి. ఈ. స్త్రీ. భూమి, వసుధ, నేల.

**మేదురము.** సం. విశ. (అ. ఆ. అ.) చిక్కనై నునుపైనది.

**మేధ.** సం. వి. ఆ. స్త్రీ. ధారణాశక్తిగలబుద్ధి. అ. పుం. ము. యజ్ఞము.

**మేధావి.** సం. వి. న్. పుం. చిలుక. విశ. మేధగలవాఁడు.

**మేధి.** సం. వి. ఇ. పుం. పసులఁగట్టుటకు కళ్లమునఁబాఁతినగుంజె, కట్టుగొయ్య.

**మేధ్యము.** సం. వి. అ. పుం. ముంజికసవు. విశ. పవిత్రము.

**మేన.** ఉభ. దే. వి. తోడఁబుట్టినదానియొక్కయు, తండ్రితోడఁబుట్టినదానియొక్కయు, తల్లితోడఁబుట్టినవానియొక్కయు దేహసంబంధము. ఉదా. మేనగోడలు, (తోడఁబుట్టినదానికూఁతురు.) మేనత్త, (తండ్రితోడఁబుట్టినది.) మేనబావ, (తనకంటె పెద్దవాఁడైన మేనత్తమేనమామలకొడుకు.) మేనమఱఁదలు, (తనకంటె చిన్నదైన మేనత్తమేనమామలకూఁతురు.) మేనమఱఁది, (తనకంటెచిన్నవాఁడైనమేనత్తమేనమామలకొడుకు.) మేనమామ, (తల్లితోడఁబుట్టినవాఁడు.) మేనల్లుఁడు, (తోడఁబుట్టినదానికొడుకు.) మేనవదిన, (తనకంటెపెద్దదైన మేనత్తమేనమామలకూఁతురు.) — సం. వి. ఆ. స్త్రీ. మేనక.

**మేనకాత్మజ.** సం. వి. ఆ. స్త్రీ. మేనకకూఁతురు, పార్వతి.

**మేనఱికము.** దే. వి. తోడఁబుట్టినదానియొక్కయు, తండ్రితోడఁబుట్టినదానియొక్కయు, తల్లితోడఁబుట్టినవానియొక్కయు దేహసంబంధభావము.

**మేని.** దే. వి. కాంతి.

**మేను.** దే. వి. 1. శరీరము; 2. జన్మము; "క. ఈమేననవ్వసికనే, నేమియునప్రియముసేయనెంతయునాతో, ల్పామునసొసరించిన యది, యేమైనఁగలిగెనేనియెఱిఁగింపుతగన్." శేష. ౨, ఆ.—3. పార్శ్వము. "క. బంభోత్తద్దాసరియ, ఘుంబరహతులంగపాగ్ని పోటులనిరుమే, నంబొడుచుచుఁబెనఁగుచుఁబో, వంబట్టిపటంబు చేర్చివాఁడిట్లనియెన్." అను. ౬, ఆ. (మెయి, మై, మే, మేను శబ్దములే గ్రంథములయందు పార్శ్వార్థకములుగా కనఁబడుచున్నవి గాని మేల అని యొకశబ్దము ఆయర్థము కలదిగా కనఁబడలేదు. అట్లుండ నీతిచంద్రికయందు "ఒకమేల." అని ప్రయోగింపఁబడి యున్నది. దానికి ఆకరమేమో తెలిసినదికాదు.)

**మేనుతాలుపు.** దే. వి. మేతాలుపు, శరీరి. "ఎ, గీ. మేనుతాలుపుగమికెల్ల మేల్లనర్చు." అచ్చ. బాల, కాం.

**మేనేజరు.** ఆం. వి. పైయధికారి, కార్యనిర్వాహకుఁడు.

**మేపరి.** దే. విశే. (మేపు+అరి.) తినువాఁడు, భక్షకుఁడు. "పాలమేపరి." అచ్చ. అర, కాం.

**మేపు.** దే. ప్రే. మేయఁజేయు. వి. 1. పశుపక్ష్యాద్యాహారము; (చూ. మలపు మొదటియర్థము.) "వనయున్ వెన్నయుమేపు మేపునొనఁగున్." పాండు. ర, ఆ. "భాన్కరవిలసితవృత్తము. గోపురవిలసనమాఁపినమూఁపున్ఘోరహలాహలమెనసినమేపున్." సమీ. ర, ఆ.—2. దోసెపిండిమొదలైనదానికి నూటి కూడఁజేర్చెడు మినుపపప్పులోనగునది.

**మేపుట్టువు.** దే. వి. 1. కూఁతురు, తనూజ; 2. కొడుకు, తనూజుఁడు. "శోఁకుతేనియనుఁగుమేపుట్టువు." అచ్చ. యు, కాం.

**మేమఱువు.** దే. వి. కవచము. (మెయిమఱువుయొక్క రూపాంతరము.)

**మేముడు.** దే. వి. మేకోలు, సమ్మతి.

**మేమెయి.** దే. వి. అనాయాసము. (చూ. మైమై.) క్రి. విశే. అనాయాసముగా. "మేమెయియాతనిఁదాఁకెనస్త్రవిద్యాలసితుండు సాత్యకి." భార. శల్య. ౧, ఆ.

**మేయు.** దే. స. క్రి. పశ్వాదులుమేఁతఁదిను. "పచ్చికమచ్చిక మేయ." (ఇక్కడ అంశకర్త.) పంచ. నా. ౨, ఆ. "అడవులమేఁతమేసి." (ఇక్కడ పక్షికర్త.) భాగ. 2, స్కం. "ఒలికిన వానిమేయుటకు." (ఇక్కడ ఎలుకకర్త.) కాశీ. ౬, ఆ. (చూ. ఒత్తు. విశే.)

**మేర.** వై. వి. 1. ఎల్ల; 2. మర్యాద; "క. మీరరయనిర్ధర్మంబుల, మేరలునెఱుకలునుగలవె." లక్ష్మీ. ౫, ఆ.—3. క్రమము; "ధరిత్రి దాశరథిమేరఁ దాల్చినారా." భాను. ౧, ఆ.—4. ఏర్పాటు. "క. ఊరూరఁదప్పకుండఁగ, మేరలుచేయింతునిపుడు మీశిష్యులకున్, హారంబులొనఁగుసట్లును, దారతవర్ణాశనములుతగనొనరింతున్." రాజ. 3, ఆ.

**మేరు.** దే. వి. (చూ.) మేరువు.

**మేరువు.** ఉభ. దే. వి. 1. (వా.) సొరువ; "ఎ, గీ. ఎందుఁబగడపుమేరువులెత్తువారు." యు. ర, ఆ.—2. శిఖరమునందుంచెడుమణి. "సీ. పైపూఁతరుచిగాక ప్రతియెకిన్నరకాయలరిదిమేరువు తలయంసినిడిన." వసు. ౨, ఆ.—3. హారమధ్యమునందు వ్రేలెడుమణి.—సం. ఉ. పుం. హేమాద్రి.

**మేలమాడు.** దే. స క్రి. (మేలము+ఆడు.) పరిహాసముచేయు. "త్రోడికోడంద్రువదినెలుమేలమాడుచుండ." వి, పు. 2, ఆ.

**మేలము.** దే. వి. పరిహాసము. "మేలములఁగుమారులకుఁదగన్, వ. ఇంపుపుట్టించుచు." సం. "కృతాతిథ్యస్తుగోవిందస్సుర్వాన్ పరిహాసన్కుర్వన్." భార. ఉద్యో. 3, ఆ

**మేలిమి.** దే. వి. 1. ఆధిక్యము, ఔత్కృష్ట్యము, గౌరవము; (వృత్తియందంత్యవర్ణలోపము. ఉదా. "మేలికూడుగూరలు." "మేలిపటికంపుగోడలు" మొ.) (ఇటమేలియనఁగా మేలిమిగలయని యర్థము.)—2. అపరంజి.

**మేలిల్లు.** దే. వి. (మేలు+ఇల్లు.) మేడ, సౌధము.

**మేలు.** దే. వి. స. 1. శుభము; "క. కర్మములమేలునిచ్చును, గర్మంబులకీడునిచ్చు." భాగ. ౧౦, స్కం. పూ.—2. ఉపకారము; "వెండియుఁగడుమేలొనరించు."—3. పుణ్యము; "తే. మేలుగోనులోకంబులమేలఁబెచ్చుఁ, గీడుచేసినఁదప్పదుకీడయగును." భార. అను. ౧, ఆ.—4. సుకృతము; "ఎ, గీ. ఇంతియ, కానిలేదె తొంటిమేనఁజేసి, నట్టిమేలు." భార. స్త్రీ. ౨, ఆ.—5. లాభము; "ద్వి. మేలమాడుచుమంచిమేలాయెననుచు." సా. ౨, ఆ.—6. విశేషము; "ఈవిశ్వంబునఁగల్గుమేలిదియపో." కళా, ౨, ఆ.—7. వలపు; "క. మెలఁతకుఁబతిపైనైనను, మెలఁతుకపైఁబతికినైనమేలగుటెందున్, గలయదిమెలఁతకుఁబతికిన్, వలపునమంబగుటజన్మవాసనచెలియా." స్వా. ౬, ఆ.—8. మదము. (చూ. జోగా.)—విశే. 1. శుభమైనది; 2. అధికము; "మ. ఈ, తనితో సాటియనంగమేలనసమందశ్రీవిలాసంబుచే, కొని యాలోకము లెల్లనేలుదును." నిర్వ. 3, ఆ.—3. శ్రేష్ఠము; "యుగంబులఁ గృతంబుమేలు." భార. అర ౨, ఆ.—4. ఉపరి. (మేలిల్లు, మేలుకట్టు మొ.) — అవ్య. ప్రశంసనార్థకము, ఔర. "తెలివి మేలు." (చూ. బాపురే.) ఆమ్రేడితమునందు మేలుమేలు. "శా. ఆమందాకిని మాళిఁబూనినను నర్ధాంగీకృతంజేసితౌ, నౌమేల్ మేలు." వసు. ౧, ఆ. (మేలురా, మేల్రా అనియు ప్రయోగములు కలవు. "మేల్రాయన." చంద్రా. ౨, ఆ.)

**మేలుకట్టు.** దే. వి. 1. ఉల్లెడ; 2. మెట్టు. "ద్వి. స్ఫటికంపు మేల్కట్లపైనెక్కలేని, కుటిలకుంతలయొట్లుగుట్టలెక్కెదవు." నళ. ౨, భా. (ఈయర్థమునకుఁబ్రయోగాంతరము మృగ్యము.)

**మేలుకను.** దే. అ. క్రి. మేలుకొను. "క. నానామంజులమాగధ, గానధ్వనులెనఁగమేలుకని." విక్ర. ర, ఆ. (రూ. మేల్కను. "క. అనిలసుతుఁడంతటనమే, ల్కనినీల్గుండు." భార. ఆది. ౫, ఆ.)

**మేలుకనుపు.** దే. ప్రే. మేలుకనఁజేయు, మేలుకొలుపు. "సీ. దుగ్ధాబ్ధిలోపలితోయజాక్షునిమేలుకనిపిశీరంబునకనుపున్న."

భో. ౧, ఆ. (రూ. మేల్కను వు. "క. అనిశనఁగౌశికమునిమే, ల్కనుపంగాలేచి." రా. బాల, కాం.)

**మేలుకమ్మిచీర.** ద్వ. వి. ఓరమూడంగులములవెడల్పుచాయనూలి తోనేసిన అంచులుగలకోక.

**మేలుకాంచు.** దే. అ. క్రి. మేలుకొను. "యోగనిద్రాంతి నొంది మేలుకాంచి లోకంబులుగావింపఁదలఁప" భార. శాం, ౬, ఆ.

**మేలుకొను.** దే. అ. క్రి. నిద్రఁదేయు. స. క్రి. మోహించు. ఉ, రా. ౪, ఆ. (రూ. మేల్కొను.)

**మేలుకొలుపు.** దే. ప్రే. మేలుకొనఁజేయు.

**మేలుకోలు.** దే. వి మేలుకొనుట, అవబోధము.

**మేలుచేయి.** ద్వ. వి. హెచ్చు. "చ. అనిలిలనీవ్రపారమునసయా వలికిప్పుడుమేలుచేయి నా, తనయులకుంబరాక్రమము తక్కు వయుం బ్రకటింప విందు." భార. భీష్మ. ౨, ఆ.—విశ. 1. హెచ్చైనది హెచ్చైనవాఁడు; "భుజంగమసార్వభౌమునిమేలు చేయిపటువాగ్విభవంబున." నై. ౨, ఆ.—2. గెలుపుగలది, గెలుపుగలవాఁడు. "తే. భండనంబునఁబార్థుచేఁబడకనేను, మేలు చేయైతినేనియుమృత్యువునకు, నెన్నఁడగపడ." భార. కర్ణ. ౨, ఆ.

**మేలుపడు.** ద్వ. అ. క్రి. వలపుగొను. "ఎవ్వనిఁజూచిమేలుపడి తేయరవిందదళాక్షి." విజ. 3, ఆ. (రూ. మేల్పడు. "ఇక్కొమ్మ యొక్కనిపైమేల్పడియేగుచున్నశాలపుంగాప్పించె." ఉ, రా. ౪, ఆ.)

**మేలుబంతి.** ద్వ. వి. 1. విద్యార్థులుచూచి ఒరవడివ్రాయమాదిరికిమీఁదమొదటవ్రాసిన అక్షరములపఙ్క్తి; 2. చూచియేదేనియొకపని సేయ్చుకొనుటకుఁగాని, చేయుటకుఁగాని మొదటనేర్పడినమాదిరి. "వైష్ణవకోటికెల్లనీత్రోవయమేలుబంతి." వి, పు. ౨, ఆ. "ఆ. హీనజన్మమఖుటయెవ్వఁడేనొకప్రాణి, సంతసిలుటముక్తిపొంతయగుట, మేలకాదెశిబియమేల్బంతిగాఁడెన, శ్వరపుదేహమిమ్మిపరముగొనుట." ఆము. ౬, ఆ.—విశ. శ్రేష్ఠము. "తే. మేదినీనాథులకునెల్లమేలుబంతి." వి, పు. ౨, ఆ.

**మేలుమచ్చు.** దే. వి. 1. చంద్రశాల; "వ. అచ్చటంబచ్చలగచ్చుమేడలమేలుమచ్చుల." (చూ. మీఁదిది, చోఁప మూడవ యర్థము.) జై. ౨, ఆ.—2. బ. బాలికాక్రీడావిశేషము. (చూ. డాఁగనమ్ముచ్చులు.)

**మేలురాసి.** ద్వ. వి. తూర్పెత్తినధాన్యపుప్రోగు.

**మేలువాఁడు.** దే. విశ. వలపుకాఁడు. "తే. అంతరాధకుమేలువాఁడైమురారి." ఆము. ౫, ఆ.

**మేవ.** దే. వి. మత్స్యవిశేషము.

**మేవడి.** దే. వి. 1. నమ్రత; "ఆ. అరినృపాలుపెంపునాత్మీయశక్తియు, నెఱిఁగిమూర్ఖవృత్తినెదురుపడక, యుచితవృత్తినతనియుద్ధతిమేవడిఁ, గడపిహీనబలుఁడుచెడకనిలుచు." భార. శాం. 3, ఆ.—2. ఉపాయము. "ఆ. కయ్యమునకువలదుకార్దవ్వనధిపసామమునభేదమునను మార్తుమనము, మెత్తచేసిచెఱిచిమేవడిఁ దప్పించు, కొనుతెఱంగెఱింగికొనుటమేలు." భార. శాం. ౨, ఆ.—విశ. ఉచితము. "చ. ప్రియమెనఁగణాదగణాబిలిచిపెట్టెదు కూడదిలెక్కకూడుద, క్కయనయహీనతందమకు నాపదయానెడ నిట్టునట్టునే, మియుననలేనికూడదియు మేవడియైచను." భార. ఉద్యో. 3, ఆ.

**మేవడికాఁడు.** దే. విశ. 1. నమ్రతగలవాఁడు; 2. ఉపాయము గలవాఁడు.

**మేవు.** దే. స. క్రి. మేపుయొక్కరూపాంతరము.

**మేషము.** సం. వి. అ. పుం. 1. పొట్టేలు; 2. ఒక రాశి; (చూ. రాశి.) 3. ఔషధవిశేషము.

**మేషి.** సం. వి. ఈ. స్త్రీ. గొఱ్ఱె.

**మేస్త్రరు.** ఆం. వి. ఉపాధ్యాయుఁడు, యజమాని.

**మేస్త్రి.** అన్య. వి. పనివారలమీఁద పెద్ద.

**మేహనము.** సం. వి అ. న. 1. మగగుఱి; 2. మూత్రము.

**మేహము.** సం. వి. అ. పుం. రోగవిశేషము. (ఇది యిరువది విధములుగలది.)

**మేళకము.** సం. వి. అ. పుం. సంగమము, కూడిక.

**మేళగాఁడు.** ఉభ. దే. విశ. (మేళము+కాఁడు.) మేళము వాయించువాఁడు. ని. గ్రా. వేశ్యాదిజనసమూహములోనివాఁడు. "వ. తలంగిపోకయిట్టునట్టున.మిట్టుమిట్టాడుచిట్టివడుగులనానట్టు వనగళ్రనంగోపంబుఁగదుర నవలించుచుఁ దనమేళగాండ్రనాలోకించి." ప్రభా. ౧, ఆ.

**మేళగించు.** వై. అ. క్రి. 1. జతగూడు*; 2. కలియు*. అం, ప్రే. 1. జతగూర్చు*; "ప్రభాతాయాతవాతాహతాలోలత్తంత్రులమేళగింపఁగదవే." స్వా. 3, ఆ.—2. కలుపు*. (చూ. మేళవించు.)

**మేళనము.** సం. వి. అ. న. కూడిక, మేళకము.

**మేళము.** ఉభ. దే. వి. నాగసరములోనగువాద్యములజోత.—సం. అ. పుం. 1. కూడిక; 2. రాగానుగుణముగ స్వరస్థానములయందు మెట్లుకుదుర్చుట; "సీ. పాలుపొందనలుగుణంబులపై శ్రుతుల్గూర్చిసారెదన్మేళప్రకారమరసి." హంస. ౨, ఆ. "సీ. లలితాంగుళీదళంబులు నమేళములైనసారెలపైరాగసంపద లిడ." వసు. ౨, ఆ.—3. వేశ్యాది జనసమూహము.

**మేళవించు.** వై. అ. క్రి. మేళగించుయొక్కరూపాంతరము. [జత గూడుటకు.—"తే. వీరశృంగారములుమేళవించినట్టి, చెలువమున." జై. ౫, ఆ.—కలియుటకు.—"సీ. బండికందెనతోడఁబ్రతివచ్చు పైచాయనీలిపచ్చడముతోమేళవింప." నై. 2, ఆ.—కలుపుటకు.— "వావిరిఁగమ్మనీరుమృగనాభిరసంబునమేళవించి." నై. 3, ఆ. ("వీణెమేళవించి." అనుచో లక్షణచే వీణెయందలి మెట్లను మేళవించియని యర్థము.) కళా. ౨, అ.]

## మై.

**మై.** ది. అప. కొన్నియెడల తృతీయావిభక్తియందువచ్చెడిప్రత్యయము. (ఉదా. ఓర్పుమై, భక్తిమై మొ.)—వి. 1. దేహము; "వేమరునడునెత్తిమూర్కొనుచుమైపులకింప." ఉ, రా. ౪, ఆ.—2. విధము; "మ. కవలేతెంచిరివేడ్కనొండొరులకుంగయ్యంబుమైఁజెప్పచుణ." భార. భీష్మ. ౧, ఆ.—3. పార్శ్వము; "రెండుమైల నడుమము." భార. విరా. 3, ఆ. "ఇరుమై." ఆము. ౬, ఆ.—4. తడవ. "అలపింహకిశోరములొక్కమైమదోన్మత్తగజావళింబొదువుమాడ్కి." భార. ఉద్యో. ౨, ఆ. (మొదటిరూపము మయి. చూ. మేను.)

**మైకము.** దే. వి. మత్తు, భ్రమ. (మొదటిరూపము మయికము.)

**మైకొను.** దే. అ. క్రి. సమ్మతించు, ఇయ్యకొను. (మొదటిరూపము మయికొను.)

**మైకోలు.** దే. వి. సమ్మతి, ఇయ్యకోలు. నై. 3, ఆ. (మొదటి రూపము మయికోలు.)

**మైజాలు.** దే. వి. కొంతయెడయెడముగా అడ్డకన్నులు వాటించిన ఆఁడుదానిచీరకొంగు. (మొదటిరూపము మయిజాలు.)

**మైతాలుపు.** దే. వి. ప్రాణి, శరీరి. (మొదటిరూపము మయితాలుపు.)

**మైత్రము.** సం. వి. అ. పుం. దినముయొక్క మూడవభాగము. (చూ. దినము.)

**మైత్రావరుణి.** సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు.

**మైత్రి.** సం. వి ఈ. స్త్రీ. 1. మిత్రభావము; 2. మిత్రకర్మము; 3. అనూరాధానక్షత్రము.

**మైత్ర్యము.** సం. వి. అ. న. 1. మిత్రభావము; 2. మిత్రకర్మము.

**మైథునము.** సం. వి. అ. న. 1. గ్రామ్యధర్మము; 2. కూడిక.

**మైద.** యు. దే. వి. గోరంటి. నై. మైకము*. "నిద్రమైదను బడిలేపమేల్కనుదారమధువ్రతనాథుభంగి." హరి. పూ. ౮, ఆ. (మొదటిరూపము మయిద.)

**మైదానము.** హిం. వి. బయలుభూమి.

**మైదు.** నై. వి. 1. మాయ*; 2. మైకము*; 3. చొక్కుపొడి*. (మొదటిరూపము మయిదు.)

**మైనపుజిడ్డి.** ద్వి. వి. మైనపుగుడ్డ.

**మైనపువత్తి** నై. వి. దీపము వెలిఁగించుటకు మైనముతోచేసినవత్తి.

**మైనము.** నై. వి. సిక్థకము. (మొదటిరూపము మయినము.)

**మైనరు.** ఆం. వి. స్వాతంత్ర్యమునకుఁదగిన యీడురానివాఁడు.

**మైనికుఁడు.** సం. వి. అ. పుం. జాలరి, కైవర్తుఁడు.

**మైపూఁత.** దే. వి. (చూ.) అంగరాగము.

**మైపోక.** దే. విణ. తేలిక. కాశీ. ౬, ఆ.

**మైమై.** దే. వి. అనాయాసము, అనుపద్రవము. "వ. సింహబలుండునిన్నుఁబరిభవించిమైమైతోనయునికింజేసియెల్లియుంజెనకవచ్చు." భార. విరా. ౨, ఆ.—క్రి. విణ. అనాయాసముగా. "మైమైపోరిరి." భార. విరా. ౨, ఆ. (రూ. మైమయి. అనాయాసముగాననుటకు. "తొల్లియేమగలుక్ మైమయిపోరొనర్చిరె." హరి. ఉ. ౬, ఆ.) (మొదటిరూపము మయిమయి.)

**మైమఱపు.** దే. వి. పారవశ్యము. (మొదటిరూపము మయిమఱపు.)

**మైమఱువు.** దే. వి. కవచము. (చూ. దట్టము. విణ. రెండవయర్థము.) (రూ. మయిమఱువు.)

**మైరేయము.** సం. వి. అ. న. చెఱకురసమునఁజేసినకల్లు. ఆరెపుల్లవెల్లముకడుగునీళ్లు వీనితోచేసినకల్లు. (అనికొందఱు.)

**మైల.** నై. వి. 1. మాలిన్యము*; 2. అశుచిత్వము*; 3. మలినవస్త్రము*; "ఉ. మానుగనంటరానికొఱమాలినమైలలమోపువీఁపునక్, బూనిధరించి." పంచ. నా. ౪, ఆ.—4. చీఁకటి*. "జలిబిలిమైలనల్దెసలఁజేకొనియెక్." హంస. ౪, ఆ.—విణ. 1. మలినము; 2. అశుచి*. (మొదటిరూపము మయిల.)

**మైలక్రోవి.** ద్వి. వి. మురళి.

**మైలచాయతొండ.** ద్వి. వి. ఒకదినుసుతొండ, దుష్ప్రభ.

**మైలపడు.** నై. అ. క్రి. (మైల+పడు.) 1. మలినమగు; "సిజవంశముమైలపడంగఁజేసితి." జై. ౬, ఆ.—2. అశుచియగు*. "ఆ. అగ్నిచల్లనైనఙమిత్రుఁడుమైల, వడ్డ." భార. అశ్వ. ౧, ఆ.

**మైలారు.** దే. వి. ఒక క్షుద్రదేవత. (చూ. గొరగ.) (మొదటిరూపము మయిలారు.)

**మైలావు.** ద్వి. వి. (మైల+ఆవు.) పొగచాయగల ఆవు.

**మైలుతుత్తము.** నై. వి. మయూరతుత్థము. (మొదటిరూపము మయిలుతుత్తము.)

**మైవడి.** దే. వి 1. సమ్మతి; "తే. బహువిధంబులనమ్మెయిఁబలుకుసతని, పలుకులేర్పడవినిమెత్తవడినయట్లు, సుభగిమైవడిచూపుగాఁజూచితనదు, హృదయమెఱుఁగించుతెఱఁగుననిట్టులనియె." భార. విరా. ౨, ఆ.—2. అనుకూల్యము; (చూ. అనుకూలమనునర్థము.) 3. విధము; "ఉ. లాలసఁగ్రొత్తబెబ్బులికళానమువెట్టిరియాసనంబుగా, గోలయుసాధువైన యొకకోమటికిక్ నిషధేంద్రు బచ్చుకుక్, మేలపుమైవడింధమనమీపముధూర్తులు." నై. ౬, ఆ.—4. సామ్యత. "వ. అదియెట్లనినధర్మనందనుండతనియుద్ధలికింబుయిలోడిమైవడిగలనడవడింబ్రవర్తిల్లుచుండియుజూదంబువెంటమోసపోయితొడరిచిక్కునంబడియె." భార. ఉద్యో. ౧, ఆ. "చ. మైవడితోడనతెల్పితెల్పియూ, యువినయబుద్ధిమాన్పఁగలయంతయు నింకనునాడిచూతమే." లక్ష్మి. ౫, ఆ.—విణ. అనుకూలము. "వ. నెఱవంగడీలకైవడినెల్లనడవడికిమైవడియై మెఱయుచిఱుదొడలును." లక్ష్మి. 3, ఆ. (మొదటిరూపము మయివడి.)

## మొ.

**మొంటె.** దే. వి. మొరిఁటెయొక్క రూపాంతరము.

**మొండరి.** ద్వి. విణ. (మొండి+అరి.) మొండితనముగలవాఁడు. (చూ. గోడచేర్పు.) (స్వార్థమున అరి.)

**మొండాడు.** ద్వి. అ. క్రి. (మొండి+ఆడు.) మొండాటలాడు. "క. అది, మొండాడఁగముక్కుసెవులుమునుకువమాన్చెక్." య. 3, ఆ. (చూ. దండమొదటియర్థము.)

**మొండి.** నై. విణ. 1. చేతులుకాళ్లుతెగినవాఁడు; "ద్వి. మొండియైనెత్తుటమునిఁగియున్నాఁడ, దండించిబేతాళతలద్రుంచిపొమ్ము." సా. ౬, భా. "చీకొఱమాలినమొండివాని కీచొప్పునఁజిక్కనోతరుణి." భో. ౫, ఆ.—2. మూర్ఖుఁడు*; 3. కొంతతెగినది*; (చేయికాలులోనగునది.) "ద్వి. మ్రుక్కశరామానుజుండుశూర్పణఖ, ముక్కున జెవులునుమొండిసేయుటయు." రా. బాల, కాం.—4. మొక్కపోయినది*; (మొండిగంటము మొ.) 5 వట్టిది*. (మొండిమెడ మొ.)

**మొండికట్టె.** నై. విణ. మొండితనముగలవాఁడు.

**మొండు.** నై. విణ. మొండియొక్క రూపాంతరము.

**మొండెపుగాము.** నై. వి. (మొండెము+గాము.) రాహువు.

**మొండెపురక్కసుఁడు.** నై. వి. (మొండెము+రక్కసుఁడు.) కబంధుఁడు. అచ్చ. అర, కాం.

**మొండెము.** నై. వి. తలతెగినశరీరము, కబంధము. (మొదటిరూపము మొండియము.)

**మొకమాలు.** దే. వి. ఒకానొకమేలు దినుసుపట్టు. "సీ. చికిలికల్లెముగ్రొత్తమొకమాలువాగెపుఁగొరంగారు జలతారుటంగువాఱు." రసి. ౧, ఆ.

**మొకము.** వై. వి. మొగముయొక్క రూపాంతరము. (చూ. పెక్కణము, మొగము.)

**మొకరము.** దే. వి. మొక్కరముయొక్క రూపాంతరము. "మెఱుంగుదేఱుతోఁగచట్టపుఁజూమొకరంబుమాటుగానచ్చపలాక్షినిల్చె." వసు. ౬, ఆ.

**మొకరరు.** హిం. విణ. నిర్ణయింపఁబడిన.

**మొకరి.** వై. విణ. 1. మొఱఁగునది; (చూ. ఈఁక మొదటియర్థము.) 2. అసంబద్ధవచనము లాడునది. "ద్వి. మొకమునఁదగఁబొమ ముడివెట్టుకొనుచు, మొకరియైపెటిగియేపునమల్లచఱచి." రా. సుం, కాం.

**మొక్క.** వై. వి. 1. మొలక; 2. చిగురుమొలక*; "సీ. మంచటనెలమావి మొక్కలనలరింపఁగర్తదానగుచెలికాఁడునడవ." హరి. ఉ. ౬, ఆ.—3. బ. ఒకదినుసుజొన్నలు. విణ. 1. వ్యర్థము; 2. మొనమడఁగినది*.

**మొక్కఁడు.** దే. విణ. బలిసినవాఁడు.

**మొక్కచెడు.** దృ. అ. క్రి. అవమానపడు.

**మొక్కట్టు.** దృ. వి. (మొకము+కట్టు.) ముఖవైఖరి.

**మొక్కడి.** దే. వి. చిన్నకొమ్ములుగలయేనుఁగు.

**మొక్కడీఁడు.** దే. వి. మొక్కడియొక్క రూపాంతరము. (సాహ్వర్థమున ఈఁడు.)

**మొక్కపడు.** వై. అ. క్రి. భంగపడు. (ప్రే. మొక్కపఱుచు. "క. రక్కసిమగువలయాలువు, మొక్కపఱిచెదీవ." పా. ౧, ఆ.)

**మొక్కపోవు.** దృ. అ. క్రి. 1. మొనమడఁగినదగు; "తత్ప్రదరంబిప్పుడుమొక్కపోదు." రా. కిష్కిం, కాం.—2. భంగపడు. (ప్రే. మొక్కపుచ్చు. భంగపఱుచుటకు.- "అవాస్వఁడిమిమొక్కపుత్తునని." (ఇక్కడవాఁడిమికిబేజమర్థము.) రా. సుం, కాం.) (రూ. మొక్కలుపోవు.)

**మొక్కమామిడి.** దృ. వి. జీడిమామిడి*.

**మొక్కము.** వై. వి. ఒకానొకచెట్టు, ముష్కకము.

**మొక్కరము.** దే. వి. 1. స్తంభము; 2. గజస్నానము. "తలపుమూసిమొక్కరమిడియెడ." ఘక. ౨, ఆ.

**మొక్కలము.** వై. వి. 1. ముష్కరత్వము*; "దండకము. శక్రునీమొక్కలంబుల్ విసంబద్ధవేశా." కాశీ. 2, ఆ.—2. శౌర్యము*; "చ. కవకవనవ్వియజ్ఞతురగంబు మెడందనయుత్తరీయముచే, లవుఁడుదగిల్చి మొక్కలమునంగదలీతరువందుఁ గట్టి వేయ." జై. ౬, ఆ.—3. ధైర్యము*; "చ. నలినదళాక్షినీవు బలినందనుకూఁతురవట్టినిన్ను మొ, క్కలమునచొక్కరుండుదనకొఁగిటనుంచునె యిట్లుకన్ను నీ, రొలుకఁగవెట్టేవే వెఱవకోడక నాంచఁగవానికెకలల్, గలవుచారహీనవయికంపము నొందకువేతలొదరీ." ఉ. హరి. ౫, ఆ.—4. ఉత్సాహము*; "చ. మొ, క్కలమునఁదాకగరుకాయము సొచ్చెబయాభిలాషియై." భో. ౫, ఆ.—5. బ. ముష్కరవచనము*. "మ. బలియుండు గ్రుడుయావనాశ్వధరణీపాలుండు తత్తై న్యుల్లా, జాలముక్కఁకలనాటిత్రేతినమహోకూరుల్ చలంబెత్తిమొ, క్కలముల్ పల్కిరి." జై. ౧, ఆ.—విణ. 1. ముష్కరము; (చూ. నీరువామి.) 2. అప్రతిహతము*. "ద. కనుఁగనియొండునకృష్ణముమనంబునబెగ్గిలిడాయునప్పుడే, మ్మునివరుఁడిట్టువోలెగ్ర వమొక్కలమైకరథంబు గాఁగఁజేయునా." భార. శాం. 3, ఆ.

**మొక్కలి.** వై. విణ. (మొక్కలము+ఇ.) 1. ముష్కరుఁడు; ఉ, రా. ర, ఆ.—2. శూరుఁడు*. "సీ. మొక్కలి దొరచేత మొక్కలించకొనవాఁడ మగుదరో నీతునేమొక్క నెంతు." సా. ౩, ఆ.

**మొక్కలించు.** వై. అ. క్రి. 1. ముష్కరముచేయు; 2. ఉత్సహించు*. "శ్లో. లఘునలాఘుపోల్లసనంబుపై మొక్కలించి వాద్యలఁజోకలపకుండ." కవిక. ౧, ఆ. (ప్రయోగములన్నయెడల మొక్కలమునకుకలిగిన తక్కినయర్థములను దీనికి చెప్పకొనవచ్చును.)

**మొక్కలింపు.** వై. వి. ముష్కరముచేయుట. క్షేత్రయ. (చూ. అరగింపు.)

**మొక్కలికాఁడు.** దృ. విణ. ముష్కరుఁడు. (సాహ్వర్థమున కాఁడు.)

**మొక్కలీఁడు.** దృ. విణ. (మొక్కలి+ఈఁడు.) 1. ముష్కరుఁడు; "శి. మంత్రివిద్వేషవంబు మాన్యపరాభవఁబును ప్రజాపీడనంబులునుగలిగి, మొక్కలీఁడగుటయు." భార. అశ్వ. ౧, ఆ.—2. శూరుఁడు*. "ఉ. ఒండురథంబుపోవిడిచి యుక్కున జక్కని మొక్కలీఁడనఁగ, రెండవకొమ్మతోండమున నేర్పున మాఁటి." పాంచా. ౧, ఆ. (సాహ్వర్థమున ఈఁడు.)

**మొక్కలుఁడు.** వై. విణ. శూరుఁడు*. "ఉ. ఎక్కడివారొకో గరుడుఁ డెక్కుడుగాఁగలవారువీరపో, యుక్కుడువారుఁలోకులకనేకవిధాకరభీకరాకృతుల్, ముక్కుటమూపు రిక్కడకు మొక్కలురైయరుదెంచిరంచు." (ముక్కుటమూపురు అనఁగా సరిగా ముప్పదిరు అని యర్థము.) ఉ. హరి. ౬, ఆ.

**మొక్కు.** దే. అ. క్రి. 1. దండముపెట్టు; 2. మురుఁగు. (చూ. మునుఁగురెండవయర్థము.) వి. దండము. (మ్రొక్కుయొక్క రూపాంతరము.)

**మొక్కుబడి.** దే. వి. దేవతాప్రార్థన. (మ్రొక్కుబడియొక్క రూపాంతరము.)

**మొగ.** వై. వి. 1. అప్రాణివస్తుముఖము; "మొగయక్కలి."— 2. మొదలు*; "వారిలోమొగఁదగువానికి." జై. ౨, ఆ. "మొగజోదు." (ఇక్కడ మొగజోదనఁగా మొదటిజోదు — యోధముఖ్యుఁడు అనుట.) ఉ, హరి. ర, ఆ.—3. ద్వారము*; "అక్కలుఁగుమొగంబడుకొక్కటిత్రోచి." అచ్చ. కిష్కిం, కాం.—4. మొగ్గయొక్క రూపాంతరము. "రగడ. మొగలివిరులె పూమొగలివిరిచెప్పెలి." యు. ర, ఆ.

**మొగకట్టు.** దృ. అ. క్రి. మోఱకు; "కంకణనిక్వణంబుమొగకట్టఁగ." నై. ౬, ఆ.

**మొగకొను.** దృ. అ. క్రి. అభిముఖమగు. "క. వినుమింకనెన్నఁడును మొగ, కొనరీయోడిచనువారుగురుకోల్తలకుక." భార. ద్రో. ౧, ఆ. (ప్రే. మొగకొలుపు. "ఉచితక్రియకుక మొగకొల్పి." భార. శా. ౧, ఆ.)

**మొగచాటు.** దృ. విణ. మొగముకొట్టునది, వెగటు. "క. పదునాల్గుమహాయుగముల, ముదుకకుభీమేశ్వరునకుమొగచాటైయుం, డదుసానిపెండ్లియెప్పుడు, నదిదాక్షారామమహిమమవ్వనొకాదో." భీ. ౧, ఆ.

**మొగడ.** వై. వి. మొగ్గ. "ఉ. తుమ్మెదకంటుపూమొగడతోన్లైనవచ్చు లతాంగిముక్కు." రామా. ర, ఆ.

**మొగడించు.** వై. అ. క్రి. మొగుడు, ముకుళించు. "తమ్ములు మొగడించిన." యు. ౨, ఆ.

**మొగడు.** దే. వి. ఇంటినడికొప్పు. "సీ. తగుపద్మరాగంపు మొగడులుచెన్నొందవైదూర్యవలభులువన్నెదూప." భాగ. 3, స్కం.

**మొగతప్పు.** ద్వి. అ. క్రి. పిఱుతివియు, విముఖమగు. "సీ. దంతులు ద్రోచినఁ దాలసాలాదులమొగతప్పబలువిడిమోఁదువారు." రా. యు, కాం.

**మొగతిరుగు.** ద్వి. అ. క్రి.——— పై. ———"క. అమ్ముల నేనుఁగుకొమ్ముల, నమ్మత్తగజమ్ము నొంపనటమైమఱిమనస్సై, న్యమ్మెల్లఁ జిదియఁబఱచెచ, యమ్మునమొగితిరిగి దిక్కుల ద్రువఁగఁ బెలుచన్." భార, భీష్మ. ౨, ఆ.

**మొగదల.** ద్వి. వి. (మొగ+తల.) 1. ఎదురు; 2. ముందటి భాగము.

**మొగపడు.** వై. స. క్రి. చూచు. "వ. తన్నుమొగపడకముందఱ నతనింగనినవెంతయుంగలుషించు." హరి. పూ. ౮, ఆ.

**మొగపాళెము.** ద్వి. వి. ఇల్లులోనగువానిముందటిభాగము, నిస్సరణము. (రూ. మొగవాళెము.)

**మొగపిడికి.** ద్వి. వి. (మొగము+పిడికి.) తాఁబేలు. "ఎ, గీ. మొగపిడికిఁగాంత ప్రపదముల్ తగులఁబోవు." హన. ౪, ఆ.

**మొగపు.** ద్వి. వి. (మొగ+పూస.) హారాదులముఖభాగము. "సీ. ధాత్రీమహాదేవితాల్చినమున్నీటిమొలనూలిరత్నంపుమొగపనంగ." ప్రభా. ౧, ఆ.

**మొగమిచ్చు.** ద్వి. అ. క్రి. (మొగము+ఇచ్చు.) సుముఖుఁడగు.

**మొగము.** వై. వి. 1. ముఖము; 2. ఎదురు*; "చ. బలవంతుఁడొకండిటుచేసెనంచుని, మొగమునఁదెల్పిని హృదయము న్నొగిలించుటకార్తిఁ జెందెదన్." ఉ, రా. ౪, ఆ.—3. ద్వారము*. "ఉ. నిత్యల, జ్మీలతికాలవాలమగుజీవన మంతయు నీమొగంబుగాఁ, బాలనసేయుము." భార. విరా. ౨, అ.—విశే. ముఖ్యము*. "ఉ. ఆహరివీరవాహినులకన్నిటికిన్ మొగమైమరుత్సుతుం, డాహవదోహలుండమరె." భార. అర. ౭, ఆ. (మొగరాడు.)

**మొగముట్టు.** ద్వి. వి. (మొగము+ముట్టు.) అశ్వముఖాలంకారము. (చూ. నిగరము.)

**మొగమున.** వై. క్రి. తోడుతన్*. "క. పోయినమొగమున నచ్చుటఁ, జేయుతెఱంగెల్లనీకుఁ జెప్పితిఁబిదపన్, మాయయ్య పెద్దకొలువున, వాయోడకయిట్లనంగవలయుంజుమ్మీ." భార. ఉద్యో. ౧, అ.

**మొగమోట.** ద్వి. వి. (మొగమోడుట.) 1. దాక్షిణ్యము; (చూ. మొగమోడు.) 2. సంకోచము. "లే. ఓరినాముందఱనె మొగమోటలేక, నీవుగర్వించి బ్రాహ్మణనిందచేసి, తి." వి, పు. ౪, ఆ. (రూ. మొగమోటము.—సంకోచమునకు.—"మ. మొగమోటంబుననీవువారియెదుటన్ ముఖ్యంబుయుద్ధంబకాఁ, దెగనాడన్ వెఱతేని." ఉ, హరి. ౪, ఆ.)

**మొగమోడు** ద్వి. అ. క్రి. (మొగము+ఓడు.) 1. దాక్షిణ్యపడు; "క. గురులకుభక్తుఁడుదారుఁడు, కరుణగలఁడుశౌర్యధైర్యగాంభీర్యధురం, ధరుఁడుమొగమోడునాసుర, వరపుత్త్రుని లేమి కోర్వవచ్చునెచెపుఁడా." భార. ద్రో. ౨, ఆ.—2. సంకోచించు. "క. తగవరియగుదానోంచినఁ, దగుదండమురాజువాని దండింపఁదగున్, మొగమోడివిడిచెనేనియు, నగుఁబాటగుఁబాపమొందు నరనాథునకున్." విజ్ఞా. ప్రా, కాం.

**మొగరంబము.** దే. వి. తుమ్మెద, భ్రమరము. "సీ. పక్కలెత్తిన గోటి పసలుసిబ్బెపుఁబోడల్ భ్రమరకంబులు మొగరంబములన." చంద్రా. ౧, ఆ.

**మొగరము.** దే. వి. మొగ్గరముయొక్కరూపాంతరము.

**మొగరించు.** దే. స. క్రి. ఆక్రమించు. "హంసడిభకులు నన్నున్ మొగరించిన." ఉ, హరి. ౪, ఆ.

**మొగలి.** దే. వి. కేతకీ. (చూ మొగ నాలుగవయర్థము.)

**మొగలింగ.** దే. వి. ఉల్లిమిరి, నరుగాముకీ.

**మొగలిపనస.** ద్వి. వి. ఒకానొకపండ్లచెట్టు. (దీనిని అనాస అనియెదరు.)

**మొగలిరేకు.** ద. వి. 1 స్త్రీశిరోభూషణవిశేషము; 2. కంఠసభుక్షణము.

**మొగలివాకిలి.** ద్వి. వి. 1. తలవాకలి; "సీ. మురియంగనేర్తురు మోహనాన్నదమ్మైన మొగలివాకిటిచాయనగరువిధ." భి. ౧, ఆ.—2. హాజోగము. "చ. అ, వ్వనజదళాక్షి నిన్ మొగలివాకటికీడిచి తెచ్చిచోరదం, డనమొనరింపఁజూడఁగ." భల్లా. ౫, ఆ.

**మొగలేఱు.** దే. వి. (మొగలి+ఏఱు.) నదివిశేషము, సువర్ణముఖి. "తే. దేవియును దాను మొగలేటఁదీర్థమాడి." కాళ. ౨, ఆ.

**మొగపడము.** వై. వి. (మొగ+పడము.) ఏనుఁగుమీఁదకప్పెడు నల్లకంబళము "క. జలధారలుమదధారలు, జలదంబులు మొగవడములు చండానిలవి, ఘ్నలగర్హార్వరవములుగ, గ్జలుగాగిరుల మరెనమదసామజసమతన్." హరి. పూ. ౬, ఆ.

**మొగవీణె.** వై. వి. వాద్యవిశేషము, ముఖవీణ.

**మొగసరి.** వై. వి. (మొగము+సరి.) మొగముట్టు. "మ. పలుకెంపుంజగి కెంపుజామొగసరిన్ బల్ ఱెక్కడాల్ పచ్చని, చ్చలపుంబట్టు మెఱుంగుపల్లముననెంచన్ మించుబల్వన్నెక్రొం, దళుకుంగంరపురేఖపెన్ నరిపెణన్ బాగైన చొక్కాటపుం, బలుకుందత్తడి నెక్కిదర్పకుఁడుదర్పంబేర్పడందాఁకినన్." (పలుకెంపుంజిగి అనుచో పలుశబ్దమునకు ముక్కు అర్థము.) చంద్రా. 3, ఆ.

**మొగసల.** వై. వి. మొగసాలయొక్కరూపాంతరము.

**మొగసాల.** వై. వి. 1. నగరితలవాకిటిచావడి; "నీమొగసాలన్ నిలువంగఁబాత్రమనుహోత్తుండు." రా. కిష్కిం, కాం.—2. తలవాకిటిపంచ. "అట్లనిమొగసాలనుండుఁడు." పాండు. ౪, ఆ.

**మొగి.** వై. వి. 1. పూనిక; "సీ. ద్వాదశవార్షికోత్తమసత్త్రయాగంబు మొగిఁజేయుచున్న యమ్మునులకడకు." భార. ఆది. ౧, ఆ.—2. మొత్తము*; "వ. భీముండును...అతిబలుఁడుననువారొక్కమొగియును, సుమిత్రుండును...మిత్త్రవర్షయుననువారొక్కమొగియును, సువీరుండును...సువర్చుఁడునుననువారొక్కమొగియును గానిట్లు మూఁడుమొత్తంబులై." భార. అర. ౫, ఆ.—3. విధము*. "శా. తోడ్తోభూతముల్ ప్రీతితో, నామ్నాయాగతభూతమాంసములు సేయారంగఁగూర్చున్ వెసన్, నిమ్నోత్తానతలంబులొక్కమొగిగా నిండారబండారమున్." ఉ, హరి. ౬, ఆ.

**మొగియు.** వై. అ. క్రి. 1. పూను; "తే. ఏసుబనిచినవిభువెన్క నేగమొగియ, వు." రా. అర, కాం.—2. కవియు*. "మొగసిన చీఁకటిం జెఱచి." రా. బాల, కాం.

**మొగుచు.** వై. ప్రే. మొగుడుచేయుయొక్కరూపాంతరము. "క కించిద్ధూరమునఁజేమొగిచి మ్రొక్కుటయున్." వై. ౨, ఆ.

**మొగుడు.** వై. అ. క్రి. ముకుళితమగు.

**మొగుడుచు.** వై. ప్రే. మొగుడఁజేయు. (చూ. మొగుడ్చు.)

**మొగుడుదామర.** వై. వి. (మొగుడు+తామర.) ముడుఁగు దామర, నమస్కారికీ.

**మొగులు.** దే. వి. మేఘము. "ఉ. సారపుసాగ్రొమ్మెఱుఁగు సంపెఁగపూవులదండపిండుచే, కూరినదోరపుంజిగిమొగుల్ దుఱు ముంబనల్లు సిల్లు." రామా. ౬, ఆ. (మొగిలు, మొయిలు, మొయులు అనుపదములు దీనికే పర్యాయములుగా కొన్నిచోట్ల వ్రాయఁబడియున్నవి కానివానికిఁదగిన ప్రయోగములు కనఁబడవు.)

**మొగులుకడిమి.** ద్వ. వి. నీరుకడిమి. ధారాకదంబముకీ.

**మొగులుదారి.** ద్వ. వి. ఆకాశము, మేఘద్వారము.

**మొగ్గ.** వై. వి. 1. ముకుళము; 2. గణికాదులు శిరముపాదము లతోఁజేర విల్లువలె వెలికిల వంగుట*. (మొగడయొక్కరూపాంతరము.)

**మొగ్గరము.** దే. వి. వ్యూహము. (చూ. పగ్గము మొదటియర్థము.)

**మొగ్గలము.** దే. విశ. మొక్కలముయొక్కరూపాంతరము. (అప్రతిహతమునకు.—"మొగ్గలమైనకోర్కితుదిముట్టఁగ." నిర్వ. ౮, ఆ.)

**మొగ్గవాలు.** ద్వ. అ. క్రి. గణికాదులు శిరముపాదములతోఁజేర విల్లువలె వెలికిలవంగు.

**మొగ్గవిచ్చు.** ద్వ. అ. క్రి 1. వికసించు; 2. యథాయథలగు.

**మొటిక.** దే. వి. 1. మొలక; 2. తునుక. (మొట్టికయొక్కరూపాంతరము.)

**మొటిమ.** దే. వి. ప్రాయమునందు మొగమునలేచెడు చిన్నగుల్ల, అవగండము. విశ. పొట్టి.

**మొట్టమొదలు.** దే. వి. (మొదలు+మొదలు.) అన్నిటికి మొదలు.

**మొట్టిక.** దే. వి. మొటికకు మొదటిరూపము.

**మొట్టికాయ.** దే. వి. తలమీఁద పిడికిటితోపొడిచెడు పోటు.

**మొట్టు.** దే. అ. క్రి. తలమీఁద పిడికిటఁబొడుచు. వి. తలమీఁద పిడికిటఁబొడుచుట.

**మొట్టె.** దే. వి. మత్స్యవిశేషము. (దీనిభేదములు బడిమొట్టె, వాన మొట్టె.)

**మొట్లమారి.** దే. విశ. మొట్టికాయలు తినువాఁడు. "సీ. సను దగ్రకలశముల్ చక్రవర్తులటంచు మొట్లమారులసరి మొనపఁ దగునె." చంద్ర.

**మొత్త.** దే. వి. 1. వాకిటిలోపలి ప్రక్కగోడ; 2. గూడలోనగు వానితోచల్లు నీళ్లుపాఱెడు కాలువమొదట పచ్చికపెళ్లలుమొదలగు వానిచే నేర్పఱుపఁబడిన మిట్ట.

**మొత్తపిరి.** దే. వి. పేతపుకడవక్రింద మెత్తగానుండుటకై అరిణ మొదటనుంచెడు అల్లికపిరి.

**మొత్తము.** వై. వి. 1. సమూహము*; "శూరులమొత్తము." "కోఁతిమొత్తము." "వింటిమొత్తము."—2. తఱచు*; "మంటమొత్తము."—3. అంతకము*. (లెక్కమొత్తమెంత.)— విశ. తఱచైనది*. "మొత్తపుదీప్తులు."

**మొత్తు.** దే. స. క్రి. 1. కొట్టు; "మొత్తుదురుగదల." భాగ. ౩, స్కం.—2. నఱకు. "ఉ. క్రొమ్మెఱుంగులం, దండఁజెలంగుభీకర కరాసివెనక్ జళిపించిదేవకిక్, ముందలపట్టివంచి తెగమొత్తఁగడంగినఁగంసు." వి, పు. 2, ఆ.—వి. దెబ్బ. "ముచ్చుకూళ్లకుఁబోయిమొత్తులఁబడి."

**మొత్తులాడు.** దే. అ. క్రి. (మొత్తులు+ఆడు.) కొట్లాడు.

**మొత్తువడు.** ద్వ. అ. క్రి. (మొత్తు+పడు.) కొట్టుపడు. "వ. దేవరమాఱుగాఁ బాదప్రణామంబుసేయంబోయిలీలాకమలంబున మొత్తువడితి." నై. ౮, ఆ.

**మొదటివేల్పు.** దే. వి. (మొదలు+వేల్పు.) బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు. (చూ. ముది. వి.)

**మొదలారి.** దే. వి. అరవశూద్రులలో నొక తెగవాఁడు.

**మొదలు.** దే. వి. 1. ఆది; "క. అడిగినపదార్థమెల్లను, డడయక నీకిత్తునని మొదలనాడితిని." జై. ౮, ఆ.—2. పూర్వము; "మా మొదలిటివారు." భార. విరా. ౧, ఆ.—3. మూలము; "అది దురితక్రియానుబంధంబులకుఁ మొదలు." భార. అర. ౧, ఆ.—4. వృక్షమూలము; (చూ. మాలకరి మొదటియర్థము.)—5. మూలధనము; "క. జనకుఁడుగొన్నఋణము౦ద, త్తనయుఁడువడ్డియును మొదలుఁదానరువఁదగుఁ." విజ్ఞా. వ్య, కాం.—6. ప్రభృతి. "నిన్నమొదలు." స్వా. 3, ఆ.

**మొదలుకొను.** దే. అ. క్రి ప్రారంభించు. "క. ధర్మము, ఖండితముగ మొదలుకొని రకార్యంబులకుఁ." భార. శాం. ౩, ఆ. ("మొదల్కొనియదిసెప్పవలయు." ఇక్కడ ప్రారంభించి యనఁగా మొదటినుండియనియర్థము. కళా. ౩, ఆ.)—స. క్రి. మొదలుచేయు, తొట్టు. (ఆమాటవిన్నదిమొదలుకొని నాకు నిదుర పట్టలేదు.)

**మొదలుపెట్టు.** దే. అ. క్రి. ప్రారంభించు. (వాఁడునంపాదింప మొదలుపెట్టెను.)

**మొదవ.** దే. వి. తృణవిశేషము, బల్బజము.

**మొదవు.** దే. వి. పాఁడియావు.

**మొదుక.** దే. విశ. 1. కఱకు; 2. దట్టము.

**మొదుకన.** దే. వి. 1. కఱకుఁదనము; (చూ. ముదుకమొదటియర్థము.) 2. బరువు. "వ. కరవాలంబుకుంభాలకుంభస్థలంబులువగులవ్రేసిన మెదడంటిమొదుకనైనఁ గేతుదంతంబులునఱకిచులుకంజేయుచు." భార. భీష్మ. ౩, ఆ. (విశేషణమైనచో "సీ. పొదివిననందండమొదుకనియఱచేతపీకతోమోరలువ్రేసివ్రేసి." హరి. పూ. ౬, ఆ.) (చూ. అలకన.)

**మొద్దఁడు.** వై. విశ. 1. మూఢుఁడు; "ఎద్దుమొద్దనికి." సురా.—2. లావైనవాఁడు*.

**మొద్దు.** వై. వి. కొమ్మలునఱికినమ్రాను*. విశ. 1. మూఢుఁడు, మూఢురాలు; 2. వాఁడిలేనిది*; 3. లావు*. "ద్వి. మొద్దు పాదంబులుముడిఁగినవ్రేళ్లు." హరిశ్చ. ౩, భా.

**మొద్దువోవు.** ద్వ. అ. క్రి. (మొద్దు+పోవు.) వాఁడిలేనిదగు. "తే. బుద్ధినీగట్టిహృదయసంపుటముదాఁకి, కుంఠితములయ్యెమరు నంపకోలలెల్ల, మొద్దువోయికదాయిప్డుమురవిరోధి, యలరువిరులెల్లవర్తులాస్యంబులయ్యె." నై. ౮, ఆ.

**మొన.** దే. వి. 1. అగ్రము; 2. వ్యూహము; "క. అనిసవినియుత్తరుండ, మ్మొనవలపటఁబెట్టియరదమునుబోవఁగనిచ్చిన." భార, విరా. ౪, ఆ.—3. సైన్యము; "క. వినుమలుకవోడమిమిక్కిలి, కనుదెఱచినత్రిపురవైరికైవడియీయాయ, ర్జునునందుఁదోఁచుచున్నది, మనమొనలకువశముగాదుమరలుపనింక౯." భార. భీష్మ. ౩, ఆ.—4. ముందు. "ద్వి. ముందఱవర్ధిలిమొనకురాఁడనుచు." పా. ౫, భా.

మొనకట్టు. దే. అ. క్రి. ఉత్సహించు. "క. వనరుహగర్భున కైనను, వనరుహలోచనునకైనవనరుహరిపుజూ, టునకైనఁదరముగాద, మ్మునివరుకోపాగ్ని కెదిరిమొనకట్టంగన్." హరిశ్చ. ౧, ఆ. — వి. 1. ఉత్సాహము; 2. ఒకానొక స్తంభనమూలిక. విణ. ఉత్సాహకరము. "మొనకట్టునెత్తమ్మిమొత్తమ్మునకు." చంద్ర.

మొనకాఁడు. దే. వి. సేనాధిపతి. విణ. 1. ముఖ్యుఁడు; 2. శూరుఁడు.

మొనకొను. దే. అ. క్రి. మొనయు. [“క. మునివరచిత్తమునఁ దెలియమొనకొనునని యెన్." (ఇక్కడ మొనయుననఁగా తోఁచునని యర్థము.) అధ్యా. ఉ, కాం.]

మొనగాలు. దే. వి. (మొన+కాలు.) అన్కుందికవిశేషము.

మొనదప్పు. దే. అ. క్రి. (మొన+తప్పు.) విముఖమగు. "మొనదప్పితిమిరణమునమనమకటలువ్వసరము." భార. సా. ౧, ఆ.

మొనపు. దే. ప్రే. (మొనయఁజేయు.) 1. పూనఁజేయు; (చూ. మొల్లమారి.) 2. కలుగఁజేయు. (చూ. నన.)—వి. పూనిక. (చూ. ప్రామిడి.)

మొనయు. దే. అ. క్రి. 1. పూను; "క. అనువారునందుఁగొందఱు, ఘనుఁడీతఁడుపిరికంపెంగార్జునవిద్యన్, దనరిసవాఁడైదీనికి, మొనసెంగాకన్యుఁడిట్లుమొనయంగలఁడే." భార. ఆది. 2, ఆ.— 2. కలుగు. "ననలుపల్లవముపైమొనసెన్." పా. 3, ఆ. "దరహాసాంకురముల్ మోవిపైమొనయన్." పా. ౪, ఆ.

మొనరు. దే. అ. క్రి. ఒప్పు. "సీ. క్షితిమీఁదలేఁతకెంగేలిడితడవు చోమొనరెడియొండొకముద్దుఁజెలువు." కళా. ౬, ఆ. (దీనికి ప్రయోగాంతరము కనఁబడదు. ఇదియు గ్రంథాంతరమునందు మొనరిడియని చూపట్టెడి. ఇది అశ్రుతపూర్వముగానున్నది.)

మొన్న. దే. వి. (మొదలు+నాడు.) కడచినదినమునకు ముందు దినము.

మొప్పలు. దే. వి. బ. చేపమెడకిరుప్రక్కలనుండుద్వారములు.

మొప్పె. దే. విణ. 1. మూర్ఖుఁడు; 2. కఱకు. "మొప్పెకరి రంబు." భల్లా. ౪, ఆ. (మొదటిరూపము మొప్పియ.)

మొర. దే. వి. మోరయొక్కరూపాంతరము. (ఇది నైఘంటికము.)

మొరడు. దే. వి. మ్రోడు, స్థాణువు.

మొరపము. దే. వి. మ్రోఁత, ధ్వని. "అందియలమొరపంబునకు." భార. విరా. ౪, ఆ.

మొరము. దే. వి. గులకఱాయి, శర్కర. "మొరపవానపెల్లుగురిసె." భార. ద్రో. 3, ఆ. (చూ. మొర్సు.)

మొరయిక. దే. వి. మొరపము, మ్రోఁత, ధ్వని.

మొరయు. దే. అ. క్రి. మ్రోయు. "క. సురలార్చిరితూర్యంబులు, మొరసెననేకంబులు." భార. శాం. ౪, ఆ.

మొరలి. దే. వి. మోరటి, ప్రియాలము †.

మొరసు. దే. వి. 1. మొరము; (మొరసునేల.) 2. మోటు.

మొరిఁటె. దే. వి. బాలికలాడుకొనెడు చిన్నచేట.

మొర్సు. దే. వి. మొరముయొక్కరూపాంతరము. "సీ. చదలుమొర్సుగఁబన్నశక్తిరాలాదులఁబఱపిపీసుఁగులురివ్వనెఱపినెఱపి." హరి. ఉ. 2, ఆ.

మొలు. దే. వి. ఆర్తధ్వని. "ద్వి. పఱతెంచినగరులపాలిపాపములు, మొలపెట్టుచున్నవిముక్కంటికనఁగ." రా. బాల, కాం. "వ. అప్పుడప్పురుసవారుగలఁగంబాఱి మొఱయనుం గూఁతయును బెట్టిరి." కాశీ. ౪, ఆ.

మొఱఁగు. దే. అ. క్రి. పొంచు. "వ. ఒక్కతరువండంబు మఱుంగునమొఱంగియేపునందూపునంధించి." రామా. ౪, ఆ.— స. క్రి. వంచించు. "శే. స్నానమాడెనెవార్చెనెసంధ్యయగ్ని, హోత్రమాచరించెనెయంచి పుత్త్రుఁడనిన, స్నానమాడెనవార్చెనుసంధ్యయగ్ని, హోత్రమాచరించెననుచునువిదమొఱఁగు." సం. "ప్రతారయతిదీక్షితమ్." కాశీ. ౪, ఆ.—వి. వంచన. "వ. ఇది విరించిమొఱంగనియెఱింగితిరిగిపోవుచు." భాగ. ౧౦, స్కం. పూ.—విణ. వంచకుఁడు. "సీ. లీలతోనామొఱాలింపఁడేమొఱఁగులమొఱలెఱుంగుచుఁదన్ను మొఱఁగువాఁడు." భాగ. ౮, స్కం.

మొఱక. దే. వి. మూర్ఖత. విణ. మూర్ఖము.

మొఱకడము. దే. వి. దౌష్ట్యము. "కంసునిమొఱకడముబదలఁప వచ్చినఁజంపకతోలఁగునెవ్వఁడు." హరి. పూ. ౯, ఆ.

మొఱకు. వై. విణ. 1. మూర్ఖుఁడు; 2. పరుషము*. "ద్వి. మొఱకువెండ్రుకలనుముదురుమీసములుఁ, గఱకునల్లనిమేనుఁగల చోరునొకని." హరిశ్చ. ౨, భా.

మొఱకుఁడు. వై. విణ. మూర్ఖుఁడు. "క. అనువారుఁదల్లిదండ్రులు, మునుకొనిచెప్పంగవినియుమొఱకుండైన, చ్చినపిదపనిట్లు ననెనం, గనవశమాచనినఁజనియెఁగాకనువారున్." భో. ౬, ఆ.

మొఱమొఱ. వై. వి. వస్త్రములొనగువాని మ్రోఁత.

మొఱమొఱలాడు. ద్వ. అ. క్రి. (మొఱమొఱలు+ఆడు.) (వస్త్రములొనగునవి) మొఱమొఱయని మ్రోయు.

మొఱవ. దే. విణ. మొనమడఁగినది, మొక్క.

మొఱవవోవు. దే. అ. క్రి. (మొఱవ+పోవు.) మొక్కవోవు. "ముదిమినింద్రియశక్తి మొఱవవోకుండంగ." (ఇక్కడ మొక్కపోవుటయనఁగా ఉడుగుటయని యర్థము.) కాశీ. ౬, ఆ.

మొఱసడము. దే. వి. (చూ.) ఉడుపకుక్క.

మొఱి. దే. వి. విణ. మొట్టెయొక్కరూపాంతరము.

మొఱికి. దే. వి. విణ. మొఱి, మొట్టె.

మొఱుఁగు. దే. అ. క్రి. 1. కుక్కకూయు; "సీ. అంబకంబేనిన హాహాతోస్థియటంచు మనుజాభంగిమొఱుంగవినిభయమున." అధ్యా. అ, కాం.—2. కూయు. (వాఁడేమోమొఱుఁగుచున్నాఁడు.) — వి. 1. కుక్కకూఁత; 2. కూఁత. "శే. అనుచునేరనిమొఱుగు లిట్లు డుటయును." వి, పు. ౬, ఆ.

మొఱుఁగుడు. దే. వి. కుక్కకూఁత, భషణము.

మొఱువు. దే. అ. క్రి. వి. మొఱుఁగుయొక్కరూపాంతరము.

మొట్టు. దే. వి. మొఱకు మొదటిరూపము. "రాజుగొట్టమొగసాలకో మొట్టు." పర. ౪, ఆ.

మొట్టె. దే. వి. అంగన్యూనత. విణ. అంగన్యూనము.

మొట్టెవోవు. దే. అ. క్రి. (మొట్టె+పోవు.) అంగన్యూనమగు. (కుండ మొట్టెవోయినది.)

మొల. దే. వి. 1. కటిప్రదేశము; 2. చీల; (చూ. పైకము మొదటి యర్థము.) 3. త్రాముమ్ముల్లు. (చూ. మొలత్రాడు.)

మొలక. వై. వి. 1 అంకురము; 2. అంకురితబీజము; "వ. చతుర హాలికులుండుచల్లు వరువంపు మొలకలచెలువున." భార. విరా. ౪, ఆ.—3. ఆసనమునందలి దుర్మాంసవిశేషము; 4. వ్రణమునందలి

దుర్గాంశవిశేషము. విణ. లేఁత. (మొలకనవ్వు, మొలకచందురుఁడు, మొలకప్రాయము మొ.)

**మొలకకట్టు.** ద్వ. స. క్రి. రొంపియందు చల్లుటకుఁగాను విత్తనము మొలకలెత్త తడిసి ముడియకట్టు. "తే. అలరుఁదేనియనానిచి మొలకకట్టి, శర్కరాబీజములనుదాశాదభూమి, భావజుఁడువిత్త మొలచినపైరునెఱపె, రదవిలాసంబుప్రాఁబోఁడిపెదవిపదవి." పాండు. ౩, ఆ.

**మొలకట్టు.** దే. వి. 1. మొలనూలు; "చ. మెడఁబులిగోరు ఫాలమునమేలిమిపచ్చలరావిరేక పు, త్తడిమొలకట్టుకొనుసఁ బవంబులఁ గెంపులగిల్కుటందియల్, విడిగలమద్దికాయకవఁనుల శోంపు ఘటింపఁదప్పు, తప్పడుగులువెట్టురాకొమరుఁడాదటదాదులుకేలువట్టుకోఁగ." చంద్రా. ౨, ఆ.—2. కట్టుకోక. "సీ. మొలకట్టుపాఱుటాకులు జాఱకుండంగదీటికట్టినబలుతీవకట్టు." చంద్రా. ౨, ఆ.

**మొలకత్తి.** ద్వ. వి. బాఁకు. "సీ. కిసలయాధరమేనిపసుపుడాల్ దుప్పటికాసెనొప్పగుమొలకత్తియమర." శశాం. ౫, ఆ.

**మొలకబంగారు.** వై. వి. పుట్టలలో పురుగులవల్లకలిగెడు బంగారు.

**మొలకెత్తు.** ద్వ. అ. క్రి. (మొలక+ఎత్తు.) మొలచు.

**మొలగులికి.** దే. వి. (మొల+కులికి.) 1. సస్యవిశేషము; 2. బధాన్యవిశేషము. (వాడుకలో మొలకొలికి.)

**మొలచు.** వై. అ. క్రి. మొలకెత్తు, అంకురించు.

**మొలతేంచు.** ద్వ. అ. క్రి. (మొలచు+తెంచు.) కలుగు, పుట్టు. "క. జడముడులుకుటిలభృకుటులు, సుడివడఁగనుఁగవలఁగెంపు మొలతేరంగా." కాశీ. ౭, ఆ.

**మొలత్రాడు.** దే. వి. పురుషునికటిసూత్రము.

**మొలత్రాసు.** దే. వి. మొలగలత్రాసు. (చూ. కమటము.)

**మొలనూలు.** దే. వి. ఆఁడువారు అలంకారార్థము ధరించెడు కటిసూత్రము. (చూ. నేవళము.)

**మొలవ.** వై. వి. మొలక, అంకురము. ఆం, భా. ద్వి. వ

**మొలవేయు.** ద్వ. స. క్రి. (మొలక+వేయు.) నాటు. (కాఁకర విత్తులు మొలవేసెను.)

**మొలాము.** దే. వి. 1. బంగారులోనగువానిపూఁత; 2. పుంటికి పూసెడుమందు. (రూ. మలాము.)

**మొలుగు.** దే. వి. మోలుగుయొక్క రూపాంతరము. ఆము. ౪, ఆ.

**మొల్క.** వై. వి. మొలకయొక్కరూపాంతరము. "మగమొల్క." కళా. ౪, ఆ.

**మొల్చు.** వై. అ. క్రి. మొలచుయొక్కరూపాంతరము. (చూ. తప్పి రెండవయర్థము.)

**మొల్ల.** దే. వి. కుందము*.

**మొల్లమి.** దే. వి. సాంద్రత. "వ. జల్లులమొల్లమినుల్లసిల్లుచు." కళా. ౬, ఆ.—విణ. సాంద్రము. "వ. తెల్లతెల్లనై మొల్లమిగనంతకంతకు దిగంతంబులు దంతంబులందీరిచిన యిడుపులంబోలెం దీండ్రింప." స్వా. ౩, ఆ.

**మొల్లము.** యు. దే. వి. తఱచు. (చూ. ముఱుగుడు.) విణ. 1. తఱచైనది; "సీ. మొల్లమైకనుపట్టుమల్లెపూగుత్తుల మొత్తంబులకుఁగడు మూఁగిమూఁగి." వర. ౨, ఆ.—2. అధికము. "ఎ, గీ. ఉల్లమునమొల్లమగువేడ్కనుల్లసిల్లె." రుక్మి. ౪, ఆ.—వై. వి. ధనము*. "ఉ. ఎల్లధనంబునోటువడి తిందుకులేశ్వర యింక నొడ్డఁగా, మొల్లము నాకుఁజూపుము." భార. సభా. ౨, ఆ.

**మొల్లాము.** దే. వి. మొలామునకు మొదటిరూపము.

**మొవు.** దే. వి. మోవుయొక్కరూపాంతరము. "మొవులాగు." కవిక. ౬, ఆ.

**మొవుడు.** వై. అ. క్రి. మొగుడుయొక్కరూపాంతరము. "క. కవిసర్పగారుడంబను, కవితాలక్షణమొనర్చి గర్వితమదదు, ష్కృవి సర్పంబులమొగముల, మొవిడించికలంచి ముంచముందుగనేర్తున్." కవిస. ౧, అధి.

**మొవ్వ.** దే. వి. మోవుయొక్కరూపాంతరము.

**మొసలి.** దే. వి. జలజంతువిశేషము, నక్రము.

**మొసలికాటు.** దే. వి. మకరముఖాకృతిగల త్సరవ్యగ్రము.

**మొసలిదోరణము.** ద్వ. వి. మకరతోరణము. "మొసలిదోరణమెక్కి." అచ్చ. సుం, కాం.

**మొసలిరాసి.** ద్వ. వి. మకరరాశి.

**మొసలివాపోఁగులు.** ద్వ. వి. బ. (చూ.) మకరకుండలములు. "మొసలివాపోఁగులింపెసఁగువీనులవాఁడు." అచ్చ బాల, కాం.

**మొసలివాయి.** ద్వ. వి. (చూ.) మొసలికాటు. (రూ. మొసలివా. "మ. ప్రతతోద్గ్రావధరభాగపీఠయుగళీభాస్వత్సరుస్తంభనం, స్థితిఁదీండ్రించెడిజాళువామొసలివాదీప్తార్చిగా." ఆము. ౧, ఆ.)

**మొహతాదు.** హిం. వి. గ్రామపుబంట్రౌతు.

**మొహదా.** దే. వి. అడ్డకత్తి, పట్టిసము. "ఖిహిపసిండిపరుఁజు మొహదా." స్వా. ౪, ఆ.

**మొహమల్.** హిం. వి. ఒకమేలుదినుసుపట్టు. (రూ. మొకమల్.)

**మొహరము.** హిం. వి. తురకల పీర్లపండుగ.

**మొహరీ.** దే. వి. ముప్పదిచిన్నములయెత్తు బంగారునాణెము.

**మొహరు.** హిం. వి. ముద్ర.

**మొహళము.** దే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు.

## మో.

**మోఁకటించు.** దే. అ. క్రి. మోఁకాళ్లునేలకానముఁదటికొఱగు. "వ. వాఁడుభయభక్తితాత్పర్యంబులతోడమోఁకటించి కరంబులు నేలనూఁదినమస్కరించి." వి, పు. ౭, ఆ. (చూ. మోఁకటిల్లఁబడు.)

**మోఁకటిల్లఁబడు.** ద్వ. అ. క్రి. (మోఁకటిల్లన్+పడు.) మోఁకటిల్లు. "తే. తత్త, టించిపొంద్రుఁడు ధరమోఁకటిల్లఁబడఁగ." ఉ, హరి. ౩, ఆ. (రూ. మోఁకటిలఁబడు. "వ. అమ్మేదినీ పతి పార్శ్వభాగంబుచెట్టడిచిన మోఁకటిలంబడియును వీఁకచెడక యెగసి." సం. "సవిహ్వలః ప్రహారేణ జానుభ్యామగమన్మహీమ్." భార. శల్య. ౨, ఆ. "క. వీఁకచెడిఘనగదాహతిఁ, దోఁకయుఁ గదలింపలేకదుష్నహపీడన్, మోఁకటిలఁ బడియెనేలను, శోఁకోర్వీక దిగ్గజంబు సుడిసుడిగొంచున్." భాగ. ౮, స్కం.) (స్వార్థమున పడు.)

**మోఁకటిల్లు.** దే. అ. క్రి. మోఁకటించు. (రూ. మోఁకటిలు.)

**మోఁకారించు.** దే. అ. క్రి. మోఁకటించుయొక్కరూపాంతరము. "క. పుడమిన్ మోఁకారించిన." పాంచా. ౧, ఆ.

**మోఁకాలు.** దే. వి. (మోఁద+కాలు.) జానువు. "శా. తాఁకెం జిచ్చుఁ బెడుకచ్చెరిపుచేతం జూడుఁడంచుక్ దెసల్, శోకంబెద్ద యెలుంగునక్ దరుచరస్తోమంబొగింబల్కఁగాఁ, దోఁకంజుట్టినమంట యుల్కపగిదిక్ దోఁపంగఁబెన్స్రోఁతతో, మోఁకాలూఁదుచు నేల మోవఁబడియెక్ మూర్ఛాదశామగ్నుఁడై." రా. యు, కాం.

**మోఁచేతిమడ్పుటిల్లు.** ద్వి. వి. రెండిండ్లు కలిపికట్టినకట్టడము.

**మోఁచేయి.** ద్వి. వి. (మోఁద+చేయి.) కూర్పరము. (రూ. మోఁచెయి.)

**మోఁత.** దే. వి. బరువు, భారము.

**మోఁద.** దే. వి. మోఁదుచేతకట్టిన నెత్తురుగడ్డ.

**మోఁదకట్టు.** దే. అ. క్రి. మోఁదుచేతనెత్తురుగడ్డకట్టు.

**మోఁదు.** దే. స. క్రి. కొట్టు, ప్రహరించు. "క. రాఁదిగుచు నెగుచుఁ గుచుక్, బోఁదట్టుక్ బెట్టుదిట్టుఁబోరిఁబోరిరోఁజుక్, మోఁదు పెడఁద్రొక్కునెక్కును, మీఁదికి నెగయించువంచుమెయి సారించుక్." ఉ, హరి. ౬, ఆ.—వి. దెబ్బ.

**మోక.** వై. వి. మొలకయొక్కరూపాంతరము. "ఎ, గీ. వలపుఁగప్రంపుఁబనఁటి, మోకలారచొకారంపుదాకలార." రసి. ౬, ఆ.

**మోకు.** దే. వి. లావుత్రాడు, వగాటము.

**మోక్షము.** సం. వి. అ. పుం. 1. కైవల్యము; 2. విడుపు; 3. మొక్కము¶.

**మోఘ.** సం. వి. ఆ. స్త్రీ. కలిగొట్టు¶.

**మోఘము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యర్థము; 2. దీనము.

**మోచ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అరఁటి¶; 2. బూరుగు¶. అ. పుం. ము. మునగ¶.

**మోచక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) ముచ్చె. అ. పుం. ము. 1. అరఁటి¶; 2. మునగ¶. విణ. 1. విడుచునది; 2. విసుగునది.

**మోచనము.** సం. వి. అ. న. మోక్షము, విడుపు.

**మోచని.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) ముచ్చె.

**మోచితము.** సం. విణ. (అ. ఆ. అ.) విడిపింపఁబడినది. (పరిమోచితమనియు.)

**మోచే.** దే. అ. క్రి. అను. (చూ. ఎంత రెండవయర్థము.)—స. క్రి. 1. వహించు; "భూతేశ్వరునియాజ్ఞఁదలమోచి." కాశీ. ౧, ఆ.—2. మొదలుకొను. "ఎ, గీ. శంకరాద్రి, కానసము మోచిమందరాగంబుదాఁకఁ, బొఁజువెట్టిరి." సాన్వ. ౫, ఆ.

**మోజు.** హిం. వి. అభిలాష, ఆశ.

**మోట.** యు. దే. వి. కపిలె. వై. విణ. మొద్దు*.

**మోటకత్తి.** వై. వి. మచ్చుకత్తి. సాన్వ. ౪, ఆ.

**మోటనము.** సం. వి. అ. న. 1. ఆక్షేపించుట; 2. పొడిచేయుట.

**మోటపాటిరెడ్లు.** ద్వి. వి. బ. రెడ్లలోనొకతెగవారు.

**మోటబరి.** ద్వి. వి. బరువుమోసెడియెద్దు.

**మోటించే.** దే. స. క్రి. పోటిగానిలుపు. (దూలముపడకుండ స్తంభమును మోటించినాఁడు.)

**మోటిక.** దే. వి. మొటికెకు మొదటిరూపము.

**మోటు.** వై. వి. 1. మొద్దు*; 2. తట్టువగుజ్జము*; "నడకగుజ్జుపుమోటుల." జై. ౨, ఆ.—3. పందికెదుట మనుష్యాకారముగానిలిపిన కపటలక్ష్యము*. "జారకిరిపట్టులకుమోటు." హంస. ౨, ఆ. "సీ. సటలెత్తుకొనియెత్తు కిటినైనమోటాసపడియేయఁబోడుతునీపాదమాన." సాన్వ. ౪, ఆ.—విణ. మూర్ఖము, మూర్ఖుఁడు. (మోటుపట్టు.)

**మోట్టాయితము.** సం. వి. అ. న. ప్రియునికథాదులయందు మనసుతగిలియుండుటను తెలియఁజేసెడు స్త్రీలయొక్కకర్ణకండూయనాదిశృంగారచేష్టావిశేషము.

**మోడము.** దే. వి. మేఘావరణము, మందారము.

**మోడి.** దే. వి. 1. గణికాదులు ముగ్గవాలికాలికిసమీపమందుంచిన వస్తువునెత్తుట; 2. బింకము; "చ. ఎసఁగినసెయ్యపుంగినుక నేఁత యుమోడిముసుంగువెట్టి." శశాం. ౪, ఆ.—3. వ్రాఁతయొక్క వైఖరి.

**మోడు.** దే. వి. 1. స్థాణువు; 2. (చూ.) పలాలము. విణ. మొక్క. (చూ. జేఅభి.) మ్రోడుయొక్కరూపాంతరము.

**మోడుచే.** వై. ప్రే. ముగుడుచేయొక్కరూపాంతరము. "ఉ. తోడికుమారులక్ సఖులు దూరమునందకరారవిందముల్, మోడిచి ఫాలభాగమునమోపినమస్కృతులాచరింపఁగా." కాశీ. ౬, ఆ.

**మోడుపడు.** ద్వి. అ. క్రి. 1. మోడగు; 2. మొక్కయగు; (చూ. మోడ్పడు.) 3. తునుఁగు; "క. మోడుపడినచేతులతోఁ, గీడగుదశఁబొందికాక." హరి. ఉ. ౭, ఆ.—4. ఖండితమగు. (ప్రే. మోడుపఱుచు. ఖండితముచేయుటకు.—"ఎ, గీ. మొనసి నీదుసహోదరిముక్కుచెవులు, మోడుపఱచినఖడ్గంబు మ్రోలఁగ్రాల" రా. యు, కాం.)

**మోడుపు.** దే. వి. ముగుడుట. "చంద్రపరిపన్నిరుద్ధనీరరుహము కుళభాతిమోడుపుఁగేలుఫాలాగ్రవీధికవిలసిల్లియలర." పాండు. ౧, ఆ. (రూ. మోడ్పు. "ముదితనేత్రాంబుజములరమోడ్పుగాంచె." కవి. ౨, ఆ.)

**మోడ్చు.** వై. ప్రే. మోడుచుయొక్కరూపాంతరము.

**మోడ్పడు.** ద్వి. అ. క్రి. మోడుపడుయొక్కరూపాంతరము. (మోడగుటకు.— "కొమ్మలుదున్నమోడ్పడుభూరుహంబునఁబోలె." భార. స్త్రీ. ౧, ఆ.—మొక్కయగుటకు.—"నెమ్మనంబులక్ మొనయు కుతూహలాంకురముమోడ్పడ." లక్ష్మీ. ౧, ఆ.)

**మోతర్భా.** హిం. వి. పన్ను.

**మోతాదు.** హిం. వి. ఒకసారి యిచ్చుమందు.

**మోతుబరు.** హిం. విణ. ఘనతగల, గొప్ప, నమ్మఁదగిన.

**మోద.** దే. వి. తములపాకులకట్ట.

**మోదకము.** సం. వి. అ. పుం. కుడుము. లడ్డు. (అనికొందఱు.)

**మోదమానము.** సం. విణ. (అ. ఆ. అ.) సంతోషించుచున్నది.

**మోదము.** సం. వి. అ. పుం. సంతోషము, ముదము.

**మోదయము.** దే. వి. తృణవిశేషము, బల్బజము.

**మోదించే.** సం. అ. క్రి. సంతోషించు, ముదమందు.

**మోదిల్లు.** సం. అ. క్రి. మోదించు. (రూ. మోదిలు.) వా. ౫, ఆ.

**మోదుగు.** దే. వి. కింశుకము¶. "తే. ఎలమిమైజాఱియారంపు టేనుఁగులను, నొంచునామనియనుతెఱనోరిమెఱము, గోళ్లనంగను

ఏగు మోదుఁగులనుమొగ్గ, లమరఁదమరంగుమిన్నెల్లనలముకొనఁగ." య. ౪, ఆ.

**మోదుగుతొడిమలు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము. (చూ. ముదుకసరులు.)

**మోదుగుమాడలు.** దే. వి. బ. 1. శాలిధాన్యవిశేషము; 2. మోదుగువిత్తులు.

**మోదువు.** దే. వి. మోదుగుయొక్కరూపాంతరము.

**మోదెన.** దే. వి. శివమల్లికీ. (రూ. మోదెనము.)

**మోపరి.** దే. విణ. (మోపు+అరి.) మోపుమోయువాఁడు. "ద్వి. మోపరికగుతగ్గు మ్రొగ్గులభరము, మోపించుకొనునట్టిముగ్ధనికగునె." భాగ. ౨, స్కం.

**మోపాది.** దే. వి. (మోపు+అది.) అపాయము. (ఇది యేఁడాది లోనగువానివంటిది.)

**మోపి.** దే. వి. ముండమోసినది, విధవ.

**మోపిక.** దే. వి. భారము. (ఇది ఓపికవంటిది.)

**మోపిడు.** దే. స. క్రి. (మోపు+ఇడు.) విల్లు ఎక్కిడు. (చూ. ఎక్కిడు.) "కొందఱుమోపిడలేకతక్కఁగాఁగొందఱొకింతయెక్కిడుచు." భాగ. ౧౦, స్కం. ఉ

**మోపు.** దే. ప్రే. 1. మోయఁజేయు, మోపించు; 2. ఆనించు; "మునికోలనత్తురొలుకమోపుచును." భార. ఆను. ౨, ఆ.— 3. ఆరోపించు. "ద్వి. నారిచేసినతప్పునామీఁదమోపి." సా. ౪, భా.—వి. 1. గడ్డిలోనగువానిపెద్దకట్ట; 2. భారము; "ఎ, గీ. మానిఖిలవృత్త, మును నముద్ధరించుమోపునీయదియక,దన్న." భార. అర. ౭, ఆ.—3. వింటినారి. "క. దనుజకులత్రాసకరం, బును రిపుభంజనమురత్నభూషితరూపం, బును గురుదేశాహ్లాదక, మును నగునిజకార్ముకంబుమోపెడలించెన్." సం. "అముంచద్ధనుషస్తస్య జ్యామక్షయ్యాంయుధిష్ఠిరః." భార. విరా. ౧, ఆ.—విణ. అధికము. (ఉత్తరమున వాన మోపుగాకురిసినది.)

**మోపుకాఁడు.** దే. విణ. మోచువాఁడు. "క. నీవేటిమోపుకాఁడవు." భార. ఉద్యో. 3, ఆ.

**మోపుదల.** దే. వి. 1. ఆరోపణము; 2. భారము.

**మోపెట్టు.** దే. స. క్రి. (మోపు+పెట్టు.) (చూ.) ఎక్కిడు. "ఎవ్వరికిమున్నీ విల్లుమోపెట్టఁబోలదు." భార. ఆది. ౭, ఆ.

**మోము.** వై. వి. మొగముయొక్కరూపాంతరము. (ద్వారమునకు.—"క. దానుగ్రంథియనంగా, మోమిడుకొని." భార. ఉద్యో. ౪, ఆ.)

**మోముముట్టు.** ద్వ. వి. మొగముట్టుయొక్కరూపాంతరము. "చక్కనిమోముముట్టు." రామా. ౨, ఆ.

**మోమోటు.** ద్వ. వి. మొగమోటయొక్కరూపాంతరము. (దాక్షిణ్యమునకు.—"గురుఁడిట్లుపలికెఁజూచితె యకటా మోమోటలేక." శశాం. ౪, ఆ.) (రూ. మోమోటము. సంకోచించుటకు.—"శా. మో, మోటంబించుకలేక తక్కినభుజాయుగ్మంబునన్ వ్రేయుచున్." ఉ, హరి. ౬, ఆ.)

**మోమోడు.** ద్వ. అ. క్రి. మొగమోడుయొక్కరూపాంతరము. (దాక్షిణ్యపడుటకు. — "క. ఆడిరిప్రమోదనృత్తము, పాడిరి మంద్రకమహాప్రబంధంబులమో, మోడిరిత్రైర్థికులకుఁగొ, ల్లాడిరి కైవల్యలక్ష్మిసమరులుమునులున్." కాశీ. ౨, ఆ.)

**మోయిను.** హిం. వి. 1. రీతి; 2. బత్తెము.

**మోయు.** దే. స. క్రి. (భారము) వహించు.

**మోర.** దే. వి. 1. పశ్వాదులదీర్ఘముఖము; "ఆ. మారమూరిమోపి మూరుకొనియె." (ఇక్కడ అశ్వముఖము.) కాశీ. ౯, ఆ.— "ఎ, గీ. నురువులురులవెడఁదనోళ్లతోడుపమోర, లెత్తుకొనుచు." (ఇక్కడ ఉష్ట్రముఖము.) రా. యు, కాం. "వ. ముంగిసమోరలం బోనిమోరలు సారెసారెకునెత్తి." (ఇక్కడ నకులతునకనులముఖములు.) సావి. ౪, ఆ. (ఇట్లు ప్రయోగములచేత ఇతరములైన వానికిని తెలియునది.) 2. (నిందయందు) మనుష్యముఖము. (చేసినావులే నీమోర.)

**మోరట.** సం. వి. ఆ. స్త్రీ. చోఱకీ. అ. న. ము. 1. ఊడుగుఁబువ్వ; 2. చెఱకువేరు; 3. ఈనిన మూడుదినములకు పైఁబడ్డపాలు; 4. మజ్జిగ.

**మోరటి.** దే. వి. ప్రియాళముకీ.

**మోరటిల్లు.** దే. అ. క్రి. మోముమీఁదికెత్తు. (రూ. మోరసాఁచు. చూ. గగ్గోలువడు.)

**మోరత్రోపు.** దే. వి. పరాఙ్ముఖత్వము.

**మోరపక్కె.** దే. వి. మత్స్యవిశేషము.

**మోరపాక.** దే. వి. (ఓరపాకకు మొదటిరూపము.)

**మోరా.** హిం. వి. కాలిపీఁట.

**మోరు.** యు. దే. వి. పర్వతశిఖరము. "వ. ఇవ్విధంబునసమ్మేరునగంబునందొక్కమోరునీఱగుటయు." ఉ, హరి. ౬, అ. — వై. మజ్జిగ. "గారెలుబూరెలు చారులుమోరులు." ఉ, రా. ౬, ఆ.

**మోరుండ.** ద్వ. వి. (మోరు+ఉండ.) భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

**మోర్చింగు.** హిం. వి. ఒకవిధమైన వాద్యము, చిన్న ముఖవీణ.

**మోఱకము.** వై. వి. మూర్ఖత్వము*. "సీ. అఖిలలోకేశ్వరుండగురమాధిపుతోడ విడువనివైరంబుదొడరునట్టి, మోఱకమేటికిమొలచెదైత్యునిబుద్ధి." లక్ష్మి. ౧, ఆ.—విణ. మూర్ఖము. "ఆ. చర్మభావమొందిసంస్పర్శసుఖముల, కానచేసిచేసియనుదినంబు, గజమువేడ్కఁదగిలి గజములోఁబడుభంగిఁ, గట్టువడకుమోఱకంపుమనస." వా. ౪, ఆ.

**మోఱకకత్తె.** వై. విణ. (మోఱకము+కత్తె.) మూర్ఖురాలు. కృష్ణా. 3, ఆ.

**మోఱకు.** వై. విణ. మూర్ఖుఁడు. "పెన్మోఱకుభంగిమాంసములు ముక్కునబంటిగ మ్రింగుచుండ." భో. ౧, ఆ. (చూ. మొఱకు.)

**మోఱకుఁడు.** వై. విణ.——పై.——"వ. అప్పుడమ్మోఱకుండు పురోహితులంబిలిపించి." లక్ష్మి. ౪, ఆ.

**మోలము.** దే. వి. మొలామియొక్కరూపాంతరము. (చూ. ఎక్కసక్కెము మొదటియర్థము.) (రూ. మోళము.)

**మోలుగు.** దే. వి. నల్లచాయచెక్క.

**మోవి.** దే. వి. 1. పెదవి; 2. ఒకానొకచెట్టు. "ఎ, గీ. తిలకరుచిఁబొల్చిమోవికాంతినిజెలంగి, పాపటఁబొసంగియామోదభరము నించెఁ, జూపఱకునెల్లవనలక్ష్మిపొంపెలర్ప, నభినవంబైనయావసంతాగమమున." కవి. ౨, ఆ.

**మోవు.** దే. వి. తాటిచెట్టులోనగువానియందు పుట్టెడుముడుత విడనిలేఁత ఆకుమొలక. "సీ. రంభోరురమణీయరమణులచెలువు మైఁదలిరాకు మోవులకలిమినెఱసి." షో. ౯, ఆ.

**మోష.** సం. వి. ఆ. స్త్రీ. దొంగతనము.

**మోషకుఁడు.** సం. వి. అ. పుం. దొంగ, తస్కరుఁడు.

**మోస.** వై. వి. 1. దొంగతనము; "తే. మోసఁదర్కించియవ్వైశ్య ముఖ్యుఁడేడ్చె." కాశీ. ౫, ఆ.—2. ప్రమాదము*; "ముదితల నమ్మియేమఱుట మోసనుమీ." కాశీ. ౬, ఆ.—3. వంచన*.

**మోసగాఁడు.** దృ. విశే. (మోస+కాఁడు.) వంచకుఁడు.

**మోసపోవు.** దృ. అ. క్రి. 1. ప్రమాదపడు; "ఆ. మొదలఁ బాడిఁదీర్చిమోసపోయితిమని, దానిఁద్రిప్పిచెప్పఁబూనిరేని, జయముగొన్నవాఁడుసభ్యులువేర్వేఱ, దండువరువ వలయుఁ దప్పుకొలఁది." విజ్ఞా. వ్య. కాం.—2. వంచింపఁబడు. "ఉ. మాయపుంజోకఁకుఁలునీవునిక్కముగఁ జూచి మనంబున మోసపోయితి." భార. అర. ౬, ఆ. (ప్రే. మోసపుచ్చు.)

**మోసము.** వై. వి. 1. దొంగతనము; (చూ. మోస.) 2 ప్రమాదము*; "క. నీగురునికామధేనువు, నేగవయంబనితలంచి యేసితిఁ గరుణా, సాగరకరుణింపుముమది, నేగతిమోసంబులేదె యెవ్వరికైనన్." మార్క. ౭, ఆ.—3. వంచన*. "ఉ. ముక్కుమొగంబుఁజూడ కొకమోసపుమాటకు విశ్వనాయకుం, డెక్కడికైనఁ బొమ్మనుచు నెట్టనిచూపులఁజూచెనల్కతోన్." భీ. 3, ఆ.

**మోసల.** వై. వి. మొగసాలయొక్క రూపాంతరము. (నగరితల వాకిటిచావడికి.—"మ. మో, నలఁగొల్లెవ్వతలవంచిఖిన్నుఁడయి చాంచల్యంబుతో నుండఁగన్." సా. 3, ఆ.)

**మోసాల.** వై. వి. మొగసాలయొక్క రూపాంతరము. (నగరితల వాకిటిచావడికి. — "సీ. దుంఠివిఘ్నేశుఁడుండుప్రదేశమీక్షించి లోలార్కునగరి మోసాలవెదకి." కాశీ. ౨, ఆ.)

**మోసు.** దే. వి. 1. మోవు; "సీ. పాలనమత్కదళికందాభఁ దిరస్కృతాస్యమునఁ గొమ్మొకటిమోసనఁగఁగ్రుంగ." ఆము. ౪, ఆ.—2. మొలక. "మోమునఁజిన్నిలేనగవుమోసులుభాసిల." పర. 3, ఆ.

**మోస్తరు.** గ్రా. వి. మాదిరి.

**మోహన.** సం. వి. ఆ. స్త్రీ. రాగవిశేషము. అ. న. ము. 1. మూర్ఛ; 2. అఱువదినాల్గువిద్యలలో నొకటి. (చూ. విద్య.)—పుం. మన్మథబాణవిశేషము. (చూ. మన్మథుఁడు.)

**మోహము.** సం. వి. అ. పుం. 1. అజ్ఞానము; 2. మూర్ఛ; 3. వలపు.

**మోహరము.** దే. వి. మొగ్గరము, వ్యూహము. (చూ. డాపలించు.)

**మోహరీ.** దే. వి. మొహరీయొక్క రూపాంతరము.

**మోహరించు.** దే. అ. క్రి. 1. ఎదుర్కొను; "తే. మూఁడు కన్నులవేల్పుతో మోహరించి, నేఁడుదేహంబులేకయున్నాఁడు దాను." నై. ౪, ఆ.—2. వ్యూహముపన్ను. "వ. ఎడనెడంగలయ నిలుచునట్లుగా మోహరించి." భార. విరా. ౪, ఆ. స. క్రి. ఎదిరించు. "మోహరింతముపురారిన్." ఉ, హరి. ౬, ఆ. (చూ. సరస.)

**మోహించు.** సం. అ. క్రి. 1. అజ్ఞానముపొందు; 2. మూర్ఛిల్లు.—స. క్రి. వలచు.

**మోహితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మోహము నొందినవాఁడు.

**మోహిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీదేవతావిశేషము; 2. పిశాచస్త్రీవిశేషము.

**మోళంగి.** దే. వి. ములకి.

**మోళా.** హిం. వి. రీతి, తరగతి.

## మౌ.

**మౌంజి.** సం. వి. ఈ. స్త్రీ. ముంజదర్భమొలత్రాడు, ముంజి.

**మౌంజె.** హిం. వి. గ్రామముక్రిందచేరినపల్లె.

**మౌంటు.** ఆం. వి. మొత్తము.

**మౌండము.** సం. వి. అ. న. కొబ్బెరయుండలనెడు భక్ష్యవిశేషము.

**మౌకలి.** సం. వి. ఇ. పుం. కాకి, వాయసము.

**మౌక్తికఫల.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లయుప్పి.

**మౌక్తికము.** సం. వి. అ. న. ముత్యము. (ముత్తెములు ఏనుఁగు కుంభస్థలము, మేఘము, పందికోఱ, శంఖము, మత్స్యశిరము, పాఁపపడగ, ముత్తెపుచిప్ప, చెఱకు, బొంగువెదురు వీనియందు పుట్టును. ముత్తెపుచిప్పయందు పుట్టినవే తఱచుగా వాడఁబడును.)

**మౌఖరి.** సం. వి. ఈ. స్త్రీ. ముఖరభావము, ముఖరత్వము.

**మౌఖర్యము.** సం. వి. అ. న.______పై.______

**మౌఢ్యము.** సం. వి. అ. న. మూఢభావము, మూఢత్వము.

**మౌద్గీనము.** సం. విశే. (అ. ఆ. అ.) పెసలుపండునది. (పొలము.)

**మౌనము.** సం. వి. అ. న. మాటాడకుండుట.

**మౌని.** సం. వి. న్. పుం. మౌనముగలవాఁడు, ముని.

**మౌరజికుఁడు.** సం. వి. అ. పుం. మద్దెలకాఁడు, మార్దంగికుఁడు.

**మౌరి.** దే. వి. నాగసరము. "వ. మౌంబేరిగౌరుగుమ్మెటంబు." ఆము. ౪, ఆ. (మొదటిరూపము మవురి.)

**మౌర్ఖ్యము.** సం. వి. అ. న. మూర్ఖభావము, మూర్ఖత్వము.

**మౌర్వి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అల్లెత్రాడు; 2. వస.

**మౌల్యము.** సం. వి. అ. న. మూలబలము.

**మౌష్కర్యము.** సం. వి. అ. న. ముష్కరభావము, ముష్కరత్వము.

**మౌహూర్తికుఁడు.** సం. వి. అ. పుం. జోస్యుఁడు. (రూ. మౌహూర్తుఁడు.)

**మౌళి.** సం. వి. ఇ. స్త్రీ. నేల. పుం, స్త్రీ. 1. సిగ; 2. కొప్పు; 3. కిరీటము. పుం. అశోకము.

## మ్ర.

**మ్రంగ.** దే. వి. మంగకు మొదటిరూపము.

**మ్రంగఁబడు.** దృ. అ. క్రి. (మ్రంగన్+పడు.) మ్రంగు. "దు, ర్భరభారాతురభోగిరాట్ఫణతతుల్ మ్రంగంబడన్." హరి. ఉ. ౨, ఆ. "ఉ. అంగనయంగదీప్తియమృతాంశు మయూఖతరంగరేఖను, ప్పొంగుచుదీప్తమైయచటఁబొల్పెసలారెడుభ్రష్టతేజమున్, మ్రంగఁబడంగఁజేసె నభిరామగుణంబిఁకఁజెప్పనేలయ, య్యంగజదివ్యతేజమునకడ్డమెయావెడ భ్రష్టతేజమున్." ఎల్లన. 3, ఆ.

**మ్రంగు.** దే. అ. క్రి. క్రుంగు, వ్రాలు. (చూ. మ్రంగఁబడు.)

**మ్రుచ్చిలిపోటు.** దే. వి. నిద్రపోవుచుండఁగా సైఁబడిచేయు యుద్ధము.

**మ్రుచ్చిలు.** దే. స. క్రి. 1. దొంగిలించు; "తే. కల్లుద్రావుట గురుపత్నిఁ గవయుటయును, విప్రుఁజంపుట బ్రహ్మస్వవిషయమైన, మ్రుచ్చిలుటయునునివిగల క్రూరజనులఁ, బ్రీతిఁగూడుట యును మహాపాతకములు." భార. శాం. ౧, ఆ.—2. వంచించు "ఉ. మ్రుచ్చిలివచ్చి దుర్వచనముల్పచరించినఁజెల్లనిత్తునే." భార. ఆర. ౭, ఆ.

**మ్రుచ్చు.** దే. వి. 1. దొంగ; 2. అరఁటిపువ్వులోనుండెడు వస్తువిశేషము. (చూ. గోరు మూఁడవయర్థము.)

**మ్రుచ్చుగొర.** దే. వి. (ముచ్చు+కోర.) పెద్దదొంగ. "ఆ. ఈ, యశ్వరాజునిట్టులపహరించి, మ్రుచ్చుగోరయీ సముద్రదేశంబున, నోటమింత లేకయున్నవాఁడు." భార. ఆర. 3, ఆ.

**మ్రుచ్చుప్రొద్దు.** ద్వి. వి. అర్ధరాత్రము.

## మ్రే.

**మ్రేఁగు.** దే. స. క్రి. 1. పూయు; (చూ. మేఁగు, మ్రేవు.) 2. ఆవరించుకొను. "తే. మందహాసంబుచేసియమందరవము మిగిలిరిపుతూర్యరవముల మ్రేఁగికొనఁగఁ, బాంచజన్యంబుఁ బెలువఁబూరించిశార్ఙ్గ, గుణముసారించిదానవ గణముఁజూచి." నిర్వ. 3, ఆ.

**మ్రేవు.** దే. స. క్రి. మ్రేఁగుయొక్కరూపాంతరము. (పూయుటకు.—"ఎ, గీ. ఆమలకప్రమాణ, మృదులమృత్పిండఖండంబు మ్రేవిమ్రేవి, గంధలేశక్షయావధిగానొనర్చ, వలయుశౌచంబు." కాశీ ౫, ఆ.)

## మ్రొ.

**మ్రొక్కు.** దే. స. క్రి. నమస్కరించు. "మ్రొక్కెనసాదరింపకనసుండు." జై. ౫, ఆ.—వి. నమస్కారము.

**మ్రొక్కుడు.** దే. వి. నమస్కారము. "మ్రొక్కుడుఁగేలు." పాండు. ౧, ఆ.

**మ్రొక్కుబడి.** దే. వి. మొక్కుబడికిమొదటిరూపము.

**మ్రొగ్గఁబడు.** ద్వి. అ. క్రి. (మ్రొగ్గన్+పడు.) మ్రొగ్గు. (చూ. బెగ్గిలు.) (సార్థమున పడు.)

**మ్రొగ్గతిల్లఁబడు.** ద్వి. అ. క్రి. (మ్రొగ్గతిల్లన్ + పడు.) 1. మోఁకటిల్లఁబడు; "ఉ. ఏపునరెండుచేతులనునిమ్ముగఁబట్టి యమర్చియెత్తఁగా, నోపక మ్రొగ్గతిల్లఁబడి." భార. ఆర. 3, ఆ. (రూ. మ్రొగ్గతిలఁబడు. "తే. అపుడునిశ్చేష్టితంబులైహయముల వనిఁ, జాఁపకట్టుగఁబడియె మత్స్యక్షితీశు, నందనుండునునొగలపై మ్రందినట్లు, మ్రొగ్గతిలఁబడిబలితంపు మూర్ఛనొందె." భార. విరా. ౪, ఆ.) (సార్థమున పడు.)

**మ్రొగ్గతిల్లు.** దే. అ. క్రి. మోఁకటిల్లు. "దిక్తటాంతవారణములు మ్రొగ్గతిల్లఁగ." రా. యు, కాం. (రూ. మ్రొగ్గతిలు. "అదిమ్రొగ్గతిలక మున్నకరిడిగ్గనుటికి." జై. ౬, ఆ.)

**మ్రొగ్గు** దే. అ. క్రి. మ్రొగ్గతిల్లు. "తే. మూర్ఛవోయిరథంబుపై మ్రొగ్గెనతఁడు." హరి. ఉ. ౬, ఆ. "వ. ఋతుపర్ణుండారథంబెక్కునప్పుడు హయంబులు మ్రొగ్గినంజూచి." సం. "అథపర్య్యతన్భూమౌజానుభిస్తేహయోత్తమాః." భార. అర. ౨, ఆ.—వి. ఎక్కువ. "వ. నిచ్చలపుటగ్గలికలందగు మ్రొగ్గులేక." కళా. 3, ఆ.

## మ్రో.

**మ్రోఁగు.** దే. అ. క్రి. మొరయు, శబ్దించు. "క. మ్రోఁగుచు దూపులఁదూపులఁ, నాఁగుచుదుస్తరశరక్షతారుణవారిన్, దోఁగుచు మూర్ఛాదశలన్, దూఁగుచురేఁగుచుఁబెనంగ దొరఁకొనిరాజిన్." రామా. ౮, ఆ. "క. మేదురతరాట్టహాసము, రోదసిపగులంగనట్ల మ్రోఁగుచు." రా. యు, కాం.

**మ్రోఁగుడు.** దే. వి. మ్రోఁత, ధ్వని.

**మ్రోఁత.** దే. వి. ధ్వని. "ఎ, గీ. కాముశరమువాఁడికైరవాప్తుఁ వేఁడి, పికముహూఁతతేఁటిపిండుమ్రోఁత, యంతకంతకడరి యెంః గాపించునో, యేమిసేయుదాన నెద్దిపెట్టఁగు." భో. ౪, ఆ.

**మ్రోడు.** దే. వి. 1. స్థాణువు; "వ. అడపొడగానరాకతెగటాఱియుఁ గాలినయట్టి మ్రోడుకైవడి." స్వా. 3, ఆ.—2. మొండి; "ధూతకళంకునిఁగుంభినొల్లకీ మ్రోడునకీవుగూర్చుటెది మోసము గాదె." భో. ౫, ఆ.—3. మొక్క. "ఆ. దశముఖానుజుండు దశకర్ణఘోణల, మ్రోళ్లఁగుమ్మరించు ముదురునట్లు, రల్లయొడలుఁ దడుప నఱసంజఁబడమటి, మిన్నువెలిఁగినట్లు సేన వెలుఁగ." రామా. ౮, ఆ. (మొరడుయొక్కరూపాంతరము.)

**మ్రోడుపడు.** ద్వి. అ. క్రి. మొక్కపోవు. "అజ్ఞానపతివేడ్క మ్రోడుపడుచందముగాఁ బి." హం. నిగ. ౭, ఆ.

**మ్రోయు.** దే. అ. క్రి. ధ్వనించు, మ్రోఁగు. "రోదసినిండ వాద్యములుమ్రోసె." ఫిల్హా. ౪, ఆ. (మొరయుయొక్కరూపాంతరము.)

**మ్రోల.** దే. వి. ఎదురు. "తే. రుక్మిణీదేవి తమయత్తమ్రోలఁజొచ్చి, బసిఁడిగిన్నియఁగస్తూరియొసఁగ." విజ. 3, ఆ. "మ. దీ, ర్ఘకరాబ్జంబులనాసదీజలములన్ గట్టెక్కడిడిసీరుమ్రోలకుఁబెల్లుబ్బిరణాగతుండయిన యాలంకేశుపైఁ దొట్టఁగన్." భాగ. ౯, స్కం. (దీని కడపటి అకారమునకు వికల్పముగా లోపము. చూ. చేపట్టు. వి. మూఁడవయర్థము.)

**మ్రోవు.** దే. అ. క్రి. మ్రోఁగుయొక్కరూపాంతరము. య. ౫, ఆ.

## మ్లా.

**మ్లానము.** సం. విశే. (అ. ఆ. అ.) వాడినది.

**మ్లాని.** సం. వి. ఇ. స్త్రీ. వాడుట.

## మ్లి.

**మ్లిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. స్పష్టముకానిది; (మాట.) 2. వాడినది.

## మ్లే.

**మ్లేచ్ఛదేశము.** సం. వి. అ. పుం. భారతవర్షమునకుతుదనుండెడు కామరూపాది ప్రత్యంతదేశము.

**మ్లేచ్ఛముఖము.** సం. వి. అ. న. రాగి, తామ్రము.

**మ్లేచ్ఛుఁడు.** సం. వి. అ. పుం. 1. గోమాంసభక్షకుఁడై సమస్తాచారములనువదలి యవ్యక్తముగా మాటలాడుచు వర్తించువాఁడు; 2. పాపరతుఁడు.

## య.

**య.** ఒక యక్షరము.

**యంత.** సం. వి. ఋ. పుం. 1. తేరుగడపువాఁడు; 2. మావటివాఁడు.

**యంత్రణము** సం. వి. అ. న. ఆ. స్త్రీ. 1. బంధనము; 2. రక్షణము; 3. నియమనము.

**యంత్రపాత్రితము.** సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము, జేంతికలు.

**యంత్రము.** సం. వి. అ. న. 1. కష్టపడిచేయవలసినపనిని కష్టపడక చేయునట్లు ఏర్పఱచిన సాధనవిశేషము; 2. బీజాక్షరచక్రము; 3. జంతికలుచేసెడు సాధనవిశేషము; 4. తిరుగలి. పుం. ఎంఢ్రి.

**యంత్రించు.** సం. స. క్రి. యంత్రణముచేయు. హరి. ఉ. ౫, ఆ.

**యంత్రితము.** సం. విశే. (అ. ఆ. అ.) కట్టఁబడినది, బద్ధము.

**యకాయకీ.** హిం. విశే. ఆకస్మికముగా, వేగముగా.

**యకృత్తు.** సం. వి. త్. న. (చూ.) కారిజేము.

**యక్షకర్దమము.** సం. వి. అ. పుం. కర్పూరము, అగురుచందనము, కస్తూరి, తక్కోలము, కుంకుమపువ్వు వీనితోచేయఁబడిన కలపము.

**యక్షధూపము.** సం. వి. అ. పుం. సజ్జరసము.

**యక్షరాట్టు.** సం. వి. జ్. పుం. కుబేరుఁడు, జెక్కులతేఁడు.

**యక్షిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గతించినవృత్తాంతములనుదెలిపెడు ఒకవిద్య; 2. యక్షునిభార్య; 3. కుబేరునిభార్య.

**యక్షుఁడు.** సం. వి. అ. పుం. 1. దేవయోనివిశేషము; 2. కుబేరుఁడు.

**యక్ష్మము.** సం. వి. అ. న్. పుం. క్షయరోగము.

**యజనము.** సం. వి. అ. న. యజించుట.

**యజమానుఁడు.** సం. వి. అ. పుం. 1. యజ్ఞకర్త; 2. గృహస్థుఁడు.

**యజించు.** సం. అ. క్రి. యజ్ఞముచేయు. స. క్రి. అర్చించు. (రూ. యజియించు. అర్చించుటకు -- "సీ. యజియింపలేనైతి నమరసంఘాతంబుఁబూజింపలేనైతి భూదివిజుల." కాశీ. 3, ఆ)

**యజుస్సు.** సం. వి. స్. న. ఒక వేదము. (చూ. వేదము.)

**యజ్ఞము.** సం. వి. అ. పుం. యాగము, వేలిమి. (పంచమహాయజ్ఞములు.—బ్రహ్మయజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము.)

**యజ్ఞసూత్రము.** సం. వి. అ. న. యజ్ఞోపవీతము.

**యజ్ఞాంగము.** సం. వి. అ. పుం. మేడిచె.

**యజ్ఞియము.** సం. వి. అ. పుం. 1. ముంజదర్భ; 2. ద్వాపరయుగము. విశే. 1. యజ్ఞకర్మమునకుఁదగినది; 2. యజ్ఞమునకు హితమైనది.

**యజ్ఞోపవీతము.** సం. వి. అ. న. జందెము.

**యజ్వ.** సం. వి. న్. పుం. విధ్యుక్తముగా యజ్ఞముచేసినవాఁడు.

**యతనము.** సం. వి. అ. న. యత్నము, జేతనము.

**యతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పద్యవిశ్రమస్థానము; 2. నియతి. పుం. తాళప్రాణ కళావిశేషము. ఇ. న్. పుం. సన్యాసి. (వైష్ణవయతికి బ్రహ్మసూత్రము, త్రిదండము, చర్మవస్త్రము, శిక్యము, బ్రుసి, కౌపీనము, కటివేష్టనమును గలవు.)

**యత్నము.** సం. వి. అ. పుం. ఉద్యోగము, కడఁక.

**యత్నించు.** సం. అ. క్రి. ఉద్యోగించు, కడఁగు.

**యథాక్రమము.** సం. అవ్య. క్రి. విశే. క్రమము నతిక్రమింపక. ఇట్లు (యథాశబ్దపూర్వకముగా మఱియుఁ గొన్నిగలవు.)

**యథాజాతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఎఱుకలేనివాఁడు, మూర్ఖుఁడు.

**యథాయథలు.** సం. అవ్య. బ. చెల్లాచెదరు. "దళములు వీనిఁ గన్గొని యథాయథలయ్యె." జై. ౭, ఆ.

**యథార్థము.** సం. విశే. (అ. ఆ. అ.) సత్యము.

**యథార్థవర్ణుఁడు.** సం. వి. అ. పుం. వేగువాఁడు, చారుఁడు, (రూ. యథార్థవర్ణుఁడు.)

**యథేచ్ఛము.** సం. క్రి. విశే. అ. న. ఇచ్ఛవచ్చినట్లు. (ఇట్లు యథేష్టము మొ.)

**యదృచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛచొప్పు.

**యదృచ్ఛాభిజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. (చూ.) డబ్బాటుసాకిరి.

**యద్భవిష్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) స్వప్రయత్నము లేక అగునది యగునని యుండువాఁడు.

**యమకము.** సం. వి. అ. న. 1. సమవర్ణయుగాధికముగా నమర్చి చెప్పిన యొకశబ్దాలంకారము; "క ఔరాయోబన్నృపాలకు, మారామనుమదనసమరమాధుర్యుఁడవై, ధీరాన్నృసింహకూడితి, మారామనుమదనసమరమాధుర్యుఁడవై." కా. ర, ఆ.–2. యమళము. పుం. సంయమము.

**యమకీటము.** సం. వి. అ. పుం. కుమ్మరపురుగు.

**యమధాటి.** సం. వి. ఈ. స్త్రీ. ఆయుధవిశేషము, జేముదాడి.

**యమధారము.** సం. వి. అ. పుం. ఇరుప్రక్కల వాదరగల కత్తి.

**యమము.** సం. వి. అ. న. యమళము. పుం. 1. హింసాదుల వలననుడుగుట; 2. శరీరమునే సాధనముగాఁగలిగిన యొక యోగాంగము. (ఇది దశవిధము.—సత్యము, దయ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచము.) (చూ. అంగము.)

**యమరాట్టు.** సం. వి. జ్. పుం. యముఁడు, కాలుఁడు.

**యమళము.** సం. వి. అ. న. యుగళము, కవ, జేంట.

**యమళిక.** సం. వి. ఆ. స్త్రీ. చర్మవాద్యవిశేషము, జెమళిగ.

**యమి.** సం. వి. న్. పుం. 1. ముని; 2. హంస. "యమిశ్రేణులు." ఆము. ర, ఆ.

**యమించు.** సం. స. క్రి. అణఁచు. నిర్వ. ర, ఆ.

**యముఁడు.** సం. వి. అ. పుం. 1. కాలుఁడు; (ఇతని పట్టణము సంయమని. భార్యధూమవర్ణ. కరణము చిత్రగుప్తుఁడు.) 2. శని.

**యమున.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకనది; 2. పార్వతి.

**యమునాభ్రాత.** సం. వి. ఋ. పుం. యముఁడు, జేముషస్థిరోడు.

**యయువు.** సం. వి. ఉ. పుం. 1. అశ్వమేధయాగదీక్షితునిచే విడువఁబడిన గుఱ్ఱము; 2. గుఱ్ఱము.

**యవకము.** సం. వి. అ. పుం. 1. అలసందెలు; 2. కారుమినుములు.

**యవక్యము.** సం. విణ. (అ. ఆ. అ.) యవలుపండునది. (పొలము.)

**యవక్షారము.** సం. వి. అ. పుం. యవలవల్లఁగలిగిన ఉప్పు.

**యవనము.** సం. వి. అ. పుం. ఒకానొకదేశము. డు. 1. యవనదేశీయుఁడు; 2. తురుష్కుఁడు.

**యవనిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. తెర; 2. తెరచీర.

**యవఫలము.** సం. వి. అ. పుం. 1. కొడిసెచెట్టు; 2 వెదురుచెట్టు.

**యవలు.** సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము.

**యవసము.** సం. వి. అ. పుం. తృణము, గడ్డి.

**యవాగువు.** సం. వి. ఊ. స్త్రీ. జావ.

**యవాగ్రజము** సం. వి. అ. పుం. యవక్షారము.

**యవాని.** సం. వి. ఈ. స్త్రీ. ఓమము. (రూ. యవానిక.) విణ. వడిగలది.

**యవాసము.** సం. వి. అ. పుం. ఈఁటకసిందచెట్టు.

**యవీయసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చెల్లెలు; 2. కొమ్ముపొటచెట్టు.

**యవీయసుఁడు.** సం. వి. స్. పుం. తమ్ముఁడు. విణ. 1. చిన్నవాఁడు; 2. యువ.

**యవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) యవలుపండునది. (పొలము.)

**యశఃపటహము.** సం. వి. అ. పుం. వాద్యవిశేషము, డంకా.

**యశస్కరము.** సం. విణ. (అ. ఈ. అ.) కీర్తిని కలుగఁజేయునది.

**యశస్వి.** సం. విణ. (న్. ఈ. న్.) కీర్తిగలవాఁడు.

**యశస్సు.** సం. వి. స్. న. కీర్తి. (రూ. యశము.)

**యష్ట.** సం. వి. ఋ. పుం. యజ్ఞకర్త.

**యష్టి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. హారముపేట; 2. ఆయుధవిశేషము; 3. అతిమధురము. పుం. 1. చేతికఱ్ఱ; 2. బెక్కుపుకాడ.

**యష్టిక.** సం. వి. ఆ. స్త్రీ. నూఱుపేటలహారము.

**యష్టిమధుకము.** సం. వి. అ. న. అతిమధురముచెట్టు.

## యా.

**యాగము.** సం. వి. అ. పుం. యజ్ఞము, వేలిమి.

**యాచకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అడిగెడువాఁడు.

**యాచన.** సం. వి. ఆ. స్త్రీ. అడుగుట.

**యాచనకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) యాచకుఁడు.

**యాచించు.** సం. స క్రి. అడుగు.

**యాచితకము.** సం. వి. అ. న. (చూ.) ఎరవు.

**యాచ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. 1. యాచన; 2. భిక్ష.

**యాజకుఁడు.** సం. వి. అ. పుం. 1. యాజ్ఞికుఁడు; 2. ఋత్విక్కు.

**యాజనము.** సం. వి. అ. న. యజింపఁజేయుట.

**యాజుషము.** సం. విణ. (అ. ఈ. అ.) యజుర్వేదసంబంధమైనది.

**యాజ్ఞికుఁడు.** సం. వి. అ. పుం. యజ్ఞమునడపువాఁడు.

**యాజ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) యజింపఁదగినది.

**యాత.** సం. వి. ఋ. స్త్రీ. తోడికోడలు. విణ. పోవువాఁడు.

**యాతన.** సం. వి. ఆ. స్త్రీ. తీవ్రవేదన, కాఁతియ.

**యాతము.** సం. విణ. (అ. ఆ. అ.) పోయినది, గతము.

**యాతయామము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. జీర్ణించినది; 2. విడువఁబడినది; 3. అనుభవించి విడువఁబడినది.

**యాతుధానుఁడు.** సం. వి. అ. పుం. 1. నిరృతి; 2. రాక్షసుఁడు.

**యాతువు.** సం. వి. ఉ. న. రాక్షసుఁడు. పుం. 1. అధ్వగుఁడు; 2. యముఁడు; 3. వాయువు. విణ. పోవువాఁడు.

**యాత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. పోవుట; 2. పుణ్యక్షేత్రములను గూర్చిపోవుట; 3. కాలముపుచ్చుట; 4. జాతర.

**యాదఃపతి.** సం. వి. ఇ. పుం. 1. సముద్రుఁడు; 2. వరుణుఁడు.

**యాదసాంపతి.** సం. వి. ఇ. పుం.——పై.——

**యాదస్సు.** సం. వి. స్. న. క్రూరజలజంతువు.

**యాదాస్తు.** హిం. వి. ఆజ్ఞాపూర్వకమైన యుత్తరము.

**యాదృచ్ఛికము.** సం. విణ. (అ. ఈ. అ.) యదృచ్ఛగాఁగలిగినది.

**యాదృశము.** సం విణ. (అ. ఈ. అ.) ఎటువంటిది.

**యాదోనాథుఁడు.** సం. వి. అ. పుం. 1. సముద్రుఁడు; 2 వరుణుఁడు.

**యానపాత్రము.** సం. వి. అ. న. జనులెక్కిపోయెడియోడ, ఓడ.

**యానము.** సం. వి. అ. న. 1. పోవుట; 2. (తనకువృద్ధిగలిగినప్పుడైనను, పరునికిక్షయముకలిగినప్పుడైనను) దండెత్తిపోవుట; [వడ్గుణములలోనొకటి. ఇది పంచవిధము.—సంధాయయానము, (పరుఁడేదనకువశపఱచుకొని దుర్గాదులనుగ్రహింపవలయునని కదలిపోవుట.) ప్రసంగయానము, (ఒకదిక్కునకుఁగదలిపోయి పొసఁగుడుపడినచో మఱియొకదిక్కునకునుగదలిపోవుట.) విగృహ్యయానము, (శత్రువునుసంహరింపవలయుననియే కదలిపోవుట.) సంభూయయానము, (శత్రువునుగెలువశక్యమునానిచో సరిరాజులనుగూర్చుకొని కదలిపోవుట.) ఉపేక్ష్యయానము. (సేనేశత్రువులను సంహరింపఁగలననుతలంపుతో దేశకాలాదులను పరికింపక కదలిపోవుట.) అని] 3. గజాదివాహనము.

**యాపనము.** సం. వి. అ. న. 1. కాలక్షేపము; 2. తిరస్కారము; 3. వర్తనము.

**యాప్యము.** వి. విణ. (అ. ఆ. అ.) 1. యాపనముచేయఁదగినది; 2. నికృష్టమైనది.

**యాప్యయానము.** సం. వి. అ. న. పల్లకి.

**యామము.** సం. వి. అ. పుం. 1. జాము; 2. శరీరమునే సాధనముగాఁగలిగినయొకయోగాంగము; (యమముయొక్కరూపాంతరము.) 3. సంయమము.

**యామవతి.** సం. వి. ఈ. స్త్రీ. యామిని, రాత్రి.

**యామళము.** సం. వి. అ. న. యమళముయొక్క-రూపాంతరము.

**యామి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కులస్త్రీ; 2. తోడఁబుట్టినది.

**యామికుఁడు.** సం. వి. అ. పుం. తలారి, ఆరక్షుఁడు.

**యామిని.** సం. వి ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు.

**యామునము.** సం. వి. అ. న. నీలాంజనము.

**యామ్య.** సం. వి. అ. స్త్రీ. 1. దక్షిణపుదిక్కు; 2. భరణీనక్షత్రము; 3. రాత్రి. పుం. చందనవృక్షము. డు. అగస్త్యుఁడు. విశే. యమసంబంధమైనది.

**యాయజూకుఁడు.** సం. వి. అ. పుం. పలుమాఱు యజ్ఞము చేయు స్వభావముగలవాఁడు.

**యాయావరము.** సం. వి. అ. పుం. 1. (చూ.) ఆయవారము; 2. అశ్వమేధపుగుఱ్ఱము.

**యాయి.** సం. విశే. (న్. ఈ. న్.) పోవువాఁడు.

**యావకము.** సం. వి. అ. పుం. యవకముయొక్క-రూపాంతరము.

**యావనము.** సం. వి. అ. పుం. చిల్లమడ్డి. విశే. యవనసంబంధమైనది.

**యావనాళము.** సం. వి. అ పుం. సస్యవిశేషము, జొన్న.

**యావము.** సం. వి. అ. పుం. 1. లత్తుక; 2. లక్క.

**యావసము.** సం. వి. అ. పుం. గడ్డివామి.

**యాశోదేయుఁడు.** సం. వి. అ. పుం. యశోదకొడుకు, కృష్ణుఁడు.

**యాష్టీకుఁడు.** సం. వి. అ. పుం. దుడ్డుగఱ్ఱ ఆయుధముగాఁగల వాఁడు.

**యాసము.** సం. వి. అ. పుం. తీఁటకసింద.

## యి.

**యియక్షువు.** సం. విశే. (ఉ.) యజింపనిచ్ఛగలవాఁడు.

**యియాసువు.** సం. విశే. (ఉ.) పోవనిచ్ఛగలవాఁడు.

## యు.

**యు.** దే. అవ. 1. ఉకారేతరశబ్దములమీఁదసముచ్చయాద్యర్థములయందు వచ్చెడు నువర్ణమునకు ముందువచ్చునది; (చూ. ను.) 2. నువర్ణపరకమైభావార్థకముమీఁద వచ్చునపుడు ఆనంతర్యమును దెలుపునది. "వ. అనుటయు మహేంద్రుండిట్లనియె." భార. శాం. ౪, ఆ.

**యుక్తము.** సం. వి. అ. న. బార. విశే. 1. కూడుకొన్నది; 2. న్యాయముతోఁగూడుకొన్నది; 3. లెక్క-కలియకూడినది; 4. తగినది.

**యుక్తరస.** సం. వి. ఆ. స్త్రీ. నన్నరాష్ట్రము.

**యుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కూడిక; 2. న్యాయము; 3. ఉపాయము; 4. అలంకారవిశేషము.

**యుక్తుఁడు.** సం. వి. అ. పుం. యోగి. విశే. తగినవాఁడు.

**యుగంధరము.** సం. వి. అ. పుం. బండిలోనగువాని నొగ, కూబరము.

**యుగపత్త్రకము.** సం. వి. అ. పుం. ఎఱ్ఱకాంచనము. కాంచనము. (అసికొండఱు.)



**యుగపార్శ్వగము.** సం. వి. అ. పుం. మరపుటకు కాఁడి మోసెడియెద్దులదాపునకట్టెడియెద్దు.

**యుగము.** సం. వి. అ. న. 1. కృతాది; (ఇవి నాలుగు.— కృతము, త్రేత, ద్వాపరము, కలి.) 2. జత; 3. బార; 4. బుద్ధియనుగంధద్రవ్యము. పుం. బండిలోనగువానికాఁడి.

**యుగళము.** సం. వి. అ. న. జత, యుగ్మము.

**యుగళి.** సం. వి. ఈ. స్త్రీ. యుగళముయొక్క-రూపాంతరము.

**యుగాంతము.** సం. వి. అ. పుం. 1. మహాప్రళయము; 2. ప్రళయము.

**యుగ్మము.** సం. వి. అ. న. జత, యుగళము.

**యుగ్యము.** సం. వి. అ. న. గజాదివాహనము. పుం. కాఁడి మోసెడియెద్దు.

**యుతకము.** సం. వి. అ. న. 1. అరణము; 2. జత; 3. కూడిక; 4. ఆఁడుదానికోకచెఱఁగు; 5. చేల్లడపుచివర; 6. సంశయము.

**యుతము.** సం. వి. అ. న. బార. విశే. 1. కూడుకొన్నది; 2. లెక్క-కలియకూడినది; 3. వేఱుపడ్డది.

**యుద్ధము.** సం. వి. అ. న. సమరము, కయ్యము. (ఇది త్రివిధము.—ప్రకాశయుద్ధము, కూటయుద్ధము, పార్ష్ణియుద్ధము.)

**యువ.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విశే. 1. ప్రాయపువాఁడు; (పదియాఱేండ్లుమొదలు ముప్పదియేండ్లవఱకుఁగల వయసుగలవాఁడు.) 2. సహజమైనబలముగల వాఁడు; 3. శ్రేష్ఠుఁడు.

**యువతి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ప్రాయముగల ఆఁడుది; (పదియాఱేండ్లుమొదలు ముప్పదియేండ్లవఱకుఁగల వయసుగలది.) 2. ఆఁడుది; 3. మునగ.

**యువరాజు.** సం. వి. అ. పుం. 1. చిన్నరాజు; 2. కర్ణుఁడు.

## యూ.

**యూకము.** సం. వి. అ. పుం. ఆ. స్త్రీ. పేను.

**యూథనాథము.** సం. వి. అ. పుం. (చూ.) పరికాఁడు.

**యూథపము.** సం. వి. అ. పుం. —— సై. ——

**యూథము.** సం. వి. అ. న. 1. సజాతీయ పశుసమూహము; 2. పశుపక్షిసమూహము.

**యూథిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమొల్ల; 2. పెద్ద గోరఁట.

**యూపము.** సం. వి. అ. పుం. 1. యజ్ఞమునందు పశుబంధనార్థమునాటిన పైపట్టలేనికొయ్య, పాలకొయ్య; 2. గంగరావి.

**యూషము.** సం. వి. అ. పుం. పప్పుకట్టు.

## యె.

**యొక్క-.** దే. అవ. శేషషష్ఠియందువచ్చెడు ప్రత్యయము. (రాజుయొక్క-, వనముయొక్క- మొ.)

## యో.

**యోక్త.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) యోగకర్త.

**యోక్త్రము.** సం. వి. అ. న. పశువుల మెడపలుపు.

**యోగపట్టము.** సం. వి. అ. పుం. (చూ.) యోగపట్టె.

**యోగపట్టె.** వై. వి. యోగులు జందెమువలె వేసికొనెడు పట్టు లోనగువానితోనేసినపట్టె. "ఎ, గీ. మిట్టయురముననిడుయోగ పట్టెమెఱయ." పా. ౧, ఆ.

**యోగము.** సం. వి. అ. పుం. 1. అపూర్వవస్తుప్రాప్తి; 2. ధ్యానము; (ఇది అష్టవిధము. చూ. అంగము.) 3. విష్కంభాది; (ఇవి యిరువదియేడు.—విష్కంభము, ప్రీతి, ఆయుష్మత్తు, సౌభాగ్యము, శోభనము, అతిగండము, సుకర్మము, ధృతి, శూలము, గండము, వృద్ధి, ధ్రువము, వ్యాఘాతము, హర్షణము, వజ్రము, సిద్ధి, వ్యతీపాతము, వరీయస్సు, పరిఘు, శివము, సిద్ధము, సాధ్యము, శుభము, శుభ్రము, బ్రహ్మము, ఐంద్రము, వైధ్రుతి.) 4. ఉపాయము; 5. కూడిక; 6. కూర్పు; 7. కవచము, 8. ప్రయత్నము; 9. ద్రవ్యము; 10. వ్యాకరణాది సూత్రము; 11. ఔషధము; 12. మూలికచేతచేసెడి యుచ్చాటనాది క్రియ.

**యోగవాగలు.** వై. వి. బ. అంతరిక్షమార్గమునఁబోయెడు యోగసిద్ధులుమెట్టెడు పావకోళ్లు. "ద్వి. ఉజ్జ్వలరత్నఖచితంబులైన యోగవాగలుమెట్టి." హరిశ్చ. ౨. భా. (రూ. యోగవాగములు. "ద్వి. యోగవాగములెక్కి యొగినారదుండు." నళ. ౨, భా.)

**యోగి.** సం. వి. న్. పుం. యోగాభ్యాసముచేయుపురుషుఁడు.

**యోగిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీదేవతావిశేషము; 2. యోగాభ్యాసముచేయు ఆఁడుది.

**యోగేష్టము.** సం. వి. అ. న. సీసము.

**యోగ్యము.** సం. వి. అ. న. బుద్ధియనెడు గంధద్రవ్యము. విశ. 1. తగినది; 2. ఉపాయముగలది; 3. నేర్పుగలది; 4. శక్తిగలది.

**యోచన.** సం. వి. ఆ. స్త్రీ. ఆలోచన.

**యోచించు.** సం. స. క్రి. ఆలోచించు.

**యోజన.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. కూర్పు. అ. న. ము. ఆమడ. పుం. నూరిగొంటువక్క.

**యోజనవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. మంజిష్ఠ†.

**యోజించు.** సం. స. క్రి. యోజనముచేయు, కూర్చు.

**యోత్రము.** సం. వి. అ. న. యోక్త్రముయొక్కరూపాంతరము.

**యోధ.** సం. వి. అ. పుం. యుద్ధముచేయువాఁడు, బంటు. (రూ. యోధుఁడు.)

**యోద్ధ.** సం. వి. ఋ. పుం.———పై.———

**యోని.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. ఆఁడుగుఱి; 2. కారణము; 3. గని.

**యోష.** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది, ఇంతి, వనిత.

**యోషిత.** సం. వి. అ. స్త్రీ.———పై.———

**యోషిత్తు.** సం. వి. త్. స్త్రీ.———పై.———

## యౌ.

**యౌకము.** సం. వి. అ. పుం. శ్వాసనిరోధకరోగము, ఊపిరికట్టు.

**యౌగపద్యము.** సం. వి. అ. న. యుగపద్భావము.

**యౌగికము.** సం. విశ. (అ. ఈ. అ.) యోగమువలనఁ గలిగినది.

**యౌతకము.** సం. వి. అ. న. (చూ.) అరణము.

**యౌతపము.** సం. వి. అ. న. త్రాసు, మూర, మూములోనగు మానము.

**యౌవతము.** సం. వి. అ. న. యువతీసమూహము.

**యౌవనము.** సం. వి. అ. న. మంచిప్రాయము. (పదియాఱేండ్లు మొదలు ఏఁబదియేండ్లవఱకుఁగలది.)

**యౌవరాజ్యము.** సం. వి. అ. న. యువరాజు దొరతనము.

## ర.

**ర.** ఒక యక్షరము. దే. అవ. 1. నీచమిత్రోద్దేశములయందు ఉద్దేశ్య వాచకమునకు ఏకత్వంబున అంతాగమంబగును; (నీచోద్దేశమునకు.— "ఉ. వంచనరాముదేవిఁగొనివచ్చినయట్టులుగాదురోరినక్తంచర." రా. యు, కాం. — మిత్రోద్దేశమునకు.—"ఏలరయాచలంబుడిగి యేలర." పా. 3, ఆ.) — అవ్య. ప్రశంసార్థకశబ్దములకు అనుప్రయుక్తమగును. (ఔర, బళిర మొ.)

**రంకువు.** సం. వి. ఉ. తెల్లనివెంద్రుకలును మెత్తనిరోలునుగల యిఱ్ఱి.

**రంగఁడు.** వై. వి. శ్రీరంగనాథుఁడు.

**రంగము.** ఉభ. దే. వి. శౌదె. సం. వి. అ. పుం, న. తగరము. పుం. 1. యుద్ధభూమి; 2. నాట్యస్థానము; 3. రంగు; 4. శ్రీరంగము. "అప్పిన్నది రంగమందయిన పెండ్లియచెప్పుము." ఆము. ౧, ఆ.

**రంగరి.** ద్వ. వి. (రంగు+అరి.) రంగువేయువాఁడు. (దీనినే రంగారియని వాడుదురు.)

**రంగరించు.** దే. స. క్రి. రంగలించునకు మొదటిరూపము.

**రంగలించు.** దే. స. క్రి. ద్రవములేనివస్తువుతో ద్రవవస్తువునుచేర్చి చూపుడువ్రేలికొనతో మర్దించు.

**రంగవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) ముగ్గు.

**రంగాజీవుఁడు.** సం. వి. అ. పుం. 1. చిత్తరువువ్రాయువాఁడు; 2. నట్టువుఁడు.

**రంగాయించు.** దే. స. క్రి. రంగుచేయు.

**రంగు.** వై. వి. 1. వర్ణము; 2. కాంతి*.

**రంగుగా.** వై. క్రి. విశ. సొంపుగా.

**రంగుపాణి.** వై. విశ. ఎఱుపురంగువేసిన.

**రంజకము.** సం. వి. అ. న. ఇంగిలీకము.

**రంజకుఁడు.** సం. వి. అ. పుం. 1. రంజించువాఁడు; 2. రంగు వేయువాఁడు.

**రంజనము.** సం. వి. అ. న. 1. ఇంగిలీకము; 2. ఎఱ్ఱగంధము. పుం. రంజించునది.

**రంజని.** సం. వి. ఈ. స్త్రీ. నీలిచెట్టు.

**రంజించు.** సం. ప్రే. రంజిల్లఁజేయు.

**రంజిల్లు.** సం. అ. క్రి. 1. ఎఱ్ఱనగు; 2. అనురాగముపొందు.

**రంజేకము.** దే. వి. తుపాకిచెవినికాల్చుటకుపెట్టెడుమందు.

**రంజేణ.** దే. వి. గాదెవంటికోఁగు.

**రంజేణి.** దే. వి.———పై.———

**రండ.** సం. వి. ఆ. స్త్రీ. 1. విధవ; 2. ఎలుకచెవి†.

**రంతి.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) క్రీడించువాఁడు.

**రంతు.** వై. వి. 1. రతి; "ఎ, గీ. దారువనవీధిశీతాంశుధరునిరంతు, శౌరిగోపాలకామినీచౌర్యకేళి, కామరసభావములుమించికానఁబడఁ గఁ, దీర్చియిడుపులయందుఁజిత్రించినారు." నై. ౭, ఆ. – 2. క్రీడ*. (చూ. రంతుకాఁడు.)

**రంతుకాఁడు.** ద్వ. విశ. క్రీడాపరుఁడు. "వ. ఆరంతుకాంద్ర కళపులువిని." (ఇక్కడ క్రీడాపరుఁడనఁగా ద్యూతక్రీడాపరుఁ డని అర్థము.) హరి. ఉ. 3, ఆ.

**రంధ్రము.** సం. వి. అ. న. 1. బెజ్జము; 2. సందు; 3. దూఱు.

**రంపె.** దే. వి. 1. మాదిగవాఁడు తోలుకోసెడుసాధనవిశేషము; 2. తాటాకులు మట్టగించికోసెడు సాధనవిశేషము. (మొదటి రూపము రంపియ.)

**రంపెలాఁడి.** దే. విశ. (రంపెలు+ఆఁడి.) రాక్షసకృత్యముకల ఆఁడుది. "సీ. చించివైచుటెకానిచీరలిచ్చినఁగటీరమునఁగైసేయ దారంపెలాఁడి." పంచ. వేం. 3, ఆ.

**రంభ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొక అప్సరస్త్రీ; 2. అరఁటిచె. అ. పుం. ము. బ్రహ్మచారిధరించెడు వెదురుకోల.

**రంహస్సు.** సం. వి స్. న. వడి. విశ. వడిగలది.

**రకము.** దే. వి. దినుసు. (ఇది మంచిరకము.) విశ. 1. శ్రేష్ఠము; "ద్వి. రకమైనశంఖంబురమ్యకంఠముగ." విష్ణు. ఉ. ౫, ఆ. - 2. సుందరము. "రకమైనజంఘలమకరలీలాయోగము." శశాం. 3, ఆ.

**రక్కసి.** వై. వి. 1. రాక్షసి; 2. రాక్షసుఁడు. "కల్లరిజంకరక్కసియుసుబలగొంగ." అచ్చ. యు, కాం.

**రక్కసీఁడు.** ద్వ. వి. (రక్కసి+ఈఁడు.) రాక్షసుఁడు. "సీ. కదలకపెన్నిధిఁగాచుదయ్యంబులురచ్చరావులబొమ్మరక్కసీలు." కవిక. ర, ఆ. (స్వార్థమున ఈఁడు.)

**రక్కసుఁడు.** వై. వి. 1. రాక్షసుఁడు; 2. నైరృతి. "మ. మల సూ డగ్గి జముండు రక్కసుఁడు నీర్పైతాల్పురా గాడ్పు జి, క్కులటేఁడుఙ్ విసదారితాలుపును బల్కుంబోటిగేస్తుండు పు, ల్గులరాడాల్దొరయుఙ్ మొదల్గలుగు వేల్పుల్ గొల్వ." నీలా. ౨, ఆ.

**రక్కసులగొంగ.** ద్వ. వి. విష్ణువు, దైత్యారి..

**రక్కెస.** వై. వి. రాక్షసస్త్రీ. "క. ఏతెంచుపాండుపుత్రుని, కేతనముననుండిపోరికిఙ్ మలసెడున, వ్వాతూలసుతునిఁగనిసం, జాతస్మరణములరక్కెసలుతమలోనఙ్." జై. ౫, ఆ. – విశ. అయుక్తము*. "క. ఆలంబులోనరక్కెస, మేలంబులుగలవె." ఉ, హరి. ౬, ఆ. "రక్కెసమాటలు." "రక్కెసతాల్మి." భార. ఉద్యో. 3, ఆ. దే. వి. వృక్షవిశేషము.

**రక్కొను.** దే. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. లేఱుకొను; "ఉ. చక్కరవింటిరాజు నగవాపునితోనెదిరించిపడ్డనాఁ, డెక్కడనుండితీవ్రమధుఁ డెక్కడనుండెనుమందమారుతం, బెక్కడనుండెసిగ్గువడరేమిపుడాతఁడదృష్టరేఖచే, రక్కొనివిక్రమంబుదికిరాఁజనవర్ణయినారుగాళశి." విజ. 3, ఆ.–3. కలుగు. "క. మ్రొక్కినఁదేతులుగోయుట, రక్కొనుసేమమ్ముఁవంటిరాజులయందుఙ్." శమీ. 3, ఆ. (రెక్కొను యొక్కరూపాంతరము.)

**రక్తకము.** సం. వి. అ. పుం. 1. పెద్దగోరంటచె; 2. తోఁపుచీర; 3. మంకెనచె. డు. అనురాగముగలవాఁడు.

**రక్తప.** సం. వి. ఆ. స్త్రీ. 1. జలగ; 2. డాకిని. పుం. డు. నైరృతుఁడు.

**రక్తపుచ్ఛిక.** సం. వి. ఆ. స్త్రీ. నలికండ్లపాము.

**రక్తఫల.** సం. వి. ఆ. స్త్రీ. దొండచె.

**రక్తము.** సం. వి. అ. న. 1. నెత్తురు; 2. కుంకుమ; 3. కుంకుమపువ్వు; 4. రాగి. పుం. ఎఱుపు. విశ. 1. ఎఱ్ఱనిది; 2. అనురాగముగలది; 3. రంగువేయఁబడినది.

**రక్తసంధ్యకము.** సం. వి. అ. న. చెంగలువ.

**రక్తసరోరుహము.** సం. వి. అ. న. 1. ఎఱ్ఱదామర; 2. కుంకుమపువ్వు.

**రక్తాంగము.** సం. వి. అ. న. 1. కుంకుము; 2. పగడము. పుం. 1. కంపిల్లముచె; 2. నల్లి. డు. అంగారకుఁడు.

**రక్తాక్షి.** సం. వి. స్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**రక్తాశ్మము.** సం. వి. స్. పుం. కావిజాయి.

**రక్తి.** సం. వి. ఇ. స్త్రీ. రాగము, అనురాగము.

**రక్తిమ.** సం. వి. న్. పుం. రక్తవర్ణము. (రూ. రక్తిమము.)

**రక్తైరండము.** సం. వి. అ. పుం. పేరాముదపుచెట్టు.

**రక్తోత్పలము.** సం. వి. అ. న. ఎఱ్ఱదామర, కెందమ్మి.

**రక్ష.** సం. వి. ఆ. స్త్రీ. 1. రక్షణము; 2. రక్షణమునకై బిడ్డలు మొదలైనవారికి కట్టెడు మూలికలోనగునది; 3. రక్షణమునకై నొసటఁబెట్టుకొనుహోమభస్మము; 4. లక్క.

**రక్షకుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) రక్షించువాఁడు.

**రక్షణము.** సం. వి. అ. న. రక్షించుట, కాపు.

**రక్షస్సు.** సం. వి. స్. న. రాక్షసుఁడు.

**రక్షి.** సం. విశ. (న్. ఈ. న్.) రక్షించువాఁడు.

**రక్షించు.** సం. స. క్రి. రక్షణముచేయు, కాపాడు.

**రక్షితము.** సం. విశ. (అ. ఆ. అ.) రక్షింపఁబడినది.

**రక్షితవ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) రక్షింపఁదగినది.

**రక్షివర్గము.** సం. వి. అ. పుం. అంగరక్షకసమూహము.

**రక్షము.** సం. వి. అ. పుం, న. రక్షించుట.

**రక్ష్యము.** సం. విశ. (అ. ఆ. అ.) రక్షింపఁదగినది.

**రగులు.** దే. అ. క్రి. మంటయెత్తు.

**రగులుచు.** దే. ప్రే. రగులఁజేయు.

**రచన.** సం. వి. ఆ. స్త్రీ. మాల్యాదినిర్మాణము. అ. న. ము. నిర్మాణము.

**రచించు.** సం. స. క్రి. నిర్మించు, పన్ను. (రూ. రచియించు.)

**రచితము.** సం. విశ (అ. ఆ. అ.) రచియింపఁబడినది.

**రచ్చ.** వై. వి. 1. రాజమార్గము; "ఉ. ఆయెడరోహపుత్రయగు నాతనిసూనుఁడురచ్చసాడఁగా." పంచ. నా. ౧, ఆ.–2. మండపము*; "సీ. రచ్చలుక్రంతలు రాజమార్గంబులు విపణిదేశంబులు విశదములుగఁ, జేసిరి." భాగ. ౧౦, స్కం. పూ. – 3. సభ*; "వ. రచ్చలోకివచ్చిబాసయిచ్చిపొమ్మనిపుడమి ఱేఁడునాడినమాటదాఁటఁగూడునే." ఉ, రా. ౮, ఆ. – 4. గోష్ఠి*; 5. కలకలము*; "చ. వనరుహాకందమూలఫలవారిలవంబులె యాత్మవృత్తిసా, ధనములోనర్చుచుఙ్ శ్రుతిహితస్వరవైఖరులుచ్చరించుచుఙ్, మనుశుభ దీప్తిదీక్షభువనద్విజరాజాల రచ్చ

లచ్చటకౕ, గనుఁగొని సాంద్రవిస్మయ వికాసవిభాసితమానసాబ్జుఁడై.'' హన. ౩, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)—6. కలహము*. ''క. అజుఁడరుగుదెంచిగురునిఁౕ, రజనీకరుఁగాంచియిట్టి రచ్చలుగలవే, గజిబిజివలదనితారా, గజయానంజేరఁబోయి గ్రక్కునఁ బలికెఁౕ.'' శశాం. ౫, ఆ.

**రచ్చకొట్టము.** వై. వి. రచ్చె, మండపము. ''సీ. బ్రాహ్మణక్షత్రియోరవ్యశూద్రప్రముఖులు నిల్వఁదగు రచ్చకొట్టములును.'' ఉ, రా. ౮, ఆ.

**రచ్చగొను.** ద్వ. అ. క్రి. (రచ్చె+కొను.) గుంపుగూడు. ''వ. అచ్చెరువడివియచ్చరులువచ్చి రచ్చగొనిసూడ.'' రామా. ౫, ఆ.

**రచ్చపట్టు.** ద్వ. వి. రచ్చకొట్టము. ''ఎ, గీ. కనకనగసీమఁగల్పవృక్షములనీడఁ, బచ్చజాచట్టుగమిరచ్చపట్టుమాకు.'' స్వా. ౩, ఆ.

**రచ్చబండ.** ద్వ. వి. రచ్చచేయుకాలమందు పదిమంది కూర్చుండెడుబండ. (ఇట్లు రచ్చబల్ల.)

**రచ్చమ్రాను.** ద్వ. వి. రచ్చసేయుచోట నీడకైపెట్టిన మ్రాను.

**రజకుఁడు.** సం. వి. అ. పుం. చాకలవాఁడు, నిర్ణేజకుఁడు.

**రజతము.** సం. వి. అ. న. 1. వెండి; 2. హారము; 3. ఏనుఁగుకొమ్ము. విశే. తెల్లనిది.

**రజతాద్రి.** సం. వి. ఇ. పుం. వెండికొండ, కైలాసము.

**రజని.** సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. పసుపు; 3. కోరింద†; 4. నీలిచెట్టు.

**రజనీముఖము.** సం. వి. అ. న. ప్రదోషము, మునిమాపు.

**రజస్వల.** సం. వి. ఆ. స్త్రీ. ముట్టుది. అ. పుం. ము. దున్నపోతు.

**రజస్సు.** సం. వి. స్. న. 1. ఒక గుణము; (చూ. గుణము.) 2. దుమ్ము; 3. ముట్టునెత్తురు; 4. పుప్పొడి. (సూ. రజము.)

**రజా.** హిం. వి. సెలవు.

**రజ్జువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. త్రాడు; 2. ఆఁడుదానిజడ.

**రజన.** దే. వి. గడన, సంపాదనము.

**రజాయి.** దే. వి. చెలికికప్పుకొనెడు దుప్పటి.

**రజ్జన.** దే. వి. ఆత్మస్తుతి, వికత్థనము. ''రిత్తరజ్జనఁబనిదీరునే వెడఁగ.'' హరి. పూ. ౯, ఆ.

**రజ్జె.** దే. అ. క్రి. ప్రేలు. (చూ. గొజ్జెఁగ.) వి. 1. వ్యర్థభాషణము; (చూ. ఇలువడి మొదటియర్థము.) 2. (చూ.) రజ్జన. ''క. సమరమునగెల్చియొరురా, జ్యముగొనియును సుజనుఁడిట్టులాడఁడుసిరిజూ, దమునఁగొని రజ్జలేటికి, సమయంబరుదెంచెఁదొంటిచందముగలదే.'' ''సం. తథాభిగమ్యవిత్తానికో వికత్థే ద్విచక్షణః.'' భార. విరా. ౪, ఆ.

**రజ్జెలాఁడి.** దే. విశే. (రజ్జెలు+ఆఁడి.) 1. వ్యర్థభాషణురాలు; 2. ఆత్మస్తుతిపరురాలు.

**రజ్జెలాఁడు.** దే. విశే. (రజ్జెలు+ఆఁడు.) 1. వ్యర్థభాషణుఁడు; 2. ఆత్మస్తుతిపరుఁడు. ''ఉ. వారిభూరిశౌ, ర్యాయుధనైపుణక్రియలయందుఁబదాఱవపాలుఁబోలఁడీ, వాయుపురజ్జెలాఁడు.'' భార. అర. ౬, ఆ.

**రటనము.** సం. వి. అ. న. ధ్వని, మ్రోఁత.

**రటితము.** సం. వి. అ. న. నిష్ఫుమంటమ్రోఁత, రెపరెప.

**రట్టడి.** దే. విశే. నింద్యము. ''క. చిట్టులిగిత్రేతలొగిఁదన, రట్టడిచందములఁదెలిపి రాయిడి పెట్టఁౕ.'' నీలా. ౧, ఆ.

**రట్టు.** యు. దే. వి. దూఱు, నింద. ''తే. హరిపురాభోగవార్తవింపపుడు వారి, మదిఁబొడమఁ దలపోసిరట్టిదియటంచు.'' రాఘ. ౩, ఆ.—వై. ఉపద్రవము. ''ఉ. రట్టొనరించునూరుపులురంజకపుంబొగచందమందఁగఁౕ.'' చంద్ర.

**రడి.** దే. వి. రడ్డియొక్కరూపాంతరము.

**రడ్డి.** దే. వి. రెడ్డియొక్కరూపాంతరము. (చూ. గుడ్డము.)

**రణనము.** సం. వి. అ. న. ధ్వని, మ్రోఁత.

**రణము.** సం. వి. అ. పుం, న. యుద్ధము. పుం. మ్రోఁత. డు. కొడుకు.

**రణితము.** సం. వి. అ. న. మ్రోఁత. విశే. మ్రోసినది.

**రతనపుగని.** వై. వి. (రతనము+గని.) సముద్రము, రత్నాకరము. ''క. నీవువేఱొండుతలం, పునమండినవీరతనపు, గనినిందిఁకనొరుఁడుదాటఁగలఁడేచెపుమా.'' అచ్చ. కిష్కిం, కాం.

**రతనపువిల్లు.** ద్వ. వి. (రతనము+విల్లు.) ఇంద్రధనుస్సు.

**రతనము.** వై. వి. మణి. ''లచ్చిరతనంబునుమచ్చయెదందలిర్పరంజిల్లెడువాని.'' రామా. 3, ఆ.

**రతము.** సం. వి. అ. న. 1. సురతము; 2. ఆఁడుగుఱి. విశే. ఆసక్తము.

**రతి.** ఉభ. దే. వి. 1. పచ్చలతూనికయందొకయెత్తు; ''సీ. అతివినోదముగాఁగ రతులఁదేలించునీ పచ్చలకడియాలపద్మగంధి.'' విజ. ౧, ఆ.—2. మణుఁగునందు ఇరువదైదవభాగము.—సం. ఆ. స్త్రీ. 1. సురతము; 2. మన్మథునిభార్య; 3. అనురాగము; 4. ఆఁడుగుఱి.

**రతిపతి.** సం. వి. ఇ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**రత్నగర్భ.** సం. వి. ఆ. స్త్రీ. భూమి, పుడమి, నేల.

**రత్నగర్భుఁడు.** సం. వి. అ. పుం. 1. సముద్రుఁడు; 2. కుబేరుఁడు.

**రత్నము.** సం. వి. అ. న. 1. మణి; (మరకతాద్యశ్మజాతి మౌక్తికాద్యనశ్మజాతియు.) (నవరత్నములు.-మౌక్తికము, పద్మరాగము, వజ్రము, ప్రవాళము, మరకతము, నీలము, గోమేధికము, పుష్యరాగము, వైడూర్యము.) 2. స్వజాతియందు శ్రేష్ఠమయినది.

**రత్నసానువు.** సం. వి. అ. పుం. మేరుపర్వతము, బంగరుకొండ.

**రత్నాకరము.** సం. వి. అ. పుం. సముద్రము, రతనపుగని.

**రత్ని.** సం. వి. ఇ. పుం, స్త్రీ. పిడివెలితిమూర. (చిటికెనచాఁచిన పిడిమూర అరత్ని.)

**రథకడ్య.** సం. వి. ఆ. స్త్రీ. రథములసమూహము.

**రథకారుఁడు.** సం. వి. అ. పుం. 1. తేరుచేయువాఁడు; 2. వడ్లవాఁడు.

**రథగుప్తి.** సం. వి. ఇ. పుం. చక్రరంధ్రములఁజొప్పించెడునెమ్ములు. పులితోలులోనగువానిచేనేర్పఱచిన రథముమీఁదికప్పు. (అని కొందఱు.)

**రథద్రువు.** సం. వి. ఉ. పుం. తినాసము†.

**రథము.** సం. వి. అ. పుం. 1. తేరు; (బృహస్పతిరథము నీతిఘోషము, అర్జునునిరథము నందిఘోషము, విష్ణురథము శతానందము.) 2. శరీరము; 3. తినిశము†; 4. వేతసము†.

**రథాంగము.** సం. వి. అ. న. రథచక్రము. పుం. చక్రవాకము.

**రథాంగాహ్వయము.** సం. వి. అ. పుం. చక్రవాకము.

**రథి.** సం. వి. న్. పుం. 1. రథమునెక్కువాఁడు; 2. రథమునెక్కి యుద్ధముచేయువాఁడు.

**రథికుఁడు.** సం. వి. అ. పుం. రథమునెక్కి యుద్ధముచేయువాఁడు.

**రథిరుఁడు.** సం. వి. అ. పుం. ——పై.——

**రథ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. రథసమూహము; 2. రాజమార్గము; 3. మార్గము. అ. పుం. ము. రథమునీడ్చెడు గుఱ్ఱములొనగునది. (కృష్ణునిరథ్యములు.—సైన్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకము.)

**రదనచ్ఛదము.** సం. వి. అ. పుం. పెదవి, పలుకప్పు.

**రదనము.** సం. వి. అ. పుం. పల్లు, దశనము.

**రదము.** సం. వి. అ. పుం.——పై.——

**రద్ది.** దే. వి. 1. అల్లరి; "క. ముద్దులకొమరుని వ్రేతల, రద్దులకెల్లి త్రోల రజ్జునఁగట్టక." భాగ. ౨, స్కం.—2. గొప్పధ్వని. "సీ. గళరవంబులరద్దిగాఁజెలంగింపఁగాఁ బలుమాఱుమెల్లనఁబల్కు మను చు." అని. 3, ఆ.

**రద్దు.** దే. వి. అల్లరి. (రద్దియొక్కరూపాంతరము.) కొట్టివేఁత, తీసివేఁత.

**రపణము.** దే. విశే. గొప్ప. "రపణంపు టెమ్ముముత్తెపుకంటసరి తోడ." పాంచా. 3, ఆ.

**రపము.** దే. వి. చెల్లుబడి. "ఎ, గీ. ఒకటినొక్కటినడ్డసేయక మెలంగు, నాపాలంబునఁ దమరపంబై మెకములు." సా. ౧, ఆ. (చూ. పాళెగాఁడు.)

**రప్పించే.** దే. ప్రే. రాఁజేయు. (ధాతువు వచ్చే.)

**రప్పా.** హిం. వి. పోగుతీయుట.

**రభసము.** సం. వి. అ. పుం. 1. వేగము; 2. సంతోషము.

**రమ.** సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి. అ. పుం. ము. రక్తాశోకము*.

**రమణ.** ఉభ. వై. వి. 1. ఒప్పిదము*; "క. అమరపతిఖాండవ మునకు, రమణనువైశ్రవణచైత్ర రథమునకునమా, నముగాదినిని భూభా, గమునకురచియించెనొక్కొకమలజుఁడుదయక." భార. ఆది. ౪, ఆ.—2. ప్రీతి*; "సీ. కీడు, రాకుండనారసిరక్షింతు నాశరీరప్రాణములయట్లురమణతోడ." వి. పు. ౭, ఆ.—3. విధము*. "ఆ. ఎలమితోడలేమికలిమివాటింపని, రమణనునికియజగర వ్రతంబు." భార. శాం. ౪, ఆ. — సం. విశే. (అ. ఆ. అ.) మనోజ్ఞ.

**రమణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. క్రీడించునట్టి ఆఁడుది; 2. ఆఁడుది.

**రమణించే.** వై. అ. క్రి. ఒప్పిదమగు. "ఎ, గీ. అప్పురంబునర మణించెసూర్యవయము." నిర్వ. ౧, ఆ.

**రమణీయము.** సం. విశే. (అ. ఆ. అ.) ఒప్పిదమైనది.

**రమణుఁడు.** సం. వి. అ. పుం. 1. మగఁడు; 2. మన్మథుఁడు విశే. మనోజ్ఞుఁడు.

**రమరమి.** దే. అవ్య. క్రి. విశే. రమారమియొక్కరూపాంతరము.

**రమారమి.** దే. అవ్య. క్రి. విశే. ఇంచుమించు.

**రమించే.** సం. అ. క్రి. 1. క్రీడించు; 2. సంభోగించు. (రమియించు అనియు.)

**రమ్య.** సం. వి. ఆ. స్త్రీ. రాత్రి. అ. న. ము. పొట్లవేరు. పుం. సంపెఁగ*. విశే. ఒప్పిదమైనది.

**రమ్యకము.** సం. వి. అ. న. భారతాదివర్షములలో నొకటి. (చూ. వర్షము.)

**రయము.** సం. వి. అ. పుం. 1. వేగము; 2. ప్రవాహము.

**రల్లకము.** సం. వి. అ. పుం. కంబళి.

**రవ.** వై. వి. 1. అణువు; "పుష్పొడిరవ." య. ౫, ఆ.—2. ఖండము*; "శే. తళుకువజ్రంపురవలయందంబుగులుక." అని. 3, ఆ.—3. వజ్రము*; "క. కవిలేనిరాజుకీర్తియు, రవిలేనినభంబు రూపరకభావములం, జవిలేనిభామపొందును, రవలేనివిభూషణం బురహిఁసరసింహా." కా. ౫, ఆ. — 4. రవగాలు*; "సీ. సింగంపుఁగొదమతేజరావురవ్రొక్కఁబొగరెక్కిత్రిశిరుండు దగిలె వెడలె." రామా. ౭, ఆ. — విశే. సన్నము*. "రవదువ్వ." "రవగాడ్పు." చంద్ర.

**రఁకారము.** దే. వి. పలుచనైన గచ్చుపూఁత.

**రవగాలు.** ద్వ. వి. అశ్వగతివిశేషము. (చూ. అస్కందితము.) "సీ. రవగాలునకుసాటిరాకగాడ్పుపటానిపొదలుసిగ్గునఁబోయిపొద లుచొచ్చు." ఉ, రా. ౧, ఆ.

**రవడి.** దే. వి. అప్పు, ఋణము.

**రవణ.** వై. వి. రమణయొక్కరూపాంతరము. (ఒప్పిదమునకు. — "రగడ. రవణరంజిలుసుమపరాగములరాగముల." భాను. ౨, ఆ.)

**రవణము.** ఉభ. వై. వి. భూషణము*. రవణముల్ దిగిచిచీరచెఱం గుతోఁగట్టివైచిన." అచ్చ. సుం, కాం.—సం. విశే. (అ. ఆ. అ.) మ్రోఁగునది.

**రవణించు.** వై. అ. క్రి. రమణించుయొక్కరూపాంతరము. "సీ. అమరేంద్రముక్తమేఘములఁదెచ్చుక్రమంబురవణించిమించివాయువులువిసరె." దశా. ౭, ఆ.

**రవపాళెము.** ద్వ. విశే. మిక్కిలి సన్నపాటిది. (వస్త్రము.)

**రవమంచము.** సం. వి. అ. పుం. నకినలమంచేము.

**రవము.** సం. వి. అ. పుం. 1. ధ్వని; 2. కంఠధ్వని.

**రవరవ.** దే. వి. 1. మొరయుటయందగు ధ్వన్యనుకరణము; "క. మొరసెక, రవరవమురజరవంబులు." ప్ర. ౪, ఆ.—2. కాంతివిశేషము; "క. రమణునికడకనుపమనో, రమకుఁ మజ్జనముదీర్చి రవరవకపము, ఘమునకుగాలాగరుధూ, పమువెట్టిజవాదినంటు వాపినిపుణతక." ప్రా. ౬, ఆ. — 3. స్పర్ధ. "క. రవరవలు నెఱపునీలవు, రవరవణముతోఁడఁజెలియరాళికచంబుల్." (నీలశబ్ద విశేషణముచే నిక్కడరవశబ్దము రత్నసామాన్యమగుచున్నది.) విజ. ౧, ఆ.

**రవళి.** వై. వి. ధ్వని. "సీ. ఋషికిఁగోర్కులొసంగనిదివేళయనురీతి రతసంపుటంబులయల్ రవళియొనఁగ." చంద్రా. 3, ఆ. (రూ. రవలి.)

**రవళించే.** వై. అ. క్రి. ధ్వనించు. "ద్వి. రవళించిదాఁటుసా మ్రాణిశేజలు." (ఇక్కడ ధ్వనించుటయనఁగా సకిలించుట.) పారిభ్ర. ౧, భా.

**రవాణా.** హిం. వి. పంపుట.

**రవాయి.** దే. వి. కృత్రిమపద్మరాగమణి.

**రవాలు.** ద్వ. వి. రవగాలుయొక్కరూపాంతరము.

**రవాళి.** వై. వి. రవళియొక్క రూపాంతరము. "సీ. కెరలినెమ్మలు సేయుకేకారవమ్ములు లావుకలెత్తునీలలరవాళి." చంద్రా. ౩, ఆ.

**రవాళించు.** వై. అ. క్రి. రవళించుయొక్క రూపాంతరము.

**రవి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు. న్. జీవ్రుఁడు.

**రవేసు.** హిం. వి. రుసుము.

**రశన.** సం. వి. ఆ. స్త్రీ. పదియాఱుపేటలుగల ఆఁడుదాని మొల నూలు.

**రశ్మి.** సం. వి. ఇ. పుం. 1. వెలుఁగు; 2. పగ్గము; 3. ఱెప్ప.

**రస.** సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. రసాతలము; 3. నాలుక; 4. అందుగుచెట్టు; 5. చిఱుబొద్దిచెట్టు; 6. కొఱ్ఱలు.

**రసంగి.** దే. వి. ధాన్యవిశేషము.

**రసకర్పూరము.** సం. వి. అ. పుం, న. కర్పూరరసము.

**రసగర్భము.** సం. వి. అ. న. 1. రసాంజనము; 2. ఇంగిలీకము.

**రసగుండు.** మి. గ్రా. వి. రసముపూసిన గోళాకారవస్తువు.

**రసజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. నాలుక.

**రసజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. పండితుఁడు. విణ. రసికుఁడు.

**రసదాడి.** వై. వి. 1. ఒకదినుసు చెఱకు. (చూ.) పుండ్రముచెట్టు; "సీ. రసదాడిచెఱకుతోఁబ్రతివెట్టిచెఱకైనఁ జానవాలెఱ ప్రతిచక్కెరగును." చంద్ర. — 2. ఒకదినుసు అరఁటిచెట్టు*. "సీ. రసదాడి సరివదరచనగానకపోల్చి యనువైనతలఁపులు గనకనిల్పి." చంద్రా. ౧, ఆ.

**రసదాళిక.** సం. వి. ఆ. స్త్రీ. చెఱకుదినుసు. (చూ.) పుండ్రముచెట్టు.

**రసన.** సం. వి. ఆ. స్త్రీ. 1. నాలుక; 2. (చూ.) రశన.

**రసము.** సం. వి. అ. పుం. 1. పాదరసము; 2. బోళము; 3. జలము; 4. శృంగారాది; (ఇవి తొమ్మిది.—శృంగారము, హాస్యము, కరుణము, వీరము, రౌద్రము, భయానకము, బీభత్సము, అద్భుతము, శాంతము. మతాంతరములఁబట్టి యీసంఖ్య యెచ్చు తక్కువలగును.) 5. కషాయాది; (ఇవి ఆఱు. — కషాయము, మధురము, లవణము, కటువు, తిక్తము, అమ్లము.) 6. రుచి; 7. పసరు; 8. అనురాగము; 9. వీర్యము; 10. దేహధాతు విశేషము; 11. ద్రవము; 12. విషము.

**రసవతి.** సం. వి. ఈ. స్త్రీ. వంటయిల్లు, మహానసము.

**రసవాదము.** సం. వి. అ. పుం. పాదరసమునుకట్టి బంగారు చేసెడువిద్య.

**రసాంజనము.** సం. వి. అ. న. అంజనవిశేషము.

**రసాతలము.** సం. వి. అ. న. పాతాళలోకము.

**రసాయనము.** సం. వి. అ. న. 1. జరావ్యాధులనుపోఁగొట్టెడి యౌషధవిశేషము; 2. మజ్జిగ; 3. విషము. పుం. విడంగముచెట్టు. డు. గరుత్మంతుఁడు.

**రసాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. సిగరి; 2. చేక్కెర; 3. నాలుక; 4. గఱికచెట్టు; 5. తెల్లనేలగుమ్ముడుచెట్టు. అ. న. ము. 1. చిల్లమడ్డి; 2. బోళము పుం. 1. చెఱకుచెట్టు; 2. మామిడిచెట్టు.

**రసి.** దే. వి. పుంటిచీము.

**రసిక.** ఉభ. దే. వి. రసియొక్క రూపాంతరము. సం. ఆ. స్త్రీ. 1. చెఱకుపాలు; 2. సిగరి. విణ. రసికురాలు.

**రసికుఁడు.** సం. విణ. (అ. ఆ, ఈ. అ.) రసమునెఱిఁగినవాఁడు.

**రసితము.** సం. వి. అ. న. 1. మేఘగర్జనము; 2. ధ్వని. విణ. 1. మొలాముచేయఁబడినది; 2. ధ్వనించినది.

**రసీదు.** ఆం. వి. చెల్లుపత్రము.

**రసోనకము.** సం. వి. అ. పుం. వెల్లుల్లిచెట్టు.

**రస్తు.** దే. వి. వస్తుసంభారము. "ఉ. వారలుఘనంబుగమార్గము అడ్డగించినన్, సన్నుతశౌర్యరస్తుమనసైన్యముఁజేరుటదుస్తరంబగున్." కృష్ణ. 3, ఆ. "చ. పరఁగెదురస్తుకొట్టడులభద్రముగా నాఁగిబీగముద్రలన్, గరిమనొనర్చి." హంస. ౧, ఆ.

**రహటము.** సం. వి. అ. పుం. రాట్నము

**రహటు.** వై. వి. రట్టు, రాటు, ఉపద్రవము.

**రహదారి.** హిం. వి. సామాన్యముగా సందలు పోఁదగినది.

**రహస్య.** సం. వి. ఆ. స్త్రీ. ఒకయేఱు. అ. న. ము. ఏకాంతము. విణ. దాఁచఁదగినది.

**రహస్సు.** సం. వి. స్. న. 1. ఏకాంతము; 2. సురతము.

**రహి.** దే. వి. 1. ఆనందము; "క. ఆగంధర్వకుమారుఁడు, నాగజగమనయుఁ బ్రఫుల్లహల్లకతల్పా, భోగంబున రహి మిగులఁగ, భోగింపందొడఁగి రాత్మఁబొంగెడికాంక్షన్." స్వా. 3, ఆ.— 2. ఆసక్తి; "ఇం, చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులుగీటుచు నేర్పుచున్నదో." పా. ౧, ఆ.—3. తెలివి; "చ. లలితరసోప భోగదశలన్ రహివీడ్కొని జర్జరాకృతిన్, దెలతెలనైవడంకుకుల దీపమపాకృతరశ్మిబంధమున్, గళితశిఖాప్రకాండమును గాఁగని తత్తపసీయకాంతియున్, దలరివిరాగయైనవిత్ఫధా మము సేరఁగడంగ నయ్యెడన్." వాస. ౪, ఆ.—4. బాగు; "ఎ, గీ. కటకకేయూర రచనాదికనకమునకు, నలరుమైజిగివన్నియలతిశయింపఁ, దొడవు లకునెల్లఁదనమేను తొడవుగాఁగ, రహివహించుచునుండెసారాజ వదన." అని. ౫, ఆ.—5. రక్తి; "సీ. రహిపుట్టజంత్రగాత్ర ములజాల్ గరఁగించువిమలగాంధర్వంబువిద్యమాఱు." స్వా. ౩, ఆ.—6. విధము. "క. అయ్యనవద్యగుణావని, యయ్యనమంత్రి మణి నరసమాంబ వివాహం, బయ్యెనహార్యకుమారిని, నెయ్యంబునఁబెండ్లియైననెలతాల్పురహిన్." ఉ, రా. ౧, ఆ.

**రహించు.** దే. అ. క్రి. 1. ఒప్పు; "చ. ఇహపరసాధకంబన రహించు ప్రబంధమొనర్ప శ్రీరఘూ, ద్వహునిచరిత్రముం దొరకె." ఉ, రా. ౧, ఆ.—2. వర్ధిల్లు. "ద్వి. విష్ణుమాయ, యందెపుట్టు రహించునడఁగులోకములు." విష్ణు. పూ. ౧, ఆ. (రహియించు అనియు.)

**రహితము.** సం. విణ. (అ. ఆ. అ.) విడువఁబడినది.

## రా.

**రా.** యు. దే. అవ. ర అనుదానియొక్క రూపాంతరము. (పీశో ద్దేశమునకు.—"కానీరా." ఆము. ౬, ఆ.—మిత్రోద్దేశమునకు.— "రారానందకుమారక." — ప్రశంసార్థకశబ్దములకు అనుప్రయుక్త మగుటకు.—'ఘోరావలరాచవేగిరము.' ఉ, హరి. ౫, ఆ.) విణ. రాయిశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. వై. రాచశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "క. రాచందముగలరాముఁడు, రాచందముమాన్పెఁదపసిరాబానకుసా, రాచతురాశ్వోపాస్య, శ్రీచతుర పదాంబుజాణురేణువ్యాప్తిన్." రామా. ౪, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**రాంకవము.** సం. విణ. (అ. ఆ, ఈ. అ.) మృగరోమములవలన నేయఁబడినది. (సాలువులోనగునది.)

**రాంభము.** సం. వి. అ. పుం. వ్రతి చేతఁబట్టెడు వెదురుకోల.

**రాఁజు.** దే. అ. క్రి. నిప్పు అంటుకొను. "సీ. ఇల్లిల్లుదిరుగ నాక్కొంతబ్బుశిఖి యబ్బెనే నింటిలోపూరినిడివిసరక, రాఁజదు రాఁజినరవ్వలుకోల్పోసాలఁగానికల్లదు." ఆము. ౪, ఆ.

**రాఁబట్టు.** దే. స. క్రి. (రాన్+పట్టు.) 1. ఇచ్చినదాని మరలఁ దీయు; 2. సేకరించు.

**రాక.** ఉభ. దే. వి. అగమనము. సం. ఆ. స్త్రీ. 1. సంపూర్ణ కళలుగల చంద్రునితోఁగూడినపున్నమ, 2. ఒకయేఱు; 3. తీఁట; 4. సమర్తాడినది.

**రాకడ.** దే. వి. రాక, ఆగమనము. (చూ. పోకడ.)

**రాకాసి.** వై. వి. 1. రాక్షసి; 2. రాక్షసుఁడు. "క. ఈకరణిం బదిమొగములు, రాకాసియొసర్చినట్టిరాయిడిచేతన్, జీకాకగుచును వేలుపు, లాకజిదేవరకునొడువనరుగుచునెదుటన్." య. ౨, ఆ. (రక్కసియొక్కరూపాంతరము.)

**రాకించు.** దే. స. క్రి. మోఁదు. (చూ. నడగొట్టు.)

**రాకిడి.** దే. వి. జేడబిల్ల.

**రాకొట్టు.** దే. అ. క్రి. రారాపోరాయని యేకవచనాంతముగా నుచ్చరించు. "ద్వి. దట్టించిరాకొట్టితటిమిపైకొనుచు." భాగ. ౬, స్కం. "సీ. రాకొట్టిపిలువనిరమణిపైనలిగితే మానము ద్రయిదేమిమానిచంద్ర." చంద్రా. 3, ఆ.—స. క్రి. తిరస్కరించు. "క. రాకొమరునెఱులునీలపు, రాకొమనునిల్లాకరించు రాకాచంద్రుకన్, రాకొట్టుమొగముకెంజిగు, రాకుఁగనిపరాకుసేయు నౌరపదంబుల్." విజ. ౧, ఆ.

**రాక్షస.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. బలాత్కారమున కన్యనపహరించుకొనివచ్చిచేసికొనెడు వివాహము. (చూ. వివాహము.)

**రాక్షసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రక్కసి; 2. బలురక్కసి; 3. నల్లకచోరము.

**రాక్షసుఁడు.** సం. వి. అ. పుం. 1. రక్కసుఁడు; 2. నైరృతుఁడు.

**రాగము.** సం. వి. అ. పుం. 1. నాటలోనగునది; 2. అనురాగము; 3. రంగు; 4. మాత్సర్యము; 5. శ్లేశములోనగునది.

**రాగసూత్రము.** సం. వి. అ. న. 1. త్రాసుత్రాడు; 2. పట్టపుఁద్రాడు.

**రాగి.** ఉభ. దే. వి. 1. తవిఁదపైరు; 2. బ. తవిఁదలు. వై. వి. తామ్రము. సం. విణ. (న్. ఈ. న్.) 1. అనురాగముగలది; 2. ఎఱుపుగలది.

**రాగించు.** సం. అ. క్రి. రాగిల్లు. "క. చంచులకాంతులువెన్నెలఁ, దించియమృత ముట్టనొనఁగుచెన్నునకునురా, గించుచుఁజవినొక్కుచుఁగబ, ళించుఁజకోరికలుసమదలీలాలసలై." నిరవ. ౬, ఆ.

**రాగిల్లు.** సం. అ. క్రి. రజిల్లు.

**రాచ.** వై. విణ. రాజసంబంధి. (రాచవాఁడు, రాచది, రాచకార్యము.) "ఉ. రాచగుణంబుపోవిడిచిరాజ్యముఁగోల్పడిపిడు వెల్వడన్, ద్రోచిన." రా. యు, కాం.

**రాచపుండు.** ద్వ. వి. ప్రాణాంతకముగా వీఁపునలేచెడు మహావ్రణము. (ఇట్లు రాచకురుపు.)

**రాచపుట్టువు.** ద్వ. వి. క్షత్రియుఁడు. "క. రంగుగఁజూపఱ కోర్కులా, సంగన్దోషంబుననఁపఁజనుదెంచినయా, గంగంగని మైయల్లనఁ, బొంగందగ మ్రొక్కిరాచపుట్టువుమదిలోన్." య. ౨, ఆ.

**రాచమామిడి.** ద్వ. వి. గుజ్జుమామిడి, రాజామ్రము.

**రాచయుసిరిక.** ద్వ. వి. అమలకవిశేషము.

**రాచవాఁడు.** ద్వ. వి. క్షత్రియుఁడు.

**రాచవీడు.** ద్వ. వి. (చూ.) రాజధాని.

**రాచు.** దే. అ. క్రి. ఒరసికొను. "సీ. భూరికిగ్గిత్తులతోరాచికొన నన్నకఱకెక్కికప్పారుకంఠమొప్ప." హరి. ఉ. 2, ఆ.—స. క్రి. 1. ఒరయు; "ద్రవిడకుటుంబినుల్ పసుపురాచినరత్నపుతాఁపక్రింద." ఆము. ౧, ఆ.—2. చెఱచు; "ఉ. తపంబొనరించి పాపముల్, రాచుటయొండెఁగాకిహ పరంబులకూరక దూరమైవయు, శ్రీచనరెంటికిం జెడిన రేవణనొదునె." స్కా 3, ఆ.—3. రుద్దు.

**రాజకము.** సం. వి. అ. న. రాజులసమూహము.

**రాజకర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దదోస.

**రాజకోశాతకి.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దబీర.

**రాజదంతము.** సం. వి. అ. పుం. ముందటిపల్లు.

**రాజధాని.** సం. వి. ఈ. స్త్రీ. రాజువసించునట్టి ప్రధాననగరము, రాచవీడు.

**రాజన్యకము.** సం. వి. అ. న. రాజన్యులసమూహము.

**రాజన్యుఁడు.** సం. వి. అ. పుం. (చూ.) రాచవాఁడు.

**రాజన్వంతము.** సం. విణ. (త్. ఈ. త్.) మంచిరాజుగలది. (దేశము.)

**రాజబల.** సం. వి. ఆ. స్త్రీ. గొంతెమగోరు.

**రాజబీజి.** సం. వి. న్. పుం. రాచకులమునందుఁబుట్టినవాఁడు.

**రాజభూయము.** సం. వి. అ. న. రాజత్వము.

**రాజమార్గము.** సం. వి. అ. పుం. రథములు మొదలగునవి పోఁదగిన పెద్దత్రోవ, బాట.

**రాజమాషము.** సం. వి. అ. పుం. అలసందెలు.

**రాజయక్ష్మము.** సం. వి. న్. పుం. క్షయరోగము.

**రాజరాజు.** సం. వి. అ. పుం. 1. చక్రవర్తి; 2. కుబేరుఁడు; 3. దుర్యోధనుఁడు; 4. చంద్రుఁడు.

**రాజవంతము.** సం. విణ. (త్. ఈ. త్.) రాజుఁగలది. (దేశము.)

**రాజవృక్షము.** సం. వి అ. పుం. రేల.

**రాజవ్రణము.** సం. వి. అ. న. (చూ.) రాచపుండు.

**రాజసము.** సం. విణ. (అ. ఈ. అ.) రజోగుణమువలనఁ గలిగినది.

**రాజసూయము.** సం. వి. అ. న. ఒకరాజు తక్కినరాజులను జయించిచేసెడి యజ్ఞము.

**రాజహంస.** సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱనిముక్కు కాళ్లుగలహంస; 2. ధూమ్రవర్ణములగుముక్కు కాళ్లుఱెక్కలుగలహంస; 3. రాజశ్రేష్ఠుఁడు.

**రాజాదనము.** సం. వి. అ. న. 1. పాల; 2. మోదుగు; 3. మోరటి.

**రాజాన్నము.** సం. వి. అ. న. 1. (చూ.) రాజనము; 2. రాజులుభుజింపఁదగిన అన్నము.

**రాజామ్రము.** సం. వి. అ. పుం (చూ.) రాచేమామిడి౹.

**రాజార్కము.** సం. వి. అ. పుం. వెల్లజిల్లేడు౹.

**రాజార్హము.** సం. వి. అ. న. అగలు. విణ. రాజోనకుఁదగినది.

**రాజి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. రేఖ.

**రాజిక.** సం. వి. అ. స్త్రీ. 1. నల్లావలు; 2. వరిమడి; 3. వరుస.

**రాజితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశితము.

**రాజిలము.** సం. వి. అ. పుం. ఇరుదలపాము.

**రాజిల్లు.** సం. అ. క్రి. ప్రకాశించు.

**రాజీ.** హిం. వి. ఇష్టము, సమాధానము.

**రాజీనామా.** హిం. వి. 1. వాదిప్రతివాదులు సమాధానపడి చేసికొను ఏర్పాటు; 2. ఉద్యోగమును మానుకొనుట.

**రాజీవము.** సం. వి. అ. న. తామర. పుం. 1. మత్స్యవిశేషము; 2. మృగవిశేషము. విణ రాజును అనుసరించి జీవించునది.

**రాజ్ఞి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రాజుభార్య; 2. సూర్యునిభార్య.

**రాజ్యము.** సం. వి. అ. న. 1. దొరతనము; 2. దొరతనమునకు లోఁబడినదేశము.

**రాజనము.** వై. వి. సస్యవిశేషము. “ద్వి. జనముగలంగెరా జనముమలంగె.” విష్ణు. పూ. 3, ఆ.—బ. ధాన్యవిశేషము.

**రాజో.** సం. వి. న్. పుం. 1. తేఁడు; 2. పుడమితేఁడు; 3. రాచవాఁడు; 4. యక్షుఁడు; 5. ఇంద్రుఁడు; 6. చంద్రుఁడు. (దీనిఁగొందఱు వైకృతపదముగా వాడియున్నారు. అది చింత్యము.)

**రాటనము.** వై. వి. రాట్నము. “తే. అప్రతిష్ఠాఖ్యనరకంబు నందుదుష్ట, నరునిఁద్రిప్పుదురొగిరాటనములఁగట్టి.” మార్క. ౨, ఆ.

**రాటము.** వై. వి. జనసమ్మర్దము*. (చూ. ఆటు మొదటియర్థము.)

**రాటు.** వై. వి. 1. ఉపద్రవము; 2. జనసమ్మర్దము*.

**రాటుపడు.** వై. అ. క్రి. ఉపద్రవపడు. (చూ. రాట్పడు.)

**రాట్టు.** సం. వి. జ్. పుం. రాజు, తేఁడు

**రాట్నపాకు.** ద్వ. వి. (రాట్నము+ఆకు.) రాట్నమునకమర్చుడు పలక.

**రాట్నము.** వై. వి. నూలువడికెడుయంత్రములోనగునది.

**రాట్పడు.** వై. అ. క్రి. రాటుపడుయొక్కరూపాంతరము. “నమున్నతనితంబపయోధరభార గర్భభారంబులఁ గోమలాంగకమురాట్పడ.” కాశీ. ౪, ఆ.

**రాడు.** దే. వి గుంజె, స్తంభము.

**రాణ.** వై. వి. రమణయొక్కరూపాంతరము. (ఒప్పిదమునకు.)— “రాణనొప్పారుపైఠాణంబు సింగిణి.” స్వా. ౪, ఆ.—ఛ్రీతికి.— “సీ. తనరుచొక్కపురాణ మునిదంపతులుదమకంబులు చీర నెయ్యంబుమీఱ, ననిచిన.” (రామాయణార్థమునతనరుచుక్ + ఒక్కపురాణమునిదంపతులు అనియు, భారతార్థమునతనరుచొక్కపురాణక్+మునిదంపతులు అనియుభేదము.) రాఘ. ౧, ఆ.

**రాణి.** వై. వి. 1. రాజుభార్య; 2. భార్య.

**రాణించు.** వై. అ. క్రి. ఒప్పు.

**రాణివాసము.** వై. వి. 1. అంతఃపురము; “చ. వజ్రాభుఁడిం పలరఁగరాణివాసమునసాడెడి పాడెడిపుష్పఁబోండ్లన్, వలుగొనుచుండ.” ప్రభా. ౪, ఆ.—2. అంతఃపురస్త్రీ*; “వ. వారునారాణివాసంబులంజిత్రపటనిచోళికాందోళికలనునిచి.” జై. 3, ఆ.—3. భార్య*. “తే. గౌరియొక్కతెయాకాశగంగయొకతె, కాశియొక్కతెదక్షిణకాశియొకతె, నలుగురునుశంభునకులోకనాయకునకు, రాణివాసంబులనురాగరసముసేర్చి.” భీ. 3, ఆ. (ఒకానొక ఆధునికకవి అంతఃపురస్త్రీ అనునర్థమునందు రాణివాసి యని ప్రయోగించియున్నాఁడు. అప్పుడు దానికి రాణివాసము కలది అనియర్థము చేసికొనవలెను.)

**రాణువ.** దే. వి. 1, సేన; “క. ఓపాపాత్మకలోనికి, రాపొమ్మని చనవొసంగి రాణువయెల్లన్, నీపార్శ్వంబుగఁజేసివు, చూపరమా పునిఁగనడప.” సా. 3, ఆ.—2. పరివారము. “అలవేఁటమాట గరిష్ఠార్భటిరాణువెల్లవినఁజాటంబంచి.” ఉ, రా. ౭, ఆ.

**రాతిగొరక.** ద్వ. వి. (రాయి+గొరక.) మత్స్యవిశేషము. హంస. ౪, ఆ.

**రాతియుప్పు.** దే. వి. (రాయి+ఉప్పు.) సముద్రమునందుఁ బుట్టినయుప్పు, అక్షిబము.

**రాతిరి.** వై. వి. రేయి, రాత్రి, రజని, యామిని.

**రాత్రి.** సం. వి. ఇ. స్త్రీ. రాతిరి, నిశ, యామిని.

**రాత్రించరుఁడు.** సం. వి. అ. పుం. 1. నిర్బతి; 2. రాక్షసుఁడు.

**రాత్రిచరుఁడు.** సం. వి. అ. పుం. ——పై.——

**రాధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకగొల్లది; 2. కర్ణునిపెంపుడుతల్లి; 3. విశాఖానక్షత్రము; 4. మెఱుపు; 5. విష్ణుక్రాంత౹; 6. ఉసిరిక౹. అ. పుం. ను. వైశాఖమాసము.

**రాద్ధాంతము.** సం. వి. అ. పుం. సిద్ధాంతము.

**రాపడు.** ద్వ. అ. క్రి. (రాడు+పడు.) 1. స్తంభించు; (రాయి+పడు.) 2. రాయియగు; “శమినూర్ధన్యనిరాణిరా పడినపైజాడ్యంబు.” చంద్రా. ౧, ఆ.—3. దృఢపడు. “కట్టరాపడక్ మట్టుచు.” గా. యు, కాం.

**రాపాడు.** దే. స. క్రి. (రాపు+ఆడు.) రాయు. “సీ. పుత్తడి కొండమూఁపురమునునొరయంగనుటికిరాపాడునొక్కొక్కమాటు.” భాగ. 3, స్కం.

**రాపిడి.** దే. వి. ఒరయిక. (ఆమ్రేడితమునందు రారాపిడి. “రారాపిళ్లభుజాంగదంబులమణుల్ రాలఁగ.” స్వా. ౪, ఆ.)

**రాపు.** దే. వి. ఒరయిక, రాయిడి. “సీ. రాపుజక్కవలఁజేరని చంద్రికలువోలెఁ జన్నులముత్యాలసరులుపెనఁగ.” ఉ, హరి. ౫, ఆ. (ఆమ్రేడితమునందు రారాపు. “సీ. ఘనపైనరారాపు చనుదోయిరాయిడిఁ దుంబీఫలంబుతుండుడుకుఁజెంద.” స్వా. ౧, ఆ.)

**రాపుడు.** దే. వి. రాచేట.

**రాపుడురాయి.** దే. వి. గోడలులోనగునవి నునుపగుటకైరాచెడు రాయి.

**రాపులుఁగు.** ద్వ. వి. (రాచే + పులుఁగు.) పక్షివిశేషము, కంకము.

**రాపువ్వు.** ద్వ. వి. (రాయి+పువ్వు.) అశ్మపుష్పము౹.

**రాపాడి.** దే. వి. (రాపు+పాడి.) ఆకుజాయితోరాచినపాడి. "నీరజాపుసానఁబట్టినరాపాడిచల్లి." స్వా. ౨, ఆ.

**రాబందు.** దవ్. వి. రాపులుఁగు.

**రాబడి.** దే. వి. వచ్చేబడి, ఆయము.

**రామ.** ఉభ. దే. వి. మత్స్యవిశేషము. సం. అ. స్త్రీ. 1. రమించు నట్టి ఆఁడుది; 2. ఆఁడుది. అ. న. ము. 1. కుష్ఠము; 2. వాస్తుకము*. పుం. పెద్ద దుప్పి. విణ. 1. ఒప్పిదమైనది; 2. తెల్లనిది; 3. నల్లనిది.

**రామఠము.** సం. వి. అ. న. ఇఁగువ.

**రామతమ్మ.** దే. వి. చిలుక, శుకము.

**రామతాడు.** దే. వి. పెద్దతాటిచెట్టు.

**రామదాసు.** దే. వి. పక్షివిశేషము.

**రామపూగము** సం. వి. అ. పుం. నిడుపుతోడిమగలపోఁక.

**రామబాణము.** సం. వి. అ. పుం. 1. తాటాకుపుస్తకములన తొలిచెడు క్రిమివిశేషము; 2. పుష్పవిశేషము.

**రామసాగరములు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము.

**రామానుజకూటము.** సం. వి. వైష్ణవుల రాకపోకలకేర్పడిన యిల్లు.

**రాముఁడు.** సం. వి. అ. పుం. 1. రఘురాముఁడు; 2. బల రాముఁడు; 3. పరశురాముఁడు.

**రామునిదాడి.** మి. వి. అసంఖ్యము. (వీధిలో జనులు రాముని దాడిగా తిరుగుచున్నారు.) (దీనిని సాధారణజనులు రామందాడి యని వాడుచున్నారు.)

**రాయంచే.** వై. వి. (రాచే+అంచే.) (చూ.) రాజహంస.

**రాయఁడు.** వై. వి. రాజు. (బహువచనము రాయలు.)

**రాయబారము.** వై. వి. దౌత్యము*. "ఉ. ఆపరమోపకారనిధి యప్పుడు వేల్పులరాయబారమట్, మోపువహించి." నై. 3, ఆ.

**రాయబారి.** దవ్. వి. (రాయబారము+ఇ.) రాయబారము చేయువాఁడు, దూత. "ఆ. రాత్రిఁగానికానరాదులోకములకుఁ, బగలుగానికానఁబడదుమనకు, రాయబారిసంధిసేయుటకైపోవఁ, గాలమెద్దిపొందుగాదుతలఁప." పంచ. నా. 3, ఆ.

**రాయసము.** దే. వి. కార్యదర్శిపని.

**రాయి.** దే. వి. శిల. "క. చేకఁగొనియుప్పునమలుట, రాతిపయి నినుప్పగొనుటరాత్రిదధిమధూ, పేతంబుగఁగుడుచుటధ, శ్లేశర ములురేయినక్తువెగ్గునరేంద్రా." భార. అను. ౪, ఆ.

**రాయిడి.** దే. వి. 1. ఒరయిక; 2. ఉపద్రవము. "ఆ. చూచి చూచియేమురాచకొమారుని, నాడవెఱతుమైననాడకుండ, రాదు కృష్ణుచేతిరాయిడియింతంత, యనఁగరాదుమాకుమనఁగరాదు." వి, పు. 2, ఆ.

**రాయిడించు.** దే. అ. క్రి. అల్లరిచేయు. "ఎ, గీ. రవలిమట్టెల మ్రోఁతలురాయిడింప." వి, పు. ౫, ఆ.

**రాయిడికత్తె.** దవ్. విణ. ఉపద్రవముచేయునది. (చూ. ప్రా మిడి. విణ.)

**రాయిడికాఁడు.** దే. విణ. ఉపద్రవముచేయువాఁడు. "నిచ్చ లునుకల్వలరాయిడికాఁడు." రుక్మి. 3, ఆ.

**రాయిడిగిడిగిడి.** దే. వి. వాద్యవిశేషము, డిండిమము.

**రాయితి.** హిం. వి. తగ్గింపు.

**రాయు.** దే. అ. క్రి. 1. (గొంతు) కమ్ము; "ఉ. గొంతులు రాయఁగోయనుచుఁగూఁతలుపెట్టెరి గ్రామ్యభూసురుల్." పాంచా. ౨, ఆ.—2. ఒరయు; "సీ. ఇలధూళియెగసినఁబలుచగాకుండంగ రాసినతోడవులరజముదొరుఁగు." భార. భీష్మ. ౧, ఆ.—3. ఎదిరించు; "క. తారకితగగనచక్రము, తోరాసినసంగరేలుతొగపువ్వ లనో, ప్వారెవిపులనిర్మలకా, సారంబులుసారసప్రసరసేవ్య ములై." హరి. పూ. 2, ఆ.—4. కలహించు. "క. భారత వర్షమునకుఁగాఁ, గౌరవులు నుపాండవులు నఁగాంక్షలఁగడుఁజె, లైరాసియొండొరులతోఁ, బోరఁదొడఁగిరిట్టిలుబ్ధబుద్ధులుగలరే." భార. భీష్మ. ౧, ఆ.

**రారాజు.** వై. వి. 1. చక్రవర్తి; 2. కుబేరుఁడు; 3. దుర్యోధనుఁడు.

**రాఱేఁడు.** దవ్. వి.——వై.——

**రాలఁగొట్టు.** దే. ప్రే. (రాలన్+కొట్టు.) రాలుచు.

**రాలు.** దే. అ. క్రి. గళితమగు, పడు.

**రాలుగాయ.** దే. విణ. (రాలు+కాయ.) టుంట. "తే. రాలు గాయతనానజేరజపుదారి, దాటితేటెయుబలుగుంటమారియయ్యె." హంస. ౫, ఆ.

**రాలుచు.** దే. ప్రే. రాలఁజేయు, రాలఁగొట్టు.

**రాలుపడు.** దవ్. అ. క్రి. (ఎలుఁగు) కంపించు. (రూ. రాల్పడు. "వ. అతండెలుంగురాల్పడవారలంగనుంగొనియిట్లనియె." భార. ఆర. ౪, ఆ.)

**రాలుపాటు.** దవ్. వి. రాలుపడుట, కంపనము. "మెయిమ్రాను పాటుతోనెలుఁగునరాలు పాటొదవె." ఉ. హరి. ౫, ఆ.

**రాలుపు.** దే. వి. రాలుట. "సీ. శానదేటిపాటమరించినెఱెవాసిన యట్టి యాకురాలుపు గండ్లయందుఁదొరఁగి." స్వా. ౬, ఆ.

**రావడి.** దే. వి. ఉపద్రవము, హావడి.

**రావడు.** దవ్. అ. క్రి. (రాయి+పడు.) రాయియగు, జడుఁడగు. "రావడి పోయెఁగాకధృతరాష్ట్రుఁడు గన్నదియేమి." భార. కర్ణ. 3, ఆ. (ఇది వ్రాఁతప్రతులయందలిపాఠము. అచ్చుపుస్తకములయందు ప్రావడు అనియున్నది. అది సాధువుకాదు.)

**రావము.** సం. వి. అ. పుం. రవము, ధ్వని.

**రావి.** దే. వి. అశ్వత్థము*. (రాగియొక్కరూపాంతరము.)

**రావించు.** దే. ప్రే. రప్పించుయొక్కరూపాంతరము.

**రావిరేక.** దవ్. వి. బిడ్డలకుకొండెయందుఁగట్టెడు రావాకువంటి పతకము. "ముందటికూఁకటిరావిరేకతో." హరి. పూ. ౫, ఆ. (చూ. మొలకట్టు మొదటియర్థము.)

**రావు.** వై. వి. రాజు. "తేజీరావు." (చూ. రవ.)

**రావుతు.** వై. వి. గుఱ్ఱమునెక్కువాఁడు, సాది. "రావుతులతుండములు." భార. స్త్రీ. ౨, ఆ.

**రావుత్తు.** వై. వి. రావుతునకు మొదటిరూపము. "ఎ, గీ. తొలు కారుకలుకుపులుఁగు, మాపురావుత్తునిలిచెబ్రాహ్మణునిమ్రోల." పాండు. ౪, ఆ.

**రావ్రేక.** దవ్. వి. రావిరేకయొక్కరూపాంతరము. (చూ. జాడరించు.)

రాశి. సం. వి. ఇ. పుం. 1. ప్రోగు; 2. మేషాది. (ఇవి పంత్రెండు.—మేషము, వృషభము, మిథునము, కర్కటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనుస్సు, మకరము, కుంభము, మీనము.)

రాష్ట్రము. సం. వి. అ. న. దేశము. పుం, న. ఉపద్రవము.

రాష్ట్రిక. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడుచెట్టు.

రాష్ట్రియుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు.) రాజోసెండ్లాముతోడఁబుట్టినవాఁడు.

రాసభము. సం. వి. అ. పుం. ఖరము, గాడిద.

రాసము. సం. వి. అ. పుం. 1. గోపకులక్రీడావిశేషము; 2. రసము; 3. పరిహాసము; 4. సల్లాపము; 5. కలకలధ్వని; 6. ధ్వని.

రాసి. వై. వి. మేషాది. (చూ. రాశి.)

రాస్తా. హిం. వి. బాట, రాజమార్గము.

రాస్న. సం. వి. ఆ. స్త్రీ. 1. సన్నరాష్ట్రముచెట్టు; 2. కారేలచెట్టు; 3. సర్పాక్షిచెట్టు.

రాహిత్యము. సం. వి. అ. న. రహితభావము, లేమి.

రాహుసు. వై. వి. గుజ్జుపురౌతు. "ద్వి. రాహుతులైనయారాక్షసాధిపుల, సాహసంబుననేలఁజమిరిరికడిమి." రా. యు, కాం.

రాహుత్తుఁడు. సం. వి. అ. పుం. గుజ్జుపురౌతు, సాది.

రాహువు. సం. వి. ఉ. పుం. గ్రహవిశేషము, తలగాము. (చూ. గ్రహము.)

రాళము. సం. వి. అ. పుం. సర్జరసము.

## రి.

రింఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. అశ్వఖురము; 2. అశ్వగతివిశేషము; 3. నృత్యము; 4. దురదగొండిచెట్టు.

రింఖణము. సం. వి. అ. న. జాఱుట, స్ఖలనము. (రూ. రింగణము.)

రింగు. దే. వి. 1. తెక్కలగాలిచప్పుడు; "రింగుననారిఁగోలన మరించి." చమ. — 2. బ. వస్త్రపుఁగుచ్చె. "రింగులవల్లెవాటు నవరించి." సా. ౨, ఆ.

రింఛోళి. సం. వి. ఈ. స్త్రీ. సమూహము.

రింజె. దే. వి. కాలుపట్టుకొనుటకుఁజొచ్చినచో కాలుతప్పించికొని దిటమెడఁబొదివిపట్టెడిపట్టు. ఉ, హరి. 3, ఆ.

రింబ. దే. వి. రిమ్మయొక్కరూపాంతరము. ఆం, భా. ప్ర. నా.

రికము. దే. అప. టీకముయొక్కరూపాంతరము. "చ. అరయఁగఁదల్లికక్కసెలియంద్రకుఁదక్కనుగల్గినట్టిమ, ట్టరికమువారికిఁ." ప్రభా. 3, ఆ.

రిక్క. వై. వి. నక్షత్రము. (ఇవి యిరువదేడు.—గుఱ్ఱపుఁజెక్క, (అశ్విని,) బరణిచుక్క, (భరణి,) మంగలకత్తిరూపురిక్క, (కృత్తిక,) బండిరిక్క, (రోహిణి,) జింకతలచుక్క, (మృగశీర్షము,) పగడపురిక్క, (ఆర్ద్ర,) పొదరింట్లచుక్క, (పునర్వసు,) కొండరూపురిక్క, (పుష్యమి,) అనిలేరురిక్క, (ఆశ్లేష,) జెన్నపురిక్క, (మఖ,) పుబ్బరిక్క, (పూర్వఫల్గుని,) ప్రొద్దురిక్క, (ఉత్తర,) కైసాటిచుక్క, (హస్త,) ముత్తెపుసవకురిక్క, (చిత్త,) కరువలిరిక్క, (స్వాతి,) చేఁటరిక్క, (విశాఖ,) చెలిమిచుక్క, (అనూరాధ,) తాటిరిక్క, (జ్యేష్ఠ,) అంకుశంబుమాద్రిరిక్క, (మూల,) నీటిరిక్క, (పూర్వాషాఢ,) ఏనేకంటిచుక్క, (ఉత్తరాషాఢ,) కతిచేల్పురిక్క, (శ్రవణము,) మద్దెలరూపురిక్క, (ధనిష్ఠ,) నీటితేనెరిక్క, (శతభిషము,) ఎనిమిదికాళ్లచుక్క, (పూర్వభద్రపద,) మక్కంటిచుక్క, (ఉత్తరభద్రపద,) మీనురూపురిక్క, (రేవతి,) బొమ్మచుక్క, (అభిజిత్తు) అని యిరువదెనిమిదవ నక్షత్రమొకటి కలదు.)

రిక్కు. దే. వి. తోఁకత్రిప్పుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. రిక్కురిక్కునఁదోఁకఁద్రిప్పిజాడింపుచుఖురపుటంబు లందలగోఁకికొనుచు." పారిజా. ౨, ఆ.

రిక్త. సం. వి. ఆ. స్త్రీ. తిథివిశేషము. (చూ. తిథి.) అ. న. ము, అడవి. విణ. వట్టి.

రిక్థము. సం. వి. అ. న. ధనము, విడిముడి.

రిక్షము. సం. వి. అ. పుం. ఋక్షముయొక్కరూపాంతరము.

రిత్త. వై. విణ. 1. వట్టి; "రిత్తతల." రామా. ౮, ఆ. "రిత్తదొనలు." భార. శల్య. ౧, ఆ. — 2. కల్ల*; "క. రిత్తయుపచారములనే, సుత్తముఁడగుధర్మ తనయునుడికించితి." సం. "తనురుద్ధశిఖరాజా మిథ్యోపచరితోమయా." భార. ఉద్యో. ౨, ఆ.— 3. ఊరక*. "క. దోషరహితకన్యకపై, దోషంబులుగట్టి రిత్తదూషించినయా, దూషకునినూఱుమాడఁగులు, దోషానుగుణముగభూపతులుగొనవలయుఁ." విజ్ఞా. ఆచా, కాం.

రిత్తకత్తె. వై. విణ. తేరకత్తె. (చూ. రిత్తకాఁడు.)

రిత్తకాఁడు. ద్వి. విణ. తేరకాఁడు. "క. ఈ, కిన్నరుఁడురిత్తకాఁడటు, గొన్నపురమునున్నసుగుడఁగొనఁగావలయుఁ." నిర్వ. 3, ఆ.

రిత్తవోవు. ద్వి. అ. క్రి. (రిత్త + పోవు.) వ్యర్థమగు. (ప్రే. రిత్తవుచ్చు. "చ. నరుఁడుసుభద్రయుఁ, దనయునిఁగాంచి నంతనముదాల్పుటయంతయు రిత్తవుత్తునే." భార. ద్రో. ౨, ఆ.)

రిపువు. సం. వి. ఉ. పుం. అరి, శత్రువు, పగతుఁడు.

రిప్ప. దే. వి. వెలితి. "సీ. తమకొప్పులకుఁగాంగితలఁగిపోయెననఁగఁ గప్పురిప్పగునాఁచుకడకుఁబోవ." య. 3, ఆ.

రిమిషక్. ఆం. వి. పన్నుతగ్గింపు.

రిమ్మ. దే. వి. ఉన్మాదము. "ఆ. బొమ్ముద్రొక్కిమోమురిమ్మపట్టఁగమోఁది." భాగ. ౫, స్కం. ౨, ఆ.

రిరంస. సం. వి. ఆ. స్త్రీ. రమింపనిచ్ఛ.

రిరంసువు. సం. విణ. (ఉ.) రమింపనిచ్ఛగలవాఁడు.

రిరక్ష. సం. వి. ఆ. స్త్రీ. రక్షింపనిచ్ఛ.

రిరక్షువు. సం. విణ. (ఉ.) రక్షింపనిచ్ఛగలవాఁడు.

రివటం. దే. వి. ఉపశాఖ, రెమ్మ. "క. ఒకగృధ్రమెంతప్రియమున, నొకచర్మముఁగఱచికొనుచునుడుపథమునరా, నొకభంగిఁబ్రిదిలిపడియది, యొకయొండినరివటమీఁదనుండఁగనెలమిఁ." భో. ౪, ఆ.

రివాజు. హిం. వి. వాడుక.

రివిన్యూ. ఆం. వి. ప్రభుత్వమువారికి దేశముమీఁదవచ్చు ద్రవ్యము; విణ. ఈ ద్రవ్యసంబంధమైన.

రివ్వ. దే. వి. ఉపశాఖ, రెమ్మ.

రిష్టము. సం. వి. అ. న. 1. క్షేమము; 2. అశుభము; 3. అభావము. పుం. 1. ఖడ్గము; 2. ఫేనిలముచెట్టు.

రిష్టి. సం. వి. ఇ. స్త్రీ. అశుభము. పుం. ఖడ్గము.

## రీ.

**రీఢ.** సం. వి. ఆ. స్త్రీ. తిరస్కారము, తెగడిక.

**రీజన్.** ఆం. వి. హేతువు, న్యాయము.

**రీణము.** సం. విణ. (అ. ఆ. అ.) కాఱినది.

**రీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తెఱఁగు; 2. మేర; 3. ఇత్తడి; 4. ఇనుపచిట్టెము; 5. కాఱుట; 6. వైదర్భ్యాది. (ఇవి మూడు.— వైదర్భి, గౌడి, పాంచాలి.)

**రీతిపుష్పము.** సం. వి. అ. న. కుసుమాంజనము.

## రు.

**రు.** దే. అప. వాఁడు, నీవు మొదలగువాని బహువచనమునందును వర్తమానాద్యర్థక ప్రథమపురుషాది బహువచనములందును వచ్చెడు ప్రత్యయము. (ఉదా. వారు, మీరు, కొట్టుచున్నారు, కొట్టఁగలరు, కొట్టుదురు, కొట్టరు మొ.)

**రుంజె.** దే. వి. చర్మవాద్యవిశేషము.

**రుండము.** సం. వి. అ. పుం. తెగినతల. "వ. అప్పరమేశ్వరుండు సురధునిశిరంబు రుండమాలికామధ్యంబున నాయకరత్నంబుగా నవధరించి." జై. ౫, ఆ.

**రుంద్రము.** సం. విణ. (అ. ఆ. అ.) విరివియైనది.

**రుక్క.** హిం. వి. చిన్నచీటి.

**రుక్కు.** సం. వి. చ్. స్త్రీ. 1. సూర్యకిరణము; 2. కాంతి; 3. ఇచ్ఛ. జ్. రోగము.

**రుక్మకారకుఁడు.** సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.

**రుక్మము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. లోహము.

**రుగ్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విఱిగినది; 2. రోగముఁ జెందినది.

**రుచకము.** సం. వి. అ. న. 1. సౌవర్చలలవణము; 2. సర్జికాక్షారము; 3. అశ్వాభరణవిశేషము; 4. మాల్యము; 5. మంగళద్రవ్యము; 6. దంతము; 7. లవంగపుఁబట్ట. పుం. 1. రాజగృహవిశేషము; 2. ఆముదపుఁజెట్టు; 3. మాదీఫలపుఁజెట్టు.

**రుచి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చేవి; 2. ఇచ్ఛ; 3. సూర్యకిరణము; 4. కాంతి.

**రుచించు.** సం. అ. క్రి. ఇష్టమగు.

**రుచిరము.** సం. విణ. (అ. ఆ. అ.) ఒప్పిదమయినది.

**రుచ్యము.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

**రుజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. రోగము; 2. చెఱుపు.

**రుజువు.** హిం. వి. సాక్ష్యము, దృష్టాంతము.

**రుటము.** వై. విణ. 1. రూఢము; "ఉ. వానిరుటంపుఁ జెందొడలు వానిరువారపు సిబ్బెపుంబొడల్." శశాం. ౨, ఆ.—2. దృఢము. "క. అటుగాననేను నియ్యెడఁ, గుటిలాలక నిన్ను నిత్తు గురువర్యునకున్, రుటముగ నింతకుమిక్కిలి, ఘటితోపాయంబులేదు కలలోనైనన్." భల్లా. ౫, ఆ.

**రుట్టు.** సం. వి. ష్. స్త్రీ. కోపము, కినుక.

**రుతము.** సం. వి. అ. న. రుతి, ధ్వని.

**రుతి.** సం. వి. ఇ. స్త్రీ.——పై.——

**రుత్త.** దే. వి. నాశము. (వానిరూపు రుత్తాయెనుపో.)

**రుత్తు.** దే. స. క్రి. కొట్టు.

**రుదితము.** సం. వి. అ. న. రోదనము, ఏడ్పు.

**రుదురక్క.** వై. వి. రుద్రాక్షము. "తే. జడలు రుదురక్కపేరులుఁ జాలఁ బూని." అచ్చ. యు, కాం.

**రుదురాక.** వై. వి. రుదురక్కయొక్క రూపాంతరము. "రుదురాకలిడ్డసంది సూతసంహిత లిఖికించి." ఆము. ౪, ఆ.

**రుద్దు.** దే. స. క్రి. తోము.

**రుద్దుడు.** దే. వి. తోమకము.

**రుద్రజట.** సం. వి. ఆ. స్త్రీ. రుద్రజెడచీ.

**రుద్రజెడ.** వై. వి. రుద్రజటచీ.

**రుద్రభూమి.** సం. వి. ఇ. స్త్రీ. శ్మశానము, ఒలుకులమిట్ట.

**రుద్రాక్షము.** సం. వి. అ. న. రుద్రాక్షపుపూస. పుం. ఒకానొకచెట్టు.

**రుద్రాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. సందెమల్లియ.

**రుద్రాణి.** సం. వి. ఈ. స్త్రీ. రుద్రునిభార్య, పార్వతి.

**రుద్రుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి. (ఏకాదశరుద్రులు.—అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట, రుద్రుఁడు, హరుఁడు, శంభుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు.)

**రుధిరము.** సం. వి. అ. న. 1. నెత్తురు; 2. చెందిరము. పుం. డు. అంగారకుఁడు.

**రుధిరోద్గారి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**రుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. చుట్టఁబడినది.

**రుబ్బు.** దే. స. క్రి. నానవేసిన బియ్యములోనగువానిని ఱోటిలోఁ బోసి రుబ్బుగుండుతో మెదుపు.

**రుబ్బుగుండు.** ద్వి. వి. రుబ్బెడుగుండ్రాయి. (ఇట్లు రుబ్బుపాత్రము.)

**రుబ్బుఱోలు.** దే. వి. రుబ్బెడుజాతిఱోలు.

**రుమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉప్పళము; 2. సుగ్రీవుని పెండ్లాము.

**రుమాలు.** దే. వి. చేతిగుడ్డ, తలగుడ్డ. (రూ. రుమాలువు. "స్త్రీ. పాగ గాదను చలంపాశపాలుఁడుగట్టెఁ జెంగావి సరిగంచు జిగిరుమాలు, మఱి రుమాలువు గాదని మత్స్యనేత, చెంపసిగఁ గెంపుతాయెతు చేరుఁజేర్చె." పాంచా. ౧, ఆ.)

**రురువు.** సం. వి. ఉ. పుం. 1. నల్లచాఱలదుప్పి; 2. ఒక రాక్షసుఁడు.

**రువాణము.** దే. వి. కాంతి. "ఎ, గీ. తెలిరువాణంపువెదురు ముత్తియపుఁజేరు." చంద్రా. ౨, ఆ.

**రువారము.** దే. వి. విలాసవిశేషము. "క. ఇరుగడల వెడలి సుడిగొని, తరళములై వెలికి బెళికి తళతళమనుచున్, బరఁగు రువారపుఁ జూపుల, హరిణాక్షీనృసింహవిభునికారతి సేసెన్." కా. 3, ఆ.

**రువ్వ.** దే. వి. దమ్మిడి.

**రువ్వము.** వై. వి. తడవ, ఆవృత్తి*. "క. పదిరువ్వంబులుభక్తిం, బదిలుండైవినఁగవలయుభారతముజగ, ద్విదితగుణవానికన్నిటి, కొదవు ఫలములేర్పరింతు నోలిననీకుౕ." హరి. ఉ. ౧౦, ఆ.

**రువ్వు.** యు. దే. స. క్రి. విసరివైచు. వి. విసరివైచుట. "క. ఎవ్వ నికీవలచెనోకోయీ, జవ్వనియనిఅవ్వమీరుసరసోక్తులలే, నవ్వులు ముడిచినపువ్వుల, రువ్వులుఁదనయందెసమధి రూఢములగుటౕ." పాండు. 3, ఆ.—వై. 1. వల్లె; "సీ. పదవర్ణసౌష్ఠవ ప్రకటనం బెంతయు నింపుమీఱంగరువ్వచ్చియిచ్చి." కళా. ౪, ఆ. — 2. తడవ*. "వినుమురెండవరువ్వవిని." హరి. ఉ. ౧౦, ఆ.

**రుశతి.** సం. విశ. (త్. ఈ. త్.) అశుభమైనది. (వాక్కు.)

**రుష.** సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

**రుసి.** వై. వి. ఋషి. "సీ. శాపాగ్నిఁగడుఁబరితాపంబునొందెడు రుసులకునభయంబునొసఁగెఁగాన." భీ. ౨, ఆ.

**రుసుము.** హిం. వి. లంచేము, లాభము.

**రుహా.** సం. వి. ఆ. స్త్రీ. 1. గఱికి*; 2. మహామంజిష్ఠ*.

## రూ.

**రూక.** వై. వి. 1. ధనము; 2. చిన్నమెత్తువెండిబంగారముల నాణెము*.

**రూక్షము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. కఱకైనది; 2. ప్రేమ లేనిది.

**రూడి.** వై. వి. రూఢి. "సీ. రూడినెన్నికగన్ననాఁడెంపుఁదెఱగంటి చిగురాకుఁబోఁడులఁజెఱలుదెచ్చి." అచ్చ. సుం, కాం.

**రూఢము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మొలకయెత్తినది; 2. ప్రసిద్ధి కెక్కినది; 3. నిశ్చయింపఁబడినది.

**రూఢి.** సం. వి. ఇ. స్త్రీ. 1. మొలకయెత్తుట; 2. ప్రసిద్ధి; 3. నిశ్చయము.

**రూణించు.** దే. స. క్రి. మల్లులు ఒకవిధముగా బంధించు.

**రూణింపు.** దే. వి. మల్లబంధవిశేషము. (చూ. అరగింపు.)

**రూపకము.** సం. వి. అ. న. 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. నాటకము; 3. రూపము; 4. తాళభేదము. (ఆఱక్షరములకాలముగలది.)

**రూపగంధ.** సం. వి. ఆ. స్త్రీ. మూరుకొండ*.

**రూపగు.** ద్వి. అ. క్రి. (రూపు+అగు.) వర్ధిల్లు. "క. ఏమిట రూపగుఁబురుషుం, డేమెయిరూపుసెడు." భార. శాం. ౪, ఆ.

**రూపడఁగు.** ద్వి. అ. క్రి. (రూపు+అడఁగు.) చేచ్చే, నశించు. "కాలువ్రమొత్తంబులు రూపడంగె." భార. కర్ణ. ౨, ఆ. (ప్రే. రూపడఁచు. "రూపడంచెనాజరాసంధు." ఉ, హరి. ౨, ఆ.)

**రూపము.** సం. వి. అ. న. 1. ఆకారము; 2. శుక్లపీతాదివర్ణము; 3. సౌందర్యము; 4. అగ్నిగుణము; 5. చక్షురింద్రియగోచరము; 6. నాటకము; 7. రువ్వము; 8. స్వభావము.

**రూపరి.** ద్వి. విశ. (రూపు+అరి.) సౌందర్యవంతుఁడు, సౌందర్యవతి.

**రూపఱు.** ద్వి. అ. క్రి. (రూపు+అఱు.) 1. అంగహీనమగు; "ఎ, గీ. రెండుదొడలునువిఱిగిధరిత్రిఁబెలుచఁ, గూలిరూపఱిరారాజుధూళిఁబ్రుంగె." భార. శల్య. ౧, ఆ. — 2. నశించు, చచ్చు. "నైరులకారూపఱఁజేసినాహృదయరోగముమాన్పఁడు." వి, పు. ౭, ఆ.

**రూపసి.** వై. విశ. రూపరి. "క. సీతమ్మగుత్తరూపసి." భార. ద్రో. ౪, ఆ.

**రూపాజీవ.** సం. వి. ఆ. స్త్రీ. వారస్త్రీ, వేశ్య.

**రూపాయ.** వై. వి. ఒక వెండినాణెము.

**రూపించు.** సం. స. క్రి. నిరూపించు.

**రూపు.** వై. వి. 1. ఆకృతి; 2. చక్కఁదనము; 3. విధము*, "వ. కృష్ణయునయ్యవ్వపం బినరూపునసందఱకుంగుడువంబెట్టె." భార. ఆది. ౭, ఆ.

**రూపుమాపు.** ద్వి. ప్రే. రూపుమాయఁజేయు. (నాశనుచేయుటకు.—"అప్పరిఘంబురూపుమాపి." భార. కర్ణ. ౧, ఆ.—చంపుటకు.—"తే. బంధుమిత్రయుతంబుగఁబార్థురూపు, మాపియేనిత్తునీకుసామ్రాజ్యలక్ష్మి." భార. కర్ణ. ౧, ఆ.)

**రూపుమాయు.** ద్వి. అ. క్రి. నశించు, చచ్చు. "కురుధరావరసైన్యమురూపుమాయఁగౕ." భార. కర్ణ. ౨, ఆ. (చూ. రూపుమాపు.)

**రూపురూపున.** వై. క్రి. సమ్ముఖమున. (ఆ సంగతి రూపురూపున మాటాడఁగా తెలియును.)

**రూపుసెడు** ద్వి. అ. క్రి. (రూపు+చెడు.) నశించు. (చూ. రూపగు.)

**రూప్యము.** సం. వి. అ. న. 1. బంగారువెండిలోనగువాని నాణెము; 2. రూపాయ; 3. వెండి. విశ. సుందరము.

**రూలు.** ఆం. వి. బ. సమమగుగీఁతలు.

**రూలుకఱ్ఱ.** మి. వి. గీఁతలుగీయుకఱ్ఱ.

**రూషితము.** సం. విశ. (అ. ఆ. అ.) ధూళిమొదలగువానిచే గప్పఁబడినది, గుంఠితము.

## రె.

**రె.** దే. అవ్య. ప్రశంసార్థశబ్దములకనుప్రయుక్తమగునది. (బళిరె, భాపురె మొ.)

**రెంచె.** దే. వి. (జోదమునందు) రెండు.

**రెంట.** దే. వి. రెండగుట, ద్వైధము. విజ్ఞా. వ్య, కాం.

**రెంటత్రాగుడుతిండి.** దే. వి. సింహము. "క. కైదువువెలిఁగా, దలద్రుంతుంజెండి రెంటత్రాగుడుతిండిౕ." పంచ. వేం. ౧, ఆ.

**రెంటత్రాగుడుమెకము.** ద్వి. వి. ఏనుఁగు, ద్విపము. "తే. కొదమసింగముల్ రెంటత్రాగుడుమెకములు." రామా. ౫, ఆ.

**రెంటము** దే. వి. మడుపు. "సీ. మృతమర్త్యరెంటానసిద్ధఁజాలక నెత్రురంజిల్లుపెనుపొట్టముంజివాని." ఆము. ౬, ఆ.

**రెంటెము.** దే. వి. జెంటనేఁతవస్త్రము, గెంటెము. "సీ. పులితోలు రెంటెంబువెలిపట్టుగెంటెం బుఁగటిమండలంబునగరి మఁదసర." రుక్మాం. ౧, ఆ.

**రెండు.** దే. వి. భేదము. "చ. పతియెడరెండులేకకులభామలు తారతఁ డెట్టిఁడైనన, స్మతిఁజరియించుటొప్ప." రా. ౧, కాం.- స. ద్వయము. (దీనికి సంధినివర్ణవికారము. రెన్నాళ్లు, రెన్నెళ్లు.)

**రెంబ.** దే. వి. రెమ్మయొక్కరూపాంతరము.

**రెక్క—.** దే. వి. ఱెక్క—యొక్క—రూపాంతరము. ‘‘క. గ్రక్కు—నఁజని వ్రాలుదునో, రెక్క—లు గట్టుకొనిదివిజరిపుమేడలపై.’’ ప్రభా. ౪, ఆ.

**రెక్కొ—ను.** దే. అ. క్రి. (రేకు+కొను.) 1. వర్ధిల్లు; 2. తేలు కొను. (ప్రే. రెక్కొ—లుపు.)

**రెక్కో—లు.** దే. వి. రెక్కొ—నుట.

**రెచ్చెల.** దే. విశే. జోగడాలమారి.

**రెచ్చు.** దే. అ. క్రి. విజృంభించు. ‘‘సీ. వచ్చియచ్చెరువుగా రెచ్చిపా ఱెడుగిబ్బ పిండునొక్కు—మ్మడిఁజెండిపైచు.’’ నీలా. ౨, ఆ.

**రెట్ట.** దే. వి. 1. భుజము; 2. పక్షిమలము. ‘‘వ. తదీయశాఖా గతంబైన కొక్కె—రయతనిపై రెట్టవైచిన.’’ భార. అర. ౫, ఆ.

**రెట్టి.** దే. వి. 1. ద్విగుణము; 2. మఱుఁగు, గుణము.

**రెట్టించు.** దే. స. క్రి. రెట్టిచేయు, ద్విగుణించు.

**రెట్టు.** దే. వి. ముతుకబట్ట.

**రెడి.** దే. వి. రెడ్డియొక్క—రూపాంతరము.

**రెడ్డి.** దే. వి. కాఁపువారిపట్టపుఁబేరు.

**రెడ్డిగము.** దే. వి. ముడుఁచుకొన్న యొకకాలితొడమీఁదమోఁకాలు మీఁదుగా మడుచుకొన్న మఱియొక కాలిపాదముమోపి ఆకాలిని మీఁపును అంగవస్త్రముతోనీడ్చికట్టుకొని కూర్చుండుట.

**రెడ్డిపాలవంకోలు.** ద్వి. వి. బ. ధాన్యవిశేషము.

**రెడ్డివారినానఁబ్రాలు.** దే. వి. పటుపర్ణి.

**రెపరెప** దే. వి. 1. నిప్పుమంటమ్రోఁత, రటితము; 2. గాలి వీచుటయందగు ధ్వన్యనుకరణము. (గాలిరెపరెపవీచుచున్నది.)

**రెపరెపమను.** దే. అ. క్రి. (రెపరెప+అను.) అఁకలెత్తు.

**రెప్ప.** దే. వి. ఱెప్పయొక్క—రూపాంతరము. ‘‘సీ. రేఖలైమీఁదటి రెప్పలయొప్పుపస్నాగంబుకడపల్లబాగుసెఱప.’’ కళా. ౭, ఆ.

**రెప్పము.** దే. విశే. పూర్ణము. ‘‘శా. ఆలోకించెదుశార్ఙ్గముక్తపటు బాణౌఘంబుచేనీమొనల్, నేలంగూలఁగపాలపాలికలలోనిండారు రక్తంబులన్, గ్రోలంగేలిఁ బిశాచబాలికలు గైకొన్నన్మణిశ్రేణి తోఁ, గ్రాలంబట్టినవెండికోరలగతిన్ గప్పంబురెప్పంబుగాన్.’’ ఉ, హరి. ౪, ఆ.

**రెబ్బ.** దే. వి. రెమ్మయొక్క—రూపాంతరము.

**రెమ్మ.** దే. వి. ఉపశాఖ.

**రెమ్ము.** దే. స. క్రి. 1. ఒడిసితిగుచు; ‘‘రేలమ్మృతాంశులోశశము రెమ్ముదమంచుఁదలంచి.’’ విజ. ౧, ఆ.—2. ఒడియు. ‘‘కొన వెంద్రుకయొక్క—టిరెమ్మితీసినన్ జల్లునవెళ్లుఁబోచమురు.’’ సా. ౧, ఆ.

**రెయి.** వై. వి. రేయియొక్క—రూపాంతరము. ‘‘ఈరెయి.’’ అధ్యా. సుం, కాం.

**రెల్ల.** దే. వి. 1. కణిశైకదేశము; 2. మెతుకు.

## రే.

**రే.** వై. వి. రేయియొక్క—రూపాంతరము. ‘‘క. రేనిద్రింపఁబ్ర భాతం, బైనను మేల్క—నిసృజించు.’’ భార. అను. ౧, ఆ. ‘‘క. పవలున్, రేలునునేమఱక తరిచరించుచునుండెన్.’’ భార. ఆది. ౨, ఆ.—దే. అవ్య. రె అనుదానియొక్క—రూపాంతరము. (బళిరే, జాపురే మొ.)

**రేఁగు.** దే. అ. క్రి. 1. ఎగయు; ‘‘తే. నవపతాకాలతాకాననస్ఫురత్సి, రాగమునిజాంగరాగంబురధచమూన, మున్మపశైవాలమును రామభద్రనికట, ధూపధూమంబునైనట్టి దుమ్మురేఁగె.’’ రామా. ౭, ఆ—2. విజృంభించు; ‘‘క. రేఁగెడుదర్పముబొనట, గాఁగూల్చెను.’’ హరి. ఉ. ౬, ఆ.—3. ఉద్రేకించు. ‘‘రేఁగిమద్య పానంబొనరించి.’’ భార. మౌ. ౧, ఆ.—వి. బదరి. ‘‘తే. మహితకమలమధురమధురసాస్వాదన, పరవశాత్తమైన భ్రమర కాంత, రిత్తబుద్ధినకటరేఁగుఁబుష్పులరస, మానుసెట్లుబేలవైతిగాక.’’ భార. అర. ౬, ఆ.

**రేఁగుడు.** దే వి. ఓంగపాల్లి.

**రేఁచు.** దే. ప్రే. రేఁగఁజేయు. ‘‘రేఁచినఁదనచూపుదప్పు.’’ భార. శాం. 3, ఆ.

**రేఁటెము.** దే. వి. రెంటెమునకు మొదటిరూపము. య. ౪, ఆ.

**రేఁపు.** దే. ప్రే. రేఁచుయొక్క—రూపాంతరము.

**రేక.** యు. దే. వి. తొలాకుమట్టతోకట్టినదొప్ప. వై. 1. గీఱ; ‘‘ఎ, గీ. రేకయైనగమైబింబమైకరంభి, తొరుణచ్ఛాయఁబొల్చెనే ణాంకమూర్తి.’’ హన. ౪, ఆ.—2. జాబు; ‘‘క. కన్నెనగుమోము తోడం, బున్నమచందురునిసాటిపోలుపవచ్చున్, నెన్నుదుటితోడ మార్కొ—ని, మున్నందఱుఁ జూడరేకమోవకయున్నన్.’’ విజ. ౧, ఆ.—3. పఙ్క్తి.

**రేకంటు.** ద్వి. వి. సూర్యుఁడు.

**రేకచీరణము.** ద్వి. వి. రేఖలుతీర్చెడుచిన్నయులి.

**రేకు.** దే. వి. ఱేకుయొక్క—రూపాంతరము. (పుష్పదళమునకు.— ‘‘సీ. రేకులన్నియువిచ్చిరే యెండజగినిండికరమొప్పుతెల్లదామరల కంటె.’’ రా. అర, కాం. ౧, ఆ.)

**రేకుమడఁచు.** దే. స. క్రి. ఱేకుమడఁచుయొక్క—రూపాంతరము. ‘‘అంతవానితంద్రేదురమందెదిర్చినను రేకునుడంతుము.’’ విజ. 3, ఆ.

**రేకెత్తు.** దే. అ. క్రి. (రేకు+ఎత్తు.) వర్ధిల్లు.

**రేఖ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎడములేక మిక్కి—లి చేరికయగు వృక్షాదులపఙ్క్తి; 2. పాణిపాద తలములయందలిగీఱ; 3. గీఱ.

**రేగడ.** దే. వి. (చూ.) రేగడి. (చూ. రేవడ.)

**రేగడి.** దే. వి. బంకమన్ను. (చూ. మన్ను. వై. రెండవయర్థము.)

**రేగడిదూలం.** దే. వి. కచ్చురి.

**రేచకము.** సం. వి. అ. పుం. 1. ఊపిరివిడుచుట; 2. ఏనుఁగు చెవివంటి పాదకంచుకము.

**రేచకి.** సం. వి. ఈ. స్త్రీ. కరక.

**రేచని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లతెగడ; 2. దంతిచెట్టు.

**రేచితము.** సం. వి. అ. న. వంకరలేక వేగముగాఁబోయెడి యశ్వ ధారావిశేషము. (చూ. ధార.)

**రేచీఁకటి.** ద్వి. వి. రాత్రికన్నుతెలియమి, నిశాంధ్యము.

**రేణము.** దే. వి. దూడపేఁడ. ‘‘వ. పెయ్యలరేణంబులం.’’ హరి. పూ. ౫, ఆ.

**రేణుక.** సం. వి. ఆ. స్త్రీ. 1. గంధద్రవ్యవిశేషము; 2. జమదగ్నిపెండ్లాము. (దేశ్యమునందు రేణుకలు అనఁగా నూఁగుదోసయని ఒకానొక నిఘంటువునందు వ్రాయఁబడియున్నది.)

**రేణువు.** సం. వి. ఉ. పుం, స్త్రీ. దుమ్ము. పుం. రేణుకీ.

**రేతస్సు.** సం. వి. స్. న. 1. ఇంద్రియము; 2. పాదరసము. (రూ. రేతము.)

**రేదొర.** ద్వ. వి. చంద్రుఁడు, నిశాపతి. "కళొనిరూఢినూహించఁగ వీనిఁబోలఁగలఁడేయలరేదొర." ఉ, రా. ౨, ఆ.

**రేద్రిమ్మరి.** ద్వ. వి. (రే + త్రిమ్మరి.) రాక్షసుఁడు, రాత్రించరుఁడు. "ననుంజయింపరేద్రిమ్మరిగుంపుతోడనరుదెంచితి." ఉ, రా. 3, ఆ.

**రేద్రిమ్మరీఁడు.** ద్వ. వి. (రేద్రిమ్మరి + ఈఁడు.) —— పై. —— (స్వార్థమున ఈఁడు.)

**రేనాఁడు.** దే. వి. దేశవిశేషము.

**రేను.** దే. వి. రేఁగు, బదరీ.

**రేపకడ.** ద్వ. వి. (రేపు + కడ.) ప్రాతఃకాలము, ప్రభాతము. "సీ. కాలోచితములగుకరణీయములుదీర్చి కమలనాభుఁడురేపకడయకదలి." సం. "ప్రాతరుత్థాయ కృష్ణస్తు కృతవాన్ సర్వమాహ్నికమ్." భార. ఉద్యో. 3, ఆ. (సంధియందు వర్ణవికారము)

**రేపాడి.** దే. వి. (రేపు + అడి.) —— పై. —— "సీ. రేపాడి మఱికర్ణి కాపయోవేణిక మజ్జనంబాడునేమంబుమెఱయ." కాశీ. ౭, ఆ. (రేపాడియనుచో అడియనునది ఆదివంటిదని యెఱుఁగునది. చూ. పేఁడాది.)

**రేపు.** దే. వి. 1. ప్రాతఃకాలము; "రేయివచ్చెదననిరేపువచ్చు." భార. ఆర. 2, ఆ.– 2 వెనుకటిదినము.

**రేఫము.** సం. వి. అ. పుం. రవర్ణము. విణ. అధమము.

**రేయి.** పై. వి. రే, రెయి, రాత్రి.

**రేయు.** దే. అ. క్రి. విజృంభించు. "హేషితరవమ్మునవక్షముఁబూర్వపత్తురాగ్రమ్మునప్రేయరేపియదికందమువట్టివిదల్ప." జై. 2, ఆ.– స. క్రి. ఖండించు. "తదుగ్రశరంబులరేసిరేసి." రాఘ. ౪, ఆ.

**రేయెండ.** ద్వ. వి. (రే + ఎండ.) వెన్నెల. "సీ. సమరవికాసంబుచెమటనొప్పఱకుండహేలిదీధితులురేయెండగాయు." భార. భీష్మ. ౧, ఆ.

**రేఱేఁడు.** ద్వ. వి. చంద్రుఁడు, నిశాపతి. (చూ. ఱేఁడుమూఁడవయర్థము.) (ఇట్లు రేరాయఁడు.)

**రేవ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకయేఱు; 2. నీలిచెట్టు.

**రేవఁడు.** దే. వి. (రేవు + అఁడు.) చాకలవాఁడు. "ఇహపరంబుల కూరకదూరమైవయస్సుచెడరెంటికిఁజెడినరేవఁడనౌదునె." స్వా. 3, ఆ.

**రేవంతుఁడు.** సం. వి. అ. పుం. అశ్వశిక్షకుఁడు.

**రేపగలు.** ద్వ. వి. (రే + పగలు.) అహోరాత్రము.

**రేవడ.** దే. వి. రేగడయొక్కరూపాంతరము. "ఇచట నల్లరేవడయదూరముపోయినఁబాండుమృత్తికాకరములుగానము." పర. ౨, ఆ.

**రేవడి.** దే. వి. రేగడియొక్కరూపాంతరము.

**రేవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. బలరామునిభార్య.

**రేవతీరమణుఁడు.** సం. వి. అ. పుం. బలరాముఁడు.

**రేవలచిన్ని.** దే. వి ఓషధివిశేషము.

**రేవు.** దే. వి. 1. నద్యాదులయందుమనుష్యులుదిగుటకనువుగానేర్పఱచినదారి; 2. సముద్రమునందుసరకులు ఎగుమతి దిగుమతిచేయుచోటు; "తే. వసధినర్వంకషంబయ్యువలయుపనికి, రేవులనకానిచొరరానిరీతినధిప, విశ్వరూపకుఁడయ్యుశ్రీవిభుఁడు నక్త, రూపములనేర్పఁడగునారురుక్షువులకు." కవిక. ౫, ఆ.– 3. కరవాకపట్టణము; "శా. రేవుల్ మావు మతంగజంబును మణిశ్రీఖండముక్తాదియుక్, రావాఁశిజ్యముఁ బెంచి." ఆము. ౪, ఆ.– 4. రేఁగుచెట్టు. "మోవులురేవులుమోదుగులు." య. ౨, ఆ.

**రేవుబోయ.** దే వి. ఓడనడపువాఁడు. "ఉ. అయ్యెడరేవుబోయలఁబ్రియంబుమెఱుక్ బిలిపించిదేవికిన్, జయ్యననోడఁబెట్టుమని." నిరవ. ౯, ఆ.

**రేవెలుఁగు.** ద్వ. వి. చంద్రుఁడు. "మ. తొలుజీజీమొసకాఁడునిమ్ముమొనవాల్ మూపుల్ వడిన్ గాచరే, వెలుఁగున్ వ్రచ్చు." అచ్చ. యు, కాం.

**రేసు.** దే. వి. చేలుకన. (చూ. పోసరము.) విణ. చులుకనిది.

**రేసుగుడ్డ.** దే. వి. చేతిగుడ్డ.

## రై.

**రై.** సం. వి. ఐ. పుం. ధనము, విడిముడి.

**రైటరు.** ఆం. వి. వ్రాయువాఁడు, ఒక యుద్యోగస్థుఁడు.

**రైతు.** దే. వి. పంటకాఁపు. (మొదటిరూపమురయితు.)

**రైలు.** ఆం. వి. ఇనుపపట్ట. ఈ మాట సాధారణముగా పొగబండికి వాడెదరు.

## రొ.

**రొ.** దే. అవ్య. 1. సంబుద్ధియందు స్త్రీవాచకంబులకనుప్రయుక్తంబగునది; (ఉదా. అక్కరొ, ఇంతిరొ, రమణిరొ మొ.) 2. ప్రశంసార్థకమునందు తద్వాచకశబ్దంబుల కను ప్రయుక్తంబగునది. (చూ. అమ్మరొ.) (వ్యాకరణవేత్తలు ఇది సంబుద్ధియందు స్త్రీవాచకశబ్దములకే అనుప్రయుక్తమగునని వ్రాసియుండఁగా ప్రయోగములందును నాలాగే కనఁబడుచుండఁగా ఒకానొక ఆధునికకవి అన్నరొ, వినుంగురొ అని ప్రయోగించియున్నాఁడు. అది చింత్యము.)

**రొంజుడు.** దే. వి. ప్రలాపము, రొండుడు.

**రొండి.** దే. వి. నడుముయొక్క పార్శ్వభాగము.

**రొండిత్రేటు.** దే. వి. మల్లబంధవిశేషము.

**రొండు.** దే. వి. శ్వాసరోగము, రోఁజు.

**రొండుడు.** దే. వి. రొంజుడు, ప్రలాపము.

**రొంప.** దే. వి. 1. పీనసరోగము; 2. పడిసెము.

**రొంపి.** దే. వి. అడుసు, బురద, పంకము.

**రొంపిదుక్కి.** దే. వి. నీళ్లుగట్టి అడుసుగాదున్నుట. (మఱియొకటి వెలిదుక్కి.)

**రొంపిమాను.** దే. వి. రొంపిదున్నినపిమ్మట మిట్టపల్లములు సరిపఱచుటకు మీఁదపాఱించెడుమాను.

**రొక్కపుదొర.** ద్వ. వి. (రొక్కము+దొర.) కుబేరుఁడు, ధనాధిపుఁడు. "జక్కులకొలఁకు లోఁ జిక్కె రొక్కపుదొర." అచ్చ. బాల. కాం.

**రొక్కము.** వై. వి. 1. చేతివెల; (ఆ యుంగరము రొక్కమిచ్చి తెచ్చినావా అప్పుగా తెచ్చినావా?) 2. ధనము*; "తే. కొలుచు రొక్కంబుఁగలుములుసెలఁగనుండుఁ, గడిఁదికోమటి రథనంపు గనులుపేట." అచ్చ. బాల, కాం.—3. సమూహము*. "క. పక్కి దొరకొల పువవలా, రొక్కమునందైననట్టిరూపసిగలదే." అచ్చ. ఆర, కాం.

**రొక్కారొక్కములు.** వై. విణ. బ. బహువిధములుగలవి, ఉచ్చావచము. "రొక్కారొక్కముల్ దిట్టి." కాశీ. 3, ఆ.

**రొక్కించు.** వై. స. క్రి. రొక్కపఱుచు. "ద్వి. భవద్గురుఁడు, సత్తుగానేకునిచ్చులునురొక్కించి, బత్తెమిమ్మనినన్నుఁ బలుకఁడొం డేని." హరిశ్చ. ౨, భా.

**రొట్టియ.** దే. వి. రొట్టె. కాశీ. ౭, ఆ.

**రొట్టె.** దే. వి. భక్ష్యవిశేషము. (రొట్టియయొక్క రూపాంతరము.)

**రొడ్డు.** దే. వి. రొండుయొక్క రూపాంతరము.

**రొడ్డుసు.** దే. వి. రొండుడుయొక్క రూపాంతరము.

**రొద.** వై. వి. 1. ధ్వని; 2. కలకలధ్వని. "ఎ, గీ. అంతటను హల్లకల్లోలనుయ్యెనపుడు, ఆరొదవిని." చంద్రా. 3, ఆ.

**రొదాళము.** వై. వి. ధ్వని. "లేఁదేఁటిగంటలనంధిల్లుగొదాళనుల్ పరవమింటక." చంద్రా. 3, ఆ.

**రొదాళించు.** వై. అ. క్రి. ధ్వనించు. పంచ. వేం. ౧, ఆ.

**రొప్పు.** దే. అ. క్రి. 1. కూయు; 2. (పులి) కూయు. (చూ. కాంద్రు, మంపిల్లు.)—స. క్రి. 1. కోపించు; "సీ. నెలనెప్ప కొనిరొప్పపులినైనఁబీడించి పడవైతుఁజొచ్చినీపాదమాన." సావి. ౪, ఆ.—2. తఱుము. "హరులఁబగ్గములు చేనందిరొప్పఁదొడంగె." భాగ. ౧౦, స్కం.

**రొమ్ము.** వై. వి. ఱొమ్ముయొక్క రూపాంతరము. "ద్వి. నీరొమ్ము కొనికాఁడ నేర్తునెచూడ, నీరాజ్యగతిచూడనేర్తుఁగాకేను." రా. యు, కాం. (ఈ గ్రంథమునందు ప్రక్షిప్తవాక్యములనేకములుండుటంజేసి లఘురేఫమనుటకు ఇతర ప్రయోగమును విచారింప వలెను.)

**రొయి.** దే. వి. రొయ్యియొక్క రూపాంతరము.

**రొయ్య.** దే. వి. మత్స్యవిశేషము.

**రొయ్యి.** దే. వి. కట్టెనిప్పుమీఁదినిగుఱు.

**రొల్లు.** దే. అ. క్రి. ప్రలాపించు.

**రొల్లుడు.** దే. వి. ప్రలాపము, రొండుడు, రొంటాడు.

## రో.

**రో.** ఉభ. వై. వి. రోయియొక్క రూపాంతరము. (వేశ్యకిచ్చెడు శుల్కమునకు.)—"క. రోయిడిముల్లనిభుజగుఁడు, రోయివిడువ వలయులంజెరోగొనిమరలక, రోయిడఁదలఁచిననిసుమడి, పాయక యిచ్చుటయతగిన పాడియరయఁగక." సం. "శుల్కంగృహీత్వాపణ్యస్త్రీ నేచ్ఛంతీద్విగుణంవహేత్, అనిచ్ఛన్‌దత్తశుల్కోపిశుల్కహానిమవాప్నుయాత్." విజ్ఞా. ప్రా, కాం.—కుదువకు.—"క. ఇన్నాళ్లకింతవెట్టక, యున్ననురోదక్కు ననుచు నొడఁబడుదా, నన్నాళ్లదక్కనతనికి, నెన్నఁడుభోగ్యంబుదక్క దేధర్మములక." సం. "ఆధిఃప్రణశ్యేద్ద్విగుణే ధనేయదినమోక్ష్యతే, కాలేకాలకృతోనశ్యేత్ఫలభోగ్యోననశ్యతి." విజ్ఞా. వ్య. కాం. (చూ. పడిదియ.)—అవ్య. రొ అనుదానియొక్క రూపాంతరము. (అక్కరో, చెలియరో, రమణిరో.) (చూ. రొ.)—సం. వి. ఐ. పుం. ధనము. (ఉదా. రోయాలి.)

**రోఁకటిబండ.** దే. వి. 1. ఒక పురుగు, శతపది; 2. పొన్ను లేనిచిన్నరోఁకలి; 3. క్రోష్టుపుచ్ఛిక¶.

**రోఁకలి.** వై. వి. దంచెడుసాధనము, ముసలము. "ఉ. కాఁక నెదిర్చి సంగరముఖంబున హెచ్చినరాజవంశముల్, గూఁకటి వేళ్లతోఁబెఱికిగోత్రవధంబును జేసినట్టియా, ప్రేఁకపుఁగేడుగాక ప్రజవేఁచఁదలంచినగోరుచుట్టుపై, రోఁకటిపోటుచందముగరోసి జనుల్ననుఁజూచితిట్టరే." జై. ౧, ఆ. (బలరామునిరోఁకలి సౌనందము.)

**రోఁజు.** దే. అ. క్రి. నిట్టూర్చు, నిశ్వసించు. "ఉగ్రపన్నగము చాడ్పునరోఁజుచు." సం. "వినిశ్వసన్‌సర్ప ఇవోగ్రతేజాః." భార. ఆర. ౫, ఆ. వి. నిశ్వాసము.

**రోఁజేడు.** దే. వి. రొంజేడు, ప్రలాపము.

**రోఁత.** దే. వి. 1. ఏవము, జుగుప్స; "ఉ. కూఁతురనీపువట్టిచెడుఁ గూఁతలుగేఁతలునేర్చికష్టులక, మూతులు నాకఁగానిధనమూలవిటాలిఁజేరవైతివి, రోఁతకునిన్ను నెల్లరునురోయఁగ నీనరివారునవ్వ నీ, కోఁతిపిటుఁదునల్పు వెడకోడిగముల్ గనిమాఁటివత్తురే." భల్లా. ౫, ఆ.—2. బ. తిట్లు

**రోఁతగించు.** దే. అ. క్రి. రోఁతపడు.

**రోక.** దే. వి. మూల, కోణము.

**రోకము.** సం. వి. అ. న. 1. ఓడ; 2. బెజ్జము; 3. కదలిక. పుం. 1. వెలుఁగు; 2. రొక్కపమ్మకము.

**రోకు.** దే. వి. వికాసము. "సీ. ప్రవిమలకుసుమసంపదలకుదూరమై రోకువాసినమహీరుహముకీతి." మార్క. ౧, ఆ.

**రోగము.** సం. వి. అ. పుం. 1. వ్యాధి, తెవులు; 2. కుష్ఠౌషధము.

**రోగహారి.** సం. వి. న్. పుం. 1. జోమ¶; 2. బూడిదగుమ్మడి¶. విణ. వైద్యుఁడు.

**రోగి.** సం. విణ. (న్. ఈ. న్.) వ్యాధిష్ఠుఁడు, తెవులుగొంటు.

**రోచన.** సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోజనము; 2. ఉత్తమస్త్రీ; 3. ఎఱ్ఱగలువ అ. పుం. ము. కొండబూరుగు¶. విణ. ప్రకాశించునది.

**రోచని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లతెగడ¶; 2. కంపిల్లము¶.

**రోచమానము.** సం. వి. అ. పుం. గుఱ్ఱపుమెడసుడి.

**రోచిష్ణువు.** సం. విణ. (ఉ.) ప్రకాశించువాఁడు.

**రోచిస్సు.** సం. వి. స్. న. సూర్యకిరణము, వెలుఁగు.

**రోజు.** హిం. వి. దినము.

**రోటు.** దే. వి. (చూ.) ఈఁచే.

**రోటువోవు.** దే. అ. క్రి. (రోటు+పోవు.) ఈఁచేఁబోవు. "ద్వి. రోటువోయినచెయ్యిరొమ్ముకంపరము, వాటుఁగాలున త్రోటివలె నున్ననడుము." హరిశ్చ. ౨, భా.

**రోడ్డు.** ఆం. వి. మార్గము, రస్తా.

**రోదనము.** సం. వి. అ. న. 1. ఏడ్పు; 2. కన్నీరు.

**రోదని.** సం. వి. ఈ. స్త్రీ. తీఁటకసింద, కచ్ఛురి.

**రోదసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మన్ను; 2. మిన్ను; 3. మన్ను మిన్ను.

**రోదస్సు.** సం. వి. స్. న.——పై.——

**రోదించు.** సం. అ. క్రి. రోదనముచేయు, ఏడ్చు.

**రోధస్సు.** సం. వి. స్. న. తీరము, దరి, గట్టు.

**రోధించు.** సం. స. క్రి. అడ్డగించు. (అనురోధించు, నిరోధించు, సంరోధించు అనియు.)

**రోపణము.** సం. వి. అ. న. 1. మోపుట; 2. పైరుచేయుట.

**రోపము.** సం. వి. అ. పుం. 1. బాణము; 2. రోపణము.

**రోమంథము.** సం. వి. అ. పుం. పశువులచర్విశచర్వణము, నెమరు.

**రోమము.** సం. వి. న్. న. ముఖము శిరముతక్కఁదక్కిన దేహము నందుఁగల వెండ్రుక.

**రోమవిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. రోమాంచము.

**రోమశము.** సం. వి. అ. పుం. 1. పంది; 2. గొఱ్ఱె. విశ. వెండ్రుకలు గలది.

**రోమశి.** సం. వి. ఈ. స్త్రీ. ములుదోస.

**రోమశుఁడు.** సం. వి. అ. పుం. శరీరమునందు ఎలుఁగుసకువలె నిసువెండ్రుకలుగలవాఁడు.

**రోమహర్షణము.** సం. వి. అ. న. రోమాంచము. పుం. తాండ్ర. డు. ఒకసూతుఁడు.

**రోమాంచము.** సం. వి. అ. పుం. గగుర్పాటు.

**రోమావళి.** సం. వి. ఈ. స్త్రీ. నూఁగారు. (రోమరాజి అనియు.)

**రోయి.** వై. వి. 1. వేశ్యకిచ్చెడుశుల్కము*; (చూ. రో.) 2. పందెము*; "క. దమయంతిరోయిగాఁజూ, దమునీతోనాడఁగడఁగెదను." భార. అర. ౨, ఆ.—3. కుదువ*; "క. రోయిగొనివడ్డికిచ్చినఁ, బాయకనెలనెలనశీతిభాగముఁగొనినఁ, న్యాయమగుమిగులఁగొనుట; న్యాయంబోడఁబడనిచోటనభినవదండి." సం. "అశీతిభాగోవృద్ధి స్స్యాన్మాసిమాసిసబంధకే." విజ్ఞా. వ్య, కాం. — 4. ఎరవు, చేబదులు*. (చూ. ప్రాయుఁడిమొదటియర్థము.)

**రోయు.** దే. అ. క్రి. రోఁతపడు. "క్రూరతకోర్చియించుకయు రోయక." భార. భీష్మ. 3, ఆ. — స. క్రి. 1. వెదకు; "ఉ. జాయనుజూపవేమియనుజాయను నవ్విధియెంతచేసెనొ, రాయను నాదుగుండెబలురాయను నాత్మ పరాక్రమోన్నతుల్, రోయనుగాన నాంతరమురోయనుదుష్టకురంగచేష్టమ, మ్మాయనుజానకీదనుజమాయలఁగ్రుంకితొపల్కుమాయనుఁ." రామా. ౫, ఆ.—2. నిందించు; (చూ. రోఁత.) 3. విసుచు. (ఇది వాడుకలోనిది.) ఒకానొక ఆధునికకవి దీనిని వెదకు అనునర్థమునందు శకటరేఫముగా ప్రయోగించియున్నాఁడు. (అది రహాదరణీయముకాదు.)

**రోలంబము.** సం. వి. అ. పుం. భృంగము, తుమ్మెద.

**రోవెలఁది.** దృ. వి. వారస్త్రీ, వేశ్య. (చూ. రో.)

**రోషము.** సం. వి. అ. పుం. కోపము, కినుక.

**రోషించు.** సం. అ. క్రి. రోషపడు, కినియు.

**రోసము.** వై. వి. రోషము, కినుక.

**రోసించు.** వై. అ. క్రి. రోషపడు, రోషించు. "క. అనపర ప్రాఢికిమది, రోసించి." విక్ర. ౪, ఆ.

**రోసుబడి.** దే. విశ. గ్రా. రోఁతగొట్టు. (ఏమి నీవు వట్టిరోసుబడిగా నున్నావు.)

**రోహణము.** సం. వి. అ. న. ఎక్కుట. పుం. ఒకకొండ.

**రోహము.** సం. వి. అ. పుం. 1. ఎక్కుట; 2. మొలక.

**రోహి.** సం. వి. ఇ. న్. పుం. 1. మఱ్ఱి; 2. ములుమోదుగు; 3. రావి.

**రోహిణము.** సం. వి. అ. పుం. బాడిదము.

**రోహిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. అంగిటిముల్లు; 3. ఆవు; 4. తొమ్మిదేండ్లకన్యక; 5. బలరామునితల్లి; 6. కటుకరోహిణి; 7. తెల్లచంద్ర.

**రోహితకము** సం. వి. అ. పుం. 1. ములుమోదుగు; 2. కెంపు.

**రోహితము.** సం. వి. అ. న. (చూ.) 1. కొండు; 2. కుంకుమపువ్వు; 3. నెత్తురు. పుం. 1. ఎఱుపు; 2. ఎఱ్ఱచేఁప; 3. కేసరి మృగము; 4. ములుమోదుగు. విశ. ఎఱ్ఱనిది.

**రోహితాశ్వుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. హరిశ్చంద్రునికొడుకు.

**రోహిషము.** సం. వి. అ. పుం. కొండగొఱ్ఱె.

## రౌ.

**రౌతు.** వై. వి. గుఱ్ఱమునెక్కువాఁడు, సాది. (మొదటిరూపము రవుతు.)

**రౌద్రము.** సం. వి. అ. పుం. 1. నవరసములలో నొకటి; (చూ. రసము.) 2 ఎండ; 3. దినముయొక్క మొదటిభాగము. (చూ. దినము.) విశ. 1. భయంకరము; 2. తీక్ష్ణము.

**రౌద్రి.** సం. వి. ఇ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**రౌను.** ఆం. వి. ప్రయాణము.

**రౌప్యము.** సం. వి. అ. న. రూప్యముయొక్కరూపాంతరము.

**రౌమకము.** సం. వి. అ. న. సంభరిదేశమున రుమయనెడు గనియందుఁబుట్టిన ఉప్పు.

**రౌరవము.** సం. వి. అ. పుం. నరకవిశేషము. విశ. భయంకరము.

**రౌలు.** దే. అ. క్రి. రగులుయొక్కరూపాంతరము. (మొదటిరూపము రవులు.)

**రౌలుకోలు.** దే. వి. రౌలుకొనుట. (మొదటిరూపము రవులుకోలు.)

**రౌలుచు.** దే. ప్రే. రగులుచుయొక్కరూపాంతరము. (మొదటిరూపము రవులుచు.)

**రౌహిణేయము.** సం. వి. అ. పుం. దినముయొక్క తొమ్మిదవ భాగము. (చూ. దినము.) విశ. ఆవునకుఁబుట్టినది. (దూడ.)

**రౌహిణేయుఁడు.** సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. బుధుఁడు.

**రౌహిషము.** సం. వి. అ. న. కాఘంచి. పుం. కొండగొఱ్ఱె

## ఱ.

**ఱ.** ఒక యక్షరము.

**ఱంకాటు.** ద్వ. వి. (ఱంకాడుట.) జారత్వము చేయుట. "శౌర్యంబు ఱంకాటసాహసంబు." విజ్ఞా. వ్య, కాం.

**ఱంకాడు.** ద్వ. అ. క్రి. (ఱంకు+ఆడు.) జారత్వముచేయు.

**ఱంకు.** వై. వి. జారత్వము. "సీ. జనులొక్కతఁపేఁదొల్లి సమయంబు దమలోనఁజేసి క్రూరతయుఁ మ్రుచ్చిమియుఱంకు, సైఁపక." భార. శాం. ౨, ఆ.

**ఱంకుఁబోతు.** ద్వ. వి. (ఱంకు+పోతు.) జారుఁడు, జారిణి.

**ఱంకుటాలు.** ద్వ. వి. (ఱంకు+ఆలు.) జారిణి.

**ఱంకుతెవులు.** ద్వ. వి. మేహరోగము.

**ఱంకుమగఁడు.** ద్వ. వి. జారుఁడు. (చూ. గోలెము.)

**ఱంకులరాట్నము.** వై. వి. ఉత్సవకాలమునందు వేడుకకు బాలకులు ఎక్కి త్రిప్పించెడు చుట్టులొట్టలేర్పఱచిన వలయాకారంపు యంత్రవిశేషము.

**ఱంకులాఁడి.** ద్వ. వి. (ఱంకులు+ఆఁడి) జారిణి.

**ఱంకువోవు.** ద్వ. అ. క్రి. (ఱంకు+పోవు.) జారత్వముచేయు.

**ఱంకె.** దే. వి. 1. వృషభధ్వని; "ఉ. ఱంకెలుగర్జలైయడరఁజాపుఁ దనంబున నెందుఁబర్వని, శ్శంకవిలోకనైద్యుతకృశాన శిఖల్దెస లెల్లఁగప్పఁగా." హరి. పూ. ౮, ఆ.—2. ధ్వని; "అనేకంబులు తూర్యముల్దిశలుఱంకెల్వేయఁజేయఁగ." రామా. ౮, ఆ.—3. కేక. "ఉ. మాటిమాటికిఁ, ఱంకెలువేయుదుష్కవిగణంబుల నెల్లఁదృణీకరించెదఁ." రుక్మి. ౧, ఆ.

**ఱంకెత.** ద్వ. విశే. (ఱంకు+ఎత.) జారిణి. (చూ. బంకెత.)

**ఱంతిల్లు.** దే. అ. క్రి. కలకలధ్వనిచేయు. (రూ. ఱంతిలు.)

**ఱంతు.** దే. వి. కలకలధ్వని. "ఉ. ఱంతులుమీఁదుమిక్కిలిగఁజాఁగ తనంబునదొమ్మిచేసి." భీ. ౪, ఆ. "మ. వినియాఱంతుదురంత శైలమథనావిర్భూతసింధూద్ధత, ధ్వనియోకాకమహోదక ప్రళయ సంత్రాసంబులోకాళిఁబై, కొనికారించెనోయీనుదుస్సహ మహా కోలాహలోదవృత్తికే, మినిమిత్తంబని భర్తలోకభరణో న్మేషంబు వాటింపఁగాఁ." వసు. ౨, ఆ.

**ఱంపకాఁడు.** దే. వి. (ఱంపము+కాఁడు.) ఱంపముతో పలకలు లోనగువాని కోయువాఁడు.

**ఱంపము.** దే. వి. పలకలులోనగునవికోసెడు సాధనము, క్రకచము.

**ఱంపిల్లు.** దే. అ. క్రి. 1. వ్యాపించు; "క. అంతటఁగడలం దెల్లఁగొ, ఱంతయొకింతయునులేకఱంపిల్లెనిరుల్." అచ్చ. సుం, కాం.—2. వర్ధిల్లు; "సీ. తెగినశోకుసుముఁకమగిడినాబలు విద్దె పెంపునబ్రతికిఱంపిల్లుచుండ." య. 3, ఆ.—3. విజృంభించు; 4. అతిశయించు. (రూ. ఱంపిలు.—విజృంభించుటకు. — "చ. దళముగనుండుకోటలతుదందవిలించినమించుపైఁడిప్రాల్, గల కటిపెక్కుముల్గనిపగల్మెఱుఁగుల్ గలమబ్బులంచుఱం, పిలితగ నాడ నన్నమిలిపిండుఁగనుంగొని చిన్కుఁగూటియు, ప్పులుఁగులు నంతసిల్లుఁగడుపుల్ గడునిండఁగనాన కోర్కులఁ." య. ౧.—అతిశయించుటకు.—"ఱంపిలుసొంపు." య. ౧, ఆ.)

**ఱంపు.** దే. వి. 1. అచ్చె; 2. కలకలము.

**ఱంపె.** దే. వి. 1. మాదిగవాఁడుతోలుకోసెడు సాధనవిశేషము; 2. తాటాకులుమట్టగించికోసెడుసాధనవిశేషము. (మొదటిరూపము ఱంపిడు.)

**ఱక్కు.** దే. స. క్రి. గీఱు. వి. గీఱ. "ఉ. చెక్కులఱక్కులఁ మిగులఁజెల్వగుమోమునిబంటి నొక్కులఁ." రాజ. ౨, ఆ.

**ఱట్టు.** దే. వి. దూఱు, నింద. "సీ. గతిమాలిబిగియారుకౌఁగిలిలేని యాఱడికూర్మికేనేల ఱట్టువడితి." ఉ, హరి. ౫, ఆ.

**ఱప్ప.** దే. వి. చిన్నజాయి. (చూ. పేటనఁజెట్టు.)

**ఱవఱవ.** దే. వి. కోపవికారము. "క. తివిరికరవాలుసేకొని, ఱవ ఱవలెసఁగంగనత్తైఱవసైఁజనుచో." అచ్చ. సుం, కాం.

**ఱవిక.** దే. వి. కంచెల. "చ. ఱవికయుఁబట్టుపుట్టముచెఱఁగు మఱుఁగయియున్కిఁజేసి." సై. ౭, ఆ. "కలయఁగఁజెంద్రకావి ఱవికంబలెఁగుంకుమపూసి." విజ. ౨, ఆ. (ఆధునికులు కొందఱు దీనిని లఘురేఫముగాఁ బ్రయోగించియున్నారు.)

**ఱవ్వ.** దే. వి. దూఱు, నింద. "క. ఇవ్విధమునఁ బ్రతిదినమును, నవ్వెలఁదిచరింపఁగొందఱతిదూషకులై, ఱవ్వలుసేయుచునోరుల, క్రొవ్వునఁబాపంబుపంచికొందురువరునఁ." భో. 3, ఆ.

**ఱవ్వాడు.** దే. స. క్రి (ఱవ్వ+ఆడు.) నిందించు.

## ఱా.

**ఱా.** దే వి. ఱాయిశబ్దమునకు వృత్తియందు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఱాపుఱ్ఱ మొ.)

**ఱాఁగ.** వై. వి. జారిణి. "తే. పూనుమీమయిభోగంబుభూషణంబు, వెనగసేవనియాఱాఁగయొనఁగరాఁగ." సా. ౨, ఆ.—విశే. 1. ఉద్ధతుఁడు*; "గోడదొల్పెడుఱాఁగ గుజ్జంబునెఱజోదు." అచ్చ. బాల, కాం.—2. ధూర్తుఁడు*. (చూ. ఱంతు.)

**ఱాఁగతుంగ.** ద్వ. వి. భద్రముస్తకము. (సంస్కృతమునందుభద్రముస్తకపర్యాయమైనగుంద్రాశబ్దముయొక్క వ్యుత్పత్తిని విచారింప ఱాఁగతుంగ అని చెప్పుట యుక్తమనితోఁచుచున్నది. ఈపదము ఒక నిఘంటువునందు వ్రాయఁబడి యున్నది. భద్రముస్తకమునకు తెనుఁగున నాగముస్తెయని వాడుచున్నారుగాని దాని వ్యుత్పత్తిని విచారింప సంస్కృతపర్యాయముల అర్థమునను సరించినదిగా కనఁబడలేదు.)

**ఱాచు.** దే. స. క్రి. 1. రాపుడుచేయు; "ద్వి. ఏచినగురుభక్తి నెల్లలోకముల, ఱాచినకొడుకునాఱడిఁజంపుకొంటి." రా. అ, కాం.—2. రుద్దు.

**ఱాతిగుండె.** దే. వి. (ఱాయి+గుండె.) కఠినహృదయము.

**ఱాతినార.** దే. వి. (ఱాయి+నార.) ఓషధివిశేషము.

**ఱాతిపాఁచి.** ద్వ. వి. (ఱాయి+పాఁచి.) ఔషధవిశేషము.

**ఱాతియులి.** ద్వ. వి. (ఱాయి+ఉలి.) కాసెయులి.

**ఱాతివాలు.** ద్వ. వి. (ఱాయి+వాలు.) వజ్రాయుధము. "తే. నెత్తురునఁదోఁగిబవరంపునేలఁద్రెళ్లి, సోఁకుదొరయొప్పెగట్టులసూడు ఱాతి, వాలుచేఁబడ్డజేగుఱువాఁగుగముల, తోదొరయుమేటిగుబ్బలి దొరదొరయుచు." అచ్చ. యు, కాం.

**ఱాపు.** దే. వి రాయిడి. (చూ ఱంకెమొదటియర్థము.)

**ఱాపువ్వు.** ద్వ. వి. (ఱాయి+పువ్వు) అశ్మపుష్పము. (మొదటి రూపము ఱాతిపూవు.)

**జొాయి.** దే. వి. శిల. ''క. నాయుల్లమరయనిన మో, జాయోకా కిల్లువూపటకవినసోర్చెఁగా.'' భార. భీష్మ. 3, ఆ.

## టి.

**టింగు.** దే. వి. తెక్కలగాలిచప్పుడు. ''ఉ. టింగను మ్రోఁత మ్రోఁగుచును తెక్కలపాములువోలెశౌరిచే, సిఁగిణివింటవెల్లి గొనచిత్రశరంబులసూతునొంచి.'' పా. ౫, ఆ.

**టిఃను.** దే. అవ. భావమునందువచ్చెడు ఒకానొక ప్రత్యయము. ''క. తెఱవకుఁగుచమండలమును, మఱిపిఱుఁదునమానుచేసిమదన్ను మనకుఁజే, దఱికమొనఁగె సరియఁజానం, దఱుడూటుట మానెఁ జూలుదాల్చుటవలనఁగా.'' భో. 3, ఆ.

**టిక్క.** దే. వి. పక్షులఁదోలునప్పటిధ్వని. ''ద్వి. కుక్కలఁబిల్చుచు టిక్కవెట్టుచును, నెక్కొనసొంగాలనిల్చుచుఁజనుచు.'' భాగ. 3. స్కం.

**టిక్కించు.** దే. స. క్రి. నిక్కించు. ''సీ. టిక్కించుకొనియున్న తెక్కమొత్తముతోడ యొడలుజాడించినెవ్వడివిదుర్చు.'' సై. ౨, ఆ.

**టిచ్చ.** దే. వి. నిశ్చేష్టత. (చూ. తేఁడు.)

**టిచ్చపడు.** ద్వి. అ. క్రి. (టిచ్చ+పడు.) చేష్టలుదక్కు. ''క. టిచ్చపడియుభయబలములు, నచ్చెరువుగఁజిత్రరూపులట్లుండ.'' భార. భీష్మ. ౧, ఆ. ''ఉ. చూపఱుల్, టిచ్చపడఁగావడింబఱచె తెప్పలుచైచినయంతమాత్రలో, నెచ్చటికేగెనోయనఁగ.'' పర. 3, ఆ. ''క. కవిసిబలముఁజంపంబాం, డవయోధులునిల్వరించుట కుఁజాలకటి, చ్చపడినఁగనిపెల్లుగఁగొ, రవసైన్యములడరెనద్ధుర స్ఫురణమెయిఁగా.'' భార. భీష్మ. ౨, ఆ.

**టిచ్చపాటు.** ద్వి. వి. టిచ్చపడుట. ''వ. అనవినిటిచ్చపాటు సకలాంగములంగడలేనిదైన్యమా, ననమునపున్యవేగనుమనంబునఁ గ్రమ్మఁగ.'' హన. 3, ఆ.

**టిప్పు.** దే. వి. టిప్పుయొక్కరూపాంతరము. ''క. అప్పుడమికొన్న నెత్తుక, టిప్పునఁజదలునకునెగసితేసినకడఁకగా, గుప్పనఁజనుతెట నొడయఁడు, తెప్పకయొకకోల వానితలఁదెగనేసెన్.'' అచ్చ. అర, కాం.

**టిమ్ము.** దే. స. క్రి. చిమ్మునఁగ్రోవితోజలాదికముఁజిమ్ము.

**టివ్వు.** దే. వి. ఎగయుటయందగు ధ్వన్యనుకరణము. ''సీ. బడివాయ కిలనగప్రతతితోటివ్వున నెగసినట్లయితోఁచుమగువలార.'' వసు. ౪, ఆ.

## టు.

**టు.** దే. అవ. ఒకానొక బహువచన ప్రత్యయము. (ఉదా. విలుకాటు, వేటకాటు మొ.)

**టుప్పు.** దే. స. క్రి. టుప్పుయొక్కరూపాంతరము. భాను. ౨, ఆ.

**టువ్వు.** దే. స. క్రి. వినరినైచు. ''సీ. డిండిమంబున కుల్పిగం డాల్పుదానమేటులుగఁదద్వహులజాలటువ్వటువ్వ.'' అను. ౨, ఆ. — వి. 1. తెక్కలగాలిచప్పుడు; ''ఉ. టువ్వన మ్రోఁతతో వెదురెఱుంగనివీఁకఁబరాక్రమించుచో.'' భో. 3, ఆ.—2. కాలుటయందగు ధ్వన్యనుకరణము. ''క. ఈలీలనుమిత్రోమతుఁ, డాలిగొనఁగనెత్తుకొడఁల నంతటఁగాటఁగా, దూలుచుభోలుచువ్రాలుచు, టోలుచుబూరివనరుచును టువ్వఁగూలెఁగా.'' రా. అర, కాం. ౨, ఆ.

**టువ్వుఁ**[illegible]**గు.** దే. వి. పక్షివిశేషము, ఖంజరీటము.

## టూ.

**టూవు.** దే స. క్రి. టువ్వునకు మొదటిరూపము. ''సీ. పనలేరు నిలుఠోరి పాటకులారని దేవాయుధంబులుటూవువారు.'' అను. ౬, ఆ.

## టె.

**టెక్క.** దే. వి. పక్షము. ''ఉ. తెక్కలుచించికంఠమున తేపలు వాపి శిరంబు వ్రచ్చి.'' భార. భీష్మ. ౨, ఆ.

**టెక్కచాఁపు.** దే. వి. కొన్నిమూరలుగలతేకు. (చూ. తార చేఁపు)

**టెక్కపాయులు.** దే. వి. బ. ధాన్యవిశేషము.

**టెప్ప.** దే. వి. కనతెప్ప ''ఉ. కంటికిఁగా, తెప్పయుఁబోలె మాఁటయినెటం బన లారసి యొజ్జచాడ్పునఁగా, జెప్పుచు.'' భార. ఉద్యో. ౪, ఆ.

**టెప్పపాటు.** ద్వి. వి నిమిషము.

**టెల్లు.** దే. వి. తృణవిశేషము, శరము.

**టెల్లుచూలి.** దే. వి. కుమారస్వామి, శరజన్ముఁడు.

**టెల్లుదీవి.** ద్వి వి. కుశద్వీపము.

## టే.

**టేఁచు.** దే. వి. శునకవిశేషము. (తేఁచుకుక్క.)

**టేఁడు.** దే. వి. 1. దొర; ''క. తేనికి సంతసముచేసి తేనిని కడఁకగా.'' య. ౨, ఆ.—2. మగఁడు. ''క. తేనియనుపురణ ముననదన, మేన విడిచినట్టికాంత మేలిపదవికిం, దానునతండును నరిగియ, సూనస్థిరసుఖములందుచుంచుటవిందుఁగా.'' భార. శాం. 3, ఆ.

**టేకు.** దే. వి. 1. పున్నదళము; ''సీ. కబరికాభరముపైఁగన్నె గేదఁగిపువ్వతేకుతోఁగూడరే తేనెఁబోదివి.'' సై. ౬, ఆ.—2. తగడు; 3. ఈఁక; (చూ. తెక్క.) 4. అంచుకమ్ములులేని వస్త్రము; 5. దుస్పటిలో సగము.

**టేకుమడఁచు.** దే. స. క్రి. అణఁగఁద్రొక్కు. పాంచా. 3, ఆ. (చూ. లంగగొను.)

**టేపు.** దే. వి. 1. ప్రాతఃకాలము; ''ఉ. తేపులుభీమలింగము గుపేంచి జపంబొనరించె నిచ్చటఁగా.'' భీ. ౨, ఆ.—2. వెన కటిదినము. (ఈ పదమునకు రాజమహేంద్రమునందు కడచిన దినము అర్థముగా వాడుచున్నారఁట.) (రేపుయొక్కరూపాంతరము.)

**టేయు.** దే. అ. క్రి. 1. అతిశయించు; (చూ. టిప్పు.) 2. విజృంభించు. (చూ. తేఁడు మొదటియర్థము.)

**టేల.** దే. వి. ఆరగ్వధము. ''పంచచామరము. చాలఁజోలు నెంతకైనఁజాలునన్న గన్నెరుల్, తేలపూలకేలగోలతేయ.'' య. ౪, ఆ.

## త్రై.

**త్రైక.** దే. వి. అటక. ''కలఁగినకొప్పుతోఁబటిలుగందముతోఁబడివడ్డ త్రైకతో.'' శకాం. ౪, ఆ. (మొదటిరూపము అయిక.) (చూ. అటక.)

## ఱొ.

**ఱొచ్చె.** దే. వి. 1. తిరస్కారము; "వ. రఘువరులసచ్చరితోచ్చయంబుల నుచ్చరించుచుఁ దొచ్చెంబులఱొచ్చుసేయుచు." రామా. ౫, ఆ.—2. ఋరవ; 3. అపవాదము; "ఆ ఇట్టులగుటయెఱిఁగియెఱిఁగియేనియునునె, ఋంగకేనిబలిమిఱొచ్చుగడిగి, చేయుపనిఫలంబు సిద్ధింపకుంకుట, కొలఁదిఁబోకదుఃఖముబును గలుగు." భార. అశ్వ. ౨, ఆ.—4. నిందడి. "ఱొచ్చోర్వకటులొంగఁ జొచ్చెమేను." అను. ౫, ఆ.

**ఱొడ్డ.** దే. విశే. ఎడమ. (ఱొడ్డచేయి.)

**ఱొడ్డు.** దే. విశే. అధికము. (ఱొడ్డుపులుసు.)

**ఱొమ్ము.** వై. వి. వక్షము. "తే. ఱొమ్ముగువ్వచేసియేయమెఱుఁగు లెల్ల, కడలనింపుచునదిని కాఁడుటయును." అచ్చ. కిష్కి౦, కా౦.

## ఱో.

**ఱోలు.** దే. అ. క్రి. బాధచేనఱచు, విలపించు. "ఉ. నను యించెనుగ్రుఁడై, ఱోలఁగనోఁ జఁగాఁబలు మఱు౦బో రలంబడిలాల గ్రక్కున, వాన్లుమగండువాక్పరిభవంబుదలంచుచు శౌర్య ధుర్యుఁడై." భార. సౌ. ౧, ఆ. (ఒకానొకఁడు ఈ యర్థము నందుదీనిలఘురేఫముగాఁ బ్రయోగించినాఁడు. అది సాధుప్రకారడు.) వి. దంచుటకుబ్బుటలోనగువానికి ఉపయోగించెడుసాధనము, ఉలూఖలము.

**ఱోలుమ్రాను.** దే. వి. ఉత్తరాసిలిరిగెడు ఉతక.

## ల.

**ల.** ఒక యక్షరము. దే. అప. 1. ద్వితీయా బహువచనమునందు వచ్చెడు ప్రత్యయము; (ఉదా. రాములఁ, వనితలఁ, వనములఁ మొ.)—2. తృతీయాదిబహువచనము పరమగుచుండఁగా వచ్చెడు ఆగమము. (ఉదా. రాములచేతఁ, వనితలకొఱకుఁ, వనములకుఁ మొ.)

**లంక.** ఉభ. దే. వి. 1. దీవి; "సీ. సెలయేటియిసుకలంకలవరాహంబులుమొత్తంబులై త్రవ్వుమన్తెలెత్త." స్వా. ౨, ఆ.—2. తలవాకిటి ప్రక్కగది. సం. ఆ. స్త్రీ. 1. రావణునిపట్టణము; 2. ఒకానొకరాక్షసి; 3. ఱంకుటాలు; 4. కలాయము.

**లంకణము** వై. వి. జ్వరాదులచేతనుండెడి యుపవాసము.

**లంకించు.** వై. అ. క్రి. తగులు*. "క. లంకించియరుంధతిపతి, మంకణునకుఁజెప్పె." భీ. 3, ఆ.—స. క్రి. 1. పెనవేయు*; (చూ. లంకియనుమాడవయర్థము.) 2. అవమానించు*. "క. జననియనకయిక్లైంతయు, ననులంకించితి." షారి. పూ. ౧, ఆ.

**లంకిణి.** అన్య. భి. ఒకవిధమైన బట్ట.

**లంకియ.** వై. వి. 1. సంగము*; 2. తగులుపాటు*; (చూ. లంకె.) 3. పెన*. "సీ. శిక్షింపవలయునట్టి, గుజ్జుకోడెలజట్టి గొని శ్రీతిలంకించి యుండులంకియతోనగండుమీటి, పాజెనక్కొడి యల్పడియున్నచనుపలాట్టునంగున్నై." భార. శాం. ౪, ఆ.

**లంకె.** వై. వి. లంకియయొక్క రూపాంతరము. (సంగమునకు.— "ఉ. ఇంకొకయేఁడునానోయిననరే శ్వరయాతలిరేయినీవునా, లంకెకువచ్చియాత్మజాలలక్షణవంతులఁగాంచెదు." భాగ. ౯, స్కం.—తగులుపాటునకు.—"చావునకునింకలంకెగాఁజనదు." జై. ౭, ఆ.—పెనకు.—"తే. శ్రీపువాపోవఁబట్టిలంకియకుఁజార్చి." పాండు. ౫, ఆ.)

**లంకెపలుపు.** ద్వ. వి. లంకెవేసెడుపలుపు. "బల్లిదపులంకెపలుపులు." నిలా. ౨, ఆ.

**లంకెపాటు.** వై. వి. దగులుపాటు, తగులము. "సీ. తనపాదములకును దమంలఁ కులంకెపాటుని దుర్లాభిపతులువల్క." సా. ౧, ఆ. "సీ. లలనపాదంబులలంకెపాటైయుండిరాఁజనునేనాపురంబులార." రామా. ౫, ఆ.

**లంకెపీఁట.** వై. వి. పెనవేసెడి మ్రానిపలక.

**లంకెవెట్టు.** ద్వ. స. క్రి. (లంకె+పెట్టు.) 1. తగులువరుచు; "ఎ, గీ. విష్ణుభక్తులందుఁ విష్ణునందుఁగ, లంకమెడలమనసులంకెవెట్టి, విహారరాజ్యవృత్తిచిడువసివాఁడునై, యుండెఁదురాచతపసియనఁగనొప్పె." భాగ. ౯, స్కం.—2. పెనవేయు. "తే. సర్వకమునంటియొకకొమ్మపండిమీఁద, నఱికియొకజాగిలముచెవియొడిసిపట్టి, యదియుఁదనచాయఁదిరుగఁదానట్టితిరిగ, లంకెవెట్టైన కైవడిఁకలలేక." పు. ౨, ఆ.

**లంకోయిక.** సం. వి. ఆ. స్త్రీ. పిక్కటి. (చూ. లంకాశిక.)

**లంగ.** వై. వి. లంఘనము. (చూ. లంగగొను.)

**లంగగొను.** ద్వ. స. క్రి. (లంగ+కొను.) లంఘించు, దాటు. "చ. కుసుకుచగుబ్బచన్నఁగవ గోర్విపుఁలాడునుఃబుట్టచెండ్ల బోం, గరములు నొక్కలంగగొనుఁ గైరవపుంబలుసంగడంబులఁ, దర లకయెత్తిపట్టు జగిత్రాళపుఁజిప్పలనొత్తియాడుఁ దా, మరవిరిమొగ్గగుత్తిఁ బలుమాఱునతేకు మడంచునెంతయుఁ." చంద్రా. ౨, ఆ.

**లంగము.** సం. వి. అ. పుం. సంగము. డు. విటుఁడు.

**లంగరు.** వై. వి. ఓడనిలుచుటకై అడుగున దిగవేసెడునాగేలువంటి యినుపసాధనము*, జీను.

**లంగోటి.** హిం. వి. గోచి.

**లంఘ.** సం. వి. ఆ. స్త్రీ. దాఁటు, లంగ.

**లంఘనము.** సం. వి. అ. న. 1. దాఁటు; 2. దూఁకుడు; 3. గుఱ్ఱపుదూఁకుడు; 4. లంకణము.

**లంఘించు.** సం. అ. క్రి. దూఁకు. స. క్రి. దాఁటు. (పరిలంఘించు, పరివిలంఘించు, విలంఘించు. అనియు.)

**లంచము.** సం. వి అ. పుం. లంచేము, ఉత్కోచము.

**లంచెగొండి.** ద్వ. విశే. (లంచేము+గొండి.) లంచేముతీయువాఁడు.

**లంచేము.** వై. వి. తనపని చక్కఁబెట్టుకొనుటకై యొకనికి రహస్యముగానిచ్చు ధనము.

**లంజ.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

**లంజిక.** సం. వి. ఆ. స్త్రీ.——పై.——

**లంజియ.** వై. వి. లంజె*. "క. మునినాథయేనునిరతము, ననిమిష పతికొలువులంజియను." వి. పు. ౨, ఆ.

**లంజె.** వై. వి. వేశ్య*. (లంజియయొక్క రూపాంతరము.)

**లంజెకాఁడు.** ద్వ. వి. విటకాఁడు, విటుఁడు.

**లంజెత.** ద్వ. వి. లంజియ, వేశ్య. "ద్వి. లంజెకాఱులసొమ్ము లంజెతలంది." భల్లా. (స్వార్థమున త ప్రత్యయము.)

**లంజెబేడిస.** ద్వ. వి. మత్స్యవిశేషము.

**లంజెటికము.** ద్వ. వి. వేశ్యాసంభోగము. భల్లా. ౫, ఆ.

లంజెసవరిము. వై. వి. గొంతెమగోరు. ప్రసారణికే.

లండి. దే. విణ. కుత్సితురాలు, కుత్సితుడు. "లండికిఁజేకడెంబు." హంస. ౫, ఆ.

లండు. దే. విణ. ——— వై. ——— (చూ. కూళుడు మొదటి యర్థము.)

లండుఁబోతు. దే. విణ. (లండు+పోతు.)———వై.——— హరిశ్చ. ద్వి. ౨, భా. (స్వార్థమున పోతు.)

లంద. దే. విణ. పొట్టవాఁడు, తుందిలుఁడు.

లంపటు. దే. వి. 1. శ్రమము; (చూ. లంపటపడు.)—2. ఆపద. (రూ. లంపటము —ఆపదకు.—"క. లంపటము నివారించపను, సంపదకృపనేయ జయము సంపాదింపఁగ, జంపెడివారివధింపను, సొంపారఁగనీకచెల్లుసొమార్గధరా." భాగ. ౯, స్క—ం.)

లంపటుపడు. ద్వ. అ. క్రి. (లంపట+పడు.) శ్రమపడు. "క. మునుపాకనికినండఁగఁజా, లనియచ్చోనిరుపురొడిఁగి లంపట పడుచే, మనిచెప్పనైననాయసఁ, గనిచోటచ్చిరిక్కృపాధికతనమ్ము నులుఁగ." పర. ౧, ఆ.

లంపటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అత్యాశక్తిగలవాఁడు.

లంపతా. దే. వి. దాసీపుత్రుఁడు. (లంపతావాఁడు అనియు.)

లంపాకము. సం. వి. అ. పుం. ఒకదేశము. విణ. ఆనగలది.

లంపు. దే. వి. దొంగమేఁత. "వ. గజేకజొంపంబులగుంపుల కుడికిలంపులుమేయుచు." భాగ. ౧౦, స్క—ం. పూ.

లంపులమారి. దే. విణ. దొంగమేఁతమేయునది. "లంపులమారి దాననినులాఁచుక మాదిగవాఁడుగోయ." హంస. ౫, ఆ.

లంబనము. సం. వి. అ. న. 1. వ్రేలుడు; 2. మెడను వ్రేలాడుహారము లోనగునది.

లంబమానము. సం వి. అ. న. మెడను వ్రేలాడుహారము లోనగునది. విణ వ్రేలాడునది.

లంబము. సం. వి. అ. పుం. వ్రేలుడు. విణ. దీర్ఘము.

లంబాడి. హిం. వి. ఒకజాతిజనము.

లంబి. దే. వి. కుటుంబము.

లంబిక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

లంబితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రేలుడు.

లంబి. దే. వి. లంబియొక్కరూపాంతరము.

లంబు. వై. వి. 1. స్థౌల్యము*; 2. గొప్పతనము*. "నీలంబు ఆగికాంచినీలంబువలదను." శశాం. 3, ఆ.

లంబుషము. సం. వి. అ. పుం. పదునేడులసుత్యాలహారము.

లంబోదరుఁడు. సం. వి. అ. పుం. వినాయకుఁడు.

లంభనము. సం. వి. అ. న. 1. తిట్టుట; 2. దూషించుట.

లంభించు. సం. స. క్రి. 1. తిట్టు; 2. దూషించు.

లకుచము. సం. వి. అ. పుం. గజనిమ్మ‡.

లకుముకి. దే. వి. ఆకసమునందుండిత్రెక్కలార్చుచుపొంచువేసి నీటిలోపలనుండు మత్స్యమునుపట్టుకొనిపోయితినెడు పక్షివిశే షము, టిట్టిభము.

లకోటా. హిం. వి. ఉత్తరము లోనగునుంచు కాగితపుసంచి.

లకోరి. దే. వి. క్రూరబాణము. "ఉ. హెచ్చినబొమ్మవిండ్లలరి యించినచూపులకోరికోలలఁగ, ముచ్చ ముదుం గనేయుచు." చంద్రా. ౧, ఆ.

లకోరీ. దే. వి. 1. లకోరియొక్కరూపాంతరము; "క. ఈరీతిం గెందలిరుల, కోరీసుంతొాని కాఁకఁగూర్చుచకోరీ, శారీకీరీమత్తవ, యూరీరవములకుసలికియుగ్గలిమడలొఁగ." చంద్ర.—2. పారావతవిశేషము. "మేలైన లకోరీలు." సా. ౧, ఆ.

లక్క. వై. వి. ఒకానొకచెట్టుబంక, జతువు.

లక్కతెవులు. ద్వ. వి. ఒకదినుసుచీడ.

లక్కణము. వై. వి. 1. వ్యాకరణాదిశాస్త్రము; "ఉ. లక్కన మెంచికైనమొదలఁగ సుగుణాక్షరముల్ ఘటింపతేఁ, డక్కఅనేలు సేల గలయఁకయుసూరెలగాచబేసికం, ట్లాక్కటఁగొల్వఁగామెఱసి యొజ్జయునిచ్చలఁబిచ్చలించురొ, పెక్కకకబ్బముల్వెలయనెయ్యెడ నెల్లరుమెచ్చనచ్చుగఁ." కవిస. ౧, ఆ.—2. గుణము.

లక్కపెట్టె. వై. వి. చిత్రపేటిక.

లక్కబియ్యము. ద్వ. వి. లక్కపొడి.

లక్కాకు. ద్వ. వి. (లక్క+ఆకు.) ఆఁడువారుచుట్టికమ్మచెవి నుంచుకొనెడు లక్కపూసిన తాటాకు. (చూ. అక్షింతలు.)

లక్కిమి. వై. వి. లక్ష్మి.

లక్కుమనుఁడు. వై. వి. లక్ష్మణుఁడు. అచ్చ. ఆ, కాం.

లక్ష. సం. స. ఆ. స్త్రీ. అ. పుం. నూఱువేలు. వి. అ. న. ము. 1. గురి; 2. నెపము.

లక్షకము. సం. వి. అ. పుం. లక్ష్యార్థమును తెలిపెడుశబ్దము.

లక్షణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక శబ్దవృత్తి; (చూ. వృత్తి.) 2. ఆఁడుబెగ్గురు. అ. న. ము. 1. గురి; 2. గుణము; 3. చూపు; 4. వ్యాకరణాదిశాస్త్రము; 5. పేరు. పుం. బెగ్గురు. (పురాణమునకుఁగల పంచలక్షణములు.—సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము.)

లక్షించు. సం. స. క్రి. 1. గురిచేయు; 2. చూచు. (ఆలక్షించు అనియు.)

లక్ష్మణ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుబెగ్గురు. అ. న. ము. 1. గుణము; 2. పేరు.

లక్ష్మణుఁడు. సం. వి. అ. పుం. రామునితమ్ముఁడు. విణ. శ్రీమంతుఁడు.

లక్ష్మము. సం. వి. న్. న. 1. గుణము; 2. ముఖ్యము.

లక్ష్మి. సం. వి. ఈ. స్త్రీ. 1. రమ; 2. సంపద; 3. వస్త్రభూషణాదులవలనఁగలిగినశోభ; 4. మెట్టదామర‡; 5. ఋద్ధియనెడు గంధద్రవ్యము; 6. గొల్లబిడ్డ‡; 7. ప్రేంకణము‡.

లక్ష్మీపతి. సం. వి. ఇ. పుం. 1. విష్ణువు, లచ్చిమగఁడు; 2. ప్రభువు.

లక్ష్మీసంతుఁడు. సం. విణ. (న్. ఈ. న్.) 1. సంపదగల వాఁడు; 2. ఒప్పిదముగలవాఁడు.

లక్ష్యము. సం. వి. అ. న. గురి. పుం. లక్షణచేఁదెలియఁదగిన యర్థము.

లగడ. దే. వి. చిమిడినయన్నము, చిమిడిక.

లగనము. వై. వి. లగ్నము. "క. తొగసూడుపుగ్గుంకెదట్టం, బుగఁ జేఁకటులొదవెరిక్కమొత్తముపొడమెఁగ, లగనముసుడాసెనయ్యెడఁ, దగఁబెద్దలునైదువలునుదద్దయునెలమిఁగ." నీలా. 3, ఆ.

లగాము. హిం. వి. కళ్లెము.

లగాయతు. హిం. వి. ఆరంభము, మొదలు.

లగుడము. సం. వి. అ. పుం. దండము.

లగుడము. దే. వి. శ్యేనవిశేషము. (చూ. లగ్గ.)

లగువు. వై. వి. 1. చేలుకన; 2. లాఘవము; "ఓరిలాగ్గలు పుంగలపోటరివోలెఁ ద్రేలెవేమి." భాగ. ౧౦, స్కం. ఉ.— 3. గంతు.—విశే. చేలుక.

లగ్గ. వై. వి. (ముట్టడించి) కోటను బ్రాఁకుట*. "వ. సత్వరంబుగ డనుకలాపూర్ణుని ప్రెగ్గడతమమొగ్గరంబునగ్గలిక నలయలగ్గకుడిగ్గి చిన." కళా. ౮, ఆ.

లగ్గదింపు. దస్య. వి. కోటమీఁదనుండి శత్రుప్రలయము దొర్లిం చెడు జాతిబండలోనగునది.

లగ్గపట్టు. దస్య. స. క్రి. (ముట్టడివేసి) కోట నెక్కు. "గ్గ పైరులలగ్గపట్టఁగరాదులంక." రా. యు, కాం.

లగ్గము. వై. వి. లగనముయొక్క రూపాంతరము.

లగ్గు దే. వి. 1. మేలు, శుభము; "వ. అనంతరంబునఁ దక్షిణభు జాస్పందనంబుపలక్షించిమీఁద లగ్గగుననుచు." భార. ఆర. ౪, ఆ.—2. ఉత్తరక్రియ. "వ. దుర్యోధనాదులకుఁ గురంతకం బైన బెనంగ నాంబికే యుండొర్ధ్వదైహిక క్రియ లాచరించుచున్నగాన నిర్భితానె జెంగినవారలకెల్లలగ్గులునేయు టకుఁదగుబంధులులేరనిపను ధరావల్లభుల నెల్లనుద్దేశించి యంచితదానంబు లఁజేయ ధౌమ్యుంబని చె." భార. శాం. ౧, ఆ.

లగ్నకుఁడు. సం. వి. అ. పుం. పూఁటకాఁపు, ప్రతిభువు.

లగ్నము. సం. వి. అ. న. రాశ్యుదయము. పుం. మదపుటే నుఁగు. విశే. 1. తగులుకొన్నది; 2. సిగ్గుఁబొందినది.

లఘిమ. సం. వి. న్. పుం. 1. లఘుత్వము, చేలుకన; 2. ఒక విభూతి. (చూ. ఐశ్వర్యము.) (రూ. లఘిమము.)

లఘిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి చులుకనైనది; 2. మిక్కిలి తక్కువైనది.

లఘుకము. సం. వి. అ. పుం. తోఁటపోఁకే.

లఘులయము. సం. వి. అ. న. నీటివట్టివేరు.

లఘువు. సం. వి. ఉ. స్త్రీ. పిక్కటి. న. నల్లగలు. క్రి. విశే. శీఘ్రము. విశే. 1. వడిగలది; 2. చేలుకనిది; 3. చేవలేనిది; 4. ఒప్పిదమైనది.

లఘ్వి. సం. వి. ఈ. స్త్రీ. బండి. విశే. 1. చులుకనైనది; 2. కుఱుచయైనది.

లచ్చి. వై. వి. 1. లక్ష్మీదేవి; 2. సంపద. "క. కడులచ్చిగలిగె నేనియుఁ, గుడుతురుకట్టుదురుగాక." భాగ. ౧౦, స్కం. పూ.

లచ్చిమగఁడు. దస్య. వి విష్ణువు, లక్ష్మీపతి. "వ, గీ. అమ్మహా క్రీడనస్థలి నాచరించె, లంఘునా క్రీడనముతొల్లిలచ్చిమగఁడు." పాండు. ౫, ఆ.

లచ్చివారము. మి. వి. గురువాసరము (ఇది నైఘంటికము.)

లచ్చెనము. వై. వి. 1. గుఱుతు; 2. వ్యాకరణాదిశాస్త్రము.

లజ్జ. సం. వి. ఆ స్త్రీ. సిగ్గు, త్రప, వ్రీడ.

లజ్జాళువు. సం. విశే. (ఉ.) లజ్జాశీలుఁడు, సిగ్గరి.

లజ్జించు. సం. అ. క్రి. సిగ్గుపడు.

లజ్జితము. సం. విశే. (అ. ఆ. అ.) సిగ్గుపడినది.

లటక్కు. దే. వి. మ్రింగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (వాఁడు దాని నోటవేసికొని లటక్కున మ్రింగెను.)

లట్టము. సం. వి. అ పుం. కస్పెర.

లట్టు. దే. వి. 1. పడియ; 2. గాఁడి.

లట్టువ. వై. వి. చిటితాగము*. "వ. కరముల మ్రానిలట్టువయుఁ గంబళమంచములందుఁ జంకెటలు, దరివపుగూఁడయుఁ గొని తదీయ నివాసముసిగ్గనుంచి." వై. 3, ఆ. (ఇది విచార్యము.)

లట్వ. సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము. అ. పుం. ము. లడ్డు.

లడాయి. హిం. వి. యుద్ధము, జగడము.

లడి. దే. వి. నిమువుగాచుట్టినదరిగలోనగువానిచుట్ట.

లడ్డిగ. వై. వి. ప్రయాణముపోవునప్పుడునెయ్యనూనెమొదలగునవి పోసికొనిపోయెడు చిన్నమూతిగలపాత్రవిశేషము*. "తేనెలడ్డి గ." (రూ. లడ్డిగము. "నేతిలడ్డిగము." మొ.)

లడ్డు. వై. వి. చక్కెరపాఁకముతోఁజేసెడు భక్ష్యవిశేషము.

లడ్డుకము. సం. వి అ. పుం, న. లడ్డు, లట్వము.

లడ్డువము. వై. వి. (చూ.) లడ్డు. (చూ. బూరియ.)

లడ్వము. వై. వి. లడ్డువముయొక్కరూపాంతరము. (చూ. బొంగు.)

లత. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁగ; 2. ఎక్కుడుదీఁగ; 3. గరిక; 4. పూలగురివెంద; 5. ముత్యాలహారపుపేట; 6. కొమ్మ; 7. పిక్కటి; 8. ప్రేంకణము; 9. చీమ; 10. పాలెపురుగు; 11. కస్తూరి.

లతకూన. మి. వి. లేఁతతీఁగవంటి ఆఁడుది. "సీ. లతకూనవినవమ్మ లతకూనగాదిది తరుణలతాతన్వితనువుగాని." భాను. 3, ఆ.

లతాంతము. సం. వి. అ. న. పుష్పము, పూవు.

లతాప్రతానని. సం. వి. ఈ. స్త్రీ. ఒకటితోనొకటి పెనఁగొన్న తీఁగలోనగునది.

లతార్కము. సం. వి. అ. పుం. పచ్చనీరుల్లి.

లతిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁగ; 2. నూలుపేటలహారము.

లత్త. దే. వి. 1. దెబ్బ; 2. ఆపద.

లత్తిక. దే. వి. బలుపును చప్పుడునుగల ఒకదినుసుగచ్చకాయ.

లత్తిచేప. దే. వి. మత్స్యవిశేషము.

లత్తుక. వై. వి. లాక్షారసము, అలక్తకము.

లత్తుకబొత్తులు. దస్య. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ.

లద్ది. దే. వి. గుఱ్ఱములోనగువాని మలము.

లద్దిపిప్పి. దే. వి. ఒకదినుసు చీడపురుగు.

లద్దిపురుగు. దస్య. వి. మగ్గినమ్రానులోనగువానియందుపుట్టెడు తెల్లని క్రిమివిశేషము.

లద్దె. దే. వి. (నేయువాఁడువస్త్రపుచివరనువిడిచెడి) కచ్చు. (మొదటి రూపము లద్దియ.)

లపక. దే. వి. ధనము, విత్తము.

లపనము. సం. వి. అ. న. 1. ముఖము; 2. నోరు; 3. మాట.

లపితము. సం. వి. అ. న. మాట. విశే. మాటలాడఁబడినది.

లప్ప. దే. వి. రాశి. "కస్తురిలప్ప." "చక్కెరలప్ప." "సీ. మంచులప్పలమించుమండెంగముమెపు సుహారలితెట్టువగట్టునమవు లయ్యె." నై. ౬, ఆ.

లప్పము. నై. వి. మ్రానిపెపైఁ బోనగువానినంచు గొందులమెపైకు ఒకపిసుపునున్న పుమ్మడి*.

లబ్బీలు. హిం. వి. తురకలలో నొకజాతివారు.

లబ్ధము. సం. వి. అ. న. భాగహారముచేయగా నేర్పడుసంఖ్య. విణ. పొందఁబడినది.

లబ్ధవర్ణుఁడు. సం. వి. అ. పుం. విద్వాంసుఁడు, చేదువరి.

లబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. లాభము, ప్రాప్తి, కలిమి.

లభించు. సం. అ. క్రి. ప్రాప్తించు, కలుగు.

లభ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లభింపఁదగినది; 2. యుక్తము.

లమిడీ. హిం. వి. బాందిస్త్రీ. ఒక తిట్టుమాట.

లయ. ఉభ. దే. వి. మోసము. సం. అ. పుం. తౌర్యత్రికసామ్యము.

లయము. సం. వి. అ. న. నీటివట్టివేరు. పుం. 1. నాశము; 2. ఆలింగనము.

లయకాఁడు. దే. విణ. మోసగాఁడు. "తే. అతనిఁ, గప్పివెపైడిచీల యకారిదొంగ." నై. ౪, ఆ.

లయించు. సం. అ. క్రి. 1. నశించు; 2. నర్తనము.

లయ్య. నై. వి. వేశ్య*. (ఇది లక్షణగ్రంథములయందు వ్రాయఁబడియున్నదిగాని దీనికి ప్రయోగము మృగ్యము.)

లలంతిక. సం. వి. ఆ. స్త్రీ. మెడనువ్రేలాడుహారములోనగునది.

లలన. సం. వి. ఆ స్త్రీ 1. విలసనశీలయైన ఆఁడుది; 2. ఆఁడుది; 3. నాలుక.

లలాటము. సం. వి. అ. న. నొసలు, నుదురు, అలికము.

లలాటిక. సం. వి. ఆ. స్త్రీ పాపటబొట్టు.

లలామకము. సం. వి. అ. న. (చూ.) బాసికము.

లలామము. సం. వి. న్. న. 1. గురుతు; 2 టెక్కెము; 3. తొడవు; 4. నొసటనుంచుకొనెడుబొట్టు; 5. గుఱ్ఱమునొసటిచుక్క; 6. తోఁక; 7. కొమ్ము; 8. ప్రభావము; 9. గుఱ్ఱము, 10. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము.

లలి. దే. వి. 1. క్రమము; (చూ. లలరు అయిదవయర్థము.) 2. ప్రేమ; "ద్వి. పొరిఁబొరిఁదమచంచుపుటములుసాఁచి, నిరతంబుగాఁగవెన్నెలఁబుక్కిలించి, లలితోఁడఁదమప్రియలకు నిచ్చియిచ్చి." రా. యు, కాం.—3. వికాసము; "ద్వి. దళముసబిగువెల్లఁ దప్పియుండంద, లలిదక్కుచును గమలంబులుమొగిడె." రా. యు, కాం.—4. ఉత్సాహము. "లలిమీఱఁగ హరికంసునుమంచముకడఁ లంఘించి" వి, పు. ౭, ఆ.

లలితము. సం. వి అ న. సుకుమారత్వముచేతనగు అంగవిన్యాసరూపమైన స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము. విణ. 1. ఈప్సితము; 2. మనోజ్ఞము.

లవంగము. సం. వి. అ. న. కరాంపువు.

లవణము. సం. వి. అ. న. ఉప్పు. (త్రిలవణము — సైంధవము, బిడము, రుచకము) పుం. 1. ఉప్పునీరు; 2. ఉప్పునముద్రము. (విణ. ... ) 1 ఉప్పునిది; 2. లావణ్యము ...

లవణాకరము. సం. వి. అ. పుం. 1. ఉప్పునముద్రము; 2. ఉప్పళము.

లవణి. దే. వి. బిగువు. "సీ. బహేయమైనయొడ్డాణంబులవణిచే నక్కళించినపొట్టమక్కళించి." హ్వా. ౧, ఆ.

లవణోదము. సం. వి. అ. పుం. ఉప్పునముద్రము.

లవనము. సం. వి. అ. న. పైరులోనగువాని కోఁత.

లవనను. ఆం. వి. జీవనార్థముఇయిచ్చు ద్రవ్యము.

లవము. సం. వి. అ. పుం. 1. లేశము; 2. చేటు; 3. కోఁత. ఁడు. రాముని కొడుకు.

లవలని. దే. విణ. శేఫల్లిక. "ద్వి. పటువజ్రనఖరపాదఘట్టనల, లవలవలైకొలంబు గ్రక్కదల." హరిశ్చ. ౧, భా.

లవలి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకతీఁగె.

లవాజిమా. దే. గ్రామసేవకుల జీతములకై తీసికొనఁబడు కొద్ది పన్ను.

లవించు. సం. స. క్రి. కోయు.

లవిటి. దే. వి తెక్కమొదలు, పక్షతి.

లవిత్రము. సం. వి. అ. న. కొడవలి, దాత్రము.

లశునము. సం. వి. అ. న. 1. వెల్లుల్లి*; 2. కెంపునందలిదోషవిశేషము. (అనఁగా పాలు పైఁబూసినట్లుండెడు తెల్లడాలు.)

లష్కరు. హిం. వి. దండు.

లసుకు. దే. స. క్రి. నాశముచేయు. "చ. లసికిరిజోదులగ్గలికలగ్గలకెక్కెనఁగుంటలపట్టులఁ, వసుమతిఁగూల్చియుఁ గదలవైచియుఁగత్తుల వ్రక్కలించియుఁ, వసులవధించియుఁ మునలవర్గములఁ బడమోఁదివాలుకల్, మసలఁగవేఁచివంచియును మందుల తిత్తులఁగాల్చివైచియుఁ." గా, వి. ౫, ఆ.

లస్తకము. సం వి. అ. పుం. ధనుర్మధ్యము, పిడికట్టు.

లసూరి. సం వి. ఇ. ఈ. స్త్రీ. పెద్ద అల, కడలు

## లా.

లాంగలము. సం. వి. అ. న. 1. నాఁగలి; 2. తాడిచెట్టు*; 3. ఒక పుష్పవిశేషము; 4 గృహదారువిశేషము; 5. మగగుఱి.

లాంగలి. సం. వి. ఈ. స్త్రీ. 1. తరిగొబ్బి*; (చూ. లాంగలిక.) 2. నిరుపిప్పలి*. న్. పుం. 1. నాఁగటిజోదు; 2. నారికడము*; 3. పాము.

లాంగూలము. సం. వి అ. న. 1. తోఁక; 2. మగగుఱి. పుం. అభినయహస్తవిశేషము. (ఉంగరపువ్రేలినివంచి చిటికెనవ్రేలిని పైకెత్తి కడమ మూఁడువ్రేళ్లనూర్ధ్వాకారముగా త్రేతాగ్నులవలెపట్టినది.)

లాంఛనము. సం. వి. అ. న. 1. గురుతు; 2. పేరు.

లాంతరు. ఆం. వి. దీపముపెట్టుటకై అద్దములతో చేసినది.

లాంపట్యము. సం. వి. అ. న. లంపటభావము. (చూ. లంపటుఁడు.)

లాఁక. దే. వి. పక్షియాఁక

లాఁకకట్టు. దే. వి విడిచికట్టిన పెడచేతులకట్టు.

లాఁగ. దే. వి. బొటియ, బిలము. "సీ. లాఁగలఁబుట్టల లోపలిశిఖలభుజంగములములుమ్రింగికొనుచు." భార. ఆర. ౨, ఆ.

**లాఁగడాఁగుడు.** దే. వి. సర్పము, బిలేశయము. "లాఁగడాఁగుడుఁజాఁగఁబ్రోఁగులిడెడుబ్రోడ." అచ్చ. బాల, కాం.

**లాఁగరి.** దే. వి. (లాఁగ+అరి.) చెవి, శ్రోత్రము.

**లాఁగించు.** వై. అ. క్రి. లంఘించు. "వ నడుములాఁగించినైచి యు." ఉ, హరి. 3, ఆ. (ఇది విచార్యము.)

**లాఁగు.** వై. వి. 1. లంఘనము; "ఎ, గీ. లాఁగువేగంబుమెఱసి చలంబునెఱపి, మల్లు తనమున మెప్పించుమనుజవిభుని." భార. విరా. ౧, ఆ. – 2. చల్లడముశ్. "కావిలాఁగులునీలికాసెలు." రసి. ౧, ఆ.

**లాఁచు** దే. అ. క్రి. 1. కవియు; "సీ. ఓనలిద్దఁజెఱకిద్దరనుజాబ్రింగఁగనరిన్ లాఁచెనో యనితోఁచెలఁకమీఁద." రామా. ౭, ఆ.–2. పొంచు. "ద్వి. గోఁచికాఁడైదాఁగొనుచునేతెంచి, లాఁచియున్నాఁడనిలాగొత్తిమాడ." హరిశ్చ. ౨, ఆ.

**లాఁత.** దే. వి. లాయుట. (చూ. లాయు.)

**లాఁతసేయు.** ద్వి. అ. క్రి. (లాఁత+చేయు.) లాయు. "వ. కరాళింపక లాఁతసేయక." ఉ, హరి. ౪, ఆ.

**లాఁతి.** దే. న. పెఱ, అన్యము. "ఉ. మన్ననిస్మైయిక్, లాఁతులఁ గాఁదలంపకునలంపకుచాలనలంగియుండఁగన్." ఉ, హరి. ౪, ఆ.

**లాఁతు.** దే. విణ. అధికము. "తే. అనినలాఁతుగఁగోలోప్లకనతఁడు రాజు, రడ్డిఁగనునని కొదముఁదీర్పంగమగుడి, యంతఁబరియుఁనుఁచై ప్రజకలికిపాఱె, పోవవాఁడునువెడపోట్లుపొడిచిచనియె." ఆము. ౬, ఆ.

**లాఁపరా.** దే. వి. (లాఁపు+రాయి) జలద్వారముఖమునతృణాదికముచొరకుండ నమర్చియుండెడు గండ్లరాయి. "వ. గుడిలాఁపరాతూపరాణికడనిలిచి." ఆము. ౬, ఆ. (సంధిని వర్ణవికారము.)

**లాఁపు.** దే. వి. లాఁచుట. (చూ. లాఁచు.)

**లాకకట్టు.** దే. వి. లాకలతోడచుట్టియుంచిన పనిముగియనిపడుగు.

**లాకలు.** దే. వి. బ. పడుగునందక్కడక్కడచొప్పించెడు వెదురుబద్దలు. హంస. ౨, ఆ. (వృత్తియందేకవచనాంతము. ఉదా. లాకచేతులు.)

**లాకు.** ఆం. వి. కాలువలోనేర్పఱచఁబడుబంధనము.

**లాక్ష.** సం. వి. ఆ. స్త్రీ. లక్క, జతువు. (చూ. రాక్ష.)

**లాక్షణికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) లక్షణజ్ఞుఁడు.

**లాక్షాప్రసాదనము.** సం. వి. అ. పుం. ఎఱ్ఱలొద్దుగుఱి.

**లాగము.** వై. వి. లాఘవము. "అతండు వానిఁగడువేగములాగము నొప్పమీఁదికిఁజైచె." హరి. పూ. ౭, ఆ.

**లాగి.** ద్వి. విణ. (లాగము+ఇ.) లఘువు, సులభము. "చ. నరననయానుభావమునఁజక్కనిచక్కెరబొమ్మలాగిగా, దొరకెనటంచు నమ్మితిని." శశాం. ౪, ఆ.

**లాగించు.** దే. స. క్రి. కొనిపోవు. "క. అనిననదియెంతగలద, ట్లననేసెదనంచుఁ జనియుట నోకానోకనాఁ, డొనవెట్టుకొని మెలంగఁగ, ననుఁజైననుమంతుపావలదిలాగించెన్." (చూ! ముందువెనుకలు.) సా. 3, ఆ.

**లాగు.** దే. స. క్రి. ఆకర్షించు. వి. 1. ఆకర్షణము; (లాగులాడు.)– 2. విధము; (చూ. నీరుమానిసి.) 3. నమ్మతి. (చూ. నేస్తము రెండవయర్థము.)

**లాగుకొను.** దే. స. క్రి. అపహరించుకొను. (ఉ. సొమ్మంతయు వాఁడు లాగుకొన్నాఁడు.)

**లాగులాడు.** దే. అ. క్రి. (లాగులు+ఆడు.) పెనఁగులాడు. "సైఁటకులాగులాడి." పాంచా. ౫, ఆ.

**లాఘవము.** సం. వి. అ. న. 1. లఘుత్వము; 2. ఆరోగ్యము.

**లాచారు.** హిం. విశే. నిరాధారముగానుండు.

**లాచి.** దే. వి. 1. గుఱ్ఱముమీఁదను గాడిదమీఁదనువేసెడు గోనె; 2. చిన్నబండిమీఁదవేయు భారము.

**లాచీ.** దే. వి. లాచియొక్క రూపాంతరము.

**లాజ.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. బ. పేలాలు. అ. ర. ము. వట్టివేరు. పుం. నానబియ్యము.

**లాటరీ** ఆం. వి. చీట్లువేసి వస్తువులనమ్ముట.

**లాటి.** దే. వి. పక్షివిశేషము.

**లాటీ** వై. వి. దుడ్డుకఱ్ఱ, లౌడియొక్క రూపాంతరము. (ఇది వాడుకలోనిది.)

**లాటు.** ఆం. వి. వేలములో నొకపద్దు.

**లాడము.** దే. వి. గుఱ్ఱపుగొరిజేలకుకొట్టెడి యినుపకట్టిబిల్ల.

**లాడి.** దే. వి. 1. పెద్దపుండు; "ఉ. లాడికిమూఁగుకాకులఁ బలాయనమొందఁగఁ జేయవేఁపుపై, ద్రాడుఁ జ్రేలునేఁగుడు." హంస. ౫, ఆ.– 2. బలి. "ఎ, గీ. దీని, వత్సయుతముగవిప్రసేవాటమునకు, లాడిఁ గావింతునంతఁ దొలంగుదూఱు." పాండు. ౫, ఆ. (ఈయర్థమింకను విచార్యము)

**లాడె.** దే. వి. బరువుమోసెడియెద్దుమీఁదపువ బరువెక్కించుట. (మొదటిరూపము లాడియ.)

**లాతము.** దే. వి. నర్తకులు చేతఁబట్టెడుదండము. "లాతపుఁగోల." (చూ. నాగబెత్తము.) "ఈలాతంబునవ్రాయఁబట్టణములౌ." (దీనికి ముందుపద్యము (చూ.) ఉదుంబడి.) విక్ర. ౨, ఆ.

**లాతాము.** దే. వి. లాతముయొక్క రూపాంతరము. (చూ. కకపాల)

**లాదు.** హిం. వి. కట్టడములలో వంపులుకట్టునపుడు వానికాధారముగా కట్టుకట్టడము.

**లాభము.** సం. వి. అ. పుం. 1. క్రయవిక్రయములవలన వచ్చిన విశేషధనము; 2. వడ్డి; 3. ప్రాప్తి.

**లామజ్జకము.** సం. వి. అ. న. నీటివట్టివేరు.

**లాయఖు.** హిం. విణ. తగిన.

**లాయము.** వై. వి. అశ్వశాల. (చూ. మందడీఁడు.)

**లాయరు.** ఆం. వి. న్యాయవాది.

**లాయిలాసా.** హిం. వి. శ్రమ.

**లాయు** దే. అ. క్రి. ఉద్రేకించు, విజృంభించు. "మ. లయకాలోత్థ పతంగబింబను క్రియన్ లాయు న్ యదీయోగ్రని, ర్దయ నిర్దుద్రుమదర్శనాఖ్య పటుచక్రంబిద్దదైతేయనం, క్షయసంక్రీడకునట్టివేల్పుఁడుకృపాకల్యాణఁడబ్జాక్షుఁడ, క్షయుఁడాశ్రీయపరాభవంబెటుమనిర్చున్ సైఁపఁగానేర్చునే." హరి. ఉ. ౭, ఆ. (చూ. మెఱుము. స. క్రి.)

**లాల.** సం. వి. ఆ. స్త్రీ. చొంగ, స్యందిని.

**లాలనము.** సం. వి. అ. న. లాలించుట, బుజ్జగము.

**లాలము.** దే. వి. ఉల్లారుక్రిందిజాలరు. (చూ. లాలసరి.)

**లాలస.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. 1. అధికేచ్ఛ; 2. ఔత్సుక్యము; 3. యాచన. విశ. విషయాసక్తురాలు.

**లాలసరి.** దవ్. వి. (లాలము + సరి.) గుత్తపుపల్లనుమీఁదియుల్లారు క్రిందవ్రేలెడుజల్లులదండ. "వ. పార్శ్వంబులం గట్టుకెంబట్టు లాలసరిసమకట్టుతెక్కలుగా." ప్రా. ర, ఆ.

**లాలాటికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) 1. ప్రభునియొక్క అభిప్రాయమును తెలిసికొనువాఁడు; 2. కార్యమునందు నేర్పు చాలనివాఁడు.

**లాలి.** దే. వి. ఉయ్యెల. "తే. లాలిఁగట్టిరిగంధోపలాలితాభి, లాలిసుమచంద్రకాంతోపలాలిసౌధ, లాలితస్థలిహాసునియిల్లాలిఁ బాడి, మేలిజవరాలిగములురాచూలికపుడు." సా. ౧, ఆ.

**లాలించు.** సం. స. క్రి. లాలనముచేయు, బుజ్జగించు.

**లాలిత్యము.** సం. వి. అ. న. లలితభావము.

**లాలు.** దే. విశ. ఎఱుపు. "సీ. మఘభూపసైనికమండలిలాలుజెండాలనఁదలిరాకుడాలునిగిడె." కవి. ౨, ఆ.

**లాలూచి.** హిం. వి. 1. అత్యాశ; 2. నైచ్యము.

**లావకము.** సం. వి. అ. పుం. లావుకపిట్ట. (గౌరికము, పాంసులము, పౌండ్రము, కచ్చురము అని ఇది చతుర్విధము)

**లావణము.** దే. వి. కొలువునకుక్రొత్తగావచ్చినకొలువుడుకానిని పట్టికయందువ్రాసికొనుట. (కొలువుడుకానిని కొలువుండుండి త్రోయుటసలితము.)

**లావణి.** దే. వి. పసులుమేసెడు బీటినేలకై ముందుగానిచ్చెడుధనము.

**లావణ్యము.** సం. వి. అ. న. 1. ముఖకాంతివిశేషము; 2. ఉప్పన.

**లావనము.** సం. వి. అ. న. లవనముయొక్కరూపాంతరము.

**లావరి.** దే. విశ. (లావు + అరి.) బలవంతుఁడు. (చూ. అఱక.)

**లావాదేవి.** హిం. వి. ఇచ్చిపుచ్చుకొను సంబంధము.

**లావు.** దే. వి. 1. బలము; "ఆ. ఇవిస్ఫనునసేచియిరువురుఁబెద్దయుఁ, బ్రొస్నపోరవాయుపుత్రుబలము, తోడుతోడఁబెసఁగఁ దొడఁగెనాకీచకా, ధమునిలావుసిదపఁదఱుఁగఁజొచ్చె." భార. విగా. ౨, ఆ.—2. సామర్థ్యము; "ఆ. సిన్నవాఁడననియుఁబెక్కుసంస్కృతములు, విననివాఁడ ననియు వెతపుమాన, మత్ప్రసాదదివ్యమహిమచేనెంతైనఁ, గవితఁజెప్పులావుగలదునీకు." వీర. ౧, ఆ.—3. ఆధిక్యము, అతిశయము; 'కొలువులావునదేవతలైనమెచ్చరే." ఉ, హరి. 3, ఆ. — 4. పక్షతి. (చూ. కసిమసఁగుమొదటి యర్థము.) విశ. 1. స్థూలము; 2. అశక్యము. "ఉ. వారలగా, లావు రణంబులోమసకలంఘ్య బలాఢ్యులనింకనోర్వఁగాఁ." భార. సభా. ౨, ఆ.

**లావుక.** వై. వి. ఒకానొకపక్షి. (చూ. రవాళి.)

**లాసకము.** సం. వి. అ. పుం. నెమిలి. డు. లాస్యముచేయువాఁడు, ఆటకాఁడు.

**లాసము.** సం. వి. అ. పుం. ఆట, లాస్యము, నృత్యము.

**లాసిక.** సం. వి. ఆ. స్త్రీ. లాస్యముచేయునది, ఆటకత్తె.

**లాస్ఫోటని.** సం. వి. ఈ. స్త్రీ. ఆస్ఫోటనియొక్కరూపాంతరము.

**లాస్యము.** సం. వి. అ. న. 1. నృత్యము; 2. తౌర్యత్రికము.

**లాహిరి.** దే. వి. మైకము. "లాహిరిపట్టినభాతి." కాశీ. ౨, ఆ. (రూ. లాహిరీ. "చ. గడుసరిలాహిరీమసగ గ్రమ్మినమత్తులుగారె భూపతుల్." రాజ. 3, ఆ.)

**లాహిరిమోదము.** దే. వి. గంజాయిపొగపట్టెడుపాత్రవిశేషము. (ఇది విచార్యము.)

**లాళము.** దే. వి. లాడముయొక్కరూపాంతరము.

## లి.

**లింగఁడు.** వై. వి. జంగమయ్య. "క. బాలునిఁబాలకుఁబిలిచెను, లింగరయుగముసాఁచి లేమ యొక తెయి, ప్లాలింగనిఁగని వేగం, బాలింగనమొసఁగవచ్చునటులుమదించెఁ." రాజ. ౨, ఆ.

**లింగకట్టుమాత్ర.** మి. గ్రా. వి. (లింగము+కట్టుమాత్ర.) లింగాకారముగాచేసిన రసవస్తువులగుళిక.

**లింగకాయ.** మి. గ్రా. వి. (లింగము+కాయ.) లింగధారులు లింగమునుంచి కట్టుకొనెడు వెండిబంగారములతోచేసినసజ్జెకాయ.

**లింగదొండ.** మి. గ్రా. వి. (లింగము+దొండ.) లింగాకారపు ఒకదినుసు దొండతీగ.

**లింగపొట్ల.** మి. గ్రా. వి. (లింగము+పొట్ల.) లింగాకారపు విత్తులుగల ఒకదినుసుపొట్ల, లింగబీజతీగ.

**లింగబలిజెలు.** మి. గ్రా. వి. (లింగము + బలిజెలు.) లింగధారులయినబలిజెవారు.

**లింగబీజ.** సం. వి. ఆ. స్త్రీ. లింగపొట్లతీగ. అభి.

**లింగము.** సం. వి. అ. న. 1. పానవట్టముమీఁదిశివమూర్తి; 2. గుఱుతు; 3. మగగుఱి; 4. అనుమానము; 5. పంచవింశతి తత్త్వములయందు ఆదియగు ప్రకృతి.

**లింగరాజు.** మి. గ్రా. వి. (లింగము+రాజు.) కూఁకటిమూఁగ.

**లింగవృత్తి.** సం. వి. ఇ. పుం. (చూ.) తొఁటదమ్ముఁడు.

**లింగి.** సం వి. న్. పుం.——వై.——

**లింగిని.** సం. వి. ఈ. స్త్రీ. దూతికావిశేషము.

**లికుచము.** సం. వి. అ. పుం. లకుచముయొక్కరూపాంతరము.

**లిక్కి.** దే వి. గన్నెలోనగువానికోసెడి చిన్నకొడవలి.

**లిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. చెమటచే తలవెంద్రుకలయందుపట్టెడి ఈరు

**లిఖించు.** సం. స. క్రి. వ్రాయు. (లిఖయించు అనియు)

**లిఖితము.** సం. వి. అ. న. 1. వ్రాఁత; 2. వ్రాయి. విశ. వ్రాయఁబడినది.

**లిఖితవ్యము.** సం విశ. (అ. ఆ. అ.) వ్రాయఁదగినది, లేఖ్యము.

**లిఖింతుఁడు.** సం. వి. అ. పుం. 1. పత్రమువ్రాసికొనువానిచే రప్పింపఁబడి పత్రమునందు సంతకముచేసినసాక్షి, వ్రాఁతసాక్షి; 2. ఒకముని.

**లిద్ది.** దే. వి. 1. దంచినుక్కిలిలోఁతుపడిన మ్రానిటొటికెఁ గొట్టెడుగూటము; "ద్వి. పెద్దగాఁదనతేన పెంచినసెండ, లిద్దగొట్టినయట్టిలిలయై." భాగ. ౧౦, స్క.—2. పడిసెముచేత ఊపిరిరాకముక్కడఁచుకొనుట.

**లిపి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. రేఖారూపమైనయక్షరవిన్యాసము, వ్రాయి.

లిపికరుఁడు. సం. వి. అ. పుం. వ్రాయసకాఁడు, లేకరి.

లిపికారుఁడు. సం. వి. అ. పుం.——పై.——

లిపీకరుఁడు. సం. వి. అ. పుం.——పై.——

లిప్తకము. సం. వి. అ. పుం. విషముపూసినబాణము. విణ. పూయఁబడినది.

లిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది; 2. భుజింపఁబడినది.

లిప్స. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

లిబ్బి. దే. వి. 1. ధనము; 2. రాశి; 3. నిధి.

లిబ్బిపడఁతి. దే. వి. లక్ష్మి.

లిబ్బిరాయఁడు. దే. వి. కుబేరుఁడు, ధనాధిపతి.

లిభి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. లిపియొక్కరూపాంతరము.

లిమ్మ. దే. వి. మాంసాదులమీఁద ముసురుకొను ఈఁగలనుదోలెడు రెమ్మ. చెన్న. ౪, ఆ.

లియ్యము. వై. విణ. లయించినది. (నామనను అందులియ్యమై నది.) "లియ్యమువియ్యమూనా." పాంచా. 3, ఆ.

లివ. దే. వి. లాఘవము. "ఉ. అ, య్యారెబలంబుధాటిబళియా లివయంచువడిరులెంచఁగన్." (చూ. తీరు. అ. క్రి.) చంద్రా. ౨, ఆ. "సీ. కదుడాకమీఱంగ మడమలుదాటించు చునుముం దటికిలివచూపిచూపి." కళా. 3, ఆ.

లివలివ. దే. వి. దరతములుకదలుటయందగు ధ్వన్యనుకరణము. "వ. కుదురుపట్టెడలివెడలిలివలివం గదలురదనపఙ్క్తులును." కవిక. ౫, ఆ.

## లీ.

లీఢము. సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

లీనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లయించినది; 2. కరఁగినది.

లీల. సం. వి. ఆ. స్త్రీ. 1. క్రీడ; 2. శృంగారచేష్ట; 3. ప్రేమాధిక్యమునవేషభాషణాదులచేత ప్రియుని అనుకరించునట్టి స్త్రీశృంగార చేష్టావిశేషము; 4. క్రియ; 5. (తెనుఁగున) విధము. "ఈలీలన్" మొ.

లీస్టు. ఆం. వి. పట్టీ, జాబితా.

## లు.

లు. దే. అవ. ప్రథమాబహువచనప్రత్యయము. (ఉదా. రాములు, వనితలు, వనములు మొ.)

లుంగ. దే. వి. వస్త్రభారము.

లుంగము. సం. వి. అ. పుం. ఫుల్లమాదిఫలము?. "ఉత్సాహ. అంగనాలలామఁగానవాలతాకుడుంగమా, తంగమాభుజంగమా పతంగమాకురంగమా, లుంగమాలవంగమాతులుంగమాథవీనట, ద్భృంగమావనీరమాకరీరమాసమీరమా." రామా. ౫, ఆ.

లుంగి. దే. వి. కుల్లాయకుప్పసములుచేర్చికుట్టినపావడ.

లుంటాకుఁడు. సం. వి. అ. పుం. దొంగ. విణ. దోఁచుకొనువాఁడు. "ఓఘునతమోలుంటాకకీర్తి." పర. 3, ఆ.

లుంఠనము. సం. వి. అ. న. భూమిమీఁదిపొర్లిక.

లుకలుక. దే. వి. పరుగెత్తుటయందును పురుగులుతొలుచుటయందునుగు ధ్వన్యనుకరణము. "క. ఉక మొగములుగాఁదివిజాలు, తెక మగనిమైరులెల్లదీకొనితమ్ముం, బకపకనగకకకలై, లుకలుకఁబరువెత్తిరోసిలోఁగొనుభీతిన్." భాగ. ౬, స్కం. "లుకలుకమస్తకంబు చెవ్వులుంగ్రిమితోల్వఁగ." భల్లా. ౨, ఆ.

లుకలుకలాడు. దే. అ. క్రి. (లుకలుకలు+ఆడు.) తడఁబడు.

లుక్కు. సం. వి. చ్. పుం. 1. లోపము; 2. కోఁత.

లుగచెడు. దే. అ. క్రి. బాగుతప్పు.

లుగ్సాను. హిం. వి. నష్టము.

లుచ్చా. హిం. వి. నీచుఁడు, తుచ్ఛుఁడు.

లుటుగు. దే. వి. ఎద్దుమెడనుకట్టు నొకవిధమైన గంట.

లుఠనము. సం. వి. అ. న. 1. భూమిమీఁదిపొర్లిక; 2. భూమిమీఁది గుఱ్ఱపుపొర్లిక.

లుఠితము. సం. విణ. (అ. ఆ. అ) భూమిమీఁద పొర్లాడినది. (గుఱ్ఱము.)

లుప్తము. సం. వి. అ. న. దొంగిలించినసొత్తు, దొంగసొమ్ము. విణ. 1. లోపించినది; 2. కోయఁబడినది.

లుబ్ధకుఁడు. సం. వి. అ. పుం. 1. బోయవాఁడు; 2. పిసినివాఁడు.

లుబ్ధుఁడు. సం. వి. అ. పుం. బోయవాఁడు. విణ. 1. ఆసగలవాఁడు; 2. పిసినివాఁడు.

లులాయము. సం. వి. అ. పుం. కారెనుపోతు.

లులి. దే. వి. తక్కున. "లులిగన్నఁబడకున్న." ఉ. హరి. 3, ఆ.

లులితము. సం. విణ. (అ. ఆ. అ.) చలించినది.

లులిపడు. దృ. అ. క్రి. (లులి+పడు.) హీనమగు. "ఈగడ. పొలతిసైపవుమాకు నీకయపోలుఁబోలులివడినకల్లలు." పా. ౪, ఆ.

లుల్లిగాఁడు. దే. విణ. కీడ్వడినవాఁడు, అధముఁడు.

## లూ.

లూటి. దే. వి. 1. ఉపద్రవము; "ఉ. లూటిచేసిద, క్కించు కొనంగనేళయనికేరుచుఁదూఱుచుఁదిట్టికొట్టిదం, డించిరిమించిత న్ధువనీపరిపాలకులడ్డగించినన్." రామా. 2, ఆ.—2. దౌడయందలి వ్రణము; 3. వ్రణరంధ్రము.

లూటీ. దే. వి.——పై.——

లూడుపులు. దే. వి. బ. చెప్పులు, పాదరక్షలు. (అప్ర.)

లూత. సం. వి. ఆ. స్త్రీ. 1. సాలెపురుగు; 2. చీమ; 3. రోగవిశేషము.

లూనము. సం. విణ. (అ. ఆ. అ.) కోయఁబడినది.

లూమము. సం. వి. అ. న్. న. తోఁక, లాంగూలము.

లూలామాలము. దే. వి. మోసము, వంచన. "క. లూలామాలపు మాటలు, చాలునినిసలిగితనవిజంబగురూపం, బాలోనఁదెలుపవలెనని, నీలగ్రీవుండునిటలనేత్రముఁజూపన్." కాశీ. 3, ఆ.

## లె.

లెంక. దే. వి. భటుఁడు, సేవకుఁడు. "క. అవసరమక్కఱలంగై, దువకర్తములందువేఁటతోఁటలయందున్, దళ్ళరైనపాంథలెంకల, మవ్వటకామముఁ ఱాడుమోపినపుడెపుడైనన్." రామా. ౨, ఆ.

లెంట. దే. వి. పటికము. (అప్ర.)

లెంప. దే. వి. 1. చెంప; 2. ప్రక్క.

లెంపకాయ. దే. వి. (చూ.) చెంపకాయ.

లెంబి. దే. వి. లంబియొక్క రూపాంతరము.

లెక్క. వై. వి. 1. లక్ష్యము*. "నాకునరుఁడేమిలెక్క." రాఘ. ౪, ఆ.-2. సంఖ్య*.

లెక్కగొను. ద్వి. స. క్రి. (లెక్క+కొను.) లక్ష్యముచేయు. "చక్రధరులెక్కగొనఁడు." భార. ఉద్యో. ౧, ఆ.

లెక్కపెట్టు. ద్వి. స. క్రి. 1. లక్ష్యముచేయు; 2. ఎన్నిక చేయు.

లెక్కసేయు. వై. స. క్రి.——పై.——(లక్ష్యముచేయు టకు.—"వ. అయ్యుగ్గంబు లెక్కసేయకయున్న." కాశీ. ౬, ఆ.)

లెక్కించు. వై. స. క్రి.——పై.——

లెప్ప. దే. వి. గుజ్జె, లక్ష్యము. [రూ. లెప్పము. "ద్వి. లెప్ప మూదనప్రాణలింగంబు." పండి. ౧, ప్ర. "క. మీపువ్వగంధి నెయ్యపుఁ, జూపులకునులెప్పమైనసుకుమారవపు, శ్రీపెంపునఁదన రినవను, ధాపతిసుతుసఖుఁడనిం ద్రదత్తాహ్వయుఁడన్." (గ్రంథ ములయందు కొన్నిచోట్ల దెప్పమనికనఁబడుచున్నది. అది సరియని చెప్పుటకుఁ దగిన ప్రయోగము దొరికినదికాదు.) భో. 3, ఆ.]

లెస్స. దే. వి. క్షేమము. "ద్వి. నీలెస్సనాలెస్స." రా. అ, కాం.—విశే. 1. క్షేమయుక్తము; "లెస్సలారాచవారు." స్వా. ౫, ఆ.—2. యోగ్యము; "తల్లికృపనేత పెద్దయునులెస్స." భార. అను. ౧, ఆ.—3. శ్రేష్ఠము. "అల్లవెలెస్సపువ్వులు." నిర్వ. ౮, ఆ.

లెస్సవాఁడు. దే. విశే. యోగ్యుఁడు. హరి. పూ. ౯, ఆ.

## లే.

లే. దే. విశే. వృత్తియందులేఁతశబ్దమునకుమీఁదివర్ణములులోపింపఁగా మిగిలినరూపము. (దీనికిఁబరుషములు పరమగుచో సుమాగమం బగు. ఉదా. లేఁగప్పు, లేఁగరువలి, లేఁగొడుకు, లేఁగొన, లేఁ గొమ్మ, లేఁగొను, లేఁజెందురుఁడు, లేఁజేప్పడు, లేఁజేన, లేఁ జిగురు, లేఁజీఁకటి, లేఁజూపు, లేఁజూలు, లేఁజెక్కు, లేఁదెమట, లేఁదగిరిస, లేఁదడి, లేఁదరఁగ, లేఁదాఁకు, లేఁదూఁడు, లేఁదెర, లేఁదేఁటి, లేఁబట్టి, లేఁబాపఁడు, లేఁబాయము, లేఁబోద, లేఁ బొన్న, లేఁబోర, లేగాప్పు, లేజవరాలు, లేజొంటి, లేనగవు, లేనడుము, లేనెల, లేచిత్తరి, లేబుడుత, లేమావి, లేమోక, లేయ నఁటి మొ.)—అవ్య. నిష్ప్రయార్థకము. (కొలే, దానికంటె ఇది విశేషమురే.)

లేఁక. దే. వి. లెంక, భటుఁడు. "లేకయుండిన విచివియాలేఁకలు." (లేక=లేవక) అచ్చ. యు, కాం. (గ్రంథములయందిపాఠము కొన్నిచోట్లే గనఁబడియెడి.)

లేఁగ. దే. వి. (లేఁత+కాసువు.) 1. క్రొత్తగాఁగలిగినదూడ, తర్ణ కము; (లేఁగటియావు.) ("అ. లేఁగదూడనొక్క లేమచిక్కము తోఁడ, గుడువవిడిచెనొక్క కోమలాంగి, కాఁగిపొంగుచున్న కాఁగుల పాలతో, నీరుచల్లమఱచి నిలిచియుండె." వి, పు. 2, ఆ. ఇక్కడ లేఁగశబ్దమునకు క్రొత్తగాఁగలిగినదనిమాత్రమర్థము.)—2. దూడ, వత్సము. "చ. ఇదియొకమంచిలేఁగనినుఁడెంతయు నొప్పెడునంచుదాన త, క్కృతమునందుఁడయింబిగియఁబట్టిచేతనొగి చెంగటఁ జేఁనిలో, కమితుఁగనొక్కపట్టుగొని చెంపెఁగుమారుఁడు లేఁగరక్కసుం, గదు లుకొనంగబాలకులుకోయనియాకసిఫబ్బ లీలతోన్." భాగ. ౧౦, స్కం. పూ.

లేఁగటియావు. దే. వి. లేఁతదూడగల ఆవు, ధేనువు.

లేఁగసవు. ద్వి. వి. (లేఁత+కసవు.) బాలతృణము.

లేఁత. దే. విశే. 1. తరుణము; "లేఁతప్రాయము." 2. చేఁత కని; "ఉ. పూఁతపసిండివంటివలపుఁబచరించుఫలంబుసీలిక్క, లేఁతగదమ్మ." స్వా. 3, ఆ.—3. సుకుమారము. "మేనలేఁత." (మఱియు దీనికి వృత్తియందు కొంచెము, చిన్న, తిన్న, కేలి, పలుచ, మెత్త, నన్న మొదలగు అనేకార్థములుగలవు. చూ. లే.)

లేఁబగలు. దే. వి. (లేఁత+పగలు.) ప్రాహ్ణము. "సీ. విన్నపై తనిపున్న మునివేదనినదంబుఁ దగుచోటనుండిలేఁబగటిదాఁక." పాండు. ౫, ఆ.

లేఁబోక. దే. వి. (లేఁత+పోక.) మందగమనము. (చూ. పూ బోఁడి.)

లేఁబ్రొద్దు. ద్వి. వి. (లేఁత+ప్రొద్దు.) అపరాహ్ణము.

లేక. వై. వి. 1. జాబు; "క. నీపతినీకైవందుచు, నాపేరనలే యనిపి నాఁడనియుదినే, నాపులుఁగువలనఁదెలిసిము, దాపూర్ణ నుల్చిబిడిచి యనిపితిదానిన్." ప్రభా. ౪, ఆ.—2. ఎడములే మిక్కిలిచేరికయగువృత్తొదులవరుస; 3. సమూహము. "లేనియ తిండిలేకలు." (చూ. తేనియతిండి.)

లేకరి. ద్వి. వి. (లేక+అరి.) లేఖకుఁడు.

లేకి. దే. వి. రాలినధాన్యపుగింజెలు. "లేకినిధివ్రజంబు." కవి. ౧, ఆ.—విశే. అప్రయోజకుఁడు.

లేకిబ్రతుకు. దే. వి. లేకిగింజెలేరికొని బ్రతికెడుబ్రతుకు, ఉంఛ వృత్తి.

లేకివాఁడు. దే. విశే. 1. లేకిగింజెలేరికొని బ్రతికెడువాఁడు; "ద్వి. వక్కసేయనిలేకివాఁడవునీవు." హరిశ్చ. ౨, భా.—2. అప్రయోజకుఁడు.

లేఖ. సం. వి. అ. స్త్రీ. 1. ఎడములేక మిక్కిలిచేరికయగువృత్తొదులపఙ్క్తి; 2. లిపి. ఆ. స్త్రీ. అ. పుం. జాబు. అ. పుం. ఇచ్చిపుచ్చుకోలుపత్రము. డు. వేలుపు.

లేఖకుఁడు. సం. వి. అ. పుం. వ్రాఁతకాఁడు, లేకరి.

లేఖనము. సం. వి. అ. న. 1. వ్రాఁత; 2. వాంతి; 3. బుకో పత్తిరి.

లేఖని. సం. వి. ఈ. స్త్రీ. వ్రాసెడుకలము. (రూ. లేఖిని.)

లేఖనికుఁడు. సం. వి. అ. పుం. 1. జాబుకొనిపోవువాఁడు; 2. తనగుఱుతిడి యొకరిచేవ్రాయించువాఁడు.

లేఖనీయము. సం. విశే. (అ. ఆ. అ.) వ్రాయఁదగినది, లేఖ్యము.

లేఖర్షభుఁడు. సం. వి. అ. పుం. వేల్పుఱేఁడు.

లేఖహారకుఁడు. సం. వి. అ. పుం. జాబుకొనిపోయి యిచ్చు వాఁడు.

లేఖితము. సం. విశే. (అ. ఆ. అ.) లిఖితము.

లేఖ్యము. సం. వి. అ. న. వ్యవహారవిషయమైనవ్రాఁత. విశే. వ్రాయఁదగినది.

లేచు. దే. అ. క్రి. 1. ఉత్థితమగు; 2. మేలుకొను; 3. పొడసూ రించు.

**లేట.** దే. వి. కొమ్మ, శాఖ. "సీ. మానికమ్ములమూటమరునిగెల్పుల కోట పండువెన్నెలతేట పసిఁడిలేట." అచ్చ. బాల, కాం.

**లేటమొగముపడు.** ద్వి. అ. క్రి. (లేటమొగము+పడు.) విముఖమగు. "క. ఏటునవాటున వ్రేటునఁ, బోటునదశముఖుఁడు రౌద్రముగనఱుముటయుఁన్, లేటమొగము వడియక్షులు, కోట కొరంబాఱిరసురకోటెగువంగన్." నిర్వ. ౪, ఆ.

**లేటి.** దే. వి. 1. జింక; "తే. లేటివలలును మఱియుఁగుందేటి వలలు." య. ౧, ఆ.-2. ఆఁడుజింక; "తే. పెంపుడిట్టులఁ గినుకనుబెనఁచిపోయి, కొమ్మునుచ్చులు దగిలించుకొన్నసరిగి, రాజు చూడంగఁజెప్పంగ రానికడిమి, నీటి యలఁ గ్రుమ్మినాంచిరిలేటి మగల." య. ౨, ఆ.-3. మగజింక. "క. లేటిందాఁచుకొన వాము, న్నీటన్నడయాడలేదొనినుద్విజరాజం, చేటికిఁబలుకఁ గోకా, ఖేటకపాటవకిరాతకేసరివిశిఖ." పాంచా. 3, ఆ.

**లేటు.** ఆం. విశ. ఆలస్యము, వెనుకఁటి.

**లేడి.** దే. వి. లేటియొక్కరూపాంతరము. (బ. లేళ్లు.)

**లేడికంటి.** దే. వి. లేడికన్నులవంటి కన్నులుగల ఆఁడుది, మృగాక్షి.

**లేఁదు.** దే. వి. ఎలుఁగుబంటి. "చ. విచారవిమూఢునకైననీవుప, ల్కినపలుకియ్యకోలగుసె లేదువనంబునజాన్నరేఁచితి, యన్యని మధుపానమొల్లకరయంబుననొండలవాటుసేయునే." భో. ౪, ఆ. (ఇది అపూర్వపదముగానున్నది.)

**లేదుబంతి.** ద్వి. వి. బొంకు. "చ. తెలియఁగఁజూచినట్లనెమదిన్ బుధులారసితప్పనీపయిన్, గలదనిపల్కు చోఁగు చయుగంబటు బట్టబయల్గఁ జేసితో, యలికచలేదుబంతియననందఱెఱెందమునిశ్చ యంబుపెం, పొలయఁగఁగల్లతోడనిజమోపదుగాఁదలపోసిచూచి నన్." సా. 3, ఆ. (ఒకానొకచో లేదుబంతీయని దీర్ఘాంతముగా ప్రయోగము కానఁబడుచున్నది.)

**లేపకుఁడు.** సం. వి. అ. పుం. సున్నముఱొనగువాని పూయు వాఁడు.

**లేపనము.** సం. వి. అ. న. 1. అలుకుట; 2. పూఁత; 3. భోజనము.

**లేపము.** సం. వి. అ. పుం. 1. పూఁత; 2. భోజనము; 3. సున్నముఱొనగునది.

**లేపు.** దే. ప్రే. లేవఁజేయు. వి. 1. పడకమీఁదపఱచెడుపఱపు; "చ. అకలుషదివ్యరత్నమయమానొకకేళిగృహంబులోపలన్, జికిలికిరీటిపచ్చలరచించినచిల్కలకోళ్లనందమా, నకినెలపట్టెమంచమునచాయనగామతివాసుపైఁదురం, గికమొకమాలులేపుననొగిన్ శయనించి మనోభవవ్యథన్." హంస. ౧, ఆ.-2. ఱోలు.

**లేప్యము.** సం. వి. అ. న. పూఁత. విశ. పూయఁదగినది.

**లేబరము.** దే. విశ. శూన్యము. "సీ. ప్రావితోవర్ణంబు నమ్ముకూర కుండుటఁబంటలేబరమయ్యెఁబాఁడితోడ." కాశీ. ౧, ఆ.

**లేమ.** వై. వి. ఆఁడుది, మగువ, వనిత. విశ. లేఁత*.

**లేమి.** దే. వి. 1. కలుగమి; 2. ఉండమి; 3. దారిద్ర్యము. "వ. తొలంగం ద్రోయరాని లేమికి మదినొండుపాయంబులేమికిం గొండొకచింతించి." విక్ర. ౨, ఆ.

**లేమిడి.** దే. వి. (లేమి+ఇడి.) దారిద్ర్యము. (స్వార్థమున ఇడి.)

**లేలిహానము.** సం. వి. అ. పుం. పాము. (రూ. లేలిహనము.) విశ. మాటిమాటికిలేహనముచేయునది.

**లేవ.** దే. వి. గుజ్జుపుతలాటము. "సీ. బలితంపుఁఋలుతిండిమల దాయరాచెక్కడపుగోవపసిచొక్కటంపులేవ." చంద్రా. ౨, ఆ. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.)

**లేవడి.** దే. వి. 1. లేమి; "సీ. నిదురలేవడిఁగెంపుసెరయుకన్గవ తోడఁ బొడిపొడియైనమేపూఁతతోడ." రసి. ౫, ఆ.-2. దారిద్ర్యము. "మ. లేవడిం, బడియుండందగదంచునత్వగరిమన్ మధ్యంబుగన్పట్టఁగా." చంద్రా. ౧, ఆ.-విశ. 1. దరిద్రము; "లేవడియెంతేనిజీవనంబు." నై. ౧, ఆ.-2. "లేవడియైనభుక్తి గొనిలేవడిగంబడదాఁకలెంతయున్." పాండు. ౪, ఆ.

**లేవుడి.** హిం. వి. దొంగనుకట్టి పిఫపిఫికి త్రిప్పుట; అవమాన పఱచుట.

**లేశము.** సం. వి. అ. పుం. కొంచెపుఁదనము. విశ. కొంచెము.

**లేసు.** వై. విశ. 1. చులుకన*; 2. సులభము*.

**లేహనము.** సం. వి. అ. న. నాకుట.

**లేహము.** సం. వి. అ. పుం. భోజనము, కుడుపు.

**లేహ్యము.** సం. వి. అ న. 1. నాకిభుజింపఁదగినమందు; 2. నాకి భుజింపఁదగిన వ్యంజనవిశేషము; 3. అమృతము. విశ. నాకఁదగినది.

## లై.

**లైను.** ఆం. వి. వరుస.

**లైసెన్సు.** ఆం. వి. సెలవుచీటి.

## లొ.

**లొంక.** దే. వి. కోన. "ఆ. ధరణిపాలుఁడంతదురగంబునచ్చోటఁ, గట్టివాలుచేతఁ బట్టుకొనుచు, లొంకఁజొచ్చెనాత్మఁగొంకకాలుఁడు, కదిసిదివియపట్టివెదకుమాడ్కి." ద్వా. ౭, ఆ.

**లొంగు.** దే. అ. క్రి. 1. లోఁబడుగు; 2. వెనుదీయు. (లోఁగు యొక్కరూపాంతరము.)

**లొండు.** దే. వి. జలాశయవిశేషము. (చూ. డిగియ.)

**లొంప.** దే. వి. అల్పగృహము, కొంప.

**లొంపు.** దే. వి. ఒకతెగ.

**లొగ్గడి.** దే. వి. కలగుండు, క్షోభము.

**లొగ్గడిల్లు.** దే. అ. క్రి. కలగుండుపడు, క్షోభించు.

**లొచ్చు.** దే. వి. తక్కువ. (చూ. లొజ్జె.) విశ. న్యూనము. "మ. ఇ, చ్చలు లెల్లన్ మనలక్ష్మణా నలికిలొచ్చే సుమ్మురమ్యాకృతిన్." చమ. ౨, ఆ.

**లొజ్జె.** దే. వి. విశ. లొచ్చుయొక్కరూపాంతరము. (తక్కువకు.- "లొజ్జంచుకయుం బూనని నెయ్యంబున." అచ్చ. బాల, కాం.)

**లొట్టు.** దే. విశ. అణఁగినది. "ద్వి. లోకంబులోలేనిలొటతాఁట కత్తె." (ఇక్కడ అణఁగినదనఁగా బయటికిమంచిదానివలె అణఁకువ కలిగియుండునదియని అర్థము.) హరిశ్చ. ౨, భా. (లొట్టయొక్క రూపాంతరము.)

**లొటకజిట్ట.** దే. వి. (చూ.) లొట్టకన్నుజిట్ట.

**లొటలొట.** దే. వి. ఫోవుటయందగు ధ్వన్యనుకరణము. "లొటలొటఁజని." ..

**లోటలోటమను.** దే అ. క్రి. (లోటలోట+అను.) లోటలోట యని ధ్వనించు. "క. తొటతొటపుర్వులుదొరఁగఁగ, లోటలోట మనుకొంచునిండ్లలోనికిఁజన." భల్లా. ౨, ఆ.

**లోటారము.** దే. వి. బొక్క, బిలము.

**లొటిపిట.** ద్వ. వి. ఒంటె, ఉష్ట్రము. (లొట్టిపిట్టయొక్క రూపాంతరము.)

**లొటిపిట్ట.** ద్వ. వి.——పై.——

**లొట్ట.** దే. వి. 1. మగగుజ్జి; 2. రుచిగలపదార్థములను భుజించునపుడు నాలుకను అంగిటఁజేర్చి పుట్టించెడుధ్వని; 3. పల్లము. (ఆమదపుఁలొట్టయనఁ చో ఎండినయామదపుకాయ్య.) విణ. అణఁగినది. (లొట్టకన్ను.)

**లొట్టకన్నుజిట్ట.** దే. వి. పక్షివిశేషము.

**లొట్టకాయ.** దే. వి. మగగుజ్జి, కామ.

**లొట్టపోవు.** దే. అ. క్రి. అణఁగు (వానికి కన్నులొట్టపోయినది.)

**లొట్టవేయు** దే. అ. క్రి. రుచిగలపదార్థములను భుజించునపుడు నాలుకను అంగిటఁజేర్చిధ్వనిపుట్టించు.

**లొట్టి.** దే. వి. కల్లుదీసెడుముంత. "కలులొట్టి."

**లొట్టిపిట.** ద్వ. వి. లొట్టిపిట్టయొక్క రూపాంతరము.

**లొట్టిపిట్ట.** ద్వ. వి. (లొట్టియ+పిట్ట.) లొటిపిటకు మొదటిరూపము. "క. అనుటయును లొట్టిపిట్టయుఁ, దనమదినుదమంది." పంచ. నా. ౧, ఆ.

**లొట్టిముచ్చె.** దే. విణ. తొగుఁబోతు.

**లొట్టియ.** దే. వి. ఒంటె, ఉష్ట్రము. "ఎ, గీ. రత్నములుఁబోని వత్సతరంబులకట, వ్రేలుచున్నవిలొట్టియవెంటఁదగిలి." భార. శాం. ౪, ఆ. (రూ. లొట్టె.)

**లొట్టెపెనుఁగు.** దే. వి. (లొట్టె+పెనుఁగు.) ఒంటె, ఉష్ట్రము. (చూ. లంకియ మూఁడవయర్థము.)

**లొడపెట్టు.** దే. స. క్రి. ద్రవద్రవ్యమునుచేకలపెట్టు.

**లొడలొడ.** దే. వి. కాఱుటయందగు ధ్వన్యనుకరణము. (కత్తితాఁకి నెత్తురు లొడలొడకాఱుచున్నది.) విణ. వదులు.

**లొడితె.** దే. వి. (చూ.) ప్రాదేశము.

**లొడితెలి.** దే. వి.——పై.——

**లొంకుగు.** దే. వి. ఆవుమెడనుకట్టెడుఘంటావిశేషము.

**లొడ్డ.** దే. విణ. ఒడ్డయొక్క రూపాంతరము.

**లొడ్డు.** దే. విణ. ఒడ్డుయొక్క రూపాంతరము.

**లొత్త.** దే. వి. పల్లము. (లొట్టయొక్క రూపాంతరము.)

**లొద్ద** దే. వి. ప్రోవు, రాశి. "ద్వి. అమృతంపుముద్దలియ్యంబుల లొద్ద." నవ.

**లొద్ది.** దే. వి. (చూ.) లోయ.

**లొద్దుగు.** వై. వి. లోధ్రము. (దీనిభేదములు ఎఱ్ఱలొద్దుగు, తెల్ల లొద్దుగు.)

**లొబ్బెస.** దే. వి. అలంతికావిశేషము. (చూ. అలంతిక.)

**లొల్ల.** దే. వి. దున్నిననేల మిట్టపల్లములులేక సరుదునట్టి బల్ల.

**లొల్లి.** దే. విణ. తఱచు, ఘనము. (చూ. ఇల్లిగులు.)

## లో.

**లో.** దే. అవ. నిర్ధారణషష్ఠియందువచ్చెడులోపలవర్ణకమునకుమాఱుగావచ్చునది. (దేవతలలోనింద్రుఁడుముఖ్యుఁడు.) వి. 1. లోనుశబ్దముయొక్క సప్తమీవిభక్తియందు నాక్షరములోపింపఁగా మిగిలినరూపము; (నాలో నేమియుఁ గపటములేదు.) (ఇది చోటుశబ్దము వంటిది.) 2. వృత్తియందులోను లోపలశబ్దములకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (లోఁబడు, లోచూపు మొ.)

**లోఁకువ.** దే. విణ. 1. అధీనము; 2. తక్కువ.

**లోఁగడ.** దే. (లోను+కడ.) 1. అంతరాళము; "క. చెడవిటీగి యడవిఁబడియెడ, నెడగట్టులతుదలఁగోటియిడిలోఁగడకుం, దడుకు వాడిపించియాకుల, గుడిసెలవసియించెమంత్రి గురుభటయుతుఁడై." ఆము. 3, ఆ.—2. గతకాలము.

**లోఁగలి.** ద్వ. వి. (లోను+కలను.) 1. గృహాంతర్భాగము; "చ. నటవిటకాంద్రపాలిటనుజారులచెంతను వేశ్యలిండ్లలోఁ, గటను నిటారితొత్తులతెగన్ నగూఁటులవీడుపట్టులన్, బటువగుఖూదకాంద్రకడఁబ్రల్లదకాండ్రడగండుమీఁటివి, స్ఫుటముగఁజేతికాసు లవి పోకడవెట్టుకొనెన్ మదంబునన్." భల్లా. 3, ఆ.—2. గృహము. (సంధినివర్ణలోపవర్ణవికారములు.)

**లోఁగిలి.** ద్వ. వి. లోఁగలియొక్క రూపాంతరము. (వాడుకయందిట్లు కనఁబడుచున్నదికాని దీనికిఁదగినప్రయోగము చిక్కినది కాదు.)

**లోఁగు.** దే. అ. క్రి. 1. లోఁకువగు; 2. అడఁగు; (చూ. లాఁగ.) 3. చొచ్చు. "ఉ. వారువచ్చునాలోవివరాంతరంబునకులోఁగినమత్కుణనాథుఁగానక." పంచ. నా. ౧, ఆ.—4. వెనుదీయు. "క. లేఁగౌఁదీఁగనితంబము, వ్రేఁగునఁద్రెవ్వటయుఁగని విరించిబిగింపన్, లోఁగిముడియిడియెవదులుగ, నాఁగోకస్తనిగభీరనాభిచెలంగున్." ఆము. ౫, ఆ.

**లోఁగొను.** దే. స. క్రి. (లోను+కొను.) లోపలనడఁచుకొను. "శా. కేళీగేహసరోమరాళమిథునక్రేంకారముం గన్యకా, డోలాకాంచనకింకిణీగణ రవాటోపంబు నృత్యన్నటీ, హేలానూపురశింజితం బుఁబురి నింపేపారఁగాలోఁగొనున్, గాలోద్యత్పురుషాయమాణగణికా కాంచీకలక్వాణముల్." కవిక. ౧, ఆ.

**లోఁచే.** దే. ప్రే. లోఁగఁజేయు. (చూ. అఁచు.)

**లోఁడు.** దే. స. క్రి. వ్రేలులోనగువానితోక్కిల్లగించు.

**లోఁతిడి.** దే. విణ. (లోఁతు+ఇఁడి.) లోఁతులేనిది, ఉత్తానము.

**లోఁతు.** దే. వి. మిక్కిలిపల్లము. (ఆ బావిలోఁతెంత.) విణ. మిక్కిలిపల్లమైనది. "లోఁతుపొక్కిలి." రామా. 3, ఆ.

**లోఁబడు.** ద్వ. అ. క్రి. అధీనమగు. "తే. కినిసిపాణినాళీకంబ ఠానుపుటయును, నంతలోఁబడకదియు." (అంతలోన్+పడక అంతన్+లోఁబడక అని భేదము.) హన. ౨, ఆ.

**లోకజిత్తు.** సం. వి. త్. పుం. బుద్ధదేవుఁడు, ఋషుఁడు.

**లోకనము.** సం. వి. అ. న. అవలోకనము. "ఇంద్రలోకలోకనార్థినై." భార. అర. ౨, ఆ.

**లోకబాంధవుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు, జగముచుట్టము.

**లోకమాత.** సం. వి. ఋ. స్త్రీ. 1. లక్ష్మి, జగముతల్లి; 2. గంగ.

**లోకము.** సం. వి. అ. పుం. 1. జగము; 2. జనము. [లోకములుమూఁడు. — స్వర్గము, మర్త్యము, పాతాళము. పక్షాంతరమున

వత్త్రై. దే. వి. చీటిక. (మొదటిరూపము వట్రైయ.)

వత్త్రొడ్డు. దే. అ. క్రి. (వత్తు+ఒడ్డు.) ప్రవహించే. "సీ. కన్నీరువత్త్రొడ్డికాంతియంతయుఁగుంది వెలఁదిసీకనదోయిఁవిన్న నయ్యె." భార. విరా. ౨, ఆ.

వల. యు. దే. వి. 1. మత్స్యములనుపట్టెడుజాలము; (చూ. ఉరి.) (దీనిభేదములు.-అనుకువల, ఎడవల, డొంకవల, త్రోపుడువల, దాఁటుడువల, మెడవల, సన్నవల మొ.) 2. మృగములు పక్షులుమొదలగువానిఁబట్టెడువాగుర. "క. వలలోన నన్నపులుంగుల, వెలువడఁగావిడిచి." భార. శాం. 3, ఆ. (దీనిభేదములు.- ఎలుకవల, పీఁదువల, కుందేటివల, దొడ్డివల, పందివల, లేటివల, సవదండవల మొ.) విణ. వృత్తియందువలను శబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (వలకన్ను, వలకేలు, వలచెవి, వలమూఁపు, వలమూల, వలవంక మొ.)-వై. వి. కామము. "క. కాదంబరిఁద్రావింతును, జూదంబాడింతువలలఁజొక్కు-లఁబెట్టం, బైదలులనియోగింతును, వైదర్భతనూజమీఁదివలపుడిగింతున్." నై. ౭, ఆ

వలఁకు. దే. వి. దిక్కు. "క. బలమెల్లఁజెదరినాలుగు, వలఁకులఁ జెడిపోయె." హరి. ఉ. 3, ఆ. (వలనుయొక్క రూపాంతరము.)

వలఁకువు. దే. వి. వలఁకు, దిక్కు. (ఇది కొలఁకువువంటిది.)

వలఁతి. దే. వి. ఆఁడుది. అం, శే.-విణ. 1. నేర్పరి; "వినఁనీమతి బోధింపవలంతినే." భార. ఉద్యో. 3, ఆ.-2. అధీనము; "సీ. నీదక్షవాటికానిలయంబునందుండుజనులకుభోగమోక్షములు వలఁతి." భీమ. 3, ఆ.-3. అనుకూలము. "ఎ, గీ. వరుణునకుఁడాఁగి కొనఁజోటు వలఁతియగుట, సుదధినాయకభావంబునుపకరించె." పా. ౫, ఆ.

వలకట్టు. దే. స. క్రి. (వలను+కట్టు.) అనుకూలపఱచు. "వ. అతండువిద్యాధికుండుకాకుండుటంజేసినిజగౌరవశైథిల్య భయంబున నితరులగువిద్యాధికులకురాజగృహంబునఁబ్రవేశంబు లేకయుండఁదౌవారికాదినకలపరిజనచక్రంబునువలకట్టుకొనియుండుటయు." కళా. ౬, ఆ.

వలకడ. ద్వ. వి. (వలను+కడ.) దక్షిణపుదిక్కు.

వలకాఁక. ద్వ. వి. మన్మథతాపము, క్షేత్రయ.

వలకాఁడు. ద్వ. వి. కాముకుఁడు. వసు. ౪, ఆ.

వలకారి. ద్వ. విణ. వలపించువాఁడు, వలపించునది. "సీ. వక్రభావంబులువలకారిబాగులువలసియొల్లములునువట్టిపనలు." పాండు. 3, ఆ.

వలగొను. దే. స. క్రి. (వలను+కొను.) ప్రదక్షిణించు. "వ. యథోచితప్రకారంబునవిడుకొనివలగొనిమగిడిరి." సం. "కృష్ణం కృత్వా ప్రదక్షిణమ్." భార. ఉద్యో. 3, ఆ.

వలగ్నము. సం. వి. అ. పుం, న. దేహముయొక్క మధ్యము, నడుము.

వలచు. యు. దే. అ. క్రి. వాసనగొట్టు. "సీ. కసటువోబీఱెండఁ గరఁగికజ్జలనంటి గమగమ వలచుచొక్కపుజవాజి." స్వా. ౨, ఆ.-వై. స. క్రి. 1. కోరు; "దానివినఁగవలతు." భార. ఆది. 3, ఆ.-2. కామించు.

వలచుట్టు. దే. స. క్రి. (వలను+చుట్టు.) (చూ.) వలగొను. "ఉ. నావలచుట్టిహర్షకలనావలమానమనోంబుజంబుతో, నావల వైరిఁబల్కునచలాగ్రణిమాయకశోకవార్ధికిన్, నావలతాంగినట్లిరళ నావలయేశ్వరుకేలఁగూర్చెదే, నావలవంతదీర్చెదెయనంతకృపార నవానవాసవా." (వలవైరి=బలవైరి.) వసు. ౫, ఆ. — వి. వలగొనుట.

వలజ. సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కనిచూపుగల ఆఁడుది; 2. భూమి. అ. న. ను. 1. వరిమడి; 2. పైరు; 3. ధాన్యరాశి; 4. పురద్వారము; 5. యుద్ధము.

వలతి. దే. వి. స్థానము. "ఎ, గీ. వచ్చెనలకూబరుండున్నవలతి కతివ." యు. ౨, ఆ.

వలదు దే. వి. ఆధిక్యము. (వీనికేమివలదువచ్చినది.) విణ. అధికము. "ఉ. చక్కలిగింతవెట్టినను సారెగిరాకికనక్షచుంబయిం, బక్కుఁబడంగఁజక్కిలికమారునివుక్కు-వ మీఅనేడ్పురాఁ, జెక్కిలి మీటియెత్తియెదఁజేరిచిముచ్చటదీఱునట్లుగా, నక్కటముద్దులాడవలదా వలదా యిటువంటి భాగ్యముల్." సా. ౧, ఆ.

వలనొర. ద్వ. వి. మన్మథుఁడు, రతిపతి. అని. ౨, ఆ. (ఇట్లు వలరాయఁడు మొ.)

వలన. దే. అవ. పంచమీవిభక్తియందువచ్చెడి యొకానొక ప్రత్యయము.

వలనము. సం. వి. అ. న. 1. కంటిపాపతిరుగుడు; 2. తిరుగుడు. పుం, ఇట్టే.

వలను. దే. వి. 1. దిక్కు; "వ. అతనిపోయినవలనెఱుంగుదురేని యానతిండు." భార. అర. ౨, ఆ.-2. పార్శ్వము; "క. ఉరగపతితలలవలనురు, తరజవమునసురులూఁది." భార. ఆది. ౨, ఆ.-3. ఉపాయము; "ద్వి. ఈనాగపాశంబు లిపుడు నాయుటకు, వానరేశ్వరులారవలనుచెప్పెదను." రా. యు, కాం.-4. నేర్పు; "వ. ఇంకనువలనుగలవారలంబంచి యాతనినిమ్ముగా నెఱుంగవలయు." భార. అర. ౨, ఆ. — 5. ప్రదక్షిణము; "ద్వి. అమరేంద్రుదెస విరూపాక్షంబుగాంచి, ప్రమదంబుమీఱంగ వలనుగావచ్చి." రా. బాల, కాం. — 6. శకునము; "ఎ, గీ. వలనులెన్నైనమిక్కిలినలరుకొనుచు." యు. ౨, ఆ.-7. విధము; "నత్రమెవ్వలనుగాఁజేసిరి." భాగ. ౪, స్కం.-8. ఒప్పిదము; "సూతకృత్యముల్ వలనుగఁబూని." భార. ద్రో. ౪, ఆ.-9. శుచిత్వము; "తే. వార్చివాఙ్నియతితో వలనుగలిగి, యుత్తరంబొండెఁదూర్పుదిక్కొండెఁజూచి, జానుమధ్యంబులందు హస్తంబులుండఁ, గుడుచునదిపవిత్రాన్నంబుగుణివరేణ్య." మార్క. 3, ఆ.-10. అనుకూల్యము; "ద్వి. వలనుతప్పినదవచ్చెనీత నికి." సా. ౪, భా.-విణ. 1. కుడి, దక్షిణము; "వలనొహస్తంబునన్." భద్రా. ౧, ఆ. — 2. యుక్తము. "మఱియొండు మార్గంబు వలనుగాదు." రా. కిష్కి, కాం.

వలపల. దే. వి. (వలను+పల.) దక్షిణభాగము. "ఎ, గీ. వలపలాదిగాఁగజలములఁదడియఁగ, ముట్టివార్చవలయు." విజ్ఞా. ఆచా, కాం.

వలపలగిలుక. దే. వి. రేఫముయొక్క రూపాంతరనామము.

వలపలించు. దే. స. క్రి. వలగొను, వలచుట్టు. "వ. గాంధారీ నందనుండు వలపలించిచుట్టుకొనిరానదినరకునేయకబకవైరి దాపలించితిరిగెన." సం. "దక్షిణంమండలంరాజన్ ధార్తరాష్ట్రోభ్యవర్తత, సవ్యంతు మండలంతత్ర భీమసేనోభ్యవర్తత." భార. శల్య. ౨, ఆ.

వలపు. యు. దే. వి. వాసన. "ఆటతోఁటవలపుల్." రామా. 3, ఆ.-వై. 1. కోరిక; (చూ. బాహిరపోవు మొదటియర్థము.) 2. కామము.

వలపుకత్తె. వై. విణ. కామముగలది, కాముకి. (మొదటిరూపము వలపుకత్తియ.)

**వలపుకాఁడు.** ద్వ. విశే. కామముగలవాఁడు, కాముకుఁడు.

**వలపుకీలు.** వై. వి. పోఁకముడి, నీవి. ''ఎ, గీ. అనుచుఁదగబుజ్జగించి హస్తాంబుజమున, వలపుకీలుదెమల్చుభూవల్లభుండు.'' నై. ౭, ఆ.

**వలపుమోపరి.** దే. వి. వాయువు, గంధవహుఁడు. ''సీ. వలపుమోపరిజియ్యవలమూలదయ్యంబుగుండులతలకట్టుపండుదండి.'' అచ్చ. బాల, కాం.

**వలపురాయఁడు.** వై. వి. మన్మథుఁడు, రతిపతి. (చూ. నీరాట రెండవయర్థము.)

**వలభి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కొణిగ; 2. చంద్రశాల.

**వలమానము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తిరుగుచున్నది; 2. చలించుచున్నది.

**వలము.** దే. వి. 1. విస్తారము, ''ఎ, గీ. ముప్పదియోజనముల, పొడువుపదియోజనమ్ములనడిమివలము, గలుగునగ్గిరి.'' సం. ''దశయోజనవిస్తారస్త్రింశద్యోజనముచ్ఛ్రితః.'' రా. సుం, కాం. — 2. స్థౌల్యము. విశే. స్థూలము. (చూ. బ్రదిమి.)

**వలమురి.** దే. వి. (వలను+మురి.) దక్షిణావర్తశంఖము. (చూ. ఉఱిది మొదటియర్థము, ముడుఁగుమూడవయర్థము.)

**వలమురితాలుపు.** దే. వి. విష్ణువు, శంఖపాణి. ''చ. వలమురితాలుపింకనిటవచ్చుటమానునుమచ్చెకంటినా.'' పాండు. ౫, ఆ.

**వలయము.** సం. వి. అ. పుం, న. కడియము. పుం. 1. కుండలాకారము; 2. కంఠమాల.

**వలయితము.** సం. విశే. (అ. ఆ. అ.) చుట్టఁబడినది.

**వలయు.** యు. దే. అ. క్రి. 1. ఇష్టమగు; ''వలయునాహారములు.'' భార. అశ్వ. ౪, ఆ. ''వలసిననేలుము.'' భార. విరా. ౧, ఆ. 'ఇది వలయునా? వలవదు.'—2. ఆవశ్యకమగు; ''మాకురక్షకుఁడొకమహీవరుండువలయు.'' భార. శాం. ౨, ఆ. ''దేవహితముదీనిఁదీర్పవలయు.'' భార. ఆర. ౨, ఆ. ''పసుపవలపెదూతభావమపేక్షించి.'' భార. ఆర. ౨, ఆ. ''వలదుకుక్కలవిడువంగ.'' స్వా. ౪, ఆ.—3. యుక్తమగు; ''క. దానికి నోర్వఁగవలయుం, గానికనలవలదు.'' భార. కర్ణ. ౧, ఆ.—4. విహితమగు. (ఈయర్థమందిది విధ్యాద్యర్థకమయి విధినిషేధములను దెలుపును.) ''తే. కడఁగినేడురథమ్మీవుగడపవలయు.'' భార. విరా. ౪, ఆ. ''ఇడుమకుడువవలసె.'' భార. విరా. ౨, ఆ. ''అడుగవలదు.'' భార, ఉద్యో. 3, ఆ. (అది శబ్దముచేత ప్రార్థనమునకు.—''వ. తరువాతి వృత్తాంతంబుకృపాయత్తచిత్తంబున నానతీవలయు.'' స్వా. 3, ఆ.—శాపమునకు.—''అరదంబుచక్రంబుపుడమిఁగ్రుంగవలయు.'' భార. కర్ణ. ౨, ఆ.) (దీనికి మొదటియర్థమునందు సాధారణంబుగఁ బ్రథమాంత నామపదంబకర్తయగు. రెండవయర్థమునందుఁ బ్రథమాంతనామపదంబుగాని అన్నంతక్రియాపదంబుగాని కర్తయగు. మూడవయర్థమందును నాలుగవయర్థమందును దఱచుగ అన్నంతక్రియాపదంబులెకర్తలగు. ''చ. వలదని యెంతచెప్పినను వావిరివైకదువేగపాటుమైఁ, బలుమఱునెల్లెడందొడరఁబాఱెదు.'' (ఇత్యాదిస్థలములయందువలదనుక్రియకుఁగర్తయధ్యాహార్యము.) భార. విరా. ౨, ఆ. 'కొన్నియెడల కర్తృభూతక్రియావృత్తియగుధాతువునకు మాఱుగా భావప్రత్యయాంతశబ్దంబును నయ్యెడి. ''వ. ఎవ్వరిం బాటించుటవిభునకువలయును.'' భార. అను. ౧, ఆ. మఱియును మొదటి రెండవ నాలుగవ యర్థములయందు తద్ధర్మభూతవ్యతిరేకార్థములయందును, మూడవయర్థమందు తద్ధర్మ వ్యతిరేకార్థములయందును దీనికి ప్రయోగములుకానఁబడుచున్నవి.)—వై.

వలయితమగు. ''క. విడివడిజలమధ్యమునకుఁ, గడువేగమకమరమేగె గ్రక్కునబొక్కం, బడెనెలుక వానిఁబొడగని, వడిఁగాకము నెగసెమృగమువలయంబాతెఱ్.'' పంచ. నా. ౨, ఆ.

**వలరాచేపని.** ద్వ. వి. గ్రామ్యధర్మము. నీలా. ౧, ఆ.

**వలరాజు.** వై. వి. మన్మథుఁడు, రతిపతి. ''సీ. వలరాజుచేమించు వహిఁగాంచితులకించు నలయంచఁగిటినొంచియలఁచినటులు.'' ఉ, రా. ౪, ఆ. (ఇట్లు వలతేఁడు మొ.)

**వలవంత.** ద్వ. వి. మన్మథవ్యథ. ''సీ. వలవంతసంతాపమొలసియుఁ జెల్లానచలిమిరిఁ దోడ్తోన శమనమొంద.'' హరి. ఉ. ౭, ఆ.

**వలవల.** దే. వి. 1. ఏడ్పుటయందగు ధ్వన్యనుకరణము. ''సీ. తలుకునిద్దంపుటద్దపుమోముకళ తప్పె వలవలకన్నీరువడువకమ్మ.'' అని. ౨, ఆ.—2. వ్రాలుటయందగు ధ్వన్యనుకరణము. ''చ. నేలపై, వలవలవ్రాలెఁ గీలె డలివ్రాలిన పుత్తడి బొమ్మ కైవడిన్.'' భాగ. ౧౦, స్కం. ఉ.

**వలవలన.** దే. విశే. వదలినది. ''వలవలనైనదంతములు.'' (చూ. వగరము.)

**వలస.** వై. వి. రాజోపద్రవాదులచే దేశమువిడిచి పరదేశమునకుఁ బోవుట*. ''చుక్కలవలసత్రోవ.'' స్వా. 3, ఆ.

**వలసతీయు.** ద్వ. అ. క్రి. (చూ.) వలసపోవు.

**వలసపోవు.** ద్వ. అ. క్రి. రాజోపద్రవాదులచే దేశమువిడిచి పరదేశమునకుఁబోవు.

**వలాహకము.** సం. వి. అ. పుం. 1. మేఘము; 2. కృష్ణుని రథ్యములలోనొకటి; (చూ. రథ్యము.) 3. పర్వతము. దు. రాక్షసుఁడు.

**వలి.** ఉభ. దే. వి. 1. శైత్యము; ''ఎ, గీ. వానలకు నెండలకుఁ గరువలికివలికి, సైఁచి.'' అచ్చ. సుం, కాం.—2. కంపము. విశే. శీతము. ''వలిగాడ్పు.'' వసు. 3, ఆ.—సం. వి. ఇ. స్త్రీ. 1. కడుపుమీఁదిముడుత; 2. ముడుత.

**వలికి.** దే. వి. సారసపక్షి, బెగ్గురు.

**వలిగొను.** దే. అ. క్రి. (వలి+కొను.) 1. చలిగొను; ''ద్వి. వలిగొన్నమెయి.'' సా. ౬, భా. 2. వణఁకు.

**వలితము.** సం. వి. అ. న. (చూ.) వల్గితము. విశే. 1. చుట్టఁబడినది; 2. చలనమునొందినది.

**వలినుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వలులుగలవాఁడు.

**వలిపని.** దే. వి. శైత్యోపచారము. నీలా. 3, ఆ.

**వలిపము.** దే. వి. 1. మడుఁగువస్త్రము; ''వలుచనిసన్నకావివలిపంబులుగట్టఁగనిచ్చి.'' విక్ర. ౧, ఆ.—2. సన్నని తెల్లవస్త్రము. ''చ. వలిపముగట్టిహారములు వైచిపటీరముపైనలందిజా, దులు నెఱికొప్పునందుఱిమి త్రోవనెపోయితిమేనిఁ దాఁకియుం, దఱఁ జెడువారులేరని మనంబుకలంకలుదేర్చిజారకాం, తలనమయస్థలంబులకుఁ దార్చిరిదూతికలట్టివెన్నెలన్.'' పా. ౨, ఆ.—విశే. 1. పరిశుద్ధమైనది; ''వలిపపుసన్నకావులను.'' లక్ష్మీ. 3, ఆ.—2. తెల్లనైనది. ''తే. తారకాధీశుకిరణకదంబకంబు, చిలికెఁ బలుచనివలిపంపు జలుఁగుమంచు.'' పా. ౨, ఆ.—(వృత్తియందు అంత్యవర్ణము వికల్పముగా లోపించును. ''సీ. కలువపుప్పొళ్లచేఁగసమైనవెన్నెల వలిపవెన్నెలలోనవడిచితేర్చి.'' పా. ౨, ఆ. ''వలిపచెంగావిపావడ.'' శశాం. 3, ఆ.)

**వలిపిరి.** దే. వి. 1. చేలి; 2. వడఁకు.

**వలిపిరిగొట్టు.** దే. విశే. వడఁకుఁబోతు.

**వలిభము.** సం. వి. అ. పుం. ఆఁడుదాని కోకకుచ్చెళ్లు.

**వలిభుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) వలులుగలవాఁడు.

**వలిమల.** దృ. వి. మంచుఁగొండ, శీతనగము. "వలిమలయల్లువాని తలవాడనిపువ్వయి." య. ౪, ఆ. (ఇట్లు వలిగట్టు, వలిగుబ్బలి, వలిగొండ.)

**వలిమిడి.** దే. వి. పశువులకు కాలిమడమలయందుఁ గలిగెడు రోగ విశేషము.

**వలిమొలక.** దే. వి. భీముఁడు, వాయుపుత్త్రుఁడు. ఆం, భా. ప్ర, కా.

**వలియు.** దే. అ. క్రి. 1. సన్నగిలు; "వాఁకలబడినీరువలియఁ బాఱఁగ." హరి. పూ. ౭, ఆ.—2. డయ్యు. "సీ. ఎదిరిన పోతులనెవ్వనినైననవారణనోడించివలియఁదోలు." హరి. పూ. ౬, ఆ.

**వలివెలుఁగు.** దే. వి. చంద్త్రుఁడు, హిమాంశువు. "వ. మంద యానలచెక్కులవెలుంగువలివెలుఁగుంజూపి." వసు. ౪, ఆ. (రూ. వలివెల్గు. "సీ. వలివెల్గుజావెల్గువలు వారిమదనవహ్ని జ్వాలికలవేఁడినిగురఁబోలు." వసు. ౪, ఆ.)

**వలీకము.** సం. వి. అ. న. ఇంటిచూరు, నీవ్రము.

**వలీముఖము.** సం. వి. అ. పుం. వానరము, తఱులమోరమేకము.

**వలుఁద.** దే. విశ. స్థూలము, వలము. "చాలవలుందమీలఁగైకొని." చెన్న. ౪, ఆ.

**వలుకు.** దే వి. వళుకుయొక్కరూపాంతరము.

**వలువ.** దే. వి. 1. సన్నవస్త్రము; (చూ. వల్వ.) 2. వస్త్రము. (రూ. వలువము. చూ. వల్వ.)

**వలువు.** దే. వి. వలువయొక్కరూపాంతరము. "రగడ. పదియారవ న్నియ బంగరువలువును, మెదలెడితళుకులమేలిమిచెలువును." కళా. ౫, ఆ.

**వలె.** దే. ద్ర. 1. వలయుఁ అనుదానికాదేశము; 2. ఉపమావాచకము. "క. అలనాసురుచిరతరలీ, లలనాన్నపుఁడత్తువేయు లాగు లఁదెలుపక, వలెనామదిఁదలఁచఁగనీ, వలెనాకేఁ నాప్తులైనవారుం గలరే." రుక్మి. ౨, ఆ.

**వలెవాటు.** దే. వి. వల్లెవాటుయొక్కరూపాంతరము. (వల్లెవాటుగా మెలిపెట్టినైచుకొన్న యుత్తరీయమునకు.—"సీ. ఉదరిబంగరువ్రాఁత పొంబట్టువలెవాటు నడలించివెసఁ గటి స్థలినిజుట్టి." పాండు. ౧, ఆ.)

**వల్కము.** సం. వి. అ. న. 1. చెట్టుమీఁదిపట్ట, నార; 2. లవంగ పుఁబట్ట; 3. తునియ.

**వల్కలము.** సం వి. అ. పుం, న. చెట్టుమీఁదిపట్ట, నార.

**వల్గ.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) వాగె, వాగ.

**వల్గనము.** సం. వి. అ. న. (చూ.) వల్గితము.

**వల్గితము.** సం. వి. అ. న. వేగముగావిడువఁబడి మీఁదికిఁగాళ్లుకద లించుచుపాఱెడి అశ్వధారావిశేషము. (చూ. ధార.)

**వల్గువు.** సం. వి. ఉ. న. కొరివెంద్రుక. పుం. మేఁకపోతు. విశ. చక్కనిది.

**వల్చు.** యు. అ. క్రి. స. క్రి. వలచుయొక్కరూపాంతరము. (వానసగొట్టుటకు.—"తనువుమీఁదపొలవల్చుజాలరిదాన." భార. ఆది. 3, ఆ.)

**వల్ద.** దే. విశ. వలుఁదయొక్కరూపాంతరము. భార. ఆది. ౪, ఆ.

**వల్పము.** దే. వి. విశ. వలిపముయొక్కరూపాంతరము. (అంతస్థ వర్ణలోపమునకు.—"వల్పపయ్యెదవల్పపావడ" మొ.)

**వల్వ.** యు. వి. వలపుయొక్కరూపాంతరము. (వాసనకు.—"చెంగలువలవల్వ." సావి. ౬, ఆ.)

**వల్మీకపాదుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పుట్టకాలివాఁడు.

**వల్మీకము.** సం. వి. అ. పుం, న. పుట్ట. (రూ. వల్మికము.)

**వల్మీకశింబి.** సం. వి. ఈ. స్త్రీ. పుట్టతమ్మికీ.

**వల్ల.** దే. అవ. పంచమీవిభక్తియందువచ్చెడువలనయొక్కరూపాంతరము. "చలిమలవల్లనుల్లసిలు చల్లఁదనంబున." సావి. ౨, ఆ.—విశ. అనుకూలము. "దక్షిణాంగ చూచుక నయన ప్రకంప గుణసూచనలేమియువల్లగావు." పా. ౧, ఆ.

**వల్లకాడు.** దృ. వి. (వల్లడి + కాడు.) శ్మశానము. "శే. అద్భినే నేఁడుమీకు మధ్యాహ్నభిక్ష, బ్రహ్మపురివాడఁగాశికాపట్టణమున, రబ్బదోనాకుఁబోలెమహర్షులార, వాడవాడలనీపెద్దవల్లకాట." కాశీ. ౭, ఆ.

**వల్లకి.** సం. వి. ఈ. స్త్రీ. వీణ, విపంచి.

**వల్లడి.** దే. వి. 1. అకారణమైనయాపద; 2. కొల్ల.

**వల్లడికాఁడు.** దే. విశ. 1. అకారణము అపదచేయువాఁడు; 2. కొల్లపెట్టువాఁడు.

**వల్లభము.** సం. వి. అ. పుం. మేలిజాతిగుఱ్ఱము. విశ. ప్రియము.

**వల్లభుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రియుఁడు; 2. అధిపతి.

**వల్లము.** దే. వి. వరపోలజాలె. "సీ. వల్లంబుపోనాడుమైత్యుని శేవనుగాలుకాలినపిల్లిక్రమముతోఁప." హంస. ౧, ఆ.

**వల్లరసి.** దే. వి. ఒకానొకచెట్టు.

**వల్లరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చిగిరించినలేఁతకొమ్మ; పూచినలేఁత కొమ్మ. (అనికొందఱు.) పూగుత్తి. (అనికొందఱు.) (చూ. మంజరి.) 2. తీఁగ.

**వల్లవుఁడు.** సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. వంటవాఁడు; 3. భీముఁడు.

**వల్లి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. తీఁగ, లత, వ్రతతి.

**వల్లించు.** దే. స. క్రి. వల్లెవేయు. అం, ప్రే. వల్లెవేయించు. "వల్లించుశ్రీరామనామ సుధామాధురిసాధురీతి." పాండు. ౪, ఆ. (చూ. వల్లె.)

**వల్లిగము.** దే. వి. బొక్కెనమీఁదియినుపవలయము.

**వల్లియ.** దే. వి. వల్లెత్రాడు. "వ. వల్లియలునైచికోడలంబట్టి." హరి. పూ. ౫, ఆ. (చూ. వల్లె.)

**వల్లిసూరణము.** సం. వి. అ. పుం. పుల్లబచ్చలికీ.

**వల్లువము.** దే. వి వరపోలజాలె, వల్లము. "పెనంగవల్లువము ద్రెంచి." ఆము. ౬, ఆ.

**వల్లూరము.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం, న. 1. కఱువాడు; 2. పందినంజుడు.

**వల్లె.** దే. వి. 1. పశుబంధనరజ్జువు; "ఎ, గీ. వల్లెనైచుచువారెవ్వరు వల్లరాల." ఉ, హరి. ౪, ఆ.—2. వరుణునిపాశము; 3. చెప్పి

నది మరలమరలఁజెప్పుట. అవ్య. అంగీకారార్థకము. "క. వల్లెయని రాజనందను, లెల్లనుసమకట్టి." భార. అది. ౬, ఆ.

వల్లెతాలుపు. దే. వి. వరణుఁడు, పాశి. (రూ. వల్లెతాల్పు.)

వల్లెవాటు. దే. వి. 1. వల్లెయొక్కవాటువంటివాటు; "సీ. వల్లెవాటు గఁగొంతవలువచన్గవనిల్పి పెరచేతనీవిఁగల్పించుకొనుచు." కళా. 3, ఆ.—2. వల్లెవాటుగామెలిపెట్టిపైచుకొన్న యుత్తరీయము. (చూ. వలెవాటు.)

వల్వ. దే. వి. వలువయొక్కరూపాంతరము. [సన్నవస్త్రమునకు.—"సీ. మొనసినతమిఁబోఁకముడిఁదివ్వఁబెనఁగఁగాఁ జనిఁగిననునువల్వనేల తోడ." (ఇక్కడ వల్వశబ్దమునకు సన్నముమాత్రమర్థము.) య. ౨, ఆ.] (రూ. వల్వము. "పసుపుఁబొడితోలువల్వంబునెసక మెసఁగ." ఆము. ౬, ఆ.)

వశ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. గొడ్డుటావు; 3. ఆవు; 4. కూఁతురు; 5. పెండ్లాము; 6. ఆఁడుది. విణ. లోఁకువైనది.

వశంవదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) లోఁకువయగునట్లు మాట లాడువాఁడు.

వశక్రియ. సం. వి. ఆ. స్త్రీ. వశముచేసికొనెడు మంత్రతంత్రాది కర్మము.

వశము. సం. వి. అ. పుం. 1. లోఁకువ; 2. ఇచ్ఛ; 3. ప్రభుత్వము. విణ. లోఁకువైనది.

వశవర్తి. సం. విణ. విధేయుఁడు.

వశి. సం. విణ. (న్. ఈ. న్.) 1. లోఁకువైనవాఁడు; 2. ఇంద్రియనిగ్రహముగలవాఁడు.

వశికము. సం. విణ. (అ. ఆ. అ.) శూన్యము.

వశిరము. సం. వి. అ. న. ఇందుప్పు. పుం. 1. ఉత్తరేను*; 2. గజపిప్పలి*. (రూ. వసిరము.)

వశీకరణము. సం. వి. అ. న. మందుమాఁకులచేత లోఁకువగాఁ జేయుట.

వశీకరించు. సం. స. క్రి. మందుమాఁకులచేత లోఁకువగాఁజేయు.

వశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) మందుమాఁకులచేత లోఁకువైనది.

వశ్యౌషధము. సం. వి. అ. న. పెట్టుమందు.

వషట్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) అగ్నియందు వేల్వఁబడినది. (హవిస్సు.)

వస. ఉభ. వై. వి. ఒకమందుదినుసు. సం. ఆ. స్త్రీ. కడుపులో బొడ్డుక్రిందనుండెడి యుల్లిపొరవంటిక్రొవ్వు, వప.

వసంతద్రుమము. సం. వి. అ. పుం. మామిడి, ఆమ్రము*.

వసంతము. ఉభ. దే. వి. పసుపునుసున్నమునుకలిపినయొఱ్ఱనీళ్లు. సం. అ. పుం. 1. ఒక ఋతువు; (చూ. ఋతువు.) 2. ఒకానొక రాగము.

వసతి. ఉభ. దే. వి. సౌఖ్యము. (అక్కడ నీళ్లవసతిలేదు.) విణ. సౌఖ్యకరము. (ఆచోటు నాకు వసతిగానున్నది.) సం. వి. ఇ. స్త్రీ. 1. ఇల్లు; 2. ఉనికి; 3. రేయి; 4. బుద్ధాలయము.

వసనము. సం. వి. అ. న. 1. ఉనికి; 2. వస్త్రము.

వసనాభి. వై. వి. గ్రా. విషవిశేషము, వత్సనాభి.

వసపడు. వై. అ. క్రి. (వశము+పడు.) "క. వసుధనుబుత్రాది కులు, రస్వనము[illegible]నందంద్రివారించుటకుఁ, వసపడఁడట మునేరాజ్య, నన్ననమువారింపనెంతవాఁడెవ్వఁడుఁ." ఆము. ౪, ఆ.

వసపోవు. దవ్. అ. క్రి. (వశము+పోవు.) శక్యముగు. "క్రతమపట్టినాఁకనికిసమకట్టివసపోనివిలువెట్టిరని[illegible]." సాంచా. ౨, ఆ.

వసము. వై. వి. స్వాధీనత, అధీనత. "చ. అనదుగఁదాఁకిమేనఁ దఱచైపోరి నెత్తురు గ్రమ్ముపోటులన్, వసమునతేరులుచుండియు ను." భార. విరా. 3, ఆ. "చ. అనదృశశక్తిచేజతుఁడనైపరిరక్షణము[illegible]చిన్, వసమునఁజిక్కితిన్." హరి. ఉ. ౮, ఆ.—విణ. 1. అధీనము; (చూ. కారూరు.) 2. శక్యము*. "వారికిన్ బ్రత్యర్థియైనిల్వఁగావసమేయెంతటివారికిన్." హరి. పూ. 3, ఆ.

వసల. దే. వి. కొయ్యకు అడుగువేసెడుకొయ్య. (రూ. వసలా)

వసారా. దే. వి. కూటమునకుప్రక్కనుండెడుకట్టడము, పంచపాది. (రూ. వసారా.)

వసి. ఉభ. దే. ఉప. మిక్కిలి. (క్రియకుముందు వసిమాలు, వసివాడు, వసిపాఱు. విశేష్యమునకుముందు. వసితొఁకు.) వై. వి. 1. కొనచెక్కనకొయ్య; 2. మీఁదుమొనగానాటినమేకు; 3. ముల్లు*. సం. ఇ. పుం. ఉనికి.

వసించు. సం. అ. క్రి. వాసముచేయు, ఉండు.

వసిగొను. దే. అ. క్రి. (వసి+కొను.) పూను, ఉత్సహించు. "ద్వి. వసిగొనిహరియుదేవతలునెత్తంగ, వెననోపిరేయశ్వనివిహితతృణము." భాగ. ౬, స్కం.

వసివాళ్లు. దే. వి. బ. (వసివాడు+లు.) మిక్కిలి వాడుటలు. "ఎ. గీ. కందకుండంగవసివాళ్లు సెందకుండ." చంద్ర.

వసుంధర. సం. వి. ఆ. స్త్రీ. భూమి, వసుధ, నేల.

వసుకము. సం. వి. అ. న. చేవ్రుటుప్పు. పుం. 1. జిల్లేడు*; 2. బకపుష్పము*.

వసుగర్భ. సం. వి. ఆ. స్త్రీ. భూమి, పైఁడిచూలాలు.

వసుదేవుఁడు. సం. వి. అ. పుం. కృష్ణునితండ్రి.

వసుధ. సం. వి. ఆ. స్త్రీ. భూమి, మహి, మేదిని, నేల.

వసుమతి. సం. వి. ఈ. స్త్రీ.———పై.———

వసులపాఁతలు. దే. వి. (వసులు+పాఁతలు.) ఒకదినుసుపంచిపుపుంజో. "ఎ. గీ. వసులపాఁతలలీరెండునుసులనీయరు." (ఇక్కడ వసులపాఁతలనఁగా వసులపాఁతలవంటివారసులు.) సా. ౨, ఆ.

వసులు. దే. అ. క్రి. తొలఁగు, అవసరిల్లు.

వసువు. సం. వి. ఉ. న. 1. బంగారు; 2. రత్నము; 3. ధనము. పుం. 1. బకపుష్పము*; 2. పలుపు; 3. కిరణము; 4. అగ్ని; 5. ఒకరాజు*; 6. గణదేవతావిశేషము. (అష్టవసువులు.—అహుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు.) (ఇవి మఱియొక్కచో వేఱొకక్రమముగా చెప్పఁబడియున్నవి.) విణ. మధురము.

వసూలు. హిం. వి. శేష, భోగుచేయుట.

వస్తము. సం. వి. అ. న. ఇల్లు, గృహము, గేహము.

వస్తాదు. హిం. వి. ఉపాధ్యాయుఁడు, యజమానుఁడు.

వస్తి. సం. ఇ. పుం, స్త్రీ. 1. బద్దె; 2. పొత్తికడుపు.

వస్తువు. సం. వి. ఉ. న. పదార్థము, బండము.

**వస్త్యము.** సం. వి. అ. న. ఇల్లు, గృహము, సద్మము.

**వస్త్రము.** సం. వి. అ. న. వలువ, వసనము.

**వస్నస.** సం. వి. ఆ. స్త్రీ. సన్న పునరము.

**వస్నము.** సం. వి. అ. న. 1. వస్త్రము; 2. ధనము; 3. కూలి; 4. వెల.

**వహనము.** సం. వి. అ. న. 1. వహించుట; 2. ఓడ.

**వహము.** సం. వి. అ. పుం. 1. ఎద్దుమూఁపురము; 2. వాహనము.

**వహి.** ఉభ. దే. వి. 1. లెక్కపుస్తకము; 2. పుస్తకము; 3. విధము. "సీ. ఒకకొన్నిసిగరలునొకకొన్నియంబళు లొకకొన్నివహులఫూపోత్కరములు." పాండు. ౪, ఆ. సం. విణ. (స్. ఈ. న్.) వహించువాఁడు.

**వహించు.** సం. స. క్రి. తాల్చు. (వహించు అనియు.)

**వహేలనము.** సం. వి. అ. న. తిరస్కారము, తెగడిక.

**వహ్ని.** సం. వి. ఇ. పుం. 1. అగ్ని; 2. చిత్రమూలము‡.

**వహ్నిశిఖము.** సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు; 2. కుసుమపువ్వు.

**వహ్నిసంజ్ఞికము.** సం. వి. అ. పుం. చిత్రమూలము‡.

**వళక్షము.** సం. వి. అ. పుం. తెలుపు. విణ. తెల్లనిది.

**వళాగ్రము.** దే. వి. క్రముకభేదము. (అప్ర.)

**వళావళి.** దే. వి. 1. కుతూహలము; "ఉ. అంబురుహాక్షినాసికని జాస్వయశత్రుపుఁజంపకప్రసూ, నంబుఁగరంబుగెల్చుట మనంబునఁబెట్టి తదీయ పార్శ్వయు, గ్మంబుననిత్యసేవకతఁగ్రాలెడు నీక్షణతారకాఖ్యరో, లంబకదంపతుల్ పెనువళావళినెంతయునంభ్రమించుచుణ్." ప్రభా. ౨, ఆ.—2. విజృంభణము. "విపులవై రమరాళులు సేయునివ్వళా, వళులకుడాఁగుటో." భాను. 3, ఆ. "సీ. లలితాననేందుమండలపాండురచ్ఛాయవనరుహావళివళావళియడంప." వసు. 3, ఆ.

**వళి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కడుపుమీఁదిముడుత; 2. ముడుత; 3. యత్యక్షరము.

**వళిరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మెల్లకంటివాఁడు. (రూ. ష్షళిరుఁడు.)

**వళుకు.** దే. వి. తగవు. "బంగరుంగొంచెముకానిమేనికళుకుల్ వళుకుల్ పచరించు." రా, వి. ౪, ఆ.

## వా.

**వా.** వై. వి. 1. నోరు; "చ. ఇ, ప్పుడునరుఁగాంచిమీరతనిపోటునతించుచుభీతినిట్లువా, విడిచియనేకభంగిఁబృథివీపతివేఁడిఁజేయుటొప్పునే." భార. విరా. ౪, ఆ.—2. ఖడ్గధార*. "ఉ. వా, తప్పకత్రేసెనొక్కమొగిఁ దార్కొనిభీముశిరంబువక్షముణ్." జై. ౨, ఆ.

**వాంచు.** వై. ప్రే. వంచుయొక్కరూపాంతరము.

**వాంఛ.** సం వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కాంక్ష, కోరిక.

**వాంఛించు.** సం. స. క్రి. ఇచ్ఛించు, కాంక్షించు, కోరు.

**వాంఛితము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**వాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వాంతియొత్తఁబడినది; 2. వెడలఁగ్రక్కుట.

**వాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వమనము; 2. వెడలఁగ్రక్కుట.

**వాంశికుఁడు.** సం. వి. అ. పుం. పిల్లంగ్రోవి యూఁదువాఁడు.

**వాఁక.** యు. దే. వి. వైపు. (చూ. కరవాఁక మొ.) వై. ఏఱు*. (వరకువాఁక దొరకుమూఁక.) విణ. వంకర. ".తే. కడునడవిఁజేర్చునొకవాఁకకనుమలోన." పర ౪, ఆ.

**వాఁకతాలుపు.** ద్వి. వి. శివ్రుఁడు, గంగాధరుఁడు. "వలిగుబ్బలిపట్టియు వాఁకతాలుపుణ్." పాండు. ౧, ఆ.

**వాఁకుడు.** వై. వి. కంటకారిక‡.

**వాఁగరత.** వై. వి. (వాఁగులు+అరత.) సముద్రతీరము. (రూ. వాఁగర్త.) (వృత్తియందేకవచనాంతము.)

**వాఁగడుపు.** దే. వి. (వాఁపు+కడుపు.) వాఁపుగలకడుపు. "సీ. బీదనరాలతోఁబెరుఁగువాఁగడుపులొబల్లనల్లకలందుఁద్రుళ్లిపడఁగ." శుక. 3, ఆ.

**వాఁగు.** వై. అ. క్రి. 1. వదరు; (వానినోరూరకవాఁగుచున్నది చూడు.) 2. మ్రోఁగు. "క్రొంగుసవాఁగు." విజ. ౧, ఆ.—వి. 1. సెలయేఱు*; "చ. వనములయందుఁగ్రుమ్మరుచువాఁగులవ్రంతలనీరుద్రావి." రా. యు, కాం.—2. సైన్యము*; "క. వెలుఁగుగనికడఁగియిరువాఁ, గులుఁబోరికిఁజొచ్చె." భార. విరా. 3, ఆ.—3. బ. అలలు.

**వాఁగుడు** వై. వి. మ్రోఁగుడు, మ్రోఁత, ధ్వని.

**వాఁచు.** వై. అ. క్రి. 1. ఏఁకరు*; "ఉ. ఏముసైతముణ్, వాఁచినవారియట్ల గరువంబునఁగన్గొనుచుంటిమువిభుణ్." వి, పు. ౬, ఆ.—2. ఊఁదు*.

**వాఁడి.** దే. వి. 1. పదను, నైశిత్యము; "క. వాఁడుమొదలుగాఁబగతుర, వాఁడిగలుగు తూపుగములవలను మెఱనీయే, నేఁడువధింతును నెవ్వఁగ, వేఁడిమిఁబడఁజాలకొక్క వెరవుదలఁచితిణ్." భార. సౌ. ౧, ఆ. "తే. మారుతమ్ములవాఁడికి మలయకూట, మారుతమ్ములవేఁడికి మట్టుమీఱు, చంద్రకిరణమ్ములకు శుకశారికాళి, చంద్రకిరణమ్ములకుఁ జాలజలదరించు." విజ. 3, ఆ.—2. శౌర్యము. "క. నేఁడింకనెఱిఁగియెరవుల, వాఁడఁగదాయనుచునేనువారిఁదొలంగం, బోఁడిమిచెడదేమదిఁగడు, వాఁడిగలదినాకునకటవారిజనాభా." భార. ఉద్యో. ౪, ఆ.—విణ. 1. పదనైనది, నిశితము; "వాఁడితూపులు."—2. తీక్ష్ణము; "వాఁడిమయూఖముల్ గలుగు వాఁడపరాంబుధిఁగ్రుంకె." భార. ఆది. 3, ఆ.—3. క్రూరము. ".క. నాఁడగ్నిలోనఁద్రోచిన, వాఁడవకటయంతఁబోకవల్లభవిమ్మై, నేఁడడవిఁద్రోచితెదగడు, వాఁడిగదేనీకురాఘవకులప్రవరా." నిర్వ. ౧౦, ఆ.

**వాఁడిమగఁడు.** దే. విణ. శూరుఁడు. "క. నీవొకతేవేలయిలఁబడి, వేపురనేవలచిపట్టివెదకిననడ్డం, బైవచ్చివలదునానిం, దేవాఁడిమగండులేమియెఱుఁగవుకంటే." భార. విరా. ౨, ఆ.

**వాఁడిమి.** దే. వి. 1. తేజము, ప్రతాపము; "క. రాజపుత్రులు దమపై, వాఁడిమిదప్పిననివ్వాల, వేఁడిమిచెడినట్లుజినులువినియులుకుదురే." (దీనికిముందుభాగము. చూ. పోఁడిమి.) భార. ఉద్యో. 3, ఆ.—2. శౌర్యము. "ఉ. వీఁడొకరుండెయింకబలవిక్రమసంపదగల్గిపోరిలో, వాఁడిమిసొంపుచూపఁగలవాఁడు సుయోధనుపాలఁజేర్చు." భార. కర్ణ. ౧, ఆ.

**వాఁడు.** దే. స. (అశబ్దమునకు మహదర్థక ప్రథమైకవచనరూపము.) అపురుషుఁడు.

**వాఁత.** వై. వి. తెవులుగొంటులైనపశ్వాదులకు వేసెడుచూఁడు. (గొల్లవాఁడు ఆకోడెకు వాఁతవేసినాఁడు.)

వాఁపి. వై. విణ. (వాఁపు+ఇ.) వాఁపురోగముగలవాఁడు. అం, భా. ద్వి.

వాఁపిరి. దృ. వి. (వాఁపు+ఇరి.) పీఁకరుట, పీఁకట.

వాఁపిరిగొట్టు. దృ. విణ. (వాపిరి+కొట్టు.) వాఁపిరివాఁడు, పీఁకరువాఁడు.

వాఁపు. వై. వి 1. ఊఁదు, శోఫ; 2. పీఁకట.

వాకట్టు. దృ. వి. (మూలికామంత్రములచేతచేసెడు) వాగ్బంధన క్రియ. "ద్వి. కాలాహిజవశక్తిఁగట్టువాకట్టు." విష్ణు. పూ. ౨, ఆ.—విణ. వాగ్బంధనముచేయునది. "సీ. మొగముపార్శ్వములకు మగిడింపకుండవాకట్టుమూలికవాగెఁబట్టిపట్టి." కళా. 3, ఆ. "సీ. తేనెలు జొట్టెడుమాటతేటలపసలువాకట్టుమంత్రంబులకరణిన మర." కళా. ౨, ఆ. (చూ. చేకట్టి.)

వాకబుచేయుట. హిం. క్రి. తెలిసికొనుట, విచారించుట.

వాకము. దే. విణ. వాటము. "ద్వి. ఈకొండపడమట నీకొండ క్రేవ, వాకమౌనొక పెద్దవటముమూలమున." రా. అ, కాం.

వాకాటు. దృ. వి. వాగ్వాదము. "క. ఆకాశదివ్యమునులును, నాకౌకః ప్రత్యనీక నాయకమునులుఁ, వాకాటులకుంజొచ్చిరి, పాకంబులుదప్పినట్టివటురోషములన్." భీ. ౪, ఆ.

వాకిలి. దృ. వి. (వా+ఇల్లు.) గృహద్వారము. "కృష్ణుఁడుఁ హార్దిక్యుఁడుఁ వాకిటనిలిచి." భార. సౌ. ౨, ఆ. (సంధిని వర్ణవికారము.) (వాకు, ఇల్లు అనువాని మూలపదములనుగా నుంచి మిశ్రపదముగాఁజేసినయెడ నచ్చతెనుఁగు ప్రయోగములకు విరోధమగు చున్నది.)

వాకు. సం. వి. చ. స్త్రీ. 1. పలుకు; 2. పలుకుచెలి.

వాకొను. దృ. అ. క్రి. 1. మాటాడు; "ద్వి. ప్రాకృతులట్ల నరవ్యజ్ఞుఁడవయ్యు, వాకొందురేయిచ్చవచ్చినయట్లు." రా. కిష్కి౦, కాం. — 2. అఱచు. "క. కనుఁగొనిపలుదెఱఁగులవా, కొనిరేపఁగ." అచ్చ. యు, కాం. (ప్రే. వాకొలుపు, వాకొల్పు. "పరులఁజూపులు వాకొల్ప." నై. 2, ఆ.)

వాక్కు. సం. వి. చ్. స్త్రీ. వాకునకు మొదటిరూపము.

వాక్పతి. సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. బృహస్పతి; 3. కవీశ్వరుఁడు. విణ. మిక్కిలి చతురముగ మాటలాడువాఁడు.

వాక్యము. సం. వి. అ. న. 1. పదపదార్థములయొక్క పరస్పర సంబంధము చెడక యేకార్థత్వము గలిగి క్రియతోఁగాని తదితరము తోడఁగాని ముగిసెడి వదనముదాయము; (ఉదా. వివేకముగలవారు తమకుఁగలకొలందిఁ గుడిచికట్టి నెమ్మదినుందురు, ఒకరు చెప్పినను వినక తామును దెలిసికొనకయుండుట మూర్ఖులకు సహజము.) 2. మాట.

వాక్రుచ్చు. దృ. స. క్రి. (వా+కూర్చు.) 1. పేరుచెప్పు; "ఉ. మెచ్చియొకింతగౌరవముమెచ్చకయుండిలఘుత్వలేశముఁ, దెచ్చుటకుఁ సమర్థులెకృతిక్రియకుఁగుకవిత్వగర్విఁతుల్, తచ్ఛరితంబు పేశ్ఖుచితంబగుఁగాకనగంగనైనవా, క్రుచ్చియజాగళస్తనసగోత్రులవారల నెన్ననేటికిఁ." కళా. ౧, ఆ.— 2. చెప్పు. "సీ. నృపులచేఁభట్టికానికలుదెచ్చిన శొమ్మొకొలఁది యెవ్వరికి వాక్రువ్వఁగాదు." విక్ర. ౫, ఆ. (సంధిని వికారము.)

వాగ. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) వాగె, వల్గ.

వాగఱ. దే. వి. (ప్రాయు+కఱ.) ముచ్చివాఁడు చిత్తరువు వ్రాసెడుతూలిక. (సంధిని వర్ణలోపము.)

వాగళెము. వై. వి. వాగళ్లముయొక్క రూపాంతరము.

వాగళ్లము. వై. వి. (వా+కళ్లము.) కళ్లమునకుముందుభాగము, ఖలముఖము.

వాగాయిత్తము. వై. వి. వాగ్వివాదము. (ఇది వాడుకలోనిది.)

వాగీశుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. బృహస్పతి; 3. కవీశ్వరుఁడు. విణ. మిక్కిలి చతురముగ మాటలాడువాఁడు.

వాగుజి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చె.

వాగుర. సం. వి. ఆ. స్త్రీ. (మృగములను పక్షులను పట్టెడి.) ఉరి, వల.

వాగురికుఁడు. సం. వి. అ. పుం. ఉరులు వలలుపన్ని మృగములను పక్షులనుపట్టెడు వేఁటకాఁడు.

వాగె. వై. వి. గుఱ్ఱమునోటికళ్లెమునకుతగిలించెడు పగ్గము. "ఘోటకంబునకువాగెయుదంతికిసంకుశంబునేకరణివారకంబులు." సం. "యథాహిరశ్మయోశ్వస్యద్విరదస్యాంకుశోయథా." భార. శాం. ౨, ఆ. (చూ. ఒత్తడి రెండవయర్థము.) (మొదటిరూపము వాగియ.)

వాగ్గులికుఁడు. సం. వి. అ. పుం. అడపకాఁడు.

వాగ్మి. సం. వి. న్. పుం. 1. చిలుక; 2. బృహస్పతి. విణ. యుక్తియుక్తముగా మాటలాడువాఁడు.

వాఙ్ముఖము. సం. వి. అ. న. (చూ.) ఉపన్యాసము.

వాచ. సం. వి. ఆ. స్త్రీ. వాకుయొక్కరూపాంతరము.

వాచంయముఁడు. సం. వి. అ. పుం. మౌనవ్రతముకలవాఁడు, మౌని.

వాచకము. సం. వి. అ. పుం. వాచ్యార్థమును తెలిపెడు శబ్దము.

వాచస్పతి. సం. వి. ఇ. పుం బృహస్పతి, వేల్పుటొజ్జ.

వాచాటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వలవని పెక్కుమాటలాడువాఁడు, వదరుఁబోతు.

వాచాలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)——వై.——

వాచించు. సం. స. క్రి. 1. చెప్పు; "సీ. ఇల్లుమంచముతేశ వెల్లిపైఁదేలాడశ్రీనాథుఁడొటవాచింపనేల." చంద్రా. ౧, ఆ.— 2. చదువు. చంద్రా. 3, ఆ.

వాచికము. సం. వి. అ. న. సమాచారము. (చూ.) వక్కాణము.

వాచ్యము. సం. వి. అ. పుం. అభిధచేఁదెలియఁదగినయర్థము. విణ. 1. చెప్పఁదగినది; 2. నిందింపఁదగినది.

వాచేరము. దృ. వి. వాచేరపముయొక్కరూపాంతరము.

వాచేఱచు. దే. అ. క్రి. మొఱపెట్టు. "చ. వెఱచినవాని దైన్యమునవేఁడుఱనొందినవాని నిద్రమై, మఱచినవాని సౌఖ్యముగ మద్యముద్రావినవాని భగ్నుదై, పఱచినవాని సాధుజడభావము వానినిగాఋమంచువా, చఱచినవానిఁ గామినులఁజంపుటధర్మముగాదు ఫల్గునా." భాగ. ౧, స్కం.

వాచేరపము. దృ. వి. వాచేరుట పరిదేవనము. అం, భా. ప్ర.

వాచేరు. దృ. అ. క్రి. పరిదేవనముచేయు. "ద్వి. చనునెమాట లఁబ్రొద్దుజరపుచునిల్వ, మునితనూజుఁడుజలమ్ములకువాచార." హరిశ్చ. ౧, భా. "సీ. నీతొతనెఱుఁగమానెలఁతలబతిమాలి వెన్నకు వాచారుచున్నవాఁడు." ఉషానిరుద్ధసంవాదము.

వాచొరు. దృ. వి. ఇంటిముంజూరు. పాండు. ౫, ఆ.

వాజపేయము. సం. వి. అ. పుం, న. యాగవిశేషము.

**వాజము.** సం. వి. అ. న. 1. నెయ్యి; 2. నీళ్లు; 3. హవిస్సు. పుం. 1. బాణముఱెక్క; 2. ఱెక్క; 3. వేగము; 4. ధ్వని.

**వాజి.** సం. వి. న్. పుం. 1. గుఱ్ఱము; 2. పక్షి; 3. బాణము.

**వాజిదంతకము.** సం. వి. అ. పుం. అడ్డసరము✱.

**వాజిబీ.** హిం. విశే. సరియైన, న్యాయమైన.

**వాజె.** దే. వి. రోఁత. "సీ. దేవురించుచువాజిదేఱెడుమొగమును బడఁబాఱుచుండెడుబసుగుటూడలు." హరిశ్చ. ౪, ఆ. విశే. రోఁతగలది.

**వాజెము.** దే. వి. పక్షివిశేషము. (చూ. వంగపండు.)

**వాటపడు.** ద్వి. అ. క్రి. అనుకూలమగు. "సీ. శశిమోమునన పోలఁజాలమిశశిరేఖవంటిదియనిపల్కవాటపడునె." కవి. ౨, ఆ.

**వాటపద్యములు.** గ్రా. వి. ఆటవిడుపుపద్యములు.

**వాటము.** ఉభ. దే. విశే. 1. జాఱుపుగానుండునది; "వాటపుఁ బొక్కిలి." వసు. ౨, ఆ.—2. అనుకూలమైనది; "వ. ఇచ్చోటు వేఁటకువాటంబనివేఁటకాండ్రు విన్నవించు మాటలాలించి." యు. ౧, ఆ.—3. సక్తమయినది; "నెయ్యంబు మనమునవాటమయినది." మార్క. ౬, ఆ.—4. పొందికయినది; "వదలినద్రిండుదొంటి గతివాటముగా బిగియించి." జై. ౨, ఆ.—5. ఓరి. "వ. నిజకు టీరద్వారంబులకవాటంబువాటంబుచేసి." వి, పు. ౭, ఆ.—సం. వి. అ. పుం, న. కూరలౌనగువానితోఁట. అ. పుం. 1. త్రోవ; 2. చుట్టువెలుగువేసినచోటు; 3. వెలుగు; 4. ఇండ్లవరుస; 5. భాగము.

**వాటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కూరలౌనగువానితోఁట; 2. ముండ్ల కంచె.

**వాటిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. తోఁట; 2. ఇండ్లవరుస.

**వాటు.** దే. వి. 1. వైచుట; "ద్వి. వడివైచు తమతమవాటుల చేత." రా. యు, కాం.—2. దెబ్బ, హతి. "ఉ. ఎత్తినతీవ్రకోప మున నింతిపయింబడఁగత్తివైచినన్. ఆ. వాటుదాఁకిముక్కవ్రయ్య లైపడెనని, ముదితకోకకొంగుమూసికొంచు, వాడవారలెల్లవడివెంటఁ దిరుగంగఁ, బోయిరాజునగరఁగూయుచుండె." పంచ. నా. ౧, ఆ.

**వాటుఁగాలు.** దే. వి. (వాటు+కాలు.) నడచునపుడు పక్క వాటుగాపోయెడుకాలు. (చూ. రోటువోవు.)

**వాటురాయి.** దే. వి. దొంగలువైచుటకు అనువుగా ఏఱి తీసికొని పోయెడుఱాయి. "ద్వి. ఒలుకులబూడిదయునువాటురాలు." భాగ. ౫, స్కం.

**వాటులాడు.** దే. అ. క్రి. (వాటులు+ఆడు.) కొట్లాడు. "చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవేడ్కతోఁబర, స్పరమెదిరించి కాంచనపుబంతులఁదచ్చున వాటులాడఁగా." నై. 3, ఆ.

**వాట్యాలకము.** సం. వి. అ. పుం. ముత్తవపులగము✱.

**వాట్లీఁడు.** దే. విశే. (వాట్లు+ఈఁడు.) కొట్లాడువాఁడు. "అ. వాదులానితోడ వాట్లీనితోడను, బూతుతోడఁదిండి పోతుతోడ, నట మటీనితోడనడియరితోడను, వెలకునెత్తమాడవెరవుగాదు." ఉ, హరి. 3, ఆ.

**వాడ.** యు. దే. వి. తావి. (వాడగాలి.) పసుపుతావి. (అనికొం దఱు.) వై. 1. వీధి; "శా. అచ్చోనద్భుతంబందన, వాడ్వంబౌర జనంబులెల్ల నితఁడెవాఁడొక్కొనేత్రోత్సవం, బైడాయంజను దెంచెనంతటనుమాయంబయ్యె నంచెంతయున్." (చూ. వెనుక.) నై. 3, ఆ.—2. ఇండ్లవరుస✱.

**వాడఁబాఱు.** దే. అ. క్రి. (వాడన్+పాఱు.) వాడు. "వాడఁ బాఱఁదొడఁగెన్జెంగల్వలున్గల్వలున్." భాను. 3, ఆ. (చూ. పాఱు.)

**వాడకట్టు.** ద్వి. వి. వాడ, వాటిక, వీధి.

**వాడగన్నేరు.** దే. వి. ఒకదినుసుగన్నేరు✱. (పచ్చగన్నేరు అని తోఁచెడి.)

**వాడగాలి.** దే. వి. మలయమారుతము.

**వాడపడతె.** వై. వి. వేశ్య, కులట. (అనికొందఱు.)

**వాడిక.** దే. వి. చెప్పకచూపకయుంచినయిల్లడ, ఉపనిధి.

**వాడు.** దే. అ. క్రి. మ్లానమవు. స. క్రి. ఉపయోగపఱుచు. వి. వాడుట, మ్లాని. "అతనిపైవాడునుహయచయంబుదప్పియు." భార. ద్రో. 3, ఆ. "క. అరుదెంచియలిగియుండెడి, యరు దెంచివితాకుతాఁకుడైతహతహతోఁ, దఱియంగనరిగిశాత్రో, దరియం గమువాడు గాంచి దయదయివాఱన్." సా. ౨, ఆ.

**వాడుక.** దే. వి. 1. ఉపయోగము; 2. అభ్యాసము; 3. వ్యవ హారము.

**వాడుకపడు.** ద్వి. అ. క్రి. పసుపడు, అలవడు.

**వాడుకొను.** దే. స. క్రి. 1. జనులు ప్రవాదముగా చెప్పుకొను; 2. ఉపయోగపఱుచుకొను.

**వాడుచే.** దే. ప్రే. వాడఁజేయు, వాడించు.

**వాడుదల.** దే. వి. వాడుక, అభ్యాసము.

**వాడుదెంచు.** దే. అ. క్రి. (వాడు+తెంచు.) వాడుపాఱు. "సీ. పగలింటిసెగలచేసొగటొందుపూఁదీఁగవడువునసెమ్మేనువాడు దెంచె." అని. 3, ఆ. (స్వార్థమున తెంచు.)

**వాడుపడు.** ద్వి. అ. క్రి.——పై.——(ప్రే. వాడు పఱుచు. "సీ. వెలలేనికళలతోవెలయుసీనెమ్మోమువనితయేవిక లుండువాడుపఱిచె." ఉ, రా. ౪, ఆ.)

**వాడుపాఱు.** దే. అ. క్రి.——పై.——"సీ. లవలీదళము లట్లనవరైనచెక్కులువాడుపాఱఁగముద్దులాడియాడి." ఉ, రా. ౪, ఆ.

**వాడెదవ.** దే. వి. చెఱకుచివర, ఇక్ష్వగ్రము.

**వాణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పలుకు; 2. పలుకుఁజెలి. ఇ. ఈ. స్త్రీ. నేఁత.

**వాణిజుఁడు.** సం. వి. అ. పుం. వర్తకుఁడు, వణిజుఁడు.

**వాణిజ్యము.** సం. వి. అ. న. వణిగ్వ్యాపారము.

**వాణిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; 2. కుంటెనకత్తె; 3. ముగ్ధ. 4. విదగ్ధ.

**వాతకము.** సం. వి. అ. పుం. శామిదము✱.

**వాతకి.** సం. వి. ఈ. స్త్రీ. శామిదము✱. విశే. (న్. ఈ. న్.) వాతరోగముగలవాఁడు.

**వాతకుంభము.** సం. వి. అ. పుం. ఏనుఁగునొసటిబుడిపి, పిన్న నుదురు.

**వాతగానివాఁడు.** దే. వి. బట్టలకురంగువేయువాఁడు.

**వాతఘ్ని.** సం. వి. ఈ. స్త్రీ. ఫులుగుడు✱.

**వాతపోథము.** సం. వి. అ. పుం. మోదుగు, కింశుకము✱.

**వాతప్రమి.** సం. వి. ఈ. పుం. వాతమృగము.

**వాతము.** సం. వి. అ. పుం. వాయువు, గాలి.

**వాతమృగము.** సం. వి. అ. పుం. గాలికెదురునడిచెడి యిఱ్ఱి వంటిమృగము.

**వాతరట్టు.** దే. విణ. (వాతఁ + రట్టు.) వదరుపోతు. "చ. అది యటులుండె సాహసపుటగ్గలికంబలెవాతరట్టవై, వదరితికొన్ని." చంద్ర.

**వాతవాఁడి.** దే. విణ. (వాతఁ + వాఁడి.) అప్రియంపదుఁడు. (చూ. పెడఁబాయు.)

**వాతాయనము.** సం. వి. అ. న. కిటికీ, గవాక్షము.

**వాతాయువు.** సం. వి. ఉ. పుం. 1. జింక; 2. వాతమృగము.

**వాతారి.** సం. వి. ఇ. పుం. ఒకానొకచెట్టు, వాలుడు.

**వాతికాసు.** వై. వి. (వాయి + కాసు.) లంచేము. (ఇది పామరులు వాడుకొనుమాట.)

**వాతిబియ్యము.** దే. వి. (వాయి + బియ్యము.) దహనము చేయునపుడు బంధువులు పీనుఁగునోటవేవెడు బియ్యము.

**వాతూలము.** సం. వి. అ. పుం. 1. గాలి; 2. సుడిగాలి. విణ. 1. గాలిసయించనిది; 2. వెఱ్ఱెత్తినది.

**వాతెఱ.** దే. వి. (వా + తెఱపి.) పెదవి. "చ. నెఱికురులుఁ విలోలసితనేత్రయుగంబును నొప్పలొప్పవా, తెఱయును." భార. ఆది. ౭, ఆ. (కొందఱు వాతెరయని లఘురేఫముగా ప్రయోగించియున్నారు. అప్పుడు వాయికితెరయని వ్యుత్పత్తి.)

**వాత్య.** సం. వి. ఆ. స్త్రీ. సుడియుగాలి, సుడిగాలి.

**వాత్సకము.** సం. వి. అ. న. వత్సములసమూహము. (వత్సము=దూడ.)

**వాత్సల్యము.** సం. వి. అ. న. వత్సలభావము, పుత్త్రాదులయందుఁగల స్నేహము.

**వాదడుచే.** దే. అ. క్రి. (వాదు + అడుచే.) వాదాడు, వాదించు. "వ. ఇట్లిద్దఱుఁబరస్పరజయార్థులగుచువాదడిచియడిచితమతారతమ్యంబామ్నాయంబులనడిగిరి." కాశీ. ౫, ఆ.

**వాదనము.** సం. వి. అ. న. వీణాదిచతుర్విధవాద్యధ్వని.

**వాదము.** సం. వి. అ. పుం. 1. వాగ్వివాదము; 2. రసవాదము; 3. తగవు.

**వాదర.** వై. వి. (వాఁడి + దార.) (ఖడ్గాది) తీక్ష్ణధార.

**వాదాడు.** దే. అ. క్రి. (వాదు + ఆడు.) వాదించు.

**వాది.** సం. వి. న్. పుం. తగవునకు పోయినవాఁడు. విణ. వాదించువాఁడు.

**వాదించు.** సం. అ. క్రి. 1. వాదాడు; 2. తగవాడు.

**వాదిత్రము.** సం. వి. అ. న. 1. తతము, ఆనద్ధము, సుషిరము, ఘనము అనెడు వాద్యచతుష్టయము, ఆతోద్యము; 2. వాద్యధ్వని.

**వాదు.** వై. వి. వాదము. (చూ. మూదల.)

**వాదులాఁడు.** దే. విణ. (వాదులు + ఆఁడు.) వావాడువాఁడు. (చూ. వాట్లీఁడు.)

**వాదోడు.** దే. విణ. (వా + తోడు.) 1. మాటకుసహాయము; "శా. సింగారంబగుముద్దుఁజిల్కతనకుఁ జేదోడువాదోడుగఁ." శుక. ౨, ఆ.—2. శకునులకు నాలికచ్ఛేదములలోనుగాఁగల తెవుళ్లను పరిశీలింప నోటఁజొప్పించి నోరుతెఱపించుటకై యేర్పఱచిన దారావియసరూపయంత్రవిశేషము. (చూ. ముకుబంతి.)

**వాద్యము.** సం. వి. అ. న. వీణలోనగునది.

**వాన.** దే. వి. 1. వర్షము; 2. వర్షాకాలము. "సీ. వానయు సీతునువర్షించిమండు వేసవిగాకమున్న సస్యములపంట, లొదవెడు తఱినెత్తుసదిశత్రుపయి." భార. శాం. ౨, ఆ.

**వానకాళ్లు.** దే. వి. బ. వర్షధారలు. "సీ. ఘనమేఘమునవానకాళ్లవ్రేలినమాడ్కి ముక్తకేశంబులుముసుఁగువడఁగ." భో. ౪, ఆ.

**వానకోయిల.** దే. వి. 1. చాతకపక్షి; 2. సర్పవిశేషము.

**వానజాలిపులుఁగు.** దే. వి. హంస. "చ. అనసలవానజాలిపులుఁగావనజాక్షినిజేరివేఁడినన్." హంస. ౪, ఆ.

**వానతఱి.** దే. వి. వర్షాకాలము, వర్షఋతువు.

**వానచెచ్చెలి.** దే. వి. వానకోయిల, వర్షప్రియము.

**వానపాము.** దే. వి. ఎఱ్ఱి, మహీలత.

**వానపేసు.** దే. వి.——వై.——

**వానప్రస్థము.** సం. వి. అ. పుం. 1. ఒక ఆశ్రమము; (చూ. ఆశ్రమము.) 2. ఇప్పచెట్టు; 3. మోదుగుచెట్టు.

**వానము.** సం. వి. అ. న. 1. కుట్టుపని; 2. చేఁప; 3. గతి; 4. వానస; 5. శారంగము. విణ. 1. ఎండినది; (కాయలోనగునది.) 2. అడవిది.

**వానరము.** సం. వి. అ. పుం. కోఁతి, మర్కటము, కపి.

**వానరాయి.** దే. వి. వడగల్లు, వర్షోపలము.

**వానస్పత్యము.** సం. వి. అ. పుం. పూచికాచెడుచెట్టు. (పూవక కాచెడుచెట్టు వనస్పతి.)

**వానాయుజము.** సం. వి. అ. పుం. వనాయుదేశమునందుఁ బుట్టినగుఱ్ఱము. (రూ. వనాయుజము.)

**వాని.** దే. వి. విణ. వాఁడియొక్కరూపాంతరము. (నైశిత్యమునకు.— "క. అనిసనినివానిమదిఁదోఁప." జై. ౪, ఆ.)

**వానీఁడు.** దే. వి. (వానె + ఈఁడు.) 1. వానెకులమువాఁడు; 2. కుబేరుఁడు. ఆం, సం.

**వానీరము.** సం వి. అ. పుం. ప్రబ్బ, వేతసముచెట్టు.

**వాను.** దే. స. క్రి. (కుండలు) చేయు. "అజాండభాండముల్ వానను." ఆము. ౧, ఆ.

**వానె.** వై. వి. వైశ్యకుల విశేషము. "క. ఆనందవనమునందొక, వానెవణిజునింటనుండివైశ్యుండుపదా, ర్థానయసార్థము పోయినఁ, దానొక్కఁడు హట్టమునకుఁదదవసరమునన్." కాశీ. ౫, ఆ.

**వానెత.** వై. వి. వానెకులము నాఁడుది.

**వానేయము.** సం. వి. అ. న. కైవడిముస్తె, పరిపేలవముచెట్టు.

**వాపము.** సం. వి. అ. పుం. 1. గొఱుగుట; 2. విత్తుట; 3. నేయుట.

**వాపసుచేయు.** హిం. క్రి. మార్పు, మఱియొకటియిచ్చుట.

**వాపి.** సం. వి. ఈ. స్త్రీ. నడబావి, దీర్ఘిక.

**వాపితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. గొఱుగఁబడినది; 2. విత్తఁబడినది.

**వాపు.** వై. వి. వాయింపుయొక్కరూపాంతరము. ఆం. భా. ప్ర.

**వాపుచ్చు.** ద్వి. స. క్రి. 1. నోరుతెఱచు; "క. చూపుల శ్రీపతిరూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతయై, వాపుచ్చి మందమధురా, లాపంబులఁబొగడెనదితిలక్ష్మినాథుఁ." భాగ. ౫, స్క-ం.—2. చెప్పు. "వాపుచ్చే నివెవ్వఁగఁ." (వాపుచ్చని= చెప్పని—అనఁగా చెప్పఁగూడనియనియర్థము.) కవిక. ౬, ఆ.

**వాపోక.** ద్వి. వి. 1. అఱచుట; 2. ఏడ్పుట.

**వాపోవు.** ద్వి. అ. క్రి. 1. అఱచు; "సీ. ఆదిత్యుఁడుదయింప నభిముఖుండైనక్క- వాపోయె మంటలువాతఁగలుగ." భాగ. ౧, స్కం.—2. ఏడ్చు. "క. అనియెడుగుచుండుబాలిక, కనుఁనులు మూఁచెదవిచిడిచికటకటవాపో, యెను మొగ్గవాలుచందం, బున నదు మెగనెత్తికొనుచుఁబొత్తులమీఁదఁ." (చూ. వెనుకటిభాగము.) కళా. ౬, ఆ.

**వాప్యము.** సం. వి. అ. న. చెంగల్వకోష్టుకి.

**వామ.** సం. వి. ఆ. స్త్రీ. ఉత్తమస్త్రీ. అ. న. ము. ధనము. పుం. ఆవుపొదుఁగు. డు. 1. శివుఁడు; 2. మన్మథుఁడు. విశే. 1. సవ్యము; 2. సుందరము; 3. వక్రము; 4. ప్రతిస్వము; 5. ప్రతికూలము.

**వామదేవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**వామనగాయ.** దే. వి. (వామనము+కాయ.) ఊరుఁగాయకు ఉపయుక్తమైన ఒకదినుసుకాయ.

**వామనగొమ్ము.** దే. వి. (వామనము+కొమ్ము.) ఊరవేసిన వామన గాయఖండము.

**వామనపాతుకాఁడు.** దే. వి. పక్షివిశేషము. ఆం, భా. ద్వి.

**వామనము.** సం. వి. అ. పుం. 1. దక్షిణపుదిక్కునందలి యేనుఁగు; 2. మానమునకు రెండరత్నులకంటె మీఱఁగొఅవడిన యేనుఁగు; (ఇది నింద్యము.) 3. ఊడుగుకి.

**వామనములు.** దే. వి. బ. వామనగాయలు. "ర. వామనములు నవామలకములు వామగతిడిగవామయలుకకు." చంద్ర.

**వామనుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. విశే. పొట్టివాఁడు.

**వామలూరువు.** సం. వి. ఉ. పుం. పుట్ట. (రూ. వామలూరము.)

**వామలోచన.** సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కనికన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**వామి.** ఉభ. దే. వి. ప్రోగు, రాశి. "ఎ, గీ. వంటకట్టెలకని తెచ్చివామిడిన, యగలు మూఁకులపై." య. ౧, ఆ. – సం. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. ఆఁడుగాడిద; 3. ఆఁడు లొట్టియ; 4. ఆఁడునక్క.

**వాము.** దే. స. క్రి. (చూ.) జోరు.

**వాయ.** వై. వి. 1. దంచుటకై ఱోటిలో నొకతూరిపోసెడు ధాన్యము; 2. కొండనందిచ్చిననేల.

**వాయదండము.** సం. వి. అ. పుం. సాలెవాఁడునేఁతనరిత బ్బెడు వలక.

**వాయనము.** సం. వి. అ. న. వ్రతోద్యాపనకాలమునందు ఉపాయనముగానిచ్చెడుమోదకము.

**వాయము.** దే. విశే. వ్యర్థము. "వాయపురజ్జులేల." మార్క. ౪, ఆ. (చూ. రజ్జులాడు.)

**వాయవ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) వాయుసంబంధమైనది. (దిక్కు—లోనగునది.)

**వాయసము.** సం. వి. అ. పుం. 1. కాకి; 2. అగలుమ్రాను; 3. సరళద్రవమను ధూపద్రవ్యము.

**వాయసారాతి.** సం. వి. ఇ. పుం. గుడ్లగూబ.

**వాయసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కాఁచికి; 2. బమ్మమేడికి.

**వాయసోలి.** సం. వి. ఈ. స్త్రీ. కారుకొల్లి, కాకోలికి.

**వాయి.** వై. వి. 1. నోరు; "ఉ. వానిముక్కునఁ, వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా." భార. సభా. ౧, ఆ.—2. ముఖము*; "మిడుతలుచిచ్చువాతఁబడి." రా. యు, కాం.—3. ఖడ్గధార*; 4. వాయువు. (కోరవాయి, మండ వాయి, వాయివిళంగము.)

**వాయించు.** వై. స. క్రి. (వీణాదివాద్యములను) వాదనము చేయు. "సీ. నేలయునింగియుఁదాళములోగావించియేపునరేఁగి వాయించియాడ." భార. విరా. ౨, ఆ.

**వాయింటు.** దే. వి. ఒకదినుసుకూరాకు, బర్బర. (దీని భేదము కుక్క-వాయింట.) అ, పా. ద్వి.

**వాయింపు.** వై. వి. వీణాదివాదనము, వాయించుట. (చూ. అర గింపు.)

**వాయిదము.** వై. వి. వాద్యము. "ఉ. పొల్తుకలుపేరఁటముల్ దగఁజెప్ప వీటిలో, నెల్లెడఁద్రిమ్మరం దొడఁగి రింపుగవాయిదముల్ సెలంగఁగ." య. ౪, ఆ.

**వాయిదా.** హిం. వి. గడువు.

**వాయిదార.** వై. వి. వంకలుగలకత్తి*. ఆం, భా. ద్వి.

**వాయివిళంగము.** వై. వి. విడంగము, క్రిమిఘ్నముకి.

**వాయువు.** సం. వి. ఉ. పుం. గాలి. (దీనిభేదములు.—గంధవహము, వానంతము, చారము, కించులుకము, ఇళింగణము, ఝంఝ, చూపకము, వాత్య. (ఆయాయర్థము నాయాయిపదముకడఁజూచునది.) పంచవాయువులు.—ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము. పంచోపవాయువులు.—నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము.)

**వాయువేగి.** సం. వి. న్. పుం. వాయువుయొక్క వేగమువంటి వేగము గలిగినదగుటచేత కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**వాయుసఖుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని, గాలిసెచ్చెలి.

**వాయోడు.** ద్వి. అ. క్రి. (వా+ఓడు.) మాటపిఱికియగు. "క. మాయయ్య పెద్దకొలువున, వాయోడకయుట్లనంగవలయుం జుమ్మీ." భార. ఉద్యో. ౧, ఆ.

**వార.** దే. వి. 1. ఎనిమిదిపుంజీములనూలు; 2. (లెక్కలయందలి) ఎచ్చుతక్కువలు.

**వారంటు.** ఆం. వి. (ఒకని పట్టుకొనుటకు) అధికారపత్రిక.

**వారఁబట్టు.** ద్వి. స. క్రి. (వా+రాఁ+పట్టు.) ఆపోశించు. "ఉ. అగస్త్యమూర్తియై, యీవృష కేతనుండరిమహీశబలాంబుధి వారఁబట్టెడుఁ." జై. ౧, ఆ. "సీ. రథచక్రనేమినిర్గతభూరజో రాజివార్ధులొక్కుమ్మడివారఁబట్ట." (ఇక్కడ వారఁబట్టనఁగా ఇంకింపఁగానని యర్థము.) జై. ౫, ఆ.

**వారకము.** ఉభ. దే. వి. లేనికాలమునందు వృద్ధ్యాదులు లేక యుపయోగార్థమొకరికిచ్చి కలిగినకాలము నందు మరలఁబుచ్చుకొనెడు ధనాదికము. "క. వారణ ఘోటకభాండా, గారంబులుమొదలుగాఁగఁగలధనములతో, సూరిజుతయందఱమునీ, వారకములుగాఁగ మమ్ము వగవుముబుద్ధిఁ." భార. ఆది. ౩, ఆ. "సీ. పలుకుల

చెలువంబుకలికికీరములకు వారకమిచ్చితేవనజగంధి." విక్ర. ౭, ఆ.—సం. అ. పుం. గుఱ్ఱపుసడ. విణ. వారించునది.

**వారడ.** దే. వి. తొటాకువారినచివ్వ.

**వారడి.** దే. వి. నష్టి, లోపము. (ఆవారడియిందుఁగలసివచ్చెను.)

**వారడు.** వై. న. క్రి. చాలించే. (అప్ర.)

**వారణ.** సం. వి. ఆ. స్త్రీ. చెలియలికట్ట. అ. న. ము. వారించుట. పుం. ఏనుఁగు.

**వారణబుస.** సం. వి. ఆ. స్త్రీ. అరఁటి. (రూ. వారణవృషీ.)

**వారధి.** దే. వి. వంతెన.

**వారము.** ఉభ. దే. వి. వారువముయొక్కరూపాంతరము. "క తేరులుచెయిగలమెకములు, వారముకాలరులుఁదన్నువావిరిఁ గొలువక్, బేరులుబూరలుఁగాళెలు, బోరుకలఁగనపుడెతరలిపోరికిఁజనియెక్." అచ్చ. యు, కాం.—సం. అ. న. మద్యపాత్రము. పుం. 1. సూర్యాదివానరము; (ఇవి యేసు.—ఆదిత్యవారము, సోమవారము, మంగళవారము, బుధవారము, బృహస్పతివారము, శుక్రవారము, శనివారము.) 2. తడవ; 3. సమూహము; 4. వాకిలి; 5. క్షణము; 6. కుబ్జవృక్షము. డు. శివుఁడు.

**వారముఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. యోగ్యతఁబట్టి జనులచేత సత్కరింపఁబడినవేశ్య.

**వారయాత్రికుఁడు.** సం. వి. అ. పుం. పెండ్లిచుట్టము. "తే. ఆరగించిరసాధారణానురక్తి, వారయాత్రికులును బెద్దవరునవారు." నై. ౬, ఆ.

**వారవాణము.** సం. వి. అ. పుం, న. కవచము.

**వారసు.** హి. వి. ఆస్తికర్త.

**వారస్త్రీ.** సం. వి. ఈ. స్త్రీ. వేశ్య. (ఇట్లు వారకాంత, వారాంగన మొ.)

**వారాన్నిధి.** సం. వి. ఇ. పుం. సముద్రము. "ఉ. పున్నమ వన్నెశంభుతలపూవు ముకుందునిచూపు దట్టపుక్, వెన్నెలదుంప జక్కవలవేసరిచీఁకటిమూఁకవిప్పువా, రాన్నిధియుబ్బుతామరలరా యిడివేల్పులపంట మింటిపైఁ, దిన్ననిపూర్వచంద్రికలుదిక్కులకుక్ వెదచల్లుచుండఁగక్." వి, పు. ౭, ఆ.

**వారాశి.** సం. వి. ఇ. పుం. సంద్రము, నీటికుప్ప. "వారాశిగర్వంబుమేరమీఱె." స్వా. 3, ఆ. (రూ. వారిరాశి.)

**వారాహి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక మాతృక; (చూ. మాతృక.) 2. అడవియాఁడుపంది; 3. పాఁచితీఁగ; 4. నేలతాడుచె.

**వారి.** సం. వి. ఇ. న. 1. నీళ్లు; 2. కురువేరు. స్త్రీ. సరస్వతి. ఈ. కుండ. ఇ. ఈ. 1. ఏనుఁగుఁబట్టెడుచోటు; 2. ఏనుఁగుఁబట్టెడుపల్లము. (చూ.) అవపాతము.

**వారించే.** సం. న. క్రి. అడ్డగించు, నివారించు.

**వారిజము.** సం. వి. అ. న. 1. తామర; 2. ఉప్పు. పుం. 1. శంఖము; 2. శంబూకము; 3. బాడిదముచె.

**వారిజేము.** వై. వి. పారిభద్రముచె. అం, భా. ద్వి. కొండబూరుగుచె. (అనికొందఱు.)

**వారిణ.** దే. వి. చిన్నచేఁపలనుబట్టెడు సాధనవిశేషము.

**వారిదము.** ఉభ. వై. వి. పారిభద్రముచె. "క. మదిఁగొలకొలనిసుడుఁగన, వృదిమొగములజోదుతేనిపైనూర్పులుకుల్, చదలద్రువనేనివిరివా, రిదముతెలంగొందఁజేసిప్రేల్షిడినొంచెక్." అచ్చ. యు. కాం.—సం. అ. పుం. 1. మేఘము; 2. ముస్తచె.

**వారిధి.** సం. వి. ఇ. పుం. వారినిధి, సముద్రము.

**వారిపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) నాఁచుచె.

**వారివాహము.** సం. వి. అ. పుం. మబ్బు, నీరుతాల్పు.

**వారు.** యు. దే. స. క్రి. రెండుచేతులతో తొటాకు ఓరచిప్ప.—వై. అ. క్రి. 1. ఉమును*; "క. భూరిభుజుం డర్జునుఁడతిశూరుఁడుదన యస్త్రవిద్యఁజూపఁగరంగ, ప్రారంభుఁడైనవతనిక్, వారకవర్ణించుజనరవంబిదియధిపా." భార. ఆది. ౬, ఆ. "క. దారాపేక్షంగష్టప్రారంభముఁబూనియిహమునందుఁబరమునక్, వారనిసంక్లేశంబులఁ, గూరునరుఁడు దానిఁ జేరగొనకొండ్రబుధల్." భార. శాం. ౬, ఆ. (దీనికి వ్యతిరేక క్త్వార్థమందును, వ్యతిరేకార్థకవిశేషణమునందునుమాత్రము ప్రయోగములు కానఁబడెడి.) 2. వడియు*. (గంజివారెను.)

**వారుచు.** యు. దే. అ. క్రి. స. క్రి. వై. ప్రే. వార్చునకు మొదటిరూపము.

**వారుణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పడమటిదిక్కు; 2. సారాయి; 3. శతభిషఙ్నక్షత్రము; 4. ఒకదినుసుగడ్డిచె.

**వారుపు.** యు. దే. వై. వి. వార్పునకు మొదటిరూపము.

**వారువపుజేన్నము.** ద్వి. వి. అశ్వమేధయాగము. "వారువంపుజన్నము." అచ్చ. బాల, కాం.

**వారువము.** దే. వి. గుఱ్ఱము, అశ్వము. "తురుతులునాలుగువారువములయ్యె." భీ. ౪, ఆ.

**వార్చు.** యు. దే. అ. క్రి. ఆచమించే. "ఒడలుకడిగికొనివార్చి." స్వా. ౨, ఆ.—స. క్రి. ప్రతీక్షించు. "వ. భవదాగమనంబు వార్చినియతవృత్తినున్నవాఁడ." భార. శాం. ౬, ఆ.—వై. ప్రే. వారఁజేయు. (వంటలక్క గంజివార్చెను.)

**వార్డరు.** ఆం. వి. చెరసాలలోనుండు బంట్రౌతు.

**వార్త.** సం. వి. ఆ. స్త్రీ. 1. వృత్తాంతము; 2. వర్తనము; 3. జీవనోపాయము; 4. అర్థానర్థవివేచనవిద్య; (చూ. విద్య.) 5. వార్తాకముచె. అ. న. ము. 1. పొల్లు; 2. ఆరోగ్యము. విణ. 1. రోగము తీర్చినది; 2. జీవనోపాయముగలది.

**వార్తాకము.** సం. వి. అ. పుం. వంగచె.

**వార్తాకి.** సం. వి. ఈ. స్త్రీ. ములకచె.

**వార్తావహుఁడు.** సం. వి. అ. పుం. 1. కావడిమోసెడువాఁడు; 2. వృత్తాంతమును తెలిసికొనిపోయి చెప్పువాఁడు.

**వార్తికము.** సం. వి. అ. న. ఉక్తానుక్తదురుక్తార్థములను వ్యక్తము చేసెడు గ్రంథము. పుం. పక్షివిశేషము.

**వార్తికుఁడు.** సం. వి. అ. పుం. సందేశహరుఁడు, దూత.

**వార్ధకము.** సం. వి. అ. న. 1. వృద్ధత్వము; 2. వృద్ధసమూహము.

**వార్ధక్యము.** సం. వి. అ. న. ముసలితనము, వృద్ధత్వము.

**వార్ధి.** సం. వి. ఇ. పుం. వారిధియొక్కరూపాంతరము.

**వార్ధుషికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు, కుసీదుఁడు.

**వార్పు.** యు. దే. వి. ఆచమనము. వై. గండి.

**వార్ణము.** సం. వి. అ. న. వర్ణములసమూహము. (వర్ణము = కవచము.)

**వార్వపుటగ్ని.** దృ. వి. (వార్వము+అగ్ని.) బడబాగ్ని. "సీ. ఎఱుఁగఁడుతనలోన నేప్రొద్దుఁబాయకయేర్చువార్వపుటగ్నియొగ్గమదని." య. ౧, ఆ.

**వార్వము.** దే. వి. వారువముయొక్క రూపాంతరము. "ఎ, గీ. వజలు నేనికతిండి వార్వమును దొలుత, గాఁగఁదానెక్కె." కళా. 3, ఆ.

**వార్షికము.** సం. వి. అ. న. కలుత్రాంతి. విణ. 1. వానకాలమునఁబుట్టినది; 2. సంవత్సరకాలపరిమితిగలది.

**వాఱంటువిల్లు.** దే. వి. (వాఱు+అంటువిల్లు.) ఊళ్లపనివారి వాఱుగట్టిన పెద్దవింటికోల.

**వాఱు.** దే. వి. సన్నగాఁ గోసినతోలు.

**వాఱెన.** దే. వి. (వాఱు+ఎన.) 1. నాగలితో కాఁడిని చేర్చికట్టెడు వాఱులోనగునది; "ఎ, గీ. గుఱ్ఱముల నాలుగస్సులఁగూలనేసి, వాఱెనయుఁజక్రరక్షకద్వయముఁద్రుంచి." ఉ, హరి. 3, ఆ.— 2. ఏఁడికోలతో కాఁడిని చేర్చికట్టెడువాఱులోనగునది; (చూ. పగ్గము మొదటియర్థము.) 3. ముంగినమ్రానితో గడను చేర్చికట్టెడు వాఱులోనగునది.

**వాఱెనపీఁట.** దృ. వి. ఏఁడికోలకును కాఁడికిని నడుమ చేరికగా నుండెడుకొయ్య.

**వాలకము.** ఉభ. దే. వి. 1. మోసము. "వానివాలకమొకవీర వానరలలామముగన్గొని." రామా. ౭, ఆ. — 2. వేషము. (చూ. అఱ్ఱాడు.)—సం. అ. పుం, న. 1. ఉంగరము; 2. సూడిగము.

**వాలధి.** సం. వి. ఇ. పుం. పసుఁగుగుఱ్ఱములోనగువానితోఁక.

**వాలపాశ్య.** సం. వి. ఆ. స్త్రీ. జేడబిళ్ల, పారితథ్య.

**వాలము.** ఉభ. వై. వి. జెబ్బులి. "క. వాలమ్ములదంష్ట్రాకర, వాలమ్ములనెత్తియేసివాలమ్ములవే, జాలమ్ములఁదగిలినకిటి, జాలమ్ముల దూరమేనింద్ర జాలమ్మునఁగణ్." పా. ౧, ఆ. — సం. అ. పుం. 1. తోఁక; 2. తలవెండ్రుక; 3. కత్తి.

**వాలయించు.** దే. అం, ప్రే. నిర్బంధించు. "క. ఏవారికి నిన్ను వాలయింపఁగనేలా." భో. ౫, ఆ. (వాలాయించుయొక్క రూపాంతరము.)

**వాలఱుగుడు.** దృ. వి. (వాలు+అఱుగుడు.) వాలిఁడికోఁతి.

**వాలహస్తము.** సం. వి. అ. పుం. 1. వెండ్రుకలుగలతోఁక; 2. వెండ్రుకలసమూహము.

**వాలాయము.** దే. వి. నిర్బంధము. "చవిగానియిందులకుహెూరాహెూరిగాఁబోరియేలావాలాయమునేయఁగా." సా. 3, ఆ.—విణ. 1. అనివార్యము; "సీ. సుతులుపుట్టిరియేనిసుతులకుమృత్యువు వాలాయమైవెంటవచ్చెనేని." భాగ. ౧౦, స్కం. పూ. "క. వాలాయమువలధాయని, వాలాయమునోఁకిధైర్యవప్రంబగలణ్." (వాలాయము—వాలాయముగ.) భద్రా. ౨, ఆ. — 2. నిరంతరము. "సీ. ఆవేలుపుచేలిఁజుట్టిరానేనుచేతు, లవెడల్పు నేలవాలాయంబుగాఁ గళవ్రాడ్చియుల్కిభజించుచున్న జనుల, చేతఁబూజలు గొనుఁబూతనాభూతనారిహర్త." పాండు. ౫, ఆ. — క్రి. విణ. అవశ్యము. "క. మాయాపదఁబాపుమువా, లాయము." రామా. 3, ఆ. "ద్వి. ఈదేవునినడుగు, వాలాయమిదివినవలచితివేని." విష్ణు. పూ. ౧, ఆ. (వాలాయము—వాలాయముగ.)

**వాలాయించు.** దే. అ. క్రి. నిర్బంధపడు. "క. వాలాయించి వనంబున, నేలమ్తతపంబునేయ." వీర. ౨, ఆ. — అం, ప్రే. నిర్బంధపఱుచు. "వ. మీకునాచెప్పినట్లుగుఁగదాయని వాలాయించి యడిగినప్పుడు." భో. ౭, ఆ.

**వాలారు.** దృ. విణ. (వాలు+ఆరు.) వాఁడియైనది. "వాలారుటై కరజంబుల్ నిగిరించె." పా. ౫, ఆ. ("వాలారుతూపు." చూ. నారి.)

**వాలిఁడి.** దృ. వి. (వాలు+ఇఁడి.) తోఁకలేనికోఁతి. విణ. తోఁక లేనిది.

**వాలిక.** ఉభ. దే. విణ. 1. దీర్ఘము; "క్రొవ్వాఁడివాలికచూపుల్." రామా. ౧, ఆ. — 2. వాఁడియైనది "క. వా, లికకైదువులాడి ననే, లకొఅగి యొప్పిరభిమన్యులక్ష్మణుల క్రియణ్." (చూ. దీని ముందుభాగము కొండొక మూడవయర్థముకడ.) భార. స్త్రీ. ౨, ఆ. "వాలికయమ్ములు." భార. భీష్మ. ౧, ఆ.—సం. వి. ఆ. స్త్రీ. అంగిటిగుంట.

**వాలు.** యు. దే. అ. క్రి. 1. అతిశయించు; "వాలినస్ఫూర్తి." హరి. ఉ. ౮, ఆ. — 2. క్రిందికిదిగు; 3. ఒఱగు; 4. వంగు. (వ్రాలుయొక్క రూపాంతరము.) (చూ. వాలుచు.) — స. క్రి. అతిక్రమించు. "క. నీకునఁనాకుణ్, వాలియవచేయవచ్చునె." (చూ. దీనిముందుభాగము మూఁడు అ. క్రి. మొదటియర్థముకడ.) భార. శాం. 3, ఆ.—వై. వి. 1. కత్తి; "క. వాలుపయినడచున ట్లు, బ్బాలికవడవడవడంకి." భార. ఆది. ౨, ఆ.—2. ధైర్యము*; "సీ. లోలాక్షిచూపువాలుగల వాలుగమీలపజ్క్తి మధ్యమునఁగూర్పంగమఱచె." భాను. ౮, ఆ. — 3. వాఁడిమి*. (చూ. వాలారు.)—విణ. 1. దీర్ఘము*; "సీ. వాలుగాఁగైవ్రాలువేలుపుపూబంతిచాలుమేలైనవానవలగట్టు." రామా. ౧, ఆ.—2. వాఁడి*; "శే. సూతునొక్కవాలమ్మునద్రుక్కనేసి." భార. భీష్మ. ౨, ఆ. (రూ. వాలురమ్ము. హరి. పూ. ౯, ఆ.) (ఇది గొడ్డురాలువంటిది.)—3. క్రూరము*. "ఎ, గీ. వాలుమృగములున్నవనమని తలఁపక." భార, ఆది. ౬, ఆ.

**వాలుఁగంటి.** దే. వి. (వాలు+కన్ను.) 1. దీర్ఘములయినకన్నులు గలయాఁడుది; 2. ఆఁడుది. (విశాలాక్షి.) "శా. వాలుంగంటికి నింటియాఁడఁడుమనోవాంఛాప్రదానక్రియా, హేలాలోలుఁడు." హరిశ్చ. 3, ఆ.

**వాలుక.** సం. వి. ఆ. స్త్రీ. ఇసుక. అ. న. ము. సూఁగుదోసి.

**వాలుకొంగ.** దృ. వి. వక్కుకొంగ, బకము.

**వాలుఁగ.** దే. వి. 1. మత్స్యవిశేషము; "సీ. తెలివాలుగలడాలుగల సోగకనుదోయి సొంపుగుల్కెడునిద్రమంపుఁజూచి." శుక. ౧, ఆ. (చూ. వాలుధైర్యమనునర్థము.)—2. మత్స్యము. "ఉ. వాలముతోఁకునణ్గిరులువజ్రనిపాతముసంస్మరింపఁదొణ్, వాలుగలై." పా. 3, ఆ.

**వాలుగకంటి.** దే. వి. 1. వాలుగవంటికన్నులుగలయాఁడుది; 2. ఆఁడుది. (చూ. సులుము రెండవయర్థము.)

**వాలుగమెంకి.** దే. వి. మత్స్యవిశేషము.

**వాలుగడాలు.** దే. వి. మన్మథుఁడు, మీనకేతనుఁడు.

**వాలుగడుపు.** దృ. వి. (వాలు+కడుపు.) బొజ్జ. (రూ. వాల్గడుపు.)

**వాలుగపాము.** దే. వి. మత్స్యవిశేషము.

**వాలుచు.** దే. ప్రే. వాలఁజేయు. (రూ. వాల్చు. వంచుటకు.— "అన్నదీపముతుదశక్తినైవమెయిఁవాల్చియదిపట్టివైచె." భార. భీష్మ. 3, ఆ.)

**వాలుచుక్క.** దృ. వి. శుక్రుఁడు.

**వాలుడు.** దే. వి. వాతారిక్త. "ఎ, గీ. కోరివాలుడున్నులం బుగ్రొ లువారు." పంచ. వేం. ౧, ఆ.

**వాలుపు.** దే. వి. వాల్పుట. "అరవాలుపుచూపులు." (రూ. వాల్పు.)

**వాలుప్రొద్దు.** ద్వ. వి. లేఁబ్రొద్దు, అపరాహ్ణము.

**వాలుమగఁడు.** ద్వ. విఞ. శూరుఁడు. "క. లాలిమియుధృతి యుఁబ్రజ్ఞా, శీలతయుఁబరాస్త్రగుణవిశేషజ్ఞానియుం, గాలోచితకా ర్యముఁగల, వాలుమగండేలుజలధివలయితధరణి." పంచ. వేం. 3, ఆ.

**వాలుమేకము.** వై. వి. అడవిపంది. ఆం, భా. ద్వి, కాం.

**వాలువ.** దే. వి. వాలుగయొక్క రూపాంతరము. "చ. వడిఁబుట మెత్తిదాఁటు నిను వాలువ చాలువయింపనంతఁబై, నీను వెలిగుంచె లకాదెలుప." పంచ. వేం. ర, ఆ.

**వాలూరు.** దే. అ. క్రి. ఆలస్యమగు. "ద్వి. పలిసపతికార్యమెడ యైనయెడను, వాలూరనటు సేయువాఁడు మధ్యముఁడు." రా. యు, కాం.

**వాలెము.** దే. వి. విఞ. క్రి. విఞ. వాలాయముయొక్క రూపాం తరము. (నిరంతరమునకు.—"క. నీవారమనుచునమ్మిక, తోవాలెము గొలుచువారిదోసఁగులపాలం, బోవిడిచినిరాబారుల, గావించుచె నంటివీవెకదపరికింపఁగ." అచ్చ. యు, కాం.—అవశ్యమునకు.— "చ. నేలతొల్పయి, ప్పనితలఁబూనిరక్షసునిపాతెసువాలెముపొచ్చి చేడియం, గనుఁగొని." అచ్చ. కిష్కిం, కాం.) (ఈరూపమీతిమ్మన కవిత్వమునందుమాత్రమే కనఁబడుచున్నది.)

**వాల్కము.** సం. విఞ. (అ. ఈ. అ.) నారది. (చీర.)

**వాల్గంటి.** ద్వ. వి. వాలుఁగంటియొక్క రూపాంతరము. "ఆవా ల్గంటింజేకొంటిమి." భాగ. ౧, స్కం.

**వాల్మీకి.** సం. వి. ఇ. పుం. సంస్కృతరామాయణమునురచించిన మహర్షి.

**వాల్లభ్యము.** సం. వి. అ. న. ఆధిపత్యము, దొరతనము.

**వావదూకుఁడు.** సం. విఞ. (అ. ఆ. అ.) యుక్తియుక్తముగా మాట లాడువాఁడు, వాగ్మి.

**వావాదు.** వై. వి. (చూ.) ఉపన్యాసము, వాక్ప్రబంధము*.

**వావి.** దే. వి. బంధుత్వము. "వావిఁజెల్లెలుగానికూఁతురువంటిది." భాగ. ౧౦, స్కం. పూ.

**వావింట.** దే. వి. వాయింటయొక్క మారురూపము.

**వావిక.** దే. వి. కుత్తుకమొదటఁగలగుంట.

**వావిరి.** దే. వి. 1. క్రమము; "క. రూపకమష్టని, ధావహామగు లక్షణంబు లలలక్ష్యంబుల్, వావిరినొసర్తువీనికి." కా. ౫, ఆ. "ఈవావిరి." కా. 3, ఆ.—2. అనుగతి; "క. పోవఁగనయ్యగ సాలెయు, వావిరిఁదోడరుగ." భో. ౫, ఆ.—3. ఉత్కర్షము. "వావిరిదక్కిన చామరంబులుఁగ." రా. యు, కాం.—విఞ. 1. అధికము; "ఒదవెవావిరియైజలతృష్ణనాకు." గా. యు, కాం.— 2. అనుగతము; "చ. వలదనియెంతచెప్పినను వావిరినైకడు వేగ పాటుమైఁ, బలుమఱునెల్లెడందోడరఁబాఱెదు." భార. విరా. ౨, ఆ.—3. ఉత్కృష్టము. "వారిజసంభవుండొసఁగెవావిరియైన వరంబులు." నిర్వ. ర, ఆ.

**వావిలి.** దే. వి. శేఫాలిక. (ఇది ద్వివిధము; నల్లవావిలి, తెల్ల వావిలి. ఇదియె నల్లవావిలి.)

**వావురము.** దే. వి. వారువమునకు మారురూపము. "సీ. నెలతొ ల్పునేనవడమ్ములకు నైవేల్పుబోనమ్ముఁదెచ్చినవావురమ్మువాఁడు." రా వి. ౧, ఆ. (దీనికి సరియైనప్రయోగము చిక్కినదికాదు.)

**వావృత్తము.** సం. విఞ. (అ. ఆ. అ.) వరింపఁబడినది.

**వాశకము.** సం. వి. అ. పుం. అడ్డసరము.

**వాశి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) బాడిస.

**వాశిత.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. ఆఁడుది. అ. న. ము. మృగపక్షిధ్వని. విఞ. వాసనకట్టఁబడినది.

**వాస.** దే. వి. ఇంటికిమీఁదపఱపెడువాసము. "నివేశనంబులో సంగరువాస." అని. ౧, ఆ.

**వాసంతము.** సం. వి. అ. పుం. 1. ఒంటె; 2. కోయిల; 3. తెమ్మెర. విఞ. 1. ఉంచఁబడినది; 2. వసంతసంబంధమైనది.

**వాసంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అడవిమొల్ల; 2. పుష్పలగురి వెంద; 3. బట్టకడిమి.

**వాసకము.** సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. అడ్డసరము.

**వాసకసజ్జిక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు పడకకువచ్చెడు నని తెలిసి పడకిల్లుసింగారించి తానును సింగారించుకొనియుండెడు నాయిక. (చూ. నాయిక.)

**వాసగృహము.** సం. వి. అ. న. పడకిల్లు, భోగగృహము.

**వాసన.** సం. వి. ఆ. స్త్రీ. 1. గంధము; 2. అనుభూతార్థస్మృతి; 3. ప్రత్యాశ. అ. న. ము. 1. వాసనకట్టుట; 2. వస్త్రము; 3. పీఠాసనము. విఞ. వసనసంబంధమైనది.

**వాసనకొడుపు.** మి. వి. పెద్దయూఁదువత్తి. ఆము. ర, ఆ.

**వాసపోయు.** దే. అ. క్రి. వాసాలుపఱచు. "సీ. వాసపోసె డుచోట వాసనగలవాసమే పెవాసనునొక్కఁడింతెమహిప." రా, వి. 3, ఆ. (చూ. వాస.)

**వాసము.** ఉభ. దే. వి. ఇంటికిమీఁదపఱపెడుపట్టె. (చూ. వాస పోయు.)—సం. ప్. న. వస్త్రము. (చూ. చాలుమొదటియర్థము.) (మొదటిరూపమువాసస్సు.) అ. పుం. 1. ఇల్లు; 2. అడ్డసరము.

**వాసయోగము.** సం. వి. అ. పుం. గంధపొడి, చూర్ణము.

**వాసరము.** సం. వి. అ. పుం, న. దినము, దివసము, ప్రొద్దు.

**వాసవుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

**వాసి.** ఉభ. దే. వి. 1. తారతమ్యము; "క. ఆసేనకునీసేనకు, వా సియడిగెదీవు." భార. ఉద్యో. ౨, ఆ.—2. భేదము; "సీ. ఇం దుఁదక్కఁ ధకంటె భేదంబుపరికింపనొనరించెఁబడసెనిలిపె, నననివి మొదలైనయట్టి భూతార్థంపుఁగ్రియలపట్టున నొనరించుఁబడయు, నిలుపుననునివియాదిగాఁగలభవిష్య, దర్థవచనంబులైన క్రియాప దంబు, లనుచుకొనుటయెవాసియెందున దలంప." కళా. ౫, ఆ.—3. ఆధిక్యము; "వ. తేజంబువాసికినాసపడియెడిమాయిరు పురకునఖ్యంబు సమకూరనేర్పునేయనుటయు." భార. ఉద్యో. ౧, ఆ.—4. లాభము; (వాఁడువడ్డికివాసికిచ్చిజీవనముచేయుచు న్నాఁడు.)—5. ప్రసిద్ధి; "ఇందునందునువాసికినెక్కిరి." భాగ. ౨, స్కం.—6. పరిమితి. (ఇందు ముప్పాతికవాసి గ్రంథ మచ్చుపడినది.)—విఞ. 1. ఉత్కృష్టము; (దానికంటె నిదివాసి.) 2. స్వస్థము; (ఇప్పుడు నాకు ఒళ్లువాసిగానున్నది.) 3. బాగు. "క. కాశీమహిమముమీచే, వాసిగవినినంశయములువాసితిమి." కూర్మపురాణము. ర, ఆ.—సం. వి. ఈ. స్త్రీ. వాశియొక్క రూపాం తరము.

**వాసించు.** సం. అ. క్రి. వసించు. స. క్రి. వాసనకట్టు. (చూ. సెలవత్తి.)

**వాసిత.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. ఆఁడుది. అ. న. ము. మృగపక్షులధ్వని. విశ. 1. వాసనకట్టినది; 2. వాసెనకట్టినది.

**వాసుకి.** సం. వి. ఇ. పుం. ఒక సర్పరాజు.

**వాసుదేవుఁడు.** సం. వి. అ. పుం. వసుదేవునికొడుకు, కృష్ణుఁడు.

**వాసువు.** సం. వి. ఉ. స్త్రీ. నాట్యపరిభాషయందు బాలిక.

**వాసె.** వై. వి. వాసెగ్రోలు. "మ. ఎలమిందుమ్మెదమ్రోఁతవాసె రవలైయింపొందమల్లిల్లుకో, వెలసీ కారులకూఁక పాటల మరల్ వేవేడ్కతోనాలిగా, డ్పుల సేరంగల నట్టువుల్ గఱపఁగోవుల్ సూపులే దీవెపా, తలకయ్యాసునిపూవుముత్తెపుసరుల్ దాల్పంగనిచ్చెంగ సుల్." య. ౪, ఆ. (మొదటిరూపము వాసియ.)

**వాసెగ్రోలు.** ద్వ. వి. (వాసె + గ్రోలు.) పిల్లఁగ్రోవి. ఆము. ౪, ఆ.

**వాసెన.** వై. వి. అవిరిపోకయెసటికుండమూతిమూసికట్టినగుడ్డ*.

**వాసెనకట్టు.** ద్వ. వి. వాసెనగుడ్డకట్టువంటికట్టు. "ఉ. మాసిన చీరగట్టుకొని మానముతోడనిరస్తభూషయై, వాసెనకట్టుకట్టినిడువాలికకస్తురిపట్టువెట్టిలో, గాసిలి చీఁకటింటికడకంకటిపై జలదాంత చంద్రరే, ఖాసదృశాంగియై పొరలెగాఢ మనోజవిషాదవేదనన్." పా. ౧, ఆ.

**వాసెనకుడుము.** ద్వ. వి. ఇడ్డెనయను పిండివంట.

**వాస్తవము.** సం. వి. అ. న. యథార్థము.

**వాస్తవికము.** సం. విశ (అ. ఈ. అ.) యథార్థమైనది.

**వాస్తవ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) వసింపఁదగినది.

**వాస్తవ్యుఁడు.** సం. వి. అ. పుం. గృహస్థుఁడు. "వండిసపెరటి కల్పకమువాస్తవ్యుండు." సా. ౧, ఆ.

**వాస్తుకము.** సం. వి. అ. న. ఒకదినుసుకూరాకు, చక్రవర్తము. (చూ. వాస్తూకము.)

**వాస్తువు.** సం. వి. ఉ. పుం, న. 1. ఇండ్లుమొదలైనవి యేర్పఱుపఁదగినభూమి; 2. ఇల్లు

**వాస్తోష్పతి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

**వాస్త్రము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. వస్త్రముచేతఁగప్పఁబడినది; (రథము.) 2. వస్త్రసంబంధమైనది.

**వాహద్విషము.** సం. వి. ష్. పుం. ఎనుపోతు.

**వాహనము.** సం. వి. అ. న. ఎక్కఁదగినయేనుఁగులోనగునది.

**వాహము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. ఎద్దు; 3. భుజము; 4. వాయువు; 5. ఇరుస.

**వాహసము.** సం. వి. అ. పుం. 1. పెనుఁబాము; 2. తూముకాలువ; 3. నీరుచెంచేలి*.

**వాహితము.** సం. విశ. (అ. ఆ. అ.) వహింపఁబడినది.

**వాహిత్థము.** సం. వి. అ. న. ఏనుఁగుయొక్క వాతకుంభము క్రిందిచోటు.

**వాహిని.** ఉభ. వై. వి. వార్గోరణి. సం. వి. ఈ. స్త్రీ. 1. నది; 2. సేన; 3. సేనావిశేషము. (ఎనుబదియొక్క రథము అన్నియేనుఁగులు ఇన్నూట నలువదిమూఁడు గుఱ్ఱములు నన్నూటయేవురు కాలుప్రురును గలది.)

**వాహినీపతి.** సం. వి. ఇ. పుం. 1. సేనానాయకుఁడు; 2. సముద్రుఁడు.

**వాహ్యము.** సం. వి. అ. న. వాహనము. విశ. వహింపఁదగినది.

**వాహ్యాళి.** సం. వి. ఇ. స్త్రీ. స్వారి. (చూ. ప్రోయాలు.)

**వాళి.** దే. వి. 1. పసులపోవుదారి; 2. వాడుక.

## వి.

**వి.** దే. అప. ది అనుదానికి బహువచనము. (చూ. ఇ.)

**వింగడము.** వై. విశ. 1. విస్తీర్ణము; "వింగడమైనయొక్కవనవీథిఁ గనుంగొనె." ఆము. ౫, ఆ.—2. సుందరము; "సీ. వింగడంబై నట్టి ముంగిటనిడికొన్న బృందావనికిమ్రుగ్గు పెట్టుఁదాన." ఆము. ౪, ఆ. 3. విపరీతము*. "క. అంగజహరుని ప్రసాదము, నంగ లుగుచువచ్చెసుతుఁడునాఁడాదిగమా, వంగడమునసదియిప్పుడు, వింగడమైకాఁతురు ధృవించెన్నాకున్." విజ. ౨, ఆ.—4. వేఱు*. (చూ. వింగడించు.)

**వింగడించు.** వై. స. క్రి. వేఱుపఱచు, విభజించు. "అమరవరక్ష్మామరవరాంచితవృత్తులువింగడించి." హన. ౨, ఆ.

**వింజామర.** మి. వి. (వెల్ల+చామర.)- తెల్లనిచామరము. "ఎ, గీ. భార్యవింజామరిడనొప్ప పాండ్యుఁగనియె." ఆము. ౪, ఆ. (రూ. వింజామరము. "ఎ, గీ. రమణశ్రీదేవివింజామరంబువిచ." శేష. ౫, ఆ.) (సంధిని వర్ణవికారము.) (అఱవమున వెణ్ శామరమందురు.) (ఇది ముంగోపమువంటిది.)

**వింజిలి.** దే. వి. మత్స్యవిశేషము.

**వింజేము.** వై. వి. వింధ్యపర్వతము. కళా. ౫, ఆ.

**వింట.** దే. వి. వినుట, శ్రవణము. కళా. ౨, ఆ.

**వింటాలము.** దే. వి. మల్లబంధవిశేషము. హంస. ౧, ఆ.

**వింటికోల.** దే. వి. (విల్లు+కోల.) ఱాళ్లపనివానియొక్క ధనురాకారమైన సాధనవిశేషము.

**వింటిపట్టు.** దే. వి. (విల్లు+పట్టు.) (చూ.) అమ్ముచేటునేల, ధన్వంతరము.

**వింటిరాసి.** ద్వ. వి. (విల్లు+రాసి.) ధనూరాశి.

**వింటివాఁడు.** దే. విశ. (విల్లు+వాడు.) విలుకాఁడు. వింత. దే. వి. ఆశ్చర్యము. విశ. 1. అపూర్వము; (చూ. ఒయ్య మొదటి యర్థము.) 2. అన్యము.

**వింతరాలు.** దే. విశ. (వింత+ఆలు.) అన్యురాలు. "సీ. ముంగొంగుబసిఁడియై మూల్గుపుణ్యంబులవిజ్ఞుకీఁగుదురెట్టివింతరాండ్రు." భాగ. ౬, స్కం. (ఇది ముద్దరాలువంటిది.)

**వింతవాఁడు.** దే. విశ. అన్యుఁడు. "సీ. వింతవానిఁగటాక్షవీక్షణంబునఁజూచు కినలయోష్ఠివహించుగిల్లకన్న." సం. "కటాక్ష యతివాన్యంవైకేకరాక్షితుసా భవేత్." కాశీ. ౨, ఆ.

**విందు.** దే. వి. 1. చుట్టములులోనగువారికిపెట్టెడుభోజనము; "చ. అప్పుడ, యఖిలనృపాలకోటికిమహార్హులకున్ దనపాకచాతురీ, సుఖమెటిఁగింపగంధవహసూనుఁడు విందని చెప్పి నేర్పునన్." జై. ౬, ఆ.— 2. ఆతిథ్యము; "ద్వి. కరమర్థిమాయింటికడవిందు గుడిచి, యరుగుము." రా. బాల, కాం.—3. చుట్టము; "విందుల

కెల్లనేఁడిచటవిందు." పాంచా. ౪, అ.- 4. అతిథి. "క. భూ సురేశ్వరప్రీతిం, బొందితినినుఁగనితాగియొడు, విందవంయితినాకు." భార. శాం. 3, ఆ.

**విందుపురుగు.** దృ. వి. ఒకదినుసు సాలెపురుగు.

**విందువు.** సం. విణ. (ఉ. ఊ. ఉ.) తెలియువాఁడు.

**వింధ్య.** సం. వి. ఆ. స్త్రీ. లవలీ. అ. పుం. ము. పర్వతవిశేష ము. డు. బోయవాఁడు.

**వింశతి.** సం. స. ఇ. స్త్రీ. ఇరువది. విణ. ఇరువదిసంఖ్యగలది.

**వింశము.** సం. విణ. (అ. ఈ. అ.) ఇరువదవది.

**వికంకతము.** సం. వి. అ. పుం. ములువెలమ్రానికి. పుల్లవెలఁగ్రానికి. (అనికొందఱు.)

**వికచము.** సం. వి. అ. పుం. కేతుగ్రహము. విణ. 1. వికసించి నది; 2. వెంట్రుకలులేనిది.

**వికట.** సం. వి. ఆ. స్త్రీ. వజ్రవారాహియనుదేవత. విణ. 1. మి క్కిలి వంకరైనది; 2. విరివియైనది; 3. చక్కనైనది.

**వికటకవి.** సం. వి. ఇ. పుం. వికటముగా మాటలాడువాఁడు, హాస్యకరుఁడు.

**వికటించే.** సం. అ. క్రి. వంకరయగు, ఎదురుతిరుగు. (వాఁడు నాతో వికటించియున్నాఁడు.)

**వికత్థనము.** సం. వి. అ. న. స్తోత్రము, పొగడిక.

**వికర్తనుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**వికర్తకుఁడు.** సం. వి. అ. పుం. అంగడిపారుపత్తెకాఁడు.

**వికలము.** సం. విణ. (అ. ఆ. అ.) విచ్ఛేదమునొందినది.

**వికల్పము.** సం. వి. అ. పుం. 1. భ్రాంతి; 2. మాఱుదల; 3. అవాంతరకల్పము; 4. ఒక యర్థాలంకారము. (చూ. అలంకా రము.)

**వికవిక.** దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. (చూ. తిరు గలి రెండవయర్థము.)

**వికస.** సం. వి. ఆ. స్త్రీ. మంజిష్ఠ. అ. పుం. డు. చంద్రుఁడు.

**వికసనము.** సం. వి. అ. న. వికాసము, తెలివి.

**వికసించే.** సం. అ. క్రి. వికాసముపొందు, విరియు.

**వికసితము.** సం. విణ. (అ. ఆ. అ.) వికసించినది.

**వికస్వరము.** సం. విణ. (అ. ఆ. అ.) వికసించునది.

**వికారము.** సం. వి. అ. పుం. 1. మనసుయొక్కగాని రూపము యొక్కగాని మాఱుపాటు; 2. తెవులు. (షోడశవికారములు.— ఏకాదశేంద్రియములు పంచభూతములును.)

**వికారి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. వికారముగలది.

**వికావిక.** దే. వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము; "వికా వికనవ్వు." ఇలా. 3, ఆ.—2. శేరుటయందగు ధ్వన్యనుకరణము; "అటఁదోఁచె గగనంపుఁబట వికావికఁ గేరునసదుఁగొను." చంద్రా. 3, ఆ.—విణ. బ. చెల్లాచెదరు.

**వికాసము.** సం. వి. అ. పుం. వికసనము, తెలివి.

**వికాసి.** సం. విణ. (న్. ఈ. న్.) వికాసముగలది.

**వికిరము.** సం. వి. అ. న. గజకుంభస్థలమధ్యము. పుం. 1. పక్షి; 2. ఖండము; 3. శ్రాద్ధకాలమునందునిమంత్రితులు భుజించిన పిమ్మట విస్తరకు ముందఱవేసెడు అన్నము; 4. నూయి.

**వికీరణము.** సం. వి. అ. న. వెదచల్లుట. పుం. జిల్లేడుచెట్టు.

**వికీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెదచల్లఁబడినది; 2. చెద రినది.

**వికుర్వాణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సంతోషమునొందిన మనస్సుకలవాఁడు.

**వికృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వికారమునొందినది; 2. తెవులునొందినది; 3. రోఁతయయినది.

**వికృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వికారము; 2. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.) పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**వికక్కము.** సం. వి. అ. పుం. ఇరువైయేండ్లవయస్సుగలయేనుఁగు.

**వికక్కవిరియు.** దే. అ. క్రి. (విరియు+విరియు.) మిక్కిలి విరి యు. "నమ్మోదంబునవిక్కవిరిసె." భాగ. ౧౦, స్కం. పూ.

**విక్కు.** దే. అ. క్రి. 1. విజృంభించు; "క. అక్కొమ్మమెకపు జోదులు, విక్కుచునక్కొండయెక్కి విరిలేనియలం, జొక్కటి పుఁడియ్యవండుల, జక్కరతెలిసీళ్లనలవు నడలించితగన్." అచ్చ. కిష్కిం, కాం.—2. గర్వించు. "క. చిక్కంబోవీఁడు నాదు చేతనటంచున్, విక్కుచుఁ దల్లికడకుఁజని." చంద్రరేఖా విలాసము. ౨, ఆ.

**విక్రమ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సర ము.) ము. 1. అధికబలము, 2. ఆక్రమణము; 3. శౌర్యము; 4. చరణము.

**విక్రమించే.** సం. అ. క్రి. 1. వీర్యముచూపు; 2. శౌర్యము చూపు.

**విక్రముఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. విక్రమార్క రాజు.

**విక్రయము.** సం. వి. అ. పుం. అమ్మకము, విపణము.

**విక్రయి.** సం. వి. న్. పుం. (చూ.) విక్రయికుఁడు.

**విక్రయించు.** సం. స. క్రి. విక్రయముచేయు, అమ్ము.

**విక్రయికుఁడు.** సం. వి. అ. పుం. అమ్మెడువాఁడు.

**విక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. విక్రమము; 2. అశ్వగతి.

**విక్రాంతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విక్రమించినవాఁడు.

**విక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) వికారము.

**విక్రీడితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ఆడఁబడినది.

**విక్రీతము.** సం. విణ. (అ. ఆ. అ.) విక్రయింపఁబడ్డది.

**విక్రేత.** సం. వి. ఋ. పుం. విక్రయించువాఁడు.

**విక్రేయము.** సం. విణ. (అ. ఆ. అ.) విక్రయింపఁదగినది.

**విక్లబుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) భయశోకాదులచేత చేతులు కాళ్లు విలవిలబోవువాఁడు.

**విక్షావము.** సం. వి. అ. పుం. 1. దగ్గు; 2. తుమ్ము.

**విక్షిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎగురవేయఁబడినది; 2. విసరివేయఁబడినది.

**విక్షేపము.** సం. వి. అ. పుం. 1. ఎగురవేయుట; 2. విసరివేయుట; 3. కదలిక.

**విక్షేపించు.** సం. స. క్రి. 1. ఎగురవేయు; 2. విసరివేయు.

**విఖ్యాతము.** సం. విణ. (అ. ఆ. అ.) విఖ్యాతిఁజెందినది.

**విఖ్యాతి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి ప్రసిద్ధి.

**విఖ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ముక్కుపోయినవాఁడు, ముక్కిఁడి. (రూ. విఖ్రుఁడు.)

**విగడియ.** వై. వి. గడియలో అఱువదవభాగము. "ఒక్కవిగడియలోన." రామా. ౮, ఆ.

**విగతము.** సం. విణ. (అ. ఆ. అ.) బొత్తిగాఁబోయినది; 2. వెలుఁగులేనిది.

**విగమము.** సం. వి. అ. పుం. 1. నాశము; 2. విభజనము.

**విగళనము.** సం. వి. అ. న. మిక్కిలి జాఱుట, విస్థలనము.

**విగళితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి జాఱినది.

**విగాఢము.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) విగాహితము.

**విగాహము.** సం. వి. అ. పుం. మునుఁగుట. (రూ. విగాహనము.)

**విగాహించు.** సం. అ. క్రి. మునుఁగు, క్రుంకు.

**విగాహితము.** సం. విణ. (అ ఆ. అ.) మునిఁగినది.

**విగుణము.** సం. విణ. (అ. ఆ. అ.) విభిన్నగుణముగలది.

**విగుర్విం చు.** దే. స. క్రి. (విఱుచు+విఱుచు.) చక్కగావిఱుచు. "క. గర్విం చిపలికితివిని, గర్వముభుజవీర్యమును బ్రకాశంబుగని, పర్వతశిఖరం బెత్తివి, గుర్విం పుముచూతమనినగో త్రభిదుండున్." భార. ఆది. ౬, ఆ.

**విగ్రహము.** సం. వి. అ. పుం. 1. శరీరము; 2. విభాగము; 3. విస్తారము. పుం, న. 1. యుద్ధము; 2. షడ్గుణములలో నొకటి. (చూ. గుణము.)

**విగ్రహించు.** సం. అ. క్రి. కలహించు, పోరు.

**విగ్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (చూ.) విఖ్యుఁడు.

**విఘటిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) విగడియ.

**విఘసము.** సం. వి. అ. పుం. దేవతాతిథులభుక్తశేషము.

**విఘాతము.** సం. వి. అ. పుం, న. 1. అడ్డంకి; 2. పెద్దదెబ్బ; 3. చెఱుపు.

**విఘాతించు.** సం. స. క్రి. 1. చెఱుచు; 2. చంపు.

**విఘ్నపడు.** మి. అ. క్రి. (విఘ్నము+పడు.) అడ్డిపడు. (చూ. జోలి మూడవయర్థము.)

**విఘ్నము.** సం. వి. అ. పుం. అడ్డి, అంతరాయము.

**విఘ్నరాజు.** సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు.

**విచక్షణుఁడు.** సం. వి. అ. పుం. చదువరి. విణ. నేర్పరి.

**విచయనము.** సం. వి. అ. న. వెదకుట, అన్వేషణము.

**విచర్చిక.** సం. వి. ఆ. స్త్రీ. గజ్జి, పామ.

**విచారణ.** సం. వి. ఆ. స్త్రీ. ప్రమాణములచేత విషయమును పరిశీలించుట, చర్చ.

**విచారణీయము.** సం. విణ. (అ. ఆ. అ.) విచారణచేయఁదగినది.

**విచారపడు.** మి. అ. క్రి. (విచారము+పడు.) సంతాపించు.

**విచారము.** సం. వి. అ. పుం. 1. ఆలోచనము; 2. సంతాపము.

**విచారించు.** సం. అ. క్రి. 1. ఆలోచించు; 2. సంతాపించు. "వ. సహజంబైనపరమపాతివ్రత్యంబున సకలధర్మంబులను సాధించికృతార్థవయ్యెదువిచారింపకుము." కళా. ౫, ఆ.

**విచారితము.** సం. విణ. (అ. ఆ. అ.) విచారింపఁబడినది.

**విచార్యము.** సం. విణ. (అ. ఆ. అ.) విచారింపఁదగినది.

**విచికిత్స.** సం. వి. ఆ. స్త్రీ. సంశయము, సందియము.

**విచికిలము.** సం. వి. అ. పుం. 1. ఒకదిసనుపల్లెతీఁ: 2. మల్లెతీఁ; 3. దవనముతీఁ.

**విచిత్రము.** సం. వి. అ. న. ఆశ్చర్యము. పుం. చిత్రవర్ణము. విణ. 1. ఆశ్చర్యకరము; 2. చిత్రవర్ణముకలది.

**విచల్లిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పావలితీఁ.

**విచేష్టించు.** సం. అ. క్రి. మిక్కిలిచేష్టించు. భార. ఉద్యో. ౨, ఆ. (చూ. చేష్టించు.)

**విచ్చేయు.** మి. గ్రా. అ. క్రి. 1. వచ్చు; "ఉ. ఈయెడకుం బ్రసన్నమతినిందఱుఁగైకొని దేవసీవు వి, చ్చేయుటఁ జేసిమానియమశీలత యుత్తమసిద్ధిఁబొందె" హరి. ఉ. ౫, ఆ.–2. పోవు. "క. చెచ్చెరఁగరినగరికి నీ, విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు నీ, వెచ్చోటికివిచ్చేయక, మచ్చికతోనుండుమయ్యమానగరమునన్." భాగ. ౧, స్కం.–["క. నిచ్చలులోపలికాంతలు, మచ్చికఁదనతోఁడనాడు మాటలునాకున్, ముచ్చలలుసెప్పమెల్లన, విచ్చలవిడిఁదొడలమీఁదవిచ్చేసినృపా." (ఇక్కడ విచ్చేయుటయనఁగా కూర్చుండుట.) భాగ. ౧, స్కం.] (విజయంచేయునకుమాఱురూపము.) (చూ. విజయముచేయు.)

**విచ్చ.** దే. వి. నాలుగువేళ్లకు చుట్టితీసిననూలిచుట్ట.

**విచ్చలవిడి.** దే. వి. (విచ్చేలు+విడి.) స్వాతంత్ర్యము. "క. విచ్చేయుమదితిగర్భము, చెచ్చెరవెలువడుమహాత్మ చిరకాలంబున్ విచ్చలవిడిలేక మరులు, ముచ్చటపడి యున్నవారు ముద మందింపన్." భాగ. ౮, స్కం.–విణ. స్వతంత్రము. "విచ్చలవిడిచేఁత కర్జమె." భార. విరా. ౨, ఆ.–క్రి. విణ. యథేచ్ఛము. "సీ. చదలెల్లనద్రువవిచ్చలవిడిమొరయువాయిదములుబెడిదంబురొదలుగాఁగ." అచ్చ. బాల, కాం.

**విచ్చవిచ్చలు.** దే. అవ్య. యథాయథలు.

**విచ్చాయ.** వై. వి. రత్నదోషవిశేషము.

**విచ్చు.** దే. అ. క్రి. 1. విరియు; "వనితపల్వరుసవిచ్చనిమొల్లమొగడలు." చంద్ర.–2. చీలు. అం, ప్రే. విరియఁజేయు. (కనువిచ్చిచూచెను.) ప్రే. విడుచుయొక్కరూపాంతరము. "చనువిచ్చిమేడలన్." ఆము. ౨, ఆ.

**విచ్చుకత్తి.** ద్వ. వి. ఒఱదూసినకత్తి.

**విచ్చుటాకు.** దే. వి. (విచ్చు+ఆకు.) చేవాకు.

**విచ్చుమొగ్గ.** ద్వ. వి. 1 విరియుమొగ్గ; 2. చెల్లాచెదరగుట. "సీ. ఎలమిఁబొల్పుగుయాధికలకుసంతలకూటములకుసుమతివిచ్చుమొగ్గలాడవె." ఆము. ౪, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)–విణ. 1. చెల్లాచెదరైనద్ది; "ప్రజజాతిన్ విచ్చుమొగ్గవడిన్." పాంచా. ౨, ఆ.–2. చెల్లాచెదరుచేయునది. "ముచ్చుచేరువలకువిచ్చుమొగ్గ." కవి. ౩, ఆ.

**విచ్ఛాయము.** సం. వి. అ. పుం. రత్నదోషవిశేషము. విశా చాయపోయినది.

**విచ్ఛిత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఎడఁబాటు; 2. వస్త్రభూషణాద్య లంకారము కొలఁదిగానుండినను మిక్కిలి యొప్పిదమును తోఁపఁజే సెడు స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము; 3. పూఁత; 4. సఱుకుడు.

**విచ్ఛిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎడఁబడినది; 2. పూయఁబడినది; 3. సఱుకఁబడినది; 4. వంకరైనది.

**విచ్ఛేదము.** సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు; 2. సఱుకుడు.

**విజనము.** సం. విశే. (అ. ఆ. అ.) జనులులేనిది, ఏకాంతము.

**విజయ.** సం. వి. ఆ. స్త్రీ. 1. జయతిథి; 2. పార్వతి; 3. పార్వతియొక్క చెలికత్తె. అ. పుం. 1. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) 2. దినముయొక్క ఆరవభాగము. (చూ. దినము.)

**విజయంచేయు.** మి. అ. క్రి. (విజయము + చేయు.) 1. వచ్చు; "వ. దివ్యబోధమహనీయుండైన యమ్మహాత్ముండు విజయం చేయుటయు." భార. ౩, ఆ.—2. పోవు. "క. మసలితిరివిచిత్రకథా, రసవృత్తిందడవెఱుంగరాకయనుస్థా, నసమయమయ్యెన భోమ, ధ్యసమీపంబునకుఁదరణియరదమువచ్చెన్, విజయంచేయుఁడు." నిర్వ. ౭, ఆ. (విజయముచేయుయొక్కరూపాంతరము. చూ. విజయముచేయు.)

**విజయచ్ఛందము.** సం. వి. అ. పుం. ఏనూఱుపేటలుగలహారము.

**విజయదశమి.** సం. వి. ఈ. స్త్రీ. ఆయుధములులోనగువానిఁ బూజించెడు ఆశ్వయుజమాసము శుక్లపక్షమునందలి పదవతిథి.

**విజయము.** సం. వి. అ. పుం. 1. మిక్కిలిగెలుపు; 2. దినముయొక్క ఆఱవభాగము. (చూ. దినము.)

**విజయముచేయు.** మి. అ. క్రి. 1. వచ్చు; "ఉ గ్రసేనుని విజయముచేయుమనుఁడు." హరి. ఉ. ౫, ఆ.—2. పోవు. "వ. ఇవాహ్నికదినంబులుగడపితరత్నమయంబునదివ్యమత్సంహారంబునకు విజయముచేయుమనుటయు." ఆము. ౪, ఆ. (ఇది పూజ్యులయొక్క రాకపోకలయందే ప్రయోగింపఁబడెడి.)

**విజయి.** సం. విశే. (న్. ఈ. న్.) విజయముగలవాఁడు.

**విజయుఁడు.** సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. విష్ణుద్వారపాలకులలో నొకఁడు.

**విజాతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. విభిన్నజాతి; 2. విశేషజాతి.

**విజాతీయము.** సం. విశే. (అ. ఆ. అ.) విజాతిసంబంధమైనది.

**విజిగీష.** సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలి జయింపనిచ్ఛ.

**విజిగీషువు.** సం. విశే. (ఉ.) మిక్కిలి జయింపనిచ్ఛగలవాఁడు.

**విజితుఁడు.** సం. విశే. (అ. ఆ అ.) జయింపఁబడినవాఁడు.

**విజిలము.** సం. విశే. (అ. ఆ. అ.) మీఁగడగట్టినది, (పెరుఁగులోనగునది) పిచ్ఛిలము.

**విజృంభణము** సం. వి. అ. న. మిక్కిలి జృంభణము. (చూ. జృంభణము.)

**విజృంభించు.** సం. అ. క్రి. 1. చెలరేఁగు; 2. వికసించు.

**విజృంభితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వికసించినది; 2. అతిశయించినది.

**విజ్ఞప్తి.** సం. వి. ఇ. స్త్రీ. విజ్ఞాపనము, విన్నపము.

**విజ్ఞాతుఁడు.** సం. విశే. (అ ఆ. అ.) ప్రసిద్ధుఁడు.

**విజ్ఞానము.** సం. వి. అ. న. 1. శాస్త్రాదులయందలి జ్ఞానము; 2. విశేషజ్ఞానము; 3. కార్యము.

**విజ్ఞాపనము.** సం. వి. అ. న. విజ్ఞప్తి. (చూ.) విన్నపము.

**విజ్ఞాపించు.** సం. స. క్రి. విజ్ఞాపనముచేయు, విన్నవించు.

**విజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిపుణుఁడు, నేర్పరి.

**విజ్జ.** దే. అ. క్రి. వ్యాపించు. "విరులపైనఖకాంతివిజ్జరాల్చి." ఉ, హరి. ౫, ఆ.—వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. పల్యాణముల క్రిందఁబడినరాహుత్తులుఁగూలి విజ్జనఁదన్నుకొనెడిహరులు." జై. ౫, ఆ. (ఆమ్రేడితమునందు విజ్జావిజ్జి. "విజ్జావిజ్జనఁదన్నంగ." సావి. ౪, ఆ.)

**విజ్జోడు.** ద్వి. విశే. (వీడు+జోడు.) జోడుకానిది, సరికానిది. "సీ. శ్రుతులువిజ్జోడైనచోఁదంత్రివిగిసిరాఁబీడించికిటకిటబిరడఁద్రిప్పు." వై. ౧, ఆ.

**విజ్జోడుపడు.** ద్వి. అ. క్రి. భేదపడు. "సీ. కల్పనాశేళిప్రకారమాత్రములైనయస్థదాఖ్యానక్రియాదికముల, తోడనెందునొకింత విజ్జోడుపడక, సమమగుటయెట్లొయన విచారముగలిగియు." శ్రీ. ౫, ఆ.

**విటంకము.** సం. వి. అ. పుం, న. కొఁటిగయందలిగువ్వగూఁడు.

**విటకత్తె.** మి. గ్రా. వి. విటుకులాఁడి, విటి.

**విటకాఁడు.** మి. గ్రా. వి. విటుఁడు. (చూ. లోఁగలి.) (స్వార్థమున కాఁడు.)

**విటతటము.** దే. విశే. విటతాటముయొక్కరూపాంతరము. "క. పుటమెగసితాళవృక్షముఁ, జటులోద్ధతిఁబూనిపెటికి సారథినవనిన్, విటతటముగఁ బడవైచెను, బటుభుజసత్వంబుమెఱయఁ బవనజుఁడల్కన్." మై. 3, ఆ.

**విటతాటనము.** దే. విశే. తాఱుమాఱు. "సీ. మండితధ్వజదండమండలంబులుగిట్టి నిటతాటసంబుగవిఱిచివిఱిచి." భార. విరా. ౫, ఆ.

**విటతాటము.** దే. విశే.——పై.——"సీ. తరువులెల్లెడవిటతాటంబులైకూలెగ్రహతారకావళి కాంతిమాసె." భాగ. 3, స్కం.

**విటపము.** సం. వి. అ. పుం, న. 1. చిగిరించినకొమ్మ; 2. కొమ్మ; 3. చిగురు; 4. బోదెలేనిచెట్టు. డు. విటరాయఁడు.

**విటపి.** సం. వి. న్. పుం. 1. చెట్టు; 2. మఱ్ఱిచెట్టు.

**విటరాయఁడు.** వై. వి. విటశ్రేష్ఠుఁడు. "క. పటుతరమగుమద్వీణా, స్ఫుటమధురరవంబు చెవులసోఁకినమాత్రన్, విటరాయఁడైనఁగానీ, ఘటదాసుఁడుగాఁడెరెండుగడియలలోనన్." రుక్మాం. ౩, ఆ.

**విటి.** సం. వి. ఈ. స్త్రీ. విటకత్తె, విటుకులాఁడి.

**విటుఁడు.** సం. వి. అ. పుం. విటకాఁడు, పల్లవుఁడు.

**విటుకులాఁడి.** ద్వి. వి. (విటుకులు+ఆఁడి.) విటురాలు.

**విట్ఖదిరము.** సం. వి. అ. పుం. తుమ్మ. వెలితుమ్మ. (అని కొందఱు.)

**విట్చరము.** సం. వి. అ. పుం. (చూ.) ఊరఁబంది.

**విట్ఛారిక.** సం. వి. అ. స్త్రీ. కీతిగోరువంక.

**విట్టు.** నా. వి. ష. స్త్రీ. విష్ఠ, మలము

**విడంగము.** సం. వి. అ. పుం, న. 1. వాయువిళంగముగ్; 2. వంటయుప్పు. విణ. నేర్పరి.

**విడంబన.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. 1. అనుకరించుట; 2. మోసపుచ్చుట.

**విడంబించు.** సం. స. క్రి. 1. అనుకరించు; 2. మోసపుచ్చు.

**విడఁద్రొక్కు.** దే. స. క్రి. (విడన్+త్రొక్కు.) విడుచు.

**విడనాడు.** దే. స. క్రి. (విడన్+ఆడు.) ——పై.—— "ద్వి. అంతటన్నృపతిభార్యనువిడనాడి, చింతించుచును గద్దెచేరి కూర్చుండి." సా.

**విడవలి.** దే. వి. ఇండ్లకుకప్పెడు తృణవిశేషము.

**విడి.** దే. వి. 1. అరుణకాంతి; "చ. విడిగలకెంపుజూరవలపంత పనుల్గలతాళి." శుక. ౧, ఆ.—2. ప్రతాపము; "క. వెడలికడల డలవారిధి, వడువునెడపడక మ్రోయువానరసేనం, బొడగనినడవఁ గనబ్బలు, విడిఁగనుఁగొనిరఘువరుండు విస్మితుఁడగుచున్." రా. యు, కాం.—3. క్రోధము; "క. బాలకులారధరిత్రీ, పాలకుశపి యింతుననుచు బలువిడినివిలో, లాలకుఁడగుమునికుంజర, బాలకుఁ డరిగెన్ త్రిలోకపాలకులదరన్. వ. ఇట్లు రోషించి" భాగ. ౧, స్కం.—4. పరాక్రమము; "ఆ. ఉద్దవిడినపసులనూఁచ ముట్టుగఁదెత్తు." సం. "అథవాగోసహస్రాణి శుభానిచబహూనిచ, వివిధానిహరిష్యామగ ప్రతిపీడ్య పురంబలాత్." భార. విరా. 3, ఆ. "ఒండొరులబలిమ్లు." రా. యు, కాం. "బలువిడి తోడవచ్చి." రా. కిష్కిం, కాం. "వ. ఇట్లుహార్దిక్యుబలు విడికోహటించి." భార. ద్రో. ౪, ఆ.—5. ప్రత్తికాయలోని శెడ. "తే. నింగియనియెడు ప్రత్తిచేనికినిరక్త, బలియుడిరనంగనెఱ నంజతొలుతనమరఁ, దఱచుగాదానవిరిసినమెఱుఁగు బ్రత్తి, విళ్లునాఁ జొక్కలెంతయునుల్లసిల్లె." కళా. ౮, ఆ.—విణ. 1. అరుణము; "చిగురులవిడిసంజనిగుడుచోట." (విడిసంజ=ఎఱసంజే.) సావ. 3, ఆ.—2. ప్రత్యేకమైనది; (విడాకు, విడిపూస, ఒకయెద్దు విడిగామేయుచున్నది.) 3. విడువఁదగినది; (విడికథ.) 4. పని నుండివిడిచినది. (విడికోడె, ఇప్పుడు వీఁడు విడిగానున్నాఁడు.)—క్రి. విణ. ఒంటరి. "క. ఆసమయంబున భిక్షుని, వేసమునదశాననుండువిడిచనుదేరన్, భూసుతపూజయొనర్చి సు, ఖాసనమిడి మధురఫలములర్పించితగన్." (విడి=విడిగ.) అధ్యా. ఆర, కాం.

**విడిగోలు.** దే. వి. (విడి+కోలు.) మాఱుపు. విణ. పనిలేనిది.

**విడిచివాటుగుదియ.** దవ్య. వి. భిండిపాలము, సాఁగు.

**విడిదల.** దవ్య. వి. (విడిది+తల.) విడియుచోటు, విడిచినచోటు. "వ. హిరణ్వతియనుపుణ్యనదిపొంతవిడిదలగానిరూపించి." భార. ఉద్యో. ౪, ఆ.—"ధర్మసుతునివిడిదలకరిగెను." భార. ద్రో. ౨, ఆ. (దండువిడియుచోటు స్కంధావారము, దండునందొక్కొక్కఁడు విడిసినచోటు శిబిరము.)

**విడిది.** దే. వి. 1. విడియుట; "ఆ. కృష్ణుకొంగుఁగేలఁగీలించి నేడుమా, యింటవిడిదిచేసియేగుమెల్లి, యనిన." వి, పు. ౭, ఆ.—2. విడిసినచోటు. (నేను నావిడిదికిపోయెదను.)

**విడిపట్టు.** దే. వి. (విడిది+పట్టు.) విడిదిచోటు. "తే. భాసురావాసములువిడిపట్టులొసఁగి." రుక్మి. 3, ఆ.

**విడిమట్టు.** దే. వి. 1. వాసస్థానము; "ఎ, గీ. జన్నములతిండి విడిమట్టుచలువగట్టు." య. ౨, ఆ.—2. కాఁపురము; "సీ. విప్రాలయమునందు విడిమట్టుగానుండువాని వంటలలో నవ్వైవ లేదు." రుక్మాం. ౨, ఆ.—3. విడిది. "వ. తుహినాచలేంద్రుం డుతనకునియమించినవిడిమట్టు ప్రవేశించియుండె." పీర. 3, ఆ.

**విడిముడి.** దే. వి. ధనము. "క. కొడుకులుపుట్టనిమానిసి, తొడుకులుబల్మియునునిండ్లుఁదొడవులుమావుల్, పుడమియునెక్కుడు మెకములు, విడిముడియుంజట్టములును వితగాఁదలఁతున్." అచ్చ. బాల, కాం.

**విడియము.** వై. వి. విడెము. "కప్పురపున్ విడియమ్ము." శృం. 3, ఆ. (రూపాంతరము విడియ. "ద్వి. ఎక్కడివిడియలిందెవ్వరు వచ్చి, రిక్కడికనితనయింతినినడుగ." భాగ. ౫, స్కం.) (మువర్ణకములేనిరూపము గ్రంథములయందు తఱచు పాడుకలో నిదికాదు.)

**విడియు.** దే. అ. క్రి. 1. ప్రయాణమైపోవువారు దారిలోనొక చోటదిగు; 2. వీడు; "విడియంబలుకంగ." భార. విరా. ౨, ఆ.—3. జాఱు. "తే. అర్థినన్నంబుఁగుడుచుచోనందుఁగలిపి, విషముపెట్టిరిపెట్టినవిడిసిపడక, గరముతోఁగూడ సగరుండుఘనుఁడు పుట్టి, వరయశస్ఫూర్తితోఁజక్రవర్తియయ్యె." భాగ. ౯, స్కం.

**విడివడు.** దవ్య. అ. క్రి. (విడి+పడు.) 1. వీడు; "విడివడ్డ తైకతో." శకాం. ౪, ఆ.—2. జాఱు; "సీ. ఆయెల్కవిడివడి యమ్మహీసురుచేతియర్ఘ్యజలంబులయందుఁబడిన." పంచ. నా. 3, ఆ.—3. తెగనుండివేఱుపడు; (ఆయావు విడివడినది.) 4. నిర్బంధమునుండితొలఁగు. (వీఁడు విడివడి యథేచ్ఛముగా తిరుగుచున్నాఁడు.)

**విడివాటుబడియ.** దే. వి. విడిచివాటుగుదియ. "ఎ, గీ. భావభవుచేతివిడివాటుబడియదుడ్లు." కవిక. ౪, ఆ.

**విడివేఁట.** దే. వి. డేగవేఁట. "తే. అపుడువిడివేఁటవిడుమని యానతిచ్చు, రాజుముంగలికడకుఁజేరంగివచ్చి, లగుడుసాళ్వంబు డేగలోనుగనుగల్లు, వేఁటపులుఁగులవిడిచినవింటికెగసి." య. ౨, ఆ. (చూ. విడి, వేఁట.)

**విడివోవు** దే. అ. క్రి. (విడి+పోవు.) వదలు, విడివడు.

**విడు.** దే. అ. క్రి. వీడు. "విడఁబాఱుకొప్పు." కళా. 3, ఆ.—అం. ప్రే. విడుచు. "ధైర్యంబువిడఁజెట్టితత్తఱముల." పాండు. ౨, ఆ.

**విడుగడ.** దే. వి. విడుపు, విడుదల, విమోచనము. "జనకాను మతంబుననాబలారికిన్ విడుగడఁజేసె." నిర్వ. ౭, ఆ.

**విడుగర.** దే. వి.——పై.——భార. శాం. 3, ఆ.

**విడుగు.** దే. అ. క్రి. వికసించు. "విడిగెఁబయోజమ్ములు."

**విడుచు.** దే. ప్రే. విడఁజేయు, విమోచనముచేయు.

**విడుత.** దే. వి. తడవ. (నీవొకవిడుతవానితోఁజెప్పుము.)

**విడుదల.** దే. వి. విడుగడ, విడుగర, విమోచనము.

**విడుపరి.** దే. విణ. (విడుపు+అరి.) 1. పరిత్యాగశీలుఁడు; (చూ. విడుపు.) 2. త్యాగశీలుఁడు. "విడుపరితనపుబలీ." య. ౫, ఆ.

**విడుపు.** దే. వి. 1. విమోచనము, పరిత్యాగము; "ఆ. విడుపు వలయునకలవిషయవాంఛలయందు, విడుపుఁబోలుగుణమువెదకి యెందుఁ, గానరైరిబుధులుకలదెపరిత్యాగ, శీలునకునసాధ్య సిద్ధి యెందు." భార. ఆర. ౫, ఆ.—2. త్యాగము, దానము. "ఎ, గీ. పుడమి, వేల్పులకుఁదైఁడియొనఁగెడు విడుపునీట, నిండికొఱ వేమియును లేకయుండెఁగడలి." య. ౧, ఆ.

**విడుమర.** దే. వి. విడుదల, విమోచనము. "క. మనమునఁ గృపవ్రుట్టెను న, ట్లనయముఁ గీడైనయునికి కాతం డెమ్మెఁ, గనియెన విడుమర." సం. "కథం వా నవిముచ్యేనన్ కస్తస్మా న్మహాభయాత్." భార. స్త్రీ. ౧, ఆ.

**విడువడు.** ద్వ. అ. క్రి. (విడుపు+పడు.) విడివడు. (చూ. డుడుకఁడు.)

**విడూరము.** సం. వి. అ. పుం. విదూరముయొక్క రూపాంతరము.

**విడెము.** వై. వి. తాంబూలము. (విడియముయొక్క రూపాంతరము.)

**విడ్చు.** దే. ప్రే. విడుచుయొక్క రూపాంతరము. "చాలవయ్యె దీపనశ్రముల విడ్వ" భార. మహా. ౧, ఆ.

**విడ్డూరము.** వై. వి. మూర్ఖ్యము*. విశే. మూర్ఖము*.

**విడ్పు.** దే. వి. విడుపుయొక్క రూపాంతరము. (విమోచనమునకు.– "ఉ. దాస్యకృతినాజనయిత్రికినివ్విధంబునన్, రాకయుద్దైవకృష్ణ మమనంబునఁబొంగుదువిడ్పుగల్గినన్." భార. ఆను. ౧, ఆ.)

**విడ్యము.** వై. వి. విడియముయొక్క రూపాంతరము. "ఎ, గీ. తరుణధావనఖగఖగద్దశనమణుల, చాత్తుకొల్పిరిలేఁతవిడ్యములడాలు." పాండు. 3, ఆ.

**విడ్వరము.** సం. వి. అ. న. ఉపద్రవము. వి, పు. ౨, ఆ.

**విత.** వై. విశే. వితాయొక్క రూపాంతరము. శశాం. 3, ఆ.

**వితండ.** సం వి. ఆ. స్త్రీ. స్వపక్షపాతముగ వాదించెడువాదము. అ. పుం. ము. తలుపునకువేసెడు తాళము.

**వితంతువు.** సం. వి. ఉ. స్త్రీ. ముండమోపి, విధవ.

**వితంసము.** సం. వి. అ. పుం. మృగములను పక్షులనుఁబట్టెడు ఉరిత్రాడు.

**విततము.** సం. విశే. (అ. ఆ. అ.) విరివిచేయఁబడినది.

**వితతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. విరివి; 2. సమూహము.

**వితథము.** సం. విశే. (అ. ఆ. అ.) అసత్యమయినది. (మాట.)

**వితమరి.** ద్వ. విశే. (వితము+అరి.) కార్యదక్షుఁడు.

**వితము.** వై. వి. విధము. "ద్వి. ప్రతిమీఱునంకల్పభవకల్పలతిక, వితమునసతులితవిభ్రమోన్నతియు." విష్ణు. ఉ. ౪, ఆ.

**వితరణము.** సం. వి. అ. న. విడుపు, దానము, ఈవి.

**వితరణి.** సం. వి. ఇ. పుం. దాత, ఈవికాఁడు. "క. ఇచ్చిచనునర్థమెల్లను, విచ్చలవిడినప్రదాత వితరణిగాఁడే." విక్ర. ౨, ఆ.

**వితర్కము.** సం. వి. అ. పుం. 1. ఊహ; 2. సంశయము.

**వితర్కించు.** సం. అ. క్రి. 1. ఊహించు; 2. సంశయించు.

**వితర్ది.** సం. వి. ఇ. స్త్రీ. అరుఁగు. (రూ. వితర్దిక. ఆ. స్త్రీ.)

**వితస్తి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. (చూ.) జేన.

**వితా.** వై. విశే. వ్యర్థము. "వితాతోలువేల్పుమూఁకచేఁజనినకచుం దలంపమదిచాలఁగరంగదె." య. 3, ఆ.

**వితాకు.** దే. వి. 1. నిశ్చేష్టత; 2. పారవశ్యము; "చ. గడెతడవాతఁడొక్కపనిగాఁ జనియింటికి రాకయుండినన్, దడఁబడుమీఁదెఱుంగదువితాకుననుండునుజన్నలోవు." శశాం. ౨, ఆ.— 3. పరాకు; "సీ. ఈవితాకునమేఁతయిడనైతిఁ గాబ్రోదిగొరవంకకనుమఁదానరిగెనోకతె." య. ౫, ఆ.—విశే. 1. నిశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితురాలు; "శారుగునుశామ్మపిల్లు మదిఁజొక్కవితాకవు." ఇలా. 3, ఆ.—2. పరవశుఁడు. "క. కనుఁద్రామిచొక్కఁజల్లిన, యనువుననందఱువితాకులైయుండంగన్." విజ. ౧, ఆ.

**వితాకుఁడు.** దే. విశే. నిశ్చేష్టితుఁడు. "వ. కదలింపలేకవితాకుండై." రామా. ౮, ఆ. "క. నలుదిక్కుల్, కనుఁగొనుచు వితాకుఁడనై, చననేరకయుంటి." పంచ. వేం. 3, ఆ.

**వితాకుపడు.** ద్వ. అ. క్రి. నిశ్చేష్టితుఁడగు. "మూర్ఛముదప్పికంపలన్ జిక్కమదిన్వితాకుపడి చింతమునుంగుచు." ద్వా. 3, ఆ.

**వితానము.** సం. వి. అ. న. వృత్తవిశేషము. పుం, న. 1. మేలుకట్టు; 2. యజ్ఞము; 3. విరివి. పుం. 1. సమూహము; 2. అవసరము. విశే. 1. మందము; 2. శూన్యము.

**వితావిత.** వై. విశే. మిక్కిలి వ్యర్థము. "ఉ. వీరొకటబ్బెగ్రామునకు నెన్నుపొసంగవు చంద్రమఃకళా, ధారికినొక్కయొద్దవితావిత సీరములేమిఁగావునన్, సీరికినొంటిపోఁగుకువిశేషములేశివుఁడాదిభిక్షువం, చేరులునెన్నుగల్గినుసమృద్ధిగఁ బాదజులుందురప్పురిన్." శశాం. ౨, ఆ.

**వితీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది; 2. ఇయ్యఁబడినది.

**వితీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ఈవి, వితరణము.

**వితున్నకము.** సం. వి. అ. న. 1. కొతిమిరి; 2. మయిలుతుత్తము. పుం. నేలయుసిరిక*.

**వితున్నము.** సం. వి. అ. న. 1. నీరుచెంచెలి*; 2. పాఁచి*.

**విత్త.** దే. వి. మిక్కిలి చిన్నగోనె.

**విత్తనము.** దే. వి. విత్తు, బీజము.

**విత్తము.** సం. వి. అ. న. ధనము. విశే. 1. తెలియఁబడినది; 2. పొందఁబడినది; 3. ప్రసిద్ధినొందినది; 4. విచారింపఁబడినది.

**విత్తు.** దే. స. క్రి. (విత్తనములు) చల్లు. వి. విత్తనము.

**విదగ్ధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నేర్పరి; 2. చొరవకాఁడు.

**విదరము.** సం. వి. అ. న. చీల్చుట, వ్రచ్చుట.

**విదర్భ.** సం. వి. ఆ. స్త్రీ. ఒక పట్టణము. అ. పుం. ము. ఒకదేశము.

**విదళనము.** సం. వి. అ. న. 1. మిక్కిలి ఖండించుట; 2. మిక్కిలి భేదించుట.

**విదళము.** సం. వి. అ. న. కందులు మొదలగువానిపప్పు.

**విదళించు.** సం. స. క్రి. 1. మిక్కిలి ఖండించు; 2. మిక్కిలి భేదించు.

**విదళితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి ఖండింపఁబడినది; 2. మిక్కిలి భేదింపఁబడినది.

**విదారకము.** సం. వి. అ. పుం. 1. చెలమ; 2. పిల్లనూయి. విశే. చీల్చునది.

**విదారణము.** సం. వి. అ. న. 1. చీల్చుట; 2. చంపుట; 3. యుద్ధము. (ప్రవిదారణము అనియు.)

**విదారి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లనేలగుమ్మడి*; 2. ముయ్యాకుపొన్న*; 3. వ్యాధివిశేషము.

**విదారించు.** సం. స. క్రి. చీల్చు, వ్రచ్చు.

**విదారిగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న*.

**విదిక్కు.** సం. వి. శ్. స్త్రీ. రెండుదిక్కులనడుమ, మూల.

**విదితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తెలియఁబడినది; 2. అంగీకరింపఁబడినది.

**విదియ.** వై. వి. (పక్షమందు) రెండవతిథి.

**విదీర్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

**విదురు.** దే. అ. క్రి. విదులునకు మొదటిరూపము. (చూ. విదురుచే.)

**విదురుఁడు.** సం. వి. అ. పుం. ధృతరాష్ట్రునితమ్ముఁడు. విశే. 1. తెలియునట్టివాఁడు; 2. తెలిసినవాఁడు.

**విదురుచే.** దే. ప్రే. విదురఁజేయు, విదిలించు. (రూ. విదుర్చు. "బిట్టుదూలినల్దిక్కులఁగూల గాత్రమువిదిర్చె." రా. యు, కాం)

**విదురుపు.** దే. వి. విదురుచేట. (రూ. విదుర్పు. "తెక్కవిదుర్పు." ఆము. ౪, ఆ.)

**విదులము.** సం. వి. అ. పుం. 1. ప్రబ్బలి; 2. నీరుప్రబ్బలి. (రూ. విధులము.)

**విదులు.** దే. అ. క్రి. రాలు. (చూ. విదులుచు.)

**విదులుచే.** దే. ప్రే. విదులఁజేయు. (రూ. విదుల్చు. "ద్వి. దోవతి ధూళి విదుల్చుచు లేచి." హరిశ్చ. ౨, భా.)

**విదులుపు.** దే. వి. విదులుచుట. (రూ. విదుల్పు. "వ. కేలుపట్టితివంబోయి యాలజ్జావతిచేతివిదుల్పులంబడి." ప్రభా. ౫, ఆ.)

**విదువు.** సం. వి. ఉ. పుం. ఏనుఁగుకుంభస్థలమధ్యము.

**విదుషి.** సం. వి. ఈ. స్త్రీ. విద్వాంసురాలు.

**విదూరము.** సం. వి. అ. పుం. వైడూర్యమణిపుట్టెడు దేశవిశేషము.

**విదూషకుఁడు.** సం. వి. అ. పుం. శృంగారనాయక సచివులలో నొకఁడు. (చూ. సచివుఁడు.) విశే. పరులను దూఱువాఁడు.

**విదేశము.** సం. వి. అ. పుం. అన్యదేశము.

**విదేశీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అన్యదేశస్థుఁడు.

**విదేహము.** సం. వి. అ. పుం. దేశవిశేషము. విశే. దేహములేనిది.

**విద్దె.** వై. వి. విద్య. చేదువు. "క. అద్దినమునందుశుచియై, ప్రొద్దునమేల్కాంచిబుధుఁడుభువనారాధ్యన్, విద్దెలతల్లిఁబితామహు, ముద్దియఁబూజింతుననిసమున్నతభక్తిన్." శేష. ౫, ఆ. (మొదటి రూపము విద్దియ.)

**విద్దెము.** వై. వి. బాలక్రీడావిశేషము*. "సీ. వ్రేలుచేతికినిచ్చి విద్దెంబులాడంగ నిలిపినఁగొంకుచునిలువనేర్చె." వి, పు. ౭, ఆ. (మొదటిరూపము విద్దియము.)

**విద్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. చేదువు; 2. జ్ఞానము. (చతుర్విద్యలు.—ఆన్వీక్షికి, (ఇందు విజ్ఞానము తెలుపఁబడును.) త్రయి, (ఇందు ధర్మాధర్మములు తెలుపఁబడును.) వార్త, (ఇందు అర్థానర్థములు తెలుపఁబడును.) దండనీతి. (ఇందు నయానయములు తెలుపఁబడును.)—షడ్విద్యలు.—ఆకర్షణము, స్తంభనము, మారణము, విద్వేషణము, ఉచ్చాటనము, మోహనము.— చతుర్దశవిద్యలు.—చతుర్వేదములు, షడంగములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము.—అష్టాదశవిద్యలు. — చతుర్దశవిద్యలు, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము.)

**విద్యమానము.** సం. విశే. (అ. ఆ. అ.) వర్తమానము.

**విద్యాధరుఁడు.** సం. వి. అ. పుం. దేవయోనివిశేషము.

**విద్యార్థి.** సం. వి. న్. పుం. చదువుకోరువాఁడు, చదువువాఁడు.

**విద్యావంతుఁడు.** సం. విశే. (త్. ఈ. త్.) విద్యగలవాఁడు, చదువరి.

**విద్యుత్తు.** సం. వి. త్. స్త్రీ. 1. మెఱపు; 2. సంధ్య. విశే. మెఱుఁగులేనిది.

**విద్యోతించు.** సం. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగు.

**విద్రధి.** సం. వి. ఇ. స్త్రీ. కడుపులోనిబల్ల.

**విద్రవము.** సం. వి. అ. పుం. 1. యుద్ధమువలనఁబాఱిపోవుట; 2. బుద్ధి; 3. నింద; 4. కాఱుట.

**విద్రావము.** సం. వి. అ. పుం. యుద్ధమువలనఁబాఱుట.

**విద్రావితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) యుద్ధమువలనఁబాఱిపోయినవాఁడు.

**విద్రుచు.** దే. ప్రే. విదురుచేయొక్క రూపాంతరము. "సీ. మొగివిచ్చుపసిఁడిగేదఁగిఱేకుగనుపించుచువిశదచ్ఛదమ్ములవిద్రిచివిద్రిచి." పాండు. ౪, ఆ.

**విద్రుతము.** సం. విశే. (అ. ఆ. అ.) కరఁగఁబడినది.

**విద్రుమము.** సం. వి. అ. పుం. 1. పగడము; 2. పగడపుఁజెట్టు; 3. చిగురు.

**విద్రుమలత.** సం. వి. అ. స్త్రీ. గువ్వగుత్తికలి.

**విద్వాంసుఁడు.** సం. వి. స్. పుం. చేదువరి. విశే. ఎఱుకగలవాఁడు.

**విద్విషుఁడు.** సం. వి. అ. పుం. పగవాఁడు, శత్రువు.

**విద్వేషణము.** సం. వి. అ. న. 1. విరోధము; 2. షడ్విద్యలలో నొకటి. (చూ. విద్య.)

**విద్వేషము.** సం. వి. అ. పుం. పగ, విరోధము.

**విద్వేషి.** సం. విశే. (న్. ఈ. న్.) పగవాఁడు, విరోధి.

**విద్వేషించు.** సం. అ. క్రి. పగగొను, విరోధించు.

**విధ.** సం. వి. ఆ. స్త్రీ. సమృద్ధి. అ. స్త్రీ. అ. పుం. ము. 1. ప్రకారము; 2. విధి; 3. వేతనము; 4. గజకబళము. (విధాశబ్దము ప్రకారార్థమునందు పుంలింగముగాను నిఘంటువులయందు చెప్పఁబడియున్నది.)

**విధవ.** సం. వి. ఆ. స్త్రీ. పెనిమిటిలేనిది, ముండమోపి.

**విధాతృఁడు.** సం. వి. ఋ. పుం. 1. బ్రహ్మ; 2. మన్మథుఁడు. (రూ. విధాత.)

**విధానము.** సం. వి. అ. న. 1. చేయుట; 2. ఆజ్ఞ; 3. పూజ; 4. గజకబళము; 5. ఉపాయము; 6. ధనము.

**విధాయకము.** సం. వి. విధి, ఆజ్ఞ.

**విధాయకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విధించువాఁడు.

**విధాయి.** సం. విశే. (న్. ఈ. న్.)——పై.——

**విధి.** సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. చేయుట; 3. కాలము; 4. భాగ్యము; 5. అలంకార విశేషము; 6. ఏర్పాటు. (ఇది త్రివిధము.—అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి.)

**విధించు.** సం. స. క్రి. కట్టడచేయు, ఏర్పాటుచేయు.

**విధుంతుదుఁడు.** సం. వి. అ. పుం. రాహుగ్రహము.

**విధుతము.** సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది; 2. కదలింపఁబడినది.

**విధురము** సం. వి. అ. న 1. ఎడఁబాటు; 2. వైకల్యము. విశే. 1. ఎడఁబాటునొందినది; 2. వైకల్యమునొందినది.

**విధువనము.** సం. వి. అ. న. కదలించుట, విధూననము.

**విధువు.** సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు; 2. విష్ణువు; 3. కర్పూరము.

**విధూతము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలింపఁబడినది; 2. విడువఁబడినది.

**విధూతి.** సం. వి. ఇ. స్త్రీ. కదలించుట, విధువనము.

**విధూననము.** సం. వి. అ. న.——పై.——

**విధేయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వినయముగలవాఁడు.

**విద్ధకర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్దికూర.

**విద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తొలువఁబడినది; 2. త్రోయఁబడినది; 3. బాధింపఁబడినది; 4. సమానమైనది.

**విధ్వంసము.** సం. వి. అ. పుం. మిక్కిలి ధ్వంసము.

**వినత.** సం. వి. ఆ. స్త్రీ. 1. గరుత్మంతునితల్లి; 2. పంపుపెట్టె. విశే. 1. వంకరైనది; 2. వంగినది; 3. గురుశిక్షితమైనది.

**వినతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వినయము; 2. నమస్కారము.

**వినని వాఁడు.** దే. విశే. చెవుటివాఁడు, బధిరుఁడు.

**వినమితము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి వంగినది.

**వినమ్రము.** సం. వి. అ. న. తగరము. విశే. మిక్కిలి వంగినది.

**వినయము.** సం. వి. అ. పుం. 1. వినమ్రత; 2. గురుశిక్ష.

**వినాయకుఁడు.** సం. వి. అ. పుం. 1. విఘ్నేశ్వరుఁడు; 2. బుద్ధదేవుఁడు; 3. గరుత్మంతుఁడు; 4. గురువు.

**వినాశము.** సం. వి. అ. పుం. మిక్కిలి నాశము. (చూ. నాశము.)

**వినినిందించు.** సం. స. క్రి. మిక్కిలి నిందించు.

**వినికి.** దే. వి. వినుట, వినుకలి, ఆకర్ణనము.

**వినికిడి.** దే. వి. (వినికి+ఇడి.) వినికి. (స్వార్థమున ఇడి.)

**వినిమయము.** సం. వి. అ. పుం. 1. వస్తువులమాఱుపు; 2. కుదువ.

**వినియుక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) వినియోగింపఁబడినది.

**వినియోగము.** సం వి. అ. పుం. 1. ఉపయోగము; 2. నియమనము.

**వినియోగించు.** సం. స. క్రి. ఉపయోగపఱచు.

**వినిర్గతము.** సం. విశే. (అ. ఆ. అ.) బయలువెడలినది.

**వినీతము.** సం. వి. అ. పుం. చక్కగామోపెడిగుఱ్ఱము.

**వినీతుఁడు.** సం. వి. అ. పుం. వర్తకుఁడు. విశే. 1. జితేంద్రియుఁడు; 2. గురువుచేత శిక్షింపఁబడినవాఁడు; 3. గురువుచేత శిక్షింపఁబడనివాఁడు; 4. వినయముగలవాఁడు.

**విను.** దే. స. క్రి. ఆకర్ణించు. వి. ఆకాశము. "వినుపుష్పవృష్టి గురిసెన్." మార్క. ౨, ఆ. (హల్లుపరమగుచో దీనియుకారము నకు వికల్పముగా లోపంబగు. "విన్వీధి." భార. ఆది. ౨, ఆ.)

**వినుకలి.** దే. వి. వినికి, ఆకర్ణనము. "దీని విన్నయవివ్వినుకలియెట్టు లైననొకవెంటనహించితి," హరి. ఉ. 3, ఆ.

**వినుకలికంటి.** దే. వి. (వినుకలి+కన్ను.) పాము, చక్షుశ్శ్రవము.

**వినుకెంపు.** దే. వి. సూర్యుఁడు, ద్యుమణి. "సీ. వినుకెంపునగఁజాలు నునుకెంపునిగడాలు మొనయింపుకుండలంబులువెలుంగ." ఉ, రా. ౧, ఆ. (ఇట్లు వినుమానికము, వినురతనము.)

**వినుచు.** దే. అ. క్రి. వినవచ్చు. "మ. కడుంజిత్రంబుతోదప్పులన్, వినిచెన్ మానవభావగంబులుగడున్ విస్పష్టమైవీనులన్." భో. ౫, ఆ.—ప్రే. వినఁజేయు, వినిపించు. "సరస్వతివినిచెన్ మునులెల్లవినఁగ." భార. ఆది. ౪, ఆ.

**వినుచూలి.** దే. వి. వాయువు, నభస్వంతుఁడు. (రూ. విన్నుచూలి. "అవ్విన్నుచూలికొమరుఁడు." అచ్చ. సుం, కాం.)

**వినుద్రిమ్మరి.** దే. వి. (విను+త్రిమ్మరి.) ఖచరుఁడు. "సీ. వినుద్రిమ్మరులు కటివేల్పుపాజ్ఞేను బూజనలిపిన క్రొత్తచెంగలువలనఁగ." అచ్చ. అ, కాం.

**వినుప్రోలు.** ద్వి. వి. స్వర్గము.

**వినుమ్రాను.** దే. వి. కల్పవృక్షము. "సీ. వినుమ్రానిపరువంపువిరిదండవెదనంచికలయనెప్పెయిఁగమ్మకలపమలఁది." అచ్చ. సుం, కాం.

**వినువలను.** దే. వి. స్వర్గము. (రూ. విన్వలను. "విన్వలనిలోనమృతంబునురసీతస్థితిన్. ఉండుసన." భార. ఆను. ౧, ఆ.)

**వినువాఁక.** ద్వి. వి. గంగ, స్వర్నది. "సీ. కరికర్ణపుటమరుద్గతినీఁకవినువాఁక పువ్వుపుప్పొడిధూళిఁబోవఁద్రోవ." రామా. ౧, ఆ.

**వినుసిగదేవర.** ద్వి. వి. శివుఁడు, వ్యోమకేశుఁడు. "చ. వినుసిగదేవరన్ సలువ వేల్పులముప్పదిమూఁడుకోటులన్, బనిగొని." రామా. ౧, ఆ.

**వినోదము.** సం. వి. అ. పుం. 1 క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చుట, వేడుక; 2. క్రీడ.

**వినోదించు.** సం. అ. క్రి. 1. క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చు; 2. క్రీడించు.

**విన్కలి.** దే. వి. వినుకలియొక్కరూపాంతరము. "చ. వారినిద్ధఅన్, బలసి మరుండు తుల్యరసపాకము తీపులుగ్రోల్చె విన్కలిన్." హరి. ఉ. ౨, ఆ.

**విన్కి.** దే. వి. వినికియొక్కరూపాంతరము.

**విన్న.** వై. విశే. వివర్ణమైనది.

**విన్నఁబడు.** వై. అ. క్రి. (విన్న+పడు.) వివర్ణమగు. "వినమోయశ్వాస్య నీకింతమాత్రన విన్నంబడనేల." పా. ౪, ఆ.

**విన్నఁబాటు.** వై. వి. విన్నఁబడుట, వైవర్ణ్యము. "క. మురరిపుఁడుగినుకవారుణ, శరము ప్రయోగింపఁదడవశాంతంబయ్యెన్, హరుబాణముబాణాసురు,పరివారంబునకు విన్నఁబాటుదలిర్చన్." హరి. ఉ. ౭, ఆ.

**విన్నఁబోవు.** ద్వి. అ. క్రి. (విన్న+పోవు.) వివర్ణమగు. "ఆమంత్రిసందనువాక్యంబులు నిక్కమయ్యెనని విన్నంబోయి." పా. ౨, ఆ.

**విన్నన.** వై. వి. 1. వైవర్ణ్యము; "క. కన్నీరొలుకఁగవగచిన, నన్నరపతులెల్లనేడ్చి గాత్రవంబుల్, మిన్నందనశ్రుజలములు, విన్ననివదనములయందువెల్లిగొనంగన్." భార. ద్రో. ౧, ఆ. (చూ. అలకన.)—2. న్యూనత*. "తే. తొమ్మనూఱునుదొంబదితొమ్మిదియును, జలజములఁబూజచేసెను శార్ఙ్గపాణి, వేయిటికినొక్కపద్మంబువిన్ననైన, నహానియమంబునకుభంగమయ్యెననుచు." ఛీ. ౬, ఆ.

**విన్నఁవు.** వై. వి. 1. నెర్పు*; "క. అనిసవినినసుచుఁగుంఫజ, తనయుండిట్లనియెనస్త్రధ్గుని బ్రతికిం, చినమేలకాదెనీ వి, స్ననవు నెజేంగెదముగాకనరసఖదీనక." భార. సౌ. ౨, ఆ.—2. విధము*. "వ. జ్వలనజ్వాలాకలాపంబులురూపంబులు గైకొన్న విన్ననువున." ఉ, హరి. ౬, ఆ.

**విన్నపత్రిక.** మి. గ్రా. వి. (విన్నపము+పత్రిక.) విజ్ఞాపన పత్రిక. "వ. సింధుకటకాధీశ్వరుండగుసింధురాజునకుఁ దత్త్రమం బంతయుఁ దేటతెల్లంబుగావిన్నపత్రికవ్రాసిపుత్తెంచిన." భల్లా. ౪, ఆ.

**విన్నపము.** వై. వి. మనవి, విజ్ఞాపనము.

**విన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. తెలియఁబడినది; 3. విచారింపఁబడినది.

**విన్నవించు.** వై. స. క్రి. మనవిచేయు, విజ్ఞాపించు.

**విన్నాణము.** వై. వి. 1. నేర్పు*; "ఉ. ప్రాణమువంటినాకు నిజభావముఁదాఁపఁగఁ జెల్లునమ్మనీ, ప్రాణవిభుఁడ్ బ్రభూతగుణబంధురుఁదెల్పఁగదమ్మ యంచు వి, న్నాణముగానఖీజనులునల్గడలఁగదియంగ." కా. ౫, ఆ.—2. మల్లబంధము*. "సీ. చేలికిఁబట్టిన మును నన్నపువిన్నాణములు దొరఁకొన్నన, ముట్టికొనఁడు." భార. విరా. ౨, ఆ.—3. ఒప్పిదము*. "లోలశిఖరీనిబిరీనకటాక్షకాంతి వి, న్నాణముచూప." వసు. ౨, ఆ. విణ. ఒప్పిదమైనది*. శశాం. ౧, ఆ.

**విన్నాణి.** వై. వి. (విన్నాణము+ఇ.) సన్యాసి. "ఆ. వేదవిదుని చేత విన్నాణిచేతను, దపసిచేతఁబిన్నదానిచేత, రాయబారిచేత రాయసుంకరులచేఁ, గూలిపుచ్చుకొనుట చాలఁదప్పు." సం. "నశ్రోత్రియేప్రవ్రజితేనయజ్ఞే." విజ్ఞా. ప్రా, కాం.—విణ. నేర్పరి. "మ. బహువర్ణంబులుబ్రహ్మతోల్లిజగముత్పాదింపవిన్నాణి గాక." భాగ. ౨, స్కం.

**విన్ను.** దే. వి. ఆకాశము. (చూ. కిలాతము.) (వినుశబ్దమునకు మొదటిరూపము.)

**విన్యసించు.** సం. స. క్రి. ఉంచు. "వ. దక్షిణజానూరుమధ్యంబున వామపాదంబును వామజానూరుమధ్యంబునదక్షిణపాద తలంబునువిన్యసించి." కాశీ. 3, ఆ.

**విన్యస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉంచఁబడినది. (మొదటి రూపము న్యస్తము.)

**విన్యాసము.** సం. వి. అ. పుం. 1. ఉనుచుట; (మొదటి రూపము న్యాసము.) 2. రచన.

**విపంచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వీణ; 2. క్రీడ. (రూ. విపంచిక. ఆ. స్త్రీ.)

**విపక్షుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు. విణ. పక్షములేనివాఁడు.

**విపణము.** సం. వి. అ. పుం. అమ్మకము, విక్రయము.

**విపణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఇ. పుం. 1. అంగడి; 2. అంగడి వీథి; 3. అంగడియందుండు అమ్ముడుసరకు. న్. పుం. వర్తకుఁడు.

**విపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. విపత్తు; 2 యాతన.

**విపత్తు.** సం. వి. ద్. స్త్రీ. ఆపద, ఇడుమ. (దీనికి విరుద్ధార్థక పదము సంపత్తు.)

**విపథము.** సం. వి. అ. పుం. చెడుత్రోవ, దురధ్వము.

**విపన్నము.** సం. వి. అ. పుం. పాము. విణ. విపత్తునొందినది.

**విపరీతము.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యత్యస్తము.

**విపర్యయము.** సం. వి. అ. పుం. వ్యత్యాసము.

**విపర్యస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) విపర్యాసమునొందినది.

**విపర్యాసము.** సం. వి. అ. పుం. (చూ.) విపర్యయము.

**విపశ్చితుఁడు.** సం. వి. త్. పుం. చదువరి, పండితుఁడు.

**విపాకము.** సం. వి అ. పుం. 1. దుష్పాకము; 2. పరిపాకము; 3. పరిణామము; 4. పాకము. విణ. పాకముచెడినది.

**విపాదిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పాదస్ఫోటము.

**విపాశ.** సం. వి. ఆ. స్త్రీ. నదీవిశేషము. విణ. విడిచిపోయిన పాశములుగలది.

**విపినము.** సం. వి. అ. న. అడవి, వనము, అరణ్యము.

**విపుల.** సం. వి. ఆ. స్త్రీ. నేల. విణ. విరివియైనది.

**విప్పు.** దే. ప్రే. విచుచేయొక్క రూపాంతరము. వి. 1. విరియుట; "సీ. ఛిద్రోష్ఠహతెవలత్క్రూజమనఁజొట్టతోవిప్పుతోదరిఁ దొండమూడ." ఆము. ౪, ఆ.—2. విరిసిపాఱుట; "సీ. తనయభిజాతనూతెనసుపర్ణస్ఫూర్తిపిషధరంబులకెల్లవిప్పొనర్ప." వసు. ౬, ఆ.—3. వైశాల్యము; "క్రోశమువిప్పు." హరి. పూ. ౪, ఆ.—4. బాహుళ్యము. "ఈజనులవిప్పుగనుంగొన వచ్చినం బురంబునకిచటిమ్ముచాలదనఁ బుద్ధిజనించె." హరి. ఉ. ౨, ఆ.

**విప్రకారము.** సం. వి. అ. పుం. 1. తిరస్కారము; 2. అపకారము; 3. దంతనిష్పీడనమువలనఁ గలిగిన ముఖవికారము లోనగునది.

**విప్రకృతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరస్కరింపఁబడినవాఁడు; 2. అపకారముచేయఁబడినవాఁడు.

**విప్రకృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) దవ్వు, దూరము.

**విప్రతిపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కలఁత; 2. విరోధము.

**విప్రతీపము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రతికూలము. (చూ. ప్రతీపము.)

**విప్రతీసారము.** సం. వి. అ. పుం. 1. పశ్చాత్తాపము; 2. కోపము; 3. అకృత్యము.

**విప్రయాణము.** సం. వి. అ. న. యుద్ధమునఁబాఱిపోవుట, పలాయనము.

**విప్రయోగము.** సం. వి. అ. పుం. స్త్రీపురుషులయెడఁబాటు, విప్రలంభము.

**విప్రలంభము.** సం. వి. అ. పుం. 1. (చూ.) విప్రయోగము; 2. (చూ.) విసంవాదము; 3. మిక్కిలి వంచనము.

**విప్రలబ్ధ.** సం. వి. ఆ. స్త్రీ సంకేతస్థలమునందు ప్రియునిఁగానక మోసపోయి వ్యాకులతఁబొందునట్టినాయిక. (చూ. నాయిక.) విణ. వంచింపఁబడినది.

**విప్రలాపము.** సం. వి. అ. పుం. 1. పరస్పరవిరుద్ధమైనమాట; 2. అపార్థమైనమాట.

**విప్రశ్నిక.** సం. వి. ఆ. స్త్రీ. సోదెచెప్పునది, వేల్పుసాని.

**విప్రుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, పాఱుఁడు.

**విప్రుషము.** సం. వి. ష్. స్త్రీ. నీటిబొట్టు.

**విప్లవము.** సం. వి. అ. పుం. 1. కొల్లమొదలగు దేశోపద్రవము; 2. ముష్టిప్రహారాది.

**విబంధము.** సం. వి. అ. పుం. మలమూత్రబంధనరోగము.

**విబుధుఁడు.** సం. వి. అ. పుం. 1. చదువరి; 2. వేలుపు; 3. చంద్రుఁడు.

**విబూది.** వై. వి. బూది, భస్మము.

**విభక్తము.** సం. విశ. (అ. ఆ. అ.) విభాగింపఁబడినది.

**విభక్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. విభాగము; 2. ప్రథమాది. (ఇవి యేడు.—ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి.)

**విభజనము.** సం. వి. అ. న. విభజించుట, విభాగము.

**విభజించు.** సం. స. క్రి. పంచు, విభాగించు.

**విభవ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. సంపద; 2. ధనము.

**విభాకరుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**విభాగము.** సం. వి. అ. పుం. 1. పాలు; 2. పంపకము.

**విభాగించు.** సం. స. క్రి. భాగించు, పంచు. (సంవిభాగించు అనియు.)

**విభాజకము.** సం. విశ. (అ. ఈ. అ.) విభజించునది. (భాగహారమునందు విభజించుసంఖ్య.)

**విభాజితము.** సం. విశ. (అ. ఆ. అ.) విభజింపఁబడినది. (భాగహారమునందు భాగింపఁగా ఏర్పడిన మొత్తము.)

**విభాజ్యము.** సం. విశ. (అ. ఆ. అ.) విభజింపఁదగినది. (భాగహారమునందు భాగింపఁదగిన సంఖ్య.)

**విభాతము.** సం. వి. అ. న. వేకువ. (చూ.) ప్రభాతము.

**విభావన.** సం. వి. ఆ. స్త్రీ. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**విభావము.** సం. వి. అ. పుం. 1. రసోత్పాదనకారణము; (ఇది ద్వివిధము.—ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము.) 2. పరిచయము.

**విభావరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రేయి; 2. పసుపు; 3. కుంటెనకత్తె.

**విభావసుఁడు.** సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

**విభీతకము.** సం. వి. అ. పుం. తాండ్రి.

**విభీషణము.** సం. వి. అ. పుం. కిక్కసకసవు. విశ. మిక్కిలి భయంకరమైనది. వి. డు. రావణునితమ్ముఁడు.

**విభుఁడు.** సం. వి. ఉ. పుం. 1. ప్రభువు; 2. శివుఁడు; 3. బ్రహ్మ; 4. సర్వవ్యాపకుఁడు.

**విభూతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తిర్యక్పుండ్రధారులు ధరించెడు భస్మము; 2. ఒక ఐశ్వర్యము. (చూ. ఐశ్వర్యము.)

**విభూషణము.** సం. వి. అ. న. తొడవు, ఆభరణము.

**విభ్రమము.** సం. వి. అ. పుం. 1. భ్రాంతి; 2. వస్త్రభూషణాదిప్రయుక్తమైనకాంతివిశేషము; 3. వచనభూషణవిపర్యాసరూపమైన స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.

**విభ్రాట్టు.** సం. విశ. (ట్.) (భూషణాదులచేత) ప్రకాశించువాఁడు.

**విమతుఁడు.** సం. వి. అ. పుం. శత్రువు. విశ. విరుద్ధమైన మతముగలవాఁడు.

**విమనుఁడు.** సం. విశ. (స.) (చూ.) అంతర్మనుఁడు.

**విమర్దనము.** సం. వి. అ. న. 1. చందనములోనగువానిపూయుట; 2. కస్తూరిలోనగువానినూఁకుట.

**విమర్శనము.** సం. వి. అ. న. (చూ.) పరామర్శము.

**విమర్శము.** సం. వి. అ. పుం. ఒక నాటకసంధి. (చూ. సంధి.)

**విమర్శించు.** సం. స. క్రి. పరామర్శముచేయు.

**విమల.** సం. వి. ఆ. స్త్రీ. సంబరేను*. విశ. 1. నిర్మలమైనది; 2. ఒప్పిదమైనది.

**విమాత.** సం. వి. ఋ. స్త్రీ. సవతితల్లి.

**విమానము.** సం. వి. అ. పుం, న. 1. అంతరిక్షమునందు దేవతలు ఎక్కి సంచరించెడు రథము; 2. చక్రవర్తియొక్క సౌధము; 3. గుఱ్ఱము; 4. నీళ్లమీఁద జనులెక్కి పోయెడు కలము.

**విముక్తము.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి విడువఁబడినది.

**విముఖుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) పరాఙ్ముఖుఁడు.

**విమోచనము.** సం. వి. అ. న. మిక్కిలి విడుపు.

**విమోహము.** సం. వి. అ. పుం. మిక్కిలి మోహము.

**విమోహించు.** సం. అ. క్రి, మిక్కిలి మోహించు.

**విమోహితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి మోహించినవాఁడు.

**వియచ్చరుఁడు.** సం. వి. అ. పుం. దేవయోనివిశేషము, ఖచరుఁడు, మింటితెరువరి.

**వియత్తు.** సం. వి. త్. న. ఆకాశము, మిన్ను.

**వియద్గంగ.** సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ, మిన్నేఱు.

**వియమము.** సం. వి. అ. పుం. 1. హింసాదులవలన నడుగుట; 2. బాధ.

**వియాతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దిట్టతనముగలవాఁడు.

**వియామము.** సం. వి. అ. పుం. వియమముయొక్క రూపాంతరము.

**వియుక్తము.** సం. విశ. (అ. ఆ. అ.) వియోగముగలది.

**వియోగము.** సం. వి. అ. పుం. ఎడఁబాటు, విరహము. (దీనికి విరుద్ధార్థకపదము సంయోగము.)

**వియ్యంకుఁడు.** దే. వి. (వియ్యము+అంకుఁడు.) వియ్యమందినవాఁడు. (పెండ్లికొమార్తతండ్రికి పెండ్లికొమారునితండ్రియు, పెండ్లికొమారునితండ్రికి పెండ్లికొమార్తతండ్రియు పరస్పరము వియ్యంకులని యెఱుంగునది.)

**వియ్యంకురాలు.** దే. వి. (వియ్యంకుఁడు+ఆలు.) వియ్యమందినది. (పెండ్లికొమార్తతల్లికి పెండ్లికొమారునితల్లియు, పెండ్లికొమారునితల్లికి పెండ్లికొమార్తతల్లియు పరస్పరము వియ్యంకురాండ్రని యెఱుంగునది.)

**వియ్యపురాలు.** దే. వి. (వియ్యము+ఆలు.) వియ్యంకురాలు.

**వియ్యపుసాని.** దృ. వి. (వియ్యము+సాని.) వియ్యపురాలు.

**వియ్యమందు.** దే. అ. క్రి. (వియ్యము+అందు.) సంబంధము చేయు. భార. ఆర. 2, ఆ. "ఈనత్యసౌభాగ్యవర్ధనుతో నియ్యెడ వియ్యమందఁగలిగెఁ ధన్యుండనైతిఁ." రామా. ౪, ఆ.

**వియ్యము.** దే. వి. 1. వైవాహికసంబంధము; 2. వియ్యంకుఁడు. "వియ్యముదలంపక లచ్చిఁగన్నయ్య." చంద్రా. ౧, ఆ.

**విరక్తి.** సం. వి. ఇ. స్త్రీ. రాగములేమి, విరాగము.

**విరక్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విరక్తిగలవాఁడు; 2. అనురాగములేనివాఁడు.

**విరచించు.** సం. స. క్రి. విశేషముగా రచించు.

**విరచితము.** సం. విణ. (అ. ఆ. అ.) విశేషముగా రచింపఁబడినది.

**విరజ.** సం. వి. ఆ. స్త్రీ. వైకుంఠమునందుండు నొకానొకనది.

**విరజస్తమసుఁడు.** సం. వి. స్. పుం. రజస్తమోగుణములులేనివాఁడు, సాత్త్వికుఁడు.

**విరజాజి.** దక్. వి. జాజివగ, నవమాలికి. "సీ. విరజాజివిరులయొవరులముంగిటిచాయ నల్లిబిల్లిగద్రాక్షల్లుకొనియె." భాను. ౨, ఆ.

**విరజాది.** దక్. వి. విరజాజియొక్క రూపాంతరము.

**విరటుఁడు.** వై. వి. విరాటరాజు.

**విరతము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి విరతిఁబొందినది.

**విరతి.** సం. వి. ఇ. స్త్రీ. విశ్రాంతి, విరామము, ఉడుగుట.

**విరమించు.** సం. అ. క్రి. విశ్రాంతిఁబొందు, ఉడుగు.

**విరవాజి.** దక్. వి. విరజాజియొక్క రూపాంతరము. (చూ. విరవాది.)

**విరవాది.** దక్. వి. విరవాజియొక్క రూపాంతరము. "రగడ. మితిలేనితేనెనామెతఁజేసెవిరవాది,యితరలతికలమరగియేఁగునదిపరవాది." సాక్. 3, ఆ.

**విరవిర.** యు. దే. వి. 1. విరియుటయందగు ధ్వన్యనుకరణము; "తోవలువిరవిరవిరిసెఁ." సా. 3, ఆ.–2. త్రెళ్లుటయందగు ధ్వన్యనుకరణము. "విరవిరఁద్రెళ్లినొవ్వడరివిహ్వలుఁడై." నిర్వ. ౪, ఆ.–వై. వి. విలవిలయొక్క రూపాంతరము. (చూ. విరవిరవాటు, విరవిరవోవు.)

**విరవిరవాటు.** దక్. అ. క్రి. (విరవిర+పాటు.) విరవిరవోవు. "చ. మైవిరవిరవాటుఁజేనడలివిల్లువడంగనిరాకుఁడిట్లనెఁ." రా. యు, కాం.

**విరవిరవోవు.** దక్. అ. క్రి. (విరవిర+పోవు.) విలవిలవోవుయొక్క రూపాంతరము. (చూ. నివువెండ్రుకవెట్టు.)

**విరసము.** సం. వి. అ. పుం. అర్థదోషములలో నొకటి. విణ. 1. రసములేనిది; 2. విరుద్ధరసముగలది.

**విరసించు.** సం. అ. క్రి. 1. విరసత్వమునొందు; 2. ద్వేషించు. "సీ. కలనైననెదిరింపఁదలఁకుమల్లోకంబువిరసించియేఘోరుఁడౌర యునతని." జై. ౬, ఆ.

**విరహము.** సం. వి. అ. పుం. ఎడఁబాటు, వియోగము.

**విరహి.** సం. వి. న్. పుం. విరహముగలవాఁడు.

**విరహిణి.** సం. వి. ఈ. స్త్రీ. విరహముగలది.

**విరహితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది; 2. లేనిది.

**విరహోత్కంఠిత.** సం. వి. ఆ. స్త్రీ. వేళకునాయకుఁడురాక తడయఁగా విరహముచేత తహతహపడునాయిక. (చూ. నాయిక.)

**విరళి.** సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పి*.

**విరళము.** ఉబ. దే. వి. ఒకవిధమైనపన్ను. (విరాళముయొక్క రూపాంతరము.) సం. అ. న. పెరుఁగు. విణ. ఎడమయినది.

**విరళి.** వై. విణ. విశాలము*.

**విరాగుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) విషయేచ్ఛారహితుఁడు.

**విరాజమానము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించుచున్నది.

**విరాజితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశితము.

**విరాట్టు.** సం. వి. జ్. పుం. 1. ఆదిదేవుఁడు; 2. క్షత్రియుఁడు; 3. గరుత్మంతుఁడు.

**విరామము.** సం. వి. అ. పుం. విశ్రాంతి, ఉడుగుట.

**విరాలము.** సం. విణ. (అ ఆ. అ.) వలపుఁబుట్టించునది. "ఉ. అంతవసంతకాలమునసంచితసాలముకోకిలారవా, క్రాంతదిగంతరాలముశుకప్రియలీలనుమత్తభృంగ వి, శ్రాంతలతాంతజాలముపరాగవిశాలము పాంథకామిపీ, కాంతమనోవిరాలము జగత్త్రయమోహనరీతిఁదోఁచినఁ." భాను. ౨, ఆ. (ఒకఁడు విరాళము వైకృతమనె.)

**విరావము.** సం. వి. అ. పుం. మ్రోఁత, ధ్వని.

**విరాళము.** యు. దే. వి. ఒకవిధమైన పన్ను. వై. వలపు. "సీ. కొమ్మసింగారంపుఁగొలఁకునఁదేలకబలువిరాళపువెట్టతోలఁగుబెట్టు." నీలా. ౨, ఆ.

**విరాళి.** వై. వి. 1. వలపు*; "చ. మెలఁతుకరంగవల్లభునిమీఁది విరాళిఁబ్రియంబుతోడనె, చ్చెలులువచించుపల్కుచెవిఁజేర్చదు." పర. 3, ఆ.–2. భక్తి*. "చ. మననునవిష్ణుచింతనలుమానఁడు నీనివిరాళియెట్టిదో." వి, పు. ౨, ఆ.

**విరి.** దే. వి. పుష్పము. విణ. 1. వికసించినది; "సీ. శ్రీరమ్యుఁడగునాదినారాయణునినాభిఁ బొలుపారవిరిదమ్మిపూవుపొడమె." భో. ౧, ఆ.–2. విడినది; "విరిదల." రా. బాల, కాం.–3. తొలఁగినది. "మొగులువిరియెండ." రామా. ౬, ఆ.

**విరించనుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

**విరించము.** సం. వి. అ. పుం. దినముయొక్క పదవభాగము. (చూ. దినము.)

**విరించి.** సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.

**విరించుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, విరించనుఁడు.

**విరిగి.** దే. వి. శ్లేష్మాతకము*.

**విరిఁబోఁడి.** దే. వి. 1. పుష్పమువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

**విరిదట్టు.** దే. విణ. (విరి+తట్టు.) ఎడఁబాటునొందినది, వియుక్తము. "క. విరసంబునఁదమునిరువుర, విరిదట్టుగఁజేసినట్టివిశ్వావసుఁడు." వి, పు. ౬, ఆ.

**విరిపోటు.** దే. వి. భేదము. "క. పేఁశెత్తిరిపులలోవిరి, పోటుకు సదుపాయమొకటి పుట్టింపఁదగుఁ, మాటుండియైనఁదాఁగను, చాటున మృగయుండువేఁటనలిపెడురీతిఁ." కవిక. ౨, ఆ.

**విరిపోటుసేయు.** దక్. స. క్రి. (విరిపోటు+చేయు.) భేదించు. "మీటితమ్ములవిరిపోటుసేయకయున్న." కా. ౧, ఆ.

**విరియఁబడు.** ద్వ. అ. క్రి. (విరియన్ + పడు.) విరియు. సీను. "విరియంబడివేనలిధూళిబ్రుంగ." మార్క. ౧, ఆ. (స్వార్థమున పడు.)

**విరియఁబాఱు.** దే. అ. క్రి. (విరియన్ + పాఱు.) 1. వికసించు; (చూ. కమ్మనీరు.) 2. వీడు; "సీ. తిరముగాముడువమి విరియఁబాఱెడు కొప్పుఁ దోడ్తోడనొకకేలఁదుఱుముకొనుచు." కళా. 3, ఆ.—3. వ్యాపించు; "ఎ, గీ. కాంతకబరీభరంబును గారుమొగులు, వితతముగనంతకంతకు విరియఁబాఱె." కళా. 2, ఆ.—4. పగులు. "చ. అలరుసురంటిగూండ్లమును పంతటఁబెట్టిన బొండుమల్లెమొ, గ్గలగమిగాలిగ్రుడ్లుతటిగాఁవునవే విరియంగఁ బాఱఁగా." చంద్రా. ౨, ఆ. (చూ. పాఱు.)

**విరియఁబోయు.** దే. స. క్రి. (విరియన్ + పోయు.) (తలవెంట్రుకలను ముడిదీసి) వ్రేలాడవిడుచు.

**విరియు.** దే. అ. క్రి. 1. వికసించు; "మ. నా, పతినోవృక్షమ కానవే యనన పుష్పంబయ్యె గోఁగంతలో, నతఁడుందోఁచిననవ్వుడున్ విరిసెఁ బ్రాంతాంచన్న మేరుద్రువున్." ఆము. ౫, ఆ.—2. పగులు; "మత్తమఘలిట్కోలాహలాసీవ్రతమైవిరిసెన్ దిక్కులు." భీ. ౬, ఆ.—3. వీడు; "క. తరిత్రాడుఁజేతికవ్వముఁ, దెరుగకయుండంగబిట్టుతెమ్మనితిగుచున్, బొరిఁబొరిగనయంబున ముడి, విరియవలువచెఱఁగువట్టి వ్రేతలనీడ్చున్." హరి. పూ. ౫, ఆ. — 4. చెదరు; "తే. అంతఁబరమేష్ఠిచోదితమైనయొక్క, మారుతమునలిరేఁగిదుర్వారభంగి, విలయకాలవిశృంఖలవిపులవారి, ధరచయంబులనెల్లనువిరియనడుచు." భార. ఆర. ౪, ఆ.—5. తొలఁగు; "చ. దురితముచేసితాపమునఁదూలిననింకిటుసేయ నన్ మతిన్, బొరసినధర్మనంచరణబుద్ధియమేలనియూఁదినంగృపా, పరుఁడయిమేలుచేసిననుబాదముపాదముగాఁగ్రమంబునన్, విరియునమస్తముం దదభివిష్టకలంకమునిర్భయంబుగన్." భార. శాం. 3, ఆ —6. ఉప్పొంగు. "ధరణిబెట్టూటాడెన్ వననిధులు విరిసె." పాండు. ౫, ఆ. (చూ. దీనికి ముందువెనుకటిభాగములను మినుకులబరణి, నిప్పుక.)

**విరివాయు.** దే. అ. క్రి. (విరి + పాయు.) పాయవడు, చీలు. "మెఱుఁగుందోడవై విరివాసివచ్చునూతనకిరణామృతౌఘముల దండ." వసు. ౨, ఆ.

**విరివి.** దే. వి. విస్తృతి. విణ. విస్తృతము.

**విరివిడి.** దే. వి. (విరివి + ఇడి.) విస్తృతి. విణ. విస్తృతము. (స్వార్థమున ఇడి.)

**విరివిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు, పుష్పధన్వుఁడు. య. ౫, ఆ. (ఇట్లు విరివిలుతుఁడు.)

**విరుద్ధము.** సం. వి. అ. పుం. అర్థదోషములలోనొకటి. విణ. విరోధముగలది.

**విరూపము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విరుద్ధరూపముగలది; 2. వంకరైనది; 3. ఱేసి.

**విరూపాక్షుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ఱేనికంటి.

**విరేచనము.** సం. వి. అ. న. పొసనము. పుం. గొలుసు.

**విరోచనుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. చంద్రుఁడు; 3. అగ్ని; 4. ప్రహ్లాదునికొడుకు.

**విరోధనము.** సం. వి. అ. న. విరోధించుట, పగగొనుట.

**విరోధము.** సం. వి. అ. పుం. 1. పగ; 2. మాఱు; 3. అడ్డంకి; 4. ఎడఁబాటు.

**విరోధి.** సం. వి. న్. పుం. 1. పగవాఁడు; 2. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**విరోధించు.** సం. అ. క్రి. ద్వేషించు, పగగొను.

**విరోధికృత్తు.** సం. వి. త్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**విఱిగి.** దే. వి. పగుళ్లువాసిననేల.

**విఱిచికట్టు.** దే. స. క్రి. (చేతులను) వెనుకకు మరలించికట్టు. వి. బ. (చేతులను) వెనుకకు మరలించికట్టుట. "ద్వి. మటుమాయచిత్రాంగి మాటలేనీకు, విఱిచికట్లాయె." సా. ౪, భా.

**విఱివి.** దే. వి. విస్తృతి "చ. తఱచయినీలనీరదవితానముపైపయిఁ గప్పి యెంతయున్, విఱివిగనేలయుందిశలునింగియు నిండఁగ, బర్వె." మార్క. ౨, ఆ.—విణ. విస్తృతము. (చూ. విరివి.)

**విఱుగఁబడు.** ద్వ. అ. క్రి. 1. గర్వించు; 2. ఓడు. "వ. ఇట్లుచెట్లువెడలివింధ్యమువంచుకొని నుంచుకొననన్నల్ల వ్రజంబూచి హాల్లకల్లోలంబై విఱుగంబడునెడ." ఆము. ౬, ఆ.

**విఱుగఁబాటు.** ద్వ. వి. (విఱుగఁబడుట.) 1. గర్వించుట; 2. ఓడుట. "ఎ, గీ. విఱుగఁబాటులవేఁపునవెడలుగొరక, లు." కవిక. ౨, ఆ.

**విఱుగడ.** దే. వి. విరామము, ఉడుకువ. "క. రాగాదిదోషదూషిత, మైగర్హితమైనచిత్తమదినంసారం, బాగతిఁబరిత్యజించిన, వేగమెభవబంధములకు విఱుగడగాంచున్." వా. ౨, ఆ.

**విఱుగు.** దే. అ. క్రి. 1. తునియు; "విఱిగెంబెక్కురథంబులొక్కమొగి." భార. ద్రో. ౪, ఆ.—2. ఓడు; "ఎ, గీ. తత్సైన్యములుసెడ, విఱిగిపాఱెభీష్ముఁడుపురంబొచ్చె." భార. విరా. ౫, ఆ.—3. పాకముచెడు. (నెత్తురువిఱిగెను, పాలువిఱిగెను, మందువిఱిగెను, మనసువిఱిగెను మొ.) వి. తునియుట. "క. తఱి నంతవేఁడుకొనపిన, నెఱుఁగనినానిష్ఠురతకు నేడువిఱుగులకన్, విఱిగనొకొప్రియునిచిత్తము, విఱుగకయున్నందయ్యఱించివెననేలచనున్." ప్రభా. ౫, ఆ. (చూ. విఱుగు. తునియుటకు.—"ద్వి. వీనువినోదమైయెక్కిడితివియఁ, బూనినఁజాపమవ్వఁడునిర్గెఁగాక." రా. బాల, కాం.)

**విఱుగుడు.** దే. వి. విఱిగినవస్తువు. (పాలవిఱుగుడు మొ.) విణ. విఱువైనది. (అది దానికి విఱుగుడు.)

**విఱుచు.** దే. స్రే. విఱుగఁజేయు.

**విఱుపు.** దే. వి. విఱుచుట. విణ. విఱుగుడు.

**విట్టువీఁగు.** దే. అ. క్రి. (వీఁగు + వీఁగు.) మిక్కిలినిక్కు. "యౌవనదర్పంబునవిట్టువీఁగి." భల్లా. 3, ఆ.

**విలంఘించు.** సం. స. క్రి. లంఘించుయొక్కరూపాంతరము.

**విలంబము.** సం. వి. అ. పుం. 1. జాగు; 2. వ్రేలుట. (రూ. విలంబనము. అ. న.)

**విలంబితము.** సం. వి. అ. న. నృత్తగీతవాద్యములయందు చౌకపుకాలము. విణ. (అ. ఆ. అ.) 1. జాగుగలది; 2. వ్రేలునది.

**విలంభము.** సం. వి. అ. పుం. ఈవి, త్యాగము.

**విలక్షణము.** సం. వి. అ. న. కారణములేనియునికి. విణ. 1. వేఱైనది; 2. విశేషమైన లక్షణముగలది.

**విలక్షుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెఱఁగుపడ్డవాఁడు; 2. సిగ్గుపడ్డవాఁడు.

విలగ్నము. సం. వి. అ. పుం., న. నడుము. విశ. చక్కగా కలిసి నది.
విలపనము. సం. వి. అ. న. విలాపము, వాచేరపము.
విలపించు. సం. అ. క్రి. దుఃఖముతో వనరు, వాచేరు.
విలయము. సం. వి. అ. పుం. ప్రళయము.
విలవిల. యు. దే. వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. విలవిలఁదన్నుకవిడిచెఁబ్రాణములు." సశ. ౪, భా. – వై. విహ్వలత*. (చూ. విలవిలపోవు.)
విలవిలపోవు. ద్వి. అ. క్రి. విహ్వలతఁజెందు. (చేతులుకాళ్లు విలవిలపోవుచున్నవి.)
విలసనము. సం. వి. అ. న. 1. క్రీడ; 2. ప్రకాశము.
విలసితము. సం. విశ. (అ. ఆ. అ.) 1. క్రీడితము; 2. ప్రకాశితము.
విలసిల్లు. సం. అ. క్రి. 1. ప్రకాశించు; 2. ఒప్పు.
విలాతి. దే. వి. దేశము. "చ. గారవమెుఱుతోఁ, బనుపునకిచ్చెనంత వృషపర్వుఁడు కొన్నివిలాతులత్తఱిన్." య. ౪, ఆ. (రూ. విలాయతి.)
విలాపము. సం. వి. అ. పుం. దుఃఖముతోడిమాట, వాచేరపము.
విలాపించు. సం. అ. క్రి. విలపించు, వాచేరు.
విలాసము. ఉభ. దే. వి. జేబుమీఁదవ్రాసెడుచిరునామా. (ఇది యన్యదేశ్యము.) సం. అ. పుం. 1. క్రీడ; 2. ప్రియసందర్శనాదులచేతనగు యానావలోకనాది క్రియావిశేషరూపమైన స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.
విలాసి. సం. వి. న్. పుం. 1. మన్మథుఁడు; 2. చంద్రుఁడు; 3. విష్ణువు; 4. శివుఁడు; 5. అగ్ని. విశ. విలాసవంతుఁడు.
విలాసిని. సం. వి. ఈ. స్త్రీ. 1. విలాసవతియైన ఆఁడుది; 2. ఆఁడుది; 3. వేశ్య.
విలియవేయు. దే. క్రి. నరిచేయు, తీర్చుబుచు.
విలీనము. సం. విశ. (అ. ఆ. అ.) కరఁగినది, విద్రుతము.
విలు. దే. వి. విల్లుయొక్కరూపాంతరము. (చూ. కాటియ.) (హల్లు పరమగుచో దీనియుకారమునకు వికల్పముగాలోపంబగు. "విల్ గుడు సైయుండుటయున్." రా. అర, కాం. ౧, ఆ.)
విలుకాఁడు. దే. విశ. విల్లుపూనినవాఁడు, ధానుష్కుఁడు. "రఘుశేఖరబల్విలుకాఁడవౌదు." రామా. ౫, ఆ. (రూ. విల్కాఁడు.)
విలుచు. దే. స. క్రి. వెలయిచ్చి కొను. "సీ. విలుచుటనమ్ముట నొలయదువంచన యర్థలాభంబులేయనుభవింతు." భార. శాం. ౫, ఆ. (రూ. విల్చు. చూ. పోకడపెట్టు రెండవయర్థము.)
విలుదాలుపు. దే. విశ. (విలు+తాలుపు.) విల్లుతాల్చినవాఁడు, ధనుర్ధరుఁడు. "విలుదాలుపుఁబ్రోడలు." రామా. ౫, ఆ. (రూ. విలుదాల్పు.)
విలువ. దే. వి. వెల, క్రయము. (చూ. చేలువ మొదటియర్థము.)
విలువకాఁడు. దే. వి. వెలయిచ్చి కొనువాఁడు, క్రయికుఁడు. (రూ. విల్వకాఁడు. "ఉ. విల్వకా, బొత్తిడిపుష్పముల్ గొనర కూరకయున్కికనల్లనవ్వుచున్." విక్ర. ౧, ఆ.)
విలేపనము. సం. వి. అ. న. 1. పూఁతపూసికొనెడు చందనాది; 2. చందనాదులపూఁత.
విలేపి. సం. వి. ఈ. స్త్రీ. కాఁచుపుగంజి, వెలవ.
విలోకించు. సం. స. క్రి. చూచు, అలోకించు.
విలోమము. సం. వి. అ. పుం. 1. కుక్క; 2. పాము. (డు. వరుణుఁడు.) విశ. అవరోహణక్రమముగలది.
విల్లు. దే. వి. ధనువు. (దీనిభేదములు.—తడవిల్లు, వెదురువిల్లు, సెలసువిల్లు మొ.) "తే. విల్లుపట్టినపదియేనువాళ్లలోన, వీఁకగలిగినతడవిల్లువెదురువిల్లు, సెలసుఁవిల్లునమొదలైనచేగవిండ్లు, చలుకగాఁదీసితబరేంద్రసూనుఁడేయ." కాశ. 3, ఆ.
వివక్ష. సం. వి. ఆ. స్త్రీ. చెప్పనిచ్ఛ.
వివక్షించు. సం. అ. క్రి. చెప్పనిచ్ఛించు.
వివక్షితము. సం. విశ. (అ. ఆ. అ.) చెప్పనిచ్ఛించినది.
వివక్షువు. సం. విశ. (ఉ.) చెప్పనిచ్ఛించువాఁడు.
వివధము. సం. వి. అ. పుం. 1. కావడి; 2. త్రోవ; 3. బరువు.
వివరణము. సం. వి. అ. న. వ్యాఖ్యానము.
వివరము. ఉభ. వై. వి. వివరణము. సం. అ. న. 1. రంధ్రము; 2. దూషణము.
వివరించు. వై. స. క్రి. 1. వక్కాణించు; "ఉ మా, దేవకిగన్నబిడ్డ నను దిట్టుచునన్ననిఁజంపనెవ్వఁడో, దేవుఁడుబాలుఁడై వసుమతిన్ జనియించినవాఁడటంచునా, తో వివరించిపోయె." వి. పు. 2, ఆ.—2. విచారించు*; (చూ. విసుమానము. వి.) 3. ఆలస్యముచేయు*. "వివరింపనెడములేదిఁక." య. ౪, ఆ.
వివర్ణుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. వెల్లఁబాఱినవాఁడు; 2. అధముఁడు; 3. మూర్ఖుఁడు.
వివర్తనము. సం. వి. అ. న. చుట్టివచ్చుట, తిరిగివచ్చుట.
వివర్తము. సం. వి. అ. పుం. 1. తిరిగివచ్చుట; 2. నృత్యము; 3. సమూహము.
వివర్ధనము. సం. వి. అ. న. విశేషవర్ధనము.
వివశుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. మరణకాలము సమీపించుటచేత కలఁతనొందినబుద్ధిగలవాఁడు; 2. స్వవశముగాని బుద్ధిగలవాఁడు.
వివస్వంతుఁడు. సం. వి. త్. పుం. 1. సూర్యుడు; (ఇతని పట్టణము వివస్వతి. ఈ. స్త్రీ.) 2. వేలుపు.
వివాదము. సం. వి. అ. పుం. తగవు. (ఇది పదునెనిమిది విధములుగలది.—అప్పుపుచ్చుకొనుట, సొమ్ముదాఁచుట, ఒకరిసొమ్మును తాను అమ్ముట, ఉమ్మడిబేరము, ఇచ్చినదాని మరలించుట, జీతమియ్యమి, ఒప్పుకొని మరలఁబడుట, క్రయవిక్రయములుచేసి తిరుగఁబడుట, స్వామిభృత్యన్యాయము, సీమానిర్ణయము, దండవాక్పారుష్యములు, దొంగతనము, బందిపోటులోనగు సాహసము, స్త్రీసంగ్రహణము, భార్యాభర్తృక్రమము, దాయభాగము, ద్యూతము, ప్రాణిద్యూతము.)
వివాహమగు. సం. స. క్రి. (వివాహము+అగు.) పెండ్లాడు. "విశ్రవసుండునమ్మునితవేడుకతోడవివాహమై." నిర్వ. ౨, ఆ.
వివాహము. సం. వి. అ. పుం. పరిణయము, పెండ్లి. (అష్టవిధవివాహములు.—బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము.)

**వివిక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఏకాంతము; 2. విభిన్నము; 3. పవిత్రము; 4. వివేకముగలది.

**వివిధము.** సం. విణ. (అ. ఆ. అ.) అనేకవిధములుగలది.

**వివీతము.** సం. వి. అ. పుం. పసులుమేయు కంచె.

**వివృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తెఱవఁబడినది; 2. వికసించినది.

**వివేకము.** సం. వి. అ. పుం. 1. దేహాత్మాది విభేదజ్ఞానము; 2. విభేదము; 3. విచారము.

**వివేకి.** సం. వి. న్. పుం. విచారణచేయువాఁడు. విణ. వివేకము గలవాఁడు.

**వివేకించు.** సం. స. క్రి. విచారించు. "క. తరుణీత్షుధామరాణాం, వరుచిర్న చకాలమనుచునగులాడుటలో, నరసి వివేకింపం దగుఁ, దెరువరులకుఁబాయసంబు తిరిసినఁగలదే." పాండు. ౪, ఆ.

**వివేచనము.** సం. వి. అ. న. వివేకించుట.

**వివేచనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) వివేకింపఁదగినది.

**వివేచించు.** సం. అ. క్రి. వివేచనచేయు, వివేకించు.

**విన్వచ్చేము.** వై. వి. బీభత్సరసము.

**విన్వచ్చేఁడు.** వై. వి. అర్జునుఁడు. "ఉ. ఈ, వచ్చుచునున్న వాఁడు బలవద్రిపుభీషణబాహుఁడైనవి, వ్వచ్చుఁడ." భార. విరా. ౪, ఆ.

**విశంకటము.** సం. విణ. (అ. ఆ, ఈ. అ.) విరివిగలది.

**విశదము.** సం. వి. అ. పుం. విణ. 1. తెల్లనిది; 2. స్పష్టమయినది.

**విశదీకరించు.** సం. స. క్రి. స్పష్టముచేయు.

**విశయము.** సం. వి. అ. పుం. 1. వాసస్థానము; 2. సందేహము.

**విశరఘాతము.** సం. వి. అ. పుం. చంపుట, వధము.

**విశల్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. తఱిగొఱ్ఱి; 2. తిప్పతీఁగ; 3. తెల్లతెగడ; 4. దంతిచెట్టు. విణ. శల్యములేనిది.

**విశల్యకరణి.** సం. వి. ఈ. స్త్రీ. ఓషధివిశేషము. (దీనితోచేరిన తక్కినమూఁడు.—సంధానకరణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి.)

**విశసనము.** సం. వి. అ. న. వధము, చంపుట. పుం. కత్తి.

**విశసించు.** సం. స. క్రి. విశసనముచేయు, చంపు.

**విశాఖ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక నక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. కాఁకరతీగె. అ. న. ము. విలుకాఁడు రెండుకాళ్ల నడుమ జేనెఁడుడుముగలుగనిలుచుట. (చూ. స్థానము.) పుం. నూలువడికెడు కదురు. విణ. శాఖలులేనిది.

**విశాఖుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి.

**విశాయము.** సం. వి. అ. పుం. 1. కావలివారు పర్యాయక్రమమునపరుండుట; 2. పర్యాయము.

**విశారదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. విద్వాంసుఁడు; 2. నేర్పరి.

**విశాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దపాఁపరకాయ; 2. ఉజ్జయిని. విణ. విరివియైనది.

**విశాలత్వక్కు.** సం. వి. చ్. పుం. పెడాకులరేఁటికాయ.

**విశాలాక్షి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. విశాలములైన కన్నులుగల ఆఁడుది.

**విశిఖ.** సం. వి. ఆ. స్త్రీ. 1. రాజమార్గము; 2. పాఱ. అ. పుం. ము. 1. బాణము; 2. చిల్లకోల. విణ. శిఖలేనిది.

**విశిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కూడుకొన్నది; 2. మిక్కిలి శిష్టమైనది.

**విశీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వదలినది; 2. కుఱ్ఱించినది.

**విశుఁడు.** సం. వి. శ్. పుం. 1. కోమటి; 2. మనుష్యుఁడు.

**విశృంఖలము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డులేనిది.

**విశేషకము.** సం. వి. అ. పుం, న. నొసటిబొట్టు. విణ. విశేషింపఁజేయునది.

**విశేషణము.** సం. వి. అ. న. గుణవాచకశబ్దము.

**విశేషము.** సం. వి. అ. పుం. 1. అతిశయము; 2. భేదము; 3. అవయవము; 4. వింతరూపము; 5. నొసటిబొట్టు; 6. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**విశేషించు.** సం. అ. క్రి. అతిశయించు.

**విశేష్యము.** సం. వి. అ. న. వస్తువాచకశబ్దము.

**విశ్రమము.** సం. వి. అ. పుం. 1. పద్యవిరామము; 2. ఊఱట.

**విశ్రమించు.** సం. అ. క్రి. ఊఱడిల్లు.

**విశ్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఊఱడిల్లినది.

**విశ్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. పద్యవిరామము; 2. ఊఱట.

**విశ్రాణనము.** సం. వి. అ. న. ఈవి, త్యాగము.

**విశ్రామము.** సం. వి. అ. పుం. విశ్రమముయొక్క రూపాంతరము.

**విశ్రానము.** సం. వి. అ. పుం. మిక్కిలి ప్రసిద్ధి, ప్రఖ్యాతి.

**విశ్రుతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి ప్రసిద్ధికెక్కినది; 2. ప్రవహించినది.

**విశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రసిద్ధి; 2. ప్రవాహము.

**విశ్రుతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధికెక్కినవాఁడు; 2. తెలియఁబడినవాఁడు.

**విశ్లేషము.** సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు; 2. ఒడఁగూడమి.

**విశ్వ.** సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. అతివసకాయ. ఆ. స్త్రీ. అ. న. ము. శొంఠి. న. లోకము. విణ. సమస్తము.

**విశ్వంభర.** సం. వి. ఆ. స్త్రీ. ధరిత్రి, భూమి, నేల.

**విశ్వంభరుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. ఇంద్రుఁడు.

**విశ్వకద్రువు.** సం. వి. ఉ. పుం. 1. వేఁటకుక్క; 2. ధ్వని. విణ. దుర్జనుఁడు.

**విశ్వకర్మ.** సం. వి. న్. పుం. 1. దేవశిల్పి; (రూ. విశ్వకర్ముఁడు. చూ. మూరిఁబోవు మూఁడవయర్థము.) 2. సూర్యుఁడు; 3. ఒకానొక ముని.

**విశ్వకేతువు.** సం. వి. ఉ. పుం. అనిరుద్ధుఁడు.

**విశ్వజనీనము.** సం. విణ. (అ. ఆ. అ.) సర్వజనులకు హితమైనది.

**విశ్వతోముఖము.** సం. వి. అ. న. బ్రహ్మము. విశే. అంతట వ్యాపించినది.

**విశ్వనాథుఁడు.** సం. వి. అ. పుం. కాశీక్షేత్రమునందు నివసించియుండు శివుఁడు.

**విశ్వభేషజము.** సం. వి. అ. న. శొంఠి.

**విశ్వరూపుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**విశ్వసనీయము.** సం. విశే. (అ. ఆ. అ.) విశ్వసింపఁదగినది.

**విశ్వసించు.** సం. స. క్రి. నమ్ము.

**విశ్వసితము.** సం. విశే. (అ. ఆ. అ.) విశ్వసింపఁబడినది.

**విశ్వసృజుఁడు.** సం. వి. జ. పుం. బ్రహ్మ, నలువ. "ఎ, గీ. ఇంద్రుతోసాటిగాఁగఁబకీంద్రుఁడొల్లి, సృజనసేయఁడె యావిశ్వసృజుఁడుగడఁగి." భో. ౪, అ.

**విశ్వస్త.** సం. వి. ఆ. స్త్రీ. విధవ. విశే. విశ్వసింపఁబడినది.

**విశ్వామిత్రుఁడు.** సం. వి. అ. పుం. ఒక ఋషి.

**విశ్వాసము.** సం. వి. అ. పుం. నమ్మకము, ప్రత్యయము.

**విశ్వాసి.** సం. విశే. (న్. ఈ. న్.) విశ్వాసముగలవాఁడు.

**విశ్వేఁడు.** సం. వి. అ. పుం. గణదేవతావిశేషము. (వీరు పదుగురు.)

**విష.** సం. వి. ఆ. స్త్రీ. అతివసకీ. అ. న. ము. జలము. పుం, న. గరళము.

**విషణ్ణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విషాదముపొందినవాఁడు.

**విషధరము.** సం. వి. అ. పుం. 1. పాము; 2. మబ్బు.

**విషధరుఁడు.** సం వి. అ. పుం. శివుఁడు. విశే. విషముధరించినవాఁడు.

**విషధి.** సం. వి. ఇ. పుం. జలధి, సముద్రము.

**విషపుచ్ఛము.** సం. వి. అ. పుం. తేలు, వృశ్చికము.

**విషమచ్ఛదము.** సం. వి. అ. పుం. ఏడాకులరఁటికీ.

**విషమము.** సం. వి. అ. న. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.) విశే. సమముకానిది, బేసి.

**విషమశరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, బేసికయిదువు జోదు. (ఇట్లు విషమాయుధుఁడు మొ.)

**విషమించు.** సం. అ. క్రి. విరోధించు.

**విషయము.** సం. వి. అ. పుం. 1. గ్రంథాదులయొక్క తెలియఁబడిన యంశము; 2. లౌకికార్థము; 3. ఇంద్రియార్థము; 4. గోచరము; 5. దేశము; 6. ఒక ముఖ్యగ్రామముతోచేరిన ఉపగ్రామముల సమూహము, పాయకట్టు.

**విషయి.** సం. వి. న్. న. ఇంద్రియము. పుం. 1. రాజు; 2. మన్మథుఁడు; 3. విషయాసక్తుఁడు; 4. ఆరోపింపఁబడునది.

**విషయీకరించు.** సం. స. క్రి. ఉద్దేశించు.

**విషవృక్షము.** సం. వి. అ. పుం. ముష్టిచెట్టు.

**విషవైద్యుఁడు.** సం. వి. అ. పుం. గారడీఁడు.

**విషాణము.** సం. వి. అ. పుం, న. 1. కొమ్ము; 2. ఏనుఁగుకొమ్ము.

**విషాణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఱేట్టుపుకీ; 2. పిన్నపాలకీ. న్. పుం. 1. ఎద్దు; 2. ఏనుఁగు.

**విషాదము.** సం. వి. అ. పుం. 1. అపరాధధనహాన్యాదులచే ఉపాయముతోఁచక మనసునఁగలిగెడు ఖేదము; 2. జేదము.

**విషాదించు.** సం. అ. క్రి. 1. అపరాధధనహాన్యాదులచే ఉపాయముతోఁచక మనసున ఖేదపడు; 2. ఖేదపడు.

**విషు.** సం. వి. ఉ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**విషువత్తు.** సం. వి. త్. న. రేయిపగలుసమమైనకాలము.

**విషువము.** సం. వి. అ. న.———పై.———

**విషూచిక.** సం. వి. ఆ. స్త్రీ. వమనవిరేచనవ్యాధి. (రూ. విషూచి. ఈ. స్త్రీ.)

**విష్కంభము.** సం. వి. అ. పుం. 1. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 2. గడెమ్రాను; 3. అడ్డంకి; 4. నాటకాంగవిశేషము; 5. యోగులబంధవిశేషము; 6. చెరిపి.

**విష్కిరము.** సం. వి. అ. పుం. 1. పక్షి; 2. కపురజీ; 3. కోడి; 4. నెమిలి.

**విష్టపము.** సం. వి. అ. న. లోకము, భువనము.

**విష్టరము.** సం. వి. అ. పుం. 1. ఆసనము; 2. దర్భపిడికిలి; 3. మ్రాను.

**విష్టరశ్రవుఁడు.** సం. వి. స్. పుం. విష్ణువు, వెన్నుఁడు.

**విష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కూలి; 2. కూలిలేనిపని; 3. పని. విశే. పనిచేయువాఁడు.

**విష్ఠ.** సం.వి. ఆ. స్త్రీ. మలము, పురీషము.

**విష్ఠించు.** సం. అ. క్రి. విష్ఠచేయు, పెరుగు.

**విష్ణుక్రాంత.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకమందుచెట్టు.

**విష్ణుపదము.** సం. వి. అ. న. 1. ఆకాశము; 2. పాలసముద్రము; 3. ఆవులమంద.

**విష్ణుపది.** సం. వి. ఈ. స్త్రీ. 1. గంగ; 2. ద్వారక; 3. రవిసంక్రమణవిశేషము.

**విష్ణురథము.** సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, గరుడుఁడు.

**విష్ణువు** సం. వి. ఉ. పుం. 1. వెన్నుఁడు; (ఇతని సారథిదారుకుఁడు, తేరుశతానందము, గుఱ్ఱములు సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకములు.) 2. ఒక ఆదిత్యుఁడు. (చూ. ఆదిత్యుఁడు.)

**విష్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విషముచేత చంపఁదగినవాఁడు.

**విష్వక్సేన.** సం. వి. ఆ. స్త్రీ. ప్రేంకణముకీ.

**విష్వక్సేనప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. పాఁచితీఁగ; 2. లక్ష్మి.

**విష్వక్సేనుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. విష్ణుసేనాధిపతి.

**విసంవాదము.** సం. వి. అ. పుం. ముందు ఒప్పుకొని వెనుకలేదని వాదించుట.

**విసదారి.** వై. వి. పాము, విషధరము. "విసదారిగముల్విచ్చెక." అచ్చ. యు, కాం.

**విసనకఱ్ఱ.** దే. వి. విసరుకొను వీవన, తాలవృంతము.

**విసపాల.** దే. వి. (విసము+పాల.) ఒకానొకమందుచెట్టు.

**విసపాలవిత్తు.** దే. విశే. నాశకుఁడు. "విసపాలవిత్తగుసుధాకరు." రస. 3, గుచ్ఛము.

**విసపు మేఁతరి.** దృ. వి. (విసము + మేఁతరి.) శివుఁడు.

**విసబొద్ది.** దృ. వి. (విసము + బొద్ది.) ఒకానొకమందుచెట్టు, పారశీ.

**విస్సము.** వై. వి. 1. విషము; 2. జలము. "సె. మించుచూపుచు నెనమ్మింత్తినిల్కడయేది విసమొసంగెడిమబ్బుఁగొసరనేల." య. ౧, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**విసరణము.** సం. వి. అ. న. ప్రసరణము.

**విసరము.** సం. వి. అ. పుం. 1. ప్రసరణము; 2. సమూహము.

**విసరియాడు.** దృ. స. క్రి. (విసరి + ఆడు.) విసరు. "ద్వి. వి శువీధిఁదోఁకలువిసరియాడుచును, గురువులువాఱుచుగునిసియాడు చును." రా. యు, కాం. (చూ. ఊఁగాడు.)

**విసరు.** వై. అ. క్రి. 1. బయలుపడు*; "క. వెలవెలఁబాఱెజ్ మొగ మూ, ర్పులుమిక్కిలినందడించెఁబొక్కిలినిసరెజ్." య. ౫, ఆ.—2. వీచు*. "క. విసవిసపవనుఁడుజవమున, విసరిన." రాజ. ౧, ఆ.—స. క్రి. 1. ఆడించు*; (పక్షిఱెక్కలు విసరు చున్నది.) 2. వేయు*. (పిరంగివిసరెను. చూ. వేయుట అన నర్థమునుదాహరణము.) వి. 1. ఆడించుట*; (చూ. దూప.) 2. వీచుట*; (చూ. కసరు. వి. రెండవయర్థము.) 3. వేయుట*. "క. తలిరాకుపిరంగివిసరుకొఁకెనసంగజ్." అని. 3, ఆ. (చూ. వెలివిసరు.)

**విసరుమొన.** దృ. వి. మల్లవిద్యావిశేషము.

**విసర్గము.** సం. వి. అ. పుం. 1. త్యాగము; 2. విసర్జనము; 3. మలవిసర్జనము; 4. విసర్జనీయము; 5. దక్షిణాయనము.

**విసర్జనము.** సం. వి. అ. న. 1. ఈవి; 2. విడుపు; 3. పుచ్చుట.

**విసర్జనీయము.** సం. వి. అ. పుం. రెండుసున్నలు. విశ. విడువఁదగినది.

**విసర్జించు.** సం. స. క్రి. విసర్జనముచేయు, విడుచు.

**విసర్పణము.** సం. వి. అ. న. 1. ప్రసరణము; 2. కండూత్యాదిప్రసరణము.

**విసవిస.** యు. దే. వి. త్రిప్పుట, నవ్వుట, ముసరుట, విసరుటల యందగు ధ్వన్యనుకరణము. "వ. కరబిసరుహంబులు విసవిసం ద్రిప్పి." అని. ర, ఆ. "వ. విసవిసనగుచు." రామా. ౧, ఆ. "విసవిసముసరిముసరి." రసి. ర, ఆ. "విసవిసవిసరు." (చూ. విసరు. స. క్రి. రెండవయర్థము.)—వై. విశ. ప్రసరించునది. "చ. వసుమతి వేయిపాదములవానికిఁబుట్టినచాయపట్టికిజ్, విస విసగాదుకాలొఁకటి." నై. 3, ఆ.

**విసారము.** సం. వి. అ. న. కొయ్య. పుం. చేఁప.

**విసారి.** సం. విశ. (న్. ఈ. న్.) ప్రసరించునది.

**విసిపలక.** దృ. వి. పరుండెడు పెద్దపలక. ఆం, భా.

**విసిమాలు.** దే. అ. క్రి. మిక్కిలి విసుగు. "మానకవేఁడివేఁడి విసిమాలుచు." షో. ర, ఆ. (చూ. జోకించు.)

**విసుగు.** దే. అ. క్రి. నిర్వేదించు. వి. నిర్వేదము. (చూ. నిర్వేదము.)

**విసుమానము.** వై. వి. ఆశ్చర్యము. "క. అసమానదీప్తితోఁన, వసుధాధరమపుడుజాలు వాకుందనపుం, బసిఁడిపెనురాశియగుచుజ్, విసుమానమొనర్చెసిద్ధవిభునకుమిగులజ్." (చూ. పైపద్యము.) పర. ౧, ఆ. "సీ. వివరించిచూడంగవిసుమానములుగాక గోత్రారివెఱచునే కుధరములకు." సం. "కియంతోవ్యాకులాశ్శైలా అహెూదావాగ్నినాపియే." కాశీ. ౨, ఆ.—విశ. ఆశ్చర్యకరమైనది. "క. విసుమానమతనితేజో, రసపూరమునెగసెబ్రహ్మాండ ధ్రముమోవజ్." కాశీ. ర, ఆ.

**విసువాసము.** వై. వి. నమ్మకము. (చూ. విసువాసి.)

**విసువాసి.** వై. విశ. నమ్మకముగలవాఁడు. ఆం, భా.

**విసువు.** దే. అ. క్రి. వి. విసుగుయొక్కరూపాంతరము. (నిర్వేదించుటకు.—"ద్వి. వనితవెంబడివిసువకమఱియొక్క, తనయు నీడిచితెచ్చితత్పుత్రు మీఁద, వైచి." విష్ణు. ఉ. ౫, ఆ.—నిర్వేదమునకు.—"సీ. ఇంతియొక్కతెపూవు వెత్తులెత్తినఁజూచి విసువు తోనొక కొన్ని విరులుదుఱిమి." స్వా. 3, ఆ.)

**విసృతము.** సం. విశ. (అ. ఆ. అ.) విస్తృతము.

**విసృత్వరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) ప్రసరించునట్టి స్వభావముగలవాఁడు.

**విసృమరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.)——పై.——

**విసృష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. విసరివేయఁబడినది; 2. విడువఁబడినది.

**విస్తర.** వై. వి. భోజనముచేసెడియాకు*.

**విస్తరము.** సం. వి. అ. పుం. 1. శబ్దవిస్తృతి; 2. విరివి; 3. స్నేహము; 4. పీఠము.

**విస్తరి.** వై. వి. విస్తరాకు*.

**విస్తరించు.** సం. ప్రే. విస్తరిల్లఁజేయు.

**విస్తరిల్లు.** సం. అ. క్రి. విరివియగు.

**విస్తారము.** సం. వి. అ. పుం. 1. విరివి; 2. బోదలేనిచెట్టు.

**విస్తీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) విరివియైనది.

**విస్తు.** దే. వి. దేహమునందుఁగలిగెడు దుర్గంధము. "ద్వి. కోల, వేమాఱువిసరుచు విస్తుకంపెసఁగఁ, బనసలుచెప్పుచు." నవ. 3, భా.

**విస్తృతము.** సం. విశ. (అ. ఆ. అ.) విరివియైనది.

**విస్ఫారము.** సం. వి. అ. పుం. వింటిమ్రోఁత. (రూ. విష్ఫారము.) విశ. మిక్కిలి యధికమైనది.

**విస్ఫారితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రకాశమొందినది; 2. కదలింపఁబడినది.

**విస్ఫూర్జితము.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశమొందినది.

**విస్ఫోటము.** సం. వి. అ. పుం. పొక్కు, బొబ్బ.

**విస్మయము.** సం. వి. అ. పుం. 1. ఆశ్చర్యము; 2. గర్వము. విశ. ఆశ్చర్యకరమైనది.

**విస్మరణము.** సం. వి. అ. న. స్మరణముతప్పుట, మఱపు.

**విస్మితి.** సం. వి. ఇ. స్త్రీ. విస్మయము, ఆశ్చర్యము.

**విస్మితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) విస్మయమునొందినవాఁడు ఆశ్చర్యమునొందినవాఁడు.

**విస్మృతము.** సం. విశ. (అ. ఆ. అ.) విస్మృతినొందినది.

**విస్మృతి.** సం. వి. ఇ. స్త్రీ. విస్మరణము, మఱపు.

**విస్రంభము.** సం. వి. అ. పుం. 1. నమ్మకము; 2. వధము; 3. స్నేహము; 4. అల్లాటజగడము.

**విస్రబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నమ్మఁబడినది; 2. అణఁగినది; 3. శాంతినొందినది. క్రి. విణ. అ. న. అత్యంతము.

**విస్రము.** సం. విణ. (అ. ఆ. అ.) అపక్వమైన గంధముగలది.

**విస్రస.** సం. వి. ఆ. స్త్రీ. ముసలితనము, జర.

**విస్వరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) భేదపడిన కంఠస్వరము కలవాఁడు.

**విహంగమ.** సం. వి ఆ. స్త్రీ. కావడిబ్రద్ద. అ. పుం. ము. పక్షి, పులుఁగు.

**విహంగము.** సం. వి. అ. పుం. 1. పక్షి; 2. బాణము. విణ. ఎగురునది.

**విహంగిక.** సం. వి. ఆ. స్త్రీ. కావడిబ్రద్ద.

**విహగము.** సం. వి. అ. పుం. పక్షి, పులుఁగు.

**విహరణము.** సం. వి. అ. న. విహారము.

**విహరించు.** సం. అ. క్రి. విహారముచేయు.

**విహర్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) విహరించువాఁడు.

**విహసితము.** సం. వి. అ. న. మృదుధ్వనిగలనవ్వు. (ఇది మధ్యమము. చూ. హాసము.)

**విహస్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నెమ్మదిలేనిమనస్సుగలవాఁడు; 2. చదువుకొన్నవాఁడు.

**విహాపితము.** సం. వి. అ. న. దానము, ఈవి.

**విహాయసము.** సం. వి. స్. అ. పుం, న. ఆకాశము. అ. పుం. పక్షి.

**విహాయితము.** సం. వి. అ. న. ఈవి, దానము.

**విహారము.** సం. వి. అ. పుం. 1. వేడుకగాఁదిరుగుట; 2. త్రిప్పట; 3. తోఁట; 4. బౌద్ధాలయము.

**విహారి.** సం. విణ. (న్. ఈ. న్.) విహరించువాఁడు.

**విహితము.** సం. విణ. (అ. ఆ. అ.) విధింపఁబడినది.

**విహృతము.** సం. వి. అ. న. మాటాడఁదగినకాలమందు సిగ్గుచే మాటాడకుండునట్టి స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.

**విహృతి.** సం. వి. ఇ. స్త్రీ. విహరణము, విహారము.

**విహ్వలించు.** సం. అ. క్రి. భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పినవాఁడగు.

**విహ్వలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పినవాఁడు.

**విళంగీలు.** దే. వి. బ. తిట్లు. (అప్ర.)

**విళంబి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. విలంబముచేయువాఁడు.

## వీ.

**వీఁక.** దే. వి. 1. ఉత్సాహము; "ఉ. ఆఁకలినీరువట్టుశ్రమమంగవిపాటన మ్రాఁకుబార్చినిక్, శోఁకకయుండవిద్యలొగిసొంపుగనీకుపదేశమిచ్చెదన్, దేఁకువవారిపూరమునదిగ్గనతుద్దియినర్చిరమ్మనన్, వీఁకరఘూద్వహుండును బళిత్రజలంబుల వార్చివచ్చినన్." రా. బాల, కాం.—2. పరాక్రమము; "వీరగుణముబలమువీఁక యుఁగలఁడు." భార. ఉద్యో. ४, ఆ. (చూ. లోఁకు. స. క్రి. రెండవయర్థము.) 3. విజృంభణము; (చూ. ఈఁక మొదటి యర్థము.) 4. గర్వము; "ఉ. ఉవ్వవిమోఁతతోనెదురెఱుంగవిఁకబరాక్రమించునో." భో. 3, ఆ.—5. ఉన్నతి; "సీ. తిలకించుభామలబలుచింతయునుబోలె విస్తీర్ణమైపొమ్ము వీఁకఁదనర." శకుం. ౨, ఆ.—6. యుద్ధమువలనఁ బాఱుట; "క. తెలివిం బుడమిందగుకలు, వలరాయామైఁదనర్చువలరాయకఁడుం, గలనైన వీఁకెఱుఁగక, కలనైనన్ మెఱయుపెంపుగలముక్కంటీ." య. ౧, ఆ.—7. సైన్యము; "మ. అనయంబున్ శమవంతుఁడైవినతశిష్టాచారమార్గంబులన్, జనుపుణ్యాత్ముఁడు దుర్గతుల్ గడచి ప్రజ్ఞాపూర్వసంరూఢుఁడై, కనుమిందున్ బటుమోహపంకజల మగ్నుండైనలోకంబుఁ, కనధోభాగమునందుడిందికనుదుఃఖంబొందఁగా నవ్వుచున్." భార. అర. ౫, ఆ.—8. సామర్థ్యము; "చ. పరువీఁకనునుండియుమిత్రభావముం, బొరయుటయున్ సుహృజ్జనుల పొలికిగల్గియుశత్రుతొగుణ; స్ఫురణమొక పుష్పపుటయుఁ జూతుము గాదె ధరిత్రి, నెల్లెడన్." భార. శాం. 3, ఆ.—9. విధము; "సీ. నృహరిభావముమవాఁడనేనవినూచించువీఁకఁబ్రహ్లాదాది వృద్ధినలరు." (చూ. ముందువెనుకలు.) రామా. 3, ఆ.

**వీఁగియాడు.** దే. అ. క్రి. (వీఁగి+ఆడు.) చలించు. "గీ. కుంభికుంభముఁబోనికుచకుంభభరమున వెడవెడనడుము లువీఁగియాడ." వీర. 3, ఆ. (చూ. ఊఁగాడు.)

**వీఁగు.** దే. అ. క్రి. 1. ఉత్సహించు; "ఎ, గీ. వీఁగితనతల్లిదానవ్యంబునీఁగఁబూని, తడయకమృతంబుగొనిపోవఁగడఁగివచ్చె." భార. ఆది. 3, ఆ.—2. నిక్కు; "అట్టిఁగుచన్నుఁగవ." భార. విరా. ౧, ఆ.—3. యుద్ధమువలనఁబాఱు; "ఉ. తమ్ములువీఁగినం బతియుదగ్రతభీముననెదిర్చియార్చుచున్." భార. భీష్మ. ౨, ఆ.—4. చలించు. "కుతలంబట్టిట్టువీఁగెన్." రా. యు, కాం.

**వీఁడు.** దే. స. (ఈశబ్దమునకు మహదర్థకప్రథమైకవచనరూపము.) ఈపురుషుఁడు.

**వీఁపు.** దే. వి. వెనుకమేను, చరమాంగము, పృష్ఠము.

**వికాశము.** సం. వి. అ. పుం. 1. ప్రకాశము; 2. ఏకాంతస్థలము.

**వీకు.** దే. వి. 1. ఉన్నతి; "వీకునవశ్వమేధములువేయొనరించిన పుణ్యశీలుఁడు." భార. అర. 3, ఆ.—2. ఉద్ధతి; "వ. నాటి నాటికింబాటించివేఁటకాఁడదనెఱింగిమేపుమేపులచమత్కారంబుల నిరాకరించివీకునదిరిగిరిగియాఁకదీర్చుకొనునవియును." స్వా. ४, ఆ.—3. పరాక్రమము. "ఉ. అద్భుతమత్స్యయంత్రమున్, వీకుననిట్టులేపినసువిక్రమునాతఁడుచూడఁగోరెదున్." భార. ఆది. 2, ఆ.

**వీక్ష.** సం. వి. ఆ. స్త్రీ. చూపు, దృష్టి.

**వీక్షణము.** సం. వి. అ. న. చూచుట, చూపు, దృష్టి.

**వీక్షించు.** సం. స. క్రి. చూచు. (అభివీక్షించు, ఉద్వీక్షించు, ప్రవీక్షించు, సంవీక్షించు, సముద్వీక్షించు అనియు.)

**వీక్షితము.** సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడినది.

**వీక్ష్యము.** సం. వి. అ. న. ఆశ్చర్యము. విణ. 1. చూడఁదగినది; 2. ఆశ్చర్యకరమైనది.

**వీచి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. అల; 2. అవకాశము; 3. కొంచెము; 4. సుఖము. (అలయనునర్థమునందిది ఈకారాంతస్త్రీలింగమునగును.)

**వీచు.** దే. అ. క్రి. (గాలి) విసరు. "గాలివీవవెఱచు." భాగ. ౯, స్కం.-స. క్రి. విసరు. "వ. దుగ్గాధిపతులేనేమయనివీచువీచ పులచ్ఛమ్ములగు కౌముదీగుచ్ఛమ్ములనంతరింప." స్వా. ౫, ఆ.

**వీచోపులు.** దే. వి. (వీచు+చోపులు.) వింజామరలు. (చూ. వీచు. స. క్రి.)

**వీజనము.** సం. వి. అ. న. విసనకఱ్ఱ, తాళవృంతము.

**వీటతటము.** దే. విణ. వీటతాటముయొక్క రూపాంతరము.

**వీటతాటనము.** దే. విణ. విటతాటనముయొక్క రూపాంతరము.

**వీటతాటము.** దే. విణ. విటతాటముయొక్క రూపాంతరము. "కేత నంబులవీటతాటంబుచేసి." భార. కర్ణ. ౧, ఆ.

**వీటి.** ఉభ. దే. వి. కొల్ల. సం. ఇ. ఈ. స్త్రీ. తాంబూలము.

**వీటిఁబుచ్చు.** దే. ప్రే. వీటిఁబోవఁజేయు. "ఉ. చారుకులాగ్ని మానమును సన్నుతధర్మమువీటిఁబుచ్చరే." గా. ఆర, కాం. ౨, ఆ.

**వీటిఁబోవు.** దే. అ. క్రి. (వీటి+పోవు.) 1. దూషితమగు; "చ. కలయనరాదురామలకుఁగాములకూటములెన్నిచందముల్, గల వవియన్నియుఁ వెలసెఁగన్నెటికిఁ బిటువీటిఁబోయె." హరి. ఉ. ౭, ఆ. (చూ. మూడవయర్థము.)-2. నష్టమగు; "క. సాధువు లగుజంతువులకు, బాధలుగావించుఖలులభంజింపనిరా, జాధము సాయుస్స్వర్గ, శ్రీధనములువీటిఁబోవుసిద్ధిముదల్లి." భాగ. ౧. స్కం.-3. వ్యర్థమగు. "క. అనునప్పుడుసంధ్యావళి, వనితలఁ గదియంగసరిగివసుధాధీశుం, జనునేయాక్రియఁబలుకఁగ, వినయం బును భయముభక్తివీటింబోవన్." రుక్మాం. ౪, ఆ. (సంధినిద్రుతము.)

**వీటిక.** సం. వి. ఆ. స్త్రీ. తాంబూలము, వీటి.

**వీడియము.** వై. వి. తాంబూలము. "వీడియములుగ్రొత్తలైతగ." కవిక. ౪, ఆ.

**వీడు** దే. అ. క్రి. 1. వదలు; "ఘోరభుజంగమబంధనంబులెల్లను వెసవీడె." వి, పు. ౭, ఆ.-2. విశదమగు; "అని వీడఁగఁ బల్కిన." భార. విరా. ౨, ఆ.-3. కొనసాగు, వర్ధిల్లు; "సీ. దేవకీసుతుకోర్కి తీఁగెలువీడంగ వెలఁదికిమైదీఁగెనీడఁదొడఁగె" భాగ. ౧౦, స్కం. పూ.-అం, ప్రే. వీడఁజేయు. "కర్మబంధ ముల్వీడుదము." లక్ష్మీ. 3, ఆ.--వి. 1. పట్టణము; 2. కట్నము; "క. వీడుచదివించెనయ్యెడ, వీడనివేడుకబలారివిబుధులతోలే, వీడుమణులనఁగఁదగుతన, వీడునఁగలమానికములువివిధాంబరముల్." వసు. ౬, ఆ. (ఇది రెండర్థములకునుదాహరణము.)-3. దండు; "ఉ. వీళ్లకురెండుపన్నుడుదివింగలపాళెనమానిమూ డుక్కలు, వ్వీళ్లుగొనంగఁజొచ్చెనలవేల్పుఁబడంతులనెమ్మనంబుపిం, పిల్లొగిగూయఁజొచ్చెఁదమిపెక్కువమృత్యువుమ్రింగఁజొచ్చెగ్రు, క్కిళ్లవియంగఁజొచ్చెరవికిన్ హృదయంబఖిలంబునయ్యెడన్." కవిక. ౨, ఆ.-4. శిబిరము; "తే. రాజువిడెత్తిచనినఁదారకభ టాలి, యంబరాభోగనిజశిబిరాంగణమునఁ, గాలుకొల్పినపావక జ్వాలయనఁగఁ, బ్రాచిఁగనుపట్టెనవసాంధ్యరాగరుచులు." పా. ౨, ఆ.-5. పథికజనసమూహము; "క. నడపించిపంచవటమున, విడియించెనువీడు." భార. మా. ౧, ఆ.-6. దొమ్మరవాండ్ర సమూహము. "దొమ్మరివీటితోడ." చెన్న. ౨, ఆ.

**వీడుకొను.** దే. స. క్రి. 1. పోయివచ్చెదనని చెప్పుకొనివదలు; "శా. చేదోయిన్ముకుళించివీడుకొనెనక్షీణప్రమోదంబునన్, వేద వ్యాసు." జై. ౧, ఆ. (చూ. వీడ్కొలుపు.)-2. వదలు. (చూ. వీడ్కొను.)

**వీడుకొలుపు.** దే. ప్రే. (వీడుకొనఁజేయు.) పోయివచ్చెదనని చెప్పుకొనఁగా మంచిది పోయిరమ్మని పుచ్చు. (చూ. వీడ్కొలుపు.)

**వీడుకోలు.** దే. వి. 1. పోవననుజ్ఞ; "తే. నీవుమున్నేగుమన యతనికివిభూవ, ణాంబరంబులతోఁదమ్ములంబుఁబెట్టి, వీడుకోలిచ్చి పుచ్చిన విప్రవరుఁడు, పాండురాజతనూజులపాలికరిగె." భార. ఉద్యో. ౧, ఆ.-2. విడుపు; "సీ. దైతేయమదవతీధమ్మిల్లముల తోడ విరులనెత్తావికివీడుకోలు." ఉ, హరి. 3, ఆ.-3. మర ణము. "క. వాఁడల్లవాఁడెపోయెడు, నేఁడతనికి వీడుకోలునిజ ముగనివా, పోఁడిమిచూచెదవేనొక, నాఁడౌనిటునిల్చిచూడునరవర తిలకా." భో. ౪, ఆ.

**వీడుచు.** దే. ప్రే. వీడఁజేయు, విడుచు. "పంచాంగముపుస్తకమును వీడిచి." కళా. ౭, ఆ.

**వీడుజోడాడు.** ద్వ. అ. క్రి. మాఱుపాటునొందు. "వ. జడనిధిలోన డయాడుచుండినయోడలతోవీడుజోడాడురథంబులును." (ఇక్కడ మాఱుపాటునొందుటయనఁగా నరిపోలుట.) ఉ, హరి. ౪, ఆ.

**వీడుజోడు.** ద్వ. విణ. విజ్జోడునకు మొదటిరూపము.

**వీడుపట్టు.** దే. వి. 1. దండువిడియుచోటు; 2. విడిది; 3. వాసస్థానము. (చూ. లోఁగిలి.)

**వీడుపడు.** ద్వ. అ. క్రి. 1. మాఱుపడు; 2. భేదపడు; 3. తడఁబడు. "ద్వి. పాదముల్వీడుపడ." హరిశ్చ. ౨, ఆ. (చూ. వీడ్వడు.)

**వీడుపాటు.** ద్వ. వి. మాఱుపాటు, వ్యత్యాసము. "మ. తనము న్నాడినమాటయుఁ నిజముగాఁదన్నానికింబ్రీతిగా, మనుజేంద్రుం డునెలన్నెలన్బురుషుఁడైమాసాంతరంబైనఁగా, మినిర్యియోగతి వీడుపాటమర భూమిందానరక్షించుఁబో, మ్మనినన్వచ్చె వసిష్ఠుఁ డామనుసుతుం డారీతిరాజ్యస్థుఁడై." భాగ. ౯, స్కం. (చూ. వీడ్పాటు.)

**వీడువడు.** ద్వ. అ. క్రి. (వీడు+పడు.) 1. మాఱుపడు; 2. భేదపడు; 3. తడఁబడు. "సీ. బోటికిఁదోఁచినఁబోలియుఁ దేఁకువయున వెగడునఁజెయ్వులు వీడువడఁగ." భార. విరా. ౨, ఆ. (చూ. వీడ్వడు.)

**వీడెము.** వై. వి. వీడియముయొక్క రూపాంతరము.

**వీడ్కొను.** దే. స. క్రి. వీడుకొనుయొక్క రూపాంతరము. (పోయివచ్చెదనని చెప్పుకొని వదలుటకు.-"ఉ. వేడ్కఁబ్రణామ పూర్వముగవిశ్వజగజ్జనకున్ జనార్దనున్, వీడ్కొని." ఉ, హరి. ౪, ఆ.-వదలుటకు.-"ఇవ్విపినమునందునొంటినినువీడ్కొనరాదని పల్కె." రామా. ౫, ఆ.)

**వీడ్కొలుపు.** దే. ప్రే. వీడుకొలుపుయొక్క రూపాంతరము. "తానప్పరమర్షివీడ్కొలుపు నంతకురమ్మనఁగొంచి." కళా. ౨, ఆ. (రూ. వీడ్కొల్పు.)

**వీడ్కోలు.** దే. వి. వీడుకోలుయొక్క రూపాంతరము. (పోవనను జ్ఞకు.-"మ. వీడ్కోలతం, డొనరింపన్ జనియెన్ బురంబునకు నిత్యోద్భాసితైశ్వర్యుఁడై." లక్ష్మీ. ౨, ఆ.)

**వీడ్పాటు.** ద్వ. వి. వీడుపాటుయొక్క రూపాంతరము. "ఓ యజ్ఞాక్షియేమంచువిభ్రాంతింబల్కెదుకల్లయున్ నిజమువీడ్పాటొం దఁగా." కళా. 3, ఆ.

**వీడ్యము.** వై. వి. విడ్యముయొక్క రూపాంతరము.

**వీడ్వడు.** ద్వ. అ. క్రి. వీడువడుయొక్క రూపాంతరము. (మాఱు పడుటకు.-"సీ. బొందులుఁదలలునుబొందింపుఁడనినసా నతులు వీడ్వడఁగూర్పనతనినతని, సంజీవితులఁజేసి చనియెనవ్విపరీతధర్మంబుఁ

ఞూచిపెద్దలకుఁజెప్పె." భో. ౫, ఆ.—భేదపడుటకు.—"ఎ, గీ. పొడవునీడయుఁబోలెపెడ్వడక మెలఁగి." విక్ర. ౪, ఆ.)

**వీణ.** సం, వి. ఆ. స్త్రీ. 1. తంత్రీవాద్యవిశేషము; (సరస్వతివీణ కచ్ఛపి, నారదునివీణమహతి.) 2. మెఱపు.

**వీణము.** దే. వి. సన్నవస్త్రము, వలిపము, అంశుకము.

**వీణాము.** దే. వి. వీణముయొక్క-గూపాంతరము. "క. పస్నీట జలకమాడెను, నున్ననివీణాముగట్టెనువిరులుదుఱిమెకా, సన్నము గనలఁదెఁగస్తురిఁ, జన్నులముత్యాలబన్న సరసులుదాల్చెకా." జై. 3, ఆ.

**వీణావాదుఁడు.** సం. వి. అ. పుం. వీణవాయించువాఁడు.

**వీణియ.** యు. దే. వి. కస్తూరిమృగముయొక్క- కస్తూరియుండెడు బొడ్డుకాయ. "వ. కస్తూరివీణియలునుపిల్లిగడ్డలున." భల్లా. 3, ఆ.—వై. వీణావాద్యము. (చూ. అపురూపను.)

**వీణె.** యు. వి. వీణయయొక్క-రూపాంతరము.

**వీతంసము.** సం. వి. అ. పుం. మృగపక్షులనుబట్టెడువల, ఉరి లోనగుసాధనము.

**వీతము.** సం. వి. అ. స. 1. అంకుశముపోటు; 2. సత్తువలేని యేనుఁగు; 3. సత్తువలేనిగుఱ్ఱము. విశ. పోయినది.

**వీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చూలుపడుట; 2. జిగి; 3. తిండి; 4. పరుగు; 5. పోక. పుం. గుఱ్ఱము.

**వీతిహోత్రుఁడు.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు.

**వీతెంచు.** దే. అ. క్రి. (వీచు+తెంచు.) వీచు, విసరు. "క. చల్లని దక్షిణమారుత, మల్లనవీతెంచెఁదగిలియాలలనాథ, మ్మెల్లకుసుమాంగరాగస, ముల్లసనసుగంధియగుచుమునివరుమీఁదకా." భార. ఆది. ౪, ఆ. (స్వార్థమున తెంచు.)

**వీది.** వై. వి. ఇండ్లవరుసలు రెంటికినడిమిత్రోవ. "ద్వి. వేడుక మదికొదవించువీదులును, నీడలుదోఁచుమాణిక్యవేదులును." హరిశ్చ. ౧, భా.

**వీధి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఇండ్లవరుస; 2. వరుస; 3. ఇండ్లవరుసలు రెంటికినడిమిత్రోవ; 4. నాటకవిశేషము.

**వీధ్రము.** సం. విశ. (అ. ఆ. అ.) గరగరికైనది, నిర్మలము.

**వీనియ.** వై. వి. వీణియయొక్క-రూపాంతరము. "వ. కన్నియలన్నుచూపంబూఁదేనె మలానిసినియలయందుంబాడునేర్పులకుమెచ్చి." య. ౪, ఆ.

**వీను.** దే. వి. 1. చెవి; 2. ప్రసిద్ధి. (చూ. వీనుమిగులు.)

**వీనుమిగులు.** దే. అ. క్రి. ప్రసిద్ధికెక్కు. "ఎ, గీ. కాననదియ శరణ్యమైవీనుమిగులు, నైహికాముష్మికాకాంక్షు లగునరులకు." పాండు. 3, ఆ.

**వీనులకంటి.** దే. వి. సర్పము, చక్షుశ్శ్రవము. "వీనులకంటి చెల్వలు." నీలా. ౨, ఆ.

**వీనె.** వై. వి. వీనియయొక్క-రూపాంతరము.

**వీప్స.** సం. వి. ఆ. స్త్రీ. ఒకటివెనుకనొకటి వ్యాపింపనిచ్ఛ.

**వీయము.** దే. వి. వియ్యమునకు మొదటిరూపము.

**వీర.** సం. వి. ఆ. స్త్రీ. మగఁడుఁ గొడుకులునుఁగల ఆఁడుది. అ. న, ము. కుంకుమపుష్పవు. పుం. రసవిశేషము. (చూ. రసము.)

**వీరకత్తియ.** వై. వి. (వీరము+కత్తియ.) వియ్యంకురాలు. "శే. కూరిమినివీరకానికివీరకత్తె, యకుసుదోలువేల్పు గొంగయన్నకును మఱియు." సీలా. 3, ఆ. (చూ. వీరకత్తె.)

**వీరకాఁడు.** దవ్. వి. వియ్యంకుఁడు. (చూ. వీరకత్తియ.)

**వీరజయంతిక.** సం. వి. ఆ. స్త్రీ. యుద్ధమునందలి వీరులనృత్తము.

**వీరణము.** ఉభ. దే. వి. చర్మవాద్యవిశేషము. సం. అ. న. అవురుగడ్డి.

**వీరతరము.** సం. వి. అ. న. అవురుగడ్డి. పుం. బాణము.

**వీరతరువు.** సం. వి. ఉ. పుం. ఏఱుమద్దిచెట్టు.

**వీరతాయెతు.** మి. గ్రా. వి. వీరులు బిరుదుగా కట్టుకొనెడు తాయెత్తు. "క. మగజాతివీరతాయెతు." చంద్ర.

**వీరపత్ని.** సం. వి. ఈ. స్త్రీ. వీరునిఁ బెండ్లాడిన పెండ్లాము.

**వీరపాణము.** సం. వి. అ. న. యుద్ధము కడపటఁగాని, మొదటఁగాని వీరులుచేసెడు గోష్ఠీపానము.

**వీరభద్రపళ్లెరము.** మి. గ్రా. వి. మిక్కిలి పెద్ద పళ్లెరము.

**వీరమద్దియలు.** వై. వి. బ. 1. (చూ.) వీరమధ్యములు; 2. స్త్రీలు కాలిపెద్దవ్రేలిని ధరించెడు ముద్రికావిశేషము*. "సీ. మట్టెలు పిల్లాండ్లుమఱివీరమద్దియలెలమిసిదొడిగెఁదొయ్యలియొకర్తు." య. ౪, ఆ.

**వీరమద్దెలు.** వై. వి. బ. వీరమద్దియలుయొక్క-రూపాంతరము.

**వీరమధ్యములు.** సం. వి. అ. న. బ. శత్రువీరులవేళ్లనడుమఁ జెక్కి శూరులు బిరుదుగా కాలిపెద్దవ్రేలినిధరించెడుముద్రికలు. "సీ. మణికిరీటకరో మంజీరములురాయవీరమధ్యంబులు వేయలేదు." ఉ, హరి. ౫, ఆ.

**వీరము.** వై. వి. బీరముయొక్క-రూపాంతరము. (చూ. వీరకత్తియ, వీరకాఁడు.)

**వీరముద్దియలు.** వై. వి. బ. (చూ.) 1. వీరముద్రికలు; 2. స్త్రీలు కాలిపెద్దవ్రేలినిధరించెడు ముద్రికావిశేషములు*. "వ. మట్టియలువీరముద్దియలు పాయపట్టంబులు." నై. ౬, ఆ.

**వీరముద్దెలు.** వై. వి. వీరముద్దియలుయొక్క-రూపాంతరము.

**వీరముద్రికలు.** సం. వి. అ. స్త్రీ. బ. శూరులు బిరుదుగా కాలి పెద్దవ్రేలినిధరించెడు ముద్రికావిశేషము.

**వీరముష్టి.** సం. వి. ఇ. పుం. కోమట్లను యాచించుకొని జీవించెడు ఒకతెగ భిక్షుకుఁడు.

**వీరవృక్షము.** సం. వి. అ. పుం. 1. ఏఱుమద్దిచెట్టు; 2. జీడిచెట్టు.

**వీరవైష్ణవుఁడు.** సం. వి. అ. పుం. వైష్ణవమతమునందు మిక్కిలి పట్టుగల విష్ణుభక్తుఁడు.

**వీరశైవుఁడు.** సం. వి. అ. పుం. శైవమతమునందు మిక్కిలి పట్టుగల శివభక్తుఁడు.

**వీరసువు.** సం. వి. ఊ. స్త్రీ. వీరునిఁగన్నతల్లి.

**వీరహుఁడు.** సం. వి. న్. పుం. ఉత్సర్గేష్టినిజేసిగార్హపత్యాగ్నిని విడిచినవాఁడు.

**వీరాణము.** దే. వి. వీరణముయొక్క-రూపాంతరము.

**వీరాయితము.** సం. వి. అ. న. పురుషాయితము.

**వీరాశంసనము.** సం. వి. అ. న. భయంకరమైన యుద్ధభూమి.

**వీరాసనము.** సం. వి. అ. న. 1. దేనిమీఁదను ఆనకకూర్చుం డుట; 2. రాత్రిపూఁట కత్తిచేఁబట్టుకొని హెచ్చరికతోఁ గావలి యుండుట.

**వీరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. శూరుఁడు; 2. శ్రేష్ఠుఁడు.

**వీరుధము.** సం. వి. ధ. స్త్రీ. 1. ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్ష తీఁగలోనగువానిపొద; 2. చిగురుఁగొమ్మ.

**వీర్యము.** సం. వి. అ. న. 1. పరాక్రమము; 2. రేతస్సు; 3. తేజము; 4. ప్రభావము.

**వీఱిడి.** దే. విశే. వెఱ్ఱిడియొక్క మాఱురూపము.

**వీలు.** దే. అ. క్రి. ఉపయోగించు. "ఉ. వీలకకాలజిహ్వముఖవీరులు మున్నకుశానుగాహతిం, గూలిరి." జై. ౬, ఆ. — విశే. అను కూలము. వి. అనుకూల్యము.

**వీలుపడు.** దృ. అ. క్రి. సరిపడు, అనుకూలపడు.

**వీవధము.** సం. వి. అ. పుం. 1. కావడి; 2. త్రోవ; 3. బరువు.

**వీవన.** దే. వి. విసనకఱ్ఱ. "సీ. ధ్వజముఁవాహనముఁవీవనయునాదిగఁ బెక్కురూపులైగరుడుఁడారూఢిఁగొల్వ." కళా. ౧, ఆ.

**వీవలి.** దే. వి. గాలి, వాయువు. "సీ. వలయగానములయుక్తులకార్యస్వ మునఁజేరెమలయంపుఁగమ్మవీవలులనలుల." ఆము. ౫, ఆ. (ఇది కావలివంటిది.)

**వీసబడి.** దే. వి. (వీసము+బడి.) గ్రామమునందు భాగప్రకారము గలిగిన భూస్వాతంత్ర్యము.

**వీసము.** దే. వి. 1. రూకలో పదునాఱవభాగము; 2. ఒకట పదు నాఱవభాగము.

**వీసర.** దృ. వి. (వీసము+అర.) కొఱఁత. వెలితి. (చూ. వీసర పోవు.) (రూ. వీసరము.)

**వీసరపడు.** దృ. అ. క్రి. వెలితిపడు, వీసరపోవు.

**వీసరపోవు.** దే. అ. క్రి. వెలితిపడు. "ఆ. ఈఁగకాలియంత యేనియువీసర, పోవకుండధర్మమునననడిచి, రయ్య." భార. శాం. ౨, ఆ. "ఉ. వీసరపోవకయుండవారిఁదా, నేఁకటడీఱ దోఁచుకొని యెంగలవస్తువు లెల్లనొక్కటన్." పర. ౪, ఆ. "వీసరపోనిమోహమున." సా. ౨, ఆ.

**వీసె.** వై. వి. సలుపదిపలములు*. (మొదటిరూపము వీసియ.)

## వు.

**వు.** దే. అవ. నామపదములమీఁదను, క్రియాపదములమీఁదను వచ్చె డు ప్రత్యయము (ఉదా. విష్ణువు, మ్రొక్కెదవు మొ.)

## వృ.

**వృంతము.** సం. వి. అ. న. 1. తొడిమ; 2. చూచుకము; 3. ఘటోదకధార.

**వృంతాకము.** సం. వి. అ. పుం. వార్తాకవిశేషము, నీరువంగ*.

**వృకధూపము.** సం. వి. అ. పుం. అనేకపరిమళవస్తువులుకూర్చి చేసినధూపము, కృత్రిమధూపము.

**వృకధూమకము.** సం. వి. అ. పుం. పావటచెట్టు.

**వృకము.** సం. వి. అ. పుం. తోఁడేలు, ఈహామృగము.

**వృకోదరుఁడు.** సం. వి. అ. పుం. భీమసేనుఁడు, తోఁడేటి కడుపువాఁడు.

**వృక్క.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం, న. ము. క్రోతాదులయందు ప్రసిద్ధమైన శ్రేష్ఠమాంసము. (రూ. వృక్క్య.)

**వృక్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. విఱిగినది; 2. కోయఁ బడినది.

**వృక్షధూపము.** సం. వి. అ. పుం. దేవదారుబంకతోఁజేసిన ఘూపద్రవ్యము.

**వృక్షము.** సం. వి. అ. పుం. చెట్టు, తరువు, పాదపము.

**వృక్షరుహ.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) బదనిక*.

**వృక్షవాటిక.** సం. వి. ఆ. స్త్రీ. అమాత్యులులోనగు ధనికుల యొక్క గృహములయందలి ఉపవనము.

**వృక్షాదనము.** సం. వి. అ. పుం. 1. ఉలి; 2. రావి*.

**వృక్షాదని.** సం. వి. ఈ. స్త్రీ. బదనిక, వృక్షరుహ*.

**వృక్షామ్లము.** సం. వి. అ. న. చింతపండు, తింత్రిణీకము.

**వృజినము.** సం. వి. అ. న. పాపము. పుం. క్లేశము. విశే. వక్రము.

**వృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వరించుట; 2. చుట్టువేసినవెలుగు; 3. చుట్టుట.

**వృతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వరింపఁబడినవాఁడు.

**వృత్తపత్రము.** సం. వి. అ. న. వన్నెవెదురు*.

**వృత్తపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. తెల్లజెనము*.

**వృత్తము.** సం. వి. అ. న. 1. పద్యభేదము; 2. నడత; 3. జీవనము. పుం. తాఁబేలు. విశే. 1. వరింపఁబడినది; 2. చుట్టఁబడినది; 3. కడచినది; 4. చచ్చినది; 5. వర్తుల మైనది; 6. గట్టియైనది.

**వృత్తముస్తకము.** సం. వి. అ. న. వర్తులమముస్తె*.

**వృత్తాంతము.** సం. వి. అ. పుం. 1. సమాచారము; 2. కథ; 3. అంశము; 4. ఏకాంతము; 5. ప్రక్రియ; 6. ప్రస్తావము.

**వృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. నడవడిక; 2. జీవనోపాయము; (ఇది చతుర్విధము.—కృషి, పాశుపాల్యము, వాణిజ్యము, సేవ.) 3. వివరణగ్రంథము; 4. అభిధాది; (ఇవి మూఁడు. — అభిధ, లక్షణ, వ్యంజన.) 5. కైశిక్యాది. (ఇవి నాలుగు. — కైశికి, ఆర భటి, సాత్వతి, భారతి.)

**వృత్రము.** సం. వి. అ. పుం. 1. చీఁకటి; 2. కొండ.

**వృత్రహుఁడు.** సం. వి. న్. పుం. ఇంద్రుఁడు.

**వృత్రుఁడు.** సం. వి. అ. పుం. 1. శత్రువు; 2. ఒక అసు రుఁడు.

**వృథ.** సం. అవ్య. వృథాశబ్దమునకు తెనుఁగున హ్రస్వమువచ్చిన రూపము.

**వృథా.** సం. అవ్య. వ్యర్థముగా. "వృథాశపింతురే." స్వా. ౪, ఆ.

**వృద్ధ.** సం. వి. ఆ. స్త్రీ. ఎనుబదియేండ్లకుపైబడిన ముసలిది.

**వృద్ధకాకము.** సం. వి. అ. పుం. మాలకాకి.

**వృద్ధదారకము.** సం. వి. అ. పుం. బొద్ది*.

**వృద్ధము.** సం. వి. అ. న. శాపుళ్ళ. విశే. వృద్ధిఁబొందినది.

**వృద్ధశ్రవుఁడు.** సం. వి. స్. పుం. ఇంద్రుఁడు.

**వృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అభివృద్ధి, 2. సమృద్ధి; 3. అభ్యుదయము; 4. వడ్డీ; (ఇది చతుర్విధము. — కాయికవృద్ధి, కాలికవృద్ధి, కారితవృద్ధి, చక్రవృద్ధి.) 5. గుణకారము; 6. కంతి; 7. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 8. గంధద్రవ్యవిశేషము.

**వృద్ధిజీవిక.** సం. వి. ఆ. స్త్రీ. వడ్డికిచ్చి జీవించెడు జీవనము.

**వృద్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎనుబదియేండ్లకుపైఁబడిన ముసలివాఁడు; 2. తెలిసినవాఁడు. (రూ. వృద్ధు.)

**వృద్ధ్యాజీవుఁడు.** సం. విణ. (అ. ఆ అ.) వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు, వార్ధుషికుఁడు.

**వృశ్చికము.** సం. వి. అ. పుం. 1. తేలు; 2. తేలుకొండిగీ; 3. ఒక రాశి; (చూ. రాశి.) 4. కందిరీఁగ; 5. గొంగళిపురుగు; 6. తెల్లగలిజేరుగీ.

**వృష.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎలుకజీడిగీ; 2. దురదగొండిగీ. పుం. ము. 1. ఎద్దు; 2. ధర్మము; 3. ఎలుక; 4. అడ్డసరముగీ; 5. ఓషధివిశేషము; 6. వాస్తుస్థానవిశేషము.

**వృషగంధిక.** సం. వి. ఆ. స్త్రీ. గాడిదగడపరగీ.

**వృషణము.** సం. వి. అ. పుం. ముష్కము.

**వృషధ్వజుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**వృషభము.** సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. ఒక రాశి; (చూ. రాశి.) 3. ఓషధివిశేషము; 4. తిరుమల. విణ. ఉత్తరపదమైనచో శ్రేష్ఠము. (కవివృషభుఁడు.)

**వృషభి.** సం. వి. ఈ. స్త్రీ. 1. విధవ; 2. స్వైరిణి.

**వృషలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. శూద్రజాతి స్త్రీ; 2. కన్యక; 3. గొడ్రాలు; 4. చేచ్చేసుబిడ్డలుగలది.

**వృషలుఁడు.** సం. వి. అ. పుం. 1. శూద్రుఁడు; 2. చంద్రగుప్తుఁడు; 3. పాపాత్ముఁడు.

**వృషస్యంతి.** సం. వి. ఈ. స్త్రీ. కాముకి.

**వృషాకపాయి.** సం. వి. ఈ. స్త్రీ. 1. లక్ష్మి; 2. పార్వతి; 3. శచి; 4. స్వాహా; 5. తిప్పతీఁగ; 6. పిల్లపీఁచరగీ.

**వృషాకపి.** సం. వి. ఇ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. అగ్ని.

**వృష్ణుఁడు.** సం. వి. అ. పుం. వీర్యవృద్ధిగలవాఁడు. విణ. ఉత్తరపదమైనచో శ్రేష్ఠుఁడు. వి. న్. పుం. 1. ఇంద్రుఁడు; 2. కర్ణుఁడు.

**వృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. వర్షము, వాన.

**వృష్ణి.** సం. వి. ఇ. పుం. 1. పొట్టేలు; 2. ఒక యాదవుఁడు; 3. కృష్ణుఁడు; 4. ఇంద్రుఁడు; 5. అగ్ని; 6. పాషండుఁడు.

## వె.

**వెంగలి.** వై. విణ. 1. మూఢుఁడు, అవివేకి; "క. అనుజుఁడొకఁడు వెంగలియై, ననుదప్పదుగానిపెద్దనకుఁగార్యజ్ఞా, ననిగూఢిలేకతక్కిన, ననుజన్ములునిక్కువడుదురవనీనాథా." భార. అను. ర, ఆ. "క. విలసిల్లుచునుండఁగ్రమ్మ, చ్చిలిపట్టికుమారునోర్చఁజీరఁదుటిమివెం, గలులగుక్రూరులుగొందఱు, వెలువడఁగొనిపోయియొక్కవిపినములోనన్." భార. ద్రో. ౨, ఆ. "క. మధుమథనక్రోధానల, మధికముగామండనూఁదునవెంగలికిన్, విధియలుగకమును మృత్యు, క్షుధార్తినివృతాన్యపదవికోఁఅయలుగదే." ఉ, హరి. ౫, ఆ.—2. జడుఁడు*. "క. రంగన్నిజభుజశక్తిన్, వెంగలులైరిపులు సమరవీథింబఱవన్." శశాం. ౧, ఆ. (రూ. వెంగళి. ఉదా. వెంగళప్ప.) (వెకలియొక్క రూపాంతరము.)

**వెంగలివిత్తు.** ద్వి. విణ. మూఢాగ్రేసరుఁడు. "క. వెంగలివిత్తయి తిరుఁగక, యంగజలీలలనుముక్తినాశించునకం, డంగనలతోడవిడువని, సంగతములువదలవలయుజలజాతముఖీ." (అంగజలీలలను వెంగలివిత్తయితిరుగక అని యన్వయము.) భాగ. ౯, స్కం.

**వెంచె.** దే. వి. మడుఁగు, హ్రదము. "రేగడవెంచ." దావ. ౧౦, ఆ.

**వెంట.** దే. వి. 1. కార్యము; "వ. కుటుంబభారంబునర్వంబు నాయందు సమర్పించితారునిర్భరులైయిష్టవిహారంబులనుండుదురు, ఏనెల్లవెంటఁ బ్రమత్తనైవర్తింతు." భార. అర. ౫, ఆ. — 2. విషయము; "ఉద్ధతిఁజనువెంటవింటనడిదంబున నింతటివారులేరు." ఉ, హరి. ర, ఆ.—3. మార్గము; "క. కనుబ్రమసినతెరువరితన, కనపాయంబైనమార్గమరసితగనెటెం, గినవారుసెప్పఁగాఁగై, కొనని కరణిఁదగినవెంటకుంజోరవకటా." భార. ఉద్యో. ౨, ఆ.—4. విధము; "ఎ, గీ. శరణుచొచ్చినాకుజానకినొప్పింపు, మొందువెంటబ్రతికి యుండఁదీరదు." భార. అర. ౭, ఆ. — 5. వేఁట. "శా. ఘంటాకర్ణుఁడనేనునాయనుజుఁడీ కాలాంతకుండేము ము, క్కంటింగొల్తుముకిన్నరేశుపనికైకైలాసశైలంబునన్, జంటన్వచ్చిన సారమేయములు నీ సైన్యంబులున్ మాయవే, వెంటంబోయితిమేమికాఅడవిలోవేఁటాడరేయెవ్వరున్." ఉ, హరి. ౨, ఆ.— క్రి. వెంబడి. "తనవెంటన్ పిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్." భాగ. ౮, స్కం.

**వెంటము.** దే. వి. వేడుక, కుతూహలము.

**వెంటి.** దే. వి. కసవుపిరి. "కోకలువెంట్లుగాఁబెనఁచి." శేష. ౧, ఆ.

**వెంటిగొను.** దే. అ. క్రి. (వెంటి + కొను.) పిరిగొను. "వెంటిగొనఁగానులిచి" రా. యు, కాం.

**వెంట్రువ.** దే. వి. ఒకదినుసుముంగిస, బభ్రువు.

**వెండి.** దే. వి. రజతము. అవ్య. 1. మఱి; "వెండికేవలాహితులు దశావశార్పితసమృద్ధరమాచరణేచ్ఛలు." ఆము. ర, ఆ.—2. పిమ్మట. "క. నాయాఁకలికోర్వవెపుడు, వేయైననుసేఁగొనంగ వెండి యనుభవింతు." భార. శాం. 3, ఆ. (ఇది యునువర్ణకాంతము నగును. చూ. ను.)

**వెండికొండ.** ద్వి. వి. రజతాద్రి. (ఇట్లు వెండిమల మొ.)

**వెండిగుండు.** ద్వి. వి. 1. వెండికొండ; 2. వెండిగుండువలె నుండుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**వెండ్రుక.** దే. వి. 1. కేశము; 2. రోమము. "ఉ. నేనులేనిచో, వెండ్రుకయంతమోసమును వేచిదురంబునకెత్తివచ్చునా, పొండ్రుఁడు." ఉ, హరి. ౨, ఆ.

**వెంపర.** దే. వి. 1. పీడనము; 2. భేదనము; 3, హింస. (చూ. వెంపరలాడు.)

**వెంపరలాడు.** దే. స. క్రి. (వెంపరలు + ఆడు.) 1. పీడించు; 2. భేదించు; "సీ. చెవిఁదార్చివినిచీమచిటుకన్నఁనటఁ బాటిసెలవి వెంపరలాడుఁజెట్టులెల్ల." స్వా. ర, ఆ.—3. హింసించు. "వ. సముద్భటవీరభటపరంపరల వెంపరలాడియు." జై. 3, ఆ.

**వెంపలి.** దే. వి. బాణపుంఖిగీ. (దీనిభేదము ములువెంపలి.)

**వెంబడి.** దే. క్రి. పశ్చాదర్థకము, వెంట.

**వెంబడించు.** దే. స. క్రి. వెనకొను. (నన్ను వెంబడించి వచ్చుచున్నాఁడు)

**వెంబర.** దే విశే. 1. దుష్టుఁడు, దుష్టురాలు; "చిక్కుచుఁబోయి యాగడపువెంబరతొత్తులయిన్ఁ జూచి." రసి. ౫, ఆ.—2. అవివేకి. "ద్వి. అమృతంబుఁగుక్కలకందిచ్చుపురిసి, నంబితొ వను నాశించునట్టి, వెంబరగానివివేకిగాఁడెందు." ప్రభు. ౧౩, ఆ.

**వెంబరవిత్తు.** దే. విశే. 1. దుష్టాగ్రేసరుఁడు; "వ. శిష్టులుం గని దుష్టాత్ములనడుమం గూర్చుండుటయు, అవ్వెంబరవిత్తులఁ జుచ్చేఁడియఁవులకుపంకలాత్తి మాటుసెప్పుటయు నొప్పక." భార. ఉద్యో. 3, ఆ.—2. మూఢాగ్రేసరుఁడు. (చూ. వెంబర.)

**వెకలి.** వై. విశే. 1. మూఢుఁడు; "సీ. వీథిలోఁబోడగన్న వృద్ధుల నరికట్టి వెకలియైపలుమాటువెక్కిరించు." ఉ, గా. ౭, ఆ.—2. ఆసక్తుఁడు*. "ఎ, గీ. వనితచిన్నారిపొన్నారివయసువాని, విప్రనందనుఁగన్నంతవెకలియగుచు." పాండు. 3, ఆ.

**వెక్క.** దే. వి. వేఁడిమి. "సీ. తరుణరంభాగర్భదళతాళవృంతంబుపైగాలివెక్కసపలుకఁబాతె." నై. ౨, ఆ.

**వెక్కలి.** వై. విశే. వెకలియొక్కరూపాంతరము. "ద్వి. ఆవి ప్రు, కడఁగూడిచదువువెక్కలిబ్రహ్మచారులు." నవ. 3, ఆ.

**వెక్కసపడు.** దన్వ. అ. క్రి. (వెక్కసము+పడు.) దుస్సహత్వము నొందు. "క. అక్కాంతడప్పిగనికడు, వెక్కసపడిపలుకుసద్ధవితతులపలుకుల్." హరి. పూ. ౫, ఆ.

**వెక్కసపాటు.** దన్వ. వి. వెక్కసపడుట. "ఉ. వెక్కసపాటు దైన్యమును విహ్వలభావము నొందియుట్లనుణా." భార. విరా. ౫, ఆ.

**వెక్కసము.** దే. వి. 1. దుస్సహత్వము; "వ. ఉబ్బుదక్కి వెక్కసంబునువెల్లఁబాటునుంగదిరి." భార. ద్రో. ౨, ఆ.—2. బ. దుస్సహవచనములు. "ద్వి. కానకనీవువెక్కసములాడెదవు." సా. 3, భా. - విశే. 1. దుస్సహము; "ఉ. ఇంకనీ, వీటికివారివీటికిని వెక్కసమయ్యెడుకయ్యమొప్పనుణా." భార. భీష్మ. 3, ఆ.—2. దుర్లభము; "అ. ధేనుకాదులైనదానవులీలాశ, వనములోననున్న వారుదీనిఁజొచ్చివానవాదిసురగణంబులకైన, వెక్కసంబు బ్రదికివెడలిచనుట." వి, పు. ౭, ఆ.—3. అధికము. "క. మును వెక్కసముగఁగ్రోలిన, వనితౌవార్తాసుధాత్ర వముచిప్పిలెనాఁ, గనుఁగవనుంబ్రమదాశ్రులు, మొనతెప్పలఁగురియఁ బ్రాయమూర్ఛంబోరనిణా." రామా. ౭, ఆ.

**వెక్కసి.** దే. విశే. (వెక్కసము+ఇ.) దుస్సహుఁడు, దుస్సహురాలు. "మ. గోగోపకగోపికానికరముల్ విభ్రాంతిమైబిట్టుమేల్, కనిచూడంజనుదెంచిరర్భకులకెల్లణా వెక్కసీణారక్కసీణా." వి, పు. ౭, ఆ.

**వెక్కసించు.** దే. అ. క్రి. దుస్సహమగు. "ఎ, గీ. నాకవెక్కసించు నాయీమహైశ్వర్యము." కవిక. ౫, ఆ.

**వెక్కిరించు.** వై. అ. క్రి. 1. వికారచేష్టలుచేయు; "మతి వెక్కిరించుఁగిఱిరించుణాడాఁగురించుణాబోరిణా." భో. ౫, ఆ.—2. ఒకరియొక్కవేషభాషాచేష్టలననుకరించి అపహాస్యముచేయు. "చ. సుకవులసూక్తులందు నరసుల్ నెరసుల్ వెదకంగఁబోరుము, తీకవితతుల్ వ్రణంబపరికించుగతిణా గొదవల్ గణించుటల్, కుజనులనైజబుద్ధితెరఁగోఁగథచొప్పనబొమ్మలాడఁగా, నొక్కడపాస్య పుంబ్రతిమలుండవె పెక్కులువెక్కిరించుచుణా." అని. ౧, ఆ.— స. క్రి.. అపహాస్యముచేయు. (నన్ను వాఁడు వెక్కిరించుచున్నాఁడు.) (చూ. వెక్కిరింతలాడు.)

**వెక్కిరింత.** వై. వి. వెక్కిరించుట. (చూ. వెక్కిరింతలాడు.)

**వెక్కిరింతలాడు.** దన్వ. స. క్రి. (వెక్కిరింతలు+ఆడు.) వికారచేష్టలుచేయు. "సీ. అలదుర్గయొక్కిరింతలవెక్కిరింతలాడు రీతినాటుకల్ వెడలఁజూచు." పు. ౨, ఆ.

**వెక్కిలి.** వై. వి. దప్పిమొదలైనవానిచేఁగలిగెడి వ్యాధివిశేషము. (బ. వెక్కిళ్లు.) (ఎక్కిలికి మాఱురూపము.)

**వెక్కు.** వై. అ. క్రి. 1. వెక్కిలివిడుచు; 2. ఏడ్చునపుడు వెక్కిలిధ్వనివలె ధ్వనించు*. "వెక్కుచుమాటతొట్రుపడవెళ్లఁ బొఱుచు." నిర్వ. ౨, ఆ.—వి. వెక్కిలి. "వివశతనొందిమేన నిసువెంబ్రుకవెట్టఁగవెక్కుమీఱె." హరి. ఉ. ౮, ఆ.

**వెక్కురు.** వై. విశే. వికారముపట్టినవాఁడు. "క. చొక్కపు రక్కసికులమున, వెక్కురుజన్మించి నాఁడు." భాగ. ౭, స్కం.

**వెగచు.** దే. అ. క్రి. వెక్కు. "ఎ, గీ. చెక్కుటద్దంబుగదియం గఁడెయుగ్గచేర్చి, వెగచు." (ఇక్కడ వెగచుననఁగా వెక్కియేడ్చు ననియర్థము.) విక్ర. ౬, ఆ.

**వెగటు.** వై. వి. వైరస్యము*. "తనకుసిగ్గు వెగటును బొడమ." స్వా. ౨, ఆ.—విశే. విరసము. "తే. అయ్యలార మీకెల్లనేమనిన మాట, వెగటుకాదుగదా." పర. 3, ఆ.

**వెగడు.** దే. వి. 1. తల్లడము; "సీ. విబుధారికినుకకువెగడొందు సెఱఁగున వసగాశికరముఘూర్ణనమునొందె." లక్ష్మీ. ౨, ఆ.—2. తడఁబాటు. "తే. కట్టువిస్తాత్రములువొంగుఁగడుపుసెదర్చు, లెండుఁగుస్తుకతడియాఱునెలుఁగుడిందు, నూర్పులెడతెగుఁగన్నుల నొందువికృతి, వెక్కుపుట్టునునాలుకవెగడుగదురు." మార్క. ౨, ఆ. "వెగడుమాటలు." నిర్వ. ౮, ఆ.

**వెగడుపడు.** దన్వ. అ. క్రి. తల్లడపడు. (చూ. ఒజ్జ మూడవ యర్థము.)

**వెగ్గలము.** దే. విశే. మిక్కుటము, అధికము. "వెగ్గలపుందాపము." ఆము. ౧, ఆ.

**వెగ్గలీఁడు.** దే. విశే. (వెగ్గలము+ఈఁడు.) అధికుఁడు. "ఎ, గీ. అబ్ధిసంభవయితఁడునోహాలహాలపు, విషముఁబుక్కిటఁదాల్చినవెగ్గలీఁడు." కాశీ. ౫, ఆ.

**వెచ్చించు.** వై. స. క్రి. వెచ్చేముసేయు. "రమ్యాకృష్ణమున్నాతిఁ గాంతేయుం గావఁగఁబూనినీసుకృతముణా వెచ్చించితి." జై. ౭, ఆ.

**వెచ్చే.** దే. వి. 1. వేఁడిమి; "సీ. ఉన్నతస్తనమండలోపరిహారముల్ వేఁడినిట్టూర్పులవెచ్చఁగంద." భాగ. ౮, స్కం.—2. కాక. "విరహభరంబునం బొడమువెచ్చకుశాంతియొనర్చు." ఆము. ౨, ఆ.—విశే. వేఁడి. "వెచ్చనిట్టూర్పు." రామా. ౬, ఆ.

**వెచ్చకాఁడు.** దన్వ. వి. (వెచ్చేము+కాఁడు.) విటుఁడు. "ఎ, గీ. సురలయాఁకటికాఁడుముచ్చులకుఁగేడు, రిక్కలకుఁజేఁడు వెలఁగులయిక్కజాోడు, లచ్చిసైదోడురేబోటివెచ్చకాఁడు, చంద్రుఁడలరారెనక్కళా సాంద్రుఁడగుచు." కవి. 3, ఆ. — విశే. మిక్కిలి వెచ్చముచేయువాఁడు.

**వెచ్చన.** దే. వి. వేఁడిమి. (విశేషణముగుచో "వెచ్చనికన్నునీరదర." భార. అను. ౧, ఆ.) (చూ. అలకన.) విశే. వేఁడి. (చూ. చల్లన. విశే.)

**వెచ్చపడు.** వై. అ. క్రి. (వెచ్చేము+పడు.) వెచ్చమగు. (చూ. ఈగడ.) (ప్రే. వెచ్చపఱుచు.)

**వెచ్చపెట్టు.** దన్వ. స. క్రి. (వెచ్చేము+పెట్టు.) వెచ్చించు. (చూ. కూడఁబెట్టు మొదటియర్థము.)

**వెచ్చెపోవు.** ద్వి. అ. క్రి. (వెచ్చెము+పోవు.) వెచ్చపడు. "చ. తనధనమించుకంతయు వృథావ్యయమైనదిలేదువైష్ణవా, ర్చనలకు వెచ్చపోయినదిసర్వము." పర. ౪, ఆ.

**వెచ్చెము.** వై. వి. 1. వ్యయము; "క. ఎచ్చోఁగజఘోటక్రయ, తచ్చర్వణసుభటజీవితద్విజసురిపూ, జోచ్చనిజభోగములసగు,వెచ్చనువెచ్చంబుగాదు విత్తంబునకుఁ." ఆము. ౪, ఆ.–2. ఇంటికి వాడుకొనుటకు కావలసిన చిల్లరసరకులయప్పు*. "క. అంగడి వెచ్చములాడకు."

**వెచ్చె** దే. అ. క్రి. కాఁగు. "శోకవహ్ని వెచ్చుచునిందున్నదాన." మార్క. ౫, ఆ. – వి. వేఁడిమి. "అఁకటిచిచ్చువెచ్చనఁ." భీ. ౨, ఆ.

**వెజ్జు.** వై. వి. వైద్యుఁడు. "సీ. ఒజ్జశిష్యులఁదజ్ఞనోక్తులవెజ్జురోగార్తులనానావిధౌషధముల, నలమటఁబొందింతురు." భార. అను. ౫, ఆ.

**వెజ్జురాలు.** ద్వి. వి. (వెజ్జు+ఆలు.) వైద్యురాలు. "మ. శమిమూర్ధన్యనిరాణిరాపడినమైజాడ్యంబు ముఃటఁటిచా, పమునంగల్గుగురుత్వమామరవరాపత్యంబుకందిష్టవా, ర్ధిమహేంద్ర ద్విషదోషముగ్రదశవక్త్రభృచ్ఛిరోభారముఁ, శమమొందింపఁగవెజ్జురాలయినకాంతఁ భక్తిభావించెదఁ." చంద్రా. ౧, ఆ.

**వెట్ట.** దే. వి. 1. వెట్టకారు; "సరియగునిట్టవెట్టనిని సర్వమునంచు." ఆము. ౨, ఆ. – 2. వేఁడిమి. "తే. తరణిపెనువెట్టవేఁగినదక్షిణాశ." ఆము. ౫, ఆ.–విశ. వేఁడి. "చ. పరిసరచంపకప్రసవపఙ్క్తులఁబుట్టినవెట్టవాననల్." ఉ, రా. ౬, ఆ.

**వెట్టకారు.** ద్వి. వి. గ్రీష్మర్తువు, వేసవి.

**వెట్టచెవులతపసి.** ద్వి. వి. ఉగ్రశ్రవుఁడు. నీలా. ౨, ఆ.

**వెట్టము.** దే. వి. శత్రువు. "సీ. కలువలచుట్టంబుకలువలవెట్టంబు తన రెండుకన్నులై తనరువాని." దాశ. ౨, ఆ.

**వెట్టి.** వై. వి. కూలిలేక చేసెడుపని. "వెట్టికిఁబట్టినవాఁడుధూర్జటిఁ." ఉ, హరి. ౫, ఆ.

**వెట్టిగొను.** ద్వి. స. క్రి. (వెట్టి+కొను.) వెట్టిచేయించు. "చ. మదమునవింద్రుఁడాదిగ సమస్తనిలింపులవెట్టిగొన్ననా, యెదుర మృగాక్షినీవకట హీనపరాక్రమురాముగీముఁజెప్పెదవు." రా. ఆర, కాం. ౨, ఆ.

**వెట్టివాఁడు.** ద్వి. వి. గ్రామమునందు దినబత్తెములేక వెట్టిపని చేయువాఁడు.

**వెట్టీఁడు.** ద్వి. విశ. (వెట్టి+ఈఁడు.) వెట్టిచేయువాఁడు.

**వెడ.** దే. విశ. 1. అల్పము; "క. వెడపనికినాలిఁజంపం, గొడుకుఁబనిచివచ్చినాఁడఁ గ్రూరత్వమునఁ." భార. శాం. ౫, ఆ. – 2. తుచ్ఛము; "క. కొన్నివెడమాటలాడుచు, నన్ననతఁడుచెట్టవట్టినఁ." భార. విరా. ౨, ఆ. – 3. వికృతము; "క. వెడరూపుదాల్చిబాంధవు, లడలఁగనిర్యాణమునకునభిముఖుఁడై." భాగ. 3, స్కం. – 4. వ్యర్థము. "సమయముపల్కరాకవెడజాగులఁజెట్టితి." రామా. ౬, ఆ. – క్రి. విశ. ఇంచుక. "వెడవికసిల్లెడునా, నవపద్మముతోడ." భార. విరా. ౨, ఆ.

**వెడఁగు.** దే. వి. 1. అవివేకము; "చ. కడుననుఁగన్నతల్లికినగానలరామునిఁ దండ్రిమాఱుగా, నుడుగనిబత్తితోఁగొలుచుచుండెడుతన్ను వెడంగువూనికా, అడవులలోపలంగఱకులాడినదోసవుఁబంటయంతయుఁ, గుడిచితినంచునామఱఁదికుఱ్ఱకునిక్కమెఱుంగఁబల్కుమా." అచ్చ. సుం, కాం.–2. వికారము. "క. అనిపలుకుపాఱ్థుపలుకులు, వినిపలుకకయున్నమనుజవిభుదెసఁగోపిం, చినతనమదివెడఁగుకుపుచు, ననిలసురుండిట్టులనియె నాతనితోడఁ." భార. శాం ౧, ఆ. – విశ. అవివేకి. "ఆ. భ్రమవిమోహలోభభయపరిభూతనై, కొడుకువిడువనంతవెడఁగనయ్య." భార. ఆది. ౬, ఆ.

**వెడఁగుపడు.** ద్వి. అ. క్రి. 1. అవివేకమునొందు; "మేదురమోహాంధకారమున వెడంగుపడఁడు." భార. అశ్వ. ౪, ఆ. – 2. జడత్వమునొందు; "క. వెడఁగుపడియుచటఁజెద్దయు, వడినిలిచి." నిర్వ. ౧౦, ఆ.–3. వికారమునొందు. "వ. ఎండతాఁకునరేయింటియలజడియు నప్పటియాఁకలియు నొడళ్లుడిల్లపడం జేసినను మొగంబులు వెడంగుపడ్డచినను బొలివోనిపౌరుషంబులనయ్యొసువాఁగునుగడంగికలయంబెరసిపెనంగిరి." (ఇచ్చట వాఁగు శబ్దమునకు సైనికులర్థము. చూ. వాఁగు.) భార. ద్రో. ౫, ఆ.

**వెడఁగుపాటు.** ద్వి వి. వెడఁగుపడుట. (జడత్వమునొందుటకు. చూ. గ్రుక్కుమిక్కుమన.)

**వెడఁగుఱుపడు.** ద్వి. అ. క్రి. జడత్వమునొందు. "ద్వి. ఎడపకనాజ్ఞాతులిప్పుడుసన్న, విడిపించుకొనలేక వెడఁగుఱుపడిరి." భాగ. ౮, స్కం.

**వెడఁద.** దే. విశ. విశాలము. "వెడఁదయురమువాఁడు." భాగ. ౨, స్కం. "వెడఁదకన్నులు."

**వెడఁదమోముమెకము** ద్వి. వి. సింహము, పంచాస్యము.

**వెడఁదవాతియమ్ము.** ద్వి. వి. (వెడఁదవాయి+అమ్ము.) బాణవిశేషము. "ఆ. అన్నివెడఁదవాతియమ్ములద్భుతముగ, నొక్కముష్టిఁదొడిగి యుక్కుమెఱయ, నతఁడులీలఁదునిమెనందఱుతలలును, ఘోరభంగిరక్తధారలెగయ." భార. విరా. ౫, ఆ.

**వెడలఁబడు.** ద్వి. అ. క్రి. (వెడలన్+పడు.) వెడలు. "తే. హాసరోజాక్షగోత్రపథార్ణవమున, మునిఁగియున్నాఁడఁజేయూర్చుకొనఁగలేక, నీకృపాదృష్టిపేరోడగాకయున్న, వెడలఁబడుటెట్లుమఖముగావించుటెట్లు." జై. ౧, ఆ. (స్వార్థమునపడు.)

**వెడలఁబాటు.** ద్వి. వి. వెడలఁబడుట. "చ. భువనభయంకరంబులగుపోరులఁ దమ్ములతోడఁగూడినీ, వువెడలఁబాటులెస్స." భార. శాం. ౧, ఆ.

**వెడలఁబాఱు.** దే. అ. క్రి. (వెడలన్+పాఱు.) వెడలు. (చూ. పోలు. వి. చూ. పాఱు.)

**వెడలు.** దే. అ. క్రి. బయలువెళ్లు.

**వెడలుచు.** దే. ప్రే. వెడలఁజేయు. "కొమ్మకేలుచెలువంబుగఁబట్టి యయాతినూతిలోవెడలిచె." య. 3, ఆ. (రూ. వెడల్చు.)

**వెడలుపు.** దే. వి. వైశాల్యము. (రూ. వెడల్పు.)

**వెడవింటి.** దే. వి. (వెడ+విల్లు.) మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (చూ. తొగ రెండవయర్థము.)

**వెడవిలుకాఁడు.** దే. వి. —— పై. —— (చూ. వంకిణి.) (ఇట్లు వెడవిలుతుఁడు.)

**వెడవెడ.** దే. విశ. అత్యల్పము, సూక్ష్మము. "వెడవెడనడుములు." (చూ. వీఁగియాడు.) "వెడవెడపనులు." శశాం. ౪, ఆ.– క్రి. విశ. 1. సూక్ష్మముగ; "వెడవెడనేనుదొల్లియిదివింటి." భార. ఉద్యో. ౪, ఆ.–2. మందముగ; "వ. వెడవెడనవ్వుచు." భార. ఉద్యో. 3, ఆ. "వెడవెడపోవు." ఆము. ౪, ఆ.– 3. మృదువుగ. "వెడవెడదడియొత్తి." ఆము. ౫, ఆ. "వెడవెడయూఁకొని." భార. ఉద్యో. ౨, ఆ.

**వెడ్డరి.** దే. విశ. (వెడ్డు+అరి.) కపటి, వంచకుఁడు.

**వెడ్డు.** దే. వి. 1. కపటము; "సీ. వెట్టుబుతొలుమేనవెడ్డునసాధుజనము మోసపుచ్చిధనంబుగొన్న, జనులు." భార. అను. ౫, ఆ.—2. వంచన. "ఎ, గీ. ఇట్టిగతిఁజెల్వకుమవెడ్డువెట్టునొక్కొ." ప్రభా. 3, ఆ

**వెడ్డువెట్టు.** దే. స. క్రి. (వెడ్డు+పెట్టు.) వంచించు. "ద్వి. దారుణక్రియల, వెఱపింతురలఁతురువెడ్డువెట్టుదురు." గా. యు, కాం. "వ. అనివెడ్డువెట్టిననతండుబేల్పడియట్లచేసె." భో. ౫, ఆ.

**వెఁౙద.** దే. విశ. వెడఁదయొక్కరూపాన్తరము. "ఉ. నందసుతుంగనుంగొని వెణందకనుంగవనించెబాష్పములే." శృం. ౭, ఆ. (దీనికిఁ బ్రయోగాంతరము మృగ్యము.)

**వెఱుతురు.** వై. వి. కరీరము. (వెలుతురుయొక్కరూపాంతరము.)

**వెత.** వై. వి. దుఃఖము. "తే. అతనియానతిఁగైకొనివెతలుమఱచి." నీలా. ౭, ఆ.

**వెతకు.** దే. స. క్రి. అన్వేషించు. "చ. అతఁడుమహాప్రసాదమనియత్తొలివాకిలిచొచ్చియచ్చటన్, వెతకె." ఉ, రా. ౪, ఆ.

**వెతారము.** దే. వి. వెత, దుఃఖము, వ్యధ.

**వెద.** దే. వి. 1. విత్తుట; "వ. వెదపదనికిఁగొంపిగలంచి." భార. విరా. ౫, ఆ.—2. పక్షిగర్భాధానము; "వ. వెదకొనచ్చు జక్కవపెంటికూటువలను." నీలా. 3, ఆ. "సీ. హలజీవిసందోహనులుబలాకికావిసరంబులకుమంచివెదలుదొరకె." ఆము. ౪, ఆ.—3. పశుఋతువు; "ఎ, గీ. వెదవివేకించుఁ గ్రీడించువిశ్రమించు." భాగ. ౧, స్కం.—4. క్రొవ్వు. (చూ. విను మ్రాను.)

**వెదకు.** దే. స. క్రి. వెతకుయొక్కరూపాంతరము. "క. బంధులగురులన్, వెదకివధియించుసౌఖ్యం, బదియేటికి." భార. ఉద్యో. ౧, ఆ.

**వెదకుడు.** దే. వి. వెదకుట, అన్వేషణము.

**వెదగొఱ్ఱు.** దే. వి. విత్తులువెదవేసెడుగొఱ్ఱు.

**వెదచల్లు.** దే. స. క్రి. 1. పాఱఁజల్లు; (వాఁడు నాలుగుతట్టుల రూకలు వెదచల్లినాఁడు.) 2. వ్యాపింపఁజేయు. "చ. తన్నుతండువ, తుసలతయుగారవంబువెదచల్లెడుమాటలనాదరింపఁగన్." ప్రభా. ౪, ఆ.

**వెదచిందు.** దే. అ. క్రి. వ్యాపించు. "సీ. అలచెందొవలవిందుచెలువెందువెదచిందు మొగమున కొకవింతజిగిదొలంకె." పా. ౧, ఆ.

**వెదపెట్టు.** దే. స. క్రి. విత్తు. (చూ. నిట్టు రెండవయర్థము.)

**వెదావు.** దే. వి. (వెద+ఆవు.) వెదపదనైయాఁబోతుచేవెనుకొనఁబడు ఆవు, నంధిని. (ఇట్లు వెదమొదవు మొ.)

**వెదురు.** వై. వి. వేణువు. (ఇది ద్వివిధము. గట్టివెదురు, బొంగువెదురు.)

**వెదురుకంపజిట్ట.** ద్వ. వి. పక్షివిశేషము.

**వెదురుపాలు.** వై. వి. త్వక్షీరము.

**వెదురుపిచ్చిక.** ద్వ. వి. పక్షివిశేషము.

**వెదురుప్పు.** ద్వ. వి. (వెదురు+ఉప్పు.) వెదురుపాలు.

**వెదురుమిడుత.** ద్వ. వి. క్రిమివిశేషము.

**వెదురువిల్లు.** ద్వ. వి. వెదురుబద్దలతోఁజేసిన విల్లు. (చూ. విల్లు.)

**వెనకయ్య.** వై. వి. వినాయకుఁడు, విఘ్నేశ్వరుఁడు.

**వెనకు.** దే. స. క్రి. వెదకుయొక్కరూపాంతరము. "తే. తనకుఁబగయగుప్రాద్దునువెనకికనక, కనలుచీఁకటిరక్కసికన్నులందుఁ, దొరుఁగుకనకనమనునిప్పుఁదునుకలనఁగఁ, బొడిచెనెడనెడమిడుఁగుఱుఁబుసువ్వలంత." య. ౭, ఆ.

**వెనకుడు.** దే. వి. వెదకుడుయొక్కరూపాంతరము.

**వెను.** దే. వి. వెన్నుయొక్కరూపాంతరము. అవ్య. వెనుక. (దీనికి హల్లుపరమగుచో ఉత్వమునకు వికల్పముగా లోపంబగు. "నవరత్నప్రోతసౌధాంగణస్థలులన్ వెన్నునివచ్చునిర్మల తనుచ్ఛాయన్ నిరీక్షించి." కా. 3, ఆ.)

**వెనుఁబడు.** ద్వ. అ. క్రి. 1. (చూ.) విషాదించు; "క. చనిమవినాగ్నిజ్వాలలు, దనుకఁగనిట్టూర్పుగాడ్పుదండడినిగుడన్, దనునూరార్పఁగసఖిదొం, కొనమికి వెనుఁబడుచుఁ గీచకుండానతితోన్." భార. విరా. ౭, ఆ. "చ. నన్నుఁగే, వలమునుముట్టనెవ్వరికివచ్చునసుంగలఁగున్ వెనుంబడున్." భార. విరా. ౭, ఆ.—2. ఖేదపడు. "క. తనుఁబాయఁజాలకందఱు, వెనుఁబడుటయెఱింగి." నిర్వ. ౨, ఆ.

**వెనుఁబాటు.** ద్వ. వి. వెనుఁబడుట. (విషాదమునకు.—"క. అనిననపనిచిత్తంబున, వెనుఁబాటంతయును బాయువెరవుకలిమియొల్లనుదెలియునట్లుగాని, ట్లనియెం బాం చాలియుచిత మగుచందమునన్." భార. విరా. ౧, ఆ.—ఖేదమునకు.—"క. అనుపలుకులకుపిసాదము, దనుకఁగధృతరాష్ట్రవిభుఁడుదనకందనునే, మనియుంబలుకఁగఁజాలక, వెనుఁబాటుననిట్టులనియె విదురునితోడన్." భార. ఉద్యో. ౭, ఆ.)

**వెనుక.** ద్వ. వి. 1. పశ్చాద్భాగము, "వెనుకకుఁబడఁద్రోసె." వి, పు. ౭, ఆ.—2. ముందు; "సీ. అయ్యనీనామధేయంబేమియెప్పుడువెనుకకుమీరుండువిషయమెద్ది." రామా. ౬, ఆ.—3. పడమర; (చూ. చుట్టలుఁగు.) 4. ఉపేక్ష. "ఎ, గీ. అనినవారలిట్టులనిరితండిరిచాళ్ళు, వినియువెనుకచేసిచనఁగనగునె." భో. ౬, ఆ.—విశ. 1. పశ్చాద్భాగముననున్నది. "ఎ, గీ. ఇనుఁడుసీతుగాలివెనుకగామొననడి, పించినడువనంభవించుజయము." భార. శాం. 3, ఆ.—2. ముందటిది. "ఎ, గీ. అంతసుద్దాలకుండునన్యాసియయ్యెఁ, గానిగార్హస్థ్యధర్మంబుఁ బూనఁడయ్యెఁ, దరుణిచేసినవెనుకరోఁతలుదలంచి." జై. ౪, ఆ.—క్రి. 1. వెంబడి; (నావెనుకరమ్ము.) 2. పిమ్మట. (నేను వెనుక వచ్చెదను.) (దీని మొదటిరూపము వెనుకల.)

**వెనుకచిక్కు.** దే. అ. క్రి. వెనుకపడు.

**వెనుకచూపులమెకము.** ద్వ. వి. ఎలుఁగు, భల్లూకము.

**వెనుకటిపని.** దే. వి. అపరకర్మము. అచ్చ. యు, కాం.

**వెనుకటివాఁడు.** దే. వి. (వెనుక+వాఁడు.) అనుజుఁడు. విశ. వెనుకనున్నవాఁడు.

**వెనుకదీయు.** దే. అ. క్రి. (వెనుక+తీయు.) 1. వెనుకకుమరలు; 2. సంకోచించు.

**వెనుకద్రొక్కు.** దే. అ. క్రి. (వెనుక+త్రొక్కు.) వెనుదీయు.

**వెనుకపడు.** ద్వ. అ. క్రి. 1. వెనుకచిక్కు; 2. (ధనము వెచ్చముకాక) కూడఁబడు.

**వెనుకపాటు.** ద్వ. వి. వెనుకపడుట. "వ. నల్పుప్వటాలకు వెనుకపాటునంగదిసి." స్వా. 3, ఆ.

**వెనుక మేను.** దే. వి. వీఁపు, చరమాంగము.

**వెనుకమ్రాను.** దే. వి. పీఠపుబానకు నీళ్లెత్తువాఁడు కూర్చుండుటకై నిలువుగాళ్లమీఁద అడ్డముగానుంచినమ్రాను.

**వెనుకల.** దన్య. వి. (వెను+కలను.) (చూ.) వెనుక. (ఇది మునుగలవంటిది. ఈపదము సాధువేకాని దీనికి ప్రయోగము మృగ్యము. వెనుకాలయనుట గ్రామ్యము.)

**వెనుక వేయు.** దే. స. క్రి. (ధనము వెచ్చముచేయక) కూడఁబెట్టు.

**వెనుకొను.** దే. స. క్రి. వెంబడించు. "ఆ. వాయుమునుదోలు కొనిరయంబునసేవెను, కొనఁగనిట్టుపఱచిక్రోడమొక్క, బోవఁగా జొచ్చి యతలమునకుడిగ్గుటయును, తోనచొచ్చిదానిఁగానకచట." మార్క. ౨, ఆ.

**వెనుచేఱుచు.** దే. స. క్రి. ——పై.—— "క. పరసేనలువెనచఱచేయుఁ, బఱతేరఁగఁబాటిపోవఁబాడియమీకున్." ఉ, రా. 3, ఆ.

**వెనుతవులు.** దే. స. క్రి.——పై.——(చూ. వెన్తవులు.)

**వెనుదన్ను.** దే. అ. క్రి. స. క్రి. వెన్నుదన్నుయొక్క రూపాంతరము. (వెనుకనిల్చుటకు.—"పార్థివ్రుఁడుకా వెనుదన్నిచూడ." భార. విరా. ౫, ఆ.)

**వెనుదీయు.** దే. అ. క్రి. (వెను+తీయు.) వెనుకకుమరలు. "కురిసెడువృష్టివర్షమునకుకా వెనుదీయక." ఉ, రా. 2, ఆ.

**వెను వెంట.** దే. క్ర. మిక్కిలి వెంబడి.

**వెన్క.** దే. వి. నిఁ. క్ర. వెనుకయొక్క రూపాంతరము. [పశ్చాద్భాగమునకు.—(చూ. వేగిరకాఁడు.) వెంబడికి.—"దానివెన్కను బత్తీంద్రుఁడు." భాగ. ౮, స్కం.]

**వెన్కొను.** దే. స. క్రి. వెనుకొనుయొక్క రూపాంతరము. "చ. ప్రకుపితుఁడైయతండునసుఁబాయకవెన్కొనిపట్టెనుగ్రతన్." కళా. 3, ఆ.

**వెన్తవులు.** దే. స. క్రి. వెనుతవులుయొక్క రూపాంతరము. ఆము. ౬, ఆ.

**వెన్న.** పై. వి. (వెల్ల+నేయి.) పెరుఁగుచిలికియెత్తినది, నవనీతము.

**వెన్నంటు.** దే. స. క్రి. (వెన్ను+అంటు.) వెంబడించు.

**వెన్నడాయి.** దన్య. వి. పక్షివిశేషము.

**వెన్నడి.** దే. వి. వెంబడి. "శౌరియునహాగ్రజాదైరథమెక్కి యయ్యపక్రాంతుని వెన్నడిందగులఁగా." హరి. పూ. 3, ఆ.

**వెన్నడించే.** దే. స. క్రి. వెంబడించు. "శే. విఱిగిపాఱినఁ బోనీకవెన్నడించు, హలధరునిఁజూచి." ఉ, హరి. 3, ఆ.

**వెన్నడికొను.** దే. స. క్రి.—— పై. ——"వీరివెన్నడికొని యిట్లుచేసెనె యనాథులఁబోలెవిధాతృఁడు." భార. అర. 2, ఆ.

**వెన్నదొంగ.** దన్య. వి. కృష్ణుఁడు, నవనీతచోరుఁడు. (ఇట్లు వెన్నముచ్చు.)

**వెన్న పడిదము.** దన్య. వి. ఒకదినుసుపిండివంట. "ఎ, గీ. గోవజవాజిఁగస్తూరిఁగొఱఁతపఱుచు, వెన్నపడిదంబుజొబ్బిలవిద్రిచివిద్రిచి." పై. ౬, ఆ.

**వెన్న పాలకాయ** దన్య. వి. భక్ష్యవిశేషము.

**వెన్న పూస.** దన్య. వి. వెన్నముద్ద.

**వెన్నప్పము.** పై. వి. (వెన్న+అప్పము.) మధురభక్ష్యవిశేషము. (చూ. కడియపుటట్టు.)

**వెన్నమడుఁగు.** దన్య. వి. వస్త్రవిశేషము. హంస. ౫, ఆ.

**వెన్నముద్దకోడి.** దన్య. ౨. పక్షివిశేషము.

**వెన్నముద్దలు.** దన్య. వి. బ. శాలిధాన్యవిశేషము. హంస. ౪, ఆ.

**వెన్నమెఱుఁగు.** దన్య. వి. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

**వెన్నయుండ.** దన్య వి. (వెన్న+ఉండ.) మధురభక్ష్యవిశేషము.

**వెన్న వెదురు.** పై. వి. ఒకదినుసుకూరాకుచెట్టు, విశల్య.

**వెన్నాడు.** దే. స. క్రి. (వెన్ను+ఆడు.) వెన్నడించు. "సీ. ఒకకావళొవలనొకకిరాతుండేటువడిపాఱుమృగమువెన్నాడిపఱచి, కానక." వా. ౫, ఆ.

**వెన్నిచ్చు.** దన్య. అ. క్రి. (వెన్ను+ఇచ్చు.) వెనుదీయు. "ద్వి. పగఱకువెన్నియ్యఁబాటిగాదయ్య."

**వెన్ను.** దే. వి. 1. వీఁపు; 2. వరిమొదలగువాని ఎన్ను; "శే. కలమగర్భంబులింతిజంఘలకుసోడి, వేఁగదృణమూ నితలవంచెవెన్నుఁజూపి." శుక్తి. ౪, ఆ.–3. ఇంటి నడికొప్పు. "వ. పాడిల్లునుంబోలెవెన్నాఱి." కవిక. ౪, ఆ. (ఈరెండు ఉదాహరణములందును శ్లేష.)

**వెన్నుఁడు.** పై. వి. విష్ణువు, కృష్ణుఁడు.

**వెన్నుకట్టె.** దన్య. వి. పృష్ఠబంధము.

**వెన్ను గాఁడి.** దే. వి. (వెన్ను+కాఁడి.) ఇంటి నడికొప్పు మ్రాను.

**వెన్నుదన్ను.** దే. అ. క్రి. (వెన్ను+తన్ను.) వెనుకనిల్చు. "వెన్నుదన్నిచూచునవసరంబున." ఉ, హరి. 3, ఆ.—స. క్రి. వెంబడించు. "వెన్నుదన్నినిలిచెదానవేశ్వరుఁడు." నిర్వ. 3, ఆ.

**వెన్ను పట్టె.** దన్య. వి. 1. ఇంటివెన్నుగాఁడి; 2. వీఁపునడిమియెముక.

**వెన్ను పాము.** దే. వి. వెన్నెముకయందుండుపురుగు, కుండలి.

**వెన్ను పూస.** దే. వి. వీఁపునడిమియెముక.

**వెన్నుబద్ద.** దే. వి. వెన్నుగాఁడి.

**వెన్నుమ్రాను.** దే. వి.——పై.——

**వెన్నెముక.** దే. వి. (వెన్ను+ఎముక.) వీఁపు నడిమియెముక, కశేరుక.

**వెన్నెల.** దన్య. వి. (వెల్ల+నెల.) 1. చంద్రునియొక్క తెల్లని కాంతి, చంద్రిక; 2. అంజలివిశేషము.

**వెన్నెలకారు.** దన్య. వి. శరదృతువు.

**వెన్నెలకుప్పలు.** దన్య. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. డాఁగిలిముచ్చులు.) (ఇట్లు వెన్నెలప్రోవులు.)

**వెన్నెలకోలు.** దన్య. వి. నమస్కారము. "మంజులగతిరగడ. విష్ణుపురంబున విలసిల్లుమహా, విష్ణుస్వామికి వెన్నెలకోలని." హంస. ౪, ఆ.

**వెన్నెలగుత్తి.** దన్య. వి. చంద్రుఁడు, శుభ్రాంశువు.

**వెన్నెలపులుఁగు.** దన్య. వి. వెన్నెలకు సంతోషించెడు పక్షివిశేషము, చకోరము. (ఇట్లు వెన్నెలపిట్ట.)

**వెన్నెలఱేఁడు.** ద్వ. వి. చంద్రుఁడు, కళానిధి. (ఇట్లు వెన్నెలరాయఁడు.)

**వెన్నడు.** ద్వ. అ. క్రి. వెనుఁబడుయొక్క రూపాంతరము. (విస్తరించుటకు.—"ఉ. ఏక్రియఁ వారిధిఁద్రచ్చువారము ధ్రువంబుగదానికిఁగవ్వ మెద్దియా, ధారిమ్ముదానికెద్దియని తద్దయువెన్నడి యున్న." భార. ఆది. ౨, ఆ.)

**వెన్నాటు.** ద్వ. వి. వెనుఁబాటుయొక్క రూపాంతరము. (విస్మయమునకు.—"ఎ, గీ. తలఁకువృట్టెఁగొంకుకొలఁదికిమీఱెవె, న్నాటు, దోఁచెనుట్టుపాటుదొడరె." భార. విరా. ౨, ఆ.)

**వెప్పు.** దే. వి. వేఁడిమి. "వ. ఉప్పువెప్పునఁగలయప్పిశితఖండంబులు." సాన్వ. ౪, ఆ.

**వెమ్ము.** దే. అ. క్రి. తప్తమగు, తాపమునొందు. "ద్వి. క్రమ్మెడు శోకాగ్నికణములందంద, వెమ్ముచురఘురాము ఁడుపునరాల." గా. అ, కాం. "తే. ఉమ్మలికమునఁ దద్దయువెమ్మునంత, రంగములతోడనరిగిరిగంగదెసకు." భార. స్త్రీ. ౨, ఆ.

**వెయి.** దే. స. వేయియొక్క రూపాంతరము.

**వెరఁగు.** దే. వి. 1. ఆశ్చర్యము; "క. వెరఁగయ్యెడునేసపుడీ, తరుణిగుణంబులునుతింపఁ దానువిరక్తిఁ, స్థిరుఁడట్లయుండితోడస, విరహార్తుఁడనైతినను టవివరింపఁజెలీ." ప్రభా. ౪, ఆ.—2. నిశ్చేష్టత. (చూ. వెఱఁగు.)

**వెరఁజొఁడు.** దే. స. క్రి. (వెరఁజి+అడు.) జోరుకొను. "ఆ. ఉవిదనీకుఁదెలియదోకానియేయింట, నైన జొచ్చియెప్పుడైనవచ్చి, వెదకి వెదకి వెన్న వెరఁజాడుచున్నాఁడు, నీసుతుండుమమ్మునిలువనీక." వి, పు. ౭, ఆ. (చూ. ఊఁగాడు.)

**వెరఁజొ.** దే. స. క్రి. జొరుకొను. "మ. అసురేంద్రాశయకుండ కాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయగాం, చినముద్యత్ప్రతిసింహ మత్సరమిళ చ్ఛేష్టందదుద్దామదీ, ర్ఘ నటార్ఘూటముఁ బెల్లగించుగతినాం త్రశ్రేణిఁగింకఁ వెరం, జానిత్రూరభవన్న భావళులు ప్రోచుఁ మర్త్యపంచాననా." ఆము. ౪, ఆ. (చూ. కదుకొను మొదటి యర్థము.)

**వెరవరి.** దే. విశే. (వెరవు+అరి.) ఉపాయశాలి. "జరాసంధుని వెరవరిగామెచ్చరు." ఉ, హరి. ౪, ఆ.

**వెరవిఁడి.** దే. విశే. (వెరవు+ఇఁడి.) ఉపాయహీనుఁడు. దానినీ వెరవిఁడిగానలేఁడు." భార. ద్రో. ౨, ఆ.

**వెరవు.** దే. వి. 1. ఉపాయము; (చూ. బెట్టిదము. విశే. రెండవ యర్థము.) 2. జీవనోపాయము; "క. కరిసనమును బేహారము, నరసిపసులఁ గూర్చుటయును ననఁగావృత్తుల్, నరులకునిందెవ్వనికే, వెరవుచితంబదియవానివేల్పైయుండుఁ." హరి. పూ. ౭, ఆ.—3. విధము. "క. సిరిరామోకాలొడ్డిన, కరణినిబైకొనుచునేనె కడయఁగననునీ, వెరవునవిడనాడుచునొక, తిరిపవుఁజెలిపట్టిఁజేరఁదివిరెద వేమీ." య. ౨, ఆ.—విశే. 1. యుక్తము; "క. పరపగుమోహరమేర్పను, వెరవగుచోనెల్లినేడువిడిసెద." ఉ, హరి. ౪, ఆ.—2. అధీనము. "క. గరుడుని పైశార్ఙధను, ర్ధరుఁడగువిష్ణుండుమేరుతటిఁబోల్చుతటి, త్పరివృతజలదముఁబోలుట, వెరవదనుజరాజ హంతవితతి యితనికిఁ." నిర్వ. 3, ఆ.

**వెరవేఁకి.** ద్వ. వి. విరహతాపము. "ఉ. ఏవిదినంబులో రజనులెయ్యవియోవిను నిద్రయిట్టిదో, వేఁపుటయెప్పుడో యకట వెమ్ముమనంబునకద్దిమందో యే, త్రోవలఁబోయెనో తలఁపుతోడనచెయ్వుతెలుంగనేనునా, కీవెరవేఁకిమాన్పఁగనులేక్షణయచ్చితినీవువెళ్లవై."

హరి. ఉ. ౭, ఆ. (ఇందలి వెరశబ్దము విరహార్థకమయి ప్రత్యేకముగా ప్రయోగములందు కానఁబడదు.)

**వెరసి.** దే. వి. లెక్కమొత్తము. విశే. కడపటిది. "వ. ఇన్నియుఁజెప్పనేల వెరసిమాటయొకటివినుమనియిట్లనియె." కళా. ౫, ఆ.

**వెరసు.** దే. వి. అంకెలులోనగువానిపఙ్క్తి. "చ. ఒక్కొకవానిఁ గొల్చుచె, న్వెర సుల సంఖ్య లుంగల యనేర్పు ననేర్ప డఁజూచిరండొగిఁ." రా. యు, కాం.

**వెరువు.** దే. వి. వెరవుయొక్క రూపాంతరము. (చూ. గొరువంక.) (ఇట్లు ఉకారమధ్యముగా వాడుకలేకయున్నను ఇది యిట్లే యుండవలయుననుటకుఁ బ్రయోగను కానఁబడుచున్నదిగాని అకారమధ్యముగా వాడుక విశేషించియుండినను అది యట్లే యుండవలెననుటకుఁదగిన ప్రయోగను కానఁబడదు.)

**వెఱ.** దే. వి. 1. భయము; "క. చెఱువునడుమవిసిననుబెను, వెఱమొకములుచెదరినను వివేకనిధియు, క్కఱిబహుళసైన్య మడ్డముఁటఁ, బఱచినఁగంగరాదుబలియురకైనఁ." భార. శాం. 3, ఆ.—2. ఆశ్చర్యము. "తే. వారుఁదానురహస్యవిచారపరత, నుండివెఱతోడిభయమునసుదిలకొనుచు." కవిక. ౬, ఆ.

**వెఱఁగు.** దే. వి. 1. ఆశ్చర్యము; "వ. అరవిందనాభురాకవిస్మయంబందుచున్నయన్నరవరాగ్రణి ఒగనుంగొని యిట్లనియె." "తే. అర్ధరాత్రంబువచ్చెనీహరియటంచు, మనమునందేలవెఱఁగంద." జై. ౧, ఆ.—2. నిశ్చేష్టత. "మనంబులోపలఁ వెఱపునుఖేదముఁ వెఱఁగునుస్మయముంబొడమంగ." ఉ, హరి. ౫, ఆ. (చూ. వెఱఁగుపాటు.)

**వెఱఁగుపడు.** ద్వ. అ. క్రి. 1. ఆశ్చర్యమునొందు; (చూ. తెఱుఁగు.) 2. నిశ్చేష్టతఁబొందు. (చూ. వెఱఁగుపాటు.)

**వెఱఁగుపాటు.** ద్వ. వి. వెఱఁగుపడుట. (ఆశ్చర్యమునకు.—"చ. కౌరవసేనలోనిభూ, పతిసుతకోటికిఁ వెఱఁగుపాటొనరించిరి బాణజాలసం, వృతగగనాంగణంబగునవీనమహాహవ విభ్రమంబునఁ." భార. విరా. ౫, ఆ.—నిశ్చేష్టతకు.—"తే. దానికమ్మునుఁల్లఁజిత్తమున భయము, విస్మయంబునుబెనఁగొనవెఱఁగుపాటు, గదిరిచిత్రరూపంబుల కరణినుండ." భార. అను. ౪, ఆ.) (చూ. వెన్నాటు.)

**వెఱఁగొందు.** దే. అ. క్రి. (వెఱఁగు+ఒందు.) ఆశ్చర్యపడు.

**వెఱక.** దే. వి. వెంద్రుక. "సీ. మత్పాదరక్షయుమాపుపెఁ వెఱకఁగుట్టినయోటితిపిరి దండెయునుమెఱయ." ఆము. ౬, ఆ.

**వెఱచేఱచు.** దే. అ. క్రి. భయపడు. (చూ. ఒక్కఱ. విశే.)

**వెఱచు.** దే. అ. క్రి.——పై.——"వ. ద్విరదంబులలోఁ జిక్కియుఁజొక్కియు దెరువునఁబోవెఱచియుంబఱచియు." ఉ, హరి. ౬, ఆ. (చూ. అఱచు మొదటియర్థము.)

**వెఱపరి.** దే. విశే. (వెఱపు+అరి.) భయముగలవాఁడు, భయముగలది.

**వెఱపిఁడి.** దే. విశే. (వెఱపు + ఇఁడి.) భయములేనివాఁడు, భయములేనిది.

**వెఱపు.** దే. వి. భయము. (చూ. వెఱచు.)

**వెఱబొమ్మ.** దే. వి. పశ్వాదులకు వెఱపుపుట్టుటకై భీకరాకారముగఁ బ్రతిష్ఠించెడు ప్రతిమ. "క. నెఱపగునంపదగలిగిన, నెఱిదానంగుడువఁగట్టనేరనిమనుజుం, డఱిముఱిఁజేనికిఁగట్టిన, వెఱబొమ్మయె కాదెయెన్నివిధములఁజూడఁ." విక్ర. ౨, ఆ. "ద్వి. మఱిమన్ఘునిసూత్రమహిమచేఁదిరుగు, వెఱబొమ్మయోయనవెసనడియాన, విరసవర్తనములవెలఁదియీభంగి, నిరువురికన్నిధికడతారితారి." రా, అర, కాం.

**వెఱవెఱపాటు.** ద్వ. వి. నిశ్చేష్టత. "ద్వి. కరములుమొగిడించి కనులువిస్మయంబు, వెఱవెఱపాటునువిహ్వలత్వంబు, వెఱపునుమఱపును వీటతాటముగ." రా. అ, కాం. (దీనికీ గ్రంథమునందు తప్ప మఱియెక్కడను ప్రయోగము కనఁబడలేదు.)

**వెఱ్ఱి.** దే. వి. 1. పిచ్చి, ఉన్మాదము; (చూ. ఒఱపు. విశే. మొదటి యర్థము.) 2. అవివేకము. "క. జడలుధరియించియడవుల, నిడుములఁబడికాయగసరులేమెసఁగెడుపెఱ, బడుగునినుఁగవయుఁదగునా, విడువిడునీశీలపట్టెవెఱ్ఱిలతాంగీ." రామా. ౬, ఆ.—విశే. 1. పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు; (చూ. వెఱ్ఱు మొదటి యర్థము.) 2. వివేకములేనివాఁడు, వివేకములేనిది. "క. తెగి పోయినవారేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార." భార. శాం. 3, ఆ. "వెఱ్ఱికార్యము." భార. ద్రో. ౪, ఆ. [వెఱ్ఱిశబ్దము ముందుగల సంజ్ఞావాచకశబ్దములు.—వెఱ్ఱిచెఱకు (చెఱకువంటి తృణవిశేషము), వెఱ్ఱిజిల్లేడు (రాజార్కము శ్రీ.), వెఱ్ఱితుమ్మ (తుమ్మదినుసు శ్రీ.), వెఱ్ఱినిమ్మ (నిమ్మదినుసు శ్రీ.), వెఱ్ఱిపుచ్చ (పుచ్చదినుసు శ్రీ.), వెఱ్ఱిబచ్చలి (బచ్చలిదినుసు శ్రీ.), వెఱ్ఱిబీర (చేఁదిబీర శ్రీ.), వెఱ్ఱిమేడి (కాకిమేడి శ్రీ.), వెఱ్ఱియావ (తెల్లావ.) ఇట్టివి.]

**వెఱ్ఱినీళ్లు.** ద్వ. వి. బ. మద్యము. "తే. వెగ్గలపుఁబచ్చిసంజాళ్లు వెఱ్ఱినీళ్లు, దోరహత్తుగనిడఁగడుపారమెసఁగి." అచ్చ. యు, కాం.

**వెఱ్ఱిబాగులు.** దే. వి. వివేకములేనిది, వివేకములేనివాఁడు.

**వెఱ్ఱివాఁడు.** దే. విశే. వెఱ్ఱిపట్టినవాఁడు, ఉన్మత్తుఁడు.

**వెల.** దే. వి. 1. కొనువస్తువులు అమ్మువానికిచ్చెడు విలువ, మూల్యము; "క. వెలఁగొనియెడువేశ్యాదుల, బలిమిఁగలిసినాతఁడచ్చుఁబదిపణములొగిన్." విజ్ఞా. ప్రా, కాం. (చూ. కడుకొను.) 2. పందెము. (చూ. వాట్లేఁడు.)

**వెలఁగ.** దే. వి. కపిత్థము. "చ. ఇదియొకమంచిలేఁగవిసుఁడెంతయు నొప్పెడునంచుఁదానత, త్పదములుఁదోఁకయుంబిగియఁబట్టిచెలంగి వెలంగమ్రానితోఁ, జదియఁగనొక్కపెట్టుగొని చంపెఁగుమారుఁడు లేఁగరక్కసున్." భాగ. ౧౦, స్కం. పూ.

**వెలఁది.** దే. వి. 1. గరగరికయైన ఆఁడుది; 2. ఆఁడుది; 3. ధాళధళ్యము. "తే. ఈవెలందియొడల్ పైఁడిలోవెలంది." విజ. ౧, ఆ.—విశే. 1. నిర్మలము; "సీ. ఓలినన్నింటిసదోగ్ధఘృతంబులనించి వెలఁదిపట్టునవర్తులలవరించి." భో. ౨, ఆ. "వెలఁదిముత్తెము." పర. 3, ఆ. "వెలఁదివెన్నెల." స్వా. 3, ఆ.—2. ప్రసన్నము. "పల్కెనునంగువెలంది పల్కులన్." హ, న. ౨, ఆ.

**వెలఁదుక.** దే. వి. (వెలఁది+ఉక.) వెలఁది. "క. వే, వేలింటం జేజేసవ, లాలుండఁగనీకునివ్వెలందుకకొఱయే." అచ్చ. సుం, కాం. (స్వార్థమున ఉక.)

**వెలచు.** వై. స. క్రి. శుద్ధిచేయు, తోము. "సీ. ఆయింటిగృహిణి నాయకుఁడు భుజించిన పసిఁడిపళ్లెరము వెల్పలికిఁదెచ్చి, వెలచు చోఁదళతళతళుకులుచిమ్ము తత్ప్రతిక్రియఁజూచితప్పరతనొడిసి, యతఁడు పుచ్చుకొనియె." పర. ౪, ఆ. (చూ. ఎడ్డన.)

**వెలనాడు.** దే. వి. దేశవిశేషము. (రూ. వెల్నాడు.)

**వెలమ.** దే. వి. శూద్రజాతివిశేషము. (వెలమవాఁడు, వెలమది.) బ. ఆజాతివారు.

**వెలమసంది.** దే. వి. నేలవేముయొక్క అవాంతరభేదము, కాకఘంఘు శ్రీ.

**వెలయాలు.** దే. వి. (వెల+ఆలు.) వేశ్య. (ఇట్లు వెలవెలఁది ము.)

**వెలయు.** వై. అ. క్రి. 1. ప్రకాశించు; 2. ప్రసన్నతనొందు; (చూ. బెరయు రెండవయర్థము.) 3. ప్రసిద్ధికెక్కు*; "ప, గీ. తానవెలయుమనుష్యుఁడుత్తముఁడుపిత్రుపి, తామహులచేతవెలయు నాతఁడుజగతి, మధ్యముఁడుమాతచేసనుమాతృబంధు, గణము చే వెలయునతండుగష్టతరుఁడు." మార్క. ౨, ఆ.—4. బయలుపడు*. "తే. వికృతవేషావృతంబయివెలయఁడితఁడు, నిద్రఱుగవిసినమెఱయనినిప్పుఁబోలె." "సం. కపటవేషసంఛన్నో భస్మన్యే వపావకశ్శనః." భార. విరా. ౪, ఆ.

**వెలరారు.** ద్వ. అ. క్రి. (వెలరు+ఆరు.) తెల్లపడు. "శీ. జలధరప్రకరంబువెలవెలనైతోఁచెవెలరారిదిక్కులుపిశపమయ్యె." పద్మ. ౯, ఆ.

**వెలరు.** వై. వి. తెల్లన. "తే. నెఱయుకీర్తిప్రతాపాఢ్యునిన్నుఁదలఁప, యశముశౌర్యంబుగలిగినట్లలరువెలరుఁ, గాఁకయును." కా. ౨, ఆ.

**వెలరువాఱు.** ద్వ. అ. క్రి. (వెలరు+వాఱు.) 1. తెల్లనగు; "సీ. ఉదరస్థుఁడగుబాలునుజ్జ్వలకాంతిదావెలిఁబేర్చెననమేనువెలరువాఱె." లక్ష్మి. 3, ఆ.—2. వెలవెలఁబోవు. "వ. అట్లుదూఱిన వెలరువాఱిచేయునదిలేక." నై. ౨, ఆ.

**వెలలు.** దే. అ. క్రి. వెడలుయొక్క రూపాంతరము. "క. వెలలిబలరిపుఁడుచలమునఁ, గలహమునకుఁజొచ్చి." భార. ఉద్యో. ౧, ఆ.

**వెలలుచు.** దే. ప్రే. వెడలుచుయొక్క రూపాంతరము.

**వెలవ.** వై. వి. కాఁపుడుగంజి. "సీ. యవలున్గుగధేనునివహోనఁద్రొక్కించి వెలవయత్తెఱఁగునూకలనకాఁచి." భార. అను. 3, ఆ.

**వెలవడము.** దే. వి. ఒకవిధమైన వరిధాన్యము.

**వెలవెలఁబాఱు.** ద్వ. అ. క్రి. (వెలవెల+పాఱు.) వివర్ణమగు. "చ. వెలవెలఁబాఱెఁదన్ముఖమువెల్వెలఁబాఱెవిటాననాబ్జమున్." స్వా. ౫, ఆ. (చూ. పాఱు.)

**వెలవెలఁబోవు.** ద్వ. అ. క్రి. (వెలవెల+పోవు.)——పై.——"మోము వెలవెలఁబోవుచు."

**వెలవెలన.** వై. వి. వెలవెలపాటు. (విశేషణమగుచో "వెలవెలని మొగమున." పంచ. వేం. ౧, ఆ.) (చూ. అలకన.)

**వెలవెలనగు.** ద్వ. అ. క్రి. (వెలవెలన+అగు.) వెలవెలఁబోవు. "క. తలయుంజీరయునొడలును, తెలతెలగానట్టెపుండి దిక్కులఁగప్పన్, బలపలనివేడ్కతోడుత, వెలవెలనైబ్రాహ్మణుండువిస్మితుఁడయ్యెన్." పంచ. నా. ౫, ఆ.

**వెలవెలనవోవు.** ద్వ. అ. క్రి. (వెలవెలన+పోవు.)——పై.——"తే. ముచ్చువేడుకకత్తెలమోములెల్ల, వెలవెలనవోవఁదూర్పునఁ దెలుపుదోఁచె." శశాం. ౪, ఆ.

**వెలవెలపాటు.** వై. వి. వైవర్ణ్యము. "వ. అమ్మగువమొగము వెలవెలపాటులేనవ్వునడంచి." ఆము. ౫, ఆ.

**వెలవెల్లనగు.** ద్వ. అ. క్రి. (వెలవెల్లన+అగు.) వెలవెలఁబోవు. "సీ. బంధులయ్యాదవపతి కెదిఁగించి ననలఁదురి వెల వెల్ల నగుచుఁ గొంత, ప్రొద్దునివ్వెఱఁగంది." భార. మౌ. ౧, ఆ.

**వెలారించు.** దే. స. క్రి. వెలారుచుయొక్క రూపాంతరము. "ఎ, గీ. తొల్లిపడినపాటులెల్లవెలారింతు." సం. "అద్య క్రోధం విమో క్ష్యామి నిగూఢం హృదయేచిరమ్." భార. శల్య. ౨, ఆ.

**వెలారుచు.** దే. స. క్రి. (వెలి+ఆరుచు.) 1. వెడలించు; 2. బయలుపఱుచు. (రూ. వెలార్చు. వెడలించుటకు.—"క. పీర్చ డలోపగతురనువె, లార్చకలోకం బునకుఁదోలంగకకుదురై, సేర్చున మనఃపవనములు, గూర్చకయోగీశ్వరుండగునెయెబ్బంగిన్." శివ. ఉ. ౧, ఆ.—బయలుపఱుచుటకు.—"తే. అతఁడాత్మీయగాన, నైపుణి వెలార్చుచునుజగన్నాథుఁగొలిచె." కళా. ౨, ఆ.)

**వెలి.** యు. దే. వి. 1. బయలు; 2. బహిష్కారము; 3. దేహము యొక్క బహిఃప్రదేశము; "క. వెలిచుచియైమజేత్రం, బులు బొచ్చుటమేలు." భార. అను. ౫, ఆ. – 4. బయలుపాటు. "క. తలలోపలనాలికపూ, సలగ్రుచ్చిన నూలుపాలఁ జల్లినసీరం, బలెవెలియెఱుఁగకమనసులు, గలసియభేదముగఁగాఁపుకడసేఁడుం డుమా." పాండు. 3, ఆ.—విశ. బాహ్యము. "ఉ. క్షత్రియుఁ డెందువాఁడువెలిగానిజరాజ్యమువైరికిచ్చునే." మార్క. 3, ఆ.—వై. వి. తెలుపు. విశ. తెల్లనిది.

**వెలికత్తెరనేల.** దస్. వి. కంకరమన్నుకలిసినభూమి.

**వెలికి.** దే. వి. ఒకానొకచెట్టు, గంధపిండీతకము.

**వెలికిలు.** దే. అ. క్రి. 1. వీఁపుక్రిందగు; (వెలికిలఁబడెను.) 2. వీఁపుక్రిందుగాపరుండు. "చ. వెలికిలిసెజ్జమీఁదఁగడుఁబిప్పగు కన్నులచాయలొప్పఁజె, క్కిలిగిలిగించి వ్రేతలునగింపఁగనుండుట యాదిగాఁగఁజె, న్నలరెడునిమ్మహోత్సవిశమంచితశైశవముం గ్రమం బుణో, విలసితదృష్టినందనుభవించినయాజనులెట్టిధన్యులో." హరి. పూ. ౮, ఆ.

**వెలిగడ.** దస్. వి. (వెలి+కడ.) మెట్టనేల.

**వెలిగారము.** వై. వి. (వెలి+కారము.) బంగారమునకు కాంతిగలు గఁజేసెడి యొకదినుసు తెల్లనియుప్పు, టంకణము.

**వెలిగిడ్డి.** వై. వి. కామధేనువు.

**వెలిగుల్ల.** వై. వి. శంఖము. "క. వెలిగుల్లయువనమాలయుఁ, గలి మియు మానికముమేనఁ గలిగినవేల్పున్." ద్వా. ౪, ఆ.

**వెలిగొండ.** దస్. వి. (వెలి+కొండ.) దూరమునందున్న పర్వతము.

**వెలిగొరు.** దస్. వి. (ఇంద్రుని) తెల్లయేనుఁగు, ఐరావతము.

**వెలిగ్రుక్క.** దే. వి. రతికూజితము, మణితము.

**వెలిచేంద్ర.** దస్. వి. తెల్లచేంద్ర, కదరము.

**వెలిచేవి.** దే. వి. జారత్వము.

**వెలిచె.** దే. వి. పక్షివిశేషము, వర్తకము. (మొదటిరూపము వెలి చియ.)

**వెలితి.** దే. వి. 1. తక్కువ; 2. తఱుచుఁదనములేమి. విశ. 1. తక్కువైనది; 2. తఱుచుకానిది.

**వెలితిప్ప.** వై. వి. వెండికొండ, కైలాసము.

**వెలితుమ్మ.** దస్. వి. తెల్లతుమ్మ, విట్ఖదిరము.

**వెలిదుక్కి.** దే. వి. నీళ్లుకట్టక వానతడిచే దున్నుట. (మఱియొకటి రొంపిదుక్కి.)

**వెలిపము.** దే. వి. వలిపముయొక్క రూపాంతరము. (సన్నని తెల్ల వస్త్రమునకు. — "సీ. వెన్నెలపోరవంటివెలిపంబుచెంగావి జిలుఁగు పావడమీఁదనలవరించి." యా. ౨, ఆ.)

**వెలిపుచ్చు.** దే. స. క్రి. బయలుపఱుచు.

**వెలిపెట్టు.** దే. స. క్రి. వెలివేయు. "సీ. వెలిపెట్టిరేచాడఁబలు పరాశరుఁబట్టిదాశకన్యకేళితప్పఁజేసి." సా. ౨, ఆ.

**వెలిబిత్తరి.** దే. వి. మల్లబంధవిశేషము.

**వెలిమాడు.** దే. వి. విదేశములకంపఁబడు ధాన్యాదులు. (లోమా డు, విదేశములనుండి తేఁబడు ధాన్యాదులు.)

**వెలిమావు.** దస్. వి. (ఇంద్రుని) తెల్లగుఱ్ఱము, ఉచ్చైశ్శ్రవము.

**వెలిమిడి.** దస్. వి. (వెలి+మిడుఁగు.) 1. భస్మము; "సీ. ఓగ సంరక్షునద్దంబుఁజూపినయట్లువెలిమిడిలోనెయ్యివేల్చినట్లు." పంచ. నా. ౧, ఆ. (చూ. ముఱుగు.) 2. బూడిద. (చూ. వెల్మిడి.)

**వెలిమొట్టు.** దస్. వి. మస్త్యవిశేషము.

**వెలిమ్రాను.** దస్. వి. దేవతరువు, కల్పవృక్షము.

**వెలియు.** దే. అ. క్రి. 1. వానకురిసినిలుచు; 2. చాయయెత్తి పోవు.

**వెలియునికి.** దే. వి. (వెలి+ఉనికి.) పరదేశమునందలి యునికి, ప్రవాసము.

**వెలివాఁడు.** దే. వి. చండాలుఁడు. "వెలివాండ్రుగరపల్లెకుఁజేరి." సం. "తస్మిన్ శ్వాపచాలపక్వేశే." భార. శాం. 3, ఆ.

**వెలివాడ.** దస్. వి. చండాలవాటిక.

**వెలివాడవాఁడు.** దస్. వి. చండాలుఁడు. "సీ. ప్రార్థింప నున్నాఁడుపాదాగ్రముల వ్రాలి వెలివాడవాఁడుతద్విప్రకులని." కాశీ. ౭, ఆ.

**వెలివాఱు.** దే. వి. వేఁటాడెడుచోట బయటచుట్టుపాఱించెడు పోఁగు. (చూ. ఆరడము.)

**వెలివిరియు.** దే. అ. క్రి. వెల్లివిరియుయొక్క రూపాంతరము. (ఉబుకుటకు.—"అంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై వెలి విరియంగనీక." భార. విరా. 3, ఆ.) (చూ. పొలుపు రెండవ యర్థము.)

**వెలివిసరు.** దే. అ. క్రి. బయలుపడు. "క. విరసమునెఱసాహ సముం, బురికొన నిట్టుభయసైన్యములుపోరఁగ, క్తరసతరసముల గదురన, శరనిధిసత్త్వములు వెలివిసరిరాఁదొడఁగెన్." పంచ. వేం. ౪, ఆ.

**వెలివేయు.** దే. స. క్రి. బహిష్కరించు. "ద్వి. వెంగలిగా మిమ్ము వెలివేసెనొకఁడు." భల్లా. ౨, భా.

**వెలిసె.** దే. వి. ఇంటిచూరు.

**వెలు.** దే. వి. వృత్తియందు వెలికివచ్చెడు ఆదేశము. (ఉదా. వెలు పల, వెలువడు మొ.)

**వెలుఁగు.** దే. అ. క్రి. 1. ప్రకాశించు; 2. జ్వలించు. "ఆ. హవ్యవాహాళింటియట్ల వెలుంగఁగ, వలయుగురుఁడుచూచియెల మినొంద." మార్క. ౭, ఆ.—వి. 1. ప్రకాశము; 2. కిరణము; "మ. తరుకుంబ్రొద్దువెలుంగుక్రొంబసిఁడినిద్రాచోపుడుంగట్టి యన్." చంద్రా. ౧, ఆ.—3. ఎండ. (చూ. కాచు. అ. క్రి. రెండవయర్థము.)

**వెలుఁగుఱేఁడు.** దే. వి. సూర్యుఁడు, త్విషాంపతి.

**వెలుఁగొందు.** దే. అ. క్రి. (వెలుఁగు+ఒందు.) ప్రకాశించు.

**వెలుక.** దస్. వి. (వెలి+ఉక.) తెల్లన. (స్వార్థమున ఉక.)

**వెలుకఁబోఱు.** ద్వ. అ. క్రి. (వెలుక+పాఱు.) వెల్లఁబాఱు. "క. తనదువర్ణము, బాధితమగుసేనివెలుకఁబాఱు ఘనుండుఙ్." పాండు. ౪, ఆ. (చూ. పాఱు.)

**వెలుగు.** దే. వి. లోపల పశువులు లోనగునవి చొరకతోఁట మొద లగువానిచుట్టు ముండ్లచెట్లుపెట్టి యొదిగించిన ఆవరణము. "ఆ. వేయిచేతులిచ్చివెస్త్రేఁజేసినశూలి, బాఱుఁజెఱుపఁదలచి భండనం బుఁ, గలుగఁజేసెనింక వెలుగుచేన్మేసినఁ, గాచువారలెందుఁగలరు జగతి." ఉ, హరి. ౫, ఆ. (రూ. వెల్గు.)

**వెలుచ.** దే. వి. సర్పము. (చూ. వెల్చ.)

**వెలుచు.** దే. స. క్రి. తోలు. "క. శరములవేగంబునగద, పరు వఁదనంబునను:గలఁగఁబడిచేడ్పడునా, కరులందోలెనుభీముఁడు, వెరవునగోపకుఁడుకదుపువెలిచినమాడ్కిఙ్." భార. భీష్మ. ౨, ఆ. (ప్రే. వెలిపించు.) ప్రే. 1. వెడలించు; "చ. వెలిచిన కన్నునీరుజడి." ఉ, హరి. ౫, ఆ. – 2. (నూలు) తోఁడు. (వెలలుచయొక్కరూపాంతరము. రూ. వెల్చు.)

**వెలుతురు.** యు. దే. వి. ప్రకాశము, ఎండ. "క. వెలుతురన లంటి యొండియు." అము. ౪, ఆ. (రూ. వెల్తురు.)—వై. వెఱు తురుయొక్కరూపాంతరము.

**వెలుపల.** దే. వి. (వెలి+పల.) బహిఃప్రదేశము. "వ. తలుపులు వెలుపలంగెడసియు." ఉ, హరి. ౬, ఆ. (చూ. లోపల. వి.) విణ. వెలియైనది. "క. ఈతఁడుదా వెలుపలయై, యేతెఱఁగుననైన వారియేపడఁచిపరా, భూతులఁజేయుదునని ప్ర, ఖ్యాతజవహయాధి రూఢుఁడయిపురివెడలెఙ్." కళా. ౮, ఆ. (చూ. వెలు.)

**వెలుపలించు.** దే. స. క్రి. వెలిపఱుచు. (రూ. వెల్పలించు.)

**వెలుపించు.** దే. స. క్రి. వెలుపుచేయు. "వెట్టనుఃబట్టిఱెక్కవెలు పించి." సా. ౧, ఆ.

**వెలుపు.** దే. వి. వెడలుపుయొక్కరూపాంతరము.

**వెలుపుడు.** దే. వి. నూలువెలుచేట. ఆం, భా. (చూ. వెలుచు.)

**వెలువడము.** దే. వి. సస్యవిశేషము. (చూ. వరగ.) బ. ధాన్య విశేషము. (చూ. వెల్వడము.)

**వెలువడు.** ద్వ. అ. క్రి. (వెలి+పడు.) 1. బయలుపడు; "నూతిలో వెలువడఁగోమలిందిగిచె." భార. ఆది. ౩, ఆ.– 2. బయలుదేఱు. "క. వెలువడియె నశేషరాజ్యవిభవచ్యుతుఁడై." భార. ఆర. ౨, ఆ. (చూ. వెలు.)

**వెలువరించు.** ద్వ. ప్రే. వెలువఱుచుయొక్కరూపాంతరము. (రూ. వెల్వరించు. "తే. మృగయులందఱునవివెల్వరించి." స్వా. ౪, ఆ.)

**వెలువఱుచు.** ద్వ. ప్రే. వెలువడఁజేయు.

**వెల్కఁబోఱు.** ద్వ. అ. క్రి. వెలుకఁబాఱుయొక్కరూపాం తరము. "ద్వి. దేహకళవెల్కఁబాఱె." రా. బాల, కాం.

**వెల్చ.** దే. వి. వెలుచేయొక్కరూపాంతరము. "వెల్చలక్రియఁ గానరానిగతులఙ్ మయిమ్రైఁబెనఁచుఙ్." స్వా. ౩, ఆ.

**వెల్చె.** దే. వి. వెలిచెయొక్కరూపాంతరము. "ప్రల్లదంబునను వెల్చెలకుందగముద్దుపెట్టి యొక్కెడమటికాటులాడనిడు." భల్లా. ౩, ఆ.

**వెల్తి.** దే. వి. విణ. వెలితియొక్కరూపాంతరము.

**వెల్పల.** దే. వి. విణ. వెలుపలయొక్కరూపాంతరము. (చూ. వెలచు.)

**వెల్మిడి.** ద్వ. వి. వెలిమిడియొక్కరూపాంతరము. (బూడిదకు.– "మనసయ్యెవెల్మిడియు." రామా. ౩, ఆ.)

**వెల్ల.** వై. విణ. తెల్లనిది, ధవళము. "కుంభభవకృపాచార్యులయుష్ణీ షములువెల్లలు." భార. విరా. ౫, ఆ.

**వెల్లఁకి.** దే. వి. గడ్డ. "చ. మాకుఁగాయలుం, గసురులువేళ్లు వెల్లఁ కులుఁగాక సముజ్జ్వలభూషణంబులుఙ్, బసిఁడియునేల." నిర్వ. ౧౦, ఆ. "వెదకితేరపోయివేరువెల్లంకి." క్షేత్రయ.

**వెల్లఁబాటు.** వై. వి. (వెల్ల+పాటు.) వెల్లనగుట. కవిక. ౪, ఆ.

**వెల్లఁబోఱు.** ద్వ. అ. క్రి. (వెల్ల+పాఱు.) వెల్లనగు, వైవర్ణ్య ముఁబొందు. "క. ఒనఁగునెడఁగసరుఁగర్జిలు, నొసఁగియొసఁగి వెల్లఁబాఱు నాగీకరణిఙ్, విసువక యొసఁగఁగనేర్చునె, యస దృశగతినఁబువాహమాబళనరసా." కా. ౨, ఆ.

**వెల్లచేఱువు** ద్వ. వి. సున్నపుపూఁత.

**వెల్లడి.** వై. వి. 1. బయలు*; 2. ప్రసిద్ధి*.

**వెల్లన.** వై. వి. తెల్లన. (విశేషణమగుచో "వెల్లనికన్నులు.") (చూ. అలకస.)

**వెల్లనగు.** ద్వ. అ. క్రి. (వెల్లన+అగు.) వెల్లఁబాఱు. "క. తల్లడ పడియరదముడిగి, విల్లును నమ్ములునువిడిచి వెల్లనగుచుమేఁ, నెల్లఁజె మర్పఁగనూర్పులు, పెల్లుగనమ్మనుజపశువు వెలుచంబఱచెఙ్." భార. ఆర. ౬, ఆ.

**వెల్లాటకత్తె.** ద్వ. వి. (వెల్లాటకము+కత్తె.) జారిణి. "తే. నీ జననిపుణ్య జనవర్ణనీయసాధ్వి, నీజనకుఁడెన్నఁనభిమాననియతిధనుఁ డు, నీనగరుపోతుటీఁగకునిలువరాని, దయ్యువెల్లాటకత్తెవీవెట్టయ రిది." శుక. ౧, ఆ.–వేశ్య. (అనికొందఱు.) (మొదటిరూపము వెల్లాటకత్తియ.)

**వెల్లాటకము.** ద్వ. వి. (వెల్ల+ఆటకము.) ప్రసిద్ధి. "ఎ, గీ. సంభవించిరి గంధర్వజాతిననినఁ, గలితసంబేలవెల్లాటకఁబునేయ." భీ. ౧, ఆ.

**వెల్లి.** యు. దే. వి. 1. ప్రవాహము; 2. పరంపర. "భావజానల రంపవెల్లిపాల్పడితి." మార్క. ౪, ఆ. – వై. తెలుపు. "ఉ. వెల్లులుగూఁటఁబోసికొను వేడుకఁబుక్కిటఁబట్టిచీఁకటుల్, జల్లునఁ బాఱఁగాన మియుఁజాఁగినకోరికలంజకోరికల్." కవిక. ౪, ఆ.

**వెల్లిక.** దే. వి. వెల్లియొక్కరూపాంతరము. (ప్రవాహమునకు.– "ఆజాబిల్లివెలుంగువెల్లికలడాయఙ్లేక." వసు. ౪, ఆ.)

**వెల్లిగొను.** దే. అ. క్రి. (వెల్లి+కొను.) 1. ప్రవహించు; "శా. ఇంకేభంగిందరియింతువెల్లిగొనిపెల్లై తెంచు శోకాంబుధిఙ్." హరి శ్చ. ౫, ఆ.–2. పరంపరగావెడలు. (చూ. జింగు.) (ప్రే. వెల్లి గొలుపు.)

**వెల్లివిరి.** దే. విణ. ప్రకటితము. "ఎ, గీ. కంసుభయమునదేవకీక మలముఖికిఁ, గడుపుదిగఁబడిపోయెనక్కటయటంచు, వెల్లివిరిగాఁ గనాడుదురెల్లవారు." వి, పు. ౨, ఆ.

**వెల్లివిరియు.** దే. అ. క్రి. 1. ప్రవహించు; "తే. పెరిఁగిపాండ వాంబుధివెల్లివిరిసినపుడు." భార. భీష్మ. ౧, ఆ.–2. ఉబుకు; "ఎ, గీ. ఉల్లముననుండిఖేదంబువెల్లివిరిసె." భార. విరా. ౨, ఆ. (చూ. వెలివిరియు.)–3. వ్యాపించు; "చ. అచ్చెరువుగఁబోయి వెల్లివిరిసెఙ్గపివాహినిలంకచుట్టునఙ్." రా. యు, కాం. – 4. ప్రకటితమగు; "ఆ. నీకడిందిలావునేనెఱుంగనెవాలి, తోఁకఁ జుట్టికడలిఁద్రోయుటయును, జెఱనుబెట్టివేయిచేతులయెకిమీఁడు,

విడుచుటయుజగమునవెల్లివిరిసె." అచ్చ. యు, కాం.—5. చెదరు. (చూ. చెన్ను రెండవయర్థము.)

**వెల్లివొడుచు.** దే. అ. క్రి. (వెల్లి+పొడుచు.) ప్రవహించు. "గంగయాతనిమఖాగారంబుపై వెల్లివొడిచిన." హరి. పూ. 3, ఆ.

**వెల్లుల్లి.** ద్వ. వి. (వెల్ల+ఉల్లి.) తెల్లగడ్డ, లశునము.

**వెల్లువ.** దే. వి. 1. ప్రవాహము; 2. సేన; "తే. వెదకిమటిగల్లు మలలెల్లఁగదియఁజేర్చి, కట్టగట్టినఁగానల్పపట్టిమున్ను, వెల్లువలనెల్ల నడిపించివెనుకఁదగిలి, తమ్ముఁడునుదాను మున్నీరుదాఁటియవల." య. 3, ఆ. (ఈయర్థముల రెంటియందు నిదివాహినీ శబ్దసమానార్థకము.)—3. ఇటికగోడలయింటిచూరు.

**వెల్లువగట్టు.** దే. అ. క్రి. (వెల్లువ+కట్టు.) 1. ప్రవహించు; 2. మడుఁగుకట్టు. "చ. వికచసరోజమధ్యమున వెల్లువగట్టుమరందబృందముల్." భాను. ౨, ఆ.

**వెల్లెలుక.** దప. వి. (వెల్ల+ఎలుక.) తెల్లయెలుక. (మొదటిరూపము వెల్లయెలుక.) (చూ. కల్లెలుక.)

**వెల్వడము.** దే. వి. వెలువడముయొక్క-రూపాంతరము. "సీ. పడఁతిసన్నంటివెల్వడముకోర్కి-ఫలించెనరాజభోగమే యతిశయిల్లు." (ఇక్కడశ్లేష.) రసి. ౧, ఆ.

**వెల్వడు.** దప. అ. క్రి. వెలువడుయొక్క-రూపాంతరము. "ఉ. తమిస్రపుం, జంబులువోలెవెల్వడియెశైలవిశాలగుహాలినుండినా, గంబులయూథముల్." భార. ఆది. ౬, ఆ.

**వెల్వెలఁబాఱు.** దప. అ. క్రి. వెలవెలఁబాఱుయొక్క-రూపాంతరము. (చూ. వెలవెలఁబాఱు.)

**వెల్వెలుకఁబాఱు.** దప. అ. క్రి. (వెల్వెలుక+పాఱు.) మిక్కిలి వెలుకఁబాఱు. "సీ. విమతుల మోములువెలవెలఁబాఱంగ విమలాస్యమోమువె వ్వెలుకఁబాఱె." భాగ. ౧౦, స్కం. పూ. (వెలువెలుకఁబాఱుయొక్క-రూపాంతరము.)

**వెల్వెల్ల.** వై. విశే. (వెల్ల+వెల్ల.) మిక్కిలి వైవర్ణ్యము. "అవ్విభుఁడు గరవ్వంబేది వెల్వెల్లగల్." భార. శల్య. ౧, ఆ.

**వెస.** వై. వి. వేగము. "పదంబులన్ గడున్ వెసగదియన్." భార. విరా. 3, ఆ. "హయములకుఁదెవులు గడువెసమైఁ జన నిచ్చుట." (కడువెసమైఁజననిచ్చుట హయములకుఁదెవులు అని యన్వయము.) హరి. పూ. 3, ఆ. — క్రి. విశే. శీఘ్రముగ*. "క. గౌతమికిం, జనియట్టులపల్క-నదివెసఁదెరువిచ్చెన్." భో. 3, ఆ.

**వెసనము.** వై. వి. వ్యసనము. (ఇది కొన్ని నిఘంటువులందు వైకృతముగా వ్రాయఁబడియున్నది.)

**వెసల.** దే. వి. వంటకుండ. "క. వెసలలనామణిబంగరు, వెసలల దొంతరలుడించి వినయముమదికిం, పొసఁగఁగఁగంకణరవములు, పొనఁగఁగనారసిరసాన్నములువడ్డించుల్." విజ. ౨, ఆ.

**వెళ్లు.** దే. అ. క్రి. 1. వెడలుయొక్క-రూపాంతరము; (వానిని వెళ్లఁగొట్టెను, వాఁడు ఇల్లు వెళ్లిరాఁడు.) 2. పోవు. (నేను ఊరికి వెళ్లివచ్చితిని.)

## వే.

**వే.** యు. దే. స. వేయి. "క. మొగములువేగలశేషుండు." కవి. ౧, ఆ.—విశే. అనేకము: (వేమాఱులు.)—వై. క్రి. విశే. 1. వేగముగ; "క. కీచకునియింటనెవ్వఁడు, వాచవియగుబహువిధంపు వారుణిగలుగున్, వేఁచనియచటికిఁగొనిర, మ్మాచూతముగానినీగమన వేగంబున్." భార. విరా. ౨, ఆ.—2. శీఘ్రముగ*. "క. వి, రోచనుఁడాత్మీయత్విగ్రరుచిఁదల్లితనూ, గోచరకాంతియఖిలమును, వేచెన్నఆఁజేసె." హరి. పూ. ౧, ఆ. (ఆమ్రేడితముగుచోవేవే. "ఉ. నా, కీయకృతంబుహాటిలుటయేర్పడమీకెటిఁగింపఁగోరివే, వేయిటు పాఱుతెంచితి." నిర్వ. ౨, ఆ.)

**వేంచేయు.** మి. గ్రా. అ. క్రి. 1. వచ్చు; "క. వేంచేయుము నాయింటికి." భాగ. ౧౦, స్కం. పూ.—2. పోవు; "ఎ, గీ. దివిజులుమునులును బ్రాహ్మణులును, జనిరినిజమందిరములకు జలజనయన, భవులువేంచేసిరిస్వకీయభవనములకు." భాగ. ౪, స్కం.—3. కూర్చుండు; "ఎ, గీ. ఉరగరిపువాహనమునన్గొక్క-వేళ, వేడ్క-వేంచేసిమెఱయుఁదిర్విధులందు." పాండు. ౪, ఆ.—4. నివసించు. "వ. ఔద్దాలకబుష్యాశ్రమంబునందువేంచేసియున్నవాఁడు." శేష. ౪, ఆ. (విజయముచేయుయొక్క-మాఱురూపము.) (చూ. విజయముచేయు.)

**వేఁడ్రము.** దే. వి. తాపము. (చూ. తీండ్రము.)

**వేఁకటి.** దే. వి. గర్భము. (వ్రేఁకటియొక్క-రూపాంతరము.)

**వేఁకరము.** దే. వి. ఉపద్రవము.

**వేఁకరి.** దే. వి. (వ్రేఁకము+అరి.) కిరాతభేదము.

**వేఁకి.** దే. వి. జ్వరము. (చూ. ముల్లుగు.)

**వేఁగి.** వై. వి. పులి, వ్యాఘ్రము.

**వేఁగినాఁడు.** దే. వి. వేఁగీదేశము.

**వేఁగిస.** దే. వి. నర్జకము‡.

**వేఁగీ.** దే. వి. దేశవిశేషము. "వ. అఖిలజలధివేలావలయవలయితవసుమతీ వనితావిభూషణంబైనవేఁగీదేశంబునకు." భార. ఆది. ౧, ఆ.

**వేఁగు.** దే. అ. క్రి. తపించు. (వ్రేఁగుయొక్క-రూపాంతరము.)

**వేఁచు.** దే. ప్రే. వేఁగఁజేయు, వేఁగించు.

**వేఁట.** దే. వి. 1. మృగయ; "ఉ. నేఁటికినొప్పుఁగాకరజనీచరు వీడెటులైననెల్లిపో, దాఁటికవాటముల్ విఱుగదాఁచుచుఁజేతులతేట వోవమై, తేఁటలుపుచ్చిరక్కసులఁదీర్చుటరాముఁ డొసర్పనున్న పెన్, వేఁటకురావణాది మృగబృందముఁదార్చుటలంచునార్చెనన్." రా. యు, కాం. (ఇది ద్వివిధము—మృగములవేఁట, పక్షులవేఁట. అందు మృగములవేఁట ఏదువేఁట, గంటవేఁట, తెరవేఁట అని త్రివిధము. పక్షులవేఁట పాదివేఁట, విడివేఁట అని ద్వివిధము.)—2. మేఁకపోతు; "వ. వేఁటమాంసంబష్టమాసంబులు, దుప్పిమాంసంబు నవమాసంబులు, గురుపోతుమాంసంబు దశమాసంబులు, ఈగరుమాంసం బేకాదశమాసంబులు, గోవుపాలును బాయసంబును బండ్రెండు మాసంబులు పితృదేవతలకుఁదృప్తియొనరించు." మార్క. 3, ఆ.—3. పొట్టేలు. "క. ఏటికిసీరాచటికము, బోటులుమొఱవెట్టఁబకుపు బోరనియఱవన్, వేఁటలనీడ్చేడుదొంగల, గీటడఁపవువెడలిశవముక్రియనుండెదిదే." భాగ. ౯, స్కం.

**వేఁటకాఁడు.** దే. వి. బోయ, మృగయుఁడు. భార. శల్య. ౨, ఆ.—విశే. సంహారకుఁడు. (చూ. కాచే రెండవయర్థము.)

**వేఁటకుక్క.** దప. వి. వేఁటాడుటయందు నేర్పుగల శునకము, విశ్వకద్రువు.

**వేఁటగిరి.** దే. వి. వేఁటాడిజీవించెడిబోయ. "క. వేఁటకరుల్గఱయలవన, వాటగిరుల్ సూటిభిల్లవరులేనాదుల్, వేఁటగిరుల్ వేఁటకరుల్, వేఁటమరుల్ దొరకుదొరకువిడివడియంతన్." రా, వి. 3, ఆ.

**వేఁటపల్లె.** దఌ. వి. బోయపల్లె, పక్కణము. "సీ. వింధ్యాద్రి, నడుమనిర్వింధ్యాతటంబునఁగానలా, నొక్క పక్కణము గలదు, పింగాక్షుఁడనియెడు పేరివాఁడావేఁటపల్లెయే లెడు భిల్లపరివృఢుం డు." కాశీ. ౪, ఆ. (మొదటిరూపము వేఁటపల్లియ.)

**వేఁటపిట్ట.** దఌ. వి. దీమపుపిట్ట. (చూ. దీమము.)

**వేఁటరి.** దే. వి. (వేఁట + అరి.) వేఁటకాఁడు. "చ. బళిరేపు రేయరరెబాపురెయంచువచింపవేఁటరుల్." చంద్రా. ౨, ఆ.

**వేఁటాడు.** దే. స. క్రి. (వేఁట+ఆడు.) 1. అడవియందు మృగములను పక్షులను వధించు; 2. వధించు. "క. వేఁటా డెదఁబ్రతిబలంబుభీరులనెల్లన్." భార. ఉద్యో. ౪, ఆ. (రూ. వేఁటలాడు. వి. వేఁటలాట.)

**వేఁడి.** దే. వి. 1. వేఁడిమి; "ఎ, గీ. కందువారలనిట్టూర్పు గాడ్పువేఁడి, ముకురములు." నై. ౧, ఆ.—2. తాపము; "ఎ, గీ. వేఁడియెల్లనుడిపివిబుధారికినకమై, భీతిపాఱఁజేసె హితి హోత్రు." లక్ష్మీ. ౨, ఆ.—3. చురుకు; "ఆ. సప్తహయుఁడు మూర్తిసప్తకంబుధరించి, కరమువేఁడిమిగులుకరములొప్ప, నదనదీ జలములనుదధిజలంబులుఁ, బీల్చిజగము శెల్లఁ బ్రేల్చఁగడఁగి." భార. అర. ౪, ఆ.—4. తేజము. "క. అపరిమితమైననీయు, గ్రపువేఁడింబ్రాణులెల్లఁగ్రాఁగెడుఁదేజం, బువసంహరింపుసృష్టికి, విపరీతము పుట్టకుండ విశ్వమయాత్మా." మార్క. ౨, ఆ.—విశ. 1. ఉష్ణము; "ఆ. వేఁడివేఁడినీరువెడఁదకాటుకకంటి, కొలుకు లందుమాటికొలుకుచుండ." సా. 3, ఆ.—2. ఎక్కడనున్నాఁడు. "ఉ. పోఁడిగనెందునుఁగలఁడుపొమ్మనుదానునిబిహ్వనుండియో, వేఁడి రమావిభుండనెడి వేఁవేఁడిదైత్యుని దృష్టి నుండియో, వాఁడిది వ్రేయునింక ననివారిఁగంబము నందునుండియో, నాఁడటులుద్భ వించుట యనందగుసర్వగతాత్ముఁడల్పుఁడే." భో. ౧, ఆ. (దీనికి వీరుశబ్దము పరమగునపుడు డివర్ణలోపము చూపట్టెడు. "తే. వీళ్లనీళులనాంఁడెవేనీళ్లనాంఁడెఁ, గడువజాతఁ దోమిననాంఁడెఁ గలుగుశుద్ధి." మార్క. 3, ఆ.)

**వేఁడికంటి.** దే. వి. (వేఁడి + కన్ను.) శివుఁడు, ఉగ్రాక్షుఁడు "ఉ. ముక్, మ్రింగినయావిసంబువెనమీఁదికిఁబిచ్చిలువేఁడికంటి యాజంగమటంచు." య. ౪, ఆ.

**వేఁడిమి.** దే. వి. 1. వెచ్చన; 2 తాపము. "క. వేఁడికొనిక్రప ణులైనను, పోఁడిమియదియేలరాజపుత్రులుదమమై, వాఁడిమి దప్పినవిప్పుల, వేఁడిమిచెడినట్లుజనులు విని యలుకుదురే." భార. ఉద్యో. 3, ఆ.

**వేఁడివెలుఁగు.** దే. వి సూర్యుఁడు, ఉష్ణరశ్మి. "ఉ. వేఁడినసట్ల కాక పృథివింజరకాలపుభీష్ట సౌఖ్యముల్, పోఁడిగమీరుగాంచి మఱి పొందుఁడుమద్గతియంచుఁజెప్పియుక్, వేఁడివెలుంగులోలిఁబడి వేలసహస్రములు న్నభంగినె, వాస్ఁడు వెలుంగు నట్టిబుధవళ్ళలుఁ దేగెనదృశ్యమూర్తియై." భో. ౪, ఆ.

**వేఁడివేలుపు.** దే. వి. 1. సూర్యుఁడు, తపనుఁడు; "చ. ఉదిరి పసిండిచాయగలయొప్పులకుప్పలు వేఁడివేలుపుం, గొదమ లుదార పావకునికట్టులు చిచ్చఱకంటినెచ్చెలుల్, తుదిజము వేడముల్ పిడుగుతున్కలువానరవీరు లొక్కటక్, బొదివిరిలంకచుట్టునను భూగగనంబులునిండనార్చుచుక్." రామా. ౭, ఆ.—2. అగ్ని, జ్వలనుఁడు. "సీ. హరిహయవాహనా హంకారము హరించి వేఁడివేలుపుజాడవెంటనంటి." వసు. ౪, ఆ. (రూ. వేఁడి వేల్పు.)

**వేఁడు.** దే. స. క్రి. 1. ప్రార్థించు; "ఉ. వీరకుమారయేను నినువేఁడెదఁబ్రార్థనవల్పమయ్య." మార్క. ౨, ఆ. — 2. కోరు; "చ. వడిగొనినిగోగణంబుఁబోదువంబలఱతెంచితిరెల్ల వారును, న్నొడఁబడిపాండు నందనులయున్నెడ యిమ్మెయిఁగాన వేఁడి." భార. విరా. ౪, ఆ.—3. యాచించు. "వీరలునోరు వేఁడఁబోదురె." సం. "ఏవమప్యయమత్యంతం పరంనార్హతియా చితుమ్." భార. ఉద్యో. ౧, ఆ. (చూ. వేఁడుకోలు.)—స. ఎవఁడు. "తే. వీరిలోముఖ్యులెవ్వారువేఁడురాముఁ, డఱనియను జన్మఁజెట్టివాఁ డనుచుఁబలుక." రామా. ౭, ఆ.

**వేఁడుకొను.** దే. స. క్రి. ప్రార్థించు. (రూ. వేఁడికొను.) (చూ. వేఁడిమి.) (స్వార్థమున కొను.)

**వేఁడుకోలు.** దే. వి. వేఁడుకొనుట. "మత్త. వేఁడు కెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనుక్, వేఁడుకోలుచితంబె." భార. ఆది. ౫, ఆ. (రూ. వేఁడికోలు.)

**వేఁత.** దే. వి. వ్రేఁతయొక్క రూపాంతరము.

**వేఁదుఱు.** దే. వి. ఉన్మాదము. "ఉ. వేఁదుఱుగొన్న మానవుని వేమఱుగంటియు బిట్టుగాల్చియుక్, మోఁదియునీటఁద్రొక్కి యునుముక్కొనిత్రవ్వఁగడంగువెజ్జన, ట్లేఁదఁగనిన్ని చందముల నెఱెంగఁ దీర్చుటకైపెనంగితిక్." లక్ష్మీ. ౫, ఆ.—విశ. 1. ఉన్మత్తుఁడు; "ఆ. వీనవేఁదుఱుగుడువానినీవేఁదుఱు, పట్టిచదువఁగలదె." సం. "ఉన్మత్తోహమనస్వత్వంకాంతమస్వనంచిరమ్." భార. శాం. ౪, ఆ.—2. మూఢుఁడు. "విజయుండుచచ్చునేవేఁదుఱులార." భార. అశ్వ. ౪, ఆ.

**వేఁపి.** దే. వి. కుక్క, శునకము, సారమేయము. (ఇది వేఁగుధాతు కృదంతము.)

**వేఁపు.** దే. వి. వేఁచుట, వేఁపుడు. (వ్రేఁపుయొక్క రూపాంత రము.)

**వేఁపుడు.** దే. వి. 1. వేఁచుట, భర్జనము; 2. వేఁచెడుచట్టి. విశ. వేఁచినది. "క. ఉడికినపిమ్మటమిరియము, పొడిబెల్లముఁజల్లి యుద్దుపొడిరాలిచినే, తడినెల్లఁగవేఁచినవేఁ, పుడుఁగండమిళిందవేణిపొందుగనిడియెక్." పాంచా. ౪, ఆ.

**వేఁబోక.** దే. వి. వేగుఁబోకయొక్క రూపాంతరము. (చూ. పూఁ బోఁడి.)

**వేకువ.** దే. వి. వేగుజాము, ప్రభాతము. "వేకువగుచో." హంస. ౨, ఆ.

**వేగ.** వై. వి. 1. వడి; 2. త్వర. "అద్భుతరాష్ట్రుండవినీతిచేసినను నందింపంగరాదంచువే, గతెగంబాఱు." భార. ఉద్యో. 3, ఆ.—క్రి. విశ. త్వరితము. "ఇప్పునివేగతీర్తునేమఱ." య. ౨, ఆ. (వేవేగయని ప్రయోగము.) (ఇది కుండలోనగువానివంటిది.)

**వేగంటి.** దే. వి. (వే+కన్ను.) ఇంద్రుఁడు, సహస్రాక్షుఁడు. "ఎ, గీ. దీనిఁగనుఁగొన్న వేగంటిదేవరకును, వెచ్చనిట్టూర్పుపుక్కిట వెడలకున్నె." రామా. ౬, ఆ.

**వేగపడు.** మి. అ. క్రి. త్వరపడు. "వేగపడుటమేలె." భార. ఉద్యో. 3, ఆ.

**వేగపాటు.** మి. వి. వేగిరపడుట. (చూ. వేఁకువ రెండవ యర్థము.)

**వేగము.** సం. వి. అ. పుం. 1. జవము; 2. ప్రవాహము; 3. త్వర; (చూ. వేగ.) 4. విషవృక్షఫలము; 5. మలమూ త్రాదిప్రవృత్తి; 6. త్వరితము. "మాన్పవలయుక్ వేగంబ భూభారముక్." హరి. ఉ. ౧, ఆ.

**వేగరి.** దే. వి. (వేగు+అరి.) సమాచారము తెలుపువాఁడు. చారుఁడు. "అవృత్తాంతము వేగరుల్ తెలుపఁగా." ఉ, రా. ౧, ఆ.

**వేగి.** సం. వి. న్. పుం. గుఱ్ఱము. విణ. వడిగలది.

**వేగించు.** దే. అ. క్రి. జాగారముచేయు. "క. నిశలెల్లనతఁడు దనప, ర్ణశాలలోపల సుఖంబుననునిద్రింపన్, శశిముఖితదాగ మాశా, వశతన్వేగించుఁజేరువనొకగుడి సెతోన్." పర. 3, ఆ.

**వేగిరకత్తె.** వై. విణ. (వేగిరము+కత్తె.) త్వరగలది. "వేగిరకత్తె వీవు." విజ. 3, ఆ. (మొదటిరూపము వేగిరకత్తియ.)

**వేగిరకాఁడు.** ద్వ. విణ. (వేగిరము+కాఁడు.) త్వరగలవాఁడు. "ఉ. వేగిరకాఁడుమన్మథుఁడు వెన్కయుముందునుజూడఁడు." విజ. 3, ఆ.

**వేగిరపడు.** వై. అ. క్రి. (వేగిరము+పడు.) త్వరపడు. "వేగిర పడియెదవేలయింత." భార. సౌ. ౧, ఆ.

**వేగిరపాటు.** వై. వి. వేగిరపడుట. "వ. అతనివేగిరపాటుచూచి శిరఃకంపంబుసేయుచు." భార. విరా. ౨, ఆ.

**వేగిరపెట్టు.** ద్వ. స. క్రి. (వేగిరము+పెట్టు.) త్వరపఱుచు. "వ. ఆరథికసారథులంజూచువేడ్కమనంబున వేగిరపెట్టెడు." భార. విరా. ౫, ఆ.

**వేగిరము.** వై. వి. 1. వేగము; "క. హరితేజముహరికాంతియు, హరివిభవము హరిభయంకరాకృతిహరివే, గిరముహరివిక్రమం బును, హరియనుపేరిటికిలక్ష్మినాపాదించున్." ఉ, హరి. ౬, ఆ.—2. త్వర. "సీ. ఉండునీవిచ్చోటనూఱటనేఁడెల్లిసురల కిప్డేమి వేగిరము వచ్చె." నై. ౪, ఆ.—క్రి. విణ. త్వరితము "సీ. కావింతునశనసంస్కారం బుమీరారగింతురుగానివేగిరమ యనుడు." పాండు. ౪, ఆ.

**వేగిరించు.** వై. అ. క్రి. త్వరపడు. "సిద్ధుఁడాత్మలోనయంబు వేగిరింపుచు." కళా. 3, ఆ.

**వేగు.** దే. అ. క్రి. 1. ఉదయమగు; "క. వేగుటయుసత్వరం బుగ, నాగాంగేయుండుమించియనికినడిచినన్." భార. భీష్మ. ౨, ఆ.—2. శుభోదయమగు. "ఉ. కంసునిబాధలంబడుజగం బులకింతటవేగుఁగాత." హరి. పూ. ౯, ఆ.—వి. 1. రాజ్యసమా చారము; "క. కింకరులచేతనంతన్, లంకకువేగందె." రామా. ౭, ఆ.—2. చారుఁడు. "తే. అరులకడనిజభూమియందనుజ తనుజ, బాంధవామాత్యమిత్రులఁబారవేష, ధరులవేగులుగాఁబెట్ట ధరణిపునకు, వలయునొండొరునెఱుఁగనివారుగాఁగ." భార. శాం. ౨, ఆ.

**వేగుఁజుక్క.** ద్వ. వి. (వేగు+చుక్క.) శుక్రుఁడు. "క. ఇనరథతురంగహేషలు, వినవచ్చినఁగెరలిగగనవీథికిలంఘిం, చెనొ పాడుపుఁగొండఁగేసరి, యనవేగుంజుక్కవొడిచెనంతన్రా చిన్." రామా. ౨, ఆ.

**వేగుఁబోక.** దే. వి. (వేగు+పోక.) వేకువ, ప్రభాతము. "క. వేగుంబోకలమేల్కని, భాగవతోద్గీయమానభగవద్గీతా, రాగంబుల కునుమదిను, ద్వేగంబువహించుఁజేఁదువిన్నవిధమునన్." సై. ౭, ఆ.

**వేగుజాము.** ద్వ. వి. తెల్లవాఱుజాము. "మ. అకటాయేమని దూఱుదాన మిమునాథా వేగుజామయ్యె." కళా. ౪, ఆ.

**వేగురు.** దే. శ. బ. వేయిమంది. (వేయికి మహన్మహత్వర్థక బహు వచనాంతాదేశము.)

**వేగురుఁజుక్క.** ద్వ. వి. (వేగు+చుక్క.) శుక్రుఁడు. "మ. పొడమఁగ వేగురుఁజుక్కకాలఘనభృద్భోగోల్లసద్రత్నమై." పా. ౨, ఆ. (సంధినిర్వర్ణాభిన్యము.)

**వేగువాఁడు.** దే. వి. వేగులవాఁడు, చారుఁడు. (చూ. కద. నై. రెండవయర్థము.)

**వేచు.** దే. స. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. "క. శక్తికనుగుణ ముగభి, క్షాచర్యసేయువిప్రుల, వేచియిడఁగవలయు నెపుడు వేగమభిక్షల్." భార. అను. 3, ఆ.

**వేచేంగులపాఁగ.** దే. వి. (వేచేంగులు + పాఁగ.) శేషుఁడు, సహస్రఫణుఁడు. (అప్ర.)

**వేటు.** దే. వి. వ్రేటుయొక్కరూపాంతరము. (అదురువేటు, కూఁత వేటు మొ.)

**వేడబము.** వై. వి. 1. మాయ; "చ. సబలునశక్తుఁజేయుదువశక్తు బలాఢ్యునిఁజేయుదజ్ఞునిన్, విబుధునొనర్తువవిబుధునిన్ జడుగా నొనరింతువెల్లెఱుం, గఁబడుభవత్ప్రభావమజకంతు హరాదుల కుంగలేరువే,డబములుగాకయైహికజడత్వములున్న వెనీకురాఘవా." ఉ, రా. ౫, ఆ.—2. వంచన; "మ. తలఁపుల్ చిచ్చులుమాట లు జ్వలసుధాధారల్ విభుండైనపు, డ్విలుతున్ మెచ్చరు అన్యులం దలఁతురే విశ్వాసమున్ లేదు క్రూ, రలుహత్తుంబతినైనఁజంపుదుర ధర్మల్ నిర్దయల్ చంచలల్, వెలయాండ్రక్కడవారి వేడబములా వేదాంతసూక్తంబులే." భాగ. ౯, స్కం.—3. వేషము. "వ. కిరీటకోటిఘటితమణిమయూఖరేఖాపుంజంబుకల్లయరసంజపాదుపు వేడబంబువిడంబింప." కాశీ. ౫, ఆ.

**వేడము.** వై. వి. మండలాగ్రము*. (చూ. వేఁడివేలుపు మొదటి యర్థము.) (చూ. వేలము.)

**వేడించు.** వై. స. క్రి. చుట్టివచ్చు, పరివేష్టించు. "వ. నవమాలి కలంగ్రీడించుచు నారంగంబులవేడించుచు." కళా. ౬, ఆ.

**వేడుక.** దే. వి. 1. కుతూహలము; "క. మునినాథయీకథాస్థితి, వినిపింపుమువినఁగనాకువేడుకపుట్టెన్." భాగ. ౭, స్కం.—2. ఇచ్ఛ, అభిలాష; "క. రసగంధప్రముఖంబుల, దెసవేడుక లేక." భార. శాం. ౫, ఆ. "క. వినునాదెనసీకునిరీతవేడుక గలదేఁ, గనుదెఱచిచక్కచూడుము." భో. ౪, ఆ.—3. సంతో షము; "ఉ. ఏడవగర్భమాజలరుహేక్షణదాల్చినలోకమంత యున్, వేడుకనొందె." వి, పు. ౭, ఆ.—4. వినోదము; (అది నేనువేడుకకు చెప్పితిని.) 5. వినోదకార్యము. (ఆవేడుక చూత మురమ్ము.) విణ. వినోదకరము. (అది వినవిన వేడుక.)

**వేడుకకత్తె.** ద్వ. వి. 1. వేశ్య; "క. కావున మీమదికింపుగ, వేవేగవలంతియైనవేడుకకత్తెన్, రావించెద." రాజ. 3, ఆ.—2. జారిణి. భాగ. ౯, స్కం. (మొదటిరూపము వేడుకకత్తియ.)

**వేడుకకాఁడు.** దే. వి. 1. జారుఁడు; "క. అనివేఁడినసత్తా పసి, వినుమేవగనైనసీకువేడుకకానిన్, గొనితెచ్చెదమచ్చాతురి, గనవేనేఁడనుచుఁబల్కిగ్రక్కునవెడలెన్." శశాం. ౪, ఆ.—2. విటుఁడు. "ఉ. వేడుకకాండ్రకైతిరుగువేశ్యలనాడినజాడ నన్నుని, ట్లాడఁగఁబాడియౌనె." ఉ, రా. ౪, ఆ.—విణ. 1. కుతూహలపరుఁడు; "క. పాతెడునీరెడత్రెవ్వఁగఁ, దాఱ బెడిదమైనయెండదనుకఁగనిప్పురం, బాతెమడువంతవేడుక, కాఱు లుజాలరులుసూచిక్రందుకొనంగన్." భార. శాం. 3, ఆ.—2. అపేక్షకుఁడు; "క. కయ్యంబుఁవేడుకకాఁ, డయ్యున్నక కలహశీలికాకాంక్షకుఁడై, సెయ్యమునవచ్చెనారదుఁ, డయ్యెడదివి నుండివారినభిదర్శింపన్." రాఘ. ౨, ఆ.—3. క్రీడాసక్తుఁడు; "ఉ. ఆడుచునుండెఁగానమునికంజలిసేయఁగనేరఁడయ్యెన; వ్వేడుక కాఁడుపుట్టదొకవేళవివేకముదొడ్డవారికిన్." (చూ. పూర్వార్థమి మోడుచు.) కాశీ. ౬, ఆ.—4. వినోదకరుఁడు. "క. సంగడి కాఁడులన్నియు, మ్రింగుచుఁగ్రక్కుచునుబయలమేలఁగించి

చును, ప్రాంగెడువేడుకకాఁడటు, మ్రింగుడువడెబకునిచేతమీఁదె యేఁగినృపా.'' భాగ. ౧౦, స్కం. పూ. (రూ. వేడ్క-కాఁడు.)

**వేడుకజోదము.** దన్య. వి. (చూ.) కరిఖలము.

**వేడుకపడు.** దన్య. అ. క్రి. 1. కుతూహలపడు; ''వ. శుచి ముఖీ నీదు విద్యావిలసనంబు విన్నవించిన నయ్యెవినవలయునని వేడుకపడుచున్నవాఁడు.'' ప్రభా. ౪, ఆ.-2. అపేక్షించు. ''విన్నఁజూడనీవు వేడుకపడితి.'' భార. శాం. ౩, ఆ. (రూ. వేడ్క-పడు.)

**వేడుకసేయు.** దన్య. అ. క్రి. (వేడుక+చేయు.) అపేక్షపడు. ''సురేశ్వరునియంతటివాఁ డఖిలాప్సరోంగనావిటుఁ డొక మర్త్య భామినికి వేడుకసేయుచునున్నవాఁడు.'' నై. ౪, ఆ.-స. క్రి. అపేక్షించు. (రూ. వేడ్క-సేయు. అపేక్షించుటకు.-''చ. ఎ, ల్లిదు లగువారికేటికిసలీలవిహారము వేడ్క-సేయఁగన్.'' నిర్వ. ౮, ఆ.)

**వేడెపెట్టు.** దన్య. స. క్రి. (వేడెము+పెట్టు.) పరివేష్టింపఁజేయు. ''ఆ. చౌకళింపకుండఁ జతురంగబలముల, శౌరిదివేడెపెట్టించుచు బిగియఁ, బట్టిచదివెనొనలిపట్టికమీఁదఁగ, స్పష్టిమెఱయు బిరుద పద్యముపుడు.'' జై. ౭, ఆ.

**వేడెము.** వై. వి. మండలగతి. ''వ. పద్మరాగమణిచూడంబగుకేడెం బునుంగోనివేడెంబునందురంగంబువఱపి.'' స్వా. ౪, ఆ.

**వేడ్క.** దే. వి. విణ. వేడుకయొక్క రూపాంతరము. (కుతూహలము నకు.-''చ. తమతమయంగనల్ కరముతప్పరతన్ బిగియించు కొఁగి ళుల్, గమనపువేడ్క-నించుకయుఁ గైకొనక.'' కళా. ౮, ఆ.) (అమ్రేడితమగుచో వేవేడ్క. చూ. వాసె.)

**వేణి.** సం. వి. ఇ. స్త్రీ. అనేకప్రవాహములయొక్క కూడిక. ఇ. ఈ. స్త్రీ. సర్పాకారముగా అల్లినజడ. ఈ. స్త్రీ. 1. కాలువ; 2. డావర డంగి.

**వేణిక.** సం. వి. ఆ. స్త్రీ. సర్పాకారముగా అల్లిన జడ.

**వేణుకము.** సం. వి. అ. న. 1. (ఏనుఁగునుబొడిచెడి) బరిగోల; 2. (పసులను దోలెడు) ములుకోల. (రూ. వైణుకము.)

**వేణుధ్మఁడు.** సం. వి. అ. పుం. పిల్లంగ్రోవి యూఁదువాఁడు.

**వేణులావకుఁడు.** సం. వి. అ. పుం. మేదరవాఁడు. పర. ౩, ఆ.

**వేణువు** సం. వి. ఉ. పుం. 1. వెదురు; 2. పిల్లంగ్రోవి; 3. ఒకరాజు.

**వేతనము.** సం. వి. అ. న. 1. సంబళము; 2. కూలి.

**వేతసము.** సం. వి. అ. పుం. ఒకానొకతీఁగ, ప్రబ్బ.

**వేతస్వంతము.** సం. విణ. (త్. ఈ. త్.) మిక్కుటమైన ప్రబ్బ లుగలది. (దేశము.)

**వేత్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) తెలిసినవాఁడు.

**వేత్రధరుఁడు.** సం. వి. అ. పుం. బెత్తమును చేతఁబట్టినవాఁడు, కట్టిక.

**వేత్రము.** సం. వి. అ. న. బెత్తము. పుం. బెత్తపుచెట్టు.

**వేత్రవతి.** సం. వి. ఈ. స్త్రీ. నదీవిశేషము.

**వేదండము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

**వేదన.** సం. వి. ఆ. స్త్రీ. 1. నొప్పి; 2. తెలివి.

**వేదము.** సం. వి. అ. పుం. తొలుచేదువులు. (వేదములు నాలు గు.-ఋక్కు, యజుస్సు, సామము, అధర్వము.)

**వేదముఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. పునుఁగుఁబిల్లి.

**వేదముఖ్యకము.** సం. వి. అ. పుం. కచోరముస్తె.

**వేదాంతము.** సం. వి. అ. పుం. ఉపనిషత్తు.

**వేదాంతి.** సం. వి. న్. పుం. 1. వేదాంతము తెలిసినవాఁడు; 2. బ్రహ్మచారి.

**వేది.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. యజ్ఞములుమొదలగువానికై చదరము గానేర్పఱచినతిన్నె; 2. తిన్నె; 3. ముద్దుటుంగరము. ఇ. న్. పుం. విద్వాంసుఁడు. న్. బ్రహ్మ. విణ. తెలిసినవాఁడు.

**వేదిక.** సం. వి. ఆ. స్త్రీ. తిన్నె. (వేదియొక్క రూపాంతరము.)

**వేదు.** దే. వి. 1. వికటగంధము; 2. గంధము; ''క. ఆదండ జడలదండను, వేదండఁజెలంగఁజెరివివేదండగతిన్, వేదండముచే వీచుచు, నాదండధరారిఁబోలెనాడుచువచ్చెన్.'' వి, పు. ౧, ఆ.-3. వెగటు; 4. బ. వెగటుమాట. (చూ. అంబేద.)

**వేద్యము.** సం. విణ. (అ. ఆ. అ.) తెలియఁదగినది.

**వేధ.** సం. వి. స్. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. విద్వాం సుఁడు.

**వేధము.** సం. వి. అ. పుం. తొలిపుచ్చుట.

**వేధించు.** సం. స. క్రి. 1. తొలిపుచ్చు; 2. బాధించు.

**వేధితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలిపుచ్చఁబడినది; 2. బాధింపఁబడినది.

**వేధ్యము.** సం. వి. అ. న. గురి. విణ. తొలిపుచ్చఁదగినది.

**వేనలి.** వై. వి. 1. జడ; ''చ. తనుకుఁబసిండిమిట్టుచెడిదంబుగ వెన్నునంటితోఁచునే, నలికడయంచులారుజత నమ్మనఁదీడిబిగించి నట్టితం, ద్రులజఘనస్తనద్వయము తోరపుఁగాయలుకొనుజాళువా, యొుళవుగనాతిజవ్వన మహెూమహిఁగాంచెఁగడుంబ్రవీణతన్.'' చంద్ర.-2. కొప్పు*. ''వేనలివిరిదండఁజెర్వ.'' కవి. 3, ఆ.-3. వెంద్రుక*. (చూ. నూనెముడి.)

**వేనవేలు.** దే. విణ. బ. (వేలు+వేలు.) పెక్కువేలు. ''ఎ, గీ. వేనవేలుమస్తకములు వేనవేలు, కన్నులును వేనవేల్నాలుకలును గలుగు, మూర్తివి.'' పారి. పూ. ౭, ఆ.

**వేపథువు.** సం. వి. ఉ. పుం. 1. కంపము; 2. స్వరకంపము.

**వేపనము.** సం. వి. అ. న. వణఁకుట, కంపనము.

**వేపితము.** సం. విణ. (అ. ఆ. అ.) కంపితము. ''అతిభీషణకోప వేపితాధరుండగుచున్.'' వి, పు. ౬, ఆ.

**వేమము.** సం. వి. న్. పుం. (చూ.) నేఁతపలక.

**వేమరు.** దే. ద్ర. క్రి. విణ. వేమారుయొక్క రూపాంతరము. ''వేమరునడునెత్తిమూర్కొనుచు.'' ఉ, రా. ౪, ఆ. (చూ. మారు.) (ఈ రూపము చింత్యము.)

**వేమఱు.** దే. ద్ర. క్రి. విణ. వేమాఱుయొక్క రూపాంతరము.

**వేమారు.** దే. ద్ర. క్రి. విణ. మాటిమాటికి. రామా. ౧, ఆ.

**వేమాఱు.** దే. ద్ర. క్రి. విణ.———పై.———

**వేము.** దే. వి. వేఁపచెట్టు, నింబము. (దీనిభేదములు.-నేలవేము, తురకవేము.)

**వేయంచులవాలు.** దన్య. వి. (వేయి+అంచులు+వాలు.) విష్ణు చక్రము, శతారము.

**వేయి.** దే. స. సహస్రము. "సీ. రావణకుంభకర్ణద్విపేంద్రములకు సింగంపువేయి మారంగశాయి." పాంచా. ౧, ఆ.

**వేయిచేతులయెకిమీఁడు.** ద్వ. వి. (వేయిచేతులు+ఎకిమీఁడు.) కార్తవీర్యార్జునుఁడు, సహస్రబాహువు. (చూ. వెల్లివిరియు నాలుగవయర్థము.)

**వేయు.** దే. స. క్రి. 1. వైచు; 2. దిగవిడుచు; (బావిలో చెంబు వేసినాఁడు.) 3. ఉంచు.

**వేరమి.** వై. వి. వేరముయొక్క రూపాంతరము.

**వేరము.** వై. వి. విరోధము. "ఉ. వీరునుబాండుపుత్రులునువేరను దక్కిపొసంగిమన్కికై, పోరితమాడియేనటులు బుద్ధులుసెప్పిన భంగియుఙ్." భార. ఉద్యో. 3, ఆ.

**వేరు.** దే. వి చెట్టుయొక్కమూలము. స. ఏ. అన్యము. "తే. కౌరవులనేమమెల్ల వేర్వేరనడిగె." భార. ఉద్యో. ౨, ఆ.

**వేరుపనస.** ద్వ. వి. వేరునందు పండ్లుపండెడుపనస.

**వేరువిత్తు.** దే. విణ. నాశకము, నాశకుఁడు. "క. వినవేమీకెల్లవేరు విత్తనిసన్నుఙ్." భార. ద్రో. ౪, ఆ. -

**వేఱడము.** దే. వి. భేదము. "క. ఆం, డ్రకుమగలకునిట్టివేఱ డంబులుగలవే." భో. ౬, ఆ.

**వేఱేఁడి.** దే. విణ. (వేఱు+ఇఁడి.) అవివేకి. "ఉ. వేఱేఁడియైన మానిసికి వెండివివేకము గల్గనేర్చునే." భార. ఉద్యో. 3, ఆ. "వేఱెండితనంబుచేత." ఉ, హరి. ౪, ఆ.

**వేఱేఁడించు.** దే. స. క్రి. అవివేకమొందఁజేయు. "మ. తెంపున, క్కజపుంబెంపునువేఱేఁడింపఁడుగదాకర్ణుండుదీనాకృతిఙ్." (అవివేకమొందఁజేయుటయనఁగా అవివేకముచే వానిఁజెఱుచుటయనియర్థము.) భార. కర్ణ. ౧, ఆ. (ఇది వ్రాఁతప్రతులయందలిపాఠము.)

**వేఱిమి.** దే. వి. భేదము, వేఱడము.

**వేఱు.** దే. వి. భేదము (చూ. వేఁడుకోలు.) స. ఏ. అన్యము. "వేఱొక భంగిఁబాకములు విన్ననువొప్పఁగసంఘటించి." భార. విరా. ౧, ఆ.

**వేఱుపడు.** ద్వ. అ. క్రి. భేదపడు. (రూ. వేర్పడు. "క. ఈ, పురుషులుగూడినసృష్టికి, వెరవరులడిసంఘటిలదువేర్పడిరేనిఙ్." భార. శాం. ౫, ఆ.)

**వేఱుపాటు.** ద్వ. వి. 1. భేదము; 2. విరోధము. (రూ. వేర్పాటు. చూ. చిరమర.)

**వేఱుపోవు.** దే. అ. క్రి. వేఱుపడు. (ప్రే. వేఱుపుచ్చు.)

**వేఱుబందము.** ద్వ. వి. వేఱుపాటు, భేదము.

**వేల.** సం. వి. అ. స్త్రీ. 1. చెలియలికట్ట; 2 పొలిమేర; 3. ఉప్పెన; 4. రాజభోజనము; 5. అనాయాసమరణము; 6. వ్యాధి; 7. బుధునిభార్య.

**వేలము.** వై. వి. 1. వేడముయొక్క రూపాంతరము; "చ. చలిమిరి గాడ్పుచేనెగసినన్నపునుఙ్లగుచాకసంబుమం, దలవిలసిల్లెఁబుప్పొడులుదట్టముగామదిఁగ్రమ్ముకూర్మిచేఁ, గలిగివిరాళిఁగుందు తెఱగంటి నెలంతలమీఁదఁజొన్నపూ, విలుతునిసైఁడిచుట్టలుఁగువేలములంబవెంపెంపుసెంపునఙ్." యు. ౪, ఆ.—2. శిబిరము*. "వ. వలరాజు పోఁడూపులకులికివేలంబువెలికింబని రావణుండు డ్రిమ్మరునట్టి యెడ." యు. ౨, ఆ.

**వేలిమి.** దే. వి. హోమము. "వేలిమియుఙ్సురార్చనయునిప్రసపర్యయుఁజక్క." హ్వా. ౨, ఆ.

**వేలిమికట్టియ.** ద్వ. వి. సమిధ. "సీ. విటకచాకృష్టికినిసుఖ నొక్కలతాంగి వేలిమికట్టియల్ విచిచితెచ్చు." కవిక. ౬, ఆ. (రూ. వేలిమికట్టె.)

**వేలిమిబొట్టు.** ద్వ. వి. (రూ.) రక్ష. "సీ. నొసటివేలిమిబొట్టు మసిమీఁదమృగనాభి తిలకంబుబటువుగాఁదీర్చవచ్చు." రామా. ౨, ఆ.

**వేలు.** దే. అ. క్రి. వి. వ్రేలుయొక్క రూపాంతరము.

**వేలుచు.** దే. స. క్రి. హోమాగ్నియందునేయిమొదలగువానినవ ర్పించు. (రూ. వేల్చు. "తే. మండునకుబిడ్డనిచ్చిన చందమొంద, బూదిలోనేయివేల్చినపోల్కియోటి, కడవలోనీళ్లువట్టినకరణియగున, పాత్రజనులకుఁ బెట్టుట పౌరవేంద్ర." భార. శాం. ౧, ఆ.)

**వేలుపు.** దే. వి. 1. దేవత; 2. దేవతాస్త్రీ; 3. జ్యోత్స్నము. "ద్వి. వేలుపుచెప్పపద్ధతినేర్తు." సవ. 3, భా. (చూ. వేలుపుసాని.) (రూ. వేల్పు. దేవతాస్త్రీకి. — "వ. మఱియనవేల్పు గాంధారియైపుట్టె." భార. ఆది. 3, ఆ. "ఎ, గీ. అవ్వనీవువేల్పువాదనికొందఱు, మొగినకేలుమొగిచిమ్రొక్కరంత." భార. అర. ౨, ఆ.)

**వేలుపుఁజెట్టు.** దే. వి. (వేలుపు+చెట్టు.) కల్పవృక్షము, దేవతరువు.

**వేలుపుఁదెరువు.** దే. వి. (వేలుపు+తెరువు.) ఆకాశము, సురవర్త్మము. (రూ. వేల్పుఁదెరువు. అచ్చ. అర, కాం.)

**వేలుపుఁబెద్ద.** ద్వ. వి. (వేలుపు+పెద్ద.) బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు. "వేలుపుంబెద్దవై." సీలా. ౨, ఆ. (రూ. వేల్పుఁబెద్ద.)

**వేలుపుగమికాఁడు.** దే. వి. 1. కుమారస్వామి; 2. బ్రహ్మ. (రూ. వేల్పుగమికాఁడు. "వ. ఎనిమిదికన్నులుగల వేల్పుగమికాఁడు." భాగ. ౧౦, స్కం. పూ.)

**వేలుపుగాణ.** ద్వ. వి. గంధర్వుఁడు. (రూ. వేల్పుగాణ. "వేల్పుగాణతూపు." అచ్చ. యు, కాం.)

**వేలుపుగిడ్డి.** ద్వ. వి. కామధేనువు. (చూ. బూమియ.) (ఇట్లు వేలుపుటావు.) (రూ. వేల్పుగిడ్డి.)

**వేలుపుజెడదారి.** ద్వ. వి. నారదుఁడు, సురముని. "సీ. వేలుపుజెడదారి విందారగించుచోనానందబాష్పంబులడ్డపడును." ఉ, హరి. ౬, ఆ.

**వేలుపుటేఱు.** దే. వి. (వేలుపు+ఏఱు.) గంగ, సురనిమ్నగ. "వేలుపుటేటిఫేనములు." భో. 3, ఆ. (రూ. వేల్పుటేఱు.)

**వేలుపుటొజ్జ.** ద్వ. వి. (వేలుపు+ఒజ్జ.) బృహస్పతి, సురాచార్యుఁడు.

**వేలుపుదాయ.** ద్వ. వి అసురుఁడు, సురద్విషుఁడు. (రూ. వేల్పుదాయ. "తే. దాయతోఁబుట్టువఁటవేల్పుదాయకొలపుఁ, బెద్దయఁట." అచ్చ. యు, కాం.)

**వేలుపుబానిస.** ద్వ. వి. వేశ్య. (రూ. వేల్పుబానిస.)

**వేలుపుబాస.** ద్వ. వి. సంస్కృతము, దేవభాష. సీలా. ౧, ఆ.

**వేలుపుబోనము.** ద్వ. వి. అమృతము. (రూ. వేల్పుబోనము, వేల్పులబోనము.) (చూ. వాతూరము.) "సీ. నిన్నుకౌశికాలివేల్పులబోనము తడవులనిడుపఁడుపుడుకుఁదోడుకు." అచ్చ. యు, కాం.

**వేలుపుమల.** ద్వ. వి. మేరుపర్వతము, సురాలయము. (రూ. వేల్పుమల. "వేల్పుమలవింటిదేవర." య. ౩, ఆ.)

**వేలుపుమానికము.** ద్వ. వి. చింతామణి. "క. దానసమగ్రత వేలుపు, మానికమును బోలుసనుచుమహనీయమణిఁ, గానుక యిచ్చి." విక్ర. ౩, ఆ.

**వేలుపుఱేఁడు.** దే. వి. ఇంద్రుఁడు, సురపతి. (రూ. వేల్పుఱేఁడు.) (ఇట్లు వేలుపుటేలిక, వేలుపురాయఁడు.)

**వేలుపుసాని.** ద్వ. వి. సోదచెప్పునది, దైవజ్ఞ. (రూ. వేల్పులసాని. కళా. 3, ఆ.)

**వేల్పుడు.** దే. వి. పూజ. "భక్తితోడజనకునకువేల్పుకొనరించి." అధ్యా. బాల, కాం.

**వేల్లంతర.** సం. వి. ఆ. స్త్రీ. వెలుతురుచెట్టు.

**వేల్లజము.** సం. వి. అ. న. మిరియము, మరిచము.

**వేల్లనము.** సం. వి. అ. న. 1. వేష్టనము; 2. చలనము.

**వేల్లము.** సం. వి. అ. న. వాయువిడంగము.

**వేల్లితము.** సం. వి. అ. న ప్లుతమనెడి అశ్వధారావిశేషము. విశే. 1. కదలింపఁబడినది; 2. వంకరైనది.

**వేవిలి.** దే. వి. పాలము. (చూ. వేవిళ్లు.) విశే. దున్ననిది. (పొలము.) "క. దేవార్చనానిమిత్తము, దావేఁడోకతోఁటనేయఁదలఁచి యతండా, తౌవుగృహస్థులచేతఁ, వేవిలినుక్షేత్రభూమివిలువకుఁ గొనియెఁ." వై. ౧, ఆ. (బ. వేవిళ్లు. చూ. వేవిళ్లు.)

**వేవిళ్లు.** దే. వి. బ. భక్షణవస్తువాంఛాతిశయరూపగర్భలక్షణవిశేషము. "క. భావంబునఁబుత్త్రవి, ర్భావముఁగాంక్షించుపరమపావనికాలీ, లావతికిఁ గోర్కిపంటల, వేవిళ్లననొప్పుమీఁటివేవిళ్లమరెఁ." పర. ౩, ఆ. (చూ. పైఁడిచూలాలు.)

**వేవు.** దే. అ. క్రి. వి. వేగుయొక్కరూపాంతరము. (ఉదయమగుటకు. – (చూ. వెరవేఁకి.) రాజ్యసమాచారమునకు.–"ద్వి. వేవులవారిట్టివిధమెల్లఁజెప్పఁ, గావిని." రా. యు, కాం.)

**వేవురు.** దే. స. బ. వేగురుయొక్కరూపాంతరము. "క. అపేతగుణుల్, వేవురుసుతులయ్యుసందువిఫలముగాదే." భార. ఆర. ౩, ఆ.

**వేవెలుఁగు.** దే. వి. సూర్యుఁడు, సహస్రాంశువు.

**వేశంతము.** సం. వి. అ. పుం. నీళ్లుగల చిన్నపల్లము, పడియ.

**వేశము.** సం. వి. అ. పుం. 1. వేశ్యలవాడ; (విటులవాడపింత;) 2. ఇల్లు; 3. వేషముయొక్కరూపాంతరము.

**వేశవారము.** సం. వి. అ. పుం. వంటసంబారము. (చూ.) ఉపస్కరము. (రూ. వేసవారము.)

**వేశ్మము.** సం. వి. న్. న. ఇల్లు, గృహము, గేహము.

**వేశ్య.** సం. వి. ఆ. స్త్రీ. భోగముది. అ. న. ము. వేశ్యలవాడ.

**వేషము.** సం. వి. అ. పుం. 1. వస్త్రభూషణాద్యలంకారము, నైపథ్యము; (మజ్జనానులేపనమాల్యవస్త్రాభరణములచేత నిదిపంచవిధము.) 2. స్త్రీలుమొదలైనవారివలె వేసెడువేషము

**వేష్టనము.** సం. వి. అ. న. 1. చుట్టుకొనుట; 2. పాగ; 3. చెవివెలుపలిభాగము.

**వేష్టము.** సం. వి. అ. పుం. 1. చుట్టువెలుగు; 2. చెట్టుబంక.

**వేష్టించు.** సం. స. క్రి. చుట్టుకొను, వేడించు, బలయు. "సుయోధనువేష్టించిరి తమ్ములందఱును." భార. ఆది. ౬, ఆ.

**వేష్టితము.** సం. వి. అ. న. కొట్టమాట, హల్లీసకము. విశే. చుట్టుకొనఁబడినది.

**వేష్టువ.** వై. గ్రా. వి. దోవతి*. "సీ. పెన్నులిత్రాటఁగిల్కొన్న కాపీనంబు వితతంపునీర్కావివేష్టువలును." వై. ౩, ఆ.

**వేసఁగి.** వై. వి. వేసవి, గ్రీష్మర్తువు*. "క. దీపమడఁగఁజేఁకటియును, గోపనుడఁగశాంతిగుణముఁగోల్కొనుక్రియనా, టోపోద్భటమగువేసఁగి, కైపుసడిలఁదోఁచెగారుకాలముదళమై." పాండు. ౪, ఆ.

**వేసగాఁడు.** ద్వ. విశే. (వేసము+కాఁడు.) స్త్రీలు మొదలైనవారి వేషములు వేయువాఁడు.

**వేసట.** దే. వి. అలపు, అలసట, శ్రమము.

**వేసడము.** యు. దే. వి. శ్వేనపవిశేషము. (చూ. కఱుకు. స. క్రి. అణుజో.)–వై. కంచరగాడిద. "ఎ, గీ. కనకవర్మముల్ధరియించి ఘనపిశాచ, ముఖములనుగల వేసడములుధరిత్రిఁ, బడిసవివెనూడు." సం. "కాంచనోరశ్ఛదా శ్చేమే పిశాచవదనాఃఖరాః." రా. అర, కాం. ౩, ఆ. (చూ. గొల్లెనబండి.)

**వేసము.** వై. వి. (చూ.) వేషము.

**వేసరము.** ఉభ. దే. వి. శ్రమము. (చూ. వేసరించు.) సం. అ. పుం. కంచరగాడిద, వేసడము.

**వేసరి.** దే. విశే. బాధకుఁడు. "జక్కవలవేసరి." (చూ. వారాన్నిధి.)

**వేసరించు.** దే. ప్రే. శ్రమపఱుచు. "దీవనలిచ్చుచువేసరింపఁగారాము." భాగ. ౧, స్కం.

**వేసరు.** దే. అ. క్రి. 1. శ్రమపడు; "వ. అన్నహుషుమోచి వేసరియున్నమునులు." సం. "శ్రమార్తాశ్చవహంతస్తమ్." భార. ఉద్యో. ౧, ఆ. "క. సరసకవివిటవిదూషక, పరిహాసకగాయకాది పరిజనములువే, సరుటపయిమేలుదూఁకెదు, తురగమునడఁదూఁగఁ గాంతిదొలుకాఁడంగఁ." నిర్వ. ౭, ఆ.–2. నొచ్చు; "సీ. విరిదీఁగసోఁకివేసరుబాలయొట్టులీకాఱుపూఁ బొదరిండ్లు తూఱనోప." రసి ౪, ఆ. – 3. విసుగు; "ఉ. ఒక్కొకవేళఁబద్ధముఖులొల్లమి సేయుదు రొక్కవేళఁబె, న్మక్కువనాదరింతురుక్షణక్షణముల్ జనవాంద్రచిత్తముల్, పక్కునవేసరంజనదు." స్వా. 3, ఆ.–4. విచారముఁబొందు. "వ. కన్నవారెల్లఁదన్నునిందింపవినివినివినివివేసరియొక్కనాడర్ధరాత్రసమయంబున." కాశీ 2, ఆ.

**వేసవి.** వై. వి. వేసఁగియొక్కరూపాంతరము. "ఎ, గీ. మండువేసవివానవిమనుపుగాపు." పాండు. ౩, ఆ.

**వేసారు.** దే. అ. క్రి. వేసరుయొక్కరూపాంతరము. (విసుగుటకు.– "శా. మారుంబేర్కొనిదూఱుగంధవహుఁబల్మారుఁదుటారించివే, సారుఁ." శుక. ౧, ఆ.)

**వేస్త్రము.** దే. వి. వేసడమునకు మాఱురూపము. ఆం, భా.

**వేహత్తు.** సం. వి. త్. స్త్రీ. (చూలుపడినవెనుక ఆఁబోతుపైకొనుటచే) ఈచుకపోయిన ఆవు.

**వేళ.** సం. వి. ఆ. స్త్రీ. సమయము, కాలము, తటి.

**వేళము.** వై. క్రి. విశే. త్వరితముగ. "వేఁడుమివ్వేళవరంబులిత్తునిదవేళమె." పాండు. ౩, ఆ.

**వేళాకోళము.** దే. వి. చిక్కు. (ఈనడుమ వీఁడు మిక్కిలి వేళాకోళమునొందినాఁడు.) విశే. చిక్కయినది. "క. వేళాకోళపుదీఁగలుఁ, జెలికలుఁగళాసములును బీఱజడలుఁదాఁ,, దాలుచుమెట్లాకిమింటఁ, లీలాహరిఁదోలనింతనేర్పరియయ్యెఁ." కళా. 3, ఆ.

## వై.

**వైకక్షకము.** సం. వి. అ. న. జేందెముపలెవేసికొనెడు పూదండ. (రూ. వైకక్ష్యకము.)

**వైకల్పికము.** సం. విశే. (అ.) వికల్పముచేతకలిగినది.

**వైకల్యము.** సం. వి. అ. న. వికలత, వికలత్వము.

**వైకుంఠము.** సం. వి. అ. పుం. విష్ణువుండెడుస్థానము.

**వైకుంఠుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. ఇంద్రుఁడు.

**వైకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) వికృతినొందినది. (వికృతి= వికారము.)

**వైఖరి.** సం. వి. ఈ. స్త్రీ. వాక్యరూపమైనవాక్కు.

**వైఖానసుఁడు.** సం. వి. అ. పుం. వానప్రస్థుఁడు.

**వైగుణ్యము.** సం. వి. అ. న. విగుణత్వము. "మృద్వైగుణ్యము కుంభకారఘటనోన్మేషంబు నంబోలె." జై. ౬, ఆ.

**వైఘ.** సం. వి. ఆ. స్త్రీ. మధురసమీపమునందుండెడి యొకనది.

**వైచక్షణ్యము.** సం. వి. అ. న. విచక్షణత, విచక్షణత్వము.

**వైచిత్రి.** సం. వి. ఈ. స్త్రీ. వైచిత్ర్యము.

**వైచిత్ర్యము.** సం. వి. అ. న. విచిత్రత, విచిత్రత్వము.

**వైచు.** దే. స. క్రి. 1. విసరివేయు, విక్షేపించు; 2. పడవేయు. "ఎడనెడఫలముల్ వైచుచును నీట." పంచ. నా. ర, ఆ. (మొదటిరూపము వయిచు.)

**వైజననము.** సం. వి. అ. పుం. ప్రసవమగునెల, ప్రొద్దులనెల.

**వైజయంతము.** సం. వి. అ. పుం. 1. ఇంద్రునినగరు; 2. ఇంద్రునిటెక్కెము. డు. కుమారస్వామి.

**వైజయంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. టెక్కెము; 2. విష్ణుమాలిక; 3. విష్ణుప్రాకారము; 4. తక్కిలిౘ.

**వైజయంతికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) టెక్కెముపట్టు వాఁడు.

**వైజాత్యము.** సం. వి. అ. న. విజాతిత్వము. (చూ. విజాతి.)

**వైజ్ఞానికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) నేర్పరి.

**వైజోతి.** వై. వి. ఒకతెగ కోమటిజాతి*. (చూ. వైజోతితొండ.) "వ. అగసాలెసాలెపటుసాలెవానె వైజోతిసాఁతుటేకులకోమటు." ఆము. ర, ఆ. (మొదటిరూపము వయిజోతి.)

**వైజోతితొండ.** దవ్వ. వి. ఊసరవెల్లి. "సీ. చెల్లుసెల్లములకీ క్షింపనిచ్చినసొమ్ముమకుడనీలేనికోమటిగులామ, చేసేతవిశ్వసించినవారివెచ్చనచ్చములబేల్పఱచు వైజోతితొండ." (వైజోతితొండ యనఁగా ఇక్కడ దానివలె వేసాలమాఱియని యర్థము.) పంచ. వేం. ౧, ఆ. (మొదటిరూపము వయిజోతితొండ.)

**వైడము.** దే. క్రి. విశే. వైళమునకు మొదటిరూపము. "ద్వి. ఊడిగంబులునేయునుత్పలాక్షులను, వైడంబపంపియవ్వనితకునండ, బంగారుమేడచప్పరముతోఁగూడ, శృంగారమొనరించి." ప్రభు. ౧౦, ఆ.

**వైడూర్యము.** సం. వి. అ. న. విదూరదేశమునందుఁబుట్టిన రత్నము, పిల్లికన్రతనము. (రూ. వైదూర్యము.)

**వైణవము.** సం. [illegible] [illegible] న. వెదురుబియ్యము.

**వైణవికుఁడు.** సం. వి. అ. పుం. పిల్లంగ్రోవియూఁదువాఁడు. (రూ. వైణుకుఁడు.)

**వైణికుఁడు.** సం. వి. అ. పుం. వీణవాయించువాఁడు.

**వైతంసికుఁడు.** సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులనుజంపి విక్రయించి జీవించువాఁడు, మాంసికుఁడు.

**వైతనికుఁడు.** సం. వి. అ. పుం. కూలికి పనిచేయువాఁడు, కూలి వాఁడు.

**వైతరణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. నరకమునందుండెడి నిప్పుల యేఱు; 2. రాక్షసులతల్లి.

**వైతాళికుఁడు.** సం. వి. అ. పుం. వేకువను రాజులకు మేలుకొలుపులుపాడువాఁడు. విశే. మేలుకొలుపువాఁడు.

**వైదగ్ధి.** సం. వి. ఈ. స్త్రీ. వైదగ్ధ్యము, నేర్పు. లక్ష్మీ. ౨, ఆ.

**వైదగ్ధ్యము.** సం. వి. అ. న. విదగ్ధత, విదగ్ధత్వము, నేర్పు.

**వైదర్భి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రీతివిశేషము; (చూ. రీతి.) 2. దమయంతి; 3. రుక్మిణి.

**వైదికము.** సం. విశే. (అ. ఆ, ఈ. అ.) వేదమునందుఁ జెప్పఁబడినది.

**వైదికుఁడు.** సం. వి. అ. పుం. వేదముతెలిసిన బ్రాహ్మణుఁడు.

**వైదుషి.** సం. వి. ఈ. స్త్రీ. వైదుష్యము, పాండిత్యము. "దాన వైదుషి." కవి. ౧, ఆ.

**వైదుష్యము.** సం. వి. అ. న. విద్వద్భావము, విద్వాంసుని తనము.

**వైదేహకుఁడు.** సం. వి. అ. పుం. 1. బట్టువాఁడు; 2. వర్తకుఁడు.

**వైదేహి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సీతాదేవి; 2. వర్తకురాలు; 3. గోరోజనము; 4. పిప్పలిౘ.

**వైద్యమాత.** సం. వి. ఋ. స్త్రీ. అడ్డసరముౘ.

**వైద్యము.** సం. వి. అ. న. రోగచికిత్సాశాస్త్రము. "తే. కాయబాలగ్రహోర్ధ్వాంగకములునాల్గు, శల్యదంష్ట్రాజరావిషసంఖ్యనాల్గు, నైసయష్టాంగకముతావులాఱుగల్గు, వైద్యమెనిమిదినెలలసర్వమును నేర్చి." స్వా. ౫, ఆ.

**వైద్యుఁడు.** సం. వి. అ. పుం. చికిత్సకుఁడు, వెజ్జు.

**వైధనిక.** సం. వి. ఆ. స్త్రీ. రత్నముఁదొలిపుచ్చెడిసూది, ఆస్ఫోటని, పిడిసాన.

**వైధవ్యము.** సం. వి. అ. న. విధవాత్వము, ముండమోపితనము.

**వైధాత్రుఁడు.** సం. వి. అ. పుం. వైద్యశాస్త్రకర్తయగు సనత్కుమారుఁడనుదేవర్షి.

**వైధేయుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) మూర్ఖుఁడు.

**వైధృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**వైనతేయుఁడు.** సం. వి. అ. పుం. 1. గరుత్మంతుఁడు; 2. అనూరుఁడు.

**వైనము.** వై. వి. 1. వివరణము*; (అదేమి ఆవైనము నాకు చక్కఁగాఁజెప్పుము.) 2. ఉపాయము*; (దానికి నేనొక వైనము చెప్పెదను.) 3. కారణము*; (వాఁడు వచ్చిచెప్పకపోయిన వైనమేమి.) 4. క్రమము*; 5. విధము*. (మొదటిరూపము

వయినము. క్రమమునకు —"ద్వి. దయనుపదేశించి తగసృష్టి సేయు, వయినంబుబోధించి వాక్సిద్ధినొసఁగి." విష్ణు. పూ. 3, ఆ.)

**వైనీతకము.** సం. వి. అ. పుం, న. రథశిబికాదిపరంపరావాహనము, తేరుమోకు. (అనికొందఱు.) అనేకులుమోయునట్టి యందలములోనగునవి. (అనికొందఱు.)

**వైపరీత్యము.** సం. వి. అ. న. విపరీతత్వము, తడఁబాటు.

**వైపు.** దే. వి. 1. తట్టు, ప్రక్క; 2. ఒడుపు, లక్ష్యము; "సీ. వైపుదప్పిన మహాకోపంబుతోడన పోయెవైరంబాత్తఁబూనిదాయ." (చూ. ముందు.) కాశీ. ౬, ఆ.– 3. ఉపాయము. "క. ఒకింతనేఁడునమకూత్రెమహీ, ధారునకు సైన్యవులపై, వైరస్యముగలుఁగఁజేయు వైపు." పర. 3, ఆ. (మొదటిరూపము వయిపు.)

**వైపుకాఁడు.** దే. విశ. ఉపాయశాలి. "ఎ, గీ. బుంగలయాసవంబు, వశిచికొనితెచ్చుచున్నట్టివైపుకాఁడు." సురా. (మొదటిరూపము వయిపుకాఁడు.)

**వైపుల్యము.** సం. వి. అ. న. విపులత్వము, విరివి.

**వైభవము.** సం. వి. అ. పుం. విభవము. (ఇది సౌఖ్యమువంటిది.)

**వైమనస్యము.** సం. వి. అ. న. విమనోభావము, దుఃఖమునొందిన మనసుగలవానితనము.

**వైమాత్రేయుఁడు.** సం. వి. అ. పుం. సవతితల్లికొడుకు.

**వైమానికుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) విమానమెక్కి సంచరించువాఁడు.

**వైమాలము.** దే. విశ. అధికము. (వైమాలపుఁగోపము.) (మొదటిరూపము వయిమాలము.)

**వైముఖ్యము.** సం. వి. అ. న. విముఖత్వము, పరాఙ్ముఖత్వము.

**వైయర్థ్యము.** సం. వి. అ. న. వ్యర్థత, వ్యర్థత్వము.

**వైయాకరణుఁడు.** సం. వి. అ. పుం. వ్యాకరణశాస్త్రము తెలిసినవాఁడు. విశ. వ్యాకరణ సంబంధముగలవాఁడు.

**వైయాఘ్రము.** సం. విశ. (అ. ఈ. అ.) పులితోలుతో కప్పఁబడినది. (రథము.)

**వైయాత్యము.** సం. వి. అ. న. వియాతత్వము, దిట్టతనము.

**వైరనిర్యాతనము.** సం. వి. అ. న. పగతీర్చుకొనుట, వైరశుద్ధి.

**వైరము** సం. వి. అ. న. విరోధము, విద్వేషము, పగ.

**వైరపులు.** దే. వి. కట్టెనిప్పు, అంగారము. (మొదటిరూపము వయిరపులు.)

**వైరశుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. పగతీర్చుకొనుట.

**వైరస్యము.** సం. వి. అ. న. విరసత్వము, వెగటు.

**వైరాగి.** సం. వి. న్. పుం. బైరాగి.

**వైరాగ్యము.** సం. వి. అ. న. విరాగత్వము, విషయేచ్ఛారహితత్వము.

**వైరారోహము.** సం. వి. అ. పుం. అంతకంతకు చేలమెచ్చెడి గొప్పయుద్ధము.

**వైరాలు.** దే. వి. (చూ.) వైరపులు. (మొదటిరూపము వయిరాలు.)

**వైరి.** సం. వి. న్. పుం. అరాతి, శత్రువు, పగవాఁడు.

**వైరించు.** సం. అ. క్రి. పగగొను. "సీ. వైరింపజమునంతవాని నేనియుఁబోర సదరంటఁగా వ్రేయుటలనిబిరుదు." భల్లా. ౪, ఆ

**వైరూప్యము.** సం. వి. అ. న. విరూపత, విరూపత్వము.

**వైల.** దే. వి. శ్యేనవిశేషము. (మొదటిరూపము వయిల.)

**వైలక్షణ్యము.** సం. వి. అ. న. విలక్షణత, విలక్షణత్వము.

**వైలక్ష్యము.** సం వి. అ. న. విలక్షత్వము, విస్మయాన్వితత్వము.

**వైవధికుఁడు.** సం. వి. అ. పుం. కావడిమోసెడువాఁడు.

**వైవర్ణ్యము.** సం. వి. అ. న. వివర్ణత, వెల్లఁబాటు.

**వైవశ్యము.** సం. వి. అ. న. వివశత, వివశత్వము.

**వైవస్వతుఁడు.** సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. ఒక మనువు; (చూ. మనువు.) 3. శనైశ్చరుఁడు.

**వైవాహికము.** సం. విశ. (అ. ఈ. అ.) వివాహసంబంధమైనది.

**వైశసము.** సం. వి. అ. న. హాని. "తస్యప్రేమ్ణస్తదిదమఘునావైశసంపశ్య జాతమ్." అమరుకము.

**వైశాఖము.** సం. వి. అ. పుం. 1. ఒకనెల; 2. కవ్వము.

**వైశారద్యము.** సం. వి. అ. న. 1. విశారదత్వము, పాండిత్యము; 2. నేర్పు.

**వైశాల్యము.** సం. వి. అ న. విశాలత్వము, వెడలుపు.

**వైశికము.** సం. వి. అ. న. 1. కపటము; "చ. ఒఱపరిగన్నఁగూడఁజను నూరక సన్నలువాఱనాడుఁద, త్తఱపడుబోటిఁబిల్చెడి విధంబునన్తొత్తిలిపల్కనవ్వఁబ, ల్లఱుఁబొరుగిండ్లకేగునొకమట్టున నిల్వదుచంటిమీఁదిముం, జెఱఁగెడలించువైశికపుసిగ్గునటించుచు జారధారణిౕ." జై. 3, ఆ.—2. భోగముతనము. "రగడ. కుందములునీవొనఁగఁగూర్చితినిగైశికము, నిందులకువెలయడుగనేల విడువైశికము." (ఇక్కడ కపటమును అర్థము.) సావి. 3, ఆ.— విశ. 1. భోగముదానిది; "క. అదియొండెభక్తియెవ్వతె, యెదవిశ్లేషైకభీరువృత్తిఁబ్రియాలా, భదశౕమెయిదొఱఁగించుౕ, వాదనునసదిగాకయున్నవివైశికముల్." అము. ౫, ఆ.—2. దూష్యము. "తే. ఏనుమాబిడ్డఁబొగడుటయెంతయేని, వైశికంబగు." హరి. ఉ. ౭, ఆ.

**వైశికుఁడు.** సం. వి. అ. పుం. బహువేశ్యోపభోగరసికుఁడు.

**వైశేషికము.** సం. వి. అ. పుం. సప్తపదార్థములనుచెప్పునట్టి తర్కశాస్త్రము.

**వైశేషికుఁడు.** సం. వి. అ. పుం. సప్తపదార్థములనుచెప్పునట్టి తర్కశాస్త్రము నెఱిఁగినవాఁడు.

**వైశ్యుఁడు.** సం. వి. అ. పుం. కోమటివాఁడు, అర్యుఁడు.

**వైశ్రవణుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు, పైఁడితేఁడు.

**వైశ్వదేవము.** సం. వి. అ. న. విశ్వదేవతలనుగూర్చిచేసెడు హోమాది. విశ. విశ్వదేవసంబంధమైనది.

**వైశ్వానరుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని, వేఁడివేలుపు.

**వైషమ్యము.** సం. వి. అ. న. [illegible]షమత్వము, వేఱిమి.

**వైషయికము.** సం. విశ. (అ. ఈ. అ.) విషయసంబంధమైనది.

**వైష్ణవము.** సం. వి. అ. న. విష్ణువేదేవుఁడు అను ఒక మతము. (చూ. మతము.) విశ. విష్ణుసంబంధమైనది.

www.teluguthesis.com

**వైష్ణవి.** సం. వి. ఈ. స్త్రీ. ఒక మాతృక. (చూ. మాతృక.)

**వైష్ణవుఁడు.** సం. వి. అ. పుం. విష్ణుభక్తుఁడు.

**వైసారిణము.** సం. వి. అ. పుం. మత్స్యము, చేఁప.

**వైసిక.** వై. వి. కపటము. "ఎ, గీ. ఉల్లముగరంగవైశికపల్లటిలఁగ, ధైర్యమెడలంగ మంత్రతంత్రములుమఱచి." షో. ౨, ఆ. (మొదటిరూపము వయిసిక.)

**వైస్వర్యము.** సం. వి. అ. న. విస్వరత్వము. (ఎలుఁగుయొక్క) రాలుపాటు.

**వైహాయసము.** సం. విశే. (అ. ఈ. అ.) విహాయససంబంధమైనది.

**వైళము.** దే. క్రి. విశే. శీఘ్రముగ. "క. ఓలేమయేతదవనీ, పాలకసంభావితార్థపరికల్పనకుఁ, జాలిననిలునిటలేదా, వైళమచనునింకమనల వలవదటనినన్." హన. ౫, ఆ. (మొదటిరూపము వయిళము.)

## వ్లో.

**వ్లోఢ.** సం. వి. ఋ. పుం. 1. తేసుగడపువాఁడు; 2. మోపరి.

## వ్య.

**వ్యంగము.** సం. వి. అ. పుం. కప్ప. విశే. కొనటి.

**వ్యంగ్యము.** సం. వి. అ. పుం. వ్యంజనచేతఁ దెలియఁదగిన యర్థము.

**వ్యంజకము.** సం. వి. అ. పుం. 1. అభినయము; 2. వ్యంగ్యార్థమును దెలిపెడిశబ్దము.

**వ్యంజన.** సం. వి. ఆ. స్త్రీ. ఒక శబ్దవృత్తి. (చూ. వృత్తి.) అ. న. ము. 1. కూర; 2. ఆఱుమగిలఁగుడి; 3. గుఱుతు; 4. మీసము; 5. హల్లు; 6. పర్యగ్నికరణాది పశుసంస్కారము.

**వ్యంజితము.** సం. విశే. (అ. ఆ. అ.) బయలుపఱుపఁబడినది.

**వ్యంసకుఁడు.** సం. వి. అ. పుం. మోసకాఁడు.

**వ్యక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. తెల్లమైనది; 2. తెలియఁబడినది. (అభివ్యక్తము అనియు.)

**వ్యక్తి.** సం. వి. ఇ. స్త్రీ. జాతికివేఱై జాతికి ఆశ్రయమైనస్వరూపము.

**వ్యగ్రుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వేగిరపడువాఁడు; 2. ఒకటతగిలినమనసుగలవాఁడు.

**వ్యజనము.** సం. వి. అ. న. విసనకఱ్ఱ, తాళవృంతము.

**వ్యడంబకము.** సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

**వ్యతికరము.** సం. వి. అ. పుం. 1. క్షోభము; 2. వ్యసనము; 3. పరస్పరమేళనము.

**వ్యతిక్రమము.** సం. వి. అ. పుం. క్రమవిపర్యయము, అక్రమము.

**వ్యతిరిక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. వేఱుపడినది; 2. మాఱుపడినది.

**వ్యతిరేకము.** సం. వి. అ. పుం. 1. వేఱు; 2. మాఱు; 3. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**వ్యతీపాతము.** సం. వి. అ. పుం. 1. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 2. (యుద్ధమున) వెనుదీయుట; 3. అత్యుత్పాతము.

**వ్యత్యయము.** సం. వి. అ. పుం. వ్యత్యాసము, తడఁబాటు.

**వ్యత్యస్తము.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యత్యాసపడినది, తడఁబడినది.

**వ్యత్యాసము.** సం. వి. అ. పుం. వ్యత్యయము, తడఁబాటు.

**వ్యథ.** సం. వి. ఆ. స్త్రీ. బాధ. అ. పుం. ము. తొలిపుచ్చుట.

**వ్యథితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. బాధింపఁబడినది; 2. తొలిపుచ్చఁబడినది.

**వ్యధ్వము.** సం. వి. అ. పుం. చెడ్డత్రోవ, కాపథము.

**వ్యపదేశము.** సం. వి. అ. పుం. మిక్కిలి కపటము. (చూ. అపదేశము.)

**వ్యపేతము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి తొలఁగినది. (చూ. అపేతము.)

**వ్యభిచరించు.** సం. అ. క్రి. 1. తప్పిచరించు; 2. ఱంకుపోవు.

**వ్యభిచారము.** సం. వి. అ. పుం. 1. తప్పిచరించుట; 2. ఱంకు.

**వ్యభిచారి.** సం. వి. న. న. శృంగారభావవిశేషము. (ఇవి ముప్పదిమూడు.--నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, స్మృతి, ధృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, త్రాసము, వితర్కము.)

**వ్యభిచారిణి.** సం. వి. ఈ. స్త్రీ. ఱంకుటాలు.

**వ్యయ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**వ్యయము.** సం. వి. అ. న. లగ్నమునకు పంద్రెండవ యిల్లు. పుం. వెచ్చము.

**వ్యయించు.** సం. స. క్రి. వ్యయముచేయు, వెచ్చించు.

**వ్యయితము.** సం. విశే. (అ. ఆ. అ.) వెచ్చింపఁబడినది.

**వ్యర్థము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రయోజనములేనిది, వట్టి.

**వ్యవకలనము.** సం. వి. అ. న. ఒక సంఖ్యలో నొక సంఖ్యను త్రోయుట.

**వ్యవకలితము.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యవకలనముచేయఁబడినది.

**వ్యవచ్ఛిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) వ్యవచ్ఛేదమునొందినది.

**వ్యవచ్ఛేదము.** సం. వి. అ. పుం. 1. ఖండించుట; 2. భాగించుట; 3. భాగహారము; 4. తారతమ్యము; 5. బాణగమనము.

**వ్యవధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కప్పు; 2. మఱుఁగు.

**వ్యవధానము.** సం. వి. అ. న. 1. అవకాశము; 2. కప్పు; 3. మఱుఁగు.

**వ్యవధి.** సం. వి. ఇ. పుం. 1. మేర; 2. వ్యవధానము.

వ్యవసాయము. సం. వి. అ. పుం. 1. ప్రయత్నము; 2. కృషి.

వ్యవసాయి. సం. విణ. (న్. ఈ. న్.) వ్యవసాయముగల వాఁడు.

వ్యవసితము. సం. వి. అ. న. 1. నిశ్చయము; 2. వ్యవసాయము. విణ. 1. అనుష్ఠింపఁబడినది; 2. నిశ్చయింపఁబడినది; 3. మోసపుచ్చఁబడినది.

వ్యవస్థ. సం. వి. ఆ. స్త్రీ. శాస్త్రనిరూపితనియమము.

వ్యవస్థితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యవస్థచేయఁబడినది.

వ్యవహరించు. సం. అ. క్రి. వివాదముచేయు. స. క్రి. వాడుక చేయు.

వ్యవహర్త. సం. వి. ఋ. పుం. న్యాయాధిపతి. విణ. వ్యవహరించువాఁడు.

వ్యవహారము. సం. వి. అ. పుం. 1. తగవు; 2. న్యాయము; 3. వాడుక; 4. జూదము.

వ్యవహితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యవధానముగలది.

వ్యవాయము. సం. వి. అ. న. తేజము. పుం. 1. మఱుఁగు; 2. గ్రామ్యధర్మము.

వ్యష్టి. సం. వి. ఇ. స్త్రీ. ఒంటరితనము, ఒంటిపాటు.

వ్యసనము. సం. వి. అ. న. 1. ఆపద; 2. కామక్రోధములవలనఁ బుట్టినదోషము; [ఇవి యేవి.—పానము, స్త్రీ, మృగయ, ద్యూతము, (ఇవి కామమువలనఁబుట్టినవి.) వాక్పారుష్యము, దండపారుష్యము, అర్థదూషణము. (ఇవి కోపమువలనఁబుట్టినవి.) ఇట్లు.] 3. ఆసక్తి; 4. పాపము; 5. అపాయము; 6. నిష్ఫలమైన ప్రయత్నము; 7. దైవమువలని యనిష్టఫలము.

వ్యస్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వేఱుపడినది; 2. వ్యాకులతఁబొందినది; 3. వ్యాపించినది

వ్యళీకము. సం. వి. అ. న. 1. అప్రియము; 2. అకార్యము; 3. అచ్చెరుపాటు; 4. అనత్యము; 5. బాధ; 6. సిగ్గు; 7. మోసపుచ్చుట; 8. మన్మథావేశముచేఁజేయఁబడిన కామినీజనాపరాధము.

## వ్యా.

వ్యాకరణము. సం. వి. అ. న. శబ్దశాస్త్రము.

వ్యాకీర్ణము. సం. విణ. (అ. ఆ. అ) చెదరినది.

వ్యాకులము. సం. విణ. (అ. ఆ. అ.) కలఁతనొందినది.

వ్యాకులితము. సం. విణ. (అ. ఆ. అ.)———పై.———

వ్యాకృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వేఱుపఱుచుట; 2. విశదపఱుచుట; 3. భాషాంతరపఱుచుట; 4. వ్యాకరణము

వ్యాకోచము. సం. విణ. (అ. ఆ. అ.) వికసించినది. (చూ. వ్యాకోశము, వ్యాకోపము.)

వ్యాఖ్య. సం. వి. ఆ. స్త్రీ. అర్థవివరణము.

వ్యాఖ్యాత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) వ్యాఖ్యానముచేసినవాఁడు. (అ. ఆ. అ.) ము. 1. వ్యాఖ్యానము చేయఁబడినది; 2. చెప్పఁబడినది.

వ్యాఖ్యానము. సం. వి. అ. న. అర్థవివరణముచేయుట.

వ్యాఘాతము. సం. వి. అ. పుం. 1. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 2. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. విఘ్నము; 4. దెబ్బ.

వ్యాఘూర్ణనము. సం. వి. అ. న. తిరుగుడు.

వ్యాఘూర్ణితము. సం. విణ. (అ. ఆ. అ.) తిరుగుడుపడినది.

వ్యాఘ్రనఖము. సం. వి. అ. న. 1. భూషణవిశేషము, పులిగోరు; 2. పులిగోరుచెట్టు; 3. గంధద్రవ్యవిశేషము; 4. నక్షత్రవిశేషము.

వ్యాఘ్రపాదము. సం. వి. ద్. పుం. ములువెలఁగ. పుల్లవెలఁగ. (అనికొందఱు.)

వ్యాఘ్రపుచ్ఛము. సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

వ్యాఘ్రము. సం. వి. అ. పుం. 1. పులి; 2. పెద్దాముదపుఁజెట్టు; 3. ఉత్తరపదమైనచో శ్రేష్ఠము.

వ్యాఘ్రాటము. సం. వి. అ. పుం. భరద్వాజపక్షి, ఏట్రింత.

వ్యాఘ్రి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడుచెట్టు.

వ్యాజము. సం. వి. అ. పుం. 1. కపటము; 2. చెడ్డతనము.

వ్యాజ్యెగాఁడు. దే. వి. (వ్యాజ్యెము+కాఁడు.) వివాదపడినవాఁడు.

వ్యాజ్యెమాడు. దే. అ. క్రి. (వ్యాజ్యెము+ఆడు.) వివాదపడు.

వ్యాజ్యెము. దే. వి. వివాదము, తగవు.

వ్యాధి. సం. వి. ఇ. పుం. 1. తెవులు; 2. చెంగల్వకోష్టు చెట్టు.

వ్యాధిఘాతము. సం. వి. అ. పుం. తేల, ఆరగ్వధముచెట్టు.

వ్యాధితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాధిగలవాఁడు, తెవులుగొంటు.

వ్యాధుఁడు. సం. వి. అ. పుం. 1. బోయవాఁడు; 2. దుష్టుఁడు.

వ్యానము. సం. వి. అ. పుం. శరీరమంతట వ్యాపించినవాయువు. (చూ. వాయువు.)

వ్యాపకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపించువాఁడు.

వ్యాపనము. సం. వి. అ. న. వ్యాపించుట.

వ్యాపనీయము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపింపఁదగినది, వ్యాప్యము.

వ్యాపాదనము. సం. వి. అ. న. 1. చంపుట; 2. ద్రోహము తలఁచుట.

వ్యాపాదము. సం. వి. అ. పుం. ద్రోహపుతలఁపు.

వ్యాపాదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చంపఁబడినది; 2. ద్రోహముతలఁపఁబడినది.

వ్యాపారము. సం. వి. అ. పుం. 1. పని; 2. ఉద్యోగము.

వ్యాపారి. సం. వి. న్. పుం. మాధ్యస్థుఁడు. విణ. (న్. ఈ. న్.) వ్యాపారముగలవాఁడు.

వ్యాపి. సం. విణ. (న్. ఈ. న్.) వ్యాపించువాఁడు.

వ్యాపించు. సం. అ. క్రి. అంతట ప్రసరించు, నెరయు. (అభివ్యాపించు అనియు.)

వ్యాపృతి. సం. వి. ఇ. స్త్రీ. వ్యాపారము.

వ్యాపృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపారమునొందినవాఁడు.

వ్యాప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాపించినది; 2. ప్రసిద్ధికెక్కినది; 3. పొందఁబడినది.

**వ్యాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వ్యాపించుట; 2. ప్రసిద్ధికెక్కుట; 3. పొందుట. (అభివ్యాప్తి అనియు.)

**వ్యాప్యము.** సం. వి. అ. న. చెంగల్వకోష్టు. విణ. వ్యాపింపఁదగినది.

**వ్యామము.** సం. వి. అ. పుం. 1. బార; 2. పాగ.

**వ్యామోహము.** సం. వి. అ. పుం. అత్యంతమోహము.

**వ్యాయతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దృఢమైనది; 2. దీర్ఘమైనది; 3. అధికమైనది; 4. వ్యాపారముగలది.

**వ్యాయామము.** సం. వి. అ. పుం. 1. శ్రమము; 2. సాము; 3. బార; 4. నిలువు.

**వ్యాయోగము.** సం. వి. అ. పుం. నాటకవిశేషము. (చూ. నాటకము.)

**వ్యాలోలము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చలించునది.

**వ్యావర్తనము.** సం. వి. అ. న. 1. వెనుకకు మరలుట; 2. చుట్టుట.

**వ్యావహారికుఁడు.** సం. వి. అ. పుం. మంత్రి. విణ. వ్యవహారముతెలిసినవాఁడు.

**వ్యావృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెనుకకు మరలినది; 2. చుట్టఁబడినది.

**వ్యావృతి.** సం. వి. ఇ. స్త్రీ. కొఱవిదయ్యము. ‘‘సి. డబ్బాటుమైనొక్కెడలు చూపియవిమాయనడఁగవేత్రేచూపువ్యావృతులును.’’ ఆను. ౬, ఆ. (దీనికిట్లర్థము కొందఱు వ్రాసియున్నారు.)

**వ్యావృత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెనుకకు మరలినది; 2. చుట్టఁబడినది.

**వ్యాసంగము.** సం. వి. అ. పుం. మిక్కిలి ఆసంగము.

**వ్యాసక్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ఆసక్తిగొన్నవాఁడు.

**వ్యాసము.** సం. వి. అ. పుం. 1. విరివి; 2. ఏదేనియొకవిషయమును విరివిగా వ్రాయుట. డు. పరాశరునికొడుకు.

**వ్యాహతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి కొట్టఁబడినది; 2. వ్యర్థమైనది.

**వ్యాహారము.** సం. వి. అ. పుం. వచనము, పలుకు.

**వ్యాహృతము.** సం. విణ. (అ. ఆ. అ.) వచింపఁబడినది, పలుకఁబడినది.

**వ్యాహృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. వ్యాహారము; 2. మంత్రవిశేషము. (ఓమ్.)

**వ్యాళగ్రాహి.** సం. వి. న్. పుం. పాములవాఁడు. (రూ. వ్యాళగ్రాహుఁడు. అ. పుం.)

**వ్యాళము.** సం. వి. అ. పుం. 1. పాము; 2. పులి; 3. తులువయేనుఁగు. విణ. క్రూరమైనది. (రూ. వ్యాడము.)

**వ్యాళాయుధము.** సం. వి. అ. న. 1. పులిగోరు; 2. గంధద్రవ్యవిశేషము. (రూ. వ్యాడాయుధము.)

## వ్యు.

**వ్యుత్క్రమము.** సం. వి. అ. పుం. క్రమవిపర్యయము, వ్యతిక్రమము.

**వ్యుత్థానము.** సం. వి. అ. న. 1. అడ్డపాటు; 2. సమాధినుండి మరలుట; 3. ప్రతికూలప్రవర్తనము; 4. స్వాతంత్ర్యము.

**వ్యుత్పత్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. శాస్త్రాదిజన్యపరిజ్ఞానము; 2. శబ్దసంభవప్రకారము.

**వ్యుత్పన్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) శాస్త్రాదిజన్యపరిజ్ఞానముకలవాఁడు.

**వ్యుత్పాదకము.** సం. విణ. (అ. ఈ. అ.) వ్యుత్పత్తిని కలిగించునది.

**వ్యుషితము.** సం. వి. అ. న. చేలిది, చేల్ది. (దీనినే చద్దియని వాడుదురు.)

**వ్యుష్టము.** సం. వి. అ. న. వేకువ. విణ. వేగినది.

**వ్యుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రయోజనము; 2. సమృద్ధి.

## వ్యూ.

**వ్యూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యూహముగా ఉంచఁబడినది; (సేన.) 2. ఉంచఁబడినది; 3. దట్టమైనది; 4. విశాలమైనది.

**వ్యూతి.** సం. వి. ఇ. స్త్రీ. నేయుట, నేఁత.

**వ్యూహము.** సం. వి. అ. పుం. 1. మిక్కిలి ఊహ; 2. మొగ్గరము; 3. సమూహము; 4. రచన; (వ్యూహభేదములు.—దండము, భోగము, మండలము, అసంహతము. చక్రగోమూత్రికాదులు వీనియవాంతరభేదములు.)

## వ్యో.

**వ్యోకారుఁడు.** స. వి. అ. పుం. 1. ఇనుముచేయువాఁడు; 2. కమ్మరవాఁడు.

**వ్యోమకేశుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, వినుసిగదేవర.

**వ్యోమము.** సం. వి. న్. న. 1. ఆకాశము; 2. జలము.

**వ్యోమయానము.** సం. వి. అ. న. (చూ.) విమానము.

**వ్యోషము.** సం. వి. అ. న. (చూ.) త్రికటుకము.

## వ్ర.

**వ్రంత.** దే. వి. 1. వీఱు; ‘‘వ్రంతలుగట్టిపాఱురుధిరంబు.’’ భో. ౫, ఆ. (చూ. కట్టు.) 2. పల్లము. ‘‘వ్రంతమిట్టేర్పడక.’’ రా. యు, కాం. (వరఁతయొక్క రూపాంతరము.)

**వ్రక్క.** వై. వి. ఖండము. ‘‘వ్రక్కలుచేయఁగాఁబఱురుధిరంబునఁదోఁగుచు.’’ పా. ౫, ఆ.

**వ్రక్కలించు.** వై. స. క్రి. వ్రక్కలుచేయు, భేదించు. ‘‘తే. శంఖభేరీమృదంగనిస్స్వనభయద, రావములుదిక్తటంబుల వ్రక్కలింప.’’ జై. ౭, ఆ.

**వ్రక్కలింత.** వై. వి. భేదనము. ‘‘సీ. తన్నడిగిట్టగుద్దలివ్రక్కలింతలనెగసిన దుమ్మువిన్నెల్లఁగప్ప.’’ అచ్చ. యు, కాం.

**వ్రక్కవాయు.** దవ్వ. అ. క్రి. (వ్రక్క+పాయు.) తెగు. ‘‘ఆ. త్రొక్కియున్నతీఁగె వ్రక్కవాసినజాతి, పడియె.’’ భో. ౫, ఆ.

**వ్రక్కవాఱు.** దవ్వ. అ. క్రి. (వ్రక్క+పాఱు.) వ్రక్కయగు, చీలు, భేదిల్లు. (చూ. పాఱు.)

**వ్రచ్చు.** వై. స. క్రి. చీల్చు, భేదించు*. "సీ. నరవరాధిపనీవు నరసింహామూర్తివైరాక్షసోరస్థలి వ్రచ్చితలుక." రా. యు, కాం.

**వ్రజము.** సం. వి. అ. పుం. 1. పసులమంద; 2. పసులకొట్టము; 3. సమూహము; 4. త్రోవ.

**వ్రజ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. భిక్షలోనగువానికొఱకు తిరుగుట; 2. ప్రయాణము; 3. ఒకతెగ.

**వ్రణము.** సం. వి. అ. న. గాయము. పుం, న. కుఱుపు. (ఇది నూటయెనిమిది భేదములుగలది.) పుం. కిణము.

**వ్రతతి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. తీఁగ; 2. విరివి.

**వ్రతము.** సం. వి. అ. పుం, న. ఉపవాసాది పుణ్యకర్మము, నోము.

**వ్రతి.** సం. వి. న్. పుం. 1. యజ్ఞముచేయువాఁడు; 2. వ్రతము గలవాఁడు. (వ్రతిభేదములు.—ఋషి, స్నాతకుఁడు, యతి, స్థాండిలుఁడు, దవ్యాతిగుఁడు, మూలికుఁడు, లోచకుఁడు, శౌర్వుఁడు, ఖపుటుఁడు.)

**వ్రప్పు.** వై. వి. చీలిక. "సీ. తలఁబడ్డగుదియ వ్రప్పులఁబాఁతమసి యిడి యంబలిగంజిండ్లనడుగువారు." ఆము. ౬, ఆ.

**వ్రయ్య.** వై. వి. వ్రక్క, ఖండము. "చ. హరిఁబరమేశ్వరుం బ్రభుసమస్త జగత్ప్రియుఁగీడువల్కుదు, ర్నరుఁడవు నీదు జిహ్వ పలువ్రయ్యలువాయదు." హరి. ఉ. ౬, ఆ.

**వ్రయ్యఁబడు.** వై. అ. క్రి. (వ్రయ్యన్ + పడు.) వ్రయ్యు, భేదిల్లు. "శా. తదుద్భూతధ్వనుల్ దాఁకిలో, కాలోకాద్రిగుహల్ ప్రతిధ్వనులొసంగన్ భూమి వ్రయ్యంబడన్." రామా. ౮, ఆ. (సార్థమున పడు.)

**వ్రయ్యవాఱు.** దవ్. అ. క్రి. (వ్రయ్య + పాఱు.)——పై.——"ద్వి. మహి వ్రయ్యవాఱనొత్తిలియార్చుచు." రా. యు, కాం. (చూ. పాఱు.)

**వ్రయ్యు.** వై. అ. క్రి. బ్రద్దలగు, చీలు*. "ఎ, గీ. దేవదత్తం బురవము గుణము, రావమునుద్దిక్తటంబుల వ్రయ్యఁజేయ." భార ద్రో. ౧, ఆ.

**వ్రశ్చనము.** సం. వి. అ. న. భేదనము. పుం. పత్రపరశువు, ఆకుఱాయి.

## వ్రా.

**వ్రాఁకుడు.** వై. వి. వాఁకుడునకు మొదటిరూపము.

**వ్రాఁత.** దే. వి. వ్రాయుట, లేఖనము.

**వ్రాతకాఁడు.** దే. వి. వ్రాయువాఁడు, లేకరి.

**వ్రాఁతచావడి.** దే. వి. వ్రాసెడుచోటు, గ్రంథకుటి.

**వ్రాఁతపని.** దే. వి. రంగువేయువాఁడు వస్త్రములయంచులయందు రంగుతో వ్రాసెడుచిత్రము.

**వ్రాఁతబల్ల.** దే. వి. వ్రాఁతకాండ్రు కాగితములుంచుకొని వ్రాయు సాలుగుకాళ్లచౌకపువాటపుపలకలోనగునది.

**వ్రాఁతసాకిరి.** దవ్. వి. (చూ.) లిఖితుఁడు.

**వ్రాతము.** సం. వి. అ. పుం. సమూహము, గుమి.

**వ్రాత్యుఁడు.** సం. వి. అ. పుం. ఉపనయనాదిసంస్కారములేని బ్రాహ్మణుఁడు లోనగువాఁడు.

**వ్రాయసకాఁడు.** దే. వి. లేకరి, లేఖకుఁడు. (వాడుకయందు రాయసకాఁడందురు.)

**వ్రాయసము.** దే. వి. 1. వ్రాఁత; 2. జాబు. "ఆ. అటఁగు శిందుసేమ మరయుచుఁదండ్రి వ్రా, యసముఁ జూచి ఎత్తె నందియు తఁడు." జై. ౮, ఆ. (వాడుకయందు రాయసమందురు.)

**వ్రాయి.** దే. వి. 1. అక్షరము; 2. రేఖ; "ఉత్సాహ. చేతి వ్రాలుచూచి యిది యశేషరాజ్యవిభవబో, గాతిశయము గలిగి యలరుననియు మృదులచరణకం, జాతరేఖలరసి రాజసతులనతుల కర్థయా, సాతియనియునపుడులక్షణజ్ఞులాడికొనిరిలన్." కళా. ౬, ఆ. — 3. పాచికమీఁది బొట్టు. "వ. తప్పుదాయంబునకు నొకవ్రాయివిడిచెద." ఉ, హరి. 3, ఆ.

**వ్రాయు.** దే. స. క్రి. లిఖించు. "సీ. కలకంఠ కంఠివీనులకు శ్రీకారముల్ రక్షయంత్రములుగా వ్రాయవచ్చు." అని. 3, ఆ.

**వ్రాలు.** దే. అ. క్రి. 1. పక్షిక్రిందికి దిగు; "తే. కాంచి మెల్లనె యయ్యనోకహముమీఁద, వ్రాలియా క్రిందిపటకుటీరంబుచూచి." రసి. ౫, ఆ. — 2. ఒఱగు; "క. అరదంబుమీఁద వ్రాలిన, ధర ణీశ్వరుఁజేరి." జై. ౨, ఆ.—3. మీఱు; "క. ఎమ్మై వ్రాలెద నోరిపులెట్టులు, కూలెదరో చూడు." భార. ద్రో. ౨, ఆ.— 4. తగ్గు. "క. పొంగుచుమూఁడుజగంబులు, రంగెసఁగఁగ నేలు చుండి వ్రాలనిబలురేవిన్." అచ్చ. అర, కాం.—వి. బ. 1. అక్షరములు; 2. సంతకము. (చూ. ఆకు మూఁడవయర్థము.)

**వ్రాలుచు.** దే. ప్రే. వ్రాలఁజేయు. (రూ. వ్రాల్చు. "క. ఏమెల్లన్, దలలువసలవ్రాల్చుమత్రుధారలుదొరుఁగన్." హరి. పూ. ౮, ఆ.)

## వ్రీ.

**వ్రీడ.** సం. వి. ఆ. స్త్రీ. సిగ్గు, లజ్జ, త్రప.

**వ్రీలు.** దే. అ. క్రి. చీలు. "అడుగునఁబండి వ్రీలియసలై." ఆము. ౧, ఆ.

**వ్రీలుపడు.** దవ్. అ. క్రి. దౌర్బల్యముఁబొందు.

**వ్రీహి.** సం. వి. ఇ. పుం. 1. వడ్లు; 2. ఎఱ్ఱవడ్లు.

## వ్రే.

**వ్రే.** దే. వి. గొల్లకులము. (వ్రేఁడు, వ్రేత.)

**వ్రేఁకటి.** దే. వి. (వ్రేఁగు+కట్టు.) వేఁకటి, గర్భము. (చూ. తెవులుగొంటు.) (సంధిని వర్ణలోపాది.)

**వ్రేఁకన.** దే. వి. భారము. "ధరిత్రికంటె వ్రేఁకనయగుదాని." భార. అర. 2, ఆ. (విశేషణమగుచో) "వ్రేఁకనిమోపు." (చూ. తెల్లగొంటు.) (చూ. అలకన.)

**వ్రేఁకము.** దే. వి. వ్రేఁగు, భారము. "ఉ. కాఁకనెదిర్చి సంగర ముఖంబున హెచ్చినరాజవంశముల్, గూఁకటివ్రేళ్లతోఁ బెటికి గోత్రవధంబును జేసినట్టియా, వ్రేఁకపుఁగీడుగాక ప్రజవేఁచఁదలం చినగోరుచుట్టుపై, రోఁకటి పోటుచందముగరోసిజనుల్ననుఁజూచి తిట్టరే." జై. ౧, ఆ.

**వ్రేఁగు.** దే. అ. క్రి. వేఁగు మొదటిరూపము. "నన్నుఁబాసి యారే మదనాస్త్రఘాతముల వ్రేఁగితో." కా. ౨, ఆ.—వి. భారము. "క. నాఁగటఁదగిలిచితగిలిచి, వ్రేఁగగురోఁకలియమర్చి వ్రేయుచుఁ దోఁతో, రేఁగెడుదర్పముబోఁకట, గాఁగూల్చెనుబగఱనెల్లఁగడుఁజోద్యముగాన్." హరి. ఉ. ౬, ఆ. "ఆ. వ్రేఁగు పెద్దైననోడవారిధిఁ దరింప, లేనిభంగి." భార. శాం. ౫, ఆ.

**ప్రేఁగుపడు.** ద్వ. అ. క్రి. భంగపడు.

**ప్రేఁచు.** దే. ప్రే. ప్రేఁగఁజేయు. (పేఁచు మొదటిరూపము.)

**ప్రేఁపు.** దే. వి. గొల్లవాఁడు, గోపకుఁడు. (చూ. పూఁట మొదటి యర్థము.)

**ప్రేఁత.** దే. వి. 1. ప్రేయుట; "క. కొండొకసేపునకుఁదెలిసి, చండగదాదండమున సహస్రాక్షోగ్రో, ద్దండత బలుప్రేయఁగనా, ఖండాగదవిఘుగఁజేసెఁదనగద ప్రేఁతన్." హరి. ఉ. ౧, ఆ.— 2. దెబ్బ. "క. అనూర్వభానుఁడీక్రియ, ప్రేసినయప్పరిఘ దను జవిభుఁడధికబలో, ల్లాసమునఁబుచ్చుకొనిపొడి, చేసె నసురులార్వ నతనిశిరమొక ప్రేఁతన్." నిర్వ. ౮, ఆ.

**ప్రేఁపు.** దే. వి. ప్రేఁపుసు. (పేఁపునకు మొదటిరూపము.)

**ప్రేఁపుడు.** దే. వి. పేఁపుడుయొక్క రూపాంతరము. (చూ. ప్రేఁగు.)

**ప్రేటు.** దే. వి. 1. ప్రేయుట; "సీ. ప్రేటునకనువైనరీతిమైఁదవు నా గెనన్న వెంబడిగ నశ్వములు మెలఁగ." కళా. ౮, ఆ.— 2. దెబ్బ. "అతని ప్రేయుటయు ప్రేటువడినొచ్చి." హరి. ఉ. 3, ఆ.

**ప్రేటుగొను.** దే. స. క్రి. (ప్రేటు+కొను.) కొట్టు. "వ. అప్పుహాబలనందనుండుగండశలంబు నందొరుఁగు నెత్తురు మదంబుగా మత్తగజంబునకరించుచుఁడుండంబుచండంబునఁజెలునొం దుగదయల్లార్చి పేర్చి ప్రేటుగొనిన." సం. 'అతౌడయచ్ఛత్రుమమిత్రకర్షనః.' భార. శల్య. ౨, ఆ.

**ప్రేత.** దే. వి. గొల్లది, గోపిక. "ఉ. ప్రేతలగూడియుట్లువసనిఘలఁ బూఁబొదరింద్లకుతూజేయుఁన్." వి, పు. 2, ఆ.

**ప్రేపల్లె.** ద్వ. వి. గొల్లపల్లె, ఘోషము. "శా. గోపాలాంగనలెంత జాలిపడిరో కోపించిరోదూఱిరో, ప్రేపల్లెన్నిజధర్మగేహములలో విభ్రాంతచైతన్యలై." భాగ. ౧౦, స్క. పూ. (మొదటి రూపము ప్రేపల్లియ.)

**ప్రేయు.** దే. స. క్రి. 1. కొట్టు; "సీ. తలదండమున ప్రేయఁదగ దనియెఱిఁగియు నన్యాయమునఁ గురుఁడడిచెనేని." విజ్ఞా. వ్య, కాం.—2. నఱకు. "క. డాసినమృగములనెగిచిభు, జాసిన్ ప్రేసియు." భార. ఆది. ౮, ఆ.

**ప్రేలఁబడు.** ద్వ. అ. క్రి. ప్రేలాడు. "సీ. కొర్తవేసిన గుచ్చి కొని ప్రేలఁబడువారు నుప్పురొంపులఁ గ్రుక్కినురియువారు." కవిక. ౫, ఆ. (స్వార్థమున పడు.)

**ప్రేలాడు.** దే. అ. క్రి. (ప్రేలి+ఆడు.) ప్రేలు. (మొదటి రూపము ప్రేలియాడు. "అన్నగంబుశాఖావలి ప్రేలియాడుడు మహాఫలముల్గని." నై. ౫, ఆ.) (చూ. ఊఁగాడు.)

**ప్రేలు.** దే. అ. క్రి. 1. ప్రేలాడు; (చూ. క్రిందల.) 2. మునుఁగు. "వ. సప్తగోదావరంబుననాడుదము, వృద్ధగంగా జలంబుల ప్రేలుదము, తుల్యభాగతోయంబులమునుఁగుదము." భీ. ౬, ఆ.—వి. 1. అంగుళి; "ఎ, గీ. ప్రేళ్లమహనీయరత్నముద్రి కలుదాల్చి." కవి. 3, ఆ.— 2. అంగుళము. "క. ఇనుమునసేఁబది వెల్లములు, నెనిమిది ప్రేళ్లాయతముగనేర్పడగుండై, నును పైయుం డఁగఁజేసిన, మసమునదిమధ్యమనకుఁ బ్రమాణంబయ్యెన్." విజ్ఞా. వ్య, కాం.

**ప్రేలుకాడు.** దే. అ. క్రి. (ప్రేలుక+ఆడు.) ప్రేలాడు. (ఇది వాడుకలోనిది.)

**ప్రేలుచు.** దే. ప్రే. 1. ప్రేలఁజేయు; (రూ. ప్రేల్చు. ప్రేల వేయుటకు.—"వ. అతండు ప్రేల్చినకాళ్లుదిగిచికొన." భార. ఉద్యో. ౨, ఆ.) 2. కదుచు.

**ప్రేలుడు.** దే. విశే. ప్రేలాడినది, లంబితము.

**ప్రేలుమిడి.** దే. వి. చిటిక, త్రుటి. (చూ. ప్రేల్మిడి.)

**ప్రేల్మిడి.** దే. వి. ప్రేలుమిడియొక్క రూపాంతరము. "సీ. లోక దుర్జయుఁడగునీకీచకునిని ప్రేల్మిడి రూపుమాపి నకడిమి పొంపు." భార. విరా. 3, ఆ.

## ప్రై.

**ప్రైహేయము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రీహిపంటపెట్టఁదగినది. (భూమి.)

## శ.

**శ.** ఒకయక్షరము.

**శంక.** సం. వి. ఆ. స్త్రీ. 1. సందేహము; 2 భయము; 3. వితర్కము.

**శంకరాభరణము.** సం. వి. అ. న. రాగవిశేషము.

**శంకరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు. విశే. సుఖమును గలుగఁజేయువాఁడు.

**శంకించు.** సం. అ. క్రి. 1. సందేహించు; 2. భయపడు. (రూ. శంకిల్లు.)

**శంకితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సందేహముఁబొందిన వాఁడు; 2. భయపడినవాఁడు.

**శంకుల.** సం. వి. ఆ. స్త్రీ. 1. పోఁకత్తి; 2. ఉలి.

**శంకువు.** సం. వి. ఉ. పుం. 1. మోడు; 2. మేకు; 3. నీరుపంది; 4. సంఖ్యావిశేషము.

**శంఖచరి.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) చేరుచుక్క.

**శంఖనఖము.** సం. వి. అ. పుం. క్షుద్రశంఖము, నత్తగుల్ల.

**శంఖపాణి.** సం. వి. ఇ. పుం. విష్ణువు, వలమురితాలుపు.

**శంఖము.** సం. వి. అ. పుం, న. సంకు. పుం. 1. నొసటి యెముక; 2. గజదంతమధ్యభాగము; 3. నిధివిశేషము; (చూ. నిధి.) 4. సర్పవిశేషము; 5. నఖమనెడి గంధద్రవ్యము.

**శంఖిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. కల్లతీగ; 2. పద్మపుతీఁగ; 3. స్త్రీజాతివిశేషము. (చూ. జాతి.)

**శంప.** సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱపు; (రూ. సంప.) 2. శంఖ ధ్వని.

**శంపాకము..** సం. వి. అ. పుం. తేల, ఆరగ్వధము.

**శంబము.** సం. వి. అ. పుం. 1. వజ్రాయుధము; (రూ. సంబము.) 2. రేఁకలిమొదలగువానిపొన్ను. విశే. సుఖముకలది.

**శంబరము.** సం. వి. అ. న. జలము. పుం. 1. చేప; 2. ఎఱ్ఱని చిన్నజింక..డు. ఒకరాక్షసుఁడు.

**శంబరారి.** సం. వి. ఇ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**శంబరి.** సం. వి. ఈ. స్త్రీ. ఎలుకచెవి, (రూ. సంబరి.)

**శంబలము.** సం. వి. అ. పుం, న. 1. దారిబత్తెము; (రూ. సంబళము.) 2. మాత్సర్యము; 3. తీరము.

శంబాకృతము. సం. విశే. (అ. ఆ. అ.) రెండుచాళ్లుదున్ని నది. (నేల.) నిడివియొకచాలును అడ్డమొకచాలును దున్నినది. (అనికొందఱు.) (చూ. సంబాకృతము.)

శంబూకము. సం. వి. అ. పుం. ఆ. స్త్రీ. కప్పచిప్ప. (చూ. శంబుకము.) అ. పుం. 1. నూక; 2. ఏనుఁగుకుంభస్థలముకడ చోటు. డు. 1. రామునిచేతఁజచ్చిన శూద్రతపస్వి; 2. ఒక రాక్షసుఁడు.

శంభళి. సం. వి. ఈ. స్త్రీ. కుంటెనకత్తె, కుట్టని.

శంభువు. సం. వి. ఉ. పుం. 1. శివుఁడు; 2. విష్ణువు; 3. బ్రహ్మ; 4. బుద్ధదేవుఁడు.

శంస. సం. వి. ఆ. స్త్రీ. 1. మాట; 2. స్తోత్రము; 3. ఇచ్ఛ.

శంసనము. సం. వి. అ. న. 1. చెప్పుట; 2. స్తుతించుట; 3. ఇచ్ఛించుట.

శకటము. సం. వి. అ. పుం, న. బండి. పుం. 1. రెండువేల పలములపరిమాణము; 2. తినాసనుచెట్టు.

శకము. సం. వి. అ. పుం. 1. ఒకనిపరిపాలనతోచేరిన సంవత్సరము; 2. ఒకదేశము; 3. ఒకజాతి. డు. ఒకరాజు.

శకలము. సం. వి. అ. న. 1. చెట్టుమీఁదిపట్ట; 2. నార; 3. రాగద్రవ్యము. పుం, న. ఖండము.

శకుంతము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. భాసపక్షి; 3. ఒకదినుసుపురుగు.

శకుంతి. సం. వి. ఇ. పుం. పక్షి, పులుఁగు, శకుంతము.

శకుటము. సం. వి. అ. పుం. అడవిచేమచెట్టు.

శకునము. సం. వి. అ. న. శుభసూచకనిమిత్తము, వలను. పుం. 1. పక్షి; 2. పక్షివిశేషము.

శకుని. సం. వి. ఈ. స్త్రీ. నల్లపిచ్చుక. ఇ. పుం. 1. పక్షి; 2. ఒక కరణము; (చూ. కరణము.) 3. దుర్యోధనునిమేనమామ.

శకులము. సం. వి. అ. పుం. మత్స్యవిశేషము, జేడిస.

శకులాక్షకము. సం. వి. అ. పుం. తెల్లగఱికచెట్టు.

శకులాదని. సం. వి. ఈ. స్త్రీ. 1. కటుకరోహిణిచెట్టు; 2. గజపిప్పలిచెట్టు.

శకులార్భకము. సం. వి. అ. పుం. కుచ్చుమీను.

శకులి. సం. వి. న్. పుం. మత్స్యము, చేప. (చూ. శకిలి.)

శకృత్కరి. సం. వి. ఇ. పుం. లేఁడాదిలోని దూడ, వత్సము.

శకృత్తు. సం. వి. త్. న. విష్ఠ, మలము, పురీషము.

శక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. బలిమి; 2. పార్వతి; 3. చిల్లకోల; 4. ఇచ్ఛాదు; (ఇవి మూడు.—ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి. ఇచ్ఛాశక్తికి ద్రవ్యశక్తియనియుపేరు.) 5. ఉత్సాహాదు; (ఇవి మూడు.—ఉత్సాహము, ప్రభుత్వము, మంత్రము.) 6. సత్వాదు. (ఇవి మూడు.—సత్వము, రజస్సు, తమస్సు.) పుం. వసిష్ఠుని కొడుకు.

శక్తిధరుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి.

శక్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) శక్తిగలవాఁడు.

శక్యము. సం. విశే. (అ. ఆ. అ.) అలవి, సాధ్యము.

శక్రధనువు. సం. వి. స్. న. (చూ.) ఇంద్రాయుధము.

శక్రపాదపము. సం. వి. అ. పుం. దేవదారుచెట్టు.

శక్రపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. పెన్నవెదురుకూర.

శక్రవల్లిక. సం. వి. ఆ. స్త్రీ. బుడ్డకాఁకరచెట్టు.

శక్రుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

శక్వరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 2. ఏఱు; 3. ఒడ్డాణము.

శచి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రునిభార్య; 2. పిల్లపీఁచరచెట్టు.

శచీపతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

శఠుఁడు. సం. వి. అ. పుం. 1. చతుర్విధశృంగారనాయకులలో నొకఁడు; (చూ. నాయకుఁడు.) 2. మధ్యస్థపురుషుఁడు. విశే. కుత్సితుఁడు.

శణపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. శోమిదముచెట్టు.

శణపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. పచ్చజనుముచెట్టు.

శణపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. కారుజనుముచెట్టు. (ఇదే గిలకచెట్టు.)

శణము. సం. వి. అ. న. 1. జనుము; 2. బాణము.

శణసూత్రము. సం. వి. అ. న. జనపనారతో నల్లినవలత్రాడు.

శతకము. సం. వి. అ. న. నూఱుపద్యములుగల గ్రంథము. విశే. నూఱుసంఖ్యగలది.

శతకోటి. సం. వి. ఇ. పుం. వజ్రాయుధము.

శతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. 1. నాలుగుమూరలనిడివిగల యినుప ముండ్లకఱ్ఱ; 2. కానుగుచెట్టు.

శతద్రువు. సం. వి. ఉ. స్త్రీ. నూఱుపాయలై పాఱెడి యొక నొకనది. (రూపాంతరము. శితద్రువు)

శతధృతి. సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. ఇంద్రుఁడు.

శతపత్రము. సం. వి. అ. న. తామర. పుం. 1. నెమలి; 2. బెగ్గురు; 3. వడ్రంగిపిట్ట; 4. రాచిలుక.

శతపది. సం. వి. ఈ. స్త్రీ. 1. కట్లజెఱ్ఱి; 2. చెవిజొరుపాము; 3. రోఁకటిబండ.

శతపర్వ. సం. వి. ఆ. స్త్రీ. శుక్రునిభార్య. న్. పుం. ను. 1. వెదురుచెట్టు; 2. ఒకదినుసుచెఱకుచెట్టు.

శతపర్విక. సం. వి. ఆ. స్త్రీ. 1. గఱికచెట్టు; 2. వసచెట్టు.

శతపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. సదాపచెట్టు.

శతప్రాసము. సం. వి. అ. పుం. గన్నేరుచెట్టు.

శతభిషము. సం. వి. జ్. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

శతమన్యువు. సం. వి. ఉ. పుం. ఇంద్రుఁడు.

శతమానము. సం. వి. అ. న. 1. పలము; 2. కర్షద్వయము; 3. నూటికొలది.

శతము. సం. వి. అ. న. నూఱు, వంద.

శతమూలి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీఁచరచెట్టు.

శతవీర్య. సం. వి. ఆ. స్త్రీ. తెల్లగఱికచెట్టు.

శతవేధి. సం. వి. న్. పుం. పుల్లప్రబ్బచెట్టు.

శతహ్రద. సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱపు; 2. వజ్రాయుధము.

శతాంగము. సం. వి. అ. పుం. యుద్ధమునకుపయోగించెడు రథము.

శతానందము. సం. వి. అ. పుం. విష్ణురథము.

**శతానందుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు.

**శతారము.** సం. వి. అ. న. వజ్రాయుధము.

**శతావరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పిల్లపీచరకీ; 2. శచీదేవి.

**శతాహ్వయ.** సం. వి. ఆ. స్త్రీ. సన్నదాపకీ.

**శత్రువు.** సం. వి. ఉ. పుం. 1. పగవాఁడు; 2. దండెత్తిపోవు వాని దేశమునకు అవలిదేశపురాజు. (శత్రున్యాదిరాజమండలము.— శత్రుమిత్రులు, శత్రుమిత్రులు, తన్మిత్రమిత్రులు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందనుఁడు, ఆసారులిరువురు, మధ్యముఁడు, ఉదాసీనుఁడు. వీరు పన్నిద్దఱు.)

**శని.** సం. వి. ఇ. పుం. శనైశ్చరుఁడు.

**శనివారము.** సం. వి. అ. పుం. ఒకవారము. (ఇట్లు మందవారము.) (చూ. వారము.)

**శనైశ్చరుఁడు.** సం. వి. అ. పుం. ఒకగ్రహము, శని.

**శపథము.** సం. వి. అ. పుం. ఒట్టు, శపనము.

**శపనము.** సం. వి. అ. న.—— పై.——

**శపించు.** సం. స. క్రి. తిట్టు, శాపించు.

**శఫము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱములోనగువానిగొరిసె; 2. చెట్టువేరు.

**శఫరి.** సం. వి. ఈ. స్త్రీ. ఎగిసిపడెడు మత్స్యము. (రూ. శఫరము. అ. పుం.)

**శబరాలయము.** సం. వి. అ. పుం. బోయపల్లె, పక్కణము.

**శబరి.** సం. వి. ఈ. స్త్రీ. శబరస్త్రీ.

**శబరుఁడు.** సం. వి. అ. పుం. 1. ఆకులుకట్టుకొని యడవియందు తిరిగెడు బోయవాఁడు; 2. శివుఁడు.

**శబలము.** సం. వి. అ. పుం. చిత్రవర్ణము. విశే. చిత్రవర్ణము గలది.

**శబలి.** సం. వి. ఈ. స్త్రీ. మైలవన్నెయావు.

**శబ్దగ్రహము.** సం. వి. అ. పుం. చెవి, శ్రోత్రము.

**శబ్దము.** సం. వి. అ. పుం. 1. ధ్వని; 2. వ్యాకరణశిక్షితమైన మాట.

**శబ్దనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) శబ్దించువాఁడు.

**శబ్దశాస్త్రము.** సం. వి. అ. న. వ్యాకరణము.

**శబ్దించు.** సం. అ. క్రి. శబ్దముచేయు, మ్రోయు.

**శబ్దితము.** సం. విశే. (అ. ఆ. అ.) శబ్దముచేయఁబడినది.

**శమంతకము.** సం. వి. అ. పుం. విష్ణుహస్తమునందలి మణి.

**శమథము.** సం. వి. అ. పుం. శాంతి. డు. మంత్రి.

**శమనము.** సం. వి. అ. న. 1. శాంతి; 2. వధము.

**శమనస్వస.** సం. వి. ఋ. స్త్రీ. యమునానది.

**శమనుఁడు.** సం. వి. అ. పుం. కాలుఁడు, యముఁడు.

**శమము.** సం. వి. అ. పుం. కామక్రోధాదులులేక యడఁగియుండుట, శాంతి.

**శమలము.** సం. వి. అ. న. విష్ఠ, పురీషము.

**శమి.** సం. వి. ఈ. స్త్రీ. 1. జమ్మికీ; 2. పెసలులోనగువానిపైపొట్టు. విశే. (న్. ఈ. న్.) శమముగలవాఁడు.

**శమించు.** సం. అ. క్రి. అడఁగు.

**శమితము.** సం. విశే. (అ. ఆ. అ.) శమించినది.

**శమీధాన్యము.** సం. వి. అ. న. మినుములుమొదలైన కాయధాన్యము.

**శమీరము.** సం. వి. అ. పుం. నేలజమ్మికీ.

**శమ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. తమిరెచీల; 2. యజ్ఞపాత్రవిశేషము.

**శమ్యాకము.** సం. వి. అ. పుం. రేల, ఆరగ్వధముకీ.

**శయనము.** సం. వి. అ. న. 1. శయ్య; 2. నిద్ర; 3. మరతము.

**శయనించు.** సం. అ. క్రి. పరుండు, పండుకొను.

**శయనీయము.** సం. వి. అ. న. శయ్య. విశే. శయనింపఁదగినది.

**శయము.** సం. వి. అ. పుం. 1. చేయి; 2. శయ్య; 3. పాము.

**శయాళువు.** సం. వి. ఉ. పుం. 1. కుక్క; 2. నక్క; 3. పెనఁబాము. విశే. నిదురపోతు.

**శయించు.** సం. అ. క్రి. శయనించు. "మనోజ్ఞమరాళతూలతల్పములశయించెవి." భా. [illegible], ఆ.

**శయితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిదురపోతు.

**శయువు.** సం. వి. ఉ. పుం. పెనఁబాము, వాహసము.

**శయ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. పడక; 2. పదగుంఫనము; 3. విధము. "[illegible] శయ్యనలంగెదేల." హస. ౪, ఆ.

**శరండము.** సం. వి. అ. పుం 1. (చూ.) సరడు; 2. తొండ. ను. జోరీ.

**శరజన్ముఁడు.** సం. వి. న్. పుం. కుమారస్వామి, తెల్లుచూలి.

**శరణము.** సం. వి. అ. న. 1. రక్షకము; 2. రక్షణము; 3. గృహము; 4. వధము.

**శరణీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) శరణుచొరఁదగినవాఁడు, శరణ్యుఁడు.

**శరణు.** సం. వి. 1. రక్షకము; "నీవెశరణుమాకు నన్యథాశరణంబులేదు." భీ. ౪, ఆ. — 2. శరణాగతి; "శరణన్నఁగాచుమభీరుల." భార. [illegible] — 3. నమస్కారము. "తే. విధిగృహస్థుయతిశివధిశరణు, [illegible] పుణ్యరాశికినిబ్రణతి." ఆము. ౯, ఆ. (వెనకటి రెం. డర్థములకు సంస్కృతమునందులేవు.) ([illegible])

**శరణుచొచ్చు.** ను. స. క్రి. శరణాగతినిబొందు. "వ. శకయవనకాంభోజ పారదపహ్లవాదిదేశంబులరాజులు ప్రాణభయార్తులై తత్కులగురుండైన వసిష్ఠుశరణుచొచ్చిన." "వ. ప్రాణభయార్తులై శరణుచొచ్చినవారిని రక్షించుటకంటెఁ బరమధర్మంబులేదు." వి, పు. ౫, ఆ.

**శరణ్యుఁడు.** సం. వి. అ. పుం. వాయువు. విశే. శరణుచొరఁదగినవాఁడు.

**శరత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. ఒక ఋతువు; (చూ. ఋతువు.) 2. సంవత్సరము. (రూ. శరద. ఆ. స్త్రీ.)

**శరధి.** సం. వి. ఇ. పుం. 1. సముద్రము; 2. అమ్ములపొది.

**శరనిధి.** సం. వి. ఇ. పుం.—— పై.——

**శరభము.** సం. వి. అ. పుం. 1. మీఁగండ్లమెకము; 2. ఒంటెపిల్ల. డు. ఒక వానరుఁడు.

**సంతానము.** సం. వి. అ. పుం. 1. బిడ్డ; 2. పుత్రపౌత్ర పారంపర్యము; 3. కులము; 4. ఒక కల్పవృక్షము. (చూ. కల్పవృక్షము.) (సప్తసంతానములు.—తటాకము, నిధి, అగ్రహారము, దేవాలయము, వనము, ప్రబంధము, పుత్రుఁడు.)

**సంతాపనము.** సం. వి. అ. పుం. మన్మథబాణవిశేషము. (చూ. బాణము.)

**సంతాపము.** సం. వి. అ. పుం. కాఁక, వేడిమి.

**సంతాపించు.** సం. అ. క్రి. మిక్కిలి తపించు.

**సంతాపితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తాపమునొందినది.

**సంతు.** వై. వి. 1. సంతానము; 2. కులము.

**సంతోసము.** వై. వి. సంతోసముయొక్కరూపాంతరము.

**సంతోషము.** సం. వి. అ. పుం. సంతసము, హర్షము.

**సంతోషించు.** సం. అ. క్రి. సంతోషపడు, సంతసించు.

**సంతోసము.** వై. వి. సంతోషము. "క. ఆసమయంబునఁ బువ్వులు, గోసిన్రపౌత్త్రజుఁడు దండ గొలుపొత్తులుగా, వేసరక కట్టికదుసం, తోసమునివ్వటిలఁబొదివితొలఁగఁగఁబెట్టెన్." భో. ౫, ఆ.

**సంతోసిల్లు.** వై. అ. క్రి. సంతసిల్లు, సంతోషించు. "క. నీసైనికులెంతయుసం, తోసిల్లుచువార్చిరవుసుదుఃఖితులైసం, తీసుతులవారుదీనద, శాసంగతులైరిబాష్పజలములుదొరుఁగన్." భార. ద్రో. ౨, ఆ.

**సందంశము.** సం. వి. అ. పుం. 1. పటుకారు; 2. అభినయహస్తవిశేషము.

**సందడి.** దే. వి. 1. రాసికొనుజనసమూహము; "తే. ముందటఁ గదియుసందడిఁగడచంగి, కర్ణదుర్యోధనులుతొలఁగంగజడియ." భార. ఉద్యో. 3, ఆ. "తే. తిలలుపైనెత్తిచల్లినదిగువఁబడని, యంతసందడిపెంద్రోవలందుఁగలిగె." వై. ౪, ఆ.—2. జనసమూహధ్వని; (చూ. సందడించు.) 3. అతిశయము. "చిట్టుములసందడిమించె." పంచ. వేం. ౫, ఆ.—విణ. సంకులము. "సందడికయ్యము." భార. భీష్మ. 3, ఆ.

**సందడించు.** దే. అ. క్రి. 1. సందడిచేయు; "ఎ, గీ. సందడించుచుఁబుష్పపచయముసలిపి." కళా. ౧, ఆ.—2. అతిశయించు. "ఊర్పులందందసందడింప." భార. సౌ. ౧, ఆ. (రూ. సందడిల్లు.)

**సందడికాఁడు.** దే. ఒణ. సామాన్యుఁడు. ఆం. భా. తృ.

**సందడిగొను.** దే. అ. క్రి. (సందడి+కొను.) సందడించు. (ప్రే. సందడిగొలుపు. చూ. గీఁటురెండవయర్థము.)

**సందడిపడు.** ద్వి. అ. క్రి. సందడించు. "క. క్రిందటిపాతాళమునను క్రీడించుచువా, నందమునొందుచునుందును, సందడిపడి సొగకులము చతురతతోడన్." భాగ. ౫, స్కం. ౨, ఆ.

**సందరము.** వై. వి. సముద్రము. "క. సందరమునసురువలరెము, కుందునిఁబెండ్లికినిబిలుచుకొంకకెగెడుభూ, బృందారకుఁ గన్గొనియా, నందంబున నిప్పయోధినపెన్నినంగన్." రుక్మి. ౪, ఆ.

**సందర్భము.** సం. వి. అ. పుం. 1. ప్రబంధముయొక్కకూర్పు; 2. పుష్పములలోనగువానిగ్రుచ్చుట; 3. ప్రబంధము; "క. ఈ సందర్భముధీరలు, చేసినయది." నిర్వ. ౧౦, ఆ.—4. సమ [illegible]ము.

**సందర్భించు.** సం. అ. క్రి. సమయమగు.

**సందానము.** సం. వి. అ. న. పసులనుగట్టెడుదామెన.

**సందానితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; 2. కూర్పఁబడినది.

**సందావము.** సం. వి. అ. పుం. యుద్ధమువలనఁబాఱిపోవుట, పలాయనము.

**సంది.** వై. వి. సందు. "ద్వి. చెవిసందిఁజెరివినచిన్నారినల్ల, తొవతేకుతావిక్కై." విష్ణు. పూ. 3, ఆ.

**సందికడియము.** ద్వి. వి. (సందిలి+కడియము.) సందిటవేసికొను కడియము. "సీ. కావడియుట్లుచిక్కముసందికడియంబు గూకలతోఁప పొగాకుతిత్తి." హంస. ౨, ఆ.

**సందిగ్ధము.** సం. వి. అ. పుం. శబ్దదోషములలోనొకటి. (చూ. దోషము.) విణ. సందేహాస్పదమైనది.

**సందితము.** సం. విణ. (అ. ఆ. అ.) (గ్రా.) సందానితము.

**సందిదండ.** ద్వి. వి. (సందిలి+దండ.) సందిటఁగట్టుకొనెడు భూషణము, కేయూరము. "సందిదండలధళధళల్." స్వా. ౫, ఆ. (చూ. గౌడసరము.)

**సందియపడు.** వై. అ. క్రి. (సందియము+పడు.) సందేహపడు, సందేహించు. "సందియపడకీవరుగుము." భార. ఉద్యో. ౧, ఆ.

**సందియము.** వై. వి. సందేహము. "సందియమేల." భార. అర. ౨, ఆ.

**సందిలి.** దే. ని. దండచేయి, ప్రగండము.

**సందు.** వై. వి. 1. ఇఱుకువీథి; 2. సారంగము; 3. అఁడుగుజి; 4. ఎడము*; 5. సందుకట్టు*; "క. ముందుమహాటవియిదియా, సందున నమరావతీవిశంకటమహామగ్నా, గ్రందుకొనినది." జై. ౭, ఆ. "ఒండువిల్లుగైకొనియొడుసందునన్ నినిచెఁగ్రూరశరంబులురంబునందు." భార. విరా. ౫, ఆ.—6. సదర్భము*; "తే. అచటనపుడట్లునినుఁగూడియలరినవియు, నట్లునీవేగుచోవచ్చినదియుఁదాన, యగుచుఁదోఁపసందదికియెట్లాడనేర్చె, మగువగాదురయిదిపెనుడగరగాని." కళా. 3, ఆ.

**సందుకట్టు.** ద్వి. వి. మధ్యకాలము. "ఉ. రాజాదయాద్రిశిఖరముఁదిరంబుగనెక్కెడు సందుకట్టునన్." లక్ష్మీ. 3, ఆ.

**సందుకా.** హిం. వి. చిన్నపెట్టె.

**సందుకొను.** ద్వి. అ. క్రి. 1. వ్యాపించు; "ఎ, గీ. శంఖభుంభుంనినాదముల్ సందుకొనియె." ఉ, రా. ౭, ఆ.—స. క్రి. 1. కూడు; "ఎమ్మెయిసందుకొంటివాయునఘుని' నట్లుగాడఁగఁ జిరాభిమతంబిదినీకు." కళా. ౪, ఆ.—2. పరిగ్రహించు. "ఆ. ఆయూరి, సానియొకతెవానిసందుకొనియె." (చూ. వెనుకటిభాగము.) భల్లా. 3, ఆ.

**సందుగొట్టు.** ద్వి. అ. క్రి. (సందు+కొట్టు.) (చూ.) సందుదవ్వులు.

**సందుదవ్వులు.** ద్వి. అ. క్రి. (సందు+తవ్వులు.) (బిడ్డలకు) సందుదోషముతగులు.

**సందుదోషము.** మి. వి. బిడ్డలకు మూసనంధియందుఁగలుగు బాలగ్రహదోషము.

**సందుసీసము.** ద్వి. వి. మల్లబంధవిశేషము.

**సందె.** వై. వి. సంధ్య. "సందెజపంబు." విజ. ౨, ఆ. "సందె ప్రొద్దు." పాండు. ౫, ఆ.

**సందెజాము.** వై. వి. సంధ్యాకాలము.

**సందెమల్లియ.** వై. వి. ఒకతీఁగె, రుద్రాక్షి.

**సందేశము.** సం. వి. అ. పుం. సమాచారము.

**సందేశహరుఁడు.** సం. వి. అ. పుం. సమాచారమును కొంచుఁబోవువాఁడు, దూత.

**సందేహము.** సం. వి. అ. పుం. 1. సంశయము; 2. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

**సందేహించు.** సం. అ. క్రి. సందేహపడు, సంశయించు.

**సందోహము.** సం. వి. అ. పుం. సమూహము, గుమి.

**సంద్రము.** వై. వి. సందరముయొక్కరూపాంతరము. "శా. రాలెంజొక్కలు గుబ్బలుల్ వగిలెసంద్రంబుల్ గలంగెన్ వడిన్." య. ౨, ఆ.

**సంద్రావము.** సం. వి. అ. పుం. యుద్ధమువలనఁబాఱుట, అపక్రమము.

**సంద్రుఁడు.** వై. వి. సముద్రుఁడు. "క. మనవాఁడైనంద్రుఁడుచె, ప్పినమాటలువింటిరింకఁబిఱుతివకములల్, గొనివచ్చికట్టఁగట్టుఁడు, చనవలయున్ గడలిదాఁటిసరగునమనకున్." య. ౨, ఆ.

**సంధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రతిజ్ఞ; 2. మేర; 3. సంధ్య.

**సంధాత.** సం. విం. (ఋ. ఈ. ఋ.) సంధాయకుఁడు.

**సంధానము.** సం. వి. అ. న. 1. కూర్చుట; 2. బాణమువింటినారియందుకూర్చుట; 3. కల్లుతేట. కల్లుసేయుట. (అనికొందఱు.)

**సంధానకరణి.** సం. వి. ఈ. స్త్రీ. ఓషధీవిశేషము. (దీనితో చేరినతక్కినమూడు.—విశల్యకరణి, సంజీవకరణి, సౌవర్ణకరణి.)

**సంధాయకుఁడు.** సం. విం. (అ. ఈ. అ.) సంధానముచేయువాఁడు, కూర్చువాఁడు.

**సంధి.** సం. వి. ఇ. పుం. 1 కూడిక; 2. శత్రువుతోడిపొందు; (ఇది కోశప్రధానహేతుకము, దండప్రధానహేతుకము, భూమిప్రధానహేతుకము అని త్రివిధము.) 3. ముఖాది; (ముఖము, ప్రతిముఖము, గర్భము, విమర్శము, నిష్ఠ అని యివి నాటకమునందలి పంచసంధులు.) 4. సందు; 5. సొరంగము; 6. ఆఁడుగుఱి; 7. ఒకజాడ్యము.

**సంధించు.** సం. అ. క్రి. కూడు. స. క్రి. కూర్చు.

**సంధితము.** సం. విం. (అ. ఆ. అ.) సంధింపఁబడినది.

**సంధిత్స.** సం. వి. ఆ. స్త్రీ. సంధింపనిచ్ఛ.

**సంధిత్సువు.** సం. విం. (ఉ.) సంధింపనిచ్ఛగలవాఁడు.

**సంధిని.** స. వి. ఈ. స్త్రీ. 1. వెదావు; 2. అకాలమునఁ బిడుకనిచ్చెడియావు.

**సంధిల్లు.** స. అ. క్రి. కూడు, చేరు.

**సంధుక్షణము.** సం. వి. అ. న. రాఁజఁబెట్టుట.

**సంధుక్షితము.** సం. విం. (అ. ఆ అ.) రాఁజఁబెట్టఁబడినది.

**సంధ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రొద్దుపొడుచుటకుముందైదుగడియలవఱకును ప్రొద్దుగ్రుంకినవెనుక మూడుగడియలవఱకునుగల కాలము; 2. సంధి; 3. ప్రతిజ్ఞ; 4. మేర; 5. నదీవిశేషము; 6. పుష్పవిశేషము; 7. చింత.

**సంపఁగియ.** వై. వి. సంపెఁగచెట్టు. "క. సింగారపుఁదోఁటకుఁజని, చెంగల్వలకొలనిపొంత జిన్నలకడసం, పంగియలనడిమియనఁటుల, చెంగటిలేమావిదండచేమంతులలోన్." య. ౫, ఆ.

**సంపఁగె.** వై. వి. చంపకముచెట్టు. "ఎ, గీ. పసిఁడిగిన్నియలోని సంపంగెనూనె, వనజముఖియోర్తు దలయంటెమనుజపతికి." రసి. ౧, ఆ.—2. బ. ధాన్యవిశేషము. (సంపఁగియయొక్కరూపాంతరము.)

**సంపతిల్లు.** వై. అ. క్రి. సమృద్ధమగు. "సీ. వీనులకమృతంబు సోనలైవర్తిల్లు శారికాముఖసూక్తిసంపతిల్లు." విజ. ౧, ఆ.

**సంపత్తి.** సం. వి ఇ. స్త్రీ. 1. సంపద; 2. సమృద్ధి.

**సంపత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. ఐశ్వర్యము; 2. గుణోత్కర్షము; 3 హారభేదము. (చూ. సంపద.)

**సంపన్నము.** సం. విం. (అ. ఆ. అ.) 1. సంపదతోఁగూడినది; 2. సమృద్ధమైనది; 3. సాధింపఁబడినది.

**సంపర్కము.** సం. వి. అ. పుం. 1. కలయిక; 2. చేరిక.

**సంపాకము.** సం. వి. అ. పుం. తేల, ఆరగ్వధముచెట్టు.

**సంపాటము.** ఉభ. దే. వి. చెక్కడపుపనియందు ఒమ్మచ్చును అందు చెక్కెడురత్నములును లక్కయుఁగూడఁజేర్చితూఁచెడి తూనిక. సం. అ. పుం. నూలువడికెడికదురు.

**సంపాతము.** సం. వి. అ. పుం. 1. చేక్కనిపాటు; 2. పక్షిగతివిశేషము.

**సంపాదకుఁడు.** సం. విం. (అ. ఆ. అ.) సంపాదించువాఁడు.

**సంపాదనము.** సం. వి. అ. న. సంపాదించుట, గడించుట.

**సంపాదించు.** సం. స. క్రి. సంపాదనముచేయు, గడించు.

**సంపాదితము.** సం. విం. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది, గడింపఁబడినది.

**సంపాద్యము.** సం. విం. (అ. ఆ. అ.) సంపాదింపఁదగినది, గడింపఁదగినది.

**సంపాసారి.** వై. వి. కోమటి, వైశ్యుఁడు. "ద్వి. కోటికిఁబడగెత్తి కోరువస్తువులు, పాటించి యొసఁగు సంపాసారులార." (చూ. ముందువెనుకలు.) హరిశ్చ. ౨, భా.

**సంపు.** యు. దే. ప్రే. చంపుయొక్కరూపాంతరము. "క. సొరంగా, హితమున్ సంపెఁగనహర్షమేపునఁబొదలన్." (సంపెన్, సంపెఁగన్ అని ఛేదములు.) హన. ౨, ఆ.—వై. వి. సమృద్ధి. "క. సొంపుననిమ్మెయిఁబెండిలి, సంపలరినసత్యధర్మ జనపతిచంద్రుం, డంపఁగనావంచకపురి, కింపలరఁగుమారుఁ డరిగెనింతియుఁదానున్." విక్ర. ౭, ఆ.

**సంపుటము.** సం. వి. అ. పుం. 1. బరణి; 2. ముకుళనము.

**సంపుటించు.** సం. స. క్రి. ముకుళించు. "సీ. జయజయధ్వని దేవ సంయమీశ్వరకోటి సంపుటించెఁగరాంబుజంబునొసల." భీ. ౪, ఆ.

**సంపృక్తము.** సం. విం. (అ. ఆ. అ.) సంయుక్తము.

**సంపెఁగ.** వై. వి. 1. సంపఁగెయొక్కరూపాంతరము; "తే. పెలుచఁదమదాయయైన సంపెంగవిరిని, గెలిచెననిముక్కునిరుగడఁగొలిచియుండి, త్రుళ్లియాడెడుతుమ్మెదపిల్లలనఁగ, బొలుచునెలఁతుక చూపులుచెలువమమరు." య. ౪, ఆ. "ద్వి. పొడగనిపొచ్చి

మేల్ పొన్నలతావి, గడియించికొని సంపెంగలపైకినెగసి." విష్ణు. పూ. ౨, ఆ.—2. బ. ధాన్యవిశేషము.

**సంపెట.** వై. వి. 1. కశ; "గొనకొనిమొత్తెసంపెటలఁగొంకక నిర్ద యవృత్తిఁజేసి." (చూ. వెనుకటిభాగము.) హరిశ్చ. ౨, ఆ.—2. ఇరుము సాగఁగొట్టెడిసమ్మెట*. (చూ. దాకలి.)

**సంప్రతి.** దే. వి. లెక్క-సరిచూచు పెద్దకరణమువాఁడు.

**సంప్రతించు.** దే. స. క్రి. లెక్క-మొదలైనవాని సరిచూచు.

**సంప్రదానము.** సం. వి. అ. న. 1. షట్కారకములలో నొకటి; 2. చక్క-నియీవి.

**సంప్రదాయము.** సం. వి. అ. పుం. గురుపారంపర్యము.

**సంప్రధారణ.** సం. వి. ఆ. స్త్రీ. (దేనిచేని యిది యుక్తమని) నమ ర్థించుట. అ. న. ము. వ్యవహారమునందు నిశ్చయమునుబుట్టించు నట్టిలిఖితసాక్ష్యాదులు.

**సంప్రయోగము.** సం. వి. అ. పుం. 1. చక్కని ప్రయోగము; 2. మూలికతోఁజేసెడి యుచ్చాటనాదిక్రియ.

**సంప్రసారణము.** సం. వి. అ. న. ఇ, ఉ, ఋ, ఌవర్ణములు య, వ, ర, ల వర్ణములకుమాఱుగావచ్చుట.

**సంప్రహారము.** సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. గమనము.

**సంప్రేషణము.** సం. వి. అ. న. ద్వాదశాహశ్రాద్ధము. (చూ. మాసికము.)

**సంప్రేషము.** సం. వి. అ. పుం. నియోగము, పనుపు.

**సంప్రోక్షణము.** సం. వి. అ. న. 1. చిలుకరించుట; 2. పరి శుద్ధిచేయుట.

**సంప్రోక్షించు.** సం. స. క్రి. సంప్రోక్షణముచేయు.

**సంఫుల్లము.** సం. విశే. (అ. ఆ. అ.) చక్కగా వికసించినది.

**సంబంధము.** సం. వి. అ. పుం. 1. చుట్టఱికము; 2. కూడిక. (నవవిధసంబంధములు.—పితృపుత్ర సంబంధము, రక్ష్యరక్షక సం బంధము, శేషిశేష సంబంధము, భర్తృభార్యా సంబంధము, జ్ఞాతృ జ్ఞేయ సంబంధము, స్వస్వామి సంబంధము, శరీరశరీర సంబంధము, ఆధారాధేయ సంబంధము, భోక్తృభోగ్య సంబంధము.)

**సంబంధి.** సం. వి. న్. పుం. సంబంధముచేసినవాఁడు, చుట్టము. విశే. సంబంధముగలవాఁడు.

**సంబంధించు.** సం. అ. క్రి. సంబంధపడు.

**సంబడము.** వై. వి. 1. దారిబత్తెము; "తే. పోయివచ్చెదనీపదాం బురుహచింత, నాకుఁదగు సంబడంబుగానలిననాభ." జై. ౧, ఆ. — 2. బత్తెము; "తే. అడవిదుంపలెకాని సంబడములొసఁగఁ, గానుటీసంబుచేత నొక్కఁడునులేక." అచ్చ. సుం, కాం.—3. జీత ము*. (సంబళమునకు మొదటిరూపము.)

**సంబడించు.** దే. అ. క్రి. సంబళించుటకు మొదటిరూపము. (చూ. గాతము.)

**సంబరము.** ఉభ. వై. వి. 1. వేగిరపాటు; 2. సంతోషము*; "క. గోవిందసంబరమునసం, భావింపుము." భార. ఉద్యో. 3, ఆ.—3. పండుగ*. (చూ. సంభ్రమ.)—సం. అ. న. శంబరము యొక్క-రూపాంతరము.

**సంబరి.** ఉభ. దే. అవ్య. సంబళికి మొదటిరూపము. "వనియెసం బరి సంబరియనుచు." హరిశ్చ. ౪, ఆ.—సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజెవి*.

**సంబరేను.** దృ. వి. చర్మకవచ*. (వాడుకలో దీనిని సంబరేణియం దురు.)

**సంబలము.** సం. వి. అ. పుం, న. శంబలముయొక్క-రూపాం తరము.

**సంబవులు.** వై. వి. బ. 1. పావకోళ్లు; "వ. అనంతరంబకుంభవ పులినసంభవులు సంబవులు దొడిగికొనికదలి." భీ. 3, ఆ.— 2. పాదరక్షలు*. "ఉ. కాయజవైరిభక్తులకుఁ గాయము చర్మము నొల్చిసంబవుల్, సేయుఁగఁజాలు." చెన్న. ౪, ఆ.

**సంబళకాఁడు.** దృ. వి. (సంబళము+కాఁడు.) జీతకాఁడు.

**సంబళము.** వై. వి. 1. దారిబత్తెము; "తే. భూవరుండొక్క-పయ సంబు పొమ్మటన్న, మంచిదని వచ్చిలిని సమ్మతించినేను, సంబళము కంబళము కత్తిచల్ది చల్ల, డంబు కేడెంబు దట్టి తెమ్మంబుజాక్షి." హంస. ౧, ఆ.—2. బత్తెము*; "ఎ, గీ. అడుగడుగుకెంబిగురు టాకుగమపుఁగూటి, బంటుగములకు రవళిసంబళములొసఁగ." చంద్రా. 3, ఆ.—3. జీతము*.

**సంబళి.** దే. అవ్య. తొలఁగుము. "ఎ, గీ. సంబళిసంబళియను జన ములఁ, గదియకావలఁదొలఁగుచునొదుఁగుచుండె." రా. బాల, కాం.

**సంబళించు.** దే. అ. క్రి. 1. వల్లపడు; "వ. విష్ణుమాయవలన నెందునుగాల్కొ-ని నిలువసంబళింపక." హరి. ఉ. ౯, ఆ.— 2. తెప్పిఱు. (చూ. సంబడించు.)

**సంబళిక.** దే. వి. సంబెళ. "ఉ. సాదనమేలు చెంపపయిజిగ్గున వ్రేలురుమాలు మీసముల్, మీఁదన జేరుకేలు ఆగిమించఁగఁగప్పిన సాలు వైరులన్, వాదులగెల్చువాలు చెలువంబుగఁదాల్చినపూలు నొప్పఁగా, నాదొరయొద్ద సంబళిక నందుచునుండునతండుధీర తన్." హంస. ౧, ఆ.

**సంబాకృతము.** సం. విశే. (అ. ఆ. అ.) శంబాకృతముయొక్క- రూపాంతరము.

**సంబాగువు.** దే. వి. పేఱుదాఁకెడు సాధనము.

**సంబాధము.** సం. వి. అ. పుం. 1. ఇఱుకు; 2. అడుగుబి.

**సంబారము.** వై. వి. (ఉప్పుచింతపండులోనగు) వేళవారము*.

**సంబారు.** వై. వి. సంభారముయొక్క-రూపాంతరము.

**సంబావు.** దే. వి. 1. సస్యవిశేషము; 2. బ. ధాన్యవిశేషము. (చూ. దినసరి.)

**సంబాళించు.** వై. స. క్రి. 1. ఆదరించు*. "బింబములసం బాళించుఁ గమ్మెవిడాలు." పాంచా. ౨, ఆ. (దీనికి ప్రయోగాం తరము మృగ్యము.) 2. నెఱవేర్చు, కలిగించు.

**సంబాళిగలు.** వై. వి. బ. 1. పావకోళ్లు; (చూ. సమ్మాళిగలు.) 2. పాపోసులు*. "సీ. పట్టంగసీఁడుసంబాళిగల్ కలనిలోఁజేర వచ్చిన మార్తుచేతఁగాని." య ౧, ఆ.

**సంబుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. సంబోధనము.

**సంబెళ.** దే. వి. వక్కలాకులతిత్తి, అడపము. "సీ. ఒడ్డెధాత్రీ నాథుఁ డుపద పుత్తెంచిన బింబారుణోష్ఠిసంబెళవహించు." కాశీ. ౧, ఆ.

**సంబోధనము.** సం. వి. అ. న. పిలుపు, ఆహ్వానము.

**సంబ్రము.** వై. వి. సంబరముయొక్క-రూపాంతరము. (వేగిరపాటు నకు.—"మ. అనయంబుజ్జ్వలమదిసంబ్రముల్ వగపు సాకంతంతటన్ గ్రమ్మఁగన్." య. 3, ఆ.)

**సంభరువు.** సం. వి. ఉ. స్త్రీ. పావలు. (రూ. సంభరుక. అ. స్త్రీ.)

**సంభళి.** సం. వి. ఈ. స్త్రీ. శంభళియొక్క రూపాంతరము.

**సంభవము.** సం. వి. అ. పుం. 1. పుట్టుక; 2. హేతువు; 3. కూడిక; 4. ఆధేయమాధారమును మీఱకుండుట.

**సంభవించు.** సం. అ. క్రి. పుట్టు. (రూ. సంభవిల్లు.)

**సంభారము.** సం. వి. అ. పుం. 1. చక్కగా భరించుట; 2. చక్కగా ధరించుట; 3. సమూహము; 4. పదార్థసంచయము; 5. సర్వపూర్ణత్వము.

**సంభావన.** సం. వి. ఆ. స్త్రీ. 1. సమ్మానము; 2. తలఁపు; 3. ప్రసిద్ధి.

**సంభావనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) సంభావింపఁదగినది.

**సంభావించు.** సం. అ. క్రి. చక్కగా తలఁచు. స. క్రి. సమ్మానించు.

**సంభావితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కగా తలఁపఁబడినది; 2. సమ్మానింపఁబడినది.

**సంభావ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) సంభవింపఁదగినది.

**సంభాషణము.** సం. వి. అ. న. చక్కగా మాటాడుట.

**సంభాషించు.** సం. అ. క్రి. చక్కగా మాటాడు.

**సంభూతము.** సం. విణ. (అ. ఆ. అ.) పుట్టినది.

**సంభృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కగా భరింపఁబడినది; 2. చక్కగా ధరింపఁబడినది.

**సంభృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చక్కగా భరించుట, 2. చక్కగా ధరించుట.

**సంభేదము.** సం. వి. అ. పుం. 1. నదీసంగమము; 2. వికసించుట; 3. కూడిక.

**సంభోగము.** సం. వి. అ. పుం. 1. మంచిసుఖము; 2. సురతము.

**సంభోగించు.** సం. అ. క్రి. కలయు, రమించు.

**సంభ్రమము.** సం. వి. అ. పుం. 1. వేగిరపాటు; 2. భయము; 3. ఆదరము.

**సంభ్రమించు.** సం. అ. క్రి. వేగిరపడు, తొందరపడు.

**సంమృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) వస్త్రాదులచేత శోధింపఁబడినది.

**సంయతము.** సం. విణ. (అ. ఆ. అ.) కట్టఁబడినది.

**సంయత్తు.** సం. వి. త్. పుం, స్త్రీ. యుద్ధము, పోరు.

**సంయమనము.** సం. వి. అ. న. 1. బంధనము; 2. వ్రతము.

**సంయమని.** సం. వి. ఈ. స్త్రీ. యమునిపట్టణము.

**సంయమము.** సం. వి. అ. పుం. 1. హింసాదులవలన విరమించుట; 2. వ్రతాదులకంగమై తొలిదినముచేయఁదగిన యాచారము.

**సంయమి.** సం. వి. న్. పుం. ముని. విణ. సంయమముగలవాఁడు.

**సంయామము.** సం. వి. అ. పుం. సంయమమునయొక్క రూపాంతరము.

**సంయావము.** సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము, సారెసత్తులు.

**సంయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

**సంయుగము.** సం. వి. అ. పుం. యుద్ధము, పోరు.

**సంయోగము.** సం. వి. అ. పుం. కూడిక.

**సంయోజితము.** సం. విణ. (అ. ఆ. అ.) మఱియొకదానితోఁ కూర్పఁబడినది.

**సంరంభము.** సం. వి. అ. పుం. వేగిరపాటు, ఆటోపము.

**సంరంభి.** సం. విణ. (న్. ఈ. న్.) సంరంభముగలవాఁడు.

**సంరంభించు.** సం. అ. క్రి. వేగిరపడు, ఆటోపించు.

**సంరబ్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) సంరంభమునొందినది.

**సంరావము.** సం. వి. అ. పుం. మ్రోఁత, ధ్వని.

**సంరూఢము.** సం. విణ. (అ. ఆ. అ.) పెరిఁగినది.

**సంలాపము.** సం. వి. అ. పుం. ప్రీతితోడి పరస్పరసంభాషణము.

**సంవత్సరము.** సం. వి. అ. పుం. ఏఁడాది. (ఇవి యఱువది.— ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి, అంగీరస, శ్రీముఖ, భావ, యువ, ధాతు, ఈశ్వర, బహుధాన్య, ప్రమాది, విక్రమ, విషు, చిత్రభాను, స్వభాను, తారణ, పార్థివ, వ్యయ, సర్వజిత్తు, సర్వధారి, విరోధి, వికృతి, ఖర, నందన, విజయ, జయ, మన్మథ, దుర్ముఖ, హేవిళంబి, విళంబి, వికారి, శార్వరి, ప్లవ, శుభకృత్తు, శోభకృత్తు, క్రోధి, విశ్వావసు, పరాభవ, ప్లవంగ, కీలక, సౌమ్య, సాధారణ, విరోధికృత్తు, పరీధావి, ప్రమాదీచ, ఆనంద, రాక్షస, నళ, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మతి, దుందుభి, రుధిరోద్గారి, రక్తాక్షి, క్రోధన, అక్షయ.)

**సంవననము.** సం. వి. అ. న. (చూ.) వశక్రియ. (రూ. సంవదనము.)

**సంవరము.** సం. వి. అ. న. శంబరముయొక్క రూపాంతరము.

**సంవర్తకము.** సం. వి. అ. న. బలరామునినాఁగలి.

**సంవర్తము.** సం. వి. అ. పుం. 1. ప్రళయము; 2. మేఘవిశేషము; 3. తాంత్రికుఁడు. ఒకానొకముని.

**సంవర్తిక.** సం. వి. ఆ. స్త్రీ. క్రొత్తతామరపూరేకు.

**సంవసథము.** సం. వి. అ. పుం. ఊరు, గ్రామము.

**సంవాదము.** సం. వి. అ. పుం. సమాచారము.

**సంవాహకుఁడు.** సం. వి. అ. పుం. ఒళ్లుపిసుకువాఁడు.

**సంవాహనము.** సం. వి. అ. న. 1. ఒళ్లుపిసుకుట; 2. చక్కగా మోసికొనిపోవుట.

**సంవిత్తి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తెలివి; 2. సమాచారము.

**సంవిత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. జ్ఞానము; 2. సంకేతము; 3. ప్రతిజ్ఞ; 4. అంగీకారము; 5. ఆచారము; 6. యుద్ధము; 7. సంభాషణము; 8. నామధేయము; 9. సంతోషపెట్టుట.

**సంవీతము.** సం. వి. అ. న. హారమువలెవేసికొన్న జందెము. విణ. చుట్టుకొనఁబడినది.

**సంవృతము.** సం. విణ. (అ. ఆ. అ.) చుట్టుకొనఁబడినది, ఆవృతము.

**సంవేగము.** సం. వి. అ. పుం. వేగిరపాటు, సంభ్రమము.

**సంవేదము.** సం. వి. అ. పుం. 1. సుఖదుఃఖాదులను తెలిసికొనుట; 2. వాదిప్రతివాదుల పరస్పరప్రాగల్భ్యము.

**సంవేశము.** సం. వి. అ. పుం. 1. పీఠము; 2. నిద్ర; 3. వేగిరపాటు.

**సంవేశిని.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) మొగసాల.

**సంవ్యానము.** సం. వి. అ. న. 1. ఉత్తరీయము; 2. వస్త్రము.

**సంశప్తకుఁడు.** సం. వి. అ. పుం. తిరుగనని ఒట్టుఁబెట్టుకొని యుద్ధముచేయువాఁడు.

**సంశయము.** సం. వి. అ. పుం. సందేహము.

**సంశయాళువు.** సం. విణ. (ఉ.) సంశయించు స్వభావముగలవాఁడు.

**సంశయించు.** సం. అ. క్రి. సందేహించు.

**సంశయి.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) సంశయించువాఁడు.

**సంశ్రయము.** సం. వి. అ. పుం. ఆశ్రయము, అండ.

**సంశ్రయించు.** సం. స. క్రి. ఆశ్రయించు, అండగొను.

**సంశ్రవము** సం. వి. అ. పుం. అంగీకారము.

**సంశ్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది.

**సంశ్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది.

**సంశ్లిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) కౌఁగిలింపఁబడినది, సంశ్లేషింపఁబడినది.

**సంశ్లేషము.** సం. వి. అ. పుం. కౌఁగిలింత, ఆలింగనము.

**సంశ్లేషించు.** సం. స. క్రి. కౌఁగిలించు.

**సంసక్తము.** సం. విణ. (అ ఆ. అ.) కదిసినది, చేరినది.

**సంసక్తి.** సం. వి. ఇ. స్త్రీ. కదియిక, చేరిక.

**సంసత్తు.** సం. వి. ద్. స్త్రీ. కొలువుకూటము, సభ.

**సంసరణము.** సం. వి. అ. న. 1. సంసారము; 2. బాట; 3. పట్టణమునుండి వెడలుట; 4. గవను; 5. ఇఱుకులేక దండునడచుట; 6. యుద్ధప్రారంభము.

**సంసరించు.** సం. అ. క్రి. పుట్టు. ఆను. 3, ఆ.

**సంసర్గము.** సం. వి. అ. పుం. 1. సంబంధము; 2. చేరిక.

**సంసారము.** సం. వి. అ. పుం. 1. ఆలుబిడ్డలతోడి యునికి; 2. పుట్టుక.

**సంసారి.** సం. వి. న్. పుం. సంసారముగల గృహస్థు.

**సంసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. 1. స్వభావము; 2. చక్కనిసిద్ధి; 3. మత్తురాలు.

**సంసృతి.** సం. వి. ఇ. స్త్రీ. సంసారము.

**సంసృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంసర్గముపొందినది; 2. వస్త్రములోనగువానిచేత శోధింపఁబడినది.

**సంసృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తిలతండులములు కలసినవిధమున నైన అర్థాలంకారములయొక్క పరస్పరసంబంధము; 2. సంసర్గము.

**సంస్కరించు.** సం. స. క్రి. 1. చక్కఁజేయు; 2. పక్వముచేయు; 3. (శవమును) దహనముచేయు.

**సంస్కారము.** సం. వి. అ. పుం. 1. చక్కఁజేయుట; 2. (శవమును) దహనముచేయుట; 3. అనుభూతార్థస్మృతి; 4. సంకల్పము; 5. పాకము.

**సంస్కృతము.** సం. వి. అ. న. దేవభాష. విణ. 1. చక్కగాఁజేయఁబడినది; 2. చక్కఁజేయఁబడినది; 3. అలంకరింపఁబడినది; 4. వ్యాకరణశిక్షితమైనది; 5. పక్వముచేయఁబడినది; 6. శ్రేష్ఠమైనది.

**సంస్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కఁజేయుట; 2. (శవమును) దహనముచేయుట.

**సంస్తరము.** సం. వి. అ. పుం. 1. చిగుళ్లులోనగువానిచేత నేర్పఱుపఁబడినపడక; 2. యజ్ఞము.

**సంస్తవము.** సం. వి. అ. పుం. 1. పరిచయము; 2. చక్కనిస్తుతి.

**సంస్తావము.** సం. వి. అ. పుం. యజ్ఞములయందు బ్రాహ్మణులు వేదఋక్కులు చెప్పెడుచోటు. యజ్ఞములయందు బ్రాహ్మణులు వేదఋక్కులను చెప్పుట. (అనికొందఱు.)

**సంస్త్యాయము.** సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. సన్నివేశము; 3. విరివి; 4. సమూహము.

**సంస్థ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి; 2. మేర; 3. నాశము; 4. సామ్యము.

**సంస్థాత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) చక్కగా నిలుచుండువాఁడు.

**సంస్థానము.** సం. వి. అ. న. 1. సన్నివేశము; 2. చతుష్పథము; 3. మృత్యువు; 4. ఆకృతి.

**సంస్థితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చచ్చినది; 2. చక్కగా ఉండినది.

**సంస్థితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. చావు; 2. చక్కనియునికి.

**సంస్పర్శ.** సం. వి. ఆ. స్త్రీ. కోరిందకి. అ. పుం. ము. చక్కనిస్పర్శము.

**సంస్ఫోటము.** సం. వి. అ. పుం. యుద్ధము, పోరు.

**సంహతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కగాఁజేరినది; 2. దృఢసంయోగముగలది.

**సంహతలము.** సం. వి. అ. పుం. మ్రొక్కుటకు వ్రేళ్లుచాఁచి, కూర్చిన చేదోయి.

**సంహతి.** సం. వి. ఇ. స్త్రీ. సమూహము.

**సంహననము.** సం. వి. అ. న. శరీరము, మేను.

**సంహరణము.** సం. వి. అ. న. సంహరించుట, చంపుట.

**సంహరించు.** సం. స. క్రి. సంహరణముచేయు, చంపు.

**సంహర్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) సంహరించువాఁడు.

**సంహారకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

**సంహారము.** సం. వి. అ. పుం. 1. సంహరణము; 2. నరభేదము.

**సంహిత.** సం. వి. ఆ. స్త్రీ. 1. వర్ణసంయోగము; 2. వేదమునందు కొంతభాగము; 3. శాస్త్రము. విణ. సంధింపఁబడినది.

**సంహూతి.** సం. వి. ఇ. స్త్రీ. అనేకులుచేరి పిలిచిన పిలుపు.

**సంహృతము.** సం. విణ. (అ. ఆ. అ.) సంహరింపఁబడినది.

**సంహృతి.** సం. వి. ఇ. స్త్రీ. సంహరణము, సంహారము.

**సకలము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సర్వము; 2. కలతోఁ గూడినది.

**సకళాతు.** దే. వి. మేలైన కంబళిదినుసు. "సీ. విరహులపైదాడి వెడలుచుమరుఁడిమ్ముకొలిపినసకళాతుగొల్లెనఁగ." రసి. ౪, ఆ. (రూ. సకలాతు.)

**సకి.** వై. వి. 1. చెలికత్తె; (చూ. తలిరుదిండి.) 2. ఆఁడుది*. (చూ. కోడంట్రికము.)

**సకినె.** వై. వి. 1. కృత్రిమపక్షి*; "చ. చికిలిపసిండివ్రాఁతనను చెంద్రికవన్నియ మేలుకట్టునం, జకచకపర్వఁ గ్రొవ్విరులు చంపకములొసవి దేంట్లుమూతిము, ట్టకనవకంపుఁగెంపుమొగడల్గని రాఁదెలిముత్తియంపుబల్, సకినలకూఁకలంగిలకిలన్నగుమోహనశయ్యనున్నెడన్." వసు. ౬, ఆ.—2. కీఁచుకీఁచుమనుధ్వని*; "ఎ, గీ. ఈఁగవ్రాలినసందందయెలుఁగులొసఁగు, నట్టిసకినలమంచము లాదిగాఁగ." స్వా. ౬, ఆ. — 3. కీఁచుబిళ్ళ; విక్ర. ౭, ఆ.— 4. బొమ్మ*. "తే. సంజవెద చల్లుచెంగావిసాలువులను, మత్తగజగామినులుతడియొత్తిరపుడు, చాలఁజూపట్టెనాపూర్ణచంద్రవదన, జాజుచేసినజాళువాసకినవోలె." భాను. ౪, ఆ.

**సకినంపుఁబులుఁగు.** ద్వి. వి (సకినము+పులుఁగు.) సకినము చెప్పెడు పక్షివిశేషము. (చూ.) పైఁడికంటె.

**సకినము.** వై. వి. 1. శుభసూచకనిమిత్తము; 2. శుభాశుభసూచకవాక్కు*.

**సకినలమంచేము.** ద్వి. వి. కీఁచుకీఁచుమని మ్రోఁగెడుమంచేము, రవమంచము. (చూ. సకిన రెండవయర్థము.)

**సకియ.** వై. వి. 1. చెలికత్తె; "క. సకియఁగనుమొఱఁగిమధుకర, చికురనిజారామవాటిఁజేరిప్రసూనాం, బకధాటీశుకఘోటీ, నికరాటీకనము మనమునివ్వెఱపఱపన్." వసు. 3, ఆ. — 2. ఆఁడుది*. "క. సకియమగపాడి కొఱకె, న్నికగాఁబగతునినడంచి నినుఁ జెఱలోఁజి, క్కకయుండునట్లొనర్చితి, నీఁకనీమదివచ్చుచోటికేగుమునెమ్మిన్." అచ్చ. యు, కాం.

**సకిలించు.** దే. అ. క్రి. గుఱ్ఱముకూయు, హేషించు.

**సకిలింత.** దే. వి. గుఱ్ఱపుకూఁత, హేష.

**సకుఁడు.** వై. వి. చెలికాఁడు, స్నేహితుఁడు.

**సకృత్ప్రజము.** సం. వి. అ. పుం. కాకి, వాయసము.

**సక్తము.** సం. విశే (అ. ఆ. అ.) ఒకటతగిలినది. (మనసు.)

**సక్తుఫల.** సం. వి. ఆ. స్త్రీ. జెమ్మి.

**సక్తువు.** సం. వి. ఉ. పుం. పేలపిండి.

**సక్థి.** సం. వి. ఇ. న. తొడ, ఊరువు.

**సఖి.** సం. వి. ఈ. స్త్రీ. చెలికత్తె. న్. పుం. 1. స్నేహితుఁడు; 2. సహాయుఁడు.

**సఖుఁడు.** సం. వి. అ. పుం. 1. స్నేహితుఁడు; 2. సహాయుఁడు.

**సఖ్యము.** సం. వి. అ. న. స్నేహము, చెలిమి.

**సగంధుఁడు.** సం. వి. అ. పుం. స్నేహితుఁడు. విశే. గంధముతోఁ కూడినవాఁడు.

**సగటు.** వై. వి. చేదరంగమునందు శకటము.

**సగటుసుమారు.** గ్రా. అవ్య. సరాసరి, రమారమి.

**సగతు.** దే. వి. గుజ్జుపుపల్లముమీఁద కెంపులు చిగుళ్లును, పచ్చలు ఆకుల్లును, రవలు పూవులునుగా సంతరించి యేర్పఱచిన బంగారు తీఁగమోడిపని. (చూ. ఉల్లారు.) "సీ. ఉదిరిబంగరువ్రాఁతపాదనిపూపనిచొక్క సగతులహొంబట్టుమొగలిపల్లము." చంద్రా. ౨, ఆ.

**సగము.** వై. వి. అర్ధము. (దీనికి వృత్తియందు హల్లుపరమగుచో వికల్పముగ నంత్యవర్ణలోపము. "తమసగపాలుగోలుపడి." భార ఉద్యో. ౧, ఆ.)

**సగర్భ్యుఁడు.** సం. వి. అ. పుం. ఒకతల్లికడుపునఁబుట్టిన తోఁబుట్టువు.

**సగిన.** వై. వి. సకినయొక్క రూపాంతరము. (చూ.) విక్ర. ౮, ఆ.

**సగిలించు.** దే. అ. క్రి. సకిలించుయొక్క రూపాంతరము.

**సగిలింత.** దే. వి. సకిలింతయొక్క రూపాంతరము.

**సగుటు.** దే. వి. సరాసరి. (వానికి సగుటుమోఁకాలిబంటి.)

**సగోత్రుఁడు.** సం. వి. అ పుం. జ్ఞాతి, దాయ.

**సగ్గారి.** వై. వి. సక్క. "క. అసగ్గారియుఁబుణ్య, స్త్రీసంభాషణము దనకుఁజెందినకతనం, జేసివివేకజ్ఞానపు, కాసంబునన్నల్లసిల్లికాననభూమిన్." వి, పు. ౪, ఆ.

**సగ్గిసముగ్గిసలు.** దే. వి. బ. ఉడ్డుగుడుపు. "ఉ. సిగ్గుసకుంగ కావికలు చిత్తసమున్నతిపేరివార్తకున్, గగ్గలకాడు శంకలకుఁగన్కని యెగ్గుకుఁబట్టు డల్కకున్, సగ్గిసముగ్గిసల్ నిలుపుపైరణకున్ గనసీని యెత్తికో, ళ్లగ్గజయానకుంబతికినయ్యె యథేష్టరహఃప్రసంగముల్." కవిక. ౪, ఆ.

**సగ్గు.** దే. అ. క్రి. 1. అడఁగు; 2. తగ్గు.

**సగ్గుబియ్యము.** దే. వి. ఒకవిధమైన కృత్రిమధాన్యము.

**సగ్గెడ.** దే. వి. చెంబు. "ద్వి. బానిసచేతఁగల్లు, వలనొప్పఁదెప్పించివాఁడునిచ్చలును, జలములుగ్రోలెడు సగ్గెడనించి." నవ.

**సఘ్ధి.** సం. వి. ఇ. స్త్రీ. బంతికుడుపు. (చూ.) సజఘ్ధి.

**సచివుఁడు.** సం. వి. అ. పుం. 1. మంత్రి; 2. స్నేహితుఁడు; 3. సహాయుఁడు. (శృంగారనాయకునకు సచివులు నలుగురు.— పీఠమర్దుఁడు, విటుఁడు, చేటుఁడు, విదూషకుఁడు.)

**సచ్చేము.** దే వి. చిల్లరరొక్కమప్పు. (చూ. వైజాతితొండ.)

**సచ్చే** దే. అ. క్రి. చచ్చుయొక్క రూపాంతరము. (చూ. సంపు.)

**సచ్ఛూద్రుఁడు.** సం. వి. అ. పుం. తగిన మంచియాచారము గల శూద్రుఁడు.

**సజఘ్ధి.** సం. వి. ఇ. స్త్రీ. పదిమందిచేరి యొకటిగా భుజించుట, బంతికుడుపు.

**సజావు.** హిం. విశే. స్పష్టమైన, క్రమమైన.

**సజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కవచము; 2. అలంకరణము.

**సజ్జక.** సం. వి. ఆ స్త్రీ. పడకిల్లు, వాసగృహము.

**సజ్జన.** సం. వి. ఆ. స్త్రీ. ఆయితముసేయుటకై యేనుఁగుమెడను గట్టెడు నిడుత్రాడు. అ. న. ము. 1. బెత్తములవారు నందడి లేక తొలఁగించుట; శిబిరరక్షణముకొఱకుఁ జుట్టుఁబెట్టిన వెలుగులో నగునది. (అనికొందఱు.) 2. రేవు.

**సజ్జనుఁడు.** సం. వి. అ. పుం. మంచి కులమునందుఁబుట్టినవాఁడు.

**సజ్జితము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కవచము తొడిగినది; 2. అలంకరింపఁబడినది.

**సజ్జుఁడు.** సం. ణ. (అ. ఆ. అ.) 1. కవచము తొడిగినవాఁడు; 2. అలంకరింపఁబడినవాఁడు.

**సజ్జె.** యు. దే. వి. బుట్ట. (చూ. ఎఱుక మూడవయర్థము.) వై. 1. సస్యవిశేషము, గంటె; "సజ్జఁగోయనుమూళింమచు." రా. వి. ౨, ఆ. (బ. ధాన్యవిశేషము.) 2. శిరోగృహము; "ఉప్పరిగల్ సజ్జలుచప్పరాలుచవికెల్ పైఁజూడలేదెక్క." రామా. ౬, ఆ.— 3. సూతికాగృహము*. "ఆ. పుట్టినపుడసజ్జచుట్టునుబెఱవారి, జననియాదిగాఁగసకలజనులు, తొలఁగియుండినన్నుఁదొలుగఁజూడఁగనిచ్చి, సుతునిఁబిదపమీరుచూచుఁడనుచు." భో. ౬, ఆ.— వి. ఆయితము. "క. ఈనెలఁతఁగన్నమన్మథుఁ, డైనఁజనుగుఁ గొమగుపువ్వటమ్ములపొదులుకా, లోనుగసజ్జలుసేయక, దానియమింపండెవిరహాతాపముపేర్చెక్." భార. విరా. ౨, ఆ.

**సజ్జకము,** దే. విణ. మనోజ్ఞము. "కొలఁకులపజ్జసజ్జకపుగొజ్జఁగెపూఁబొదరిండ్ల." వసు. ౨, ఆ.

**సజ్జకట్టు.** దవ్. విణ. ఆయితము. ఆం, భా.

**సజ్జనకోల.** దవ్. వి. (సజ్జె + కోల) బెత్తము. "ఎ, గీ. వేయిసజ్జనకోలలు విఱిచివైచు." హంస. 3, ఆ. (సంధిని పన్గాభకవ్యము.)

**సజ్జరసము.** వై. వి. ధూపద్రవ్యవిశేషము

**సజ్జాకారము.** వై. వి. సర్జకవృక్షమునసెత్తెడియుప్పు.

**సజ్జోరము** వై. వి. వీనుఁగునుకట్టుచోటు.

**సట్టి.** ఉభ. వై. వి. కపటము, మోసము*. "సటలిటమానరోరి." పా. 3, ఆ.—సం. ఆ. స్త్రీ. 1. సన్యాసులజెడ; 2. జూలు. (చూ. జూలు మొదటియర్థము.)

**సఠ.** దే. వి. దట్టమగు నాఱువరుస, తసి.

**సడపు.** దే. స. క్రి. అపహరించు. "ఎ, గీ. సామాజికులుతమసొమ్ములెల్ల, నొనఁగులుగ వైవసడపుచునొప్పమీతె, రుక్మిణిసుతుఁడు మాయానిరూఢిమెఱసి." ప్రభా. ర, ఆ.

**సడలు.** వై. అ. క్రి. 1. ఊఁగు; 2. జాఱు; 3. వదలు. వి. 1. ఊఁగుట; 2. జాఱుట; 3. వదలుట. (ఇది సడిలు అని ఇకారమధ్యముగా వ్రాఁతపుస్తకములయందు కొన్నిచోట్ల కానంబడుచున్నది.)

**సడలుచు.** వై. ప్రే. సడలఁజేయు. (రూ. సడల్చు.)

**సడలువడు.** వై. అ. క్రి. (సడలు + పడు.) సడలు. "సడలువడనికడింది." అచ్చ. బాల, కాం. (ప్రే. సడలువఱుచు. "ఎ, గీ. అనేకవదన, సదనసంచారభేదంబు సడలువఱిచి, భారతీదేవినీజిహ్వఁబాదుకొనియె." కా. ౧, ఆ.)

**సడవ.** దే. వి. త్రోవ, మార్గము. ఆం, భా.

**సడి.** దే. వి. 1. అపకీర్తి; (చూ. ఆడికోలు) 2. నింద; "క. వారలతోరఘువరుఁడనుఁ, జారుల వాక్యములుచెప్పిసడిఁబొందెనుసీ, తారమణిలోకమునదు, ష్పూరుషుచే నిందఁబొందు శ్రుతియుంబోలెక్." జై. ౬, ఆ. (సడినన్న అనఁగా సడిచనినయని భారతప్రయోగములవలన నేర్పడుచున్నది. దానంజేసి యిది వేఱుపదముగా ఎత్తఁబడలేదు. "సడినన్నవాఁడు." భార. విరా. 3, ఆ. "సడినన్నయేడ్తెఱ." విరా. ర, ఆ. "సడినన్నయాప్తయోధుల." శాం, ౨, ఆ.)—3. జాడ.

**సడించు.** దే. స. క్రి. దంచు.

**సడింపులు.** దే. వి. బ. ఎసటిపోఁతలుగాదంచినబియ్యము "సడింపుఁబ్రాలు." ఆము. ౬, ఆ. (వృత్తియందేకవచనాంతము. (చూ.) అఱుపుల్లు.)

**సడికియ.** దే. వి. సడికెకు మొదటిరూపము. ఆం, భా.

**సడికుడక.** దే. వి. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

**సడికె.** దే. వి. కుక్కమెడత్రాడు. (సడికియయొక్కరూపాంతరము.) ద్వి. భాగ. ౫, స్కం.

**సడుగులు.** దే. వి. బ. 1. వంకరమాటలు; 2. కటిప్రదేశమునందలి కీళ్లు.

**సడ్డ.** వై. వి. 1. అక్కఱ; 2. లక్ష్యము*. (చూ. ఎడ్డమి.)

**సడ్డకుఁడు.** వై. వి. తోడియల్లుఁడు.

**సడ్డసేయు.** వై. స. క్రి. (సడ్డ + చేయు.) లక్ష్యపెట్టు. "శే. సడ్డసేయనునుమ్ముముజ్జగమువారి." హంస. ౭, ఆ.

**సణుగు.** దే. వి. బాధ. "తే. దనుజకులవైరిశౌరినందనులుసట్ల, రక్కసులుమనవారుబారలకు మనకుఁ, బొసఁగునేనడ్డఁబెట్టినపూరిగాలు, నేలచిత్రరేఖామదినింతసణుగు." ఉ, హరి. ౫, ఆ.

**సత.** వై. స. ఏడు, సప్తకము. "సతగిబ్బల్." సీలా. ౨, ఆ.

**సతతము.** సం. క్రి, విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

**సతనాల్కలజేజే.** దవ్. వి. అగ్ని. అచ్చ. బాల, కాం. (చూ. సప్తజిహ్వుఁడు.)

**సతము.** వై. వి. శాశ్వతము*. "కలిమియులేమియుఁ సతముగావు." భార. అర. ౭, ఆ.

**సతాయించు.** హిం. క్రి. హింసించు, బాధించు.

**సతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పతివ్రత; 2. పార్వతి.

**సతీనకము.** సం వి. అ. పుం. ధాన్యవిశేషము, లంకలు.

**సతీర్థ్యుఁడు.** సం. వి. అ. పుం. కూడచదువువాఁడు, సహపాఠి.

**సత్కరించు.** సం. స. క్రి. సన్మానించు.

**సత్కారము.** సం. వి. అ. పుం. సన్మానము.

**సత్కృతి.** సం. వి. ఇ. స్త్రీ.———వై.———

**సత్కృతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సత్కరింపఁబడినవాఁడు.

**సత్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. సత్కారము.

**సత్త.** ఉభ. వై. వి. సత్తువ. ఆం, భా.—సం. ఆ. స్త్రీ. 1. ఉనికి; 2. మంచితనము.

**సత్తముఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అందఱికంటె మంచివాఁడు; 2. అందఱికంటె పూజ్యుఁడు; 3. శ్రేష్ఠుఁడు.

**సత్తిరువు.** వై. వి. అన్నప్రదానగృహము, సత్రము. "క. చలిపందిరులునసత్తరు, వులునూతులుబావులుంబువుందోఁటలుచె, రువ్వలునల్లిండ్లునుమొదలుగ, నిలిపియమీన్వానుఁడసమునించెంబుడమిక్." య. ౧, ఆ.

**సత్త్రా.** వై. స. ఏడు. "క. అత్తివం చిత్తిగ దుగ, సత్త్రాదచ్చోకవంచచౌవం చీకై, దిత్తిగయద్దుగ బద్రలు, చిత్తంబునఁదలఁచినట్లు చేతికిఁదెచ్చుక్." ఉ, హరి. 3, ఆ. (బద్రకడనుండు పద్యమునిట్లు దిద్దుకొని యక్కడ కుండలీకరణములోపల వ్రాసియుండుదాని బహిష్కరింపవలయును.)

**సత్తి.** వై. వి. 1. ఆయుధవిశేషము; "తే. మున్ను నెత్తమ్మిచూలిచేఁ గొన్నయట్టి, సత్తియనుతూపునిగిడింప." అచ్చ. యు, కాం.— 2. కాళి; 3. బలిమి; "ఎ, గీ. హత్తి మిత్తిచందంబునహత్తి వెడఁద, కత్తిఁ గుత్తికనుబిజానఁ గత్తిరించి, సత్తిమత్తిల్ల ఒలిచేసె సత్తినొక్కఁ, డవనిపతియిచ్చ మేలుమేలనుచు మెచ్చ." చంద్రా. ౨, ఆ. (ఇది వెనుకటి రెండర్థములకు నుదాహరణము.) 4. పార్వతి; "ఆ. మత్తగిల్లుసత్తుగిత్తతత్తడినెక్కి, మిత్తిమొత్తిసత్తి నత్తిబత్తిఁ, బత్తిరిడినముత్తిబుత్తులురెండును, నొత్తిగుత్తగట్టుచుండు త్రేఁడ" నీలా. ౧, ఆ.—5. వసిష్ఠునికొడుకు. "ఆ. అప్పుడ దనుచెయ్యువ్వలలరించిసత్తియ, బ్బయు" అచ్చ. అ, కాం. (ఇక్కడ శక్తియని యుండవచ్చునుగాని కవివచనభంగిఁజూడ వైకృతముగానే యుండునని తోఁచెడి.)

**సత్తితాలుపు.** ద్వ. వి. కుమారస్వామి, శక్తిధరుఁడు.

**సత్తు.** ఉభ. దే. వి. సీసము. వై. 1. సత్వము; (చూ. సత్తి నాలుగవయర్థము.)—2. సత్యము. "ఉ. ఒత్తుగమాంసముఞ్ మదుఁగుటోగిరముఞ్ ఘృతశర్కరాదులుఞ్, గుత్తకబంటిమేసికడుఁగ్రొవ్వి వధూరతితంత్రలీలలఞ్, మత్తిలిదేహముఞ్ మఱచిమాటికిబొంకు నృపాలకోటికిఞ్, సత్తుదలంపనెక్కడిదిసంయమినీకిటుపల్కఁబాడియే." హరిశ్చ. ౧, ఆ.—సం. త్. న. నక్షత్రము. విణ. 1. ఉన్నది; 2. చదువరి; 3. పూజ్యము; 4. శ్రేష్ఠము; 5. సత్యము; 6. సాధువు.

**సత్తువ.** వై. వి. దేహమునందలిబలము, శక్తి.

**సత్తెనంగ.** దే. వి. సస్యవిశేషము. "ద్వి. సత్తెనంగబెడంగ సత్తయ్యె." విష్ణు. పూ. 3, ఆ.

**సత్పథము.** సం. వి. అ. పుం. 1. మంచిత్రోవ; 2. నక్షత్ర మార్గము.

**సత్యంకారము.** సం. వి. అ. పుం. క్రయవిక్రయములగట్టి మాట.

**సత్యము.** సం. వి. అ. న. 1. నిజము; 2. ఒట్టు; 3. కృతయుగము. పుం. ఒక లోకము. (చూ. లోకము.) విణ. నిజమయినది.

**సత్యవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వ్యాసునితల్లి; 2. నారదుని పెండ్లాము; 3. సోమెదకూర. విణ. సత్యముగలది.

**సత్యాకృతి.** సం. వి. ఇ. స్త్రీ. (చూ.) సత్యంకారము.

**సత్యానృతము.** సం. వి. అ. న. వర్తకము, వాణిజ్యము.

**సత్యాపనము.** సం. వి. అ. న. (చూ.) సత్యంకారము.

**సత్రము.** సం. వి. అ. న. 1. అన్నప్రదానగృహము; 2. యజ్ఞవిశేషము; 3. ఎడతెగనియీవి; 4. అడవి; 5. కపటము. విణ. మంచివారిని కాపాడునది.

**సత్రి.** సం. వి. న్. పుం. ఎడతెగక దానముచేయువాఁడు.

**సత్వము.** సం. వి. అ. న. 1. సత్త; 2. దేహబలము; 3. ఒక గుణము; (చూ. గుణము.) 4. స్వభావము; 5. మనస్సు; 6. ప్రయత్నము; 7. ప్రాణము; 8. పృథివ్యాదిద్రవ్యము; (చూ. ద్రవ్యము.) 9. పిశాచాది. పుం, న. జంతువు.

**సత్వరము.** సం. క్రి, విణ. అ. న. త్వరితము. విణ. వడిగలది.

**సద.** వై. వి. ఆకుమీఁదినూఁగు*. ఆం, భా.

**సదనము.** సం. వి. అ. న. 1. గృహము; 2. జలము.

**సదమదమగు.** దే. అ. క్రి. (సదమదము+అగు.) నలఁగు. "క. ఇదిరేయిదిపగలనుచుఞ్, మదినెఱుఁగకచాలఁబొదలుమరుపోటులఞ్, సదమదమగుచుం శిరియ, ముదితయురాజేఁడుఁగూర్మిముంచుకొనంగఞ్." య. ౫, ఆ.

**సదమదము.** దే. విణ. నలఁగినది. "వ. మదనకదనంబునసదమదంబులగునంగంబులు." వసు. ౪, ఆ

**సదమదముసేయు.** ద్వ. స. క్రి. (సదమదము+చేయు.) 1. నలఁచు; 2. చంపు. (ఇట్లు సదమదమొనరించు.)

**సదము.** సం. వి. స్. స్త్రీ. సదస్సుయొక్కరూపాంతరము.

**సదరహీ.** హిం. విణ. పైనచెప్పిన, ఆ. (రూ. సదరు.)

**సదరుబోయలు.** దే. వి. బోయలలో నొకజాతి.

**సదసద.** దే. విణ. సదమదము. (చూ. కక్కసము. వి, మొదటియర్థము.)

**సదస్సు.** సం. వి. స్. స్త్రీ. 1. సభ; 2. రాజసభ. (రూ. సదసు.)

**సదస్యుఁడు.** సం. వి. అ. పుం. 1. యజ్ఞవిధిపరీక్షాధికారి; 2. సభికుఁడు.

**సదా.** సం. అవ్య. ఎల్లప్పుడు. "సదానాసఞ్."

**సదాగతి.** సం. వి. ఇ. పుం. 1. వాయువు; 2. మోక్షము; 3. సూర్యుఁడు; 4. సర్వేశ్వరుఁడు.

**సదాటు.** దే. విణ. దృఢము. "సీ. గాలంపుమీఁకసదాటైనమేనుల నెఱమట్టినిగనిగల్ హరువుమీఱ." శశాం. ౧, ఆ.

**సదాతనుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు. విణ. శాశ్వతుఁడు.

**సదానీర.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) కరతోయ.

**సదాప.** వై. వి. ఒకానొకచెట్టు.

**సదాముస్తె.** వై. వి. ఒకానొకచెట్టు. హంస. ౪, ఆ.

**సదావృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. బైరాగులులోనగువారికిచ్చెడు వంటసామగ్రి.

**సదాశివుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**సదృక్షము.** సం విణ. (అ. ఆ. అ.) సరి, సమానము.

**సదృశము.** సం. విణ. (అ. ఈ. అ.) 1. సమానము; 2. తగినది.

**సదేశము.** సం. వి. అ. న. సమీపము. విణ. సమీపమైనది.

**సద్దు.** వై. వి. చప్పుడు, మ్రోఁత, రవళి, ధ్వని.

**సద్మము.** సం. వి. న్. న. 1. గృహము; 2. జలము.

**సద్యము.** సం. స్. అవ్య. అప్పుడు. "క. ఆద్యంతంబునునీయన, వద్యకథవినంగఁగనినవారికిఁ బాయుఞ్, సద్యంబ బ్రహ్మహత్యా, వద్యముమొదలైనపాపవర్గంబెల్లఞ్." భార. స్వ. ౧, ఆ.

**సధర్మము.** సం. విణ. (న్.) 1. సమానము; 2. ధర్మముతోఁగూడినది.

**సధ్ర్యంచుఁడు.** సం. విణ. (చ్. ఈ. చ్.) కూడఁబోవువాఁడు.

**సనగ.** వై. వి. 1. సస్యవిశేషము; "ద్వి. సనగసొంపుఁజణింగెసమసెబొబ్బరలు." విష్ణు. పూ. 3, ఆ.—(సెనగకు మొదటిరూపము.) 2, బ. ధాన్యవిశేషము. (చూ. అదరు.)

**సనత్కుమారుఁడు.** సం. వి. అ. పుం. వైద్యశాస్త్ర కర్తయగు దేవర్షి.

**సనాతనుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు. విణ. శాశ్వతుఁడు.

**సనాథము.** సం. విణ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

**సనాభి.** సం. వి. ఇ. పుం. జ్ఞాతి. విణ. సమానుఁడు.

**సని.** ఉభ. వై. వి. శని. సం. ఇ. స్త్రీ. (చూ.) అన్వేషణ.

**సనీడము.** సం. వి. అ. న. సమీపము. విణ. 1. సమీపమైనది; 2. నీడముతోఁగూడినది.

**సను.** దే. అ. క్రి. చనుయొక్క రూపాంతరము. (చూ. చలుపు.)

**సనె.** దే. వి. సన్నెయొక్క రూపాంతరము.

**సనెకల్లు.** దే. వి. సన్నెకల్లుయొక్క రూపాంతరము. (అంత్యోకారంబునకు వికల్పముగలోపంబగు. "సనెకల్ దాఁచినఁబెండ్లిమానునా కొ." కాశీ. ౫, ఆ.)

**సన్న.** వై. వి. హస్తాదులచేత చేసెడుసంజ్ఞ. (కనుసన్న మొ.) (సన్నకసన్నయనుచో జాడజాడగా ననియర్థము. అర్థానుకూలముగా సన్నకుక్, అ, సన్నయని పదములను భాగించుకొనవలెను.)

**సన్నకద్రువు.** సం. వి. ఉ. పుం. మోరటికీ.

**సన్నగాఁడు.** దే. వి. (సన్నము+కాఁడు.) చీమ. విణ. అల్పుఁడు. "ఎ, గీ. సన్నగాండ్రనుబోఁదోలిసరగవారి, నెలవులెల్లనుగైకొని చెలఁగుచుండు, తులువవినదారిరాకాటువులకునెందుఁ, దలఁపనొక్కించుకయుమంచితనముగలదె." అచ్చ. బాల, కాం. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**సన్నగాలి.** దే. వి. (సన్నము+గాలి.) మందమారుతము. "తే. వీల ప్రేలెదుకేఁటియింతేటికలుగ, నం శ్రితలసన్నగాలియోసన్నగాలి." రామా. ౬, ఆ.

**సన్నగాళె.** ద్వ. వి. (సన్నము+కాళె.) వాద్యవిశేషము, తిరుచిన్నము.

**సన్నగిల్లు.** దే. అ. క్రి. సన్నమగు. (రూ. సన్నగిలు.)

**సన్నదు.** హిం. వి. యోగ్యతాపత్రిక, ఆజ్ఞాపత్రిక.

**సన్నన.** దే. వి. సన్నఁదనము. (విశేషణమగుచో "సన్ననిగాలి." వై. 3, ఆ.) (చూ. అలకన.)

**సన్నపిల్లి.** ద్వ. వి. సాలెపురుగు.

**సన్నపువాఁడు.** దే. విణ. (సన్నము+వాఁడు.) అల్పుఁడు. "సన్నంపువారితో జగడమేల." రా. యు, కాం.

**సన్నమండెఁగలు.** ద్వ. వి. బ. (సన్నము+మండెఁగలు.) శాలిధాన్యవిశేషము. హంస. ౪, ఆ.

**సన్నము.** ఉభ. దే. వి. సూక్ష్మత్వము. "కౌను సన్నము మోముగోము మెయిబాగును బూని." అచ్చ. అర, కాం.—విణ. సూక్ష్మము. (వృత్తియందు దంత్యవర్ణము వికల్పముగ లోపించుచు. సన్నగాలి మొ.)—సం. అ. న. అల్పము. విణ. కృశించినది.

**సన్నయము.** సం. వి. అ. పుం. 1. వెనుకనున్నదండు; 2. సమవాయము; 3. సమూహము.

**సన్నయేలకి.** ద్వ. వి. (సన్నము+ఏలకి.) చిట్టేలకీ.

**సన్నరాష్ట్రము.** ద్వ. వి. రాన్నకీ.

**సన్నవాలు.** దే. అ. క్రి. (సన్నము+వాలు.) సన్నగిల్లు. "వ. కృష్ణుండునుగులంబులోనం గలహంబుపుట్టుననితలంచితానుశక్తుండయ్యును గొనకొల్లకయయ్యెప్రసంగంబులంగొర్కి సన్నవాలం బలుకుచుండ." హరి. పూ. 3, ఆ.

**సన్నసన.** వై. విణ. (సన్న+సన్న.) సులభము. (చూ. నిట్టు రెండవయర్థము.)

**సన్నహనము.** సం. వి. అ. న. 1. కవచము; 2. ప్రయత్నము.

**సన్నిహితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రయత్నింపఁబడినది.

**సన్నాయి.** దే. వి. నాగసరము.

**సన్నాసి.** వై. వి. సన్యాసి.

**సన్నాహము.** సం. వి. అ. పుం. 1. కవచము; 2. ప్రయత్నము.

**సన్నాహ్యము.** సం. వి. అ. పుం. యుద్ధమునకుఁదగిన యేనుఁగు.

**సన్ని.** దే. వి. సన్నీయొక్క రూపాంతరము.

**సన్నికర్షణము.** సం. వి. అ. న. సమీపించుట.

**సన్నికర్షము.** సం. వి. అ. పుం. సమీపము, చేరువ.

**సన్నికృష్టము.** సం. వి. అ. న. సమీపము, విణ. సమీపించినది.

**సన్నద్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కవచముదొడిగినవాఁడు; 2. ప్రయత్నపడినవాఁడు.

**సన్నిధానము.** సం. వి. అ. న. 1. సమీపము; 2. ఆశ్రయము.

**సన్నిధి.** సం. వి. ఇ. పుం. సమీపము, చేరువ.

**సన్నిపాతము.** సం. వి. అ. పుం. 1. జేన్ని; 2. కలయిక.

**సన్నిభము.** సం. విణ. (అ. ఆ. అ.) సమానము.

**సన్నివిష్టుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమీపించినవాఁడు; 2. కూర్చున్నవాఁడు.

**సన్నివేశము.** సం. వి. అ. పుం. పట్టణములోనగువానిచుట్టు వాటినబయలు, గృహాద్యపరభాగము. (అనికొందఱు.)

**సన్నిహితము.** సం. విణ. (అ. ఆ. అ.) సమీపించినది.

**సన్నీ.** దే. వి. తుపాకికొనకుచెక్కియుండెడు బాఁకువంటికత్తి.

**సన్నుతము.** సం. విణ. (అ. ఆ. అ.) చక్కగా స్తోత్రముచేయఁబడినది.

**సన్నుతి.** సం. వి. ఇ. స్త్రీ. చక్కనిస్తోత్రము.

**సన్నుతించు.** సం. స. క్రి. చక్కగా స్తోత్రముచేయు.

**సన్నె.** దే. వి. సన్నెకల్లు. (చూ. చిఱుబంతిపసుపు.)

**సన్నెకల్లు.** దే. వి. నూఱెడుఱాయి, పట్టము.

**సన్మాననము.** సం. వి. అ. న. గౌరవించుట. "క. దానోపమానములన, న్మానితగతిలేదుకూద్రునకుయతిదెసన, న్మాననమునఁదజ్ఞోజా, ధీనరతింగానియున్నిదెరువులఁజూడక." భార. అను. 3, ఆ.

**సన్మానము.** సం. వి. అ. పుం. గౌరవము. (చూ. సన్మాననము.)

**సన్మానించు.** సం. స. క్రి. గౌరవించు, సమ్మానించు.

**సన్మానితము.** సం. విణ. (అ. ఆ. అ.) గౌరవింపఁబడినది; 2. సమర్పింపఁబడినది.

**సన్యసించు.** సం. స. క్రి. కామ్యకర్మములను విడుచు.

**సన్యస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సన్యసింపఁబడినది; 2. సమర్పింపఁబడినది.

**సన్న్యాసము.** సం. వి. అ. పుం. 1. కామ్యకర్మములవిడుపు; 2. ఒక ఆశ్రమము. (చూ. ఆశ్రమము.)

**సన్న్యాసి.** సం. వి. న్. పుం. సన్న్యాసాశ్రమముకలవాఁడు.

**సపత్ని.** సం. వి. ఈ. స్త్రీ. (చూ.) సవతి.

**సపత్నుఁడు.** సం. వి. అ. పుం. పగవాఁడు, శత్రువు.

**సపర్య.** సం. వి. ఆ. స్త్రీ. పూజ, నమస్య.

**సపాట.** దే. విణ. మట్టము. "క. వడిఁదేజిఁదోలిరాజు, ర్వడిడొంకినసపాటగానురస్థ్సలియపుడా, పిడికిటిగొరకఁవేయఁ, బిడికిటిబిట్టెగసిబిల్లబీటునఁబడియెఁ." సా. ౧, ఆ. (రూ. సపాటము. "వ. కుంభసంభవుదవ్వుదవ్వులంగాంచి కాంచనశిరశ్శృంగశృంగాటకంబులంగమలభవాండకటాహంబులుద్ఘాటించుతనమేనిపొడువు నేలసపాటంబుగావంచివింధ్యాచలంబమ్మహానుభావు నెదుర్కొనియె" కాశీ. ౨, ఆ.)

**సపిండీకరణము.** సం. వి. అ. న. చచ్చినపండ్రెండవదినమునందుచేసెడు సంవత్సరాంతశ్రాద్ధము.

**సపిండుఁడు.** సం. వి. అ. పుం. ఏడుతరములలోపలిజ్ఞాతి.

**సపీతి.** సం. వి. ఇ. స్త్రీ. పదిమందిచేరి యొకటిగా త్రాగుట, సహపానము.

**సప్త.** సం. వి. ఆ. స్త్రీ. ఏడుతంతులుగల వీణ, పరివాదిని.

**సప్తకము.** సం. స. అ. న. ఏడు. విణ. ఏడవది.

**సప్తకి.** సం. వి. ఈ. స్త్రీ. ఏడుపేటలుగల ఆఁడుదానిమొలనూలు.

**సప్తజిహ్వుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని, సతనాల్కలజేజే. (సప్తజిహ్వలు.—కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ.)

**సప్తతంతువు.** సం. వి. ఉ. పుం. యజ్ఞము, జన్నము.

**సప్తతి.** సం. వి. ఇ. స్త్రీ. డెబ్బది.

**సప్తపది.** సం. వి. ఈ. స్త్రీ. సప్తపదములసమాహారము.

**సప్తపర్ణము.** సం. వి. అ. పుం. 1. ఏడాకులరఁటి; 2. ఏడాకులపొన్న.

**సప్తమము.** సం. విణ. (అ. ఈ. అ.) ఏడవది.

**సప్తమి.** సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు ఏడవతిథి. విణ. ఏడవది.

**సప్తల.** సం. వి. ఆ. స్త్రీ. 1. విరజాజి; 2. కలిగొట్టు; 3. గురిజ; 4. సంబరేను.

**సప్తహస్తుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని, ఏడుచేతులవేలుపు.

**సప్తార్చి.** సం. వి. స్. పుం. అగ్ని. విణ. క్రూరదృష్టిగలవాఁడు.

**సప్తాశ్వుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**సప్తి.** సం. వి. ఇ. పుం. గుఱ్ఱము, అశ్వము, హయము.

**సప్పుఁజుక్క.** వై. వి. ఆశ్లేషానక్షత్రము.

**సప్పము.** వై. వి. పాము. "సప్పంబుపడగనీడను."

**సఫలము.** సం. విణ. (అ. ఆ. అ.) ఫలముతోఁగూడినది, సార్థకము.

**సఫేదు.** హిం. విణ. తెల్లని. వి. తెల్లవర్ణము.

**సబబు.** హిం. వి. కారణము.

**సబము.** వై. వి. పీనుఁగు "ఆ. అంటరానిదాని నంటిన్నిఁక బలితునసబంబుఁ బేడి నన్నుఁ బరవధూవ, రాయణుని నన్మింటు మృతదారకుఁ, జూచినేయవలయునాచమనము." మార్క. ౩, ఆ.

**సబళము.** దే. వి. ఆయుధవిశేషము, అత్తలము, ప్రాసము. "సబళముఁదద్గాత్రముఁదాఁకనేసెఁ శుత్రసోముండల్కతోడఁ." సం. "ప్రాసేనవిధ్వాద్రాణింతుశ్రుతసోమఃప్రతాపవాన్." భార. సా. ౧, ఆ.

**సబాము.** వై. వి. స్వభావము. "తే. పాలుకడుఁదెక్కుదానిసబాము లెస్స." భార. అను. ౨, ఆ.

**సబిడీ.** దే. వి. ఆయుధవిశేషము. "సబిడీలవంకులజముదాళులను." అచ్చ. యు, కాం.

**సబురు.** హిం. వి. ఓడప్రయాణము.

**సబ్బండు.** దే. విణ. అనేకభేదములుగలది, ఉచ్చావచము.

**సబ్బు.** దే. వి. జిడ్డునుపోఁగొట్టెడు ఒకవిధమైన కారము.

**సబ్రహ్మచారి.** సం. వి. న్. పుం. 1. వేదాధ్యయనమునందు సహపాఠి; 2. సహపాఠి.

**సభ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కొలువుకూటము; 2. గృహము; 3. సమూహము; 4. జూదము.

**సభర్తృక.** సం. వి. ఆ. స్త్రీ. మగనాలు, పతిపత్ని.

**సభాజనము.** సం. వి. అ. న. చుట్టములులోనగువారినాలింగనాదులచేత సంతోషపఱచుట. యాత్రాదులయందు బంధువులులోనగువారి యనుజ్ఞవడయుట. (అనికొందఱు.)

**సభాసదుఁడు.** సం. వి. ద్. పుం. సభయందుండు ధర్మజ్ఞుఁడు.

**సభాస్తారుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**సభికుఁడు.** సం. వి. అ. పుం. 1. సభయందుండు ధర్మజ్ఞుఁడు; 2. జూదమాడించువాఁడు; 3. న్యాయవాది.

**సభ్యము.** సం. వి. అ. పుం. హోమరహితాగ్ని.

**సభ్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. సభయందుండువాఁడు; 2. మంచివాఁడు.

**సమ.** సం. వి. ఆ. స్త్రీ. సంవత్సరము. విణ. 1. సమానము; 2. సమస్తము; 3. సాధువు.

**సమంగ.** సం. వి. ఆ. స్త్రీ. 1. మంజిటి; 2. ముడుఁగుదామర.

**సమంజసము.** సం. వి. అ. న. న్యాయము. విణ. న్యాయముతోఁగూడినది.

**సమంతదుగ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. జెముడు.

**సమంతభద్రుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

**సమకట్టు.** ద్వి. అ. క్రి. యత్నించు. "క. అమరాసురవీరులుము, న్నమలపయోరాశి ద్రచ్చియమృతమువడయఁ, సమకట్టి." భార. ఆది. ౨, ఆ.—స. క్రి. 1. సిద్ధపఱుచు; "కడఁకతోనంజుళ్లుగడుగంగసమకట్టిజలమపేక్షించుడు." భార. అర. ౨, ఆ.—2. సేకరించు; "సంభారసముదయముసమకట్టుము." భార. అర. 3, ఆ.—3. ఏర్పఱుచు; "పేరోజనుదాత్తయజ్ఞగృహయూపతతుల్ సమకట్టఁబంపు." భార. అర. ౬, ఆ.—4. చేయు. "అ. తండ్రి నీవునాకుదయతోడనిచ్చిన, వరముచిత్తగించివలయుతెఱఁగు, సమయసముచితముగ నమకట్టుమయ్య." భార. విరా. ౧, ఆ.—వి. కవ

చను. "క. జిల్లుకిచ్చెంబచ్చుల, పల్లకియును దన్నికంపుఁబత కపుజోడుఁ, జల్లులసమకట్టులరఁ, బల్లించినవారువము నఁబంగరు గొడుగుఁ." య. ర, ఆ.

**సమకుఱు.** ద్వ. అ. క్రి. సమకూరుయొక్క రూపాంతరము. "మేలుసమకుఱునచటఁ." భాగ. ర, స్కం. (చూ. చేకుఱు.)

**సమకూడు.** ద్వ. అ. క్రి. 1. లభించు; 2. సిద్ధించు.

**సమకూరు.** ద్వ. అ. క్రి. సమకూడుయొక్క రూపాంతరము.

**సమకూరుచు.** ద్వ. ప్రే. సమకూరఁజేయు. (రూ. సమకూర్చు.)

**సమకొను.** ద్వ. అ. క్రి. 1. లభించు; "క. సమకాలమునను నీత్రిత, యమునబ్బినముక్తిఫలదమగు నొకటొకటే, సమకొనినం కల్పితమం, త్రములగునత్యుచ్చసిద్ధిదములగుఁదలఁపఁ." వా. ర, ఆ.—2. సిద్ధించు. "ద్వి. అమరంగసిద్ధించునఖిలకార్యములు, సమకొనునంచితస్వర్గభోగములు." రా. బాల, కాం. (ప్రే. సమకొల్పు.) 1. లభింపఁజేయు; 2. సిద్ధింపఁజేయు; 3. సిద్ధపఱుచు; "వ. మఱియుసురులుజివురుఁగంజెలు మూరమ్ములుమొదలగు మృగయాసాధనమ్ములు సమకొల్పుచుఁదలయిచ్చియు." చంద్రా. ౩, ఆ.—4. వహించు. "సమకొల్పుధృతిఁ." రా. అ, కాం.

**సమకోలు.** ద్వ. వి. (సమకొనుట.) 1. లభించుట; 2. సిద్ధించుట.

**సమక్షము.** సం. విణ. (అ. ఆ. అ.) నయనేంద్రియగోచరమైనది.

**సమగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) సమస్తము.

**సమగ్రిమ.** సం. వి. న్. పుం. సమగ్రత. (రూ. సమగ్రిమను.)

**సమజము.** సం. వి. అ. న. అడవి. పుం. పశుసమూహము.

**సమజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. యశము. (రూ. సమాజ్ఞ.)

**సమజ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. సభ; 2. కీర్తి.

**సమత.** సం. వి. ఆ. స్త్రీ. 1. కావ్యగుణములలో నొకటి; 2. సమత్వము.

**సమదర్శి.** సం. విణ. (న్. ఈ. న్.) సర్వభూతములను సమముగాఁ జూచువాఁడు.

**సమదృష్టి.** సం. ఇ. స్త్రీ. సర్వభూతములను సమముగాఁజూచు చూపు.

**సమధికము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి యధికమైనది. (ఇది సమ్ అను ఉపసర్గముతోకూడినరూపము. ఇట్లు ఉపసర్గముతోకూడినపదములు కొన్నిమాత్రము వ్రాయఁబడునుగాని అన్ని వ్రాయఁబడవు. వ్రాయఁబడనివి కొన్ని యీదిగువ వ్రాయఁబడుచున్నవి.—సమారూఢము, సమాలోకించు, సమావృతము, సమాశ్రయము, సమాశ్రితము, సమాసాదనము, సమాసాదితము, సమాసాద్యము, సముచితము, సముత్థితము, సముత్పన్నము, సముత్సుకము, సముదితము, సముదమము, సముద్గీర్ణము, సముద్ధతము, సముద్ధరణము, సముద్ధృతము, సముద్భవించు, సముద్ఘాతము, సముద్యతము, సముద్వృత్తము, సమున్నతము. ఇత్యాదులు.) (తక్కిన వాని నిట్లూహించుకొనవలయును.)

**సమధిగమము.** సం. వి. పుం. పొందుట.

**సమను.** ఆం. వి. విచారణకై న్యాయాధికారులవలనఁ బిలువఁబడుట.

**సమన్వితము.** సం. విణ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

**సమపదము.** సం. వి. అ. న. విలుకాఁడు రెండుకాళ్లతో సమముగా నిలుచుట. (చూ. స్థానము.)

**సమభివ్యాహారము.** సం. వి. అ. పుం. 1. చెప్పినది త్రిప్పిచెప్పుట; 2. అత్యంతము.

**సమయపడు.** మి. అ. క్రి. సంకేతితమగు. "సమయపడినవానసంబు చేయవచ్చితిమి." భార. అర. ౧, ఆ.

**సమయము.** సం. వి. అ. పుం. 1. శపథము; 2. ఆచారము; 3. కాలము; 4. సిద్ధాంతము; 5. బుద్ధి; 6. సంకేతము; 7. ప్రతిజ్ఞ; 8. ఆజ్ఞ; 9. ఆన.

**సమయు.** వై. అ. క్రి. 1. చచ్చు; 2. నశించు. "సమసెనె కౌరవేశ్వరునిసంపద." భార. ద్రో. ౧, ఆ.

**సమరత.** వై. వి. సమర్త. "క. అ, ప్పావువ్వంబోఁడికిబాల్యము, జవ్వాడితోలంగెనంత సమరతపొడమెఁ." శుక. ౧, ఆ. (సమర్తకు మొదటిరూపము.)

**సమరతి.** సం. వి. ఇ. స్త్రీ. ఉపరతికివ్యతిరిక్తమైనది.

**సమరథుఁడు.** సం. వి. అ. పుం. ఒక విలుకానితో సరిగానిలిచి పోరెడి యోధుఁడు.

**సమరము.** సం. వి. అ. పుం, న. యుద్ధము, పోరు.

**సమరసము.** సం. వి. అ. పుం. 1. సమానరాగము; 2. అభేదము.

**సమర్త.** వై. వి. స్త్రీప్రథమఋతువు, సమరత.

**సమర్తాడు.** దే. అ. క్రి. (సమర్త+ఆడు.) ఋతుమతియగు.

**సమర్థనము.** సం. వి. అ. న. పట్టినదితగినట్టునెఱవేర్చుట.

**సమర్థము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అన్వయయోగ్యమైన యర్థముగలది; 2. హితమయినది.

**సమర్థించు** సం. స. క్రి. పట్టినదితగినట్టునెఱవేర్చు.

**సమర్థుఁడు.** సం. విణ. గట్టివాఁడు, నేర్పరి.

**సమర్థకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) వరమునిచ్చువాఁడు.

**సమర్యాదము.** సం. వి. అ. న. సమీపము. విణ. 1. సమీపమైనది; 2. మర్యాదతోఁగూడినది.

**సమవర్తి.** సం. వి. న్. పుం. యముఁడు. విణ. అంతట సమముగా వర్తించువాఁడు.

**సమవాకారము.** సం. వి. అ. పుం. నాటకభేదము. (చూ. నాటకము.)

**సమవాయము.** సం. వి. అ. పుం. 1. సమూహము; 2. కూడిన సంబంధము.

**సమవేతము.** సం. విణ. (అ. ఆ. అ.) కూడినసంబంధమునొందినది.

**సమష్టి.** సం. వి. ఇ. స్త్రీ. సమస్తము, మొత్తము. విణ. కలిసియుండు.

**సమష్టిల.** సం. వి. ఆ స్త్రీ. 1. ఏఱువంగ; 2 తురుజె.

**సమసకము.** వై. వి. (చూ.) సమాసకము.

**సమసనము.** సం. వి. అ. న. సంక్షేపము.

**సమసీసము.** ద్వ. మి. మల్లబంధవిశేషము.

**సమస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) సర్వము, అంతయు.

**సమస్య.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) కైపదము.

**సమాంసమీన.** సం. వి. ఆ. స్త్రీ. ఏఁటేఁటనీనెడియావు.

**సమాకర్షి.** సం. విణ. (న్. ఈ. న్.) దూరము వ్యాపించునట్టిది. (పరిమళము.)

**సమాఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. యశము; 2. బందుకట్టు.

**సమాగతము.** సం. విణ. (అ ఆ. అ.) 1. చేక్కగా వచ్చినది; 2. పొందినది.

**సమాగమము.** సం. వి. అ. పుం. 1. చక్కనిరాక; 2. పొందిక.

**సమాఘాతము.** సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. వధము.

**సమాచారము.** సం. వి. అ. పుం. 1. చక్కగా నడపుట; 2. వృత్తాంతము.

**సమాజము.** సం. వి. అ. పుం. 1. పశువులకంటె నితరమైన మనుష్యాదిసమూహము; 2. ఏనుఁగు.

**సమాధానపడు.** మి. అ. క్రి. (సమాధానము + పడు.) సమ్మతిపడు. (ప్రే. సమాధానపఱుచు.)

**సమాధానము.** సం. వి. అ. న. 1. కచ్చగా ఉంచుట; 2. అంగీకారము; 3. యూపస్తంభముయొక్క మధ్యభాగము.

**సమాధి.** సం. వి. ఇ. పుం. 1. మనోలయము; (ఇది యోగాష్టాంగములలో నొకటి.) (చూ. అంగము.) 2. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. కావ్యగుణములలో నొకటి; (చూ. గుణము.) 4. సమర్థనము; 5. నియమము; 6. అర్థోత్కర్షహేతు జనాదరము.

**సమానము.** ఉభ. వై. వి. సమ్మతి. "చ. మనమునఁజింతనొందక సమానముగాఁ జనుతారనీవునీ, వనితలును." రా. కిష్కిం, కాం.—సం. అ. పుం. నాభియందలివాయువు. (చూ. వాయువు.) విణ. 1. తుల్యము; 2. ఒకటి; 3. సాధువు.

**సమానోదర్యుఁడు.** సం. వి. అ. పుం. ఒకతల్లికడుపునఁబుట్టిన తోఁబుట్టువు.

**సమాపకము.** సం. విణ. (అ ఆ. అ.) 1. ముగించునది; 2. చంపునది.

**సమాపనము.** సం. వి. అ. న. 1. ముగించుట; 2. చంపుట.

**సమాప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముగిసినది; 2. చచ్చినది.

**సమాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ముగియిక; 2. చావు.

**సమాప్తించు.** సం. స. క్రి. 1. ముగించు; 2. చంపు.

**సమాప్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముగియఁదగినది; 2. చావఁదగినది.

**సమాలంభము.** సం. వి. అ. పుం. చందనములోనగువానిపూఁత. నలుఁగుపెట్టుట. (అనికొందఱు.)

**సమావృత్తుఁడు.** సం. వి. అ. పుం. వేదాధ్యయనానంతరము ఇఁక గృహస్థుఁడవుకమ్మని గురువుచే ననుజ్ఞపొందినవాఁడు.

**సమావేశము.** సం. వి. అ. పుం. 1. ఒకచోటకూడనుండుట; 2. ప్రవేశము.

**సమావేశితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒకచోటకూడనుండినది; 2. ప్రవేశించినది.

**సమాసంజనము.** సం. వి. అ. న. తగులము.

**సమాసంజితము.** సం. విణ. (అ. ఆ. అ.) తగిలినది. "వ. పురోవర్తి శాఖాసమాసంజిత సమంజసరత్నపంజరంబుననున్న నన్నుం జూచి." కళా. ౫, ఆ.

**సమాసకము.** సం. వి. అ. పుం. శుద్ధాంధ్రపదములసమాసము.

**సమాసము.** సం. వి. అ. పుం. 1. సమర్థములగు పదముల యేకీభావము; 2. సంక్షేపము.

**సమాసార్థ.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) సమస్య.

**సమాహారము.** సం. వి. అ. పుం. 1. చెదరినవి ఒకటిగా ప్రోగుచేయుట; 2. సంక్షేపము. (రూ. సమాహారణము.)

**సమాహితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చేక్కగా ఉంచఁబడినవాఁడు; 2. అంగీకరింపఁబడినవాఁడు; 3. సమాధియుందున్నవాఁడు.

**సమాహృతము.** సం. విణ. (అ. ఆ. అ.) సంక్షేపింపఁబడినది.

**సమాహృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సంక్షిప్తగ్రంథము; 2. సంక్షేపము.

**సమాహ్వయము.** సం. వి. అ. పుం. 1. నామధేయము; 2. ప్రాణిద్యూతము; 3. యుద్ధము.

**సమితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సమూహము; 2. యుద్ధము; 3. సంగమము.

**సమిత్తు.** సం. వి. త్. స్త్రీ. యుద్ధము, పోరు.

**సమిధ.** సం. వి. ధ్. స్త్రీ. 1. చిదుగు; 2. వంటచెఱకు.

**సమీకము.** సం. వి. అ. న. యుద్ధము, పోరు.

**సమీకరణము.** సం. వి. అ. న. ఒకటిగాఁజేయుట.

**సమీకృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఒకటిగాఁజేయఁబడినది.

**సమీక్షణము.** సం. వి. అ. న. 1. చక్కగా చూచుట; 2. వెదకుట.

**సమీక్ష్యకారి.** సం. విణ. (న్. ఈ. న్.) ఏపనియేనియుఁ జక్కగా యోచించి చేయువాఁడు.

**సమీచీనము.** సం. వి. అ. న. సత్యము. విణ. 1. సత్యమైనది; 2. పరిశుద్ధమైనది; 3. తగినది.

**సమీపము.** సం. వి. అ. న. చేరువ. విణ. చేరువైనది.

**సమీపించు.** సం. అ. క్రి. చేరువయగు.

**సమీరణము.** సం. వి. అ. న. 1. చక్కగా పోవుట; 2. పాఱవేయుట. పుం. మరువము. డు. 1. వాయువు; 2. బాటసారి.

**సమీరితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చేక్కగా పోయినది; 2. పాఱవేయఁబడినది.

**సమీరుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, అనిలుఁడు.

**సమీహితము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

**సముందనము.** సం. వి. అ. న. తడియుట, తేమము.

**సముఖము.** సం. వి. అ. న. ఎదురు. "కనికొనిపోయితం డ్రి సముఖంబునఁబెట్టిన." జై. ౮, ఆ.—విణ. మాటలమారి.

**సముచ్చయము.** సం. వి. అ. పుం. 1. చెదరినవాని నొకటిగా ప్రోగుచేయుట; 2. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

**సముచ్ఛ్రయము.** సం. వి. అ. పుం. 1. మిక్కిలి పొడుగు; 2. విరోధము. (రూ. సముచ్ఛ్రాయము.)

**సముచ్ఛ్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి పొడుగైనది.

**సముజ్ఝితము.** సం. విణ. (అ. ఆ. అ.) విడువఁబడినది. (చూ. ఉజ్ఝితము.)

**సముతు.** దే. వి. 1. కట్టుపాటు; వై. ౩, ఆ.– 2. తాలూకాలో నొకభాగము.

**సముతుపడు.** ద్వి. అ. క్రి. పట్టుపడు. (ప్రే. పట్టుపఱుచు. "తే. మస్తకముదువ్వి పలుమాఱు గుస్తరించి, సమరసముచూపి మెల్లనేసముతుపఱిచి, వాగెబిగియించితమ్మినూలా్వగెనడలి, పన్నె శోఁకినముందఱఁబఱవదయ్యె." చంద్రా. 3, ఆ.)

**సముత్థానము.** సం. వి. అ. న. 1. ప్రయత్నము; 2. వ్యాధి నిర్ణయము.

**సముత్పింజము.** సం. వి. అ. పుం. మిక్కిలి కలఁతపాటైన సేన లోనగునది, పింజలము.

**సముదయము.** సం. వి. అ పుం. 1. చక్కనియుదయము; 2. సమూహము; 3. యుద్ధము.

**సముదాయము.** సం. వి. అ పుం. 1. సమూహము; 2. యుద్ధము.

**సముదాయించు.** దే. క్రి. ఓదార్చు.

**సముద్గకము.** సం. వి. అ. పుం. బరణి, సంపుటము.

**సముద్దారు.** హిం. వి. సముకుకు అధికారి.

**సముద్ధతుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) గురువుచే శిక్షింపఁ బడనివాఁడు.

**సముద్ధూళించు.** సం. స. క్రి. (విబూది) పూసికొను. "సీ. భూతి సర్వాంగీణముగ సముద్ధూళించు ధరియించురుద్రాక్షదామక ములు." కాశీ. 2, ఆ.

**సముద్భాషించు.** సం. స. క్రి. స్తుతించు. "మ. కెలనఁ ముందఱ సిద్ధకింపురుషులుఁ గీర్వాణులుఁ నాగసా, ధ్యులు విద్యాధరకిన్నరేంద్రులు సముద్భాషింప." భీ. ౫, ఆ.

**సముద్రనవనీతము.** సం. వి. అ. న. చంద్రుఁడు, పాలకడలి వెన్న.

**సముద్రము.** సం. వి. అ. పుం. సాగరము, కడలి. (సప్తసముద్రములు.—లవణసముద్రము, ఇక్షుసముద్రము, సురాసముద్రము, సర్పిస్సముద్రము, దధిసముద్రము, క్షీరసముద్రము, జలసముద్రము.)

**సముద్రాంత.** సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁటకసిందరీ; 2. సిక్కరీ; 3. ప్రత్తిచెట్టు.

**సముద్రియము.** సం. విశ. (అ. ఆ. అ.) సముద్రముది.

**సమున్నద్ధుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. గర్వించిన వాఁడు; 2. చదువని తన్ను చదువరిగా నెంచుకొనువాఁడు; 3. పుట్టినవాఁడు.

**సమున్నము.** సం. విశ. (అ. ఆ. అ.) తడిసినది, ఆర్ద్రము.

**సమున్నయము.** సం. వి. అ. పుం. 1. వెనుకనున్నదండు; 2. సమవాయము.

**సమూఢము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రోగుచేయఁబడినది; 2. అప్పుడుపుట్టినది; 3. వంగినది.

**సమూరువు.** సం. వి. ఉ. పుం. తెల్లనిజూలును లావుమెడయును మెఱుఁగెక్కిన నున్నని వెంట్రుకలునుగలిగి గోధూమవర్ణముగానైనను కృష్ణవర్ణముగానైనను ఉండెడు మృగవిశేషము. (దీని తోలును జనులుపయోగపఱుచుకొందురు.)

**సమూహము.** సం. వి. అ. పుం. గుంపు, గుమి.

**సమూహ్యము.** సం. వి. అ. పుం. యాగాగ్నియందుపయోగింపఁ దగినవేరు, ఉపచాయ్యము.

**సమృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి సంపద, నిండు.

**సమృద్ధుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి సంపదగల వాఁడు, నిండుగలవాఁడు.

**సమేతము.** సం. విశ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

**సమేలము.** వై. వి. 1. ఒద్దిక; "సీ. అలనోకగావచ్చియప్పటప్పటికి సమేలంపుమాటల మేలమాడు." వి, పు. ౫, ఆ.– 2. చేరిక.

**సమ్మతము.** సం. విశ. (అ. ఆ. అ.) సమ్మతియైనది.

**సమ్మతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అంగీకారము; 2. అనుజ్ఞ; 3. ఇచ్ఛ.

**సమ్మతించు.** సం. అ. క్రి. అంగీకరించు. (రూ. సమ్మతిల్లు.)

**సమ్మదము.** సం. వి. అ. పుం. సంతోషము, సంతసము.

**సమ్మర్దము.** సం. వి. అ. పుం. 1. రాయిడి; 2. యుద్ధము.

**సమ్మాననము** సం. వి. అ. న. గౌరవించుట.

**సమ్మానము.** సం. వి. అ. పుం. గౌరవము.

**సమ్మానించు.** సం. స. క్రి. గౌరవించు.

**సమ్మానితము.** సం. విశ. (అ. ఆ. అ.) గౌరవింపఁబడినది.

**సమ్మార్జనము.** సం. వి. అ. న. శోధనము.

**సమ్మార్జని.** సం. వి. ఈ. స్త్రీ. చీఁపురుకట్ట, శోధని.

**సమ్మాళిగలు.** వై. వి. బ. సంబాళిగలుయొక్కరూపాంతరము. (పావలకు.–"సీ. అట్టిటుదొడిగినయంఘ్రులరత్నంపు సమ్మాళిగలు సారెజాఱుచుండ." (సంబాళిగలు అని పాఠాంతరము.) కళా. ౩, ఆ.)

**సమ్మితము.** సం విశ. (అ. ఆ. అ.) 1. సమానమైన పరిమితి గలది; 2. సమానము.

**సమ్మియు.** వై. వి. (చూ.) సెమ్మె.

**సమ్ముదము.** సం. వి. ద్. స్త్రీ. మిక్కిలి సంతోషము. "స, మ్ముదము మనంబునంబెరయ ముత్పులకల్ తనువల్లినిండి." వి, పు. ౬, ఆ.

**సమ్మూర్ఛనము.** సం. వి. అ. న. 1. మిక్కిలి మూర్ఛనొందుట; 2. అంతటు వ్యాపించుట.

**సమ్మృష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) శోధింపఁబడినది.

**సమ్మె.** వై. వి. కట్టుపాటు. (సమ్మెజోబు.) (సమ్మియయొక్క రూపాంతరము.)

**సమ్మెట.** యు. దే. వి. పెద్దసుత్తె, ముద్గరము. (చూ. దాయి.) వై. కళ. (చూ. చేఱుకోల.)

**సమ్రాట్టు.** సం. వి. జ్. పుం. తనయాజ్ఞచే రాజులనుశిక్షించి రాజసూయయాగముచేసిన మండలేశ్వరుఁడు.

**సయ్యాట.** ద్వి. వి. (సయి+ఆట.) 1. సహక్రీడ; "సీ. ఆమనితోడిసయ్యాటకై యచ్చోటి కరుగుదెంచినకానసిరియనంగ." య. 3, ఆ.–2. లీల; 3. స్త్రీపురుషులపరిహాసము. (రూ. సయ్యాటము. సహక్రీడకు.—"క. శయ్యకుఁదార్చి యనంగుని, సయ్యాటపుఁబట్టకంపుఁబదురులకపుడా, యయ్యదోరఁగొని." రామా. ౪, ఆ.—లీలకు.—"క. అయ్యావగపేటికినే, నియ్యెడనిదయున్నదాన నిల్వఁభూఁడునసుణ, నెయ్యమునఁదెచ్చె నిట్లోక,

సయ్యాటపుమాయ నెదురుచనుదెంచివెసన్." పర. ౪, ఆ.— స్త్రీ పురుషుల పరిహాసమునకు.—(చూ. కీలు మొదటియర్థము.)

**సయ్యాటించు.** దే. స. క్రి. పరిహసించు. "శా. అమండో ద్భవభీతమండరుచిసయ్యాటించుచున్ మత్సికా, స్తోమంబాతతపక్ష కుచ్ఛమగుచున్ దోలేరఁగా." పాండు. ౪, ఆ.

**సయ్యొద్ద.** దే. వి. (సయి+ఒద్ద.) చేరిక. (వారు మిక్కిలి సయ్యొద్దగానున్నారు.) (ఇది సమ్యోద్దె అని వాడఁబడుచున్నది.)

**సరంగు.** దే. వి. ఓడమాలిమికాఁడు, నావికుఁడు.

**సరంజాం.** హిం. వి. సరకులు, సామాను.

**సరంబీ.** అన్య. వి. బల్లకూర్పు.

**సరకట్టు.** దే. వి. (సరము+కట్టు.) వీణెమెట్టు. "సీ. తరుణాం గుళిచ్ఛాయ దంతపుసరకట్టులింగిలీకపురింతరంగులీన." స్వా. ౧, ఆ.

**సరకము.** సం. వి. అ. పుం, న. 1. కల్లు; 2. కల్లుత్రాగుట; 3. కల్లుత్రాగెడుగిన్నె; 4. కల్లునుచుట్టుకొనుట.

**సరకు.** దే. వి. 1. అమ్మఁదగినవస్తువు; 2. వస్తువు; "క. స౯కులు భారవహులకును, భరియింపఁగఁ గొల్లఁదియైనధంగిన్నిమో పుల్, నెరవుపడంగట్టుఁడుచె, చ్చెరశకటములు యత్నమునసేయుఁడు మీరల్." భార. శాం. ౧, ఆ.—3. లక్ష్యము. "మానవులాశ నరకనాకు." భార. ఉద్యో. ౩, ఆ. "చ. అమరపదంబు మెచ్చ రమరాధిపులీలగణింపరేమియున్, గమలభవత్వమున్ సరకుగాఁ గొనరాఖలితార్థధర్మ మోక్షములతెఱంగుచీరికినిగైకొన రచ్యుతదాస్య వృత్తిపై, నమితసుఖానుభూతినమృతాంబుధిఁదేలుచునుండుసాత్వి కుల్." లక్ష్మీ. ౫, ఆ.

**సరకుగొను.** దే. స. క్రి. (సరకు+కొను.) లక్ష్యపెట్టు. "సరకు గొందునెద్రోణునిఁ దోడియోధులన్." భార. ద్రో. ౩, ఆ.

**సరకుసేయు.** దే. స. క్రి. (సరకు+చేయు.)——పై.—— "సీ. నాదుహూపంబు మనంబునఁ జిక్కినఁ దరుణితక్కొరునేల సరకుసేయు." భార. విరా. ౩, ఆ.

**సరగ.** వై. క్రి. విశే. శీఘ్రముగ. "సరగనీవుమరలిరమ్ము." భార. అను. ౩, ఆ.

**సరగు.** వై. వి. వేగము. (చూ. సంద్రుఁడు.)

**సరఘ.** సం. వి. ఆ. స్త్రీ. మధుమక్షిక, తేనెటీఁగ.

**సరటము.** సం. వి. అ. పుం. తొండ, కృకలాసము.

**సరడు.** వై. వి. స్త్రీలు మెడనుధరించెడు బంగారపుశిక్కీఁగ.

**సరణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. త్రోవ; 2. వరుస.

**సరదారు.** వై. వి. 1. శూరుఁడు; 2. రౌతు*. "సీ. హరులు మ్రగ్గినడిగ్గియనిపిఁగుసరదార్లు సరదార్లువడినవోవరిలుహరులు." చంద్ర.

**సరదు.** దే. స. క్రి. సమభాగముగాపంచు. "తే. చలిదియుతలఁదం దఱుకునిట్లునరదిపెట్టు, నదిశలాయెుకయెుకముద్దెఁడారగించి." పర. ౪, ఆ. (చూ. సరసు.)

**సరఫరా.** హిం. వి. కావలయువాటిని సంపాదించుట.

**సరబడి.** దే. వి. ద్వారము. "సీ. కోటలుకొమ్మలుక్రొత్తడంబులు పెద్దగవఁకులునరబల్లుగట్టిపటిచి." అచ్చ. యు, కాం. "ఇనవంశ మణియొద్దనెవ్వారిసరబడిఁగొలువ్వుపట్టితివి." రామా. ౬, ఆ. "ఎ, గీ. తలఁచితనసరబడినెల్లదళముఁగూర్చు." పంచ. నా. ౧, ఆ.

**సరమ.** ఉభ. వై. వి. శ్రమము. (చూ. సరమగొను.) సం. ఆ. స్త్రీ. 1. విభీషణునిపెండ్లాము; 2. ఆఁడుకుక్క; 3. వేలుపు కుక్క.

**సరమగొను.** దే. అ. క్రి. (సరమ+కొను.) శ్రమపడు. "వ. పరమపుణ్యసరమనరమగొనకజనకజంగూడిభయనివారణంబు సేయుచు." రామా. ౭, ఆ.

**సరము.** ఉభ. వై. వి. 1. ముక్కుగాలి; (చూ. కొసరు. స. క్రి.) 2. వడ్డాది. (చూ. సరకట్టు) సం. అ. పుం. 1. హారము; 2. మీఁదిపెరుఁగు; 3. గమనము.

**సరపడి.** దే. వి. (చూ.) ఈడిక.

**సరవి.** దే. వి. క్రమము. "వానలు సరవితోవర్షించె." స్వా. ౬, ఆ.

**సరవెంద.** దే. వి. నెరవెంద, తీక్ష్ణగంధి*.

**సరస.** ఉభ. దే. వి. సమీపము. "శా. నాచిత్తంబునవిత్తఱంగు నొడమెన్నాగారిమున్నైచనన్, బ్రాచీదిక్కుఖుఁడైన నాకుసరసన్ బ్రద్యుమ్నుఁడున్నీవుహో, లాచాతుర్యముదాపటన్ వలపటన్ లావైపచారింపధా, శ్రీచారంబునమోహరింతముపురారింజేరలేఁ డెమ్మెయిన్." ఉ, హరి. ౬, ఆ. – సం. ఆ. స్త్రీ. తెల్లతెగడ*. విశే. రసముతోఁగూడినది.

**సరసర.** వై. క్రి, విశే. (సరగ+సరగ.) మిక్కిలి శీఘ్రముగ. "ద్వి. సరసరగొనివచ్చి" భాగ. ౪, స్కం.

**సరసి.** సం. వి. ఈ. స్త్రీ. సరస్సు, కొలను, కుంట.

**సరసిజనాభుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు, పద్మనాభుఁడు.

**సరసిజభవుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, తమ్మిచూలి.

**సరసిజము.** సం. వి. అ. న. కమలము, పద్మము, తామర.

**సరసీరుహము.** సం. వి. అ. న.——పై.——

**సరసు.** దే. స. క్రి. (చూ.) సరదు. "తే. జంతయిటులల్లియుండ రాజంతనచట, సరసిచెంతబిసాగ్రంబుసరసికొంత, మగనికందిచ్చు కోకిప్రేమగనితనదు, దుండియెడఁదగులెంచియుండుడియపుడు." సా. ౩, ఆ.

**సరస్వంతము.** సం. వి. త్. పుం. 1. సముద్రము; 2. ఒకా నొకనదము.

**సరస్వంతుఁడు.** సం. వి. త్. పుం. 1. కుబేరుఁడు; 2. రసికుఁడు; 3. తెలిసినవాఁడు.

**సరస్వతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పలుకుఁజెలి; 2. పలుకు; 3. నది; 4. నదీవిశేషము; 5. ఆవు; 6. స్త్రీలలో శ్రేష్ఠురాలు; 7. మనువుపెండ్లాము.

**సరస్సు.** సం. వి. స్. న. 1. కొలను; 2. జలము.

**సరళ.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లతెగడ*. అ. పుం. ము. 1. గకారాది వర్గతృతీయవర్ణము; 2. ఒకానొకచెట్టు. విశే. 1. ఔదార్యము గలది; 2 వంకరకానిది.

**సరళద్రవము.** సం. వి. అ. పుం. (చూ.) వృక్షధూపము.

**సరాగము.** ఉభ. దే. వి. ఒద్దిక. "అన్నదమ్ములసరాగమువారలదే సుమీ." విజ. ౧, ఆ. "క. రాగముచిగురాకునకను, రాగము బోఁటులకుపునపరాగమువనికిన్, రాగముమధుకరములకును, రాగ ముగృహులకునుగల్గెరహినవేళన్." రసి. ౩, ఆ. – సం. విశే. (అ. ఆ. అ.) రాగముతోఁగూడినది,

**సరాతి.** దే. వి. గోడవలె గుడారముచుట్టు నేర్పఱచినతెర. "సీ. పాథోధిపుతపీడుపట్టుచొక్కపుగుడారంపుహొంబట్టు సరాతియ నఁగ." ఉ, రా. ౧, ఆ.

**సరాసరి.** ద్వ. వి. (సరసిన+సరి.) సరసిచూడఁగానైన సమత్వము. (ఈ కెంపులన్ని సరాసరికి ఏమివెల.)

**సరాళము.** సం. విణ (అ. ఆ. అ.) సరళముయొక్కరూపాంతరము. "సీ. కల్లోలడోలానమల్లోలలీలాసరాళమరాళవాచాలఘురము." రామా. ౫, ఆ.

**సరి.** యు. దే. వి. సరియ. "సీ. ఘనభోగభాగ్యసంగతులైనమంత్రికే సరులేడసరులేడఁజంద్రవదన." కా. ౫, ఆ.–వై. హారము "విరి సరికొప్పునందుచెమి." రస. 3, గుచ్ఛము.–విణ. ఏ. 1. సమము; "అవి దీనికి సరిగావు." భార. సభా. ౧, ఆ. (ఇది ఒకానొకచో బహువచనాంతముగాఁ గానఁబడుచున్నది. "తే. ఇరులు గెలిచిన యంతఃపురేందుముఖుల, కురులుమరుఁడనువేఁటకాఁడురులుసేసి, మరులుగొలుపంగలేఁడయ్యెమనుజవిభుని, సరులులేనిదృక్షంజనశాబకముల." నై. 3, ఆ.) – 2. యుక్తము*; (అది సరికానిపని.) 3. సమాప్తము*; (ఈ యుత్సవము నేటితోసరి.) 4. ఋజువు*. "చనుదెంచెనయోధ్యనుండి సరియిందులకుఙా." భార. ఆర ౨, ఆ.–క్రి, విణ. పూర్ణముగా*. "ప్రభుఁడుర్వియెల్లసరిపసునొకండువేలేఁడులేలిచనియె." భార. ఆర. 3, ఆ. – అవ్య. అంగీకారార్థకము*.

**సరించు.** సం. అ. క్రి. పోవు. "సరించెవెంబడిఙా." నై. 3, ఆ.

**సరిక.** సం. వి. ఆ. స్త్రీ. నూఱుపేటలహారము.

**సరికట్టు.** ద్వ. అ. క్రి. సరిదాఁకు, సరిపడు.

**సరికడచు.** ద్వ. అ. క్రి 1. మించుమించు; "వ. త్రిభువనానంద మాకందవాటికావసంతంబైన యావృత్తాంతంబు సరికడచె." నై. 2, ఆ.–2. మీఱు. "తే. మోసమగునప్పుతీర్పకమున్నె యొక్క, గడియ తడవైన మితిసరికడచెనేని, క్షితితలేశ్వర నిన్ను బొంకింపఁబూని, కంకణముగట్టుకొన్నాఁడుగాధిపట్టి." హరిశ్చ. ర, ఆ.

**సరిగ.** వై. వి. 1. హారము; "జడలఁ గ్రొన్నెలమెడఁబాఁపసరిగ." ఉ, హరి. ౨, ఆ.–2. జలతారు*. "సరిగంచుకోక."

**సరిగస్తు (షహర్ గస్తు.)** హిం. వి. ఊరేగింపు.

**సరిగొను.** ద్వ. స. క్రి. (సరి+కొను.) చంపు, రూపుమాపు. "క. భూరిశ్రవుండుసచ్చుట, సైరింపక సూతసుతుఁడుసాత్యకి తోడఙా, బోరందొడంగెమనమువి, చారింపకయెయిదవలయుసరి గొనకుండఙా." భార. ద్రో. ర, ఆ. "సీ. సరియన్నవిరిపొన్న సరిగొన్నగరిమచే గంభీరమగునాభిఁగాంచుదాని." శశాం. ర, ఆ.

**సరిచేయు.** వై. స. క్రి. నాశముచేయు. "చేనువచెట్టులెల్లసరిచేసి." ఉ, రా. ౭, ఆ.

**సరిచూచు** వై. స. క్రి. సంప్రతించు.

**సరితరము.** దే. వి. భూమిని సారమునుబట్టి తరగతులుగా నేర్పఱచుట.

**సరితూఁగు** ద్వ. అ. క్రి. సమానమగు. "నాతోసరితూఁగరమ్మ." రా, వి. 3, ఆ.

**సరిత్తు.** సం. వి. త్. స్త్రీ. నది, తటిని, ధుని, ఏఱు.

**సరిత్పతి.** సం. వి. ఇ. పుం. సముద్రుఁడు, ఏటిఱేఁడు.

**సరిదాఁకు.** ద్వ. అ. క్రి. (సరి+తాఁకు.) సరికట్టు, దృష్టాంతమగు. "మునుచెప్పినట్టికతలుఙాదలపోయయథార్థముల్ మనంబున సరిదాఁకెనాకు." కళా. ౨, ఆ.

**సరిపడు.** వై. అ. క్రి. 1. అనుకూలమగు; 2. యుక్తమగు; 3. సమానమగు. (ఒకానొకచోట సరిఁబడు అని ప్రయోగము కానఁబడుచున్నది. "ఉ. చేవడివీణెమీటుటయుఁ జొక్కొడలించుటయుఙాసరింబడఙా." ఆము. ౧, ఆ.)

**సరిపణి.** ద్వ. వి. సరిపెణయొక్కమాఱురూపము. "ఎ, గీ. పచ్చలకడెంబులుసరిపణులుపూని." కవి. 3, ఆ. "ఎ, గీ. భ్రమరపజ్తులుపై సరిపణులుగఁగ." రాఘ. ౨, ఆ. (రూ. సరిపణీ, "హురుమంజిముత్తెంపుసరిపణీలు." చంద్రా. ౨, ఆ.)

**సరిపెట్టు.** ద్వ. స. క్రి. 1. సరిచేయు; 2. చంపు.

**సరిపెణ.** ద్వ. వి. (సరి+పెన.) బంగారుతోనగువానిగొలుసు. "సీ. అనిలనటోక్తనాట్యక్రీడఁదగులతాబింబోష్ఠులకుసరిపెణలొసంగె." అని. ౨, ఆ. (సంధిని వర్ణవికారము.)

**సరిపోవు.** ద్వ. అ. క్రి. 1. సమానమగు; "వ, పెద్దలంజెనకియొడిసరియైతిననియు, సరిపోయిజయించితిననియునబద్ధంబులాడి." ఆము. ౬, ఆ. – 2. సమాధానమగు; "చ. మనసున కొండురెండుమఱిమంత్రములఙా సరిపోవఁజెప్పినఙా." ఆము. ర, ఆ.–3. అయిపోవు; "మ. తెరవట్టించినవేళ చేతిపిలసద్దివ్యప్రసూనాస్త్రముల్, సరిపోనేసెరతీశుఁడు." కవిక. 3, ఆ.–4. సరించు. "ఉ. ఈతఁడుపద్మతీర్థమున శేగి యొకానొకనాఁడుతప్పయో, ధౌతనిజాంగుఁడై చనుకతంబున విప్రవధాదిపాతక, వ్రాతముఁదొంటిపుట్టువులఁ బ్రాప్తములైన యఘంబులుఙామరు, ద్ధూతఘనాఘనావళులతోసరియైసరిపోయెనన్నియుఙా." పాండు. ౫, ఆ. (ప్రే. సరిపుచ్చు.)

**సరిప్రొద్దు.** వై. వి. సగమురాతిరి. "వ. నృత్తగీతవాద్యంబులు ప్రవర్తిల్లసరిప్రొద్దుపోవునందాఁక జాగరంబుచేసి." కాశీ. ర, ఆ.

**సరిబిత్తరము.** ద్వ. వి. మల్లబంధవిశేషము.

**సరిబేసులు.** ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. ఈలకూఁతలు.)

**సరియ.** దే. వి. 1. పగుల్లువాఱినసందు; "కొండసరియ." భల్లా. 3, ఆ. "క. హరిపదపీఠస్థలిఁగల, సరియనుఁజొట్టెలుకడాఁగె." పాండు. ర, ఆ.–2. సందు. "పండ్లసరియ." స్వా. ర, ఆ.

**సరియగు** ద్వ. అ. క్రి. (సరి+అగు.) నశించు. (చూ. దిససరి.)

**సరియించు.** దే. స. క్రి. అఖండమునకు నూనెసిద్ధముచేయు.

**సరిహద్దు.** దే. వి. పొలిమేఱ.

**సరీసృపము.** సం. వి. అ. పుం. పాము, సర్పము.

**సరుగు.** దే. అ. క్రి. పెరుఁగు, వర్ధిల్లు. రగడ. "సరిగెనానాలతాజాలములుసాలములు." రాఘ. ౨, ఆ.

**సరుడు.** వై. వి. 1. బాణము; "ఎ, గీ. పురుడువాక్రువ్వఁగా రానిసరుడువాని." చంద్రా. ౧, ఆ. – 2. గఱిలేనిబాణము*. సురుఁగు. (అనికొందఱు.)

**సరుదు.** దే. వి. 1. ఎల్ల, మేర, సీమము; (దీనినే సరిహద్దు అని వాడెదరు.) 2. వరద.

**సరువు.** హిం. వి. ఒక విదేశపుచెట్టు.

**సరేసు.** దే. వి. ఒకదినుసుబంక. (దీనిని వజ్రమందురు.)

**సరోజము.** సం. వి. అ. న. తామర, కమలము, పద్మము.

**సరోజిని** సం. వి. ఈ. స్త్రీ. 1. తామర; 2. తామరకొలను.

**సరోరుహము.** సం. వి. అ. న. తామర, అరవిందము.

**సర్కారు.** హిం. వి. ప్రభుత్వమువారు.

**సర్ క్యూటు.** ఆం. వి. దేశసంచారము.

**సర్గము.** సం. వి. అ. పుం. 1. అధ్యాయము; 2. విసర్జనము; 3. నిశ్చయము; 4. ఉత్సాహము; 5. మోహము; 6. స్వభావము; 7. సృష్టి. [ఇది నవవిధము. — మహత్సర్గము, అహంకార సర్గము, భూతసర్గము, ఇంద్రియసర్గము, దేవసర్గము, (ఇది యష్టవిధము.) తమస్సర్గము, (ఇవి యాఱు ప్రాకృతములు.) వనస్పత్యాదిసర్గము; (ఇది షడ్విధము.) తిర్యక్సర్గము, (ఇది యష్టావింశతిద్విధము.) మనుష్యసర్గము. (ఇవి మూఁడు వైకృతములు.) కుమార సర్గంబని యొకటిగలదు. అది తదంతర్భూతంబ. భిన్నంబుగాఁ గైకొన్నయెడ దశవిధసర్గంబగు.] (ఇది పురాణలక్షణములలో నొకటి.) (చూ. లక్షణము.)

**సర్జకము.** సం. వి. అ. పుం. 1. జీవకమను గంధద్రవ్యము; 2. వేఁగిసచెట్టు.

**సర్జము.** సం. వి. అ. పుం. మద్దిచెట్టు.

**సర్జరసము.** సం. వి. అ. పుం. 1. యక్షధూపము; 2. వాద్య భాండవిశేషము.

**సర్జికాక్షారము.** సం. వి. అ. పుం. సజ్జీకారము.

**సర్పము.** సం. వి. అ. పుం. పాము, అహి, భుజంగము.

**సర్పరాజు.** సం. వి. అ. పుం. సర్పములలో ముఖ్యమయినది, వాసుకి.

**సర్పశిరము.** సం. వి. స్. పుం. అభినయహస్తవిశేషము.

**సర్పి.** సం. వి. స్. న. 1. నేయి; 2. జలము.

**సర్వ్య.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతకిచ్చెడుమందు, కాయము.

**సర్వంసహ.** సం. వి. ఆ. స్త్రీ. భూమి, పుడమి.

**సర్వజనీనము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సమస్తజనులకు సంబంధమైనది; 2. సమస్తజనులకు హితమైనది.

**సర్వజిత్తు.** సం. వి. త్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**సర్వజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. శివుఁడు. విశే. సమస్తమునెఱిఁగినవాఁడు.

**సర్వతోభద్ర.** సం. వి. ఆ. స్త్రీ. గుమ్ముడుచెట్టు. అ. పుం. ము. 1. శబ్దాలంకారవిశేషము; 2. నాలుగుదిక్కులవాకిండ్లుగల రాజగృహము; 3. వేముచెట్టు.

**సర్వతోముఖము.** సం. వి. అ. న. 1. ఆకాశము; 2. జలము. పుం. డు. 1. ఆత్మ; 2. బ్రహ్మ; 3. శివుఁడు.

**సర్వత్ర.** సం. అవ్య. అంతట. "క. ధాత్రీపులకర్జునునకు సర్వత్ర జయముఁబుత్రుచేఁబరాభవముఁగనం, బాత్రము." జై. ౭, ఆ.

**సర్వదా.** సం. అవ్య. ఎల్లప్పుడు. "క. ఒకవర్షశతంబుననొం, డొకతీర్థమునందుఁగల ప్రయోజనలాభం, బొకదివసంబునవానం, దకానవమునందుసర్వదాసిద్ధించుఁజా." కాశీ. ౭, ఆ.

**సర్వదుంబాలా.** హిం. వి. పన్నులేనిమాన్యము.

**సర్వధారి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**సర్వధురీణము.** సం. వి. అ. పుం. అన్నిబరువులను మోసెడి యెద్దు.

**సర్వభక్షకుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని. విశే. అన్నిటిని భక్షించువాఁడు.

**సర్వమంగళ.** సం. వి. ఆ. స్త్రీ. పార్వతి, గౌరి, చూలి.

**సర్వము.** సం. స. (అ. ఆ. అ.) సమస్తము, అంతయు.

**సర్వరసము.** సం. వి. అ. పుం. సర్జరసముయొక్కరూపాంతరము.

**సర్వల** సం. వి. ఆ. స్త్రీ. చిల్లకోల, తోమరము. (చూ. శర్వల.)

**సర్వలింగి.** సం. వి. న్. పుం. వేదబాహ్యుఁడు, పాషండుఁడు.

**సర్వవేదుఁడు.** సం. వి. స్. పుం. సమస్తధనమును దక్షిణగానిచ్చి విశ్వజిదాదియజ్ఞమును చేసినవాఁడు.

**సర్వాంగీణము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎల్లయవయవముల సంబంధముతోఁగూడినది; 2. ఎల్లయవయవములయందు వ్యాపించినది.

**సర్వానుభూతి.** సం. వి. ఇ. స్త్రీ. తెల్లతెగడచెట్టు.

**సర్వాన్నీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అందఱియన్నమును భుజించువాఁడు; 2. అన్నివిధములైన యన్నమును భుజించువాఁడు.

**సర్వాభిసారము** సం వి. అ. పుం. యుద్ధమునకు సమస్తబలము నాయిత్తపడుట.

**సర్వార్థసిద్ధుఁడు.** సం. వి. అ. పుం. శాక్యబుద్ధదేవుఁడు.

**సర్వీ.** ఆం. వి. పొలములను కొలచుట మొదలగుపనులు.

**సర్వేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. 1. ఈశ్వరుఁడు; 2. సార్వభౌముఁడు.

**సర్వోఘము.** సం. వి. అ. పుం. (చూ.) సర్వాభిసారము.

**సర్షపము.** సం. వి. అ. పుం. ఆవాలు.

**సట్టు.** దే. వి. మ్రుక్కుటయందగు ధ్వన్యనుకరణము. "వెలుఁగుల జేనిలేవెలుఁగువేఁడిమిసట్టునమ్రుక్కు." చంద్రా. ౨, ఆ.

**సలి.** దే. వి. పేటికాలువ లోనగువాని కీల్లు అవలికిఁబోవుటకు నడుమ నడ్డముగానిలిపెడు జల్లితడిక.

**సలక.** దే. వి. 1. చిన్నగోనె; (చూ. అడిగము.) 2. రెండున్నర తూము.

**సలగ.** దే. వి. సలగపాఱ, పాఱచిప్ప.

**సలగము.** వై. వి. విష్ఠ, మలము.

**సలవ.** దే. వి. సలగయొక్కరూపాంతరము.

**సలసల.** దే. వి. క్రాఁగుటయందును తెర్లుటయందునునగు ధ్వన్యనుకరణము. "సీ. పన్నీరనుచునన్నుబ్రమయించి యక్కటా సలసలఁగ్రాఁగుక్రొంజిమురుచల్లి." చంద్ర. "సరసిపైనీరు సలసలఁ దెరలె." పాండు. ౧, ఆ.

**సలహా.** హిం. వి. ఆలోచన, సమ్మతి.

**సలాక.** వై. వి. బంగారులోనగువానికమ్మి. "ఆ. కెంపుఱాలనడుమ సొంపారుపనీఁడిన, లాకవోలెసీతలలీఁదనర్చె." అచ్చ. యు, కాం.

**సలాపము.** దే. వి. సముద్రములో ముత్యాలచిప్పలేఱుట.

**సలాము.** హిం. వి. నమస్కారము. "సలాముసేతు సముదండజ రాజవిరాజమానవేదండ." రా, వి. ౪, ఆ.

**సలి.** దే. వి. సందడి. "క. సలిచప్పుడులేకమ్రొయిఁ, దొలఁగినసైన్యంబు." ఉ, హరి. ౩, ఆ.

**సలించు.** వై. అ. క్రి. చలించు. "చ. చఱచిపోక చాలింపక సలింపక." ఉ, హరి. ర, అ.

**సలికము.** దే. విణ. అల్పము. (చూ. నేలతొలుపు రెండవయర్థము.)

**సలిగ.** దే. వి. ప్రాపు, ఆశ్రయము. (నీకు వాని సలిగయుండఁగా భయమేమి.)

**సలితము.** దే. వి. కొలువుడుకానిని కొలువునుండి త్రోయుట. (కొలువునందుఁజేర్చుకొనుట లావణము.)

**సలిలము.** సం. వి. అ. న. ఉదకము, జలము, నీరు.

**సలీసు.** హిం. విణ. సులభమయిన.

**సలుగ.** దే. వి. 1. ధాన్యముకొలుచునపుడు నిర్ణీతసంఖ్యముగిసిన తోడనే గుఱుతుకైదోసిటితోనెత్తిపోసెడు ధాన్యపుకుప్ప; 2. కొలుచువానికి పుట్టికింతయనియిచ్చెడు పెచ్చుధాన్యము; 3. పెచ్చు; 4. రూపాయలులెక్కింపునపుడు యెంచునపుడు నిర్ణీతసంఖ్య ముగిసిన తోడనే గుఱుతుకైయెత్తియుంచెడు రూపాయలెక్కనగునది. (చూ. సలువ.) (దీనినే సలగయని వాడెదరు.)

**సలుగు.** వై. వి. పీడుపంది.

**సలుపు.** దే. ప్రే. చేలుపుయొక్క రూపాంతరము.

**సలువ.** దే. వి. సలుగయొక్క రూపాంతరము (పెచ్చునకు. — "వ. ఋణశుద్ధిగావలసినవాఁడునురఁబోలెమననిలువసలువమనకుం బ్రవేశించినట్లయై యుండమాయవన్నించెంగావలయు." పర. ర, అ.)

**సలువు.** వై. వి. సలుగుయొక్క రూపాంతరము.

**సల్లకి.** సం. వి. ఈ. స్త్రీ. అందుగు*.

**సల్లపనము.** సం. వి. అ. న. సల్లాపము. "వాక్యవిస్తరచతురత్వమేర్పడఁగ సల్లపనంబొనరించు." భార. విరా. ౧, అ.

**సల్లాపము.** సం. వి. అ. పుం. పరస్పరసంభాషణము.

**సల్లాపించు.** సం. వి. అ. పుం. పరస్పరము సంభాషించు.

**సవ.** దే. వి. జోడు. "వ. అప్పురిమళంబు సవపట్టుకొనిపోయి." కాశీ. ర, అ. (ఆమ్రేడితమునందు సవసవ. "వ. ఆదొప్పయంబు సవసవగాఁదెలిసి." సాన. ౫, అ.)

**సవడి.** దే. వి. సవ్వడియొక్క రూపాంతరము.

**సవతాలు.** దృ. వి. (సవతి+ఆలు.) సవతి. "తే. దాసియైసవతాలికిఁదల్లివనులు, చేసిమెలఁగంగ." భార. అను. ౧, అ.

**సవతి.** వై. వి. తోడిపెండ్లాము, సపత్ని.

**సవతితల్లి.** దృ. వి. మాఱుతల్లి, విమాత.

**సవతు.** వై. వి. ఏ. సామ్యము*. "సవతులేనియభిరవాకారంబుతోడ." భో. 3, అ.—విణ. సమానము*. "క. సురదైత్యయక్షరాక్షస, నరఖేచరసిద్ధమునిగణప్రవరులభా, సురతపములునాదగుదు, ష్కరఘోరతపంబుసవతుకావమరేంద్రా." భార. ఆది. 3, అ.

**సవదండవల.** దృ. వి. ఒకదినుసువల. (చూ. వల.)

**సవదరించు.** వై. స. క్రి. వహించు, తాల్చు. "సీ. సవదరించుటయెట్లుజఠరగోళమునందునవమమాసావసానఁబుదాఁక." కాశీ. ర, అ.

**సవనము.** సం. వి. అ. న. 1. యజ్ఞము; 2. స్నానము; 3. సోమపానము.

**సవము.** ఉభ. వై. వి. సగముయొక్క రూపాంతరము. (వృత్తియందు హల్లుపరముగుచో వికల్పముగ సంత్యవర్ణలోపము. "సీ. సందెప్రద్దునుండినవరేయిగడచనసమ్ముఖమ్మునఁగొల్చినంవసించు." పాండు. ౫, అ.)—సం. అ. పుం. 1. యజ్ఞము; 2. కల్లుతేట.

**సవయస్కుఁడు.** సం. వి. అ. పుం. స్నేహితుఁడు. విణ. సమానవయస్సుగలవాఁడు.

**సవర.** దే. విణ. 1. చక్కనైనది; "క. శివునికినెఱపీరంబును, వివరింపఁగనితరమైనవేల్పులకెల్లన్, గవగొను నరవీరంబులు, సవరగ నిర్మింపఁబ్రతియెశాస్త్రములందున్." భల్లా. ౨, అ.—2. చదునైనది.

**సవరచేయు.** దృ. స. క్రి. 1. చక్కఁజేయు; "సీ. చేదోయి యొత్తునఁజేసినెత్తురులైనయవయవంబులు నోరసవరచేయు." నై. ౨, అ.—2. చదునుచేయు. "అ. వివమకరినివిమ్మ వీథివిటంకంబు, సంతతాంతరములసరసియరసి, యత్నకర్దమమునయుష్మత్వ రాదులు, సవరచేసెరధికసంభ్రమమున." భీమ. ౫, అ.

**సవరణ.** దే. వి. 1. వాహనాద్యలంకరణము; "సీ. రథగజహయంబులసవరణలునపూర్వధంగి, నొప్పియరిభీషణంబులైయుండవలయు." భార. శాం. ౨, అ.—2. పరికరము; "వ. ఈశ్వరాదిదేవతలుసమకట్టిన సవరణగలయజ్ఞునచేత నిర్జింపంబడిన యుష్కృష్టజాతులనేకులుగలుగుట యెఱుంగుదురుకాదె." భార. ఉద్యో. ౨, అ.—3. సేవ; "క. అవుఁబేసారముఁగృషియున్, సవరణయును బనులఁ బొంపుసరి." భార. శాం. ౨, అ.—4. సామ్యము. (చూ. ఎత్తువోవు రెండవయర్థము.) (రూ. సవరణము.)

**సవరణసేయు.** దృ. స. క్రి. (సవరణ+చేయు.) వాహనాదుల నలంకరించు. "క. ఇభములాదిగవా, హనములసవరణసేయక." భార. మా. ౧, అ.

**సవరణించు.** దే. స. క్రి.——వై.——"సీ. విఖ్యాతికెక్కిన వెలిమావుసాటిగా సైంధవంబులనెల్లసవరణించు." కా. ర, అ.

**సవరన.** దే. వి. 1. చక్కన; 2. చదును. "ద్వి. అవయవంబుల గంటులన్నియుమాని, సవరనైతొల్లిటిజాడనెయుండె." నవ. 3, ఆ. (విశేషణమైనచో "సవరనిపీఁట." వై. ౧, అ.) (చూ. అలకన.)

**సవరపుమెకము.** వై. వి. జల్లిమెకము, చమరమృగము.

**సవరము.** వై. వి. చమరమృగముతోఁక*.

**సవరలు.** దే. వి. చెంచు, శబరాదిజాతులఁబోలిన యడవిజనులు.

**సవరించు.** దే. ప్రే. (సవరిల్లఁజేయు.) 1. అలంకరించు; "ప్రియాగమవేళగృహముఁదనువు సవరించునింతివాసకసజ్జ." కా. ౨, అ.—2. చక్కఁబఱచు; "చ. ప్రదిలినశీర్ణనేలసవరించు తలఁదరినోర్తుఁగాంచి." నై. 3, అ.—3. కూర్చు; "దానికి బహుసాధనంబులు సవరించుకొని." భార. శాం. 3, అ. "ఆహూవార్జితమతినొండునారిసవరించి." వై. ౫, అ.—4. తాల్చు; "వ. ఏయాయుధంబునీకుంబరిచయంబైయుండునదిసవరించుకొని నాతోడందలపడుదుగానిరమ్మనియె." భో. ౫, అ.—5. చేయు. "సీ. సవరించు నొకవేళ జలవిహారముచాలఁ బ్రేమ భీమరథీగభీర వారి." పాండు. ర, అ.

**సవరింత.** దే. వి. సవరించుట. (చూ. సవరింతసేయు.)

**సవరింతసేయు.** దృ. స. క్రి. (సవరింత+చేయు.) సవరించు, చక్కఁబఱచు. "చ. హరువుగఁగాంచికాగుణమొయారముగా సవరింతసేయుచున్, వెరవునఁగేలఁబోఁకముడివీడిచె." రస. 3, గుచ్ఛము.

**సవరిల్లు.** దే. క్రి. అందమగు, ఒప్పు. "సీ. సవరిల్లునేచోటజర డగ్గఱఁగసీకసంతతయావనసౌష్ఠవంబు." కాశీ. ౨, ఆ.

**సవరుచే.** దే. ప్రే. (సవరించుయొక్కరూపాంతరము.) చిత్రించు. "క. జనకుఁడు భువిఁగలప్రాయపు, జనపతులంబటము నందు సవరిచియనుఁగుం, దనయకడకనుపనితరముఁ, గననొల్లదు నీపదంబెకానిమురారీ." భద్రా. ౨, ఆ. (ఈ రూపమీగ్రంథమునందొకచోటనే కనఁబడుచున్నది.)

**సవాయి.** దే. వి. 1. మేహరోగవిశేషము; 2. పడవపెద్దమోకు.

**సవారి.** హిం. వి. పల్లకి, గుఱ్ఱమునెక్కిపోవుట.

**సవాలు.** హిం వి. ప్రశ్న, విచారణ.

**సవి.** దే. అవ్య. అని. "ఎ, గీ. నాకునిచ్చియున్న నామెడహారంబు, నిజనఖాంకురములనిగిడికొనుచు, సరభసముగఁజనియెసవి రాత్రినేఁగల, కంటినపుడమేలుకంటినపుడు." లక్ష్మీ. 3, ఆ.

**సవిత.** సం. వి. ఋ. పుం. 1. సూర్యుఁడు; 2. తండ్రి. (రూ. సవితృఁడు.)

**సవిత్రి.** సం. వి ఈ. స్త్రీ. 1. తల్లి; 2. ఆవు.

**సవిధము.** సం. వి. అ. న. సమీపము. విణ. సమీపమైనది.

**సవేశము.** సం. వి. అ. న. విణ.———పై.———

**సవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎడమ; 2. కుడి; 3. ప్రతికూలము.

**సవ్యేష్ఠుఁడు.** సం. వి. అ. న్. పుం. సారథి. (రూ. సవ్యేష్ఠ. ఋ. పుం.)

**సవ్వడి.** దే. వి. (సవ+వడి.) జాడ. (స్వార్థమున వడి.)

**ససి, యు.** దే. వి. 1. బాగు; (ససిగలరూపము.) 2. ఆరోగ్యము; (ఒళ్లు ససితప్పినది.) 3. నిగ్గు. విణ. 1. బాగైనది; 2. ఆరోగ్యముగలది; (ఒళ్లు ససిగాలేదు.) 3. నిగ్గుగలది. "వ. ససి మెఱుంగుమొత్తంబులు." సా. 3, ఆ.—వై. వి. పైరు. "ససినెల్లమేయుచు." నీలా. ౨, ఆ. (వైకృతార్థమునససియొక్కరూపాంతరము.)

**ససువు.** దే. విణ. సాధువు. (చూ. కసిమసఁగు. స. క్రి. రెండవయర్థము.)

**సస్కాని.** దే. వి. రెండుడబ్బులనాణెము.

**సస్యము.** సం. వి. అ. న. 1. పైరు; 2. వృక్షాదిఫలము. (రూ. శస్యము.)

**సస్యసంవరము.** సం. వి. అ. పుం. మద్దిచెట్టు.

**సస్సెము.** వై. వి. పైరు, సస్యము.

**సహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చేమంతిచెట్టు; పిన్నగోరంటచెట్టు. (అనికొందఱు.) 2. పిల్లపెసరచెట్టు; 3. భూమి. అ. పుం, న. స్. న. ము. బలిమి. స్. న. 1. వెలుఁగు; 2. వేగము. అ. పుం. ఓర్పు. స్. పుం. 1. మార్గశీర్షమాసము; 2. హేమంతఋతువు.

**సహకారము.** సం. వి. అ. పుం. తియ్యమామిడిచెట్టు.

**సహకారి.** సం. విణ. (స్. ఈ. న్) సహాయుఁడు.

**సహగమనము.** సం. వి. అ. న. 1. కూడఁబోవుట; 2. భార్య భర్తతోఁగూడ చితిఁజొచ్చుట. (దీనిని సాగుమానమందురు.)

**సహచరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. స్నేహితురాలు; 2. భార్య. ఈ. స్త్రీ. అ. పుం. ము. పచ్చపుష్పములుగలగోరంటచెట్టు. విణ. కూడఁదిరుగునది.

**సహచరుఁడు.** సం. వి. అ. పుం. స్నేహితుఁడు. విణ. కూడఁదిరుగువాఁడు.

**సహజ.** సం. వి. ఆ. స్త్రీ. తోడఁబుట్టినది. అ. పుం. డు తోడఁబుట్టినవాఁడు.

**సహజము.** సం. వి. అ. పుం. స్వభావము. విణ. కూడఁబుట్టినది.

**సహధర్మిణి.** సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షికముగా పెండ్లాడిన పెండ్లాము.

**సహనము.** సం. వి. అ. న. ఓర్పు. విణ. ఓర్చునది.

**సహపాఠి.** సం. వి. న్. పుం. కూడఁజదువువాఁడు.

**సహవాసము.** సం. వి. అ. పుం. 1. కూడనుండుట; 2. స్నేహము.

**సహస్యము.** సం. వి. అ. పుం. పుష్యమాసము.

**సహస్రదంష్ట్రము.** సం. వి. అ. పుం. వేయికోఱలుగలచేప, పాఠీనము.

**సహస్రపత్రము.** సం. వి. అ. న. తామర, కమలము.

**సహస్రపాదుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. సూర్యుఁడు.

**సహస్రము.** సం. స. అ. న. పదినూఱులు, వేయి.

**సహస్రవీర్య.** సం. వి. ఆ. స్త్రీ. గఱికచెట్టు.

**సహస్రవేధి.** సం. వి. ఇ. న్. న. ఇంగువ. న్. పుం. పుల్లప్రబ్బచెట్టు. విణ. వేయిటినివేధించునది.

**సహస్రాంశువు.** సం. వి. ఉ. పుం. సూర్యుఁడు, వేవెలుఁగు.

**సహస్రాక్షుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, వేగంటి.

**సహాధ్యాయుఁడు.** సం. వి. అ. పుం. (చూ.) సహపాఠి.

**సహాయత.** సం. వి. ఆ. స్త్రీ. సహాయులసమూహము.

**సహాయుఁడు** సం. వి. అ. పుం. 1. తోడైనవాఁడు; 2. స్నేహితుఁడు.

**సహారువు.** దే. వి. జూదమునందలి పరిభాష. (చూ.) ఉ, హరి. 3, ఆ.

**సహించు** సం. స. క్రి. ఓర్చు, సైచు.

**సహితము.** సం. విణ. (అ. ఆ. అ.) కూడుకొన్నది. అవ్య. (తెనుఁగున) సహార్థకము. (ఈశ్వరుఁడుసహితము నిర్దోషుఁడు గాఁడు.) (రూ. సైతము.)

**సహిష్ణువు.** సం. విణ. (ఉ.) ఓర్చువాఁడు, సహనుఁడు.

**సహృదయుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మంచిమనసుగలవాఁడు.

**సహోదరుఁడు.** సం. వి. అ పుం. తోడఁబుట్టినవాఁడు.

**సహ్యము.** సం. వి. అ. న. 1. ఆరోగ్యము; 2. సౌఖ్యము. పుం. ఒకానొకకొండ. విణ. సహింపఁదగినది.

**సళించు.** దే. అ. క్రి. దుఃఖించు. "క. లేమానీవెతమానవు, లేమామోమోటముసళింపఁగనిపుడే, లేమాఱుమాట యొసఁగుము." నీలా. ౨, ఆ.

**సళుపరించు.** దే. అ. క్రి. వ్రణములోనగునదిపోటెత్తు.

**సళుపరింత.** దే. వి. సళుపరించుట, సళుపు.

**సళువు.** దే. అ. క్రి. వ్రణములోనగునదిపోటెత్తు. వి. వ్రణము లోనగుదానిపోటు.

**సళువు.** దే. విశే. భారమైనది.

**సళ్లు.** వై. అ. క్రి. సడలుయొక్క రూపాంతరము.

## సా.

**సా.** వై. విశే. వృత్తియందు సామశబ్దమునకు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (సాఁబాలు, సామేను మొ.)

**సాంకవము.** సం. వి. అ. పుం. సంకుమదము, జవాది.

**సాంకాలిక.** సం. వి. ఆ. స్త్రీ. ప్రతిదినమునిచ్చెడువడ్డి.

**సాంకేతికము.** సం. విశే. (అ. ఈ. అ.) సంకేతమువలన నేర్పడినది.

**సాంఖ్యము.** సం. వి. అ. న. యోగవిశేషము.

**సాంగత్యము.** సం. వి. అ. న. కూడిక, చేరిక.

**సాంతపనము.** సం. వి. అ. న. మూఁడుదినములు పగళ్లును మూఁడుదినములు రాత్రులును భోజనముచేసి మూఁడుదినములు అయాచితపదార్థములనుభుజించి పిమ్మట మూఁడుదినములు నిట్రుపాసముండెడు వ్రతము. పంచగవ్యమును కుశోదకమునుపుచ్చుకొని ఒకరాత్రియుపవాసముండుట. (అనికొందఱు.)

**సాంత్వనము.** సం. వి. అ. న. ఓదార్చుట, అనునయము.

**సాంత్వము.** సం. వి. అ. న. 1. సామోపాయము; 2. దాక్షిణ్యము. విశే. మిక్కిలి మసురమైనది. (వాక్కు.)

**సాందృష్టికము.** సం. వి. అ. న. అప్పుడుగలిగెడుఫలము.

**సాంద్రము.** సం. వి. అ. న. అడవి. విశే. 1 దట్టమైనది; 2. మెత్తనైనది.

**సాంధ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) సంధ్యాసంబంధమైనది.

**సాంపరాయము.** సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. ఆపద; 3. రాఁగలకాలము. (రూ. సంపరాయము )

**సాంపరాయికము.** సం. వి. అ. న. యుద్ధము. (రూ. సంపరాయికము.)

**సాంప్రతము.** సం. అవ్య. 1. యుక్తము; 2. ఇప్పుడు.

**సాంబ్రాణి.** యు. ద్వ. వి. సంబరేనుచెట్టువలనఁగలిగెడు ధూపద్రవ్యవిశేషము. వై. ఉత్తమాశ్వము*. "తే. పసిఁడిజక్కరతేజి సాంబ్రాణినెక్కి." రామా. ౪, ఆ.

**సాంబ్రాణివత్తి.** ద్వ. వి. ఊఁదువత్తి.

**సాంయాత్రికుఁడు.** సం. వి. అ. పుం. ఓడవర్తకుఁడు.

**సాంయుగీనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) యుద్ధమునందు నేర్పుగలవాఁడు.

**సాంవత్సరికము.** సం. వి. అ. న. ఆబ్దికము. విశే. సంవత్సరాంతమున జరగునది.

**సాంవత్సరుఁడు.** సం. వి. అ. పుం. జోస్యుఁడు.

**సాంశయికుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) సంశయమునొందిన మనసుగలవాఁడు.

**సాఁకు.** దే స. క్రి. 1. కాపాడు; 2. పెంచు.

**సాఁగఁదీయు.** దే. స. క్రి. (సాఁగన్+తీయు.) ప్రార్థించు. (ఎంతసాఁగఁదీసినను వాఁడువచ్చువాఁడుకాఁడు.)

**సాఁగు.** దే. అ. క్రి. 1. దీర్ఘమగు; 2. దండాకారముగ నేలపడ్రాలు. (చాఁగు యొక్క రూపాంతరము.) వి. అడుగునఁ ద్రాడుగట్టినకటారియలుఁగువంటియాయుధవిశేషము, విడిచివాటుగుదియ, భిండివాలము.

**సాఁడు.** దే. వి. రేతస్సు.

**సాఁతు.** దే. వి. గోనెలునేయువారిజాతి.

**సాకతము.** దే. వి. 1. ఊఱడింపు; "క. కైకొనుమర్చనమనఘుడు, నాకోమలితెలిసియర్ఘ్యమందుకొనియెను, శ్లోకుఁడగునమ్మునీశ్వరు, సాకతమునశోకవహ్నిశాంతతఁ బొందన్." నిర్వ. ౯, ఆ.—2. అనుగ్రహము. "నేఁడిచటికిందనదివ్యరథంబుతోడసా, కతమునఁ బంపనెంతపనికల్గెనొగాక." విక్ర. ౨, ఆ.

**సాకము.** దే. వి. 1. ఉత్సవము; 2. వ్యాజము. ఆం, భా.

**సాకల్యము.** సం. వి. అ. న. సకలత్వము.

**సాకిరి.** వై. వి. స. సాక్షి. "ఈనిమిత్తమునకుసాకిరిగావె." ఉ. గా, ౬, అ.

**సాకు.** దే. వి. వ్యాజము. "అదలించినను సాకదియేమకానోయన్." క్షే. త్రయ.

**సాక్షాత్కరించు.** సం. అ. క్రి. ప్రత్యక్షమగు.

**సాక్షాత్కారము.** సం. వి. అ. పుం. సాక్షాత్కరించుట.

**సాక్షాత్కృతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సాక్షాత్కరించినవాఁడు.

**సాక్షి.** సం. విశే. (న్. ఈ. న్.) ఏదేనియొకకార్యమునుకనిగాని వినిగాని తెలిసినవాఁడు. (సాక్షులు పదునొక్కండ్రు. అందు కృతసాక్షులేవురు, అకృతసాక్షులారువ్వరు. కృతసాక్షులు.— లిఖితుఁడు, స్మారితుఁడు, యదృచ్ఛాభిజ్ఞుఁడు, గూఢుఁడు, ఉత్తరుఁడు. అకృతసాక్షులు. — గ్రామస్థులు, ప్రాడ్వివాకలేఖకసభ్యులు, రాజు, కార్యాధికారి, వాదిచేఁబంపఁబడినవాఁడు, (కులవివాదములయందు) కులమువారు. కృతసాక్షులు అనఁగా నిర్ణయించుకొనఁబడిన సాక్షులు, అకృతసాక్షులనఁగా నిర్ణయించుకొనఁబడని సాక్షులు.)

**సాక్ష్యము.** సం. వి. అ. న. 1. సాక్షికనివిని తెలిసిచెప్పినమాట; 2. ఏకాదశాహశ్రాద్ధము. (చూ. శ్రాద్ధము.)

**సాగనంపు.** దే. స. క్రి. (సాగన్+అంపు.) (ప్రయాణమైపోవువారిని) కొంతదూరముతీసికొనిపోయివిడుచు. (వానిని సాగనంపివచ్చితిని.)

**సాగరము.** ఉభ. దే. వి. నెయ్యి నూనె మొదలగునవి నింపిన సీద్దెలజోడు. సం. అ. పుం. 1. సముద్రము; 2. ఏనుఁగుచెవియందలి మదము.

**సాగవేయు.** దే. స. క్రి. పుచ్చు, పంపు. (ఆ బొమ్మంతయు నింటికి సాగవేసినాఁడు.)

**సాగు.** దే. అ. క్రి. 1. పోవు; 2. ప్రవర్తిల్లు; 3. యత్నించు; 4. జరగు. (చాగుయొక్కరూపాంతరము.) వి. కృషి. వ్యవసాయము.

**సాగుపాటు.** ద్వ. వి. జరగుపాటు.

**సాగుబడి.** దే. వి. 1. సైరుపెట్టుట, కృషి; 2. సాగుపాటు.

**సాచివ్యము.** సం. వి. అ. న. సచివత్వము.

**సాజాత్యము** సం. వి. అ. న. సజాతిత్వము.

**సాజెము.** వై. వి. సహజము. (చూ. దొన రెండవయర్థము.)

**సాటు.** దే. వి. వర్తకులు ఒకవస్తువునిచ్చి మఱియొకవస్తువును మార్చుకొనుట, పరివర్తనము.

**సాటూ.** దే. వి. సాటయొక్క రూపాంతరము.

**సాటూకోటి.** దే. వి. సాటాబేరము.

**సాటి.** దే విశ. వి. సమానము. "ఎ, గీ. అపురూరవుఁడాద ప్రులాజయంతుఁ, డాపులస్త్యునిమనుమఁడీయధిపుత్రోడ, సాటి యగుదురె." నై. ౬, ఆ.

**సాటికి.** దే. విశ. వి. సాటియొక్క రూపాంతరము. (సార్థమున కప్రత్యయము.) ఆం, భా.

**సాతల.** సం. వి. ఆ. స్త్రీ. నంబరేను.

**సాతాను.** అన్య. వి. సైతానుకు రూపాంతరము.

**సాతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అవసానము; 2. దానము; 3. దుకూలము.

**సాతు.** వై. వి. 1. వర్తకజనసమూహము; "ఆ. సాతులోనికుబేర జనములనున్నద, లీలనేలఁబెట్టికోలఁజమరఁ, జొచ్చుటయును." భార. శాం. 3, ఆ.—2. పథికజనసమూహము*. (చూ. బిఱుబిఱ్ఱు.)

**సాత్వతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కావ్యవృత్తులలోనొకటి; (చూ. వృత్తి.) 2. శిశుపాలునితల్లి.

**సాత్వికము.** సం. వి. అ. పుం. రోమాంచాదికము. విశ. సత్వగుణమువలనఁ గలిగినది.

**సాదన.** వై. వి. 1. అభ్యాసము; (చూ. గరిడి మొదటియర్థము.) 2. శరాభ్యాసము*. (చూ. బోదన.)

**సాదనకాఁడు.** దర్వ. వి. మల్లుఁడు. కళా. ౫, ఆ.

**సాదనజోదు.** వై. వి.———వై.——(చూ. టంకు.)

**సాదనము.** సం. వి అ. న. ఇల్లు. "మృత్యుసాదనమునకుఁ." భార. అర. ౧, ఆ. (సదనముయొక్క రూపాంతరము.)

**సాదము** ఉభ. దే. వి. అన్నము. సం. అ. పుం. 1. నైర్మల్యము; 2. విషాదము; 3. శరణము; 4. గతి.

**సాదా.** హిం. విశ. కలుపులేని, అలంకారములేని.

**సాది.** సం. వి. న్. పుం. 1. గుఱ్ఱపురౌతు; 2. మావటీఁడు; 3. సారథి.

**సాదు.** వై. వి. సాధువైన గోమహిషాద్యదికము. (చూ. తలపాలము.) విశ. మంచిది, మంచివాఁడు. "ఎ, గీ. దుర్జనులఁగూడి పేద సాదులనుగొట్టు." భల్లా. 3, ఆ. (చూ. కందము. వై.)

**సాదృశ్యము.** సం. వి. అ. న. సామ్యము, పోలిక.

**సాధకము.** సం. విశ. (అ. ఆ. అ.) సాధించునది.

**సాధనము.** సం. వి. అ. న. 1. సాధించుట; 2. ఉపకరణము; 3. ఉపాయము; 4. ధనము; 5. వధము; 6. మృతసంస్కారము; 7. గమనము; 8. అనుగమనము; 9. ఋణదానము; 10. నివర్తనము; 11. సైన్యము; 12. మగగుఱి.

**సాధనీయము.** సం. విశ. (అ. ఆ. అ.) సాధింపఁదగినది.

**సాధర్మ్యము.** సం. వి. అ. న. సామ్యము, పోలిక.

**సాధారణ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విశ. 1. సామాన్యము; 2. సమానము.

**సాధారణ్యము.** సం. వి. అ. న. సాధారణత్వము.

**సాధించు.** సం. స. క్రి. నెఱవేర్చు, సమకూర్చు.

**సాధితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. దండుగపుచ్చుకొనఁబడినవాఁడు; 2. సాధింపఁబడినవాఁడు.

**సాధిష్ఠము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి పదిలము; 2. మిక్కిలి మంచిది.

**సాధీయసుఁడు.** సం. విశ. (స్. ఈ. స్.) 1. మిక్కిలి దిటవు గలవాఁడు; 2 మిక్కిలి మంచివాఁడు.

**సాధువు.** సం. వి. ఉ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. మునీశ్వరుఁడు. విశ. 1. మంచివాఁడు; 2. చక్కనివాఁడు; 3. వడ్డికిచ్చి బ్రదుకువాఁడు.

**సాధ్యము.** సం. వి. అ. పుం. ఒక గ్రహయోగము. (చూ. యోగము.) విశ. సాధింపఁదగినది.

**సాధ్యుఁడు.** సం. వి. అ. పుం. గణదేవతావిశేషము. (వీరు పన్నిద్దఱు.—మనువు, హనుమంతుఁడు, విష్ణువు, ధర్ముఁడు, నారాయణుఁడు మొదలగువారు.) విశ. సాధింపఁదగినవాఁడు.

**సాధ్వసము.** సం. వి. అ. న. భయము, భీతి, వెఱపు.

**సాధ్వి.** సం. వి. ఈ. స్త్రీ. పతివ్రత, క్రొత్తడి.

**సాన.** వై. వి. 1. మణులమొక్కలు చేయుచేసెడుజాయి; 2. కత్తులు లోనగునవి నూరెడుజాయి; 3. గందముతీసెడుజాయి*.

**సానకత్తి.** వై. వి. (సాదన+కత్తి.) సాదనచేయుకత్తి. ఆం, భా.

**సాని.** వై. వి. 1. అధిపురాలు; "సీ. అయ్యిద్దఱునుగృష్ణనట్లొప్పఁదోడ్కొనిచనియొక్కమఱుదుసలిసానికపుడు, మ్రొక్కియక్కన్యను మ్రొక్కించి." భార. ఆది. ౭, ఆ.—2. వేశ్య*; (చూ. సందుకొను. స. క్రి. రెండవయర్థము.) 3. (ఉత్తరపదమగుచో) భార్య*. (మేదరసాని, దొరసాని మొ.)

**సానిక.** దే. వి. మట్టికంచము, మల్ల.

**సానుమంతము.** సం. వి. న్. పుం. కొండ, పర్వతము.

**సానువు.** సం. వి. ఉ. పుం, న. 1. కొండనెత్తము; 2. కొన; 3. అడవి; 4. సుడిగాలి; 5. త్రోవ.

**సాన్నాయ్యము.** సం. వి. అ. న. హవిస్సు, దధిపయోరూపమైన హవిస్సు. (అనికొందఱు.)

**సాన్నిధ్యము.** సం. వి. అ. న. సామీప్యము.

**సాపడు.** దే. స. క్రి. సాపాటుచేయు, భుజించు.

**సాపత్న్యము.** సం. వి. అ. న. సపత్నీత్వము.

**సాపాటు.** దే. వి. సాపడుట, భోజనము.

**సాప్తపదీనము.** సం. వి. అ. న. స్నేహము, చెలిమి.

**సాఫల్యము.** సం. వి. అ. న. సఫలత, సఫలత్వము.

**సాఫు.** హిం. విశ. తేట, శుభ్రమైన, వంకరలేని.

**సామంజస్యము.** సం. వి. అ. న. సమంజసత్వము.

**సామంతరాగోల.** దే. వి. ఆయుధవిశేషము. "ద్వి. సామంతరాగోలసాఁచివేసినను."

**సామంతుఁడు.** సం. వి. అ. పుం. ఒకదేశమునెల్లకు చేరికనున్న రాజు.

**సామగ్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సమగ్రత; 2. ఉపకరణము.

**సామజము.** సం. వి. అ. పుం. ఏనుఁగు. విణ. సామవేదమువలనఁ బుట్టినది.

**సామము.** సం. వి. న్. న. 1. ఒక వేదము; (చూ. వేదము.) 2. మంచిమాట; 3. అనుకూలప్రవర్తనరూపమైన యొక యుపాయము. (ఇది పంచవిధము.—పరస్పరోపకారము కనిపింపఁజేయుట, మంచితనముచేయుట, గుణములన కొనియాడుట, చుట్టఱికమును తెలుపుట, నేను నీవాఁడనని మంచిమాటలాడుట.) (చూ. ఉపాయము.)

**సామరస్యము** సం. వి. అ. న. సమరసత్వము.

**సామరి.** ద్వి. విణ. (సాము+అరి.) సామునేర్చినవాఁడు. ''సంపెఁగమొగ్గముల్కి-గడసామరి.'' విజ. ౧, ఆ.

**సామర్థ్యము.** సం. వి. అ. న. 1. నేర్పు; 2. యోగ్యత.

**సామాజికుఁడు.** సం. వి. అ. పుం. సభయందుండువాఁడు.

**సామాను.** హిం. వి. సామగ్రి, వస్తువులు.

**సామాన్య.** సం. వి. ఆ. స్త్రీ. సర్వసాధారణనాయిక. అ. న. ము. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. సామ్యము. విణ. సాధారణము.

**సామి.** వై. వి. 1. రాజు; ''ఓసామీయిపుడేమిసేయుదుము.'' ఉ, రా. ౧, ఆ.—2. పెనిమిటి; ''ఎ, గీ. సామిననుఁగూర్చినీతోడ నేమిపలికె.'' అచ్చ. సుం, కాం.—3. కుమారస్వామి.

**సామిధేని.** సం. వి. ఈ. స్త్రీ. 1. (చూ) ధాయ్య; 2. సమిధ.

**సామిమల.** వై. వి. కుమారస్వామి వసియించియుండు నొకానొక పర్వతము. ''సామిమలకుంజని.'' కాశీ. ౪, ఆ.

**సామీప్యము.** సం. వి. అ. న. సమీపత్వము.

**సామీరి.** సం. వి. ఇ. పుం. 1. హనుమంతుఁడు; 2. భీముఁడు. (సమీరునికొడుకు. చూ. సమీరుఁడు.)

**సాము.** వై. వి. 1. సగము; 2. వ్యాయామము*. ''ఆ. చదువు సాముగలిగిక్షత్రియుల్ సంపూర్ణ, విద్యులనఁగ కీటవినుతికెక్కి, సాధులను బరిచ్యుతాధులఁజేయంగఁ, జాలకుండుదురె ప్రశంస సేయ.'' కవి. ౧, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**సాముకంటిచుక్క.** ద్వి. వి. (సాముకన్ను+చుక్క.) పూర్వఫల్గునీనక్షత్రము.

**సాముద్రము.** సం. వి. అ. న. భాగ్యసూచకదేహలక్షణము. విణ. సముద్రమునఁబుట్టినది.

**సాముద్రికము.** సం. విణ. (అ. ఈ. అ.) 1. భాగ్యసూచక దేహలక్షణమును తెలుపునది; (శాస్త్రము.) 2. సముద్రసంబంధమయినది.

**సామెత.** వై. వి. లోకోక్తి*.

**సామ్యము.** సం. వి. అ. న. సమత్వము, పోలిక.

**సామ్రాజ్యము.** సం. వి. అ. న. సమ్రాట్టుతనము.

**సామ్రాణి.** వై. వి. ఉత్తమాశ్వము. ''క. తామ్రధ్వజభూవరుఁడా, తామ్రనయనుఁడగుచుఁ గనలితంత్రాధిపునీ, సామ్రాణెవ్వరిదన విని, నమ్రుఁడగుచులీలఁగదలినకులధ్వజాఁడుఁ.'' జై. ౭, ఆ. (సాంబ్రాణియొక్క-రూపాంతరము.)

**సాయంకాలమనీ.** సం. వి. అ. పుం. మునిమాపు.

**సాయంతనము.** సం. విణ. (అ. ఆ. అ.) సాయంకాలసంబంధమైనది.

**సాయకము.** సం. వి. అ. పుం. 1. బాణము; 2. కత్తి.

**సాయము.** ఉభ. వై. వి. సహాయము. సం. అ. పుం. 1. సాయంకాలము; 2. బాణము.

**సాయరు.** హిం. వి సుంకము.

**సాయిల.** దే. వి. డుబుడక్క-వాఁడు.

**సాయుజ్యము.** సం. వి. అ. న. సహాయోగము

**సారంగము.** సం. వి. అ. పుం. 1. ఇఱ్ఱి; 2. ఏనుఁగు; 3. తుమ్మెద; 4. వానకోయిల. విణ. చిత్రవర్ణముగలది.

**సారంగి.** దే. వి. వాద్యవిశేషము.

**సారఘము.** సం. వి. అ. న. నేయివంటివర్ణముగలతేనె.

**సారటు.** ఆం. వి. రథము, గుఱ్ఱపుబండి.

**సారణ.** సం. వి. ఆ. స్త్రీ. గొంతెమగోరుచీ.

**సారణము.** ఉభ. దే. వి. శ్యేనవిశేషము. ''ద్వి. సాళువంబుల మేటిజలకట్టియలన, బెద్దసారణములబెట్టుగావిడిచి.'' హరిశ్చ. ౧, భా.—సం. అ. పుం. అతిసారరోగము. డు. ఒక రాక్షసుఁడు.

**సారణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కాలువ; 2. గొంతెమగోరుచీ; 3. షడ్జస్వరముఁబలికెడితంతి.

**సారథి.** సం. వి. ఇ. పుం. 1. తేరుగడపువాఁడు, నియంత.

**సారము.** సం. వి. అ. న. 1. జలము; 2. ధనము; 3. న్యాయ్యము. పుం. 1. బలిమి; 2. చేవ; 3. మూలగ. విణ. శ్రేష్ఠము.

**సారమేయము.** సం. వి. అ. పుం. కుక్క-, శునకము.

**సారవము.** సం. విణ. (అ. ఈ. అ.) సరయూనదిసంబంధమయినది.

**సారసనము.** సం. వి. అ. న. 1. మూఁడుపేటలుగల ఆఁడుదాని మొలనూలు; 2. కవచముతొడిగినవానినడికట్టు.

**సారసము.** సం. వి. అ. న. తామర. పుం. బెగ్గురుపక్షి.

**సారస్యము.** సం. వి. అ. న సరసత్వము.

**సారస్వతము.** సం. విణ. (అ. ఈ. అ.) సరస్వతీసంబంధమైనది.

**సారాయి.** వై. వి. మద్యము, మదిర, మధువు, కల్లు.

**సారి.** యు. దే. వి. తడవ. వై. యుద్ధయాత్ర*. ఆం, భా.

**సారించు.** సం. స. క్రి. 1. చాఁచు; ''గదసారించి.''—2. తెఱచు; ''వాకిలిసారించి.''—3. విసరు; ''కుంచెసారించి.''—4. సరిదీయు. ''కనారిసారించి.''

**సారు.** దే. వి. నాట్యగతిభేదము. ఆం, భా.

**సారువ.** దే. వి. 1. ఎక్కుటకును బరువెక్కించుటకును పొడుగుగా కట్టవలెవేయఁగచెడి యిసుకలోనగువాని డిబ్బ; ''ఎ, గీ. అదిలతాంత, రజముసారువయై దిశప్పురంపుటనఁటి, చప్పరంబు.'' వసు. ౨, ఆ. ''వ. తేరులగములచేరువలసారువలుగట్టువారు వంబులపక్కి-రలపై.'' ఉ, హరి. ౪, ఆ.—2. కట్ట. ''క. ఆరీతి సేనపోరఁగ, హేరాళపురక్తనదములీఁదఁగరామిఁ, సారువగట్టెక్ వినిహత, వైరిమహీభృత్క-బంధవారముచేతఁ.'' చంద్ర.

**సారువా.** దే. వి. వర్షాకాలమునందు నీరాసరానుపండెడుపల్లపుపంట.

**సారూప్యము.** సం. వి. అ. న. సమానరూపత్వము.

**సారె. యు.** దే. వి. 1. కూఁతునత్తగారింటికిఁబంపునపుడు పంపెడు వరుస; 2. కుమ్మరవానిచక్రము; "కడవకుసారెపైనమరమృత్తిక యిడునపుడు." భార. స్త్రీ. ౧, ఆ.—3. బ. వీణెమెట్లు. "శ్రుతి గీల్కొనసారెలుచక్కనొత్తి." పాండు. 3, ఆ.—క్రి. మాటి మాటికి. "మ. త్రిపురస్త్రీలఁబతివ్రతామణులసారెంబుంశ్చలీవర్త నం, బుపదేశంబొనరించి చేల్పఁజేచి." పా. 3, ఆ.—వై. 1. పగడసాలకాయ; 2. గోరువంక; "క. సారెయదెపాడువృమని యొక, సారెయొకతెయక్షకేళిసమయంబునని, చ్ఛారతినొకతెకుఁ జెప్పిన, సారెకనకపంజరమునసాధ్వసమందెన్." (ఇది రెండర్థ ములకు నుదాహరణము.) నై. 3, ఆ.—3. పాచిక*. "క. విను మేముకల్లసారెలు, గొనికపటపునెత్తమాడుకుశలతగాదు." భార. శల్య. ౨, ఆ.

**సారెకు.** దే. క్రి. మాటిమాటికి. "సారెకుమదిజాలివొందియొక రీతిఁదలంకెడు." పా. ౧, ఆ. (ఆమ్రేడితమగుచో సారెసారెకు.)

**సారెసత్తు.** దే. వి. భక్ష్యవిశేషము, జంతిక, సంయావము.

**సార్జంటు.** ఆం. వి. భటులమీఁద అధికారి.

**సార్ద్రము.** సం. విశే. (అ. ఆ. అ.) తడిసినది, ఆర్ద్రము.

**సార్థకము.** సం. విశే. (అ. ఈ. అ.) సఫలము.

**సార్థము.** సం. వి. అ. పుం. 1. జంతుసమూహము; 2. వర్తక జనసమూహము. విశే. అర్థముతోఁగూడినది.

**సార్థవాహుఁడు.** సం. వి. అ. పుం. వర్తకుఁడు. విశే. ముఖ్యుఁడు. "శ్లో. గురుమామంబకృతార్థసార్థవాహమ్." (మేదినీకోశము లోనగు నిఘంటువులయందు సార్థశబ్దమిట్లు థకారాంతపదమధ్యము నందుఁ బఠింపఁబడియున్నది.)

**సార్లా.** దే. విశే. అనుకూలము, సఫలము.

**సార్వభౌమము.** సం. వి. అ. పుం. ఉత్తరపుదిక్కునందుండెడి యేనుఁగు.

**సార్వభౌముఁడు.** సం. వి. అ. పుం. సమస్తభూమిని నేలురాజు, చక్రవర్తి.

**సాల.** వై. వి. 1. ఇల్లు; "నాటకసాల," "పురిటిసాల."—2. చావడి. "కొలువుసాల."

**సాలగ్రామము.** సం. వి. అ. పుం. విష్ణుమూర్తి చిహ్నితశిలా విశేషము.

**సాలపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ముయ్యాకుపొన్న‡. (రూ. శాలపర్ణి.)

**సాలభంజిక.** సం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదులచేత చేయఁ బడినబొమ్మ, పుత్తళిక.

**సాలము.** సం. వి. అ. పుం. 1. వృక్షము; 2. ప్రాకారము; 3. మద్ది‡.

**సాలామిశ్రి.** దే. వి. ఒక మందుదినుసు.

**సాలావృకము.** సం. వి. అ. పుం. 1. కుక్క; 2. కోఁతి; 3. తోఁడేలు; 4. నక్క.

**సాలీఁడు.** ద్వ. వి. (సాలె+ఈఁడు.) 1. సాలెవాఁడు; "తే. తొడరిసాలీనిసతిచేతదూతికయును." పంచ. నా. ౧, ఆ.—2. సాలెపురుగు. "సీ. మైనిండుసాలీనిమగ్గంపుఁ జికచకల్ బూది పూఁతకు రెట్టిపుట్టసేయ." చంద్రా. 3, ఆ.

**సాలీయానా.** హిం. విశే. సంవత్సరపు. (రూ. సాల్యానా.)

**సాలు.** దే. వి. 1. (చూ.) రాంకవము; 2. సన్నవస్త్రము. (చూ. మెట్ట మూడవయర్థము.)

**సాలు.** హిం. వి. సంవత్సరము.

**సాలువు.** దే. వి. సాలుయొక్క రూపాంతరము. (సన్నవస్త్రమునకు.)— "ఎ, గీ. పొసఁగఁగతెవన్నె సాలువుముసుఁగువెట్టి." శశాం. ౪, ఆ. (చూ. సకిన నాలుగవయర్థము.)

**సాలె.** వై. వి. సాలెవానికులము*.

**సాలెపట్టు.** ద్వ. వి. సాలెపురుగునేసినసేఁత, ఆశాబంధము.

**సాలెపురుగు.** వై. వి. బొడ్డునందలి నూలువిడిచి నేఁతనేసెడి యొకపురుగు, తంతువాయము.

**సాలెవాఁడు.** ద్వ. వి. నేఁతనేయువాఁడు, తంతువాయుఁడు.

**సాలోక్యము.** సం. వి. అ. న. సమానలోకత్వము.

**సాల్వడు** ద్వ. అ. క్రి. (సాలు+పడు.) 1. నిస్సారమగు; "మ. విక్షోధినిక్షిప్తప, క్షతివాతాహతిఁదూలితూలశకలాకారంబులై వారిద, ప్రతతుల్ సాల్వడినల్లడంజెదరఁగాఁబాజెన్ మనోవేగుఁడై, పతగేంద్రుఁడు." భార ఆది. ౨, ఆ. (చూ. ప్రే.)—2. ఓఅ గు. "ఉ. మహామారుతముప్పుఁడచెను...ధరి, త్రీరుహశాఖలున్ విటిగిత్రెళ్లఁగఁగుల్లలరాలి సాల్వడన్." భార. అర. 3, ఆ.—(ప్రే. సాల్వఱుచు. "చ. ప్రతిబలవార్ధిబాడబముభంగిదహించునరాము పోలికన్, శితశరధారసాల్వఱుచు." విక్ర. ౬, ఆ.)

**సావలి.** దే. వి. తుబుడక్కవాఁడు.

**సావలీఁడు.** దే. వి.——పై.——(స్వార్థమున ఈఁడు.)

**సావాసము.** వై. వి. సహవాసము, పొత్తు.

**సావాసి.** వై. వి. (సావాసము+ఇ.) సావిదల్లుఁడు. "తే. సాత్య కియుసీరపాణియునంభ్రమించి, తమకుఁ జెప్పిన వారునదాముఁ గూడి, పెద్దలైనసావాసులఁబిలిచిపంచి, రంతిపురములోవారినెత్త మాడునెడకు." (చూ. ముందువెనుకలు.) ఉ, హరి. 3, ఆ.

**సావి.** దే. వి. కాలము. "సీ. వానకాలమువచ్చెవర్షంబులందందు జడివట్టికురిసెనాసావియందు." కాశీ. 2, ఆ.—అవ్య. నవియొక్క రూపాంతరము. "ఉ. నిక్కపుదూతసావిధరణీపతిముందటనేమి యంటివో, పెక్కులుమాటలేననుచు భీమతనూభవనెమ్మనంబునన్, ప్రుక్కుచునుండె." నై. ౪, ఆ.

**సావిక.** సం. వి. ఆ. స్త్రీ. మంత్రసాని.

**సావిత్రము.** సం. వి. అ. పుం. దినముయొక్క ఐదవభాగము. (చూ. దినము.)

**సావిత్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సరస్వతి; 2. పార్వతి; 3. సత్య వంతునిభార్య.

**సావిత్రుఁడు.** సం. వి. అ. పుం. 1. ఒక వసువు; (చూ. వసు వు.) 2. శివుఁడు.

**సావు.** దే. వి. చావుయొక్క రూపాంతరము.

**సాసువుఁబు.** దే. వి. బ. ఆవాలు. హంస. ౨, ఆ.

**సాస్న.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) గంగడోలు.

**సాహసము.** సం. వి. అ. న. 1. తెగువ; 2. దండోపాయము.

**సాహసించు.** సం. అ. క్రి. సాహసముచేయు, తెగించు.

**సాహసికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సాహసముకలవాఁడు

**సాహస్రము.** సం. వి. అ. న. 1. సహస్రముల సమూహము;

**సాహస్రుఁడు.** సం. వి. అ. పుం. సహస్రబలమునకధికారి.

**సాహాయ్యము.** సం. వి. అ. న. సహాయత్వము, తోడుపాటు.

**సాహిణము.** దే. వి. గుఱ్ఱపుశాల. (చూ. ఎకగా.)

**సాహిణి.** దే. వి. (సాహిణము+ఇ) గుఱ్ఱపువాఁడు. (చూ. తలాటము.) (రూ. సాహిణీ.-"సాహిణీలురూపులఁగలఁ"అను. 3, ఆ.) (దీనికి గ్రంథాంతరములయందు ప్రయోగము మృగ్యము.)

**సాహితి.** సం. వి. ఈ. స్త్రీ. సాహిత్యముయొక్క రూపాంతరము.

**సాహిత్యము.** సం. వి. అ. న. 1. అర్థజ్ఞానము; 2. కూడిక.

**సాహుఁ.** హిం. వి. సాహుకారి, వర్తకుఁడు, కోటీదారుఁడు. (చూ. మిండకడమిండవర్తి.)

**సాహేబు.** హిం. వి. ప్రభువు. "సాహేబునగరు." గా, వి. ౫, ఆ. (రూ. సాయిబు.)

**సాహెూ.** హిం. అవ్య. కటికవాఁడుచేసెడుహెచ్చరిక. "ఎ, గీ. స్వామిసాహెూపరాకు హెచ్చరికయనుచు, వేత్రహస్తులుపలుమాఱువిన్నవింప." అని. ౪, ఆ.

**సాళగము.** సం. వి. అ. న. తిలతండులన్యాయమున నొకరాగమేళనము. "ఎ, గీ. శుద్ధసాళగసంకీర్ణశోభితములు, త్రుటులు చదువుండ." వి, పు. 2, ఆ.

**సాళగించు.** సం. అ. క్రి. మిళితమగు. "ఉ. పాడిరంగనల్, దేశివిధంబు మార్గమున తేటయునొక్కటసాళగింపఁగాఁ." నై. ౬, ఆ. "వ. పీలకులసౌరభంబులలో సాళగించుకస్తూరికారంగనాభికర్పూరగంధసారసీహారవాఃపూరంబులవలపును." కాశీ. ౭, ఆ.

**సాళగింపు.** సం. వి. మేళనము. "గీరడంబులుసాళగింపులు." పాండు. 3, ఆ. (సాళగశబ్దము సంస్కృతముగానుండుటవలన దీనిని తత్సమమనియే చెప్పవలెను. తత్సమక్రియ ఇంపఁతముగానుండుటయపూర్వము.)

**సాళువము.** దే. వి. శ్యేనవిశేషము. (చూ. అణుజా.)

**సాళ్వఁడు.** దే. వి. సాళ్వమునుడేగవలెపాఱి వేఁటాడుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**సాళ్వము.** దే వి. సాళువముయొక్క రూపాంతరము.

## సి.

**సింగఁడు.** వై. వి. 1. నృసింహుఁడు; 2. ఎటుకువాఁడు*. "క. మాసింగఁడల్లతరిగొండతటిక్, దలమోచితెచ్చినదియిది." శుక. ౧, ఆ.-విణ. కోపించినవాఁడు*. (చూ. బూరఁడు.)

**సింగపుఁబీఁట.** వై. వి. (సింగము+పీఁట.) సింహాసనము. "నమ్మి పూసింగపుఁబీఁట." పాంచా. ౧, ఆ.

**సింగము.** వై. వి. సింహము. (చూ. పురుడించు. స. క్రి.)

**సింగళము.** వై. వి. సింహళద్వీపము.

**సింగాణి.** వై. వి. 1. ఒక దినుసువిల్లు; 2. విల్లు; 3. కుక్కపేరు*. (చూ. జగురు రెండవయర్థము.)

**సింగారపుఁదోఁట.** వ్య. వి. (సింగారము+తోఁట.) ఉద్యానవనము. య. 3, ఆ.

**సింగారము.** వై. వి. అలంకారము, శృంగారము.

**సింగారి.** వై. వి. శృంగారవతియగు ఆఁడుది.

**సింగారించు.** వై. స. క్రి. అలంకరించు.

**సింగి.** వై. వి. ఎఱుకుది*.

**సింగిణి.** వై. వి. సింగాణియొక్క రూపాంతరము. "కుసుమాస్త్రునిసింగిణివింట్లు." దుక్షి. ౪, ఆ. (రూ. సింగిణీ.-"తే. వింతయగుసింగిణివింట్లపనిబొమలు." గాజ. ౨, ఆ.)

**సింగినాదము.** వై. వి. పొడుసుకొమ్ముతో చేయఁబడిన యొకరమువాద్యవిశేషము. (చూ. నాగబెత్తము.) (వ్యర్థసంభాషణ కీమాట వాడుదురు.)

**సింగిలీకము.** దే. వి. పుష్పవిశేషము. "ద్వి. శిరములుదొగిపడుసింగిలీకములు." సారె. 3, భా.

**సింగోటు.** దే. వి. (చూ.) చిలుదారికొమ్ము. ఆం, భా.

**సిందుకము.** సం. వి. అ. పుం. వావిలి, సిందువారము.

**సిందురము.** వై. వి. 1. సిందూరము; "క. పగడముమంకెనవిరియును, చిగురాకున దొండపండు సిందురమునుసొం, పగుతమ్మికెంపుగుంపును, మగువకిసరిగాదొగరు మోవికిదొరయే." సీలా. ౨, ఆ.-2 సిందువారవృక్షము. "రగడ. చెలువచెలువపుదాడిమాగసీలపు సిందురసంపుమీఱుఁ." వసు. 3, ఆ.

**సిందువారము.** సం. వి. అ. పుం. వావిలి. (దీనికి దోహదక్రియ మువంటలము.)

**సిందూరము.** సం. వి. అ. న. చెందిరము. పుం. సిందువారము.

**సింధురము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

**సింధువు.** సం. వి. ఉ. స్త్రీ. ఒకానొకయేఱు. పుం. 1. సముద్రము; 2. ఏనుఁగు; 3. పడమరగాఁబాఱెడియేఱు; 4. ఒకదేశము.

**సింహద్వారము.** సం. వి. అ. న. తలవాకిలి.

**సింహనాదము.** సం. వి. అ. పుం. వీరులు మొదలైనవి భయపడుటకై సేయులు చేసెడుధ్వని, బొబ్బ.

**సింహపుచ్ఛి.** సం. వి. ఈ. స్త్రీ. సక్కతోఁకపొన్న.

**సింహము.** సం. వి. అ. పుం. 1. సింగము; 2. ఒక రాశి. (చూ. గారి.) 3. (ఉత్తరపద స్థితమౌ) శ్రేష్ఠము.

**సింహాసంహననుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సర్వాంగసుందరుఁడు.

**సింహావలోకనము.** సం. వి. అ. న. శబ్దాలంకారవిశేషము. "క. మనవేటికినూనవమా, తనమా యెడఁ బ్రేమ తనకుఁ దక్కి తినునమా, ననుమానకదయదనరం, దనరలతులుమానినరసభపురమ్మనవే." కా. ౪, ఆ.

**సింహాసనము.** సం. వి. అ. న. సింహముఖ మేర్పఱచిన స్వర్ణమయమైన యున్నతపీఠము.

**సింహాస్యము.** సం. వి. అ. పుం. అడ్డసరము.

**సింహి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అడ్డసరము; 2. ములక.

**సింహుండము.** సం. వి. అ. పుం. జెముడు.

**సిక.** వై. వి. సిగ, జుట్టు. "సీ. జక్కులకొలములలోఁజిక్కురొక్కపు దొరచికిరముల్ గొనసాను సికవలంతి." అచ్చ. బాల, కాం.

**సికత.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇసుకనేల; 2. మొరపనేల; 3. ఒక వ్యాధి; బ. 4. ఇసుక; 5. మొరము.

**సికతిలము.** సం. విణ. (అ. ఆ. అ.) ఇసుకగలది. (నేల.)

**సికస్తు.** హిం. విణ. శిథిలమయిన.

**సికా.** వై. వి. ముద్ర*. (చూ. సికాయుంగరము.)

**సికాయుంగరము.** ద్వ. వి. (సికా+ఉంగరము.) ముద్దుటుంగ రము, మొహరుగల ఉంగరము.

**సిక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) తడిసినది.

**సిక్థము.** సం. వి. అ. న. మైనము. పుం. మెతుకు.

**సిక్యము.** సం. వి. అ. న. ఏనుఁగుయొక్క స్తనాగ్రమునందలి మదము.

**సిగ.** వై. వి. సికయొక్క రూపాంతరము.

**సిగబంతి.** ద్వ. వి. సిగదండ, శేఖరము. "ఎ, గీ. అమ్ముగొడవేల యలగవయమ్ములకును, ఖడ్గమంకింపఁగానేలఖడ్గములకు, భల్లమది యేలనాయిభభల్లములకు, సయ్యయిాబంతిసిగబంతియయ్యెసేని." చంద్రా. ౨, ఆ.

**సిగము.** దే. వి. సివమునకు మొదటిరూపము.

**సిగరి.** వై. వి. సిగరియొక్క రూపాంతరము. (చూ. వహి. మూడవ యర్థము.)

**సిగరము.** వై. వి. శిఖరము. ఆం, భా.

**సిగ్రి.** వై. వి. కొన్నిసంబారువులుచేర్చి పక్వముచేసిన మజ్జిగ. (చూ. దుంబొడి.)

**సిగ్గరి.** దే. విశే. (సిగ్గు+అరి.) లజ్జగలవాఁడు, లజ్జగలది.

**సిగ్గరికత్తియ.** ద్వ. విశే. లజ్జగలది. "వ. ఎట్టకేలకుంజిట్టకాలకుఁ జెవియొగ్గినసిగ్గరికత్తియలు." వసు. ౪, ఆ. (రూ. సిగ్గరికత్తె.) (పావర్థమున కత్తియ.)

**సిగ్గలు.** దే. అ. క్రి. (సిగ్గు+అలు.) సిగ్గుచెడు. "సి, గ్గవేతుద నిట్లుపాటుటిదికర్జమె." భార. ద్రో. ౪, ఆ.

**సిగ్గిఁడి.** దే. విశే. (సిగ్గు+ఇఁడి.) లజ్జచెడినవాఁడు, లజ్జచెడినది.

**సిగ్గు.** దే. వి. స్తుత్యాదులచేఁ గలిగెడు మనస్సంకోచము, లజ్జ.

**సిగ్గుపడు.** ద్వ. అ. క్రి. సిగ్గుఁజెందు, లజ్జించు.

**సిగ్గుపాటు.** ద్వ. వి. సిగ్గుపడుట. "సీ. వంచనమైడాఁగివర్తించు టిదియేమిప్రాభవంబనిసిగ్గుపాటునొందు." నై. 3, ఆ.

**సిగ్గువోవు.** దే. అ. క్రి. (సిగ్గు+పోవు.) సిగ్గుపడు, లజ్జించు. "ఎ, గీ. అసురచిత్తంబుగానఁగనలవిగాక, సిగ్గువోయిరియచ్చరచెలు వలెల్ల." లక్ష్మీ. ౨, ఆ.

**సిచయము.** సం. వి. అ. పుం. 1. వస్త్రము; 2. జీర్ణవస్త్రము.

**సిడము.** దే. వి. 1. ధ్వజము; "సిడముకామనూడువడఁకెడి." భార. కర్ణ. ౨, ఆ. "సీ. వట్టిమ్రాఁకులుచివుర్వెట్టఁజేయునఖుం డుభువనాంతరక్రీడఁబొడముసిడము." రుక్మి. 3, ఆ.—2. ధ్వజ స్తంభము. (చూ. పడగ. మొదటియర్థము.)

**సిడి.** దే. వి. 1. ఏతపుమ్రాను; "క. ఏతపుసిడిదావంగినఁ, బాతా ళపునీరుదెచ్చు."—2. సిడులజాతరకునాటినస్తంభముమీఁది యడ్డు మ్రాను. "సీ. అంభోధరముక్రిందనసియాడునైరావతియుఁబోలె సిడివ్రేలెఁదెఱవయొప్పు." పాండు. 3, ఆ. (ఇది గంపసిడి, గాలపుసిడి అని ద్వివిధము.) బ. (చూ.) సిల్లు.

**సిత.** సం. వి. ఆ. స్త్రీ. చక్కెర. అ. న. ము. తెల్లపులుము. పుం. తెలుపు. విశే. 1. తెల్లనిది; 2. కట్టఁబడినది; 3. ముగిసినది.

**సితచ్ఛత్ర.** సం. వి. ఆ. స్త్రీ. సదాపకూ.

**సితవీర్య.** సం. వి. ఆ. స్త్రీ. జీలుగు.

**సితశివము.** సం. వి. అ. న. ఇందుప్పు, శీతశివము.

**సితాభము.** సం. వి. అ. పుం. కర్పూరము, ఘనసారము.

**సితాభ్రము.** సం. వి. అ. పుం.——వై.——

**సితుఁడు.** సం. వి. అ. పుం. శుక్రుఁడు. విశే. తెల్లనివాఁడు.

**సిద్దాయము.** వై. వి. వెచ్చపుశొమ్మునందు కూడఁబెట్టినధనము*.

**సిద్దీ.** హిం. వి. నీగ్రోజాతివాఁడు.

**సిద్దె.** దే. వి. బుంగవలె తోలుతోఁకుట్టినపాత్రము. (మొదటిరూపము సిద్దియ.)

**సిద్ధము.** సం. వి. అ. పుం. ఒక గ్రహయోగము (చూ. యోగము.) విశే. 1. ఆయిత్తమైనది; 2. ఈడేఱినది; 3. ఎడతెగనిది; 4. వం డఁబడినది.

**సిద్ధాంతము.** సం. వి. అ. పుం. 1. స్థిరమైనపక్షము; 2. నవ విధజ్యోతిష గ్రంథములు.

**సిద్ధాంతి.** సం. వి. న్. పుం. 1. నవవిధజ్యోతిష గ్రంథములను తెలిసినవాఁడు; 2. తత్వశాస్త్రమును తెలిసినవాఁడు.

**సిద్ధాంతీకరించు.** సం. స. క్రి. సిద్ధాంతముచేయు.

**సిద్ధాయము.** సం. వి. అ. పుం. అరి, కప్పము.

**సిద్ధార్థము.** సం. వి. అ. పుం. తెల్లావలు.

**సిద్ధార్థి.** సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**సిద్ధార్థుఁడు.** సం. వి. అ. పుం. శాక్యబుద్ధదేవుఁడు.

**సిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. 1. ఈడేఱుట; 2. బుద్ధియనుగం ద్రవ్యము; 3. ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**సిద్ధించు.** సం. అ. క్రి. ఈడేఱు, సమకూడు.

**సిద్ధుఁడు.** సం. వి. అ. పుం. 1. దేవయోనివిశేషము; 2. వ్యా సాది.

**సిధ్మము.** సం. వి. న్. న. సిబ్బెము. విశే. సిబ్బెముగలది.

**సిధ్మల.** సం. వి. ఆ. స్త్రీ. ఉప్పుఁజేఁప. విశే. సిబ్బెముగలది.

**సిధ్యము.** సం. వి. అ. పుం. పుష్యనక్షత్రము.

**సినీవాలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చంద్రకళకానవచ్చెడి యమా వాస్య; 2. పార్వతి.

**సిఫాయి.** హిం. వి. కాలిబంటు.

**సిఫారసు.** హిం. వి. యోగ్యతాపత్రిక, యోగ్యతావచనము.

**సిబ్బంది.** హిం. వి. బంట్రౌతులు.

**సిబ్బి.** దే. వి. ఇత్తడిమూఁకుడు.

**సిబ్బితి.** దే. వి. సిగ్గు. "ఉ. సిబ్బితిపేరువోఁదుడిచిసీధుమదంబ పుడన్నుకొల్పుచుఁ, బ్రబ్బఁగ." కళా. ౬, ఆ.

**సిబ్బితికత్తె.** ద్వ. విశే. సిగ్గుగల ఆఁడుది.

**సిబ్బితికాఁడు.** దే. విశే. సిగ్గుగలవాఁడు. "క. కాంతుఁడుచిత జ్ఞుఁడైనను, గాంతకుసిగ్గువడఁజెల్లుఁగాకకటకటా, కాంతుఁడుసిబ్బితి కాఁడయి, కాంతయునట్లయిన నెట్లుకాఁపురమింకన్." కళా. ౪, ఆ.

**సిబ్బెము.** వై. వి. దేహమునందుఁగలిగెడి యొకదినుసుపొడ. (మొద టిరూపము సిబ్బియము.)

**సిర.** సం. వి. ఆ. స్త్రీ. 1. నాడి; 2. ఈనె.

**సిరంగఁడు.** వై. వి. శ్రీరంగనాథుఁడు. "ఉ. నింగిఁబొరల్ కవేర జమునింగిసిరంగనిసేవచేసియా, పొంగలిముద్దమ్రింగి విఘుపుష్క

రిణీజలమానిమానితో, త్తుంగతరూత్తమోపవనిఁదూటిసి రంగములో ననున్నవాఁ, డుంగనునాటిటంకు టకటాంకుపురంబులకాఁపురంబు నన్." పాంచా. ౧, ఆ.

**సిరంగము.** వై. వి. శ్రీరంగక్షేత్రము. (చూ. సిరంగఁడు.)

**సిరము.** ఉభ. వై. వి. తల. "రగడ. గానిగానిరమంబెనలవకకస్తూరిమేలరంతులు." వసు. 3, ఆ. — విశ. చల్లనిది. "సీ. సిరమైన పచ్చకప్పురముగంధముతోఁడఁగలపి పాలిండ్లపైనలఁదియలఁది." విక్ర. ౪, ఆ.—సం. వి. అ. పుం. పిప్పలికట్టె.

**సిరస్తాదారు.** హిం. వి. లెక్కలుచూచువారికి స్వయ.దోగ్యోగస్థుఁడు.

**సిరా.** హిం. వి. వ్రాయుటకు వినియోగించు ద్రవము.

**సిరాజి.** దే. వి. దేశవిశేషము. (చూ. సారాజి.) (రూ. సిరాజి. "డాకెలంకునసిరాజీకరాచురకత్తి." స్వా. ౪, ఆ.)

**సిరాణము.** దే. వి. ఆయుధవిశేషము. "వ. పట్టెంబుసిరాణంబు చక్రంబు మొదలగుకైదువులు." ఉ. హరి. ౪, ఆ.

**సిరి.** వై. వి. 1. లక్ష్మి; 2. సంపద; 3. శోభ. "అత్తలుసిరులరానరగంటఁగనుఁగొనె." ఆము. ౫, ఆ.

**సిరిగందము.** వై. వి. 1. శ్రీచందనము*; (చూ. చిలచిబ.) 2. శ్రీచందనవృక్షము*. "రగడ. అలసియలసిరిగందమడరెడు నాడనాడభుజంగవగుదువె." వసు. 3, ఆ.

**సిరిగట్టు.** వై. వి. ఒక పర్వతము, శ్రీశైలము.

**సిరిచూలి.** ద్వి. వి. మన్మథుఁడు, శ్రీపుత్రుఁడు.

**సిరిమంతుఁడు.** వై. విశ. శ్రీమంతుఁడు. నీలా. ౧, ఆ.

**సిరిసింగణావత్తి.** ద్వి. వి. బాలక్రీడావిశేషము. (చూ. కుందెన గుడి.) (రూ. సిరిసింగణాలవత్తి.)

**సిలాజిత్తు.** వై. వి. అంగడిమందుదినుసు.

**సిలుగు.** దే. వి. ఉపద్రవము. "క. ముచ్చులబారులఁబోరిఁ బోరిఁ, జిచ్చులఁగఱవులనురాచ సిలుగులఁజెడియుఙ్, జచ్చియుఁ బ్రజకొంచెముగా, నెచ్చోటులుఁ బాడగును మహీతలమెల్లన్." హరి. ఉ. ౯, ఆ. "ఏసిలుగునఁబడకతొలఁగుమీవు." హరి. ఉ. ౭, ఆ.

**సిలువ.** దే. వి. క్రీస్తును బంధించి వధించినకొయ్య.

**సిల్హము.** సం. వి. అ. పుం. ధూపద్రవ్యవిశేషము, చిల్లమడ్డి.

**సివఁగి.** దే. వి. 1. సివ్వఁగియొక్క రూపాంతరము; "వలలకావళ్లు సివంగులబండ్లును." రుక్మాం. 3, ఆ.—2. సివఁగివలెనుండుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.) (చూ. సివ్వఁగి.) (రూ. చివఁగి.)

**సివము.** దే. వి. దేవతావేశము. "క. ఈతెలుఁగునసాకామిని, చేతోజాతప్రయుక్తచేష్టలువెలయన్, భూతముసోఁకినరీతిని, గోఁతికిసివమెత్తినట్లుకొంతనటించెన్." బ్ర. 3, ఆ.

**సివాయి.** హిం. అవ్య. తప్ప, కాక.

**సివారు.** హిం. విశ. గ్రామమునకుచేరియుండు.

**సివిలు.** ఆం. విశ. ఆస్తివిషయమైన.

**సివ్వఁగి.** దే. వి. ఒకానొకమృగము, తరక్షువు. "గాటపుబోన లుంబిగురుఁగండలుసివ్వఁగిబండ్లు." ఉ, రా. ౭, ఆ.

**సిసల్.** హిం. విశ. నిర్ధారణమైన.

**సిసువు.** వై. వి. పసిబిడ్డ, శిశువు.

**సిసృక్ష.** సం. వి. ఆ. స్త్రీ. సృజింపనిచ్ఛ.

**సిసృక్షువు.** సం. విశ. (ఉ.) సృజింపనిచ్ఛగలవాఁడు.

**సిసృప్స.** సం. వి. ఆ. స్త్రీ. పోవనిచ్ఛ.

**సిసృప్సువు.** సం. విశ. (ఉ.) పోవనిచ్ఛగలవాఁడు.

**సిస్తు.** దే. విశ. 1. అందము; "సీ. కస్తూరికాచర్చసిస్తుగాదని నీటుగాఁదావికుంకుమ గంధములఁది." ఉ, రా. ౪, ఆ.—2. వి. పన్ను.

**సిళ్లు.** దే. వి. బ. (ఏనుఁగును పొడిచెడు) బరిగోల. "మ, హిమవత్పాదవనాంత కేలిరతిసైనేపారికోపారుణ, క్రమనేత్రాంచలమైప్రభూతమదరేఖంబైనగంధద్విపేం, ద్రముడాయంజనిసిళ్లు చూపుటసుమీధర్మాత్మునత్యుగ్రమి, క్రముఁగొంతేయవరిష్ఠునీవ్రదోడరంగాఁజూచుటూహింపఁగన్." సం. "దండీవయూధానపసేధనేత్వమ్." భార. అర. ౬, ఆ. (మొదటిరూపము సిడులు.)

## సీ.

**సీ.** వై. వి. శ్రీ. "సీగానుసేసవాలుమెకంబుల్." స్వా. ౪, ఆ.

**సీకాయ.** దే. వి. నూనెజిడ్డునుపోఁగొట్టెడి యొకానొకకాయ.

**సీకారి.** వై. వి. పాటపాడువాఁడు, గాయకుఁడు*. (చూ. వాస.)

**సీకు.** ఆం. విశ. ఆరోగ్యములేని.

**సీత.** సం. వి. ఆ. స్త్రీ. 1. శ్రీరామునిభార్య; 2. నాఁగటిచాలు; 3. గంగ.

**సీతభేది.** దే. వి. ఆమవిరేచనము.

**సీతాకోకచిలుక.** దే. వి. చిత్రవర్ణముగలిగి చేటలవలెనుండు పెద్దటెక్కలుగల యొకపురుగు.

**సీతాఫలము.** సం. వి. అ. న. ఒకానొకపండు.

**సీతాభోగములు.** సం. వి. అ. పుం. బ. శాలిధాన్యవిశేషము.

**సీతు.** వై. వి. 1. చలి; "సీతునసకలాంగకంబులుఁబ్రతున్నము లయ్యెడు." భార. శాం. 3, ఆ.—2. చలికాలము. (చూ. వాన రెండవయర్థము.)

**సీతువు.** వై. వి. సీతుయొక్క రూపాంతరము.

**సీత్కారము.** సం. వి. అ. న. చలిలోనగువానివలని బాధచేఁగలిగెడు ధ్వనివిశేషము.

**సీత్యము.** సం. విశ. (అ. ఆ. అ.) ఒకసారిదున్నినది. (నేల.)

**సీదరము.** యు. దే. వి. దారిద్ర్యము. వై. 1. సర్పము; (చూ. సీద్రము.) 2. సర్పకంచుకము*. "సీ. అనయంబునడకతప్పని గోత్రపతులెప్పుడును సీదరములేనియనఘభోగులు." వసు. ౧, ఆ. (ఇది దారిద్ర్యమునకును, సర్పకంచుకమునకును నుదాహరణము.)

**సీద్రము.** యు. వి. సీదరముయొక్క రూపాంతరము. (సర్పమునకు,—"సీ. తరిత్రాడుసీద్రంబుపొరలంటిగాలిచే జడియుచందమున నంచలుభ్రమింప." పాండు. ౨, ఆ.)

**సీమ.** ఉభ. దే. వి. 1. దేశము; "సీమలుగానిసీమలకు." కాశీ. ౨, ఆ.—2. ప్రదేశము; "సీ. ఒకచెంతనిగమాంతయుక్తిసంతతచింత లొక సీమసురభామయోగ్యశాలలు." హంస. 3, ఆ.—3. రాజ్యము. "ఉ, ఈముదిమర్కటంబునకు నేటికి నీకపిరాజ్యమంచుమ, ట్లాడుపటుప్రతాపబలధర్పమునన్ వెడలంగఁద్రోలినన్,

సీమకుఁబాసియొక్కరుఁడుసిగ్గెనఁగఁగాబలివర్దుఁడేగ." పంచ. నా. ర, ఆ.—సం. ఆ. న్. స్త్రీ. 1. ఎల్ల; [దేశసీమ, గ్రామసీమ, క్షేత్రసీమ, గృహసీమ అని సీమచతుర్విధము. అది అయిదు విధములైన చిహ్నములుగలది. అవి—౧. ధ్వజిని, (వృక్షములోనగు నవి చిహ్నముగాఁగలది,) ౨. మత్స్యని, (తటాకాదిజలస్థానము చిహ్నముగాఁగలది,) 3. నైధాని, (తుషాంగారాదినిధానముచిహ్నముగాఁగలది,) ర. భయవర్జిత, (అభిజ్ఞానముకొఱకు అర్థిప్రత్యర్థులేర్పఱచిన చిహ్నముగలది,) ౫. రాజశాసనసీత. (రాజుస్వేచ్ఛచే నిర్ణయించినచిహ్నముగలది.) అని] 2. పెడతల; 3. వరిమడి.

**సీమంతము.** సం. వి. అ. పుం. 1. పాపట; 2. సీమంతోన్నయనము.

**సీమంతిని.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది, ఇంతి, వనిత.

**సీమాటి.** వై. వి. భాగ్యశాలినియైనయాఁడుది. "మ. చెలులం దిట్టుచు నంతఁ జేరెనట కాసీమాటి సీమాటికిఁ బావల దన్నఁ బవినకేల ప్రేలెదరు." చంద్రా. 3, ఆ.

**సీరపాణి.** సం. వి. ఇ. పుం. బలరాముఁడు, నాఁగటిజోదు.

**సీరము.** సం. వి. అ. పుం. నాఁగలి, హలము.

**సీరి.** సం. వి. న్. పుం. బలరాముఁడు, నాఁగటిజోదు.

**సీల.** దే. వి చీలయొక్కరూపాంతరము.

**సీలమండ.** దే. వి. చీలమండయొక్కరూపాంతరము.

**సీవనము.** సం. వి. అ. న. (బట్ట) కుట్టుట.

**సీవిరి.** దే. వి. 1. వింజామరము; "సీవిరుల్ కవలిడఁగా." (ఇది వ్రాఁతప్రతులయందలి పాఠము.) భార. శాం. ౧, ఆ.—2. ఆలవట్టము. "తే. కడలుకొనఁజుట్టుపట్టెడు గొడుగులెవ్వి, యొనర మెసఁగంగసీవిరులేలపట్టరు." సం. "శ్వేతదమలం ఛత్రంవ్యజనంశ్చపార్థివ." (ఇక్కడ వ్యజనశబ్దమునకు ఆల వట్టమర్థము.) భార. శల్య. ౨, ఆ.

**సీసకము.** ఉభ. దే. వి. 1. కిరీటము; "సీ, నకమెడలించినెత్తిఁ బెలుచఁ గాఁగద వ్రేయుచు దాఁటె." రా. యు, కాం.—2. మల్లబంధవిశేషము. (చూ. కుదికిలు.) సం. అ. న. సీసకము.

**సీసము.** ఉభ. దే. వి. మల్లబంధవిశేషము. "సీసానఁబట్టియునుప్పళించిపోవనిచ్చు." భార. విరా. ౨, ఆ.—సం. అ. న. సత్తు.

**సీసా.** హిం. వి. బుడ్డి.

## సు.

**సు.** సం. (ఉపసర్గము.) మంచి, మిక్కిలి అనునర్థములను తెలుపునది. (ఉదా. సుగుణము, సునాయాసము మొ.)

**సుంకము.** వై. వి. 1. కొన్ని అమ్ముడుసరకులకుఁగాను దొరతనమువారికిచ్చెడుపన్ను; (వృత్తియందువికల్పముగ అంత్యవర్ణలోపము. ఉదా. సుంకసరకు.)—2. ప్రతిబంధము*. "చ. అతఁడుతదల్పపాపఫలమందుట సుంకముదీఱిపోయిత, చ్ఛతదళపత్రనేత్రునకుఁ జాఁగిలిమ్రొక్కి." ఆము. ౬, ఆ.

**సుంకరి.** దృ. వి (సుంకము + అరి.) సుంకము తీయువాఁడు.

**సుంకరీఁడు.** దృ. వి. (సుంకరి + ఈఁడు.) ——పై.—— "క. అడిగినఁబలితోనిట్లను, దడవాయొనుసుంకరీఁడుతనులెక్కలకై, వడియున్నాఁడిదెకనుమని, వడఁతియతనిఁజూపఁజూచిభయము ప్పొంగఁగా." హంస. ర, ఆ. (స్వార్థమున ఈఁడు.)

**సుంకీఁడు.** దృ. వి. (సుంకము + ఈఁడు.)——పై.——

**సుంకు.** యు. దే. వి. 1. జొన్నలోనగువానికంకిమీఁదిపూవు; 2. పెండ్లియందు పళ్లెరమునఁబోసి వధూవరులమీఁద చెరుగు బియ్యము. "ఎ, గీ. అచ్చరలకభ్రమునఁ బ్రహస్తాదివీర, పరిణయముగల్గఁదద్వధూవరులమీఁద, శాలయవీనల బలధూళి సుంకుచెరుగు, నగ్రకరిఁద్రోలియాపాక్షుఁడురవడించె." రామా. ౮, ఆ.—వై. ప్రతిబంధము*. "సీ. మీలనుబుట్టించి మెఱుఁగులఁబుట్టించి శుక్తులఁబుట్టించి సుంకడంగి." కవిక. ౨, ఆ.

**సుంకేసలము.** దే. వి. వృక్షవిశేషము.

**సుంత.** దే. విశ. ఇంచుక. "సుంతసేపుదానిఁజూడకుండఁగలేవు." క్షేత్రయ. (ఇసుమంతయొక్క మాఱురూపము.)

**సుందరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చక్కనియాఁడుది; 2. ఆఁడుది.

**సుందరుఁడు.** సం. విశ. (అ. ఆ, ఈ. అ.) చక్కనివాఁడు.

**సుకందకము.** సం. వి. అ. పుం. 1. నీరుల్లి*; 2. మట్టుకాఁకర*.

**సుకత.** సం. వి. ఆ. స్త్రీ. సాధువుకానియావు, ఒట్టియ.

**సుకము.** వై. వి. సౌఖ్యము, భోగము.

**సుకర.** సం. వి. ఆ. స్త్రీ. సాధువైనయావు. విశ. సులభము.

**సుకర్మము.** సం. వి. న్. న. మంచిపని. పుం. ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**సుకలుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దాతయుభోక్తయునైనవాఁడు.

**సుకవాసి.** వై విశ. కష్టపడక సుఖముగనుండువాఁడు.

**సుకారి.** దే. వి. ఎద్దులమీఁదసరకెత్తించుకొని యూరూరుతిరిగి వర్తకముచేసెడి యొక నీచజాతి. "సీ. ఆఁడుబిడ్డ సుకారి యల్లుఁడు పింజారి మఱఁదలుఁగోడలు మారువాడి."...శతకము.

**సుకిని.** వై. వి. సుఖవతి. ఆం, భా.

**సుకియ.** దే. వి. భక్ష్యవిశేషము. (చూ, బొఁగు.)

**సుకుమారము.** సం. వి. అ. పుం. పుంశ్రేష్ఠుడు. విశ. కోమలము.

**సుకృతము.** సం. వి. అ. న. 1. పుణ్యము; 2. శుభము. విశ. చక్కఁగాఁజేయఁబడినది.

**సుకృతి.** సం. విశ. (న్. ఈ. న్.) 1. పుణ్యవంతుఁడు; 2. భాగ్యవంతుఁడు.

**సుక్కురుఁడు.** వై. వి. శుక్రుఁడు. అచ్చ. యు, కాం.

**సుఖ.** సం. వి. ఆ. స్త్రీ. వరుణునిపట్టణము. అ. న. ము. 1. సౌఖ్యము; 2. స్వర్గము. విశ. సౌఖ్యముగలది.

**సుఖవర్చకము.** సం. వి. అ. పుం. సజ్జెకారము.

**సుఖవాసి.** సం. వి. న్. పుం. కారుబుడమ*. విశ. సుకవాసి.

**సుఖి.** సం. వి. న్. పుం. యతి. విశ. సుఖముగలవాఁడు.

**సుఖించు.** సం. అ. క్రి. సుఖపడు.

**సుగంధి.** సం. వి. ఇ. పుం. నూఁగుదోస*. విశ. ఇంపైనవాసనఁగలది.

**సుగంధిమాల.** సం. వి. ఆ. స్త్రీ. మావలి*.

**సుగతుఁడు.** సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

**సుగము.** వై. వి. సుకముయొక్కరూపాంతరము.

**సుగుడి.** దే. విశే. సరసుఁడు. "క. సుగుణిశిరోమణి యుంచునతండు, య్యసితాబ్జేక్షణలగానియస్మిత్కోపఘం, బెనఁగగఁగలయించునగున, వ్రేసఁ బాలుఁడు సుగుడి గామిసెల్లమియుకదా" స్వా. ౮, ఆ. "సీ. త్రిజగన్మాతవాగ్దేవిభండారంబు చూ అగాఁగొనుటయే సుగుడితన ము." కా. ౫, ఆ. "తే. వలచిపట్టినఁదాలిమివదలకిప్పు, డన్ని చెప్పెదుతగవుఁవివేకితనము, మొనసి యూరకరతిరంగము నకుగాని, సుద్దులవియేల చాలింపు సుగుడివౌదు." సా. ౨, ఆ.

**సుగ్గడితపు.** దే. విశే. తఱచునేరుగలది. (వస్త్రము.) "సుగ్గడితపు జీబునేత్రము." వసు. ౫, ఆ. "సుగ్గడితంపుఁబయ్యెద." హంస. ౫, ఆ.

**సుగ్రీవుఁడు.** సం. వి. అ. పుం. ఒక వానరుఁడు. విశే. మంచి మెడగలవాఁడు.

**సుచకము.** సం. వి. అ. పుం. మొఱఁగెడికుక్క.

**సుచరిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. పతివ్రత, క్రొత్తడి.

**సుచేలకము.** సం. వి. అ. పుం. సన్నకోక, వలిపము. విశే. మంచివస్త్రముకలది.

**సుజనుఁడు.** సం. వి. అ. పుం. 1. ఇంద్రునిసారథి; 2. మంచి మనుష్యుఁడు.

**సుడాలము.** సం. వి. అ. పుం. అశ్వధారావిశేషము. (చూ. మురళి రెండవయర్థము.)

**సుడి.** దే. వి. 1. జలావర్తము; 2. రోమావర్తము; 3. అనిలా వర్తము. "అనువగుసుళ్లనొప్పుమలయానిలవాంహాము సెక్కె." వ సా. ౨, ఆ.

**సుడిఁబడు.** ద్వి. అ. క్రి. (సుడిన్+పడు.) సుడివడుటుయొక్క రూపాంతరము. "గర్వాలసుడైసుడింబడెను." ద్వా ౧౧, ఆ.

**సుడిగట్టు.** ద్వి. వి. చక్రవాళపర్వతము. "సీ. తనతేజుసుడిగట్టు వెనుకచీఁకటినెల్ల విరియించుతత్తులచిందుగాఁగ." యా. ౧, ఆ.

**సుడిగాలి.** దే. వి. సుడియుగాలి, వాత్య.

**సుడిగొట్టు.** దే. వి. గాలి, వాయువు.

**సుడిగొను.** దే. స. క్రి. (సుడి+కొను.) చుట్టుకొను. "ద్వి. చూచెడువారిని సుడిగొనఁగలదు." సా. 2, భా. (ప్రే. సుడి గొలుపు.) (ఆమ్రేడితమగుచో సుడిసుడిగొను = మిక్కిలి సుడి గొను.) (చూ. తోఁక.)

**సుడిగోరు.** ద్వి. వి. తంతిమీటుటకు బంగారులోనగువానితోఁచేసి వ్రేలికివేసికొనెడుగోరు. "శ్రుతిగూడఁదంత్రులు సుడిగోళ్లమీటు చు." సారంగ. ౨, ఆ.

**సుడియ.** దే. వి. తములపాకులబరువునందు సగము. విశే. తులువ.

**సుడియు.** దే. అ. క్రి. 1. చుట్టిచుట్టివీచు; "వ. వాయువులు గంధబంధురంబులై సుడిసె." మార్క. ౬, ఆ.—2. చుట్టు కొను. "క. నీకోడలుకొడుకునక్కై, శోకంబుడిగింపలేక సుడిసిన యది." హరి. ఉ. ౫, ఆ.

**సుడివడు.** ద్వి. అ. క్రి. (సుడి+పడు.) 1. చుట్టుకొను; "వ. వలిమించుక్రొమ్మంచుతొదుళ్లీఁదియోఁదివడినడలిసుడివడుచుసూడ లోను భోమరిగాలియలవోకసోఁకులకు." స్వా. 3, ఆ.–2. కలఁ తపడు; "నీదుసైన్యముల్ సుడివడ భీష్ముఁడాఁకుటయు." భార. భీష్మ. ౨, ఆ.—3. చలించు. "క. వేణీభరకుచకుంభ, శ్రోణీభర ములనుగొను సుడివడఁగ." రామా. 3, ఆ.

**సుడివాలుఁ.** ద్వి. వి. చక్రాయుధము. "సీ. సుడివాలుసింధంబు నడుసఁబూని యాసి చెలుఁగుఁబసించిపిడువ్వలువవాని." అచ్చ. బాల, కాం. (ఇట్లు సుడికయ్యడుపు మొ.)

**సుడివోవు.** దే. అ. క్రి. (సుడి+పోవు.) వ్యర్థమగు.

**సుడుము.** దే. వి. నూలుగొట్టెలగుంపు. కంటకాదిభారము. (అని కొందఱు.)

**సుత.** ఉప. దే. అవ్య. ప్రభృత్యర్థకము, మొదలుకొని. (అదిసుత, నాటిసుత మొ.)–సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు.

**సుతనువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. కోమలమైన దేహముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**సుతరాం.** గ్రా. అవ్య. బొత్తుగా, ఎంతమాత్రము. (రూ. సుత లాం.)

**సుతశ్రేణి.** సం. వి. ఈ. స్త్రీ. ఎలుకచెవి, మూషకపర్ణి*.

**సుతి.** వై. వి. 1. షడ్జాదిస్వరారంభకావయవమైనహ్రస్వమాత్రక శబ్దవిశేషము; 2. కంఠస్వరాదులకు సహాయమగు తంత్రిలోనగు వానిధ్వని*.

**సుతికాఁడు.** ద్వి. వి. సుతిపోయువాఁడు.

**సుతుఁడు.** సం. వి. అ. పుం. 1. కొడుకు; 2. రాజు.

**సుత్తె.** దే. వి. దాగిపేనీఁద బంగారులోనగువానినంచి సాఁగ గొట్టెడు కారువులసాధనవిశేషము, తొడఘు. "సీ. సుత్తెవాటుల గారుఁజెత్తునిసొమ్ములా పలరించునవ్వఁడాశాంబరునకు." రా, వి. ౧, ఆ. (మొదటిరూపము సుత్తియ.)

**సుత్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. సోమలతనుకొట్టిపిడుచుట; సోమపా నము. (అనికొందఱు.) 2. స్నానము.

**సుత్రాముఁడు.** సం. వి. న్. పుం. ఇంద్రుఁడు.

**సుత్వుఁడు.** సం. వి. న్. పుం. యజ్ఞమునందు సోమలతను కొట్టి పిడిచినవాఁడు.

**సుద.** దే. వి. సుద, గాస, కథ. "క మదనశిలిలుగొనవచ్చుట, సుదనెనుఁగికన్న భామలసుదనెఱుఁగఁ." విజ. ౧, ఆ.

**సుదతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చక్కని పలువరుసగల ఆఁడుది; 2. ఆఁడుది.

**సుదర్శనము.** సం. వి. అ. న. అమరావతీపట్టణము. పుం. 1. విష్ణుచక్రము; 2. మేరుపర్వతమునందలి నేరేడు*.

**సుదాయము.** సం. వి. అ. పుం. పెండ్లియందు అల్లునికి ఆఁడు బిడ్డకునిచ్చెడి అరణము.

**సుదూరము.** సం. విశే. (అ. ఈ. అ.) మిక్కిలి దవ్వు, ఎడ దవ్వు.

**సుద్ద.** వై. వి. తెల్లమన్ను, శ్వేతమృత్తిక*.

**సుద్దగించే.** వై. స. క్రి. బంగారులోనగువానిని సుత్తెతో మిట్టపల్ల ములులేక సుద్దపఱచు. "వ. కరఁగనుబోసిపోయఁగను గ్రాచిక దించను గమ్మిదీయఁగా, నోరయఁగ వన్నియలేమిగులనుండఁగఁజూ పఁగఁ బూదగట్టతే, కరయుఁగఁడుర్చఁ జెక్కఁబడియచ్చున వేయఁగ సుద్దగింపఁగా, భారిదినిచిత్రచిత్రముగ సొమ్ములు సేయనతండునేరు చుణ్." హంస. ౨, ఆ.

**సుద్దము.** వై. విశే. నిర్దోషము. "సుద్దంపుటద్దంపునిద్దంపు చెక్కిలి." కళాం. ౧, ఆ.

సుద్ది. వై. వి. 1. వృత్తాంతము; "ద్వి. శాంపేదిరామునిసుద్దిచెప్పు చును." రా. అ, కాం.—2. పరిశుద్ధి; 3. మాట*. "ద్వి. సుధలొల్కుతియ్యని సుద్దులవాని." రా. అ, కాం.

సుద్దిగాఁడు. ద్వ. వి. (సుద్ది+కాఁడు.) పరిశుద్ధుఁడు. "అట్టు వంటిసుద్దిగాఁడుకాఁడటందువు." శుక. ౧, ఆ.

సుద్దిచేయు. వై. స. క్రి. శుద్ధిపఱుచు.

సుధ. సం. వి. ఆ. స్త్రీ. 1. అమృతము; 2. పాలు; 3. సున్నము; 4. జెముడుచెట్టు; 5. చాఁగచెట్టు; 6. ఇటిక.

సుధర్మ. సం. వి. ఆ. స్త్రీ. న్. పుం. దేవసభ.

సుధాంశువు. సం. వి. ఉ. పుం. చంద్రుఁడు.

సుధాకరుఁడు. సం. వి. అ. పుం.——పై.——

సుధి. సం. వి. ఈ. పుం విద్వాంసుఁడు, చదువరి.

సునాభము. సం. వి. అ. పుం. తెల్లగినియచెట్టు.

సునాయాసము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి సులభము.

సునాసీరుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

సునామణి. హిం. వి. చదివి వినిపించుట.

సునిషణ్ణకము. సం. వి. అ. న. నీరుచెంచేలిచెట్టు.

సున్న. వై. వి. 1. అనుస్వారము; 2. అభావము; 3. మణి దోషవిశేషము*.

సున్నగిల్లు. వై. అ. క్రి. గుండ్రమగు. (రూ. సున్నగిలు.) చమ ౧, ఆ.

సున్నతి. హిం. వి. శిశ్నము కొనతోలును ఛేదించుట. ఇది మహమ్మ దీయుల, యెహూదీయుల యాచారము.

సున్నపుఁగాయ. ద్వ. వి. (సున్నము+కాయ.) సున్నముంచు కొనెడు కరండము.

సున్నము. వై. వి. తెల్లనియొకదినుసు కారపువస్తువు. (ఒకదినుసు రాతినిగాని, శంఖమునుగాని, నీటిగుల్లలనుగాని, ముత్యపుచిప్పనుగాని, ముత్యమునుగాని కాల్చి దీనిని చేయుదురు.)

సున్ని. వై. వి. నలుఁగునకై పచ్చిపెసలుతోనగువాని విసరిచేసిన పాశి

సున్నితము. వై. విశే. కచ్చితము*.

సుపథము. సం. వి. న్. పుం. సత్పథము, మంచిత్రోవ.

సుపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. గరుత్మంతునితల్లి; 2. తామరతీఁగ. అ. పుం. ము. 1. పాలపిట్ట; 2. తేలచెట్టు.

సుపర్ణుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, గరుడుఁడు.

సుపర్వుఁడు. సం. వి. న్. పుం. వేలుపు, దేవత.

సుపాణి. వై. వి. 1. (ముత్యమునందలి) శుభ్రమైననీరు*; "ముత్యముల సుపాణి." సాండు. 3, ఆ.—2. శుభ్రమైన నీరు గలముత్యము*. "తే. ఈసుపాణిరదశ్రేణియే సుపాణి." విజ. ౧, ఆ. (సుప్పాణియొక్కరూపాంతరము.)

సుప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిద్ర; 2. నిద్రయందలివధము; 3. తిమ్మిరి.

సుప్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నిద్రించినవాఁడు.

సుప్పాణి. వై. వి. (సుప్ప+పాణి.) (చూ.) సుపాణి.

సుప్రతిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.)

సుప్రతీకము. సం. వి. అ. పుం. ఈశాన్యపుదిక్కునందలి యేనుఁగు. విశే. మంచి యవయవములుగలది.

సుప్రలాపము. సం. వి. అ. పుం. మంచిమాట.

సుబా. హిం. వి. రాజ్యమునందొక గొప్పభాగము.

సుబాణము దే. వి. ఒకదినుసు పిరంగి. అం, భా.

సుబ్బు. దే. అ. క్రి. బయలుపడు. "క. ఆచిత్రఫలకమెవ్వరు, చూచినవెలివిసరియపుడసుబ్బెడుసడిసీ, వేచూచుచేను జూచుట, యోచంచలనయనయింతయునెఱుంగుదువే." ప్రభా. ౧, ఆ.

సుబేదారు. హిం. వి. 1. సుబాకుప్రభువు; 2. సేనలో నొక యధికారి.

సుబ్రహ్మణ్యుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి.

సుభగ. సం. విశే. (అ. ఆ. అ.) 1. మనోహరురాలు; 2. భాగ్యవంతురాలు.

సుభద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. అర్జునునిభార్య; 2. గుమ్మడిచెట్టు. అ. పుం. ము. స్వరగ్రామనామవిశేషము.

సుభిక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఆరెపుష్ప. విశే. ము. సులభభిక్షము కలది. (దుర్భిక్షములేనిదియనుట.)

సుమంగలి. సం. వి. ఈ. స్త్రీ. ముత్తయిదువ, సువాసిని.

సుమనము. సం. వి. అ. పుం. గోదుమలు.

సుమనస్సు. సం. వి. స్. స్త్రీ. 1. పువ్వు; 2. జాజిచెట్టు. పుం. 1. వేలుపు; 2. విద్వాంసుఁడు.

సుమనోరజము. సం. వి. స్. న. పుప్పొడి.

సుమము. సం. వి. అ. న. కుసుమము, పువ్వు.

సుమారు. హిం. వి. కొంచెమెచ్చుతగ్గు.

సుమాళము. దే. వి. సంతోషాదులవలనఁగలిగెడు పారవశ్యము, ఆవేశము. "పుష్పావనవఁబు గ్రోలినసుమాళము." రామా. ౨, ఆ.

సుమాళి. దే. విశే. (సుమాళము+ఇ.) సుమాళముగలవాఁడు. (చూ. తవకలి. విశే. రెండవయర్థము.)

సుమాళించు. దే. అ. క్రి. సుమాళమునొందు. "ఎ, గీ. తన్నుఁ గనిసుమాళించుచుధవునిహృదయ, సవమయూరముచెలరేఁగినాట్య మాడె." కళా. ౭, ఆ.

సుముఖుఁడు. సం. వి. అ. పుం. 1. గరుత్మంతునికొడుకు; 2. ఒక నాగకుమారుఁడు; 3. విఘ్నేశ్వరుఁడు; 4. విద్వాంసుఁడు. విశే. చక్కని ముఖముగలవాఁడు.

సుమేరువు. సం. వి. ఉ. పుం. మేరుపర్వతము.

సుర. ఉభ. దే. వి. 1. గాలిసుడి; (చూ. సురగాలి, అవచాటము.) 2. గాలి. (చూ. సురఁటి, సురమాలి.) విశే. పెద్ద. (చూ. సుర మాయి.)—సం. ఆ. స్త్రీ. 1. మద్యము; 2. మద్యపానము చేసెడుగిన్నె. అ. పుం. బ. వేలుపులు.

సురంగ. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. సొరంగము. అ. పుం. ఒకదినుసుపూఁజెట్టు.

సురఁటి. దే. వి. (సుర+అంటు.) వట్రువవిసనకఱ్ఱ. "ద్వి. మరువంపుఁగొనలనమర్చినయట్టి, సురఁటివట్రువగాలిసుడియం గఁద్రిప్పు, తనమంత్రివరుమోముతప్పకచూచి." హరిశ్చ. ౧, భా. "క. అనవినియానతియింతయు, వినిపించెదవినుఁడటంచు విభునకులీలన్, దనచేతిసురఁటివిసరుచు, వినయముమధురభణితినిట్లు

వినిపించెదగఁ." కళా. ౧, ఆ. "చ. అలరుసురంటిగూండ్లమునుపంతటఁ బెట్టిన బొండుమల్లెము, గ్గలగమిగాలిగ్రుడ్లు." చంద్రా. ౨, ఆ. (కొందఱు చామరము అని వ్రాసియున్నారు. అదికాదు. "సీ. సురఁటిచేకొనిభద్రశుశ్రూషగావింపనిరిచామరలుమిత్రనిందఁయిడఁగ." ప్రభా. ౨, ఆ.—కొందఱు కుంచె అని వ్రాసియున్నారు. అదికాదు. "సీ. కప్రంపుటరిగయొక్క విలాసినివహింపఁ అగురాకుగొంపుగొక్క మగువపూన, నకరుకుంచియయొక్క యలివేణిధరియంప నలరుపావడయొక్క చెలువవైవఁ, దమ్మిక్రొవ్విరిగిండిఁగొమ్మయొక్క తెమ్మల్పఁగలువకాళాంజియొక్క సుదతి, మొగలిరేకడపమొక్క గురుస్తనిభరింపఁ గురువేరుసురఁటియొక్క రితయూన." చంద్ర.) (చూ. సురఁటీ. "పువ్వుసురఁటినిపస రుచు." శశాం. 3, ఆ. "కప్పురంపుఁబోఁబొరసురంటిగాస్పుడి మంబు." చంద్ర.)

**సురకాని.** ద్వ. వి. కానిలో నాలవభాగము. "క. హాయియుత్తర భాగంబునఁ, బురుషుఁడుదాఁబాపమైనఁబుణ్యంబైనఁ, సురకాని యెత్తుచేసినఁ, బరిణతిమైమేరుకుదరభారముఁజూపుఁ." పా. వు. ౪, ఆ. (ఇక్కడ సురశబ్దమునకు వ్యతిరేకలక్షణచే చిన్నదని యర్థము.)

**సురకోలి.** దే. వి. ఒకదినుసు పిరంగి. ఆం, భా.

**సురగవి.** సం. వి. ఈ. స్త్రీ. కామధేనువు, వేల్పుటావు.

**సురగాలి.** దే. వి. సుడిగాలి. (చూ. చొరుగు.) (ఇట్లు సుర కరువలి.)

**సురజ్యేష్ఠుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, వేలుపుఁబెద్ద.

**సురటి.** సం. వి. ఈ. స్త్రీ. రాగవిశేషము.

**సురతము.** సం. వి. అ. న. స్త్రీపురుషులకలయిక.

**సురతాణి.** వై. వి. 1. ఇంద్రుఁడు; "క. ఈరీతిఁగెందలిరుల, కోరీసురతాణికాఁకఁగూర్చుచకోరీ, శారికీరీమత్తమ, యూరీరవము లకు నలికియుగ్మలిమదిలోఁ." చంద్ర. — 2. ఇంద్రాణి. "ఎ, గీ. మేటిరతులకుసురతాణినుంచుఁబోణి." శశాం. ౪, ఆ.

**సురతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దయగలవాఁడు.

**సురదీర్ఘిక.** సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ, వేల్పుటేఱు.

**సురద్విషుఁడు.** సం. వి. ష్. పుం. అసురుఁడు, వేల్పుదాయ. (ఇట్లు సురారి మొ.)

**సురనిమ్నగ.** సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ, వేల్పుటేఱు.

**సురపతి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుతేఁడు.

**సురపొది.** దే. వి. ఒకానొకచెట్టు, కాకాంగము.

**సురపున్నాగము.** సం. వి. అ. పుం. సురపొన్న చెట్టు.

**సురపొన్న.** వై. వి. ఒకదినుసుపొన్న చెట్టు.

**సురభి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కామధేనువు; 2. ఆవు; 3. అందుగు చెట్టు; 4. మురయనెడు గంధద్రవ్యము. న. 1. బంగారు; 2. వాసనగలకలువ. పుం. 1. వసంతఋతువు; 2. చైత్రమాసము; 3. సంపెంగ చెట్టు; 4. జాజికాయ. విశే 1. మంచి వాసనగలది; 2. మనోజ్ఞమయినది.

**సురభిళము.** సం. విశే. (అ. ఆ. అ.) మంచివాసనగలది. "సీ. నిశ్వాససురభిళానిలములసంపద సరసవసంతర్తుసరణిఁజేయ." కవి. 3, ఆ.

**సురభీకరించు.** సం. స. క్రి. వాసనకలదానిఁగాఁజేయు. "మిక్కుటంబైనగంధముదిక్కులఁ సురభీకరింప." హరి. పూ. ౭, ఆ.

**సురమాయి.** దే. విశే. మిక్కిలి నల్లనిది. "సీ. పడగలుతేఁటఁబడఁ దొడరుభోగులగెల్చి సురమాయిజల్లులఁశోభగుఁగాంచె." భాను. ౪, ఆ. (దీనికి వృత్తియందు వికల్పముగా అంత్యవర్ణలోపము.) "చ. చటులశఁబాంధులం గెలువఁ జాలినశంబర దైత్యభేదికిఁ, బటువగుతెక్కుజొంపుసురమాజగజల్లులమేటిరొతుబం, ట్లటెకలకంపముల్ మదనుకావళిపచ్చనిడాలువాపురా, లబెవనవాటిలోన జలజాననయేఁగలిడాఁగవచ్చితే." భాను. ౩, ఆ.

**సురమాలి.** దే. విశే. గాలికించినది. (చూ. బాలీసు.)

**సురర్షి.** సం. వి. ఇ. పుం. నారదాదిదేవఋషి.

**సురలోకము.** సం. వి. అ. పుం. స్వర్గము, వేల్పుఁబ్రోలు.

**సురవర్త్మము.** సం. వి. న్. న. ఆకాశము, వేల్పుఁదెరువు.

**సురస.** సం. వి. ఆ. స్త్రీ. 1. నాగమాత; 2. సర్పాక్షి చెట్టు. అ. న. ము. సల్లగగ్గెర చెట్టు. విశే. తియ్యనిది.

**సురాచార్యుఁడు** సం. వి. అ. పుం. బృహస్పతి, వేల్పుటొజ్జ.

**సురామండము.** సం. వి. అ. న. కల్లుతేట, కల్లుమీఁగడ. (అని కొందఱు.)

**సురాలయము.** సం. వి. అ. పుం. మేరుపర్వతము.

**సురాష్ట్రజము.** సం. వి. అ. పుం. 1. తొగరి; 2. తొగరిమన్ను; 3. అడవితొగరిచెట్టు.

**సురాళము.** దే. వి. 1. భూతావేశజనితశిరోభ్రమణము; 2. కోపావేశము.

**సురాళించు.** దే. స. క్రి. (దృష్టిదోషపరిహారార్థము.) దిగఁదుడుచు. "ఎ, గీ. కడనుప్రాదండలెల్లనొక్కటిగ బట్టి, బాలకపుడు సురాళించి పాఱవైచె." కళా. 2, ఆ.

**సురిగ.** దే. వి. చిన్నకొమ్మ, ఉపశాఖ.

**సురిగి.** దే. వి. ఒకానొకచెట్టు.

**సురియ.** వై. వి. చురకత్తి. "ఎ, గీ. సారసస్వనప్రౌఢిమార్థి, యీ సురియచేతనాలుకఁగోసికొనియు." కళా. 3, ఆ.

**సురియాళు.** ద్వ. వి. (సురియ+ఆళు.) మాలవాఁడు. "ఎ, గీ. వచ్చుసేవింప సురియాళు వైష్ణవుండు." ఆము. ౬, ఆ. (ఇందు ఉత్తరపదము అరవము.)

**సురుఁగు.** దే. అ. క్రి. 1. అదృశ్యమగు; "వరాహముకడంకన దర్శితమయ్యునయ్యడఁ, పందిసురింగిపోయినన్నపాలతనూజుఁడు చిన్నవోయి." విక్ర. 3, ఆ.—2. పాఱు; "చ. నాడలఘోషయాత్రలోఁ, గురుపతిడించి క్రీడితృపకుం దగుపాత్రముచేసి యొక్కడఁ, సురిఁగితి." భార. కర్ణ. ౨, ఆ. — 3. జోడఁగాఁబోవు; "సీ. అదియెవ్వరోపిలిచెదరునన్నే మొకో యరసివచ్చెదనంచు సురిఁగెనొకతె." కళా. 2, ఆ.—4. చలించు. "సుడిగాలిత్రిప్పులసురుఁగదేయీతనివ్వి." (చూ. ఉత్తరార్థము.) హన. 3, ఆ. (చూ. వ్రబ్బ.)

**సురుగుడు.** దే. వి. ఒకానొక యెఱ్ఱచాయచెక్కచెట్టు.

**సురుడు.** దే. వి. దివటీకిమూఁటుగా కాల్చిపట్టుకొనెడు వెలుతురు కట్టెలకట్ట. ఆం, భా.

**సురుమా.** హిం. వి. ఒకవిధమైన కాటుక, అంజనము.

**సురుము.** దే. వి. పొడి, చూర్ణము. ఆం, భా.

**సురూపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. చక్కనివాఁడు; 2. విద్వాంసుఁడు.

**సురె.** వై. వి. సురియయొక్క రూపాంతరము. ''సీ. అందమైమరు సురెచందమై శోభిల్లునారీలలామనూఁగారుసొబగు.'' పర 3, ఆ.

**సురెయాళు.** ద్వ. వి. సురియాళుయొక్క రూపాంతరము.

**సురేకారము.** ద్వ. వి. ఒకదినుసు ఉప్పు.

**సురోదము.** సం. వి. అ. పుం. కల్లుసముద్రము.

**సుఱసుఱ.** దే. వి. ప్రుక్కుటయందగు ధ్వన్యనుకరణము. ''వాని మైసుఱసుఱప్రుక్కనొక్కి.'' నిర్వ. 2, ఆ.

**సులభము.** సం. విణ. (అ. ఆ. అ.) సుఖముగా లభించునది. (సులభముకానిది దుర్లభము.)

**సులువు.** వై. విణ. చేలకనైన.

**సులోచనము.** సం. వి. అ. న. ముక్కద్దము.

**సుల్తాను.** హిం. వి. తురుష్కప్రభువు.

**సువర్చల.** సం. వి. ఆ. స్త్రీ. నింగిమిరి*.

**సువర్ణకము.** సం. వి. అ. పుం. తేల, కృతమాలము*.

**సువర్ణము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. మాడ; 3. ధనము; 4. ఒకపువ్వు; 5. నల్ల అగలు. విణ. మంచి వర్ణముగలది.

**సువల్లి.** సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చే*.

**సువహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగు*; 2. కారేలకి*; 3. చెప్పుతట్ట*; 4. నల్లవావిలి*; 5. సర్పాక్షి*; 6. వీణె. విణ. సుఖముగ మోవఁదగినది.

**సువారము.** వై. వి. వంట*. ''చ. పొడిమిరియంబుగావెడలి పోయెడుకొండలునుగ్గుచేసియొ, క్కడుజలజంతులంబోలసుకూరలువండివెడందచిప్పలం, దుడుకఁగఁబెట్టిముత్తియపుటోగిరముల్ గసుఁగుప్పరించెన, య్యెడరఘువీరుసాయకములెక్కడనేర్చె సువారపుంబనుల్.'' రామా. 2, ఆ.

**సువాల.** ద్వ. వి. సువ్వాలయొక్క రూపాంతరము. (చూ. అల్లొనేరెడు మూడవయర్థము.)

**సువాసిని.** సం. వి. ఈ. స్త్రీ. పేరంటాలు.

**సువ్రత.** సం. వి. ఆ. స్త్రీ. సులభముగా పిదుకఁదగినయావు. విణ. మంచివ్రతముఁగలది.

**సువ్వాలాల.** ద్వ. వి. (సువ్వి+ఆలతి+ఆలతి.) సువ్వాల.

**సువ్వాల.** ద్వ. వి. (సువ్వి+ఆలతి.) ఆఁడువారు పెండ్లిండ్లయందు సువ్వియను పదముతో ఆలాపముచేసి పాడెడుపాట. ''క. అలలనామణికాగ, య్యాళియొకానొక్కవేళనక్కఱతోను, వ్వాలలుశోభానలుధవ, ళాలుణ్మొదలైనపాటలాదటనేర్పుణ్.'' శుక. ౧, ఆ.

**సువ్వి.** దే. వి. దంచుటయందగు ధ్వన్యనుకరణము.

**సుషమ.** సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలి శోభ. విణ. 1. మనోజ్ఞమైనది; 2. సరిసమానమైనది.

**సుషవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కాఁకర*; 2. జీలకఱ్ఱ; 3. నల్లజీలకఱ్ఱ. (రూ. సుశవి.)

**సుషి.** సం. వి. ఇ. స్త్రీ. బెజ్జము, రంధ్రము.

**సుషిమము.** సం. వి. అ. న. చల్లన. విణ. చల్లనిది. (రూ. సుశిమము.)

**సుషిర.** సం. వి. ఆ. స్త్రీ. గువ్వగుత్తిక*. అ. న. ము. 1. బెజ్జము; 2. పిల్లంగ్రోవిలోనగువాద్యము. పుం. కిక్కస*. విణ. బెజ్జముగలది.

**సుషుప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఒళ్లెఱుఁగనినిద్ర. (ఇది త్ర్యవస్థలలో నొకటి. చూ. అవస్థ.)

**సుషుమ్న.** సం. వి. ఆ. స్త్రీ. ఒక నాడి. (చూ. నాడి.)

**సుషేణము.** సం. వి. అ. పుం. కలివి*.

**సుషేణిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ*.

**సుస్తి.** హిం. వి. సోమరితనము.

**సుహృదుఁడు.** సం. వి. ద్. పుం. చెలికాఁడు.

**సుళువు.** వై. విణ. సులభము. (రూ. సులువు.)

**సుళ్లమారి.** దే. విణ. 1. సుడులుగలవాఁడు; 2. చుట్టఁబెట్టువాఁడు. ''క. అనిలుఁడు సుళ్లమారికమలారినిశాచరుఁడు.'' శృం. ౧, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

## సూ.

**సూకరము.** సం. వి. అ. పుం. పంది, వరాహము.

**సూక్ష్మము.** సం. వి. అ. న. 1. అధ్యాత్మము; 2. కపటము. పుం. అణువు. విణ. సన్నము.

**సూచకము.** సం. వి. అ. పుం. 1. సూది; 2. నక్క; 3. కుక్క; 4. కాకి; 5. పిల్లి.

**సూచకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొండెముచెప్పువాఁడు; 2. బోధచేయువాఁడు.

**సూచన.** సం. వి. ఆ. స్త్రీ. 1. జాడ; 2. గ్రుచ్చుట; 3. తెలుపుట; 4. చూపు.

**సూచి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సూది; 2. అభినయహస్తవిశేషము. (చూ. సూచీముఖము.)

**సూచించు.** సం. స. క్రి. 1. జాడగా తెలియఁజేయు; 2. తెలియఁజేయు.

**సూచిక.** సం. వి. ఆ. స్త్రీ. సూది. విణ. తెలియఁజేయునది.

**సూచితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. జాడగా తెలుపఁబడినది; 2. తెలుపఁబడినది.

**సూచీముఖము.** సం. వి. అ. పుం. 1. అభినయహస్తవిశేషము; (తక్కిన వ్రేళ్లు ముడువఁబడి ముక్కుమోవ నిలువుగా చాఁపఁబడిన చూపుడువ్రేలుగలది.) 2. బాణము; 3. పక్షివిశేషము.

**సూటి.** దే. వి. 1. గురి; ''తే. చెలఁగుమావింటినేర్పునుజేతిసూటి, నీవు చూచినఁజాలు.'' రామా. ౨, ఆ. — 2. విధము. ''ఎ, గీ. సుఖముశొంపునొక్కసూటిననడవంగ.'' నిర్వ. ౮, ఆ.

**సూటికాఁడు.** దే. విణ. 1. గురికాఁడు; 2. అందగాఁడు.

**సూటిపడు.** ద్వ. అ. క్రి. సరితూఁగు. ''ఆవంచనాయతియాదృచ్ఛికసూక్తిసూటిపడ.'' వసు. ౨, ఆ.

**సూడించు.** దే. అ. క్రి. పగగొను. ''క. చేడియచూపులుదమలో, సూడించె.'' విక్ర. ౮, ఆ.

**సూడిగములు.** దే. వి. బ. 1. ఆఁడుదాని చేతిగాజులు; ''తే. కంకణంబులతోసూడిగములురాయ.'' కాశి. ౫, ఆ. — 2. చేతికడియములు. ''ఆ. కనుబీసులరాచసూడిగంబులతోఁడా.'' అచ్చ. సుం, కాం.

**సూడిద.** దే. వి. కానుక. ''సీ. తరుణియొక్కతె పూవుదండసూడిద వెట్టి హేలాపరీరంభమెచ్చరించె.'' జై. 3, ఆ.

**సూడు.** దే. వి. 1. పగ; "క. సూడొక్కటియునుసుఖిదాఁ, గీడొక్కటియునుజగంబు కీర్తించుటకై." ఉ, హరిశ్చ. ౪, ఆ.– 2. పగవాఁడు. "జక్కవగమిసూడు చక్కని వగకాఁడు." శశాం ౧, ఆ.

**సూడుకాఁడు.** దే. వి. పగవాఁడు, శత్రువు. ఆం, భా.

**సూడుకొను.** దే. అ. క్రి. పగగొను. "ఎ, గీ. ఇరుగుపొరుగుల వారి నింటింటివారి, సూడుకొనఁ దిట్టిమఱికానికూడు గుడువదు." భో. ౩, ఆ.

**సూడుపట్టు.** దే. స. క్రి. విరోధించు. "తే. చూడపేటికినిడు వాలుశోగమీల, సూడుపట్టఁగఁ జాలెడుచూపుఁగొనల." నై. ౮, ఆ.

**సూతకము.** సం. వి. అ. న. 1. జాతాశౌచము; 2. మృతాశౌచము. పుం. న. పాదరసము.

**సూతము** సం. వి. అ. పుం. పాదరసము, సూతకము.

**సూతి** సం. వి. ఇ. స్త్రీ. 1. కుట్టు; 2. ప్రసవము.

**సూతిక.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు.

**సూతిని.** దే. వి. దేశవిశేషము. (చూ. బాలీసు.)

**సూతుఁడు.** సం. వి. అ. పుం. 1. తేరుగడపువాఁడు; 2. బట్టువాఁడు; 3. వడ్లంగి.

**సూత్థానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నేర్పరి.

**సూత్రధారుఁడు.** సం. వి. అ. పుం. 1. ఆటాడించువాఁడు; 2. నడపించువాఁడు; 3. వడ్లంగి; 4. వేల్పుతేఁడు.

**సూత్రపడు.** మి. అ. క్రి. శేతపడు. "క. క్షేత్రంబు పురుషకారము, ధాత్రీశ్వరబీజమరయ దైవమురెండుణ్, సూత్రపడఁ గూడెనేనిం, బాత్రమగుంగర్షకరుఁడు ఫలమునకొందుణ్."

**సూత్రము.** సం. వి. అ. న. 1. నూలిపోఁగు; 2. శాస్త్రసూచనాగ్రంథము; 3. జన్నిదము; 4. ఏర్పాటు.

**సూత్రించు.** సం. స. క్రి. సూత్రపఱచు. "శ్లోకంబుల్ శతకోటి కాండములుగాసూత్రించి." నిర్వ. ౧, ఆ.

**సూదంటుఱాయి.** ద్వ. వి. (సూది+అంటుఱాయి.) అయస్కాంతము.

**సూదనము.** సం. వి. అ. న. చంపుట. విశే. చంపునది.

**సూదము.** సం. వి. అ. పుం. వండినపప్పు.

**సూది.** వై. వి. గుడ్డలుకుట్టుసాధనము.

**సూదిగొంటు.** వై. వి. ఒకదినుసుపోఁక, లతాపూగము.

**సూదితము.** సం. విశే. (అ. ఆ. అ.) చంపఁబడినది.

**సూదిమల్లె.** వై. వి. ఒకదినుసుమల్లెపూ.

**సూదిరాయి.** ద్వ. వి. సూదంటుఱాయి.

**సూదుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వంటవాఁడు.

**సూన.** సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. కొండనాలుక; 3. వధస్థానము. [ఇవి అయిదు.–కండని, (ఱోలు,) పేషణి, (సన్నికల్లు,) చుల్లి, (పొయ్యి,) ఉదకుంభి, (నీళ్లకడవ,) మార్జని, (పొరక.) ఇట్లు.] అ. న. ము. 1. ప్రసవము; 2. పుష్పము. విశే. శూన్యము.

**సూనగాఁడు.** మి. గ్రా. విశే. (సూన+కాఁడు.) చేంపువాఁడు. (చూ గొడగరి.)

**సూనరి.** మి. గ్రా. విశే. (సూన+అరి.) 1. చేంపువాఁడు; "శాల్యకనిత్యమొక్కొకని సూనరి చోలెవధించి." భార. సభా. ౧, ఆ.– 2. పూవులమ్మువాఁడు. "సూనరియన్నంబుజూదరియన్నంబు."

**సూనుఁడు.** సం. వి. ఉ. పుం. 1. కొడుకు; 2. తమ్ముఁడు; 3. సూర్యుఁడు. (స్త్రీలింగమైనచో. పు. కూఁతురు.)

**సూనృతము.** సం. వి. అ. న. శుభము. విశే. ప్రియమును సత్యమునైనది. (మంట.)

**సూపకారుఁడు.** సం. వి. అ. పుం. వంటవాఁడు.

**సూపము.** సం. వి. అ. పుం. వండినపప్పు. డు. వంటవాఁడు.

**సూయాణము.** వై. వి. శత్రుభయంకరమైనదండయాత్ర. "సీ. తగు నాజ్ఞసూయాణముగ నొసరించెమంచిగనేలనాలుగుపెఱుగులకును." భాగ. విరా. ౫, ఆ.

**సూరణము.** సం. వి. అ. పుం. కందగడ్డ.

**సూరసూతుఁడు.** సం. వి. అ. పుం. అనూరుఁడు.

**సూరి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు. ఇ. న్. పుం. పండితుఁడు.

**సూరుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**సూరెగిల్లు.** దే. అ. క్రి. ప్రక్కకొదుఁగు. "మ. అసురాధీశతనూజకోట్లలకుఁ గన్యాంతఃస్థితిన్గలం, గిసురానీకము సూరెగిల్లిన." నిర్వ. ౬, ఆ. (చూ. సూరెగిలు. "సీ. కమనీయబహుచిత్రగతులనేపాగుచో సురవిమానంబులుసూరెగిలఁగ." భో. ౭, ఆ.)

**సూరెపాను.** దే. వి. ఆలవట్టము. "రగడ. చికిలిపుత్తడిక్రొత్తహరువులఁజెందునిగిడ్డ సూరెపానలు, ఒకటఁగస్తురిమెకములుం దుటకొప్పనెడలపొబ్బోసలు." శుక. ౧, ఆ.

**సూరెప్పటము.** వై. వి. (చూ.) సూర్యపటము. "రగడ. మొకమాలులున సూరెపుటములు బనాతులును." హంస. ౫, ఆ.

**సూరెలు.** దే. వి. బ. పార్శ్వములు. "క. సూరెలనవఁదిజనులిం, పారఁగన తిలుంపు." భార. స్త్రీ. ౨, ఆ. "ఆననిఁగొల్లపోయి వారితటిదంష్ట్రుల సూరెలనిల్వ." రామా. ౨, ఆ.

**సూర్మి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. లోహపుప్రతిమ. (చూ. శూర్మి.)

**సూర్యకాంతము.** సం. వి. అ. పుం. సూర్యరశ్మితగులుటచే నిప్పునెగయు ఒకదినుసుఱాయి.

**సూర్యతనయ.** సం. వి. ఆ. స్త్రీ. యమునానది, కాళింది.

**సూర్యపటము.** సం. వి. అ. పుం. మేలుతరపుమొకమాలు. "ఎ, గీ. బాయసూర్యపటంపుఁగుళ్లాయపానఁగ." చంద్రా. ౨, ఆ.

**సూర్యుఁడు.** సం. వి. అ. పుం. వెలుఁగుఱేఁడు.

**సూర్యానువర్తిని.** సం. వి. ఈ. స్త్రీ. పొద్దుతిరుగుడుపూ.

**సూల.** వై. వి. రోగవిశేషము. "చ. కడుపునసూలయెత్తివడిగానిలి ప్రాణములేగునట్లుయై." హంస ౧, ఆ.

**సూలచేకట్లు.** దే. వి. కంకణవిశేషము. "సూలచేకటులొక్కమూలవైచి."

**సూసకము.** దే. వి. స్త్రీలు తలనుధరించెడు తిరుగుడుబిళ్ల. "సీ. చెంగల్వపూదండఁ జేర్చి పెందుఱుముపై ఘనసారమున సూసకము ఘటించి." చంద్రా. ౬, ఆ.

**సూసరి.** దే. వి. సున్నముపూయువాఁడు, లేపకుఁడు.

## సృ.

**సృక్వము.** సం. వి. న్. న. పెదవిమూల, సెలవి.

**సృక్వి.** సం. వి. ఇ. న.——సై.——

**సృగము.** సం. వి. అ. పుం. సాఁగు, భిండివాలము.

**సృగాలము.** సం. వి. అ. పుం. నక్క, జంబుకము.

**సృజన.** సం. వి. ఆ. స్త్రీ. సృష్టి. (చూ. విశ్వసృజుఁడు.)

**సృజించు.** సం. స. క్రి. సృష్టిచేయు.

**సృజ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) సృజింపఁదగినది.

**సృణి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. అంకుశము.

**సృణిక.** సం. వి. ఆ. స్త్రీ. చొంగ. (రూ. సృణీక.)

**సృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ; 2. పోక.

**సృమరము.** సం. వి. అ. పుం. పెద్దచమరమృగము.

**సృష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సృజింపఁబడినది; 2. విడువఁబడినది; 3. నిశ్చయింపఁబడినది; 4. అధికమైనది.

**సృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సృజించుట; 2. స్వభావము.

## సె.

**సెంటెన్సు.** ఆం. వి. శిక్షావిధి.

**సెక.** వై. వి. 1. జ్వాల; 2. తాపము*. "మత్తకోకిల. సెకలు చల్లనిలేఁత యెండలచేత వేడుకసేయఁగా, నకటసాటియెకాలముల్ శరదాగమంబునకెయ్యెడన్." రుక్మాం. ౪, ఆ.

**సెకకంటి.** ద్వ. వి. (సెక+కన్ను.) శివుఁడు. (చూ. పాందు. విశే.)

**సెకవెలుఁగు.** ద్వ. వి. సూర్యుఁడు, ఉష్ణరశ్మి. "క. అదరుం గ్రొక్కనవెడమకన్నుసెకవెలుఁ, గునకున్." య. ౧, ఆ.

**సెగ.** వై. వి. సెకయొక్కరూపాంతరము.

**సెగతేఁడు.** ద్వ. వి. అగ్ని, శిఖావంతుఁడు. "సెగతేనిచాన గౌఁగిలబంతి." య. ౧, ఆ.

**సెగ్గము.** దే. వి. రోఁత. "క. సెగ్గంబులదెసఁబోవక, సిగ్గులుగైకొనక మానసీమఁ జనకపే, రగ్గలికరెండుమనసులు, డగ్గఱి చూపుబడి నుత్కటంబుగఁగలసెన్." హరి. ఉ. 2, ఆ.—(చూ. సెగ్గించు.) విశే. నింద్యము. "కలనెవ్వఁడుదగ్గఱనేనిసెగ్గమే." ఉ, హరి. ౫, ఆ. (చూ. అలి.)

**సెగ్గించు.** దే. స. క్రి. రోయు. "సీ. కడునశక్తుఁడుప్రోవఁగాఁ జాలఁడితఁడనిసెగ్గింతురర్థిఁగృహీవలుండు, బడుగుముసలెద్దురోసిన పగిది." భాగ. 3, స్కం.

**సెగ్గింపు.** దే. వి. రోఁత. (చూ. అరగింపు.)

**సెగ్గు.** దే వి. సెగ్గముయొక్కరూపాంతరము.

**సెజ్జ.** వై. వి. శయ్య. "సీ. ఈమట్టియాకొకోయేకార్ణవమునాడు శేషాహిశాయికి సెజ్జయయ్యె." భో. ౨, ఆ.

**సెట్టి.** వై. వి. 1. కోమట్లులోనగువారి పట్టపుఁబేరు; 2. వర్తకుఁడు.* "వ. వారింగొన్నట్టిసెట్టి." కళా. ౬, ఆ.

**సెపియించు.** వై. స. క్రి. శపియించు. "క. నృపనీవుమదీయం బగు, జపముఖలంబడిగితేను సమ్మతినీఁగా, విపరీతఫణితులాడిన, సెపియింతుఁజుమీయెఱుంగఁజెప్పితినీకున్." భార. శాం. (రూ. సెపించు.)

**సెబాసు.** హిం. అవ్య. బళి. "సెబాసురయోరిజయంటి." ఉ, రా. ౪, ఆ. (చూ. సేబాసు.)

**సెబ్బర.** దే. వి. చెడుగు. (మంచిసెబ్బరలు.) విశే. చెడ్డది. (చూ. సెబ్ర.)

**సెబ్ర.** దే. వి. సెబ్బరయొక్కరూపాంతరము. (చెడ్డది అనుటకు.— "గుణమాసెబ్ర." హంస. ౫, ఆ. "ఎ, గీ. సెబ్రచెంచడమా బ్రాహ్మణబ్రువుండు." పాండు. ౪, ఆ.)

**సెమ్మె.** వై. వి. దీపస్తంభము*.

**సెర.** దే. వి. నేత్రమునందలిరేఖ. "తే. లేచికూర్చుండికలయంగఁ జూచియెఱ్ఱ, సెరలకాంతియుదంతరుచియునుబెరయు, టలిమనో హరముగఁదనసుతునితోడ,మనుజనాయకకుశలమేయనుచునతఁడు." భార. అశ్వ. ౪, ఆ.

**సెరగు.** దే. వి. అపద. "క. ధరణీసురవరులకుఁగడు, సెరగై యుండు నెడనెడయుఁ జేయుదురెమహా, పురుషులనిరుఁడు విలుగొని, యరిగెనుమ్రుచ్చులపెఱుఁదనవ్విప్రుపనిన్." భార. ఆది. ౮, ఆ.

**సెల.** వై. వి. 1. సెలయేఱు; (చూ. జెలజెలకడప్రవహించుట యందు అనుసర్థము.) 2. బాణపుములికి; "ద్రోణునంపసెలలవి యుటయున్." భార. ఉద్యో. ౪, ఆ.—3. ఏదుపందిముల్లు; 4. మునికోలమొదలగువాని చివరయందలి యినపముల్లు; 5. బాణము*; "సీ. సెలవాఱసెలపొమ్మసిలవైచిశరభంబుఁబరి మార్పకున్ననీబంటఁగాను." పంచ. వేం. 3, ఆ.—6. వ్రణమునందు చీమువ్యాపించెడిరంధ్రము*. "వ. ఎఱకలువిఱుగనఱికినయెడలసెలలకునిడినజలగలపొలుపున." పా. ౨, ఆ.

**సెలకట్టె.** వై. వి. 1. బాణము; 2. బాణమువలెవేగముగఁబాఱునట్టిశ్యేనవిశేషము. "క. మొలదట్టిచెఱఁగుఁజెక్కుచు, బలుదిట్ట కిరాతుఁడొకఁడు పటువగు ముష్టిన్, సెలకట్టెఁబట్టివేటొక, సెలకట్టెంగొట్టివైచెఁజెమరుంగాకిన్." స్వా. ౪, ఆ. (కొందఱు ఆధునికకవులుజలకట్టెయని ప్రయోగించినారు. అపక్షమున నది యవ్యుత్పన్న పదమగుటమాత్రముగాక యీ యుదాహరణమునందలి వేటొకయను విశేషణమునకు ప్రయోజనమును లేకపోవుచున్నది.) (మొదటిరూపము సెలకట్టియ.)

**సెలగ.** దే. వి. 1. ఉపశాఖ; అం, భా. 2. దోసెఁడుగింజలు.

**సెలగత్తి.** ద్వ. వి. (సెలగు+కత్తి.) కల్లుగీచువానికత్తి. "సీ. అడిద, ములబల్లెములనీఁటెయలసెలగత్తులగుదియలఁదూపులగొడ్డళులను." అచ్చ. యు, కాం.

**సెలగు.** దే. స. క్రి. ఖండించు. "చెండాడెన్‌గొండగొర్లన్‌సెలగనెలుఁగులన్." య. ౨, ఆ. (చెలగుయొక్కరూపాంతరము.) (చూ. చెలవు.)

**సెలగొమ్మ.** దే. వి. (సెలగ+కొమ్మ.) ఉపశాఖ. "వ. చెలంగి సెలగొమ్మలెక్కివ్రేలుచు." భో. ౪, ఆ.

**సెలగోల.** ద్వ. వి. (సెల+కోల.) గొల్లవాఁడుపసులమేపెడు కోల. "తే. చిఱుతకూఁకట్లుదూఁగాడఁజేతిచల్ది, చిక్కములు సెలగోలలుఁ జెలువుమిగుల." హరి. పూ. ౫, ఆ.

**సెలపంది.** ద్వ. వి. ఏదుపంది, ముండ్లపంది.

**సెలపుండు.** ద్వ. వి. నారికురుపు, నాడీవ్రణము.

**సెలయు.** దే. అ. క్రి. విజృంభించు. "ఆమేటిదొరసలసితానల మన్మతి." (హరిశ్చంద్రకథయందు ఆమేటిదొరసలసి అనియు, నలకథయందు ఆమేటిదొరసలసితానలమన్మతి అనియు భేదములు.) హన, ౨, ఆ.—స. క్రి. చిమ్ము. "సీ. అలవోకగనకాద్రిసెలయుచోవిరిసినహరివరాహముదంష్ట్రనవతరించె." స్కాందు. ౧, ఆ. (చెలయుయొక్క రూపాంతరము.)

**సెలయూట.** దస. వి. (సెల+ఊట.) కొండయూట, ప్రస్రవణము.

**సెలయేఱు.** దస. వి. (సెల+ఏఱు.) పర్వతమునుండిపాఱెడు నది, నిర్ఝరము.

**సెలవడు.** వై. అ. క్రి. (సెల+పడు.) సెలవాఱు. (చూ. పులినీరు.)

**సెలవాఱు.** దస. అ. క్రి. (సెల+పాఱు.) సలపేయు. "తే. త్రిపురసంహారమొనరించునపుడు హరుఁడు, బండికల్లుగనీమేనుగండిచేసె, నదియుసెలవాఱెలెగటాఱవైతిచంద్ర, యకటరోహిణివలనిపథ్యమునఁజేసి." స్వా. 3, ఆ.

**సెలవి.** వై. వి. పెదవిమూల. "సీ. సెలవులవనదంశములుమూఁగనెఱవెట్టఁగ్రోల్పులుల్ పొదరండ్లగులకలిడఁగ." స్వా. ౨, ఆ.

**సెలవిచ్చు.** దే. స. క్రి. (సెలవు+ఇచ్చు.) ఆజ్ఞాపించు. "క. తనపరి, వారము సెలవిచ్చెవారు వంబులఁబట్టఁగ." జై. ౮, ఆ.

**సెలవిల్లు.** దే వి సెలసువిల్లుయొక్క రూపాంతరము "క. సెలవిండులెక్కపెట్టుచు, సెలవిండునృపాలయనుచుఁజేరికిరాతుల్, వలకేలమ్రొక్కిచూడుము, వలకేలపుకాలఁదోలవలెమేమనికిన్." సా. ౧, ఆ.

**సెలవు.** దే స. క్రి. సెలగుయొక్క రూపాంతరము. "సీ ఊనగాగ్రంబుననీనగాఁడినయంతశిలనైనమిన్నేఱు సెలవకున్నె." ఉ, హరి. ౨, ఆ.—వి. 1. ఆజ్ఞ; 2. ఉపయోగము. (చూ. ప్రేంఖణము మొదటియర్థము నుదాహరణము.)

**సెలసు.** దే. వి. ఒకానొకచెట్టు. "సీ. కలుగొట్టుమోదుగుకానుగుచాలిలిచెలిమేడిసేరేడు సెలసుబలుసు." పంచ. వేం. ౪, ఆ. (చెలిమేడి- ఇది సందిగ్ధము.)

**సెలసువిల్లు.** దే. వి. సెలసుబద్దలతోఁజేసినవిల్లు. (చూ. విల్లు.) "సీ. తుదినెమ్మిపురికుంచెతూర్చికట్టినగంటగలిగిననిడుదలల్ సెలసువిల్లు." చంద్రా. ౨, ఆ.

**సెల్లా.** వై. వి. అంచుకన్నులులేని తెల్లవస్త్రము*. "ఉ. పూనినఖమణుల్ కుసుమపూజిగిపావడగీలుకొల్పియుం, పైనమిటారిబల్పిఱఁదుసందుఘటించినజిల్గుచల్వసె, ల్లానెఱమించెఁ జెంగలువలంగలపుప్పొడిగప్పుకొన్న జాం, బూనదసైకతంబుపయిఁబున్నమవెన్నెలగాయుకైవడిన్." భాను. ౪, ఆ.

**సెల్లుఁడు.** వై. వి. శల్యుఁడు. "ఆ. సెల్లుఁడట్లునేలఁద్రెళ్లిచెచ్చెరలేచి, యొడలుదుడిచికొనుచు నొయ్యనరిగె." (అచ్చుపుస్తకమునందు "శల్యుఁడట్లు" అని యున్నది. అప్పుడు ఛందోలక్షణమునకు దోషము.) భార. ఆది. ౭, ఆ.

**సెవ.** వై. వి. సెగయొక్క రూపాంతరము.

## సే.

**సేకము.** ఉభ. వై. వి. ఖగా*. "ఎ, గీ. కుములుకుంపటిసేకముల్ గోరువారు." పంచ. వేం. ౧, ఆ. (ఇది విచార్యము.)—సం. అ. పుం. 1. చేల్లుట; 2. తడుపుట.

**సేకరము.** వై. వి. సంగ్రహము.

**సేకరించు.** యు. దే. అ. క్రి. తెప్పిఱిల్లు. "వ. మడమలందాటిఁచినఘోటకంబు వెగ్గలంబున మ్రొగ్గియు నగ్గలికచెడకమోఁకరించుకొని కొన్ని యడుగులుచనిసేకరించుకొనికంచుమించుగాఁ బఱచుటగగనచరుల వెఱఁగు పఱిచె." స్వా. ౪, ఆ.—వై. స. క్రి. సంగ్రహించు.

**సేగి.** దే. వి. 1. నష్టి; "క. మీసేగుతెల్లనచ్చెద, వేసఱకుఁడు." హరి. పూ. ౫, ఆ. "క. వెలగొనియమ్మినబండము, విలిచినతనకీనివాఁడువేగమెదాసం, గలలాభముఁదానీఁదగుఁ, గలసేగియునెఱిఁగియఱువఁగాఁదగుఁబిదపన్." విజ్ఞా. ప్రా, కాం.—2. ఆపద, కీడు. "తే. ...లనృపాలకబాలుఁడల్లనల్ల, నడుగువెట్టంగడంగిననడుగువట్టి, రథలసైన్యలు నాఁటనయ్యాదిదేవు, నడుగువట్టినఁగలదెసేఁడకటసేగి." గామా. 3, ఆ.

**సేచకము.** సం. వి. అ. పుం. మేఘము. విణ. 1. చల్లునది; 2. తడుపునది.

**సేచనము.** సం. వి. అ. న. 1. చల్లుట; 2. తడుపుట; 3. ఓడలోఁజొచ్చిన నీళ్లువెలికిఁ బాఱఁజల్లెడు బొక్కెన.

**సేడుకత్తి.** దే. వి. సాలెవాని సాధనవిశేషము.

**సేతువు.** సం. వి. ఉ. పుం. 1. నీటికట్ట; 2. ఉలిమిరిచెట్టు.

**సేద.** వై. వి. శ్రమము, బడలిక. "క. వలసినఫలమూలాదులు, నలువునఁదెత్తునులుదనికునములుఁడుమఘుగా, మలజలములుద్రావుడునే, దయివాయఁగనను మెఁబవనతనయుఁడునతితోన్." రా. కిష్కి. ౧, కాం.

**సేదగొను.** దస. అ. క్రి. (సేద+కొను.) బడలు, శ్రమము నొందు. "క. చిప్పఱు విలుకానిచె యుప్వలసేదగొన్న, యన్న నిస్నల." అచ్చ. ఉ, కాం.

**సేద్యము.** వై. వి. పయిరుపెట్టుట, కృషి*.

**సేద్యకాఁడు.** దస. వి. సేద్యముచేయువాఁడు, కృషీవలుఁడు.

**సేన.** ఉభ. దే. విణ. బహుళ్ళు. (వాఁడువచ్చి సేనసేపైనది.) సం. వి. ఆ. స్త్రీ. దండు, సైన్యము.

**సేనము.** దే. వి. చిన్నయులి, బంగారునఱకెడియులి. (అనికొందఱు.) (ఇది సానము అని కొన్నిచోట్ల వ్రాయఁబడియున్నది.)

**సేనాంగము.** సం. వి. అ. న. రథగజతురగపదాతి చతుష్టయము.

**సేనాని.** సం. వి. ఈ. పుం. 1. కుమారస్వామి; 2. సేనాధిపతి.

**సేనాముఖము.** సం. వి. అ. న. 1. సేనయొక్క అగ్రభాగము; 2 మూడు రథములు, మూడేనుగులు, తొమ్మిది గుఱ్ఱములు, పదునేవురు కాల్వురునుఁగల సేన.

**సేపు.** దే. వి. కాలము. ("ఇంచుకసేపు" మొ.)

**సేబాసు.** దే. అవ్య. సెబాసుయొక్క రూపాంతరము. (చూ. బసివి.)

**సేమంతిక.** సం. వి. ఆ. స్త్రీ. చేమంతిచెట్టు. "క. సేమంతికాస్రగంచిత, సీమంతవతీకుచోష్ణలత శీతభయ, శ్రీమంతంబైగొబ్బున, హేమంతము దోఁచెమదనుఁజేచెవిరహులకున్." భాగ. ౧౦, స్కం. పూ. (మొదటిరూపము సేమంతి. ఈ. స్త్రీ.)

**సేమము.** వై. వి. 1. ఉన్నదిచెడకుండుట; 2. శుభము.

**సేరి.** దే. విణ. ఈనాముకానిపొలము.

**నేరు.** దే. వి. 1. అఱువదినాలుగుడబ్బులయెత్తుపట్టెడు తూన విశేషము; 2. ఇరువదిడబ్బులయెత్తు; 3. ఇరువదినాలుగు తులములయెత్తు.

**నేల.** వై. వి. వస్త్రము. "సీ. మొనసినతమిఁబోఁకముడిదివ్వఁబెనఁగఁగా-జినిఁగిననునువల్వ నేలతోడ." య. ౩, ఆ.

**నేలు.** దే. వి. సాలుయొక్క రూపాంతరము. (అప్ర.)

**సేవ.** సం. వి. ఆ. స్త్రీ. శుశ్రూష, కొలువు.

**సేవకము.** సం. వి. అ. పుం. వీణకరివె, ప్రసేవకము.

**సేవకుఁడు.** సం. వి. అ. పుం. కొలువుడుకాఁడు. విణ. కొలుచువాఁడు.

**సేవనము.** సం. వి. అ. న. 1. కొలువు; 2. కుట్టు.

**సేవి.** సం. వి. న్. పుం. సేవకుఁడు, కొలువుడుకాఁడు.

**సేవించు.** సం. స. క్రి. కొలుచు. (సంసేవించు. అనియు.)

**సేవిక.** సం. వి. ఆ. స్త్రీ. సేవియ. "సీ. గోధూమసేవికాగుచ్ఛంబు లల్లార్చి ఖండశర్కరలతోఁగలపికలపి." నై. ౬, ఆ.

**సేవితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సేవింపఁబడినవాఁడు.

**సేవియ.** వై. వి. గోదుమనూకతో సన్నగాతాలికలుచేసిపాలుపోసి వండెడు భక్ష్యవిశేషము. "సీ. తెగిన జందెము లేల తెచ్చెద రసఁగావువినుఁ డివిసన్న సేవియలుగాని." జై. ౮, ఆ.

**సేవె.** వై. వి. సేవియయొక్క రూపాంతరము. "సీ. అనుకువెన్నెలఁ దాల్చితునిచి సేవెలుచేసివెన్నెలపాలనుజున్నొనర్చి." య. ౩, ఆ.

**సేవ్యము.** ఉభ. దే. వి. దున్నిసిద్ధముచేసిన పొలము. సం. వి. అ. న. 1. వట్టివేరు; 2. నీటివట్టివేరు. విణ. సేవింపఁదగినది.

**సేస.** వై. వి. 1. అక్షత; "సీ. మందారసుమకాయమానముల్ పవమానశీర్ణకేసరములసేనచల్ల." వసు. ౬, ఆ.—2. సేసఁబ్రాలు; "అతివనతీకరోన్నమితయైవిభునౌదలసేసచల్లె." వసు. ౬, ఆ.—3. పాపట*.

**సేసఁబ్రాలు.** ద్వ. వి. బ. తలఁబ్రాలు. "లీలఁబార్వతిసేసఁబ్రాలుశివుమౌళిఁబోసె." వీర. 3, ఆ.

**సేసకొప్పు.** ద్వ. వి. కొండెసిగ. (చూ. మక్కళించు.)

**సేళము.** దే. వి. ఒకసోకచెట్టు, కారంభ.

## సై.

**సై.** వై. ఉప. సహశబ్దార్థకము. (సైదోడు మొ.) (మొదటిరూపము సయి.)

**సైంధవము.** సం. వి. అ. పుం, న. ఇందుప్పు. పుం. గుఱ్ఱము. విణ. సింధువునఁబుట్టినది.

**సైంహికేయుఁడు.** సం. వి. అ. పుం. రాహుగ్రహము.

**సైఁచు.** వై. అ. క్రి. 1. ఓర్చుకొను; 2. రుచించు*. (నాకదిసైఁచదు.) స. క్రి. ఓర్చు. (మొదటిరూపము సయిఁచు. ఓర్చుకొనుటకు.—"ద్వి. ఇంచుకసేపు సయించునీవింక." భాగ. 3, స్కం.)

**సైఁదము.** దే. వి. గోదుమపిండి. "సీ. పాయసంబులునపూపములు సైఁదపుఁబిండివంటలు పప్పును వలయుఁనట్టి, ఫలశాకములువండఁబంపుఁడు." భాగ. ౧౦, స్కం. పూ.

**సైఁపు.** వై. వి. ఓర్పు. "ద్రుపదాత్మజనానభనట్లుచేసినఁదానికి సైఁపలెన్నయని." భార. ఉద్యో. 3, ఆ. (మొదటిరూపము సయిఁపు.)

**సైఁపుడు.** వై. వి. ఓర్పు. (మొదటిరూపము సయిఁపుడు.)

**సైకతము.** సం. వి. అ. న. 1. ఇసుకదిబ్బ; 2. ఇసుకనేల.

**సైకము.** దే. వి. సూక్ష్మత్వము. "ఎ, గీ. కలహశీలరాక్షసిసయికంబులేదు." భార. అను. ౫, ఆ.—విణ. సూక్ష్మము. "క. నడుమెంతసైకమోహెూ, పిడికెటిలోనడఁగు." విజ. ౩, ఆ. (మొదటిరూపము సయికము.)

**సైగ.** వై. వి. హస్తాదులసంజ్ఞ. (మొదటిరూపము సయిగ.)

**సైడు.** ఆం. వి. ప్రక్క, పుట.

**సైతము.** వై. అవ్య. కూడ. "ఉ. మేముసైతముఖ, వాఁచినవారియట్లగనువంబునఁ గన్గొనుచుంటిమవ్విభుఁ." వి. పు. ౬, ఆ. (మొదటిరూపము సయితము.)

**సైతవాహిని.** సం. వి. ఈ. స్త్రీ. బాహుదయనెడునది.

**సైతాను.** హిం. వి. పిశాచములయధిపతి.

**సైదోడు.** ద్వ. వి. (సై+తోడు.) తోఁబుట్టువు. (చూ. పొందు. విణ.)

**సైద్ధాంతికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) సిద్ధాంతముతెలిసినవాఁడు.

**సైనికుఁడు.** సం. వి. అ. న. సేనాధిపతి. విణ. సేనతోఁజేరినవాఁడు.

**సైన్యము.** సం. వి. అ. న. సేన. పుం. కృష్ణునితేరిగుఱ్ఱములలో నొకటి. (చూ. శధ్యము.) విణ. సేనతోఁగూడినది.

**సైరంధ్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. (చూ.) గట్టువాలు; 2. అంతఃపురపుకావలికత్తె; 3. సంకరజాతిస్త్రీ.

**సైరణ.** వై. వి. సహనము. (మొదటిరూపము సయిరణ.)

**సైరించు.** వై. అ. క్రి. సైరణచేయు. "ఎ, గీ. వేచియాహారమున కనివేడ్కకనియు, నఖిలజీవులనిట్లునిత్యంబునమయఁ, జేయునీవరమునవిస్పుసిద్ధుఁడైన, నీతఁడుసైరించునేలోకహితవిచార." నిర్వ. 3, ఆ. (మొదటిరూపము సయిరించు.)

**సైరికము.** సం. వి. అ. పుం. దున్నెడియెద్దు. విణ. సీరసంబంధమయినది. (సీరము=నాఁగలి.)

**సైరికుఁడు.** సం. వి. అ. పుం. దున్నెడువాఁడు, హాలికుఁడు.

**సైరిభము.** సం. వి. అ. పుం. 1. కారెనుపోతు; 2 స్వర్గము.

**సైరేయకము.** సం. వి. అ. పుం. తెల్లగోరంట, ములుగోరంట. (అనికొందఱు.)

**సైలరు.** ఆం. వి. ఓడలమీఁద పనిచేయువాఁడు.

## సొ.

**సొంటి.** వై. వి. పక్వముచేసియెండఁబెట్టిన అల్లము.

**సొంటు.** వై. వి. తప్పు, దోషము*. "తే. వెంటనరుదెంచుతనమచ్చెకంటిశిరు, సొంట్లుసొదింపఁగడకంటఁజూచుకొనుచు." శుక. ౩, ఆ.

**సొంతము.** వై. విణ. స్వకీయము. (ఈ యిల్లు నాకుసొంతము.) (వృత్తియందు వికల్పముగ అంత్యవర్ణలోపము. సొంతధని.)

**సొంపిల్లు.** దే. అ. క్రి. సొంపగు. (రూ. సొంపిలు.)

**సొంపు.** దే. వి. 1. సమృద్ధి; "క. భూసురవరులకు రత్నని, వాసాలంకారధేనువసుధాదాన, శ్రీసొంపుససంపన్నులఁ, జేసెఁగరంభముఁ దమ్రీంచిచిత్తుండగుచుఁ." మార్క. ౮, ఆ. "చోళమండలమున సొంపులాత్తమెచ్చుచు." పర. ౨, ఆ.–2. సంతోషము; "ఉ. తాపసుగ్రేసరపేరు సొంపు నొప్పఁగ సొంపు జనించు నాపుడున్." గామా. ర, ఆ.–3. ప్రసన్నత; "సొంపు నజందుసుఁడు." య. ౧, ఆ.–4. సుఖము; "ఉ. అంచ్చోసిన నిగ్గ నిచ్చలును సొంపులను సొంపుదురమ్ము వెంబడిఁ." రా. పా. ౫, ఆ.–5. సౌందర్యము. "సీ. కొలువు నేయఁగవచ్చు కొంచు సొంపువారసుందరుల్ నృపు సొంపు చూచి చూచి." ప్ర. ౧, ఆ.

**సొగటాలు.** ద్వ. వి. బ. (సొగపు+ఆటలు) పగడసాలాట. "క. జగిగలకెమ్మోవులఁజెలు, సగవులనిగనిగలు చేతు సొగసులతోఁ, దగనందఱొక్క మొగియై, సొగటాలాడుదురు చంచుసుదతులు పల్కన్." చమ. ౧, ఆ. (సంధిని వర్ణలోపవర్ణవికారములు.) (వృత్తియందేకవచనాంతము.) "సొగటాసాగెలు." కవిక. 3, ఆ.

**సొగటు.** దే. వి. వాదు. "సీ. పగలింటి సొగలచేసొగటందు పూఁదిఁగెవడు నృపనెన్నేనువాడుదేటె." అని. 3, ఆ.

**సొగపు.** వై. వి. చొక్కు, పారవశ్యము. "చ. సొగపుసరాజనందను నిమాపులు నిల్పుఁ దదంతరంబులన్." నై. 3, ఆ. "క. విసువకసీగాన ము సొగ, పిసుటయును జెపొసుఁడున టయొగ్గ పాసెం, బడిగిరవారలు బీరజె, కొడిమెలుగట్టుకుఁడ యతనిఁ గొనఁబనియేలా." అము. ౫, ఆ.

**సొగయిక.** వై. వి. సొగపు, చొక్కు, పారవశ్యము.

**సొగయు.** వై. అ. క్రి. 1. చొక్కు, పరవశత్వమునొందు*; "క. నెత్తురువడిసినమూర్ఛ, యత్తుం జైసొగయుటయున." భార. ఉద్యో. ర, ఆ.–2. మూర్ఛిల్లు*. "తే. సైచుటయురక్కసుఁడు నేలవ్రాలి సొగసె." (చూ. వెనకటిభాగము.) మార్క. ౬, ఆ.

**సొగసు.** వై. వి. 1. అందము*. (దీనిఁ జూచువారు సొగయుదురని వ్యుత్పత్తి.)

**సొగసుకత్తె.** వై. వి. విటకత్తె. (చూ. సొగసుకాఁడు.) విగ. అందగత్తె.

**సొగసుకాఁడు.** ద్వ. వి. విటకాఁడు. "చ. వన్నెకాఁడనై, కలయ మెలంగుబల్ సొగసుకానికి నెత్తులు వెట్టలేసు టా, ణలకడుగు మంచు విటునవ్వు దురవ్వరిఁ బుష్పలావికల్." చంద్రా. ౧, ఆ.–విగ. అందగాఁడు.

**సొగియించు.** వై. అ. క్రి. సుఖించు. "ఉ. చందనచామసత్రకము సంస్తుతకౌస్తుభ కర్ణికంబున, స్పందితలాంఛన భ్రమరసంగమనోజ్ఞమునైనయట్టిగో, విందుసురస్థలంబ యరవిందముగా సొగియించియున్నయ, య్యిందిరచూచుఁగాతఁగృపనింపగు చూపులభక్తసంతతిన్." లక్ష్మీ. ౧, ఆ.

**సొగియు.** వై. అ. క్రి. ఇంపగు*. (చూ. సొదరోకి.)

**సొచ్చెము.** వై. వి. హెచ్చు, అధికము*. "ఉ. ధనేశునికుల్ సమయప్పువడ్డికిన్, వచ్చిన సొచ్చెమంతను దనప్పుదురప్పరిలోని కోమటుల్." శశాం. ౨, ఆ.

**సొజ్జె.** దే. వి. బియ్యమువేఁచి వండినయన్నము.

**సొజ్జెబూరె.** ద్వ. వి. భక్ష్యవిశేషము. "సీ. పొంగరంబులు సొజ్జెబూరెలొరిగులు సేవెలుక్కెరలడ్డుపలుదక్కెలములు." కళా. ౭, ఆ.

**సొటసొట.** దే. వి. కార్శ్యము.

**సొటసొటవోవు.** దే. అ. క్రి. (సొటసొట+పోవు.) కృశించు. "క. దిటచెడకదిగులుగొని సొట, సొటవోవక వెనుకముందు చూడక." హంస. ౫, ఆ. (రూ. సొటసొటలువోవు. "సీ. ఈతూంస్తనభరంబుఁ జాలియంచలు సొటసొటలు వోకున్న వాశోభనాంగి." విజ. 3, ఆ.) (ఈ యర్థమునందు సొటసొటలాడు అను రూపము నిక్కలి వాడుకలో నున్నది.)

**సొట్ట.** దే. వి. చొట్టయొక్క రూపాంతరము.

**సొడ్డు.** దే. వి. న్యూనత, కొఱత*. "చ. వం, గడమునకెల్ల సొడ్డునిసఁగాదటు సేనల పిన్ననాఁడె పే, న్పడితినటన్నఁబోవునె." సా. ౨, ఆ.

**సొత్తు.** వై. వి. సొమ్ము*.

**సొద.** వై. వి. పీనుఁగునుగాల్చుటకుఁ బేర్చిన కట్టెలలోనగువాని ప్రోగు.

**సొన.** దే. వి. 1. గ్రుడ్లలోనిజిగట; 2. బెండలోనగువానిమీఁది సుంగు; "సీ. సొనదేఱి సోటమునిగించి సెలెవా సినయట్టి యాకురాలుపుగండ్లయందుఁ దొరిఁగ." స. ౯, ఆ.–3. ఊటకాలువ.

**సొనచిప్పడు.** దే. వి. ఉనకాయవంటికాయలుగల ఒకానొక చెట్టు.

**సొన్నము.** వై. వి. 1. బంగారు; "సొన్నపుసన్న సేలకటిఁజుట్టి." విజ. ౨, ఆ. – 2. మాడ. "తే. కోటిసొన్నాలు దశశతఘోటకములు." వై. ౮, ఆ. (వృత్తియందు మువర్ణలోపమును అంత్యవర్ణమునకు దీర్ఘంబునగు. "సొన్నాటంకము.")

**సొన్నారి.** ద్వ. వి. (సొన్నము+అరి.) అగసాలెవాఁడు. (చూ. కమ్మటము.)

**సొబగు.** వై. వి. చక్కఁదనము, సౌందర్యము*.

**సొబగుఁడు.** వై. విగ. చక్కనివాఁడు. "క. వామాక్షినీకుఁ గుశలమె, నీమనసువార్వరియందు నిత్యప్రేమం, బైమెఱయునట్టి సొబగులు, నీమగలేర్పడకునిపుడు సమ్మదియమఁచిన్." భార. అర. ౬, ఆ.–వి. విటుఁడు*. "బట్టియుండా సొబగుండుభావభవదర్పభ్రాంతుఁడై వచ్చి." భార. విరా. ౨, ఆ.

**సొబను.** దే. వి. బడబనీలు. ౧౧, భా.

**సొమ్మ.** వై. వి. మూర్ఛ*. "సొమ్మవోసి." అచ్చ. యు, కాం.

**సొమ్మగొను.** ద్వ. అ. క్రి. (సొమ్మ+కొను.) సొమ్మసిల్లు. "క. నొప్పిఁబడివాఁడు తద్దయు, నప్పంపుముద్రువంగనార్చియొకవాలుం దూ, పప్పాలముట్రమ్మరివఁటుగ్గి, గుప్పునసదరింప సొమ్మగొనియుండుసెడన్." అచ్చ. యు, కాం.

**సొమ్మవోవు.** ద్వ. అ. క్రి. (సొమ్మ+పోవు.) సొమ్మసిల్లు. "తే. సొమ్మవోయి, పడియునాతఁడు చూపఱుభయమునొంద." హరి. పూ. ౬, ఆ. (రూ. సొమ్మలువోవు. "చ. సొలసియతండుతేరిపయి సొమ్మలువోయినచేసినస్థితిన్." ఉ. హరి. ర, ఆ.)

**సొమ్మసిల్లు.** వై. అ. క్రి. మూర్ఛిల్లు. (రూ. సొమ్మసిలు. "క. అనియుకగుహ కుంజనిలో, చ్చినసొమ్ములుగాంచి సొమ్మసిలితెలిసి." రామా. ౫, ఆ.)

**సొమ్ము.** వై. వి. 1. ధనము; "ఎక్కుడు సొమ్ముగలవాఁడనెంతయర్థంబైన యిచ్చినిన్ను విలిచెద." మార్క. ౧, ఆ.–2. ఆభరణము*; 3. గోధనము*; "సీ దొడ్డిపట్టులగొల్లదొరసానులయిండ్ల సొమ్ములుసొమ్ములు సొంపు నెఱప." అచ్చ. బాల, కాం (ఇది రెండర్థములకు నుదాహరణము.)–4. అధీనవస్తువు*. "ఉ. చక్రముతోం

ఖముల్ గదయు శార్ఙ్గము ఖడ్గమువిస్ఫురన్నహో, విక్రముఁడైనదేవుఁడు త్రివిక్రముసొమ్ములు.'' హరి. ఉ. ౬, ఆ.

**సొరంగము.** వై. వి. గుహావలెతొలిచినరంధ్రము.

**సొరగు.** దే. అ క్రి. లీనమగు. ''శీ. వెలయునీవెన్నెలతెలుపునఁ జామలచూపుచీఁకటిచొచ్చిసొరగకున్న.'' లక్ష్మీ. ౨, ఆ.

**సొరదోఁకి.** దే. విశ. దురాచారుఁడు ''సీ. వర్ణసంకరమునువావులతబ్బిబ్బుసొరదోఁకితనమును సొగియదందు.'' ధ్రువ. ౧, ఆ.

**సొరవు.** దే. విశ. కృశము. (చూ. సొరవు. విశ.)

**సొరము.** వై. వి. 1. కంఠధ్వని; 2. షడ్జాది.

**సొరిది.** దే. వి. 1. వరుస; 2. క్రమము.

**సొరుగు.** దే. అ. క్రి. మూర్ఛిల్లు. ''క. అల్లలనయతనివచనము, లెల్లన్ విని మొదలునఱక నించుకవడిలోఁ, ద్రెళ్లెడికదళికవలెహో, తల్లీయనిబెట్టుసొరిగిధరపైఁబడియెన్.'' ఉ, రా. ౬, ఆ. – వి. మూర్ఛ. ''వ. పైఁబైఁబెరుఁగుసొరుగు:నన్ధరంబడిపొరలి.'' సా. 3, ఆ

**సొఅ.** దే. వి. తుంబిక. (దీనిభేదము చేఁతిసొఅ.) (చూ. సొజ్జ.)

**సొజ్జ.** దే. వి. సొఅకుమొదటిరూపము. ''చివికికంపలఁగాచినవెజ్జెసొజ్జతీవలు.'' పంచ. వేం. ౧, ఆ.

**సొలపు.** దే. వి. 1. పారవశ్యము; ''జలిబిలిబిలిముద్దుఁబలుక్లసొలపులరారె.'' రసి. ౫, ఆ.–2. వైముఖ్యము. ''ఎ, గీ. నాతిరాయంచగమిఁగూడి నడచుమురువు, చెలుల గెలువంగఁ జనునాటిసొలపునలఁపు.'' ఐజ. 3, ఆ.

**సొలయిక.** దే. వి. వైముఖ్యము. ''వ. అలయికసొలయికలకొక వింతయొయ్యారంబుఁ జూపు చూపుల వనకుం జూపోవక.'' కళా. ౬, ఆ.

**సొలయు.** దే. అ. క్రి. 1. మూర్ఛపోవు; ''తే. అమ్మగధపతియు, సొలసివేగయాలోననతెలిసినిలిచి.'' హరి. ఉ. ౧, ఆ.–2. వెనుదీయు; ''క. బాణా, సురునకుదోడుపడవచ్చి సొలయుటవినరే.'' సాంబోపాఖ్యానము. – 3. వైముఖ్యమునొందు; ''సీ. మామకునత్తకు మార్వల్క దేవపిత్రతిథి పూజనములయందు సొలయ.'' భార. అను. ౪, ఆ. – 4. వైరస్యమునొందు. ''సీ. భామలన్నియుఁబడి నామీఁద సొలయక యున్న వేల్పుల తొల్లియొప్పఁబోగడ.'' లక్ష్మీ. ౫, ఆ.

**సొలిమిడి.** దే. వి. సొమ్మ, మూర్ఛ. ఆం, భా.

**సొవ.** దే. వి సవయొక్కరూపాంతరము. (అమ్రేడితముగుచో సొవసొవ. ''తే. ఇరుగుపొరుగులదంపతులేపురేఁగి, సంగమక్రీడనోలాడి సరసమాడు, సొవసొవలు విన్నమాత్ర నున్నురుమటంచు, మన్మథునిబారిగొత్తెయై మసువతలఁకు.'' హంస. ౫, ఆ.)

**సొసాయించు.** దే. క్రి. మందలించు, హెచ్చరించు.

సో.

**సోఁకు.** దే. అ. క్రి. 1. తగులు; 2. గ్రహమావేశించు. వి. 1. స్పర్శము; ''చ. సోఁకునెఱుఁగు శక్తిచర్మమునకుం బ్రభవింపదు.'' భార. అశ్వ. ౨, ఆ.–2. రాక్షసుఁడు. ''క. అసోఁకు జోదుఁడై కొని, రోసంబున వింటినారిమ్రోయించికడున్, వానిలకోరుల బడిబడి, నేనికలంచుటయువాఁడు హెచ్చినకినుకన్.'' అచ్చ. యు, కాం.

**సోఁకుఁజుక్క.** ద్వ. వి. (సోఁకు+చుక్క) మూలానక్షత్రము.

**సోఁకుటొజ్జ.** ద్వ. వి. (సోఁకు+ఒజ్జ.) శుక్రుఁడు, దైత్యగురువు.

**సోఁకుడు.** దే. వి. 1. స్పర్శము; ''దయ్యము పేరు పేరికుచితంబగు సోఁకుడు.'' చంద్ర.– 2. గ్రహావేశము; ''తే. కాఁగియున్నదిమిగులనంగంబుచూడఁ, గలవరించుచున్నది కలదో యేమొ, సోఁకుడల్లనన్యాసికే చూపవలయు, భామననిపల్కెనాసత్యభామనగుచు.'' విజ. 3, ఆ –3. పిశాచము; ''సీ. ఈవికంబులఁ జూచియుందీవరేక్షణ చెఱుగుసోఁకుడులంచుజడిసెనేమొ.'' రసి. ౪, ఆ.– 4. రాక్షసుఁడు. ''ఉ. బల్లిదులై జగంబుమనుపన్ జెఱుపంగలయట్టిమీరయి, ట్లుల్లమునందు సోఁకుడులనొండొకకొండఁగఁజూచి చెల్లఁబో, యిల్లొకపట్టునంగడచియేగఁగనేరని చుంచుఁగుజ్జునన్, మొల్లపుఁగాఱు గానలకుమున్నరకంగొనిపోవఁజూతురే.'' అచ్చ. బాల, కాం.

**సోఁకుడుముడుఁగు.** దే. వి. ఓషధివిశేషము.

**సోఁకుదయ్యము.** ద్వ. వి. వాయువు, స్పర్శనము. రుక్మి. 3, ఆ.

**సోఁకులఱేఁడు.** దే. వి. నైరృతి, మూలఱేఁడు.

**సోఁగు** వై. వి. సరము. ''సీ. ఒకచోఁబునరద్రుమపూఁగెవృత్తుపుఁగొమ్మనుడి వడ్డముత్యాల సోఁగుంబోలె.'' కాశీ. ౧, ఆ.

**సోఁపు.** దే. వి. ఒకానొక సంబారపుదినుసు.

**సోఁపుఁబిండి.** ద్వ. వి. చణకపిష్టము, చమరి.

**సోగ.** దే. వి. దైర్ఘ్యము. ''సీ. కేలిమైనొక్కటలీలఁ గ్రేస్సుటికెడు వాలుగసోగలమేలుడించి.'' భార. విరా. ౨, ఆ.– విశ. దీర్ఘము. ''సోగమెడ.'' ధ్రువ. ౪, ఆ.

**సోజరు.** అం. వి. సైనికుఁడు.

**సోడు.** దే. వి. మాడపట్టు, బ్రహ్మరంధ్రము. ''క. సీదగుతనుభవదివ్యా, మోదముసాంద్రమయిసోడుముట్టెడు.'' భార. అను. ౨, ఆ

**సోఢ.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) 1. ఓపువాఁడు; 2. ఓర్చువాఁడు.

**సోఢము.** సం. విశ. (అ. ఆ. అ.) ఓర్వఁబడినది. (అపరాధములో నగునది.)

**సోణము.** దే. వి. నాసామూలము. ''శా. ముక్, రొట్కఁతీరవమ్మై యొనర్చెవడిసోణాలంట ఘోణాచ్ఛిరన్.'' ఆము. ౫, ఆ.

**సోద.** దే. వి. గచ్చ, గార.

**సోదన** వై. వి. 1. శోధనము; 2. శకునార్థము రామాయణము మొదలైన గ్రంథములయందు దారమువేసి శోధించుట. ''సీ. పతి నన్నుఁజనవునఁ బాలించునాయని ధైర్యంబు వదలి సోదనలు చూచి.'' రుక్మాం. 3, ఆ.

**సోదరి.** సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినది.

**సోదరుఁడు.** సం. వి. అ. పుం. తోడఁబుట్టినవాఁడు.

**సోదర్యుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**సోదించు.** వై. స. క్రి. శోధనచేయు. (చూ. సొంటు.)

**సోదె.** వై. వి. రాఁగలమేలుకీడులనుగూర్చిచేయు ప్రశ్నము. ''తే. వనితయిటువచ్చినీప్రునీవలయుసోదె, గొనుము.'' ప్రభా. ౫, ఆ. (మొదటిరూపము సోదియ.)

**సోదెకత్తె.** వై. వి సోదెచెప్పునది దైవజ్ఞ (మొదటిరూపము సోదెకత్తియ.)

సోదెము. వై. వి. సోద్దెముయొక్క రూపాంతరము. "ఎ, గీ. సోదె మాసామివేఁటాడి చూడరాదె." ఉ, రా. ౭, ఆ.

సోద్దెము. వై. వి. ఆశ్చర్యము. విశ. ఆశ్చర్యకరమైనది.

సోధ్రకము. సం. వి. అ. పుం. బిల్లు*.

సోన. దే. వి. 1. అల్పవర్షము; "క. కురిసె విరిసోనవానలు." రామా. ౪, ఆ.—2. వర్షము. "చ. మెఱుఁగులుగ్గిత బులును మిక్కిలి సోనయుఁగల్గుమేఘముల్, గిరికొనసొప్పునాక సనుమీలు రణశీతివాడనొప్పగుణ్, దఱుచగు భూమ్మదుగ్ధని వెన సుపంక్తి గజవ్రజంబుపె, ల్లాఱలు మనెస్తురుల్‌దొరఁగుచుండఁగఁగ బసి యున్కి నత్తటిన్." భార. ద్రో. ౧, ఆ.

సోనంగి. దే. వి. శునకజాతి. (రూ. శోనంగి.)

సోపనము. వై. వి. మెట్టు. "ఆ. నేతిఖండమోచియేనెఱఁగున సోప, నాలుద్రాఁకునైపుణంబుగలుగు." భార. శాం. ౫, ఆ.

సోపప్లవుఁడు. సం. వి. అ. పుం. రాహువుచేపట్టఁబడినవాఁడు. (చంద్రుఁడు, లేక సూర్యుఁడు.)

సోపానము. సం. వి. అ. న. మెట్టు, ఆరోహణము. (చూ. సోపానము.)

సోబ. వై. వి. వ్యాధివిశేషము, శోఫ.

సోబతు. హిం. వి. తోడు, సహవాసము.

సోబనము. వై. వి. మంగళము. "క. వివరింపనెడములేదిఁక, నవిదశ సోబనపుజలకమొనరింపంగా, జవరాంద్రఁబనుపును." య. ౪, ఆ.

సోబాన. వై. వి. ఒకదినుసు పెండ్లిపాట*. (చూ. సువ్వాల.)

సోబె. వై. వి. సిబ్బెము. (మొదటిరూపము సోబియ.)

సోమ. వై. వి. 1. శ్రమము; "ద్వి. ఇతఁడు, సోమకోర్వఁగ లేఁడునుకుమారమూర్తి." హరిశ్చ. ౧, ఖా.—2. పరాక్రమము*. "ద్వి. ఉరుమదేభంబులునుత్తమాశ్వములు, నరిదిరథంబులు నలరుకాల్బలము, సోమమైనవనంబుచుట్టునుగాది." రా. యు, కాం. (చూ. సోమము.)

సోమకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. కరవుచ్చే*.

సోమధార. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

సోమపీథి. సం. వి. న్. పుం. యజ్ఞమునందు సోమపానము చేయువాఁడు. (రూ. సోమపీతి.)

సోమపుఁడు. సం. వి. అ. పుం.——వై.——

సోమము. ఉభ. వై. వి. పరాక్రమము*. "క. ఆమిషమనిదానిం గొనఁ, గామదినమకట్టియొక్క ఖగమాఖగముల్, సోమమునఁదాఁక దివినం, గ్రామంబారెంటికయ్యెఁగడురభసనుసరణ్." భార. ఆది. 3, ఆ. (సోమయొక్క రూపాంతరము.)—సం. అ. పుం. 1. తిప్ప తీఁగ; 2. జలము; 3. కర్పూరము; 4. దినముయొక్క పదునా కండవభాగము. (చూ. దినము.)

సోమయాజి. సం. వి. న్. పుం. యజ్ఞముచేసినవాఁడు.

సోమరాజి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చే*.

సోమరి. ద్వ. విశ. (సోము+అరి.) అలసుఁడు, మందుఁడు. "సోమరిగాలి." సార. 3, ఆ.

సోమవల్కము. సం. వి. అ. పుం. 1. తెలిచండ్ర*; 2. ఈఁత*.

సోమవల్కలము. సం. వి. అ. పుం. వెలిచండ్ర*.

సోమవల్లరి. సం. వి. ఈ. స్త్రీ. సామెదకూర.

సోమవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

సోమవారము. సం. వి. అ. పుం. ఒక వారము. (ఇట్లు ఇందు వారము మొ.) (చూ. వారము.)

సోమసూత్రము. సం. వి. అ. న. 1. పానవట్టమునుండి నీళ్లు పోవుదారి; 2. సోమసూత్రమువంటి ముఖభాగముగలిగిన లోహపాత్రవిశేషము.

సోమాసి. వై. వి. సోమయాజి.

సోమించు. వై. అ. క్రి. 1. నరిపోలు; "క. ఆమనిముకులమొదుగుతో, సోమించి మురాంతకానుజాఁడు." ఉ, హరి. ౪, ఆ.—2. పరాక్రమించు*; "ద్వి. సోమించి విజబల స్ఫురణంబుచూపి, రాముఁడాభోగివరాసుఘంగించె." రా. యు, కాం.—3. విజృంభించు*; "ద్వి. రాముండుసుగుఁడనిరమణి నీవెవుడు, సోమించి యాడదు ప్రుక్క తైన." రా. సుం, కాం.—4. వ్యాపించు*. "క. సోమము సఫలచిరచి, త్తోన్నమంబునన్నాత్మవగుచుసోమించు టచే, సోమము పసులు సర్వము, నైమెఱసెదసీవాకండవంబుజనాభా." కవిక. ౬, ఆ.

సోమిద. వై. వి. తిప్పతీఁగ*.

సోమిదము. దే. వి. తిరువ్లి*.

సోమిదమ్మ. వై. వి. (సోమిద+అమ్మ.) సోమయాజిభార్య.

సోమిసాని. వై. వి. (సోమిద+సాని.)——వై.——

సోము. వై. వి. సుఖము. విశ. ఆసక్తము*. "చూపులువిష్ణుమూర్తులకుసోముగ." భో. ౨, ఆ.

సోముఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. శివుఁడు; 3. కుబేరుఁడు; 4. వాయువు; 5. పితృదేవత; 6. ఒక వసువు; (చూ. వసువు.) 7. ఒకవానరుఁడు.

సోమెద. వై. వి. ఒకదినుసు కూరాకు, సోమవల్లరి.

సోమోద్భవ. సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

సోయగము. దే. వి. అందము, చక్కఁదనము. "సీ. అణిముత్యము సోయగముమించిన్నవ్రాలు పరుసతోనిరుగేలవ్రాయనేర్చె." విక్ర. ౧, ఆ.

సోరంగి. దే. వి. మత్స్యవిశేషము.

సోరణగండ్లు. దే. వి. బ. (సోరణము+గండులు.) గవాక్షము. "ఎ, గీ. మలయమారుతమేతెంచు కలిరుటాకు, గములనందును సోరణగండ్లుగాఁగ." భాను. ౨, ఆ. (వృత్తియందేకవచనాంతము. "వ. మెఱుంగు కెంపుటా సోరణగండి చిఱుతతెమ్మెరసోఁకున." ఉ, రా. ౬, ఆ. చూ. అఱుభ్రళ్లు.)

సోరణము. దే. వి. గవాక్షము. (చూ. పట్టియ మూడవయర్థము.)

సోరు. దే. వి. సోరుపప్పు, పెట్టుపప్పు.

సోరువా. హిం. వి. మాంసపుచారు.

సోర్ణగండ్లు. దే. వి. బ. సోరణగండ్లుయొక్క రూపాంతరము. "ఎ, గీ. తెల్లవాఱుచున్నదివియలల్లార్పుచు, సోర్ణగండ్లయందుఁ జొచ్చినుడిసి, తిరిగివసుఁబోక తెమ్మెరలెలదీఁగ, కొనలువంకలొత్తనవలఁద్రోచు." భార. ఉద్యో. ౨, ఆ.

సోల. దే. వి. పదునాఱుడబ్బులయెత్తు వస్తువుపట్టెడు కొలవిశేషము, నిఘంటుకము.

**సోలము.** దే. వి. 1. మస్తు; "ఎ, గీ. ఒండొరులచిత్తములునాటి యొలయుచున్న, చొక్కులెక్కుడుసేయంగసోలమడరి." నిర్వ. ౮, ఆ. "సీ. అలరుతేనియఁగ్రోలియొలయుసోలంబునమురియు తేఁటులనునుమ్రోఁతయింపు." భార. అను. ౧, ఆ.–2. చొక్కు. "సీ. పొలఁతులనునుఁదీపుఁబలుకు లయింపునసుల్లంబుసోలంబు నొందునసుట." లక్ష్మీ. ౨, ఆ. "సీ. చూపులనిగురొత్తు సోలంబు తోడనసోలంబుతనువునమేళవింప." విక్ర. ౧, ఆ.

**సోలింత.** దే. వి. వివశత్వమునొందివ్రాలుట. (చూ. పొరపు. విణ.)

**సోలు.** దే. అ. క్రి. వివశ్వతమునొందివ్రాలు.

**సోళాదొప్పి.** దే. వి. ద్యూతవిశేషము. "శా. సోళాదొప్పియుః నెత్తముఙ్ మొదలుగాజూదంబునీవాడునవ్వేళఙ్." జై. 3, ఆ. (కొన్నిచోట్ల సోళాందొప్పి అని కనఁబడుచున్నది.)

## సౌ.

**సౌందర్యము.** సం. వి. అ. న. చక్కఁదనము.

**సౌకర్యము.** సం. వి. అ. న. 1. అనాయాసము; 2. సూకర భావము.

**సౌకుమార్యము.** సం. వి. అ. న. 1. సుకుమారత్వము; 2. కావ్య గుణములలోనొకటి. (చూ. గుణము.)

**సౌఖశాయనికుఁడు.** సం. వి. అ. పుం. రాజులను నిద్రమేలు కొలుపువాఁడు. విణ. సుఖనిద్రయాయని ప్రశ్నముచేయువాఁడు.

**సౌఖ్యము.** సం. వి. అ. న. సుఖము.

**సౌగంధికము.** సం. వి. అ. న 1. చెంగలువ; 2. కామంచిగీ. పుం. 1. మాణిక్యవిశేషము; (ఇది ఆంధ్రమునందుపుట్టినది, అశోకపుచిగురు డాలుగలది, మధ్యమజాతిరత్నము. చూ. మాణిక్యము.) 2. గంధకము. డు. సుగంధవస్తువులవ్యాపారముచేయు వాఁడు.

**సౌగంధ్యము.** సం. వి. అ. న. వాసన.

**సౌచికుఁడు.** సం. వి. అ. పుం. కుట్రపువాఁడు.

**సౌజన్యము.** సం. వి. అ. న. సుజనత్వము, మంచితనము.

**సౌదాగరు.** హిం. వి. వర్తకుఁడు, గుఱ్ఱములబేరగాఁడు.

**సౌదామని.** సం. వి. ఈ. స్త్రీ. 1. మెఱపు; 2. ఒకదిసును మెఱపు; 3. ఒక అప్సరస్త్రీ. (రూ. సౌదామిని.)

**సౌదాయికము.** సం. వి. అ. న. తల్లిదండ్రులచేతనేనియు అన్న దమ్ములచేతనేనియు నియ్యఁబడు స్త్రీధనము.

**సౌధము.** సం. వి. అ. పుం, న. రాజగృహము, నగరు.

**సౌనికుఁడు.** సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులనుజంపి విక్రయించి జీవించువాఁడు.

**సౌప్తికము.** సం. వి. అ. న. 1. నిద్రించుటలోనగుసమయము అందు శత్రువులపైఁబడిచంపుట; 2. మహాభారతమునందలి యొకపర్వము.

**సౌభాగినేయి.** సం. వి. ఈ. స్త్రీ. భాగ్యవతికూఁతురు.

**సౌభాగినేయుఁడు.** సం. వి. అ. పుం. భాగ్యవతికొడుకు.

**సౌభాగ్యము.** సం. వి. అ. న. 1. సుభగత్వము; 2. ఒక గ్రహ యోగము. (చూ. యోగము.)

**సౌభ్రాత్రము.** సం. వి. అ. న. మంచితోడఁబుట్టుఁదనము.

**సౌమనస్యము.** సం. వి. అ. న. 1. సుమనోభావము; 2. శ్రాద్ధ మునందుపిండదానానంతరముబ్రాహ్మణహస్తమునందిచ్చెడు పుష్ప దానమంత్రము.

**సౌమ్య.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**సౌమ్యుఁడు.** సం. వి. అ. పుం. బుధగ్రహము. విణ. 1. తిన్నని వాఁడు; 2. ఒప్పినవాఁడు; 3. సోముఁడు దేవతగాఁగలవాఁడు.

**సౌరభము.** సం. వి. అ. న. 1. వాసన; 2. కుంకుమము; 3. బోళము. పుం. ఎద్దు.

**సౌరభేయము.** సం. వి. అ. పుం. ఎద్దు, బలీవర్దము.

**సౌరభేయి.** సం. వి. ఈ. స్త్రీ. ఆవు, గోవు.

**సౌరభ్యము.** సం. వి. అ. న. 1. వాసన; 2. ఒప్పిదము; 3. గుణగౌరవము.

**సౌరము.** సం. వి. అ. న. ఒక మతము. (చూ. మతము.)

**సౌరాష్ట్రము.** సం. వి. అ. న. కంచు. పుం. 1. ఒక దేశము; 2. రాగవిశేషము.

**సౌరాష్ట్రికము.** సం. వి. అ. పుం. విషభేదము. విణ. సౌరాష్ట్రదేశ సంబంధమైనది.

**సౌరి.** సం. వి. ఇ. పుం. 1. శనైశ్చరుఁడు; 2. యముఁడు.

**సౌరికుఁడు.** సం. వి. అ. పుం. కల్లమ్మువాఁడు, కల్పిలి.

**సౌరు.** దే. వి. 1. అందము; 2. విధము. (చూ. గగ్గులకాఁడు.) విణ. మనోజ్ఞము. (మొదటిరూపము సవురు. అందమునకు.—"చ. చలువలతేఁడసీసవురుసన్నముగా నిఁకనిందురాకుమీ." నీలా. 3, ఆ.)

**సౌవర్చలము.** సం. వి. అ. న. ఒకదిసును ఉప్పు.

**సౌవర్ణకరణి.** సం. వి. ఈ. స్త్రీ. ఓషధివిశేషము. (దీనితోచేరిన తక్కినమూఁడు.–విశల్యకరణి, సంధానకరణి, సంజీవకరణి.)

**సౌవిదల్లుఁడు.** సం. వి. అ. పుం. అంతఃపురపు కావలివాఁడు.

**సౌవిదుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**సౌవీరము.** సం. వి. అ. న. 1. పులియఁబెట్టిన కడుగునీళ్లు; 2. నీలాంజనము; 3. రేఁగుఁబండు. పుం. ఒకానొకదేశము.

**సౌశీల్యము.** సం. వి. అ. న. సుశీలత్వము.

**సౌష్ఠవము.** సం. వి. అ. న. 1. సుష్ఠుభావము; 2. నాట్యాంగ విశేషము.

**సౌహార్దము.** సం. వి. అ. న. సుహృద్భావము, స్నేహము.

**సౌహిత్యము.** సం. వి. అ. న. తృప్తి, తనివి.

**సౌహృదము.** సం. వి. అ. న. (చూ.) సౌహార్దము.

**సౌహృద్యము.** సం. వి. అ. న.——పై.——

## స్కం.

**స్కందుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి.

**స్కంధము.** సం. వి. అ. పుం. 1. మూఁపు; 2. చెట్టుబోదె; 3. యుద్ధము; 4. సమూహము; 5. శరీరము. డు. దశార్ణదేశపు రాజు. (స్కంధత్రయము.—ఆదానము, నిదానము, చికిత్స. (ఇవి వైద్యశాస్త్రమునందలివి.) స్కంధపంచకము.—రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారములు. (ఇవి బౌద్ధశాస్త్రోక్తములు.)

స్కంధపట్టిక. సం. వి. ఆ. స్త్రీ. తలుపునకమర్చెడు గందపట్టె.
స్కంధశాఖ. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిమొదటికొమ్మ.
స్కంధావారము. సం. వి. అ. పుం. 1. దండువిడిసినచోటు; 2. దండు.
స్కన్నము. సం. విశే. (అ. ఆ. అ.) జాఱినది.

స్ఖ.

స్ఖలనము. సం. వి. అ. న. 1. జాఱుపాటు; 2. తొట్రుపాటు.
స్ఖలించు. సం. అ. క్రి. 1. జాఱు; 2. తొట్రుపడు.
స్ఖలితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. జాఱినది; 2. తొట్రుపడినది.

స్ఖా.

స్ఖాలిత్యము. సం. వి. అ. న. స్ఖలితభావము, పొరపాటు.

స్టా.

స్టాంపు. ఆం. వి. బిల్ల, ముద్ర, ముద్రవేసినకాగితము.

స్టీ.

స్టీమరు. ఆం. వి. పొగయోడ.

స్టే.

స్టేషను. ఆం. వి. ఉండుతావు. (పోలీసుస్టేషను, రైలుస్టేషను మొ.)

స్త.

స్తంబకరి. సం. వి. ఇ. పుం. ధాన్యము.
స్తంబఘనము. సం. వి. అ. పుం. వరిపైరుమొదలగువానికో సెడు కొడవలిలోనగునది.
స్తంబఘ్నము. సం. వి. అ. పుం.——పై.——
స్తంబము. సం. వి. అ. పుం. 1. వరిలోనగువానిగంట; 2. బోదలేని చిన్నచెట్టు.
స్తంబేరమము. సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.
స్తంభనము. సం. వి. అ. న. 1. మ్రానుపడఁజేయుట; 2. మంత్రశక్తిచేత అగ్నిలోనగువానిశక్తి నణఁగఁజేయుట. (ఇది షడ్విద్యలలో నొకటి. చూ. విద్య.)
స్తంభబలి. సం. వి. ఇ. పుం. (చూ.) కంబవల్లి.
స్తంభము. సం. వి. అ. పుం. 1. కంబము; (గృహమధ్యస్తంభము కహారము.) 2. మ్రానుపాటు.
స్తంభయిత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) స్తంభించువాఁడు.
స్తంభించు. సం. అ. క్రి. మ్రానుపడు. అం, ప్రే. మ్రానుపడఁజేయు. "భుజస్తంభమ్ముఁ స్తంభించి." భార. అర. 3, ఆ. (సంస్తంభించు అనియు.)
స్తనంధయ. సం. వి. ఆ. స్త్రీ. పాలుద్రాగెడు ఆఁడుబిడ్డ, చంటిపాప.
స్తనంధయుఁడు. సం. వి. అ. పుం. పాలుత్రాగెడు మగబిడ్డ, చంటిపాప.
స్తనము. సం. వి. అ. పుం. కుచము, చను.
స్తనయిత్నువు. సం. వి. ఉ. పుం. 1. మబ్బు; 2. ఉఱుము.
స్తనితము. సం. వి. అ. న. ఉఱుము, గర్జనము.
స్తన్యము. సం. వి. అ. న. చనుఁబాలు.
స్తబకము. సం. వి. అ. పుం. పూగుత్తి, గుచ్ఛకము.
స్తబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అణఁగినది; 2. ముడిఁగినది.
స్తబ్ధరోమము. సం. వి. న్. పుం. పంది, వరాహము.
స్తమితము. సం. విశే. (అ. ఆ. అ.) తడిసినది.
స్తవము. సం. వి. అ. పుం. స్తోత్రము, పొగడిక.

స్తి.

స్తిమితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలనిది; 2. తడిసినది.

స్తు.

స్తుతము. సం. విశే. (అ. ఆ. అ.) స్తోత్రముచేయఁబడినది.
స్తుతి. సం. వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.
స్తుతించు. సం. స. క్రి. స్తోత్రముచేయు, పొగడు.
స్తుతిపాఠకుఁడు. సం. వి. అ. పుం. బట్టువాఁడు.
స్తుత్యము. సం. విశే. (అ. ఆ. అ.) స్తోత్రముచేయఁదగినది.

స్తూ.

స్తూపము. సం. వి. అ. పుం. మట్టిమొదలగువానిదిబ్బ.

స్తే.

స్తేనుఁడు. సం. వి. అ. పుం. దొంగ, చోరుఁడు.
స్తేమము. సం. వి. అ. పుం. తడియుట, నయుందనము.
స్తేయము. సం. వి. అ. న. దొంగతనము, చౌర్యము.
స్తేయి. సం. వి. న్. పుం. దొంగ, చోరుఁడు.

స్తై.

స్తైన్యము. సం. వి. అ. న. దొంగతనము, చౌర్యము.

స్తో.

స్తోకకము. సం. వి. అ. పుం. చాతకపక్షి, వానకోయిల.
స్తోకము. సం. వి. అ. న. నీటిబొట్టు. పుం. వానకోయిల. విశే. అల్పము.
స్తోత్రము. సం. వి. అ. న. స్తుతి, పొగడిక.
స్తోమము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. స్తోత్రము; 3. యజ్ఞము.

స్త్రీ.

స్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది. (స్త్రీజాతులు నాలుగు. — పద్మిని, చిత్రిణి, హస్తిని, శంఖిని.)

స్త్రీఘోషము. సం. వి. అ. పుం. వేకువ, ప్రభాతము.

స్త్రీధనము. సం. వి. అ. న. అధ్యగ్నికృతాది స్త్రీద్రవ్యవిశేషము. (ఇది షడ్విధము. — అధ్యగ్నికృతము, అధ్యావాహనికము, ప్రీతిదత్తము, భ్రాతృసౌదాయికము, మాతృసౌదాయికము, పితృసౌదాయికము.)

స్త్రీధర్మిణి. సం. వి. ఈ. స్త్రీ. ఋతుమతి, ముట్టుది.

స్త్రీభూషణము. సం. వి. అ. న. మొగలిచెట్టు.

## స్త్రై.

స్త్రైణము. సం. వి. అ. న. స్త్రీస్వభావము. విణ. స్త్రీసంబంధమయినది.

## స్థ.

స్థండిలము. సం. వి. అ. న. వ్రతముపూనినవాఁడు పండుకొనుటకు దర్భాదులచేసంస్కరింపఁబడినభూమి. అగ్నిహోత్రము నుంచుటకై సంస్కరించిన స్థానము. (అనికొందఱు.)

స్థగనము. సం. వి. అ. న. కప్పు, ఆచ్ఛాదనము.

స్థగితము. సం. విణ. (అ. ఆ. అ.) కప్పఁబడినది, ఆచ్ఛాదితము.

స్థపతి. సం. వి. ఇ. పుం. 1. శిల్పివిశేషము; 2. బృహస్పతిసవనముచేత యజించినవాఁడు; 3. అంతఃపురపుకావలివాఁడు. విణ. శ్రేష్ఠుఁడు.

స్థపుటము. సం. విణ. (అ. ఆ. అ.) మధ్యావనతము పార్శ్వోన్నతమునైనది.

స్థలపద్మిని. సం. వి. ఈ. స్త్రీ. మెట్టతామరచెట్టు.

స్థలము. సం. వి. అ. న. మెట్టనేల.

స్థలి. సం వి. ఈ. స్త్రీ.——పై.——

స్థవిరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ముసలివాఁడు.

స్థవిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి స్థూలము.

స్థవీయము. సం. విణ. (స్. ఈ. స్.) రెంటికంటె మిక్కిలి స్థూలము.

## స్థా.

స్థాండిలుఁడు. సం. వి. అ. పుం. స్థండిలభూమియందుశయనించెడు వ్రతి, స్థండిలశాయి.

స్థాణువు. సం. వి. ఉ. పుం. 1. మేకు; 2. శివుఁడు. పుం, న. కొమ్మలులేనిచెట్టు, మోడు. విణ. స్థిరమయినది.

స్థాత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఉండువాఁడు.

స్థాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఉండఁదగినది.

స్థానము. సం. వి. అ. న. 1. చోటు; 2. ఉనికి; 3. త్రివర్గమునందొకటి; (అనఁగా కృష్యాద్యష్టవర్గమునందు శత్రుతోసమముగానుండుట. చూ. వర్గము.) 4. విలుకానియుద్ధమప్పటినిలుపు; (ఇది పంచవిధము.—ప్రత్యాలీఢము, ఆలీఢము, సమపదము, విశాఖము, మండలము.) 5. పోలిక.

స్థానాపతి. సం. వి. అ. పుం. మధ్యవర్తి.

స్థాని. సం. విణ. (న్. ఈ. న్.) స్థానముకలది.

స్థానికుఁడు. సం. వి. అ. పుం. 1. స్థానమునకధ్యక్షుఁడు; 2. గుడిపారుపత్తెగాఁడు.

స్థానీయము. సం. వి. అ. న. పట్టణము, ప్రోలు.

స్థాపకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్థాపించువాఁడు.

స్థాపత్యుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురపు కావలివాఁడు, హెగ్గడి.

స్థాపనము. సం. వి. అ. న. 1. స్థాపించుట; 2. సమాధి; 3. పుంసవనము.

స్థాపని. సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్దిచెట్టు.

స్థాపించు. సం. స. క్రి. స్థాపనముచేయు, నిలుపు.

స్థాపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలుపఁబడినది; 2. నిశ్చయింపఁబడినది.

స్థామము. సం. వి. న్. న. శరీరబలము.

స్థాయి. సం. విణ. (న్. ఈ. న్.) ఉండునది.

స్థాయిభావము. సం. వి. అ. పుం. రసస్థితస్వాదుత.

స్థాయుకుఁడు. సం. వి. అ. పుం. ఒకగ్రామమున కధికారి.

స్థాలము. సం. వి. అ. న. భోజనపాత్రము, కంచము.

స్థాలి. సం. వి. ఈ. స్త్రీ. 1. వంటకుండ, లోవి; 2. కలిగొట్టుచెట్టు.

స్థాలీపులాకన్యాయము. సం. వి. అ. పుం. కుండెఁడు అన్నమునకు ఒకమెతుకుపట్టిచూచుట అనెడు న్యాయము.

స్థావరము. సం. వి. అ. న. వింటినారి. పుం. కొండ. విణ. కదలనిది.

స్థావిరము. సం. వి. అ. న. వృద్ధత్వము, ముదిమి.

స్థాసకము. సం. వి. అ. పుం. 1. చేతనిడినకుంకుమలోనగునది; కుంకుములోనగువానిపూఁత. (అనికొందఱు) 2. నీరులోనగువానియందలిబుగ్గ.

స్థాస్నువు. సం. విణ. (ఉ.) బహుకాలము ఉండునది.

## స్థి.

స్థితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉన్నది; 2. నిలుచున్నది; 3. నిశ్చయింపఁబడినది; 4. ప్రతిజ్ఞ చేయఁబడినది.

స్థితి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఉనికి; 2. కూర్చుండుట; 3. నిలుకడ; 4. మేర.

స్థిర. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. ముయ్యాకుపొన్నచెట్టు. అ. పుం. ము. 1. కొండ; 2. చెట్టు; 3. మోక్షము. డు. శని, విణ. నిలుకడైనది.

స్థిరవారము. సం. వి. అ. పుం. శనివారము. (ఇట్లు మందవారము.) (చూ. వారము.)

స్థిరాయువు. సం. వి. స్. పుం. బూరుగుచెట్టు.

## స్థూ.

స్థూణ. సం. వి. ఆ. స్త్రీ. 1. స్తంభము; 2. ఇనుపప్రతిమ.

స్థూరి. సం. వి. న్. పుం. బరువుమోసెడుగుఱ్ఱము.

స్థూలనాసము. సం. వి. అ. పుం. పంది, సూకరము.

స్థూలపుష్పకము. సం. వి. అ. పుం. మాదెన*.

స్థూలము. సం. వి. అ. న. గుడారము. విణ. 1. బలిసినది; 2. బుద్ధిలేనిది.

స్థూలలక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యీవి కాఁడు; 2. మిక్కిలి వెచ్చకాఁడు.

స్థూలోచ్ఛ్రయము. సం. వి. అ. పుం. 1. పెద్దఱాయి; 2. బొటిమ; 3. ఏనుఁగు నడిలెరపునడ; 4. అసాకల్యము.

## స్థే.

స్థేమము. సం. వి. న్. న. శరీరబలము.

స్థేయుఁడు. సం. వి. అ. పుం. 1. పురోహితుఁడు; 2. తీర్పరి. విణ. మిక్కిలి స్థిరుఁడు.

## స్థై.

స్థైర్యము. సం. వి. అ. న. స్థిరత్వము. పుం. జోపత్రి.

## స్థౌ.

స్థౌణేయము. సం. వి. అ. పుం. 1. గండివనము*; 2. మాచి*.

స్థౌరము. సం. వి. అ. న. గుఱ్ఱమువీఁపునమోయుబరువు.

స్థౌరి. సం. వి. న్. పుం. బరువుమోయుగుఱ్ఱము.

స్థౌల్యము. సం. వి. అ. న. స్థూలభావము.

## స్న.

స్నపనము. సం. వి. అ. న. స్నానము, మునక.

స్నపితము. సం. విణ. (అ. ఆ. అ.) స్నానముచేసినది.

స్నవము. సం. వి. అ. పుం. స్రవణము, కాఱుట.

స్నసః. సం. వి. ఆ. స్త్రీ. నన్నపునరము.

## స్నా.

స్నాతకుఁడు. సం. వి. అ. పుం. స్నానశీలవ్రతుఁడు. (చూ. వ్రతి.)

స్నాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్నానముచేసినవాఁడు.

స్నానము సం. వి. అ. న. 1. మునుక; 2. నలుఁగుపిండి.

స్నానీయము. సం. వి. అ. న. నలుఁగుపిండి.

స్నాయువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. నన్నపునరము.

## స్ని.

స్నిగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్నేహముగలది; 2. నునుపుగలది; 3. చిక్కనగలది.

స్నిగ్ధుఁడు. సం. వి. అ. పుం. స్నేహితుఁడు.

## స్ను.

స్నుక్కు. సం. వి. క్. స్త్రీ. జెముడు*.

స్నుతము. సం. విణ. (అ. ఆ. అ.) కాఱినది, రీణము.

స్నువు. సం. వి. ఉ. పుం. కొండనెత్తము.

స్నుష. సం. వి. ఆ. స్త్రీ. కోడలు.

స్నుహి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. జెముడు*.

## స్నే.

స్నేహము. సం. వి. అ. పుం. 1. చెలిమి; 2. చేమురు.

స్నేహించు. సం. అ. క్రి. స్నేహముచేయు.

స్నేహితుఁడు. సం. వి. అ. పుం. చెలికాఁడు. విణ. చెలిమిగలవాఁడు.

## స్నై.

స్నైగ్ధ్యము. సం. వి. అ. న. స్నిగ్ధభావము, స్నేహము.

## స్ప.

స్పందము. సం. వి. అ. పుం. ఇంచుకకంపము.

స్పర్ధ. సం. వి. ఆ. స్త్రీ. 1. పోటి; 2. పోలిక; 3. క్రమసమున్నతి.

స్పర్ధాళువు. సం. విణ. (ఉ.) స్పర్ధగలవాఁడు.

స్పర్శనము. సం. వి. అ. న. 1. తాఁకుడు; 2. ఈవి. పుం. వాయువు.

స్పర్శము. సం. వి. అ. పుం. 1. తాఁకుడు; 2. తాఁకునది; 3. ఈవి; 4. వ్యాధి.

స్పర్శవేధి. సం. వి. న్. పుం. (సూ.) పరుసవేది.

స్పశము. సం. వి. అ. పుం. యుద్ధము, పోరు.

స్పశుఁడు. సం. వి. అ. పుం. 1. వేగులవాఁడు; 2. పులితోడను ఏనుఁగుతోడను పోట్లాడెడువాఁడు.

స్పష్టము. సం. విణ. (అ. ఆ. అ.) వెల్లడియైనది.

## స్పృ.

స్పృక్క. సం. వి. ఆ. స్త్రీ. పిక్క*.

స్పృక్కు. సం. వి. క్. స్త్రీ. స్పర్శము.

స్పృశి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు*.

స్పృశించు. సం. స. క్రి. తాఁకు. (సంస్పృశించు అనియు.)

స్పృశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) స్పృశింపఁదగినది.

స్పృష్టకాండుఁడు. సం. వి. అ. పుం. ఆయుధమునుధరించి జీవించువాఁడు.

స్పృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) స్పృశింపఁబడినది. (ఉపస్పృష్టము అనియు.)

స్పృష్టి. సం. వి. ఇ. స్త్రీ. తాఁకుడు.

స్పృహ. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

స్పృహణీయము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁదగినది.

స్పృహ్యము. సం. వి. అ. పుం. మాదిఫలము. విణ. కోరఁదగినది.

## స్ప్రృ.

స్ప్రృష్ట. సం. వి. ఋ. పుం. తపింపఁజేయురోగము.

## స్ఫ.

స్ఫట. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. పాముయొక్కపడగ.

స్ఫటి. సం. వి న్ పుం. పాము. "స్ఫటిరాడాదివరాహకీర్తిత బలుఁ." బ్ర. ౧, ౮.

స్ఫటికము. సం. వి. అ. పుం. పటికపుఁకాయి.

## స్ఫా.

స్ఫాతి. సం. వి. ఇ. స్త్రీ. వృద్ధి.

స్ఫారము. సం. వి. అ. పుం. 1. చలనము; 2. బంగారులో నగువానిచీలిక. విశ. అధికమయినది.

## స్ఫి.

స్ఫిక్కు. సం. వి. చ్. జ్. స్త్రీ. పిఱుఁదులయున్నతి.

స్ఫిరము. సం. విశ. (అ. ఆ. అ.) అధికమైనది.

## స్ఫీ.

స్ఫీతము. సం. విశ. (అ. ఆ. అ.) అధికమైనది.

## స్ఫు.

స్ఫుటనము. సం. వి. అ. న. భేదించుట.

స్ఫుటము. సం. విశ. (అ. ఆ. అ.) 1. స్పష్టమయినది; 2. వికసించినది.

స్ఫురణము. సం. వి. అ. న. 1. అదురుట; 2. తోఁచుట.

స్ఫురించు. సం. అ. క్రి. 1. అదురు; 2. తోఁచు.

స్ఫురితము. సం. వి. అ. న. 1. చుంబనవిశేషము; 2. రతిబంధవిశేషము. విశ 1. అదిరినది; 2 తోఁచినది.

స్ఫులింగము. సం. వి. అ. పుం. అగ్నికణము, మిణుఁగురు.

## స్ఫూ.

స్ఫూర్జకము. సం. వి. అ. పుం. తుమ్మికి.

స్ఫూర్జథువు. సం. వి. ఉ. పుం. వజ్రధ్వని.

స్ఫూర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అదురుట; 2. తోఁచుట.

## స్ఫే.

స్ఫేష్ఠము. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి అధికమయినది.

## స్ఫో.

స్ఫోటకము. సం. వి. అ. పుం. బొబ్బలుపొక్కెడు రోగవిశేషము.

స్ఫోటము. సం. వి. అ. పుం. భేదించుట.

## స్మ.

స్మయము. సం. వి. అ. పుం. 1. గర్వము; 2. ఆశ్చర్యము.

స్మరణము. సం. వి. అ. న. 1. తలఁపు; 2. జ్ఞప్తి.

స్మరహరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

స్మరాంకుశము. సం. వి. అ. పుం. పెంచిదిద్దినగోరు.

స్మరించు. సం. స. క్రి. స్మరణముచేయు, తలఁచు.

స్మరుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

స్మర్త. సం. విశ. (ఋ. ఈ. ఋ) స్మరించువాఁడు.

## స్మా.

స్మారితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) తలఁపుసాకిరి. (చూ. సాక్షి.)

స్మార్తము. సం. వి. అ. న. స్మృత్యుక్తకర్మము. విశ. స్మృతిసంబంధమైనది.

## స్మి.

స్మితము. సం. వి. అ. న. అధరమునందుమాత్రము ప్రకాశించెడు చిఱునవ్వు. (ఇది యుత్తమము. చూ. హాసము.)

స్మితి. సం. వి. ఇ. స్త్రీ. స్మితము, చిఱునగవు.

## స్మృ.

స్మృతము. సం. విశ. (అ. ఆ. అ.) తలఁపఁబడినది.

స్మృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తలఁపు; 2. ధర్మశాస్త్రము; 3. బుద్ధి; 4. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

## స్మే.

స్మేరము. సం. విశ. (అ. ఆ. అ.) 1. కొంచెము నవ్వునది; 2. వికసించినది.

## స్య.

స్యందనము. సం. వి. అ. న. 1. కాఱుట; 2. జలము. పుం. తినాసముకి. పుం, న. రథము.

స్యందము. సం. వి. అ. పుం. స్రవణము, కాఱుట.

స్యంది. సం. విశ. (న్. ఈ. న్.) స్రవించునది.

స్యందిని. సం. వి. ఈ. స్త్రీ. చొంగ, లాల.

స్యదము. సం. వి. అ. పుం. వేగము, వడి.

స్యన్నము. సం. విశ. (అ. ఆ. అ.) కాఱినది, స్రుతము.

## స్యా.

స్యాలిక. సం. వి. ఆ. స్త్రీ. భార్యతోడఁబుట్టినది. (రూ. శ్యాలిక.)

స్యాలుఁడు. సం. వి. అ. పుం. భార్యతోడఁబుట్టినవాఁడు. (రూ. శ్యాలుఁడు.)

## స్యూ.

స్యూతము. సం. వి. అ. పుం. పల్లిక, దాఁగర. విశ. కుట్టఁబడినది.

**స్యూతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కుట్టు; 2. సంతతి.

**స్యూనము.** సం. వి. అ. పుం. దాఁగర, స్యూతము.

## స్ర.

**స్రంసనము.** సం. వి. అ. న. క్రిందపడుట.

**స్రంసి.** సం. వి. న్. న. పోఁక. పుం. గొనుగుకీ. విశే. క్రిందపడునది.

**స్రగ్గు.** దే. అ. క్రి. సగ్గునకు మొదటిరూపము.

**స్రగ్వి.** సం. విశే. (న్. ఈ. న్.) పూలదండగలవాఁడు.

**స్రజము.** సం. వి. జ్. స్త్రీ. పూలదండ, హారము.

**స్రవ.** సం. వి. ఆ. స్త్రీ. చేఁగకీ. అ. పుం. ము. కాఱుట.

**స్రవంతి.** సం. వి. ఈ. స్త్రీ. నది, తరంగిణి, ఏఱు.

**స్రవణము.** సం. వి. అ. న. స్రవము, కాఱుట.

**స్రవించు.** సం. అ. క్రి. కాఱు. (స్రవియించు అనియు.)

**స్రష్ట.** సం. వి. ఋ. పుం. బ్రహ్మ, ధాత, నలువ.

**స్రస్తము.** సం. విశే. (అ. ఆ. అ.) జాఱినది, చ్యుతము.

## స్రా.

**స్రావకము.** సం. విశే. (అ. ఆ. అ.) కాఱునది.

**స్రావణము.** దే. వి. అగసాలెవానికొలిముట్టు.

**స్రావము.** సం. వి. అ. పుం. స్రవము, కాఱుట.

**స్రావి.** దే. వి. సరవియొక్కమాఱురూపము.

## స్రు.

**స్రుక్కఁబడు.** ద్వి. అ. క్రి. (స్రుక్కన్ + పడు.) స్రుక్కు, దుఃఖించు. "అవమతి తన్నొందినస్రుక్కఁబడక." భార. విరా. ౧, ఆ. (సార్థమున పడు.)

**స్రుక్కు.** ఉభ. దే. అ. క్రి. 1. వెనుదీయు; "ఉ. పాపవృత్తికిన్, స్రుక్కక వైరమెత్తి కడుఁ గ్రూరుఁడనై యిటు నేఁత చూడఁగా, దిక్కులు గెల్వఁగాదుననుఁ ద్రెక్కొనఁ బోయి తిగానియిమ్మెయిన్." నిర్వ. ౫, ఆ.—2. భయపడు; "స్రుక్కము చావునకొత్తనేని యున్." భార. అర. ౪, ఆ. "తే. రక్కసులతోఁడ నేడిటు స్రుక్కనేల, దురములోపల మార్తురఁదొడరి గెలుచు, జాడలెన్నైనఁగలవెద జంకుమాని, చెలువుదొడరని ప్రేలిమిచేయుమొకటి." అచ్చ. యు, కాం.—3. ముడుఁగు; "క. జక్కవలలరఁజకోరము, లుక్కఱఁగ మలములు విరియనొగిఁగైరవముల్, స్రుక్క నమస్తజనంబులు, మ్రొక్క దిశలు వెలుఁగ భాస్కరుఁడు పొడతెంచెన్." భో. ౧, ఆ.—4. ముడుతపడు; "తే. కలయనరసి వెంట్రుకలు స్రుక్కఁ జర్మంబు, వీఁపువంగె బొమలు వ్రేలఁబడియె, గన్నులనుపుడప్పెఁ గదలెదంతంబులు, కనఁకలడఁగెశిరమువణఁకఁదొడఁగె." భో. ౬, ఆ.—5. తగ్గు; (చూ. ముసుఁగురెండవయర్థము.)—6. దుఃఖించు; "ఉ. సత్యయింతకున్, స్రుక్కకయున్నె నీమహిమ సూచినబోటులు విన్నవింపఁగన్." పా. ౧, ఆ.—7. చింతించు; "భీమతనూభవనెమ్మనంబునన్ స్రుక్కుచు నుంటనైమ ధుఁడు నుంగడుఁ జింతవహించె." నై. ౪, ఆ.—8. మూర్ఛిల్లు; "తే. కంకటము దూఁటియంగంబుగాఁడిపోవఁ, గ్రూరనారాచమేసిన స్రుక్కి నతఁడు." భార. ద్రో. ౨, ఆ.—9. సంకోచించు; "తావినీతప్పి స్రుక్కుచునీచభామినుల చొప్పునఁ బల్కెడు." భార. విరా. ౧, ఆ.—10. వాడు; "తే. కలికి యెండదాఁకిన తొగకామభంగిఁ, బాఁపటేనిమే నెంతయుబలముదప్పఁగి, స్రుక్కె." హరి. పూ. ౭, ఆ.—11. చేట్టుకొను. ఆము. ౫, ఆ.—వి. 1. చిక్కు; "సీ. చూర్ణాలకంబుల స్రుక్కుచక్కఁగఁదీర్చి సలువునెమ్మనములో మొలపఁ బెట్టు." నై. ౭, ఆ.—2. దుఃఖము; "భోగంబులన్ మెచ్చున్ స్రుక్కునలేకయుండు." భార. శాం. ౨, ఆ.—3. శోకము; "సీ. సౌఖ్యంబుదుఃఖంబు సంప్రాప్తమైనచో నుబ్బు స్రుక్కులు లేకయుండెనేని." పు. ౧, ఆ.—4. బ. కడుపుమీఁది ముడుతలు. "సీ. సగవులునురువులు నడలుగాయంచలు స్రుక్కులుతరఁగలు పొక్కిలిసుడి." సిలా. ౨, ఆ.—సం. చ్. స్త్రీ. మిల్లివంటి యజ్ఞోపకరణవిశేషము.

**స్రుతము.** సం. విశే. (అ. ఆ. అ.) కాఱినది.

**స్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. కాఱుట.

**స్రువ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగుకీ; 2. చేఁగకీ. అ. పుం. ము. స్రుగ్భేదము.

**స్రువావృక్షము.** సం. వి. అ. పుం. ములువెలఁగకీ. (చూ. స్రువావృక్షము.)

## స్రో.

**స్రోతస్విని.** సం. వి. ఈ. స్త్రీ. నది, నిమ్నగ, ఏఱు.

**స్రోతస్సు.** సం. వి. స్. న. 1. ప్రవాహము; 2. ఏఱు; 3. నీరు వచ్చెడితూము; 4. ఇంద్రియము; 5. తొండముచివర.

**స్రోతోంజనము.** సం. వి. అ. న. నీలాంజనము.

## స్లే.

**స్లేటు.** ఆం. వి. రాతిపలక.

## స్వ.

**స్వకము.** సం. విశే. (అ. ఆ. అ.) స్వకీయము.

**స్వకీయము.** సం. విశే. (అ. ఆ. అ.) తనది.

**స్వచ్ఛందము.** సం. విశే. (అ. ఆ. అ.) స్వతంత్రము.

**స్వచ్ఛము.** సం. వి. అ. పుం. ముత్యము. విశే. తెల్లనిది.

**స్వజనుఁడు.** సం. వి. అ. పుం. సగోత్రుఁడు, జ్ఞాతి.

**స్వతంత్రము.** సం. విశే. (అ. ఆ. అ.) సొంతము.

**స్వతంత్రించు.** సం. అ. క్రి. ఒకరియనుమతిలేక తానుగా తీర్పుడు.

**స్వధితి.** సం. వి. ఇ. పుం. గండగొడ్డలి, పరశువు.

**స్వనము.** సం. వి. అ. పుం. మ్రోఁత, శబ్దము, ధ్వని.

**స్వనితము.** సం. వి. అ. న. ఉఱుము. విశే. మ్రోసినది.

**స్వపన్నక్కు.** సం. విశే. (క్.) నిదురపోతు.

**స్వప్నము.** సం. వి. అ. పుం. 1. కల; 2. నిదుర; 3. చూపు.

**స్వభాను.** సం. వి. ఉ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**స్వభావము.** సం. వి. అ. పుం. స్వధర్మము.

**స్వభువు.** సం. వి. ఊ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.

**స్వము.** సం. వి. అ. పుం, న. 1. ధనము; 2. తాను. విశే. తనది,

**స్వయంభువు.** సం. వి. ఊ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. మన్మథుఁడు.

**స్వయంవర.** సం. వి. ఆ. స్త్రీ. తనంతట మగనివరించునట్టి యాఁడుది.

**స్వరము.** సం. వి. అ. పుం. 1. అకారాది; 2. ఉదాత్తాది; (ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము.) 3. షడ్జాది; (స, రి, గ, మ, ప, ధ, ని.) 4. ముక్కుగాలి; 5. కంఠధ్వని.

**స్వరాట్టు.** సం. వి. జ్. పుం. 1. బ్రహ్మము; 2. ఇంద్రుఁడు. (రూ. స్వరాటు.)

**స్వరితము.** సం. వి. అ. పుం. స్వరవిశేషము. (చూ. స్వరము.)

**స్వరువు.** సం. వి. ఉ. పుం. 1. వజ్రాయుధము; 2. యూపస్తంభముయొక్కతునుక; 3. బాణము; 4. యజ్ఞము. విణ. స్వతంత్రము.

**స్వరూపము.** సం. వి. అ. న. స్వభావము.

**స్వర్గము.** సం. వి. అ. పుం. దేవలోకము, వేల్పుఁబ్రోలు.

**స్వర్ణకారుఁడు.** సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.

**స్వర్ణక్షీరి.** సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానఁబ్రాలుచెట్టు.

**స్వర్ణది.** సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ, వేల్పుటేఱు.

**స్వర్ణపారేవతము.** సం. వి. అ. న. పెద్దయీడచెట్టు.

**స్వర్ణము.** సం. వి అ. న. బంగారు. పుం. ఎఱ్ఱటెంకాయచెట్టు.

**స్వర్భానువు.** సం. వి. ఉ. పుం. రాహువు.

**స్వల్పము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి అల్పమయినది.

**స్వవాసిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. పేరంటాలు; 2. పుట్టినింటనుండెడి యాఁడుది.

**స్వస.** సం. వి. ఋ. స్త్రీ తోడఁబుట్టినది.

**స్వస్తి.** సం. ఇ. అవ్య. శుభము. "స్వస్తియగుఁగాక." హరి. పూ. 3, ఆ.

**స్వస్తికము.** సం. వి. అ పుం. 1. తూర్పువాకిలిగల రాజగృహము; 2. చేదుకము; 3. భుజబంధవిశేషము; 4. మంగళవస్తువు; 5. ముగ్ధస్త్రీహస్తవిన్యాసవిశేషము; 6. అభినయహస్తవిశేషము; (వ్రేళ్లుచాఁపఁబడిన చేతులను మనికట్లయందుఁగూర్చి వెలిముఖముగా నెడమప్రక్క పట్టినది.) 7. పాముయొక్క పడగమీఁది వంపయిన మొనలుగల యర్ధచంద్రాకారపు నల్లనిరేఖ.

**స్వస్తిముఖము.** సం. వి. అ. పుం. జోబు.

**స్వస్తిముఖుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. బట్టువాఁడు.

**స్వస్థము.** సం. విణ. (అ. ఆ. అ.) నెమ్మదిగానుండునది.

**స్వస్రీయ.** సం. వి. ఆ. స్త్రీ. మేనకోడలు. అ. పుం. డు. మేనల్లుఁడు.

## స్వా.

**స్వాంతము.** సం. వి. అ. న. 1. మనస్సు; 2. గుహ.

**స్వాగతము.** సం. వి. అ. న. 1. కుశలప్రశ్నము; 2. సుఖముతోడిరాక; 3. వృత్తవిశేషము.

**స్వాచ్ఛ్యము.** సం. వి. అ. న. స్వచ్ఛత.

**స్వాతంత్ర్యము.** సం. వి. అ. న. స్వతంత్రభావము, స్వతంత్రత.

**స్వాతి.** సం. వి. ఇ. స్త్రీ సంజ్ఞాదేవి. ఇ. పుం, స్త్రీ. ఈ. స్త్రీ. నక్షత్రవిశేషము. (చూ. నక్షత్రము.)

**స్వాదనము.** సం. వి. అ. న. పానము.

**స్వాదము.** సం. వి. అ. పుం. 1. రుచి; 2. రుచిచూచుట.

**స్వాదితము.** సం. విణ. (అ. ఆ. అ.) పానముచేయఁబడినది.

**స్వాదుకంటకము.** సం. వి. అ. పుం. 1. పల్లేరు; 2. ములువెలఁగచెట్టు.

**స్వాదుధన్వుఁడు.** సం. వి. న్. పుం. తియ్యవిలుకాఁడు, మన్మథుఁడు.

**స్వాదురస.** సం. వి. ఆ. స్త్రీ. 1. కారుగొలిమిడిచెట్టు; 2. ద్రాక్షచెట్టు.

**స్వాదువు.** సం. విణ. (ఉ.) 1. ఇంపయినది; 2. గరగరికైనది; 3. తియ్యనిది.

**స్వాదూదము** సం. వి. అ. పుం. మంచినీళ్లసముద్రము.

**స్వాద్వి.** సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్షచెట్టు.

**స్వాధీనపతిక.** సం. వి. ఆ. స్త్రీ. స్వాధీనుఁడైన పెనిమిటిగల నాయిక. (చూ. నాయిక.)

**స్వాధీనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తనకు లోఁకువైనవాఁడు.

**స్వాధ్యాయము.** సం. వి. అ. పుం. 1. వేదాధ్యయనము; 2. వేదము; 3. జపము.

**స్వాధ్యాయి.** సం. వి న్. పుం. 1. వేదాధ్యయనముచేయువాఁడు; 2. పట్టణమునందలి వర్తకుఁడు.

**స్వానము.** సం. వి అ. పుం. స్వనము, ధ్వని, మ్రోఁత.

**స్వాపతేయము.** సం. వి. అ. న. ధనము, విడిముడి.

**స్వాపము.** సం. వి. అ. పుం. 1. నిద్ర; 2. శయనము; 3. అజ్ఞానము; 4. తిమ్మిరి.

**స్వాభావికము.** సం. విణ. (అ. ఈ. అ.) స్వభావముచేతఁగలిగినది.

**స్వామి.** సం. వి. న్. పుం. 1. ఒడయఁడు; 2. కుమారస్వామి. విణ. అధికారి.

**స్వామిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒడయరాలు.

**స్వామ్యము.** సం. వి. అ. న. సొంతము. (అష్టస్వామ్యములు.— విక్రయ, దాన, వినిమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు.)

**స్వారాజ్యము** సం. వి. అ. న. స్వర్గలోకపు దొరతనము.

**స్వారాట్టు.** సం. వి. జ్. పుం. స్వర్గలోకాధిపతి, ఇంద్రుఁడు.

**స్వారి.** దే. వి. వాహ్యాళి, విహారము. "ఎ, గీ. శివుఁడు మంథానగిరితుంగశృంగవీథిఁ, జెలువుమీఱంగస్వారివేంచేయునపుడు." ఉ, రా. ౧, ఆ.

**స్వాస్థ్యము.** సం. వి. అ. న. స్వస్థత, నెమ్మది.

**స్వాహా.** సం. వి. ఆ. స్త్రీ. అగ్నిభార్య.

## స్వి.

**స్విన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) స్వేదముతోఁగూడినది.

## స్వీ.

**స్వీకరించు.** సం. స. క్రి. అంగీకరించు.

**స్వీకర్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) స్వీకరించువాఁడు.

**స్వీకారము.** సం. వి. అ. పుం. అంగీకారము.

**స్వీకృతము.** సం. విణ. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది.

**స్వీయ.** సం. వి. ఆ. స్త్రీ. పతియందుమాత్రము అనురాగముగల నాయిక. (చూ. నాయిక.) విణ. తనది.

## స్వే.

**స్వేదజము.** సం. విణ. (అ. ఆ. అ.) చెమటవలనఁబుట్టినది. (పురుగులోనగునది.)

**స్వేదని.** సం. వి. ఈ. స్త్రీ. పెనము, కందువు.

**స్వేదము.** సం. వి. అ. పుం. 1. చెమట; 2. చెమట పోయుట.

## స్వై.

**స్వైరి.** సం. విణ. (న్. ఈ. న్.) స్వతంత్రుఁడు.

**స్వైరిణి.** సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, జారిణి.

**స్వైరిత.** సం. వి. ఆ. స్త్రీ. యథేచ్ఛత.

**స్వైరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్వతంత్రుఁడు; 2. పామరి.

## హ.

**హ.** ఒక యక్షరము.

**హంకరించు.** వై. అ. క్రి. అహంకరించు.

**హంకారము.** వై. వి. అభిమానము, అహంకారము. "తనువు మూలము దుఃఖములకు దేహముకర్మముననుబుట్టు హంకారమునఁగల్గు సత్మైన." అధ్యా. కిష్కిం, కాం. "సీ. తగుకొందునెఱతనంబులు పుట్టుపుట్నిల్లు హంకారములకెల్ల నాటపట్టు." చంద్రా. ౨, ఆ.

**హంగామా.** హిం. విణ. కొంతకాలము ఉండు.

**హండ.** సం. వి. ఆ. స్త్రీ. వెడల్పునోరుగల పెద్దమృత్పాత్రము. (వాడుకయందు వెడల్పు నోరుగల లోహపాత్రముగానున్నది. మఱియు నిది దీర్ఘాంతముగానే వాడుకలోఁ గనఁబడుచున్నది.) (రూ. హండి. ఈ. స్త్రీ.)

**హంత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) హింసించువాఁడు.

**హంభ.** సం. వి. ఆ. స్త్రీ. గోధ్వని.

**హంవీరుఁడు.** సం. వి. అ. పుం. క్షత్రియుఁడు. విణ. శూరుఁడు. "సమరహంవీరుఁడు." శశాం. ౫, ఆ.

**హంస.** సం. వి. అ. పుం. 1. అంచే; 2. యోగివిశేషము; 3. పరమాత్మ; 4. తెల్లగుఱ్ఱము; 5. మంత్రవిశేషము; 6. శరీర వాయువిశేషము; 7. మాత్సర్యము; 8. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము. (రాజహంస.) (రూ. హంసము.)

**హంసకము.** సం. వి. అ. పుం. కాలియందె.

**హంసపక్షము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

**హంసపాదము.** సం. వి. అ. పుం. (దూ.) అంచపదము.

**హంసవాహనుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, అంచరవుతు.

**హంసాయి.** హిం. వి. ఇరుగుపొరుగువాఁడు.

**హంసాస్యము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

**హంసి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుహంస. (రూ. హంసిక. ఆ. స్త్రీ.)

**హంసుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. జీవుఁడు; 3. విష్ణువు; 4. శివుఁడు; 5. లోభగుణములేనిరాజు.

**హకర్సు.** హిం. వి. పగ.

**హక్కు.** హిం. వి. బాధ్యత.

**హక్కుదారు.** హిం. వి. బాధ్యతగలవాఁడు, ఆస్తికర్త.

**హజరతు.** హిం. వి. గౌరవార్థపదము.

**హజారము.** దే. వి. అజారమునకు మొదటిరూపము. (ఆస్థాన మండపమునకు.—"కొలువుహజారమై." గామా. ౧, ఆ.)

**హజారు.** దే. వి. ఆస్థానము. "క. వచ్చిసమంతిరినృపతివి, యచ్చర నాయకునననుజ్ఞనవసానసచివ్వులే, వచ్చరహజారునకుఁబిలువ, వచ్చిన దిగ్గుననరుగుచు పడిడిగ్గానే." ౧", వి. ౫, ఆ. (హజారము యొక్క మాఱురూపము.)

**హజ్జె.** దే. వి. పాదము. (అజ్జెకు మొదటిరూపము.)

**హట్టము.** సం. వి. అ. పుం. అంగడివీధి.

**హట్టవిలాసిని** సం. వి. ఈ. స్త్రీ. నఖమనెడు గంధద్రవ్యము.

**హఠము.** సం. వి. అ. పుం. 1. పట్టు; 2. బలాత్కారము; 3. యోగవిశేషము.

**హఠవాది.** సం విణ. (న్. ఈ. న్.) పట్టుపట్టి సాధించువాఁడు.

**హడపము.** దే. వి. అడపమునకు మొదటిరూపము.

**హతి** సం. వి. ఇ. స్త్రీ. కొట్టు, దెబ్బ. (ఉపహతి అనియు.)

**హతుడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కొట్టబడినవాఁడు; 2. మనసుచెడినవాఁడు

**హత్తి** వై. వి. ఏనుఁగు, గజము. (చూ. కత్తిరించు.)

**హత్తు.** దే. అ. క్రి. అత్తునకు మొదటిరూపము. (కలుగుటకు.— "ఆచంద్రాననపొందునాకెటువలెఁ హత్తించెదో." రసి. 3, ఆ.)

**హత్య.** సం. వి. ఆ. స్త్రీ. చంపుట, హననము.

**హదను.** దే. వి. అదనునకు మొదటిరూపము. "ఆహదనంజెలంగు జనము." ఆము. ౪, ఆ.

**హద్దు.** దే. వి. మేర, ఆజ్ఞ.

**హననము.** సం. వి. అ. న. హత్య, చంపుట.

**హనుమ.** వై. వి. హనుమంతుఁడు. "హనుమకనిలజుఁడనియెఁ." భార. అర. 3, ఆ.

**హనుమంతుఁడు.** సం. వి. త్. పుం. అంజనేయుఁడు.

**హనుమఁడు.** వై. వి. అనుమఁడునకు మొదటిరూపము.

**హనుమానుఁడు.** సం. వి. త్. పుం. హనుమంతుఁడు.

**హనువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. నఖమనెడు గంధద్రవ్యము; 2. చావు; 3. ఆయుధము; 4. వ్యాధి. పుం, స్త్రీ. చెక్కిలి క్రిందిభాగము.

హాన్నుఁడు. సం. విణ. (అ. అ. అ.) విస్మీంచినవాఁడు. (హాన్నము అని చెప్పి విస్మీంపఁబడినది. అనికొందఱు.)

హామాంబొాపతు. హిం. వి. మొత్తము.

హామేషా. హిం. అవ్య. ఎల్లప్పుడు, అవశ్యముగా.

హాయగ్రీవుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణ్వవతారవిశేషము; 2. దైత్యవిశేషము.

హాయపుచ్ఛి. సం. వి. ఈ. స్త్రీ. కారుమినుమురీ.

హాయమారకము. సం. వి. అ. పుం. గన్నేరుచెట్టు.

హాయము. సం. వి. అ. పుం. అశ్వము, గుఱ్ఱము.

హాయామము. హిం. వి. కాలము, వీలుఁబడి.

హారకత్తు. హిం. వి. ఆటంకము.

హారణము. సం. వి. అ. న. 1. హరించుట; 2. (చూ.) అరణము; 3. భాగహారము.

హారబ్బి. దే. వి. 1. దేశవిశేషము; 2. ఆదేశపుగుఱ్ఱము.

హారి. సం. వి. ఇ. న. ఒక వర్ణము. (చూ. వర్ణము.) పుం. 1. విష్ణువు; 2. ఇంద్రుఁడు; 3. సూర్యుఁడు; 4. చంద్రుఁడు; 5. యముఁడు; 6. సింహము; 7. గుఱ్ఱము; 8. కోఁతి; 9. పాము; 10. గాలి; 11. కిరణము; 12. కప్ప; 13. చిలుక. విణ. 1. పచ్చనిది; 2. బంగారువర్ణముగలది.

హారించు. సం. అ. క్రి. అడఁగు. "క. వీతపములనేజపముల, నేతీర్థవిలోకనములనే క్రతువులనీ, జ్ఞానివధంబొసరించిన, పాతకము హారించునఁదపస్వియతనితోఁగా." జై. ౧, ఆ.—అం, ప్రే. అడఁచు.

హారిగ. దే. వి. కేడెము. "చ. దురమునలక్ష్మణుండునిహతుం డయినంగుఱుఁడచ్చలంబునన్, హారిగయువాలుఁగైకొని." జై. ౬, ఆ. (అరిగకు మొదటిరూపము.)

హారిగోలు. దే. వి. అరిగోలునకు మొదటిరూపము.

హారిచందనము. సం. వి. అ. న. 1. చెందిరము; 2. వెన్నెల. పుం, న. 1. పసుపువన్నెగల చందనము; 2. ఒక కల్పవృక్షము. (చూ. కల్పవృక్షము.)

హారిణము. సం. వి. అ. పుం. 1. జింక; 2. తెలుపు. విణ. తెల్లనిది.

హారిణక్రీడనము. సం. వి. అ. న. బాలక్రీడావిశేషము. "వ. అందఱుహరిణక్రీడనంబనునాటకుందొడంగి." హరి. పూ. ౭, ఆ.

హారిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుజింక; 2. ఒక యప్పరస్త్రీ; 3. బంగారుప్రతిమ; 4. వృత్తవిశేషము; 5. అడవిమొల్లరీ. విణ. ఆకుపచ్చవర్ణముగలది.

హారిత. సం. వి. ఆ. స్త్రీ. గరికరీ. అ. పుం. ము. 1. ఆకుపచ్చవర్ణము; 2. పచ్చగుఱ్ఱము; 3. పచ్చపిట్ట; (ఇదే గిజిగాఁడు.) 4. పచ్చపెసరరీ; 5. సింహము. విణ. ఆకుపచ్చనిది.

హారితకము. సం. వి. అ. న. కూర, శాకము.

హారితపత్రిక. సం. వి. ఆ. స్త్రీ. పచ్చాకుచెట్టు.

హారితాళము. సం. వి. అ. న. హారిదళము.

హారిత్తు. సం. వి. త్. స్త్రీ. దిక్కు. పుం. 1. ఆకుపచ్చవర్ణము; 2. పచ్చగుఱ్ఱము; 3. సింహము. పుం, న. గరికరీ. విణ. ఆకుపచ్చనిది.

హారిదళము. వై. వి. అరిదళమునకు మొదటిరూపము. "సీ. నిద్రమేల్కాంచినసెత్తమ్మిమొగడలపరువంపు పుప్పొళ్లహారిదళముగ." కాశీ. ౧, ఆ.

హారిదశ్వుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

హారిద్ర. సం. వి. ఆ. స్త్రీ. పసుపు, నిశాహ్వ.

హారిద్రాభము. సం. వి. అ. పుం. పసుపువర్ణము. విణ. పసుపువర్ణముగలది.

హారిద్రువు. సం. వి. ఉ. పుం. మ్రానిపసుపు.

హారిన్మణి. సం. వి. ఇ. పుం. పచ్చ, మరకతము.

హారిప్రియ. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. భూమి; 3. తోళసి; 4. ఏకాదశి.

హారిబువ్వము. దే. వి. వివాహమునందు నాలవనాటిరాత్రి బంధువులైన మగవారు ఆఁడువారు అందఱును ఒకటిగాఁగూడి వేడుకగా భుజించుట.

హారిమంథకము. సం. వి. అ. పుం. సెనగలు.

హారివాణము. సం. వి. అ. పుం. తట్ట.

హారివాలుకము సం. వి. అ. న. నూఁగుదోస, కూఁతురుబుడమరీ.

హారివాసరము. సం. వి. అ. పుం. ఏకాదశి.

హారిహయుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

హారీతకి. సం. వి. ఈ. స్త్రీ. కరకరీ.

హారుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

హారువు. దే. వి. 1. మనోజ్ఞత; "ఆ. పాండురంగసుకవిపద్యంబుహారువును." పాంచా. ౧, ఆ.—2. నాణెమైనపని. "క. వెరవరులీహారువులకీ, గురుకుచలనితలఁచి." రామా. ౨, ఆ.—విణ. 1. మనోజ్ఞము; "ఎ, గీ. మెఱుఁగుబంగరుపుహారువుఁ, బసులనలరొందుగొనబుటుప్పరిగయందు." అచ్చ. అ, కాం.—2. నాణెము. "క. హారువుగొనమ్మలతిట్టా." అచ్చ. కిష్కి౦, కాం.

హారుసము. వై. వి. అరుసమునకు మొదటిరూపము. "చ. పరహితుఁడైనవానికిశుభంబులంభించిన నెల్లవారలుకా, హారుసమెకంద్రు." ఉ, రా. ౨, ఆ.

హారుసించు. వై. అ. క్రి. సంతోషించు. "ద్వి. హారుసించిసిరి శుకర్పించుకొఱకు." భల్లా. ౧, భా.

హారేణువు. సం. వి. ఉ. స్త్రీ. రేణుకయను గంధద్రవ్యము. పుం. బంకలు.

హార్కారా. హిం. వి. వార్తాహారుఁడు.

హార్త. సం. విణ. (బు. ఈ. బు.) హారించువాఁడు.

హార్మ్యము. సం. వి. అ. న. మిద్దెటిల్లు.

హార్యక్షము. సం. వి. అ. పుం. సింహము, పచ్చకన్నులమెకము.

హార్యక్షుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

హార్షకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషింపఁజేయువాఁడు.

హార్షణము. సం. వి. అ. న. సంతోషించుట. పుం. 1. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 2. నేత్రరోగవిశేషము. విణ. సంతోషించువాఁడు.

హార్షమాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషముపొందిన మనసుగలవాఁడు.

**హర్షము.** సం. వి. అ. పుం. సంతోషము, హరుసము.

**హర్షి.** సం. విణ. (న్. ఈ. న్.) సంతోషముగలవాఁడు.

**హర్షించు.** సం. అ. క్రి. సంతోషించు, హరుసించు.

**హలము.** సం. వి. అ. న. నాఁగలి. (బలరామునిహలమునం వర్తకము.)

**హలహలము.** సం. వి. అ. పుం. హాలాహలమనువిషము.

**హలాయుధుఁడు.** సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. మడఁకదున్నువాఁడు.

**హలాహలము.** సం. వి. అ. పుం. 1. హాలాహలమనువిషము; 2. బల్లి; 3. నలికిఁచు.

**హలి.** సం. వి. ఇ. స్త్రీ. నాఁగలి. న్. పుం. 1. బలరాముఁడు; 2. మడఁకదున్నువాఁడు.

**హలికుఁడు.** సం. వి. అ. పుం. మడఁకదున్నువాఁడు.

**హలిని.** సం. వి. ఈ. స్త్రీ. తటిగొబ్బీ.

**హలిప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. కల్లు. అ. పుం. ను. కడపఁ.

**హల్కా.** హిం. విణ. అల్పమైన, నీచమైన.

**హల్య.** సం. వి. ఆ. స్త్రీ. నాఁగళ్లసమూహము. విణ. ఒకతూరి దున్నినది. (హలము.)

**హల్లకము.** సం. వి. అ. న. చెంగలువ.

**హల్లకల్లోలము.** దే. విణ. అల్లకల్లోలమునకు మొదటిరూపము. "సీ. కలగుండుపడిహల్లకల్లోలమైచాలఁగలఁగెవాహినులు భంగముల తోడ." జై. ౨, ఆ.

**హల్లీసకము.** సం. వి. అ. న. స్త్రీలు పెక్కండ్రుచేరి మండలాకారముగా తిరుగుచుఁజేయు నృత్యము.

**హల్లు.** సం. వి. కకారాదియక్షరములలో నొకఁటి.

**హవణించు.** దే. ప్రే. 1. అలంకరించు; "సీ. అవనీవధూమణి హవణించుకాంచియైయంభోధియెందాఁకనలరుచుండు." శశాం. ౧, ఆ.–2. ధరించు; "పయ్యెదఁజెంగావి పావడహవణించి." శశాం. ౪, ఆ.–3. చక్కఁబఱచు; "ఇంటిజగడమింటిలోనె హవణింపక." జై. ౬, ఆ.–4. ఉంచు. "పక్కలోపవళించి పదముపైహవణించి." సత్య. 3, ఆ.

**హవణింపు.** దే. వి. అలంకరణము. "ఆహవణింపుసొంపులుఁగా." శశాం. ౨, ఆ. (చూ. అరగింపు.)

**హవణిక.** దే. వి. అలంకారము. "అరుదాహావిడుదులున్న హావణికపాలుపు." విజ. 3, ఆ.

**హవణిల్లు.** దే. అ. క్రి. 1. ప్రకాశించు; "సీ. తనమఱుంగున దురంతప్రతాప స్ఫూర్తిహవణిల్లునినఁడునునడఁగియుండ." పంచ. వేం. ౧, ఆ. – 2. విజృంభించు. "ద్వి. చెవులఁదొమ్మిదిలెక్కఁ త్రీలనుద్రొక్క, హవణిల్లు నలచక్కనయ్యచేడక్క." విష్ణు. ఉ. ౪, ఆ.

**హవణు.** దే. వి. ఒప్పిదము. "సీ. ధవళంబువినిచొక్కహవణు దెల్పెడుబిళ్లి హాళిఁ గోయిలపల్కు లాలకించి." విజ. ౧, ఆ.

**హవనము.** సం. వి. అ. న. హోమము.

**హవనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) హోమముచేయఁ దగినది.

**హవము.** సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. పిలుపు; 3. యజ్ఞము.

**హవాలా.** హిం. వి. అప్పనము, పరము.

**హవిష్యము.** సం. వి. అ. న. 1. హవిస్సు, 2. నెయ్యి.

**హవిస్సు.** సం. వి. స్. న. 1. అగ్నిహోత్రమునందువేల్చుటకు ఇపురఁబెట్టినయన్నము; 2. నెయ్యి. (రూ. హవి.)

**హవేలి.** హిం. వి. నగరు, రాజుకుచెందినది.

**హవ్యము.** సం. వి. అ. న. దేవతలకీఁదగినయన్నము.

**హవ్యవాహనుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిహోత్రుఁడు. (రూ. హవ్యవహుఁడు.)

**హసంతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కుంపటి; 2. మల్లెతీఁ; 3. శాకినీ భేదము.

**హసదు.** దే. విణ. దొడ్డవాఁడు. (అప్ర.)

**హసనము.** సం. వి. అ. న. 1. హాస్యము; 2. హాస్యరసము.

**హసని.** సం. వి. ఈ. స్త్రీ. కుంపటి. (హసంతియొక్కరూపాంతరము.)

**హసము.** సం. వి. అ. పుం. 1. హాస్యము; 2. హాస్యరసము.

**హసాదు.** దే. అవ్య. గొప్పవారియాజ్ఞను విధేయులు మంచిదని యంగీకరించుటయందువచ్చునది. "అనఁడుహసాదటంచతిరయంబునలంకకుఁబోయి." ఉ, గా. ౨, ఆ. (ఇది అసాదునకు మొదటి రూపము. దీనికాయర్థమునను దానికీయర్థమునను చెప్పవచ్చును.)

**హసించు.** సం. అ. క్రి. హాసముచేయు, నవ్వు.

**హసితము.** సం. వి. అ. న. పండ్లుతెలియనవ్వెడునవ్వు. (ఇది యుస్మితమువలె నస్తమము. చూ. హాసము.) విణ. 1. వికసించినది; 2. నవ్వినది.

**హస్త.** సం. వి. ఆ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.) అ. పుం. ను. 1. చేయి; 2. తొండము; 3. మూర; 4. (కేశ పర్యాయములకువెనకవచ్చినప్పుడు) వానిసమూహము. (కేశహస్తము మొ.)

**హస్తావలంబనము.** సం. వి. అ. న. 1. చేతితో అడ్డగించుట; 2. దంపవచ్చినవాని నడ్డగించుట.

**హస్తి.** సం. వి. న్. పుం. ఏనుఁగు, గజము, దంతావళము.

**హస్తినఖము.** సం. వి. అ. పుం. గవనివాకిటవాటముగానేర్పఱచిన మట్టిదిబ్బ.

**హస్తిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడు ఏనుఁగు; 2. హస్తినాపురము; 3. స్త్రీజాతివిశేషము. (చూ. జాతి.)

**హస్తిపకుఁడు.** సం. వి. అ. పుం. మావటివాఁడు.

**హళ్ఁది.** వై. వి. అళఁదికి మొదటిరూపము. (చూ. తలాడ.)

**హళిహళి.** సం. వి. ఈ. స్త్రీ. త్వర. "చ. హళిహళినవ్వులిచ్చిన క్రియఁజావిరితేనియలానుతేఁటులుఁగా." ఉ, రా. ౬, ఆ. (రూ. హళిహళిక. ఆ. స్త్రీ. "నముచితహళహళికలతోరాయంచలుమ్రోయఁగా." కళా. ౬, ఆ.)

**హళాహళి.** ఉభ. దే. వి. కలకలధ్వని. "సీ. తులువరాచిలుక మూఁకలహళాహళులకుఁ భావమేపుడుఁబుల్గుబారురొదకు." నీలా. 3, ఆ. – సం. ఈ. స్త్రీ. 1. త్వర; "ఉ. చెప్పెడిదేమి నావలపుచేసినచేఁతలుకొలువ్వలోనని, న్నెప్పుడుగంటినప్పుడపయింబడనీడిచినిల్వఁబడ్డపా, టప్పుడెదెంతయైనఁగలదట్టి హళాహళికింత నేపునీ, వొప్పెదుదాఁకఁదాఁగుటకయో మదిమెచ్చుదుగాన్నపాలకా."

విజ. ౧, ఆ.—2. శౌర్యము. "ఉ. విరహార్తునిమీఁదనేనీదుశౌర్యముల్, భావజయీహాళాహాళిఁగపాలికిముందఱఁజూపలేవుగా." సా. ౨, ఆ.

## హా.

**హా.** సం. అవ్య. 1. ఆశ్చర్యమునుదెలుపునది; 2. దుఃఖమును దెలుపునది.

**హాకీము.** హిం. వి. యజమాని, వైద్యుఁడు.

**హాజరు.** హిం. విణ. వచ్చియున్న.

**హాజోరము.** దే. వి. హజారముయొక్క రూపాంతరము. (కొలువుకూటమునకు.—"క. యోజింపుమనుచుఁబనిచిన, హజారంబునకు వచ్చి యమ్మంత్రివరుండు." రామా. ౨, ఆ.)

**హాటకగర్భుఁడు.** సం. వి. అ. పుం. (చూ.) హిరణ్యగర్భుఁడు.

**హాటకము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. ఉమ్మెత్త.

**హాని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తక్కువగుట; 2. కీడు.

**హామిక.** వై. వి. ఆమికకు మొదటిరూపము*. "ద్వి. పాయంపు హామిక." విష్ణు. ఉ. ౪, ఆ.

**హాయనము.** సం. వి. అ. పుం, న. 1. సంవత్సరము; 2. కిరణము. పుం. ధాన్యవిశేషము.

**హాయి.** దే. వి. సుఖము, సౌఖ్యము.

**హారకుఁడు.** సం. వి. అ. పుం. 1. దొంగ; 2. జూదరి. విణ. దోఁచుకొనువాఁడు.

**హారతి.** వై. వి. ఆరతికి మొదటిరూపము. "నక్షత్రపుహారతి." బ్ర. 3, ఆ.

**హారము.** సం. వి. అ. పుం. 1. నూటయెనిమిదిపేటలముత్యాల పేరు; 2. యుద్ధము. విణ. హరసంబంధమయినది.

**హారి.** సం. వి. ఇ. స్త్రీ. పథికజనసమూహము. విణ. మనోజ్ఞమైనది. (న్. ఈ. న్.) 1. హరించువాఁడు; 2. హారముగలవాఁడు.

**హారిద్రము.** సం. వి. అ. పుం. 1. కడపచెట్టు; 2. పసుపువర్ణము. విణ. పసుపువర్ణముగలది.

**హారీతము.** సం. వి. అ. పుం. 1. పచ్చపిట్ట; 2. కపటము. డు. మునివిశేషము.

**హారువు.** దే. వి. జూదమునందలిపరిభాష. ఉ, హరి. 3, ఆ.

**హార్దము.** సం. వి. అ. న. స్నేహము.

**హార్యము.** సం. వి, అ. పుం. తాండ్రచెట్టు. విణ. హరింపఁదగినది.

**హాల.** సం. వి. ఆ. స్త్రీ. సారాయి. అ. పుం. ము. నాఁగేలు.

**హాలహాలము.** సం. వి. అ. పుం, న. హాలాహలముయొక్క రూపాంతరము.

**హాలాహలము.** సం. వి. అ. పుం. 1. నలికండ్లపాము; 2. బల్లి. పుం, న. విషభేదము.

**హాలికుఁడు.** సం. వి. అ. పుం. హలికుఁడుయొక్క రూపాంతరము.

**హాలుసాలు.** హిం. వి. నడచుసంవత్సరము.

**హావడి.** దే. వి. ఉపద్రవము. "శా. వర్షంపునెవ్వారుజన్, హావళ్లన్దిగునన్యభూప్రజలరాజాయాయిజాత్యోచిలిన్, బ్రోవంగాఁదగు." ఆము. ౪, ఆ. (ఆవడికి మొదటిరూపము.)

**హావము.** సం. వి. అ. పుం. భ్రూనేత్రాదివికారములచేత కొంచెము తెలియఁదగిన మనోవికారము.

**హావళి.** దే. వి. హావడియొక్క రూపాంతరము. "సమీపదేశముల్ హావళిఁబోవకుండ." వి, పు. ౨, ఆ. "లోకావళిహావళింగను." ఉ, రా. ౫, ఆ.

**హాసము.** సం. వి. అ. పుం. 1. హాస్యము; (ఇది స్మితము, హసితము, విహసితము, ప్రహసితము, అపహసితము, అతిహసితము అని యాఱువిధములుగలది.) 2. హాస్యరసము.

**హాసించు.** సం. అ. క్రి. నవ్వు. "పకపకహాసించు." చంద్రా. ౧, ఆ.

**హాస్తికము.** సం. వి. అ. న. హస్తిసమూహము.

**హాస్యము.** సం. వి. అ. న. 1. నవ్వు; 2. ఒక రసము. (చూ. రసము.)

**హాస్యాలు.** హిం. వి. పన్ను.

**హాహా.** సం. అవ్య. 1. ఆశ్చర్యమును తెలుపునది; 2. దుఃఖమును తెలుపునది.

**హాహాఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక దేవగాయకుఁడు.

**హాళి.** దే. వి. ఆసక్తి. "ఎందుమీఁదిహాళియునులేక." ఉ, రా. ౪, ఆ. "క. హాళింగొనియాడందగు, హేళిఁబ్రసన్నోదయుఁడ్రయీమధుపాళిన్, గేళీసంకీలితకం, కేళిగుళుచ్ఛస్వరూపఘృణిరింఛోళిన్." రామా. ౧, ఆ.

## హి.

**హింగుది.** సం. వి. ఈ. స్త్రీ. ఇంగుదియొక్క రూపాంతరము.

**హింగునిర్యాసము.** సం. వి. అ. పుం. 1. ఇంగువరసము; 2., వేఁపచెట్టు.

**హింగువు.** సం. వి. ఉ. న. ఇంగువ.

**హింగుళము.** సం. వి. అ. పుం, న. రాగద్రవ్యవిశేషము, ఇంగిలీకము.

**హింగుళి.** సం. వి. ఈ. స్త్రీ. ములకచెట్టు.

**హిండనము.** సం. వి. అ. న. 1. వ్యాప్తి; 2. భ్రమణము; 3. సురతము.

**హిండితము.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపించినది.

**హింతాలము.** సం. వి. అ. పుం. గిఱకతాడుచెట్టు.

**హిందోళము.** సం. వి. అ. పుం. ఒకానొకరాగము. (దీనిని శిశిరవసంతఋతువులసంధినిపాడుదురు.)

**హింస.** సం. వి. ఆ. స్త్రీ. 1. చంపుట; 2. దొంగతనము; 3. బాధించుట.

**హింసకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) హింసించువాఁడు.

**హింసనము.** సం. వి. అ. న. హింసించుట.

**హింసించు.** సం. స. క్రి. 1. చంపు; 2. బాధించు.

**హింస్ర.** సం. వి. ఆ. స్త్రీ. నల్లయుశ్వచెట్టు. విణ. చంపునది.

**హిక్క.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎక్కిలి; 2. పైఁడికంటియను పక్షి.

**హిజారు.** దే. వి. కాలికితొడిగికొనుచట్ట. "పసిఁడిపట్టుహిజారు." శుక. ౧, ఆ. (ఇజారునకు మొదటిరూపము.)

**హిజిరి.** హిం. వి. మహమ్మదీయశకము.

**హిజ్జలము.** సం. వి. అ. పు. ఎఱ్ఱగన్నేరుచెట్టు.

**హితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వెనకటికి మేలుచేయునది; 2. ధరింపఁబడినది; 3. పోయినది.

**హితవరి.** వై. విణ. (హితవు+అరి.) ఇతవరికి మొదటిరూపము. (స్వార్థమున అరి.)

**హితవు.** వై. విణ. ఇతవునకు మొదటిరూపము.

**హితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) హితవుచెప్పువాఁడు.

**హిమ.** సం. వి. ఆ. స్త్రీ. పాలకూర. అ. న. ము. 1. మంచు; 2. చందనము. విణ. చల్లనిది.

**హిమకరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, చేలివెలుఁగు.

**హిమధాముఁడు.** సం. వి. న్. పుం.——పై.——

**హిమవంతము.** సం. వి. త్. పుం. హిమవత్పర్వతము, మంచుకొండ.

**హిమవాలుక.** సం. వి. ఆ. స్త్రీ. కర్పూరము.

**హిమాంబువు.** సం. వి. ఉ. న. పన్నీరు.

**హిమాంశువు.** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు, చేలివెలుఁగు.

**హిమాచలము.** సం. వి. అ. పుం. మంచుకొండ. (ఇట్లు హిమాద్రి మొ.)

**హిమాని.** సం. వి. ఈ. స్త్రీ. హిమసమూహము.

**హిమాలయము.** సం. వి. అ. పుం మంచుకొండ.

**హిమావతి.** సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానుబ్రాలుచెట్టు.

**హిమిక.** సం. వి. ఆ. స్త్రీ. హిమము, మంచు.

**హిరణ్మయము.** సం. వి. అ. న. ఒక వర్షము. (చూ. వర్షము.) విణ. బంగారుమయము.

**హిరణ్యగర్భుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ.

**హిరణ్యము.** సం. వి. అ. న. 1. బంగారు; 2. మాడ; 3. ధనము; 4. గవ్వ; 5. రేతస్సు.

**హిరణ్యరేతసుఁడు.** సం. వి. స్. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు. (రూ. హిరణ్యరేతుఁడు.)

**హిరణ్యవాహము.** సం. వి. అ. పుం. శోణనదము.

**హిలమోచిక.** సం. వి. ఆ. స్త్రీ. చిలుకకూర.

**హిహాకము.** సం. వి. అ. పుం. దేహము ముడుచుకొన్న పిల్లి.

**హిహీ.** దే. అవ్య. ఇహీ "హిహీయిటురండు." ఉ, రా. 3, ఆ. (ఇహిహీయొక్క మాఱురూపము.)

## హీ.

**హీనము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. తక్కువైనది; 2. దూఱఁదగినది; 3. విడువఁబడినది.

**హీర.** సం. వి. ఆ. స్త్రీ. 1. చీమ; 2. లక్ష్మి. అ. పుం. ము. వజ్రమణి.

## హు.

**హుంకరించు.** సం. అ. క్రి. హుమ్మని ధ్వనించు.

**హుంకారము.** సం. వి. అ. పుం. హుమ్మని ధ్వనించుట.

**హుంకారించు.** సం. అ. క్రి. హుంకారముచేయు. "ధరాచక్రంబు ఘూర్ణిల్లఁగా హుంకారించిన." వీర. ౪, ఆ.

**హుంకృతి.** సం. వి. ఇ. స్త్రీ. హుంకారము.

**హుండీ.** హిం. వి. సొమ్మిచ్చుట కాజ్ఞాపత్రిక.

**హుకుం.** హిం. వి. ఆజ్ఞ.

**హుజూరు.** హిం. వి. సముఖము, సమక్షము.

**హుటాహుటి.** దే. వి. గమనవేగము. "క. నడచుహుటాహుటిఁ బూడిచి, విడిచెమహాబిలమునొక్కవిగడియలోనన్." రామా. ౫, ఆ.—విణ. వేగవంతము. "హుటాహుటినడలన్." స్వా. ౧, ఆ.

**హుడుక్క.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. ఉడుక.

**హుతభుక్కు.** సం. వి. జ్. పుం. అగ్నిహోత్రుఁడు.

**హుతవహుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**హుతాశనుఁడు.** సం. వి. అ. పుం.——పై.——(రూ. హుతాశుఁడు.)

**హుమా.** దే. వి. హుమాయియొక్క రూపాంతరము. "క. గిత్త హుమానెక్కి హొయలు గేరెడుతేఁడా." సీలా. 3, ఆ.

**హుమాయి.** దే. వి. గుజ్జము. (చూ. జోకచేయు రెండవ యర్థము.)

**హురుమత్తు.** దే. విణ. గొప్ప, పెద్ద. "సీ. ఒక్కనిబ్బరముగా హురుమత్తు పరువెత్తు నశ్వంచుకట్లెముల్ గల్లసంగ." కృష్ణ. ౧, ఆ. (చూ. హుర్మత్తు.)

**హురుముంజి.** దే. వి. దేశవిశేషము. "వరహురుముంజిమహీశసుతుఁడు." భాను ౬, ఆ. "ఉ. ముక్కఱబెట్టిగట్టి హురుముంజి చొకారపు ముత్తియంబుచే, ర్పుక్కయమర్చి." పాంచా. ౨, ఆ. (రూ. హురుముంజీ. "మ. చెలువందైకళలన్ వెలుఁగు హురుముంజీదేశపున్ముత్తియం, బులతోఁగూర్చినచేఁబుచుక్క." అని. ౫, ఆ.)

**హుర్మత్తు.** దే. విణ. హురుమత్తుయొక్క రూపాంతరము. "హుర్మత్తుగఁదోఁచె మింట నెదురన్ ధ్వజరాజిశోకఁపుద్ధతిన్." చంద్రా. 3, ఆ.

**హుర్ముంజి.** దే. వి. హురుముంజియొక్క రూపాంతరము. "సీ. తోతెంచెనొక్కొ మధూకపుష్పములనుసానహుర్ముంజి ముత్యముల వలన." పాండు. ౪, ఆ.

**హుషారు.** హిం. వి. జాగ్రత్త. (చూ. ఖైజో.) (రూ. హుషారు.)

**హుళికి.** దే. వి. హుళిక్కియొక్క రూపాంతరము. "అప్తాది తోపణము దబ్బఱ సత్యమా హుళికి." హంస. ౫, ఆ.

**హుళిక్కి.** దే. వి. అభావము. "లేదరదంబు తత్తడిహుళిక్కి." స్వా. ౪, ఆ.

## హూ.

**హూ.** దే. వి. ఆవులించుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. ఒదిఁగిలితనవచ్చి హూయని బిట్టావులించి చొక్కుకదేటిలేచినల్గి, కలయఁజూచుటయును." భార. అర. ౭, ఆ.

**హూణము.** సం. వి. అ. పుం. దేశవిశేషము. (ఆదేశస్థులు హూణులు.)

**హూతము.** సం. విణ. (అ. ఆ. అ.) పిలువఁబడినది. (ఆహూతము అనియు.)

హైమనము. సం. వి. అ. పుం. మార్గశీర్షమాసము. విశే. 1. మంచుచేతకలిగినది; 2. బంగారుచేతకలిగినది.

హైమము. సం. వి. అ. న. వేకువను మంచువలనఁగలిగిన జలము. విశే. 1. మంచుచేతకలిగినది; 2. బంగారుచేతకలిగినది.

హైమవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. ఆకాశగంగ; 3. కరక్కాయ; 4. తెల్లవసకొమ్మ; 5. రెడ్డివారినానుఁబ్రాలు ఫ్రి.

హైయంగవీనము. సం. వి. అ. న. 1. తొలినాఁడు చిలికియుత్తిన అప్పువెన్న; 2. తొలినాఁడు చిలికియొత్తిన అప్పువెన్న కాఁచిననెయ్యి.

హైరాను. హిం. విశే. ఎటుతోఁచని, తొందరపడిన.

హొం.

హొం. దే. విశే. వృత్తియందు హొన్నుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరములగునపుడు సమాగమంబగు. ఉదా. హొంగాళె, హొంబట్టు మొ.)

హొంతె. దే. వి. పరిశ్రమము. "తే. హొంతఁబాడుట వనవిహారోత్సవంబు, నంపుటయు." అని. ౨, ఆ.

హొంత కాఁడు. దే. వి. జెట్టివాఁడు. (చూ. సంగడము. దే.)

హొంపుకారి దే. వి.——పై.——భార. విరా. ౧, ఆ.

హొన్ని త్తడి. దస్. వి. (హొన్ను+ఇత్తడి.) ఇత్తడిలో భేదము.

హొన్ను. దే. వి. పొన్ను, బంగారు, స్వర్ణము. (ఇది యన్యదేశము) (వృత్తియం దంత్యవర్ణలోపము. చూ. హొం.)

హొమ్ము. దే. విశే. ఒమ్మునకు మొదటిరూపము.

హొయలు. దే. వి. విలాసము. "అప్పురిలోనబోఁజంగుమిన్న లెల్లపుడుదినాంత వేళల హొయల్మెఱయఁ విహరింతురు." రసి. ౧, ఆ.

హొయలుబంఁడి. దే. వి. గాడి. [illegible]

హొరంగు. దే. [illegible] "హొయగపుమేని హొరంగుగుబంగ లింపఁగా." రసి. ౫, ఆ.

హోహో.

హోహో. ధ్వ. దే. వి. పిలుచుటయందగు ధ్వన్యనుకరణము. "హోహోనిబు పు." భో. ౪, ఆ.—పై. అవ్య. ఆశ్చర్యమునందు వచ్చును. "హోహోయని...పువ్వువృష్టిఁగురియించిరి." భార. అర. ౭, ఆ.

హోడము. సం. వి. అ. పుం. ఓడ, నావ, తరణి.

హోతృ. సం. వి. ఋ. పుం. ఋగ్వేదముతెలిసిన బుత్విక్కు.

హోత్రి. సం. వి. న్. పుం.——పై.——

హోదా. హిం. వి. ఉద్యోగము.

హోమము. సం. వి. అ. పుం. 1. వైశ్వదేవము; 2. దేవయజ్ఞము.

హోమ్యము. సం. వి. అ. న. నెయ్యి. విశే. హోమము చేయఁదగినది.

హోర. సం. వి. ఆ. స్త్రీ. 1. అహోరాత్రము; 2. రాశ్య [illegible]ము; 5. రేఖాభేదము.

హోరాట. దే. వి. ఆటోపము. "హోరాటమైనేలయుత్త[illegible] బవరంబులం గెలువఁగా." భార. ఉద్యో. ౧, ఆ.

హోరాహోరి. దే. క్రి. విశే. అవిరామము. "వచ్చి యుండుదలకు హోరాహోరిగాఁ బోరియేలాగాలాయమునేయగా." స్వా. ౩, ఆ.

హోరు. గ్రా. వి. ధ్వన్యనుకరణము. (హోరుగాలి.)

హోళి. దే. వి. కామునిపండుగ కడపటినాఁడు తగులఁబెట్టు పోగుచేసెడు గడ్డికంప. (ఇది యన్యదేశ్యము.)

హోళిగ. కన్న. వి. భక్ష్యవిశేషము.

హోళిపండుగ. దస్. వి. కామునిపండుగ.

హౌ.

హౌదా. హిం. వి. ఏనుఁగుమీఁది అంబారి.

హౌను. దే. వి. 1. భాగను; 2. ఒయ్యారము. (హైరూపము హావును.)

హౌసుకాఁడు. దే. విశే. 1. భాగసుకాఁడు; 2. ఒయ్యారకాఁడు. (మొదటిరూపము హావునుకాఁడు.)

హ్ర.

హ్రదము. సం. వి. అ. పుం. 1. పేటినడుమ లోఁతు చోటు; 2. లోఁతుగల నిడుపాటి నీటిపల్లము.

హ్రసిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి హ్రస్వమైన [illegible]

హ్రస్వగవేధుక. సం. వి. ఆ. స్త్రీ. చీఱి.

హ్రస్వము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కుఱుచ; 2. [illegible]

హ్రస్వాంగము. సం. వి. అ. పుం. జీవకమను ద్రవ్యము.

హ్రా.

హ్రాదిని. సం. వి. ఈ. స్త్రీ. 1. వజ్రాయుధము; 2 (చూ. హ్రాదిని.) 3. మెఱపు; 4. అందుగు ఫ్రి.

హ్రి.

హ్రిణీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. సిగ్గు; 2. రోఁత.

హ్రీ.

హ్రీ. సం. వి. ఈ. స్త్రీ. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప.

హ్రీణము. సం. విశే. (అ. ఆ. అ.) సిగ్గునొందినది.

హ్రీతము. సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

హ్రీబేరము. సం. వి. అ. న. కురువేరు.

హ్రే.

హ్రేష. సం. వి. ఆ. స్త్రీ. హేషయొక్క రూపాంతరము.

హ్లా.

హ్లాదనము. సం. వి. అ. న. 1. సంతోషించుట; 2. సంతో[illegible]

